## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్థం మహానుభావులైన శ్రీ చిన్న జీయర్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) చిన్న జీయర్ వెబ్ సైట్: http://www.chinnajeeyar.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో చిన్న జీయర్ వెబ్ సైట్ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## చిన్న జీయర్ వారి వెబ్ సైట్

## http://www.chinnajeeyar.org



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః



66 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మిక మాసపత్రిక

# భక్తినివేదన




శ్రీ విజయ నామ సంవత్సరం

పుష్యమాసము

**సంపుటి 66 జనవరి**

**సంచిక 10 2014**


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి

శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. **రంగరామానుజాచార్యులు**

ఉప సంపాదకులు

శ్రీమతి డా॥ T.K. **చూడామణి**

## పంచాంగ వివరాలు

**జనవరి :**

1. ఆంగ్ల నూతన సంవత్సరం, అమావాస్య, పిండపితృ యజ్ఞము
2. తిథి ద్వయం
3. తదియ తిథి
5. అవమ తిథి
9. శుక్రమౌఢ్యారంభం
11. ఉత్తరాషాఢకార్తె, సర్వేషామేకాదశి ముక్కోటి ఏకాదశి శ్రీరంగాది సమస్త శ్రీ వైష్ణవ క్షేత్రముల యందు వైకుంఠ ద్వారదర్శనోత్సవం
12. కూర్మద్వాదశి, శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి పరమపదోత్సవము
13. భోగి పండుగ, గోదాకళ్యాణం
14. మకర సంక్రమణం రా. 6-16, సంక్రాంతి పండుగ
15. కనుమ పండుగ
16. శుక్రమౌఢ్య నివృత్తి
17. విదియ తిథి
18. తదియ తిథి
19. శూన్య తిథి, తిరుమొజి శైయాళ్వార్ తిరు॥
21. శ్రీ త్యాగరాజస్వామి ఆరాధన
22. కూరత్తాళ్వాన్ తిరు॥ శ్రీ వైష్ణవ గృహములయందు ప్రబంధ ఆరంభం.
23. శ్రవణకార్తె
26. తిథి ద్వయం, గణతంత్ర దినోత్సవం
27. శ్రీ ఉ.వే.శ్రీమాన్ గోపాలాచార్య తిరు॥
29. అవమతిథి
30. అమావాస్య పిండ పితృయజ్ఞము.

## విషయ సూచిక




*Printed & Published by :* H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**
*Printed & Published at :* **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh.
*Editor :* Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.

చందావివరాలు :-

సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-





మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.



D.T.P. & Design by :

పరిశోధనాలయమ్



E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org

సంపాదకీయం

# కృతేచ ప్రతికర్తవ్యమ్



లోకంలో కృతజ్ఞతాబుద్ధి అనేది పశుపక్ష్యాదుల్లో కూడా మనంచూస్తూ ఉంటాం. ఇది మనుష్యజన్మ ఎత్తినవానికి తప్పనిసరిగా ఉండవలసిన లక్షణం. 'కృతేచ ప్రతికర్తవ్యమ్ ఏష ధర్మః సనాతనః' అంటాడు వాల్మీకి, సుందకాండంలో. ఎవరైన మనకు ఉపకారం చేస్తే, వారికి ప్రతిగా ఉపకారం చేయాలని అభిప్రాయం. ఉపకారం రెండురకాలుగా ఉండవచ్చు. శరీరానికి ఉపకరించేది, ఆత్మకు ఉపకరించేది. తల్లిదండ్రులు, మన చుట్టూ ఉన్న సమాజం మనకు శారీరకంగా ఉపకరించవచ్చు. కాని ఆత్మకు ఉపకరించే వారు ఆచార్యులు మాత్రమే. వీరు ఆత్మోజ్జీవనానికి కావలసిన సర్వోచ్చ సంస్కారాన్ని ఇస్తారు. మన ప్రాచీనాచార్యులంతా ఇలా ఉత్త సంస్కారానిచ్చి భారతీయ సమాజాన్ని ఉజ్జీవింపచేసినవారే. అటువంటి ఆచార్యులపట్ల ప్రీతిలేని వారు విషంకంటే క్రూరులంటారు విళాంశోలైపిళ్లైఅనే వారు. వీరు లోకాచార్యస్వామికి శిష్యులు. గొప్పఆచార్యనిష్ఠ కలవారు.

ఆచార్యులు రెండురకాలుగా ఉంటారు. ఉత్తరకాచార్యులు, ఉపకారకాచార్యులు. పంచసంస్కారపురస్సరంగా మంత్ర–మంత్రార్థాలను ఇచ్చిన ఆచార్యులు ఉత్తారకులైతే, దానికి కావలసిన శాస్త్రంద్వారా బుద్ధి–వివేక– దార్ఢ్యాలను ఉభయవిధవేదాన్తాలను (సంస్కృత–ద్రావిడ వేదాన్తాలను) ఇచ్చిన ఆచార్యులు ఉపకారకులు అంటారు. ఈ ఇరునిరిలక్ష్యం ఒక్కటే. మంత్రముఖంగాను, శాస్త్రముఖంగానూ ఐదు అర్థాలనివ్వడం. మంత్రమైనా, వేదాన్తమైనా ఐదు అర్థాలను ఈయడమే లక్ష్యంగా కలిగి ఉంది. పొందదగిన పరమాత్మ ఎలాంటివాడో తెలియడం, ఆపరమాత్మను పొందే ఈ జీవాత్మ ఎలాంటివాడో తెలియడం, వారిని పొందడానికి కావలసిన ఉపాయాన్ని తెలియడం, అలా పొందితే వచ్చే ఫలమేమిటో, అలాపొందడానికి అడ్డం ఏమిటో తెలియడం. సూక్ష్మంగా విశ్లేషిస్తే, ఆచార్యులిచ్చేమంత్రమైనా, శాస్త్ర వేదాన్తాలైనా ఈ ఐదర్థాలను తప్పక చెప్పాలి. చెబుతాయి. ఇలా ఐదర్థాలిచ్చే ఆచార్యునిపట్ల కృతజ్ఞతాపురస్కృతమైన ప్రీతిలేకపోతే, అలాలేనివారు విషంకంటే చాలా భయంకర క్రూర స్వభావులు అంటారు విళాంశోలైపిళ్లై, తమ సప్తగాథలో.

**'అంజుపొరుళుమ్ అళిత్తవన్ బాల్, అన్బిలార్,**
**నంజిల్ మిగక్కొడియర్ నామ్‌శొన్నోమ్–నంజ దాన్**
**ఊనై ముడిక్కుం, ఇవర్ ఉయిరై ముడిప్పర్, ఎన్ఱు**
**ఈనమిలార్ శొన్నారితై'**

ఐదు అర్థాలను (అర్థపంచకాన్ని) అనుగ్రహించిన వారిపట్ల ప్రేమలేనివారు, విషంకంటే మిక్కిలి క్రూరులు. ఎందువల్ల? విషం, తాను, కేవలం శరీరాన్నే చంపుతుంది. మరి వీరో, ఆత్మనుకూడా చంపుతారు. అంతేకాదు ఎంతోగొప్పవివేకం, శాస్త్రజ్ఞానం, ఇంకాఇంకా ఎంతో విజ్ఞానం కలిగి ఉండవచ్చును గాక, కాని తమనుకటాక్షించి అనుగ్రహించిన ఆచార్యులపట్ల ప్రీతి,లేశమాత్రమైనా ఉండదట. అలాంటివారు చతుస్సముద్ర ముద్రితమైన ఈ భూమండంలంమీద, ఎన్ని దుఃఖాలు పొందాలో అన్నీపొంది, అంతటితో ఆగక పరమనింద్యమైన ఘోరనరకాన్ని కూడా పొందుతారంటారు, విళాంశోలైపిళ్లై.

**పార్త కురువిన్ అళవిల్ పఱివిన్ఱి**
**శీర్త మిగు ఞానమెల్లాం శేర్న్దాలుమ్, కార్తకడల్**
**మణ్ణినేమేల్ తున్బుత్తు మంగుమే తేంగామల్,**
**నణ్ణుమే కీళామ్ నరకు. అని.**

ఇలాంటి ఘోరనరకాన్ని పొందే కృతఘ్నుత లేకుండా ఉండడానికి మనం కృతజ్ఞులమై ఉండటమే మనలోని మానవతకు వివేకసంపత్తికి ప్రథమనిదర్శనం అంటారు పెద్దలు.

మనమంతా కృతజ్ఞతాబద్ధులమై ఉండవలసిన ఎందరో ఆచార్యులలో విశేషగణనీయులు భగవద్రామానుజులు. సర్వమానవకోటి, ఉజ్జీవించాలని ఆశపడి 'గురుద్రోహ'మని నిందించినా వెనుకాడక, మంతార్థాన్ని ఆశగలవారికెల్లరకు ఉదారంగా వెదజల్లిన మహాచార్యులు వీరు. భగవదుపాసనానికి 'ఆర్తి' ఒక్కటే యోగ్యత అని ఎలుగెత్తిచాటి, వైదిక విజ్ఞానాన్ని అందరికీ అందిచ్చిన మహానుభావులువీరు. తమ ఉత్తమానుష్ఠానం చేత, శ్రీభాష్యాది సద్గ్రంథరచనంచేత,

శ్రీరంగం, తిరుమలవంటి మహాలయాల పాలనాదివ్యవస్థకు మర్యాదలే ర్పరచడం ద్వారా, ఎన్నో సామాజిక సంస్కరణలు చేసి, మన ప్రత్యుపకృతికి పరమపాత్రులైనారు భగవద్రామానుజులు. వీరు అవతరించిన సంవత్సరం 1017 కనక, 2017 నాటికి 1000 సంవత్సరాలు పూర్తి అవుతున్నాయి వారు అవతరించి. ఈ భవ్యసందర్భాన్ని శాశ్వత స్మరణీయంగా చేయాలని, ఆసేతుశీతనగం అనేక కార్యక్రమాలు చేస్తున్నది ఈదేశం. ఆచార్యప్రీతి కలవారంతా ఏదో ఒకరూపంలో చిరస్మరణీయంగా, వారి, తిరునక్షత్రమహోత్సవ సహస్రాబ్ది మహోత్సవాన్ని జరుపుకోవాలని ప్రయత్నాలు సాగించడం పరమమోదావహం. అందుకోసం మనం వెచ్చించే ప్రతిరూప్యకం మన కన్నులముందు ఒకగొప్ప ఆకారాన్ని దాల్చి కనిపించాలి.

2016 నుంచి సహస్రాబ్దిప్రారంభం అవుతుంది. ఈ సహస్రాబ్దిని దేశమంతటామాత్రమేకాక విదేశాలలో కూడా జరపాలని భావన. ఈ సందర్భంగా చేయదలచిన అనేక కృత్యాలలో వారి "మహోచ్చతామ్ర ప్రతిమాస్థాపనం" అప్రతిమ వైభవంతో జరగాలని ఆచార్య ప్రేమిలోకం భావిస్తున్నది. ఇది కార్యరూపం దాల్చవలసి ఉంది. ఇది, సర్వప్రధానమైనదిగా శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య **శ్రీశ్రీశ్రీత్రిదండిచిన్న శ్రీమన్నారాయణజీయర్‌స్వామి**వారి సంకల్పప్రేరణంతో పలువురు ఉదారులైన పెద్దలు ఉపక్రమించడం, దానికై ఉద్యమించడం ఆరంభమైంది. శంషాబాద్‌కు దగ్గరలోని శ్రీరామనగరంలో మనం ఏర్పరచుకున్న **'జీవా'** (జీయర్–ఇంటిగ్రేటెడ్–వేదిక్–అకాడెమి) ప్రాంగణానికి ఆనుకుని మరి కొంత భూమిని స్వీకరించి, దానిలో సుమారు నలభైఎకరాల భగవద్రామానుజ సహస్రాబ్ది మహోత్సవ ప్రాంగణాన్ని శాశ్వత నిర్మాణంతో ఏర్పరచాలని ఉద్యమిస్తున్నారు. వేయిసంవత్స రాలకు ప్రతీకంగా **''వేయి అంగుళాలప్రమాణంతో''** తామ్రవిగ్రహాన్ని ఏర్పరచాలని చేసిన ఈ సంకల్పం కార్యరూపం ధరించడానికి సహకరించడంలో మనమంతా కటిబద్ధులం కావాలి. శుద్ధిపరచిన తామ్రాన్ని మనం యథాశక్తి సమర్పించ వచ్చు. శుద్ధి పరచిన తరువాత, దాన్ని శుద్ధిని సూచించే అంకెలతో ముద్రించి ఇస్తారు. లోహాన్ని కరిగించే వ్యవస్థ ఉన్నచోట ఎక్కడైనా శుద్ధి పరచే వివరాలు తెలుస్తాయి. ఇలా శుద్ధి చేసిన తామ్రాన్నే మనం సమర్పించే ప్రయత్నం చేద్దాం. ఇక ద్రవ్యరూపంగా ఈయదలిస్తే, ఎవరైనా వారు సంపాదించే సంపాదనలో ఒక మాసపుసంపాదనను సమర్పించవచ్చు. దాన్ని మూడు భాగాలుగా ఈయవచ్చు. ఉత్సాహం ఉంటే ఇంకా మూడు సంవత్సరాల కాలం వ్యవధి ఉంది కనుక, ప్రతిసంవత్సరం ఒక్కొక్క మాసపు ఆదాయాన్ని సమర్పించవచ్చు. మనం మనకు తెలియకుండానే జరుగుతున్న దుర్వ్యయాన్ని, నియమించి ఈ సత్కార్యంలో పాలుపంచుకొందాం. ఇలా సమకూడిన ద్రవ్యంతో, దాదాపు 200 అడుగులు (దండంతో సహ) ఎత్తైన భగవద్రామానుజ తామ్రవిగ్రహం, స్వామిపద్మాసనాసీనులై ఉండేలా, ఏర్పరచేందుకు కావలసిన స్వరూప స్వభావాదుల నిర్ణయం శిల్పులు చేస్తున్నారు. ఆ విగ్రహం ప్రతిష్ఠితమైనచోట, విగ్రహానికి చుట్టూ, భగవ ద్రామానుజ చరిత విశేషాలతో పాటు, భారతీయ సంస్కృతి సంప్రదాయాలను ప్రతిబింబించే చారిత్రక ఐతిహాసిక సన్నివేశాలను కూడా చుట్టూ సుందరప్రాంగణంగా తీర్చిదిద్దాలనే ప్రయత్నం సాగుతున్నది.

ఈ సందర్భంగానే, భగవద్రామానుజ– శాంకర– మాధ్వసూత్రభాష్యాలను ఒకచోట సంకలనంచేసి, తులనాత్మకాను సంధానానికి వీలుగా మన **'జీవా'** గ్రంథమాలలో ముద్రించాలని కూడా ఒక ప్రయత్నం. ఇవన్నీ ఉదారులు, జిజ్ఞాసువులైన విజ్ఞుల ప్రోత్సాహంతోనే కదా సాగాలి! అంతేకాదు 108 దివ్యదేశ సన్నిధానాల లఘు ప్రతికృతులను చుట్టూ ఏర్పరచాలని కూడా నిర్ణయించడం జరిగింది. ఆ వివరాలను కూడా ఎప్పటికప్పుడు మన పత్రికలో ప్రముఖంగా ప్రచురించడం జరుగుతుంది. ఆసక్తిగల సంప్రదాయ రసికులు, వదాన్యులెవరైనా ఈవిషయంలో **'జీవ'** ప్రాంగణంలో ఉండే కార్యనిర్వహణవ్యవస్థను సంప్రదించడం ద్వారా తమ భాగస్వామ్యాన్ని స్వీకరించవచ్చు. మనం అంతాపాల్గొని, రాబోయే ఆ సహస్రాబ్దిని చిరస్మరణీయం చేసుకుందామని, సాదరంగా ఆహ్వానిస్తూ, ఈకార్యక్రమం సుసంపన్నం కావాలని ఆశిస్తున్నది మీ భక్తినివేదన. ఏ విధంగా, ఎవరిని సంప్రదించాలి అనే వివరాలను ముందుముందు సంచికల్లో తెలిసికోవచ్చు.

**వేంకటరంగరామానుజాచార్య**



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*గత సంచిక తరువాయి)*

## (1వస్కంధం - 11-12 వ అధ్యాయం - భగవదవతార వైచిత్ర్యం)

**తమయం మన్యతేలోకోహ్య సంగమపి సంగినమ్ ।**
**ఆత్మోపమ్యేనమనుజం వ్యాపృణ్వానం యతోఽ బుధః ॥**

స్వామియొక్క మహామహిమను తెలియలేకపోవడం లోకానికి ఏర్పడిన అజ్ఞానమేతప్ప వేరుకాదు. ఈ లోకంలోని ప్రతివ్యక్తి తనలాగే సర్వమూ ఉందనుకుంటాడు. సాక్షాత్తు భగవానుడే, తన పరిపూర్ణదైవస్వభావాన్ని, ఏ మాత్రంవిడిపెట్ట కుండానే వచ్చినా, ఆయనలోని స్వాభావిక దివ్యత్వాన్ని గ్రహించలేడు. అందువల్లనే తనలోని లోటుపాట్లనే భగవానుని యందు ఆరోపించి, స్వభావతః 'అసంగు'డైన స్వామిని, తనలాగే విషయసంగునిగా (విషయ సంబంధం కలవానిగా) అజ్ఞానంచే భావిస్తాడంటుంది భాగవతం. స్వామి శ్రీగీతలో దీన్నే స్పష్టంగా చెప్పాడు.

**అవజానన్తి మాం మూఢాః మానుషీం తను మాశ్రితమ్ ।**
**పరంభావమజాన న్తోమమ భూత మహేశ్వరమ్ ॥ *(శ్రీగీత-9-11)***

సర్వభూతలకు నియామకుడైన నా పరభావాన్ని (పరస్వభావాన్ని) తెలిసికోలేక, మూఢులైన లోకులు, ఈ భూమిపై మనుష్య శరీరాన్ని ధరించివచ్చిన నన్ను అవజ్ఞచేస్తారు. ఇలా అంటూ, తనను తెలియలేని వారు వ్యర్థాలైన ఆశలచేత కర్మలచేత, విపరీతజ్ఞానంచేత విక్షిప్త మనస్కులై (మనశ్చాంచల్యాన్ని పొందిన వారై, రాక్షసము, అసుర సంబంధము అయిన స్వభావాన్ని ఆశ్రయించి. వ్యామోహితులై నన్ను గుర్తింపలేరు- ఇక, మహానుభావులు దైవీప్రకృతిని ఆశ్రయించి ఉంటూ, అనన్యచేతస్కులై "నేను సర్వభూత మహేశ్వరుడ"నని ఎరిగి, నన్నే సేవిస్తా రంటాడు స్వామి- ఆసురీ ప్రకృతి పరమాత్మ స్వభావాన్ని తెలియనివ్వదు. దైవీప్రకృతి, తెలియపరుస్తుంది.

**మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః ।**
**రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ॥**
**మహాత్మానస్తు మాంపార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః ।**
**భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్ ॥**

***(శ్రీగీత-9-12-13)***

పరమాత్మకుకల గుణాలలో 'అపహతపాప్మా' అని ఒకగుణం. పాపసంబంధం ఎంతమాత్రం లేనివాడు. నశింపజేయబడిన పాపసంబంధంకలవాడని అభిప్రాయం. పుణ్యపాపకర్మలు రెండూ బంధకాలే కనుక పాపాలుగానే పరిగణిస్తుంది శాస్త్రం. ఇలాంటి పుణ్యపాపకర్మల సంబంధం ఎంతమాత్రంలేనివాడు స్వామి. ఎందువల్ల? సమాధానం చెప్పాడుస్వామి.

**'నమాం కర్మాణి లింపంతి నమే కర్మ ఫలస్పృహా'**

నాకు కర్మఫలానుభవంపట్ల ఇచ్ఛలేదు కనుక, నన్నుకర్మలు అంటవు అంటాడుస్వామి. కర్మనాచరించేవాడు ఆకర్మలవల్ల కలిగేసుఖదుఃఖాది ఫలాలపట్లఇచ్ఛకలవాడై 'కర్మఫలస్పృహ'తో కర్మలు చేస్తే అవితప్పక అంటుకుంటాయి. ఇదే కర్మసంగం. ఇలాంటి 'కర్మసంగం' లేనివాడు స్వామి. కాని, లోకులు అజ్ఞానంతో ఈ రహస్యాన్ని ఎరుగలేక, తమతో పోల్చుకొని, స్వామికూడా తమలాగే కర్మసంగం కలవాడనుకుంటారు. దీన్నే పై భాగవత శ్లోకం చెప్పింది.

ఇలాంటి కర్మసంగరహితుడైన స్వామికి గల సర్వనియామకత్వం ఎలాంటిదో భాగవతం చెబుతున్నది.

**ఏతదీశనమీశస్య ప్రకృతిస్థోపి తద్గుణైః ।**
**నయుజ్యతే సదాఽత్మస్థైః యథాబుద్ధిః తదాశ్రయా॥**

భగవానునికిగల 'ఈశనం' నియమనం అనేది ఇదే. ఏది? తాను ప్రకృతిలో ఉంటూనే, ఆ ప్రకృతి సంబద్ధాలైన సత్త్వరజస్తమోగుణాలచేత ఎంతమాత్రం సంయుక్తుడుకాక పోవడమే. ఈ విషయంలో వ్యతిరేక దృష్టాన్తాన్నిస్తున్నది పురాణం. బుద్ధిఅనేది ప్రకృతిలోనే పుట్టి ప్రాకృతిక గుణాలకు నెలవై వాటితో నిత్యయోగం ఎలా కలిగి ఉంటుందో పరమాత్మ అలా ఉండడు. ఇదే ప్రాకృతిక తత్త్వాలకు పరమాత్మకుగల భేదం. ఈ ప్రకృత భాగవత- శ్లోకంలోని పదాలకు సమన్వయాన్ని జాగ్రత్తగా పరిశీలించాలి. ఈ శ్లోకంలో స్వామికి గల ఈశనం ఎలాంటిదో చెప్పబడుతున్నది. స్వామి ఈ

ప్రకృతిలో జీవునితోపాటు ప్రవేశిస్తాడు. జీవుడు ప్రాకృతిక భోగానికిలొంగితే, పరమాత్మ మాత్రంలొంగడు. "ద్వాసుపర్ణా సయుజా" ఇత్యాది ఉపనిషన్మంత్రం దీన్నే స్పష్టపరుస్తుంది. ప్రకృతి అనే ఒకే చెట్టుపై జీవాత్మ పరమాత్మలనే రెండుపక్షు లున్నాయి. ఈ రెంటిలో జీవుడనే పక్షి ఆ చెట్టుకు పుట్టిన పిప్పలఫలాన్ని రుచిగా ఆస్వాదించి భోగాన్ని అనుభవించి, అనుభవించి, దాన్ని ఇక అనుభవింపరాదని నిశ్చయించినా అలా ఉండలేక శోకిస్తుందట. కాని రెండవ పక్షి అయిన పరమాత్మ అదే చెట్టుపై అంటే ప్రకృతిలో ఉన్నా, నిరీహతో ఫలాన్ని కనీసం చూడనైనాచూడక నిరామయంగా వెనుతిరిగి ఆనందిస్తూ ఉంటుందట. శోకమగ్నమైన జీవుడనే పక్షి, శోకించి శోకించి దిక్కుతోచక, చివరకు తన ప్రక్కనే ఉన్న పరమాత్మ అనే పక్షినిచూచి తన శోకాన్ని విడిచిపెడుతుందట.

ఈ అందమైన ఉపనిషన్మంత్రవర్ణనంచేత, పరమాత్మకూడా ఈ ప్రకృతిలోనే ఆయా ప్రాణుల హృదయాల్లోను, భూతాల్లోను అంతర్యామిగా ఉన్నా తానున్న ప్రకృతికి సంబంధించిన సత్త్వ–రజస్తమస్సులనే మూడుగుణాలచే పరివేష్టితుడై ఉండికూడా వాటి ప్రభావానికి లొంగడని తెలుస్తున్నది. ఇదే భావాన్ని– "ప్రకృతిస్థోపితద్గుణైః నయుజ్యతే" అన్న భాగవత వచనం స్పష్టపరుస్తున్నది. ఈ ప్రకృతిమండలంలోని ప్రాకృతిక దేహాలు ధరించి ప్రాణుల్లానే, తానూ ప్రాకృతిక సమానరదేహాన్ని ధరించినా, ప్రాకృతవ్యక్తిత్వం కలవాడెంతమాత్రంకాడు. ఆ ప్రాకృతిక దివ్యమంగళవిగ్రహమేనన్నమాట. ఇక్కడ రెండవ పాదంలోని పదాలను జాగ్రత్తగా సమన్వయించుకోవాలి. లేకపోతే విరోధం స్ఫురిస్తుంది. ఎలా? చూడండి. ఈ పదాలకు పై పాదంలోని సమన్వయరీతినే ఆశ్రయించి, అంటే "నయుజ్యతే సదాఽత్మస్థైః యథాబుద్ధిః తదాశ్రయా" అన్నవాక్యానికి ఆపాతతః కనిపించే అర్థంతీసికొంటే, ఎలాగైతే బుద్ధి అనేది తనలోనే ఉన్న గుణాలకు తానశ్రయమై ఉంటూ ఆగుణాలచే సంయుక్తం కాదో అని అర్థం చెప్పవలసివస్తుంది. అంటే, ప్రకృతిలోనే ఉన్నబుద్ధి, తనకు చెందిన గుణాలతోకూడిఉడనట్లుఅని అర్థం వస్తుంది. ప్రకృతిలోనే ఉన్న పరమాత్మకు ప్రాకృతిక గుణాలు అంటకపోవడం సమంజసమే అయినా, ప్రకృతిని ఆశ్రయించి ఉంటూ, దాని గుణాలతో సంబంధంకల బుద్ధితత్త్వం ప్రాకృతిక గుణాలచే సంయుక్తంకానట్లే అనే అర్థం చెబితే ఆ పోలిక కుదరదు. ఎందువల్ల? ప్రకృతిలో ఉన్న బుద్ధికి, ప్రాకృతిక గుణాలంట కుండా ఉండటం ఉండదు కదా! బుద్ధికూడా త్రిగుణాత్మకమే కనుక మూడు గుణాలు దానికి తప్పక అంటుతాయి. మరి గుణాలంటిని పరమాత్మకు గుణాలంటించుకునే బుద్ధి దృష్టాన్తం ఎలా అవుతుంది. అంటే వెనుక చెప్పుకున్నట్లు వ్యతిరేక దృష్టాన్తంగా చెప్పాలి. ప్రకృతిలోనే ఉన్న బుద్ధికి ప్రాకృతిక గుణాలు అంటినట్లుగా, ప్రకృతిలోనే ఉన్నా పరమాత్మకు అంటవు అని చెప్పాలి. లేదా మరొక రకంగా సమన్వయించాలి. శ్లోకం ఇలా ఉంది.

**ఏదేతదీశనమీశస్య ప్రకృతి స్థోపి తద్గుణైః ।**
**నయుజ్యతే సదాఽత్మస్థైః యథా బుద్ధిః తదాశ్రయా ॥**

యథా= ఏవిధంగా అయితే, బుద్ధిః= బుద్ధితత్త్వం అనేది, ఆత్మస్థైః =విశుద్ధమైన ఆత్మయందున్న, తద్గుణైః=అపహత పాప్మత్వాదిగుణా లెనిమిదిటిచేత, తదాశ్రయా=ఆత్మనే అంటిపెట్టుకొని ఉండేదే అయినా, నయుజ్యతే=కూడినదికాదో, అలాగే ప్రకృతిలోనే ఉన్నా పరమాత్మకు ప్రాకృతిక గుణాలంటవు అని.

ఇదిదీని అభిప్రాయం– బుద్ధి అనేది ప్రకృతిలో పుట్టి జీవుని ఆశ్రయించి ఉంటుంది. ఇలా ఆత్మతో సంబంధం కలిగిఉన్నా (తదాశ్రయా) ఆత్మయందున్న (ఆత్మస్థైః) ఆత్మగుణాలచేత(తద్గుణైః) సంయుక్తం కాదు. ఆత్మతో నిత్యసంబంధంకలిగి ఉన్నా, ఆత్మకు చెందిన అపహత పాప్మత్వాది కళ్యాణగుణాలేవీ బుద్ధికి అంటునట్లుగా, ప్రకృతిలోనే స్వామి ఉన్నా, ఆయనకు ప్రకృతి గుణాలేమాత్రం అంటవు అని భాగవతం చెబుతున్నది.

గుణాలు అంటకపోవడంలో పరమాత్మకు బుద్ధితో పోలికచెబుతున్నది పురాణం. ప్రకృతిలో ఉన్నా ప్రాకృతిక గుణాలు అంటవు పరమాత్మకు ఎలా? ఆత్మతోనే సంబంధం కలిగి, ఆత్మనే ఆశ్రయించి ఉన్నా, బుద్ధికి ఆత్మగుణాలేవీ ఎంతమాత్రం అంటనట్లుగా అని దృష్టాన్తం.

విష్ణుసహస్రనామాల్లోని ఆరంభనామాల్లో "భూతాత్మా" "భూతభావనః" "పూతాత్మా" "పరమాత్మా"చ "ముక్తానాంపరమా గతిః" అనే నామాలు ఐదు, భగవానుడు సర్వభూతాలకు లోపల అంతర్యామిగా ఉండి నియమించే 'ఆత్మ' అని, భూతాలను వికారంపొందేలా చేసేవాడు (అంటే వాటిలో త్రిగుణవైషమ్యం కలిగేలా చేసేవాడు) ఆయనే అని, అయినా ఆయన 'పూతాత్మ' తానున్న ప్రకృతిలోని గుణదోషాలకు అతీతుడని, అందువల్లనే ఆయనను 'పరమాత్మ' అంటారని, ఈ పరమాత్మయే ముక్తులకు పరమగతి అని ఈనామాలు చాలా అందంగా పరమాత్మస్వభావాన్ని ఇతర వైలక్షణ్యాన్ని విశదపరుస్తున్నాయి. *(సశేషం)*

(గడచినమాసం ఈవ్యాసం వేయవలసినచోట ఇతిహాసమాల పొరపాటున వేయడం జరిగింది. దీనికి చింతిస్తున్నాం. సంపాదకుడు).



# అహో! భారతమ్

(గత సంచిక తరువాయి)

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

## సభాపర్వం

ఉగ్రశ్రవసుడు రోమహర్షుని కుమారుడు. అందువల్ల ఆయనని రౌమహర్షణి అని అంటారు. శౌనకాది మహర్షులకి ఖాండవ వన దహనం దాగా జరిగిన భారతకథని చక్కగా వివరించాడాయన. తరువాత కథని మొదలుపెట్టాడు.

ఖాండవ వన దహనం తరువాత మయుడు పాండవులకి ఏదైనా సమర్పించి తన కృతజ్ఞతను చాటుకోవాలని అనుకున్నాడు. ధర్మరాజు, అర్జునుడు, శ్రీకృష్ణుడు కూర్చుని యుండగా సంతోషంగా వెళ్ళి వారికి నమస్కరించాడు. అర్జునుని చూచి, 'మహానుభావా! నువ్వు నన్ను రక్షించిన ఉపకారకుడివి. నీకు ఏంచేసినా ఋణం తీరదు. నీకు ప్రత్యుపకారం చెయ్యగల సామర్థ్యం కూడా నాకు లేదు. అయినా ఏదో ఒకటి చేసి నీకు ఆనందం కలిగించాలని కోరికగా ఉంది. నేను దానవ శిల్పినికదా! మీకిష్టమైన దాన్ని నిర్మించి, ఇవ్వగలను. ఆజ్ఞాపించు' అంటూ వినయంగా కోరాడు. అతని విధేయతకి, కృతజ్ఞతావిష్కారానికి మురిసిపోయాడు అర్జునుడు. ప్రక్కనే ఉన్న శ్రీకృష్ణుని చూచాడు. 'బావా! ఏదైనా అపూర్వమైన దానిని నిర్మించవలసినదిగా ఆజ్ఞాపించు' అన్నాడు. నవ్వాడు శ్రీకృష్ణుడు.

'మా ధర్మరాజు రాజులందరిచేత సేవింపబడే కురు సార్వభౌముడు. అలాంటివానికి సకలరత్నాలతో, అపూర్వంగా నీ శిల్పకళానైపుణ్యానికి మచ్చుతునకగా ఒక మహాసభను నిర్మించి వెంటనే తీసుకొనిరా' అన్నాడు. ఎగిరి గంతేశాడు మయుడు. 'ఓ! అలాగే. దేవతల భవనాలు కూడా ఇలా ఉండవ, లేవు అనిపించేలా ఒక మహాసభను నిర్మించి తెస్తాను చూడండి'.

'పూర్వం వృషపర్వుడనే రాక్షసరాజుకి ఒక సభను నిర్మించి ఇవ్వాలని రత్నాలు నింపిన నిర్మాణ సామాగ్రిని సమకూర్చాను. దానిని బిందుసరం అనే సరోవరంలో జాగ్రత్తపరచాను. ఇప్పుడు ఆ సమగ్రిని తెస్తాను. దానితో చిత్ర విచిత్రమైన సభను నిర్మిస్తాను. అంతేకాదు. భౌమాదిత్యుడు అనే రాజు తపస్సుచేసి, ఋషిత్వం పొందాడు. ఆయన శత్రువులను హతమార్చే గదనొకదానిని శంఖం ఒకదానిని సంపాదించాడు. అవి నాదగ్గరే ఉన్నాయి. ఆ గదని భీమునికిస్తాను. ఆ దేవదత్త శంఖాన్ని అర్జునుని కిస్తాను. నాకు అనుజ్ఞ నియ్యండి' అని పల్కి ఈశాన్యదిశగా వెళ్ళి ఉత్తరాన మైనాకపర్వతంమీద హిరణ్యశిఖరం చేరాడు. బిందు సరోవరంలో ఉన్న వివిధ రత్నసాధనసామగ్రిని సేకరించాడు. ముందుగా, మహాకార్యారంభం చేస్తున్నందుకు దేవబ్రాహ్మణ పూజ చేశాడు. నిర్మాణం మొదలుపెట్టాడు. దూలాలన్నీ రత్నమయాలుగా తయారుచేశాడు. మణులను కూర్చి గోడలు, అరుగులు, స్తంభాలు సిద్ధంచేశాడు. వాటన్నింటిని అందంగా కూర్చి ఒక సభని నిర్మించాడు.

ఆ సభలో మణిమయ ప్రదేశాలు నీటిమడుగులుగా భ్రమింపచేస్తున్నాయి. ఇంద్రనీలమణుల కాంతులు నీళ్ళుగా కన్పిస్తున్నాయి. పద్మరాగాలు ఎఱ్ఱని పద్మాలనే తలపిస్తున్నాయి. రాజహంసలు, తెల్లతామరలుగా, వెండి రూపుదాల్చింది. బంగారంతో పోతపోసిన తాబేళ్ళు మిలమిలలాడుతున్నాయి. కలువలుగా వైదూర్యాలే కదలుతున్నాయి. వజ్రాలు చేపలుగా మారాయి. ముత్యాలే నురుగులయ్యాయి. మరకతాలు నాచుగా కనువిందుచేశాయి. నీరులేని సరోవర భ్రాంతి ఇది.

ఇంక స్ఫటికపుగోడలకాంతులు నీళ్ళని కప్పివేసి నీళ్ళున్నా లేనట్లే భ్రమని కల్గిస్తున్నాయి. మయుని శిల్పచాతుర్యం మాటలకందేది కాదు. ఆ సభలో మయుడు పూలు పళ్ళంతో కన్నులవిందు చేసే తోటలు రూపొందించాడు. కొలనులు, ఉద్యానవనాలు, గువ్వల గూళ్ళు, తీగలు, చెట్లపూలు!.... ఏమిటీ నిర్మాణవైభవం! ఇది ఇంద్రసభని మించిపోయిందే! పదునాల్గు పదివేలమూరల చుట్టుకొలతతో అతి విశాలంగా అత్యద్భుతంగా ఎనిమిదివేలమంది రాక్షసభటుల చేత మోయించి తెచ్చి, ధర్మరాజుకు సమర్పించాడు మయుడు. భీమునికి గదని ప్రసాదించాడు. అర్జునునికి దేవదత్త శంఖాన్ని ఇచ్చాడు. ధర్మరాజు ఆసభను చూచి, ఆశ్చర్యపోయాడు. ఆనందంతో మయుని సమ్మానించాడు.

ఆ సభలో ప్రవేశించేముందు ధర్మరాజు పదివేలమంది బ్రాహ్మణోత్తములకి పాయసాన్నాదులతో విందుచేశాడు. వారికి ఒక్కొక్కరికి వెయ్యిగోవులు, పట్టువస్త్రాలు, ఆభరణాలు,. దివ్యచందన సత్కారాలు చేశాడు. ధౌమ్యుడు మొదలైన బ్రాహ్మణుల ఆశీర్వచనాలమధ్య తమ్ములందరితో ఆ సభలో ప్రవేశించాడు. ఎన్నో

దానధర్మాలు చేశాడాయన. రాజులందరినీ ఆహ్వానించాడు. వారంతా ఎన్నోరకాల కానుకలర్పించారు. దానిని చూడవచ్చిన మహామునులందరిని సత్కరించాడు. మహర్షులు చెప్పే ధర్మకథలు వింటూ ఆనందంగా కాలంగడిపాడు.

ఒకనాడు నారదమహర్షి పాండవుల వద్దకు వచ్చాడు. ధర్మరాజు స్వాగతం పలికి పూజించాడు. ఎన్నో రాజధర్మాలను చెప్పాడు నారదుడు. అవి ఎంతో ఆశ్చర్యాన్ని కల్గిస్తాయి. సేవకులకు ఇచ్చే జీతాలు, జీవన భృత్యం, రైతులకు పడ్డీలేని ఋణాలు, వికలాంగుల పోషణ, గ్రామీణ పథకాలు, గూఢచార నిర్వహణలు, పండిత సన్మానాలు.... ఇలా ఒకటేమిటి! అనేక విషయాలందులో చోటుచేసుకున్నాయి. శ్రద్ధగా విన్నాడు ధర్మరాజు. సంపూర్ణ ధర్మమార్గంలో పాలన చేస్తున్నా.... నా కన్నీ తెలుసు అని అహంకారంగా జవాబు చెప్పలేదు. "మునీంద్రా! చేతనైనంతవరకు అన్యాయాన్ని విడిచిపెట్టి, న్యాయానికే పట్టంకట్టి, మహాత్ముల చరితల్ని ఆదర్శంగా తీసుకొని మీవంటి పెద్దల సందేశాల్ని శిరసావహిస్తూ పాలన సాగిస్తాను" అన్నాడు. ఆదర్శ రాజ్యపాలనకి ఉత్తమ ప్రమాణాలు మహనీయుల సందేశాలు. ధర్మరాజు నారదునికి మయ సభని చూపించాడు. స్వామీ! ఇలాంటి సభని మీరెక్కడయినా చూశారా అని అడిగాడు. సభని చూచి, నారదుడెంతో ఆనందించాడు. రాజా! ఈ భూలోకంలో ఎక్కడా ఇటువంటి సభని చూడలేదయ్యా! దేవలోకాల్లో కొన్ని గొప్ప సభలు చూశాను. కానీ అవికూడా దీనిముందు దిగదుడుపే. అంటూంటే ''మునీంద్రా! ఆ సభలెలా ఉంటాయి అన్నాడు. చెప్పడం మొదలుపెట్టాడు నారదుడు.

ఇంద్రసభ నూఱుయోజనాల వెడల్పు, నూటఇరవై యోజనాల పొడుగు, రత్నాలు, బంగారంతోటే నిర్మాణం జరిగింది. అప్సరసలు, దేవతాశ్రేష్ఠుల రాకపోకలు... అబ్బో! శచీపతి కొలువు వర్ణనాతీతం. అశ్వినీదేవతలు అంటే నాసత్యుడు, దస్రుడు. వీళ్ళిద్దరూ దేవవైద్యులు. సూర్యుడు అశ్వరూపంతో సంజ్ఞాదేవితో కలియడం వలన కలిగిన సంతానం. వారీసభలో ఉంటారు. హరిశ్చంద్రుడనే రాజర్షి ఇంద్రసభలో ఉంటాడు. ఇంద్రుడే తపోబలంతో స్వయంగా నిర్మించుకున్నాడు.

ఇంక యమసభ. ధర్మ, అధర్మ వివేచనకి మూలమిది. విశ్వకర్మ నిర్మించినదే. ఈ సభలన్నీ ఒకచోటనుండి వేరొకచేటుకి ప్రయాణం చేయగలవు. మా తండ్రి పాండురాజిక్కడే ఉన్నాడు.

జలస్తంభన విద్యతో విశ్వకర్మ నిర్మించినది వరుణసభ. నదీ జలాధిష్ఠానదేవతలంతా వరుణిని కొలిచే సభ. దైత్య, దానవ, నాగరాజులందరూ అతనిని సేవిస్తూ ఉంటారు.

కుబేరుని సభ ఇంద్రసభలాగే ఉంటుంది. దీనికి కుబేరుడే అద్భుతంగా నిర్మించుకున్నాడు. నందనవన మందమారుత చల్లదనాన్ని ఆస్వాదిస్తూ ఉంటాడు కుబేరుడు. అప్సరలుంటారిక్కడ. కుబేర సఖుడు ఈశ్వరుడిక్కడే ఉంటాడు.

సూర్యుడు వర్ణించి చెప్తే ఆగలేక బ్రహ్మగారి సభని కూడా చూడాలని వెళ్ళాను. ఆకాశస్తంభం మీదుంటుందాసభ. దిక్పాలకులతో, కాలచక్రంతో, రూపుదాల్చిన విద్యలతో.... ఓహో! అద్భుతం. 'అలాంటి సభల కంటే బాగుందీసభ' అన్నాడు. అయితే మా తండ్రి యమలోకంలో ఉన్నాడు. హరిశ్చంద్రుడెలా ఇంద్రలోకంలో ఉన్నాడు అన్నాడు ధర్మరాజు. ఆయన చక్రవర్తి చెప్పాడు నారదుడు. ఆయన రాజసూయ మహాయాగం చేశాడయ్యా! బ్రాహ్మణాశీర్వచనాలు పొందాడయ్యా. ఆఫలంగా ఇంద్రలోకం చేరాడాయన. అందుకే మీనాన్న నీకొక మాట చెప్పమన్నాడు. నువ్వుకూడా రాజసూయమహాయాగం చెయ్యి. అలాచేస్తే నాకూ ఇంద్రలోకం వస్తుందని చెప్పాడయ్యా. ఆమాట నీకు చెప్పాలనే నేనిలా వచ్చాను. అయితే ఆయాగం చేయాలంటే ఎన్నో విఘ్నాలు ఎదుర్కోవాలి. యాగం పూర్తి అయితే మహాయుద్ధం వస్తుంది ఉంటూ వెళ్ళిపోయాడు నారదుడు.

An.Y. ఆర్థోఫిట్ సిరప్
అన్ని రకముల జాయింట్ నొప్పులకు
సరికొత్త పరిష్కారం
ఇది ఫిజికెమ్ వారి ప్రతిష్ఠాత్మక ఉత్పాదనలలో ఒకటి
సత్వర నివారణకు అద్భుత ఆయుర్వేద ఔషధం
Also available as Oil & Capsules
ORTHO Fit Syrup
ఇంటింటా ఆర్థోఫిట్ నొప్పులన్నీ ఫటాఫట్

ఆమాటలు విని ధర్మరాజు ధౌమ్యమహర్షి మొదలగువారి నందరిని సమావేశపరిచాడు. తండ్రికి ఉత్తమలోకాన్ని కల్గించాలంటే రాజసూయయాగం చెయ్యాలి. కానీ ముందు భయంకరయుద్ధం వస్తుందంటే.... ఏం చేస్తే బాగుంటుంది? అన్నాడు. వెంటనే వారంతా రాజసూయం చెయ్యి. దానివలన పాపాలు పోతాయి. సంపదలు సమకూడతాయి. అంటూ ప్రోత్సహించారు. సోదరులంగీకరించారు. శ్రీకృష్ణుడే ఈ యాగాన్ని నిర్విఘ్నంగ జరిపించగలడని విశ్వసించారు. ఆ పరంధామునితోడి తెమ్మని సేవకుల్ని పంపించారు. యాగానికి ముందు దిగ్విజయయాత్ర జరగాలి. యజ్ఞం నిర్విఘ్నంగా పరిసమాప్తి చెందాలి. ధర్మజుని వర్తమానాన్ని అందుకొని శ్రీకృష్ణుడు బయలుదేరాడు. వస్తూనే పెద్దలకి నమస్కరించాడు. ధర్మరాజు ఆతని ఆదరించి గురుపూజ గావించాడు. నారదుడు చెప్పిన విశే,లిలన్నీ చెప్పాడు. ఆమాటలు విని, శ్రీకృష్ణుడిలా అన్నాడు. 'ధర్మజా! సోదరులతోకలిసి రాజసూయం చేయడానికి నువ్వే సమర్థుడివి'.

నేను చెప్పాల్సినది కొంత ఉంది. జమదగ్ని కొడుకు పరశురాముడు క్షత్రియనాశనం చేశాడుకదా! తరువాత కొద్దిమంది మిగిలారు. వారందరిని జరాసంధుడనే రాజు జయించాడు. అతనికి సేనాధిపతి శిశుపాలుడు. ఈయన చే రాజ్యాధిపతి. కౌశికుడు, చిత్రసేనుడు అనే పేర్లున్న హింసడిభకులు జరాసంధునికీ ఆప్తులు. భగదత్తుడు పాండురాజ మిత్రుడే అయినా జరాసంధుడంటే భయం.

నేను కంసుని చంపానుకదా! కంసుని భార్య జరాసంధుని కూతురే. అందువల్ల అతనికి నేనంటే కక్ష. పైగా ఇప్పుడు భైరవ పూజ చేస్తున్నాడు. వాణ్ణి చంపాలి. అప్పుడే విజయం లభిస్తుంది. వివేకశూన్యుల సంపదస్థిరంగా ఉండదు. అలాగే జరాసంధునికి పతనం తప్పదు. అన్నాడు భీముడానందంగా ముందుకువచ్చి బావా! నీదయ, మా అర్జునుని సహాయం ఉంటే నేను జరాసంధుని చంపేస్తానన్నాడు. భీముని మాటలువిని, అర్జునుడు కూడా ఆనందిస్తూ ఇలా అన్నాడు. 'అన్నా! ధర్మరాజా! రాజులందరిని జయించి, అపార ఐశ్వర్యంలో రాజసూయం నిర్వహించు. అలా చేయడానికి మేమంతా ఉన్నాం. ఈ గాండీవం, ఈ దివ్యబాణాలు, ఈ దివ్యరథం ఇవన్నీ ఉన్నందుకు ప్రయోజనమదే. మయసభలాంటి సభ పొందినందుకు ప్రయేజనమదే' అన్నాడు. కృష్ణుడెంతో ఆనందించాడు. భీమార్జునులు, నేను ముగ్గురం జరాసంధుని పని పూర్తిచేస్తాం అన్నారు. ధర్మరాజు జరాసంధుని పరాక్రమాన్ని గూర్చి అడిగాడు. చెప్పడం మొదలుపెట్టాడు కృష్ణుడు.

బృహద్రథుడనే మగధరాజుండేవాడు. ఆయన కాశీరాజు కూతుళ్ళ కవలపిల్లల్ని పెళ్ళిచేసుకున్నాడు. ఆనందంగా గడిపాడు. అతనికి సంతానం కలుగలేదు. అందుకని పెద్దల ఆశీస్సులు అందుకోవాలని చండకౌశికి మహర్షి తపస్సుచేసుకొనే అడవికి భార్యలతో కలిసి వెళ్ళాడు. ఆయన భార్యలతో కలసి సేవించాడు. ఆ ఋషి అతని సేవలకి మెచ్చి వరం ఇస్తాను కోరుకో అన్నాడు. వెంటనే స్వామీ! పుత్రోదయం కావాలని ఆశర్వదించండి అన్నాడు. ఆయన కళ్ళుమూసుకున్నాడు. ఇంతలో ఆయన కూచున్న మామిడిచెట్టుపై నుండి ఒకకాయ రాలి ఒళ్ళోపడింది. గాలిలేదు, చిలుకలులేవు. పండుపడింది. ఇదుగో రా... రా... పండువలన నీకు పుత్రుడు కలుగుతాడు అని ఆశీర్వదించాడు. ఆనందపరవశుడయ్యాడు రాజు. భార్యలతో రాజ్యానికి వచ్చాడు. ఆపండు ఇద్దరుభార్యలకి చెరొకసగం సమానంగా ఇచ్చాడు. ఆరగించారువారు. ఆఫల ప్రసాదంగా గర్భవతులయ్యారు. పదినెలలు నిండాయి. ఒకనాటి రాత్రి ఇద్దరికీ పురుడువచ్చింది. కాని ఆశ్చర్యం. ఒక కన్ను, ఒక చెవి, ఒక చెంప, సగం బొద్దు, ఒక భుజం ఒక చెయ్యి, ఒక తొడ, ఒకకాలు... అలా శరీరంలో సగంభాగం ఒకరికి, సగంభాగం ఒకరికి రెండుముక్కలుగా జన్మించింది. భయపడిపోయారాతల్లులు. భక్తకెలా దీనిని చూపించడం? వద్దు.... ఒక పనిచేస్తే...!

7 సం॥లలో CA/CWA లలో అత్యధిక ఆలిండియా ర్యాంకులు మరియు పాస్ పర్సెంటేజ్ సాధించిన
నెం.1 కామర్స్ విద్యా సంస్థ
ఆంధ్రప్రదేశ్‌లోనే అత్యుత్తమ ఉత్తీర్ణతతో పాటు ర్యాంకులు సాధిస్తున్న ఏకైక అగ్రగామి కామర్స్ విద్యా సంస్థ
స్టేట్ 1st RANK 490/500
2012 Jr.MEC లో
K. VYSHNAVI
No.1 for ▸ Inter(MEC / CEC) ▸ CA/CWA
శ్రీMEDHA™
Igniting Intelligence. Delivering Excellence.
Head Office: 6/9 Brodipet, Vuda Office Road, Guntur-2. Ph: 22 55 891 / 988 52 49166
Branch Office: Sriya Towers 2nd Floor, Besides Income Tax Office, Near Sidhardha Public School, Mogalrajpuram, VIJAYAWADA Ph:9248920266
vijay ads

# శ్రీమద్భాగవత మాహాత్మ్యము

(గతసంచిక తరువాయి)

శ్రీమాన్ నోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

శ్లో ॥ అలం వ్రతైరలం తీర్థైరలం యోగైరలం మఖైః ।
అలం జ్ఞాన కథాలాపై ర్భక్తి రేకైవ ముక్తిదా ॥

వ్రతాలు, తీర్థాలు, యోగాలు, యజ్ఞాలు, జ్ఞానంపై చర్చలు మొదలైనవన్నీ అనవసరం. ఒక్క భక్తియే ముక్తినిచ్చేది."

ఇలా నారదుడు చెప్పిన మాటలకు భక్తి చాల సంతోషించి ఇలా అంది. "నారదా! నీవు ధన్యుడవు. నాపై నీకు నిశ్చలమైన ప్రేమ ఉంది. నేనెల్లప్పుడు నీ హృదయంలో నివసిస్తాను. నిన్ను వదిలి వెళ్ళను. ఓ మహానుభావా! నీవు ఎంతో దయతో నాలోని దుఃఖాన్ని తగ్గించావు. కాని నా కుమారులైన ఈ జ్ఞానవైరాగ్యాలలో చైతన్యం ఏమీ రాలేదు. దయ చేసి వీరిని కూడా చైతన్యవంతులుగా చేసి మమ్మల్ని రక్షించు. వీరిద్దరిని మేల్కొలుపు."

ఆ మాటలకు నారదుడు మిక్కిలి దయగల వాడై వారిద్దరినీ చేతితో తట్టుకుంటూ లేపడం మొదలుపెట్టాడు. "ఓ జ్ఞానమా! లే! ఓ వైరాగ్యమా లేలే!" అంటు పెద్ద గొంతుతో వారిని లేపడం మొదలుపెట్టాడు.

శ్లో ॥ వేద వేదాంత ఘోషైశ్చ గీతాపాఠైర్ముహుర్ముహుః ।
బోధ్యమానౌ తదా తేన కథం చిచ్చోత్థితౌ బలాత్ ॥

జ్ఞాన వైరాగ్యాలకు మూలము వేదాలేనని తెలిసి వారిద్దరిని ఎదుటబెట్టుకొని వేదములన్నీ వల్లె వేసాడు. ఎటువంటి ప్రయోజనం కలుగలేదు. ఉపనిషత్తులు చదివాడు. ఏ లాభము చేకూరలేదు. భగవద్గీతా పఠనం చేసాడు. ఫలితం మారలేదు. వాళ్ళని మళ్ళీ మళ్ళీ కుదిపి లేపాడు. అతికష్టం మీద వాళ్లు కళ్ళు మాత్రం తెరిచారు. కాని సోమరిగా ఆవులిస్తూ మళ్ళీ కళ్ళు మూసుకున్నారు. వారి వెంట్రుకలన్నీ తెల్లబడిపోయాయి. అవయవాలన్నీ ఎండిపోయి నిస్తేజాలుగా కనిపించాయి. ఆకలిదప్పులచే నిస్తేజాలైన వారిని చింతాక్రాంతుడై చూస్తూ నారదుడు "నేనింకేం చెయ్యగలను" అని యోచించడం మొదలుపెట్టాడు.

## నారదునికి మార్గదర్శకత్వం

నారదుడు తన మనసును భగవంతుడిపై లగ్నం చేసాడు. అంతలో ఆకాశవాణి ఇలా పలికింది. "ఓ నారదా! దుఃఖించకు. నీ ప్రయత్నం తప్పకుండా ఫలిస్తుంది. సందేహించకు. దీనికి సరియైన మార్గదర్శకత్వం నీకు సత్పురుషులైన మహాత్ములు ఉపదేశించగలరు. వారు చెప్పిన విధిని నీవు ఆచరించగానే ఈ జ్ఞాన వైరాగ్యాలకు నిదుర, వృద్ధావస్థ వంటివి తొలగగలవు. ఈ జగత్తంతా భక్తి గుబాళించగలదు."

నారదుడు ఈ మాటలను విని ఆశ్చర్యపోయాడు. కాని తానేం చెయ్యాలో మాత్రం బోధపడలేదు. ఆ మహానుభావ లెవరో ఎక్కడుంటారో తెలియదు. ఈ సమస్య ఎలా పరిష్కారమౌతుందో అర్థంకాలేదు. "అయినా సరే ప్రయత్నించక తప్పదు" అనుకున్నాడు. అక్కడినుండి బయలుదేరి ప్రతి మునీశ్వరుణ్ణి తన సమస్యను చెప్పి చేయవలసిన సాధన తమకేమైనా తెలుసునా! అని అడగడం మొదలుపెట్టాడు. అందరూ నారదుని ప్రశ్న విన్నవారే గాని సమాధానం మాత్రం చెప్పలేకపోయారు. అందరూ తమలో తాము చర్చించుకోవడం మొదలుపెట్టారు. "ఈ మాట విన్నారూ! వేదవేదాంత ఘోష, గీతాపఠనం వల్ల కూడా జ్ఞాన వైరాగ్యాలు మేల్కొనలేకపోతే ఇంక ఉపాయం ఏముంటుంది? "అయినా నారదునికే తెలియని సమాధానం మిగిలిన ఎవరు మాత్రం చెప్పగలరు?".

కాని అలా ప్రయత్నం చేస్తూ నారదుడు తీర్థాలన్నీ దాటుకుంటూ చింతాక్రాంతుడై బదరికావనాన్ని చేరాడు. 'ఇక సమాధానం దొరక్కపోతే తపస్సే దీనికి సమాధానం చెప్పగలదు. నేను తపస్సు ఆరంభిస్తాను'. అలా అనుకుంటుండగానే కోటిసూర్య ప్రభాభాసమై వెలుగుతున్న సనక సనందాది ఋషులు దర్శనమిచ్చారు. వారి వద్దకు వెళ్ళి ప్రణామం చేసి వారిని నారదుడు ఇలా అడిగాడు.

"మహాత్ములారా! నా అదృష్టం వలన మీ వంటి పుణ్యవిభూతుల దర్శనం కలిగింది. మీరందరూ గొప్ప

యోగులు, జ్ఞానులు, పండితులు, విద్వాంసులు, కాని చూడటానికి మీరు ఐదు సంవత్సరాల పిల్లల్లా కనబడతారు. కాని మీరు పూర్వులకు కూడా పూర్వులు. మీరు సర్వదా వైకుంఠం లోనే నివసిస్తూ ఉంటారు. నిరంతర హరిభక్తి తత్పరులై ఉంటారు. భగవంతుని లీలామృత రసాస్వాదన చేస్తూ ఎప్పటికి ఆ భగవత్కథలలోనే ఉన్మత్త చిత్తులుగా ఉంటారు. భగవత్కథలే మీ జీవనాధారం. "హరిఃశరణమ్" అని సదా తలుస్తూ ఉంటారు. అందువలన కాల ప్రేరితమైన యవ్వన వార్ధక్యదశలు కూడా మిమ్మల్ని చేరడం లేదు.

గతంలో మీ కోపాగ్నికి ఆహుతి అయి శ్రీహరి యొక్క ద్వారపాలకులైన జయవిజయులు భూలోకంలో జన్మించగా మళ్ళీ మీ కృపకే పాత్రులవడం చేత వాళ్ళు తిరిగి వైకుంఠం చేరగలిగారు. ఇన్నాళ్ళకి నాకు మీ దయ వలననే మీ దర్శనం సంప్రాప్తమైంది."

అని నారదుడు తన సమస్యను వారికి సవివరంగా చెప్పాడు. "అన్నలారా! మీరు నా యందు దయ చూపించండి. ఇంతకీ ఆకాశవాణి పలికిన సాధన ఏంటి? దానిని నేనెలా చెయ్యాలి? దీనిని మీకంటే చెప్పగల సమర్థులు ఎవ్వరూ లేరు. మీ మార్గదర్శకత్వ వలననే జ్ఞానవైరాగ్యములకు స్వస్థత చేకూరగలదు. భక్తి సంతోషించగలదు. వీరి ప్రతిష్ఠను పునః ప్రతిష్ఠించడానికి మీ సహాయాన్ని అర్థిస్తున్నాను. దయ చేసి చెప్పండి నన్నేం చెయ్యమంటారో?"

దానికి సనకాదులు చిరునవ్వు నవ్వి ఇలా అన్నారు. " ఓ నారదా! చింతించకు. ప్రసన్నుడవుకా! వీటిని ఎలా ఉద్ధరించాలి అన్న విషయం ముందునుండి నిర్ణయించబడే ఉంది . ఓ నారదా! నీవు ధన్యుడవి. గొప్ప విరక్తుడవి. భక్తియోగంలో నిలిచిన సూర్యుడిలాంటి వాడివి. శ్రీకృష్ణ దాసులకు శాశ్వతమైన మార్గం చూపేవాడివి. నీవు చేసే ఈ ప్రయత్నం నీ స్వాభావికమైన ప్రయత్నమే. భగవద్భక్తుడైన నీ వంటివారు భక్తిని చక్కగా నిలిపే ప్రయత్నం చేస్తారు.

ఋషులు ఇప్పటివరకూ అనేక మార్గాలను ఉపదేశించినా అవి ఎంత కష్టసాధ్యాలయినా అవన్నీ స్వర్గద్వారాలు తెరిచేవే. ఇంత వరకూ భగవంతుణ్ణి పొందించే మార్గం మాత్రం గుప్తంగానే ఉండిపోయింది. అలాంటి మార్గాన్ని అందించే భక్తుడు అరుదుగా లభిస్తాడు. అట్టి ఆచార్యుడవు నీవే. ఇక నీకు ఆకాశవాణి సూచించిన సత్కర్మను చెపుతాం. సావధానుడవై విను. నారదా! ద్రవ్యయజ్ఞం, దానయజ్ఞం, స్వాధ్యాయ యజ్ఞం మొదలైనవన్నీ స్వర్గాదులను పొందించే కర్మలే.

శ్లో ॥ సత్కర్మ సూచకో నూనం జ్ఞానయజ్ఞః స్మృతో బుధైః ।
శ్రీమద్భాగవతాలాపః స తు గీతః శుకాదిభిః ॥

జ్ఞానయజ్ఞమే సత్కర్మ అని, అంటే ముక్తినొసగే కర్మయని, పండితులనుకొంటున్నారు. అదే శ్రీమద్భాగవత పారాయణం. ఇట్టి జ్ఞానయజ్ఞాన్ని శుకాది మహానుభావులు గతంలో చేసారు.

దీని మాట వింటే చాలు, భక్తి, జ్ఞాన, వైరాగ్యాలు గొప్పబలాన్ని పుంజుకుంటాయి. జ్ఞాన వైరాగ్యాల కష్టం తొలగిపోతుంది. భక్తి ఆనందంతో పొంగిపోతుంది. సింహగర్జన విన్న తోడేళ్ళలా, శ్రీమద్భాగవత ధ్వని విన్నంతనే కలియుగ కష్టాలు పారిపోతాయి. అది జరిగిన తరువాత జ్ఞాన వైరాగ్యాలను వెంట తీసుకొని భక్తి ప్రతి ఇంట, ప్రతి మానవుని హృదయం లోపల నర్తించగలదు.

**భాగవతమహిమ**

ఆ మాటలను విన్న నారదుడు ఎంతో సంతోషించాడు. కాని తనలో ఉన్న అనుమానబీజాన్ని తొలగించుకోవాలని ఆ సనకాది ఋషులతో ఇలా అన్నాడు. "నేను ఈ జ్ఞాన వైరాగ్యాలను మేల్కొలపడానికి వేదాలను వల్లె వేసాను. వేదాంతాలయిన ఉపనిషత్తులను చదివాను. గీతాపాఠాలను భక్తితో పారాయణ చేసాను. ఇన్ని చేసినా నా ప్రయత్నాలేవీ జ్ఞాన వైరాగ్యాలను లేపలేక పోయాయి. ఇలాంటి స్థితిలో ఈ శ్రీమద్భాగవతాన్ని వినిపించడం వలన ప్రయోజనం ఉంటుందంటారా? ఎందుకంటే శ్రీమద్భాగవతం కేవలం వేదసారము మాత్రమే. వేదము వలననే లేవనిది, వేదసారం వలన లేస్తుందా? మీరు భక్తవత్సలురు కాబట్టి మీరు నా తెంపరి ప్రశ్నను తప్పుగా తలవక నా సందేహనివృత్తి చేయండి".

అలా అడిగిన నారదునితో సనక సనందనాదులు "నీవు చెప్పింది నిజమే. శ్రీమద్భాగవతం వేదాల సారమే. కాని వేదాల కంటే భిన్నమైన ఆకారం కలిగిన ఫలమవడం వలన ఇది వేదాల కంటే ఉత్తమమైనదిగా తెలియబడుతోంది.

ఒక వృక్షంలో రసమనేది దాని వేళ్ళు, కాండము, కొమ్మల వరకూ ఉంటుంది. కాని ఆ స్థితిలో ఉన్న రసము ఆస్వాదన యోగ్యంగా ఉండదు. కాని అదే ఆ కొమ్మకు కాసిన ఫలరూపంలో గ్రహిస్తే అదే రసం ఎంతో ఆస్వాదింపదగినదిగా ఉంటుంది. అలాగే పాలలో నెయ్యి ఉంటుంది. యజ్ఞంలో అగ్నిని ప్రోది చేయడానికి నెయ్యి పనికి వచ్చినట్లు పాలు పనికిరావుగా! చెరుకుగడలో మాధుర్యం వ్యాపించియున్నా, దానిలోని రసాన్ని వేరుచేసి ఆస్వాదిస్తే దాని మాధుర్యం పెరుగుతుంది కదా! అలాగే భాగవత కథకూడా శ్రేష్ఠమై సంకల్పించిన కార్యాన్ని సాధించగలదు.

**శ్లో॥ ఇదం భాగవతం నామ పురాణం బ్రహ్మ సమ్మితమ్ ।**
**భక్తి జ్ఞాన విరాగాణాం స్థాపనాయ ప్రకాశితమ్ ॥**

ఈ భాగవత పురాణం వేదాలతో సమానమైనది. దీనిని శ్రీవేదవ్యాస మహాముని భక్తి జ్ఞాన వైరాగ్యాలను ఈ లోకంలో సుస్థాపితం చేయడానికే ప్రకాశింపజేసాడు.

**శ్లో॥ వేదాన్త వేద సుస్నాతే గీతాయా అపి కర్తరి ।**
**పరితాపవతి వ్యాసే ముహ్యత్య జ్ఞానసాగరే ॥**

పూర్వం ఒకసారి శ్రీ వేదవ్యాస మునీంద్రుడు వేద వేదాంతాలను, శ్రీమద్భగవద్గీతను రచించి కూడా ఖిన్నుడై దుఃఖసాగరంలో మునిగి యున్నాడు కదా!

**శ్లో॥ తదా త్వయా పురాప్రోక్తం చతుఃశ్లోక సమన్వితమ్ ।**
**తదీయ శ్రవణాత్స ద్యో నిర్బాధో బాదరాయణః ॥**

ఆ సమయంలో నీవే కదా వ్యాసునకు చతుఃశ్లోక భాగవతాన్ని ఉపదేశించావు. దానిని విన్నంతనే ఆ బాదరాయణుని చింత అంతా తొలగిపోయింది కదా! అలాంటి నీవు మమ్మల్ని అడుగుతున్నావేమిటి? తీరా చెప్పిన తరువాత ఆశ్చర్యపోతున్నావేంటి? అందుకని నీవు భక్తియొక్క దుఃఖాన్ని బాపడానికి వెళ్ళి శ్రీమద్భాగవతాన్ని వినిపించు" అని చెప్పారు.

ఆ మాటలు విన్న నారదుడు ఎంతో సంతోషించి "మహానుభావుల్లారా! మీ దర్శనం సమస్త జీవుల పాపాలను నశింపజేస్తుంది. సంసార దుఃఖం నుండి బయటపడవేస్తుంది". అని స్తుతించాడు. అనేక జన్మలలో కలిగిన పుణ్యం వలననే మానవునకు సత్సాంగత్యం లభిస్తుంది. అదే వారిలోని అజ్ఞానాన్ని, మోహాన్ని, మదాన్ని నాశనం చేస్తుంది. వివేకాన్ని కలిగిస్తుంది.

**భక్తి యొక్క దుఃఖ నివారణ**

నారదుడు మళ్ళీ సనక సనందనాదులను ఇలా అడిగాడు. " ఓ యోగులారా! నేను మీరు ఆదేశించిన విధంగా భక్తి జ్ఞాన వైరాగ్యాలకు పరిపుష్టి కలిగించడానికి శుక మహర్షి చెప్పిన భాగవతకథను ఒక జ్ఞానయజ్ఞంగా ఆచరిస్తాను. అయితే ఈ యజ్ఞాన్ని నేను ఎక్కడ చేయాలి? మీరు వేద వేదాంగాలు ఎరిగిన వారు కాబట్టి ఈ శ్రీమద్భాగవతాన్ని ఎన్ని రోజుల్లో వివరించాలో తెలియజేయండి. ఆ కథను వినడానికి ఏదైనా శ్రవణ విధానం ఉంటే అది కూడా తెలియజేయండి".

నారదుని మాటలు విన్న సనకాదులు " నారదా! నీవు ఎంతో వినయ విధేయతలు కలవాడవు. వివేకం కలవాడివి. నీవు అడిగిన విషయాలన్నీ చెబుతాం విను. హరిద్వారం సమీపంలో గంగానది ఒడ్డున ఆనందమనే ఒక రేవు ఉంది. అక్కడ పన్నెండు మంది ఋషులు నివసిస్తున్నారు. దేవతలు, సిద్ధులు కూడా ఆ ప్రదేశాన్ని సేవిస్తున్నారు. ఆ ప్రదేశమంతా వృక్షాల వల్ల, లతల వల్ల దట్టంగా అలుముకొని ఉంటుంది. అక్కడ మెత్తని ఇసుక తిన్నెలు వ్యాప్తమై ఉంటుంది. ఆ తటం లేదా రేవు ఎంతో అందంగా, ఏకాంతంగా ఉంటుంది. అక్కడ బంగారు పద్మముల సువాసన గుబాళిస్తూ ఉంటుంది. *(సశేషం)*

వ్యక్తిత్వ వికాసానికి ... నాణ్యమైన సాంకేతిక విద్యా బోధనకు
కళ్ళం హరనాథరెడ్డి ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ
శ్రీ కళ్ళం హరనాథరెడ్డి
చైర్మన్ : కళ్ళంగ్రూప్
EAMCET Code
KHIT
KHIT Campus - 10 KM from Guntur City, NH-5
మేనేజ్‌మెంట్ సీట్స్ కొరకు సంప్రదించండి : సెల్ : 98856 04528, 94402 61773, 94910 73337.
బిటెక్ కోర్సులు
కంప్యూటర్ సైన్స్ అండ్ ఇంజనీరింగ్ ( సియస్ఇ )
ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ ( ఇఇఇ )
ఎలక్ట్రానిక్స్ అండ్ కమ్యూనికేషన్స్ ఇంజనీరింగ్ ( ఇసిఇ )
సివిల్ ఇంజనీరింగ్ ( సిఇ ), మెకానికల్ ఇంజనీరింగ్ (ఎమ్ఇ )
M.Tech : - CSE
Affiliated to JNTU Kakinada, Approved by AICTE, New Delhi
యన్‌హెచ్ - 5 . 10వ కి.మీ, వద్ద, కళ్ళం స్పిన్నింగ్ మిల్స్ వెనుక,
చిలకలూరిపేట రోడ్, చౌడవరం, గుంటూరు - 19. ఫోన్ : 0863 - 2119726.
సిటీ ఆఫీస్ : ఫస్ట్‌లైన్, గుజ్జనగుండ్ల సర్కిల్, గుంటూరు - 6.
ఫోన్ : 0863 - 2272345.
Vijay ads 9949525191

# ముఖచిత్ర పరిచయము

సంవత్సర ప్రమదకు ముఖతిలకంలా మార్గశీర్షం రానేవచ్చింది. ఈమాసమంతా మార్గళిగా ధనుర్మాస వ్రతం, ప్రవచనాలు దేశమంతా సాగుతాయి. ఈతెలుగు భూమి ధనుర్మాసానికి పెట్టిందిపేరు. ఈవ్రతానికి మూలం గోదమ్మ. ఈమెను'ఆముక్త మా.ల్యద' అన్నారు కృష్ణదేవరాయలువారు. గోదమ్మ ఇంట పెద్దపూదండ దాల్చిన మురళీమోహనుని చిత్తరువు ఉంది. ఏమాఅందం? తలపై నెమలిపింఛం, నుదుటిపై కదలాడుతున్న ముంగురులు, చేతిలో పిల్లనగ్రోవి, రెండుభుజాల మోచేతులనుంచి క్రిందికి జారి వింత సొబగులీనుతున్న ఉత్తరీయం, మేనధరించిన ఆభరణాలు ఈరూపమేకదా గోపికలను వశపరచుకున్నది. ఇక మన గోదమ్మ కూడా ఆగోపవర్గంలోనే చేరింది. చిత్తరువులో కన్నయ్య దాల్చిన పూదండలాంటి పెద్దపూదండ తానూ స్వామికి ధీటుగా తాల్చాలి, కానీ లేదు. ఉన్నదో! నాన్న రంగపతికి సమర్పించడానికైన పెద్దపూదండ, అయితేనేం, దాన్నే తానొకమారు అలంకరించుకొని, తన మెడలోని పూదండను కృష్ణుడు చిత్తరువులోదాల్చిన పూదండతో పోల్చి చూచుకుని తృప్తిచెందుతున్నది గోదమ్మ. దీన్ని చూచిన తండ్రి నివ్వెరపోతున్నాడు. అపచారమని నోరుకొట్టు కుంటున్నాడు. కాని గోదమ్మ పూదండదాల్చిచూపిన వయారానికి చిత్తరువులోని స్వామికూడా సరసుడై చిరునవ్వును చిందిస్తున్నాడు.

రసికశిఖామణికదా మనస్వామి!

---

జై శ్రీమన్నారాయణ !





## 18వ గోపాలోపాయన పురస్కార సమర్పణము

## ఆచార్య వరివస్య-2014

**శ్రీమదుభయవేదాంతాచార్యపీఠం (ట్రస్టు) నిర్వహణలో....!**

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారు,**

**శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు,**

**శ్రీశ్రీశ్రీ త్రిదండి దేవనాథ రామానుజ జీయర్‌స్వామివార్ల ప్రత్యక్షపర్యవేక్షణలో...!**

**కీర్తిమూర్తులైన ఉ.వే.శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యస్వామివారి**

**తిరునక్షత్ర సందర్భముగా, ఆచార్యస్మరణంగా**

18వ గోపాలోపాయన పురస్కార సమర్పణం ది.27-1-2014న జరుగుతుంది.

*న్యాయమీమాంసోభయవేదాన్త విద్వాంసులు, రాష్ట్రియ సంస్కృతవిద్యాపీఠం విశిష్టాద్వైతవేదాంతాచార్యులు*

**ఉ.వే. శ్రీమాన్ కె.ఇ. దేవనాథన్ స్వామివారు**- తిరుపతివారుఈసంవత్సరం గోపాలోపాయనాన్ని స్వీకరిస్తున్నారు.

భగవద్బంధువులకు ఇదే మా హృదయపూర్వక ఆహ్వానము.

**వేదిక : వాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం, గుంటూరుజిల్లా.**

# ముముక్షు రహస్యం

*గత సంచిక తరువాయి*

శ్రీమతి చక్రవర్తుల చూడామణీ -ఖమ్మం

"అత్తయ్యా! పరాశరభట్టర్ వారికి సంబంధించిన వాక్యం ఒకటున్నది కదా!"

అవునమ్మా! వాక్కినాల్ ఎన్నేనో భట్టరైప్పోలే?" అని ఒకప్రశ్న. తోళ్ కాట్టి వన్దేనో భట్టరైప్పోలే?" అని ఒకటి. మొత్తం భట్టరువారికి సంబంధించినవి రెండు ప్రశ్నలున్నాయి.

"అవి కూడా చెప్పవా పిన్నీ!" వకుళ.

"శ్రీ పరాశరభట్టర్ ఎవరి కుమారులో తెలుసుగా!" బామ్మగారు.

"కూరత్తాళ్వాన్ వరపుత్రులు కదా పిన్నీ!"

"బాల్యంలో తోటి పిల్లలతో చేరి వీధిలో ఆడుకుంటున్నారు. అప్పుడు 'సర్వజ్ఞ భట్టర్' అనే మాయావాది ఒకడు ఆ వీధినే వస్తున్నారు. వారి శిష్యులు, భృత్యులు ముందు నడుస్తూ వారి బిరుదనామాలను పెద్దగా చెప్తూ బరాబరీ చేస్తున్నారు. అది చూసి భట్టరువారు ఆశ్చర్యపోయారు. "జ్ఞాన, భక్తి, వైరాగ్య సంపన్నులైన ఉడయవర్లు, కూరత్తాళ్వాన్, ఆండాన్, ఎంబారులాంటి ఆచార్య పురుషులు నివాసముంటున్న వీధిలో ఇంత అట్టహాసంగా ఊరేగింపుగా వస్తున్న ఈ అహంకారి సర్వజ్ఞుడా? ఈయన సర్వజ్ఞత ఎంతో చూద్దాం" అనుకున్నారు.

నేలమీది నుండి గుప్పెడు మట్టి చేతిలోకి తీసుకున్నారు. ఆ విద్వాంసుడి ముందుకురికి, ఆయన ముందు తన చేతినుంచి ''తమరే సర్వజ్ఞులైతే ఇది ఎంతో చెప్పండి. ఒకవేళ చెప్పలేకపోయారో. మీరు విద్వాంసులా? పండితులా? సర్వజ్ఞులా? మీకు బిరుదులు, బరాబరీలునా?" అన్నారు. ఆ మాయావాది సమాధానం చెప్పలేకపోయాడు. సిగ్గుతో తలవంచుకున్నాడు. 'ఇంత చిన్న పిల్లవాడు నన్ను నోరెత్తకుండా చేశాడే! ఏ పుణ్యదంపతుల వరపుత్రుడో అని ఆ పిల్లవాడి వాక్చాతుర్యానికి పొంగిపోయాడు. కూరత్తాళ్వాన్ కుమారులని తెలుసుకొని పిల్లవాణ్ణి ఎత్తుకొని వాళ్ళింటిదాకా తీసుకువెళ్ళి దింపాడు.

"అంత చిన్నవయసులోనే ఒక గొప్పపండితుడిని అవలీలగా గెలిచారన్నమాట!"

''భట్టరువారికి సంబంధించి ఇంకో వార్త కూడా తిరుక్కోళూరుమ్మాళ్ ఆనతిచ్చారు. అదేమిటంటే "తోళ్ కాట్టి వందేనో భట్టరైప్పోలే?"

"భట్టరులాగా భుజం చూపించానా?" అని అర్థం.

"చెపుతాను తొందరపడకు. ఈ సంఘటన జరిగిందో లేదో తెలియదు. ఆ రోజులలో 'నంబెరుమాళ్' వీధిలోవచ్చే సమయంలో శ్రీరంగంలోని ప్రతీవీధి ఇసుకవేస్తే రాలనంత మంది జనం ఉండేవారు. అందుకని 'పెరుమాళ్ళ' మార్గంలో దారి ఇవ్వమని ప్రజలను పక్కకు నెట్టడం కోసం కొందరిని నియమించేవారు.

ఇపుడు తిరుపతిలో 'జరగండి' అని నెట్టి పారేసే వాళ్ళలాగా సరిగ్గా అంతే! వాళ్ళ చేతుల్లో తోలుబెల్టులుండేవి. వాటిని ఝళిపిస్తూ జనాన్ని, పక్కకు నెట్టేవారు. ఒక్కోసారి అది గుంపులోని వాళ్ళకు తగులుతూ ఉండేది. ఒకసారి భట్టరువారు భుజాలకు ఈ తోలుపట్టీ (బెల్టు) తగిలిందట."

"అమ్మో! ఎంత దెబ్బ తగులుతుందో కదా!"

"అంతేగా! మనలాంటి వాళ్ళయితే ఏడ్చి గోలపెట్టేవాళ్ళం. భట్టరు దానిని పెరుమాళ్ళ ప్రసాదంగా స్వీకరించారు. ఆయన శిష్యులు 'పట్టీ' ఝళిపించిన వాడిని కోప్పడ్డారట. వాళ్ళు క్షమించమని ప్రార్థిస్తూ' స్వామిని పోల్చుకోలేకపోయాం. మేం ఈ పనిలో కొత్తగా చేరామ'ని చెప్పారట. దానికి భట్టరు ఏం చెప్పారో తెలుసా! 'మీ తప్పేమీ లేదు. మీ కర్తవ్యం మీరు నిర్వహించారు. నా తప్పు ఉంటే మీకు దండించే అధికారం ఉంది. మీ 'పట్టీ' ఒక్క భుజానికే తగిలింది. రెండోభుజం మీద కూడా వేయండ'ని రెండో భుజం చూపారట."

"ఆ కైంకర్యపరులు సిగ్గుతో చితికిపోయారనుకుంటాం."

"అంతేగా మరి. తనకు అపకారం చేసినవారిపట్ల క్షమాగుణం చూపడం నిజమైన శ్రీ వైష్ణవ లక్షణం. ఇలాంటి క్షమాగుణం, వాక్చాతుర్యం నాకు లేకపోయింది కదా! అని అమ్మాళ్ ఈ వార్తలు చెప్పారు.

రుచికి, సువాసనకి, ఆరోగ్యానికి నాణ్యమైన
"ఆశాలత"
పసుపు, కారం, ధనియాలపొడి మరియు సేమియానే ఎల్లప్పుడు వాడండి
రవికుమార్ అండ్ కంపెని - చెన్నై
044 25204046, 26171341
Vijay Ads

తిరువరంగత్తముదనార్లు అనుగ్రహించిన ప్రపన్నగాయత్రి

# ఇరామానుశనూత్తన్దాది

గత సంచిక తరువాయి

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

### 17వ పాశురం

**మునియార్ తుయరంగళ్ ముందిలుమ్, ఇన్బంగళ్ మొయ్త్తిడినుమే**
**కనియార్ మనమ్ కణ్ణమంగై నిన్ఱానై, కలైపరవుమ్**
**తనియానైయై తణ్ తమిళ్గ్ర్శెయ్త నీలన్ తనక్కులగిల్**
**ఇనియానై, ఎంగళ్ ఇరామానుశనై వన్దెయ్ తినరే ॥**

**ప్రతిపదార్థం:**

| | |
|---|---|
| **కలైపరవుమ్** | = అన్నిశాస్త్రములచేత స్తుతింప బడుచున్న |
| **తని ఆనైయై** | = అద్వితీయమైన మదగజంవంటి |
| **తిరుక్కణ్ణమంగై నిన్ఱానై** | =తిరుక్కణ్ణమంగైలో వేంచేసియున్న పత్తరావి ప్పెరుమాళ్ళనుగూర్చి |
| **ఉలగిల్** | = ఈ లోకంలో |
| **తణ్ తమిళ్గ్ర్శెయ్ద** | = ద్రావిడ దివ్యప్రబంధాన్ని అనుగ్రహించిన |
| **నీలన్ తనక్కు** | = తిరుమంగై ఆళ్వార్ల విషయంలో |
| **ఇనియానై** | = ప్రేమ కలిగిన |
| **ఎంగళ్** | = మాకు ఆచార్యులయిన |
| **ఇరామానుశనై** | = భగవద్రామానుజులను |
| **వందు ఎయ్దినర్** | = వచ్చి సేవంచే మహానుభావులు |
| **తుయరంగళ్ ముందిలుమ్** | |
| **మునియార్** | = కష్టాలువచ్చి మీదపడినా క్రుంగిపోరు |
| **ఇన్బంగళ్** | = ఆనందాలు |
| **మొయ్త్తిడినుమ్** | |
| **కనియార్** | = అధికంగా మీదపడినా గాలిలో ఎగిరిపోరు. |

**తాత్పర్యము:**

శ్రీతిరుమంగై ఆళ్వార్లు శ్రీమన్నారాయణుని అద్వితీయ వైభవాన్ని తమ ద్రవిడ ప్రబంధాలలో అత్యద్భుతంగా వర్ణించారు. ఆ ఆళ్వార్ల శ్రీసూక్తులకు పరవశించి, వారికి అంతరంగ భక్తులయ్యారు భగవద్రామానుజులు. ఆ యతిరాజులను ఆశ్రయించిన మహానుభావులు లోకంలోని సంసారులవిధంగా కష్టాలకి క్రుంగిపోరు. ఆనందాలకి పొంగిపోరు.

శ్రీ తిరుమంగై ఆళ్వారుల వైభవాన్ని తలపింపచేస్తున్నారు అముదనార్లు ఈ పాశురంలో.

శ్రీతిరుమంగై ఆళ్వార్లకే నీలన్ అనిపేరు. వీరు అందమైన ద్రవిడభాషలో ఆరు దివ్యప్రబంధాలు రచించారు.

అవి- పెరియతిరుమొళ్ళి, తిరుక్కురున్దాండకం, తిరునెరున్దాణ్డకం, తిరువెళ్లుక్కూత్తిరుక్కై, శిఱియ తిరుమడల్, పెరియతిరుమడల్. ఈ ఆరు గ్రంధాలు శ్రీనమ్మాళ్వార్లు రచించిన నాల్లుదివ్యప్రబంధాలకి షడంగాలుగా ప్రసిద్ధికెక్కాయి. సంస్కృత వేదాలు నాల్గింటికి ఆరు అంగాలున్నట్లే ఇక్కడ ద్రవిడవేదాలకివి అంగాలుగా కూరాయి. తిరుమంగై ఆళ్వార్లు ఆశు- మధురం- చిత్రం- విస్తారం అనే నాల్గువిధాలైన కవితలు చెప్పి చతుష్కవి శిఖామణులుగా బిరుదు వహించారు.

భగవద్రామానుజులు ఆ ఆళ్వార్లపట్ల అత్యంత భక్తిశ్రద్ధలు కలిగినవారు. అటువంటి రామానుజుల నాశ్రయించిన మహానుభావులు కష్టాలకి క్రుంగిపోరు. సుఖాలకి పొంగిపోరు అంటూ భగవద్భక్తులు స్థితప్రజ్ఞులై మెలగాలని చక్కని హితాన్ని ఉపదేశించారు తిరువరంగత్తముదనార్లు.

### 18వ పాశురం

**ఎయ్త అ్కరియ మఱైకళై, ఆయిరమిన్ తమిళ్గ్రాల్**
**శెయ్తర్కులకిల్ వరుం శడకోపనై, శిన్దెయుళ్ళే**
**పెయ్తత్కిశెయుమ్ పెరియవర్ శీరై యుయిర్కళెల్లామ్**
**ఉయ్ తక్కుదవుమ్ ఇరామానుశన్ ఎమ్ముఱు తుణైయే ॥**

**ప్రతిపదార్థము:**

| | |
|---|---|
| **ఎయ్తఅ్కరియ** | = నేర్చుకొనడానికి కష్టమైన |
| **మఱైకళై** | = వేదాలను |
| **ఇన్ తమిళ్గ్ర్** | = తియ్యని ద్రావిడభాషలో |
| **ఆయిరత్తాల్** | = వేయి పాశురాలలో |
| **శెయ్తఱ్కు** | = అనుగ్రహించడం కోసం |
| **ఉలకిల్ వరుం** | = ఈ లోకంలో అవతరించిన |
| **శడగోపనై** | = నమ్మాళ్వార్లను |
| **శిన్దై ఉళ్ళే** | = తమ హృదయం లోపల |
| **పెయ్తఱ్కు ఇశైయుమ్** | = ధ్యానించడానికి ఇష్టపడిన |
| **పెరియవర్** | = మహనీయులైన మధురకవుల యొక్క |
| **శీరై** | = కళ్యాణగుణాలను |
| **ఉయిర్కళ్ ఎల్లామ్** | = సకల ఆత్మలు |
| **ఉయ్తఱ్కు** | = ఉజ్జీవించేటట్లు |

**ఉతవుమ్** = ఉపకారముచేసే
**ఇరామానుశన్** = భగవద్రామానుజులు
**ఎమ్ ఉఱు తుణైయే** = మాకు గొప్పదిక్కు

**తాత్పర్యం:**

శ్రీ నమ్మాళ్వార్లు దయాస్వరూపులు. వేదాలలో ఎన్నో అర్థాలు దాగిఉన్నాయి. ఆ వేదాల అధ్యనం చేయ్యడం అందరికీ సాధ్యంకాదు కదా! మరెలా? అందుకని వేదాలలో ఉండే సారాన్ని తీసి, అందమైన తియ్యని ద్రవిడభాషలో కూర్చి ఈ లోకానికి అందించడంకోసమే అవతరించిన మహనీయులు నమ్మాళ్వార్లు. వారిని సదా తమ మనస్సులో నిలుపుకొని ఆచార్యనిష్ఠకు మారుపేరై నిలచిన మహనీయులు మన మధురకవి ఆళ్వార్లు. వారి వైభవం లోకానికి వివరించి చెప్పి, సకల ఆత్మ ఉజ్జీవనానికి, లోకోపకారానికి అంకితమయ్యారు. మన భగవద్రామానుజులు ఆయతీశ్వరుడే మనకి రక్షకులు.

వేదాలను ద్రావిడీకరించారు నమ్మాళ్వార్లు. వారికి పరమభక్తులై నిలిచారు శ్రీమధురకవులు. అంతగొప్పవారు కాబట్టి వారిని పెరియవర్ అంటూ కీర్తించారు అముదనార్లు. శ్రీమన్నారాయణుని తమలో నింపుకొన్న నమ్మాళ్వార్లనే తమలో ఇముడ్చుకున్న మధురకవులు, నిజంగా పెరియవర్ అనే విశేషణానికి న్యాయం కూర్చిన మహనీయులు. వారిని సేవించే భగవద్రామానుజులే మనకి రక్షకులంటున్నారు అముదనార్లు.

*********

**19వ పాశురం:**

**ఉఱు పెరుం శల్వముమ్ తన్దైయుం తాయుం, ఉయర్‌కురువుమ్**
**వెఱితరు పూమకళ్ నాతనుమ్ మాఱన్ అళంగియశీర్**
**వెఱి తరుం శెంతమిళ్గ్ ఆరణమే ఎన్ఱు ఇనీళ్ నిలత్తోర్**
**అఱితరనిన్ఱ ఇరామానుశన్ ఎనక్కు ఆరముతే ॥**

**ప్రతిపదార్థము:**

**ఉరుపెరు శెల్వముమ్** = చాలా గొప్ప సంపదయును
**తందైయుమ్** = తండ్రియును
**తాముమ్** = తల్లియును
**ఉయర్ కురువుమ్** = సదాచార్యుడును
**వెఱితరు** = సుగంధభరితమైన
**పూమగళ్** = తామరపువ్వులు పుట్టిన లక్ష్మీదేవికి
**నాతనుమ్** = భర్త అయిన శ్రీమన్నారాయణుడును అన్నీ
**మాఱన్ విళంగియశీర్** =నమ్మాళ్వార్లు అనుగ్రహించిన రీతిని
**నెఱితరుమ్** = ప్రసాదించిన
**శెమ్ తమిళ్గ్**
**ఆరణమే ఎన్ఱు** = అందమైన ద్రావిడవేదం తిరువాయ్ మొళ్గియే అని
**ఇనీల్ నిలత్తోర్** = ఈ విశాలమైన భూమిలోని జనులందరూ
**అఱితరనిన్ఱ** = తెలుసుకొనునట్లు ఉపదేశించుచున్న
**ఇరామానుశన్** = శ్రీమద్రామానుజులవారే
**ఎనక్కు** = ఈ దాసునికి
**ఆరముదు** = నిరంతిశయ భోగ్యమగు అమృతము

**తాత్పర్యం:**

శ్రీ నమ్మాళ్వార్లు ప్రసాదించిన తిరువాయ్‌మొళ్గి మానవునికి సర్వస్వం. ఆ నమ్మాళ్వార్ల ద్రవిడవేదాన్ని నమ్మి, వ్యాపింపచేసి, వ్యాఖ్యానాలు అందింపచేసి, జీవిత సర్వస్వంగా స్థిరీకరించారు భగవద్రామానుజులు. వారికి దాసుడనై అనన్యభోగ్యుడనయ్యాను. రామానుజులే నాకు అమృత స్వరూపులు అంటున్నారు అముదనార్లు.

శ్రీ ఆళ్వందార్లు మాతాపితాయువతయ.... అనే శ్లోకంద్వారా శ్రీ నమ్మాళ్వార్ల శ్రీచరణాలే సర్వస్వం అని చాటిచెప్పారు. ఈ పాశురంలో ఆ నమ్మాళ్వార్ల శ్రీసూక్తులనే సర్వస్వంగా చాటిచెప్పిన భగవద్రామానుజులే అమృతస్వరూపులు అంటున్నార్లు.

తిరువాయ్‌మొళ్గి దివ్యప్రబంధమే సకలచేతనులకు ఉజ్జీవ కారకమని ఉపదేశించే ఎంబెరుమానారులు అపర్యాప్తామృత స్వరూపులు అని అర్థం.

*********

**20వ పాశురం:**

**ఆరప్పొళ్గిల్ తెన్ కురుకై ప్పిరాన్ అముతత్తిరువాయ్**
**ఈర త్తమిళ్గిన్ ఇశై యుణరన్దోర్ కట్కు ఇనియవర్ తమ్**


జై శ్రీమన్నారాయణ
తీర్థయాత్ర
ముక్తినాథ్ యాత్ర కలదు.
22-12-2013 విజయవాడ నుండి బయలుదేరును
108 శ్రీ వైష్ణవ దివ్య దేశములలో 95 తమిళనాడు మరియు కేరళలోని శ్రీ వైష్ణవ దివ్య దేశముల 16 రోజుల తీర్థయాత్ర
| | |
|---|---|
| తొండైనాడు | - 22 |
| నడునాడు | - 2 |
| చోళనాడు | - 40 |
| పాండ్యనాడు | - 18 |
| మలైనాడు | - 13 |
| క్షేత్రములు | 95 |

వివరములకు :
విష్ణు వందన ట్రావెల్ సర్వీసెస్
సెల్: 09290574187
09032935316

**శీరై పయిన్దు ఉయ్యుం శీలం కొళ్ నాదమునియై నెంజాల్**
**వారి ప్పరుకుం ఇరామానుశన్ ఎన్ తన్ మానితియే ॥**

*ప్రతిపదార్థం:*

**ఆరమ్ పొళ్ఖిల్** = చందనవృక్షములతో కూడిన తోటలతో
**తెన్ కురుకై పిరాన్** = తిరుక్కురుగూర్‌లో అవతరించిన మహోపకారకులైన ఆళ్వార్లయొక్క
**అముదమ్** = అమృతమువలె పరమభోగ్యమైన
**తిరువాయ్** = దివ్యవాక్కులనుండి పుట్టిన
**ఈరం తమిళ్ఖిన్ ఇశై** = ఆర్ద్రద్రావిడ దివ్యప్రబంధమైన తిరువాయ్‌మొళ్ఖి రాగాన్ని
**ఉణర్న్దోర్ కట్కు** = అనుభవించినవారికి
**ఇనియవర్ తమ్** = ఇష్టులైనవారి యొక్క
**శీరై** = దివ్య కళ్యాణగుణములను
**పయిన్దు** = అనుసంధించి
**ఉయ్యుం** = ఉజ్జీవించే
**శీలం కొళ్** = స్వభావం కలిగిన మహనీయులైన
**నాదమునియై** = నాథమునులను
**నెంజాల్** = తమ మనస్సుచే
**వారి** = కుతూహలంతో
**పరుకుమ్** = పానముచేసే
**ఇరామానుశన్** = భగవద్రామానుజులు
**ఎన్ తన్ మానితియే** = దాసునికి మహానిక్షేపము, మహానిధి.

**తాత్పర్యము:**

శ్రీనమ్మాళ్వార్లు తిరునగరిలో అవతరించారు. చందనవనాలతో, దివ్యగంధాలందించే పూలవనాలతో కన్నులపండువుగా ఉంటుంది ఈ ఊరు. ఇక్కడ అవతరించిన నమ్మాళ్వార్లు మన తాపాలన్నింటిని పోగొట్టే తిరువాయ్‌మొళ్ఖి దివ్యప్రబంధాన్ని అనుగ్రహించారు. మధురకవులు అర్థానుసంధానంగా దానిని అభ్యసించి, ఆచార్యభక్తిలో దివ్యానందాన్ని పొందారు. అలాగే తిరుమంగై ఆళ్వార్లనే మహనీయులు ఆ దివ్యగ్రంథాస్వాదనలో అమందానందాన్ని పొందారు. అటువంటి మహనీయులను తమ హృదయంలో పదిలపరచుకొన్నారు శ్రీమన్నాథమునులు. అటువంటి మహనీయులను సేవించినవారు భగవద్రామానుజులు. వారేనాకు తరగనినిధి అంటున్నారు అముదనార్.

**21వ పాశురం:**

**నితియై ప్పొళ్ఖియుం ముకిలెన్దు, నీశర్ తమ్ వాశల్ పత్తి**
**త్తుతి కత్తు ఉలకిల్ తువళ్ఖ్ కిన్ఱిలేన్ ఇని, త్తూయ్ నెతిశేర్ ।**
**ఎతి కట్కు ఇఱైవన్, యమునై త్తుఱైవన్ ఇణైయడియాయ్**
**కతి పెత్తుడైయ, ఇరామానుశన్ ఎన్నై క్కాత్తననే ॥**

*ప్రతిపదార్థం:*

**తూయనెతిశేర్** = అతి పవిత్రసాధనములు కల్గిన
**నెతికట్కు** = యతులకు
**ఇఱైవన్** = నాయకులైన
**యమునైత్తుఱైవన్** = ఆళ్‌వందార్లయొక్క
**ఇణై అడి ఆయ్ కతి** = పాదముల జంటనే, గతిగా,
**పెత్తుడైయ** = పొందియున్న
**ఇరామనుశన్** = నన్ను రక్షించినవారు
**ఇని** = ఇకపై (ఇప్పుడు)
**నితియై పొళ్ఖియుమ్** = నిధులను వర్షించే
**ముకిల్ ఎన్దు** = మేఘమా! అని
**తుతికత్తు** = స్తోత్రము చేసి
**ఉలకిల్** = ఈ లోకంలో
**నీశర్తమ్** = నీచులైన వారియొక్క
**వాశల్ పత్తి** = ద్వారములను ఆశ్రయించి
**తువళ్ఖ్ గిన్ఱిలేన్** = విలవిలలాడును.

**తాత్పర్యము:**

నాకు ఈనాడు భగవద్రామానుజులే రక్షకులు. వారెంత గొప్పవారో కదా! పవిత్ర అనుష్ఠానంతో యతీశ్వరులకే తలమానికంగా నిలిచిన ఆళ్వందార్ల దివ్యపాదారవింద యుగళమునే ఆశ్రయించిన మహానుభావులు. అటువంటి యతిరాజులు నాకు రక్షకులుగా లభించిన తరువత ఇప్పుడు నేను జ్ఞానహీనులు, దురహంకారులైన నీచుల వాకిళ్ళలో నిలిచి మీరు ఇంద్రులు, చంద్రులు, ఉదారులు అంటూ పొగడి నా కాలాన్ని దుఃఖమయం


అదృష్ట రత్నాలు ధరించండి ! అనుకున్నది సాధించండి !
శ్రీ సాయి
పవిత్ర డైమండ్స్
4/7, బ్రాడీపేట, ఖజానా జ్యూయలర్స్ ప్రక్కన, గుంటూరు. సెల్: 9246410099, ఫోన్ : 2262626.
బి/3, జైహింద్ కాంప్లెక్స్, గ్రౌండ్‌ఫ్లోర్, యాక్సిస్‌బ్యాంక్ ప్రక్కన, గవర్నర్‌పేట, విజయవాడ. సెల్ : 9246310099, ఫోన్ : 6665011.
సంపూర్ణ జ్యోతిష్యం చూడబడును
నాణ్యమైన జాతిరత్నాలు
జెమ్ టెస్టింగ్ ల్యాబ్
కెంపులు పచ్చల పూసలు
మంచి ముత్యములు, పగడములు
శివస్వరూపమైన రుద్రాక్షలు
స్పటికమాలలు
1 గ్రామ్ గోల్డ్ ఇమిటేషన్ జ్యూయలరి

చేసుకోను. ఆ దురవస్థ ఈనాడు తీరిపోయింది. ఇది రామానుజ కటాక్షము అంటున్నారు అముదనార్లు.

**********

**22వ పాశురం:**

**కార్తిగైయానుం కరిముగత్తానుం కనలుం ముక్కణ్**
**మూర్తియుం మోడియుం వెప్పుం ముదుగిట్టు మూవులగుమ్।**
**పూత్తవనే యెన్రు పోత్తిడ వాణన్ పిழைపొఱుత్త**
**తీర్తనై యేత్తుం ఇరామానుశన్ ఎన్దన్ శేమవైప్పే ॥**

*ప్రతిపదార్థం:*

**కార్తిగైయానుమ్** = కృత్తికానక్షత్రమునందుదుయించిన సుబ్రహ్మణ్యస్వామి,
**కరిముగత్తానుమ్** = గజముఖుడైన వినాయకుడును,
**కనలుమ్** = అగ్నియును
**ముక్కణ్ మూర్తియుమ్** = త్రినేత్రుడగు రుద్రుడును
**మోడియుమ్** = దుర్గయును
**వెప్పుమ్** = జ్వరదేవతయును
**ముదుగిట్టు** = స్వామి చక్రాయుధమునకు భయపడి వెన్నుచూపి పరుగుపెట్టుచు
**మూవులగుం పూత్తవనే**
**ఎన్రు పోత్తిడ** = ముల్లోకములను నాభీకమలము నుండి సృష్టించిన దయామయా! కాపాడు అని స్తోత్రము చేయగా
**వాణన్** = బాణాసురునియొక్క
**పిழை** = నేరమును
**పొఱుత్త** = క్షమించి అతనిని కాపాడిన
**తీర్తనై** = దివ్య కల్యాణగుణ సముద్రుడైన సర్వేశ్వరుని
**ఏత్తుం** = స్తోత్రము చేయుచున్న
**ఇరామానుశన్** = భగవద్రామానుజ ముని సార్వభౌములు
**ఎన్ తన్** = నాకు
**శేమం వైప్పు** = ఆపద్ధనము

**తాత్పర్యము:**

భగవద్రామానుజులే నాకు ఆపద్ధనము అనే విషయాన్ని స్పష్టంగా వివరిస్తున్నారీ పాశురంలో అముదనార్లు. ఈ పాశురంలో ఒకకథ ప్రస్తావింపబడింది. ఈ కథ భాగవతం, హరివంశం మొదలైన గ్రంథాలలో ప్రసిద్ధము. ఆ కథేమిటంటే..

బాణాసురుడు గొప్ప రాక్షసుడు. ప్రహ్లాదునికి మనమడు. బలి చక్రవర్తికి పుత్రుడు. శివభక్తుడు. శివుని నాట్యాన్ని చూచి ఆనందంతో నాట్యానికి అనుగుణంగా తన రెండుచేతులతో మద్దెల మ్రోగించాడు. పరవశించాడు శివుడు. అతనికి వేయి బాహువులు, అగ్ని ప్రాకారము, గొప్పసంపద, బలం ఇచ్చాడు. అంతేకాదు. 'నీవు ద్వారంలో కావలి కాస్తూ నాకు సర్వలోక జయాన్ని కల్గించడానికి నీ పరివారంతో సహా నా దగ్గరికి రావాలి అని బాణాసురుడు ప్రార్థిస్తే సరే అని వరమిచ్చి బాణాసురునికి కావలివానిగా ద్వారంలో నిలిచాడు. ఆ బాణాసురుని కూతురు ఉష. అందగత్తె. ఆవిడకోసం ఒక భవనాన్ని విశ్వకర్మ వంశీయులచే కట్టించి ఇచ్చాడు. ఆవిడ ఒకరోజు నిద్రలో ఒక పురుషునితో కలసినట్లు కలగంది. వెంటనే తన ఇష్టసఖి చిత్రలేఖకి ఆ విషయాన్ని చెప్పింది. చిత్రలేఖ మూడులోకాలలోని రాజకుమారుల అందమైన చిత్రపటాలు తెచ్చి ఉషకి చూపించింది. అందులో ఒక అందగానిని చూపి ఇతడే అని చెప్పింది. వెంటనే చిత్రలేఖ అతనిని గూర్చి తెలుసుకొంది. ఆ రాజకుమారుడు ద్వారకానగరవాసియైన శ్రీకృష్ణపరమాత్మ మనుమడని, ప్రద్యుమ్నుని కుమారుడని, అతనిపేరు అనిరుద్ధడని చెప్పింది. ఉష ప్రార్థనపై చిత్రలేఖ యోగవిద్యామహిమతో ద్వారకచేరి, అంతఃపురంలో ఉన్న అనిరుద్ధని తెచ్చి ఉషాదేవి మందిరంలో చేర్చింది. ఉషానిరుద్ధులు గాంధర్వ వివాహం చేసుకున్నారు. ఈ విషయం బాణునికి తెలిసి అనిరుద్ధుని బంధించాడు.

శ్రీకృష్ణునకీ విషయం తెలిసింది. వెంటనే బానాసురునిపై దండెత్తాడు. శోణితనగరం చేరాడు. శివుడు పరివారం కాపలా ఉన్నారు కదా! శివునితో సుబ్రహ్మణ్యుడు, వినాయకుడు, అగ్ని, దుర్గ, జ్వరాధి దేవత వీరంతా కలసి ఎదుర్కొన్నారు. జ్వరదేవత మూడుకాళ్ళతో, మూడుతలలతోవచ్చి శ్రీకృష్ణునిపై పడబోయింది. శ్రీకృష్ణుడు వారందరినీ తరిమి కొట్టాడు. అగ్నిదేవతలను ధ్వంసం చేశాడు. శివుణ్ణి, పరివారాన్ని శక్తిహీనుల్ని చేశాడు. చక్రాయుధం బాణాసురుని వేయి చేతుల్ని నరికేసింది. బాణుని ప్రార్థన విని కరిగిపోయాడు శ్రీకృష్ణుడు. ప్రాణాలతో విడిచిపెట్టాడు. ఉషానిరుద్ధలకు అందరి సమక్షంలో వివాహం జరిపించాడు. ద్వారకకు తిరిగి వచ్చాడు.

ఇటువంటి కల్యాణగుణాకరుడైన శ్రీకృష్ణుని సర్వకాల సర్వావస్థలలో స్తోత్రం చేస్తున్న భగవద్రామానుజులే నాకు ఆపద్ధనము అంటున్నారు తిరువంగత్తముదనార్.

*********

# నేర్చుకుందామా! - 24

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

ఏక ఏవ సుహృద్ధర్మః
నిధనేప్యనుయాతి యః ।
శరీరేణ సమం నాశం
సర్వమన్యత్ తు గచ్ఛతి ॥

ఈ లోకంలో శరీరంతో పాటే అన్నీ మనని విడిచి పెట్టేస్తాయి. కాని, విడిచిపెట్టకుండా మనకూడా వచ్చేది ధర్మమే. అదే మనకి మిత్రము.

ధర్మం యొక్క గొప్పతనాన్ని ఈ శ్లోకం మనకి వివరిస్తోంది. జీవించి ఉన్నంతకాలం ఎన్ని బంధాలో కదా! కానీ అవన్నీ శరీరం విడిచిపెట్టగానే సడలిపోయే బంధాలు. అవే శాశ్వతమనుకుంటాం. కానీ అవి కూడారావు. మరి శరీరాన్ని విడిచినా, మనని వదవకుండా అనుసరించి వచ్చేది ధర్మమొక్కటే. అందుకనే ధర్మాన్ని ఆచరించాలి. 'ధర్మోరక్షతి రక్షితః". మనం ధర్మాన్ని రక్షిస్తే అది మనల్ని రక్షిస్తుంది. దీనినే కాళిదాసు చాలా అందంగా చెప్తాడు. కంచుకి అనే ఒకభృత్యుడు అంతఃపురంలో తిరుగాడే సమయంలో కూడా చేతిలో ధర్మదండం ఉంటుంది. దాన్ని పట్టుకొనే తిరగడం అతని ఆచారం. అలా అలవాటైన దండం కాలంగడిచినకొద్దీ చేతిలో ఊతగా ఆధారంగా, అవసరంగా, ఆవశ్యకంగా మారిపోతుంది అంటాడు. అలాగే మనం ధర్మాన్ని ఆచరిస్తే తరువాత అదే మనకి కూడా వచ్చే నిజమైన మిత్రంగా నిలుస్తుంది.

ధర్మాన్ని ఆచరించండి! ధర్మజ్ఞుల్ని ఆదరించండి!!

**ధర్మో రక్షతి రక్షితః**

రామే ప్రవ్రజనం బలేర్నియమనం, పాండోః సుతానాం వనం,
వృష్ణీనాం నిధనం, నలస్య నృపతే రాజ్యాత్ పరిభ్రంశనమ్ ।
కారాగార నిషేవణం చ మరణం సంచిత్య లంకేశ్వరే,
సర్వః కాలవశేన నశ్యతి నరః కోవా పరిత్రాయతే ॥

కాలమహిమ చాలా గొప్పది. దాన్ని అతిక్రమించడం ఎంతటివారికి సాధ్యం కాదు. ఈవిషయాన్ని కొందరి చరిత్రలు చూపిస్తూ చెప్తుందీ శ్లోకం.

రావణాదులను ఓడించగల్గినవాడు శ్రీరాముడు. అయినా అడవిపాలు కాక తప్పలేదు. కాలమహిమ కాకపోతే ఏమిటీ!

ఇంద్రాదులను ఓడించినవాడు, మహాదాత బలిచక్రవర్తి. అయినా పాతాళానికి త్రొక్కివేయబడ్డాడంటే విధిబలీయం.

రాజసూయాదులు చేయకల్గిన భుజబలపరాక్రమవంతులు, మహావీరులు పాండవులు. అయినా అరణ్యవాసం, అజ్ఞాతవాసం తప్పలేదుకదా! శ్రీకృష్ణునంతటివాని వంశంలోవారే యాదవులు. అంతఃకలహములు తప్పలేదుమరి.

అశ్వ హృదయం గుర్తించడంలోను, వంటలు వండటంలోను-సూద- జూదాదులలోను అద్వితీయుడు నలుడు. పాపం రాజ్యభ్రంశం పొందక తప్పలేదు.

ఇంక లంకేశ్వరుడైన రావణుడు, కార్తవీర్యార్జుననిచే బంధింపబడి చెలసాలలో పెట్టబడడం, శ్రీరామునిచేతిలో విగతజీవుడవడం, ఇవన్నీ చూస్తూంటే, మానవుడెంత గొప్పవాడయినా కానీండి! కాలానుగుణంగా దానిమహిమకి తల ఒగ్గవలసినదే కాని, తప్పించుకొనలేడు.

కాలం చాలా మహిమాన్వితమైనది. దాని నెవ్వరూ ఎదిరించలేరు అంటోంది ఈ శ్లోకం. అందుకే కాలాన్ని దైవంగా భావించాలి. ఎదురైన పరిస్థితులను దైవప్రసాదంగా స్వీకరించాలి. దైవబలంతోనే చక్కబరచుకోవాలి.

---

**సుభాషితము**

**సువర్ణపుష్పాం పృథివీం చిన్వన్తి పురుషాస్త్రయః ।**
**శూరశ్చ కృతవిద్యశ్చ యశ్చజానాతి సేవితుమ్॥**

ఇది మహాభారతంలోని శ్లోకం. ఎవడైనా ధనార్జనం చేయడానికి ఉండవలసిన యోగ్యతలు మూడు. వీటిలో ఏఒక్కటి ఉన్నాచాలు. ఏమిటవి? దేశాన్ని రక్షించడానికి కావలసిన ధైర్యసాహసాలున్న యోధుడు అయి ఉండటం, ఈతనివలనేకదా దేశంరక్షింపబడేది. ఇక చక్కటి విద్యావైశద్యం కలవాడు కావటం, వీడు దేశానికి మస్తిష్కం లాంటివాడు, వీనివలనే దేశానికి ప్రపంచంలో గుర్తింపు. ఇక మూడవవాడు సామాజిక సేవాతత్పరుడు, వీనివల్ల సమాజానికి సరియైన సేవ అందుతుంది. ఈమూడిటిలో ఏఒక్క లక్షణం ఉన్నవాడైనా బంగారుపూలుకల భూమిని సంపాదిస్తాడంటుంది భారతం.

# మన ఆళ్వార్లు




**తిరుప్పాణి ఆళ్వార్**

**శ్రీలోకసారంగ మహామునీంద్రం**
**స్కంధాధిరూఢం కలయామి నిత్యమ్ ।**
**కళంకహీనం కమనీయ భక్తం**
**కవీశ్వరం గాయక సార్వభౌమమ్ ॥**

శ్రీరంగక్షేత్రానికి నైఋతిదిక్కున కావేరీతీరంలో నిచుళాపురి అనే పట్టణం ఉంది. ద్రావిడభాషలో దీనిని ఉరైయూర్ అంటారు. ఆ ఊరిలో అవతరించారు తిరుప్పాణాళ్వార్. చేతిలో వీణ ధరించి ఉంటారు కాబట్టి వీరికి తిరుప్పాణన్ అనేపేరు సార్థకమైంది.

దుర్మతినామ సంవత్సరం కార్తీకమాసం పూర్ణిమతిథి, రోహిణీ నక్షత్రం, బుధవారం వృశ్చికలగ్నంలో పొలంలో వరివెన్నునుండి అవతరించారు పాణన్. అయోనిజులు వీరు. ఆ గ్రామంలో ఉండే పంచముడు నీవార ధాన్యం కోసం పొలానికి వచ్చాడు. ఆపొలంలో దివ్యకాంతిని చూశాడు. సూర్యుడు నేలపై ఉన్నాడేమిటి అనుకుంటూ దగ్గరగా పోయి చూస్తే బాలుడు ధగద్ధగాయమానంగా మెరిసిపోతున్నాడు. 'ఆహా నాకు పిల్లలు లేరని భగవంతుడిచ్చిన సంతానం' అనుకుంటూ అక్కున చేర్చుకున్నాడు. పరుగుపరుగున పోయి భార్యచేతికిచ్చాడు. ఆతల్లికి ఆనందంతో క్షీరం కలిగింది. కానీ బిడ్డ నోరు తెరవలేదు. ఆవుపాలు తెప్పించిపోస్తే ఆనందంగా త్రాగాడు. చిన్నప్పటినుండే శ్రీమన్నారాయణుని యందే భక్తి. శుక్లపక్ష చంద్రునిలా పెరుగుతూ విష్ణుభక్తునిగా రూపుదాల్చాడు. ద్వాదశోర్ధ్వపుండ్రాలు, మెడలో తులసిమాల, నోరారా శ్రీరంగనాథుని కీర్తన ఆయన సొంతాలయ్యాయి. చేతిలో వీణ పట్టుకొని ఆనందంగా గానం చేస్తూ, వాయిస్తూండేవాడు. భగవంతుని గుణానుభవం చేసే సమయంలో ఒళ్ళు మరిచిపోయేవాడు. శరీరం గగుర్పొడిచేది. కనులనుండి ఆనందబాష్పాలు జాలువారేవి. లోకం గుర్తుండేదికాదు.

ప్రతినిత్యం తెల్లవారుఝామునే లేవడం, పవిత్రకావేరీనదీ స్నాం చేయ్యడం, ఆ ఒడ్డునే నిలిచి శ్రీరంగనాథుని కీర్తించడం ఇదీ ఆయన జీవనవిధానం.

శ్రీరంగనాథుని ఆలయంలో లోకసారంగముని అనేస్వామి ఉండేవారు. ఆయన స్వామికి నిత్యతీర్థకైంకర్యం చేసేవారు. వారు ఒకరోజు కావేరిలో స్నానమాడి బిందెతీర్థం పట్టుకొని వస్తున్నారు. ఎదురుగా తిరుప్పాణన్ నిశ్చలంగా పెరుమాళ్ళ సంకీర్తనలో మునిగిపోయి ఉన్నారు. లే... లే... తప్పుకో అన్నారు లోకసారంగులు. మైమరచి ఉన్న పాణన్‌కి వినిపించలేదు. వినీ కూడా దారివిడువడం లేదనుకొన్నారు లోకసారంగులు. ఒక రాయితీసి విసిరారు. అది తగిలి పాణన్ ముఖం నుండి రక్తంకారసాగింది. స్వామి వెళ్ళిపోయారు. కోయిల్‌లోని శ్రీరంగనాథుని ముఖంపై నుండి రక్తధార కారుతోంది. అయ్యో అయ్యో ఇదేమిటి స్వామి! ఎందుకిలా జరిగిందంటూ విలవిలలాడారు. లోకసారంగులు నాభక్తుణ్ణి కొట్టావు కదా! ఆ దెబ్బ నాకు తగిలింది అన్నాడు స్వామి. క్షమించు తండ్రీ! ఎంత అపరాధం చేశాను. క్షమించు అన్నారు. నువ్వు వెంటనే వెళ్ళి నా భక్తుని నావద్దకు తీసుకొనిరా! అన్నాడు స్వామి. పరుగుపరుగున వెళ్ళారాయన. కానీ పాణన్ ఆలయంలో అడుగుపెట్టి అపవిత్రం చెయ్యను. రాను అన్నాడు. మళ్ళీ స్వామికి చెప్పారు. ఆయన నడిచి రావద్దయ్యా! నువ్వు భాజాలమీద ఎక్కించుకొని రా! అన్నారు. ఎంత చెప్పినా రానంటున్న పాణన్‌ని తమ భుజాలపై ఎక్కించుకొని వచ్చారు

లోకసారంగులు. అందుకే పాణన్‌కి యోగివాహనులు, మునివాహనులు అనే పేరు వచ్చింది. వచ్చిన భక్తుని చూచి మురిసిపోయాడు శ్రీరంగనాథుడు. ఆయనమీద దయతో తన దివ్యమంగళ విగ్రహాన్ని దర్శింపచేసాడు. పాదాది శిరఃపర్యంతం ఆ శ్రీరంగనాథుని దివ్యస్వరూపాన్ని దర్శించిన తిరుప్పాణన్ పులకితగాత్రులయ్యారు. అమలనాదిపిరాన్ అనే పదిపాశురాల దివ్యప్రబంధంలో శ్రీరంగనాథుని అద్భుతంగా కీర్తించారు. 'స్వామీ నిన్ను చూచిన కన్నులతో వేరొక దైవాన్ని చూడనని శపథంచేసారు. ఆభక్తికి, ఆ ఏకాగ్రతకు, ఆ నిష్ఠకు పులకించాడు శ్రీరంగనాథుడు. ఆయనని తన శ్రీవత్సంలో చేర్చేసుకున్నాడు. చూస్తున్న భక్తులు పరమాశ్చర్యాన్ని పొందారు. శ్రీరంగనాథుని అనుగ్రహంతో అర్చామూర్తిగా దర్శనమిచ్చారు తిరుప్పాణి ఆళ్వార్. శ్రీరంగనాథుడు తప్ప వేరొక దైవాన్ని ఎరుగని భక్తులు తిరుప్పాణాళ్వార్లు. పంచములనే మాటకి చాలా విశేషార్థాన్ని చెప్పారు మన పెద్దలు.

జీవాత్మలు 5 రకాలుగా ఉంటాయి. బద్ధులు, ముకుక్షువులు, కేవలులు, ముక్తులు, నిత్యులు. వీరు నిత్యులలో చేరినవారు 5వ జీవాత్మకోటికి చెందినవారు అని ఒక అర్థం.

కలియుగంలో అవతరించిన అయోనిజులైన ఆళ్వార్లు పొయ్‌గై, పూదత్త, పేయాళ్వార్, ఆండాళ్, తిరుప్పాణి ఆళ్వార్లు. వీరిలో 5వ వారు కాబట్టి పంచములు.

ఆళ్వార్లు తమ భక్తిని చాటుతూ దివ్యప్రబంధాలు చెప్పారు. వాటిలో చివర తమ పేరుగాని, గ్రంథసంఖ్యగాని, ఫలశ్రుతిగాని చెప్పకుండా చెప్పినవారు ఐదుగురున్నారు. పొయ్‌గై, పూదత్త, పేయాళ్వార్లు తిరుమడిశై ఆళ్వార్లు తిరుప్పాణి ఆళ్వార్లు. వీరిలో 5వ వారు కాబట్టి ఆపేరు.

వీరి చరిత్రలో మనకి తెలిసే విశేషవిషయం. భగవంతుడు తనకు అపరాధం చేసినవారిని రక్షిస్తాడుగాని, తన భక్తులకు అపరాధం చేసినవారిని క్షమించడు. నన్ను నిందించినా పరవాలేదు. నా భక్తుల్ని నిందించేవారు నాకు నూరుకోట్ల తామరపూలతో పూజచేసినా క్షమించను. ఎవరిపట్ల అపరాధం చేశారో వారినే ఆశ్రయించిన అపరాధక్షమాపణ పొందాలి. అందుకే లోకసారంగులచేత ఆళ్వార్లను భుజాలపై ఎక్కించుకొని తీసుకొని వచ్చేపని చేయించాడు స్వామి. అంతేకాదు, తన భక్తులు ఏ కులం, ఏజాతి, ఎవరికి చెందినవారనే విషయాన్ని స్వామి పట్టించుకోడు. భక్తిముఖ్యం.

'ఎన్నముదనై క్కణ్ణకణ్గళ్ మత్తొన్ఱినైక్కాణావే' నాకు అమృతస్వరూపుడైన శ్రీరంగనాథుని చూచిన కళ్ళతో వేరొకరిని చూడను అని ఇతరపెరుమాళ్ళని సేవించలేదు. అంతటి ప్రేమమూర్తులు కాబట్టి శ్రీరంగనాథముని సన్నిధిలో అర్చారూపంలో నిత్యనివాసం చేస్తున్నారు తిరుప్పాణి ఆళ్వార్లు.

మిగిలిన ఆళ్వార్ల ప్రబంధాలలో భగవద్ వర్ణనతోపాటు పరోపదేశాలు కూడా చోటుచేసికున్నాయి కాని, ఈ ఆళ్వార్లు అమలనాదిపిరాన్ దివ్యప్రబంధంలో శ్రీరంగనాథుని వర్ణిస్తూ అదేరూపాన్ని ఆస్వామిదించారు కాని వేరొక వర్ణనే చేయలేదు. భగవదనుభవం సాగుతున్నపుడు మధ్యలో విచ్ఛేదం జరిగితే వెనుకటిది గుర్తుకువస్తుంది వీరికాప్రసక్తే లేదు. అవిచ్ఛిన్నసంస్మరణ– తైలధారవలె సాగిన మహనీయులు వీరు.

**తిరుప్పాణి ఆళ్వార్ల తిరునక్షత్ర తనియన్**

**వృశ్చికే రోహిణీజాతం శ్రీపాణం నిచుళాపురే ।**
**శ్రీవత్సాంశం గాయకేంద్రం మునివాహనమాశ్రయే ॥**

**నిత్యతనియన్**

**ఆపాదచూడ మనుభూయ హరిం శయానం**
**మధ్య కవేర దుహితుః ముదితాన్తరాత్మా ।**
**అదృష్టతాం నయనయోః విషయాన్తరాణాం**
**యో నిశ్చికాయ మనవై మునివాహనం తమ్ ॥**

---

**డిసెంబరు నెల సమాధానములు**

1.రెండు పరా – అపర, 2. శైబ్యం, సుగ్రీవం, 3. రాజర్షి, 4. నముచి అనే రాక్షసుని తమ్ముడు, 5. దూర్వాసుడు, 6. శ్రీ పెద్ద జీయరు స్వామివారి దివ్య స్మృతిగా ఇస్తారు, 7. గాలిలో కూడా నడువగలిగిన శక్తి కలవాడు, 8. సముద్రం, 9. తొండరడిప్పొడి ఆళ్వార్లు, 10. పెరుమాళ్ తిరుమొఝి, 11. ఐరమ్మదము, 12. దేవదేవి తల్లి, 13. ప్రాబోధకి, 14. తిరుమంగై ఆళ్వార్లు, 15. ఆపః, జలం, వారి, 16. స్నేహంతో కలిపి ఉంచే స్వభావం, 17. శామ్యూల్ క్రిస్టియన్ ఫ్రెడరిక్ హానిమన్, 18. హోమియోపతి, 19.ద్రావణాన్ని తీవ్రంగా కుదిపే ప్రక్రియ, 20. శ్రీ పెద్ద జీయరు స్వామివారి నిరాడంబర జీవితాన్ని కొనియాడారు.

# శ్రీవేంకటాచల "చిత్రే"తిహాసమాల

రచనం
రంగరామానుజాచార్య

7

చిత్రానువర్తనం
జి.వి.ఎస్. శ్రీనివాస్
కె. సత్య శ్రీనివాస్



తిరుమలలో శ్రీనివాసుడు ఆవిర్భవించినవైనాన్ని పురాణాలు వర్ణించాయి. స్వామిని ఎవరెవరు ఎలా దర్శించారో, అలా దర్శించినప్పుడు స్వామిస్వరూపం ఎలా ఉన్నదో ఆయా పురాణాలు పరిశీలిస్తే విస్పష్ట మవుతుంది. భగవద్రామానుజులు యాదవరాజసభలో వర్ణించిన ఘట్టాలలో వాయువు, అరుంధతి, స్కందుడు, శంఖనృపుడు వసిష్ఠాదులు ఇలా పలువురు శ్రీనివాసుని దర్శించిన రీతిని ప్రదర్శించారు. వాయువు స్వామిని శ్రీభూసహితుడుగా స్వామి పుష్కరిణీ దక్షిణతటాన ఆనందనిలయ విమానంలో సాక్షాత్కరించాడు. ఇదే విమానంలో కల్పాంతంవరకు, వాయువుకు ప్రీతిని కలిగిస్తూ స్వామి ఉంటాడని వారాహపురాణం చెప్పింది.

వైవస్వేంతరే దేవి పూర్వే కృతయుగాన్తరే ।
వాయోస్తపో మహద్దృష్ట్వా శ్రీభూమిసహితోఽనఘే ॥
ఆగచ్ఛత్ శ్రీనివాసశ్చ స్వామిపుష్కరిణీతటే ।
దక్షిణేస్మిన్ పుణ్యతమే విమానే ఆనంద సంజ్ఞకే ॥

వాయువుకు శ్రీభూసమేతుడై
శ్రీనివాసుడు సాక్షాత్కరించుట-

స్వామిని సాక్షాత్కరించిన వారిలో అరుంధతి ప్రముఖురాలు. ఆమె సాక్షాత్కరించిన వైనాన్ని భగవద్రామానుజులు యాదవరాజసభలో ఉద్ఘాటించారు. సాక్షాత్కరించిన స్వామిని అరుంధతి ఈ క్రింది శ్లోకంలో స్తుతించింది. ఆస్తుతిలో స్వామి "లక్ష్మీవక్షఃస్థలు"దని విస్పష్టం. ఇది 'శ్రీనివాస' నామకుడైన వేంకటేశ్వరుడు నారాయణుడేననడానికి విశేషలింగం.

**గరుడపురాణం ఇలా అంటుంది–**

అరుంధతీ మహాభాగా లక్ష్యాలింగితవక్షసం ।
దృష్ట్వాహరింవేంకటేశం ప్రణనామ ముదాన్వితా ॥

యస్యోరస్యనిశం విభాతి జగతీసౌభాగ్యధాత్రీ రమా
ధత్తే యస్య పదావనేజనజలం మూర్ధ్నా పురారిస్సదా ।
శ్రీమద్వేంకటశైల నిత్యనిలయం దేవోత్తమంత్వాం వినా
దృష్టాదృష్ట ఫలప్రదం కిమపరం దృష్టం క్షితౌదైవతమ్ ॥

ఎవ్వని వక్షఃస్థలంపై సకలజగత్సౌభాగ్య ధాత్రియైన లక్ష్మి కొలువై ఉన్నదో, ఎవ్వని పాదప్రక్షాళణా జలాన్ని నిత్యం పరమశివుడు శిరస్సు పై ధరిస్తున్నాడో, అలాంటి వేంకటశైలవాసుడు, దేవతాసార్వభౌముడు అయిన శ్రీనివాసునికంటే, కనిపించేవి, కనిపించనవి అయిన ఫలాలనిచ్చే దైవతం మరెవరున్నారు అని స్తుతించింది అరుంధతి.

(సశేషం)





చిత్రకథ-26

# రామానుజ చిత్రకథ



పుణ్యాంభోజ వికాసాయ పాపధ్వాన్త క్షయాయచ !
శ్రీమాన్ ఆవిరభూద్భూమౌ రామానుజ దివాకర: !!

కాంచీపురానికి తూర్పుదిక్కులో "పురుష మంగళం" అనే అగ్రహారం ఉంది.

ఓం అగ్నిమీళే పురోహితం...

అక్కడ 'అనంతదీక్షితులు' అనే సుప్రసిద్ధ వేద విద్వాంసుడు ఉండేవారు.


అనంతదీక్షితుల భార్య,
రామానుజుల సహోదరి.


ఈ పుణ్య దంపతులకు "దాశరధి" అనే పుత్రుడుండేవాడు.
ఆయుష్మాన్‌భవ!


రామానుజులు సన్యాసాశ్రమం స్వీకరించాక,
వారి సేవకే అంకితమయ్యాడు దాశరధి.


రామానుజులవారి వద్ద సకల శాస్త్రాలూ అభ్యసించాడు.


దాశరధితో పాటు ఎందరో జిజ్ఞాసువులు, రామానుజులను ఆశ్రయించి, సేవించేవారు.
ఇంకావుంది...

జై శ్రీమన్నారాయణ! శ్రీమనతే రామానుజాయ నమః జై శ్రీమన్నారాయణ!

ప్రియ భగవదర్బంధువులారా!

## గతసంవత్సరానికి వీడ్కోలు..! ఆగామి సంవత్సరానికి స్వాగతం...!!

2014 నూతన సంవత్సరాన్ని స్వాగతిస్తూ, భక్తినివేదన మీ అందరికీ శుభకామనలను అందిస్తున్నది. నూతన సంవత్సరంలో కళ్యాణ పరంపరను అనుగ్రహించాలని శ్రీయఃపతిని ప్రార్థిస్తున్నది. రాబోయే 2017 భవద్రామానుజ సహస్రాబ్ది వత్సర మహోత్సవాలకు మనమంతా సిద్ధంకావాలి.

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి హృదయంలో ఆవిర్భవించి, అచిర కాలంలో కార్యరూపాన్ని ధరించనున్న శ్రీభగవద్రామానుజ ప్రతిమా నిర్మాణ మహోద్యమంలో మనమంతా శక్తికి వంచనలేకుండా పాలుపంచుకొని, ఆచార్య ఋణాన్ని లేశమాత్రంగా నైనా తీర్చుకునే మహావకాశాన్ని పొందుదాం! భక్తినివేదన మీకు ఎప్పటికప్పుడు సమాచారాన్ని అందిస్తుంది. మరొక్కసారి నూతనసంవత్సర శుభకామనలతో యథాపూర్వం అవికలంగా మీ అపూర్వ ఆదరణను ఆశిస్తూ...! మీ భక్తినివేదన



# శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్‌స్వామివారి ఈస్ట్ ఆఫ్రికా పర్యటనా చిత్రాలు







శ్రీశ్రీశ్రీ స్వామివారితో టాంజానియా ప్రధాని H.E పిండాని ప్రభృతులు

'ఆచార్యత్రయం' నృత్యరూపకం శ్రీశైలంలో 18వ ప్రదర్శన చిత్రాలు





*With Best Compliments from*








# KAKATIYA CEMENT

**Quality Always - Ahead**

53 Grade Cement &
White Crystal Sugar

**Sri P. VENKATESWARLU**
Chairman & Managing Director

## KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED

*Regd. Office :* 1-10-140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
✆:27637717, 27633627, Fax No : 040 - 27630172, E-mail : kcsil@sol.net.in
E-mail: info@kakatiyacements.com

*Cement Factory :*
Srinivasanagar, Jaggaiahpet,
Krishna Dist - 521 175
✆ 08654 - 200014
Fax No: 08654-296331

*Sugar Factory :*
Peruvancha Village, Kallur Mandal,
Khammam Dist - 507 209,
✆: 08761 - 287207
Fax No: 08761 - 287206






# SERVOMAX INDIA LIMITED

AN ISO - 9001:2008, ISO - 14001:2004 & BS OHSAS - 18001:2007 CERTIFIED COMPANY




***Safe Power Saves Power***



Power Saver

- Exports to 26 Countries
- Over 1 Lakh Installations
- Pan India Operations
- Manufacturers of India's Highest Capacity Auto Transformers

## Green Energy & ESCO

Complete Solutions for Grid Connected or Off Connected


Solar Panels


Inverters



Batteries


Solar UPS


Solar Lamps


Solar Street Lights


Bharat Ratna Dr. M Visvesvaraya Industrial Award-2008 Best Performance in Small Scale Sector


Rajiv Gandhi National Quality Award - 2007


A.P Best Entrepreneur Award - 2009


CITD Industrial Trade Achievement Award - 2006

## Our Products

- Power Conditioners
- Servo Voltage Stabilizer (HT / LT)
- Power Savers
- Ultra Isolation Transformers
- Distribution & Power Transformers

# SERVOMAX INDIA LIMITED

# 406, Meridian Plaza, Ameerpet Hyderabad - 500 016. A.P. INDIA.
Ph: +91 40 4050 9999 / 9900

admin@servomax.net
www.servomax.net

# శ్రీ కలివైరి సూరి వైభవము



శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழி 1-9-9**

**పత్తేలోన్ను మిలేన్ పావమే శెయ్‌తు పావియానేన్**
**మత్తేలొన్నరియేన్ మాయనే ఎంగళ్ మాదవనే ।**
**కళ్‌తేన్ పాయ్ న్దొழுకుంకమలచ్చునై వేంగడవా**
**అత్తేన్ వందడైందేన్ అడియేనై ఆట్కొండరుళే ॥**

ప్రతిపదార్థము: **కల్**=రాళ్ళనుండి; **తేన్**=తేనె; **పాయ్‌న్దు**=స్రవించి; **ఒழுకుం**=ప్రవహించుచున్న; **కమలచ్చునై**=తామర పూలతో ఒప్పు చెరువులుగల (వాగులుగల); **వేంగడవా**=శ్రీ వేంకటగిరి యందువేంచేసియున్నస్వామి!; **మాయనే**=ఆశ్చర్య గుణచేష్టితుడా!; **ఎంగల్**=మాయొక్క; **మాదవనే**=లక్ష్మీ వల్లభుడా!; **పత్తేల్**=ఆశ్రయమైతే; **ఒన్ను**=ఏ ఒకటిని; **ఇలేన్**=లేనివాడను; **పావమేశెయ్‌తు**=పాపములనే చేసి; **పావియానేన్**=పాపాత్ముడనైతిని; మత్తేల్=మఱియొక ఉపాయమును; **ఒన్ను**=ఏ ఒకటిని; **అరియేన్**=ఎరుగను; **అత్తేన్**=అర్థుడనైతిని; **వందు**=వచ్చి; **అడైందేన్**=ఆశ్రయించితిని; **అడియేనై**=దాసుని; **ఆళే**=దాస్యమందు; **కొండరుళే**=స్వీకరించి అనుగ్రహింపుమా!

**తాత్పర్యము:** ఆశ్చర్యగుణములు కలవాడా! పురుష కారభూతురాలగు శ్రీదేవికి వల్లభుడా! కొండగుహలయందు ప్రవహించు తేనెలు కలదియు, పద్మ సరోవరములు కలదియునగు శ్రీ వేంకటాద్రిపై వేంచేసియున్న స్వామీ! ఆధారమేదియును లేనివాడను. పాపములనే చేసి పాపినైనవాడను. ఉపాయాంతరములును ఎరుగనివాడను. నిన్నే గతిగ తలచి వచ్చి శరణుజొచ్చితిని. దాసుడనగు నన్ను కృపతో నేలుకొనుమా!

**విశేషార్థము:** యాదృచ్ఛిక సుకృత విశేషమును కారణముగ గొని నేనే (భగవంతుడు) మీకు సంసారమందుండలేని స్థితిని కల్పించితినని అంటిరి కదా! మరి మీరు మనోరథ సిద్ధికి కారణమైన శరణాగతిని ఏల చేయుచున్నారని భగవంతుడు ఆళ్వారులను ప్రశ్నించెను. స్వామీ! నా పూర్వస్థితిని తలచుకొనినచో ఇంతటి వైరాగ్యము నాకు కలుగుటకు నాలో ఏ ఒకమంచితనమునులేదే అని తలచి ఆ విధముగ పలికితినని తిరుమంగై ఆళ్వారులు సమాధానమును నొసగిరి.

**సభ్రాతు శ్చరణౌ గాఢం నిపీడ్య రఘునందనః ।**
**సీతామువాచాతిశయా రాఘవం చ మహావ్రతమ్ ॥**

*శ్రీరామాయణం, అయోధ్యకాండ 31-2*

తాత్పర్యము: లక్ష్మణస్వామి సీతమ్మను మున్నిడుకొని వన వ్రత దీక్షితుడగు (పితృవాక్య పరిపాలనావ్రత దీక్షితుడగు) శ్రీరామచంద్రుని శ్రీపాదములపై వ్రాలి ఇట్లు ప్రార్థించెను.

నమ్మాళ్వారులు... **"అలర్‌మేల్ మంగై ఉఱైమార్పా ఉన్నడిక్కీழ் అమర్‌న్దు పుగున్దేనే"**

"లక్ష్మీదేవిని వక్షఃస్థలమందు ధరించిన స్వామి! నీ చరణార విందములను ఆశ్రయించితిని" అని ప్రార్థించిరి. ఆ విధముగ శ్రీ పరకాలసూరియు ఈ పాశురమున శ్రీమాధవుడగు శ్రీ శ్రీనివాసుని శరణువేడుచున్నారు.

**పత్తేలొన్నుమిలేన్:** భగవంతునితో గల సంబంధమును తెగ తెంపులు చేసికొని చేయిజార్చుకొనిపోయిన నాకు మరల ఇంతటి భగవత్ప్రేమ కలుగుటకు చెప్పదగిన సుకృత విశేషము నాలో ఒకటియునులేదు. పాపములనే చేసితిని. జీవునకు జ్ఞానానందములు సహజలక్షణములై ఉండగ ఈ జీవుని (తిరుమంగై ఆళ్వార్లను) గూర్చి చెప్పవలసి వచ్చినపుడు నేను చేసిన పాపరాశిని చూసి "పాపములే ఈ జీవునకు సహజ లక్షణములని" తెలుపవలసినదిగ ఉన్నది.

**మత్తేలొన్నరియేన్:** నిన్ను పొందుటకు తగు ఉపాయ విషయక జ్ఞానము మిసుమంతయులేనివాడనైతిని. అటువంటి జ్ఞానములేకపోవుటయేగాక!

**మాయనే:** ఎంతటి అపరాధములను చేసినవారినైనను సంరక్షించుటకు తగిన ఆశ్చర్యకరమగు శక్తిగల స్వామి!

**ఎంగళ్ మాదవనే:** దోషుల దోషములనన్నింటిని క్షమింప చేసి 'వారు రక్షింపతగినవారే' అని నీ సన్నిధిలో పురుషకారమును అనుగ్రహించు లక్ష్మీదేవిని వక్షఃస్థలమందుగల స్వామి! సర్వసమాశ్రయణీయుడా! (అందరికీ ఆశ్రయమైనవాడా!)

**కల్తేన్:** తేనెటీగలు పర్వతగుహలలో తేనెతెట్టులను పెట్టినవి. ఆగుహలనుండి ప్రవహించు తేనెవాగులు నీటిమడుగు లలో చేరుచున్నవి. ఆ మడుగులనిండుగ తామరపుష్పములు అలరారుచున్నవి. అటువంటి జలాశయములతో తిరుమల క్షేత్రము ప్రకాశించుచున్నది. ఆ క్షేత్రమును వాసముగాగల శ్రీ వేంకటాద్రినాథా!

**అత్తేన్:** నీ శ్రీచరణారవిందములందు నిశ్చయజ్ఞానముకల వాడనైతిని.

**అడియేనై ఆట్కొండరుళే:** ఇదివరలో నాకుగత్యంతరము లేదంటిని. నీవే నాకు గతివి. నీవు లక్ష్మీనాథుడవుకదా! కనుక నా స్వరూపమునకు తగు కైంకర్యమును ప్రసాదింపుమా!

# ధనుర్మాస మహోత్సవము

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామి వారి ప్రత్యక్షటపర్యవేక్షణలో..**

**నిత్యకార్యక్రమములు. ది.16-12-13 నుండి 14-01-2014 వరకు**

| | | |
|---|---|---|
| **ఉదయం** | 7.30 నుండి 8.30గం॥ల వరకు | **భగవద్రామానుజులవారి చరిత్ర** ప్రవచనము |
| | 8.45ని॥లకు తీర్థప్రసాద గోష్ఠి | |
| **సాయంకాలం** | 5.30గం॥నుండి 6.00గం॥ల వరకు | **శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్ర** పారాయణము |
| | 6.00గం॥లనుండి7.30గం॥ల వరకు | **తిరుప్పావై** ప్రవచనము. |

**విశేషకార్యక్రమములు.**

| | |
|---|---|
| 11-01-2014 | **కూడారై పాశురం, ముక్కోటి ఏకాదశి** |
| 12-01-2014 | **శ్రీశ్రీశ్రీ పెద్దస్వామివారి పరమపదోత్సవము.** |
| 13-01-2014 | **శ్రీగోదారంగనాథుల కళ్యాణమహోత్సవము** |

సమాచారానికై సంప్రదించండి. 9396686086, 9949955517, 9347076804

**కార్యస్థలము-** సర్కస్ గ్రౌండ్, ముకరంపుర, కరీంనగం

ధనుర్మాస ఉత్సవ నిర్వహణ కమిటి మరియు జిల్లా వికాసతరంగిణి, కరీంనగర్

## శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామివారి ధనుర్మాస ప్రవచనములు

**16.12.2013 నుండి 15.1.2014 వరకు, శ్రీకాకుళం, క్రొత్తపేటలోని శ్రీరామాలయంలో... ప్రతిరోజూ తీర్థప్రసాద కార్యక్రమానంతరం, చిన్నపిల్లలకు తిరుప్పావై, శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రం నేర్పడం, ఇటీవల తుఫానువల్ల బాధపడిన గ్రామాల్లో పర్యటించడం విశేషంగా జరుగుతున్నది.**

**సాయంకాలం తిరుప్పావై ప్రవచనాలు కొనసాగుతున్నాయి.**

## శ్రీశ్రీశ్రీ త్రిదండి దేవనాథ జీయర్‌స్వామివారి కార్యక్రమాలు

**శ్రీశ్రీశ్రీ స్వామివారు ఈ నెల 16 నుండి హైదరాబాద్ - దోమలగూడలో జెట్‌లో వేంచేసియున్నారు. 19.12.2013న సిద్దిపేట దగ్గరలోని భండారం వద్ద సిద్ధ డెవలప్పర్స్ శేముషీ ఎంక్లేవ్స్ వారు సమర్పించిన 15 ఎకరాల స్థలంలో శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారితో కలసి శ్రీరామానుజ విద్యాపీఠ భవనానికి శంకుస్థాపనం చేసారు.**

**డిసెంబర్ 29న హైదరాబాద్‌లో రింగ్‌రోడ్ నుండి జరుపతలపెట్టిన వాక్‌థాన్‌కార్యక్రమాన్ని పర్యవేక్షిస్తున్నారు. అటుతరువాత కరీంనగర్‌లో శ్రీ చిన్నజీయర్‌స్వామివారి కార్యక్రమంలో అన్వయించి ఉంటారు.**

## ప్రకృతి బడిలో - జీవన పాఠాలు 5

### శ్రీమద్భాగవతం ఏకాదశ స్కంధం నుండి

వైశారది

### అగ్ని

ఓ యదుమహారాజా! మనం చుట్టూ ఉండే ప్రకృతిలో ఎన్నిటినో మన సుఖాలకోసం ఆనందం కోసం ఎన్నో రకాలుగా నిత్యం వినియోగించుకుంటుంటాం! అలాటివాటిలో ప్రధానమైనది అగ్ని. ఇది పంచభూతాలలో "తేజోభూత స్వరూపము".

నిత్యమూ ఆహారాన్ని పక్వం చేసుకోవటంతో ప్రారంభిస్తే, యజ్ఞయాగాది శాస్త్రీయ కర్మలెన్నింటికో ఈ అగ్నిని వినియోగి స్తున్నాం కద! ఎక్కడ ఎలాంటి సందర్భంలో, ఎవరు ఎప్పుడు వినియోగించినా ఒకేరకంగా ప్రజ్వరిల్లుతూ ఊర్ధ్వగమనం కలిగి ఉండే అగ్ని నా మనసుని ఆకర్షించింది. ఆసక్తితో గమనించే నాకెన్నెన్నో పాఠాలు నేర్పింది చెబుతా విను.

అగ్నిలోని ప్రత్యేకతే దానికాపేరు వచ్చేట్లు చేసింది. గాలి, నీరు, ఆకాశం ఎక్కడెక్కడ అవకాశం దొరికితే ఆయా దిక్కులలో ప్రదేశాలలో వ్యాపిస్తూంటాయి. అగ్నిమాత్రం ఎల్లప్పుడూ పైపైకే ప్రసరిస్తూ ఉంటుంది. అందుకే **అగ్రం గచ్ఛతి ఇతి అగ్నిః** లేదా **అగ్రం నయతి ఇతి అగ్నిః** అని పేరుపెట్టారు. తానెప్పుడు ఉన్నతంగా ఊర్ధ్వంగా ప్రసరించటమేకాక, తనను ఆశ్రయించిన దానిని కూడా పైకి తీసుకువెళ్ళేది. ఉన్నత స్థితికి చేర్చేది అగ్ని అయ్యింది.

1. అగ్నిలో మొదట నాకు నచ్చినది తరగని వెలుగునిచ్చే స్వభావము. ఆ "తేజస్సే" నాకొకపాఠం నేర్పింది. ఏ మానవుడు అయినా తనలో జిజ్ఞాసతో జ్ఞానమనే అగ్నిని రగిల్చితే తేజస్సుతో ప్రకాశించే విద్వాంసుడు కాగలుగు తాడు.
2. అతనిలోని జ్ఞానకాంతులే అతని నేత్రాల ద్వారా తేజస్సుగా ప్రసరిస్తుంటాయి. ఆ జ్ఞానానికి తోడుగా తపస్సుకూడా చేయ గలిగినసాధకుడు అగ్ని స్వరూపునిలా ప్రకాశించగలడు. తన జ్ఞానకాంతులతో పదిమందికీ జీవనపథంలో మార్గనిర్దేశం చేయగలవాడవుతాడు.
3. సహజకాంతితో ప్రజ్వరిల్లుతున్న అగ్నిని, వేరొక వస్తువేది కప్పి వేయలేదు. దానిని ఆక్రమించి ఆ అగ్నికాంతులని తగ్గించనూ లేదు. అగ్నిలోని ఈ స్వభావము సాధకుడు పాటింపవలసిన తీరు నాకు నేర్పింది. ఊర్ధ్వగతి జ్ఞానంతో ప్రకాశిస్తూ పరమాత్మ లక్ష్యంగా సాధనతో ఉన్నతంగా సాగిపోవాలనుకునే యోగి మరెవరిచేతనూ చలింప చేయరానివారై ఉండాలి. ఏ ఇతర విషయాలవలనా కలతచెందక, ఉన్నత లక్ష్యం వైపే సాగిపోవా లని తెలుసుకున్నాను.
4. అగ్నికి మరోపేరు **హుతాశనః** లేదా **హుతభుక్.** అంటే, తనలో ఆహుతిగా సమర్పించినదేదైనా వెంటనే తినివేస్తాడు. రాత్రికి దాచుకుందాం, రేపటికి దాచుకుందాం అనుకోడు.

అలానే యోగసాధకుడు ఎప్పటికప్పుడు ఆకలి వేళకు పరమాత్మ అనుగ్రహంతో లభించిన దానిని అవసరమైనంత ఆహారంగా స్వీకరించాలి, తప్ప, అవసరానికి మించి తీసుకో కూడదు. రేపటికి మాపటికిని దాచాలని అసలే అనుకోకూడదు. అలా ప్రోగుచేయడం దోషమౌతుంది. తరువాత దాచినది వినియోగించాలి కదా అన్న భావనలతో ఆహారనియమమే భంగమై పోతుంది. అందుకే సాధకుని **ఉదర భాజనుడి**గ ఉండాలంటారు. **ఉదరము** అంటే పొట్టయే పాత్రగ కలవాడు. అంటే పాత్ర (పొట్ట) పట్టినంతే స్వీకరించాలి తప్ప ఒక్కకణం కూడా ఎక్కువ ఆశించ రాదని నేర్చుకున్నా. దీనినే అపరిగ్రహము అనికూడా అంటారు.

5. అగ్నిలోని మరొక సుగుణము **సర్వభక్షకత్వము.** అగ్ని ఇది గొప్పది, రుచికరమైనది, అనేభావములేక ఎక్కువ తక్కువ అనే తేడా చూడక దొరికినదల్లా భక్షించివేస్తాడు. తనకి అర్పించినదల్లా అంగీకరిస్తాడు. అందుకే "సర్వభక్షకుడు" అన్పించుకున్నాడు.

   యోగి సాధనదశలో సర్వభక్షకునిగా ఉండగలగాలి. అంటే, దొరికినదల్లా తినివేయడం కానేకాదు. యోగసాధనకు శరీరము ప్రధానసాధనం. కనుక, అది సాధనకై నిలిచి ఉండేందుకు అవసరమైన ఆహారాన్నే అందించాలి. అయితే అది రుచికరమా? కాదా? అని చూడకూడదు. పంచభక్ష్య పరమాన్నములే కావాలి అని కోరకూడదు. అలా అని ఏది పడితే అది ముఖ్యంగా రాజస తామస గుణాలుకల నిషిద్ధాహారం జోలికి వెళ్ళకూడదు. మరింక సర్వభక్షకుడు కావడమంటే, ఎలా అంటే సాధనకు తగిన ఆహారం ఏదైనా రుచి అరుచి అని ఎంచక స్వీకరించి తృప్తి చెందగలగాలని నేర్చుకున్నా! కనుకనే ఓ యదుమహారాజా! అయాచితంగా లభించిన దానితో సంతృప్తిగా ఉన్నాను.

6. అగ్నిలోని మరొక విశేషం నాకింకొక అద్భుతపాఠం నేర్పింది.

అగ్నిలో ఎవరు ఎలాంటి వస్తువులు వేసినా దహించి వేయగలదు. కానీ, ఆ వస్తువులలో ఒకవేళ ఏమైనా దోషాలు ఉన్నప్పటికీ అగ్ని వాటికి లోనుకాదు. సరికదా! ఆ దోష భూయిష్ట వస్తువులు అర్పించిన వారి దోషాలని కూడా భస్మం చేయగల సామర్థ్యం కలిగి ఉంటాడు. అందుకే అగ్నిని పవిత్రం చేసే వానిగ **పావకః** అంటారు. అలాగే సాధకుడు కూడా ఎలాంటి వారినుండి ఏ రకమైన ఆహారం స్వీకరించాల్సి వచ్చినా స్థిరచిత్తుడై ఆశ్రయదుష్ట ఆహారాన్ని కూడా భగవన్నివేదన ద్వారా పునీతం చేసుకొని స్వీకరించే వాడై ఉండాలి. దోషదూరుడై నిలవాలి. భగవదనుగ్రహాన్ని పంచడం ద్వారా వారిలోని దోషాలను కూడా నశింప చేయాలి.

7. ఒక్కొక్కసారి అగ్ని నివురుగప్పి ఉందా లేదా అన్నట్లుం టుంది. కొంచెం ఆజ్యం (నేయి)పోయగానే ప్రజ్వరిల్లు తుంది. నివురుగప్పిన నిప్పుకూడా నాకొక పాఠం నేర్పింది. కొన్ని సమయాలలో సాధకుడు తనలో ఉన్న జ్ఞానాన్ని, శక్తినీ గొప్పతనాన్ని లోకానికి వ్యక్తీకరించరాదు. ఈ గొప్పతనాన్ని చాటుకోకుండా ఉండడమే మేలు. మరొకప్పుడు చుట్టూ ఉండే వ్యక్తులు, పరిస్థితుల ప్రభావం తనని నివురుగప్పేయకుండా యోగాభ్యాసమనే నేతిని పోస్తూ అంతర్గత సాధనని తీవ్రతరం చేసుకోగలగాలి.

8. అగ్నిని స్వర్గమో, మోక్షమో కావాలనుకునేవారు ఆశ్రయిస్తారు. ఉపాసనలు చేస్తారు. లౌకికమైన సంపదలు కోరి ఆశ్రయించే వారూ ఉంటారు. **శ్రియమిచ్ఛేత్ ఉపాసనాత్** లౌకికంగ ధనం కావాలన్నా అగ్నినే ప్రార్థించాలి. **జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత** అన్నట్లు స్వర్గాది పరలోక సుఖం కావాలన్న యజ్ఞ రూపంలో అగ్నినే ఉపాసించాలి. "ముక్తి" కావాలన్నా **నాచికేతాగ్ని** మొదలైన వేదభాగాలు అగ్ని రూప ఉపాసననే విధించాయి.

ఓ యదుమహారాజా! ఎవరెవరు ఏయే కోరికలతో వచ్చి తనని ఆశ్రయించి ఆహుతులర్పించి, ఉపాసన చేస్తే అగ్ని వాటిని స్వీకరించి ఆయా ఫలితాలని అందిస్తాడు. అలానే యోగసాధకుడు స్వలాపేక్షతో వచ్చినవారికి ఆశ్రయణీయుడిగా ఉండాలి. అయాచితంగ వారర్పించినవి స్వీకరిస్తూ, వారికున్న ప్రాచీన, ఆగామి పాపకర్మలను తన తేజస్సుతో తపశ్శక్తితో భస్మం చేయగలగాలి. వారి వారి మనోభీష్టాలు పరమాత్మ అనుగ్రహంతో నెరవేరేట్లు చేయాలి. ఇహ పర భావనలు దాటి మోక్షము కూడా అందించగలగాలి.

9. ఓ యదుమహారాజా! వీటన్నిటితో పాటు మరొక అద్భుత ఆధ్యాత్మిక రహస్యం కూడా అగ్ని మనకి నేర్పిస్తుంది. అగ్ని తాను ఏ వస్తువును కాలుస్తుంటే ఆయా ఆకృతిని పొందు తుంది. నిలువుగా ఉన్న కర్రలను కాల్చితే నిట్టనిలువుగానే దర్శనమిస్తుంది. లావుగా ఉన్న కర్రని కాలుస్తూ అగ్ని ఆకృతి కూడా లావుగా కన్పిస్తుంది. కాస్త వంకరటింకరు లున్న కర్రని కాలుస్తుంటే అగ్నికూడా వక్రంగా తిరిగినట్లు కన్పిస్తోంది. నిజానికి లావు, సన్నము, వంకర, తిన్నన అగ్నికుండే గుణాలుకావు. అగ్నిని ఆశ్రయించిన వస్తుగతమైనది.

అలాగే పరమాత్మ చిదచితాత్మకమైన ప్రపంచమంతా వ్యాపించి ఉన్నాడు. దేవతలు, మనుష్యులు మొదలైన ఆకారాలలో ఉన్నాడు. అయితే అంతర్యామిగ పరమాత్మకి చెందిన స్వరూపాలు కావేవీ. ఆశ్రయించిన కర్ర ఆకృతినే అగ్ని పొందినట్లుగ, పరమాత్మ దేవ మనుష్యాది రూపాలని పొందుతున్నాడు, అని గ్రహించగలగాలి. పైపై ఆకారాలలో, పేర్లలో భేదమేకానీ, అంతటా వ్యాపించిన ఆత్మలోని తత్త్వము ఒక్కటే అని గుర్తించగలిగాను" అంటూ మనం నిత్యం చూసే అగ్ని నుండి ఎన్ని ఆధ్యాత్మిక పాఠాలు నేర్వవచ్చో అవధూత యదుమహారాజుకి వివరించారు.



# కాలస్వరూపమే - పంచాంగము

**శ్రీమాన్ తి.న.చ. సంపత్కుమార కృష్ణమాచార్య సిద్ధాంతి - జనగామ**

## మకర సంక్రాంతి (సంక్రమణము)

ఈ పండుగ పుష్యమాసములో వచ్చును. సంక్రాంతి పండుగ మనకి పంటలు పండుగ. యిది పెద్ద పండుగ. మనకే కాక దేశమున కంతటికి పెద్దపండుగ మకరసంక్రాంతి.

సంక్రాంతి యనగా ఏమి? సంక్రాంతియనగా చేరుటయని అర్థము. సంక్రాంతి మాసమునకొకసారి వచ్చును.

జ్యోతిష శాస్త్రమునందు **"తతః మేషాదిషు ద్వాదశ రాశిషు క్రమేణ సంచరతః సూర్యస్య పూర్వస్మాద్రాశేః ఉత్తరరాశౌ సంక్రమణ ప్రవేశః సంక్రాంతిః** (జయసింహ కల్పద్రుమము)

సూర్యనారాయణుడు మేషాది ద్వాదశ రాశులలో సంచరించుచూ ఒకరాశిలోనుండి మరొకరాశిలో ప్రవేశించు సమయమును సంక్రాంతి లేదా సంక్రమణము అని వ్యవహరిస్తారు. ఇవి క్రమముగా 1. మేష, 2. వృషభ, 3. మిథున, 4. కర్కాటక, 5. సింహ, 6. కన్య, 7. తుల, 8. వృశ్చిక, 9. ధనస్సు, 10. మకర, 11. కుంభ, 12. మీన సంక్రాంతులు వచ్చును. వీటిలో మకర సంక్రాంతికి అధిక ప్రాధాన్యము కలదు. ఈ మకర సంక్రాంతికి ఎందుకంత ప్రాముఖ్యము...

ద్వాదశాదిత్యుడైన సూర్యనారాయణుడు సంచరించు ప్రధానములగు ఘట్టములు నాలుగు. అవి క్రమముగా 1.మేష, 2.కటక, 3.తుల, 4మకర, సంక్రణములు. (భాస్కరుడు) సూర్యనారాయణుడు ఒక్కొక్క సంక్రమణమునకు చేరగానే ప్రకృతి పులకించి పరిపరి విధముల విలాసములు కలిగించును. ఈ విలాసముల విశిష్టరూపమే మకర సంక్రాంతి.

కర్కాటక సంక్రమణమునుండి మకర సంక్రమణము వరకు గల ఆరుమాసముల కాలము దక్షిణాయణమనియు, మకర సంక్రామణమునుండి కర్కాటక సంక్రమణము వరకు గల ఆరు మాసముల కాలము ఉత్తరాయణమనియు రెండు విధములు.

సూర్యభగవానుడు కర్కాటకమునుండి మకరము వరకు కొంచెము దక్షిణాభిముకముగా సంచరించుట వలన ఈ ఆరుమాసములు దక్షిణాయణము, ఈ కాలము పితృదేవతలకు ముఖ్యము. మకరము నుండి కర్కాటకమువరకు కొంచెము ఉత్తరాభిముఖముగా సంచరించుట వలన ఈ ఆరుమాసములు ఉత్తరాయణమనియు ఈ కాలము దేవతలకు ముఖ్యము ఇది ఉత్తమకాలము. ఈ కారణములవలన మకర సంక్రాంతిని ఉత్తరాయణ పుణ్యకాలమందురు. ఉత్తరాయణ పుణ్యకాల ప్రశస్తి శ్రుతి, స్మృతి ఇతిహాస పురాణములయందు బహువిధముల వర్ణింపబడినది.

సంక్రాంతి పండుగను మూడురోజులు అత్యంత ఉత్సాహముతో జరుపుకోవడానికి మన ప్రాచీనాచారములే ప్రతీకలు. వీటిలో 1. భోగి, 2. మకర సంక్రాంతి, 3. కనుమ.

మకరసంక్రమణమునకు ముందు ముప్పదిరోజులు ధనుర్మాసము. సూర్యభగవానుడు ధనూరాశిలో ఉండును. ఈ ధనుర్మాసము 30. దినములు వేకువ ఝామున మేల్కొని స్నానాదికములను నిర్వర్తించి దైవారాధన పూర్వకముగా భజన, కీర్తనలు, తిరుప్పావై మొదలగు నామ సంకర్తీనలు జరుపుతూ గ్రామప్రదక్షిణమొనరింతురు. ఇవి అన్నియు మకర సంక్రాంతి. భోగి, గోదారంగనాథ కళ్యాణోత్సవముతో ముగియును.

**'భోగి'** యనుపదము భుజ్ అను సంస్కృత ధాతువునుండి నిష్పన్నమైనదనియు, ఇంద్రుని ప్రీతి కొరకు ఈ పండుగను ఆచరించుదురు. పోగు పొంగల మున్నగు ద్రావిడ ధాతువులనుండి పుట్టిన పోగు. పొంగు అనుపదముల సంస్కృతీ కరణమే "భోగి" అని కొందరు పెద్దల వచనము. 2వరోజు మకర సంక్రాంతి, ఉత్తరాయణ పుణ్యకాలము. ఈ రోజు సూర్యుడు మకరరాశిలో ప్రవేశించును. మకరరాశ్యధిపతి శని, శనివాత ప్రధానగ్రహమని జ్యోతిషశాస్త్రము వాతమెట్లు తగ్గును? నూనె మొదలగు స్నేహ ద్రవ్యముల వలనను, వాతహరమగు కూష్మాండాది శాకముల భక్షణమువలనను కదా! కనుక ఈనాడు తెలకపిండితో శరీరమునందు రుద్దుకొని స్నానమాచరించి నువ్వులు బెల్లము గుమ్మడికాయ, బంగారం, ఇత్తడి, వస్త్రములు, ఛత్రము, పాదుకలు మున్నగునవి దానమీయవలయును. పితరుల పుణ్యలోక ప్రాప్తి నిమిత్తము తర్పణ శ్రాద్ధాదులు జరుపవలయును. "నాస్తి" యను శబ్దము రాకుండా దానమీయువలయునని ధర్మశాస్త్రములు తెలుపుచున్నవి. స్త్రీలు తమ మాంగల్యాభివృద్ధికై కుంకుమ సుగంధ ద్రవ్యములు, గుడము, పుష్పములు, వస్త్రములు మొ॥ దానమొనర్పవలెనని పురాణములు ఉద్ఘోషించుచున్నవి.

మకర సంక్రాంతియందు చేయు దానములను హేమాద్రివ్రత ఖండమునందు

**దేయం తిలమయీం రాజన్ దద్యాద్యశ్చోత్తరాయణే ।**
**సర్వాన్కామానవాప్నోతి విందతే పరమం సుఖమ్ ॥**
**ఉత్తరేత్వయనే విప్రా వస్త్రదానం మహాఫలమ్ ।**
**తిలపూర్ణ మనడ్వాహం దత్త్వారోగైః ప్రముచ్యతే ॥**

3వరోజు కనుమ. ఈనాడు గోవులను ఆరాధించిన సంపద కలుగును. నిజమునకు గోధనమే దేశధనము.

# మకర సంక్రాంతి నిర్ణయము

ఈ సంవత్సరము పుష్యశు॥ చతుర్దశి మంగళవారము తేది 14.01.2014 రోజున సాయంత్రం 6-16 ని॥లకు సంధ్యాకాలమున సూర్యుడు మకర రాశిలో ప్రవేశించినందున.

రవి సంక్రమణము నిశీధముకన్న ముందు ప్రవేశమయి నపుడు పూర్వదిన అంతిమ నాడికలు పుణ్యకాలము (స్కాంద)

**ప్రదోష అస్తమయాదూర్ధ్వం ఘటికాద్వయ మిష్యతే ।**
**ప్రదోషాత్ అర్ధభిన్నే రాత్రౌ పూర్వభాగే, పూర్వదినే పుణ్యం॥**
(గౌడము)

**అస్తంగతే యథాసూర్యేజుషం** (మకర) **యాతి దివాకరః॥**
**ప్రదోషేవా అర్ధరాత్రే వా తథా పుణ్యదినద్వయం ॥**
*(ఇతిబోధాయన వచనం)*

**గ్రహణేర్కస్య సంక్రాంతౌ వివాహే పుత్రజన్మని ।**
**కామ్య వ్రతేచ మరణే, రాత్రౌ స్నానార్థ ముత్తమమ్॥**
*(మనుస్మృతి)*

సూర్యాస్తమయమునకు కొద్దినిమిషముల భేదమున్నను దేశాంతర భేదమున సూర్యాస్తమయాత్పూర్వమే ప్రవేశమగు చున్నది. సా॥ 5.30 నుండి సంక్రాంతి పుణ్యకాల స్నానం, కూష్మాండ, తిల, వస్త్రదానములు చేయవలయును.

శ్లో॥ **రాహు పర్వణి వివాహకర్మణి**
**స్థాపనే దివిషదాం సుతోత్సవే।**
**సంక్రమే వ్రతవిధావనిందితా**
**స్నానదాన విషయే విభావతి ॥** (భార్గవ ప్రమాణం)

పై ఆధారముల ప్రకారము పుష్యశు॥ చతుర్దశి మంగళవారం తేది 14-1-2014 రోజున మకర సంక్రాంతి ఉత్తరాయణ పుణ్యకాలము ఆచరించవలయును.

జీయరు ఎడ్యుకేషనల్ ట్రస్ట్‌ద్వారా ప్రచురించబడిన

## శ్రీమతి కరి తిరువేంగళమ్మగారి రచనలు

1. అమ్మ చెప్పిన మంచిమాట (నాచ్చియార్ తిరుమొళ్లి)
2. భగవద్విషయము
3. భాగవత సుధాస్రవంతి
4. పెరియాళ్వార్ తిరుమొళ్లి 1, 2 పదులు
5. చిన్నికృష్ణుని చిలిపిచేష్టలు
6. భాగవత మాహాత్మ్యము
7. శ్రీరంగ గద్యము
8. శ్రీ కృష్ణ శతకము

సవరణ: గత సంచికలో తప్పుగా వచ్చిన కారణముగా



పరమపదవాసులు
హైదరాబాద్- జీయాగూడ వాస్తవ్యులు ఉ.వే.శ్రీమాన్ శృంగారం శ్రీనివాసాచార్యులు, ధర్మపత్ని శ్రీమతి స్వరాజ్యలక్ష్మి (తాయారు)గార్ల స్మృతి చిహ్నముగా

**అహిర్బుధ్న్యసంహిత** ను

శ్రీమాన్ శృంగారం తిరువేంగళాచార్యులు మరియు కుటుంబసభ్యులు అందించినారు

శ్రీపాంచరాత్రాగమాన్తర్గత
**శ్రీవిష్వక్సేన సంహితా**



**శ్రీ విష్వక్సేన సంహితా ముద్రణ కైంకర్యము**
**శ్రీబాలాజీవేంకటేశ్వరస్వామి దేవస్థానమ్ తమ్మరబండపాలెమ్ వాస్తవ్యులు**
**పరమపదవాసులు శ్రీమాన్ ముడుంబై వెంకటనరసింహాచార్యుల వారి స్మృతిచిహ్నముగ**
**ఆచార్యకైంకర్య రూపకముగ సమర్పణ**
**ధర్మపత్నీ ముడుంబై సీతాపిరాట్టి**
**పెద్దకుమారుడు,కోడలు. ముడుంబై వేణుగోపాలాచార్యులు**
**ధర్మపత్నీ ప్రసన్నలక్ష్మీ**
**మనమలు: సీమంత్, నారాయణాచార్యులు**
**చినకుమారుడు ముడుంబై మధుసూదనాచార్య**

# నిత్యజీవితంలో - హోమియో

డా॥ పావులూరి కృష్ణచౌదరి
8-3-945/ఎ.22, నాగార్జున నగర్,
అమీర్‌పేట, హైదరాబాద్-500 873

ఆమోద యోగ్యమైన సూత్రాలపై ఆధారపడి వ్యాధి నివారణ జరగాలన్నది రెండువేల సంవత్సరాల క్రితమే గ్రీక్ వైద్యుడు ఈస్ట్రియస్ కన్నకల.

అంతేకాదు, వ్యాధి నివారణ సున్నితంగా జరగాలని, వ్యాధి శాశ్వతంగా నివారణ కావాలని కూడా ఆయన చెప్పడం జరిగింది. ఆయన కన్నకలలకు వాస్తవరూపం కల్పించే చికిత్సా విధానం కనిపెట్టిన ఘనత హానిమన్‌కు దక్కుతుంది. హోమియో వైద్యవిధానం పరిపూర్ణత సంతరించుకొన్న వైద్యవిధానం (COMPLETE SYSTEM OF MEDICINE). ఈ వైద్యవిధానాన్ని వివరించే హానిమన్ రచించిన ప్రధాన గ్రంథాలలో మొదటిగా చెప్పుకోదగ్గది **'ఆర్గనాన్ ఆఫ్ మెడిసిన్'** 292 సూత్రాలతో గూడిన ఈ గ్రంథం 1810లో వెలువడింది. ఈ గ్రంథంలోని మొదటి రెండు సూత్రాలలోనే తాను కనిపెట్టిన వైద్యవిధానాల లక్ష్యాలను వివరించడం జరిగింది. రోగి ఆరోగ్య పునరుద్ధరణే వైద్యుని ఏకైక ధ్యేయం. దీనినే నివారణ అంటాం. ఇది మొట్టమొదటి సూత్రం. వ్యాధి నివారణ సత్వరంగా జరగాలి. సరళంగా జరగాలి. వ్యాధి నివారణ శాశ్వతంగా జరగాలి. ఇదంతా సులభగ్రాహ్యమైన సుస్పష్టమైన సూత్రానుగుణంగా సాగాలి. విశ్వసనీయంగా రోగికి సురక్షితంగా చికిత్స జరగాలని ఆర్గనాన్‌లోని రెండవ సూత్రం చెబుతుంది.



ఈ రెండు సూత్రాలలోని ఆదర్శాలను దృష్టిలో ఉంచుకొని హానిమన్ సంపూర్ణ వైద్య విధానాన్ని రూపొందించడం జరిగింది. ఈ వైద్య విధానానికి హోమియోపతి అని పేరు పెట్టాడు. ఈ లక్ష్యాలను అనుసరించని విధానానికి అలోపతి అని పేరు పెట్టింది కూడా హానిమనే. హోమియో వైద్యవిధానం తన లక్ష్యసిద్ధికి మూడు ముఖ్యమైన నియమాలు (LAWS) పాటిస్తుంది.

మొట్టమొదటి నియమం **సారూప్యతా నియమం** (LAW OF SIMILARS). ఇది ఔషధాల ఎంపికకు సంబంధించినట్టి నియమం. 1790లో తాను స్వయంగా చేపట్టిన కషాయ ప్రయోగం ద్వారా ఈ ప్రకృతి నియమాన్ని (LAW OF n\NATURE) కనిపెట్టడం జరిగింది. ఈ సమయానుసారంగా ఔషధాలు ఎంపిక చేసి వాడినట్లయితే వ్యాధులు సత్వరంగా, శాశ్వతంగా నివారణవుతాయి.

రెండవ నియమనం **సూక్ష్మమోతాదులలో ఔషధాలు ప్రయోగించడం** (LAW OF MINIMUM DOSE) ఈ నియమం కూడా హానిమన్ హోమియో వైద్యవిధానాన్ని స్వయంగా అమలులో పెట్టి కనిపెట్టిన అంశమే! ఈ నియమం పాటించడం మూలంగా రోగనివారణ రోగికి ఏ దుష్ఫలితాలు లేకుండా సరళంగా సాగుతుంది. మొదట చెప్పుకొన్న సారూప్యతా నియమం హానిమన్‌కు ముందు హిపోక్రాటీస్ ప్రభృతులు చెప్పడం జరిగింది. సూక్ష్మతా నియమాన్ని కనిపెట్టిన ఘనత మాత్రం హానిమన్‌కే దక్కుతుంది.

మూడోది **స్వస్థతా నియమం** (LAW OF DIRECTION OF CURE). సారూప్యతా నియమానుసారంగా, సూక్ష్మమోతాదులలో ఔషధాలు ప్రయోగించినప్పుడు స్వస్థత చేకూరే తీరును ఈ నియమం వివరిస్తుంది. డాక్టర్ హెరింగ్ ఈ మూడో నియమాన్ని కనిపెట్టారు.

స్వస్థతా నియమం మరో ముఖ్యమైన అంశాన్ని కూడా వివరిస్తుంది. వ్యాధి ముందుగా అప్రధాన అంగాలను దెబ్బతీసి ప్రధాన అంగాల దిశగా ముందుకు సాగుతుంది. వ్యాధి నివారణ సమయంలో ముందుగా శరీర ప్రధాన అంగాలు వ్యాధి నుంచి విముక్తి చెందాలి. తరువాతనే అప్రధాన అంగాలలో కూడా వ్యాధి నివారణ జరగాలి. ఉదాహరణకు చర్మవ్యాధి, ఉబ్బసంతో బాధపుడుతుంటే వ్యక్తికి ఔషధం పుచ్చుకొన్న తరువాత ముందుగా ఉబ్బసం బాధ తగ్గిపోవాలి. ఆ తరువాత చర్మవ్యాధి నివారణ కావాలి. ఏవో పూత మందులువాడి ఆవ్యక్తిచర్మవ్యాధి తగ్గిపోయే టట్లు చేయడం ఆ వ్యక్తికి వ్యాధి విముక్తి చేకూర్చినట్లుగాదు. కొన్ని సందర్భాలలో చర్మవ్యాధికి గురైన వారికి పూతమందులు వాడినప్పుడు చర్మవ్యాధి తగ్గి ఉబ్బసం వ్యాధి రావచ్చు. ఇదీ అనుభవంలో గమనించిన అంశమే! ఈ రోగికి సారూప్యతా సూత్రానుగుణంగా ఔషధం ఎంపిక చేసి వాడినట్లయితే ముందుగా ఉబ్బసం బాధ తగ్గిపోయి తరువాత చర్మవ్యాధి కూడా బయటపడి

నివారణకు వీలవుతుంది. ఇదీ డాక్టర్ హెరింగ్ చెప్పిన స్వస్థతా నియమంలోని అంశమే!

స్వస్థతా నియమం శరీరంలో ఆయా అవయవాల ప్రాధాన్య క్రమాన్ని కూడా గుర్తుచేస్తుంది. ప్రాధాన్యక్రమంలో మెదడుది అగ్రస్థానం. రెండవ స్థానం గుండెది. మూడవ స్థానం లివరుకు దక్కుతుంది. ఈ వరుసక్రమంలో చర్మానికి చివరిస్థానం దక్కుతుంది.

నియమబద్ధమైన విజ్ఞానాన్ని శాస్త్రం అని వ్యవహరిస్తారు. పైన పేర్కొన్న సూత్రాలను, నియమాలను ఏ శాస్త్రజ్ఞుడు కాదనలేడు. శాస్త్రీయ వైద్య విధానాన్ని కనిపెట్టిన మూలంగానే హానిమన్ చిరస్మరణీయుడయ్యాడు. ఆర్గనాన్ మొదటిసూక్తిలో రోగి ఆరోగ్యాన్ని పునరుద్ధరించడం వైద్యుని ధ్యేయం అని పేర్కొనడం జరిగింది. మనిషి అంటే శరీరం మాత్రమేగాదు ప్రాణంతో గూడిన శరీరం. ప్రాణం మనసులతో గూడిన శరీరం (LIFE, MIND, BODY) ప్రాణం లేని శరీరాన్ని మనిషి అనలేం. శవం అని పిలుస్తాం. ప్రాణం ప్రధానమైన అంశం.

మనిషిని హానిమన్ ప్రాణశక్తి అని వ్యవహరిస్తాడు. (VITAL FORCE) శరీరం తన విధులను కార్యక్రమాలను (SENSATIONS AND FUNCTIONS) ప్రాణశక్తి సహాయంతోనే నిర్వహించగలుగుతుంది. ఆరోగ్యం, అనారోగ్యం, మరణం ప్రాణశక్తికి సంబంధించిన అంశాలు. అనారోగ్యానికి గురైన వ్యక్తి నా ప్రాణం బాగాలేదు అని చెప్పుకొనడం మనకందరికి తెలిసిన విషయమే!

దేహధర్మ నిర్వహణకు ఆధారం ప్రాణశక్తే. దేహధర్మాలు అనగానే శారీరక ధర్మాలు మాత్రమేగాక మానసిక ధర్మాలు కూడా గుర్తుంచుకోవాలి. మనస్సు శరీరాలను వేరు చేసి చూడడం గొప్ప తప్పిదం కాగలదు.

ప్రాణశక్తి లయబద్ధంగా (HARMONY) ఉంటే మనిషి సుఖంగా ఉంటాడు. దానినే ఆరోగ్యం అని పిలుస్తారు. ప్రాణశక్తి లయతప్పితే దేహధర్మాలలో మార్పులు చోటుచేసుకుంటాయి. బాధలో కనిపిస్తాయి. దీనినే అనారోగ్యం అంటారు. అనారోగ్యం అవయవాలకు మాత్రం పరిమితం గాదు. మనిషి యావత్తుకు సంబంధించి ఉంటుంది. ప్రాణశక్తి మనస్సు అవయవాలకు సంబంధించి ఉంటుంది.

బాధలు లేక లక్షణాలు మొత్తంగా వ్యాధి స్వరూపాన్ని సచిస్తాయి గనుక ఔషధాల ఎంపిక లక్షణాలపై ఆధారపడి ఉండడం సహేతుకం.

రోగిలో వ్యాధి రెండు దశలు. వ్యాధి మొదటిదశలో రోగి వివరించే లక్షణాల ద్వారా మాత్రమే వ్యక్తమవుతుంటుంది. దీనిని 'సబ్జెక్టివ్ దశ అని పిలుస్తారు. ఈ దశలో దేహధర్మాలు వైకల్యం చెందుతాయి.

రెండవ దశలో రోగి అవయవాలలో మార్పులు వస్తాయి. పరీక్షల ద్వారా మార్పులను గమనించవచ్చు. దీనిని 'అబ్జెక్టివ్' దశ అని వ్యవహరిస్తారు. పరీక్షలలో మార్పు కనిపించకపోతే మనిషి ఆరోగ్యం దెబ్బతినదనడం సరికాదు. అతని అనారోగ్యం ప్రథమదశలో ఉన్నదని గుర్తించాలి.

లక్షణాలపై ఆధారపడి ఔషధాల ఎంపిక చేసే హోమియో వైద్యవిధానం ద్వారా వ్యాధి ముదిరి చరమదశకు చేరకముందే నివారించడం సాధ్యమవుతుంది.

మనిషిలో యావత్తు లక్షణాలు (Spirit, Mind, Body) పరిగణలో తీసుకొని ఔషధాలను ఎంపిక చేయడం జరుగుతుంది. కనుక వ్యాధి సమూలంగా నివారించడం జరుగుతుంది. ఏదో ఒక్క లక్షణాన్ని మాత్రమే తగ్గించడానికి వాడే వైద్య పద్ధతిని SYMPTOMATIC TREAMENT అని పిలుస్తారు. హోమియో వైద్యవిధాన లక్ష్యం మనిషి ఆరోగ్యాన్ని పునరుద్ధరించడం. ప్రత్యేకంగా ఏదో ఒక లక్షణాన్ని తగ్గించడం కాదు.

---

**జిమ్స్ హాస్పిటల్ - విజయవంతమైన హోమియో వైద్యం**

పేరు :భాగ్యమ్మ, పొత్తూరు. వయస్సు: 45 సం॥

**డెంగ్యూ జ్వరం:** పదిరోజులపాటు జ్వరం చలి, కీళ్ళ నొప్పులు, వాపు తలనొప్పి, ఆకలి మందం, విపరీతమైన దాహం.
రక్తపరీక్షలో – ప్లేట్‌లెట్స్ ఒక లక్ష పదివేలు.

**చికిత్స : బ్రయోనియా200** ప్రతినాలుగు గంటలకు 7 గోళీలు ఇచ్చిన తరువాత 2 రోజులలో బాధలన్ని తగ్గాయి.

**చికిత్స అనంతరం రక్తపరీక్ష :** ప్లేట్‌లెట్స్ 2లక్షల 90 వేలు.

**డెంగ్యూ జ్వరానికి వాడదగిన మరిరెండు ఔషధాలు వాటి లక్షణాలు**

**రస్టాక్స్ :** జ్వరం, ఒళ్ళు నొప్పులు అటూఇటూ కదులుతుంటే హాయి. రోగి స్థిమితంగా ఉండలేడు. దాహం అంతగా ఉండదు.

**యుపటోరియం :** ఎముకలతోసహా ఒళ్ళంతా విరగగొట్టి నట్లుగా నొప్పులు. రోగి స్థిమితంగా వుండలేడు. అటూ ఇటూ మెసులుతున్నా రస్టాక్స్‌రోగి మాదిరిగా ఉపశాంతి వుండదు.

*********



పరమహంస పరివ్రాజకులు
శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



## చిన్నజీయర్ స్వామివారి మత్స్యపురి ఆగమనం.

శ్రీమత్‌పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీత్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారు పశ్చిమగోదావరి జిల్లాలోని మత్స్యపురి గ్రామానికి 20-11-2013 సాయం సమయమున 7గం॥లకు వేంచేసినారు. రాజమండ్రి నుండి వస్తున్న స్వామివారిని మత్స్యపురి జంక్షన్ నుంచి స్వాగతిస్తూ, కాషాయ జండాలతో అలంకరించిన మోటారు సైకిళ్లపై యువభక్తులు, గ్రామపెద్దలు, శ్రీవేదాల కోనమాచార్య గ్రామ వికాస సమితి సభ్యులు, మేళతాళములతో స్వాగతం పలికి స్వామివారిని ఊరేగింపుగా పురాతనమైన శ్రీ, భూ సమేత జనార్దన స్వామివారి దేవాలయమునకు తీసికొని వచ్చారు. వారికి అర్చక స్వాములు పూర్ణకుంభముతో స్వాగతం పలికారు.

రాత్రి గం॥ 8.30ని॥లకు స్వామివారి సమక్షంలో శ్రీ వేదాల కోనమాచార్య భవనంలో గ్రామపెద్దలు సమావేశమైనారు. గత 10 సంవత్సరములుగా శ్రీవేదాల కోనమాచార్య గ్రామ వికాస సమితివారు తమ గ్రామాభివృద్ధికి చేసిన సేవాకార్యక్రమాలను స్వామివారికి నివేదించినారు. అక్కడ జరుగుతున్న మార్పులను స్వామివారు సానందంగా స్వాగతించారు.

శ్రీస్వామివారు గ్రామ పెద్దలకు ఓ సందేశమునిస్తూ 'ఒకొక్కరు ఒక్కొక్కవీధిని దత్తత తీసుకుని పారిశుద్ధ్య విషయమై ప్రజలను కూడా కలుపుకుని శ్రమదానం చేసి పాలిథిన్ సంచులు, చెత్త లేకుండా ఆరోగ్యకరమైన వాతావరణం నెలకొల్పేందుకు కృషి చేయండి' దానికై ఒక ప్రణాళికను రూపొందించండి' అని ఆదేశించారు. సభ్యులు, ప్రజలందరూ వారి సందేశాన్ని ఆదేశంగా శిరసావహించి, తామందరూ గ్రామ పారిశుద్ధ్యానికై కృషి చేయగలమని సవినయంగా మనవిచేసినారు.

శ్రీవేదాల కోనమాచార్య భవనంలో శ్రీవారి శ్రీహస్తములతో **శ్రీమతి వేదాల రాఘవమ్మ గ్రంథాలయము**నకు ప్రారంభోత్సవం చేసారు.

'మానవసేవ-మాధవసేవ' సరికాదు, 'సర్వప్రాణి సేవను మాధవసేవగా' చేయాలి. సమాజాన్ని, ప్రకృతిలో ప్రతిజీవిని ఆదరించాలి అని చెప్పి, ప్రేక్షక, శ్రోతలచే దీనిని చెప్పించారు.

"మనమందరం ఈ మట్టిలోంచే పుట్టాము. మాతృభూమిని పవిత్రంగా ఉంచడం, సంపన్నం కావించడం మనబాధ్యత. ఈ గ్రామసేవద్వారా సంస్కరణలు అనే ఆలోచనాధార. ఈ వేదాలవారి తండ్రిగారైన శ్రీ వేదాల కోనమాచార్యులుగారు ప్రారంభించారు. ఉత్తమసంస్కారంకల ఈ కుమారులు తమపెద్దవారిపై గౌరవాన్ని పాటిస్తూ, నలుగురూ ఏకమై చేస్తూవచ్చిన ఎన్నో సేవాకార్యాలకి చేయూతనిస్తున్న ఈ గ్రామస్థులకి, అందరికీ మంగళాశాసనములు వేదాలవారి సోదరులు, తమ తండ్రిగారిపేర ఈ గ్రామంలో హాస్పిటల్, స్కూలుభవనం, రక్షితజలవసతి, ఎన్నో మందిరాల పునరుద్ధరణవంటి సౌకర్యాలు కల్పించి గ్రామానికి ఎంతో ఉపకారం చేసారు. వీరిమాటపై గౌరవంతో గ్రామస్థులు ఎన్నికలు లేకుండా గ్రామాధికారులను నిర్ణయించుకొనే మంచి అలవాటు చేసుకున్నారు. ఇట్లాగే ఈ గ్రామం ఇతర గ్రామాలకి ఆదర్శవంతమై, ఒక మోడల్ విలేజ్‌గా అవ్వాలి" అని అనేక మంగళాశాసనములు కృపచేసినారు. ఆ సాయంకాలం భీమవరానికి సమీపంలోగల గొల్లపాలెం అనే గ్రామానికి విచ్చేసారు. ఇక్కడ గ్రామకరణంగ ఉండే శ్రీమాన్ పులిపాక వెంకటాచలం గ్రామానికి చెందిన శ్రీకోదండరామాలయాన్ని శ్రీస్వామివారికి సమర్పించారు. ఈ మధ్యవారు పరమపదించడంతో, ఈ సమర్పణకి కారకులైన శ్రీమాన్ రామకృష్ణశాస్త్రిగారు శ్రీవారిని ఆ ఆలయసందర్శనచేసి సరిగా నడిచే వ్యవస్థ చేయమని కోరారు ఆలయాన్ని దర్శించి అక్కడి స్థితిగతులనుచూసి ప్రవచనం చెప్పాక ఆలయాభివృద్ధికి తగిన ఏర్పాట్లు చేస్తామని తెలిపి, రాత్రికి సీతానగరం చేరారు.



### సుందకాండ సామూహిక పారాయణము

శ్రీమతి జానకిగారి ఆధ్వర్యవంలో విజయనగరం నుంచి శ్రీవైష్ణవ భక్తబృందం ప్రత్యేకంగా బస్ ఏర్పాటు చేసుకొని మన దివ్యసాకేతానికి వచ్చారు. కోదండరాముని సన్నిధిలో నవంబర్ నెల24వ తేదీన సామూహికంగా సుందరకాండ పారాయణం చాలా భక్తిశ్రద్ధలతో చేయడం అందరికీ ఆనందం కలిగించింది. బృందానికి మన జీయర్‌స్వామివారు మంగళాశాసనాలు చేసారు.

### ఆచార్య త్రయము నృత్యరూపకము

తనదైన నృత్యమాధ్యమం ఎన్నుకొని ఉద్యమించారు ముగ్గురు ఆచార్యుల భవ్యచరితాన్ని ప్రచారం చేయడానికి శ్రీమతి సముద్రాల మాధవీ రామానుజం. "ఆచార్యత్రయము" నృత్యరూపక తొలి ప్రదర్శన 26-02-2012న స్వామివారు ముఖ్యఅతిథిగా సికింద్రాబాద్‌లోని హరిహరకళాభవన్‌లో జరిగింది. ప్రదర్శనానంతరం శ్రీస్వామివారు తమ దివ్యమంగళాశాసనములను అందిస్తూ, ఈనృత్యరూపకం 108మార్లు వివిధ వేదికలపై ప్రదర్శించాలని సూచించారు.

శ్రీస్వామివారి సూచనను ఆదేశంగా భావించి, దైవాజ్ఞగా స్వీకరించి ప్రదర్శనా పరంపరలో కదిలారు ఆంగ్ల అధ్యాపకురాలుగా అదిలాబాద్‌లో పనిచేస్తున్న శ్రీమతి సముద్రాల మాధవీ రామానుజం. ఇప్పటివరకూ బదరీనాథ్, హృషీకేశ్, తిరుమల, మందస, సింహాచలం, ద్వారకాతిరుమల, మార్కాపురం, నడిగడ్డపాలెం మున్నగు దివ్యక్షేత్రాలలో 17ప్రదర్శనలు జరిగినాయి. శ్రీశైలంలో 18వ ప్రదర్శన 19వది భద్రాచలంలో, 20వది రవీంద్రభారతిలో, 21వ ప్రదర్శన ఢిల్లీలో జరిగాయి.

ఈ "ఆచార్యస్మరణ" యజ్ఞంలో భక్తులు పాలుపంచుకొని సముచిత వేదికలపై "ఆచార్యత్రయము" నృత్యప్రదర్శనకై ముందుకు రావలసిందిగా ఈనృత్యకళాకారిణి (8297399925,9946777594) తెలిపారు.

### రామానుజ విద్యాపీఠం శంకుస్థాపనం

19-12-13 గురువారం శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారు, శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయర్‌స్వామివారి ప్రణాళికననుసరించి స్థాపించతలపెట్టిన శ్రీరామానుజ విద్యాపీఠానికి అనుబద్ధమైన విద్యాసంస్థకు, భవన నిర్మాణం కావించడానికి మెదక్ జిల్లా సిద్ధిపేటకు 5కిలోమీటర్ల దూరాన హైదరాబాద్-కరీంనగర్ హైవేకి దగ్గరగా ఏర్పరచిన శేముషీ ఎంక్లేవ్‌లోని విద్యాలయప్రాంగణానికి శంకుస్థాపనం కావించారు. సిద్ధదెవలపర్స్ నిర్మిస్తున్న ఈనిర్మాణానికి 15ఎకరాల స్థలాన్ని శేముషీ ఎంక్లేవ్ వారు కేటాయించడం ముదావహం. కన్నులపండువుగా జరిగిన ఈకార్యక్రమానికి పలువురు పెద్దలు వేంచేసి వారి అభిప్రాయాలను వెలిబుచ్చారు. శ్రీశ్రీశ్రీ దేవనాథ జీయర్‌స్వామివారి నిర్వహణలో జరిగిన ఈకార్యక్రమంలో విద్యావికాసానికి గురువు, శిష్యులు ఎలాకారణం అవుతారో స్వామివారు వివరించారు. జీవా ఎకడమిక్ డైరెక్టర్ డా॥ రంగరామానుజాచార్యస్వామి ప్రసంగించారు, సెక్రటరీ పురుషోత్తంరావు, వి.టి. యూత్ శ్రీమతి కృష్ణకుమారి, సర్వోమాక్స్ ఇండియా లిమిటెడ్ సి.ఇ.ఒ. శ్రీమాన్ వేంకటేశ్వరరావు మున్నగువారు కార్యక్రమానికి విచ్చేసారు. శేముషీ ఎంక్లేవ్, సిద్ధదెవలపర్స్ యజమానులకు స్వామివారు మంగళాశాసనాలను అనుగ్రహించారు.

మన చిన్నజీయర్ స్వామివారు శ్రీరామానుజ విద్యాపీఠం, శంకుస్థాపన చేసిన సిద్ధిపేట దగ్గరలోని శేముషీ ఎంక్లేవ్‌లో 19-12-13న శ్రీమతి సముద్రాల మాధవీరామానుజం బృందంచే ''ఆచార్యత్రయం'' నృత్యకార్యక్రమం జరిగింది. స్వామివారు నృత్యబృందానికి మంగళాశాసనం చేసారు. స్వామివారి సమక్షంలో ఈకార్యక్రమం జరగడం చాలా అదృష్టంగా నృత్యప్రదర్శనాబృందం భావించింది.

ఈసందర్భంగా 25వ 'ఆచార్యత్రయం' నృత్యరూపక ప్రదర్శనం రజతోత్సవంగా కరీంనగర్‌లో జనవరి 5వ తేదిన జరుపవలసినదిగా శ్రీస్వామివారు ఆదేశించారు.

శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారి శతాబ్ది ఉత్సవాల సందర్భంగా 2009వ సంవత్సరంరో ఈస్ట్ ఆఫ్రికా టాంజానియా అనే దేశంలో దారేసలామ్ అనే పట్టణంలో శ్రీసనాతన ధర్మసభా ప్రాంగణంలో శ్రీస్వామివారి శ్రీహస్తాలచే ప్రతిష్ఠితమైన శ్రీవేంకటేశ్వరస్వామివారి 4వ



బ్రహ్మోత్సవాలను నిర్వహింపచేయడానికి అక్కడ ఉండే మనవారందరికోరికతో, దారేసలాం ఆలయ ప్రధానార్చకులు శ్రీమాన్ చక్రవర్తుల యాదగిరాచార్యస్వామి (వేదాధ్యాపకులు), శ్రీమాన్ జి. శేషాచార్యస్వామివార్ల ప్రార్థనమేరకు శ్రీస్వామివారు పరివారంతో ది28.11.2013న బయలుదేరారు.

హైదరాబాద్‌నుండి దుబాయ్‌మీదగా 29వ తేదీ సాయంకాలానికి ఉగాండ దేశంలో గల కంపాల అనే పట్టణానికి చేరారు. అక్కడ ఉండే మన భారతీయులు, శ్రీమాన్ లక్ష్మీరమేశ్ దంపతులు, ఇతర బృందం శ్రీస్వామివారికి, పరివారానికి ఘనస్వాగతాన్ని సమర్పించారు.

సాయంకాలం ఆరాధన సమర్పించి, శ్రీస్వామివారు తీర్థగోష్ఠి జరిపారు. ఆతరువాత అక్కడవారు ఏర్పాటుచేసిన సత్సంగంలో శ్రీస్వామివారు మంగళాశాసనాలు అందించారు.

30వ తేది ఉదయం శ్రీమాన్ రమేశ్‌గారి ఇంట్లోనే ఆరాధనాదులు పూర్తిగావించి, అక్కడి తెలుగువారు నిర్వహించే ఒక కార్యాలయానికి మంగళాశాసనం చేశారు.

తరువాత ఉంగాడలోని విశేష స్థానాల్ని చూపించారు. భూమధ్యరేఖ సన్నిహితంగా ఉండే విశేషాల్ని తెలియచేశారు. ఇక్కడి విశేషమేమంటే భూమధ్యరేఖకు దక్షిణభాగంలో ఒకపాత్రను నీటితో నింపి, క్రిందిపాత్రలోనికి నీటిని వదిలితే ఆ నీరు క్రిందుకి వచ్చే సమయంలో యాంటీక్లాక్‌వైజ్‌గా క్రిందికి నీరు పోతుంది. అలానే ఉత్తరభాగాన నీటిని క్రిందికి వదిలితే క్లాక్‌వైజ్‌గా నీరు తిరుగుతూ క్రిందికి చేరుతుంది. మధ్యభాగంలో వదిలితే నేరుగా క్రిందకి చేరుతుంది. ఇలాంటి విశేషాల్ని గమనించి, శ్రీస్వామివారు భగవంతుని సృష్టిలోని ప్రకృతి విశేషాలను తెలియచెప్పారు.

తరువాత కంపాలా పట్టణంలో మనవారందరు కలసి నిర్మించుకొన్న శ్రీవేంకటేశ్వర దేవాలయాన్ని సందర్శించారు. భక్తుల ప్రార్థనమేరకు సామూహిక లక్ష్మీనారాయణపూజా కార్యక్రమాన్ని జరిపించారు.

1వతేదీన ఆరాధనాదులు పూర్తిచేసుకొని, టాంజానియాలోని మౌంజా పట్టణానికి శ్రీమాన్ వేదగిరిగారు ఏర్పాటుచేసిన ఛార్టెడ్ ఫ్లైట్‌లో చేరుకున్నారు. ప్రయాణసమయంలో ప్రపంచంలోనే మిక్కిలి పెద్దదైన విక్టోరియా సరస్సును దాటుతూ, అక్కడుండే చిన్నచిన్న ద్వీపాలను చూస్తూ, వారు అక్కడ నివసించేవిధానాన్ని తెలియచేసారు.

మౌంజా పట్టణంలో శ్రీమాన్ వేదగిరిగారి గృహంలో బస ఏర్పాటుచేసి, శ్రీరామచంద్ర పెరుమాళ్ళకు, శ్రీస్వామివారితోపాటు పరివారానికి విక్టోరియా సరస్సులో నౌకావిహారం ఏర్పాటుచేశారు. అందులో మొసళ్ళుగూడా ఉన్నాయని తెలిపారు. తరువాత సాయంకాలం ప్రవచనాన్ని అందించి, దగ్గరలో ఉన్న స్వామినారాయణ మందిరం దర్శించి, మంగళాశాసనాలు అందించారు. ఇక్కడి ఆఫ్రికన్ పిల్లల్ని 50మందిని పెట్టుకొని ఒక ఆంగ్లవనిత Forever Angles అనే అనాథాశ్రమాన్ని నడుపుతోంది. దాన్ని దర్శించి, కొంత ధనసహాయాన్నందించారు.

2వ తేది ఆరాధనాదులు పూర్తిచేసుకొని, సెరంగేటి నేషనల్‌పార్కును సందర్శించారు. ఏనుగులు, సింహాలు, జిరాఫీలు, జీబ్రాలు, రకరకాల జింకలు, అడవిదున్నలు, హిప్పోపొటమస్‌వంటి ఎన్నో వన్యమృగాలు స్వతంత్రంగ సంచరిస్తూంటాయి. వాటి సహజీవనాన్ని ఎవ్వరూ భంగపరచరాదు. వాహనాలలో పరిమితంగా యాత్రికులు లోపల తిరగవచ్చు. ఆహారాలందివ్వడంవంటివేవీ కూడా అక్కడ చేయనివ్వరు. ఆటవికసహజీవనశైలి ఎలాఉంటుందో అక్కడ చూడవచ్చు. అవి వేటాడుకొనే విధానంగూడ గమనించవచ్చు.

3వ తేది ఆరాధనాదులు పూర్తైన తరువాత అక్కడవారు చేసే కార్యక్రమాన్ని తెలుసుకొని, తగినసూచనలు మంగళాశాసనాలు అందించారు. మధ్యాహ్నానికి అరూష పట్టణానికి చేరుకున్నారు.

సాయంకాలం శ్రీమాన్ రామదాసు ఏర్పాటుచేసిన విడిదిలో శ్రీలక్ష్మీనారాయణ మందిరంలో హోమపూర్ణాహుతిలో పాల్గొని, మంగళాశాసనాలు చేశారు. దగ్గరలో ఉన్న స్వామినారాయణ మందిరాన్ని కూడా దర్శించి, ప్రవచనాన్ని అనుగ్రహించారు.

4వ తేది మధ్యాహ్నానికి దారేసలాం చేరుకున్నారు. 6వ తేదీన ముకుండిలో శ్రీచౌదరిగారి పేపర్‌మిల్లుని సందర్శించారు. 6నుండి 8వరకు కళ్యాణంలో పాల్గొని గీతావైభవాన్ని ప్రవచించారు. 8వ తేదీన దారేసలాంలో టాంజానియా ప్రధాని H.E పిండాని కలిసి, మంగళాశాసనాలు చేశారు. వారికి మన జీవాలోని నేత్రవిద్యాలయం గురించి చెప్పినప్పుడు విద్యార్థులు ల్యాప్‌టాప్స్‌పై తమ విద్యాభ్యాసం సాగిస్తున్నారన్నవిషయం విని, ఆశ్చర్యపడి, టాంజానియా ప్రధాని మేము భారతదేశానికి వచ్చి, చూస్తామని ఆసక్తి ప్రదర్శించారు. శ్రీమాన్ పిండాగారి గ్రామమైన దుడోమా అనే వారి పట్టణంలో ఉండే 600మంది అంధవిద్యార్థులుగల పాఠశాలకి కంప్యూటర్లను తగిన శిక్షణనుగూడా యిస్తామని తెలిపారు. తప్పక విచ్చేయ వలసినదిగా శ్రీస్వామివారు వారిని దివ్యసాకేత బ్రహ్మోత్సవాలకు ఆహ్వానించారు. డిసెంబర్ 9న తిరిగి హైదరాబాద్‌కి విచ్చేశారు.

**స్వామివారి ధనుర్మాస ప్రవచనాలు**

శ్రీశ్రీశ్రీ జీయర్‌స్వామి వారు ఈ సంవత్సరం కరీంనగర్ వారి ఆహ్వానం మేరకు ఈనెల 16వతేదీనుండి ధనుర్మాస ప్రవచనాలారంభించారు. ఇందుకోసం 15సాయంకాలానికే కరీంనగర్ చేరి అవతారికా ప్రవచనం చేశారు.

స్థానిక సర్కస్‌గ్రౌండులో ఉదయం ప్రవచనం, తీర్థప్రసాదగోష్ఠి, సాయం ప్రవచనాలు సాగుతున్నాయి.

**శ్రీస్వామివారి అనంతపురం పర్యటనము**

డిసెంబర్10 స్వామివారు అనంతపురమునకు రాత్రి విచ్చేసి సాయిబాబా కళాశాలలో అనంతప్రవచనాసమితి మరియు అరవిందనగర్ వినాయకచవితి సంఘము కార్యకర్తలకు మంగళాశాసనములు చేశారు. తరువాత నేరుగా ఈశ్వర్‌రెడ్డి గారి గృహమున విడిది చేసారు. నిర్వాహకులు శ్రీపదుచురి
శేషాంజనేయులుగారు, శ్రీఅప్ప సుధీర్‌గారు, శ్రీ పి.ఈశ్వర్‌రెడ్డిగారు, శ్రీఫణికుమార్ గారు, బి.శ్రీనివాసులుగారు, జీవన్‌ప్రశాంత్ గార్లతో మాట్లాడి కార్యక్రమ వివరాలు తెలిపారు.

డిసెంబర్11 ఉదయం ఈశ్వర్‌రెడ్డిగారి గృహమున తీర్థగోష్ఠి తరువాత నూతనంగా నిర్వహిస్తున్న రామ,విష్ణు ఆలయాలను సందర్శించి, ఆ తరువాత బ్రాహ్మణ వెల్ఫేర్ సొసైటీ ప్రారంభోత్సవం చేశారు.

సాయంత్రం విష్ణుసహస్రనామ పారాయణం, భగవద్గీతపైన అనుగ్రహభాషణం జరిగింది.

డిసెంబర్12 ఉదయం తీర్థగోష్ఠి ముగించుకొని, నేరుగా అనంతపురమునకు ఇరవైకిలోమీటర్ల దూరములో ఉన్న హంపాపురము అనే గ్రామములో 125 ఎకరాల విస్తీర్ణములో పాడిపంటలు సాగుచేస్తున్న శ్రీనల్లపాటి రామకృష్ణ గారి "ఆదరణ పాడి-పంట సమగ్ర ప్రకృతి వ్యవసాయ క్షేత్రం" సందర్శించారు. అక్కడ స్వామివారు గోశాలను దర్శించి రావి, వేపమొక్కలను నాటారు. ఆపై స్వామివారు సభాస్థలంలో మాధవసేవగా సర్వప్రాణుల సేవ ఎలా చేయాలో హృదయానికి హత్తుకునే విధంగా వివరించారు.

సాయంత్రం విష్ణుసహస్రనామ పారాయణము, ప్రవచనములను అనుగ్రహించారు.

ఆరాత్రి కార్యకర్తలకు చేయదగిన సేవాకార్యక్రమాలు వివరించారు.

డిసెంబర్13 ఉదయం 9.00గం॥లకు లలితకళా పరిషత్‌కు విచ్చేసి "గీతాజయంతి" విశిష్టతను గురించి వివరించి భగవద్గీతను పారాయణం గావించి భక్తులచేత పలికించారు.

ఐదుగంటల సమయం సాగిన ఈకార్యక్రమంలో భక్తులు అంతా భక్తిశ్రద్ధలతో ఓపికగా పారాయణమును చేసారు. ఆసాయంత్రము యథావిధిగా విష్ణుసహస్రనామ పారాయణము చేసిన తరువాత ప్రవచనము చేసి, అందరికీ మంగళాశాసనములు అనుగ్రహించి శంషాబాద్‌కు తిరిగి వచ్చారు.

# పరమపద వార్తలు



కోరుకొండ వాస్తవ్యులు, పెద్దస్వామి వారిపట్ల, శ్రీచిన్నజీయర్‌స్వామివారి పట్ల విశేష ప్రీతికలిగిన శ్రీమాన్ **మార్గపురి లక్ష్మీనరసింహాచార్యులు** గారు, మన సీతానగరం ఆశ్రమంలో సకుటుంబంగా బహుకాలం నివసించియుండి అనేకరకాలుగా సంస్థకి సేవలందించారు. వీరేకాక, వీరి కుమారుడు శ్రీమాన్ వేణుగోపాలాచార్యులు కూడా మన సంస్థలో సేవచేస్తున్నారు. శ్రీమాన్ లక్ష్మీనరసింహాచార్యులు ది.16.11.2013న రాజమహేంద్రిలో పరమపదాన్ని పొందారు. వీరు విశేషంగ భక్తినివేదన ప్రచారానికి చేసిన సేవలకు మన భక్తినివేదన ఎంతో ఋణపడి ఉన్నాది. వారికి శ్రీయఃపతి సన్నిధానంలో నిత్యానందానుభవం కలగాలని కోరుతున్నాము.



శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న జీయర్‌స్వామివారి శిష్యులు, విజయవాడ వాస్తవ్యులు, పరమ పదవాసిని, శ్రీమతి **గొట్టుముక్కల సుజనలక్ష్మి** గారు (శ్రీమాన్ జి.యస్.ఎన్.రాజు, అడ్వకేటు, గారి ధర్మపత్ని) ది. 23-12-2004 న పరమపదించారు.

ది **14-12-2013**న వీరి **9వ వర్థంతి** సందర్భంగా భక్తినివేదనకు కైంకర్యాన్ని సమర్పించారు. వీరి కుటుంబ సభ్యులకు శ్రీశ్రీశ్రీ స్వామివారు మంగళాశాసనములు కృపచేసారు.



శ్రీశ్రీశ్రీ త్రిదండి పెద్ద జీయర్ స్వామివారి శిష్యులు, జగ్గయ్యపేట వాస్తవ్యులు అయిన **శ్రీమాన్ ముదుంబ వేణుగోపాలాచార్యులు** గారు ది. **3.12.2013**న ఆచార్య తిరువడి చేరినారు.

వీరికుటుంబ సభ్యులు ముదుంబ భట్టరాచార్యులు (మెల్‌బోర్న్), వెంకటాచార్యులు, శ్రీనివాసాచార్యులు శ్రీనివాసా చార్యులకు శ్రీశ్రీశ్రీ స్వామివారు మంగళాశాసనములు కృపచేసారు.



శ్రీశ్రీశ్రీ స్వామివారి శిష్యురాలు, గుంటూరు జిల్లా, మంగళగిరి వాస్తవ్యులు **శ్రీమతి దోగిపర్తి నాగేంద్రమ్మగారు** ది**19.11.2013**న ఆచార్య తిరువడి చేరినారు. వీరి కుటుంబ సభ్యులకు శ్రీశ్రీశ్రీ స్వామివారు మంగళాశాసనములు కృపచేసారు.



శ్రీశ్రీశ్రీ స్వామివారి శిష్యులు, విశాఖపట్నం, ఎమ్.వి.పి. కాలనీ వాస్తవ్యులు **శ్రీమాన్ మర్రి లలితేంద్రరావుగారు** ది**13.6.2013**న ఆచార్యతిరువడి చేరినారు. వీరి కుటుంబ సభ్యులకు శ్రీశ్రీశ్రీ స్వామివారు మంగళా శాసనములు కృపచేసారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు.

శ్రద్ధతో మీరు పంపిన **డిసెంబరు సమాధానాలందాయి.** విజేత పేరు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

*గతనెల సమాధానాలు 20వ పేజీలో కలవు.*

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. ఆచార్యుల పట్ల ప్రీతిలేనివారు విషంకంటే క్రూరులు అన్నవారు ఎవరు? | |
| 2. పరమాత్మకుగల గుణాలలో ఒక గుణం ఇది. ఏది ? | |
| 3. దేవదత్త శంఖాన్ని అర్జునునికి ఇచ్చినవాడెవడు? | |
| 4. జయవిజయులను శపించిన వారెవ్వరు? | |
| 5. 'ఆముక్తమాల్యద' అని గోదనువ్యవహరించినవారెవ్వరు? | |
| 6. 'గోపాలోపాయనం' ఎవరి స్మృతిగా ఇస్తారు? | |
| 7. నిజమైన శ్రీవైష్ణవ లక్షణం ఏది ? | |
| 8. 'నీలన్' అన్న పేరు ఎవరికుంది? | |
| 9. 'మునివాహనులు' ఎవ్వరు ? | |
| 10. 'ఆక్' అంటే ఏమిటి? | |
| 11. ఏదో ఒక్కలక్షణాన్ని తగ్గించడానికి వాడే వైద్యపద్ధతిని ఏమంటారు? | |
| 12. 'భోగి' అనే పదం ఏ ధాతువు నుండి పుట్టింది ? | |
| 13. ముఖచిత్రంలో గోదమ్మ ఎవరిలా అలంకరించుకుంది ? | |
| 14. స్వామిని వేంకటాచలం పై సాక్షాత్కరించిన వారెవ్వరు ? | |
| 15. కాంచీపురానికి తూర్పున ఉన్న అగ్రహారం ఏది ? | |
| 16. డెంగ్యూజ్వరానికి వాడే హోమియోపతి మందు ఏది? | |
| 17. మనిషి సుఖంగా ఉండాలంటే ఏది ఉండాలి ? | |
| 18. ఉదరభాజనుడు అంటే ఏమిటి? | |
| 19. అరుంధతికి స్వామి ఎలా సాక్షాత్కరించాడు ? | |
| 20. విడిచిపెట్టకుండా మనవెంట వచ్చేది ఏది ? | |

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేత పేరు**

విజేతల పేర్లు: కె. ఇందిర, పి & టి. కాలనీ, హైదరాబాద్, జయలక్ష్మి రామానుజదాసి, చెన్నై

**గత విజేతలంతా తమ తమ పోస్టల్ అడ్రెస్ వివరంగా సీతానగరం పంపిస్తే వారికి బహుమతులను పంపించగలము.**

**మీ శ్రద్ధాసక్తులకు భక్తినివేదన అభినందనలు అందిస్తుంది. బహుమతులు కూడా పంపిస్తుంది.**

మీ చిరునామా
..............................
..............................
..............................

*సూచన:* సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.

భక్తినివేదన సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929




సమగ్ర సమాచార నివేదన

సంపాదకులు శ్రీమతి టి. అరుణ

## శ్రీశాంత్ కాలేయ మార్పిడికి వి.టి. సేవ యు.ఎస్.ఎ. చాప్టర్ వారి చేయూత

మాధవ సేవగా సర్వ ప్రాణి సేవ లక్ష్యంగా వికాస తరంగిణి ప్రపంచవ్యాప్తంగా ఎన్నో సేవలు అందిస్తోంది. విదేశాలలో వి.టి. సేవ కార్యక్రమాలను అనేక ప్రాంతాలలో నిర్వహిస్తు న్నారు. భారతదేశంలో అవసరమైన వారికి విద్యా మరియు వైద్య సేవలను కూడా అందిస్తున్నారు.

6 సం॥ వయసు కలిగిన చి. ఎ. శ్రీశాంత్ కాలేయ వ్యాధితో బాధపడతున్నాడు. కాలెయమార్పిడికి ఏడు లక్షల ఇరవైవేల రూపాయలు ఖర్చు అవుతుంది. ఆర్థిక సహాయం అందించమని వికాసతరంగిణి వారిని ప్రార్థించగా వి.టి.సేవ యు.ఎస్.ఎ. చాప్టర్ వారు ఏడులక్షల ఇరవైవేల రూపాయలు చెక్కును 14-12-2013న శ్రీ స్వామివారి ద్వారా అందజేశారు. హైదరాబాద్ గ్లోబల్ ఆసుపత్రివారు చికిత్స నిర్వహిస్తున్నారు. చి.ఎ.శ్రీశాంత్‌కు శ్రీస్వామివారు మంగళాశాసనములుచేసారు.

మంగళగిరికి చెందిన శ్రీమతి అర్చన బ్రెస్ట్ కాన్సర్‌తో బాధపడుతోంది. ఆమెకి రెండు కిమోథెరపీలకు అవసరమైన లక్షా నలభైవేల రూపాయలను వికాసతరంగిణి (భారత్) అందజేసింది.

## ఆరోగ్యవికాస్ శిక్షణ శిబిరం

**విజయవాడ :**

శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో విజయ వాడ చైతన్య మహిళా ఆరోగ్యవికాస్ ఆర్గనైజర్ శ్రీమతి మాధవీ రవీంద్రగారు విజయనగరం ఆరోగ్య వికాస్ టీం వారికి శిక్షణ తరగతులు నిర్వహించారు. డిసెంబర్ 6,7 తేదీలలో వి.ఐ.ఎ. పరీక్షలు నిర్వహించడానికి కావలసిన పరికరాలపై అవగాహన కలిగించారు. కాల్పోస్కోప్ పరికరముతో పరీక్షలు ఎలా నిర్వహించాలో శిక్షణనిచ్చారు. స్త్రీల వ్యాధులకు చేయవలసిన పరీక్షలు ప్రత్యక్షంగా చూపించారు. పరికరాలు ఎలా వాడాలి? వాటిని ఎలా శు భ్రపరచాలో తెలియజేసారు. ఆరోగ్య శిబిరం నిర్వహించే ప్రాంతాల వారికి పూర్తి ఆరోగ్యం అందించేలా సర్వే ఎలా నిర్వహించాలో తెలియజేసారు. విజయనగరం ఆరోగ్య వికాస్ ఆర్గనైజర్ శ్రీమతి ఎన్.శకుంతల చైతన్య ఆరోగ్యవికాస్ వారికి కృతజ్ఞతలు తెలియజేసారు.

### విజయవాడ చైతన్య మహిళా ఆరోగ్య వికాస్

శ్రీశ్రీశ్రీ స్వామివారి తిరునక్షత్రం సందర్భంగా విజయవాడ చైతన్య ఆరోగ్యవికాస్ కార్యకర్తలు ఉచిత వైద్య శిబిరాలకు సేవలందిస్తున్న వైద్యులకు ఎన్.ఆర్.ఐ. హాస్పిటల్‌లో సహకారం అందిస్తున్న సిబ్బందికి 2014 కొత్త సంవత్సరం క్యాలండర్లు అందజేశారు. మంగళగిరి హైవేలో

ఉన్న శ్రీకృష్ణ చైతన్య వృద్ధాశ్రమంలో తదియారాధన ఏర్పాటు చేసారు. పెనమలూరులో శ్రీరామ ప్రకృతి వైద్యం మరియు వృద్ధాశ్రమంలో శ్రీస్వామివారి తిరునక్షత్రం నుండి ప్రతి వారం సత్సంగం భజన నిర్వహిస్తున్నారు. ఈ కార్యక్రమంలో శ్రీమతి ఎ. పద్మగారు ఆధ్వర్యంలో చైతన్య వికాసతరంగిణి సభ్యులు నిర్వహిస్తున్నారు.

10-11-2013న రామవరప్పాడులో గవర్నమెంట్ స్కూల్ నందు ఉచిత వైద్య శిబిరం నిర్వహించారు. 350 మందికి అవగాహన కల్గించి 102 మందికి పరీక్ష నిర్వహించారు. ఐదుగురు మహిళలను ఎన్ఆర్ఐ హాస్పిటల్‌కు తీసుకువెళ్ళి మళ్ళీ పరీక్షలు నిర్వహించారు. శిబిరానికి రామవరప్పాడు పంచాయితి ప్రెసిడెంట్ కిల్లా ఆనంద కుమార్, ఉమ,షీలా, సుజాతగారు తమ సహకారమందించారు. ఆరోగ్యవికాస్ సేవలను చూసి స్పందించిన వారు కార్యకర్తలుగా ఇకపై సేవలందించుటకు ముందుకు వచ్చారు.

చైతన్య ఆరోగ్యవికాస్ సేవలను ప్రోత్సహిస్తూ అమెరికాకు చెందిన కార్డియాలజిస్ట్, ప్రముఖ వైద్యులు శ్రీమాన్ జయంతి నాగేంద్ర (చైతన్య వికాసతరంగిణి ప్రెసిడెంట్ శ్రీమతి అన్నపూర్ణ ప్రసాదరావు గార్ల కుమారుడు) కాల్పోస్కోపి ద్వారా జరిపిన పరీక్షలు రికార్డు చేయటకు ల్యాప్‌టాప్ అందజేసారు. ఆరోగ్య వికాస కార్యకర్తలు కృతజ్ఞతలు తెలియజేసారు.

**విజయవాడ- ఆరోగ్య వికాస్**

వికాసతరంగిణి మహిళా ఆరోగ్య వికాస్ కార్యకర్తలు నవంబర్ 24వ తేదీ నుండి 29 తేదీ వరకు కంకిపాడు గ్రామంలో మహిళలకు వచ్చే వ్యాధులపై అవగాహన కల్గించారు. 78మందికి పరీక్షలు చేసారు. 49 మందికి బ్రెస్ట్ చెకప్, విఐఎ పరీక్షలు జరిగాయి. డా. శ్రీలత, డా. ఉషారాణి పరీక్షలు నిర్వహించారు. పి.వి. రామరాజు సహకారమందించారు. 08-11-2013 అరండల్ పేటలో పరీక్షలు నిర్వహించిన మహిళలకు పై పరీక్షలను సీతానగరంలో నిర్వహించారు. ముగ్గురు మహిళలకు సర్జరీ చేసారు. శ్రీమతి రుక్మిణిగారు వికాసతరంగిణి కార్యకర్తలు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

**విజయనగరం :**

ద్వారపూడి గ్రామంలో ఆరోగ్యవికాస్ కార్యకర్తలు 04-12-2013న సర్వే నిర్వహించి 09-12-2013న మహిళా వైద్య శిబిరం నిర్వహించారు. 110 మందికి డాక్టర్ మాటూరు సుధాకుమారిగారు పరీక్షలు జరిపారు. ఆరుగురు మహిళలకు పేప్సమీర్ పరీక్షలు జరిగాయి. ద్వారపూడి గ్రామ సర్పంచ్ శ్రీనివాస్‌గారు సహకారమందించారు. అవసరమైన వారికి మందులను చెరుకూరి శ్రీధర్‌గారు ఉచితంగా అందజేసారు.

## ఆధ్యాత్మిక - సేవాకార్యక్రమాలు

**ఆదిలాబాద్ జిల్లా : మంచిర్యాల**

మంచిర్యాల గౌతమ బుద్ధ పాఠశాలలో 17వ తేదీ ప్రజ్ఞ పరీక్షలు నిర్వహించారు. 200 మంది విద్యార్థులు పరీక్షలు వ్రాసారు. ధనుర్మాస ఉత్సవాలలో భాగంగా టి. రఘురామా చారిగారు తిరుప్పావై ప్రవచనం చేస్తున్నారు.

**ఖమ్మం జిల్లా : సత్తుపల్లి**

వికాసతరంగిణి ఆచార్య తిరునక్షత్ర మహోత్సవాన్ని వైభవంగా నిర్వహించారు. తత్త్వకళాశాల ప్రచారకులు నచ రామకృష్ణమాచార్యవారు పార్థసారథి ఆలయంలో శ్రీశ్రీశ్రీ స్వామివారి వైభవాన్ని వివరిస్తూ పూజా కార్యక్రమాన్ని నిర్వహించారు. సత్తుపల్లి కమిటి అధ్యక్షులు మందపాటి కేశవరెడ్డిగారు అనాథ బాలల పాఠశాలలో పండ్లు ప్రసాదాలు పంచిపెట్టారు. స్వామివారి పేరుమీద 1000 రూ. పాఠశాలకు సమర్పించారు.

4వ తేదీ ప్రముఖ నేత్రవైద్యనిపుణులు శ్రీ జూపల్లి సీతారామారావుగారిచే 69మందికి ఉచిత నేత్ర పరీక్షలు జరిపి మందులు అందజేసారు. రక్తదాన శిబిరంలో 84మంది రక్తదానం చేశారు. ద్విచక్రవాహనములు ముందు నడువగా శోభాయాత్ర నిర్వహించారు. ఈ కార్యక్రమంలో గుడివాడ వెంకటేశ్వరరావు, సత్యవతి, భవాని, శారద, రత్నకుమారి సేవలందించారు. సత్తుపల్లి పండితులైన శ్రీమాన్ ముడుంబై రామానుజాచార్యులవారిని శ్రీమాన్ సీతారామాచార్యుల వారిని సత్కరించారు.

**నల్గొండ జిల్లా : మిర్యాలగుడ**

శ్రీశ్రీశ్రీ స్వామివారి తిరునక్షత్ర సందర్భముగా శ్రీ సరస్వతి శిశుమందిర్ పాఠశాల మాధవ ఆవాస్ విద్యార్థులకు 14-11-2013న స్కూల్ బ్యాగులు, ఫేన్లు, దోమతెరలు మరియు ఆట వస్తువులు అందజేసారు. శ్రీరామ భక్త తరంగిణి కార్యక్రమంలో భాగంగా విద్యార్థులకు శ్రీరాముని సద్గుణాలను వివరిస్తూ సంక్షేపరామాయణ పారాయణ చేసారు. ప్రచార సామాగ్రిని పంచిపెట్టారు. పాఠశాలలో శ్రీశ్రీశ్రీ స్వామివారు వికాసతరంగిణి ద్వారా చేయిస్తున్న సేవా కార్యక్రమాల గూర్చి తెలియజేసారు. వికాసతరంగిణి మిర్యాల గుడా శాఖ అధ్యక్షులు గౌరు విజయకుమార్, గౌరు దయాకర్, మున్సిపల్ కమీషనర్ కర్నాటి నిర్మల, రేపాల పురుషోత్తంరెడ్డి, ఇ.లక్ష్మయ్య, కె.దుర్గయ్య, జె. కోటేశ్వరరావు, నిర్మల మొదలైనవారు పాల్గొన్నారు.

**తుఫాను బాధితులకు సహాయం.**

నల్గొండ జిల్లా వేములపల్లి మండలం కామేపల్లి గ్రామవాసులు తుఫాను ప్రభావంతో ఇళ్ళతోసహా సర్వం కోల్పోయారు. వికాసతరంగిణి కార్యకర్తలు వారికి వస్త్రాలు, దుప్పట్లు,వంటపాత్రలు, వంట సామగ్రి అందజేసారు. శ్రీరామాయణ పారాయణ సర్వ సంపదలు చేకూర్చి పెడుతుందని వారి మనసుకు ఊరట కల్గిస్తూ శ్రీరామనామ వైభవాన్ని వివరించి సంక్షేపరామాయణ పారాయణ చేశారు.

**హుజూర్‌నగర్ :**

వికాసతరంగిణి అధ్యక్షులు కొత్త కళావతి విద్యార్థులను ప్రోత్సహిస్తూ పై చదువులు చదివిస్తున్నారు. ఆర్థికంగా వెనుకబడిన చదువులో ఎమ్‌సెట్ (506వ ర్యాంకు) మంచి ర్యాంకు తెచ్చుకున్న యం. యమునకు రూ.3,000/- ఆర్థిక సహాయం అందించారు. ఈ కార్యక్రమంలో విటి సభ్యులు పాల్గొన్నారు.

**కృష్ణజిల్లా - జగ్గయ్యపేట**

లిటిల్ ఏంజిల్స్ హైస్కూల్ విద్యార్థుల అందరూ నేత్రవిద్యాలయ కళాశాలకు 35,295 రూపాయలు సమర్పించినారు. విద్యార్థులంతా సేవలందించ టానికి సహకరించిన పాఠశాల సిబ్బందికి, విద్యార్థులకు వికాస తరంగిణి నిర్వాహకులు శ్రీమతి శ్రీరాం విజయలక్ష్మి జ్ఞాపికలను అందజేసారు. ఆ ద్రవ్యాన్ని శ్రీస్వామివారి ద్వారా నేత్ర విద్యాలయంకు అందజేసారు.

**విజయవాడ**

విజయవాడ కొత్తపేట వికాసరతంగిణి (216శాఖ) కార్తీకమాసం సందర్భంగా కార్తీక దామోదరుని ప్రార్థిస్తూ 25-11-2013 సోమవారం ఉదయం 6 గంటల నుండి సాయంత్రం 6 గంటలవరకు శ్రీ విష్ణుసహస్రనామ పారాయణము చేసారు. ఈ కార్యక్రమంలో నగరానికి చెందిన ఇతర వికాసతరంగిణి శాఖలు పాల్గొన్నాయి. 26వ తేదీన 600 మందికి తదీయారాధన నిర్వహించారు. ఝాన్సి లక్ష్మి, శారద, హేమలత, చంద్రావతి, రమాదేవి మొదలగు వారు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

**రాజమండ్రి**

గీతాజయంతి సందర్భంగా భగవద్గీత 3వ అధ్యాయంపై పోటీలు జరిగాయి. 150 మంది విద్యార్థులు ఎపెక్స్ ఇంగ్లీషు స్కూల్ నుండి పాల్గొన్నారు. ప్రజ్ఞ కన్వీనర్ యం.వి.పద్మ రామానుజమ్ కార్యక్రమాన్ని నిర్వహించారు. రామలక్ష్మి, మైథిలి ప్రసాద్ చౌదరి సేవలందించారు.

**విశాఖపట్టణం**

విశాఖపట్టణం రాంనగర్‌లో విశాఖప్టణం విశ్వ హిందూ పరిషత్ నిర్వహించిన భగవద్గీత పోటీలలో 12 బహుమతులకి 1 2 బహుమతులు మన వికాసతరంగిణికే రావటం విశేషం. డా. అంగర లతాకుమారిగారు శేఖర్ ఆధ్యాత్మిక కేంద్రం వికాస తరంగిణి ద్వారా పిల్లలకు, పెద్దలకు భగవద్గీత నేర్పిస్తున్నారు. అక్కడ నేర్చుకున్న వారికే బహుమతులు లభించడం మన వికాసతరంగిణి గర్వించదగ్గ విషయం. లతాకుమారి గారు నిర్వహించే ఆధ్యాత్మిక కార్యక్రమాలు చూసి ఎన్నో సంస్థలు వారి ద్వారా ప్రజ్ఞ నేర్చుకుంటున్నారు. యం.వి.పి. కోలనీలో (జీయర్ విద్యానికేతన్) - పేరుమీదుగా సత్సంగ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. శ్రీమతి హైమవతిగారు యం.వి.పి. కోలనీ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

## నేత్రవిద్యాలయ కార్తీక వన మహోత్సవం



కార్తీకమాసం వనమహోత్సవాలల్లో అందరూ ఉత్సాహంగా పాల్గొంటారు. తమ స్నేహితులతో బంధువులతో కలసి ఆనందంగా నిర్వహించుకునే అద్భుతమైన కార్యక్రమం అన్ని ప్రాంతాలవారు నిర్వహించుకుంటారు. విశాఖపట్నం లక్ష్మి సత్యనారాయణ దంపతులు ఈ వనమహోత్సవాన్ని వారిజ నేత్ర విద్యాలయ, వేద పాఠశాల విద్యార్థులతో ఇందిరాగాంధి జూలాజికల్ పార్క్‌లో నిర్వహించారు. సాగర తీరాన్ని కూడా సందర్శించారు. విద్యార్థుల కేరింతలతో ఆటపాటలతో కార్యక్రమం ఆహ్లాదంగా కొనసాగింది. శ్రీమతి లక్ష్మిగారు కార్యక్రమానికి సహకారమందించారు.

**విజయనగరం :**

కొండవెలగాడ ఆదర్శగ్రామాన్ని శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబల రామానుజ జీయర్ స్వామివారు,శ్రీశ్రీశ్రీ దేవనాథ్ జీయర్ స్వామివారు 30-11-2012 సందర్శించినారు. ప్రజ్ఞా టీచర్స్, ఆదర్శగ్రామ కార్యకర్తలు, గ్రామ ప్రజలు స్వామీజీ లకు ఘన స్వాగతం పలికారు.ప్రశ్నలు వేస్తూ విద్యార్థులతో సమాధానములు రప్పిస్తూ అహోబల రామానుజ జీయర్ స్వామివారు ప్రజ్ఞ గురించి తెలియజేసారు. ఈ కార్యక్రమంలో శ్రీరామభక్త తరంగిణి ఆర్గనైజింగ్ సెక్రటరీ చెరుకూరి శ్రీధర్ గారు, పట్టణ సమన్వయకర్త శివరామకృష్ణగారు, నెల్లిమర్ల మండల కన్వీనర్ బూర్ల సత్యంగారు పాల్గొన్నారు. ఆదర్శ గ్రామ సేవలో ఉన్నవారందరికీ స్వామీజీలు మంగళా శాసనములు అందజేశారు.

**భువనేశ్వర్**

ఒడిస్సాలోగల భువనేశ్వర్‌లో డిసెంబర్ 10వ తేదీన శ్రీవైష్ణవ సమాజం రజతోత్సవాలలో నేత్ర విద్యాలయ పాఠశాల(వారిజ) విశాఖపట్టణంవారిచే సాంస్కృతిక కార్య క్రమాలు నిర్వహించారు. చిన్నారులు జానపద నృత్యంతో ప్రేక్షకులను ఆనందపరవశులనిచేసారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు నిర్వహించే పాఠశాలలో విద్యా విధానం అందరినీ ఆశ్చర్య పరిచింది. ఈ కార్యక్రమాన్ని శ్రీశ్రీశ్రీ చిన జీయరుస్వామి వారి శిష్యులు శ్రీ బచ్చు జగన్నాధదాస్ నిర్వహించారు. శ్రీమతి బేబిగారు, శ్రీమతి పాకలపాటి విజయగారు, శ్రీమతి అమృతవల్లి గారు మొదలైనవారు నేత్ర విద్యార్థులతో కార్యక్రమం నిర్వహించారు.

**నేత్రవిద్యాలయ డిగ్రీ కళాశాలకు కుమారి అర్చన సేవ**

రాజమండ్రి వికాసతరంగిణి సభ్యులు పద్మారామానుజం గారి మేనకోడలు, శ్రీమాన్ ఎమ్.వి. చిరంజీవిగారి మనుమరాలు చి॥ చిలకమర్రి అర్చిత శ్రీశ్రీశ్రీ స్వామివారు నిర్వ హిస్తున్న సేవా కార్యక్రమాల పట్ల ప్రభావితురాలై తను కూడా సేవలు అందించాలని నిర్ణయించుకున్నారు. తాను ఇంజనీర్‌గా అందుకున్న ప్రథమ వేతనం రూ.26,000లను స్వామి వారి తిరునక్షత్రం సందర్భంగా నేత్రవిద్యాలయ డిగ్రీ కళాశాలకు అందజేసారు. చి॥ అర్చితకు స్వామివారు మంగళా శాసనములు అందించారు.

## అభిప్రాయ నివేదన

నాపేరు కె.లక్ష్మి. సికింద్రాబాద్ సఫిల్ గుడాలో ఉంటున్నాను. శ్రీశ్రీశ్రీ చిన్నజీయరు స్వామివారు వికాసతరంగిణి ద్వారా ఎన్నో సేవలు చేయిస్తున్నారు. నా వంతుగా ఏదో సేవ చేయా లనుకున్నాను. శ్రీరాంనగర్‌లో 2012 బ్రహ్మోత్సవాలలో వికాస తరంగిణి శిక్షణ తరగతులు నిర్వహించారు. 10 రోజులలో శ్రీస్వామివారు ఎన్నో ఆధ్యాత్మిక విషయాలు తెలియజేసారు. సేవ ఎలా చెయ్యాలో చెప్పారు. శిక్షణ తరగతులలో చివర రోజున స్వామీ! పదిమందిలో మాట్లాడగలిగే శక్తిని ప్రసాదించండి అని ప్రార్థించాను. ఆనాటి నుండి ఈనాటి వరకు ప్రతి శనివారం సత్సంగ కార్య క్రమాలు నిర్వహిస్తు న్నాను. సదాచార్యుల దివ్య ఆశీస్సుల వైభవం ఏమని వర్ణించగలను? వారికి కృతజ్ఞతలు తెలియ జేసుకుంటూ మా ప్రాంతంలో లక్ష విష్ణుసహస్రనామ పారాయణ చేసాము.

లిటిల్ బర్డ్ స్కూల్‌లో 3,4,5 తరగతుల వారికి ప్రజ్ఞ కథలు, శ్లోకాలు చెప్తున్నాను. సత్సంగం నిర్వహించగలిగే శక్తిని ప్రసాదించిన ఆచార్యుల పాదపద్మములకు దాసోహములు సమర్పిస్తున్నాను.

---

నాపేరు ఎన్. శకుంతలానాయుడు. విజయనగరం వికాసతరంగిణి మహిళా ఆరోగ్య వికాస్ కన్వీనర్‌గా సేవ చేసుకునే భాగ్యాన్ని స్వామివారు నాకు కల్గించారు. 2013వ సంవత్సరంలో విజయనగరంలో 10 ఉచిత వైద్యశిబిరములు నిర్వహించాము. సుమారు 1500 మందికి చికిత్స చేయించాము. 6000 మంది మహిళలకు ఆరోగ్యం గూర్చి అవగాహ::న కల్గించాము. కేన్సర్‌తో బాధపడుతున్న వారికి కిమోథెరపీ చేయించాము. ముగ్గురికి పెద్ద ఆపరేషన్లు చేయించాము. నెలకి ఒక మెడకల్ కేంప్ చేస్తున్నాం అని ఆనందపడ్డాంకాని విజయవాడ సీతానగరం ఆశ్రమంలో శ్రీమతి మాధవిరవీంద్రగారి శిక్షణ తరగతులలో పాల్గొన్న తరువాత తెలిసింది. మేము చేయ్యవలసింది ఎంతో ఉంది అని. మాధవిరవీంద్రగారు 2 రోజులు మా విజయనగరం ఆరోగ్యా వికాస్ వారికి శిక్షణ ఇచ్చారు. సర్వే ఎలా చేయాలి? పరీక్షలు మనమే ఎలా నిర్వహించాలి? ఏ జాగ్రత్తలు తీసుకోవాలి? అన్న విషయాలను మాకు అర్థమయ్యే విధంగా ఓపికగా వివరించారు.

శిక్షణ తీసుకున్న తరువాత ద్వారపూడి గ్రామములో మెడికల్ క్యాంప్ నిర్వహించాం. ఇప్పుడు మాధవిగారిచ్చిన స్ఫూర్తితో కార్యక్రమాలు ఇంకా బాగా నిర్వహించగలుగు తున్నాం. మహిళా ఆరోగ్య వికాస్ కార్యకర్తలు శిక్షణ పొంది కార్యక్రమాలు నిర్వహిస్తే శ్రీశ్రీశ్రీ స్వామివారి ఆశయాలకు అనుగుణంగా పనిచేయగల్గుతాం. శిక్షణనిచ్చిన శ్రీమాధవి గారికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం.

## కార్యకర్తలకు సూచన

మీ వికాసతరంగిణి శాఖ ద్వారా చేసే ఆధ్యాత్మిక, సామాజిక, సేవా కార్యక్రమాలను అందరితో పంచుకోవాలనుకుంటున్నారా! కార్యక్రమ వివరాలను సంక్షిప్తంగా వ్రాసి, కార్యక్రమ ఫోటోలను జతపరచి ప్రతి నెల 10వతేదీలోపుగా **news@vtsbharath.org** కి మెయిల్ చేయండి.

**Cell No. 9440106555**

జై శ్రీమన్నారాయణ

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః





66 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన

## పంచాంగ వివరాలు

**జనవరి :**

29. అవమతిథి
30. అమావాస్య పిండపితృ యజ్ఞం

**ఫిబ్రవరి :**

4. మదనపంచమి, వసంతపంచమి
6. ధనిష్ఠకార్తె, రథసప్తమి
10. భీష్మైకాదశి, శ్రీవిష్ణు సహస్రనామ జయంతి
11. భీష్మద్వాదశి
12. కుంభ సంక్రమణం రా.తె. 5-6
19. శతభిషకార్తె
మందసా శ్రీవాసుదేవ పెరుమాళ్ బ్రహ్మోత్సవారంభం
22. మందసా శ్రీవారి కళ్యాణోత్సవం
24. మందసా శ్రీవారి అవభృధోత్సవము
25. సర్వేషామేకాదశి
27. మహాశివరాత్రి వేములవాడ శ్రీశైలములందు అభిషేక కళ్యాణోత్సవము.

**మార్చి :**

1. తిథి ద్వయం. అమావాస్య.
పిండ పితృయజ్ఞము.
3. శ్రీ యాదగిరి లక్ష్మీనృసింహ స్వామివారి బ్రహ్మోత్సవారంభం


శ్రీ విజయ నామ సంవత్సరం

మాఘమాసము

సంపుటి 66 ఫిబ్రవరి

సంచిక 11 2014

వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి

శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. **రంగరామానుజాచార్యులు**

ఉప సంపాదకులు

శ్రీమతి డా॥ T.K. **చూడామణి**


## విషయ సూచిక




*Printed & Published by :* H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**
*Printed & Published at :* **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh.
*Editor* : Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.

చందావివరాలు :-
సంవత్సరచందా రూ.225/-
విదేశాలకు సంవత్సరచందా $30/-





మీ సేవలో....
భక్తినివేదన, సీతానగరం - 522 501,
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com**
Internet : www.chinnajeeyar.org



D.T.P. & Design by :
పరిశోధనాలయమ్

సంపాదకీయం

# మతవిశ్వాసాలు - దేశభక్తి - సామాజికజీవనం



**మతం** అన్నపదానికి అభిమతం, ఇష్టం అని సాధారణమైన అర్థం. తన మనస్సుకునచ్చి, ఆచరణ యోగ్యంగా తనకనిపించే ఒక భావన. అయితే, క్రమ క్రమంగా ఈ అర్థం మారిపోయింది. ఆ పదం గట్టిగా ఉచ్చరించడమే పనికిరాదన్న దురభిప్రాయం సమాజంలో ఏర్పడింది.

ఏదైనా ఒక విశ్వాసం సమాజ సముద్ధరణా నికి బహుజన హితానికి ఉపకరించేటప్పుడు, ఆ విశ్వాసాన్ని ప్రమాణబద్ధం చేసి దాని పట్ల సరియైన అవగాహన కలిగేలా చేసేదే సిద్ధాన్తం. ఈ విశ్వాసం విజ్ఞానపరమైతే వైజ్ఞానిక విశ్వాసాల చుట్టూ వైజ్ఞానిక సిద్ధాన్తా లేర్పడతాయి. ఈవిశ్వాసం సామాజిక జీవన విధానం, సామాజిక స్థితిగతుల మీద ఏర్పడినదైతే, వాటిని కూడా ప్రమాణ బద్ధంగా కూడా నిరూపించి సిద్ధాన్తీకరించే ప్రక్రియ ఉంటుంది. వ్యవస్థిత రాజకీయవర్గాలకు భావజాలలకు ఈ లక్షణం వర్తిస్తుంది. ఇహ ఈలోకం, పరలోకం, పునర్జన్మలు, దైవభక్తి విశ్వాసాలు, పుణ్య పాపాలు, ఆరాధనావిధానాలు, ఆచార ప్రక్రియలు వీటిపై ఏర్పడే విభిన్న విశ్వాసాలకు కూడా సిద్ధాన్తీకరణ ఉంటుంది, ఉంది.

తనకు, ఇతరులకు, హానిని, ఆత్మవినాశనాన్ని కలిగించని ఏ సిద్ధాన్తాన్నైన, విశ్వాసాన్నైనా యథోచితంగా యథాభిరుచితంగా స్వీకరించడంలోను వీటిని మతవిశ్వాసాలు అంటారు. ప్రచారం చేసికోవడంలోనూ ప్రతిభారతీయునికి ఈ దేశంలో స్వేచ్ఛఉంది. అలాంటి స్వేచ్ఛమనకు మన రాజ్యాంగం కలిగించింది. ఈ విషయం లో అభ్యంతరం ఏవరికీ ఉండదు. అలా ఈ భరతభూమిపై ఏర్పడ్డవే శైవ, వైష్ణవ, శాక్తేయాది విశ్వాసాలు, ద్వైతాద్వైతవిశిష్టాద్వైతాది సిద్ధాన్తాలు. ప్రతిమత విశ్వాసము సాధారణ మానవ జీవన విధానంతో ముడివడి ఉంటుంది కనుక, దానికి ఒక క్రమబద్ధమైన ఆచరణ ప్రక్రియ కూడా ఉంటుంది. దీన్నేReligious discipline అంటున్నారు.

దైనందిన జీవనంలో ఈ ఆచరణ ప్రక్రియలు, కట్టు, బొట్టు, ఆహారవిహారాలు, విద్యావిధానాలు, ఆలోచనాధోరణులు వీటన్నిటిలో ఒక విడదీయరాని అనుబంధం కలిగి ఉంటాయి. మతపరమైన విశ్వాసం, ఆచారవిచారం సామాజిక జీవన విధానం లో ఒక భాగంఅయి ఉంటుంది కనుక, సామాజికాభ్యున్నతకి, లేదా పతనానికి తప్పక కారణం అయే అవకాశం ఏ మత విశ్వాసానికైనా ఉంది. ఆ దృష్టితో పరిశీలించినప్పుడు శైవ, వైష్ణవాది విశ్వాసాలు కాని, ఆవిశ్వాసాల పునాదిపై విల్లివిరిసిన ద్వైతాద్వైత విశిష్టాద్వైత సిద్ధాన్తాలు కాని, సామాజిక జీవనసమున్నత స్థితికి ఉపకరించేవి, దోహదపరచేవేనని కొన్నివందల సంవత్సరాలుగా ఈ భూమిపై నిరూపింపబడింది, నేటికీ వీటని మతవిశ్వాసాలని అంటారు. నిరూపింపబడుతున్నది. పై విశ్వాసాలేవీ సామాజిక జీవనానికి విఘాతాలు కాలేదని విజ్ఞులెరుగుదురు. శంకరభగవత్పాదులు, ఆవిష్కరించిన సిద్ధాన్తాలు కాని, శ్రీమన్మాధమునులు, భగవద్యామునులు, భగవద్రామానుజులు మున్నగు వైష్ణవాచార్యులు దాదాపు 1300 వందల సంవత్సరాలనుండి వెలికిదీసి ప్రచారంచేసిన శ్రీవైష్ణవ దర్శన సిద్ధాన్తాలుకాని, వాటి సాంద్రాయిక ఆచార విచారాలు కాని, ఈనాడు ఆసేతుసీతనగం పరివ్యాప్తి చెంది, అనేక అవాంతర సంప్రదాయ రీతుల ఆవిర్భావానికి కూడా ఆలవాలాలైనాయన్న చారిత్రిక సత్యాలు ఈవిషయాన్ని విశద పరుస్తున్నాయి.

ఈ సమస్తజగత్తు భగవంతుని శరీరమని, భగవంతుడు జీవకోటిని, ఈ ప్రకృతిని తన శరీరంగా ధరించి దాన్ని నియమిస్తూ అణువణువున వ్యాపించి ఉన్నాడని, ఇదంతా బ్రహ్మాత్మకమేనన్న దార్శనిక సిద్ధాన్తంకాని, ఆ భగవంతుడు, శ్రీమన్నారాయణుడనే పరమాత్మ తత్త్వమని, ఆతత్త్వాన్ని ఏ రూపంలో విశ్వసించి ఆరాధించినా, వారంతా ఒక్కటేనని వారికై ఆచార్య ముఖంగా లభించే సంస్కారం, ఆసంస్కారం వల్ల కలిగే సమానయోగ్యత ఇవన్నీ సామాజిక జీవనాన్ని ప్రభావితం చేస్తూ, మార్గదర్శకాలై ఉన్నాయన్న సత్యాన్ని అంగీకరించక తప్పదు. ఇదే రీతి శైవాదిమత విశ్వాసాల్లోనూ ఉంది. వాస్తవానికి ఈ ఆస్తిక వాదాలకు విశ్వాసాలకు మూలం వేద, పురాణేతిహాస వాఙ్మయమే కనుక, వివిధ మతవిశ్వాసాల ఆవిర్భావం అన్నది ఒక వైచిత్ర్యమే తప్ప, వైపరీత్యంకాదని బుద్ధిమంతులు గ్రహింప గలరు.

మనపూర్వాచార్యులు తాము విశ్వసించి సిద్ధాన్తపరచిన భావజాలం, అనుష్ఠానవిధానాలు, క్రమశిక్షణ నేర్పి సామాజికాభ్యున్నతకి మార్గదర్శకాలని నిరూపింపబడింది. అయితే ప్రాచీన సాంప్రదాయికరీతిని అనుసరించే కొందరిలోనూ ఆధునిక జీవనవిధానానికి అలవాటుపడ్డ కొందరిలోనూ, కొన్ని విపరీత

భావాలు ఉన్నాయి. ప్రాచీన సాంప్రదాయికరీతిలో బ్రతుకుతున్న వారు కొందరు, వేదాంత సిద్ధాన్తాలు కాని, ఆధ్యాత్మిక జీవనం కాని, సమాజపుటవసరాలతో ముడిపడిందికాదని, వ్యక్తిగతమైన ఉజ్జీవన విధానమేనని, తత్త్వవేత్తలు ప్రచారకులు, ముఖ్యంగా యతీశ్వరులు, వారి ఆశ్రమాలు, సామాజిక కృత్యాల్లో, అంటే సమాజపుదైనందిక సమస్యలు, అవసరాలకు స్పందించరాదని భావించేవారున్నారు.

అలాగే ఆధునికులు కొందరు అసలీవేదాంత సిద్ధాన్తాలు, ఆచరవ్యవహారాలు బూచుపట్టిన జీవసరళికి నిదర్శనాలు కనుక, సమాజానికి అసలు పనికేరావని అంటారు. ఇలా విరుద్ధభావాలు కలిగి ఉండటంవల్ల సామాజికమైన అభ్యుదయం, సామాన్య ప్రజాశ్రేయస్సుకోరే వారెవ్వరూ, తాత్త్వికచింతన, తన్మూలమైన జీవన సరళిజోలికి పోకూడదని వాదిస్తారు. ఇవి రెండూ, తప్పే. రెండూ విపరీతవాదనలే!

భగవంతుని అనన్యభావనతో శరణుకోరి, తమ మనస్సులో కలిగే కామభావనలను నశింపజేసి, మమ్ములను ఉజ్జీవింప చేయమని ప్రార్థించిన గోదాదేవి. పాడిపంటలతో పశుసమృద్ధితో సమాజం విల్లివిరియాలని కాంక్షించలేదా! భగవంతునిముందు అందరూ సమానమేనని చాటిన మన ఆళ్వారులు, నాయన్మారులు, ఇతర భక్తుల భావజాలాలు, ఉత్తరదేశంలో ఆవిర్భవించిన రామానంద చైతన్య సంప్రదాయాది సరణులు సమాజాన్ని విడచి ఆకాశంలో ఎగురుతున్నాయా? అందుకే యతిధర్మాన్ని స్వీకరించినా, సమాజంలోని అన్ని వర్గాలను ఆలయవ్యవస్థలో అన్వయించి, అందరికీ తాత్త్వికచింతనా యోగ్యత ఉన్నదని చాటిన రామానుజుల జీవనాన్ని ఆదర్శంగా తీసికొని, పరమహంస పరివ్రాజకులు **శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్ స్వామి**వారు మహిళాభ్యుదయానికి నిమ్నజాతుల సముద్ధరణానికి పాటుపడిన వైనం లోకమంతా ఎరుగును. తాము విశ్వసించిన వైదికమత విశ్వాసాలను విడవకుండానే, 'దేశభక్తిని' సామాజిక స్పృహను లోకానికి చాటారు. చిరస్మరణీయులైనారు. పంచమకులానికి చెందిన మారనేరినంబికి బ్రహ్మమేధ ప్రక్రియ జరిపిన మహాపూర్ణుల హృదయవిశాలతముందు, వారి సాంప్రదాయిక తాత్త్విక విచారం, చింతనం, ప్రతిబంధాలు కాలేదే! ఇదే మన **చిన్నజీయరు**లకు ఆదర్శం అయినరీతి. అందుకే వారిని అందరూ అనుసరిస్తున్నారు. 66సంవత్సరాలక్రితం స్వాతంత్ర్యం సాధించుకున్న ఈ జాతికి స్వాతంత్ర్యసారథులైన మహనీయులను వీలైనప్పుడల్లా తలచుకుందాం.

దేశవైజ్ఞానిక ప్రగతినీ, సగర్వంగ, సంభావించుదాం. దేశభక్తికి-ఆధ్యాత్మికజీవనం అడ్డుకాదని చాటుదాం. మత విశ్వాసాలు సామాజికాభ్యున్నతికి సోపానాలయేలా మలచు కుందాం. ఏ మత విశ్వాసమూ, దేశభక్తిని, జన్మభూమి పట్ల, ఈసమస్త ప్రాణికోటిని సహనంగా భరించిపోషించే **ధరిత్రీమాత** పట్ల ప్రేమ భక్తులను ఆరాధనాభావనను వ్యతిరేకించే 'తీవ్రవాదం' కాదు. కారాదు. అలా కాకుండా జాగ్రతపడదాం.

మనకుటుంబం, మనజీవనవిధానం, మనకూ మన చుట్టూ వున్న సమాజంపట్ల ఉండవలసిన బాధ్యత, భాగస్వామ్యం ఇవేవీ విడవకుండానే ఈ దేశపు పౌరునిగా సామాజిక స్పృహతో ఉంటూనే, మన మత-తాత్త్విక విశ్వాసాలను ఆదరించుదాం. వేదాన్తం వివేకాన్నిచ్చి నిత్యజాగరూకం చేస్తుందేతప్ప, బుద్ధికి స్తబ్ధతను, నిష్క్రియత్వాన్ని ఇచ్చేది కాదని నిరూపించుదాం. దేశాన్ని యువతను మేల్కొలిపిన వివేకానందాదులు వేదాన్తులు కారా! దురదృష్టంవల్ల నేటి ప్రపంచంలో 'మతచ్ఛాందస' వాదాలుగా వ్రేలెత్తి చూపే స్థితిలోనే కొన్నిమతవిశ్వాసాలు కొనసాగటంచాలా శోచనీయం.

ఏమత విశ్వాసమూ, మనభారతీయతకు, మనకుండ వలసిన సామరస్య ధోరణులకు విఘాతం కలిగించేది కారాదు. "మేము ఎవ్వరితోనూ చేరం, మాకు రాజ్యాంగసూత్రాలు అన్వయించవు" అనే ఏమత విశ్వాసమైనా, ఏ సామాజిక ధోరణి అయినా, ఈ దేశంలో మనుగడ సాగించలేదు. సాగించరాదు. ఈ సూత్రం రాజకీయ భావజాలానికీ అన్వయిస్తుంది. ఆయామత ప్రవర్తకు లెంతటివారైనా, ఈ దేశంలో అనాదిగా ఉన్న జీవనశైలిని, ఆచారవిధానాలను, మతవిశ్వాసాలను, ఇతరులకు బాధకం కానంత వరకు, సామరస్యానికి భంగం కలుగనంతవరకు న్యూనపరచే పద్ధతులు విడిచి మతప్రచారాలు చేపట్టాలి. సమాజ బాధకాలైన రాజకీయ ధోరణలను కూడా విడిచిపెట్టేలా సభ్య సమాజం దృఢంగా ఎలుగెత్తి చాటాలి. ప్రజలలో మతాలపట్ల అపోహలు ఏర్పడకుండా, ఇవి సామాజిక జీవనానికి ప్రోద్బలకాలయేలా మతప్రవక్తలు, నియంత్రించవలసిన అగత్యం ఎంతైనా ఉంది.

ఇలా మతం పట్ల సదవగాహనను కలిగిస్తూనే "దేశభక్తి" పెంపొందేలా చేయాలి. జాతీయ పతాకాన్ని, భారతభూమి పటాన్ని, పెద్దలేర్పరచిన రాజ్యాంగాన్ని, రాజ్యాంగవ్యవస్థను, కించపరచని రీతిలోనే మతప్రచారాలు సాగేలా చట్టపరమైన దృఢవ్యవస్థను చేయాలి. మరొక్క విషయం. ఒక మతవిశ్వాసంలోని వ్యవహారాలు ఆరాధనాది విధానాలు మరొక మతవిశ్వాసానికి రుచించకపోవచ్చు. అంతమాత్రంచేత, హద్దు అదుపులేకుండా, నోరుందికదా అని

వదరుబోతుతనాన్ని ప్రదర్శించడం, లేదా బాహాటంగా మరొక మతాచారాలను కించపరచేలా ప్రవర్తించడం "సభ్యసమాజం సహించరాదు". అలాకాక, మాకేంలే అని చూస్తూ గుడ్లప్పగించి చూచే ఏ సమాజమూ 'సభ్యసమాజం కాజాలదు' "సభిక సమజమే" (త్రాగుబోతుల-గొర్రెలమంద మాత్రమే) అవుతుందని విద్యా వివేకాలు కలవారు గుర్తించాలి. తాము విజ్ఞులమన్నదాన్ని తమ మాటలలో చేతలలో చూపగలగాలి. ప్రభుత్వాలు, చట్టాలు, ఇదేదో గొప్ప లౌకికవాదం అని భ్రాంతిపడి, నిష్కారణంగా దూషించేది కారాదు. 'మతం' అంటేనే అంటరాని వస్తువనే ధోరణిని ప్రదర్శించ కూడదు. మత ప్రవచనాలు చేసేవారు, ఇతర మతవిశ్వాసాలను బాహాటంగా తమ ప్రవచనాలలో విమర్శించే ధోరణిని వారు మానడమేకాదు, ఇలాంటి ధోరణిని నివారించే చట్టపరాలైన విధానాలు కూడా దృఢంగా అమలుజరపాలి. మతవిశ్వాసాలు-సామాజిక జీవనాల మధ్య ఒకసామరస్యాన్ని సాధించవలసిన అగత్యం **ఆధునికభారతం** లో ఎంతైనా ఉందని మన రాజకీయ నాయకులు, మతవిశ్వాస ప్రచారకులు గుర్తింతురుగాక! అలా చేయకపోతే ఈ దేశం విచ్ఛిన్నం కాక తప్పదు. పరాక్రాంతమైనా ఆశ్చర్యపోనక్కర లేదు. అలాంటి దుస్థితి కలుగుకుండును గాక!

వేంకటరంగరామానుజాచార్య.




**2014 ఫిబ్రవరి**

## శ్రీశ్రీశ్రీచిన్నజీయర్‌స్వామివారిపర్యటనవివరాలు

| | | | |
|---|---|---|---|
| 2 | సా॥ | వరంగల్లు | గిర్మాజీపేట శ్రీవేంకటేశ్వర స్వామివారిదేవాలయకార్యక్రమంలో పాల్గొంటారు. |
| 3 | ఉ॥ | వరంగల్లు | శ్రీవేంకటేశ్వరస్వామిదేవాలయం, రాత్రికి బీదర్ చేరుకుంటారు. |
| 4 | ఉ॥ | బీదర్ | శ్రీవిష్ణుయాగము. రాత్రికి (భాగ్యనగరం) |
| 5 | | అపోలో | శ్రీవేంకటేశ్వరస్వామి ద్వితీయ పుష్కరోత్సవ అంకురార్పణలో పాల్గొంటారు. |
| 6-7 | | మంగళంపాడు | నెల్లూరు జిల్లా మంగళంపాడు ఆలయఉత్సవాలలో పాల్గొంటారు. |
| 8 | ఉ॥ | హైద్రాబాద్ | అపోలో శ్రీవేంకటేశ్వరస్వామిఆలయంలో సమాశ్రయణాలు. |
| | సా॥ | | సామూహిక ఉపనయన కార్యక్రమంలో పాల్గొనే వటువులకు ఉదకశాంతి. |
| 9 | ఉ॥ | | శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయంలో పూర్ణాహుతి, సామూహిక ఉపనయనాలు. |
| 10 | సా॥ | ఉప్పగూడ | హైదరాబాద్ సా॥5.00 నుండి, భీష్మఏకాదశి సందర్భంగా విశ్వశాంతికై విరాట్‌శ్రీవిష్ణుసహస్రనామపారాయణ ఉప్పగూడ, ఓల్డ్‌సిటి హైదరాబాద్. రాత్రికి వరంగల్లు చేరుట. |
| 11 | మ॥ | జమ్మికుంట | మీదుగా యాదగిరిగుట్ట. వేంచేస్తారు. |
| 12 | ఉ॥ | యాదగిరిగుట్ట | మూర్తిప్రతిష్ఠాపన కార్యక్రమంలో పాల్గొంటారు. |
| | సా॥ | శామీర్‌పేట | శాంతినికేతన్ విద్యాలయ వార్షికోత్సవములో పాల్గొని అనంతరం శ్రీరామనగరం చేరుతారు. |
| 14 | | శ్రీరామనగరం | జిమ్స్‌హాస్పిటల్ ప్రథమవార్షికోత్సవము. |
| 15-16 | | ముంబై | ముంబైలోని వర్లి శ్రీవేంకటేశ్వస్వామిదేవాలయ వార్షికోత్సవంలో పాల్గొని, చెన్నైమీదుగా ఒంగోలుజిల్లా కందుకూరు (మం) జంగారెడ్డిపాలెం వేంచేస్తారు. |
| 17-19 | | | జంగారెడ్డిపాలెం రామాలయప్రతిష్ఠా కార్యక్రమంలో అన్వయిస్తారు. |
| 20-27 | | అమెరికా పర్యటన. | |
| 28 | | శ్రీరామనగరానికి వేంచేస్తారు. | |
| మార్చి | | | |
| 1 | ఉ॥ | శ్రీరామనగరం | బాకాస్ మీటింగ్ రాత్రికి బళ్ళారి చేరుతారు. |
| 2 | రా॥ | దావణగేరె. | |
| 3 | | వేంకటేశ్వరస్వామిఆలయశంకుస్థాపనకార్యక్రమము, | |
| 4-5 | | హోస్‌పేటలో కార్యక్రమాలు జరిపి శ్రీరామనగరం చేరుకుంటారు. | |






# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

గత సంచిక తరువాయి)

## (1 స్కంధం 11,12వ అధ్యాయాలు)

భగవానునికికల అవతార వైలక్షణ్యం **ఏతదీశనం మీశస్య** అనే శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ విశేషంగా చెప్పుకున్నాం. పదకొండవ అధ్యాయం చివరిశ్లోకంతో సామాన్యజనులకు స్వామిపట్ల ఉండే భావన ఎలాంటిదో పురాణకర్తచెబుతున్నాడు.

నిరంతరము స్వామితో అనుబంధించిఉంటూ స్వామిప్రీతికి వాల్లభ్యానికి నెలవైన మహిషులు కూడా స్వామియొక్క వాస్తవమైన వైభవాన్ని ఎరుగలేరని అంటున్నారు.

**తన్మేనిరేऽబలా మూఢాః స్త్రైణంచ అనువ్రతం రహః ।**
**అప్రమాణవిదో భర్తుః ఈశ్వరం మతయోయథా ॥**

శ్రీకృష్ణుని పత్నులు మొదలైన సన్నిహిత స్త్రీలుకూడా తమ భర్తయైన శ్రీకృష్ణుని ప్రభావము ఇంతటిది అని ఎరుగుజాలని వారై, సర్వనియామకుడు (ఈశ్వరం) ఈశ్వరుడైన స్వామిని సాధారణంగా ఇంద్రియప్రసారం కలిగిన సాంసారిక బుద్ధులు ఎలా ఎరుగజాలరో, పైగా మూఢబుద్ధులై విపరీతంగా భావిస్తారో అలాగే భావించారట. ఇక్కడ **అబలాః** అని ఒక విశేషణం వేసారు. అబలా శబ్దానికి స్త్రీలని సాధారణార్థం ఉన్నప్పటికీ బలహీనలని అర్థం చెబుతారు. కాని ఇక్కడ శరీరబలంకాక శాస్త్రబలం లేనివారనే చెప్పాలి. ఎందువల్ల నంటే, శరీరంచేత దుర్బలైనా శాస్త్రబలంచేత బుద్ధివైభవం కలవారు పరమాత్మతత్త్వాన్ని తప్పక ఎరుగ గలుగుదురు గదా!

ఇలాంటి శాస్త్రబలం లేనివారని చెప్పడానికి **అబలాః** అన్నారు. అంతేకాదు **మూఢాః** అనడంచేత పరమాత్మకుగల సహజస్వభావానికి విరుద్ధంగా ఆయనకు విపరీతస్వభావాన్ని తమ దుర్బల బుద్ధులచే కల్పించి భావిస్తున్నారన్నమాట. **స్త్రైణః** అనటంచేత పత్నులేకాక సన్నిహితలైన ఇతరస్త్రీలుకూడా ఇలాగే భావిస్తున్నారట. ఎలా భావిస్తు న్నారు? **రహః అనువ్రతం తంమేనిరే** రహస్యంగా స్వామితమకు వశ్యుడై ఏకాంతంగా తమను అనుసరిస్తున్నాడని వారు భావించినారట.

ఇక్కడ వీరరాఘవవ్యాఖ్య ఇలా ఉంది. ఏ విధంగా, తెలివి లేని లోకులు వెనుకచెప్పినట్లుగా అసంగుడై సకల నియామకుడుగా ఉన్న సాక్షాత్తు పరమాత్మను తమలాంటివాని గానే ఎలా భావిస్తారో, అలాగే స్త్రీలుకూడా అజ్ఞానంచే సర్వాన్ని తనవశంలో పెట్టుకున్న స్వామిని, తమకు వశపడినవానిగా, తామిచ్చిన సంకేతాన్ని అనుసరించి రహస్యంగా తమను అనుసరించే వానిగా భావిస్తున్నారని వారి అజ్ఞతను ఉద్ఘాటించడానికి **మూఢాః, అబలాః** అన్న విశేషణాలు వేశారట.

ఇక విజయధ్వజతీర్థులు తమ వ్యాఖ్యలో అప్రమాణ విదః అన్న పదానికి **అసురాః** అని అర్థంచెప్పారు. ఖలులు, ఇంద్రియాల ద్వారా విషయాలను అనుభవిస్తూ ఆనందించే వారు, శాస్త్రార్థం తెలియ నందువల్ల పరమార్థం ఎరుగలేక మూఢులై తామస, రాజస స్వభావులైన వారు, **అనంత గుణాలుకలవాడు** అన్న పరమాత్మకు చెందిన ప్రభావాతిశయాన్ని ఎరుగలేక, కృష్ణుని, భృత్యునివలె తమను అనుసరించి ఉండే వాడని, స్త్రీ విజితుడని భావించినారట. వైశేషికులు మొదలైనవారు యుక్త్యాభాసాలతో ఈశ్వరుణ్ణి తమబుద్ధికి తోచినట్లు కల్పించుకున్నట్లే, అవాప్తసమస్త కాముడైన శ్రీకృష్ణుని కేవలం స్త్రీ విజితునిగా భావించినారని విజయధ్వజులు వ్యాఖ్యానించారు. ఈ విధంగా ఈ అధ్యాయం శ్రీకృష్ణుని ప్రభావాతి శయాన్ని ఉద్ఘోషిస్తూ స్వామి అవతరించడంలోని రహస్యాన్ని ఎరుగ జాలని సామాన్య జనులు రాజస, తామస ప్రవృత్తులైన అసురులు సామాన్యస్త్రీలు అంతఃపురస్త్రీలు అందరూ స్వామిని ఒక ప్రాకృత వ్యక్తిగానే భావించినారని ఈ పదకొండవ అధ్యాయం ముగిస్తున్నది.

### 12వ అధ్యాయం, పరీక్షిత్ వృత్తాంతము

శౌనకాది మహర్షులు సూతుని ఉద్దేశించి ఇలా ప్రశ్నించారు. ఓ సూతమహర్షీ! అశ్వత్థామచేత విడువబడి అతిరౌద్రాలైన తేజస్సు లను వెడలగ్రక్కుతున్న బ్రహ్మశిరో నామకమైన మహాస్త్రంచేత ఉత్తరాగర్భము కొట్టబడిందిగదా! అశ్వత్థామాస్త్రంచేత వినష్టమైన ఆ గర్భం మళ్ళీ శ్రీకృష్ణునిచే బ్రతికింపబడింది.

ఇలా శ్రీకృష్ణప్రభావం చేత బ్రతకగలిగిన ఆ మహానుభావుని జన్మ ఎలాంటిది? కర్మలు ఎలాంటివి? ఎలాంటి మరణాన్ని పొంది దేహాన్ని విడిచాడు? ఈ విషయాలన్నీ వినదలచి ఉన్నాం. ఏ మహానుభావునికి శుకుడు జ్ఞానాన్ని ఇచ్చాడో ఆ మహానుభావుని

చరితాన్ని శ్రద్ధాళువులైన మాకు వివరించు, అని శౌనకాదులు ప్రశ్నించారు. దీనికి సూతుడు ఇలా చెప్పసాగాడు. ఓ మహర్షులారా కురుపాండవ యుద్ధానంతరం రాజ్యాన్ని పొందిన ధర్మరాజు శ్రీకృష్ణ పాదసేవనంచేత సర్వకామాలనుండి విరక్తుడై ప్రజలను తన తండ్రి వలె రంజింపచేస్తూ పరిపాలిస్తున్నాడు.

ముకుందునియందు ఏకాగ్రచిత్తం కలవానికి సంపదలు క్రతువులు లోకాలు, మహిషులు, సోదరులు, భూమి, ఈ జంబూ ద్వీప ఆధిపత్యము, స్వర్గగతమైన యశస్సు, దేవార్హాలైన కామాలు ఎందుకు? ఇలాంటి వారికి ఇవేవి అవసరం లేనివే. ఆకలివున్నవానికి అన్నంకంటే వేరైన పూలమాలలు చందనానులేపాలు మొదలైన భోగాలేమీ రుచించ నట్లుగా, ముకుందపాదలగ్నమైన మనస్సుకల ఆ ధర్మరాజుకు ఇతర కామాలు, ఇతర భోగాలేవి రుచించలేదు.

మాతృగర్భంలోఉన్న పరీక్షిత్ తాను అస్త్రంచే దహింపబడుతూ, ఒక పురుషుని దర్శించాడు. ఆ పురుషుడు అంగుష్ఠ మాత్రుడై ఉన్నాడు. నిర్మల స్వభావుడు. బంగారు కిరీటాన్ని శిరస్సుపై ధరించివున్నాడు. అతిసుందరమైనరూపం కలిగి ఉన్నాడు. మెరుపు తీగలాగా మెరిసే బంగారు జలతారుగల వస్త్రాన్ని కట్టి శ్యామల వర్ణుడైన అచ్యుతుని పరీక్షిత్తు దర్శించాడు.

స్వామి దీర్ఘాలైన నాలుగు బాహువులను కలిగి, పుటంపెట్టిన బంగారంతో మెరిసే కుండలాలు ధరించి, రక్తంలా ఎర్రగా ఉజ్జ్వలాలైన నేత్రాలతో నలువైపులా పరకాయించి చూస్తూ, గదా పాణియై ఉల్కలాగా మెరుస్తున్న తన గదను గిరగిరా తిప్పుతూ, తానున్న మాతృగర్భంలో పరిభ్రమిస్తున్నాడు. భానుడు తనకిరణాలచే మంచును పటాపంచలు చేసినట్లుగా అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రంనుండి వెలువడే జ్వాలలను తన గదచే అణగగొడుతున్నాడు. ఇలా ఉన్న స్వామిని, అతిసన్నిహితంగా దర్శించి ఎవడీతడు? అని వితర్కించాడు మాతృగర్భంలోఉన్న పరీక్షిత్తు. ఈ విధంగా అప్రమేయ స్వభావుడైన ఆ భగవంతుడు ధర్మగోప్తయై, అస్త్రపీడను నివారించి, తాను చూస్తుండగానే కన్నుల ముందు అంతర్థానమై య్యాడు. ఈ విషయాన్ని విస్తారంగా ఈక్రింది శ్లోకాల్లో సూతుడు శౌనకాదులకు వివరించాడు.

**మాతుర్గర్భగతో వీరః స తదా భృగునందన! ।**
**దదర్శ పురుషం కంచిత్ దహ్యమానోఽస్త్రతేజసా ॥**

**అంగుష్ఠమాత్రమమలం స్ఫురత్పురటమౌళినమ్ ।**
**అపీచ్యదర్శనం శ్యామం తటిద్వాససమచ్యుతమ్ ॥**

**శ్రీమద్దీర్ఘ చతుర్బాహుం తప్త కాంచనకుండలమ్ ।**
**క్షతజాక్షం గదాపాణిమ్ ఆత్మనస్సర్వతో దిశమ్ ॥**

**పరిభ్రమంతముల్కాభాం భ్రామయంతం గదాం ముహుః ।**
**అస్త్ర తేజస్స్వగదయా నీహారమివ గోపతిః ॥**

**విధమంతం సన్నికర్షే పర్యైక్షత క ఇత్యసౌ ।**
**విధూయ తదమేయాత్మా భగవాన్ ధర్మగుబ్విభుః ॥**
**పశ్యతో దశమాసస్య తత్రైవాంతర్దధే హరిః ।**

ఇలా పరీక్షిత్తు పదినెలలు నిండిన సమయంలో స్వామిని దర్శించగలిగాడు. అటుతరువాత సర్వగుణ భద్రమై అనుకూల గ్రహములు ఉదయించి వున్న సమయంలో పాండువంశాన్ని నిలబెట్టడానికి మరొకసారి పాండురాజే ఉదయించాడా అన్నట్లుగా మహాతేజస్వి అయిన పరీక్షిత్తు ఆవిర్భవించాడు.

**తతః సర్వగుణోదర్కే సానుకూల గ్రహోదయే ।**
**జజ్ఞేవంశధరః పాండోః భూయః పాండురివౌజసా ॥**

పరీక్షిత్తు ఆవిర్భవించగానే ధర్మరాజు ప్రీతిగొని ధౌమ్యుడు మొదలైన విప్రులద్వారా మంగళవాచనం కావించి, జాతకర్మను పూర్తిచేశాడు. తదంగంగా బంగారాన్ని, భూమిని, గ్రామాలను, మంచిగుఱ్ఱాలను, దానం చేశాడు. విప్రులకు ప్రశస్తమైన అన్నాన్ని సమర్పించాడు. వారంతా ఆనందించి ఇలా ఆశీర్వదించారు.

**ఏషహ్యస్మిన్ ప్రజాతంతౌ పురూణాం పౌరవర్షభ।**
**దైవేనా ప్రతిఘాతేన శుక్లే సంస్థాముపేయుషి ॥**

**రాతోవోఽనుగ్రహార్థాయ విష్ణునా ప్రభవిష్ణునా ।**
**తస్మాన్నామ్నా విష్ణురాతః ఇతి లోకే బృహచ్ఛ్రవాః।**
**భవిష్యతి నసందేహో మహాభాగవతోత్తమః ।**

ఓ మహారాజా! కురువంశపు ప్రజాతంతువైన ఈ గర్భ పిండము, దైవయోగంచేత ఎంతమాత్రము దెబ్బతినక నిలచి స్థైర్యాన్ని పొంది ఉండగా, మిమ్ములను అనుగ్రహించడానికి సర్వసమర్థుడైన విష్ణువుచే ఈయబడ్డాడు కనుక **విష్ణునా రాతః విష్ణురాతః** అని అన్వర్థనామధేయాన్ని పొందుతాడు. అంతేకాదు లోకంలో గొప్పకీర్తికలవాడై పరమభాగవతోత్తముడు అవుతాడు. ఇందులో సందేహము ఎంతమాత్రము లేదు. అని ఆశీర్వదించారు విప్రులు. ఈ విధంగా పరీక్షిత్తు విష్ణురాతునిగా ఆవిర్భవించాడు. ఈతని జన్మనుద్దేశించి విప్రులు పలికిన మాటలు విని యుధిష్ఠురుడు ఇలా ప్రశ్నించాడు విప్రులను. ఓ విప్రులారా! ఈతడు, పుణ్యశ్లోకులు మహానుభావులు అయిన మావంశంలో పుట్టిన రాజర్షులను తన కీర్తిచేత సాధువాదంచేత అనువర్తించి ఉంటాడు కదా? అని, అనగానే ఆ విప్రులంతా ఏకోన్ముఖంగా విష్ణురాతుని వైభవాన్ని కీర్తించారు.

**విష్ణురాతవైభవం**

'ఓ మహారాజా! సాక్షాత్తు ఇక్ష్వాకువువలె ప్రజారక్షకుడై బ్రహ్మణ్యుడు (వేదవేత్తలకు హితాన్ని కలిగించేవాడు) సత్యసంధుడు అయి దశరాథరామునివలె కీర్తినిపొందుతాడు. ఔశీనరుడైన (ఉశీనర దేశాధిపతియైన) శిబిచక్రవర్తిలాగా ఈతడు మహాదాత శరణాగత వత్సలుడు అవుతాడు.

దుష్యంతపుత్రుడైన భరతునిలా తాను ఆచరించిన యాగములద్వారా విశాల యశస్సును విస్తరింప చేస్తాడు. గొప్ప ధనుర్ధారియై అర్జునునికి కార్తవీర్యార్జునికి సమానుడౌతాడు. అగ్నిలా దుర్ధర్షుడు, (ఇతరుల తిరస్కారాన్ని పొందనివాడు) సముద్రంలా దాటరానివాడు, సింహపరాక్రముడు, హిమవంతునిలా సేవింపదగ్గవాడు, భూమిలా సహనంకలవాడు, ప్రీతిచే తల్లితండ్రుల వలె ఓర్మికలవాడు, బ్రహ్మసమానుడు, అనుగ్రహించడంలో పరమశివునితో సముడు, లక్ష్మీపతియైన నారాయణునివలె సర్వప్రాణులకు ఆశ్రయమైనవాడు, సర్వవిధ సద్గుణప్రభావంలో సాక్షాత్తు కృష్ణునే అనుసరించినవాడు, రంతిదేవునిలా ఉదారుడు, యయాతిలా ధార్మికుడు, ధైర్యంలో బలిచక్రవర్తితో సమానుడు, శ్రీకృష్ణునియందు ప్రహ్లాదునిలా అభినివేశంకలవాడు, అనేక అశ్వమేథాలను నిర్వహించేవాడు, వృద్ధోపాసకుడు, రాజర్షులను ఆవిర్భవింపచేసేవాడు, అపమార్గంలో వెళ్ళేవారిని నియమించే వాడు, కలిని నిగ్రహించి భూమిపై ధర్మాన్ని నిలపడానికి కారణమైన వాడు, అంతేకాదు బ్రాహ్మణపుత్రునిచే సృజింపబడిన తక్షకునివలన తనకు మరణమున్నదని విని, సర్వసంగ పరిత్యాగుడై శ్రీహరిపాదాన్ని ఆశ్రయించినవాడు.

సాక్షాత్తుగా వ్యాసపుత్రుడైన శుకునివల్ల ఆత్మయాథాత్మ్యాన్ని జిజ్ఞాసచేసినవాడు, అయిన ఈ మహానుభావుడు ఈ లోకాన్ని విడచి గంగఒడ్డున వైరాగ్యసంపదతో నిర్భయస్థితిని పొందుతాడు' అని రాజుకు జాతకకోవిదులైన విప్రులు భవిష్యత్తును జోష్యంచెప్పారు. ప్రభువువల్ల బహుమతులుపొంది తమ గృహాలకు వెడలిపోయారు.

**దేవరాతుడే పరీక్షిత్తు**

మాతృగర్భంలో ఉండగా పరమపురుషుడైన ఏ నారాయణుని సాక్షాత్కరించాడో, ఆ లక్షణాలుకల పురుషుడు ఈ నరులలో ఎవరైనా ఉన్నాడా అని నిరంతరం పరీక్షించే లక్షణం కలవాడు అవటంచేత ఈతడు పరీక్షిత్తు అని చెప్పబడ్డాడు అని పురాణకర్త నిర్వచనం చెప్పాడు.

**స ఏషలోకే విఖ్యాతః పరీక్షిదితి యత్ప్రభుః ।**
**గర్భేదృష్టమను ధ్యాయన్ పరీక్షేత నరేష్విహ ॥**

వీరరాఘవవ్యాఖ్య ఈ శ్లోకాన్ని ఇలా వివరించింది. 'జాతక కోవిదులైన వారు భవిష్యద్గుణములు ఇలాంటివి అని ఉత్తరాసుతుడైన దేవరాతుని గురించి చెబుతూ, ఈతడు పరీక్షిత్ అనే నామంచేత లోకంలో ప్రసిద్ధిచెందుతాడు' అని చెప్పారు. ఎందువల్లనంటే ఈ ఉత్తరాసుతుడు మాతృగర్భంలో సాక్షాత్కరించిన పరమ పురుషుని ధ్యానిస్తూ ఈ లోకంలోని నరులలో ఆ పురుషుని అన్వేషించినాడట. ఇలా పరీక్షించి శ్రీకృష్ణుడే ఆ పరమపురుషుడని నిశ్చయించాడు. వెనుక మాతృగర్భంలో పరమపురుషుని దర్శిస్తున్నసందర్భాన్ని వర్ణించిన శ్లోకాల్లో **సన్నికర్షేపర్యేక్షత క ఇత్యసౌ** అని చెప్పబడటం వల్ల తాను సన్నిహితంగా చూస్తున్న ఆ పరమ పురుషుని ఈతడెవ్వడా? అని పరీక్షించాడుగనుక పరీక్షిత్ అనే నామం ఏర్పడినదని చెప్పవచ్చు. పరి ఉపసర్గతో కూడిన ఈక్ష ధాతువుకంటే శతృప్రత్యయంచేయగా పరీక్షత్ అన్న రూపం ఏర్పడుతుంది. అయితే పరీక్షిత్ అని తరచుగా ప్రయోగం కనిపిస్తున్నది. దీన్ని ఎలా సాధించాలి? అని జిజ్ఞాస చేసి వీరరాఘవవ్యాఖ్య ఇలా అంటుంది. **హృసృరుహి యుషిభ్యః** అనే ఔణాదిక సూత్రంలో ఈక్షధాతువు గ్రహింపబడక పోయినా బహుళ గ్రహణాన్నిబట్టి ఇత్ ప్రత్యయం చేరిస్తే ఈక్షిత్ అవుతుంది, అని చెప్పారు. హరిత్, సరిత్, ఇత్యాది శబ్దాలలాగే దీన్నీ సాధించాలని వీరి అభిప్రాయం. పరీక్షిత్ శబ్ద నిర్వచనం విజయధ్వజ తీర్థులు చేసింది వేరుగా ఉంది. ఏ ప్రభువు మునిబాలక శాపంవల్ల తక్షకుని మూలంగా తనకు మరణం సంభవిస్తున్నదని, తక్షకుని దర్శనాన్ని గురించి ధ్యానిస్తూ తన దగ్గరకు వచ్చిన ప్రతివ్యక్తిని ఈతడే తక్షకుడా అని పరీక్షించాడో ఈయన పరీక్షిత్తు అయినాడని నిర్వచనం చెప్పారు. ఇది అంత సమంజసంగా తోచదు.

దీనివల్ల పరీక్షిత్తు భాగవతోత్తమునిగాకంటే మృత్యుభీతి కలవాడుగానే ఈనిర్వచనంవల్ల అవగతం అవుతున్నాడు. కాని వీరరాఘవ వ్యాఖ్యాన నిర్వచనం అలాగే శ్రీధరవ్యాఖ్యా వివరణం ఈ రెండు పరీక్షిత్తును భాగవతోత్తమునిగా నిరూపిస్తున్నాయి కనుక సముచితాలని భావించవచ్చు. *(సశేషం)*


**శ్రీమతే రామానుజాయ నమః**

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి మంగళాశాసనములతో...**

**రాజమహేంద్రి - రంగధామంలో వేంచేసియున్న**

**శ్రీరంగనాథ పెరుమాళ్ళ 5వ బ్రహ్మోత్సవములకు శుభాహ్వానము**

**ది. 02-03-2014 నుండి 05-03-2014 వరకు జరుగును.**

# శ్రీమద్భాగవత మాహాత్మ్యము

(గతసంచిక తరువాయి)

శ్రీమాన్ నోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

గంగానది ఒడ్డున ఉన్న ఆనందమనే తటంలో అన్ని జంతువులు తమ జాతి వైరాన్ని విస్మరించి జీవిస్తాయి. అక్కడ నీవు ఈ భాగవతం అనే జ్ఞానయజ్ఞాన్ని ఆరంభించు. ఆ ప్రదేశంలో ఈ కథనుండి ఒక అపూర్వరసం ఉదయిస్తుంది. భక్తి కూడా జరావస్థలో ఉన్న తన కుమారులైన జ్ఞాన వైరాగ్యా లను వెంట తీసుకుని అక్కడికి వస్తుంది. భాగవతకథ జరుగు తున్న ప్రదేశానికి భక్తులు తమంతట తామే కదలివస్తారు. ఈ కథాశబ్దాలు వినవడగానే పూర్వంలాగే ముగ్గురు యవ్వన వంతులౌతారు" అని చెప్పారు.

ఆవిధంగా చెప్పిన సనక సనందనాదులు కూడా నారదునితో కూడి శ్రీమద్భాగవత కథామృతాన్ని సేవించడానికి అక్కడ నుండి బయలుదేరి ఆనందమనే ఆ గంగాతీరానికి చేరుకున్నారు. వారిలా గంగాతీరానికి చేరారన్న వార్త భూ, భువర్లోక, స్వర్లోక, బ్రహ్మలోకాలకు అతివేగంగా ప్రయాణించి పెద్ద కోలాహలం ఏర్పడింది. ఆ భాగవతకథ వినాలని విష్ణుభక్తులందరూ పరుగులు పెడుతూ ఆ గంగాతీరానికి చేరడానికి బయలుదేరారు. అక్కడకి వచ్చిన ప్రముఖులు ఎందరోయున్నారు.

భృగువు, వసిష్ఠుడు, చ్యవనుడు, గౌతముడు, మేధాతిథి, దేవలుడు, దేవలాతుడు, పరశురాముడు, విశ్వామిత్రుడు, శాకలుడు, మార్కండేయుడు, దత్తాత్రేయుడు, పిప్పలాదుడు, యోగేశ్వరుడైన వ్యాసమహర్షి పరాశరుడు, ఛాయాశుకుడు, జాబాలి, జాహ్నువు మొదలైన ఎందరో మునులు తమతమ పుత్రులు, శిష్యులు, భార్యలతో అత్యంత ప్రేమతో అక్కడికి చేరారు. వేదాలు, ఉపనిషత్తులు, మంత్రాలు, తంత్రాలు, పదిహేడు పురాణాలు, ఆరు శాస్త్రాలు దేవరూపాలను ధరించి అక్కడికి వచ్చి చేరాయి.

గంగాది నదులు, పుష్కరాది సరోవరాలు, కురుక్షేత్రాది క్షేత్రాలు, సమస్త దిక్కులు, దండకాది వనాలు, హిమాలయాది పర్వతాలు, దేవతలు, గంధర్వులు, దానవులు మొదలైన వారందరు ఆ భాగవత కథను శ్రవణం చేయడానికి అక్కడికి వచ్చారు. భృగు మహర్షి వారినందరిని ప్రోత్సహించి అక్కడకు తీసుకొని వచ్చాడు.

**శ్లో ॥ దీక్షితా నారదేనాథ దత్త మాసన ముత్తమమ్ ।**
**కుమారా వందితాస్సర్వైర్నిషేదుః కృష్ణతత్పరాః ॥**

తర్వాత కథను వినిపించడానికి దీక్షితులైన సనక సనందనాదులు నారదుడు చూపించిన ఉత్తమాసనాల మీద ఆసీనులయ్యారు. ఆ భాగవత శ్రవణం కోసం వచ్చిన భక్తులంతా వారికి వందనం చేసారు. భాగవత శ్రవణానికి ఏ వరుసలో కూర్చోవాలి? వచ్చిన శ్రోతలలో ముందు వరసలో కూర్చున్న వారెవరో ఈ క్రింది పద్మపురాణం శ్లోకం వివరిస్తుంది.

**శ్లో ॥ వైష్ణవాశ్చ విరక్తాశ్చ న్యాసినో బ్రహ్మచారిణః ।**
**ముఖభాగే స్థితాస్తే చ తదగ్రే నారదః స్థితః ॥**

అందరికంటే ముందు నారదమహర్షి కూర్చున్నాడు. అతని తరువాత వైష్ణవులు, బ్రహ్మవేత్తలు, సన్యాసులు, బ్రహ్మచారులు కూర్చున్నారు.

ఇక ఒకప్రక్కన ఋషులు, ఒక ప్రక్కన దేవతలు, మరియొక ప్రక్కన వేదములు, ఉపనిషత్తులు, పురాణాలు, మరొక ప్రక్కన తీర్థములు, మరియొక్క వైపు స్త్రీలు కూర్చున్నారు. అందరూ విష్ణునామముతో జయజయ ధ్వానములు చేయ సాగారు. వందన, నమస్కార శబ్దములు వినరాసాగాయి. కొందరు శంఖములను పూరించారు. గులాములు, పేలాలు, పుష్పాలు ఒకరిపై ఒకరు జల్లుకోసాగారు. కొందరు దేవతలు విమానాలపై వచ్చి అక్కడ కూర్చున్న భక్తులందరిపై పడేటట్లు కల్పవృక్ష పుష్పాలను కురిపించారు. ఈ విధముగా సకల భక్తపూజ జరిగిన తరువాత సనకాది ఋషులు నారద మహర్షికి శ్రీమద్భాగవత మాహాత్మ్యాన్ని చెప్పడం మొదలుపెట్టారు.

"భక్తులారా! మీకు ఇప్పుడు భాగవత మాహాత్మ్యాన్ని వినిపిస్తున్నాం. ఇది విన్నవారికి ముక్తి కరతలం లోకి చేరుతుంది. అందరూ శ్రీమద్భాగవతాన్ని సేవించాలి, ఆస్వాదించాలి. దీనిని వినడం వలన శ్రీహరి మీమీ హృదయాలలో చేరతాడు. ఈ గ్రంథంలో 18000 శ్లోకాలు, 12 స్కంధాలు ఉన్నాయి. భాగవత మహిమ తెలుసుకోవడానికి శ్రీ శుక మహర్షి పరీక్షిత్ మహారాజుల మధ్య జరిగిన సంవాదం ఒకటి ఉంది. అది తెలుసుకోండి.

**శుక మహర్షి చెప్పిన భాగవత మహిమ**

రాజా! నీవీ భాగవతాన్ని శ్రద్ధగా విను. ఒక క్షణకాలమైనా ఈ భాగవత కథ చెవుల బడకపోతే జీవుడు అజ్ఞానం వలన ఈ సంసార చక్రంలోనే పడి తిరుగుతూ ఉంటాడు. అనేకమైన శాస్త్రాలను, పురాణాలను వినడం వలన, ఏమి ప్రయోజనం?

అవసరమైన భ్రమలు పెరగడం తప్ప. మనకి మోక్షం కావాలంటే భాగవత శాస్త్రం ఒక్కటే గర్జన చేస్తుంది. నిత్యం భాగవతం ప్రవచనం చేయబడుతున్న గృహం తీర్థస్థానమౌతుంది. ఆ గృహంలో నివసించే జనుల సర్వ పాపాలు నశిస్తాయి. వేయి అశ్వమేధయాగాలు, వందల కొద్ది వాజపేయ యజ్ఞాలు కూడా ఈ భాగవతకథ యొక్క పదహారో భాగానికి సరిపోవు.

ఓ తాపసులారా! శ్రీమద్భాగవతాన్ని వినే వరకు మాత్రమే మానవ శరీరంలో పాపాలు నివసిస్తాయి. ఫలితమనే దృష్టితో చూసినప్పుడు భాగవతకథ ఫలితానికి గంగా, గయ, కాశి, పుష్కరం, ప్రయాగ ఏ తీర్థ ఫలితము సాటిరావు. పరమగతిని పొందాలను కున్నవారు ప్రతిదినం శ్రీమద్భాగవతంలోని ఏదైనా ఒక శ్లోకాన్ని కాని లేదా శ్లోకపాదాన్ని కాని అర్థయుక్తంగా నియమంగా చదవాలి.

ఓంకారం, గాయత్రీ మంత్రం, పురుషసూక్తం, మూడువేదాలు, శ్రీమద్భాగవతం, ఓమ్ నమో భగవతే వాసుదేవాయ అనే ద్వాదశాక్షరీ మంత్రం, పన్నెండు మూర్తులు గల సూర్య భగవానుడు, ప్రయాగ, సంవత్సర రూపకాలం, బ్రాహ్మణుడు, అగ్నిహోత్రం, గోవు, ద్వాదశీ తిథి, తులసి, వసంతఋతువు, పురుషోత్తముడైన శ్రీ మహావిష్ణువు వీరందరిలోను బుద్ధిమంతుడైనవారు భేదాన్ని చూడరు. అంటే వీరందరిని సమంగా పవిత్రభావనతో దర్శిస్తారన్నమాట.

రేయింబవళ్ళు శ్రీమద్భాగవతాన్ని అర్థసహితంగా చదివే వాళ్ళకి కోట్లాది జన్మల పాపాలన్నీ సమూలంగా నశిస్తాయి. ఇందులో ఏ మాత్రం సందేహం లేదు. ప్రతిదినం భాగవతంలోని శ్లోకార్థాన్ని, శ్లోకపాదాన్ని చదివేవాడికి రాజసూయ యాగాన్ని, అశ్వమేధయాగాన్ని చేసిన ఫలం లభిస్తుంది.

నిత్యం భాగవతాన్ని చదివినా, భగవచ్చింతనం చేసినా, భక్తిగా తులసిని పెంచినా, గోవును సేవించినా అన్ని సమానాలే. అంత్యకాలంలో శ్రీమద్భాగవత వాక్కులను విన్న మానవుడు భగవంతునకు ప్రీతిపాత్రుడై వైకుంఠాన్ని పొందుతాడు. శ్రీమద్భాగవతాన్ని ఒక సువర్ణ సింహాసనం పై ఉంచి, ఒక విష్ణు భక్తునికి దానం చేసినవాడు విష్ణు సాయుజ్యాన్ని పొందుతాడు.

తన జీవితంలో చిత్తాన్ని నిశ్చలంగా ఉంచి శ్రీమద్భాగవత కథలోని రసాన్ని కొద్దిగా కూడా ఆస్వాదించని దుష్టుడు తన జన్మంతా చండాలుడిలా, గాడిదలా వ్యర్థం చేసుకున్న వాడవుతాడు. వాడు కేవలం తల్లికి ప్రసవ వేదన మిగిల్చడానికే పుట్టిన వాడవుతాడు. శ్రీశుకశాస్త్రం (భాగవతం) యొక్క వాక్కులను కొంచెం కూడా వినని పాపాత్ముడు జీవించియున్న శవంతో సమానం. వాడు భూమికి భారం. పశువుతో సమానం అయిన అలాంటి మానవుడికి ధిక్కారం అని స్వర్గలోకంలో ఉన్న ఇంద్రాది దేవతలు చెప్పు కుంటారు. ఈ ప్రపంచంలో శ్రీమద్భాగవతకథ లభించడం కష్టమే. అది కోట్ల కొలది జన్మల పుణ్యఫలం చేతనే సాధ్యమౌతుంది.

**భాగవత సప్తాహశ్రవణము**

నారదా! నీవు బుద్ధిమంతుడివి, యోగనిధివి. నీవు ప్రయత్న పూర్వకముగా ఈ కథను శ్రవణం చేయి. దీనిని ఇన్ని దినాలలోనే వినాలన్న నియమమేమి లేదు. దీనిని ఎప్పటికి అలా వింటూనే ఉండవచ్చు, అది మంచిదికూడా. సత్యభాషీ, బ్రహ్మచర్యమును అవలంబించేవాడు దీనిని శ్రవణం చేయడం వలన అత్యుత్తమ ఫలాలను ఇస్తుంది. కాని కలియుగంలో ఇలాంటి వాళ్ళు దొరకడం కష్టం. కాబట్టి శుకమహర్షి చెప్పిన విశేష శ్రవణవిధిని తెలుసుకోండి.

**శ్లో ॥ మనోవృత్తి జయశ్చైవ నియమాచరణం తథా ।**
**దీక్షా కర్తుమశక్యత్వాత్సప్తాహ శ్రవణం మతమ్ ॥**

కలియుగంలో చాలా రోజుల వరకు బుద్ధిని నియమనం చేయడం, నియమాలను పెట్టుకొని ఆచరించడం, పుణ్యకార్యాల కోసం దీక్ష వహించడం చాలా కష్టం. అందువలన సప్తాహ శ్రవణమనే విధి సులభంగా పాటించడానికి ఏర్పాటు చేయడ మయింది. నిత్యం శ్రద్ధగా శ్రవణం చేయడం వలన, మాఘమాసంలో శ్రవణం చేయడంవలన లభించే ఫలం సప్తాహ శ్రవణంలో లభిస్తుందని శుక మహర్షి నిర్ధారించాడు. మనసును నిగ్రహించ లేకపోవడం వలన, రోగాల వలన, అల్పాయుష్యం వలన ఇంకా ఎన్నో కలియుగ దోషాలవలన సప్తాహ శ్రవణ విధానాన్ని ఏర్పరచాడా శుకమహర్షి.

తపస్సు, యోగము, సమాధి చేత లభించే ఫలము సప్తాహశ్రవణంవలన సులభంగా కలుగుతుంది. సప్తాహశ్రవణం యజ్ఞంకంటే గొప్పది. అనేకమైన వ్రతాలు, తపస్సులు, తీర్థ సేవనాలు, యోగం, ధ్యానాలు, జ్ఞానంకంటే ఈ భాగవతసప్తాహ శ్రవణమే గొప్పది. అందువలన దీని గొప్పతనాన్ని ఏమని వర్ణించగలం? ఎంతని వర్ణించగలం! ఇది అన్నింటి కంటే గొప్పదని మాత్రమే చెప్పగలం.!!!

(సశేషం)

మరింత విశాలంగా ... వినూత్నంగా....
ప్రత్యేక 1 గ్రామ్ జ్యూయలరీ కౌంటర్
కామధేను సిల్క్స్
పట్టు చీరలు
ఫ్యాన్సీ చీరలు
పార్టీ శారీస్
గద్వాల్
వెంకటగిరి
మెటీరియల్స్
డ్రెస్ మెటీరియల్స్
బీసెంట్‌రోడ్, విజయవాడ-2. ఫోన్: 2574220

# నేర్చుకుందామా! - 24

**స్నానంనామ మనఃప్రసాద జననం, దుఃస్వప్నవిధ్వంసనం,**
**శౌచస్యాయతనం, మలాపహరణం, సంవర్ధనం తేజసః ।**
**రూపోద్యోతకరం, గదప్రశమనం, కామాగ్నిసందీపనం,**
**నారీనాంచ మనోహరం, శ్రమహరం, స్నానే దశైతే గుణాః॥**

శౌషం, సంతోషం మొదలైనవి పెద్దలచే ఆత్మగుణాలుగా చెప్పబడ్డాయి. శౌచం అనేది విశుద్ధతను కలిగించే ఒక ప్రక్రియ. వెలుపల మన శరీరానికి ఒకశౌచం కావాలి. మన వాక్కుకు ఒకశౌచం కావాలి. మన మనస్సుకు ఒకశౌచం కావాలి.

శౌచం ఎలా కలుగుతుంది? స్నానంవల్ల కలుగుతుంది. స్నానము, శౌచము అనే పదాలు రెండూ పర్యాయార్థకాలే. కొన్ని వస్తువులు సహజంగానే శౌచము కలిగి ఉంటాయి. వాటికి వేరే వేరే వస్తువుల వల్ల మనం శౌచాన్ని సాధించనక్కరలేదు కనుకనే మహాకవి భవభూతి **తీర్థోదకంచ వహ్నిశ్చ నాన్యతఃశుద్ధిమర్హతః** అని అంటాడు.

స్నానము మొదలైన శౌచక్రియవల్ల దోషాలు తొలగి వినిర్మలత సాధారణంగా ప్రతివస్తువుకీ ఏర్పడుతుంది. అలాగని సహజ పవిత్రత కలిగిన వస్తువులకు కూడా మనం శౌచాన్ని కలిగించే విధానాలు ఏవీ ఆచరించము. ఉదాహరణానికి గంగాది తీర్థాలలో నుంచి తెచ్చిన జలానికి మనం క్రొత్తగా శౌచాన్ని సంపాదించ నక్కరలేదు.

అలాగే వహ్ని లేదా అగ్ని, సహజ విశుద్ధమైనది. దానికి కూడా మనం ఏశౌచ క్రియలు ఆచరించి విశుద్ధిని కలిగించ నక్కరలేదు. కాని ఇలాంటి వస్తువులకు కూడా కొన్ని కొన్ని విశేష సన్నివేశాలలో వినియోగించదలచినపుడు కొన్ని సంస్కారాలు చేయడం ఉన్నది. అగ్నికి అలాంటి విశేష సంస్కారాలు చేసి వినియోగించడం అనేది వైదిక ప్రక్రియలో ఉంది. దీన్ని బట్టి శౌచ ప్రక్రియ చాలా అవసరమైనది అని గ్రహించాలి. భౌతిక జీవనంలో మనకు పైన చెప్పుకున్నట్లు మానసికశౌచం వాక్‌శౌచం శరీరశౌచం ఈమూడూ మిక్కిలి అవసరపడి ఉన్నాయి. మన వాక్కుకు శౌచం సత్యం వల్ల ఏర్పడుతుంది. **సత్యపూతంవచోవదేత్** సత్యంచేత పవిత్రమైన మాటలు మాట్లాడాలి. అంటే మనమాటకు సత్యం మూలంగానే శుచి ఏర్పడుతుందన్నమాట. అదే దానికి స్నానం. వ్యాకరణం మొదలైన శాస్త్రాలవల్ల శబ్దానికి శుద్ధికలుగుతుంది. ఇక మనస్సుకు ఆచార్యోపదేశంవల్ల మంచి ఆలోచనవల్ల శుద్ధి కలుగుతుంది. మనస్సుకు ఇదే స్నానం. ఇక శరీర స్నానం గురించి చెప్పుకుందాం. విశుద్ధమైన జలంలో శరీరమలాన్ని తొలగించు కోవడమే శరీరశౌచం అంటాం. దీనికే స్నానం అనికూడా పేరు. స్నానం పవిత్రమైనది, ఆయుర్దాన్ని పెంచేది, శ్రమమూలంగా ఏర్పడిన స్వేదమలాన్ని పోగొట్టేది, శరీరబలాన్ని కలిగించేది, ఓజస్సును ఇచ్చేది, శరీరముయొక్క అథోభాగానికి వేడినీటితోటి పరిషేచనం చేయడం బలావహం అని వైద్యశాస్త్రం చెబుతున్నది. **ఉష్ణాంబునా అథః కాయస్య పరిషేకోబలావహః** శిరస్సుపై స్నానంచేస్తే అది అతిదాహాన్ని, దవడలు ఎండిపోవడాన్ని నివారిస్తుంది. **వినిహంతి శిరఃస్నానం తృష్ణాతాల్వాస్యశోషణం** అని కూడా వైద్యశాస్త్రం చెబుతున్నది

ఇలాంటి స్నానంయొక్క ఆవశ్యకతను పై సుభాషిత శ్లోకం మన ముందు ఉంచుతున్నది. స్నానం అంటే మనస్సుకు ప్రసన్నతను కలిగించేది, చెడుకలలను పోగొడుతుంది, శరీరానికి శుచిని కలిగిస్తుంది. శరీరమలాన్ని దూరంచేస్తుంది. తేజస్సును పెంచుతుంది. శరీరానికున్న అందాన్ని పైకి స్ఫుటపరుస్తుంది. శరీరరోగాన్ని ప్రశమింపజేస్తుంది. వయస్సులో ఉన్నవారికి వారిలో ఉన్న కామాన్ని ఇది ఉద్దీపింపజేస్తుంది. విశేషించి స్త్రీలకు స్నానం అనేది ఎంతోప్రీతికరమైన ప్రక్రియ. (జలక్రీడలు వారికి చాలా ఇష్టం). శ్రమను హరిస్తుంది. ఈవిధంగా స్నానంలో పదిగుణాలున్నా యంటాడు సుభాషిత కారుడు.

An.Y.
ఆర్థోఫిట్ సిరప్
అన్ని రకముల జాయింట్ నొప్పులకు
సరికొత్త పరిష్కారం
ఇది ఫిజికెమ్ వారి ప్రతిష్టాత్మక ఉత్పాదనలలో ఒకటి
సత్వర నివారణకు అద్భుత ఆయుర్వేద ఔషధం
Also available as Oil & Capsules
ORTHO Fit Syrup
ఇంటింటా ఆర్థోఫిట్ నొప్పులన్నీ ఫటాఫట్

# మన ఆళ్వార్లు



కులశేఖరాళ్వార్

**యస్యామభూ చ్చేరకులప్రదీపః శ్రీకౌస్తుభాత్మా కులశేఖరాఖ్యః ।**
**మహీపతిర్మాఘపునర్వసూద్యద్దినే హరేః పూర్ణకటాక్షలక్ష్యమ్ ॥**

(దివ్యసూరిచరితం – గరుడవాహన పండితుడు)

మన ఆళ్వార్‌లలో రాజవంశానికి చెందిన కులశేఖరులు విశేషంగా చెప్పదగి ఉన్నారు. శ్రీమన్నారాయణుని కౌస్తుభాంశంగా శ్రీహరి పూర్ణ కటాక్షవీక్షణానికి లక్ష్యమై కులశేఖరులు మాఘమాసంలోని పునర్వసూ నక్షత్రంతో కూడిన ప్రశస్తమైన రోజున ఆవిర్భవించారు. వీరివల్ల వీరికి జన్మనిచ్చిన చేరకులం గొప్ప దీప్తిని పొందింది.

కేరళలోని కొంతభాగాన్ని ప్రాచీనకాలంలో చేరదేశంగా వ్యవహించేవారు. ఆ చేరదేశంలో కొల్లినకర్ అనే పేరున ఒక నగరం ఉండేది. ఆదేశాన్ని దృఢవ్రతుడనే రాజు పరిపాలించే వాడు. ఆయన పుత్రుడుగా జన్మించినవారే కులశేఖరులు. కలియుగారంభమై ఇరవైఏడు సంవత్సరాలు గడిచిన తరువాత ఇరవై ఎనిమిదవ సంవత్సరంలో అంటే పరాభవ సంవత్సరంలో సౌరమానం ప్రకారంగా మాశిమాసం శుక్లపక్షద్వాదశి గురువారంనాడు పునర్వసూ నక్షత్రంలో మన ఆళ్వార్లు అవతరించారు. వీరు భవిష్యత్తులో తమ కులానికి గొప్ప ప్రశస్తిని తేగలరనే భావనతో కులశేఖరులు అని వీరికి తండ్రి పేరుపెట్టారు.

చిన్న వయస్సులోనే ఒకరాజుకు ఉండవలసిన శస్త్రాస్త్ర విద్యలు మొదలైన వాటితో పాటుగా ఆచార్యానుగ్రహంచేత వేదవేదాంగాలు నేర్చే అవకాశం కలిగింది. యుక్తవయస్సులో యువరాజుగా పట్టాభిషిక్తులైనారు మన కులశేఖరులు. తన క్షాత్రధర్మాన్ని చూపి చుట్టుప్రక్కల రాజ్యాలపై దండెత్తి చోళ, చేర, పాండ్యదేశాలను **కొల్లికావలన్ కూడల్ నాయగన్** అన్నట్లుగా వశపరచుకున్నారు. ఈతని పరాక్రమాన్ని గమనించిన తండ్రి కులశేఖరులకు రాజ్య పరిపాలనాబాధ్యతను పూర్తిగా ఇచ్చి వానప్రస్థుడైనాడు.

మన కులశేఖరులకు శ్రీరామచంద్రునిపట్ల విశేషమైన ప్రీతి. గృహస్థధర్మాన్ని స్వీకరించిన తరువాత రామునిలాగే ధర్మబద్ధమైన పాలన సాగించారు. ఒక కుమారుడు, ఒక కుమార్తె ఇరువురిని గృహస్థ ధర్మ ఫలంగా పొందారు.

నిత్యమూ రామాయణాన్ని కాలక్షేపంగా వినే అలవాటు కలిగినవారు మన కులశేఖరులు. సీతతో పాటు అడవికి వెళ్ళిన రామునికి శూర్పణఖామూలంగా ఖరదూషణాదులతో యుద్ధం చేయవలసి వచ్చింది.

**చతుర్దశ సహస్రాణి చతుర్దశచ రాక్షసాః ।**
**ఖరశ్చ దూషణశ్చైవ శరేణైకేన ఘాతితాః॥**

అని చెప్పబడ్డట్లు పదునాలుగువేల పదునాలుగుమంది రాక్షసులను ఖరదూషణులతో పాటుగా ఒక్కబాణంతో సంహరించాడు రాముడు, అని చెప్పబడిన సన్నివేశాన్ని వింటున్నపుడు రాముడొక్కడే ఇంతమందిని ఒంటరిగా ఎదిరించి యుద్ధం చేస్తున్నాడే! అయ్యో! సీతమ్మను ఎలా రక్షించుకుంటాడు, అనే భావోద్వేగాన్ని తట్టుకోలేక శ్రీరామచంద్రునికి సహాయం చేయాలని భావించారు మన కులశేఖరులు.

ఎందువల్లనంటే ఆ యుద్ధ సన్నివేశం తమముందు అప్పుడే జరుగుతున్నట్టుగా మన కులశేఖరులు భావించడమే దీనికి కారణం. రామాయణమన్నా, రామాయణ సన్నివేశాలన్నా అంతటి ఏకతానత వారికుండేది. వెంటనే సేనాధ్యక్షుని మంత్రులనుద్దేశించి రామసహాయం కొరకు సైన్యాన్ని సిద్ధం చేయమని ఆదేశించి తాము ఆయుధాన్ని ధరించి వేగంగా యుద్ధానికి ఉపక్రమించారట. ఈసన్నివేశంలో ఏమిచేయాలో పాలుపోక మంత్రులు, సేనాని నిశ్చేష్టులై ఉండగా రామాయణ కాలక్షేపం చేస్తున్న విద్వాంసుడు రాక్షసవధ జరిగిందని, సీతమ్మ ఆనందంతో శ్రీరామచంద్రుని పరిష్వంగం చేసుకున్నదని ఆపరిష్వంగంతో ఆయన శ్రమ తీరిందని చెప్పాడట. ఆమాటలు విని మన కులశేఖరులు ఊరడిల్లారు. ఈ అనుభవాన్ని పురస్కరించుకొని శ్రీరామచంద్రునికి ఆపదకలిగిన

సన్నివేశాల్లో దేన్నీ కాలక్షేప పండితుడు చెప్పేవాడు కాదట. ఒకప్పుడు ఆకాలక్షేప పండితుడు తాను రాక తన కుమారుని పంపించినాడట. ఆతనికి మనకులశేఖరుల స్వభావం తెలియనందున రావణుడు సీతమ్మను అపహరించిన వృత్తాంతాన్ని చెప్పాడట. దీనికి ఉద్వేగపడిన కులశేఖరులు రావణుని వధించడానికి సైన్యంతో లంకకు వెళ్ళాలని సముద్రతీరానికి చేరారట. మన కులశేఖరుల భక్త్యావేశాన్ని గమనించిన పెరుమాళ్ (శ్రీరామచంద్రుడు) సీతాలక్ష్మణ సమేతుడై సాక్షాత్కరించి రావణవధను కావించినట్లు, సీతమ్మను రక్షించినట్లు చెప్పి కులశేఖరులను ప్రశాంతపరచి నగరానికి త్రిప్పి పంపి అంతర్ధానం అయినాడట.

శ్రీరంగం క్షేత్రం పట్ల వీరికి గల ఉద్వేలమైన ప్రీతి, వీరిని నిరంతరమూ రంగయాత్రకు పురికొల్పేది. దీన్ని నిలువరించడానికి మంత్రులు ఒక పన్నాగం పన్ని వైష్ణవగోష్ఠి కనిపిస్తే తాము వెనుకకు మరలడానికి అలవాటు పడ్డారు కనుక వైష్ణవులకు నిరాఘాతంగా అంతఃపురప్రవేశ లాభం కలిగించారు. కానీ ఎక్కడ పడితే అక్కడ వైష్ణవులు నిర్భయంగా సంచరించడాన్ని చూచిన కొందరుమంత్రులు వారిపట్ల ఈర్ష్యాసూయలతో ద్వేషాన్ని పుట్టించాలని భావించి రాజాభరణం దొంగిలింపబడి నట్లు దాన్ని ఎవరో వైష్ణవుడే దొంగిలించి ఉంటాడనే నెపం మోపారు.

ఇలా వైష్ణవునిపై చేసిన దోషారోపణాన్ని సహించలేని మన కులశేఖరులు వైష్ణవులు ఎవ్వరూ ఇలాంటి దోషాన్ని చేయరు అని నేను నిరూపిస్తాను అని ఒక కుండలో భయంకర సర్పాన్ని ఉంచి, నిజంగా వైష్ణవుడే దొంగిలిస్తే ఆ సర్పం నన్ను కాటు వేస్తుంది, అలాకాకపోతే కాటువేయదు అని అందరూ చూస్తుండగా సర్పంఉన్న కుండలో చేయిపెట్టారట. కులశేఖరులను పాము కరవలేదు. ఈ సన్నివేశాన్ని చూసిన మంత్రులకు పశ్చాత్తాపం కలిగి జరిగిన విషయాన్ని రాజుకు మనవిచేసి ఆభరణాన్ని చూపించినారట.

వైష్ణవులపట్ల జరిగిన అపచారానికి ప్రతిగా వారికి నిత్యమూ తదీయారాధనను జరపాలని కులశేఖరులు ఆజ్ఞాపించినారట.

ఇంతటి నిష్ఠగలిగిన మన కులశేఖరులు ముకుందమాల అనే స్తోత్రాన్ని సంస్కృతంలో అనుగ్రహించడమే కాక పెరుమాళ్ తిరుమొఴ్రి అనే దివ్యప్రబంధాన్ని కూడా అనుగ్రహించారు. ఈ ప్రబంధంలో రామకృష్ణావతారాలనే కాక శ్రీరంగం, వేంకటాచలం మొదలైన దివ్యతిరుపతులలోని అర్చామూర్తిని స్తుతించారు. విశేషించి ఒక దశకంలో నవవిధ సంబంధాలను చాలా అందంగా దృష్టాంత పురస్సరంగా నిరూపించారు.

తిరువేంగడపతిపై తమకున్న ఉద్వేలప్రీతిని ఆవిష్కరించి ఆకొండలో శిఖరంగానో, అక్కడ ఉండే కోనేటిలో చేపగానో, తిరువేంగడపతిని నిరంతరం దర్శించే భాగ్యం కలిగేలా ఒక గడపగానో తాము కావాలని కోరారు.

అందువల్లనే తిరుమల గర్భాలయంలో శ్రీనివాసుడు వేంచేసిఉన్న గర్భాలయపు గడప కులశేఖరపడి (కులశేకరన్‌పడి) గా వ్యవహరింపబడుతున్నది. మన ఆళ్వార్ల తిరునక్షత్రం **మార్చి 11వ తేదీన** రాబోతున్నది. దాన్ని మనందరం జరుపుకుందాం.

**కులశేఖరాళ్వార్ల తిరునక్షత్ర తనియన్**

**కుంభే పునర్వసౌ జాతం కేరళేచోళపట్టణే।**
**కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖరమాశ్రయే॥**

**నిత్య తనియన్**

**ఘుష్యతే యస్యనగరే రంగయాత్రా దినేదినే।**
**తమహం శిరసావందే రాజానం కులశేఖరమ్॥**


రుచికి, సువాసనకి, ఆరోగ్యానికి నాణ్యమైన
"ఆజంతా"
పసుపు, కారం, ధనియాలపొడి మరియు సేమియానే ఎల్లప్పుడు వాడండి
రవికుమార్ అండ్ కంపెని - చెన్నై
044 25204046, 26171341
Vijay Ads

వ్యక్తిత్వ వికాసానికి ... నాణ్యమైన సాంకేతిక విద్యా బోధనకు
కళ్ళం హరనాథరెడ్డి ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ

శ్రీ కళ్ళం హరనాథరెడ్డి
చైర్మన్ : కళ్ళంగ్రూప్


బిటెక్ కోర్సులు
➔ కంప్యూటర్ సైన్స్ అండ్ ఇంజనీరింగ్(సియస్ఇ)
➔ ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ (ఇఇఇ)
➔ ఎలక్ట్రానిక్స్ అండ్ కమ్యునికేషన్స్ ఇంజనీరింగ్ (ఇసిఇ)
➔ సివిల్ ఇంజనీరింగ్ (సిఇ),
➔ మెకానికల్ ఇంజనీరింగ్ (ఎమ్ఇ)
M.Tech :- CSE
మేనేజ్‌మెంట్ సీట్స్ కొరకు సంప్రదించండి : సెల్: 98856 04528, 94402 61773, 94910 73337.
EAMCET Code
KHIT
NH- 5.10వ కి.మీ వద్ద, కళ్ళం స్పిన్నింగ్ మిల్స్ వెనుక, చిలకలూరిపేట రోడ్, చౌడవరం, గుంటూరు- 19. ఫోన్: 0863 2119726.
సిటీ ఆఫీస్: ఫస్ట్‌లైన్, గుజ్జనగుండ్ల సర్కిల్, గుంటూరు -6. ఫోన్: 0863 2272345.




(ప్రియభగవత్‌బంధువులారా! రాబోయే పదహారు పదిహేడు సంవత్సరాలు భగవద్రామానుజ సహస్రాబ్దిగా మనం జరుపుకోబోతున్నాం. ఈ సందర్భంగా భగవద్రామానుజులు చేసిన మహోపకారాన్ని స్మరించడానికి ఎన్నో కార్యక్రమాలు చేపడుతున్నాం. పెద్ద మూర్తిని మన జీవా ప్రాంగణంలో నెలకొల్పుకొనబోతున్నాం. ఇలా మనం చేపట్టిన ఎన్నో ప్రధాన అంశాలలో భగవద్రామానుజ వైభవాన్ని ప్రకాశింపచేసే గ్రంథాలను మళ్ళీ విలక్షణ రీతిలో ముద్రించు కోవడం కూడా ఒకటి. రామానుజ భాష్యంతో పాటు శంకరమధ్వ భాష్యాలను కూడా చేర్చి జిజ్ఞాసువులైన పాఠకుల తులనాత్మకాను సంధానానికి వీలుగా ముద్రించాలని భావిస్తున్నట్లు మాసంపాదకీయంలో సూచించడం జరిగింది. భగవద్రామునుజుల సహస్రాబ్ది ఉత్సవ సందర్భంగా ఆయిన వెలయించిన సిద్ధాన్తాలలోని వైభవాన్ని ప్రకాశింపచేసే కొన్ని విశేషాలను కూడా మనం అనుస్యూతంగా భక్తినివేదనలో అనుసంధానం చేద్దాం. దీనికి నాందిగా ఒక ప్రధాన విషయాన్ని ఈమాసంలో మనం తీసుకుంటున్నాం. పాఠకులు ఈ అంశాన్ని చక్కగా మననం చేస్తారని ఆశిస్తున్నాం సంపాదకుడు).

### <u>భగవద్రామానుజ సిద్ధాన్తంలో చిత్‌తత్త్వము</u>

భగద్రామానుజ సిద్ధాన్తంలోని విశేషాలను పర్యాలోచన చేసేముందు కొన్ని పారిభాషిక పదాలను స్పష్టంగా అవగతం చేసుకొనవలసిఉంది. రామానుజ దర్శనంలో చిత్(చేతన) అచిత్(అచేతన) ఈశ్వర అనే శబ్దాలను తరచువాడటం ఉంటుంది. చిత్ అనే శబ్దానికి జ్ఞానం అనే అర్థంతో పాటు జ్ఞానముకల జీవుడు అను అర్థంకూడా ప్రసిద్ధంగా ఉంది. చితీసంజ్ఞానే అనే సంస్కృతధాతువుపై **చేతతే** బాగుగా తెలుసుకొనుచున్నాడు అనే అర్థంలో క్విప్ ప్రత్యయం చేరిస్తే **చిత్** అనే శబ్దం ఏర్పడుతుంది. బాగాతెలుసుకొనేవాడు అనే అర్థం. ఇలా తెలుసుకొనే లక్షణం కలవాడు జీవుడు, ఈశ్వరుడు ఇద్దరు అయినప్పటికీ జీవునికే కేవలం చిత్ పదంచేత వ్యవహారం ఉన్నది. పరమాత్మను వ్యవహరించవలసి వచ్చినపుడు పరమచిత్, పరమచేతన ఇత్యాది శబ్దాలు వాడతాము. చిత్ శబ్దంచేత చెప్పబడే జీవుణ్ణి ఆత్మ అనికూడా శాస్త్రం వ్యవహరిస్తున్నది. ఆత్మ అంటే వ్యాపించినవాడు, ఆప్తుడైనవాడు అని రెండర్థాలు ఛాందోగ్యోపనిషత్తు చెప్పింది. "ఆప్యత్వాత్ ఆప్తిమత్వాద్వా ఆత్మా" పొందబడేవాడు, పొందేవాడు అనికూడా అర్థం.

వాస్తవానికి ఆత్మశబ్దం ఈశ్వరునికే చెందినది. అయినప్పటికీ జీవునకు కూడా ఈశబ్దం వాడతాము. ఆత్మకే జీవుడనికూడా పేరు "జీవతీతి జీవః" అనే వ్యుత్పత్తిని బట్టి ప్రాణస్ఫురణము కలిగిన శరీరాన్ని ధరించి బ్రతుకుతాడు కనుక జీవుడు ఈవిధంగా జీవ, ఆత్మ పదాలు పర్యాయ పదాలు. జీవ, ఈశ్వరులకు భేదాన్ని స్పష్టంగా చెప్పడానికి ఆత్మశబ్దానికి ముందు జీవశబ్దాన్ని చేర్చి జీవాత్మ అని, పరమ శబ్దాన్ని చేర్చి పరమాత్మ అని వేరువేరుగా వ్యవహరిస్తున్నాం. ఇది శాస్త్ర సమ్మతమే. ఇలాగే ప్రత్యక్ అని మరొకశబ్దం ఉన్నది. తనను తాను తెలుసుకొనే లక్షణం కలది ప్రత్యక్ తత్త్వం. స్వస్మై భాసమాత్వం ప్రత్యక్త్వం అని శాస్త్రీయ లక్షణం. ఈపదం కూడా జీవాత్మ పరమాత్మలకు ఇద్దరకూ అన్వయిస్తుంది. కనుక జీవ పరంగా వాడినపుడు ఆత్మశబ్దాన్ని చేర్చి ప్రత్యగాత్మ అని వ్యవహరిస్తారు. ఈజీవుడు లేక ఆత్మ లేక చేతనుడు లేదా చిత్ తత్త్వము ప్రకృతి సంబంధమూలంగా దేవమనుష్య తిర్యక్ స్థావరాది శరీరాలను పొందినపుడు శరీరము కలవాడు కనుక శరీరి అని అంటారు. జీవుని శరీరి అని అన్నప్పుడు దేవశరీరాన్నో, మనుష్యశరీరాన్నో, పశుపక్ష్యాది శరీరాన్నో లేదా చెట్టు, పుట్ట, రాయి, రప్ప శరీరాలనో పొంది ఉండాలి. ఇక్కడ ఒకప్రశ్న? జీవుడు దేవ, మనుష్య, పశు,పక్షి, కీటాది శరీరాలను ధరించి ప్రాణశక్తి మూలముగా బ్రతుకుతాడు కనుక ప్రాణిగా కూడా ఆదశలో వ్యవహరింపబడతాడని మనకు తెలుసు.

వేద పురాణాదులు చెట్లలోను, లతలలోను, గుల్మాల లోను, జీవస్ఫురణమున్నదని ఉద్ఘోషించాయి కనుక వాటినికూడా శరీరిగా వ్యవహరించవచ్చు. వీటన్నింటిలోను జీవుడు ప్రవేశించి ఉన్నాడన్న మాట. మరి రాయి రప్ప, కొండ, బండ, మొదలైన ఎన్నో వస్తువులు ప్రాణస్ఫురణము అంటే, ప్రాణవాయువుద్వారా బ్రతకడం అనే వ్యవస్థ లేకుండా ఉన్నాయి కదా! మరి వీటిలో కూడా జీవుడు ప్రవేశించి ఉంటాడా అని ఒకప్రశ్న సాధారణంగా అందరికీ కలుగుతుంది. ఎందువల్లనంటే ఆధునిక, వైజ్ఞానిక అవగాహనను బట్టి ప్రాణస్ఫురణము లేని వస్తువులన్నీ జడాలు. కనుక వాటిలో జీవతత్త్వం ఉండదు అని భావించడం ఉంది. కాని మన వైదిక సంప్రదాయం దాన్ననుసరించిన పురాణ సంప్రదాయం ఈసృష్టిలోని ప్రాణవంతాలైన వస్తువులలోను, ప్రాణ రహితాలైన వస్తువుల్లోను జీవతత్త్వం ప్రవేశించి ఉందని ఉద్ఘోషిస్తున్నాయి.

**సర్వవస్తువుల్లోను జీవశక్తి తారతమ్యంతో ప్రవేశించి ఉంది.**

శంకర రామానుజాది మహాచార్యులచే పరమ ప్రమాణంగా తీసుకొనబడిన విష్ణుపురాణం ఈఅంశాన్ని నిర్ద్వందంగా ఉద్ఘోషిస్తున్నది. ఈక్రింది శ్లోకాలు గమనించండి.

శ్లో॥ విష్ణుశక్తిః పరాప్రోక్తా క్షేత్రజ్ఞాఖ్యా తథాపరా ।
అవిద్యాకర్మసంజ్ఞాన్యా తృతీయా శక్తిరిష్యతే ॥
యయా క్షేత్రజ్ఞశక్తిః సావేష్టితా నృప సర్వగా ।
సంసారతాపానఖిలానవాప్నోత్యతిసన్తతాన్ ॥
తయా తిరోహితత్వాచ్చ శక్తిః క్షేత్రజ్ఞసంజ్ఞితా ।
సర్వభూతేషు భూపాల తారతమ్యేన లక్ష్యతే ॥
అప్రాణవత్సు స్వల్పాసా స్థావరేషుతతోధికా ।
సరీసృపేషు తేభ్యోన్యాప్యతిశక్త్యా పతత్రిషు ॥
పతత్రిభ్యో మృగాస్తేభ్యః స్వశక్త్యాఽ పశవోధికాః ।
పశుభ్యో మనుజాశ్చాతిశక్త్యా పుంసః ప్రభావితాః ॥
తేభ్యోపి నాగా గన్ధర్వా యక్షాద్యా దేవతా నృప ।
శక్రః సమస్తదేవేభ్య స్తతశ్చాతి పజ్రాపతిః ॥
హిరణ్యగర్భోఽ తి తతః పుంసః శక్త్యుపలక్షితః ।
ఏతాన్యశేషరూపస్య తస్య రూపాణి పార్థివ ॥

విష్ణుపురాణం ఈసృష్టి మూడు శక్తులతో కూడి ఉన్నదని చెబుతున్నది. ఒకటి విష్ణుశక్తి, రెండవది క్షేత్రజ్ఞశక్తి, మూడవది అవిద్యారూపమైన కర్మశక్తి. సర్వవ్యాపకుడైన పరమాత్మను నిరంతరం అంటి పెట్టుకుని ఉండేది విష్ణుశక్తి. పరమాత్మ యొక్క ఈవైష్ణవీ శక్తి పరమాత్మతో పాటుగా ఈసృష్టిలోని ప్రతి వస్తువులోను ప్రవేశించి ఉంది. రెండవది క్షేత్రజ్ఞశక్తి దీనినే జీవశక్తి అని అంటారు. ఇదికూడా ప్రతివస్తువులోను ప్రవేశించి ఉన్నది. ప్రతి వస్తువులోను అనడంచేత, చేతనమని మనం వ్యవహరించే వస్తువైనా, అచేతనమని మనం వ్యవహరించే వస్తువైనా ఈరెంటిలోను తప్పని సరిగా జీవశక్తి లేదా క్షేత్రజ్ఞశక్తి ప్రవేశించి ఉంది. అయితే ఆయా వస్తువులలో ప్రవేశించిన జీవుని కర్మానుగుణంగా జీవశక్తియొక్క స్ఫురణంలో తేడా ఉంటుంది. దేవమనుష్యతిర్యక్ స్థావరాలు అనే నాల్గింటిలో దేవతలు, మనుష్యులు, పశుపక్ష్యాదులు, క్రిమికీటకాదులు, సరీసృపాలు మొదలైనవి స్పష్టంగా ప్రాణస్ఫురణంకలిగి ఉన్నాయి. ఇలాంటి వస్తువులలో ప్రవేశించిన జీవశక్తి కర్మఫలాన్ని అనుభవించడమే కాక ఫలభోగానుభవాన్ని ఆవిష్కరించగల సామర్థ్యం కూడా కలిగి ఉంటుంది. వీటిలో అవిద్యారూపమైన కర్మశక్తి చేత కప్పబడి ఉడటంచేత, క్షేత్రజ్ఞశక్తి లేదా జీవశక్తి, సర్వభూతాల్లోనూ కొంతకొంత తేడాతో తరతమ భావాన్ని కలిగి ఉంటుంది అని విష్ణుపురాణం తెలియపరుస్తున్నది.

శ్లో॥ తయా తిరోహితత్వాచ్చ శక్తిఃక్షేత్రజ్ఞ సంజ్ఞితా ।
సర్వభూతేషు భూపాల తారతమ్యేనలక్ష్యతే ॥

అన్న శ్లోకం ఈఅభిప్రాయాన్నే చెబుతున్నది. ఈ జీవశక్తి ఎలా తారతమ్యాన్ని పొంది ఉన్నదో తరువాతి శ్లోకాలు చెబుతున్నాయి.

**"అప్రాణవత్సు స్వల్పాసా"** అన్న మాటచేత ప్రాణవంతములైన వస్తువులకంటే ప్రాణస్ఫురణములేని వస్తువులలో, అంటే రాయి, రప్ప మొదలైనవాటిలో జీవశక్తి చాలా స్వల్పంగా ఉంటుంది అని స్పష్టం. ఇక్కడ ఒక ప్రశ్న. ప్రాణస్ఫురణంకల వస్తువులలో జీవశక్తి కర్మానుగుణంగా ప్రవేశించింది అనడంలో అర్థంఉంది. ప్రాణరహితాలైన రాయి, రప్ప మొదలైన వాటిలో జీవశక్తి ప్రవేశించడంవల్ల ప్రయోజనమేమిటి? అని. ఇక్కడ కూడా పూర్వ కర్మాను భవమే ప్రయోజనం. కనుకనే రాయి, రప్పల్లో కూడా తాముచేసిన పాప ఫలాన్ని అనుభవించడానికి కొందరుజీవులు ప్రవేశించిఉండి ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ క్లేశాన్ని అనుభవిస్తున్నా తమ క్లేశాన్ని ఆవిష్కరింపలేని దుర్దశలో ఉంటారు. కనుక రాతిలో జీవశక్తి లేదని అనడం విష్ణుపురాణ వచన విరుద్ధం.

ఇక **"స్థావరేషు తతోధికా"** అని అనడంచేత ప్రాణస్ఫురణం లేని రాయి రప్ప మొదలైన వాటికంటే కొద్దిపాటి ప్రాణస్ఫురణం కల చెట్లు లతలు మొదలైన వాటిలో ఈజీవశక్తి అధికంగా ఉంటుందట. **"సరీసృపేషు తేభ్యోన్యాప్యతిశక్త్యా పతత్రిషు"** అనడం చేత, చెట్లు లతలు మొదలైన వాటికంటే ఇంక ఎక్కువగా ప్రాణస్ఫురణం కలిగిన పాములు బల్లులు మొదలైన వాటిలోను, వాటికంటే పక్షుల్లోను, జీవశక్తి అధికంగా ఉంటుంది. ఈక్రమంలో పక్షులకంటే మృగాల్లోను(అడవులలో ఉండే జంతువుల్లోను) వీటికంటే పశువుల్లోను(గ్రామాల్లో ఉండే జంతువుల్లోను) వీటికంటే మనుష్యుల్లోను వాటికంటే నాగగంధర్వ యక్షాది దేవజాతుల్లోను ఈక్రమంలో ఇంద్రాది దేవతలు, చతుర్ముఖ బ్రహ్మ మొదలైన వారిలో ఈజీవశక్తి సర్వాధికంగా ఉంటుంది అని పైశ్లోకాలు స్పష్టపరుస్తున్నాయి. ఈ మాటలనుబట్టి జీవశక్తి సంబంధంలేని వస్తువంటూ ఈసృష్టిలో ఏదీ ఉండదని జీవశక్తి స్ఫూర్తిలో తేడాలు మాత్రం ఉంటాయని విష్ణుపురాణ తాత్పర్యం తెలుస్తున్నది.

భగవద్రామానుజ దర్శనం ఈ విష్ణుపురాణ వచనాలను, ఇక్కడ చెప్పబడిన సిద్ధాన్తాన్ని అంటే సర్వ వస్తువుల్లోను ప్రాణవంతాలైనా, ప్రాణవంతాలు కాకపోయినా జీవశక్తి తప్పనిసరిగా ప్రవేశించి ఉంటుందన్న విష్ణుపురాణ సిద్ధాన్తాన్ని ఎట్టి పొరపొచ్చాలు లేకుండా రామానుజులు స్వీకరిస్తున్నది.

## విష్ణుపురాణ సిద్ధాన్తమే భగద్రామానుజ సమ్మతం

ఇంతవరకు విష్ణుపురాణం ఏం చెప్పిందో మనం తెలుసుకున్నాం. శంకరభగవత్పాదులు, రామానుజులు వీరు ఇరువులు తమ దర్శనసిద్ధాన్త సమర్థనంలో విష్ణుపురాణ వచనాలను సర్వప్రమాణంగా స్వీకరించారని రామానుజులవారి గ్రంథాలు చూస్తే స్పష్టమవుతున్నవి.

రామానుజులు పైవిష్ణుపురాణవచనాలనే సమర్థించారని వేదార్థసంగ్రహ గ్రంథ వచనాలను బట్టి, శ్రీభాష్య గ్రంథ వచనాన్ని బట్చి తెలుస్తున్నది. ఎలాగో కొంత పరిశీలించే ప్రయత్నం చేద్దాం. ముందుగా రామానుజ దర్శనమౌళికభావజాలాన్ని గురించి పరిచయం చేసుకుందాం. వెనుక చిత్ తత్త్వాన్ని గురించి తెలుసుకున్నాం. ఇప్పుడు సృష్టిప్రళయాది ప్రక్రియలో జీవస్వభావం ఎలా ఉంటుందో తెలుసుకుందాం.

### భగవద్రామానుజ దర్శన సంగ్రహం

"భగవద్రామానుజదర్శనంలో పరమాత్మ శ్రీమన్నారాయణుడు. ఆయిన సర్వచేతనులలోను అంటే జీవులలోను అచేతన వస్తువులలోను ప్రవేశించి వీటన్నింటినీ తన శరీరంగా కలిగి ఉంటాడు. కనుక సమస్తచేతనాచేతన ప్రపంచానికి పరబ్రహ్మం లేదా పరమాత్మ **'ఆత్మ'**గా ఉంటాడు. అందువల్లనే ఈ చేతనాచేతనరూపమైన ప్రపంచాన్ని బ్రహ్మాత్మకం అంటాం. అంటే పరబ్రహ్మను ఈప్రపంచం ఆత్మగా కలిగి ఉన్నదని అభిప్రాయం. ఇలా అనడంవల్ల ప్రతి చేతనునిలోను పరమాత్మ ఉంటాడు, ప్రతి అచేతన వస్తువులోను పరమాత్మ ఉంటాడు అని స్పష్టం.

**చేతనాచేతనవస్తువులకు నామరూప వ్యవహారం అన్ని దశల్లోను ఉన్నది?**

రామానుజ దర్శనాన్ని బట్టి చిత్, అచిత్, ఈశ్వర అనే పేర్లతో మూడుతత్త్వాలు ఉన్నాయని చెప్పుకున్నాము. చిత్ అంటే జీవుడని కూడా చెప్పుకున్నాము. అచిత్ అంటే జీవునికంటే వేరైన తత్త్వము అని అర్థము. ఈ అచిత్ శబ్దాన్ని వివరిస్తూ తత్త్వత్రయగ్రంథంలో లోకాచార్యులవారు అచిత్ అనే తత్త్వము మూడు రకాలుగా ఉన్నదని చెప్పారు. మొట్టమొదటగా అచిత్ అంటే జ్ఞానశూన్యము వికారాస్పదము అని లక్షణం చెప్పి దాన్ని శుద్ధసత్త్వము మిశ్రసత్త్వము సత్త్వశూన్యము అని మూడు రకాలుగా విభజించారు.వీటిలో శుద్ధసత్త్వం ఎలా ఉంటుందో మనం ప్రత్యక్షంగా తెలుసుకోలేము. భగవంతుని దివ్యమంగళ విగ్రహం పరమపదం అక్కడ ఉండే ప్రదేశాలు ఇవన్నీ శుద్ధసత్త్వమయాలని సంప్రదాయ గ్రంథాలు చెబుతున్నాయి. అందువల్ల ప్రస్తుతం దాని గురించిన విచారణ మనకు అవసరం లేదు. ముందు ముందు సందర్భోచితంగా తెలుసుకుందాం. ఇక మూడవది సత్త్వశూన్యము, అంటే సత్త్వము ఎంతమాత్రమూ లేనిది కాలము. ఇది పరిణామశీలమే. రెండవదైన మిశ్రసత్త్వం ప్రకృతి అనే పదంచేత వ్యవహరింపబడుతుంది. మిశ్రసత్త్వం అంటే రజస్సు, తమస్సు అనే మరిరెండు గుణములతో కూడిన సత్త్వం అన్నమాట. ఈమూడూ కలిసిన అంటే స్త్వము, రజస్సు, తమస్సు అనే మూడు కలిసిఉన్న స్వరూపమే ప్రకృతి. దీనిని ఇరవైనాలుగు రకాలుగా శాస్త్రకారులు విభజించారు. కొద్దిపాటి తేడాతో సాంఖ్యదర్శన కారులు కూడా దీన్ని నిరూపించారు. వారి ప్రక్రియకు కొద్దిపాటి తేడాతో రామానుజ దర్శనం కూడా ఈ తత్త్వాలను స్వీకరిస్తున్నది. సామాన్య వ్యవహారంలో అచిత్ తత్త్వంగా పరిణామశీలమైన ప్రకృతిని ప్రాకృత పదార్థాలను మనం ప్రస్తుతంలో పరిగణించి మన విచారణను ముందుకు సాగించుదాం.

ఈప్రకృతి అనేది చిత్ రూపుడైన జీవునికంటే వేరైనది కనుక అచిత్తు. స్వయంగా ప్రకాశించలేదు కనుక జడము. జీవుని సంబంధం లేకపోతే ఇది పరిణామాన్ని పొందలేదు అని సాఖ్యదర్శనకారులే కాదు రామానుజ దర్శనం కూడా నిర్ద్వద్వంగా అంగీకరిస్తున్నది. అసలు ఏపదార్థానికైనా పదార్థత్వం సిద్ధించాలంటే జీవుని శరీరంగా ధరించిన పరమాత్మ ప్రవేశించి తీరాలి అని రామానుజులు తమ వేదార్థ సంగ్రహంలో ఉద్ఘోషించారు. ఈక్రింది మాటను చూడండి. **"అనేన జీవేనాత్మనా"** ఇతి జీవస్య బ్రహ్మాత్మకత్వం ప్రతిపాద్య, **"బ్రహ్మాత్మక జీవానుప్రవేశాదేవ కృత్స్నస్యఅచిద్వస్తునఃపదార్థత్వమ్ ఏవం భూతస్త్యైవ అచిద్వస్తునఃనామరూప భాక్త్వం ఇతి చ దర్శయతి"** అని. ఈవాక్యానికి అభిప్రాయం ఇది. **"అనేన జీవేన ఆత్మనా అనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి"** అని భగవంతుడు పృథివీ జల తేజస్సులను సృజించి, సామాన్యంగా వాటికున్న నామరూప వ్యవహారం కంటే విశేషంగా నామరూప వ్యవహారాన్ని కలిగింపగోరి జీవుని శరీరంగా ధరించాడు. తాను ఇదివరకే ప్రవేశించి ఉన్నా పృథివీ జల తేజస్సులను వాటిని ఉపలక్షణంగా చేసుకొని వాయువు, ఆకాశాలను చేర్చుకుని పంచభూతాలలో జీవుని శరీరంగాకల తాను, ప్రవేశించి ఉంటూనే వాటి పరస్పర సమ్మేళనం మూలంగా దేవతలు మనుష్యులు పశుపక్ష్యాదులు స్థావరాలు కొండలు మొదలైన అనేక పదార్థములుగా పంచభూతాలను విభజించాడు.

అలా విభజింపబడి ఏర్పడిన వాటికి కూడా తన సత్తను పురస్కరించుకొని వాటికి వస్తుత్వము నామరూప విభాగము పదార్థత్వము ఏర్పడేటట్లు చేసాడు. పైమంత్రం జీవుడు బ్రహ్మాత్మకుడని స్పష్టంగా చెబుతున్నది. బ్రహ్మాత్మకుడైన జీవుడు ప్రవేశించి ఉన్నందువల్లనే సమస్తమైన అచేతన వస్తువుకు అంటే ప్రకృతికి ప్రకృతిమూలంగా ఏర్పడిన ద్రవ్యాలకు పదార్థత్వం కలిగిందని స్పష్టంగా రామానుజులు పేర్కొంటున్నారు.

అసలు పదార్థత్వం అంటే ఏమిటో వివరిస్తా... వేదార్థసంగ్రహానికి తాత్పర్యదీపికా వివరణాన్ని వ్రాసిన సుదర్శన సూరి ఇలా అంటున్నారు. **"పదార్థత్వం తత్తదవస్థావిశిష్టత్వం, దేవమనుష్యా ద్యాకార విశిష్టత్వం"** అని. పదార్థత్వం అంటే భిన్నభిన్నావస్థలతో కూడి ఉండటం. అంటే, దేవతలు మనుష్యులు పశుపక్ష్యాదులు స్థావరాలు పర్వతాదులు, ఇలా దుబ్బుమొదలు చతుర్ముఖబ్రహ్మవరకు ఉన్న విభిన్న ఆకారములతో కూడి ఉండటం అన్నమాట. ఇవన్నీ పదార్థాలే, బ్రహ్మాత్మకుడైన జీవుడు ప్రవేశించడం వల్లనే వీటన్నింటికీ పదార్థత్వం ఏర్పడిందని **బ్రహ్మాత్మక జీవానుప్రవేశా దేవ, కత్స్నస్య అచిద్వస్తునః పదార్థత్వం** అని చాలాస్పష్టంగా రామానుజులు ఉద్ఘోషిస్తున్నారు. అంతేకాదు **ఏవంభూతస్త్యైవ అచిద్వస్తునః నామరూపభాక్త్వం** అని చాలా

విస్పష్టంగా వెనుక చెప్పినట్లు బ్రహ్మాత్మక జీవుడు అను ప్రవేశించి ఉన్న అచేతన వస్తువుకు మాత్రమే నామరూపాలు పొందే యోగ్యత ఉన్నది అని విస్పష్టపరుస్తున్నారు రామానుజులు. ఈ అంశాన్ని వివరిస్తూ సుదర్శనసూరి ఇలా అంటున్నారు. **"నహి నిరాకారఃపదార్థః. పృథివీత్వాకారవిశిష్టోహి పృథివీ పదార్థః. పరమాత్మ పర్యన్తస్యైవ వస్తునః తత్తదవస్థావిశిష్టత్వం. న స్వతంత్రస్య ఇత్యర్థః। తత్పర్యన్తస్యైవ దేవాది నామభాక్త్వఇ్చ ఇత్యాహ ఏవం భూ తస్యైవ** ఇతి" ఈ సుదర్శన సూరి వచనాల అభిప్రాయం ఇది. "ఆకారములేనిది ఎంతమాత్రమూ పదార్థము కాదు. పృథివీత్వాకారంతో కూడి ఉంటేనే పృథివీపదార్థం అంటాం.

పరమాత్మ వరకు పర్యవసించి ఉండే వస్తువుకే ఆయా అవస్థలతో కూడి ఉండటం(అంటే పదార్థత్వం) ఏర్పడుతుంది. స్వతంత్ర వస్తువుకి పదార్థత్వం ఏర్పడదు. ఇలా పరమాత్మ వరకు ఉన్న స్వరూపం కలిగిన వస్తువుకే దేవతలు మనుష్యులు మొదలైన నామవ్యవహారం పొందే యోగ్యత ఉంటుంది అని. ఈఅభిప్రాయాన్నే **"ఏవం భూతస్యైవ** అనే వాక్యంచే రామానుజులు చెపుతున్నారు అని వివరించారు సుదర్శన సూరి. ఏపదార్థానికైనా పరమాత్మ పర్యన్తత్వం ఎలా ఏర్పడుతుంది? బ్రహ్మాత్మకుడైన జీవుడు ప్రవేశించినందు వల్లనే. ఇలా అనటంచేత కేవల జీవునికి ప్రవేశంలేదని పరమాత్మకు తాను శరీరంగా అమరి ఉండే జీవుడు, అచిద్వస్తువులలో ప్రవేశించగలుగు తాడని తెలుస్తున్నది. ఈవిధంగా ప్రతి అచిద్వస్తువులోను పరమాత్మకు శరీరంగా ఉన్న జీవుడు ఆజీవుని శరీరంగా గల పరమాత్మ ఇరువురు విధిగా ప్రవేశించి ఉంటేనే నామరూప విభాగ యోగ్యతగల్గి ఆయా పదార్థాలు ఏర్పడుతున్నాయని ఈఘట్టం నిర్ద్వంద్వంగా చెబుతున్నది కదా! *(సశేషం)*










జై శ్రీమన్నారాయణ!

# ఆయు

**శ్రీరామనగర్-జీవా 'గోశాల'**

మనదేశం వ్యవసాయం ప్రధానంగా కలది. అందువల్ల పాడిపంటలు సమృద్ధిగా ఇక్కడ మనజీవనాన్ని పోషిస్తున్నాయి. గోపోషణం దేశంలో పలుసంస్థలు ఉద్యమంగా స్వీకరించాయి. శ్రీశ్రీశ్రీచిన్నజీయర్స్వామివారిమంగళాశాసనాలతో మనజీవా ప్రాంగణంలో ఏర్పరుచుకున్న గోశాలలో గోపోషణాన్ని క్రమబద్ధంగా చేయటమేకాక, గోవులనుండి లభించే పదార్థాలను మన దైనందిన జీవితంలో వాడుకొనే వస్తువులుగా మనమే తయారుచేసి అందరికీ ఆ ఉత్పత్తులను అందిస్తున్నాం. ఆయు గోరసం (సిరప్), పళ్ళపొడి, చర్మరక్షక ఔషధం, షాంపూ, ఫేస్ప్యాక్, తిరుమంజనచూర్ణం, మొదలైన వస్తువులను మనం తయారు చేసి అందిస్తున్నాం. ఈ ఉత్పత్తులన్నీ మనగోశాలలోనే కాక ఈ క్రింది చిరునామాలో కూడా లభిస్తాయి. ఆసక్తికలవారు తప్పకుండా సంపాదించివాడండి. గోసేవలో మీవంతు భాగస్వామ్యాన్ని తప్పకుండా స్వీకరించండి. గోరక్షణం ప్రతిభారతీయుని పవిత్రబాధ్యత.

**గావోమే పృష్ఠతఃస్సన్తు గావోమేసన్తుచాగ్రతః।**
**గావోమే పార్శ్వతస్సన్తు గవాంమధ్యేవసామ్యహమ్ ॥**

గోవులు నావెనుక ఉండాలి. గోవులునాకు ఎదురుగా ఉండాలి. గోవులనునాప్రక్కన ఉండాలి. నేను గోవుల మధ్యలోనే ఉంటాను అన్నాడు శ్రీకృష్ణభగవానుడు.

**ఏ. సత్యనారాయణమూర్తి**
ఎమ్.ఐ.జి.548, కె.పి.హెచ్.పి.కాలనీ, హైద్రాబాద్-85
040 23055622, సెల్. 98665 52122

**పోలాస్జ్యూస్పాయింట్**
రైల్వేస్టేషన్, బొమ్మనాసెంటరు, జెడ్.పి.సెంటరు,
జిల్లాకోర్టుఎదురుగా, బస్డిపోరోడ్డు,
మోర్సూపర్మార్కెట్ 98497 92603

**గోపాల్రావు**
రామానుజవాణి, కరీంనగర్, సెల్. 99639 35696

**గణేష్, విభావరి డ్రైఫ్రూట్స్ పికిల్స్**
సినిమారోడ్డు, కాకినాడ, సెల్. 99485 32333

**ఎమ్.కుసుమకుమారి**
ఇ.నెం.12-1398, రోడ్నెం.15 మహానాడు,
సుందరయ్యనగర్, గుంటూరుజిల్లా.
90596 01538, 91604 51813

**వి.లక్ష్మీరెడ్డి**
సి.638 ఎమ్. జి. ఐ. వనస్థలీపురము,
ఎన్.జి.ఓ కాలనీ, హైద్రబాద్. 99125 05486

**సి. హెచ్. వేణుగోపాల్రావు**
ఇ.నెం. 3-4-15/7 బర్కత్పుర, హైద్రాబాద్ 500027
92476 67659, 040 27564139




# శ్రీ కలివైరి సూరి వైభవము



శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழ్ఴి 1-9-10**

**కణ్ణా యేழ்ఴులకుక్కు యిరాయ వెంకార్ వణ్ణనై**
**విణ్ణోర్ తాయ్ పరవుమ్ పొழ్ఴిల్ వేంగడ వేతియనై ।**
**తిణ్ణార్ మాడంగళ్ శూழ్ఴ్ తిరుమంగైయర్‌కోన్ కలియన్**
**పణ్ణార్ పాడల్ పత్తుమ్ పయల్ వార్కిల్లైపావంగళే ॥**

**ప్రతిపదార్థము: ఏழ்ఴులకుక్కు**=ఏడులోకములకు (సమస్త లోకములకు); **కణ్‌ఆయ్**=నేత్రభూతుడును; **ఉయిరాయ**=ప్రాణభూతుడును; **వెంకార్ వణ్ణనై**=మాకు నీలమేఘవర్ణుడును; **విణ్ణోర్‌తాం**=నిత్యసూరులు; **పరవుం**=స్తోత్రము చేసెడి; **పొழ్ఴిల్**=తోటలుగల; **వేంగడం**=శ్రీ వేంకటగిరియందు వేంచేసి యున్నవాడును; **వేదియనై**=వేదవేద్యుడును అయిన స్వామి (విషయముగ); **తిణ్ణార్**=దృఢమైన; **మాడంగళ్**=మేడలచేత; **శూழ்ఴ్**=పరివేష్టితమైన;**మంగైయార్**=మంగైనాడులు ఉన్నవారికి; **కోన్**=ప్రభువైన; కలియన్=తిరుమంగై ఆళ్వారులు (కృపచేసిన); **పణ్ణార్**=రాగములచే పరిపూర్ణమైన; **పాడల్ పత్తుమ్**=పది పాశురములను; **పయల్వార్కు**=అభ్యసించినవారికి; **పావంగళ్**=పాపములను; **ఇల్లై**= లేవు.

**తాత్పర్యము:** సకల లోకములకు దృష్టిభూతుడును, ప్రాణ భూతుడును నీలమేఘశ్యామవర్ణుడును, నిత్యసూరులచే సంస్తుతింపబడువాడును వేదవేద్యుడును అయిన స్వామి శ్రీ వేంకటాద్రిపై వేంచేసియున్నాడు. ఆ గిరి సువాసనలతో నిండిన తోటలతో కూడియున్నది. శ్రీ వేంకటనాథుని విషయముగ తిరుమంగై యాళ్వారులు ఈ దశకమును అనుగ్రహించిరి. దృఢములగు మేడలచే శోభిల్లు మంగైనాడునకు ప్రభులైన వారు తిరుమంగై ఆళ్వారులు. చెవులకింపైన ఈ పాశురములను అనుసంధించువారికి భగవత్ప్రాప్తి ప్రతిబంధకములగు పాపము లన్నియును చెదరిపోవును.

**విశేషార్థము:** "కణ్ణాయ్ ఇత్యాది" - సకల లోకములకు నేత్రమువంటివాడా! సకల భూతములు జీవించుటకు కారణ మైన ప్రాణమువంటి వాడా! అంతమాత్రమే కాక నన్ను ఆనందింప చేయుటకును, నాయొక్క సాంసారిక తాపమును తొలగించుటకును మేఘవర్ణముగొనిన నీలమేఘశ్యాముడా! ఏడు లోకములలోని జీవులతోపాటు నిత్యసూరులుకూడ తిరుమలకు వచ్చి శ్రీశ్రీనివాసుని సంస్తుతించుచుందురు. అటువంటి తిరుమలను వాసస్థానముగా గలవాడా! అపౌరుషేయములగు వేదములచేతనే తెలిసికొనదగినవాడా!

**తిణ్ణార్:** "తిణ్ణార్ మాడంగళ్ శూழ்ఴ్ తిరుమంగైయర్ కోన్ కలియన్" అను పాశురములోని **"తిణ్ణార్"** అనుపదమును 'తిరుమంగై ఆళ్వారులకు కలిగిన ఆర్తిని (భగవంతుని సేవింప వలెననెడి తపనను) జూచి శ్రీ వేంకటగిరినాథుడు ఆ ఆళ్వారులకు తప్పక సుప్రసన్నుడగును' అని తలచి "తిరుమంగై" క్షేత్రములోని వారెల్లరును సంతోషించి మనోధైర్యమును కలిగి సుదృఢులైరి అని భావము. అది యెట్లనిన

**పంక దిగ్ధస్తు జటిలః భరతస్త్వాం ప్రతీక్షతే ।**
**పాదుకేఽస్య పురస్కృత్య సర్వం చ కుశలంగృహే ॥**

*శ్రీరామాయణం, యుద్ధకాండ 127-4*

**తాత్పర్యము:** రఘువరా! కేశసంస్కార రహితుడును జటాధారియునగు భరతుడు నీరాకకై ఎదురు చూచుచున్నాడు. నీపాదుకలను మున్నిడుగొని రాజ్యపాలన గావించుచున్నాడు. అంతఃపురమందున్న జనులేగాక ప్రజలెల్లరును సుఖవంతులుగా నున్నారు. తిరుమంగై ఊరిలోని వారెల్లరును సుఖసంతోషము లతో నున్నారనుటకు ఈ శ్లోకము ఉదాహరణముగ గైకొనబడినది.

**పణ్ణార్ పాడల్ :** రాగయుక్తముగ నుండు పాశురములు. ఈ పాశురములను అభ్యసించినవారిని ఏ ఒకపాపమును దరిచేరదు. భగవంతుని చేరుటకు అడ్డంకులైనవి అన్నియును పటాపంచలై చెదరిపోవును.

**పావమేశెయ్‌తు పావియానేన్** 'పాపములనే జేసి

పాపభూయిష్ఠుడనైతిని' అని ఆళ్వారులు తమ నోరార పలికిన పాపములనన్నింటిని సర్వేశ్వరుడు మన్నించిన పిమ్మట ఇక ఈ ఆళ్వారులకు పాపము లెక్కడివి. పాపములే లేవుకదా!

శ్రీరామచంద్రమూర్తిని శరణాగతి చేయదలచి వచ్చిన విభీషణునితో నలుగురు రాక్షసులుగూడ, **చతుర్భిః సహరాక్షసైః** అను విధముగ శ్రీరామచంద్రుని సన్నిధికి వచ్చిరి. వానరవీరులు విభీషణుని జూచి

**"వధ్యతామ్ ఏష తీవ్రేణ దండేన సచివై స్సహ ।**
**రావణస్య నృశంసస్య భ్రాతా హ్యేష విభీషణః ॥"**

*శ్రీరామాయణం, యుద్ధకాండ 17-27*

నలుగురు మంత్రులతో వచ్చియున్న ఈ విభీషణుడు తీవ్ర దండనలతో వధింపతగియున్నాడు. ఇతడు క్రూరుడగు రావణుని యొక్క సోదరుడు అని భయంకరముగ పలికిరి. ఆ విభీషణుడే శ్రీరామచంద్రమూర్తియొక్క అనుగ్రహమునకు పాత్రుడైనపుడు అతని వెంట వచ్చిన నలుగురు రాక్షసులును అవధ్యులైరి. శిక్షింప బడలేదు కదా!

అదేవిధముగనే తిరుమంగై ఆళ్వారుల శ్రీచరణముల సంబంధము కలిగి ఈ దశకమును అనుసంధించగనే అనుసంధాతలయొక్క పాపములను కూడ సర్వేశ్వరుడు పోగొట్టును. తిరుమంగై ఆళ్వారులు తమ వృత్తి హీనతను భగవంతునకు ముందుగ విజ్ఞాపనమును చేసికొని ఆ పిమ్మట "అడైందేన్" ఆశ్రయించితిని అనుటలో భావమేమనగ, ఆళ్వారులు ఆ విధముగ మనవి చేసికొనుట వలననే వారు భగవంతుని కృపకు పాత్రులయిరి. ఆ కృపయే ఆళ్వారులకు స్వరూపానురూప కైంకర్యము నకు కారణమైనది. అని వ్యాఖ్యాత పెరియవాచ్చాన్ పిళ్ళైగారు సెలవిచ్చియున్నారు. 9వ దశకము సమాప్తమైనది.


**శ్రీమతే రామానుజాయ నమః**
**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి మంగళాశాసనములతో...**
**నడిగడ్డపాలెం-శ్రీ వాసుదాసాశ్రమంలో వేంచేసియున్న**
**శ్రీలక్ష్మీనారాయణ-శ్రీ కోదండరామస్వామివార్ల బహ్మోత్సవములు మరియు లక్షమల్లెపుష్పార్చన**
**ది. 10-03-2014 నుండి 16-03-2014 వరకు జరుగును.**
**వివరములు వచ్చే సంచికలో...**

శ్రీమతే నారాయణాయ నమః
జై శ్రీమన్నారాయణ!
శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమదుభయవేదాంతాచార్యపీఠం నిర్వహణలో...
**మందసా శ్రీవాసుదేవ స్వామి పంచమ బ్రహ్మోత్సవము**
శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి మంగళాశాసనములతో...!
శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు
శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయర్‌స్వామివార్ల పర్యవేక్షణలో...!
19.02.2014 నుండి
25.02.2014 వరకు
22.02.2014 శ్రీవాసుదేవస్వామి కళ్యాణమహోత్సవం
శ్రీవాసుదేవ సేవాసమితి - శ్రీవాసుదేవస్వామి ఆలయం, మందస, శ్రీకాకుళం జిల్లా. 532 242.
వివరాలకు: ఫోన్: 9440416276, 9573491007, 9704718143,9908478260,9032494629, 9618886978

# ప్రకృతి బడిలో - జీవన పాఠాలు 6

వైశారది

## చంద్రుడు

పంచభూత స్వరూపాలైన భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశము చెప్పే పాఠాలను అవధూత అందించిన విధంగా తెలుసు కుంటున్నాం కద! పంచభూతాలలో ఒకటైన తేజస్సు 3 విధాలుగా ఉంటుంది. అవి 1. భౌమము, 2. దివ్యము, 3. ఆకరజము.

1. భూమిమీద ఉండే తేజస్సు అంటే అగ్ని. అది నేర్పే పాఠాలు గత సంచికలో తెలుసుకున్నాం. 2. దివ్యమైన తేజస్సు. 'దివి' అంటే ఆకాశము. ఆకాశంలో ఉండే చంద్రుడు, విద్యుల్లత, నక్షత్రాలు దివ్య తేజస్సులని అంటారు. 3) ఆకరజం అంటే గనులలో ఉండే తేజస్సు గనులలో దొరికే తేజస్సే బంగారము. ఈ సంచికలో దివ్యతేజ స్స్వరూపుడైన చంద్రుడు నుండి అవధూత గ్రహించినవి తెలుసుకుందాం!

ఓషధులకు అధిపతియైన చంద్రుని మనం నిత్యం చూస్తూనే ఉంటాం! నెలలో ఒక్కరోజు మాత్రమే నిండుగా కన్పిస్తాడు. 16 కళలతో పరిపూర్ణుడై, చల్లని వెన్నెలతో అందరికీ ఆహ్లాదాన్ని పంచుతుంటాడు. దానినే 'పూర్ణిమ' అంటాం! ఆ మరుసటిరోజు నుండి ఒక్కొక్క కళ చంద్రునిలో తగ్గిపోతూంటుంది. కాలక్రమంలో 14 రోజులు గడవగానే ఏకకళామాత్రంగానే మిగులుతాడు. ఆరోజునే అమావాస్య అంటున్నాం. పూర్ణిమ మరునాటి నుండి అమావాస్య వరకు ఉండే రాత్రులలో చీకటి ఎక్కువ ఉంటుంది కనుక కృష్ణపక్షము అంటున్నాం. 16కళలవాడు కాస్తా రోజుకో కళని కోల్పోతూ ఒక్క కళతోనే మిగులుతున్నాడు.

అయితే అలానే ఉండిపోతున్నాడా? లేదు. మళ్ళీ అమావాస్య మరునాటి నుండి మరొక పక్షం రోజులు ఒక్కొక్క కళని తిరిగి సంతరించుకుంటూ దినదిన ప్రవర్ధమానుడై వెన్నెలని వెదజల్లుతూ ప్రకాశిస్తున్నాడు. అమావాస్య మరునాటి నుండి పూర్ణిమ వరకు 15 రోజులు చంద్రునిలోని కళలు పెరుగుతూ తెల్లని వెన్నెల కాంతులని పెంచుతున్నాయి కనుక శుక్లపక్షము అంటున్నాం. ఇది ప్రతీనెలలోను మనం గమనిస్తాం! చాంద్రమానం ప్రకారం అమావాస్య మరునాటి నుండి కొత్తనెల మొదలవుతుంది. నెలలో పూర్ణిమనాడు చంద్రుడు ఏ నక్షత్రంతో చేరి ఉంటాడో ఆ నక్షత్రం పేరుతోనే నెలని వ్యవహరిస్తున్నాం. ఉదాహరణకి చిత్తా నక్షత్రంతో చంద్రుడు పూర్ణిమనాడు చేరిన నెలని చైత్రము, విశాఖతో చేరినది వైశాఖమాసం ఇలా వ్యవహరిస్తున్నాం కద!

"ఓ యదుమహారాజా! ప్రతినెలలో సగంరోజులు పెరుగుతూ, సగంరోజులు క్షీణిస్తూ ఉన్న చంద్రుడు ఒక చక్కని నిత్యజీవితంలో గుర్తుంచుకోదగిన ఆధ్యాత్మిక పాఠాన్ని, నేర్పిస్తున్నాడు. కాలక్రమంలో వృద్ధి క్షయాలనేవి ఎదురవుతూనే ఉంటాయి. వాటిని ప్రకృతి సహజంగ గుర్తించి కర్తవ్యంలో ముందుకి సాగిపోవాలి.

గమనించాల్సిన విశేషమేమంటే నిజానికి చంద్రుడు పెరిగి పోవడం లేదు, చంద్రుడే తరిగిపోవడంలేదు. అతనిలోని కళలు మాత్రమే కాల ప్రభావానికి వృద్ధి క్షయాలు పొందుతున్నాయి. అలానే మన శరీరాలు కాలప్రభావానికి లోనై ఎన్నో మార్పులు చెందుతుంటాయి. ప్రతిమానవుని శరీరము పంచభూతాత్మకమైన ప్రకృతియే! ఒక ఆకారము పేరుతో వ్యవహరించేట్టు ఉన్న ప్రతిజీవి శరీరము, పరిణామం చెందేదే! నిరంతరం పరిణామం చెందే శరీరం అనేక వేల మార్పులని పొందుతుంది. ప్రధానంగ ఈ శరీరములో జరిగే మార్పులని 6 స్థాయిలలో గుర్తించవచ్చు. వీటినే షట్ భావ వికారములు అంటారు. 1. అస్తి, 2. జాయతే 3. పరిణమతే 4. వర్ధతే 5. క్షీయతే, 6 నశ్యతి.

1. **అస్తి** : తల్లి గర్భంలో ఒక జెకోట్‌గా వైద్యులు గుర్తించి చిన్నప్పటి నుండి బిడ్డ 'ఉన్నాడు' అనే గుర్తింపు లభిస్తుంది. ఇది జీవుని ఉనికిని నిర్ధరించే దశ, శరీరపు తొలిదశ. తండ్రి నుండి వెలువడిన కణం, తల్లిలోని అండంతో కలసి ఒక ఆకృతి సంతరించుకొని, జీవునికి శరీర సంబంధం కల్గించిన స్థితి. అక్కడ నుండి 9 నెలలపాటు అనేక మార్పులు చెందుతుంది.

2. **జాయతే** : తల్లి గర్భవాసంలో కరచరణాది అవయవాలు సంతరించుకొని బయటికి శిశువుగా రావడం, అప్పుడే పుట్టాడు అంటాం. లోపల ఉన్నదశ నుండి మార్పులు జరిగి వెలువడడమే, జననం.

3. **పరిణమతే** : పుట్టినది మొదలు శిశువు శరీరం అనేక మార్పులు చెందుతుంది. ఈ పరిణామ క్రమంలోనే బాలునిగా మారతాడు. శైశవస్థితినుండి బాల్యం వస్తుంది.

4. **వర్ధతే** : బాలక శరీరం మరెన్నో మార్పులు సంతరించుకొని పెరుగుతూ ఉంటుంది. 30 సం॥ల వరకు ఈ మార్పులు శరీరంలో వృద్ధి దిశలోనే ఉంటాయి శరీరం పటుత్వం పొందుతుంది. యవ్వనదశని పొందుతుంది.

5. **క్షీయతే** : 30 సం॥ల తర్వాత కూడా శరీరంలో మార్పులు వస్తూనే ఉంటాయి. కానీ, క్షీణదిశగా మార్పులుంటాయి. యవ్వనదశనుండి వృద్ధాప్య దిశగా ఈ మార్పులు జరుగుతాయి.

6. **నశ్యతి** : చివరికి జీవుడు శరీరం వదిలిపెట్టేసే రోజు వస్తుంది. జీవుడు వదిలిన శరీరం తిరిగి పంచభూతాలలో చేరిపోయేట్టు కాల్చివేస్తారు.

ఓ యదుమహారాజా! ఈ 6 రకాల దశలలో జరిగే అన్ని మార్పులు శరీరానివే! ఇవి చంద్రుని కళలలో జరిగే వృద్ధిక్షయాల్లాంటివే! కళలలోని హెచ్చుతగ్గులకి అతీతంగా చంద్రుడు ఉన్నట్లే, శరీరంలో జరిగే కాలానుగుణ మార్పులకి అతీతంగా జీవుడు ఉంటాడన్న విషయం చంద్రుని చూసే నేర్చుకున్నాను. అలాగే అమావాస్యకి ఏకకళామాత్రంగా మిగిలిన చంద్రుడు తిరిగి కళాపూర్ణతని పొందినట్లే, ఒక శరీరం జీర్ణం కాగా అది వదిలిన జీవుడు మరొక నూతన దేహం పొందుతూ నిత్యమై ఉంటున్నాడన్న పాఠాన్ని చంద్రుని చూసి నేర్చుకున్నాను" అంటూ అవధూత తెలిపారు.

## ముఖచిత్ర పరిచయం

కురుక్షేత్రమహాసంగ్రామంలో కౌరవపక్షాన, తన అసమాన పరాక్రమాన్ని చూపి, అపారమైన పాండవసేనను నశింపజేయడమేకాక, కృష్ణసారథ్యంలో తనపై యుద్ధంచేస్తున్న అర్జునికి కూడా ఆయసపరచాడు భీష్మాచార్యుడు-చివరకు శిఖండిని అడ్డంగా పెట్టుకొని, శ్రీకృష్ణప్రేరణంచే భీష్మునిపై నిశితాస్త్రాలు ప్రయోగించి, ఆ మహామహుని రథంనుండి కూలజేశాడు అర్జునుడు. అటువంటి మహాత్ముని శరీరంనేలతాకరాదని అమ్ములతో ఒక శయ్యాఏర్పరచి, భీష్ముడు ఆశయ్యపై ఒరిగేలా చేశాడు. అంపశయ్యపై శయనించిన భీష్ముని చూడడానికి కృష్ణునితో సహా పాండవులంతా వచ్చారు. పాండవులతో పాటు తన దగ్గరకు వచ్చినిలుచున్న కృష్ణుని చూచి భీష్ముడు-శ్రీకృష్ణుడు సాక్షాత్తునారాయణుడేనని తన మనస్సులో సాక్షాత్కరించాడు. తన దివ్యరూపాన్ని చూపి స్వామి, స్వచ్ఛందమరణంకల భీష్ముని అనుగ్రహించాడు. ఆ మహామహుడు పరమ పదాన్ని అలంకరించిన రోజున భీష్మైకాదశిగా భారతీయులు భక్తి శ్రద్ధలతో సంభావిస్తున్నారు.

జై శ్రీమన్నారాయణ !

# శ్రీవిష్ణు సహస్రనామ విశ్వశాంతి విరాట్ పారాయణము

10-2-2014



10-2-2014వ తేదీ సాయంత్రం 5గం॥ల నుండి శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి సమక్షంలో జరిగే ఈ విశ్వశాంతి విరాట్ శ్రీవిష్ణుసహస్రనామ పారాయణములో మనమూ పాల్గొందాం.

ఒక వ్యక్తి చేసే పారాయణ కంటే సామూహికంగా అంతాకలిసి చేసే పారాయణం ఎన్నోరెట్లు శక్తివంతమైనది, ప్రయోజనకరమైనది. ఈ లాభాన్ని మనమూ పొందుదాం.

**రండి! విశ్వశాంతికై కలిసి పారాయణ చేద్దాం!**
**భగవదనుగ్రహాన్ని పొందుదాం!!**

**తేది**
**10.02.2014**

**వేదిక**
**ఉప్పుగూడ రైల్వేస్టేషన్ ప్రక్కన, ఓల్డ్‌సిటి, హైదరాబాద్.**

**సమయం**
**సాయంత్రం 5గం॥ల నుండి 8గం॥ల వరకు**

**భీష్మ ఏకాదశి ఉత్సవ కమిటి**

వివరాలకు:
జీవా, శ్రీరామనగరం, శంషాబాద్,
పాలమాకుల (పో), రంగారెడ్డి జిల్లా. 50932
ఫోన్: 95535 49971/72

*With Best Compliments from*








# KAKATIYA CEMENT

**Quality Always - Ahead**

53 Grade Cement &
White Crystal Sugar

**Sri P. VENKATESWARLU**
Chairman & Managing Director

## KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED

*Regd. Office :* 1-10-140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
✆:27637717, 27633627, Fax No : 040 - 27630172, E-mail : kcsil@sol.net.in
E-mail: info@kakatiyacements.com

*Cement Factory :*
Srinivasanagar, Jaggaiahpet,
Krishna Dist - 521 175
✆ 08654 - 200014
Fax No: 08654-296331

*Sugar Factory :*
Peruvancha Village, Kallur Mandal,
Khammam Dist - 507 209,
✆: 08761 - 287207
Fax No: 08761 - 287206




# SERVOMAX INDIA LIMITED

AN ISO - 9001:2008, ISO - 14001:2004 & BS OHSAS - 18001:2007 CERTIFIED COMPANY




*Safe Power Saves Power*




Power Saver

- Exports to 26 Countries
- Over 1 Lakh Installations
- Pan India Operations
- Manufacturers of India's Highest Capacity Auto Transformers

## Green Energy & ESCO

Complete Solutions for Grid Connected or Off Connected


Solar Panels


Inverters



Batteries


Solar UPS


Solar Lamps


Solar Street Lights


Bharat Ratna Dr. M Visvesvaraya Industrial Award-2008 Best Performance in Small Scale Sector


Rajiv Gandhi National Quality Award - 2007


A.P Best Entrepreneur Award - 2009


CITD Industrial Trade Achievement Award - 2006

## Our Products

- Power Conditioners
- Servo Voltage Stabilizer (HT / LT)
- Power Savers
- Ultra Isolation Transformers
- Distribution & Power Transformers

# SERVOMAX INDIA LIMITED

# 406, Meridian Plaza, Ameerpet Hyderabad - 500 016. A.P. INDIA.
Ph: +91 40 4050 9999 / 9900

admin@servomax.net
www.servomax.net




డా॥ పావులూరి కృష్ణచౌదరి
8-3-945/ఎ.22, నాగార్జున నగర్,
అమీర్‌పేట, హైదరాబాద్-500 873

## 24 గంటలు నొప్పి (ఎపెండిసైటిస్)- హోమియో

పెద్దపేగు మొదటి భాగంలో చిటికెన వేలులా వేలాడు తుండే భాగాన్ని ఉండుకం (ఎపెండిక్స్) అంటారు. ఇది పొట్టలో కుడివైపు అడుగు భాగంలో ఉంటుంది. ఈ ఉండుకం ఇన్ఫెక్షన్‌కు గురైతే దాన్ని 'ఎపెండిసైటిస్' అంటారు. ఈ సమస్య తలెత్తినప్పుడు ఆ పేగుభాగం 24 గంటల్లో చిట్లిపోయే అవకాశం ఉంటుంది. అది చాలా ప్రమాదకర పరిణామం. అందుకే దీన్ని '24 గంటల కడుపునొప్పి' అనీ, '24 గంటల జబ్బు' అనీ వ్యవహరిస్తుంటారు. ఈ ఎపెండిసైటిస్ సమస్య సాధారణంగా 10-15 ఏళ్ల వారిలో ఎక్కువ. 3 ఏళ్లలోపు పిల్లల్లో మాత్రం రాదు.

నిజానికి ఉండుకం నిర్వర్తించే శారీరక ధర్మాలపైన ఇప్పటికీ మనకు అవగాహన తక్కువే. ఒకప్పుడు ఇదో నిరర్థక అవయవమని భావించేవాళ్లు. కానీ ఇటీవలి పరిశోధనలలో దీనికి ప్రాధాన్యం ఉందని, ముఖ్యంగా దీనిలో ఉండే 'లింఫాయిడ్' ధాతువు కారణంగా శరీర రక్షణ వ్యవస్థలో దీనికి పాత్ర ఉందని గుర్తించారు.

గట్టిపడ్డ మలం ఈ ఉండుకం పైభాగంలో బిరడాలా అతుక్కుంటే దీనిలో ఇన్ఫెక్షన్ చోటు చేసుకునే అవకాశం ఎక్కువ. బొడ్డువద్ద కడుపునొప్పి దీని ప్రాథమిక లక్షణం. కొద్దిపాటి జ్వరం తోడవుతుంది. ఈ లక్షణాలతో పాటు వాంతులు మొదలవుతాయి. ఇవన్నీ 'ఎ పెండిసైటిస్' వ్యాధిని సూచించే లక్షణాలే. నొప్పిగా వున్నచోట బొటన వేలితో కొద్దిసేపు నొక్కి ఉంచితే నొప్పి ఎక్కువ అవుతుంది. నొక్కి పెట్టిన బొట్టనవేలును పైకి తీసినట్లయితే అంతకు ముందు కన్నా క్షణం పాటు నొప్పి ఎక్కువై, తగ్గిపోతుంది. దీన్ని ఎపెండిసైటిస్ ప్రత్యేక లక్షణంగా గుర్తిస్తారు. 24 గంటల కడుపునొప్పి సమస్యను పట్టించే విచిత్రలక్షణమిది. పరీక్షా యంత్రాల సహాయంలేని రోజుల్లో ఈ లక్షణాలు ఎంతో ప్రాధాన్యాన్ని సంతరించుకొనేవి. ఎపెండిసైటిస్ రోగికి జ్వరం మరీ అంత ఎక్కువ ఉండదు. గరిష్టంగా $101-102^0$ వరకూ ఉండొచ్చు.

కాస్త పెద్దవయసు పిల్లల్లో కడుపునొప్పి ముందు తెరతెరలుగా కన్పించి, తరువాత తగ్గకుండా నిలిచిపోతుంది. ముందునొప్పి బొడ్డు చుట్టూ మొదలవుతుంది. కొంత సేపటికి పొట్టలో కుడివైపు అడుగు భాగంలో ఉండిపోతుంది. ముందుగా ఆకలి తగ్గిపోవడం, మలబద్ధకం, వాంతులు కన్పిస్తాయి. తర్వాత విరేచనాలు మొదలవుతాయి. దానితో జ్వరంకూడా పెరుగుతుంది. దగ్గినా తుమ్మినా పొట్ట నొప్పి ఉద్రేకిస్తుంది. చిన్నపిల్లలో వ్యాధి లక్షణాలు స్పష్టంగా కన్పించవు. వ్యాధి నిర్ణయం కష్టతరమే. పొట్టలో కుడివైపు అడుగుభాగంలో మాత్రం నొప్పి వుంటుంది.

14 సంవత్సరాలలోపు పిల్లల్లో ప్రతి వెయ్యి మందిలో నలుగురు ఈ వ్యాధికి గురవుతుంటారని అంచనా. బాలికలకన్నా ఈ సమస్య బాలురలో ఎక్కువ. ఇలా ఎందుకో కారణం ఇప్పటికీ తెలియదు. ఈ రోగులు చెయ్యి బొడ్డుపైన పెట్టుకుంటారు. పొట్టలోకి కాళ్ళు ముడుచుకొని పండుకొంటారు. చిన్న పిల్లల్లోనైతే వ్యాధి త్వరితంగా తీవ్రస్థాయికి చేరుకుంటుంది. ఈ వ్యాధి లక్షణాలను గుర్తించినప్పుడు శస్త్రచికిత్సతో పనిలేకుండా నయం చేసేందుకు హోమియోలో ప్రత్యేక ఔషధాలున్నాయి.

### * బాధలేమిటి?

పొట్టలో నొప్పి, జ్వరం, తీవ్రమైన వాంతులు, విరేచనాలు, మలబద్ధకం. బాధలో మార్పులను బట్టి ఔషధాలు మారు తుంటాయి. లక్షణాలను పరిశీలించి ఔషధాన్ని మనమే ఎంపిక చేసుకోవచ్చు.

### * ఔషధాన్ని ఎంపిక చేసుకునేదెలా?

| | |
|---|---|
| పొట్టలో నొప్పి, పొట్ట తాకితే ఓర్చుకోలేకపోతుంటే- | బ్రయోనియా |
| ఏదైనా తింటే రాయి పెట్టినట్లుగా వుంటే - | బ్రయోనియా |
| కుడివైపు పొట్ట అడుగుభాగంలో నొప్పి, కాళ్ళు ముడుచుకొంటే హాయి- | లేకిసిస్ |
| పొట్ట బిర్రుగా, వేడిగా, సున్నితంగా ఉంటే- | లేకిసిస్ |
| పొట్ట నిండా బిర్రుగా గాలి, నొప్పిగా వున్నట్లయితే- | కాలోసింథ్ |
| పొట్టలో నొప్పి, విరేచనాలున్నట్లయితే - | కాలోసింథ్ |
| పొట్టలో మెలిపెట్టినట్లు నొప్పిగా వున్నట్లయితే - | బెల్లడోనా |
| జ్వరంవున్నా దాహం లేనట్లయితే - | బెల్లడోనా |
| పొట్టలో అడుగుభాగం కుడివైపు నొప్పిగా వుంటే- | రస్టాక్స్ |
| నొప్పితో పొట్ట ముందుకు వంగి నడవాల్సివస్తే - | రస్టాక్స్ |
| పొట్టలో నొప్పి, ఉబ్బరం, వేడిద్రవాలు హాయినిస్తే - | ఫాస్ఫరస్ |
| రక్తంతో కూడిన విరేచనాలవుతుంటే - | ఫాస్ఫరస్ |

**ఎంపిక చేసుకున్న ఔషధం సరియైనదో కాదో పరిశీలించుకోవడానికి మరిన్ని వివరాలు**

* **బ్రయోనియా:** శరీరంలో కుడివైపు బాధలకు ఇది ప్రత్యేక ఔషధం. దాహం ఎక్కువ నోరు పొడారిపోతుంటుంది. కుట్టు నొప్పితో బాధపడుతుంటారు. వేడి భరించలేరు. చల్లదనం హాయినిస్తుంది.
* **బెల్లడోన్నా:** అకస్మాత్తుగా తీవ్రంగా చోటు చేసుకొనే బాధలకు ప్రత్యేక ఔషధం. తల, పొట్ట వేడిగా వుంటాయి. కంటిపాపలు విప్పారి వుంటాయి. జ్వరం తీవ్రంగా వుంటుంది.
* **లాకిసిస్:** ఎడమవైపు బాధలకు ప్రత్యేక ఔషధమే. బాధలు ముందుగా ఎడమవైపు మొదలై తర్వాత కుడివైపుకు చేరిపోతాయి. ఒత్తిడి బాధాకరం. కొంచెం తాకినా భరించలేరు.
* **రస్టాక్స్–** చల్లటి, తేమతో గూడిన వాతావరణం గిట్టదు. వేడి ద్రవపదార్థాలు హాయినిస్తాయి. అటూ ఇటూ కదులుతుంటే హాయిగా వుంటుంది. శారీరకంగా, మానసికంగా అస్థిమితంగా వుంటారు.
* **కాలోసింథ్–** ముడుచుకు పడుకొన్నా, ఒత్తిపెట్టినా నొప్పి ఉపశమిస్తుంటుంది. మలవిసర్జన తరువాత, అపానవాయువు పోయిన తరువాత హాయిగా వుంటుంది. మందులు వాడితే మలబద్ధకం ఎక్కువ.
* **ఫాస్ఫరస్–** జాలి, సానుభూతి, అధికం. భయం, ఆందోళనలు హెచ్చు. బోళాశంకరులు. మసాలాలు ఇష్టం. ఐస్, చల్లటి ద్రవాలుకావాలి. భవిష్యత్తన్నా, భూతాలన్నా భయపడతారు.

**Case-sheet**

**జి. లక్ష్మి–కాటేదాన్, కరీంనగర్.**

గత 8 మాసాలుగా నోటిపూత. బుగ్గలపై తెల్లనిమందం. డాక్టర్లు పరీక్షచేసి లూకోప్లేకియాగా నిర్ధారించారు. నోరు విపరీతంగా మండుతుంది. ఒళ్ళంతా చెమటలు. ముఖంమీద చాలాపులిపిర్లు. ఆకలిమందం మలబద్ధకం. బహిష్టులు ఆగిపోయాయి. ఈ బాధలన్నీ రుతుస్రావాలు ఆగిపోయిన తరువాతనే మొదలయ్యాయి. జిమ్స్ ఆసుపత్రిలో ఆగష్టు 8వ తేదినుండి చికిత్స జరుగుతుంది.

యాసిడ్‌నైట్రికం 30 పొటెన్సీలో ఉదయం 6, సాయంకాలం 6, గోలీలు వాడడం జరిగింది. డిసెంబరు 6, 2013 నాటికి వ్యాధి దాదాపు పూర్తిగా తగ్గిపోయింది. ఆకలి వేస్తుంది. ముఖాన పులిపుర్లు తగ్గాయి. మలబద్ధకంలేదు.


7 సం॥లలో CA/CWA లలో అత్యధిక ఆలిండియా ర్యాంకులు మరియు పాస్ పర్సెంటేజ్ సాధించిన నెం.1 కామర్స్ విద్యా సంస్థ



ఆంధ్రప్రదేశ్‌లోనే అత్యుత్తమ ఉత్తీర్ణతతో పాటు ర్యాంకులు సాధిస్తున్న ఏకైక అగ్రగామి కామర్స్ విద్యా సంస్థ

స్టేట్ 1st RANK 490/500 2012 Jr.MEC లో K. VYSHNAVI

No.1 for ▸ Inter(MEC / CEC) ▸ CA/CWA

శ్రీMEDHA™

Igniting Intelligence. Delivering Excellence.

Head Office: 6/9 Brodipet, Vuda Office Road, Guntur-2. Ph: 22 55 891 / 988 52 49166

Branch Office: Sriya Towers 2nd Floor, Besides Income Tax Office, Near Sidhardha Public School, Mogalrajpuram, VIJAYAWADA Ph:9248920266


## శ్రీరామానుజ సహస్రాబ్ది - 2016 - 17

ప్రియ భగవద్బంధువులారా! రాబోయే 2016- 17 సంవత్సరాలలో భగవద్రామానుజ సహస్రాబ్దిని మహా వైభవంగా జరుపుకోబోతున్నామని పాఠకులకు తెలియజేయడం జరిగింది.

ఈసందర్భంగా మన జీవాప్రాగణంలో ప్రతిష్ఠించ దలచుకున్న భగవద్రామానుజుల మహామూర్తి నిర్మాణానికి ఆర్థికంగా సహకరించడానికి



ఎందరో ముందుకు వచ్చారు. వారందరికీ మంగళాశాసనాలు. ఈ సందర్భంగా వారు సమర్పించదలచుకున్నద్రవ్యాన్ని ఈక్రింది అకౌంట్‌కి సమర్పించవచ్చు.

శ్రీరామానుజ సహస్రాబ్ది
ఆంధ్రాబ్యాంక్-ముచ్చింతల్ శాఖ (జీవా ప్రాంగణం)
అకౌంట్ నెం. 209710100000007

# ప్రపంచ క్యాన్సర్ దినోత్సవం (ఫిబ్రవరి 4) సందర్భంగా మహిళలకోసం

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి దివ్య మంగళాశాసనములతో**

2007లో ప్రారంభమైన **మహిళా ఆరోగ్య వికాస్** ఎందరో మహిళలను ప్రాణాంతకమైన సర్వికల్, బ్రెస్ట్ క్యాన్సర్ నుండి కాపాడుతూ, మరెందరికో ముందు చూపుగా వాటియొక్క దశలను తెలియచేస్తూ ఇంకెందరినో వీటి బారిన పడకుండా జిల్లాల వ్యాప్తంగా చికిత్సా శిబిరాలను నిర్వహించటానికి వీలుగా శిక్షణా తరగతులను నిర్వహిస్తూ “ఇంతై ఇంతింతై వటుడింతై” అన్న రీతిగా ముందుకు నడుస్తుంది మహిళా ఆరోగ్య వికాస్.

ఇప్పటివరకు వరంగల్, కరీంనగర్, కృష్ణా, గుంటూరు, విజయనగరం, విశాఖపట్నం, శ్రీకాకుళం మొదలైన జిల్లాలలో శిబిరాలను నిర్వహించటమే కాకుండా అనంతపురం, నల్గొండ, ప్రకాశం, పశ్చిమగోదావరి, తూర్పు గోదావరి జిల్లాలకు వ్యాప్తి చెంది మహిళలకు ఒక వరంగా అవతరించింది.

మహిళ ఆరోగ్యంగా ఉంటే కుటుంబం తద్వారా సమాజం బాగుటుంది అనేది స్వామివారి ఆశయం, శరీరంపైన కనిపించే భాగాలను చెప్పుకున్నంతగా లోలోపల ముదిరిపోయే సమస్యలను (Infections) చెప్పుకోవటానికి మహిళలు బిడియపడటం సహజం. అయితే ఇది ఎంత ప్రమాదకరమో అవగాహన లేకపోవటం 2020 నాటికి ఇండియన్ మెడికల్ కౌన్సిల్ లెక్కల ప్రకారం మహిళలలో వచ్చే సర్వికల్ మరియు బ్రెస్ట్ క్యాన్సర్‌కి మనదేశం ప్రథమ స్థానంలో ఉండటం విచారించదగిన విషయం. ఇలాంటి సమయంలో మన జగదాచార్యుల ద్వారా మహిళలయొక్క శ్రేయస్సుకోసం ప్రారంభించబడి, ఎంతోమందికి ఉచిత V.I.A. పరీక్ష చేయడం ద్వారా మారుమూల గ్రామాలలో ప్రాంతాలలో కనీస ఖర్చులు కూడా పెట్టుకోలేని స్థితిలో ఉన్నవారందరికీ, వారిలో ఉన్న సమస్యను వారికి చూపించి, వివరించి పరిష్కరించడానికి ఆవిర్భవించిందే మహిళా ఆరోగ్య వికాస్. వివాహం అయిన ప్రతి మహిళా సంవత్సరానికి ఒకసారి స్క్రీనింగ్ టెస్ట్ చేయించుకోవాలి.

40 సం॥లు దాటిన తరువాత 6 నెలలకు ఒకసారి చేయించుకుంటే వచ్చే సమస్యను ముందుగానే తెలుసుకొని విచారించవచ్చు. రొమ్ము పరీక్షా విధానం కూడా ఎవరికీ వారే పరీక్షించుకొనే విధానాన్ని తెలిపి మహిళలను చైతన్యవంతులను చేస్తోంది మహిళా ఆరోగ్య వికాస్.

V.I.A. (Visual Inspection with Acetic acid) అనే పరీక్ష ద్వారా తక్కువ ఖర్చుతో, తక్కువ సమయంలో వెనువెంటనే Infection ని నిర్ధారించి అందరికీ అందుబాటులో ఉండేవిధంగా దీనిని ప్రాచుర్యంలోనికి తీసుకొని వచ్చారు మన ఆచార్యులు. ముంబైలాంటి మహాపట్టణాల్లో V.I.A. పరీక్షను ఎక్కువగా ఉపయోగిస్తున్నారు. కాల్పోస్కోపి ద్వారా శిబిరానికి వచ్చిన మహిళలకు వారి గర్భాశయం యొక్క ముఖద్వారాన్ని వారు చూసి తెలుసుకోవడం ద్వారా మహిళలలో అవగాహన బాగా పెరిగి, వీరు మరెందరికో దీనిని గురించి వివరించటం, అంతే కాకుండా ఎవరైనా ఆపరేషన్ చేయించుకోలేని స్థితిలో ఉన్న మహిళలకు మన వికాసతరంగిణి తమవంతు సహాయాన్ని, సహకారాన్ని అందించి మహిళలకు చేయూతనిస్తుంది. NRI హాస్పిటల్ ద్వారా Papsmear, Scanning, F.N.A.C., Mammography, Biopsy లాంటి పరీక్షలను ఉచితంగా చేయిస్తూ మొదటి దశలోనే వారికి తగ్గేలా చేస్తుంది మహిళా ఆరోగ్య వికాస్. ఈ వ్యాసాన్ని చదివిన ప్రతి మహిళా ఇది వారికోసమే అని గుర్తించి స్క్రీనింగ్ టెస్ట్ చేయించుకోవడానికి మరియు సాటి మహిళలకు తెలియపరచడానికి ముందుకు వచ్చి క్యాన్సర్ రహిత సమాజ నిర్మాణానికి దోహదపడాలి.

శ్రీ స్వామివారి ద్వారా జరుగుతున్న ఆరోగ్య వికాస్ శిబిరాలకు వచ్చి, పరీక్ష చేయించుకొని వారిలో ఉన్న సమస్యలను మందుల ద్వారా, సకాలంలో ఆపరేషన్ చేయించుకోవటం ద్వారా తగ్గించుకొని, తమ ఆనందాన్ని, అనుభవాన్ని, శ్రీస్వామివారి ముందు వ్యక్తపరచడానికి, శ్రీస్వామివారి ఆశీస్సులు పొందటానికి 2014 జనవరి 28న

మహిళా ఆరోగ్య వికాస్ – వికాస తరంగిణివారి ఆధ్వర్యంలో పలు జిల్లాలో నిర్వహించిన

**ఉచిత కేన్సర్ అవగాహన – చికిత్సా శిబిరాలు 2007 నుండి 2013 వరకు**

| Sl | District | Total Camps | VIA | Pap | U/S | Mammo | Biopsy | Breast | Hystero-ctomy | Pree cancer Detection | Total Home Survey |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | వరంగల్ | 21 | 1603 | 263 | 263 | 143 | 580 | 3 | 11 | 14 | 23,810 |
| 2. | కరీంనగర్ | 100 | 6,541 | 690 | 161 | 52 | 112 | 10 | 9 | 15 | 23,393 |
| 3. | విజయనగరం | 10 | – | 1810 | 80రీ | – | 7 | 2 | 5 | 5 | 26,580 |
| 4. | విశాఖపట్నం | 26 | 462 | 512 | 2 | 29 | 33 | 2 | 4 | 4 | 15,000 |
| 5. | విజయవాడ | 86 | 8,961 | 466 | 403 | 176 | 686 | 21 | 172 | 43 | 51,029 |

విజయవాడలోని బందర్‌రోడ్డునందు D.V.Manor ప్రక్కన జరగబోయే "ప్రపంచ క్యాన్సర్ దినోత్సవ సదస్సు"కు అన్ని జిల్లాల నుండి మహిళలు రావటానికి సిద్ధంగా ఉండడం ఒక విశేషం. సమాజానికి ఉపయోగపడే మంచి కార్యక్రమాన్ని నిర్వహిస్తున్న శ్రీస్వామివారిని సేవించడానికి ఆరోగ్య శిబిరాలకు సేవలు అందిస్తున్న డాక్టర్స్ కూడా ఎదురు చూడటం ఇంకొక విశేషం.

ఒక ప్రక్క ఆధ్యాత్మిక కార్యక్రమాలతో, మరొక ప్రక్క సామాజిక సేవా కార్యక్రమాలతో నిరంతరం భక్త, దీన ఆర్తులకోసం శ్రమిస్తున్న శ్రీస్వామివారు ఆరోగ్య వికాస్ సేవల ద్వారా మాలోని అహంకారాన్ని తొలగించి, జీవితానికి ఒక సార్ధకతనూ, గమ్యాన్ని ఏర్పరచి మా గురుదేవుని పాదపద్మములకు అనేక దాసోహములు సమర్పించు కుంటుంది మహిళా ఆరోగ్య వికాస్.

మాధవీ రవీంద్ర రామానుజదాసులు
08645 272929,
9346405010

## శ్రీశ్రీశ్రీ దేవనాథరామానుజ జీయర్ స్వామివారి పర్యటన వివరములు

ఫిబ్రవరి నెల

| | | |
|---|---|---|
| 1 | సిద్ధిపేట | పుల్లూరుగుట్ట శ్రీ నృసింహ కల్యాణోత్సవం |
| 2. | హైదరాబాద్ | అరుణారాఘవరెడ్డిగారి గృహప్రవేశం-బర్కత్‌పుర అనంతరం శ్రీ సుదర్శన హవన పూర్ణాహుతి, శ్రీరామాలయం కోహెడ గ్రామం, హయత్‌నగర్‌మం॥ |
| 2-5 | సంగారెడ్డి | వైకుంఠపురం బ్రహ్మోత్సవాలలో పాల్గొనుట. |
| 6-9 | హైదరాబాద్ | అపోలో శ్రీ వేంకటేశ్వరస్వామి ద్వితీయ పుష్కరోత్సవంలో పాల్గొనుట. |
| 10 | హైదరాబాద్ | శ్రీ భీష్మఏకాదశి, ఉప్పగూడ. |

ఫిబ్రవరి 25 మార్చి 1 వరకు 28 ఖమ్మంజిల్లా

2-4 రాజమహేంద్రి శ్రీరంగధామం బ్రహ్మోత్సవాలలో పాల్గొనుట

జై శ్రీమన్నారాయణ!

## శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజజీయర్ స్వామివారి పర్యటన వివరములు

ఫిబ్రవరి నెల

| | | |
|---|---|---|
| 2 | సంగారెడ్డి | శ్రీ వేంకటేశ్వరస్వామి సన్నిధి బ్రహ్మోత్సవాలు. |
| 3-6 | రాజమహేంద్రి | శ్రీరంగధామము |
| 7-10 | విజయనగరం | పర్యటన, భీష్మఏకాదశి పారాయణ |
| 10 | విశాఖ | సా॥ భీష్మఏకాదశి |
| 11-18 | శ్రీకాకుళం | కవిటి, మందస మండలములలో విజయధ్వజ యాత్ర |
| 19-24 | మందస | శ్రీ వాసుదేవస్వామి బ్రహ్మోత్సవాలలో పాల్గొనుట |
| 25 | గుంటూరు | |

మార్చి

| | | |
|---|---|---|
| 2-5 | రాజమహేంద్రి | శ్రీరంగధామం 5వ బ్రహ్మోత్సవాలలో పాల్గొనుట. |
| 6-10 | మార్కాపురం | ఆమలక లక్ష్మీనారాయణస్వామి ఆలయ బ్రహ్మోత్సవాలలో పాల్గొనుట. |

## మెదడుకి మేత

### జనవరి నెల సమాధానములు

1.విళాంశోలై పిళ్లై; 2.అపహతపాప్మా; 3.యముడు; 4.సనక సనందనాదులు; 5. శ్రీకృషణదేవరాయులు; 6.ఉ.వే.తే.కం. గోపాలాచార్యస్వామి; 7.క్షమాగుణం కలిగి ఉండడం; 8.తిరుమంగై ఆళ్వార్లకు; 9. తిరుప్పాణి ఆళ్వారులు; 10.దాస్యం; 11.సింటోమాటిక్ ట్రీట్‌మెంట్; 12. భుజ్ ధాతువునుండి; 13.కృష్ణనిలా; 14.వాయువు, అరుంధతి, స్కందుడు॥మొ; 15.పురుషమంగళం; 16. బ్రయోనియా రస్టాక్స్, యుపటోరియం; 17.ప్రాణశక్తి లయబద్ధంగా ఉండాలి; 18.పొట్టనే పాత్రగాకలవాడు; 19.లక్ష్మీవక్షస్థలుడై; 20.ధర్మం

తీర్థయాత్ర
జై శ్రీమన్నారాయణ
22-12-2013 విజయవాడ నుండి బయలుదేరును
108 శ్రీ వైష్ణవ దివ్య దేశములలో 95 తమిళనాడు మరియు కేరళలోని శ్రీ వైష్ణవ దివ్య దేశముల 16 రోజుల తీర్థయాత్ర
ముక్తినాథ్ యాత్ర కలదు.
తొండైనాడు - 22
నడునాడు - 2
చోళనాడు - 40
పాండ్యనాడు - 18
మలైనాడు - 13
క్షేత్రములు 95
వివరములకు :
విష్ణు వందన ట్రావెల్ సర్వీసెస్
సెల్: 09290574187
09032935316



పరమహంస పరివ్రాజకులు
# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



### కరీంనగర్‌లో శ్రీశ్రీశ్రీస్వామివారి ధనుర్మాస ప్రవచనాలు

డిసెంబర్ 15వతేదీ మధ్యాహ్నం శంషాబాద్ జీవా ప్రాంగణం నుండి ధనుర్మాస కార్యక్రమానికి శ్రీవారు బయలుదేరారు. మార్గమధ్యంలో భక్తులను అనుగ్రహిస్తు సిద్దిపేట మీదుగా రాత్రి సుమారు 10గం॥లకు కరీంనగర్‌లోని సర్కస్ గ్రౌండ్స్‌కి చేరుకున్నారు. అప్పటికి ఎంతోమంది భక్తులు శ్రీస్వామివారి రాకకై ఎదురుచూస్తున్నారు. కార్యక్రమ నిర్వాహకులైన శ్రీమాన్ వీర్ల ప్రభాకర్‌రావుగారు, VT కార్యదర్శి శ్రీగౌతమ్‌రావుగారు జగిత్యాల నంబి వేణుగోపాలాచార్య స్వామి, శ్రీమతి కౌసల్యాదేవి గారు తదితరులు కార్యకర్తలు ఘనంగా శ్రీస్వామివారికి స్వాగతం పలికారు. నంబి వేణుగోపాలాచార్య స్వామివారు మాట్లాడుతూ 26సంవత్సరాల తరువాత మళ్ళీ కరీంనగర్‌వాసులకు ధనుర్మాసం శ్రీస్వామివారి సన్నిధిలో జరుపుకునే అదృష్టం లభించినందరు.

శ్రీ స్వామివారు.. "ఎంతోకాలంగా ధనుర్మాస వ్రతాన్ని చేస్తున్నా, 8 సంవత్సరాల బాలికగ ఆనాడు శ్రీవిల్లిపుత్తూరులో గోదాదేవి వ్రతాన్ని చేయాలనుకున్నప్పుడు నిండుచంద్రుడు పండు వెన్నెలకల పౌర్ణమికలిగి వచ్చినట్లే ఈఏడాది మనకి కూడా ఈమార్గశీర్షమాసం ప్రారంభ మయిం"దని ఆనందాన్ని వ్యక్తంచేసారు. ఆ భాగ్యం కరీంనగర్ వాసులు అదృష్టంగా భావించారు.

16వతేదీన ఉదయం తిరుమంజనాది కార్యక్రమాలు అనంతరం శ్రీగోదాకృష్ణ సమేత కోదండరామప్రభువు పరివారంతో దీక్షావస్త్రాలు ధరించి భక్తులకు దర్శనమిచ్చారు. పసుపు వస్త్రాలతో మేము ముందుండి మీచే వేంకటేశ్వర శరణాగతి దీక్ష చేయిస్తాం అన్నట్లుగా ఉంది. ఇది శరణాగతి దీక్షలో పాల్గొన్న భక్తులందరికీ చాలా ఆనందాన్ని, ఉత్సాహాన్ని కల్గించింది.

మన "జెట్" ఆగమ పాఠశాల ప్రిన్సిపాల్ శ్రీమాన్ మధుసూదనా చార్యస్వామి అందరికీ సంకల్పాన్ని చెప్పించి శరణాగతిదీక్షాబద్ధులను గావించారు. పెరుమాళ్ల దర్శనానికి, తీర్థగోష్ఠికి వేలసంఖ్యలో భక్తులు పాల్గొన్నారు. ధనుర్మాసం నెలరోజులు ఉదయం శరణాగతిదీక్షాప్రార్థనల వైభవాన్ని, సాయంత్రం శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రపారాయణ అనంతరం తిరుప్పావై వైభవాన్ని శ్రీస్వామివారు భక్తులకు అనుగ్రహించారు.

### శ్రీవేంకటేశ్వర వైభవం

శ్రీవేంకటేశ్వర వైభవాన్ని తెలియజేస్తూ "మనం చేసే శరణాగతిదీక్ష అత్యంత విలక్షణమైనది. **నాడి నీ వేంగడవర్కు విధి ఎన్నై** అని గోదాదేవి తెలిపినట్లు పెరుమాళ్ళ నిత్యసేవ, సత్సంప్రదాయవిరుద్ధం కాని రీతిలో **రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతాం అభివర్ధతాం** అన్నట్లుగా ప్రవర్తింపచేయ గలిగే శక్తిని భక్తగోష్ఠికంతకూ అనుగ్రహించమని ఆ పెరుమాళ్ళని ప్రార్థించడమే" అని తెలిపారు.

సాయంత్రం ధనుర్మాస కార్యక్రమాన్ని ప్రారంభిస్తూ "అంతటా భగవంతుడు వ్యాపించి ఉంటాడు. ఆయనే మనకోసం విగ్రహ రూపంలో దిగివచ్చాడు, అని విశ్వాసంతో ఆరాధిస్తే మనం కోరిన ఫలితాన్ని పొందవచ్చు. ఆ విగ్రహం ఉత్తబొమ్మ కాదు సాక్షాత్తు పరంబ్రహ్మ. గోదాదేవి ఆవిగ్రహం దగ్గరే తన వ్రతాన్ని చేసింది. తాను కోరిన ఫలితాన్ని పొందింది. విగ్రహరూపంలో ఉన్న స్వామికి తగిన రీతిలో ఆరాధన జరగాలి. అంతటా వ్యాపించి ఉన్న స్వామికి ఏమీ చేయలేకపోయినా విగ్రహరూపంలో ఉన్న స్వామికి ఆయా సమయాలకి ఆయా సేవలను అందించవలసి ఉంటుంద"ని తెలియజేసారు.

శ్రీవేంకటేశుని వైభవాన్ని తెలియజేస్తూ శ్రీవేంకటేశుడు ఈలోకంలో ఆవిర్భవించి సుమారు 200కోట్ల సంవత్సరాలు అయిందని తెలియజేసారు. తిరుమలలోని శిలాతోరణం దానికి సాక్షి. స్వామి ఆవిర్భవించి అంతకాలమైనా ఒక వేయిసంవత్సరాలకు పూర్వం భక్తులకు కల్గిన అనేక సందేహాలను భగవద్రామానుజులు తీర్చి ఆరాధనా వ్యవస్థని క్రమబద్ధీకరించారని తెలియజేసారు. భక్తులమను కుంటూ ఎందరో ఆ స్వామిని క్షణకాలం విశ్రాంతిని కూడా ఇవ్వకుండా పగలు రాత్రి కోర్కెల పుట్టలతో దర్శించడాన్ని తలచి చాలా విచారించారు.

మన పెద్దలు మనకు అందించిన సంప్రదాయాన్ని , ధర్మాన్ని ముందు మనం పాటిస్తూ తరువాతి తరాలకి అందించడం మన కర్తవ్యమని సూచించారు.

మెదకుజిల్లా సిద్దిపేటవద్ద మందారంగ్రామంలో కట్టా ప్రసన్నబాబు గారు 15 ఎకరాల భూమిని దానంచేస్తే దానిలో శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజస్వామి **శ్రీరామానుజవిద్యాపీఠం** పేర ఒక ఉన్నత పాఠశాలను ప్రారంభించడానికి పూర్వరంగంగ భవననిర్మాణాలు చేయించ సంకల్పించారు. శ్రీశ్రీశ్రీ జీయరు స్వామివారు 19వ తేదీ ఉదయం ఆభవన సముదాయానికి శిలాన్యాసం చేసారు.

20వతేదీ పాఠశాలల కరస్పాండెంట్స్‌తో సమావేశమయ్యారు. యువతరం తమ శక్తిని,ధనాన్ని, సమయాన్ని వృధాచేయకుండా మంచి మార్గంలో పెట్టుకొనేట్లు తగిన సూచనలు ఇచ్చారు. సంవత్సరపు చివరి ఆదివారం **వికాసతరంగిణి యూత్** ద్వారా జరిగే అవయవదాన అవగాహనా యాత్రలో పాల్గొనవలసినదిగా సూచించారు.

22వతేదీ కామధేను గోరక్షణ కేంద్రాన్ని చిన్నకలువల గ్రామంలో రామాలయాన్ని దర్శించి, మంచిర్యాల **లయన్స్‌క్లబ్** వారి రీజినల్ సమావేశాలలో పాల్గొన్నారు.

24వతేదీ ABVP రాష్ట్రసభలో ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు.

తేనేటీగ తేనెని తేవడానికి ఎంతదూరం ప్రయాణించి, శ్రమపడి తేనెని సంపాదిస్తుందో జ్ఞాన సముపార్జన కూడా అలానే ఉండాలని తెలిపారు.

24,25,26 తేదీలలో వికాస తరంగిణి ప్రాంతీయకార్యకర్తల శిక్షణాతరగతులు జరిగాయి. వి.టి. అధ్యక్షులు శ్రీమాన్ T. రమేష్‌గుప్త పూర్వాధ్యక్షులు శ్రీమాన్ మహేందర్ రెడ్డి తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. శ్రీస్వామివారు కార్యనిర్వహణలో కావలసిన మెలకువలను వారికి తెలియజేసారు.

27వతేదీ మామిడాలపల్లి గ్రామంలో వికాసతరంగిణి సభ్యులు డా॥చారిగారు, డా॥సంజీవరావు గార్ల బృందం నిర్వహించిన పశువైద్య శిబిరంలో పాల్గొన్నారు. పశువులకు వచ్చే గర్భకోశవ్యాధులు, మట్టవ్యాధులు మొదలైన వాటిని పరీక్షించారు. సౌజన్యం డైరి చైర్మన్ సి. హెచ్. రాజేశ్వరరావుగారు ఉచితంగా పశువులకు మందులు అందించారు.

**శతావధాని స్మారక పురస్కార సమర్పణం**

28వతేదీ కీర్తిమూర్తులు శ్రీ.ఉ.వే.శ్రీమాన్ శిరశినగల్ శతావధాని కృష్ణమాచార్య స్వామి(కోరుట్ల) స్మారక పురస్కార సమర్పణం జరిగింది. దీనిని శ్రీమాన్ చీటి అయోధ్య రామారావు గారు, సంస్కృత భాషలో పండితులు మన భక్తినివేదన సంపాదకులు శ్రీ ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకటరంగరామానుజాచార్య స్వామికి, తెలుగుభాషా పండితులైన శ్రీమాన్ కోవెల సుప్రసన్నాచార్యులవారికి అందజేసారు. వారికి శ్రీస్వామివారు మంగళాశాసనం చేసారు.

28వతేదీన వడుగనంబి వంశస్థులైన శ్రీమాన్ సీతారామా చార్యులు ఏర్పాటు చేసిన **బొమ్మినగ్రామం**లోని భక్తుల సమావేశంలో పాల్గొన్నారు. అక్కడ నుండి **దూలూరు గ్రామం**లో రామాలయం, **తక్కలపల్లి** శ్రీవేంకటేశ్వరాలయాన్ని దర్శించి మెట్టుపల్లి (మం) **గుండంపల్లిగ్రామం**లో భక్తులకు మధురభాషణాన్ని అందించి రాత్రికి కరీంనగర్ చేరారు.

**అడ్వకేట్స్ సమావేశం**

29వతేదీ అడ్వకేట్స్ సమావేశం జరిగింది. రాబోతున్న "మతహింసనిరోధకచట్టం"గురించి వారికి తెలియజేసారు. అదివస్తే ఈ జాతిబ్రతుకు ఘోరంగా ఉంటుందని ముందుగా మేల్కొని జాగరూకతతో ఉండడం అవసరమని సూచించారు.

ఈసంవత్సరానికి 29వతేది ఆఖరి ఆదివారం కావడం వల్ల హైదరాబాద్‌లో **వికాసతరంగిణి యాత్** నిర్వహించే అవయవ దాన అవగాహనాసదస్సులో పాల్గొన్నారు. తిరిగి మధ్యాహ్నం 4.00గం॥కు కరీంనగర్‌లో జరిగిన అవయవదాన అవగాహనా యాత్ర, సదస్సుల్లో కూడా అన్వయించారు.

**నూతనసంవత్సర స్వాగతం**

కాలస్వరూపుడైన భగవంతునికి 2013గ వీడ్కోలు పలుకుతూ 2014రూపంలో స్వామికి స్వాగతాన్ని పలుకుకూ 31వ తేది రాత్రి 11.00గం.నుండి 1.00గం.వరకు భజనలతో జరిగిన నగర సంకీర్తనలో శ్రీవారు పాల్గొన్నారు. దీనిలో MP శ్రీపొన్నం ప్రభాకరరావు, ముస్లిం సోదరులు శ్రీమాన్ ముగ్దుమ్, శ్రీమాన్ ఖలీల్ పాల్గొనడం పేర్కొనదగినది.

తిరుప్పావై సమితివారు 1వతేదీన సుదర్శన నారసింహ హోమం నిర్వహించారు. మైహోమ్స్ అధినేత శ్రీమాన్ జూపల్లి రామేశ్వరరావు దంపతులు, జగపతిరావు, బెంగుళూరునుండి వచ్చిన శ్రీమతి ఉషాజగదీష్ తదితరులు శ్రీస్వామివారి మంగళాశాసనాలను అందుకున్నారు. భక్తులు తండోపతండాలుగా ఉదయపు కార్యక్రమాల లోను శ్రీసుదర్శన నారసింహ హవనంలోనూ పాల్గొని తరించారు.

2వతేదీన శ్రీ శివకుమార్ రాజు నిర్వహించే కావ్య మానోవికాస్ మానసిక వికలాంగుల కేంద్రాన్ని దర్శించి విద్యార్థులకు మంగళా శాసనం అందించారు. మన ధనుర్మాస కార్యక్రమాన్ని నిర్వహించు కోవడానికి అనువుగా కరీంనగర్ నడిబొడ్డున సర్కస్ గ్రౌండ్స్‌ని నెలరోజులపాటు ఇప్పించిన MLA శ్రీమాన్ గంగుల కమలాకర్ గారు శ్రీవారిని సేవించారు. ఈ సేవ తమకు లభించడం తమ భాగ్యమని పొంగిపోయారు శ్రీవారి మంగళాశాసనాలనందు కున్నారు.

**శ్రీవైష్ణవదీక్షాగ్రహణం**

4వతేదీ సుమారు 4వేలమంది శ్రీవైష్ణవదీక్షని స్వీకరించారు, సమాశ్రయణములను పొందారు. సమాశ్రయణాల సందర్భంగా సమాశ్రయణావశ్యకతని శ్రీవారు తెలిపారు. ఆహార నియమం తప్పని సరిగా పాటించాలని శ్రీస్వామివారు పదేపదే తెలియ జేసారు. మనం తీసుకునే ఆహార ప్రభావం మన మనస్సుమీద ఉంటుందని, మనస్సు మంచిగా ఉంటే మనం మంచి పనులను చేయగల్గుతాం అని తెలియజేసారు. మాంసాహారం క్రూరమృగాలకి భగవంతుడు నిర్దేశించాడు. ఏతల్లీ తన సంతానాన్ని తన కళ్ళముందే సంహరిస్తూంటే చూసి హర్షించదు. భగవంతుడు కూడా ప్రాణహింసను సహించలేడు. కనుక మాంసాహారాన్ని మానమని శ్రీస్వామివారు తెలియజేసారు. దానితో పాటు తామసిక ఆహారాలు కూడా వదలమని శ్రీస్వామివారు నిర్దేశించారు.

VILAN V
Just face the world
Hot Cutes
vijay ads

రెండేళ్ళక్రితం ఇదే కరీంనగర్‌లో 3200 మంది సమాశ్రయాణాలు పొందడం చరిత్రలో ప్రథమమని, ఇప్పుడు 4వేలమంది కావడంతో ఆరికార్డు శ్రీవారిద్వారానే, ఇక్కడే తారుమారైందని నిర్వాహకులు హర్షాతిరేకంతో తెలిపారు.

7వతేదీ వెండివస్తువులు తయారు చేసే చందనఫిలిగ్రీ వర్కుషాపు, షోరూమును సందర్శించారు. వెండితీగెతో జాలీ, అల్లిక ద్వారా వివిధ వస్తువులను తయారుచేసే కళను "ఫిలిగ్రీ" అంటారు. అది అంతర్జాతీయంగా గుర్తింపు పొందింది ఇక్కడి కళాకారులద్వారానే. కరీంనగర్‌కు చెందిన శ్రీమాన్ అశోక్ మొదలగు కుటుంబసభ్యులు అంతర్జాతీయంగ పేటెంట్ రైట్స్ పొంది, ఎందరో యువకులకు దానిని నేర్పిస్తున్నారు. శ్రీవారు వారికి మంగళాశాసనాలు చేసారు. తదనంతరం ఇల్లంతకుంట(మం) **రేపాకగ్రామం**లో రామాలయం శంకుస్థాపన చేసారు. అక్కడ వికాసతరంగిణి యువవికాస్ శాఖనొకదానిని ప్రారంభించారు. వికాసతరంగిణి సెంట్రల్ కమిటి సభ్యులందరూ శ్రీస్వామివారిని దర్శించి మంగళాశాసనాలు పొందారు.

10వతేదీన శ్రీదేవేందర్ రావు ప్రభృతులు **ఇరుకుగ్రామం**లో నిర్వహించే పద్మనాయక వృద్ధాశ్రమాన్ని దర్శించారు. అక్కడ ఉన్న వృద్ధులకు మంగళాశాసనాలను కృపజేసారు.

### ముక్కోటి ఏకాదశీ, కూడార్ై వేడుకలు

11వతేదీ ధనుర్మాసంలో విశేషమైన రోజు. కూడారై ప్రయుక్త వైకుంఠ ఏకాదశి. రెండు విశేషాలు కలిసివచ్చాయి ఈ ఏడాది. తెల్లవారుజాము సుమారు 4.00గం॥లకే సర్కస్ గ్రౌండ్ ప్రాంగణం అంతా భక్తులతో కిక్కిరిసి పోయింది. పెరుమాళ్ళ ఉత్తరద్వార దర్శనం శ్రీప్రశ్నసంహితలో ఉన్న వైకుంఠ ఏకాదశి విశేషాలను శ్రీవారు తెలియజేసారు. వైకుంఠ మండప నిర్మాణాన్ని వి.టి. సభ్యులు చాలా అందంగా తీర్చిదిద్దారు.

శ్రీకోదండరామస్వామి పరివారం ఉదయాన్నే నిత్య ఆరాధనలు పూర్తిచేసుకుని వైకుంఠ మండప ఉత్తరద్వారం నుండి బయటకు వస్తూ భక్తులకు దర్శనమిచ్చారు. బయటకి వచ్చిన స్వామి అక్కడే మధ్యాహ్నం సుమారు 3గం॥ల దాకా వైకుంఠమండపంలో భక్తులను అనుగ్రహించారు. వేలాది భక్తులకు శ్రీవారే స్వయంగా తీర్థాన్ని అనుగ్రహించారు. తదనంతరం గోదాదేవి వ్రతాన్ని తీరుస్తూ భగవద్ రామానుజులు వారు నిర్వహించిన కూడారై ఉత్సవం చాలా వైభవంగా జరిగింది. అది కాగానే శ్రీస్వామివారు కొద్దిదూరంలో LMD కాలనీలో శ్రీపెద్దజీయర్ స్వామివారు ప్రతిష్ఠచేసిన శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయాన్ని దర్శించారు. సాయంత్రం ధనుర్మాస కార్యక్రమంలో పాల్గొన్న జిల్లాజెడ్జి శ్రీమాన్ నాగమారుతీశర్మ గారికి, DRDA ప్రాజెక్ట్ డైరెక్టర్ శ్రీశంకరయ్య గారికి తదితరులకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేసారు.

### శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారి పరమపదోత్సవం

12వతేదీ విశేషమైన రోజు. శ్రీపెద్దజీయర్ స్వామివారి పరమ పదోత్సవం. శ్రీవైష్ణవ సంప్రదాయంలో పరమపదోత్సవాన్ని జరుపుకోవచ్చా? అయితే మనం రామానుజులవారికి, ఆళ్వారులకి, ఇతర ఆచార్యులకి ఎప్పుడూ జరుపుకోమే? అంటూ శ్రీస్వామివారు వాటి విశేషాన్ని తెలియజేసారు.

ఆచార్యుల దగ్గర నేరుగా మంత్రాన్ని పొందిన శిష్యులు ఉన్నంతవరకూ ఆ ఆచార్యుల పరమపదోత్సవం జరుగుతుంది. రామానుజుల వారి దగ్గర నేరుగా మంత్రాన్ని పొందిన శిష్యులు ఈకాలంలో ఉండరు కనుక మనం వారి తిరునక్షత్రాన్ని మాత్రమే జరుపుకుంటాం. మణవాళమామునుల పరమపదోత్సవం నేటికి జరుగుతోంది శ్రీరంగంలో. వారిశిష్యులు ఉన్నారు కనుక.

శ్రీరంగనాథుడు సంవత్సరకాలం ఆలయంలో జరిగే ఉత్సవాలన్నింటినీ ఆపి మణవాళమామునులు సాయించే తిరువాయ్‌మొజిని సేవించాడు. అంతేకాకుండా నేటికీ మనం ప్రతినిత్యం అనుసంధానం చేసే "శ్రీశైలేశ దయాపాత్రం" అనే శ్లోకాన్ని శ్రీరంగనాథుడే గురుదక్షణగా మణవాళమామునులకు సమర్పించుకున్నాడు. ఆ రకంగా సాక్షాత్తుశిష్యుడైన శ్రీరంగనాథుడు ఇప్పటికీ ఉన్నాడు కనుక. ఆయనే నేరుగ ఆచార్యుల పరమపదోత్సవం ఆలయంద్వారా జరిపిస్తాడు. ఆనాటికి కావలసిన వస్తుజాతాన్నంతా మణవాళమామహునుల సన్నిదికి ఆలయం నుండే ఈనాటికీ వెడుతుంది. రామానుజులవారి శిష్యుడు కూడా ఒకరున్నారు తిరుమలలో. కానీ మన దురదృష్టం వేంకటేశునికి వారి ఆచార్యుల పరమపదోత్సవాన్ని చేసుకునే అదృష్టం ఉండే ఉంటుంది. కానీ మధ్యలో ఎప్పుడో తొలగి ఉంటుంది అని తెలిపారు. శ్రీపెద్దజీయర్ స్వామివారి అష్టోత్తరం అయిన తరువాత పెద్దస్వామివారు చివరిగా కరీంనగర్ వచ్చారని అక్కడే వారు అస్వస్థులయ్యారని తిరిగి వెళుతూ వరంగల్‌లో ఇక ప్రయాణం చేయలేక **శ్రీ పద్మశేషగిరిరావు** దంపతుల ఇంట్లో ఆగారని, అక్కడనే 20రోజులు శ్రీస్వామివారు వేంచేసి ఉన్నారని తెలియజేసారు. ఆ 20రోజులు వచ్చిన భక్తులందరికీ శ్రీశేషగిరిరావు దంపతులు అన్ని రకాల వసతులను కల్పించారని తెలియజేసారు. శ్రీపెద్దజీయర్‌స్వామివారి పరమపదోత్సవానికి వచ్చిన పద్మ శేషగిరిరావు దంపతులకు శ్రీవారు మంగళాశాసనం చేసారు. శ్రీపెద్దజీయర్ స్వామివారు వారింటినుండి బయలుదేరుతూ శ్రీమతి పద్మగారిని "అమ్మా! తల్లిలాగా నువ్వు అన్ని సేవలు చేసావు. నిజంగా నీవు తల్లివే" అని ప్రశంసించారని తెలిపారు. శ్రీనంబి వేణుగోపాలచార్య స్వామి శ్రీపెద్దస్వామివారి వైభవాన్ని తెల్పుతూ "శ్రీపెద్దస్వామివారు ఎవరినీ దండించేవారు కాదు. తప్పుఉన్నా చాలా చక్కగా వారిని తిరిగి ఆ తప్పుచేయకుండా మార్చేవారు", అంటూ కొన్ని విషయాలు తెలిపారు. అందులో ఒకటి, ఒకస్వామి ఆరాధన అనంతరం గోష్ఠి పూర్తికాక మునుపే బూరెల ప్రసాదాన్ని ఆలయంలో లోపల స్వీకరిస్తుంటే శ్రీస్వామివారి దృష్టిపడిందట. మరునాడు ఓపెద్ద వెదురుబుట్టెడు బూరెలను చేయించి నేరుగా ఆస్వామిగదికి పంపి ఇవన్నీ మీకోసమే అని కబురుపంపారట. అంతే, ఆస్వామి తమ తప్పును తెలుసుకున్నారు. మళ్ళీ జీవితంలో అలాంటి తప్పు చేయను అని చెప్పారట. శ్రీపెద్దస్వామివారిని మొదలు కరీంనగర్‌కి తీసుకువచ్చి సమాశ్రయణం పొందిన శ్రీమతి కౌసల్యమ్మగారికి మంగళాశాసనాలు చేసారు.

## భోగిభోగం

13వతేదీ భోగి విశేషమైన రోజు ఉదయం 9.00గం॥ శ్రీస్వామి నారాయణ సంప్రదాయానికి చెందిన శ్రీఆత్మస్వరూపీ స్వామిబృందాన్ని శ్రీమాన్ రామేశ్వరరావుగారు తీసుకువచ్చారు. వారితో భగవద్ రామానుజుల వారి సహస్రాబ్ది విశేషాన్ని గురించి శ్రీవారు మాట్లాడారు. శ్రీస్వామివారి ఆరాధ్యదైవమైన శ్రీకోదండ రామచంద్రప్రభువుని వారు దర్శించి ఆనందంగా కార్యోన్ముఖుల య్యారు. తదనంతరం ఎదుర్కోలు ఉత్సవం జరిగింది.

సాయంత్రం శ్రీమాన్ ఎన్.వి.యల్.ఎన్ రామానుజాచార్యస్వామి - నరసాపురం వారు 108 దివ్యదేశాలను దర్శించుకునే విధంగ **దివ్యదేశ వైభవ ప్రకాశికా** అనే గ్రంథాన్ని చాలా అద్భుతంగా తయారుచేసి ఇచ్చారు. శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి శ్రీహస్తాలమీదుగ ఆవిష్కృతమైనది. ఇది మన శ్రీరామానుజవాణివాణిలో లభిచుచున్నది.

ముత్యాల మండపంలో గోదారంగనాథుల కల్యాణం అంగరంగ వైభవంగా జరిగింది. వేలమంది భక్తులు కల్యాణోత్సవంలో పాల్గొన్నారు. కళ్యాణం అనంతరం గోదారంగ నాథులు హంసతూలికా వాహనంపై విహరించడం పెద్దవిశేషం.

14వతేదీ ఆరాధనానంతరం శరణాగతి దీక్ష విరమణ గావింప జేసారు శ్రీమాన్‌మధుసూదనాచార్యస్వామి. ఈనెలరోజులు వికాసతరంగిణి కార్యకర్తలు గోదారంగనాథుల వేషధారణలో పోటీలు, డ్రాయింగ్ పోటీలు, వ్యాసరచన పోటీలు, భజన పోటీలు, వక్తృత్వ పోటీలు, రంగవల్లుల పోటీలు, మాలలు అల్లే పోటీలు, ఇలా ఎన్నో కార్యక్రమాలు చాలా చక్కగా నిర్వహించారు. ఇవి మాత్రమే కాకుండా శ్రీస్వామివారు అక్కడ ఉన్న స్వాములకు సంప్రదాయ విషయమును తెలియజేసే క్లాసును తీసుకున్నారు. ఎంతోమంది భక్తుల ఇళ్ళను పావనం చేసారు.

ప్రతిరోజు ధనుర్మాస పాశుర ప్రవచనం అనంతరం నృత్య, రూపక, కార్యక్రమాలు భక్తులహృదయాలను అలరించాయి. ఇలా నెలరోజులు శ్రీవారి చల్లని కనుచూపుల సన్నిధిలో గడిపిన కార్యకర్తలు జనవరి 14వతేదీ అశ్రునయనాలతో స్వామివారికి వీడ్కోలు పలికారు. నిజామాబాద్ జిల్లా, పిరికేట్‌వద్ద శ్రీమాన్ లలితనరహరి దంపతులు అందమైన కళ్యాణమండపాన్ని నిర్మించారు. శ్రీస్వామివారి పాదస్పర్శతో దాన్ని సమాజసేవకు అంకింతం చేయాలనికోరి శ్రీవారిని తీసుకువెళ్లారు.

14వతేది సాయంకాలం శ్రీవారి పూజాకార్యక్రమం జరిపి, ఆ సందర్భంలో శ్రీరామానుజ సహస్రాబ్దికి ఏడాదికి రెండు లక్షల చొప్పున 3సంవత్సరాలు సమర్పిస్తామన్నారు.

వికాసతరంగిణికి చెందిన శ్రీమాన్ గంపాశ్రీనివాసుగారు 9లక్షలు రామానుజసేవలో సమర్పిస్తామని వాగ్దానం చేసారు. ఆర్మూర్ మీదుగా శ్రీవారు హైదరాబాద్ చేరుకున్నారు. రాత్రి డా॥శ్రీమాన్ శ్రీకుమారీ రామేశ్వరరావు దంపతుల ప్రార్థన మేరకు వారి గృహంలోనే బసచేశారు.

## దివ్యసాకేతంలోని వేడుకలు

శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారు కరీంనగర్ వేంచేసినా జీవా ప్రాంగణంలో దివ్యసాకేతంలోనూ ధనుర్మాస వేడుకలు అర్చకులు, కార్యనిర్వాహకబృందపెద్దలు చక్కగా అవికలంగా నిర్వహించారు. 11వతేదీ కూడారై వేడుక, గోదా కళ్యాణాలు యథాతథంగా సాగాయి. ఈసంవత్సరం కూడారై రోజుననే వైకుంఠేకాదశీ పర్వం రావడంవల్ల తెల్లవారు ఝామున 5గం॥నుండి భాగ్యనగరం, దివ్యసాకేతం చుట్టు ప్రక్కల ప్రాంతాలనుంచి భక్తులు స్వామిని ఉత్తరద్వారంలో దర్శించడానికి వచ్చారు. శ్రీ దేవనాథ రామానుజ జీయర్ స్వామివారు, ఉ.వే. శ్రీమాన్ వేంకట రంగరామానుజాచార్యస్వామివార్ల సన్నిధిలో అర్చకులు ఈకార్యాన్ని వైభవంగా జరిపించారు. రంగరామానుజాచార్య స్వామి ముక్కోటి వైభవాన్ని తెలిపారు.

శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారి పరమపదోత్సవం 12వతేదీన వచ్చింది. ఉ.వే. శ్రీమాన్ రంగరామానుజాచార్య స్వామివారి ద్వారా అభిషేక అర్చనాది వైభవాలను జరిపించారు అర్చకస్వాములు. స్వామివారి వైభవాన్ని రంగరామానుజాచార్య స్వామివారు వివరించారు.

15వతేదీన దివ్యసాకేతంనుండి శ్రీగోదారంగమన్నారులు భాగ్యనగరయాత్ర మొదటసారి చేసారు. మధ్యాహ్నానికి దోమలగూడ జెట్‌భవనానికి విచ్చేసి ముస్తాబుచేసుకొని సిద్ధమయ్యారు కళ్యాణ మహోత్సవానికి.

అప్పటికే శ్రీశ్రీశ్రీఅహోబిలరామానుజజీయరుస్వామి వారు శ్రీకాకుళంలో తమ ధనుర్మాసవ్రతాన్ని ముగించి విచ్చేసారు. శ్రీశ్రీశ్రీ దేవనాథరామానుజజీయరుస్వామివారు, మన వి.టి., జెట్, దివ్యసాకేత కార్యకర్తలతో ఉండి NTR స్టేడియంలో కళ్యాణం జరగడానికి అవసరమైన ఏర్పాట్లను పర్యవేక్షించారు.

సాయంకాలం 5.30కి జెట్‌భవనంనుండి పెరుమాళ్ళుయాత్రగ కళ్యాణమండపానికి మేళతాళలతో భక్తుల భజనలతో కోలాహలంగ విచ్చేసారు.

విశాలమైనవేదికను, దర్శనరమాశీయుల శ్రీమాన్ E. రామారావు. T. రమేష్‌గుప్తగార్లు తయారుచేయించి, అందంగ అలంకరించిఉంచారు.

పెరుమాళ్ళు వేంచేయాగానే హారతినిచ్చి శ్రీశ్రీశ్రీ అహోబిలజీయర్ స్వామివారు, Dr. శ్రీమాన్ ఎస్.వి.రంగరామానుజాచార్య స్వామివారు, శ్రీశ్రీశ్రీ దేవనాథ జీయరుస్వామివారు కార్యక్రమాన్ని పరిచయంచేసారు. శ్రీ చిన్నజీయరుస్వామివారు కార్యక్రమాన్ని వివరిస్తూ, అందరిచేతా శాంతికళ్యాణాన్ని స్వయంగచేసుకునేట్టు జరిపించారు. ఉభయదారులుగ ఉన్నవారందరికీ గోదాకృష్ణుల శ్రీమూర్తులను అందచేసారు స్వాములు. రాత్రి ..గం 10.00లకి కార్యక్రమమంతా అద్భుతవైభవంతో జరిగింది.

శ్రీమాన్‌పురుషోత్తమరావు, శ్రీమాన్ T.రమేష్‌గుప్తా కృతజ్ఞతావిష్కరణచేస్తూ.. ఫిబ్రవరి 10వ తేదీన శ్రీవిష్ణుసహస్రనామ విరాట్‌పారాయణ, చార్మినార్‌వద్ద జరుగుతుందని శ్రీస్వామివారే దానిని స్వయంగజరిపిస్తారని ఆహ్వానిస్తు కళ్యాణ మహోత్సవాన్ని ముగించారు.

# పరమహంస పరివ్రాజకులు
## శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయర్‌స్వామివారి ప్రచారవార్తలు

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి మంగళాశాసనములతో శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల జీయరు స్వామివారిప్రత్యక్ష పర్యవేక్షణలో ధనుర్మాస మహోత్సవములు తేది. 16-12-2013 నుండి 13-01-2014 వరకు శ్రీకాకుళం జిల్లా ఎచ్చెర్లమండలం కొత్తకోట గ్రామంలో వైభవోపేతముగా జరిగినది. కొత్తపేట పరిసర ప్రాంత గ్రామస్థులు, భక్తులు శ్రీశ్రీశ్రీ స్వామివారిని స్వాగతించడానికి ఆంజనేయస్వామి గుడివద్దకు చేరుకున్నారు. డిసెంబరు 15వ తేదీ సాయంత్రం 6గం॥లకు శోభాయాత్రతో కొత్తపేట గ్రామానికి శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు చేరుకున్నారు.

డిసెంబరు 16వ తేదీ ఉదయం 10గం॥లకు శ్రీ అహోబిల జీయరు స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో ధనుర్మాస కార్యక్రమములు ప్రారంభమైనవి.

ప్రతిరోజూ ఉదయం 5గం॥కు ఆరాధన, అష్టోత్తర శతనామావళి, సేవాకాలం మరియు శ్రీస్వామివారిచే శ్రీ వేంకటేశ్వరస్వామి వైభవ ప్రవచనం, తీర్థగోష్ఠి, రోజుకు ఒకవీధి చొప్పున శోభాయాత్రను 9 గం॥లకు పూర్తిచేసుకొని ఉదయం 10గం॥లకు రోజూ కొత్తపేట నుండి బయలుదేరి ఒకటి లేదా రెండు వేరే గ్రామాల్లో ఆధ్యాత్మిక సామాజిక పరంగా ప్రజలను చైతన్య పరుస్తూ ప్రవచనకాలక్షేపం చేస్తూ మధ్యాహ్నం సుమారు 3గం॥లకు కొత్తపేట గ్రామానికి తిరిగి చేరుకునేవారు.

సాయంత్రం 5.30 గం॥కు శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ, 6.00గం॥కు శ్రీమాన్ అమరవాది వేంకట నరసింహాచార్యస్వామివారిచే శ్రీమద్భాగవత ప్రవచనము అనంతరం శ్రీ అహోబిల జీయరు స్వామివారు ఆరోజు తిరుప్పావై పాశుర ప్రవచనము జరిగేది. రాత్రి 8గం॥ నుండి విద్యార్థులకు ఆరోజు ప్రవచనంపై ప్రశ్నలు-జవాబులు, తిరుప్పావై, శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రం నేర్పించుతూ, చక్కగా జవాబు చెప్పిన వారికి చిన్న చిన్న బహుమతులనిస్తూ ఉత్తేజపరుస్తూ ప్రసాదవితరణతో సుమారు 9గం॥లకు ఆరోజు గోష్ఠి ముగుస్తున్నది.

డిసెంబరు 17వ తేదీ పొందూరు మండలం రాజాం స్కూలు, 18వ తేదీ శ్రీకాకుళం పట్టణంలో శ్రీసాయి విద్యామందిర్ స్కూల్ విద్యార్థులు, ఉపాధ్యాయులను ఉద్దేశించి శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారు, శ్రీమాన్ గోవింద్‌స్వామి ప్రజ్ఞ నైతిక విలువల ఆవశ్యకతను గూర్చి వివరంగా తెలియజేస్తూ ప్రసంగించారు. డిసెంబరు 19వ తేదీ శ్రీమాన్ ఆరవెల్లి సీతారామస్వామివారి ఆహ్వానం మేరకు బూరవెల్లి, గారమండలం లక్ష్మీనరసింహస్వామి దేవాలయానికి శ్రీస్వామివారు విచ్చేసి, అచ్చట భక్తులనుద్దేశించి ప్రసంగించారు. ఈ కార్యక్రమానికి శ్రీమాన్ ఆరవెల్లి లక్ష్మీనరసింహాచార్యులవారు శ్రీపెద్ద జీయరు స్వామివారితో వారి అనుభవాల్ని వివరించారు.

20వ తేదీ శ్రీమాన్ రంగదాసుగారి ఆహ్వానంమేరకు దూసిపేట వేంకటేశ్వరస్వామి ఆలయంలో భక్తులనుద్దేశించి ప్రవచనాన్ని పూర్తిచేసుకొని, ఆముదాలవలస లక్ష్మీనారాయణ ఆలయంలో స్వామివారు భక్తులనుద్దేశించే వికాసతరంగిణి కార్యక్రమాలు గూర్చి శ్రీరామభక్త తరంగిణి గూర్చి వివరించారు.

21వ తేదీ శ్రీకాకుళం పట్టణంలోగల కల్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయంలో గోష్ఠికి చక్కని ఆధ్యాత్మిక ప్రవచనాన్ని శ్రీస్వామివారు అందించారు. ఈ కార్యక్రమానికి మంత్రివర్యులు శ్రీ ధర్మాన ప్రసాదరావుగారు, మాజీ మున్సిపల్ చైర్ పర్సన్ శ్రీమతి ఎమ్. పద్మావతి, మాజీ మున్సిపల్ చైర్మన్ శ్రీవరంగారు ప్రభృతులు హాజరయ్యారు.

డిసెంబరు 22వ తేదీ శ్రీకాకుళం పి&ఎల్ కాలనీలోగల నారాయణ తిరుమల ఆలయమునకు శ్రీమాన్ గురుగుబెల్లి శ్రీను స్వామివారి ఆహ్వానంమేరకు విచ్చేసి చక్కని ఆధ్యాత్మిక ప్రవచనాన్ని అందించారు.

డిసెంబరు 23వ తేదీ విశాఖపట్టణం సెంట్రల్ జైల్‌లో సుమారు 80మంది ఖైదీలకు తులసిమాలల్ని ప్రసాదస్తూ శ్రీస్వామివారు శరణాగతి దీక్షలను అనుగ్రహించారు.

24వ తేదీ శ్రీమాన్ దన్నాన శ్రీరామూర్తిగారి ఆహ్వానం మేరకు బూరగవలస గ్రామాన్ని సందర్శించి గోష్ఠికి ప్రవచనాన్ని అందించారు.

25వ తేదీ శ్రీకాకుళం తన్మయి ఫంక్షన్ ప్లాజాలో వివిధ పాఠశాలల జూనియర్ కాలేజీ, డిగ్రీకాలేజ్ ఉపాధ్యాయులు సుమారు 300మందితో ప్రజ్ఞ కార్యక్రమం ఏర్పాటు చేయడం జరిగింది. ఈ కార్యక్రమంలో శ్రీస్వామివారు విద్యార్థులు-నైతిక విలువల ఆవశ్యకత, Time Management ప్రజ్ఞ పాఠ్యాంశాల గూర్చి, చక్కని అవగాహన కల్పించి అనంతరం టీచర్స్‌తో ఒక గంటసేపు సదస్సు కొనసాగించారు. ఈ కార్యక్రమంలో శ్రీమాన్ అమరవాది గారు అందులో Language writing, అందులో Common Errors వాటిని ఎలా సరిదిద్దుకోవాలో చిన్నప్పట్నుంచే పిల్లలకు తెలియజేయాలని ఉపాధ్యాయులకు సూచనలిచ్చారు. శ్రీమాన్ గోవింద్‌గారు వికాసతరంగిణి ప్రజ్ఞ కార్యక్రమాల గూర్చి వివరించారు. డిసెంబరు 26వ తేదీ శ్రీకాకుళం పట్టణంలోగల కోదండ రామాలయం భక్తుల గోష్ఠికి ప్రసంగించి అనంతరం పొందూరు మండలం సురవరం గ్రామం చేరుకుని అచ్చటి కార్యక్రమాన్ని ఉద్దేశిస్తూ ప్రవచించారు.

### శ్రీసుదర్శన హోమం

డిసెంబరు 27వ తేదీ శ్రీకాకుళం పట్టణంలో గల శ్రీ ఆర్యవైశ్య కల్యాణమండపంలో శ్రీ సుదర్శన హోమం శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో మందస ప్రధాన అర్చకులు శ్రీకూర్మాచార్యులు పవన్‌స్వామివారి నిర్వహణలో వైభవంగా జరిగింది. ఈ కార్యక్రమంలో శ్రీమాన్ అమరవాది వేంకట నరసింహాచార్యులవారు శ్రీ సుదర్శన శతక వైభవాన్ని అందరికీ అర్థమయ్యేటట్లు వివరించారు.

28వ తేదీ శ్రీమాన్ తేజస్వామివారి ఆహ్వానం మేరకు నరసన్నపేట మం॥ పిన్నింటిపేట గ్రామం శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయానికి

శ్రీస్వామివారు వేంచేసి, శ్రీరామభక్తతరంగిణి, రామనామ వైశిష్ట్యాన్ని, వికాసతరంగిణి కార్యక్రమం గూర్చి అక్కడి భక్తులకు అవగాహన కల్గేటట్లు ప్రవచించి, దగ్గర్లోఉన్న మత్స్యకారుల గ్రామమునకు శోభాయాత్రతో విచ్చేసి అచ్చట ప్రవచనం గావించి, తర్వాత సరుబుజ్జిలవలస మ॥ రొట్టవలస గ్రామానికి శ్రీమాన్ వెంకటరమణ మాష్టారు ఆహ్వానంపై విచ్చేసి సుమారు 1500 మంది గోష్ఠితో వైభవంగా ప్రవచనం సాగింది.

## అవయవ దాన అవగాహన యాత్ర

డిసెంబరు 29వ తేదీ శ్రీస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో "అవయవ దాన అవగాహన యాత్ర" శ్రీకాకుళం స్థానిక కోడిరామూర్తి స్టేడియం నుండి 7రోడ్ జంక్షన్ మీదుగా బాపూజీ కళామందిర్ వరకు వివిధ పాఠశాలల, జూనియర్ కళాశాలల, పాలిటెక్నిక్, డిగ్రీ కాలేజ్, ఇంజినీరింగ్ కాలేజ్ విద్యార్థులు, భక్తులు, వి.టి.సభ్యులతో సుమారు 900 మందితో అవయవదాన సంబంధిత ప్లకార్డులతో నినాదాలు చేస్తూ సుమారు 3 కి.మీ. దూరం ర్యాలీ జరిగింది. ఈ కార్యక్రమ Inagaration కు జిల్లా కలెక్టరు శ్రీమాన్ రాజ్‌కుమార్‌గారు ప్రారంభోత్సవం చేశారు. శ్రీరజనీకాంత్‌గారుDRDA PD, మున్సిపల్ కమీషనర్ శ్రీరామ్మోహన్‌గారు, శ్రీ హరిప్రసాద్ (యురాలజిస్ట్)గారు, ప్రభృతులు హాజరయ్యారు. ర్యాలీ అనంతరం శ్రీ బాపూజీ కళామందిర్‌లో ర్యాలీలో పాల్గొన్న యువతతో, వికాసతరంగిణి సమన్వయకర్త శ్రీమాన్ (చక్రవర్తిగారు అవయవదాన అవగాహన సదస్సును ఏర్పాటు చేశారు. శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారి ఆధ్వర్యంలో ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా ప్రముఖులు శ్రీ గురుగుబెల్లి యతిరాజులుగారు (ఆంధ్రప్రదేశ్ అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్ ఛైర్మన్) శ్రీ గురుగుబెల్లి శ్రీనివాసులు నారాయణ తిరుమల ప్రధాన అర్చకులు, శ్రీమతి పైడి రజని (మాజీ ఫెమినా ప్రెసిడెంట్) శ్రీమతి వరుదు కల్యాణి (సోషల్ వర్కర్), రవికిరణ్ (హెల్త్ ఆఫీసర్), శ్రీమాన్ మురకయ్యగారు, శ్రీమాన్ గోవింద్‌స్వామి, శ్రీమాన్ మధుసూదనరావు మాస్టారు మొ॥వారు హాజరయ్యారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు హాజరైనవారికి అవయవ దానం పై చక్కటి వివరణ ఇచ్చి పాల్గొన్నవారికి చక్కటి అవగాహనను అందించారు. పలువురు యువత ఉత్తేజంతో అవయవ దాన అంగీకార పత్రాల్ని నింపి తమ అంగీకారాన్ని తెలియజేశారు.

## క్యాన్సర్ డిటెక్షన్ మెడికల్ క్యాంపు

అదేరోజున అనగా డిసెంబరు 29వ తేదీని కొత్తకోటగ్రామంలో కొత్తగా ఏర్పాటైన వికాసతరంగిణి కొత్తపేట గురుగుబెల్లి నారాయణదాసు ట్రస్టువారి సౌజన్యంతో Cancer Detection Medical Camp ను నిర్వహించారు. శ్రీమతి మాలతిగారు, సింధూర హాస్పిటల్ సిబ్బంది గ్రామస్థులకు పరీక్షలు జరిపి ఏడు కేసెస్ Cancer suspecte cases బయాప్సీకు పంపించారు.

డిసెంబరు 30వ తేదీన శ్రీశ్రీశ్రీ స్వామివారు గూనపాడు, వీరభద్రపురం గ్రామాలు పర్యటించి అచ్చటి భక్తులకు వారమునకు ఒకరోజు సత్సంగం ఏర్పాటు చేసుకున్నట్లు చేసి, ప్రజ్ఞ, ఆరోగ్యవికాస్, వికాసతరంగిణి సేవలుగూర్చి అవగాహన కల్పిస్తూ చక్కని ప్రవచనాన్ని అందించి భక్తులను చైతన్య పరిచారు.

**విద్యార్థులకు మోరల్ వాల్యూస్:** డిసెంబరు 31వ తేదీ శ్రీకాకుళం పట్టణంలో న్యూ సెంట్రల్ స్కూల్ సుమారు 1500 (నైతిక విలువలు) చెప్పే చిన్న కథలను చెప్పి, ప్రశ్నోత్తరాలతో విద్యార్థులు సాంస్కృతిక కార్యక్రమంతో వినోదాన్నందించారు.

జనవరి 1వ తేదీన రాజాం మండలం కొమరి గ్రామాన్ని పర్యటించారు. అచ్చట శ్రీరామభక్త తరంగిణి, వికాసతరంగిణి గూర్చి ప్రవచించారు. శ్రీమతి అరుణ–విజయనగరం గోష్ఠికి హాజరయ్యారు.

జనవరి 2వ తేదీ శ్రీరామకృష్ణమాచారివారి ఆహ్వానం మేరకు అరసవెల్లిలో శ్రీ రమ్య వేంకటేశ్వరస్వామివారి ఆలయమునకు శ్రీస్వామివారు వేంచేసి, అచ్చట ఆరోజు పాశుర వైభవాన్ని ప్రవచించారు. అనంతరం శ్రీ కూర్మనాథస్వామి దేవాలయం, సిబ్బంది, భక్తులు ఘనంగా శోభాయాత్రతో శ్రీశ్రీ శ్రీ అహోబిల స్వామివారికి స్వాగతం పలికారు. స్వామివారు పెరుమాళ్ళను సేవించుకొని భక్తులను, ఆలయ కమిటీ నుద్దేశించి ప్రసంగిస్తూ రామానుజ సహస్రాబ్దిలోపు రామానుజ సంబంధమున్న ఆలయం కనుక వినూత్న కార్యక్రమాలకు శ్రీకారం చుట్టమని వారిని ప్రోత్సహిస్తూ సూచనలిచ్చారు. శ్రీమాన్ అరవాదిగారు శ్రీకృష్ణుని బాల్యచేష్టల ఘట్టాన్ని ప్రవచించారు. తరువాత అదేరోజు వొమ్మరవెల్లి గ్రామాన్ని సందర్శించి అక్కడి రెసిడెన్షియల్ స్కూల్లో విద్యార్థులకు, సిబ్బందికు Prajna Awareness కార్యక్రమం జరిగింది. గత రెండు తుఫానుల తాకిడికి ఈ గ్రామం గురి అయి సుమారు 10 అడుగులవరకు ఆ పాఠశాలలో నీరు నిండుకుందని అచ్చటి ప్రిన్సిపాల్ తెలియజేశారు. తర్వాత అక్కడి నుండి కి.మీ. దూరంలో ఉన్న కళింగపట్నం చేరుకుని అచ్చటి శ్రీరామస్థూపాన్ని శ్రీస్వామివారు సేవించుకుని తిరిగి కొత్తకోట చేరుకున్నారు. డిసెంబరు 3వ తేదీ శ్రీస్వామివారు దళితవాడ కాలనీని సందర్శించి అచ్చటి భక్తులకు మంగళాశాసనములు చేసి అనంతరం శ్రీకాకుళం పట్టణంలోగల వేణుగోపాలస్వామి ఆలయంలో లక్ష్మీపూజలు జరిపించి ఆ తర్వాత శ్రీస్వామివారు కనుగులవానిపేట గ్రామాన్ని పర్యటించి అచ్చటి భక్తులకు ప్రవచనాన్ని అందించారు.

డిసెంబరు 4వ తేదీన శ్రీమాన్ వాసుదేవరావుగారి ఆహ్వానం మేరకు గోరింట గ్రామంలో ఆధ్యాత్మిక ప్రవచనాన్ని అందించి, అక్కడ్నుంచి శ్రీస్వామివారు లయిదాం గ్రామం చేరి అక్కడ యాగకార్యక్రమాన్ని ప్రారంభించి కొత్తపేట చేరుకున్నారు. జనవరి 5వ తేదీన శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారు సుమారు 270మంది భక్తులకు సమాశ్రయణములు అనుగ్రహించారు. అదేరోజు వికాసతరంగిణి ఆరోగ్యవికాస్ 4 (సుమారు) వివిధ ప్రాంతాల్లో మెడికల్ క్యాంప్‌లను నిర్వహించారు. కొత్తపేట గ్రామంలో మెగా మెడిల్ క్యాంప్ (కిమ్స్ యూనిట్ డాక్టర్) వచ్చి సేవలందించారు. ఈ కార్యక్రమానికి డా॥ డి. హరిప్రసాద్(యూరాలజిస్ట్), డా॥ జి. వరహాలనాయుడు (జనరల్ ఫిజిషియన్), డా॥ శ్రీ శివ (చెస్ట్ ఫిజిషియన్) డా॥ ఎమ్. కృష్ణ (కిమ్స్ డాక్టర్), డా॥ గోపి, డా॥ హేమ, శ్రీ ప్రసాద్ (ఫార్మసిస్ట్) పలువురు డాక్టర్లు సుమారు 300 మందికి ఉచితముగా పరీక్షలు జరిపి మందులు పంపిణీ చేశారు.

**వికాసతరంగిణి కేన్సర్ అవగాహన క్యాంప్** : అదేరోజు వేరే ప్రాంతం సాకివానిపేట గ్రామంలో కేన్సర్‌అవగాహనక్యాంపు, నిర్వహించి సుమారు 80మందికి పరీక్షలు నిర్వహించి, వాళ్ళకు కేన్సర్‌పై అవగాహన కల్పించి

ఉచిత మందులు పంపిణీ చేశారు. ఈ కార్యక్రమానికి డా॥ ఉమామహేశ్వరరావుగారు, (కేన్సర్ స్పెషలిస్ట్), మరియు డా॥ జ్యోతిర్మయి (గైనకాలజిస్ట్) పాల్గొన్నారు. వీరిలో ఒక కేస్‌ను పరీక్ష చేసి శాంపిల్ బయాప్సీకి పంపించారు.

**ఉచితదంతవైద్యశిబిరనిర్వహణ:** రెండు ఉచిత దంతవైద్య శిబిరాలను నిర్వహించారు. కొత్తపేటగ్రామంలో సుమారు 300మందికి డా॥ శ్రీమతి వైశ్యరాజు వాణిగారు దంతపరీక్షలు జరిపి, మందులు, టూత్‌పేస్ట్‌లు, టంగ్‌క్లీనర్‌లు ఉచితంగా అందించారు.

వి.టి -వంజంగిలో వేరొక దంతవైద్యశిబిరాన్ని నిర్వహించారు. డా॥ ప్రవీణ్‌కుమార్, డా॥ సిహెచ్. కిరణ్‌కుమార్, డా॥ ప్రదీప్‌కుమార్ గార్లు వంజంగి ప్రాథమిక పాఠశాలలో విద్యార్థులు, గ్రామస్థులు సుమారు 200మందికి ఉచిత దంత వైద్యాన్నందించారు.

జనవరి 6వ తేదీన శ్రీస్వామివారు చింతలబడవంజి, దివంజిపేట, మతలబుపేట గ్రామాలను సందర్శించి ప్రవచనాన్నందించారు.

**శ్రీరామభక్త తరంగిణి**: జనవరి 7వ తేదీన శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి మంగళాశాసనములతో శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో శ్రీరామభక్త తరంగిణి-హనుమధ్వజయాత్రలో శ్రీస్వామివారు కొత్తపేట నుండి బయలుదేరి సుమారు 600 మంది భక్తులు వివిధ వాహనాలపై హనుమధ్వజాలతో, రామనామాన్ని జపిస్తూ 18గ్రామాలలో పర్యటించి, ఒక్కొక్కగ్రామంలో శ్రీ హనుమధ్వజాన్ని ప్రతిష్ఠించి ఆ గ్రామంలో ప్రవచించి అక్కడి భక్తులతో రామనామం జపింప చేస్తూ వేరొక గ్రామానికి అలా ఉదయం 8.30 నుండి సా.5.00గం. వరకు అన్నిగ్రామాలు పర్యటించి, అత్యద్భుతంగా సుమారు 500 మంది భక్తులతో శోభాయాత్ర రమ్యంగా జరిగింది. ఈకార్యక్రమంలో శ్రీ గురుగుబెల్లి శ్రీనివాసులు, నారాయణ తిరుమల అర్చకులు, గ్రామపెద్దలు, భక్తులు పాల్గొన్నారు. 1. కొత్తపేట, 2. తోటపాలెం, 3. పెద్దకొంగరం, పొన్నాడ, 5. కమ్మపేట, 6. ధర్మవరం, 7. బైరాగిపురం 8.మత్స్యలేశ్వరం, 9. దిబ్బలపాలెం, 10. కొయ్యాం, 11. నిమ్మవానిపేట, 12. పాతకూర్మినాయుడి పేట, 13. కొత్తపేట, 14. హుజ్జారం, 15. సంతసీతారామపురం, 16. బలిజిపేట, 17. చిన్నారావుపల్లి, 18. ఎచ్చెర్ల గ్రామాలను పర్యటించారు.

జనవరి 8వ తేదీ ఉదయం గోదాదేవికి నీరాట్టోత్సవం జరిపించి, పార్వతీపురం విజయనగరం జిల్లా వేంకటేశ్వరస్వామి ఆలయంలో స్వామివారు రామభక్త తరంగిణిపై ప్రవచనం సాగించి తిరిగి కొత్తపేట చేరుకుని విశేష దీపోత్సవ కార్యక్రమం జరిపించారు.

**మందసాలో గోష్ఠి.**

జనవరి 9వ తేదీ శ్రీస్వామివారు శ్రీమాన్ కూర్మాచార్యుల స్వామి ఆహ్వానం మేరకు మందస వాసుదేవస్వామి ఆలయంలో గోష్ఠిలో ప్రజ్ఞ కార్యక్రమాల వివరాలు జూనియర్ కాలేజ్ విద్యార్థులు, సిబ్బందికి అవగాహన కల్పించి, భక్తులతో రాబోయే బ్రహ్మోత్సవ కార్యక్రమ వివరాలను సమీక్షించారు. అనంతరం పలాస-కాశీబుగ్గ శ్రీమానక బాలాజీగారి నేతృత్వంలో రామాలయం వద్ద గోష్ఠికి ప్రవచనాన్ని అందించారు. తర్వాత శ్రీమాన్ మాల వేమనరావుగారి ఆహ్వానం మేరకు టెక్కలి ఆదిత్య కల్యాణ మండపమునకు వేంచేసి శ్రీస్వామి వారు వారికి రసవత్తర ప్రవచనాన్ని అందించారు.

**శ్రీకాకుళం బార్ అసోసియేషన్ కార్యక్రమం.**

జనవరి 10వ తేదీ శ్రీమాన్ తవిటినాయుడుగారు, శ్రీమాన్ భువనేశ్వరరావు న్యాయవాదుల ఆహ్వానం మేరకు శ్రీకాకుళం పట్టణంలోగల డిస్ట్రిక్ట్ బార్ అసోసియేషన్ లో న్యాయవాదులందరికీ శ్రీస్వామివారు ఆధ్యాత్మిక ఉపన్యాసం చేశారు. ఈ కార్యక్రమంలో శ్రీస్వామివారు మాట్లాడుతూ ఇరువురమూ మంచిని చెప్పడానికి ఏ విధమైన భయంలేని వాళ్ళమనీ, బాధ్యతాయుత పౌరులుగా మనం సమాజంలో మనం కర్తవ్యపాలన చేస్తున్నామని అన్నారు. నవ్విస్తూ, ఎన్నో ఛలోక్తులతో హృద్యంగా సాగింది శ్రీస్వామివారి ప్రవచనం. రిటైర్డ్ జిల్లా జడ్జి శ్రీ పప్పల జగన్నాథంగారు మాట్లాడుతూ శ్రీ అహోబిల జీయరు స్వామివారి మాటలు మా అందరికీ బాగా నచ్చాయి అనీ, వారు చెప్పే తీరు మమ్మల్నందరినీ బాగా ఆకర్షించిందనీ, వారికి మేము డైరెక్ట్‌గా శిష్యులం కాకపోయినా వెంటనే శిష్యులం కావాలన్న భావం మాలో కల్గించిందని చెప్పారు. ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించిన శ్రీమాన్ పొన్నాడ రమణ జడ్జిగారు మాట్లాడుతూ శ్రీస్వామివార్లతో మాకు ఇట్లాంటి కార్యక్రమంలో పాలుపంచుకోవడం మా అదృష్టం అని, జిల్లాలో ఇదే ప్రప్రథమమని వారు ఆనందించి, తదనంతరం న్యాయవాదులు అడిగిన ప్రశ్నలకు శ్రీ అహోబిల స్వామివారు సమాధానాలనిచ్చారు. దానికి లాయర్లందరూ ఎంతో సంతృప్తి చెందారు.

జనవరి 11వ తేదీ ఉదయం కూడార్రై, ముక్కోటి ఉత్సవం జరిపించి శ్రీస్వామివారు తిమ్మరాజుపేట అనకాపల్లి శ్రీమతి అరుణగారు ఏర్పాటు చేసిన గోష్ఠిలో ప్రవచనం అందించి తర్వాత 3.30గం॥లకు రాజమహేంద్రి సెంట్రల్‌జైల్‌లో ప్రవచించి వేంకటేశ్వర శరణాగతి బృందానికి మంగళాశాసనాలందించి శ్రీరంగధామం కోటి దీపోత్సవం, తెప్పోత్సవ కార్యక్రమంలో పాల్గొని జనవరి 12వ తేదీ తెల్లవారుఝాము 3 గం॥లకు కొత్తపేట గ్రామం చేరుకున్నారు. జనవరి 12వ తేదీన 130మందికి సమాశ్రయణములు శ్రీస్వామివారు అనుగ్రహించారు. కొత్తపేట గ్రామంలో శ్రీ సుదర్శన హోమం శ్రీస్వామివారి పర్యవేక్షణలో శ్రీమాన్ శ్రీకాంతాచార్యుల యాజ్ఞీకంలో జరిగినది. కొత్తపేట గ్రామంలో పెద్దజీయరు స్వామివారి పరమపదోత్సవం సందర్భముగా విశేష తదీయారాధనలు జరిగాయి.

శ్రీస్వామివారి మాటలకు ప్రభావితులై కొత్తపేట గ్రామస్థులు తమ వీధుల పేర్లన్నీ భగవంతుని, భగవద్భక్తుల నామాల్ని శ్రీస్వామివారు సూచించిన విధంగా బోర్డులను తయారుచేసుకొని శ్రీస్వామివారితో ఆవిష్కరించుకొని స్థాపించుకున్నారు. మరియు ప్రతివీధికీ రెండు చెత్తకుండీలను కూడా ఏర్పాటు చేసుకున్నారు.

**గోదారంగనాథులకల్యాణం**

చివరగా జనవరి 13వ తేదీన శ్రీ గోదారంగనాథుల కల్యాణంతో శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయరు స్వామివారి ధనుర్మాస మహోత్సవం సుసంపన్నమైనది. ఈ కార్యక్రమాన్ని బాగా నిర్వహించి తమతమ బాధ్యతలను చక్కగా నిర్వర్తించిన శ్రీమాన్ కె.ఎన్.పి. చక్రవర్తికి, శ్రీమతి ఉషశ్రీగారికి, శ్రీమాన్ మధుసూదనరావుకి, భక్తులకు, వి.టి. సభ్యులకు, కొత్తపేట గ్రామస్థులకు, పెద్దలకు, శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరుస్వామివారు అనేక మంగళాశాసనాలు చేసారు.

## సికింద్రాబాద్ వి.టి. శాఖ :

నిజామాబాద్ మం॥, సారంగపూర్ జిల్లా జైల్లో వికాసతరంగిణి ఆధ్వర్యంలో శ్రీ వేంకటేశ శరణాగతి దీక్షలు ప్రారంభించారు. ఖైదీలలో పరివర్తన, మార్పుకోసం శ్రీ వేంకటేశ శరణాగతి దీక్షలు ఎంతో దోహదపడతాయని శ్రీమాన్ మక్కూరి రామాచారిగారు అన్నారు. భగవంతుని నామస్మరణంతో మోక్షం లభిస్తుందన్నారు. శ్రీమాన్ రామాచారిగారి చేతులమీదుగా 30మంది ఖైదీలకు మాలాధారణ చేశారు. ఈ సందర్భంగా "మానవజన్మ ఎంతో గొప్పదన్నారు. ఆ జన్మను సార్థకం చేసుకోవాలన్నారు. నిత్యం గోవింద నామస్మరణ చేయాలని కోరారు. ఖైదీలు జైలు నుంచి బయటకు వెళ్ళిన తరువాత ఆదర్శవంతమైన జీవితాన్ని గడపాలని ఆయన సూచించారు. ప్రతిఒక్కరు ప్రతిరోజు ఐదునిమిషాలు భగవంతుడి ధ్యానం చేసుకోవాలని, తద్వారా శుభాలు జరుగుతాయన్నారు. శనివారం

సికింద్రాబాద్ వి.టి. శాఖ ప్రతినిధి శ్రీమతి వనజా భాస్కర్‌గారు మాట్లాడుతూ శ్రీమన్నారాయణుడి చరణాలను నిరంతరం పూజించాలని... తద్వారా దోషాలు తొలగి పరిశుద్ధులుగా మారుతారని, తెలిసో తెలియకో తప్పులు చేసి జైలుకు వచ్చిన ఖైదీలు ఈ మాలధారణను ఆచరించటం ద్వారా భగవంతుని ఆశీస్సులు లభిస్తాయన్నారు.



ఖైదీలకు జైల్లాలో అవసరమైన సామగ్రిని కేర్ డిగ్రీ కళాశాల డైరెక్టర్, కార్యదర్శి నరాల సుధాకర్ అందించారు.ఈ కార్యక్రమంలో వి.టి. జిల్లా అధ్యక్షుడు గంపా శ్రీనివాస్ గుప్త, జైలర్ సత్యనారాయణరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# పరమపద వార్తలు



హైదరాబాద్ వాస్తవ్యులు, శ్రీస్వామివారి పదాశ్రితులు **శ్రీమాన్ బి. నరసింహమూర్తి**గారు ది. **8.12.2013**న ఆచార్య తిరువడి చేరినారు. వీరికి శ్రియఃపతి సన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు వీరి కుటుంబసభ్యులకు మంగళా శాసనం చేశారు.



పాలకొల్లు వాస్తవ్యులు, **శ్రీమతి ఉప్పరమ్మ** గారు (ఆండాళ్) ది. **30.11.2013**న ఆచార్య తిరువడి చేరినారు. వీరికి శ్రియఃపతి సన్నిధిలో శాశ్వతకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.



హుజూర్‌నగర్ వాస్తవ్యులు, **శ్రీమాన్ కొత్తా హరిప్రసాద్** గారు ది. **15.1.2014**న ఆచార్య తిరువడి చేరినారు. వీరికి శ్రియఃపతి సన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు వీరి కుటుంబసభ్యులకు మంగళాశాసనం చేశారు.



కరీంనగర్ జిల్లా, వేములవాడ వాస్తవ్యులు, **శ్రీమాన్ జిల్లా శంకరయ్య** గారు ది. **3.1.2014**న ఆచార్య తిరువడి చేరినారు. వీరికి శ్రియఃపతి సన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామి వారు వీరి కుటుంబసభ్యులకు మంగళాశాసనం చేశారు.

హైదరాబాద్ వాస్తవ్యులు, **శ్రీమతి చిలకమర్రి సౌందర్యం**గారు ది. **28.12.2013**న ఆచార్య తిరువడి చేరినారు. వీరికి శ్రియఃపతి సన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు వీరి కుమారులకు మరియు కుటుంబసభ్యులకు మంగళాశాసనం చేశారు.



గుంటూరు వాస్తవ్యులు శ్రీమతి లగడపాటి రామలక్ష్మమ్మగారి భర్త **శ్రీమాన్ లగడపాటి వెంకట రామానాయుడు** గారు ది. **6.1.2014**న ఆచార్య తిరువడి చేరినారు.

వీరికి శ్రియఃపతి సన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు రామలక్ష్మమ్మ గారికి, కుమారులు రాజగోపాల్, మధుసూదన రావు, శ్రీధర్‌లకు కుమార్తె గార్లపాటి పద్మావతికి మంగళాశాసనం చేశారు.



శ్రీశ్రీశ్రీ స్వామివారి శిష్యులైన, నల్లగొండ జిల్లా వాస్తవ్యురాలు, వి.టి. సభ్యులు **శ్రీమతి పి. పిరాట్టమ్మ** గారు **27-10-2013** ఆచార్యతిరువడిని చేరారు. వీరికి శ్రియఃపతి సన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని కుటుంబ సభ్యలకు శ్రీస్వామివారు మంగళాశాసనం కృపచేశారు.



శ్రీశ్రీశ్రీ స్వామివారి శిష్యులు, వి.టి సభ్యురాలు నల్లగొండ జిల్లా వాస్తవ్యులైన **శ్రీమతి పి. చంద్రశేనమ్మ ది. 25-12-2013** ఆచార్యతిరువడిని చేరారు. వీరికి శ్రియఃపతి సన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని కుటుంబ సభ్యలకు శ్రీస్వామివారు మంగళాశాసనం కృపచేశారు.



శ్రీస్వామివారి ప్రియశిష్యులు, విజయవాడ వాస్తవ్యులు, **శ్రీమాన్ మొగళ్ళపు విద్యా సుగుణ పూర్ణచంద్రరావు**గారి 13వ వర్ధంతి జరుపుకొను సందర్భముగా వారు చేసిన సేవలను గుర్తుంచుకొని వారి శ్రీమతి సరోజనమ్మ గారికి మరియు కుటుంబ సభ్యులకు శ్రీస్వామి వారు మంగళా శాసనములు కృపచేశారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు.

శ్రద్ధతో మీరు పంపిన **జనవరి నెల సమాధానాలందాయి.** విజేత పేరు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం! *గతనెల సమాధానాలు 34వ పేజీలో కలవు.*

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. భగవంతుని శరీరమని దేనిని అంటారు? | |
| 2. గోదాదేవి పాటలతో సమాజం కోసం ఏమని కాంక్షించింది? | |
| 3. అబల అన్న పదానికి సాధారణ అర్థం ఏమిటి? | |
| 4. మాతృగర్భంలో దహింపబడేవాడు ఎవరు? | |
| 5. "విజ్ఞులు" అని ఏ విధంగా చూపగలరు? | |
| 6. పరీక్షిత్తు తల్లిగర్భంలో ఎవరిని సాక్షాత్కరించుకున్నాడు? | |
| 7. శ్రీ వేంకటేశ్వరస్వామి ఈ లోకానికి వచ్చి ఎన్ని సంవత్సరాలు అయ్యింది? | |
| 8. ఏ కథ వినగానే యవ్వనవంతులౌతారు? | |
| 9. మానవశరీరంలో పాపాలు ఎప్పటివరకు నివశిస్తాయి? | |
| 10. ప్రతి వెయ్యిమందిలో ఎంతమంది ఎంపెడిసైటిస్‌కి గురవుతారు? | |
| 11. శిరస్సుపైన స్నానం చేస్తే.....? | |
| 12. ఎడమవైపు బాధకు ప్రత్యేక ఔషధం ఏమిటి? | |
| 13. నిత్యం రామాయణాన్ని వినే అలవాటు కలిగినవారు ఎవరు? | |
| 14. ఆత్మ శబ్దం ఎవరికి చెందినది? | |
| 15. వేదార్థ సంగ్రహానికి తాత్పర్య దీపికా వివరణ వ్రాసినదెవరు? | |
| 16. నిరంతరం పరమాత్ముని అంటిపెట్టుకొని ఉండే శక్తి ఏది? | |
| 17. నిత్యసూరులచే స్తుతింపబడేవాడు? | |
| 18. దివ్యసాకేతం నుండి భాగ్యనగరానికి వచ్చిన పెరుమాళ్....? | |
| 19. వైకుంఠద్వారదర్శన విశేసాలను శ్రీస్వామివారు ఏసంహితలో ఉన్నదని తెలియజేశారు? | |
| 20. మనం తీసుకునే ఆహార ప్రభావం దేనిమీద ఉంటుంది? | |

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేత పేరు**

జి. రాజ్యలక్ష్మి- గుంటూరు; ఎస్.వి. రాఘవాచార్యుల-ఏలూరు

**గత విజేతలంతా తమ తమ పోస్టల్ అడ్రెస్ వివరంగా సీతానగరం పంపిస్తే వారికి బహుమతులను పంపించగలము. మీ శ్రద్ధాసక్తులకు భక్తినివేదన అభినందనలు అందిస్తుంది. బహుమతులు కూడా పంపిస్తుంది.**

మీ చిరునామా
....................................
....................................
....................................

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.

భక్తినివేదన సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929




సమగ్ర సమాచార నివేదన

సంపాదకులు శ్రీమతి టి. అరుణ

## ఆరోగ్య వికాస్

శ్రీశ్రీశ్రీ చిన్నజీయరు స్వామివారి మంగళాశాసన ములతో "వికాస తరంగిణి ఆరోగ్యవికాస్" మహిళలకు, విద్యార్థులకు ఉచిత వైద్య శిబిరముల ద్వారా ఆరోగ్యా న్నందిస్తున్నారు. అవసరమైన వారికి అవయవ మార్పిడికై విదేశాలలో వి.టి.సేవ ఆర్థిక సహాయాన్ని అందిస్తున్నారు.శ్రీ వేణుగోపాలరెడ్డి కిడ్నీ వ్యాధితోబాధపడుతున్నారు. వేణు గోపాలరెడ్డి కిడ్నీమార్పిడికి ఆర్థిక సహాయం అందించ మని కోరగా సియాటల్ బే ఏరియా వి.టి. సేవ వారు నాలుగులక్షల రూపాయలు ఆర్థిక సహాయ మందించారు. సెంట్రల్ కమిటీ సభ్యులు శ్రీమతి వనజా భాస్కరరావుగారు, శ్రీమాన్ వై. సూర్యనారాయణ గారు, రాజేశ్వరి గారు వేణుగోపాలరెడ్డి గారికి చెక్కును 21-12-2013న అందజేశారు.



**యద్దనపూడి ప్రకాశం జిల్లా :**

చైతన్య మహిళా ఆరోగ్య వికాస్ ఆర్గనైజర్ శ్రీమతి మాధవి రవీంద్రగారి ఆధ్వర్యంలో 15-12-2013న యద్దన పూడి సమీపంలో చింతపల్లిపాడు గవర్నమెంట్ స్కూల్ నందు ఉచిత ఆరోగ్య శిబిరం జరిగింది. ఈ కార్యక్రమంలో 202 మంది హాజరుకాగా 64 మందికి విఐఎ పరీక్ష, మిగిలిన వారికి బ్రెస్ట్ చెకప్ జరిగింది. వీరిలో ఐదుగురికి సెకండ్ చెకప్ చేశారు. ఆపరేషన్ చేయించు కోవడానికి ఆర్థిక పరిస్థితి సరిగాలేని మహిళకు యద్దనపూడి వికాస తరంగిణి వారు ఆపరేషన్ చేయించడానికి ముందుకు రావడం అభినంద నీయం. మార్టూరు జీవనవికాస్ అనాథ బాలుర పాఠశాలను నిర్వహిస్తూ, మహిళా ఆరోగ్యశిబిరాలు నిర్వహిస్తూ చక్కటి సేవలందిస్తున్నారు. ఈ గ్రామానికి చెందిన డా.రాంబాబుగారు ఈ శిబిరంలో బి.పి., షుగర్, థైరాయిడ్ పరీక్షలు నిర్వ హించారు. ఉచితంగా అందరికి మందులు అందజేశారు. వి.టి. సభ్యులు రాజ్యలక్ష్మి, మాధవి, శ్యామల మొదలైన వారందరూ సేవలందించారు.

**బావాజీ పేట - విజయవాడ**

మహిళా ఆరోగ్యవికాస్ సభ్యురాలు శ్రీమతి రుక్మిణి వికాస తరంగిణి కార్యకర్తలతోకలసి బావాజీ పేటలో డిసెంబర్ 22న మెడికల్ క్యాంప్ నిర్వహించారు. డిసెంబర్ 15నుండి 22వరకు సర్వే నిర్వహించారు. 352 మందికి మహిళల ఆరోగ్య సమస్యలు, తీసుకోవల్సిన జాగ్రత్తలు గురించి తెలియజేసారు. నెహ్రూ కన్నడి అప్పర్ ప్రైమరీ స్కూల్‌లో కేంప్ జరిగింది. డా.వి.శ్రీలత, డా.కె.ఝాన్సీ వైద్య పరీక్షలు నిర్వహించారు. వికాసతరంగిణి కార్యకర్త శ్రీమతి ఎన్. నీలావతి (సత్యనారాయణరాజుగారి భార్య) ఈ కార్యక్రమంలో అందరికి ఉచితంగా మందులు అందజేసారు.

### వివిధజిల్లాల్లోఅవయవదానఅవగాహనయాత్ర

**అమీర్ పేట - రంగారెడ్డి జిల్లా :**

శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో 31 డిసెంబర్ 2013 సాయంత్రం గం. 6-00లకు వికాస తరంగిణి - గీత భక్త సమాజం అవయవదాన యాత్ర నిర్వహించారు.

యువతనందరినీ ఆహ్వానించి నూతన సంవత్సర వేడుకలు సమాజానికి ఇబ్బందికలిగేలా జరపకూడదని - సమాజానికి ఉపయోగపడే సేవలందించాలని తెలియ జేసారు.

మనిషిలో పది అవయవాలు ఇతరులకు ఎలా ఎప్పుడుపయోగ పడతాయో వివరిస్తూ అవయవదానంపై అవగాహన కల్పించారు.

గ్రామం బాగుంటే ప్రజలంతా సంతోషంగాఉంటారు. కనుక పరిశు భ్రత పాటించడానికి యువత ముందుకు రావాలని పిలుపునిచ్చారు.గ్రామ పెద్దలు, యువత స్పందించి పెద్దసంఖ్యలో అవగాహనా యాత్రలో పాల్గొన్నారు.

**భద్రాచలం - ఖమ్మం జిల్లా :**

29 డిసెంబర్ 2013 అవయవదాన అవగాహన సదస్సు విస్తృతస్థాయిలో జీయర్‌మఠంలో నిర్వహించారు.

ఈ సదస్సులో డా. జయభారతి, డా. సుదర్శన్ దంపతులు పవర్‌పాయింట్ ప్రజంటేషన్ ద్వారా అవయవ దానం ఎందుకు చేయాలో వివరించారు. విటి మహిళా వికాస్ కార్యకర్తలు వివిధ సేవా సంస్థలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

యువత సమాజానికి హానికల్గించని విధంగా ప్రవర్తించాలని, నూతన సంవత్సర వేడుకలపేరుతో సమయాన్ని, ధనాన్ని వృధా చేసుకో కూడదని హితవు పలికారు.

జీయర్ మఠం వారు అందరికీ అల్పాహారం అందజేశారు. వికాసతరంగిణి సభ్యులు డా. జయభారతి, డా.సుదర్శన్ గారిని సన్మానించారు.

వి.టి. కేంద్ర కమిటి కార్యదర్శి శ్రీ పి.జి. భట్టర్‌గారు, భద్రాచలం విటి అధ్యక్షులు కమలారాజశేఖర్ మిగిలిన సభ్యులు కార్యక్రమాన్ని నిర్వహించారు.

**కర్నూల్ :**

శ్రీస్వామివారి మంగళాశాసనములతో కర్నూల్ జిల్లాలో వికాసతరంగిణి 17వ శాఖ - 89 శాఖ కలసి అవయవ దాన అవగాహన యాత్ర నిర్వహించారు. కళాశాల విద్యార్థులు, పాఠశాలల విద్యార్థులు, వికాసతరంగిణి కార్యకర్తలు పాల్గొన్నారు. యువత సమాజ సేవ చేయాలని సంకల్పిస్తే సమాజానికి ఎంతో మేలు చేయవచ్చు. యువతను ప్రోత్స హిస్తూ అవయవాలను ఎలా దానం చేయవచ్చో శ్రీమాన్ నాగేంద్, లక్ష్మీ కాంత్ రెడ్డి అందరికి వివరించారు. ఈ కార్య క్రమం జరిగిన వెంటనే జి. రమేష్ అనే వ్యక్తి అవయవ దానం చేస్తానని పేరు నమోదు చేసుకున్నాడు. యువవికాస్ లో చేరడానికి అనేకమంది ముందుకు వచ్చారు. కర్నూల్ పాత బస్టాండ్ నుండి కలక్టరాఫీస్ వరకు అవగాహన యాత్ర జరిగింది. వచ్చినవారందరికి వికాసతరంగిణి కార్యకర్తలు ప్రసాద ములందజేసారు.

### చిత్తూరు జిల్లా

శ్రీస్వామివారి మంగళాశాసనములతో మదనపల్లిలో ధనుర్మాస ప్రవచనాలు అనుగ్రహిస్తున్న శాంతారామ్ గురువుగారు 29 డిసెంబర్ 2013వ తేదీన అవయవదాన అవగాహన యాత్ర నిర్వహించారు. స్థానిక ఎమ్మెల్యే శ్రీ యం.షాజహాన్ భాషా ముఖ్య అతిథిగా విచ్చేసి యాత్రను ప్రారంభించారు. బర్మావీధి, కొత్తపేట, మదనపల్లి మొదలైన ప్రాంతా లవారికి అవగాహన కల్గిస్తూ కలసినడిచారు. వికాసతరంగిణి విటి యూత్ కమిటీవారు, 500 మంది విద్యార్థులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### ఆదిలాబాద్ జిల్లా

మంచిర్యాల వికాసతరంగిణి సభ్యులు 29వ తేదీన 2500 మంది యువతలో అవయవదాన అవగాహన యాత్ర నిర్వహిం చారు. వివిధ కళాశాలల సిబ్బంది, ఉపాధ్యాయులు, భక్తులు, సేవా సంస్థలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. అధ్యక్షులు రాజేశ్వర్రావు, కార్యదర్శి బి. నర్సింగరావు, ఉమ, ప్రభాకర రాజు, డా. విశ్వేశ్వర రావు, యం. వేంకటేశ్వర రావు తదితర కార్యకర్తలు పాల్గొన్నారు.

### నాగార్జునసాగర్ : - నల్గొండ జిల్లా

శ్రీశ్రీశ్రీ స్వామివారి ఆదేశానికి అనుగుణంగా సేవలందించడా నికి పట్టణాలు, మారుమూల ప్రాంతాలు, చిన్నవారు, పెద్దవారు, చదువుకున్న వారు, చదువులేనివారు అన్న తేడా లేకుండా అందరూ ముందుకు వస్తారు. “అవయవ దానం” ఎంత అవసరమో శ్రీస్వామివారు చెప్పేంతవరకూ మాకు తెలియదు. ఈ కార్యక్రమం గూర్చి మా చుట్టుప్రక్కలా తెలియజేస్తామంటూ చిన్న చిన్న వాడలలో ఉన్నవారు ముందుకు వచ్చారు. బేనర్ వారే తెల్లటి వస్త్రంపై వ్రాసి ఆచార్యుల చిత్రపటంతో నాగార్జున సాగర్‌లో అవయవదానం గూర్చి తెలియజేసారు.

**గోదావరిఖని శాఖ - 16.**

29 డిసెంబర్ 2013 అవయవదాన అవగాహన యాత్ర నిర్వహించారు. లక్ష్మీనారాయణ ఆలయం నుండి కళ్యాణ నగర్‌వరకు అవగాహన యాత్ర సాగించారు. వికాసతరంగిణి డా. ఆగమరావు, గిరిజాదేవి, ఆశోక్‌రావు తదితరులు పాల్గొన్నారు.

**మిర్యాలగుడ:**

అవగాహన యాత్ర మిర్యాలగుడలో వినూత్నంగా జరిగింది. రెండు వికాసతరంగిణి శాఖలు రెండు ప్రాంతాల నుండి బయలుదేరి ఒకచోట కలసి కార్యక్రమం నిర్వహిం చారు.

రెడ్డి కాలని కోదండరామస్వామి ఆలయనుండి, హౌసింగ్ బోర్డ్ కోలనీ వికాసతరంగిణి వేంకటేశ్వర ఆలయం నుండి రెండు ప్రాంతాల నుండి నడక ప్రారంభించి రాజీవ్‌చౌక్ వరకు నిర్వహించారు. ‘అవయవదానం’ పై అవగాహన కల్గించారు. వివిధ కళాశాల పాఠశాలల విద్యార్థులు పాల్గొన్నారు. పార్లమెంట్ సభ్యులు గుత్తా సురేందర్‌రెడ్డి, శాసన సభ్యులు జూలకంటి రంగారెడ్డి ప్రారంభంలో పాల్గొన్నారు. వికాసతరంగిణి మిర్యాలగుడ అధ్యక్షులు జి. విజయ్ కుమార్, కర్నాటి నిర్మల తదితరులు హౌసింగ్ బోర్డ్ శాఖ వికాసతరంగిణి శాఖ అధ్యక్షులు విజయలక్ష్మి, ఆలయకమిటి శ్రీదేవి మొదలైన వారు పాల్గొన్నారు.

**విజయవాడ పడమట :**

వేంకటేశ్వరస్వామి దేవస్థానం నుండి అవయవదాన అవగాహన యాత్ర ప్రారంభమైంది. శ్రీ చైతన్య కళాశాల వరకు జరిగింది. వివిధ కళాశాలలు,

సేవా సంస్థలు, వేద విశ్వవిద్యాలయం సీతానగర్ విద్యార్థులు, వికాసతరంగిణి సభ్యులు పాల్గొన్నారు.

వికాసతరంగిణి అధ్యక్షులు రాఘవన్‌గారు, మహిళా ఆరోగ్య వికాస్ ఆర్గనైజర్ శ్రీమతి మాధవి రవీంద్ర – వేద విశ్వవిద్యాలయ అధ్యాపకులు శ్రీమాన్ శ్రీనివాసాచార్యులు గారు, శ్రీ వరప్రసాద్‌గారు, వేద విద్యార్థి చి.సంతోష్ ఇంకా ఎందరో ప్రముఖులు అవయవదానం గూర్చి పురాణకాలంలో విషయాలను ఉదహరిస్తూ అందరికీ అర్థమయ్యేలా వివరించారు. ఈ కార్యక్రమంలో 250మంది పాల్గొన్నారు. కృష్ణాజిల్లా వికాసతరంగిణి కార్యదర్శి నల్లూరు కృష్ణ, శ్రీ రవీంద్ర, రంగారావుగారు మొదలైన వారు పాల్గొన్నారు.

**మార్కాపురం:**




యువవికాస్ చేసే సేవలను చూసి ఎందరో యువత ముందుకు వస్తు సేవలందిస్తున్నారు. మార్కాపురం యువత ఎంతో ఉత్సాహంతో అవయవదానంపై అందరికి అవగాహన కల్గిస్తున్నారు. 29వ తేదీ పట్టణంలో పలుసేవా సంస్థలను కలుపుకుంటూ యాత్ర నిర్వహించారు. వికాసతరంగిణి సభ్యులు అవయవదానంపై అవగాహన కల్గించటాన్ని పలువురు పెద్దలు ప్రశంసించారు.

**ఏలూరు : పశ్చిమ గోదావరి**

ఏలూరు యువవికాస్ కార్యకర్తలు, వికాసతరంగిణి కార్యకర్తలు అవయవదానంపై అవగాహన కల్గిస్తూ జనార్థనస్వామి ఆలయం నుండి ఆర్.ఆర్.పేట వేంకటేశ్వర స్వామి ఆలయం వరకు కలిసి నడిచారు.

**జగ్గయ్యపేట :**

జగ్గయ్యపేట వికాసతరంగిణి కార్యకర్తలు అందరికి కరపత్రాలను




ముందుగానే అందజేసి స్థానిక కళాశాలలు, పాఠశాలలు,స్వచ్ఛంద సేవా సంస్థలు ఆధ్యాత్మిక సంస్థల సభ్యులను, కార్యనిర్వాహకులను అందరూ కలసి అవయవ దానం గూర్చి, స్వామివారు నిర్వహిస్తున్న కార్యక్రమం గూర్చి తెలియజేసారు. డా.జయరాం, స్థానిక శాసనసభ్యులు శ్రీరాం రాజగోపాల్ మొదలైన వారు పాల్గొన్నారు. వెయ్యి మందితో అవగాహన యాత్ర జరిగింది. అవయవదాన కార్యక్రమం గూర్చి వైద్యులు అందరికి వివరించారు. అవయవాలు దానం చేయటానికి 35 మంది తమ పేర్లను నమోదు చేయించుకున్నారు.

**రాజమండ్రి**

29 డిసెంబర్ 2013న అవయవదాన అవగాహన యాత్ర పుష్కర్ ఘాట్ నుండి కోటిపల్లి బస్‌స్టాండ్‌వరకు జరిగింది. ఈ కార్యక్రమంలో అధిక సంఖ్యలో విద్యార్థులు పాల్గొన్నారు. శ్రీమతి పద్మారామానుజంగారు, రామానుజం గారు,శ్రీరంగధామ భట్టర్‌గారు, వర్మగారు ఈ కార్య క్రమంలో పాల్గొన్నారు.

**విశాఖపట్టణం :**

వారిజ వేద విద్యార్థులు, నేత్ర విద్యాలయ విద్యార్థులు 30 డిసెంబర్ 2013న జరిగిన అవయవదాన అవగాహన యాత్రలో పాల్గొన్నారు. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా డా. రవిశంకర్ (సెవెన్‌హిల్స్), డా. వెలగాడ శ్రీనివాస్, మోహన్ ఫౌండేషన్ వాసుదేవరావుగారు పాల్గొన్నారు. గవర్నమెంట్ ఉమెన్స్ కాలేజ్ వరకు అవగాహనయాత్ర జరిగింది. శ్రీమాన్ యం.ఎస్.ఎస్.ఆర్.వర్మ, శిరీష, కార్యదర్శి రాజుగారు వికాసతరంగిణి సభ్యులు, యువత ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

**విజయనగరం**

30-12-2013 అవయవదాన అవగాహన యాత్ర విజయనగరం వికాసతరంగిణి కార్యకర్తలు నిర్వహించారు. ఈ కార్యక్రమం స్థానిక ఎజిఎల్ కాలేజీలో నిర్వహించారు. కార్యక్రమానికి శ్రీమతి టి.కె. చూడామణిగారు, నరసింహా చార్యులవారు ముఖ్య అతిథిగా విచ్చేసారు. ఆరోగ్య వికాస్ కి ప్రతి సంవత్సరం సేవలు అందిస్తున్న డా.మాటూరి సుధాకుమారి, మల్లేశ్వరరావు దంపతులను సన్మానించారు.

చూడామణిగారు, నరసింహాచార్యులవారు స్వామి వారు నిర్వహిస్తున్న సమాజసేవ కార్యక్రమాలను అందరికీ అర్థమయ్యేలా వివరించి యువతను కార్యక్రమాలు నిర్వహించమని ఆహ్వానించారు.

సుమారు 300 మంది విద్యార్థులతో అవగాహన యాత్రసాగింది. చి.వాసు, చి.కళ్యాణ్ యువవికాస్ కార్యకర్తలు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

**కొండవెలగాడ**

అవయవదాన అవగాహన యాత్ర ఆదర్శ గ్రామ కార్యకర్తలు కొండవెలగాడ గ్రామంలో నిర్వహించారు. 31-12-2013 ఉదయం గం. 10లకు వెలగాడ ప్రభుత్వ పాఠశాల ఉపాధ్యాయులు, యువత, ప్రజ్ఞా విద్యార్థులు, గ్రామమంతటా అవయవదానం ఎలా చేయాలో వివరిస్తూ యువత తమ సమయాన్ని, శక్తిని సమాజసేవ కోసం ఉపయోగించాలని అందిరకీ తెలియజేసారు. రెడ్డిక వీధి భజన బృందానికి మైక్‌సెట్

అందజేసారు. ఈ కార్యక్రమానికి విజయనగరం జిల్లా అధ్యక్షులు బి.వెంకట్రావు, ప్రజ్ఞ ఆరోగ్య సమన్వయ కర్త శ్రీమతి శివ్వా రమాదేవి పాల్గొన్నారు.

***శ్రీకాకుళం జిల్లా :***

## ప్రజ్ఞ మరియు ఆధ్యాత్మిక కార్యక్రమాలు

**మిర్యాలగుడా హౌసింగ్ బోర్డు శాఖ :**

13 డిసెంబర్ 2013 శుక్రవారం గీతాజయంతి సందర్భంగా భగవద్గీత పోటీలు నిర్వహించారు. గెలుపొందిన వారికి ప్రథమ, ద్వితీయ బహుమతులు అందజేశారు. భగవద్గీత వైభవాన్ని ఆలయ ప్రధాన అర్చకులు శ్రీ రాఘవాచార్యులు వివరించారు. ఈ కార్యక్రమంలో పాఠశాల సిబ్బంది, విద్యార్థులు, వికాసతరంగిణి, ఆలయ కమిటీ సభ్యులు పాల్గొన్నారు. యం.విజయలక్ష్మి (అధ్యక్షులు), శ్రీదేవి ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

**కరీంనగర్ :**

వికాసతరంగిణి ప్రజ్ఞ కార్యకర్తలు 06-12-2013 వేద భవనంలో 14 మండలాల్లో పాఠశాలలకు చెందిన 120 మంది విద్యార్థులకు "కనిపించే దైవాలు తల్లిదండ్రులు" మొదటి మాడ్యుల్‌పై పరీక్షలు నిర్వహించారు. భగవద్గీత మూడవ అధ్యాయంపై ప్రాంత స్థాయిలో, జిల్లా స్థాయిలో పోటీలను నిర్వహించారు. మూడు విభాగాలలో 18 మందికి బహుమతులను శ్రీశ్రీశ్రీ స్వామివారు అందజేసారు. ముగ్గుల పోటీ, విశేష వేషధారణ (గోపికా కృష్ణ), చిత్రలేఖనం (గోవులతో గోపాలుడు, గోపికలతో గోదాదేవి, గీతోపదేశం) వ్యాస రచన, ఉపన్యాస పోటీలు, భజన పోటీలు, మాలలు అల్లుట అన్ని పోటీలలో 2,230 మంది పాల్గొనగా 71 వ్యక్తిగత బహు మతులు, 8 భజన బృందాలకు బహుమతులను శ్రీ స్వామి వారు అందజేసారు. ఈ కార్యక్రమాన్ని ప్రజ్ఞ కన్వీనర్ తాండ్ర పద్మా పాపారావు, వికాసతరంగిణి కార్యకర్తలు నిర్వహించారు.

**తిమ్మన్నపాలెం - ప్రకాశం జిల్లా**

బెంగుళూరు (కర్ణాటక) వికాసతరంగిణికి చెందిన శ్రీమతి రూప శైలేష్ వారి స్వంత గ్రామం అయిన ఎర్రబాలెం, తిమ్మన్నపాలెం గ్రామాలలో ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహించారు. ఆరివారి జిల్లా పరిషత్ పాఠశాలలో, ఎర్ర బాలెం ఎలిమెంటరీ పాఠశాలలో 250మంది విద్యార్థులకు ఉచిత నేత్ర వైద్య శిబిరం జరిగింది. దుర్గా నర్సింగ్‌హోం ఒంగోలు వారి సహాయంతో ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. ఈ పాఠశాలలో వారానికి ఒకసారి ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

**రాజమండ్రి**

గీతాజయంతి సందర్భంగా భగవద్గీత పోటీలు నిర్వహించారు. 150మంది విద్యార్థులు ఈ పోటీలో పాల్గొన్నారు. గెలుపొందిన విద్యార్థులకు బహుమతులు అందజేసారు. ప్రజ్ఞ కన్వీనర్ శ్రీమతి పద్మారామానుజం, మైథిలీ ప్రసాద్ చౌదరి, లక్ష్మి, రామలక్ష్మి మొదలైనవారు కార్యక్రమాన్ని నిర్వహించారు.

**విశాఖపట్టణం:**

శ్రీశ్రీశ్రీ అహోబలరామానుజ జీయర్‌స్వామివారు విశాఖ పట్టణం సెంట్రల్ జైల్ ఖైదీలకు శరణాగతి గూర్చి తెలియజేసి శ్రీ వేంకటేశ శరణాగతి దీక్షను అనుగ్రహించారు. 50 మంది ఖైదీలకు తులసిమాలలు, పూజా సామగ్రి, వస్త్రాలు విశాఖపట్టణం వికాసతరంగిణి సభ్యులు అందజేసారు. జైలు సిబ్బంది, వి.టి. కార్యకర్తలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. శ్రీమతి వర్మ, శిరీష, శ్రీరాజు మొదలగువారు పాల్గొన్నారు.

**విజయనగరం :**

ప్రజ్ఞ కార్యక్రమంలో "కనిపించే దైవాలు తల్లిదం డ్రులు" కథలు పాఠశాలలకు అందజేసారు. ప్రజ్ఞ పాటలైన "అమ్మే మా దైవం, నాన్న అను పదమే" అను పాటలను పాఠశాల విద్యార్థులంతా నేర్చుకుని (600మంది) అందరూ ఏక కంఠంతో గానం చేశారు. సాక్షి గుప్త 'నాన్న అనుపదమే' అనే పాటకు తానే నృత్యాన్ని రూపకల్పన చేసి అభినయించి అందరి అభినందనలు అందుకుంది. అమ్మ, నాన్నగారిపై వారి మనసులో ఉన్న భావాన్ని వ్రాసి తల్లిదండ్రులకు ఆనందాన్ని కల్గించారు. బాగా వ్రాసిన ఐదుగురు విద్యార్థులు, పాటలు పాడిన విద్యార్థులు వేదికపై తల్లిదండ్రులకు పాదపూజచేసారు.

అన్నిటికంటే విశేషమేమంటే ప్రజ్ఞ పాటలు వ్రాసిన డా. టి.కె. చూడామణి గారి సన్నిధిలో ఈ కార్యక్రమం జరిగింది. చూడామణిగారు, శ్రీమాన్ టి.కె. నర్సింహా చార్యులు గారు ముఖ్య అతిథులుగా విచ్చేసారు.

తల్లిదండ్రులపట్ల, గురువులపట్ల, సమాజంపట్ల విదార్థులు ప్రవర్తన ఏ విధంగా ఉండాలో చూడామణిగారు వివరించారు. ఈ కార్యక్రమంలో పాఠశాల సిబ్బంది, వికాస తరంగిణి, ప్రజ్ఞ విభాగ కార్యకర్తలు పాల్గొన్నారు.

**సహస్ర హృదయార్చన :**

విజయనగరం వికాసతరంగిణి సభ్యురాలు శ్రీమతి కంచెర్ల లక్ష్మిగారు "హరినామ సంకీర్తన" అనే కార్యక్రమాన్ని నిర్వహించారు. ప్రారంభించి 3 సంవత్సరాల నుండి భజన సంప్రదాయ సంకీర్తనలను ప్రముఖ సంగీత విద్వాంసులు శ్రీ బుర్రా శ్రీనివాస్ గారు శిక్షణ నిస్తున్నారు. 'హరినామ సంకీర్తన"లో భద్రాచల రామదాసు కీర్తనలను నేర్చుకుని భద్రాచలరాముని ఎదురుగా సంకీర్తన చేశారు. శ్రీమతి లక్ష్మిగారు ఈ కార్యక్రమాన్ని చూసి ఇలాంటి కార్యక్రమం విజయనగరంలో నిర్వహించాలని శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో 'సహస్రనామాలవానికి సహస్ర హృదయార్చన' కార్యక్రమం రూపొందించారు. కీర్తనలు నేర్పించడానికి 'వారం రోజులు శిక్షణ తరగతులు" నిర్వహించారు. శ్రీమాన్ బుర్రా శ్రీనివాసరావుగారు ఉదయం 2 గంటలు, సాయంత్రం 2 గంటలు సుమారు 800 మందికి చాలా అద్భుతంగా కీర్తనలు నేర్పారు. పంచముఖ ఆంజనేయ స్వామి ఆలయ కమిటీ వారు ఉచితంగా వసతి, ప్రసాదం ఏర్పాటుచేశారు. గ్రామాల భజన బృందాలు, సంగీత కళాకారులు, మహిళలు, విద్యార్థులు, పెద్దలు అందరూ శ్రద్ధగా నేర్చుకున్నారు. శిక్షణ శిబిరం చివరి రోజున శ్రీమతి డా.కె.చూడామణి గారు, శ్రీ టి.కె.నరసింహాచార్యుల వారు పాల్గొని 'కీర్తన' వైభవాన్ని వివరించారు. వికాసతరంగిణి కార్యకర్తలంతా సేవలందించారు. శ్రీమతి కె.జానకమ్మగారు, శ్రీ కోలగట్ల వీరభద్రస్వామిగారు,పెద్దలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

మన ఆచార్యులు శ్రీశ్రీశ్రీ స్వామివారు, సంగీత కళానిధి శ్రీమాన్ నేదునూరి కృష్ణమూర్తిగారు ప్రత్యక్ష పర్య వేక్షణ గానం చేయడానికి 1000మంది భక్తులు శిక్షణ పూర్తి అయ్యింది. త్వరలో ఈ కార్యక్రమం విజయనగరంలో స్వామి వారి సన్నిధిలో జరుగుతుంది.

శ్రీస్వామివారి మంగళాశాసనములతో విజయనగరం జిల్లాలో ధనుర్మాస ఉత్సవాలు ఈ సంవత్సరం చాలా విశేషంగా జరిగాయి. నీళాదేవి భవనంలో ఉన్న కృష్ణుని మేల్కొల్పి పాఠం చెప్పింది ఆనాడు గోదాదేవి. ఈ ధనుర్మాసంలో తన మృధుమధురమైన మాటలతో వికాస తరంగిణివారికి మార్గనిర్దేశం చేసారు శ్రీమతి డా.టి.కె.చూడా మణిగారు. కళ్యాణవేంకటేశ్వర స్వామివారి ఆలయంలో ఉదయం, సాయంత్రం ప్రవచనం చెప్పేవారు. వికాసతరంగిణి ఆహ్వానించిన అన్ని కార్యక్రమాలకి వచ్చి మంగళాశాసనం చేసారు.

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారిపై చూడామణిగారికి, నరసింహా చార్యులవారికి ఉన్న అపారమైన ఆచార్యాభిమానమే "ఆచార్య వందనం". కార్యక్రమంగా రూపొందింది. అవయవ దాన అవగాహన యాత్ర చూసిన తరువాత నరసింహా చార్యులవారు ఆచార్యులు ఆదేశించిన కార్యక్రమాలు అందరికీ తెలియజేయాలని డిసెంబర్ 6, విజయనగరంలో అన్ని గోష్ఠులవారిని ఆహ్వానించారు. అందరినీ ఒక్కచోట చేర్చి భగవద్రామానుజాచార్యులవారి సహస్రాబ్ది ఉత్సవాలను ఎలా నిర్వహించుకోవాలో వివరించారు. అపర రామాను జులైన చినజీయరు స్వామి వారు సమాజానికి చేస్తున్న సేవలు, అవి నిర్వహించడంలో మన వంతు బాధ్యతలేమిటో వివరించారు.

ఈ కార్యక్రమంలో రామానుజకూటం భక్త గోష్ఠి, ఆండాళ్ గోష్ఠి, యతిరాజ మహిళా మండలి, శ్రీనివాస సేవా సంఘం, లక్ష్మీ మహిళా మండలి, వికాసతరంగిణి శాఖలు, రామానుజదాస బృందం ఇలా ఎన్నో ఆధ్యాత్మిక సంస్థల వారు, గ్రామ భక్తులు పాల్గొన్నారు.

శ్రీనివాస సేవా సంఘం వారు వచ్చిన వారందరికీ ప్రసాద వినియోగం గావించారు. ఈ కార్యక్రమంలో శ్రీమతి కందాడై జానకమ్మగారు, తిరువేంగళమ్మగారు (చిన్నారిగారు), పీసపాటి సంపత్, నరసింహాచార్యులు మరియు శ్రీమన్నారాయణాచార్యులు 'ఆచార్య వైభవాన్ని' ప్రవచించారు.

శ్రీమతి చూడామణిగారు, నరసింహాచార్య స్వామి వారు ఈ కార్యక్రమాన్ని నిర్వహించినందుకు భక్తులందరు తమ ఆనందాన్ని వ్యక్తం చేసారు.

**సాలూరు - విజయనగరం జిల్లా :**

సాలూరు వికాసతరంగిణి కన్వీనర్ శ్రీమాన్ విశ్వనాథ్‌గారు ట్రైబల్ ప్రాంతాలలో శ్రీరామభక్తతరంగిణి, ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. నగర సంకీర్తన, శ్రీరామ వైభవం, ప్రవచన కార్యక్రమాలు అనేక గ్రామాలలో నిర్వహిస్తున్నారు. పాచిపెంట గ్రామంలో శ్రీరామపూజ కార్యక్రమాన్ని సరస్వతి శిశుమందిర్‌లో నిర్వహించారు. 400మంది భక్తులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. విజయనగరం వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీ బి.వి. వెంకటరావుగారు, జిల్లా సమన్వయకర్త శ్రీమతి అరుణగారు, ట్రైబల్ గ్రామాలలో ప్రచార కార్యక్రమంలో పాల్గొన్నారు.

**రాజాం - శ్రీకాకుళం జిల్లా :**

శ్రీ మద్భగవద్గీత పోటీలను 4 సంవత్సరములుగా రాష్ట్రమంతట వికాసతరంగిణి కార్యకర్తలు నిర్వహిస్తున్నారు. ప్రతి సంవత్సరం రాజాం వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీ టి.టి.వి. రమణ మూర్తి (బుస్కీ మాస్టారు) అద్భుతంగా గీతా పోటీలు నిర్వహిస్తున్నారు. శ్లోకాలు, తాత్పర్యసహితంగా చెప్పడానికి పెద్ద సంఖ్యలో పాఠశాల విద్యార్థులు పాల్గొన్నారు.

పాఠశాల స్థాయిలో విజయం సాధించిన విద్యార్థులం దరికీ 11 డిసెంబర్ 2013న వికాసతరంగిణి కార్యాలయంలో పోటీలు నిర్వహించారు. వారి పాఠశాల విద్యార్థులే విజేత లుగా నిలవాలని ఉపాధ్యాయులు ఉత్సాహంతో, పట్టు దలతో శిక్షణ ఇచ్చారు. చివరి పోటీలకు పాఠశాల ప్రధానోపాధ్యాయులు కూడా పాల్గొనడం విశేషం. భగవద్గీత పఠనంతో విద్యార్థులకు మంచి ప్రవర్తన అలవడుతుందని తల్లిదండ్రులు అందరూ సంతోషం వ్యక్తం చేసారు. న్యాయనిర్ణేతలకు కృతజ్ఞతలు తెలియజేసారు.

***నేత్ర విద్యాలయ - వారిజ :***

అంధులపాలిట ఆశాజ్యోతి లూయిస్ బ్రెయిల్. కంటిచూపు లేనివారికి అక్షరాలను కనిపెట్టిన మహనీయుడు. అక్షరాలు నేర్చినా తన పరీక్ష తానే వ్రాసుకోలేక బాధపడు తుంటే లాప్‌టాప్ మీద వారి పరీక్ష వారే వ్రాసుకునేలా అంధులకు దారిచూపిన దయామయులు శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు. నేత్రవిద్యాలయ పాఠశాల కళాశాల విద్యార్థులు శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో ప్రపంచ వ్యాప్తంగా అందరి మన్ననలు అందుకుంటున్నారు.

హైదారాబాద్ ఎల్.బి. నగర్ వికలాంగుల కళ్యాణ వేదిక సభ్యులు సుభాష్ గుప్తాగారు అండర్ 19 క్రికెట్ పోటీలు నిర్వహించారు. ఈ పోటీలలో మన నేత్ర విద్యాలయలో 8వ తరగతి చదువుతున్న ఎల్.రాం ప్రసాద్ పాల్గొన్నాడు. టి.వి. టవర్స్ టీం తరపున ఆడి గెలుపొంది ఫీల్డింగ్ విభాగంలో సెలక్ట్ అయ్యాడు. ఇది మన నేత్ర విద్యాలయం సాధించిన ఘనతగా అందరూ అభినందిస్తున్నారు. వారికి చేయూతనిచ్చి మరింతగా ప్రోత్సహిస్తున్నారు.

శ్రీమాన్ కోనేరు శ్రీనివాస్ గారు(అసిస్టెంట్ ప్రొఫెసర్, ఐ.టి. డిపార్ట్‌మెంట్, గీతం యూనివర్సిటీ) ప్రతినెల నేత్ర విద్యాలయ విద్యార్థుల పాల కొరకు రూ.10,000/-ను అందజేస్తున్నారు. శ్రీనివాస్ గారికి నేత్రవిద్యాలయ కమిటీ కృతజ్ఞతలు తెలియజేసారు.




**కార్యకర్తలకు సూచన**

**మీ వికాసతరంగిణి శాఖ ద్వారా చేసే ఆధ్యాత్మిక, సామాజిక, సేవా కార్యక్రమాలను అందరితో పంచు కోవాలనుకుంటున్నారా! కార్యక్రమ వివరాలను సంక్షిప్తంగా వ్రాసి, కార్యక్రమ ఫోటోలను జతపరచి ప్రతి నెల 10వతేదీలోపుగా news@vtsbharath.org కి మెయిల్ చేయండి. Cell No. 9440106555**

**జై శ్రీమన్నారాయణ**

**సూచన:** అవయవదాన అవగాహన యాత్ర చిత్రములు మార్చినెల సంచికలో చూడవచ్చును.



శ్రీమతే నారాయణాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః



66 సం॥ల నుండి అశేష భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ఆధ్యాత్మికమాసపత్రిక

# భక్తినివేదన



## పంచాంగ వివరాలు

మార్చి

1. తిథిద్వయం, అమావాస్య, పిండపితృయజ్ఞము;
3. శ్రీయాదగిరి లక్ష్మీ నృసింహస్వామి బ్రహ్మోత్సవారంభం;
4. పూర్వాభాద్రకార్తె;
10. శ్రీయాదగిరి లక్ష్మీనృసింహ స్వామి కళ్యాణోత్సవము;
11. ఏకాదశితిథి, కన్దాడైయాండాన్‌తిరు, కులశేఖరాళ్వార్ తిరు॥;
12. శూన్యతిథి, సర్వేషామేకాదశి;
13. నృసింహద్వాదశి, మేల్కోటవైరముడి సేవ;
14. దక్షిణాది కామదహనం; మీనసంక్రమణం రా. 12-42;
15. ఉత్తరాది కామదహనం;
16. హోళికోత్సవం;
18. ఉత్తరాభాద్రకార్తె;
21. మేళ్ళచెఱ్వు శ్రీవారి బ్రహ్మోత్సవారంభం;
27. సర్వేషామేకాదశి;
28. అవమతిథి;
30. పిండపితృయజ్ఞము, అమావాస్య;
31. శ్రీ జయనామ సం॥ర ఉగాది; పెరియపెరుమాళ్‌తిరు॥


శ్రీ విజయ నామ సంవత్సరం

ఫాల్గుణమాసం

సంపుటి 66 మార్చి

సంచిక 12 2014

వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి

శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. రంగరామానుజాచార్యులు

ఉప సంపాదకులు

శ్రీమతి డా॥ T.K. చూడామణి


## విషయ సూచిక




*Printed & Published by :* H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**
*Printed & Published at :* **Sriman Printers & Processors** C/o JET, Sitanagaram-522 501, Guntur Dist., Andhrapradesh.
*Editor* : Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.


*చందావివరాలు :-*

సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-




మీ సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.



D.T.P. & Design by :

పరిశోధనాలయమ్



E-mail : **jetsitanagaram@yahoo.com**

Internet : www.chinnajeeyar.org

సంపాదకీయం

# అక్షైర్మాదీవ్యః కృషిమిత్ కృషస్వ



## జూదమాడకు - కృషిచేసి సంపాదించు

సముద్రానికి ఉత్తరాన, హిమాద్రికి దక్షిణాన ఉన్న వర్షాన్ని భరతవర్షం అన్నారు. ఇక్కడ నివసించే జాతి భారతీజాతిగా విష్ణుపురాణం పరిగణించింది.

**ఉత్తరం యత్సముద్రస్య హిమాద్రేశ్చైవదక్షిణం ।**

**వర్షంతత్ భారతంనామ, భారతీయత్రసంతతిః ॥**

అని విష్ణుపురాణం ఉద్ఘోషించింది.

భారతీ సంతతికి ప్రాచీనమైన ఒక జీవనవిధానం ఉంది. అవికలమైన ఒక అవగాహనారీతి ఉంది. ఈరెంటికీ మూలస్రోతస్సులు వేదాలు.

మనం మనకంటితో చూచి తెలిసికోలేని విషయాన్ని, అలాగే మన బుద్ధితో హేతుబద్ధంగా ఊహించి తెలుసుకోలేని విషయాన్ని చెప్పేది కనుక **వేదం** అని దానిని శాస్త్రకారులు వ్యవహరించారు.

**ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదముల** భేదం చేత నాలుగుగా ప్రసిద్ధాలైన వేదాలు ప్రాచీన సంస్కృతికి ఆలంబనాలు. నాల్గు వేదాలలోను ఋగ్వేదం చాలా ప్రాచుర్యాన్ని వహించి ఉంది. ఇందులో పదిమండలాల్లో విభిన్న సూక్తాల్లో ఋఙ్మంత్రాలున్నాయి. పదవ మండలంలోనే చాలా ప్రసిద్ధాలైన సూక్తాలున్నాయి. దానిలోనే ఉంది అక్షసూక్తం. ఇది ముప్పదినాల్గవ సూక్తం. ఇందులో పదునాలుగు మంత్రాలున్నాయి. ఈ అక్షసూక్తం ద్యూతకరసూక్తంగా కూడా ప్రసిద్ధమై ఉంది.

ఇది వేదకాలంనాటి జీవన విధానాన్ని స్పష్టంగా మనముందు ఉంచుతుంది. జూదమాడేవారు తమ వ్యసనానికి ఎలా బానిసలవుతారో, దానివల్ల ఎంతటి దుర్భర కుటుంబ పరిస్థితులను ఎదుర్కొంటారో ఈ సూక్తం మనముందు ఉంచి, జూదం ఆడవద్దని ప్రతిబోధిస్తుంది.

కొన్నివేల సంవత్సరాలనాటి ఈవైదిక ఉపదేశం నేటిసమాజానికి అత్యవసరమైంది, నిత్యానుసంధేయమైంది. దీనిలోని ఆంతర్యాన్ని గమనించే ప్రయత్నం చేద్దాం.

**అక్షైర్మాదీవ్యః కృషిమిత్ కృషస్వ,**

**విత్తేరమస్వ బహుమన్యమానః ।**

**తత్రగావః కితవ, తత్ర, జాయా**

**తన్మేవిచష్టే సవితాయమర్యః ॥**

అన్నది అక్షసూక్తంలోని పదమూడవ మంత్రం.

పాచికలాడకు, 'కృషి' చేయి.

ధనంపట్ల ఆదరణ, గౌరవభావం కలిగి, సంపాదించు ఆనందించు. ఇలా కృషిచేసి ధన సంపాదనచేస్తూ జూదమాడనివానికే, పశుసంపద, గృహం, గృహిణి ఇవన్నీ అవికలంగా సమకూడతాయి' అని ప్రతిబోధిస్తున్నది వేదం.

**'జూదం'** ఆడవద్దు అని వేదం చెప్పడం, కేవలం ఒక 'క్రీడ' గురించికాదు. ఇక్కడ జూదం (ద్యూతం) అనేది ఒక విధమైన జీవన విధానం. ఒకవిధమైన ఆలోచనాసరణి. ఇది చాలా ప్రమాదకరమైంది. కనుకనే తగదని చెబుతున్నది.

ఏమిటది?

ఇది కేవలం ఒక ఆటకాదా? కాదు.

అసలు 'జూదం' అంటే ఏమిటి?

శ్రమపడకుండా, కొద్దిపాటి పెట్టుబడితో అసలు పెట్టుబడే లేకుండానైనా, బాగా ధనాన్ని సంపాదించాలని చేసే ప్రయత్నమే జూదం.

గుర్రపు పందేలు, లాటరీటిక్కట్లు, పేకాడటం, కోడిపందేలు ఇవన్నీ ఈ కోవకు చెందినవే. వీటిలో కొన్ని క్రీడలుగా ఆరంభమై జూదాలుగా మారాయి. ఈనాడు జూదంగా మార్చలేని అంశం అంటూ ఏదీ లేదు. వినోదంకోసం ఆడే ఆటలను కూడా జూదంగా మార్చి, పందేలు ఒడ్డి ఇల్లు గుల్ల చేసికొంటున్న తీరు నేటి సమాజజీవనాన్ని అతలాకుతలం చేస్తున్నది. ఇలా భ్రష్టులైనవారు మళ్లీ డబ్బుసంపాదించడానికి చేసే ప్రయత్నాలే సమాజానికి పెద్ద సవాళ్ళుగా అవుతున్నాయి.

ఈనాటి సమాజం ఇదివరకెప్పుడూ లేనంతగా, అర్థ-కామ-ప్రధానమైన సామాజికజీవనం వైపు పరుగులు పెట్టడం చూస్తున్నాం. ఇది సమాజ పతనానికి ప్రత్యక్షనిదర్శనం.

ధనంలేనివారు ధనసంపాదన కొరకు శతవిధాల ప్రయత్నించడం సహజం. కానీ, ధనంబాగా సంపాదించి, భోగాలనుభవించే వారి భోగమయ జీవితాన్ని చూసి, తామూ అలాగే బ్రతకాలని ఆశించడం, ఆ ఆశ నెరవేర్చుకోవడా నికి వేరు వేరు మార్గాలు త్రొక్కడం మనం చూస్తున్నాం. ఇది ఒక దుర్బలమైన మనఃప్రవృత్తి. దీన్ని జయించడం చాలా కష్టం. ఇలాంటి ప్రవృత్తితో ఒకొక్కప్పుడు చెడుత్రోవలో కూడా వెళ్లి ఇక్కట్ల పాలవడం సర్వసామాన్యం అయింది. ఇలాంటి ప్రవృత్తి ఎంతమాత్రం సమర్థనీయం కాదు.

కోట్లకు పడగలెత్తిన వారిలో కూడా ఈప్రవృత్తి వల్లనే ఇంకా ఇంకా సంపాదించాలనే **దురాశ**కు అంతులేని స్థితికూడా నేడు కనిపిస్తున్నది. దీని వల్లనే ఆర్థిక దోషాలు రోజురోజుకూ ఎక్కువై పోతున్నాయి. ఇలాంటి

ప్రవృత్తిగల వారిని చట్టంకూడా ఏమీచేయలేని దుఃస్థితిలో ఉన్నదంటే, ఎంతగా వీరి ధనబలం పనిచేస్తున్నదో గమనించవచ్చు. వీరి యీప్రవృత్తికి బ్యాంకులు, సంస్థలు గురి అవుతున్నాయి.

ఇక పాచికలాడటం ఎంతటిదారుణ పరిణామాన్నిస్తుందో మహాభారతం నిరూపించింది.

**"జూదం"** వ్యసనానికి అలవాటుపడ్డ వారి మనస్తత్త్వం ఎలా ఉంటుందో ఈ అక్షసూక్తం మనముందుంచుతుంది. వారికి సమాజంలో ఎదురయ్యే దుర్భరస్థితి ఎలాంటిదో కూడా ఈ సూక్తం విశదపరుస్తుంది. జూదం ఆడటం లోని దోషాన్ని లోకానికి చూపడానికే మహాభారతం పుట్టింది. జూదంవల్లవచ్చే అనర్థాన్ని తెలియజెప్పే నలమహారాజుకథ పురాణాల్లోని గొప్ప ఉదాహరణ.

జూదగాళ్ళ మనఃప్రవృత్తిని గురించి వేదం ఇలా అంటుంది. జూదానికి వెళ్లేవాడు ఈసారి తప్పక గెలుస్తాననే ఆశతో జూదమాడే చోటుకు చేరుతాడట. వీడిలోని ఆశను రెట్టింపు చేస్తాయట ఆటకు ఉపయోగించే పాచికలు మొదలైన సాధనాలు.

కానీ, వీడు ఓడిపోవడం ప్రారంభిస్తే, ఇక వీడి పాట్లు అంతా ఇంతాకాదు. అత్తమామలు బంధువులు ద్వేషిస్తారట. భార్య, వద్దని బ్రతిమాలుతూ అడ్డం పడుతుందట. అయినా వీడిలోని "ఆశ" చావదు. ఓడినకొద్దీ పట్టుదలపెరుగుతుంది. ఈతని దీనస్థితిని చూచి, తోటి జూదగాళ్లు వీనిభార్యపట్ల అమర్యాదగా ప్రవర్తిస్తారట. కలహిస్తున్న వీడిని రాజభటులు బంధించి తీసికొనిపోతుంటే, తెలిసిన వారుకూడా "వీడు మాకు తెలియడని" తప్పించుకుపోతారట. భార్య వీని దుఃస్థితికి దుఃఖ పడుతుందట. వృద్ధురాలైన తల్లి ఇంటిపట్టున ఉండని కొడుకును చూచి తపిస్తుందట. ఇవన్నీ మనం సమాజంలో నిత్యం చూస్తూన్నవే!

అయినా, **'వేదం'** ఎంత అభినివేశంతో ఇలాంటి జూదగాళ్ల దైన్య స్థితిని వర్ణిస్తుందో మనం గమనించాలి. ఇలాంటి మనఃప్రవృత్తి ఇతర దేశాల్లోనూ ఉంది. మనదేశంలోను రోజురోజుకు ఎక్కువైపోతోంది. "జూదం" అనేది ఇక్కడ ఏదో ఒక క్రీడగా కాక, అనాయాసంగా మితిమీరి ధనాన్ని సంపాదించాలనే ఒక దురాశాప్రవృత్తికి ప్రతీకంగా మనం గ్రహించాలని చెప్పాం కదా!

ఇక్కడ యథార్థమైన చిన్న సన్నివేశాన్ని పాఠకుల ముందుంచు తున్నాం.

ఒక వృత్తిలో బాగా సంపాదించే స్థితిలోనే ఉన్న ఒక వ్యక్తి నా కళ్లముందే ఒక చిన్నకొట్టులో లాటరీ టిక్కెట్లు కొంటున్నాడు. ఇదేం పనయ్యా! అని చనువుతో నవ్వుతూ అడిగితే, అతడు ఇలా అన్నాడు. ఈ లాటరీటికెట్టు తగిలితే నా 'కమిట్‌మెంట్స్' అన్నీ తీరిపోతాయి అని.

శ్రమపడి సంపాదిస్తున్నది చాలక, ఇంకా సంపాదించాలనే కోరిక, అందునా శ్రమపడకుండానే సంపాదించాలనే ధోరణి చదువుకున్న ఆ "పెద్దమనిషి"ని కూడా "జూదా"నికి ప్రేరించింది. దీనికి కారణం ఆతని "కమిట్‌మెంట్స్". ఇలాంటి ప్రవృత్తికి ప్రేరించే "కమిట్‌మెంట్స్" గురించి తప్పక ఆలోచించవలసిందే! ఇదే ప్రవృత్తి చాలామందిలో ఉంటున్నది.

జీవితాన్నే ఒక 'జూదం'గా మార్చుకుంటున్న స్థితి, నేటి సమాజంలో చాలా మందిలో కనిపిస్తున్నది. ఇది కేవలం కొందరు వ్యక్తులకే పరిమితమైంది కాదు. ఒక **"సాంక్రామిక వ్యాధి"**. ఇది సమాజాన్నే భ్రష్టుపట్టిస్తుందనడంలో సందేహంలేదు.

**'లాటరీ'**లాంటివాటిని ప్రభుత్వాలే తమ **"కమిట్‌మెంట్స్"** నెరవేర్చుకోవడా నికి బహుకాలంగా ప్రోత్సహిస్తున్నతీరు మనందరకూ తెలుసు. ఇలాంటి ధోరణులను ఎంతమాత్రం ప్రోత్సహించకూడదు.

సమాజంలోని వ్యక్తుల మనోదౌర్బల్యాన్ని అడ్డంపెట్టుకొని, **"మద్యం"** అలవాటు చేస్తున్నట్లే, జూదాన్నీ ప్రభుత్వాలే అలవాటు చేస్తే, ఇక ఈ సమాజాన్ని రక్షించేదెవరు?

సమాజశ్రేయస్సును కాంక్షించే సామాజికవేత్తలు, విజ్ఞులైన రాజకీయ వేత్తలు, సంఘసంస్కరణానికి ఉద్యమిస్తున్న **"జన విజ్ఞాన వేదికలు"** ముందుకు రావాలి. ఈ జాఢ్యపు భయంకరమైన కోరలనుండి భారతీయ సమాజాన్ని రక్షించే ప్రయత్నం చేయాలి.

కొన్ని వేలసంవత్సరాలకు పూర్వమే మనవేదవ్మాయం ప్రారంభించిన ఉద్యమాన్ని మేధావులు గుర్తించి స్పందించవలసిన అవసరం ఎంతైనా ఉంది. అసలు లాటరీలతో సహా, అన్నిరకాల జూదాలను నిర్దాక్షిణ్యంగా ప్రభుత్వాలు నిషేధిస్తే సమాజం బాగుపడు తుందని ఆశించవచ్చు. లేకపోతే ఇంకా అధోగతితప్పదు.

మన ఆచార్యులు, ఇలాంటి వ్యసనాలకు సమాజం బలికాకూడదనే సద్భావనతోనే, సమాజంలో విభిన్న మనస్తత్త్వాలుకల వారి మనశ్శాంతికి తమ తాత్త్విక చింతనారీతులను ప్రచారంచేస్తున్నారు. అయినా ఈ సమాజం మారడం అనేది **"గగనకుసుమం"** గానే గోచరిస్తున్నది. ఇది ఆలోచించదగ్గ తీవ్ర విషయం కాదా! గమనించండి.

"అక్షైర్మాదీవ్యః కృషిమిత్ కృషస్వ"

**జూదమాడకు - కృషిచేసి సంపాదించు**

వేంకట రంగరామానుజాచార్య

---


**శ్రీమతే రామానుజాయ నమః**

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి మంగళాశాసనములతో...**

**రాజమహేంద్రి - రంగధామంలో వేంచేసియున్న**

# శ్రీరంగనాథ పెరుమాళ్ళ 5వ బ్రహ్మోత్సవములకు శుభాహ్వానము

**ది. 02-03-2014 నుండి 05-03-2014 వరకు జరుగును.**



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

## (1వస్కంధం - 12-13 వ అధ్యాయాలు)

*గత సంచిక తరువాయి)*

**'పరీక్షిత్'** అనే అన్వర్థనామంకల రాజపుత్రుడు, శుక్లపక్షంలోని చంద్రుడు దిక్కులను తన కాంతులతో నింపినట్లుగా, ధర్మజుడు మొదలైన తండ్రులచే సముచితాలైన కామనలతో వృద్ధిపొందింపబడి పాండవ వంశాన్ని తన కీర్తులతో నింపాడు.

ఇక, ధర్మజుడు యుద్ధంలో మరణించిన జ్ఞాతుల మూలంగా ఏర్పడిన పాపాన్ని పోద్రోలడానికి అశ్వమేధయాగాన్ని చేయాలని నిశ్చయించాడు. దీనికొరకు కావలసిన గొప్ప ధనాన్ని సంపాదించడానికి ధర్మబద్ధంగా ప్రజలు చెల్లించే పన్ను, దుష్టులను నిగ్రహించడంవల్ల ఏర్పడే ధనం తప్ప మరొక విధానంలేదని భావించాడు.

అయితే, ఈరెండు విధానాలద్వారా లభించే ధనం ప్రజాభరణానికి సరిపోతుంది కనుక, అధిక ధనం ఎలా లభిస్తుందని యోచిస్తున్న ధర్మజుని కామనను పూరించడానికి, సోదరులు విభిన్న దిక్కులకు దండెత్తివెళ్లారు.

మరుత్తు యజ్ఞంచేసినప్పుడు విడచిపెట్టిన సువర్ణపాత్రాదులను సంపాదించి తెచ్చారు. తాను సోదరముఖంగా సాధించిన ధనంతో యుధిష్ఠిరుడు అశ్వమేధాన్ని నిర్విఘ్నంగా పరిసమాప్తం కావించాడు. ఇదే క్రమంలో జ్ఞాతివధవల్ల వచ్చే పాపాన్ని పరిహరించాలనుకొని మూడు అశ్వమేధాలు నిర్వహించాడు యుధిష్ఠురుడు.

అశ్వమేధం ద్వారా శ్రీహరినే ఆరాధించాడు. యుధిష్ఠిరునిచే ఆహ్వానింపబడివచ్చిన అచ్యుతుడు రాజుచేత, బ్రాహ్మణాదులచేత ప్రార్థింపబడి కొన్నినెలలు హస్తినలోనే ఉండి, యుధిష్ఠిరుని అనుమతిని పొంది, యాదవులతో కలసి, అర్జునునితోపాటు ద్వారకకు వెళ్లాడు.

### 13వ అధ్యాయం

**సూతుడు ఇలా అంటున్నాడు...**

తీర్థయాత్రలో, విదురుడు మైత్రేయునిద్వారా "ఆత్మగతి"ని గురించి తెలిసికొన్నాడు. ఇలా మైత్రేయముఖంగా తాను తనకు ప్రాప్యమైన తత్త్వంగా తెలిసికొన్న దానిని, విశేషంగా ధ్యానముఖంగా సాక్షాత్కరింప గోరి ముందుగా హస్తినకు వెళ్లినాడట.

మైత్రేయుని ఎదుట తాను వేసిన మూడునాల్గు ప్రశ్నలచేత తానెరుగ గోరిన తత్త్వాన్ని శ్రీహరిరూపమేనని నిశ్చయించి, పరిపూర్ణభక్తిని పొందినవాడై కృతార్థుడైనాడు విదురుడు. హస్తినకు చేరిన విదురునికి ధర్మరాజు తన సోదరులతో స్వాగతం పలికాడు. ధృతరాష్ట్రుడు, యుయుత్సువు, సూతుడు, శారద్వతుడు, కుంతి, గాంధారి, ద్రౌపది, సుభద్ర, ఉత్తర, కృపి, ఇంకా ఇతరులైన జ్ఞాతిభార్యలు, స్త్రీలు సానందంగా స్వాగతించారు. ఆనంద బాష్పాలను విడచి విరహదుఃఖాన్ని విడచి పెట్టారు. భోజనాదులతో ఆదరించినరాజు, దరిచేరి సుఖాసీనుడై విదురునితో సాదరంగా సంభాషించాడు.

"ఓ విదుర మహాశయా! మీ చ్ఛాయలో పెరిగిన మమ్ము మీరు స్మరిస్తున్నారు కదా! మీ రక్షణం చేతనే విషం, అగ్నిదాహం, మొదలైన పలుక్లేశాల నుండి మేమంతా బయల్పడగలిగాం. పలు ఆపదలు దాటాము. ఈ భూమండలమంతా సంచరించిన మీరు, ఏవిధంగా జీవనం సాగించారు? ఏయే తీర్థాలు, క్షేత్రాలు, సేవించారు?

**భవద్విధా భాగవతాః తీర్థభూతాః స్వయంప్రభో ।**
**తీర్థీకుర్వన్తి తీర్థాని స్వాన్తస్థేన గదాభృతా ॥**

మీబోటి భాగవతోత్తములు స్వయంగా తీర్థాలవంటివారు. మీ హృదయం లోపలనే కొలువున్న గోవిందునిచే తీర్థాలనే పరమపావన తీర్థాలు చేస్తారు మీరు. ఓవిదురా! శ్రీకృష్ణనే పరమదైవతంగా సంభావించే మన బాంధవులందరినీ మీరు దర్శించారా? వారి గురించి విన్నారా? ఆ యాదవులంతా తమ పురాల్లో క్షేమంగానే ఉన్నారు కదా? ఇలా ప్రశ్నించిన ధర్మజునికి విదురుడు విస్తారంగా వారి కుశల వార్తలను వివరించాడు. అయితే, క్రమంగా అన్నీ చెప్పాడు, కాని యదుకుల నాశనాన్ని గురించి మాత్రం చెప్పలేదు.

**నన్వప్రియం దుర్విషహం నృణాం స్వయముపస్థితం ।**
**నావేదయత్ సకరుణో దుఃఖితాన్ ద్రష్టుమక్షమః ॥**

యాదవులంతా ఒకరినొకరు కొట్టుకొని నశించిపోయారన్న వార్త, ధర్మరాజాదులకు చాలా దుఃఖాన్ని కలిగించేది. దుర్భరమైంది. అనుకోకుండా వచ్చిపడ్డ ఇలాంటి దుర్భర వినాశనాన్ని మానవులు తట్టుకోలేరు. ఈవార్త చెబితే దుఃఖపడే వారి దుఃఖాన్ని చూడలేక, ఈదుర్వార్తను విదురుడు చెప్పలేదు.

తన వారిచే సత్కరింపబడి, తన జ్యేష్ఠభ్రాత అయిన ధృతరాష్ట్రునికి శ్రేయస్సును కలిగింపగోరి, అందరకు ప్రీతిని కలిగించే ఆ విదుర మహాశయుడు కొంతకాలం హస్తినలో ఉన్నాడు.

ఇక్కడ విదురుని జన్మవృత్తాంతాన్ని సూతుడు స్మరింపజేస్తున్నాడు.

**అబిభ్రదర్యమాదండం యథాఘమఘకారిషు ।**
**యావద్దధార శూద్రత్వం శాపాద్వర్షశతం యమః ॥**

విదురుడు పూర్వజన్మలో యముడు కాగా, ఆతని తండ్రి 'అర్యమ' (సూర్యుడు) ఆతనిని శాపగ్రస్తునిచేసి దండించాడు. పాపాలు చేసిన వారిని

వారివారి పాపాలకు తగిన విధంగా దండించడమే ఆతని ధర్మంకదా! ఆ దండనం మూలంగానే నూరుసంవత్సరాలు భూమిపై శూద్రజన్మనెత్తాడు యముడు.

ఈవృత్తాంతాన్ని శ్రీధరస్వామి తన వ్యాఖ్యలో ఇలా ఉట్టంకించారు. “ఒకచోట చోరులను వెంటతరుముతున్న రాజభటులు, మాండవ్యుడనే ఋషి తన ఆశ్రమ సమీపంలో తపస్సు చేస్తున్నప్పుడు ఆతని సమీపంలో చోరులను పట్టుకొని, వారితోపాటుగా మాండవ్యుని కూడా బంధించారు.

రాజుకు నివేదించి, ఆతని ఆజ్ఞచే చోరునితో పాటు, ఆ మాండవ్య మహర్షిని కూడా శూలానికి గ్రుచ్చి దండించారు. ఆతరువాత రాజు, మాండవ్యుని ఋషిగా గుర్తించి, శూలంనుండి దించి, అనునయించాడు.

అప్పుడు ముని యమలోకానికి వెళ్ళి ‘నేను శూలారోపణాన్ని పొందదగిన నేరం ఏమి చేశానని’ ప్రశ్నించాడు.

దానికి యముడు ‘నీవు బాల్యంలో మిడతను కుశపుముల్లుతో పృష్ఠాన పొడిచి క్రీడించి ఆనందించావు దానిఫలమే ఇది’ అని సమాధానించాడు.

‘బాల్యంలో తెలియక చేసిన తప్పును మహాపరాధంగా నన్నెలా శిక్షిస్తావని’ ఎదురుప్రశ్న వేసి యముని, శూద్రుడవు కమ్మని’ శపించాడు.

ఈ విధంగా విదురుడు శూద్రునిగా శాపవశాన మరుజన్మనెత్తిన యముడేనని పూర్వవృత్తాంతాన్ని గుర్తుచేశాడు పురాణకర్త. సూతుడు అటుతరువాత కథను చెబుతున్నాడు.

ధర్మరాజు, రాజ్యాన్ని పొందిన తరువాత, తన వంశాన్ని నిలబెట్టే పౌత్రుని చూచి, లోకపాలురవంటి సోదరులతో కూడి మహైశ్వర్య సంపన్నుడై ఆనందించాడు. ఇక, కృష్ణుడు బంధువులందరినీ వీడ్కొలిపి, అర్జునుడు, ఉద్ధవుడు, మొదలైన వారితో చుట్టువారి, ద్వారవతీ నగరానికి వెడలిపోయాడు.

**ఏవం గృహేషు సక్తానాం ప్రమత్తానాం తదీహయా ।**
**అత్యక్రామద విజ్ఞాతః కాలఃపరమదుస్తరః ॥**

కాలం చాలా విచిత్రమైంది. మనం గడవాలనుకున్నా, అనుకోక పోయినా దానంతట అది గడుస్తూనే ఉంటుంది. కానీ, ఈ సాంసారిక జీవనంలో సంసారప్రీతితో ఏమరచి ఉన్న గృహస్థులైన సామాన్య జనులకు దాటరానిదైన ఆకాలం తెలియకుండానే దాటిపోతుంది.

కాలాన్ని మనం దాటలేం, కానీ మనకు తెలియకుండానే పరమ దుస్తరమైన (మిక్కిలి దాటరానిదైన ఆకాలం) దాటిపోతుంది. అది దాటిపోయిన తరువాత మాత్రమే మనం దాని పోకడను గుర్తింప గల్గుతాం తప్ప, అది గడుస్తున్నప్పుడు దాని పోకడను జాగరూకతతో గమనించే ఏకాగ్రత మన కెంత మాత్రం ఉండదంటాడు పురాణకర్త.

కాలగతిని గమనించకపోవడానికి కారణం, సంసార రసాస్వాదన లంపటులు అవడమేనంటుంది భాగవతం. ‘గృహాసక్తి’ ప్రమత్తత’ (ఏమరుపాటు) ఈరెండే కాలగతిని మానవులు గుర్తించలేకపోవడానికి కారణమన్నమాట. ఇలా కాలగతిని ఎరిగినవాడు కనుక, విదురుడు, కాలోచితంగా ప్రవర్తించమని ధృతరాష్ట్రునికి ఉపదేశించడానికి ఉద్యమించి ఇలా అంటున్నాడు.

**కాలగతి నిరూపణం**

ఓరాజా! (ధృతరాష్ట్రా) త్వరగా గృహాన్ని విడచి బయలుపడు. ఇదుగో గొప్పభయం వచ్చిపడిందని గుర్తించు. ఈ వచ్చిపడిన భయానికి, ప్రతిక్రియ అనేది ఏవిధంగాను, ఎక్కడనుండి సాధ్యంకాదు సుమా!

**విదురస్తమభిప్రేత్య ధృతరాష్ట్రమభాషత ।**
**రాజన్నిర్గమ్యతాం శీఘ్రం పశ్యేదం భయమాగతమ్ ॥**
**ప్రతిక్రియా నయస్యేహ కుతశ్చిత్ కర్హిచిత్ ప్రభో ।**
**సఏష భగవాన్ కాలః సర్వేషాం హ సమాగతః ॥**

అంతటి భయం ఏమొచ్చింది? అంటే, భగవత్స్వరూపమైన కాలం మనందరికి దగ్గరకు వచ్చిందంటున్నాడు విదురుడు.

**‘భగవాన్ కాలః’** అనడం చేత కాలం భగవత్ స్వరూపమేనని, భగవానునికున్న వ్యక్తం, అవ్యక్తం, పురుషుడు, కాలము అనే నాల్గురూపాలలో కాలం ఒకరూపమని స్పష్టపరుపబడుతున్నది. ఈకాలం ఎంతటి ప్రబలమైందో చెబుతున్నాడు. ఇది (ఈకాలం) ప్రాణులకు ఎంతో ప్రియాలైన ప్రాణాలనే ఆపదలపాలు చేస్తుంది. ఇక ధనాది ప్రీతికర వస్తువులను గురించి చెప్పేదేముంది ?

**యేనచేహాభిపన్నోఽయం ప్రాణైః ప్రియతమైరపి ।**
**జనస్సద్యోవిముచ్యేత కిముతాన్యైర్ధనైరపి ॥**

(ప్రియతమైః) అనడం చేత ఈ అభిప్రాయం స్ఫురిస్తున్నది.

ఏ ప్రాణి కావాలని ప్రాణాలను విడచిపెట్టదు. ప్రాణాలకు ఆపదలు కొనితెచ్చిపెట్టుకోదు. కాని, కాలం చూస్తూ ఊరుకోదు. ఆపదను కలిగించాలని తాను సమకట్టి ప్రవర్తించినప్పుడు, ఎంతటి ప్రీతికర వస్తువునైనా క్షణంలో దూరంచేసి వేస్తుంది కాలం. ప్రాణాలు ప్రాణులకు అత్యంత ప్రీతికరాలు. అయినా వాటినీ తీసికొని పోతుంది. ఇంక తక్కిన ధన, కనక, వస్తు, వాహనాదుల గురించి చెప్పేదేముంది. కాలం తలచుకుంటే దేన్నైనా పట్టుకుపోగలదన్నమాట.

**పితృ-భ్రాతృ-సుహృత్-పుత్రాః హతాస్తే- విగతం వయః ।**
**ఆత్మా చ జరయాగ్రస్తః, పరగేహముపాససే ॥**

ఓ ధృతరాష్ట్రా! నీ దుఃస్థితి ఎలాంటిదో ఒకసారిచూడు, నీతండ్రి, సోదరుడు, మిత్రులు, పుత్రులు, అంతా చంపబడ్డారు. ఇక వయస్సా! దాటిపోయింది. నీశరీరం ముదుసలితనాన్ని పొంది పనికిరాని దశకు చేరింది. అయినా పొరిగింట పడి కాలక్షేపం చేస్తున్నావు. ఇంతకంటే దుర్భరస్థితి ఏముంది ?

**అనాయాసేన మరణం వినాదైన్యేన జీవనం** అంటారు పెద్దలు.

‘క్లేశపడకుండా ప్రాణాలు పోవడం, దైన్యం, దేబిరింపులు, లేకుండా బ్రతకగలగడం’ ఇవే కదా ఎవరైనా కోరేది! మరి నీవో, ఈదుర్భర దశలో కూడా పరుల పంచనపడి దేహయాత్ర సాగిస్తున్నావు. ఇంతకంటే దైన్యస్థితి మరేముంది? అని ధృతరాష్ట్రుని దుర్భరస్థితిని ఎత్తి చూపిస్తున్నాడు విదురుడు.

ధృతరాష్ట్రుని వ్యాజంగా చేసుకుని వృద్ధతాదశలో ఉన్న ఎవనికైనా ఈ ఉపదేశం అందేలా విదురుడు మాట్లాడుతున్నాడు. *(సశేషం)*



# అహో! భారతమ్

(జనవరి సంచిక తరువాయి)

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

ఈ మానవాకారం ఇలా రెండుముక్కలుగా... అయ్యో! ఎందుకిలా జరిగింది. భర్తకి తెలిస్తే... బాబోయ్ ... కంగారు పడిపోయారు రాజపత్నులు. పనివాళ్ళని పిలిచారు. 'ఇదుగో ఎవ్వరికీ తెలియకుండా ఈ ముక్కల్ని బయట దూరంగా పడేయండి. తొందరగా... ఊఁ... పనికత్తెలు ఆ రెండు శరీరభాగాల్ని వెంటనే తీసుకొని వెళ్ళి రాజభవనానికి కొంచెం దూరంగా విసిరేసి వచ్చేశారు.

జర... అదొక పేరు. ఆ పేరుతో ఒక రాక్షసి అటు ఇటు తిరుగుతూ ఉండేది. ఆవిడ సరిగ్గా అటువైపు వచ్చి 'ఏమిటీ నరవాసన!' అనుకొంటూ ఆనందంగా చేతుల్లోకి తీసుకొంది. తీరా చూస్తే... సగం సగం... ముక్కలు. కదులుతూ ఉన్న ఆ రెండు ముక్కల్ని దగ్గరగా కలిపి పట్టుకొని తీసుకొని పోదామని దగ్గరచేసింది. ఆశ్చర్యం! ఆ రెండుముక్కలూ ఒకదానితో ఒకటి చక్కగా అతుక్కున్నాయి. చూస్తుండగా ఒక బాలుడు రూపొందాడు. ఆశ్చర్యపోయింది. ఇదేమిటి? చిన్నారి బాలుడు... ఓహ్ ఇంత బరువున్నాడేమిటి? అబ్బ – నేనే ఎత్తలేకపోతున్నానే.. అనుకుంటూండగా గొల్లుగొల్లుమని ఏడవడం మొదలు పెట్టాడు ఆ పసివాడు. ఆ ఏడుపు విని వాణ్ణి విడిచి పెట్టేసి వెళ్ళిపోతోంది జర.. ఇంతలో ఏడ్పు విని అంతఃపురంలో నుండి పనికత్తెలు... పెద్దలు చివరికి రాజుగారు కూడా వచ్చేశారు. పనివాళ్ళు ఆ పసివానిని ఎత్తుకున్నారు.

చూశాడు రాజు. మహానందభరితుడయ్యాడు. అపుడు జర ఒక మానవకాంతగా మారిపోయి రాజు దగ్గరికి వచ్చింది. "రాజా! నేను జర అనే రాక్షసిని. ఈ నగరంలో హాయిగా విహరిస్తూ ఉంటున్నాను. నీ భార్యలకి రెండు మానవదేహభాగాలు పుట్టాయి. వాటిని నీ పనివాళ్ళు ఇదుగో ఇక్కడ పడేశారు. నేను ఇటుగా వచ్చి ఈ రెండుముక్కల్ని కలిపి పట్టుకోగానే... రెండూ కలసిపోయి ఈ బాలుడు రూపొందాడు. వీడు సామాన్యుడు కాడు. వజ్రదేహుడు. నువ్వు వీడిని ప్రేమతో పెంచుకో! నీకు ఉపకారం చెయ్యాలని వీడిని నీకిస్తున్నాను" అంది.

ఆనందంతో రాజు ఒక్కనిముషం మాటాడలేకపోయాడు. 'అమ్మా! నువ్వేమిటి? రాక్షసివేమిటి? నా వంశాన్ని ఉద్ధరించే పుత్రుని అందించిన పుణ్యమూర్తివి. నీచేత కలుపబడి వీడు ఏర్పడ్డాడు. జర సంధించిన రూపం వీడిది. కాబట్టి వీడికి **జరాసంధుడు** అని పేరు పెడుతున్నాను. నీకు ప్రతి సంవత్సరం ఈరోజు ప్రత్యేక పండుగ చేయిస్తాను అని నమస్కరించాడు. భార్యలచేతికిచ్చాడు పుత్రుణ్ణి. ప్రేమతో పెంచారు బాలుణ్ణి.

ఒకసారి చండకౌశికుడు బృహద్రథుని దగ్గరకు వచ్చాడు. యోగదృష్టితో తనకంతా తెలిసిందని రాజుకు చెప్పాడు. జర నీకెంతో ఉపకారం చేసింది. ఈ బాలుడు కుమారస్వామి అంతటి శక్తి సంపన్నుడు ఔతాడు. మృత్యుంజయుని ప్రత్యక్షం చేసుకుంటాడు. ఎంతటి వీరులైనా ఇతని బలపరాక్రమముల ముందు నిలువలేరు. పరరాజ సంపదల్ని కైవసం చేసుకుంటాడు అంటూ అతని సామర్థ్యాన్ని పొగడి ఆశీర్వదించి వెళ్ళిపోయాడు. క్రమంగా పెరిగి పెద్దయ్యాడు జరాసంధుడు. అతనికి పట్టాభిషేకం చేసి రాజ్యభారం అప్పగించి భార్యలతో కలసి తపోభూమికి వెళ్ళిపోయాడు బృహద్రధుడు. ధర్మరాజా! ఇదీ జరాసంధుని కథ. అలాంటి బలవంతుని నువ్విప్పుడు జయించాలి. రాజసూయయాగం చెయ్యాలి. జరాసంధుడు బంధించిన రాజులందరికీ మోక్షం – విడుదల కల్పించాలి' అన్నాడు శ్రీకృష్ణుడు.

'శ్రీకృష్ణా! నీ ఆశీస్సులే ఉంటే నేను, మా అర్జునుడు నీ సహాయంతో ఈ ప్రపంచాన్నే గెలువగలం' అన్నాడు భీముడు. ఆ జరాసంధుని దగ్గర హంసుడు – డిభకుడు అని ఇద్దరు వీరులున్నారు. వాళ్ళకి ఏ ఆయుధాలచేత కూడా మరణం లేదు. ఇది వారికొక వరం. వారి సహాయ సహకారాలతో విజృంభిస్తు న్నాడు జరాసంధుడు.

మరి ఆ హంసడిభకులను చంపడమెలా?

ఒక యుద్ధంలో హంసుడనే వాడొకడు మరణించాడు. ఆ పేరునుపయోగించుకొని 'హంసుడు మరణించాడు' అంటూ డిభకునికి చెప్పారు. 'అయ్యో! నా ప్రాణమిత్రుడు హంసుడు పోయాడా...! ఇంక నా జీవితం ఎందుకూ...!?' అనుకుంటూ డిభకుడు నీళ్ళలో మునిగి స్వయంగా ప్రాణాలు తీసుకున్నాడు. ఇతని మరణం విని హంసుడు పాపం, బాధ తట్టుకొనలేక ప్రాణాలు విడిచేశాడు. అలా హింసడిభకులు జరాసంధునికి దూరమయ్యారు. వారి మరణం జరాసంధుని క్రుంగదీసింది. అతనిలో మరింత క్రూరత్వం పెరిగింది. రాజులందరినీ పట్టి బంధించేశాడు. రోజూ ఒక్కొక్కరిని వధించి భైరవపూజలు చేస్తున్నాడు. ఆ నీచుని సహరించడం చాలా ముఖ్యం.

పూర్వం భగీరథుడు ప్రజలను రక్షించి సమస్త సామ్రాజ్యం పొందాడు. భరతుడు భుజబలంతో పొందాడు. కార్తవీర్యుడు తపోబలంతో సాధించాడు. ధర్మరాజు ఈ బలాలు అన్నీ కలిగినవాడు కాబట్టి రాజసూయం చేయగలడు.

జరాసంధుని వధించగల శక్తిసామర్థ్యాలు భీమునికున్నాయి. ఆ విషయాన్ని శ్రీకృష్ణుడు ఎంతో యుక్తియుక్తంగా చెప్పాడు. ఆయుధాలచేత

మరణం లేదని జరాసంధుడు పొందినవరం. అందుచేత భీమునితో మల్లయుద్ధం చేస్తే ఆయుధాల గొడవే ఉండదు. ఇదీ శ్రీకృష్ణుని యుక్తి.

శ్రీకృష్ణుని మాటలకు పొంగిపోయారు పాండవులు. ధర్మరాజు తమభారం శ్రీకృష్ణుని భుజస్కంధాలపై మోపాడు. నిశ్చింతగా ఉన్నాడు. వారికి అనుమతినిచ్చాడు.

శ్రీకృష్ణ భీమార్జునులు బయలుదేరారు. కాలకూట, శోణ, గండకీ, సదానీరాలనే నదులను దాటారు. ప్రయాణం చేసిచేసి మగధదేశం చేరారు. గిరివ్రజమనే పట్టణం ప్రవేశించారు. ఆ పట్టణానికి పెట్టని కోటల్లా ఐదుకొండలున్నాయి. గోరథం, ఋషభం, వైహారం, ఋషగిరి, చైతన్యకాద్రి అనేవి ఆ ఐదుకొండలు. అవి చుట్టి ఉండడం చేత ఆ పట్టణం గిరివ్రజమైంది. చైత్యకమనే కొండనెక్కారు. అక్కడ ప్రాచీన మగధ రాజులు 'మానుషాద' మనే ఎద్దును చంపి దాని చర్మంతో మూడుఢక్కలను నిర్మించారు. ఎవరైనా క్రొత్తవాళ్ళు ఆ పురం తిరిగి వస్తే అవి వాటంతటవే మ్రోగుతాయి. అలాంటి భేరుల్ని పగుల గొట్టేశారు. చైత్యక పర్వతం మధ్య పగులగొట్టి ద్వారం చేసుకొని ద్వారం కాని ద్వారం ద్వారా గిరివ్రజపురం చేరారు.

పువ్వులు అలంకరించుకున్నారు. గంధం అగరులు పూసుకున్నారు. వీరిరాక విని జరాసంధుడు ఎదురువచ్చాడు. మధుపర్కాలీయ బోయాడు. వారు స్వీకరించలేదు. నిజంగా మీరెవరు? ఎందుకిలా దారికాని దారిలో వచ్చాడు అన్నాడు. శత్రువుల ఇంటికి ద్వారం గుండా వెళ్ళకూడదని ఇలా వచ్చామన్నారు. 'మీకూ... నాకూ శత్రుత్వమేమిటి? నువ్వు రాజులను హింసిస్తున్నావు. బంధిస్తున్నావు. రాజులని బలి యిచ్చే శివపూజ ఎవరైనా చేశారా పూర్వం? ఆ పనిచేస్తున్నావు. ధర్మరక్షణ చేయవలసిన మేము చూస్తూ ఎలా ఊర్కోగలం? ఎంతటి వీరులైనా అవినీతిపరులై, మహాత్ములను అవమానిస్తే అపజయం పాలుగాక తప్పదు. నామాట విను. రాజుల్ని విడిచి పెట్టు. నేను శ్రీకృష్ణుణ్ణి. ఇతడు భీముడు. ఇతడు అర్జునుడు. రాజులను రక్షించాలని వచ్చిన వీరులు. మాట వినకపోతే నీ అహంకారాన్ని అణచివేయగల సమర్థులు అన్నాడు. అయితే నేను మీతో యుద్ధం చేస్తా... ముగ్గిరితోనా! ... ఒక్కొక్కరితోనా? అన్నాడు. ఒక్కరితో ఒక్కరు యుద్ధం చేయడమే ధర్మం.

'భీమునితో మల్లయుద్ధం చెయ్యి' అన్నాడు శ్రీకృష్ణుడు.

'నాకు సరిజోడు భీముడే... సరే!' అన్నాడు జరాసంధుడు.

ముందుగా తన కొడుకు సహదేవునికి మగధరాజ్య పట్టాభిషేకం చేశాడు. ఏమో... ఎందుకైనా మంచిదని ఊహించాడు. మల్లవీరులుగా భీమ – జరాసంధులు ఎదురెదురయ్యారు. యుద్ధోత్సాహం మితిమీరి పోయింది. భయంకర యుద్ధానికి దారితీసింది. సింహ–గజేంద్ర, వజ్ర పర్వత, ఇంద్ర–వృత్రాసురులుగా యుద్ధం సాగించారు.

కార్తీక శుద్ధ పాడ్యమినాడు ప్రారంభమైన యుద్ధం చతుర్దశి దాకా సాగింది. క్రమంగా జరాసంధుడు బలహీనుడయ్యాడు. గుర్తించారు భీమాదులు. శ్రీకృష్ణ ప్రబోధంతో తన తండ్రి వాయుదేవునికి నమస్కరించి అధికబలోపేతుడయ్యాడు భీముడు. జరాసంధుణ్ణి ఎత్తి త్రిప్పి త్రిప్పి పడేశాడు.

జరాసంధుని చంపడానికి శ్రీకృష్ణుడు భీమునికి ఒక సంకేతం చూపించాడు. ఒకరకమైన గడ్డిని తీసుకొని రెండుగా చీల్చి పక్కన పడేశాడు. ఓహో – చీల్చేయమంటావా! అని ఆ సంకేతాన్ని గ్రహించి అతని శరీరాన్ని ఒక పాదంతో త్రొక్కిపట్టి అతని శరీరాన్ని రెండుగా చీల్చాడు. ఆశ్చర్యం... చూస్తుండగా ఆ రెండు ముక్కలూ మళ్ళీ అంటుకుపోయాయి. మళ్ళీ యుద్ధం... ఇదేమిటి? ఆశ్చర్యపోతున్నాడు భీముడు.

మళ్ళీ శ్రీకృష్ణుడు ఒక గడ్డిపఱకను తీసుకొని రెండుగా చీల్చి ఇటుముక్కని అటు, అటు ముక్కని ఇటు విసిరాడు. చూశాడు భీముడు. ఓహో కేవలం రెండుగా చీలిస్తే సరిపోదు. విపరీతదశలో అటుది ఇటు, ఇటుది అటు పడెయ్యాలా... సరే నంటూ ఆ సంకేతాన్ని అందుకొని జరాసంధుని పడేసి ఒంటికాలిపై పెట్టి రెండుగా చీల్చి వ్యతిరేకదిశగా పడేశాడు. అంతే అవి మళ్ళీ అతుకుకొనలేకపోయాయి. ఆ శరీరంలో నుండి క్రొవ్వు, రక్తం, ఎముకలు జారి పడ్డాయి. తల, శరీరం అంతా– అలా రెండుగానే అటు ఇటు ఉండిపోయాయి. అంతే!

విజయగర్వంతో భూమండలం దద్దరిల్లేలా అరిచాడు. ఇది భీముని మల్లయుద్ధ పద్ధతి. హిడింబాసురుని, బకాసురుని కూడా ఇలాగే చంపాడు మల్లయుద్ధంలో... ఇలాగే అరిచాడు.

జరాసంధుని పుట్టుకలో పెద్ద ఏడుపు – మరణంలో భీముని దారుణమైన అరుపు. ఈ రెండు శబ్దాల మధ్య ముగిసింది జరాసంధుని జీవితం. భవన ద్వారతోరణం దగ్గరికి విసిరేశాడు ఆ దేహాన్ని. ప్రజలంతా హడలిపోయారు.

అభయ హస్తాన్ని చూపించాడు శ్రీకృష్ణుడు. జరాసంధుడు బంధించిన రాజులనందరినీ విడిపించాడు. జరాసంధుని పుత్రుడైన సహదేవునికి ధైర్యం చెప్పాడు. మగధ రాజ్యానికి నీవే రాజువి అని అభిషిక్తుని చేశాడు. జరాసంధుని రథాన్ని తెప్పించాడు. ఆశ్చర్యంగా చూస్తున్నారందరూ.

శ్రీకృష్ణుడా రథాన్ని చూస్తూ "పూర్వం తారకాసురునితో యుద్ధం చేసినప్పుడు ఇంద్రుడెక్కిన రథమిది. ఇంద్రుని నుండి వసుమహారాజు పొందాడు. అతని నుండి బృహద్రథుడు సంపాదించాడు. తండ్రి రథం జరాసంధుడు గ్రహించాడు" అంటూ ఆ రథంకథ చెప్పి భీమార్జునులతో ఆ రథమెక్కాడు.

ఒక్కసారి గరుత్మంతుని తలచాడు. వెంటనే గరుత్మంతుడు ప్రత్యక్షమై వినయంగా శిరసు వంచి నమస్కరించాడు. ఆ రథానికి గరుత్మంతుని సారథిగా నియమించాడు. మనోవేగ వాయువేగాలతో శ్రీకృష్ణ భీమార్జునులు ఇంద్రప్రస్థం చేరారు. *(సశేషం)*



# రామాయణంలో జంటలు
# భరత - లక్ష్మణ సోదరులు



*నవంబరు సంచిక తరువాయి*

శ్రీరామునికి సర్వకాల సర్వావస్థలలోను సర్వవిధ కైంకర్యములు చేయాలన్న ఆశతో, అన్నవెంటే నీడలా అరణ్య ప్రవేశం చేసిన లక్ష్మణుని శేషత్వ వైభవాన్ని గతసంచికలో తెలుసుకున్నాం.

ఇక శ్రీరాముని సోదరులలో పెద్దవాడు, కైకేయీ సుతుడైన భరతుని గురించి, శ్రీరామునిపట్ల అతనికున్న సేవాభావనలను గురించి తెలుసుకుందాం!

లక్ష్మణుడు **బాల్యాత్ ప్రభృతి సుస్నిగ్ధః** పసితనం నుండి వీడక, వీడితే ఉండలేక భౌతిక, మానసిక, ఆత్మీయస్థాయిలలో శ్రీరాముణ్ణే అనుసరించ గలిగాడు. భరతునికి రామునిపట్ల ప్రీతి మదినిండుగా ఉంది. అయితే, అన్నివేళలా భౌతికంగా రాముణ్ణి అనుసరించినట్లుగ కనబడడు. కాని, మానసికభావనలలో గాని, ఆత్మీయంగ శ్రీరాముని పరాత్పరునిగ భావించి సేవించడంలోనేమి, నిష్ఠ కలవాడే భరతుడు కూడా! అదెలానో అయోధ్యకాండ ఉత్తరభాగంలో వివరించారు వాల్మీకి మహర్షి.

శ్రీరామ వనవాసానికి, తండ్రియైన దశరథుని పరలోక గమనానికి కారణం కైకేయేనని విన్న వెంటనే దుఃఖంతో చలించిపోయాడు భరతుడు. సకల సుగుణాభిరాముడైన మా అన్నగారిని అన్యాయంగ అరణ్యంపాలు చేశావని, తండ్రి మరణానికి కారణమయ్యావని దుఃఖావేశంలో కైకమ్మని నిందించాడు. అంత దుఃఖంలోను సోదరుని గుణాలని తలచుకుని తల్లిని దూషిస్తాడు.

**"అపాపదర్శనం శూరం కృతాత్మానం యశస్వినమ్...."**

"ఎవరినైనా ఇబ్బంది పెట్టే ఏ చిన్ని పాపమూ ఎన్నడూ చేయని వాడు మా అన్న రాముడు. అసలు ఎవరిపట్లా మనసులో కూడా పాపచింతన లేనివాడే మా రాముడు. గొప్పశూరుడు, కీర్తిమంతుడు అయిన రాముడు నీకు ఏమి అపకారం చేశాడని అడవులపాలు చేశావు?

తన తల్లి కౌసల్యపట్ల ఉన్నంత భక్తి ప్రపత్తులనే నీపట్ల చూపించాడే! అలాంటి రాముని నిర్దయగ వనవాసానికి ఎలా పంపమన్నావు? కేవలం నాకు రాజ్యం సంపాదించాలన్న తీవ్రమైన కోరికతోనే కదా! ఇంత పాపానికి ఒడిగట్టావు. కొడుకుని అడవికి పంపి, భర్త ప్రాణాలు తీసిన నిన్ను నేను క్షమించలేను. మా అన్నదమ్ముల్ని విడదీసిన నీ దురాశను నేను తీర్చలేను" అని నిందించాడు.

ఆ దుఃఖావేశంలో, ఇంత పాపానికి ఒడిగట్టి, కుటుంబాన్ని ఛిన్నా భిన్నం చేసి, లక్ష్మణుడిలానే రాముని సేవలో గడపాల్సిన నా జీవితాన్ని అంతం చేసేసిన నిన్నసలు నా తల్లిగానే అంగీకరించను అంటాడు పాపం భరతుడు.

కాని, అంతలోనే తన దాసభావాన్ని గుర్తు తెచ్చుకుంటాడు.

**న మే వికాంక్షా జాయేత త్యక్తుం త్వాం పాప నిశ్చయాం**
**యది రామస్య నాపేక్షా త్వయి స్యాత్ మాతృవత్ సదా!**

నిజానికి, నీవు చేసిన ఈ అకృత్యానికి నేను నిన్ను తల్లిగా ఇకపై భావించలేను. నిన్ను వదిలి పెట్టేయాలని ఉంది. కానీ రామునికి నీపై ఎంత ప్రేమ! నిన్ను ఎల్లప్పుడూ కౌసల్యమ్మతో సమానంగా ఆరాధించాడు. ఇప్పుడు నేను నిన్ను వదిలిపెట్టినా, ద్వేషించి దూషించినా రాముని మనసే బాధపడుతుంది. కనుక నిన్నేమీ చేయలేకపోతున్నాను అంటూ విలపించాడు భరతుడు. అంటే, తాను రామునికి సర్వవిధాలా దాసుడనని భావించాడు. భరతునిలోని దాసత్వం ఎంతటిదో గమనించాలి.

భరతుడు రాముని కేవలం సోదరునిగ మాత్రమే ప్రేమించలేదు

**వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే** సాక్షాత్తు వేద ప్రతిపాద్యుడే శ్రీరాముడని దశరథుని తనయునిగ ఆవిర్భవించాడన్న పరతత్త్వజ్ఞానం కల జీవునికి ప్రతీక భరతుడు. కనుకనే రాముని పరోక్షంలో కూడా మనసా అతనికే పరతంత్రుడై ఉన్నాడు. తను, ధన, మాన, ప్రాణములతో పాటు ఆత్మపర్యంతము రామునికే చెంది, వానిప్రీతికే వినియోగ పడా లన్న తపన భరతుని పారతంత్ర్య పరాకాష్ఠని సూచిస్తోంది. దుఃఖ కారకురాలైన తల్లిని వదిలివేయాలని ఉన్నా, అది రామునికి ప్రీతి కలిగించదు కనుక మానుకున్నాడు. అలా పరిత్యజించే స్వాతంత్ర్యం తనకి లేదని గుర్తు తెచ్చుకున్నాడు.

**ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి** అన్న వేద వాక్యాన్ని తలచి ఉంటాడు. వివిధ శరీరాలలో ఉన్న జీవులకి అంతర్యామిగ ఉన్న పరమాత్మకి ప్రీతి కలిగితేనే ఆయా జీవులకి దేహబంధువుల పట్ల ప్రీతి కలుగుతుంది. అంతే తప్ప జీవునికి ప్రత్యేకంగా ప్రియము, అప్రియము అనేవి వేరే ఉండవు. ఇది భరతునిలో మనం చూస్తున్నాం. రామునికి ప్రియమైనది తనకి ఆదరించ తగినదే! తనకంటూ వేరే అప్రియభావన తగదని మాతృ పరిత్యాజ్య భావనని వదులుకున్నాడు.

వనవాస కారకురాలైన కైకేయిని రాముడేమి ద్వేషించలేదే, వదిలిపెట్టాలని అనుకోలేదే! కనుక, తనకీ ఈ భావన తగదని మనసుని సమాధాన పరచుకునే ప్రయత్నం చేశాడు. కానీ, తన సర్వస్వమైన రామునికి కష్టం కలిగించిదన్న భావనతో కైకేయిని నిందించకుండా మాత్రం ఉండలేకపోయాడు. అతని దేహం బాధతో దహించుకు పోయింది.

కైకేయి శరీరానికి మాత్రమే తల్లి. అదీ ఈ జన్మలో మాత్రమే! పరాత్పరుడో జన్మాంతర సహస్రంలో కూడా వీడని బంధువు. కనుక అతని పట్ల పాటించలసినదే శాశ్వత ధర్మం. "మాతృదేవో భవ" అని వేదమే చెప్పినా, తన మాతయైన కైక భౌతిక సుఖం కోరి ఆత్మ ధర్మాన్ని నాశనం చేసుకున్నదని బాధపడ్డాడు భరతుడు. ఆమె మాట వినకున్నా దోషం కాదు అనుకున్నాడు. అందుకే కైకేయిని నిందించాడు.

ఆమెకి మనస్తాపం కలిగించైనా, తన తప్పుని గ్రహించేలా, పశ్చాత్తాప పడేలా, ఆమెకి ప్రాయశ్చిత్తం జరపాలనుకున్నాడు. అందుకే, కైకమ్మతో 'నీ కోరిక తీరదు. రామలక్ష్మణులని దూరం చేసిన రాజ్యాన్ని నేను అంగీకరించలేను. నేనూ వనానికే వెళతాను. మా రాముణ్ణి పాదాలంటి ప్రార్థిస్తాను. తిరిగి వచ్చి పట్టాభిషిక్తుడయ్యేట్లు బ్రతిమాలుకుంటాను. సింహాసనాధిష్ఠితుడైన రామునికి నిరంతరం సేవ చేసుకుంటూ జీవిస్తాను" అంటాడు.

**నివర్తయిత్వా రామం చ తస్యాహం దీప్త తేజసః ।**
**దాసభూతో భవిష్యామి సుస్థితే నాంతరాత్మనా"**

కైకమ్మమీద కోపంతో కాదు, రామునిమీద ప్రేమతో వనానికి వెళతాన న్నాడు. తనలా రాముని కోసం ఎదురుచూస్తూ విలపిస్తున్న అయోధ్యాప్రజలందరి కోసం కూడా రాముని వనవాసం నుండి మరలించి తీసుకువస్తానని దృఢసంకల్పం చేశాడు. తేజస్సుతో ప్రకాశిస్తున్న రాముని సేవలోనే నా మనసు నిలిచి ఉంటుందన్నాడు. రామునికి సేవ చేయడం కన్న, దాసునిగ నిలవడం కన్న కోరదగినదే ముందని!!

తన పారతంత్ర్యాన్ని అంత విషమ స్థితిలోనూ విస్మరించని వైనం వాల్మీకిమహర్షి చక్కగా వివరిస్తున్నారు. వచ్చే సంచికలో తెలుసుకుందాం!

## మెదడుకి మేత

### ఫిబ్రవరినెల సమాధానములు

1. సమస్త జగత్తు; 2. పాడిపంటలు, పశుసమృద్ధి విల్లివిరియాలని; 3. స్త్రీ; 4. పరీక్షిత్; 5. మాటలతో, చేతలతో; 6. నారాయణుని; 7. సుమారు 200 కోట్ల సంవత్సరాలు; 8. శ్రీమద్భాగవతకథ; 9. శ్రీమద్భాగవతం వినేవరకే; 10. నలుగురు; 11. అతి దాహాన్ని, దవడలు ఎండిపోవడాన్ని; నివారిస్తుంది; 12. లాకిసిస్; 13. కులశేఖరులు; 14. ఈశ్వరునికి; 15. సుదర్శనసూరి; 16. విష్ణుశక్తి; 17. శ్రీ వేంకటేశ్వరుడు; 18. గోదా రంగమన్నారులు; 19. శ్రీప్రశ్న సంహితా; 20. మనస్సుమీద.


అంపాపుర గ్రామ

# శ్రీరామచంద్రస్వామి దేవస్థాన

# మహాసామ్రాజ్యపట్టాభిషేక మహోత్సవము

తేది. 31.3.2014 నుండి 9.4.2014 వరకు

వేదిక: అంపాపురం,

బాపులపాడు మం॥ కృష్ణాజిల్లా.

జై శ్రీమన్నారాయణ



పరమహంస పరివ్రాజకులు

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి

ప్రత్యక్ష పర్యవేక్షణలో...

**నిత్యకార్యక్రమ వివరములు**

తేది. 31.03.2014 నుండి 08.04.2014 వరకు

ఉ॥ : 7.00 గం॥లనుండి ప్రాతరారాధన సేవాకాలం, తీర్థగోష్ఠి, శ్రీరామాయణపారాయణ, నివేదన తదీయారాధన.

సా॥ : 6.00 గం॥నుండి శ్రీవిష్ణుసహస్రనామపారాయణ, శ్రీరామాయణప్రవచనం

**విశేష కార్యక్రమవివరములు**

| తేది | ఉదయం | సాయంకాలము |
|---|---|---|
| మార్చి | | |
| 31 | అంకురార్పణం,ధ్వజారోహణం, అగ్నిప్రతిష్ఠ, శ్రీరామాయణపారాయణప్రారంభం | |
| | శ్రీరామజననం | దేవతాహ్వానమ్ |
| ఏప్రిల్ | | |
| 1 | శ్రీరామాయణ పారాయణము | |
| 2 | శ్రీరామాయణ పారాయణము, పాదుకాపట్టాభిషేకం, | శ్రీరామపూజ |
| 3 | సమాశ్రయణములు | |
| 4 | శ్రీరామాయణ పారాయణము | శ్రీలక్ష్మీనారాయణపూజ |
| 5 | శ్రీరామాయణ పారాయణము | శ్రీవేంకటేశ పూజ |
| 6 | శ్రీరామాయణ పారాయణము, అంగుళీప్రదానము | |
| 7 | శ్రీరామాయణ పారాయణము | |
| 8 | శ్రీసీతారామకళ్యాణం, మహాపూర్ణాహుతి | దేవతోద్వాసనమ్ |
| 9 | మహాసామ్రాజ్యపట్టాభిషేకము | |

**భగవద్బంధువులందరికీ మా హార్దిక స్వాగతాంజలి!**

వివరములకు: 8985821379, 92472 69348, 92999 97333, 96034 23427

ఇట్లు
శ్రీకోదండరామాలయ కమిటీ
అంపాపుర గ్రామస్థులు




## పదార్థాలకు పదార్థత్వం ఎలా సిద్ధిస్తుంది?

బ్రహ్మాత్మకుడైన జీవుడు ప్రవేశించినందువల్లనే ప్రతి వస్తువుకూ పదార్థత్వం సిద్ధిస్తున్నదని వెనుక చెప్పుకున్నాం. ఈవిషయంలో వేదార్థ సంగ్రహం ఏంచెబుతున్నదో చూదాం. ఈ తరువాత వేదార్థసంగ్రహం లోనే ఉన్న మరికొన్ని వాక్యాలు, వాటికి సుదర్శనసూరి వ్రాసిన వ్యాఖ్యానం ఈ విషయాన్ని మరింతగా స్పష్టపరుస్తున్నాయి.

వేదార్థ సంగ్రహ వాక్యాలు చూడండి. **ఏతదుక్తం భవతి–జీవాత్మాతు బ్రహ్మణః శరీరతయా ప్రకారత్వాత్ బ్రహ్మాత్మకః. "యస్యాత్మా శరీరమ్" ఇతి శ్రుత్యన్తరాత్. ఏవం భూతస్య జీవస్య శరీరతయా ప్రకారభూతాని దేవమనుష్యాది సంస్థానాని వస్తూని ఇతి, బ్రహ్మాత్మకాని తానిసర్వాణి. అతః, దేవో, మనుష్యః, యక్షో, రాక్షసః, పశుః, మృగః, పక్షీ, వృక్షో, లతా, కాష్ఠం, శిలా, తృణం, ఘటః, పటః ఇత్యాదయః సర్వే, ప్రకృతి ప్రత్యయ యోగేన అభిధాయకతయా ప్రసిద్ధాః, శబ్దాః, లోకే, తత్తద్వాచ్య తయా ప్రతీయమాన తత్తత్ సంస్థానవస్తుముఖేన తదభిమానజీవ తదంతర్యామి పరమాత్మ పర్యంత సంఘాతస్యైవ వాచకాః ఇతి"** ఈ వాక్యాల అభిప్రాయం ఇది.

"జీవాత్మ పరబ్రహ్మానికి శరీరంగా ఉంటాడు కనుక ప్రకారమని చెప్పబడతాడు. **ప్రకారం** అంటే వేరుచేయరాని విశేషణం. (అపృథక్ సిద్ధవిశేషణం, ఉదాహరణానికి నల్లనికలువ అన్నప్పుడు కలువలోని నల్లతనం కలువకు విశేషణము. ఇది వేరుచేయరానిదే కదా!)

ఒక వస్తువులోని విశేషాన్ని బోధించే శబ్దాన్ని విశేషణం అంటారు. ఈ విశేషణము ద్వారా విశిష్టతను పొందే వస్తువును విశేష్యం అంటారు. అటువంటి విశేష్యము నుండి వేరుచేయరాని విశేషణాన్ని ప్రకారం అని పిలుస్తారు. పరమాత్మకు జీవాత్మకూడా అలాంటివాడే! కనుక అతడు బ్రహ్మాత్మకుడు.

**యస్య ఆత్మా శరీరం** అని వేరొకశ్రుతి చెబుతున్నది కదా! ఏ పరమాత్మకు జీవాత్మ శరీరమై ఉన్నాడో అని దీని అర్థం. ఇలా పరమాత్మకు శరీరంగా ఉన్న జీవునికి ప్రకారాలుగా అంటే విడదీయరాని విశేషణాలుగా దేవతలు, మనుష్యులు మొదలైన ఆకారాలుగల వస్తువులన్నీ ఉన్నాయి. కనుక ఈ వస్తువులన్నీ బ్రహ్మాత్మకాలు. అందువల్ల దేవుడు, మనుష్యులు, యక్షులు, రాక్షసులు, పశువు, మృగము, పక్షి, వృక్షము, లత, కాష్ఠము, శిల, తృణము, ఘటము, పటము, మొదలైన శబ్దాలన్నీ ప్రకృతి ప్రత్యయాల సంబంధం చేత, ఆయా అర్థాలను బోధించేవిగా లోకంలో ప్రసిద్ధములై ఉన్న శబ్దాలు. ఇవి, వాటివాటికి అర్థంగా పైకి కనిపిస్తున్న ఆయా అవయవాలు కల వస్తువులను బోధించి, ఆ వస్తువులద్వారా వాటిలో ప్రవేశించి ఉండి ఇవి నా శరీరాలు అని అభిమానించే జీవునికూడా బోధిస్తాయి. అంతటితో ఆగక ఆ జీవుని లోపల అంతర్యామిగా ఉన్న పరమాత్మను అంతవరకూ ఉన్న సముదాయాన్ని బోధిస్తాయి."

అంటే, ప్రతిశబ్దమూ పైకి కనిపించే ఆకారాన్ని, దానిలోపలఉన్న బ్రహ్మాత్మకుడైన జీవుని, ఆతడు శరీరంగా కల అంతర్యామియైన పరమాత్మను, ఈమూడు తత్త్వాలను బోధిస్తుందన్నమాట.

ఈ వాక్యాలను బట్టి పైన నిర్దేశించిన శబ్దాల్లాంటి శబ్దాలు ఏవైనా, పైకి కనిపించే వస్తువును ఆ వస్తువు లోపల ఉన్న "ఇది నాది" అనే అభిమానం కల జీవుని, ఆ లోపల అంతర్యామిగా ఉన్న పరమాత్మను ఈమూడింటిని విధిగా బోధింపవలసినదే అని స్పష్టంగా తెలుస్తున్నది.

ఇక్కడ ఒక ప్రశ్న? లోకంలో కొన్ని శబ్దాలు విన్నప్పుడు కేవలం కంటికికనిపించే పదార్థంమాత్రమే తెలుస్తుంది. లోకంలో దాన్నే వ్యవహరిస్తున్నారు. ఉదాహరణానికి రాయి అనే శబ్దంచేత కంటికి కనిపించే వస్తువుని మాత్రమే వ్యవహరిస్తున్నాం తప్ప, లోపల ఉన్న జీవుని కాని, ఆలోపల ఉన్న పరమాత్మను కాని వ్యవహరించడంలేదు. మరికొన్ని శబ్దాల దగ్గర అంటే ప్రాణవంతాలైన వస్తువులను బోధించే శబ్దాల విషయంలో కొంతవరకు పైకి కనిపించే పదార్థాన్ని కనిపించక పోయినా లోపల ఎవడో ఒక జీవుడు ఉన్నాడని కొన్ని శాస్త్రాలు చెప్పిన విధానాన్ని బట్టి జీవుని కూడా బోధించడం ఉన్నది. ఎలాగంటే, "వీడు రాముడు" అనగానే రామశబ్దంచే వ్యవహరింపబడే ఒక ఆకార వికారం గల శరీరమనే వస్తువు. ఆ లోపల ఉన్న జీవుని కూడా మనం అవగతం చేసుకోవడం ఉన్నది. కానీ, ఆ లోపల పరమాత్మ కూడా ఉన్నాడని, ప్రతిశబ్దము, పైకి కనిపించే వస్తువును, లోపల ఉన్న జీవాత్మ పరమాత్మలను, మూడింటిని బోధిస్తుందని లోకానుభవం లేదుకదా! అన్న ప్రశ్నను రామానుజులు సమాధానించారు. లోకానుభవం వేరు, శాస్త్రానుభవం వేరు. పైగా వేదాన్తశాస్త్రానుభవం మరీవేరు.

లోకంలో మనందరికీ పైపై వస్తువులు చూడగల సామర్థ్యం ఉంది. మరికొందరికి కొన్ని వస్తువులలో జీవతత్త్వం కూడా ఉన్నదని ప్రాణస్ఫురణాన్ని బట్టి గుర్తించే సామర్థ్యం ఉండవచ్చు. పరమాత్మ కూడా లోపల ఉన్నాడని ఎలా తెలుస్తుంది? అంటే వేదాంతాధ్యయనం చేస్తే తెలుస్తుంది అన్నారు రామానుజులు. వారి వాక్యాలు చూడండి.

**అశ్రుతవేదాంతాః పురుషాః, సర్వేపదార్థాః, సర్వేజీవాత్మానశ్చ, బ్రహ్మాత్మకాఃఇతి నపశ్యంతి, సర్వశబ్దానాం చ కేవలేషు తత్తత్ పదార్థేషు**

**వాచ్యైకదేశేష వాచ్యపర్యవసానం మన్యంతే. ఇదానీం వేదాంత వాక్య శ్రవణేన బ్రహ్మకార్యతయా, తదంతర్యామికతయాచ, సర్వస్య బ్రహ్మాత్మకత్వం, సర్వశబ్దానాం తత్తత్ ప్రకార సంస్థిత బ్రహ్మవాచిత్వం జానన్తి.**

ఈవాక్యాల అభిప్రాయం ఇది. వేదాంత వాక్యాలను వినియుండని సామాన్య జనులు, సర్వ పదార్థాలు, సర్వజీవాత్మలు, బ్రహ్మాత్మకాలని అంటే బ్రహ్మమే ఆత్మగా కలవని చూడలేకపోతున్నారు. ఆయా శబ్దాలకు కేవలం లోకవ్యవహారాన్ని మాత్రమే ప్రసిద్ధంగా చేసుకుని, వాస్తవానికి ఆ శబ్దాలకున్న పరిపూర్ణార్థంలోని ఒక భాగమందు మాత్రమే బోధకత్వ శక్తిని గ్రహిస్తున్నారు. ఈశబ్దానికి ఇంతే అర్థం అని భావిస్తున్నారు. ఇప్పుడు వేదాంత వాక్యాలు విన్న తరువాత, సమస్త పదార్థజాతము పరబ్రహ్మం చేతనే నిర్మింపబడటంచేత పరబ్రహ్మమే అంతర్యామిగా ప్రవేశించి ఉండడంచేత సమస్త పదార్థజాతము బ్రహ్మాత్మకమేనని గ్రహిస్తున్నారు.

అన్ని శబ్దాలు, ఆయా పదార్థాలు వేరుచేయరాని విశేషణాలుగా (ప్రకారాలుగా) కలిగిఉన్న బ్రహ్మాన్నే బోధిస్తున్నాయని తెలుసుకుంటున్నారు. అని ఈ వాక్యాల అభిప్రాయం. ఇలా అన్నప్పుడు పుట్టే శంకలను రామానుజులు ఉద్భావనచేసి మళ్ళీ ఇలా అంటున్నారు.

**నన్వేవం గవాది శబ్దానాం, తత్తత్పదార్థవాచితయా వ్యుత్పత్తిర్బాధితా స్యాత్, నైవం, సర్వేశబ్దాః అచిజ్జీవ విశిష్టపరమాత్మనో వాచకా ఇత్యుక్తం– నామరూపే వ్యాకరవాణి ఇత్యత్ర. తత్ర లౌకికాస్తు పురుషాః, శబ్దం వ్యవహరన్తః, శబ్దవాచ్యే ప్రధానాంశస్య పరమాత్మనః, ప్రత్యక్షాద్య పరిచ్ఛేద్యత్వాత్, వాచ్యైకదేశభూతే వాచ్య సమాప్తిం మన్యన్తే. వేదాన్త శ్రవణేన హి వ్యుత్పత్తిః పూర్యతే.**

మరి అలా అంటే లోకంలో గోవు మొదలైన శబ్దాలకు ఆయా పదార్థాలను బోధించడానికి శాస్త్రకారులచే కల్పింపబడిన బోధకత్వశక్తి బాధింపపడవలసి వస్తుంది కదా! (గోవు అన్న పదానికి శాస్త్రకారులు, గంగడోలు మొదలైన అవయవాలు కల జంతువు అని అర్థం చెప్పారు.)

లోకంలో సామాన్యులు కూడా అలాగే తెలుసుకుంటున్నారు. మరి ఇక్కడ ఈ జంతువులోపల ఉన్న జీవునికానీ, ఆ జీవునిలోపల అంతర్యామిగా ఉన్న పరమాత్మనుగానీ వారు అర్థంగా చెప్పలేదే! అంటే ఇది సరైందికాదు. **నామరూపే వ్యాకరవాణి** అనే వాక్యాన్ని వివరించేటప్పుడే అన్ని శబ్దాలు జడమైన జగత్తుతోను, జీవులతోను కూడిన పరమాత్మనే బోధిస్తాయని చెప్పడం జరిగింది. అయితే ఈ విషయంలో లౌకిక ప్రజ్ఞకలిగిన జనులు ఆయా శబ్దాలను వ్యవహరించేటప్పుడు, ఆశబ్దాలకు ఉన్న ముఖ్యార్థంలోని ప్రధానాంశమైన పరబ్రహ్మం ప్రత్యక్షంగా తెలియక పోవడంచేత ఆ అర్థాన్ని విడచిపెట్టి తమ కంటికి కనిపించే అర్థమందే పర్యవసానాన్ని భావిస్తున్నారు. అంటే సంపూర్ణార్థంలో కొంత అర్థాన్నే వారు భావిస్తున్నారన్నమాట. అట్టి వారికి వేదాంతవాక్యాలు విన్నందువల్ల మాత్రమే, వారికిగల అర్థజ్ఞానం పరిపూర్ణమవుతుంది.

**ఏవమేవ వైదికాః శబ్దాః సర్వే, పరమాత్మ పర్యన్తాన్ స్వార్థాన్ బోధయన్తి. వైదికా ఏవ సర్వేశబ్దాః, ఆదౌ వేదాదేవ ఉద్ధృత్యఉద్ధృత్య, పరేణైవ బ్రహ్మణా సర్వపదార్థాన్ పూర్వవత్ సృష్ట్వా, తేషు పరమాత్మ పర్యన్తేషు పూర్వవత్ నామతయా ప్రయుక్తాః –**

ఇలాగే వేదంలో ఉన్న ఇంద్రాది వైదిక శబ్దాలు కూడా ఇంద్రాది దేహాలు, వాటిలోపల ఉన్న జీవులు, వారిని శరీరంగా కల పరమాత్మ వరకు ఉన్న స్వార్థాన్నే బోధిస్తున్నాయి. వైదికశబ్దాలకు, లౌకిక శబ్దాలకు తేడా ఏంలేదు, ఆ పరమాత్మే వెనుకటి కల్పాలలో ఏపదార్థాలున్నాయో వాటిని అలాగే సృజించి వెనుకటిలాగే పైకి కనిపించే వస్తువు, లోపల జీవశరీరకుడైన పరమాత్మ వరకు ఉన్న అర్థాన్ని, అలాగే తరువాతి తరువాతి సృష్టుల్లో కూడా ఆశబ్దాలకు అర్థాలుగా నిర్ణయించాడు.

**తథామనుః –**

**సర్వేషాంతుస నామాని కర్మాణిచ పృథక్ పృథక్ ।**
**వేద శబ్దేభ్య ఏవాదౌ పృథక్సంస్థాశ్చ నిర్మమే ॥** *(1-21)* ఇతి
**సంస్థా–సంస్థానాని, రూపాణీతి యావత్ ।**
**ఆహచ భగవాన్ పరాశరః –**
**నామరూపంచ భూతానాం కృత్యానాం చ ప్రపంచనమ్ ।**
**వేదశబ్దేభ్య ఏవాదౌ దేవాదీనాం చకారసః ॥** *(వి.పు. 7-5-63)*

**శ్రుతిశ్చ–సూర్యా చంద్రమసౌ ధాతా ధాతా యథాపూర్వమ్ అకల్పయత్' ఇతి. సూర్యాదీన్ పూర్వవత్ పరికల్ప్య నామానిచ పూర్వవత్ చకార ఇత్యర్థః ॥**

ఈ విషయాన్ని మనువు ఇలా అంటున్నాడు. **సర్వేషాంతు స నామాని** అన్నిటికినీ విభిన్నాలైన నామాలను, కర్మలను, విభిన్న రూపాలను మొదటగా వేదశబ్దాలనుండే నిర్మించాడు అని దీని అర్థం. **సంస్థాః** అంటే సంస్థానములు అంటే రూపాలు అని అర్థం. భగవానుడైన పరాశరమహర్షికూడా విష్ణుపురాణంలో ఇలా చెప్పాడు **నామరూపంచ భూతానాం** ప్రాణులయొక్క నామరూపాలను, వాటివాటి క్రియలను వేద శబ్దాలనుండే వేరువేరుగా కల్పించాడు. దేవాదులకు కూడా ఇలాగే కల్పించాడు అని దీని అర్థం. ఈ విషయాన్నే వేదం ఇలా అంటున్నది. **సూర్యా చంద్రమసౌ** సూర్యచంద్రులను, బ్రహ్మ, పూర్వంలాగానే కల్పించాడు అని చెబుతున్నది. సూర్యచంద్రాదులను వెనుకటిలాగానే కల్పించి, నామరూపాలను వెనుకటి లాగానే ఏర్పరచాడని అభిప్రాయం.

ఇంతవరకూ ఉన్న మాటలను గమనిస్తే ఈసృష్టిలోని ఏ పదార్థానికైనా పరమాత్మ ప్రవేశించి ఉంటేనే పదార్థత్వం కలుగుతుందని ఆపరమాత్మ కూడా జీవుని శరీరంగా ధరించే ప్రవేశిస్తాడని, కనుక ప్రతి శబ్దానికి పైకి కనిపించే అర్థం, అంటే వస్తువు, దానిలోపల ఉండే జీవుడు, జీవుని శరీరంగా కలిగిన పరమాత్మ అనే మూడు అర్థాలు తప్పని సరిగా ఉంటాయని, అలా చెప్పుకున్నప్పుడే ఆపదార్థాలకు పదార్థత్వం ఏర్పడుతుందని స్పష్టంగా తెలుస్తున్నది కదా! *(సశేషం)*

# శ్రీమద్భాగవత మాహాత్మ్యము

(గతసంచిక తరువాయి)

శ్రీమాన్ నోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

**13**

ఈ వివరణ విన్న శౌనకమహర్షి సూతమహామునిని ఇలా ప్రశ్నించాడు. "ఓ సూతమహామునీ! తమరు అత్యంత ఆశ్చర్యకరమైన విషయాన్ని చెప్తున్నారు. శ్రీభాగవత పురాణం అనేది బ్రహ్మకు కూడా ఆది కారణమైన శ్రీమన్నారాయణుని లీలలను వర్ణించి ఆ స్వామియొక్క ఉనికిని నిరూపిస్తోంది. కాని ఇది మోక్షాన్నిచ్చే అన్ని సాధనాలను తిరస్కరించి ఈ యుగంలో వాటి అన్నింటి కంటే గొప్పదెలా అయ్యింది? దయచేసి నా శంకను నివారించవలసినది."

ఆ మాటలకు సూతమహాముని ఇలా చెప్పడం మొదలు పెట్టాడు. "ఓ శౌనకా! నీవు అడిగిన ప్రశ్న యథార్థమే. కాని దీనికి ఒక రహస్య ముంది. శ్రీకృష్ణభగవానుడు ఈ లోకాన్ని విడిచి తన నిత్యధామమైన వైకుంఠానికి వెళ్లే సమయంలో ఆయన ముఖమండలంలోనుండి ఏకాదశస్కంధాన్ని శ్రవణం చేసిన ఉద్ధవుడు ఆయన ప్రక్కనే కూర్చుని స్వామిని ఇలా ప్రశ్నించాడు.

"గోవిందా! ఇప్పుడు నీవు నీ భక్తుల కార్యాలనన్నింటిని పూర్తిచేసి ఇక పరమపదానికి పోవడానికి సిద్ధమయ్యావు. కాని నా మనస్సులో ఒక ప్రశ్న బాధిస్తోంది. ఇది విని నాకు శాంతిని కలిగించు.

ఇప్పుడు ఘోరోమైన కలికాలం దాపురిస్తుంది. ఈ లోకంలో అనంతమైన దుష్టులు జన్మిస్తారు. వారి సహవాసం చేత సత్పురుషులు కూడా ఉగ్రస్వభావం కలవారైపోతారు. అలాంటి వారి భారాన్ని భరించ లేని గోరూపంలో ఉండే భూదేవి ఎవరివద్ద శరణు పొందుతుంది? ఓ కమలనయనా! నీవు తప్ప మరి ఎవ్వరూ ఈ భూమిని రక్షించేవారు నాకు కనబడడం లేదు. అందువలన ఓ భక్తవత్సలా! నీవు సాధువులను కనికరించడానికి నీవు ఇక్కడ నుండి వెళ్లిపోకు. నీవు నిరాకారుడివి, చిన్మాత్రుడివి అయిఉండి కూడా భక్తులకోసం సగుణరూపాన్ని ధరించావు. నీవు లేని ఈ భూమి మీద భక్తులు ఎలా బ్రతుక గలరనుకుంటున్నావు! నిర్గుణోపాసన చాల కష్టం. స్వామీ! రక్షరక్ష! ఈ విషయాన్ని కొద్దిగా యోచించు" అని కన్నీరు పెట్టుకున్నాడు.

శ్రీకృష్ణభగవానుడు ఆ మాటలు విని "నేనేం చేస్తే సాధు రక్షణ కొనసాగుతుంది" అని తృటికాలం యోచించి ఇలా అన్నాడు. "ఉద్ధవా! చింతించకు. నేను నా శక్తినంతా భాగవతంలో నిలుపుతున్నాను." అని చెప్పి తాను అంతర్ధానమై ఈ భాగవతమనే సముద్రంలోకి ప్రవేశించాడు.

అందువలన ఓ శౌనకా! ఈ భాగవతం సాక్షాత్తుగా భగవంతుని వాఙ్మయమూర్తి. దీనిని సేవించడం, శ్రవణం చెయ్యడం, చదవడం వలన మానవుల సర్వపాపాలను నశింపజేస్తుంది. భాగవత సప్తాహశ్రవణం అందువలననే అన్నింటికంటే గొప్పదిగా భావించబడు తోంది. ఈ యుగంలో ముక్తికి మిగిలిన సర్వసాధనాల కంటే ఇదే ప్రధానంగా చెప్పబడుతోంది. ఈ భాగవతశ్రవణం దుఃఖాన్ని, దారిద్ర్యాన్ని, దౌర్భాగ్యాన్ని పాపాలని కడిగివేస్తుంది. కామక్రోధాదు లను జయింపజేస్తుంది. వైష్ణవమాయను దేవతలే దాటలేరు. ఇక అది మానవులకు ఎలా సాధ్యపడుతుంది? అందువలననే మానవులకు సప్తాహవిధి చెప్పబడింది. ఇలా సనకసనాది మునీశ్వరులు సప్తాహశ్రవణ మహిమను చెప్తుండగా యువకులైన ఇద్దరు పుత్రులతో ప్రేమరూపిణి అయిన భక్తి "శ్రీకృష్ణా, గోవిందా, హరీ, మురారీ, నాథా, నారాయణా, వాసుదేవా!" అని గట్టిగా పలుకుతూ అక్కడ ప్రకటితమయ్యింది.

భాగవతార్థ భూషణాలను ధరించిన ఆ పరమసుందరియైన భక్తిని మునులు కనులారా చూశారు. "ఈమె ఇక్కడికి ఎలా రాగలిగింది?" అని తమలో తాము చర్చించుకోసాగారు. దానికి సనకాదులు ఇలా చెప్పారు. "ఓ మునులారా! ఈ భక్తిదేవి ఇప్పుడే ఈ భాగవత కథార్థములో నుండి బయటకు వచ్చింది" ఆ మాటలను విన్న భక్తి వినమ్రతతో తన పుత్రులతో కూడి సనత్కుమారునితో ఇలా అంది.

"ఓ మహానుభావులారా! కలియుగంలో నేను నష్టమై పోయాను. మీరు చేసిన ఈ కథామృతం వలన నాకు మళ్లీ పుష్టి కలిగింది. ఇప్పుడు నన్నెక్కడ నివసించమంటారో ఆదేశించండి".

ఆ మాటలను విన్న సనత్కుమారుడు ఇలా అన్నాడు. "ఓ భక్తీ! నీవు భక్తుల హృదయంలో భగవత్స్వరూపాన్ని కలిగించే దానివి. భగవంతునిపై అనన్యప్రేమను కలుగజేసే దానివి. భవరోగాన్ని జీవులకు రూపుమాపే దానివి. అందువలన నీవు ధైర్యం వహించి నిరంతరం శ్రీమహావిష్ణువుయొక్క భక్తుల హృదయాలలో నివసించు. ఈ కలిదోషాలు ఎవరిపై కనబడినా, ఇక నీపై తమ ప్రభావాన్ని చూపించలేవు". అని ఆజ్ఞాపించారు. వారి ఆజ్ఞానంతరం భక్తి వెంటనే వెళ్లి భగవద్భక్తుల హృదయాలలో నిలిచింది.

శ్రీహరిభక్తి మాత్రమే హృదయంలో కలవారు పూర్తిగా నిర్ధనులైనా వారు ముల్లోకాల్లో పరమ ధన్యులే. ఎందుకంటే భక్తి అనే సూత్రంచే బంధింపబడే వాడైన భగవంతుడు కూడా తన లోకాన్ని వదలి భక్తుల హృదయాలలో నివసిస్తాడు. భూలోకంలో ఈ భాగవతం సాక్షాత్తు పరబ్రహ్మంయొక్క స్వరూపమే. మేము దీని మహిమని ఏమని వర్ణించ

గలం? దీనిని ఆశ్రయించుకుని దీనిని వినిపించినవాడు, వినినవాడు ఇద్దరు శ్రీకృష్ణునితో సమత్వాన్ని పొందుతారు. అందువలన ఇతర ధర్మాల వలన ఏం ప్రయోజనం?

**భక్తుల హృదయంలో భగవంతుడు ప్రవేశించుట**

అలా భాగవత ప్రవచనం వింటున్న భక్తుల హృదయంలో అలౌకికమైన భక్తి ప్రాదుర్భవించింది. అది చూసి భక్తవత్సలుడైన భగవంతుడు తన లోకాన్ని విడిచి వారి హృదయాల్లోకి ప్రవేశించాడు. ఆ దివ్యమంగళ విగ్రహం యొక్క అనుభూతిని అక్కడ ఉన్న భక్తులందరూ ఆనందంగా అనుభవించసాగారు. ఆయన వనమాలచే శోభిల్లు తున్నాడు. మేఘంలాంటి శ్యామలవర్ణం కలిగినవాడు. మనోహరమైన పీతాంబరాన్ని ధరించాడు. కటి ప్రదేశంలో మొలత్రాడు ధరించి ఉన్నాడు. అందమైన కిరీటంతో, కుండలాలతో ప్రకాశిస్తున్నాడు. ఆ స్వామి చిద్విలాసుడై భక్తుల హృదయాలను కొల్లగొడుతున్నాడు. ఆయన వక్షస్థలంలో కౌస్తుభమణి ప్రకాశిస్తోంది. ఆయిన దేహమంతా హరిచందనచర్చితం. అనేక వేలకోట్లమన్మథులను మించిన సౌందర్య రాశియై ఒప్పుతున్నాడు. హృదయములో ఆవిర్భవించిన ఆ పరమానంద మూర్తిని, మధురాతి మధురమూర్తిని, మురళీధరుడైన ఆ శ్రీకృష్ణభగవానుని సాటిలేని శోభను అలా దర్శిస్తూ భక్తులందరూ తన్మయులయ్యారు.

ఆ స్వామి కదలి ఆ ప్రాంతానికి వచ్చేయడంతో వైకుంఠంలో నివసించే వారు అయిన, ఉద్ధవాది వైష్ణవులు అందరూ ఆ కథను శ్రవణం చెయ్యడానికి అక్కడికి గుప్తంగా వచ్చి చేరారు. భగవంతుడు భక్తుల హృదయంలో ప్రకటింపబడగానే నలువైపుల నుండి జై శ్రీకృష్ణ!, జై జై వాసుదేవ!!, జై జై జై శ్రీమన్నారాయణ!!! అంటూ అన్ని వైపులనుండి జయజయధ్వానాలు మిన్నుముట్టాయి. ఆ ప్రాంగణంలో అప్పుడు అద్భుతమైన భక్తిరస ప్రవాహం మొదలైంది. మాటిమాటికి శ్రీచూర్ణము, పుష్పములు వారిపై వర్షించసాగాయి. శంఖధ్వనులు అంతటా వినిపించాయి. ఇక ఆ సభలో కూర్చున్న వారెవరూ వారిలో వారు లేరు. వారికి తమ శరీరాల మీదగాని, వారి గృహాల మీదగాని ఎలాంటి స్మృతిలేకుండా పోయింది. వారి తన్మయాన్ని చూసి నారదుడిలా అన్నాడు.

**సప్తాహపద్ధతిలో పునీతులయ్యేవారు**

"ఓ మునీశ్వరులారా! సప్తాహశ్రవణ మహిమా విశేషాన్ని నేను కనులారా చూస్తున్నాను. ఇక్కడ ఉన్న మూర్ఖులు, దుష్టులు, పశుపక్షులు సర్వులు పాపరహితులయ్యారు. ఈ కలియుగంలో జీవులను పాపదూరుల్ని చెయ్యడంలో శ్రీమద్భాగవతాన్ని మించిన పవిత్ర సాధనం లేదు. ఇందులో సందేహం లేదు.

ఓ మునిశ్రేష్ఠులారా! మీరు చాల దయ గలవారు. మీరు లోకహితాన్ని కాంక్షించి భాగవత సప్తాహమార్గాన్ని కనుక్కున్నారు. అయితే ఈ సప్తాహమార్గంలో ఎవరెవరు పవిత్రులౌతారో దయచేసి చెప్పండి". నారదునిమాటలకు సనకాదులు దయతో ఇలా చెప్పారు. "సప్తాహమార్గంలో పవిత్రులయ్యే వారెవరో వినండి. అనేక విధాలైన పాపాలు చేసినవారు, దురాచారాలలో నిమగ్నులయ్యేవారు, దుర్మార్గాలు అనుసరించేవారు, క్రోధాగ్నివలన దగ్ధమయ్యేవారు, కుటిలురైనవారు, కామపరాయణులైనవారు సర్వులు ఈ కలియుగంలో సప్తాహయజ్ఞంలో పవిత్రమౌతారు.

సత్యహీనులు, తల్లిదండ్రులను నిందించేవారు, ఆశచేత కలత చెందినవారు, ఆశ్రమధర్మాలను వదిలినవారు, డాంబికులు, అసూయాగ్రస్తులు, ఇతరులను బాధించేవారు అందరూ ఈ కలియుగంలో సప్తాహ యజ్ఞంతో పవిత్రులౌతారు. కల్లుతాగినవారు, బ్రహ్మహత్యచేసినవారు, బంగారాన్ని దొంగిలించినవారు, గురువుయొక్క భార్యను పొందినవారు, విశ్వాసఘాతకులు అనే ఈ ఐదు విధాలుగా ఉన్న పాపాలను ఆచరించిన మహాపాపులు, కపటం చేసి మోసంచేసే వారు, క్రూరులు, పిశాచాలవలే దయలేనివారు, బ్రాహ్మణుల ధనం చేత పుష్టిచెందినవారు, వ్యభిచారులు కలియుగంలో సప్తాహ యజ్ఞంచే పవిత్రులౌతారు.

పట్టుదలతో ఎప్పుడు మనోవాక్కాయ కర్మలచే ఎల్లప్పుడు పాపాలనే చేసే దుష్టులు, ఇతరుల సంపద కొల్లగొట్టే నీచులు, మలినమైన మనస్సుకలవారు. దుష్టహృదయులు కూడా ఈ సప్తాహ యజ్ఞం వలన పవిత్రులౌతారు.

నాణ్యమైన ప్లాట్లు మరియు ఫ్లాట్లు కొనుగోలుకు నమ్మకమైన అగ్రగామి సంస్థ

అభినందన హౌసింగ్ (ప్రై). లిమిటెడ్



సెంట్రల్ ఆఫీస్: 4వ లైను, పండరీపురం, లక్ష్మీపురం మెయిన్ రోడ్, గుంటూరు. ఫోన్: 2354002.

మా బ్రాంచీలు: విజయవాడ 1, విజయవాడ 2, విజయవాడ 3, గుంటూరు 1, గుంటూరు 2, హైదరాబాద్, విశాఖపట్నం.

0866 - 6628668 : 0866 - 6642428 : 0866 - 6633668 :. 0863 - 6641177 : 0863 - 6454588 :. 040 - 66637799 :. 0891 - 2538686.

# 14

## గోకర్ణోపాఖ్యానము

నారదా! ఈ విషయంలో నీ కొక ప్రాచీన ఇతిహాసాన్ని వినిపిస్తాం విను. ఈ కథను వినడం వలననే సర్వపాపాలు నశిస్తాయి.

పూర్వకాలం తుంగ భద్రా నదీ తీరంలో ఒక ఉత్తమమైన పట్టణం ఒకటి ఉండేది. అక్కడ, సర్వవర్ణాలవారు తమతమ ధర్మాలను చక్కగా పాటిస్తూ, సత్యవాక్యపరిపాలన సత్కర్మలయందు ప్రీతి కలవారై ఉండేవారు. ఆ నగరంలో సర్వవేద విశారదుడు, శ్రౌతస్మార్తకర్మల యందు నిపుణుడు అయిన **"ఆత్మదేవుడ"**నే బ్రాహ్మణుడు ఒకడు నివసిస్తూ ఉండేవాడు. అతడు రెండవ సూర్యుడా అన్నట్లు భాసిస్తూండేవాడు. అతడు ధనవంతుడై కూడా సాధరణ బ్రాహ్మణునివలే భిక్షాజీవిగా బ్రతికేవాడు. ఆతని భార్యపేరు **దుంధులి**. ఆమె చక్కటి కుటుంబంలో నుండే వచ్చినా, చక్కటి సౌందర్యరాశి అయినా ఆమెకు, లోపాలు అధికమే. తన మాటే నెగ్గాలనే పంతం. మొండి పట్టుదలకల మనిషి. ఇతరుల విషయాలను గూర్చి ఉబుసుబోకు కబుర్లు చెప్పడం అంటే పరమప్రీతి. ఒక రకంగా ఆవిడది క్రూరస్వభావం అనే చెప్పాలి. తెగవాగే స్త్రీ. లోభి, ఊరికే పోట్లాట పెట్టుకునే అమ్మాయి. కాని చక్కగా ఇంటిపనులన్నీ నేర్పుగా చేసుకోగల వనిత.

భార్యాభర్తలిద్దరూ ఒకరిపట్ల ఒకరు ప్రేమతో జీవనాన్ని గడుపుతున్న వారే. వారి దగ్గర కావల్సినంత ధనం ఉంది. దాని పర్యవసానంగా ఇల్లంతా శుభ్రంగా, వాకిలంతా అందంగా చక్కగా ఉండేవి. అయినా వారికి వాటివల్ల సుఖంలేదు. వారికున్న బాధంతా ఒక్కటే. వారికి సంతానం లేదు. వయసా గడిచిపోయింది. సంతానమా కలగడం లేదు. సరే ఇద్దరూ కలిసి సంతానం కోసం ఎన్నో రకాల పుణ్యకార్యాలు నిర్వహించడం ఆరంభించారు. దీనులకు దానాలు, దుఃఖితులైన వారికి గోవులు, భూమి, సువర్ణం, వస్త్రాలు ఇలా ఎన్నో దానం చేసారు. అలా వారి ఆస్థి సగం ఖర్చుయిపోయింది. అయినా వారికి సంతాన సుఖం కలుగలేదు.

ఆ బ్రాహ్మణుడు, ఆత్మదేవుడు ఖిన్నుడై పోయాడు. ఆ దుఃఖంలో ఒకనాడు అలా నడుచుకుంటూ అడివిలోకి వెళ్లాడు. మధ్యాహ్నం అయ్యింది. దాహం వేస్తుంది. అక్కడ ఒక చెరువు ఉంటే దాని దగ్గరకు వెళ్ళాడు కాస్త నీరు త్రాగి అలాగే కూర్చున్నాడు. ఈ బ్రతుకు వ్యర్థమని తలచాడు. ఆత్మహత్య చేసుకోవడం మేలని తలంపు మదిలో చేరింది. అంతలో ఒక సన్యాసి అక్కడికి వచ్చాడు. అతడు కూడా కొంత జలాన్ని స్వీకరించి, కాసేపు చెట్టు నీడన విశ్రమించాడు.

ఆత్మదేవుడు వెంటనే లేచి, ఆ సన్యాసి వద్దకు వెళ్లి పాదములకు నమస్కరించి, ఆయన ఎదుట నిలబడి నిస్పృహతో నిట్టూర్పులు విడవటం మొదలు పెట్టాడు. అదిచూసి సన్యాసి "నాయనా! ఎవరునీవు? ఎందుకలా బాధపడుతున్నావు? ఏమిటి నీకు వచ్చిన కష్టం? నీ దుఃఖానికి కారణం ఏంటో చెప్పు?" అన్నాడు. (సశేషం)


జై శ్రీమన్నారాయణ!



శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి మంగళాశాసనములతో..
శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయరు స్వామివారి పర్యవేక్షణలో...

**శ్రీలక్ష్మీనారాయణ - శ్రీ కోదండ రామస్వామివార్ల**

**లక్ష మల్లె పుష్పార్చన సహిత బ్రహ్మోత్సవ శుభాహ్వానము**

**ది.10-03-2014 నుండి 16-03-2014 వరకు**

**బ్రహ్మోత్సవ నిత్యకార్యక్రమము**

**ఉదయం**

6-30 సుప్రభాతం, నిత్యారాధన, గోష్ఠి
9-00 తిరువీధి వాహనసేవ
10-30 తాయార్లకు సమష్టి మల్లెపుష్పార్చన సహస్రనామాలతో
12-30 ఇష్టి కార్యక్రమ పూర్ణాహుతి
1-00 నిత్యపూర్ణాహుతి, మంగళాశాసనము, కైంకర్యపరులకు ఆశీర్వచనము, గోష్ఠి

**సాయంత్రం**

5-30 సమష్టి శ్రీవిష్ణు సహస్రనామస్తోత్ర పారాయణ, నిత్యహోమాది కార్యక్రమములు
6-30 శ్రీలక్ష్మీ తాయార్లకు సహస్ర దీపాలతో ఊయలసేవ
7-30 నిత్యపూర్ణాహుతి, బలి, మంగళాశాసనము-గోష్ఠి
8-30 విశేషవాహనంపై తిరువీధి (ఉరేగింపు)
అవకాశానుసారము పండితుల ప్రవచనములు ఉండును.

**విశేష కార్యక్రమములు**

| తేది | ఇష్టి | ఉదయపు వాహనసేవ | రాత్రి వాహనసేవ | |
|---|---|---|---|---|
| మార్చి 9 | ఆదివారం --- | --- | సా॥76 గం॥ విష్వక్సేన ఆరాధనతో అంకురార్పణ | |
| 10 తేది | సంతానార్థమై | వైనతేయ ఇష్టిధ్వజారోహణము | శేష | |
| 11 తేది | దుష్టశక్తిగ్రహ దోష నివారణకై | నృసింహ ఇష్టి | సూర్యప్రభ | చంద్రప్రభ |
| 12 తేది | మోక్షప్రాప్తికై | శ్రీమన్నారాయణ ఇష్టి | సింహ | హంస |
| 13 తేది | సకల విద్యా, జ్ఞానప్రాప్తికై | హయగ్రీవ | కల్పవృక్ష | హనుమంత |
| 14 తేది | ఐశ్వర్య వ్యాపారాభివృద్ధికై | లక్ష్మీనారాయణ ఇష్టి | మోహిని, పల్లకిసేవ | గరుడ |
| 15 తేది | ఆరోగ్య ప్రాప్తి, సకలాభిష్ట సిద్ధికై | సుదర్శన ఇష్టి | అశ్వ | గజ |
| | | వార్షిక శ్రీ లక్ష్మీనారాయణ కళ్యాణం | దోపిడీ ఉత్సవం | |
| 16తేది | రథోత్సవం, | 108 కలశాలతో క్షీరాభిషేకం ద్వాదశారాధన, పుష్పయాగం | | |
| | | మహాపూర్ణాహుతి, | శ్రీ లక్ష్మీనారాయణ కళ్యాణం | |

వివరములకు : ఉభయ వేదాంతాచార్యపీఠం, శ్రీవాసుదాసాశ్రమం,
నడిగడ్డపాలెం, గుంటూరుజిల్లా - 522 318
ఫోన్ (08644) 276522, (08645) 272929;
సెల్: 94410 65582, 98663 99790, 98497 41537.

తిరువరంగత్తముదనార్లు అనుగ్రహించిన ప్రపన్నగాయత్రి

# ఇరామానుశనూత్తన్దాది

జనవరి సంచిక తరువాయి

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

## 23వ పాశురం

వైప్పాయ వాన్ పొరుళెన్ఱు నల్లన్బర్ మనత్తకత్తే
ఎప్పోతుం వైక్కుం ఇరామానుశనై ఇరునిలత్తిల్ ।
ఒప్పారిలాత వరువినైయేన్ వంజనెంజిల్ వైత్తు
ముప్పోతుమ్ వాళ్త్తువన్ ఎన్నామ్ ఇతు అవన్ మొయ్‌పుకళ్ర్కే॥

**ప్రతిపదార్థం:**

| | | |
|---|---|---|
| వైప్పు ఆయ వాన్ | = | ఆపద్రక్షకమైన |
| పొరుళ్ ఎన్ఱు | = | అక్షయమైన ధనమని |
| నల్ అన్బర్ | = | పరమప్రేమగల భక్తులు |
| మనత్తు అకత్తే | = | తమ హృదయపద్మాలలో |
| ఇరామానుశనై | = | యతిసార్వభౌములయినరామానుజులను, |
| ఎప్పోతుమ్ | = | అన్ని కాలములలోను |
| వైక్కు | = | వేంచేపు చేసుకొనియుండే |
| ఇరునిలత్తిల్ | = | ఈ విశాలమైన భూమిలో |
| ఒప్పార్ ఇలాత | = | సాటిలేని |
| ఉఱు వినైయేన్ | = | మహాపాపి అయిన నేను |
| వంజమ్ నెంజిల్ వైత్తు | = | నా కృత్రిమమైన మనస్సులోనిలుపుకొని |
| ముప్పోతుం వాల్త్తువన్ | = | ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం మూడు కాలాలలో పొగడుతున్నాను. |
| ఇదు | = | ఇలా నేను పొగడడం |
| అవన్ మెయ్ పుకళ్ర్కు | = | ఆ మహాత్ముని కీర్తికి |
| ఎన్నామ్ | = | ఏమి ఔతుందో!?(అపకీర్తిని తెస్తుందేమో!) |

**తాత్పర్యము:**

మన సంప్రదాయంలో నైచ్యానుసంధానం చెయ్యడం అనే పద్ధతి చాలా గొప్పది. ఈ పాశురంలో ఆ పనేచేస్తున్నారు అముదనార్లు.

రామానుజులను పరమధనంగా భావించిన మహనీయులు కూరేశులు, ముదలియాండాన్ మొదలైనవారు. వారంతా పరమభక్తితో ఎంబెరుమానార్లను తమ హృదయాలలో నిలుపుకున్నారు. మరి నేనో, మహాపాపాత్ముణ్ణి. వారివలే అంత భక్తి లేనివాడిని. మోసం నిండిన మనస్సు నాది. నావంటి పాపాత్ములు ఈ లోకంలోనే లేరు. ఆ రామానుజులను కీర్తించడానికి నాకేవిధమైన అర్హతా లేదు. అయితేనేం! నన్ను నేను మరిచిపోయి ఆ యతిరాజులను స్తుతించాలని సాహసిస్తున్నాను. ఈ నా అపవిత్రమైన మనస్సులో ఉండడం వలన యతిరాజుల కల్యాణ గుణాలకి ఎటువంటి అవమానం కలుగుతుందో ఏమో! ఎంత పాపం చేస్తున్నాను. అర్హతలేనివాడిని అని తెలిసి కూడా ముందుకి వచ్చానే అని ఆరాటపడుతున్నారు అముదనార్లు.

అతి పవిత్రులు రామానుజులు. అతి నికృష్టమైనది నా మనసు. నావంటివాని కీర్తన ఆయన మహిమకి చెడ్డపేరు తీసుకురాదు గదా! అని ఆవేదన ప్రకటిస్తున్నారు.

********

## 24వ పాశురం

మొయ్త్త వెం తీవినైయాల్ పల్లుడల్ తొఱుం మూత్తు, అదనాల్
ఎయ్త్తొళ్ర్విన్దేన్ మున నాళగళ్ ఎల్లామ్, ఇన్ఱుకండు ఉయర్న్దేన్ ।
పొయ్‌త్తవమ్ పోత్తుం పులై చ్చమయంగళ్ నిలత్తవియ
కైత్త మెయ్ ఞానత్తు, ఇరామానుశ నెన్నుం కార్త్తన్నైయే ॥

**ప్రతిపదార్థం:**

| | | |
|---|---|---|
| మున నాళ్కళ్ ఎల్లామ్ | = | గడచిన కాలమంతా |
| పల్ ఉడల్ తొఱుం | = | అనేక శరీరాలతో |
| మొయ్‌త్త | = | ఆత్మను ఆవరించియుండే |
| వెయ్ | = | అతిక్రూరమైన |
| తీవినైయాల్ | = | దుష్కర్మలచేత |
| మూత్తు | = | ముసలితనం వచ్చేవరకు నివసించి |
| అతనాల్ | = | అందుచేత |
| ఎయ్‌త్తు ఒళ్ర్విన్దేన్ | = | చాలా పరితాపాన్ని పొందాను. |
| పొయ్‌తవమ్ | = | అసత్యములైన తపస్సులను |
| పోత్తుమ్ | = | చేయుచుండు |
| పులై చ్చమయంగళ్ | = | నీచములగు మతములను |
| నిలత్తు అవియ | = | భూమియందు నశించేటట్లు |
| కైత్త | = | నిరసించిన |
| మేయ్ ఞానత్తు | = | వాస్తవ జ్ఞానముగల |
| ఇరామానుశన్ | = | రామానుజులనే |
| ఎన్నుమ్ కార్ తన్నై | = | కాలమేఘాన్ని |
| ఇన్ఱుకండు | = | ఇప్పుడు గుర్తెరిగి |
| ఉయర్న్దేన్ | = | కృతార్థుడనయ్యాను. |

**తాత్పర్యము:**

నేను ఈ సంసారంలో పడి అనేక పాపాలుచేసి ఆ పాపకర్మల ఫలంగా ఎన్నో జన్మల నెత్తాను. పడరాని పాట్లు పడ్డాను. దుఃఖాలు అనుభవించాను. ఆపదలపాలయ్యాను.

ఇప్పుడు పరమోదారులయిన రామానుజులు ఈ భూమిలో అవతరించారు. దుర్మతాలని సమూలంగా నశింపచేశారు. జలస్థల భేదం లేకుండా కురిసే మేఘంలా గొప్ప ఉదార భావంతో అందరినీ ఉజ్జీవింపచేశారు. తమ నిర్హేతుక కృపను నాపై వర్షించారు. నన్ను – అంగీకరించారు. నేను ధన్యుణ్ణి అయ్యాను' అంటూ కృతార్థులయిన తిరువరంగత్తముదనార్లు ఆనందాన్ని ప్రకటించారీ పాశురంలో.

********

## 25వ పాశురం

**కారేయ్ కరుణై యిరామానుశ! ఇక్కడ లిడత్తిల్**
**ఆరే యతిపవర్ నిన్నరుళిన్ తన్మై అల్లలుక్కు ।**
**నేరే యుఱై విడమ్ నాన్ వందు నీయెన్నైయుత్తపిన్ ఉన్**
**శీరే యుయిర్ క్కుయిరాయ్, అడియేఱ్కిన్ఱు తిత్తిక్కుమే! ॥**

**ప్రతిపదార్థం:**

| | |
|---|---|
| **కార్ ఏయ్** | = మేఘంతో పోలిన |
| **కరుణై** | = దయగల |
| **ఇరామానుశ** | = భగవద్రామానుజా! |
| **నాన్** | = దాసుడనైన నేను |
| **అల్లలుక్కు నేరే** | = దుఃఖాలను నేరుగా |
| **ఉఱవు ఇడమ్** | = నివాసస్థానమై ఉన్నాను. |
| **ఎన్నై** | = ఇటువంటి నన్ను |
| **నీవందు ఉత్తపిన్** | = మీరే స్వయంగా స్వీకరించినతరువాత |
| **ఉన్ శీరే** | = తమ కల్యాణగుణాలే |
| **ఉయిర్క్కు ఉయిర్ ఆయ్** | = ఆత్మకు ధారకమై |
| **అడియేఱ్కు** | = దాసుడనైన నాకు |
| **ఇన్ఱు తిత్తిక్కుమ్** | = ఇపుడు రుచిస్తున్నది |
| **నిన్ అరుళిన్ తన్మై** | = నీ దయాగుణాన్ని |
| **ఇ కడల్ ఇడత్తిల్** | = సముద్రముచే చుట్టబడిన ఈ భూమండలంలో |
| **ఆరే అఱివార్** | = తెలియగల్గినవారెవరూ లేరు. |

**తాత్పర్యము:**

భగవద్రామానుజుల దయను మేఘంతో పోల్చారు అముదనార్లు. మేఘం ఇది జలమని, ఇది స్థలమని భేదం చూపకుండా అన్ని చోట్ల ఒకేలా వర్షిస్తుంది. అలాగే భగవద్రామానుజులు కూడా వీరు అధములు, వీరు ఉత్తములు అనే భేదభావం చూపకుండా అందరిపట్ల ఒకేరకమైన దయను చూపించు మహనీయులు. ఇంక నా విషయమా! భయంకర దుఃఖాలన్నింటికీ నివాసస్థానంగా ఉన్నవాడిని. అలాంటి నన్ను మీరు స్వయంగా వచ్చి అనుగ్రహించారే– ఓహో! మీ కల్యాణగుణాలు నాకు పరమ భోగ్యంగా భాసించాయి. ఆత్మకి ధారకంగా నిలిచాయి. రామానుజా! కృపామాత్ర ప్రసన్నాచార్యా! ఈ విషయాన్ని ఈ లోకంలో ఎవ్వరూ తెలుసుకొనలేక పోతున్నారు.

ఈ పాశురంలో ఆచార్య వైభవం అందంగా వర్ణింపబడింది. మేఘానికి ఎలా స్థల జల భేదాలు లేవో, మన రామానుజులకి కూడా మానవుల ఉచ్చ నీచ స్థితులతో సంబంధం లేదు. ఎలా వీళ్ళందరిని ఉద్ధరించాలా అనే ఆలోచన, కృప... అదొక్కటే వారి ఉదార రూపం. అందుకే వారు కృపామాత్ర ప్రసన్నాచార్యులు! వారు మన ఆచార్యులు! మన రామానుజులు మన స్వామి!!!

********

## 26వ పాశురం

**తిక్కుత్త కీర్తి యిరామానుశనై, ఎన్ శెయ్ వినైయాయ్**
**మెయ్క్కుత్తమ్ నీక్కి విళంగియ మేకత్తై, మేవుమ్ నల్లోర్ ।**
**ఎక్కుత్తువాళర్ ఎతుపిఱప్పు ఏతియల్ వాక నిన్ఱోర్**
**అక్కుత్తమ్ అప్పిఱప్పు అవ్వియల్ వే నమ్మై యాట్కొళ్ళుమే! ॥**

**ప్రతిపదార్థం:**

| | | |
|---|---|---|
| **ఎన్ శెయ్ వినై ఆమ్** | = | నేను చేసిన కర్మలు అనే |
| **మెయ్ కుత్తమ్ నీక్కి** | = | స్థిరమైన దోషాలను పోగొట్టి |
| **విళంగియ** | = | ఆ ఆనందంతోఉజ్జ్వలులయిన |
| **మేకత్తై** | = | మేఘమువలె పరమోదారులై |
| **తిక్కు ఉత్తకీర్తి** | = | అన్ని దిక్కులలో వ్యాపించిన కీర్తికలిగిన వారైన |
| **ఇరామానుశనై** | = | భగవద్రామానుజులను |
| **మేవుమ్** | = | భక్తితో ఆదరించే |
| **నల్లోర్** | = | సత్పురుషులు |
| **ఎక్కుత్తవాళర్** | = | ఏ దోషాన్ని కలవారై |
| **ఎతు పిఱప్పు** | = | ఓ జన్మ కలవారై |
| **ఎతు ఇయల్వు ఆక** | = | ఏ చరిత్ర కలవారై |
| **నిన్ఱోర్** | = | ఇంతకు ముందున్నారో |
| **అక్కుత్తమ్** | = | ఆ దోషం |
| **అప్పిఱప్పు** | = | ఆ జన్మ |
| **అ ఇయల్ వే** | = | ఆ చరిత్రయే |
| **నమ్మై** | = | మనలను |
| **ఆళ్ కొళ్ళుమ్** | = | దాసులనుగా చేస్తుంది! |

**తాత్పర్యము:**

ఎటువంటి నీచులైనా, ఏకులంలో పుట్టినా, ఎలాంటి జ్ఞానహీను

లయినా భగవద్రామానుజుల సేవలో ఉజ్జీవింపవచ్చును అని చెప్పే పాశుర అర్థమిది.

యతిరాజులను ఆశ్రయించడానికి ఏ గొప్ప అర్హతలూ అవసరం లేదు. అంతేకాదు వారి చరిత్ర చూస్తే, నీచజన్మలలో పుట్టినవారు, దోషభూయిష్ఠులు, హీనచరిత్రులూ కూడా వారిని ఆశ్రయించి, వారి కరుణకు పాత్రులై తరించారు. ఇది మనవంటి వారికి ధైర్యాన్ని కలిగించే విషయం. ఇంకో విశేషమేమంటే రామానుజులను ఆశ్రయించినవారు ఏజాతికి, కులానికి, గుణానికి చెందినవారైనా ఆ స్వామిని ఆశ్రయించిన ధన్యులు కాబట్టి వారు మనకి గౌరవింపదగినవారే! ఎంబెరుమానారులసేవలో, కైంకర్యంలో అందరూ తరించవచ్చు. అందరికీ ఆ సౌభాగ్యం చేకూరుతుంది. అటువంటి పెద్దలందరినీ మనం ఆదర్శంగా గ్రహించాలి అని ఈ పాశురం వివరిస్తోంది.


జై శ్రీమన్నారాయణ!

**శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి మంగళాశాసనములతో...**

**శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయరు స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో...**

ప్రకాశం జిల్లా, మార్కాపురంలో వేంచేసియున్న శ్రీ, భూ సమేత ఆమలక లక్ష్మీనారాయణ శ్రీరామ కృష్ణ స్వామివార్ల దేవస్థానమునందు

**50వ శ్రీరామనామ సప్తాహ మహోత్సవములు**

**14-03-2013 నుండి 21-03-2013 వరకు జరుగును.**

**- శ్రీ ఆమలక లక్ష్మీనారాయణ రామకృష్ణ దేవాలయము, జవహర్‌నగర్ కాలనీ, మార్కాపురం**

**వివరములకు: ఫోన్: 9866730211, 9849036925**



మరింత విశాలంగా ... వినూత్నంగా....

ప్రత్యేక 1 గ్రామ్ జ్యూయలరీ కౌంటర్



**కామధేను సిల్క్స్**

పట్టు చీరలు
ఫ్యాన్సీ చీరలు
వర్క్ శారీస్
గద్వాల్
వెంకటగిరి
చుడీదార్స్
డ్రెస్ మెటీరియల్స్

**బీసెంట్‌రోడ్, విజయవాడ-2. ఫోన్: 2574220**


# తరంగిణీ - వికాస తరంగిణీ

1. తరంగిణీ తరంగిణీ
తరంగిణీ తరంగిణీ !!
నవ జీవన వికాస మంగళ కారిణి !
చిన జీయరు పావన హృదయ విహారిణి !! ॥తరంగిణీ॥

మానవ జన్మ అమూల్యవరమని...
అన్ని ప్రాణుల సేవ చేయమని
అదే, అదే శ్రీమాధవ సేవనీ....
తెలిపే జ్ఞాన, సుజ్ఞాన ప్రదాయిని ॥తరంగిణీ॥

2. వేదమార్గమే హిత కర్మ కరమ్మని
ధర్మ రక్షణే మనకు రక్షయని....
వివరించే ఘన సుపథగామిని ॥తరంగిణీ॥

జీయర్ వచనం శిరోధార్యమని .....
ఆచార్యుండే దారి చూపునని....
సేవల నెపుడూ మరువరాదని.....
సూచించే సుశ్రేయోదాయిని ॥తరంగిణీ॥

4. అంధుల సేవలు నిరుపమానమని....
మహిళల క్షేమం మన లక్ష్యమ్మని...
'భక్తినివేదన' పఠనీయమ్మని....
స్పష్టం చేసిన సౌఖ్యకారిణి..... ॥తరంగిణీ॥

**జీయర్ చరణౌ శరణం ప్రపద్యే**
**జయ జయ వికాస తరంగిణీ!**

**జయ రామానుజ!** **జయ జయ జీయర్**


**ఇట్లు**
భగవత్ భాగవత బంధువు
భక్తుల, భక్తుల, భక్తుడు&శ్రీరామానుజ దాసుడు
డా॥ **మరింగంటి లక్ష్మణాచార్య**
ఫోన్ : 9640233930



**7 సం॥లలో CA/CWA లలో అత్యధిక ఆలిండియా ర్యాంకులు మరియు పాస్ పర్సెంటేజ్ సాధించిన నెం.1 కామర్స్ విద్యా సంస్థ**



ఆంధ్రప్రదేశ్‌లోనే అత్యుత్తమ ఉత్తీర్ణతతో పాటు ర్యాంకులు సాధిస్తున్న ఏకైక అగ్రగామి కామర్స్ విద్యా సంస్థ

2012 Jr.MEC లో స్టేట్ 1st RANK 490/500



K. VYSHNAVI

No.1 for ▸ Inter(MEC / CEC) ▸ CA/CWA

**శ్రీMEDHA**™

Igniting Intelligence. Delivering Excellence.

Head Office: 6-9 Brodipet, Vuda Office Road, Guntur-2. Ph: 22 55 891 / 988 52 49166

Branch Office: Sriya Towers 2nd Floor, Beside Income Tax Office, Near Sidhardha Public School, Mogalrajpuram, VIJAYAWADA Ph:9248920266

vijay ads

# ప్రకృతి బడిలో - జీవన పాఠాలు 7

వైశారది

## సూర్యుడు

పరిదృశ్యమాన ప్రపంచంలో కంటికి కనబడే దైవస్వరూపమే సూర్యుడు. సూర్య నారాయణునిగ ప్రత్యక్షదైవముగ మనందరి ఆరాధన లందుకుంటున్నాడు. భూమిపై నివసించే మనకేగాక, విశ్వమంతటికీ కాంతిని, వెచ్చదనాన్ని కలిగించడం ద్వారా పోషణ కల్పిస్తూ, రక్షిస్తున్నాడు. సైన్స్ ప్రకారం చూసినా నీరు ఉంటేనే జీవకోటి ఆవిర్భవిస్తుంది. సూర్యుడు, అతనికాంతి ఉంటేనే పుట్టిన ప్రాణికోటి జీవనాన్ని కొనసాగించ గలుగుతుంది. మరి సూర్యునికి అంతటి కాంతి, శక్తి ఎక్కడివి? అంటే, వేదాలు సమాధానం చెప్తున్నాయి. "సూర్యమండల మధ్యవర్తి అయిన నారాయణుడు ఆపాద మస్తకం బంగారువర్ణ దేహంతో, తేజస్సుతో ప్రకాశిస్తున్నాడని, ఆ స్వామి తేజస్సునే సూర్యుడు లోకానికంతటికీ పంచుతున్నాడు.

నిజానికి భగవంతుడు జగత్‌లో అంతటా, అన్నిటా మనందరి లోనూ తన పరిపూర్ణ తేజస్సుతోనిండి ఉన్నాడు. కానీ, మనం పాంచభౌతిక దేహంతో, ఎన్నో జన్మల నుండి పేరుకుపోయిన కర్మ ప్రభావంతో ఆ స్వామి తేజస్సును గుర్తించలేకున్నాం! బయటికి ప్రసరించనీయక అడ్డుకుంటున్నాం! కానీ, సూర్యమండలమనే గోళాన్ని తన దేహంగా కలిగిన జీవుడు తనలోని స్వామి తేజస్సును లోకానికంతటికీ పంచుతున్నాడు. పోషణ, రక్షణ కల్పిస్తున్నాడు.

"సూర్యుని"గ "పూషా" పోషించేవానిగ స్తుతిని అందుకొంటు న్నాడు.

అసలు సూర్యునిలోని ఈ పంచే స్వభావమే అతనిని ప్రాణికోటికి అంతటికీ పోషకునిగ పరమాత్మ అనుగ్రహించడానికి కారణమై ఉంటుంది. ఆ సూర్యుని నుండి అవధూత గ్రహించిన పాఠాలని ఈ సంచికలో తెలుసుకుందాం!

మనకందరికీ నేటి విజ్ఞానశాస్త్రం ద్వారా పంటలు పండడానికి మనకి కావలసిన ఆహారపదార్థాలు మొక్కల నుండి పొందడానికి "సూర్యరశ్మే" కారణమని తెలుసు. పంటలు బాగా పండాలంటే సక్రమంగా వానలు కురవాలి. దానికి సూర్యుడే కారణం. సముద్రంలోని ఉప్పునీటిని తన కిరణాల ద్వారా గ్రహిస్తాడు సూర్యుడు, వేసవికాలంలో. అలా గ్రహించిన నీటినంతటినీ తన దగ్గరే నిలువ ఉంచుకోడు. తిరిగి వర్షాకాలం రాగానే పంటలకి తగిన యోగ్యతకల మంచినీటిగా వర్షింప చేస్తాడు. పంటలు సూర్యుని వలన లభించిన నీటిని, సూర్యరశ్మిని, భూసారాన్ని గ్రహించి చక్కగా పెరుగుతాయి. మనకి రావలసిన ధాన్యాలు, పప్పు దినుసులు, కూరలు, పండ్లువంటి వాటినన్నిటినీ మనకందిస్తున్నాయి.

అదే సూర్యుడు తన కిరణాల ద్వారా గ్రహించిన నీటిని తిరిగి వదిలి పెట్టకపోతే ప్రాణికోటికి ఎంత ప్రమాదం? సూర్యుడు తనకు మాత్రమే అని నీటిని ప్రోగుచేసుకోవటంలేదు. నిలువ ఉంచేసుకోవటం లేదు. ఓ యదుమహారాజా! సూర్యునిలోని ఈ స్వభావమే ఒక చక్కని సందేశాన్నిస్తోంది. మానవులమంతా మన ఇంద్రియ సుఖానుభవం కోసమై ఎన్నెన్నో విషయాలను సేకరిస్తూంటాం! అవి ఎప్పటికీ మనకే అనే లోభబుద్ధితో దాచేసుకోరాదు. అర్థులైన వారికి వాటిని ఇచ్చివేయగలగాలి.

ముఖ్యంగా యోగి కాగోరే వ్యక్తి తాను పొందిన వస్తుజాతమంతా తనదే అనే స్వార్థబుద్ధిని వీడాలి. సూర్యుడు తన కిరణాలతో సేకరించిన నీటిలో ఏ ఒక్క బిందువూ తనకోసం అని భావించక వానగ వితరణ చేసినట్లే, యోగి స్వార్థబుద్ధిని వీడి స్వప్రయోజనాన్ని ఆశించక ఇతరులకే పంచివేయాలి. తద్వారా విషయసేకరణలో ఆసక్తిని, సుఖోపయోగ వస్తుజాతంతో సంగాన్ని పోగొట్టుకోగలుగుతాడు. పరమాత్మ పట్ల ఆసక్తుడై అంతర్ముఖుడు కాగలుగుతాడని తెలుసుకొన్నాను. ఓ యదుమహారాజా! అందుకే అన్నిటినీ వదిలి నిశ్చింతగ, ఈ వనప్రదేశంలో ఆత్మారాముడినై విహరించగలుగుతున్నాను.

అంతేకాదు, ఆకాశంలో ఉండే సూర్యుడు, అద్దంలో చూస్తే అందులోనే ఇమిడి వెలుగుపంచుతూ ఉన్నట్లు కన్పిస్తాడు. నీటిలో చూస్తూ కదిలే అలలతో పాటు తానూ కదులుతూ నీటిలోనే ఉన్నట్లుంటాడు. పదునైన కత్తితో చూస్తే, అదే ఆకృతితో తళతళ మెరుస్తూ కత్తిలోనే ఉన్నట్లుగ అన్పిస్తాడు. ఇదంతా భ్రమ మాత్రమే!

నిజానికి సూర్యుడు ఆకాశంలోనే ఉన్నాడు. భ్రమవలన అద్దంలోనో, నీటిలోనో, ఖడ్గంలోనో ఉన్నట్లుగ అన్పిస్తున్నాడు. కానీ, అద్దానికి, నీటికి, ఖడ్గానికి ఉండే స్వభావాలేవీ, దోషాలేవీ సూర్యునికి అంటనే అంటవు.

జీవుడు కర్మానుగుణంగ దేవ, మనుష్య, తిర్యక్, స్థావరాల..

శరీరంరలో ప్రవేశిస్తాడు. నిజానికి జీవులలో దేవతలు, మనుష్యులు, తిర్యగాది భేదాలు లేనేలేవు. జీవులంతా సమానమే! దేవతాశరీరంలో ప్రవేశించిన జీవుని దేవత అంటాం. అలానే మనుష్య శరీరం పొందితే మనిషి అంటున్నాం. జంతు శరీరం లభిస్తే పశువు. స్థావర శరీరమైతే చెట్టు, పుట్ట అని అంటున్నాం.

కారణం దేహమే ఆత్మ అనే భ్రమ. దీనినే దేహాత్మ భ్రాంతి అంటారు. ఇది పంచభూతాత్మకమైన శరీరాన్నే, శుద్ధజ్ఞాన స్వరూపునిగ భ్రమింపచేస్తుంది. ఆ జ్ఞానాన్ని విస్మరించి దేవతగానే, మనుష్యులు మొదలైన స్వభావాలతో ప్రవర్తింపచేస్తుంది. నిజానికి ఆత్మ అణు స్వరూపం... జ్ఞానమయమూను. కానీ, మనల్ని మనం "నేను లావుగ" ఉన్నాను. "నేను సన్నబడ్డాను" అంటూ వ్యవహరించు కుంటున్నామంటే కారణం 'ఈ దేహమే నేను' అనేభ్రమ మాత్రమే!

ఓ మహారాజా! అద్దము, నీరు మొదలైన వాటిలో ప్రతిఫలిస్తూంటే వాటిలోనే తానున్నాడు అని భ్రమ పడుతున్నాం! కానీ, వాస్తవాన్ని గుర్తించగలిగితే సూర్యుడు వాటికి అతీతంగ ఆకాశంలో ప్రకాశిస్తున్నాడు. ఆ సూర్యుని చూశాక యోగినైనవాడు, దేవ, మనుష్యాది శరీరాలలో ఉన్న జీవుడు, ఆ జీవునిలో ఉండే పరమాత్మ కూడా ఆయా శరీరాలకంటే వేరని గుర్తించుకోవాలి! అంటే, మనం ఈ దేహాలకంటే వేరు. మనలో ఉన్న పరమాత్మ మనకంటే (జీవులకంటే) విలక్షణుడని గుర్తించగలిగా నయ్యా! దానితో దేహాత్మభ్రాంతి నుండి బయటపడగలిగాను.

తద్వారా ఆయా దేహగత దోషాలు మనకి (జీవునికి) అంటవన్న తెలివి కలిగింది. అంతేకాక, సూర్యునిలానే పరమాత్మ కూడా దేవ మనుష్యాది శరీరక, జీవులందరిలో ఉంటూ, కర్మానుభవ రూప, సుఖ దుఃఖాది దోషాలకి అతీతంగా ప్రకాశిస్తుంటాడని గ్రహించగలిగాను. నిత్యమూ ఈ ఎరుక కలిగిన యోగి సూర్యునిలా తనలోని పరమాత్మ ప్రకాశాన్ని లోకానికి పంచగలుగుతాడు. లోకారాధ్యుడు కాగలుగుతాడు. అని సూర్యుని నుండి నేర్చిన పాఠాలని అవధూత యదుమహారాజుకి వివరించారు.

# నేర్చుకుందామా! - 25

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

**రామే ప్రవ్రజనం బలేర్నియమనం, పాండోః సుతానాం వనం**
**వృష్ణీనాం నిధనం, నలస్య నృపతే రాజ్యాత్ పరిభ్రంశనం ।**
**కారాగారా నిషేవణం చ మరణం సంచిత్య లంకేశ్వరే**
**సర్వః కాలవశేన నశ్యతి నరః కోవా పరిత్రాయతే ॥**

కాలమహిమ చాలా గొప్పది. దాన్ని అతిక్రమించడం ఎంతటి వారికి సాధ్యం కాదు. ఈ విషయాన్ని కొందరి చరిత్రలు చూపిస్తూ చెప్తుందీ శ్లోకం.

రావణాదుల నోడించగల్గినవాడు శ్రీరాముడు. అయినా అడవిపాలు కాక తప్పలేదు. కాలమహిమ కాకపోతే ఏమిటి!

ఇంద్రాదులను ఓడించినవాడు, మహాదాత బలి చక్రవర్తి అయినా పాతాళానికి త్రొక్కివేయబడ్డాడంటే విధి బలీయం.

రాజసూయాదులు చేయకల్గిన భుజబల పరాక్రమవంతులు మహావీరులు పాండవులు. అయినా అరణ్యవాసం, అజ్ఞాతవాసం తప్పలేదు కదా! శ్రీకృష్ణునంతటివాని వంశంలో వారే యాదవులు. అంతఃకలహాలు తప్పలేదు మరి!

అశ్వ - సూద - జూదాలలో అద్వితీయుడు నలుడు. పాపం రాజ్యభ్రంశం పొందక తప్పలేదు.

ఇంక లంకేశ్వరుడైన రావణుడు కార్తవీర్యార్జునునిచే బంధింపబడి చెఱసాలలో పెట్టబడడం, శ్రీరాముని చేతిలో విగత జీవుడవడం ఇవన్నీ చూస్తూంటే మానవుడెంత గొప్పవాడయినా కానీండి..! కాలానుగుణంగా దాని మహిమకి తల ఒగ్గవలసినదే కాని, తప్పించుకొనలేడు. కాలం చాలా మహిమాన్వితమైనది.

దాని నెవ్వరూ ఎదిరించలేరు అంటోంది ఈ శ్లోకం. అందుకే కాలాన్ని దైవంగా భావించాలి. ఎదురైన పరిస్థితులను దైవ ప్రసాదంగా స్వీకరించాలి.

అదృష్ట రత్నాలు ధరించండి! అనుకున్నది సాధించండి!
శ్రీ సాయి
పవిత్ర డైమండ్స్
4/7, బ్రాడీపేట, ఖజానా జ్యూయలర్స్ ప్రక్కన, గుంటూరు. సెల్: 9246410099, ఫోన్ : 2262626.
బి/3, జైహింద్ కాంప్లెక్స్, గ్రౌండ్‌ఫ్లోర్, యాక్సిస్‌బ్యాంక్ ప్రక్కన, గవర్నర్‌పేట, విజయవాడ. సెల్ : 9246310099, ఫోన్ : 6665011.
సంపూర్ణ జ్యోతిష్యం చూడబడును
నాణ్యమైన జాతిరత్నాలు
జెమ్ టెస్టింగ్ ల్యాబ్
కెంపులు పచ్చల పూసలు
మంచి ముత్యములు, పగడములు
శివస్వరూపమైన రుద్రాక్షలు
స్ఫటికమాలలు
1 గ్రామ్ గోల్డ్ ఇమిటేషన్ జ్యూయలరి

# శ్రీ కలివైరి సూరి వైభవము



**శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు**

**తిరుమంగై ఆళ్వార్- పెరియ తిరుమొழ్హి 1-10-1**

**కణ్ణార్ కడల్ శూழ్హిలంగై క్కిఱై వన్తన్**
**తిణ్ణాకం పిళక్కచ్చర మ్శెలవుయ్త్తాయ్ ।**
**విణ్ణోర్ తొழ్హుం వేంగడ మామలై మేయ**
**అణ్ణా వడియేన్ ఇడరై క్కళైయాయే ॥**

**ప్రతిపదార్థము: కణ్ణార్**=ప్రదేశములచేత పూర్ణమైనదియునగు; **కడల్ శూழ్హ్**=సముద్ర పరివేష్టితమైనదియునగు; **ఇలంగైక్కు**=లంకా నగరమునకు; **ఇఱైవన్తన్**=రాజైన రావణాసురునియొక్క; **తిణ్ణాకం**= దృఢమగు శరీరమును; **పిళక్క**=బ్రద్దలు చేసేటట్టుగా; **శరమ్**=బాణము; **శెలఉయ్త్తాయ్**=వెళ్ళేటట్టుప యోగించినవాడా; **విణ్ణోర్**=దేవతలు; **తొழ్హుం**=నమస్కరించునట్టి; **వేంగడ మామలై**=ఎత్తైన వేంకటగిరియందు; **మేయ**=నిత్యనివాసము చేయుచున్న; **అణ్ణా**=అన్నివిధముల బంధువైనవాడా!; **అడియేన్**=నీదాసునియొక్క; **ఇడరై**=దుఃఖమును; **క్కళైయాయే**=తొలగింపుమా!

**తాత్పర్యము:** ఎత్తైన వేంకటగిరియందు వేంచేసియున్నవాడా! నాకు సకల విధములుగ బంధువైనవాడా! సముద్ర పరివేష్టితమగు లంకానగరము నకు అధిపతి అయిన రావణాసురునియొక్క శరీరము బ్రద్దలగునట్లు బాణముప్రయోగము చేసినవాడా! స్వామీ! దాసుని దుఃఖమును పోగొట్టుము.

**విశేషార్థము:** తిరుమంగై ఆళ్వారులు.. **తాయే తందై యెన్నుమ్** అను దశకములో **ఎన్నేను మిరందార్కు ఇనితాకవురైత్తరియేన్** *1.9.3;* యాచించిన వారికి ఎన్నడును మృదువుగా సమాధానమును చెప్పినవాడను గాను.

**నలందానొన్నుమిలేన్ నల్లతోరరం శెయ్దుమిలేన్** *1.9.4*

మంచికార్యమును ఏ ఒక్కదానిని కలిగినవాడను కాను.

సద్ధర్మములను అనుష్ఠించిన వాడనుకాను. **పెరియేనాయిన పిన్ పిరర్కే యుழైత్తు ఏழైయానేన్** పెద్దవాడిని అయిన పిమ్మట పరులకే (స్త్రీలకే) సేవలు చేసి దుఃఖాల పాలైతిని' అని ఈ విధముగ తమ అకించిన్యతను భగవంతుని సన్నిధిలో తెలుపుకొని శ్రీ వేంకటాచలపతిని శరణువేడిరి.

ఈ దశకములో భగవంతుని పొందుటకు ఏవేవి అడ్డంకులుగానున్నవో వానినన్నిటిని తొలగించమని ప్రార్ధించుచున్నారు.

ఇష్టప్రాప్తి ప్రార్ధనలోనే అనిష్టనివృత్తిగూడ ఉండును కదా! అనుటకు వీలులేదు. స్వామి భగవద్రామానుజులు గద్యత్రయము నందు ముందుగ శరణాగతిని చేసి ఆ పిమ్మట **మదీయానాది కర్మప్రవాహ** అనే చూర్ణికలో తమకు స్థూలరూపముగను సూక్ష్మ రూపముగను ఉన్న ప్రకృతిని తొలగించమనియు, అహంకార మమకారములను తొలగించమనియు పరభక్త్యాదులను కలిగించమనియు ప్రార్ధించియున్నారు కదా!

విరోధి నిరసనశీలుడును సర్వరక్షకుడును తన భక్తుల కరస్పర్శగల ద్రవ్యము లేనిదే ఉండలేని వాడును, తన భక్తులతో నిత్యసంశ్లేషము కలవాడును, సర్వసులభుడునగు సర్వేశ్వరునితో తిరుమంగై ఆళ్వార్లు "స్వామీ! నీవు లేనిదే నేను ఉండలేని స్థితిని నాకు కలిగించుమా!' అని ప్రార్థించిరి. సర్వేశ్వరుడు తిరుమంగై ఆళ్వార్లకు ఇట్లు తెలిపిరి.

'ఓ పరకాలసూరివర్యా! నీకోరికలనన్నింటిని తీర్చుటకొరకే కదా! నేను తిరుమలపై నిత్యవాసము చేయుచున్నది' అని పలికిరి. ఆ విధముగ సర్వేశ్వరుడు మొదట శేషాద్రిశిఖరాలపైకి వచ్చి, ఆ పిమ్మట తిరుమంగై ఆళ్వార్ల హృదయమున చేరి, వారికి పరభక్త్యాదు లను కలిగించిన విధమును తిరుమంగై ఆళ్వార్లు ఈ దశకమున తెలుపుచున్నారు.

భక్తి అనునది కేవలము ఉపాసకునికే చెందినదని భావింప కూడదు. ప్రపన్నులకు కూడ భక్తి కలదు.

**సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః।**

**నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥** *గీత 9 -14* ఈ శ్లోకమున **నమస్యంతశ్చ** అను పదమును ప్రపత్తిపరముగ కూడ పెద్దలు వ్యాఖ్యానించారు.

**కణ్అర్కడల్**:కణ్=స్థలము. **కణ్ణార్ కడల్**=సువిశాలమగు సముద్రము.

భూమిపై ఉన్న ప్రాణులకంటే ఎక్కువ ప్రాణులు సముద్రమున గలవు. ఎక్కువ ప్రాణికోటికి ఆవాసమై సువిశాలమైన సముద్రము. అది సందర్శనీయ మైనది. కనురెప్పలార్పక చూడముచ్చటనైనది. అటువంటి సముద్రమును అగడ్త కలిగి రక్షకమైన లంకానగరమునకు ప్రభువైన రావణాసురుడు అతడే లంకానగరమునకు తానధిపతి అనే దురభిమానము కలవాడు.

**తిణ్ణాకం:** బ్రహ్మాస్త్రాదులు కూడ నిరుపయోగములగునట్లు దేవతా వరములను పొంది నిర్భయుడై శరీరమును పెంచుకొనిన వాడు. అటువంటి రావణాసురునియొక్క శరీరము బ్రద్దరిల్లునట్లు బాణప్రయోగములను చేసినవాడు.

**విణ్ణోర్:** రావణాసురునిచే తమ తమ ఆవాసములను కోల్పోయిన దేవతలు శ్రీ వేంకటాచలపతిని ఆశ్రయించుచుందురు. బ్రహ్మాదు లచే ఆశ్రయింప బడు స్వభావము కలవాడగు భగవంతుడు ఇపుడు తిరుమలను నిత్యవాసము చేసికొని యున్నాడు. అతడే నాకు నిరుపాధిక బంధువు.

**అడియేన్:** 'ఈ లోకమున నివసించుట దుఃఖఫలము అని నామనస్సునకు తోచినది. ఇక నేను ఇచ్చట వసించలేను. నాకైంకర్య విరోధిని తొలగించి అనుగ్రహించుమా!' అని తిరుమంగైఆళ్వార్లు వేడుకొనుచున్నారు.

# శ్రీవేంకటాచల "చిత్రే"తిహాసమాల

9

రచనం
రంగరామానుజాచార్య

చిత్రానువర్తనం
జి.వి.ఎస్. శ్రీనివాస్
కె. సత్య శ్రీనివాస్



## శంఖచక్రాలు సహజంగా లేకుండా కృత్రిమంగా ఎందుకు ఏర్పడ్డాయి?

శ్రీనివాసుడు ఆదిలో తానావిర్భవించినప్పుడు శంఖచక్రాలతోనే అరుంధతి మొదలైనవారికి గోచరించాడు. కాలాంతరంలో ఆశంఖచక్రాలు మరుగునపడి శంఖచక్రరహితునిగా, స్వామి గోచరించి, ప్రతి పక్షుల విపరీత భావనలకు ఊతంఇచ్చాడు. స్వామి, ఇలా ఉండటాన్ని బట్టి, ఈయన శ్రీనివాసుడేకాదని వాదించారు ప్రతిపక్షులు. రామానుజులు ఐతిహ్యాన్ని చెప్పి వారివాదాన్ని ఖండించారు. బ్రహ్మాండపురాణంలో, తొండమాన చక్రవర్తి కథ, స్వామికి శంఖచక్రాలు లేక పోవడానికి గల కారణాన్ని చెప్పింది. ఒకప్పుడు, స్వామి భక్తుడైన తొండమాన చక్రవర్తి ఉన్న నగరాన్ని శత్రుసైన్యం ముట్టడించింది. శత్రువులతో యుద్ధంచేయబోయి, చక్రవర్తి పరాజితుడైయ్యాడు.

స్థితే కదాచిత్ క్షితిపే శ్రీనివాసస్య సన్నిధౌ ।
శత్రవశ్చ బలోద్రిక్తా రురుధు స్తస్య వై పురీమ్ ॥
శ్రుత్వా బలార్ణవం ఘోరమ్ ఆయాన్తం నాతిశంకితః ।
యోద్ధుకామో జగామాథ పునస్తైశ్చ పరాజితః ॥

(ఒకప్పుడు రాజు, శ్రీనివాస సన్నిధిలో ఉండగానే ఆతని నగరాన్ని శత్రువులు బలోద్రేకంతో చుట్టుముట్టారు. ఘోరమైన ఆసైన్య సాగరాన్ని చూచి పెద్దగా శంకించక యుద్ధానికెళ్లాడు. కాని వారిచే పరాజితుడయ్యాడని తాత్పర్యం).

**తతో భిన్నమనా భూత్వా తమేవ శరణం యయౌ ।**
**బిలద్వారేణ దేవేశం గత్వా పాదౌ ప్రగృహ్యచ ॥**
**రురోద త్రాహి త్రాహీతి తం ప్రాహార్చా స్వరూపవాన్ ।**

కలతపడిన రాజు బిల మార్గాన కొండకుచేరి శ్రీనివాసుని సన్నిధిలో శరణాగతి చేశాడు.

తన సన్నిధికి రక్షణార్థమై వచ్చిన తొండమానునిచూచి అర్చారూపియైన స్వామి ఇలా అన్నాడు.

**మా భైషీః పుత్ర! భద్రంతే చక్రశంఖౌ దదామితే ॥**
**ఇత్యుక్త్వా తౌదదౌ తస్మై తాభ్యాం సహ జగామ సః ।**

పుత్రా! భయపడకు, నీకు 'భద్రం' కలుగుతుంది. నీకు శంఖచక్రాలను ఇస్తాను, నీనగరాన్ని రక్షించుకో అంటూ తన శంఖచక్రాలు ఇచ్చాడు. శంఖచక్రాల ద్వారా శత్రుపరాజయం అయిన తరువాత చక్రవర్తి శంఖచక్రాలతో, స్వామిని చేరి స్తుతించాడు. ఆస్తుతికిమెచ్చి స్వామి ఏదైనా వరంకోరుకోమన్నాడు. అప్పుడు రాజు "అర్చాబింబంలో శంఖచక్రాలను ధరింపవద్దని" ప్రార్థించాడు. అందువల్లనే స్వామికి శంఖచక్రాలు లేవని రామానుజులు పురాణాన్ని ఉట్టంకించి నిరూపించారు. రాజ ప్రార్థనాన్ని పురాణం ఇలా నిర్దేశించింది.

**అర్చాబింబే శిలాబింబే శంఖచక్రౌ న ధారయ ।**
**ఇతి సంప్రార్థితోదేవో నదధార పునశ్చ తౌ ।**
**అదృశ్యౌ తిష్ఠతశ్చోభౌ పార్శ్వతశ్శార్ఙ్గధన్వినః ॥**

స్వామికి, అదృశ్యంగానే ఆనాటినుండీ శంఖచక్రాలున్నాయని రామానుజులు ప్రతిసమాధానించారు.



చిత్రకథ– **28**

# రామానుజ చిత్రకథ




















అయ్యో... హతవిధీ...!
దయానిధీ ! మమ్మ్ము కాపాడు.


రేపు సభకి పిలిచి, వీరికి తగిన న్యాయం చేయాలి...!


మరునాటి సభలో...
మీ చింతకు కారణం తెలిసింది.


సమయం దాటకమునుపే మీ కుమార్తెను మేం వివాహంలో స్వీకరిస్తాం.


కూరనాథా! వేలాది మందికి నివాస వృక్షమైన మీరు కలకాలం వర్ధిల్లాలి.


ఈమె వైధవ్య యోగానికి మీరు బలి కారాదు.


మీకా భయం అక్కరలేదు.
ముహుర్తానికి సిద్ధం చేయండి.


వివాహం ....
అగ్ని ప్రదక్షిణ....


గార్హస్థ్యాన్ని వదిలి, నేనిప్పుడే వానప్రస్థాన్ని స్వీకరిస్తున్నా.


ఆహా! ఏమి వైరాగ్యం.
ఆ అమ్మాయికి ఎంత ఆసరా ఇచ్చారాయన.
అవును. ఆమె తల్లిదండ్రుల భారాన్ని తీర్చారు.


అవునులే, కాపురం చేస్తే కదా! 'వైధవ్యం' అనే ప్రసక్తి.
పిల్ల గతిని గౌరవించాడు,
తన ప్రాణాన్ని దక్కించుకున్నాడు.
శాస్త్రాన్ని పాలించాడు.


ఆహా! ధర్మ సూక్ష్మాలు గ్రహించడంలో ఈయనికి ఈయనే సాటి.


అలా... చిన్ననాటి నుంచి పరమ విరాగిగా, వేలాది మందికి అన్నదానాలు చేస్తూ ...నిస్వార్థంగా జీవిస్తున్న మహనీయుడు 'శ్రీవత్సాంక మిశ్రులు'.


ఈయననే 'కూరేశ మిశ్రులు' అని కూడా అంటారు.


వీరి శాస్త్రదృష్టి సునిశితం.

(ఇంకా వుంది)


శ్రీవేంకటేశ్వరస్వామివారి ద్వితీయ పుష్కరోత్సవం - అపోలో హాస్పిటల్స్




శ్రీశ్రీశ్రీ స్వామివారిచే శ్రీవేంకటేశ్వర పూజలలో పాల్గొన్న భక్తులు



శ్రీవిష్ణుసహస్రనామ విరాట్‌పారాయణ ఉపదేశాత్మకం చేయిస్తున్న శ్రీస్వామివారు, శ్రద్ధతో అందుకుంటున్న భక్తులు







# SERVOMAX INDIA LIMITED

AN ISO - 9001:2008, ISO - 14001:2004 & BS OHSAS - 18001:2007 CERTIFIED COMPANY

***Safe Power Saves Power***




Power Saver

- Exports to 26 Countries
- Over 1 Lakh Installations
- Pan India Operations
- Manufacturers of India's Highest Capacity Auto Transformers

## Green Energy & ESCO

Complete Solutions for Grid Connected or Off Connected


Solar Panels


Inverters



Batteries


Solar UPS


Solar Lamps


Solar Street Lights


Bharat Ratna Dr. M Visvesvaraya Industrial Award-2008 Best Performance in Small Scale Sector


Rajiv Gandhi National Quality Award - 2007


A.P Best Entrepreneur Award - 2009


CITD Industrial Trade Achievement Award - 2006

## Our Products

- Power Conditioners
- Servo Voltage Stabilizer (HT / LT)
- Power Savers
- Ultra Isolation Transformers
- Distribution & Power Transformers

# SERVOMAX INDIA LIMITED

# 406, Meridian Plaza, Ameerpet Hyderabad - 500 016. A.P. INDIA.
Ph: +91 40 4050 9999 / 9900

admin@servomax.net
www.servomax.net

With Best Compliments from








# KAKATIYA CEMENT

Quality Always - Ahead

53 Grade Cement & White Crystal Sugar

Sri P. VENKATESWARLU
Chairman & Managing Director

## KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED

Regd. Office : 1-10-140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
✆:27637717, 27633627, Fax No : 040 - 27630172, E-mail : kcsil@sol.net.in
E-mail: info@kakatiyacements.com

Cement Factory :
Srinivasanagar, Jaggaiahpet,
Krishna Dist - 521 175
✆ 08654 - 200014
Fax No: 08654-296331

Sugar Factory :
Peruvancha Village, Kallur Mandal,
Khammam Dist - 507 209,
✆: 08761 - 287207
Fax No: 08761 - 287206

# మన ఆళ్వార్లు



- శ్రీనృసింహ-

## తిరుమంగై ఆళ్వార్లు

**కలయామి కలిధ్వంసం కవిం లోక దివాకరమ్ ।**
**యస్య గోభిః ప్రకాశాభిః ఆవిద్యం నిహతం తమః ॥**

అది చోళదేశం. అందులో ఆలినాడు అనేది ఒక ప్రాంతం. అక్కడ నాగపురి అనే పట్టణం. అక్కడ శంఖముఖమను పుణ్యస్థానం. దాని దగ్గర బిల్వారణ్యం అనే పుణ్యక్షేత్రం. అక్కడ శ్రీమహాలక్ష్మి తపస్సు చేసింది. శ్రీమన్నారాయణుడామె తపస్సుకు మురిసి ప్రేమతో ఆలింగనం చేసుకున్నాడు. అందుకని ఆ పట్టణానికి పరిరంభపురం అనే పేరు వచ్చింది. పరిరంభమంటే కౌగిలి.

ఆ పట్టణానికి దగ్గరగా 'తిరుక్కురైయలూర్" అని ఒక ప్రదేశం. అందులో 'నీలుడు' అనే పుణ్యాత్ముడొకడుండేవాడు. చోళరాజు అతనికి ఆలినాడు దేశంపై అధికారాన్నిచ్చాడు. అందువల్ల ఆరాజు "ఆలినాడుడైయార్" అనే పేరుతో ప్రసిద్ధి చెందాడు.

ఆ రాజుకి కలియుగాది మూడువందల తొంభై ఏళ్ళు గడిచాక నళనామ వత్సం, శుక్ల పూర్ణిమ, గురువారం కృత్తికా నక్షత్రంతో కూడిన శుభదినంలో ఒక కుమారుడు పుట్టాడు. ఆయన నారాయణుని ధనస్సు 'శ్రీశార్ఙ్గం' అంశంతో అవతరించారు.

పుత్రుని చూచి పొంగిపోయారు 'ఆలినాడుడైయార్'. ఆ బాలునికి **నీలుడు** అని తన పేరే పెట్టారు. అల్లారుముద్దుగా పెంచారు. యథావిధి అక్షరాభ్యాసం చేయించారు. క్రమంగా అన్ని ఆయుధాలతో యుద్ధాలు చేయడం, గజ, తురగ, రథారోహణాది విద్యలు... ఇలా అన్నీ నేర్పించారు.

దినదిన ప్రవర్ధమానుడయ్యాడు నీలుడు. ఎంతో అందం, శౌర్యం, తేజస్సు... చూడగానే ఆకర్షించే ఉజ్జ్వల మూర్తిత్వం. పెరిగి పెద్దవాడయ్యాడు నీలుడు. అతని పరాక్రమానికి ఆశ్చర్యపడి అందరూ 'పరకాలన్' శత్రువులకు యముడు అనే బిరుదు ఇచ్చారు. తండ్రి గతించిన తరువాత వెంటనే నీలునికే పట్టం కట్టాడు రాజు. చోళరాజుకి సామంతరాజు నీలుడు. అతనికి ప్రసిద్ధులు, అత్యంత సమర్థులు అయిన నలుగురు మంత్రులు లభించారు.

వారు...

**నీర్మేల్ నడప్పాన్** = అంటే నీటిపై నడిచే సామర్థ్యం కల వాడొకడు.

**తాళూదువాన్** = నోటి గాలితో తాళాలనే తెరిచేంత శక్తి సామర్థ్యాలు కలిగినాయన ఒకడు.

**తోలావళ్ళక్కన్** = వాదనలో జయమే తప్ప అపజయం తెలియని ఆయన ఒకడు.

**నిళ్లలోతుంగువాన్**= అంటే నీడలో ఒదిగిపోయేవాడు ఒకడు.

ఇలా నలుగురు మంత్రులు. ఆయన గుఱ్ఱం పేరు **'అడల్మా'** ఆయన ఏనుగు పేరు **అమరర్ కడమా కళియానై**. ఈ పరివారంతో అద్వితీయునిగా వెలిగాడు నీలుడు.


వ్యక్తిత్వ వికాసానికి ... నాణ్యమైన సాంకేతిక విద్యా బోధనకు

కళ్ళం హరనాథరెడ్డి ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ



శ్రీ కళ్ళం హరనాథరెడ్డి
ఛైర్మన్ : కళ్ళంగ్రూప్




మేనేజ్‌మెంట్ సీట్స్ కొరకు సంప్రదించండి : సెల్: 98856 04528, 94402 61773, 94910 73337.

బిటెక్ కోర్సులు
- కంప్యూటర్ సైన్స్ అండ్ ఇంజనీరింగ్(సియస్‌ఇ)
- ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ (ఇఇఇ)
- ఎలక్ట్రానిక్స్ అండ్ కమ్యూనికేషన్స్ ఇంజనీరింగ్ (ఇసిఇ)
- సివిల్ ఇంజనీరింగ్ (సిఇ),
- మెకానికల్ ఇంజనీరింగ్ (ఎమ్‌ఇ)

EAMCET Code
KHIT

NH- 5.10వ కి.మీ వద్ద, కళ్ళం స్పిన్నింగ్ మిల్స్ వెనుక, చిలకలూరిపేట రోడ్, చౌడవరం, గుంటూరు- 19. ఫోన్: 0863 2119726.
సిటీ ఆఫీస్: ఫస్ట్‌లైన్, గుజ్జనగుండ్ల సర్కిల్, గుంటూరు -6. ఫోన్: 0863 2272345.

M.Tech :- CSE

నాగపురికి కొంచెం దూరంలో 'శ్వేతహ్రదం' అనే పేరుతో ఒక తటాకముంది. ఆ నీరెంతో నిర్మలంగా ఉండేది. దానినిండా కలువపూలే! ఆ సౌందర్యం చూడడానికి రెండు కన్నులు చాలవు. దేవలోకం నుండి కొందరు అప్సరసలు ప్రతిరోజూ ఆ కొలనికి వచ్చి జలక్రీడలాడేవారు. అంతా కలిసివచ్చి కలసి వెళ్ళిపోయేవారు.

ఒకరోజు **'తిరుమామకళ్'** అనే అప్సరస ఆ కలువపువ్వులు చూస్తూ కోస్తూ ఆనందంతో మైమరచి పోయింది. ఎప్పటికీ రాదే...! మిగిలినవారు చూసి చూసి ఆలస్యమైయిందని ఆవిడని వదిలేసి వెళ్ళిపోయారు. ఈవిడ తేరుకొని వచ్చి చూచేటప్పటికి పాపం... ఎవ్వరూ లేరు. దివ్యవిమానం లేదు. ఏం చేయాలి? ఆ తటాకం ఒడ్డునే కూర్చుంది. చూస్తుండగా మానవకాంతగా మారిపోయింది. అప్పుడామెకి గుర్తుకు వచ్చింది తన శాపకథ. ఔను నేను తిరుమామగళ్ – సుమంగళిని నా స్నేహితులైన అప్సరసలతో కలసి హిమవత్ ప్రాంతంలో ఆనందంగా తిరుగుతున్నాను. అక్కడ కపిలమహర్షి ఎందరికో శ్రీమన్నారాయణ తత్త్వాన్ని బోధిస్తున్నారు. వినేవారందరిని ఒక్కసారి పరికించి చూశాను. అందులో ఒక ఋషి అబ్బ కురూపి... చూడడానికే ఒకలా... ఉన్నాడు. ఆయన్ని చూస్తే నవ్వాగలేదు నాకు. అందరికీ చూపించి ఒకటేనవ్వు. చూశాడా ఋషి. 'ఎంత అహంకారం నీకు. నన్ను పరిహసించావు కాబట్టి మనుష్యకాంతగా మారిపోతావు. ఒక దొంగను పెళ్ళాడతావు' అంటూ శపించాడు. అంతే! మత్తొదిలి పోయింది. 'స్వామీ! నా అపరాధాన్ని క్షమించండి! ఇంత శాపమా' అంటూ వెక్కి వెక్కి ఏడ్చాను.

మహాఋషి కదా కోపం తాటాకు మంటలా క్షణకాలమే ఉంటుంది. చల్లబడిపోయాడు. నా ప్రార్ధనకి కరిగిపోయాడు. 'అమ్మా! దుఃఖించకు. కొద్దిరోజులలో నీకు పరకాలుడు అనే వ్యక్తి ఎదురౌతాడు. అతడు నారాయణుని శార్జ్గం అంశతో పుట్టినవాడు. అతడు మార్గంతప్పి నడిచినప్పుడు, నువ్వు అతనిని మంచిమార్గంలో పెట్టగలిగితే నీ జీవితం ధన్యమౌతుంది' అంటూ చెప్పాడు.

'అబ్బ! ఎంత అహంకారంతో ఎక్కిరించానలా? ఎలాంటి శాపం పొందానూ! అంతే అహంకారులకి ఫలితమిలాగే ఉంటుంది. ఇంక ఇప్పుడు శాపఫలం అనుభవించవలసినదే! దివ్యశక్తులన్నీ కోల్పోయాను. ఎగిరిపోలేను... అని గతాన్నంతా తలచుకొని విలపించింది.

అంతలో అక్కడికొక శ్రీ వైష్ణవస్వామి వచ్చారు. ఆయన వైద్యవృత్తిలో జీవించేవాడు. స్నానార్థం ఆ కొలనికి వచ్చి కలువపూలు చేతిలో ధరించి ఉన్న ఆ అమ్మాయిని చూశాడు. ఎవరీబాల...? ఇంత అందగత్తె... ఇలా ఒంటరిగా... ఈ అడవిలో... ఎందుకుందీ...? అనుకుంటూ దగ్గరకి వెళ్ళాడు. 'అమ్మా....!' అంటూ పిలిచాడు. ముఖమెత్తి చూసిందా బాల.

'అమ్మా! నువ్వెవరివి? ఎందుకిలా ఒంటరిగా ఉన్నావు?' అన్నాడు.

'స్వామీ ! నా కథ చెప్తా వినండి!' అంటూ జరిగినదంతా చెప్పింది. 'అయ్యా! నన్ను మీ ఇంటికి తీసుకొని వెళ్తారా.. నాకు రక్షణనిస్తారా...!' అని ప్రశ్నించింది.

సంతానం లేని ఆ స్వామి ఆ బాలికను ఆదరంగా దగ్గరకు తీసుకొని శిరస్సుపై ముద్దు పెట్టుకొన్నాడు.

'అమ్మా! నాకు భగవంతుడిచ్చిన బిడ్డవి. రా...' అంటూ ప్రేమతో ఇంటికి తీసుకొని వెళ్ళాడు.

చేతులలో కుముదాలు– అదే కలువలు. అలా వచ్చిన బాలికను చూచి మురిసిపోయింది ఆ స్వామి ఇల్లాలు. 'అమ్మా! కుముదములు చేత పట్టుకొని వచ్చావు కాబట్టి, నువ్వు ఈ రోజునుండి **'కుముదవల్లి**వి. మాఇంటి మహలక్ష్మివి' అంటూ అక్కున చేర్చుకొంది. ఆ దంపతుల ఒడిలో అల్లారు ముద్దుగా పెరుగుతోంది కుముదవల్లి.

ఆమె సౌందర్యం అత్యద్భుతం. కన్ను తిప్పలేని సౌందర్యం. చూచిన వారంతా ఆశ్చర్యపోవడమే! ఆ అందాన్ని అందరూ పొగడడమే. అందంతోపాటు సంస్కారం. తండ్రి దగ్గర పంచ సంస్కారాలు పొంది, శ్రీ వైష్ణవ ధర్మాలన్నింటినీ తెలుసుకొంది.

'శ్రీ వైష్ణవధర్మం – అత్యద్భుత ధర్మం. మోక్షదాయక ధర్మం. పెళ్ళంటూ చేసుకుంటే ఆ ధర్మాన్ని పాటించే వానినే పెళ్ళాడాలి. భగవంతుని భక్తులను భాగవతులు అంటారు. వారిని ఆరాధించ డమే భాగవత తదీయారాధన. పెళ్ళాడబోయేవాడు శ్రీ వైష్ణవ దాసుడై



ఉండాలి. ప్రతిరోజూ వేయిమంది భాగవతోత్తములకు తదీయారాధన చేయగలిగినవాడై ఉండాలి' నిశ్చయించుకుంది కుముదవల్లి.

కుముదవల్లి సౌందర్యం అలా అలా ప్రజలలో బాగా ప్రచారం పొందింది. చివరికి పరకాలుడు అదే నీలుని చెవులదాకా ప్రాకింది. ఆహా! అంత సౌందర్యవతా! చూడవలసినదే అంటూ బయలు దేరాడు.

ఆ భిషగ్వరుని ఇంటికి చీనీ చీనాంబరాలు మణిమాణిక్యాలు తెచ్చి ఇచ్చి నమస్కరించాడు. ఇంతలో బైటికి వచ్చింది కుముదవల్లి. నీలుడు అలా చూస్తూ ఉండిపోయాడు. 'ఇంత అందమా..! విన్నదానికి పదిరెట్లు. ఔను కన్నులతో చూస్తే కదా తెలుస్తుంది..! తప్పదు ఈమెను చేపట్టవలసినదే' అనుకున్నాడు.

"స్వామీ! ఈమె...!"

'ఔను! మా అమ్మాయి. అయితే...!'

"ఈమెను నేను పెళ్ళాడతాను" అన్నాడు.

ఒకరాజు స్వయంగా ఇంటికి వచ్చి అమ్మాయినడిగితే ఏ తండ్రి మురిసిపోడూ! ఈయనా అంతే! అయితే ఒక్క మాటన్నాడు.

'రాజా! మీమాటలు నాకు పరమానందాన్ని చేకూరుస్తున్నాయి. కాని...' "కాని ఏమిటి స్వామీ!"

'మా అమ్మాయి తన వివాహానికి కొన్ని నియమాలు, షరతులు పెట్టింది.'

"ఓహో! ఏమిటో చెప్పండి"

'మా అమ్మాయి పంచసంస్కారాలు పొందిన శ్రీ వైష్ణవుని తప్ప వేరొకరిని చేపట్టదు.'

"సరే..!"

'అంతేకాదు ప్రతిరోజు వేయిమంది శ్రీ వైష్ణవులకు ప్రసాదము సమర్పించి వారి శ్రీపాదతీర్థాన్ని స్వీకరిస్తేగాని తాను భుజించదు. ఇవి ఆవిడ ప్రతిజ్ఞలు. మరి... నువ్వు...!' మధ్యలో అందుకున్నాడు రాజు.

"స్వామీ! నేను శైవుణ్ణే! అయినా ఈ క్షణం నుంచే శ్రీ వైష్ణవాన్ని స్వీకరిస్తాను. పంచసంస్కారాలూ పొందుతాను. అంతేకాదు. మీ అమ్మాయి ప్రతిజ్ఞ నెరవేరుస్తాను. ప్రతిరోజు వెయ్యిమంది భాగవతోత్తములకు తదీయారాధన చేస్తాను. మాట ఇస్తున్నాను" అన్నాడు.

'అమ్మా! కుముదా!' పిలిచారు తండ్రి.

గుమ్మం దగ్గరనుండి ఈసంభాషణంతా వింటున్న కుముదవల్లి చిఱునవ్వుతో రాజును చూసింది. తండ్రి దగ్గర తలవంచి నమస్కరించింది.

'మీ ఇష్టం నాన్నా' అంటూ లోపలికి పారిపోయింది.

నీలుడు వెంటనే తిరునఱైయూర్ వెళ్ళాడు. అక్కడ ఉండే నంబిని ప్రార్థించి పంచసంస్కారాలు పొందాడు. అర్థపంచకాది విశేషాలు తెలుసుకున్నాడు. ఆకారత్రయ సంపన్నుడైనాడు. ఇప్పుడాయన దాసనామం **"తిరుమంగై ఆళ్వార్"**.

శ్రీ వైష్ణవ లక్షణ సంపన్నుడై ఊర్ధ్వపుండ్రధారుడై, తులసి మాలాలంకృతుడై వచ్చి భిషగ్వరుని సేవించుకున్నాడు. పరమానంద భరితులయ్యారాయన.

కుముదవల్లి ఆ భాగవతోత్తముని దర్శించి మురిసిపోయింది. తనకోసం శ్రీ వైష్ణవోత్తమునిగా మారాడు ఈ రాజు.

ఇంక ప్రతిరోజు వెయ్యిమంది శ్రీవైష్ణవ స్వాములకు తదీయారాధన... తప్పకుండా జరిపిస్తాను అన్న రాజుమాటలు చెవులలో అమృతధారలుగా కురిశాయి. సిగ్గులమొగ్గ అయింది. పెద్దల సమక్షంలో రాజైన తిరుమంగై ఆళ్వారులతో కుముదవల్లి వివాహం అత్యద్భుతంగా జరిగిపోయింది. (సశేషం)

రుచికి, సువాసనకి, ఆరోగ్యానికి నాణ్యమైన
"ఆశలత"
పసుపు, కారం, ధనియాలపొడి మరియు సేమియానే ఎల్లప్పుడు వాడండి
రవికుమార్ అండ్ కంపెని - చెన్నై
044 25204046, 26171341
Vijay Ads

నాణ్యమైన ప్లాట్లు మరియు ఫ్లాట్లు కొనుగోలుకు నమ్మకమైన అగ్రగామి సంస్థ
అభినందన హౌసింగ్ (ప్రై). లిమిటెడ్
సెంట్రల్ ఆఫీస్ : 4వ లైను, పండరీపురం, లక్ష్మీపురం మెయిన్ రోడ్, గుంటూరు. ఫోన్ : 2354002.
మా బ్రాంచీలు : విజయవాడ 1, విజయవాడ 2, విజయవాడ 3, గుంటూరు 1, గుంటూరు 2, హైదరాబాద్, విశాఖపట్నం.
0866 - 6628668 : 0866 - 6642428 : 0866 - 6633668 :. 0863 - 6641177 : 0863 - 6454588 :. 040 - 66637799 :. 0891 - 2538686.

# హోమియో....! మీకోసం....!



డా।। పావులూరి కృష్ణచౌదరి
8-3-945/ఎ।22, నాగార్జున నగర్,
అమీర్‌పేట, హైదరాబాద్-500 873

## అమీబియాసిస్:

అమీబియాసిస్ అనేది 'ఎంటమీబా హిస్టొలిటికా' రకం సూక్ష్మక్రిముల ద్వారా సంక్రమించే వ్యాధి. ఈ క్రిమి ఏకకణజీవి. ఇది పెద్దపేగుల్లో స్థావరం ఏర్పరచు కుంటుంది. దీనివల్ల రక్త విరేచనాలు కన్పిస్తాయి. దీన్నే 'అమీబిక్ డిసెంటరీ' అంటారు.

అయితే ఈ క్రిములు పేగులకే పరిమితం కాకుండా ఊపిరితిత్తులు, మెదడు, కాలేయాలను గూడా దెబ్బ తీస్తుంటాయి. అందుకే ఈ 'అమీబిక్ డిసెంటరీ'ని 'ఏమీబియాసిస్' అని పిలుస్తుంటారు, వాస్తవానికి ఇదే ఉచితమైన పేరు.

ముఖ్యంగా ఈ క్రిమిజీవితంలో రెండుదశలు ఉంటాయి. ఒకటి చురుకుగా ఉండే **'ట్రోఫోజువైట్'** దశ. రెండవది స్తబ్దుగా ఉండే **'సిస్ట్'**దశ. ట్రోఫోజువైట్‌దశలో ఉన్నప్పుడు ఇవి పెద్దపేగులలోని ఇతర క్రిములపైగానీ, లేదా లోపలిపొరలపైగానీ దాడిచేసి జీవిస్తాయి. అందు చేత పెద్దపేగుల్లో పుండ్లు (అల్సర్లు) ఏర్పడతాయి. ఇలా కేవలం పెద్దపేగుల్లోని పొరలు మాత్రమే ఎందుకు ప్రభావితమవుతాయి?

చిన్నపేగుల గోడలు ఎందుకు గురికావన్న దానికి జీవశక్తి విన్యాసాన్నే సమాధానంగా పరిగణించాలి. ఇదే 'ఇమ్యూనిటీ'. ఎందుకంటే 'మనిషి అంటే 'ప్రాణం, మనస్సు, దేహాల' త్రికం. రోగిలో ఈ మూడు అంశాలనూ పరిశీలించడమే సహేతుకం. ప్రాణశక్తి ప్రమేయమే ఆరోగ్యం, అనారోగ్యం వ్యాధి.

పెద్దపేగులు ట్రోఫోజువైట్ ఇన్ఫెక్షన్ గురైనప్పుడు విరేచనాలు కన్పిస్తాయి. విరేచనాల ద్వారా ఈ క్రిములు బహిర్గతమవు తుంటాయి. ఇలా బహిర్గతమవుతుండే సమయంలో ఈ క్రిములు ట్రోఫోజువైట్ దశ నుండి సిస్ట్ దశకు చేరుకుంటాయి. బహిర్గతమైన ఈ అమీబిక్ సిస్టులు నీరు, ఆహార పదార్థాలను కలుషితం చేస్తాయి. ఈ కలుషిత నీరు, పదార్థాలను సేవించి ఇతరులు మళ్లీ ఈ వ్యాధికి గురి కావడం జరుగుతుంది.

ఎక్కువమంది అమీబియాసిస్ రోగుల్లో విరేచనాలు కనిస్తుంటే కొంతమందిని మలబద్ధకం వేధిస్తుంది. అపాన వాయువు అధికం. పొట్టనొప్పి, మలంలో జిగురు, నెత్తరు, రక్తహీనత, చిక్కిపోతారు. పేగుల్లో కణుతులు ఏర్పడ వచ్చు. ఈ కణుతులను 'ఏమీబోమా' అని వ్యవహరిస్తారు. ఇవి క్యాన్సర్ కణుతులా అని భ్రమపడే అవకాశాలూ ఉంటాయి. ఈ అమీబా క్రిములు లివర్‌లో చోటుచేసు కోవచ్చు. దీన్ని 'అమీబిక్ యాబ్సెస్' అని వ్యవహరిస్తారు. లివర్‌నొప్పి, జ్వరం, చలి, చెమటలు కన్పించవచ్చు. వికారం, వాంతులు తోడుగావచ్చు. బలహీనత, రోగి చిక్కిపోతాడు. కొంతమందిలో పచ్చకామెర్ల లక్షణాలు చోటుచేసుకోవచ్చు.

వ్యాధులను జీవశక్తి విన్యాసాలుగా పరిగణించడానికి ఏమీబియాసిస్ ఒక మంచి ఉదాహరణ. ఏమీబా క్రియాశీలదశ (ట్రోఫోజోవైట్), స్తబ్దదశ (సిస్ట్) కలిగి ఒక వ్యక్తినుండి బయట పడినా, అంతరించిపోకుండా మరో వ్యక్తిలో ప్రవేశించి, జీవించి బాధలు **కలుగజేయు** జీవశక్తి విన్యాసాలకు గొప్పనిదర్శనం.

వ్యాధులను జీవశక్తి విన్యాసాలుగా పరిగణించి రోగుల దేహపరీక్షలేగాక మనసు, ప్రాణం, ఒక్కమాటలో చెప్పాలంటే జీవనశైలి, వారసత్వ విశేషాలను కూడా పరిగణనలోకి తీసుకోవా లంటాడు హానిమన్. ఇదే హోమియో వైద్య విధానానికి మూలం.

## బాధలేమిటి?

| | |
|---|---|
| విరేచనాలు, రక్తవిరేచనాలు, అజీర్తి, పొట్ట ఉబ్బరం, మానసిక చికాకు. | |
| ముడ్డితీపు విపరీతంగా ఉండి మాటిమాటికీ మల విసర్జనకు వెళ్ళాల్సివస్తే... | - **మెర్క్‌కార్** |
| జిగురు, రక్తం, పసరురంగు విరేచనాలవుతుంటే | - **మెర్క్‌కార్** |
| ఆకుపచ్చ దుర్వాసనతో కూడిన విరేచనాలవుతుంటే | - **ఆర్స్ ఆల్బ్** |
| దాహం విపరీతం, కొద్దిపాటి నీళ్ళు తాగుతుంటే | - **ఆర్స్ ఆల్బ్** |
| జిగట విరేచనాలు, మలం సుద్దలు సుద్దలుగా వుంటే | - **యాలో** |
| మూత్రవిసర్జన సమయంలో విరేచనమయితే | - **యాలో** |
| విరేచనమయినా ఏదో మిగిలిపోయినట్లుంటే | - **నక్స్‌వామికా** |
| ముడ్డితీపు విరేచనమయిన తరువాత కొంచెంసేపు మాత్రమే బాగుంటే | - **నక్స్‌వామికా** |
| మలం దుర్వాసనతోపాటు గ్యాస్ ఎక్కువగా ఉంటే | - **ఫాస్ఫరస్** |
| విరేచనంలో రక్తం ఎక్కువగా కన్పిస్తే | - **ఫాస్ఫరస్** |
| ఉదయం 4 గంటలకే మలవిసర్జనకు పోవాల్సివస్తే | - **ఫాస్ఫరస్** |
| ఉదయం 11 గం।। నిస్త్రాణ, శోషకొచ్చినట్లుంటే | - **సల్ఫర్** |

### ఎంపిక చేసిన ఔషధాలకు సంబంధించి మరిన్ని వివరాలు :

* **మెర్క్‌కార్ :** రక్తవిరేచనాలకిది ప్రత్యేక ఔషధం. ముడ్డితీపు, మాటిమాటికీ మలవిసర్జన, మలం తక్కువ, బంక విపరీతం, రోగి కదలకుండా ప్రశాంతంగా పండుకొని ఉంటాడు.
* **యాలో :** జిగట విరేచనాలు, మలం సుద్దసుద్దలుగా ఉంటుంది. రాత్రిళ్ళు మాటిమాటికీ విరేచనాలు. అపాన వాయువుతో మలం కూడా కన్పిస్తుంది. మూత్రవిసర్జన సమయంలో విరేచనం గావచ్చు. విరేచనానికి ముందు పొట్టలో గడబిడలు కనిపిస్తాయి.
* **ఆర్స్ ఆల్బ్ :** దుర్వాసనతో కూడిన రక్త విరేచనాలు. మలం తక్కువ.

పొట్ట ఉబ్బరం జాస్తి. విరేచనమయిన తరువాత ముడ్డిలో మంట. కొద్దికొద్దిగా నీళ్ళు ఎక్కువసార్లు తాగుతుంటారు. జీవితం పట్ల నిరాశ.

* **నక్స్‌వామికా :** బుద్ధిజీవులకు ఇది ప్రత్యేక ఔషధం. అజీర్తి, కాఫీ, టీలు ఎక్కువ తాగుతుంటారు. మత్తుపదార్థాలు కావాలి. ఉద్రేకపరులు.
* **సల్ఫర్ :** మొండికేసుల్లో ఇది ప్రత్యేక ఔషధం. ఈ రోగికి పాలు పడవు. వేకువ జామున విరేచనాలధికం. నిద్రలేచిన వెంటనే దొడ్డికి పోవాలి. ఉదయం 11 గం.కు శోషకొచ్చినట్లు ఆకలి. వెంటనే తినాలి.
* **ఫాస్ఫరస్ :** మలం దుర్వాసన కొడుతుంది. గ్యాస్ ఎక్కువ. పెద్దపెద్ద విరేచనాలు. నొప్పి వుండదు. నీరసం ఎక్కువ. మల విసర్జనకు ముందు విపరీతంగా నీరసం. తెలియకుండా విరేచనం అవుతుంది.

జిమ్స్‌లో సేవలందుకొని...

**ఎ. రామమోహన్‌రెడ్డి -** వయస్సు-47 సం॥ ఊరు-కల్వకుర్తి.

గత 7 సం॥లుగా మెదడు, నరాలబాధకు గురికావడం జరిగినది. నడవడం కష్టం. మాటలు స్పష్టంగా రావడం లేదు. ప్రతిచిన్న పనికి మితిమీరిన ఆందోళన. ఏపాటి శబ్దమయినా ఉలిక్కిపడడం. నిద్రకూడా సమంగా లేదు. డాక్టర్లు **పార్కిన్సోనిజం** అని నిర్ధారించారు.

జిమ్స్ ఆసుపత్రిలో 2013 మార్చి 26 నుండి చికిత్స జరుగు తుంది. కాస్టికం-30 పొటెన్సీలో ప్రతిదినం ఉదయం సాయంకాలం వాడుతూ, ఆదివారం మాత్రం అర్జెంటం నైట్రికం 200 పొటెన్సీలో ఇవ్వడం జరిగింది. జులైమాసం వచ్చేసరికి రోగి స్పష్టంగా మాట్లాడుతున్నాడు. నడక మామూలుగా ఉంది. ఉలికిపాటు లేదు. ఆందోళన తగ్గింది. హాయిగా నిద్రపోతున్నాడు.

# సూర్య మహిమ

చి॥ అనంత్-సీతానగరం, వేదపాఠశాల

**ఓం హ్రీం శ్రీం సూర్యనారాయణాయ నమః**

**సప్తాశ్వరథమారూఢం..... తం సూర్యం ప్రణమామ్యహమ్ ॥**

సూర్యభగవానుడు మన కంటికి కనిపించే ప్రత్యక్షదైవం. ఈయన అదితి పుత్రుడు కనుక ఆదిత్యుడు అని పేరు. ఒక్కోమాసంలో ఒక్కో దేవతను ఆరాధించవలెను అని ప్రత్యేకంగా చెప్పారు. ఆ విధంగా కార్తీకంలో **"అగ్నిర్నః పాతు కృత్తికాః"** అన్నట్లుగా అగ్నిని, మార్గశీర్ష మాసంలో భగవంతుణ్ణి, ఇలానే మాఘమాసంలో ప్రత్యక్ష భగవానునుడైన సూర్యుణ్ణి, అందులో ఆదిత్యమండలాన్తర్వర్తి అయిన హిరణ్మయవపు"తో ఉన్న నారాయణుణ్ణి ఉపాసించాలి. అని పెద్దలు చెప్పారు.

సూర్యుడు తెల్లవారుఝామున ఉదయిస్తున్నాడంటే, సూర్యుకూడ ఒకడికి భయపడే ప్రవర్తిస్తున్నాడు. **భీషోదేతి సూర్య** అని ఉపనిషద్వాక్యం. ఎవరికి భయపడతాడు అంటే, సూర్యాన్తర్యామి శ్రీమన్నారాయణునికి అని అర్థం. అందుకే సూర్యాన్తర్యామి నారాయణుడే **శ్రీసూర్యనారాయణు** డయ్యాడు.

మనందరికీ ప్రాణాధారం అన్నము. ఆ అన్నము వర్షము ద్వారానే వస్తుంది. ఆ వర్షానికి ఆధారం ఆదిత్యుడు. **పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః"** అని ఆదిత్యహృదయ స్తోత్రంలో అగస్త్యుడు శ్రీరామునకు ఉపదేశించాడు.

ఈ సూర్యుడు **"ఏకో అశ్వో వహతి సప్తనామా" "సప్తనామా" 'సప్త'** అనే పేరుగల గుర్రం పూన్చిన ఒకేఒక్క చక్రం కలిగిన రథం మీద తన ప్రయాణాన్ని కొనసాగిస్తూ ఉంటాడని యజుర్వేదీయ తైత్తిరీయ ఆరణ్యకం తెలుపుతోంది. **"ఏక చక్ర మేకధురమ్"**, అనే వాక్యాల ద్వారా తెలుస్తోంది. వేదాల్లో చెప్పబడిన "సప్త ఛందస్సులే" సూర్యునికి 'సప్త' అనే గుఱ్ఱముగ ఉన్నాయి. ఆ సప్త ఛందస్సులు....

1.) గాయత్రీ; 2) త్రిష్టుప్; 3) జగతీ; 4) అనుష్టుప్; 5) బృహతీ; 6)ఉష్ణిక్; 7) కకుప్. ఈ ఏడు చందస్సులు కలిపి గుర్రముగా ఏర్పడ్డాయి కనుక. ఆ గుర్రానికి సప్తి అనే పేరు వచ్చింది.

ఈ సూర్యునియొక్క కిరణములలోనుండి మన కంటికి కనిపించే ఈ ప్రకృతిలోని ఇన్ని వర్ణాలూ ఏర్పడ్డాయి. మనం వీటిని వర్షంలో ఎండ వచ్చినపుడు ఇంద్రధనుస్సుగా దర్శించవచ్చు. ఊదా, ఇండిగో, నీలం, ఆకుపచ్చ, ఎరుపు, ఆరెంజ్...! ఇప్పుడు మనం చూసే అన్ని వర్ణాలకూ మూలము. ఆయనయొక్క తెల్లనికాంతిలోనుండే ఇన్ని రంగులూ ఏర్పడ్డాయి.

ప్రతీమనిషికి కావల్సింది ఆరోగ్యము. "ఆరోగ్యమే మహాభాగ్యము". ఆ ఆరోగ్యాన్ని ప్రసాదించేది సూర్యభగవానుడు.

"ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అన్నాడు అగస్త్యముని.

ఈ సూర్యనారాయణుని ఉపాసిస్తే సర్వశత్రు వినాశనం, జయాన్ని కలిగిస్తాడు, అక్షయ ఫలాన్ని అందిస్తాడు. పరమశుభం. సర్వమంగళ మాంగళ్యాన్ని ప్రసాదిస్తాడు. చింతా, శోకములను శమింపచేస్తాడు. ఆయుష్షును పెంచుతాడు. ఇన్నింటినీ మనకు ప్రసాదిస్తున్నాడు శ్రీసూర్యనారాయణుడు.

ఆదిత్యమండలాన్తర్వర్తి అయిన శ్రీమన్నారాయణుని మాఘమాసం మొత్తం ఉపాసించాలి అని తెలిపారు. ఎందుకీ మాఘమాసంలోనే అంటే మనకు ఒక సంవత్సరకాలం దేవతలకు ఒకరోజు. ఆ విధంగా చూస్తే మార్గశీర్షం బ్రాహ్మీముహూర్తం అని, ఈ మాసం సూర్యోదయం ఉషః కాలోదయం లాంటిది.

సూర్యోదయ, సూర్యాస్తమయ కాలాన్ని "సంధి"కాలమంటారు. ఆ సంధ్యాసమయంలో ఋతుకర్త అయిన సూర్యుని మీదకు మందేహాసురులు అనే రాక్షసులు ఆయన్ని మింగేద్దాం అని వస్తూంటారు. వాళ్ళని గాయత్రీమంత్రంతో జపించిన తీర్థాన్ని అర్ఘ్యరూపంగా వదిలిన ఆ జలం "ఆపో వైవజ్రీభూత్వా" అని శ్రుతి. వజ్రంలా మారి ఆ అసురులను, వారి ఆయుధాలను, వారి వాహనాలను చంపి వేస్తాయి. అలాగే ఈ మాసం మొత్తం అలాంటి కాలం కనుక అర్ఘ్యం వదిలి సూర్య నమస్కారాలు ఆచరించాలి అని తెలియచేశారు పెద్దలు.

# సేవావ్రతులకు వికాసతరంగిణి ఆహ్వానం

**"మాధవసేవగా - సర్వప్రాణిసేవ"**

భగవద్రామానుజులు దర్శించి ఆచరించి ఆత్మీయంగా బోధించిన విశిష్ట జీవన మార్గమిది. భారతీయ సంస్కృతిసారమైన ఈ సూత్రాన్ని శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయరు స్వామివారు వికాస తరంగిణికి లక్ష్యంగా ఏర్పరిచారు.

"స్వీయ ఆరాధన –సర్వ ఆదరణ" నియమాన్ని పాటిస్తూ, ఈ లక్ష్య సాధనకై వికాస తరంగిని విశ్వవాప్తంగా పలు సేవలను అందిస్తోంది. రాబోయే 2016లో "రామానుజ సహస్రాబ్ది" రానున్నది. రామానుజులు అవతరించి వేయేళ్ళు కానున్న సందర్భంగా వారి స్ఫూర్తితో మరెన్నో సేవా కార్యక్రమాలను సమాజ రూపుడైన మాధవునికి సమర్పించాలని వికాసతరంగిణి నిర్ణయించింది. ఈ సందర్భంగా సేవద్వారా సమాజంలో శాంతి, సామరస్యాలను, సోదరభావాన్ని, శ్రేయస్సును పెంపొందించాలని భావించే సేవా తత్పరులకు వికాసతరంగిణి ఆహ్వానం పలుకుతోంది.

1. పూర్తి సమయమిచ్చి కనీసం రెండు సంవత్సరాలు "సేవావ్రతులు"గా పనిచేయాలనుకునేవారు తమ వివరాలను ఈ క్రింది చిరునామాకు 15 రోజులలోగా పంపగలరు.
2. సేవావ్రతులుగా ఎంపికైనవారు ఏప్రిల్ 15 నుండి రెండుమాసాలు శిక్షణను స్వీకరిస్తారు.
3. శిక్షణకాలంలో శిక్షణ అనంతరం పని ఆధారంగా సేవావ్రతులకు సంస్థ గౌరవ పారితోషికాన్ని అందజేస్తుంది.

**సంప్రదించవలసిన చిరునామా:**

**వికాసతరంగిణి కార్యాలయం**

**రిజిష్టర్డు ఆఫీస్**

గగన్‌మహల్ కాలనీ, డోర్.నెం. 1-2-412/1/3
దోమల్‌గూడ, హైదరాబాద్. ఫోన్ : 040-23226748
Website: www.vt.bharath.org

**వర్కింగ్ ఆఫీస్:**

శ్రీరామనగరం, ముచ్చింతల్ (గ్రా)
పాలమాకుల (పో), శంషాబాద్ (మం)
రంగారెడ్డి జిల్లా – 509325
ఫోన్: 8331810945, 9492615691
Email: vikasataranginioffice@gmail.com

---

హైదరాబాద్,
తేది: 11.02.2014

సర్క్యులర్ నెం: 002/2014

**ప్రియ భగవద్బంధువులారా!**

1. వికాసతరంగిణి సభ్యత్వ నమోదు కార్యక్రమ తొలిదశను పూర్తిచేశారని భావిస్తున్నాము. ఆశయాలను, ఆచరణలో చూసే దృఢ సంకల్పంతో మనం చేస్తున్న పని సభ్యులను గుర్తించడంతో ప్రారంభమౌ తున్నది. కనుక 2014 సంవత్సరంలో ఇది తొలి అడుగు అని భావిస్తున్నాము.
2. సభ్యత్వ నమోదు అనంతరం కార్యక్రమాలను ముందుకు తీసుకొని వెళ్ళగల నిర్వాహక శ్రేణిని శాఖ స్థాయినుండి జిల్లాస్థాయి వరకు నిర్ధారించడం ద్వితీయ దశ. ఈ రెండుదశలను వీలైనంత త్వరగా ఫిబ్రవరి 28వ తేదీ లోపల పూర్తి చేసుకుందాం.
3. మార్చినెలలో జిల్లాస్థాయి నిర్వాహకులను, శాఖల స్థాయి నిర్వాహకులకు శిక్షణను పూర్తి చేసుకొందాం. మీ వద్దనుండి సభ్యుల, శాఖల నిర్వాహకుల సమాచారాన్ని పంపిన వెంటనే తేదీలను నిర్ధారించుకుందాం.
4. జనవరి 28న 'మహిళా ఆరోగ్య వికాస్" సమావేశాన్ని శ్రీమతి కె. మాధవీ రవీంద్రగారు తమ బృందంతో కలసి చక్కగా నిర్వహించారు. "మహిళా ఆరోగ్య వికాస్" ప్రాంత సమన్వయ కర్తగా శ్రీమతి మాధవీరవీంద్రగారిని శ్రీశ్రీశ్రీ స్వామివారు నిర్ణయించారు. మహిళా ఆరోగ్య వికాస్‌పై శ్రద్ధను చూపి, చక్కని సేవా కార్యక్రమాలను మహిళలకు అందిద్దాం. అందుకోసం జిల్లా స్థాయిలో శాఖల స్థాయిలో ఈ పనికి సమయమివ్వగల కార్యకర్తలను మనం ఎంపిక చేసుకొందాం. ఈ "సేవా కార్యకర్తల"తో జిల్లాస్థాయిలో ప్రత్యేక సమావేశాలను, శిక్షణకు మనం ఏర్పరచుకొందాం.
5. సమాజరూపుడైన మాధవునికి మరెన్నో సేవా కార్యక్రమాలను సమర్పించే లక్ష్యంతో సేవావ్రతలుగా పనిచేసే పూర్తి సమయ కార్యకర్తలకు వికాసతరంగిణి ఆహ్వానం పలుకుతున్నది. ఆ ప్రకటన ఈ లేఖతో జతపరుస్తున్నాము. మన ప్రాంతంలో యోగ్యులైన "సేవావ్రతుల"ను గుర్తించి కేంద్ర కార్యాలయానికి తెలియజేయ వలసినదిగా విజ్ఞప్తి చేస్తున్నాము.

సేవావ్రతులకు శ్రీరామనగర్ ఆశ్రమంలో (శంషాబాద్) తేది. 15.4.2014 నుండి 15.6.2014 వరకు రెండు మాసాల శిక్షణ ఉంటుంది. గమనించగలరు.

**కె. మూలకిషన్‌రావు,**
జనరల్ సెక్రటరీ
ఫోన్: 9391392191

**కె. భవాని ప్రసాద్**
ఆర్గనైజింగ్ సెక్రటరీ
ఫోన్: 9492615691

**భవదీయ**
రమేష్‌గుప్త
అధ్యక్షులు: వికాసతరంగిణి
సెంట్రల్ కమిటీ
ఫోన్: 9246242222



## పరమహంస పరివ్రాజకులు
# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



జనవరి 27వ తారీఖు నడిగడ్డపాలెం-బృందావనంలో శ్రీ గోపాలాచార్య స్వామివారి అభీష్టస్థానంలో కవిగారు స్వగ్రామమైన నడిగడ్డపాలెం శ్రీ వాసుదాసాశ్రమంలో "గోపాలోపాయన పురస్కారం" జరగటం ఇదే ప్రథమం.

స్వీకర్త శ్రీ ఉ.వే. శ్రీమాన్ కె.ఇ. దేవనాథన్‌గారు సీతానగరం విచ్చేసి విద్యార్థులతో ముచ్చటించారు. ఆపై వీరిని శ్రీ ఉ.వే. శ్రీమాన్ వేంకట రంగరామానుజాచార్యస్వామివారు నడిగడ్డపాలెంకు వెంటబెట్టుకు వెళ్ళారు.

చాలాకాలం తరువాత నడిగడ్డపాలెం విచ్చేసిన శ్రీస్వామివారు తిరువారాధన అనంతరం స్వయంగా తీర్థగోష్ఠిని అందించారు.

సుమారు 11 గం॥లకు ప్రారంభమైన పురస్కార ప్రదానము ముచ్చటగా మూడుగంటలకు ముగిసినది. ఈ కార్యక్రమానికి ఎస్.వి. రంగరామానుజాచార్య స్వామివారు అధ్యక్షత వహించి, సన్మాన గృహీతృ పరిచయం చేశారు. అనంతరం శ్రీ స్వామివారి కరకమలముల ద్వారా అవార్డును సమ్మానగ్రహీత అందకున్నారు. శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారు, శ్రీశ్రీశ్రీ దేవనాథ జీయరుస్వామివారు ఈ కార్యక్రమంలో అన్వయించారు. పురస్కారానంతరం ఉభయవేదాంతల విశిష్టతను శ్రీ దేవనాథ జీయరు స్వామివారు వివరించారు.

శ్రీమాన్ ఎస్.వి. రంగరామానుజాచార్యస్వామివారు రచించిన "ప్రణవ మంజూష" గ్రంథాన్ని శ్రీశ్రీశ్రీ స్వామివారు ఆవిష్కరించారు. అతిథులందరికీ అందజేశారు. ఇదే సమయంలో శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యస్వామివారి మనవరాలు శ్రీమతి టి.కె. అరుణగారు తెలికిచర్ల కందాళ గోపాలాచార్యస్వామివారి రచనలలో "విశిష్టాద్వైత-విశ్వజనీనత" అనే గ్రంథాన్ని పరిశోధించిన గ్రంథాన్ని శ్రీ దేవనాథన్ గారు ఆవిష్కరించారు. శ్రీశ్రీశ్రీ స్వామివారి వాగామృతాన్ని ఆస్వాదించి, ఆనందభరితులయ్యారు. ఈ కార్యక్రమాన్ని మన కవిగారి పుత్రులైన శ్రీమాన్ కూర్మనాథాచార్యులు చక్కగా నిర్వహించారు.






జనవరి 28వ తేదీన శ్రీశ్రీశ్రీ స్వామివారు విజయవాడలో విజయవాడ వికాసతరంగిణి వారు నిర్వహించిన "కేన్సర్ అవగాహన సదస్సు"కు వేంచేశారు.

ఈ సదస్సులో డా॥ ముక్కామల అప్పారావుగారు, వారి సతీమణి, శ్రీ జి. గంగరాజుగారు, శ్రీ రమేశ్‌గుప్తాగారు, శ్రీ మండవ జానకిరామయ్యగారు, శ్రీ ఎమ్.సి. దాసుగారు, భవానీప్రసాద్‌గారు, డా॥ సుబ్బారావుగారు-అంకాలజిస్ట్; మరియు నగర ప్రముఖులు పాల్గొన్నారు. శ్రీస్వామివారు ప్రవచిస్తూ... "ఆరోగ్య అవగాహన సదస్సు" 2006లో ఏర్పడిందని, దాని ఉపశాఖ "మహిళా ఆరోగ్య సదస్సు" అని ప్రవచించారు. ఈ కార్యక్రమాన్ని చక్కగా నిర్వహించిన విజయవాడ వి.టి. కార్యకర్తలకు, ఈ కార్యక్రమంలో పాల్గొన్న బాలికలకు, యాజమాన్యం వారికి శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.

ఈ సదస్సులో వాణీ విద్యానికేతన్, శ్రీ విద్యానికేతన్, మహితా పబ్లిక్‌స్కూల్, ఇడియల్ పబ్లిక్ స్కూల్ త్రివేణీ కాలేజీ బాలికలు, యాజమాన్యంవారు పాల్గొన్నారు.

29వ తేదీన వెలగలేరు గ్రామంలో ఉషాజగదీష్‌గారు నూతనంగా నిర్మించుకున్న తదీయారాధన మండపాన్ని శ్రీ స్వామివారు ఆవిష్కరించి, మంగళాశాసనాలు కృపచేశారు.

జనవరి 30వ తేదీ నుండి ఫిబ్రవరి 2వ తేదీ వరకు సీతానగరంలో వేంచేసి ఉండి, కార్యాలయ కార్యక్రమాలను పర్యవేక్షించారు.

5వ తేదీ హైదరాబాద్ 'అపోలో హాస్పిటల్స్-శ్రీ వేంకటేశ్వరస్వామి ద్వితీయ పుష్కరోత్సవం సందర్భంగా శ్రీ స్వామివారు వేంచేశారు. తీర్థగోష్ఠి అనంతరం అగ్నిమథనంతో కార్యక్రమం ప్రారంభమైనది.

6వ తేది మధ్యాహ్నం బయలుదేరి సాయంకాలానికి మంగళంపాడు చేరి కార్యక్రమంలో అన్వయించారు.

7వ తేదీ మంగళంపాడులో ప్రతిష్ఠా కార్యక్రమం పూర్తిచేసి మంగళాశాసనాలు అందించి తిరిగి రాత్రి 7.30 లకు అపోలో చేరారు.

8వ తేదిన అపోలో హాస్పిటల్ - శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయ ప్రాంగణంలో సుమారు 3000 మంది సమాశ్రయణాలు పొందారు. సా॥ సామూహిక ఉపనయాల సందర్భంగా ఉదకశాంతి కార్యక్రమం జరిగింది.

9వ తేదీ సామూహిక ఉపనయనాలు జరిగాయి. సుమారు 30 మంది చిన్నారులకు శ్రీస్వామివారు మంగళాశాసనము అనుగ్రహించి, వటువులకు సమాశ్రయణాలు అనుగ్రహించి శంషాబాద్-శ్రీరామనగర్ దివ్యసాకేతానికి వేంచేశారు.

10వ తేదీ విశ్వశాంతి శ్రీ విష్ణు సహస్రనామ విరాట్ పారాయణ హైదరాబాద్ ఉప్పుగూడలో శ్రీస్వామివారు 4గం॥ ప్రారంభించారు. ఉపదేశాత్మకంగా జరిగిన శ్రీ విష్ణు సహస్రనామ పారాయణని భక్తులందరికి కృపచేశారు.

13వ తేదీ శ్రీమాన్ పురుషోత్తమంగారు నిర్వహించే శాంతినికేతన స్కూలుకు వేంచేసి, అక్కడ విద్యార్థులకు మంగళాశాసనాలు అనుగ్రహించి శ్రీరామ్‌నగర్ విచ్చేశారు.

## జిమ్స్ ప్రథమ వార్షికోత్సవం

14వ తేదీ... సంవత్సరకాలంగా జీయర్ ఇంటిగ్రేటెడ్ సర్వీసెస్ సేవలను అందిస్తున్న డాక్టర్లతో, మై హోమ్ గ్రూప్ & కంపెనీ అధినేత డా॥ రామేశ్వరరావుగారు, శ్రీమాన్ జగపతిగారితో శ్రీస్వామివారు వార్షికోత్సవం జరుపవలసిన విధానాన్ని సూచించారు. శ్రీస్వామివారి సూచన మేరకు ఈ కార్యక్రమాన్ని చక్కగా నిర్వహించగలిగారు.

ఈ కార్యక్రమాని ముఖ్యఅతిథిగా మంత్రి డా॥ గీతారెడ్డి; మంత్రి శ్రీమాన్ ఉత్తమ్‌కుమార్‌రెడ్డి; మంత్రి శ్రీమాన్ ప్రసాద్‌కుమార్; శ్రీమాన్ ఇ. దయాకర్‌రావు–ఎమ్.ఎల్.ఎ.; శ్రీమాన్ టి. ప్రకాశ్‌గుప్తా–ఎమ్.ఎల్.ఎ.; శ్రీమాన్ సి. ప్రతాప్‌రెడ్డి – ఎమ్.ఎల్.ఎ.; ఇంకా అనేక మంది ముఖ్యప్రభృతులు, ఐ.ఎ.ఎస్. అధికారులు, ఐ.పి.ఎస్. అధికారులు పాల్గొన్నారు. వీరందరినీ శ్రీస్వామివారు జ్ఞాపిక, శాలువాతో సత్కరించారు.

13వ తేదీ జీవా ప్రాంగణంలోని క్వార్టర్స్ ప్రారంభించారు.

## ఉచిత మెగా మెడికల్ క్యాంప్

14,15,16 తేదీలలో మన జిమ్స్‌లో విశేష కార్యక్రమాలు

ఉదయం జిమ్స్ ప్రథమ వార్షికోత్సం వైభవంగా జరిగింది. జిమ్స్‌కు చెందిన డాక్టర్లనేకాక, పైవారినికూడా సమ్మానించారు మన స్వామివారు. జిమ్స్‌కు భూరి విరాళాలు సమర్పించిన పెద్దలందరినీ, వారితోపాటు వివిధ సేవలందించి పాట్రన్స్‌గా గుర్తింపుపొందిన పెద్దలను వేదికపై ఆహ్వానించి అందరిచేత యథోచితంగా మాటాడించి వారిని సత్కరించడం జరిగింది. ముగ్గురు జీయర్ స్వాములతోపాటు డా॥ ఎన్.వి. రంగరామానుజాచార్యస్వామివారు ప్రసంగించారు. జీవా కమిటీ కార్యదర్శి పురుషోత్తమరావు, జిమ్స్ పూర్వ డైరెక్టర్ రామారావు, పలువురు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

ఈ కార్యక్రమానికి విచ్చేసిన మంత్రులు శ్రీమతి జె. గీతారెడ్డి, శ్రీమాన్ ఎన్. ఉత్తమకుమార్‌రెడ్డి, శ్రీమాన్ జి. ప్రసాద్‌కుమార్, శ్రీమతి సబితా ఇంద్రారెడ్డి, శ్రీమాన్ ఎర్రబెల్లి దయాకరరావు M.L.A, శ్రీమాన్ టి. హరీశ్‌రావు M.L.A, శ్రీమాన్ టి. ప్రతాప్‌రెడ్డి గౌడ్ M.L.A, శ్రీమాన్ సి. ప్రతాప్‌రెడ్డి M.L.A, మరియు ప్రభుత్వ అధికారులు శ్రీమాన్ అజయ్ ప్రకాశ్ IAS, సంజయ్‌కుమార్ IAS, శ్రీమాన్ బి. శ్రీధర్ IAS, శ్రీమాన్ కె. ధనంజయ రెడ్డి IAS, శ్రీమాన్ సయ్యద్ అన్వర్ IPS, శ్రీమాన్ పూర్ణచంద్రరావు IPS, శ్రీమాన్ సి.వి. ఆనంద్ శ్రీమాన్ కె.పి. శ్రీవాసుకి IPS, పాల్గొన్నారు. వీరందరికి శ్రీస్వామివారు శాలువ, జ్ఞాపికతో సత్కరించారు. జీవా చైర్మన్, జిమ్స్ స్వరూప నిర్మాత, డా॥ రామేశ్వరరావుగారి పూర్తి ప్రోత్సాహంతో వారిసోదరులు జగపతిరావుగారి బృందం నిర్వహణలో మెగా మెడికల్ క్యాంపులు జరిగాయి. ఒక "జిమ్స్ ప్రథమ








వార్షికోత్సవ సావనీర్' విడుదల చేశారు. డా॥ పావులూరి వారి కృషిని ప్రశంసించారు. ఈ కార్యక్రమం ముగిసినఅనంతరం మధ్యాహ్నం 2 గం॥లకు శ్రీస్వామివారు వైద్యశిబిరాన్ని జిమ్స్ ప్రాంగణంలో ప్రారంభించారు.

శరీరంలో అన్నిభాగాలకు సంబంధించిన వైద్యనిపుణులు ఈ కార్యక్రమంలో అన్వయించి సుమారు 18వేలమందికి ఉచిత పరీక్షలను నిర్వహించి అవసరమైన మందులను పంపిణీ చేశారు. హోమియో, ఆయుర్వేదం, అల్లోపతి మందులను పంపిణీ చేశారు.

కార్యక్రమానికి మైహోమ్ గ్రూప్స్, యశోదా హాస్పిటల్ తరపున డాక్టర్లు,, చల్మెడ ఆనందరావు వైద్య విజ్ఞాన సంస్థవారు, భాస్కర్ మెడికల్ కాలేజ్& జనరల్ హాస్పిటల్‌వారు, మాక్సివిజన్ – కంటిహాస్పిటల్‌వారు, ఎస్.ఎస్.సి.డి.ఎస్.–











దంతవైద్యశాల వారు, నాట్‌కో ఫార్మా లిమిటెడ్‌వారు, డాక్టర్ రెడ్డీస్ వారు, బసవతారకం ఇండో-అమెరికన్ కాన్సర్ హాస్పిటల్-రీసెర్చ్ వారు; హెచ్.ఎమ్.టి.వి. వారు, సిటి. విజన్‌వారు, మహాసిమెంట్స్‌వారు ఈ మెగా మెడికల్ క్యాంప్‌లో ఉచిత మందుల పంపిణీచేశారు.

15వ తేదీన చిన్నపిల్లలకు, విద్యార్థులకు మాత్రమే వైద్య పరీక్షలు నిర్వహించారు. ఇందులో సుమారు 7వేలమంది విద్యార్థులు పాల్గొన్నారు. కంటి, పంటి పరీక్షలు ఎక్కువమందికి నిర్వహించారు. అవసరమైన మందులు ఉచితంగా ఇచ్చారు.

16వ తేదీ అన్నివయస్సులవారికి వైద్యపరీక్షలు నిర్వహించారు. ఈ కార్యక్రమంలో అవసరమైన చికిత్సలను (గుండె, కాన్సర్‌లకు) యశోదా హాస్పిటల్ యాజమాన్యంవారు వెంటనే ఉచితంగా శస్త్ర చికిత్స నిర్వహించారు.

15వ తేది ఉదయం శ్రీస్వామివారు ముంబాయి మహానగరానికి విచ్చేశారు. ఆలయ అర్చక పరివారము, ఆలయ కమిటీవారు శ్రీమాన్ కృష్ణహరిగారు, రాజా రేడేకర్, మ్యానగేశ్, కృపేందర్‌గార్లు విమానాశ్రయంలో శ్రీస్వామివారికి పూర్ణకుంభ స్వాగతం పలికారు. శ్రీస్వామివారు నేరుగా "వర్లి" ప్రాంతంలోని "బాలాజీ ఆలయానికి" వేంచేసి మంగళాశాసనం చేశారు. ఈ ఉత్సవంలో పాల్గొన్న భక్తులనుద్దేశించి ప్రవచించారు. అనంతరం శ్రీమాన్ గొళ్ళ రమేశ్-అనితగారి గృహంలో బసచేశారు. రాత్రి 7గం॥ శ్రీ భూ సమేత వేంకటేశ్వరస్వామి కళ్యాణం శ్రీస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో అంగరంగ వైభవంగా జరిగింది.

16తేది ఉదయం శ్రీ భూ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామివారి తిరువీధి ఉత్సవంలో శ్రీస్వామివారు పాల్గొన్నారు. సర్వాంగ సుందరంగ అలంకరించిన రథంలో పెరుమాళ్ళు, శ్రీస్వామివారు వేంచేసి ఉండగా కలశాలను శిరస్సుపై ధరించి, పెరుమాళ్ళ రథానికి ముందు పాదయాత్రగా నడుస్తూ ఈ శోభాయాత్రకి పూర్ణశోభను చేకూర్చారు. ఈ యాత్రలో పాఠశాల, కళాశాల విద్యార్థులు నృత్యం, కోలాటం చేస్తూ ఉత్సాహంగా పాల్గొన్నారు. ఈ శోభాయాత్ర 'వర్లి-ముంబాయి" ప్రధాన వీధులగుండా అత్యంత వైభవంగా సాగింది.

ఈ కార్యక్రమాన్ని శ్రీమాన్ కృష్ణహరి, రాజారేడేకర్, మ్యాన్‌నగేశ్,

కృపేందర్‌గార్లు భక్తులు చక్కగా నిర్వహించాడు. కరీంనగర్ మొదలైన ప్రాంతాల తెలుగువారు విశేషంగా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

16న శోభాయాత్ర 2 కిలోమీటర్లు సాగింది. 16 రాత్రి ఢిల్లీ శ్రీనివాస్‌గారి గృహం శంకుస్థాపనం జరిగింది.

17వ తేదీ సీతానగరం మీదుగా ఒంగోలు వేంచేశారు. జంగారెడ్డిపల్లి శ్రీరాంపురి – రామాలయ పునరుద్ధరణ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఊరంతా వైష్ణవమతస్థులు. చక్కగా ఊర్ధ్వపుండ్రాలు ధరించి పాల్గొనడం విశేషం. బంగారం, ముత్యాల వ్యాపారులు ఎక్కువగా ఉన్న ఇక్కడనుంచే ఒక భక్తుడు ప్రతిసంవత్సరం దివ్యసాకేత కల్యాణానికి ముత్యాలు సమర్పించడం ఆనవాయితి.

17,18 తేదీల్లో హైదరాబాద్ సమీపంలో కార్యక్రమాలు పూర్తి చేసికొని, 19 రాత్రి అమెరికా ప్రయాణమయ్యారు శ్రీస్వామివారు.

# పరమపద వార్తలు



శ్రీస్వామివారి శిష్యురాలు, విజయవాడ వాస్తవ్యులు **శ్రీమతి కోనేరు హైమవతి**గారు ది. **30.1.2014**న ఆచార్య తిరువడి చేరినారు. పరమాత్మ పదసన్నిధిలో వీరికి నిత్య కైంకర్యం లభించాలని వీరి కుటుంబసభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనం కృపచేశారు.



శ్రీశ్రీశ్రీ స్వామివారిశిష్యులు, విశాఖపట్టణం వాస్తవ్యులు **శ్రీమాన్ మంగళగిరి సుదర్శనం** గారు ది. **11.12.2013**న ఆచార్య తిరువడి చేరినారు. వీరు శ్రీస్వామివారు నిర్వహించే కార్యక్రమాలలో తమవంతు కైంకర్యం చేసేవారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో వీరికి నిత్యకైంకర్యం లభించాలని వీరి కుటుంబసభ్యు లకు శ్రీస్వామివారు మంగళాశాసనం కృపచేశారు.



అవనిగడ్డ వాస్తవ్యులు **శ్రీమతి బొప్పన శశిరేఖమ్మ** గారు ది. **5.1.2014**న ఆచార్య తిరువడి చేరినారు. పరమాత్మ పదసన్నిధిలో వీరికి నిత్య కైంకర్యం లభించాలని వీరి కుటుంబసభ్యు లకు శ్రీస్వామివారు మంగళాశాసనం కృపచేశారు.



శ్రీస్వామివారి శిష్యులు, రాజమహేంద్రి వాస్తవ్యులు **శ్రీమాన్ వంగల వెంకట నరసింహ రామాచార్యులు** (రాంబాబు) ది. **7.1.2014**న ఆచార్య తిరువడి చేరినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళా శాసనం కృపచేశారు.



వేకనూరు వాస్తవ్యులు **శ్రీమతి బొప్పన శశిరేఖమ్మ**గారు ఆచార్యతిరువడి చేరినారు. పరమాత్మ పదసన్నిధిలో వీరికి నిత్య కైంకర్యం లభించాలని వీరి కుటుంబసభ్యులకు శ్రీస్వామివారు మంగళా శాసనం కృపచేశారు.



కలువపాముల వాస్తవ్యులు, మాజీ ఎం.పి. వడ్డే శోభనాద్రీశ్వరరావు తల్లిగారైన **శ్రీమతి వడ్డే అన్నపూర్ణమ్మ**గారు ది. **22.12.2013**న ఆచార్య తిరువడి చేరినారు. వీరికి పరమాత్మ పద సన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామి వారు మంగళాశాసనం చేశారు.



ఒంగోలు వాస్తవ్యులు **శ్రీమాన్ చిలకపాటి శ్రీనివాసాచార్యులు** గారు ది. **10.11.2013** ఆచార్య తిరువడి చేరినారు. వీరికి పరమాత్మ సన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామి వారు మంగళాశాసనం చేశారు.



శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారి శిష్యులు, చెన్నై వాస్తవ్యులు **శ్రీమాన్ పాతాళం నిరంజన్** గారు ది. **4.1.2014** ఆచార్య తిరువడి చేరినారు. వీరు గతంలో ఉభయవేదాంతాచార్యపీఠం ట్రెజరరీగా పనిచేసేవారు. వీరికి పరమాత్మ సన్నిధిలో నిత్య కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళా శాసనం చేశారు.



విజయవాడ వికాసతరంగిణి సభ్యులైన శ్రీమాన్ కోనేరు నిరంజన్‌గారు తమ తల్లిగారైన **శ్రీమతి సరోజిని** గారి **3వ వర్ధంతి** సందర్భంగా భక్తినివేద నకు కైంకర్యం సమర్పించారు.



విజయవాడ వికాసతరంగిణి సభ్యులైన **శ్రీమాన్** కోనేరు నిరంజన్‌గారు తమ తండ్రి గారైన **శ్రీమాన్ కుటుంబరావుగారి 20వ వర్ధంతి** సందర్భంగా భక్తినివేదనకు కైంకర్యం సమర్పించారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు.

శ్రద్ధతో మీరు పంపిన **జనవరి నెల సమాధానాలందాయి.** విజేత పేరు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం! *గతనెల సమాధానాలు 9వ పేజీలో కలవు.*

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. ప్రాణులకు అత్యంత ప్రీతికరాలు.......... | |
| 2. భరతునికి రాముని పరాత్పరునిగ భావించి, సేవించడం......... వివరించారు వాల్మీకి మహర్షి. | |
| 3. ప్రకారం అంటే....... | |
| 4. సమస్త పదార్థములోను అంతర్యామిగా ఉండేది? | |
| 5. భక్తుల హృదయంలోకి ప్రవేశించగానే నలువైపుల నుండి ..... మిన్ను ముట్టాయి. | |
| 6. ఆత్మదేవుని భార్య పేరు........ | |
| 7. భగవద్రామానుజుల దయను దేనితో పోల్చారుఅముదనార్లు? | |
| 8. ఆత్మదేవుని దుఃఖానికి కారణం.......... | |
| 9. కృపామాత్ర ప్రసన్నాచార్యులు............. | |
| 10. వికాసతరంగిణి ఎప్పుడు పుట్టింది? ఎక్కడ పుట్టింది? | |
| 11. సూర్యనారాయణుని ఆపాదమస్తకం ఏ వర్ణంలో ఉంటుంది? | |
| 12. దేహమే ఆత్మ అనే భ్రమ............. అంటారు. | |
| 13. కాలమహిమకు .............. కానీ తప్పించుకోలేడు. | |
| 14. భూమిపై ఉన్న ప్రాణులకంటే ఎక్కువ ప్రాణులు.................... గలవు. | |
| 15. కూరేశ మిత్రులకు ............. సునిశతం. | |
| 16. శ్రీనివాసుడు తన శంఖ చక్రాలను ......... తొండమానునికి | |
| 17. తిరుమంగై ఆళ్వార్ ఏ అంశతో జన్మించారు. | |
| 18. బుద్ధిజీవులకు......... ఇది ప్రత్యేక ఔషధం | |
| 19. ఎన్నివేల మందికి ఉచిత వైద్య పరీక్షలు నిర్వహించారు? | |
| 20. జూదం అనేది ..................................................... | |

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేత పేరు**

జె. శాయిరెడ్డి–హైదరాబాద్; ఎస్.వైదేహి–విజయవాడ; కె. పూర్ణచంద్రరావు–రాజమహేంద్రి.

**గత విజేతలంతా తమ తమ పోస్టల్ అడ్రస్ వివరంగా సీతానగరం పంపిస్తే వారికి బహుమతులను పంపించగలము. మీ శ్రద్ధాసక్తులకు భక్తినివేదన అభినందనలు అందిస్తుంది. బహుమతులు కూడా పంపిస్తుంది.**

మీ చిరునామా
.......................................
.......................................
.......................................

సూచన: సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్లు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.

భక్తినివేదన సీతానగరం–522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929



శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః




# వికాసదర్శిని

*సమగ్ర సమాచార నివేదన*

**సంపాదకులు శ్రీమతి టి. అరుణ**

**మహిళా ఆరోగ్య సదస్సు - విజయవాడ**

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి మంగళాశాసనములతో 2007 సంగలో ప్రారంభమైన మహిళా ఆరోగ్య వికాస్ శ్రీ స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో 2014 జనవరి 28న ప్రపంచ కేన్సర్ దినోత్సవం (ఫిబ్రవరి 4) సందర్భంగా విజయవాడ, బందర్‌రోడ్ పవర్‌మెక్ ఫౌండేషన్ నందు మహిళా ఆరోగ్యవికాస్ సదస్సు నిర్వహించారు. ఈ సదస్సులో 1000 మంది మహిళలు పాల్గొన్నారు. ఈ సదస్సు ప్రారంభించే ముందు 500 మంది విద్యార్థినులకు హైజిన్ గురించి, హెచ్‌పివి వ్యాక్సిన్ గురించి డా. భవానిగారు, మన వికాసతరంగిణి సేవలు గురించి వి.టి. ప్రెసిడెంట్ శ్రీమతి సీతామహలక్ష్మిగారు తెలియజేసారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు విద్యార్థులకు మంచి ఆహారపు అలవాట్ల గురించి వివరించి ప్రజ్ఞ కార్యక్రమాలను గూర్చిచెప్పి వారిలో నూతన ఉత్సాహాన్ని నింపి మంగళాశాసనం చేసారు.

మహిళా వికాస్ సదస్సు శ్రీశ్రీశ్రీ జీయరుస్వామివారు, శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరుస్వామివారు జ్యోతి ప్రజ్వలనతో ప్రారంభించారు. మహిళా ఆరోగ్యవికాస్ కార్యకర్తలు అందరూ (ఆకుపచ్చని వస్త్రాలు) 'డ్రస్ కోడ్'తో విచ్చేసారు. వారితోపాటు వారి గ్రామాలలో ఆరోగ్యవికాస్ మెడికల్ కేంప్‌లో చికిత్స పొందిన మహిళలను తీసుకువచ్చి వారి అనుభవాలను తెలియజేసారు.

కృష్ణాజిల్లా వేకనూరు నుండి వాణీగారు మాట్లాడుతూ ఆరోగ్య శిబిరం ద్వారా తమ గ్రామంలో ఒకే ఇంట్లో రెండు ఆపరేషన్లు నిర్వహించామని తెలియజేసారు. శ్రీమతి మాధవి రవీంద్రగారు ఆ గ్రామానికి చేసిన సేవలను కార్యకర్తలు కొనియాడారు.

నల్గొండ జిల్లా మిర్యాలగుడా నుంచి వచ్చిన జానకి రాఘవాచారి గారు మాట్లాడుతూ తమ హౌసింగ్ బోర్డ్ కోలనీలో నిర్వహించిన మెడికల్ కేంప్ ద్వారా కొంతమందికి ఆపరేషన్ చేయించగల్గామని - ఆమని అనే 28 ఏళ్ళ మహిళకు మొదటి స్టేజ్‌లో కనిపించిన కేన్సర్‌కు హైదరాబాద్ బసవతారకం హాస్పిటల్‌లో చూపించి చికిత్స చేయించి పూర్తిగా నయం చేసామని తెలియజేసారు. ఆమెకు మళ్ళీ రెండవ జన్మని ప్రసాదించిన శ్రీశ్రీశ్రీ స్వామివారికి కృతజ్ఞతలు తెలియజేసారు.

ప్రకాశం జిల్లా నుండి రాజ్యలక్ష్మిగారు, ఏలూరు నుండి శ్రీమతి నాగలక్ష్మిగారు, విజయనగరం జిల్లా నుండి శకుంతల గారు, అరుణగారు, నూజివీడు వెంకటాపురం నుండి రాధిక గారు తమ అభిప్రాయాలను తెలియజేసారు.

కేన్సర్ కనిపించని వ్యాధి - ఈ వ్యాధితో బాధపడే వారి దగ్గరికి వెళ్ళి ప్రతి ఒక్కరికి అవగాహన కల్గిస్తూ విఐఎ మొదలైన పరీక్షలు నిర్వహించి ఎన్ఆర్ఐ హాస్పిటల్‌కు తీసుకువెళ్ళి పూర్తి చికిత్స నిర్వహిస్తున్న శ్రీమతి మాధవిరవీంద్రగారు సేవలు మరువలేనివి. కేవలం సేవలందించడమేకాదు మాధవిగారు ఆరోగ్య వికాస్ కార్యకర్తలను తయారుచేస్తూ సమాజానికెంతో సేవ చేస్తున్నారు. మేమంతా కలసి మాధవ సేవగా సర్వ ప్రాణి సేవ - లక్ష్యంగా పనిచేస్తాం" శ్రీశ్రీశ్రీ స్వామివారి ఆశయాలకనుగుణంగా కేన్సర్ వ్యాధి నివారణకై కృషిచేస్తామని అందరూ తెలియజేసారు.

అనుకోని అతిథిగా వచ్చిన గజల్ శ్రీనివాస్‌గారు "నీవే కదా స్వామి మము తట్టిలేపింది" అంటూ శ్రీస్వామివారిని గూర్చి అద్భుతంగా పాడి సదస్సులో అందరికీ ఆనందాన్ని కల్గించారు.



ప్రత్యేక అతిథిగా విచ్చేసిన శ్రీమాన్ డా. యం.సి. దాస్‌గారు మాట్లాడుతూ శ్రీశ్రీశ్రీ స్వామివారు లోకకళ్యాణం కోసం కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. శ్రీ స్వామివారు చెప్పిన వాటిని ముందు **ఆలకించండి - ఆలోచించండి - ఆచరణలో పెట్టండి** స్వామివారు చెప్పినట్లు ఆచరిస్తే మీ జీవితాలలో సుఖ సంతోషాలు వాటంతట అవే వచ్చి చేరుతాయి" అంటూ అద్భుతంగా వివరించారు. వికాసతరంగిణి కేంద్ర అధ్యక్షులు శ్రీమాన్ రమేష్ గుప్తాగారు మాట్లాడుతూ మహిళలు తమ ఆరోగ్యాన్ని కాపాడుకుంటే ఇంట్లో అందరూ ఆరోగ్యంగా ఉన్నట్లే. మహిళా ఆరోగ్య వికాస్‌లో శ్రీమతి మాధవిగారు విశేష కృషి చేస్తున్నారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు ఆధ్యాత్మిక కార్య క్రమాలతోపాటు సమాజానికి సేవలు చేయిస్తున్నారు. వారి శిష్యులుగా ఉండడమే మన అదృష్టం అని తెలియజేసారు.

శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు మంగళాశాసనముల అనంతరం శ్రీశ్రీశ్రీ స్వామివారు సదస్సు ఏర్పాటు చేసిన శ్రీమతి మాధవి, శ్రీమాన్ రవీంద్రగారికి ముందుగా మంగళాశాసనము చేసారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు మాట్లాడుతూ కేన్సర్ వ్యాధి కల్గిన దేశాలలో మొదటి దేశం మనదే. మన దేశంలో సంవత్సరానికి 90 లక్షల కేసులు క్రొత్తగా నమోదు అవుతున్నాయి అంటే ఆరోగ్యవిషయంలో మనము ఎంత వెనుకబడి ఉన్నామో తెలుస్తుంది. అందువలనే వికాసతరంగిణి మహిళా ఆరోగ్యవికాస్ ద్వారా అన్ని ప్రాంతాలలో శిక్షణనిస్తూ కేన్సర్ రాకుండా అవగాహన కల్గించాలన్నారు. ఈ కార్యక్రమానికి స్థలాన్ని ఇవ్వడమేకాక తదీయారాధనకు తమవంతు ప్రోత్సాహాన్ని అందించిన పవర్‌మెక్ ఫౌండేషన్ అధికారి లక్ష్మీ కిషోర్‌గార్కి శ్రీ స్వామి వారు మంగళాశాసనములు చేసారు.

ఈ కార్యక్రమంలో డా. బచ్చువీణా రాధాకృష్ణ, ఉడయవర్లు స్వామివారు, కొంపల్లి నరసింహాచార్యులుగారు, డా. అమ్మాజీ, డా. లక్ష్మిదేవి, డా. పద్మావతి, డా.. శ్రీలత, డా. పగడాల మహేష్‌శారద, డా. ఫణి విశేష అతిథులుగా విచ్చేసారు.

ఈ కార్యక్రమంలో ముఖ్య అతిథులుగా శ్రీమాన్ గోకరాజు గంగరాజుగారు, డా. ముక్కామల అప్పారావుగారు, డా. సుబ్బారావు, సీతానగరం ఆశ్రమ నిర్వాహకులు శ్రీమాన్ పురాణం వేంకటాచారిగారు, గుడిమెళ్ళ రఘుగారు, వేణుగోపాలాచార్యస్వామి, భవానీప్రసాద్‌గారు, రమేష్ గుప్తాగారు పాల్గొన్నారు.

విజయవాడ విటి. నల్లూరి కృష్ణ, రాఘవన్, రంగారావు, సీతామహాలక్ష్మి, కోనేరు అన్నపూర్ణ ప్రసాదరావు, రాజేశ్వరి, రుక్మిణి, కొల్లా ఆనందకుమార్, భగవాన్ పాల్గొన్నారు. శ్రీమతి మాధవి రవీంద్రగారిని సెంట్రల్ ఆరోగ్య వికాస్ సమన్వయకర్తగా శ్రీశ్రీశ్రీ స్వామివారు ప్రకటించారు. అందరినీ ఉత్సాహపరుస్తూ ఆలోచింపజేస్తూ కార్యక్రమాన్ని నిర్వహించిన శ్రీమాన్ రవీంద్రగారికి, శ్రీమతి మాధవిగార్కి శ్రీశ్రీశ్రీ స్వామివారు మంగళాశాసనములు కృపజేసారు.

**చెన్నై :**

ఫిబ్రవరి 4 కేన్సర్ అవగాహన సదస్సు వికాసతరంగిణి కార్యకర్తలు నిర్వహించారు. ఈ కార్యక్రమంలో పాల్గొన్న ఒక మహిళ తనకు రొమ్ము భాగంలో ఉన్న సమస్యను గురించి తెలియజేసారు. వెంటనే వికాసతరంగిణి కార్యకర్తలు చెన్నై కేన్సర్ హాస్పిటల్‌కు తీసుకువెళ్ళారు. డా. రమణగారు పరీక్ష చేసి బ్రెస్ట్ కేన్సర్ ఉన్నట్లు తెలియజేసారు. కీమోథెరపీ ప్రారంభించారు. కీమో అయిన తరువాత హాస్పిటల్‌వారు ఉచితంగా ఆపరేషన్ నిర్వహిస్తారు. వికాసతరంగిణి చేస్తున్న సేవలను చూసి డా.రమణగారు ఉచిత వైద్య శిబిరం కోవలమ్‌లో నిర్వహిస్తామని తెలియజేసారు.

కోవలమ్‌లో ప్రజ్ఞ సెంటర్‌లో యోగా, కంప్యూటర్, టైలరింగ్, ప్రజ్ఞ సిలబస్ శిక్షణ నిస్తున్నారు. శ్రీమతి ఆనంద కుమారి, పద్మలత, మీరాశేఖర్, గజలక్ష్మి మొదలైన కార్య కర్తలు కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. భీష్మ ఏకాదశి రోజు వికాసతరంగిణి కార్యకర్తలు పార్థసారధి ఆలయ సమీపంలో గల శ్రీరామక్రతు స్థూపం వద్ద శ్రీ విష్ణు సహస్రనామ పారా యణ నిర్వహించారు. అదే రోజు వికాసతరంగిణి కార్యకర్తలు శ్రీమతి ప్రతిమారెడ్డి, శ్రీమతి హేమగారి గృహాలలో కూడా పారాయణ నిర్వహించారు.

**కరీంనగర్ :**

ఫిబ్రవరి 4వతేది వికాసతరంగిణి సభ్యులంతా కేన్సర్ హాస్పిటల్‌కి వెళ్ళి డా. హేమంతకుమార్‌గారిని కలిసి వారి సహకారంతో కేన్సర్ పేషంట్లతో మాట్లాడి 98 మందికి ఫలా లను అందజేసారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు ఆరోగ్య వికాస్ ద్వారా కేన్సర్ వ్యాధి నిర్మూలనకు చేయుచున్న కృషిని వికాస తరంగిణి అధ్యక్షులు వి. ప్రభాకరరావుగారు అక్కడ అందరికి తెలియజేసారు. ఆరోగ్యవికాస్ కన్వీనర్ సిరికొండ ప్రభాకర రావు మొదలైన వారు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

**గోదావరి ఖని :**

వికాసతరంగిణి సభ్యులు అవయవదాన అవగాహన యాత్ర నిర్వహించారు. అంధులకు సహాయ నిధిగా 17,360 రూపాయలు అందరూ కలసి అందజేసారు. రథ సప్తమి సందర్భంగా ఆదిత్యహృదయ పారాయణ నిర్వహించారు. ఈ కార్యక్రమంలో లక్ష్మణాచార్యులవారు, డా. ఆగమరావు గారు, మహేందర్‌రావు, సుందరరావు మొదలైన సభ్యులు పాల్గొన్నారు. వివిధ వికాసతరంగిణి శాఖలకు చెందిన కార్యకర్తలు పాల్గొన్నారు. అందరు ప్రతి వారం సత్సంగ కార్య క్రమాలు నిర్వహించాలని నిర్ణయించుకున్నారు.



భీష్మ ఏకాదశి సందర్భముగా విష్ణుసహస్రనామ విరాట్ పారాయణ నిర్వహించారు. 3 సార్లు పారాయణ చేసారు. వివిధ రకాల ఫలాలు నివేదించి అందరికీ ప్రసాదం అందించారు. ఈ కార్యక్రమాన్ని వి.టి. అధ్యక్షులు ఆగమరావు మరియు సభ్యులు నిర్వహించారు

**మిర్యాలగుడ :**

ఫిబ్రవరి 4న ప్రపంచ కేన్సర్ డే సందర్భంగా హౌసింగ్ బోర్డ్ వికాసతరంగిణిశాఖ వారు కేన్సర్ అవగాహన యాత్ర నిర్వహించారు. మిర్యాలగుడా పట్టణానికి చెందిన డాక్టర్ డా. నాగేంద్రగారు, డా. జ్యోతి, డా. గీతగారు మరియు వికాసతరంగిణి సభ్యులు, కార్యకర్తలు పాల్గొని కేన్సర్‌పై అవగాహన కలిగించారు.

**నల్గొండ :**

వికాసతరంగిణి భీష్మ ఏకాదశి రోజున శ్రీవిష్ణు సహస్రనామ పారాయణ పదవ తేదీ నిర్వహించారు. ఈ కార్యక్రమంలో 125 మంది భక్తులు పాల్గొన్నారు. వికాసతరంగిణి సభ్యులంతా ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

**కోదాడ - నల్గొండ జిల్లా**

తాగ్రాయ గ్రామంలో జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల విద్యార్థులు స్థానిక వివేకానంద యూత్ కేన్సర్ అవగాహన యాత్రలో పాల్గొన్నారు. కేన్సర్ రాకుండా తీసుకో వలసిన జాగ్రత్తలు వివరించారు. శ్రీమతి నళిని, లక్ష్మి, ఎస్.ఎల్.ఎన్. శాస్త్రిగారు వికాసతరంగిణి చేస్తున్న కార్యక్రమా లను గూర్చి అందరికి తెలియజేసారు. ఫిబ్రవరి 6 రథ సప్తమి సందర్భంగా ఆదిత్య హృదయం పారాయణను శ్రీమతి కొండ పల్లి భారతి, ఎస్. హైమవతి, నిర్వహించారు. వికాసతరంగిణి భక్తులు, కార్యకర్తలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

**భద్రాచలం - ఖమ్మం జిల్లా :**

ముక్కోటి ఏకాదశి పర్వదినాన భద్రాచలంలో శ్రీ సీతారామా చంద్రస్వామివారి

దేవస్థానంలో అవతార సందర్శ నం జరిగింది. ఉత్సవాల సందర్భంగా మన వికాసతరంగిణి కార్యకర్తలు విశేష సేవలందించారు. 9వ తేదీన వి.టి. మహిళలందరూ సహస్రనామ పారాయణ చేసారు.

ఉత్తర దర్శనం, తెప్పోత్సవం సమయానికి వికాసతరంగిణి అందించిన సేవలను అధికారులు, భక్తులు ప్రశంసించారు.

జనవరి నెలలో మారుతి నర్సింగ్ హోమ్ నేత్ర వైద్య శిబిరం వికాసతరంగిణి కార్యకర్తలు నిర్వహించారు. అనేకమంది ఈ సేవలను సద్వినియోగ పర్చుకున్నారు. భద్రాచలం వికాసతరంగిణి సభ్యులందరూ ఈ కార్యక్రమా లను నిర్వహించారు.

**వరంగల్ :**

వరంగల్ సెంట్రల్ జైల్‌లో 30మంది ఖైదీలు శ్రీ వేంకటేశ్వర శరణాగతి దీక్షను స్వీకరించారు. జనవరి 14న శ్రీమాన్ ముడుంబైన నరసింహరంగాచార్యులు ఖైదీలతో ఆరాధన చేయించి దీక్షను విరమింపజేసారు. గత ఏడు సంవత్సరముల నుండి జైల్లో దీక్షా కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నందుకు ఖైదీలు, జైలు సిబ్బంది వికాసతరంగిణి వారికి కృతజ్ఞతలు తెలియజేసారు.

జనవరి 26వ తేదీ భగవద్గీత 'జ్ఞాన యోగం'పై వివిధ పోటీలను నిర్వహించారు. గత ఐదు సంవత్సరములుగా ఈ పోటీలలో విద్యార్థులు ఉత్సాహంగా పాల్గొంటున్నారు. ఈ సంవత్సరం మూడు వందల మందికిపైగా ఈ పోటీలలో పాల్గొన్నారు. పాల్గొన్న వారందరికి ప్రశంసా పత్రాలు అంద జేసారు. గెలుపొందిన విద్యార్థులకు ఫిబ్రవరి 2వ తేదీన శ్రీశ్రీశ్రీ స్వామివారి శ్రీ హస్తములమీదుగా బహుమతులు అందజేసారు. వరంగల్ జిల్లాలో ఫోర్ట్ వరంగల్, పెరుమాళ గూడెం, పెద్దపహాడ్, నైనపాక, రెడ్లవాడ, రంగాపూర్ మొదలైన 6 గ్రామాలలో 6 పశువైద్య శిబిరాలు నిర్వహించారు. 1402 పశువులకు గోపూజ చేసి తరువాత ఉచిత చికిత్సలు నిర్వహించారు. డా.శ్రీరామ్‌రెడ్డి (జనరల్ సెక్రటరీ తెలంగాణ, వెటర్నల్ సర్జన్ సర్వీస్ అసోసియేషన్), పి శంకర్‌రెడ్డి (జాయింట్ డైరక్టర్), డా. ఎ గోపాల్‌రావు (అడిషనల్ డైరెక్టర్)డా. సిహెచ్. సుభాష్ రెడ్డి (రిటైర్డ్ జెడి), డా. రాజేష్, డా. శ్రీశైలం, డా. రవిప్రసాద్, డా. సింధుప్రియ, డా.శ్రీకాంత్, డా. నరసింహంగారు, వెటర్నరీ సిబ్బంది ఉచిత వైద్య సేవలు అందజేసారు. వైద్య సేవలందించిన డాక్టర్స్‌కు శ్రీమాన్ శ్రీశ్రీ స్వామివారు ఫిబ్రవరి 25న మంగళాశాసనములు అనుగ్రహిం చారు.

**మార్కాపురం :**



వి.టి. యూత్ ప్రకాశం జిల్లా కాకరాల గ్రామంలో పదవ తరగతి విద్యార్థులకు పౌష్టికాహారం అందజేసారు. పరీక్షలు ఎలా వ్రాస్తే విద్యార్థులు మంచి ఫలితాలు సాధిస్తారో తెలియజేసారు. విటి యూత్ ప్రెసిడెంట్ రంగనాయకులు సెక్రటరీ ప్రదీప్, ట్రెజరర్ నాగేంద్ర, మహేష్ ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.పాఠశాల ఉపాధ్యాయులు శ్రీ యం. సుధాకర్, విటి. యూత్‌ని అభినందించారు.

**కృష్ణా జిల్లా - జగ్గయ్యపేట :**

ధనుర్మాస ఉత్సవాలు ధనశైల సీతారామస్వామి ఆలయంలో వైభవంగా జరిగాయి. 'మంగళాశాసన' పాశురం రోజు 'హారతి' పళ్ళెముల అలంకరణ పోటీలను నిర్వహించారు. చక్కటి అలంకరణ చేసిన వారికి బహుమతు లను అందజేసారు. జనవరి 13వ తేది తొర్రగుండపాలెం గ్రామంలో 100 మంది చిన్నారులకు భోగిపండ్లు పోసారు. వైదిక సంప్రదాయంలో ఉందామన్నా ఈ గ్రామంలో ఎన్నో ఆటంకాలుండేవి. మన వికాసతరంగిణి



కార్యకర్త శ్రీమతి డి. జ్యోతి 5 సంIIముల నుండి సత్సంగ కార్యక్రమాలు నిర్వహిస్తూ మంచిమార్గంలో నడిపిస్తున్నారు. ఇందుమతి, కమలాభాయి, సావిత్రమ్మ, మంగతాయారు మొదలైనవారు సహకారమందిస్తున్నారు. జగ్గయ్యపేట వికాసతరంగిణి సభ్యులు శ్రీమతి శ్రీరాంవిజయలక్ష్మి ముందుండి ఆధ్యాత్మిక, సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. కేతవారి అగ్రహార రామాలయంలో శ్రీరామభక్తతరంగిణి కార్యక్రమం వైభవంగా నిర్వహించారు. శ్రీరామ పూజ అనంతరం శ్రీమాన్ జి సుబ్బారావుగారు (ఇంజనీరింగ్ కాలేజ్ ఛైర్మన్), హనుమాన్ చాలీసాపై ప్రవచనం చేసారు. శ్రీమతి శ్రీరాం విజయలక్ష్మి ఉచితంగా ప్రచార సామగ్రి అందజేసారు. వికాసతరంగిణి సభ్యులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

**పాలకొల్లు :**

వికాసతరంగిణి సభ్యులు మాధురి, పార్వతి, పాఠశాల విద్యార్థులకు భగవద్గీత 3వ అధ్యాయంపై పోటీలు నిర్వహించారు. శ్లోక పఠనంలో ప్రథమ, ద్వితీయ బహు మతులు తాత్పర్య సహిత శ్లోక పఠనంలో రెండు బహు మతులు, వక్తృత్వ పోటీలలో బహుమతులు అందించారు. పాఠశాల ఉపాధ్యాయ బృందం, తల్లిదండ్రులు తమ సంతోషాన్ని వ్యక్త పరిచారు.

**గుంటూరు జిల్లా - వినుకొండ :**



వినుకొండ ప్రాంతవాసులు అవయవదాన అవ గాహన యాత్ర నిర్వహించారు. కార్యక్రమానికి పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. గుంటూరు జిల్లా అధ్యక్షులు వికాస తరంగిణి అందిస్తున్న సేవలు వివరించి అవయవదానంపై అవగాహన కల్గించగా అనేకమంది అవయవదానం చేసేందుకు ముందుకువచ్చారు.

వినుకొండ జీయరు నిలయంలో ధనుర్మాసం నెల రోజులు శరణాగతి దీక్షలు జరిగాయి. విశేష సేవలు జరిగాయి. ప్రతిరోజు 300 మంది భక్తులు పాల్గొన్నారు. కళ్యాణమహోత్సవం అనంతరం 2000 మందికి తదీయా రాధన జరిగింది. ఈ

కార్యక్రమాన్ని వికాసతరంగిణి జిల్లా అధ్యక్షులు భవనాని మల్లిక ప్రసాదరావు, వికాసతరంగిణి కార్యకర్తలు నిర్వహించారు.

**పశ్చిమగోదావరి జిల్లా - జంగారెడ్డి గూడెం :**



వికాసతరంగిణి కార్యకర్తలు రథసప్తమి సందర్భంగా ఆదిత్యహృదయ పారాయణ నిర్వహించారు. శ్రీ ఎస్. రవి కుమారాచార్యులు అందరికి ఉపదేశం చేసారు. ఈ కార్యక్రమంలో 200 మంది పాల్గొన్నారు. వి.టి. అధ్యక్షులు శ్రీమతి కొల్లూరు శ్యామలాంబగారు వికాసతరంగిణి అందిస్తున్న సేవలగూర్చి తెలియజేసారు. ఫిబ్రవరి 10 భీష్మ ఏకాదశి సందర్భంగా విష్ణు సహస్రనామ పారాయణ నిర్వహించారు. 108 హారతులు, 108 దివ్యదేశ పెరుమాళ్ళకు పూజలు వైభవంగా నిర్వహించారు. శ్రీ వక్కలగడ్డ శ్రీనివాస్, హేమలత దంపతులు, శ్యామలాంబ ఈ కార్యక్రమం నిర్వహించగా శ్రీ నల్లూరి ఋషికేశ్ ఆరాధన, పారాయణ చేసారు.

**విజయవాడ :**

వికాసతరంగిణి కార్యకర్తలు వివిధ పాఠశాల విద్యార్థులకు భగవద్గీత 3వ అధ్యాయంపై పోటీలు నిర్వ హించగా గెలుపొందిన వారికి బహుమతులు అందజేసారు. అనేక ప్రాంతాల వికాసతరంగిణి కార్యకర్తలు సేవలందిం చారు. శ్రీమాన్ రాఘవన్, శ్రీ వల్లూరి కృష్ణగార్ల నేతృత్వంలో ఈ కార్యక్రమం జరిగింది. శ్రీమతి మాధవి, నాగమణి, వెంకట్రావమ్మ, రుక్మిణి, ఎస్. ఝాన్సీలక్ష్మి కార్యక్రమాన్ని నిర్వహించారు.

**విశాఖపట్టణం :**

విశాఖపట్టణం సెంట్రల్ జైలులో ఉన్న ఖైదీలు శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారి శ్రీ హస్తముల మీదుగా దీక్షను స్వీకరించారు. 21వ రోజున దీక్ష విరమించారు. ప్రతి రోజు ఆరాధన, భజనలు అత్యంత భక్తి శ్రద్ధలతో నిర్వహించుకున్నారు. వారికి ఏర్పాటు చేసిన ప్రత్యేక గదిని ఆకర్షణీయంగా అలంకరించి పూజలు నిర్వహించడం విశేషం. వచ్చే సంవత్సరం 200 మంది దీక్షలు స్వీకరిస్తామని తెలియజేసారు. జైలు అధికారులు వారికి పూర్తి సహకార మందించారు. సింహాచల దేవస్థానం వారు విరమణ రోజు అందరికీ ప్రసాదం అందజేసారు. శ్రీమాన్ పి.ఎస్.ఎన్. రాజుగారు, శ్రీమాన్ సుధారాణి, సుబ్బలక్ష్మి, బేబి, వర్మ, దేవి, కృష్ణవేణి, రఘు మొదలైన వారు విరమణ రోజు పూజా సామగ్రి అందించారు.

**మాడుగుల :**

మాడుగుల వికాసతరంగిణి సభ్యులు శ్రీమాన్ శ్రీనుగారు 33 గ్రామాల యువతతో, భక్తులతో పాఠశాల విద్యార్థులతో భీష్మ ఏకాదశి సందర్భంగా శ్రీ విష్ణు సహస్రనామ విరాట్ పారాయణ కార్యక్రమాన్ని



ఏర్పాటు చేశారు. శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరుస్వామి వారు ప్రజ్ఞ కార్యక్రమాల గురించి వికాసతరంగిణి అందిస్తున్న సేవలను గురించి విద్యార్థులకు వివరించారు. శ్రీ విష్ణు సహస్ర నామ వైభవాన్ని అందరికీ అర్థమయ్యేలా వివ రించారు. ఈ కార్యక్రమంలో విశాఖ వికాసతరంగిణి సెక్రటరీ శ్రీమాన్ పి.ఎస్.ఎన్.రాజుగారు, ఎమ్.ఎస్.ఎస్.ఆర్. వర్మగారు, వారిజ శ్రీకాంత్ గురువుగారు, తుని వర్మగారు పాల్గొన్నారు.

**విజయనగరం - ఆరోగ్యవికాస్**

మహిళా ఆరోగ్యవికాస్ కన్వీనర్ శ్రీమతి ఎస్. శకుంతలగారు కుమిలి గ్రామంలో 27న తేది సర్వే నిర్వహించి జనవరి 7వ తేదీన ఉచిత వైద్య శిబిరం నిర్వహించారు. డా. మాటూరి సుధాకుమారి వైద్య సేవలం దించారు. 150 మంది పరీక్షలు చేయించుకున్నారు. 6 పేప్ స్మియర్ పరీక్షలు జరిగాయి. శ్రీమతి సుగుణవేణిగారు ఉచితముగా మందులు అందజేసారు. మహిళా ఆరోగ్యవికాస్ కో-కన్వీనర్ శ్రీమతి విజయలక్ష్మి, కార్యకర్తలు సేవలు అందించారు.

ఫిబ్రవరి 4 కేన్సర్ డే సందర్భంగా స్థానిక సరస్వతి ఆలయ ప్రాంగణంలో 2000 మందికి అవగాహన కల్పించారు. 80 మందికి పరీక్షల నిర్వహణ, 10 పేప్‌స్మియర్ పరీక్షలు జరిగాయి. విజయవాడ నుండి శ్రీమతి మాధవి, శ్రీమాన్ రవీంద్ర మరియు కార్యకర్తలు 12 గంటలకు విజయనగరం చేరుకొని 12 విఐఎ పరీక్షలు నిర్వహించారు. ముగ్గురికి బయాప్సీ చేయవలసి ఉంది. విజయనగరం మహిళా ఆరోగ్య వికాస్ కార్యకర్తలకు విఐఎ పరీక్షలు నిర్వహించుటలో శిక్షణ నిచ్చారు. శ్రీమతి పి. విజయలక్ష్మి గారు, శకుంతలగారు కాల్పోస్కోపి ద్వారా పరీక్షలు నిర్వహించుట నేర్చుకున్నారు. విఐఎ పరీక్ష చేయుటలో శిక్షణ నిచ్చిన శ్రీమతి మాధవిగార్కి విజయనగరం వికాసతరంగిణి కార్యకర్తలు కృతజ్ఞతలు తెలియజేసారు. శ్రీమాన్ చెరుకూరి శ్రీధర్ గారు ఉచితంగా మందులు అందజేయుటే గాక ఆ రోజు కార్యక్రమాలన్నింటిని నిర్వహించుటలో తమ సహకారమందించారు.

**విజయనగరం - ఆలయ జీర్ణోద్ధరణ**

ఆధ్యాత్మిక చైతన్యాన్ని కలిగించే ప్రాంతాలు ఆలయాలు. ప్రాచీన ఆలయాలు మన భారతదేశ సంస్కృతి సంప్రదాయాలను తెలియజేసే కేంద్రాలు. ప్రాచీన ఆలయాల జీర్ణోద్ధరణ కార్యక్రమాలని శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరుస్వామివారు, శ్రీశ్రీశ్రీ చిన్న జీయరుస్వామివారు అనేక చోట్ల నిర్వహించారు. విజయనగరం మహిళా కళాశాల ప్రిన్సిపాల్ డా. లతాకుమారి గారు స్వామివారిని ఆదర్శంగా తీసుకొని విజయనగరం లోగల ప్రాచీన దేవాలయం జగన్నాధస్వామి ఆలయాల జీర్ణోద్ధరణ చేయాలని సంకల్పించారు. లతాకుమారిగారు 1994 నుండి జీయర్ స్టడీసర్కిల్ పేరుమీద వికాసతరంగిణి కార్యకర్తలకు స్తోత్ర పాఠాలు నేర్పేవారు. దాసన్నపేట, అలకానంద కాలనీ, శార్వాణీ నగర్ భక్తులు ఆలయ జీర్ణోద్ధరణకు తమ సహాయ సహకారాలందించారు. శార్వాణీ నగర్‌కు చెందిన శ్రీమతి సుజాతగారు ప్రతి ఇంటికి 11రూ చొప్పున ఈ కార్యక్రమానికి సేకరించారు. డా. లతాకుమారి గారు, శేఖర్ ఆధ్యాత్మిక కేంద్రం వారు, కార్యకర్తలు, పెద్దలు అందరు కలసి భగవద్రామానుజ సన్నిధి, ఆళ్వారుల సన్నిధి పై గోపురం బాగుచేయించి, ఇనుప గ్రిల్స్ వేయించారు. జగన్నాధస్వామి సన్నిధి ఆళ్వారుల సన్నిది మార్బుల్ గచ్చులు చేయించారు. ఈ పనులన్నింటిని శ్రీమతి పాకలపాటి విజయ గారు దగ్గరుండి చేయించారు. మార్బుల్ మర్చంట్ శ్రీమాన్ ఎన్.ఎస్.ఎన్. రాజుగారు తమవంతు సేవగా రూ.8,000/- సామగ్రి అందజేసారు. పురాతన ఆలయాల జీర్ణోద్ధరణలో డా. లతాకుమారి గారు ఎందరికో ఆదర్శప్రాయమయ్యారు.

**విజయనగరం జిల్లా - సాలూరు**

14 ఫిబ్రవరి 2014న సాలూరు వికాసతరంగిణి సభ్యులు శ్రీమాన్ విశ్వనాథ్ తదితరులు పెదచీపురువలస అనే ట్రైబల్ ఏరియాలో (గిరిజన ప్రాంతంలో) మెడికల్ కేంప్ నిర్వహించారు. డా. బి.ఎస్.ఎన్. మూర్తి 100 మందికి జనరల్ చెకప్ నిర్వహించారు. వికాసతరంగిణి కార్యకర్తలు ఉచితంగా మందులు అందజేసారు.

## శ్రీరామ భక్తతరంగిణి - విజయనగరం :

వికాసతరంగిణి కార్యకర్తలు 2013 శ్రీరామ నవమి నుండి సుమారు 500 ప్రాంతాలలో శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. నూతనంగా కార్యక్రమాలు ప్రారంభించిన మండలాల్లో శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారి ప్రవచన కార్యక్రమాలను ఏర్పాటు చేశారు.

ఏడవ తేది తెల్లవారుఝామున శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరుస్వామివారు విజయనగరం రామానుజ కూటం వేంచేశారు. రామానుజ కూటం కమిటీ సభ్యులు శ్రీమాన్ దాసరి కృష్ణాజీగారు, శ్రీమతి సుశీలమ్మ, కనకవల్లి, బదరీ స్వామివారు అందరూ నాలుగు రోజులు చక్కటి ఏర్పాట్లు గావించారు. పెద్దలు వేంచేసినప్పుడు వారికి, వారితో వచ్చిన భాగవతోత్తములకు అందించవలసిన గౌరవ మర్యాదలు భక్తి శ్రద్ధలతో చేయడంలో రామానుజ కూటం కమిటీ సభ్యులే అందరికీ ఆదర్శం. నాలుగు రోజులూ తీర్థ ప్రసాద వినియోగం, ప్రవచన కార్యక్రమాలు జరిగాయి. ఏడవతేదీ ఉదయం శ్రీమాన్ చెరుకూరి శ్రీధర్‌గారు, శ్రీనివాస సేవా సంఘం వారు, కళ్యాణ వేంకటేశ్వర స్వామివారి ఆలయంలో నిర్వహిస్తున్న సేవాకార్యక్రమాలను చూసి శ్రీశ్రీశ్రీ స్వామివారు మంగళాశాసనం చేశారు. అనంతరం చీపురుపల్లి విచ్చేసారు. 8వ తేదీ రామతీర్థంలో శ్రీశ్రీశ్రీ శరణ్య జీయర్ స్వామివారిని సేవించుకుని నెల్లిమర్ల వేంకటేశ్వర స్వామివారి ఆలయంలో ఏర్పాటుచేసిన శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమంలో పాల్గొన్నారు. నెల్లిమర్ల సమన్వయకర్త శ్రీమాన్ బూర్ల సత్యంగారు పట్టణ సమన్వయకర్త శ్రీమాన్ శివరామ కృష్ణగారు, శ్రీమతి లలితగారు, శ్రీమాన్ వెలగాడ రమణ ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. అనంతరం దాసన్నపేట వికాసతరంగిణి కార్యకర్తలు శ్రీకృష్ణ ఆలయంలో చేస్తున్న సేవలను చూసి ఆ ప్రాంతమంతా ప్రచారం చేస్తున్న శ్రీమతి రామరత్నం, సత్యనారాయణ, శ్రీమతి లక్ష్మి, శ్రీమాన్ రాము, అప్పలనర్సమ్మ, నాగలక్ష్మి మొదలైన కార్యకర్తలకు మంగళాశాసనం చేశారు. పురాతన జగన్నాథ దేవాలయంలో ఆళ్వారుల సన్నిధి ప్రాంగణంలో శిథిలమైన భాగాలను డా. శ్రీమతి లతాకుమారిగారు భక్తుల సహాయంతో బాగు చేయించారు. అక్కడ జరిగిన నూతన నిర్మాణాలను చూసి మంగళాశాసనం చేశారు.

బాలాజీ నగర్ వికాస తరంగిణి ప్రతి రెండవ శనివారం ఆ ప్రాంతం భక్తులందరితో, యువతతో ఆధ్యాత్మిక ఆటపాటల కార్యక్రమం, సత్సంగం నిర్వహిస్తుంటారు.

8వ తేదీ సాయంత్రం శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్ స్వామివారు ఈ కార్యక్రమానికి విచ్చేసి మంగళాశాసనం చేసారు. శ్రీమతి పద్మజగారు ఆధ్యాత్మిక ఆటల కార్యక్రమాన్ని నిర్వహించారు. శ్రీమతి సరళ, కుమారి దివ్య, శ్రీమాన్ రవిగారు గానం చేశారు. శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయంవారు వచ్చినవారందరికీ ప్రసాద వినియోగం చేసారు. శ్రీమాన్ గోపాలాచార్యులవారు ఈ కార్యక్రమాన్ని శ్రీరామ వైభవాన్ని తెలిపే పద్యంతో ప్రారంభించారు.

9వతేదీ ఉదయం సాలూరు వికాసతరంగిణి సభ్యులు శ్రీమాన్ విశ్వనాథం గారు నిర్వహిస్తున్న శ్రీరామ భక్త తరంగిణి కార్యక్రమంలో పాల్గొన్నారు. శ్రీరామాలయంలో శ్రీరామనామ వైభవాన్ని ప్రవచించారు. అందరికీ మహిళా ఆరోగ్య వికాస్ గూర్చి తెలియజేసారు. కార్యకర్తలు, భక్తులు, విశేష సంఖ్యలో పాల్గొని క్రమ శిక్షణతో కార్యక్రమం నిర్వహించారు. శ్రీమాన్ విశ్వనాథ్‌గారి గృహానికి వేంచేసి కార్యకర్తలకు మంగళాశాసనం చేసారు. మధ్యాహ్నం గజపతి నగరం కార్యక్రమానికి వేంచేసారు. ముందుగా శ్రీమతి రమాదేవి రమేష్‌గార్ల గృహానికి విచ్చేసారు. ఆంజనేయస్వామి ఆలయం నుండి శోభాయాత్రగా రామాలయం కార్యక్రమ వేదికకు చేరారు. అధిక సంఖ్యలో భక్తులు పాల్గొన్నారు. మనిషి తమ సమయాన్ని ఎలా సద్వినియోగ పరుచుకోవాలో వివరిస్తూ శ్రీరామ కళ్యాణగుణములపై చక్కటి ప్రవచనం చేశారు.

ఈ కార్యక్రమాన్ని గజపతినగరం శ్రీరామభక్త తరంగిణి కన్వీనర్ శ్రీమతి శివ్వా రమాదేవి, డా. సూర్య నారాయణ మూర్తి, శ్రీమతి రమ, రూప, శ్రీమాన్ ఈశ్వరరావు, శ్రీమాన్ రామారావు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. జిన్నాం శ్రీరంగనాధుని ఆలయంలో పెరుమాళ్ళను సేవించుకుని ఆలయ అర్చకులకు మంగళాశాసనం చేశారు.

10వ తేదీ రామానుజ కూటంలో భీష్మ ఏకాదశి సందర్భంగా శ్రీవిష్ణు సహస్రనామ విరాట్ పారాయణ జరిగింది. అన్ని ప్రాంతాల నుండి అధికసంఖ్యలో భక్తులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ప్రతీ వంద నామాలకు నివేదనలు సమర్పించి రామానుజులవారి సన్నిధిలో మంగళ నీరాజనాలు సమర్పించారు. శ్రీమతి కరి తిరువేంగళమ్మ గారు, సింహాచలం నుండి వచ్చిన ఎస్.టి.పి. గోపాలా చార్యులవారు శ్రీ విష్ణుసహస్రనామ వైభవాన్ని వివరించారు. శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు, శ్రీశ్రీశ్రీ స్వామివారి పాదపూజ భక్తులచే నిర్వహింపజేసి సంప్రదాయ గోవింద నామాల సి.డి.ని ఆవిష్కరించారు. సి.డి.ల ద్వారా వచ్చే ద్రవ్యాన్ని భగవద్రామానుజ నిధికి సమర్పిస్తున్నారు. కార్యక్రమాన్ని రామానుజ కూటంలో నిర్వహించిన కమిటీ వారికి, కార్యకర్తలకు మంగళాశాసనములు చేసి మాడుగుల బయలుదేరారు. విజయనగరం వికాసతరంగిణి కార్యకర్తలు, సభ్యులు కార్యక్రమాలను నిర్వహించారు.

## శ్రీకాకుళం జిల్లా - రాజాం



శ్రీమద్రామాయణం మానవతా విలువలని తెలియ జేసే ఒక గొప్ప గ్రంథం. ఈనాటి విద్యార్థులందరికి శ్రీమద్రా మాయణ వైభవాన్ని వివరించేందుకు రాజాం వికాసతరంగిణి ప్రతి సంవత్సరం రామాయణంలో ఒక్కొక్క విషయంపై చిత్రలేఖన పోటీలు నిర్వహించారు. ఒరిస్సా పద్ధతిలో శ్రీరామా యణ కథలను వివరించే చిత్రాలను శ్రీ స్వామివారు శంషా బాద్‌లో అందజేసారు. ఈ సంవత్సరం రాజాంలో చిత్ర లేఖన పోటీలు నిర్వహించారు. విశేషమైన స్పందన లభించింది. 50 పాఠశాలల నుండి 231 మంది విద్యార్థులు పాల్గొన్నారు. ఈ సంవత్సరం "చిత్రలేఖన అంశం" వాల్మీకి మహాముని భరద్వాజుడనే శిష్యునితో తమసా నదికి సంధ్యావందన నిమిత్తం బయలుదేరగా మార్గమధ్యంలో బోయవాడు ప్రేమ పూర్వక క్రౌంచ పక్షుల జంటలో మగ పక్షిని నేలకూల్చుతాడు. ఈ దృశ్యం చూసిన వాల్మీకి నోటి నుండి బాధలో అప్రయత్నంగా 'మానిషాద' అనే శ్లోకం వచ్చింది. ఇదే రామాయణ ఆరంభ శ్లోకం అయ్యింది.వాల్మీకి,భరద్వాజుడు క్రౌంచ పక్షులు,బోయవాడు అటవీ ప్రాంతం ఈ చిత్ర లేఖనంలో అంశాలు. విద్యార్థులు అద్భుతంగా చిత్రీకరిం చారు. గెలుపొందిన వారికి ప్రథమ, ద్వితీయ, ప్రోత్సాహక బహుమతులు అందజేసారు. ఈ కార్యక్రమాలకు టి.టి.వి. రమణమూర్తి (బుస్కీ మాస్టారు), కొత్తా రమేష్ కుమార్, డి. లీలావతి, ఎస్. శ్రీనివాసాచార్యులు నిర్వహించారు. శ్రీరామాయణంలో వివిధ అంశాలపై విద్యార్థులకు అవగాహన కల్గిస్తున్న విధానాన్ని ఉపాధ్యా యులు, తల్లి దండ్రులు అభినందించారు. వాల్మీకికి కల్గిన శోకాన్ని వివరిస్తూ జీవహింస చేయరాదనే విషయాన్ని విద్యా ర్థులకు చెప్తూ 'మాధవ సేవగా సర్వ ప్రాణి సేవ' లక్ష్యంగా వికాసతరంగిణి అందిస్తున్న సేవలు గూర్చి అందరికీ తెలియజేసారు.

## అవగాహన సదస్సు - శ్రీకాకుళం

శ్రీమతి మాధవి రవీంద్రగారు శ్రీకాకుళం జిల్లాలో మహిళా ఆరోగ్య వికాస్ కార్యకర్తలకు విఐఎ పరీక్షల గూర్చి శిక్షణ నిచ్చారు. శ్రీకాకుళంలో డా. బి.ఆర్. అంబేద్కర్ యూనివర్సిటీ ఫేకల్టీ శ్రీమతి లలితగారు స్థానిక అంబేద్కర్ యూనివర్సిటీ సెమినార్ హాలులో శిక్షణ శిబిరాన్ని ఏర్పాటు చేసారు. శ్రీమతి మాధవీ రవీంద్ర యూనివర్సిటీ విద్యార్థులకు కేన్సర్ పై అవగాహన కల్గించారు. 200 మంది ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.



విద్యార్థినులు, మహిళా సిబ్బంది ఎంతో శ్రద్ధగా ఈ శిక్షణలో అన్ని విషయాలు అడిగి తెలుసుకున్నారు. యూనివర్సిటీ డైరెక్టర్ శ్రీ పి. చంద్రయ్యగారు మాట్లాడుతూ 'ప్రత్యేకంగా మహిళలకు అవగాహన కల్గిస్తూ ఒక సేవా సంస్థ శిక్షణనివ్వడం మా యూనివర్సిటీలో ఇదే ప్రథమం. వికాసతరంగిణి మహిళలకు శిక్షణనిస్తూ అన్ని ప్రాంతాలలో కేన్సర్‌పై అవగాహన కల్గించడం మాకు చాలా ఆనందంగా ఉంది. శ్రీమతి మాధవీ రవీంద్రగారు విజయవాడ నుండి శ్రీకాకుళం జిల్లా విచ్చేసి ఈ చుట్టుప్రక్కల ప్రాంతాలలో శిక్షణ నిస్తున్న ఆమె కృషిని అభినందిస్తున్నాం" అంటూ తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. మహిళా పాలిటెక్నిక్ కళాశాలలో శ్రీమతి ఉషశ్రీ గారు (ఆరోగ్యవికాస్ శ్రీకాకుళం కన్వీనర్) అవగాహన సదస్సు ఏర్పాటు చేశారు. మాధవి గారు ఉదయం అవగాహన కల్గించి మధ్యాహ్నం మహిళా కార్యకర్తలకు వివిఎ పరీక్ష ఎలా నిర్వహించాలో చూపించారు. శ్యామల, శ్రీమతి సునీత, మధుసూధనరావు, రామారావు మొదలైన కార్యకర్తలు పాల్గొన్నారు.

టెక్కలి ఆదిత్య కళ్యాణ మండపంలో వేమనగారు మహిళా కార్యకర్తలకు సదస్సు ఏర్పాటుచేసారు. 100 మంది కార్యకర్తలకు మాధవిగారు శిక్షణ నిచ్చారు.

పలాసలో శ్రీమాన్ బాలాజీగారు 100 మంది మహిళలకు అవగాహన సదస్సు ఏర్పాటు చేశారు. మహిళలు కేన్సర్ రాకుండా తీసుకోవల్సిన జాగ్రత్తలు గూర్చి శ్రీమతి మాధవీరవీంద్రగారు తెలియజేసారు.

**రొట్టవలస :**

శ్రీమాన్ వెంకటరమణమూర్తిగారు ప్రతీ మూడవ ఆదివారం సత్సంగంతోపాటు రొట్టవలస ఆశ్రమంలో ఉచిత ఆరోగ్య శిబిరం నిర్వహిస్తున్నారు. 100 మందికి వైద్య పరీక్షలు నిర్వహించి అవసరమైనవారికి ఉచితంగా మందులు అందజేసారు.

**వికాసతరంగిణి - సత్సంగము**

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయరుస్వామివారి మంగళాశాసనములతో వికాసతరంగిణి కార్యకర్తలు అనేక ప్రాంతాలలో సత్సంగ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. 'సత్సంగము'లో పాల్గొన్నవారంతా భజనలు, స్తోత్రాలు, పారాయణలు చేస్తుంటారు. మనమంతా వేద భూమిపై పుట్టాము. మన దైనందిన జీవితంలో ఎలా నడుచుకుంటే మనకు వ్యక్తిత్వ వికాసం, శాంతి సౌఖ్యములు కలుగుతాయో తెలియజేసే ఆసక్తికరమైన విషయాలు శ్రీరామాయణం, భాగవతం, భగవద్గీత మొదలైన గ్రంథాలలో మన పూర్వులు చక్కగా తెలియజేసారు. వాటిని మన సత్సంగములో చదవాలి. కేవలం చదవడం కాదు. చర్చించుకోవాలి. అర్థం చేసుకోవాలి. ఆచరించాలి. అందరికి తెలియజేయగలగాలి. ప్రతివారం మనం సత్సంగము నిర్వహించుకోవడానికి "విషయాన్ని' కూడా స్వామివారే అందజేస్తున్నారు. www.chinnajeayar.org అనే వెబ్‌సైట్‌లో "Satsung" లో మనం తెలుసుకోవలసిన విషయాన్ని అందించారు. ఈనెల 'శ్రీమద్భగవద్గీత - సాత్వికాహారం' గూర్చి వివరించారు. సత్సంగంలో ఈ విషయం చర్చించుకొని, భగద్గీత - 3,6, 15, 17 అధ్యాయాలలో శ్లోకాలు ఆహారం గురించి ఏమి చెప్పారో తెలుసుకుందాం -

ప్రతి ప్రాంతం **సత్సంగం** ఏర్పాటు చేసుకోవాలి. వారములో ఏదైనా ఒక రోజు అందరికీ అనుకూలమైన ఒక గంట సమయంలో ఈ క్రింది విధముగా నిర్వహించాలి.

**ఒక గంట ఏవి ఎలా జరపాలి :**

| | |
|---|---|
| **మొదటి ఐదు నిమిషాలు** | : ప్రార్థన (పూర్ణమిదం, ఈశావాస్యం); భగవన్నామస్మరణ (జై శ్రీమన్నారాయణ శ్రీరామ జయరామ, జయజయ రామ); ధ్యానం |
| **10 నిమిషాలు** | : శ్లోకాలు, తప్పులు లేకుండా పఠించడం. |
| **30 నిమిషాలు** | : **సత్సంగవిషయం**(శ్రీస్వామివారు అనుగ్రహించినది). |
| **10 నిమిషాలు** | : చదివిన విషయాన్ని చర్చించుకొని తెలియని విషయాన్ని గుర్తించి పెద్దల ద్వారా తెలుసుకోవాలి. తరువాత సత్సంగం గూర్చి చెప్పాలి. |
| **చివరి 5 నిమిషాలు** | : ధ్యానం, భగవన్నామం - ప్రార్థన. |

ఈ విధంగా వారానికి ఒక రోజు సత్సంగం నిర్వ హించుకొని మన సంస్కృతి సంప్రదాయాలను తెలుసుకొని ఆచరిద్దాం. పిల్లలు, యువత, పురుషులు, స్త్రీలు ఇంట్లో అందరినీ ఆహ్వానిద్దాం."ఆధ్యాత్మిక - నైతిక విలువలను పెంచే సత్సంగం" మన జీవితంలో ఒక భాగమని గుర్తిద్దాం.

**శ్రీశ్రీశ్రీ స్వామివారు వెబ్‌సైట్‌లో అనుగ్రహించిన ఆంగ్ల వ్యాసము తెలుగు అనువాదం :**

భగవద్గీత అనేది కృష్ణ భగవానుడు విషాదంలో మునిగి ఉన్న అర్జునుడి ద్వారా మనకి అందించిన దివ్య సందేశం. అర్జునుడు శోక సముద్రంలో మునిగి తేలుతూ, ఎంతో సందిగ్ధావస్థలో పడి యుద్ధభూమిలో తన కర్తవ్యం ఏమిటో ఎటూ తేల్చుకోలేక పోతాడు. తనకు ఎన్నో విధాలుగా బంధుత్వం కలిగి కూడా శత్రువులుగా మారిన వారితో యుద్ధం చేయాలా, వద్దా! ' అని ఆలోచిస్తు ఉంటాడు. అలా ఆలోచిస్తున్న అర్జునుణ్ణి ఈ సంక్లిష్ట పరిస్థితుల నుండి తక్షణ కర్తవ్యంవైపు కార్యోన్ముఖుణ్ణి చేయడమనే మిషతో ఏవత్ మానవాళికి అవసరమైన ఎంతో శక్తివంతమైన సందేశాన్ని కృష్ణభగవానుడు అందించారు.

ఈ భగవద్గీత ప్రతి ఒక్కరికి జీవితంలో ఎదురయ్యే సమస్యలకు పరిష్కారంగా, మనస్సుకి, బుద్ధికి మధ్య జరిగే సంఘర్షణకి సమాధానాలు అందిస్తూ ప్రతి వ్యక్తి వారి వారి బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించడానికి ఉపయుక్తంగా ఉంటుంది.

ప్రపంచ వ్యాప్తంగా ఎందరో మహనుభావులు భగవద్గీత గురించి వారి అమూల్యమైన అభిప్రాయాలను వ్యక్తీకరించారు. జాతిపిత మహాత్మాగాంధీ 'భగవద్గీత' గూర్చి మాట్లాడుతూ సందేహాలు నన్ను చుట్టిముట్టినప్పుడు, అనంతృప్తి ఛాయలు ముఖంలో అలుముకున్నప్పుడు, కునుచూపు మేరలో ఎటువంటి ఆశా కిరణం కనబడనప్పుడు నేను వెంటనే భగవద్గీతనే ఆశ్రయిస్తాను. అందులో నాకు ఒకటి కాదు రెండు కాదు అనేక విధములైన సమాధానాలు లభిస్తాయి" అని తెలియజేసారు.

భగవద్గీత అనేది ఒక్క తత్త్వవేత్తల కోసమో, వయోవృద్ధుల కోసం మాత్రమే కాదు. ఇది ప్రతి ఒక్కరికి ఉపయోగపడే సాధన. పరిష్కాలతో కూడిన గ్రంథం.

ఈ సమాజంలో చిన్న పెద్ద, స్త్రీ, పురుష, ఎవ్వరికైన సరే ఏ కులం వారికైనా సరే బ్రతకడానికి నీరు గాలి ఎంత ముఖ్యమో ఈ భగవద్గీత కూడా అంతే ముఖ్యం. ఈ భగవద్గీత మన సమస్యలకి తగిన పరిష్కారం చూపించడమే కాక, జీవితంలో ఎదురయ్యే ఎన్నో సవాళ్ళను ఎదుర్కొనే శక్తి ఇచ్చి మనం కోరుకున్న గమ్యాన్ని చేరడానికి సహకరిస్తుంది.

సాధారణంగా మనం లక్ష్య సాధనకు యోగ సాధన అవలంబిస్తాం. మన బాధల నుండి ముక్తి పొంది గమ్యాన్ని చేరడమే లక్ష్యంగా పెట్టుకున్నప్పుడు వాటి గురించి మనం అవలంభించే మార్గాలు కూడా సులభంగా అమలుపరిచే విధంగా ఉండాలి. జీవన లక్ష్యాలు వాటిని చేరే మార్గాలు వ్యక్తి వ్యక్తికి మారుతూ ఉంటాయి. లక్ష్యాన్ని చేరుకోడానికి ఎన్నోమార్గాలున్న, ముఖ్యంగా కావలసిన మార్గాన్ని ఎంపిక చేసుకోవడానికి స్పష్టమైన ఆలోచన, దృఢ సంకల్పం, సూచనలను స్వీకరించి వాటిని అమలుపరచడానికి శరీర సామర్థ్యం కావాలి.

ప్రస్తుతం ఈనాటిరోజుల్లో సమాజంలో ఎన్నో అస హనాలు, ఆందోళనలు నిత్య కృత్యాలుగా మారి పోయాయి. మానవ జీవితం ఎన్నో బాధలతో నిండి ఉంది. ఈ అవరోధా లకి, అనర్థాలకి కారణం అస్థిరమైన మానసిక స్థితి. ఈ మానసిక అస్థిరతకు కారణం **మనం తినే ఆహారం**. మన సుని జయించి ప్రశాంతంగా జీవించడానికి కృష్ణ భగవానుడు మనకి భగవద్గీతలో ఎటువంటి పరిష్కారాలు సూచించారో చూద్దాం...

**యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు ।**
**యుక్త స్వప్నా బోధస్య యోగో భవతి దుఃఖహా ॥.**

భగవద్గీత 6వ అధ్యాయం 17వ శ్లోకంలో శ్రీకృష్ణ భగవానుడు 'మితమైన ఆహారము, సముచితమైన ఆహారం మాత్రమే తీసుకోవాలి. మితమైన వినోద, విహారాలు, కార్య క్రమాలు, శరీరంతో చేసే పనులు నియమబద్ధంగా చేయాలి. మాట్లాడే మాట క్రమబద్ధం కావాలి.నిర్ణీత సమయంలో నిద్ర, మెలుకువ కలిగి ఉంటే దుఃఖము పోయి విజయం నిన్ను వరిస్తుంది అని చెప్పాడు.

పైన చెప్పినవన్నీ సవ్యంగా చేయడానికి సరైన ఆహారం తీసుకోవాలి. 17వ అధ్యాయంలో చెప్పిన విధంగా సాత్వికమైన ఆహారం ఒక్కటే మార్గం. మంచి ఆహారం ఎంచుకున్న తర్వాత దాన్ని పరిశుభ్రపరచి తీసుకోవాలి.

ఆహారాన్ని పరిశుభ్రపరిచే విధానాన్ని 3వ అధ్యా యంలో వివరించారు. ఆహారం తయారుచేసేటప్పుడు మంచి ఆలోచనలతో నిండిన మనసు కలిగి ఉండాలి. ఆహారం తయారు అయ్యాక కృష్ణ భగవంతుడికి సమర్పిం చాలి. ఇలా చేయడం వల్ల ఆహారంలో ఉన్న దుష్ట పదార్థములు తొలగిపోయి ఆహారం మహా ప్రసాదంగా (యజ్ఞ ప్రసాదం) మారుతుంది.

15వ అధ్యాయంలో కృష్ణుడు ఆహారం ఎలా తీసుకోవాలో వివరించాడు. భగవంతుడు మనందరి హృదయాలలో 'వైశ్వానరుడుగా ఆశీనుడై ఉన్నాడు. పొట్ట లోనికి పంపబడిన ఆహారాన్ని సక్రమంగా అరిగేలాగ చేసి, శక్తిగామార్చి శరీరంలో ప్రతిభాగానికి సరఫరా చేసి అన్ని భాగాలు సక్రమంగా బలంగా పనిచేయడానికి భగవంతుడు సహకరిస్తాడు.

మనం స్వీకరించే ఆహారం 3 భాగాలుగా మారుతుంది.

1) స్థూల భాగం మలరూపంలో బయటకు విసర్జించ బడుతుంది.
2) మధ్యమ భాగం శరీరంలో మాంసాదులుగా మారు తుంది.
3) సూక్ష్మ రూపం మన మనస్సును పెంచుతుంది.

ఛాందోగ్యోపనిషత్ ఈ విషయాన్ని క్రింది మంత్రంలో తెలియజేస్తుంది.

**అన్నం అసితమ్ త్రేధా విధీయతే తస్య యస్తువిష్టో ధాతుః**
**తత్ పూరిషమ్ భవతి - యోమధ్యమస్తన్ మాంసమ్ యో**
**అనిష్టః తన్ మహః**

నిర్దేశించబడిన ఆహారం తీసుకోవడం వలన మనం నిరంతర శక్తి పొందడమే కాకుండా సక్రమంగా మాట్లాడడానికి, ఆలోచించడానికి,బాధ్యతలు నిర్వర్తించడానికి ఉపకరిస్తుంది.

శ్రీకృష్ణ భగవానుడు మనకి అందించిన ఈ సందేశం సులభతరమైనది . దీని వెనుక ఎంతో శాస్త్రీయమైన వివరణ ఇమిడి ఉన్నప్పటికీ శ్రీకృష్ణ భగవానుడు మన కోసం సులువుగా అర్థం చేసుకోవడానికి అనుగుణంగా అందిం చాడు. దీని సారాంశాన్ని ఆకళింపు చేసుకొని అమలు పరచడానికి ప్రయత్నం చేద్దాం. ఈ దివ్య సందేశం ఒక మచ్చు తునక మాత్రమే. మన జీవన ప్రమాణంలో అడుగడుగునా ఉపయోగపడే ఎన్నో పరిష్కారాలను శ్రీకృష్ణ భగవానుడు అన్ని వయస్సుల వారికి అందించడం జరిగింది -

సత్సంగంలో పై విషయాలు చర్చించుకుందాం. భగవద్గీతలో వివరించిన **ఆహార నియమాలు**" పాటిద్దాం.

"జై శ్రీమన్నారాయణ"

గమనిక : నూతనంగా 'సత్సంగం' ఏర్పాటు చేసుకొనేవారు మీ సత్సంగ సభ్యుల వివరాలను మీకు దగ్గరలోగల వికాస తరంగిణి శాఖకు తెలియజేయండి.

**వికాసతరంగిణి కార్యకర్తల సమావేశం :**

శ్రీశ్రీశ్రీ స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో విశాఖపట్టణం జిల్లా భీమిలి వారిజ ఆశ్రమంలో జనవరి 25న సాయంత్రం విజయనగరం, శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పుగోదావరి జిల్లాల కార్యకర్తల సమావేశం, సీతానగరం ఆశ్రమంలో గుంటూరు, ప్రకాశం, కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాల కార్యకర్తలతో సమావేశం జరిగింది.

ఈ సమావేశాలలో వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ రమేష్ గుప్తాగారు, ఆర్గనైజింగ్ సెక్రటరీ భవానీ ప్రసాద్‌గారు, శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్ స్వామివారు, శ్రీశ్రీశ్రీ దేవనాథ జీయరు స్వామివారు కార్యకర్తలకు కార్యక్రమ నిర్వహణలో సూచనలను తెలియజేసారు. వికాసతరంగిణి కార్యకర్తలు చేసిన కార్యక్రమ వివరములను అడిగి తెలుసుకున్నారు. రాబోయే సహస్రాబ్ది ఉత్సవాలను గురించి, "సత్సంగం" కొత్త ప్రాంతాలలో ఏర్పాటు చేయడం గురించి, వికాసతరంగిణి సభ్యత్వం గురించి తెలియజేసారు. మహిళా ఆరోగ్యవికాస్ వంటి సేవలలో శిక్షణ అవసరమని తెలియజేసారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు సత్సంగంలో కేవలం పారాయణ మాత్రమే కాకుండా భగవద్గీత, శ్రీరామాయణం, భాగవతం వంటి గ్రంథాలలో ఏదో ఒక విషయాన్ని చదివి అది అందరూ చర్చించుకుని ఇంకా ఏమైనా తెలియని విషయాలుంటే పెద్దలను అడిగి తెలుసుకునే ప్రయత్నం చేయమని చెప్పారు. భగవద్రామా నుజ సహస్రాబ్దినాటికి రామానుజ వైభవం మనని తెలుసుకుని అందరికీ తెలియజేయమని ఆదేశించారు. వికాసతరంగిణి కార్యక్రమాలలో పాల్గొన్న కార్యకర్తలందరికీ శ్రీశ్రీశ్రీ స్వామివారు మంగళాశాసనములను కృప చేశారు.



భగవద్రామానుజుల వారు అవతరించి 2016కి వెయ్యి సంవత్సరములు పూర్తి అవుతుంది. సహస్రాబ్ది మహోత్సవాల నాటికి రామానుజులవారిని స్మరిస్తూ స్తోత్రాలను నేర్చుకొనే ప్రయత్నం చేద్దాం. ఈ నెలలో నాలుగు వారములు మౌక్తికములు నేర్చుకొని పారాయణ చేద్దాం!

**"కాషాయ శోభి కమనీయ శిఖానివేశం"**

అనే ఈ శ్లోకములు శ్రీపతి స్తుతిమాల పుస్తకములో 227వ పేజీలో కలవు.

## కార్యకర్తలకు సూచన

మీ వికాసతరంగిణీ శాఖ ద్వారా చేసే ఆధ్యాత్మిక, సామాజిక, సేవా కార్యక్రమాలను అందరితో పంచుకోవాలనుకుంటున్నారా! కార్యక్రమ వివరాలను సంక్షిప్తంగా వ్రాసి, కార్యక్రమ ఫొటోలను జతపరచి ప్రతినెల 10వ తేదీలోపు news@vtsbharath.org కి మెయిల్ చేయండి.. సెల్ నెంబరు: 9440106555

జై శ్రీమన్నారాయణ!

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః

67 సం॥ల నుండి భగవద్బంధువులు ఆదరిస్తున్న ... ఆధ్యాత్మిక మాసపత్రిక

# భక్తినివేదన








సంపుటి 67

ఏప్రిల్ 2014
శ్రీ జయనామ సంవత్సర చైత్రమాసము

సంచిక 1


## పంచాంగ వివరములు

**మార్చి**

28. అవమతిథి;
30. పిండపితృయజ్ఞము, అమావాస్య;
31. **శ్రీ జయనామ సం॥ర ఉగాది;**
    పెరియపెరుమాళ్‌తిరు॥

**ఏప్రియల్**

2. ఉత్తమ మన్వాది
4. లక్ష్మీపంచమి, మత్స్యజయంతి నంబెరుమాళ్‌తిరు
8. సర్వేషాం శ్రీరామనవమి, భద్రాచలాది శ్రీవైష్ణవ క్షేత్రములయందు శ్రీ సీతారామ కళ్యాణోత్సవము
9. శెల్వపిళ్ళై తిరునక్షత్రం,
11. సర్వేషామేకాదశి
12. వామనద్వాదశి, అనంగ త్రయోదశి
13. శ్రీరంగనాచ్చియార్‌తిరు
14. మేషసంక్రమణము ఉ.9-1,
    అశ్వినికార్తె తమిళవత్సరాది;
15. హనుమద్విజయోత్సవము;
25. సర్వేషామేకాదశి
26. తిథిద్వయం
27. భరణికార్తె, చతుర్దశితిథి, మాసశివరాత్రి
28. పిండపితృయజ్ఞము
29. అమావాస్య.


వ్యవస్థాపకులు
పరమహంస పరివ్రాజకాచార్య
**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు
శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి
శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. **రంగరామానుజాచార్యులు**

ఉప సంపాదకులు
శ్రీమతి డా॥ T.K. **చూడామణి**

**చందావివరాలు :-**
సంవత్సరచందా రూ.225/-
విదేశాలకు సంవత్సరచందా $30/-

మీా సేవలో....
భక్తినివేదన, సీతానగరం - 522 501,
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

D.T.P. & Design by :
పరిశోధనాలయమ్

E-mail : **jetsitanagaram@yahoo.com**
Internet : www.chinnajeeyar.org


## విషయసూచికా




| | | |
|---|---|---|
| *Printed & Published by* | : | H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** |
| *Printed & Published at* | : | **Srijman Printers & processors** : C/o JET, Sitanagaram - 522 501, Guntur Dist., Andhra Pradesh. |
| *Editor* | : | Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh. |

**Sriman Printers & Processors**

# శ్రీ జయనామ సంవత్సర ఉగాది సందేశం

SRIMANNARAYANA RAMANUJA YATHIBHYO NAMAHA

Tridandi Chinna Srimannarayana
Ramanuja Jeeyar Swamy

JEEYAR EDUCATIONAL TRUST
SITANAGARAM - 522 501
GUNTUR DISTRICT. A.P.
© (08645) 272929, 272353

శ్రీమద్భగవద్బంధువుల్లార!
శ్రీవైష్ణవసాంప్రదాయబంధువులార!
అనేకమంగళాశాసనములు!

Dt. :

శ్రీ జయనామ సంవత్సరానికి స్వాగతం! చాంద్రమాన సంవత్సరాదికి స్వాగతం. పండుగలన్నింటినీ వెంటపెట్టుకు వచ్చే తెలుగువారి పెద్ద పండుగకి స్వాగతం. పేరుకు విజయమైనా విచారాన్ని, ఎంతో విషాదాన్ని విందుచేసి పోతున్న పాత సంవత్సరానికి వీడ్కోలు. వికారాన్ని విడిచిపెట్టి వస్తోందిక నూతన వినోదాన్ని, విలాసాన్ని కూడా తీసుకొని వస్తుందనుకున్న 'జయ' "అంత సుఖంగా ఏమాత్రం వెళ్ళబోదని తెలుసు.

మొదటి పండుగ ఉగాదినే, ఉత్తమపురుషుడైన మన శ్రీరామచంద్రుడి పుట్టిన రోజును ఉత్సవంగా జరుపుకునే స్థితి లేకుండా చేసింది. సమాజ ఉద్యమానికి 4, 5 శతాబ్దాల చరిత్ర కలగా ముందు పెట్టింది. విద్యార్థులు కాని కొంత కూడా పెద్దవాళ్ళుగా ప్రకృతిని పెట్టుకొన్నారు. దీని ప్రభావం వల్ల సమాజమంతా చిన్న, పెద్ద తేడా లేకుండా ఇబ్బందిని ఉద్యోగ, వ్యాపారాలు కోల్పోయి అల్లాడిపోయారు. ఇదొక పెద్ద దెబ్బ. దీనిలోంచి ఎవ్వరూ బయటపడలేరు. తాత్విక వర్గాలూ, వైదిక వర్గాలూ ఇబ్బందులను ఎదుర్కోక తప్పదు. కొంత సమయాన్ని సవరించుకొని వీటిని సహనంగా ఓర్చే అవకాశమున్నా దాన్ని గమనించకుండా ప్రవర్తించే పాలకులకి జయనామ సంవత్సరం తగిన పాఠం చెప్పాలి.

కాలానికి కళ్ళు, కాళ్ళు ఉండవు. చెవులు, నోరూ ఉండదు. కానీ అన్నీ గమనిస్తుంది. ఎవరి మెప్పూ, ఒప్పుదలా దానికవసరం లేదు. ఎవ్వరి సహాయమూ, సలహాలూ అవసరం లేదు. అందుకే అది నిష్పక్షపాతంగా రావలసిన సమయంలో సాక్షాత్కరిస్తుంది. మార్పు, తీర్పు దానికుండాలి.

→ →

సంపాదకీయం

# ఆధ్యాత్మిక జీవనం-సామాజికస్పృహ



**శ్రీజయో విజయం దద్యాత్, సర్వసంపత్సమృద్ధిభిః।**
**నవాబ్దరూపో భగవాన్ దివ్యసాకేతగోఽవతాత్ ॥**

భక్తినివేదన పాఠకులకు, ఆధ్యాత్మిక సామాజిక జీవనాలను చక్కగా సమన్వయించుకుని అర్థవంతమైన జీవనాన్ని గడుపుతున్న మంచిమనస్సు కలవారందరికీ **శ్రీజయనామ సంవత్సర శుభకామన** లందిస్తున్నాం.

మానవజీవితం ఒక ప్రవహించే మహానదిలాంటిది. ఏ నదికైనా రెండుగట్లు ఉంటాయి. ఆ రెండు గట్లూ దృఢంగా ఉన్నప్పుడు వాటిమధ్య ప్రవహించే నది క్రమంగా అవికలంగా ముందుకుసాగి తన ప్రయాణ మార్గంలోని రెండువైపుల ఉన్న ప్రదేశాల అవసరాలను తీరుస్తూ తన లక్ష్యమైన సముద్రాన్ని చేరగలుగుతుంది. అలాకాక ఒకగట్టు దృఢంగా ఉండి, రెండవది దృఢంగా లేకపోతే ఆ నది, ఉపద్రవ కారణమై తీరప్రాంతాలకు వినాశనాన్ని కలుగజేస్తుంది, లేదా నిరుపయోగ మవుతుంది. మానవజీవనమూ అంతే. దీనికి ఆధ్యాత్మిక జీవనము, సామాజిక జీవనము అనేవి రెండు గట్లుగా ఉంటాయి. కొందరు సామాజిక స్పృహలేని, అంటే సమాజంతో ఎంతమాత్రమూ సంబంధంలేని, కేవలం వ్యక్తిగతమైన ఆధ్యాత్మిక జీవనాన్ని గడుపుతూ ఉంటారు. అంటే, వైయక్తికంగా దేవతారాధనాలు జరుపుకోవడం, మంత్రానుష్ఠానం చేసుకోవడం, తాత్త్వికగ్రంథాలు అధ్యయనం చేయడం, తాము మాత్రమే అనుసంధానం చేయడం లేదా ఎక్కడో సమాజానికి దూరంగా కొండల్లో అడవుల్లో ముక్కుమూసుకుని ఏకాంతజీవనం గడపడం ఇలాంటివి చేస్తూ ఉంటారు. జీవన ప్రమాణం నాలుగు ఆశ్రమాలుగా విభజింపబడిన క్రమంలో, పూర్తిగా చిట్టచివరిదశలో ఇలా ఏకాంతజీవనం ఉపయోగపడేదే అయినా, శరీరంలో జవసత్త్వాలు ఉన్నంతవరకు సమాజానికి దూరంగా బ్రతకడం కష్టమే కాక, అపేక్షితంకూడా కాదు. కనుకనే సామాజిక జీవనంతో ముడివడిన ఆధ్యాత్మిక జీవనాన్నే సమగ్ర విధానంగా మనకు శాస్త్రాలు, పురాణాలు బోధించాయి. వేద రహస్యంకూడా ఇదే. అభ్యుదయ, నిఃశ్రేయస పదాలచే ఈరెండురకాల జీవన విధానాలను సమన్వయించి వేదం చూపింది. ఇక సామాజిక జీవనం ప్రధానంగా గడుపుతూ తాత్త్వికచింతన ఎంతమాత్రం లేనివారు సమాజంలో ఎందరో ఉండవచ్చు. ఇదికూడా ఒక గట్టును మాత్రమే దృఢపరచుకుని రెండవ గట్టును పూర్తిగా విస్మరించడమే అవుతుంది. తాత్త్విక చింతనలేని కేవల సామాజిక జీవనంకూడా క్రమక్రమంగా యాంత్రికమై నీరసం అవుతుంది. కనుక సామాజిక వేత్తలైనవారు, సామాజిక జీవనౌన్నత్యాన్ని సాధించగోరినవారు తప్పకుండా ఏదోఒకదశలో ప్రారంభించి, తాత్త్వికచింతన చేసి ఆధ్యాత్మిక జీవనాన్నికూడా పరిపుష్టం చేసుకోవాలి. తత్త్వజ్ఞానం లేకపోయినా, సమాజసేవయే పరమార్థం, సమాజమే ప్రత్యక్షదైవం అని భావించడం తప్పుకాకపోయినా, సమగ్రావగాహన మాత్రం కాదు. తత్త్వచింతన ముఖంగా ఈ అవగాహన దృఢపడ్డప్పుడు మాత్రమే ఇది పరిపూర్ణం, జీవనసాఫల్య సాధకం అవుతుంది. తాత్త్వికచింతన లేని కేవల సామాజిక జీవనాన్ని ఉపనిషత్తులు నిందించాయి. కఠోపనిషత్తు ఇలా అంటుంది.

**అన్యచ్ఛ్రేయో అన్యదుతైవ ప్రేయః తే ఉభే నానార్థే పురుషగ్ం సినీతః।**
**తయోఃశ్రేయ ఆదదానస్య సాధుర్భవతి, హీయతేఽర్థాత్ యఉ ప్రేయోవృణీతే॥**
**శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్య మేతః, తౌ సంపరీత్య వివినక్తి ధీరః।**
**శ్రేయో హి ధీరో అభిప్రేయసో వృణీతే, ప్రేయోమందో యోగక్షేమాత్ వృణీతే॥**

ఉపనిషత్తు, పరమాత్మానుభవరూపమైన మోక్షం లక్ష్యంగా కల ఆధ్యాత్మిక జీవనాన్ని శ్రేయస్సుగాను, లోకికంగా సాగే తన కుటుంబంతో ప్రారంభమైన సామాజిక జీవనాన్ని ప్రేయస్సుగాను పేర్కొన్నది. ఈరెండు మనిషిని తనవైపు ఆకర్షించే ప్రయత్నం చేస్తాయి. వీటిలో శ్రేయోమార్గాన్ని ఎంచుకున్నవాడికి మంచి జరుగుతుంది. ప్రేయోమార్గాన్ని ఎంచుకున్నవాడికి పరమార్థం దూరమవుతుంది. కనుక మనిషి తన ముందున్న శ్రేయః ప్రేయో మార్గాలను రెంటినీ తరతమబుద్ధితో పర్యాలోచన చేసి, ధీరుడైనవాడు ప్రేయోమార్గంకంటే శ్రేయోమార్గాన్నే వరిస్తాడు. ఇక ఈలోకంలో మాత్రమే యోగక్షేమాలు, సామాజికోన్నతి మాత్రమే కోరి ప్రేయోమార్గాన్ని ఎంచుకున్నవాడు మందుడంటుంది ఉపనిషత్తు. ఇక్కడ శ్రేయోమార్గాన్నే పరమార్థంగా చూపించడం ఉపనిషత్తుకు ప్రతిపాద్యాంశమైనా, సామాజిక జీవనాన్ని పూర్తిగా నిరసించటం దాని అభిప్రాయం కాదు. నేల విడచిన సాము ఉండదుకదా! శ్రేయస్సును విడచిన కేవల ప్రేయస్సు, పూర్ణప్రయోజనవంతమూ, పరమార్థమూ, జీవన చరమావధి కాదని మాత్రమే చెప్పటం అభిప్రాయం.

ఉపనిషత్తులను పర్యాలోచన చేసి తమజీవన విధానంలో అన్వయించుకున్న మన పూర్వాచార్యులు శంకర– రామానుజ– మధ్వాదులు తమ ఆధ్యాత్మిక జీవనంలో సామాజిక స్పృహను మేళవించుకుని, సమాజోన్నతిని కాంక్షిస్తూనే తమతోపాటు దాన్ని పరమార్థమైన జీవనపు చివరిలక్ష్యాన్ని చేర్చేందుకు కృషిచేసారు. శాంకర సంప్రదాయానికి చెందిన కంచి పరమాచార్యులు శృంగేరి పీఠాచార్యులు అలాగే మధ్వపీఠానికిచెందిన ఆచార్యులు అలాగే చైతన్య రామానంద స్వామినారాయణ సంప్రదాయాలకు చెందినవారు, రామకృష్ణమిషన్‌కు చెందినవారు ఇలా ఎందరో రెండు మార్గాలను అర్థవంతంగా సమన్వయించుకున్నవారే. ఆధ్యాత్మిక జీవనం

ప్రధానంగా చేసికొని సామాజిక జీవనాన్ని దానితో అందంగా మేళవించుకున్నవారే. సమాజం, కేవల సామాజికవేత్తలకంటే తత్త్వచింతన కలిగి సమాజ నారాయణసేవ చేసేవారిని మరింతగా విశ్వసించి అక్కున చేర్చుకుంటున్నది. ఇది కఠోర సత్యం.

మన పెద్దజీయర్ స్వామివారు, వారి మార్గాన్ననుసరించిన చిన్నజీయర్ స్వామివారు, శ్రేయఃప్రేయో మార్గాలను రెంటినీ చక్కగా సమన్వయించుకుని ముందుకుసాగిన మహనీయులు. ఇలాగే మన ఇతర జీయర్‌ల, తత్త్వప్రచారకుల, జీవనవిధానాన్నికూడా మనం గమనించాలి, అనుసరించాలి.

రాబోయే నూతనసంవత్సరంలో ఆధ్యాత్మికతను కలబోసుకుని మన సామాజిక జీవనం అవికలంగా సాగాలని ఆశిస్తూ భక్తినివేదన పాఠకులకు నూతన సంవత్సర శుభకామనలను అందిస్తున్నది భక్తినివేదన.

ప్రాత సంవత్సరం గడచిపోయింది. మనకిష్టమైనా, ఇష్టం కాకపోయినా, నిరంకుశమైన తన ధోరణిలో ఎన్నో సాంఘిక, ఆర్థిక భౌతిక పరిణామాలను మనపైకి నెట్టి వెళ్ళిపోయింది. రాబోయే శ్రీజయనామ సంవత్సరం గడచిన సంవత్సరం కంటే మరింత మంచిని మనకు కలుగజేస్తుందని ఆశించుదాం. ఏ పరిణామమైనా సంవత్సరకాలగతిలో వచ్చిన దానిని స్వాగతించి, తదనుగుణంగా ప్రవర్తించే మనఃప్రవృత్తిని అలవరచుకుందాం. మనం సుఖంగా బ్రతుకుతూ మనచుట్టూఉన్న సమాజాన్ని బ్రతకనిస్తూ తాత్త్విక జీవనాన్ని విడిచిపెట్టకుండా ముందుకు సాగుదాం. భగవంతునికి ఈజగత్తంతా శరీరమని, దాన్ని భగవద్విభూతిగా చూడమని ప్రతిబోధించిన భగవద్రామానుజుల దివ్యసందేశాన్ని నిరంతరం మననం చేద్దాం. నూతన సంవత్సరం మనందరికీ శుభబుద్ధిని, సర్వవిధ సంపత్సమృద్ధిని కలుగజేయాలని శ్రియఃపతిని, మన పూర్వాచార్యులను, మనకు మార్గదర్శకులైన ప్రస్తుతాచార్యులను ప్రార్థిస్తూ అనేక శుభకామనలందిస్తున్నాం.

*- వేంకట రంగరామానుజాచార్యులు*





జై శ్రీమన్నారాయణ



పరమహంస పరివ్రాజకులు
శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జియరుస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో...

నిత్యకార్యక్రమ వివరములు
తేది. 31.03.2014 నుండి 08.04.2014 వరకు
ఉ॥ : 7.00 గం॥లనుండి ప్రాతరారాధన సేవాకాలం, తీర్థగోష్ఠి, శ్రీరామాయణపారాయణ, నివేదన తదీయారాధన.
సా॥ : 6.00 గం॥నుండి శ్రీవిష్ణుసహస్రనామపారాయణ, శ్రీరామాయణప్రవచనం

విశేష కార్యక్రమవివరములు

| తేది | ఉదయం | సాయంకాలము |
|---|---|---|
| మార్చి | | |
| 31 | అంకురార్పణం,ధ్వజారోహణం, అగ్నిప్రతిష్ఠ, శ్రీరామాయణపారాయణప్రారంభం, శ్రీరామజననం | దేవతాహ్వానమ్ |
| ఏప్రిల్ | | |
| 1 | శ్రీరామాయణ పారాయణము | |
| 2 | శ్రీరామాయణ పారాయణము, పాదుకాపట్టాభిషేకం, | శ్రీరామపూజ |
| 3 | సమాశ్రయణములు | |
| 4 | శ్రీరామాయణ పారాయణము | శ్రీలక్ష్మీనారాయణపూజ |
| 5 | శ్రీరామాయణ పారాయణము | శ్రీవేంకటేశ పూజ |
| 6 | శ్రీరామాయణ పారాయణము, అంగుళీప్రదానము | |
| 7 | శ్రీరామాయణ పారాయణము | |
| 8 | శ్రీసీతారామకళ్యాణం, మహాపూర్ణాహుతి | దేవతోద్వాసనమ్ |
| 9 | మహాసామ్రాజ్యపట్టాభిషేకము | |

భగవద్బంధువులందరికీ మా హార్దిక స్వాగతాంజలి!

వివరములకు: 8985821379, 92472 69348, 92999 97333, 96034 23427

ఇట్లు
శ్రీకోదండరామాలయ కమిటీ
అంపాపుర గ్రామస్థులు



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*(గత సంచిక తరువాయి)*

ధృతరాష్ట్రుని వ్యాజంగా చేసికొని, వృద్ధతాదశలో ఉన్న ఎవని కైనా ఈ ఉపదేశం అందేలా విదురుడు మాటాడుతున్నాడు.

**అంధః పురైవ, బధిరో, మందప్రజ్ఞశ్చ సాంప్రతమ్ ।**
**విశీర్ణదంతో, మందాగ్ని స్సరోగః కఫముద్వహన్ ॥**
**అహో! మహీయసీజంతోర్జీవితాశా, యయాభ వాన్ ।**
**భీమాపవర్జితం పిండమాదత్తే గృహపాలవత్ ॥**

వెనుకనే గ్రుడ్డివాడివి, చెవిటివి, ఇప్పుడు మందబుద్ధివి, దంతాలు రాలిన వాడివి అగ్నిమాంద్యం నిన్ను బాధిస్తున్నది. రోగగ్రస్తుడవై కఫంతో బాధపడుతున్నావు. ఆహా! పుట్టుక కల ఏప్రాణికైనా జీవితాశ (బ్రతకాలనే కోరిక) చాలా గొప్పది. ఆ ఆశ చేతనే నీవు, భీముడు పడవేసిన పిండాన్ని తీసికొంటూ కుక్కలా బ్రతుకుతున్నావు.

**అగ్నిర్నిసృష్టో దత్తశ్చగరో దారాశ్చదూషితాః ।**
**హృతం క్షేత్రం, ధనం యేషాం దద్దత్తైరసుభిః కియత్ ॥**
**తస్యాపి తవదేహోఽయం కృపణస్య జిజీవిషోః ।**
**పరైత్యనిచ్ఛతో జీర్ణో జరయా వాససీ ఇవ ॥**

నిప్పుపెట్టావు, విషమిచ్చావు, వారి ధర్మపత్నిని అపమానించి దోష పరిచావు, వారి రాజ్యాన్ని, ధనాన్ని అపహరించావు. అయినా వారు దయతో ఇచ్చిన ప్రాణాలతో నీచపు బ్రతుకు బ్రతుకుతున్నావు. ఇదెంతపాటి బ్రతుకు? ఇంతటి పరాన్న భోజనం చేత అవమానం చేత నికృష్టమైన జీవితం సాగిస్తున్నప్పటికీ ఇంకా జీవించాలనే కాంక్షించే పరమదీనుడవైన నీ, ఈజరాజీర్ణమైన (ముసలితనంచే క్షీణించిన) శరీరం, చినిగిన బట్టల్లా నీకిష్టం ఉన్నా లేకపోయినా నశించి పోక తప్పదు.

**గత స్వార్థ మిమం దేహం విరక్తో ముక్త బంధనః ।**
**అవిజ్ఞాతగతిః జహ్యాత్ న వై ధీర ఉదాహృతః ॥**

పుణ్యం పురుషార్థం ఎంతమాత్రంలేని ఈ దేహాన్ని వైరాగ్య సంపన్నుడై బంధాన్ని పూర్తిగా విడచి, దీని గతి ఏమిటో తెలియాలనే ఆసక్తిలేనివాడై త్యజించినవాడు ధీరుడని పెద్దలంటారు. (దీనికి ఏస్థితి కలుగనున్నదో అనే విచారణ ఎంతమాత్రం లేకుండా నిరామయంగా విడచిపెట్టగలవాడెవ్వడో వాడే ధీరుడని అభిప్రాయం) అంతేకాదు, తనంత తాను కాని, పరప్రేరణం చేత కాని, ఈలోకంలో నిర్వేదాన్ని పొందినవాడు స్థిరబుద్ధియై హృదయంలో శ్రీహరిని కుదురు కొలిపి గృహంనుండి దూరంగా వెడలిపోవాలి. అలా వెళ్లగలిగిన వాడే 'నరోత్తముడు' (నరులలో శ్రేష్ఠుడు) కాగలడు

**యఃస్వకాత్ పరతో వేహ జాతనిర్వేద ఆత్మవాన్ ।**
**హృది కృత్వా హరిం గేహాత్ ప్రవ్రజేత్ స నరోత్తమః ॥**

అని ఇలా విదురుడు ధృతరాష్ట్రునికి పలువిధాల ప్రతిబోధించాడు.

ఈమాటలు ఈనాటికీ సామాజిక జీవనంలో వివేకులు తమకు కూడా అన్వయించుకొని శేషజీవితాన్ని సద్వినియోగపరచ గలగడం ఎలాగో ప్రతిబోధిస్తున్నాయి. పరాన్న భుక్కులై నిష్ప్రయోజనము, ఇతర నిందనీయము అయిన జీవనాన్ని సాగించరాదని ఈఘట్టకం ప్రతిమానవుని ప్రతిబోధిస్తున్నది.

తాము తమ జీవనంలో సాధింపదగిన జీవన పరమార్థాన్ని సాధించిన తరువాత శరీరంలో జవసత్త్వాలుడిగి పోయిన దశలో పరుల పంచనపడి వారి దయాదాక్షిణ్యాలతో ఇంకా సుదీర్ఘంగా వ్యర్థమైన బ్రతుకును బ్రతికేవారికి, ధృతరాష్ట్రుని చివరిదశలోని దైన్యావస్థ ఒక ప్రత్యక్షమైన గుణపాఠం అవుతుంది. ఈనాటి సమాజంలో వృద్ధుల దైన్యదశను, మనం కన్నులారా చూస్తున్నాం. మనలో చాలా మందిమి ఈ దుర్భరదశను అనుభవిస్తున్నాం కూడా. అయినా బిడ్డలపై ఆధారపడి బ్రతకవలసిన దుర్దశ, చాలా మంది చేజేతులా తెచ్చిపెట్టుకున్నదే. ఎందువల్లనంటే తమ వార్ధకజీవనం ఎలా సాగాలో ముందు చూపు, ఒక నిర్దుష్టమైన నిర్ణయం లేకపోవడం చేత ఎంత బిడ్డలైనా వారిపట్ల చూపవలసిన ఆదరాభిమానాలకు ఉండవలసిన ఎల్లలు, మరచిపోయి, వల్లమాలిన గ్రుడ్డి ప్రీతితో ముందు ముందు జీవితాన్ని గురించి ఆలోచనలేని దశలోనే ఇలాంటి కష్టాలను తెచ్చిపెట్టుకొంటున్నాం మనం. మనమంతా ధృతరాష్ట్రుని వంటి అవివేకులం కాకపోయినా, మనకు మన బిడ్డలకు మధ్య ఉండవలసిన హద్దులు ఎరుగక ప్రవర్తించినందువల్ల కలిగే అనర్థాలను గుర్తింపలేకపోతున్నాం. అన్నీ ఉండీ వృద్ధాశ్రమాల పాలౌతున్నాం. ధృతరాష్ట్రుని దుర్దశ తమ తల్లిదండ్రులకు రానివ్వకుండా బిడ్డలు చూచుకోవడం వారికర్తవ్యం. ఇది విస్మరించి, కేవలం తమ జీవితాన్ని, స్వార్థాన్నే భావించేవారు. దుర్యోధనాదులకంటే ఏమాత్రం తీసిపోరుకదా. కుంతి బిడ్డలచాటున కష్టాలు పంచుకొని బ్రతికింది. స్వేచ్ఛగా విరక్తిచెంది వెళ్ళిపోయింది. ఇది గమనించాలి. ఈసన్నివేశం ఈ సందేశాన్నిస్తోంది.

చివరిగా విదురుడు, ధృతరాష్ట్రుని దేశంవిడచి పొమ్మని బోధించాడు. "ఇక స్వేచ్ఛగా ఉత్తర దిక్కుకు వెళ్లు ఇటు తరువాత కాలమంతా గుణహీనంగానే

సాగుతుంది" (మనిషిలోని గుణాలను లాగిపారవేసేదే అవుతుంది) అన్న విదురుని మాటలు విన్న ధృతరాష్ట్రుడు, వివేకాన్ని పొంది బంధుస్నేహాన్ని విడచి పెట్టి తన సోదరుడైన విదురుడు చూపిన మార్గంలోనే నిష్క్రమించాడు. తన భర్తను పరమపతివ్రత అయిన గాంధారి అనుసరించింది. యుద్ధంలో తగిలిన దెబ్బకూడా శూరులకు ఆనందదాయకమైనట్లు, దండాన్ని విడచిన ప్రభువులకు హిమాలయ గమనం కూడా క్లేశదాయకం గాదు. కేవలం తోషదాయకమే అవుతుంది.

ఇక ధర్మజుడు, తాను పూర్తి చేయవలసిన నిత్యవైదిక కృత్యాన్ని పూర్తి చేసి వచ్చి, గాంధారీధృతరాష్ట్రుల గురించి సంజయుని ప్రశ్నించాడు. పినతండ్రి ఎక్కడికి వెళ్ళాడని అడిగాడు, మాలో ఏదైనా అపరాధాన్ని చూచి భార్యతో పాటు విరక్తుడై గంగలో పడ్డాడా మాపెద్దనాన్న? మా తండ్రి మరణించిన తరువాత మమ్ములనందర్నీ రక్షించిన గాంధారీ ధృతరాష్ట్రులు ఏమయ్యారని పరమదుఃఖంతో ప్రశ్నించిన ధర్మజునికి, సంజయుడు ఆతనికన్నీటిని తుడిచి మనస్సును చిక్కబరచుకొని "గాంధారీధృతరాష్ట్రుల నిశ్చయమేమో నేనెరుగనని"దుఃఖాకులుడై ప్రతిసమాధానిస్తూ ఉండగా ఇంతలో నారదాదులు అక్కడకు విచ్చేశారు.

శ్లో ॥ అథాజగామ భగవాన్ నారద స్సహ తుంబురుః ।
ప్రత్యుత్థాయాభివాద్యాహ సానుజోऽభ్యర్చయన్నివ ॥

(సశేషం)

## గ్రంథపరిచయం

శ్రీవైష్ణవాగమాలలో శ్రీపాంచరాత్ర వైఖానసాలు రెండూ దేశంలోని వైష్ణవాలయాల్లో ఆదరింపబడుతున్నాయి. వీటిలో పాంచరాత్రానికి చెందిన గ్రంథాలముద్రణం వైఖానసాగమ ప్రధానమైన తిరుమల పరిపాలకుల చిన్నచూపుకు నెలవైంది. కొండక్రింద తిరుచానూరులో పాంచరాత్రమే ఆదరింపబడుతున్నా, బహుకాలంగా పాంచరాత్రాగమ గ్రంథాలను ముద్రించవలసిన బాధ్యతగల దేవస్థాన పరిపాలకులదృష్టి వైకల్యాన్ని పొందడం శోచనీయం. అస్తు. దేశంగొడ్డుపోలేదు. తిరుపతిలోనే ఉన్న సంస్కృత విద్యాపీఠం పాంచరాత్రాగమ విషయంలో విశేషపరిశోధనం సాగించి ఎన్నో సంహితలను ముద్రించింది. ఇది సర్వథా అభినందనీయం. ఇక, స్వామినారాయణ సంప్రదాయం పాంచరాత్రాన్ని ఆదరించినదవటం వల్ల ఆసంప్రదాయ ప్రచార సంస్థలూకొన్ని పాంచరాత్రాగమ సంహితలను ముద్రించాయి. శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి (పెద్దస్వామివారి) ప్రోత్సాహంతో శ్రీమన్నారాయణ సంహిత మొదలైన కొన్ని ప్రకాశితాలు కాగా శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి పాంచరాత్రాగమ సంశోధన ప్రణాళిలో శ్రీమాన్ మధుసూదనాచార్యులు, శ్రీమాన్ సముద్రాల శ్రీనివాసాచార్యుల కృషితో ఆగమ ప్రేమికుల ప్రోత్సాహంతో ఇటీవల చాలా గ్రంథాలు ముద్రింపబడ్డాయి. పురుషోత్తమ సంహిత, శ్రీప్రశ్న సంహిత, శ్రీవిష్ణుతిలక సంహితలు పూర్వమే ముద్రింపబడ్డాయి. ప్రస్తుతం మూడు సంహితలు ముద్రింపబడ్డాయి. 1. అహిర్బుధ్న్యసంహిత 2.విష్వక్సేనసంహిత 3.జయాఖ్యసంహిత. వీటిని చక్కగా పరిష్కరించి రామానుజవాణి ద్వారా ప్రకాశింపజేయడం జరిగింది. ఈమూడింటిని ఆగమపండితులే స్పాన్సర్లుగా ముద్రించడం చాలా ముదావహం.

## తాత్పర్యంతో అహిర్బుధ్న్య సంహిత

ఇక ప్రముఖ విద్వాంసులు, సాంప్రదాయకులు ఉ.వే. శ్రీమాన్ నల్లంతిగళ్ లక్ష్మీనరసింహాచార్య స్వామివారు తాత్పర్యసహితంగా రెండు సంపుటాలుగా అహిర్బుధ్న్యసంహితను ముద్రించారు. చక్కటి ముద్రణంతో ఎంతో శ్రమకోర్చి, పరిశోధనాత్మక పీఠికతో ప్రకాశింపచేసిన ఈగ్రంథరాజానికి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి రంగరామానుజ జీయర్ స్వామివారు శ్రీమదుపనిషత్సిద్ధాన్త పీఠంద్వారా మంగళాశాసనపురస్సరంగా ఆర్థిక సహకారాన్ని అందించారు. రెండు సంపుటాల్లో శ్రీమాన్ నల్లంతిగళ్ స్వామివారి కృషిఫలితంగా ఆవిర్భవించిన ఈగ్రంథాల వెల రు.600- పుటలు -700- కావలసినవారు 9247355355 లేదా 9704168678 నెంబర్లకు ఫోనుచేసి వివరాలు పొందవచ్చును.

## 'జీవా' గ్రంథమాల

శ్రీరామనగర్‌లోని 'జీవా' సంస్థకు చెందిన పరిశోధన ప్రకాశన విభాగంద్వారా ప్రారంభమైన ముద్రణ ప్రక్రియలో మొట్టమొదటి ప్రకాశనంగా **'ప్రణవమంజూష'** అనే గ్రంథాన్ని ముద్రించడం జరిగింది. రెండు సంపుటాల్లో ముద్రింపబడే ఈగ్రంథానికి చెందిన మొదటిసంపుటం వెలువడింది. పూర్తిగా సంస్కృతభాషలో వివిధోపనిషద్భాగాలు వాటి వ్యాఖ్యల సంకలనం **'ప్రణవం'** విషయకంగా సాగించి, ప్రణవాన్ని గురించి సమగ్రంగా విచారించదలచిన వారికీగ్రంథం సహకరిస్తుంది. దీనికి **'సువర్ణకుంచిక'** అనే ఉపోద్ఘాతం మూలగ్రంథ తాత్పర్యంపై విశేష వివేచన మూలగ్రంథావగాహనకు ఉపకరిస్తుంది. వివరాలకు 94415 62863 నెంబరును సంప్రదించవచ్చు. **'తత్త్వవివేచన'** అనే భాగవత వివేచనాపరమైన మరొక గ్రంథం త్వరలో పాఠకులకు 'జీవా' ద్వితీయప్రకాశనంగా అందుతుంది. ఇదేక్రమంలో మరికొన్ని గ్రంథాలు అందగలవు. వాటిలో **'అగస్త్యసంహిత'** కూడా ఉంది. వీటి విశేష పరిచయం ముందు సంచికలో చూడండి.

**పెద్దల శ్రీసూక్తులలో ఎన్నో అంతరార్థాలు దాగి ఉంటాయి.**



# అహో! భారతమ్

(జనవరి సంచిక తరువాయి)

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

శ్రీకృష్ణుడు, భీమార్జునులు ఇంద్రప్రస్థం చేరుకోగానే ధర్మరాజు వారికి స్వాగతం పలికాడు. ఆనందంతో శ్రీకృష్ణునికి నమస్కరించి ఇలా అన్నాడు 'శ్రీకృష్ణా! నీ సహాయంతో మా భీమసేనుడు జరాసంధుని జయించాడు. నీమేలు మరచిపోలేను. నీ ఆజ్ఞ అయితే రాజసూయ యాగాన్ని నీసహాయంతోనే పూర్తిచేయగల్గుతాను. జరాసంధుని వధతో కీర్తి, అంతేకాదు సంపద... ఇవి రెండూ కైవశమయ్యాయి. బావా! అంతా నీ అనుగ్రహం. మేం వేసే ప్రతిఅడుగు నీ కటాక్షంతోటే సాగుతోంది సాగుతుంది."

ధర్మరాజు మాటలు విని శ్రీకృష్ణుడు ప్రేమతో అతనిని కౌగలించు కున్నాడు. "మరి నాకు అనుమతినిస్తే ద్వారకకు బయలుదేరతాను" అన్నాడు. తప్పదు కదా అని అంగీకరించారే కాని, అతనిని విడువలేకపోయారు పాండవులు. ప్రతి ఒక్కరికి పేరు పేరునా చెప్తూ... అందరివద్దా సెలవు తీసుకొని ద్వారకకు బయలుదేరాడు శ్రీకృష్ణుడు.

ధర్మరాజు ధర్మబద్ధమైన పాలన సాగించాడు.

ఒకనాడు అర్జునుడు ధర్మరాజును చేరి నమస్కరించి "అన్నా! విల్లు, అక్షయ తూణీరాలు, జెండా, రథం, సభాభవనం ఇలా ఎన్నో అపురూప సంపదలను పొందాం! మరి కోశాగారాన్ని పటిష్ఠం చేయాలి కదా! నీ ఆజ్ఞ అయితే ఉత్తర దిక్కుగా బయలుదేరి రాజలోకాన్ని ఓడించి, నీ సామంతరాజుల్ని చేస్తాను. అనుగ్రహించి ముహూర్తం పెట్టించు" అన్నాడు.

ధర్మరాజు మురిసిపోయాడు. అతని మాటలకు వ్యాసుడు ధౌమ్యుడు ఆనందం పట్టలేకపోయారు. వారి సోదరప్రేమను చూసి మురిసిపోయారు. వ్యాసుడు 'నాయనా! నీలాంటి సోదరునిపొంది ధర్మరాజు ధన్యుడయ్యాడు. అటు శ్రీకృష్ణుని రాజనీతి, ఇటు సోదరుల బలపరాక్రమాలు ధర్మజుని చక్రవర్తిని చేస్తాయి. చూడు నాయనా! నువ్వు దేవతలు పాలించే ఉత్తర దిక్కుని జయించు. భీముడు తూర్పుకు, సహదేవుడు దక్షిణానికి, నకులుడు పశ్చిమానికి వెళ్ళి విజయులై వస్తారు" అన్నాడు. "మునిశ్రేష్ఠా! మీ ఆజ్ఞ శిరసా వహిస్తాం" అన్నారంతా. ఆశీర్వదించారు మహర్షి.

యుధిష్ఠిరుని ఆజ్ఞ పొంది అర్జునుడు ఉత్తరదిక్కుగా బయలు దేరాడు. కుళింద దేశ రాజులందరూ యుద్ధం చేయకుండానే అతని పాదాక్రాంతులయ్యారు. వారి కానుకలు స్వీకరించాడు. శాకలద్వీపాన్ని, దానికి రాజైన ప్రతివింధ్యుని జయించాడు. చుట్టుపట్ల ఏడుద్వీపాలవారు ఓడి నమస్కరించారు. అందరితో కలసి ప్రాగ్జ్యోతిషపురానికి బయలు దేరాడు.

భగదత్తుడు అనే రాజు ప్రాగ్జ్యోతిషపురానికి రాజు. కిరాతులు, చీనులు, సముద్రతీరవాసులు అతనికి లోబడి ఉన్నారు. ఆరాజుతో ఎనిమిది రోజులు యుద్ధం చేశాడు అర్జునుడు. ఏమాత్రం అలసటలేని అతనిని చూచి భగదత్తుడు చిరునవ్వుతో - నాయనా! ఇంద్రపుత్రా! అర్జునా! ఏమి వీరుడవయ్యా! నీ బలపరాక్రమానికి తలవంచుతున్నాను. నేను ఇంద్రుని స్నేహితుణ్ణి. అంతటి బలం కలవానినే కాని నీముందు ఓడిపోయాను. నీ కోరిక ఏమిటో చెప్పు' అన్నాడు. 'మా అన్న ధర్మరాజు ధర్మజ్ఞుడు. సత్యవాక్పాలకుడు. కురుకులశ్రేష్ఠుడు. ఆ మహనీయుడు రాజసూయయాగం చేయ సంకల్పించాడు. అతడు చక్రవర్తి కావాలి. మీరంతా అతని సామంత రాజులై అతనికి కప్పం కట్టాలి. మీరు మా నాన్న ఇంద్రుని స్నేహితులు కాబట్టి నేను మిమ్మల్ని ఆజ్ఞాపించలేను. మీ ప్రేమ భావాన్ని చూపించండి. కప్పం కట్టండి" అన్నాడు.

'ఎంత బాగా మాట్లాడావయ్యా! నువ్వు నా స్నేహితుని కొడుకువి. మరి మీ అన్నా అంతే కదా! మీ సోదరులంతా నాకు పుత్ర సమానులే! నీకోసం ఏమైనా చేస్తాను' అన్నాడు. కృతజ్ఞతలు పలికి, అతనిఆశీస్సులు గ్రహించి, రత్నసంపదలు గ్రహించి బయలుదేరాడు అర్జునుడు.

అంతర్గిరి, బహిర్గిరి, ఉపగిరి అనే ప్రదేశాలు జయించాడు. రాజుల్ని, ధనరాశుల్ని స్వాధీనం చేసుకున్నాడు. ఉలూకదేశాన్ని పాలించే బృహంతునిపై దాడి చేశాడు. ఆ మహావీరుడు కూడా ఇతని ముందు నిలువలేక కైమోడ్పులందించాడు. రత్నరాసులు సమర్పించాడు. సేనాబిందుని రాజ్యాన్ని జయించాడు. పంచగణదేశాలు జయించాడు. అర్జునసైన్యమే ఆ విజయం సాధించింది.

విష్వగశ్వుడు అనే పౌరవదేశాధిపతిని జయించాడు. పౌరవునితో పాటు పర్వతవాసులయిన ఉత్సవసంకేతులనే పేరున్న బందిపోటు దొంగల ఏడుగణాలని కూడా అణచివేశాడు అర్జునుడు. అక్కడ నుండి కాశ్మీరం బయలుదేరాడు. దశమండలాధీశుడైన లోహితుని జయించాడు. త్రిగర్తులు, దార్వులు, కోకనదులు ఇలా ఎంతమందినో, ఎన్నిరాజ్యాలనో ఓడించి, ధనరాశులు గెలిచాడు. అభిసారీ నగరాన్ని జయించాడు. సుహ్మలని, చోళులని గెలిచాడు. బాహ్లీకులు అనే గొప్ప - అతి గొప్ప పరాక్రమవంతులైన రాజులనోడించాడు. కాంభోజులు, దరదులు దాసోహమన్నారతనికి. ఈశాన్యంలో ఉండే దొంగలందరిని స్వాధీనం చేసుకున్నాడు. లోహ, పరమకాంభోజ, ఉత్తరదేశాలన్ని మూలలా వెదకి, వెదకి ఏ ఒక్క భాగాన్ని విడిచి పెట్టకుండా వశం చేసుకున్నాడు. విశేషమేమిటంటే ఏ యుద్ధమైనా రాజ్యకాంక్షతో కాదు. వారంతటవారు వశులయ్యారా సరే, లేదా

పరాక్రమంతో ఓడించి, సామంతుల్ని చేసి, విడిచిపెట్టడం. వారి రాజ్యాలు వారికే ఇచ్చేయడం, గౌరవంతో కొన్ని, శౌర్యపరాక్రమాలతో కొన్ని అనేక విధాలుగా.... మొత్తం ఉత్తరదేశ రాజ్యాలన్నీ అర్జునుని కైవశం అయ్యాయి. అపార ధనరాసులు, రత్న సంపదలూ పాదాలచెంత చేరాయి. ఇలా ధనాన్ని గెలిచిన మహావీరుడు కాబట్టి 'ధనంజయుడు' అనే పేరు వచ్చింది అర్జునునికి. ఋషికులు అనే వారిని జయించి చిలుకపొట్టరంగుగల ఆకుపచ్చగుఱ్ఱాలు ఎనిమిది - చాలా విశేషమైనవి, అద్భుతవేగం కలవి అయిన గుఱ్ఱాలు కానుకగా పొందాడు. అంతేకాదు, నెమలిరంగు గుఱ్ఱాలు - అతి శీఘ్రగమనం కలవి అందమైనవి. వాటిని ఉత్తరదేశాలవారి కానుకగా ఎన్నింటినో సంపాదించాడు.

కింపురుషులని ఒకజాతివారు నివసించే శ్వేతపర్వత ప్రాంతంలోని ద్రుమపుత్రుని ఓడించాడు. కప్పం కడతానని లొంగిపోయాడాయన. కిన్నరదేశం జయించాడు. హాటకులనోడించాడు. గుహ్యకజాతిని వశపరచుకున్నాడు. మానససరోవర ప్రాంతాన్ని - అక్కడి గంధర్వులను కూడా జయించాడు. ఎవరిని జయించినా ఒకటే పద్ధతి. మీరే మీ రాజ్యాలు పాలించుకోండి. మా అన్న ధర్మజునికి సామంతులై కప్పం కట్టండి. మా అన్న చక్రవర్తిగా రాజసూయం చేస్తున్నాడు అని అన్నాడు. హేమకూట పర్వతంపై ఎందరో కిన్నర-కింపురుష గంధర్వాదులు విహరిస్తూ ఉంటారు. వారంతా జేజేలు పలికారు. హరివర్షం చేరాడు అర్జునుడు. అక్కడి స్త్రీపురుషులు అందానికి మారుపేర్లై కనిపించారు. అక్కడి వనాలు, జలాలు- జలాశయాలు-విహరించే దేవజాతులు అర్జునుని మనస్సు దోచేసుకున్నాయి. వారంతా రత్నరాసులర్పించి పంపించారు. నిషధ పర్వతప్రాంతం గెలిచి ఇలావృతవర్షం చేరాడు. అది జంబూద్వీపంలో మధ్యభాగమన్నమాట. అక్కడి స్త్రీపురుషులు అబ్బ... ఎంత సౌందర్యవంతులో... కన్నుతిప్పుకోలేని సౌందర్యం. విశేషమేమిటంటే వారంతా అర్జునుని అందం చూసి దిగ్భ్రాంతులయ్యారు. మహావీరా! సౌందర్యమూర్తీ... అంటూ దరిచేరి పట్టువస్త్రాలు, రత్నాల ఆభరణాలు, బంగారాలు... ఒకటేమిటి రాశులు - రాశులుగా అర్పించారు. ముందుకు సాగాడు. ఆ.. ఏమిటీ కాంతి! ఈ కొండ. ఓ... ఇదే మేరు పర్వతం. బంగారుమయం. నాల్గుకాంతులుగా ప్రకాశిస్తోంది. లక్షయోజనాలు పొడుగు. సూర్యకాంతి దీనిముందు దిగదుడుపే! సిద్ధులు-చారణులు-గంధర్వులు - ఆనందంగా నివసించే భూమి అధర్మాత్ములు చేరలేని భూమి. పక్షుల కిలకిలారావాలు పరవశింపచేస్తున్నాయి. ఈ పర్వతానికి నాల్గువైపులా మండలాకారంలో ఇలావృత వర్షం ఉంది. దీనికి కుడివైపు జంబువు అనే చెట్టు పళ్ళతో కలకలలాడిపోతోంది. దాని కొమ్మలు స్వర్గందాకా ఉన్నాయి. అంత పెద్ద చెట్టు. వేలమంది దానికింద నివాసమున్న చెట్టు. దానిని బట్టే ఆ ద్వీపానికి బంబూద్వీపమనే పేరు వచ్చింది. అర్జునుని చూస్తూనే సిద్ద - చారణ-కిన్నర - కింపురుష - గంధర్వాదులంతా దగ్గరకొచ్చారు. ధర్మరాజు చేసే రాజసూయ యాగాన్ని గూర్చి చెప్పాడు అర్జునుడు. ఆనందంతో కేరింతలు కొట్టి ఆడిపాడారు వారు. రత్న, వస్త్ర అలంకారాదులు రాశులుగా వర్షించారు.

జంబూనదీ- జంబూవృక్షం అంతా బంగారుమయంగా దర్శించాడు. నదీతీరం బంగారు మెట్లు, బంగారురేవులు - అక్కడ ఆ నదీజలాలే ఆహారంగా గ్రహించే సౌందర్యమూర్తులు. వారిచ్చిన జాంబూనదం అనే పేరుగల బంగారం, రత్నాలు, ఆభరణాలు మోయలేనన్ని.

కొంచెం పశ్చిమంగా గంధమాదన పర్వతం... ఆ కొలనులు అక్కడి పూల పరిమళాలు.. సొగసులు... ఆనందం పట్టలేక పోయాడు అర్జునుడు. కేతుమాల వర్షం చేరాడు. అక్కడ దేవతాజాతులే! అంతా విలువైన కానుకలతో పాటు ధర్మరాజుకి కప్పం కట్టడానికి ఆనందంగా ముందుకు వచ్చారు. కాస్త తూర్పుగా మేరుమందర పర్వతాలు-శైలదానది - అక్కడ నివసించే పశుపకులిందాది జాతుల వారందరిని కైవసం చేసుకొని మాల్యవంత పర్వతం - భద్రాశ్వవర్షం అనే స్వర్గ భూమికి చేరాడు. అందరూ కానుకలు - కప్పాలు సమర్పించారు. నీల పర్వతం రమ్యక వర్షం చేరాడు. బంగారు రంగు మృగాలు - బంగారు రంగు పక్షులు ఆ అందానికి మురిసి అన్నగారికి కానుకలుగా గ్రహించాడు. గంధర్వగిరి, ధవళగిరి, హిరణ్యవర్షం ఒక్కొక్కటి చూస్తూ పులకించాడు. అక్కడివారు మన్మధుడిలా వచ్చాడా - దేవసేనాని ఇలా వచ్చాడా అంటూ ఆశ్చర్యపోయారు. వారి ప్రశంసలు పుష్పవర్షాలతో నిండి... రత్నాభరణాదుల స్వీకరించి, శృంగవంత పర్వతం దాటి "ఉత్తర కురువర్షం" చేరాడు. ఆశ్చర్యం! కొందరు దేవతామూర్తులు ప్రత్యక్ష మయ్యారు. 'మానవా! అసలీలోకానికి ఎలా రాగలిగావు. మానవ మాత్రుడిక్కడికి రాలేదే!... నువ్వు దీనిని జయించలేవు. ఆ అవసరం లేదు. నీకేం కావాలో చెప్పు. స్వయంగా మేమే చేస్తాం" అన్నారు.

ఈ భూమండలానికి మా అన్న ధర్మజుడు చక్రవర్తి కావాలి. ఆయన చేసే రాజసూయానికి ఎంతో ధనం కావాలి. అంటూండగానే దివ్యవస్త్రాలు - దివ్యాభరణాలు - సంపదలు రాశులుగా పోసేశారు. మేం కప్పం కడతాం. ఇంకేం కావాలి. ఈ రత్నాలరాశులన్నీ నీ అన్నపాదాల చెంత చేరుస్తాం. తిత్తిరి-కల్మాష- శుక వర్ణపు గుఱ్ఱాలు- నెమలిరంగు గుఱ్ఱాలు. ఎన్ని వేలో... కానుకలు... తీసుకో!" అన్నారు.

ఆనందంతో నిండింది అర్జునహృదయం. ఇవన్నీ మా అన్న ధర్మజుని పాదాలచెంత సమర్పిస్తాను. మా అన్న భూలోకచక్రవర్తి. మా అన్నపై అనన్యసోదరప్రేమగల మా సోదరులం. ఆయన దాసులం. శ్రీకృష్ణభక్తి మాకు రక్ష అనుకుంటూ ఇంద్రప్రస్థానికి బయలుదేరాడు. (సశేషం)

రుచికి, సువాసనకి, ఆరోగ్యానికి నాణ్యమైన
"అజంతా"
పసుపు, కారం, ధనియాలపొడి మరియు సేమియానే ఎల్లప్పుడు వాడండి
రవికుమార్ అండ్ కంపెని - చెన్నై
044 25204046, 26171341
Vijay Ads



# శ్రీమద్భాగవతమాహాత్మ్యము



గతసంచిక తరువాయి...

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

సన్యాసి మాటలకు ఆత్మదేవుడు "మహాత్మా! నేను నా పూర్వజన్మ పాపం వలన కలిగిన దుఃఖాలను గురించి ఏం చెప్పగలను? నా పితరులు నేను సమర్పించిన తర్పణజలాలను తమ చింత అనే నిప్పుమీద వేడిచేసుకుని తాగుతున్నారు. దేవతలుకాని, బ్రాహ్మణులుకాని, నేను ప్రేమతో ఇచ్చిన దాన్ని స్వీకరించట్లేదు. నాకు సంతానం లేదు. సంతానం లేని జీవనం వ్యర్థం. సంతానం లేని గృహం వ్యర్థం. నాధనం వ్యర్థం. సంతానం లేని నాకులం వ్యర్థం. నేను పెంచిన గోవుకూడా గొడ్డాలే అవుతోంది. నేను నాటిన చెట్టుకూడా పూలు పూయడం లేదు. కాయలు కాయడం లేదు. నా ఇంటికి వచ్చిన పండు కూడా త్వరగా కుళ్లిపోతుంది.

నిర్భాగ్యుణ్ణి సంతానహీనుడనైన నాకు ఈ జీవితంతో ఏం పని? నాకు సర్వము శూన్యంగా కనుబడుతోంది. అందుకే నేను ప్రాణాలను త్యజించాలన్న ఉద్దేశ్యంతో ఇక్కడికి వచ్చాను" అన్నాడు కడుదుఃఖితుడయి. తన మాటలవలన తానే దుఃఖితుడై, తనవంటి బాధలు ఎవరికీ ఉండవని చెప్పుకుంటూ వెక్కివెక్కి ఏడ్చాడు. అది చూసి ఆ సన్యాసికి చాలా జాలి కలిగింది. తనకు వచ్చిన విద్య ద్వారా ఆ బ్రాహ్మణుని నొసటన ఉన్న గీతలను పరిశీలించి అతని భవిష్యత్తు నంతటిని గ్రహించాడు ఆ యతి. అప్పుడు ఆ యతి ఆత్మదేవుడితో ఇలా అన్నాడు.

"ఓ బ్రాహ్మణుడా! సంతానం కోసం నీ మోహాన్ని ఇక్కడే వదిలేయ్. కర్మ యొక్క గతి చాలా ప్రబలమైంది. జ్ఞానాన్ని తెచ్చుకో. విను. నీ ప్రారబ్ధకర్మలను నేను తెలుసుకోగలిగాను. నీకు ఏడుజన్మల వరకు ఎలాంటి సంతానము లేదు. సంతానం ఆనందాన్నే కలిగిస్తుందన్న నియమమేమీ లేదు. ఎందరు సంతానాన్ని పొంది వారితో కష్టాలనుభవించట్లేదు? నీవు నీ కుటుంబం మీద ఆశలు వదులుకో. సన్యాసం మీద ప్రీతి పెంచుకో. నీకు సన్యాసం లోనే సుఖం ఉంది". ఆ మాటలను విన్న ఆత్మదేవుడిలా అన్నాడు. "ఓ మహాత్మా! నాకు ఈ జ్ఞానం ఎందుకు? మీకు కుదిరితే నాకు పుత్రుణ్ణి ప్రసాదించండి. లేకపోతే నేనిలాగే శోకంతో ప్రాణాలను వదిలివేస్తాను. భార్యపుత్రులు లేని సన్యాసం నాకేల స్వామి!"

ఆ మాటలకు యతి "నాయనా! విధి వ్రాతను ఎవ్వరూ తప్పించలేరు. దైవనిర్ణయానికి వ్యతిరేకంగా పుత్రులను బడసినా ఆ పుత్రుల వలన సుఖము కలుగదు. కానీ నీవు చూస్తే చాలా పట్టుదలతో ఉన్నావు. నా ముందు ఒక యాచకునిలా నిలబడి ఉన్నావు. నీకు నేనేమని చెప్పగలను? అని ఆ యతీశ్వరుడు మంత్రించిన ఒక ఫలాన్నిచ్చి "నాయనా! దీనిని నీ భార్యకివ్వు. దీనిని భక్షించి ఆమె ఒక పుత్రునకు జన్మనీయ గలదు. అయితే నీ భార్య ఒక సంవత్సర కాలం సత్య, శౌచ, దయా, దానాదులనే నియమాలను కలిగిఉండాలి. ఏకభుక్తగా ఉండాలి. అంటే ఒక రోజులో ఏదో ఒకసారి మాత్రమే అన్నం తినాలి. అలా చేసినట్లయితే నీకు పరిశుద్ధ స్వభావం గల పుత్రుడుదయిస్తాడు". అని చెప్పి ఆ సన్యాసి వెళ్లిపోయాడు.

ఆత్మదేవుడు కూడా సంతోషంగా ఇంటికి వెళ్లి తన భార్య దుంధులికి ఆ పండుఇచ్చి, చెప్పవలసిన నియమాలన్నీ చెప్పి, పనిమీద బయటకు వెళ్లాడు. దుంధులి మిక్కిలి కుటిల స్వభావంగల స్త్రీ. ఈ వయస్సులో నేను గర్భవతినవ్వాలా అన్న తలంపుతో ఏడ్చేసింది. ఆ సమయంలో తనను చూడడానికి వచ్చిన స్నేహితురాలితో ఇలా అంది.

"ఓ మిత్రురాలా! నాకు చాలా దుఃఖంగా ఉంది. నేనీ పండును తినను. తింటే నాకు కడుపొస్తుంది. ఇంక నాకు ఏమీ తినడానికే వీలుకాదు. దానివలన నాశక్తి క్షీణిస్తుంది. ఇక అప్పుడు ఇంటిపని అంతా ఎలా సాగుతుంది? నేనా సుకుమారిని, నేనంతటి బాధను భరిచగలనా! పైగా సత్యము, శౌచములాంటి ఈ వ్రతనియమాలు నావల్ల కావు. అందువలన పిల్లలు పుట్టడంకంటే గొడ్రాలుగా ఉన్నా, చివరకు వితంతువయినా అలాంటి స్త్రీయే హాయిగా బ్రతుకుతుందని నా అభిప్రాయం" అని చెప్పింది. ఆమె విపరీతపు ఆలోచనలు విన్న ఆ స్నేహితురాలు మారుమాటాడక మెల్లిగా వెళ్లిపోయింది.

కొంతసమయానికి భర్త తిరిగివచ్చాడు "పండుతిన్నావా?" అని అడిగాడు. "ఆ...తిన్నాను" అని సమాధానం చెప్పింది దుంధులి. అలా కొన్నాళ్లు గడిచింది. ఒకరోజు ఆమె చెల్లెలు తన ఇంటికి వచ్చింది. తన కష్టమంతా ఆ చెల్లెలికి చెప్పి వాపోయింది దుంధులి. "అందువలన నా మనసులో దీనిని గురించిన చింత చాల మిక్కుటంగా ఉంది. దీనిని గురించి ఆలోచిస్తూ కృశిస్తున్నాను. నన్నేం చెయ్యమంటావ్?" అని అడిగింది. ఆ మాటలకు సోదరి ఇలా సమాధానం చెప్పింది.

"దిగులు చెందకు, నీ ప్రశ్నకు నేను సమాధానమవుతాను. నేనిప్పుడు గర్భవతిని. నాకు పుట్టిన బాలుణ్ణి నీకిచ్చేస్తాను. నీకు కూడా గర్భం వచ్చినట్లు నటిస్తూ ఉండు. నా భర్తకు నేను నచ్చ చెప్తాను. అతనికి కొంతడబ్బిస్తే ఒప్పుకుని నీకు బాలుణ్ణి ఇచ్చివేయగలడు. "నా చెల్లెలు పిల్లవాడు ఆరునెలలు పెరిగి చనిపోయాడని అందరికి చెప్పు. నీకు పాలుపడలేదు కాబట్టి ఈమె వచ్చి నా బాలుణ్ణి పోషిస్తుందని చెప్పు". అని చెప్పింది. దుంధులి చాల సంతోషించింది. "అయితే చెల్లీ! ఈ పండును ఏం చేద్దాం. దీనిని ఎలా వదుల్చుకోవాలి?" అని అడిగింది.

"అదేమంత పెద్ద కష్టమేమీ కాదు. దీనిని నీ ఇంట్లో ఆవుకు పెట్టేయ్! దాని వలన అసలు ఈ పండుకు మహిమ ఉందో లేదో కూడా తెలుతుంది." అని చెప్పిందా సోదరి.

దుంధులికి ఆ మాటలన్నీ నచ్చాయి. తన చెల్లెలు ఎలా చెపితే అలా చేసింది. అలా కొన్నాళ్లు గడిచాయి. ఆమె సోదరి ఒక బాలుణ్ణి ప్రసవించింది. ఆమె భర్త అతి రహస్యంగా తెచ్చి దుంధులికి ఇచ్చేసాడు. తనకు సుఖప్రసవమైందని తమకు బాలుడు పుట్టాడని దుంధులి సత్యదేవునికి చెప్పింది. భర్త ఆ వార్తవిని అమితంగా ఆనందించాడు. ఆ బాలుడు పుట్టినందుకు జాతకకర్మ సంస్కారములు చేయించాడు. బ్రాహ్మణులకు దానాలు చేసాడు. మంగళవాద్యాలు మ్రోగాయి. ఎన్నోవైదిక కర్మలు చేయించాడు. దుంధులి భర్తతో ఇలా అంది.

"నా స్తనములలో పాలు పడలేదు. గోవు వంటి అన్యప్రాణుల పాలచే నా

బాలుణ్ణి ఎలా పోషించగలం? నా చెల్లెలుకు కూడా ఒక కొడుకు పుట్టిపోయాడు. చాల దుఃఖంలో ఉంది. ఆమెను పిలిచి మన ఇంట్లో ఉంచుకుంటే ఆమె ఈ బాలుణ్ణి పెంచి సుఖమును పొందగలదు. మన సమస్య కూడా తీరుతుంది." ఆత్మదేవుడికి అంతాకన్నా మంచి ఆలోచన ఏమీ లేకపోవడం వల్ల "సరే" అని అంగీకరించాడు. తల్లితండ్రులు అతనికి **"దుంధుకారుడు"** అని నామకరణం చేసారు.

**15**

అలా మూడునెలలు గడిచింది. తరువాత తన ఇంటిలోని గోవుకూడా మనుష్యాకారం గల బాలుణ్ణి ప్రసవించింది. ఆ బాలుడు సర్వాంగ సుందరంగా ఉన్నాడు. దివ్యంగా, నిర్మలంగా, సువర్ణఛాయతో శోభిల్లుతున్నాడు. కాని అతనికి ఆవుచెవులవంటి చెవులుమాత్రం మానవాకారానికి భిన్నంగా ఉన్నాయి. అదృష్టవశాత్తు ఈ పందురహస్యం ఎవ్వరికీ తెలియలేదు. ఆ ఆవుని పిల్లవాణ్ణి చూడదానికి ఆవూరి ప్రజలంతా వచ్చి చూసి ఆశీర్వదించి వెళ్లారు. ఆత్మదేవుడు తనను తాను చాలా అదృష్టవంతుడిగా భావించాడు. ఒక్క సంతానం కూడా లేదనుకుంటే తనఇంట ఇద్దరు పిల్లలు పుట్టారు. ఆ ఆవుకు పుట్టిన పిల్లవానికి "గోకర్ణుడు" అని పేరు పెట్టి తన కుమారుడు దుంధుకారునితో సమానంగా పెంచుకోవడం మొదలుపెట్టాడు.

కొంతకాలం అలా గడిచింది. ఆ పిల్లలిద్దరూ యువకులయ్యారు. గోకర్ణుడు గొప్పపండితుడు, జ్ఞాని అయ్యాడు. దుంధుకారుడు గొప్ప దుష్టుడయ్యాడు. వాడిలో స్నానశౌచాది బ్రాహ్మణ లక్షణాలు మచ్చుకైనా కానరావు. ఎలాంటి భోజన నియమాలు లేవు. క్రోధం ఎక్కువ. దుష్టమైన వస్తువుల ఎడ మక్కువ. శవహస్తభోజనానికైనా సిద్ధపడేటంత నీచస్వభావం కలిగి ఉన్నాడు.

ఇక వీడి దుర్లక్షణాలకు అంతేలేదు. ఇతరుల దగ్గర డబ్బుంటే వారిని తన్ని లాక్కునేవాడు. సర్వజనులను ఆఖరుకు తల్లిదండ్రులను కూడా ద్వేషించేవాడు. ఎవ్వరూ చూడకుండా పక్కఇళ్లకి నిప్పుపెట్టడం, వీధిలో ఆడుకుంటున్న పిల్లల్ని ఎత్తుకుపోయి బావిలో విసిరేసి ఆనందించడంలాంటి దుర్గుణాలెన్నో ఉన్నాయి. వాడికి ఇతరులను హింసించడం ఒక వ్యసనం. కత్తులు కర్రలు కలిగి ఉండేవాడు. దీనులను, అంధులను బాధించేవాడు. కుక్కలగుంపును తీసుకొని వేటకి వెళ్లేవాడు.

వేశ్యల వలలో చిక్కుకుని ఇంట్లో ఆస్తి అంతా తగలేసాడు. తల్లిదండ్రులను కొట్టి ఇంట్లో సామగ్రి అంతా ఎత్తుకుపోయి అమ్మేసి వేశ్యలకిచ్చేసాడు. వాడి ప్రవర్తనకు విసిగిపోయిన తండ్రి ఆత్మదేవుడు గోకర్ణుడితో ఇలా అన్నాడు. "తల్లి గొడ్రాలుగా ఉన్నా పరవాలేదు కాని, ఇలాంటి దుర్మార్గుణ్ణి మాత్రం కనకూడదు. ఈ దుఃఖం వలన నేను చనిపోవడమే మంచిదనిపిస్తోంది. అయ్యో! నాకెంత కష్టం వచ్చింది" అని వాపోతున్న తండ్రిని చూచి గోకర్ణుడు ఇలా అన్నాడు.

"నాన్నగారూ! ఈ సంసారం సారం లేనిది. ఇది మిక్కిలి దుఃఖరూపం కలది. అయినా ఇది మోహాన్ని కలిగించేది. ఇక్కడ మనం అర్థం చేసుకోవలసిన విషయాలున్నాయి. ఎవడు ఎవడికి పుత్రుడు? ఏది ఎవరి ధనం? అంతా మన భ్రమ మాత్రమే. ప్రారబ్ధం వలననే పుత్రులు, ధనం మనని చేరతాయి. స్నేహం కలవాడు మాత్రమే మనకోసం రేయింబవళ్ళు కష్టపడుతూ ఉంటాడు. ఇంద్రుడైనా, చక్రవర్తి అయినా, చంద్రుడైనా వాడికి సుఖం మాత్రం ఉండదు. సుఖమనేది కేవలం విరక్తుడికే లేక ఏకాంత జీవి అయిన మునికే ఉంటుంది. "వీడు నా పుత్రుడు" అని అనిపించే అజ్ఞానాన్ని వదిలేయ్. ఈ మోహం వల్లనే నరకం కలుగుతుంది. ఆ శరీరాలు ఏనాడైనా రాలిపోవలసిందే. అందు వలన ఇక్కడి సమస్తాన్ని వదిలేసి అడవికి వెళ్ళిపో, అక్కడే నీకు సుఖం లభిస్తుంది" అని చెప్పాడు.

దానికి ఆత్మదేవుడు ''నాయనా! నన్ను అడవికి వెళ్ళి ఏం చెయ్యమంటావు? గోకర్ణా! నేను చాలా మూర్ఖుణ్ణి. ఇంతవరకు నా ప్రారబ్ధకర్మ వలన స్నేహమనే పాశంతో బంధింపబడి ఈ గృహంలో పడి దుఃఖిస్తూ ఉన్నాను. నీవు దయకలవాడివి. ఈ గృహం అనే కారాగారం నుండి నన్ను విముక్తుణ్ణి చేయ్యి. నన్నుద్ధరించు, "నాకు మార్గదర్శకం చెయ్యి" అని అడిగాడు.

ఆ మాటలకు గోకర్ణుడిలా అన్నాడు. "నాన్నగారూ! ఈ శరీరము ఎముకలు, మాంసము, రక్తము, చీము, మజ్జ వంటి పదార్థాలతో నిండి ఉంది. దీనిలో "నేను" అనే అభిమానాన్ని కలుగనివ్వకు. అలాగే భార్యాపుత్రులను "నావాళ్ళు" అనే భావాన్ని కలుగనీయకు. ఈ జగత్తులో సర్వము క్షణభంగురమే. దీనిలో ఏ వస్తువుని స్థిరమని తలువకు. అనురాగాన్ని పెంచుకోకు.

అన్నింటి కంటే భగవంతుని భజించుటయే అత్యుత్తమ ధర్మం. నిరంతరం దానినే కొనసాగించు. ఇతర లౌకికమైన ధర్మాలను అన్నింటిని వదిలేయ్. ఎల్లప్పుడు సాధువులను సేవించు. భోగాల నుండి నీ బుద్ధిని మరలించు. ఇతరుల గుణదోష చింతన వదిలేయ్. భగవంతుని గుణములనే చింతన చెయ్యి. ఆతడినే సేవిస్తూ ఉండు. భగవత్కథారసాన్నే గ్రోలుతూ ఉండు". గోకర్ణుడి మాటలకు ప్రభావితుడై ఆత్మదేవుడు ఇల్లువదలి వనానికి వెళ్ళిపోయాడు. అరువదిఏళ్ళ వయసులో అడవికి వెళ్ళి భాగవతంలోని దశమ స్కంధాన్ని సేవించి తన అంత్యదశ తరువాత సాక్షాత్తు శ్రీకృష్ణ పరమాత్మనే పొందాడు. (సశేషం)

ఓర్పు మనిషిని దైవంగా మారుస్తుంది.

**జై శ్రీమన్నారాయణ!**

**శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయర్ స్వామివారి**

## పర్యటన వివరములు

**మార్చి 31 నుండి ఏప్రియల్8వరకు**

| | |
|---|---|
| శంషాబాద్ | ఉ॥ ఉగాది వసంతోత్సవాలు, శ్రీరామనవమి కళ్యాణం, ఉ. సుందరకాండ పారాయణ, హోమము |
| | సా॥ 6-7 గం॥ వరకు శ్రీరామాయణ ప్రవచనం మధురానగర్ అభయాంజనేయస్వామి కోవెల, హైదరాబాద్ |
| ఏప్రిల్ 9 | జనగాం శ్రీ సీతారామస్వామి మహాసామ్రాజ్య పట్టాభిషేకం |
| 10-13 | నెల్లూరు మహాలక్ష్మీయాగములో పాల్గొంటారు. |
| 14 | గుంటూరు అష్టలక్ష్మీయాగంలో అన్వయిస్తారు. |
| 15 | శ్రీకాకుళం జిల్లా లయిదాం శ్రీరామనవమి ఉత్సవాలు |
| 16. | రాజమహేంద్రి, ధవళేశ్వరం వేదవతిగారింట్లో వేంచేసి ఉంటారు |
| 17 నుండి | శ్రీరామ్‌నగర్‌లో వేంచేసి ఉంటారు. |

# ముముక్షు రహస్యం

శ్రీమతి చక్రవర్తుల చూడామణి-ఖమ్మం

"బామ్మా... బామ్మా నేను నీవెనక దాక్కుంటాను... అమ్మవస్తే లేనని చెప్పవా!" అంటూ బామ్మ వెనుక దాక్కున్నాడు వేంకట కృష్ణ.

వెనకాలే అమ్మ చేతిలో కర్రతో కోపంగా వచ్చింది. అమ్మకోపం పోగొట్టాలని "కృష్ణుడిని వెదుకుతున్న యశోదలా ఉన్నావే తల్లీ....! అని నవ్వింది. ఆ మాటతో అమ్మకూడా నవ్వేసింది.

"మీరు మాత్రం తక్కువా ఏం! దధిభాండుడు దాచినట్టు కృష్ణుడిని దాచి పెట్టారుగా...!" అంటూ అలసటతో అక్కడే కూర్చున్నది.

వేంకటకృష్ణ వెంటనే బామ్మ ఒళ్ళో చేరి 'బామ్మా ఆ కథ చెప్పవా...!" అంటూ నసిగాడు.

"అలాగే చెప్తాగానీ... ఇకముందు అల్లరి చేసి అమ్మను విసిగించకుండా ఉంటావా?"

"అలాగేలే... ఇక చెప్పు...!"

"నందవ్రజంలో గోపికలందరూ పొద్దున్నే పెరుగు చిలుకుతారు. దాన్ని పవిత్రమైన యజ్ఞంలా భావిస్తారు. అలానే ఒకరోజు చీకటితో లేచి పనులు ముగించుకొని యశోద వెన్న చిలుకుతూ ఉంది. ఇంతలో కృష్ణుడొచ్చి పాలివ్వమన్నాడు.

"అంత పెద్దవాడు అమ్మ దగ్గర పాలు తాగుతాడా?"

"ఎంత పెద్ద ఐదారేళ్ళేగా.... ఆరోజులలో... అంతదాకా ఎందుకు మీనాన్న, అత్త అందరూ ఆరేడేళ్ళు వచ్చేదాకా నా దగ్గర పాలు తాగేవాళ్ళు. అందుకే వాళ్ళంతా ఆరోగ్యంగా ఉన్నారు. తెలుసా..!"

"సరే కథ చెప్పు...!" అన్నాడు వేంకటకృష్ణ.

"యశోద కృష్ణుడిని ఒళ్ళో వేసుకొని పాలిస్తూ వెన్న చిలుకుతున్నది. కాసేపటికి వంటింట్లో పొయ్యిమీద పాలు పొంగుతున్న వాసన వచ్చింది. వెంటనే కన్నయ్యను దింపి కూర్చోబెట్టి వంటింట్లోకి వెళ్ళింది.

కృష్ణుడికి యశోదమీద కోపం వచ్చింది. "తనకంటే పొయ్యిమీది పాలే ముఖ్యమా ఈమెకు?" అనుకున్నాడు. ఒకరాయి తీసి పెరుగు కుండమీద వేసాడు. పెద్దబాన పైన వెన్న తేలుతున్నది. లోపల చిక్కటి మజ్జిగ.... కుండ పగలటంతో మొత్తం నేలపాలు. యశోదమ్మ వంటింట్లోంచి వచ్చి చూసింది. ఒక్కపక్క అమాయకంగా నిద్రపోతున్న కృష్ణుడు. మరోపక్క నేలంతా పరచుకున్న వెన్న, మజ్జిగ... ఇదంతా కొంటె కృష్ణయ్య పనే అని గ్రహించి కోపంతో ఊగిపోయింది. చేతికి దొరికిన కర్రముక్క అందుకుంది. అది చూసిన కృష్ణుడు అమ్మ కొట్టక ముందే కొట్టినంతగా ఏడుస్తూ పరుగు పెట్టాడు. అమ్మ కూడా కన్నయ్య వెనకాలే పరుగు పెట్టింది. ఎంతైనా కన్నయ్య చిన్నవాడు చకచకా పరిగెత్తగలడు. అమ్మ అంత వేగంగా పోలేదు కదా! ఆయాస పడుతూ కృష్ణుడిని ఆగమంటూ గబగబా అడుగులు వేస్తోంది.

"భలే... భలే" వేంకటకృష్ణ సంతోషంతో చప్పట్లు కొట్టాడు.

"భడవా... నీకెంత సంబరంరా...!"

"చెప్పు... చెప్పు... తరువాత ఏం జరిగింది...?"

"ఏం జరుగుతుంది. కృష్ణుడు వీధిలోకి పోయాడు. అలాగే పరుగులుతీస్తూ మలుపు తిరిగేశాడు. అక్కడ దధిభాండుడని ఒక తాత ఉన్నాడు."

"దధిభాండుడంటే అర్థమేమిటి బామ్మా?"

"అతను రోజూ పెద్దబాన నిండా పెరుగు అంటే దధి తీసుకు వెళ్ళి మధురాపట్టణంలో అమ్ముకొని తిరిగివస్తాడు. అందుకని ఆయనకు దధిభాండుడని పేరు వచ్చింది. కృష్ణుడు ఆ తాత దగ్గరకు వెళ్ళి 'తాతా...! తాతా...! నన్ను నీ బానలో దాచిపెట్టు. మా అమ్మ నన్ను వెతుక్కుంటూ ఇటు వచ్చి అడుగుతుంది. నేను ఇక్కడ లేనని చెప్పు' అని అడిగాడు. అంతేకాదు. 'అమ్మ చేత దెబ్బలు నుంచి నన్ను కాపాడవా!' అని ఏడుస్తూ ముద్దు ముద్దుగా అడిగాడు. అలా అడిగితే ఎవరు మాత్రం కాదంటారు. 'అలాగే!' అని కన్నయ్యను కూర్చోమని పైన బాన బోర్లించాడు తాత.

ఇంతలో యశోదమ్మ ఆయాసపడుతూ రానే వచ్చింది. 'తాతా మా కృష్ణుడు ఇటుగా వచ్చాడా?' అని అడిగింది.

'లేదమ్మా...! ఇక్కడ నేను తప్ప ఎవ్వరూ లేరు' అని పచ్చి అబద్ధం చెప్పేశాడు తాత.

"బామ్మా! అబద్ధాలు చెప్పకూడదని చెప్పావుగా!"

"తప్పే... కాని దానికి కొన్ని మినహాయింపులున్నాయి. ఒకరిని కాపాడటానికి ఎవరికీ నష్టం లేని విధంగా అబద్ధం చెప్పొచ్చు. ఇక్కడ కృష్ణుడు లేడని చెప్పడం వలన ఎవరికీ నష్టంలేదు. పైగా కృష్ణుడికి దెబ్బలు తప్పాయి. అంతకంటే ముఖ్యమైన విషయం మరొకటుంది. ఈ తాత చాలాకాలంగా తనవృత్తినే దైవంగా భావించి, ఆచరిస్తూ వచ్చాడు. పరమాత్మ తనకు విధించిన కర్తవ్యాన్ని ఆయన కైంకర్యంగానే భావించి, నిర్వహిస్తూ తనను అనుగ్రహించడానికి ఆయనే వస్తాడన్న విశ్వాసంతో బతుకుతున్నాడు.

అంతటా వ్యాపించి ఉన్నవాడొచ్చి 'నేనిక్కడ లేనని చెప్ప'మన్నాడు. లోకరక్షకుడొచ్చి 'నన్ను రక్షించవా!' అన్నాడు. అప్పుడే తాతకు అర్థమైపోయింది. వచ్చినవాడు సామాన్యమైన పిల్లవాడు కాదు. తననుద్ధరించడానికి వచ్చిన పరమాత్మ అన్న జ్ఞానం కలిగింది. అందువల్లే ఆయన చెప్పమన్న అబద్ధం ధైర్యంగా చెప్పాడు."

"సరే తరువాత ఏం జరిగిందో చెప్పు...!"

యశోదమ్మ అటు వెళ్ళగానే కృష్ణుడు బాన లోపల్నుంచి "తాతా బాన తీయవా! నేను బయటికి రావాలి!" అని అడిగాడు.

"నేను తియ్యను. నాకు మోక్షమిస్తానంటేనే బాన తీస్తా"నన్నాడు తాత.

"నేను చిన్నపిల్లవాడిని, గొల్లవాడిని. నేను నీకు మోక్షమివ్వటమేమిటి?" అన్నాడు కృష్ణుడు.

"కృష్ణయ్యా నువ్వు పిల్లవాడివీ కాదు, గొల్లవాడివీ కాదు. సాక్షాత్ నారాయణమూర్తివి. నన్నుద్ధరించే దైవానివి. ఇంతలోకంలో నీకు దాక్కోడానికి చోటు దొరకకే నా దగ్గరకు వచ్చావా! నిర్హేతుకమైన దయతో నన్నుద్ధరించాలని నా బానలో దాక్కున్నావు. నాకు మోక్షమివ్వక తప్పద"న్నాడు.

దధిభాండుడి బుద్ధికుశలతకు మెచ్చి అలాగే మోక్షమిస్తా! బాన తియ్యమన్నాడు కృష్ణుడు.

"ఊహూ... ఈ బానకు కూడా మోక్షమిస్తానని చెప్పు. అది ఎప్పుడూ నాతోనే ఉంటుంది. నన్ను నమ్ముకున్న బానను వదిలి నేను మాత్రం వెళ్ళడం న్యాయం కాదు కదా!" అన్నాడు తాత.

తాత ఉదార స్వభావానికి మెచ్చి ఆ బానకు కూడా మోక్షమిస్తాలే' అని మాట ఇచ్చాడు. తాత బానతో సహా పరమపదానికి వెళ్ళాడు.

భక్తాగ్రగణ్యుడైన ప్రహ్లాదుడు పరమాత్మ అంతటా ఉన్నాడు అని చెప్పగా ఏమీ తెలియని గొల్లవాడు "ఇక్కడ లేడని" చెప్పి మోక్షం పొందాడు. నాకు అంతటి అదృష్టం లేకపోయింది కదా అన్న అర్థంతో "ఇంగిల్లై ఎన్నేనో దధిభాండనై పోలే?" అని అని తిరుక్కోళ్ళూర్ అమ్మాళ్ బాధపడింది. (సశేషం)

తిరువరంగత్తముదనార్లు అనుగ్రహించిన ప్రపన్నగాయత్రి

# ఇరామానుశనూత్తన్దాది

*గత సంచిక తరువాయి*

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

**27వ పాశురము**

కొళ్ళకుఱైవత్తిలంగి క్కొఱుందు విట్టోంగియ ఉన్
వళ్ళల్ తనత్తినాల్ వల్వినైయేన్ మనమ్ నీపుకుందాయ్
వెళ్ళై చ్చుడర్ విడు మున్ పెరుమేన్మైక్కు ఇళ్ళిక్కు తెన్ఱు
తళ్ళుత్తిరంగుమ్ ఇరామానుశ ఎన్ తని నెంజమే!

**ప్రతిపదార్థము :**

**ఇరామానుశ** = భగవద్రామానుజా!
**కొళ్ళ కుఱైవు అత్త ఇలంగి** = ఎంత గ్రహించినా ఏమీ కొఱతలేక
**కొఱుందు విట్టు ఓంగియ** = మరింత అభివృద్ధి చెందుతున్న
**ఉన్ వళ్ళల్ తనత్తినాల్** = నీ ఔదార్య స్వభావం చేత
**వల్ వినైయేన్ మనమ్** = మహాపాపిని అయిన నా మనసులో
**నీ పుకున్దాయ్** = నీవు వచ్చి ప్రవేశించినావు
**ఇతు** = ఈ ప్రవేశం
**శుడర్ విడుమ్** = వెలుగుతున్న
**ఉన్ పెరుమేన్మైక్కు** = నీ ప్రభావానికి
**ఇళ్ళుక్కు ఎన్ఱు** = దోషాన్ని కలిగిస్తుందో ఏమో అని
**ఎన్ తని నెంజమ్** = నా నిస్సహాయమైన మనసు
**తళ్ళుత్తు** = ఆర్తిచెంది
**ఇరంగుమ్** = విలవిలలాడుచున్నది.

**తాత్పర్యము:** స్వామీ! భగవద్రామానుజా! నీవెంతటి మహోదారుడవో కదా! నా పాపభూయిష్ఠమైన మనసులో స్వయంగా వచ్చి ప్రవేశించావు. నీచుడనైన నా స్థితిని గమనించి, తెలిసీ కూడా ఇంతటి దయను నాపై వర్షించడం నా భాగ్యం. దీనివలన నీకెక్కడ – నీ మహిమకెక్కడ దోషం తగులుతుందో అని నా మనస్సు రెపరెపలాడిపోతోంది ప్రభూ!

*******

**28వ పాశురము**

నెంజిల్ కఱై కొండ కంజనై కాయన్ద నిమలన్, నంగళ్
పంజిత్తిరువడి పిన్నైతన్ కాతలన్, పాతమ్ నణ్ణా
వంజర్క్కరియ ఇరామానుశన్ పుకళ్నణ్ణి యెన్ వాయ్
కొంజి ప్పరవకిల్లాతు, ఎన్నవాళ్ఱ్విన్ఱు కూడియతే ॥

**ప్రతిపదార్థము:**

**నెంజిల్** = మనస్సులో
**కఱైకొండ** = కల్మషము నిండిన
**కంజనై** = కంసుని
**కాయ్న్ద** = సంహరించిన
**నిమలన్** = కల్యాణగుణుడై
**నంగళ్ పంజి తిరువడి** = ఆశ్రితులపట్ల అభిమానం కల్గి దూదివలె సుకుమార ములైన శ్రీచరణములు కల్గినదై
**పిన్నై తన్ కాతలన్**= నప్పిన్నకు ప్రియుడైన శ్రీకృష్ణునియొక్క
**పాతమ్ నణ్ణా** = శ్రీ చరణాలను ఆశ్రయించని
**వంజర్క్కు** = ఆత్మాపహారులైన చోరులకు
**అరియ** = తెలిసికొనలేని ప్రభావము కల్గిన
**ఇరామానుశన్** = భగవద్రామానుజుల
**పుకళ్ అన్ఱి** = కల్యాణగుణములను తప్ప వేరొక విషయాన్ని
**ఎన్వాయ్** = నావాక్కు
**కొంజి పరవకిల్లాదు** = ఆశపడి కీర్తించలేదు.
**ఎన్న** = ఎంత ఆశ్చర్యం!

**తాత్పర్యము:** భగవద్రామానుజులు భగవద్భక్తులకు పరమ సులభులు. నన్నొక మనిషిగా తీర్చిదిద్దిన మహోపకారులు. ఆయన వైభవం తెలిసిన తరువాత నావాక్కు మిగిలిన వాటిని పలుకడానికే ఇష్టపడడం లేదు.

తనను సంహరించేవాడు రహస్యంగా పెరుగు తున్నాడని విన్నాడు కంసుడు. శ్రీకృష్ణునిపై కసిని పెంచుకున్నాడు. వధించే మార్గాలెన్నో వెదికాడు. చివరికి ఆతని చేతిలోనే ముగిసింది అతని జీవితం. ఆ శ్రీకృష్ణుని ప్రియపత్ని నప్పిన్న పిరాట్టి. ఆ సుకుమార గాత్రికి వల్లభుడు స్వామి. అటువంటి స్వామిని సేవించని నిర్భాగ్యులకు మాత్రమే దుర్లభులు మన భగవద్రామానుజులు. ఆయన గుణగానానికి అలవాటు పడిన ఈ నోరు వేరొకదానిని పొగడనే పొగడదు.

*******

**29వ పాశురం**

కూట్టుమ్ వితి యెన్ఱు కూడుంగొలో, తెన్కురుకైప్పిరాన్
పాట్టెన్నుమ్ వేతప్పశున్దమిళ్ఱ్ తన్నై త్తన్ పత్తి యెన్నుమ్ ।
వీట్టిన్ కణ్ వైత్త ఇరామానుశన్ పుకళ్ మెయ్యుణర్న్దోర్
ఈట్టంగళ్ తన్నై ఎన్ నాట్టంగళ్ కణ్డు ఇన్బమెయ్‌తిడవే ॥

**ప్రతిపదార్థము :**

**తెన్ కురుకై పిరాన్** = శ్రీ నమ్మాళ్వార్ల
**పాట్టు ఎన్నుమ్** = పాటలు అని ప్రసిద్ధమై

| | |
|---|---|
| **వేదమ్** | = వేదరూపమై |
| **పశుం తమిర్ర్ తన్నై** | = అందమైన ద్రావిడభాషలో ఉండే తిరువాయ్‌మొళ్ళిని |
| **తన్ పత్తి ఎన్నుమ్** | |
| **వీట్టిన్ కణ్** | = తమ భక్తి అనే భవనంలో |
| **వైత్త** | = స్థాపించిన |
| **ఇరామానుశన్** | = భగవద్రామానుజుల |
| **పుకర్ర్** | = కల్యాణగుణాలను |
| **మెయ్ ఉణర్‌న్దోర్** | = పూర్తిగా తెలిసినవారి (యథాతథంగా) |
| **ఈట్టంగళ్ తన్నై** | = గుంపులను |
| **ఎన్ నాట్టంగళ్ కండు** | = నా నేత్రాలు సేవించి |
| **ఇన్బమ్ ఎయ్‌తిడ** | = ఆనందించేటట్లు |
| **కూట్టుమ్ వితి** | = కూర్చు కృప |
| **ఎన్రు కూడుమ్ కొల్** | = ఏనాటికి లభిస్తుందో కదా! |

**తాత్పర్యము:** చాలా విలువైన రత్నాన్ని మనం భరణిలో భద్రంగా దాచుకుంటాం కదా! అలాగే శ్రీ నమ్మాళ్వార్లయొక్క తిరువాయ్‌మొళ్ళి అనే అనే శ్రీసూక్తిరత్నాన్ని భగవద్రామానుజులు తమ భక్తి అనే అద్భుత భరణిలో పెట్టుకొని ఆరాధించారట.

నమ్మాళ్వార్లు అనుగ్రహించిన తిరువాయ్‌మొళ్ళి ద్రవిడవేదం గొప్పరత్నం. దానిని భగవద్రామానుజులు తాము భక్తితో అనుసంధించి ఆ కల్యాణగుణాలకు మురిసిపోతూ ఉండేవారు. అటువంటి రామానుజ గోష్ఠులలో ఒకదాసుడనై ఆ మహనీయులను సేవిస్తూ, ఆ శ్రీసూక్తులను ఆనందంగా అనుసంధానం చేసుకుంటూ ఉండే భాగ్యం ఎప్పటికి నాకు లభిస్తుందో కదా!

తిరువాయ్‌మొజి దివ్యానుసంధానం జరిగే గోష్ఠిలో అన్వయించడం మహాసౌభాగ్యం అంటున్నారు అముదనార్లు.

*******

### 30వ పాశురం

ఇన్బమ్ తరు పెరువీడు వన్దెయ్‌తిలెన్ ఎణ్ణిఅన్ద
తున్బమ్ తరు నిరయమ్ పలశూకిలెన్, తొల్లులక్రిల్
మన్ పల్లుయిర్ కట్కు ఇఱైయవన్ మాయనెన మొర్ర్రిన్ద
అన్బననకన్, ఇరామానుశన్ ఎన్నై యాణ్డననే!

**ప్రతిపదార్థం :**

| | |
|---|---|
| **తొల్ ఉలకిల్** | = అనాది అయిన |
| **మన్‌పల్ ఉయిర్ కట్కు** | = నిత్యులయిన జీవాత్మలందరికీ |
| **ఇఱైవన్** | = శేషి అయిన |
| **మాయన్** | = మాయావి అయిన విష్ణువే |
| **ఎనమొర్ర్రిన్ద** | = అని అనుగ్రహించిన |
| **అన్బన్** | = పరమకారుణికులును |
| **అనకన్** | = నిర్దోషులును, పుణ్యాత్ములును అయిన |
| **ఇరామానుశన్** | = భగవద్రామానుజులు |
| **ఎన్నై ఆండవన్** | = నన్ను దాసునిగా స్వీకరించారు కాబట్టి |
| **ఇన్బమ్ తరు** | = ఆనందాన్ని కల్గించే |
| **పెరు వీడు** | = మోక్షం |
| **వన్దు ఎయ్‌తిల్ ఎన్** | = లభిస్తే మాత్రం ఏమిటి? |
| **ఎణ్ ఇఅన్ద** | = అంతులేని |
| **తున్బమ్ తరు** | = దుఃఖాలను ఇచ్చే |
| **పల నిరయమ్** | = పలు నరకాలు |
| **శూర్ర్రిల్ ఎన్** | = చుట్టుముడితే మాత్రం ఏమిటి? |

**తాత్పర్యం:**

భగవద్రామానుజుల దాస్యం లభించడం సామాన్యమైన భాగ్యం కాదు. అటువంటి అదృష్టం లభించిన తరువాత, నాకు మోక్షం లభిస్తే గొప్పేమిటి? భయంకరమైన నరకబాధలు ఎదురైతే నష్టమేమిటి? ఏది లభించవలసినదో అది అదే భగవద్రామానుజుల దాస్యం లభించిన తరువాత మోక్ష నరకాలు రెండూ నాకు అనవసరమే - ఏది లభించినా ఏమాత్రం బాధలేదు. భగవద్రామానుజుల కృప నాపై వర్షించి, వారి సేవా భాగ్యం లభించడమే నా జన్మాంతర సుకృతం - అని అముదనార్లు యతిరాజ సేవా వైభవాన్ని కీర్తిస్తున్నారు. ఆ భాగ్యానికి మురిసిపోతున్నారు. (సశేషం)

An.Y. ఆర్థోఫిట్ సిరప్
fizikem
అన్ని రకముల జాయింట్ నొప్పులకు
సరికొత్త పరిష్కారం
ఇది ఫిజికెమ్ వారి ప్రతిష్టాత్మక ఉత్పాదనలలో ఒకటి
సత్వర నివారణకు అద్భుత ఆయుర్వేద ఔషధం
Also available as Oil & Capsules
ORTHO Fit Syrup
ఇంటింటా ఆర్థోఫిట్ నొప్పులన్నీ ఫటాఫట్

# శ్రీరామానుజ సహస్రాబ్ది 2016-17

ప్రియ భగవద్బంధువులారా! రాబోయే 16, 17 సంవత్సరాలలో భగవద్రామానుజ సహస్రాబ్దిని మహా వైభవంగా జరుపుకోబోతున్నామని పాఠకులకు తెలియజేయడం జరిగింది. మీకు శుభకామనలు. ఈ సందర్భంగా మీరు సమర్పించ దలచుకున్న ద్రవ్యాన్ని ఈక్రింది అకౌంట్‌కి సమర్పించవచ్చు.

ఇక్కడ ఒక విషయాన్ని గమనించండి.

శ్రీరామానుజ సహస్రాబ్ది అనేపేరున చెక్కుకానీ, డి.డి కానీ, ట్రాన్స్‌ఫర్ ఓచర్ తీసుకుని కానీ, మీరు వేయదలచిన ద్రవ్యాన్ని నేరుగా ఈక్రింది అకౌంట్‌కి జమచేసి, బ్యాంకుల్లో జమచేసినట్లు ఓచర్ వివరాలు మీదగ్గర ఒక కాపీ ఉంచుకుని, ఈక్రింది అడ్రస్‌కు పంపించండి. దాన్నిబట్టి మీకు సరైన రసీదుపంపడం జరుగుతుంది. మీ పూర్తి చిరునామా ఫోను వివరాలు తెలుపండి.

ఒకవేళ నేరుగా సమర్పించదలచుకున్నట్లయితే, ఆపేరున ఏకేంద్రాలలో సమర్పించవచ్చో ఆవివరాలు కూడా ఈక్రింది ఫోన్ నెంబర్లకు చేసి తెలిసికోవచ్చు.

శ్రీరామానుజ సహస్రాబ్ది,
జీవా, శ్రీరామనగర్, ముచ్చింతల్(గ్రా), పాలమాకుల(పో),
శంషాబాద్ (మం), రంగారెడ్డి జిల్లా -509325

శ్రీరామానుజ సహస్రాబ్ది కార్యనిర్వాహక సమితి
కార్యదర్శి - 9441562863, 9676825361,
ట్రెజరర్ - 9246540270



**శ్రీరామానుజ సహస్రాబ్ది**
**ఆంధ్రాబ్యాంక్-ముచ్చింతల్ శాఖ**
**అకౌంట్ నెం.** 209710100000007
IFSC Code ANDB – 0002097

RTGS/NEFT **ద్వారా ఆంధ్రాబ్యాంకు ముచ్చింతల్ బ్రాంచికి జమచేయవచ్చు. మీరు పంపే చెక్కులు విధిగా క్రాస్‌చేసి లేదా అకౌంట్ పేయీచేసి పంపగలరు.**

సమతామూర్తికి జరిపే శిలాన్యాసానికి సాదర స్వాగతం! అందరూ తరలిరండి!!

02.05.2014 శుక్రవారం ఉదయం 9గం॥-10గం॥ మధ్య మన శ్రీరామనగరం జీవ ప్రాంగణంలో శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి పవిత్ర కరకమలముల ద్వారా సమతామూర్తి భగవద్రామానుజుల శ్రీ విగ్రహ నిర్మాణానికి శిలాన్యాసం జరుగనున్నది.

**ఆచార్యసేవలో పాల్గొనాలనుకొనే భగవద్బంధువులకు స్వాగతం పలుకుతున్నాం!**




జై శ్రీమన్నారాయణ!

మెళ్ళచ్చెరువు మహాసిమెంట్స్ ప్రాంగణంలో
శ్రీకళ్యాణవేంకటేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవ సందర్భముగా

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి
కరకమలములచే ఆవిష్కృతమైన
శ్రీజయనామ సంవత్సర క్యాలెండర్ - పంచాంగము 2014 - 15

ప్రామాణికమైన దశావతార చిత్రములతో, అవతార విశేషాలను శ్లోక, తాత్పర్యరూపంగ క్లుప్తంగ వివరిస్తూ మీముందుకు వచ్చింది. శ్రీజయనామ సంవత్సరంలో అందరికీ జయాలు, శుభాలు కలగాలని భగవంతుని ప్రార్థిస్తూ అందిస్తోంది మీ భక్తినివేదన.

పంచాంగం కావలసినవారు
శ్రీరామానుజవాణి, మరియు వికాసతరంగిణి శాఖలద్వారా పొందవచ్చును

శ్రీరామానుజవాణి
11-49-136 శివాలయం వీధి
విజయవాడ - 1
ఫోన్ 0866 2420820

జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్
సీతానగరం, 522501
గుంటూరు జిల్లా.
ఫోన్ 08645 272929, 272353

జీవా, శ్రీరామనగర్, ముచ్చింతల్ (గ్రా), పాలమాకుల (పో),
శంషాబాద్ (మం), రంగారెడ్డి జిల్లా -509325




*గత సంచిక తరువాయి*

ఇక్కడ తాత్పర్య చంద్రికాకారులు ఈ విషయాలనే వివరించారు. **ఏతదుక్తం భవతి** అని భగవద్రామానుజులు ఉట్టంకించిన వచనాలను వివరిస్తూ తాత్పర్యదీపికాకారుడైన సుదర్శనభట్టు ఇలా అన్నారు..

**దేవత్వాది విశిష్టశరీరాణి, జీవద్వారా బ్రహ్మాత్మకాని, "అప్రాణ వత్సుస్వల్పాసా" "తతోహి శైలాబ్ధి ధరాది భేదాన్ జానీహి విజ్ఞాన విజృంభితాని", "భూతానాం ప్రాణినః శ్రేష్ఠాః ఇత్యాదిభిః, లోష్ఠకాష్ఠాదేః జీవాధిష్ఠితత్వ శ్రవణాత్ కాష్ఠం శిలా ఇత్యాద్యుక్తమ్. ఛిన్నద్రుమో హి కాష్ఠం, తత్ర ద్రుమావస్థాధిష్ఠాతృ జీవాపగమేపి, కాష్ఠావస్థాభిమానీ జీవో విద్యత ఏవ, నామరూప భాక్త్వాత్ ఇతి భావః** అని.

ఈవాక్యాల అభిప్రాయం ఇది. "దేవత్వాది ధర్మంతో కూడిన శరీరాలన్నీ, జీవునిద్వారా బ్రహ్మాత్మకాలే. ప్రాణరహితాలైన వస్తువుల్లో ఆ జీవశక్తి చాలా తక్కువగా ఉంటుంది. కనుక శైలాలు, అబ్ధి, ధర మొదలైన వస్తుభేదాలన్నీ విజ్ఞానశబ్దవాచ్యుడైన జీవునిచే వ్యాపించి ఉన్నాయి. ఉనికి గల వస్తువుల్లో (భూతాల్లో) ప్రాణవంతాలైనవి శ్రేష్ఠమైనవి ఇత్యాది వచనాలచేత లోష్ఠం (మట్టిబెడ్డ) కాష్ఠం(కర్ర) మొదలైన వాటిలో జీవుడు అధిష్ఠించి ఉన్నాడని శ్రుతి చెబుతున్నది. కనుక **కాష్ఠం శిలా** ఇత్యాది చెప్పబడింది. చెట్లు నరికినపుడు దానిలోంచి జీవుడు వెళ్ళిపోయినా, అక్కడ కాష్ఠాభిమాని అయిన (మరొక) జీవుడు తప్పక ఉంటాడు. నామరూపాలను పొందటం ఉందికదా అని అభిప్రాయం"

ఈవాక్యాలను పరిశీలించినపుడు, ముఖ్యంగా చివరివాక్యాలను చూచినపుడు కాష్ఠ,లోష్ఠ,ద్రుమాది విభిన్నావస్థల్లో ఉన్న అచేతన వస్తువులలో చేతనులు తప్పక ఉండితీరాలి, లేకపోతే నామరూపాలను పొందటం కుదరదు కదా అంటున్నారు సుదర్శన సూరి.

**రామానుజ దర్శనంలో సృష్టి ప్రళయ ప్రక్రియలు**

ఇంతవరకూ చిత్, అచిత్, ఈశ్వర లేక పరమాత్మ అనే మూడు తత్త్వాలకు ఉన్న పరస్పర సంబంధాన్ని వేదార్థసంగ్రహ- తద్వ్యాఖ్యా వచనాలతో అవగతం చేసుకునే ప్రయత్నం చేసాం. ఇప్పుడు ఈమూడింటికీ సృష్టి ప్రళయ ప్రక్రియలో ఎలాంటి సంబంధం ఉన్నదో ఎలాంటి నామరూపాది వ్యవహారం ఉన్నదో గమనించే ప్రయత్నం చేద్దాం. ఈఅంశంలో శ్రీభాష్యాది గ్రంథ వచనాలను కూడా పర్యాలోచనం చేద్దాం. రామానుజ దర్శనంలో చిత్ అంటే జీవుడని, అచిత్ అంటే జీవునికంటే వేరైన తత్త్వమని అది మూడురకాలుగా ఉండగా వాటిలో మిశ్రసత్వం అని చెప్పబడేదే ప్రకృతి అని, ఈ కంటికి కనిపించే ప్రపంచమంతా ప్రకృతి పరిణామమేనని రామానుజ దర్శనం ఉద్ఘోషించింది.

ఈ ప్రకృతినే అచేతనమని కూడా అంటున్నాం కదా. లోక వ్యవహారంలో మనం అచేతనాలనుకున్నవన్నీ ప్రాణరహితాలైన వస్తువులు. వీటికి చేతన సంబంధం లేదని మనకు ఒక సామాన్యమైన భ్రాంతి ఉన్నట్లు కూడా వెనుక చెప్పుకున్నాం. చేతన సంబంధంలేని అచిద్వస్తువు ఉండనే ఉండదని కూడా విష్ణుపురాణ వచనాన్ని బట్టి మనం తెలుసుకున్నాం. చేతనాచేతనాల్లో నిత్యం ప్రవేశించి ఉంటూ నియమించేవాడే ఈశ్వరుడని, ఇలా నియమిస్తాడు కనుకనే ఆయనకు అంతర్యామి అని పేరని మనం గ్రహించాము. ఈమూడు తత్త్వాలు అంటే చేతన, అచేతన, అంతర్యామి అయిన ఈశ్వర అనే తత్త్వాలు నిత్యాలై, ఒకదానితో ఒకటి నిత్యసంబద్ధాలై, (నిత్యసంబంధం కలిగి) ఏదశలోను విడివడకయే ఉంటాయని ఉపనిషత్సిద్ధాన్తాన్ని మనం గ్రహించాలి.

ఇక చేతనుడంటే జీవుడని చెప్పుకున్నాం కనుక జ్ఞానసంబంధం నిత్యం కలవాడే చేతనుడని అలాంటి చేతనుని సంబంధం అచేతనానికి ఎప్పుడూ ఉంటుందని గ్రహించాం. ఈచేతనాచేతనాలకు సృష్టిదశ ప్రళయదశ అని రెండు అవస్థలుంటాయని ఉపనిషత్తులు చెబుతున్నాయి. చేతన సంబంధం వల్ల కలిగే పరిణామం మాత్రం ప్రళయదశలో ఉండదని, సృష్టిదశలో మాత్రమే అది ఉంటుందని ఇప్పుడు మనం గ్రహించాలి. జ్ఞానమున్నట్టు స్పష్టంగా ప్రాణస్ఫురణాదులను బట్టి ఎక్కడ తెలుసుకునే అవకాశం ఉన్నదో దాన్ని మాత్రమే మనం చేతనమని వ్యవహరిస్తూ ఈ జ్ఞానస్ఫురణం తక్కువగా ఉండి ప్రాణస్ఫురణం స్పష్టంగాలేని వస్తువులను జడాలుగా(అచేతనాలుగా) జీవసంబంధం లేనివానిగా మనం వ్యవహరిస్తున్నామని ఇది సరికాదని కూడా మనం గ్రహింపవలసి ఉంది.

రామానుజదర్శనంలో చేతనవర్గానికి అచేతన వర్గానికి నామం అంటే పేరు, రూపం అంటే ఆకార వికారం అనేవి ఎలా ఏర్పడతాయి? ఎప్పుడు ఏర్పడతాయి? అని ముందుగా మనం తెలుసుకొనే ప్రయత్నం చేద్దాం. వేదాంత వాక్యాలు పరమాత్మను ఈ జగత్తుకు కారణంగా చెబుతున్నాయి. కారణము మూడు రకాలుగా ఉంటుంది. ఉపాదాన కారణము, నిమిత్త కారణము, సహకారి కారణము అని. ఏమూల ద్రవ్యాన్ని తీసుకుని ఒకవస్తువు ఏర్పడుతున్నదో ఆమూలద్రవ్యానికి ఉపాదాన కారణమని పేరు.

ఉదాహరణానికి మట్టిని తీసుకుని కుండ ఏర్పడుతున్నది. బంగారాన్ని తీసుకుని ఆభరణాలు ఏర్పడుతున్నవి. కనుక కుండకు మట్టి ఉపాదాన కారణం, ఆభరణాలకు బంగారం ఉపాదాన కారణం అని శాస్త్రం చెబుతున్నది. కేవలం ఉపాదాన కారణం వల్లనే వస్తువు తయారు కాదు. దానిని తయారుచేసే వ్యక్తి కూడా ఉండాలి. వాడిని నిమిత్త కారణం అంటారు. ఆ వ్యక్తి కొన్ని సాధనాలు తీసుకుని కుండను తయారు చేస్తాడు లేదా నగలను తయారు చేస్తాడు. ఈ సాధనాలను లేదా పరికరాలను సహకారి కారణం అంటారు. ఇలా ఒక మూల ద్రవ్యాన్ని తీసుకుని ఒకవ్యక్తి కొన్ని పరికరాలతో లేదా సాధనాలతో ఒక వస్తువును తయారు చేయడం మనకు లోకంలో కనిపిస్తున్న విషయమే.

ఈసమస్త జగత్తు చేతన వస్తువులతోను, అచేతన వస్తువులతోను కూడి ఉన్నది. మరి ఈ ప్రపంచాన్ని తయారు చేయడానికి కూడా ఏవో కొన్ని ఉపాదాన కారణాలు(మూలకారణాలు) కొన్ని నిమిత్తకారణాలు (ఆయావస్తువులను తయారు చేసేవారు) కొన్ని ఉపకరణాలు లేదా సాధనాలు అంటే సహకారి కారణాలు విడివిడిగా ఉండితీరాలి కదా? అన్న శంకను నివారిస్తూ వేదం ఇలా అంటుంది. ఈసమస్త ప్రపంచానికి ఉపాదాన కారణం పరమాత్మయే, నిమిత్త కారణం పరమాత్మయే. సాధన సంపత్తి కూడా పరమాత్మయే. కనుక పరమాత్మకంటే వేరుగా ఉపాదానం, నిమిత్తం, సాధనం అంటూ ఏదీ విడివిడిగా లేదు అని అంటూ ఈవిషయాన్ని ఒక అందమైన పోలికతో వేదం మనముందు ఉంచుతున్నది.

ఒక జిజ్ఞాసువు ఇలా ప్రశ్నిస్తున్నాడు.

**కింస్విద్వనం? క ఉ స వృక్ష ఆసీత్, యతో ద్యావాపృథివీ నిష్టతక్షుః ।**
**మనీషిణో మనసా పృచ్ఛతే దు తత్, కిమధ్యతిష్ఠద్భువనాని ధారయన్?**

"ఓ మనన శీలురారా! మనఃపూర్వకంగా అడుగుతున్నాను. ఆ వనం ఏది? ఆ వనంలోని ఆవృక్షం ఏది? దేనితో ఈ ద్యావాపృథువులను చెక్కినారో అది ఏమిటో చెప్పండి. ఈ భువనాలను అధిష్ఠించిఉండి ధరిస్తున్నది ఏమిటి? ఇలా ప్రశ్నించిన ఈప్రశ్న ఈప్రపంచాన్నంతటినీ ఒక చెక్కతో చెక్కిన వస్తువుగా భావనంచేసి, ఆవస్తువు తయారు కావడానికి మూలకారణమైన చెక్క ఏచెట్టులోంచి వచ్చింది? ఆచెట్టు ఏఅడవిలో ఉంది? అని ప్రశ్నిస్తున్నాడు. ఇలా ప్రశ్నించడంలో ప్రపంచము ఏవస్తువుతో తయారైంది అనే జిజ్ఞాస, దీనిని ఎవరు తయారు చేసారు అనే జిజ్ఞాస, రెండూ ఇమిడి ఉన్నాయి. ఈప్రపంచానికి ఉపాదాన కారణము, నిమిత్త కారణము అంటే ఏమిటి? అని అడుగుతున్నాడు. అంతేకాదు అసలీ ప్రపంచాన్ని అధిష్ఠించి ఉండి నిలబెడుతున్నవాడు ఎవడు? అనికూడా మరొక ప్రశ్న. జిజ్ఞాసువు అడుగుతున్నాడు. అయితే వీటన్నింటికీ బుద్ధిమంతుడైన మంత్రద్రష్ట ఒకే సమాధానాన్ని చెబుతున్నాడు.

**బ్రహ్మ వనం, బ్రహ్మ స వృక్ష ఆసీత్,**
**యతోద్యావాపృథివీ నిష్టతక్షుః ।**
**మనీషిణో మనసా బ్రవీమివో,**
**బ్రహ్మాధ్యతిష్ఠద్భువనాని ధారయన్ ॥** అని...

"ఓ బుద్ధిమంతులారా! మనఃపూర్వకంగానే మీకు నేను చెబుతున్నాను. బ్రహ్మం అనే వనంలోంచి, బ్రహ్మమనే వృక్షాన్ని స్వీకరించి దాని కర్రతో ద్యావాపృథువులనే ఈసమస్త ప్రపంచాన్ని చెక్కారు. ఈభువనములను అధిష్ఠించిఉండి ధరిస్తున్నది ఆబ్రహ్మమే. ఇలా చెప్పడంచేత ఈ ప్రపంచం తయారుకావడానికి మూల వస్తువు బ్రహ్మమే అని, తయారు చేసినవాడు కూడా బ్రహ్మమే అని, ఆయనే అధిష్ఠించిఉండి ఈ భువనాలను ధరిస్తున్నాడని చెప్పబడింది. (సశేషం)

## మార్చినెల మెదడుకు మేత సమాధానములు

1. ప్రాణాలు 2. అయోధ్యకాండ, ఉత్తరభాగంలో 3. వేరు చేయరాని విశేషణం. 4. పరబ్రహ్మం; 5. జై శ్రీకృష్ణ! జైజై వాసుదేవ!! జైజైజై శ్రీమన్నారాయణ!!!; 6. దుంధుళి; 7. కురిసే మేఘంతో; సంతానం లేదని; 8. భగవద్రామానుజులు; 9. సంతానం లేదని; 10. 1992, గోదావరి నదిమధ్యలో; 11. బంగారువర్ణ దేహంతో 12. దేహాత్మభ్రాంతి; 13. తల ఒగ్గవలసినదే; 14. సముద్రములో; 15. శాస్త్రదృష్టి; 16. నగరాన్ని రక్షించుకోమని. ఇచ్చాడు. 17. శ్రీశార్ఙ్గం; 18. నక్స్వామికా; 19. సుమారు 18 వేలమందికి; 20. శ్రమపడకుండా, కొద్దిపాటి పెట్టుబడితో, అసలు పెట్టుబడే లేకుండా బాగా ధనాన్ని సంపాదించాలని చేసే ప్రయత్నం.

మరింత విశాలంగా ... వినూత్నంగా....
ప్రత్యేక 1 గ్రామ్ జ్యూయలరీ కౌంటర్
కామధేను సిల్క్స్
బీసెంట్‌రోడ్, విజయవాడ-2. ఫోన్: 2574220

అదృష్ట రత్నాలు ధరించండి! అనుకున్నది సాధించండి!

శ్రీ సాయి
పవిత్ర డైమండ్స్
4/7, బ్రాడీపేట, ఖజానా జ్యూయలర్స్ ప్రక్కన, గుంటూరు. సెల్: 9246410099, ఫోన్ : 2262626.
బి/3, జైహింద్ కాంప్లెక్స్, గ్రౌండ్‌ఫ్లోర్, యాక్సిస్‌బ్యాంక్ ప్రక్కన, గవర్నర్‌పేట, విజయవాడ. సెల్ : 9246310099, ఫోన్ : 6665011.
సంపూర్ణ జ్యోతిష్యం చూడబడును
నాణ్యమైన జాతిరత్నాలు
జెమ్ టెస్టింగ్ ల్యాబ్
కెంపులు పచ్చల పూసలు
మంచి ముత్యములు, పగడములు
శివస్వరూపమైన రుద్రాక్షలు
స్పటికమాలలు
1 గ్రామ్ గోల్డ్ ఇమిటేషన్ జ్యూయలరి



# శ్రీరామాయణంలో జంటలు

# భరత - లక్ష్మణులు



కన్నతల్లియైన కైకేయి తన సోదరుని వనవాస గమనం, తండ్రి మరణం గురించి విన్న భరతుని ఆవేదనకి అంతేలేదు. తనకి రాజ్యం లభింపచేయడం కోసం, మర్యాదాపురుషోత్తముడైన రాముని వనానికి పంపివేసిన కైకేయిపై తీవ్రమైన కోపం వచ్చింది. 'అసలు నువ్వు నాకు తల్లివే కావు. నీకూ నాకు సంబంధమే లేదు. నిన్ను ఇప్పుడే వదిలి పెట్టేస్తున్నా...' అనాలన్నంత ఆవేశం కలిగింది. కానీ, అంతలో రామునికి కైకేయిపై ఉన్న మాతృభావన గుర్తురావడంతో ఆగిపోయాడు. కైకేయిని తాను పరిత్యజిస్తే, రాముడు తనని సోదరునిగ అంగీకరించడేమోనన్న భయంతో క్రోధాన్ని అణచుకున్నాడు.

దుఃఖం మాత్రం తట్టుకోలేకపోయాడు. సాక్షాత్ ధర్మస్వరూపుడైన రాముని దూరం చేసిన పాపానికి తల్లిని నిందిస్తాడు. ఒక సోదరునిగ, రాజుగ, పరమాత్మగ సర్వప్రాణులకీ రాధ్యనీయుడు "రాముడే"నన్న తత్త్వజ్ఞానం కల జీవునికి ప్రతీక భరతుడు. కనుకనే, మోక్షసామ్రాజ్యాన్నే అనుగ్రహించగల రామచంద్రుని, పరిమితమైన భూసామ్రాజ్యం కోసం దూరం చేసిన తల్లిని నిందించాడు. చేసిన పాపానికి ఏదోవిధంగ ప్రాణత్యాగం చేసుకోవడమే కైకేయికి తగిన ప్రాయశ్చిత్తమన్నట్లు దూషించాడు. కానీ, తానే స్వయంగ శిక్షించలేదు. రామునికి పరతంత్రుడు కనుక.

తనలానే ఆవేశపడుతున్న శత్రుఘ్నుని కూడా సముదాయించి తమ పారతంత్ర్యాన్న గుర్తుచేశాడు. కైకేయి మనసులో విషబీజం నాటిన మంధరను శిక్షించాలని శతృఘ్నుడు ఆమెను పట్టుకొని ఈడ్చుకుపోతుంటే, కైకేయి వచ్చి భరతుని రక్షించమంటుంది. ఆ సందర్భంలో భరతుడు శతృఘ్నునికి నచ్చచెప్తాడు.

'శతృఘ్నా! నీకే కాదు నాకు కూడా మంధరమీద కోపం కలిగింది. కానీ, ఆమె దాసి. దుష్టబుద్ధి కలది. ఆమె మాటలు విని మతితప్పిన నాతల్లిమీద, ఇంకా కోపం వచ్చింది. దాసిమాటలతో బుద్ధిగడ్డితిని తనకుటుంబాన్నే సర్వనాశనం చేసుకొన్న నా తల్లిని నిజానికి చంపవలసింది. అయినా, నేను ఎందుకు ఊరుకున్నానో తెలుసా! స్త్రీలని చంపరాదన్నది శాస్త్రం. అది కూడా ప్రక్కన పెట్టి శిక్షించదగిన పనే కైకేయి చేసింది.

కానీ, సోదరా!

హన్యామహమిమాం పాపాం కైకేయీం దుష్టచారిణీం ।
యది మాం ధార్మికో రామో నాసూయే న్మాతృఘాతకమ్ ॥
ఇమా మసి హతాం కుబ్జాం యది జానాతి రాఘవః ।
త్వాం చ మాం చ హి ధర్మాత్మా నాభిభాషిష్యతే ధ్రువమ్॥

రాముడు, మాతృఘాతుకుడనని, నాపై కోపిస్తాడన్న ఒక్క భావనతో ఊరుకోవలసి వచ్చింది. సదా శాస్త్రానువర్తి, ధర్మానువర్తి అయిన మన సోదరుడు రామచంద్రుడు, కైకేయినే కాదు, దుష్టబుద్ధియైన మంధరలాంటి స్త్రీని చంపినా, నీతోనూ, నాతోనూ మాట్లాడనే మాట్లాడడు, సరికదా, మనం ముఖం చూడడానికైనా ఇష్టపడడు. కనుక రాముని తలచుకునియైనా మనం ఈ ఆవేశాన్ని వదులుకోవాలి. ఈ స్త్రీలిద్దరినీ వదిలివేయాలని నచ్చచెప్తాడు.

భరతునిలోని ఈ ప్రవృత్తి జీవునిలోని పారతంత్ర్యాన్ని సూచిస్తోంది కృత్యాకృత్య వివేచన చేసేటప్పుడు మనం గుర్తుంచుకోవలసిన పాఠాన్ని ఈ సన్నివేశాన్ని భరతుడు నేర్పిస్తున్నాడు. మనం చేసే పని శాస్త్ర సమ్మతమా? విరుద్ధమా? అని కాదు ఆలోచించాల్సింది. ఈ పనివలన భగవంతునికి ప్రీతి కలుగుతుందా! లేక అప్రీతి క్రోధం కలుగుతాయా అన్నిది ప్రతిజీవి గమనించు కోవలసింది.

భరతుడు పరమాత్మయైన రామునికి అప్రీతిని, క్రోధాన్ని కలిగించే పనిని మానుకున్నాడు. పరతంత్రునిగ తన ఆత్మ స్వరూపాన్ని నిలబెట్టుకున్నాడు.

నిజంగా భరతునికి రాముడు పరమాత్మే నన్న జ్ఞానం ఎంతగాఢంగా ఉందో తెలిపే మరో సన్నివేశం మనకి అయోధ్యాకాండలోనే వివరించారు వాల్మీకిమహర్షి.

దశరథ చక్రవర్తికి జరగవలసిన అపరకర్మలన్నీ పూర్తయిన మరునాడు పెద్దలంతా కలసి భరతుని రాజుగ చేయడానికి సంసిద్ధమయ్యారు. భరతుడు పట్టాభిషేకానికి సంసిద్ధమైన సామగ్రి కూడా రామునికే చెందినదని వినయంతో ప్రదక్షిణం చేశాడు. ఆ సామగ్రినంతా తీసుకొని వెళ్ళి రాముని రాజలాంఛనాలతో అయోధ్యకి తిరిగి తీసుకొని రావడానికి ఏర్పాట్లు చేయమన్నాడు. వారంతా అందులో నిమగ్నం అయ్యారు.

రాజగురువైన వసిష్ఠులవారు రాజులేని రాజ్యంలో అరాచకం తలెత్తుతుందని, తక్షణమే భరతునికి పట్టాభిషేకం జరపడానికై ఒక సభని ఏర్పాటు చేశారు. అయోధ్యలోని మంత్రులను, వివిధ సంఘాల నాయకులని సభకి పిలిపించారు. అందరి సమక్షంలో భరతునికి రాజ్యం స్వీకరించవలసిందిగ భరతునికి నచ్చచెప్పారు.

అది వింటూనే భరతుడు సభామధ్యలో విలపించాడు. ఈ రాజ్యం ధర్మబద్ధంగ రామునికి చెందినది. ఆ రాముడే అన్నివిధాల రాజు కావడానికి తగిన యోగ్యతలన్నీ ఉన్నవాడు. తగినంతకాలం గురుకులవాసం చేసి వేదాలను, ఇతర శాస్త్రాలను అధ్యయనం చేసిన జ్ఞాని. వాటి అర్థములను

కూడా తెలుసుకొని ప్రవర్తించే ధర్మాచరణశీలి. అలాంటి రామునికి సోదరుడిగా నేను శాస్త్ర విరుద్ధంగా రాజునెలా కాగలను? అలా ప్రవర్తించిననాడు. రామునికి సోదరుడిగా గుర్తించబడే అర్హతని కోల్పోతాడు. రామునికి చెందినది రాజ్యం. నేను తీసుకుంటే అది దొంగతనంతో సమానం. ఇది తగదు.

"రాజ్యం చ అహం చ రామస్య ధర్మం వక్తుమిహార్హసి"

ఎలాగైతే రాజ్యం రాముని సొత్తే, అలాగే నేను కూడా రామునికి చెందిన వస్తువును. ఒక వ్యక్తికి చెందిన రెండు వస్తువులు ఒకదానిపై ఒకటి ఆధిపత్యం ఎలా చూపించగలదు. ఒకదానిని మరొకటి ఎలా అనుభవించగలదు? అంటూ తనని కూడా ఒక అచిద్వస్తువుగా రామునికి అధీనమై ఉండదగిన వస్తువుగా నిరూపించుకుంటూ, అచిద్వత్ పారతంత్ర్యాన్ని ప్రకటించాడు.

ఆత్మస్వరూపం తెలిసిన జ్ఞాని కనుక, జీవుడు ప్రకృతి రెండూ పరమాత్మ అధీనములే, పరతంత్రములే అని వ్యక్తీకరించాడు. ఈ విశ్వమంతా చేతనాచేతనాత్మకము.

అందులో చేతనులు, జీవులు. జ్ఞానం కలవారు. అచేతనము ఆయా జీవులకి శరీరాలుగ, భోగ్యపదార్థాలుగ, భోగోపకరణాలుగా ఏర్పడే ప్రకృతి జ్ఞానం లేనిది. ఇవి రెండూ పరమాత్మకు చెందినవే. వాని సంకల్పానుగుణంగా ఉపయోగపడదగినవే! జ్ఞానరహితమూ, చైతన్యరహితమూ అయిన ప్రకృతి సంపూర్ణంగా పరమాత్మ సంకల్పానుసారమే పరిణమిస్తూంటుంది. అలానే జ్ఞానం కలవాడైన జీవుడు కూడా చిత్‌లాగ పరమాత్మ అధీనుడయ్యే ప్రవర్తిస్తూంటాడు.

అయోధ్య సామ్రాజ్యం ప్రకృతి అనుకుంటే, భరతుడు, జీవుడు. ఇద్దరూ పరమాత్మ అయిన రామునికి అధీనులే! కనుకనే రాజ్యము, తానూ ఇద్దరూ రామునిచే అనుభవింపదగినవారు. తనకంటూ స్వతంత్రత, రాజ్యభోగానుభవము తగవని భరతుడు అత్యంత పారతంత్ర్యాన్ని జీవునిగ ప్రదర్శించాడు. (సశేషం)


జై శ్రీమన్నారాయణ!

శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి నేతృత్వంలో నిర్వహించే జీయర్ ఇంటిగ్రేటెడ్ వేదిక్ అకాడమీకి చెందినది

అడ్మిషన్లు జరుగుతున్నవి. త్వరపడండి

**జీవాగురుకులము, క్రొత్త విద్యార్థులను ఆహ్వానిస్తోంది**

Reg.A.P. Govt

**ప్రస్తుతం 150 మంది విద్యార్థులకు వైదిక / లౌకిక విద్యలను బోధించే ఈ గురుకులంలో ఈ ఏడాది చేరడానికి రుచి, శ్రద్ధకల విద్యార్థులు అప్లికేషన్లు పెట్టుకోవచ్చు.**

**బోధనామాధ్యమం** - ఇంగ్లీషు & సంస్కృతం.

**బోధనాంశాలు** - వేద, వేదాంత శాస్త్రముల అధ్యయనం/ లౌకికవిద్య

**అభ్యాస కాలం** - 10 సం॥లు

**అభ్యర్థి వయస్సు** - 8సం॥ నుండి 12సం॥ లోపు

**కనీస అర్హతలు** - ఇంగ్లీషు, తెలుగు చక్కగ చదువుట, వ్రాయుట. వైదికవేషంలో ఉండాలి.

**దరఖాస్తులు లభించుచోటు**

www.chinnajeeyar.org / jivagurukulam

or జీవా ప్రాంగణంలో కూడ లభిస్తాయి.

**మరిన్ని వివరాలకు సంప్రదించండి** 94415 83064/ 93462 62189/ 9704882707

**ఇతర వివరాలు**

- **అభ్యర్థి పూర్ణ ఆరోగ్యంతో చురుకుగ ఉండాలి. ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణులైతేనే మౌఖిక పరీక్షకు పిలుస్తారు. అందులో ఉత్తీర్ణులకే గురుకుల ప్రవేశం.**
- **4 వ సం॥ ఇంగ్లీషు మీడియంలో స్టేటుసిలబస్ 10వ తరగతికి పంపిస్తారు.**
- **2013-10వ తరగతి పబ్లిక్ పరీక్ష ఇచ్చిన 14మంది విద్యార్థులలో 12మంది ఫస్ట్‌క్లాస్‌లో ఉత్తీర్ణత. అత్యధిక 9.3 GPAను జీవాగురుకుల విద్యార్థులు సాధించారు.**

*గమనిక:* ఏవిషయంలోనైనా తుదినిర్ణయము గురుకుల యాజమాన్యానిదే.

**JIVA, శ్రీరాంనగరం, ముచ్చింతల్, పాలమాకుల పోస్ట్ 509 325 శంషాబాద్, రంగారెడ్డి జిల్లా. ఆంధ్రప్రదేశ్**

# శ్రీవేంకటాచల "చిత్రే"తిహాసమాల

10

రచనం
రంగరామానుజాచార్య

చిత్రానువర్తనం
జి.వి.ఎస్. శ్రీనివాస్
కె. సత్య శ్రీనివాస్



యాదవరాజ సభలో జరుగుతున్న వాద ప్రక్రియలో, శ్రీనివాసునికి పొడవైన కేశపాశం ఉండటంవల్ల ఆయన జటాజూటం కలిగిన పరమశివుడు ఎందుకు కాకూడదు? అని కొందరు శంకించారు. భగవద్రామానుజులు, స్వామికి పొడవైన కేశాలుండటం అసహజం కాదని, ఇంతమాత్రంచేత ఆయన వేరొకదైవం కాదని సప్రమాణంగా నిరూపించారు. సాత్త్వతసంహితలో వర్ణింపబడిన శ్రీనివాసునికి, **సితోష్ణీషలలాటం చ నాతి దీర్ఘ జటాధరమ్** తెల్లని తలపాగాతో కూడిన నుదురు, మరీ అంత పొడవుకాని జడలు ఉన్నాయని వర్ణింపబడింది. ఇలాగే శ్రీవరాహపురాణంలో **సుసూక్ష్మక్షౌమసంవీత నీలచూలిక యోజ్జ్వలమ్** చాలా సూక్ష్మమైన పట్టుబట్టతో చుట్టబడిన నీలవర్ణంకల గిరజాలతో ఉజ్జ్వలమైన వదనం కలవాడు స్వామి అని వర్ణింపబడింది. ఇక్కడ స్వామి గుర్రంపై స్వారీ చేస్తూ వెళ్తున్నట్లు, పద్మావతీ వివాహానికి పూర్వస్థితిని వర్ణించిన ఘట్టంలో స్పష్టంగా చెప్పబడింది. ఇక భవిష్యోత్తరపురాణంలో కూడా ఇలాంటి సన్నివేశాన్ని వర్ణించిన ప్రఘట్టకంలో **కబరీ కృతకేశేషు రక్తవస్త్రం సువేష్ట్య చ** అని ఉంది. కేశపాశాన్ని కొప్పుగా దిద్దుకుని దానికి ఎర్రనివస్త్రాన్ని పాగగా చుట్టినట్లు వర్ణింపబడింది. ఇవన్నీ శ్రీనివాసునికి కేశాలు వ్రేలాడుతూ జడలుగా ఉన్నవని తెలియజేస్తున్నాయి. ఆళ్వారులలో మహాయోగి (పేయాళ్వార్)–

**"తాళ్శడైయుమ్, నీణ్ముడియుమ్"** ఇత్యాది పాశురంలో వ్రేలాడే జడలు స్వామికున్నాయని వర్ణించారు. వీటిని రామానుజులుట్టంకించారు. కనుక జటలు ధరించినందువల్ల స్వామి, నారాయణుడు కాదనడానికి వీలులేదని ఈప్రమాణాలు నిరూపిస్తున్నాయి.

ఇక, శైవులుచేసిన మరొక శంక, స్వామి నాగాభరణాలు ధరించడం. నారాయణునికి నాగాభరణాలు ఎలా వచ్చాయని వారి సంశయం. దీనికి అనంతార్యులు ఐతిహ్యాన్ని ఉట్టంకించారు. పురాణాలలో, నాగాభరణం స్వామికి ఉండటం సముచితమేనని రామానుజులు ప్రమాణాలను చూపారు. పద్మసరోవరంలో శ్రీశుకమహర్షిని అనుగ్రహించడానికి శ్రీనివాసుడు సాక్షాత్కరించిన వైనాన్ని పద్మపురాణం వర్ణించిన ఘట్టంలో చాలా స్పష్టంగా, **"నాగైరభినవాకల్పైః తపనీయమయాంశుకైః"** బంగారపు నాగాభరణాలతోను, స్వర్ణవికారాలైన వస్త్రాలతోను ఒప్పుతున్నాడు స్వామిఅని చెప్పబడింది. భవిష్యోత్తర పురాణంలో పార్వతితో పరమేశ్వరుడు స్వామిని, **'రమణీయాహిభూషణు'** నిగా వర్ణించాడు.

**ఇంద్రనీలమణిశ్యామరమణీయాహిభూషణైః ।**

**శంఖచక్రాభయాది శ్రీభూషితైశ్చ భుజోత్తమైః ॥** అని

మరొకచోట **"భోగేంద్ర సద్భూషణం"** అని పరమశివుడు స్వామిని కీర్తించాడు. ఇంతేకాక, వాయు, శేషులకేర్పడిన స్పర్ధలో పరాజితుడైన శేషుని ఓదార్చి, స్వామి, నీకంటే నాకు ప్రియుడు లేడని కీర్తించాడు. కనుక, శేషప్రీతికొరకు నాగాభరణాలను ధరించాడు స్వామి అనికూడా చెప్పవచ్చు. అయితే పద్మావతీ పరిణయానన్తరం, స్వామికిగల శేషప్రీతిని ఆవిష్కరించడానికే తన అల్లుడైన శ్రీనివాసునికి ఆకాశరాజు రెండు నాగాభరణాలను సమర్పించాడని భవిష్యోత్తరపురాణంలోని పదకొండవ అధ్యాయం స్పష్టపరుస్తోంది.

**కన్యాప్రదాన సమయే దక్షిణాం రాజసత్తమః ।**

**కోటిసంఖ్యాన్నిష్కపుంజాన్ దత్తవాన్ వేంకటేశితుః ॥** అని ప్రారంభించి, ఆకాశరాజు ఏయే ఆభరణాలు కన్యాదాన సమయంలో సమర్పించాడో చెబుతూ

**నాగాభరణ యుగ్మంచ బాహుపూరాదికాంస్తథా ।**

**భూషణాన్యంగులీయాంశ్చ దశానాం వీరముద్రికామ్ ॥**

రెండు నాగాభరణాలు, బాహుపూరాలు, పదివ్రేళ్ళకు అంగులీయకాలు, వీరముద్ర, వీటన్నింటినీ ఆకాశరాజు సమర్పించాడట. నాగాభరణ విషయంలో మరొక కథకూడా ఉంది. ఇది చారిత్రికం. దీని గురించి పై నెలలో తెలుసుకుందాం.

(సశేషం)





చిత్రకథ-

# రామానుజ చిత్రకథ

















దాసానుదాసః


హారీత గోత్రుడను,
కూరేశదాసుడను.
యతిరాజా!
మీదర్శన భాగ్యాన్నిచ్చి ధన్యుణ్ణి
చేసారు.


వేంచేయండి! కూర్చోండి!


ఈ సంసార విషవృక్షానికి రెండు
అమృత ఫలాలుంటాయి.


ఎన్నో జన్మల పుణ్యం పండితే, ఏర్పడే విష్ణుభక్తి ఓ అమృతఫలం


విష్ణుమార్గాన్ని చూపే మహానుభావుల సేవ అరుదైన అమృతఫలమంటారు.


మా అదృష్టఫలంగా మీసేవ మాకు లభించింది.


స్వామి కూరేశమిశ్ర మీరు ఉత్తమ జ్ఞాననిధులని, వైరాగ్య గుణసంపన్నులనీ విన్నాం.


మీ సౌశీల్యాన్ని వినయసంపదనీ ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నాం.


నిరాడంబరులైన మీ సాహచర్యం మాకెంతో స్ఫూర్తిదాయకం.


నిజం యతిరాజా! సద్గ్రంథ పరిశీలనలో
కూరేశులు మీకు తోడుంటే...
లోకంలో భగవద్భక్తి పెరుగుతుంది.
ఇంకా ఉంది




# SERVOMAX INDIA LIMITED

AN ISO - 9001:2008, ISO - 14001:2004 & BS OHSAS - 18001:2007 CERTIFIED COMPANY




*Safe Power*
*Saves Power*




Power Saver

- Exports to 26 Countries
- Over 1 Lakh Installations
- Pan India Operations
- Manufacturers of India's Highest Capacity Auto Transformers

## Green Energy & ESCO

Complete Solutions for Grid Connected or Off Connected


Solar Panels


Inverters



Batteries


Solar UPS


Solar Lamps


Solar Street Lights


Bharat Ratna Dr. M Visvesvaraya Industrial Award-2008 Best Performance in Small Scale Sector


Rajiv Gandhi National Quality Award - 2007


A.P Best Entrepreneur Award - 2009


CITD Industrial Trade Achievement Award - 2006

## Our Products

- Power Conditioners
- Servo Voltage Stabilizer (HT / LT)
- Power Savers
- Ultra Isolation Transformers
- Distribution & Power Transformers

# SERVOMAX INDIA LIMITED

# 406, Meridian Plaza, Ameerpet Hyderabad - 500 016. A.P. INDIA.
Ph: +91 40 4050 9999 / 9900

admin@servomax.net
www.servomax.net




ఓ యదుమహారాజా! ప్రకృతిలోని పంచభూతాల నుండి నేర్చుకోవలసిన అంశాలు విన్నావు కదా! ఇప్పుడు అదే ప్రకృతిలో ఉండే తోటి ప్రాణులైన పశు పక్ష్యాదుల నుండి, వాటి ప్రవర్తనారీతిని గమనించడం ద్వారా కొన్ని విషయాలు తెలుసుకోవచ్చు. కొన్ని పాఠాలు ఎలా ఉండాలో తెలుపుతాయి. మరికొన్ని సన్నివేశాలు ఎలా ఉండకూడదో నేర్పుతాయి. అరణ్యంలో పచ్చని చెట్లమధ్య పశుపక్ష్యాదులతో విహరిస్తూ నేను నిరంతరం గమనించిన సన్నివేశాలలో ఒక జరిగిన విషయాన్ని చెపుతా విను!

ఒకసారి ఈ అరణ్యంలో చెట్టుపై చక్కని పావురాళ్ళజంట గూడు కట్టుకొని నివసిస్తుండేది. అది పరస్పరము అత్యంతానురాగంతో ఎన్నడూ వీడక కలసి సంచరిస్తుండేది. ఆ జంట పావురాళ్ల ప్రవర్తన చూస్తే, నిరంతరం పరస్పరం వీక్షించుకుంటూ, ఒకదాని మనసు, మరొకదానితో నిలిపి భౌతికస్థాయికి అతీతమైన ఆత్మీయతతో జీవిస్తున్నట్లు ఉండేవి. అలా కొన్ని సంవత్సరాలు ఆనందంగ అన్యోన్యంగా ఆ జంట కాలం గడిపింది.

కొంతకాలానికి ఆడపావురము గర్భం దాల్చింది. ఇక మగపావురం ఆనందానికి అవధే లేదు. నిరంతరం ఆడపావురాన్నే వెన్నంటి ఉండేది. ఆడపావురం కూర్చున్నా, తిరుగుతున్నా, ఆహారం తింటున్నా, ఆడుతున్నా సర్వకాల సర్వావస్థలలోనూ దానితోనే ఉండేది మగపావురం. ఆడపావురం ఏదేది కావాలన్నా, ఎంతశ్రమైనా భయపడక తక్షణమే అది సంపాదించి తెచ్చి అందిస్తూ, తన అనురాగాన్ని ప్రకటించేది. ప్రేమతో ఇంకేమేమి కావాలో కొసరి కొసరి మరీ ముచ్చట తీర్చేది.

ఒక శుభదినాన ఆడపావురం తాము జంటగ చెట్టుపై నిర్మించుకొన్నగూటిలో భర్త అండగా ఉండగ గుడ్లని పెట్టింది. కొన్నిరోజులు ఆ జంట వాటిని ప్రేమతో సంరక్షించగా అందులో నుండి పిల్లలు బయటికి వచ్చాయి. సున్నితమైన దేహంతో సుకుమారమైన బుల్లిబుల్లి రెక్కలతో ఉన్న ఆ చిన్నిపక్షులని చూసి పావురాల జంట ఎంతో మురిసిపోయింది. ఆ చిట్టిపక్షుల బుడిబుడి నడకలు, చిన్ని చిన్ని రెక్కలతో ఎగిరే ప్రయత్నాలూ, కిలకిలా రావాలు వింటూ పరమానందం పొందేవి. ఆ చిన్నారులకోసం ఎక్కడెక్కడికో ఎగిరివెళ్ళి ఆహారాన్ని సంపాదించి వాటి నోటికి అందిస్తూండేవి. జాగ్రత్తగ పెంచుకుంటూండేవి.

ఒకనాడు ఆదారిన వచ్చిన ఒక వేటగాడు చెట్టుపైనున్న ఆ పక్షిగూటిని చూశాడు. గూటిలోని పిల్లపక్షుల కిలకిలారావాలు విన్నాడు. వెంటనే ఆ చెట్టు దగ్గర వలపన్ని, దూరంగా దాగి గమనిస్తున్నాడు. బుల్లిబుల్లి రెక్కలతో పిల్లపావురాళ్లు ఎగరాలని ప్రయత్నిస్తూ, గూటిలోనుండి జారి వేటగాని వలలో చిక్కుకున్నాయి. దురదృష్టవశాత్తు ఆ సమయంలో పావురాళ్లజంట పిల్లల ఆహారం కోసమని వనంలోకి వెళ్లింది. ఇంకా తిరిగిరాలేదు. వలలో చిక్కిన పిల్లపావురాళ్లు భయంతో, బాధతో రోదిస్తున్నాయి.

పిల్లలకి ఆహారం అందించాలని ఆతృతతో తిరిగివచ్చిన పావురాళ్లజంటకి దిగ్భ్రాంతి కలిగింది. వలలో చిక్కుకున్న వాటిని చూడగానే తల్లిమనస్సుతో ఆడపావురం దుఃఖిస్తూ తక్షణమే వాటిని రక్షించుకోవాలని దగ్గరకు తీసుకోవాలనీ వెళ్ళి తానూ బందీ అయిపోయింది. ఎన్నడూ ఎడబాయక తిరిగిన జంట, ప్రాణంకంటే ఎక్కువ ప్రీతిపాత్రమైన సంతానం, అలా వేటగాని వలలో బందీలైన తీరు చూసిన మగపావురం దుఃఖసాగరంలో మునిగిపోయింది. అసహాయస్థితిలో దిక్కుతోచక అనంతమైన విషాదాన్ని పొందింది.

తీవ్ర విషాదంతో కూడిన దుఃఖస్థితి మగపావురంలో పశ్చాత్తాపాన్ని, ఒకవిధమైన విరక్తిని కలిగించింది. విషయ సుఖానుభవంపై ఆసక్తితో, భార్యాపిల్లలతో ఇన్ని సంవత్సరాలుగ కాలం గడిపేశానే తప్ప, మంచిపనుల గురించి ఎప్పుడూ ఆలోచించనేలేదు. నిజానికి గృహస్థ జీవితం ధర్మ, అర్థ కామములను ఆర్జించుకోవడంతోపాటు, ఆముష్మిక ఫలాన్ని పొందడానికి కూడా సాధనమంటారు. అలాంటి జీవితాన్ని కేవలం సుఖానుభవంలో మాత్రమే గడిపాను. చివరికి భార్యని, పిల్లలను పోగొట్టుకొని శోకసాగరాన్ని మాత్రమే మిగుల్చుకున్నాను. అని పశ్చాత్తాపంతో దుఃఖించింది.

VILAN V
Just face the world
Hot Cutes
vijay ads

సహధర్మచారిణిని కోలుపోయి జీవించి, పొందే పురుషార్థా లేముంటాయి? ప్రాణానికి ప్రాణమైన సంతానాన్ని కోల్పోయిన జీవితమెందుకు? అనుకుంటూ విరక్తితో తానూ అదే వలలో బందీ అయింది. సకుటుంబంగ ప్రాణాలు కోల్పోయింది.

ఓ యదుమహారాజా! 'ఒక పక్షిశరీరంలో ఉన్న జీవికే చివరిదశలో కాస్త కనువిప్పు కలిగిందే! ఇక మానవదేహంలో ఉన్న మనమెంత కళ్ళు తెరవాలో కదా! ఈ ప్రపంచంలోని జీవరాశులు అన్నింటిలో ఉత్తమమైనది మానవదేహాన్ని పొందిన జన్మ.

కారణం, తానెవరు? ఎక్కడినుండి వచ్చాడు? ఎందుకిలా కర్మ అనే వలలో చిక్కుకున్నాడు? అనేవి ఆలోచించగలగడమే కాదు, కర్మపువల నుండి బయటపడేయగల వాడెవడు? వానిని ఆశ్రయించడమెలా? అన్న జ్ఞానాన్ని కూడా పొందగలిగేట్టు, ఆచరించేట్టు కర్మబంధంనుండి విడుదల పొందేట్టు అవకాశం కల్పించేది మానవజన్మే!

**"దుర్లభో మానుషోదేహః"** అంటారు. సృష్టిలోని ప్రతిప్రాణీ మానవదేహాన్ని పొందలేదు. పొందిన వారమైనా కాలం మించిపోకముందే, ఈ దేహంలో ఉండగానే తెలుసుకోవలసినవి తెలుసుకోగలగాలి. అప్పుడే చేయవలసినవి చేయడానికి తగిన అవకాశం ఉంటుంది.

ఓ మహారాజా! మానవదేహం పొందిన జీవులలో కూడా గృహస్థ ఆశ్రమం విలక్షణమైనది. పురుషార్థ ప్రాప్తికి రాజమార్గం లాంటిది.

గృహస్థుడయిన వాడే మిగిలిన మూడు ఆశ్రమాలవారికీ ఆధారభూతుడు. వారిని పోషించదగినవాడు. గృహస్థుడు జితేంద్రియుడై, కుటుంబియై నియతంగ విషయ సుఖానుభవాన్ని పొందడం దోషం కానేకాదు. కానీ, చలితేంద్రియుడై, చాపల్యంతో కేవల భోగాసక్తుడైతే, నశించిపోతాడన్నదే పావురం కథ తెలుపుతోంది.

పశుపక్ష్యాదులకంటే ఉన్నతజ్ఞానం కలిగిన మానవుడు తదనుగుణమైన విలక్షణ ప్రవృత్తి కలిగి ఉండాలి. పావురంలాగ భార్యాపిల్లలు, భోగ్యపదార్థాల యందు అతిస్నేహాన్ని పెంచుకోరాదు. వేటితోటీ వీడి ఉండలేనంత సంగాన్ని పెంచుకోరాదు. అలా చేసినట్లయితే కథలోని పావురంలాగ తన వినాశాన్ని తానే కోరి తెచ్చుకున్నట్లు, తనకు తానే విషయసంగమనే ఉచ్చు బిగించుకున్నట్లు అవుతుంది. మానవజన్మ ముక్తిద్వారంవంటిది. దేవతలు పశుపక్ష్యాదులు, స్థావరాదులుగా ఉన్న ఇతర ఏ జీవికీ లేని అద్భుత అవకాశం మానవదేహధారికి ఉంది. మిగిలిన జీవులన్నీ కూడా ముక్తి పొందాలంటే మానవజన్మ పొంది, సాధనచేస్తేనే లభిస్తుంది.

అందులోనూ గృహస్థుడు పంచమహాయజ్ఞాలను చేస్తూ దేవ, ఋషి, పితృ, భూత ఋణాలను తీర్చుకుంటూ రాజమార్గంలో ముక్తిని చేరగలుగుతాడు. అసలు జీవితాన్నే ఒక యజ్ఞంగ, భగవదారాధనగ మలచుకొనే అవకాశం గృహస్థునికి ఉంది. భగవద్దత్తమైన విషయసుఖాలను భగవదర్పణ బుద్ధితో, భగవత్ప్రసాదంగా పొందడమూ ఒక యజ్ఞమే! కనుక ఓ యదుమహారాజా! మానవులెవరైనా ఏ ఇతర ప్రాణితోటి, ఏ వస్తువుతోటీ, ఎన్నటికీ, ఎప్పటికీ మితిమీరిన సంగాన్ని (అనుబంధాన్ని) పెంచుకోరాదన్న పాఠాన్ని పావురం నేర్పిందయ్యా! అది పడిన దుఃఖాన్ని చూసైనా మనుషులు, అలా ఉండరాదని గుర్తించాను! లభించిన విలువైన అరుదైన మానవజన్మని కర్మబంధనాలనుండి పూర్తిగా విడవడటం కోసమే వినియోగించుకోవాలని తెలుసుకున్నా! అందుకే నిస్సంగుడినై ఇలా సంచరిస్తున్నా! నీవూ గ్రహించుకో!!




**శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్**

అందమైన తెలుగు పద్యాలు మనందరి భాగ్యామృతాలు. ఆ పద్యాలు చదువుతూంటే మనస్సు అలౌకికానందానికి చేరువౌతుంది. సహజపండితుడు, భక్తకవి అయిన పోతనామాత్యులవారి భక్తి కవితాధారలో మునిగి ఓలలాడే అనుభవం మాటలకందనిది. శ్రీకృష్ణుని స్తుతించే ఈ పద్యాన్ని నేర్చుకుందాం! జాలువారిన మకరందాన్ని ఆస్వాదిద్దాం!

ఉత్పలమాల:

**రాజస తామసాత్ములకు రాదుకదా నినుగాన నవ్య పం**
**కేజ దళాయతాక్ష! మునిగేయ పవిత్ర చరిత్ర! విస్ఫుర**
**ద్రాజ కళాధరాజ సురరాజ ముఖామరమౌళిరత్న వి**
**భ్రాజిత పాదపీఠ! భవబంధ విమోచన! పద్మలోచనా!.**

స్వామి పద్మలోచనుడు సంసారబంధాన్ని దూరం చేసేవాడు. మహర్షి గణంచేత స్తోత్రం చెయ్యబడే పవిత్ర చరిత్రుడు. అంతకంటే విశేషం – రాజకళాధరుడైన పరమశివుడు, అజుడైన బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతా గణమంతా ఆ శ్రీమన్నారాయణుని పాదపద్మాలకు భక్తితో నమస్కరిస్తూ ఉంటారు. అంతటి వైభవోపేతుడాయన. దేవాధిదేవతలు మ్రొక్కినపుడు ఆ కిరీట రత్నకాంతులతో మెరిసేపాద పద్మాలాయనవి.

మరి... రాజస తామస గుణాలు కలవారు ఆయనను దర్శించుకోగలరా... అబ్బే... అవకాశమేలేదు. లోకంలో మనం చూస్తున్నాం. నేను కాబట్టి ఇంత సేవచేస్తున్నాను, నేను కాబట్టి దానధర్మాలిలా నడిపిస్తున్నాను... అనే రాజసం, ఆ విషయాన్ని లోకం గుర్తించకపోతే వచ్చేకోపం – తద్వారా తామసం... మనిషి వీటిని జయించాలి. స్వామిసేవలో ఒకసేవకునిగా అవకాశం వచ్చిందే... భగవంతుడు కల్పించాడే అనే సాత్త్విక ప్రవృత్తి మనలో తలెత్తాలి. రాజస తామసాలని దూరం చేసుకొనే ప్రయత్నం చెయ్యాలి. అప్పుడే భగవద్దర్శనం– భాగవత కటాక్షం మనకి లభిస్తాయి.

**సత్త్వసంపదను పెంచుకోండి ! స్వామిసేవలో తరించండి !!**

# మన ఆళ్వార్లు



- శ్రీనృసింహ-

## తిరుమంగై ఆళ్వార్లు - 2

పరకాలురు మామగారి ఆజ్ఞ పొంది కుముదవల్లిని తీసుకొని తమ ఊరికి బయలుదేరారు. భార్యకి చేసిన ప్రతిజ్ఞ నెరవేరుస్తూ ప్రతిదినం వెయ్యిమంది భాగవతోత్తములకి సంతృప్తిగా భోజనం పెట్టి... అంటే తదీయారాధన చేసి, వారి శ్రీపాదతీర్థం తానూ.. భార్యా స్వీకరిస్తూ ఆనందంగా కాలం గడుపుతున్నారు. మరి కూర్చుని తింటూంటే కొండలయినా కరిగిపోతాయి. ప్రతిరోజూ ఒకరిగా ఇద్దరికా - వందమందికా - వెయ్యిమందికి షడ్రసోపేతంగా భోజనం పెట్టడమంటే మాటలా! ధనమంతా ఖర్చుయిపోయింది. పైగా ఇతనిని చూచి ఓర్వలేని అసూయాపరులు రాజును చేరి.. అయ్యా! ఈ మహానుభావుడు మీకు పన్నుకూడా కట్టడంలేదటగా... చక్కగా విలాసంగా బాగా గడిపేస్తున్నాడుగా" అంటూ నేరాలు చెప్పారు.

రాజు విషయం తెలుసుకొని రమ్మని భటులని పంపించాడు. పరకాలుడు రండి రండి మీ పన్ను - ఇదుగో నాల్గురోజులలో కట్టేస్తా...! అంటూ అప్పటికెలాగో పంపించేశాడు. ఇలా వచ్చినపుడల్లా రేపు మాపు అంటూ తిప్పి పంపించేస్తుంటే చివరికి వారు ఎదురుతిరిగారు. ఇంకేముంది యుద్ధం. అందరిని ఓడించి పంపించాడు. గొల్లుమంటూ రాజు గారికి మొరపెట్టారు వారు. రాజు పరివారాన్ని పంపించి బంధించి తీసుకొని రమ్మన్నాడు. వచ్చిన సైన్యమంతా.. చిత్తు చిత్తుగా ఓడడమే! చివరికి మహారాజే బయలుదేరి వచ్చాడు యుద్ధానికి. పరకాలుడు రాజుని కూడా ధైర్యంగా ఎదిరించాడు. రకరకాల ఆయుధాలతో రథాలు నుగ్గు చేశాడు.

ఏనుగుల్ని పొడిచేశాడు.
గుఱ్ఱాల్ని ముక్కల్ని చేశాడు
కాల్బలాన్ని రూపుమాపాడు
పతాకాలు కూల్చేశాడు
కిరీటాలు నేలపాలు చేశాడు
పాదాలు ఖండించాడు.
శిరస్సులు త్రుంచేశాడు.

ఆ... ఏమిటీ పరాక్రమం! నిజంగా ఇతడు శత్రువుల పాలిట యముడే! అందుకే పర-కాలుడు.... పరకాలుడు! ఆశ్చర్యపోవడం రాజు వంతయింది. పరకాలుడు రాజుని చేరి నమస్కరించాడు. అయ్యా! ఇంత చెయ్యడం నా అభిమతం కాదు. చేసేది లేక.. ఇలా జరిగింది... అంటూండగా రాజు మంత్రివైపు చూశాడు. ఆయన పరకాలుని బంధించాడు. ఖైదీని చేశాడు. తీరిక దొరికేసరికి ఆలోచనలు ముప్పిరిగొన్నాయి పరకాలునికి. స్వామీ నేనా మాటిచ్చాను. నిలుపుకోవాలి కదా... మరి ధనం లేనిదే ఎలా? ఏం చెయ్యాలి? మధ్యలో ఈపన్నులు - రాజు - గొడవ.. ఏం చెయ్యను? ఏదీ దారి? అని భగవంతుని ప్రశ్నిస్తున్నాడు. రంగనాథా...! వరదరాజా! ఏదీ గతి నాకు.. నెమ్మదిగా నిద్రలోకి జారుకున్నాడు. కల... అందులో భక్త పరాధీనుడయిన వరదరాజస్వామి. నవ్వుతున్నాడు... కనుబొమలు తిప్పుతున్నాడు. పరకాలా.. ఇటు.. ఇటు చూడు... కాంచీపురం దగ్గర వేగవతీ నది ప్రవహిస్తుంది కదా! ఆ నదీతీరంలో ఒకచోట నిధి ఉంది. అది తీసుకో... తీసుకో... తీసుకో... అంతలో మెలకువ వచ్చేసింది. ఆ.. నిధా... ఒక్క అరుపు అరిచాడు. రక్షకభటులు పరుగు పెట్టుకుంటూ వచ్చారు. ఏమిటి? ఎందుకలా అరిచావు? జరిగిన కలని వివరించారు పరకాలురు. రాజుకి చెప్పమన్నాడు. వెంటనే రాజు ఆ నిధికోసం ప్రయత్నించాడు. కాని దొరకలేదు... అబద్ధాలు అలవాటేగా... ఆయన చెప్పడం మనం వినడం.. అంటూ కొట్టిపారేశాడు. రాజభటులు కూడా నవ్వులే నవ్వులు. పరకాలురు స్వామీ! ఎందుకలా చెప్పావు అని భగవంతుని ప్రశ్నించాడు. నాయనా! సరిగ్గా చూడమను. ఇదుగో గుర్తులు చెప్తున్నా... శ్రద్ధగా విని చెప్పు. నిధి కనిపిస్తుంది అన్నాడు వరదుడు. పరకాలుని మాటలు ముందు నమ్మకపోయినా - అంతగా గుర్తులు చెప్పేటప్పటికి మరొక్కసారి ప్రయత్నిద్దామని రాజు భావించాడు. పరివారాన్ని పంపాడు. ఆశ్చర్యం నిధి బయలు పడింది. వెంటనే పరకాలుని విడిపించారు. ఆయన ఆ నిధిని తీసి కప్పం కట్టవలసినదంతా రాజుకి చెల్లించి ఆ ధనాన్ని తీసుకొని ఆనందంగా ఇంటికి బయలుదేరాడు.. అమ్మయ్య కొంతకాలం హాయిగా తదీయారాధన గడిచిపోతోంది... మాట

నాణ్యమైన ప్లాట్లు మరియు ఫ్లాట్లు కొనుగోలుకు నమ్మకమైన అగ్రగామి సంస్థ
అభినందన హౌసింగ్ (ప్రై). లిమిటెడ్
సెంట్రల్ ఆఫీస్ : 4వ లైను, పండరీపురం, లక్ష్మీపురం మెయిన్ రోడ్, గుంటూరు. ఫోన్ : 2354002.
మా బ్రాంచీలు: విజయవాడ 1, విజయవాడ 2, విజయవాడ 3, గుంటూరు 1, గుంటూరు 2, హైదరాబాద్, విశాఖపట్నం.
0866 - 6628668 : 0866 - 6642428 : 0866 - 6633668 : 0863 - 6641177 : 0863 - 6454588 : 040 - 66637799 : 0891 - 2538686.

దక్కుతుంది... అనుకున్నారు. రాజుగారికి పరకాలుని మహిమ అర్థమైంది. పదిమందికి అన్నదానం కోసమే ఈ మహనీయుని తాపత్రయం. తనకోసం అంటూ స్వార్థమే లేదు. పైగా... ఎంత గొప్పభక్తుడీయన. సాక్షాత్తు భగవంతుడే నిధిని చూపించి రక్షించుకున్నాడే...! ఇలాంటి మహనీయుడు నా కన్నులముందుంటే ఆ విలువ తెలియక బంధించి అపచారం చేశానే... క్షమించమని ప్రార్థిస్తాను అనుకొంటూ పరకాలుని చేరాడు. నమస్కరించారు, స్తోత్రం చేశాడు, గౌరవించాడు, ఆదరించాడు, సన్మానించాడు. తన పట్టణానికి వెళ్ళిపోయాడు రాజు. పరకాలుడు కట్టిన కప్పాన్ని దానధర్మాలు చేశాడాయన.

కొంతకాలం గడిచింది. మళ్లీ మామూలే. ధనంలేదు. ఎలా జరిపించాలి కార్యక్రమం! ఒక్కటే ఉపాయం.. పోనీ... దొంగతనం.. దొంగతనం.. చేసి డబ్బు సంపాదిస్తే... అది మాత్రం మాటలా... పెద్దకళ.. ఎంత కష్టం... కానీ తప్పదు. ఒక పనిచేద్దాం! భగవంతుని మీద భక్తి ఏమాత్రం లేని ధనవంతుల దగ్గరే దోచుకుందాం! ఒకచోట వ్యర్థంగా మూలుగుతున్న ధనాన్ని, పదిమందికీ భోజనం పెట్టడానికి దొంగిలించడంలో తప్పేంలేదు. ఔను... తప్పులేదు. అదే మార్గం... దొంగతనం.. అయితే నలుగురు సహాయకులు తోడుంటే బాగుంటుంది. ఉన్నారుగా నల్గురూ!

1. నీర్‌మేల్ నడప్పాన్; 2. నిఝలోదుంగవాన్; 3. తాళూదువాన్; 4. తోలావఝక్కన్.... చాలు.. మహాచతురులు వీళ్ళు. నైపుణ్యం వీరి సొత్తు. బయలుదేరుదాం. 'అడల్ మా' గుఱ్ఱం ఉందిగా. 'అమరర్ కడమా కళియానై'... ఏనుగు ఇంకేం... నయాన భయాన దోచేసుకోవచ్చు... అంతే చోరయాత్ర ప్రారంభమైంది. పట్టణాలు.. గ్రామాలు.. పల్లెలూ... ఒక్కొక్కటే దోచుకోవడమే పని.

అదొక చిన్న పల్లెటూరు. ఆ ఊళ్ళో చాలా డబ్బున్న దంపతులుంటున్నారు. ఎంత డబ్బున్న వాళ్ళంటే బంగారు పళ్ళెంలో అన్నం తినేంత. అన్నీ గమనించారు పరకాలురు. రాత్రి ఆ దంపతుల భోజనమయిన తరువాత ఆవిడే స్వయంగా పళ్ళెం కడిగే అలవాటు కాబట్టి బంగారు కంచం పట్టుకొని దొడ్డిలో కడిగేద్దామని వచ్చింది. అంతే... ఒక్కసారి ఆవిడ చేతిలోని కంచం లాగుకొని గోడ దూకేస్తున్నారు పరకాలురు. ఆశ్చర్యపోయింది... అంతలోనే అస్మద్గురుభ్యో నమః - అంటూ చేతులు జోడించిందావిడ. అదిరి పడ్డారు పరకాలురు. అస్మద్గురుభ్యో నమః ఆహా! ఏమి ఆచార్యభక్తి. అంటే ఈ దంపతులు భాగవతోత్తములన్నమాట. ఇలాంటి వారింట్లోనా నేను దొంగతనం చెయ్యడం! మహాపాపం. వెంటనే వెను తిరిగారు పరకాలురు. ఆవిడ గబగబా ఇంట్లోకి వెళ్ళి జరిగిన సంగతి చెప్తోంది భర్తకి. పరకాలురు ఆ బంగారు కంచాన్ని గుమ్మంలో పెట్టేసి గోడ దూకేశారు. ఇంతలో ఆ భార్యాభర్తలు వచ్చారు. చూస్తే.. బంగారు పళ్ళెం అక్కడే మెరుస్తూ కనిపించింది. తల పంకించాడు గృహస్థు. చూడు ఈమధ్య పరకాలురు అనే భక్తులు దొంగతనం చేసి భక్తులకు తదీయారాధన చేస్తున్నారని తెలిసింది. ఆ పళ్ళెం లాగేటప్పుడు నువ్వు ఏమైనా అన్నావా? లేదు లేదు నేనేమీ నిందించ లేదు. అస్మద్గురుభ్యో నమః అన్నానంతే" ఆ.. తెలిసింది చాలు - ఆచార్యుల్ని తలుచుకోగానే మనం విష్ణు భక్తులమనీ, సంప్రదాయ పరులమనీ గ్రహించి ఆయన ఈ పళ్ళెం ఇక్కడే విడిచి వెళ్ళిపోయాడు. దొంగతనంలో కూడా ఎంతటి వివేచన! అయ్యో! మన సొమ్ము భాగవత తదీయారాధనలో చోటు చేసికొనలేకపోయిందే! ఎంతటి దురదృష్టవంతులం. సరే కానీ! ఏం చేస్తాం... లోపలికి నడు! అంటూ భార్యను తీసుకొని, లోపలికి వెళ్ళి తలుపు వేశాడాయన.

వారి సంభాషణంతా చీకట్లో గోడ ప్రక్కన నిలిచి విన్నారు పరకాలురు. ఆహా! ఈ సంప్రదాయమెంత గొప్పది. వస్తువు పోలేదు కదా! అని ఆనందపడకుండా - అయ్యో - మన సొమ్ము తదీయారాధనలో ఉపయోగపడలేదే అని వాపోతున్నారీ భార్యాభర్తలు. ఎంతటి ఆచార్యనిష్ఠ. ఎంతటి సంప్రదాయ నిష్ఠ... ఇటువంటి వారి సొమ్ము దొంగిలించకూడదు. చేసేది దొంగతనమే అయినా.. అందులో ఒకనీతి ఒక న్యాయం.

అవసరాన్ని మించి దాచుకొనే ధనవంతులనుండి గ్రహించి భగవత్ భాగవత సేవలో ఉపయోగించడమే ఈ చౌర్యానికి లక్ష్యం అనుకుంటూ ఆ ఇంటికి ఒకసారి నమస్కరించి బయలుదేరాడు పరకాలుడు. *(సశేషం)*

---


**STATEMENT OF OWNERSHIP AND OTHER PARTICULARS OF BHAKTHINIVEDANA**

*FORM IV* (See Rule 8)

| | | |
|---|---|---|
| 1. | Place of publication | : Sitanagaram, Guntur |
| 2. | Language / Periodicity | : Spiritual Telugu Monthly |
| 3. | Printer's Name | : **Sriman Printers & Processors** |
| | Nationality | : Indian |
| | Address | : **JEEYAR EDUCATIONAL TRUST,** Sitanagaram, Guntur Dt. Andhra Pradesh-522 501 |
| 4. | Publisher's Name | : **H.H. Sri Sri Sri Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji** |
| | Nationality | : Indian |
| | Address | : **JEEYAR EDUCATIONAL TRUST,** Sitanagaram, Guntur Dt. Andhra Pradesh-522 501 |
| 5. | Editor's Name | : Sri **S.V. Rangaramanujacharyulu** |
| | Nationality | : Indian |
| | Address | : S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh. |
| 6. | Name and address of individuals who own the news paper and partners of share holders holding more than one percent of the total capital | : Nil |
| 7. | R.N.I.No. | : 52762/91 |

I, Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji herebydeclare that the particulars given above are true to the best of my knowledge and belief.

Dt. 31.03.2014

Sd/-
**SRI SRISRI TRIDANDI CHINNA SRIMANNARAYANA RAMANUJA JEEYAR SWAMY**
*Signature of Publisher*




డా।। పావులూరి కృష్ణచౌదరి
8-3-945/ఎ22, నాగార్జున నగర్, అమీర్‌పేట, హైద్రాబాద్-500 873

## మలేరియా

మలేరియా రక్తంలోని ఎర్రకణాల ఇన్ఫెక్షన్. ప్లాస్మోడియం రకం ఏకకణజీవి ఎర్రరక్తకణాలపై దాడిచేస్తుంది. దీంతో మలేరియా జ్వరబాధలు మొదలవుతాయి. మలేరియా వ్యాధి కారకాలైన ఈ క్రిములను 'మలేరియా పారాసైట్స్' అని పిలుస్తారు. ఈ ఇన్ఫెక్షన్ ఒకరినుండి మరొకరికి ఎనాఫిలిస్‌రకం ఆడదోమల ద్వారా వ్యాపిస్తుంది. ఆ దోమలు కుట్టిన నెల తర్వాత జ్వరం వస్తుంది. ఆ జ్వరం ఆదిలో ఫ్లూ జ్వరాన్ని పోలి ఉంటుంది.

మలేరియాను నేడు మానవజాతిని పొట్టనబెట్టు కుంటున్న అతిపెద్ద భయంకరవ్యాధిగా పరిగణిస్తారు. మలేరియా వ్యాధి కారకాలుగా 4 రకాల పారాసైట్స్‌ను గుర్తించారు. అందులో ఒకరకమైన ఫాల్సిఫారం మలేరియా సోకినట్లయితే నూటికి 20మంది మరణానికి గురవుతుంటారు. అన్ని ప్రపంచ యుద్ధాలలో చనిపోయినవారికన్నా మలేరియా మూలకంగా చనిపోయినవారి సంఖ్యే హెచ్చు అంటాడు సర్ విలియం ఆస్లర్.

మలేరియా పారాసైట్స్‌లు నాలుగు తరగతులు. ప్లాస్మోడియం వైవాక్స్, ప్లాస్మోడియం ఒవేలీ, ప్లాస్మోడియ ఫాల్సిఫారం, ప్లాస్మోడియం మలేరియా. ఈ నాలుగూ మలేరియా తెచ్చిపెట్టేవే. వీటిలో ప్లాస్మోడియం ఫాల్సిఫారం మరీ ప్రాణాంతకమైన వ్యాధి. మెదడుపై దాడి మూలంగా పెద్దపెట్టున జ్వరం, మరణం గూడా సంభవిస్తుంది. దీన్ని 'బ్రెయిన్ ఫీవర్' అని వ్యవహరిస్తారు. పిల్లలెక్కువగా ఈ బాధకు గురవుతారు.

దోమలు కుట్టినప్పుడు మలేరియా పారాసైట్స్ రక్తంలో ప్రవేశించి 2-4 రోజులపాటు లివరులో ఉండి కొన్ని మార్పులు చోటుచేసుకొని బయటపడి రక్తంలోని ఎర్రకణాలపై దాడిచేస్తాయి. చలి జ్వరం వస్తుంది. ప్లాస్మోడియం వైవాక్స్, ప్లాస్మోడియం ఓవేలీ పారాసైట్లు లివరులోనే స్థావరం ఏర్పాటు చేసుకొంటాయి. మధ్యమధ్యలో బయటపడినప్పుడు మలేరియా జ్వరం తిరగబెడుతుంటుంది.

ఇక ప్లాస్మోడియం మలేరియా క్రిములు రక్తప్రవాహంలో సంవత్సరాల తరబడి మనగలుగుతాయి. ఆ కారణంగా అప్పు డప్పుడు మలేరియా తిరగబెడుతూ ఉంటుంది. ప్లాస్మోడియా ఫాల్సిఫారం మెదడు కణాలను దెబ్బకొడుతుంది. అందుకే దాన్ని 'సెరిబ్రల్ మలేరియా' అని వ్యవహరిస్తాం.

### బాధలేమిటి?

మలేరియా రోగులలో ఎదురయ్యే సమస్యలు వణుకుతో గూడిన చలి, జ్వరం, తలనొప్పి. ఈ బాధలు నాలుగు తరగతుల చలిజ్వరంలో కనిపిస్తాయి.

### ఎంపిక చేసుకొనేదెలా?

జ్వరం ఉదయం 10 గం।।కు ప్రారంభమయితే - నేట్రంమూర్

| | |
|---|---|
| చలి, తలనొప్పి, అధికంగా దాహం, వికారం కలసి ఉంటే | - నేట్రంమూర్ |
| జ్వరం మధ్యాహ్నం 1-2 గం।। ప్రారంభమయితే | - ఆర్స్ ఆల్బ్ |
| దాహం విపరీతం అయితే, నీరు కొద్దికొద్దిగా మాత్రమే చప్పరిస్తుంటే | - ఆర్స్ ఆల్బ్ |
| చలి, జ్వరం, చెమటలు మూడు దశలు ఒకదాని తరువాత ఒకటి స్పష్టంగా కనిస్తే | - చైనా |
| చెమట కల్పించే దశలో దాహం విపరీతంగా ఉంటే | - చైనా |
| జ్వరం ఉదయం 7-8 గంటలకు ప్రారంభమైతే | - యుపటోరియం పెర్ఫ్ |
| ఆవలింతలు, ఒళ్ళు విరుపులు, నొప్పులు తోడయితే | - యుపటోరియం పెర్ఫ్ |
| విపరీతంగా ఒళ్ళు నొప్పులు, అస్థిమితంగా ఉంటే | - రస్టాక్స్ |
| మూతిచుట్టూ నీటి బొబ్బలు కనిపిస్తే | - రస్టాక్స్ |

### ఎంపిక చేసుకున్న ఔషధాలకు సంబంధించి మరిన్ని వివరాలు:

* **నేట్రంమూర్ :** చలిజ్వరం. తేమగా ఉన్న ప్రాంతాలలో నివసించే వారికి ఎంతో ప్రయోజనకర ఔషధం. చలి వచ్చే ముందు విపరీతమైన దాహం. చలి మొదలవ్వగానే తలనొప్పి, చెమటలు పట్టగానే అన్ని బాధలు తగ్గిపోతాయి. మలబద్ధకం వల్ల వచ్చే తలనొప్పికి ఇది ముఖ్య ఔషధం.
* **ఆర్సెనికం :** విపరీతమైన నిస్త్రాణ, శారీరకంగా, మానసికంగా కూడా అస్థిమితం. అర్థరాత్రి సమయంలో బాధలధికం. దాహం ఎక్కువ కాని మాటిమాటికి నోరు తడుపుకొంటారు. కలుషిత ఆహారం వల్ల కలిగే బాధలకు ఇది ముఖ్య ఔషధం.
* **చైనా :** ప్రతి ఏడురోజులకు క్రమబద్ధంగా జ్వరం వస్తుంది. జ్వరం వచ్చే ముందు ఒళ్ళు నొప్పులు. విపరీతంగా దాహం. వికారం, చలి, జ్వరం దశలో దాహం ఉండదు. చెమటలు పట్టేదశలో దాహం విపరీతం. నిద్రపోయే సమయంలో చెమటలు. ఊరగాయ పచ్చళ్ళు చాలా ఇష్టం.
* **యుపటోరియం :** ఉదయం 7-9 గం।। మధ్య జ్వరం. చలిజ్వరం రాబోయే ముందు విపరీతమైన దాహం. చలిగా ఉన్నప్పుడు దాహం ఎక్కువే. జ్వరంలో దాహం ఉండదు. విపరీతం నొప్పులు. మెరుపులాగా వస్తాయి. తగ్గుతాయి.
* **రస్టాక్స్ :** జ్వరం, ఒళ్ళు విరుపులు. కుదురుగా ఉండలేరు. పక్క కుదరదు. తడిసిన తరువాత, తేమ గాలిలో తిరిగి నందువల్ల బాధలు, నాలుక చివరి విభాగం త్రిభుజా కారంలో ఎర్రగా ఉంటుంది. విశ్రాంతి, పండుకొంటే బాధలధికం. అటూ ఇటూ మసులుతుండవలసిందే! రస్టాక్స్, ఆర్స్ ఆల్బ్ అనే మూడింటినీ అస్థిమిత ఔషధత్రయంగా పరిగణిస్తారు.

### జిమ్స్‌లో చికిత్స పొందుతున్న...

**ఎం. సుజాత,** వయస్సు 40 సం।।లు - శంషాబాద్.

గతమూడు సంవత్సరాలుగా ఎలర్జీ బాధ. ముక్కు కారడం, తుమ్ములు. ముక్కులోపలకండ పెరిగి శ్వాస ఆడకపోవడం. డాక్టర్లు ఎవలర్జిక్ రైనైటిస్. సైనసైటిస్ అని నిర్ధారించి చికిత్స చేయడం జరిగింది. ఫలితం దక్కలేదు.

జిమ్స్ ఆసుపత్రిలో 2013 జులై 5 నుండి చికిత్స జరుగుతోంది.

కాలిబైక్రోమ్ 30 పోటెన్సీలో ఉదయం 6, సాయంకాలం 6 గోళీలు. నెలకు ఒకరోజు కార్సినోసిన్ 200 "ఉదయం 6, సాయంకాలం 6 గోళీలు వాడడం జరిగింది. ఎలర్జీబాధలన్ని తగ్గాయి. సైనసైటిస్ కూడా నివారణయింది.



# కటాక్షం

"సుధామయి" – హైదరాబాద్

సుధా.. సుధా ఏమయ్యావే.. త్వరగా రా .. టైం అయిపోతోంది. ఆలస్యంగా వెడితే తీర్థం దొరకదే...! కంగారు పెట్టేస్తూ పిలుస్తోంది అమ్మ. ఈ అమ్మ ఒకత్తి. గుళ్ళు, గోపురాలు అంటూ చంపేస్తుంది. తను వెళితే సరే! ఉహూ నన్నూ లాక్కొని పోతుంది. రేపు పెళ్ళైతే నీకే తెలుస్తుందే.. ఇప్పుడు చెప్పినా అర్థం కాదు అంటుంది. సరే ఆవిడ ఆనందం కోసం, ఉత్సాహం లేకపోయినా పోతూ ఉంటాను. వస్తున్నావా.. ఆ ! ఆ– ! వస్తున్నా అంటూ దాదాపు పరుగుదీశాను. ఇద్దరం మా ఊళ్ళో రామాలయం దగ్గర జరిగే పూజాకార్యక్రమానికి, అక్కడికి వచ్చే స్వామివారట.. వారిని సేవించుకొని తీర్థప్రసాదాలు స్వీకరించి రావటానికి.... ఏమిటే... ఆలోచన రా త్వరగా.. అమ్మతో ముందుకు సాగా.

మా ఊరని చెప్పడం కాదుకాని, చాలా అందంగా ఉంటుంది. ప్రతిపల్లెలాగే ఓ రామాలయం – ప్రక్కనే అందమైన చెఱువు. దానినిండా కలువలు.. తామరలు... గట్టుమీద మందలుగా పోయే పశువులు. వాటి మధ్య వాటిపైన పాలేరులు.

మా ఆలయం కట్టి చాలా ఏళ్ళయిందట. కొంచెం కొంచెం గోడలు బీటలు వారి.. పాతబడి.. వార్ధక్యం మాకూ తప్పదన్నట్లు నిలిచి ఉండేది. మా ప్రెసిడెంటుగారి అబ్బాయి అమెరికాలో డాక్టరు. రెండుచేతులా సంపాదిస్తున్నాడు. వాళ్ళ నాన్న కోరికమీద ఈ గుడిని బాగు చేయించాడు. ఇప్పుడెంత బాగుందో...! చూడ్డానికి రెండుకళ్ళు చాలవు. మా గుళ్ళో రాముణ్ణి ఎంత వర్ణించినా చాలదు. చిరునవ్వుతో పలుకరిస్తాడు. కోరికలు తీరుస్తాడు. అందుకే ఊళ్ళో అందరూ ఆ రాముణ్ణి ఒక్కసారి చూడకుండ పనులకి పోరు. అక్కడ పదిక్షణాలు కూర్చుంటే ఎంతో ఆనందం...! తృప్తి.. అన్నింటిని మించి మనస్సుకి బలం వచ్చినట్లవుతుంది. శాంతి చేకూరుతుంది.

చిన్నపిల్లలయితే చెరువు గట్టుమీద పరుగులు పెడుతూ ఆలయంలో చుట్టూ ఆటలాడుతూ అదే ఇల్లంటూ ఆనందంగా గడుపుతారు. మా గుళ్ళో పంతులుగారు పెద్దగా చదువుకోలేదు కాని మనస్సున మారాజు. అందరిని ప్రేమగా పలకరిస్తారు. ఆప్యాయంగా తీర్థప్రసాదాలిస్తారు. రాముణ్ణి కన్నబిడ్డలా చూసుకుంటారు. అందిన పూలతో ఆనందంగా అందంగా అలంకరిస్తారు. అసలు రాముణ్ణి చూడడంతోపాటు ఆయన్ని చూడాలని అనిపిస్తుందంటే అబద్ధం కాదు. అందుకే ఇంకెక్కడికన్నా అంటే బద్ధకంగాని రామాలయానికంటే ఆనందమే! అమ్మతో నడుస్తూ ఆలయం దగ్గర కొచ్చేశాను. చూస్తే.. ఆ జనమేమిటి! వేలమీదున్నారు. అందుకేనేమో అమ్మ అంత తొందరపెట్టింది. అమ్మా... ఏమిటీ ఈ జనం.. ఈ హడావిడి.

అదేనే.. ఈ రోజు స్వామివారొస్తున్నారు. ఇక్కడ తీర్థగోష్ఠి చేస్తారు. ఎప్పటినుంచో ప్రార్థిస్తే ఇప్పటికి అవకాశం వచ్చిందట. నెలరోజులుగా మన పంతులుగారు చుట్టుపక్కల ఊళ్ళన్ని తిరిగి ఈ రోజు పూజకి రావాలని మంచిప్రచారం చేశారట. ఎంత ఆశ్చర్యమో ఈ జనం చూశావా! మన ఊళ్ళో తిరునాళ్ళకి కూడ ఇలా రాలేదు గదా.. సరే! రారా.. అరుగో బారులుతీరి జనం తీర్థానికి పరుగులు పెట్టేస్తున్నారు. మనకీ అందుతుందిలే.. అంటూ లాక్కొనిపోతోంది అమ్మ.

ఆలయంలో ప్రవేశించాం. క్రిక్కిరిసి పోయింది గుడి. ముందువైపు గోడ పూర్తికాకపోవడంతో ఎంతదూరం నుంచైనా మండపం కనిపిస్తోంది. స్వాములంతా మంత్రపఠనం చేస్తున్నారు. అప్పుడు చూశాను వారి మధ్యలో దివ్యప్రశాంతమూర్తిని. నా జీవితంలో అటువంటి శాంతసుందరమూర్తిని దర్శించడం ఇదే మొదటిసారి. ఒక్కసారిగా శరీరం ఆనందంతో పులకరించింది. కళ్ళెత్తి అందరివైపు చూస్తున్న స్వామి మా ఆలయంలో రాముడే బయటికి వచ్చాడా అన్నట్లున్నారు. ఔను ఆ నవ్వు.. ఆ చూపు.. ఆ దివ్యకాంతి.. మైమరచిపోయాను. రావే.. తీర్థం తీసుకోగానే పరుగెత్తకు.. ఒక్కక్షణం పక్కగా నిలుచుందాం! తీర్థగోష్ఠి తరువాత సందేశం ఉంటుంది. విని వెడదాం.. వింటున్నావా.. అంటూండగానే అమ్మ తీర్థానికి దగ్గరగా వచ్చేసింది. వెనకాలే నేను. కనురెప్పలు ఆర్పడం మరచి ఆ పవిత్రమూర్తినే చూస్తూ ముందుకు నడిచా.. చేతులు జోడించి నమస్కరించి తీర్థానికి చేయి చాపాను. సరిగ్గా అప్పుడే అయిపోయిన తీర్థపాత్రని శిష్యులు నింపడంతో ఒక్కక్షణం నిలిచే భాగ్యం దక్కింది. చిరునవ్వుతో చూశారు స్వామి. ఏం చేస్తున్నారమ్మా! అంటూ పలుకరించారు. అంతే ఆనందంతో మాటలు రాలేదు. నన్నేనా.. అమ్మ కల్పించుకుంది. M.C.A. చేసింది స్వామి. మీ ఆశీస్సులతో పెళ్ళి చేసేయాలి. దీవించండి అంటోంది. అబ్బబ్బ పెళ్ళేనా.. చెప్పేందుకింకేమీ లేవా! పదిమందికి ఉపయోగపడేలా ఒక సేవాకార్యక్రమాన్ని చెయ్యాలనే తపనని ఎలా చెప్పడం. తీర్థం చేతిలో నిలిచింది. భక్తిగా తీసుకొని కన్నుల కద్దుకొని స్వామీ! ఒక మనిషిగా ఏదైనా సేవ.. చేయాలనుంది.. అన్నాను. ఒక్కసారి కనుబొమలు ఎగరవేశారు. తీర్థగోష్ఠి అయిన తరువాత


వ్యక్తిత్వ వికాసానికి ... నాణ్యమైన సాంకేతిక విద్యా బోధనకు



కళ్ళం హరనాథరెడ్డి ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ



శ్రీ కళ్ళం హరనాథరెడ్డి
ఛైర్మన్: కళ్ళంగ్రూప్




బిటెక్ కోర్సులు
- కంప్యూటర్ సైన్స్ అండ్ ఇంజనీరింగ్(సియస్ఇ)
- ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ (ఇఇఇ)
- ఎలక్ట్రానిక్స్ అండ్ కమ్యునికేషన్స్ ఇంజనీరింగ్ (ఇసిఇ)
- సివిల్ ఇంజనీరింగ్ (సిఇ),
- మెకానికల్ ఇంజనీరింగ్ (ఎమ్ఇ)

M.Tech :- CSE

మేనేజ్‌మెంట్ సీట్స్ కొరకు సంప్రదించండి : సెల్ : 98856 04528, 94402 61773, 94910 73337.

EAMCET Code KHIT

NH- 5.10వ కి.మీ వద్ద, కళ్ళం స్పిన్నింగ్ మిల్స్ వెనుక, చిలకలూరిపేట రోడ్, చౌడవరం, గుంటూరు- 19. ఫోన్: 0863 2119726.
సిటీ ఆఫీస్: ఫస్ట్‌లైన్, గుజ్జనగుండ్ల సర్కిల్, గుంటూరు -6. ఫోన్: 0863 2272345.

కలవండి అన్నారు. మనస్సు గంతులు వేసేసింది. అమ్మయితే చెప్పలేను.. ఎంత ఆనందమో...

రెండుగంటల సమయం పట్టింది తీర్థగోష్ఠికి. అయినా చెదరని చిఱునవ్వు. ప్రియదర్శనత్వం... నిజంగా శ్రీరామచంద్రుడే అలా సేవిస్తూ నిలుచుంటే అప్పుడే రెండుగంటలు గడిచాయా అనిపించింది.

స్వామివారు పిలుస్తున్నారంటే అమ్మ నేను ఆ జనంలోంచి దగ్గరగా చేరాం. తల్లీ! నీకు సేవ చేయాలని ఉందా.. నిజంగానా.. అన్నారు. ఔను స్వామీ.. కాని ఏం చెయ్యాలో.. ఎలా చెయ్యాలో ఏం తెలియదు అంది అమ్మ. ఔనన్నట్లు తలూపాను నేను. చేసేవాళ్ళుండాలే గాని ఎలా చెయ్యాలో చెప్పడానికేగా పెద్దలింతమంది ఉన్నారు. ముందు మీ ఊళ్ళో చదువురాని వాళ్ళందరిని ఒకసారి కలుసుకో! రెండువందల దాకా ఇళ్ళున్నాయి కదా... ఎవరికి చదువుకోవాలని ఆసక్తి ఉందో వాళ్ళని ఈ రామాలయంలో రోజూ ఒక గంట కూర్చోపెట్టు. ముందుగా వాళ్ళ జీవిత విధానం. వాళ్ళ సమస్యలు.. అన్నీ ఆత్మీయంగా తెలుసుకో! వాళ్ళకి మన పురాణాల్లో ఉన్న కథలు చిన్నచిన్నగా ఆసక్తికరంగా చెప్పు... మధ్యలో అమ్మ అందుకుంది. ఇది కథ చెపితే కళ్ళకి కట్టినట్లు ఉంటుంది స్వామీ! నవ్వారు స్వామి.

మరింకేం అలా రోజూ రావడానికి అలవాటు పడిన తరువాత.. పిల్లలతో పాటు తల్లులుకూడా ఆనందంగా వచ్చేలా.. ఏవో కొన్ని విద్యలు. మీ ఊళ్ళో లేసులు అల్లుతారట కదా... ఇదుగో మా పెరుమాళ్ళకు సమర్పించారు ఇప్పుడే.. ఆ విద్య రానివారికి కూడా నేర్పి అందరూ కలిసి ఆనందంగా గడపడం అనే మూలసూత్రాన్ని అలవాటు చెయ్యి తల్లీ.. మేం రెండునెలల్లో మళ్ళీ ఇటే వస్తున్నాం. అప్పటికేం చేస్తావో.. ఎలా ప్లాన్ చేస్తావో.. చూస్తాం అంటున్నారు స్వామి. మనస్సు గాలిలో తేలిపోతోంది. నేనొక కార్యకర్తగా ఏదైనా చేయగలనా.. నావల్ల ఔతుందా.. ఇలా సాగుతున్నాయి ఆలోచనలు. ఇంతలో ఊరి పెద్దల్ని పిలిచారు స్వామి. చూడండి ఉత్సాహవంతుల్ని చక్కగా ఉపయోగించుకోండి. దైవం ఈ గుడిలో లోపలేలేడు. అంతా నిండి ఉన్నాడు. మానవ సేవలోనే సర్వప్రాణిసేవ మీకు సాధ్యమౌతుంది. ఇలాంటి పిల్లల్ని పదిమందిని పిలవండి అంటుండగానే మధ్యవయస్కులు పిల్లలూ ముందుకొచ్చారు.

స్వామీ మేమంతా మీ ఆజ్ఞ పాటిస్తాం. మేం... ఒకటి రెండు పన్నెండుమందిమి మా ఊరు బాగుచేసుకొంటాం. ఇటు గ్రామాభివృద్ధి అటు మానవత్వాన్ని చాటే సేవ మీరెలా చెప్తే అలా చేస్తాం. వారి ఉత్సాహానికి పొంగిపోయారు స్వామి. కొన్ని కార్యక్రమాలు పెద్దలద్వారా వారికి అప్పచెప్పి మళ్ళీ వచ్చి చూస్తామని నవ్వుతూ, వీడ్కోలు అందుకొంటూ వెళ్ళిపోయారు.

ఒక్కసారి మనసంతా శూన్యమైపోయింది. మా రాముడు దూరంగా వెళ్ళిపోతున్నాడా లేదు ఆలయంలోనే ఉన్నాడు. అందరం ఆయనకి మ్రొక్కి పంతులుగారి ఆశీస్సులు తీసుకొని ఇళ్ళకి బయలుదేరాం. స్వామి ఇలా చెయ్యమన్నారు. అలా చెయ్యమన్నారు అని పదిమందికీ చెప్తూ అమ్మ లోపలికి రావడానికి ఇంకో గంట పట్టింది.

మర్నాడు ఉదయమే రామాలయం చేరాను. పంతులుగారు అందరికీ కబురుపెట్టారేమో మా పన్నెండుమందీ వచ్చేశారు. ఊళ్ళో 6 వీధులు ఇద్దరిద్దరుగా పంచుకున్నాం. సాయంత్రానికి ఆ వీధివారి సహకారంతో కొంత శుభ్రంగా అందంగా తీర్చాం. మరునాటి నుంచి సాయంత్రం ఆలయంలో ఒకగంట పిల్లల్ని తీసుకొని వచ్చి కథలు చెప్పే కార్యక్రమానికి శ్రీకారం చుట్టారు పంతులుగారు. ఉత్సాహంతో కొందరు - అసలేమిటో చూద్దామని కొందరూ.. పంతులుగారి మాట కాదనలేక కొందరు పిల్లల్ని తీసుకొని వచ్చారు.

నాల్గురోజులలో ఉగాది పండుగ. అందుకని ముందుగా ఆ పండుగ.. అసలు పండుగంటే ఏమిటి? ఆనాటి పచ్చడి అందులో ఆరురుచులు.. ఎందుకో... జీవితానికి అవి ఎలా అన్వయించుకోవాలో చిన్నకథగా చెప్పారు పంతులుగారు. నాకు తెలిసిందల్లా పిల్లల్ని చక్కగా కూర్చోపెట్టి వినేలా చెయ్యడం. మధ్యలో ప్రశ్నలు వెయ్యడం. వాళ్ళ ఆసక్తి చూస్తోంటే ఎంత ఆనందంగా అనిపించిందో.. నిజంగా ఆచార్య సంకల్పం - ఆచార్య మంగళాశాసనం అంటే ఇదేనేమో... ఉగాదికి మా పన్నెండుమందిమి ఊరంతా ముగ్గులతో నింపాం. ప్రతి ఇంటివద్దా ఒక మొక్కనాటాం. మా రామునికోసం శ్రీరామనవమి వరకు అందరం వంతులు వేసుకొని ఆలయాన్ని తీర్చిదిద్దాం. శ్రీరామనవమి మా ప్రెసిడెంట్‌గారు అద్భుతంగా చేశారు. మమ్మల్ని ఎంత మెచ్చుకున్నారో ఆయన. మాసేవలని స్వామికి కూడా తెలియచేశారు ... నాల్గుకథలు, నాల్గు పద్యాలు - నాల్గు పాటలు ఇలా అందరికీ నేర్పారు పంతులుగారు. ఉత్సాహంతో మా పక్కింటి మాస్టారు శ్రీరాముడు ఏకపాత్రాభినయం చేశారు. ఇంతస్ఫూర్తి - ఇంత ఉత్సాహం- ఎలా కల్గింది. అంతా స్వామివారి దయ. నిర్లిప్తంగా ఉండే జీవితాల్లో అమృతానందాలు కురిపించారు స్వామి.

చూస్తుండగా కాలం పరుగులు తీసి స్వామివారు వచ్చేరోజు రానే వచ్చింది. ఎప్పుడెప్పుడా అంటూ ఊరి బయట నుండే జెండాలు.. నాట్యాలు.. మేళతాళాలు.. మధ్యలో మా శ్రీరామచంద్రుడు... మందస్మిత మూర్తి చల్లని పలుకరింపు.. ఇంతకంటే ఈ జీవితానికి ఏం కావాలి. ఆచార్యకటాక్షం వెల్లివిరిసింది. ఆదర్శగ్రామం చక్కగా నవ్వింది ఉగాది శుభాకాంక్షలు అందించింది.

---

జై శ్రీమన్నారాయణ!

శ్రీశ్రీశ్రీ త్రిదండి దేవనాథ రామానుజ జీయర్ స్వామివారి

## పర్యటన వివరములు

| | |
|---|---|
| మార్చి 31 నుండి ఏప్రియల్8వరకు | మెదక్‌జిల్లా, సంగారెడ్డి, వైకుంఠపురంలో ఉగాది నుండి శ్రీరామనవమి వరకు వేంచేసి ఉంటారు. |
| ఏప్రిల్ 9 | కోయంబత్తూరు పొలాచి సుదర్శన హోమంలో పాల్గొంటారు. |
| 10-13 | నెల్లూరు మహాలక్ష్మీయాగములో పాల్గొంటారు. |
| 14 | గుంటూరు అష్టలక్ష్మీయాగంలో అన్వయిస్తారు. |
| 16 నుండి | శ్రీరామ్‌నగర్‌లో వేంచేసి ఉంటారు. |

# అరచేతిలో... ఆరోగ్యం

విజయలక్ష్మి - హైదరాబాద్

మనిషి సుకర్మలు చేస్తూ ఊర్ధ్వగమనం సాగించాలని వేదాలు చెబుతున్నాయి.

శారీరకంగా, మానసికంగా ఎదిగినప్పుడే ఇది సాధ్యపడుతుంది. ఇది సాధించాలంటే ప్రకృతి సహజంగా జీవించాలి. మనసు, శరీరం రెండూ వేరువేరు కాదు.

మనసు వికలమైనా దాని ప్రభావం శరీరం మీద పడుతుంది. శరీరం రోగాలతో పీడింపబడుతుంటే ఆ ప్రభావం మనస్సు మీద పడుతుంది.

హడావుడి ప్రపంచం, ఉరుకుల కాలం అనవసరపు తాపత్రయం. అవసరంలేని పాశ్చాత్య పోకడలు... ఇవన్నీ మనలని ప్రకృతి సహజంగా బ్రతకనివ్వటంలేదు.

అయితే కొన్ని అనివార్యమైప్పుడు వాటిని సరిచేసుకునే మార్గాలు ఉన్నాయి.

యుగాల చరిత్రనాటి నుండి గ్రహిస్తే మనిషి శారీరక మానసిక ఎదుగుదలకు తోడ్పడినది. ప్రకృతి చికిత్సలే. మనదేశమే ఎన్నో ప్రకృతి వైద్యాలకు జన్మభూమి. అయితే, విదేశీయుల దండయాత్రలో మూలగ్రంథాలు దొంగిలించి వాటిలోని ఎన్నో వైద్య విద్యలను కొన్నిదేశాలు వాళ్ళవిగా ముద్రించుకుంటున్నారు. నేడు ఎన్నోదేశాలలో కళాశాలలలో ఈ వైద్యవిద్య కోర్సులు ఉన్నాయి. అలాంటి వాటిలో ఆక్యుప్రెజర్, ఆక్యుపంక్చర్ చికిత్సలు ఉన్నాయి.

భారతీయ సంస్కృతి, వేదాలు ఈ చికిత్సలనే మనకి మార్గాలుగా చూపుతున్నాయి. అందుకు శ్రీరామాయణ, మహాభారతాలు ఆధారం. మూర్ఛబోయిన లక్ష్మణుడు మేల్కొనుటకు హనుమంతుడు తెచ్చిన సంజీవని మూలిక ఆయుర్వేద చికిత్స.

బాణాల మొనలమీద భీష్ముణ్ణి పడుకోబెట్టడం నేడు చెప్పుకుంటున్న ఆక్యుపంక్చర్ చికిత్స.

పూర్వం యుద్ధంలో సిపాయిలమీద బాణాలు గుచ్చుకున్నపుడు కొన్నిసార్లు వారికున్న జబ్బులు నయం కావడం గమనించారు. అలా ఆక్యుపంక్చర్ వైద్యం మొదలైంది. మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక మళ్ళీ ఈ ప్రకృతి వైద్యాల గురించి ఉత్తర భారతదేశంలో ఎక్కువ ప్రచారం జరిగింది. ఎందరో వైద్యులు వీటికోసం కృషి చేశారు. అలాంటివారిలో డా॥ దేవేంద్ర వోరా గారు అతిముఖ్యులు. వారు ప్రపంచ ఆరోగ్య W.H.O సంస్థతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి "ఇవి భారతదేశంయొక్క వైద్యవిధానములు" అని నిరూపిస్తూ ఎంతో ప్రచారం చేశారు. అటుపిమ్మట కొన్ని రాష్ట్రాలలో ఈ వైద్యవిధానాలు ప్రాచుర్యం పొందినవి. మన




ఆంధ్రదేశంలోను దీనికి సంబంధించిన వైద్యులు ఉన్నారు. గత మూడున్నర దశాబ్దాలుగా మన జగదాచార్యులు శ్రీచిన్న జీయరు స్వామివారు వసుధైక కుటుంబ ఆనంద-ఆరోగ్యములకై చూపుచున్న మార్గములలో హోమియోపతి వైద్యం మరియు ఆక్యుప్రెషర్ వైద్యం కూడా ఉన్నవి. శ్రీశ్రీశ్రీ స్వామివారి అనేక కార్యక్రమములయందు ఉచిత వైద్య శిబిరాలలో వేలాది జనాలు ఈ ఆక్యుప్రెజర్ వైద్యంతో ఊరట చెందియున్నారు. శరీరంమీద కొన్నిభాగాలను వ్రేళ్ళతో ఒత్తడం వలన ఎన్నో రకాల వ్యాధులు మరియు నొప్పులనుండి ఉపశమనం కలుగుతుంది.

యోగా, ధ్యానం, ముద్రలు, ప్రకృతి చికిత్సలు, హిప్నాటిజం మొదలగునవి కొన్ని సూత్రాలు మరియు వయస్సు పరిమితులు ఆధారం చేసుకొని చికిత్స చేయబడును. ఆక్యుప్రెజర్ వైద్యవిధానంలో ఒకరోజు వయస్సు నుండి 100 సం॥ల వయస్సు వారికి కూడా వారి వారి శరీర ప్రకృతిని అనుసరించి అందరికి చికిత్స చేయవచ్చు. మన చుట్టూ వాతావరణం ఉన్నట్లు, మన శరీరంలో కూడా వాతావరణం ఉంటుంది. ఈ రెండు వాతావరణాల సమతుల్యమే ఆరోగ్యం.

మన శరీరం జీవశక్తి/బయోవిద్యుచ్ఛక్తి/ ప్రాణశక్తి ప్రవహించుచుండును. ఆక్యుప్రెషర్ వైద్యవిధానం శరీరంలోని జీవశక్తిని ఆయా శరీరభాగాల యందు ఒత్తిడి కలుగజేసి సరిచేయటం. మానవ శరీరానికి తనంత తానుగా రోగనిదానం పొందే అంతశక్తి మరియు జీవశక్తిని పునరుజ్జీవింప చేసుకునే సహజగుణం ఈ శరీరంలో ఉంది.

శ్వాస, జీవశక్తి, దారుఢ్యం, ఈ మూడింటి సమాహారమే ప్రాణశక్తి/ జీవవిద్యుత్‌శక్తి. ప్రాణశక్తి మన శరీరంలో పధ్నాల్గు మార్గముల ద్వారా ఎప్పుడూ ప్రవహిస్తూ ఉంటుంది. ఈ జీవశక్తిలో పాజిటివ్ ఎలక్ట్రాన్స్ బ్యాలెన్స్ అయి ఉంటాయి. ఈ రెండింటిలో ఏ ఒకటి ఎక్కువ తక్కువైనా బ్యాలెన్స్ తప్పి శరీరం అస్వస్థతకు లోనవుతుంది.

ఆక్యుప్రెజర్ చికిత్సలో ఈ బ్యాలెన్స్‌ను సరిచేయడం వలన శారీరక రోగాలనే కాక తీవ్రమైన మానసిక రోగాలు సైతం సరిచేయవచ్చు. ఈ పధ్నాల్గు మార్గాలలో మూడువందలకు పైగా ఆక్యుప్రెజర్ పాయింట్‌లు ఉన్నాయి. ఈ పాయింట్‌లను ప్రపంచ ఆరోగ్య సంస్థ W.H.O సైతం గుర్తించినది. ఈ పాయింట్‌లను రోగాన్ని బట్టి నిర్ణయించి స్టిమ్యులేట్ చేసి జీవశక్తి ప్రసారం జరిగేలా చేసిన ఆరోగ్యం చేకూరుతుంది.

జీవశక్తి ప్రవహించే మార్గాలన్నింటికి (ఛానెల్స్ అంటారు) శరీరంలోని అవయవాలు అన్నీ అనుసంధానం చేయబడి ఉంటాయి. ఛానల్స్ వలన వ్యాధుల సంబంధం చూద్దాం. ఛానల్స్ అన్నియు శరీరానికి రెండువైపులా ఉంటాయి.

**1. ఊపిరితిత్తులు- ప్రెషర్‌పాయింట్లు 11**

చర్మవ్యాధులు, దగ్గు సమస్యలు, తల వెనుక భాగం నొప్పి, ఊపిరి ఆడని స్థితి, ముక్కుకారుట, ఉగ్రరూపం, గొంతు సమస్యలు, పిల్లలు భయపడటం, థైరాయిడ్ సమస్యలు, కీళ్ళనొప్పులు.

*(అరచేయి బొటనవ్రేలు చివరనుండి భుజం ముందువైపు వరకు ప్రవహిస్తుంది).*

**2. పెద్దప్రేగు - ప్రెషర్‌పాయింట్ - 20**

జలుబు, పంటినొప్పులు, భుజాలనొప్పి, ముక్కునుండి రక్తం కారడం, రేచీకటి, తీవ్రజ్వరంతో కళ్ళు తిరిగి పడుట, ఆందోళన, కంటిసమస్యలు, గొంతువాపు, హైబి.పి., మెడ బిగుసుకు పోవడం, టాన్సిల్స్, చేతులు వణకడం, డిప్రెషన్, బ్లడ్ కేన్సర్, చర్మవ్యాధులు, సడన్‌గా మాటపడిపోవడం, ముక్కు వాసనలను గ్రహించలేకపోవడం, హైపర్ థైరాయిడిజం మొదలగునవి.

*(చూపుడువ్రేలు గోరు క్రింద నుండి బొటనవ్రేలుపైనుండి భుజంపై నుండి కంఠం వరకు మార్గం).*

**స్టమక్ ఛానెల్ (కడుపు) : (ప్రెషర్‌పాయింట్లు - 45)**

నోరు, ముఖ అన్ని సమస్యలు ఆకలి ఎక్కువ, తక్కువ అగుట, గ్యాస్ సమస్యలు, కంటి చూపుసమస్యలు, ముఖపక్షవాతం, దవడలు బిగుసుకుపోవటం. మాటలు రాకపోవడం, అజీర్ణం, అపెండిసైటిస్, హెర్నియా, ఇంపోటెన్సీ, మోకాళ్ళ నొప్పులు మొదలగునవి.

*(కంటిక్రింది నుండి పెదవి ప్రక్కగా మళ్ళీ తలపైకి చెవిప్రక్కగా కంఠం ద్వారా పాదంయొక్క రెండోవ్రేలు గోరు క్రింది వరకు మార్గం)*

**4. స్ప్లీన్‌ఛానెల్ : (ప్రెషర్ పాయింట్స్ 21)**

వెన్నెముక ప్రాబ్లెమ్స్, కడుపులో ఇబ్బందులు, జననేంద్రియ మూత్ర ఇబ్బందులు, ఎప్పుడూ తీపి తినాలనే కోరిక, జ్ఞాపకశక్తి తగ్గుట, పాదాలయందు శక్తి తగ్గుట, అస్తమానం టాన్సిల్స్ ఇబ్బందులు, అధిక ఋతుస్రావం మరియు అన్నిరకాల స్త్రీ నెలసరి సమస్యలు, కాళ్ళు, చేతులు చల్లగా ఉండుట, బొడ్డువద్ద తీవ్రనొప్పి, కిడ్నీలు బలహీనపడటం.

*(కాలి బొటనవ్రేలు గోరుక్రింది నుండి పాదంపైవైపు కాలు ప్రక్కనుంచి తొడనుండి తుంటిభాగం ద్వారా కడుపుపై నుంచి భుజం ద్వారా చంకభాగం వరకు మార్గం)*

**5. హార్ట్ (హృదయం) ఛానెల్ : (ప్రెషర్ పాయింట్లు - 9)**

హృదయ సమస్యలు, నిద్రలేమి, హిస్టీరియా, మానసిక సమస్యలు, అధికదాహం, శ్వాససమస్యలు, భుజాలనొప్పి, చేతులు మొద్దుబారడం, చేతితో రాయడంలో తేడాలు, కంపవాతము, తీవ్రదిగ్భ్రాంతితో మాట పడిపోవుట, ఆందోళన, భయం, ముక్కునుండి రక్తం కారుట, భరించలేని ఛాతినొప్పి, ఫిట్స్, పిచ్చితనం మొదలగునవి.

*(భుజం ముందు నుండి అరచేయి చిటికెనవ్రేలు లోపలివైపు గోరుప్రక్క వరకు మార్గం)*

**6. స్మాల్ ఇంటస్టయిన్ (చిన్నప్రేగు) : (ప్రెషర్‌పాయింట్లు - 19)**

చెవి సమస్యలు, అపెండిసైటీస్, కంటిసమస్యలు, తల్లులకు చనుపాలు లేకపోవుట, కామెర్లు, షుగర్‌వ్యాధి, ఫిట్స్, పిచ్చితనం, మణికట్టు నొప్పి, వెన్నునొప్పి సమస్యలు అన్నిరకాల మానసిక సమస్యలు, తల తిరగడం, ముఖపక్షవాతం.

*(అరచేయి పైన చిటికెనవ్రేలు వెలుపలి ప్రక్కనుండి భుజం వెనుకనుండి మరియు మెడ ప్రక్కనుండి ముక్కు కన్ను, మధ్య గుండా చెవి మధ్యలోకి మార్గం)* *(సశేషం)*



**పరమపదవార్త**

కాకర్లతోట, బళ్ళారి, కర్ణాటక వాస్తవ్యులు, శ్రీస్వామివారి శిష్యులు, **శ్రీమాన్ డి. శ్రీనివాసులు** గారు ది. **23.01.2014**న ఆచార్యతిరువడి చేరినారు. వీరికి పరమపదంలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు వీరి కుటుంబ సభ్యులకు మంగళాశాసనం చేశారు.



**పరమపదవార్త**

శ్రీస్వామివారి శిష్యులు, **శ్రీమతి పొట్లూరి వేంకట పుష్ప లీలావతి** గారు ది. **29.01.2014**న ఆచార్యతిరువడి చేరినారు. వీరికి పరమపదంలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు వీరి కుటుంబసభ్యులకు మంగళాశాసనం చేశారు.


7 సం॥లలో CA/CWA లలో అత్యధిక ఆలిండియా ర్యాంకులు మరియు పాస్ పర్సెంటేజ్ సాధించిన
నెం.1 కామర్స్ విద్యా సంస్థ



ఆంధ్రప్రదేశ్‌లోనే అత్యుత్తమ ఉత్తీర్ణతతో పాటు ర్యాంకులు సాధిస్తున్న ఏకైక అగ్రగామి కామర్స్ విద్యా సంస్థ

స్టేట్ 1st RANK 490/500
2012 Jr.MEC లో
K. VYSHNAVI

No.1 for ▸ Inter(MEC / CEC) ▸ CA/CWA
శ్రీ MEDHA™
Igniting Intelligence. Delivering Excellence.

Head Office:
6/9 Brodipet, Vuda Office Road, Guntur-2.
Ph: 22 55 891 / 988 52 49166

Branch Office:
Sriya Towers 2nd Floor, Besides Income Tax Office, Near Sidhardha Public School,
Mogalrajpuram, VIJAYAWADA Ph:9248920266

vijay ads

## శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారి ప్రవచనము నుండి



మనకి ఆత్మ ఉజ్జీవనానికి నిర్ణయించబడిన ఉపాయాల్లో, ఏది మనకి తగినటువంటిదీ అని ఆలోచిస్తే, కర్మ-స్వరూప విరుద్ధమైనదే, జ్ఞానము స్వరూప విరుద్ధమైనదే! భక్తి - స్వరూప విరుద్ధమైనదే, ప్రపత్తీ కూడా నిరంకుశత్వమైనదే! అవడం చేతను, అనాది పాపవిశిష్టులమైన మనం అవడం చేతనున్నూ, అదీ సందేహాస్పదమైనదే! నిస్సందేహమైనటువంటిది ఆచార్యకటాక్షం.

# ఆచార్య కటాక్షం

గురువుని ఆశ్రయించి, వారివల్ల మనం పొందవలసిన ఉపదేశం పొంది, వారికి సేవా శుశ్రూషలను చేయడం ద్వారా, మనవాడు అనే వారియొక్క ప్రేమకి, కటాక్షానికి పాత్రులం కాగలగడమే, ఆఖరు ఉపాయం అని నమ్ముతున్నాను.

దీనికేదైనా ఉదాహరణ ఉందా? ఉంది. శ్రీరామచంద్రమూర్తి ఒక ఉదాహరణ.

ఈవేళ శబరి ఉదాహరణ గురించి చెప్పుకుందాం! ఒక ఆటవికజాతి కులంలో పుట్టిన స్త్రీ శబరి. ఆమె చిన్నతనంలోనే, ఇల్లువదిలిపెట్టేసి, అదృష్ట విశేషం చేతను, పూర్వజన్మ సుకృతవిశేషం చేతను, మతంగమహర్షి శిష్యులను గురువులుగా ఆశ్రయించి, వారియొక్క సేవా శుశ్రూషలు చేస్తూవుండేది.

కొంతకాలమైన తరువాత వారికి ఆయుర్దాయం పూర్తయింది. వారు పరమపదానికి వెళ్ళేటప్పుడు శబరిని పిలిచి, "ఇంకా నీకు కొంత టైమ్ ఉంది. అంచేత, నువ్వు ఇక్కడ ఉండిపోవలసి ఉంది. అంతేకాకుండా, శ్రీరామచంద్రమూర్తి మనని వెతుక్కుంటూ... ఇలా వస్తాడాయన. అలా వచ్చినప్పుడు మన ఆశ్రమంలో ఎవ్వరూ గనక లేకపోయినట్లయితే... 'ఇంత కష్టపడి వెతుక్కుంటూ వచ్చేనే, ఆశ్రమం అంతా శూన్యంగా ఉంది. ఎవరూ లేరే' అని బాధపడతాడాయన. అందులోనూ, ఆశ్రమానికి వెళుతున్నాం అనంటే, ఏదో ఒక ఆతిథ్యానికై కావచ్చు, ఆకలి వేస్తుంటే, 'ఇంకెంతసేపులే, ఒక గంటలో ఆశ్రమానికి వెళుతున్నాం. మతంగ మహర్షి ఆశ్రమం చాలా బాగుంటుంది. పళ్ళు, ఫలములు, తేనె లాంటివి అన్నీ బాగా దొరుకుతాయి. ఇప్పుడిక్కడ పచ్చికాయలు తినేస్తే ఆకలుండదు. అక్కడికి వెళ్ళి బాగా ఆరగిద్దాం' అని చెప్పి, ఆతిథ్యానికి వస్తే, ఇక్కడెవ్వరూ లేకపోతే చాలా బాధపడతాడు. అతిదాహంతో ఉన్న వాడికి 'ఇక్కడ ఎదురుగుండా ఒక చలివేంద్రం ఉన్నదయ్యా! అక్కడ మంచినీళ్ళు దొరుకుతాయి' అని ఎవరైనా చెబితే, దానికి ఆశపడి, అతడు చేరిన తరువాత అక్కడ నీళ్ళులేని కుండలు బోర్లించి ఉంటే, ప్రాణం పోతుంది వాడికి. ఆ విధంగానే రామచంద్రుడు వచ్చినప్పుడు, ఇక్కడెవ్వరూ లేకపోయినట్లయితే, చాలా బాధపడతాడాయన. అంచేత నువ్వు ఇక్కడ ఉండు. ఆయనకి మేము లేని లోటులేకుండా, చక్కగా సేవా శుశ్రూషలు చేసి, అప్పుడు రావచ్చు నువ్వు మా దగ్గరకి" అన్నారు వాళ్ళు.

చిన్నప్పటినుంచీ సేవ చేస్తోంది ఆయనకి. వెళ్ళిపోతామంటు న్నారు. అయితే గురువుయొక్క ఆజ్ఞని నిర్వహించడమే శిష్యుడియొక్క కర్తవ్యం. అంతేగాని తన ఇష్టప్రకారంగా చేసే కైంకర్యం కూడదు. కైంకర్యంలో ఉండే దోషమదే! 'తనకీ దానిలో కొంచెం ఆనందం కలగాలి. అవతలివారికీ కలగాలి' అనే భావం ఉందే, అదిదోషం. కేవలం అవతలవానియొక్క ఆనందమే తనకి ముఖ్యంగా, తన నిమిత్తమే తాను ఎంత త్యాగం చేయవలసి వచ్చినా, ఎంత బాధపడ వలసి వచ్చినా, దానిని సంతోషంతో స్వీకరించి, ఎదటివాని యొక్క ఆనందనిమిత్తమై మాత్రమే సేవ చేయాలి. అది నిజమైన కైంకర్యం.

మనం చాలామంది కైంకర్యం చూస్తుంటాం. కానీ దానిలో ఈ దోషం ఉంటుంది.

సామాన్యంగా లోకంలో కైంకర్యం చేసేవాళ్ళందరికీ కూడా ఈ దోషం ఉంటుంది. ఈ దోషం ఉండకూడదు. ఉండకుండా ఉండడమే కైంకర్యం. 'అయ్యా ఈవేళ నమ్మాళ్వార్ల తిరునక్షత్రమండీ! ఏదైన వారికి మనం కైంకర్యం చేయాలి' అంటారు.

నలుగురు కూర్చున్నారు, ఆలోచిస్తున్నారు. ఒకరంటారు 'నమ్మాళ్వార్‌కి పులిహోర చాలా ఇష్టమండీ!, పులిహోర చేద్దామండి'.

ఇంకొకరంటారు, 'అబ్బ, ఏం పులిహోరండీ అస్తమానం. చక్రపొంగలి చేస్తే మంచిదండీ.' ఈయనకి పులిహోర ఇష్టంలేదు, చక్రపొంగలంటే ఇష్టమే.

అయితే నమ్మాళ్వార్‌కి ఇష్టం అనా, నాకిష్టం అనా చేయవలసింది? ఇంకొకళ్ళు 'దద్ధోజనం చేయండీ', అంటారు.

అంటే ఏమిటి? 'తమకి కూడా దాంట్లో బాగుండాలి' అనే ఒక స్వార్థం ఉంది దానిలో. మనకి ఇష్టం లేకపోయినప్పటికీ కూడా ఆయనకి, ఎదటివానికి ఇష్టం గనుక అనే భావంతోటి చేస్తే, అదే నిజమైన కైంకర్యం. అది చాలా కష్టం. దానికి భాగవతంలో చక్కని ఒక ఉదాహరణ ఉన్నది.

నారదుడు 'స్వార్థంయొక్క వాసనైనా లేకుండా కైంకర్యం చేయడమనేది ఉంటుందా? ఎవరైనా అలా కైంకర్యం చేస్తారా?' అని సందేహించి, శ్రీకృష్ణపరమాత్మని అడిగేడు. 'ఎవరైనా ఉన్నారా? నీ భక్తుల్లో అలాంటివాళ్ళు?'

'సరే, ఒకటి, రెండురోజులు నా దగ్గరుండు, చూపిస్తాను', అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

ఇలా ఆయన మాట్లాడుతుంటే, అక్కడ్నుంచీ కృష్ణుడు వణకడం ప్రారంభించేడు. జ్వరం వచ్చినట్టుగా. మలేరియా జ్వరం $105^0$ డిగ్రీల జ్వరం వచ్చినట్టుగా వణకడం మొదలు పెట్టేడు.

నారదుడు భయపడి అడిగేడు, 'ఏమిటయ్యా, వణుకుతున్నావ్?'

'నాకు మలేరియా జ్వరం వచ్చేసిందీ' అన్నాడు కృష్ణుడు.

'అయ్యయ్యో! అలాగా, దానికేదైనా మందు చెప్పు. పట్టుకొచ్చి ఇస్తాను' అన్నాడు నారదుడు.

'దానికి ఒకటే మందుంది' కృష్ణుడు.

'ఏమిటామందు?'

'ఎవరైనా ఒక కృష్ణభక్తుడియొక్క అరికాలి మట్టి గోకి, ఒకమాత్రగా చేసి ఇస్తే, అది నేను వేసుకుంటే తగ్గిపోతుంది.'

'అయ్యో! ఏ భక్తుడిస్తాడండీ, సాక్షాత్తూ భగవంతుడికి? ఆయన పాదాలు

తలమీద పెట్టుకుని, ఆయన పాదరజస్సుని తాను శ్రీపాదతీర్థంగా స్వీకరించే భక్తుడు, తనయొక్క కాలియొక్క రజస్సుని భగవంతుడికి ఇస్తాడా? ఎవడూ ఇవ్వడే?'

'ఇవ్వకపోతే నాకు జ్వరం ఇంతే!' 'పోనీ ఎవ్వడో చెప్పు, అటువంటివాడెవడో చెప్పు పోనీ, నేను అడిగొస్తా.' 'భక్తులందరిలో కూడాను మహాభక్తుడవు నువ్వే! నీ కాలిమట్టి ఇవ్వు' అన్నాడు కృష్ణపరమాత్మ.

'ఓహో, కొంప ముంచేసేవు! నీ జ్వరం రెండురోజులుంటుంది, మూడు రోజులుంటుంది. తరువాత ఎలాగూ పోతుందది. నేనే నా కాలిమట్టిగనక ఇస్తే, జన్మ జన్మాంతరాలకిన్నీ నరకకూపంలో పడిపోతాను నేను. నేనసలు ఇవ్వను నీకు' అన్నాడు నారదుడు.

'అలాగయితే జ్వరం తగ్గదే!'

'తగ్గకపోతే మతేం ఫర్వాలేదులే! ఒకటి రెండు రోజులు లంఖణాలు చేస్తివా, మాంచి వెన్నాగిన్నా పుచ్చుకోవడం, మీగడ గీగడా తినడం మానేయ్. అదే తగ్గుతుంది. కానీ, నన్ను మాత్రం నరకంలో పడేయకు' అన్నాడు నారదుడు.

కానీ, పాపం కృష్ణుడు మతీ వణుకుతున్నాడు. నారదుడు చూచి సహించలేకపోయాడు, బ్రతిమాలుకున్నాడు. 'అయ్యా, నేను మాత్రం ఇవ్వనుగానీ, ఇంకో భక్తుడెవరైనా ఉంటే చెప్పు.'

'ఇక్కడికి బృందావనం ఆరుమైళ్ళదూరంలో ఉంది. అక్కడ గోపికలు అని ఉన్నారు. వాళ్ళని వెళ్ళి అడుగు, ఇస్తారు' అన్నాడు.

నారదుడు వెళ్ళి గోపికలని అడిగేడు. 'ఓహో, జ్వరం వచ్చిందా! కాలి మట్టి కావాలన్నాడా! ఎప్పుడొచ్చిందయ్యా జ్వరం?' అని అడిగేరు గోపికలు.

'అమ్మా, ప్రొద్దున్న పదిగంటలకొచ్చింది.'

'సరే, మధ్యాహ్నం మూడుగంటల దాకా నువ్వేం చేస్తున్నావు?' 'ఆయనతోటి ఇలా తర్కం చేస్తున్నాను' అన్నాడు. అక్కడ్నుంచి నారదుడిని కొట్టడానికి సిద్ధమయ్యారు.

'ఆయనకి జ్వరంగా ఉందీ అంటే, వెంటనే రావద్దూ. సరే, ఇప్పుడైనా వెంటనే తీసుకువెళ్ళు' అని చెప్పి పదిమందీ వరుసగా కూర్చుని, అల్చిప్పలు తీసుకొచ్చి గీకీ, గీకీ, గీకీ మట్టిని ఇంతింత ఉండలని చేసి, తట్టెడు చేసి, నారదుడి నెత్తిమీద పెట్టి, 'పరుగెట్టు వేగంగా' అన్నారు గోపికలు.

ఆశ్చర్యం వేసింది నారదుడికి. 'ఒకమాత్ర ఇమ్మంటే నేనింత భయపడ్డానే, వీళ్ళు ఇంత స్వేచ్ఛగా సాహసించి ఇస్తున్నారే! అజ్ఞానం చేత ఇచ్చారేమో?' అని వాళ్ళని అడిగేడు, ఇప్పుడు మీరేం పనిచేస్తున్నారో తెలుసా?'

'అయ్యా, తెలియకెందుకు? నువ్వు చెప్పిందే కదా చేసేం.'

'మీ అరికాలిమట్టిని సాక్షాత్తు భగవంతుడైన కృష్ణపరమాత్మకి ఇవ్వవొచ్చా?'

'మరి ఇమ్మన్నాడుగదటయ్యా ఆయన?'

'ఆయనేదో చెబితే మీరలా చేయడమేనా? దీనివల్ల ఫలమేమిటో మీకు తెలుసా?'

'మాకేం ఫలం గిలం అక్కర్లేదు. ఆయన ఇమ్మన్నాడు, ఇచ్చేం. అంతే!'

'అయ్యయ్యో, మీరు నరకంలో పడిపోతారు. రౌరవాది నరకాలలో పడిపోతారు.' అక్కడినుంచీ నారదుడియొక్క జుట్టు పట్టుకోవడానికి సిద్ధమయ్యారు.

"ఏమయ్యా, ఎందుకీ ఆలస్యం? ఇంత వాదనెందుకు చేస్తావు? 'కృష్ణుడు జ్వరమొచ్చి బాధపడు తున్నాడు' అనే మాట వినడం కంటే నరకం వేరేవుందా? రౌరవాది నరకం వుంటుందా? ఇంతకంటే. కనుక, ఆయన బాగుంటే అంతకంటే మాకు పరమపదం ఎందుకూ? ఇలాంటి వాదన చేయక, తీసుకు వెళ్ళి వెయ్' అన్నారు గోపికలు.

అప్పుడు వాళ్ళ కాళ్ళమీద పడ్డాడు నారదుడు. 'అయ్యో, వీళ్ళకున్నంత భక్తి శ్రద్ధ నాకు లేదే! కృష్ణుడియొక్క ఆనందమే తమనిమిత్తమై ఉంటే, నరకంలోకి వెళ్ళడానికి కూడా సిద్ధమవుతున్నారే వీళ్ళు' అనుకున్నాడు.

'నువ్వు అడవికి రావద్దు. అక్కడంతా బాధలు పడాలి' అని శ్రీరామచంద్రమూర్తి సీతమ్మతో అంటున్నాడు. 'అయ్యా నిన్ను విడిచిపెట్టి అంతఃపురంలో ఉంటే, స్వర్గమా ఇది? ఇది నరకం కాదా. నీతో ఉంటే ఆ అడవే స్వర్గం. నీ సేవచేస్తూ, నిన్ను చూస్తూ, నీ ఆలాపనలు వింటూవుంటే అంతకంటే పరమపదం ఏముంది?' అంటుంది సీతమ్మ.

**అంటే, కైంకర్యమనగానేమి?**

తనకి యజమాని అయినవానియొక్క ఆనందం నిమిత్తమై, తాను చేసే త్యాగపూర్వకమైన క్రియా విశేషానికే **'కైంకర్యం'** అని పేరు. అదే నిష్కళంకమైన, నిర్మలమైన కైంకర్యము. చేయవలసిన విధానము అదే. ఇలాగ, కొంతమందికీ, 'కూడా ఉండి' చేయాలని ఉంటుంది. కొంతమందికి 'ఆజ్ఞ మాత్రమే చేయాలీ' అని ఉంటుంది.

రామాయణంలో చెబుతారు భరతుడిని, 'వెళ్ళి అయోధ్యలో కూర్చో!' అని రాముడంటే, 'అందరూ తిడతారండీ, వాళ్ళకి మొగం చూపిస్తే, ఈ దౌర్భాగ్యుడు రాముడిని పంపించివేసేడు. అడవిపాలు చేసేడు, అని తిడతారండీ, కొడతారండీ!'

'ఏం చేసినా సరే, నువ్వు వెళ్ళి అక్కడ ఉండవలసిందే!' 'చిత్తం' అన్నాడు, వెళ్ళేడు భరతుడు.

లక్ష్మణస్వామిని వెళ్ళమంటే, 'నేను వెళ్ళను' అన్నాడు.

ఒక యజమానికి 'అన్ని పనులూ కావాలి' అని సేవకుడిని పెట్టుకుంటాడు. 'అయ్యా, నేను నీ ఎదట ఊరికే కూర్చుని నిన్ను స్తుతిస్తుంటాను. నువ్వు ఇంద్రుడివయ్యా, చంద్రుడివయ్యా' అని సేవకుడు అంటే, 'వెళ్ళి వంటచేసి పెట్టరా!' అని యజమాని ఆజ్ఞాపిస్తే, 'అబ్బెబ్బే, వంటకాదండీ, మిమ్మల్ని చూస్తూ, మిమ్మల్ని స్తుతిచేయడమే నాకు ఆనందమండీ!' అని ఆతడు కూర్చుంటే, యజమానికి కడుపులో కాలిపోతుంది కదా!

కనక, తనకి బాధగా ఉన్నప్పటికిన్నీ, ఆయనకి కావలసిన పనిచేయాలి. అంచేత శబరి, పాపం, గురువుగారి ఆజ్ఞ అయ్యింది అని చెప్పి, వారి విరహాన్ని సహించింది, చెబుతానంది. వారు వెళ్ళిపోయారు.

పదమూడు సంవత్సరాల తరువాత శ్రీరామచంద్రుడు వచ్చేడు. ఇదెప్పుడు జరిగిందీ, ఈ మతంగమహర్షి శిష్యులకిన్నీ, శబరికీ జరిగిన వృత్తాంతం, సంభాషణ? చిత్రకూటపర్వతంలో రాముడుండగా జరిగింది. చిత్రకూట పర్వతంనుంచీ, శబరి ఆశ్రమం వచ్చేటప్పటికి పదమూడు సంవత్సరాలు పట్టింది. అయితే, శబరికి గురువియోగం అయ్యేటప్పటికి ఆ దుఃఖంలో అడగడం మరచిపోయింది. 'ఎప్పుడొస్తాడు రాముడు?' అని. వారూ

చెప్పలేదు. తెలిసే చెప్పలేదో, తెలియక చెప్పలేదో, హడావుడిచేత, ఏదో, మొత్తానికి చెప్పలేదు.

శబరేమనుకుందీ, 'రాముడొస్తాడు, ఈ వేళ వస్తాడు, అందుకని ఆతిథ్యమిచ్చి త్వరగా రమ్మన్నారు' అనుకుంది పాపం. అనుకునే అక్కడే కూలబడింది. కొంచెంసేపు అయిన తరువాత గబగబా వెళ్ళి, అడవిలో ఆ పళ్ళు గిళ్ళూ అన్నీ తీసుకొచ్చేసింది. ఆ అరుగుమీదే కూర్చుంది. లోపలికి వెళితే రాముడొచ్చి ఎవరూ లేరని వెళ్ళిపోతాడేమో! అని అక్కడే పళ్ళని బాగుచేసుకుంటోంది.

సాయంకాలమైంది. రాముడి రాక కనిపించలేదు. 'అయ్యో, అడవిలో పడి రావాలి. అందులో సీతమ్మ కూడా ఉంది కదా!' అనుకుంది. 'ఎక్కడైనా ఆగివుంటారు, ప్రొద్దున్నే లేచి వస్తారు', అనుకుని, రాత్రి గడిపించింది. ప్రొద్దున్నే చూసింది. ప్రొద్దున్నా రాలేదు. 'అయ్యో, ప్రొద్దున్నే నీరసంగా ఉంటుంది. అంచేత, దూరంనుంచీ రావడానికి బాధ భరించాలి. ఎక్కడో కొంచెం భోజనం చేసి సాయంకాలానికి నిమ్మళంగా చేరతారు' అనుకుని సాయంకాలందాకా కూర్చుంది. రాలేదు.

మళ్ళీ ప్రొద్దున్నే వస్తారేమో అనుకుంది. ప్రొద్దున్న రాలేదు. ఈవిధంగా రాముడి ధ్యానం తోటి పదమూడు సంవత్సరాలు గడిపింది. ఇంట్లోకి వెళ్ళలేదు. వెళితే రాముడు వెళ్ళిపోతాడేమో! అని అనుక్షణమూ రామధ్యానం తప్ప వేరే ధ్యానం లేదు. ఇంతకంటే ధ్యానయోగం ఏముందండీ!? అదే వైష్ణవ ధ్యానయోగ పద్ధతి.

ఒకడు కైంకర్యం అనుకుని చెప్పి, అక్కడ 'అయ్యో, పెరుమాళ్ళకి తిరుమంజనమైపోతోందండీ! అయిపోతుందండీ, గంట కొట్టేసేరు'. వీడు స్నానం చేస్తున్నా అదే, గంట అవుతోంది అనే ధ్యానమే! బొట్టు పెట్టుకుంటున్నా అదే ధ్యానమే! అన్నం తింటున్నా అదే ధ్యానమే! ఎక్కడికి వెళుతున్నా అదే ధ్యానమే! ఆ కైంకర్యం ఉంటుందనే ఆత్రుతతోటి అదే అనుకుంటూ వుంటాం. ఆ విధంగా పదమూడు సంవత్సరాల గడిపిందండీ శబరి. ఎంత మహానుభావురాలు! ఆఖరికి రాముడొచ్చేడు. చాలా ఆనందపడింది. ఆ తీసుకొచ్చిన పళ్ళన్నీ పెట్టింది.

రాముడు ఎంగిలి పళ్ళు తిన్నాడంటారు.

ఎంగిలి అంటే శేషం. ఎంగిలి అనేది అనేక రకాలుగా ఉంది. ఒక గిన్నెతోటి వండి, ఆ గిన్నెలోది వేరేగా ఎవరికైనా పెట్టినా, ఆ మిగిలినది కూడా శేషమని, అది ఎంగిలిగా లెక్క. లేక ఒక పళ్ళెంలో ఎవడికైనా వడ్డిస్తాం. వాడు ముట్టుకోకుండా జాగ్రత్తగా వడ్డిస్తాం. కానీ, కొంత వడ్డిస్తాం. ఇంకా కొంత ఉంటుంది. అదీ ఎంగిలనే లెక్క. శేషం పనికిరాదు కొంతమందికి. అది నిషేధం. ఆ విధంగానే తాను కొన్ని పళ్ళు తీసుకొచ్చి, అవి బాగున్నాయో, లేదో అనేటటువంటి ఉద్దేశం చేత కొన్ని పళ్ళు. లేక ఒక జామపండు వుంది, ఒక మామిడిపండువుంది, గిల్లి ఒకముక్క నోట్లో పెట్టుకుంది. 'బాగుందో లేదో', అని.

మంచి వేసవికాలంలో, భోజనం లేకుండా బాగా శ్రమపడి ఒక పెద్దమనిషి సాయంకాలానికి వచ్చాడు. ఆయన యందుండే సంతోషం కొద్దిన్నీ, మంచి బాదంపలుకులు మొదలైనవన్నీ అక్కడ పెట్టేరు. ఆ బాదం పలుకుల్లో ఒక్కొక్క పలుకేమో చేదుగా ఉంటుంది. కిలో ఎనభైరూపాయలు పెట్టి ఎంతో ఆదరంగా తీసుకొచ్చి అక్కడ పెడితే, ఆ పలుకులు వేసుకునేసరికి నోరంతా చెడిపోయింది. ఇంకేవీ తినలేకపోయాడు. ఆ పలుకు చేదుగా ఉండి, మిగిలినవేవీ తినలేకపోయాడు. ఏం లాభం అది. అలా కాకుండా, ఒక పలుకు తిని చూసి, మంచివేనయ్యా అనుకుని పెడితే దోషం కాదది. ఆ విధంగానే, ఒకరమైనటువంటి పళ్ళలో, రామాయణంలో ఉందీ దానిమ్మపళ్ళు.

అంటే, ఆ శబరిఘట్టం వచ్చినప్పుడు దానిమ్మపళ్ళు ఆరగింపు చేయమని ఉంది. శబరి, 'దానిమ్మ పళ్ళల్లో గింజ వస్తుందీ, అది మూగదానిమ్మ, తియ్యదానిమ్మ, బావుందా, లేదా' అని, చూసింది. ఆ మిగతావి అట్టే పెట్టింది. అవి ఎంగిలివే పెట్టినట్టు లెక్క శాస్త్రప్రకారంగా. సరే, ఆవిధంగా ఆతిథ్య మిచ్చేసింది. రాముడు చాలా సంతోషించాడు. 'రామా, మా గురువుగారి యొక్క ప్రభావం చూపిస్తాను చూస్తావా?' అడిగింది శబరి. *(సశేషం)*


జై శ్రీమన్నారాయణ!

**ప్రజ్ఞ వేసవి శిబిరము**

**తేది. ఏప్రిల్ 20 నుండి మే 5 వరకు**

**వేదిక: జీవాప్రాంగణం, శ్రీరామనగరం, పాలమాకుల, శంషాబాద్, రంగారెడ్డి జిల్లా.**

**గమనిక: 10 నుండి 18 సంవత్సరములు గల బాల బాలికలకు మాత్రమే!**

శిబిరములో నేర్పించు అంశములు

**యోగ శిక్షణ, ప్రజ్ఞ తరగతులు, పూర్వపు నైతిక విలువలు, సంప్రదాయం, సంగీతం, ఆటలు, సమాజసేవ, చిత్రలేఖన, తబల, క్విజ్... మొదలైనవి మరింకెన్నో!**

**తరగతులలో పాల్గొనువారికి భోజన, వసతి సౌకర్యము ఉచితముగ కల్పించబడును.**

**వివరములకు : 94415 83064, 93462 62189**

rd_nela_jet@yahoo.com 95535 49971/72

శ్రీస్వామివారి మంగళాశాసనములతో...!

బెంగుళూరు వారి

**శ్రీవైష్ణవ పాణిగ్రహణ వేదిక**

శ్రీవైష్ణవులను, వారి సంప్రదాయాలను అభివృద్ధి చేయటానికి బెంగుళూరుకు చెందిన శ్రీమాన్ ఫణికుమార్ గారు చిన్న ప్రయత్నం చేయుచున్నారు.

మీ జీవిత భాగస్వామికోసం ఎదురుచూస్తున్నారా! మీ ముందుకు మంగళాక్షతలు!

**www.mangalaakshatas.com**

వైదిక పరంపరని పరిరక్షించడం కోసం ఓ చిన్ని ప్రయత్నం! దీన్ని సద్వినియోగ పరచుకోగలరు.



# పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



మార్చి 1వ తేదీన శ్రీరామనగర్, జీవాప్రాంగణంలో బదరీ అష్టాక్షరీ క్షేత్రీయ శాఖాసంఘం వార్షిక సమావేశం శ్రీశ్రీశ్రీ స్వామివారి అధ్యక్షతన జరిగింది. ఈ సమావేశంలో ముందుగా 2013 సం॥లో జరిగిన BAKASS కార్యక్రమాలను సమీక్షించారు.

**అన్నదాన సేవలు:** బదరీక్షేత్రంలో సరస్వతీనది పుష్కరాలు జరిగాయి. ఈ సందర్భంగా మన అష్టాక్షరీక్షేత్రంలో సుమారు 35వేలమంది అన్నప్రసాదాన్ని స్వీకరించారు.

ఉత్తరాంచల్ రాష్ట్రంలోని కేదార్‌నాథ్‌లో పెను ఉపద్రవం సంభవించింది. ప్రకృతి ఉత్పాత ప్రభావంవల్ల దారులు మూసుకుపోయాయి. పర్యవసానగా పాండుకేశ్వరంలోను, బదరికాశ్రమంలోను ఎక్కడి యాత్రీకులు అక్కడే నిలిచిపోయారు. రాకపోకల సౌకర్యం స్తంభించి పోవడంతో యాత్రికులకు ఆహార, వసతి కొరత ఏర్పడింది. ఇలాంటి పరిస్థితులలో బదరీనాథ్‌లోని మన అష్టాక్షరీక్షేత్రం యాత్రికులను అన్నివిధాలా ఆదుకున్నది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మన క్షేత్రాన్ని **"నోడల్ ఆఫీస్"**గా ఏర్పటు చేసుకొని యాత్రికులను ఢిల్లీకి తరలించే ప్రయత్నాలు చేసింది. ఈ ప్రయత్నాలన్నీ పూర్తయ్యేదాకా మన క్షేత్రమే తెలుగువారందరికీ ఆహార, వసతి సదుపాయాలు అందించింది.

మన అష్టాక్షరీక్షేత్రంలో ఉన్న అర్చకస్వామి, వంటస్వామి శ్రీధర్ ప్రభృతులు నిర్విరామంగా విశేషసేవలు అందించి యాత్రికుల మెప్పును పొందారు. ఈ విపత్కాలంలో వారు సుమారు 45వేలమందికి అన్నప్రసాదాన్ని అందించారు.

బదరీక్షేత్రంలోనే కాక పాండుకేశ్వరంలోను, ఋషీకేశ్‌మఠంలోను మన BAKASS భక్తులకు అన్నప్రసాదాన్ని ప్రేమతో అందించింది. మూడుచోట్లా కలిపి ఈ 2013సం॥లో మన సంఘానికి ఒక లక్ష 25వేలమంది భక్తులకు అన్నప్రసాదాన్ని అందించే భాగ్యం లభించింది.

**తదీయారాధన:** ఈ ఏడాది BAKASS పక్షాన తదీయారాధనికి చీకోటి వేంకటేశ్వరరావుగారు ఉభయదారులుగా ఉండి, నిర్వహించుటకు సిద్ధమయ్యారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు వారికి మంగళాశాసనాన్ని చేశారు.

బదరీనాథ్ క్షేత్ర దర్శనం : **జ్యోతిర్దర్శనము**

**2014సం॥లో మే 5వ తేదీన బదరీనాథ్ క్షేత్రాన్ని జ్యోతి దర్శనంతో ఆరంభించనున్నారు. భక్తుల సౌకర్యం నిమిత్తం మన క్షేత్రాన్ని ఒకటవ తేదీనాటికి తెరిచే ఏర్పాటు BAKASS చేస్తున్నది.**

ఋషీకేశ్ క్షేత్రదర్శనం: మే 5వ తేదీన బదరీనాథ్ క్షేత్రాన్ని జ్యోతిదర్శనంతో ఆరంభించనున్నారు. భక్తుల సౌకర్యనిమిత్తంగా మన క్షేత్రాన్ని మే 1వ తేదీన తెరిచే ఏర్పాటు BAKASS చేస్తున్నది.

**4. ఋషీకేశ్ బ్రహ్మోత్సవం :** ఋషీకేశ్‌మఠంలో వేంచేసియున్న "హనుమత్సమేతుడైన వైకుంఠ రామచంద్రస్వామి"కి మే నెలలో 23,24,25 తేదీలలో బ్రహ్మోత్సవాలు జరుగనున్నాయి. శ్రీస్వామివారి మంగళాశాసనములతో ఈ ఏడాది బ్రహ్మోత్సవంలో పెరుమాళ్ళకు క్రొత్తగా గరుడ వాహనం ఏర్పడనున్నది. బాకాస్ భక్తులకు సాదర ఆహ్వానం పలుకుతున్నది.

**మూలనిధి :** BAKASS సాగించే తదీయారాధన నిమిత్తం **"కోటిరూపాయల"** మూలనిధిని ఏర్పాటు చేయాలని సంఘం రెండు సంవత్సరాల క్రితం నిర్ణయించింది. ఈ దిశగా సంఘం సగం దూరం మాత్రమే ప్రయాణించింది. భక్తులకు ఇందుకు సంబంధించిన సమాచారాన్ని అందించి, వారి భాగస్వామ్యంతో మూలనిధిని పరిపూర్ణం చేయాలని కమిటీ సభ్యులు నిర్ణయించారు.

**ఇతర సేవలు :** ప్రకృతి ఉత్పాతం కారణంగా పాండుకేశ్వరం నుండి క్రింది ప్రాంతాల దాకా తీవ్రమైన నష్టం సంభవించింది. మార్గాలు తీవ్రంగా భగ్నమయ్యాయి. 2013 నవంబర్‌లో పైన చిక్కుకుపోయిన 3000 బస్సులను క్రిందికి దించేందుకు వీలుగా ప్రభుత్వం తాత్కాలికంగా రహదారులను సరిచేసింది.

క్షేత్రం తెరిచే మే నెలనాటికి రహదారులు మరికొంత బాగుపడే అవకాశమున్నది. క్షేత్రం ప్రారంభించిన తరువాత మన కమిటీవారు ఆ ప్రాంతాన్ని దర్శిస్తారు. మనం చేయగలిగిన సేవల విషయంలో ఆలోచించి, బాధితులకు తగిన సేవలను అందించాలని కమిటీ నిర్ణయించింది.

కమిటీ సభ్యులకు శ్రీస్వామివారి మంగళాశాసనములను అందించడంతో సమావేశం ముగిసింది.

మార్చి 2వ తేదీ శ్రీరామనగర్, జీవా ఆశ్రమం నుండి శ్రీశ్రీశ్రీ స్వామివారి రోడ్డుమార్గాన్ని రెండవతేదీ సాయంత్రానికి కర్ణాటక రాష్ట్రంలోని బళ్ళారి నగరానికి చేరారు. మేల్కోట కమిటీసభ్యులు శ్రీమాన్ సదాశివరెడ్డిగారి ఆహ్వానం మేరకు వారి మిత్రులైన శ్రీశ్యామసుందర చిరానియాగారి గృహంలో జరిగిన సుదర్శనయాగ పూర్ణాహుతిలో శ్రీస్వామివారు పాల్గొని వారి కుటుంబీకులకు మంగళా శాసనాలు చేశారు.

శ్రీస్వామివారు శ్రీమాన్ మురళిగారు ఫ్యాక్టరీని, శ్రీమాన్ ఉమేష్‌గారి గృహాన్ని దర్శించి వారికి మంగళాశాసనాలను అనుగ్రహించారు. సుధాకర్ పైప్స్ నిర్వాహకులు శ్రీమాన్ అనుంతుల సుధాకర్‌గారి ఆహ్వానం మేరకు వారి గృహానికి వెళ్ళి, అనంతరం బాల హనుమాన్‌జీ మందిరాన్ని, అయ్యప్ప దేవాలయాన్ని శ్రీస్వామివారు దర్శించారు.

**దావణగేరె విశేషాలు :**

శ్రీస్వామివారు సాయంత్రం 4గం॥లకు దావణగేరె చేరారు.

దావనగిరిలో శ్రీమాన్ వీరభద్రరావుగారు 1994లో వికాసతరంగిణి శాఖను ఏర్పాటు చేశారు. అప్పటినుండి గత 20 సంవత్సరాలుగా వేసవిలో మజ్జిగ వితరణ "చలివేంద్రా"ని నియతంగా వారు నిర్వహిస్తున్నారు. నిరంతరాయంగా వేసవిలో దాహార్తుల దాహం తీర్చడం విశేషసేవ.

శ్రీమాన్ వీరభద్రరావుగారు, శ్రీమాన్ సత్యనారాయణగారు తదితర సభ్యుల సహకారంతో ధావణగిరి వికాసతరంగిణి శాఖ అందిస్తున్న సేవలకు శ్రీస్వామివారు మంగళాశాసనాలను అందజేశారు.

అంతేకాక, శ్రీ వీరభద్రరావుగారు సంకల్పించిన కళ్యాణ వేంకటేశ్వర స్వామి దేవాలయ నిర్మాణానికి శ్రీస్వామివారు శంకుస్థాపన చేశారు. బెంగుళూరు వికాసతరంగిణి నిర్వాహకులు శ్రీమతి ఉషాజగదీష్, శ్రీమతి శారదలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. శ్రీమతి విజయలక్ష్మి, శ్రీరాఘవేంద్రలు నిర్వహిస్తున్న విశ్వచేతన స్కూలును శ్రీస్వామివారు దర్శించి విద్యార్థులకు మంగళాశాసనాలు చేశారు.

**హోస్‌పేట :** మే 4వ తేదీ రాత్రికి శ్రీస్వామివారు హోస్‌పేటకు చేరుకుని శ్రీమాన్ సదాశివరెడ్డిగారి సోదరులు శ్రీమాన్ జనార్ధనరెడ్డిగారి కోరిక మేరకు వారింట్లో బసచేశారు.

5వ తేది ఉదయం శ్రీస్వామివారు శ్రీ వేంకటేశ్వరస్వామి దేవస్థానంలో జరిగిన శ్రీ సీతారమ కల్యాణంలో పాల్గొన్నారు. శ్రీమతి గీతా శ్రీనివాస్ దంపతుల పక్షాన వారి కుమారులు శ్రీమాన్ సంతోష్ దంపతులు ఈ కల్యాణోత్సవాన్ని ప్రధానంగా నిర్వహించారు. శ్రీమాన్ రణధీర్ కంప్లీ తమ గ్రామస్థుల గోష్ఠితో కలసి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు . హోస్‌పేట నుండి బయలుదేరి శ్రీస్వామివారు గంగావతిలో కొద్దిసేపు ఆగారు. మేల్కోటలో జరిగే అన్నదాన కార్యక్రమాల నిర్వహణలో ముఖ్యులైన కృష్ణమూర్తిగారి శ్రీమతి పరమపదించారు. శ్రీ కృష్ణమూర్తి బావగారు శ్రీమాన్ రామారావుగారు కూడ పరమపదించారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు వారి గృహానికి వేంచేసి కుటుంబసభ్యులను పరామర్శించారు.

5వ తేది రాత్రి 10గం॥లకు హైదరాబాద్‌లోని లాంకోహిల్స్‌కు చేరి శ్రీమాన్ హరి ఓరుగంటి గృహంలో బసచేశారు.

6వ తేది ఉదయం శ్రీమతి లగడపాటి రామలక్ష్మిగారి కోరిక మేరకు కీ.శే. లగడపాటి రామానాయుడిగారి పరమపదోత్సవ కార్యక్రమంలో పాల్గొని కుటుంబసభ్యులకు మంగళాశాసనం చేశారు. అనంతరం శ్రీస్వామివారు శ్రీరామనగర్ వేంచేశారు. 7,8,9 తేదీలలో శ్రీరామనగర్ ఆశ్రమ కార్యక్రమాలను సమీక్షించారు.

**వావిలాలపల్లి-కరీంనగర్:**

10వతేదీ రాత్రి శ్రీస్వామివారు కరీంనగర్ జిల్లాలోని వెలిచాల గ్రామానికి వేంచేశారు. వేదభవన నిర్వాహకులు శ్రీమాన్ వీర్ల ప్రభాకర్‌రావుగారి స్వగ్రామం. వెలిచాల. వీరు గ్రామాభివృద్ధికోసం పలు సేవా కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. వికాసతరంగిణి తరపున ఈ గ్రామానికి రక్షిత మంచినీరు, మూడు బోర్లు ఏర్పాటుచేశారు.

వెలిచాల గ్రామంలో శ్రీ లక్ష్మీ నరసింహస్వామి దేవాలయ బ్రహ్మోత్సవాలలో భాగంగా 11వ తేదీన జరిగిన ఎదుర్కోలు ఉత్సవంలో శ్రీస్వామివారు పాల్గొన్నారు.

కరీంనగర్‌లోని వావిలాలపల్లి రామాలయంలో శ్రీమాన్ ఎన్. రమణాచార్యుల ద్వారా జరిగిన యాత్ర ప్రతిష్ఠా కార్యక్రమంలో శ్రీస్వామివారు పాల్గొని భక్తులకు మంగళాశాసనం చేశారు. అనంతరం శ్రీ స్వామివారు శ్రీమాన్ బి.వి. రావుగారి గృహానికి వేంచేసి, వారి కుటుంబసభ్యులకు మంగళాశాసనం చేశారు.

12వ తేదీన శ్రీ లక్ష్మీనరసింహస్వామి కళ్యాణ మహోత్సవంలో పాల్గొని అనంతరం కోరుట్ల గ్రామం చేరారు.

**కోరుట్ల:**

13 తేదీన శ్రీమాన్ రామస్వామి గౌడ్‌గారి ఆహ్వానం మేరకు శ్రీశ్రీశ్రీ స్వామివారు కోరుట్ల వేంచేశారు. క్రొత్తగా ఏర్పాటైన వెటర్నరీ యూనివర్శిటీని సందర్శించి, అనంతరం మెట్‌పల్లిలోని అతిపురాతనమైన చెన్నకేశవస్వామి దేవాలయాన్ని దర్శించి, అక్కడి కార్యకర్తలకు తగిన సూచనలు చేశారు. తరువాత శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయాన్ని సందర్శించి కోరుట్ల చేరారు.

14 తేదీన కోరుట్ల, మల్లాపూర్, రాయకల్, జగిత్యాల, దరూర్ క్యాంప్ ప్రాంతాలనుండి విచ్చేసిన వికాసతరంగిణి కార్యకర్తలతో శ్రీస్వామివారు సమావేశమై వారికి మార్గదర్శనం చేశారు. జిల్లా వికాసతరంగిణి సమన్వయకర్త శ్రీమాన్ గౌతమ్‌రావుగారు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. అనంతరం కుంకుమపూజ నిర్వహించి శ్రీస్వామివారు కోరుట్ల నుండి బయలుదేరి ప్రకాశంజిల్లా, క్రొత్తపేటకు పయనమయ్యారు.

**క్రొత్తపేట -ప్రకాశం జిల్లా:**

15వ తేదీ తెల్లవారు ఝాముకుకు శ్రీస్వామివారు ప్రకాశం జిల్లాలోని క్రొత్తపట్నం గ్రామానికి చేరారు. వైష్ణవ సంప్రదాయ నిష్ఠులైన వైశ్యప్రముఖులకు ఈ ఊరు ఒకప్పుడు గట్టి స్థానం. కాలక్రమంలో పలువురు ఇక్కడనుండి చెన్నై తరలివెళ్ళారు.

యేల్చూరు వేంకటసుబ్బయ్య ఛారిటీస్‌వారు క్రొత్తపట్నంలో రామానుజ కూటాన్ని ఏర్పరిచి, నిర్వహించేవారు. ఆ ప్రాంగణంలో వాసవి ఛారిటీస్ ద్వారా నూతనంగా నిర్మించిన కళ్యాణమండపాన్ని శ్రీస్వామివారు ప్రారంభించారు. శ్రీమాన్ వి. చలపతిరావుగారు, లక్ష్మీ దంపతులు వాసవి ఛారిటీస్ కమిటీ సభ్యులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

క్రొత్తపట్నంలో ఉన్న ప్రాచీనమైన శ్రీరాజగోపాలస్వామి ఆలయాన్ని శ్రీస్వామివారు దర్శించారు. ఎంతో సంప్రదాయ బద్ధంగా నడిచే ఈ దేవాలయం ఓ దశాబ్దానికి ముందు దేవాదాయ శాఖ ఆధ్వర్యంలోకి వెళ్ళిన అనంతరం కాలక్రమేణ 3 సంవత్సరాల మునుపు ధ్వజస్తంభం కూడా విరిగిపోయి శిథిలావస్థలోకి వచ్చింది. బ్రహ్మోత్సవాలు కూడా జరగని దురవస్థలో ఆలయ నిర్వహణ సాగుతున్నది.

శ్రీస్వామివారు కార్యనిర్వహణాధికారికి, గ్రామస్థులకు ఆలయ అభివృద్ధికి సంబంధించిన పలు సూచనలు అందజేశారు.

**కోటతిప్పల-చదలవాడ :** 16వ తేది ఉదయం శ్రీస్వామివారు క్రొత్తపట్నం నుండి బయలుదేరి కనిగిరి దగ్గరవున్న కోటతిప్పల గ్రామానికి చేరారు. శ్రీమాన్ తిరుపతిరాజు, వేంకట రత్నమ్మగార్ల ఆహ్వానం మేరకు ఈ గ్రామంలో జీర్ణోద్ధరణ అయిన శ్రీ రామాలయాన్ని శ్రీస్వామివారు ప్రారంభించారు. అనంతరం 16వ తేదీ సాయంత్రం శ్రీస్వామివారు చదలవాడ చేరారు.

**చదలవాడ :**

ప్రకాశంజిల్లా, ఒంగోలుకు సమీపాన, చీరాలకు వెళ్ళేదారిలో "చదలవాడ" గ్రామం ఉన్నది. 'చతుర్వాటిక' గా ఈ గ్రామం పూర్వం ప్రసిద్ధి చెందింది. శాలివాహనశకం 46లో, అంటే క్రీ.శ. 539లో నిర్మితమైన అతిపురాతన శ్రీరామాలయం ఇక్కడ ఉన్నది. ఈ దేవాలయ జీర్ణోద్ధరణ అనంతరం ప్రతిష్ఠా కార్యక్రమానికి శ్రీస్వామివారు శ్రీమాన్ రామకోటయ్యగారి ఆహ్వానం మేరకు ఈ గ్రామానికి విచ్చేశారు. శ్రీస్వామివారు ఇప్పటిదాకా దర్శించిన అతి ప్రాచీన ఆలయం ఇదే!

వివిధ వర్గాల భాగస్వామ్యంతో నడుస్తున్న ఈ దేవాలయానికి వంశపారంపర్య ధర్మకర్తగా శ్రీమాన్ ఉత్పల లక్ష్మీనరసింహాచార్యులు వ్యవహరిస్తున్నారు.

18వ తేదీన తీర్థగోష్ఠి అనంతరం శ్రీస్వామివారు చినగంజాం గ్రామానికి వెళ్ళారు. ఒంగోలుకు చెందిన శ్రీమాన్ భక్తవత్సలంగారు ఈ గ్రామంలో నిర్వహిస్తున్న కాలక్షేపగోష్ఠి సభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనాలను అందజేశారు. వారి కోరిక మేరకు "వికానతరంగిణి" ఏర్పాటుకు సంబంధించిన సూచనలు శ్రీస్వామివారు అందించారు.

శ్రీమాన్ రామానుజంగారు, భావనారాయణస్వామి ఆలయ కేంద్రంగా వికానతరంగిణిని ఏర్పరచుకొని కార్యక్రమాలను నిర్వహించేందుకు సిద్ధమయ్యారు. ఆలయ అర్చకస్వామి బాలకృష్ణ కార్యక్రమాలకు తమ సంసిద్ధతను తెలియజేసి శ్రీస్వామివారి ఆశీస్సులను పొందారు.

19వ తేదీ ఉదయాన చదలవాడలో జరిగిన ప్రతిష్ఠాపన కార్యక్రమంలో శ్రీస్వామివారు పాల్గొన్నారు. అనంతరం ఒంగోలులో ఉన్న 'అక్షర' విద్యాలయాన్ని దర్శించి విద్యార్థులకు శ్రీస్వామివారు మార్గదర్శనం చేవారు. అనంతరం కొండమీద ఉన్న రామాలయాన్ని దర్శించి నిర్వాహకులకు సూచనలు ఇచ్చి, రాత్రికి శ్రీరామనగరం జీవ ప్రాంగణానికి చేరారు.

**పరమపదవార్త**

రాజమహేంద్రి వాస్తవ్యులు, శ్రీమాన్ శ్రిఘాకొళ్ళపుశివరామ సుబ్రహ్మణ్యం గారి తల్లిగారైన **శ్రీమతి శ్రిఘాకొళ్ళపు నాగరత్నం** గారు ది. **31.01.2014**న ఆచార్య తిరువడి చేరినారు.

శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు వీరి గృహానికి విచ్చేసి, వారి కుటుంబసభ్యులకు అనేక మంగళాశాసనాలు అనుగ్రహించారు.



Serve All Beings As Service to God

Worship Your Own, Respect All

Come let us join together and celebrate !

Memorial Day Weekend!

Celebrating 20 Years in USA- 35 years around the world

Jeeyar Educational Trust (JET) USA
National Convention

From Friday, May 23 thru Monday, May 26, 2014

Early Registration discount before February 15th, 2014

- Spiritual Discourses by His Holiness
- VT Seva Activities
- Prajna Children Performances
- Prajna Talent Shows
- Parents Talent Shows
- Volunteers Meet
- A trip with Swamiji to one of the Disney Theme parks
- Yoga & Meiditation
- Cultural Programs
- Quiz Contest

Contact us at 919-JEEYAR-9
Email: convention@jetuas.org

For Online Registration and more details, please Visit
www.jetconvention.org

Empower! Enlighten! Engage!

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు.

శ్రద్ధతో మీరు పంపిన **మార్చినెల సమాధానాలందాయి.** విజేత పేరు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం!

*గతనెల సమాధానాలు 18వ పేజీలో కలవు.*

**ప్రశ్నలు** **సమాధానాలు**

1. ప్రేయస్సు అంటే ఏమిటి?
2. ధృతరాష్ట్రుడు ఏ దిక్కుగా బయలుదేరాడు?
3. ప్రణవ మంజూష గ్రంథంలో ఉపోద్ఘాతం పేరేమిటి?
4. భగదత్తుడు ఎవరి స్నేహితుడు?
5. పౌరవదేశాధిపతి పేరేమి?
6. ఉత్తర దిగ్విజయయాత్రలో అర్జునుని వరించిన బిరుదేమి?
7. జంబూద్వీపానికి ఆ పేరు ఎందుకు వచ్చింది?
8. దుంధుళి ఎవరు?
9. గోకర్ణుడు అనే పేరు ఎందుకు వచ్చింది?
10. కుండకు కూడ మోక్షం ఇప్పించిన మహనీయుడెవరు?
11. పిన్నైతన్ కాతలన్ అంటే ఎవరు?
12. రామానుజ సహస్రాబ్ది ఎప్పుడు చోటు చేసుకుంది?
13. కారణము ఎన్ని విధాలు? అవి ఏవి?
14. జీవరాశిలో ఉత్తమ జన్మ ఏది?
15. గృహస్థు చేయవలసిన యజ్ఞాలు ఎన్ని?
16. పేయాళ్వార్లను ఏమని పిలుస్తారు?
17. శ్రీనివాసుని మామగారెవరు?
18. కాంచీనగర సమీపంలో ప్రవహించే నది ఏది?
19. మానవసేవగా .... మనమెలాంటి సేవ చేయాలి?
20. ఎర్రకణాల ఇన్ఫెక్షన్ వలన వచ్చే రోగం....

శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేత పేరు

గత విజేతలంతా తమ తమ పోస్టల్ అడ్రస్ వివరంగా సీతానగరం పంపిస్తే వారికి బహుమతులను పంపించగలము. మీ శ్రద్ధాసక్తులకు భక్తినివేదన అభినందనలు అందిస్తుంది. బహుమతులు కూడా పంపిస్తుంది.

మీ చిరునామా
..................................
..................................
..................................

సూచన: సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.

భక్తినివేదన సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929




# వికాసదర్శిని

సమగ్ర సమాచార నివేదన

**సంపాదకులు శ్రీమతి టి. అరుణ**

మహిళా ఆరోగ్య వికాస్ కేంద్ర సమన్వయకర్త శ్రీమతి మాధవి రవీంద్రగారు నిర్వహించిన కార్యక్రమాలు

మహిళా ఆరోగ్య వికాస్ కేంద్ర సమన్వయకర్త శ్రీమతి మాధవి రవీంద్రగారు శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో రాష్ట్రేతర ప్రాంతాలలో ఆరోగ్య శిబిరాలు, శిక్షణ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ఫిబ్రవరి 11 నుండి 16వ తేదీ వరకు ముంబైలో వర్లి అనే ప్రాంతంలో మెగాకేంప్ మరియు శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు. 178మంది మహిళలు ఈ శిబిరంలో పరీక్ష చేయించుకున్నారు. 13మందికి కొన్ని పరీక్షలు మరల నిర్వహించవలసి ఉంది. కొంతమంది మహిళలు తమ సమస్యలను పరీక్షానంతరం అడిగి తెలుసుకున్నారు. అక్కడ మహిళలందరిని ఉత్సాహపరుస్తూ VIA పరీక్షలో శిక్షణ తీసుకున్న శ్రీమతి ఉజ్వలగారికి శ్రీస్వామివారు మంగళాశాసనములు అందజేశారు. శ్రీశ్రీశ్రీ స్వామివారిని సేవించుకొని ముంబై ప్రజలు ధన్యులయ్యారు. శ్రీమాన్ రవీంద్ర గారు వికాసతరంగిణి అందించే సేవలు గూర్చి అందరికీ వివరంగా తెలియజేశారు. విజయవాడ చైతన్య మహిళా ఆరోగ్య వికాస్ కార్యకర్తలు సేవలందించారు.

**ప్రకాశం జిల్లా కోనంకి :**

25.02.2014న ప్రకాశంజిల్లా కోనంకి గ్రామపెద్దలు శ్రీమాన్ సాంబశివరావుగారు, చక్రపాణి, సురేష్‌గారి ఆధ్వర్యంలో మెడికల్ క్యాంపు జరిగింది. 106మంది మహిళలు ఈ శిబిరంలో పరీక్ష చేయించుకోగా ఇందులో వి. ప్రమీల అనే మహిళకు బయాప్సీ చేయించగా స్టేజ్ – 2 బి అని తెలియగా హైదరాబాద్ బసవతారకం హాస్పిటల్‌లో చికిత్స చేయిస్తున్నారు. మరొక ఇద్దరు మహిళలకు గర్భసంచి ఆపరేషన్లు జరుపవలసివుంది. 15 మంది మహిళలకు ఇన్ఫెక్షన్ ఉన్నట్లు గుర్తించటమైనది. ప్రకాశంజిల్లాలో మార్టూరు, యద్ధనపూడి, యనమదల, చింతపల్లిపాడు, ఇసుకదర్శి, కోనంకి గ్రామాలలో వైద్య శిబిరములు ఏర్పాటు చేసిన మార్టూర్ జీవన్ వికాస్ అనాథ బాలల సంరక్షణా కేంద్ర నిర్వాహకులు శ్రీమతి రాజ్యలక్ష్మి మరియు వారి కుటుంబసభ్యులు ఎందరో ఆదర్శమయ్యారు.

02.03.2014వ తేదీ విజయవాడలో గులాబితోటనందు శ్రీ గౌతంరెడ్డిగారి ఆధ్వర్యవంలో ఆరోగ్య శిబిరాన్ని నిర్వహించారు. అక్కడి కార్యకర్తలందరికి VIA పరీక్షల గూర్చి శిక్షణ నిచ్చారు. ఉచిత వైద్యశిబిరంలో 86మంది శిబిరమునకు హాజరుకాగా 60మంది మహిళలకు పరీక్షలు నిర్వహించి ఒకరికి బయాప్సీ చేశారు. ఈ శిబిరానికి డా॥ అమ్మాణి, డా॥ లిఖిత మరియు శ్రీదేవిగార్లు తమ సహకారాన్ని అందించారు.

09.03.2014న డోకిపర్రు అనే గ్రామంలో ఓం అల్లా జీసస్ వృద్ధాశ్రమం నిర్వాహకులు ఎన్. శివప్రసాద్‌గారి ఆశ్రమంలో ఆరోగ్య శిబిరం నిర్వహించారు. ఈ కార్యక్రమంలో 125మంది మహిళలు పాల్గొనగా 68మందికి VIA పరీక్షలు నిర్వహించి 8మందిని సెకెండ్ చెకప్‌కి పంపించారు. డా॥ జయశ్రీగారు తమవంతు సహకారాన్ని గ్రామప్రజలకు అందించటమే కాకుండా వారి గ్రామంలో కూడా ఆరోగ్య శిబిరాన్ని నిర్వహించమని కోరారు. శివప్రసాద్‌గారు, నందకిశోర్‌గారు, మహిళా ఆరోగ్య వికాస్ కార్యకర్తలు సేవలందించారు.

కరీంనగర్ : **"మాధవసేవగా సర్వప్రాణి సేవ చేయటమే"** లక్ష్యంగా వికాసతరంగిణి కార్యకర్తలు మంచిసేవలందిస్తున్నారు. కరీంనగర్‌లో యాదగిరి అనే పేషెంట్‌కి కిడ్నీలు సరిగా పనిచేయటలేదు. కుడికాలు వ్యాధిసోకి నడవలేకపోతున్నారు. తల్లికి మతిస్థిమితం లేదు. ఇంట్లో చదువుకొనే ఇద్దరు చెల్లెళ్ళు. పెద్ద వయసు కలిగిన తండ్రి కూలి పనిచేస్తూ చాలా కష్టపడుతూ ఉన్నారు. మన వికాసతరంగిణి కార్యకర్తలు యాదగిరి కుటుంబానికి ప్రతినెలా ఇంట్లోకి కావలసిన సామగ్రి, వస్త్రాలు, మందుల నిమిత్తం 2,500 రూపాయలు అందజేశారు. ఒక సంవత్సరకాలం వీరికి మందులు అందజేయడానికి నిర్ణయించుకున్నారు.

**మిర్యాలగూడశాఖ - నల్లగొండ:**

వికాసతరంగిణి హౌసింగ్‌బోర్డ్‌శాఖవారు స్త్రీలకు ఉచిత వైద్య, ఆరోగ్య అవగాహన శిబిరమును 2014 మార్చి 23న కొండ్రపోల్ గ్రామంలో నిర్వహించారు. ఇంటింటికి వెళ్ళి సర్వే నిర్వహించి కరపత్రాలు పంచిపెట్టారు. ఇంటింటికి వెళ్ళి సర్వే నిర్వహించి కరపత్రాలు పంచిపెట్టారు. మహిళా ఆరోగ్య వికాస్ సెంట్రల్ కో–ఆర్డినేటర్ శ్రీమతి మాధవి రవీంద్రగారు, మిర్యాలగూడ

పట్టణమునకు చెందిన ప్రముఖ గైనకాలజిస్ట్ డా॥ జ్యోతిగారు పరీక్షలు నిర్వహించారు. ఈ కార్యక్రమంలో 100 మందికి పైగా పరీక్షలు చేయించుకున్నారు. స్త్రీలు ఆరోగ్య విషయంలో ఎటువంటి జాగ్రత్తలు తీసుకోవాలో డా॥ జ్యోతిగారు తెలియజేశారు. పరీక్ష చేయించుకున్నవారిలో 11మందికి ఆరోగ్య సమస్యలు ఉన్నట్లుగా గుర్తించారు. వారికి ప్రత్యేక పరీక్షలు నిర్వహించవలసి ఉంది. గ్రామపెద్దలు, పాఠశాల ఉపాధ్యాయులు, మహిళలు వికాసతరంగిణి మహిళా ఆరోగ్యవికాస్ ద్వారా చేస్తున్న సేవలను అభినందించారు. మారుమూల గ్రామాలకు కూడ వచ్చి సర్వే నిర్వహించి ఉచితముగా పరీక్షలు నిర్వహించుట వలన గ్రామంలో ఎందరికో ఆరోగ్య సమస్యలు తొలగాయని తమ అభిప్రాయాన్ని వ్యక్తపరిచారు. శ్రీ చిరుమామిళ్ళ వేంకటేశ్వరరావు, అరుణ దంపతులు ఉచితముగా మందులు అందించడమే కాకుండా వారు తమ పూర్తి సహకారమందించారు.

**జగ్గయ్యపేట** : 02.03.2014 వత్సవాయి మండలం మంగొల్లు పంచాయితీ ఆఫీసు నందు ఉతచి వైద్యశిబిరం నిర్వహించారు. హోమియో వైద్యులు డా॥ నకిరికండి జనార్దనరావుగారు ఉచితముగా వైద్యసేవలు చేసి మందులు అందజేశారు. ఈ కార్యక్రమాన్ని మంగొల్లు వికాసతరంగిణి సభ్యులు, జగ్గయ్యపేట వికాసతరంగిణి సభ్యులు నిర్వహించారు. జగ్గయ్యపేటలో పురాతనమైన శ్రీ ధనశైల సీతారామస్వామి దేవాలయంలో భీష్మ ఏకాదశి సందర్భంగా లక్షతులసి పూజలు వికాసతరంగిణి కార్యకర్తలు నిర్వహించారు.

**మార్కాపురం** : పురాతన వేణుగోపాలస్వామి ఆలయ జీర్ణోద్ధరణకు యువవికాస్ కార్యకర్తలు సేవలందిస్తున్నారు. పరిసరాల పరిశుభ్రత, మొక్కలు నాటటం, ఉచిత వైద్యశిబిరములు, త్యాగరాజ విగ్రహ ప్రతిష్ఠ, గ్రామీణ సేవ సమ్మేళనం వంటి కార్యక్రమాలు నిర్వహించారు. యువవికాస్ సేవలందిస్తున్న 120 మంది కార్యకర్తలకు శ్రీశ్రీశ్రీ అహోబిల స్వామివారు మంగళాశాసనములు అందజేశారు.

ప్రతినెలా మార్కాపురం యువవికాస్ సభ్యులు చక్కని సేవలందిస్తున్నారు. అమృతహస్తం పేరుతో పదవతరగతి విద్యార్థులకు పౌష్టికాహారం కాకర్ల అను గ్రామంలో అందజేస్తున్నారు.

కరీంనగర్ వికాసతరంగిణి శాఖలలో కాయిన్‌బాక్కులు ఏర్పాటు చేసి బాక్సల ద్వారా సేకరించిన రూ.21,190/-లు వారిజ, విశాఖపట్టణం నేత్ర విద్యాలయంకు అందజేశారు.

జిల్లా వికాసతరంగిణి కార్యాలయం (ఆండాళ్‌గోష్ఠి)లో ప్రతి ఆదివారం సాయంత్రం 4గంటల నుండి 5 గంటల వరకు ఆక్యుప్రెషర్‌లో శిక్షణ నిస్తున్నారు. 5గం. నుండి 6 గం. వరకు సత్సంగ కార్యక్రమం నిర్వహిస్తున్నారు. పట్టణంలో 8 వికాసతరంగిణి శాఖలలో ప్రజ్ఞ తరగతులు ప్రతి ఆదివారం కార్యకర్తలు చక్కగా నిర్వహిస్తున్నారు.

**హైదరాబాద్ - ఎస్.ఆర్.నగర్** : శ్రీమతి సంధ్యగారు ప్రతి సంవత్సరం వారి బంధువులు, స్నేహితులతో కలసి శ్రీరామనగర్ గోశాలలో గోవులకు, దివ్యసాకేత ఆలయమునకు సహజ సిద్ధ బెల్లము(ఆర్గానిక్) 125 కేజీలు సమర్పిస్తున్నారు. ఇంతకు పూర్వం 400 కె.జిలు బెల్లమును సమర్పించారు. ఏ రసాయన పదార్థములు కలవని, సహజ సిద్ధము పండిన చెఱకు నుండి తీసిన ఈ బెల్లాన్ని శ్రీశ్రీశ్రీ స్వామివారి శ్రీహస్తాలతో గోవులకు పెట్టారు. ఇటువంటి సేవలు ప్రతిసంవత్సరం నిర్వహించాలని గోష్ఠివారికి శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారు మంగళాశాసనం చేశారు.

**ఏలూరు** : శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాలు ప్రతివారం వికాసతరంగిణి సభ్యులంతా నిర్వహిస్తున్నారు. 12.2.2014 శ్రీ పి. వేంకటేశ్వర్లుగారి గృహములో 100మంది భక్తులుపైగా పాల్గొని కార్యక్రమాలు నిర్వహించారు. శ్రీమాన్ చల్లగొండ వెంకటరమణగారి గృహంలో కూడా సత్సంగ కార్యక్రమాన్ని నిర్వహించారు.

**సిద్ధాంతం - పశ్చిమగోదావరి జిల్లా** : శ్రీమాన్ వంగూరి వెంకట్రామయ్యగారి ఆధ్వర్యంలో వికాసతరంగిణి కార్యకర్తలు భీష్మ ఏకాదశి కార్యక్రమం నిర్వహించారు. ఏకాదశిరోజున 24 గంటలు శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ, హోమం, సహస్రనామార్చనలు నిర్వహించారు. పరీక్షలు బాగా వ్రాయాలని పదవతరగతి విద్యార్థులను ఆశీర్వదిస్తూ కంకణములందజేశారు. లక్ష్మీనారాయణ కల్యాణ మహోత్సవాన్ని వైభవంగా నిర్వహించారు. వచ్చిన వారందరికి తదీయారాధన (ప్రసాదం) చేశారు.

**విశాఖపట్టణము - పాయకరావుపేట** :

వికాసతరంగిణి కార్యకర్తలు పాయకరావుపేట, తుని ప్రాంతాలలో ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ప్రజ్ఞ సిలబస్ చెప్పటంతోపాటు విద్యార్థులకు దంతపరీక్షలు మరియు జనరల్ చికిత్సలు నిర్వహించారు. 2014 ఫిబ్రవరి 7న గంటుపిల్లిగ్రామం జిల్లా పరిషత్ పాఠశాలలో దంతవైద్య శిబిరం జరిగింది. డా॥ డి. వెంకటరమణ, డా॥ ఆర్.యం. సునీత వైద్యపరీక్షలు నిర్వహించారు. వికాసతరంగిణి కార్యకర్తలు ఉచితముగా మందులు అందజేశారు. శ్రీనివాస్ వర్మ, శ్రీమతి రావు ఆండాళ్ కిరిందాదేవి, చిక్కాబిల శ్రీనివాన్, డి. సత్యనారాయణ, సి.హెచ్.వి. రమణమూర్తి, డి.ఎన్.పురం వికాసతరంగిణి సభ్యులు సేవలందించారు.

**విజయనగరం** : వికాసతరంగిణి 'హరినామ సంకీర్తన' కార్యక్రమాన్ని కన్వీనర్ శ్రీమతి కంచర్ల లక్ష్మిగారు ప్రతి ఆదివారం సంస్కృత కళాశాలలో నిర్వహిస్తున్నారు. భద్రాచలం రామదాసు నవరత్న కీర్తనలను ఫిబ్రవరి మొదటివారంలో భద్రాచలంలో నేదునూరి కృష్ణమూర్తిగారి పర్యవేక్షణలో జరిగే కార్యక్రమంలో గానం చేశారు. మందస వాసుదేవ పెరుమాళ్ బ్రహ్మోత్సవంలో సంకీర్తన చేశారు.

అలకనంద కాలనీ వికాసతరంగిణి కార్యకర్తలు గోకపేట ప్రాంతంలో 3 రోజులు సుందరకాండ పారాయణను నిర్వహించారు. భగవద్రామానుజ సహస్రాబ్ది వేడుకలలో భాగంగా 108 బుధవారములు సత్సంగ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

బాలాజీ నగర్ వికాసతరంగిణి ప్రజ్ఞ విద్యార్థులు సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించారు. విద్యార్థులే నృత్యాన్ని రూపకాలను తయారు చేసుకొని ప్రదర్శించి పెద్దలు ఆశీస్సులు పొందారు. పర్యావరణాన్ని పరిరక్షించుట, పెద్దలను గౌరవించుట చక్కగా చూపించారు.

ప్రతి రెండవశనివారం ఆధ్యాత్మిక ఆట పాటలను నిర్వహిస్తూ యువతలో కూడా వికాసతరంగిణి కార్యకర్తలు ఆధ్యాత్మిక చైతన్యం కల్గిస్తున్నారు.

www.chinnajeeyar.org అనే వెబ్‌సైట్‌లో Satsung లో ఉన్న విషయాన్ని భక్తినివేదన తెలుగులో అనువదించినది చదివి అందరూ చక్కగా తెలుసుకున్నారు. శ్రీమతి దంటు పద్మజగారు సత్సంగ కార్యక్రమాన్ని నిర్వహించారు. మార్చినెలలో మహిళా దినోత్సవం సందర్భముగా బాలాజీనగర్‌లో సేవలందిస్తున్న శ్రీమతి జి. సావిత్రమ్మగారిని వికాసతరంగిణి అధ్యక్షులు, కార్యదర్శి సత్కరించారు.

**సాలూరు:** విజయనగరం జిల్లా సాలూరులో 22.2.2014 కందిరివలస, గుంటమామిడివలస గ్రామాలలో ఉచితవైద్య శిబిరం నిర్వహించారు. డా॥ జ్ఞానేశ్వర్‌గారు 80మంది గిరిజనులకు ఉచిత వైద్యసేవలు అందజేశారు. ఉచితముగా మందులను కూడ డాక్టర్‌గారే అందజేశారు. ఈ కార్యక్రమాన్ని వికాసతరంగిణి కన్వీనర్ శ్రీమాన్ విశ్వనాథ్‌గారు, శ్రీమతి రమణమ్మగారు నిర్వహించారు.

15.02.2014న పెద్ద చీపురుపల్లిలో డా॥ బి.ఎస్.ఎన్ మూర్తి 100మందికి వైద్యశిబిరంలో పరీక్షలు నిర్వహించారు. శ్రీమతి రమణమ్మగారు సేవలందించారు.

**రాజాం - శ్రీకాకుళం జిల్లా:** రాజాంలో వికాసతరంగిణి అధ్యక్షులు టి.టి.వి. రమణమూర్తిగారు వీరు ప్రభుత్వ ఉన్నత పాఠశాలలో సైన్స్ ఉపాధ్యాయులుగాని, అనేక విద్యలను అందరికి అందించగల ప్రజ్ఞావంతులు. విద్య అంటే చదువు మాత్రమే కాదు. ఎక్కువ మార్కులు తెచ్చుకున్నవారు మాత్రమే మంచి విద్యార్థులు అనే భావన చాలామంది తల్లిదండ్రులలో ఉంది. మంచిమార్కులు వస్తాయి. కాని, మంచిమార్కులు వచ్చిన వారంతా మంచివిద్యార్థులు కారు. మంచి విద్యార్థి తన చుట్టూ ఉన్న పరిసరాలు గమనించి, సమాజంలో తోటివారితో కలసి జీవించగలగాలి. స్పష్టమైన భావ వ్యక్తీకరణ కలిగి ఉండాలి. తను చదువుతున్న విద్యపట్ల స్పష్టమైన అవగాహన ఉండాలి. విద్య విద్యార్థిని సమగ్రమైన మానవుడిగా తయరు చేయాలి. అటువంటి విద్యను అందించడానికి రమణమూర్తిగారు వికాసతరంగిణి ద్వారా ఎంతో కృషి చేస్తున్నారు. 'వెయ్యి గడియారములు మన దగ్గర ఉన్నా గడిచిపోయిన ఒక్కగంటను తిరిగి తీసుకురాలేము' కనుక విద్యార్థి సమయాన్ని సద్వినియోగం చేసుకుంటూ ఉత్తమ విద్యార్థి కావడానికి ఏమి చేయాలో ప్రతిసంవత్సరం ప్రజ్ఞ తరగతుల ద్వారా తెలియజేస్తున్నారు.

ప్రతిసంవత్సరంలాగానే ఈ సంవత్సరం కూడా పదవతరగతి విద్యార్థులకు ప్రేరణా తరగతులు నిర్వహించారు. 37 ప్రభుత్వ పాఠశాలలకు చెందిన 725మంది చదువులో వెనుకబడిన విద్యార్థులను గుర్తించి, అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులతో శిక్షణనందించారు. గణితం – కె.ఆర్.యం. జయరావు (జిల్లాపరిషత్ ఉన్నతపాఠశాల–లక్ష్మీపురం); ఆంగ్లము – ఆర్.వి.జె. నాయుడు (సిగడాం) ఫిజికల్ సైన్స్ – భరత్‌కుమార్ (లింగాలవలస) చదువులో మెళకువలు నేర్పించారు. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథులుగా విచ్చేసిన డా॥ జి. ప్రసాద్, యం.డి. సూపరెండెంట్ ప్రభుత్వ ఆసుపత్రి, జిల్లా ప్రధాన ఉపాధ్యాయుల సంఘం అధ్యక్షురాలు శ్రీమాన్ టి. బలరాం–ఆంధ్ర యూనివర్శిటీ ప్రొఫెసర్ శ్రీ అల్లాడ జనార్దనరావు, శ్రీ రెడ్డి విజయకుమార్, రాజాం నగర పంచాయతీ అధ్యక్షులు వి. అచ్చినాయుడు చక్కటి విషయాలను విద్యార్థులకు తెలియజేశారు. ప్రభుత్వ పాఠశాలలో చదువుకున్న, పేదరికం నుండి వచ్చినా, ఈనాడు గౌరవమైన స్థానంలో బాధ్యతలు నిర్వహిస్తున్నాము. ఏ పాఠశాలలో చదివిన విద్యార్థికైనా తన లక్ష్యం గుర్తుకు రావాలి. మంచిపౌరులుగా ఎదగాలి అని తెలియజేశారు. పదవతరగతి పరీక్షంటే భయపడే విద్యార్థులకు భయం తొలగించి ఉత్తమఫలితాలు పొందేలా కృషి చేస్తున్న వికాసతరంగిణి సేవలను అభినందించారు. డా॥ శెట్టి శ్రీనివాసరావు అల్పాహారాన్ని, మధ్యాహ్న భోజనాన్ని బాలాజీ రెస్టారెంట్ లక్ష్మణరావు, యం. నగేష్, ఐ. పవన్ కుమార్ సమకూర్చారు. శ్రీ దాసరి అప్పారావు గారు కల్యాణ మండపాన్ని, మైక్‌సెట్‌ని సమకూర్చారు. శ్రీ కొత్తా మధుసూదనరావు విద్యార్థులకు స్టడీ మెటీరియల్ అందించారు. ఈ కార్యక్రమాలలో అబ్బులు, డి. శ్రీను, ఎల్ విశ్వేశ్వరరావు, కె. జగదీష్, కె. వాసు, లలిత, మాధవి, పద్మశ్రీ, రాము, నాయుడు సేవలందించారు.

**VT Seva - USA**

VT సేవ USA జాయింట్ సెక్రటరీ శ్రీమాన్ కిరణ్ వంగల, వారి స్నేహితులను సంతోష్ కె. (ఢిల్లీ) మన నేత్రవిద్యాలయం వైజాగ్, అల్లంపల్లి, బీర్సాయిపేట, కఠారివానిపాలెం పాఠశాలలని, నేత్ర విద్యాలయ కళాశాలలను సందర్శించారు. విద్యార్థులందరిని పేరు పేరునా ఎలా చదువుతున్నారో అడిగి తెలుసుకున్నారు. వారి భోజన, వసతి గృహాలను పరిశీలించారు. నేత్ర విద్యాలయం చిన్నారులు క్రికెట్, ఫుట్‌బాల్ ఆడే తీరుని చూసి ముగ్ధులయ్యారు. విద్యార్థులు చేసే యోగా, కుంపూ చూసి ఆశ్చర్యపోయారు. మన భారతదేశంలో శ్రీస్వామివారు చేస్తున్న సేవాకార్యక్రమాలను అమెరికాలో అందరికీ తెలియజేయడానికి ఉత్సవ్, తరంగిణీ, వసంతం, రాగా, బ్లూమ్ మొదలైన కార్యక్రమాలు నిర్వహిస్తూంటారు. వారందరూ ఇచ్చే ప్రోత్సాహంతో ఇక్కడ పాఠశాలలను చక్కగా నిర్వహించగలుగుతున్నాం. వి.టి. సేవా సెక్రటరీ శ్రీమాన్ కృష్ణకాంత్‌గారు, కిరణ్‌గారు ఇంకా ఎందరో ఇక్కడ జరుగుతున్న సేవా కార్యక్రమాలకై యువతను ప్రోత్సహించే తీరు చాలా అభినందనీయం.

## ధరిత్రీ దినోత్సవం 22-04-2013

ఈ భూమి సర్వప్రాణి కోటికి సంబంధించినది. ఖగచరాలు, భూచరాలు, జలచరాలు మొదలైనవాటితో కలిసి మానవుడు సహజీవనం సాగించాలి. ఏ జాతి ఉనికికైనా జీవవైవిధ్యం చాలా అవసరం. మనిషితోపాటు అన్నిరకాల పక్షి, జంతు జీవజాలానికీ ఆవాసం భూమి. ఒక జాతి అంతరించి పోయేలా ప్రకృతిని నాశనం చేసే హక్కు ఎవరికీ లేదు. భూమిమీద జీవించే అన్నిజాతుల జంతువులను, మొక్కలను అందరూ పరిరక్షించాలి. మనదేశంలో 2014 సంవత్సరంలో జీవవైవిధ్యం చట్టం అమలులోకి వచ్చింది. 2012వ సంవత్సరంలో అక్టోబర్ 1 నుండి 19వ తేదీ వరకు హైదరాబాద్ నగరంలో 'అంతర్జాతీయ వైవిధ్య పరిరక్షణ సదస్సు" జరిగింది. ఈ సదస్సులో మానవజాతి నిద్రమత్తు వదిలించే కొన్ని భయంకరచేదు నిజాలు వెల్లడించడం జరిగింది.

ఈ సదస్సు వెల్లడించిన నిర్ణయాలు అమలు పరచకపోతే మానవాళి మనుగడే కష్టమని అంతర్జాతీయ నిపుణులు హెచ్చరిస్తున్నారు.

**1. బల్లులు, మిడతలు, గబ్బిలాలు మొదలయిన అల్ప ప్రాణులు మానవజాతికి స్నేహితులే.** ఇవి దోమలు, చిన్నచిన్న పురుగులను భక్షించి మనకెంతో సహాయకారులుగా వుంటున్నాయి. ఒక చిన్న గబ్బిలం గంటకు 600 దోమలను భక్షిస్తుంది. మిడతలు దండు వేలసంఖ్యలో ఎగురుతున్నా ఏ క్కటీ దేన్నీ ఢీ కొనవు. దీని శరీర నిర్మాణం చూసి, వోల్వో కార్ల కంపెనీ వోల్వో × సి 60 అనే కారుని నిర్మించింది. ఈ కారుకు ఏదైన అడ్డం వస్తే తనంతట తానే దారి మళ్ళించుకుంటుంది. ఐతే ఈ జాతులన్నీ నశించిపోయే దశకి చేరుకున్నాయి.

పూర్వం గ్రామీణ ప్రాంతాలలో ఎక్కడ బడితే అక్కడ కిచకిచమని వినిపించే పిచ్చుకలు, నేడు సెల్ టవర్లకు, పురుగు మందులకు బలి అయిపోయాయి.

| | | |
|---|---|---|
| **ప్రపంచంలో క్షీరద జాతులు** | : | **5494 రకాలు** |
| **ఇప్పటికే అంతరించినవి** | : | **78 రకాలు** |
| **అంతర్ధానం అంచున వున్నవి** | : | **190 జాతులు** |
| **కనుమరుగయ్యే జాబితాలో ఉన్నవి** | : | **447 జాతులు** |

**2) అటవీ సంపద:** 2000 సం॥ వరకు ఏటా కనుమరుగవుతున్న అడవులు 60 లక్షల హెక్టార్లు. గత 20 సంవత్సరాలలో అంతరించిన అడవులు 35 శాతం. ప్రపంచంలోని అరణ్యసంపదలో 53శాతం ప్రముఖ దేశాలైన అమెరికా, రష్యా, చైనా, కెనడా, బ్రెజిల్ మొదలగువాటిలో ఉన్నాయి. మనం వాడే ఆధునిక ఔషధాలలో 50శాతం పైగా అటవీ సంపదలోనిదే! విశ్వవ్యాప్తంగా 80శాతం ప్రజలు సంప్రదాయ మూలికలు, ఔషధాల మీదే ఆధారపడుతున్నారు.

ఒక మోటారు వాహనం పదివేల మైళ్ళు ప్రయాణించి సృష్టించిన కాలుష్యాన్ని కేవలం 15 వృక్షాలు పూర్తిగా పీల్చుకుంటాయి. నగరీకరణ పేరిట మానవుడు ఏటా 3% అడవులు నాశనం చేసుకొంటున్నాడు.

ఒక కిలో చెట్టు కలప 14.7 కేజీల బొగ్గుపులుసు వాయువును పీల్చుకొని 1.07 కిలో ప్రాణవాయువును విడుదల చేస్తుంది. చెట్టుకున్న విశ్వాసం మనిషికి ఉందా?

మన సుఖజీవనానికి పెట్రోల్ ఉత్పత్తులు అవసరం. భూగర్భ శిలాజము నుంచి లభించే ఇంధనాలు క్షీణదశకు చేరుకున్నాయి. వాటిస్థానే జీవ ఇంధనం (బయోడీజిల్) ఉత్పత్తులు ప్రారంభించాయి. ఈ జీవఇంధనం మొక్కజొన్న, చెరకు వంటి ఆహారపంటల నుంచి తయారు చేయబడుతోంది. ఆకలి తీర్చాల్సిన ఆహారపంటలు, వాణిజ్యఇంధన అవసరాలకు తరలిస్తే భవిష్యత్తులో ఆహార సంక్షోభం తలెత్తడం తథ్యం. 2010సం॥లో జీవ ఇంధనాల ఉత్పత్తి 10,500 కోట్ల లీటర్లు. ఇది 2009 ఉత్పత్తులతో పోలిస్తే 17శాతం అధికం. నగరీకరణ, ఇసుక దొంగరవాణా, జీవ ఇంధన తయారీల మూలంగా అటవీ సంపద క్షీణించిపోతోంది. తద్వారా భూమిపై సగటు ఉష్ణోగ్రత 3-4 సెం.గ్రే. పెరుగుతుంది. 2030 సంవత్సరం నాటికి భూమిపై 60శాతం నగకరీకరణకు గురయ్యే అవకాశం ఉందని నిపుణుల హెచ్చరిక.

**3. సముద్రాలు :** భూ ఉపరితలంలో 70శాతం సముద్రాలే! ప్రపంచ జీవవైవిధ్యానికి 80శాతం ఆశ్రయం సాగరాలు. ప్రపంచ జనాభాలో 50శాతం మందికి ఆవాసం సముద్రతీరాలే! మనం పీల్చే ప్రాణవాయువు 50శాతం సముద్రాల నుండి లభిస్తుంది. ప్రపంచ వ్యాప్తంగా 300 కోట్లమంది ప్రజలు తమ జీవనోపాధి కోసం సముద్రాలపై ఆధారపడి వున్నారు. దాదాపు 100 కోట్ల మందికి చేపలే ఆధారం. మనం సృష్టించిన కాలుష్యాన్ని సముద్రాలే తమ గర్భంలో దాచుకుంటున్నాయి. భూమిపై విడుదలైన కర్బనాన్ని, సాగరాలు 15 రెట్లు అధికంగా నిల్వ చేసుకుంటున్నాయి. మితిమీరిన మత్స్యవేట, పారిశ్రామిక వ్యర్థాల పారబోత మొదలైన వాటివల్ల సముద్రంలోని జీవజాతులు తీవ్రంగా నష్టపోతున్నాయి. భూతాపం పెరగటం వలన సముద్రజలాలు వేడెక్కి సముద్రమట్టాలస్థాయి, వాటి గాలుల తీరు మారిపోతోంది. తద్వారా తీరప్రాంతాలు సముద్ర ముంపుకు గురి అవుతాయి. జననష్టం తీవ్రంగా వుంటుంది. ఉప్పునీరు వచ్చి మంచినీటిని ఆక్రమించి వ్యవసాయాన్ని తీవ్రంగా దెబ్బతీస్తుంది. అత్యాధునిక యంత్రాలతో చేపలవేట విస్తారంగా చేయటం, చమురు లీకేజీలు, ప్రమాదకర వ్యర్థ పదార్థాలను సముద్రాలలో పారబోయటం వలన సముద్ర జీవ వైవిధ్యం విపరీతంగా దెబ్బతినే ప్రమాదముంది. దేశ వ్యాప్తంగా తీరప్రాంతంలో బొగ్గు ఆధారిత విద్యుత్ కేంద్రాలు, ఓడరేవులు, సముద్రంలో గోడల నిర్మాణం తదితర విషయాలవల్ల భారతదేశంలో జీవవైవిధ్యానికి అఖాతం ఏర్పడింది. భూతాపం వాతావరణ మార్పులను పరిగణలోనికి తీసుకొని ఈ శతాబ్దం చివరలో సముద్రమట్టం 0.18 - 0.59 మీటర్లు పెరుగుతుందని శాస్త్రవేత్తల హెచ్చరిక.

**4. కెనడా దేశానికి అతిచెత్త డోడో అవార్డు:** జీవవైవిధ్య సదస్సు నిర్ణయాలను ఉల్లంఘించిన కారణంగా కెనడా దేశానికి 'డోడో' (అతిచెత్తదేశం) అవార్డు లభించింది. ఇంగ్లాండ్, చైనా, బ్రెజిల్ దేశాలు తర్వాత స్థానాల్లో ఉన్నాయి. భారతదేశం తస్మాత్ జాగ్రత్త!

ఈ భయంకర నిజాలు వింటే మనకు ఆకలి వేయదు, నిద్రరాదు. ఈభూమి మన ఒక్కరి సొమ్మే కాదు. మనం నివసించాలి. అందరికీ నివసించే అవకాశం ఇవ్వాలి. చిన్న కీటకం మొదలు ఏనుగు, హిప్పోలాంటి జంతువులు కూడా నివసించాలి. వేటిస్థానం వేటిఅధికారం వాటిదే! అపుడే వాతావరణం సమతుల్యం అవుతుంది. దీన్ని ఉల్లంఘిస్తే మిగతా జంతువులతో సహా మానవుడు కూడా నశించిపోతాడన్నది విస్మరించలేని నిత్యం.

సేకరణ : వైద్యం విజయరాఘవ్-విజయవాడ

గమనిక : మీమీ ప్రాంతాలలో చేసిన ధరిత్రీ దినోత్సవ కార్యక్రమ వివరాలను సాధ్యమైనంత త్వరగా మాకు తెలియజేస్తారు కదా!

**కార్యకర్తలకు సూచన**

మీ వికాసతరంగిణి శాఖ ద్వారా చేసే ఆధ్యాత్మిక, సామాజిక సేవాకార్యక్రమాలను అందరితో పంచుకోవాలనుకుంటున్నారా! కార్యక్రమ వివరాలను సంక్షిప్తంగా వ్రాసి, కార్యక్రమ ఫోటోలను జతపరచి ప్రతి నెల 10 తేదీలోపుగా **news@vtsbharat.org**కి మెయిల్ చేయండి.

**Cell No. 9440106555**

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః

67 సం॥ల నుండి భగవద్బంధువులు ఆదరిస్తున్న ...
ఆధ్యాత్మిక మాసపత్రిక

# భక్తినివేదన








సంపుటి 67 మే 2014 సంచిక 2

శ్రీ జయనామ సంవత్సర వైశాఖమాసము


## పంచాంగ వివరములు

**ఏప్రియల్**

29. అమావాస్య

**మే:**

1. పరశురామ జయంతి, ఉయ్యక్కొండార్ తిరు॥
2. అక్ష తృతీయ, సింహాద్రి చందనోత్సవం
4. వాస్తు కర్తరీ ప్రారంభం, శంకర జయంతి, భగవద్రామానుజాచార్య జయంతి.
5. చక్రవర్తి తిరుమగనార్ జయంతి
7. శ్రీరామనగర దివ్యసాకేత బ్రహ్మోత్సవఅంకురారోపణం
9. తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి కళ్యాణోత్సవం
10. సర్వేషామేకాదశి
11. కృత్తిక కార్తె, అగ్నికర్తరి, పరశురామ ద్వాదశి
12. మధురకవి యాళ్వార్ తిరు ॥
13. సర్వేషాం నృసింహజయంతి
14. అన్నమాచార్య జయంతి
15. వృషభ సంక్రమణము ఉ 7-22
22. అవమతిథి
23. హనుమజ్జయంతి
24. సర్వేషామేకాదశి
25. రోహిణి కార్తె, అగ్నికర్తరీ త్యాగము
27. మాస శివరాత్రి
28. పిండపితృయజ్ఞము, అమావాస్య, శనిజయంతి, వాస్త కర్తరీ త్యాగము


వ్యవస్థాపకులు
పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ
రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు
శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి
శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. రంగరామానుజాచార్యులు

ఉప సంపాదకులు
శ్రీమతి డా॥ T.K. చూడామణి

చందావివరాలు :-
సంవత్సరచందా రూ.225/-
విదేశాలకు సంవత్సరచందా $30/-

మీ సేవలో....
భక్తినివేదన, సీతానగరం - 522 501,
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

D.T.P. & Design by :
పరిశోధనాలయమ్

E-mail : jetsitanagaram@yahoo.com
Internet : www.chinnajeeyar.org


## విషయసూచికా




*Printed & Published by :* H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**
*Printed & Published at :* **Srijman Printers & processors** : C/o JET, Sitanagaram - 522 501, Guntur Dist., Andhra Pradesh.
*Editor :* Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.

**Sriman Printers & Processors**

జై శ్రీమన్నారాయణ!

# సమతామూర్తియైన ఆచార్యచంద్రునికి అక్షర నీరాజనమ్

శ్రీమతే నారాయణాయ నమః




శ్రీమతే రామానుజాయ నమః



లోకానికి వెలుగునిచ్చి, పండించిన పంటని మంచెపై ఉండి కాపలాకాచే రైతులాగ, తాను వెలుగులోకి తెచ్చిన లోకాలను రక్షించుకొంటూ శేషశయనుడై సేవసాయించే శ్రీరంగశాయి తిరునక్షత్రంతో ఈ క్రొత్త సంవత్సరం **"జయ"** నామంతో ప్రారంభమయింది.

సోమవారంతో ప్రారంభమైందని ఈ సంవత్సరానికి చంద్రుణ్ణి రాజుగ నిర్ణయించారు. ఆయనే మంత్రికూడా అయి లోకహితానికి అవసరమైన మంత్రాంగాన్ని చేస్తాడని అందువల్ల లోకం చల్లగ జీవనయాత్రసాగిస్తుందని పంచాంగవేత్తలు వ్యాఖ్యానించారు. చంద్రుడు ఆచార్యులకు ప్రతీకగద!

సూర్యకాంతిని తాను గ్రహిస్తాడు. దానిలోని తీవ్ర తాపాన్ని మారుస్తాడు. చల్లని వెన్నెల కిరణాలుగ లోకంలో వర్షిస్తాడు. జనుల హృదయాలను ఆహ్లాదపరుస్తాడు. అలానే ఆచార్యుడు భగవంతుడికి మనపై కలిగే భావకిరణాలలోని తీవ్రతను తాను గ్రహిస్తాడు. దయాకిరణాలుగ మనపై సాగేట్టు చేస్తాడు. ఆచార్యులలో ఉండే ఈ అనుగ్రహమే మనపాలిటి రక్ష కనుకనే ఆచార్యులను చంద్రుడితో పోలుస్తారు.

ఆచార్యులంటే భగవద్రామానుజులే. తాను నరకంపాలైనా లోకాలన్నీ తరిస్తే చాలనుకున్న మహనీయులు. తనకిచ్చిన వాగ్దానాన్ని అతిక్రమించిన ఈతణ్ణి శపిద్దామని చేయెత్తిన గురువుగారే రామానుజుల హృదయవైశాల్యం తెలిసి, అదే చేతితో "మాకంటే మీరే మహోన్నతులు, మాకు మార్గదర్శకులు'' అన్నట్లుగ "ఎంబెరుమానారే" అని చల్లని ఆశీశ్శులనందించి సంభవించారు. శిష్టులైన పెద్దలంతా దానిని ఆమోదించి రామానుజులే సర్వలోకాలను ఉద్ధరించే జగదాచార్యులని ఏకకంఠంగ నిర్ణయించారు. ఎలుగెత్తిచాటారు.

**"స ఏవ సర్వలోకానా ముద్ధర్తా నాస్తి సంశయః"** అన్నారు.

120 సంవత్సరాల సంపూర్ణాయుర్దాయాన్ని పొంది పూర్ణానుభవంనిండి సామాన్యులస్థాయికి సర్వేశ్వరుడైన శ్రియఃపతి శ్రీమన్నారాయణుని మహామంత్రాన్ని అందేటట్టు దింపారు. ఆయనయొక్క ఆరాధనాపద్ధతిని ప్రకటించారు.

శాస్త్రాలలో సంకీర్ణమై దాగిన సర్వ సమత్వవాదాన్ని సముద్ధరించి భగవంతుని ముందు కుల,మతభేదం, లింగ వయోభేదం వలదన్నారు. పంచసంస్కార సంపన్నులై, ఆహార, ఆరాధనాది నియమాలు పాటించే వారెవరైనా భగవద్బంధువులైన శ్రీవైష్ణవులేనని నిర్ణయించారు. నమ్మిన సిద్ధాన్తాన్ని నిర్భయంగ లోకంనలుదిశలా ఎలుగెత్తిచాటారు భగవద్రామానుజాచార్యులవారు.

ఈ వాదాన్ని తమతోటే ముగించలేదు. తరతరాలుగ కొనసాగేందుకు స్థిరమైన పునాదిరాళ్ళలా 74 మంది సింహాసనాధిపతులను స్థాపించి "సువిశాల భూమండలంలో అన్ని మూలల్లోనూ ఆర్తికలిగి, తరించాలనే ఆశఉన్నవాళ్ళుంటే చాలు, నిస్సంకోచంగ జాతివిచక్షణ కతీతంగ వారికికూడా మంత్రాన్ని ఇవ్వండి!" అంటూ ఆనతిచ్చారు శ్రీమద్రామానుజులు.

ఈనాడు లోకంలో భక్తి అనేమాట ఉందంటే, భగవంతుడూ, పూజాపద్ధతులు కొనసాగుతున్నాయంటే, అది ఏ పేరుతోటి చెలామణిలో ఉన్నా, అదంతా ఆ రామానుజులు పెట్టినభిక్ష. వారికీలోకం ఎప్పటికీ ఋణపడే ఉంటుంది. వారి ఋణం తీర్చుకొనేదెట్లా ?

గురువిచ్చిన మంత్రాన్ని మదిలో పదిలపరచుకొని, వారి వైభవాన్ని లోకంలో వెదజల్లాలని, వారి నామాన్ని నలుదిశలా చాటాలని శాస్త్రాలు ఉద్ఘోషిస్తున్నాయి, **గురుం ప్రకాశయేత్ ధీమాన్, మన్త్రం యత్నేన గోపయేత్.** అంటూ.

ఇప్పుడదే మనకర్తవ్యం. ఆమహానుభావుల భగవద్రామానుజుల దివ్యవైభవం ప్రజలందరూ గుర్తించేట్టు చేయాలి. అందునా ఈ నెల, మే 4వ తేదీన ఆ ఆచార్యుల 997వ తిరునక్షత్ర మహోత్సవం. అంటే, మరో మూడుసంవత్సరాలలో ఆ ఆచార్యులకి వెయ్యేళ్ళు నిండుతాయి, సహస్రాబ్ది మహోత్సవం.

అప్పటికి వారిపేరు మారుమ్రోగాలంటే ఇప్పటినుంచీ ఏమైనా చేయాలిగద! అందుకే మీముందీ విన్నపము.

**పశుర్మనుష్యః పక్షీ వా యే చ వైష్ణవ సంశ్రయాః ।**

**తేనైవ తే ప్రయాస్యంతి తద్విష్ణోఃపరమం పదమ్ ॥**

'ఆచార్యానుగ్రహం మనుష్యులవంటి తెలివి నమ్ముకొని బ్రతికేజీవులనేకాదు, పశుపక్ష్యాదిజీవులనుకూడా బంధవిముక్తులను చేస్తుంది. 'నా' అనడంవల్ల రాయి, రప్ప కర్ర బుర్రవంటి అచేతన శరీరాల్లో మ్రగ్గుతూ బ్రతికే జీవులనుసైతం కర్మపాశాలనుంచి విడదీసి ఉజ్జీవింపచేస్తుందిసుమా!' అనే ఋషి ఉపదేశాన్ని సాకారాన్ని చేసిన **సమతామూర్తి** శ్రీరామానుజాచార్యస్వామి. ఆ కార్యాన్ని వారెలా చేశారో నిరూపించే సన్నివేశాలు వారిజీవితంలో కోకొల్లలు. అవన్నీ కాకపోయినా, అందులో కొన్నైనా ఒకచోట స్పష్టంగ చూడగలిగే ఒక **స్ఫూర్తికేంద్రం** కావాలి. వారందించిన ప్రేమకు మూలస్రోతస్సులుగ ఉండే నూటఎనిమిది దివ్యదేశాలు, వారభిమానించిన దివ్యాలయాలు ఆ స్ఫూర్తికేంద్రంలో సాక్షాత్కరించాలి.

లోకాలకు వెలుగుచూపిన జ్ఞానభాస్కరుడైన ఆ మహోన్నత మూర్తిని సమతామూర్తిగ, సమున్నతమూర్తిగ ఆ స్ఫూర్తికేంద్రంలో సాక్షాత్కరించుకోగలగాలి.

ఇలా ఆచార్యశ్రీవిగ్రహాన్ని, వారి జీవితసన్నివేశాలని, వారారాధించిన దివ్యదేశాలనీ ఒకచోట త్రివేణీ సంగమంలా సాక్షాత్కరింప చేయడానికి ఆరంభమైయ్యేదే **"సమతామూర్తి స్ఫూర్తికేంద్రం"**

ఆచార్యులిచ్చే జ్ఞానం అక్షయ్యం. అంటే నశించనిది. నిత్యమైనది. వారి మంత్రం అక్షయ్యం, వారుచూపిన పరమాత్మ అక్షయ్యం. ఆ ఆచార్యులూ అక్షయ్యమే. వారివల్ల స్వరూపాన్ని లభించిన మనమూ అక్షయులమే గద! అందుకే ఈ మే నెల, 2వ తేదీ అక్షయతృతీయనాడు **సమతామూర్తి స్ఫూర్తికేంద్రాన్ని** నిర్మించే మహోద్యమానికి శ్రీకారం చుడదాం. దానికి శంకుస్థాపన చేసుకుందాం.

శంషాబాద్‌లోని జీవాప్రాంగణానికి తూర్పుగ 25 ఎకరాల విశాలభూభాగాన్ని ఈ స్ఫూర్తికేంద్ర నిర్మాణానికి అంకితం చేసారు శ్రీమాన్ జె. రామేశ్వరరావుదంపతులు. జీవాసంస్థకు చెందిన దాంట్లోంచి ఓ 20 ఎకరాలు దీనితో కలిపితే మొత్తం 45 ఎకరాల విశాలస్థలం ఈ సమతామూర్తి స్ఫూర్తికేంద్రానికి నిలయమౌతోంది. దానిలో అక్షయతృతీయనాడు ఉదయం 9.30–10.30 మధ్య సమయంలో శిలాన్యాసం జరుగుతుంది.

2016–17 సంవత్సరంలో రాబోయే **శ్రీరామానుజసహస్రాబ్ది** మహోత్సవంవరకు ఇందులో మూర్తి సాక్షాత్కారం. దివ్యదేశ నిర్మాణం వరకైనా ముగించి, ఆ మహానుభావుని దివ్యమంగళవిగ్రహమును లోకానికి చూపాలి. నిర్మాణ వివరములు, కైంకర్యవివరాలూ విడిగ చూపిస్తాం. శ్రీరామానుజసహస్రాబ్ది మహోత్సవాలు మనకు పూర్వముండే వారెవ్వరూ సేవించలేదు. మన తరువాతి తరాల వారెవ్వరూ సేవించే ప్రశ్నేలేదు. ఆ అదృష్టం ఇప్పటి మనకు మాత్రమే లభిస్తుంది. అందుకే ఈ అపురూపమైన, అపూర్వమైన దివ్యావకాశాన్ని మనమందరమూ సద్వినియోగం చేసుకుందాం!

**మన బంధుమిత్రుల కందరికీ తెలియచేసి**

**వారూ వినియోగించుకునేట్టు చేద్దాం!**

**భగవద్ బంధువులైన మిమ్మందరినీ సాదరంగా స్వాగతిస్తున్నాం!!**

**వేంచేయండి !!!**

సంపాదకీయం

# మనం రామరాజ్యాన్ని ఎందుకు కోరుకుంటున్నాం!



తరచు మనం **'రామరాజ్యం'** గురించి మాటాడుతూ ఉంటాం. వాల్మీకి, రామాయణ మహాకావ్యం ద్వారా రామచరితాన్ని రమణీయంగా అక్షరబద్ధం చేశాడు. రాముడు సాక్షాత్తు నారాయణావతారమే. అయినా, ఒక సర్వోత్తమ లక్షణాలుకల నరునిగానే ఆయనను మనం స్వీకరించినప్పుడు ఆయన జీవనవృత్తం మనకు ఆదర్శం అవుతుంది. రాముడు రాజ్యంచేసిన వైనాన్ని వాల్మీకి విశదంగా వర్ణించలేదు. అయినా, రాముడు మంచి పరిపాలకుడని మనం గుర్తించడానికి కొన్ని సన్నివేశాలను ఆయన తన మహాకావ్యంలో నిక్షిప్తం చేశాడు. రాముడు స్వయంగా ఆయా సందర్భాల్లోమాటాడిన మాటలనుబట్టి, భరత లక్ష్మణాదులతో చేసిన సంవాదాన్నిబట్టి, ఆయాసన్నివేశాలలో ఎదుర్కొన్న సమస్యలను పరిష్కరించిన తీరునుబట్టి ఆయనకుగల పాలనా దక్షతను మనం బేరీజు వేయవచ్చు. తన కల్యాణగుణాలచేత సామాన్యప్రజలను ఆకర్షించిన రాముడు, ప్రతివ్యక్తిలోనూ, తననే చూచి, ఒకరు మరొకరిని ద్వేషించకుండా ఉండేలా, తన ముద్రను ప్రజలపై వేశాడంటాడు వాల్మీకి.

**రామోరామోరామఇతి ప్రజానామభవన్ కథాః ।**
**రామభూతం జగదభూద్ రామేరాజ్యం ప్రశాసతి ॥**

ప్రజలు మాటాడే మాటల్లో 'రాముడు' 'రాముడు' 'రాముడు' అని రామ కథల ప్రస్తావనం తప్ప మరేమీ లేదట. లోకమంతా రామమయం అయింది అంటాడు. ఏనాయకునికైనా ఇది సాధ్యమా? అని ఆధునికులకు అనిపించవచ్చు. ఇది వాల్మీకి సాతిశయంగా ఒకనాయకుని గొప్పతనాన్ని ఆవిష్కరించడానికి పలికిన మాటగా అనిపించవచ్చు. అంతేకాదట–

**సర్వం ముదితమేవాసీత్ సర్వోధర్మ పరోఽభవత్ ।**
**రామమేవాను పశ్యన్తో నాభ్యహింసన్ పరస్పరమ్ ॥**

సమస్తమూ సంతుష్టమై ఉంది. ప్రతివ్యక్తి ధర్మపరుడయ్యాడు. రామునే చూస్తూ ప్రజలు ఒకరినొకరు హింసించు కోకుండా ఉన్నారట. ఇది కూడా నేటి దృష్టితో చూస్తే కొంత అనుభవసాధ్యమా? అనే సందేహాన్ని కొందరికి కలిగించవచ్చు. కేవలం రాముడొక్కడే ధర్మాత్ముడైనందువల్ల రాజ్యం ధర్మబద్ధం అయిపోలేదు. ప్రజలుకూడా ధర్మబద్ధులైనారు అందువల్లనే ఈనాడు మనం అనుకుంటున్న, లేదా కలలుకంటున్న రామరాజ్యం ఆనాడు సుసాధ్యమైంది. ఆదర్శవంతాలైన సమాజాలు ఉండనే ఉండవనో, ఉండటానికి అవకాశమే లేదనో ఎవరైనా వితండవాదంచేస్తే, అలా వాదించేవారికి చరిత్ర తెలియదని అనకతప్పదు. **'గుప్తయుగం'** ఏ యుగాలకో చెందిందికాదు. మనముందే నిజంగా జరిగింది.

ఈ కలికాలంలోనే దాన్ని **'స్వర్ణయుగం'**గా చరిత్రకారు లంతా ఎలుగెత్తిచాటారు. కృష్ణదేవరాయల కాలన్నీ అలాగే ఉద్ఘోషించారు మన చరిత్రకారులు. ఆ కాలాల్లో అధర్మ ప్రవృత్తి అక్కడక్కడా లేదని అనలేం. కాని, పరిపాలకులైన ప్రభువుల చారిత్రం ఉత్తమమైంది అయినప్పుడు, ప్రజల ఆలోచనలపై దాని ప్రభావం పడకతప్పదు. తమను పరిపాలించే పాలకుడు మంచి గుణాలు కలవాడని తాము స్పష్టంగా గుర్తించిన ఏ ప్రజలైనా ఆగుణాలను ఆదర్శంగా తీసికోకమానరుకదా!

**'సర్వేధర్మాః రాజధర్మప్రధానాః'** అంటుంది మహాభారతం ఏధర్మమైనా రాజ ధర్మాన్నే ఆశ్రయించి ఉంటుంది. (ధర్మమంటే సుఖంగా తానుంటూ తన చుట్టూ ఉండే సమాజాన్ని సుఖంగా ఉంచేందుకుచేసే కాయిక –మానసిక కర్మ అని గ్రహిస్తేచాలు) రాజు ధర్మాత్ముడైతే ప్రజలూ ఇష్టమున్నాలేకపోయినా, ఆ మార్గాన్నే క్రమంగానైన అనుసరించకమానరు. ధర్మబద్ధుడైన పాలకుడు, తనపాలనలోని ప్రజలు అధార్మికులుగా ఉంటే చూస్తూ ఊరుకోడుకదా! అలాకాక, తానే స్వయంగా, అవినీతి పరుడు, కుంభకోణాల్లో ఇరుక్కుపోయిన వాడు, ప్రజాద్రవ్యాన్ని దుర్వినియోగపరిచేవాడు, లంచగొండి, ఇలాంటివే ఎన్నో దుర్లక్షణాలు ఈనాడు తరచుగా మనం చూస్తున్నవన్నీ కలవాడైతే, ఇక పరిపాల్యులైన ప్రజలు ఆత్రోవలోనే పోక తప్పదు కదా!

లంచగొండులు, వేలకోట్ల ఆస్తులు కూడబెట్టుకోవడమే పరమార్థంగా ఉన్న ప్రభుత్వవ్యవస్థలోని వారు (వీరేకదాపరిపాలకులు!) రాజ్యం ఏలుతూ ఉన్నప్పుడు, సామాన్యప్రజలు లంచాలివ్వందే ఏ పనీకాని దుఃస్థితి నేటి సమాజంలో ఏర్పడిందని మనందరికీ తెలుసు. రాజకీయనాయకులు, ప్రభుత్వాధికారులు లంచాలకు మరిగినవారు, ఏ స్థాయిలోవారైనా, దొంగ గడ్డిమేయడానికి అలవాటుపడ్డ గొడ్డుల్లాగా, సిగ్గు, ఎగ్గులు, విడచి విచ్చలవిడిగా రాజ్యాలను ఏలుతున్నప్పుడు, ప్రజలు "పరమధార్మికు"లై ఇళ్లల్లో బ్రతకలేరు కదా. కొండల్లో ముక్కుమూసికొని కూర్చోవలసి దుఃస్థితే కదా ఏర్పడేది! ధరలు ఆకాశాన్ని అంటినప్పుడు 'ఆహారనియమం' తప్పదు. భోగసాధనాలు అందుబాటులో లేనప్పుడు 'విరాగులు' కాకతప్పదు. గొంతుచించుకొని ఆక్రోశించినా పట్టించుకునే నాథుడు లేని అనాథపు బ్రతుకులు వెళ్లదీస్తూ నోరు మెదపలేని స్థితిలో 'మహామునులు' కావలిసిందేకదా! ఇలాంటి సమాజంలో బ్రతుకుతున్న బడుగుబ్రతుకులవారికి వద్దన్నా 'వైరాగ్యం' తప్పదు. వారంతా మన రాజకీయనాయకుల దృష్టిలో **"సన్యాసులే"** సందేహంలేదు. రామరాజ్యంలోనూ వైరాగ్యసంపన్నులున్నారు. తమంతతాముగా ఆహార విహార నియమాలు కల్పించుకున్నవారు వారు. భోగసాధనాలు అందుబాటులో

ఉన్నా, నిరీహతో విరాగులైనవారు వారు. వారికి"సన్యాసం" చివరి లక్ష్యం. అందుకోసమే, వారు ఆక్రోశించనక్కరలేకుండానే రాముడు స్వయంగా వారిని రక్షించడానికి అడవికి వెళ్ళాడు.

నేడు మనం చూస్తున్న దుస్థితి రామరాజ్యంలో లేదని వాల్మీకి వ్రాశాడు. ఆరాజ్యం నిజంగా ఉండినదేనని విశ్వసించినా, అది భావనా కల్పితమేనని ఎవరైనా భావించినా, తప్పక ఆరాజ్యమే కావాలని మనం కోరుకుంటున్నాం. ఈ కలియుగంలో అది సాధ్యమోకాదో, ఆపైవాడే తేల్చాలి అని మనం ఉదాసీనంగా ఉండకూడదు.

మన ప్రస్తుత "కునాయకులు", నాయకులై దేశాన్ని ఏలాలని ఉవ్విళ్లూరు తున్నవారు, రామునిలోని ఒకటి రెండుగుణాలు కలవారైనా అయితే రామరాజ్యం సాధ్యమే. రామునిలోని, వాల్మీకి చెప్పిన ఒకటి రెండు గుణాలు గమనించుదాం.

అయోధ్యాకాండలో, ప్రజలంతా ముక్తకంఠంగా రాముడే రాజుకావాలని దశరథుని దగ్గర, మహాసభలో ఎలుగెత్తి రామగుణాలను ఏకరువు పెట్టారు. **"బహవో నృపకల్యాణగుణాః సంతి తవాత్మజే"** అన్నారు. ఇక్కడ 'నృప' ఓరాజా అని సంబోధనం చెప్తారు. అయితే నృపశబ్దాన్ని పై భాగంతో అన్వయిస్తే **'నృపకల్యాణగుణాః'** అని అవుతుంది. రాజుకావడానికి, లేదా రాజైనవాడికి ఉండవలసిన కల్యాణగుణాలు అని అర్థం వస్తుంది. అలాంటివి రామునిలో ఉన్నాయని సోదాహరణంగా నిరూపించారు ప్రజలు. అయోధ్యాకాండలోని మొదటి సర్గ, ఒక పరిపాలకునికి ఉండవలసిన యోగ్యత ఎలాంటిదో చెప్పింది.

ప్రజలకు ఏచిన్న దుఃఖం ఏదో ఒక సన్నివేశంలో కలిగినా, దాన్ని ఏ సమయంలోనూ మరచిపోకుండా, 'అయ్యో' నా ఏమరుపాటువల్లనే కదా వీనికి ఈ బాధకలిగింది. అని తలచుకొని తలచుకొని, తల్లిలా దుఃఖించే మనస్తత్త్వమట రామునిది. నేటి నాయకుల్లో ఒక్కడికైనా ఈ గుణం మచ్చుకైనా కనిపించదని మనకు తెలుసు. ప్రజలకు ఏ సంతోషకర సన్నివేశం ఏర్పడ్డా, అది తనకే ఏర్పడినట్లుగా ఒకతండ్రిలా భావించి, అలాగే నిరంతరం ప్రజలు సంతోషంతో ఉండాలని కోరే మనస్తత్త్వమట రామునిది. ఇది, నేడు అసలే దొరకదు. ఎన్నోకల్యాణగుణాలను వర్ణించి, చివరకి ఒక్కమాటంటాడు వాల్మీకి-

**స్త్రియో వృద్ధా స్తరుణ్యశ్చ సాయం ప్రాతస్సమాహితాః ।**
**సర్వాన్ దేవాన్ నమస్యంతి రామస్యార్థే యశస్వినః ॥ అని.**

స్త్రీలు, వృద్ధులు, యువతులు (ఇంకాఇతరులు) ప్రొద్దుట, సాయంకాలం దేవాలయాల్లో రాముని క్షేమంకోసం నిరంతరం దేవతలను ప్రార్థిస్తారట. అలా దేవతలను మనం ప్రార్థించి క్షేమంకోరదగిన నాయకుడు ఒకడైనా ఉన్నాడా? అన్నది నేటి సమాజంలో ప్రతి ఒక్కని ముందున్న పెద్ద ప్రశ్న.

భరతుడు రామునివద్దకు అరణ్యానికి వెళ్ళినప్పుడు వారిరువురి మధ్య జరిగిన అద్భుత సంవాదాన్ని వాల్మీకి వర్ణించాడు. రామాయణంలో ఈ సందర్భంగా "కచ్చిత్ సర్గ" అనే ఒకభాగం ఉంది. ఇక్కడ రాముడు ఒక అద్భుతమైన మాట అంటాడు.

**కచ్చిత్ స్త్రియః సాన్త్వయసే కచ్చిత్తాస్తే సురక్షితాః**
**కచ్చిన్నశ్రద్దధాస్యాసాం కచ్చిత్ గుహ్యన్నభాషసే ॥**

స్త్రీలకు ఏదైనా కష్టంకలిగినపుడు వారికి ఆశ్వాసం కలుగజేస్తున్నావా ? స్త్రీలు సురక్షితంగా ఉన్నారుకదా? వాళ్ళ విషయంలో శ్రద్ధ చూపిస్తున్నావా? వారితో ఏకాంతంగా నర్మభాషణం చేయడంలేదు కదా? అని భరతుని రాముడు ప్రశ్నిస్తాడు .స్త్రీల విషయంలో రాముడు చూపిన జాగరూకతకు ఇది నిదర్శనం. స్త్రీ బాల, వృద్ధుల సంరక్షణం బాగా చేయగలిగిన పరిపాలకులే పరిపాలకు లవుతారు. ఇది ఆయవ్యయాలలో నియమాన్ని పాటించినప్పుడే సాధ్యం. ఆదాయం ఎక్కువగా ఉండాలి, ప్రభుత్వపరమైన వ్యయం తక్కువగా ఉండాలి. ఏదశలోనూ ప్రభుత్వాలు అనవసరపు దుబారాలు చేయకూడదు. ఇది రామరాజ్యం. ఆస్థితిని ఈనాడు మనం చూడలేము సరికదా దరిదాపులకు కూడా వెళ్ళలేము అని సామాన్యుని ఆక్రోశం.

**ఆయస్తే విపులః కచ్చిత్ ? కచ్చిదల్పతరో వ్యయః?**
**అపాత్రేషు న తే కచ్చిత్ కోశో గచ్ఛతి రాఘవ? ॥**

ప్రజాక్షేమానికి ఉపయోగపడని కేవలం దుర్వ్యయమే లక్ష్యంగాకల కార్యక్రమాలు (నేటి ప్రచారవ్యయంలాగా) రామరాజ్యంలో లేవన్నమాట. రామరాజ్యంలో ఉద్యోగులకు విశేషించి సైనికులకు సమయానికి "భక్తం" (**Ration**), వేతనం (**salary**) క్రమం తప్పకుండా ఇవ్వబడేది. ప్రభుత్వసేవకులకు ఇవ్వవలసిన భక్త వేతనాలు సమయానికి ఇవ్వకపోతే భృత్య- యజమాన వ్యవస్థ పాడవుతుందని, అది గొప్ప అనర్థాన్ని కలుగజే స్తుందంటాడు రాముడు.

ఇలాగే ఏపరిపాలకునికైనా ఉండరాని 14దోషాలను రాముడు ఎత్తిచూపుతాడు. మన రాజకీయ నాయకులకు ఇలాంటి విషయాలేవీ తెలియవు. క్రొత్తగా రాజకీయాల్లోకి వచ్చే యువకులకు ఏకొంతైనా ప్రజాసేవ చేయాలనే సద్బుద్ధికల నాయకులకు, రామాయణంలోని ఈ కచ్చిత్‌సర్గ అద్భుతమైన పాఠం. ఈసర్గను చదివినవాడు ఎవడైనా రామరాజ్యం ఎలా ఉండేదో గుర్తించి అదే నేడూ కావాలనే కోరతాడు.

'అర్థం' తప్ప, 'ధర్మం' అనే పదమే ఎరుగని మనమహానాయకుల అధ్వాన్నపు పరిపాలన అంతమై రామగుణాల్లో ఏ ఒకటి, రెండైనా ఉన్న నాయకులుకల రాజ్యం రావాలని కోరదాం.అలాంటి నాయకత్వ లక్షణాలుకల వ్యక్తుల్ని వెదకి వారి క్షేమాన్ని మనం సర్వదా భావించుదాం. అప్పుడు 'రామరాజ్యం' తప్పక వస్తుందని ఆశించడం దురాశకాదు. రామాయణాన్ని నిరంతరం పారాయణచేసే ఈభారత జాతికి, వాల్మీకి నిరూపించిన రామరాజ్యం, నేడు అందని ద్రాక్షపండే కాగా, నేటి చిన్నచిన్న ఐరోపాదేశాల్లో కూడా కొంచమైనా అనుభవంలో ఉండటం ఆశ్చర్యంకదా!

*- వేంకట రంగరామానుజాచార్యులు*



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*(గత సంచిక తరువాయి)* (1స్కంధం-13వ అధ్యాయం)

**నారదాద్యాగమనం**

సంజయుడు, ధృతరాష్ట్రాదులగురించి ధర్మజుడు అడిగిన దానికి ప్రతిసమాధానింపలేక, కన్నీటిని నిలవరించుకుంటూ, తనకేమీ తెలియదని అంటూ శోకిస్తూ ఉండగా నారదుడు, తుంబురుడు ఇరువురు అక్కడకు విచ్చేశారు. లేచి, వారికి, ప్రణామంసమర్పించి, ధర్మజుడు సోదరులతోపాటు వినయపురస్సరంగా ఇలా అన్నాడు.

**ప్రత్యుత్థాయాభివాద్యాహ సానుజోఽభ్యర్చయన్నివ ।**
**నాహంవేద గతిం పిత్రోః, భగవాన్! క్వగతః పితా ॥**

"హే భగవాన్! నా తల్లిదండ్రుల గతి నాకు తెలియదు. వారెక్కడికి వెళ్లారో మీరు వారిజాడ చెప్పి అనుగ్రహించండి. బిడ్డలను కోల్పోయిన తల్లి (గాంధారి) ఎక్కడకు వెళ్లిందో తెలియదు. తండ్రి ఎక్కడకు వెళ్లాడో తెలియదు. వ్యసనసాగరంలో మునిగిన మాకు, కర్ణధారునిలా (నౌకచుక్కాని పట్టిన నావికునిలా) నీవు లభించావు. తీరాన్ని చూపించి నీవే మమ్ములను రక్షించు" అన్న ధర్మజుని దీనోక్తులు విని నారదుడు ఇలా అంటున్నాడు.

**నారదవచనాలు**

**మా కంచన శుచోరాజన్! యదీశ్వర వశంజగత్ ।**
**స సంయునక్తి భూతాని, స ఏవ వియునక్తి చ ॥**

**లోకాస్సపాలా యస్యేమే వహన్తి బలిమీశితుః ।**
**యథా గావో నసి ప్రోక్తా స్తంత్ర్యాం బద్ధాఃస్వదామభిః॥**

**వాక్తంత్ర్యాం నామభిర్బద్ధాః వహన్తి బలిమీశితుః ।**

ఓ రాజా! ఎవరినుద్దేశించీ, నీవు శోకపడవద్దు. ఎందువల్ల నంటే ఈ జగత్తంతా ఈశ్వరవశమేకదా! ఆపరమాత్మయే ఈ సమస్త ప్రాణులను కలుపుతాడు, విడగొడతాడు. లోకపాలకులైన ఇంద్ర యమ వరుణ కుబేరాదులతోపాటు లోకాలన్నీ పరమాత్మకు చెందిన 'బలి'ని వహిస్తున్నాయి.

ఎలాగైతే ఎద్దులు ముక్కుత్రాటిచేత నాసికయందు గ్రుచ్చబడ్డాయో, ఎలాగైతే త్రాళ్లచే కంఠాల్లో బంధింపబడి ఒక పెద్దత్రాటికి కట్టబడ్డాయో, అలాగే, కర్తవ్యాకర్తవ్య విధాయకమైన వేదవాక్కనే పెద్దత్రాటిలో, బ్రాహ్మణ- క్షత్రియాది చిన్నచిన్న నామంచేత బంధింపబడి ఈప్రాణులు పరమాత్మచే ప్రేరితమైన 'బలి'ని వహిస్తున్నాయితప్ప, వేరేమీలేదు. కనుక ఈ ప్రాణికోటికి చెందిన ప్రతివ్యవహారము, చేష్ట, పరతంత్రమే తప్ప పరమాత్మయొక్క ఆజ్ఞను పారతంత్ర్యాన్ని (నియమనాన్ని) మీరగలిగినవుకావు.

**యథాక్రీడోపస్కరాణాం సంయోగ విగమావిహ।**
**ఇచ్ఛయా క్రీడితుః స్యాతాం తథైవేశేచ్ఛయా నృణామ్ ॥**

అంతే కాదు. ఆడుకునే ఆటబొమ్మల కలయిక, విడివడటం అనేది ఆటగాని ఇష్టంపైనే ఆధారపడి ఉన్నట్లు, భగవంతుని చేతిలో ఆటబొమ్మలైన ఈ ప్రాణుల సంయోగ-వియోగాలుకూడా ఆయన సంకల్పంమీదనే ఆధారపడి ఉన్నాయి తప్ప, మరేదీ నియామకంకాదు.

**యన్మన్యసే ధ్రువంలోక మధ్రువం వా నచోభయమ్ ।**
**సర్వథాపి న శోచ్యాస్తే స్నేహాదన్యత్ర మోహజాత్ ॥**
**తస్మాజ్జహ్యంగ వైక్లబ్యమ్ అజ్ఞానకృతమాత్మనః ॥**

ఓ రాజా! ఈజగత్తును స్థిరమైందనో అస్థిరమనో నీవుభావిస్తున్నావు. ఈ రెండూకాదు. (దీన్ని స్థిరం అనుకోవడమూ తప్పే. ఎందువల్ల? నిత్యం పరిణామాన్ని పొందుతోంది కనుక. అలాగని అస్థిరమని భావించడమూ సరికాదు. ప్రవాహరూపంగా నిత్యమూ ఉన్నదేకదా! కనుక రెండూ భావింపరాదని తాత్పర్యం) ఈ విధంగా ప్రవాహనిత్యమై, నిరంతర పరిణామశీలమైన ఈ జగత్తులోని ఏ ప్రాణీ స్థిరముకాదూ, అస్థిరమూకాదు. కనుక, మోహంవల్ల కలిగిన స్నేహములంగా తప్ప, ఎవ్వరిగురించీ శోకింపతగదు.

**కథం త్వనాథాః కృపణా వర్తేరన్ బత! మా మృతే ।**
**కాల-కర్మ-గుణాధీనో దేహోఽయం పాంచభౌతికః ॥**

**కథమన్యాంస్తు గోపాయేత్ సర్పగ్రస్తో యథాఽపరమ్ ।**
**అహస్తాని సహస్తానామ్ అపదాని చతుష్పదామ్ ॥**
**ఫల్గూని తత్రమహతాం, జీవో జీవస్య జీవనమ్ ॥**

నీకు కల్గిన అజ్ఞానంవల్ల ఏర్పడిన ఈశోకాన్ని పూర్తిగా విడచిపెట్టు. నీవల్లనే వారి బ్రతుకు అనేదికూడా సరికాదు. నీవు లేకుంటే వారు అనాథులని భావించడమూ అజ్ఞానమే, ఈ దేహంపాంచభౌతికం.

కాలాధీనం, కర్మాధీనం, ప్రాకృతికాలైన త్రిగుణాలకు అధీనం. ఇలాంటి ఈ దేహం కాల-కర్మ-గుణాలను విడచి ఎలాంటి ఉనికిని పొందజాలదన్నప్పుడు, అలాంటి దేహమే ధరించి ఉన్న నీవల్ల వారు సనాథులు ఎలా అవుతారు? పాముకాటు పడినవాడు, మరొకనిని రక్షించ యత్నించడం ఎంత అవివేకమో, కాల-కర్మ- గుణాధీనమైన దేహంకల నీవు, నీలాంటి మరొకరిని

రక్షించాలని భావించడమూ అజ్ఞానవిలాసమే తప్ప వేరుకాదు. ఎవరు ఎవరిపై ఆధారపడి బ్రతకాలో దైవమే నిర్ణయించింది.

భగవత్కల్పితమైన జీవనవిధానం సర్వత్ర సుఖలభ్యమే కదా! ఎలా నంటావా? చూడు భగవంతుడు ఒక విధమైన దాన్ని మరొకదానికి 'జీవనం' (బ్రతుకు తెరువుగా) ఏర్పరచాడు. హస్తాలుకల నరవానరాదులకు హస్తరహితాలైన వాటిని ఆహారంగా ఏర్పరచాడు. ఇక పాదరహితాలైన గడ్డిమొదలైన వాటిని, చతుష్పాత్తులైన పశువులు మొదలైన వాటికి జీవనంగా ఏర్పరచాడు. బలహీనాలైన మృగాదులను, బలవంతాలైన సింహవ్యాఘ్రాదులకు ఆహారంచేశాడు.

ఒక జీవుని మరొక జీవునికి జీవనం చేశాడు. కనుక ఎవరివల్లా ఎవ్వరూ సనాథులనికాని, వారులేకపోతే ఇతరులు అనాథులని భావింపనక్కరలేదు. అలా భావించడం అజ్ఞానంతప్ప మరొకటి కానేకాదు. కనుక, ధృతరాష్ట్ర-గాంధార్యాదుల గురించిన చింత నీవు పడనక్కర లేదు. అని నారదుడు ధర్మజునికి ప్రతిబోధనం చేశాడు అని భగవద్ సృష్టిలోని ఆయా ప్రాణులకు భగవానుడు కల్పించిన పరస్పరాశ్రయ స్వభావాన్ని విశదంగా వర్ణించాడు నారదుడు. ఈ సందర్భంలో వేదాన్తవిషయపరమైన ఒకశ్లోకాన్ని వ్యాఖ్యాతలు తమతమ దర్శన సిద్ధాన్తానుసరించి, విభిన్న వ్యాఖ్యలు చేశారు. ముఖ్యంగా శ్రీధర వీరరాఘవ వ్యాఖ్యల్లో కొంత తేడా ఉంది. వ్యాఖ్యా విశేషాలతో పాటు ఆశ్లోకాన్ని కూడా మనం మననం చేద్దాం.




జై శ్రీమన్నారాయణ !

# దివ్యసాకేత 5వ బ్రహ్మోత్సవములు

పరమహంస పరివ్రాజకులు
శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో...!

7.5.2014 నుండి 13.5.2014 వరకు

శ్రీరామనగర్, జీవా ప్రాంగణం, పాలమాకుల పోస్ట్, రంగారెడ్డి జిల్లా. 509 325

ఆలయాల్లో విగ్రహరూపంలో ఉండి భక్తులు సమర్పించే పూజలను గ్రహించి సమస్తమైన కోరికలను నెరవేర్చు అర్చామూర్తి అని, ఆళ్వార్లు, ఆచార్యులు, పరమఋషులు స్తోత్రాలు చేశారు.

అలాంటి ఆలయాలలో మన "దివ్యసాకేతము" పరమశ్రేష్ఠము. మంత్రరాజమైన అష్టాక్షరీ మంత్రంలోని ఒక్కొక్క అక్షరానికి ఒకొక్కగోపురంతో 'అష్టాంగవిమానము'గా విరాజిల్లుతున్నది దివ్యసాకేతము. 'త్రి తలము' అనగా మూడు అంతస్థులతో క్రమముగా క్రిందన శ్రీరాముడు, ఆపై శ్రీరంగనాథుడు, దానిపై శ్రీ వైకుంఠనారాయణునితో దర్శనమిస్తోంది.

శ్రీ వైష్ణవ సంప్రదాయంలోని 106 దివ్యక్షేత్రాల తులసిమృత్తిక, సాలగ్రామాలతో శ్రీరంగనాథుని మూర్తి ఆవిర్భవించింది. సకల దేవతావృక్షముల రసములతో స్వామికి వర్ణకలాపము చేశారు. ఒక్క శ్రీరంగనాథుని సేవిస్తే 108 దివ్యక్షేత్రాలు దర్శించిన ఫలము దక్కుతుంది. పవిత్రమైన ఈ దివ్యదేశము శ్రీశ్రీశ్రీ పెద్ద జీయర్ స్వామివారి "శతజయంతి"ని పురస్కరించుకొని వారికి కానుకగా శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు లోకానికి అందించారు.

అపూర్వమైన ఈ దివ్యసాకేత ఆలయంలో తేది. 7.5.2014 నుండి 13.5.2014 వరకు 5వ బ్రహ్మోత్సవములు శ్రీ జీయరు స్వామివార్ల పర్యవేక్షణలో జరుగనున్నవి. వేయి అశ్వమేధ యాగాలు చేస్తే కలిగే ఫలము బ్రహ్మోత్సవాలలో పాల్గొంటే కలుగుతుంది అని ఆగమాలు చెప్పున్నాయి. సకల సంపదలను అనుగ్రహించి, మహాపాతకాలను దూరం చేసే ఈ ఉత్సవాలలో అందరం పాల్గొని తరిద్దాం!!





ప్రతిరోజు ఉదయం : యాగశాలలో ఆరాధన, హవనములు, తిరుమంజనం
మధ్యహ్నం : నిత్యపూర్ణాహుతి, ప్రసాద వితరణ
సాయంత్రం : శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ, ప్రవచనం, వాహన సేవలు.

| | |
|---|---|
| 07-05-2014 | ఉ॥ ఉత్సవారంభ స్నపనము<br>సా॥ విష్వక్సేనారాధన, అంకురారోపణ |
| 08-05-2014 | ఉ॥ధ్వజారోహణము, అగ్నిప్రతిష్ఠ,<br>సా॥ దేవతాహ్వానం, వాహనసేవ<br>లక్ష్మీనారాయణ అష్టోత్తరపూజ |
| 09-05-2014 | ఉ॥ తిరుమంజనం, శ్రీరంగనాథ పూజ<br>సా॥ హనుమద్వాహనసేవ, ఎదుర్కోలు ఉత్సవం |
| 10-05-2014 | ఉ॥ తిరుమంజనం రామపూజ<br>సా॥ తిరుకళ్యాణమహోత్సవము |
| 11-05-2014 | ఉ॥తిరుమజనం రామానుజ అష్టోత్తరపూజ<br>సా॥ గరుడవాహనసేవ |
| 12-05-2014 | ఉ॥ రథోత్సవము, చక్రతీర్థోత్సవము<br>సా॥ శ్రీ పుష్పయాగము, ద్వాదశారాధన, దేవతోద్వాసనము, మహాపూర్ణాహుతి, ధ్వజారోహణము |
| 13-5-2014 | ఉ॥ ఉత్సవాన్త స్నపనము<br>సా॥ సప్తావరణము, ఉత్సవ పరిసమాప్తి |




భగవద్బంధువులకు ఇదే మా ఆహ్వానము



# అహో! భారతమ్

(జనవరి సంచిక తరువాయి)

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

అర్జునుడు ఉత్తర దిగ్విజయ యాత్ర పూర్తిచేసి అపార సంపదలతో అన్న ధర్మరాజును సత్కరించాడు. ధర్మజుని ఆనందం వర్ణనాతీతం. సోదరులంతా తలొకవైపు వెళ్ళాలనే నిర్ణయంలో భీముడు పూర్వ దిగ్విజయానికి బయలుదేరాడు.

పాంచాల మహానగరం అహిచ్ఛత్రానికి చేరి అక్కడి వారినందరిని వశపరచుకున్నాడు. గండకీనదీతీరంలో ఉన్న విదేశదేశాలను, దశార్ణదేశాన్ని జయించాడు. దశార్ణరాజు పేరు సుధర్ముడు. ఆయన భీమునితో మల్లయుద్ధం చేశాడు. భీమ-సుధర్ములయుద్ధం చూచి ప్రజలు అత్యంతాశ్చర్యాన్ని పొందారు. ఓహో, మల్లయోధుల యుద్ధం ఇంత భయావహంగా, శౌర్యభరితంగా ఉంటుందా... అనుకున్నారు. సుధర్ముడు భీమసేనునికి దాసోహమన్నాడు. అతని బలపరాక్రమాలకు భీముడు కూడా ఎంతో పొంగిపోయాడు. 'నువ్వు నాకు ప్రధాన సేనాపతివి కావాలి' అన్నాడు. సుధర్ముడు ఆనందంగా అంగీకరించాడు.

రోచమానుడు అనే రాజు తమ్ములతో కలిసి వచ్చాడు. అతనిని మంచిమాటలతో వశపరచుకొని ధర్మరాజు గొప్పదనాన్ని చెప్పి యుద్ధం లేకుండా సామోపాయంతోనే వశం చేసుకున్నాడు భీముడు. పులిందనగర రాజు సుమిత్రుని యుద్ధంలో ఓడించాడు.

చేదిరాజు శిశుపాలుడు. ఇతనికి ధర్మరాజంటే చాల గౌరవం. భీముడు అన్న ఆజ్ఞానుసారం శిశుపాలుని రాజ్యంపైకి వెళ్ళాడు. శిశుపాలుడు విషయం తెలుసుకొని నగరం వెలుపలికి వచ్చాడు. భీమునికి స్వాగత సత్కారాలు చేశాడు. కురువంశ శ్రేష్ఠుడు భీముడు, చేదివంశ శ్రేష్ఠుడు శిశుపాలుడు ఒకరినొకరు కౌగలించుకొని పరస్పరం కుశల ప్రశ్నలు వేసుకున్నారు. ధర్మరాజు చేయబోయే రాజసూయ యాగాన్ని గురించి తెలుసుకున్నాడు శిశుపాలుడు. వెంటనే అతనికి వశపడి పోయాడు. 'ఈ రాజ్యం, సంపదలు అన్నీ మీ అనుగ్రహ ఫలితమే. కప్పం కట్టేస్తాను' అంటూ ఆదరంగా సన్మానించాడు.

భీముడు పదమూడు రోజులు అతని ఆతిథ్యంలో ఉండిపోయాడు. తరువాత తూర్పు దేశాల రాజులందరినీ ఓడించి వందల కోట్ల రత్న, రజత, కాంచన రాసులను కప్పంగా తెచ్చి, కుప్పలుగా పోశాడు. ధర్మరాజు పాదాలచెంత చేరి నమస్కరించి తాను తెచ్చిన అశేష సంపదలను సమర్పించాడు. ధర్మరాజు భీముని కౌగిలించుకొని ఆత్మీయభావాన్ని ప్రదర్శించి పులకించి పోయాడు.

సహదేవుడు దక్షిణ దిక్కుకు బయలుదేరాడు. ముందుగా శూరసేన దేశవాసుల్ని జయించాడు. దంతవక్రుని జయించి కప్పం గ్రహించాడు. జంభకుడనే రాజుకి శ్రీకృష్ణుడంటే పడదు. అతనితో యుద్ధం చేశాడు. జంభకుని జయించి అపార సంపదలు సంపాదించాడు. విందుడు, అనువిందుడు అనే అవంతీ దేశ రాజుల నోడించాడు. భీష్మకుని జయించాడు.

కిష్కింధా గుహలోని మైందద్వివిదులతో వారం రోజులు యుద్ధం చేస్తే వారు ప్రసన్నులై రత్నరాసులను కానుకగా ఇచ్చారు. తరువాత సహదేవుడు మాహిష్మతీనగరం చేరాడు. అక్కడ రాజు పేరు నీలుడు. ఆయన గొప్ప పరాక్రమవంతుడు. పైగా ఆయనకి అగ్నిహోత్రుడు సాయం చేశాడు. ఇంక చెప్పేదేముందీ సహదేవుడేమీ చేయలేకపోయాడు. తన సైన్యమంతా అగ్నికి ఆహుతి అయిపోతోంది. అయ్యో... ఏమిటిది ఎక్కడా ఎదురు దెబ్బ తగులలేదే....! ఈ పరిస్థితి నుండి ఎలా తప్పించు కోవాలి? అగ్ని నీలునికెందుకు సాయం చేస్తున్నాడు? అపుడు తెలిసింది కారణం.

అగ్నికి నీలుని పుత్రిక సుదర్శనపై కోరిక కలిగింది. సుదర్శన అపురూప సౌందర్యవతి. ఆవిడ అగ్నిహోత్రగృహంలో అగ్నిని రాజేసేది. ఆవిడ పెదవులు గాలికే అగ్ని మండేది. వింజామరలతో వీస్తే మండేది కాదు. విషయం నెమ్మదిగా ఆమె తండ్రి నీలునికి తెలిసింది. ముందు అంగీకరించలేదు. కానీ, అగ్నిహోత్రుని కోపాగ్నిని చూచి భయపడి కూతురు సుదర్శనను అతనికిచ్చి పెళ్ళి చేశాడు. శాంతించాడు అగ్నిహోత్రుడు.

'మీ అమ్మాయిని నాకిచ్చావు కాబట్టి నీకేదైనా వరమిస్తాను కోరుకో' అన్నాడు. 'నా నగరాన్ని ఎవరైనా జయింప వస్తే వారిని అగ్నిదగ్ధులుగా చెయ్యి' అని కోరాడు నీలుడు. అలా మాహిష్మతీనగరానికి రక్షకునిగా అగ్ని నిలవడంతో ఏ రాజులు దానిని ఆక్రమించలేకపోతున్నారు. అదీ కథ.

ఓహో.. ఇదా విషయం అనుకొన్నాడు సహదేవుడు. వెంటనే సైన్యానికి అభయమిచ్చి, ఆచమనం చేసి పవిత్ర భావంతో అగ్నిదేవుని ప్రార్థించాడు.

'అగ్నిదేవా! నమస్కారం. నువ్వే నాకు సహకరించాలి. మా అన్న ధర్మజుడు రాజసూయ యాగం చేయ సంకల్పించాడు. ధర్మరాజు సంకల్పం నీకెంతో ఆనందాన్నిస్తుంది కదా! దానికి నీ సహకారం పూర్తిగా కావాలి. నువ్వు జాతవేదుడవు. శమీ-అశ్వత్థ ఆరణుల నుండి పుట్టడం చేత, మంత్రజపం కారణంగా పుట్టడం చేత జాతవేదుడవయ్యావు. వైశ్వానరుడనేవాడు శివుని దయచేత ఆగ్నేయమూలకి అధిపతి అయ్యావు. విశ్వానరుని పుత్రుడవు కాబట్టి నీవే వైశ్వానరుడవు. హోమంలో వేసిన ఆహుతులను హవ్యాలు అంటారు. వాటిని మోసుకొనిపోయి దేవతలకు అందిస్తావు కాబట్టి హవ్యవాహనుడ వయ్యావు. ఇంత గొప్పవాడివి ధర్మస్థాపనకోసం ధర్మరాజు రాజసూయం చేస్తుంటే ఆనందించవా! వరదా! అగ్నిహోత్రా! వాయుమిత్రా! వేదాలన్నీ నీమూలంగా లోకాన్ని పవిత్రం చేస్తున్నాయి. నీవే పవిత్రుడివి. నీవే యజ్ఞానివి. నీకివే నావందనాలు' ఇలా ప్రార్థించే సరికి పొంగిపోయాడు అగ్నిదేవుడు.

సైన్యాన్ని రక్షించాడు. అభయమిచ్చాడు. విషయం తెలిసి నీలుడు కూడా దాసుడయ్యాడు. ప్రేమతో గుఱ్ఱాల్ని, మదపుటేనుగుల్నీ, వస్త్రాలను, నానావిధ రత్నాభరణాల్ని తెచ్చి సహదేవుని పాదాల చెంత ఉంచి నమస్కరించాడు. కప్పం కట్టాడు. ధర్మజునికి సామంతుడనని అంగీకరించాడు.

అమ్మయ్య - సమస్య తీరింది. మాహిష్మతీపురాన్ని అలా జయించి, కప్పం గ్రహించి బయలుదేరాడు సహదేవుడు. రుక్మి, భీష్మక శూర్పారకాదులచే అపార సంపదలు పొందాడు. సముద్ర ద్వీపంలో ఉండే నిషాద, పురుషాదాదుల్ని ఇలా ఎందరెందరినో - అందరినీ వశపరచుకున్నాడు. దక్షిణ సముద్రతీర వనభూముల్లో దండు విడిసి తన అన్న కుమారుడు ఘటోత్కచుని తలచి రప్పించాడు. అతని ద్వారా లంకాధిపతి విభీషణునికి తన రాకను తెలియ పంపాడు. విభీషణుడు పాలించే లంకానగర సౌందర్యానికి ముగ్ధుడయ్యాడు ఘటోత్కచుడు. రామాయణంలో ఆంజనేయస్వామి లంకను చూచి పొందిన అనుభవం ఘటోత్కచునికి కలిగింది. విభీషణుని, అతని ధార్మిక చింతను చూచి పరవశించాడు. ఆయన అడిగితే ధర్మరాజు రాజసూయ యాగాన్ని గూర్చి వివరించాడు.

పాండవుల బలపరాక్రమాలను తెలియచేశాడు. సహదేవుడు నన్ను నీవద్దకు దూతగా పంపించాడు. నాపేరు ఘటోత్కచుడు. హిడింబి నా తల్లి. భీముడు నా తండ్రి. అర్జునుడు ఉత్తర దిక్కు జయించాడు. అలాగే భీముడు తూర్పు దిక్కు జయించాడు. నేను దక్షిణంగా వచ్చాను. అందగాడు నకులుడు పశ్చిమంగా వెళ్ళాడు. శ్రీకృష్ణభగవానుడే మాకందరికీ అండ-దండ. అందువల్ల నువ్వు కప్పంకట్టి ధర్మరాజు చక్రవర్తిత్వాన్ని అంగీకరించాలి అని చెప్పాడు. విభీషణునికి దివ్యానందం కలిగింది.

ఏనుగు అంబారీకి వీలయిన కంబళీలు, పరుపులు, బొంతల దగ్గరనుంచి ఏనుగుదంతాలతో చేసిన పాన్పులు, మణిమయాలంకృత స్వర్ణ హారాలు, బంగారం, మణులు పొదిగిన శస్త్రాలు, కలశాలు, యజ్ఞతోరణాల కుపయోగించే తాళాలు, పల్లకీలు, కిరీటాలు, కుండలాలు, బంగారు పుష్పాలు ఒకటేమిటి సంపదనంతా సమర్పించాడు. అంతేకాదు చందనం, అంగరు కొయ్య, పట్టు వస్త్రాలు- ఇంకా ఎన్నోవేల ఆభరణాలు తన పరివారినికిచ్చి సహదేవునికి సమర్పించి రమ్మని ఘటోత్కచునితో పంపించాడు. వారంతా బయలుదేరి వస్తోంటే చూచిన సైన్యం హడలి పోయింది. వారందరికీ విషయం వివరించి ధైర్యం కూర్చాడు ఘటోత్కచుడు. అతని సాహసం చూచి సహదేవుడు పులకించి కౌగలించుకొన్నాడు. నమస్కరించి సెలవు తీసుకొన్నాడు ఘటోత్కచుడు.

వేలకోట్ల విలువైన బంగారు ఆభరణాలతో రత్నరాసులతో, ధనాలతో వచ్చిన సహదేవుని చూచి ధర్మరాజు మురిసిపోయాడు. తండ్రీ! ఇలారా...! అంటూ బాహువులు చాచి కౌగలించుకున్నాడు.

నకులుడు పశ్చిమంగా బయలుదేరాడు. రోహితకమనే పర్వత ప్రాంతం చేరాడు. మత్తమయూరకులనే రాజులతో ఘోరసంగ్రామం జరిగింది. మరుభూమిని శాసించే ఆక్రోశుని జయించాడు. పుష్కరారణ్య నివాసులు ఉత్సవసంకేతలు అనే పేరున్న గణాలవారినందరినీ జయించాడు. పంచనద దేశాలు జయించాడు. శ్రీకృష్ణుని సమీపానికి దూతను పంపించాడు. కృష్ణుడు ప్రేమతో ఆశీర్వదించాడు. తన మేనమామ అయిన శల్యుని మాద్రదేశం చేరాడు. అతని ఆశీస్సులను పొంది సత్కరించబడ్డాడు. సముద్రమధ్యవాసులు, మ్లేచ్ఛులు, బర్బరులు, కిరాతులు, యవనులు ఇలా పశ్చిమదిశ నంతా గెలిచాడు.

పదివేల ఒంటెల మీద ధనాన్నంతా ఎక్కించి, మోయించుకుని అంతులేని సైన్యంతో ఇంద్రప్రస్థం బయలుదేరాడు. అన్న ధర్మరాజు పాదాలచెంత సర్వసమర్పణ చేసి దాసోహం చేశాడు. ధర్మరాజు కళ్ళలో ఆనందబాష్పాలు. సోదరుల విశ్వజిత్ యాత్రకి ఆనందం, గర్వం, ఆత్మవిశ్వాసం అతనిలో నిండి పోయాయి. ఒక్కసారి శ్రీకృష్ణుని తలచుకొని నమస్కరించాడు ధర్మరాజు. (సశేషం)


రుచికి, సువాసనకి, ఆరోగ్యానికి నాణ్యమైన
"అజంతా"
పసుపు, కారం, ధనియాలపొడి మరియు సేమియానే ఎల్లప్పుడు వాడండి
రవికుమార్ అండ్ కంపెని - చెన్నై
044 25204046, 26171341
Vijay Ads



www.mangalaakshatas.com
In commitment to help the people of spiritually inclined, we come up with the unique platform for 'Sri Vaishnava Community' to choose their life partner with an ideal mind set.
*With the Mangalasanams of*
"Sri SriSriTridandiChinnaSrimannarayanaRamanujaJeeyarSwamiji" we present you with 'mangalaakshatas' - A wedding platform for Sri Vaishnavas.
We are now open for free registrations. Please visit: www.mangalaakshatas.com

మీ జీవిత భాగస్వామికోసం ఎదురుచూస్తున్నారా?.. ఇదిగో మీ ముందుకు 'మంగళాక్షతలు'
మన ఆచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి
మంగళాశాసనములతో...! పై వెబ్‌సైట్‌లో రిజిస్టర్ చేసుకోండి!
విశిష్టాద్వైత పరంపర కొనసాగించడంకోసం ఓ చిన్ని ప్రయత్నం!



# శ్రీమద్భాగవతమాహాత్మ్యము



*గతసంచిక తరువాయి...*

శ్రీమాన్ నోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

## దుంధుకారి ప్రేతమగుట

ఆత్మదేవుడు అడవికి వెళ్ళిపోయిన తరువాత ఒకరోజు దుంధుకారి ఇంటికి వచ్చాడు. డబ్బుకోసం ఇల్లంతా కలియతిరిగాడు. ఎక్కడా డబ్బు దొరకలేదు. విపరీతమైన ఆవేశం వచ్చింది. ఒక కర్ర తీసుకుని తల్లి దుంధులిని తీవ్రంగా కొట్టాడు. "ధనం ఎక్కడుందో చెప్పు. చెప్పక పోతే నిన్ను ఈ కొరివితో కాల్చి చంపేస్తాను" అని గద్దించాడు. ఆతని మాటలకు చాల ఖిన్నురాలై దుంధులి అతని నుండి దూరంగా పరుగెత్తి ఒక బావిలో దూకి చనిపోయింది.

యోగ నిష్ఠుడైన గోకర్ణుడు అప్పుడు తీర్థయాత్రలకై బయలుదేరాడు. అతనికి ఈ సంఘటనల వలన దుఃఖంగాని, బాధగాని, కోపంగాని, కలుగలేదు. వాడికి ఎవ్వడూ శత్రువుకాడు, ఎవ్వడూ మిత్రుడు కాడు.

దుంధుకారుడు ఐదుగురు వేశ్యలను తెచ్చుకుని తనఇంట్లోనే నివసించడం మొదలుపెట్టాడు. వారినందరిని పోషించడానికి ఎంతటి పాపకర్మకైనా, క్రూరకర్మకైనా వెనుదీయక తన జీవితాన్ని సాగించడం మొదలుపెట్టాడు.

ఒకరోజు ఆ వేశ్యలు తమకు అందమైన ఆభరణాలు కావాలని కోరారు. అలాగే అని చెప్పి దుంధుకారుడు ఎన్నో ఆభరణాలు, అందమైన వస్త్రాలు, చాల ధనం తెచ్చియిచ్చాడు. అవి అన్నీ తీసుకున్న వేశ్యలు అందరూ దుంధుకారి ఇంట్లో లేనప్పుడు ఒకచోట సమావేశమయ్యారు. వాళ్ళల్లో వాళ్ళు ఇలా చెప్పుకున్నారు.

"దుంధుకారుడు రోజూ విచ్చలవిడిగా దొంగతనాలు చేసి డబ్బు, ఆభరణాలు, వస్త్రాలు తెచ్చి ఇస్తున్నాడు. ఇలా ఇతని ఆటలు ఎన్నోరోజులు సాగవు. ఏదో ఒకరోజు ఈతడు రాజుయొక్క సైనికులకు దొరికి తీరతాడు. వాళ్ళు వచ్చి మనలందరినీ చావగొట్టి వీడు తెచ్చిచ్చిన ఆభరణాలన్నీ లాక్కుపోతారు. మనకి కారాగారవాసం, వాడికి మరణశిక్ష పడుతుంది. అదంతా జరిగిందాకా ఆగడం కంటే మనమే వాణ్ణి రహస్యంగా చంపేసి ఈ నగలు డబ్బుతో పారిపోవడం ఉత్తమం" ఇలా ఆలోచించిన వేశ్యలందరూ దుంధుకారి నిద్రపోయేటప్పుడు వాణ్ణి గట్టిగా పట్టుకుని వాడి కాళ్ళు చేతులు మంచానికేసి తాళ్ళతో గట్టిగా కట్టేసారు. అందరూ కలసి వాడి మెడచుట్టూ తాడు బిగించి ఉరివేయడానికి శతథా ప్రయత్నించారు. అయినా వాడు చావలేదు. ఆ వేశ్యలందరూ వాడు చావలేదని చింతాక్రాంతులయి కూలబడ్డారు.

అప్పుడు మళ్ళీలేచి వంటింట్లో పొయ్యిలో ఉన్న నిప్పులన్నీ తెచ్చి వాడి ముఖంమీద పోసేసారు. వాడు ఆ అగ్నిజ్వాలలకి తట్టుకోలేక గిలగిల కొట్టుకుని మరణించాడు.

ఆ వేశ్యలందరూ వాడి శవాన్ని మోసుకునిపోయి దొడ్డిలో ఒకగొయ్యి తీసి వాణ్ణి పూడ్చిపెట్టారు. వారు చేసిన పని గుప్తంగానే ఉండిపోయి ఎవ్వరూ ఎరుగలేక పోయారు.

"మీ భర్త ఏమయ్యాడు" అని ఎవరైనా అడిగితే "మా ప్రియుడు మా కోసం చాలా ధనం తెస్తానని శపథం చేసి ఇతర దేశాలకు వెళ్ళిపోయాడు. ఒక సంవత్సరం లోగా తిరిగి వస్తానని చెప్పాడ"ని బొంకారు ఆ వేశ్యలు. అందువలన బుద్ధిమంతుడైన పురుషుడు ఎప్పుడు స్త్రీలను గుడ్డిగా నమ్మరాదు. అలా చేయనివాడు తప్పక కష్టాలపాలు కావలిసి వస్తుంది. స్త్రీల వాక్కులు అమృతంలా కాముకుల హృదయంలో రసాన్ని కలిగిస్తుంది. కాని స్త్రీల మనసు కత్తిలాగా పదునుగా ఉంటుంది, అని పురాణం వ్యాఖ్యానించింది.

ఆ వేశ్యలు దుంధుకారియొక్క సమస్త సంపదను సమానంగా పంచేసుకుని ఎవరి ద్రోవన వాళ్ళు వెళ్లిపోయారు. వారుఎందరో పతులుండే పడతులు. వారికి వచ్చిన బాధ ఏంలేదు. దుంధుకారి మాత్రం తన చెడునడత వలన చచ్చి భయంకరమైన ప్రేతం అయ్యాడు. వాడు సుడిగాలి రూపంలో అన్ని దిక్కుల్లో తిరుగుతూ ఉన్నాడు. ఆకలి దప్పులతో అలమటిస్తున్నాడు. "హా దైవమా! హా దైవమా! ఏమిటీ నాకీ దుర్గతి" అని అరుస్తున్నాడు. కాని వాడికి ఆశ్రయమిచ్చే నాథుడే లేడు.

### దుంధుకారుని ఉద్ధరించుట

అలా కొన్నిరోజులు గడిచిన తరువాత గోకర్ణుడికి దుంధుకారి మరణవార్త తెలిసింది. "అయ్యో! వాడు అనాథగా మరణించాడే!" అని జాలిపడి వాడికి తాను గయాశ్రాద్ధాన్ని పెట్టాడు. ఇంకా ఏఏ పుణ్యక్షేత్రాలు వెళ్ళాడో అక్కడంతా శ్రాద్ధకర్మలు జరిపించాడు. ఇలా తిరుగుతూ తిరుగుతూ తన గ్రామానికే వచ్చి, తన ఇంటిముందు ఉన్న అరుగుమీద విశ్రమించాడు.

అర్ధరాత్రివేళ అరుగుమీద పడుకున్న గోకర్ణుడికి ఏదో అలికిడి వినిపించింది. కళ్ళు తెరిచిచూచాడు. అతడికి ఒక భయంకర రూపం కనబడింది. అది చూస్తుండగానే ఒక గొర్రె రూపాన్ని పొందింది. దానిని చూసి గోకర్ణుడు ఆశ్చర్యపోయేంతలో అది ఏనుగు రూపాన్ని ధరించింది. అదే గేదె రూపంలో కనబడింది. ఒకసారి అది ఇంద్రరూపాన్ని పొందింది. మరోసారి అగ్నిలా కనబడింది. వాడు చివరకు ఒక మానవరూపం పొందాడు. వాడి యొక్క విపరీత అవస్థలను చూసి వీడెవ్వడో దుర్గతి చెందిన జీవుడై ఉండవచ్చు అని భావించి, కొంచెం ధైర్యం తెచ్చుకుని గోకర్ణుడు వాణ్ణి ఇలా అడిగాడు.

"ఎవరు నీవు? ఈ రాత్రివేళ నాకీ భయంకర రూపాలన్నీ ఎందుకు చూపిస్తున్నావు? నీకీ దశ ఎందుకు పట్టింది? నీవు ప్రేతానివా? పిశాచానివా? రాక్షసునివా? ఎవరు నీవు? చెప్పు". ఆ మాటలకు వాడు పెద్దగా ఏడవడం మొదలు పెట్టాడు. వాడికి మాట్లాడేశక్తి లేకపోయింది. దానికి గోకర్ణుడు జాలితో నీరు తీసుకుని మంత్రించి వాడిమీద జల్లాడు. దాని వలన వాడి పాపం కొంత ఉపశమించి వాడినుండి వాక్కు బయటకు వచ్చింది.

16

"గోకర్ణా! నేను నీ అన్నను, దుంధుకారిని. నేను నాదోషం వల్లనే బ్రాహ్మణత్వాన్ని పాడు చేసుకున్నాను. నేను చేసిన చెడ్డపనులకు లెక్కేలేదు. నేను గొప్ప అజ్ఞానంలో పడి ఉన్నాను. దీని వలన జనులను పెక్కువిధాలుగా పీడించాను. చివరకు నేను ఏ స్త్రీల మీద ప్రీతితో ఈ చెడ్డ పనులన్నీ చేసానో ఆ స్త్రీలే నన్ను హింసించి చంపివేసారు. అందు వలన నేను ఈ ప్రేతత్వాన్ని పొందాను. ఈ దుర్దశను అనుభవిస్తున్నాను. ఇన్నిరోజులకు దైవ వశమున నీవు దయచూడటం వలన నాకు వాయు భక్షణ సాధ్యమయ్యింది. తమ్ముడా! నీవు దయా సముద్రుడివి. ఏదో ఒకటి చేసి నన్ను ఈ ప్రేతత్వం నుండి విడిపించు దయ చూడు." అని దుంధుకారి ప్రాధేయపడ్డాడు.

"అన్నా! నీ కోసం గయాశ్రాద్ధం పెట్టాను. ఇంకా ఎన్నో పుణ్యక్షేత్రాలలో నీకు పిండప్రదానం చేసాను. ఇంకా నీకు ప్రేతత్వం వదలలేదా! ఆశ్చర్యంగా ఉందే!" అన్నాడు గోకర్ణుడు. కొంతసేపైన తరువాత మళ్ళీ గోకర్ణుడే మొదలు పెట్టాడు. "గయాశ్రాద్ధం వల్ల కూడా నీకు ముక్తి కలగలేదంటే మరి మనకి ఉపాయం ఏది లేదుకదా! నేనిప్పుడు ఇంకా ఏం చేయగలను.?"

అప్పుడు ప్రేతరూపంలో ఉన్న దుంధుకారి ఇలా అన్నాడు. "తమ్ముడూ! వందల కొలది గయాశ్రాద్ధాలు పెట్టినా నాకు ముక్తి కలుగదు. నేను చేసిన పాపాలటువంటివి. అందువలన మరేదైనా ఉపాయం ఆలోచించు".

"గయాశ్రాద్ధాలు కూడా నీకు ముక్తిని ప్రసాదించలేకపోతే ఇక నీకు ముక్తి దాదాపు అసంభవమే. అయినా ఫరవాలేదు. నీవు నావెంటనే తిరుగుతూ ఉండు. నీకు కావలసిన తరుణోపాయమేదో నేనే ఆలోచిస్తాను" అన్నాడు గోకర్ణుడు.

తెల్లవారింది. గోకర్ణుణ్ణి పలకరించడానికి ఊరి ప్రజలందరూ వచ్చారు. గోకర్ణుడు రాత్రి జరిగిందంతా వారందరికీ చెప్పాడు. వాళ్ళలో ఉన్న విద్వాంసులు, యోగులు, జ్ఞానులు, వేదపండితులు అందరూ శాస్త్రాలన్నీ తిరగేసారు. ఎవరికి ఏ తరుణోపాయము గోచరించలేదు. అప్పుడు గోకర్ణుడు తన తపోబలంతో సూర్యుణ్ణి ఆపి "ఈ జగత్తుకు సాక్షి అయిన సూర్యదేవా! నీకు నమస్కారము. నా అన్న దుంధుకారిని ఉద్ధరించడానికి మార్గం చెప్పు" అని వేడుకున్నాడు. దానికి సూర్యదేవుడు స్పష్టంగా ఇలా చెప్పాడు.

"శ్రీమద్భాగవతం వలన అతడికి ముక్తి లభిస్తుంది. కాబట్టి నీవు భాగవతాన్ని సప్తాహ పారాయణం చెయ్యి". ఆ సూర్యుడి మాటలు అక్కడ ఉన్న వారంతా విన్నారు." ఇది చాలా సరళమైన మార్గం. దీనిని నీవు చేసి చూపించు" అని అందరూ గోకర్ణుడిని ప్రోత్సహించారు. గోకర్ణుడు కూడా భాగవత సప్తాహానికి మనో నిశ్చయం చేసుకున్నాడు. *(సశేషం)*




**శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్**

పోతనామాత్యులవారి ఆంధ్రమహాభాగవతంలో ప్రతిపద్యం ఒక ఆణిముత్యం.

శ్రీకృష్ణుని స్తుతిస్తూ సాగిన ఈ పద్యం నిత్యజీవితంలో ప్రతిరోజూ పారాయణ చేసుకోదగిన పద్యరత్నం.

ఉత్పలమాల

**వారిజనాభ! భక్తజనవత్సల! దుష్టమదాసురేంద్ర సం**
**హార సరోరుహాసన పురారి ముఖామరవింద్యపాదపం**
**కేరుహ సర్వలోక పరికీర్తిత దివ్యమహాప్రభావ సం**
**సార విదూర నందతనుజాత రమాహృదయేశ మాధవ ॥**

సంసారచక్రంలో తలమునకలౌతున్న మనం సర్వకాల సర్వావస్థల లోనూ ప్రార్థించవలసిన పద్యమిది.

పద్మనాభా! భక్తజనులను ప్రేమతో ఆదరించే స్వామీ! దుష్టరాక్షస సంహారా! బ్రహ్మ, ఈశ్వరుడు, దేవేంద్రుడు మొదలైన దేవతాకోటిచేత నమస్కరింపబడే పాదపద్మాలుకల స్వామీ! సర్వలోకాలు నీకీర్తిని పొగడు తున్నాయి. దివ్యప్రభావ మహిమాన్వితుడవయ్యా నీవు. సంసారాన్ని దూరం చేయగల వాడివయ్యా నందకుమారా! శ్రీలక్ష్మీమనోహరా! మాధవా! నీకిదే వందనం.

దుష్టరాక్షస సంహారుడై, బ్రహ్మాది దేవతలచే కొలువబడు స్వామిని అన్ని లోకాలు కీర్తిస్తున్నాయి. మన సంసార బాధలను తొలగించ కలిగిన సామర్థ్యం ఆ స్వామి కొక్కనికే ఉంది. శ్రీకృష్ణా! నన్ను రక్షించు స్వామీ అంటూ ఆ దయామయుని ప్రార్థిద్దాం!

7 సం॥లలో CA/CWA లలో అత్యధిక ఆలిండియా ర్యాంకులు మరియు పాస్ పర్సెంటేజ్ సాధించిన
నెం.1 కామర్స్ విద్యా సంస్థ
ఆంధ్రప్రదేశ్‌లోనే అత్యుత్తమ ఉత్తీర్ణతతో పాటు ర్యాంకులు సాధిస్తున్న ఏకైక అగ్రగామి కామర్స్ విద్యా సంస్థ
2012 Jr.MEC లో స్టేట్ 1st RANK 490/500
K. VYSHNAVI
No.1 for ▸ Inter(MEC / CEC) ▸ CA/CWA
శ్రీMEDHA
Igniting Intelligence. Delivering Excellence.
Head Office: 6-9 Brodipet, Vuda Office Road, Guntur-2. Ph: 22 55 891 / 988 52 49166
Branch Office: Mogalrajpuram, VIJAYAWADA Ph:9248920266

# ముముక్షు రహస్యం

శ్రీమతి చక్రవర్తుల చూడామణి-ఖమ్మం

"అత్తయ్యా! నాకు చాలా రోజులుగా ఒక సందేహం!"

"సందేహాలుంటే నివృత్తి చేసుకోవటం మంచిది. ఇంతకీ ఏమిటి నీ సందేహం?"

"శ్రీవచనభూషణంలో..... **ఉపాయత్తుక్కు ప్రాట్టియైయుమ్, ద్రౌపతియైయుమ్, తిరుక్కణ్ణ మంగైయాండానైప్పోలే ఇమక్క వేండుమ్. ఉపేయత్తుక్కు ఇళయ పెరుమాళైయుమ్ పిళ్ళై తిరునరైయూర్ అరైయరైయుమ్, చింతయంతియైప్పోలే ఇరుక్క వేండుమ్"**

*(శ్రీవచనభూషణం - 80)*

అని చెప్పారు కదా! 'ప్రాట్టి' అంటే శ్రీదేవి కదా! ఆమెతో ద్రౌపదిని సమానం చేసి చెప్పారు కదా! అది ఎలా సాధ్యం?"

"మంచిప్రశ్నే వేశావు. భారతంలో ద్రౌపది, రామాయణంలో సీతాదేవి గురించి కొంచెం చర్చించుకుంటే నీ సందేహం తీరుతుంది."

"సరే, ముందు ద్రౌపది గురించి చెప్పదంత్తయ్యా!"

"ధర్మరాజు రాజసూయ యాగం చేసిన తరువాత ధర్మబద్ధంగా పరిపాలిస్తూ తమ్ముళ్ళు, తల్లి, ద్రౌపదితో కూడి సంతోషంగా ఉన్నాడు. అది దుర్యోధనుడిని అశాంతిపాలు చేసింది. దుష్టులు, ఎప్పుడూ తాము సంతోషంగా ఉండాలని కోరుకోరు. తమకు జయం కలగాలని కూడా అనుకోరు. అవతలి వారికి అపజయం కలగాలి. వాడు దుఃఖించాలి. అదే వీడికి అసలైన ఆనందం. దుర్యోధనుడు పాండవులను ఎలాగైనా రాజ్యభ్రష్టులను చేససి వాళ్ళు కష్టపడటం చూసి తాను ఆనందించాలని' అనుకున్నాడు. దానికోసం తన మేనమామ అయిన శకుని, మిత్రుడైన కర్ణునితో సమాలోచన చేశాడు.

"మహదాపది సంప్రాప్తే స్మర్తవ్యో భగవాన్ హరి" అన్న వసిష్టవాక్కు ననుసరించి.. **"శంఖ చక్ర గదాపాణే ద్వారకా నిలయాచ్యుతా! గోవింద! పుండరీకాక్ష! రక్షమాం శరణాగతామ్"** అని శ్రీకృష్ణుడిని ప్రార్థిస్తూ శరణాగతి చేసింది. మొదట స్త్రీ సహజమైన అభిజాత్యంతో తనను తాను రక్షించు కోవటానికి ప్రయత్నం చేసింది. అలవికాలేదు. ఆ శ్రీకృష్ణుడిమీద భారం వేసి రెండు చేతులెత్తి నమస్కారం చేస్తూ శరణాగతి చేసింది. మరుక్షణం ద్వారకావాసి అయిన శ్రీకృష్ణుడు అపారంగా వస్త్రం ఇచ్చి ద్రౌపదిని ఆపదనుండి రక్షించాడు. ఈ సంఘటన వలన ఏమర్థమయిందమ్మా కోడలా....?"

"పరమాత్మ రక్షకుడనే అధ్యసాయం ఉండాలి భక్తులకు. స్వప్రయత్నం మాని పరమాత్మను ఆశ్రయించటం అవశ్యం.

"పరమాత్మను పొందదానికి భక్తులు ఏ ఉపాయాల్ని అనుసరించాలి?"

"పరమాత్మ శ్రీచరణాలను పొందదానికి పరమాత్మే ఉపాయం. అంతేగా అత్తయ్యా...!"

"సరిగ్గా చెప్పావు. ఇప్పుడు శ్రీవచనభూషణంలోని చూర్ణికసారం సగం అర్థమయింది కదా! ఇక సీతమ్మవారి విషయం చూద్దాం. సీతమ్మ సాక్షాత్ మహాలక్ష్మి అంశ. దేవదేవి దివ్యమహిషి, అఖిల జగన్మాత. శివధనస్సును అతి పిన్నవయస్సులో అవలీలగా ఎత్తగలిగింది. ఆమెకు రావణుడొక లెక్కా? తన కష్టాన్ని నివృత్తి చేయగల ఉపాయం పరమాత్మ. ఆయనే వచ్చి రక్షించాలని ఓర్పు వహించింది. రాముడొచ్చేదాకా రావణచెరలో వేచి ఉంది సీతమ్మ. ద్రౌపది కూడా పరమాత్మనే ఉపాయంగా నమ్మి విశ్వసించినవారే అయినా ద్రౌపది కొంత స్వప్రయత్నం చేసిన తరువాత లజ్జను విడిచి రెండు చేతులెత్తి గోవిందుడిని ప్రార్థించింది.

అందుకే తిరుక్కోళూరమ్మాళ్ **"ఇరుకైయ్యుం విట్టేనో ద్రౌపదియైప్పోలే?"** అన్నది. "ద్రౌపదిలాగా రెండు చేతులూ విడిచి లజ్జను విడిచి పరమాత్మమీద మహావిశ్వాసం కలిగి ఉన్నానా?" అని ఆక్రోశించింది.

"పిన్నీ శ్రీవచనభూషణంలోని 81వ చూర్ణికలో 'ప్రాట్టిక్కుమ్, ద్రౌపదిక్కుమ్ వాసి శక్తియుమ్, అశక్తియుమ్' అని ఉంది కదా!

"మనం చెప్పుకున్నది కూడా అదేకదా వకుళా! సీతమ్మకు శక్తి ఉండి ఓర్పు వహించింది. అంటే తన శక్తిని వదిలివేసింది. ద్రౌపది తనను తాను కాపాడుకోలేని అశక్తురాలు. కాని గోవిందుడిని శరణాగతి చేయటం వలన తన అశక్తత తొలగిపోయి నిండుసభలో జరగబోయే అవమానం నుండి తప్పించబడింది. 82వ చూర్ణికలో ఇంకా వివరంగా ఉంటుంది.

'ప్రాట్టి స్వశక్తియై విట్టాళ్, ద్రౌపది లజ్జయై విట్టాళ్, తిరుకణ్ణమంగై ఆండాన్ స్వవ్యాపారతై విట్టాన్"

"ఇప్పుడర్థమయిందత్తయ్యా...!" *(సశేషం)*

VILAN V
Just face the world
Hot Cutes
vijay ads

తిరువరంగత్తముదనార్లు అనుగ్రహించిన ప్రపన్నగాయత్రి

# ఇరామానుశనూత్తన్దాది

గత సంచిక తరువాయి

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

### 31వ పాశురము

ఆందుగళ్ నాళ్ తింగళాయ్ నిగర్గ్ కాలమెల్లాం మనమే
ఈండు పల్‌యోనిగళ్ తోఱు ఉఱ్లల్వోమ్, ఇన్ఱోర్ ఎణ్ ఇన్ఱియే
కాణ్ తకు తోళ్ అణ్ణల్ తెన్ అత్తియూరర్ కఱ్లలిణైక్కీళ్
పూండ వన్బాళన్ ఇరామనుశనై ప్పొరున్దినమే ॥

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **మనమే** | = | ఓ మనస్సా! |
| **నాళ్ ఆయ్, తింగళ్ ఆయ్** | = | రోజులుగా, నెలలుగా |
| **ఆందుగళ్ ఆయ్** | = | సంవత్సరాలుగా... ఇలా |
| **నిగర్గ్ కాలం ఎల్లాం** | = | నడిచే కాలాలన్నింటిలో |
| **ఈండు పల్ యోనిగళ్ తోఱు** | = | అనేక సంఖ్యలలో, అనేక రీతుల జన్మలన్నింటిలో |
| **ఉఱ్లల్ వోమ్** | = | సంసారచక్రంలో క్రిందికి పైకి తిరుగుతున్న మనం |
| **ఇన్ఱు ఓర్ ఎణ్ ఇన్ఱియే** | = | ఈ రోజు ఏ ఆలోచన లేకపోయినా అకస్మాత్తుగా |
| **కాణ్ తకు తోళ్** | = | కన్నులారా సేవించే అందమైన బాహువులు కల |
| **అణ్ణల్** | = | స్వామి అయిన |
| **తెన్ అత్తియూరర్** | = | అందమైన హస్తిగిరిలోని వరదరాజ స్వామి యొక్క |
| **కఱ్లల్ ఇణైక్కీళ్** | = | శ్రీ చరణాలలో |
| **పూండ అన్బు ఆళన్** | = | భక్తి శ్రద్ధలు కలిగిన |
| **ఇరామానుశనై** | = | భగవద్రామానుజులను |
| పొరుందినమ్ | = | చేరకలిగాము. ఎంత భాగ్యవంతులం! |

**తాత్పర్యము:** ఓ మనసా! ఎంతకాలం ఇప్పటివరకు గడిచిందో మనకి తెలియదు. రోజులని, నెలలని, సంవత్సరాలని, యుగాలని ఇలా కాలం నడుస్తూంటే అబ్బా – **'పునరపి మరణం పునరపి జననం'** అన్నట్లు ఎన్ని జన్మలెత్తు తున్నామో కదా! ఎలా సంసారచక్రంలో తిరుగుతున్నామో కదా! ఈనాడు ఏం అదృష్టమో – అకస్మాత్తుగా భగవద్రామానుజుల శ్రీచరణాలు మనకి లభించాయి. మనం ఇలా లభిస్తాయని కలలో కూడా ఊహించలేదు. సుందరమైన బాహువులు కల శ్రీ కంచి వరదరాజ పెరుమాళ్ళను భక్తితో కొలిచిన శ్రీరామానుజుల శ్రీచరణాలు మనకి లభించడం ఎంత భాగ్యం! అని శ్రీ అముదనార్లు తమ మనస్సుతో ఆనందంగా చెప్పుకుంటున్నారు.

*******

### 32వ పాశురము

పొరుందియ తేశుమ్ పొఱైయుమ్ తిఱలుమ్ పుగఱ్లుమ్, నల్ల
తిరుందియ ఞానముమ్ శెల్వముమ్ శేరుం, శెఱు కలియాల్
వరుందియ ఞాలత్తై వణ్మైయినాల్ వందెడుత్తళిత్త
అరుందవన్, ఎంగళిరామానుశనై యడైపవర్కే!

**ప్రతిపదార్థము :**

| | |
|---|---|
| **శెఱుకలియాల్** | = ధర్మాన్ని నశింపచేసే కలిచేత |
| **వరుందియ** | = బాధపడుచున్న |
| **ఞాలత్తై** | = భూమిని |
| **వణ్మైయినాల్** | = తమ నిర్హేతుక కృపతో |
| **వందు ఎడుత్తు అళిత్త** | = వచ్చి, ఉద్ధరించి రక్షించినవారు |
| **అరుమ్ తవన్** | = శరణాగతి అనే అరుదైన తపస్సుచేసిన వారు |
| **ఎంగళ్** | = మాకు స్వామి అయిన |
| **ఇరామానుశనై** | = భగవద్రామానుజులను |
| **అడైపవర్కు** | = ఆశ్రయించిన వారికి |
| **పొరుందియ తేశుమ్** | = తమ స్వరూపమునకు తగిన తేజస్సు |
| **పొఱైయుమ్** | = క్షమా గుణము |
| **తిఱలుమ్** | = ఇంద్రియ జయమనే ఫలము |
| **పుగఱ్లుమ్** | = కీర్తి |
| **నల్లతిరువందియ** | = చక్కగా సరిదిద్దబడిన |
| **ఞానముమ్** | = జ్ఞానమును |
| **శెల్వముమ్** | = భక్తి అనే సంపద |
| **శేరుమ్** | = తామే స్వయంగా వచ్చి చేరుతాయి. |

**తాత్పర్యము :** భగవద్రామానుజులు నిర్హేతుక కృపతో జీవుల నుద్ధరించిన మహనీయులు. ధర్మాన్ని బాధించి, అధర్మాన్ని పెంచే కలి బారినుండి జీవకోటిని రక్షింప అవతరించిన కారుణ్యమూర్తి. అటువంటి రామానుజుల నాశ్రయిస్తే – అద్భుతమైన తేజస్సు మనలను వచ్చి చేరుతుంది. సహనం అనే అద్భుతగుణం వరిస్తుంది. ఇంద్రియ జయమనే లక్షణం అలవడుతుంది. కీర్తి పొందుతారు. జ్ఞాన భక్తి సంపదలు వాటంతట అవే వచ్చి చేరుతాయి.

మాకు ఆత్మగుణాలేవీ లేవే అని బాధపడనక్కరలేదు. రామానుజ పవిత్ర పాదాలను ఆశ్రయిస్తే తేజస్సు ఓర్పు, ఇంద్రియజయం, కీర్తి, జ్ఞానం, భక్తి మొదలైన గొప్ప గుణాలన్నీ వాటంతట అవే వచ్చి వరిస్తాయి అంటున్నారు అముదనార్.

*******

### 33వ పాశురము

**అడైయార్ కమలత్తు అలర్ మంగళ్ కేళ్వన్, కైయాళ్రి ఎన్నుమ్**
**పడైయోడు నాందకముమ్, పడర్ తండుమ్, ఒణ్ శార్ఙ్గ విల్లుమ్**
**పుడైయార్ పురిశంగముమ్, ఇన్దప్పూతలమ్ కాప్పతఱ్కెన్ఱు**
**ఇడైయే ఇరామానుశముని యాయిన ఇన్నిలత్తే!**

పంచాయుధాలు లోకరక్షణార్థం భగవద్రామానుజులను ఆశ్రయించాయి అనే విశేష విషయాన్ని అందిస్తున్నారీ పాశురంలో

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **అడై ఆర్ కమలత్తు అలర్ మకళ్** | = | ఒత్తుగా దళాలున్న తామరపూవులో అవతరించిన లక్ష్మీదేవికి |
| **కేళ్వన్** | = | ప్రియమైన భగవంతునియొక్క |
| **కై** | = | శ్రీహస్తంలో ప్రకాశిస్తున్న |
| **ఆఴిఎన్నుం పడైయోడు** | = | శ్రీ సుదర్శనం అనే దివ్యాయుధంలో |
| **నాందకముమ్** | = | నందకమనే ఖడ్గం |
| **పడర్ తండుమ్** | = | రక్షించడమే పనిగా కల గద |
| **ఒణ్ శార్ఙ్గం విల్లుమ్** | = | అందమైన శ్రీశార్ఙ్గమనే విల్లు |
| **పుడై ఆర్ పురి** | = | నిండైన నగగా విలసిల్లే శ్రీపాంచజన్య శంఖం ఈ ఐదు ఆయుధాలు. |
| **ఇంద పూతలమ్** | = | ఈ భూమిపై |
| **కాప్ప తఱ్కు ఎన్ఱు** | = | రక్షించడం కోసం |
| **ఇన్నిలత్తు** | = | ఈ భూమిపై |
| **ఇరామానుశముని** | | |
| **ఇడైయే ఆయిన** | = | రామానుజులనాశ్రయించి నిలచినవి. |

**తాత్పర్యము:** స్వామిపంచాయుధాలు రామానుజుల నాశ్రయించి నిలిచాయనే అద్భుత భావన ఈ పాశురంలో అందించారు అముదనార్.

| | |
|---|---|
| శ్రీ సుదర్శనమనే | చక్రము |
| నందకము అనే | ఖడ్గము |
| కౌమోదకి అనే | గద |
| శార్ఙ్గము అనే | విల్లు |

శ్రీపాంచజన్యము అనే శంఖము ఈ పంచాయుధాలు రామానుజులను ఆశ్రయించాయి. వారి ధర్మస్థాపనకు సహకరించాలని వచ్చి వారి నాశ్రయించాయి.

ఇంకొకలా కూడా చెప్పవచ్చు. ఈ భూమిని సంరక్షించడం కోసం పంచాయుధాలు భగవద్రామానుజులుగా అవతరించాయి. ఈ రెండు విధాల సమన్వయానికి సారాంశం ఒక్కటే!

పంచాయుధాల శక్తి భగవద్రామానుజరూపుదాల్చింది.

*******

### 34వ పాశురము

**నిలత్తై చ్చెఱుత్తుండుమ్ నీశ క్కలియై, నినైప్పరియ**
**పెలత్తై చ్చెఱుత్తుమ్ పిఱఙ్గియతిల్లై ఎన్ పెయ్ వినై తెన్**
**పులత్తిల్ పొఱిత్త వప్పుత్తక చ్చుమ్మై పొఱుక్కియ పిన్**
**నలత్తై ప్పొఱుత్తతు, ఇరామానుశన్ తన్ నయప్పుకళే !**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **నిలత్తై** | = | భూలోకాన్ని |
| **శెఱుత్తు ఉణ్ణుమ్** | = | బాధించి మ్రింగేసే |
| **నీశం కలియై** | = | నీచుడైన కలిపురుషునియొక్క |
| **నినైప్ప అరియ** | = | ఇంతింతని చెప్పలేని అంతులేని |
| **పెలత్తై** | = | పరాక్రమాన్ని |
| **శెఱుత్తుమ్** | = | నిరసించినా |
| **ఇరామానుశన్ తన్** | = | భగవద్రామానుజుల |
| **నయమ్ పుకఙ్** | = | కల్యాణగుణములు |
| **పిఱంగియతు ఇల్లై** | = | ప్రకాశించలేదు. (కలిపురుషుని అణచి వేయడం చేత రామానుజులకు కీర్తి రాలేదు. మరెలా వచ్చిందంటే) |
| **ఎన్ పెయ్ వినై** | = | నేను చేసిన పాపాలను |
| **తెన్ పులత్తిల్** | = | యమలోకంలో చిత్రగుప్తుడు |
| **పొఱిత్త** | = | వ్రాసిన |
| **అప్పుత్తకమ్** | = | ఆ పుస్తకాల కట్టలను |
| **పొఱుక్కియ పిన్** | = | బూడిద చేసిన తరువాత |
| **నలత్తై పొఱుత్తదు** | = | చక్కగా ఆ గుణాలు ప్రకాశించాయి. |

**తాత్పర్యము :** భగవద్రామానుజుల వద్ద ఎన్నో కల్యాణగుణాలున్నాయి కదా! అవి కలి ప్రభావాన్ని అణచివేయడం వలన ప్రకాశించలేదు. మరెప్పుడు ప్రకాశించాయి అంటే ... వినండి.

నేను అబ్బో.. ఎన్ని పాపాలు చేశానో.. వాటిని చిత్రగుప్తుడు పాపం ఎప్పటికప్పుడు వ్రాసుకుంటూనే ఉన్నాడు. ఒకటా రెండా.. పెద్ద పుస్తకమై పోయింది నా పాపాలమూట. నా అదృష్టం కొద్దీ నేను రామానుజుల శ్రీచరణాలను ఆశ్రయించాను. వారి దయ నాపై ప్రసరించింది. అంతే.. ఆ పాపాల పుస్తకం నాది.. కాలి బూడిద.. బూడిద అయిపోయింది. అదుగో.. అప్పుడండీ శ్రీరామానుజుల నిర్హేతుకకృప మొ॥ గుణాలు ప్రకాశించాయి. అప్పుడు వాటికి మంచి అవకాశం వచ్చింది. నావంటి పాపిష్టివానిని కూడా రామానుజులు కరుణించారు. కాబట్టి లోకులారా! శ్రీరామానుజుల పవిత్ర చరణాలను ఆశ్రయించండి. తరించండి. అంటున్నారు అముదనార్లు. *(సశేషం)*




*గత సంచిక తరువాయి*

ఇక్కడ మరొక ప్రశ్న. చేతనాచేతనాత్మకమైన ఈప్రపంచానికి పరమాత్మ ఒక్కడే అన్నిరకాల కారణం ఎలా అవుతాడు? అంటే దీనికి సమాధానాన్ని ఛాందోగ్య వచనం చెబుతున్నది. **"సదేవసౌమ్య ఇదమగ్రఆసీత్, ఏకమేవ అద్వితీయమ్"** ఓసౌమ్యుడా దేవమనుష్య పశుపక్షి వృక్షపర్వతాదులతో కూడిన ఈజగత్తు. అంటే ప్రాణవంతాలు, ప్రాణరహితాలు అయిన వస్తువులతో కూడిన ఈజగత్తు, అపూర్వంగా పుట్టలేదు. ఇది ఇలా ఏర్పడడానికి ముందుకూడా ఉంది. ఇలా ఏర్పడడానికి ముందున్న దశ ప్రళయదశ. ఆదశలో విడివిడిగా వస్తువులు ఏర్పడి ఏవస్తువుకావస్తువు వేరువేరు నామరూపాలు కలిగిలేదు. "సత్" అనిచెప్పబడే పరమాత్మతో చేరిఉండి విశేషనామరూప విభాగం లేకుండా ఉంది.

ఆదశలో కూడా చేతనాచేతనాలు రెండూ ఉన్నాయి. వాటిలో పరిణామం లేదు. రెండు ఒక ముద్దగా(సముదాయంగా) ఏర్పడి పరమాత్మ నుండి వేరుచేయరాని విధంగా సూక్ష్మంగా ఉన్నాయి. ఈదశలో ఈసూక్ష్మ తత్త్వాన్ని "తమస్" అని వేదం పేర్కొన్నది. తమస్ శబ్దానికి చీకటి అని లౌకికార్థం. చీకట్లో అన్ని వస్తువులున్నా విడివిడిగా తెలియనట్లుగా ప్రళయదశలో చేతనాచేతనాలు అన్నీ ఉన్నా సూక్ష్మంగా ఉండటం వల్ల తెలియబడవు. దీనినే అవ్యక్తదశ అని అంటారు. ఇలాంటి అవ్యక్త చేతనాచేతన సముదాయాన్ని అంటే తమస్సును శరీరంగా కలిగి పరమాత్మ ఉన్నాడు. ఈపరమాత్మయే సకలజగత్కారణమైనవాడు. కనుక పరమాత్మ కారణదశలో ఉన్నప్పుడు ఆపరమాత్మతోనే చేరిఉండి, చేతనాచేతనాలు, తాము, కారణాలుగానే చేరి ఉంటాయి. కనుకనే పరమాత్మ తాను కరణమై మళ్ళీ జగత్తును సృజించాలనుకున్నప్పుడు, తాన శరీరంగా ఉన్న తమస్సునే అంటే చేతనాచేతన సముదాయాన్నే, సూక్ష్మంగా ఉన్నదాన్ని తాను సంకల్పంచేసి చేతనాచేతనాల ద్వారానే ఈసమస్త జగత్తును స్థూలంగా సృజించాడు.

యథాపూర్వంగా ఈస్థూల ప్రపంచాన్ని కూడా తన శరీరంగానే కలిగి ఉంటాడు. దీన్ని(స్థూలంగా ప్రపంచాన్ని తయారు చేసిన దశను) కార్యతాదశ అంటారు. ఇలా పరమాత్మకు ఏర్పడిన కారణతాదశ, కార్యతాదశ అనే ఈరెండు ఈప్రపంచంగా ఏర్పడిన చేతనాచేతన వస్తువులకు కూడా తప్పదు. రెండు దశల్లోను పరమాత్మ వీటిలో తాను ప్రవేశించే ఉంటాడు. పరమాత్మ అంతర్యామిగా ప్రవేశించాడు అని. అంటే ఇది వరకు లేకుండ క్రొత్తగా ప్రవేశించాడు అని అర్థంకానేకాదు. అలా అంటే పరమాత్మకు అంతర్యామిత లేనిదశ అంగీకరింపవలసి వస్తుంది. అంతేకాదు పరమాత్మను అంతర్యామిగా కలిగి ఉండని దశ చేతనాచేతనాలకు ఉన్నదనికూడా అంగీకరింపవలసి వస్తుంది. దీనివల్ల చేతనా చేతనాలతో పరమాత్మకు గల సంబంధం అనిత్యం కావలసి వస్తుంది. ఇది వేదవిరుద్ధం, రామానుజ దర్శన విరుద్ధం. చేతనాచేతనాలను శరీరంగా కలిగి ఒకదశలో ఉన్నవాడు మరొకదశను స్వీకరిస్తున్నాడని అర్థం.

పరమాత్మ అంతర్యామిగా పృథివ్యాదులలో ప్రవేశించి ఉన్నాడని చెప్పిన మంత్రం ఏదీకూడా ఒకకాల నియమాన్ని చెప్పలేదు. సర్వకాల సర్వావస్థల్లోను పరమాత్మ అంతర్యామిగా ప్రవేశించి ఉంటాడనే వాటి అభిప్రాయం. **"యః పృథివ్యాం తిష్ఠన్, యస్యపృథివీ శరీరం"** అని ప్రారంభించి, అచేతన వస్తువుల్లో స్వామి ప్రవేశించి ఉన్న వైనాన్ని చెబుతూ **"యోవిజ్ఞానే తిష్ఠన్, యస్య విజ్ఞానం శరీరం" "య ఆత్మని తిష్ఠన్, యస్య ఆత్మా శరీరం"** ఇత్యాదిగా విజ్ఞానస్వరూపుడైన జీవునిలో అంతర్యామిగా ప్రవేశించి ఉన్నాడని వేరువేరుగా చెప్పినా, అచేతనాన్ని విడచి చేతనవస్తువు, చేతనాన్ని విడచి అచేతన వస్తువు వేరువేరుగా పరమాత్మకు శరీరాలై ఉన్నాయని అర్థం కానేకాదు.

సర్వదేశ సర్వకాల సర్వావస్థల్లోను చేతనాచేతనాలు రెంటిలోను పరమాత్మ సర్వదా ప్రవేశించి ఉన్నాడని ఈ రెండు సర్వదా పరమాత్మకు శరీరమేనని, అయితే చేతనా చేతనాలు రెండు ఒకే తత్త్వము కాదని చెప్పడానికి మాత్రమే ఆరెంటినీ వేరుగా నిర్దేశించడం జరిగిందని గ్రహించాలి.

**చేతనాచేతనాలు ఏదశలోనైనా పరమాత్మను విడచి ఉంటాయా? అసలు వీటికి అవిభక్త నామరూపం, విభక్తనామరూపం అనే స్థితులు ఎలా ఉంటాయి?**

పరమాత్మకు కారణావస్థ, కార్యావస్థ ఉన్నట్లే పరమాత్మకు శరీరమైన చేతనాచేతనాలకు కూడా పరమాత్మతో పాటే కారణావస్థా, కార్యావస్థలు ఏర్పడతాయని శాస్త్రం స్పష్టంగా చెబుతున్నది. దీన్ని గురించి మరికొంత తెలుసుకునే ప్రయత్నం చేద్దాం.

ఈ చేతనాచేతనప్రపంచానికి కారణతాదశ, కార్యతాదశ అని రెండు ఉన్నాయి. చేతనాచేతనాలు సూక్ష్మంగా ఉండే దశ కారణతాదశ. ఆదశలో కూడా అవి పరమాత్మకు శరీరంగానే అమరి ఉంటాయి. శరీరం అంటే పరమాత్మపై ఆధారపడి ఉంటూ, ఆయనకొరకే వినియోగింపబడుతూ, అయనచే నియమింపబడి, ధరింపబడి ఆయనకు **'శేషమై'** ఉండటమే. ఏవస్తువు మరొక వస్తువును అంటిపెట్టుకుని ఉంటూ దానికి మాత్రమే ఒక అతిశయాన్ని కలిగిస్తూ ఉంటుందో అది దానికి శేషమని అంటారు.

ఉదాహరణానికి ఒక కారు, అదికల యజమానునికి **"శేషం"**. ఎందువల్ల? ఆకారు ఆయజమానినే అంటిపెట్టుకుని ఉంటూ తన ఉనికి చేత ఆ యజమానికి ఒక అతిశయాన్ని కలిగిస్తూ ఉంటుంది కనుక. ఇలాగే ఒక సేవకుడు తన యజమానికి తన ఉనికి వల్ల ఒక అతిశయాన్ని కలుగచేస్తాడు కనుక ఆతనిని శేషుడు అంటారు. శ్రీమన్నారాయణునికి నిత్యము సేవచేస్తూ ఆయనకు ఒక అతిశయాన్ని కలిగించే అనంతుడు ఆదిశేషునిగా

కీర్తింపబడుతున్నాడు. శేష ధర్మానికి **ఆద్యుడు** అని అభిప్రాయం. ఇలా పరమాత్మకే వినియోగింపబడుతూ, నియమింపబడి, ధరింపబడే వస్తువు ఏదైనా ఆయనకు శషమే కనుక శరీరమే. ఈసమస్త చేతనాచేతనాత్మక ప్రపంచము పరమాత్మకు శరీరమే. ఇలా శరీరంగా ఉండే స్థితి చేతనాచేతనాలకు అంటే జీవకోటికి, జడమైన ప్రకృతి ద్రవ్యానికి అన్నీ అవస్థల్లోను ఉంటుంది. ఇప్పుడు మనం చెప్పుకున్న కారణతాదశలో కూడా చేతనాచేతనాలు పరమాత్మకు శరీరమే.

ఇక్కడ ఒక ప్రశ్న? ఈ దశలో అతి సూక్ష్మంగా ఉండే ఈ చేతనాచేతనాలకు నామరూపాలు ఉన్నాయా? లేవా? అని. ఈదశలో పరమాత్మతో అవిభక్తమైన సంబంధం ఉన్నదా లేదా? అని. ఈ దశలో కూడా చేతనాచేతనాలకు నామరూపాలు ఉన్నాయి. పరమాత్మతో అవిభజనీయ సంబంధమూ ఉంది. అయితే ఇక్కడ ఉన్న నామరూపాలు విభక్తములు కావు. అంటే వేరువేరుగా అనేకవస్తుభేదాలతో కూడినవికావు. సామాన్యమైన నామము, సామాన్యమైన రూపము తప్పనిసరిగా ఉండితీరాలి. లేకపోతే ఆదశలో వాటిని ఎలా వ్యవహరించాలి. నామరూపాలు లేకపోతే వ్యవహారం కుదరదుకదా! ఆ కారణతాదశలో కూడా సూక్ష్మంగా ఉన్న జీవులను జీవశబ్దంతోనే వ్యవహరిస్తున్నాం. ఆదశలోనూ అణుస్వరూపం ఉన్నదని వ్యవహరిస్తున్నాం. ఎందువల్ల? జీవులకు సామాన్యంగా ఉండేది అణుస్వరూపం. ఈ రూపం సూక్ష్మదశలో కూడా ఉంటుంది కదా. సామాన్యంగా చేతనులకు జీవులని పేరు. ఆత్మలు అని కూడా పేరు అని వెనుక చెప్పుకున్నాం. ఈ రెండుపేర్లు సూక్ష్మదశలో కూడా ఉంటాయి.

అలాగే ప్రకృతి ద్రవ్యం అనేక వస్తువులుగా విభక్తాలైన నామాలు, రూపాలు లేకపోయినా సామాన్యమైన ప్రకృతి అనే నామాన్ని తమస్సు అనే నామాన్ని సూక్ష్మరూపాన్ని తప్పనిసరిగా కలిగే ఉంటుంది. ఇలాంటి సూక్ష్మనామరూపాలుకల చేతనాచేతనాలను శరీరంగా కలిగిఉన్న పరమాత్మనే కారణబ్రహ్మం అంటాం. దీన్నిబట్టి తేలింది ఏమిటంటే, పరమాత్మ జగత్కారణము అని అన్నప్పుడు ఆయన సూక్ష్మచేతనాచేతనాలను తనకు శరీరంగా కలిగిఉండియే తాను కారణంగా చెప్పబడుతున్నాడు తప్ప, చేతనాచేతనాలను విడచి కేవలం తానొక్కడే కాదు. తానొక్కడే కారణం అంటే జగత్పరిణామం సాధ్యంకాదు. ఎందువల్లనంటే పరమాత్మకు సాక్షాత్తుగా పరిణామం లేదు. చేతనా చేతనాల ద్వారానే పరమాత్మ జగత్తుగా పరిణామాన్ని పొందుతాడు. ఇది రామానుజ దర్శనం.

ప్రకృత్యధికరణంలో భాష్యాన్ని వ్యాఖ్యానిస్తూ సుదర్శనసూరి, పరమాత్మకు **అద్వారక** పరిణామమా(సాక్షాత్తు పరిణామమా) లేక, **సద్వారక** పరిణామమా(అంటే చేతనాచేతనాలద్వారా పరిణామమా) అని చాలా విస్తారంగా విచారించి, పరమాత్మ, జగత్తునుద్దేశించి తానుకారణమై, సద్వారక పరిణామాన్నే పొందుతాడు తప్ప, అద్వారక పరిణామం కాదని నిష్కర్షించాడు. దీని అర్థం ఏమిటంటే, పరమాత్మ, జగత్కారణమై తానే జగత్తుగా ఉపాదాన కరణమైనాడని అన్నప్పటికీ, తాను ఎట్టిపరిణామాలను పొందక తనకు శరీరంగా ఉన్న చేతనా చేతనాలనే, తాను లోన ప్రవేశించి, వాటిలో క్షోభను కలిగించి, జగత్తుగా పరిణమింప జేస్తాడన్నమాట. కనుకనే విష్ణుపురాణంలోని ప్రారంభాధ్యాయంలో ప్రాకృతిక గుణాలు లేనివాడు అప్రమేయుడు, విశుద్ధుడు, అమల స్వభావుడైన పరమాత్మకు సర్గాది కర్తృత్వం ఎలా కుదురుతుంది? అని మైత్రేయుడు ప్రశ్నించాడు.

**నిర్గుణస్య అప్రమేయస్య శుద్ధస్యాప్యమలాత్మనః ।**

**కథం సర్గాది కర్తృత్వం బ్రహ్మణోఽభ్యుపగమ్యతే ॥** అని.

దీనికి సమాధానంగా పరాశరుడు ఇలా చెప్పాడు. ఈసృష్టిలోని పదార్థాలలో ఉన్న శక్తులు, మన బుద్ధిచే ఊహించడానికి వీలుకానివి. ఈశక్తులనే సర్గాది భావశక్తులు అని అంటారు. ఇవన్నీ ఆపరమాత్మకు చెందిన శక్తులేతప్ప వేరుకాదు.

**శక్తయఃసర్వభావానామ్ అచింత్యజ్ఞానగోచరాః ।**

**యతోఽతో బ్రహ్మణస్తాస్తు మంతవ్యా భావశక్తయః॥**అని సమాధానం చెప్పాడు.



### ఏప్రిల్ నెల మెదడుకు మేత సమాధానములు

1. లౌకిక, సామాజిక జీవనం; 2. ఉత్తర; 3. సువర్ణకుంచిక; 4.ఇంద్రుని స్నేహితుడు; 5. విష్వగశ్వుడు; 6. ధనంజయుడు; 7. జంబువు అనే వృక్షాన్ని బట్టి; 8. ఆత్మదేవుని భార్య పేరు; 9. ఆవు చెవులవంటి చెవులు ఉండడం వలన; 10.దధిభాండుడు; 11. నప్పిన్న ప్రియుడు శ్రీకృష్ణుడు; 12.2016-2017; 13. మూడు విధాలు. ఉపాదాన కారణం, నిమిత్తకారణం, సహకారి కారణం; 14. మానవజన్మ; 15. పంచమహాయజ్ఞాలు;16. మహాయోగి; 17.ఆకాశ రాజు; 18. వేగవతి; 19. సర్వప్రాణిసేవ; 20. మలేరియా.

మరింత విశాలంగా ... వినూత్నంగా....
ప్రత్యేక 1 గ్రామ్ జ్యూయలరీ కౌంటర్
కామధేను సిల్క్స్
బీసెంట్‌రోడ్, విజయవాడ-2. ఫోన్: 2574220

అదృష్ట రత్నాలు ధరించండి! అనుకున్నది సాధించండి!
శ్రీ సాయి
పవిత్ర డైమండ్స్
4/7, బ్రాడీపేట, ఖజానా జ్యూయలర్స్ ప్రక్కన, గుంటూరు. సెల్: 9246410099, ఫోన్ : 2262626.
బి/3, జైహింద్ కాంప్లెక్స్, గ్రౌండ్‌ఫ్లోర్, యాక్సిస్‌బ్యాంక్ ప్రక్కన, గవర్నర్‌పేట, విజయవాడ. సెల్ : 9246310099, ఫోన్ : 6665011.
సంపూర్ణ జ్యోతిష్యం చూడబడును
నాణ్యమైన జాతిరత్నాలు
జెమ్ టెస్టింగ్ ల్యాబ్
కెంపులు పచ్చల పూసలు
మంచి ముత్యములు, పగడములు
శివస్వరూపమైన రుద్రాక్షలు
స్పటికమాలలు
1 గ్రామ్ గోల్డ్ ఇమిటేషన్ జ్యూయలరి

ఈశ్లోకంలో భావశబ్దానికి, సృష్టిలోని వస్తువులని అర్థము. అవి చేతనాచేతనాలు. వాటిలోని శక్తులవల్లే ఈ సమస్త సృష్టి జరుగుతోంది. ఈశక్తులన్నీ పరమాత్మకే చెందినవి. ఇలా అనడం చేత పరమాత్మ, వెనుక విష్ణుపురాణం చెప్పినట్లు, విష్ణుశక్తి, క్షేత్రజ్ఞశక్తి, అవిద్యాకర్మశక్తులను మూడిటినీ తాను కలిగి ఉండి, అవిద్యా కర్మ శక్తిచే జీవశక్తిని ఆవరించి, సృష్టిఉన్ముఖంగా చేసి, విష్ణుశక్తితో తాను లోపల ప్రవేశించి సృష్టి ఏర్పడేలా చేస్తున్నాడని అవగతం అవుతున్నది. ఈసృష్టిప్రక్రియను వర్ణిస్తున్న విష్ణుపురాణం పరబ్రహ్మానికి పురుషుడు, వ్యక్తావ్యక్త ప్రకృతులు, కాలము, అనే రూపాలున్నాయని చెబుతూ పరమాత్మ యొక్క స్వస్వరూపం కంటే వేరుగానే పురుష ప్రకృతి రూపాలు ఆయనకే చెంది, ఆయనలో ఉన్నాయని చెబుతున్నది. అంతేకాదు సృజించాలని సంకల్పించినపుడు ఆ పరమాత్మ స్వసంకల్పంచేత ప్రకృతి పురుషులలో తాను ప్రవేశించి ఉండి, ప్రపంచంగా పరిణమింప చేస్తాడని విష్ణుపురాణం ప్రథమాశంలోని మూడవ అధ్యాయం స్పష్టపరిచింది. ఈప్రక్రియనే సుదర్శన సూరి స్వీకరించి, సద్వారక పరిణామాన్ని, తమ శ్రుత ప్రకాశికలో వివరించి చెప్పారు.

ఇది కారణతాదశకు చెందిన వ్యవస్థ. ఇక సూక్ష్మచేతనాచేతనాలు శరీరంగా కలిగి ఉన్న ఇలాంటి కారణమైన పరమాత్మయే తాను సంకల్పించి, **బహుస్యాంప్రజాయేయ** "అనేక విధములుగా అగుదును గాక. అందుకొరకు పుట్టుదునుగాక" అని తాను చేసిన సంకల్పానికి తగిన విధంగా, కారణతా దశలో, తననుండి వేరుచేయరానివిగా ఉన్న చేతనాచేతనాలను పరిణమింప చేసి, స్థూలాకృతిని కలుగచేస్తాడు. తాను లోపల పూర్వంనుండి ప్రవేశించి ఉంటూనే, జీవులకు స్థూల ప్రకృతితో సంబంధమును కలిగించి, దేవ మనుష్యాది ఆకృతులు కలిగేలాచేస్తాడు. విశేషనామరూపాలను కర్మానుగుణంగా విభజించి ఏర్పరుస్తాడు. ఇప్పుడు స్థూలంగా, నామరూప విభాగం స్పష్టంగా కలిగిఉన్న చేతనాచేతనాలను, తన శరీరంగా తననుండి వేరుచేయరాని విధంగా కలిగిఉండి, పరమాత్మ కార్యావస్థను పొందుతున్నాడు. ఈ దశలో పరమాత్మ స్థూలప్రపంచాన్ని శరీరంగా ధరించి ఉన్నాడన్న మాట. *(సశేషం)*

**మే 19 తేదీనుండి 23వ తేదీ వరకు** వాసుదాసాశ్రమము నడిగడ్డపాలెంలో **హనుమజ్జయంతి** సందర్భంగా శ్రీ ఆంజనేయస్వామివారికి లక్ష నాగవల్లీ దళార్చన విశేషంగ జరుగును.

***వివరములకు:*** **శ్రీవాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం, గుంటూరు జిల్లా - 522318**

**ఫోన్: 08644 276522, 9441065582, 9849741537, 97011 68704**

అడ్మిషన్లు జరుగుతున్నవి. త్వరపడండి

**జై శ్రీమన్నారాయణ!**

**శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి నేతృత్వంలో నిర్వహించే జీయర్ ఇంటిగ్రేటెడ్ వేదిక్ అకాడమీకి చెందినది**

**జీవాగురుకులము, క్రొత్త విద్యార్థులను ఆహ్వానిస్తోంది**

Reg.A.P. Govt

**ప్రస్తుతం 150 మంది విద్యార్థులకు వైదిక / లౌకిక విద్యలను బోధించే ఈ గురుకులంలో ఈ ఏడాది చేరడానికి రుచి, శ్రద్ధకల విద్యార్థులు అప్లికేషన్లు పెట్టుకోవచ్చు.**

**బోధనామాధ్యమం** - ఇంగ్లీషు & సంస్కృతం.
**బోధనాంశాలు** - వేద, వేదాంత శాస్త్రముల అధ్యయనం/లౌకికవిద్య
**అభ్యాస కాలం** - 10 సం॥లు
**అభ్యర్థి వయస్సు** - 8సం॥ నుండి 12సం॥ లోపు
**కనీస అర్హతలు** - ఇంగ్లీషు, తెలుగు చక్కగ చదువుట, వ్రాయుట. వైదికవేషంలో ఉండాలి.

**దరఖాస్తులు లభించుచోటు**

www.chinnajeeyar.org / jivagurukulam

or జీవా ప్రాంగణంలో కూడ లభిస్తాయి.

**మరిన్ని వివరాలకు సంప్రదించండి** 94415 83064/ 93462 62189/ 9704882707

**ఇతర వివరాలు**

- **అభ్యర్థి పూర్ణ ఆరోగ్యంతో చురుకుగ ఉండాలి. ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణులైతేనే మౌఖిక పరీక్షకు పిలుస్తారు. అందులో ఉత్తీర్ణులకే గురుకుల ప్రవేశం.**
- **4 వ సం॥ ఇంగ్లీషు మీడియంలో స్టేటుసిలబస్ 10వ తరగతికి పంపిస్తారు.**
- **2013-10వ తరగతి పబ్లిక్ పరీక్ష ఇచ్చిన 14మంది విద్యార్థులలో 12మంది ఫస్ట్‌క్లాస్‌లో ఉత్తీర్ణత. అత్యధిక 9.3 GPAను జీవాగురుకుల విద్యార్థులు సాధించారు.**

**JIVA, శ్రీరాంనగరం, ముచ్చింతల్, పాలమాకుల పోస్ట్ 509 325, శంషాబాద్, రంగారెడ్డి జిల్లా. ఆంధ్రప్రదేశ్**

*గమనిక:* **ఏవిషయంలోనైనా తుదినిర్ణయము గురుకుల యాజమాన్యానిదే.**



# శ్రీరామాయణంలో జంటలు

## భరత లక్ష్మణులు సోదరులు



వైశారది

శ్రీరాముని కేవలం సోదరునిగ మాత్రమే కాక పరమాత్మగ గుర్తించ గలిగిన జ్ఞాని భరతుడు. కనుకనే, ఆ పరతత్త్వాన్ని బాగా తెలిసిన వసిష్ఠుని **"ధర్మం వక్తుం ఇహ అర్హసి"** అంటూ ప్రార్థించాడు.

"కైకేయి కోరిన ప్రకారం రాజుగ పట్టాభిషిక్తుడవై అయోధ్యని పరిపాలించవలసిందే" అని నిర్బంధించవద్దని విలపించాడు సభామధ్యలో.

అందరితోపాటు తనని రాజుకమ్మంటున్న వసిష్ఠుని, కొంచెం గట్టిగానే నిలదీశాడు. "మిగిలిన వారంటే పామరులు. కానీ, ఆచార్య! వసిష్ఠా! మీకైతే పరిపూర్ణంగ రామతత్త్వం తెలుసు. వేదవేదాంత విద్వాంసునిగ, ఆచార్యునిగ, జీవుడు సదా పరతంత్రుడేనన్న జ్ఞానమూ ఉంది. అన్నీ తెలిసిన మీరుకూడా నన్ను స్వతంత్రునిగ ప్రవర్తించమనడం తగునా? అచేతనమైన "రాజ్యమూ, రామునిదే! జ్ఞానమున్నా నేనూ అచిత్‌వలె రామునికి పరతంత్రుడినే" రామునికే చెందిన వస్తువునే! ఒక వస్తువు, మరొక వస్తువుని ఎలా పరిపాలిస్తుంది? మీరే న్యాయం చెప్పండి" అని వసిష్ఠులవారిని ప్రార్థిస్తూ పారతంత్ర్య పరాకాష్ఠని ప్రదర్శించాడు భరతుడు.

ఇది అయోధ్యలో రాజసభలో జరిగిన సన్నివేశం... ఇలాంటివే మరొక సన్నివేశం. శ్రీరాముని అన్వేషిస్తూ సపరివారంగ వనానికి వెళ్ళినపుడు ఎదురవుతుంది.

భరతుని నిజ ఆంతర్యం తెలిసిన వెంటనే వసిష్ఠాది గురువులు, సుమంత్రాది మంత్రులు, ప్రజలు అంతా ఆనందంతో భరతుని వెంట శ్రీరామ సందర్శనార్థమై వనానికి బయలుదేరారు. గుహుని సహాయంతో గంగ దాటిన భరతుడు శ్రీరాముని జాడకై భరద్వాజ మహర్షిని ఆశ్రయిస్తాడు. భరద్వాజ మహర్షి, భరతుని పరివారాన్ని పరీక్షించదలచి తన తపశ్శక్తితో ఒక అద్భుతమైన విందు ఏర్పాటు చేశాడు.

ఆనాడు భరద్వాజ మహర్షి తాపసిక శక్తితో భరతునికి, ఆతని పరివారానికి వారి వారి స్థాయికి తగ్గట్లు వసతులని కూడా సిద్ధం చేశాడు. క్షణకాలంలో ఏర్పడిన వసతులు, అద్భుత ఆహారపదార్థాలను చూసి భరతుని వెంట వచ్చిన పరివారమంతా మోహపడిపోయారు. ఎక్కడనుండి బయలుదేరామో? ఏ పనిమీద బయలుదేరాము? అన్నీ మరచి ఆహారపు రుచులలో, విలాసాల మత్తులో మునిగిపోయి "అయోధ్యకీ వద్దు, అడవికీ వద్దు. ఇక్కడే ఆగిపోదాం" అన్నారు. అంతలా ఆకట్టుకొంది భరద్వాజమహర్షి విందు. తమ అస్తిత్వాన్ని కర్తవ్యాన్నే మరిచిపోయారంతా!

కానీ, భరతుడో, మహర్షి తనకోసం ఆ వనంలో నిర్మించిన రాజప్రాసాదం లాంటి తాత్కాలిక విడిది భవనంలోకి నిర్మలమైన నిశ్చలమైన మనసుతో ప్రవేశించాడు. అతనిని అనుసరించి, మంత్రులు పురోహితులు అంతా ఆ భవనశోభకి ముగ్ధులౌతూ ప్రవేశించారు.

ఆ భవనం మధ్యలో కొలువుదీరడానికి వీలుగా ఒక చక్కని సభామండపం ఉంది. ఆ మండపంలో రాజుగారు కూర్చోతగిన సింహాసనం, ఛత్ర చామరాది రాజలాంఛనాలతో అలంకృతమై ఉంది. మిగిలిన వారందరికీ కూడా వారి స్థాయికి తగ్గట్లుగా అలంకృతమైన ఆసనాలున్నాయి. అది అయోధ్యకాదు. భరద్వాజాశ్రమం. అది రాజసింహాసనం కాదు. భరద్వాజమహర్షి భరతుని గౌరవించడానికి ఏర్పాటు చేసినది. అయినప్పటికీ భరతుడు, ఏమాత్రం ఏమరుపాటుకు లోనుకాలేదంటారు... వాల్మీకి మహర్షి

**భరతో మంత్రిభిస్సాకం అభ్యవర్తత రాజవత్ ।**
**ఆసనం పూజయామాస రామాయాభి ప్రణమ్య చ**
**వాలవ్యజినమాదాయ న్యషీదత్ సచివాసనే..."** అయోధ్యకాండ 95

మంత్రులందరూ అనుసరిస్తుండగ, ఆ మండపంలోకి భరతుడు రావడం, రాజు ప్రవేశిస్తున్నట్లే ఉంది. కానీ, తీరా ఆసనం దగ్గరికి వచ్చేసరికి, భరతుడు అది రాజార్హం కనుక, తనకి రాజు రాముడే, దానిని అధిష్ఠించి ఉన్నట్లుగ భావించాడట. రాజైన శ్రీరాముని సింహాసనంగ దానిపై కూర్చొనే అధికారం తనకి లేదని తలచాడు. అది రాముని స్థానం కనుక, దానిని గౌరవించాడట. రాముడు దానిని అధిష్ఠించిన భావనతో అటు తిరిగి నమస్కరించాడు. అంతేకాదు, నిజంగా రాముడు వేంచేసి ఉంటే, దాసునిగ తన కర్తవ్యమేమిటో స్మరించి, వెంటనే చామరం ధరించి వీయడం మొదలు పెట్టాడట. ఆ తర్వాత మంత్రులకు తగిన ఆసనంలో తాను కూర్చున్నాడు. ఎంతటి అద్భుతభావన. ఏమి అనుబంధమో కదా! సోదరునిగ ప్రేమిస్తూనే, దాసునిగ పరిపూర్ణ భావనతో, పరోక్షంలో కూడా సేవించడం భరతునికే చెల్లింది. భరద్వాజ మహర్షి ఇదంతా తనని గౌరవించడం కోసమే చేసినా, భరతునిలో ఎక్కడా స్వతంత్ర భావనకాని, అహంకార ప్రవృత్తికాని మనం చూడం. ఇంతటి విందు, అంతటి మర్యాద మహర్షి చూపారంటే కారణం, తాము రాముని పరివారం గనుకనే అన్న సంబంధ జ్ఞానం మరువని జ్ఞాని భరతుడు.

భరద్వాజుడు తనని రాజుగ గుర్తించాలనుకున్నా, భరతుడు మాత్రం తనని రామదాసునిగనే, భావించాడు. రాముడు ఆజ్ఞ ఇచ్చేవాడు, తాను పాలించేవాడిని మాత్రమే అన్నట్లుగ మంత్రుల స్థానంలో కూర్చొన్నాడు. తన ఈ ప్రవర్తన ద్వారా భరద్వాజ మహర్షి మనసులోని సంశయాలన్నీ పటాపంచలు చేశాడు. అయోధ్యయైన అడవిలోనైనా ప్రత్యక్షంలోనైనా, పరోక్షంలోనైనా తన రారాజు రాముడే అన్నభావన వదలలేదు భరతుడు. రాజ్యంపై కాంక్ష, రాజుననే భావనా ఏకోశాన రానీయలేదతడు. జీవునికి సహజమైన పారతంత్ర్యనిష్ఠా గరిష్ఠుడు భరతుడు. *(సంశేషం)*

# శ్రీ కలివైరి సూరి వైభవము

**బృహత్సూక్తి - పెరియ తిరుమొழ్రి మొదటి పది పదవ దశకము - రెండవ పాశురము**

**శ్రీ ఉ.వే.శ్రీమాన్ కె. టి. రామానుజాచార్యస్వామి-నెల్లూరు**



**ఇలంగై ప్పతిక్కన్నిఱైయాయ వరక్కర్**
**కులంకెట్టవర్మాళ్ కొడి ప్పుళ్ తిరుత్తాయ్**
**విలంగుఱ్కుడిమి త్తిరువేంగడమ్ మేయ**
**అలంగల్ తుళవ ముడియాయరుళాయే ॥**

**ప్రతిపదార్థము:** **ఇలంగై పతిక్కు**=లంకాపట్టణమునకు; **ఇఱైయాయ**=రాజులైన; **అరక్కర్**=రాక్షసులయొక్క; **కులం**=కులము; **అన్ను**=అప్పుడు; **కెట్టు**=చెడి; **అవర్**=ఆ రాక్షసులు; **మాళ**=నశించునట్లు; **కొడి**= ధ్వజమైనటువంటి; **పుళ్**=గరుత్మంతుని; **తిరిత్తాయ్**=సంచరింప చేసినవాడా!; **విలంగళ్**=అడ్డగించుచున్న (చంద్రసూర్యుల గమనమును అడ్డగించుచున్న; **కుడిమి**=శిఖరములుగల; **తిరువేంగడమ్**=శ్రీ వేంకటాచలమున; **పేయ**=నిత్యవాసము చేయుచున్న; **తుళవమలంగళ్**=తులసీమాలికలు; **ముడియాయ్**=కిరీటమందు కలవాడా! **అరుళాయే**=కృపచేయుమా!

**తాత్పర్యము:** మునుపు లంకాపురికి రాజులైఉన్నట్టి మాలి, సుమాలి మున్నగు రాక్షసులందరు చెల్లా చెదరై నశించునట్లు గరుడధ్వజుడవై సంచరించినవాడా! ఆకాశమున చంద్రసూర్యులు తొలగిపోవునంత యెత్తైన శిఖరములుగల శ్రీ వేంకటాద్రిపై నిత్యవాసము చేయువాడా! తులసిమాలను కిరీటమున దాల్చిన స్వామి! నన్ను దయ చూడుమా!

**విశేషార్థము:** భగవంతుని చేరుకొనుటకు ప్రతిబంధకములగు విరోధులనన్నింటిని తొలగించు స్వభావము కలవాడు శ్రీవేంకటాచలపతి. తమ దుఃఖమును పోగొట్టవలెనని కలివైరిసూరి ఆ స్వామిని ఈ పాశురమున ప్రార్థించుచున్నారు. భగవంతుని ఆజ్ఞననుసరించి జీవుడు కర్మలను ప్రయోజనాంతర అపేక్షలేనివాడై నిష్కాముడై చేయవలసి యుండగా అనాదిగ తనకేర్పడిన అజ్ఞానము వలన జీవుడు ఫలాపేక్షతో కర్మలను ఆచరించును. ఆ విధముగ ఆచరించిన కర్మలను జీవుడు అనుభవింపక తప్పదు. అందువలన జీవునకు జనన మరణాదులు తప్పుటలేదు. ఈ విధముగ తమ జనన మరణాదులకు కారణమై అనాదిగ తమను వెన్నంటి వచ్చుచున్న కర్మలను సవాసనముగ తొలగించమని శ్రీ వేంకటాచలపతిని ఆళ్వార్లు ప్రార్థించుచున్నారు.

మనము ఈనాడు సందర్శించుకొనుచున్న శ్రీశేషాద్రివాసుడు ఒకనాడు శ్రీరామచంద్ర మూర్తిగ నవతరించి అసురుల నందరిని సంహరించిన మహనీయుడు. అసురులకు నిలయమైనది లంకానగరము.

లంకానగరము పాముపుట్టవంటిది. పుట్టలో ఎన్నెన్నో పాములు దాగియుండును. పుట్టపాములకు నివాసస్థలము. అటువంటిలంకా నగరము కేవలము రావణాసురునకు మాత్రమే నిలయమైనది కాదు. ఆతనికి మునుపున్న మాలి సుమాలి మున్నగువారికి కూడ నిలయమైనది. వారి నందరిని సంహరించినవాడు మన శ్రీ వేంకటాచలపతి. శ్రీ వేంకటాచలపతి పన్నగవాహనారూఢుడై గరుడధ్వజుడై పాతాళలోకమున దాగియున్న అసురవర్గ మంతటిని సంహరించినవాడు. ఆతని నిత్యనివాసము శ్రీ వేంకటగిరి. ఆ పర్వతముయొక్క ఔన్నత్యమును **"నిలంగళ్ కుడిమి"** అని ఆళ్వార్లు వర్ణించుచున్నారు.

శ్రీ వేంకటాచలముయొక్క శిఖరములు ఆకాశమున సంచరించు సూర్యచంద్రుల గమనమునకు అడ్డు తగులుచున్నవి. చంద్రసూర్యులు వానిని అతిక్రమించి పోలేక తామే ప్రక్కకు జరిగిపోవుచున్నారట. అంత ఎత్తైన శిఖరములు గలది శ్రీ వేంకటాద్రి.

తనను ఆశ్రయించిన వారిని రక్షించి తీరుతానని శ్రీ వరాహావతారమున **"అహం స్మరామి మద్భక్తం న యామి పరమాం గతిం"** అంతిమ సమయమున నా భక్తుని నేనే స్మరింతును. వానిని సద్గతికి తీసికొని పోయెదను అనియు,

శ్రీరామావతారమున **"అభయం సర్వభూతేభ్యో దదామ్యేతత్ వ్రతం మమ"** తనను శరణు వేడిన వానిని రక్షించుట తన వ్రతమనియు,

శ్రీకృష్ణావతారమున **''సర్వపాపేభ్యః మోక్షయిష్యామి''** తనను శరణువేడిన వానిని సర్వపాప విముక్తిని జేసెదనని పలికి ఆశ్రిత రక్షణ బాధ్యతను వహించిన ఓ శ్రీ వేంకటాచలపతి! నా దుఃఖనివృత్తి చేయుట నీవంతే! దానిని నేను ప్రార్థించనవసరములేదు. తులసీమాలలచే నలంకరింపబడిన కిరీటమును దాల్చిన శ్రీ శేషాద్రివాసా! నీ దయను నాపై ప్రసరింపజేయుమా! భగవంతుని దయ ప్రసరింపగనే మన అనాద్యవిద్యా కర్మవాసనలన్నియు సమూలముగ నశించి పోవుననుట సారాంశము. *(సశేషం)*

An.Y.
ఆర్థోఫిట్ సిరప్
అన్ని రకముల జాయింట్ నొప్పులకు
సరికొత్త పరిష్కారం
fiziken
సత్వర నివారణకు అద్భుత ఆయుర్వేద ఔషధం
Also available as Oil & Capsules
ఇది ఫిజికెమ్ వారి ప్రతిష్ఠాత్మక ఉత్పాదనలలో ఒకటి
ORTHO Fit
ఇంటింటా ఆర్థోఫిట్ నొప్పులన్నీ ఫటాఫట్

# అరచేతిలో... ఆరోగ్యం

విజయలక్ష్మి - హైదరాబాద్

**7. యూరినరి బ్లాడర్ (మూత్రాశయం) : ప్రెషర్ పాయింట్లు - 67**

*(కన్నుల కొలుకల నుండి తలపై నుండి మధ్యగా మెడక్రిందికి తర్వాత వెన్నుపూస ప్రక్కనుండి క్రిందివైపుకు వెళ్ళి మళ్ళీ వీపుపైదాకా క్రిందివరకు మార్గం)*

ఆస్తమా, క్షయవ్యాధి, కంటి సమస్యలు, ముఖపక్షవాతం, మూర్ఛపోవుట, పిచ్చితనం, ముక్కుదిబ్బడ, మాడునొప్పి, చెవుడు, ఎముకల సమస్యలు, ఆత్మహత్య చేసుకోవాలనిపించటం, మాట తడబాటు, బాడీ ఫ్లూయిడ్స్ కంట్రోలు, కాళ్ళు చేతులు వేడిగా ఉండడం, ఏమి తిన్నా వెంటనే కడుపునొప్పి, లివర్ వ్యాధులు, కడుపులో పుండ్లు, పొట్ట సాగుట, బ్లీడింగ్, పైల్స్, మోకాళ్ళ నొప్పులు, జననేంద్రియాల సమస్యలు.

**8. కిడ్నీ ఛానెల్ : (ప్రెజర్ పాయింట్లు) - 27)**

*(అరికాలు క్రింది నుండి మళ్ళీ పాదంపైన బ్రొటనవ్రేలు వైపునుండి మడమపైనుండి మోకాలుపై నుండి తొడ ముందు భాగం ద్వారా నాభి ప్రక్క నుండి ఛాతి పైభాగం వరకు మార్గం)*

తలకు సంబంధించిన తీవ్రసమస్యలు, మోకాళ్ళనొప్పులు, కటిభాగం సంబంధ అన్ని రకాల సమస్యలు, శరీరం రంగు తగ్గుట, అప్పుడే పుట్టిన బిడ్డకు పోలియో రావడం, పిల్లలు భయకంపితులు అవడం, అతినిద్ర, టెటనస్, మూత్రం ఆగిపోవడం, అతిగా రావడం, జననాంగ సమస్యలు, కాళ్ళు, చేతులు చల్లబడుట, పక్క తడపడం, దగ్గతోపాటు మూత్రం జారవిడుచుట, విమానం లేక రైలు ప్రయాణంలో వేగం వలన భయం కలుగుట, స్త్రీ నెలసరి సమస్యలు, శరీరంలో అనవసరపు వేడి, మాటిమాటికి గర్భస్రావాలు, హిస్టీరియా, థైరాయిడ్ సమస్యలు, రక్తంలో దోషాలు, నిద్రించినపుడు చెమట పట్టడం మరియు అధిక చెమట, ఆహారం వలన కాని, మందులవలన కాని విషయం కలిసిన తొలగించవచ్చును.



**9. పెరికార్డియమ్ (హృదయాన్ని ఆవరించి యున్న కవచం) (ప్రెషర్ పాయింట్లు - 9)**

*(భుజం ముందువైపు నుండి చేతిమీదుగా అరచేతి మధ్యనుండి మధ్యవ్రేలు గోరు చివరవరకు మార్గం)*

వెదదువనిని కంట్రోలు చేసేది హృదయం అయితే, రక్తప్రసరణని కంట్రోల్ చేసేది పెరికార్డియం. ఇది మనిషియొక్క జీన్స్‌ని నిల్వఉంచే రిజర్వాయర్. గుండెనొప్పి, నిద్రలేమి, గుండె ఎక్కువగా కొట్టుకోవడం, వాంతులు, కంటిచూపు మసకబారడం, భుజం నొప్పి, వయస్సు పైబడుతున్న లక్షణాలు కంట్రోలు చేయడం.

**10. ట్రిపుల్ వార్మర్ ఛానెల్ (ప్రెషర్‌పాయింట్లు - 23)**

*(అరచెయ్యి వెనుక ఉంగరపు వ్రేలు వెలుపల వైపునుండి బయలుదేరి భుజంవెనుక నుండి మెడ మీదుగా చెవి తమ్మె మొదలు చెవి చుట్టూ ఆపై కనుబొమ్మల చివరివరకు మార్గం)*

చెవికి సంబంధించిన అన్నిరకాల సమస్యలు, నాలుక మెలితిరగడం, థైరాయిడ్ అన్ని సమస్యలకు మాష్టరు పాయింట్లు ఉన్నవి ఈ మార్గంలో. ఆక్యుప్రెషర్ చికిత్సలో ఎప్పుడైనా రోగి కొన్ని సెకన్లు స్పృహతప్పిన ఈ ఛానెల్ పాయింట్లు ఉపయోగపడును.

**11. గాల్ బ్లాడర్ ఛానెల్ (ప్రెషర్ పాయింట్లు - 44)**

*(కంటిచివర నుండి మొదలయిన చెవి ద్వారా తలపైకి వెళుతూ మళ్ళీ మెడ వరకు అక్కడ నుండి కడుపు ప్రక్కటెముకల ద్వారా పిరుదుల ప్రక్కనుండి కాళ్ళ ద్వారా అరికాలు నాల్గవవ్రేలు గోరు క్రింది వరకు మార్గం).*

చెవుడు, కళ్ళు తిరగడం, కిడ్ని సమస్యలు, కటిభాగం నొప్పులు, మోకాళ్ళనొప్పులు, సయాటికా సమస్యలు. కాళ్ళల్లో పక్షవాతం, కఫదోషాలు, కాళ్ళు, చేతులు చల్లబడటం అన్ని రకాల వాతదోషాలు.


వ్యక్తిత్వ వికాసానికి ... నాణ్యమైన సాంకేతిక విద్యా బోధనకు

కళ్ళం హరనాథరెడ్డి ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ



శ్రీ కళ్ళం హరనాథరెడ్డి
ఛైర్మన్ : కళ్ళంగ్రూప్




బిటెక్ కోర్సులు
- కంప్యూటర్ సైన్స్ అండ్ ఇంజనీరింగ్(సియస్ఇ)
- ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ (ఇఇఇ)
- ఎలక్ట్రానిక్స్ అండ్ కమ్యునికేషన్స్ ఇంజనీరింగ్ (ఇసిఇ)
- సివిల్ ఇంజనీరింగ్ (సిఇ),
- మెకానికల్ ఇంజనీరింగ్ (ఎమ్ఇ)

M.Tech :- CSE

EAMCET Code KHIT

మేనేజ్‌మెంట్ సీట్స్ కొరకు సంప్రదించండి : సెల్ : 98856 04528, 94402 61773, 94910 73337.

NH- 5.10వ కి.మీ వద్ద, కళ్ళం స్పిన్నింగ్ మిల్స్ వెనుక, చిలకలూరిపేట రోడ్, చౌడవరం, గుంటూరు- 19. ఫోన్: 0863 2119726.
సిటీ ఆఫీస్: ఫస్ట్‌లైన్, గుజ్జనగుండ్ల సర్కిల్, గుంటూరు -6. ఫోన్: 0863 2272345.

# శ్రీవేంకటాచల "చిత్రే"తిహాసమాల

రచనం
రంగరామానుజాచార్య

11

చిత్రానువర్తనం
జి.వి.ఎస్. శ్రీనివాస్
కె. సత్య శ్రీనివాస్





వేంకటేశ్వరుడు శ్రీమన్నారాయణుడే అయితే, నాగాభరణాలు ఎందుకున్నాయి? అన్న ప్రశ్నకు గడచిన మాసంలో పురాణాగమప్రామాణ్యాన్ని చూపిస్తూ, స్వామి, నాగభూషణుడు కావడంలో ఆశ్చర్యమేమీ లేదని చెప్పుకున్నాం. దీని వెనుక ఒక స్థానిక చరిత్ర కూడా ఉందని వేంకటాచల ఇతిహాసమాల చెప్పింది. రామానుజులకు పూర్వకాలంలోనే జరిగిన చరిత్ర ఇక్కడ స్మరింపవలసి ఉంది. ఒకప్పుడు వీరనరసింహదేవుడనే పేరుగల 'గజపతి' ప్రభువు, రామేశ్వరాన్ని (సేతువు)ను దర్శించి వస్తూ తిరుమలక్షేత్రానికి వచ్చి, అక్కడ స్వామికి ఏదైనా కైంకర్యాన్ని సమర్పించుకోవాలని అనుకున్నాడు. అప్పుడు విద్వాంసులు, "భూషణానాం కిరీటశ్చ..." అని ఆగమశాస్త్రంలో చెప్పబడినరీతిలో 'గోపురాణాం విమానశ్చ' అని, స్వామివైభవానికి దీటుగా గోపురనిర్మాణం చేయమని బోధించారు. వారి ఆదేశాన్నిబట్టి గోపురనిర్మాణం ప్రారంభంకాగా, పర్వతరూపుడైన శేషుడు భారాన్ని సహించలేక, ఒకపాముగా, స్వామిసన్నిధికి చేరి చేతిని చుట్టుకున్నట్లు కలగన్నాడు నరసింహదేవుడు. దీని తాత్పర్యం ఏమిటని చర్చించి, వెంటనే గోపురనిర్మాణాన్ని ఆపివేసి, స్వామికి నాగాభరణాన్ని చేయించి అలంకరింపచేశాడు. ఆనాటి నుండి, ఒక చేతికి మాత్రమే నాగాభరణం ఉంది.





అయితే, పూర్వమే పద్మావతీ పరిణయఘట్టంలో అల్లునికి మామగారు సమర్పించిన రెండు నాగాభరణాలు కాలాంతరంలో మరుగైపోగా రామానుజులకాలానికి నరసింహదేవుడు సమర్పించిన ఒక ఆభరణం మాత్రమే మిగిలింది. దీన్ని గమనించారు రామానుజులు. స్వామిచేతికి ఒకదానికి మాత్రమే నాగాభరణం ఉండటానికిగల చరిత్రను గమనించారు సాకల్యంగా. భగవద్రామానుజులు ఈ వృత్తాన్తాన్ని విన్నారు. ఆకాశరాజు సమర్పించిన నాగాభరణాలు మాయమైనాయి. వీర నరసింహగజపతి సమర్పించిన నాగాభరణం ఒకటి మాత్రమే స్వామి భుజానికి ఉంది. రెండవ భుజం ఆభరణశూన్యంగా ఉండరాదని, ఆనాటి ప్రభువును ఆదేశించి రెండవ నాగాభరణాన్ని శ్రీమద్రానుజులే చేయించి, స్వయంగా సమర్పించారు. ఈవిధంగా ఒకటి నరసింహదేవుడు, రెండవది రామానుజులు సమర్పింపగా ఇప్పుడు రెండు భుజాలకు రెండు నాగాభరణాలు ధరించి స్వామి అలరారుతున్నాడని ఇతిహాసమాల చెప్పింది.

పురాణాగమాలలో ఉన్న వైనానికి అవిరుద్ధంగానే స్వామికి నాగాభరణాలు అమరి ఉన్నాయని, పూర్వవైభవానికి హాని కలుగరాదని నాగాభరణం సమర్పణంచేశారు రామానుజులని ఇతిహాసమాల చెప్పింది. దీన్నిబట్టి నాగాభరణాలు ధరించినంతమాత్రంచేత శ్రీనివాసుడు వేరొకదేవత ఎంతమాత్రం కాదని వేంకటాచలేతిహాసమాల నిష్కర్షించింది.



చిత్రకథ-30

# రామానుజ చిత్రకథ



నిజం యతిరాజా! సద్గ్రంధపరిశీలనలో
కూరేశులు మీకు తోడుంటే...






ఈ అమృతఫల రసాలు లోకాలను ఉజ్జీవింపజేస్తాయి




ఆహా! వరదరాజస్వామి ఆమోదాన్ని అందిస్తున్నాడు.
చూసారా!

యతిరాజా! శాస్త్రకోవిదులైన కూరేశులకి,
ఉత్తముడైన దాశరథికి సద్గ్రంధాధ్యయనం
ప్రారంభించండి.

మేముసిద్ధము


మేముసిద్ధము. ప్రమాణగ్రంథాధ్యయనం
వైదిక ధర్మానికి ఊపిరి.


మీరంగీకరిస్తే రేపే ప్రారంభిద్దాం


ఆమాయన్తు బ్రహ్మచారిణ స్సాహా ।
యశోజనేసాని స్వాహా




భద్రంకర్ణేభిఃశ్రుణుయామదేవాః'

# విజయకీలాద్రి శ్రీవేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవ విశేషాలు సీతానగరం





1. శ్రీభూ సమేత శ్రీవేంకటేశ్వర పెరుమాళ్
2. శేషవాహనాధిరూఢుడైన శ్రీవేంకటేశ్వరుడు
3. గరుడవాహనంపై స్వామిని ఊరేగిస్తున్న భక్తులు, ఆశ్రమ నిర్వాహకులు
4. హంసవాహనంపై వేంచేసి, భక్తులను అనుగ్రహిస్తున్న పెరుమాళ్
5. తిరుక్కళ్యాణాన్ని కనులవిందుగా అందిస్తున్న స్వాములు, అనువదిస్తున్న శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు
















1. తిరుమంజనాన్ని సమర్పిస్తున్న స్వాములు, తిలకిస్తున్న భక్తులు, విశేషాలను అనుగ్రహిస్తున్న శ్రీశ్రీశ్రీ జీయర్‌స్వామివారు.
2. తిరువీధిలో భక్తజనగోష్ఠి, 3. నృత్యాలు, 4. కోలాటాలు
5. సీతానగరవాసులందరికీ తదీయారాధన








SERVOMAX INDIA LIMITED
AN ISO - 9001:2008, ISO - 14001:2004 & BS OHSAS - 18001:2007 CERTIFIED COMPANY




Safe Power
Saves Power




Power Saver

- Exports to 26 Countries
- Over 1 Lakh Installations
- Pan India Operations
- Manufacturers of India's Highest Capacity Auto Transformers

Green Energy & ESCO
Complete Solutions for Grid Connected or Off Connected


Solar Panels


Inverters


Batteries


Solar UPS


Solar Lamps


Solar Street Lights


Bharat Ratna Dr. M Visvesvaraya Industrial Award-2008 Best Performance in Small Scale Sector


Rajiv Gandhi National Quality Award - 2007


A.P Best Entrepreneur Award - 2009


CITD Industrial Trade Achievement Award - 2006

Our Products
- Power Conditioners
- Servo Voltage Stabilizer (HT / LT)
- Power Savers
- Ultra Isolation Transformers
- Distribution & Power Transformers

SERVOMAX INDIA LIMITED
# 406, Meridian Plaza, Ameerpet Hyderabad - 500 016. A.P. INDIA.
Ph: +91 40 4050 9999 / 9900

admin@servomax.net
www.servomax.net

*With Best Compliments from*








# KAKATIYA CEMENT

**Quality Always - Ahead**

53 Grade Cement &
White Crystal Sugar

**Sri P. VENKATESWARLU**
Chairman & Managing Director

## KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED

*Regd. Office :* 1-10-140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
©:27637717, 27633627, Fax No : 040 - 27630172, E-mail : kcsil@sol.net.in
E-mail: info@kakatiyacements.com

*Cement Factory :*
Srinivasanagar, Jaggaiahpet,
Krishna Dist - 521 175
© 08654 - 200014
Fax No: 08654-296331

*Sugar Factory :*
Peruvancha Village, Kallur Mandal,
Khammam Dist - 507 209,
©: 08761 - 287207
Fax No: 08761 - 287206




ఓ యదుమహారాజా! ప్రతిజీవికి పుట్టుక సుఖదుఃఖాది అనుభవము ప్రారబ్ధం వల్లనే కలుగుతాయి. ఎన్నో జన్మలుగా మనం చేసిన కర్మలు అన్నీ ఒకచోట సంచిత కర్మగా పేరుకు పోతుంటాయి. అలా ఉన్నదానిలోంచి ప్రస్తుతం మనకి ఉన్న ఈ శరీరం, ఈ జీవితంలో సుఖదుఃఖములు కలిగించడానికి భగవంతుడు నిర్ణయించిన కర్మని ప్రారబ్ధకర్మ అంటారు. అనుభవించడానికి ఆరంభమైన కర్మ అని అర్థం. మిగిలిన కర్మలన్నీ సంచితంగ, Fixed depositలా అలా పడి ఉంటాయి. ఇప్పుడు లభించిన ఈ శరీరంతో, చేసే కొత్త కర్మలవలన ఏర్పడే పుణ్యపాపాలు భవిష్యత్‌లో అనుభవించడానికి సిద్ధంగా ఉంటాయి. కనుక వాటిని ఆగామి కర్మలు అంటారు.

ప్రతిజీవి సుఖాన్ని, దుఃఖాన్ని రెంటినీ అనుభవించడం మనం లోకంలో గమనిస్తూనే ఉన్నాం! అందరం సుఖమూ, ఆనందమే కావాలి అని కోరుకుంటుంటాం! ఎంత వద్దని అనుకున్నా ప్రతి ఒక్కరికీ దుఃఖానుభవాలు ఎదురవుతూనే ఉన్నాయి. కారణం ప్రారబ్ధకర్మే! అలా అని అన్ని దుఃఖాలేనా అంటే కాదు. సుఖానుభవాలు వస్తూనే ఉంటాయి. అవీ ప్రారబ్ధం చేతనే సుమా!

ఈ లోకంలో సుఖం కష్టపడితేనే వస్తుంది. అందులో దుఃఖం కూడా కలసి ఉంటుంది. హాయిగ స్వర్గలోకం చేరితే అంతా సుఖమే అనుకోవడానికీ వీల్లేదు. అక్కడ కూడా ప్రారబ్ధకర్మ మనవెంటే ఉంటుంది. ఇంద్రుడంతటివాడు, స్వర్గసుఖాలకి అధిపతియైనవాడు కూడా రాక్షసపీడతో బాధపడడం ప్రారబ్ధ ప్రభావమే!

అలానే దుఃఖాలకి, శిక్షలకి నిలయమనుకునే నరకంలో కూడా పుణ్యరూప ప్రారబ్ధకర్మ వలన అన్నపానాదులు అనుభవిస్తూ కాస్త సుఖాన్ని పొందడమూ ఉంటుంది. ఏతావతా మనకున్న ఈ శరీరమూ, ఇంద్రియాల వలన కలిగే సుఖదుఃఖాది అనుభవాలన్నీ కేవలం పుణ్య పాప రూప ప్రారబ్ధకర్మవల్లనే! మనం ఔనన్నా కాదన్నా వచ్చిపడుతున్నాయి.

ఇది గుర్తించగలిగిన జ్ఞానులు కర్మవశాన వచ్చిపోయే దుఃఖాలని వద్దనుకున్నట్లే, పుణ్యం ఉన్నంతసేపే లభించే తాత్కాలిక సుఖాలని, స్వర్గ భోగాలనీ కూడా అశాశ్వతాలు, అస్థిరాలు కనుక వద్దనుకుంటారు. శాశ్వత ఆనంద ప్రదమైన మోక్షస్థానంపై దృష్టి పెట్టి ప్రారబ్ధవశాన లభించిన ఈ దేహాన్ని ముక్తిమార్గంలో ప్రవేశించేందుకు తగిన సాధనంగ మలచుకుంటారు. ఇలాంటి వారికి సంచిత ఆగామి కర్మలు అంటకుండా పరమాత్మే అనుగ్రహిస్తాడు. కానీ, ప్రారబ్ధం మాత్రం అనుభవించక తప్పదు.

ఓ యదుమహారాజా! సుఖదుఃఖాది నిరపేక్షతో ముక్తి సాధనకై అరణ్యంలో సంచరిస్తున్న నాకు, ప్రారబ్ధకర్మ తీరేవరకు ఈ దేహయాత్ర ఎలా జరపాలన్న కనువిప్పు ఒక అజగరాన్ని (కొండచిలువను) చూస్తే కలిగిందయ్యా! ఆ కొండచిలువ నేర్పిన పాఠమేమిటో చెప్తా విను.

"కొండచిలువ ఒకచోటనే కదలకపడి ఉంటుంది. ఏదైనా ఆహారం తన దగ్గరికి వస్తే టక్కున నోటవేసుకుంటుంది. రాకుంటే పస్తుంటుంది. దైవికంగ స్వప్రయత్నం లేకుండా లభించిన ఆహారంతో సంతుష్టి చెందిన కొండచిలువ, ఇతర వ్యాపారాలేమీ లేకుండా కదలక ఉంటుంది.

దానిని చూసి నేను గ్రహించానయ్యా! మోక్షార్థియైన జ్ఞాని, చిట్టచివరి కర్మ తీరేవరకు కూడా ఈ శరీరంలోనే ఉండాల్సి వచ్చినప్పుడు, కొండచిలువలాగ ప్రవర్తించాలి. శరీరధారణకి అవసరమైన ఆహారం కోసం తాను ప్రయత్నించరాదు. దైవవశాత్, అప్రయత్నంగ లభించిన ఆహారంతో సంతుష్టి చెందాలి. అలా లభించిన ఆహారం, రుచికరమైనదా, రసహీనమైనదా అన్న ప్రశంసే ఉండకూడదు. ఒకరోజు ఎక్కువ, మరొకరోజు తక్కువ ఆహారం లభించవచ్చు. ఒక్కొక్కరోజు ఆహారమే లభించకపోవచ్చు. ఏది లభిస్తే అది, ఎంత లభిస్తే అంత, అసలేమీ దొరకకున్నా, ఆనాటికి భగవంతుడు తన ప్రారబ్ధంలో అంతే రాసిపెట్టాడని అంగీకరించగలగాలి. అంతేకాని, ఆహారసముపార్జన కోసం ప్రయత్నించకూడదు.

ఇతర వ్యాపారాలన్నీ కట్టిపెట్టి, లభించిన ఆహారం తింటూ కొండచిలువలా పడి ఉండడమంటే, బద్ధకంగా కదలక పడి ఉండడమని అర్థం కాదు. ఇది సామాన్యులు చేసుకునే అపార్థం.

ముముక్షువులైన ధీమాన్యులు ప్రతిక్షణం భగవంతుని స్మరణలో లగ్నమై ఉంటారు. కనుకనే, దేహపోషణకి కూడా స్వప్రయత్నం లేక భగవంతునిపైనే నిర్భరులై ఉంటారు. ప్రారబ్ధానుసారం తమకు చెందాల్సింది భగవంతుడు అనుగ్రహించి తీరతాడన్న విశ్వాసంతో ఉండాలి. లభించని నాడు, భగవదేచ్ఛగా భావించి ఆ సమయాన్ని భగవత్స్మరణలోనే గడుపుతూ ఉపవసించి ఉండాలి. ఎన్నిరోజులైనా అలానే గడపాలి. తత్త్వదర్శనంలోనే ఏకాగ్రచిత్తులై ఉండాలి, అన్నపాఠం కదలక మెదలక పడి ఉన్న కొండచిలువను చూస్తే స్ఫురించింది.

శరీరమంటూ ఉన్నాక ఏ స్వప్రయత్నం లేకుండా పడి ఉండడం అంటే, ఇంద్రియాలకి బలం లేకనో, శరీరంలో అవయవాలు పట్టుతప్పడం వల్లనో అనిపించవచ్చు. కానీ, అది నిజంకాదు. కొండచిలువ తన శరీరంతో చుట్టి ఎంతటి పెద్దజీవినైనా నశింపచేయగలదు. కానీ, ప్రయత్నించదు. అలానే సాధకులు, ఇంద్రియబలం, దేహదారుఢ్యం కలిగి ఉండి కూడా మనో నిగ్రహంతో ఎదురుగా విషయాలు కన్పిస్తున్నా ఆ శక్తిని దైవపరంగా మళ్ళించాలే తప్ప, భౌతిక అవసరాలు, సుఖాలకోసం వినియోగించరాదు. ఇంద్రియ ప్రవృత్తులన్నీ భగవత్పరంగా చేయడంలోనే ఏకాగ్రులై రాత్రిపగలు గడపాలి. ప్రారబ్ధానుసారం లభించిన ఆయువు ఉన్నంతవరకు ఏ జ్ఞాని అయితే ఇలా అజగరవృత్తి అవలంబించి, దైహిక సుఖాలకై ప్రాకులాడక, భగవద్దర్శనానికై భగదనుభూతికై ఏకాగ్రచిత్తుడై సాధనచేస్తాడో, ఆ జీవి ప్రారబ్ధం పూర్తి చేసుకొని ముక్తిమార్గంలో ప్రవేశిస్తాడు.

ఓ యదుమహారాజా! అరణ్యంలో ఉండే ఒక జీవి అయిన ఈ అజగరం వేదారణ్యాల్లో విహరించే పరమాత్మ తత్త్వాన్ని చేరే సాధనమార్గాన్ని చూపిందయ్యా! దైవానుగ్రహంతో ఈ అజగరం నుండి నేర్చిన పాఠాన్ని అనుసరించి, దైహిక సుఖాభిలాష రహితుడనై ప్రశాంతంగా ఉండగలుగుతున్నాను" అంటూ అవధూత యదుమహారాజుకి అజగరవృత్తి నుండి గ్రహించిన అధ్యాత్మ పాఠాన్ని వివరించారు.

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీహరి క్షమాగుణ వైభవము

శ్రీమాన్ సముద్రాల శఠకోపాచార్య, వరంగల్

సర్వేశ్వరుడు, సర్వజగద్రక్షకుడు, సర్వసృష్టికర్త, సర్వజగత్తును నియమించునట్టి పరమాత్మలో ఉండే కల్యాణగుణాలను లెక్కించలేము. పరమాత్మలో ఉండే గుణాలు అనంతములు. కావున అవి లెక్కకు అందేవి కావు. పరమాత్మలో దోషాలు అసలు లేనే లేవు. అందువల్ల లేని దోషాలను ఎవరూ లెక్కించలేరు అనే విషయాన్ని -

**సంఖ్యాతుం నైవ శక్యంతే గుణాః దోషాశ్చ శార్ఙ్గిణః ।**

**ఆనన్త్యాత్ ప్రథమోరాశిః అభావాదేవపశ్చిమః ॥**

అనే శ్లోకం వెల్లడిచేస్తున్నది.

భగవంతునియొక్క అనంతకోటి కళ్యాణగుణాలను పూర్తిగా వేదాలు కూడా కీర్తించలేనప్పుడు, ఆయన గుణాలను, గుణాలనుబట్టి ఏర్పడిన నామాలను ఆళ్వారులు ఆచార్యులు ప్రబంధాలలో స్తోత్రాలలో ఎందుకు స్తుతించారు అనే సందేహం కలుగడం సహజమే. భగవంతుని గుణాలను నిరంతరం అనన్యభక్తితో అనుభవించే ఆళ్వారాచార్యులు ఒక్క క్షణకాలం భగవంతుని నామస్మరణలో గుణానుభవంలో భగవచ్చింతనలో అంతరాయం ఏర్పడినా, అదొక మహా హానికరమైన సంఘటనగా, భయంకరమైన లోపంగా ప్రమాదంగా విపరీత పరిణామంగా భావిస్తారని-

**యన్ముహూర్తం క్షణం వాపి వాసుదేవో న చిన్త్యతే ।**

**సా హానిస్తన్మహచ్ఛిద్రం సా భ్రాన్తి స్సా చ విక్రియా ॥**

అనే శ్లోకం తెలియపరుస్తున్నది.

ఆళ్వారాచార్యుల దివ్యప్రబంధాలు శ్రీవైష్ణవ స్తోత్రాలు అన్నీ భగవద్గుణానుభవపరములే. పురాణేతిహాసాల్లో, యామునులు, కూరేశులు, వేదాంతదేశికులు, పరాశరభట్టర్ మొదలైన ఆచార్యుల స్తోత్రాలలో భగవంతుడి కళ్యాణగుణాలు ఎన్నో ఎన్నెన్నో కీర్తించబడినాయి.

అయితే భగవంతునియొక్క గుణరాశినుండి ఒక్క గుణాన్నే ప్రధానంగా స్వీకరించి కీర్తించిన స్తోత్రాలు మాత్రం రెండే రెండు.

అవి దయాశతకం, క్షమాషోడశి అనేవి. కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీవేంకటేశ్వరస్వామివారియొక్క దయాగుణవైభవాన్ని వర్ణిస్తూ శతాధిక గ్రంథకర్తలైన వేదాంతదేశికులు దయాశతకాన్ని రచించారు.

కూరేశుల కుమారులిద్దరిలో ఒకరైన వ్యాసభట్టర్‌వారి మనుమలు, శ్రుతప్రకాశికాచార్యులుగా ప్రసిద్ధులు అయిన సుదర్శనభట్టర్‌వారికి కుమారులైన వేదాచార్యభట్టర్ అనువారు భూతల పరమపదంగా కీర్తించబడే శ్రీరంగక్షేత్రానికి అధిపతియైన శ్రీరంగనాథుని క్షమాగుణాన్ని కీర్తిస్తూ ఈ క్షమాషోడశి అనే స్తోత్రాన్ని అనుగ్రహించారు.

దయాశతకం, క్షమాషోడశి అనే రెండు స్తోత్రాలను శ్రీవైష్ణవ సంప్రదాయాభిమానులు ఎందరెందరో ఎక్కువగా అభిమానించి అనుసంధిస్తూ ఉంటారు.

భగవంతుని సన్నిధిలో - స్వామీ! పురుషోత్తమా! నీకు ఉపచారము చేసే నెపంతో ప్రతిరోజు నేను చేసే అనేక అపచారాలను మన్నించి నన్ను క్షమించమని మన పెద్దలు కోరిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి-

**ఉపచారాపదేశేన కృతానహరహర్మయా ।**

**అపచారాన్ ఇమాన్ సర్వాన్ క్షమస్వ పురుషోత్తమ ॥**

ఈ శ్లోకంతో భగవంతుణ్ణి క్షమించమని కోరుతారు. భగవద్రామానుజులవారు శరణాగతి గద్యలో -

“మనోవాక్కాయైః అనాదికాలప్రవృత్త అనన్త అకృత్యకరణ కృత్యాకరణ భగవదపచార భాగవతాపచార అసహ్యాపచారరూప నానావిధ అనన్తాపచారాన్ ఆరబ్ధకార్యాన్ అనారబ్ధకార్యాన్ కృతాన్ క్రియమాణాన్ కరిష్యమాణాంశ్చ సర్వానశేషతః క్షమస్వ ॥”

అనాదికాలంగా మనోవాక్కాయములచేత లెక్కకు అందనంత సంఖ్యలో చేయకూడని కార్యాలను ఎన్నింటినో చేసినందుకు, విధిగా చేయవలసినవాటిని ఎన్నింటినో అసలే చేయకుండా భగవదపచారాలను, భాగవతాపచారాలను, అసహ్యాపచారాలుగా పేర్కొనబడే అపచారాలను అనేకములను చేసినందుకు, ఇంకా చేస్తున్నందుకు, భవిష్యత్తులో ఇంకా చేయబోవుదునేమో అందుకు కూడా నన్ను మన్నించి నా దోషాలన్నింటిని క్షమించమని కోరారు.

ప్రతివాది భయంకరం అణ్ణన్ స్వామివారు శ్రీవేంకటేశ్వర స్తోత్రంలోని చివరి శ్లోకంలో ఓ శేషశైలాధివాసా! అజ్ఞానుడనైన నేను నీ విషయంలో ప్రతిరోజు లెక్కకు అందనన్ని దోషాలను చేస్తున్నాను. అయినా నీవు నా దోషాలను లెక్కించవద్దని, నన్ను క్షమించము

**అజ్ఞానినా మయాదోషాన్ అశేషాన్ విహితాన్ హరే ।**

**క్షమస్వ త్వం క్షమస్వ త్వం శేషశైల శిఖామణే ॥**

అని స్తుతించారు.

పరమాత్మయగు శ్రీ వేంకటేశ్వరస్వామి క్షమాగుణవిశిష్టుడే కాని ఆయన సర్వతంత్రస్వతంత్రుడు, నిగ్రహానుగ్రహదక్షుడు, ఆశ్రితులలో ఉండే అనేకానేక దోషాలను చూసి ఎప్పుడైనా, ఎవరినైనా చటుక్కున శిక్షిస్తాడేమోనని, ఆయన రక్షించకపోతే వేరొక రక్షకుడు లేడని, ఆ పరమాత్మలో ఉండే క్షమాగుణాన్ని రెట్టింపు చేయడానికి ఆయన వక్షఃస్థలంలో నిత్యనివాసం చేయడానికి అమ్మ ఇష్టపడి, ఆయన వక్షఃస్థలాన్ని చేరినదని శ్రీవేంకటేశ్వరప్రపత్తిలోని

**ఈశానాం జగతోఽస్య వేంకటపతేః విష్ణోః పరాం ప్రేయసీం।**

**తద్వక్షఃస్థల నిత్యవాసరసికాం తత్ క్షాంతి సంవర్ధినీమ్ ॥**

అనే శ్లోకంలో ప్రస్తుతింపబడినది.

స్తోత్రరత్నంలో యామునాచార్యులవారు పరమాత్మయొక్క క్షమాగుణ వైభవాన్ని కీర్తించియున్నారు.

**రఘువర యదభూస్త్వం తాదృశో వాయసస్య**
**ప్రణత ఇతి దయాళుః యచ్చ చైద్యస్య కృష్ణ ।**
**ప్రతిభవం అపరాద్ధుః ముగ్ధ! సాయుజ్యదోఽభూః**
**వద కిమపదం ఆగః తస్య తేఽస్తి క్షమాయాః ॥**

రామావతార సమయంలో అసహ్యామైన మహాపచారాన్ని చేసిన కాకాసురుణ్ణి దయతో మన్నించి రక్షించావు. అలాగే కృష్ణావతారంలో వరుసగా మూడుజన్మలనుండి నీ పట్ల ఘోరాపచారాలు చేసిన శిశుపాలునికి కూడా మోక్షాన్ని ప్రసాదించావు. ఆశ్చర్యకరమైనట్టి నీ క్షమాగుణానికి ఆస్పదం కాని దోషం అంటూ మరేమున్నది? మా అపరాధాలన్నింటిని క్షమించగలవాడవు నీవే అని స్తుతించారు.

యతిరాజవింశతిలో వరవరమునీంద్రులు భగవంతుని క్షమాగుణాన్ని గూర్చి **కాలత్రయేఽపి కరణత్రయ నిర్మితాతి పాపక్రియస్య శరణం భగవత్ క్షమైవ** అని కీర్తించారు. గడిచినకాలంలో కాని, వర్తమానకాలంలో కాని, భవిష్యత్తులో కాని వాక్కుతో, మనస్సుతో, శరీరముతో కాని సహించలేని పాపాలను చేసే మనకు ఏనాటికైనా సద్గతిని పొందే అవకాశమున్నదా లేదా అని విచారిస్తే ఒకే సమాధానం- ఉదారహృదయంతో ఆయన క్షమిస్తే తప్ప వేరొక గతి లేనే లేదు అని చెప్పారు.

శ్రీవైకుంఠస్తవంలో కూరత్తాళ్వాన్లు భగవంతుని క్షమాగుణం ఎంతటి మహోదాత్తమైనదో ఒక శ్లోకంలో వివరించారు -

**యద్బ్రహ్మకల్ప నియతానుభవేపి అనాశ్యం**
**తత్ కిల్బిషం సృజతి జంతురిహ క్షణార్ధే**
**ఏవం సదా సకల జన్మసు సాపరాధం**
**క్షామ్యస్యహో! తదభిసంధి విరమమాత్రాత్ ॥**

కొన్ని వేల బ్రహ్మకల్పముల కాలంలో పూర్తిగా అనుభవించినా తీరనంతటి మహాపాతకాలను మానవుడు ఒక అరక్షణంలోనే చేస్తున్నాడు. అలాంటి పాపాలను విడువకుండా ప్రతిజన్మలో ప్రతిక్షణం చేస్తూ జీవించేవాణ్ణి ఎవరు క్షమిస్తారయ్యా! మహాపాపాత్ముడై ఆ క్షణం వరకు ఘోర పాపాలను చేసినవాడైనా హఠాత్తుగా మనసు మార్చుకొని ఇక పాపాలు చేయను క్షమించమని వేడుకుంటే వెంటనే ఆ మరుక్షణమే నీ మనస్సు కరిగి క్షమిస్తావు. స్వామీ నీ హృదయం చాలా విశాలమైనది అని పరమాత్మ క్షమాగుణవైభవాన్ని కీర్తించారు కూరేశులు. శ్రీమద్రామాయణంలో శ్రీరామచంద్రస్వామి గుణవైభవాన్ని వర్ణించే సందర్భంలో 'క్షమయా పృథివీసమః' అని కీర్తించారు వాల్మీకిమహర్షి.

కూరేశుల సద్వంశంలో జన్మించారు ఈ వేదాచార్యులు. ఈ స్తోత్రంలోని 16వ శ్లోకంలో వేదాచార్యులవారు 'శ్రీమాన్ కూరాన్వవాయే' అని చెప్పుకున్నందునే వంశపరిచయం కలిగింది. ఈ రచయిత శ్రీరంగనాథునికి అత్యంత ప్రేమపాత్రమైన భక్తుడు. స్తోత్రంలో రంగనాథస్వామితో రచయిత ఛలోక్తులను విసురుతూ ధారాళమైన కవిత్వంతో స్తుతిస్తూ, రంగనాథుడే రక్షకుడనే విశ్వాసాన్ని, గాఢమైన ఆర్తిని కలిగియుండడాన్ని దర్శించవచ్చు.

భగవద్రామానుజులు పరమాత్మ విషయంలో చేసిన శరణాగతి గద్యను ఎట్లా నిత్యం మనం అనుసంధించుకోవాలో వేదాచార్యులవారి ఈ క్షమాషోడశి స్తోత్రాన్ని కూడా మనం అర్థాన్ని మనసులో మననం చేసుకుంటూ ప్రతినిత్యం అనుసంధించాలి.

ఈ క్షమాషోడశీ స్తోత్రంలో రచయిత ప్రతి శ్లోకంలోనూ ఒక శాస్త్రీయమైన లేక సాంప్రదాయికమైన హేతువును చూపుతూ పరమాత్మను క్షమించమని వేడుతున్నారు.

వేదాచార్యభట్టర్‌వారు భగవంతుని క్షమాగుణప్రశస్తిని కీర్తిస్తూ రచించిన క్షమాషోడశిలోని విశేషాలను ఆస్వాదిద్దాం -

శ్లో. **శ్రీరంగేశ! యయా కరోషి జగతాం సృష్టి ప్రతిష్ఠా క్షయాన్**
**అత్రాముత్రచ భోగ మక్షయసుఖం మోక్షం చ తత్తత్ తృషామ్ ।**
**తత్ స్వాతంత్ర్యమపాస్య కల్పిత జగత్ క్షేమా అతిహృద్యా స్వతః**
**క్షాంతిస్తే కరుణాసఖీ! విజయతాం క్షేమాయ సర్వాత్మనామ్ ॥**

స్వామీ! రంగనాథా! నీవు జగత్కారణభూతుడవు. సర్వలోక సృష్టికి, జగత్ స్థితికి, జగత్ సంహారం చేయటానికి నీలోని క్షమాగుణమే ప్రేరకము అవుతున్నది. ఈ లోకంలో వివిధ ఐశ్వర్యభోగాదులను, పరలోకాల్లో వివిధ భోగాలను అనుగ్రహించడానికి, అక్షరము అనబడే కేవల ఆత్మతత్త్వాన్ని ఉపాసించేవారికి, ఆత్మానందరూపమైన కైవల్యసుఖాన్ని నీవు ప్రసాదించడానికి నీ దివ్యసన్నిధిని కోరే ముముక్షువులకు బ్రహ్మానందానుభవరూపమైన పరమ మోక్షాన్ని ప్రసాదించడానికి కూడా నీ హృదయంలో నిత్యజాగరితమైయుండే ఈ క్షమాగుణమే ఉద్బోధక మౌతున్నది స్వామీ! శాస్త్రవ్యవస్థకు వ్యతిరేకుల్ని శిక్షిస్తాను అనే నీ నిరంకుశ స్వాతంత్ర్యాన్ని నెట్టివేసి నీ హృదయాన్ని ఆక్రమించిన క్షమాగుణం వల్లనే సర్వలోకాలకు క్షేమం కలుగుతున్నది. ఆ క్షమాగుణం నీలో లేకపోతే ఎన్ని జన్మలు, ఎన్ని కల్పాలు గడిచినా మాకు కష్టాలు తప్పేవి కావు. నీ క్షమాగుణం నీలోని దయాగుణానికి ఒక స్నేహితురాలివలె సహకరిస్తున్నది అని రచయిత స్తోత్రప్రారంభశ్లోకంలో పేర్కొన్నారు.

భగవంతుడి క్షమాగుణం సృష్ట్యాదులకు ఎట్లా ప్రేరకం అవుతుందనే సందేహం కలవారికి సమాధానంగా భగవంతుడిలో క్షమాగుణం ఉండబట్టే ప్రళయానన్తరం మళ్ళీ సృష్టిని చేస్తున్నాడు. క్షమాగుణం ఆయనలో లేకపోతే ఆయన స్వతంత్రబుద్ధితో మరల సృష్టించకపోతే జీవరాశి ప్రకృతిలో లీనమై శరీరేంద్రియాలు లేకుండా అచిత్ప్రాయమై ఉండాల్సివచ్చేది. పిల్లవాడి అల్లరి తట్టుకోలేక తల్లిదండ్రులు అతనిని గదిలో బంధించినా కొంతసేపయ్యాక దయతో విడిచిపెడతారు కదా. అట్లే జగత్పితయైన పరమాత్మకుండే ఈ క్షమాగుణమే ఆయన స్వాతంత్ర్యాన్ని వెనక్కు నెట్టేసి సృష్టికి ఉన్ముఖుణ్ణి చేసినదని భావం. *(సశేషం)*

# మన ఆళ్వార్లు



- శ్రీనృసింహ-

*గత సంచిక తరువాయి....*

భాగవత తదీయారాధన చెయ్యడంలో పరకాలురకు అనేక కష్టాలెదురయ్యాయి. ఏరోజుకారోజు ఎలా గడుస్తుందో తెలియదంలేదు. అక్కడికీ... దొంగతనం కూడా మొదలుపెట్టారు. అయినా తదీయారాధన జరిగేదాకా జరుగుతుందో లేదో అని బెంగే. ఏం చెయ్యడం? బాటసారులను దోచుకుందాం... ఇంక అదే దారి అనుకుంటూ బయలుదేరారు.

అది బిల్వారణ్యం. దాన్ని దాటి అవతల గ్రామాలకి పోవాలి. పగలైనా అందులో ప్రయాణం భయమే బాటసారులకి. చూద్దాం! ఎవరైనా దొరకకపోతారా! అనుకున్నారు పరకాలురు. అలా ధనం లభించక పోతే, తదీయారాధన ఆగిపోయే ప్రమాదం వస్తే ప్రాణాలు తీసేసుకుంటాను అని నిశ్చయించుకున్నారు. తనకు తోడుగా ఉండేవారిని తీసుకొని బిల్వారణ్యం ప్రవేశించారు. ఒక పెద్ద చెట్టు పైకెక్కి ఎవరైనా బాటసారులు వస్తున్నారా లేదా అంటూ చూస్తున్నారు. అబ్బే ఒక్కరు కూడా కనిపించలేదు. అయ్యో ఈ రోజు నావ్రతం తీర్చుకోలేను. ఎందుకీబ్రతుకు అని బెంగపెట్టుకొని చితాక్రాంతులయ్యారు.

వారిని చూచాడు కరుణాసముద్రుడు రంగనాథుడు. అయ్యో! నా భక్తులకోసం ఈయనెంత తపిస్తున్నాడు! ఇతనికి సాయం చేద్దాం. ఎలాగ? తానొక పెళ్ళికుమారునిగా మారిపోయాడు. ఒంటినిండా ఎన్నో నగలు ధరించాడు. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకునికి నగలకేం కొరత. అమ్మ లక్ష్మీదేవి శ్రీరంగనాయకి పెళ్ళికుమార్తెగా మారింది. సర్వాభరణభూషితురాలైంది. ఆపాదశిరః పర్యంతం ఎన్ని ఆభరణాలో ఆవిడ శరీరంపై మెరిసిపోతున్నాయి. సాక్షాత్తు బ్రహ్మగారు పురోహితుల రూపం దాల్చారు. ఇంద్రాది దేవతలంతా బంధుకోటిగా మారిపోయారు. వధూవరులిద్దరూ గుఱ్ఱంపై వస్తున్నారు. అంతులేని సంపద గుఱ్ఱాలపై తెస్తున్నారు. మంగళవాద్యాలు మారుమ్రోగుతున్నాయి. ఆధ్వని చెట్టుపై ఉన్న పరకాలుర హృదయంలో మంగళవాద్యాన్ని మ్రోగించింది.

ఆహా! ఎంతటి శ్రవణసుభగంగా ఉందీ వాద్యధ్వని. అదుగో పెళ్ళివారి ఊరేగింపు. ఇటేవస్తోంది. అందరూ సంసిద్ధంగా ఉండండి. ఏ ఒక్కరిని విడిచిపెట్టకండి... గట్టిగా హెచ్చరిస్తూ చెట్టుదిగి ఆపరివారాన్ని చుట్టుముట్టారు. ఆహా! ఏం పెళ్ళికొడుకువయ్యా! ఇంత అందమా. మరింకా ఈ నగలన్నీ ఎందుకు తియ్.. ఊ... గబగబా... దబాయించేస్తూ తీసేసుకున్నారు నగలన్నింటిని పరకాలురు. అమ్మ భయంతో ముందే అన్నీ తీసి ఇచ్చేసింది. ఆహా... ఆనందం అంటూ ఒక్కసారి పెళ్ళికుమారుని మళ్ళీ చూశాడు. ఆయన కాలు వెనక్కు పెట్టాడు. ఇయ్యవే! దాచుకుందామనా... - తియ్యి... ఇయ్యి... అంటూ మీద పడ్డారు. ఇదొక్కటీ విడిచిపెట్టవయ్యా - వేలికి బిగుసుకుపోయి ఉంది. రాదు అంటున్నాడు పెళ్ళికొడుకు. రాదే- నేను తీస్తానుండు అంటూ నోటిని ఆ వేలుకి చేర్చి వేలు కొరికి అయినా సరే తీయవలసిందే అంటూ బలవంతంగా లాగారు. ఒకపూట విస్తరాకుల ఖర్చుకైనా ఇది సరిపోతుంది సరిగ్గా నిలు.. ఊ.. అంటూ వేలినుంచి లాగి పడేశారు ఆభరణాన్ని. అమ్మయ్య... నిలువు దోపిడీ - బాగా జరిగిందిలే. అంటూ అనుచరుల్ని చూచి ఇవన్నీ మూటలు కట్టండి అన్నారు. వారు శ్రద్ధగా మూటలు కట్టేశారు. గుఱ్ఱాలపై ఉన్న వస్త్రాలు మిగిలిన పదార్థాలు ఒక్కటీ విడవకుండా అన్నింటినీ మూటలు కట్టించేశాడు.

పెళ్లికొడుకు పరకాలుని చూచి 'ఏమయ్యా! నువ్వు కలివైరివా?' అన్నాడు.

అప్పటినుండి పరకాలురు కలివైరిగా ప్రసిద్ధిపొందారు. ఆ మూటలను తీసుకొని నడవండి అన్నారు. సరే అని ఎత్తబోతే కదలవే... ఉహు...! ఎంతబలం ప్రయోగించినా మూటపైకి లేవడం లేదు. కోపంతో ఊగిపోయారు పరకాలురు. కత్తి పురోహితుడి మెడమీద పెట్టి 'ఏం చేశావ్.. మంత్రించావా?' అన్నాడు.

బ్రహ్మగారు పురోహితులు ఇలాంటి అనుభవం ఎప్పుడూ లేదేమో హడలిపోయారు. 'నాకేం తెలియదు బాబోయ్ నన్నొదిలెయ్యి. పెళ్ళికొడుక్కే అన్ని విద్యలూ వచ్చు. ఆయన్ని అడుగు' అన్నాడు.

నవ్వుతున్నాడు పెళ్ళికుమారుడు. మండిపోయింది పరకాలురకి. 'ఏయ్ ఏం చేశావ్?' అంటూ దగ్గరగా వెళ్ళాడు. వరుడు ఆయన శిరస్సుపై చెయ్యివేశాడు. హస్తమస్తకసంయోగం అద్భుతావహ పరిణామాన్ని తెచ్చింది. అంతేకాదు పరకాలుని చెవి దగ్గర నోరుపెట్టి అష్టాక్షరీ మహామంత్రాన్ని ఉపదేశించాడు స్వామి. అష్టాక్షరీ మంత్రం సర్వవేదాంత సంగ్రహం. స్వస్వరూపాన్ని తెలిసే, పురుషార్థాన్ని ప్రతిపాదించే మహామంత్రం. సంసార సముద్రాన్ని దాటించే అద్భుత మంత్రం. ఆ మహోపదేశంతో విలక్షణ జ్ఞానాన్ని పొందారు పరకాలుడు. చూస్తూండగా వరుడు లక్ష్మీసహితుడై గరుడ వాహనారూఢుడై దర్శనమిచ్చాడు.

ఇది కలా– నిజమా.. స్వామీ! శ్యామసుందర సుకుమారమూర్తీ! దివ్యమంగళ స్వరూపా! సర్వాభరణభూషితా! శంఖ చక్రాది దివ్యాయుధోపేతా! నమస్తే నమస్తే ... అంటూ పాదాలపై వ్రాలారు పరకాలురు. అలా శ్రీమన్నారాయణునికి శిష్యులయ్యారు.

ఆ ఆనందం ఆయనలో ఆగలేదు. అక్షరాత్మకంగా ప్రవహించింది. కవిత్వం నాలుకపై తాండవం చేసింది. చతుర్విధ కవిత్వాలు నేను నేనంటూ నాట్యమాడాయి ఆ నాలుకపై. పెరియ తిరుమొడి, తిరుక్కురుందాండకం, తిరునెరుందాండకం, తిరువెడుకూత్తిరుక్కై, శిరియ తిరుమడల్, పెరియ తిరుమడల్ – ఇలా ఆరు దివ్య ప్రబంధాలు ఆ మహనీయులు లోకానికి ఆనందామృతంగా అందించారు. శ్రీరంగనాథుని ఆనందానికి అంతేలేదు. 'స్వామీ! మీరు మా శ్రీరంగం వేంచేయండి. సప్త ప్రాకారాలు, గోపురాలు, మండపాలు... ఇలా కైంకర్యాన్ని అందించండి' అంటూ ఆదేశించారు.

పరవశించారు పరకాలురు. శ్రీరంగనాథుని ఆజ్ఞతో ఈ దివ్యచరిత్రమే ప్రతి సంవత్సరం బ్రహ్మోత్సవాలలో దొంగల దోపిడీ ఉత్సవంగా ఈనాటికీ జరగడం భాగవతోత్తముల అదృష్టం. అశ్వవాహన రూఢుడై స్వామి రావడం, పరకాలురు వారిని అడ్డగించి దోచుకొనడం ఈ దొంగల దోపిడీ ఉత్సవం.

చతుష్కవిశిఖామణి అయిన పరకాలురు దివ్యదేశాలన్నింటికీ మంగళా శాసనాలందించారు. తిరుమల స్వామిని దర్శించారు. అక్కడి నుండి వస్తూ దారిలో శ్రీ సత్యవతీక్షేత్రంలో అందమైన ఉద్యానవనంలో విశ్రాంతి తీసుకుంటున్నారు. ఆ క్షేత్రంలో అష్టభుజనరసింహస్వామి భక్తులను కరుణించే దైవం. ఆయన ఒక వృద్ధబ్రాహ్మణుని వేషం వేసుకొని ఆ తోటలోనికి వచ్చాడు. పరకాలురకి, ఆయన పరివారానికి విందుభోజన మందించారు. అయ్యా! మీరెవ్వరు? ఎందుకు ఇలా వచ్చారు? అని అడిగితే నేను అష్టభుజ నృసింహుడను. ఈ క్షేత్రంలో వెలసిన దైవాన్ని. నిన్ను చూడాలని వచ్చాను అంటూ తన అప్రాకృత దివ్యమంగళ విగ్రహాన్ని చూపించి, మాయమైపోయాడు. ఆ ప్రసాద మారగించిన వారికి సంవత్సరకాలం ఆకలి దప్పికలు లేని దివ్యానందం కలిగింది. 'స్వామీ! ఇలా నన్ను అడుగడుగునా కాపాడుతూ వస్తున్నావా!' అంటూ ఆనందబాష్పాలు విడిచారు పరకాలురు.

శ్రీరంగనాథుని ఆజ్ఞ అయినందువలన పరకాలురు భార్య కుముదవల్లిని వెంట పెట్టుకొని, శిష్యులతో శ్రీరంగానికి బయలుదేరారు. ఆయన వస్తోంటే జయ జయధ్వానాలు మిన్నంటాయి. నాలుకవి ప్పెరుమాళ్ వందార్ =చతుష్కవి శిఖామణులు వచ్చారు. నమ్ కలియన్ వందార్=కలిమలాంత ధ్వాంత నభోమణి=కలిదోషాన్ని పారద్రోలే సూర్యులు ఏతెంచారు. పరవాదిమత్తగజ కంఠీరవర్ వందార్ పరవాది మత్తేభయకంఠీరవ చూడామణి=వాదించే శత్రు మదగజాలను సంహరించే సింహశ్రేష్ఠులు విచ్చేశారు. ఇలా – రకరకాల బిరుదులను పాడుతూ, పొగడుతూ, విజయకాహళాలు ఊదుతూ ప్రజలంతా విస్మయం పొందేలా ఆహ్వానిస్తూ పరకాలుర వైభవాన్ని లోకానికి చాటారు ప్రజలు.

ప్రజలు అందరూ తోసుకుంటూ ముందుకు వచ్చి చూస్తున్నారు. వింటున్నారు. వారిలో "సంబంధి" అనే ద్రవిడ కవి శిష్యులు కూడా ఉన్నారు. వారికి ఈ జయజయధ్వానాలు రుచించలేదు. మా గురువు వున్నచోట ఇలా మీ గురువుని పొగడుతారా! ఊరుకోం అంటూ యుద్ధానికి వచ్చారు.

## శ్రీరామానుజ సహస్రాబ్ది - 2016 - 17

**ప్రియ భగవద్బంధువులారా! మీరంతా ఎంతో ఉత్సాహంతో భగవద్రామానుజ విగ్రహ నిర్మాణానికి మీమీ ద్రవ్యాన్ని వినియోగింపదలచడం చాలా ముదావహం. మీరు ద్రవ్యం బ్యాంక్ అకౌంట్‌కు జమకట్టే విషయంలో ఈక్రింది అంశాలను గమనించండి.**

1. మీరు ఆంధ్రాబ్యాంక్, ముచ్చింతల్ బ్రాంచ్‌కి. 209710100000007 నెంబరుకు - ఏ ఆంధ్రాబ్యాంక్ బ్రాంచి నుంచి అయినా నేరుగా జమకట్టవచ్చు. జమకట్టేటప్పుడు -కౌంటర్ ఫయిల్, వర్జినల్ మీవద్ద ఉంచుకుని దాని నకలు, జతచేసి ఒక తెల్లకాగితంపై మీవివరాలు, అడ్రస్ స్పష్టంగా, ఎవరిపేరున రసీదు పంపాలో వ్రాసి మా అడ్రస్‌కు పంపండి.
2. మీరు ఆంధ్రాబ్యాంకు కాక, వేరేబ్యాంకు ద్వారా పంపదలిస్తే- IFSC Code ANDB – 0002097 అనే నెంబర్‌ను వినియోగించి పై ఆంధ్రాబ్యాంక్ అకౌంట్‌కే అమౌంట్‌ను పంపవచ్చును.

వివరాలు తప్పని సరిగా మా ఆఫీస్‌కు అందాలి. అందిన తరువాతనే రసీదు పంపబడుతుంది. ఎలా పంపినా -మీరు జమచేసిన వివరాలు- కౌంటర్‌ఫైల్ నకలు, మీపేరు, ఊరు, చిరునామా వగైరా ఈక్రింది అడ్రస్సుకు పోస్టులో పంపండి.

శ్రీరామానుజ సహస్రాబ్ది కార్యనిర్వాహక సమితి
కార్యదర్శి - 9441562863, 9676825361,
ట్రెజరర్ - 9246540270

శ్రీరామానుజ సహస్రాబ్ది,
జీవా, శ్రీరామనగర్, ముచ్చింతల్(గ్రా), పాలమాకుల(పో),
శంషాబాద్ (మం), రంగారెడ్డి జిల్లా -509325

Email -contact@sriramanujasahasrabdi.org

నాణ్యమైన ప్లాట్లు మరియు ఫ్లాట్లు కొనుగోలుకు నమ్మకమైన అగ్రగామి సంస్థ
అభినందన హౌసింగ్ (ప్రై) . లిమిటెడ్
సెంట్రల్ ఆఫీస్ : 4వ లైను, పండరీపురం, లక్ష్మీపురం మెయిన్ రోడ్, గుంటూరు. ఫోన్ : 2354002.
మా బ్రాంచీలు: విజయవాడ 1, విజయవాడ 2, విజయవాడ 3, గుంటూరు 1, గుంటూరు 2, హైదరాబాద్, విశాఖపట్నం.
0866 - 6628668 : 0866 - 6642428 : 0866 - 6633668 :. 0863 - 6641177 : 0863 - 6454588 :. 040 - 66637799 :. 0891 - 2538686.




డా॥ పావులూరి కృష్ణచౌదరి
8-3-945/ఎ22, నాగార్జున నగర్, అమీర్‌పేట, హైద్రాబాద్-500 873

## కర్వాణి (ఎక్జిమా)

శిశుదశలో సాధారణంగా కర్వాణి, హేఫీవర్ (జలుబు)... మూడూ ఎక్కువ. అందుకే వీటిని 'ఏటోపిక్ వ్యాధి త్రయం'గా పరిగణిస్తారు. ఏటోపిక్ అంటే విచిత్రమని! ఇటీవలి కాలంలో ఉబ్బసం, హేఫీవర్‌లకు ఎలర్జీ కారణమని గుర్తించారు. ఇక కర్వాణికి కారణం ఏమిటో ఈనాటికీ తెలియదు. అందుకే దీనికి 'ఏటోపిక్ డెర్మటైటిస్' అనేది తగిన పేరని చెప్పుకోవచ్చు. వీరిలో చర్మం ఎర్రబారటం, దురద, దద్దు కూడా (అర్టికేరియా) ఉంటాయి. వీళ్ళే పెద్దైన తర్వాత ఉబ్బసానికి గురికావచ్చు.

ఇది వంశపారంపర్యంగా సంక్రమిస్తుందని గుర్తించారు. ఆనువంశిక, ఇన్ఫెక్షన్ కారణాలను తోడుచేసుకొని సంక్రమించే వ్యాధులకు హోమియో వైద్యంలో 'మయాజం' అని వ్యవహరిస్తారు.

హోమియోకు మూడు విలక్షణతలున్నాయి. మొదటిది - ఔషధాల ఎంపికకు సంబంధించిన సారూప్యతా నియమం. ఈ నియమాన్ని హానియన్ 1790లో కనుగొన్నారు. రెండోది సూక్ష్మతానియమం. ఏ వైద్యవిధానంలోనూ లేని, హానిమన్‌కు పూర్వం ఎవ్వరికీ తెలియని నియమం ఇది. దీన్ని హానిమణ్ 1812లో వెలువరించాడు. ఇక మూడోది మయాజం. దీర్ఘవ్యాధులకు మూలం 'మాయాజం' అని గుర్తించాడు హానియన్. దీన్ని 1828లో వెలువరించాడు. ఈ నియమాలను పురస్కరించుకొని హోమియోవైద్యం 'నియమబద్ధ వైద్య విధానం' అని చెప్పుకోవచ్చు. దీర్ఘవ్యాధుల నివారణకు 'మయాజం' తోడ్పడే అంశం.

సాధారణంగా కర్వాణి పసిబిడ్డలకు నెల తర్వాత ఆరంభమవుతుంది. 5ఏళ్ళ తర్వాత మొదలుగాదు. పదేళ్ళు వచ్చేసరికి తగ్గిపోతుంది. పోతపాల పిల్లల్లో ఎక్కువ. తల్లిపాల పిల్లల్లో తక్కువ.

సమస్యలు: చర్మం పొడారిపోవడం, ఎర్రబారడం, దద్దు, చీము పట్టడం, వాపు, దురదలు, బొబ్బలు, రసికారడం. వ్యాధి ఉధృతం తగ్గిన తర్వాత చర్మం పొడిబారి, పొలుసులు కనిపిస్తాయి.

## ఔషధాలను ఎంపిక చేసేదెలా ?

| | |
|---|---|
| చర్మం ఎర్రబారి, కర్వాణితో దురద పెడుతుంటే | - ఆర్స్ ఆల్బ్ |
| వాతావరణం చల్లగా ఉండి దురదలు పెడుతుంటే | - ఆర్స్ ఆల్బ్ |
| పసుపురంగులో రసి, జిగురు కన్పిస్తుంటే | - గ్రఫయిటీస్ |
| చెక్కులు గట్టడం, చెక్కులు లేస్తే దుర్గంధం | - గ్రఫయిటీస్ |
| కర్వాణి చెక్కులు లేని చెమ్మ, చీము కన్పిస్తే | - కాల్కేరియా కార్బ్ |
| తల, ఒంటిమీద చెమటలు ఎక్కువగా ఉంటే | - కాల్కేరియా కార్బ్ |
| చర్మం పొడారి, పొలుసులు లేస్తూ పొడిగా ఉంటే | - లైకోపోడియం |
| మూత్రం దుర్వాసన, మడ్డి పేరుకున్నట్లు కన్పిస్తే | - లైకోపోడియం |
| చర్మం పొడారి బీటలు వారినట్లు కన్పిస్తే | - సల్ఫర్ |
| విపరీతంగా చర్మం దురదపెడుతుంటే | - సల్ఫర్ |
| జిటకబారిన పిల్లలు, మెడ సన్నగా ఉంటే | - నేట్రంమూర్ |
| కీళ్ళ మడతల్లో, తలకట్టు అంచుల్లో దద్దు కన్పిస్తే | - నేట్రంమూర్ |

## మీరు ఎంపిక చేసుకున్న ఔషధాలకు సంబంధించి మరిన్ని వివరాలు

* **ఆర్సెనికం ఆల్బ్:** వయస్సుకు తగినట్లు పెరగరు. అస్తిమితంగా, చికాకుగా ఉంటారు. భయస్తులు. చలి భరించలేరు. ఉబ్బసం, చర్మవ్యాధి ఒకటి మార్చి ఒకటి వేధిస్తుంటాయి. వెచ్చదనం హాయిగా వుంటుంది.

* **గ్రఫయిటీస్:** బొద్దుగా కన్పిస్తారు. పుష్టిగా తింటారు. మలబద్ధకం ఎక్కువ. దద్దు. పసుపు పచ్చని చీములాంటి స్రావం. జిగురుగా ఉంటుంది. దురద చాలా తక్కువ. అసలు ఉండకపోవచ్చు. తలమీద, చెవుల వెనుక, కీళ్ళ మడతల్లో, కంటి రెప్పలుమీద, చర్మం ముడతల్లో దద్దు కన్పిస్తుంది.

* **కాల్కేరియా కార్బ్:** బొద్దుగా వుంటారు. స్తబ్దత. తలలో చెమలు, కాళ్ళూచేతులూ చల్లగా ఉంటాయి. చర్మవ్యాధి చెమ్మ, రసికారుతుండొచ్చు. చంకల్లో గ్రంధులు వాచి ఉండొచ్చు. చర్మం పొడారి తెల్లని పొలుసులు లేస్తూ ఉండవచ్చు. మాటిమాటికీ జలుబు చేస్తుంటుంది. తేలికగా అలసిపోతారు.

* **సల్ఫర్:** కర్వాణి కేసుల్లో ముందుగా ఆలోచించదగ్గ ఔషధం. చర్మం పొడారి ఉంటుంది. పగుళ్ళు. విపరీతంగా జిల పెడుతుంటాయి. చర్మం మీద అంతా గుల్లలు. కీళ్ళ ముడతల్లో పగుళ్ళు. స్నానం తర్వాత బాధలెక్కువ. పిల్లల్లో ముసలితనం కన్పిస్తుంది. మూతి, ముక్కు, కనుకొలకలు ఎర్రగా ఉంటాయి. స్నానం తర్వాత కూడా వాసనపోదు. కోడినిద్ర. తేలికగా లేచిపోతుంటారు.

* **లైకోపోడియం:** ముసలితనం కన్పిస్తుంది. చర్మం పొడిగా ఉంటుంది. దురద, మూత్రం దుర్వాసన. ముక్కు పుటాలు కదులుతుంటాయి. ఎదురు చెబితే సహించలేరు. పాలకు తహతహలాడుతారు. కొద్దిగా తాగి ఊరుకుంటారు.

* **నేట్రంమూర్:** పిల్లలు ఎదగరు. మెడ సన్నం. తలకట్టు అంచున, కీళ్ళ మడతల్లో గుల్లలు, కొద్దిపాటి చెమ్మ. దాహం ఎక్కువ. శక్తి లేకున్నా ఏదో చెయ్యాలన్న ఆబ. దిగులుగా వుంటారు. తేలికగా ఏడుపు. మాటలు తొందరగా రావు.

### జిమ్స్‌లో చికిత్స పొందుతున్న...

**జి. శ్రీనివాస్;** వయస్సు 32సం॥లు ఊరు: నార్సింగ్

గత 6 సం॥లుగా చేతులు శుష్కించిపోయి పట్టుకూడా తగ్గిపోయింది. చేతులలో వణుకు. వైద్యులు పరీక్షచేసి 'ఏమయుట్రోపిక్ లేటరల్ స్కెర్లోసిస్' అని నిర్ధారించారు. అది నరాల వ్యాధి. ఒక తరగతి ఎండువాతం. ఆ చేతులతో ఏ పనీచేయలేరు.

జిమ్స్ ఆసుపత్రిలో 2013 సెప్టెంబర్ 30 నుండి చికిత్స చేయించుకుంటున్నాడు.

ప్లంబంమెట్ 30 పొటెన్సీలో ఉదయం 6గోళీలు, సాయంకాలం 6 గోళీలు తీసుకోవడం జరిగింది. డిసెంబరు 2013 నాటికి ఆరోగ్యం కుదుటపడింది. చేతులతో అన్ని పనులు చేస్తున్నాడు. సైకిల్ కూడా నడుపగల్గుతున్నాడు. నరాలు బలహీనత తగ్గింది.

# శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారి ప్రవచనము నుండి

*గత సంచిక తరువాయి....*



'అయ్యో! తప్పకుండా' అన్నాడు రామచంద్రుడు. తీసుకు వెళ్ళింది, చూపించింది అంతా. ఎప్పుడో పదమూడు సంవత్సరముల క్రితం ఆరవేసిన బట్టలు ఇంకా తడి అలాగే ఉన్నాయి. అప్పుడు తాను పూజించిన పుష్పాలు వాడిపోకుండా వారి పటం దగ్గర అలాగే ఉన్నాయిట. అలాగే వారియొక్క ప్రభావాలన్నీ చూపించింది. చాలా సంతోషించాడు. 'శబరీ, నీలాంటి గురుభక్తి కలిగినవారు ఇంకెవరూ లేరు ఈ ప్రపంచంలో, చాలా సంతోషించాను నేను, నీకు మోక్షమిస్తాను' అన్నాడు.

'మోక్షమంటే ఏమిటయ్యా?'

'పరమపదం, నువ్వు ఎందుకాశ్రయించావు గురువుని? పరమపదం కోసమే కదా!'

'అయ్యా, నాకు పరమపదం వద్దు, మోక్షమూ వద్దయ్యా.'

'మరి, ఏం కావాలంటావు?'

'మా ఆచార్యులయొక్క పాదాల్ని చేరాలి. పాదాల దగ్గరకి చేరాలి. **ప్రాణహం పర్యచారిణం పాదమూలం గమిష్యామి** అని ఆచార్యులయొక్క పాదాల దగ్గరికి వెళ్ళాలి.'

'అక్కడికి చేరితే ఏం లాభం? ఇక్కడేదో బాధపడ్డావు, అయిపోయింది. ఆ పరమపదం కోసమేగా ఆచార్యపాదాల్ని ఆశ్రయించింది.'

అయితే శబరి చెబుతుందీ, 'నాయనా నువ్వు ఇక్ష్వాకువంశంలో పుట్టిన చక్రవర్తివి. పదమూడు సంవత్సరాలకి, ఈ ఆశ్రమం ఎక్కడుందీ? శబరి ఎక్కడుందీ' అని వెతుక్కుంటూ, నువ్వు నా దగ్గరకు వచ్చావా! నీకోసం నేనేమైనా శ్రమచేశానా, ధ్యానం చేశానా? భక్తి చేశానా, ప్రపత్తి చేశానా? లేదు. నువ్వు నా దగ్గరికి వెతుక్కుంటూ వచ్చావు. నేను పెట్టినటువంటి ఎంగిలంతా తిన్నావు. ఏది చూపిస్తే అదంతా చూసి ఆనందించావు. దానికి కారణమేమి? మా ఆచార్యులయొక్క కటాక్షం. వారి కటాక్షం ఉంది కనుక లేకపోతే, నేను నీదగ్గరకు రాగలనా, నువ్వు నా దగ్గరకి రాగలవా? నువ్వువరివో నేను తెలుసుకోగలనా? నీకేమైనా ఆతిథ్యం ఇవ్వగలనా? ఈ విధమైన మహాభాగ్యం నాకు కలిగిందో కలిగిన తరువాత ఆచార్యులని వదిలిపెట్టేస్తే? అదంతా ఆచార్యుల సంకల్పం. నిజానికి వారికే గనుక నన్ను పరమపదంలో ఉంచాలి అనే ఉంటే, వారు కూడా పరమపదంలో ఉంటే, అక్కడే ఉంచుతారు. ఇక్కడ ఉండమన్నారు, ఉన్నాను నేను. అక్కడ ఉండు పరమపదంలో అంటే, అక్కడే ఉంటాను నేను. వారి ఆజ్ఞ లేకుండా నేనేదీ చేయలేను'. ఇదీ వైష్ణవ సంప్రదాయం.

ఎవరైనా పోతే, 'వారు మరణించారు, చనిపోయారు అని మామూలు పామరులు వ్రాస్తారు. కొంచెం ఆత్మజ్ఞానం కలిగినవారు స్వర్గస్తులయ్యారు అంటారు. కొంచెం భక్తిశ్రద్ధలు కలిగినవారు, 'వైకుంఠానికి, పరమపదానికి వేంచేసారు' అంటారు. ఇవన్నీ కూడాను సరియైన, సంప్రదాయం పూర్తిగా తెలిసినవారియొక్క మాటలూ కావు.

ఏమనాలీ? 'వారియొక్క ఆచార్యపాదములు చేరారు. వారి ఆచార్యుల తిరువడికి చేరారు' అనడం ఇక్కడ ధర్మం. 'వారు ఆశ్రయించిన ఆచార్యులు బ్రతికే ఉన్నారు. మరి ఆచార్యుల తిరువడికి చేరేరు అంటే ఎలాగ? ఏమిటో' వారికే ఉత్తరం వ్రాస్తారు. 'మీ శిష్యుడు ఆచార్య తిరువడికి చేరారు' అని. ఆయన, ఏమిటిది, నేను బ్రతికుండగానే ఈ అఘాయిత్యం? అని అనుకోవచ్చు కదా! అంటే, ఆచార్యులు ఎవరు? పారంపర్య పెరుమాళ్ళే ఆచార్యులు. గురుపరంపరలో ఆచార్యులు ఎవరు?

**లక్ష్మీనాథ సమారంభాం నాథ యామునమధ్యమాం ।**
**అస్మదాచార్యపర్యన్తాం వందే గురుపరంపరామ్ ॥**

కనుక, ఆచార్యకోటిలో ఆఖరి ఆచార్యుడు ఎవరూ అంటే, శ్రీమన్నారాయణుడే ఆచార్యుడు. ఈ మధ్యవున్నవాళ్ళుంటారే, నిన్న ఉదాహరణ చెప్పుకున్నాం, ఆ ఇనుప సంకెళ్ళల్లాంటి వాళ్ళు ఈ ఆచార్యులు. అంచేత 'ఆచార్య తిరువడికి చేరేరు' అంటే, 'పెరుమాళ్ళయొక్క పాదాలు చేరేరు' అని అర్థం. దాంతో ఈ ఆచార్యులవారియొక్క పాదములక్కరలేదు. అదొక అఘాయిత్యంగా భావించనక్కరలేదు. చాలా సంతోషించాడు రాముడు. అప్పుడు, 'శబరీ, సరే, పోనీ అలాగే నీయొక్క ఆచార్యపాదాలు చేరు. నేను వెళ్ళి వస్తాను' అన్నాడు.

'రామా! ఒక్క మనవి.'

'ఏమిటి శబరీ?'

'నేనెలా ఆతిథ్యమిచ్చానో నాకేం తెలుసు? ఆతిథ్యమెలా ఇవ్వాలో నాకు తెలుసా? ఇదివరకైతే గురువులు ఉంటే, వారు 'నీళ్ళు పట్రా!' అంటే తెచ్చేదాన్ని. 'పూలేవి?' అంటే పూలు తెచ్చేదాన్ని. ఎవరికెలా చేయాలో, ఏం మంత్రాలు చదవాలో, ఏం మాటలు చెప్పాలో నాకేం తెలుసని? ఆచార్యులు లేకుండా నేనొక్కదాన్ని చేసేను. అంచేత, వారు వెళ్ళేటప్పుడు ఏం చెప్పేరు? 'రాముడికి చక్కగా, సంతోషంగా ఉండేలాగ పూజచేసి, అప్పుడు రా' అన్నారు. నేను వెళ్ళడంతోటే అడుగుతారు... 'రామునికి చక్కగా చేసేవా? నువ్వు చేసిన పూజవలన రాముడు సంతోషించాడా? అని అడుగుతారు. ఏం చెప్పాలి నేను? నువ్వు సంతోషించావో, లేదో!

అందరూ 'సంతోషించాను' అనే చెబుతుంటారు. నాకు తెలుసు. అవసరార్థం చెప్పాలి. ఆ సంగతి తెలుసును. కనుక, నువ్వెలా నా ఆతిథ్యాన్ని స్వీకరించావో చెప్పవా?'

'శబరీ! చాలా బాగుందమ్మా, చాలా సంతోషించానమ్మా!'

'అయ్యా, నువ్వన్నావుగానీ, మాటలు గాలికెగిరిపోతాయి. కాస్త, ఆకుమీద నాకు వ్రాసి యిద్దూ!'

'సరే, తెచ్చుకో' అన్నాడు.

ఒక తాటాకు తెచ్చింది. మసిబొగ్గు తెచ్చింది. దానిమీద వ్రాసేడు **సమ్యక్ పూజితః** చక్కగా పూజించబడ్డాను.

'అంటే, ఎంతమంది ఉన్నారు మునీశ్వరులంతా, ఇక్కడంతా నున్నూ? ఎవరు పూజించారో, ఎవరిచ్చారో ఈ చీటీ, ఎలా తెలుస్తుందయ్యా?' అన్నది శబరి.

'నువ్వే చేసేవు కదా?' 'మరి ఆ ముక్కేదీ దీంట్లో?' 'ఓహోహో, అలాగా సరే **శబర్యా పూజితః సమ్యక్** శబరిచేత చక్కగా పూజించబడ్డాను' అని వ్రాసేడు.

చూసింది, 'బావుంది, అయితే ఎవరూ ? ఆ పూజించబడ్డవాడు ఎవరయ్యా? సంతకమేదీ దీంట్లో?'

'ఓహోహో, అసాధ్యురాలిలా ఉందే!', అనుకుని "రామః" అని చేర్చేడు.

'అయ్యా, రాముళ్ళు చాలామంది ఉన్నారీ ప్రపంచంలో. బండరాముడున్నాడు, అడవి రాముడున్నాడు, పిడుగు రాముడూ ఉన్నాడు. అంచేత ఏ రాముడో, ఎలా తెలుస్తుందయ్యా? దానికి మళ్ళీ తండ్రిపేరు ఉండొద్దూ' అంది శబరి.

**'రామో దశరథాత్మజః శబర్యా పూజితః సమ్యక్'** వ్రాసి ఇచ్చాడు రాముడు.

# స్మృత్యంజలి



**శ్లో ॥ స్వాచార్యపదమాశ్రిత్య కృతకృత్యత్వమాపితా ।**
**తిర్వేంగడాంబా విదుషీ శబరీవ ప్రశామ్యతు ॥**

పుట్టినింటికి మెట్టినింటికీ రెంటికీ సమస్కంధమైన గౌరవాన్ని పంచగల మహావకాశాన్ని పొందిన అతి పరిమిత విదుషీమణులలో వన్నెకెక్కిన విదుషి శ్రీమతి కరి తిరువేంగళమ్మగారు. తండ్రిగారైన మా ఆచార్యులు ఉ.వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారి సారస్వతౌరసత్వాన్ని అవికలంగా పొంద గలిగిన ఈమె మెట్టి 'కరి'వంశాన్ని వరణీయంగా చేసిన ఘనతను పొందారు. దాసునియందు అవ్యాజమైన ప్రీతిగల తిరువేంగళమ్మగారు చాలా ఆప్యాయంగా పలుకరిస్తూ చక్కటి సాహిత్యాన్ని సార్వజనీనంగా పొందగల్గారు. చిట్టచివరగా వరంగల్లులోను, నెల్లూరులోను కలిసికొని ఆప్యాయంగా పలకరించుకున్న ఆ సన్నివేశాలు, జ్ఞాపకాలు మనస్సులో చెదిరిపోకముందే ఇంతటి ఘోరవిపత్తు చిత్తాన్ని కలచివేస్తుందని ఊహింపలేకపోయాము.

నేను, మాసోదరులు శ్రీమాన్ యస్.టి.కె. శ్రీరంగాచార్యుల వారు ఇరువురమూ, వేరువేరుగా భాష్యాన్ని మా గురువుగారైన శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామి వారివద్ద అధికరించగా, భాష్యవిషయంలో సభల్లో ఆచార్యఋణాన్ని తీర్చుకొనగలుగుతున్నందుకు, శ్రీమతి తిరువేంగళమ్మగారు ఎంతగానో మురిసిపోయారు. చాలా గౌరవంగా భావించారు.

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారు నిర్వహించిన సభల్లోను, శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరామచంద్ర రామానుజజీయర్ స్వామివారు నిర్వహించిన శ్రీభాష్యసదస్సుల్లోను ఆమెకూడా శ్రోతగా తప్పక పాల్గొని, మా ప్రసంగాలు శ్రద్ధగా ఆనందించి, తమసంతోషాన్ని ఆవిష్కరించే వారు. శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారిపట్ల ఆమెకుగల విశేషప్రీతి ఖ్యాపనీయం. జీవాప్రాంగణంలో జరిగిన పలుఉత్సవాల్లో ఆమె పాల్గొని వాచాకైంకర్యాన్ని చేశారు.

మాటతీరు సరళం. విషయం ఒకప్పుడు గహనమైందే అయినా, దాన్ని ప్రతిపాదించే తీరు చాలా లౌకికంగా సులభగ్రాహ్యంగా ఉండేది. మధ్యమధ్య ఆధునికకవుల గేయభాగాలుకూడా ఉట్టంకిస్తూ ఆధునికతను మేళవించేసే తాత్త్వికప్రసంగాలు పండిత పామరోభయరంజకంగా ఉండేవి.

తండ్రిగారే సర్వాచార్యులుగా అందించిన ఉభయవేదాన్త సంస్కారాన్ని యథాశక్తి పలువురికి సామాన్యులకు సహితం అందించి "గురు"ఋణాన్ని తీర్చుకున్న ధన్యురాలు.

సాధారణ తాత్త్వికవిషయాలనుండి భగవద్విషయం వరకు చక్కగా విషయప్రతిపాదనంచేసి మెప్పించే వాక్పటిమ తండ్రిగారి ఔరసత్వంగా లభించడం ఆమె చేసుకొన్న గొప్పభాగ్యం. చక్కటి సౌహార్దంగల మాసోదరి తిరువేంగళమ్మగారు, మా సోదరులు శ్రీనివాస్‌గారు, తమ తండ్రిగారు మా ఆచార్యులు అయిన ఉ.వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారి స్మారకపురస్కారాన్ని దాసునికి సమర్పించి, నన్ను ఋణిగా చేశారు. వాక్కుతోతప్ప దాన్ని తీర్చుకొనే మార్గంలేదు.

ఆమెకు, ఆమె కుటుంబానికి, నా హార్దసహానుభూతిని, అనుతాపాన్ని ప్రకటిస్తూ సెలవుదీసికొంటున్నాను.సోదరుడు – యస్.వి. రంగరామానుజాచార్యులు

**సంపాదకుడు భక్తినివేదన – 'జీవా', శ్రీరామనగరం.**

## మా అక్క (తిరువేంగళమ్మ) - ధన్యజీవి

**శ్రీభాష్యం శ్రీనివాస్ - విశాఖపట్నం**

చిన్నతనం నుంచీ ఆధ్యాత్మికచింతనలో, కృష్ణభక్తితో, జీవితాన్ని నడిపిన కరి తిరువేంగళమ్మ నాకు సోదరి, నాకూ ఆమెకూ ఐదు సంవత్సరాలే వయస్సులో తేడావల్ల అభిప్రాయాల్లో పెద్దతేడా లేకపోవడం వల్ల సన్నిహితంగా కలిసిపోయాం. ఇంట్లోపనులు, చదువుకోడానికి క్షణం తీరిక లేదు అనే వాళ్లందరూ, ఆమెను చూసి పనులకి, చదువుకీ, సమయాన్ని ఎలా విడదీసుకోవాలో తెలుసుకోవాలి. పుస్తకం చేతిలో లేని అక్కని నేనెప్పుడూ చూడలేదు. చిన్నతనంలో స్కూల్ చదువు లేకపోయినా, పుస్తకం చేతిలో పెడితే ఆఖరిపేజీదాకా చదవకుండా వదలడం ఆమెకి అలవాటులేదు. అది దేవులపల్లి, శ్రీశ్రీ, విశ్వనాథదైనా కావచ్చు. కాళిదాసు, పోతన, పెద్దన ఏదైనా కావచ్చు. ఆధునికమైనా, ప్రాచీనమైనా అంతే ప్రీతి. పూర్వజన్మ సుకృతం వల్ల మా నాయనమ్మగారు ముకుందమాలలో ఆఖరి శ్లోకం **"క్షీరసాగరతరంగ..."** చదువుతూ ప్రాణం వదిలారని చెబుతారు. ఆవిడ పోలికో ఏమో, చిన్నతనంలోనే పోతనభాగవతం మీద ప్రీతిఏర్పడి ఎన్నోసార్లు చదివి తెలియని వాటిని నాన్నగారి దగ్గర తెలుసుకుని కృష్ణుని మీద ప్రీతి విపరీతంగా పొందింది. అందుకే కాబోలు "భాగవత సుధాస్రవంతి" "చిన్నికృష్ణుని చిలిపిచేష్టలు" "కృష్ణశతకానికి వ్యాఖ్యానం" "పెరియాళ్వార్ తిరుమొఱ్ఱి"కి తెలుగులో వ్యాఖ్యానం ఆవిడచేత చేయించుకున్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

హైదరాబాద్ జెట్‌లో ఒకసారి ధనుర్మాసంలో ఆమెను ఒక చిన్నికృష్ణుడు దరిచేరాడు. రోజూ వచ్చేవారినందరినీ ఇది ఎవరిదని అడిగితే అందరూ మాది కాదన్నారు. ఆ కృష్ణుడే ఆమె ఆరాధ్యదైవంగా నిత్య ఆరాధనలో ఉంచుకున్నారు. నాన్నగారు కాకినాడలో పనిచేసిన రోజులలో శ్రీశ్రీశ్రీ లక్ష్మణయతీంద్రులవారి కృష్ణభక్తినిచూసి, వారి సాహిత్యాన్ని వారి వాక్యాలలో విని పరవశించింది. రాజమండ్రిలో నాన్నగారు, మానాప్రగడ శేషసాయిగారు, శరభయ్యగారు, సంస్కృత సాహిత్యాన్ని కలబోసుకుంటుంటే తన్మయమయ్యేది. ఏది విన్నా, చదివినా, ఆమె స్మృతిపథంలో నిలిచి పోవల్సిందే. భగవదనుగ్రహంచేత శ్రీమాన్ భాష్యం అప్పలాచార్యస్వామివారే ఆమెకు ఆధ్యాత్మికరంగంలో గురువులైనారు. ద్రావిడ సంప్రదాయ రహస్యాలన్నిటినీ ఆమెకు విశదీకరించారు. ఇద్దరికీ చదువు మీద శ్రద్ధ, ఓపిక ఎక్కువే. అందుచేత అతితక్కువకాలంలో భగవద్విషయాన్ని

పూర్తిచేసుకోగలిగింది.

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయర్ స్వామివారి అనుగ్రహంతో పదిపదుల ఈడు వ్యాఖ్యానాన్ని తెలుగులో తీసుకురాగలిగారు. ముక్కకి ముక్కగా కాకుండా అందరికీ అర్థమయ్యేలా సుబోధకంగా అందించింది. ఎందరో పెద్దలు "అప్పలాచార్యులు చేప్పి ఆమెచేత రాయించారు" అంటే పరవశించిపోయేది. ఇలా వారు అన్నారంటే ఇది ప్రామాణికంగా ఉన్నట్టేకదా! అని ఆవిడ ఉపన్యాసం ఒక రసగుళిక. విన్నవారి హృదయాన్ని మీటేది, వారి మనసుల్లో ఆరసం పరవళ్ళు తొక్కేది. ఎదురుగా కృష్ణదర్శనం ఆమెకు, మనకుకూడా కలిగేది. ఏమిటీ కృష్ణుడనగానే కళ్ళవెంట నీళ్ళుకారుస్తుంది. గొంతుక గద్గదం చేస్తుంది అనేవాళ్ళు ఉన్నా, అది అనుభవించిన వారికి కానీ తెలియదు. ఆమధురానుభూతి అన్ని వేదికలమీద అన్ని ఆధ్యాత్మిక పత్రికలలో ఆమె తన ప్రవచనాల ద్వారా వ్యాసాలద్వారా పాలుపంచుకున్నారు. కృష్ణునిగూర్చి ఎప్పుడు మాట్లాడినా కృష్ణశాస్త్రిగారి

**"నీలిమేఘం ఆకాశం విడిచి నేలనడుస్తోందా**
**నడిచేమబ్బులకు నవ్వే పెదవుంటే**
**నవ్వే పెదవులకు మువ్వల మురళుంటే...**

అదీ మా కృష్ణయ్యంటే అని చదవకుండా, కన్నీరు కార్చకుండా సాగేదికాదు. ఎంతమందికో భగవద్విషయాన్ని అందించారు. సమయపాలన ఆమెదగ్గర నేర్చుకోవాలి.

శ్రీశ్రీశ్రీ త్రిదండి రంగరామానుజ జీయర్ స్వామివారు శఠారి నృత్యనాటిక రూపొందించిన సన్నివేశంలో ఎన్నో పాశురాలకి తెలుగులో గేయరూపంగా అందించారు. ఆమెకు కృష్ణపరమాత్మ అన్నా, శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయర్ స్వామివారు అన్నా, అప్పలాచార్యస్వామివారు అన్నా అంచంచల విశ్వాసం. అప్పలాచార్యస్వామివారే ఒకసారి ఆమె ఉపన్యాసం అయిన తరువాత ఇంట్లో ఆమెతో నీ అంత మృదువుగా నేను చెప్పలేనమ్మా అన్నారు. 2003లో పరమపదంలో శ్రీమన్నారాయణుడు రామాయణాన్ని వినాలి అని సంకల్పించి అప్పలాచార్యస్వామి వారిని పిలిపించుకున్నారు. మళ్ళీ 2014లో భాగవతం వినాలనిపించింది కాబోలు తిరువేంగళమ్మగారిని తీసుకెళ్ళారు. ఆయన "ఆపదామపహర్తారం..." అంటే ఈమె "త్రిజగన్మోహన నీలకాంతి" అని వినిపిస్తున్నారు కాబోలు. నాన్నగారు 8మంది జీయరుస్వామి వార్లను ఒకేవేదికపై సేవించి పరమపదానికి చేరుకుంటే, ఈమె నెల్లూరు లక్ష్మీయాగంలో 7గురు జీయరుస్వాములను సేవించి ఆచార్య తిరువడిగళ్ చేరారు.

2003లో నాన్నగారు పరమపదించిన తరువాత నాకు అన్నీ అయి తీర్చిదిద్దిన తల్లి మాఅక్క. ఆమె గురించి ఎంత చేప్పినా తనివి తీరదు. ఆమెకు తీరని కోరిక ఒక్కటే. ధనుర్మాసంలో నెలరోజులు శ్రీరంగంలో ఉండాలని, కానీ అది తీరకపోవడానికి కారణం గోదాగోపికే. స్వామివారి అనుగ్రహంతో ప్రతిసంవత్సరం భక్తలోకానికి ఆ 30పాశురాలను అందించడంలోనే ఆమె జీవితం అయిపోయింది. ఆమె ధన్యజీవి.

## అమృతమూర్తికి అక్షరాంజలి

డా॥టి.కె.చూడామణి

ఆత్మీయతకి పేరు శ్రీమతి కరి తిరువేంగళమ్మగారు. పెద్దపెద్ద కన్నులు విప్పార్చి అమ్మా! బావున్నారా అని దగ్గరకు తీసుకొనే మాతృమూర్తి దూరమైన దుఃఖం తట్టుకొనడం సాధ్యం కాలేదు. మొన్న ధనుర్మాసం గోదాకల్యాణవేదిక మీద తిరువేంగళమ్మగారు, జానకమ్మగారు నేను-ముగ్గురం చాలా ఆనందంగా కలిశాం. తిరువేంగళమ్మ దివ్యదంపతుల పవిత్రహస్తాలతో మాకిద్దరికీ సన్మానం, బిరుద ప్రదానం జరిపించారు రింగురోడ్డు శ్రీకల్యాణవేంకటేశ్వరస్వామి ఆలయకమిటీ వారు. ముగ్గురు మాతృమూర్తులు విజయనగరంలోనే ఉన్నారు. ఎంత ఆనందం అంటూ మురిసిపోయారు మురిపించారు ఆనాడు తిరువేంగళమ్మగారు తమ అమృతసూక్తులతో మైమరిపించారు. ఆ జ్ఞాపకాలు హృదయంలో శాశ్వతంగా నిలిచిపోయాయి. ఇంతలో.. ఇది నిజమేనా... కాకపోతే.. ఏదో దురాశ.. నమ్మలేని సత్యం.

ఆవిడ వాఙ్మాధుర్యాన్ని మీరే ఆస్వాదిస్తూంటే... ఎలా..! మరిమాకో...! అని అనుకున్నారు శ్రీలక్ష్మీనారాయణులు. అందుకే తమ శ్రీచరణాలలో చేర్చుకొని నాచ్చియార్ తిరుమొళ్ళి సూక్తులు వింటూ ఒకరినొకరు చూసుకుంటున్నారా.. భాగవతసూక్తులు వింటూ... పరవశిస్తున్నారా.. భగవద్విషయ వ్యాఖ్యానాలకి నమ్మాళ్వార్లతో కలిసి తలలూపుతున్నారా.. ఔను... అమ్మ వైకుంఠధామంలో, నిత్యసూరిగోష్ఠిలో తీయతీయగా పాశురాలు, పద్యాలు మైమరచి వినిపిస్తున్నారు.

నెల్లూరులో పరమహంసల దివ్యదర్శనంతో పులకించిపోయారు. శ్రీమహాలక్ష్మీ యాగంలో అన్వయించిన ధన్యురాలు. జగన్మాత తిరునక్షత్రపవిత్ర సంబంధం ఆవిడ జీవితంతో పెనవేసుకుపోయింది. తండ్రి శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారి పాండిత్యానికి, శిష్యవాత్సల్యానికి వారసత్వాన్ని పుణికి పుచ్చుకున్న విదుషీమణి. ఆవిడ దివ్యసాహచర్యంతో పునీతులైన భర్తగారికి మా ఓదార్పు ఇచ్చే ధైర్యమెంత? మాతృసన్నిధిలో ప్రేమతోపాటు భగవద్విషయా నుసంధానాన్ని రుచిచూసిన పుత్రులు ఈ వియోగాన్ని తట్టుకొనడం ఎలా? సోదరులు శ్రీమాన్ శ్రీనివాసాచార్యులుగారు తోబుట్టువు ఆప్యాయతనెలా మరువగలరు? శ్రీమన్నారాయణుడే ఆ శక్తినిస్తాడు. విశేషమేమిటంటే పరమహంసలు, పరమయోగులు అయిన జీయరుస్వాములందరి ఆత్మీయతా మంగళాశాసనములకు నోచుకున్న ధన్యురాలు శ్రీమతి తిరువేంగళమ్మగారు. పండితమండలి అందరూ తిరువేంగళమ్మగారు వచ్చారు.. అని ఆనందంగా ఆహ్వానించే ప్రేమమూర్తి.

సభలలో మా ముగ్గురి ఉపన్యాసాలు ఒకేసారి వరుసగా ఏర్పాటు చేసేవారు. ముగ్గురం ఆనందాన్ని పంచుకుంటూ అన్వయించేవారం. ముగ్గురినీ కలిసి పెద్దలంతా పెద్దమనసుతో అభినందిస్తూ ఉంటే ఎంత తృప్తి! తమ దివ్యసూక్తులతో శాంతిని నింపి భవసాగరంలో కొట్టుకుపోయే ఎంతో మందికి అమృతహస్తాన్ని అందించారు అమ్మ. ఆ తల్లి మాటలతోనే ఈ సిద్ధాంతవైభవం తెలిసింది అని పలికే భక్తులెందరో... అభిమానులెందరో... శిష్యులెందరో...

మానవత్వానికి మరో రూపంగా జీవితాన్ని ఆదర్శవంతంగా నడిపి ఒక ధర్మపత్నిగా, ఆదర్శమాతగా, ఆదర్శమూర్తిగా, సంప్రదాయానికి విశిష్టసేవ లందించిన తిరువేంగళమ్మగారికి దాసోహములు సమర్పిస్తున్నాను.

# "నమోఽస్తు రమణీయ గుణార్ణవాయై"

## స్త్రీ గుణాంబుధికి శిరసాభివందనము

**శ్రీమతి కె.వి. జానకి - విజయనగరము**

**"కొండంత దేవునికి గోరంతదీపం"** అన్నారు మన పెద్దలు. కొండంత మమతకు మారుపేరైన మన అమ్మ శ్రీమతి కరి తిరువేంగళమ్మ మనకు మరి లేరు (భౌతికంగా) అనే వాస్తవాన్ని అంగీకరించలేక వేలాది మనస్సులు కరిగి కన్నీరవుతున్న తరుణమిది. ఆమె పరమపదవార్తతో కమ్ముకుంటున్న శోకమనే చీకటిలో నిస్సహాయంగా నిలుద్దామా! స్నేహదీపాన్ని వెలిగించి ఆమె దివ్యరూపాన్ని సందర్శిద్దామా! పరంధాముని దివ్య కల్యాణ గుణానుభవంతో పరిపూర్ణురాలైన ఆమెను తలచుకొని కొరతపడడం కన్న, ఆమె మంచిగుణాలను మనసారా తలుస్తూ దీపారాధనతో కొలవడమే సమంజసం కదా! ఆమె ఓరిమికి ధరణి, కలిమికి హరిణి, చెలిమికి ప్రేరణి చెలుములరాణి, చైతన్యతరంగిణి, సౌజన్య వసుధారిణి, వినయాన్విత విదుషీమణి, రమణీశిరోమణి. వేదాలు వాల్మీకి చేత రామాయణంగా రూపొందాయి. వేదవేద్యుడైన పురుషోత్తముడు శ్రీరామునిగా రూపుదాల్చేడు. ఆ శ్రీరాముని కల్యాణగుణాలకు ఒక రూపం కనక ఉంటే అదే శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామి వారని ప్రతీతి. ఆ స్వామి వారి గర్భశుక్తి ముక్తామణి మన తిరువేంగళమ్మగారు. సుగుణాంబుధి ఆయన. తద్గుణ సారమీమె. అందుకే తండ్రీ తనయలిద్దరూ సకల జనమనోభి రాములైనారు. అందులో ఆశ్చర్యమేముంది! ఇద్దరూ తమ ప్రవచనాలతో, గ్రంథరచనలతో, ఆకట్టకొనే వ్యక్తిత్వంతో, సత్సంప్రదాయనిష్ఠతో తమ విశిష్టతను విలుపుకున్నారు. అప్పలాచార్యస్వామివారి అనంతరం కూడా ఈమె సంప్రదాయ వారసత్వాన్ని చక్కగా కొనసాగించారు. **"శృంగారయంతి హృదయం గురవః త్వదీయాః"** అన్నట్లుగా

సహజమైనస్త్రీత్వం ఈమెకు పెట్టని ఆభరణం. అదే ఈమెకు గురుత్వాన్ని సమకూర్చింది. తండ్రికి రామనామం తప్ప మరొకటి తెలియదు. తనయకు "కృష్ణ కృష్ణ" తప్ప మరొకటి లేదు. రామభక్తి సామ్రాజ్యానికి చక్రవర్తివారు. కృష్ణభక్తి సాగరంలో తలమునకలయింది ఈమె.

మా విజయుంజేరెడు వన్నెకాదు మదినావేశించు నెల్లప్పుడున్" అంటూ ఆమె చదివే ప్రార్థనాపద్యం ఆమె మదిలో మరొకరికి స్థానంలేదని తెలియ జేస్తూనే ఉండేది. ఇదేం విడ్డూరం! అనిపిస్తోందికదా! ఉనికి ఏదైనా అనుభవం ఒకటే. అటువంటి దివ్యానుభవాన్ని పొందిన వారిద్దరూ ధన్యులు. వారిని మనవారుగా చెప్పుకొనే అదృష్టాన్ని అందుకున్న మనమూ ధన్యులమే.

చూపులో ఆప్యాయత, రూపులో సంప్రదాయం, మాటలో ఆత్మీయత, మనస్సులో మార్దవం తొణికిసలాడే మూర్తి మన తిరువేంగళమ్మ. "ముగురమ్మల మూలపుటమ్మ చాల పెద్దమ్మ" ఆనందాన్ని పంచుకోవాలన్నా, దుఃఖాన్ని దూరంచేసుకోవలన్నా, దోషాన్ని సరిదిద్దుకోవాలన్న మంచినడవడిని అలవరచుకోవాలన్నా నిస్సంకోచంగా కోరి చేరేది ఆ తల్లిదరినే. మనమనసు తెలుసుకొని, మంచి మాటలతో మైమరపించి, సరైన మార్గాన్ని చూపించే చాతుర్యం ఆమె సొంతం. తనశక్తి, తన ఆలోచన, తనవైదుష్యం, తన సమయం మన కొరకు వినియోగించాలనే తపనగల తల్లి మనకు దూరమయిందనే ఆలోచనకు మనం దూరమవుదాం.

**"దూరేఽపి సతాం వసతాం ప్రీతిః కుముదేందువద్భవతి"** అన్నట్లు దూరంగా ఉన్న ఆ తల్లి చల్లని చూపు మనపై ఎల్లకాలమూ ఉంటుంది. తన కుటుంబాన్ని ఉన్నతంగా తీర్చి దిద్దుకోగలిగిన ఉత్తమ ఇల్లాలు ఆమె. వసుధైక కుటుంబినిగా మన హృదయాలలో సదా ఉన్నత స్థానాన్ని అలంకరిస్తుంది.

**"ఇదం శరీరం పరిణామపేశలం పతత్యవశ్యం..."** అన్న కులశేఖరుల మాట ఆమెకు ఒంటబట్టింది. శారీరకమైన అశక్తిని లెక్క చేయలేదు. **"జిహ్వేకీర్తయకేశవం..."** అంటూ ఇంద్రియాలను బుజ్జగించారు. మంచి మాటలు మహనీయుల సమక్షంలో చెప్పాలని, మంచి కార్యక్రమాన్ని మహాత్ములతో కలసి సేవించాలని నిశ్చయించుకున్నారు. దూరప్రయాణపు బడలిక ఆమె మనోనిశ్చయానికి ఆటంకం కాలేదు. దాని తరువాత సామాన్యమైన సాంసారికమైన అనుభవాలకు ఆమె ఇంద్రియాలు ఇష్టపడలేదు. **'మాద్రాక్షం.....మాశ్రౌషం'** అంటూ మొరాయించాయి. దానికి భగవత్సంకల్పం తోడయింది. ఇంకేముంది? ఆనందధామకు ఆమె చేరువయింది. ఎందుకిలా జరిగింది! అనేది చిక్కుప్రశ్న. దీని ఆంతర్యం అంతుబట్టడం కష్టం. అంతలోతుకు మనం దిగవద్దు. "నిందలేనిదే బొందిపోదు" అన్న మాటను గుర్తు చేసుకుందాం కాలనియమనానికి కట్టుబడి ఉందాం!

ఆమెతో నాకున్న అనుబంధం మాటకు, మాటకు మనసుకు కూడా అందనిది. ఈ హఠాత్పరిణామానికి మనసు మూగబోయింది. మాట రావడంలేదు. మా మధ్య స్నేహానికి వయసు, వైదుష్యం అడ్డుకాలేదు. చనువు, సౌహార్ద్రం ఇనుమడించేయి. "అమ్మా! మరీ అంత మార్దవం మంచిది కాదు. కాస్త కాఠిన్యం కూడా అవసరం సుమండీ!" అని ఆమెతో చనువుగా అనేదాన్ని "ఊరుకోవే! జానకీ! అన్నీ ఇలాగే అంటావు!" అంటూ మృదువుగా, మురిపెంగా త్రోసిపుచ్చే సౌశీల్యం ఆమెది. **"జీవితస్సజీవలోకే సుజీవితః.."** అనేది ఆర్యోక్తి, తన వారి అనుభవానికి తగినట్టుగా ప్రేమతో తెరిచిపెట్టిన వాడి బ్రతుకే నిజమైన బ్రతుకు. భక్తామృతానికి (తిరువాయిమొఝ్రి, భగవద్విషయము) విశ్వజనానుమోదనంగా సరళమైన ఆంధ్రవివరణాన్ని అందించి అందరి మన్నన లను అందుకున్న ఘనత మన తిరువేంగళమ్మ గారిది. తనకు భగవంతుడిచ్చిన శక్తికి కార్యరూపాన్నిచ్చి అందరూ అనుభవించేటట్లు చేసిన భాగ్యశాలిని ఆమె. సత్సంప్రదాయ సేవానిరతుల శ్రేణిలో ఆమె చిరస్థాయి కావాలి. "అమ్మ చెప్పిన మంచి మాట" మనకు మంచిబాట కావాలి. ఆమె జీవనం మనకు ఆదర్శం కావాలి. ఆమె ఆత్మీయులందరి హృదయ(నాచ్చియార్ తిరుమొఝ్రి) నిత్యం నివాసినికావాలి. కాయేన, వాచా, మనసా ఆదివ్యమూర్తికి అనేకాభివందనములు.



పరమహంస పరివ్రాజకులు

# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



ఆలయాలు ఆధ్యాత్మిక తత్త్వోపాసన చేసే కేంద్రాలు మాత్రమేకాదు, సమాజాన్ని సన్మార్గంలో నడిపే ఏకతాకేంద్రాలు కూడా. బాధ్యత, సద్భావన కల వ్యక్తులు నేతృత్వం వహించి మార్గదర్శనం చేయాలి. అంతే, ఆ కేంద్రము ఆదర్శవంతమౌతుంది.

దీనికి ప్రత్యక్ష నిదర్శనం నిజామాబాద్ జిల్లాలో "మాపల్లె"గ్రామం, ఊరి అసలుపేరు నర్సింగపల్లె. అయితే అందరూ కలిసి దానిని "మాపల్లె" అని మార్చేసారు. ఊరిలో అన్నిజాతుల వారూ ఉన్నారు. అన్ని మతాలవారూ ఉన్నారు. అన్ని వృత్తులు చేసుకొనేవారూ ఉన్నారు. మిగిలిన ఊళ్ళకీ ఈ ఊరికీ ఎందులోనూ ఏం తేడాలేదు. అయినా అవి 'మాపల్లె'లు కాలేదు. ఈఊరైంది. మిగిలినవీ ఊళ్ళే. ప్రజలే. వీరు అంతే. అయితే వీరి సంస్కారం విలక్షణం. వీరిని అలా తీర్చిదిద్దిన శ్రీమాన్ నరసింహారెడ్డిగారి కృషి అపూర్వం. అందుకే అది 'మాపల్లె' అయింది.

ఓ 9 సం॥రాల క్రితం ఊరిలో గుడికట్టుకోవాలని సంకల్పం కలిగింది, ఆ ఊరికిచెంది, హైదరాబాద్‌లో సినిమారంగానికి, వాణిజ్యరంగానికీ అంకితమై ఉన్న శ్రీమాన్ దిల్‌రాజు వారి సోదరులు శ్రీమాన్ నరసింహారెడ్డి గార్లకి, సొంత ఊరిలో ఏమీలేకపోయినా, ఆ ఊరితో సంబంధం పోకూడదని కొంతస్థలం సేకరించి శంకుస్థాపనకి రమ్మని పిలవడానికి శ్రీచిన్నజీయరు స్వామివారి దగ్గరకొచ్చారు. ఊరిలో ఎందరికి దీనిపై శ్రద్ధ ఉందని శ్రీవారడిగారు. పెద్దగ ఎవరికీ భక్తి, దైవం తెలీదని అందుకే గుడికావాలని వారు చెప్పారు. 'ఊరివారిలో ఏకత సాధించండి. వారందరూ కలిసొస్తే అప్పుడు వారికోసం గుడి.. మీ కోసమే అయితే మీ యింట్లో చాలు కద!' అన్నారు స్వామివారు.

శ్రీమాన్ నరసింహారెడ్డిగారీ మాటలను ప్రేరణగ తీస్కొని ఊరిని సంస్కరించే పని ప్రారంభించారు. కుల, మతాలు అడ్డురాలేదు. అందరూ కలిసారు. తలో చెట్టునాటుకున్నారు. పోషించే బాధ్యత వహించారు. ఊరిని పచ్చగ మార్చారు. గోశాల, త్రాగే R.O. నీటి వసతి కల్పించుకున్నారు. ఊరివారందరూ తలోరాయి, తలోతట్టమట్టి మోస్తూ శిలామయమైన అద్భుతాకారం తో తిరుమల ఆలయానికిది కాపీనా అన్నంత చక్కగ ఆలయం నిర్మించుకున్నారు. తమాషా ఏమిటంటే ఆలయనిర్మాణం, నిర్వాహణలలో నరసింహారెడ్డిగారికి కుడి చేయిగ ఉంటూ బాధ్యత వహించిన ఓ కుర్రవాడు చిరంజీవి జబ్బీర్ అనే ముస్లిం. ప్రభుత్వోద్యోగం మానేసి, ఈ సేవకి అంకితమయ్యాడు. ఊరిలో ఎన్నికలు అవసరం లేని వాతావరణం తయారుచేసుకున్నారు. అందుకే అది 'మాపల్లె' అయింది.

ఎందరెన్ని భయాలు కల్పించినా చెదరని విశ్వాసంతో ఆలయనిర్మాణం పూర్తిచేయించి, ప్రతిష్ఠాభాగాన్ని శ్రీచిన్నజీయరుస్వామివారి శ్రీహస్తాలద్వారా జరపాలని మార్చి 19 నుండి 26 వ తేదీదాక. మన ఆగమ పాఠశాల ప్రాధ్యాపకులైన శ్రీమాన్ ఎస్.శ్రీనివాసాచార్యస్వామి, శ్రీమాన్ ఎమ్. మధుసూదనాచార్యస్వామివార్ల ద్వారా కార్యక్రమాలు జరిపించారు. ఏడుదినాలు అద్భుతంగా కార్యక్రమాలు జరిగి శ్రీవారి శ్రీహస్తాలమీదుగ ప్రతిష్ఠజరిగింది. ఆ క్షేత్రానికి "ఇందూరు తిరుమలక్షేత్ర'మనే పేరు పెట్టుకున్నారు. వేలమందికి ప్రతిరోజు తదీయారాధన జరిగింది. విశేషమేమిటంటే, ప్రసాదశాలలో ఎన్నివేలమంది ఉన్నా ఒక్క శబ్దం కూడా లేకుండా వితరణ జరపడం అలవాటు చేసారు. ప్రసాదం వడ్డించేటపుడు, తినేటపుడు మాటలాడరాదు అనే విషయం వారికిచెపితే, 'ఎన్నో వింటున్నాం, అందులో ఇదోటి' అని విని వదిలివేయకుండా, తు.చ. తప్పకపాటించడం 'మాపల్లె'కు చెందింది. దీనినిబట్టి ఆ ఊరివారిలో పరివర్తన, సాత్త్విక సంస్కారాలను పండించడంలో శ్రీమాన్ నరసింహారెడ్డిగారి కృషి ఎంతటిదో ఊహించవచ్చు.

ఒక వ్యక్తి నిశ్చలభక్తితో, దృఢవిశ్వాసంతో ఓ ప్రయత్నం ప్రారంభిస్తే ఎన్నిరకాల అవరోధాలొచ్చినా చెదిరిపోకుండా నిలబడితే ఎంత మహత్తర ఫలం సాధించవచ్చునో నిరూపించిన గ్రామం 'మాపల్లె'. అందుకే శ్రీ స్వామివారు ఆ కార్యక్రమానికి ప్రత్యేకించి ఆద్యంతాల వరకు ఉండి జరిపించారు. అయితే మధ్యలో మాత్రం ఓ చిన్న అవసరం ఏర్పడింది. మార్చి 24వ తేదీన మేళ్ళచెర్వువద్దనున్న మహాసిమ్మెంట్సు ప్రాంగణంలో శ్రీ వేంకటేశ్వర స్వామివారి ఆలయంలో 15వ వార్షికోత్సవప్రయుక్త కళ్యాణోత్సవం ఉంది. ఆ కళ్యాణసందర్భంగ పంచాంగ ఆవిష్కరించడం కోసం, స్వామికి మంగళాశాసనాలు చేయడంకోసం కోదాడవద్ద మహాసిమ్మెంట్సుకి విచ్చేసి, కళ్యాణంజరిపి, తిరిగివెంటనే 'మాపల్లె'కు విచ్చేసారు శ్రీస్వామివారు.

ఆదారిలోనే 23వ తేదీరాత్రి తొగర్రాయి వద్ద జరిగిన కాన్సర్ శిబిరంలో కూడా శ్రీవారు పాల్గొని గ్రామస్థులకందరికీ మంగళాశాసనాలు చేసారు. విజయవాడ ఆరోగ్యవికాస్ నిర్వహించే శ్రీమతి మాధవి రవీంద్రగార్లు తమ పరివారంతో వచ్చి ఈ శిబిరాన్ని సమర్థవంతంగ జరిపారు.

మార్చి27వ తేదీన మా పల్లెలో ప్రతిష్ఠ, శాంతికళ్యాణం జరగగానే భగవత్కృపాసూచకంగ చిన్న పుష్పవృష్టికురిసి అందరికీ ఆహ్లాదాన్నిచ్చింది. ఆ రాత్రికే శ్రీస్వామివారు జగిత్యాలకు విచ్చేసారు. శ్రీ ఉ.వే. నంబి వేణుగోపాలాచార్య స్వామి ఆ ఊళ్ళో తమ భవనాన్ని జీర్ణోద్ధరణం జరిపి నూతనంగ నిర్మించుకున్నారు. ఆ సందర్భంగ శ్రీశ్రీనివాస, శ్రీసీతారామచంద్ర స్వాములు ఇరువురికీ శాంతికళ్యాణం నిర్వహించారు. శ్రీ స్వామివారు వారికి మంగళాశాసనాలు చేసి, శంషాబాద్ జీవా ఆశ్రమానికి విచ్చేసారు.

29 వ తేదీన మన జీవా సమితి కార్యదర్శి శ్రీమాన్ ప్రొఫెసర్ పి.పురుషోత్తమరావు గారికి ఉస్మానియాయూనివర్సిటిలో ఉద్యోగవిరమణ సభా కార్యక్రమంలో శ్రీస్వామివారు ముఖ్యాతిథిగ పాల్గొని, ప్రొఫెసర్ పురుషోత్తమరావు సాధించిన ఘనకార్యాలకు, కామర్సు విభాగానికి దేశమొత్తంమీద వారు అందించిన సేవలకు మంగళాశాసనాలుచేసారు. గతంలో ఎన్నడూ ఎవరికీ జరగనంత ఘనంగ, దేశం నలుమూలలనుండీ వచ్చిన కామర్సు శాఖ అధిపతులు, అధికారులతో ప్రాంగణమంతానిండి, ప్రొఫెసర్‌రావుకు వీడ్కోలు ఉత్సవం జరిగింది. శ్రీజీయర్‌స్వామివారి చరణ సంబంధంతో తానెదిగానని వారు చెప్పుకోవడం, వచ్చిన అతిథులంతా శ్రీరావుగారి సేవలను ప్రస్తుతించడం, శ్రీరావు వాటిని అంగీకరిస్తూ ఆచార్యకృపగ వాటిని సమర్పించడం, శ్రీరావులోని సంస్కారాన్ని చాటింది. డా॥ సముద్రాల రంగరామానుజాచార్యస్వామి కూడా అతిథిగ కార్యక్రమములో పాల్గొన్నారు.

30వ తేదీన హైదరాబాద్‌లో L.B.నగర్‌లోనున్న శ్రీవైష్ణవసంఘ

మండపంలో వార్షికంగ జరిగే పంచాంగ డైరీల ఆవిష్కరణమహోత్సవంలో శ్రీవారు ముఖ్యాతిథిగ పాల్గొని మంగళాశాసనాలు చేసారు. శ్రీఉ.వే. మహామహోపాధ్యాయ, S.N.C. రఘునాథాచార్యస్వామివారుకూడా ఈ కార్యక్రమంలో పాల్గొని మంగళాశాసనం చేసారు.

ఆ రాత్రికే శ్రీవారు కృష్ణాజిల్లా గన్నవరం వద్దనున్న అంపాపురం గ్రామానికి విచ్చేసారు. ఆ గ్రామంలో 100 సం॥ క్రితం నిర్మించిన శ్రీసీతారామచంద్రస్వామి సన్నిధిలో శతాబ్ది మహోత్సవాల నిర్వహణకోసం వసంతనవరాత్రాలు చేయాలని అక్కడిఆలయకమిటి అధ్యక్షులు శ్రీమాన్ ధనకోటేశ్వరరావుగారు, కార్యక్రమ అధ్యక్షులు శ్రీమాన్ ఎమ్. భవాని కోటేశ్వరరావు ప్రభృతులు ఆహ్వానించారు. ఆదిత్యాకన్‌స్ట్రక్షన్స్ నిర్వాహకులు శ్రీమాన్ కోటేశ్వరరావుగారు, తమ స్థలాలలో శ్రీవారివసతి సౌకర్యాలకోసమే ఓ భవనాన్ని ప్రత్యేకంగ నిర్మించేసారు. వచ్చే భక్తులకు ఓ వసతిని వేరే ఏర్పాటు చేసారు. భక్తులందరికీ తదీయారాధన ఏర్పాట్లు చేసారు. ప్రతిరోజూ ఉదయం సంక్షేపరామాయణం, సుందరకాండ సామూహిక పారాయణం, ప్రవచనాదులు చాల వైభవోపేతంగ సాగాయి. 31వ తేదీన శ్రీవారు 'విజయ' సం॥ వీడ్కోలుపలికి 'జయ' సం॥ స్వాగతం చెపుతూ 'వి' కారాలు తొలగి ప్రజలంతా చైతన్య వంతులై రాబోయేకాలాన్ని ధార్మికంగ, న్యాయబద్ధంగ, అన్యాయాలు అణగేటట్లు, దేశభక్తి, దైవభక్తి పెంపొందేటట్లు తీర్చిదిద్దుకోగలిగే ప్రభుత్వాలని తెచ్చుకోవాలని, కాలపురుషుడాశక్తి ప్రసాదించాలని మంగళాశాసనాలు చేసారు.

7వ తేదీన ఎదుర్కోలు ఉత్సవం అద్భుతంగ జరిపారు భక్తగోష్ఠులంతా. 8వ తేదీనాడు శ్రీసీతారామకళ్యాణం, మనశ్రీవారి పెరుమాళ్ళకు, ఆలయ పెరుమాళ్ళకూ కలిపి వేలాదిభక్తుల సమక్షంలో ఆనందదాయకంగా జరిగింది. అంపాపురంలో శ్రీసీతారామచంద్రస్వామివారి ఆలయ శతజయన్తి మహోత్సవాలు 9వ తేదీనాటి పట్టాభిషేకంతో సార్వభౌమ వర్చస్కంగ సుసంపన్నమైయ్యాయి. కళ్యాణంనాటి కంటే పట్టాభిషేకానికి వేలాదిమంది భక్తజనులు అన్నీ ప్రాంతాలనుండీ తరలిరావడం విశేషం.

ఈ మధ్యకాలంలో శ్రీస్వామివారు బయటకార్యక్రమాలలో 9దినాలు ఉండడం, అందునా మారుమూల గ్రామంలో ఉండడం ఎందరినో ఆశ్చర్య పరచింది. ఆచుట్టుపట్ల గ్రామాలలో రేమల్లెలోని టెక్స్‌టైల్ ఫ్యాక్టరీ, కొన్ని ఆలయాలనూ సందర్శించారు. 7వ తేదీన శ్రీమాన్ G. గంగరాజుగారబ్బాయి చిన్నబుజ్జి విజయవాడలో ఆటోనగర్‌లో అత్యంతాధునికమైన వ్యవస్థతో నిర్మించి లైలాగ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీస్ ద్వారా నిర్వహించే వైజ్ఞానిక పరిశోధనాలయాన్ని అందులోని కార్యక్రమాలనీ సందర్శించి, శ్రీచిన్నజీయరుస్వామివారు అక్కడి వైజ్ఞానికుల నందరినీ మంగళాశాసనాలు చేసారు. ఇలా అంపాపుర కార్యక్రమాలను ముగించి 9వ తేదీ రాత్రి సీతానగరం చేరారు. 11వ తేదీ మధ్యాహ్నం ఒంగోలు జిల్లాలోని కరవది అనే గ్రామంలో హరిజనవాడలోని శ్రీరామాలయాన్ని సందర్శించి, అక్కడి భక్తులకు సంక్షిప్త సందేశాన్నిచ్చి నెల్లూరు బయలుదేరారు. రాత్రికి శ్రీమతి విజయలక్ష్మీ రమణయ్య దంపతుల గృహంలో బసచేసారు. నెల్లూరులో శ్రీశ్రీశ్రీత్రిదండి శ్రీరామచంద్ర రామానుజజీయరు స్వామివారు 15వ లక్ష్మీయాగాన్ని నిర్వహిస్తున్నారు. అందులో పాల్గొని ప్రవచనాన్ని అందించారు.

అలానే 12వ తేదీ ఉదయం కూడా ఆరాధనానంతరం జరిగే కోటితుల స్యర్చనలో పాల్గొని భక్తులకు మంగళాశాసనాలందించారు. నెల్లూరు ప్రజల అదృష్టంవల్ల ఈ స్థాయివైదిక కార్యాలు ఇక్కడ శ్రీజీయర్‌స్వామి వారు నిర్వహిస్తున్నారని కార్యకర్తలందరికీ ఇది గర్వించదగిన అంశమని దీనిని సద్వినియోగం చేసుకోవడం అవసరమని సూచించారు. ఆ వెంటనే బయలుదేరి రాత్రికి తమిళనాడులోని శేలంనగరానికి చేరి కుంభకోణం A.N.S. జ్యూయలరీని, అధినేత శ్రీమాన్ ఉమా శ్రీరామ్‌గారి గృహానికి చేరి బసచేసారు. 13వ తేది లక్ష్మీఅమ్మవారి తిరునక్షత్రం. ఉదయమే మన పెరుమాళ్ళకు తిరుమంజనం, తిరునక్షత్రోత్సవం జరిపారు శ్రీస్వామివారు. అప్పుడే బయలుదేరి సాయం కాలానికి శ్రీరంగంలోని మన మఠం శ్రీవీరరాఘవ రామానుజ కూటం చేరారు.

శ్రీశ్రీశ్రీ రంగనారాయణ జీయరుమఠంలో ఏర్పాటు చేసిన సభలో శ్రీవైష్ణవశ్రీ శ్రీమాన్ కృష్ణమాచార్య, రచించిన శ్రీవారు వేదాన్తదీపం భగవద్రామానుజుల వారి కృతికి తమిళవ్యాఖ్యను విడుదల చేసారు. ఉడయవర్ల సన్నిధికి విచ్చేసి 'శ్రీరామానుజ సహస్రాబ్ది' సమతామూర్తి స్ఫూర్తికేంద్ర నిర్మాణానికి, మే2వ తేదీన పునాదివేసే కార్యక్రమం, ఆపై నిర్మాణంమొత్తమంతా ఏ అవరోధం రాకుండా చక్కగ జరుపుకొమ్మని 'తానాన తిరుమేని' భగవద్రామానుజులు చరమవిగ్రహ సన్నిధిలో విన్నవించారు. ఆపై మణవాళమామునుల సన్నిధిని సేవించారు.

## వైద్యసేవ

గోమఠం వంశస్థులై సేవచేసుకునే శ్రీమాన్ రామానుజస్వామికి కాన్సర్‌వ్యాధి చికిత్స జరుగుతోంది. మొత్తం రూ.8లక్షలు ఖర్చవుతుందని అపోలో హాస్పిటల్ చెప్పింది. ఇప్పటికి రూ.3లక్షలు చెల్లించగలిగారట ఏదైనా సహాయం కావాలని శ్రీస్వామివారిని ప్రార్థించారు. శ్రీవారు హైదరాబాద్‌లోని భట్టరస్వామి ద్వారా సుచరితమ్మను సంప్రదించి రామానుజం స్వామికి మిగిలిన డబ్బు చెల్లించనవసరం లేకుండా చికిత్స జరిగే ఏర్పాటు చేసారు.

13వ తేది చేర్తిసేవ అమ్మరంగనాయకి సన్నిధికి శ్రీరంగనాథుడు వచ్చి ఒక రోజు కలిసి ఉండేది. ఏడాదిలో ఈరోజే, అమ్మవారి తిరునక్షత్రదినాన మాత్రమే. శ్రీరంగంలో 4 బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. అమ్మవారి తిరునక్షత్రంతో ముగిసే ఈ ఉత్సవమే అసలు బ్రహ్మోత్సవం. మిగిలిన మూడూ ఆర్జితోత్సవంగ ఏర్పడ్డ బ్రహ్మోత్సవాలు. ఆర్జితం అంటే ఎవరో ఒక ఉభయదాత కొంతధనమో, పొలమోఇచ్చి దానిపై వచ్చేరాబడితో ఈ ఉత్సవం చేయాలి అంటూ చేసిన ఏర్పాటన్నమాట.

మామూలుగ మన ఆలయాలలో బ్రహ్మోత్సవాలలో భాగంగ పెరుమాళ్ళకి అమ్మవార్లకీ కళ్యాణం జరుగుతుంది. శ్రీరంగంలో చతుర్ముఖ బ్రహ్మగారు ఆ ఉత్సవాన్ని అమ్మవారి పుట్టినరోజుతో ముగిసేట్టుగ జరిపారని గుర్తించవచ్చు. అందుకే రంగనాథుడు ఉదయాన్నే ఆరాధనానంతరం అమ్మవారి సన్నిధికిరావడంతో అక్కడ ప్రణయకలహోత్సవం జరుగుతుంది.

అది, ఆచార్యుల జోక్యంతో సర్దుకొంటుంది. అమ్మవారు స్వామివారిని అంగీకరిస్తారు. ఆపై ఇరువురూ తాయార్ల సన్నిధిలోనే ఓ ఎత్తైన విశాలమైన మండపంలో వేంచేస్తారు. ఆనాటి రాత్రియే అక్కడ భగవద్రామానుజ స్వామి వేంచేసినపుడు 'ఆచేరిక'ను దర్శించి 'శరణాగతిగద్య' ప్రారంభించి 'శ్రీరంగగద్య' 'వైకుంఠగద్య' అనే మూడు కృతులను ఆసువుగ విన్నవించారు. శ్రీరామానుజుల వారి 9గ్రంథాలలో ఈ మూడూ వీరి స్వీయ అభిమతాన్ని తెలిపే గ్రంథాలు. అప్పటినుండే ఆమండపాన్ని గద్యత్రయ మండపంగ కీర్తించనారంభించారు. తెల్లవారేదాక అక్కడే ఉండి శ్రీరంగనాథుడు, బ్రహ్మోత్సవ చివరిభాగంగ రథంలో వేంచేసి చక్రతీర్థమునకు వేంచేస్తాడు. దాంతో ప్రథమ బ్రహ్మోత్సవం ముగుస్తుందన్నమాట.

గతంలో కళ్యాణం జరుగుతూ ఉండి ఉండవచ్చు. కానీ ఏ కారణం వల్లనో ఇప్పుడాపద్ధతి అక్కడలేదు. అసలుదక్షిణదేశంలో 'కళ్యాణం' జరిగే విధానం ప్రాయః కనిపించదు. ఎందుకోతెలియదు. గద్యత్రయ విన్నపము భగవద్రామానుజుల వారే స్వయంగ పెరుమాళ్ళ చేరికలో సమర్పించారు

ఆనాడు. ఆ సందర్భాన్ని తెలిపేట్టు 'చేర్తి' ఉన్నపుడు రామానుజులు వారే విచ్చేసి ఉండి గద్యత్రయానుసంధానం జరగవలసింది. కానీ కారణాలు సరిగా తెలియలేదు. ఆ చేర్తిలో స్వాములంతా ఉండి గద్యత్రయం అనుసంధించి, తర్వాత శాత్తుముత్రై శ్రీరామానుజులవారి సన్నిధికి వెళ్ళి అక్కడ విన్నవిస్తారు. శ్రీస్వామివారు అక్కడవారిని 'రామానుజుల గోష్ఠిలో ఎందుకు వేంచేయడంలేదు? ఏడాదిలో ఒక్కరోజు జరిగేచేర్తిని సేవించడం వారూ కోరుకుంటారుగద! అని అక్కడివారిని అడిగినా, సమాధానం సంతృప్తికరంగ లభించలేదు.

శ్రీ చిన్నజీయరుస్వామివారు చేర్తిని సేవించి శ్రీరామానుజ సహస్రాబ్ది నిర్మాణ విషయం విన్నవించారు. వెంటనే తిరుగుప్రయాణం శేలం, మీదుగ తిరుక్కోవలూరు చేరారు. 14వ తేదీన, మొదటి ఆళ్వార్లు ముగ్గురూ ఒకేచోట చేరి జ్ఞానదీపాన్ని ఆవిష్కరించి స్వామిని దర్శించిన చోటు ఇది. ఎత్తైన త్రివిక్రముడు కుడి పాదం పైకిచాపి, కుడిచేత శంఖం, ఎడమచేత చక్రం పట్టినిలచిన సన్నిధి. వైఖానసాగమంప్రకారం జరిగే 5 ప్రాకారాలున్న ఉత్తమ స్థానం వైఖానస పద్ధతిలోని ప్రాచీన పరంపరగా అర్చకులంతా పంచసంస్కార పరాయణులు. సపాదంగ ఊర్ధ్వపుండ్రాలు ధరించే సదాచార సంపన్నులు.

ఇక్కడ గృహస్థులుగ ఉండే జీయరుస్వామి బిరుదుగల ఆచార్యపురుషులు స్థానాచార్యులు. 'తిరుక్కోవలూరు జీయరు' మఠం అనే దీనిని వ్యవహరిస్తారు. ఆలయమంతా వారి ఆధీనంలో ఉంటుంది. అర్చకులూ వారి ఆదేశాన్ని అనుసరించే ఆరాధనోత్సవాదులు జరపడం అనే ప్రాచీనవిధానం ఇంకా ఇక్కడ సజీవంగ ఉంది. వైఖానసాగమాన్ననుసరించే దివ్యదేశాలలో ఇదే ఉత్తమమైన సన్నిధి. ఇక్కడ సన్నిధి జీర్ణోద్ధరణ జరుగుతోంది మూలవర్లు దారుమూర్తి. జీర్ణోద్ధరణ జరగుతున్నందున బాలాలయంచేసి, గర్భాలయం కూడా సరిచేస్తున్నారు. మూలవిగ్రహానికి తైలంపూసి, పూసి నల్లగ దర్శనమిస్తూ ఉండేవారు. అదంతా తొలగిస్తే లోపల దారువు, అంటే చెక్కతో చేసిన అతిసుందరమైన మూర్తిగ బయటపడ్డాడుస్వామి. ఇప్పుడు ఆమూర్తికి ప్రకృతిసహజమైన రాళ్ళు, ఆకులతో రంగులను తయారుచేసి "వర్ణకలాపం" చేయాలని నిర్ణయించారు. కేరళలో అలా చేయగలిగే నిపుణులున్నారు వారితో చేయిస్తున్నారు.

ఈసందర్భంగ గర్భాలయంలోకిపోయి, ఆవేలసంవత్సరాల ప్రాచీన మూలమూర్తిని స్పృసించి, సేవించే అవకాశం, అదృష్టం ఉంది రమ్మని ఆహ్వానిస్తే ఆభాగ్యాన్ని కోల్పోరాదు అంటూ శ్రీచిన్నజీయరుస్వామివారు 14వ తేది రాత్రికి ఆవూరు చేరి, భక్తబృందం అందరితో గర్భాలయాన్ని దర్శించి, తాకి, తరించి అక్కడకూడా 'సహస్రాబ్దినిర్మాణవిజ్ఞాపన' చేసి బెంగుళూరు మీదుగ 15వ తేదీ మధ్యాహ్నానికి జీవా ఆశ్రమానికి చేరారు.

18వ తేదీన విజయవాడ వద్ద పోరంకిలోనున్న శ్రీవేణుగోపాలస్వామి వారి ప్రాచీనాలయ రాజగోపుర నిర్మాణం జరిగి సంప్రోక్షణకై కోరగ శ్రీవారు జరిపించారు. శ్రీమాన్ రామకృష్ణ దంపతులు కైంకర్యంగ నిర్మించిన ఈగోపురప్రతిష్ఠను వైఖానసాగమ విద్వాంసులు శ్రీమాన్ చక్రవర్తి గారు జరిపించారు. అక్కడినుండి నడిగడ్డపాలెం విచ్చేసి శ్రీమన జీయరుస్వామివారి సన్నిధిలోను శ్రీకోదండరాముడు, లక్ష్మీనారాయణుల సన్నిధిలోనూ సహస్రాబ్ది నిర్మాణానికి అంగీకారాన్ని స్వీకరించి తిరిగి శ్రీస్వామివారు "జీవా" చేరారు.

## తిరునాడలంకరించిన తిరువేంగళమ్మగారు-తండ్రిని మించిన తనయ

గతంలో 12వ తేదీన నెల్లూరులో శ్రీస్వామివారు వేంచేసి ఉన్నపుడు అక్కడికి వచ్చిన శ్రీమతి కరి తిరువేంగళమ్మగారు చూచి పలుకరించారు. ఆ తర్వాత ఆమె అక్కడనుండి కారులో గుంటూరుమీదుగ విజయనగరం బయలు దేరి నగర పొలిమేర దాక చేరి, తెల్లవారుతుండగ జరిగిన రోడ్డుప్రమాదంలో అక్కడిక్కడే అసువులుబాసారు.

సమాచారం శ్రీస్వామివారు శ్రీరంగంలో ఉండగానే, వికాసతరంగిణి కార్యకర్తలద్వారా వెంటనే చేరింది. స్వామివారిదగ్గర నుండే విజయనగరంలోని వారికీ, చుట్టాలకు, పక్కాలకు అందజేయవలసివచ్చింది. కీర్తిమూర్తులైన శ్రీఉ.వే. శ్రీమాన్‌శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారి కుమార్తె శ్రీమతి తిరువేంగళమ్మగారు. ప్రభుత్వపాఠశాలలో అధ్యాపకురాలిగ పనిచేసి విశ్రాన్తురాలైన వీరు తండ్రిగారి సన్నిధిలో వేదాన్తగ్రంథాలు సేవించారు. తండ్రిని మించిన తనయగ తమ ప్రవచనాల ద్వారానే కాక, భగవద్విషయ వంటి ఉత్తమగ్రంథాలను సుందరమైన తెలుగువచనంగ అనువదించారు.

వీరు హైదరాబాద్‌లో కొద్దిరోజుల ఉన్న సందర్భంలోనే దోమలగూడ, జెట్‌లో ప్రతిరోజూ ప్రవచనాలు చేస్తూ ఉండేవారు. ఆ సందర్భంగానే మన జెట్ మహిళా సభ్యురాండ్రు అందరికీ, వీరు శిక్షణనిచ్చి, చక్కగ మాట్లాడ గలిగేటట్లు తయారు చేసారు. భగవద్విషయ కాలక్షేపంచెప్పి, ఆపాశురాలమీద మహిళలు ప్రవచించ గలిగే తర్ఫీదునిచ్చారు. ఇప్పటికీ అది ఎంతో ఉపయోగకరంగ ఉంది. సహజమాతృత్వంతో అమ్మగోరుముద్దలు తినిపించి నట్టు, సూటిగ, అందంగ విషయాన్ని ప్రవచించడం, చెప్పించడంలోనూ తిరువేంగళమ్మగారు వారికివారే సాటి. ఉత్తమ విదుషీమణి.

శ్రీచిన్నజీయరుస్వామివారి విషయంలో వీరికుండే గౌరవం అపారం. వారి ఆదేశంవల్లే తాను భగవద్విషయం వ్రాయగలిగానని ఓ విశ్వాసం. ధనుర్మాసంలో తిరుప్పావై ప్రవచనాలు జరిగే ప్రతిసారి శ్రీవారి మంగళాశాసనాలు తీసుకొనే ప్రారంభించేవారు. అవి అందకపోతే సరిగా ధనుస్సు జరగదని అంటూ ఉండేవారు. శ్రీవారు అమెరికాలో, హ్యూస్టన్‌లో ఉన్నపుడు తిరువేంగళమ్మగారు తమకుమారుని చూడటానికి అదే నగరానికి వచ్చారు. 6నెలలు ఉందామని. అక్కడిమన అష్టలక్ష్మీదేవాలయంలో భక్తులకి ఏమైన నేర్పితే బాగుంటుందని శ్రీస్వామివారు కోరితే, అలాగేనని ఆమె ప్రారంభించారు. అయితే అనారోగ్యకారణంగ అది సాగలేదు. వారుకూడా అమెరికా వదిలి వెంటనే విజయనగరం తిరిగివచ్చేసారు. అక్కడ ఏమీచేయలేక పోయానని బాధవ్యక్తపరచారు.

మాటలో, చేతలో, వ్రాతలో అన్నింటిలోనూ ఓ అవ్యక్తమైన లలిత మాధుర్యం శ్రీమతి తిరువేంగళమ్మగారిలో నిండి ఉందేది. పుణ్యస్త్రీగా వైదిక యజ్ఞకార్యక్రమాలలో పాల్గొని ఆరోగ్యంగా ఉంటూ లక్ష్మీఅమ్మవారి తిరునక్షత్ర దినాన, అనాయాసంగ తిరునాడలంకరించారు. కుమారులను గృహస్థులనుచేసి, వారికి సంతానప్రాప్తి కలిగిందనే సంతృప్తితో బాధ్యతలన్నీ తీరిన ఆమె సంతోషంతోనే తిరునాడు చేరారు. వారి కుటుంబసభ్యులకిది పెద్ద పిడుగు పాటు. వారికే కాదు మన వైష్ణవ సంప్రదాయానికి ఇది తీరనిలోటు. ముఖ్యంగ తిరువేంగళమ్మగారి వంటి విదుషీమణిని కోలుపోవడం మహిళాలోకానికి గొప్పలోటు. అంటూ ఈవిషయాలన్నీ వారి పరమపదోత్సవ సందర్భంలో శ్రీచిన్నజీయరుస్వామివారు స్మరించుకుంటూ శ్రీశ్రీశ్రీత్రిదండి అహోబిలరామానుజ జీయరుస్వామి వారిని తమ ప్రతినిధిగ విజయనగరం పంపారు. శ్రీవారక్కడ మంగళాశాసనాలు చేసారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన **ఏప్రిల్ నెల సమాధానాలందాయి.** విజేత పేరు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం! *గతనెల సమాధానాలు 16వ పేజీలో కలవు.*

**ప్రశ్నలు** **సమాధానాలు**

1. స్వర్ణయుగంగా ప్రసిద్ధి చెందిన కాలమేది?
2. ధర్మరాజు గాంధారి ధృతరాష్ట్రులను గూర్చి ఎవరిని ప్రశ్నించాడు?
3. భీముడు ప్రధాన సేనాపతిగా చేసుకున్న రాజుపేరేమి?
4. సుదర్శన ఎవరు?
5. దుంధుళి ఎవరు?
6. ప్రేత పీడలనయినా పోగొట్టగలిగిన శక్తి దేనికి ఉంది?
7. ప్రాప్తి అని ఎవరిని అంటారు?
8. రామానుజుల గుణాలు ఎప్పుడు నిజంగా ప్రకాశించాయి?
9. పృథివ్యాదులలో పరమాత్మ ఎలా వేంచేసి ఉన్నాడు?
10. శ్రుతప్రకాశికా అనే గ్రంథమును రచించిన వారు ఎవరు?
11. అయోధ్యకి వద్దు, అడవికీ వద్దు ఇక్కడే ఉందాం అని అనుకొన్నవారు ఎవరు?
12. 'అహం స్మరామి మద్భక్తం' ఇది ఎవరి సూక్తి?
13. వేంకటాచలపతికి నాగాభరణాన్ని చేయించినదెవరు?
14. అజగర వృత్తిని అవలంబించడం అంటే ఏమిటి?
15. స్వామి క్షమాగుణాన్ని ప్రధానంగా గుర్తించిన సోత్రాలేవి?
16. యతిరాజ వింశతి అనే స్తోత్రాన్ని ఎవరు రచించారు?
17. భగవంతుని దయాగుణాన్ని వేదాంత దేశికులు ఏ గ్రంథం ద్వారా అనుగ్రహించారు?
18. పరకాలురకు మంత్రోపదేశం చేసిన ఆచార్యులెవరు?
19. దీర్ఘవ్యాధుల నివారణలో తోడ్పడే హోమియో వైద్య అంశమేది?
20. శబరి ఏమి కోరింది?

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేతల పేర్లు:**
మేరెడ్డి నరసింహారెడ్డి–హిమయత్ నగర్, హైదరాబాద్; పి. సుబ్రహ్మణ్యం–విజయవాడ;

**సరియైన సమాధానములు వ్రాసినవారు:** యర్రమిల్లి జయలక్ష్మి–రాజమహేంద్రి; వేగేశ్న రామసీతమ్మ–కాళ్ళకూరు; ఆర్.వి. ప్రభాకరరావు–నల్లగొండ; వై.ఎన్.బి.గుప్త–అమలాపురం; గుడివాడ రాజ్యలక్ష్మి– గుంటూరు; జె. సాయిరెడ్డి–సికింద్రాబాద్; ఐ. వసంతలక్ష్మి–వైజాగ్; పి. సుబ్రహ్మణ్యం–విజయవాడ; బి. సాధుబాబు–విశాఖపట్నం; కుమాందూరి ఇందిర – హైదరాబాద్;

**గత విజేతలు తమ తమ పోస్టల్ అడ్రెస్ వివరంగా సీతానగరం పంపిస్తే వారికి బహుమతులను పంపించగలము. మీ శ్రద్ధాసక్తులకు భక్తినివేదన అభినందనలు అందిస్తుంది. బహుమతులు కూడా పంపిస్తాము.**

మీ చిరునామా
..........................................
..........................................
..........................................
..........................................

**సూచన: సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.**
**భక్తినివేదన సీతానగరం–522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929**





సమగ్ర సమాచార నివేదన

**సంపాదకులు శ్రీమతి టి. అరుణ**


## సత్సంగ సుగంధం – విశేష స్పందన

పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారు "ఒక ప్రాంతం వారంతా కలసి ప్రతీవారం సత్సంగాన్ని నిర్వహించుకోమని ఆజ్ఞాపించారు. ఎవరి ప్రాంతంలో వారు సత్సంగం ఎలా నిర్వహించుకోవాలో సూచనలందించారు.

www.chinnajeeyar.org లో ప్రతినెలా ఒక కొత్త విషయాన్ని అందిస్తూ, నెలలో నాలుగు వారాలు పురాణాలు, ఇతిహాసాలలో ఏదో ఒక విషయంపై చర్చించుకొని తెలియని విషయాలని పెద్దలనడిగి తెలుసుకోమన్నారు. ఈ సత్సంగ కార్యక్రమం ఎలా నిర్వహించుకోవాలో మార్చినెల భక్తినివేదనలో ప్రచురించడం జరిగింది. ఈ కార్యక్రమంపై విశేష స్పందన లభించింది. అనేక ప్రాంతాలలో ప్రతివారం సత్సంగములు నిర్వహిస్తున్నారు. ఒకవీధిలో, ఒక్కొక్క అపార్ట్‌మెంట్లో ఒక నలుగురు కలిస్తే చాలు చిన్న సత్సంగ కార్యక్రమం నిర్వహించుకుంటున్నారు. సత్సంగం నిర్వహించుకొనేవారి స్పందన వారి మాటల్లోనే తెలుసుకుందాం...

"నాపేరు సుధారాణి. మాది విశాఖపట్టణం, MVPకాలనీలో ప్రతివారం శ్రీస్వామివారు ఆదేశించినట్లుగా సత్సంగం నిర్వహించు కుంటున్నాం. ఎప్పుడూ పారాయణ చేసేవాళ్ళం. ఇప్పుడు మంచివిషయాలను చదివి అందరం కలసి చర్చించుకుంటున్నాం. ఇలా అన్నిచోట్ల జరగాలని కోరుకొనే వాళ్ళం. ఇప్పుడు అన్ని ప్రాంతాలలో తప్పనిసరిగా వారానికి ఒకరోజు సత్సంగము నిర్వహించుకుంటున్నందుకు చాలా సంతోషంగా ఉంది. సుధారాణి– MVPకాలనీ, విశాఖపట్టణం. **యం.వి.పి.కాలనీ శాఖ, వికాసతరంగిణి ప్రెసిడెంట్.**

నాపేరు దంటు పద్మ. నేను కొత్తగా వికాసతరంగిణిలో చేరాను. సత్సంగం కార్యక్రమంలో పాల్గొని భగవద్గీత, రామాయణ విషయాల గూర్చి అందరం మాట్లాడుకుంటున్నాం. ఆహారం ఎలా ఉండాలో శ్రీస్వామివారు వెబ్‌సైట్‌లో ఇచ్చిన విషయం చాలా బాగుంది. ఆధ్యాత్మిక ఆటలు, పాటలు, భజనలతో 'సత్సంగం' వచ్చిన వారందరి ఆత్మయతతో ఒక కుటుంబంలా ఉంది. వేసవికాలం చాలా వేడి అని ఎవ్వరూ అనుకోనక్కరలేదు. అందరం వారానికి ఒక్కసారి కలిసి సత్సంగకార్యక్రమంలో పాల్గొంటే వేసవితాపం తీర్చే భగవదమృత పానీయం మనకు వేసవి తాపాన్ని తీరుస్తుంది. పిల్లలు, పెద్దలు, యువత, కాలనీవాసులు అందరూ పాల్గొనే ఈ కార్యక్రమం ఎంతో ఆనందాన్నిస్తోంది. **దంటు పద్మజ, విజయనగరం-** ***బాలాజీనగర్ శాఖ సెక్రటరీ.***

ఇలా ఎందరో తమ అనుభవాలను తెలియజేశారు. కొందరు రామాయణంలో కథలు, కొందరు భగవద్రామానుజులవారి చరిత్ర, కొందరు సంప్రదాయ గ్రంథాలు సత్సంగంలో పఠిస్తూ సంప్రదాయ సుగంధాలను సత్సంగంలో అందిస్తున్నారు.

సత్సంగం శక్తి ఉత్పాదక కేంద్రం. ఏ శక్తిని అందిస్తుంది? ఆధ్యాత్మిక శక్తిని అందిస్తుంది. ఆధ్యాత్మికశక్తి ఆనందాన్ని కల్గిస్తుంది. బాధలలో, మానసిక అశాంతితో నీరసించిన వారికి సత్సంగం బాటరీ రీచార్జింగ్ సెంటర్. భగవన్నామ సంకీర్తన, పెద్దలమాటలు మనలో కొత్తశక్తిని నింపి మనకు తెలియని అనేక విషయాలను తెలియజేసే అద్భుతమైన స్థలం సత్సంగం. మనలో మంచిమార్పుని తీసుకువచ్చే రీఫార్మింగ్ సెంటర్. ఈర్ష్య, అసూయ, కోపం, ద్వేషం తొలగించి సంస్కరించే కేంద్రం సత్సంగం. యువతలో, పెద్దలలో, పిల్లల్లో, మహిళలల్లో అందరి ఆలోచనలలో మార్పు తీసుకువచ్చే ఒక మోటివేటింగ్ సెంటర్ సత్సంగం.

ప్రేరణనిచ్చి మంచి పనికై ప్రేరేపించగల శక్తి సత్సంగానికి ఉంది. అందరిలో శక్తి ఉంటుంది. ఎంతటి కష్టమైన పనినైనా సాధన చేస్తే సాధించవచ్చు. అనే కాన్ఫిడెన్స్ పెంచే కేంద్రం సత్సంగం. ప్రతివారం కొత్త కొత్త కార్యక్రమాలు నిర్వహిస్తూ ఉంటే ప్లానింగ్ ఎలా చెయ్యాలో తెలుసుకోవచ్చు. మనకి మనమే ఆత్మ పరిశీలన చేసుకోవచ్చు. సంకల్పాలను సత్కార్యాలుగా మార్చగల కేంద్రం సత్సంగం. మంచి సంకల్పాలు సత్కార్యాలుగా మారాలి అంటే ముందు విశ్వాసం, ఆత్మీయభావన కలగాలి. అంటే తరచు కలసి అందరితో మాట్లాడాలి. మన సత్సంగాలలో అందరిదీ ఒకే కుటుంబం. వికాస తరంగిణి కుటుంబం. కల్మషంలేని, ప్రేమనిండిన కుటుంబం. మనమంతా శ్రీమన్నారాయణుని సంతానం.

ఒక కుటుంబంలో వ్యక్తులంతా తరచు కలుసుకోవాలి. ఎవరి మనసులో ఏముందో తెలుసుకోవాలి. తెలుసుకున్న దానిని అర్థం చేసుకోవాలి. అర్థం చేసుకొని పనిచేస్తున్న వ్యక్తుల మధ్య ఆత్మీయతా భావాన్ని పెంచుకోవాలి. ఇలా అంతా అన్నిచోట్లా "సత్సంగం" ద్వారా విషయాలను తెలుసుకొని ఆచరించి అందరికీ ఆదర్శం కావాలి.

క్రిందటినెల భక్తినివేదనలో భగవద్గీత-ఆహారపు అలవాట్లు గురించి తెలియజేశారు. ఈనెల www.chinnajeeyar.org వెబ్‌సైట్‌లో ఇంగ్లీషులో విషయాన్ని తెలుగులో యతాతథంగా అనువదించి అందిస్తున్నాం.

**నిశ్చింతకు రెండు చిన్న చిట్కాలు**

ఒకసారి ఆంధ్రప్రదేశ్‌లోని "శ్రీకూర్మం నుండి పూరి" వరకు మన వేదవిద్యార్థులు వేదయాత్ర చేశారు. పూరిలో వారు సముద్రస్నానానికి వెళ్ళారు. అది వారికి ప్రథమ అనుభూతి. ఈ పిల్లలంతా ఒకరిచేతులు ఒకరు పట్టుకుని జాగ్రత్తగా సముద్రంలోకి వెళ్ళారు. కెరటాలు చాలా ఎక్కువగా వీరిని తాకుతూ పోతున్నాయి. కొంతమంది ఆ అలలతాకిడికి అదుపుతప్పి పడిపోయారు. మరికొందరు ఒడ్డుకు (బలమైన కెరటాల ఉధృతికి) కొట్టుకు వచ్చారు. ఈ పిల్లలంతా ప్రశాంతంగా స్నానం చేయడానికి అవకాశం చిక్కడం లేదు.

ఈ జరుగుతున్న సంఘటనంతా దూరం నుండి ఒక బెస్తవాడు గమనిస్తున్నాడు. అతను వాళ్ళ దగ్గరికి వెళ్లి రెండు చిట్కాలు చెప్పాడు. "పెద్ద కెరటం వస్తే తలవంచండి. చిన్న కెరటం వస్తే ఒక గెంతు గెంతండి. అప్పుడా కెరటం తాకిడికి మీరు నెట్టి వేయబడరు. అంతేకాకుండా ఈతలో వున్న ఆనందాన్ని అనుభవించవచ్చు."

ఇది మనకి కూడా ఒక విచిత్రమైన పాఠము కదూ! మన జీవిత ప్రయాణంలో సుఖ దుఃఖాల ఆటుపోటులను ఎదుర్కొనే విషయంలో ఈ చిట్కాలు ఉపయోగించి సాఫీగా జీవితాన్ని సాగించవచ్చు కదా! అయితే ఎలా? మనలో ప్రతి ఒక్కరి జీవితంలో కష్టాలను ఎదుర్కొనవలసి వస్తూ ఉంటుంది. వాటికి మన ప్రతిస్పందన ఎలా ఉంటుంది? ఇదిగో ఇలా....

ఆ రోజుతో యుగాంతం అయిపోయిందని అనిపిస్తుంది. మనం అధః పాతాళంలో పడిపోయి అంధకారంలో ఇరుక్కుపోయినట్లు అనుకుంటాము. మన మీద మనకే చాలా జాలి కలుగుతుంది. జీవితాన్ని ఇక్కడితో అంతం చేసుకుందామా లేదా ఈ పరిసరాలనుండి సుదూరాలకి పారిపోదామని ఆరాటపడతాం.

దీన్ని నుండి తప్పించుకోవడానికి వేరే మార్గమేదైనా ఉందా? సరే ఇటువంటి పరిస్థితులలోనే మనం ఆ బెస్తవారు చెప్పిన సలహా ప్రకారం మనమంతా ఔదార్యంతో కర్మ సిద్ధాంతానికి తలవంచి ఎంతో మహోన్నతుడైన భగవంతుడు మనకు సదా ఎల్లప్పుడూ తోడుగా వున్నాడని, మనల్ని ఎప్పుడూ వదలిపెట్టడని, మనందరి రక్షణాభారం ఆయనే వహిస్తాడనే విశ్వాసంతో వుండాలి. ఈ నమ్మకంతో వుంటే (మనకు ఎదురైన సమస్యలు త్వరలోనే తొలగిపోతాయి.)

అంతే కాకుండా మన జీవితంలో మంచిరోజులు వచ్చే దశకూడా వుంటుంది. ఊహించని ఆనందాన్ని పొందే అవకాశం కూడా రావచ్చు. అప్పుడు మన ఆనందానికి అవధులు వుండవు కదా! మన ఆనందానికి ఆకాశమే హద్దు అవుతుంది. మనల్ని మనమే మైమరచిపోతాము. పైన ఉదహరించిన విషయంలో బాలురు (కుర్రాళ్ళు) చిన్న అలలు తాకిడికి తట్టుకోవడానికి గంతులు వేసి తమ సమతుల్యతను కాపాడుకున్నట్లు, మనం కూడా ప్రతి చిన్న విషయానికి కృంగిపోకుండా ధైర్యంతో ఎదుర్కోవాలి.

ఇలా అయితే మనం ఎటువంటి అవాంతరాలు లేని మృదువైన జీవనప్రయాణాన్ని సాగించి అంతిమ లక్ష్యాన్ని చేరుకోవచ్చు. అంటే ఈ భవబంధాల నుండి విముక్తి పొంది భగవత్‌సేవలో జీవితాన్ని గడపవచ్చు.

పై విషయానికి చక్కటి ఉదాహరణ శ్రీమద్రామాయణంలో సుందరకాండలో హనుమంతుడు ఈ విషయాన్నే స్పష్టంగా తెలియజేస్తాడు. సీతమ్మ కనబడనందుకు ఎంతో బాధపడతాడు. శ్రీరాముని సీతమ్మని ప్రార్థించి వచ్చే ఆపదలను దాటి తనతోటివారితో ఆనందాన్ని పంచుకుంటాడు. సుందరకాండలో హనుమంతుడు ఏ సందర్భంలో ఎక్కడ అంటాడో మీ ప్రాంతాలలో పెద్దలనడిగి తెలుసుకునే ప్రయత్నం చేస్తారు కదూ!

**కరీంనగర్ :** కరీంనగర్ పట్టణంలోని వివిధ ఆలయాలలో శ్రీరామనవమి కల్యాణ మహోత్సవాలకి వచ్చిన భక్తులందరికీ మజ్జిగ, పానకం, మినరల్ వాటర్ అందజేశారు. సప్తగిరి కాలనీ, భగవత్ నగర్, రాంనగర్, విద్యానగర్ వికాసతరంగిణిశాఖ సభ్యులు 11వేలమంది భక్తులకు సేవలందించారు. భక్తులకు ప్రసాద వినియోగం చేశారు. రామానుజ సహస్రాబ్ది ఉత్సవాలగూర్చి తెలియజేశారు.

**ఎస్.ఆర్. నగర్:** హైదరాబాద్ **ఎస్.ఆర్. నగర్:**శ్రీమతి సంధ్యగారు మార్చి మొదటివారంలో సహజసిద్ధ బెల్లం (ఆర్గానిక్)ను శంషాబాద్ గోశాలకు సమర్పించారు. శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారు మంగళాశాసనములతో ఫాల్గుణ పౌర్ణమిరోజు స్నేహితులు, బంధువులతో కలసి 100 కె.జి. బెల్లాన్ని గోశాలకు సమర్పించారు. శ్రీమతి బిందు మోహన్, వారి అబ్బాయి చేత గోవులకు బెల్లాన్ని తినిపించారు. చిన్నతనం నుండి 'సేవ' చేయడం పిల్లలకు అలవాటు చేయాలనే కోరికతో ప్రతీగోవుకు శ్రద్ధగా పిల్లవానితో బెల్లాన్ని తినిపించారు. అందరు తల్లులు ఇలాగే ఆలోచిస్తే ఈ బాలలే యువసేవకులుగ తయారై సేవలందించ గల్గుతారు.

**హౌసింగ్ బోర్డు కాలనీ:** మిర్యాలగూడ వికాసతరంగిణి శాఖ ప్రథమ వార్షికోత్సవాన్ని మార్చి 28న అత్యంత వైభవంగా నిర్వహించారు. ఏరియా ఆసుపత్రిలో చికిత్స పొందుతున్న వారికి పండ్లు, బ్రెడ్ పంచిపెట్టారు. మార్చి 11 నుండి రెండు నెలలు చలివేంద్రాలు ఏర్పాటు చేయుటకు నిర్ణయించి ప్రారంభించారు. 200 మంది సభ్యులతో అనేక సేవలందిస్తున్న హౌసింగ్ బోర్డు శాఖ (మిర్యాలగూడ) వికాసతరంగిణ కార్యకర్తలను పట్టణ ప్రముఖులు అభినందించారు.

**జగ్గయ్యపేట :** ఏప్రిల్ 16న కృష్ణాజిల్లా జగ్గయ్యపేట **మంగొల్ల గ్రామంలో** మహిళా ఆరోగ్య వికాస్ కేంద్ర సమన్వయకర్త శ్రీమతి మాధవీరవీంద్ర పర్యవేక్షణలో ఉచితవైద్యశిబిరం జరిగింది. 171మంది మహిళలకు పరీక్షలు నిర్వహించారు. 63మందికి వి.ఐ.ఎ. టెస్టులు నిర్వహించారు. అమెరికాలో నివసిస్తున్న గాదిరాజు శ్రీకాంత్, తనూజలు ఉచితంగా మందులు అందజేశారు. జగ్గయ్యపేట ప్రభుత్వ ఆసుపత్రి వైద్యాధికారి డా॥ అనీల్‌గారు,

రిటైర్డ్ కల్పన దత్తు మరియు దివ్య, జ్యోతిగార్లు పరీక్షలు నిర్వహించడంలో సహకర మాందించారు. వికాసతరంగిణి సభ్యులు, గ్రామ మహిళలు సేవలందించారు.

**విజయవాడ :** కృష్ణాజిల్లా, విజయవాడ చైతన్య వికాసతరంగిణి కార్యకర్తలు పటమట రైతుబజార్ దగ్గర చలివేంద్రాన్ని ఏర్పాటు చేశారు. తుమ్మల బాబూరావుగారి కుటుంబసభ్యులు సహకారమందించారు. శ్రీశ్రీశ్రీస్వామివారు నిర్వహింప చేస్తున్న వికాసతరంగిణి సేవా కార్యక్రమాలను చలివేంద్ర సమీపంలో ఫ్లెక్సీల ద్వారా తెలియజేస్తున్నారు.

మాఘమాసంమంతా ఆదిత్యహృదయ పారాయణచేసి, వివిధ ఆధ్యాత్మిక సంస్థలతో కలసి కార్యక్రమాలు నిర్వహించే విజయవాడ చైతన్య వికాసతరంగిణి ప్రెసిడెంట్ శ్రీమతి అన్నపూర్ణ ప్రసాదరావు మార్గనిర్దేశంలో చైతన్య వికాస తరంగిణి చక్కట సేవలందిస్తోంది.

**ఏలూరు :** పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు వికాసతరంగిణి కార్యకర్తలు ఏప్రిల్ 4వ తేదీన పాణంగి రోడ్డులో గల రవితేజ చిల్డ్రన్ స్కూల్ (ఎయిడ్స్ పిల్లల పాఠశాల)లో అన్నదాన కార్యక్రమం నిర్వహించారు. 5వ తేదీ శ్రీరామపూజ కార్యక్రమాలు నిర్వహించారు.

**సిద్ధాంతం :** పశ్చిమగోదావరి జిల్లా సిద్ధాంతం వికాసతరంగిణి శాఖ (220) కన్వీనర్ వంగూరి వెంకట రామయ్యగారి ఆధ్వర్యంలో 2014 మార్చి 31 ఉగాది రోజు శ్రీ విజయ గోపాలస్వామి ఆలయ ప్రాంగణంలో శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ, పంచాంగ శ్రవణం కార్యక్రమాలు జరిగాయి. శ్రీరామనవమి సందర్భంగా శ్రీరామాలయంలో సహస్రనామ పారాయణ శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమాలు జరిగాయి.

**జంగారెడ్డి గూడెం :** పశ్చిమ గోదావరి జిల్లా జంగారెడ్డిగూడెం వికాసతరంగిణి కార్యకర్తలు పదవ తరగతి పరీక్ష వ్రాస్తున్న విద్యార్థులకు వేసవి తాపం కలగకుండా మజ్జిగ అందజేశారు. శ్రీ లక్ష్మీనారాయణ వికాసతరంగిణి వారు సుమారు 1200 మందికి మజ్జిగ అందజేస్తున్నారు. సుమారు 50మంది కార్యకర్తలు మజ్జిగ అందిస్తూ విద్యార్థులకు పర్యావరణ పరిరక్షణ గురించి తెలియజేశారు. వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమతి కొల్లూరి శ్యామలాంబ మరియు కార్యదర్శి శ్రీమతి వక్కలగడ్డ హేమ తెలియజేశారు. ఉగాది పర్వదినాన శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ చేసి చలివేంద్రంలో మజ్జిగను అందజేశారు.

**తాడేపల్లి గూడెం :** వికాసతరంగిణి ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. మార్చి 28వ తేదీన ముద్దం సత్యనారాయణ మున్సిపల్ హైస్కూల్‌లో సుమారు 130మంది విద్యార్థులకు పరీక్షలు నిర్వహించారు. ఉత్తీర్ణులైన వారికి శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారి చేతులమీదుగా బహుమతులు అందజేశారు. వాణి పబ్లిక్ స్కూల్ విద్యార్థులకు క్రికెట్ పోటీలు నిర్వహించి గెలుపొందిన టీమ్‌కి బహుమతులు అందజేశారు. "అమ్మా వికాసతరంగిణి" పేరు మీద ఎందరికో తదీయారాధన నిర్వహిస్తున్నారు. సేవా కార్యక్రమాలాన్నిటిని శ్రీమాన్ పి.వి.ఆర్.కె. కుమార్ మరియు వికాసతరంగిణి సభ్యులు చక్కగా నిర్వహిస్తున్నారు.

**వారిజ :** విశాఖపట్టణం వారిజ ఆశ్రమంలో శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో శ్రీరామనవమి సందర్భంగా శ్రీ సీతారామ కళ్యాణ కార్యక్రమం జరిగింది. ఈ కార్యక్రమాన్ని యం.వి.పి. కాలనీ వికాసతరంగిణి సభ్యులు శ్రీ ఒమ్మి వెంకట అప్పమూర్తి, బిందు దంపతులు నిర్వహించారు. శ్రీమాన్ శ్రీకాంతాచార్యులు, సంతోషగురువుగారు, శిష్యులు కార్యక్రమాన్ని అద్భుతంగా నిర్వహించారు. 200 మందికి పైగా భక్తులు ఈ కాదిర్యక్రమంలో పాల్గొన్నారు. ఆశ్రమానికి వచ్చిన భక్తులందరికి అప్పమూర్తి, బిందు దంపతులు తదీయారాధన ఏర్పాటు చేశారు. మధురవాడ వికాసతరంగిణి సభ్యులు శ్రీమతి సుధగారి ద్వార 6 కుర్చీలు వారిజ ఆశ్రమానికి అందించారు. వారిజ కమిటి సభ్యులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

**విజయనగరం:** శ్రీరామభక్త తరంగిణి కార్యక్రమంలో భాగంగా "శ్రీరామ! జైరామ!! జైజై రామ!!! నామం అనేక ప్రాంతాలలో నిర్వహించారు. శ్రీరామకళ్యాణం జరగని గ్రామాలలో రామాలయాలకు విగ్రహాలను, పట్టువస్త్రాలను అందజేసి శ్రీరామకళ్యాణం జరిపించారు. అనేక గ్రామాలలో తిరువీధి ఉత్సవం, ప్రసాద వినియోగం కూడా జరిగాయి. శ్రీరామకల్యాణ ఉత్సవ కమిటి వారు విగ్రహాలను, వర్షక్లాత్ షోరూంవారు 50 గ్రామాలలో కళ్యాణానికి పట్టువస్త్రాలు అందజేశారు. శ్రీ శ్రీనివాస సేవా సంఘం వారు శ్రీరామ భక్తతరంగిణికి ఒక సంవత్సరం ప్రచార రథాన్ని ఇచ్చి ఈ సంవత్సరమంతా ప్రచార కార్యక్రమాలు నిర్వహించడానికి సహకరించారు. శ్రీనివాస సంఘం వారికి వికాసతరంగిణి సభ్యులు కృతజ్ఞతలు తెలియజేస్తూ వాహనాన్ని తిరిగి అప్పజెప్పారు. కార్యక్రమాలన్నిటికి ఎంతగానో సహకారమందించిన శ్రీమాన్ చెరుకూరి శ్రీధర్‌గార్కి, శివరామకృష్ణగార్కి కబుతజ్ఞతలు తెలియజేశారు. శ్రీరామనవమి సందర్భంగా పెద తాడినాడ గ్రామంలో శ్రీమాన్ వరహాలరాజుగారు 9 సంవత్సరాలుగా శ్రీ సీతారాముల కల్యాణం, పట్టాభిషేకం నిర్వహిస్తున్నారు. 9వ సంవత్సరం కార్యక్రమాన్ని వైభవంగా నిర్వహించారు. ఈ సందర్భంగా పేద మహిళలకు వస్త్రాలు అందజేశారు. తదియారాధన నిర్వహించారు. అలకనంద కాలనీ సభ్యులు సుందరకాండ పారాయణ నిర్వహించారు. దాసన్నపేట వికాసతరంగిణి శ్రీరామనవమి కార్యక్రమాలు వైభవంగా నిర్వహించారు.

**సాలూరు :** విజయనగరం జిల్లా సాలూరు మార్చిలో 5 మెడికల్ క్యాంప్‌లు నిర్వహించి సుమారు 550మందికి పరీక్ష చేయించారు. అవసరమైనవారికి డా॥ బి.ఎస్.ఎన్.మూర్తిగారు ఉచితంగా వైద్యం చేసి మందులు అందజేశారు. డా॥ డి. మీనాక్షిగారు స్త్రీలకు పరీక్షలు నిర్వహించారు.

**కవిటి కొత్తూరు :** శ్రీకాకుళం జిల్లా కవిటి కొత్తూరు వికాసతరంగిణి కార్యకర్తలు ప్రతినెల పలు ఆధ్యాత్మిక కార్యక్రమాలను ఉత్సాహంగా నిర్వహిస్తున్నారు. శ్రీ సీతారమ భక్తసేవా బృందంతో కలసి శ్రీరామనవమి సందర్భంగా నగర సంకీర్తన, ప్రవచనం, కళ్యాణం నిర్వహించారు. సుమారు వెయ్యిమంది భక్తులకు తదీయారాధన (అన్నప్రసాదం) నిర్వహించారు. శ్రీమతి అనసూయమ్మగారు కార్యకర్తలు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

# వికాసతరంగిణి-స్మృత్యంజలి

**"త్రిజగన్మోహన నీలకాంతి తనువుద్దీపింప..."** అని రాగయుక్తంగ ప్రవచనం ప్రారంభించే గళం ఆ త్రిజగన్మోహుని సేవించటానికి పరమపదానికి వేంచేసింది. ఏడుపదుల వయస్సు వరకు సప్తస్వరాల సుమధుర సంగీత నాదంలా ప్రవచనాలు చేసిన కోకిల వసంతకాలంలో భూలోకాన్ని వదిలి శ్రీ భూ నీళా సమేత స్వామి సన్నిధికి చేరింది. "అమ్మా" అని ఆప్యాయంగా అందరిచేత పిలిపించుకున్న కరుణామూర్తి శ్రీమతి కరి తిరువేంగళమ్మగారు అమ్మ ఒడికి చేరుకున్నారు. అందరి హృదయాలలో అపారమైన బాధను మిగిల్చి ఏప్రియల్ 13 తెల్లవారుఝామున ఆచార్య తిరువడి నలంకరించారు.

ప్రేమని పంచుతూ సంప్రదాయ సౌరభాలను సమాజానికి అందించిన పరమపదవాసులు శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారి పుత్రికారత్నంగా పుట్టి, తండ్రిగారి బాటలో నడుస్తూ తండ్రిగారి వైభవాన్ని ప్రకాశింపచేసిన ప్రవచన శిరోమణి శ్రీమతి కరి తిరువేంగళమ్మగారు.

1943వ సంవత్సరం భాద్రపదమాసంలో శ్రీమాన్ అప్పలాచార్యస్వామి, తిరువేంగళమ్మగార్ల పుత్రికగా విజయనగరం జిల్లా పద్మనాభం పుణ్యక్షేత్రంలో జన్మించారు. ప్రాథమిక విద్య పద్మనాభంలో జరిగింది. చిన్నతనంలోనే శ్రీమాన్ నరసింహాచార్యులగారితో వివాహం జరిగింది. చదువుకోవాలనే కోరిక, చదువుకోలేకపోతున్నాననే అమ్మగారి తపన గమనించిన నరసింహాచార్యులుగారు. డిగ్రీ వరకు చదివించి, పండిట్ ట్రైనింగ్ రాజమహేంద్రిలో చేయించారు. గ్రేడ్ – 1, గ్రేడ్ – 2 తెలుగు పండితురాలుగా జిల్లా పరిషత్ పాఠశాలల్లో ఉద్యోగం చేసి స్వచ్ఛందంగా పదవీ విరమణ చేసారు. ఆమె ఉద్యోగం చేసే రోజుల్లో విద్యార్థులకు చదువుపై ఆసక్తి కల్గించి, అప్పుడు పాఠాలు చెప్పేవారు. అమ్మగారు విద్యార్థులకి పాఠం చెబుతూంటే సహ ఉద్యోగులు కూడా తమ విశ్రాంత సమయాల్లో అమ్మగారి పాఠం వినటానికి ఆసక్తిగా వచ్చేవారట.

శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారు తిరువేంగళమ్మగారి శ్రద్ధను గమనించి, ఆమెకు పది సంవత్సరముల వయస్సున్నపుడే శ్రీమద్భాగవత గ్రంథాన్ని చదవమని చేతికందించారు. అర్థంకాని విషయాలని వివరించమని అమ్మ అడిగేతీరు చూసి భాగవతం, శ్రీమద్రామాయణం, భగవద్విషయం, శ్రీభాష్యం అన్నింటిని నేర్పించారు. ఉభయవేదాంతాలను క్షుణ్ణంగా నేర్పించిన తండ్రే ఆచార్యులయ్యారు.

తిరువేంగళమ్మగారు తమ పుత్రులైన దాశరథి, వేణుగోపాల్‌కు చక్కటి విద్యలనందిస్తూ ఇంటిపనులు చక్కబెట్టుకుంటూ ప్రవచనాలు, రచనలు చేసేవారు.

శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి ఆజ్ఞమేరకు హైదరాబాద్ జెట్‌లో భగవద్విషయ ప్రవచనాలు చెప్పారు. అందరికి అర్థమయ్యే విధంగా అతి సులభంగా వివరించేతీరు చూసి భగవద్విషయం "ఈడు" వ్యాఖ్యానాన్ని తెలుగులో అనువదించమని శ్రీస్వామివారు సూచించారు. శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారే విశదతమంగా అందించిన వెయ్యి పాశురాల అర్థాన్ని భగవద్విషయ గ్రంథాలుగా తెలుగులో లోకానికందించారు. భగవత్ సౌందర్య పరాజిత మనస్కులైన ఆళ్వారుల భావావేశం చెదరిపోకుండా అలతి అలతి పదాలతో అద్భుత దర్శనం చేయించటం శ్రీమతి తిరువేంగళమ్మగారికే సాధ్యం.

భగవద్విషయం, భాగవత సుధాస్రవంతి, అమ్మ చెప్పిన మంచిమాట, పెరియాళ్వార్ తిరుమొళిలో కొంతభాగానికి తెలుగు వ్యాఖ్యానం, కృష్ణశతకానికి వ్యాఖ్య, నమో నమో యామునాయ, చిన్ని కృష్ణుని చిలిపిచేష్టలు, స్తోత్రరత్నం మొదలైన రచనలు చేశారు. శ్రీ వేంకటేశ్వర భక్తి ఛానెల్, భక్తి ఛానెల్, సి.వి.ఆర్. ఓమ్ ఛానెళ్ళలో ప్రవచనాలు చేశారు, అమెరికా వారికి ఎన్నో సంప్రదాయ విషయాలు నేర్పించారు.

వ్యాఖ్యాన శిరోమణి, ఆధ్యాత్మిక రత్న వంటి బిరుదులతో భక్తజనం, అమ్మగారిని సత్కరించారు. గోపాలదేశిక పురస్కారం, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సాహిత్యరంగంలో అందించిన 2013 ఉగాది పురస్కారాన్ని అందుకున్నారు. ఉభయవేదాంత పండిత సభలలో వారి ప్రవచనం వేదికపై ఆశీనులై ఉన్న పండితులకే కాదు వినడానికి వచ్చిన సామాన్యులకు కూడా "ఎంత మధురమైన మాటతీరు" అనిపించేది. "హితంగా, ప్రియంగా, ఎవ్వరినీ నొప్పించకుండా తన దగ్గరకు వచ్చిన అందరినీ పేరుపేరునా అభిమానంతో పలుకరించే పండిత పుత్రిక మన విజయనగరంలో ఉండడం మన అదృష్టం" అనుకోని వారుండరు.

తండ్రి గురువు తామే అయి అప్పలాచార్యస్వామివారంటే ఎంత భక్తి గౌరవమో, శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారంటే అంతే భక్తి గౌరవము. ఎప్పుడు, ఎక్కడ ప్రవచనాలకి వెళ్ళినా ముందుగా శ్రీ చిన్న జీయరు స్వామివారి మంగళాశాసనములు తీసుకొనే ప్రవచనాలు ప్రారంభించేవారు. తిరువేంగళమ్మగారి ప్రవచనాలలో "మా చిన్న జీయరు స్వామివారు" అని వారి గూర్చి ప్రస్తావించని ప్రవచనం ఉండదు.

భగవంతుని అవతారాలలో శ్రీకృష్ణావతారమంటే అమ్మగారికి అపారమైన ప్రీతి. గోవులను, గోపాల గోపికా వంశ అమాయకులను, అతి సామాన్యులను తరింపచేయటం మా కృష్ణయ్యకి తప్ప ఇంకెవరికి తెలుసు?" అని మురిసిపోయేవారు. యశోదమ్మ కృష్ణుని రోటికి కట్టిన విధానాన్ని 'తజ్జనని లోగిటంగల" పద్యంలో "బొజ్జ" అనే పదాన్ని ఎందుకు పోతనగారు ఉపయోగించారో చెప్పే విధానం అత్యద్భుతం. శ్రీమద్రామాయణం ప్రవచనం చెయ్యాలన్నా "త్రిజగన్మోహన" అనే పద్యంతోనే ప్రారంభిస్తారు. చివరగా అమ్మగారు వరంగల్‌లో తనకిష్టమైన కృష్ణతత్వాన్ని ప్రవచనంగా అందించి అమితానంద భరితులయ్యారు.

శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు చేయించే వికాసతరంగిణి సేవలన్నింటిలో విజయనగరంలో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పాల్గొనేవారు. అమ్మగారి నేతృత్వంలో, మార్గనిర్దేశనంలో ఎన్నో బృహత్తర కార్యక్రమాలు విజయనగరం వికాసతరంగిణి నిర్వహించింది. ప్రార్థన చేస్తే గురువు శిష్యులకి పాఠం చెప్పటం అన్నిచోట్ల జరుగుతుంది. కాని తిరువేంగళమ్మగారు అందరిని రమ్మని వారింట్లో నిత్యం ఏదో ఒక సంప్రదాయ విషయాలని నేర్పించేవారు. "దూరం నుండి రాలేము" అన్నవారి కాలనీలకి వారే ఆటోలో వెళ్ళి మరీ భగవద్విషయాన్ని నేర్పించిన సౌశీల్యమూర్తి. అలకానంద కాలనీలో వారి గృహం 20 సంవత్సరాలుగా తిరుప్పావై, స్తోత్రరత్నం, సుదర్శన శతకం, భగవద్విషయం, ఇరామానుజ నూత్తందాది వంటి ఎన్నో విషయాలను నేర్పించిన సహనశీలి.

సంప్రదాయ సుగంధాలను సమాజంలో వెదజల్లిన శ్రీమతి కరి తిరువేంగళమ్మగారు దివ్యజ్యోతి స్వరూపులై స్వాచార్య శ్రీ చరణ సన్నిధానం చేరారు. భగవంతుని దివ్యధామాన్ని చేరి నిత్యకైంకర్య"శ్రీ"ని పొందిన అమ్మ చెప్పిన మంచిమాటలను మననులో చిరస్థాయిగా నిలుపుకొని నీరాజనాలర్పిస్తున్నాం.

మన వికాసతరంగిణి నిర్వహించే అనేక కార్యక్రమాల్లో ఎంతో ప్రీతితో ఉత్సాహంతో పాల్గొనే ఒక "మనీషిణి" నేలకొరిగింది. మన వికాసతరంగిణికి ఇది తీరనిలోటు. పూడ్చలేని ఈలోటును ఖిన్నహృదయాలతో భావిస్తూ మన సభ్యులు తమతమ శోక సంతాపాన్ని తెలియ పరచారు.

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః

67 సం॥ల నుండి భగవద్బంధువులు ఆదరిస్తున్న ...
ఆధ్యాత్మిక మాసపత్రిక

# భక్తినివేదన








సంపుటి 67 | జూన్ 2014 | సంచిక 3

శ్రీ జయనామ సంవత్సర జ్యేష్ఠమాసము


## పంచాంగ వివరములు

**జూన్:**

8. మృగశిరకార్తె
9. సర్వేషామేకాదశి (నిర్జలైకాదశి), కూర్మజయంతి
10. రామలక్ష్మణ ద్వాదశి, అళగియ సింగర్ తిరు॥
11. నమ్మాళ్వార్ తిరు ॥
12. శ్రీ పరాశర భట్టర తిరు ॥
13. తిరువరంగప్పెరుమాళ్ అరయర్ తిరు॥
14. అవమతిథి
15. మిథున సంక్రమణము సా. 5-31
19. ఉదయాది సార్ధత్రికోటి సహిత యమునానది పుష్కరారంభము
22. ఆర్ద్రాకార్తె
23. సర్వేషామేకాదశి
25. మాసశివరాత్రి
26. పిండపితృయజ్ఞము
27. వటసావిత్రీవ్రతం, అమావాస్య
29. పూరి జగన్నాథ రథయాత్ర

**జూలై:**

2. స్కంద పంచమి
6. తిరుక్కోట్టియూర్ నంబి తిరు॥
7. పెరియాళ్వార్ తిరు॥


వ్యవస్థాపకులు
పరమహంస పరివ్రాజకాచార్య
**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు
శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి
శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. **రంగరామానుజాచార్యులు**

ఉప సంపాదకులు
శ్రీమతి డా॥ T.K. **చూడామణి**

చందా వివరాలు :-
సంవత్సరచందా రూ.225/-
విదేశాలకు సంవత్సరచందా $30/-

మీ సేవలో....
భక్తినివేదన, సీతానగరం - 522 501,
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

D.T.P. & Design by :
పరిశోధనాలయమ్



E-mail : **jetsitanagaram@yahoo.com**
Internet : www.chinnajeeyar.org


## విషయసూచికా




| | | |
|---|---|---|
| *Printed & Published by* | : | H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** |
| *Printed & Published at* | : | **Srijman Printers & processors** : C/o JET, Sitanagaram - 522 501, Guntur Dist., Andhra Pradesh. |
| *Editor* | : | Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh. |

**Sriman Printers & Processors**

సంపాదకీయం

# భగవద్రామానుజులు... ఆలయ పాలనావ్యవస్థ



ఈనాడు బహుచర్చనీయాంశంగా ఉన్న విషయం ఆలయ పాలనావ్యవస్థ. ఈ దేశంలో ఆలయాలకున్న ప్రాచుర్యం ప్రాధాన్యం అంతా ఇంతా కాదు. ఈ ఆధునికకాలంలో ప్రజల్లో, దైవభక్తి బాగా పెరిగిందని లోకం భావించడానికి ప్రత్యక్ష నిదర్శనం ఎక్కడపడితే అక్కడ, ఆఖరుకు రోడ్లకూడళ్ళలోను, రోడ్డుకు (హైవేకికూడా) మధ్యన వెలుస్తూన్న వివిధాలయాలే. ప్రజల్లోకూడా ఆలయాల నిర్వహణపట్ల అవగాహన పెరగడమేకాక, ఆసక్తికూడా పెరగడం ఒకవైపు ఆనందించదగినదే అయినా, మరొకవైపు ఆలయానికి ట్రస్టీయో, మరొకవిధమైన అధికారియో అవడం ఒక విధమైన సామాజికంగా గుర్తింపు పొందడానికి, లేదా రాజకీయంగా ఎదగడానికి ఒక సోపానంగా **'ఆలయ యజమాన్యం'** లో సభ్యులుకావాలని ఉవ్విళ్ళూరడం నేడు ఆందోళనకలిగించే విషయం. ప్రభుత్వాలుకూడా, ఇటీవల కార్పోరేషన్లు, వివిధ సంస్థలకు, చైర్మన్లకు నామినేట్ చేస్తున్నట్లుగా, పెద్దపెద్ద ఆలయాలకు ట్రస్టు బోర్డులను రాజకీయదృక్పథంలో చేయడం, అవి వివాదాస్పదాలుకావడం గమనిస్తూన్నాం.

ప్రభుత్వాల్లో ఉన్నతాధికారులుగా ఉన్నవారుకూడా, ప్రజాసేవకంటే ఆలయాల్లో విశేషాధికారాలుకల అధికారులుగా 'దైవసేవ' (?) చేయడానికే ఉవ్విళ్ళూరడం, తిరుమలతిరుపతిలాంటి ఆలయాల పాలనావ్యవస్థలో తాము ప్రధానభాగస్వాములు కావాలని కోరడం మనం చూస్తున్నాం. నిజంగా వారిలో దైవభక్తి పెరిగో, లేక, ఆలయ వ్యవస్థను బాగుచేయాలనే సద్బుద్ధితోనో అలా ఆలయపాలనావ్యవస్థను చేరే వారైతే ఆనందించవచ్చు. నిజానికి పాలనానుభవంకలవారు ఆలయ పాలకులు కావడం సర్వ స్పృహణీయమే. కాని, చాలా చోట్ల అలా జరగడంలేదు. వారు ఆలయ ధర్మకర్తలతోనో, ఇతరులతోనో చేరి ఆలయవ్యవస్థను భ్రష్టంచేస్తున్న స్థితి భక్తులకు ఆందోళనను కలిగిస్తోంది.

దానికి నిదర్శనంగా పెద్దపెద్ద ఆలయాల్లో ఎన్నో ఆర్థికదోషాలు వెలుగులోకి రావడం, వాటిపై ప్రజలు ప్రతిస్పందించినా ప్రభుత్వాలు మిన్నకుండటం చాలా అనుమానాలకు కారణం అవుతున్నది.

భగవద్రామానుజులకాలంలో, వారి ప్రోత్సాహంతో ఆనాటి ప్రభువులు తాము స్వతంత్రించక, ఆచార్య శాసనాన్ని శిరసావహించి సుస్థిరమైన ఆలయవ్యవస్థకు పునాదులు వేశారని చరిత్ర చెబుతోంది.

భగవద్రామానుజులు తాము ఎన్నో జీర్ణాలైన ఆలయాలను ఉద్ధరించారు. ధూప, దీప, నైవేద్యాలకు నోచుకోని మరెన్నో ఆలయాలను సుస్థిర వ్యవస్థ కలిగించారు. సమాజంలోని విభిన్న వర్గాలవారికి సమాన భాగస్వామ్యం కలిగించారు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అనే స్థూలంగా ఆనాడున్న సామాజిక వ్యవస్థను దృష్టిలో పెట్టుకుని పాలనావ్యవస్థను ఏర్పరచారని శ్రీరంగాదిక్షేత్ర పాలనావ్యవస్థను గమనిస్తే స్పష్టపడుతున్నది.

శ్రీరంగక్షేత్రం వారి మధ్యోత్తర వయస్సుల్లో కార్యనిర్వహణకేంద్రం అయింది. సన్యాసాశ్రమస్వీకారానన్తరం వారి కార్యరంగం బహుముఖీనంగా విస్తరించింది. శ్రీరంగాలయవ్యవస్థను పది అంతరువులతో సుస్థిరపరచారు భగవద్రామానుజులు.

శ్రీరంగాలయవ్యవస్థగురించి 'కోయిల్ఒళుగు' అనే గ్రంథం స్పష్టంగా చెబుతున్నది. భగవద్రామానుజులు ఆ క్షేత్రంలో చేసిన మార్పులు చేర్పులు ఇవన్నీ దానిలో స్పష్టంగా చెప్పబడ్డాయి. గరుడవాహన పండితుడనే పేరుగల భగవద్రామానుజ శిష్యుడువ్రాసిన దివ్యసూరి చరితంలో ఈ విషయాన్ని స్పష్టంగా ఉట్టంకించాడు.

**"భృత్యానాం దశవిధవర్గణాత్ ద్విజానాం**
**శూద్రాణాం యతితిలక స్సతావతాం చ"** అన్నాడు.

ఆ **'దశవిధవర్గణం'** (పదిరకాలుగా సేవకులను విభజించడం) ఎలా సాగిందో కోయిల్ఒళుగు చెప్పింది. వైదికక్రియాకలాపాన్ని వేదవేత్తలైన విప్రులకు అప్పగించి, శూద్రులకు పదివిధాలబాధ్యతలు అప్పగించారట రామానుజులు. వెల్లాలులు, సాళువులు, ఎంబెరు మానడియార్లు, తిరువెలక్కరార్లు, కమ్మాలులు, నేతపనివారు, కుమ్మరులు, నావికులు, నాట్టువానార్లు మొదలైన సామాజిక వర్గాలకు వారి వారి బాధ్యతలు నిర్వచించి ఆలయవ్యవస్థలో భాగస్వాములను చేశారు.

రామానుజులు స్వయంగా ఆయా వ్యవస్థకులు ఎలా పనిచేస్తున్నాయో పర్యవేక్షించేవారు. ఎవరైనా తాముచేసే ఆరాధనాప్రక్రియలో కాని, లేదా సాధారణపాలనలోకాని వ్యవస్థకు భంగం కలిగించడంలాంటివిచేస్తే, వెంటనే దండించే విధానాన్ని ఆనాటి పాలకుల ప్రమేయంతో చేసేవారని ఆనాటి చరిత్రను విశదపరచినవారు స్పష్టంగా పేర్కొన్నారు.

గరుడవాహనపండితుడు, ఈ అభిప్రాయాన్నే

**"శ్రీకార్యప్రతిరోధినః పరికరాన్ రంగేశితుః దుర్మదాన్**

**దూరీకృత్య తదీయకార్యనిరతో రంగప్రతిష్ఠా మివ"**। ఇత్యాదిగా స్పష్టపరచాడు.

స్వామికి జరిపే కైంకర్యానికి ప్రతిరోధకులుగా ఉన్న భృత్యులు మదించి విశృంఖలంగా ప్రవర్తించినప్పుడు, వారందర్నీ ఆ బాధ్యతలనుంచి తొలగించారట రామానుజులు. అపచారపడినవారు సాధారణపాలనాధికారులుకావచ్చు. (E.O., J.E.O లాంటివారన్న మాట) లేదా, వైదికక్రియాకలాపాన్ని నిర్వహించే అర్చకులు మొదలైనవారు కావచ్చు, ఎవరు దోషంచేసినట్లు నిరూపింపబడినా శిక్షించడం అనివార్యం చేశారు రామానుజులు.

స్వామికి ఆరగింపు చేసే పదార్థాలవిషయంలో ఒకరు అపచారపడ్డారు. స్వామికి దధ్యోదనం, నేరేడుపళ్ళరసం వెంటవెంటనే సమర్పించడం గమనించి, దీనివల్ల రెంటి మేళనం విషపరిపాకాన్ని కలిగించేదవడంవల్ల ఈ పనిచేసిన వానిని శిక్షించారట. ఈ విషయాలను గరుడవాహనపండితుడు వ్రాశాడు. స్వామికి ఇలాంటి అపచారాలు జరుగరాదని కట్టడిచేసి, రంగేశునికి ఔషధాన్ని నివేదించే ప్రక్రియను ఆరంభించారట. దాని బాధ్యతను గరుడవాహనపండితునికి అప్పజెప్పారట రామానుజులు. ఈ సన్నివేశాన్ని గరుడవాహనపండితుడే తన కావ్యంలో ఉట్టంకించాడు. దీన్నిబట్టి మనం అవగతం చేసికొన వలసింది ఏమిటి? ఏ ఆలయంలోనైనా ఆరాధనలో నైవేద్యాది సమర్పణలో ఇంకా ఇతరవిషయాలల్లో ఏ విధమైన దోషం జరుగకుండా చూడాలని, ఒకవేళ జరిగితే, జరిపినవారిని బాధ్యులుచేసి శిక్షించాలని, ఈ బాధ్యత నిర్మత్సరంగా వ్యవహరించగల వైరాగ్యసంపన్నులైన యతీశ్వరులు మాత్రమే నిర్వహించగలరని, శ్రీరంగక్షేత్ర పాలనావ్యవస్థ నిరూపించింది.

తిరుమలక్షేత్రంలో భగవద్రామానుజులు జీయర్, ఏకాంగి వ్యవస్థ నేర్పాటుచేసి, పాలనావ్యవస్థను సుస్థిరం చేశారు. ఇక్కడ కూడా దురాచారాన్ని స్పష్టంగా నివారించి నియమ నిబంధనలను ఏర్పాటు చేశారు. వెనుకటికాలంలో పెద్దలకు భగవత్ప్రసాదంగా శేషమాలలు సమర్పించే పద్ధతి ఉండేది. అలా భగవత్సమర్పితంకాని మాలలు శేషమాలలంటూ ధరిస్తే చాలాదోషం.

శ్రీశైలపూర్ణులనేవారి శిష్యులొకరు, భగవర్పితంకాని మాలను ధరించి, ఇది శేషమాల అని ప్రచారం చేశారట. ఈసన్నివేశం తెలిసిన రామానుజులు, ఇకపై కొండమీద స్వామికి తప్ప పుష్పాలంకారాదులు జనులెవ్వరూ చేయరాదని, చివరకు 'శేష' మాలలు కూడా ఎవ్వరికీ ఈయరాదని కట్టడిచేశారు. ఆ నియమాన్ని బట్టి కొండపై పూలు ధరించడం నిషిద్ధం.

శేషమాలలు ఆలయం వెలుపలకు రారాదు. పూల బావిలో వేయడమో లేక విష్వక్సేనులవారికి సమర్పించడమో జరగాలని నియమించారట. ఇలాంటి ఆలయ మర్యాదలను కట్టుబాట్లను E.O లకు J.E.Oలకు, ఇతర ఆలయాధికారులకు ముందుగా స్పష్టంగా తెలియపరచి తరువాతనే వారికి నియమకాలు జరుపడం ప్రభుత్వాల కర్తవ్యం.

ఏ ఆలయం ఏ మర్యాద సంప్రదాయం కలిగి ఉందో, అంటే, శైవమో, వైష్ణవమో లేక శాక్తేయమో, ఆ మర్యాదలు క్షుణ్ణంగా ఎరిగి అమలు చేయగలవారినే నియమించే వ్యవస్థను ప్రభుత్వాలు చేయాలి.

నేటి ప్రభుత్వాలకు, రాజకీయాలకంటే వేరుగా ఆలయ సంప్రదాయాలు, చరిత్ర, మర్యాదలు తెలియని కారణంగాను, తెలిసికొనే ఆసక్తిలేనికారణంగాను, అక్కడ అధికారులుగా నియుక్తులయ్యేవారి "ఇష్టారాజ్యం"గా సాధారణ పరిపాలన, వైదిక పరిపాలనా రెండూ అనాసక్తంగానే "అర్థం", పరమార్థంగా సాగుతున్నాయి. ఇది చాలా శోచనీయం. నియమనం చేయవలసిన బాధ్యతను భగవద్రామానుజుల ద్వారా అందిపుచ్చుకున్న వ్యవస్థల్లో ఉన్నవారే నిర్లిప్తతతో, తమకు లభించే ప్రతిఫలాలు అవికలంగా లభిస్తే చాలనే ధోరణితో వేటినీ పట్టించుకోకుండా కాలక్షేపం చేసే దుర్గతి ఏర్పడిందని సంప్రదాయ మెరిగిన పెద్దలు లోలోన దుఃఖపడుతున్నారు.

కలికాలంలో నేను కన్నులు తెరువను, మాటాడను అని భీష్మించుకొని కూర్చున్న "స్వామికి" కూడా ముసుగువేసి, మాయ చేయగల్గిన మహా మాయావులు తయారౌతున్నారని, ఇప్పటికైనా స్వామి కన్నులు తెరచిచూడవలసి అగత్యం ఎంతైనా ఉందని భక్తులు ఆక్రోశిస్తూన్నారు. అపచారపరులకు శాపనార్థాలు పెడుతున్నారు. "నవ్విపోదురుగాక! నాకేటిసిగ్గు" అన్న తీరులో మనవారి పోకడ కనిపిస్తున్నది. ఈ సహస్రాబ్దిలోనైనా మనస్వామి భగవద్రామానుజులు దురాచార-దురాలోచనాపరుల్లోకూడా మానసిక పరివర్తనం తప్పక తెస్తారని ఆశించడం కంటే మనం చేయగలిగింది ఏముంది?!

*- వేంకట రంగరామానుజాచార్యులు*

# మన సదాచార్య పరంపర

'శాస్త్రరత్నాకర' 'మహామహోపాధ్యాయ' 'కవిశాబ్దికకేసరి'
ఉ.వే.ప్ర. శ్రీమాన్ న.చ. రఘునాథాచార్యస్వామివారు- వరంగల్

**శ్లో ॥ఉపదేశాత్మ కైర్యస్యాః అనుష్ఠానైశ్చసూక్తిభిః ।**

**త్రాతో వైష్ణవలోకస్తాం వందే గురుపరంపరామ్ ॥**

**"సా విద్యయా యా విముక్తయే".... "విద్యాన్యా శిల్పనైపుణమ్"** అనే అనర్ఘదివ్యసూక్తిని బట్టి పరమ పురుషార్థమైన మోక్షమునకు సాధనమైనదే విద్యయని, క్షుద్రలౌకిక ఫలాన్తరములనిచ్చు విద్యను విద్యయనదగదని, అది కేవలము నలుగురి మెప్పునకు ధనార్జనమునకు చేయుగారడీవంటి కళాప్రదర్శన మాత్రమే ననియు స్పష్టమగుచున్నది. మోక్షప్రదమైన అట్టి ఉత్తమవిద్యను తానధికరించి శిష్యునికుపదేశించి సంస్కరింపగలిగినవాడే ఆచార్య శబ్దవాచ్యుడనియు శాస్త్రనిర్ణయము. **"ఆచార్యో వేదసంపన్నః విష్ణుభక్తో విమత్సరః...మంత్రజ్ఞః...సంప్రదాయ సంయుక్తః.... అనన్యసాధనః.. అనన్య ప్రయోజనః... సద్వృత్తః... ఏవమాదిగుణోపేతః.... ఆచార్యస్స ఉదాహృతః..."** ఇత్యాది ప్రమాణములు ఎన్నో ఆచార్యలక్షణమును నిర్వచించియున్నవి. "సిద్ధం సత్సం ప్రదాయే స్థిరధియం... ఇత్యాది శ్రీవేదాన్త దేశిక సూక్తియు పై ప్రమాణవాక్యములకు సారసంగ్రహమే.

ఇట్టివాడే సదాచార్యుడను దృఢనిష్కర్షమును బట్టి ఖ్యాతి, లాభాపేక్ష కలవాడును, తనను పూజించువారిని పదిమందిని వెంటనిడుకొని తిరుగుచూ పూర్వాచార్యుల వచనానుష్ఠానములను వదలి తనకు తోచినదే పరమార్థమని లోకోపదేశమును చేయుచు అర్థార్జనపరుడై స్వోదరపోషణ చేసుకొనవాడును ఆచార్యుడు కాజాలడని స్పష్టమగుచున్నది గదా!

పైగా శాస్త్రనిర్ణీతములైన సదాచార్యలక్షణములేమియు లేక మంచి నడవడికయు లేక కేవల వేషభాషలతో జనాకర్షణము చేయుచూ ధనార్జనకై అనర్హులకును మన్త్రోపదేశము చేయు ఆచార్యుదును, భ్రమపడి ఆచార్యుని వెంటపడిన ముముక్షువగు శిష్యుడును, ఈ ఉభయులును దుర్గతినే పొందుదురనియు ఈ క్రింది ప్రమాణము తెలుపుచున్నది.

**లోభాద్వా యదివామోహాత్-శిష్యంశాస్తి నయోగురుః। తస్మాత్సం శృణుతే యశ్చ - ప్రచ్యుతౌ తావుభౌవపి ॥**

ధనవ్యామోహముచేత ధనవంతుడైన శిష్యుని నిర్మొహమాటముగా శాసింపలేని ఆచార్యుడు గాని, అట్టి ఆచార్యుని పట్టుకొని ఊసులాడు శిష్యుడుగాని, ఎన్నటికిని సద్గతి నొందలేరని దీని సారాంశము.

**"తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్"** అని ఉపనిషత్ చెప్పినట్లు, ముముక్షవైన ఉత్తమశిష్యునికి సర్వలక్షణ సంపన్నుడగు సదాచార్యుని అన్వేషించుకొనుట ఎంత అవసరమో, ఆయా ఆచార్యుడిని **"సద్బుద్ధిః సాధుసేవీ సముచితచరితః తత్త్వబోధాభిలాషీ... శాస్త్రవిశ్వాసశాలీ'** ఇత్యాది శిష్యలక్షణములు గలవానినే వెదకి పరీక్షించి, తన విద్యనుపదేశించుట అవసరమట.

ఆయన అనర్హుడైన శిష్యునికి ఉపదేశించినపుడు **"శిష్యపాపం గురోరపి"** అన్నట్లు, ఆ శిష్యుని పాపం గురువునకు అంటుకొనుట తప్పదట.

ఇక శిష్యునికుపదేశించు ప్రతి ఆచార్యుడు తన ఆచార్యుని శిష్యుడే గనుక, ఈ శిష్యాచార్య లక్షణములు అన్నియు ప్రతి ఆచార్యునికిని ఉండక తప్పదు. శిష్యులందరును విధిగా ఆచార్యులు కాకపోవచ్చునుగనుక, వారు శిష్యలక్షణములను పాటించినచాలును. ఆచార్యులు ఉభయలక్షణ సంపన్నులగుట మాత్రము అత్యవసరము. ఇట్లు ఆచార్యునికిని శిష్యునికిని మోక్షపథమున సంచరించునపుడు స్వీకరింపవలసిన ఈ శిష్యాచార్యులక్షణదీక్ష సునిశితమైన అసిధారావ్రతము వంటిదనుట వాస్తవము.

"నచమాంయో భ్యసూయతి" అని గీతలో శ్రీకృష్ణ పరమాత్మ పలికినట్లు విశ్వాసహీనుడు అసూయాపరుడు విద్యాగౌరవమును కాపాడలేనివాడునగువానికి నన్ను ఉపదేశింపకుము సుమాయని ఆ మంత్రవిద్యగూడ ఆచార్యుని వేడుకొనునట "అసూయకాయమాం మాదాః '' అని. మహోదాత్తములైన ఈ శిష్యాచార్యలక్షణములను సమగ్రముగాకలిగి నిగ్గుదేరిన జ్ఞానానుష్ఠానములతో భాసిల్లినవారు మన పూర్వాచార్యులు అని సంగ్రహముగా దిఙ్మాత్రముగా వివరించుటయే ఈ రచన యొక్క పరమార్థము.

**భగవద్రామానుజులతో ఏర్పడిన ఉభయవేదాన్తములకు చెందిన ఆచార్యపరంపరలు**

శ్రీవైష్ణవసంప్రదాయమునకు ఉపనిషత్తులనబడు సంస్కృతవేదాన్తము, పరమభక్తి సంపన్నులగు పదిమంది ఆళ్వారులు ప్రసాదించిన దివ్యప్రబంధములనబడు ద్రవిడవేదాన్తము, మరియు ఈ ఉభయవేదాన్తములపై అవతరించిన వ్యాఖ్యాన ప్రబన్ధములును ప్రధాన ప్రమాణములు.

ఈ సంప్రదాయమునకు చెందిన ఆచార్యులందరును ఉభయవేదాన్తములపై సమానపరిజ్ఞానము ప్రవచనాధికారము కలవారేయైనను, ప్రత్యేకించి కొందరాచార్యులు తమ ప్రవచన కాలక్షేపము మరియు గ్రన్థరచనను ఒక్కొక్క వేదాన్తము పైననే పరిశ్రమించి కొనసాగించుట చేత శాఖాభేదమును కల్పించి, వీరు సంస్కృత వేదాన్త ప్రవచన పరంపరకు ఆచార్యులని, వీరు ద్రవిడ వేదాన్త ప్రవచన పరంపరకు ఆచార్యులనియు విభాగము చేయక తప్పదు. శ్రీమన్నాథమునులు మొదలుకొని శ్రీపరాశరభట్టరు పర్యంతముగల ఆచార్యపరంపరలో ఆచార్య పురుషులందరును ఉభయవేదాన్త ప్రవచనధురీణులుగాను సర్వప్రామాణికులుగాను పరిగ్రహింపబడిన వారేగాని, ఏ ఒక్క శాఖకో వారి ప్రవచనగోష్ఠి పరిమితము కాలేదు. అంతవరకు అందరును విశిష్టాద్వైత సిద్ధాన్త ప్రతిష్ఠాపన పరిశ్రమను,

శాస్త్రపద్ధతిలోనొక ప్రక్క నిర్వహించుచునే, మరొక ప్రక్క ద్రవిడదివ్యప్రబంధ ప్రవచనప్రచారములను కూడ జనసామాన్యములో ప్రవర్ధింపజేసిరి! అటుపిదపనే ఇతోధికముగా సంస్కృతవేదాన్త సిద్ధాన్త ప్రతిష్ఠాపనావశ్యకతను, ద్రవిడ ప్రబన్ధవైశిష్ట్య ప్రచారావశ్యకతను గుర్తించిన పెద్దలు విడివిడిగనే ఆయా భారములను తమపై ఆరోపించుకొని రెండు శాఖలుగా తమ ఉద్యమమును కొనసాగించుచూ వచ్చిరి. అయితే ఈ రెండు శాఖలును నేడు వడగలై, తెన్గలై భేదములతో వృద్ధదురాగ్రహగ్రహిళమై దుర్భరవైరభావము కలిగియున్న శాఖలవంటివి కావని గ్రహింపదగును. కనుక ఉభయశాఖాప్రవర్తకులకును పరస్పరముగా పరిపూర్ణగౌరవముండినది. భగవద్రామానుజుల తరువాత,వారినుండి ఆరంభమైన ఆచార్యపరంపరను మాత్రమే ప్రస్తుతమున ఉభయశాఖా ప్రవర్తకులైన మహనీయుల వైభవములను, వారిలోని ఆచార్యత్వపూర్తిని వరుసగా ప్రస్తావింతును.

### భగవద్రామానుజులతో దృఢపడిన ఆచార్యపరంపర

సంస్కృత-ద్రావిడ వేదాన్తములను ఆలంబనముగా గొని ఏర్పడిన శ్రీవైష్ణవ సంప్రదాయము భగవద్రామానుజుల కాలమున శతశాఖముగా విస్తరించినది. ప్రధానాచార్య పీఠమును నిర్వహించిన రామానుజులే డెబ్బది నాలుగు ఆచార్య పీఠములను స్థాపించి తమ శిష్యులను తత్తత్పీఠాధిపతులను గావించి, వారి ద్వారా పరంపరగా సిద్ధాన్త ప్రచారము జరుగుటకు దృఢవ్యవస్థను ఏర్పరిచిరి.

అట్టి ఆచార్య పురుషులలో "కూరత్తాళ్వాన్" అనబడువారు ఒకరు.

### కూరత్తాళ్వాన్ వైభవం

మానవ జీవనమునకు నేత్రేంద్రియము ప్రధానసాధన మైనట్లును, అది లేని జీవితము నిష్ప్రయోజనమైనట్లును ఈ కూరత్తాళ్వానుల యొక్క వైభవము శ్రీ వైష్ణవ సంప్రదాయమునకు నేత్రమువంటిది. కనుక వీరి సంబంధం లేనిచో వైష్ణవసిద్ధాన్తమునకు ప్రశస్తియే లేదు. ఆచార్యత్వపూర్తిని బట్టియు, ఉత్తమచారిత్రమును బట్టియు శాస్త్రవైదుష్యమును బట్టియు రామానుజకాలముననే వీరు, ఈ సిద్ధాన్తమునకు మూలస్తంభమువలె విలసిల్లియుండిరి.

కాంచీపురమునకు సమీపమునందుగల "కూరమ్" అను అగ్రహారమునందు అవతరించిన వీరు, సాంగముగా వేద-వేదాన్త ములను అధ్యయనము చేయుటయేకాక మహైశ్వర్యసంపన్నులై యుండిరి. ఐశ్వర్యమునకు తగినట్లు ధర్మతత్పరులై బ్రాహ్మణోత్తములకు, బీదలకును నిరతము అన్నదానము చేయుచుండిరి. ఉదయము నుండి రాత్రి 10-11 గంటల వరకును అవిచ్ఛిన్నముగా వీరి భవనమున భక్తులకు తదీయారాధనము నిత్యమును కొనసాగుచుండెనట. ఆ రోజునకు అన్నదానము పూర్తిఅయి భవనద్వారమును మూసినపుడు ఆద్వారముల గంటల ధ్వని సుమారు పదిమైళ్ళు దూరంలోనున్న కాంచీపురమునకుకూడ రాత్రి 10 గంటలకు వినిపించుచుండెనట. దీనినిబట్టి వీరి ఐశ్వర్యసంపద ఎంతటిదో గుర్తింపవచ్చును. వీరు ఒకనాడు తమ అగ్రహారమునందలి ప్రజలబాగోగులను గుర్తించుటకై అర్ధరాత్రి సమయమున మారువేషముతో గ్రామమును పర్యటించిరి. ఆ సమయంలో ఒక బ్రాహ్మణుని గృహమున ఇంటి యజమానులగు దంపతుల ఆవేదన పూర్వమైన సంభాషణమును వినిరి. ఆ కుటుంబీకుడికి నష్టజాతకురాలగు ఒక కుమార్తె గలదు. ఆ జాతకమును చూచిన వారెవ్వరును వైధవ్యయోగము కలదని చెప్పి వివాహమునకు అంగీకరించకుండిరి. ఆ కారణముగా దుఃఖముతో కుమిలిపోవుచున్న తల్లిదండ్రుల సంభాషణము, వీరి చెవిన పడినది. వయస్సు వచ్చి వివాహము కాని పిల్ల, ఇంటిలోనుండుట ఆనాటి సమాజములో అత్యంతావమానకరమని భావించిన తల్లిదండ్రులు అట్టి అపవాదును తొలగించుకొనుటకై నిగూఢముగా ఆ బిడ్డను హత్య చేయుటకై తలపెట్టినట్లు సంభాషణను బట్టి గ్రహించినవీరు కలతచెంది మరుసటి ఉదయమే ఆ బ్రాహ్మణుని తమ వద్దకు పిలిపించుకొని తమకు కన్యాదానమును చేయమని కోరిరి. కాని ఆ తండ్రి, తన పుత్రిక యొక్క వైధవ్య దుర్యోగముచే వారికపాయము కలుగునని భావించి అందులకు తిరస్కరించెను. కాని ఆ తండ్రికి కన్యచెరను విడపించవలసిన మహోదారులైన ఈ ఆచార్యులు, ఆమెతో దేహసంబంధమును పెట్టుకొన్నప్పుడు కదా నాకు ప్రాణాపాయము! అట్లుకాక జీవితాంతము వానప్రస్థమునే స్వీకరించియుందునని భీష్మప్రతిజ్ఞను చేసిరి. తండ్రిని ఒప్పించి ఆమెను వివాహమాడిరి. ఇది వీరి మహౌదార్యమునకు ఒక ఉదాహరణము.

### సర్వోత్తమాచార్యులు శ్రీమద్రామానుజులు ఉత్తమశిష్యులు కూరత్తాళ్వాన్

వరవరమునీంద్రుల సన్నిధిలో అష్టదిగ్గజ విద్వాంసులలో ఒకరైన శ్రీప్రతివాది భయంకరం అణ్ణన్ స్వామివారు, **"సప్తరత్నమాలికా"** అనుపేరుగల డెబ్బది శ్లోకముల ఒకచిన్న గ్రంథమున **"ఆచార్యత్వోపయుక్తాః మునిజనకథితాః దేశికైః స్వేనచోక్తాః, సర్వే పూర్ణాః గుణాః సముదితవిభవాః సర్వతన్త్ర స్వతన్త్రే. శిష్యత్వేచోపయుక్తాః అథచ గుణగణాః కూరనాథేయథాస్యుః నైవాన్యత్రేతి"**.... అను శ్లోకఖండమున భగవద్రామానుజులే ఆచార్యలక్షణములకు పూర్ణోదాహరణమనియు, శిష్యలక్షణమునకు ఈ కూరత్తాళ్వానులు ప్రధానలక్ష్యమనియు వివరించియున్నారు. ఆ శ్లోకమున సర్వతంత్రస్వతంత్రులుగా కీర్తింపబడినది భగవద్రామానుజులే శిష్యాచార్య లక్షణపూర్తి, వారిద్దరిలోనే కలదు అనిదీని భావము. అతిదీనుడై అలమటించుచున్న ఒక మూగవానికి తమ శ్రీపాదములను చూపి సంజ్ఞలతో తమ పాదములనే శరణమని నమ్మమని అతనికి ప్రబోధించి అతనికి ప్రతిగా తామే భగవంతునికి శరణాగతిచేసి భగవద్రామానుజులు కృపామాత్ర ప్రసన్నాచార్యులైనట్లు చరిత్ర ప్రసిద్ధి కలదు. **"దీర్ఘబన్ధుం దయాళుమ్"** అను ఆచార్య లక్షణములు దీనినిబట్టి వారిలో ప్రస్ఫుటమగుచున్నవి. ఆ సమయమున శ్రీరామానుజులవారి నిర్వ్యాజమైన మహాకృపకు ఆ మూగవానివలె నేను పాత్రము కాలేకపోయితినే! శాస్త్రజ్ఞానముచే

చెడిపోయితినే. అని ఈ కూరత్తాళ్వానులు మిక్కిలి పరితపించిరట! పరిపూర్ణమగు శాస్త్రవిజ్ఞానము, ఉన్నతమగు హారీతకులమున జన్మము, సంపూర్ణైశ్వర్యము మంచి చారిత్రము కలిగియున్న వీరు ఆ మూగవానికి కలిగిన భాగ్యము తమకు లభించలేదే! అని వాపోవుటను బట్టి **"త్యక్తమానః "** అను శిష్యలక్షణము వీరిలో సంపూర్ణముగా ఉన్నట్లు స్పష్టమగుచున్నది. వయస్సునుబట్టి వీరు భగవద్రామానుజులకంటే సుమారు 8 సంవత్సరములు పెద్దవారని చెప్పుదురు. అయినను అత్యున్నత జ్ఞానానుష్ఠానములు గల వీరు **"రామానుజాఙ్ఘ్రి శరణోస్మి"** అని చెప్పుకొని వారి ఆజ్ఞకు పరతంత్రులై ధన్యతనొందిరి.

**ఆచార్యవశ్యత**

**"తమ అభిజాత్యమునకు భంగము కలిగినను ఆచార్యాజ్ఞను అవశ్యము నెరవేర్చవలెను గాని ఉల్లంఘించరాదు"**. అను ఉత్తమ లక్షణము వీరిలో కలదు. అద్భుతమగు ఒక సందర్భమునిందులకు ఉదాహరణముగా చూపవచ్చును.

శ్రీరంగమునందున్న కందాడైవంశమువారు, గొప్ప శిష్యసంపత్తిగల ఆచార్యపీఠమునకు చెందినవారు. కొందరు మహారాజులు కూడ వారికి శిష్యులైయుండిరి. ఆ కందాడై స్వామికి రామానుజ భాష్యమును అధ్యయనం చేయవలెనని కుతూహలము కలిగి రామానుజులవద్ద ప్రార్థింపగా వారు ఈ కూరత్తాళ్వానులను చూపి వీరివద్ద భాష్యమును చదువుకొనమని ఆదేశించిరి. కాని రాజగురువైన ఆ కందాడైస్వామికి ఈ కూరత్తాళ్వానులవద్ద శిష్యరికము చేసి భాష్యాధ్యయనమును పొందుటకు ఇష్టములేదు. అట్లాగని మానుకొన్నచో భాష్యాధ్యయనం జరుగదు. అప్పుడా స్వామి, తన గౌరవమునకు భంగము కలుగకుండునట్లు ఉపాయమునాలోచించి ఎవరికిని తెలియకుండునట్లు ఒక రహస్యస్థలమున తనకు భాష్యపాఠమును చెప్పమని వీరిని కోరెను. వీరు తమ ఆచార్యత్వప్రతిష్ఠను కోరువారు కారు కనుక అట్లేనని అంగీకరించి జనసంచారము లేని తోటలో ఒక మూలకు ఈయనకు భాష్యమును చెప్పుచుండిరి. ఒకనాడు అకస్మాత్తుగా ఆ కందాడైస్వామికి ఆ శిష్యుడైన మహారాజు, తమ ఆచార్యులను దర్శింపవలెనని భాష్యపాఠము జరుగుచున్న ప్రదేశమునకే వచ్చెను. అకస్మాత్తుగా అతనిని చూచిన ఈ కందాడైస్వామికి తన గురువుగారే మరొకరివద్ద శిష్యరికము చేయుచున్నారని రాజు శంకించునేమో? తనకు అవమానకరమైన ఇట్టి సంకటస్థితినుండి తప్పించుకొనుట ఎట్లా? అను ఆవేదన కలిగెను. ఆ స్వామియొక్క ఆరాటమును గుర్తించిన కూరత్తాళ్వానులు వెంటనే అతనిచేతనున్న భాష్యగ్రంథమును తమ చేతిలోనికి తీసుకొని **"అయ్యా! ఈ సూత్రమునకు అర్థమును తెలుపుడు"** అని ప్రార్థించుచూ గ్రంథమును పఠించిరి. ఈ దృశ్యమును చూచి దగ్గరకువచ్చిన మహారాజు, తమ గురువుగారే ఈ వృద్ధశిష్యునికి పాఠమును చెప్పుచున్నారని గ్రహించెను. తమ గౌరవమును కాపాడుకొనుటకై పాటుపడక తామే శిష్యునివలె నటించి ఆ కందాడైస్వామియొక్క గౌరవమును కాపాడిన ఈ కూరత్తాళ్వానుల హృదయవైశాల్యము వాచామగోచరము. అన్ని విధములుగా నిరపాయముగా తానే విజయమును సాధించిపెట్టి అర్జునాదులకు కీర్తిని సంపాదించిన కృష్ణపరమాత్మ వంటి ఉదారస్వభావము ఈ మహాచార్యులొక్కరిలోనే కలదు. ఒక శిష్యునికి భాష్యమును నేర్పి శాంతిని చేసి గ్రంథప్రచారము చేయవలెనను తపనయే తప్ప కీర్తిలాభాపేక్ష అణుమాత్రముకూడా ఈ మహాచార్యునిలో లేదు. ఆత్మాభిమానముగల అట్టి శిష్యునికి కూడా నిరహంకారులైన వీరు, గ్రంథప్రవచనము చేయుటకు రామానుజుల ఆజ్ఞయే మూలకారణమని గ్రహించినపుడు వీరి గుర్వాజ్ఞ పరతంత్రత ఇట్టిది అనికూడా దీనిచే స్పష్టమగుచున్నది.

వీరు వరదరాజస్తవమున **"విద్వేషమానమదరాగవిలోభమోహా ద్యాజానభూమిరహమ్.."** అని తమ నైచ్యమును భగవత్సన్నిధిలో ప్రకటించుకొనిరి. ఇతరులపై ప్రబలద్వేషమును, అహంకారమును ఐశ్వర్యాదులచే ఇతరులనవమానించుచూ అవివేకరూపమైన మదమును, స్త్రీలౌల్యరూపమగు రాగము, ధనములపై లోభమును, దారపుత్రాదులపై మోహము అను ఈ దుర్గుణములన్నింటికి నేనే జన్మస్థానమని చెప్పుకొనియున్నారు. ఇది వారి నైచ్యానుసన్ధానమును, నిరాడంబరతను, ప్రకటించునుగాని ఎంతమాత్రము వాస్తవము కాదనివారి ఉత్తమచారిత్రమునుబట్టి తెలియును. ఇందు అణుమాత్రముకూడ సందేహములేదు. మొదట తమ శిష్యుడైయుండి పిదప ధనలోభముచే రాజునాశ్రయించి ఈ ఆచార్యులవారికే ద్రోహమును తలపెట్టిన "నాలూరాన్" అను మహాపాపిష్ఠికిని కూడా నాకు కలుగునట్టి మోక్షము కలుగవలెనని భగవంతుని వద్ద ప్రార్థించిన ఈ మహాచార్యుని హృదయములో విద్వేషలేశమైన కలదని చెప్పగలమా? వెనుక చెప్పినట్లు శిష్యుని గౌరవమును కాపాడుటకై తామే ఆతనికి శిష్యుడిగా నటించిన ఈ మహాత్మునిలో అభిమానమున్నదని ఊహించగలమా?

భగవంతుని ఐశ్వర్యమువలె తమ ఐశ్వర్యముకూడ గొప్పది అని కొందరు తమను కొనియాడినపుడు భరింపలేక తమ సర్వస్వమును దానముచేసి వైరాగ్యముచే రామానుజులనాశ్రయించిన ఈ మహాశయునిలో ఐశ్వర్యాదిమదము కలదని సంభావించగలమా? వైధవ్యదుర్యోగముగల స్త్రీని వివాహమాడి ఆమెతో దేహసంబంధమును వదలి జీవితాంతము వానప్రస్థులై గడిపిన వీరిలో స్త్రీలపై అనురాగము కలదని శంకించగలమా? **"రేపటి రోజునకు నాకు ఆహారమేది?"** అని విచారింపక ఏ రోజుకారోజు సరిపడు ఆహారమునే సంపాదించుకొను ఉత్తమబ్రాహ్మణుని **"అశ్వస్తనుడు"** అని శాస్త్రములలో వ్యవహరింతురట. మహైశ్వర్యమును త్యజించివచ్చి రామానుజులనాశ్రయించి శ్రీరంగమున భిక్షాటనతో కాలము గడుపుచున్న వీరికి ఒకప్పుడు వర్షాకాలమున అతివృష్టిచే భిక్షావకాశము లభించక పస్తునుండిరట. అంతేకాని కొన్ని రోజులకు సరిపడు ఆహారము నిలవ చేసుకొనలేదట. ఇట్టి మహానుభావునికి లోభగుణము లేశమాత్రమైన కలదని సంభావించగలమా? భగవత్ప్రసాదమహిమచే తమకు లభించిన **"వ్యాస-పరాశర"** అనుపేరుగల కమారులకు వివాహయుక్త వయస్సు

వచ్చినను పట్టించుకొనక భగవంతుడే వారి యోగక్షేమములను గుర్తించువాడని కుటుంబవ్యవహారముపై కూడ ఉపేక్ష వహించిన మహర్షి కల్పులైన వీరికి దారపుత్ర వ్యామోహము కలదని అనుమానించగలమా? ఒక్క వైష్ణవసంప్రదాయముననే కాదు, ఏ ఇతర సంప్రదాయములలో కూడ మొత్తముగా ప్రపంచచరిత్రము పరిశీలించినను ఇట్టి మహాచార్యులెచ్చటను **"న భూతో న భవిష్యతి"** అనుట పరమసత్యము.

**"స్థాలిత్యే శాసితారమ్"** అనునది అచార్యునికి ముఖ్యమైన లక్షణము. శిష్యుడెంతటివాడైనను సంకోచించక అతనిని శాసించి తీరవలెను. ఉపేక్షించినచో శిష్యపాప ఫలము గురువునకు సంక్రమించునట. వీరి అనుగ్రహమునకు పాత్రులైన పలుగురు శిష్యులలో **"పిళ్లైప్పిళ్ళైఆళ్వాన్"** అను ఒక పండితులుండిరి. శ్రీవిద్యాధనాభిజన్మమదములుచే ఆయన తరుచుగా ఇతర శ్రీవైష్ణవులను దూషించుచుండెను. ఇది భగవంతునికి కూడా అసహ్యమైన భాగవతాపచారము. శిష్యునిలో గల ఈ దుర్లక్షణమును మానిపించినచో అతడుజ్జీవించడు సరిగదా! అది తమ ఆచార్యత్వ పూర్తికి కూడ లోపమేనని భావించిన ఈ కూరత్తాళ్వానులు, ఒక సంక్రమణ దివసమున కావేరిలో స్నానమాడుచున్న ఆ శిష్యుని వద్దకువెళ్ళి నాకొక దానమును చేయమని కోరిరి. ఆ శిష్యుడు భక్తితో తన సర్వస్వమును సమర్పింతునని ఆచార్య గౌరవముతో విన్నవింపగా వీరు ఇక ముందెప్పుడును నా జీవితములో మనోవాక్కాయములుచే భాగవతాపచారమును చేయనని వాగ్దానము చేయమని ఆదేశించిరి. అట్లే వాగ్దానముచేసి జాగ్రత్తగా మసలుచుండిన ఆయన ఒకరోజున నిగ్రహమును కోల్పోయి భాగవతదూషణమును చేసి ఆవేశము శాంతించిన పిదప మిక్కిలి ఆవేదన చెందెను. ఈ విషయము ఈ ఆచార్యులవారికి తెలిసి ఆయనకు కలిగిన పశ్చాత్తాపమునకు సంతసించి **"ఇకనెప్పుడును ఇట్లు చేయకుము"** అని శాసించిరి. శిష్యుని శిక్షించుటలో వీరికి గల పట్టుదల దీనిచే అభివ్యక్తమయినది.

ఆచార్యలక్షణములలో **''స్థిరధియమ్''** అను లక్షణము అత్యావశ్యకమైనది. తాను నమ్మిన దైవము పైనను, మతముపైనను అచంచల విశ్వాసము కలిగియుండుట ఆచార్యునిలో యుండదగిన ప్రధానగుణము. ఈ గుణమునకు ప్రధానలక్ష్యము ఈ గురుపుంగవుడే. ఆ రోజులలో చోళదేశమును పరిపాలించుచుండిన ఒక మహారాజు, తాను శైవమతస్థుడైనందున శివపరత్వమును స్థాపించుటకై మిక్కిలి ప్రయత్నించెను. అతనివద్ద ప్రధాన ఉద్యోగిగా ఉండిన **"నాలూరాన్"** అను శ్రీవైష్ణవుడు (ఈతడు కూరత్తాళ్వానులశిష్యుడు) బలవంతముగా నైనను రామానుజులచేతను, కూరత్తాళ్వానులచేతను శివపరత్వము నంగీకరించునట్లు ఆమోదముద్రగా వారిచే సంతకములు తీసుకొన్నచో శివపరత్వము స్థిరముగా నిలచునని రాజునకు సూచననిచ్చెను. ఈ విషయమును ముందుగానే పసిగట్టిన శ్రీవైష్ణవులందరును రాజువలన రామానుజులవారికి అపాయము సంభవించవచ్చునని తలంచి ముందుగానే వారిని శ్రీరంగమునుండి తప్పించిరి. వారు ప్రధానశిష్యులతో భద్రముగా కర్ణాటక ప్రాంతమునకు వెడలిపోయిరి. ఇచ్చట మహారాజు, రామానుజులను రాజసభకు పిలుచుకొనిరండని భటులనాజ్ఞాపించగా ఈ కూరత్తాళ్వానులే కాషాయవస్త్రములను ధరించి మహాపూర్ణులతోపాటు రాజసభకేగిరి. ఆ సభలో శైవులవాదముల నన్నింటిని పూర్వపక్షముచేసి ప్రబలప్రమాణయుక్తులతో నిర్భయముగా విష్ణుపరత్వమునే స్థాపించిరి. సభలోని పండితులందరును వీరి వాదమునంగీకరించినను క్రూరుడైన రాజు ఒక పత్రముపై **"శివాత్పరతరం నాస్తి"** (శివునికన్న పరదైవములేదు) అని వ్రాయించి దీనిపై హస్తాక్షరిని చేయుమని వీరిని ఆజ్ఞాపించెను. వీరు తమ అభీష్టమునకు వ్యతిరేకముగా హస్తాక్షరిని చేయుటకు నిరాకరించగా క్రూరుడైన ఆ ప్రభువు, మిమ్ములను దండింతునని బెదిరించెను. అతని బెదిరింపులోగాని తమ ప్రాణములకు కలగబోవు అపాయమును గాని వీరు లెక్కించక ప్రామాణికమైన నారాయణపరత్వమునందు తమకుగల ప్రగాఢవిశ్వాసమును నిండు సభలో ఎలుగెత్తిచాటిరి. ఉగ్రుడైనరాజు, వారి నేత్రములను పెరికివేయుటకు భటులను ఆజ్ఞాపించగా నీవంటి పాపిష్ఠిని చూచిన ఈ నేత్రములు నాకు లేకపోవుటయే మంచిదని పలుకుచూ తామే గోళ్ళతో తమ నేత్రములను పెరికివేసుకొనిరి. ఆ సంఘర్షణమున వృద్ధులైన మహాపూర్ణులు ప్రాణత్యాగముచేసిరి. ఇట్లు రామానుజదర్శనస్థాపనముకై తమ నేత్రములను కూడా బలిదానముచేసిన ఈ మహనీయుల చిత్తస్థైర్యము, మహావిశ్వాసము, శ్రీవైష్ణవమతమునకు వజ్రకవచమువలె రక్షకమైనది. ఇట్లు దృఢదీక్షతో సిద్ధాన్తమునకు మహాసేవను చేసిన వీరిపై భగవద్రామానుజులకు కూడా శిష్యభావముకాక పరిపూర్ణగౌరవభావమే కొనసాగినది.

ఒకనాడు వీరు, జీవితముపై విరక్తితో శ్రీరంగనాథుని వద్దకు పోయి తమకు శీఘ్రముగా మోక్షమును ప్రసాదించుమని ప్రార్థించిరి. భగవంతుడుగూడ అందులకు వారంరోజులగడువునుపెట్టి ఫలానారోజున తప్పక మోక్షమును ప్రసాదింతునని అభయమునిచ్చెను. వెంటనే వీరు, తమకేకాక, తమ సంబంధం కలవారికికూడ ముక్తిని ప్రసాదించుమని వేడగా **'తథాఽస్తు'** అని భగవంతుడు అనుమతించెను. ఈ సంగతిని విన్న రామానుజులవారు మిక్కిలి కలతనొంది కలగబోవువారి విశ్లేషమును భరించలేకున్నను అది భగవదాజ్ఞయని శిరసావహించి వారు కోరిన వరమును బట్టి వారి సంబంధమునే తమకుకూడా మోక్షమే నిశ్చితమేగదాయని ఆనందపారవశ్యముతో ఎగిరిగంతులు వేసిరట! ఇట్లు ఆచార్యుల హృదయమును పరిపూర్ణగౌరవమును చూరగొన్న ఈ మహాచార్యుల ఉత్తమచారిత్రము శ్రీవైష్ణవమండలికి నాటికిని నేటికిన్ని శిరోధార్యమైనది. వీరు పరమపదించినపుడు భగవద్రామానుజులు తనకు ఒక్కతియే పుత్రికకలదనియు, ఆమె లోకాతీతమైన సౌందర్యాది సద్గుణములు కలది అనియు, ఆ చిన్నబిడ్డను లక్ష్మినివలె పెంచుకొంటి ననియు, కృష్ణుడు ఆమె సౌందర్యమునకు ముగ్ధుడై నాకు చెప్పకుండనే తీసుకుపోయినాడనియు ఒక గోపికయొక్క తల్లి దుఃఖించునట్లు

పెరియాళ్వారులు ఈ పాశురమున వర్ణించిరి. **"ఒరుమకోళ్ తన్నై యుడైయేన్ ఉలకమ్ నిఱైన్దపుకళ్ తిరుమకళ్ పోలవళర్తేన్ శెమ్‌కణ్ మాల్‌తాన్ కొణ్డుపోనాన్"** అను పెరియాళ్వారుల పాశురము ననుసంధించుచూ మూర్ఛనొందిరట. వేలమంది శిష్యులన్నను వీరిపై ఆచార్యులవారికిగల వాత్సల్యము అపారము అనుటకు ఈ ఒక సన్నివేశమే చాలును.

మకరమాసమునందు హస్తానక్షత్రము వీరి అవతారదినము. శ్రీస్తవము, శ్రీవైకుంఠస్తవము, అతిమానుషస్తవము, సుందరబాహు స్తవము, వరదరాజస్తవము, అనబడు 5 స్తోత్రములు వీరిచే రచింపబడినవి. అనేక వేదాన్త రహస్యములు, సంప్రదాయసారార్థములు హృదయఙ్గమమైన భక్తిరసము వీరి స్తోత్రములలో కనబడును. "యమకరత్నాకరము" అను మహాకావ్యము సవ్యాఖ్యానముగా వీరే రచించినట్లు ప్రచారములో కలదు కాని గ్రంథములోని కొన్ని సందర్భములనిబట్టి అదివీరి రచన కాదనియు, ఈ వంశంలోనివారే అర్వాచీనులెవ్వరో రచించిరనియు పెద్దల నిర్ణయము. వ్యాకరణము వీరి అభిమానశాస్త్రమని పంచస్తవిలోని సుశబ్దప్రయోగవైచిత్రిని బట్టి గ్రహింపవచ్చును. వ్యాకరణమహాభాష్యమే మూర్తీభవించి వీరిరూపమున నడచి వచ్చుచున్నదనిభావించిన ఆనాటి పెద్దలు వీరిని **"నడైయాడు పాతంజలమ్"** అని వ్యవహరించుచుండిరట. వీరి వ్యాకరణపాండిత్యము అనన్యసాధారణమైనది అని తెలుపుటకు ముక్తకముగా వీరురచించి రామానుజులవారికి పంపిన ఈ క్రింది శ్లోకమే ప్రబల నిదర్శనము.

**శ్లో॥ త్రిస్రోఽష్టకాః అయానాఖ్యాః ధీవిశేషవతాం నృణామ్ ।**
**తత్ర పశ్చిమ పూర్వం మాం నహ్యత్యన్తాయ మధ్యమః ॥**

ఈ శ్లోకమున వ్యాకరణ శాస్త్రార్థము, అష్టాక్షరీ మహామంత్ర సంప్రదాయార్థముకూడ ఇమిడియున్నది.

చోళరాజుచే, కలిగిన సంక్షోభముబట్టి రామానుజులవారు కర్ణాటక ప్రాంతముననే పలు సంవత్సరములు ఉండిపోవలసివచ్చినది. ఆ సమయమున శ్రీరంగమునందే యుండిన ఈ ఆచార్యులవారు, చిన్న తాళపత్రముపై ఈ శ్లోకమునువ్రాసి వార్తాహరుని ద్వారా రామానుజులవారికి పంపినట్లు ప్రసిద్ధికలదు.

(అష్టకాః) అనగా "అష్టాధ్యాయీ" అను వ్యాకరణశాస్త్రమును పఠించినవారు, వారు తమ వ్యాకరణశాస్త్రములలో ఒకసూత్రముచేత (ధీవిశేషతాం నృణాం) బుద్ధిమంతులగువారికే తెలియునట్లు, (త్రిస్రః ఆఖ్యాః) మూడు సంజ్ఞావాచకపదములను, (అయాన్) సాధించి పెట్టియున్నారు. (తత్ర) ఆ మూడుసంజ్ఞలలో, (పశ్చిమ) చివరపదముచే బోధింపబడు ఓస్వామీ! (పూర్వంమాం) మొదటిపదముచే బోధింప బడునన్ను, (మధ్యమః) నడుమనున్న పదమునకువాచ్యుడగు ఒక నీచుడు, (అన్తాయ) నశింపజేయుటకు, (నహ్యతి) బంధించుచున్నాడు. అని శ్లోకమునకు బాహ్యార్థము. ఆ శ్లోకమేదియో తెలిపినవారికి గాని ఇందలి రహస్యము బయటపడదు. వ్యాకరణమున 'అస్తినాస్తి దిష్టంమతిః' అని ఒకసూత్రముకలదు. ఈ సూత్రమునుబట్టి "ఠక్" అను ప్రత్యయమురాగా 'ఆస్తికః నాస్తికః దైష్టికః' అను మూడుపదములు వరుసగా సిద్ధించును. (అస్తిపరలోకాదికమితి మతిఃయస్య) పరలోకములు, పుణ్యపాపముల, దృష్టిగోచరముగాని జీవేశ్వరులు ఇట్టి పదార్థములుకలవని శాస్త్రముచే నమ్మువాడు ఆస్తికుడు, వాటిని బొత్తిగానమ్మనివాడు (నాస్తీతి మతిః యస్య) నాస్తికుడు. (దిష్టం ఇతి మతిఃయస్య) దైవమే సర్వకారణమని నమ్మువాడు దైష్టికుడు అని ఆ సూత్రముచే సిద్ధించిన మూడుపేర్లకును అర్థము. ఇందు చివరిదైన "దైష్టిక" పదముచే బోధింపదగిన దైవవిశ్వాసముగల ఓ రామానుజా! ప్రథమపదమైన ఆస్తికశబ్దముచే చెప్పబడినట్లు పరలోకాదులను జీవేశ్వర తత్త్వమును గ్రహించి విశ్వసించిన ఆస్తికుడనైన నన్ను, మధ్యమపదమైన నాస్తికశబ్దముచే బోధింపదగిన చోళభూపాలుడు (అంతాయనహ్యతి) చంపుటకు ప్రయత్నించుచున్నాడు. అని దీనిభావము. ఈ అంతరార్థము రహస్యముగా సందేశరూపమున రామానుజులువారికి పంపబడింది.

దీనికి సంప్రదాయపరముగాకూడా మరొక అర్థమున్నది. **అష్టకాః** అనగా అష్టాక్షరమహామంత్రనిష్ఠులు, వారు ఆ మంత్రములోని మొదటిపదమైన ప్రణవముచే ఈశ్వరునికే జీవుడు శేషభూతుడని తెలుపబడును అనియు, చివరిపదమైన "నారాయణాయ" అనుపదముచే నారాయణకైంకర్యమే ప్రధాన ప్రయోజనమని బోధితమనియు, మధ్యమమైన "నమః" పదముచే ప్రాకృతరూప విరోధివర్గము నివారింపబడుననియు పూర్వాచార్యుల సమన్వయము. ఈ విధముగా చూచినపుడు (నారాయణాయ) భగవత్ కైంకర్యనిష్ఠుడవైన ఓ రామానుజా! ప్రణవ బోధితమైన శేషత్వజ్ఞానము కలిగియున్న నన్ను విరోధివర్గమునకు చెందిన చోళభూపాలుడు అంతము నొందించదలంచినాడు, అనికూడా భావమును చెప్పవచ్చును. *(సశేషం)*

అదృష్ట రత్నాలు ధరించండి! అనుకున్నది సాధించండి!
శ్రీ సాయి
పవిత్ర డైమండ్స్
4/7, బ్రాడీపేట, ఖజానా జ్యూయలర్స్ ప్రక్కన, గుంటూరు. సెల్: 9246410099, ఫోన్: 2262626.
బి/3, జైహింద్ కాంప్లెక్స్, గ్రౌండ్‌ఫ్లోర్, యాక్సిస్‌బ్యాంక్ ప్రక్కన, గవర్నర్‌పేట, విజయవాడ. సెల్: 9246310099, ఫోన్: 6665011.
సంపూర్ణ జ్యోతిష్యం చూడబడును
నాణ్యమైన జాతిరత్నాలు
జెమ్ టెస్టింగ్ ల్యాబ్
కెంపులు పచ్చల పూసలు
మంచి ముత్యములు, పగడములు
శివస్వరూపమైన రుద్రాక్షలు
స్పటికమాలలు
1 గ్రామ్ గోల్డ్ ఇమిటేషన్ జ్యూయలరి

# ఆచార్య పరమాచార్య పరిచర్య

## భగవద్రామున భగవద్రామానుజ జీవన దర్శనములు

'పరమపదవాసులు' ఉ.వే.ప్ర.శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యస్వామివారు.
హైదరాబాదు

శ్రీమద్యామున మునులు పరమాచార్యులు. వీరికి ఆళవందారులని ద్రావిడ నామం. భగవద్రామానుజులు జగదాచార్యులు. వీరిరువురు శాస్త్రజననికి సల్పినసేవ చాలా గొప్పది. వారిరువురిని గురించి వారొనరించిన సేవను గురించి కొంచెము ఈ వ్యాసములో అందించ డానికి ప్రయత్నించడం జరిగినది. జగదాచార్యులు, రామానుజులు పరమా చార్యులైన యామునుల పదధ్యానముతో పరమార్థమును సంపాదించుకొని ప్రపంచానికి పంచిపెట్టినారు. దీనిని వారొనరించిన పరమాచార్య పరిచర్యగా భావించవచ్చును. వీరిరువురు కావించిన పరిచర్యనే కొంచెము మనమను సంధించుకొనిననూ అది మనము వారిరువురికిని సల్పునట్టి పరిచర్య కావచ్చును. అందుకని ఈ చిన్ని ప్రయత్నము.

ఈ మహానుభావులిద్దరు కూడా శ్రుతిమాత యొక్క శోకాశ్రువులను తుడిచివేసిన ఘనులు. ఆ తల్లి మాటకపార్థము కల్పించువారి ఆటకట్టించ జాలిన మేటి మేధా సంపత్తి వీరిసొత్తు. వేదాంత విద్యావీధులలో నాటికిని ఆరిపోని వెలుగులు వెదజల్లిన దివ్య ధిషణా దీప శిఖాకృతులు ఈ బహుశ్రుతులు. అవిద్యాంధకార ప్రధ్వంసనము పట్ల పరమాచార్యులు ప్రచండ చండ కిరణులైతే జగదాచార్యులు సకల కలా పరిపూర్ణ సుధాంశు బింబస్వరూపులే. వీరిలో పరమాచార్యుల పలుకులు దారుణా ఖండల శస్త్ర తుల్యములు కాని, జగదాచార్యుల నిండు మనమ్ము నవ్య నవనీత సమానము. ఈ ఆచార్యులిద్దరు కూడా అజ్ఞానపు సుడిగుండములో జడమువలె పడి తిరుగు అస్మదాదులనే కాక, కుదృష్టి కుహనా ముఖమున పడి గుణములను ఆకారమును కూడా కోల్పోవుచున్న పరమాత్మను కూడా తమ అమృతాక్షర శీతల కరములతో పైకెత్తి ప్రశాశింపజేసిన పరమ దయామయులు.

### యమునార్య వైభవము

పరమాచార్యులైన యామునుల ప్రభావమెంత గొప్పదో? అనుసంధించుకొందాం. వీరవతరించిన దివ్యస్థలం వీరనారాయణపురము. వీరి తాతగారు శ్రీరంగనాథులు. వీరికే నాథమునులని వ్యవహారం. వీరి పితృదేవులు ఈశ్వరనామధేయులు. వీరికి యామునేయులని పేరుపెట్టిన వారు శ్రీరామ మిశ్రులు. వీరి బాల్యము తాతగారి నయనాల దీప్తులలో ఆటలాడుకొనినది. వారి వాత్సల్య పీయుష రసధునులలో క్రుంకులిడినది. ఇట్లు మన బాల యామునేయులు కడిగిన ముత్తెముల కాంతి నంతటిని సొంత మొనరించుకొనినారు. సకలవిద్యా మాతృమూర్తి శ్రుతిరమణీమణి, ఈ బాల భాస్కరుని ప్రతిభాపీఠమునధిష్ఠించినది. పితామహ శ్రీనాథముని బాంధవ్యముతో భాసిల్లు నిరుపమాన దార్శనిక సుధాసందరి, మన యామునేయ ముక్తామణి ప్రణయ బంధమున మెరిసిపోయినది. మురిసిపోయినది. కమనీయ కవితా గాథ పరీరంభణము ఈ కుమార యామున హృదయ కుహర సీమలనలరించినది.

ఇక మహాభాష్య భట్టారక శ్రీచరణ సన్నిధిలో అధ్యయన మొనరించిన శాస్త్రగ్రంథ జాతమెట్టిదో మనకు తెలియదు. కాన వీరి గురుకులము ఈ యామున కిశోరరత్నమునకు సర్వశాస్త్రార్థ సామ్రాజ్య పట్టాభిషేక స్థలమైనది. అంతేకాదు ఈ మహాభాష్య భట్టారకుల అంతే వాసిత్వమే మన కుమార యామునులకు చోల దేశార్ధ రాజ్యలక్ష్మీ స్వయం వరానికి దారి తీసినది. శ్రీరంగనాథ మునులు, స్వయం కృషితో పెంచిపోషించిన దివ్యాద్భుత జ్యోతిర్మయ యోగవిద్య, ఉపదేశపరంపరగా కుమార యామునుల దరిజేరిన జాడలు కన్పించవు. ఐతే వారి వాత్సల్య భరితహార్దిక మంగళాశాసనములతో వివిధశక్తి సమంచిత ప్రౌఢ పాండితీ పాటవము మన యామున కుమారుల అంతరాంతరాలను ఉద్దీపిత మొనరించినది. తనంతటి పండిత ప్రకాండము ఇంకనూ వెదక వలసినదే తప్ప దొరుకునది కాదని పండిత మండలీ పరిమండితమగు రాజసభలో సింహనాద మొనర్చ గలిగినంతటి ఆత్మవిశ్వాసము మన యామున పంచాననులకు కలిగింప జేసినది, పితామహులు సంక్రమింప జేసిన వివిధ శక్తి విశేషమే యనవలసి యున్నది. విద్యజ్జన కోలాహలునితో వాదగోష్ఠీ ప్రారంభ సమయమున ఆశుధారారూపమున మన యామున కిశోర ముఖారవిందము నుండి వెలువడిన ఈ స్రగ్ధర్మ పద్యబంధము పాండిత్య వీరమునకు ప్రథమోదాహరణమనదగినది.

**ఆ శైలాదద్రి కన్యా చరణ కిసలయన్యాస ధన్యోప కణ్ఠాత్**
**ఆ రక్షో నీత సీతా ముఖకమల సముల్లాస హేతోశ్చ సేతోః ।**
**ఆ చప్రాచ్య ప్రతీచ్య క్షితిధర యుగలాదర్క చన్ద్రావతం స్యాత్**
**మీమాంసాశాస్త్రయుగ్మ శ్రమ విమలమనా మృగ్యతాం మాదృశోఽన్యః॥**

"పార్వతీదేవి పాదన్యాసములతో పరిపూతమైన ప్రాంతముగల హిమాలయముదాకనూ, రావణాసురుడప హరించి కొనిపోయిన సీతాదేవి ముఖారవిందమును సంతోష పరచు సేతువుదాకనూ, సూర్యచంద్ర భూషిత ములగు ఉదయాస్తాచలముల దాకనూ, వేదార్థ విచారమొనరించు రెండు శాస్త్రములలో పరిశ్రమ సల్పి మనోమాలిన్యమును ప్రక్షాళిత మొనరించు కొనిన, నావంటి పండితుడిని వెదకండి దొరకడు" అన్ని ఈ శ్లోకము యొక్క తాత్పర్యము. ఇంతేకాదు తమగురుకులానికి వచ్చిన రాజభటులకు తన పరిచయ పత్రముగా ఈ క్రింది శ్లోకమును వ్రాసిచ్చినారట యామునేయులు.

**నవయం కవయస్తు కేవలం, నవయం కేవలట తన్త్ర పారగాః।**
**అపితు ప్రతివాది వారణ ప్రకటాటోప విపాటన క్షమాః॥**

"మేము కవులము మాత్రమే కాదు. మేము శాస్త్ర విద్వాంసులము మాత్రమే కాదు. మరేమంటే ప్రతివాదులనెడు మదపుటేనుగులు ప్రకటించు గర్వమును ఖండించు దక్షత కలవారము" అని ఈ శ్లోకము యొక్క తాత్పర్యము. ఈ శ్లోకములు మన యామునేయుల ప్రతిభను ప్రకాశింప చేయుచున్నవి.

చోల రాజేంద్ర సభాభవనమునకు సకల మర్యాదలతో మన యామున సుధీమణి విచ్చేసినారు. ఈ మహాభాగుని ముఖవర్చస్సునకు మహారాజ పట్టమహిషి మురిసిపోయినదట. ఈ కుమార సింహమే విజయము నవలీలగా హస్త గతమొనరించుకొనగలడని మహారాజు చెవిలో నూదినదట! ఐతే అర్ధరాజ్య మాతని పరం చేద్దామన్నాడట మహారాజు. ఓహో! ఏమి వాదగోష్ఠియో! వెయ్యేండ్ల క్రిందటి విద్వత్కవిమత్తేభ పంచాననుల విద్యాకవితా మహాటవీ వీరవిహారాలు అరి భయంకర ఘీంకారాలు, శ్రుతి మనోహర సింహనాదాలు, విన్నవారే విద్వాంసులు. కన్నవారే కవిపుంగవులు! నమస్సదసే...... విజయలక్ష్మితో పాటు మన యామున యువరాజును రాజ్యలక్ష్మి కూడా వరించినది. యామునేయ యౌవనము వివిధ విషయ భోగాలతో తేలియాడుచున్నది. విద్యావిలాసిని కనుమరుగైనది. కవితా కామిని కబుర్లన్ని గాలిలో కలిసిపోయినవి. వీరి పితృ పితామహులు యశోమాత్ర శరీర ధారులైనట్లున్నారు. ఐతే నాథమునుల శిష్యులు శ్రీరామ మిశ్రులున్నారు. యామున యువరాజుకు నామకరణ మొనరించిన వారు వీరే. యామునుల పేరును చిరస్థాయిగా చేయగలిగినవారు కూడా వీరే.

(శ్రీమద్యామునుల భవ్యరచరితమును ఆముక్త మాల్యద అనుప్రబంధమున శ్రీకృష్ణ దేవరాయలవారు సుందరంగా నిబంధించారు.)

ఈ శ్రీరామ మిశ్రులకు రాజభవన ప్రవేశానుమతి దుర్లభమైనది. యువరాజుల వారికిష్టమైన కూరను శ్రీరామ మిశ్రుల వారు పాచక స్వాముల కందించెడివారు. కొన్ని నెలల తరువాత కాని శాకోపయోగియగు కూరను ప్రతిదినము సమర్పించు శ్రీరామ మిశ్రులకు యువ రాజులుం గారి దర్శనము కాలేదు. దర్శనమైన తరువాత శాకమర్పించినందుల కేమైన అర్థం కావాలేమో కోరకొండన్నారుట యువరాజులు. అపుడు శ్రీరామమిశ్రులు తనవద్దనే చాలా అర్థాలున్నవని, అవి నీ కందించడానికి నీ భవనములోనికి ప్రతిదినము ప్రవేశించ నివ్వవలెనని, విన్నవించినారట. అంటే ప్రతినిత్యము శ్రీరామమిశ్రులు రాజభవనము చేరి గీతార్థములనుపదేశించెడివారట. ఈ గీతార్థ సంశ్రవణము యామునేయుల హృదయములో గొప్ప పరివర్తనమును తెచ్చినది. పురషోత్తమ ప్రాప్తికి సులభమైన ఉపాయము గీతాచరమ శ్లోకమున ప్రతిపాదించబడినదని తెలిసికొనినారు యామునేయులు. దీనితో తాము యౌవరాజ్య భోగాలతో పోగొట్టు కొనిన దివ్యాజ్ఞాన దృష్టిని తిరిగి పొందగలిగినారు. శ్రీరామ మిశ్రుల ఆచార్యత్వమును మన్నించి భోగిరాజైన యామునులు యోగిరాజులుగా మారి శ్రీరంగం చేరినారు.

"అమ్మా నీ పేరే శ్రీ కదా ! నిన్నేమని చెప్పగలము." అంటూ కాంతా స్తుతి రచించినారు. "తాతగారగు నాథమునులను చూచి నన్ను దయచూడు ప్రభూ!" అని స్తోత్రరత్నమును అనుగ్రహించినారు. దండ కాషాయ ఖండాలతో స్వామి దార్మినిక శేముషి ఉద్దీపతిమైనది. అతిజటిలములగు శాస్త్రీయ విషయయాలనేకములు తన బుద్ధితో విద్యోతమానములైనవి. వీనిని పది మందికి పంచి, ఔపనిషద తత్త్వార్థమును ప్రచారము చేయవలెనని అపార్థముల పారద్రోలవలెనని ఆశపడినారు యామునమునులు. కాని వారి యాశ అడియాసయే ఐనది. పెరియనంబి, తిరుమలనంబి, తిరుక్కచ్చినంబి, తిరుక్కోట్టియూర్‌నంబి, తిరుమాలై యాండాన్ వంటి శిష్యులనేకులు ఏర్పడినారు. ఐతే వీరలు మంత్ర మంత్రార్థములనో శ్రీశ్రియఃపతి స్తోత్రములనో, రామాయణ విశేషార్థములనో, ఆళ్వార్ల పాశురాలనో నేర్చుకోవడం తోనే చదువులు చాలించెడివారు. అంతేకాని దార్మినిక వాదోపవాదాల నవగాహనం చేసికొనడానికి గాని, ధరించడానికి గాని, మరొక్కరికి ఉపదేశించడానికి గాని ఉత్సాహము చూపువారు కారు. ఇది వేయేండ్ల క్రిందటి విశిష్టాద్వైత వేదాంత విద్యామాతృమూర్తి యొక్క దైన్యావస్థ. తలచుకొనిన వారి హృదయము తరిగిపోదూ!

**భగవద్రామానుజాన్వేషణం**

కాని, పాపం! యామునేయులు సరియైన దర్శన స్థాపనౌత్సుక్యం కలవారి కోసమన్వేషించెడువారు. ఈ అన్వేషణలో భాగముగానే మన యామునులు ఒకసారి కాంచీపురమేతెంచినారు. అచట వీరికి యాదవ ప్రకాశుల అంతేవాసి గణకుమార రామానుజ శశిబింబము కనుల విందొనరించినది. తామన్వేషించు వ్యక్తి ఈతడు కావచ్చునని స్వామికని పించినది. ఐతే ఆతని ప్రాథమిక విద్యా వ్యాసంగమునకు భంగము జరుప గూడదనుకొనినారు. కేవలము కృపాకటాక్షములతో మంగళాశాసనములు కృపచేసి స్వామి తిరిగి శ్రీరంగము చేరినారు.

ఐతే తనకు భగవంతుడు అనుగ్రహించిన న్యాయ్యములైన బహుళ శాస్త్రార్థముల సంరక్షించు విధానమేది? ఆ కాలమున బౌద్ధము చాలా ఉద్ధృతంగా వ్యాపించినది. వేదవిద్యయందనాదరమును పెంచడానికే మేధావులనబడువారు ప్రయత్నించుచుండిరి. శంకరాచార్యుల వారు కొంత ఈ విషయము నెదుర్కొనిననూ, భగవంతుడు వారిని 32 ఏండ్ల వయస్సుకే తీసుకెళ్ళినాడు. సర్వశాస్త్రార్థములను చక్కగా సమన్వయ

పరచడానికి కావలసినంత ఆయుస్సు వారికి లభించలేదు. బౌద్ధుల ప్రపంచ మిథ్యాత్వ వాదమును స్వీకరించినారు. బ్రహ్మకు గుణములు లేవనడమే కాక అనాది అజ్ఞానమును అంటగట్టవలసి వచ్చినది. ఆత్మలను జడములన వలసి వచ్చినది. అపారమగు ప్రతిభా పాటవము ప్రతివాదుల వాదాలను ఖండింప చేసినది. వైదికులు వేదప్రామాణ్యమును సాధించుచున్నందులకు సంతసించినారు. వారి గ్రంథాలింకనూ అందరికి అందుబాటు లోనికి రాలేదు. కాని వారి వేదవిరుద్ధ వాదాలు కొన్ని ఆ నోటా ఆ నోటా వెలుగు చూచినవి. వారిని సమర్థించలేక భాస్కరాచార్యుల వారు వేరే సూత్ర భాష్యము వ్రాసినారు. యాదవ ప్రకాశులు వ్రాస్తున్నారని ఇంకనూ మనవారికెవ్వరికిని తెలియదు. ఈ స్థితిలో వారి వాదములోని దోషాలను ఎత్తిచూపితే, వాటిని మననం చేసి ఎదుర్కొన సాహసించు మేధావులు కరవైనారు. అందుకని స్వామి యామునేయులు గ్రంథరచన కారంభించినారు. సత్యాన్వేషణ సల్పువారెవ్వరైనా పుట్టకపోరు. అట్టి వారికి ఈ గ్రంథాలు మార్గదర్శకాలు కాగలవని స్వామి యామునేయులు భావించి యున్నారు.

1. కాంతాస్తుతి. 2. స్తోత్రరత్నము. 3. గీతార్థసంగ్రహము. 4. ఆగమ ప్రామాణ్యము 5. సిద్ధిత్రయం 6. పురుష నిర్ణయము. ఇవి పరమాచార్య రచనలుగా వేదాంత దేశికుల వారొక శ్లోకములో నిబంధించియున్నారు.

**మానత్వం భగవన్మతస్య, మహతః పుంసస్తథా నిర్ణయః,**
**తి ప్రస్సిద్ధయ ఆత్మసంవిద ఖిలాధీశాన తత్త్వాశ్రయాః ।**
**గీతార్థస్యచ సంగ్రహ, స్తుతియుగం, శ్రీశ్రీ శయోరిత్యమూన్**
**యద్గ్రంథాననుసందధే యతిపతిస్తం యామునేయం నుమః ॥**

కంచికి పరమాచార్యులగు యామునులరు దెంచినపుడు యాదవ ప్రకాశకులనెడు పండితులుండేవారు. వీరు, నాటికాలమున కాంచిలో ప్రసిద్ధులైన ఆచార్యులే. వీరూ బ్రహ్మసూత్రాలపై భాష్యమును వ్రాసినవారే. మరి ఎందుకోకాని పరమాచార్యులతో వీరికి వాదగోష్ఠి ఏర్పడలేదు. ఏర్పడితే ఏం జరిగేదో? వీరు భాష్యరచన ఆపివేసి మరోరకంగా చేసి ఉందురు. మన కుమార రామానుజులు అప్పుడే పరమాచార్యులవెంట ప్రయాణమయ్యేవారు. వీరికి పరమాచార్యుల సహవాసమో అంతేవాసిత్వమో అబ్బేదిది. అపుడు కేవల గ్రంథాల వల్లనే కాక సల్లాపములతో కూడ కుమార రామానుజులకు, పరమాచార్య యామునేయ సహకార మంది యుండెడిది. ఇద్దరి హృదయాలు సంతృప్తి చెందెడివి, కానీ అలా జరుగలేదు.

**శ్రీరామానుజుల అవతారము**

కంచికి కొంత దూరములో నున్న శ్రీ పెరుంబూదూరులో రామానుజులువతరించినారు. వీరి పితృపాదులు కేశవ సోమయాజులు, మాతృమూర్తి కాంతిమతి. వీరి మేనమామగారు తిరుమల నంబిగారు. ఉపనయనానన్తరం స్వామి అధ్యయనానికి కంచికి చేరినారు. తల్లిదండ్రుల వల్ల బాల్యమున అనుభవించదగిన భోగాలేవియు స్వామికి లభించినట్లు కనిపించవు. బాల్యమునుండియే స్వామికి భోగతృష్ణకంటె విద్యాతృష్ణ మిక్కుటముగానున్నట్లు కన్పించును. యాదవ ప్రకాశులే నాటి కాలమున కంచిలోనున్న విద్యా గురువులు. ఆయనగారి గురుకులములోనే చేరినారు మన కుమార రామానుజులు. శ్రీకాంచీప్రాంతములో నాడు సహృదయ సంవాదమునకు సహకరించునట్లు శ్రుత్యర్థముల ప్రవచించు పండితులు కరువైనారు. ఉన్నవారొక్క యాదవ ప్రకాశులు. కాని వీరు వ్యాఖ్యానించు నట్లుగా పరతత్త్వముండదని పించుచున్నది. జీవాత్మ పరమాత్మ స్వరూప స్వభావాలు కూడా ఎందుకోకాని వీరు వ్యాఖ్యానించు రీతిగా నుండవని కుమార రామానుజుల అంతరాత్మ అరచుచున్నది. మరి ఎలా ఉండవచ్చునో తమకు అంతు చిక్కడంలేదు. పరమాత్మ శ్రియఃపతియే అని అనిపించును కాని శ్రుత్యర్థ సమన్వయము చేయ చాలునంతటి ప్రజ్ఞాపాటవ మింకనూ పట్టుబడలేదు. పరమాత్మ నిఖిల కల్యాణ గుణాకరుడనిపించును. దివ్యమంగళ విగ్రహము కలవాడనిపించును. వాక్యార్థ సమన్వయం స్వతంత్రముగా చేయరాదు. గురువుగా నున్న యాదవ ప్రకాశులు చెప్పునట్టి అర్థము రుచించదు. కాని ఎదిరించు శక్తి చాలదు. అట్టి శక్తిని ప్రసాదించగల గ్రంథాలుగాని ఆచార్యులు గాని ఉన్నారా?

అంతరాదిత్య విద్యలో భగవంతుడు బంగారు కొండగా భాసించును. సూర్యమండల మధ్యవర్తియట ఆతడు. ఆయన కనులెంత అందమైనవో? కప్యాసపుండరీకము వంటివి ఆ స్వామి కనులని శ్రుతి చెప్పినది. కప్యాస పుండరీకమంటె కోతి పృష్ఠ భాగము వంటి పుండరీకమని గురువు గారర్థము చెప్పుచున్నారు. ఈ అర్థము బాగోలేదని తెలియుచున్నది. కాని మరియొకటి చెప్పి ఒప్పించగల ప్రజ్ఞ కుదరదు. స్వామి కన్నుల్లో నిండిన నీరు వేడి వేడిగా గురువుగారి శరీరముపై బడి గురువుగారిని దహించివేసినవి. నీరే నిండక పోతే కన్నుల నుండి అగ్నికణాలు రాలెడువేమో? మనశ్శాంతి లేదు. అంతర్మథనము నిరంతర మనశాంతిని పెంచెడిది. గురువుగారికిని వీరిపై కసి పెరిగినది. రామానుజులను శిష్యులని కూడా చూడకుండా నిర్దాక్షిణ్యంగా అంత మొందించడానికి ప్రయత్నించి విఫలు లయ్యారు. గురుదేవులు. యాదవప్రకాశకులు.

**కాంచీవాసము పరమాచార్య బంధము**

ఇది అంతయూ వరదరాజ భగవానుని దివ్యకరుణాకటాక్ష ఫలితమే అనుకొని, స్వామి కోవెలలోనే, సమయమెక్కువగా వెచ్చించ బూనినారు కుమార రామానుజులు. వీరికి తెలియకుండానే వీరిపై ప్రసరించిన పరమాచార్య వాత్సల్య భరిత కటాక్షములు వీరిని తిరుక్కచ్చినంబిగారికి సన్నిహితుల నొనరించినది. ఆనంబిగారు చదువు స్తోత్రరత్నశ్లోకములు వీరి హృదయములోని భావములనే సమర్థించుట చూచి

ఉప్పొంగిపోయెడి వారు మన రామానుజులు. వీరి సహవాసము గృహస్థాశ్రమ భోగాలను కూడా అణచివేసినది. తిరుక్కచ్చినంబి గారు వైశ్యులు. ఇక, ఆనాటి స్థితిగతులను బట్టి దూరము ఉంచబడిన వారే, పంచమకులముగా చెప్పబడే కులంలో పుట్టినవారే, ఐననూ మారనేర్‌నంబిగారు, బ్రాహ్మణోత్తములగు పెరియనంబితో సమానులుగా పరమాచార్య కృపకు పాత్రులైనారు. సాక్షాత్తు పెరియనంబి ద్వారా, బ్రహ్మమేధ ప్రక్రియలో అంత్యేషిని పొంది సమ్మానింపబడినారు మారనేరినంబి. ఇది ఆనాటి ఆచార్యుల హృదయౌదార్యము!

పాపం! మన రామానుజులకానాడు ఇంటా బయటా ఎక్కడా సుఖం లేదు. సాంసారిక సుఖముల యందుస్వామికాసక్తిలేదు. సత్యమునన్వేషించుటలో స్వామికి సహకరించు వారు లేరు. ఐతేనేమి? శ్రీహస్తిశైల శిఖరోజ్జ్వల పారిజాతమగు వరద రాజస్వామి యొకడున్నాడు. ఇదివరకొకసారి వింధ్యాటవిలో దారి తప్పి తచ్చట్లాడు మన కుమార రామానుజులను కాపాడి కంచికి తెచ్చిన కరుణాపయోనిధి ఈతడే. ఈ భగవానుని దయవల్లనే తిరుక్కచ్చినంబి పరిచయము కలిగి అది యామున పరమాచార్య పరిచయమును ప్రగాఢ మొనరించినది. ఎటులైనా శ్రీరంగము వెళ్ళాలి. పరమాచార్య యామున పాదధూళి స్వీకరించాలి. ఇది రామానుజుల హృదయంలోని దృఢసంకల్పము. అటు శ్రీమద్యామున మునులకునూ వీరి విజ్ఞానము, వీరి యార్తి తెలియవచ్చినది. వెంటనే మన యామున మునులు తమ శిష్యులగు పెరియ నంబిగారిని కంచికి పంపించినారు. శ్రీరామానుజులకు పంచసంస్కారముల ప్రసాదించ వలసినదిగా ఆదేశించినారు. శ్రీరామానుజులు శ్రీరంగం వెళ్ళుతున్నారు. పెరియనంబి గారు కాంచీపురం దయచేయుచున్నారు. మధురాంతకం చెరువు కట్టపై ఈ ఇరువురి సమాగమమేర్పడినది. వెంటనే అచ్చటనే పంచసంస్కారములు లభించిన రామానుజులు పెరియ నంబిగారితో కాంచీపురం వేంచేసినారు.

### గుణమే పూజాస్థానం-కేవలము జాతికాదు

కొన్ని దినములు బాగానే గడిచినవి. పెరియనంబిగారి కుటుంబము కొంత నవీనాచారానికి నాందిపలికినకుటుంబము. మరి రామానుజుల కుటుంబిని, కేవల ప్రాచీనాచారానికే అలవాటు పడినది. ఒకే ఇంటిలో సహవాసము కొంత క్లిష్టమైనందున పెరియనంబిగారు శ్రీరంగం పయనమైనారు. రామానుజుల కేమో తననింటిలో కట్టివేయ గలిగిన సంతానము కలుగలేదు. ప్రాచీనాచారము నందు పెద్ద పట్టు కూడా లేనివారు శ్రీరామానుజులు. వస్తుతః ఆళ్వార్లయుగమే ప్రాచీనాచార పరంపరకు స్వస్తి పలికినది. మారనేర్‌నంబిగారిని చేరదీసిన పరమాచార్యులు గారూ దానినే ఆమ్రేడితమొనరించి బలపరచినారు. ఇట్లు విశిష్టాద్వైతుల తత్త్వ విచారధార చరమపురుషార్థకామన కలవారి ఆచార వ్యవహార ధోరణికి అత్యాధునికముగా కన్పట్టు నవ్య భావములనానాడే జోడించినది. ఆచార్యుల భావనలలోని, సమాజ సంస్కార ధోరణిని మనం గమనించాలి. అస్తు.

### యత్యాశ్రమ స్వీకృతి

ఇట్లు సత్యాన్వేషణాభిలాష, ప్రాచీనాచార సంస్కారణాభిలాష, సాంసారిక సుఖభోగముల యందనాసక్తి ఇవి యన్నియూ కలిసి శ్రీ రామానుజులకు తురీయాశ్రమమిప్పించినవి. శ్రీరంగం నడిపించినవి. కాని ఇప్పటికీ ఎనలేని ఆలస్యము జరిగినది. శ్రీరంగం వీరు చేరువరకే పరమాచార్యులు మరో రంగం చేరినారు. వారు పరిహరించి వెళ్ళిన చరమ శరీర దర్శనమే తప్ప మన రామానుజులకు పరమాచార్య దివ్య వాగమృత నిష్యందసమాస్వాద సౌభాగ్యము సమకూరలేదు. వారు విడిచిన శరీరమున ముడిచి ఉంచిన మూడు వ్రేళ్ళు మాత్రమే శ్రీరామానుజలకేదో రహస్యత్రయమునుపదేశించినవి. కర్తవ్యము నాదేశించినవి. ఈ కర్తవ్యాంశములేమిటో తాము తెలిసికొన్నట్లు విన్నవించితే ఆ వ్రేళ్ళు చక్కనైనవట. అట్లు వారు విన్నవించినమూడు కర్తవ్యాంశములు ఇవి. 1. బ్రహ్మసూత్రములపై భాష్యమును రచించుట. 2. వ్యాస పరాశర నామములకు చిరస్థాయిత్వమును సంపాదించిపెట్టుట. 3. పంచ సంస్కారముల ద్వారా కాని దివ్య ప్రబంధముల యొక్క ప్రచారము ద్వారా కాని శ్రీవైష్ణవ శ్రీనిపెంచుట. ఈ మూడింటిలోనూ చివరి రెండు కార్యములు పెద్ద ప్రయాసరమవసరం లేకుండానే సాధించవచ్చును. కాని బ్రహ్మసూత్ర భాష్యరచన బహు ప్రయాస సాధ్యము కదా.

### రచనావ్యాసంగము

బ్రహ్మ సూత్రరచన, ఉపనిషద్వాకార్యర్థనిర్ణయము కొరకు బాదరాయణ భట్టారకులవారు చేసినది. దీనిపై ఇదివరకే కొన్ని వ్యాఖ్యానాలున్నట్లు తెలిసినది. ఆ వ్యాఖ్యానాలు శ్రుతులకు,స్మృతులకు సూత్రములకునూ ఎంత సన్నిహితములో తెలియదు. అన్నిటికిని బోధాయనుల వారి వృత్తి గ్రంథము ప్రాచీన తమమని పెద్దలు చెప్పుచుండెడివారు. వారు కూడా ఆ గ్రంథాన్ని చూచినవారు కారు. ఆ వృత్తి గ్రంథార్థములను కూడా టంక,ద్రమిల,భారుచి, గుహదేవాదులు సంగ్రహించి ప్రవచించెడి వారుట. వారి గ్రంథాలు లభించలేదు. జైన బౌద్ధాదులు కొందరు వేద ప్రామాణ్యమునే అంగీకరించెడివారు కారు. కపిల కణాద గౌతమాదులు వేద ప్రామాణ్యమును అంగీకరించిననూ పరబ్రహ్మకు జగదుపాదాన కారణత్వమును స్వీకరించినట్లు కన్పించదు. పూర్వమీమాంస కులు బ్రహ్మను ఒక పదార్థముగానే పట్టించుకోవడంలేదు. అపుడపుడే ప్రచారము జరుగుచున్న ఆది శంకరుల అద్వైతవాదము, సర్వ శూన్య వాదులనుండి వైదిక బ్రహ్మమును రక్షించిననూ, వేద ప్రతిపాద్యమగు త్రైత వాదాన్ని సమర్థించడంలేదు. యాదవ ప్రకాశుల వంటి విద్వాంసులీ అద్వైత వాదము నించుక మార్చివేసిననూ బ్రహ్మమునకు జీవ భావాన్ని కాదన లేక పోవుచున్నారు. ఈ స్థితిలో బ్రహ్మ సూత్రభాష్య రచనా భారమును శ్రీరామానుజులపై బడినది. పరమపదం దయచేసిన పరమాచార్యుల వారికి మనఃపూర్వకంగా మాట ఇచ్చినారు. *(సశేషం)*




ఈవిధంగా కారణతాదశ, కార్యతాదశ అనేవి రెండు పరమాత్మకే చెందినప్పటికీ, పరమాత్మకు శరీరంగా ఉన్న చేతనాచేతనాలకు కూడా, ఈదశలు తప్పవు అని గ్రహించాలి. ఇలా కారణతాదశలోను, కార్యతాదశలోను మనకు మూడు వస్తువులు స్పష్టంగా గోచరిస్తున్నాయి. పరమాత్మ, ఆయన శరీరంగా ధరించిన సూక్ష్మస్థూల చేతనాచేతనాలు. అంటే, పరమాత్మ, సూక్ష్మస్థూల అవస్థలు కల జీవులు, సూక్ష్మస్థూల అవస్థలు కల ప్రకృతి ద్రవ్యము. వీటినే తత్త్వత్రయంగా రామానుజ దర్శనం పేర్కొంటున్నది.

ఇంతవరకు చెప్పుకున్న మాటలను బట్టి, ఏ అవస్థలోనూ అంటే కారణావస్థలోను, కార్యావస్థలోను పరమాత్మకు, జీవులకు, ప్రకృతికి, ఉన్న సంబంధం విడిపోదు అని స్పష్టం అవుతున్నది. ఇలా అంటే మరి జీవులకు ప్రకృతితోను, ప్రాకృతిక పదార్థాలతోను సంబంధం నిత్యమైతే, ఇక ముక్తి అసలు ఉండనే ఉండదనే శంక కలుగవచ్చు. తప్పకుండ ఉంటుంది. సర్వజీవులకు ఏకకాలముక్తి సంభవం కాదు కనుక కొందరు జీవులు ప్రకృతినుండి విడివడిపోయినా అసంఖ్యాకులైన జీవులు ప్రకృతితోను, ప్రాకృతిక పదార్థాలతోను సంబంధం కలిగే ఉంటారు. కనుక ప్రకృతికి ప్రాకృతిక పదార్థాలకు చేతన వియోగం అసలు ఉండనే ఉండదు. ఒక జడవస్తువులోంచి కర్మానుభవం తీరిన జీవుడు వెళ్ళిపోయినా, మరొక జీవుడు ఆ వస్తువులో ప్రవేశించే ఉంటాడు. వానితో పాటు పరమాత్మ కూడా ప్రవేశించి ఉంటాడు. కనుక ఏజడవస్తువుకు ఏదశలోను నామరూపాలు లేకపోవటం ఉండనే ఉండదు.

కేవలం ప్రళయంలో నామరూప విభాగం మాత్రం ఉండదు. సృష్టిదశలో నామరూప విభాగం ఉంటుంది. ఇదే తేడా! దీన్ని బట్టి ప్రతి అచేతన వస్తువులోను చేతనుడు, తచ్ఛరీరకుడైన పరమాత్మ కూడా ప్రవేశించి ఉన్నందు వల్లనే నామరూపాలు సర్వావస్థల్లోను ఉంటున్నాయి అని మనం గ్రహించాలి. అయితే ఇక్కడ ఒక విషయాన్ని గమనించాలి. సూక్ష్మంగా ఉన్న దశలో చేతనాచేతనాలు సామాన్యనామరూపం కలిగి పరమాత్మకు శరీరంగా ఉండటమే తప్ప ప్రకృతి ప్రభావానికి జీవులు కాని, జీవప్రభావానికి ప్రకృతి కాని, లొంగి ఉండవు. ఈదశలో ఈ రెండు సాక్షాత్తుగా పరమాత్మతోనే సంబంధం కలిగి ఉంటాయి. ఈ దశలో ఎట్టి పరిణామాలు లేకపోవడం చేత ఒక స్తబ్ధమైన దశగా మాత్రమే పేర్కొంటూ దీన్ని ప్రళయం అన్నాయి. ప్రకృష్టంగా, అంటే తేడా తెలియరానంతగా లీనమై ఉన్నాయి చేతనాచేతనాలన్నమాట. ఈవిషయాన్నే స్పష్టపరుస్తున్నాయి వేద, పురాణేతిహాసాలు. ఇక స్థూలంగా ఏర్పడి ఉన్నదశ కార్యదశ, అంటే సృష్టిదశ. ఈ సృష్టిదశలో చేతనాచేతన వస్తువులకు వృద్ధిక్షయాది పరిణామాలు అన్నీ ఉంటాయి. ప్రకృతి ప్రభావం జీవులమీద, జీవప్రభావం ప్రకృతి మీద ఉంటుంది. ప్రళయదశకు, సృష్టిదశకు ఉన్న **పరిణామము లేకపోవటం, పరిణామము కలిగి ఉండటం** అనే తేడా తప్ప రెండు దశల్లోను మూడుతత్త్వాలు విడదీయరాని విధంగా కలిసి ఉంటాయి అన్న వస్తుతత్త్వం ఎంతమాత్రము నిరాకరింపరానిది. దీనినే అపృథక్‌సిద్ధతా స్థితి అంటారు. ప్రకార ప్రకారి భావం అని శాస్త్రీయ నిరూపణం.

ఈ రహస్యాన్ని భగవద్రామానుజులు వేదార్థసంగ్రహంలోనూ, శ్రీభాష్యంలోనూ పలుతావులలో స్పష్టపరచారు. శరీరశరీరి సంబంధాన్ని నిర్వచించినప్పుడు, పరమాత్మ చేతనాచేతనాల్లో సర్వావస్థల్లోను అంతర్యామిగా ప్రవేశించి ఉన్నాడని నిరూపించిన ఘట్టాల్లోను, ప్రళయ సృష్టిప్రక్రియలను అంటే సూక్ష్మదశా, స్థూలదశలను విశదపరచేటప్పుడు చాలా స్పష్టంగా నిస్సందిగ్ధంగా రామానుజులు ఉద్ఘోషించారు.

ఇంతవరకూ చెప్పిన మాటల సారం ఏమిటంటే, పరమాత్మకు చేతనాచేతనాలు రెండూ, సర్వావస్థల్లోను వేరుచేయరాని విధంగా, శరీరమై అమరి ఉంటాయి, పరమాత్మ సర్వావస్థల్లోను లోన ప్రవేశించి ఉండి నియమిస్తూ, వాటికి ఆధారమై తాను వాటిని తనకు శేషముగా చేసికొని ఒక అతిశయాన్ని పొందుతూ ఉంటాడు అని. అంతే కాదు జీవులకుకాని, ప్రకృతికి కాని నామరూపాలు లేని దశ అంటూ ఉండనే ఉండదు. అలా ఉంటే, ప్రళయ దశలో జీవులను జీవశబ్దంతో వ్యవహరించడంకాని, వారికి అణుస్వరూపం ఉన్నది అనడంకాని కుదరకుండా పోతుంది కదా! అవేవీ లేనేలేవు అనంటే శూన్యవాదాన్ని సమర్థించడమే అవుతుంది. నామరూపాలు లేని వస్తువును దేన్నీ ఏదశలోను రామానుజ దర్శనం అంగీకరించదు. నామరూపాలు ఉన్నాయి అనంటే పరమాత్మానుప్రవేశం తప్పదు.

పరమాత్మ తాను స్వయంగా ప్రవేశించక ప్రతి వస్తువులోను జీవుని ద్వారానే ప్రవేశిస్తాడు. ఈవిషయం వెనుకనే వేదార్థసంగ్రహ గ్రంథ పర్యాలోచనవల్ల స్పష్టమయింది కదా! అయితే ప్రళయంలో సూక్ష్మదశలో ఉన్న జీవులకు నామరూపాలు విభక్తాలు కావు. కేవలం సామాన్యవ్యవహారమే ఉంటుంది. ప్రకృతికి కూడా అంతే. ఇలాంటి ఈ సామాన్య వ్యవహారాన్నే తమస్సు అనే పేరుతో ఉపనిషత్తు వ్యవహరించింది అని కూడా వెనుకనే చెప్పాం. తమస్సు అంటే విశేషమైన నామరూపాలు లేక సామాన్య నామరూపాలు కల చేతనా చేతనాల సముదాయమన్న మాట. ఇక సృష్టిదశలో జీవులకు ప్రకృతి సంబంధంవల్ల ఏర్పడిన కర్మమూల శరీరాలవల్ల దేవతలు, మనుష్యులు, పశువులు, పక్షులు, శిలలు, కాష్ఠాలు, తృణాలు, ఘటపటాలు, ఇలా నామరూపవిభాగం విశేషంగా ఉంటుంది.

ఇలా జీవప్రకృతి ద్రవ్యాలకు సామాన్యశబ్దవ్యవహారానికి కావలసిన నామాలు, రూపాలు తప్పనిసరిగా ఎప్పుడూ ఉంటాయన్నమాట. అలా లేకపోతే ఈశ్వరశబ్దాన్నితప్ప మరేశబ్దాన్ని మనం ప్రయోగించడానికి వీలు ఉండదు కదా. ఇక్కడ ఒక ప్రశ్న?

ఛాందోగ్యంలోని ఈక్రింది మాటను పరిశీలిస్తే పరమాత్మ సృష్టిచేసి తరువాత దానిలో ప్రవేశించి నామరూపాలు కలిగించాడనే తోచవచ్చు. ఎక్కడ? **హన్త! అహం ఇమాః తిస్రో దేవతాః అనేన జీవేన ఆత్మనా అనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి** అన్నచోట. హన్త అను అవ్యయం కృతకృత్యతను సూచిస్తున్నది. తెలుగులో అమ్మయ్య అన్నట్లు. "నేను ఈ మూడు (తేజస్సు, జలము, పృథివి) అనే మూడు తత్త్వాలలోను ఈ జీవుని శరీరముగా కలిగి ప్రవేశించి నామ రూప విభాగాన్ని కలిగిస్తాను అని ఈమాటకు అర్థం. ఇక్కడ పరమాత్మ తేజస్సు, జలము, పృథివి అనే తత్త్వాలను సృజించి అటు తరువాత జీవుని శరీరంగా కలిగిన తాను ఆతత్త్వాలలో ప్రవేశించి వాటికి పేర్లు, ఆకారము వచ్చేటట్టు చేశాడని అక్షరపర్యాలోచనవల్ల అవగతం అవుతున్నది. ఈ అర్థాన్ని తీసుకున్నప్పుడు తేజస్సు, జలము, పృథివి అనే తత్త్వాలలో తాను ప్రవేశించకముందు వాటికి ఆపేర్లు ఎలా వచ్చాయి? వాటికి ఏ ఆకారాలు ఉన్నాయి? ఏ పేర్లు, ఏ ఆకారాలు లేకపోతే, **ఇమాః తిస్రో దేవతాః ఈ మూడు దేవతలను** అని నిర్దేశించడం ఎలా కుదురుతుంది? అంటే తాను జీవునితో పాటుగా ప్రవేశించడానికి ముందు, సృజించిన మూడు తత్త్వాలకు నామరూపాలు లేకపోతే వాటి వ్యవహారం ఎలా చేస్తున్నాడు? అంతేకాదు వీటిని సృజించడం అంటే ఇంతకుముందు ఎంతమాత్రము లేని క్రొత్త తత్త్వాన్ని పుట్టించడమా ? లేక ఇది వరకే ఉన్నదాన్ని వెలికి తీయడమా? అని ప్రశ్న ? వైదిక దర్శనంలోకాని, దాన్ని అనుసరించే రామానుజ దర్శనంలో కాని, ఏ దశలోను క్రొత్తగా పదార్థం పుట్టటం అనేది లేదు. భగవంతుడు పూర్వమున్నపదార్థాన్నే ఆయా కాలాలలో సూక్ష్మదశను పొందించి మరుగుపరచి, తన నుండి వేరుచేయరాని విధంగా ధరించి ఉండి, తగిన సందర్భంలో వెలికితీసి స్థూలతాదశను కలిగించి, ప్రపంచంగా సర్వాను భవయోగ్యంగా ఆవిష్కరించడమే తప్ప, ఏ వొక్క వస్తువు పూర్వం లేనిది సృజింపబడదు అని కూడా వేదార్థ సంగ్రహ గ్రంథంవల్ల తెలిసింది కదా!. శ్రీరామానుజ దర్శనంలో, **"అజాయమానో బహుధా విజాయతే"** అని చెప్పబడ్డట్లు పరమాత్మ పుట్టుక లేనివాడై, లోకోద్ధరణకోసం ఆకృతిని ధరించి ఆవిర్భవించినట్లే, జీవులకు **"అజో నిత్యః శాశ్వతోయం పురాణః** అన్నట్లు పుట్టుక లేకపోయినా, కర్మమూలంగా స్థూలశరీరాన్ని ధరించినట్లు, ప్రకృతికూడా **అజాం నిత్యాం** అన్నట్లుగా పుట్టుక లేనిదై కేవలం స్థూలదశను పొంది పుట్టినట్లుగా శాస్త్రాలు వ్యవహరించిన రీతిని అంగీకరించడం జరిగింది. దీన్నిబట్టి ఈశ్వరులు, జీవులు, ప్రకృతి మూడు తత్త్వాలూ ఒకదానివలన మరొకటి పుట్టినవి కావు, నిత్య సత్యాలు అని రామానుజ దర్శనం. ఇది వైదిక సిద్ధాన్తం మాత్రమే కాదు. వైజ్ఞానికులంగీకరించిన **ద్రవ్యస్థైర్యవాదం** కూడా.

ఈ వైదిక దర్శనాన్నే రామానుజదర్శనం స్వీకరిస్తున్నది. దీన్ని బట్టి పరమాత్మ ఎప్పుడూ నామరూపాలు కలిగి వ్యవహార యోగ్యతను పొందివున్నట్లుగా చేతనాచేతనాలు అంటే జీవప్రకృతితత్త్వాలు కూడా ఎప్పుడూ నిత్యసిద్ధాలై ఉంటూనే సూక్ష్మతాదశను పొంది ఒక కాలంలోనూ, స్థూలతాదశనుపొంది మరొక కాలంలోనూ, వ్యవహరింపబడుతున్నాయి అని తెలుస్తున్నది. అంతేతప్ప, ఏ దశలోనూ సామాన్యరూపంగానో, విశేషరూపంగానో, నామరూపాలు లేకుండా ఉండటం అనేది లేనేలేదు అని కూడా గ్రహించాలి. ఏదశలోనైనా నామరూపాలు లేని వస్తువుఅంటూ ఉన్నది అని అంగీకరించడం అంటే అది అనిర్వాచ్యము, నిరూపాఖ్యము అయిన తత్త్వాన్ని ఇతరేతర దర్శన కారులు అంగీకరించి నట్లు రామానుజదర్శనం కూడా అంగీకరించినట్లే కావలసివస్తుంది.

రామానుజదర్శనంలో అనిర్వాచ్యమైన వస్తువులేదు. ఇలాగే నిరూపాఖ్యమైన వస్తువుకూడా లేదు. పరమాత్మతో సహ అన్నీ, వస్తువుగా చెప్పబడేదేదైనా యథార్థమైన ఉనికికలదైనప్పుడు తప్పనిసరిగా అది వస్తు శబ్దవాచ్యము, నిర్వచనీయము, సాకారము అయి తీరవలసినదే. అయితే సూక్ష్మతాదశ స్థూలతాదశ అని దశా భేదము, తదనుగుణాలైన నామరూపాలు ఉన్నాయని అంగీకరించి తీరవలసినదే. ఇప్పుడు వెనుక నిర్దేశించిన ఛాందోగ్యమంత్రంలో పరమాత్మ జీవుని శరీరంగా చేసికొని ప్రవేశించి నామరూపాలను విస్తరింపచేశాడు అన్నమాట, స్థూలతాదశను వేరుచేసి చూపటానికే తప్ప దానికి పూర్వదశలో సూక్ష్మాలైన చేతనాచేతనద్రవ్యాలలో పరమాత్మ జీవశరీరకుడై ప్రవేశించి లేడని అనడానికి కాదు. ఈ అభిప్రాయాన్నే బ్రహ్మసూత్రాల్లోని ఈక్రింది వాక్యాలు స్పష్టపరుస్తున్నాయి. **'సర్వచిదచిత్వస్తుశరీరతయా సర్వదా సర్వాత్మభూతం పరంబ్రహ్మ కదాచిత్ విభక్త నామ రూపం కదాచిత్ అవిభక్తనామరూపం'. యదా విభక్తనామరూపం తదా తదేవ బహుత్వేన కార్యత్వేనచ ఉచ్యతే. యదా చ అవిభక్తనామరూపం తదా ఏకమ్ అద్వితీయం కారణం ఇతిచ. ఏవమ్, సర్వదా చిదచిత్వస్తుశరీరస్య పరబ్రహ్మణః అవిభక్తనామరూపా యా కారణావస్థా సా 'గౌరనాద్యన్తవతీ', వికారజననీమ్ అజ్ఞాం, అజామ్, ఏకాం ఇత్యాదిభిః అభిధీయతే"**. అని **ప్రకృత్యధికరణంలోని ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాన్తాను పరోధాత్**. అనే సూత్రంలోని భాష్యంలో భగవద్రామానుజులు పేర్కొన్నారు. ఈ మాటలలో విభక్తనామరూపం, అవిభక్తనామరూపం అనే పదాల అర్థాలను జాగ్రత్తగా పరిశీలించాలి.

విభక్తనామరూపం అంటే విడివిడిగా పర్వతం చెట్టు, పుట్ట, మనిషి, దేవత, పశువు, పక్షి, అని ఇలా వేరువేరుగా నిర్దేశింపదగిన నామాలు, తదనుగుణాలైన రూపాలు విశకలితముగా కలిగిన పరబ్రహ్మము అని అర్థము. ఇక్కడ పరబ్రహ్మము స్పష్టంగా చేతనులను శరీరంగా కలిగి అచేతనవస్తువులలో ప్రవేశించి తదనుగుణమైన నామరూపాలను విస్తరింపచేశాడు అని అభిప్రాయం. ఇక అవిభక్తనామరూపం అంటే, ఇదే పరబ్రహ్మము, ఇలా అనేక రకాలుగా నామరూప విభాగం చేయకుండా, సామాన్యరూపంగా జీవులు,ప్రకృతి అన్న సాధారణ నామరూప నిర్దేశంకల వస్తువులను శరీరంగా కలిగి ఉన్నాడని అర్థం. ఈ దశలో కూడా పరమాత్మ జీవుని శరీరంగా కలిగే సూక్ష్మమైన ప్రకృతిలో ప్రవేశించిఉన్నాడు. అందువల్ల ఈ రెండు పదాల చేత సూక్ష్మదశలోనూ స్థూలదశలోనూ, చేతనాచేతనాలను రెంటిని తనకు శరీరంగా కలిగిఉన్న పరబ్రహ్మమే చెప్పబడుతున్నాడని తెలుస్తున్నది. కనుక జీవుని విడచి తానొక్కడే అచిద్వస్తువులో ప్రవేశించి నామరూప యోగ్యతను కలిగించడం అనేది పరమాత్మ ఏదశలోనూ చేయడు. ఇలా అనటం చేత ఆయనకు జీవుని విడచిపెట్టి అచేతనలో ప్రవేశించే సామర్థ్యము లేదని మనం భావించనక్కర్లేదు. ఎప్పుడూ జీవశరీరకుడై ఉండటమే ఆయన స్వభావంగా మనం అర్థంచేసుకోవాలి. కనుకనే తరువాత **'ఏవం సర్వదా చిదచిత్వస్తుశరీరస్య పరస్య బ్రహ్మణః అవిభక్తరూపా యా కారణావస్థా** అన్న మాటలు కూడా పరబ్రహ్మకు చేతనాచేతనాలు రెండు, కారణవస్థలో కూడా

శరీరంగా ఉంటాయని చెబుతున్నది. ఇలా చెప్పినందువల్ల అచేతనాన్ని విడచి చేతనుని లోనూ, చేతనాన్ని విడచి అచేతనంలోనూ ఆయన ప్రవేశిస్తాడని చెప్పడానికి అవకాశం ఎంతమాత్రము లేదు. కనుక ఏదశలో అచేతనంలో ప్రవేశించినా చేతనుని శరీరంగా ధరించే ప్రవేశిస్తాడని చెప్పక తప్పదు. అలాకాక అచేతనసంబంధం లేకుండా చేతనంలోనూ, చేతనసంబంధం ఎంతమాత్రమూ లేకుండా అచేతనంలోనూ, స్వామి సాక్షాత్తుగా ప్రవేశిస్తే, చేతనంలో ప్రవేశించినప్పుడు అచేతనాన్ని విడచిపెట్టాలికాదా అలా అచేతనంలో ప్రవేశించని దశ అంటూ ఒకటి ఉంటుందా.

ఇలాగే అచేతనంలో ప్రవేశించినప్పుడు చేతనసంబంధం తనకు లేకుండా తాను ప్రవేశిస్తే, అచేతనంలో ప్రవేశించిన దశలో పరమాత్మతో సంబంధంలేని చేతన తత్త్వం ఒకటైనా విడిగా లభిస్తుందా ? ఈ రెండూ అసాధ్యమే. అందువల్ల పరమాత్మ సర్వావస్థల్లోనూ చేతనాచేతనాల్లో ఎప్పుడూ ప్రవేశించే ఉంటాడు. అందువల్ల చేతనాచేతనాల్లో చేతన తత్త్వం ఉత్కృష్టం కనుక చేతన ప్రవేశం వల్లనే అచేతన వస్తువుకి సత్తను పరమాత్మ అనుగ్రహిస్తున్నాడు. ఈవిషయం కూడా వెనుకటి వేదార్థసంగ్రహ వచనాలవల్లే స్పష్టం. అందువల్ల ఏ అతి సూక్ష్మమైన వస్తువులో తాను ప్రవేశించినా చేతన సంబంధం కలిగే ప్రవేశిస్తాడు. కనుక ప్రతి చేతనునిలోనూ పరమాత్మ తప్పని సరిగా ఉన్నట్లే, చేతన శరీరకుడైన పరమాత్మ ప్రతి అచిద్వస్తువులోనూ తప్పని సరిగా చేతన విశిష్టుడై ప్రవేశిస్తాడని భగవద్రామానుజ దర్శనం. దీన్నే శరీర శరీరి భావం అని అంటారు.

# ఆచార్య త్రయము

## నృత్యరూపకంతో, శ్రీరామానుజులవారి ఘట్టం తరువాత

సముద్రాల మాధవి

**వచనం** – ఇంతటి మహనీయులు శ్రీభగవద్రామానుజులు 1017వ సంవత్సరంలో అవతరించి, సుమారు వేయి సంవత్సరాలుగా సమాజానికి మేలుకలిగించి, ఒక సాంప్రదాయమై నిలచి, ముందు ముందు వేవేల సంవత్సరాల వరకూ మానవాళి అభ్యున్నతి కోసం –2017సం॥లో శ్రీరామనగరంలో తామ్రమూర్తిగా అవతరించ నున్నారు. శ్రీశ్రీశ్రీత్రిదండి చిన్నజీయర్ స్వామివారు సంకల్పించారు. సకల భక్తజనులూ ధన్యులయ్యే భాగ్యం ప్రసాదించారు.

**పాట - పల్లవి - త్రిపుటతాళం**

అదిగో అదిగదిగో శ్రీరామానుజులు
శ్రీరామనగరానికి వేంచేయనున్నారు;
మనజీయర్ స్వామివారు సంకల్పించారు
సహస్రాబ్ది వేడుకలకు మూర్తిమంతమౌతారు. ॥అదిగో॥

**చరణం 1 -** రెండొందల అడుగుల ఘనతామ్ర మూర్తియట
భువిలోన భాసించే ఎత్తైన ప్రతిమయట;
నూటఎనిమిది దివ్యక్షేత్రముల మూర్తులట
కనులారా చూసి తరించే భాగ్యం మనదేనట ॥అదిగో॥

**చరణం 2 -** చిన్నజీయరుస్వామి చిరనవ్వు నవ్వితే
ఏకొందరో కోట్లు కుమ్మరిస్తే –
రామానుజులవారి విగ్రహప్రతిష్ఠాపన
ఒక్క త్రుటిలోనే పూర్తి అయితే –

ఆచార్యులకు సేవచేసేటి భాగ్యం
ఏకొందరికో సొంతమైపోదా?
ఈధర్మక్రతువు సాగించుయోగం
ఏకొందరికో పరిమితం కాదా!

అందుకే మనస్వామి కరుణించినారు
భక్తజనులందరికీ పిలుపునిచ్చారు
విగ్రహస్థాపనతో మనమందరం
పాలుపంచుకునే అవకాశమిచ్చారు

అనుకూల ప్రతికూల స్థితులు సహజమ్మనే
అనువుగా మూడేళ్ళ వ్యవధినిచ్చారు
తృణమైన పణమైన ఏమేరకైనా
ముమ్మారు సేవించె వీలునిచ్చారు

ప్రతిస్పందించాలి మనమందరం
నేనుసైతం అంటు ప్రతి ఒక్కరం;
అపురూపమైనదీ అరుదైన తరుణం
జన్మకొక్కసారే దొరికే వరం.

VILAN V
Just face the world
Hot Cutes
vijay ads

# భగవద్రామానుజుల మధురార్థనిర్వాహం

*పండిత రత్న ఉ.వే. శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్య స్వామి - తిరుపతి*

**పుణ్యాంభోజ వికాసాయ పాపధ్వాన్త క్షయాయ చ ।**
**శ్రీమానావిరభూద్భూమౌ రామానుజ దివాకరః ॥**

విశిష్టాద్వైత సిద్ధాన్తప్రవర్తకాచార్యసార్వభౌములైన భగవద్రామానుజుల వ్యక్తిత్వం విలక్షణమైనది, సమగ్రమైనది, ఏ దృక్కోణంలో దానిని దర్శించినా, అది సంపూర్ణంగా, మనోహరంగా గోచరిస్తుంది. తత్త్వవేత్తగా, వైదికసంప్రదాయప్రచారకుడుగా, ఉద్గ్రంథప్రణేతగా, సమతావాదిగా, పరిపాలనాదక్షుడిగా, వైతాళికుడుగా, మానవవనరుల (హ్యూమన్ రిసోర్సెస్) నిర్వాహకుడిగా, చక్కని విమర్శకుడుగా, భవిష్యద్ద్రష్టగా- ఈ విధంగా ఏ దృష్టిలో పరిశీలించిచూచినా, శ్రీరామానుజులు విరాడ్రూపంతో దర్శనమిస్తారు. ప్రస్తుతం - శ్రీరామానుజులు, ఆళ్వారుల దివ్యప్రబంధసూక్తులలోని అర్థాలను మధురంగా, శాస్త్రీయంగా నిర్వహించిన ఒక మధురనిర్వాకం ప్రస్తావినిపబడుతున్నది. ఇది,వారి విలక్షణవిమర్శనపాటవాన్ని తెలుపుతున్నవి.

నమ్మాళ్వార్లు, తిరువాయ్మొజి ప్రబంధంలోని మొట్టమొదటి పాశురంలో తమ మనస్సును సంబోధించి, తమకు దోషరహితమైన, భక్తిగా పరిణమించిన జ్ఞానాన్ని ప్రసాదించిన భగవానుని క్లేశహారియైన, ఉజ్జ్వలమైన శ్రీచరణాలను ఆశ్రయించమని అంటూ **"తుయరఱుశుదరడి తొళుదులు ఎన్ మననే"** అని హితవుపలికారు. ఈ సూక్తిలో, ఆళ్వార్లు, భగవానుని శ్రీచరణాలను **"తుయరఱుశుదరడి"** అని విశేషించి పలికారు. ఈ సందర్భంలో భగవానుని పాదాలకు "తుయరఱు, శుదర్" అనే రెండు విశేషణాలు ప్రయోగింపబడ్డాయి. ఈ రెంటిలో, "తుయరఱు" అనే విశేషణంద్వారా స్ఫురించే అర్థస్వారస్యాన్నిగూర్చి శ్రీయామునులవరకుగల ముందున్న ఆచార్యులు ఒకరీతిలో వివరించగా, భగవద్రామానుజులు వేఱు రీతిలో విలక్షణంగా, శాస్త్రీయమైన రీతిలో అర్థాన్ని నిర్వహించారు.

ఇక్కడ భగవానుని పాదాలకు విశేషణంగా ప్రయోగింపబడిన "తుయర్ అఱు" అనే పదాలకు "దుఃఖాన్ని పోగొట్టే అని, దుఃఖం తీరిన అని రెండు తెలుపబడ్డాయి. నమ్పిళ్ళై ఈడు వ్యాఖ్యానంలో పూర్వుల అర్థయోజన, శ్రీరామానుజులు చేసిన అర్థనిర్వాహం రెండు ప్రస్తావింపబడ్డాయి. "తుయర్ అఱుక్కుమ్-ఎన్ఱు మున్పుళ్ళమొదలికళ్ అరుళిచ్చెయ్యుమ్బడి" అని ఈ రెండు వివరణలు ఈడువ్యాఖ్యలో తెలుపబడ్డాయి. సకలాత్మలయొక్క దుఃఖాన్ని పోగొట్టడాన్ని స్వభావంగా కలిగిన గొప్పగా ప్రకాశించే శ్రీచరణాలు- అనేది పూర్వాచార్యుల అర్థనిర్వాహంకాగా, దుఃఖంతీరిన, గొప్పగా ప్రకాశించే శ్రీచరణాలు- అనేది శ్రీరామానుజుల అర్థనిర్వాహం. పెరియవాచ్చాన్పిళ్ళై ఇరుపత్తునాలాయిరప్పడిలోకూడా శ్రీరామానుజుల నిర్వాహం "తుయరఱ ఎన్ఱప్పడి" అని తెలుపబడింది. నంజీయర్ అనుగ్రహించిన ఒన్బది నాయిరప్పడిలోకూడా పూర్వాచార్యుల నిర్వాహంతోపాటు శ్రీరామానుజుల నిర్వాహం తెలుపబడగా, ఆఱాయిరప్పడి, పన్నీరాయిరప్పడి వ్యాఖ్యానాలలో పూర్వాచార్యుల నిర్వాహం మాత్రం చూపబడింది.

భగవానుడు హేయప్రతిభటుడు. అందువల్ల భగవానునకు దుఃఖప్రసక్తిలేదు. దుఃఖప్రసక్తిలేనప్పుడు, అది తీరవలసిన ఆవశ్యకతకూడా లేదు. "ప్రస్తకస్యహి ప్రతిషేధః" అందువల్ల పూర్వులు ఇక్కడ దుఃఖనివృత్తిని ఆశ్రితగతంగా భావించి, ఆశ్రితుల సకలదుఃఖాలను తీర్చే స్వభావాన్ని కలిగిన శ్రీచరణాలు అనే అర్థాన్ని నిర్వచించారు.

ఇక, శ్రీరామానుజుల అర్థనిర్వాహంలో "తుయరఱు అడి" అంటే దుఃఖం తీరిన శ్రీచరణాలు- అని అర్థం. అది ఏవిధంగా? అంటే, ఆశ్రితులకు కల్గిన దుఃఖం కారణంగా భగవానునకు దుఃఖం కలుగుతుంది. ఆశ్రితులదుఃఖం తీరినపుడు భగవానుని దుఃఖంకూడా తీరుతుంది. భగవానునకు దుఃఖం తీరితే, ఆ స్వామి శ్రీచరణాలదుఃఖం కూడా తీరినట్టే కదా! ఆశ్రితుల దుఃఖం వారికి యదార్థజ్ఞానం కల్గినప్పుడు తీరుతుంది. ఆ విధంగా ఆశ్రితుల దుఃఖం తీరితే, భగవానుని శ్రీచరణాలదుఃఖం తీరుతుంది. ప్రకృతంలో, భగవానుడు ఆళ్వార్లకు **"మయర్వఱ మదినలమ్"** (సంశయవిపర్యయాదిదోషరహితమైన, భక్తిగా రూపొందిన జ్ఞానాన్ని) అనుగ్రహించినందున వారి దుఃఖం తీరింది. వారి దుఃఖం తీరగానే భగవానుని దుఃఖం తీరిందని భావం.

అయితే, హేయగుణప్రత్యనీకుడుకదా, భగవానుడు. మఱి, భగవానునకు హేయధర్మమైన దుఃఖం ఏ విధంగా కల్గుతుంది? ఒకవేళకలిగితే, అతనికి హేయప్రతిభటత్వం ఏ విధంగా సిద్ధిస్తుంది? అనే సందేహం ఇక్కడ కలుగుతుంది. ఈ సందేహం శ్రీరామాయణసూక్తి ద్వారా పరిహరింపబడింది. కర్మమూలకమైన దుఃఖం హేయం కాని, కృపామూలకమైన దుఃఖం హేయం ఎంతమాత్రంకాబోదు, సరికదా, గొప్పగుణంగా గౌరవింపబడుతుంది. శ్రీరామాయణంలోని అయోధ్యాకాండలోగల **"వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః"** అనే సూక్తి దీనికి ప్రమాణం. అయోధ్యాపురజనులు శ్రీరామచంద్రుని కల్యాణగుణాలను కీర్తించే సందర్భంలోనిది ఈ సూక్తి. తనకు అంతరంగులై ఉండే వారికి కల్గిన క్లేశాలనేకాక, సామాన్యజనులకు కల్గిన దుఃఖాలను చూచిన శ్రీరాముడు, వారికంటే ఎక్కువగా, ఆ దుఃఖం తీరేవరకు నిరంతరం బాధపడతాడు, అని పై శ్రీరామాయణసూక్తి తాత్పర్యం. ఈ విధంగా ఇతరుల దుఃఖాన్ని చూచి "అయ్యో" అని జాలిపడి

బాధపడడం లోకంలో గుణంలోకేకదా పర్యవసిస్తుంది. గుణంకాకపోతే, దీనిని ఈ సందర్భంలో అయోధ్యాపురజనులు ప్రస్తావించే అవకాశంకాని, ఔచిత్యంకాని లేదుకదా. అంతేకాదు, ఈ స్వభావం లేకపోతే అది లోపంగా, దోషంగా కూడా కాగలదు.

ఇక్కడ ఇంకొక విషయంకూడా ప్రస్తావనార్హం. భగవానునకు, జీవునకు మధ్యగల పలు సంబంధాలలో రక్ష్య-రక్షకరూపసంబంధం ఒకటి. భగవానుడు రక్షకుడు, సమస్త జీవవర్గం ఆతనిచే రక్షింపదగినది. ఈ విషయంప్రణవంలోని అకారం చేత (అవ-రక్షణే-అనే ధాత్వర్థం ద్వారా) తెలుపబడుతున్నది. నిరుపాధికరక్షకుడైన భగవానుడు ఆశ్రితులకు కల్గిన దుఃఖాన్నిచూచి "అయ్యో! నా రక్షణ లోపంవల్ల కదా వీరికి ఈ దుఃఖం కల్గింది" అని చాలా బాధపడుతాడు. ఈ విషయాన్ని అరుంబదకారులు" నమ్ కావల్ శోర్వాలే వన్ద తన్తో! ఎన్ఱు మికవుమ్ ఇవనైక్కాట్టిల్ దుఃఖితనా యిరుక్కుమ్" (నా రక్షణలోని అనవధానతవల్ల ఈ దుఃఖం కల్గిందికదా- అని చాలా జీవునికంటే ఎక్కువ దుఃఖాన్ని పొందుతాడు) అని వివరించారు. "హ్రీరేషాహి మమాతులా" ఇత్యాది శ్రీరామాయణసూక్తులు ఈ సందర్భంలో స్మరణీయాలు. అందువల్ల ఆశ్రితులకు దుఃఖంకల్గినపుడు వారి కంటే ఎక్కువగా బాధపడే స్వభావాన్ని కల్గిన భగవానుడు, వారి దుఃఖం తీరి ఆనందించేటపుడు వారికంటే అధికంగా ఆనందిస్తాడని చెప్పనక్కఅలేదుకదా. అదికైముతిక న్యాయసిద్ధం.

ప్రమాణ తంత్రులైన, గంభీరార్థవివేచనా దృష్టినికల శ్రీరామానుజులు ఇటువంటి సరసమైన శాస్త్రీయమైన అర్థనిర్వాహాన్ని ఏ సూక్తులను దృష్టిలో పెట్టుకొని చేసి ఉంటారు? అనే విషయాన్ని కొంచెం గమనించి చూడవలసి ఉన్నది. ఈ విషయంలో మనకు శ్రుతివాక్యం, బ్రహ్మసూత్రం, భగవద్గీతాసూక్తి, శ్రీరామాయణ సూక్తి కూడా దర్శనమిస్తాయి. ఛాందోగ్యోపనిషత్తు "సఖల్వేవం వర్తయన్ యావదాయుషం బ్రహ్మలోకమభి సంపద్యతే, న చ పునరావర్తతే" (ముముక్షువు ఈ విధంగా ఆయుస్సు ఉన్నంతకాలం వర్తిస్తూ, ఆయుష్కాలంచివర బ్రహ్మలోకాన్ని పొందుతున్నాడు కదా! అక్కడనుండి తిరిగిరావడం లేదు కూడా) అని తెల్పింది. ఈ అర్థాన్నే భగవద్గీత- "ఆ బ్రహ్మభువనాల్లోకాః పునరావర్తిన్యోర్జున, మాముపేత్యతు కౌంతేయ పునర్జన్మ న విద్యతే" అర్జునా బ్రహ్మలోక పర్యంతంగల లోకాలు పునరావృత్తిని కల్గినవి. కౌంతేయ! నన్ను పొందిన తరువాత ఇక పునర్జన్మలేదు) అని స్మరించింది. "అనావృత్తిశ్శబ్దాదనావృత్తిశ్శబ్దాత్" అనే బ్రహ్మసూత్రం ఈ విషయాన్ని సూత్రీకరించింది. ఇక్కడ, ముక్తపురుషుడు భగవానుని చేరిన పిమ్మట తిరిగి ఈ లోకానికి (కర్మమూలకంగా) రాకపోవడానికి జీవుని సంకల్పం కారణంకాదు. భగవత్సంకల్పమే కారణమనే విషయాన్ని భగవద్రామానుజులు ఈ సూత్రవ్యాఖ్యానంలో "న చ పరమపురుషః సత్యసంకల్పః అత్యర్థప్రియం జ్ఞానినం లబ్ధ్వా న కదా చిదావర్తయిష్యతి" (పరమ పురుషుడు సత్యసంకల్పుడు కనుక, తనకు అత్యంతం వాచమగోచరంగా ప్రియమైన జ్ఞానిని పొందిన తరువాత, ఇక ఎపుడు అతనిని ఈలోకం లోనికి రానీయడు) అని అనుగ్రహించారు. అందువల్ల ముక్తుడు ఈలోకంలోనికి రాకపోవడానికి భగవానుని అప్రతిహతమైన, సత్యమైన సంకల్పం ఒకకారణం కాగా, అతడు భగవానునకు అత్యర్థప్రియుడు కావడం ఇంకొక కారణం. ఈ విధంగా జ్ఞాని భగవానునకు మిక్కిలి ప్రియుడనే విషయాన్ని భగవద్గీతలో కంఠోక్తిగా సాక్షాత్తు భగవానుడే **"ప్రియోహి జ్ఞానినోఽత్యర్థమహం, స చ మమ ప్రియః "** అని తెల్పిన వచనాన్ని ఇక్కడ శ్రీభాష్యంలో శ్రీరామానుజులు ప్రమాణీకరించారు కూడా. ఏతావతా తెలిసిన విషయమేమంటే- జ్ఞాని, భగవానునకు అత్యర్థప్రియుడని. "మణివరఇవశౌరేః" అనే రీతిలో కౌస్తుభస్థానీయుడుకదా, జీవుడు జ్ఞాని విషయంలో అయితే, ఆ ప్రీతి, అతనికి గల జ్ఞానవైలక్షణ్యాన్ని బట్టి అతిశయించి ఉంటుంది. తన ప్రీతికి ఆస్పదుడైన ఆశ్రితునను దుఃఖం కలిగినపుడు, భగవానుడు "భృశం దుఃఖితో భవతి" అనే రీతిలో అత్యంతం దుఃఖితుడు కావటంలో ఆశ్చర్యమేమున్నది. అతని దుఃఖం తీరినిపుడు అత్యంతం హృష్టుడు కావడంలో అచ్చెరువేమున్నది?

ఇపుడు తిరువాయ్‌మొళి ప్రబంధంలో చివరగా నమ్మాళ్వార్లు పలికిన ఒక అద్భుతమైనసూక్తి గమనించదగినది. ఈ ప్రబంధంలోని "శూళ్న్దు" (10-10-10) ఇత్యాది పాశురంలో ఆళ్వార్లు భగవానుని వల్ల తమకు కల్గిన ఆర్తి తత్త్వత్రయాన్ని, (భగవత్సంకల్పరూపజ్ఞానాన్ని) సైతం కబళీకరించిదని, అది గోష్పాదమనే రీతిలో చాలా గొప్పది-అని, అటువంటి అభినివేశాన్ని, సైతం దానికి మించిన, గొప్పదైన అభినివేశాన్ని భగవానుడు తమపట్ల పై దర్శించి, వేంచేసి, వారితో సంశ్లేషించా,దని అన్నారు. ఈ అర్థం **"శూళ్న్దు అతనిల్ పెరియ ఎన్నవా అఱచ్చూళ్న్దాయే"** అనే సూక్తి ద్వారా వ్యక్తమవుతున్నది. దీనివల్ల, జ్ఞాని అయిన ఆళ్వార్లకు భగవానుని పట్లగల అభినివేశానికి మించిన అభినివేశాన్ని భగవానుడు ఆళ్వార్ల పట్ల కల్గిఉన్నాడని తెలుస్తున్నది. ఈ పాశురంలో" ఎన్ అవా అఱ" అనే ప్రయోగానికి నంబిళ్ళై రెండు అర్థనిర్వాహాలను చూపించారు. "ఎన్ అవాఅఱ" అంటే- "నా ఆర్తి తీరేటట్లుగా"- అనేది ఒక అర్థంకాగా, "నా ఆర్తి అల్పమయ్యేరీతిలో"- అనేది ఇంకొక అర్థం. ఈ రెండు అర్థాలలో, మొదటి అర్థం-తుయరఱుశుడరడి" -అనే ప్రథమగాథా సూక్తికి పూర్వుల అర్థనిర్వాహానికి అనుగుణం కాగా, రెండవ అర్థం- భగవద్రామానుజుల అర్థనిర్వాహానికి అనుగుణం కావడం గమనార్హం. ఈ అంశం అరుంబదంలోని- తుయరఱుశుడరడి-ఎన్ఱు ఉపక్రమత్తిలే

అరుళిచ్చెయ్ తత్తై ఉపసంహరిక్కిఱాల్- ఎన్నుమిదమ్ తోట్టుకిఅదా" (తుయరఱుశుడరడి-అని ప్రారంభంలో పల్కినదానిని ఉపసంహరిస్తున్నారని స్ఫురిస్తున్నది) అనే వివరణం ద్వారా సుస్పష్టం. ఇక్కడ నివృత్తి వాచకమైన "అఱ" అనే పదం అల్పత్వవాచకమవుతుందా? అనే సందేహానికి అరుంబదకారులు- ఎత్తైన మేరుశిఖరంపై ఉండేవాడు, కింద ఉండే ఆవగింజవంటి అత్యల్పపరిమాణాన్నికల వస్తువులను చూచి, "లేవు" అంటే, అవి సర్వథా లేవని అర్థంకాదుకదా! లేవు అనే రీతిలో చాలా అల్పంగా, దృష్టిగోచరం కాకుండా ఉన్నాయి-అనే అర్థమేవస్తుంది. అదే రీతిలో, ఇక్కడకూడా భగవానుని అభినివేశంతో పోలిస్తే ఆళ్వార్ల అభినివేశం అసత్కల్పంగా తోచిందని తాత్పర్యం. భగవదభినివేశం మేరు పర్వతంవంటిది, సముద్రంవంటిది కాగా, ఆళ్వార్ల అభినివేశం గోష్పాదసమం, సర్షపసమమని అరుంబద వివరణ హృదయం ఈ విధంగా ఇక్కడ తిరువాయిమొళి ప్రబంధప్రతిపాద్యార్థం యొక్క ఐక్యం కూడా సూచింపబడింది.

మఱి ఒక విషయంకూడా గమనార్హం భగవానుడు సర్వస్వామి. జీవులందఱు అతని సొత్తు. లోకంలో సొత్తును కోల్పోయినపుడు స్వామి దుఃఖాన్ని పొందుతాడే తప్ప, సొత్తు దుఃఖాన్ని పొందదు. అదే విధంగా, తిరిగి ఆ సొత్తునుపొందినపుడు ఆనందాన్ని పొందేది సొత్తుదారుడే తప్ప, సొత్తుకాదు. పై కృతంలో స్వామ్య స్థానీయుడైన జీవుడు తనకు సహజంగాకల చైతన్యం కారణంగా భగవద్విశ్లేష-సంశ్లేషాదులవల్ల దుఃఖాన్ని ఆనందాన్ని పొందిన, అవి పరమచేతనుడు సర్వస్వామి అయిన భగవానుడు పొందే దుఃఖంతో, ఆనందంతో సాటిరావు. అయితే, భగవానునికి కలిగే ఈ దుఃఖం కర్మకృతమైనది కానందున హేయంకాదు. ఈ రీతిలో కూడా భగవానుని దుఃఖం, ఆనందం- రెండు తగినవే.

పూర్వం ప్రస్తావించిన " ఎన్అవాఅఱచ్చూళ్న్దాయే" అనే తిరువాయిమొళి ప్రబంధసూక్తిని నమ్బిళ్ళై ఈడు వ్యాఖ్యలో వివరించిన రీతిని ప్రకృతంలో గమనించాలి. "(అంటే భరత మారోప్యముదితః పరిషస్వజే) - ఎన్ను మాణ్డుపుకున్ను, భరతాళ్వానై మడియిలేవైత్తు, ఉచ్చియై మోన్దు, ఉకన్దు, అణైత్తాప్పోలేయాయ్త్తు, ఇవరుడైయవిడాయ్ లెదుమ్బుడి కలన్దదు" (భరతుని ఒడిలో పెట్టుకొని ఆనందించిన వాడై, ఆలింగనం చేసికొన్నాడు) అనే రీతిలో అయోధ్యను శ్రీరాముడు తిరగివచ్చి, భరతుని ఒడిలో పెట్టుకొని శిరస్సును ఆఘ్రాణించి, ఆనందించి, ఆలింగనం చేసికొన్నట్లుగా, భగవానుడు ఆళ్వార్ల ఆర్తితీరే రీతిలో సంశ్లేషించాడు) అని నమ్బిళ్ళై వివరణం. ఇక్కడ ఉట్టంకింపబడిన శ్రీరామాయణ శ్లోకంలోని "ముదితః" అనే పదం రెండవ అవతారికకు (అంటే భగవద్రామానుజుల అర్థనిర్వాహానుగుణమైన అవతారికకు) పొసగుతుంది-అని అరాంబుదకారులు వివరించారు. "ముదితః" అనే ఈ పదంద్వారా-**"కదాన్వహం సమేష్యామి భరతేన మహాత్మనా"** అని అంటూ పూర్వం భరతునిపట్ల శ్రీరాముడుపొందిన ఆర్తి తీరిన విషయం స్ఫురిస్తున్నది-అని కూడా అరుంబుదవివరణం. ఈ రీతిలో శ్రీరామాయణంలో కూడా భరతునిక్లేశమేకాక, శ్రీరామునిక్లేశంకూడా తీరిన విషయం తెలువబడింది. ("ఆరోపితో విమానాంతః భరతః సత్య విక్రమః, రామమాసాద్యముదితః" పుష్పక విమానంలోపలకు ప్రవేశింప జేయబడినవాడు, సత్యవిక్రముడైన భరతుడు, రాముని చేరి ఆనందించిన వాడయ్యాడు- అనే శ్రీరామాయణసూక్తి భరతుని ఆర్తి తీరి, అతడానందించిన విషయాన్ని తెల్పుతున్నది.) దీని వల్ల శ్రీరామానుజులు చేసిన అర్థనిర్వాహం శ్రీరామాయణ ప్రమాణాను గుణం కూడా. ఇంతవరకు చేయబడిన వివరణాన్నిబట్టి "తుయరఱుశుడరడి" అనే తిరువాయ్మొళిసూక్తి భగవద్రామా నుజులు చేసిన అర్థనిర్వాహం శ్రుతి, స్మృతి, శ్రీరామాయణ, శ్రీభాష్యసూక్త్యనుగుణమని తెలుసుస్తున్నందున, ఇది ఉభయవేదాంతార్థైక్యానికి చిహ్నంగా భావించదగినది.

చివరగా, ఆళ్వార్ల సూక్తిలో భాసించే ఒక రస్యమైన విషయాన్ని విన్నపించి వ్యాసాన్ని ముగిస్తాను. శ్రీకృష్ణుడు శకటాసుర భంజనాన్ని చేసిన వృత్తాంతాన్ని నమ్మాళ్వార్లు కీర్తిస్తూ 'శకడవశురర్ ఉడల్ వేడా ప్పిళన్దు వీయత్తిరుక్కాల్ ఆణ్డపెరుమానే' (6.9.4) (శకటాసురుని దేహం భిన్నమై, రూపుమాసిపోయే టట్లుగా శ్రీచరణాలతో కార్యనిర్వాహాన్ని' చేసిన స్వామీ!) అన్నారు. ఈ సూక్తిని నమ్బిళ్ళై వ్యాఖ్యానిస్తూ 'నమ్ముడైయ ఆపత్తుక్కళుక్కే అన్ఱిక్కే, అవనుడైయ ఆపత్తుక్కుమ్ తిరువడికళే కాణుమ్ ఉతవువతు' మన ఆపదలకే కాకుండా, అతని ఆపదలకూడా శ్రీచరణాలే సుమా! సహాయపతాయి అని చమత్కరించారు. భగవానుని తిరుమేనికి శకటాసురుని వలన కల్గిన ఆపద శ్రీచరణాలు కారణమవడం తగినదే. ఆశ్రితులకు ఇక్కడ కల్గిన అనిష్టమేమి? అది శ్రీచరణాలవల్ల ఏవిధంగా తీరింది? అంటే, భగవానుని తిరుమేని 'భక్తానాం త్వం ప్రకాశసే' అనేరీతిలో ఆశ్రితులసొత్తు కనుక, దానిని కాపాడడం ద్వారా ఆశ్రితుల అనిష్టాన్ని శ్రీచరణాలు తీర్చాయని తాత్పర్యం.

అదేవిధంగా ప్రకృతంలోకూడా 'తుయరడు శుడరడి' అనే ప్రయోగానికి ఆశ్రితులదుఃఖాన్ని తీర్చి, ప్రకాశించే శ్రీచరణాలనే అర్థంతోపాటు, భగవానుని దుఃఖాన్ని కూడా తీర్చి ప్రకాశించే శ్రీచరణాలనే అర్థం ఆళ్వార్ల దివ్యసూక్త్యనుగుణం. ఈ రీతిలో ఈ అర్థం తిరువాయ్మొడి ప్రబంధంలో ఆదిమధ్యావసానాలలో అనుసంధింపబడడం సహృదయైక సంవేద్యం. భగవద్రామానుజుల సమన్వయశైలికి నిదర్శనం.

# రామానుజ వైభవమును చాటిచెప్పిన రమణులు

శ్రీమతి జానకిగారు - విజయనగరం

**"ఆచార్య స్సహరిస్సాక్షాత్ చరరూపీ న సంశయః"** హరియే గురువు. గురువే శ్రీహరి. సందేహమక్కర లేదు. భగవద్రామానుజులు గురువు. గురువే శ్రీహరి. సందేహమక్కర లేదు. భగవద్రామునుజులు అవతరించిన తరువాత 'శ్రీహరి కన్న ఆచార్యుడే మిన్న' అనే నిశ్చయము అందరకీ. ఇది ముమ్మాటికీ సత్యము. ఆయనే సర్వలోక సముద్ధర్త. **"సత్యం సత్యం పునస్సత్యం యతిరాజో జగద్గురుః, స ఏవ సర్వలోకానాముద్ధర్తా నాస్తి సంశయః"** అని చేయెత్తి చాటి చెప్పే చైతన్యము కలిగింది. మాతా, పితా, సఖా, భ్రాతా, ధనంవై సర్వఏవసః " అనే నిశ్చయము ఏర్పడింది. విరించి పదవిని తృణీకరించే ధైర్యము, రామానుజుల పదమును ఆశ్రయించే స్థైర్యము గల ఈ లోకమును చూసి కలిపురుషునికి కంగారు పుట్టింది. యతిరాజుల సామ్రాజ్యములో తనకిక చోటులేదని తప్పుకోక తప్పలేదు. కలి బలిమిని కాలరాసి, తమ చెలిమితో లోకమును చేరదీసి, మంత్రోపదేశమనే కలిమిని కలుగజేసిన మహోపకారులు మన రామానుజులు. ఆ స్నేహశీలికి ముందుగా అంజలి చేద్దాము.

భగవద్రామానుజుల చరిత్రదివ్యము సదా అనుభావ్యము. వారి చరిత్రలో ఎన్నో అద్భుతమైన సన్నివేశాలు మనకు కనిపిస్తాయి. ఈ వ్యాసములో ప్రధానముగ రామానుజుల కాలములో తారసిల్లిన రమణీమణులను, వారి విశిష్టతను తెలుసుకుందాము, యతివరుల వైభవమును విలక్షణముగ చాటి చెప్పిన అతివల ఆంతర్యమును అవగాహన చేసుకోవాలనే ప్రయత్నమిది. వారి కాలములో కానవచ్చిన మహిళామణులందరిని గురించి ప్రస్తావించడము సాధ్యముకాదు. తమకు గల ఆచార్యనిష్ఠను ఆచరణతో వ్యక్త పరచిన వారిని కొందరిని గురించి తెలియజేస్తాము. మ్రదిమ, పతిపారార్థ్యము, కరుణ, క్షమ వంటి గుణములు స్త్రీత్వైకాంతములు అని భట్టరు వారు అంటారు. ఆడవారికి ఇవి పెట్టని ఆభరణములు. పతిసేవకు అంకితమయే పడతికి కైంకర్యాసక్తి స్వాభావికమైనది. మార్దవము మూర్తిమంతమై మహిళ అయింది. కరుణకు ఆలవాలముగ, ఓరిమికి మారుపేరుగ వనితాలోకము నన్నెకెక్కినది.

ఇటువంటి గుణపూర్తిగల మహిళలు రామానుజుల కాలములో ఎందరో ఉన్నారు. శేషాంశ సంభూతులైన రామానుజులకు విషాన్నమును భిక్షగా వేసిన విప్రపత్ని, మోక్షమునకు చీటీని వ్రాసి ఇమ్మని ఉడయవరులను ఒత్తిడి చేసిన గొల్లవనిత, యతిరాజుల పరివారమునకు ఆతిథ్యమిచ్చుటకు తన శీలమునే పణముగా పెట్టిన **పరుత్తి కొల్లి నాచ్చియార్ (కార్పాస రామలక్ష్మి)** ఎంబెరుమానారుల పాదుకలను చేలాంచలమున కొలువుదీర్చి కొలిమిన **కొంగు పిరాట్టి (చేలాంచలాంబ)** రామప్రియుని వీడలేని ప్రేమమూర్తి **బీబీనాంచారు**, తమ కుమార్తెను ఆవహించిన దుష్టశక్తిని దూరము చేయగల శక్తిమంతులు రామానుజలేనని విశ్వపించిన **విఠలరాయుని రాణి**. తిరుప్పావై జీయరుల ప్రబంధానుభవమును అప్రయత్నముగ ఆస్వాదించిన ఆచార్యపుత్రి **అత్తుళాయమ్మ** ఇలా ఎందరో మహిళామణులు భగవద్రామానుజ వైభవ ప్రతిష్ఠాపకులుగా మనకు సాక్షాత్కరిస్తారు. విలక్షణ లక్షణ విశిష్టమైన ఈ మహిళామణిహారము రామానుజ దివ్యచరితక విశేషాలంకారమై శోభావహమయినది.

**విప్రపత్ని:** పతిమాటను కాదనలేని నిస్సహాయత, అంగీకరించి ఆచరించడానికి అడ్డువస్తున్న ఆచార్య ప్రతిపత్తి. ఏమి చెయ్యాలో తెలియని అయోమయస్థితి. భగవద్రామానుజుల శ్రీరంగాలయ నిర్వాహణ దక్షతను చూచి అసూయతో వారిని అంతము చెయ్యాలని అనుకున్నాడు ఒక అర్చకుడు. **"విషాన్నం లక్ష్మణార్యాయ దీయతామ్"** రామానుజులకు విషాన్నమును భిక్షగా వేయమని తన భార్యను కట్టడి చేసాడు. పతి మాటను పాటించడానికి ఆమెమతి అంగీకరించలేదు. **"సాసాధ్వీతద్వచః శ్రుత్వా మతిం తత్ర నచాకరోత్"** అంగీకరించడానికి మనసురాదు. ధిక్కరించే సాహసము లేదు. ఈసంఘర్షణ నుండి ఉభయతారకముగా ఒక ఉపాయము తోచినది. విషాన్నమును భిక్షగావేసి పాదాభివందనము చేసింది. నీరునిండిన కనులతో నిస్సహాయంగే నిలిచింది. యతీంద్రుల పదపంకజమును నఖములతో తాకింది. ఇంగితజ్ఞులైన రామానుజులకు ఆమె అభిప్రాయము అర్థమైనది. తొలగినది. పత్నీధర్మమును పాటిస్తూనే ప్రమాదమును తొలగించి ప్రమోదమును కలిగించిన ప్రమదారత్న మీమె. చిన్నతనంలో రామానుజులకు కలిగిన ప్రాణాపాయమును తొలగించి, సంరక్షించిన పెరిందేవితాయార్ల మాతృప్రేమను ఈమెలో మనము దర్శించి దాసోహమందాము.

**తొండ్లూరుకొండి (గొల్ల వనిత):** పాలు, పెరుగులు అమ్ముకొని జీవించే పామరురాలు. అల్పమూల్యముగల వస్తువును ఇచ్చి ప్రతిగా అమూల్యమైన మోక్షమును ఆశించిన అమాయకురాలు అని అనుకుందామా! కానేకాదు. ఆచార్యానుగ్రహముతో మోక్షసామ్రాజ్యాన్ని పొందిన భాగ్యవంతురాలు. రాముని పాదము సోకి రాయి రమణి అయినదని విన్నాము. గొల్లపిల్లకు ముక్తికాంక్షను కలుగజేసే శక్తి రామానుజుల పాదతీర్థమున కున్నదని ఇక్కడ తెలుసుకుందాము.

సూక్ష్మములో మోక్షము అంటే ఇదేనేమో! పైకి కనిపిస్తున్నంత సులక్షమయినది కాదు ఈ ప్రవృత్తి. మహా విశ్వాసమనే ఆయసము ఇందులో ఇమిడి ఉంది. ఉడయవరుల ఉభయ విభూతి నాథత్వమును వారసత్వమును నిరూపించిన నిపుణ ఈమె. తనకు మోక్షమును ఇయ్యమని శ్రీవేంకటేశునికి లేఖవ్రాసి చేవ్రాలు చేయమని స్థిరముగా రామానుజులను అడిగిన అంగనారత్న మీమె. కాదనలేని కరుణాంతరంగులు వారు. ఆ లేఖను గోపబాలిక తీసుకొని వెళ్ళిన తీరు, శ్రీవేంకటేశ్వరుడు శిరసావహించిన తీరు అపూర్వమైనది. **'తూర్ణం పరం పదం నిత్యం తస్యై ముదా దదౌ'** పరమామోదముతో పరమపదమును ప్రసాదించినాడు స్వామి. అఖిలలోకము అంతులేని ఆశ్చర్యముతో అవాక్కయినది. పంచమోపాయ నిష్ఠకు ప్రథమోదాహరణ ముగా నిలిచిన ముదితారత్నమీమె. మార్గశీర్షమును మనకు

తెలియజేసిన గోదమ్మ మనో నిశ్చయమును ఈమెలో దర్శించి దాసోహమందాం!

**కార్పాసారామలక్ష్మీ (పరుత్తికొల్లినాచ్చియార్):** భగవద్రామానుజుల తిరుమల యాత్రలో తారసిల్లిన తరుణి ఈమె. ఊరు అష్టసహస్రగ్రామము. భర్తపేరు వరదాచార్యుడు. లౌకికమయిన ఐశ్వర్యము లేకపోయినా అతిథి సత్కారమునకు వెనుదీయని సంస్కారముగల గృహిణి. రామానుజులకు వీరి గృహమే తమకు విడిదిగా తగినదని అనిపించినది. తమ ఇంటికి వేంచేసిన ఆచార్యులకు ఎదురువచ్చి ఆహ్వానించలేని తన దైన్యమునకు తాత్కాలికముగా క్రుంగినా ధైర్యమును వీడలేదు. చేతిగాజుల సవ్వడితో రామానుజుల శాటీని సంపాదించుకున్నది. **"తేషాం విధాతుమాతిథ్యం మనశ్చక్రే ద్విజాంగనా"** వారందరికీ ఆతిథ్యమును ఇవ్వాలని నిశ్చయించుకున్నది. **"శరీరమర్థం ప్రాణాంశ్చ సద్గురుభ్యో నివేదయత్"** అనే సూక్తిని జ్ఞాపకము చేసుకున్నది. మానినులకు ప్రాణముకన్న మిన్న అయిన తన శీలమును పణముగ పెట్టింది. ఆచార్యారాధనము, తదీయారాధనము చేసినది. రామానుజుల శ్రీపాదతీర్థమును శేషప్రసాదమును తీసుకొని కామాతురుడైన వైశ్యునివద్దకు భర్త అనుమతితో నిస్సంకోచంగ చేరినది. ఆచార్యశ్రీపాదతీర్థమును అతనికిఇచ్చి నిశ్చలముగ నిలచినది. **"మాతాత్వం మమ తే భర్తా పితా సాధ్వి! న సంశయః"** అని వైశ్యునిచేత అనిపించినది. అతనిని రామానుజదాసునిగా తీర్చిదిద్దినది. ఆచార్యసేవాభాగ్యమును ఎప్పుడూ చేజార్చుకోరాదని తన సాహసముతో లోకమునకు చాటిచెప్పిన సాధ్వీమణి ఈమె. ఆచార్యానుగ్రహమువలన తన పాతివ్రత్యమునకు భంగము కలుగదనే విశ్వాసము ఈమెలో పూర్తిగ కనపడుతుంది. మన సర్వస్వము ఆచార్యులకొరకే అనే కైంకర్యభావనకు సీమాభూమి. ఆచార్యారాధనము సర్వథా కరణీయమని ఆచరించి చూపిన మానినీమణి. కామాతురుడైన రావణుని చెరలో తానున్ననాడు కూడా శ్రీరామరక్ష తనకున్నదని విశ్వసించిన సీతమ్మను ఈమెలో దర్శించి దాసోహమందాము.

**కొంగుపిరాట్టి** (చేలాంచలాంబ) భగవద్రామానుజులు పెట్టిన పరీక్షలను తట్టుకొని వారి అనుగ్రహమునకు పాత్రమయిన వనితారత్నమామె. మనకు ఆచార్యులు ఉపదేశించిన మంత్రమును, ఆరాధనకొరకు అనుగ్రహించిన పాదుకలను పదిలపరుచుకోవాలని, ఆచార్య దివ్యస్మృతిగా నిత్యము ఆరాధించుకోవాలని నిరూపించిన మహనీయురాలు. శ్రీరాముని పాదుకలను శిరసాధరించి ఆనందముతో రథమును అధిరోహించినవాడు భరతుడు. రామానుజుల పాదుకలను కొంగు బంగారముగ స్వీకరించి మేలునాడుకు తరలివెళ్ళిన మహిళామణి ఈమె. తన స్వరూపమును మరుగుపరుచుకొని ఉన్న రామానుజుల పాదములకు, తన వద్దనున్న పాదుకలను చేర్చి,వారే తన ఆచార్యులయిన యతివరులని గుర్తించిన ధీశాలిని ఈమె. **"ఏతౌ పాదౌ ప్రకాశేతే తదీయావతి సుందరౌ"** అని గుర్తించినది. **"అహమేవహి మన్నాథః శ్రీరంగాదధునాగతః"** అని రామానుజులవారిచేత యథార్థమును పలికించినది. తన అనుష్ఠానముతో ఆచార్యులను మెప్పించి ఆతిథ్యమిచ్చిన అదృష్టవంతురాలు. సమయానుకూలమయిన తన ప్రవృత్తితో భర్త మనసును మార్చిన సమర్థురాలయిన ఇల్లాలు. పతిహిత కామన కలిగిన పత్నీశిరోమణి. రామానుజులచే తన భర్తకు పంచసంస్కారవిధిని గావించి శ్రీరంగదాసునిగా చేసిన ఈమె చాతురి అసమాన్యము. **"సందేహోమాస్తు భవతాం శిష్యాహం యతిభూపతేః"** అని సగర్వముగా తెలియజేసి తనకుగల గురుపాదాబ్జ సేవానిరతిని నిరూపించిన శిష్యశిఖామణి. రామపాదుకలకు పట్టముకట్టిన భరతుని సేవానిరతిని ఈమెలో దాసోహమందాము.

**బీబినాంచారు:** ఢిల్లీనవాబుగారాలపట్టి కోరినది చేకూరడములో కొరతలేదు. రామప్రియుడే తనకు ప్రాణనాథుడని తలచినది. ఆమె శయ్యాగృహమునే తనకు నివాసగృహముగ ఆస్వామి చేసుకున్నాడు. తనను విడిచి వెళ్ళడనే ధీమా ఈమెది. మీ దైవమైతే పిలిచి తీసుకొని వెళ్ళమని నవాబు సవాలు చేసేడు. యతీంద్రులు ఆ స్వామి సంపత్పుత్రుడని సంభావించి రామప్రియుని తనతో తీసుకొని వెళ్ళిపోతున్నారు. భాష్యకారుల ప్రభావము ఆమెకు అర్థమయినది. రామప్రియుని విశ్లేషణమునకు తల్లడిల్లిపోయినది. స్వామి మనోభిప్రాయమును గ్రహించిన రామానుజులు ఆమెనుకూడా తమతో తీసుకొని పోవడానికి అంగీకరించేరు. అంతలోనే అద్భుతము జరిగినది. మార్గమధ్యములోనే ఆమె మాయమయినది. రామప్రియునిలో ఐక్యమయినది. అభూతపూర్వమయిన అనురాగమునకు అసలయిన తార్కాణంగా నిలిచినది. రామానుజులకు ఈ ప్రేమమూర్తిపట్ల ఆదరము పెరిగినది. యాదవాచలముపై అర్చామూర్తి పదసన్నిధిని ఈమెనుకూడ అర్చారూపముతో ప్రతిష్ఠించేరు శ్రీరంగనాథునికి తనను అంకితము చేసుకొన్న గోదమ్మ వైభవమును ఈమెలో దర్శించి దాసోహమందాము.

వీరేకాక మరికొంతమంది మహిళామణులు రామానుజుల చరిత్రలో మనకు దర్శనమిస్తారు. ప్రతి ఒక్కరిది విలక్షణమయిన వ్యక్తిత్వము. ఆదరణీయమైన వైభవము. అనుసరణీయమయిన అనుష్ఠానము (ఆచరణము). ఆశ్చర్యకరమయిన ఆచార్యాభిమానము. ఆమోదావహమయిన జీవనము. ఆదర్శవంతమయిన చారిత్రము. ఈ మహిళామణిహారము రామానుజచరితకు అపురూపమయిన అలంకారము.

## ముఖచిత్ర పరిచయము

**క్షమాగుణంలా ఆచార్యునికి లోకసంస్కారం ప్రధానగుణం కావాలి. చిన్నతనంలోనే తాను ఎన్నో శ్రమలకోర్చి, ఆచార్యానుగ్రహంచేత పొందిన మంత్రమంత్రార్థాలను, అందరికీ పంచరాదనే కఠోర నియమమున్నా పాటించక, తాపత్రయార్తుల తాపంతీర తాను నరకానికి పోవడానికైనా సిద్ధపడి, అవిశ్రాంతంగా అందించిన మహానుభావులు భగవద్రామానుజులు. వారు చేసిన గోపుర సందేశం సర్వలోక సమాదరణీయం. తిరుక్కోష్టియూర్ గోపురం నుండి, తాము అధికరించిన మంత్ర మంత్రార్థాలను లోకానికి వెదజల్లడమే ఈ నెల ముఖచిత్రము.**

# శ్రీవేంకటాచల "చిత్రే"తిహాసమాల

రచనం
రంగరామానుజాచార్య

12

చిత్రానువర్ణనం
జి.వి.ఎస్. శ్రీనివాస్
కె. సత్య శ్రీనివాస్



ప్రతి గురువారం నాడు నిజ నేత్రదర్శనం చేసేటప్పుడు స్వామి ఏ ఆభరణాలూ ధరించకుండా కేవలం ధోవతి మాత్రమే కట్టుకుని దర్శనం అనుగ్రహిస్తాడు.

తిరుమలకొండపై వేంచేసి ఉన్న స్వామి, శ్రీనివాసుడుకాడని పూర్వపక్షులు చెప్పే హేతువుల్లో ఒకటి శుక్రవారాభిషేకం. వాస్తవానికి శుక్రవారాభిషేకాన్ని స్వామికి జరపాలని పురాణాగమాదులు నిర్దేశించాయి. వైఖానసాగమానికి చెందిన ఆనందసంహిత, చాలాస్పష్టంగా

సహలక్ష్మ్యా౽భిషేకస్తు వాసరే భార్గవే హరేః ।
సాన్నిధ్యకారీ సతతం సర్వసంపత్ప్రదాయకః ॥

"లక్ష్మీదేవితోపాటు, శ్రీహరికి భార్గవవాసరంలో, అంటే శుక్రవారంనాడు అభిషేకం చేయాలి. ఇది భక్తులకు ఆదివ్యదంపతుల నిత్యసాన్నిధ్యాన్ని కలుగజేస్తుంది. అంతేకాదు సర్వ సంపదలనూ ఇస్తుంది." అని శ్రీవైఖానసాగమం చెబుతున్నదని గుర్తించి భగవద్రామానుజులు పూర్వమే ఉన్న సంప్రదాయాన్ని నియమపరచారు. ప్రాచీనకాలంలో శుక్రవారంనాడు స్వామికి అభిషేకం జరిగేదని, తొండమాన్ చక్రవర్తి కుమార్తెలు, బిలమార్గంలో శుక్రవారాభిషేక సమయంలో స్వామిని, దర్శించడానికి వెళ్లారని భవిష్యోత్తరమహాపురాణం చెబుతున్నది.

"పూర్వదేవగురోర్వారః సంప్రాప్తస్తు గతేదినే ।
తద్దినే వేంకటేశస్య ప్రసక్తమభిషేచనమ్ ॥
తద్ధర్మనార్థం మేకన్యాః సర్వాజగ్మూర్మహీసుర ।"

ఈ శ్లోకాల్లో శుక్రవారాభిషేకప్రస్తావన ఉన్నా, వాస్తవానికి రామానుజులకు పూర్వం, స్వామికి నిత్యం అభిషేకం జరిగేదట. ఇలా చేయడంవల్ల విగ్రహానికి శైథిల్యం ఏర్పవచ్చుననే భావనచేత, రామానుజులు శుక్రవారం మాత్రమే నియతంగా అభిషేకం జరిపేటట్లు కట్టడి చేశారని వేంకటాచలేతిహాసమాల చతుర్థగుచ్ఛంలో చెప్పింది.

గురువారంనాడు నిజనేత్ర దర్శనం చేయిస్తున్న స్వామి



శ్రీనివాసునికి శుక్రవారాభిషేకం





## స్వామికి అమ్మవారికి బిల్వార్చనం తగునా? తగును

శ్రీనివాసునికి బిల్వార్చనం జరిపే ప్రక్రియ తిరుమలలో ఉంది. బిల్వార్చనం శివునికే తప్ప శ్రీహరికి జరుపరని, కనుక, ఈఅర్చనా ప్రక్రియనుబట్టి, శ్రీనివాసుడుగా కీర్తింపబడుతున్న స్వామి పరమశివుడేనని పూర్వపక్షులవాదన. దీన్ని రామానుజులు ఖండించారు. శ్రుతి-స్మృతులు విష్ణువుకు బిల్వపత్రార్చనం తగునని ఉద్ఘోషించాయి. "ఆదిత్యవర్ణే తపసోఽధిజాతో, వనస్పతిస్తవ వృక్షోఽథ బిల్వః" అని శ్రీసూక్తం విస్పష్టంగా లక్ష్మికి బిల్వ పత్రాలు ప్రీతికరాలని చెబుతున్నది. హారీతస్మృతి 5వ అధ్యాయంలోని ధనుర్మాసపూజావిధానంలో -

**కోదండస్థే దినకరే తస్మిన్ మాసి నిరంతరమ్ ।**
**శతపత్రైశ్చజాతీభిః తులసీ-బిల్వ-పుష్కరైః ॥** ఇత్యాదిగా

బిల్వార్చనం చెప్పింది. ఇక్కడనే భార్గవవాసరంనాడు రాత్రి లక్ష్మీనారాయణులను అఖండ బిల్వపత్రాలతో అర్చించాలని నిర్దేశించింది.

**లక్ష్మీనారాయణందేవం భార్గవేవాసరేనిశి ।**
**అఖండ బిల్వపత్రైశ్చ కోమలైః తులసీదళైః ॥**
**అర్చయేన్మంత్రరత్నేన వామాంకస్థశ్రియాసహ ।**
**అఖండ బిల్వపత్రైర్వా పద్మపత్రైర్థ్వ తేనవా ॥**
**శ్రీసూక్త పురుషసూక్తాభ్యాం ప్రత్యర్చ్యం జుహుయాత్తతః ।**
**కరవీరైః కోవిదారైః బిల్వైరాస్ఫోటకైరపి ॥** ఇత్యాది శ్లోకాలు

బిల్వార్చనను విధిస్తున్నాయి.

**ఇక వారాహ పురాణం కూడా -**

**అర్చయన్తి జగన్నాథం తథా బిల్వదళైరపి ।**
**తులస్యాస్సుదళైశ్చాపి కృష్ణశ్వేతైశ్చ యోగినః ॥** అంటుంది.

లక్ష్మి, బిల్వవనంలో ఉంటుందట. కనుక "బిల్వవనస్థ"గా కీర్తింపబడింది.

**ప్రసన్నముఖ పద్మాయై పద్మకాన్త్యైనమోనమః ।**
**నమోబిల్వవనస్థాయై విష్ణుపత్న్యై నమోనమః ॥** అని

లక్ష్మీస్తోత్రం స్పష్టపరుస్తున్నది. అమ్మ తానుస్వయంగా అఖండబిల్వపత్రాలతో నరులు నన్నర్చిస్తారని చెప్పింది. **"అఖండైర్బిల్వపత్రైర్మా మర్చయన్తి నరాభువి"** అని



చిత్రకథ- 31

# రామానుజ చిత్రకథ


















మిమ్మల్ని శ్రవణానికి రానిస్తున్నారా?


ఓ...! సామాన్యులనే సమీపంలో కూర్చోనిస్తున్నారు.


ఆరంభంలో ముగ్గురు... క్రమంగా ఆరుగురు...
వారం రోజులలోనే మఠమంతా నిండిపోయిందమ్మా!


అమ్మా! మీరూ... ఒకసారి వచ్చి వినరాదూ!


రేపు మేం వెళ్ళేటప్పుడు ఇక్కడికి వస్తాం.
మీతో కలసి వెడతాం. సరేనామ్మా ...!


అలాగేనమ్మా! నాకూ చూడాలనే ఉంది.
మా దగ్గరుండి పాపం! ఎంత కష్టపడ్డాడో!




ఈ జగత్తుని తనలోంచి విష్ణువే సృజిస్తాడు. నామ, రూపాలిచ్చి పెంచుతాడు. తిరిగి తనలో చేర్చుకుంటాడు.


శ్రియ:పతికి... జీవులు, ఈ త్రిగుణాత్మక ప్రకృతి శరీరంగ అమరి ఉన్నాయని 'వేదం' స్పష్టం చేస్తోంది.


ఆత్మగ ఉండే ఆ శ్రియ:పతీ,
మూడు స్థితులలో ఉండే జీవులూ,
మూడు గుణాలుండే ప్రకృతి...
ఈ మూడూ కూడా నిత్యములే!


అదెలానో రేపు తెలుసుకుందాం!


నారాయణ...
నారాయణ...
నారాయణ...


త్రిదండాన్ని ధరించి, కషాయాన్ని చుట్టిన ఈ రామానుజుడు...
నారాయణ ఋషిలా ప్రకాశిస్తున్నాడు.


ఉదయించే సూర్యుడిలా దేదీప్యమానంగా వెలిగిపోతున్నాడు.




నాయనా! తేజస్వీభవ!
లోకాన్ని దీప్తివంతం చేయవయ్యా!
ఇంకా ఉంది...

## 2-5-2014న జీవ ప్రాంగణంలో జరిగిన సమతామూర్తి స్ఫూర్తి కేంద్ర శిలాన్యాస కార్యక్రమము



స్ఫూర్తి కేంద్రానికి శిలాన్యాసం చేస్తున్న శ్రీశ్రీశ్రీ స్వామివారు.




వేదికపై జీయర్‌స్వాములు, కార్యక్రమంలో అన్వయించిన భక్తజన వాహిని

## దివ్యసాకేతము, శ్రీరామనగరంలో శ్రీభగవద్రామానుజుల 997వ తిరునక్షత్రోత్సవ మహోత్సవము





దివ్యసాకేత ప్రాంగణములో శ్రీభగవద్రామానుజుల జయంతి సందర్భముగా మొదటిరోజు వాహన సేవలో యతిశేఖరులు



భగవద్రామానుజుల తిరునక్షత్ర సందర్భముగా తిరువీధి ఉత్సవము



రామానుజులకు తిరుమంజనోత్సవము


శ్రీభగవద్రామానుజుల 997వ తిరునక్షత్రోత్సవ మహోత్సవసందర్భముగా
ఖాజాగూడ ప్రాంతములో నిర్వహించిన శ్రీశ్రీనివాస కళ్యాణోత్సవ విశేషాలు

















*With Best Compliments from*








# KAKATIYA CEMENT

**Quality Always - Ahead**

## 53 Grade Cement & White Crystal Sugar

**Sri P. VENKATESWARLU**
Chairman & Managing Director

# KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED

*Regd. Office :* 1-10-140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
✆:27637717, 27633627, Fax No : 040 - 27630172, E-mail : kcsil@sol.net.in
E-mail: info@kakatiyacements.com

*Cement Factory :*
Srinivasanagar, Jaggaiahpet,
Krishna Dist - 521 175
✆ 08654 - 200014
Fax No: 08654-296331

*Sugar Factory :*
Peruvancha Village, Kallur Mandal,
Khammam Dist - 507 209,
✆: 08761 - 287207
Fax No: 08761 - 287206

శ్రీమతే రామానుజాయ నమః

# కంచిలో రామానుజులు

ఉ.వే. శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యస్వామి- హైదరాబాద్

భగవద్రామానుజులు భూతపురిలో ఉండగా తంజమాంబతో వివాహానంతరం పితృవియోగం కూడా సంభవించి వారి విద్యాభ్యాసం ఆగిపోయింది. ఆ తరువాత విద్యాభ్యాసానికి శ్రీయాదవప్రకాశులే తగిన వారని నిశ్చయించుకుని భూతపురిని వదలి తన తల్లియైన కాంతిమతితో భార్యయైన తంజమాంబతో కాంచీపురానికి చేరుకున్నారు శ్రీరామానుజులు.

యాదవప్రకాశుల వద్ద విద్యాభ్యాసం ఆరంభమైన రోజుల్లో కాంచీపుర మహారాజుకు ఒక కుమార్తె ఉండేది. ఆ అమ్మాయిని ఒక బ్రహ్మరాక్షసుడు ఆవహించి బాధ పెడుతున్నాడు. రాజుగారు రాజవైద్యులద్వారా, భూతవైద్యులద్వారా ప్రయత్నాలు చేసి చివరకి వేదవేదాంగవేత్త అయిన యాదవప్రకాశులే తగినవారని విని వారిని పిలిపించారు యాదవప్రకాశులు కొందరు శిష్యులతో బయలుదేరి వెళ్లి ఆ అమ్మాయిని సమీపించారు.

వేద వేదాంగాలలో భూతప్రేతములను భయపెట్టే కొన్ని మంత్రాలను చదివి ఆ అమ్మాయి మీద నీళ్లు జల్లారు. అది చూసి ఆ అమ్మాయి భయంకరంగా నవ్వి గుడ్లురిమి చూసింది. ఆ చూపుకి యాదవుల పై ప్రాణాలు పైకి పోయి నిరుత్తరులైపోయారు. ఆ అమ్మాయిని ఆశ్రయించిన బ్రహ్మరాక్షసి యాదవునితో ఇలా అంది. "ఓరేయ్ యాదవా! నీకు నన్ను పారద్రోలే శక్తి ఎక్కడిది? నీ ఈ బ్రాహ్మణ జన్మ కొరకు నీవు గత జన్మలలో చేసుకున్న పుణ్యం ఏముందని?" ఆ మాటలకు యాదవప్రకాశులు మిన్నకుండిపోయారు. దానికి మళ్లీ బ్రహ్మరాక్షసే మళ్లీ చెప్పడం మొదలెట్టింది.

"నీ గత జన్మ ఎంటో నీకు చెప్తాను విను. నీవు గతజన్మలో ఒక ఉడుము. నీవు ఒక అడవిలో బండ క్రింద ఉండేవాడివి. ఆ బండ మీద ఒక శ్రీవైష్ణవుడు వంట చేసుకుని భగవంతుడికి నైవేద్యం చేసి ఆ ప్రసాదాన్ని తిని ఆకును క్రిందపడవేసి చేతులు కడుక్కుంటే ఆ ఆకులోని ఉచ్ఛిష్టాన్ని భుజించి ఆ నీటిని త్రాగావు. అందుకే నీకు ఈ మానవ జన్మ... బ్రాహ్మణ జన్మ...వేద జ్ఞానము... అంత మాత్రాన నీవో గొప్పవాడివనుకోకు. నేనూ గత జన్మలో ఒక వేదవేదాంగవేత్తనైన ఒక బ్రాహ్మణుడినే. నీలాగే అహంకారంతో ఒక యజ్ఞాన్ని చేసాను. దాంట్లో కొంత మంత్రక్రియాది లోపాలు చెయ్యడం వలన నేను బ్రహ్మరాక్షసుడనయ్యాను. అందువలన నన్ను ఇక్కడి నుండి పారద్రోలడం నీవల్లకాదు. నన్నిక్కడి నుండి పంపేయాలనుకుంటే ఏం చెయ్యాలో కూడా నేనే చెప్తాను విను. నీ శిష్యుల మధ్యలో సర్వలక్షణ శోభితుడైన రామానుజుడు అనే శిష్యుడున్నాడు. ఆతడు తన పాదంతో నన్ను తాకి ఆయన పాదోదకాన్ని నా శిరసునజల్లి పొమ్మని ఆజ్ఞాపిస్తే వెళ్లిపోతాను."

ఆ మాటలను విన్న మహారాజుగారు చాలా సంతోషించి రామానుజుల పాద తీర్థాన్ని కటాక్షించమని కోరారు. రామానుజులు తన పాదంతో ఆ బాలిక శిరస్సును తాకి పాదోదకాన్ని శిరస్సున జల్లి ఆ రాక్షసుణ్ణి తక్షణమే అక్కడినుండి వెళ్లి పోవలసిందిగా ఆజ్ఞాపించారు.

రామానుజుల పాదోదకం లభించిన బ్రహ్మరాక్షసుడు వెంటనే తన పాప భూయిష్ఠమైన శరీరాన్ని వదిలి పాపములు నశించి పుణ్యములు మాత్రమే మిగిలి ఉండగా తనొక దివ్యదేహాన్ని ధరించి దేవతలంపిన ఒక దివ్య విమానంలో స్వర్గాన్ని చేరుకున్నాడు. రాజకుమార్తె ఆరోగ్యం చేకూరింది.

కాంచీపుర మహారాజు రామానుజులకు కనకాభిషేకాన్ని చేసి సత్కరించాడు. యాదవ ప్రకాశుని కూడా సత్కరించి పంపాడు. రామానుజులకు ఆ రాజు యిచ్చిన కనకాన్ని అంతా యాదవప్రకాశులకు భక్తితో సమర్పించుకున్నారు భగవద్రామానుజులు. అయినా తన గతజన్మ రహస్యం బట్టబయలవ్వడం వలన, రామానుజులకు బ్రహ్మరాక్షసిని పారద్రోలిన గౌరవం దక్కడం వలన, యాదవులు అవమానభారంతో దుఃఖించారు లోలోనే.

ఆ తరువాత కొన్నిరోజులు గడిచాయి. యాదవప్రకాశులు పాఠం చెప్తున్నారు. **"సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ"** నాయనలారా ఇది బ్రహ్మపదార్థమైన భగవంతునికి చెందిన వేదవాక్యం. ఈ వాక్యం యొక్క అర్థం ప్రకారం బ్రహ్మము మాయవలే అసత్యం కానిది, అజ్ఞానం కానిది, అంతము లేనిది అంటే అదే సత్యము అని మనం తెలుసుకోవాలి" అని చెప్పారు. దానికి రామానుజులు "ఆచార్యా ఈ వాక్యానికి మరొక రకమైన వ్యాఖ్య చేయవచ్చునుకుంటాను" అన్నారు. "అలాగా అయితే చెప్పు" అన్నారు యాదవప్రకాశులు. దానికి రామానుజులు ఇలా చెప్పారు.

"మనకు తెలిసిన సత్యాలన్నింటిలోకి ప్రముఖమైనది ప్రత్యక్షంగా కనబడుతున్న ఈ ప్రకృతియే, బ్రహ్మము ఈ ప్రకృతికంటే విలక్షణమైన సత్యము. జ్ఞానము అనేది జీవాత్మ ద్వారానే ఈ ప్రకృతిలోకి ప్రవేశించింది. బ్రహ్మము పరిమితమైన ఈ జీవజనిత జ్ఞానము కంటే ఉత్తమమైన జ్ఞానము. ఈ చేతనా చేతనములతో కూడియున్న ఈ జగత్తు దేశ కాల పరిచ్ఛిన్నము కలది. ఇట్టి దేశ కాల పరిచ్ఛిన్నము కాని అనంతమే ఆ బ్రహ్మము"

రామానుజుల విద్వత్తుకు ఆశ్చర్యపడుతూనే "వేదార్థం నీకు తెలుసా! మాకు తెలుసా!" అని దూషించారు యాదవప్రకాశకులు. రామానుజులు మిన్నకుండిపోయారు.

కాని యాదవప్రకాశుల కోపం తారాస్థాయికి చేరింది. తనకు విశ్వసనీయులైన నలుగురు శిష్యులతో తన దుఃఖాన్ని పంచుకున్నారు. అందరు కలిసి రామానుజుల్ని మట్టుపెట్టడమే మంచిదని నిర్ణయించుకున్నారు. అందరు తగిన వేదిక కాశీలోని గంగానదే అని నిర్ణయించుకుని "అందరం కలిసి కాశీవిశ్వేశ్వరుణ్ణి సేవిద్దాం'' అని తీర్థయాత్రకై బయలుదేరారు యాదవప్రకాశులు. అమాయకంగా వెంట నడిచారు రామానుజులు.

వీరి కుటిల ప్రయత్నం గురించి గుసగుసలు విన్న గోవిందుడనే మరో శిష్యునికి అవగతమైంది. ఆతడు రామానుజులకు పినతల్లి కొడుకు. ఈ విషయాన్ని రహస్యంగా చెప్పి రామానుజులను హెచ్చరించాలనుకున్నాడు గోవిందుడు. చివరికి ఒక అర్ధరాత్రి వింధ్యపర్వత ప్రాంతాల్లో ఆ అవకాశం లభించింది గోవిందుడికి. రామానుజులకు విషయం చెప్పి అక్కడినుండి తిరిగి వెనక్కి కంచికి వెళ్లిపోవలసిందిగా సూచించాడు గోవిందుడు. తమ ఆచార్యులైన యాదవ ప్రకాశకులకు చెడ్డపేరు రాకూడదనే భావంతో ఆ రాత్రికిరాత్రే వెనుతిరిగారు రామానుజులు.

అలా రెండుమూడు రోజులు అడవులలో తిరిగి దారి తప్పిపోయిన రామానుజులు "ఓ కాంచీపురవాసా! వరదరాజా! రక్షించు తండ్రీ" అని నమస్కరించుకున్నారు. కొంత దూరం అలా ప్రయాణించిన తరువాత ఒక వ్యాధుడు భార్యాసమేతుడై తారసపడ్డాడు. రామానుజుడు ఆ బోయవానిని

సమీపించి "అయ్యా నేను కంచికి వెళ్తూ దారి తప్పాను. నాకు ఈ అడవిలోంచి బయటపడి కంచికి వెళ్లే మార్గం చెప్తారా!" అని అడిగాడు "నాయనా! మాది సత్యవ్రతక్షేత్రము. ఇక్కడికి ఒకక్రోసు దూరం ఉంటుంది. మా వూరి దగ్గర నుండి ఈ అడవి నుండి బయటపడగల మార్గం ఉంది. మా వెంటరా!" అని తనతో తీసుకొని వెళ్లాడు. కొంతసేపటికి అలసిన ఆ దంపతులు ఒక చెట్టు కింద విశ్రమించారు. కొద్దిసేపటికి ఆతని భార్య "స్వామీ! నాకు చాల దాహంగా ఉంది. కొంచం జలం తెచ్చి ఇస్తారా!" అని అడిగింది. "ఇక్కడ కుడి ప్రక్కన ఒక దిగుడుబావి ఉంది. కాని "ఈ రాత్రిపూట నీళ్లు తేవడం కుదరదు. మాటాడక పడుకో"మని ఆజ్ఞాపించిడు వ్యాధుడు.

ఆ మాటలను విన్న రామానుజులు "అయ్యో! ఆ తల్లికి దాహంగా ఉందే! ఆ నీటిని నేనే తెచ్చి ఇస్తాను" అని తలచి నెమ్మదిగా ఆ దిగుడు బావినుండి రెండు దొప్పలతో నీటిని తెచ్చాడు. కాని అక్కడ ఆ వ్యాధ దంపతులు కనబడడంలేదు. ఎక్కడికి వెళ్లారా అని చుట్టూ కలయ జూసారు రామానుజులు. అక్కడ కొందరు జనులు తిరగడం చూసి వారి దగ్గరకు వెళ్లి "స్వామీ! ఈ వూరి పేరేమిటి?" అని అడిగారు రామానుజులు వారు "నాయనా! ఇది కాంచీపురం" అని చెప్పి వెళ్లిపోయారు. ఆశ్చర్యపోయి చూస్తుండగా రామానుజులకు కాంచీపుర గోపురం కనబడింది. "వరదరాజా! రక్షించావా తండ్రి! దాహమని నీరడిగింది మా తల్లి లక్ష్మీదేవేనా! దయామయా! ఒక్కరాత్రిలోనే నన్ను కాంచీపురం చేర్చావా తండ్రీ!" అని పదేపదే ధన్యవాదాలు చెప్పుకుంటూ ఇంటికి చేరుకున్నాడు రామానుజులు. రామానుజులను వ్యాధ దంపతుల రూపంలో శ్రీవరదరాజు దర్శనమిచ్చి రక్షించారని విన్న ఊరి ప్రజలందరూ ఆనందాశ్చర్యాలకు లోనయ్యారు. ఆ రోజునుండి రామానుజులు ఆ బావినుండి స్వామివారికి లక్ష్మీ అమ్మవారికి తీర్థకైంకర్యం చెయ్యడం మొదలుపెట్టారు.

అలా కొద్ది రోజులు గడిచిన తరువాత యాదవప్రకాశులు తిరిగి వచ్చి రామానుజులు తిరిగి క్షేమంగా కాంచీపురం చేరాడని ఆశ్చర్యపోయి ఏమీ ఎరుగనట్లే ఆతనిని తిరిగి తన శిష్యకోటిలో చేర్చుకుని విద్యను నేర్పడం మొదలుపెట్టారు.

ఒకనాడు యాదవులు అభ్యంగనస్నానం చేస్తూ రామానుజులకు **"కప్యాసం పుండరీక మేవ మక్షిణీ"** అనే వాక్యానికి "పుండరీకాక్షుని కన్నులను మర్కటము యొక్క పృష్ఠభాగమువలే ఎర్రగా ఉన్న పద్మంతో సమానంగా ఉంటాయని" చెప్పారు. భగవంతుని నేత్రాలకు అలాంటి నీచమైన కోతిపిర్రతో పోల్చబడిన పద్మాలతో పోల్చడం వినిన రామానుజుల కంటివెంట నీరు కారింది. అది గమనించిన యాదవ ప్రకాశులు "నాయనా ఎందుకు దుఃఖిస్తున్నావు?" అని అడిగారు. ''మీరు వేదవాక్యానికి చెప్పిన విపరీతార్థం విని దుఃఖం పొంగుకొచ్చింది ఆచార్యా" అన్నారు రామానుజులు.

"అలాగా అయితే నీవు నీకు తెలిసిన సరియైన అర్థం చెప్పు" అన్నారు యాదవప్రకాశులు.

"స్వామీ! కం అంటే నీరు. ఆ నీటిని త్రాగేవాడు సూర్యుడు. సూర్యుని వలన 'అస్యతే' వికసించేది తామరపువ్వు. అలా వికసించిన తామరపువ్వు రేకులవంటివి ఆ పుండరీకాక్షుని నేత్రములు" అని చెప్పాడు రామానుజులు.

ఆ మాటలకు ఆశ్చర్యపోయిన యాదవప్రకాశకులు క్రోధారుణ నేత్రములతో "మూర్ఖుడా! నీకు తోచిన అర్థాలు నా ముందర చెప్పకు. వెళ్లు నీకు నా శిష్యుడవయ్యే యోగ్యతలేదు. ఇక దయచేయ్" అని రామానుజులతో కటువుగా అన్నారు యాదవప్రకాశులు. రామానుజులు నెమ్మదిగా ఆశ్రమాన్ని వదిలేశారు.

ఆ రోజుల్లోనే యామునాచార్యస్వామివారు రామానుజుని గురించి విని వారికి విశిష్టాద్వైత ప్రచారకునిగా నియమిద్దామని తన శిష్యుడైన మహాపూర్ణుల ద్వారా రామానుజుని పిలిపించారు. కాని రామానుజులు శ్రీయామునాచార్యులను సమీపించేలోపే వారు ఆచార్య శ్రీచరణాలను చేరిపోయారు. అదిచూసి దుఃఖిస్తున్న రామానుజులకు యామునాచార్యుల దక్షిణహస్తంలో మూడువేళ్లు ముడుచుకుని ఉండడం చూసి ఆశ్చర్యపోయారు. "ఆచార్యులకు మూడువేళ్లు ఇలా ఎప్పుడూ మూసుకునే ఉండేవా?" అని అడిగారు రామానుజులు "అలాంటిదేంలేదే" అన్నారు ఆ స్వామి శిష్యులు.

"నేను శ్రీవైష్ణవమతాన్ని అవలంబించి అందరికీ ఈ మతాన్ని ప్రచారం చేస్తాను" అన్నారు శ్రీరామానుజులు అప్రయత్నంగా అందరూ చూస్తుండగా శ్రీయామునుల ముడుచుకున్న ఒకవేలు తెరచుకుంది. అందరూ ఆశ్చర్యపోయారు. రామానుజులు మళ్లీ చెప్పడం మొదలెట్టారు యామునుల భావాన్ని అర్థం చేసుకుంటూ.....

"నేను బ్రహ్మసూత్రాలకు తత్త్వజ్ఞానపరంగా సరిపోయే భాష్యాన్ని రచిస్తాను" ఆ మాట అనగానే శ్రీయామునాచార్యుల రెండవవేలు తెరచుకుంది. మూడవ మాటగా రామానుజులు "విష్ణుపురాణాన్ని రచించి శ్రీపరాశరుల నామాన్ని ఒక వైష్ణవునికి పెట్టి వారి ఋణం తీర్చుకుంటాను" అన్నారు. శ్రీయామునుల మూడవవేలు కూడా తెరచుకుంది. సంభ్రమాశ్చర్యాలకు లోనైన ఆ శిష్యకోటి అంతా రామానుజులకు మోకరిల్లింది. రామానుజులు భక్తితో శ్రీయామునులకు నమస్కరించి వెను తిరిగి కాంచీపురానికి చేరుకున్నారు. ఆచార్య దర్శనం కాలేదన్న దుఃఖంలో శ్రీరంగనాథుని కూడా దర్శించలేదు.

తిరిగి వచ్చిన రామానుజులకు దిగులు పట్టుకుంది. "తన ఆచార్యులు ఎవ్వరా" అని కంచిలో నివసించే కాంచీపూర్ణులే అందుకు తగిన వారని భావించారు శ్రీరామానుజులు. కాని వైశ్యకులోద్భవులైన కాంచీపూర్ణులు అందుకు అంగీకరించలేదు. రామానుజులు "స్వామీ! ఈ విషయాన్ని కంచివరదరాజులకే చెప్పి నాకు సమాధానం ఇవ్వండి" అని తాను సమాధానం తెలుసుకోవలసిన ఆరు ప్రశ్నలను అడిగారు. ఆ రాత్రి వింజామర కైంకర్యం చేసే కాంచీపూర్ణులకు ఈ క్రింది రామానుజుల ప్రశ్నలకు తనంతట తానే సమాధానాలు చెప్పాడు శ్రీవరదరాజస్వామి.

| | | |
|---|---|---|
| **1. రామానుజుని ప్రశ్న** | : | **పరబ్రహ్మమెవరు? ఈ జగత్తుకు కారణమెవ్వరు?** |
| **భగవంతుడు** | : | **"అహమేవ పరబ్రహ్మ జగత్కారణకారణం" నేనే ఆ పరబ్రహ్మమును, జగత్కారణములకు కూడా కారణాన్ని.** |
| **2. రామానుజుని ప్రశ్న** | : | **ఆత్మకు, పరమాత్మకు భేదం ఉందా?** |
| **భగవంతుడు** | : | **ఆత్మపరమాత్మలకు సహజంగానే భేదం ఉంటుంది.** |
| **3. రామానుజుని ప్రశ్న** | : | **మోక్షోపాసకులకు ఉత్తమమైన ఉపాయం ఏమిటి?** |
| **భగవంతుడు** | : | **ప్రపత్తియే.** |
| **4. రామానుజుని ప్రశ్న** | : | **మోక్షం కావాలంటే అంతిమస్మృతి ఉండి తీరాలా?** |
| **భగవంతుడు** | : | **అందరికీ ఉండాల్సిందే... నా భక్తులకు తప్ప.** |
| **5. రామానుజుని ప్రశ్న** | : | **మోక్షం పొందాలంటే నీ భక్తులు ఎన్ని జన్మలెత్తాలి?** |
| **భగవంతుడు** | : | **నా భక్తులకు దేహావసానం కాగానే మోక్షం లభిస్తుంది.** |

6. రామానుజుని ప్రశ్న : ఇప్పుడు నేను ఆచార్యులుగా ఎవరిని స్వీకరించాలి?

భగవంతుడు : మహాత్ముడైన పూర్ణాచార్యులను.

ఈ సమాధానాలు విన్న రామానుజులు పరమానందభరితులై మహాపూర్ణుల్ని తమ ఆచార్యులుగా స్వీకరించారు. ఆ తరువాత రామానుజులకు వారి భార్య తంజమాంబకు పొసగలేదు. దానికి కారణాలివి.

1. రామానుజులు ఒకనాడు శ్రీ కాంచీపూర్ణులను తమ ఇంటికి సాపాటుకై ఆహ్వానించారు. వారి భుక్త శేషాన్ని స్వీకరించాలనే ఉద్దేశ్యంతో, భర్త మనసెరుగని తంజమాంబ ఆ భుక్త శేషం రామానుజులకు అందకుండా చేసింది.

2. అన్నార్తుడైన వైష్ణవుడు ఆహారాన్ని కోరగా రామానుజులు ఆ భక్తునికి భోజనం పెట్టమన్నాడు. సర్వము ఉండి కూడా ఏమీలేవని చెప్పిందా భార్యామణి.

3. రామానుజుల గురుపత్ని నీళ్లు తోడుకుంటుంటే కొంత నీరు చిలికి తన బిందెలో పడ్డాయని ఆమెతో వాదులాడి మహాపూర్ణులు కుంటుంబ సమేతంగా ఊరువదలి వెళ్లిపోయేట్లు చేసింది ఆ సతీమతల్లి.

4. ఒక విద్వాంసుడైన బ్రాహ్మణునికి సాపాటు పెట్టమని పంపితే నిరాకరించిన ఆ తల్లి, ఆతనినే తన పుట్టింటి బంధువుగా పరిచయం చేస్తే సర్వవిధ సేవలూ చేసింది.

దాంతో ఆ విద్వాంసుడైన బ్రాహ్మణుని తోటే భార్యను పుట్టింటికి పంపివేసి, భగవద్రామానుజులు తురీయావస్థ అయిన సన్యాసాన్ని స్వీకరించారు. దండకమండాలలను స్వీకరించిన రామానుజుల ముందు శ్రీవైష్ణవ జాతి అంతా పులకించి మోకరిల్లింది. ఇలా కాంచీపురం రామానుజులు విశిష్టాద్వైత మతస్థాపనకు ఆరంభస్థానమైంది.

రుచికి, సువాసనకి, ఆరోగ్యానికి నాణ్యమైన
"అజంతా"
పసుపు, కారం, ధనియాలపొడి మరియు సేమియానే ఎల్లప్పుడు వాడండి
రవికుమార్ అండ్ కంపెని - చెన్నై
044 25204046, 26171341
Vijay Ads




శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

భగవద్రామానుజ సహస్రాబ్ది వచ్చేస్తుంది. భాష్యకారుల వైభవాన్ని చాటే శ్లోకాలు, పద్యాలు ఆనందంగా నేర్చుకుందాం. పదిమందికి నేర్పుదాం. మన పెద్దలందించిన మధురాతిమధురములైన పద్యాలు రామానుజ సౌందర్యాన్ని మన కన్నులముందు నిలుపుతున్నాయి. ప్రాతఃస్మరణీయులైన ఈ పద్యం ద్రాక్షాపాకాన్ని అందిస్తోంది. ఆస్వాదిద్దాం ।

ఉ॥ **ముద్దుమొగంబు, కెంజివురుమోవి, దయారసమొల్కు గన్నులున్**
**నిద్దపు జెక్కులున్, పసిడినిగ్గులుదేఱెడు మేను, బాగుగా**
**దిద్దిన యూర్ధ్వపుండ్రములు, తెల్లని జన్నిదమున్, త్రిదండమున్**
**దద్దయు నొప్పు చిన్ని శిఖదాల్చిన మా యతిరాజు గొల్చెదన్ ॥**

శ్రీరామానుజచార్య రూప, కల్యాణ గుణ విశేషాలను శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యస్వామివారు (కవిగారు) కన్నులకు కట్టినట్లు చూపించిన పద్యమొకటి. ఇదుగో...

శా॥ **మీ కాషాయము, మీ త్రిదండమును, మీ స్మేరాంకురాస్యంబు, మీ**
**శ్రీకాంతాంఘ్రి సరోజ దాస్యమును, మీ శ్రీ భాష్యవైదుష్యమున్**
**మీ కల్యాణ గుణ ప్రభావమును, స్వామీ! లక్ష్మణాచార్య! యిం**
**దా కల్పాంతము నిత్యమంగళము, నిత్యశ్రీగ వర్ధిల్లుతన్**

భగవద్రామానుజాచార్య! త్యాగైకమూర్తులైన మీరు ధరించిన కాషాయము, ప్రకృతి, జీవుడు, ఈశ్వరుడు అనే మూడు ప్రతీకగా మీరు ధరించిన త్రిదండము, అందమైన మందస్మితము, సుకుమార సుందర పాదద్వయ దాస్యం, మహాభాష్యరచనా పాండిత్యం, కల్యాణగుణవైభవం ఇవన్నీ ఈ కాలతత్త్వం నిలిచినంతకాలం వర్ధిల్లుగాక!

**"రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతాం అభివర్ధతాం"...**


www.mangalaakshatas.com
In commitment to help the people of spiritually inclined,
we come up with the unique platform for
'Sri Vaishnava Community' to choose their life partner with an ideal mind set.
With the Mangalasanams of
"Sri SriSriTridandiChinnaSrimannarayanaRamanujaJeeyarSwamiji" we
present you with 'mangalaakshatas' - A wedding platform for Sri Vaishnavas.
We are now open for free registrations. Please visit: www.mangalaakshatas.com

తిరువరంగత్తముదనార్లు అనుగ్రహించిన ప్రపన్నగాయత్రి

# ఇరామానుశనూత్తన్దాది

*గత సంచిక తరువాయి*

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

### 35వ పాశురము

నయవేన్ ఒరుదెయ్‌వమ్ నానిలత్తే, శిలమానిడత్తై ।
ప్పుయలేయెనక్కవి పోణి శెయ్యేన్, పొన్నరఙ్గమెన్నిల్॥

మయలే పెరుకుం ఇరామానుశన్ మన్ను మామలర్‌త్తాళ్
అయరేన్, అరువినై ఎన్నై యెవ్వాఱు ఇన్ఱు అడప్పర్‌ప్పుత్తువే ॥

**ప్రతిపదార్థము :**

**ఒరుదెయ్‌వమ్** = వేఱొకదైవాన్ని

**నయవేన్** = ఆశ్రయించను

**నా నిలత్తే** = ఈ లోకంలో

**శిలమానిడత్తై** = కొందరుఅల్పులనుద్దేశించి

**పుయలే ఎన** = మేఘంవలె వర్షించువాడా అని పల్కి

**కవిపోణ్ణిశెయ్యేన్** = కవిత్వం చెప్పి పొగడను

**పొన్ అరంగమ్ ఎన్నిల్** = శ్రీరంగము అని అంటేచాలు

**మయల్ పెరుకుమ్**

= గొప్ప వ్యామోహాన్ని పొందే

**ఇరామానుశన్** = భగవద్రామానుజుల

**మన్ను మా తాళ్ మలర్** = అందంగా ఉండే గొప్ప పాదపద్మాలను

**అయరేన్** = మఱువను కాబట్టి

**అరువినై** = భయంకర పాపాలు

**ఎన్నై** = నన్ను

**ఇన్ఱు** = ఈనాటి నుండి

**ఎవ్వాఱు అడర్‌ప్పుత్తు** = ఎలావచ్చి బాధించగలవు ?(రాలేవు అని అర్థం)

**తాత్పర్యము:** నాకు భగవద్రామానుజులు తప్ప వేరొక దైవం లేదు. నీచ మానవులను చేరి పొగడి పొగడి నాస్వరూపాన్ని చెడగొట్టుకోను శ్రీరామానుజులు "శ్రీరంగం" అనే పేరు వింటేచాలు ఉప్పొంగిపోతారు. అటువంటి మహనీయుల శ్రీచరణ పద్మాలను నేనేనాడు మరువను మరువలేను. అలాంటప్పుడు పాపాలు నాదరిదాపులకు కూడా రాలేవు. నన్ను బాధించలేవు. ఇది సత్యం.

యతిరాజ శ్రీపాదపద్మాలను నమ్ముకొన్నవారికి ఏబాధలు కలుగవని అముదనార్లు చాటి చెప్తున్నారు.

### 36వ పాశురము

అడల్ కొణ్డ నేమియన్ ఆరుయిర్ నాతన్, అన్ఱారణచ్చొల్
కడల్ కొణ్డ వొణ్ పొరుళ్ కండళిప్ప, ప్పిన్నుమ్ కాశినియోర్

ఇడరిన్ కణ్ వీళ్న్దిడత్తానుం అవ్వొణ్ ప్పొరుళ్ కొణ్డు అవర్‌పిన్
పడరుమ్ కుణన్ ఎమ్మిరామానుశన్ తన్ పడి యితువే ॥

**ప్రతిపదార్థము :**

**అడల్‌కొణ్డనేమియన్** = అద్భుతశక్తిగల శ్రీసుదర్శన చక్రాన్ని ధరించి

**ఆర్ ఉయిర్ నాతన్** = ఆత్మలకు శేషి అయిన స్వామి

**అన్ఱు** = పార్థునకు సారథి అయినవేళ

**అరణచ్చొల్** = వేదాలు అనే

**కడల్‌కొణ్డ** = సముద్రంలో దాగిన

**ఒణ్‌పొరుళ్** = అర్థాలను

**కణ్డు** = విచారించి చూచి

**అళిప్ప** = భగవద్గీతగా ఉపదేశించగా

**పిన్నుమ్** = ఆ తరువాత కూడా

**కాశినియోర్** = భూలోకవాసులందరూ

**ఇడరిన్ కణ్ వీడున్దిడ** = సంసారదుఃఖంలో పడి ఉండగా

**తానుమ్** = రామానుజులు కూడా

**ఆ ఒణ్ ప్పొరుళ్‌కొణ్డు** = ఆ గొప్ప అర్థాలను దర్శించి

**అవర్ పిన్ పడరుమ్** = ఆసంసారుల వెంటపడే

**కుణన్** = గుణము కల్గిన

**ఎమ్ ఇరామానుశన్ తన్** = మన ఆచార్యులయిన రామానుజుల

**పడి ఇతు** = స్వభావం ఇది

**తాత్పర్యము:** శ్రీసుదర్శన చక్రాయుధాన్ని ధరించిన శ్రీమన్నారాణుడు సకల ఆత్మకోటికి శేషి. అటువంటి స్వామి అర్జునునికి సారిథిగా నిలిచాడు. అతణ్ణి మిషగాచేసుకొని వేదసారాన్ని శ్రీమద్‌భగవద్గీతగా లోకానికి అందిచాడు. అయినా దానిని అర్థం చేసికొనలేని లోకులు ఈసంసార సాగరంలోనే పడికొట్టుమిట్టాడుతున్నారు. రామానుజులకు సంసారులపై దయకల్గింది. గీతాసారాన్ని వారికెలా అయినా తెలియచెప్పాలని గీతాభాష్యాన్ని అనుగ్రహించారు. చరమశ్లోకార్థాలను గోపురంపైకి ఎక్కి ఆసక్తిగలవారందరికీ అందించారు. అహా! రామానుజ ! ఏమి కళ్యాణగుణసంపన్నులు మీరు! అంటూ ఆనందాన్ని అందించారు అముదనార్లు.

### 37వ పాశురము

పడికొణ్డ కీర్‌తి ఇరామాయణమెన్నుం పత్తివెళ్ళమ్
కుడికొణ్డ కోయిల్ ఇరామానుశన్ కుణమ్ కూఱుమ్, అన్బర్

కడికొణ్డ మామలర్ తాళ్ కలన్దుళ్ళమ్ కనియుమ్ నల్లోర్
అడి కణ్డుకొణ్డు ఉగన్దు, ఎన్నైయుమ్ ఆళవర్కు ఆక్కినరే .

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **పడికొణ్డ** | = | లోకమంతా వ్యాపించిన |
| **కీర్తి** | = | కీర్తిని కలిగిన |
| **ఇరామాయణమ్ ఎన్నుమ్** | = | శ్రీరామాయణమనే |
| **పత్తివెళ్ళమ్** | = | భక్తి సముద్రం |
| **కుడికొండ** | = | నిత్యవాసం చేసే |
| **కోయిల్** | = | పవిత్రస్థానమైన |
| **ఇరామానుశన్** | = | భగవద్రామానుజుల |
| **కుణమ్ కూఱుమ్** | = | కల్యాణ గుణములను గూర్చిపలికే |
| **అన్బర్** | = | భక్తుల |
| **కడికొండ** | = | పరిమళభరితమైన |
| **మా తాళ్ మలర్** | = | గొప్ప పాదరవిందాలలో |
| **ఉళ్ళమ్ కళన్దు** | = | మనస్సులగ్నమై |
| **కనియుమ్** | = | పండిన స్నేహంగల |
| **నల్లోర్** | = | మహానుభావులు |
| **అడి కండు కొండు** | = | ఈ ఆత్మ రామానుజులకే శేషము అనే అర్థాన్ని తెలియజేస్తూ |
| **ఉకన్దు** | = | ఆదరించి |
| **ఎన్నైయుమ్** | = | నన్నుకూడా |
| **అవర్కు** | = | ఆ రామానుజులకే |
| **ఆళ్ ఆక్కినర్** | = | కింకరునిగా చేసారు. |

**తాత్పర్యము :** శ్రీరామాయణం లోక ప్రసిద్ధం. ఆ భక్తిసాగరాన్ని మనస్సులో నింపుకున్నారు రామానుజులు. వారి కల్యాణ గుణాలను ఎందరో ప్రతినిత్యం తలచుకుంటూ మురిసిపోతూంటారు. శ్రీరామానుజులవారి భక్తులు నన్ను అనుగ్రహించారు. ఎందుకూ పనికిరాని వానిగా పడి ఉన్న నన్ను చూచి జాలిపడ్డారు. అయ్యో! రామానుజదాసుడే, పాడైపోతున్నాడే అని పరితపించారు. నన్ను సంస్కరించారు. భగవద్రామానుజుల శ్రీచరణాలలో చేర్చారు. ఉజ్జీవింప చేసారు. ఎంతదయ చూపించారు అంటూ కూరేశుల వంటి మహనీయులకు కృతజ్ఞతలు చాటుకున్నారు అముదనార్లు.

*******

## శ్రీరామానుజ సహస్రాబ్ది - 2016 - 17

ప్రియ భగవద్బంధువులారా! మీరంతా ఎంతో ఉత్సాహంతో భగవద్రామానుజ విగ్రహ నిర్మాణానికి మీమీ ద్రవ్యాన్ని వినియోగింపదలచడం చాలా ముదావహం. మీరు ద్రవ్యం బ్యాంక్ అకౌంట్‌కు జమకట్టే విషయంలో ఈక్రింది అంశాలను గమనించండి.

1. మీరు ఆంధ్రాబ్యాంక్, ముచ్చింతల్ బ్రాంచ్‌కి. 209710100000007 నెంబరుకు - ఏ ఆంధ్రాబ్యాంక్ బ్రాంచి నుంచి అయినా నేరుగా జమకట్టవచ్చు. జమకట్టేటప్పుడు -కౌంటర్ ఫయిల్, వర్జినల్ మీవద్ద ఉంచుకుని దాని నకలు, జతచేసి ఒక తెల్లకాగితంపై మీవివరాలు, అడ్రస్ స్పష్టంగా, ఎవరిపేరున రసీదు పంపాలో వ్రాసి మా అడ్రస్‌కు పంపండి.

2. మీరు ఆంధ్రాబ్యాంకు కాక, వేరేబ్యాంకు ద్వారా పంపదలిస్తే-
IFSC Code ANDB – 0002097 అనే నెంబర్‌ను వినియోగించి పై ఆంధ్రాబ్యాంక్ అకౌంట్‌కే అమౌంట్‌ను పంపవచ్చును.

వివరాలు తప్పని సరిగా మా ఆఫీస్‌కు అందాలి. అందిన తరువాతనే రసీదు పంపబడుతుంది. ఎలా పంపినా -మీరు జమచేసిన వివరాలు- కౌంటర్‌ఫైల్ నకలు, మీపేరు, ఊరు, చిరునామా వగైరా ఈక్రింది అడ్రస్సుకు పోస్టులో పంపండి.

వివరములకు జీవా ఆఫీస్, 98498 59337, 98488 22522 నెంబర్లకు ఫోన్ చేయవచ్చును.

శ్రీరామానుజ సహస్రాబ్ది, జీవా, శ్రీరామనగర్, ముచ్చింతల్(గ్రా), పాలమాకుల(పో), శంషాబాద్ (మం), రంగారెడ్డి జిల్లా –509325

Email -contact@sriramanujasahasrabdi.org


వ్యక్తిత్వ వికాసానికి ... నాణ్యమైన సాంకేతిక విద్యా బోధనకు

కళ్ళం హరనాధరెడ్డి ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ



శ్రీ కళ్ళం హరనాధరెడ్డి
ఛైర్మన్ : కళ్ళంగ్రూప్




బిటెక్ కోర్సులు
➤ కంప్యూటర్ సైన్స్ అండ్ ఇంజనీరింగ్(సియస్ఇ)
➤ ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ (ఇఇఇ)
➤ ఎలక్ట్రానిక్స్ అండ్ కమ్యునికేషన్స్ ఇంజనీరింగ్ (ఇసిఇ)
➤ సివిల్ ఇంజనీరింగ్ (సిఇ)
➤ మెకానికల్ ఇంజనీరింగ్ (ఎమ్ఇ)

M.Tech :- CSE

మేనేజ్‌మెంట్ సీట్స్ కొరకు సంప్రదించండి : సెల్ : 98856 04528, 94402 61773, 94910 73337.

EAMCET Code KHIT

NH- 5.10వ కి.మీ వద్ద, కళ్ళం స్పిన్నింగ్ మిల్స్ వెనుక, చిలకలూరిపేట రోడ్, చౌడవరం, గుంటూరు- 19. ఫోన్: 0863 2119726.
సిటీ ఆఫీస్: ఫస్ట్‌లైన్, గుజ్జనగుండ్ల సర్కిల్, గుంటూరు -6. ఫోన్: 0863 2272345.

# భగవద్రామానుజులు-మేల్కోట వైభవం

శ్రీమాన్ డా॥ శ్రీమత్తిరుమల వేంకటరాజగోపాలాచార్యస్వామి, సంపాదకులు -గోవిందప్రియ

శ్లో॥ సకృదపి మఖమగ్రే పశ్యతాం యాదవాద్రౌ
నిఖిల భువన రక్షా నిర్నమేషస్య విష్ణోః
సురభిత హరిదంతం స్వాగతం ధామ్నిదివ్యే
వదనకమల గంధైః వక్తి వైకుంఠ నాథః ॥ యాదగిరి మాహాత్మ్యం.

యాదవాద్రి అంటే మేల్కోటయే ఇదే తిరునారాయణపురము. దీనికి పద్మకూటము, పుష్కరము, పద్మశేఖరము, ఆనందమయము, యాదవగిరి, యదుశైలము, యతిశైలము, వేదగిరి, దక్షిణబదరికాశ్రమము, గోమంతగిరి, ఇందిరక్షేత్రము, విద్యా (విజ్ఞాన) మంటపము, భూలోకవైకుంఠ, దొడ్డ గరుడన హళ్లి, దొడ్డ గురుగల హళ్లి, మొదలైన అనేకపేర్లు ఉన్నట్లు పలుప్రాచీన గ్రంథములను బట్టి తెలుస్తోంది. కృతయుగంలో 'నారాయణాద్రి', త్రేతాయుగంలో 'వేదగిరి', ద్వాపరయుగంలో 'యాదవగిరి', కలియుగంలో సుమారు 12 సంవత్సరములు భగవద్రామానుజుల నివాసంతో 'యతిశైలము'గా ప్రసిద్ధి చెందినది మేల్కోట. ఇదే తిరునారాయణపురము. ఇది కర్ణాటక రాష్ట్రం, మాండ్యంజిల్లా, పాండవపుర తాలూకాలో బెంగుళూరుకు 157 కి.మీ. దూరంలో ఉంది. "కర్ణాలంకృతి విభ్రమం భజత యః కర్ణాట దేశ శ్రియః" అని కర్ణాటక రాజ్యలక్ష్మికి ఈ పురము కర్ణాభరణంవలె ఉన్నదని వర్ణించారు శ్రీవేదాంత దేశికులు తమ సంకల్ప సూర్యోదయం నాటకంలో.

కృతయుగంనాటి దివ్యక్షేత్రం మేల్కోట. ఇందలి తిరునారాయణుని ఆలయం కాలగమనంలో మరుగున పడిపోయింది. చోళరాజు కలిగించిన ఉపద్రవం వలన శ్రీరామానుజులు సాలగ్రామము చేరి, అటనుండి తొండమాన్‌గ్రామమున విడిసి, తిరునారాయణుడొసగిన తన స్వప్నాదేశమును, ఆ ప్రాంత పాలకుడు, తనకు శిష్యుడు అయిన విష్ణువర్ధనునికి తెలిపి, తిరునారాయణపురుమున కేగవలెనని చెప్పెను. అప్పటికి ఆ మార్గమంతయు మహారణ్యము ఆచార్యాదేశము ఎంతక్లిష్టమైనదైనను శక్తియున్నచో దానిని అమలుజరుపుట శిష్యుని కర్తవ్యము. రాజు వెంటనే అడవినంతయు నరికించి చక్కని బాట వేయించెను. శ్రీరామానుజులు శిష్యబృందముతో తిరునారాయణపురముచేరి, పవిత్ర వేద పుష్కరిణిలో దత్తాత్రేయులవలెనే స్నానమాచరించి ఒడ్డున గల "పరిధానశిల" యందుంచబడిన త్రిదండ కాషాయములను తీసికొని ధరించి, పిమ్మట ఎంత వెదకినను యాదవ శైలమున స్వామి దొరకలేదు. పెరుమాళ్ల జాడ కానరాక ఖిన్నులై పవళింప, మరల స్వప్నమున స్వామి సాక్షాత్కరించి నాయనా! భాష్యకారా! కళ్యాణ తీర్థము గట్టున దక్షిణపువైపున కొండక్రిందుగల తులసివనంలో చంపక వృక్షము క్రింద పుట్టలో ఉన్నాను. సత్యము- సత్యము-సత్యము అని ముమ్మారు పలికెను. ఈ స్వప్న వృత్తాంతమును విష్ణుస్థలమునకేగి కళ్యాణపుష్కరిణీ తీర్థముతో పుట్టను తడుపగా అందు తిరునారాయణస్వామి సేవ లభించెను.

స్వామి ఆజ్ఞతో, విష్ణువర్ధన ప్రభువు సహకారముతో యతిరాజులు అచట సలక్షణముగ ప్రాకార మంటపములను, కోవెలను కట్టించి తిరునారాయణపురమని పేరిడెను. తిరునారాయణుని దివ్యమంగళమూర్తిని దర్శించి ఆనంద నృత్యము చేసి, ప్రభువును పిలిచి చూపించి, క్షీరాభిషేకము చేసి స్వప్నమున దర్శించిన స్వామిని ప్రత్యక్షముగ శ్రీచరణములనుండి కిరీట పర్యంతము కన్నుల తనివితీర దర్శించి ఆనందించి పరమాచార్యులైన నమ్మాళ్వారుల తిరువాయిమొళి ప్రబంధములోని 'ఒరునాయకమ్' దశకాన్ని స్వామికి సమర్పించిరట. స్వామికి సకల వైభవములు జరుగుచుండ ఆ వైభవములను దర్శించుటకు వచ్చు జనులు అచటనే నివాసములేర్పరచు కొనుటచే తిరునారాయణపురుము (మేల్కోట) ఒక పెద్ద పట్టణమయ్యెను. ఈ ఘటన బహుధాన్య సం॥ర పుష్యశుద్ధ చతుర్దశీ పునర్వసు, గురువారము జరిగినదని చారిత్రక పరిశోధకులు నిర్ణయించిరి. సాలగ్రమం, తొండనూరు తరువాత శ్రీరామానుజులు మేల్కోటలో స్థిరపడి, తొండనూర్ నంబిద్వారా విష్ణువర్ధనుని కలిసి వాని సాయముతో మేల్కోట ఆలయములో స్వామి అర్చామూర్తి పునఃప్రతిష్ఠము క్రీ.శ.1099లో నిర్వహించినట్లు కాలపరిశోధకులు నిర్ధరించిరి. అప్పటికీ శ్రీరామానుజుల వయసు 82 సం.లు.

అరణ్యమును ఛేదించి, శ్రీమన్నారాయణుని దర్శించి, ఆలయమును నిర్మించి, అందుస్వామి అచల అర్చామూర్తిని ప్రతిష్ఠించి, సంప్రోక్షణాదులు

7 సం॥లలో CA/CWA లలో అత్యధిక ఆలిండియా ర్యాంకులు మరియు పాస్ పర్సెంటేజ్ సాధించిన
నెం.1 కామర్స్ విద్యా సంస్థ
ఆంధ్రప్రదేశ్‌లోనే అత్యుత్తమ ఉత్తీర్ణతతో పాటు ర్యాంకులు సాధిస్తున్న ఏకైక అగ్రగామి కామర్స్ విద్యా సంస్థ
2012 Jr.MEC లో స్టేట్ 1st RANK 490/500 K. VYSHNAVI
No.1 for ▸ Inter(MEC / CEC) ▸ CA/CWA
శ్రీMEDHA
Igniting Intelligence. Delivering Excellence.
Head Office: 6/9 Brodipet, Vuda Office Road, Guntur-2. Ph: 22 55 891 / 988 52 49166
Branch Office: Mogalrajpuram, VIJAYAWADA Ph:9248920266

రంగరాజభట్టరులచే జరిపించి, భక్తుల నివాస యోగ్యమైన నగరమునే నిర్మింపజేసినను, ఎల్లరు తరించుటకు తిరునారాయణుని బ్రహ్మోత్సవములు జరుపవలె. ఉత్సవాదులలో స్వామిని ఊరేగించుటకు ఉత్సవ విగ్రహము లేదే అని ఉడయవర్లు విచారించుచుండ స్వప్నమున స్వామి తాను ఉత్సవమూర్తి రామప్రియునిగ ఢిల్లీశ్వరుడైన తురుష్కరాజువద్ద ఉన్నానని అచటికి పోయితీసుకురమ్మని ఆజ్ఞాపించెను. శ్రీరామానుజులు తమ 74 వేదాంత సింహాసనాధిపతులతో, 1200 ఏకాంగ భక్తులతో, లక్షసామాన్య శిష్యులతో, విష్ణువర్ధన ప్రభువు తన సైన్యముతోను వెన్నంటిరాగా ఢిల్లీ చేరి యమునా తటమున విడదిచేసెను. ఈ మహత్తర రామానుజసేనను చూచి పాదుషా బిత్తరపడి సన్యాసికి రాజ్యకాంక్ష, ధనకాంక్ష ఉండదు కదా మరి ఇట్లు సన్నాహమేలనో అని మంత్రులతో సమాలోచింప అతని కుమారుడు కబీరు ఇట్లనెను.

నాయనా! వచ్చిన నాయకుడు సన్యాసి. అతని చేతిలో ఓడిపోయినచో అవమానము. సన్యాసిని గెలుచుట ఒక ఘన కార్యము కాదు కనుక గెలిచినను కీర్తిస్తున్న వారు యుద్ధ సంకల్పముతో వచ్చినట్లు తోచదు. రాజపురోహితులను పంపి కారణము తెలిసికొనుడని చెప్పెను. పాదుషా మేళతాళములతో శ్రీరామానుజులను స్వాగతించి వారి రాకకు కారణ మడిగెను. మాస్వామి సంపత్కుమారుల అర్చావిగ్రహము ఒకటి మీ చెరసాలలో ఉన్నది. అది మాకు పూజ్యమైనది కనుక దాని కొరకై మేము వచ్చినామని చెప్పెను. ఇంతవరకు వాటిని అడిగిన వారు లేరు. మీరు మహాత్ములు కనుక ఒక విగ్రహము కొరకు అంతపెద్ద ప్రయత్నముతో వచ్చిరి. వెతికి తీసుకొనుడని విగ్రహములు గల ఒక శాలను చూపెను. మేము కోరిన విగ్రహము సుందరమైనది ఇందులేదు. నవాబు అనుకూలుడే ఇతడేమి చేయును అని బసకేగి చింతించుచుంట, స్వామి, కనిపించి "నీవు పిలచిన పలుకనా?" అని, తాను పాదుషా పుత్రిక చెంత సౌఖ్యములు అనుభవించుచున్నాను అచటికి వచ్చి పిలువగా వచ్చెదనని చెప్పెను. పాదుషావారితో అంతఃపురమునకు వెళ్లి సంపత్కుమారులను దర్శించి స్వామీ! నీవు లేక అచట సమస్త ఉత్సవములు నిలిచిపోయినవి దయతో వేంచేయుడని ఆదరముతో జాలిగా పిలువగా, రాజపుత్రి బీబీని ఎడబాసి అయిన ఆచార్యసూక్తిని మన్నించి తీరవలెనని ఆలోచించి గుడగుడ నడిచివచ్చి రామానుజుల తొడపై బిడ్డనివలె వేంచేసెను. శ్రీరామానుజులు స్వామిని ఆలింగనము చేసికొని 'శెల్వపిళ్లా' అని పిలిచిరి. 'యతిరాజపుత్రన్' అని అచటివారు స్వామిని కీర్తించిరి.

శ్రీరామానుజులు శెల్వపిళ్లై (సంపత్కుమారుల) ఉత్సవమూర్తిని మేల్కోటలోని తిరునారాయణమూర్తితో చేర్చి నిత్య, పక్ష, మాస, అయన, సంవత్సర ఉత్సవ విధులను నడిపించిరి. 52 మంది ధర్మకర్తలకు తగిన నిత్యకైంకర్యమును ఏర్పరచి ఏలోటూ కలుగకుండ స్వామికి తిరువారాధనలు జరిపించిరి. ఏడు విధములైన వివిధశాఖలకు చెందిన 57 విధముల కైంకర్యములు ఏర్పరచి, వాని నిర్వహణకు యోగ్యత కలవారిని నియమించి తమ అనంతర ప్రతినిధిగా శ్రీయదుగిరి యతిరాజ జీయర్ మఠమును నెలకొల్పిరి. ఈ వ్యవస్థ నేటికినీ కొనసాగుచున్నది.

మేల్కోటైతో భగవద్రామానుజులకున్న సంబంధాన్ని శ్రీమతి సరోజనీ జగన్నాథన్ Sri Ramanuja in Temple worship అనే గ్రంథంలో కొంత వివరించారు. చూ(252-259)

మేల్కోట వైభవ విశేషాలు, మున్నూట అరువది రోజుల జరిగే పలు ఉత్సవాది వివరములు తెలిసికొనుటకు శ్రీమాన్ చిత్రకవి ఆత్రేయస్వామి 80వ జన్మదినోత్సవ జ్ఞాపికగా వెలువడిన సమగ్రసమాచార దర్శిని, ఉ.వే. డా.ఈ.ఏ. శింగరాచార్యస్వామి విరచిత 'మేల్కోట వైభవము' గ్రంథము ఎంతైనా ఉపయుక్తము. 108 దివ్యక్షేత్రములసారం తిరునారాయణపురం ఇందు కళ్యాణతీర్థమునకు తూర్పునగల కొండపై వెలసిన శ్రీనృసింహస్వామి ఆలయము కృతయుగమునాటిది. ప్రతియేట ఫాల్గుణమాసములో జరిగే బ్రహ్మోత్సవములలో ఆరవనాడు నిర్వహింపబడే వైరముడిసేవ ఒక ప్రత్యేకతను సంతరించుకున్నది. అనాదిగా మేల్కోట ఒక గొప్ప యోగ భూమిగా, ఉభయవేదాంతముల కేంద్రంగా విరాజిల్లుతోంది. భగవద్రామానుజులు ఒకపుష్కరకాలమట వేంచేసి యుండుటచే యదుశైలము 'యతిశైల'ముగా ప్రసిద్ధిగాంచినది.

శ్రీరామానుజుల కృపచే అడవి ఊరయ్యెను. ఊరునగర మయ్యెను. ఇక అచట భక్తజన వాహినికి అంతులేకుండెను. స్వామికి నిత్యోత్సవ, వారోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవము లతో మేల్కోట నిత్యకళ్యాణము పచ్చతోరణమైనది. పుష్కరిణీ స్నానము, తిరునారాయణస్వామి దర్శనము, యతిరాజ మంగళాశాసనములతో మానవులు భక్తులై ప్రపన్నులై ముముక్షువులగుచుండిరి. ఉద్ధరింపబడిన ఆత్మలు యదుశైలము నుండి వైకుంఠమునకు మార్గమేర్పరచుకొనెను. భగవద్రామానుజులు వలన యదుశైలము కలియుగ వైకుంఠమై శ్రీరంగ వైభవమును సంతరించుకొనెను. క్షణకాలమైన యదుశైలమైన మేల్కోటలో నివసించినవారికి సకలబంధములు సానుకూలమై పరమపురుషు గోష్ఠీపంక్తి మధ్యమున నివాస భాగ్యము కలిగి దేవయానము సుగమమగునట.

**శ్రీరామానుజార్య దివ్యాజ్ఞా వర్థతామ్! అభివర్థతామ్!**

మరింత విశాలంగా ... వినూత్నంగా....
ప్రత్యేక 1 గ్రామ్ జ్యూయలరీ కౌంటర్
కామధేను సిల్క్స్
బీసెంట్‌రోడ్, విజయవాడ-2. ఫోన్: 2574220

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీరామానుజ కీర్తికౌముది

శ్రీమాన్ పురాణం వేంకటాచార్యస్వామి- సీతానగరం

సర్వేజనా స్సుఖినో భవన్తు సర్వే భద్రాణి పశ్యన్తు అనుసూక్తిని ఆచరణలో పెట్టిన మహనీయులు భగవద్ రామానుజులు. ఆనాడు త్రేతాయుగంలో విభీషణుడికారణంగా శ్రీరామచంద్రమూర్తి శరణాగతి మంత్రాన్ని మనకు అందించాడు. ద్వాపరయుగంలో శ్రీకృష్ణపరమాత్మ అర్జునుణ్ణి నిమిత్తంగా చేసికొని శరణాగతి తత్త్వాన్ని అమను బోధించాడు. కానీ రామానుజులో ఈ జీవుల దురవస్థను మార్చి భవగంతుని అనుగ్రహం కలగడానికి నారాయణ మంత్రాన్ని లోకానికి వెదజల్లారు. గురువుగారి ఆజ్ఞను మీరితే తనకు నరకం వస్తుందని తెలిసినా అందుకు సిద్ధపడి లోకాని కంతటికి మంత్రాన్ని అందించారు. ఇంతటి త్యాగ పురుషులు భారతావనిలోనే లేరు. వేయిసంవత్సరాలకు పూర్వమే మనకై పరితపించి దేశమంతా సంచరించి భక్తితత్త్వాన్ని ప్రబోధించిన పురుషోత్తములు శ్రీరామానుజులు. శ్రీ పెరుంబూదూరులో కాంతిమతీ కేశవయజ్వులనకు అవతరించిన శ్రీరామా నుజులు తమ కార్యస్థానంగా శ్రీరంగాన్ని ఏన్నుకొన్నారు. ఆనాడు అస్తవ్యస్తంగా ఉండే దేవాలయ వ్యవస్థని సరిదిద్దే ప్రయత్నం చేశారు. దేవాలయం సామ్రాజ్యానికి సంకేతంగా ఉండేది. సకల కళాస్రవంతులు ఆముహాసముద్రంవైపు ప్రయాణించేవి. సకల విద్యలుఅక్కడే రాణించేవి. సకలజనులు ఆ మహావేదికను ఆశ్రయించేవారు. అలాంటి దేవాలయ వ్యవస్థ నిర్వీర్యమైన తరుణంలో దానిని పునరుద్ధరించడానికి శ్రీరంగం కరిశైల మంజనగిరిం అన్నట్లు ఆసేతు శీతాచలం ప్రయాణించి ఒక సువ్యవస్థను స్థాపించారు. వేదార్థమైన శ్రీమన్నారాయణ పరతత్త్వాన్ని లోకానికి చాటారు.

శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః అన్నట్లు భగవంతుని అనుగ్రహం పొందడానికి అందరూ అర్హులే అని విశ్వసించి అట్టడగు వర్ణాలవారికి కూడా ఆలయ ప్రవేశం కల్పించారు. వారికి హరిజనులని (తిరుక్కులత్తార్) పేరు పెట్టింది శ్రీరామానుజులే.

ఎక్కడో మారుమూల అటవీప్రాంతంగా ఉన్న తిరునారాయణ పురంలో అద్భుతమైన ఆలయాన్ని నిర్మించి అక్కడి ప్రజానీకానికై కల్యాణి ఆనకట్టను నిర్మించి వందలాది యకరాల భూమిని సాగులోకి తీసికొని వచ్చిన సామాజిక సద్భావనా పరులు శ్రీరామానుజులు. తాను ఆశ్రయించిన ఆచార్యులే **"జగదాచార్యులు శ్రీరామానుజులని"** ముక్తకంఠంతో ప్రశంసింపగా అఖండకీర్తిని ఆర్జించిన మహాను భావులు శ్రీరామానుజులే. ఆనాడు విద్యానిలయమైన కాశ్మీరులోని పండితపరిషత్ అయిన శారదాపీఠానికి ప్రయాణించి ప్రాచీన మహర్షులైన భగవద్ బోధాయన మహర్షి రచించిన బ్రహ్మసూత్ర వృత్తిని సంపాదించి ఆమహర్షి అభిప్రాయానుసారంగా శ్రీవేదవ్యాసవిరచిత బ్రహ్మసూత్రాలకు వ్యాఖ్యానాన్ని ప్రసాదించిన విజ్ఞాననిధి శ్రీరావ శ్రీకృష్ణపరమాత్మ ప్రసాదించి భగవద్గీతకు అద్భుతమైన వ్యాఖ్యానాన్ని అనుగ్రహించిన యథార్థవాది శ్రీరామానుజులే.

ఈనాడు తిరుమలలో మనం దర్శించే ఉత్సవాలుగాని, నిత్యారాధనలు గాని, ఒకవ్యవస్థనుగానీ ఏర్పాటు చేసినది శ్రీరామా నుజులే. దిగవ తిరుపతిలో శ్రీగోవిందరాజస్వామివారి ఆటయాన్ని దానుచుట్టు అగ్రహారాన్ని నిర్మించి ఆలయానికి సుపరిపాలన అందించినది శ్రీరామానుజులే. శ్రీవేంకటేశ్వరస్వామివారికి శంఖచక్ర ప్రదానము, తిరుక్కురుంగుబి నంబిగారికి ద్వయమంత్రము, తిరునారాయణపురం స్వామికి విశ్వసామ్రాజ్యప్రదానము గావించిన యతీశ్వరులు శ్రీరామానుజులే.

సాక్షాత్ శ్రీరంగనాథునిచే శ్రీరామానుజదర్శనం అని ప్రశంసింప బడిన విశిష్టాద్వైత సిద్ధాంత నిర్ధారణసార్వభౌములు శ్రీరామానుజులే. ఇలా చెబుతుంటే శ్రీరామాకథను మించిపోతుంది శ్రీరామానుజులవారి దివ్యచరితం శతకోటిప్రవిస్తరం.

ఇంతటి మహానుభావులు యతీశ్వరులు అవతరించి వేయి వసంతాలు దగ్గరపడుతున్నాయి . శ్రీరామానుజులవారు మనకందించిన భగవత్కబుపకు ప్రతిగా ఆస్వామివిషయంలో మనంచేయగల కైంకర్యమేమిటి? ఏవిధంగా వారిని తరువాత తరాలవారు కూడ సులభంగా తెలిసికొనేటట్లు చేయడం ఎలా? వారిదివ్యకీర్తికి తగినట్లు కొంతైనా మనంచేయగల ప్రయత్నం ఏమిటి? ఇలా ఆలోచించిన అపర శ్రీరామానుజులు శ్రీశ్రీశ్రీత్రిదండి చినశ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి హృదయపుండరీకంలోంచి అవతరించిన కార్యశ్రీ శ్రీరామానుజ విగ్రహ ప్రతిష్ఠ.

వాస్తవంగా శ్రీరామానుజులవారి జీవిత కాలంలోనే శ్రీపెరుంబూదూరు తిరునారాయణపురం, తొండనూరు తిరుమల మొదలైన క్షేత్రాలలో వారి దివ్యమంగళ విగ్రహప్రతిష్ఠరిగితే వారి చరమ తిరుమేని (భౌతిక శరీరము) శ్రీరంగ క్షేత్రంలో మనకు దర్శనం ఇస్తుంది. ఆతరువాతి కాలంలో అన్ని దివ్యదేశాలలోను సుప్రసిద్ధ వైష్ణవ ఆలయాల్లోను వారి విగ్రహ ప్రతిష్ఠ జరిగింది. అలాంటి విగ్రహ ప్రతిష్ఠకాదు స్వామివారు తలపెట్టింది. ఇది మరొక విశిష్టమైన ప్రకియ.

శ్రీరామానుజులవారు అవతరించి విశ్వమానవ కల్యాణానికై అహర్నిశలు శ్రమించి మనకొక గతిని కల్పించారు. గతులన్నీ ఖిలమైన కలియుగమందున గతి ఈతడే అన్న అన్నమాచార్యులవారి మాట అక్షరసత్యం. అందుకే విశ్వమే తలయెత్తి దర్శింపదగ్గరీతిలో శ్రీరామానుజ విగ్రహప్రతిష్ఠచేయాలని సంకల్పించారు.

ఒకనాటి సమైక్యరాష్ట్రమైన ఆంధ్రప్రదేశ్‌లో శంషాబాద్ సమీపంలోని శ్రీరామనగర్ ప్రాంతంలో 200అడుగుల శ్రీరామానుజుల వారి కాంస్యవిగ్రహాన్ని నిర్మింప తలపెట్టారు. సుమారు 400కోట్ల

రూపాయలకైంకర్యంతో ఈనిర్మాణం కొనసాగుతుంది. శ్రీజీయరుస్వామి వారు ఆదేశిస్తే ఎవరో ఒక్కరి ద్రవ్యంతోనే నిర్మించవచ్చు. కానీ-ఇది ఏఒక్కరి ప్రదవ్యంతోనో నిర్మించడంకాదు. ఈ మహాయజ్ఞంలో భగవద్బంధువులందరు భాగస్వాములు కావాలి. శ్రయాదేయం అన్న వేదసూక్తిని అనుసరించి తమ శక్తికొలదీ ఈ కైంకర్యంలో అన్వయించాలి. సముద్రంలో మునిగేకొండకూ ఇసుక రేణువుకు తేడాలేదు. వారి వారి శక్తిని బట్టి ఉంటుంది. అలాగే ఈమహాయజ్ఞంలో కోటికి నూటికి తేడాలేదు. కైంకర్యం కైంకర్యమే. అలాగని కోటి ఇవ్వగలిగినవారు నూరు నూరు ఇవ్వగలిగినవారు కోటి ఇచ్చేప్రయత్నం మాత్రం వద్దు అందుకే శ్రీజీయరుస్వామివారు ఒక చక్కని ప్రణాళిఖను మనకు అందించారు. మనకు సంవత్సరానికి వచ్చే ఆదాయంలోంచి ఒకనెల ఆదాయం- ఉద్యోగస్థులైతే ఒక నెలజీతం, వ్యాపారస్థులైతే ఒకనెల నాభం, వ్యవసాయదారులైతే ఒకనెలఫలసాయం ఇలా తమవంతు కైంకర్యాన్ని ఈమహాయజ్ఞానికి సమర్పించి కృతార్థులు కావాలనే సంకల్పాన్ని ప్రకటించారు. వారి ఆజ్ఞను పాటించి మనమందరం ఇందులో భాగస్వామ్యం పొందుదాం భగవత్కటాక్షాన్ని పొందొదాం.

జన్మజన్మలుగా మనం చేసిన పుణ్యాపాపరూపకర్మలు నశించాలంటే అఖండ ఆనందసామ్రాజ్యాని పొందాలంటే అందుకు గతి శ్రీమన్నారాయణుడే. ఆయన అనుగ్రహం మనకు లభించాలంటే శ్రీరామానుజుల శ్రీచరణములు ఆశ్రయించాలి. అలాంటి శ్రీరామానుజ కైంకర్యంలో మనంచేరి కృతార్థులం అవుదామా!

రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతాం అభివర్ధతాం.

## శ్రీరంగేశ జయధ్వజో విజయతే

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

భగవద్రామానుజ సహస్రాబ్ది చేరువౌతుంది. పవిత్రమైన ఈ కాలంలో ఈ భూమిపై ఉన్న మనం భాగ్యవంతులం. ఆనాటి ఎంబెరుమానార్ల దర్శనభాగ్యాన్ని ఈనాడు మనకందిస్తున్న అపరరామానుజులు శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారు. మేరునగోన్నత దివ్యసంకల్పమూర్తి. వారు లోకానికందించే అపూర్వకానుక సమతామూర్తి స్ఫూర్తికేంద్రం. అది మన కనులముందు ప్రత్యక్షమయ్యే శుభతరుణం ఆసన్నమౌతుంది. దివ్యదేశములైన శ్రీదివ్య తిరుపతుల ఏకత్రదర్శనావకాశం, భాష్యకారులకు శ్రీపెరుంబూదూరు, కంచి, శ్రీరంగం, మేల్కోట, (తిరునారాయణపురం) దివ్యక్షేత్రాలతో పెనవేసుకొన్న అనుబంధం శ్రీరామానుజసర్వస్వంగా సమతామూర్తి సన్నిధిలో సాక్షాత్కరింపనున్నాయి.

నిరీశ్వరవాదాన్ని సప్రామాణికంగ త్రోసిరాజని, శ్రీమన్నారాయణ పరత్వాన్ని, తమ ఆచార్యులందించిన శ్రీ విశిష్టాద్వైత వైభవాన్ని సామాన్యుల కందించి, వివరించి, నిరూపించి, భక్తిసిద్ధాన్తానికి పట్టంకట్టిన భాష్యకారులు శ్రీరంగనాథుని జయధ్వజంగా వేదాకాశంలో అందాలు చిందించారు. చిత్-అచిత్-ఈశ్వరతత్వాన్ని సుప్రతిష్ఠితం గావించారు. ఆ ప్రయత్నంలో అడుగడుగునా ఎదురైన గరళాన్ని తాము ద్రిగమింగి, అమృతస్వరూపుని మనకందించారు. కార్చిచ్చు ఎంతటి పెద్ద అడవినైనా క్షణంలో భస్మీభూతంచేస్తుంది. యతిరాజదావాగ్ని పాషండ ద్రుమాలపాలిటి కార్చిచ్చే అయింది. పిడుగుకొండలనే, పిండి చేస్తుంది. చార్వాకశైలాలకి యతిరాజులు ఆశానిపాతంగా నిలిచారు. అవైదికతిమిరాన్ని దూరం చేయడంలో రామానుజులు దివాకరులే అయ్యారు.సింహం మదగజకుంభస్థలాన్ని చీల్చినట్లు జైనమదగజాల్ని చీల్చిచెండాడారు యతిపతి. మాయావాదిభుజంగానికి కోరలు పీకేశారు రామానుజగరుత్మంతులు. వేదోద్ధారకులై నిలిచారు ఎంబెరుమానార్లు.

### గీతాంజలి

1) ఎగురుతోంది ఎగురుతోంది రంగేశ జయధ్వజం
అంబరాన శ్రీరంగ అంగరంగ వైభవంగ
సమతామూర్తి జయధ్వజం ॥

2) సంసారసాగరాన ఈదులాడలేని మాకు చల్లని కరమందించిన
రంగేశ జయధ్వజం సమతామూర్తి జయధ్వజం ॥

3) గురువువేళ్ళు తెలిపించి మరువలేని సేవచేసి
మానవతను మహినిచాటు సమతామూర్తి ధ్వజం ॥

4) కూరేశుల సాంగత్యము ఎంబారుల సర్వస్వము
దండ పవిత్రములు కాగ సమతామూర్తి ధ్వజం ॥

సహస్రాబ్ది ఉత్సవాల ఎగురుతోంది జయధ్వజం. శ్రీరంగేశ జయధ్వజమ్ ॥

నాణ్యమైన ప్లాట్లు మరియు ఫ్లాట్లు కొనుగోలుకు నమ్మకమైన అగ్రగామి సంస్థ
అభినందన హౌసింగ్ (ప్రై). లిమిటెడ్
సెంట్రల్ ఆఫీస్ : 4వ లైను, పండరీపురం, లక్ష్మీపురం మెయిన్ రోడ్, గుంటూరు. ఫోన్ : 2354002.
మా బ్రాంచీలు: విజయవాడ 1, విజయవాడ 2, విజయవాడ 3, గుంటూరు 1, గుంటూరు 2, హైదరాబాద్, విశాఖపట్నం.
0866 - 6628668 : 0866 - 6642428 : 0866 - 6633668 :. 0863 - 6641177 : 0863 - 6454588 :. 040 - 66637799 :. 0891 - 2538686.

# విశేష సూచన

*మీరు జీవా ప్రాంగణంలోని సమాచారం కోరుతున్నారా?*

**ప్రియ భక్తినివేదన పాఠకులకు, భగవద్బంధువులకు సూచన**

శ్రీరాంనగర్ జీవాలో జరిగే వివిధ కార్యక్రమాలగురించి, స్వామివార్లు ప్రాంగణంలో ఉన్నారా? లేరా? ఇంలాంటివి ఎన్నో సమాచారాలు మీరు తెలిసికో కోరుతున్నారు.

ఈక్రమంలో భక్తినివేదనలో కనిపించిన ప్రతి ఫోను నంబరుకు ఫోన్ చేస్తున్నారు. ఇది సరికాదు. మీకు ఏ సమాచారం కావలసివచ్చినా ఈ క్రింది రెండు నెంబర్లకు మాత్రమే చేసి తెలుసుకోండి! ఇక రామానుజ సహస్రాబ్దిగురించి తెలిసికోగోరినవారికి వేరే. ఆ సమాచారం మన భక్తినివేదనలోనే ప్రతినెల విడిగా ఇస్తున్నాం. ఆ నంబర్లకే ఫోన్ చేసి, సమాచారం పొందవలసినదిగా భక్తినివేదన సూచిస్తున్నది.

**జీవా రిసెప్షన్ ఫోన్ నెం. 95535 49972, 95535 49972.**

## దళితయువకుని వైష్ణవదీప్తి

దళితయువకుని వైష్ణవదీప్తి ఫలితమే పుల్లూరులో మరొక తిరుమలకొండ ఆవిర్భావం. శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామి వారి ఉపదేశంతో ఆలయ నిర్మాణం, భగవదారాధనం పురోహిత కృత్యం అవికలంగా దాదాపు 4 సంవత్సారాలుగా చేస్తున్నాడు శ్రీమాన్ రామచంద్రంస్వామి. భగవద్రామానుజుల విశిష్టాద్వైత సిద్ధాన్తాన్ని పూర్తిగా విశ్వసించి ప్రాచీన కాలంగా ఆ కులం వారి సంప్రదాయంగా వస్తున్న వైష్ణవ ప్రచారం సరళినే తన జీవన విధానంగా మలచుకొని ఎందరికో ఆదర్శవంతంగా జీవనాన్ని సాగిస్తున్నవాడు రామచంద్రస్వామి. సిద్ధిపేట మండంలంలోని పుల్లూరు గ్రామంలో చెందిన ఈ దళిత యువకుడు పుల్లూరు గ్రామ ప్రాంతంలోని తిరుమల కొండ దగ్గర అతి పురాతాన వెంకటేశ్వరస్వామి అర్చావిగ్రహం లభిస్తే దాన్ని గ్రామస్తుల సహకారంతో నిర్మించిన చిన్న ఆలయంలో తన ఖర్చులతోనే శ్రీనివాసుని ప్రతిష్ఠించి నిరంతరం అర్చిస్తున్నాడు. పెద్దల సాన్నిధ్యం వల్ల అర్చనానికి వివాహాది ముహూర్తనిర్ణయానికి కావలసిన పరిజ్ఞానాన్ని సాధించుకొని తాను విశ్వసించిన వైష్ణవ సంప్రదాయాన్ని తనకు గల చిన్న క్షేత్రంద్వారా సంపాదించుకున్న ధనంతోనే సేవించుకుంటూ ఆలయ మర్యాదలను సక్రమంగా నెరవేరుస్తూ ఆప్రాంతంలోని పలువురి మన్ననలను పొందాడు. తరచు మన జీవాప్రాంగణంలోనే దివ్యసాకేతంలో జరిగే ఉత్సవాలకు కార్యకర్తగా వస్తూ ఇక్కడి అర్చకుల సహకారం వల్ల తన భగవదారాధనా నైపుణ్యాన్ని బాగా మెరుగు పరుచుకున్నాడు. స్వంత డబ్బుతో నిర్మించిన ఆలయాన్ని ఆశ్రయించి ఉంటూ దళిత యువకులకు హిందూధర్మం పట్ల అవగాహనను పెంచుతున్నాడు. ఈతని కృషిని అభినందిస్తూ వదాన్యులు ఈతనికి సర్వవిధాలా ప్రోత్సాహాన్నివ్వాలని మన భక్తినివేదన ఆకాంక్షిస్తున్నది.

### మే నెల మెదడుకు మేత సమాధానములు

1. గుప్తులకాలం; 2. సంజయుని; 3. సుధర్ముడు; 4. నీలునిపుత్రిక; 5. దుంధుకారుని తల్లి; 6. భాగవత శ్రవణానికి; 7. శ్రీదేవిని/లక్ష్మి; 8. అముదనార్లు చేసిన పాపాలను బూడిద చేసిన తరువాత; 9. అంతర్యామిగా; 10. శ్రీసుదర్శన సూరి; 11. భరతుని పరివారం; 12. వరాహ చరమసూక్తి; 13. వీర నరసింహ గజపతిరాజు; 14.సాధకుడు; 15. దయాశతకం క్షమాశోడశి; 16. వరవరమునీంద్రులు; 17. దయాశతకం; 18. శ్రీరంగనాథుడు; 19."మయాజం" 20. ఆచార్యుల శ్రీపాదాలలో చేరాలని కోరింది.

An.Y.
ఆర్థోఫిట్ సిరప్
అన్ని రకముల జాయింట్ నొప్పులకు
సరికొత్త పరిష్కారం
ఇది ఫిజికెమ్ వారి ప్రతిష్ఠాత్మక ఉత్పాదనలలో ఒకటి
సత్వర నివారణకు అద్భుత ఆయుర్వేద ఔషధం
Also available as Oil & Capsules
ఇంటింటా ఆర్థోఫిట్ నొప్పులన్నీ ఫటాఫట్



పరమహంస పరివ్రాజకులు
# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



**దివ్యసాకేతంలో భగవద్రామానుజ తిరునక్షత్రోత్సవం.**

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీత్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి వారి ప్రత్యక్ష పర్యవేక్షణలో రామానుజ జయన్తి ఉత్సవాలు జరిగాయి. నిర్మత్సరంగా సర్వప్రాణికోటిక్షేమాన్ని కాంక్షించి, సార్వజీనవమైన దర్శన సిద్ధాన్తాన్ని శ్రీసంప్రదాయంగా లోకానికందించిన మహనీయులు భగవద్రామానుజుల తిరునక్షత్రోత్సవం ఈ సంవత్సరం ముచ్చింతల్లోని జీవాప్రాంగణంలో వేంచేసి ఉన్న దివ్యసాకేతంలో సర్వాంగ సుందరంగా జరిగింది. ఐదురోజులపాటు జరిగిన ఈ ఉత్సవంలో భగవద్రామానుజు లకు వైభవంగా విశేషారాధనలు జరిగాయి. ప్రతిదినం భగవద్రామానుజుల విగ్రహాన్ని పీఠంపై వేంచేపుచేసి అభిషేకం జరిపారు. ఊరేగింపుగా ఆలయ పరిక్రమణం కావించి దివ్యసాకేతంలోని శ్రీరాఘునాథ సన్నిధిని ఉదయం 10 గం.లకు అభిషేకం తరువాత ఇరామానుశనూత్తందాది సేవాకాలం, శాత్తుమురైలతో, తీర్థప్రసాద వితరణంతో ఉదయ కార్యక్రమాలు ముగించారు.

పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీత్రిదండి అహోబిలరామానుజ జీయర్ స్వామివారు, పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీత్రిదండి దేవనాథ రామానుజ జీయర్ స్వామివారు ఉభయవేదాన్త పీఠాధ్యక్షులు భక్తినివేదన సంపాదకులు ఉ.వే. శ్రీమాన్ ఎస్.వి. రంగరామానుజాచార్యస్వామి వారు ఈ కార్యక్రమాల్లో పాల్గొని మార్గదర్శనం చేశారు. భగవద్రామానుజ వైభవాన్ని ఆవిష్కరించే "ఉడయవర్ తిరుమంజన కట్టి" యాన్ని శ్రీశ్రీశ్రీ అహోబిలస్వామి వారు అనుసంధానంచేశారు. అభిషేకానంతరం నిత్యం రామానుజులకు విశేషార్చనాన్ని, నామావళీ పురస్సరంగా జరిపారు. సాయంకాలం 6.30 గంటలకు పురప్పాడు (ఊరేగింపు) జరిపి, శాత్తుమురై తీర్థప్రసాదాలతో కార్యక్రమం ముగించారు. ప్రతిరోజు సాయం సమయంలో నాలాయిర దివ్యప్రబంధసేవ జరిపించారు. 30-4-14 నుండి 4-5-14 వరకు ప్రతిదినం ఇదే కార్యక్రమం జరిగింది.

**భగవద్రామానుజ విగ్రహస్థాపన ప్రారంభశంకుస్థాపనం.**

భగవద్రామానుజుల, విగ్రహస్థాపనానికి, ప్రారంభశంకుస్థాపనం నిర్ణయించిన స్థలంమధ్యలో జరిగింది. శ్రీమాన్ సముద్రాల శ్రీనివాసాచార్య స్వామి, శ్రీమాన్ ముడుంబై మధుసూదనాచార్యస్వామివార్ల ఆధ్వర్యంలో వైభవంగా విష్వక్సేన పూజా పుణ్యాహవాచ ప్రక్రియ క్రమంలో సాగించారు. దివ్యసాకేతార్చకులు శ్రీమాన్ వరప్రసాదాచార్యస్వామి ప్రభృతులు పాల్గొని విశేష వైభవాన్ని సంతరించారు. ఇదే క్రమంలో ఈశాన్య స్థానంలో 108 దివ్యస్థలాల ఆలయ ప్రతిష్ఠాపనానికి నాందిగా శ్రీరంగనాథ మందిరానికి శంకుస్థాపనం జరిపారు. ఇక మూడవ స్థానంగా 60వ దివ్యదేశాన్ని తిరువణ్ పరిశాడు అనేదాన్ని ఎంచుకొని, దానికి నైరుతిమూల శంకుస్థాపనం చేశారు. ఈ కార్యక్రమానికి, మనజీవా చైర్మన్ డా॥ జూపల్లి రామేశ్వరరావు దంపతులు, జీవా కార్యవర్గ సభ్యులు, దివ్యసాకేత నిర్వాహక సమితి సభ్యులు, ఇంకా పలువురు ప్రముఖులు విచ్చేసి కార్యక్రమాన్ని సుసంపన్నం చేశారు. శంకుస్థాపనం జరిగిన తరువాత నూతన మండపంలో పలువురు ప్రముఖుల సమక్షాన విశేష కార్యక్రమం జరిగింది. ఈ సందర్భంగా పలువురు తమవదాన్యతను ప్రకటించారు. కొందరు ఒక్కొక్క ఆలయం (నమునా) నిర్మాణానికయే సుమారు ఒకటిన్నర కోట్ల ధనాన్ని సమర్పించడానికి ముందుకువచ్చి, స్వామివారి మంగళాశాసనాన్ని పొందారు. అలాంటి ప్రముఖుల్లో శ్రీమాన్ తాతాచార్యులు (హ్యూస్టన్) గారి పుత్రుడు శ్రీమాన్ చి॥ డి.వి.ఆర్ భట్టరాచార్యులు, గోవిందమాధవి దంపతులు ఒక కోటి రూపాయలు సమర్పించారు. శ్రీమాన్ తాతాచార్యులు గారు సహస్రాబ్దికి 5 లక్షలు, ప్రతిసంవత్సరం జీయర్ అవార్డుకు లక్ష ఈయడానికి ముందుకు వచ్చి, తమ ఔదార్యాన్ని చాటారు. మన జీవా సభ్యులు శ్రీమాన్ చల్మెడ లక్ష్మీనరసింహారావు దంపతులు, ఇలా పలువురు వాగ్దానం చేయడమే కాక ద్రవ్య సమర్పణం కూడా చేసి స్వామివారి మంగళాశాసనాన్ని పొందారు. మన ఆర్గనైజేషన్ చెందిన అల్లంపల్లి వగైరా ట్రైబల్ స్కూళ్లను పర్యవేక్షించే శ్రీమతి కృష్ణకుమారి శ్రీమాన్ వెంకట నారాయణాచార్యుల దంపుతుల పుత్రుడు కూడా ఈ కార్యక్రమానికి భూరివిరాళాన్ని సమర్పించ నిశ్చయించినట్లు ప్రకటించారు.

## రామానుజులవారి 997వ తిరునక్షత్రం
## తత్త్వయుక్త శ్రీనివాస కళ్యాణం

ఈ సంవత్సరం భగవద్రామానుజుల జయన్తి మే 4వ తేదీని వచ్చింది. అందువల్ల ఆనాటి ఉదయం మన దివ్యసాకేతంలోన వేంచేసి ఉన్న భగవద్రామానుజులను నూతన మండపంలో వేంచేపు చేసి అశేష జనసందోహం సమక్షాన తిరుమంజనం అర్చనాదులు వైభవంగా జరిపారు. సాయం లాంకోహిల్స్ దగ్గర, ఢిల్లీ పబ్లిక్ స్కూల్ ప్రక్కన ఉన్న ఖాజాగూడ గ్రామంలో శ్రీమాన్‌వేణుగోపాల్‌రెడ్డి దంపతుల గృహంలో మన దివ్యసాకేత శ్రీనివాసపెరుమాళ్లను, భగవద్రామానుజులను వాహనాలపై సుందరంగా అలంకరించి అక్కడనుండి అందంగా శోభాయాత్ర సాగించారు. ఈ యాత్ర శ్రీరుక్మిణీ సత్యభామా సహిత వేణుగోపాలస్వామి ఆలయం వరకు సాగింది. అశేషభక్త సందోహం అనుసరించి రాగా గుఱ్ఱాలు, ఒంటెలు, ముందున సుందరంగా అలంకరించుకొని యాత్రను మరింత శోభాయమానం చేశాయి. ఆలయం ప్రక్కన విశాల ప్రాంగణంలో సుందరంగా వేదికను ఏర్పాటుచేసి శ్రీనివాసపెరుమాళ్లను, రామానుజులను వేంచేపు చేసారు. శ్రీమాన్ సముద్రాల శ్రీనివాసాచార్యులు, శ్రీమాన్ ముడుంబై మధుసూదనాచార్యుల ఆధ్వర్యంలో శ్రీనివాస కళ్యాణం వైభవంగా జరిగింది. శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారితో పాటు శ్రీశ్రీశ్రీ అహోబిలజీయరుస్వామివారు, శ్రీశ్రీశ్రీదేవనాథజీయరు స్వామివారు పలువురు పెద్దలు కార్యక్రమం నిర్వాహకులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. శ్రీమాన్ పవన్‌కుమార్ బృందం దశవతారాలు నృత్యరూపకాన్ని స్వామివారి సమక్షంలో ప్రదర్శించింది. ఈ కార్యక్రమమంతా టీవి.5 మీడియా పార్ట్‌నర్ చైర్మన్ శ్రీ బి.ఆర్ నాయుడుగారు, కొమిరిశెట్టి ఫౌండేషన్ చైర్మన్ శ్రీమాన్, శ్రీవిద్య, వేణుగారు ప్రభృతుల నిర్వహణంలో వైభవంగా సాగింది. జీయర్‌స్వాముల మంగళాశాసనాలతో ఈ కార్యక్రమం సుసంపన్నం అయింది.

# దివ్యసాకేత 5వ బ్రహ్మోత్సవాలు - శ్రీరాంనగర్, శంషాబాద్.





అనంతరం శ్రీజీయర్‌స్వామివారు అమెరికాలో జరుగు జెట్‌కన్వెన్షన్‌లో అన్వయించడానికి 16వ తేదీన బయలుదేరి వేంచేశారు. వికాసతరంగిణిని అమెరికాలో ఏర్పాటుచేసి, ఇప్పటికి 20సంవత్సరాల కుడా విశేషం. వివరాలు పైసంచికలో ఇవ్వబడతాయి.

శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో దివ్యసాకేతరాముని 5వ బ్రహ్మోత్సవాలు వైభవంగా జరిగాయి. సీతానగరంనుండి వేదాగమ విద్వాంసులు, విద్యార్థులు, జీవా గురుకుల విద్యార్థులు పాల్గొని ఈ కార్యక్రమాన్ని వైభవంగ జరిపారు.

7వ తారీఖు ఉ॥ సాకేత రామచంద్రస్వామికి, ఉత్సవారంభ స్నపనము, గావించి సాయంకాలం అంకురారోపణ కార్యక్రమము, జరిగినది. మరునాడు ఉదయం ధ్వజావరోహణం, యాగశాలలో అగ్నిప్రతిష్ఠాపన, చతుస్థానార్చనలు వేద, ఇతిహాస, పురాణ, ప్రబంధాది పారాయణములు ప్రారంభం అయ్యాయి.

ప్రతిరోజూ రాత్రివేళల వాహనసేవలు కనుల పండుగగా శ్రీస్వామివారు జరిపించారు. మొదటిరోజు పొన్నవాహనసేవ, రెండవరోజు హనుమద్వాహన సేవ, మూడవరోజు శేషవాహనసేవ, నాల్గవరోజు గరుడ వాహనం పై పెరుమాళ్ళు దర్శనం ఇచ్చారు.

విశేషంగా మూడవరోజు సాయంకాలం సాకేతరామచంద్రస్వామి కల్యాణమహోత్సవం. నాల్గవరోజు ఉ॥ సామూహిక ఉపనయనకార్యక్రమాలు, సమాశ్రయణములు బ్రహ్మోత్సవంలో జరుపుకున్నాము.

ప్రత్యేకించి ఐదవ నాటి ఉదయం రథోత్సవం వైభవంగా జరిగింది. అనంతరం చక్రతీర్థానికి వేంచేసారు. సాయంకాలం శ్రీపుష్పయాగము, ద్వాదశారాధన, దేవతోద్వాసన, యాగశాలలో మహాపూర్ణాహుతి జరుపుకొని యాగపెరుమాళ్ల ధ్వజ అవరోహణం జరిపి ఆలయానికి ప్రవేశించారు. అనంతరం శ్రీస్వామివారు కుంభప్రోక్షణ, ఋత్విక్ సమ్మానం, జరిపిస్తూ మంగళాశాసనం కృపచేశారు.



#  పరమపద వార్త 

శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి శిష్యులు, వికాసతరంగిణి సభ్యులు, కరీంనగర్ వాస్తవ్యులు **శ్రీమాన్ చెన్నమనేని కిషన్‌రావుగారు** ది. **19.03.2014**న ఆచార్య తిరువడి చేరినారు. శ్రీ చిన్న జీయరు స్వామివారు నిర్వహించే అనేక సేవా కార్యక్రమాలలో పాల్గొనే వారు. వీరికి శ్రియఃపతి సన్నిధిలో శాశ్వతకైంకర్యం లభించాలని వీరి కుటుంబసభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనం కృపచేశారు.



హైదరాబాద్, కూకట్‌పల్లి వాస్తవ్యులు కీ.శే. శ్రీమాన్ మాధవరం కిషన్‌రావు, శ్రీమతి లక్ష్మీబాయి దంపతుల కుమార్తె **యన్. అనిత** పరమపదించి నారు. వీరి స్మృతి చిహ్నంగా వీరి తల్లిగారయిన శ్రీమతి లక్ష్మీబాయి గారు శ్రీస్వామివారిచే నిర్వహించబడే వివిధ కార్యక్రమాలలో తమ వంతు కైంకర్యములను సమర్పించుకుంటున్నారు. వీరి కుమార్తెకు శ్రియః పతి సన్నిధిలో శాశ్వతకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు వీరికి మంగళాశాసనం కృపచేశారు.



శ్రీస్వామివారి శిష్యులు, కృష్ణాజిల్లా, గుడ్లవల్లేరు మం॥, అంగలూరు వాస్తవ్యులు **శ్రీమాన్ గొట్టిపాటి బుద్ధప్రసాద్**గారు ది.**27-2-2014**న ఆచార్య తిరువడి చేరినారు. వీరికి శ్రియఃపతి సన్నిధిలో శాశ్వతకైంకర్యం లభించాలని వీరి కుమారుడైన గొట్టిపాటి వేంకటేశ్వరరావుకు



వరంగల్ జిల్లా, హన్మకొండ వాస్తవ్యులు; **శ్రీమతి మంగనూరి రేవతిగారు** ది.**10.5.2014** న ఆచార్య తిరువడి చేరినారు. వీరికి శ్రియః పతి సన్నిధిలో శాశ్వతకైంకర్యం లభించాలని వీరి కుటుంబసభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనం కృపచేశారు.

శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి శిష్యులు, సికింద్రాబాద్ వాస్తవ్యులు **శ్రీమాన్ పోచంపల్లి హేమ్‌చందర్‌రావుగారు** ది.**04.04.2014**న ఆచార్య తిరువడి చేరినారు. వీరు శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరు స్వామివారి వద్ద సమాశ్రితులు. శ్రీ చిన్న జీయరు స్వామివారు చేసే అనేక సామాజిక సేవలలో తమవంతు సేవ చేసేవారు. వీరికి శ్రియఃపతిసన్నిధిలో శాశ్వతకైంకర్యం లభించాలని వీరి కుటుంబ సభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనం కృపచేశారు.



మెదక్ జిల్లా, పుల్లూరు వాస్తవ్యులు **శ్రీమాన్ కృష్ణమనేని హన్మంతరావుగారు** ది. **01.03.2014**న ఆచార్య తిరువడి చేరినారు. వీరికి శ్రియఃపతి సన్నిధిలో శాశ్వతకైంకర్యం లభించాలని వీరి కుటుంబసభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనం కృపచేశారు.



విజయవాడ వాస్తవ్యులు **శ్రీమాన్ పబ్బతి భావనారాయణ గారు** ది. **14.01.2013**న ఆచార్య తిరువడి చేరినారు. మొదటి సంవత్సరీక సందర్భముగ కుటుంబసభ్యులు భక్తినివేదనకి కైంకర్యం సమర్పించారు.



కృష్ణాజిల్లా, బొమ్మినంపాడు వాస్తవ్యులు **శ్రీమతి దామెర రమాదేవిగారి** సంవత్సరీకం. **జూన్ 25**వ తేదీ. ఈ సందర్భముగ కుటుంబసభ్యులు భక్తినివేదనకి కైంకర్యం సమర్పించారు. వీరికి శ్రీస్వామివారి మంగళాశాసనములు తెలియజేయు చున్నాము.



తూర్పు గోదావరిజిల్లా, అనపర్తి వాస్తవ్యులు **శ్రీమాన్ చిలకమర్రి శ్రీనివాసాచార్యులుగారు** ది. **5.6.2013**న ఆచార్య తిరువడి చేరినారు. వీరి **ప్రథమ వర్ధంతి 25.5.2014.** ఈ సందర్భంగా వీరి కుటుంబసభ్యులు భక్తినివేదనకు కైంకర్యం సమర్పించినారు. వీరికి శ్రీస్వామివారు మంగళాశాసనాలు కృపజేయుచున్నారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన **ఏప్రిల్ నెల సమాధానాలందాయి.** విజేత పేరు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం! *గతనెల సమాధానాలు 40వ పేజీలో కలవు.*

**ప్రశ్నలు** **సమాధానాలు**

1. భగవద్రామానుజులు భృత్యులను పదిగా వర్గణం చేసిన ఆలయం ఏది?
2. భగవద్యామునులు ఏ ఆచార్యునివద్ద శాస్త్రగ్రంథాలను అధ్యయనం చేసారు?
3. చేతనాచేతనాదులకు సూక్ష్మదశలోనూ నామరూపాలు ఉంటాయా?
4. భగవద్రామానుజులు ఏ ఆంగ్ల సంవత్సరంలో ఆవిర్భవించారు?
5. ఎలాంటి దుఃఖాన్ని హేయం అంటారు?
6. భగవద్రామానుజులు తీర్థకైంకర్యం ఎవరికి చేసారు.?
7. గోపురంపై ఎక్కి భగవద్రామానుజులు వేటిని అందించారు?
8. శ్రీనివాసునికి విశేషాభిషేకం ఏరోజున జరుగుతుంది?
9. శ్రీనివాసునికి తులసి కాక, మరేదళాలతో అర్చనం చేస్తారు?
10. మనకు ఆచార్య పరంపరలు దేనికి సంబంధించి ఉన్నాయి?
11. రామానుజులు సర్వోత్తమాచార్యులైతే, ఉత్తమ శిష్యులెవరు?
12. మేల్‌కోట ఆలయంలో అర్చా, ప్రతిష్ఠ ఏ సంవత్సరంలో జరిగింది?
13. దళితులకు రామానుజులు ఏమని పెట్టారు?
14. భగవద్రామానుజుల మూర్తిని ఏ పేరుతో మనం ప్రతిష్ఠించుకుంటున్నాం?
15. భగవద్రామానుజానుగ్రహాన్ని పొంది, పంచమోపాయనిష్ఠకు ప్రథమోదాహరణమైన శ్రీరత్న మెవరు?

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేతల పేర్లు:**
మేరెడ్డి నరసింహారెడ్డి–హిమయత్ నగర్, హైదరాబాద్; పి. సుబ్రహ్మణ్యం–విజయవాడ;

**సరియైన సమాధానములు వ్రాసినవారు:** యర్రమిల్లి జయలక్ష్మి–రాజమహేంద్రి; వేగేశ్న రామసీతమ్మ–కాళ్ళకూరు; ఆర్.వి. ప్రభాకరరావు–నల్లగొండ; వై.ఎన్.బి.గుప్త–అమలాపురం; గుడివాడ రాజ్యలక్ష్మి– గుంటూరు; జె. సాయిరెడ్డి–సికింద్రాబాద్; ఐ. వసంతలక్ష్మి–వైజాగ్; పి. సుబ్రహ్మణ్యం–విజయవాడ; బి. సాధుబాబు–విశాఖపట్నం; కుమాండూరి ఇందిర – హైదరాబాద్;

మీ చిరునామా
..........................................
..........................................
..........................................
..........................................

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.
భక్తినివేదన సీతానగరం–522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929




సమగ్ర సమాచార నివేదన

**సంపాదకులు శ్రీమతి టి. అరుణ**

# "వికాసతరంగిణి వార్తావాహిని"

**చెన్నై:**

వికాసతరంగిణి సభ్యులు ఏప్రియల్ 22వ తేదీన ధరిత్రీ దినోత్సవాన్ని కోవలం ప్రాంతంలో మత్స్య నారాయణస్వామి ఆలయ సన్నిధిలో నిర్వహించారు. అక్కడివారందరికి పర్యావరణ పరిరక్షణ గూర్చి తెలియజేసారు. పచ్చదనాన్ని పెంచేందుకు మొక్కలు నాటారు. ద్వారక తిరుమల దేవాలయం (పశ్చిమ గోదావరి జిల్లా) వారి సౌజన్యంతో ఆలయానికి మైక్‌సెట్ అందించారు. మే నెల నుంచి 5 రోజులు వినూత్నమైన రీతిలో ప్రజ్ఞ తరగతులు నిర్వహించారు. భగవంతుని కళ్యాణ గుణాల పేరుతో విద్యార్థులను టీమ్స్‌గా ఏర్పాటు చేసి ఒక్కొక్క టీమ్‌కి ఒక్కొక్క టీచర్‌ని పెట్టి శిక్షణనిచ్చారు. "ఆచార్యవైభవం" కార్యక్రమంలో నమ్మాళ్వార్ గూర్చి, రామానుజాచార్య స్వామి వారి గూర్చి తెలియజేసారు.

ఎన్నో ఆధ్యాత్మిక ఆటలను ఆడించారు. 50 మంది విద్యార్థులు చాలా ఉత్సాహంగా శిక్షణ పొందారు. మౌక్తికములు మొదలైన స్తోత్రాలను నేర్చుకున్నారు. ప్రముఖ బంగారు వ్యాపారస్తులు నాదేళ్ళ రంగనాథ గుప్త విద్యార్థులకు బహుమతులు అందించారు. ఈ కార్యక్రమాలన్నీ అన్ని పాఠశాలల్లో తప్పని సరిగా 'వికాసతరంగిణి' వారు నిర్వహించాలని సూచించారు. ప్రతి సంవత్సరం విద్యార్థుల కోసం చక్కటి కార్యక్రమాలను నిర్వహిస్తున్న 'వికాసతరంగిణి' సభ్యులను అభినందించారు.

**కె.పి.హెచ్.బి.కాలనీ-హైదరాబాద్ :**

వికాసతరంగిణి సభ్యు లంతా సత్సంగ కార్యక్రమాలను చక్కగా నిర్వహిస్తున్నారు. ప్రతి రోజు సాయంత్రం 5 గంటల నుండి 6 గంటల వరకు శ్రీమద్భగవద్గీత పారాయణ, రామానుజ చరిత్ర చదవటం, పెద్దల ప్రవచన కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. వికాసతరంగిణి కార్యకర్తలతో పాటు క్రొత్తవారు కూడా ఈ సత్సంగ కార్యక్రమా లలో పాల్గొంటున్నారు. శ్రీస్వామివారు ఆదేశించిన కార్యక్రమా లన్నీ కోలనీలో నిర్వహిస్తారు. తే 22-04-2014 ది ధరిత్రీ దినోత్సవాన్ని శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయంలో నిర్వహించారు. పర్యావరణ పరిరక్షణ గూర్చి తెలియజేసారు. శ్రీ వి. చలపతిరావు (రిటైర్డ్ డిప్యూటి కలెక్టర్), శ్రీ ఎ. సత్యనారాయణ మూర్తి, శ్రీ నాచారయ్య, శ్రీమతి పుష్ప ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

ఆర్థికంగా వెనుకబడిన విద్యార్థులకు వికాస తరంగిణి సేవలందిస్తూ అందరి అభినందనలనందుకుంటుంది.

**కరీంనగర్ :**

వికాస తరంగిణి కార్యకర్తలు ఈ వేసవిలో మూడు ప్రాంతాలలో ఉచిత ప్రజ్ఞ తరగతులు నిర్వహిస్తున్నారు. మే 5వ తేది నుండి 20వ తేదీ వరకు ప్రజ్ఞ శ్లోకాలు, కథలు, భగవద్గీత, యోగా పై శిక్షణ ఇస్తున్నారు. ఆండాళ్‌గోష్ఠి ముకరంపురంలో 65 మందికి, వావిలాలపల్లి శాఖ రామాలయంలో 45 మందికి, సప్తగిరి కోలనీశాఖ రామాలయంలో 65 మందికి శిక్షణ ఇస్తున్నారు.

మే 4న రామానుజ జయంతి ఉత్సవాలను వేదభవ నంలో నిర్వహించారు. కరీంనగర్ వివిధ వికాసతరంగణి శాఖలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.



జెట్ అధ్యక్షులు శ్రీ వీర్ల ప్రభాకర్ రావుగారు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. శ్రవణకుమారా చార్యులు, శ్రీ టి. రంగాచార్యులు కార్యక్రమాలు నిర్వహించారు.

**వరంగల్ :**

వికాసతరంగిణి సభ్యులు 15వ తేది నుండి వరుసగా నాలుగు రోజులు ఉచిత దంత వైద్యశిబిరాలు నిర్వహించారు. కొత్తూరు, మౌలాలి, మసుమలి ప్రభుత్వ పాఠశాలలో మొత్తం 250 మందికి ఉచిత దంతవైద్య పరీక్షలు జరిగాయి. డా॥ పొన్నాల రాకేష్ (స్మైల్ కేర్ దంతవైద్యశాల) ఉచిత వైద్యసేవలతో పాటు పేస్ట్‌లు, బ్రష్‌లు, మందులు అందజేసారు.

**వనపర్తి : మహబూబ్‌నగర్ జిల్లా :**

మండు వేసవిలో మంచినీరు అందించి సేవలందిం చడం ఎన్నో ప్రాంతాల్లో మనం చూస్తుంటాం. వనపర్తి వికాస తరంగిణి సభ్యులు బస్‌స్టాండ్ సమీపంలో "అంబలి ప్రసాద వితరణ చేస్తూ ఎందరికో ఆకలి తీరుస్తూ సేవలందిస్తున్నారు. ప్రతిరోజు సుమారుగా 18 వందల మందికి అంబలిని ఆహారంగా అందిస్తు న్నారు. చలివేంద్రం ద్వారా 3 వేల మందికి మంచి నీటినంది స్తున్నారు. రోడ్డు రవాణా సంస్థ ఉద్యోగులు, ప్రయాణీకులు, ప్రజలు వికాసతరంగిణి సేవలను అభినందిస్తున్నారు. మహబూబ్‌నగర్ జిల్లా అధ్యక్షులు శ్రీ రాజశేఖర్, కార్యదర్శి ఎ. రఘునాధాచార్యులు వనపర్తి శ్రీని వాసులుగారు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. వనపర్తి మహిళా విభాగ కార్యకర్తలు ప్రజ్ఞ శిక్షణ తరగతులు నిర్వహించారు. వేసవి అంతా సాయంత్రం 5 నుండి 7 గంటల వరకు ప్రజ్ఞ శిక్షణ తరగతులు జరుగుతున్నాయి. శ్లోకపఠనం, వేదగణితం, చిత్రలేఖనం, ప్రజ్ఞ కథలు శిక్షణనిస్తున్నారు. ప్రజ్ఞ కన్వీనర్ శ్రీమతి రాధిక ఈ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. సంస్కృత ఉపాధ్యాయులు శ్రీ శ్రీనివాసులుగారు, వి.టి. అధ్యక్షులు శ్రీమతి సువర్ణమ్మ, కార్యదర్శి శ్రీమతి సంధ్య మొదలగు కార్యకర్తలు సేవలందించారు. 75 మంది విద్యార్థులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

**భద్రాచలం, ఖమ్మం జిల్లా :**

ప్రతి సంవత్సరం భద్రాచల శ్రీరామ చంద్రుని సన్నిధిలో సేవచేసే అదృష్టం మన వికాసతరంగిణి కార్యకర్తలకు లభిస్తుంది. దేవాలయ కార్యనిర్వహణాధికారి, స్థానిక సి.ఐ. ఆంజనేయులు గారు, మన జీయర్‌మఠ్‌కి వచ్చి ఆలయంలో వికాసతరంగిణి కార్యకర్తలకు బాధ్యతలను వివరించారు.

దేశవ్యాప్తంగా ఉత్సవాలకు వేలాది భక్తులు విచ్చేస్తారు. వారికి మంచినీటిని, ప్రసాదాలను అందించటం, క్యూలైన్లు నడపడం వంటి కార్యక్రమాలను విటి కార్యకర్తలు చక్కగా నిర్వహించారు. ప్రతి సంవత్సరం లాగానే మన జీయర్‌మఠ్‌లో గరుడద్వజ పటావిష్కరణ జరిగింది. ఎదుర్కోలు ఉత్సవంలో వికాసతరంగిణి స్వామివార్కి, అమ్మవారికి పట్టు వస్త్రాలు సమర్పించారు. జీయర్‌మఠంలో వేలాది మంది భక్తులకు ప్రసాద వినియోగం జరిగింది. ఆలయ కమిటి వారిని, అర్చకులను మన సభ్యులు సత్కరించారు. శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి కైంకర్యంగా రూ. 30,000/-ల పట్టువస్త్రాలను దుద్దునూరు దుర్గాప్రసాద్ దంపతులు శ్రీరామచంద్రునికి సమర్పించారు. కళ్యాణవేళ మూలవర్లకు ఈ వస్త్రాలే అలంకరించటం విశేషం. శ్రీమాన్ పి.జె. భట్టర్, శ్రీ వేంకటాచార్యులుగారు, శ్రీమతి కమల, శ్రీమాన్ చక్రవర్తి, శ్రీరాము, శ్రీ నరసింహారావు, ఎ. నాగేశ్వరరావు, జి. నాగేశ్వరరావు, శ్రీ గోపాలరావు, శ్రీ పురుషోత్తం, శ్రీమతి కృష్ణకుమారి, స్వరూపారాణి ఈ కార్యక్ర మాలు అన్నింటిని నిర్వహించారు.

**జగ్గయ్యపేట, కృష్ణా జిల్లా :**

వసంత నవరాత్రుల సందర్భంగా 9 రోజులు ఒక్కొక్కరోజు ఒక్కొక్క గృహంలో సంక్షేపరామాయణ పారాయణ కార్యక్రమం నిర్వహించారు. శ్రీరామ



పట్టాభిషేక కార్యక్రమాన్ని ధనశైల రామాలయంలో నిర్వహించారు. ఆలయంలో వికాసతరంగిణి సభ్యులు లక్షమల్లెల పూజ నిర్వహించారు. బదరికాశ్రమంలో నిత్యాన్నదానమునకు బియ్యం, వంద కిలోల టమాట పచ్చడి జగ్గయ్యపేట వికాసతరంగిణి కార్యకర్తలు అందజేసారు.

**కోదాడ :**

వికాస తరంగిణి కార్యకర్తలు ధరిత్రీ దినోత్సవం నిర్వహించారు. వాకతాన్ ప్రారంభించిన ముఖ్య అతిథి పట్టణ సి.ఐ. శ్రీధర్‌రెడ్డి గారు పర్యావరణ పరిరక్షణ




ప్రతిఒక్కరి బాధ్యత అని తెలియ జేసారు. పోలిథిన్ సంచుల వాడకాన్ని పూర్తిగా తగ్గించాలని తెలియజేసారు. మొక్కలు నాటి పచ్చదనాన్ని పెంచాలన్నారు. మున్సిపల్ కమీషనర్ రామానుజల రెడ్డి "వీలయినంత వరకు పోలిథిన్ కవర్ల వాడకం నిషేధించేందుకు ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటామని తెలియజేసారు. పాదచారుల కు వస్త్రంలో తయారుచేసిన సంచులను పంచిపెట్టారు వికాస తరంగిణి సభ్యులు, కార్యకర్తలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

**జంగారెడ్డిగూడెం, పశ్చిమగోదావరి జిల్లా :**

శ్రీలక్ష్మీనారాయణ వికాసతరంగిణి వివిధ పాఠశాలల విద్యార్థులకు ప్రజ్ఞ తరగతులు నిర్వహించారు. వికాస తరంగిణి అధ్యక్షురాలు శ్రీమతి కొల్లూరు శ్యామలాంబ, కుమారి వక్కలగడ్డ గౌరి వర్ధిని, "ప్రజ్ఞ" విద్యార్థులకు శిక్షణ



నిచ్చారు. 50 మంది విద్యార్థులకు శ్లోకాలు, "కనిపించే దైవాలు తల్లిదండ్రులు" పుస్తకంలో కథలు నేర్పించారు. శిక్షణ పొంది ప్రతిభకనబరచిన విద్యార్థులకు బహుమతులు అందజేసారు. శ్రీమాన్ నల్లూరి రవికుమారాచార్యులు, శ్రీశ్రీశ్రీ స్వామివారు నిర్వహిస్తున్న ప్రజ్ఞ గూర్చి వివరించారు. ఈ కార్యక్రమ నిర్వహణకు స్థలమిచ్చిన శ్రీమాన్ తడికమళ్ళ శ్రీనివాసరావు మరియు అనంతలక్ష్మి దంపతులకు కృతజ్ఞతలు తెలియజేసారు. వికాసతరంగిణి కార్యదర్శి శ్రీమతి వక్కడగడ్డ హేమలత కార్యక్రమాన్ని రూపొందించగా శ్రీమతి బేబి సరోజిని, సుగుణ లక్ష్మి సహకారమందించారు. సుమారు 60 మంది కార్యకర్తలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

**సిద్ధాంతం, పశ్చిమగోదావరి జిల్లా :**

వికాసతరంగిణి కన్వీనర్ శ్రీమాన్ వంగూరి వెంకట్రామయ్యగారు తే 3-5-2014 ది న సూర్యుడు మేషరాశిలో ఉండగా వైశాఖ పూజా మహోత్సవం నిర్వహించారు. ఆరాధన అనంతరం విష్ణు సహస్రనామ పారాయణ జరిగింది. శ్రీమతి కె. కృష్ణవేణి అందరికి ప్రసాదం అందజేశారు.

**ఏలూరు :**

వికాసతరంగిణి సభ్యులు ధరిత్రీ దినోత్సవం సంద ర్భంగా దక్షిణపు వీధి, మెయిన్ బజార్, సుంకరవారిపేటలో పర్యావరణ పరిరక్షణ గూర్చి తెలియజేసారు. పచ్చదనం కోసం ప్రతి ఇంటివారికి మొక్కలు అందించారు. ఈ కార్యక్రమాన్ని వికాసతరంగిని అధ్యక్షురాలు ఎన్. సాయిలీల, కార్యదర్శి శ్రీమతి పద్మావతి, కోశాధికారి కె. భాస్కరరావు, సభ్యులు నిర్వహించారు.

**రాజమండ్రి :**

శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయరు స్వామివారు ఏప్రిల్ 16, 17, 18 తేదీలలో రాజమండ్రిలో వేంచేసియున్నారు. వికాసతరంగిణి కార్యకర్తలు, భక్తులు స్వామివారిని ప్రార్ధించగా స్వామివారు తిరుప్పల్లాండు,




కణ్ణినుం శిరుత్తాంబు నేర్పారు. ఈ కార్యక్రమంలో అధిక సంఖ్యలో భక్తులు పాల్గొన్నారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు ఎప్పుడు వేంచేసిన స్తోత్రాలను నేర్పించాలని కార్యకర్తలు ప్రార్థన చేసారు.

23వ తేదీ వికాసతరంగిణి ప్రజ్ఞ విద్యార్థులు చలివేంద్రం ఏర్పాటు చేసి 50 లీటర్లు మజ్జిగను అందజేసారు. శ్రీమాన్ ఇంజనీర్ రామానుజం, పద్మ దంపతులు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

వికాసతరంగిణి సభ్యులు ప్రజ్ఞ వేసవి తరగతులు తే 1-5-2014 నుండి 15-5-2014 ది వరకు పదిహేను రోజులు నిర్వహించారు. 40 మంది విద్యార్థులు శిక్షణ పొందారు. ప్రజ్ఞ శ్లోకాలు, కథలు, భజనలు, శిక్షణలో నేర్చుకున్నారు. డా॥ మైథిలి, ప్రసాద్‌చౌదరి, ఇంజనీర్ రామానుజమ్ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. శ్రీమతి పద్మారామానుజమ్ వి.టి. సభ్యులు కార్యక్రమాన్ని నిర్వ హించారు. ముఖ్య అతిధిగా విచ్చేసిన డా॥ రామరెడ్డిగారు విద్యార్థులకు బహుమతులు అందజేసారు.

**విజయనగరం, విజయనగరం జిల్లా :**

అలకనందకోలనీ వికాసతరంగిణి మహిళాఆరోగ్య వికాస్ సభ్యురాలు శ్రీమతి శకుంతలానాయుడు గారి నేతృత్వంలో ధరిత్రీ దినోత్సవం అద్భుతంగా నిర్వహించారు. ప్రభుత్వ ఆసుపత్రి దగ్గర టీస్టాల్‌లో పోలిథిన్ కవర్లలో టీ సరఫరా నిషేధిస్తూ టీస్టాల్ యజమానికి 50 చిన్న స్టీల్ టీకేన్‌లు అందజేసారు. ప్రభుత్వ ఆసుపత్రి వైద్యులు వికాసతరంగిణి సేవలను అభినందించారు. 'పోలిథిన్ కవర్లలో టీ, కాఫీలు లోనికి తీసుకురాకూడదు' అని వ్రాసి గోడలకు అతికిస్తామని చెప్పారు. పోలిథిన్ కవర్లలో ఆహారపదార్థాలు ఎంత అనర్థమో వివ రించారు. శ్రీమతి శకుంతల విటి కార్యదర్శి శ్రీ సత్యనారాయణ, అధ్యక్షులు శ్రీమాన్ వెంకటరావు, రమాదేవి దంపతులు బాలాజీనగర్ విటి అధ్యక్షులు శ్రీ రవివర్మ, విజయలక్ష్మి పాల్గొన్నారు.

దాసన్నపేట వికాసతరంగిణి ప్రభుత్వ ప్రసూతి ఆసుపత్రి దగ్గర స్టీల్‌కేన్‌లు అందించి టీస్టాల్‌లో పోలిథిన్ కవర్లు నిషేధించారు. మే నెల నుండి చలివేంద్రాన్ని ప్రారంభించి అందరికీ చల్లని మజ్జిగ అందజేస్తామన్నారు. శ్రీమతి రామరత్నం శ్రీ సత్యనారాయణ, అప్పలనర్సమ్మ, రాము తదితరులు సేవలందిస్తున్నారు.

**బాలాజీనగర్ శాఖ :**

బాలాజీనగర్ వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ రవివర్మగారు, కార్యదర్శి శ్రీమతి దంటు పద్మజగారు, కోశాధికారి టి. శ్రీనివాస్‌గారు ఏప్రిల్ నెలలో మూడు రోజులు (28, 29, 30) ప్రజ్ఞ తరగతులు నిర్వహించారు. 50 మంది విద్యార్థులు శిక్షణ పొందారు. ప్రజ్ఞ శ్లోకాలు, "అమ్మే మా దైవం" అనే ప్రజ్ఞ పాట, భగవద్గీత శ్లోకాలు "శ్రీకృష్ణ లీలలు" నాట్యం నేర్చు కున్నారు. కార్యక్రమం చివరి రోజు మాతృవందనంగా పాదపూజ కార్యక్రమం వైభవంగా జరిగింది. ఈ కార్యక్రమంలో పాల్గొన్న విద్యార్థులకు ప్రతి ఆదివారం ప్రజ్ఞ తరగతులు నిర్వహించడం జరుగుతుంది. గెలుపొందిన విద్యార్థులకు బహుమతులు అందజేసారు. ప్రజ్ఞ కార్యక్రమాలను చూసిన శ్రీమాన్ చెరుకూరి శ్రీధర్‌గారు వెనుకబడిన 10 గ్రామీణ ప్రాంతాలలో ప్రజ్ఞ కార్యక్రమాలకు ఆర్థిక సహకారం అందిస్తారని తెలియజేసారు. చాలా శ్రద్ధగా విద్యార్థులంతా నేర్చుకుంటున్న విషయాలు ఆచరించడం ఇక్కడ విశేషం.

**కొండవెలగాడ**

యువ వికాస్ సభ్యులు ప్రతినెల ఆర్థికంగా వెనుకబడిన వృద్ధులకు 5 కేజీల బియ్యం, నిత్యావసర సామాగ్రి అంద జేస్తున్నారు. ఆ గ్రామంలో 20 మంది వృద్ధులకు సేవలంది స్తున్నారు.

**సాలూరు, విజయనగరం జిల్లా :**

వికాసతరంగిణి సభ్యులు శ్రీమాన్ విశ్వనాథ్ గారి నేతృత్వంలో చినహరిజనపేట, పెద హరిజనపేట, మెంటాడ వీధి మొదలైన ప్రాంతాలలో ఉచిత వైద్య శిబిరములు జరిగాయి. మొత్తం 345మంది వైద్య పరీక్షలు



చేయించుకున్నారు. డా.బి.ఎస్.ఎన్. మూర్తిగారు పరీక్షలు నిర్వహించి ఉచితంగా మందులు అందజేసారు. విశ్వనాథపురంలో 40మంది సభ్యులతో నూతన వికాసతరంగిణి శాఖ ప్రారంభించారు. మే9వ తేదీన యువతను ప్రోత్సహిస్తూ యువవికాస్ శాఖను కూడా ప్రారంభించారు. ప్రతీ నెలా మొదటి, మూడవ మంగళవారాలలో సత్సంగ కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. ఈ సత్సంగంలో భగవద్రామానుజ చరిత్రపై చర్చా కార్యక్రమం జరుగుతోంది.

**పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి వారి ప్రత్యక్ష పర్యవేక్షణలో**

**ఆచార్య సమాగమనము-భాగవత సమ్మేళనము**

**తేది : 21-06-2014 ది నుంచి 23-6-2014 వరకు ఉభయవేదాంత పండిత సభారజతోత్సవాలు**

**ఉదయం తీర్థగోష్ఠి అనంతరం 11 గంటలకు సభాకార్యక్రమము (చర్చాగోష్ఠి)**

**సాయంత్రం 6 గం॥ నుండి శ్రీస్వామివారి ప్రవచనము (శ్రీరామానుజ సహస్రాబ్ది మహోత్సవ వైభవము)**

**ఈ కార్యక్రమాలలో పాల్గొని శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళా శాసనములు పొందవలసినదిగా అందరినీ ఆహ్వానిస్తున్నాము.**

**తే 22-06-2014 ది ఉదయం 8 గంటలకు సమాశ్రయణములు కలవు. సమాశ్రయణము కాగోరువారు ఫోనుద్వారా ముందే పేరు నమోదు చేసుకొనవలెను.**

**ఇట్లు**
**ఉభయవేదాంత ఆచార్యపీఠం - విజయనగరం శాఖ**

**వేదిక : త్రైవర్ణిక వైష్ణవ రామానుజకూటము, విజయనగరం**
**వివరములకు 9989893954, 9966808888, 9440106555**

## మహిళా ఆరోగ్యవికాస్

తే 21-3-2014 దిన సీతానగరం ఆశ్రమంలో శ్రీమతి ఆదిలక్ష్మి, శ్రీమతి రత్నమాలగారి నేతృత్వంలో వైద్యశిబిరం జరిగింది. శిబిరంలో సీతానగరం చుట్టుప్రక్కల ప్రాంతాల మహిళలు పాల్గొన్నారు. 127 మంది మహిళలు పాల్గొనగా 86 మంది మహిళలకు VIA పరీక్షలు నిర్వహించి 19 మంది మహిళలను సెకండ్ చెకప్‌కు తీసుకు వెళ్లడం జరిగింది. ఇద్దరికి మెమోగ్రామ్, ముగ్గిరికి బయాప్సి చేయటం జరిగింది. డా॥ లక్ష్మి, డా॥ రామతులసి తమ సహకారమందించారు. శిబిరములో పాల్గొన్నవారందరికి అహోబిల జీయరుస్వామివారు మంగళాశాసనములు అందించారు.

ఈ వైద్య శిబిరంతో పాటు శిక్షణ శిబిరం జరిగింది. మహిళా ఆరోగ్యవికాస్ కేంద్రసమన్వయ కర్త శ్రీమతి మాధవి రవీంద్రగారు విశాఖపట్నం నుంచి వచ్చిన ఆరోగ్యవికాస్ కార్యకర్తలకు శిక్షణనిచ్చారు. సర్వే నిర్వహించే విధానం, స్టెరిలైజేషన్‌ను ప్రాక్టికల్‌గా చూపించారు. డా॥ రామతులసిగారు విశాఖపట్నం నుండి వచ్చి మన చైతన్య ఆరోగ్య వికాస్ VIA టెస్ట్ నిర్వహించే విధానాన్ని చూసి ఎంతో అభినందించారు. విశాఖ వికాసతరంగిణి శ్రీమతి శిరీషగారు అన్ని వివరములను ఈ మూడు రోజుల శిక్షణ శిబిరంలో అడిగి తెలుసుకున్నారు. తే 23-3-2014 దిన కోదాడ సమీపంలో తాగ్రాయి గ్రామంలో జరిగిన ఆరోగ్య శిబిరంలో 152 మంది మహిళలు పాల్గొన్నారు. 83 మందికి VIA పరీక్షలు నిర్వహించారు. 7 గురికి రెండవసారి తనిఖీ చేయించారు. అందు వెంకటరమణ అనే మహిళకు బయాప్సి చేయించి కేన్సర్ లక్షణాలు ఉండడం వలన హైదరాబాద్ బసవతారకం హాస్పటల్‌కు పంపడం జరిగింది. శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్నశ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామిగారు, శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారు కూడా విచ్చేసి గ్రామంలో యువతకు, కార్యకర్తలకు, మహిళలకు మంగళాశాసనములు చేయటం అందరికీ ఆనందాన్ని కల్గించింది.

తే 13-4-2014 దిన కోదాడ సమీపంలో అనంతగిరి యువవికాస్‌తో కలసి ఆ గ్రామ సర్పంచ్ శ్రీమతి సరోజగారు ఏర్పాటు చేసిన వైద్యశిబిరంలో 205 మంది పాల్గొనగా 81 మందికి VIA పరీక్షలు జరిగాయి. 7 మందికి సెకండ్ చెకప్ జరిగింది. డా॥ పల్లవి నందగోపాల్ వైద్య పరీక్షలు నిర్వహించారు. శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములలో ఖమ్మం జిల్లాలో చుట్టుప్రక్కల గ్రామాలలో మహిళావైద్య శిబిరాలను ఏర్పాటు చేయటానికి ముందుకు వచ్చిన వికాసతరంగిణి సభ్యులు శ్రీమతి లక్ష్మి, నళిని, శ్రీమాన్ శాస్త్రిగారు మరియు ఆ గ్రామ పెద్దలెంతో అభినందనీయులు.

– కేంద్ర కన్వీనర్ **శ్రీమతి మాధవి రవీంద్ర**

### కార్యకర్తలకు సూచన

మీ వికాసతరంగిణి శాఖ ద్వారా చేసే ఆధ్యాత్మిక, సామాజిక, సేవా కార్యక్రమాలను అందరితో పంచు కోవాలనుకుంటున్నారా! కార్యక్రమ వివరాలను సంక్షిప్తంగా వ్రాసి, కార్యక్రమ ఫోటోలను జతపరచి ప్రతి నెల 10వతేదీలోపుగా news@vtsbharath.org కి మెయిల్ చేయండి.
Cell No. 9440106555

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః

67 సం॥ల నుండి భగవద్బంధువులు ఆదరిస్తున్న...
ఆధ్యాత్మిక మాసపత్రిక

# భక్తినివేదన








సంపుటి 67

జూలై 2014
శ్రీజయనామ సంవత్సర ఆషాఢమాసము

సంచిక 4


## పంచాంగ వివరములు

**జూలై:**

2. స్కంద పంచమి
6. పునర్వసుకార్తె, తిరుక్కోట్టియూర్ నంబి తిరు॥
7. పెరియాళ్వార్ తిరు॥, లక్ష్మీవ్రతారంభం
8. సర్వేషాం ఏకాదశి, తొలిఏకాదశి, శయనైకాదశి, చాతుర్మాస్యారంభం, గోపద్మవ్రతారంభము
9. వాసుదేవ ద్వాదశి, నాథమునుల తిరు॥
11. గురుమౌఢ్యారంభం
12. గురుపూర్ణిమ, వ్యాసపూర్ణిమ,యతులకు చాతుర్మాస్యారంభము
16. అవమతిథి
17. కర్కాటక సంక్రమణము ఉ.9-05 ఉదయాది దక్షిణాయ పుణ్యకాలము
20. పుష్యమికార్తె
22. సర్వేషామేకాదశి
25. మాసశివరాత్రి
26. చుక్కలమావాస్య, పిండపితృయజ్ఞము
28. త్రిద్యుస్పృక్
30. నాగచతుర్థి, ఆండాళ్ తిరునక్షత్రము

**ఆగస్టు:**

1. నాగ గరుడ పంచమి, బదరీనారాయణప్పెరుమాళ్ తిరునక్షత్రం


వ్యవస్థాపకులు
పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ
రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు
శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి
శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. రంగరామానుజాచార్యులు

ఉప సంపాదకులు
శ్రీమతి డా॥ T.K. చూడామణి

చందావివరాలు :-
సంవత్సరచందా రూ.225/-
విదేశాలకు సంవత్సరచందా $30/-

మీ సేవలో....
భక్తినివేదన, సీతానగరం - 522 501,
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

D.T.P. & Design by :
పరిశోధనాలయమ్

E-mail : **jetsitanagaram@yahoo.com**
Internet : www.chinnajeeyar.org


## విషయసూచికా




*Printed & Published by* : H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**
*Printed & Published at* : **Srijman Printers & processors** : C/o JET, Sitanagaram - 522 501, Guntur Dist., Andhra Pradesh.
*Editor* : Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.

**Sriman Printers & Processors**

సంపాదకీయం

# పృథివీరక్షకులు పాలకులేకాదు - ప్రజలు కూడా...



పదునాల్గు భువనాలుగా ప్రసిద్ధి చెందిన మన బ్రహ్మాండంలోని లోకాలలో భూలోకం, మధ్యలోకం, మర్త్యలోకం ఇలా ప్రసిద్ధి చెందింది మన పృథివీ మండలం. ఒకప్పుడు వేనుడనే ఒక దుర్మార్గ ప్రభువు పాలనలో అస్తవ్యస్తంగా జననివాసయోగ్యతను కోల్పోయి ఉన్న ఈ భూమండలాన్ని, సమతలంగా పరచి, నివాసయోగ్యంగా పృథుచక్రవర్తి చేశాడు. కనుక దీన్ని "పృథివి" అని అంటున్నారు. 'ప్రథనాత్ పృథివీ' అని నిరుక్తకారుడైన యాస్కాచార్యుని నిర్వచనం.

ఒకప్పుడు సర్వపర్వతాలు హిమవంతుని దూడగాచేసి, మేరు పర్వతం గోపాలునిగా పాలు పితికే బాధ్యతను స్వీకరిస్తే, దేవతలు మొదలైన లోకపాలకులు ఈ భూమిని గోవుగా చేశారు. పృథుచక్రవర్తి నాయకత్వంలో అనర్ఘమణులను, ప్రశస్తౌషధాలను, క్షీరంగా పితికినారని కాళిదాసు తన కుమారసంభవకావ్యంలో పేర్కొన్నాడు. విష్ణుపురాణం మొదలైన పురాణవాఙ్మయం ఆ కథను విస్తరించి వర్ణించింది.

పరిపాలకుడైన ప్రభువు దుర్మార్గుడు, ప్రజాకంటకుడు, అయి ప్రజలజీవనవిధానాన్ని అస్తవ్యస్తంచేసి భూమికి భారమైనప్పుడు, ప్రజారక్షణ బాధ్యతను విజ్ఞానులు స్వీకరించక తప్పదు. వేనుడు పరమదుర్మార్గుడై భారతీయ చరిత్రలో ఒక "దుర్భరదశ"కు కారణమైనప్పుడు, ప్రజాక్షేమాన్ని మరచి, ప్రజాపీడకుడైనప్పుడు మహర్షులు, తమ తపఃప్రభావంచేత ఆతనిని వధించారు. ఆతని తొడను మథించి పృథువనే మహానుభావుని పాలకునిగా ఆవిర్భవింప చేశారు అని పురాణాలు ఉద్ఘోషించాయి.

ధర్మశాస్త్రాలు **'రాజవధ్యావిగర్హ్యతే'.** (రాజును వధించడం నింద్యమైన కృత్యం) అని ఉద్ఘోషిస్తూనే, పాలనాయోగ్యతలేనివానిని భరించరాదని శాసించాయి. పాలకులను శాసించగలవారు, నాడు,నేడు, ఏనాడైనా ప్రజలే. వారి వివేచనపైననే వారిక్షేమం ఆధారపడి ఉంటుందనేది స్పష్టం. ప్రజాకంటకుడైన పాలకుని గ్రుడ్డి భక్తితో భరించక తొలగించడంతో పాటు, ప్రజాక్షేమాన్ని కాంక్షించే పాలకునికి పాలనాబాధ్యతను అప్పజెప్పడమూ వారి బాధ్యతే. ఆతనిని విశ్వసించి, ఆతని పాలనను నిష్కంటకం, సఫలం చేయడమూ ప్రజలబాధ్యతే. ప్రజలంతా అలా చేయగలవారు కాకపోవచ్చు. మేధావులు, ప్రజాక్షేమకాంక్షులు, రాగద్వేషాలు లేనివారు అయిన విజ్ఞానులు న్నారు కదా! వారు భవిష్యద్రష్టలై ఆ బాధ్యతను తమపై వేసికోవడం చాలా అవసరం. ప్రాచీనకాలంలో మహర్షులు ఆ బాధ్యతను నిర్వహించారు. ప్రజాక్షేమంకరుడైన ప్రభువుకు అధికారబాధ్యతను సంక్రమింపచేశారు. అలా అధికారాన్ని పొందినవాడే పృథువు.

పృథువు చేసిన మొట్టమొదటిపని, పంటకు పనికిరాక బీడు వారిన భూమిని సస్యశ్యామలం చేయడమే. ఆతడు తన ధనుష్కోటితో భూమిని సమతలం, జలసమృద్ధం అయేలా చేశాడని పురాణాలు వ్రాశాయి.

**స్వపాణౌ పృథివీనాథో దుదోహ పృథివీం పృథుః ।**
**సస్య జాతాని సర్వాణి ప్రజానాం హితకామ్యయా ॥**
**తేనాన్నేన ప్రజాస్తాత ! వర్తంతేఽద్యాపి నిత్యశః ।**
**ప్రాణప్రదాతా సపృథుర్యస్మాద్భూమేరభూత్ పితా ।**
**తతస్తు పృథివీ సంజ్ఞామవాపాఖిల ధారిణీ ॥**

"పృథువు స్వయంగా తనచేతిలోకే పృథివీసారాన్ని క్షీరంగా పితికాడు. అవే పంటలుగా ప్రజాకోటికి వినియోగపడ్డాయి. ప్రజల మేలుకోరు పరిపాలకుడైన పృథువు చేసిన కృత్యంవల్ల ప్రజలు నేటికీ అన్నం తినగలుగుతున్నారు.

పృథివికి, ప్రజలకు, ప్రాణప్రదాత పృథువు. కనుక ఆయన పిత. ఈ భూమి పృథివి అయింది.

ఈ కథ కేవలం, పుక్కిటి పురాణాల్లోని ఉబుసుపోక కథ అని ఎవరైనా అనుకుంటే వారంతటి మూర్ఖులు ఎవ్వరూ ఉండరని మనం గమనించాలి. పృథువు నిర్వహించిన అతిక్లిష్టమైన బాధ్యత క్రొత్తగా పాలనాధికారాన్ని అందిపుచ్చుకున్న పరిపాలకులకెవరికైనా బాధ్యతే. దీని అభిప్రాయం ఏమిటి?

పృథువుకు పూర్వం వేనుడనేవాడు (పృథువుకు తండ్రి) పాలించినప్పుడు పంటలు సరిగా పండలేదు. పశురక్షణం కొరవడింది. వ్యవసాయం సాగలేదు. వాణిజ్యం కుంటుపడింది. ఈ అస్తవ్యస్త పరిస్థితినుంచి ఈ భూమిని ఉద్ధరించినవాడు పృథువుకనుక ఆయన పేరున ఈ భూమి పృథివి అయింది అంటుంది పురాణం. ఇలాంటి ఉద్ధరణం చేసినవానినే 'పిత' అని అంటుంది పురాణం.

ఏ పాలకుల కాలంలో ఇలాంటి అస్తవ్యస్త స్థితి ఏర్పడుతుందో, ఆ పాలకులను తొలగించి, మరొకరిని పాలకునిగా ప్రజలు ఏర్పరుచుకున్నప్పుడు, ఆ క్రొత్త పాలకునికి అన్ని రంగాల్లోను, వెనుకటి వెనుకబాటు తనాన్ని తొలగించి సువ్యవస్థస్థితిని కలిగింపవలసిబాధ్యత సహజంగా ఉంటుందికదా! మన క్రొత్త పాలకులుకూడా దీన్ని గుర్తిస్తారని

మనం కొండంత ఆశతో ఉన్నాం. మన ఆశలు అడియాసలు కాకుండా పృథుచక్రవర్తిని ఆదర్శంగా చేసికొని, ప్రజాపాలన అంటే 'ఇది' అనే ఒక చక్కని అర్థాన్ని మన పాలకులు కల్పిస్తారని నమ్ముతూ, వారికి ఆ శక్తిని భగవంతుడీయాలని ప్రార్థిద్దాం.

ఇక పృథివిని రక్షించుకోవడంలో మనకు బాధ్యత ఉందా? లేదా? అని మనం ఒకసారి ఆలోచించాలి. దీన్ని రక్షించుకొనవలసిన బాధ్యత మనకు లేదని మనం అనుకుంటే, మన జీవనవిధానాన్ని, క్రమబద్ధంగా అన్ని వనర్లూ సమకూర్చి రక్షించే, ఆ పృథివి నుండి రక్షణాన్ని పొందే అర్హత మనకు ఉండదు.

సువిశాలమైన ఈ భూమి అంతా ప్రజోపయోగం కలిగి ఉండదు. ప్రభుత్వాధీనంలో ఎన్నో బంజరుభూములు, రాళ్ళురప్పలతో, మిట్టపల్లాలతో నిరుపయోగంగా పడి ఉండవచ్చు. అలాంటి భూమిని విశుద్ధపరచి ప్రజావినియోగానికి వీలుగా చేయడం– అవసరపడినవారికి ఆ భూమిని ఇచ్చి, ప్రజోపయోగిగా చేయడం పాలకుని ప్రథమప్రధాన బాధ్యత అని పురాణకథ చెబుతోంది.

ఈ పృథివి పట్ల మనకుండవలసిన బాధ్యతను గుర్తించే ముందు, అసలీ పృథివిని గురించి వేదం ఏమంటుందో తెలుసుకుందాం. అథర్వవేదంలో పృథివీ సూక్తం ఉంది. దాన్ని అనుసంధానంచేస్తే పృథివిపట్ల వైదికభావన ఎలా ఉందో తెలుస్తుంది. చూడండి.

**సత్యం బృహత్, ఋత ముగ్రం దీక్షాతపో**
**బ్రహ్మ యజ్ఞః పృథివీం ధారయన్తి ।**
**సానో భూతస్య భవ్యస్య పత్నీ**
**ఉరుం లోకం పృథివీ నః కృణోతు ॥**

అసలీ పృథివి ఎలా నిలబడుతోంది? దీన్ని ఇలా అవికలంగా నిలపగల సామర్థ్యం దేనికుంది? వేదం అంటోంది. – 'సత్యం బృహత్' సర్వవ్యాపియై మూడుకాలాలలోను బాధచెందని 'సత్య'శబ్దంచేత చెప్పదగిన పరమాత్మ తత్త్వమే దీన్ని నిలబెడుతుంది. దాన్ని మనం విశ్వసించాలి. రెండవది 'ఋతం' అంటే మనంచేసిన మంచిపనుల ఫలం. ఇదే దీన్ని నిలబెడుతోంది. మూడవది 'దీక్ష'. మొక్కవోని సంకల్పం. నాల్గవది 'ఉగ్రంతపః', అతి తీవ్రమైన ఆలోచన. దీని నిలుకడ గురించిన ఆలోచన అన్నమాట. ఇక ఐదవది ఈ ఆలోచనాధారకు మూలమైన 'బ్రహ్మ' అంటే వైదికవాఙ్మయం. ఇక చివరిది ఈ వైదికవాఙ్మయం ద్వారానిరూపింపబడ్డ 'యజ్ఞం'. దైవప్రీతి కోసం, తత్ఫలమైన ప్రజాక్షేమం కోసం మనంచేసే మన విధ్యుక్తకర్మ. ఇన్నీ అవికలంగా సాగినప్పుడే ఈ పృథివి, ఎలాంటి ఉపద్రవాలూ లేకుండా మనగలుగుతుంది.

ఈ సమస్తాన్ని ఒక అదృశ్యదివ్యతత్త్వం శాసిస్తున్నదని విశ్వసించాలి. మనంచేసిన మంచిపనులఫలంగానే ఈ పృథివి సస్యశ్యామలమై మనకు సిద్ధిస్తుందని తెలిసికోవాలి. దాని యోగక్షేమాలగురించి నిరంతరం తీవ్రంగా ఆలోచించాలి. దృఢసంకల్పం వహించాలి. మనప్రాచీన వేదశాస్త్ర విజ్ఞానాన్ని ఆదరించి ఆశ్రయించాలి. భగవత్ప్రీతికోసం మన కర్తవ్యాన్ని మనం పాలించాలి. వీటివల్లనే ఈ భూమి మనగలుగుతుందని వేదతాత్పర్యం. ఈ పృథివి మన వెనుకటి జీవనానికి, భవిష్యజీవనానికి ఏకైక పరిరక్షకం. ఇది క్షేమంగా ఉంటేనే మనకు ఇంతకంటే ఉత్తమ సుఖలాభం. ఈ పృథివి మనచే రక్షింపబడుతూ మనలను రక్షించాలని వేదసందేశం.

పృథివి క్షేమంగా ఉండటం అంటే ఏమిటి ? ఈ పృథిపై ఉన్న కొండలు, (గిరయః) పెద్ద పెద్ద శిఖరాలుకల పర్వతాలు (పర్వతాః) మంచుతో కప్పబడిన పెద్దపెద్ద కొండలు (హిమవన్తః) అరణ్యాలు ఇవన్నీ సుఖకరాలుగా ఉండాలి. అంటే, అవి భద్రంగా తమ స్వరూపాన్ని కోలుపోకుండా ఉన్నప్పుడేకదా అవి మనలను రక్షించేది? అంతేకాదు, జేగురురంగుతోను, నల్లగాను, ఎర్రగాను, ఇలా ఎన్నో విలక్షణ స్వరూపాలుకల ఈ భూమిని దివ్యశక్తులు కాపాడుతున్నాయంటోంది వేదం. ఇలాంటి పృథివిని అధిష్ఠించి భద్రంగా ఉందుముగాక అని ఆశిస్తున్నది వేదం.

**గిరయస్తే పర్వతా హిమవన్తోఽరణ్యం తే పృథివి! స్యోనమస్తు ।**
**బభ్రుం, కృష్ణాం, రోహిణీం, విశ్వరూపాం**
**ధ్రువం భూమిం పృథివీమింద్ర గుప్తామ్ ॥**
**అజీహతో అక్షతోఽధ్యష్ఠాం పృథివీమహమ్ ॥**

ఈ సువిశాలభూమిమీద పరాజయం ఎరుగక, హింసింపబడక, ఎట్టి క్లేశాన్ని పొందకుండానే నేనుండాలనే భావనను మంత్రద్రష్ట ఆవిష్కరిస్తున్నాడు. మనందరి భావన అదేకదా! ఈ భూమి ఎవరో కొందరి సొత్తుకాదు. మనందరిది. దీనిపై బ్రతికే హక్కు మనందరికీ ఉంది. అలాగే దీన్ని రక్షించుకోవలసిన బాధ్యత కూడా మనందరికీ ఉంది.

'క్షమ' అనే పేరుగల పృథివీమాత, ఎన్నో భాషలు మాట్లాడేవారిని, వివిధధర్మాలను అనుసరించేవారిని వారివారి యోగ్యతకు తగ్గట్లుగా తన ఒడిలో ధరిస్తోంది. ఇలాంటి పృథివి సర్వసంపదలను ఈయాలని వేదముఖంగా మంత్రద్రష్ట సంభావిస్తున్నాడు. ఇదే మనందరి ఆకాంక్ష.

**జనం బిభ్రతీ బహుధా వివాచసం నానాధర్మాణం పృథివీ యథౌకసమ్ ।**
**సహస్రంధారా ద్రవిణం మేదుహాం ధ్రువేవధేను రనపస్ఫురన్తీ ॥**

ఒక ఆవు స్థిరంగా పాలనిచ్చినట్లు నాకు సకలైశ్వర్యాలను ఇది పితికి ఈయాలని ఆకాంక్షిస్తున్నాడు వైదిక మంత్రద్రష్ట. పృథివి ఇలా ఈయాలంటే, ఇప్పించగలవాడు పాలకుడేకదా! ఆ పనిని చేసినవాడు పృథువని చెప్పుకున్నాం. మన పాలకులూ అలాంటి నిస్స్వార్థబుద్ధులు, ప్రజారక్షకులు, పృథివీ పాలకులు కావాలని ఆశించడం దురాశకాదుకదా!

# బంగారు పలుకు

'శాస్త్రరత్నాకర' 'మహామహోపాధ్యాయ' 'కవిశాబ్దికకేసరి'
ఉ.వే.ప్ర. శ్రీమాన్ న.చ. రఘునాథాచార్యస్వామివారు- వరంగల్

1. ఇది బంగారంవంటి అమూల్యమైన పలుకు। అంతటి శ్లాఘనీయమైన పలుకు ఎవరిది? మన సీతమ్మతల్లిదే ఆ పలుకు. పరమగంభీరముగా భావగర్భితముగా, మరువలేని విధముగా, మాటలాడగలిగిన అంతటి **వాక్శక్తి** మన సీతమ్మతల్లికి తప్ప మరెవరికి సాధ్యం. కనుకనే ఆమె జగన్మాత. తనను శూలముల వంటి మాటలతో... మాటలతోనే కాదు, చేతలతోగూడా హింసించిన రాక్షసస్త్రీలను చిత్రవధ చేయుదునని కోపోద్రగుడైన హనుమంతుని బారినుండి కాపాడి, వారికి ప్రాణభిక్షను పెట్టుటకై ఆమె పలికిన పలుకు బంగారు పలుకే. ఇదుగో ఆ పలుకు.. వినండి.

**శ్లో॥ పాపానాం వా శుభానాం వా, వధార్హాణాం ప్లవంగమ !**
**కార్యం కరుణమార్యేణ న కశ్చిన్నాపరాధ్యతి ॥**

నిజంగా పదారువన్నెల పసిడిపలుకే సుమా ఇది. దీన్ని వివరించుకుందాం.

ఓ హనుమా! ఈ రాక్షసస్త్రీలు పాపిష్ఠులా! కాదు. **"శుభానాంవా"**. మెచ్చుకోదగిన సద్బుద్ధికలవారు వీరు. **"వధార్హాణాం"** వీరు వధకు అర్హులు అంటావా? తప్పు! **"ప్లవంగమ!"** అంటూ నీవు భావించటం నీ కోతిబుద్ధివల్లనే సుమా! ఈ ప్లవంగమపదం ఎత్తిపొడుపుతూండటం. శ్రీరామునిబంటువైనా కూడా నీకీ హింసాబుద్ధి పోలేదే! అనిభావం.

**"ఆర్యేణ కార్యం కరుణం"** – నవవ్యాకరణవిద్యావేత్తగా ప్రశస్తిగలనీకు వీరి విషయంలో దయను చూపుటమే కర్తవ్యం కావాలి. హింస దుర్జనస్వభావంగదా! ఇది నీవంటి ఆర్యులకు ఉండరాదయ్యా.

**"న కశ్చిన్నాపరాధ్యతి"** – ఓ హనుమా! నిజంగా ఈ లోకంలో తప్పుచేయని వాడంటూ ఎవడైనా ఉన్నాడా? ప్రతివ్యక్తిలోను చిన్నదో, పెద్దదో, ఏదో ఒక తప్పు ఉండకపోదు. అలాగని ప్రతివారిపైననూ హింసకు దిగవచ్చా!! మహాదోషులనుగూడా ఉదారహృదయంతో కనికరించుటమే ఉత్తమ పురుషలక్షణంకదా. నామాట విను. హింసాబుద్ధిని మానుకో.

భయంతో బిక్కుబిక్కుమంటూ నీ ప్రక్కకు చూస్తున్న వీరిని రక్షించటమే ఇపుడు నీకు నాకున్నూ కర్తవ్యం. అని హనుమంతునికి హితబోధచేసి రాక్షసస్త్రీలను రక్షింపజేసిన ఈ మన తల్లి సీతమ్మ పలుకు బంగారుపలుకు. ఇది వెలలేని పలుకు. పాఠకులారా!!

మరొక్కసారి ఈ శ్లోకాన్ని, దీనిలోగల గంభీరభావాన్ని మనస్సుకు తెచ్చుకొని, మన సీతమ్మ తల్లి హృదయంలోని దయను, సావధానంగా ఆస్వాదించండి. ఆ తల్లికి చేతులారా నమస్కరించండి.

ఇట్లా ఆ రాక్షసస్త్రీలనుగూడా కనికరించటం, ఆ తల్లిలోని మహాగుణంకాగా, నిర్దోషియైన తనను లోకాపవాదభీతితో పరిత్యజించిన శ్రీరాముని పైన, కించిత్తైనా అలకను చూపకపోగా, ఆ స్వామిని **"సర్వలోకైకపిత"** అని మనసారా ప్రస్తుతించిన పతివ్రతాశిరోమణియైన ఆ తల్లియొక్క మరొక పలుకును ఇటుపైన ఆస్వాదిద్దాం–రండి.

2. సీతాపరిత్యాగానంతరం కొంతకాలానికి శ్రీరామునికి ఒక యాగం చెయ్యాలని బుద్ధి పుట్టింది. అందుకు కావలసిన సన్నాహాలన్నీ చేసుకొని ఆయన, వివిధప్రాంతాలలో ఉన్న మహర్షులందరిని ఆహ్వానించాడు. వాల్మీకి మహర్షికిన్నీ ఆ ఆహ్వానం అందినది. యాగానికి వెళ్ళబోతూ ఆయన తన వెంట కుశలవుల్నూ తీసుకువెళ్ళానుకున్నాడు. తన ఆశ్రమంలోపెంచిన శ్రీరాముని పుత్రులను ఆయనకు తిరిగి అప్పజెప్పవలెననుకున్నాడు. కరుణామయుడుగదా ఆ మహర్షి.

3. నా వెంట మీరుగూడా రండి, అని కుశలవులను ఆయన ఆదేశించి నాడు. ఆ మాట వినగానే పరమసన్తోషంతో కుశలవులు తల్లివద్దకు పరుగెత్తి ఆ విషయం తెలిపినారు. తన పుత్రులకు విద్యాబుద్ధులు నేర్పిన మహర్షి తిరిగి స్వామివద్దకు వారిని చేర్చుచున్నందుకు, ఆ తల్లి ఆనంద పరవశురాలయినది. ఉప్పొంగి పోయినది. ఆ సందర్భముగా ఆ పిల్లలకు ఆమెకున్నూ జరిగిన మధురాతిమధురమైన సంభాషణను ఒక కవి తాను రచించిన ఛలితరామమ్ అనే సంస్కృతనాటకంలో ఇట్లు కూర్చియున్నాడు.

సీతా– **వత్సౌ! కల్యం ఖలు ఉపాధ్యాయేన అయోధ్యాం ప్రతిగన్తవ్యమ్ । తత్ర స రాజాయువాభ్యాం వినయేన పణాయితవ్యః.**

**(అనువాదం)–** నాయనలారా! రేపు ఉదయం మీ ఉపాధ్యాయులవారు (వాల్మీకి) అయోధ్యకు వెళ్ళబోతున్నారుగదా! ఆయనతో కలిసి వెళ్ళుతున్నమీరు అచట ఆ మహారాజును వినయపూర్వకంగా సేవించాలిసుమా! అన్నది సీతమ్మతల్లి.

లవః – **అథకిమావాభ్యాం రాజోపజీవిభ్యాం భవితవ్యమ్ ?**

**(అనువాదం) –** అయితే మేము అచట రాజసేవకులవలె ప్రవర్తించవలెనా? అన్నాడు లవుడు. క్షత్రియాహంకారం గనుక పౌరుషంతో అతడు పలికిన ఈ మాటనువిన్న ఆ తల్లి మనస్సు చివుక్కుమన్నది. అక్కడ వీరితో ఏమైనా ప్రమాదం సంభవిస్తుందేమో? అని శంకించినది. అప్పుడు ఉద్వేగంతో ఆమె తాను పరోక్షజీవనం గడుపుతున్నానన్న సంగతిని మరిచి ఉద్వేగంతో,

**"వత్సౌ! స ఖలుయువయోః పితా"** అన్నది. నాయనలారా! **ఆయన మీ తండ్రిరా! ఆయనవద్ద గౌరవంగా మీరు ప్రవర్తించవద్దా?** అంటూ అప్రయత్నంగా వాస్తవాన్ని బయటపెట్టినది. ఆ మాటను విన్న వెంటనే తిరిగి లవుడు **"అంబ! కిమావయోఃరఘుపతిః పితా?"** అని ఆశ్చర్యంగా ప్రశ్నించినాడు.

**"అమ్మా! శ్రీరాముడు మా తండ్రా? ఇంతకాలంగా చెప్పలేదేమమ్మా?"** అని లవుడు అడిగిన ఈ ప్రశ్నతో ఆ తల్లి తన రహస్యజీవనం లోకానికి తెలిసిపోతుందేమోనని గుర్తించి ఆవేదనతో ఆమెపలికిన ఈ క్రింది పసిడి పలుకును వినండి–

**"సీతా–వత్సౌ! మా అన్యథా శంకధ్వమ్, న కేవలం యువయోరేవ... అపితు సకలాయా ఏవ పృథివ్యాః స పితా!!**

**(అనువాదం)** – నాయనలారా! ఆయన మీకే కాదురా! లోకానికంతా తండ్రి సుమా! అని మాటను మార్చి బదులుచెప్పి, ఉద్ధతులైన పుత్రులిద్దరినీ సముదాయిస్తూ ఉపదేశించినది.

విన్నారా! ఇది ఎంత గంభీరమైన, భావగర్భితమైన పసిడి పలుకో!!

అవాస్తవమైన, నిర్హేతుకమైన లోకాపవాదమనే వ్యాజంతో ఆ స్వామి తనను నిర్దాక్షిణ్యంగా వనవాసానికి పంపి దుఃఖసముద్రంలో ముంచివేసినా, ఈషత్తైనా ఆయనపై కోపావేశాన్ని చూపకపోగా, ఆయనను లోకానికంతటికి తండ్రిసుమా! యని నిండు హృదయంతో కీర్తిస్తున్న ఆమెయొక్క గాఢమైన పతిభక్తిని చాటిచెప్పిన బంగారుపలుకు నిజంగా ఇదియేగదా!

ఇట్లా మానవులలో గాని, మహర్షులలోగాని, దేవతలలో గాని, శ్రీరామునిపై భక్తిని నిండుకుండవంటి తన ప్రశాంతహృదయంలో నింపుకున్నవారు, ఆ మహాతల్లి తప్ప మరెవరైనా ఉన్నారా? నిర్మలమైన తన హృదయదర్పణంలో ఆ స్వామి మూర్తినే నిరంతరం ఆరాధించుకుంటున్న ఆ జగజ్జనని తప్ప విశాలప్రపంచంలో ఎవరైనా ఆ స్వామిని జగత్పిత **(జగత్పతి)** అని నోరారా కీర్తించినారా!! కనుకనే ఆయన జగత్పితయైనట్లుగా, ఆమెయున్నూ జగన్మాత అని భగవద్రామానుజులు గద్యత్రయంలో ఉగ్గడించియున్నారు.

మన సీతమ్మనోట వెలువడిన ప్రతిమాట ఇట్లా పసిడిపలుకే అనుటలో ఇంకా సందేహమా? కోట్లకొలది రత్నరాసులు పోసినా అవి ఈ సీతమ్మ పసిడిపలుకులకు సాటిరాగలవా? రావు... రావు.. రావు... ఇది సత్యం ॥

గమనిక – ఇందలి రెండవసూక్తి సాహిత్యదర్పణంలో 6వ పరిచ్ఛేదంలో విశ్వనాథపండితునిచేత అజ్ఞాతకర్తృకమైన ఛలితరామం అనే నాటకంలో ఉన్నట్లు ఉదాహరింపబడినది. సంస్కృతవాఙ్మయంలో ఈ ఛలితరామంవంటి దృశ్యకావ్యాలు ఎన్ని ఆవిర్భవించి, కాలగర్భంలో కలసి పోయినవోగదా! హా కష్టమ్ !

## విశేష సూచన

**మీరు జీవా ప్రాంగణంలోని సమాచారుం కోరుతున్నారా?**

**ప్రియమైన భక్తినివేదన పాఠకులకు, భగవద్బంధువులకు సూచన**

**శ్రీరాంనగర్ జీవాలో జరిగే వివిధ కార్యక్రమాల గురించి, స్వామివార్లు ప్రాంగణంలో ఉన్నారా? లేరా? ఇలాంటి ఎన్నో సమాచారాలు మీరు తెలికో కోరుతున్నారు.**

**ఈక్రమంలో భక్తినివేదనలో కనిపించిన ప్రతి ఫోనునెంబరుకు ఫోను చేస్తున్నారు. ఇది సరికాదు. మీకు ఏ సమాచారం కావలసివచ్చినా ఈక్రింది రెండు నెంబర్లకు మాత్రమే చేసి తెలుసుకోండి! ఇక రామానుజ సహస్రాబ్ది గురించి తెలిసికోగోరినవారికి వేరే. ఆసమాచారం మన భక్తినివేదనలోనే విడిగా ఇస్తున్నాం. ఆనంబర్లకే ఫోన్ చేసి, సమాచారం పొందవలసినదిగా భక్తినివేదన సూచిస్తున్నది.**

**జీవా రిసెప్షన్ ఫోన్ నెం - 9553549971, 9553549972.**

**శ్రీశ్రీశ్రీత్రిదండి చిన్న శ్రీమన్నారాయణరామానుజజీయర్‌స్వామివారి**

## చాతుర్మాస్య కార్యక్రమము
## గురుపూజా మహోత్సవములు

**తేది జులై 12 నుంచి నాలుగుమాసములు శ్రీశ్రీశ్రీ చిన్నజీయరుస్వామివారు గురుపూజా మహోత్సవములుగా ఈసంవత్సరం చాతుర్మాస్యం నిర్వహింపనున్నారు. శ్రీరామనగర్‌లోని జీవాప్రాంగణంలో ఈ కార్యక్రమం చేయాలని నిర్ణయించినారు. నవంబరు 4వ తేది క్షీరాబ్ధి ద్వాదశి వరకు ఈకార్యక్రమం జరుగుతుంది.**

**కార్యక్రమ వివరాలు జీవా రిసెప్షన్ నెంబర్లకు ఫోన్ చేసి తెలిసికొనగోరుతున్నాము.**

**9553549971, 9553549972.**

7 సం॥లలో CA/CWA లలో అత్యధిక ఆలిండియా ర్యాంకులు మరియు పాస్ పర్సెంటేజ్ సాధించిన
నెం.1 కామర్స్ విద్యా సంస్థ
ఆంధ్రప్రదేశ్‌లోనే అత్యుత్తమ ఉత్తీర్ణతతో పాటు ర్యాంకులు సాధిస్తున్న ఏకైక అగ్రగామి కామర్స్ విద్యా సంస్థ
2012 Jr.MEC లో స్టేట్ 1st RANK 490/500 K. VYSHNAVI
No.1 for ▸ Inter(MEC / CEC) ▸ CA/CWA
శ్రీ MEDHA™
Igniting Intelligence. Delivering Excellence.
Head Office: 6/9 Brodipet, Vuda Office Road, Guntur-2. Ph: 22 55 891 / 988 52 49166
Branch Office: Sriya Towers 2nd Floor, Besides Income Tax Office, Near Sidhardha Public School, Mogalrajpuram, VIJAYAWADA Ph:9248920266
vijay ads

# ఆచార్య పరమాచార్య పరిచర్య

## భగవద్రామున భగవద్రామానుజ జీవన దర్శనములు

'పరమపదవాసులు' ఉ.వే.ప్ర.శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యస్వామివారు.
హైదరాబాదు

### రామానుజుల ఆలోచనపై యామునుల ప్రభావము

కాంతాస్తుతి, స్తోత్ర రత్నములు అను గ్రంథాలు తప్ప పరమాచార్యుల వారి మిగతా నాలుగు గ్రంథాల గురించి స్వామికి ఇంతవరకును తెలియదనే చెప్పాలి. అంగుళి త్రయ విమోచనానన్తరమే పరమాచార్యులైన యామునా చార్యులు రచించిన మిగతా గ్రంథాలను దర్శించగల సౌభాగ్యము స్వామికి కలిగినదనవలెను. వీనితో భగవద్రామానుజులకు కొండంత నిధి దొరికినంతటి సంతోషము కలిగి ఉంటుంది. శ్రుతి ప్రతిపాదించునట్టి చిదచిదీశ్వర, తత్స్వభావ, భోగాపవర్గ తదుపాయ గతులను యథావస్థిత స్వరూపము చెడకుండా సమర్థించడం వీరి గ్రంథాలలో భగవద్రామానుజు లకు లభించినది. చిదచిదీశ్వరులనెడు మూడు తత్త్వముల లోనూ ప్రధానమైనది ఈశ్వర తత్త్వము. చిదచిత్ తత్త్వాలు రెండునూ ఈశ్వరునికి పరతంత్రములైనవి. ఈశ్వర నియామ్యము లైనవి. ఈశ్వరుడి నుండి విడదీయరాని విశేషములుగా నున్నవి. ఈ విషయము భగవద్రామానుజుల హృదయమేనాటి నుండియో చెప్పుచున్నది. దానిని ప్రవచించి సిద్ధాంతముగా ప్రచారము చేయడానికి కావలసిన సామాగ్రి పరమాచార్య గ్రంథాలు ప్రసాదించినవి.

పరమచార్యుల గ్రంథాలలో మహాపురుష నిర్ణయమను గ్రంథము, మనకింత వరకును లభించనే లేదు. ఈ గ్రంథమును చూచియే భగవద్రామానుజులు వేదార్థ సంగ్రహ రచన చేసి యుంటారని పెద్దలు చెప్పుచుందురు. ఇక సిద్ధి త్రయమను గ్రంథమొకటి పరమాచార్యుల పాండితీ ప్రాభవాన్ని ప్రకటించునట్టిది. దీనిలో ఆత్మ సిద్ధి ఈశ్వరసిద్ధి సంవిత్సిద్ధి అని మూడు ప్రకరణాలున్నవి. ఐతే ఈ మూడు భాగాలు కూడా అసంపూర్ణములే లభించుచున్నవి. వీనిలో ఆత్మసిద్ధి భాగము కంటె అల్పమైనదిగా సంవిత్సిద్ధి భాగము. ఈ భాగము కంటెనూ అత్యల్పమీశ్వర సిద్ధి భాగము లభించినది. ఇట్లే ఆగమ ప్రామాణ్యము శ్రీపాంచరాత్రశాస్త్రము యొక్క ప్రామాణ్యమును బాగుగా సమర్థించుచున్న గ్రంథము. గీతార్థ సంగ్రహమనునది భగవద్గీతా ప్రత్యధ్యాయ ప్రతిపాద్యాంశములను వర్గీకరించి చూపెట్టినది.

ఈ గీతార్థ సంగ్రహమే మన జగదాచార్యులకు గీతాభాష్య రచనలో మార్గదర్శకత్వమును వహించినదనవచ్చును. ఈ గీతాభాష్య ప్రారంభమున జగదాచార్యులు రామానుజులు పరమాచార్యులైనయామునుల పదధ్యానము వల్లనే తమకు వస్తుత్వము సమకూరినట్లు ప్రస్తుతిస్తారు.

**స్వధర్మజ్ఞాన వైరాగ్య సాధ్యభక్త్యేక గోచరః ।**
**నారాయణః పరం బ్రహ్మ గీతాశాస్త్రే సమీరితః ॥**

భక్తి మాత్రగోచరుడగు భగవానుడు నారాయణుడు గీతాశాస్త్రమున ప్రతిపాదించబడిన వాడని పరమాచార్యుల వారి గీతార్థసంగ్రహము. 'స్వవిషయం భక్తియోగ మవతారయామాస' అని గీతాభాష్యము. ఈ గీతాశాస్త్రమును భగవానుడే అవతరింపచేసినాడని ఆ శాస్త్రము తనను ప్రధానముగా చెప్పడమే గాక తనను గురించి అనుష్ఠించవలసిన భక్తియోగమును మరీ ప్రధానముగా చెప్పునని భగవద్రామానుజులు యామునేయుల శ్లోకాలను చిన్ని వ్యాఖ్యాన రూపముగా గీతాభాష్యమును మొదట రచించినారనిపించును. ఏ మంటే గీతాభాష్య రచనకు సంబంధించిన శైలి ఎక్కడో ఒక్కొక్క చోట తప్పితే పెద్దగా శాస్త్రార్థ వాదముల జోలికి వెళ్ళినట్లు కనిపించదు. ఖండన సందర్భముననూ జీవబ్రహ్మైక్యమునే ఒకటి రెండు స్థలములలో దూషించడము జరిగింది.

వేదార్థ సంగ్రము జగదాచార్యులైన రామానుజుల వాదపాటవాన్ని పట్టి చూపెట్టునట్టిది. దీని ప్రారంభమున కూడా భగవద్రామానుజులు పరమాచార్యులైన యామునుల వారిని సగౌరవముగా సంస్మరిస్తారు. మహాపురుష నిర్ణయమనెడు యామునేయ గ్రంథమీ రచనకు బాగుగా తోడ్పడి ఉండవచ్చునని పెద్దలూహింతురు. ఆ గ్రంథము లభించునంతవరకు మన మింత కంటెను మరేమి అనలేము కదా. "సర్వం చైతత్ పురుష నిర్ణయే నిపుణతర ముపపాదితమితి న ప్రపంచ్యతే" ఇది యంతయూ పురుష నిర్ణయ గ్రంథమున బాగుగా ఉపపాదించబడినందున ఇక్కడ విస్తరించబడడం లేదు. అని పరమాచార్యుల వారే ఆగమ ప్రామాణ్యగ్రంథమును తమ పురుష నిర్ణయ గ్రంథమున ఉట్టంకించి యున్నందున పురుష నిర్ణయ గ్రంథమొకటి వారిది ఉంటుందని మనమనుకోవడంలో పొరపాటులేదు.

ఇక ఆగమ ప్రామాణ్య గ్రంథము ఆళవందార్‌స్వామి యొక్క బహు గ్రంథ పరిశీలన పాటవాన్ని ప్రకటించు అద్భుత గ్రంథము. ఈ గ్రంథములో వీరెత్తి చూపిన ప్రమాణములనేకములు, మన భగవద్రామునుజులకు పశుపత్యధికరణ భాష్యరచనకు ఉత్పత్త్యసంభవాధికరణభాష్యరచనకు ఎంతగానో ఉపయోగపడినవి. ఈ గ్రంథమున ఎన్నెన్ని శ్రుతి వాక్యములో మరెన్ని స్మృతీతిహాస పురాణ వాక్యములో శరపరంపరగా వచ్చి పడడం గమనించ గలిగిన వారికి, గ్రంథకర్త తమముందు సాక్షాత్కరించినట్లు అనిపించును. వీరి రచనలోనూ వచనములతో పాటు అపృథగ్యత్న నిర్వర్త్యములుగా వచ్చి పడు శ్లోకములెన్నియో ఆశ్చర్యమును కల్గించును.

మహేశ్వర తంత్రంలో కాపాలిక, కాలాముఖ, పాశుపత శైవ, భేదమును బట్టి నాల్గు రకాల మహేశ్వరులు చెప్పబడినారట. వీరిలోనూ కాపాలికులు ముద్రికా షట్కవిజ్ఞానముతోనే అపవర్గఫల ప్రాప్తియని బ్రహ్మజ్ఞానముతో కాదని చెప్పుదురట. **ముద్రికాషట్క తత్త్వజ్ఞః పరముద్రా విశారదః** ఇత్యాదిశ్లోకములు అనేకములు ఈ ఆగమ ప్రామాణ్యములో కనుపించునవి మనకు పశపత్యధికరణ శ్రీభాష్యములోనూ దర్శన మిచ్చుచున్నవి.

ఇట్లే ఉత్పత్త్య సంభవాది కరణ శ్రీభాష్యమునకును ఈ ఆగమ ప్రామాణ్య గ్రంథ మెనలేని ఉపకారమొనరించిన దనవచ్చును. ఈ అధికరణము ద్వితీయాధ్యాయ ద్వితీయపాదమున చివరిది. దీనిలో నాలుగు సూత్రములు ఉన్నవి. ఈ అధ్యాయములోని ఈ పాదము పరపక్ష ప్రతిక్షేప మొనరించునట్టిదని

ప్రాజ్ఞులు ప్రవచించుచుందురు. ఈ పాదమున మొదటినుండి గడచినవి ఏడు అధికరణములు. వానిలో సాంఖ్య, యోగ, న్యాయ, వైశేషిక, జైన, బౌద్ధ పాశుపతమతములు. ఏడు కూడా దోష దూషితములుగా శ్రుతి విరుద్ధములుగా చూపెట్టబడినవి. కనక ఈ చివరి అధికరణము కూడా శ్రీ పాంచరాత్ర మతమును ప్రతిక్షేపించుటకే ఏర్పడినదనెడు భావము కలుగవచ్చు. సాంఖ్యాదులవలె, ఈ తంత్రము శ్రుతి విరుద్ధము కానందున, వాటిలాగా దీని ప్రామాణ్యమును ప్రతిషేధించవలసిన అవసరములేదని ఈ అధికరణములోని చివరి రెండు సూత్రములలో బాదరాయణులవారు వివరింతురు. ఆగమ ప్రామాణ్య గ్రంథమున పరమాచార్యులు యామునేయులు, లింగ, వరాహాది పురాణములనే కాక ఈ అధికరణానికి సంబంధించిన సూత్రములను కూడా ఎత్తి చూపెట్టినారు. సూత్రాక్షరార్థమును స్పష్టపరచినారు. అది మన శ్రీభాష్యకార రామానుజుల కెంతయో ఉపయోగపడినది. ఇంతేకాదు. ఈ అధికరణమునకు సంబంధించిన నాలుగు సూత్రాలకును చక్కని వ్యాఖ్యకూడా పరమాచార్యుల వారు చేసి చూపెట్టినారు. వీరి వ్యాఖ్యననుసరించియే శ్రీభాష్యకారులు కూడా మొదటరెండు సూత్రాలను పూర్వపక్ష సూత్రాలుగాను చివరిరెండు సూత్రాలను పూర్వ పక్ష ప్రతిక్షేప పరంగానూ వ్యాఖ్యానంచేసి శ్రీ పాంచరాత్రము అప్రమాణ మనరాదని సాధించిపెట్టినారు. ఈ సందర్భములో కూడా పరమాచార్యులు యామునేయులు ప్రస్తావించిన అనేక శ్లోకాలు శ్రీభాష్యమున మనము గమనించగలము.

ఇక సిద్ధిత్రయ గ్రంథమునకు సంబంధించిన ఆత్మ సిద్ధి భాగము మహా సిద్ధాంత రచనలో భాష్య కారులకు బాగా ఉపకరించినదని తెలిసికొనవచ్చును. అనేక స్థలములలోనూ అర్థమాత్ర సామ్యమే కాక, శబ్ద సామ్యము రచనా సామ్యము కూడా శ్రీభాష్యకారులకు సిద్ధిత్రయ గ్రంథమునందున్న ఆదరాతిశయమును చెప్పును. నిర్విశేష బ్రహ్మవాదమును నిరాకరించుటలో యామున గ్రంథమే, రామానుజులకు అక్షరశః ఆలంబనమనక తప్పదు.

తాము పరమాచార్యులకు చేసిన వాగ్దానము ప్రకారము శ్రీభాష్యకారులు ఎంతో ప్రయాసపడి శ్రీభాష్య గ్రంథమును రచించినారు. వ్యాసపరాశరుల నామధేయములుంచి కూరేశుల కుమారులకు దర్శన నిర్వాహకత్వమును అప్పజెప్పినారు. 72 మంది ఆచార్యపురుషులను ఏర్పాటు చేసి శ్రీవైష్ణవ సంపత్తిని పెంపొందించుటకు ప్రణాళిక సిద్ధము చేసినారు. తాము అభిమానించిన కురుకై పిరాన్ పిళ్ళై అనువారి ద్వారా ఆళ్వార్ల దివ్య ప్రబంధముగు తిరవాయ్‌మొళ్ళికి వ్యాఖ్యానము చేయించినారు. నాటి కాలపు అస్పృశ్యులనబడు వారిని ఏడు వందలమందిని ఊర్ధ్వపుండ్రాలతో అలంకరింపచేసి తిరునారాయణపురంలోని సంపత్కుమారమూర్తిని తురుష్కప్రభువు నుండి స్వాధీనమొనర్చుకొనినారు. ఆతురుష్క ప్రభువు కూతురుకును, నాటి కాలపు అస్పృశ్యులకును అక్కడి మందిరంలో ప్రవేశము కల్పించినారు. ఆతురుష్క ప్రభువు కూతురే బీబీనాచ్చియార్‌గా సేవింప బడుతున్నది. ఇట్లు జగదాచార్యులైన భగవద్రామానుజులు, పరమాచార్యులగు యామునమునులు ఉపనిషత్తులు ప్రతిపాదించు సత్యస్వరూప స్వభావ ములను సమాజానికి చాటి చెప్పడము ద్వారా తమ అనుష్ఠానములో దర్శింపచేయడం ద్వారా శ్రుతిమాతకుగాని, సమాజానికిగాని సాటిలేని మేటి పరిచర్య సల్పినారని సంగ్రహంగా స్మరించుకొనుచున్నాము.

## శ్రీవానమామలై జీయర్‌స్వామివారు - శ్రీసంప్రదాయ దీప్తి

**సాంప్రదాయికాచార్యులు లేనిలోటు పూర్తికానిది. భగవద్రామానుజులు సత్సంప్రదాయ ప్రచారానికి ఏర్పరచిన వ్యవస్థలో భాగమే శ్రీవానమామలైమఠం. దానికి 30వ జీయర్‌గా బాధ్యతను స్వీకరించి, నవంబరు 10-1994 నుండి నిర్విఘ్నంగా శ్రీవైష్ణవ సంప్రదాయ ప్రచారం చేస్తున్న వానమామలై జీయర్‌స్వామి (శ్రీశ్రీశ్రీ కలియన్ వానమామలై రామానుజ జీయర్ స్వామిగా ప్రసిద్ధులైన స్వామి), తమ 82వ ఏట తిరునాడుకు వేంచేయడం శ్రీవైష్ణవ సంప్రదాయానికి తీరని లోటు. పూర్వాశ్రమంలో చెన్నైలోని కేంద్రియ విద్యాలయానికి ప్రిన్సిపాలుగా బాధ్యతలు నిర్వహించిన స్వామి, తమిళం, ఇంగ్లీషు, హిందీ, సంస్కృత భాషల్లో విశేష అభినివేశం కలవారు. "ఒక ఉత్తమ ఉపాధ్యాయునిగా ఈయన శిష్యుల సందేహాలను సరళంగా సమాధానించడంలో దిట్ట" అని భక్తుల అనుభవం. పట్టభద్రులైన మనస్వామి "తిరుక్కురల్" అనేద్రావిడ గ్రంథాన్ని సంస్కృతీకరించారు. అంతేకాదు "డాక్టరెట్ డిగ్రీ" పొందారు. లఘుకథలు, కవితలు వ్రాయడంలో అందెవేసిన చెయ్యి. వీరి రచనలు పలు పత్రికల్లో ముద్రింపబడ్డాయి. మనస్వామి తిరునక్షత్రాన్ని నవంబరు 26-2013న వానమామలైలో చాలా వైభవంగా నిర్వహించారు.**



**చిత్ర, కార్తిగై, శుక్లపక్ష ద్వితీయనాడు (ఏప్రియల్ 30-2014) సాయంకాలం 4.20ని॥లకు శ్రీమత్పరమహంసేత్యాది శ్రీశ్రీశ్రీ వానమామలై జీయర్ స్వామి తమచరమదేహాన్ని విడచి అవతారాన్ని చాలించారు. స్వామికి సన్నిహితులు ఉ.వే. నారాయణ స్వామి, తమకు పూర్వమున్న నలుగురు జీయర్లను సేవించినవారు ప్రస్తుత వానమామలై పీఠాన్ని అధిరోహించారు.**

**శ్రీమన్నవాళమామునుల శిష్యులైన శ్రీశ్రీశ్రీ పొన్నడిగల్ జీయర్ స్వామివారిచే ఆరంభింపబడిన వానమామలైమఠాన్ని సమర్థవంతంగా నడిపిన శ్రీశ్రీశ్రీవానమామలై రామానుజ జీయర్‌స్వామివారి అవతార పరిసమాపనం సాంప్రదాయిక లోకానికి తీరనిలోటని భావిస్తూ మన భక్తినివేదన, శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీత్రిదండి చిన్నశ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు తమ ప్రగాఢ సానుతాపాన్ని ఆవిష్కరించారు. పై సంచికలో విశేషంగా వానమామలై పరంపరతో మనకున్న అనుబంధాన్ని భావించుదాం.**

సంపాదకుడు

63 సంవత్సరములనాటి ఖరనామ సంవత్సరము

భక్తినివేదన వ్యాసము

# పరవిద్య

'న్యాయవేదాన్తవిద్వాన్' 'సాహిత్య భూషణ'
శ్రీ ఉ.వే. శ్రీమాన్ సముద్రాల లక్ష్మణాచార్యస్వామివారు,- ముక్తిపల్లి అగ్రహారం.

**శ్లో ॥ శ్రీమద్వేఙ్కటరఙ్గాఖ్య దేశికేంద్ర పదాబ్జయోః ।**
**అనులోమవిలోమాభ్యాం మనోలగతుమామకమ్ ॥**

ఆర్యమిత్రులారా! "సర్వేశ్వరసృష్టములగు ఈప్రకృతిమండలములందు చేతనులందరునూ సుఖమునపేక్షించుదురేకాని దుఃఖమపేక్షింపరు. అయిననూ ఒకచేతనుడైననూ దుఃఖమిశ్రము కాని సుఖమును పొందువాడులేదు. అట్టి సుఖమును పొందవలయునన్న సర్వేశ్వర సాన్నిధ్యముననే లభించును. అట్టిసాన్నిధ్యము లభించవలయునన్న వారి యనుగ్రహమును సంపాదించుకొన వలయును. అట్టి యనుగ్రహమునకు పరవిద్యయే సాధనము. అనగా భక్తియే సాధనము. తత్స్వరూపాదులు తెలియవలయునన్న స్వతః ప్రమాణమైన శ్రుతియే శరణ్యము.

ఆ శ్రుతి, గమ్భీరార్థము కలదగుటచేత తదర్థము నెరుగుట మానవులకు సాధ్యము కానేరదు. గాన తన యాజ్ఞారూపమగు వేదాభిప్రాయమును తానేబయలుపరచ దలచి **"వ్యాసోనారాయణాంశజః"** యన్నటుల సర్వేశ్వరుడు వ్యాసరూపమున నవతరించి, శ్రుత్యభిప్రాయమును బ్రహ్మసూత్రరూపమున తెలియపరచెను. నిత్యమునూ సర్వేశ్వరునికి శయ్యారూపమున కైంకర్యమొనర్చుచూ సల్లాపములాడుచుండెడు యనన్తుడే, సర్వేశ్వర హృదయాభిప్రాయమెరిగినవాడగుటచేత, ఆ యనన్తుడు భగవద్రామానుజ రూపమున యవతరించి యాబ్రహ్మసూత్రాభిప్రాయమును శ్రీభాష్యమునందు, "పరవిద్యయే పరబ్రహ్మప్రాప్తికి సాధనమ"ని ప్రసాదించినాడు. పరవిషయకవిద్య యగుటచేకాని సర్వవిద్యాశ్రయత్వ రూపోత్కృష్ట్యము కలది యగుటచేగాని, పరవిద్యయన సార్థకము.

**శ్లో॥ "అథ పరా యయా తదక్షరమధిగమ్యతే, యత్తద**
**ద్రేశ్య మగ్రాహ్య మవర్ణ మగోత్ర మచక్షుశ్శ్రోత్రం**
**తదపాణిపాదం, నిత్యంవిభుం సర్వగతం సుసూక్ష్మం,**
**తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః ॥** యని...

ఉపనిషత్తునందు పరవిద్యయే పరబ్రహ్మప్రాప్తిసాధనమని చెప్పబడినది. పరవిద్యయన భక్తిరూపాపన్న జ్ఞానమేయని మున్ముందు విశదముకాగలదు. అక్షరశబ్దవాచ్యుడైన అద్రేశ్యత్వాది ధర్మవిశిష్టుడైన పరబ్రహ్మయొక్క ప్రాప్తికి పరవిద్యయే సాధనము.

**వాది-** అయితే, అక్షరశబ్ద వాచ్యుడు పరబ్రహ్మయైనచో తత్ప్రాప్తికి పరవిద్య సాధనమని చెప్పవచ్చును. ఇచ్చట పరశబ్దవాచ్యమైన, సూక్ష్మరూప ప్రకృతియెగాన మీయిష్ట సిద్ధి కానేరదు. అయితే చేతనాచేతన సాధారణములైన యదృశ్యత్వాది గుణములనుబట్టి సూక్ష్మరూప ప్రకృతియే అక్షరశబ్దవాచ్య మనుటన్యాయమా? అనితరసాధారణ ధర్మములచే నిర్ణయించవలెనందువా? నిశ్చయమె వినుము.

అబ్రాహ్మణాది శబ్దములు బ్రాహ్మణభిన్న సమస్తవ్యక్తులను బోధించిననూ సజాతీయులగు ఆ ప్రసక్తిగల శీఘ్రోపస్థితులైన క్షత్రియాదులనె బోధించునుగాని చణ్డాలాదులు బోధింపనేరవు. అటులనే అదృశ్యత్వాది శబ్దములున్నూ స్థూలరూపాచేతనగత దృశ్యత్వాది ధర్మములు నిషిద్ధములై సజాతీయమై ప్రసక్తిగల అవస్థాన్తరమును పొందిన సూక్ష్మరూపాచేతనమునే బోధించునే గాని, విజాతీయమై అప్రసక్తమైన కాష్ఠాదులను బోధించనేరదు.

**"అక్షరాత్పరతఃపరః"** యన్నచోటకూడా పరభూతమైన యక్షరముకంటే పరుడగు వానిని నిర్దేశించినదిగాని వానికంటే పరుడగువానిని నిర్దశించలేదు.

అందులన పురుషగత పరత్వావధిగా నిర్దేశించబడినవాడు పరమ పురుషుడు కానేరదు. అక్షరాత్పరతః పరః యన్నచోట అక్షరముకంటే పరుడు జీవుడు, అతనికంటే పరమాత్మయని సామానాధికరణ్యమును విడచి చెప్పకూడదా? యని యందువేమో అనరాదు. సమాన విభక్తితో నిర్దేశించబడిన వాటికి సామానాధికరణ్యముచే నన్వయించుటయుచితముగాన ఈసామానాధి కరణ్య స్వారస్య భంగముకాకుండ విశేషణ విశేష్యభావమే న్యాయము.

కాబట్టియే ప్రకృతికి సమష్టిపురుషాధిష్ఠితమై భూతసృష్టి చేయుటచే భూతయోనిత్వము సిద్ధించును అని, **"యథోర్ణనాభి స్సృజతే గృహ్ణతే చ"** యనువాక్యశేషము ప్రకటన చేయుచున్నది. ప్రథమదృష్టాన్తము, పురుషాధిష్ఠిత మైన ప్రకృతి భూతసృష్టిని చేయునట్టి విధమునున్నూ రెండవ దృష్టాన్తము పురుషానధిష్ఠితమై భూతసృష్టి చేయు విధమునున్నూ, మూడవ దృష్టాన్తము పురుషసన్నిధానమున భూతసృష్టిచేయు విధానమునున్నూ తెలియ చేయుచున్నది కావున రెండు స్థలములయందునూ పరబ్రహ్మ కానేరదు.

**సిద్ధాన్తి**--చాలా పొరపడితివి, సావధానముగా వినుము

**"అథపరా యయా తదక్షరమధిగమ్యతే"** యను శ్రుతిని ఉభయ సాధారణములైన ధర్మములనుబట్టి సూక్ష్మరూపప్రకృతి పరముగా నన్వయించితివి గాని, ఈప్రకరణమునందు **'యస్సర్వజ్ఞస్సర్వవిత్'** అవి శ్రుతి అనితరసాధారణములైన సర్వజ్ఞత్వాది గుణములను ఆయక్షరునకే విధించుటచే యక్షరశబ్దవాచ్యుడు పరమాత్మయే. కావుననే **"యద్భూత యోనిం"** అని చెప్పిన భూతయోనిత్వముకూడా సర్వేశ్వరునికి స్వరసముగా సమన్వయించును. ఏలయందువా **"అక్షరాత్సంభవతీహవిశ్వమ్"** విశ్వశబ్ద ప్రయోగము వలన

చేతనాచేతనాత్మకమైన నిఖిల ప్రపంచ సృష్టి తెలుపబడుతున్నది. గాన అట్టి చేతనాచేతనాత్మక ప్రపంచసృష్టి ప్రకృతికారణము కానేరదు.

అయితే భూతయోనియనగా భూతోపాదాన కారణమనిగదా నీవు చెప్పునది. అప్పుడు ఘటాదులకుపాదానకారణము మృదాదులుగాన, సమస్త భూతోపాదాన కారణత్వము పరమాత్మకు సిద్ధింపనేరదే. కాదు, **"యస్యాత్మా శరీరం యస్య పృథివీ శరీరం"** అనియెడి శ్రుతియందు పృథివీశరీరకునిగా చెప్పుటచే మృత్తునందుకూడా నన్తర్యామిగానుండుటచే, ఘటాద్యుపాదాన కారణము సర్వేశ్వరుడగుటచే, సర్వభూతయోనిత్వ ముపపన్నమే, గనుకనే **యథోర్ణనాభిస్సృజతే గృహ్ణతేచ"** యను వాక్యశేషము చక్కగా పరమాత్మను దార్ష్టాన్తీకరించుచున్నది. ఎటులనగా

1. లోకమునందు ఉపాదానకారణము తనకంటే భిన్నమగు నిమిత్తకారణము నపేక్షించుట చూచుచున్నాము. గాన పరమాత్మయూ స్వభిన్ననిమిత్త కారణాపేక్షియైనచో ఏక విజ్ఞానేన సర్వవిజ్ఞానము అనుపపన్నము కాదా.
2. ఒక పరబ్రహ్మకు పరస్పర విలక్షణ ప్రపంచోపాదాన కారణత్వము ఎటుల సంభవించును.
3. ఘటాద్యుత్పత్తియందు ఉపాదాన కారణములైన మృత్పిండాదులకు పూర్వావస్థోపమర్దము కనపడుచున్నది.
4. ప్రాకారమునకు ఉపాదానకారణములైన ఇటుకరాళ్ళయందు చతురశ్రత్వాది రూప పూర్వాకార తిరోధానము కనపడుచున్నది. అక్షరశబ్దవాచ్యుడైన నిర్వికారుడైన పరబ్రహ్మకు పూర్వాకారోపమర్ద తిరోధానములు సంభవించవు గాన ఉపాదానకారణత్వము ఎటుల సిద్ధించును? అనునట్టి యాశంకలకు సమాధానమును "యథోర్ణనాభి స్సృజతే గృహ్ణతేచ" యను వాక్యశేషము ఒసంగుచున్నది.

శ్లో॥ **"యథోర్ణనాభి ర్హృదయా దూర్ణాం సన్తత్యవక్త్రతః॥**
**తథా విహృత్య భూయస్తాంగ్రస త్యేవంజనార్దనః॥**

అనునటుల, ఎట్లు లూతమను కీటము, తనలోపలనున్న తంతువులను బయల్పరచుటకు, మరల ప్రింగుటకు, నిరపేక్ష కర్తృత్వము కలదియో, ఒకటియైన పృథివికి పూర్వావస్థోపమర్ద తిరోధాములు లేకున్ననూ అతి విలక్షణములైన అనన్తౌషధులకు ఉపాదానత్వమెటుల సిద్ధించినదో, పరస్పర విలక్షణుడైన చేతనునికి అచేనములైన కేశ లోమాద్యుపాదానత్వమెటుల సిద్ధించునో, అటులనే నిమిత్త కారణాన్తరాపేక్షలేని ఉపాదేయ విలక్షణుడైన నిర్వికారుడైన పరమాత్మ నుండి పరస్పరవిలక్షణమైన చేతనాచేతనాత్మకమైన నిఖిల జగత్తు కలుగుచున్నదని సమాధాన మొసంగినది.

**"అక్షరాత్పరతః"** యను శ్రుతికి నీవు చెప్పునది సరికాదు. ఇచ్చట పఞ్చమ్యన్తముగా నిర్దేశించబడిన పరతఃయనునది పరశబ్దము పఞ్చమ్యన్త పదాపేక్ష కలదియనుటచే వచ్చినదిగాని, సామానాధికరణ్యసిద్ధికి కాదు. ఇదిగాక పరతఃయను పదము స్వకార్యవర్గబోధక పదాధ్యాహారా పేక్షకలదిగాన, దానినపేక్షించుచో, అధ్యాహారదోషదుష్టమగును. మరియును అక్షరాత్పరతః పరుడు జీవుడుకాదు, పరతః అక్షరాత్ అని శ్రుతి చెప్పలేదు. అక్షరాత్పరతః పరః అని శ్రుతిక్రమము చెప్పినది గాన, అక్షరాత్పరతః పరుడుగా నిర్ణయించబడినవాడు పరమాత్మయే కాని జీవుడు కాదు. మరియు ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞాన రూపవిశేషణముచేత కూడా అక్షరశబ్దవాచ్యుడు పరమాత్మయని నిర్ణయింపబడినది.

**"స బ్రహ్మవిద్యాం సర్వవిద్యాప్రతిష్ఠాం అథర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ"** బ్రహ్మదేవుడు తన పెద్దకుమారుడగు అంగిరసునకు సర్వవిద్యాశ్రయమైన బ్రహ్మవిద్యనుపదేశించెను. ఇట్లు చతుర్ముఖాది గురుపరంపరాలబ్ధమైన బ్రహ్మవిద్యను అంగీరసుని వలన వినగోరి శౌనకుడు బ్రహ్మవిద్య సర్వవిద్యాశ్రయ మగుటచే ఒక బ్రహ్మజ్ఞానమువలన సర్వవిజ్ఞానము కలుగుననెడి యాశచే **కస్మిన్ను భగవోవిజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి** యని యడిగెను. ఈప్రశ్నకు శౌనకుడు **"ద్వేవిద్యే వేదితవ్యే ఇతిహ యద్బ్రహ్మవిదో వదన్తిస్మ పరా చైవాపరా చేతి**యని సమాధానము చెప్పను. ఈతావున బ్రహ్మను పొందగోరువాడు పరాపరవిద్యలను తెలుసుకొనవలయుననగా, పరాపరవిద్యలు బ్రహ్మవిద్యకు అర్థాన్తరములు కావని తేలినది. అట్టి పరాపరవిద్యలలో పరవిద్యయనగా భక్తిరూపాపన్నజ్ఞానము యొక్క విశేషస్వరూపమును తెలుపుచున్నది. అయితే పరబ్రహ్మప్రాప్తికి ఒకవిద్యచాలదా? ఒకవిద్యచేతనే బ్రహ్మప్రాప్తి కలుగుచుండగా రెండవవిద్య వ్యర్థమే కదాయని యందువేమో, కాదు పరాపరవిద్యలతో పరవిద్యయోగ జన్యమైనది. దానిని అపరోక్షజ్ఞానమందురు. అదియే భక్తిరూపాపన్న జ్ఞానము. ఆపరవిద్యశాస్త్రజన్యజ్ఞానము. ఇది పరోక్షజ్ఞానము ఈరెంటిలో అపరోక్షమైన భక్తిరూపాపన్న జ్ఞానము అవ్యవధానముగా పరబ్రహ్మప్రాప్తి సాధనము. పరోక్షజ్ఞానమో వ్యవధానముగా పరబ్రహ్మప్రాప్తి సాధనముగాన, రెండునూ సార్థకములెగాన, అక్షరశబ్దవాచ్యుడై జగత్కారణుడై సర్వజ్ఞత్వాది సమస్త కళ్యాణగుణాకరుడైన నారాయణ పరబ్రహ్మయొక్క ప్రాప్తికి ముఖ్యసాధనమైనది పరవిద్యయేయని సిద్ధాన్తము.

**(ఈవ్యాసం ప్రస్తుత సంపాదకుని తండ్రిగారు 60 సంవత్సరాలకు పూర్వంఖరనామ సంవత్సరంలో వ్రాసిన వ్యాసం. ఇక్కడ పునర్ముద్రణం చేస్తున్నాము. సంపాదకుడు).**


మరింత విశాలంగా ... వినూత్నంగా....
ప్రత్యేక 1 గ్రామ్ జ్యూయలరీ కౌంటర్
కామధేను సిల్క్స్
పట్టు చీరలు
ఫ్యాన్సీ చీరలు
వర్క్ శారీస్
గద్వాల్
వెంకటగిరి
మధీరాడ్స్
డ్రెస్ మెటీరియల్స్
బీసెంట్‌రోడ్, విజయవాడ-2. ఫోన్: 2574220



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

*(గత సంచిక తరువాయి)* *(1స్కంధం-13వ అధ్యాయం)*

*యుధిష్ఠిర నారద సంవాదంలోని ఒక శ్లోకాన్ని గురించి మనం చర్చింతున్నాం!*

నారద యుధిష్ఠిర సంవాదంలో ఉన్న శ్లోకాలన్నీ ఇంచుమించుగా తత్త్వభరాలే. కొన్ని శ్లోకాల సమన్వయంలో వ్యాఖ్యాతల వ్యాఖ్యాసరణి భిన్నంగా ఉంది. ఈ క్రిందిశ్లోకాన్ని గమనించండి.

**తదిదం భగవాన్ రాజన్, ఏక ఆత్మా, ఆత్మానాం స్వదృక్ ।**
**అంతరోఽనన్తరో భాతి పశ్య! త్వం మాయయోరుధా ॥**

**శ్రీధర వివరణం**

ఈ శ్లోకానికి శ్రీధర-వీరరాఘవవ్యాఖ్యలు విశేషంగా ఉన్నాయి. ఈ శ్లోకాన్ని ద్వైతనిషేధపరంగా శ్రీధరులు తమవ్యాఖ్య సాగించారు. వారి ప్రతీకవచనం ఇది- "మోహనివృత్త్యర్థం ద్వైతస్య అవస్తుత్వమాహ" మోహాన్ని నివారించడానికి ద్వైతాన్ని అవాస్తవతత్త్వంగా చెబుతున్నాడు." అనివీరి వ్యాఖ్యానారంభం. ఈ అహస్త-సహస్తాది విశిష్టమైన జగత్తంతా భగవానుడే తప్ప ఆయన కంటే వేరుకాదు. (తదిదమ్ అహస్త సహస్తాది రూపం జగత్ స్వదృక్ భగవానేవ, నతతః పృథక్". 'సతు ఏక ఏవ నతు నానా', ఆపరమాత్మ ఒక్కడే అనేకులు కాదు. "నను సజాతీయ విజాతీయ భేదే ప్రత్యక్షే, కుత ఏతత్? తత్రాహ-ఆత్మానాం భోక్తౄణామ్ ఆత్మా-స్వరూపమ్, అతోన సజాతీయ భేదః" "మరి, సమాన జాతికల వస్తువులు, విరుద్ధజాతికల వస్తువులు ఇలా పలురకాలైన భేదం స్పష్టంగా కనిపిస్తూ ఉంటే, ఆ భేదం లేదనడం, 'ఒక్కటే' ననడం ఎలా కుదురుతుంది? అన్న శంకను వారించడానికి అంటున్నాడు. ఆత్మలన్నింటికీ, భోక్తలైన జీవులందరికీ, 'ఆత్మా', స్వరూపం, ఆయనే, అంటే భగవానుడే. కనుక, ఆయన కంటే వేరేమీ సమాన వస్తువుల భేదం అంటూ ఏదీ లేదు. **"అంతరఇతి, అంతరోఽనన్తరశ్చ, అంతర్బహిశ్చ భోక్తృభోగ్య రూపశ్చభాతి. అతోన విజాతీయభేదోఽపి".**

అంతరము అని, అంతరం (లోపల) అనంతరం (వెలుపల) లోపల-వెలుపల భోక్తృవర్గం (జీవులు) భోగ్యవస్తుజాతం (జీవులచే అనుభవింపబడే పదార్థాలు) ఇవన్నీ ఆయనే తప్ప వేరేమీ లేదు. ఆయనే ఇలా ఆంతరబాహ్యవస్తుజాతంగా భాసిస్తున్నాడు. కనుక వేరొక విజాతీయ (విరుద్ధజాతికల) వస్తువంటూ ఏదీలేదు". "నన్వేకః కథం తథా ప్రతీయతే? తత్రాహ। మాయయా బహుధాభాన్తం, తం పశ్యేతి" "మరి, ఒక్కడే అలా (పలురకాలుగా) ఎలా భాసిస్తాడు? అన్న శంకకు సమాధానంగా 'మాయచేతనే అనేక విధాలుగా భాసిస్తాడు, అలాంటి వానినిచూడు' అని అంటున్నాడు" అని శ్రీధరవ్యాఖ్య. ఇలా సజాతీయ- విజాతీయ భేదనిరసనం ద్వారా బ్రహ్మమాత్ర సత్యత్వమే ఇక్కడ ప్రతిపాద్యమని, ఇక పలురకాలుగా ఆ బ్రహ్మమేమాయచే భాసిస్తున్నదని శ్రీధరవ్యాఖ్యా తాత్పర్యం స్పష్టం.

**వీరరాఘవ వివరణం**

ఇక్కడ వీరరాఘవవ్యాఖ్య విశిష్టాద్వైత దర్శనాన్ని ఇలా దర్శింప చేస్తున్నది. **'ఆత్మనామ్ ఆత్మా'** అన్నదానికి సర్వజీవులకు అంతర్యామి అని వీరి వివరణం. **'స్వదృక్'** అంటే స్వయం ప్రకాశకుడని అర్థం. సర్వజీవుల్లోను అంతర్యామిగా ప్రవేశించి స్వయప్రకాశకుడైన పరమాత్మ ఒక్క శ్రీమన్నారాయణుడే, సర్వపదార్థాన్తర్యామియై (లోపల)(అంతరః), వాటి అన్నింటికీ వెలుపల (అనంతరః) కూడా వ్యాపించి ఉన్నాడు. **"అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః"** అనే శ్రుతి ఈ అభిప్రాయాన్నే చెబుతున్నది.

ఆనారాయణుడే ఈ కనిపించే జగత్తుగా భాసిస్తున్నాడు. ఇలా భాసించడంవాస్తవమే. స్వసంకల్పానుగుణమే. కనుకనే **'బహుస్యాం ప్రజాయేయ'** (అనేకవిధాలుగా అవుతాను అందుకోసం పుడతాను) అని కదా సంకల్పం. అదే మాయ. మాయఅంటే భగవద్రామానుజ దర్శనంలో" ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు కనుపింపచేసే, అవాస్తవ తత్త్వం' ఎంతమాత్రంకాదు. **'మాయా తు వయునం జ్ఞానమ్'** అనే కోశాన్ని బట్టి ఇది జ్ఞానరూపమైన ఒక వాస్తవతత్త్వం. ఇది భగవంతుని ఆశ్చర్యకర శక్తి. ఈ సంకల్పరూపజ్ఞానం చేతనే, పరమాత్మ తానొక్కడే అనేకరూపాలు ధరిస్తాడు. ఈప్రపంచరూపంగా వాస్తవంగానే గోచరిస్తాడు.

**'ఆత్మనామ్ ఆత్మా'** అనే భాగవతశ్లోకవచనంలో 'ఆత్మనాం' అనే బహువచనప్రయోగం, జీవాత్మలు అసంఖ్యాకులని స్పష్టపరుస్తున్నది. 'ఆత్మా' అనే ఏకవచనం, ఇలా అనన్త సంఖ్యాకులైన జీవులలో ప్రవేశించి ఉండి– ఈజీవులనే శరీరాలుగా కలిగి నియమిస్తూ, తానొక్కడే ఉంటాడు అని చెబుతున్నది. కనుక, విష్ణుపురాణం 'ఏకానేక స్వరూపాయ' అన్నది. ఏకస్వరూపుడైన స్వామి, అనేక పదార్థాల్లో ప్రవేశించి అనేకస్వరూపుడు అవుతున్నాడు. ఇలా అంతర్యామిగా పరమాత్మను, నియామ్యులుగా జీవులను, నిర్దేశించడాన్నిబట్టి జీవ–బ్రహ్మలభేదమే ఇక్కడ ప్రతిపాదింప బడుతున్నదని వీరరాఘవవ్యాఖ్యాతాత్పర్యం. ఈ అభిప్రాయాన్నే ఈక్రింది వాక్యాలు చెబుతున్నాయి.

తత్ర "ఆత్మనా"మితి జీవ భేదః, "ఆత్మేతి" తేషామప్యన్తర్యామిత్వ ప్రతిపాదనేన జీవాత్మ–పరమాత్మ భేదశ్చ. "స్వదృక్" ఇతి భగవతః సగుణత్వం, **"అంతరోఽనన్తరశ్చేతి"** అంతర్బహిశ్చేతిశ్రుత్యర్థవివరణేన జగత్సత్యత్వం, ''తదిదమ్'' ఇతి సామానాధికరణ్యేన శరీరశరీరిభావప్రయుక్తం విశిష్టాద్వైతం, **"మాయయోరుధే"**తి ప్రతిపాదనేన **'సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి** శ్రుతిసూచనేన తత్ప్రకరణసిద్ధం నిఖిల విశిష్టాద్వైతతత్త్వం చ సప్రపంచ ముపాదితమిత్యను సంధేయమ్". ఈ వాక్యాల అభిప్రాయం ఇది. "ఆత్మనామ్" అనడంచేత జీవభేదం చెప్పబడుతున్నది. 'ఆత్మ' అనడంచేత ఆత్మలందరికి పరమాత్మ అంతర్యామి అని ప్రతిపాదించడం చేత, జీవాత్మ పరమాత్మలకు భేదం చెప్పబడుతున్నది. 'స్వదృక్' అనడంచేత పరమాత్మ సగుణడని తెలుస్తున్నది. 'అంతరోఽనన్తరశ్చ' అనడంచేత 'అంతర్బహిశ్చ' ఇత్యాది శ్రుతివివరణం, దానిచేత జగత్సత్యత్వం తెలుస్తున్నది. 'తదిదమ్' అని నామానాధికరణ్య నిర్దేశం (ఒకేవిభక్తికలపదాలతో జగత్తును పరమాత్మను నిర్దేశించడం) చేత శరీరశరీరి భావసంబంధమూలమైన 'విశిష్టాద్వైతం' తెలుస్తున్నది. సూక్ష్మచేతనాచేతన విశిష్టుడైన పరమాత్మ, స్థూలచేతనాచేతన విశిష్టుడై ఒక్కడేనని తెలుస్తున్న దన్నమాట. **'మాయయోరుధే'** అనడంచేత **'సోఽకామయత'** ఇత్యాది శ్రుతిసూచనం చేత ఆప్రకరణంద్వారా సిద్ధించిన విశిష్టాద్వైతతత్త్వం విస్తారంగా చెప్పబడిందని అనుసంధానంచేయాలి". అని వీరరాఘవవ్యాఖ్య.

---

**శ్రీశ్రీశ్రీత్రిదండి అహోబిలరామానుజ జీయర్ స్వామివారి చాతుర్మాస్య కార్యక్రమం.**

**వారిజ-విశాఖపట్నం. జులై 12 నుండి సెప్టెంబర్ 9 వరకు**
**శ్రీస్వామివారు రెండునెలలు చాతుర్మాస్యం నిర్వహిస్తారు.**
**ప్రతిరోజూ గురుపూజామహోత్సవాలు**

**ఉదయం - శ్రీయాగం-రామానుజ తిరుమంజనార్చనాదులు.**
**సాయంత్రం - వేరువేరు స్థలాల్లో ప్రవచనాలు.**

**వివరములకు:** శ్రీకాంత్‌స్వామి 9247217901 పి.ఎస్.ఎన్. రాజుగారు 9908333301, 9989695888, 9440106555

**నూతన గ్రంథ పరిచయం - ఆపస్తంబ కల్పసూత్రమ్**

ఈ గ్రంథం శ్రౌతపరిభాషా, ఏకాగ్నికాండం, గృహ్యసూత్రాలు, ధర్మసూత్రాలు, శుల్బసూత్రాల సముదాయంగా 30 ప్రశ్నలలో కూర్చబడిన గ్రంథరాజం. ఇది మూలం మాత్రమే. శ్రీమాన్ డా॥ నల్లందిగళ్ లక్ష్మీనరసింహాచార్యులవారు తమ అవిశ్రాన్త కృషిలో భాగంగా దీన్ని వెలువరించారు. 1-16 ప్రశ్నలు ఒక భాగంగాను, 17-30 రెండవ భాగంగాను వెలువరించారు. దీనికి తిరుపతి శ్రీవేంకటేశ్వర వేద విశ్వవిద్యాలయ పూర్వకులపతులు డా॥ ప్రొ. సన్నిధానం సుదర్శన శర్మగారు శ్రౌతసూత్ర వ్యాయ పరిచయ రూపమైన చక్కని 'అభినందనలు' తెలియపరచారు.

విశ్రాన్త సంస్కృతాచార్యులు (ఉస్మానియా యూనివర్సిటి) డా॥ ప్రొ॥ బి. నరసింహాచార్యులుగారు విపులమైన ఉపోద్ఘాతాన్ని సంతరించారు. ఈ ఉపోద్ఘాతంలో పలుసూత్రానుగతాలైన ఇష్టుల గురించిన పరిచయం విశేషంగా ఉంది. ఇలాంటి గ్రంథరాజాన్ని లోకానికి అందించిన శ్రీమాన్ నల్లందిగళ్ స్వామివారు అభివందనీయులు. రెండుభాగాలు, పుటలు సుమారు 800. మూల్యం కూడా రూ॥ 800. దీన్ని వినియోగించుకొనదలచిన జిజ్ఞాసువులు ఈ మూలగ్రంథాన్ని, గాయత్రీ ప్రచురణలు, దేవుని అల్వాల, హైదరాబాద్-10 కి వ్రాసి తెప్పించుకోనవచ్చు. ఫోన్ నెం- 9247355355, 9704168678


వ్యక్తిత్వ వికాసానికి ... నాణ్యమైన సాంకేతిక విద్యా బోధనకు
కళ్ళం హరనాథరెడ్డి ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ
KHIT Campus - 10 KM from Guntur City, NH-5
బిటెక్ కోర్సులు
కంప్యూటర్ సైన్స్ అండ్ ఇంజనీరింగ్(సియస్ఇ)
ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ (ఇఇఇ)
ఎలక్ట్రానిక్స్ అండ్ కమ్యునికేషన్స్ ఇంజనీరింగ్ (ఇసిఇ)
సివిల్ ఇంజనీరింగ్ (సిఇ)
మెకానికల్ ఇంజనీరింగ్ (ఎమ్ఇ)
M.Tech :- CSE
శ్రీ కళ్ళం హరనాథరెడ్డి
ఛైర్మన్ : కళ్ళంగ్రూప్
EAMCET Code KHIT
మేనేజ్‌మెంట్ సీట్స్ కొరకు సంప్రదించండి : సెల్: 98856 04528, 94402 61773, 94910 73337.
NH- 5.10వ కి.మీ వద్ద, కళ్ళం స్పిన్నింగ్ మిల్స్ వెనుక, చిలకలూరిపేట రోడ్, చౌడవరం, గుంటూరు- 19. ఫోన్: 0863 2119726.
సిటీ ఆఫీస్: ఫస్ట్‌లైన్, గుజ్జనగుండ్ల సర్కిల్, గుంటూరు -6. ఫోన్: 0863 2272345.

# రామభక్తి సామ్రాజ్యము

శ్రీమతి ఎ.పార్వతి
c/o ఆకెళ్ళ మణి, 825 ఓల్డ్ యార్క్ రోడ్
నూజెర్సీ, యు.ఎస్.ఎ-08876

**శ్లో॥ సాకేతే శరదిందు కుంద ధవళే సౌధే మహా మండపే,**
**పర్యస్తాగరు ధూప దీప లలితే కర్పూర దీపోజ్వలే,**
**సుగ్రీవాంగద జాంబవత్పరివృతం సౌమిత్రిణా సేవితమ్,**
**లీలామానుష విగ్రహం రఘువరం రామం భజే శ్యామలమ్ ॥**

శ్రీరాముడు నామరూప గుణాతీతుడు. రాముడేమిటో ఆయన కార్యములే తెలుపుతాయి. రామావతారములో ఆయన కార్యములలో ఆయన కేవలము సాక్షీభూతుడు మాత్రమే. ఏకార్యమూ ఆయన తనపై ఆపాదించుకోలేదు. ఆయన ఎప్పుడూ సచ్చిదానందములోనే వుండేవాడు. సర్వకాలములలోనూ ఆయన భక్తులు వున్నారు. త్యాగరాజు, తులసీదాసు, రామదాసు, రహీం మొదలైన రామభక్తులు, ఆనాడూ, ఈనాడూ వున్నారు. మా గురుదేవులు అవధూత శ్రీనరసింహయతీంద్రులు పరమరామభక్తులు. ఆయన తుదిశ్వాస వరకూ రామనామముతోనే గడపిన ధన్యజీవి. వీరందరూ రామభక్తి సామ్రాజ్యములో ఓలలాడినవారే. ఆ ఆనందము, తన్మయత అనుభవించిన వారికే తెలుస్తుంది.

ఇహ, పరములు రెండూ కోరుకునేవారికి భక్తికి మించిన మార్గము మరొకటి లేదని రాముడే స్వయముగా చెప్పాడు. మానవశరీరమును పొందుట బహుకష్టము. ఇది దేవతలకు కూడా దుర్లభమైనదని మన గ్రంథములు చెప్తున్నాయి. మానవ శరీరము సాధనకి మూలము, మోక్షానికి ద్వారము. ఈసాధనమును ఉపయోగించుకోలేనివారు ఎదురుగా విందు భోజనమున్నప్పటికీ తినలేక ఆకలితో అలమటించేవారవుతున్నారు. సూర్యోదయము నుంచి సూర్యాస్తమయమువరకూ జీవన సంఘర్షణలో పరుగులు తీసేవారికి భగవంతునికి నమస్కారము చెయ్యడానికే సమయముండదు.

మానవుడు తన మేధ, తెలివి, సమయము, జీవన ప్రగతికే వెచ్చిస్తే జీవనగతి ముగిసేటప్పటికి మిగిలేదేమిటి? అశాంతి, ఏదో పొందాలనే తపన మిగులుతాయి. సత్వ, రజస్, తమో గుణములతో కూడిన మనోబుద్ధి చిత్త అహంకారములు మానవుని సమయానుసారముగా నర్తింపచేస్తాయి. పడుతూ లేస్తూ జీవితము గడిపేస్తాడు. ఈసంఘర్షణలో జీవిత పరమార్థము మరుగున పడిపోతుంది. అనేక కర్మలు చేస్తూ జనన మరణ చక్రములో భ్రమిస్తూ వుంటాడు. మరొక జన్మ, మరొక తల్లీతండ్రీ, మరొక జీవితమూ తిరిగి మాయలో పడి జీవిస్తాడు. దీనికి అంతమెక్కడ? కాల మహిమతో వ్యక్తి ఊపిరి సలపని కార్యక్రమములలో మునిగి తేలుతూ ఉంటాడు. తెలివైన మానవుడు ఈజన్మనే సద్వినియోగం చేసుకుంటాడు. ఈభవసాగరమును భక్తి అనే నావను ఎక్కితేనే దాటగులుగుతాడు. భక్తినావ అనేకమంది భక్తులకు శ్రీరామ సాయుజ్యాన్ని ప్రసాదించింది.

ఇహమూ, పరమూ రెండూ పొందాలంటే పరమాత్మానుగ్రహము పొందాలి. పరమాత్మ అనుగ్రహము పొందడానికి భక్తికి మించిన మార్గము వేరేమీలేదు. జడమును చేతనముగానూ, చైతనమును జడముగానూ చేయగల సమర్థుడు శ్రీరామచంద్రుడు. ఆరాముడు ఎవరి హృదయంలో నివసిస్తాడో వారు ఎప్పుడూ ప్రకాశమానముగానే వుంటారు. ఆభక్తి జాజ్వల్యమానముగా వెలుగుతూ ఉన్నంతసేపూ లోభమోహములు మనస్సును తాకవు. అటువంటి భక్తునికి విషము అమృతతుల్యమౌతుంది, శత్రువు పరమమిత్రుడవుతాడు, అగ్ని మంచు అవుతుంది, జలాశయము భూమిస్థలమవుతుంది. ఎవరి మనస్సు రామభక్తి సాగరములో మునిగి తేలుతుందో వారికి లేశమాత్రమైనా దుఃఖము కలగదు. శ్రీరామచంద్రుని కృప వుంటేకానీ ఆ భక్తి అనే చింతామణి దొరకదు. వేదపురాణములనే మహానిధులలో తెలిసిన ఆ భక్తిని ఏప్రాణి వెతికి పొందుతుందో ఆ జీవి ధన్యజీవి.

శ్రీరామచంద్రుడు చందనవృక్షమైతే రామభక్తుడు వాయువువంటి వాడు. ఆభక్తుని సమస్తసాధనాఫలము రామభక్తి అవుతుంది. రామభక్తుల సాంగత్యము వలన రామభక్తి సులభముగా లభ్యమవుతుంది. శబరి మహారామభక్తురాలు. శబరి రాముని దర్శనము కోసము ఎన్నో సంవత్సరములు నిరీక్షించింది. భక్తపరాయణుడైన శ్రీరామచంద్రుడు శబరివద్దకు వచ్చాడు. తన గురువు చెప్పినమాటపై అంత విశ్వాసము. ఆ విశ్వాసమే శ్రీరామరక్షగా నిలిచింది. రాముడు ఆమెకోసం స్వయముగా వచ్చాడు. రామభక్తి ప్రాశస్త్యమునకు ఇంతకంటే నిదర్శనమేమిటి? భక్తప్రవణుడైన రాముడు శబరి ప్రేమతో ఇచ్చిన అమృతతుల్యమైన ఫలములను ఎంతో తృప్తిగా స్వీకరించాడు.

శబరి ప్రేమభక్తికి పరవశుడైన రామచంద్రుడు భక్తిప్రాశస్త్యము గురించి శబరికి ఇలాచెప్పాడు. 'తనను పొందుటకు, స్త్రీ, పురుషభేదముకానీ, జాతిభేదములుకానీ లేవు. రాముని కృపకు పాత్రులవ్వాలంటే రామభక్తి కలిగివుండాలి. అనన్యభక్తులకే రామదర్శనము లభ్యమవుతుంది. రామభక్తి, శ్రీరామచంద్రుని ప్రేమ ఏమిటో అనుభవించిన వారికి మాత్రమే వాటిరుచి తెలుస్తుంది. రామునియందు భక్తిలేనివారు యజ్ఞదానాదులచే కానీ, తపస్సుచేగానీ, వేదాధ్యనముచేగానీ మరే ఇతర కర్మలచే గానీ చూడలేరు. కేవలము భక్తిచే మాత్రమే రాముని చూడగలరు' అని రాముడే తెలియజేసారు.

**శ్రీరాముడు శబరికి తెలిపిన భక్తిసాధనములు**

1. సత్పురుషుల సాంగత్యము. ఇది మొదటిసోపానము. సత్సాంగత్యము మనస్సును సన్మార్గమువైపు మరలిస్తుంది.
2. రెండవది రామకథలను వినుట, రామకథలు రామతత్వాన్ని తెలియజేస్తాయి. వీటివలన రాముడంటే ఏమిటో అర్థమవుతుంది.

3. రామగుణగానము చేయడం. రామగుణగానము రామస్వభావమును మనస్సుకు హత్తుకునేలాచేస్తుంది.
4. శ్రీరాముని తెలియజేయు ఉపనిషద్వాక్యముల వ్యాఖ్యానము చేయడము. ఈజగమంతా రామమయము. తాను రాముని అంశే అన్న సత్యమును మహావాక్యములు నిర్ధారిస్తాయి.
5. నిర్మలమైన మనస్సుతో తన గురువును భగవంతునిగా భావించి సేవించుట. పుణ్యకార్యములనాచరించుట. యమనియములను పాటించుట అయిదవ సాధనము. తన గురువును శరీర గుర్తింపుతో గాక భగవత్స్వరూపుడుగా భావించి సేవించుట, రామానుగ్రహమును ఇస్తుంది. అహింస, దొంగతనము చేయకుండుట, బ్రహ్మచర్యము, అపరిగ్రహము,(ఎవరి వద్దనుంచీ ఏమీ స్వీకరించకపోవుట) ప్రాణాయామ, ప్రత్యాహారములు, శౌచము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరభక్తి, ధ్యానము, సమాధి.- పరమాత్మను పొందుటకు సాధనములు.
6. ఎల్లప్పుడూ రామభక్తి కలిగి ఉండుట, రామసేవానిష్ఠ పాటించుట ఆరవసాధనముగా తెలుపబడినది.
7. సాంగోపాంగ ఆరాధన సప్తమసాధనము. సాంగముగ రామ మంత్రము ఉపాసించుట.
8. రామభక్తులను సర్వదా పూజించుట, అంతర్బాహ్య సమస్తమునందూ రాముని దర్శించుట, అంతా రామమయమనుకోవడము అష్టమ సాధనము.
9. రామతత్త్వమును మహావాక్యములద్వారా విచారించుట నవమ సాధనము.

ఈ తొమ్మిదీ, శ్రీరాముడు శబరికి తెలిపిన భక్తిసాధనములు. స్త్రీ పురుషులెవరైనా ఈనవసాధనములతో రాముని సేవించితే ప్రేమతోకూడిన భక్తి జనిస్తుంది. ఎప్పుడైతే భక్తి పుడుతుందో, అప్పుడు రామతత్త్వ అనుభవము కలుగుతుంది. రామతత్త్వ అనుభవము ఈజన్మలోనే మోక్షప్రాప్తిని కలిగిస్తుంది. ఎవరికైతే మొదటి సాధనయందు ఆసక్తి, శ్రద్ధ కలుగుతుందో వారికి తక్కిన సాధనములన్నీ సిద్ధిస్తాయి అని రాముడే స్వయముగా తెలియపరచినట్లు ఆధ్యాత్మరామాయణములో చెప్పబడినది. అందువలన భక్తియే ముక్తియని నిశ్చయముగా తెలుపబడినది. కాకభుశుండి బాలరాముని దర్శనముకోసము ఇరవైఏడు కల్పములు కాక రూపములో జీవించాడు. ఆయన ఆ తన్మయానందాన్ని ఎంతో తృప్తిగా అనుభవించాడో ఆయన జీవితము తెలియజెప్తుంది.

కర్ణాటక సంగీత సామ్రాట్ త్యాగరాజు రామభక్తి అమృతాన్ని తనివితీరా సేవించాడు. రామసాన్నిధ్యాన్ని అనుభవించాక నిధి గడ్డిపరకతో సమానమని తెలుసుకున్నాడు. **"నిధి చాలా సుఖమా, రాముని సన్నిధి చాలా సుఖమా"** అన్న యథార్థాన్ని అనుభవించి మరీ తేల్చాడు. హృదయ పరితాపం అంతా తన పాటల ద్వారా తెలియపరిచాడు. **'సీతమ్మ మాయమ్మ, శ్రీరాముడు మాకుతండ్రీ - నను బ్రోవమని చెప్పవే సీతమ్మ తల్లీ-బ్రోవభారమా రఘురామా నన్ను పాలింప నడచి వచ్చితివా రామా -** మొదలైన అనేక కీర్తనలు ఆయన హృదయములోనుంచి పుట్టుకు వచ్చాయి. పరమ రామభక్తుడైన త్యాగరాజు ప్రేమ మయము అయిన రామభక్తి అనే అమృతాన్ని తృప్తిగా సేవించాడు. రాముని దర్శనమైనప్పుడు తన ఆరాధ్యదైవమైన శ్రీరాముడిని తనివితీరా దర్శించి **'ధన్యుడనైతిని రామయ్యా'** అని ఆత్మానందాన్ని వెల్లడి చేశాడు. అటువంటి భక్తునికి ఈప్రపంచములో ఏమికావాలి? రామామృతమును సేవించాక ఇక ఏమి కావాలి? నిజ భక్తునికి భగవంతుని కంటే ఆప్తులెవ్వరూ వుండరు. తన మనోభావనలన్నీ ఏదాపరికమూ లేకుండా భగవంతునికి చెప్పుకుంటాడు. సత్యసంధత భగవంతునికి ఎంతో ఇష్టము. భక్తికి ఆయన దిగివస్తాడు.

'ఒక్కసారి,'నేను నీవాడను, రామా నన్ను రక్షించు' అని శరణాగతుడైన వానిని రాముడు అరిభయంకరుడై రక్షిస్తాడు. ఇది రాముని వ్రతము. రామభక్తి సామ్రాజ్యము దొరికాక ఇంకేమి కావాలి?

**నమస్తే రామ రాజేంద్ర నమఃసీతా మనోరమ ।**
**నమస్తే చండ కోదండ నమస్తే భక్తవత్సల ॥**



**www.mangalaakshatas.com**
In commitment to help the people of spiritually inclined, we come up with the unique platform for 'Sri Vaishnava Community' to choose their life partner with an ideal mind set.
*With the Mangalasanams of*
"Sri SriSriTridandiChinnaSrimannarayanaRamanujaJeeyarSwamiji" we present you with 'mangalaakshatas' - A wedding platform for Sri Vaishnavas.
We are now open for free registrations. Please visit: **www.mangalaakshatas.com**

తిరువరంగత్తముదనార్లు అనుగ్రహించిన ప్రపన్నగాయత్రి

# ఇరామానుశనూత్తన్దాది

గత సంచిక తరువాయి

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

### 38వ పాశురము

ఆక్కి అడిమై నిలైప్పిత్తనై, ఎన్నై ఇన్ఱు అవమే
పోక్కి ప్పుఱత్తిట్టతు, ఎన్ పొరుళా మున్బు పుణ్ణియర్ తమ్
వాక్కిల్ పిరియా ఇరామానుశ, నిన్నరుళిన్ వణ్ణమ్
నోక్కిల్ తెరివరితాల్, ఉరైయా యిన్దనుణ్ పొరుళే ॥

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **ఎన్నై** | = | అహంకారిగా ఉన్న నన్ను. |
| **ఇన్ఱు** | = | ఈనాడు. |
| **ఆక్కి** | = | ఒక వస్తువుగా చేసి. |
| **అడిమై** | = | శేషత్వంలో. |
| **నిలైప్పిత్తనై** | = | నిలిపిన మీరు. |
| **మున్బు** | = | ఇంతకు ముందు. |
| **అవమే పోక్కి** | = | వ్యర్థంగా గడిపి. |
| **పుఱత్తు ఇట్టతు** | = | ఇతర విషయాలలో పడవేయడం. |
| **ఎన్ పొరుళా** | = | ఏకారణం వలన. |
| **పుణ్ణియర్ తమ్** | = | మీ దయపొందిన భాగ్యశాలుర. |
| **వాక్కిల్ పిరియా** | = | వాక్కును విడువని. |
| **ఇరామానుశ** | = | భగవద్ రామానుజ! |
| **నిన్ అరుళిన్ వణ్ణమ్** | = | మీ దయావిధానమును. |
| **నోక్కిల్** | = | చూచినట్లైతే. |
| **తెరివు అరితు** | = | తెలియడం చాలా కష్టంగా ఉంది. |
| **ఇన్ద** | = | ఈ. |
| **నుణ్ పొరుళ్** | = | సూక్ష్మమైన విషయాన్ని. |
| **ఉరైయాయ్** | = | మీరే అనుగ్రహించండి. |

**తాత్పర్యము:** ఆచార్యా! ఇన్ని రోజులు నన్ను దూరంగా ఉంచడానికీ ఈనాడు నన్ను స్వీకరించి ఉజ్జీవింపచేయడానికీ కారణం ఏమిటీ? దీనికి, మీ నిర్హేతుక కృప, మూలకారణం. నేను ఇప్పుడు చేసిన పుణ్యమేమీలేదు. ఇది నాగొప్పదనం కాదు. కేవలం మీ అకారణమైన దయ మీసన్నిధిలోనికి చేర్చింది. ఇలా కూడా ఒకదయ ఉంటుందా? మీ దయామహిమను ఎవరు తెలిసికొనగలరు? తెలిసిన మీరు చెప్తేనే మాకు అర్థమౌతుంది అంటూ ఆచార్య నిర్హేతుక కటాక్షానికి ముగ్ధులయ్యారు అముదనార్లు.

### 39వ పాశురము

పొరుళుమ్ పుతల్వరుమ్ పూమియుమ్, పుంకుజలారు మెన్ఱే
మరుళ్ కొండిళైక్కుమ్ నమక్కు నెంజే । మత్తుళార్ తరమో
ఇరుళ్ కొండ వెమ్తుయర్ మాత్తిత్తన్నీతిల్ పెరుమ్ పుకళే
తెరుళుమ్ తెరుళ్ తందు, ఇరామానుశన్ శెయ్యుమ్ శేమంగళే॥

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **పొరుళ్ ఎన్ఱుమ్** | = | 'ధనము' అని అంటూ. |
| **పుతల్వర్ ఎన్ఱుమ్** | = | 'పుత్రులు' అని అంటూ. |
| **పూమి ఎన్ఱుమ్** | = | 'భూమి' అనిఅంటూ. |
| **పూమ్‌కుజలార్ ఎన్ఱుమ్** | = | అందమైన కేశసంపదకలస్త్రీలు అనిఅంటూ. |
| **మరుళ్‌కొండు** | = | అజ్ఞానాన్నిపొంది. |
| **ఇళైక్కుమ్ నమక్కు** | = | దుఃఖపడుచున్న మనకు. |
| **ఇరుళ్‌కొండ** | = | అజ్ఞానంతో కూడిన. |
| **వెమ్ తుయర్** | = | భయంకరమైన దుఃఖాలను. |
| **మాత్తి** | = | పోగొట్టి. |
| **తమ్** | = | తమయొక్క. |
| **ఈఱు ఇల్** | = | అంతులేని. |
| **పెరుపుకళే** | = | గొప్ప కల్యాణగుణాలనే |
| **తెరుళుమ్ తెరుళ్** | = | భావించగల్గిన జ్ఞానాన్ని. |
| **తందు** | = | అనుగ్రహించి. |
| **ఇరామానుశన్** | = | భగవద్ రామానుజులు. |
| **శెయ్యుమ్ శేమంగళ్** | = | చేసే లాభాలు. |
| **నెంజే** | = | ఓ మనసా. |
| **మత్తు ఉళార్ తరమో** | = | మిగిలిన వారికి లభిస్తాయా? |

**తాత్పర్యము:** ఓ మనసా! డబ్బు, సంతానం, భూమి, స్త్రీలు ఇవే సంపదలని భ్రమించి, ఈశరీరం కోసమే శ్రమపడుతున్న మనని చూచారు రామానుజులు. అయ్యో! ఎంత అజ్ఞానంలో ఉన్నారు వీరంతా అని జాలిపడ్డారు. మన పాపాలు పోగొట్టారు. వారి దివ్యగుణాలను అనుసంధానం చేసుకొనేభాగ్యం కల్పించారు. వారు మనకు చేసిన ఇన్ని ఉపకారాలు లోకంలో వేరెవరికయినా లభిస్తాయా? మనమెంత అదృష్టవంతులం అంటూ మురిసిపోతున్నారు. అముదనార్లు.

**40వ పాశురము**

**శేమ నల్వీడుమ్, పొరుళుమ్, తరుమముమ్, శీరియనల్**

**కామము, మెన్ఱివై నాన్గెన్బర్ నాన్గినుమ్ కణ్ణనుక్కే**

**ఆమతు, కామ మఱమ్ పొరుళ్ వీడిదఱ్కెన్ఱురైత్తాన్**

**వామనన్ శీలన్, ఇరామానుశన్ ఇందమణ్ మిశైయే ॥**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **శేమమ్ నల్ వీడుమ్** | = | అందరికీ క్షేమమైన గొప్పమోక్షం, |
| **పొరుళుమ్** | = | సంపద, |
| **తరుమముమ్** | = | ధర్మం, |
| **శీరియనల్ కామయుమ్** | = | చాలాగొప్పదైన కామము అనిచెప్పే, |
| **నాన్గు ఎన్బర్** | = | ఇవి నాల్గుపురుషార్థాలు అంటారు వైదికులు, |
| **నాన్గినుమ్** | = | ఈనాల్గు పురుషార్థాలలో, |
| **కామమ్** | = | కామము, |
| **కణ్ణనుక్కే ఆమతు** | = | భగవంతుని విషయంలోనే ఉండాలి, |
| **అఱమ్** | = | ధర్మము, |
| **పొరుళ్** | = | అర్థము, |
| **వీడు** | = | మోక్షము అనే ఈమూడు, |
| **ఇదఱ్కు ఎన్ఱు** | = | ఈ కామానికే శేషభూతాలు అని, |
| **వామనన్ శీలన్** | = | వామనమూర్తియైన భగవంతునితోసాటి వారైన, |
| **ఇరామానుశన్** | = | భగవద్రామానుజులు, |
| **ఇందమణ్మిశై ఉరైత్తాన్** | = | ఈలోకంలో అనుగ్రహించారు. |

**తాత్పర్యము :** యతిరాజులు లోకులకు ఉపదేశించిన ఒక విశేషార్థాన్ని అముదనార్లు ఈపాశురంలో వివరిస్తున్నారు.

పురుషార్థాలు నాలుగు. అవి- ధర్మం, అర్థం, కామం, మోక్షం ఈనాల్గింటిలో కామము అంటే కేవలం భగవంతుని విషయంలో కోరిక మాత్రమే. అల్పవిషయాలలో చూపే కామం పురుషార్థంకాదు. మిగిలిన మూడు పురుషార్థాలు ఈభగవంతునియందు చూపే కామానికే శేషభూతాలు. కామం అంటే కోరిక తప్పక ఉండాలి. కాని అది భగవంతుని విషయంలో ఉంటేనే ముఖ్య పురుషార్థం అవుతుంది. మిగిలినవి దానికి శేషభూతంగా ఉంటాయి అని రామానుజులు ఉపదేశించారు. *(సశేషం)*




**శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్**

భగవద్రామానుజుల వైభవాన్ని తెలిపేస్తోత్రం ధాటీపంచకం. దీనిని రచించిన మహనీయులు ముదలియాన్డాన్ "దాశరథి"అని వీరిపేరు.

**మొదటిశ్లోకం -**

**పాషండ ద్రుమషండ దావదహనః చార్వాకశైలాశనిః**
**బౌద్ధధ్వాంత నిరాసవాసరపతిః జైనేభ కంఠీరవః ।**
**మాయావాది భుజంగ భంగ గరుడః, త్రైవిద్య చూడామణిః**
**శ్రీరంగేశ జయధ్వజో విజయతే రామానుజోఽయం మునిః ।**

**ప్రతిపదార్థం :-**

| | | |
|---|---|---|
| **పాషండద్రుమషండ దావదహనః** | - | పాషండమతస్థులు చెట్లు, ఆ చెట్లకు కాఱుచిచ్చులాంటివారు(రామానుజులు) |
| **చార్వాక శైల అశనిః** | - | చార్వాకులనే పర్వతాలకు వజ్రాయుధంలాంటివారు, |
| **బౌద్ధధ్వాంత** | - | బౌద్ధులు అనే చీకట్లను పోగొట్టే. |
| **వాసరపతిః** | - | సూర్యునివంటివారు, |
| **జైన ఇభ కంఠీరవః** | - | జైనులు అనే మదగజాలపాలిటి సింహం వంటివారు, |
| **మాయావాది** | - | అద్వైతులనబడే |
| **భుజంగ భంగ** | - | సర్పాలను ఓడించే |
| **గరుడః** | - | గరుడపక్షి వంటివారు, |
| **త్రైవిద్య చూడామణిః** | - | వైదికుల శిరస్సులను అలంకరించే చూడామణి వంటివారు, |
| **శ్రీరంగేశ జయధ్వజః** | - | శ్రీరంగనాథునికీర్తికి పతాకమువంటి వారు (అయిన) |
| **అయం రామానుజః మునిః** | - | శ్రీభగవద్రామానుజమునులు. |
| **విజయతే** | - | గొప్పగా ప్రకాశిస్తున్నారు. |

**తాత్పర్యం -** దావాగ్ని చెట్లని కాల్చేస్తుంది. రామానుజులనే అగ్ని పాషండులనే చెట్లని కాల్చేసింది. పర్వతాలని వజ్రాయుధం చీల్చేస్తుంది. చార్వాకులనే పర్వతాలని రామానుజులనే పిడుగుపాటు రూపుమాపింది. సింహం గజాలని చీల్చిచెండాడు తుంది. రామానుజ కంఠీరవం జైనమదగజాల్ని అణచివేసింది. గరుడపక్షి సర్పాన్ని నశింపజేస్తుంది. రామానుజ గరుడులు అద్వైత సర్పాలననగగొట్టారు. వైదికాగ్రేసరులు రామానుజులు - శ్రీరంగనాథుని కీర్తిధ్వజమే మన భగవద్రామానుజులు.



# భగవద్రామానుజ వైభవం

డా॥ మరింగంటి లక్ష్మణాచార్యస్వామి
హైదరాబాద్

**రండి..రండి..**

**రండి... రండి...**

**రండి రండి భక్తులార! రండోయ్ రండి**
**రామానుజవైభవమ్ము వినగా రండి... భగవత్**
**రామానుజ వైభవమ్ము వినగా రండి**

శేషుని అవతారమే రామానుజులు...
ఆ లక్ష్మణుని అంశ మన రామానుజులు
పుణ్యాంభోజమునకు రవి రామానుజులు - (2) మనకు
'ముక్తిపథం' అందించిన రామానుజులూ..శ్రీరామానుజులు **॥రండి, రండి॥**
కాంతిమతీ, కేశవార్య పుణ్యఫలం...
తిరువళిక్కేణి పెరుమాళ్ళ దివ్యవరం
పెరుంబుదూరు అందించిన మణిదీపం - (2)
మనకు.. ముక్తిపథం చూపించిన ఔదార్యం మహా ఔదార్యం **॥రండి,రండి॥**
యాదవ ప్రకాశం చెంత విద్యాభ్యాసం...
శ్రీ తంజమాంబతో జరిగెను కల్యాణం...
చేతనులను ఉద్ధరింప సంకల్పించీ... (2)
తాను, స్వీకరించె సన్యాసం మనభాగ్యం...మన సౌభాగ్యం...**॥రండి రండి॥**
గొల్లపైన చిందించెను కారుణ్యం
బ్రహ్మ రక్కసినే వదిలించిన వాత్సల్యం
'దాసు' కళ్ళు తెరిపించిన అనురాగం
మనకు... ముక్తిపథం చూపించిన ఔదార్యం మహా ఔదార్యం **॥రండి రండి॥**
కులం, మతం, వర్ణ వర్గ వయోభేదం చూపక,
కృపజేసెను అందరికీ తిరుమంత్రం
గురుదేవుల కోపాగ్నికి వెరవని ధైర్యం (2)
మనకు 'ముక్తిపథం' చూపించిన ఔదార్యం మహా ఔదార్యం **॥రండి రండి॥**
దాశరథి, కూరేశుల సాంగత్యంలో...
తాను సాగించెను జైత్రయాత్ర, అనితరసాధ్యం
స్థాపించెను శ్రీ విశిష్టాద్వైత మతం... (2)
పొంగించెను దేశమంత చైతన్యం వైష్ణవచైతన్యం **॥రండి రండి॥**
బ్రహ్మ సూత్ర భాష్యమ్మును రచియించీ...
భాష్యకారుడన్న ఘనతను సాధించి
'గద్యత్రయ', 'దీప', 'సార', 'సంగ్రహ' మిచ్చీ... (2)
మనకు 'ముక్తిపథం' చూపించిన ఔదార్యం మహా ఔదార్యం **॥రండి రండి॥**
ధన్యజీవి, పుణ్యజీవి, రామానుజులు...
వేంకటపతికే గురువులు రామానుజులు
కారణజన్ములు... భగవద్రామానుజులూ... (2)
మనకు 'ముక్తిపథం' చూపించిన రామానుజులు
భగవద్రామానుజులు. **॥రండి రండి॥**

**రండి రండి భక్తులార! రండోయ్ రండి**
**రామానుజ వైభవమ్ము వినగా రండి... భగవద్రామానుజ**
**వైభవమ్ము వినగా రండి.... మీరు వినగా రండి...**





# అహో! భారతమ్

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

*గత సంచిక తరువాయి*

భీమార్జున నకుల సహదేవులు తమ పరాక్రమంతో దిక్కులన్నీ జయించి అంతులేని ధన, కనక, వస్తు, వాహనాదులు తెచ్చి ధర్మరాజు పాదాల చెంత సమర్పించారు. పెద్దలంతా ధర్మరాజును చేరి రాజసూయ మహాయాగం ప్రారంభించమని ప్రోత్సహించారు. రత్నరాసులు, నిధులు మేరు పర్వతంలా దర్శనమిచ్చాయి. ఇంద్రప్రస్థం కల్పవృక్షంలా భాసించింది. ధర్మరాజు తలచుకోగానే ప్రత్యక్షమయ్యాడు శ్రీకృష్ణుడు. అపార ధన రత్నరాసుల్ని కానుకగా తెచ్చాడు. ధర్మరాజు ఎదురేగి అర్ఘ్యపాద్యాదులతో శ్రీకృష్ణుని పూజించాడు. ధౌమ్యుడు మొదలైన పెద్దలంతా ఆదరంతో స్వాగతించారు. ధర్మరాజు శ్రీకృష్ణునితో 'పద్మనాభా! ఈ విజయానికి మూలం నువ్వు. ఈ ధనాన్ని ఎలా ఎవరికి దానం చేసి ధన్యుణ్ణి కావాలో చెప్పు. దేవతలని అగ్నిముఖంగా ఎలా పూజించాలో చెప్పు. రాజసూయయాగం నా చేత చేయించి నన్ను అనుగ్రహించు' అని ప్రార్థించాడు. "ధర్మజా! భరతాన్వయ భూషణ! నీవే రాజసూయం చేయడానికి సర్వ సమర్థుడవు. లే... మేమంతా ఏయే పనులు ఎలా చెయ్యాలో ఆజ్ఞాపించు" అంటూ అండగా నిలుచున్నాడు శ్రీకృష్ణుడు. స్వామి ఆజ్ఞతో పులకించిన ధర్మరాజు సంసిద్ధుడయ్యాడు. ధౌమ్యులువారి ఆజ్ఞ ప్రకారం యాగసామాగ్రి సమకూర్చేపనిని ఎవరెవరెలా చెయ్యాలో సహదేవునికి చెప్పాడు. విడిది ఏర్పాట్లు చూడడానికి శిల్పులను నిర్దేశించాడు. పెద్దలనాహ్వానించడానికి నకులుణ్ణి స్వయంగా పంపించాడు హస్తినాపురానికి. ధృతరాష్ట్రాదులు, భీష్మాదులు బయలుదేరి వచ్చారు. వారి విశ్రాంతి భవనాలు స్వర్గ సుఖాలతో నిండాయి. ఎత్తైనసౌధాలు! ఉద్యానవనాలు! దిగుడుబావులు! మణిమయ సోపానాలు! రెండుకళ్ళుచాలవు ఆ అందాలు దర్శించడానికి.

వచ్చిన పెద్దలందరికీ ఆదరంగా ఆప్యాయంగా ఎదురేగి, నమస్కరించి, స్వాగతవచనాలు పల్కాడు. 'ఈ ధనాన్ని మీ ఇష్టానుసారం పంచండి' అంటూ పెద్దలకాబాధ్యతనప్పగించాడు. భక్ష్యభోజ్యాల పరిశీలనకు దుఃశాసనుని నియమించాడు. బ్రాహ్మణ సత్కారాది బాధ్యతలు అశ్వత్థామపై నిలిపాడు. వచ్చిన కానుకలను స్వీకరించడం, భద్రపరచడం దుర్యోధనునికి స్వయంగా అప్పగించాడు.

విదురునికి ధనవ్యయ బాధ్యతనిచ్చాడు. శ్రీకృష్ణుడు బ్రాహ్మణుల పాద ప్రక్షాళనకు స్వయంగా నడుంబిగించాడు. అది చూచి అందరూ ఆనందాశ్చర్యాలతో మునిగిపోయారు. యజ్ఞాన్ని చూడవచ్చిన దేవతల విమానాలు ఆకాశమంతా నిండిపోయాయి. అగ్నికార్యం మొదలైంది. బ్రహ్మవేత్తల ముఖాలు అగ్నికాంతులతో దేదీప్యమానంగా వెలిగిపోతున్నాయి. దానాలు ---ప్రవాహంలా సాగుతున్నాయి. బంధువులకు పెద్దరికాన్నిచ్చే సంస్కృతిని చూచి సంతృప్తి చెందారు. మహనీయులంతా యజ్ఞశాలలో ప్రవేశించిన ధర్మరాజు మరొక అగ్నిదేవుడా అన్నట్లు వెలుగొందాడు. అతనిని చూచిన వారంతా తమ జీవితాలు ధన్యమైనట్లు భావించారు.

ధౌమ్యులు ఋగ్వేద తంత్రాన్ని నిర్వహించారు. యాజ్ఞవల్క్యుడు యజుర్వేదతంత్రాన్ని నడిపించాడు. సుసాముడు సామవేద ప్రతినిధిత్వాన్ని స్వీకరించాడు. వేదవ్యాసుడు ప్రధాన ఋత్విక్కుగా బ్రహ్మగా వ్యవహరించాడు. ఎందరో సహాయ ఋత్విక్కులు, బ్రహ్మర్షులు సదస్యులయ్యారు. సంపూర్ణ దక్షిణలు వెల్లి విరిశాయి. జగన్నాథుడు యజ్ఞరక్షకుడయ్యాడు. రాజసూయం దేవతలకు తృప్తినిచ్చింది. బ్రాహ్మణులకు సంతృప్తినిచ్చింది. సమ్మానాలతో రాజులను మైమరపించింది. అన్నదానంతో తృప్తి-తృప్తి- లోకమంతా తృప్తి.

చూస్తున్నాడు నారదుడు. పాండురాజుకోరికని పుత్రులెంత ఆనందంగా భక్తిగా నిర్వహిస్తున్నారు. అనుకుంటూ శ్రీకృష్ణుని చూచి అంజలి సమర్పించాడు.

భీష్ముడు రాజసూయయాగాన్ని చూచి పులకించి పోయాడు 'ధర్మరాజా! నీ తండ్రి ధన్యుడయ్యా. ఎంత అద్భుతంగా సాగిందీ యాగం. చూడునాయనా! స్నాతకుడు, ఋత్విజుడు, సద్గురుడు, ఇష్టుడు, భూపాలుడు, జ్ఞాన సంపన్నుడు. ఈ ఆరుగురిని ఇటువంటి గొప్ప సమయాలలో పూజించాలి. కాబట్టి అటువంటి వ్యక్తికి పూజచెయ్యి తండ్రీ' అంటూ కర్తవ్యోపదేశం చేశాడు. 'ఆ వ్యక్తీ ఎవరో మీరే స్పష్టంగా తెలియచేయండి' అన్నాడు ధర్మరాజు. 'నాయనా! సత్పురుషులు సేవింపదగినవాడు, పుండరీక దళామలాయ తేక్షణుడు, శ్రీవిష్ణుస్వరూపుడు అయిన శ్రీకృష్ణుడు ఈ సభలో విరాజమానుడైయుండగా ఆలోచన ఏమిటి? యజ్ఞ పురుషుడు, సర్వలోక పూజ్యుడు, అచ్యుతుడు అయిన శ్రీకృష్ణుని పూజించు. అదే యజ్ఞానికి నిజమైన ఫలం అన్నాడు ఆనందంతో భీష్ముడు. ధర్మరాజు సహదేవునివైపు చూశాడు. పూజాసామగ్రిని చేతపట్టి ఆనందంగా నిలిచాడు సహదేవుడు. శాస్త్రోక్తంగా మహావిష్ణు స్వరూపుడైన శ్రీకృష్ణునికి అర్ఘ్యాన్నిచ్చి పూజాకార్యక్రమం నిర్వహించాడు ధర్మరాజు. భక్తితో చేసిన అర్ఘ్యప్రదానం సభను పరవశింప చేసింది. ఆత్మను పరమాత్మకు సమర్పించిన పవిత్రభావనకు అద్దంపట్టిన దృశ్యమది.

అదే దృశ్యం శిశుపాలుని మనస్సును భగ్గున మండించింది. ఆ

పూజను సహింపలేకపోయాడు శిశుపాలుడు, 'ధర్మరాజా'! పిడుగుపట్టంత శబ్దం. సభ అదిరిపోయింది. నిశ్శబ్దం తాండవించింది. 'ధర్మరాజా! ఏమిటీపని! ఈ సభలో ఇంతమంది మహారాజులు, బ్రాహ్మణోత్తములు కొలువుతీరి ఉండగా, ఈమతిలేని వృద్ధుడు భీష్ముని మాటవిని, ఆ యాదవునికి నీ పూజనందిస్తావా? ఎంత తెలివితక్కువ పనిచేశావూ? శ్రీకృష్ణుడు నీకంత కావలసినవాడు, సన్నిహితుడు అయితే ధనమియ్యి, సేవచెయ్యి, పోషించు, అంతే కాని శాస్త్రవిధిగా పూజచేస్తావా? అతనికేమి అర్హత ఉందని ఈ పనిచేశావు? వయసులో పెద్దవాడనా? ఆయన తండ్రి వసుదేవుడే ఉన్నాడే? ఋత్విజుడనా? వేదవ్యాస మహర్షి ఉన్నాడు కదా! గురువు అని పూజించావా? ద్రోణ, కృపాచార్యాదులున్నారుకదా! ఎందుకు? ఎందుకు? ఈయాదవునికి ప్రథమ పూజనం చేశావు? భీష్ముని మాటకి విలువనిచ్చి మూఢుడివయ్యావు? ఇంతమంది రాజులు నీ గొప్పదనాన్ని నమ్మివస్తే వారందరినీ అవమాన పరుస్తావా? ఇదినీకు న్యాయమా? ధర్మమా? నువ్విస్తే మాత్రం గ్రహించడానికి ఆకృష్ణునికి సిగ్గైనాలేదా? నపుంసకుడి పెళ్ళిలా, చెవిటివానిముందు పాటలా, గ్రుడ్డివానికి సౌందర్యదర్శనంలా ఉంది నువ్వుచేసిన పని. ధర్మరాజువా నువ్వు– అధర్మం చేసి ఆపేరు కూడా పాడుచేసుకున్నావు' అంటూ కోపంతో, తన పరివారంతో సభనుండి వెళ్ళిపోయాడు. ధర్మరాజు పరుగు పరుగున వెళ్ళి అతణ్ణి ఆపాడు.

'చూడు ప్రభువులు ఇలా కఠినంగా మాట్లాడవచ్చా! భీష్మాచార్యుల వారు సామాన్యులా? వారు చెప్పారు అంటే అది ధర్మమే అయి తీరుతుంది. శ్రీకృష్ణతత్త్వం భీష్ములవారికి తెలిసినట్లు ఎవ్వరికీ తెలియదు. మహనీయుల చరితలు అల్పులకు అర్థంకావులే' అంటూండగా భీష్ముడు విన్నాడు. 'ధర్మజా! ఎందుకయ్యా ఆబుద్ధిహీనుడికి అంత వివరంగా చెప్తావు. చెప్పినా వాడికర్థంకాదయ్యా' అన్నాడు. 'ఈసభలో రాజులంతా ఆశ్రీకృష్ణుని దయవలన జరాసంధునిబారినుండి రక్షింపబడినవారే, ఔనా, కాదా చెప్పు శిశుపాలా!' అన్నాడు భీష్ముడు.

జ్ఞాన పరాక్రమాలు శ్రీకృష్ణునిసొత్తు. అందువల్ల అర్ఘ్యపూజకు ఆయనే అర్హుడు. ముమ్మాటికి పూజార్హుడు. ఒక్క శ్రీకృష్ణుని పూజిస్తే ముల్లోకాలను పూజించినంత పుణ్యం వస్తుంది. యోగేశ్వరుడు శ్రీకృష్ణుడు, సర్వభూత భవోద్భవుడు శ్రీకృష్ణుడు. జగత్ ప్రభువు శ్రీకృష్ణుడు. ఈపూజకు ఆయనే అర్హుడు. ఆయన మాత్రమే అర్హుడు.

ఒక్కనిమిషం ఆగాడు భీష్ముడు. 'మేం శ్రీకృష్ణునికి అర్ఘ్యమిచ్చాం. దీనికి తిరుగులేదు. ఎవడైనా కాదంటే ఇదుగో.... వారితలమీద నాపాదం ఇలా పెట్టి అణగద్రొక్కుతా......' అంటూ సహదేవుడు పాదం పైకెత్తాడు. భయం భ్రాంతి అంతా నిండింది. *(సశేషం)*


రుచికి, సువాసనకి, ఆరోగ్యానికి నాణ్యమైన

"అజంతా"

పసుపు, కారం, ధనియాలపొడి మరియు సేమియానే ఎల్లప్పుడు వాడండి

రవికుమార్ అండ్ కంపెని - చెన్నై

044 25204046, 26171341

Vijay Ads




## శ్రీరామానుజ సహస్రాబ్ది - 2016 - 17

ప్రియ భగవద్బంధువులారా! మీరంతా ఎంతో ఉత్సాహంతో భగవద్రామానుజ విగ్రహ నిర్మాణానికి మీమీ ద్రవ్యాన్ని వినియోగింపదలచడం చాలా ముదావహం.

మీరు ద్రవ్యం బ్యాంక్ అకౌంట్‌కు జమకట్టే విషయంలో ఈక్రింది అంశాలను గమనించండి.

1. మీరు ఆంధ్రాబ్యాంక్, ముచ్చింతల్ బ్రాంచ్‌కి. 209710100000007 నెంబరుకు - ఏ ఆంధ్రాబ్యాంక్ బ్రాంచి నుంచి అయినా నేరుగా జమకట్టవచ్చు.
   జమకట్టేటప్పుడు -కౌంటర్ ఫయిల్, వర్జినల్ మీవద్ద ఉంచుకుని దాని నకలు, జతచేసి ఒక తెల్లకాగితంపై మీవివరాలు, అడ్రస్ స్పష్టంగా, ఎవరిపేరున రసీదు పంపాలో వ్రాసి మా అడ్రస్‌కు పంపండి.
2. మీరు ఆంధ్రాబ్యాంకు కాక, వేరేబ్యాంకు ద్వారా పంపదలిస్తే-
   IFSC Code ANDB - 0002097 అనే నెంబర్‌ను వినియోగించి పై ఆంధ్రాబ్యాంక్ అకౌంట్‌కే అమౌంట్‌ను పంపవచ్చును.
   వివరాలు తప్పని సరిగా మా ఆఫీస్‌కు అందాలి. అందిన తరువాతనే రసీదు పంపబడుతుంది. ఎలా పంపినా -మీరు జమచేసిన వివరాలు- కౌంటర్‌ఫైల్ నకలు, మీపేరు, ఊరు, చిరునామా వగైరా ఈక్రింది అడ్రస్సుకు పోస్టులో పంపండి.

శ్రీరామానుజ సహస్రాబ్ది, జీవా, శ్రీరామనగర్, ముచ్చింతల్(గ్రా), పాలమాకుల(పో), శంషాబాద్ (మం), రంగారెడ్డి జిల్లా -509325

శ్రీరామానుజ సహస్రాబ్ది కార్యనిర్వాహక సమితి, 9553549971, 9553549972.

Email -contact@sriramanujasahasrabdi.org



# శ్రీ మదుభయవేదాన్తాచార్యపీఠ పర్యవేక్షణలోని ఆలయాలు
# మందస
# శ్రీవాసుదేవ పెరుమాళ్ దివ్యాయతనం

నిఖిలహేయప్రత్యనీక కల్యాణగుణగణైకతానుడు, స్వాశ్రితవాత్సల్య జలధి అయిన శ్రియఃపతి శ్రీమన్నారాయణుడు **"పరవాసుదేవమూర్తి"**గా దేవీ సహితుడై అర్చావైభవంతో ఆరాధనలందుకొనే ప్రశస్తోత్తరాంధ్ర భవ్యభూమి, శ్రీకాకుళ మండలాన్తర్గమైన **మందస**".



శ్రీ ప్రమోద సంవత్సర మార్గశీర్ష కృష్ణద్వాదశి వృశ్చికలగ్నంలో, బుధవారంనాడు క్రీ.శ. 1744 ఎ.డి. శ్రీచంద్రవంశానుగత 'మంజూష' నృపవంశ మూర్ధన్యుడైన శ్రీహరిహర రాజమణిచేత దివ్యమందిరనిర్మాణ పురస్సరంగా అప్రతిహతంగా అర్చనలందుకున్న శ్రీవాసుదేవస్వామి, కాలక్రమంగా ఏర్పడిన దుర్భరస్థితులవల్ల నిత్యార్చనకు ధూపదీపనైవేద్యాలకు నోచుకోని పరిస్థితి ఏర్పడింది. దైవప్రతిష్ఠనొనర్చిన రాజుల, అనువంశిక ధర్మకర్తల, ధర్మకర్తృత్వంలో ఆంధ్రప్రదేశ్ దేవాదాయ ధర్మాదాయశాఖవారి ఆధ్వర్యవంలో నిర్వహింపబడుతూ వచ్చిన ఈ మందిరం, మాన్యాలు పోయి, ఆర్థికపుష్టి కొరవడి, పూర్వవైభవాన్ని కోలుపోయి, శిథిలమైంది. క్రీ.శ. 1988 నవంబర్ నెలలో విశ్వశాంతి వేదపాదయాత్రను శ్రీకాకుళంలోచేస్తూ **'మందస'** వేంచేసినపుడు ఈ ఆలయదుఃస్థితిని గమనించి పునరుద్ధరించాలని సంకల్పించారు శ్రీమత్పరమహంస పరివ్రాజకులు, శ్రీమదుభయవేదాన్తాచార్య పీఠాధిపతులు, **శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారు.** ఆంధ్రప్రదేశ్ దేవాదాయధర్మాదాయశాఖకు వ్రాసి వారి ఆమోదంతో "దేవాదాయ ధర్మాదాయశాఖవారి ఉత్తర్వులు **(D.Dis No.B3/1751/98 Dt 7-7-2000) Rc No : A1/417/98 Dt. 22.06.2000"** ప్రకారము వారినుండి శిథిలమందిర యాజమాన్యాన్ని స్వాధీనపరుచుకున్నారు స్వామివారు. రాజాం పట్టణనివాసి, శ్రీవారి అంతేవాసి అయిన శ్రీమాన్ పి.బి. విశాల్‌గుప్తగారి పర్యవేక్షణలో మందిర పునరుద్ధరణసమితి ఏర్పరిచి శ్రీమాన్ రఘునాథమహాపాత్రో-భువనేశ్వర్‌స్థపతి ద్వారా, దాదాపు అరవైలక్షల రూపాయలవ్యయంతో ఈ ఆలయాన్ని పునర్నిర్మించారు.

శిథిల మందిర పునర్నిర్మాణము ది. 13-11-2003న ప్రారంభం అయినది. గర్భాలయ, ధ్వజస్తంభ, ముఖమండపాది నిర్మాణాలు ప్రాచీన వైభవాన్ని స్మరింపజేసేలా అవసరమైన స్థలాల్లో నూతనశిలలను చేరుస్తూ నిర్మాణం యథాతథంగా జరిగింది.

**(పాత ఆలయంలోని శిల్పసంపదకు ఎలాంటి నష్టం కలగకుండా, ఆ శిల్పసౌందర్యాన్ని యథాతథంగా భద్రపరచారు. ఆలయకుడ్యాలపై వీటిని గమనించండి)**












<u>ఆలయకుడ్యాలపై ఉన్న శిల్పాల సౌందర్యం</u>

పునర్నిర్మాణ సమయంలో లభించిన అరబ్‌భాష కల నాణెములు- 457, తామ్రపత్రాలు ఒకటి రెండు చిన్నచిన్న సువర్ణాభరణాలు వగైరా తాత్కాలికంగా స్థానిక ప్రభుత్వాధికారివద్ద భద్రపరచి తిరిగి యథాపూర్వంగా నిర్మాణం జరిగిన తరువాత యథాతథంగా పునఃప్రతిష్ఠితం చేయబడ్డాయి. **ఈ మందిరపునరుద్ధరణం శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు, వేదమార్గప్రతిష్ఠాపనాచార్యులు, కీర్తిమూర్తులు అయిన శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణరామానుజజీయర్ (పెద్దజీయర్) స్వామివారికి, వారి సహాధ్యాయులు హృదయనిర్విశేషులు న్యాయవేదాన్తవిద్వాంసులు అయిన ఉ.వే.తె.కం. గోపాలాచార్యస్వామివారికి సేవాకైంకర్యముగా అర్పింపబడినది.**

శ్రీచిన్నజీయర్‌స్వామివారి ఆచార్యులయిన అప్పట్లో పూర్వాశ్రమంలో నున్న శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారు, వారి అంతరంగికులైన శ్రీ. తె.కం. గోపాలాచార్యస్వామివారు శ్రీభాష్యాన్ని అధ్యయనం చేయడానికి 'మందస' వేంచేసిరి. వారికి ఒక స్వప్నము కలిగినది. గోదావరిసేతువుపై తాము సాగుతుండగా మధ్యలోతాము ఉన్నప్పుడు ముందుభాగమంతా భగ్నమైనట్లు కనిపించింది. మేల్కొనిన ఈ యువకులు ఇరువురు కలతచెంది శ్రీమాన్ తె.కం. రామానుజాచార్యస్వామివారివద్దకు వెళ్ళి **"శ్రీభాష్యమనే మహానదిని అధికరింపవచ్చిన తమ అధ్యయనం మధ్యలోనే భగ్నమగునో అని భయము కలుగుతున్నది"** అంటూ తమ కలతను నివేదించారు. వారిరువురను వాసుదేవస్వామి ఆలయమునకు తీసుకువెళ్ళి స్వామి ముందర సాష్టాంగ దండప్రణామం చేయించి తామును చేసి, లేచి భగవంతునితో **"ఈ ఇరువురు యువకులు శ్రీభాష్యాధ్యయనమునకై వచ్చినారు. నీ సత్సంప్రదాయమునకు వీరిరువురు ఉత్తమప్రవర్తకాచార్యులు కాగలరు. వీరి అధ్యయనము నిరాటంకముగా కొనసాగించు బాధ్యత నీదియే"** అని వీరిచే మరల దాసోహము చేయించిరి. ఏడాది జరుగవలసిన అధ్యయనము 6,7 నెలలోనే చక్కగా ముగిసినది. ఉ.వే. శ్రీమాన్ (మందస) రామానుజాచార్యస్వామి వారికి ఆశ్రయమిచ్చి, ఆదరించిన మాన్యప్రభువుల కీర్తి చిరప్రతిష్ఠితం కావాలని, వారికి ఆరాధ్యదైవమైన శ్రీవాసుదేవ పెరుమాళ్ తన కృపార్ద్రదృష్టులను అందరిపై ప్రసరింపజేయాలని శ్రీచిన్నజీయర్‌స్వామివారు జరిపించిన ఈ కైంకర్యము, వారి ఆచార్యులకు ఆచార్యుడైన మందసస్వామివారికి అత్యంతప్రీతకరం కావాలని ఆశిస్తూ- స్వస్తిశ్రీ వ్యవహారిక చాంద్రమాన శ్రీమత్ పార్థివనామ సంవత్సర జ్యేష్ఠబహుళపంచమి ఆదివారం ది. 26-6-2005న ఉ॥గం.10.35ని॥కు ధనిష్ఠా నక్షత్రయుక్త సింహలగ్న శుభముహూర్తమున తామ్రశాసనాన్ని ఆచార్యపీఠం ప్రతిష్ఠించినది. దీన్ని మనమంతా దర్శిద్దాం ఆలయవైభవాన్ని లోకానికి చాటుదాం. *(సశేషం)*

*దీని ఉత్సవాదివైభవాన్ని పై సంచికలో గమనించుదాం!*

**(ఈఆలయాన్ని దర్శించగోరేవారు విశాఖ-హౌరా రైలుమార్గంలో పలాసవద్ద దిగి బస్సులో వెళ్ళవచ్చును, లేదా మందస రోడ్డులో కూడా దిగి వెళ్ళవచ్చును.)**









**ఆలయకుడ్యాలపై సుందరశిల్పాలు (దశావతారాలు)**

# శ్రీవేంకటాచల "చిత్రే"తిహాసమాల

## 13



వ్యూహలక్ష్మీ అమ్మవారికి శుక్రవార అభిషేకం

స్వామివారికి శుక్రవారాభిషేకం చేసిన రోజుననే స్వామివారి కంఠమాలికలో వేంచేసి ఉన్న ద్విభుజవ్యూహలక్ష్మీదేవీ రూపిణి అయిన పద్మావతీ అమ్మవారికి అభిషేకం జరుగుతుంది. స్వామివారికి సర్వసంపత్సమృద్ధులు కలగాలని శుక్రవారం, ఉత్తరఫల్గుణీ నక్షత్రంతో కూడిన శుక్లపక్షద్వాదశినాడు, రత్నమాలికా యోగంలో సువర్ణకంఠాభరణంలో లక్ష్మీదేవిని ప్రతిష్ఠితం చేయించారు రామానుజులు. దానికి ప్రమాణం- వారాహపురాణంలో ఉంది.

**ద్విభుజా వ్యూహలక్ష్మీఃస్యాత్ బద్ధపద్మాసనప్రియా ।**
**శ్రీనివాసాంగమధ్యస్థా సుతరాం కేశవప్రియా ॥**

భవిష్యోత్తరంలో **పద్మావతీం విశాలాక్షీం భగవాన్ ఆత్మవక్షసి** అని విశాలాక్షి అయిన పద్మావతిని స్వామితన వక్షఃస్థలమున ధరించాడని చెప్పబడింది. రెండు భుజాలను ధరించిన వ్యూహలక్ష్మీ అమ్మవారు పద్మాసనంపై కూర్చొని ఉండగా స్వామి, ఆమెను వక్షఃస్థలాన కూర్చొనబెట్టుకున్నాడని వారాహపురాణం చెబుతోంది.

**సహలక్ష్మ్యా అభిషేకస్తు వాసరే భార్గవే హరే ।**

లక్ష్మీదేవితోపాటుగా శుక్రవారంనాడు స్వామికి అభిషేకం చేయాలనే నియమం ఏర్పరచడంవల్ల, స్వామికంఠమాలికలో ఉన్న ద్విభుజవ్యూహలక్ష్మికి విడిగా శుక్రవారంనాడు అభిషేకం జరుపుతారు. ఇలా జరిపేటప్పుడు స్వామి విరహం అమ్మకు, ఈమె విరహం ఆయనకు కలుగుతుంది కనుక, ఆ విరహతాపాన్ని తీర్చేలా గోదాదేవి అనుగ్రహించిన "నాచ్చియార్ తిరుమొళి" దివ్యప్రబంధాన్ని స్వాములు అనుసంధానం చేస్తారు.

## స్వామి లలాటంపై ఎలాంటి పుండ్రం ఉండాలి?

స్వామి నుదుటిపై ఊర్ధ్వపుండ్రం ఎలా ఉండాలో శాస్త్రం చెప్పింది పాద్మపురాణంలో.

**అష్టమీందుకళాకార లలాటస్థోర్ధ్వ పుండ్రకః ।**

అని చెప్పబడటంవల్ల అష్టమినాటిచంద్రవంక లాగా లలాటం మీద ఊర్ధ్వపుండ్రం ఉండాలని చెప్పబడటం వల్ల, అలా చంద్రవంకలా ఉండే బొట్టు స్త్రీ సహజం కనుక, ఈ మూర్తి స్త్రీమూర్తియే అని కొందరు వాదించారు. దానికి రామానుజులు, స్వామి, మోహినీ అవతారం ధరించినప్పుడు అర్ధచంద్రాకృతిగల బొట్టును ధరించాడు. కనుక, "అర్ధచంద్రాకృతిః స్త్రీణాం ధార్యం పుండ్రం భ్రువోరధః" అని చెప్పబడ్డట్టు, స్త్రీలకు కనుబొమ్మల క్రింద లలాటంపై అర్ధచంద్రాకృతిని ధరించడం ఉండాలని శాస్త్రనిర్ణయం. ఒకప్పుడు శుక్రవారాభిషేకసమయంలో స్వామి ధరించిన పుండ్రరేఖలు అభిషేకజలంచేతచెరిగి, కనుబొమ్మలనడుమ నాసికపైమాత్రమే తిరుమణి మిగిలి, దానిపై పొడవుగా శ్రీచూర్ణరేఖసుందరంగా భాసించింది. ఆ మిగిలిన పుండ్రం





'అష్టమీందు కళలా ఉంది. కనుక, అలానే స్వామికి సోమవారం మూడురోజులు పుండ్రధారణం చేయించాలని రామానుజులు నియమనంచేశారు.

గురువారం వజ్రాలు పొదిగిన, శ్రీచూర్ణంతో పుండ్రం శుక్రవారాభిషేకం అయిన తరువాత 'నాసికామూలమారభ్య' అని చెప్పబడ్డట్టు ఉండాలని నిర్ణయించారు. వెడల్పాటి రెండు ఊర్ధ్వరేఖలతో నాసికామూలాన సపాదంగా, మధ్య శ్రీచూర్ణరేఖతో ఊర్ధ్వపుండ్రము ను ధరింపజేయాలని రామానుజులు నియమించారని వేంకటాచలేతిహాసమాల చెప్పింది. ప్రస్తుతం ఉన్నట్లు పాదవిహీనమైన పుండ్రం బ్రిటీష్‌వారి పాలనలో కోర్టు ఆదేశాన్ని బట్టి ఏర్పడిందని, ప్రాచీనకాలంలో ఇది ఇలా లేదని సాంప్రదాయికులంటారు. భారద్వాజసంహిత, పరాశరసంహిత, వైఖానసాగమసంహితలు సపాదోర్ధ్వపుండ్రాన్నే సమర్థిస్తాయని రామానుజులు నిరూపించారు.



చిత్రకథ- 32

# రామానుజ చిత్రకథ


















నా గురువులు నేర్పినది అలా లేదుకదా...!


అప్పట్లో వారికి అంతే తోచివుండొచ్చు.
సందర్భానికి తగిన తద్వ్యాక్యము స్వీకరించడం
పండితుడి లక్షణం కదూ...!మొండితనం మూర్ఖత కదా!


రామానుజుని వ్యాక్యలు నన్ను చాలా అలోచింప చేసేవి.
వాటిని కాదనలేకపోయాను.అంగీకరించడానికి 'అహం'
అడ్డొచ్చింది. అది అసూయగా మారింది.


బ్రాహ్మణ్యానికే మచ్చగా 'బ్రహ్మహత్య'కీ పాల్పడ్డా.
ఏదో దైవం దయచూపి ఆ దోషంనుంచి నన్ను దూరం
చేసింది. ఒకరకంగా నేను దోషినే!


నాకు ఎంతో ప్రీతిపాత్రుడు. నన్ను ఎంతో ప్రీతితో సేవించాడు.
శాశ్వతంగా అతన్ని దూరం చేసుకున్నా.
ఇప్పుడేమో 'ఉత్తమాశ్రమి' అయిపోయాడు.


రామానుజుని జ్ఞానం స్వచ్ఛమైనది.
అతని మనస్సు వెన్నలాంటిది.


అవునమ్మా! లేకపోతే వేదవాక్యాలకి
అంత గంభీరమైన వివరణ తోచదు.


నాయనా! నీవు నొచ్చుకోనంటే నాదో సలహా!


నా హితాన్ని, ప్రియాన్ని కోరిన తల్లివి.
సలహా ఏమిటమ్మా? నీమాట సదా ఆజ్ఞ. చెప్పమ్మా!


రామానుజులమీద పెంచుకున్న కోపాన్ని తగ్గించుకో.
'ఉత్తమాశ్రమాన్ని' స్వీకరించినవారు సదా పూజ్యులుకదా!
నీవాతన్ని ఆశ్రయించడం మంచిదని నాభావన!


ఇన్ని రకాలుగా ఆతన్ని హింసించిన నన్ను ఆదరిస్తాడా?


నాయనా! ఈమధ్యనే నేను వెళ్ళి వచ్చా.
ఎంత ప్రేమగా ఆదరించాడో! నీ కుశలం కూడా అడిగాడు.


అందరూ అంటూ ఉంటే విన్నా.
ఇత'నాదిశేషుని' అంశ అని.




కాంచీపూర్ణుల వంటి వృద్ధులూ జ్ఞానులూ
కూడా రామానుజుణ్ణి 'మహాత్ముడ'ని కీర్తిస్తున్నారు.


అదటుంచి, నేనే వెళ్ళాను ఈమధ్యనే. ఎంత బాగా తత్త్వాన్ని బోధిస్తున్నాడో!
ఇంకా ఉంది...

*With Best Compliments from*








# KAKATIYA CEMENT

## Quality Always - Ahead

**53 Grade Cement &**
**White Crystal Sugar**

**Sri P. VENKATESWARLU**
Chairman & Managing Director

# KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED

*Regd. Office :* 1-10-140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
✆:27637717, 27633627, Fax No : 040 - 27630172, E-mail : kcsil@sol.net.in
E-mail: info@kakatiyacements.com

*Cement Factory :*
Srinivasanagar, Jaggaiahpet,
Krishna Dist - 521 175
✆ 08654 - 200014
Fax No: 08654-296331

*Sugar Factory :*
Peruvancha Village, Kallur Mandal,
Khammam Dist - 507 209,
✆: 08761 - 287207
Fax No: 08761 - 287206

# మన ఆళ్వార్లు



- శ్రీనృసింహ-

*గత సంచిక తరువాయి....*

**సంబంధులనే** గురువుగారు చాలా ప్రసిద్ధులు. ఆయన శిష్యులు తమ గురుదేవుల కంటే ఎవ్వరూ గొప్పవారు కారని యుద్ధానికి వచ్చారు. అయితే మీ ఆచార్యులతోనే వాదిస్తా, రమ్మనండి అన్నారు **పరకాలురు.** శిష్యులు పరుగు పెట్టుకుంటూ వెళ్ళి తమ గురువుకి విషయం వివరించారు. **సంబంధి** అనే ఆ గురువు వెంటనే వాదానికి సంసిద్ధులయ్యారు. **తిరుమంగై ఆళ్వార్లు** ఒక్కసారి భగవంతునికి నమస్కరించి వద్దామంటే ఆ ఊరిలో ఒక్క ఆలయమైనా లేదు. ఇదెక్కడి వింత అనుకుంటూంటే ఒక వైష్ణవ భక్తురాలు కనిపించింది. అమ్మా! నేను ఆరాధించుకోడానికి ఇక్కడ భగవంతుని విగ్రహమేదైనా లభిస్తుందా అని అడిగారు. వెంటనే ఆవిడ బాలగోపాల విగ్రహాన్ని ఒకదాన్ని ఇంటినుంచి తెచ్చి ఇచ్చింది. స్వామీ! ఈయనపేరు 'శిందనైక్కినియాన్' ధ్యానానికి తగినమూర్తి గ్రహించండి అంది. వెంటనే ఆ బాలగోపాలుని విగ్రహాన్ని స్వీకరించి దాసోహం సమర్పించారు కలివైరి. నేను వాదానికి సిద్ధమే అన్నారు. **సంబంధికవి** ఒక చిత్రమైన ప్రశ్నవేసి కవిత్వం చెప్పమని అడిగారు. అదేమిటంటే ఆయన తన చేతివ్రేళ్ళు తెరిచి ఒకటి, రెండు, మూడు....రెండు, ఒకటి అనే సంఖ్యల్ని చూపించారు. అంటే ముందుగా ఒకటి, తరువాత రెండు, తరువాత మూడు... ఇలా అయ్యాక ఒకవేలు మడచి రెండు, మళ్లీ ఒకటి... ఇలా సంఖ్యల్ని చూపిస్తూ, కవిత్వం చెప్పండి ఇలా... అన్నారు.

ఓహో... ఒకటి, రెండు, మూడు దాకా వెళ్ళాలా, మళ్ళీ వెనక్కి రెండు, ఒకటిగా చెప్పాలా... సరే అన్నారు **పరకాలురు.** వెంటనే పాశురం చెప్పారిలా.

**పాశురం- ఒరు కుఱళాయ్ యిరునిలమ్ మూవడిమణ్‌వేణ్డి**
**యులగనైత్తు మీరడియాలొడుక్కి ఒన్రుమ్**
**తరుగవె నామావలియై చ్చిఱైయిల్ వైత్త**
**తాదాళన్ తాళణై వీర్, తక్కకీర్తి**
**యరు మఱైయిన్ తిరళ్ నాన్గుమ్, వేళ్వియైన్దుమ్,**
**అఙ్గఙ్గళవై యాఱు, మిశైగళేజుమ్,**
**తెరువిల్ మలి విజా,వళముమ్ శిఱక్కుమ్, కాఙి**
**చ్చీరామ విణ్ణగరే శేర్మినీరే (పెరియ తిరుమొజి - 3-4-1)**

ఈ పాశురంలో ఒకటి, రెండు, మూడు, రెండు, ఒకటి ఎలా వర్ణించారో చూస్తే ఆశ్చర్యానందాలు ముంచెత్తుతాయి.

అద్వితీయమైన వామనవేషం (ఒకటి) ధరించాడు స్వామి, లోకాలు రెండూ కొలిచాడు. మూడు అడుగుల నేలకదా యాచించాడు. రెండడుగులు అయ్యాయి. ఒక అడుగు ఎక్కడ అని ప్రశ్నించి బలి తలపై మోపాడు అని ఆయన వ్రేళ్ళని అనుసరించి కవిత్వం చెప్పారు. అంతటితో ఆగక, నాల్గువేదాలు, పంచమహాయజ్ఞాలు, ఆరు అంగాలు, సప్తస్వరాలు, గ్రామోత్సవాలు, వీటితో అలరారే శ్రీరామ విణ్ణగరమును ఆశ్రయించండి అంటూ సప్తసంఖ్య పర్యంతం కవితను ప్రసాదించి, ఆసేవలనందుకునే స్వామిని ఆశ్రయించమని చక్కని ఉపదేశాన్ని కూడా ఆ కవితకు జోడించి తమ కవితాశక్తిని గుబాళింపజేశారు.

**సంబంధికవి** ఆనందంతో ఉప్పొంగిపోయారు. అప్పటికప్పుడు తాము నిర్దేశించిన అంశాన్ని భగవత్ పరంగా కవితా రూపంగా అందించడమే గాక దానికి ఆలంకారిక పౌష్ట్యాన్ని చేకూర్చి అద్భుతకవితాశక్తిని ప్రదర్శించారే! ఓహో! నిజంగా **'చతుష్కవి శిఖామణి'** అనే బిరుదు మీకుమాత్రమే సరిపోతుంది. ఇతరులకు చాలదంటూ పాదాభివందనం చేశారు. మరిశిష్యుల మాట చెప్పేదేముందీ! అలా సాగింది విజయయాత్ర.

పరకాలుర మనసంతా శ్రీరంగరాజ విమాన ప్రాకారాదినిర్మాణం చుట్టూ పరిభ్రమిస్తోంది. ఎంతో ధనం కావాలి. ఎలా?ఎలా? నాగ పట్టణంలో బంగారు విగ్రహమొకటుందట. అయితే ఆబంగారం సంపాదించి అమ్మేస్తే శ్రీరంగనాథుని ఆలయ ప్రాకారాదులు సులభంగా అయిపోతాయి. ఆలోచనరావడమాలస్యం బయలుదేరారు.

అది నాగపట్టణం. అక్కడొక బౌద్ధాలయం. అందులో బంగారు విగ్రహం. ఎలా దాన్ని తేవడం? ముందు సారపుష్కరిణీ తీరంలో సుందర అరణ్యంలో ఉన్న సుందరరాజ స్వామినిచేరి నమస్కరించి, బౌద్ధాలయానికి బయలుదేరారు. అమ్మో! ఆలయం ఎంత ఎత్తుగా ఉందో. ఎంత నున్నగా ఉందో. లోపలికి చేరడమెలా? అబ్బే.. దారే కనిపించలేదు. ఊళ్ళోకి వచ్చి అందరినీ ఆరా తీశారు. ఆ ఆలయాన్ని నిర్మించిన శిల్పి వేపాణం అనే ద్వీపంలో ఉంటాడని ఆయన చాలా అద్భుతంగా, చాతుర్యంగా, నిర్మాణ రహస్యయుక్తంగా దానిని నిర్మించాడని ప్రజల మాటల్లో తెలుసుకున్నారు.

అయితే ఆ శిల్పి ద్వారానే విషయం తెలుసుకోవాలి. కాని అదంత తేలికకాదే, ఏమైనా సరే సాధించాలి. అనుకుంటూ ఆ శిల్పి దగ్గర చేరారు. ఎన్నో విశేషకథలు చెప్పి అతణ్ణి మరిపించారు. కొంత పరిచయమయ్యాక మాటల సందర్భములో- నాగపట్టణం ఆలయంలో దొంగలువడి

స్వర్ణప్రతిమను ఎత్తుకుపోయారట కదా! జనమంతా చెప్పుకుంటున్నారు అన్నారు. పిడుగుపడ్డట్టు అదిరిపడి అరిచి ముక్కున వ్రేలేసుకున్నాడా శిల్పి. ఆ! అంత సమర్థుడైన దొంగ ఉన్నాడా ఈ లోకంలో? అన్నాడు. పరకాలురు నవ్వి, దానికంత ఆశ్చర్యపోయేదేముంది? దొంగకి ఆ మాత్రం నేర్పు ఉండదా ఏమిటి? అన్నాడు. లేదు... ఉండదు... ఆ ఆలయంలో ప్రవేశించడం ఎవ్వరికీ సాధ్యంకాదు. ఎందుకంటే ఆ నిర్మాణాన్ని చేపట్టినవాడిని నేనే. ఆ దేవాలయ శిఖరం చేరేలాగా ఒక బిలద్వారాన్ని ఏర్పరచాను. అందులో ప్రవేశించడం మాటలుకాదు.

ఒక చక్రం ముందుకి వెనక్కి.. అటుఇటూ తిరిగేలా ఆ ద్వారానికి మధ్యలో పెట్టాను. విమానశిఖరం దగ్గరనుండి ఒక గొలుసు ఎవ్వరికీ తెలియకుండా, కన్పించకుండా ఉండేలా క్రిందికి విడిచాను. ఆ కొసని తిరుమంజన తీర్థం పోయే గోముఖం క్రింద చీలకు తగిలించాను. ఇటు ఏడుసార్లు, అటు ఏడుసార్లు త్రిప్పితే తప్ప అది ఊడదు. ఎవడైనా చక్రం దాకాపోయాడో ఆ చక్రాలు ముక్కలు ముక్కలుగా నరికేస్తాయి వాడి శరీరాన్ని. అరటిమట్ట ఆ చక్రాలపై ముందుగా వేస్తే ఆ దూట ముక్కలు ముక్కలై- అందులో నార చక్రాలకి చుట్టుకొని అవి తిరగడం ఆగుతుంది. ఈ విషయాలెవ్వరికీ తెలియవు. ఆ దొంగ... ఎంత గొప్పవాడు... ఎలా తెలుసుకున్నాడు? అసలెలా ఇది సాధ్యమయింది.. అంటూ ఆవేదనతో రహస్యాన్ని కాస్తా బయటపెట్టాడు శిల్పి. ఓహో! ఇదా రహస్యం అంటూ బయలుదేరారు కలివైరి. *(సశేషం)*

### ప్రియమైన భక్తినివేదన పాఠకులకు - విశేషసూచన

మన భక్తినివేదనను బహుకాలంగా ఆదరిస్తున్న మీకు మా ధన్యవాదాలు. శీర్షికల విషయంలోకాని, వ్యాసాల విషయంలో కాని, భాష విషయంలోకాని, సంపాదకీయం విషయంలోకాని, లెటర్ ఫాంటు విషయంలో గాని పాఠకులు తమ అభిప్రాయాలను నిర్ద్వంద్వంగా వెలిబుచ్చవచ్చును. వాటిని తప్పక స్వాగతిస్తున్నాం. సాధ్యమైనంతమేర తప్పక మార్పులు చేర్పులు చేసికుంటూ, పాఠకులకు తగినంత సమాచారాన్ని అందించే ప్రయత్నం చేస్తున్నాం, చేస్తాం. మీరు వ్రాసే లేఖలేవైనా ఈక్రింది చిరునామాకే వ్రాస్తే ఆలస్యం కాకుండా మాకే అందుతాయి.

రచయితలు కూడా ఈక్రింది అడ్రస్సుకే వ్రాయండి. ముఖ్యంగా సంపాదకునికి వివిధ విషయాలపై మీఅభిప్రాయాలను వ్రాసేటప్పుడు తప్పనిసరిగా మీ పూర్తిచిరునామా, ఫోనునెంబరు ఇస్తే వెంటనే మీతో సంప్రదించే అవకాశం ఉంటుంది. ఇటీవల భాషవిషయంలో తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చిన ఒకపాఠకులు తమ చిరునామా వ్రాయలేదు. చిరునామా లేని లేఖలను పత్రిక పరిగణించదని గమనించగలరు. మీ సహకారానికి ధన్యవాదాలు **- సంపాదకుడు.**

**చిరునామా -** సంపాదకుడు, భక్తినివేదన, శ్రీరామనగర్, ముచ్చింతల్, పాలమాకుల(పో), 509325 రంగారెడ్డి జిల్లా, తెలంగాణా.

## "ధన్యజీవనులు శ్రీమాన్ భాస్కర్‌రావుగారు"



**పరదుఃఖాపనోదాయ భగవత్ప్రీతయే సదా।**
**యేచాత్మనో యాపయన్తి జీవనం ధన్యజీవనాః ॥**

ఎవ్వరు ఇతరుల దుఃఖాన్ని పోగొట్టడానికి, భగవత్ప్రీతికొరకు తమ జీవితాన్ని ధార్మికంగా గడుపుతారో వారు ధన్యజీవనులు.

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ పెద్దజీయర్ స్వామి, శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివార్ల శిష్యులు శ్రీమాన్ జోగినపల్లి భాస్కరరావుగారు, వీరు **02-06-1940** నాడు కరీంనగరమున జన్మించారు.

వీరి కుటుంబమంతా కూడా సమాశ్రయణముల్లై మన స్వామివారు చేసే కార్యక్రమాలతో ఆధ్యాత్మికంగా, సామాజికంగా కూడా చక్కటి అనుబంధాన్ని కలిగియున్నవారు. హైదరాబాద్ నగరశివార్లలో మొయినాబాద్ సమీపమున జె.బి.ఇనిస్టిట్యూషన్స్ స్థాపించి వైద్యరంగమున విద్యార్థులకు చక్కటి విద్యాసదుపాయమును, ఆసుపత్రులని స్థాపించి, విద్వల్లోకానికి ఎనలేని సేవలనందించారు.

ముఖ్యముగా వీరు 1988వ సంవత్సరమున ఆంధ్రరాష్ట్రమున వర్షాభావసమస్యతో జనులు తల్లడిల్లుతున్న సమయములో భాగ్యనగరమున, శ్రీ చిన్నజీయర్‌స్వామివారి పర్యవేక్షణలో భాస్కరాప్యాలెస్ ఆవరణలో జూలైమాసంలో 5రోజులుపాటు 'మహావరుణయాగం' విశేషంగా జరిపించారు. తరువాత రాష్ట్రమున చక్కటివర్షాలతో సమృద్ధికలిగినది. వీరి ప్రోత్సాహంతో వీరి ధర్మపత్ని శ్రీమతి వసుమతిగారు మన కార్యక్రమాలకు చేస్తున్న సేవ సర్వతోముఖమైనది, బహుప్రశంసింపదగినది.

ఇవేకాక, శ్రీస్వామివారు చేస్తున్న అనేకసామాజిక కార్యక్రమాల్లో నిర్విరామంగా సేవలనందిస్తున్న శ్రీమాన్ భాస్కరరావుగారు **17-06-2014** నాడు పరమపదించారు. భక్తినివేదన వీరికి స్మృత్యంజలులు ఘటిస్తున్నది.

శ్రీశ్రీశ్రీ స్వామివారు వీరు దేహంచాలించినందుకు తమ సానుతాపాన్ని ప్రకటించారు. వీరికి పరమపదంలో శాశ్వతకైంకర్యం లభించాలని శ్రీస్వామి వారు మంగళాశాసనం చేసారు.

**శ్రీమతే రామానుజాయ నమః**

# శ్రీహరి క్షమాగుణ వైభవము

**శ్రీమాన్ సముద్రాల శఠకోపాచార్యస్వామి-వరంగల్**

*గత సంచిక తరువాయి*

**శ్లో. త్వత్ క్షాంతిః ఖలు రంగరాజ! మహతీ, తస్యాః పునస్తోషణే**
**పర్యాప్తం న సమస్తచేతనకృతం పాపం, తతో మామకమ్ ।**
**లక్ష్యం నేతి నమోక్తు మర్హసి యతః కుత్రాపి తుల్యో మయా**
**నాన్యః సిద్ధ్యతి పాపకృత్, తదధునా లబ్ధంతు నోపేక్ష్యతామ్ ॥**

స్వామీ! నీవు రంగరాజువు. **రాజా ప్రకృతి రంజనాత్** అన్నారు నీతిశాస్త్రవేత్తలు. ప్రజలను నొప్పించకుండా రంజింపజేయువాడే రాజు. రాజు క్రూరబుద్ధితో ఒక్కణ్ణి హింసించినా అతనిని మంచి రాజుగా కీర్తించరు. నీవు రంగరాజువని కీర్తింపబడుటకు నీ క్షమాగుణమే కారణం. ఓ స్వామీ! నీవు లోకంలో అందరినీ క్షమించినా తృప్తి లేదు. అది ఎంతోకాలంగా ఆకలితో ఉన్నవానికి నాలుగు మెతుకులు పెట్టడం వంటిదే సుమా! అందరి పాపాలు ఒక ఎత్తు, నా పాపాలు మరో ఎత్తు. పాపాత్ములను రక్షిస్తున్నావని నేను వచ్చాను. నాలో ఉండే సహింపరాని పాపాలను చూసి వీణ్ణి క్షమించటం నా వల్ల కాదు అంటే నీకే ఎంతో నష్టం. నీ క్షమాగుణానికి వన్నె తెచ్చేవాణ్ణి నేనే.

నన్ను క్షమించకుండా వదిలిపెడితే నావంటి మహాపాపిష్ఠి నీకు మరొకడు దొరకడు. దొరికిన సదవకాశాన్ని చేజేతులారా జారవిడుచుకోకు. పరమాత్మ ఫలానా మహాపాపాత్ముణ్ణి రక్షించాడు అనే ప్రతిష్ఠ నీకు చరిత్రలో చిరస్థాయిగా నిలిచేది నావల్లనే సుమా! నన్ను క్షమించి, రక్షించి, నీ క్షమా వైభవాన్ని చాటుకో! అని వేదాచార్యులవారు మూడవశ్లోకంతో రంగనాథ స్వామిని ప్రార్థించారు.

**శ్లో. పుణ్యం పాపమితి ద్వయం ఖలు, తయోః పూర్వేణ యత్సాధ్యతే**
**తత్ త్వద్విస్మృతి కారకం తనుభృతాం రంగేశ! సంజాయతే।**
**పాశ్చాత్యస్య తు యత్ఫలం తదిహ తే దుఃఖచ్ఛిదః స్మారకం**
**తేనానేన కృతం తదేవ శిశునా ఇత్యస్మత్ కృతం క్షమ్యతామ్ ॥**

ఓరంగనాథా! మానవులు అందరూ బాగుపడాలని వేదశాస్త్రా లను అందించి నియమావళి ఇచ్చి పుణ్య-పాపాలు అనే రెండు మార్గాలను ఇచ్చావు. ధర్మబద్ధమైన రీతిలో యజ్ఞయాగాది కర్మాచరణంవల్ల పుణ్యం కలిగి సర్వసుఖాలు పొందుతారు. తద్విరుద్ధంగా చేస్తే కష్టాల పాలవుతారు అని ప్రబోధించావు. పుణ్యాలు చేసి ఐశ్వర్యాన్ని, సర్వసుఖాలను పొందేవారు నిన్ను తలవనే తలవరు. ఎవరైనా నీకు ఇంతటి ఐశ్వర్యం భగవంతుడిచ్చినదే కదా అని అంటే, అతడివ్వలేదు, నేనే కష్టపడి సంపాదించుకున్నాను అంటాడు. నీవు వేదశాస్త్రాలను, శరీరేంద్రియాలను ఇచ్చినా పుణ్యాత్ములు నిన్ను స్మరించరు. నేను అందుకే రెండవదైన పాపమార్గాన్ని ఎంపికచేసుకున్నాను. ఎన్ని పాపాలు చేస్తే అన్ని కష్టాలు. కష్టాలు ఎక్కువైతే స్వామీ నిన్నే స్మరించవచ్చు. నిన్ను మరిపించే సుఖాలకన్న నిన్ను తలపించే కష్టాలనిచ్చే పాపమార్గమే మిన్న అని తలచి పాపాల్ని చేస్తున్నా.

పూర్వం పాండవులతో కలిసి అరణ్యవాసానికి వెళ్ళిన కుంతీదేవి **'విపదస్సంతు నశ్శశ్వత్ యాసు సంకీర్త్యతే హరిః'** – మాకు ఎల్లప్పుడు ఆపదలనే కలిగించు. ఆపదలు కలిగితేనే నిన్ను ఎల్లప్పుడు స్మరిస్తూ ఉంటాము. నీవు వచ్చి మమ్ములను రక్షిస్తూ ఉంటావు. అలాకాక దుర్యోధనాదులవలె ఐశ్వర్యసుఖంలో పడితే నీ దర్శనం మాకు లభించేదా, అని ఆమె తలంచినట్లు పుణ్యకర్తకంటే వీడే మంచివాడని భావించి నా అపరాధాలు క్షమించు. నన్ను ఈ దుఃఖసముద్రం నుండి గట్టెక్కించు అని వేదాచార్యులవారు రంగనాథుణ్ణి కోరారు.

**శ్లో. న ద్విత్రాణి కృతాన్యనేన నిరయైర్నాలం పునః కల్పితైః**
**పాపానాం, ఇతి మత్కృతే తదధికాన్ కర్తుం ప్రవృత్తే త్వయి ।**
**తేభ్యోఽపి అభ్యధికాని తాన్యహమపి క్షుద్రః కరోమి క్షణాత్**
**తద్యత్నః తవ నిష్ఫలః ఖలు భవేత్ తత్తే క్షమైవ క్షమా ॥**

స్వామీ! రంగనాథా! నేను చేస్తున్న, చేసిన పాపాలకు తగినట్లుగా అన్ని శిక్షలు నాకు వేయాలనే పట్టుదల వదిలేసుకో. పందెం వేసుకుంటే నీవు పందెంలో గెలవలేవు. నా పాపాలకు తగినట్లుగా నీవు సృష్టించిన నరకలోకాలు చాలవు. అప్పుడు లెక్క చేసుకొని పాపాలకు తగిన నరకాలను సృష్టించడానికి నీకు కొంత సమయం పట్టవచ్చు. కాని క్షణంలో ఎన్నెన్నో పాపాలను చేయడంలో నేను సర్వసమర్థుడను. నీవు నాతో-మరి నీకు నరకబాధలు అనుభవించడం కష్టం కాదా అంటావేమో. **సర్వం సహే మే సహజం హి దుఃఖమ్** అనే యామునాచార్యుల వారి సూక్తివలె దుఃఖాలను ఓర్చుకొనే స్థితి నాకు సహజంగానే కలిగింది. నరకబాధలు నాకు అలవాటైపోయినాయి. కష్టాలు ఓర్చుకునే మొండితనం జన్మజన్మలనుండి వస్తున్నది. నేను మొండివాణ్ణి. రాజెక్కువా? మొండెక్కువా? అంటే మొండివైఖరికి రాజే విసిగిపోతాడు. స్వామీ! నీవు నీ మనసు మార్చుకొని నా సర్వాపరాధాలను క్షమించు. స్వామీ! నీ క్షమాగుణం ఒక్కటే నా సంకటాలను తొలగిస్తుంది. అట్లా చేస్తే నీ గౌరవం పెరుగుతుంది. నేను ఉజ్జీవిస్తా. ఇది ఇద్దరికీ ఉపయోగకరమైన మార్గం అని 6వ శ్లోకంలో రచయిత ప్రార్థించారు.

**శ్లో. మత్పాప క్షపణాయ యోజయసి చేత్ ఘోరేణ దండేన మామ్**
**రంగాధీశ్వర! కేవలాఘు కరణాత్ దుఃఖం మమ స్యాన్మహత్ ।**
**తత్ద్రష్టుః భవతోఽపి దుఃఖమతులం ఘోరం, దయాళో! భవేత్**
**తస్మాత్ తేఽపి సుఖాయ మత్కృతమిదం సర్వం త్వయా క్షమ్యతామ్ ॥**

శ్రీరంగేశ్వరా! నీ మంచి కొరకు నన్ను క్షమించమని కోరుతున్నా. నీవు ఇతరుల దుఃఖాన్ని చూడలేవు. నీవు మృదువైన మనసు గల దయాశాలివి. **'వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః'** బాధలోనున్నవారిని చూసి వారికంటె నీవే ఎక్కువ బాధపడతావని వాల్మీకి మహర్షి తెలిపారు. దుఃఖం చూసి ఊరకే దుఃఖపడటం కాకుండా పరదుఃఖ ప్రహాణేచ్ఛను (ఇతరుల దుఃఖాన్ని తొలగించాలనే కోరికను) పొందుతావు. లోకంలో కొందరు ప్రత్యుపకారం ఆశించి ఇతరులకు సహాయం చేసి వారిని దుఃఖంలోనుండి బయటపడేస్తారు. కాని నీది నిష్కారణ పరదుఃఖ ప్రహాణేచ్ఛ, నిర్హేతుక కృప. (నీకృపకు కారణం ఏదీ లేదుకదా!).

నీవు నా పాపాలకు శిక్ష వేస్తే, నాకు నరకబాధలు కలిగితే, నీవు చూస్తూ ఊరుకోలేవు. నీవు నిశ్చింతగా ఉండాలంటే నా పాపాలను మన్నించి రక్షించు. నేను ఏడిస్తే నీవు ఏడవాలి. అందుకే కోరి దుఃఖం కొనితెచ్చుకోకు అని తనను తప్పక క్షమించవలసిన స్థితిని రచయిత రంగనాథునికి వివరించారు.

దయాశతకంలో వేదాంతదేశికులు వేంకటేశ్వరస్వామియొక్క దయను కోరుతున్నారు -

**అహమస్మి అపరాధ చక్రవర్తీ,**
**కరుణే త్వం చ గుణేషు సార్వభౌమీ !**
**విదుషీ స్థితిం ఈదృశీం స్వయం మాం**
**వృషశైలేశ్వర పాదసాత్ కురు త్వమ్॥**

దయాదేవీ! నేనేమో పాపాలకు చక్రవర్తిని. నీవేమో పరమాత్మకు ఉండే గుణాలలో గొప్పదానవు. ఇటువంటి నా స్థితిని తెలిసినట్టి నీవు నన్ను స్వయంగా శ్రీ వేంకటేశ్వరుని పాదాలచెంతకు చేరునట్లు చేయుము అని వేంకటేశ్వరస్వామివారి గుణాలలో ప్రధానమైన దయాగుణాన్ని ప్రార్థించారు. అపుడే దయాగుణానికి సార్థకత. భగవంతునికి కూడా పాపాత్ముడి దుఃఖాన్ని చూసి దుఃఖించాల్సిన పరిస్థితి ఏర్పడదు.

జగన్నాథపండితుడు కరుణాలహరి అనే స్తోత్రంలో - **"అయమత్యధమోఽపి నిర్గుణో - దయనీయో భవతా దయానిధే!"** - ఓ కరుణాసముద్రా! నేను గుణహీనుడను. మానవాధముడను. అయినా నేను దయకు పాత్రుణ్ణి తప్పక కాగలను. నీ దయాగుణం ఎంతటి పాపిష్ఠినైనా చేరదీసి రక్షిస్తుంది అని పేర్కొన్నారు.

శ్లో. **దేవ! త్వాం శరణం ప్రపన్నమపి మాం దుఃఖాన్యనన్యాశ్రయం**
**బాధంతే యది, సర్వపాపనివహాత్ త్వాం మోక్షయిష్యామ్యహమ్।**
**ఇత్యుక్తం తవ వాక్యమర్థవిధురం జాయేత, యద్వా భవాన్**
**తత్రాశక్త ఇతి ప్రథేత హి, తతో మాం రక్షతు త్వత్క్షమా ॥**

ఓ రంగనాథా! నాకు నీవు తప్ప వేరే గతి లేదు అనే భావంతో శరణుజొచ్చాను. నీ ప్రభావంవల్ల నా కష్టాలు పోతాయి, బాధలుండవు అనుకున్నా. విశ్వాసంతో నిన్ను ఆశ్రయించినాను. అయినా నాకు ఈ కష్టాలు తప్పడంలేదేమి? శ్రీకృష్ణావతార సమయంలో అర్జునునితో నీవు పలికిన **"మామేకం శరణం వ్రజ! అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥"** అనే మాట అబద్ధమేనా!

శ్రీరామావతారంలో -

**సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే ।**
**అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్ వ్రతం మమ ॥**

నన్నాశ్రయించిన వ్యక్తి ఒకసారి నేను నీవాడను, నన్ను రక్షించమని కోరగానే అతనికి అభయమిచ్చి రక్షిస్తాను. ఇది నా ప్రతిజ్ఞ అని తెలిపావు. ఈ రెండు యుద్ధభూమిలో యుద్ధానికి ముందు చేసిన ప్రతిజ్ఞలే. అట్లే కృష్ణావతారంలో ద్రౌపదితో నీవు -

**ద్యౌః పతత్ పృథివీ శీర్యేత్ - హిమవాన్ శకలీ భవేత్ ।**
**శుష్యేత్తోయనిధిః కృష్ణే! న మే మోఘం వచో భవేత్ ॥**

మిన్ను విరిగిపడిన పడుగాక, భూమి బ్రద్దలైనా అవ్వచ్చు గాక. హిమవత్పర్వతం ప్రేలిపోయి ముక్కలైనా అవ్వచ్చుగాక. సముద్రం ఇంకిపోయినా పోవుగాక. ఎట్టి పరిస్థితుల్లోనూ ఆడిన మాటను తప్పను అని ప్రతిజ్ఞ చేశావు. ఆ ప్రతిజ్ఞ కూడా అబద్ధమౌతుంది. నా కష్టాలు తీరకపోతే నీకు నన్ను రక్షించే అంతటి శక్తి లేదని బట్టబయలౌతుంది. కావున క్షమించి **'నన్నాశ్రయించిన వారికి ఎన్నటికీ దుర్గతి రాదు'** అనే మాటను ఋజువు చేసుకో అని వేదాచార్యులవారు రంగనాథస్వామిని 10వ శ్లోకంలో ప్రార్థించారు.

శ్లో. **న త్వం క్షామ్యసి చేత్ ఇదం మమకృతం నాస్త్యత్ర కాచిత్ క్షతిః**
**పూర్వం యత్సమభూత్ తదేవ హి పునర్జాయేత తజ్జాయతామ్ ।**
**యద్వా స్యాదధికం చ, సోఽపి సుమహాన్ లాభోస్తు మే తాదృశః**
**స్వామిన్! దాసజనస్తవాయమధికం స్వైరేణ దూరీ భవేత్ ॥**

శ్రీరంగేశ్వరా! నేను ఎంత బ్రతిమిలాడినా నీవు స్వతంత్రుడివైనందున కోపావేశంలో నిన్ను క్షమించడం నావల్ల కాదు, పాపాలకు తగిన శిక్ష విధిస్తాను అని నీవు అన్నా నాకేమి నష్టం లేదు. కొత్తగా ముంచుకవచ్చే ప్రమాదమేదీ లేదు. అన్ని రకాలైన నరక దుఃఖాలు అనుభవించడం ఎన్నోసార్లుగా నాకు పూర్వమే అలవాటైంది. మళ్ళీ నీవు అవే కదా విధించేది. నేను సిద్ధమే! నీవు మరీ రోషంతో నన్ను మోక్షానికి రాకుండా శాశ్వతంగా నరకకూపంలోనే ఉంచినా సరే. మరీ మంచిది. ఉంటా. ఎప్పటిలాగా స్వతంత్రుడనై నీ వశంలోకి రాకుండా తిరుగుతా. కానీ కౌస్తుభరత్నం లాంటి కుమారుణ్ణి అయిన నన్ను దూరం చేసుకున్న నీకు మాత్రం శాశ్వత దుఃఖం తప్పదు.

లోకంలో తండ్రికి ఎంతమంది కుమారులున్నా, వారిలో ఒక కుమారుడు దూరమైనా తండ్రికి పుత్రశోకం ఏర్పడునే కాని సంతోషం కలుగదు కదా! నీకు అట్టి స్థితి రాకుండా ఉండాలంటే తక్షణం నన్ను క్షమించి అక్కున చేర్చుకో అని 11వ శ్లోకంలో విన్నవించారు.

శ్లో. **అల్పం చేత్ అనవేక్షణీయసరణా వారోప్యతాం మత్కృతం**
**కించిద్భూరి భవేదిదం యది గురూన్ సంప్రేక్ష్య మే త్యజ్యతామ్ ।**
**యద్వానంతమ్, అనంతవైభవజుషో రంగక్షమావల్లభ!**
**త్వత్ క్షాంత్యాః ఖలు లక్ష్యతామనుగుణామ్ ఆనీయతాం తత్త్వయా॥**

శ్రీరంగాధిపతీ! నాతప్పులు కొంచెమే కదా అనుకుంటే అట్లయినా క్షమించి నన్ను వదిలిపెట్టు. నావి అపచారాలు పెద్దవే అనుకుంటే, మా పూర్వులైన ఆచార్యుల సంబంధాన్ని బట్టి క్షమించి వదిలిపెట్టు. యామునాచార్యులు స్తోత్రరత్నంలో - **పితామహం నాథమునిం విలోక్య ప్రసీద మద్వృత్తమచింతయిత్వా** అన్నారు. నేను శ్రీరామానుజుల శిష్యపరం పరలో చేరాను. కూరత్తాళ్వాన్ మా వంశ పూర్వపురుషులు. నీ సిద్ధాంతాన్ని బాగుగా ప్రచారం చేసిన మహావంశంలో జన్మించాను. కావున వీడు మావాడు అనే అభిమానంతో కాపాడు. క్షమించరాని ఘోర అపచారాలు చేసాడు అంటావా? నన్ను క్షమిస్తేనే కదా నీ కీర్తిప్రతిష్ఠలు పెరుగుతాయి. నావంటి పాపిష్ఠి వేరొకడు దొరకడు. కాబట్టి ఎట్లాగైనా కాపాడాల్సిందే అని క్షమాషోడశి స్తోత్రంలోని చివరి శ్లోకంలో రంగనాథస్వామిని వేదాచార్యులవారు వేడుకున్నారు.

పరమాత్మసంతానమైన మనము, మనకు రక్షకుడైన శ్రీమన్నారాయణుని యొక్క సన్నిధిలో, ఇదివరకు మేం చేసిన దోషాలను చూసి దోషానుభవం కొరకు జన్మపరంపరను ఇవ్వకు స్వామీ! మమ్ములను నీ క్షమాగుణానికి పాత్రులనుగా చేసుకో స్వామీ! అని ప్రార్థిద్దాం. కొత్తగా దోషాలను చేయకుండా జాగ్రత్త పడుదాం. 'ఎన్ని తప్పులు చేసినా క్షమించే పరమాత్మ ఉండనే ఉన్నాడు. ఇక బయలుదేరు. రోజుకు ఒక రకంగా కొత్తకొత్త దోషాలను చేద్దాం' అనే వింత వాదనను చేయకుండా సత్సాంగత్యాన్ని ఏర్పరచుకొని భగవద్భాగవతాచార్యుల కృపకు పాత్రులమై ఈ మానవజీవితానికి సార్థకతను చేకూర్చుకుందాం! *(సశేషం)*



# శ్రీమద్భాగవతమాహాత్మ్యము



శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యులు - హైదరాబాద్

గతసంచిక తరువాయి...

**దుంధుకారి, ప్రజలు, గోకర్ణుడు ఉద్ధరింపబడుట**

గోకర్ణుడు భాగవతం చెప్తాడని తెలియగానే ఆ ఊరిలో పక్క ఊర్లల్లో ఉన్న జనులందరూ కథను వినడానికి విచ్చేసారు. ఆ వూరిలో ఉన్న కుంటివారు, గుడ్డివారు, ముసలివారు, మందబుద్ధులు కూడా తమ పాపరాశిని దగ్ధం చేసుకోవడానికి అక్కడికి వచ్చారు. జన సమూహం ఏర్పడింది. అది చూసి దేవతలే ఆశ్చర్యపడ్డారు. గోకర్ణుడు ఒక ఎత్తైన ఆసనం మీద కూర్చుని చెప్పడం మొదలుపెట్టాడు. దుంధుకారి తన ప్రేతరూపంతో వచ్చి ఎక్కడ ఉండి వినాలా అని వెతుక్కోసాగాడు. అంతలో వాడి దృష్టి ఏడు కణుపులు ఉన్న ఒక వెదురు బొంగుపై పడింది. వాడు వాయురూపంలో ఉన్నాడు. కాబట్టి బయట ఉండలేడు. అందుకని వాడు ఆ వెదురు బొంగులో కూర్చున్నాడు.

గోకర్ణుడు ఒక వైష్ణవ స్వామిని ముఖ్య శ్రోతగా చేసుకుని తాను ప్రథమ స్కంధంలోని కథను వినిపించడం మొదలు పెట్టాడు. అలా ఆ ప్రవచనం సాయంత్రం దాకాసాగింది. సభాసదులు చూస్తుండగానే ఆ వెదురుబొంగులోని ఒక కణుపు ధ్వని చేస్తూ పగిలింది. ఇలా రెండోరోజు రెండవకణుపు, మూడవరోజు మూడవ కణుపు అలా పగులుతూ పోయాయి. ఏడు రోజుల కథ ముగిసే సరికి ఏడు కణుపులు పగిలిపోయాయి. తరువాత భాగవత శ్రవణం వలన పవిత్రుడైన దుంధుకారి ప్రేతదేహం నుండి ఉద్ధరింపబడి ఒక దివ్యరూపాన్ని ధరించాడు. అందరికీ కనబడ్డాడు. ఆతడు మేఘశ్యామల వర్ణంతో, పీతాంబరం ధరించి, తులసీమాలను ధరించి మెరిసిపోతున్నాడు. అతని శిరస్సుపై ఒక అందమైన కిరీటం ఉంది. అందమైన భూషణాలు, కర్ణాలకు అందమైన కుండలాల్ని ధరించి ఉన్నాడు. అతడు గోకర్ణునికి నమస్కరించి “సోదరా! నాకు ప్రేతరూపం నుండి విముక్తి కలిగింది. అని నీవు చేసిన మహిమే సుమా!” అని చెప్పాడు. సభాసదులనుద్దేశించి దుంధుకారి ఇలా చెప్పాడు. “ఓ మహానుభావులారా! ఈ ప్రేతపీడను పోగొట్టే శ్రీమద్భాగవత కథ ధన్యమైనది. శ్రీకృష్ణలోకాన్ని పొందించే ఈ సప్తాహ పారాయణ కూడా ధన్యమైనదే. ఈ సప్తాహం జరిగే సమయంలో ఈ భాగవత కథ మమ్మల్ని నాశనం చేస్తుందని తెలిసి పాపాలన్నీ వణుకుతూ ఉంటాయి. అగ్ని ఎలా అయితే కట్టెలను దగ్ధం చేసేస్తుందో, అలా ఈ సప్తాహ శ్రవణం మన కర్మవశాత్తు చేసిన పాపాలన్నింటిని భస్మం చేసేస్తుంది.

ఈ భారతవర్షంలో శ్రీమద్భాగవత కథని విననివాడి జన్మ వ్యర్థమని ఇక్కడ ఉన్న విద్వాంసులు, దేవతలు ఈ సప్తాహసమయంలోనే చెప్పుకున్నారు. ఈ శరీరం ఎముకలే స్తంభాలుగా కలది. నాడులనే తాళ్ళతో కట్టివేయబడింది. మాంసంతోను రక్తంతోను నింపబడింది. చర్మంతో కప్పబడి ఉంది. దుర్గంధ పూరితమైనది, మలమూత్రాలతో నిండినది. ఈ శరీరం వార్ధక్యం చేత, శోకం చేత అనేక దుఃఖాలకు ఆలవాలమై ఉంది. రోగాలకు నిలయమై ఉంది. నిరంతరం ఏదో ఒక కోరికతో పీడింపబడుతూ ఉంటుంది. ఎప్పటికీ తృప్తి చెందదు. పోనీ ఈ శరీరాన్ని అలా నిలుపుకుందామా! అంటే అదీ సాధ్యపడదు. ఈ శరీరంలో రోమరోమాల్లోను దోషాలే ఉంటాయి. ఇది క్షణకాలమే ఉండేది. ఆ శరీరాన్ని భూమిలో పాతిపెడితే క్రిములుగా మారుతుంది. పశువులు తినేస్తే మలమైపోతుంది. దగ్ధంచేస్తే బూడిదవుతుంది. అలాంటి అస్థిరమైన శరీరాన్ని కలిగిన మానవుడు స్థిరమైన ఫలాన్ని పొందే కర్మలు ఎందుకు చెయ్యడు.?

పొద్దున్న వండిన వంట సాయంకాలానికే చెడిపోతోంది. అలాంటి అన్నం తిని పుష్టిని పొందే శరీరానికి నిత్యత ఎలా వస్తుంది? ఈ లోకంలో సప్తాహవిధి ద్వారా భాగవత శ్రవణం చేస్తే భగవత్ప్రాప్తి త్వరగా కలుగుతుంది. అందువలన సర్వవిధ దోషాలు తొలగడానికి ఉన్న ఏకైక సాధనం ఇదే. భాగవత కథాశ్రవణం చెయ్యనివారు నీటిలో బుడగల్లాగా, జీవులలో దోమల్లాగా కేవలం మరణం కోసమే పుడుతున్నారు. ఏది వినడం వలన జడమైన వెదురుబొంగులోని కణుపులు కూడా పగిలిపోయి విడిపోయినాయో, ఆ భాగవత కథను వినడం వలన హృదయగ్రంథులు భేదింపబడడంలో విశేషమేముంది.

**శ్లో ॥ భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వ సంశయాః ।**
**క్షీయంతే చాస్య కర్మాణి సప్తాహశ్రవణే కృతే ॥**

సప్తాహ శ్రవణం చేస్తే మానవుని హృదయగ్రంథులు విడివడతాయి. వాడి సమస్త సందేహములు ఛిన్నములవుతాయి. అంటే తీరిపోతాయి. సర్వ కర్మలు నశిస్తాయి. ఈ కథ లోకంలోని సర్వ కల్మషాలను కడిగివేస్తుంది. ఈ కథ హృదయంలో తలచుకునే వానికి ముక్తి నిశ్చయమే అని విద్వాంసులు చెప్తున్నారు. దుంధుకారి ఇలా చెప్తుతుండగానే అతని కోసం వైకుంఠంనుండి ఒక దివ్యమైన విమానం ఒకటి వచ్చింది. దానికి నలువైపులా వైకుంఠవాసులు చామరాలను పట్టుకుని నిలబడి ఉన్నారు. దాని కాంతి అన్ని వైపులకు మండలాకారంగా ప్రసరిస్తోంది. అందరూ చూస్తుండగా ఆ దుంధుకారిని విమానం లోకి ఆహ్వానించారు. దుంధుకారి ఆ విమానాన్ని అధిరోహించాడు. ఆ విమానంతో వచ్చిన వైష్ణవులతో గోకర్ణుడు ఇలా అన్నాడు.

“భగవంతునికి ఇష్టులైన పార్షదులారా! ఇక్కడ నిర్మల హృదయులైన నా శ్రోతలెందరో ఉన్నారు. వారందరి కోసం ఒక్కసారే చాలా విమానాలు మీరు ఎందుకు తీసుకురాలేదు? అందరూ ఈ కథను చక్కగా శ్రవణం చేసిన వారే కదా! ఈ ఫల భేదానికి కారణం ఉన్నట్లయితే దయచేసి చెప్పండి.” అని.

దానికి హరిదాసులు ఇలా చెప్పారు. “ఈ ఫల భేదానికి కారణం శ్రవణభేదమే. అందరూ సమానంగానే శ్రవణం చేసినా అందరూ ఇతనిలా శ్రవణం చెయ్యలేదు. ఈ ప్రేతం ఏడుదినాల పాటు ఉపవాసం చేస్తూ శ్రవణం చేసింది. విన్న విషయాలపై స్థిరచిత్తంతో చక్కగా మనన నిదిధ్యాసనాలను చేసింది. దృఢం కాని జ్ఞానం వ్యర్థమవుతుంది. అలాగే ధ్యానం చెయ్యక పోతే

శ్రవణము, సందేహము ఉండడం వలన మంత్రము, చిత్తం అటు ఇటూ వెళ్ళిపోవడం వలన జపము ఎలాంటి ఫలాన్ని సాధించలేవు. వైష్ణవులు లేని దేశము, అయోగ్యుడైన వానిని కూర్చోబెట్టి చేసే శ్రాద్ధము, శ్రోత్రియుడు కాని వాడికి చేసిన దానం, ఆచారం లేని కులము నశిస్తాయి.

పెద్దల మాటలపై నమ్మకం, దైన్యభావన, మానసిక దోషాలను జయించడం, భాగవత కథపై నిశ్చలబుద్ధి మొదలైన నియమాలను పాటిస్తేనే వారికి శ్రవణఫలం కలుగుతుంది. ఈ శ్రోతలే మళ్ళీ ఈ నియమాలన్నీ పాటించి భాగవతాన్ని వింటే అందరికీ వైకుంఠ ప్రాప్తి కలుగుతుంది. గోకర్ణా! నిన్ను భగవానుడే స్వయంగా వచ్చి గోలోకానికి తీసుకుని వెళ్ళగలడు." అని చెప్పి ఆ వైష్ణవాగ్రేసరులందరూ హరికీర్తనం చేసుకుంటూ వైకుంఠానికి వెళ్ళిపోయారు.

ఆ మాటలు విన్న వారందరికీ గోకర్ణుడు శ్రావణ మాసంలో మళ్ళీ మరో సప్తాహక్రమంలో కథను వినిపించాడు. శ్రోతలందరూ మనస్సు పెట్టి శ్రద్ధగా విన్నారు. అంతే కథ పూర్తయ్యే ఏడవదినానికి ఆ ప్రాంగణంలో ఎంతమంది ఉన్నారో అందరికీ ఒక్కొక్క విమానం వచ్చి చేరింది. ఆ విమానాలతోపాటు భగవానుడైన శ్రీకృష్ణుడు కూడా ప్రత్యక్షమయ్యాడు. అన్ని వైపుల నుండి జయ జయ ధ్వానాలు, నమస్కార ధ్వనులు మిన్నుముట్టాయి. శ్రీహరి ఆనందంతో పాంచజన్యాన్ని పూరించాడు. ఆ తరువాత గోకర్ణుణ్ణి ఆలింగనం చేసుకుని ఆతనికి సాయుజ్యముక్తిని ప్రసాదించాడు.

ఆ క్షణంలో శ్రోతలందరికీ మేఘశ్యామల వర్ణం ఏర్పడింది. అందరూ పీతాంబరధారులు, అనేకానేక భూషణాలు కిరీట కుండలాదులు ధరించిన వారయ్యారు. అందరూ గోకర్ణుని దయవలన విమానాలెక్కేసారు. అందరూ గోలోకానికి తీసుకొని వెళ్ళబడ్డారు. గోకర్ణుడు శ్రీకృష్ణునితో కలిసి గోలోకానికి వెళ్ళిపోయాడు. సూర్య చంద్ర ఇంద్రాదులకు కూడా సాధ్యంగాని లోకాలకు వారు శ్రీమద్భాగవతశ్రవణం వలన వెళ్ళిపోయారు. నారదా! సప్తాహ యజ్ఞం ద్వారా కథా శ్రవణం చేత పొందే సంచితమైన ఉజ్జ్వల ఫలం గూర్చి ఏం చెప్పగలం?

**శ్లో॥ కర్ణేన గోకర్ణ కథాక్షరో యైః । పీతశ్చ తే గర్భగతా న భూయః ॥**

మన చెవులతో గోకర్ణుని కథలోని ఒక్క అక్షరమునైనా పానము లేదా శ్రవణం చేసిన వాడు తిరిగి మాతృగర్భంలో ప్రవేశించడు. వాయువును పీలుస్తూ, నీటిని త్రాగుతూ, ఆకులు, అలాలు తిని శరీరాన్ని శుష్కింపజేస్తూ బహుకాలం ఘోరతపస్సు చేసే ఫలం కంటే ఆ సప్తాహ పద్ధతిలో శ్రవణం చెయ్యడం ద్వారా సహజంగానే ఎక్కువ ఫలాన్ని పొందుతున్నారు. ఈ పరమ పవిత్రమైన ఈ కథను ఒక్కమారు శ్రవణం చేసినా వారి పాపరాశి పూర్తిగా దగ్ధమౌతుంది. శ్రాద్ధ సమయంలో శ్రవణం చేస్తే పితృదేవతలు తృప్తిపడతారు. నిత్యము పఠించడం వలన మోక్షం వస్తుంది.

**సప్తాహ యజ్ఞ విధానము**

ఇంత వరకూ గోకర్ణోపాఖ్యానం చెప్పిన సనకసనందనాదులు నారదునితో ఇలా అన్నారు. "నారదా! ఇక నీకు సప్తాహ శ్రవణ విధానాన్ని చెపుతాం విను. ఇది జరగాలంటే జనుల సహాయము కావాలి. ఎంతో ధనము కావాలి. ముందుగా జ్యోతిష్యుణ్ణి పిలిపించి ఒక మంచిముహూర్తాన్ని నిర్ణయింప జేయాలి. ఈ కథారంభం చెయ్యాలంటే భాద్రపద, ఆశ్వయుజ, కార్తీక, మార్గశిర, ఆషాఢ, శ్రావణ మాసాలు శ్రేష్ఠమని చెప్తారు. ఎందుకంటే ఇవి మోక్షప్రాప్తికి కారణమౌతాయి.

భాగవత కథ చెప్పేముందు అందరూ సపరివారంగా రండి అని అందరికీ కబురు పెట్టాలి. శ్రీవైష్ణవులు ఎందరు తెలిస్తే అందరికీ ప్రత్యేక ఆహ్వానాలు పంపాలి. మీకు ఏడురోజులు రాలేని పక్షంలో కనీసం ఒక్కరోజైనా అన్వయించు కోండి. అని అందరికీ తెలియజేయాలి. ఎందుకంటే భాగవత సప్తాహంలోని ప్రతిక్షణం దుర్లభమైనదే. వచ్చినవాళ్ళందరూ అనుకూలంగా కూర్చోవడానికి తగిన ఏర్పాట్లను చేయాలి.

భాగవత కథను ఏ తీర్థంలో కాని, వనంలో కాని, తన ఇంటిలో కాని చేయవచ్చును. విశాలమైన ప్రదేశం కథాస్థలంగా ఉండాలి. భూమిని శుద్ధిచేయడం, అలకడం, ముగ్గులు పెట్టడం చేయాలి. భక్తులు కూర్చోవడానికి కథ వినడానికి అడ్డుగా ఉన్న వస్తువులనన్నింటిని ఒక ప్రక్కగా పెట్టుకోవాలి. కిందపరచడానికి చద్దర్లు తెప్పించుకోవాలి. అరటి స్తంభాలతో శోభిల్లేటట్లు ఒక ఉన్నతమైన మండపాన్ని నిర్మించుకోవాలి. మండపాన్ని పుష్ప ఫల పత్రములచేత చాందినీలచేత అలంకరించుకోవాలి. మండపం కొంచం ఎత్తుగా విశాలంగా ఉండాలి. దానిపై భక్తులు, వైష్ణవులను ఆహ్వానించవలసి ఉంటుంది.

వక్తకు ఎదురుగా అన్ని వర్గాలవారికి వేరువేరుగా ఆసనాలు ఏర్పాటు చేసుకోవాలి. వక్త తూర్పుముఖంగా కూర్చుంటే మంచిది. వక్త వేదశాస్త్రములను స్పష్టంగా వ్యాఖ్యానించగలవాడు, వివిధమైన దృష్టాంతాలనివ్వగలిగిన వాడు, వివేకి, నిస్పృహ కలవాడు విరక్తుడు, విష్ణుభక్తుడు అయి ఉండాలి. శ్రీమద్భాగవతంలో ప్రావీణ్యుడైనా అనేక ధర్మాల భ్రమలో పడినవాడు (అంటే అనేకమంది దేవతలను కొలిచేవాడు), స్త్రీలోలుడు, పాషండుడు అయిన బ్రాహ్మణుని వక్తగా నియమించరాదు.

వక్తకు సహాయకారిగా మరియొక విద్వాంసుని సహాయకునిగా నియమించుకోవాలి. కథారంభానికి ముందు రోజే వక్త క్షౌరము చేసుకుని

An.Y.
ఆర్థోఫిట్
సిరప్
అన్ని రకముల
జాయింట్ నొప్పులకు
సరికొత్త పరిష్కారం
Fizikem
సత్వర నివారణకు అద్భుత
ఆయుర్వేద ఔషధం
Also available as Oil & Capsules
ఇది
ఫిజికెమ్ వారి
ప్రతిష్టాత్మక ఉత్పాదనలలో ఒకటి
ORTHO FIT
ఇంటింటా ఆర్థోఫిట్ నొప్పులన్నీ ఫటాఫట్

దీక్ష వహించాలి. కథ ఆరంభమయ్యే దినాన చక్కగా శౌచముతో స్నానాదులు పూర్తి చేసి, సంధ్యాది కర్మలు నిర్వహించి సర్వవిఘ్నములు తొలగవలెనని గణనాయకుడైన విష్వక్సేనుని పూజించాలి. మధ్యలో ఒక మండలము చేసి శ్రీహరిని స్థాపించాలి. శ్రీకృష్ణమంత్రంతో షోడశోపచారవిధితో పూజించాలి. ప్రదక్షిణ, నమస్కారస్తుతులు చేయాలి. ధూప దీపాది సామగ్రితో శ్రీమద్భాగవతాన్ని ఉత్సాహంతోటి ప్రేమతోటి పూజించాలి. "ఓ శ్రీకృష్ణా! ఈ భాగవత రూపములోనున్నది నీవే! నాథా! ఈ భవసాగరాన్ని దాటడానికి నీ శరణుజొచ్చాను. నేను నీ దాసుడను. అనుగ్రహించు." అని చెప్పి వక్తను పూజించి ఇలా చెప్పాలి.

"ఓ శుకరూపుడైన దేవా! బోధించడంలో నీవు కుశలుడవు. సర్వశాస్త్ర పారంగతుడవు. దయతో ఈ కథను వినిపించి మా అజ్ఞానాన్ని పోగొట్టండి." అని కర్త యజ్ఞ దీక్షను స్వీకరించి 7రోజులపాటు చక్కగా పాటించాలి. ఈ శ్రవణానికి అంతరాయం కలగకుండా ఐదుగురు బ్రాహ్మణులను సేవించాలి. వారు ద్వాదశాక్షర మంత్రంతో భగవన్నామాన్ని జపించాలి. ఆ తరువాత వక్త అందరితో భగవన్నామ సంకీర్తన చేయించి, సర్వులకు నమస్కరించి వారి ఆజ్ఞతో కథారంభం చెయ్యాలి. వక్త సూర్యోదయంతో కథను ఆరంభించి మూడున్నర ఝాముల వరకు కథా ప్రవచనం చెయ్యాలి. రెండు ఝాములు పూర్తి అయిన తరువాత కథను రెండుగంటలపాటు ఆపాలి. అప్పుడు వైష్ణవులు భగవద్గుణగానం చేస్తారు.

కథ జరిగే ఏడురోజులు వ్యర్థమైన మాటలు మాట్లడకూడదు. మల మూత్రముల వేగాన్ని నిరోధించడానికి అల్పాహారం స్వీకరించాలి. శ్రోత ఒక్కమారే హవిష్యాన్నాన్ని స్వీకరించాలి. శ్రోతలు శక్తి ఉంటే ఏడుదినాలు ఆహారం లేకుండానే ఉండాలి. శక్తి సరిపోకపోతే మితాహారాన్ని కథాశ్రవణానికి సుఖ సాధమయ్యేలా స్వీకరించవచ్చును. ఎందుకంటే శ్రవణానికి ఉపవాసం అవరోధం కావచ్చు.

విష్ణుభక్తి లేనివారు కథా శ్రవణానికి అధికారులు కారు. నియతంగా కథని వినేవారు బ్రహ్మచర్యంతో ఉండాలి. నేలపై పడుకోవాలి. కథ పూర్తి అయిన తరువాత ప్రతిరోజు ఆకులలో(అరటి) భోజనం చేయాలి. కామ క్రోధాది అరిషడ్వర్గాలను దరిచేరనీయరాదు. శ్రవణమునకు అధికారి అయిన వారు వేదములను, వైష్ణవులను, బ్రాహ్మణులను, గురువులను, గోసేవకులను, స్త్రీలను, రాజును, మహాపురుషులను నిందించకూడదు. దీక్షతో కథను వినేవారు రజస్వల అయిన స్త్రీతోను, మ్లేచ్ఛులతోను, పతితలతోను, గాయత్రిని జపించని ద్విజునితోను, బ్రాహ్మణులను ద్వేషించు వారితోను, వేదాలను అంగీకరించని వారితోను మాటలాడరాదు. శుచిలేనివారు ఈ కథను వినరాదు. ఎల్లప్పుడు సత్యాన్నే పలుకాలి. శౌచము, దయ, మౌనము, హృదయ సారళ్యము, వినయము, ఉదారత, మొదలైన గుణాలను కలిగియుండాలి.

ఈ కథను వ్రతవిధులను పాటించి చెప్పిన తరువాత ఉద్యాపనం చేస్తే మంచిది. కథ ముగిసిన ఏడవరోజున భక్తులందరూ భాగవత గ్రంథాలకు, వక్తకు నమస్కరించాలి. వక్త శ్రోతలకు ప్రసాదాన్ని, తులసిని, ప్రసాద మాలలను ఇవ్వాలి. చివరకు హరినామ సంకీర్తన జరగాలి.

బ్రాహ్మణులకు, యాచకులకు ధనమును, వస్త్రాలను ఇవ్వాలి. ఈ మహాపురాణం గాయత్రీ స్వరూపం కాబట్టి గాయత్రీ మంత్రంతో చివరికి హోమం చెయ్యడం కూడా మంచిది. శ్రోతలందరూ ఏదో ఒక బ్రాహ్మణుని సత్కరించాలి. అందరూ కలిసి విష్ణుసహస్రనామార్చన చెయ్యాలి. ఎవరికి తోచిన దానధర్మాదులు వారు చేసుకోవాలి. అదే వ్రతపూర్తి అన్నమాట. ఇలా చేసిన ఆశ్రోతలకు వక్తకు జనన మరణ బంధనం నుండి విముక్తి కలుగుతుంది. ఈ సప్తాహ పారాయణం సర్వపాపాలను హరిస్తుంది. ధర్మార్థ కామ మోక్షా లన్నింటిని పొందించే సాధనమిది. ఇందులో సందేహం లేదు. ఈ భాగవత పఠనంచేత భోగమోక్షాలు రెండూ కరతలామలక మౌతాయి. *(సశేషం)*

# మా స్వామి

**శ్రీమాన్ కె.వి. రాఘవాచార్యస్వామి-గుంటూరు.**

ముద్దుమొగంబుతో, చిగురు మోవి వహించిన లాస్యరేఖతో,
దిద్దిన యూర్ధ్వపుండ్రముల దీథితితో, కరుణార్ద్ర దృష్టితో,
నిద్దపు చెక్కుటద్దముల నీటులతో, కడువన్నెమేనితో,
తద్దయునొప్పు చిన్నిశిఖదాల్చిన జీయరు సామిగొల్చెదన్.

ద్వాదశ తిరుపుండ్ర ధాళధళ్యముతోడ,
తనరు కాషాయ వస్త్రంబుతోడ,
త్రికరణారూఢమౌ ధీమార్గరుచితోడ,
దంబుచూపెడు త్రిదండముతోడ,
విధి విశిష్టాద్వైత పృథు ప్రచారముతోడ,
జయమిచ్చు వైష్ణవశక్తితోడ,
చెన్నారు వైష్ణవచిహ్నామౌ శిఖతోడ,
తెల్లనైవరలు జందెంబుతోడ,

మధుర వాగ్వైభవశ్రీల మహిమతోడ,
తెలియఁజెప్పెడు పలుకులతేనెతోడ,
నిత్యదరహాస చంద్రికానియతితోడ,
చెలఁగు చినజీయరుస్వామిఁజేరి కొలుతు.

గోష్ఠీవిశేషంబు కూలంకషమ్ముగా
తెలియఁజెప్పెడు మేటి ధీవరుండు,
భక్తికి మతమేమి? భక్తికి కులమేమి?
భక్తి ముఖ్యంబన్న పరమవిదుడు,
రామానుజుని మతరాజిత సిద్ధాంత
పంక్తిచాటెడు భవ్య బంధుగుణుఁడు,
దేశ విదేశ సందేశార్థ సంచార
వైష్ణవ వ్యాప్తి సంవర్ధితుండు,

బధిర పంగ్వంధమూక సద్బాంధవుండు,
పరగ విద్యాప్రదాత! శుంభద్విజేత!
వివిధ విషయానుశీలి! వివేకశాలి!
చిన్నజీయరు తిరుమఁజేరి మనెద.



# ముముక్షు రహస్యం

శ్రీమతి చక్రవర్తుల చూడామణి-ఖమ్మం

"పిన్నీ శ్రీవచనభూషణంలోని 81వ చూర్ణికలో పిరాట్టిక్కుమ్, ద్రౌపదిక్కుమ్ వాసి శక్తియుమ్, అశక్తియుమ్ అని ఉందికదా!

"మనం చెప్పుకున్నది కూడా అదేకదా వకుళా! సీతమ్మకు శక్తి ఉండి ఓర్పు వహించింది. అంటే తన శక్తిని వదిలివేసింది. ద్రౌపది తనను తాను కాపాడుకోలేని అశక్తురాలు. కాని గోవిందుడిని శరణాగతి చేయటం వలన తన అశక్తత తొలగిపోయి నిండుసభలో జరగబోయే అవమానం నుండి తప్పించబడింది. 82వ చూర్ణిక చూడు ఇంకా వివరంగా ఉంటుంది.

'పిరాట్టి స్వశక్తియై విట్టాళ్, ద్రౌపది లజ్జయై విట్టాళ్, తిరుకణ్ణమంగై ఆండాన్ స్వవ్యాపారతై విట్టాన్".

"ఇప్పుడర్థమయిందత్తయ్యా..."

"పిన్నీ! కూరత్తాళ్వాన్ అపార జ్ఞానసంపన్నులు, పరమ విరాగి కదా! ఆయనే ఒక మూగవాడిని చూసి ఈర్ష్య పడ్డారట కదా! అలా చెయ్యవచ్చా?"

"అసలు విషయం తెలిస్తే నువ్విలా అనవు వకుళా? ఉడయవరుల మఠంలో ఒక శ్రీవైష్ణవులుండేవారు. ఆయన మూగవారు. కాని నిరంతరం ఏదో ఒక కైంకర్యంలో నిమగ్నమై ఉండేవారు. అది చిన్నదా? పెద్దదా! తనకు తగినదా? అన్న చింతలేదు. మఠంలో ఏ కైంకర్యం దొరికినా మహాభాగ్యంగా భావించేవారు. ఉడయవరులు వీరి భక్తిని చూసి సంతోషించి అపారమైన కరుణతో వారిని అనుగ్రహించాలనుకున్నారు. వెంటనే ఆ భక్తుడిని పిలిచి తన అంతరంగ మందిరంలోకి తీసుకువెళ్ళారు. అక్కడ ఆ భక్తుడి శిరస్సుమీద తన శ్రీపాదాలనుంచి అనుగ్రహించి "ఆచార్య శ్రీపాదములే శరణం" అని ఉపదేశించారు.

"ఆహా ఏమిభాగ్యం అలాంటి జగదాచార్యుల శ్రీపాదధూళి ఎంత భాగ్యంచేస్తే దొరకాలి...."

"చూశావా? ఇన్ని వందల సంవత్సరాల తరువాత వింటున్న నీకే ఇలా అనిపించింది కదా! ఆచార్య శ్రీపాదములనే ఆశ్రయించి నిత్యకైంకర్యం చేస్తున్న కూరత్తాళ్వాన్‌కి ఎలా ఉండి ఉంటుంది. ఈ మూగవారిని ఆచార్యులు తన అంతరంగ మందిరానికి తీసుకుపోవటం, చూసి ఆశ్చర్యపోయిన ఆళ్వాన్ కిటికీ గుండా చూశారు. అక్కడ ఆచార్యుల శ్రీపాదాలు ఆ మహాభక్తుడి శిరస్సుమీద కనిపించాయి. "అయ్యయ్యో! ఉభయ వేదాంతం నేర్చుకొని, ఎంత పోగొట్టుకున్నాను. ఏమీ తెలియని మూగగా పుట్టి ఉంటే ఆచార్యకృప లభించేది కదా!" అని బాధపడ్డారు ఆళ్వాన్.

ఆరోజు నుండి ఆ వైష్ణవులు ఉడయవరుల తిరుమేనిసేవ చేస్తూ వారి శ్రీపాదాలే తన ప్రాణంగా భావించారు.

'కైయిల్ కనియెన్న కణ్ణనై క్కాట్టి త్తరిలుం ఉన్దన్ ।
మెయిల్ పిఱంగియ శీరన్ఱి వేణ్డిలన్‌యాన్ నిరయ,
త్తాయ్యిల్ కిడక్కిలుం శోదివిణ్ శేరిలుం ఇవ్వరుళ్ నీ
శెయ్యిల్ దరిప్పన్ ఇరామానుశా! ఎన్ శెజుంకొణ్డలే । *(104 ఇరామానుశ నూత్తందాది)*

అని తిరువరంగత్తముదనార్ ఇరామానుశ నూత్తందాదిలో చెప్పినట్టుగా ఈయన ఉండేవారు.

"అర్థం చెప్పవా పిన్నీ...."

"తప్పకుండా తల్లీ..! తన అతిమానుష చేష్టితాలతో అందరినీ అలరించిన ఆ శ్రీకృష్ణుడిని కరతలామలకం చేసినా ఉడయవర్ల దివ్యమంగళ విగ్రహముయొక్క తేజస్సును తప్ప వేరొక దానిని కోరను. ఈ సంసారంలో పడవేసినా, మనలనే నిరంతరం ఆశ్రయించి ఉన్నాడే అని దయతో పరమపదంలో వేసినా, నిరంతరం ఉడయవరుల కల్యాణగుణాలను దాసుడికి అనుభవించేస్తే తప్ప, ఉజ్జీవింపలేను" అని అముదనార్లు చెప్పారు. ఈ వైష్ణవులు చేసి చూపారు.

అందుకే తిరుక్కోళూరమ్మాళ్ "ఉయిరాయ్ పెత్తేనో ఊమయైప్పోలే?" అన్నారు. (మూగవారిలా ప్రాణమయ్యానా?)

## జూన్ నెల మెదడుకు మేత సమాధానములు

1. శ్రీరంగం; 2. మహాభాష్యభట్టారకులు; 3. సామాన్య నామరూపాలుంటాయి; 4. ఎ.డి1917లో;5. కర్మమూలమైన దుఃఖాన్ని;6. కంచివరదరాజస్వామికి; 7. చరమశ్లోకార్థములను; 8. శుక్రవారంనాడు; 9. బిల్వదళాలతో; 10. ఉభయవేదాన్తాలకు; 11. కూరత్తాళ్వాన్; 12. క్రీ.శ 1099లో; 13. తిరుకులత్తార్ అని; 14. సమతామూర్తి; 15. గోపస్త్రీ (గొల్లవనిత)

అదృష్ట రత్నాలు ధరించండి! అనుకున్నది సాధించండి!
శ్రీ సాయి
పవిత్ర డైమండ్స్
4/7, బ్రాడీపేట, ఖజానా జ్యూయలర్స్ ప్రక్కన, గుంటూరు. సెల్: 9246410099, ఫోన్: 2262626.
బి/3, జైహింద్ కాంప్లెక్స్, గ్రౌండ్‌ఫ్లోర్, యాక్సిస్‌బ్యాంక్ ప్రక్కన, గవర్నర్‌పేట, విజయవాడ. సెల్: 9246310099, ఫోన్: 6665011.
సంపూర్ణ జ్యోతిష్యం చూడబడును
నాణ్యమైన జాతిరత్నాలు
జెమ్ టెస్టింగ్ ల్యాబ్
కెంపులు పచ్చల పూసలు
మంచి ముత్యములు, పగడములు
శివస్వరూపమైన రుద్రాక్షలు
స్పటికమాలలు
1 గ్రామ్ గోల్డ్ ఇమిటేషన్ జ్యూయలరి

# అరచేతిలో... ఆరోగ్యం

విజయలక్ష్మి - హైదరాబాద్

**12.లివర్** (కాలేయం) ప్రెషర్ - 14)

*(కాలి బ్రొటనవ్రేలు లోపలివైపు గోరుక్రింద నుండి మొదలై పాదం పైవరకు మరియు మోకాళ్ళు ప్రక్కనుండి తొడ నుండి కడుపు ద్వారా నాభి ప్రక్క నుండి ఛాతి వరకు మార్గం)*

హై బి.పి. సమస్యలు, నాభి నుండి పాదాల వరక అన్ని సమస్యలు రక్తనాళాల అడ్డంకులు. పసిపిల్లవాడు తన లింగాన్ని పట్టుకొని ఏడుస్తుంటే కాలిబ్రొటనవ్రేలుపై ఆక్యుప్రెజర్ ఇవ్వాలి. కలత నిద్ర, పిల్లల్లో భయం, కంట్లో నీరు రావడం, అధిక ఋతుస్రావం, మూత్రం చుక్కలు, చుక్కలు రావడం, ఆగిపోవడం. మరియు కళ్ళు, చెవులు, ముక్కు, గుదమార్గం వీటి ద్వారా రక్తస్రావం, ఆకలి దాహం లేకపోవుట.

**13. గవర్నింగ్** (అన్నింటిని కంట్రోల్ చేసేమార్గం) ఛానెల్ :

**ప్రెషర్ పాయింట్లు - 28**

*(తలపై నుండి ముక్కు క్రిందపై పెదవివరకు మార్గము)*

ఆస్తమా, జలుబు, జ్ఞాపకశక్తి, ఇంపోటెన్సీ, సర్వైకల్ స్పాండిలైటిస్, కోమ, మానసిక వ్యాధులు.

**14. కన్సెప్షన్ ఛానెల్** (జననాంగాల సంబంధిత మార్గం)

**ప్రెషర్ పాయింట్లు - 24**

(కటిమధ్యభాగం నుండి క్రింది పెదవి వరకు)

పిల్లలు ప్రకృతడపడం, స్త్రీ పురుష సహజ ఇబ్బందులు, అజీర్ణం, గుండె జబ్బులు, ఛాతి నొప్పి, మాటలో తడబాటు, వాంతులు, మొలలు.



మన శరీరంలో రెండేసి అవయవాల మధ్య సమన్వయం ఉంటుంది. అది ఎలాగో చూద్దాం.

**1. లివర్ మరియు గాల్‌బ్లాడర్ :** చేతులు మరియు కాళ్ళయొక్క గోళ్ళు పరీక్షించిన (రంగు కోలుపోవడం, చిట్లడం మొదలగునవి) లివర్ పనితీరు తెలుస్తుంది. లివర్ పనితీరు సరిగా ఉన్న, మాట స్పష్టంగా, గట్టిగా ఉంటుంది. నాడీ వ్యవస్థ, కండరాల వ్యవస్థ సరిగా ఉంటుంది. కష్టించి పనిచేయాలనే ఆలోచన లివర్ సరిగా ఉన్న వస్తుంది. సరియైన నిర్ణయం తీసుకొని దాన్ని అమలు పర్చి సరియైన టైమ్‌కు పూర్తి చేయడం గాల్ బ్లాడర్ పని. గాల్ బ్లాడర్ సరిగా లేకున్నా కోపం ఎక్కువగా వస్తుంది. లివర్ పని సరిగా లేకున్నా కాళ్ళల్లో బలహీనం, స్త్రీలరోగాలు, మూత్రం ఆపలేకపోవడం, చేయలేకపోవడం, గొంతు ఎండిపోవుట, వేడిమి, నడుము నొప్పి, వంగలేకపోవడం, ఛాతిలో నొప్పి, కంటి బలహీనత, తీపి తినాలనే కోరిక. మాటిమాటికి దీర్ఘమైన శ్వాస తీసుకోవాలనే కోరిక, శరీరం నీలిరంగు కలగడం మొదలగునవి. గాల్‌బ్లాడర్ సరిగా పనిచేయకున్నా కాళ్ళు, పాదాలు చల్లగా ఉంటాయి. అన్ని జాయింట్లలో నొప్పి చెమట పట్టుట.

**2. హృదయం మరియు చిన్నప్రేగు:** వ్యక్తియొక్క రంగు ముఖకాంతి గంభీరత చూసి గుండె యొక్క స్థితి చెప్పవచ్చు. తీపిరుచి, తీపిమాటలు హృదయాన్ని సంతులీనం చేస్తాయి. నాలుక మాట్లాడడం మొదలగునవి ఈ రెండుఅవయవాల సంబంధం. హృదయంలో సమ్యలు లేకున్నా మైండ్ పని తీరు బాగుంటుంది. వ్యవహారశైలి బాగుంటుంది.

చిన్నప్రేగులో సమస్యలు ఉన్న చర్మరోగాలు, గొంతునొప్పి తక్కువ వినికిడి, తిమ్మిరి మొదలగునవి...

**3. ప్లీన్ మరియు కడుపు:** ఇవి రెండు సరిగాఉన్న శ్రావ్యంగా పాడుతారు.





Malineni Lakshmaiah Group of Colleges

B.Tech | M.Tech | Polytechnic | B.Pharmacy | M.Pharmacy | MCA | MBA | B.Ed. | D.Ed.

Singarayakonda - Guntur

Co-Education/ Women's/ Integrated Colleges

Our City Offices:

GUNTUR: H.No. 3-28-18/90,Brindavan Gardens 4th Lane,Beside Syndicate bank,Guntur,Ph:(8886509898)

ONGOLE: Dia Complex,3rd Floor,RTO Office Road, Bhagyanagar 2nd Lane,Ongole,Ph:(9581205333)

Phones: 9885509898, 8886449999, 9703144771/2/3

www.malinenicolleges.acin



Dr.M.Perumallu
Vice-Chairman

సామాన్య తీపి భోజనంతో స్లీన్ అవయవాలను సరిచేస్తుంది. అధిక తీపి కఫాన్ని కలిగిస్తుంది. శరీరంలో అంతరాయాన్ని కలుగజేస్తుంది. శరీరంలో మాంసమును నియంత్రిస్తాయి. మనిషి లావు సన్నం ఈ రెండింటిపై ఆధారపడి ఉంటాయి. ఋతువులు మారుతున్నప్పుడు స్ప్లీన్ మరియు కడుపు పాయింట్లపై ఉపచారం చేయాలి. ఇవి సరిగా లేకున్నా అతినీరసం పనిచేయలేకపోవడం, శక్తి లేకపోవడం, బుద్ధిహీనత కోపం కలుగును. భోజనం, ఆచారం, విచారం వలన వచ్చే మార్పులకు ఈ రెండు అవయవాలను సరిచేయాలి.

**4. ఊపిరితిత్తులు మరియు పెద్ద ప్రేగు:** ఈ రెండింటిలో లోపాలు కలిగినపుడు మనోవ్యధ కలుగుతుంది. రోధించాలని అనిపిస్తుంది. ఊపిరితిత్తులు శరీరంపై (తలపైన కాదు) వెంట్రుకలు మీద చాలా ప్రభావం చూపుతాయి. చర్మరోమాలు మూసుకుపోవడం, తెర్చుకోవడం ద్వారా వాతావరణం నుండి మనల్ని చర్మం కాపాడుతుంది. శ్వాసక్రియ, రక్త ప్రసరణ, వేడిమి ఇవన్ని ఎక్కువగాని, తక్కువగాని వీటి వలనే కలుగుతుంది. లంగ్స్ సరిగా లేకున్నా శ్వాస కష్టం. దగ్గు, చేతుల్లో వేడి, ఛాతి పట్టడం, మూత్రం ఆపుకోలేకపోవడం, భుజాలు నొప్పి, క్షయవ్యాధి కలుగుతాయి.

పెద్దప్రేగు సరిగా పనిచేయకున్న ముఖం ఎండిపోవడం, గొంతులో నొప్పి, ముక్కునుండి రక్తస్రావం, అతి చలి, క్షయవ్యాధి.

**5. కిడ్నీ మరియు మూత్రాశయం :** తలవెంట్రుకలను చూసి కిడ్నీ పనితీరు తెలుసుకోవచ్చు. ఆత్మవిశ్వాసం, భయం, నిర్భయం, చింత ఇవన్నీ కిడ్నీ శక్తిపై ఆధారపడి ఉంటాయి. దృఢ నిశ్చయం, నిర్భయం, ఇవి కిడ్నీ పనితీరుపై ఆధారపడి ఉంటాయి. కిడ్నీ సరిగా లేకున్నా శరీరంలో గ్రుచ్చుకున్నట్లు ఉండడం, అక్కడక్కడ ద్రవాలు నిల్చిపోవడం, అందుమూలంగా అర్థ్రరైటిస్, ఎడిమా వ్యాధులు వస్తాయి. కిడ్నీ సక్రమంగ పనిచేయని వ్యక్తి అనైతిక పనులు చేస్తుంటాడు. తనకు తాను అదుపులో ఉండలేడు. అందరపట్ల అనుమానంగా చూస్తాడు. కాళ్ళు చేతులు చల్లబడి ఉంటాయి. తుంటిభాగంలో నొప్పి. ఎప్పుడూ పడుకోవాలనే కోరిక కలుగుతుంది.

మూత్రాశయం సరిగా పనిచేయకున్నా చర్మరోగాలు కంటిలో చూపు తగ్గుట, తీవ్ర తలనొప్పి, ముక్కు మూసుకుపోవటం, కాలు చిటికెన వ్రేలు కదపలేకపోవడం.

**6. పెరికార్డియం మరియు స్పైన్ కార్డు :** సంతోషం, చక్కని మాట అట్టహాసం వీటివలన కలుగును. శరీరం బయటి వాతావరణం ఇన్‌ఫెక్షన్ వలన వచ్చే రోగాలను పెరికార్డియం సరిచేస్తుంది. మానసిక స్థితి వలన వచ్చే రోగాలను హృదయం సరిచేస్తుంది. శరీరంలో అన్ని ఫ్లూయిడ్స్‌ని (రక్తం, జలం, హార్మోన్స్) వెన్నెముక సరిచేస్తుంది.

మానవ శరీరాన్ని ఒక వాహనం అనుకుంటే లివర్ యాక్సిలేటర్‌గా పనిచేస్తుంది. ఊపిరితిత్తులు స్టీరింగ్‌గా పనిచేస్తాయి. కిడ్నీలు బ్రేక్స్‌వలే పనిచేస్తాయి. ఆక్యుప్రెజర్ చికిత్సలో ఎటువంటి సైడ్ ఎఫెక్ట్స్ కలుగవు. అన్ని వైద్యవిధానాలను మించి అతిసులభరీతిలో ఎవరికివారే చికిత్స చేసుకునే రీతిలో ఈ వైద్యవిధానం అందుబాటులో ఉన్నది.

(ఎందరికో ఆరోగ్యాన్ని ఇచ్చి ఎన్నో రుగ్మతలను తొలగించి, కొందరి అనుభవాలను వ్రాయించడం జరిగినది. అవి కొన్ని మీ ముందు ఉంచుతాము.

**చికిత్స పొందినవారు :** నా పేరు భారతి. ముగ్దుంపూర్ గ్రామము. కరీంనగర్ జిల్లా. నాకు 16 సం॥ల వయస్సులో పెద్ద దొబ్బ తగిలి ఎడమచేయి కదపలేని స్థితిలో ఎముక ఒకదానిమీద ఒకటి ఉండిపోయినది. ఆసుపత్రిలో చూపించగా చికిత్స జరుగలేదు. మళ్ళీ 20 సం॥ల తరువాత ఆక్యుప్రెషర్ చికిత్సతో చెయ్యి మామూలు స్థితికి వచ్చినది. మొదటి రెండుమూడు రోజులు చికిత్స కొంత నొప్పి ఉన్నది. మూడవ రోజు చికిత్స చేస్తూ ఉంటే స్పృహతప్పి పడిపోయాను. అప్పుడు కొన్ని మంచినీళ్ళు, మిశ్రి ఇచ్చారు. వెంటనే తెలివి వచ్చినది. 'నా ఎడమ చేయి 20॥లుగా భూమివైపే చూసేది'' ఇప్పుడు నా చేతిని అటూ ఇటూ తిప్పగలుగుతున్నాను. 20సం॥ల నుండి కుడిచేతితో మాత్రమే పనులు చేసుకున్నాను. స్వామివారి ఆశీస్సులతో ఆక్యుప్రెషర్ చికిత్సతో నా ఎడమచేయి పూర్తి స్వాధీనంలోకి వచ్చినది. నన్ను, నాచేతిని చూడడానికి మా గ్రామములోని వారందరూ ఆశ్చర్యముగా చూడడానికి వచ్చారు. ***చింతపూల భారతి***

నా పేరు శ్రీహిత. కుడిచేతి నొప్పితో 4సం॥లుగా బాధపడుతున్నాను. బొలాక్స్ ఇంజక్షన్ కూడా తీసుకున్నాను. న్యూరో స్పెషలిస్ట్ డాక్టర్ ఇంకా చాలా మంది దగ్గర కూడా చికిత్స తీసుకున్నాను. కాని నాచేతిలో ఎలాంటి మార్పులేదు. ఇప్పుడు "ఆక్యుప్రెషర్ చికిత్స" తీసుకున్నాక చాలా వరకు పని చేసుకోగలుగుతున్నాను.

***యమ్. శ్రీహిత* - 8801947391**

నాపేరు రవీందర్‌రెడ్డి,"ఆక్యుప్రెషర్" చేసిన తరువాత నాకు శ్వాసక్రియ సమస్య తక్షణమే తగ్గినది. 10సం॥ల నుండి నాకు ఈ సమస్య ఉన్నది. దీనితోపాటు నాకు ఉన్న నడుము నొప్పి సమస్యకూడా దీనివల్ల తగ్గినది.

***రవీందర్ రెడ్డి*** - 99123 49827

నాణ్యమైన ప్లాట్లు మరియు ఫ్లాట్లు కొనుగోలుకు నమ్మకమైన అగ్రగామి సంస్థ
అభినందన హౌసింగ్ (ప్రై). లిమిటెడ్
సెంట్రల్ ఆఫీస్: 4వ లైను, పండరీపురం, లక్ష్మీపురం మెయిన్ రోడ్, గుంటూరు. ఫోన్: 2354002.
మా బ్రాంచిలు: విజయవాడ 1, విజయవాడ 2, విజయవాడ 3, గుంటూరు 1, గుంటూరు 2, హైదరాబాద్, విశాఖపట్నం.
0866 - 6628668 : 0866 - 6642428 : 0866 - 6633668 : 0863 - 6641177 : 0863 - 6454588 : 040 - 66637799 : 0891 - 2538686.




డా॥ పావులూరి కృష్ణచౌదరి
8-3-945/ఎ 22, నాగార్జున నగర్, అమీర్‌పేట, హైద్రాబాద్-500 873

## అజీర్తి అవస్థ పెడుతోందా?

చిన్న చిన్న ఆరోగ్య సమస్యలు ఇబ్బంది పెడుతున్నప్పుడు, వైద్యుడి వద్దకు వెళ్ళే వీలులేనప్పుడు ఎవరికి వారే హోమియో ఔషధాన్ని ఎంచుకునేందుకు వీలైన విలక్షణ విధానాన్ని పరిచయం చేయటం ఈ శీర్షిక లక్ష్యం.

అజీర్తి (డిస్పెప్సియా) సర్వసాధారణమైన బాధ. పొట్ట ఉబ్బరించటం, గ్యాస్ బాధించటం. ఈ లక్షణాలు ఇబ్బంది పెడుతుంటే 'అజీర్తి' అంటారు. మితి మీరి ఆహారం తీసుకోవటం, మద్యపానం వంటి అలవాట్లూ అజీర్తికి దోహదం చేస్తాయి. కేవలం జీర్ణమండల వ్యాధులతో బాధపడేవారే కాదు. దైనందిన జీవితంలో ఆర్థిక బాధలు, కుటుంబ సమస్యలతో సతమతమవుతున్నవారు, వ్యక్తిగత సమస్యలతో కుంగిపోతున్నవారు కూడా తరచూ అజీర్తికి గురవుతుంటారు. వీరికి ఎన్ని పరీక్షలు చేసినా ఏమీ కనిపించవుగానీ బాధలుమాత్రం వేధిస్తుంటాయి. అందుకే దీన్ని 'ఫంక్షనల్' సమస్యగా పరిగణిస్తారు. అలాగే అల్సర్ నుంచి క్యాన్సర్ వరకూ చాలా సమస్యల్లో అజీర్తి లక్షణాలు కనిపించవచ్చు. హెచ్. పైలోరీ అనే రకం బ్యాక్టీరియాతో కూడా ఇటు వంటి బాధలు రావచ్చు.

ఔషధాన్ని ఎంచుకోవటానికి పొట్ట ఉబ్బరింత, త్రేన్పులువంటి రోగ లక్షణాలతోపాటు రోగి లక్షణాలకూ హోమియో వైద్యంలో ప్రాముఖ్యం ఉంది. వృత్తి, కుటుంబం, సమాజపరమైన బాధలు, వ్యక్తి ప్రకృతి...వీటన్నింటినీ ఆధునిక కాలంలో 'జీవనశైలి' అంటున్నారు. ఇవి 'రోగి లక్షణాలు'

**జీర్ణవ్యవస్థ**- జీర్ణమండలం నోటి నుంచి ఆసనం వరకూ విస్తరించి ఉండే పొడవాటి గొట్టంలాంటి వ్యవస్థ! దీని పొడవు 35-40 అడుగుల వరకూ ఉంటుంది. ఈ గొట్టం లోపలి భాగమంతా జిగురు పొరకప్పి ఉంటుంది. ఈ జీర్ణమండలాన్ని ప్రధానంగా 3 భాగాలుగా విభజించొచ్చు. నోరు, అన్నవాహిక, జీర్ణాశయం మొదటి భాగం. జీర్ణశయం రిజర్వాయర్‌లా పనిచేస్తుంది. దీని కుండర సంకోచాలవల్ల ఆహారం బాగా చిలికినట్లపుతుంది. ఇక చిన్నపేగులు రెండోభాగం. పెద్దపేగు, ఆసనం మూడోభాగం. ఈ జీర్ణ వ్యవస్థకు కాస్త వెలుపలగా ఉండి సహాయపడుతుండే లాలాజల గ్రంథులు, కాలేయం, క్లోమాలను నాలుగో భాగంగా పరిగణించవచ్చు. ఈ మొత్తం వ్యవస్థలో ఎక్కడ సమస్య తలెత్తినా అజీర్తి ఏర్పడవచ్చు.

**1. సమస్య**

పొట్ట పైభాగం ఉబ్బరింత, త్రేన్పులు, ఆకలి మందగించడం నోరు అరుచి

**2. ఔషధాన్ని ఎంపిక చేసుకునేదెలా?**

ప్రధానంగా- పొట్ట ఉబ్బరం, నోరు అరుచి, త్రేన్పుల తీరు, ఆకలి దప్పికల తీరుతెన్నుల మీద ఆధారపడి ఔషధాన్ని ఎంపికచేసుకోవాల్సి ఉంటుంది.

| | |
|---|---|
| **పొట్ట ఉబ్బరం** | |
| ఏపాటి తిన్నా పొట్ట ఉబ్బరం | లైకో |
| పొట్ట ఉబ్బరం, పెద్దగా త్రేన్పులతో ఉపశమనం | చైనా |
| బొడ్డు, పొట్ట పైభాగంలో ఉబ్బరం | కార్బోవెజ్ |
| పొట్టలో రాయిపెట్టినట్లు బరువు ఆహారం అంటే అయిష్టం | పల్సటిల్లా |
| **నోరు అరుచి** | |
| నోరుపులుపు | లైకో |
| నోరు చేదు | చైనా |
| నోరు ఉప్పగా ఉండటం | పల్సటిల్లా |
| **త్రేన్పులు** | |
| పొట్ట ఉబ్బరం. పుల్లటి త్రేన్పులు ఎక్కువ త్రేన్పులు | కార్బోవెజ్ |
| త్రేన్పులు వచ్చినా పొట్ట ఉబ్బరించే ఉంటుంది | చైనా |
| పెద్దశబ్దాలతో గూడిన అపాన వాయువు | లైకో |
| **ఆకలి, దప్పికలనుబట్టి** | |
| ఏ రకమైన ఆహారమూ ఇష్టముండదు | చైనా |
| దాహం చాలా తక్కువ | పల్స్ |
| ఏ కొంచెం తిన్నా పొట్ట నిండిపోతుంది | లైకో |

**3. మీ ఔషధం గురించి మరిన్ని వివరాలు**

**లైకోపోడియం**

ఆకలనిపిస్తుంది. కొద్దిగా తిన్నా పొట్ట నిండినట్లనిపించడం, కడుపులో మంట, త్రేన్పులు తినే ఆహారం పులుపు అనిపిస్తుంది. పొట్టదేవినట్టనిపిస్తుంది. వేడి ద్రవాలు హాయినిస్తాయి. కడుపులో గుడబిడలు సాయంకాలం 4-8 మధ్య బాధలెక్కువ.

**నక్స్‌వామికా:** మితిమీరి తినడం, ఎక్కిళ్ళు, వికార పెడుతుంది. వాంతయితే హాయిగా ఉంటుంది. పొట్ట బిగించినట్లుగా బాధ. వేడి ద్రవపదార్థాలు హాయినిస్తాయి.

**చైనా:** చేదు, పులుపు త్రేన్పులు. ఆకలి మందగిస్తుంది. ఏ ఆహారం ఇష్టపడరు. పాలు సరిపడవు. టీ తాగినా సుఖంలేదు. పొట్టంతా ఉబ్బరిస్తుంది. మితిమీరి గ్యాస్.

**కార్బోవెజ్:** పొట్ట పై భాగంలో ఎక్కువగా ఉబ్బరం. గ్యాస్ అధికం. పొట్టలో నొప్పి ముందుకు వంగబడిపోతారు. అపానవాయువు విసర్జన తరువాత హాయి. తిన్న ఆహారం అంతా గ్యాస్‌గా మారుతుంది.

**పల్సటిల్లా** : ఆహారం ఇష్టమనిపించదు. చివరకు నీళ్ళు కూడా తాగాలనిపించదు. పొట్ట బరువు ఆహారం అరుచి. ఉప్పగా ఉంటుంది. పొట్టలో రాయి పెట్టినట్లుగా ఉంటుంది. ఛాతిలో మంట. ఎప్పుడో తిన్నది కూడా వాంతి అవుతుంది.

*గమనిక* - మీరు ఎంచుకున్న ఔషధాన్ని 30 పొటెన్సీలో రోజూ ఉదయం, సాయత్రం. పెద్దలు 6 మాత్రలచొప్పున.12 ఏళ్లలోపు పిల్లలు 3 మాత్రల చొప్పున.. 2,3 వారాల పాటు వాడుకోవాల్సి ఉంటుంది.

**బి. లావణ్య, 24.సం॥ - తిమ్మాపూర్:- కష్టమైనకాన్పు, సిజేరియన్ ఆపరేషన్. మూడవరోజు తరువాత రొమ్ములవాపు, గట్టిపడడం, నొప్పి, బిడ్డకు చనుమొనలనుకుంచించుకుపోయి బిడ్డకు పాలివ్వడం కష్టమైపోయింది. ఫైటోలక్క 200 పొటెన్సీలో, ఒక డోసు ఇవ్వడం జరిగింది. 24 గంటలలో యాభైశాతం బాధలుతగ్గాయి తరువాతతరువాత ప్రతిరోజు ఒక డోసు, మూడురోజులపాటు ఇవ్వడం జరిగింది. రోగి బాధలు పూర్తిగా తగ్గాయి.** *గమనిక*- **స్త్రీలరొమ్ములవాపు ఫైటోలక్కా ముఖ్య ఔషధం.**



పరమహంస పరివ్రాజకులు
# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



## జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ (యూ.యస్.ఎ) సమావేశాల సమాచారం
## ఫ్లోరిడా -మే 23,24,25 - 2014

అభ్యుదయ నిశ్రేయసాలు రెండూ మానవజాతికి రెండు లక్ష్యాలు. ఈరెండూ ఒకదానితో ఒకటి ముందుకు సాగాలి అన్నది ఆళ్వారులభావన, శ్రీవైష్ణవసంప్రదాయానికి ప్రతిష్ఠాపకులైన భగవద్రామానుజుల భావన. రామానుజులు ఆధ్యాత్మిక దర్శనవేత్తయేకాక, గొప్ప సామాజిక పరివర్తకులు అని జగమెరిగిన సత్యం. ఆళ్వారుల, ఆచార్యుల జీవన విధానాన్ని ఈదేశంలో విస్తృతంగా ప్రచారం చేసిన మహనీయులు శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్ స్వామివారు కాగా! ఈసంప్రదాయపు జీవన మాధుర్యాన్ని దేశంలోనూ, విదేశాలలోనూ విస్తృతంగా ప్రచారం చేస్తున్న మహనీయులు శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారు. స్వామివారు తురీయాశ్రమాన్ని స్వీకరించి పూర్తికావడమే కాక అమెరికాలో తమ ప్రచారదీప్తిని ఆరంభించి కొనసాగించడం దాదాపు 23సంవత్సరములు అవుతున్న సందర్భంగా అమెరికాలోని మనవారంతా ఈసన్నివేశాలను జ్ఞప్తిలో పెట్టుకునే విధంగా ఒక చక్కటి కార్యక్రమాన్ని రూపొందించి సమావేశాలను ఏర్పాటు చేశారు. మన స్వామివారి ఆధ్యాత్మిక విద్యాకార్యక్రమాలను నిర్వహించే **జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్** అమెరికా దేశంలో ప్రవేశించి 20సంవత్సరాలు పూర్తిఅయినది. శ్రేయోమార్గాన్ని సుగమంచేసే కార్యక్రమాలు రూపొందించి అమలు జరిపే బాధ్యతను **జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్** స్వీకరించగా, అభ్యుదయిక అభ్యున్నతిని సమాజశ్రేయస్సును దృష్టిలో పెట్టుకుని రూపొందించే కార్యక్రమాలను ప్రజలలోనికి తీసుకునివెళ్ళే బాధ్యతను **వి.టి సేవ** స్వీకరించింది. నాలుగైదు సంవత్సరాలుగా **వి.టి సేవ** కార్యక్రమాలు అమెరికాలో విస్తృతప్రచారాన్ని పొందుతున్నాయి. అక్కడివారికి ఆరోగ్యకరమైన ఆహారాన్ని అందించిన అక్కడ అనుకోకుండా ఏర్పడిన విపత్తులనుండి అక్కడివారిని రక్షించే సేవాకార్యక్రమాలను స్వీకరించడం, ఇలా ఎన్నో కార్యక్రమాలు నిరంతరంగా సాగుతున్నాయి. ముఖ్యంగా ఈనాడు పిల్లలుగా ఉన్నవారు రేపు పెద్దలై వి.టి సేవ కార్యక్రమాల్లోనూ, జెట్ కార్యక్రమాల్లోనూ పాల్గొనవలసి ఉంటుంది కనుక, భవిష్యత్తులో అన్నిరకాల కార్యక్రమాలు వారే రూపొందించి అమలుచేయగలిగేలా చక్కని బుద్ధిసామర్థ్యాన్ని ప్రోదిచేయడానికి ప్రజ్ఞా కార్యక్రమాలను అమలు చేయడం జరుగుతుంది. ఈకార్యక్రమాలు పిల్లలలో భారతీయ సంస్కృతీ సంప్రదాయాలపట్ల ప్రీతినీ, ఆదరాన్ని కలిగించడంతో పాటు అమెరికాలో వారి జీవన విధానాన్ని ఆలోచనాధోరనిని క్రమబద్ధం చేయడానికి కూడా ఉపకరిస్తుంది. ప్రజ్ఞాకార్యక్రమాలు పిల్లలనే కాక పెద్దలను కూడా సంస్కారవంతులుగా తీర్చిదిద్దగలుగుతున్నాయి. సహస్రనామావధానం, గీతావధానాల్లాంటివి వారిలో ఎంతో ఉత్సాహాన్ని నింపుతున్నాయి. గడచిన 20సంవత్సరాల్లోనూ అమెరికాలో జెట్ నిర్వహించిన ఆధ్యాత్మిక కార్యక్రమాలు ఎన్నో ఉన్నాయి. శ్రీయాగాది కార్యక్రమాలు, వీటికి ప్రత్యక్ష నిదర్శనాలు. న్యూజెర్సీలో స్థాపించిన ఆశ్రమం, హ్యూస్టన్‌లో అష్టలక్ష్మీ ఆలయం ఈరెండూ జెట్ కార్యక్రమాలకూ, వికాసతరంగిణీ కార్యక్రమాలకు కేంద్రస్థానాలయి ఉన్నాయి. ఈసందర్భంగా ఒక ముఖ్యవిషయాన్ని పాఠకులముందు ఉంచుతున్నాం. భారతదేశంలో జరిగే అనేక కార్యక్రమాలకు ముఖ్యంగా నేత్రవిద్యాలయా నిర్వహణానికి, గిరిజన పాఠశాలలకు ఇంకా ఎన్నో కార్యక్రమాలకు అమెరికా జెట్ నుంచి మనకు ఆర్థిక సహకారం అందుతున్నది. 16,17 సంవత్సరాలలో మనం నిర్వహించనున్న శ్రీరామానుజ సహస్రాబ్ది కార్యక్రమాల నిర్వహణంలోనూ సమతామూర్తి విగ్రహ ప్రతిష్ఠాపన లోనూ, జెట్ యూ,ఎస్,ఎ నుండి విశేషమైన ఆర్థిక ప్రోత్సాహం లభిస్తున్నది. అమెరికాలో ఉన్న మన జెట్ సభ్యులు, వి.టి సేవ సభ్యులు బహుకాలంగా నిర్వహిస్తున్న సేవాకార్యక్రమాలను ఆవిష్కరించడమే కాక వారందరినీ సమావేశపరచి వాళ్ళల్లో ఒక సమన్వయరీతి ఏర్పడేలా ఏకలక్ష్యంగా కార్యక్రమాలు నిర్వహించేలా ఫ్లోరిడా సమావేశం ఒక చక్కటి ప్రణాళిని, వేదికను ఏర్పరచాలని భావిస్తూ సుందరంగా కార్యక్రమాలు రూపొందించడం జరిగింది. ఫ్లోరిడాలో మే 23,24,25 తేదీలలో జరిగిన కార్యక్రమాల సంగ్రహ పరిచయం ఈక్రింద ఇస్తున్నాం.

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి ప్రత్యక్ష మంగళాశాసనాలతో జెట్. యూ.యస్.ఎ జాతీయ సమావేశం ఫ్లోరిడా ఓర్లాండోలోని, హిల్టన్ రిసార్ట్‌లో వైభవంగా జరిగింది. జెట్ 20 సంత్సరాలు పూర్తి చేసికొన్న సందర్భంగా జరిపిన ఈ సమావేశానికి 3000పైగా సభ్యులు హాజరైనారు. సభ్యులనమోదుతో ఆరంభించి, సభ్యులను సమావేశ ప్రదేశానికి తీసికొనివెళ్ళడంతో పాటు ఎన్నో అంశాలను శ్రమకోర్చి ప్రణాళికాబద్ధంగా రూపొందించారు. ఓర్లాండోలో జరిగిన ఈ సమావేశం స్వామివారు దీపప్రజ్వలనంచేసి ఆరంభించారు. మనోజ్ఞంగా జరిగిన ఆరంభ సన్నివేశమే రాబోయే 2రోజుల్లో జరిగే కార్యక్రమానికి దిశానిర్దేశం చేసింది. స్వామివారు ఈ సందర్భంగా దాతలను, కార్యకర్తలను, వివిధకార్యక్రమాలను నిర్వహించిన వారిని, ప్రేక్షకులను గుర్తించి మంగళాశాసనాలను అనుగ్రహించారు. మొదటిరోజు మొట్టమొదటిగా స్వామివారు 1990ల్లో అమెరికా పర్యటనను ఆరంభించడానికి దారితీసిన సన్నివేశాలను మననం చేయడం జరిగింది. ప్రేక్షకులు అర్థరాత్రివరకు చాలా ఉత్సాహంగా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

మరునటిరోజు, ఉదయం 4.30కే యోగం, ప్రాణాయామం, సూర్యనమస్కారాలతో ప్రారంభమైంది. ఈ ప్రారంభ కార్యక్రమాన్ని శ్రీస్వామివారి సన్నిధిలో సుధన్వాచార్య నిర్వహించారు. కొద్దిపాటి విరామంతో తీర్థగోష్ఠి పూర్తిచేసుకొని, బాలభోగం ముగించుకోవడం జరిగింది. ఉదయం కార్యక్రమం అమెరికా-భారతదేశాల జాతీయగీతాల ఆలాపనంతో ప్రారంభమైంది. ఇరుదేశాలకు చెందిన వీరప్రముఖుల నిరువులకు సమ్మానం జరిగింది. ఈ రోజు మెమోరియల్‌డే (స్మారకదివసం) కావడం విశేషం. ప్రజ్ఞాబృందాలు ప్రదర్శించిన సాంస్కృతిక-సంగీతప్రధానంగా సాగిన కార్యక్రమాలు ప్రేక్షకులను అలరించాయి. ఆదివారంకూడా వెనుకటిరోజులానే ఉదయపు కార్యక్రమాలతో ఆరంభమైంది. స్వామివారు స్వయంగా పాల్గొన్న వారికి ధ్యానప్రక్రియను పరిచయంచేసి జరిపించారు. తీర్థగోష్ఠి తరువాత రుచ్యంగా బాలభోగం, అనుయాగం, మధ్యమధ్య చిరుతిండ్లు వగైరా సాగాయి.

భగవద్రామానుజ సహస్రాబ్ది విశిష్టతను, అవశ్యకతను శ్రీశ్రీశ్రీ స్వామివారు ఆవిష్కరించడంతో ఆదివారం కార్యక్రమం ప్రధానంగా సాగింది. రామానుజులమీద నిర్వహించిన 'క్విజ్' చాలా ఆకర్షణీయంగా సాగింది. శనివారం ప్రాథమికాంశాలు, ఆదివారం ప్రధానాంశాలతో కార్యక్రమం సాగింది. రామానుజాచార్యస్వామి వైభవం ప్రకాశించేలా నృత్యం ఏర్పరచ బడింది.

కార్యక్రమాలన్నిటికీ తలమానికంగా సాగిన కార్యక్రమం ప్రజ్ఞా బాలుర శ్రీవిష్ణుసహస్రనామావధానం, శ్రీమద్భగవద్గీతావధానం. దీన్ని నిర్వహించిన వారు ఎంతో బుద్ధివైభవంతో ప్రేక్షకుల భాగస్వామ్యంతో కార్యక్రమం సాగింది. 8-12

సం॥ మధ్యవయస్కులు కావడం విశేషం. ఉదాహరణానికి ఏదైనా ఒక నామాన్ని చూపితే దాని అర్థాన్ని చెప్పి, అలాంటి నామాలన్నీ ఏకరువుపెట్టి వాటి అర్థాన్ని వివరించడం అనే ప్రక్రియ ప్రశంసనీయం. ఇలాగే ప్రేక్షకుడు ఎవరైనా రెండవ అధ్యాయంలోని ఒక శ్లోకం అందించి చెప్పమంటే దానిని వివరించడంతో పాటు, ఆ శ్లోకంలో ఉన్న పదాలెన్నో, వాటి అర్థమేమిటో దాని సందర్భం ఇవన్నీ వివరించడం ఒక విలక్షణమైన ప్రతిభావైభవమే. దీన్నిబట్టి ప్రజ్ఞాక్లాసుల్ని బాగా వినియోగించుకున్నారని స్పష్టపడుతుంది. శ్రీస్వామివారన్నట్లు, పెద్దలు ప్రశ్నించడంలో తప్పుచేసినా, పిల్లలు తప్పులు లేకుండా సమాధానించడం అభినందనీయం.

విభిన్నస్థలాలకు చెందిన భాగస్వాములైనవారు పిల్లలైనా, పెద్దలైనా, వారు ప్రదర్శించిన "ప్రజ్ఞ" అపూర్వం. కార్యక్రమాల్లో, ప్రదర్శించిన నృత్యాలు, పాటలు, ఆటలు, అన్నీ ప్రేక్షకుల్ని ఆకట్టుకున్నాయి. విభిన్న బృందాలుకూడా ఏర్పడ్డాయి. యువబృందం, డాక్టర్లబృందం, స్త్రీలబృందం, వికాసతరంగిణిసేవల గురించి సమాచారప్రదర్శన, భారతదేశానికి సంబంధించికూడా సాగడం విశేషం. ప్రవచనంచేసిన పెద్దలు, కుండలినితో ప్రారంభించి, అద్వైతం, ఆధునికవైద్యం, మొదలైన ఎన్నో అంశాలను ప్రస్తావించారు.

ఈ కార్యక్రమాలన్నింటిలోను శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారు పూర్తిగా తమ సాన్నిహిత్యాన్ని, మంగళాశాసనాలు అనుగ్రహించారు. ఈ సమావేశాలు చాలా అపూర్వానుభూతులను మిగిల్చాయి.

ఈ సందర్భంగా జెట్ యు.ఎస్.ఎ బాధ్యతను మహిళాసంఘానికి అప్పగించడం జరిగింది. అలాగే వికాసతరంగిణీ సేవ కార్యక్రమాలను నిర్వహించడానికి కూడా మన రామకృష్ణారెడ్డిగారి కుమార్తె శ్రీమతి అపర్ణకు బాధ్యతను అప్పగించడం జరిగింది.

ఈ కన్వెన్షన్‌లో శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారుతో పాటు, శ్రీశ్రీశ్రీత్రిదండి అహోబిలజీయర్‌స్వామివారు, వేణుగోపాలాచార్యస్వామి, శ్రీమాన్ డా॥ రామేశ్వర్‌రావు–శ్రీకుమారి దంపతులు, శ్రీమతి వనజా భాస్కర్‌రావుగారు, శ్రీమాన్ ఎర్నేని రామారావుగారు, శ్రీమాన్ విష్ణువర్ధన్‌రెడ్డి గారు, శ్రీమాన్ రాజారామ్‌గారు మొదలైన ప్రముఖులు భారతదేశమునుండి వెళ్ళి పాల్గొన్నారు.

స్థానికంగా అక్కడి ప్రముఖులు శ్రీమాన్ రామకృష్ణారెడ్డిగారు, శ్రీమతి చిత్రగారు, శ్రీమాన్ బంగారురాజు, శ్రీమాన్ అలక్కి శర్మగారు, శ్రీమాన్ రఘు మొదలైనవారు, పలువురు జెట్, వి.టి. సేవ ప్రముఖులు ఇంకా బహుసంఖ్యలో అమెరికాలోని ఆధ్యాత్మికకుటుంబమంతా పాల్గొన్నారు.

*సుమిత్రపోతరాజు, (యూ. యస్. ఎ)*

11.6.2014న శ్రీస్వామివారు అమెరికానుండి తిరుగు పయనమయ్యారు. అనంతరం శ్రీరాంనగర్ చేరారు.

13తేదీన జె.బి. ఇన్‌స్టిట్యూట్&టెక్నాలజీ అధినేత శ్రీమాన్ జె. బాస్కరరావు గారు కొంతకాలంగ అస్వస్థతగా ఉన్నారు. వారిని పరామర్శించి, మంగళా శాసనాలు అనుగ్రహించారు. సాయంత్రం బదరికాశ్రమం బయలుదేరిరి.

## బదరీయాత్ర

డెహరాడోన్ విమానాశ్రమం నుండి శ్రీమాన్ వినోద్ అగర్‌వాల్– వికాసతరంగిణి నేపాల్ వారి ఆహ్వానం మేరకు హరిద్వాలోని హరికాపౌరి చేరుకొని, వారి గీతాపఠన కార్యక్రమంలో పాల్గొని, ఆర్తితో ఎదురుచూస్తున్న వారికి మంగళాశాసనములు చేసారు. అనంతరం గంగాస్నానం, హారతి సేవించుకొని రాత్రికి హృషీకేశ్‌లోని జీయర్‌మఠానికి చేరుకున్నారు.

14.వ తేదీ తీర్థగోష్ఠి తరువాత గరుడాళ్వార్ల ప్రతిష్ఠాకార్యక్రమానికి పూర్వరంగంగా ఆధివాసములు, తిరుమంజనము జరిగినది. అదేరోజు సాయంకాలానికి వైకుంఠరాముని ఎదురుగా గరుడాళ్వార్ల ప్రతిష్ఠాకార్యక్రమము సుసంపన్నముయినది. రాత్రికి డా॥రామనాథంగారు ఆచార్య శ్రీహస్తభావంతో సమర్పించిన నూతన గరుడవాహనముపై రామచంద్రుడు సీతాలక్ష్మణ హనుమత్ సమేతంగా హృషఈకేశ్ నగరవీధులలో భక్తుల హర్షధ్వానాలమధ్య వేదవిద్యార్థుల నృత్యములతో, శ్రీస్వామివారు వెంటనడిచి కనులపండుగగా వైభవోపేతంగా జరిపించారు.

15వ తేదీ ఉదయం సపరివారంగా హృషీకేశ్ నుండి బయలుదేరి సాయంత్రానికి బదరీనాథ్ చేరుకున్నారు. గత సంవత్సరం వరదబీభత్సము వలన భక్తుల రద్దీ తక్కువగా ఉండుట వలన శ్రీస్వామివారు బదరీ పెరుమాళ్ళను ఉన్న మూడు రోజులు తనివితీరా సేవించుకొన్నారు. మానా గ్రామ భజనమండలి మరియు బదరీనాథ్ పండాల కమిటీ వారు శ్రీస్వామివారిని సేవించుకొని మంగళాశాసనములు, సహాయము పొందారు. ప్రతిరోజు జరిగే సాధుసంతర్పణలో శ్రీమాన్ శ్రీరామ్, శ్రీమాన్ వేంకటేశ్వర రావు, శ్రీమతి రాధామయి, శ్రీమాన్ శ్రీపతిగారు కైంకర్యముగావించారు.

16వ తేదీ సాయంత్రం మన అష్టాక్షరీక్షేత్రంలో కొలువున్న శ్రీభూసమేత శ్రీనివాసపెరుమాళ్ళ వార్షిక కల్యాణోత్సవం శ్రీస్వామివారు జరిపించారు. కల్యాణమునకు పట్టుపస్త్రాలు, మట్టెలు, మంగళసూత్రాలు వెండిబిందెలను శ్రీమతి లక్ష్మీరామనాథం సమర్పించారు. ఈ సంవత్సరము తదియారాధన చేసిన శ్రీమాన్ చీకోటి జనార్దనరావుగారు శ్రీస్వామివారినుండి మంగళాశాసనాలు అందుకున్నారు.

17వ తేదీ శ్రీస్వామివారు సమాశ్రయణాలను భక్తులకు అనుగ్రహించారు. 18వ తేదీ ఉదయం బయలుదేరి హృషీకేశ్‌కి చేరారు.

19వ తేదీ ఉదయం తీర్థగోష్ఠి అనంతరం "సార్థత్రికోటి సహిత యమునానది పుష్కర"స్నానానికి బయలుదేరారు. హృషీకేశ్‌కి 100కి॥మీ॥ దూరంలో ఉన్న ఉత్తరాఖండ్ మరియు హిమాచల్‌ప్రదేశ్ మధ్య "పోంటెసాహిబ్" అనేప్రదేశంలో ప్రవహిస్తున్న యమునాతీరాన్ని చేరారు. శ్రీస్వామివారు, శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు, శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయర్‌స్వామివార్లు సుమారు 150మంది భక్తులతో నదీపూజ, స్నాన తర్పణములు ఆచరింపచేసారు. ఈ సందర్భంగా యమునానది వైభవాన్ని వివరిస్తూ శ్రీరామచంద్రుడు కోపగించినగాని సముద్రుడు లంకకు దారిని ఇవ్వలేదని, అడుగకుండానే యమున వసుదేవునికి రెండుపాయలుగా చీలి, దారినిచ్చిందని చెప్పారు. నదిని దాటుతున్న చిన్ని కృష్ణుని పాదములను సేవించి, వాసుదేవుని పాదస్పర్శతో పునీతమైన యమునానది భగవత్, భాగవత కైంకర్యం చేసిన యమున పరమపవిత్రమైన పుణ్యనది. అట్టి యమునాపుష్కర ప్రథమ దినాన స్నానమాచరింపచేసిన శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారికి భగవద్బంధువులు శతకోటి దాసోహములు సమర్పించుకున్నారు.

ఈ కార్యక్రమాన్ని నిర్వహించిన బాకాస్ అధ్యక్షులు శ్రీమాన్ డా॥ రామనాథం, సెక్రటరీ శ్రీమాన్ చీకోటి వేంకటేశ్వరరావు, సభ్యులు వేణుగోపాల్, శ్రీమాన్ లక్ష్మణరావు, శ్రీమాన్ కె.బి.చారి మరియు మోహన్‌రావులకు శ్రీస్వామివారు మంగళాశాసనాలను అనుగ్రహించారు.

20వ తేదీ సా॥ విజయనగరంలో శోభాయాత్రగా ఉబయవేదాంతసభ రజతోత్సవాలలో పాల్గొన్నారు.

21 నుండి 23వ తేదీవరకు విజయనగరం త్రైవర్ణిక రామానుజకూటంలో జరిగిన వివిధ కార్యక్రమాలలో శ్రీస్వామివారు పాల్గొన్నారు. వివరాలు వచ్చేసంచికలో....

# పరమపదవార్తలు



లింగారెడ్డిపల్లి గ్రామం, బత్తలపల్లి(మం) అనంతపురం జిల్లా వాస్తవ్యులు, శ్రీస్వామివారి శిష్యులు **శ్రీమాన్ చింతకుంట నారాయణాచార్యులు 2-5-14**న ఆచార్య తిరువడిని చేరినారు. వీరికి పరమపదంలో శాశ్వతకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు వీరి కుటుంబసభ్యులకు మంగళాశాసనం చేసారు.



కరీంనగర్ చైతన్యపురి, వాస్తవ్యులు, శ్రీస్వామివారిశిష్యులు **శ్రీమాన్ చందుపట్ల వీరసేనారెడ్డి** 23-5-2013న ఆచార్య తిరువడిని చేరినారు. వీరి **సంవత్సరీకం 12-5-14** జరిగింది. వీరికి పరమపదంలో శాశ్వతకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు వీరి కుటుంబసభ్యులకు మంగళాశాసనం చేసారు.



మంచిర్యాల వాస్తవ్యులు, మాజీ శాసనసభ్యులు **శ్రీమాన్ గోనె హనుమంతరావు** గారు **14.6.2014**న పరమపదాన్ని అలంకరించారు.

వీరు శ్రీస్వామివారు నిర్వహించిన అనేక కార్యక్రమాలలో అన్వయించి, తమవంతు కైంకర్యాన్ని సమర్పించారు. మంచిర్యాల గోదావరి పుష్కరాలకి హనుమంతరావుగారు చేసిన సేవలు ఎనలేనివి. వీరికి పరమాత్మ పదసన్నిధిలో శాశ్వతకైంకర్యం లభించాలని, వీరి కుటుంబ సభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనాన్ని అనుగ్రహించారు.



తూర్పుగోదావరిజిల్లా అనవపర్తి వాస్తవ్యులు శ్రీమాన్ **చిలకమర్తి సత్యనారాయణాచార్యులుగారు 5.6.2013**న ఆచార్యతిరువడి చేరినారు. వీరి ప్రథమ వర్ధంతి 25.5.2014. ఈ సందర్భంగా వీరి కుటుంబ సభ్యులు భక్తినివేదనకు కైంకర్యం సమర్పించినారు. వీరి కుటుంబ సభ్యులకు శ్రీస్వామివారు మంగళా శాసనాలు కృపచేశారు.



గుంటూరుజిల్లా, సీతానగరం-మహానాడు వాస్తవ్యులు శ్రీమతి **పి. సరస్వతిగారు 31.5.2014**న ఆచార్యతిరువడిని అలంకరించారు. వీరికి పరమపదంలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళా శాసనాలు కృపచేశారు.



కృష్ణాజిల్లా తిరువూరు వాస్తవ్యులు శ్రీమాన్ కటికనేని మురళీకృష్ణగారి ధర్మపత్ని **శ్రీమతి కటికనేని భారతమ్మ**గారు ది. **20.5.2014**న పరప పదించారు. వీరు శ్రీ పెద్ద జీయరు స్వామివారి వద్ద సమాశ్రితులు. ఆనాటి నుండి నేటి వరకు కూడా సంప్రదాయనిష్ఠతో ఉంటూ శ్రీ చిన్న జీయరు స్వామివారు నిర్వహించే అనేక కార్యక్రమాలలో పాల్గొంటూ , తమ వంతు సహకారం అందిస్తూ విశేష సేవలు చేసి తరించిన ధన్యజీవి. వీరికి శ్రియఃపతి సన్నిధిలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.

సీతానగరం వాస్తవ్యులు **శ్రీమాన్ పరశురామయ్య 4.6.2014**న పరమపదాన్ని పొందారు. వీరు రైల్వే ఉద్యోగానంతరం శ్రీస్వామివారి కైంకర్యం చేసుకుంటూ కాలాన్ని గడిపారు. వీరు వీరి శ్రీమతి ఇరువురూ శ్రీస్వామివారి కైంకర్యపరులే. వీరు కాలంచెందేవరకు సీతానగరం ఆశ్రమంలో చెట్లను సజీవంగా ఉంచడంలో తీసుకునే శ్రద్ధ చెప్పరానిది. తదీయారాధనకు కూరగాయలు తీసుకురావడం, గేటువద్ద కాపలాకాయడం వీరి నిత్యకృత్యం. 75సం॥ పైబడ్డ వీరు ఎండలకు ఓర్వలేక శాశ్వతలోకాన్ని పొందారు. వీరికి శ్రీస్వామివారు మంగళాశాసనాన్ని అనుగ్రహించారు.

చుందూరు మండలం, నడిగడ్డపాలెం వాస్తవ్యులు **శ్రీమాన్ సాంబయ్య 4.6.2014**న పరమపదాన్ని పొందారు. వీరు నడిగడ్డపాలెం ఆశ్రమం ప్రారంభమైననాటినుండి అక్కడ సేవచేయడమే లక్ష్యంగా సాగారు. వీరు శ్రీస్వామివారు నిర్వహించే శ్రీరాంనగర్, సీతానగరం, బదరీనాథ్ వంటి ప్రదేశాలకు వెళ్ళి కైంకర్యాన్ని చేసేవారు.

వీరికి పరమాత్మ పదసన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనాన్ని అనుగ్రహించారు.



వరంగల్ జిల్లా, హన్మకొండ వాస్తవ్యులు **శ్రీమాన్ నూగూరి కిషన్**గారు ది. **23.6.2012**న ఆచార్య తిరువడి చేరినారు. వీరి **ద్వితీయ వర్ధంతి 1.7.2014**. వీరి ఈ సందర్భంగా వీరి కుటుంబ సభ్యులు భక్తినివేదనకు కైంకర్యం సమర్పించినారు. వీరి కుటుంబ సభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు కృపచేశారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన **జూన్ నెల సమాధానాలందాయి.** విజేత పేరు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం! *గతనెల సమాధానాలు 37వ పేజీలో కలవు.*

**ప్రశ్నలు** **సమాధానాలు**

1. ప్రధనాత్ పృథివీ అని నిర్వచించిన ఆచార్యుడెవ్వడు?
2. అజ్ఞాత కర్తృకమైన సంస్కృతనాటకం?
3. ఈశ్వరునికి పరతంత్రాలైన తత్త్వాలు ఏవి?
4. పరబ్రహ్మప్రాప్తికి సాధనం ఏది?
5. 'తదిదం' అనే శ్లోకానికి వివరణలు వ్రాసినవారెవరు?
6. నూతనంగా పరిచయం చేయబడిన గ్రంథం ఏది?
7. రామచంద్రుడు చందనం వృక్షంలాంటివాడైతే రామభక్తుడు ఎలాంటివాడు?
8. 'పొరుళ్' అనే పదానికి అర్థం?
9. శ్రీరంగనాథుని కీర్తిధ్వజం ఎవ్వరు?
10. శ్రీరామానుజులకు ఎవరితో కల్యాణం జరిగింది?
11. రాజసూయంలో విదురునికి అప్పగించిన బాధ్యత ఏది?
12. మందస ఆలయంలో ఉన్న పెరుమాళ్ ఎవ్వరు?
13. శుక్రవారం వ్యూహలక్ష్మికి అభిషేకం చేసేటప్పుడు ఏ ప్రబంధాన్ని అనుసంధించాలి?
14. ఈనెల కలర్ చిత్రాలు ఎక్కడివి?
15. తిరుమంగైఆళ్వార్లు ఏ కవితో వాదించారు?
16. 'విపద స్సంతున శశ్వత్' అన్నది ఎవరు?
17. భాగవత సప్తాహం నిర్వహించిన వాడెవ్వడు?
18. చెన్నారు వైష్ణవ చిహ్నం ఏది?
19. ఈనెల ముముక్షు రహస్యంలో ఉట్టంకించిన పాశురం ఎక్కడిది?
20. గాల్‌బ్లాడర్ సరిగా పనిచేయకపోతే ?
21. నోటినుండి పొట్టదాకా పొడవుగా వ్యాపించిన పొడవాటి గొట్టంలాంటి వ్యవస్థఏది?

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేతల పేర్లు:**
బి. సాధుబాబు- యం.వి.పి. కాలనీ, విశాఖపట్నం.

**సరియైన సమాధానములు వ్రాసినవారు**
కొమాండూరి ఇందిరా - హైదరాబాద్, కె. రాజ్యలక్ష్మి- కొత్తగూడెం, కానాల రమాదేవి- హైదరాబాద్, గుడివాడ రాజ్యలక్ష్మీ-గుంటూరు. వి. రామసీతమ్మ-కాళ్ళకూరు

మీ చిరునామా
.............................................
.............................................
.............................................
.............................................

*సూచన:* సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.
భక్తినివేదన సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929








# వికాసదర్శిని

*సమగ్ర సమాచార నివేదన*

**సంపాదకులు శ్రీమతి టి. అరుణ**

## జీయర్ విద్యాసంస్థల ఉపాధ్యాయుల శిక్షణ శిబిరం



జీయర్ విద్యాసంస్థల ఉపాధ్యాయులకు 15-05-2014 నుండి 30-05-2014 వరకు శ్రీరామ్ నగరంలో శిబిరం నిర్వహించారు. ఈ కార్యక్రమాన్ని శ్రీశ్రీశ్రీ చినజీయరు స్వామివారు ప్రారంభించారు.

మానవునిలో దాగియున్న అంతర్గత శక్తులను బహిర్గతం చేయడమే విద్య యొక్క పరమావధి. పిల్లలు విద్యను పొందే హక్కుతోపాటు విద్యానాణ్యత గురించి కూడా దృష్టి సారించాలని, పిల్లల శారీరక, మానసిక, ఉద్వేగ వికాసాలను, రాజ్యాంగ విలువలను, పిల్లలు పొందిన జ్ఞానము, నైపుణ్యాలు, సామర్థ్యాలను నిత్య జీవితంలో అన్వయించుకునే వైఖరిని మదింపు చేయాలని విద్యా హక్కు చట్టం సూచించింది. చదువు అంటే మార్కుల ఉత్పత్తి కేంద్రం కాదు. సామర్థ్యం అంటే బట్టీ పట్టడం కాదు. విషయ పరిజ్ఞానంతోపాటు సమాజంపట్ల, ప్రకృతి పట్ల, జీవవైవిధ్యంపట్ల బాధ్యత వహించే వ్యక్తులుగా, సున్నితంగా స్పందించేవారిగా ఎదిగేందుకు నిరంతర సమగ్ర మూల్యాంకనం ఎంతగానో దోహదపడుతుందని విద్యావ్యవస్థలో రాష్ట్ర ప్రభుత్వం ద్వారా ప్రవేశపెట్టబడింది. ఈ మార్పుకు అనుగుణంగా రాష్ట్ర విద్యా పరిశోధన శిక్షణ సంస్థ, ఆంధ్రప్రదేశ్ (ఎ.పి.ఎస్.సి.ఇ.






ఆర్.టి), రిసోర్స్ పర్సన్స్ ద్వారా మన జీయర్ గురుకుల ఉపాధ్యాయులకు శిక్షణ అందించడం జరిగింది.

శ్రీశ్రీశ్రీ స్వామివారు ఈ శిక్షణ శిబిరాన్ని ప్రారంభిస్తూ సమయాన్ని చక్కగా సద్వినియోగం చేసుకోవాలని, ఈ శిక్షణ శిబిరం నుండి మంచిని గ్రహించి విద్యార్థుల నిరంతర వికాసానికై కృషి చేయాలని ఉపాధ్యాయులకు మంగళాశాసనం చేసారు.

15-05-2014 నుండి 17-05-2014 వరకు ఎస్.సి.ఎ.ఆర్.టి. కేంద్ర ఎ.పి.ఎ.ఆర్.డి.లో నిరంతర సమగ్ర మూల్యాంకనంపై శిక్షణ నిచ్చారు.

18-05-2014 నుండి 25-05-2014 వరకు శ్రీమాన్ కె.విజయబాబు ఇంగ్లీషు లెక్చరర్ ఆంగ్లభాషలో భావ ప్రసార నైపుణ్యంపై శిక్షణనిచ్చారు. 23,24 తేదీలలో విక్రమ్, విజయ్, స్వామినాయుడు కంప్యూటర్‌పై శిక్షణనిచ్చారు. జీయర్ గురుకులం అరణ్య ప్రాంతంలో, సముద్రతీరంలో ఉండడం వల్ల, ఆసుపత్రులకు దూరంగా ఉండడంవల్ల ఆరోగ్యం మరియు ప్రాథమిక చికిత్స గూర్చి డా. రామనాథం(బాకాస్ అధ్యక్షులు) శిక్షణనిచ్చారు. శ్రీమాన్ అశోక్‌రెడ్డి, శ్రీమతి నీరజ, ఎస్.సి.ఆర్.టి. టెక్స్ట్ బుక్ విభాగంవారు నాలుగురోజులు శిక్షణ నిచ్చారు. ఈ శిక్షణ ఉపాధ్యాయులకు వారి వారి విశ్వాసపు స్థాయిలను పెంచడంలో బాగా ఉపకరించింది. బోధనా మరియు పాఠ్యాంశములలో మూల్యాంకనంలో చాలా మార్పులను విషయ పరంగా ప్రవేశపెట్టడం జరిగింది. ఈ విషయంపై సమగ్ర అవగాహన కలిగించడానికి ఎస్.సి.ఇ.ఆర్.టి. నుండి డా. ఉపేంద్రరెడ్డి, సువర్ణవినాయక్, శ్రీ జానారెడ్డి, శ్రీమతి మాధవి, ఉపేంద్రరావు, రథాంగపాణి, శ్రీధరాచార్యులు, గణపతి 29,30 తేదీలలో శిక్షణ నందజేసారు. విద్యాప్రమాణాలను, వివిధ లక్ష్యాలను ఉపాధ్యాయులు చక్కగా తెలుసుకున్నారు. వికాసతరంగిణి సెంట్రల్ ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీమాన్ భవానీ ప్రసాద్‌గారి సలహా సంప్రదింపులతో శిక్షణ సమర్థవంతంగా జరిగింది.

శిక్షణ శిబిరం ఇన్‌చార్జ్ శ్రీమతి కె. కృష్ణకుమారి రోజంతా జరిగిన విషయాలను పునశ్చరణ చేయిస్తూ, యోగా, ప్రాతఃస్మరణీయం తరగతులను పర్యవేక్షించారు. అనుభవజ్ఞులైన రీసోర్స్ పర్సన్సను ఏర్పాటుచేస్తూ చక్కటి శిక్షణ కార్యక్రమాలను నిర్వహించారు. శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారి మంగళాశాసనములతో శిక్షణ శిబిరం సుసంపన్నమైంది.

**మహిళా ఆరోగ్య వికాస్ :**




శ్రీరాంనగర్ జిమ్స్ హాస్పిటల్‌లో మే నెలలో 24,25 తేదీలలో శ్రీమతి మాధవి రవీంద్రగారు జంటనగర కార్యకర్తలకు శిక్షణ నందించారు. 15 మంది కార్యకర్తలు శిక్షణలో పాల్గొన్నారు. మహిళా ఆరోగ్య వైద్యశిబిరాలు ఎలా నిర్వహించాలో అందరికీ అర్థమయ్యేలా చక్కగా వివరించారు. జంటనగరాల కార్యదర్శి వనజా చలపతిరావు, ఆరోగ్య సమన్వయకర్త శ్రీమతి సునీత ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

**గుడి మల్కాపురం, హైదరాబాద్ :**



ప్రజ్ఞ ఉచిత వేసవి శిక్షణ తరగతులను నిర్వహించారు. 40 మంది విద్యార్థులకు శిక్షణ నందించారు. శ్రీమాన్ సుధాకర్ రెడ్డి కార్యదర్శి, ఆరోగ్యవికాస్ సమన్వయకర్త శ్రీమతి సునీత, ప్రజ్ఞ కో-ఆర్డినేటర్ శ్రీమతి గీతారాణి కార్యక్రమాన్ని చూసి శ్రీమతి రంగనాయకి గారి సేవలను అభినందిస్తూ విద్యార్థుల కార్యక్రమాలను చూసి అరుణా రాఘవరెడ్డి బహుమతులు అందజేసారు. ప్రతి వారం అందరూ నేర్చుకోవాలని తెలియజేసారు.

**ఎల్.ఐ.సి. కోలనీలో చలివేంద్రం ఏర్పాటు :**గత 12 సంవత్సరాలుగా ఈ కోలనీలో చలివేంద్ర కేంద్రాన్ని ఏర్పాటు చేసి ప్రజలకు సేవలందిస్తున్నారు. చలివేంద్రంలో సేవలంద జేసిన చి.రోహిత్‌కు రూ. 3000/- ఆర్థిక సహాయం అందజేసారు.

**జంటనగరాల సమావేశం - దోమల్‌గుడా :**

జూన్ 1వ తేదీ సాయంత్రం గం.5లకు శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయర్ స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో కార్యకర్తల సమావేశం జరిగింది. వికాసతరంగిణి శాఖల ముఖ్య సభ్యులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. సుమారు 30శాఖల కు చెందిన సభ్యులు తమ నివేదికలను అందజేసారు. ప్రజ్ఞ, ఆరోగ్యవికాస్, సత్సంగ నిర్వహణ గురించి విషయాలను అందించారు. రామానుజ సహస్రాబ్ది ఉత్సవాలను ఏ విధంగ నిర్వహించుకోవాలో శ్రీ దేవనాథ జీయర్‌స్వామివారు వివరించారు. కార్యక్రమాలను ఎలా నిర్వహించాలో శ్రీమాన్ మహేంద్రరెడ్డిగారు, శ్రీమాన్ సూర్యనారాయణగారు, శ్రీమతి ఆండాళ్ దేవిగారు,

పద్మనాభరావుగారు, శ్రీమతివనజాచలపతి, అరుణారాఘవరెడ్డి, శ్రీమతి గీత, మొదలైనవారు తెలియజేసారు. ఈ కార్యక్రమంలో ప్రజ్ఞ, సత్సంగ కార్యక్రమాలను గురించి వికాసదర్శిని సంపాదకులు శ్రీమతి అరుణ వివరించారు.

**హైద్రాబాద్ :**

శ్రీమతి వనజాచలపతిగారి నేతృత్వంలో 15-06- 2014 తేదీన మదీనాగూడాలోని మై హోమ్ జువెల్ ప్రాంగ ణంలో జరిగిన ఉచిత మహిళా ఆరోగ్యశిబిరానికి హాజరైన 82 మంది మహిళలకు శ్రీమతి మాధవీ రవీంద్రగారు ఆరోగ్య పరీక్ష చేసారు. ఆ శిబిరానికి వచ్చిన వారందరికీ ఆరోగ్యవికాస్ నిర్వహిస్తున్న కార్యక్రమమునుగూర్చి తెలియజేసారు. పరీక్షలు చేయించుకున్న 11మంది మహిళలకు మళ్ళీ పరీక్షలు చేయ వలసిన అవసరం కలిగింది. శిబిరానికి వచ్చిన మహిళల వెంట డా.చలపతిరావుగారు జనరల్ పరీక్ష చేయడమైనది. హైద్రాబాద్ ఆరోగ్యవికాస్ కన్వీనర్ శ్రీమతి సునీతగారు వి.ఐ.ఎ. పరీక్ష చేయడానికి శిక్షణ తీసుకోవడం జరిగింది. ఈ శిబిరానికి విజయవాడ ఆరోగ్య వికాస్ నిర్వహించే కార్యకర్తలు రత్నమాల, జయలక్ష్మి, ఆదిలక్ష్మిగారు మరియు జంటనగరాలకు చెందిన ఆరోగ్యవికాస్ కార్యకర్తలు పాల్గొన్నారు. ఈ శిబిరానికి విటి. కేంద్రకమిటీ సభ్యులు శ్రీమాన్ సూర్యనారాయణ, రాజేశ్వరీ దంపతులు ఈ శిబిరంలో పాల్గొన్నారు. విజేత సూపర్ మార్కెట్ వారు ఉచితంగా మందులు అంద జేసారు.

**అల్వాల్-తిరుమలగిరి- సికింద్రాబాద్ :**

కరీంనగర్ సభ్యులు శ్రీమతి లీలగారు ముందుకు వచ్చి అల్వాల్‌లో నూతనంగా వికాసతరంగిణి శాఖను ఏర్పాటు చేసారు. శ్రీశ్రీశ్రీ దేవనాథ్ రామానుజ జీయర్ స్వామివారు 80మంది సభ్యులతో శాఖను ప్రారంభించి మంగళాశాసనం చేసారు. జంటనగరాల వికాసతరంగిణి సెక్రటరీ శ్రీమతి వనజా చలపతి, కూకట్‌పల్లి సభ్యురాలు పద్మగారు పాల్గొన్నారు.

**కరీంనగర్ : కరీంనగర్ జిల్లా :**

వికాసతరంగిణి ఆండాళ్ భవన్‌లో విద్యార్థులకు ప్రజ్ఞ "ఉచిత వేసవి శిక్షణ శిబిరం" జరిగింది. విద్యార్థులను ప్రోత్సహిస్తూ వారికి పరీక్షలు నిర్వహించారు. గెలుపొందిన వారికి 21-05-2014న బహుమతులు



అందజేసారు. కార్యక్రమంలో ప్రథమ, ద్వితీయ, తృతీయ, ప్రోత్సాహక బహుమతులతోపాటు 150 మందికి ప్రశంసాపత్రములు అందజేసారు. ఈ కార్యక్రమంలో ముఖ్య అతిథులుగా జిల్లా విద్యాశాఖ ఉప అధికారి కె.ఆనంద్‌గారు, శ్రీమాన్ సి.హెచ్.అయోధ్య రామారావు గారు, పట్టణ శాఖల అధ్యక్షులు పాల్గొన్నారు. టి.. రవీందర్‌రావు, శ్రీ పి. వేణుగోపాల్, కుమారి, ఎస్. శ్రీదేవి, యం. రాజేంద్రరెడ్డి, ఎస్. నరసింహాచార్యులు, శ్రీమతి సి. అరుణ భాస్కరరావు ప్రజ్ఞ విద్యార్థులకు శిక్షణ నిచ్చారు. ఆర్థికంగా శ్రీమాన్ యాదవకృష్ణ, అయోధ్య రామారావు సహకరించారు.

05-06-2014 ప్రపంచ పర్యావరణ దినోత్సవం సందర్భంగా కరీంనగర్ పట్టణంలో వికాసతరంగిణి మరియు మానేర్ పర్యావరణ సమితి కలిసి స్థానిక పద్మనాయక కళ్యాణ మండపంలో పండ్లమొక్కలు మరియు పూలమొక్కలు నాటి, జిల్లా కార్యాలయం ఆండాళ్ భవనంలో సభ నిర్వహించారు. ఈ కార్యక్రమానికి శ్రీమాన్ బోయినపల్లి వెంకట రామారావు (స్వాతంత్ర్య సమరయోధులు), కాటారి దేవేందరరావుగారు (మాజి శాసనసభ్యులు) ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు. పర్యావరణంపైన శ్రీమాన్ తోట లక్ష్మణరావుగారు (రిటైర్డ్ ప్రిన్సిపాల్) మానేరు పర్యావరణం అధ్యక్షులు రచించిన పుస్తకాన్ని ఆవిష్కరించారు. పర్యావరణాన్ని కాపాడుటకు తీసుకోవలసిన జాగ్రత్తలను గురించి అందరూ వివరించారు. ఈ కార్యక్రమంలో 80మంది పాల్గొన్నారు. వారందరికీ వికాసతరంగిణి కార్యకర్తలు గుడ్డ సంచులను అందజేసారు.



శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో 07-06-2014 ఉదయం గం. 11 నుండి కరీంనగర్ జిల్లాలో 28 శాఖల ప్రతినిధులతో జిల్లా కార్యాలయం ఆండాళ్ భవన్‌లో వికాసతరంగిణి సమావేశం జరిగింది. ఈ సమావేశమునకు వికాసతరంగిణి ఆర్గనైజింగ్ సెక్రటరీ భవానిప్రసాద్‌గారు, సెంట్రల్ కమిటి జనరల్ సెక్రటరీ శ్రీమాన్ బాలకృష్ణగారు కార్యక్రమాన్ని నిర్వహించారు. యువ వికాస్, విజ్ఞాన వికాస్ ఆరోగ్య వికాస్ ద్వారా సమాజానికి అందించగలిగే సేవలు తెలియజేసారు. భగవద్రామానుజ సహస్రాబ్ది

కార్యక్రమాలు ఏ విధంగా నిర్వహించాలో తెలియజేసారు. 28 శాఖలలో మొదటి విడతగా 1214 మందికి సభ్యత్వ కార్డులు అందజేసారు. కరీంనగర్ వికాసతరంగిణి నిర్వహిస్తున్న కార్యక్రమాలను కేంద్ర కమిటీకి వివరించారు.

**మార్టూరు, ప్రకాశం జిల్లా:**



02-06-2014 మార్టూరు జీవన్ వికాస్‌లో జిల్లా శాఖల సమావేశం జరిగింది. ఈ సమావేశంలో 12 శాఖల నుండి 50 మంది కార్యకర్తలు పాల్గొన్నారు.

వికాసతరంగిణి సెంట్రల్ కమిటీ ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీమాన్ భవానీ ప్రసాద్‌గారు కార్యక్రమాన్ని ప్రారంభించారు. సమావేశానికి సెంట్రల్ కమిటి సహాయ కార్యదర్శి శ్రీమన్ విద్యాసాగర్ అధ్యక్షత వహించారు. సెంట్రల్ కమిటీ గాయత్రీ దేవిగారు శాఖల సభ్యుల గుర్తింపు కార్డులు అందజేసారు. 2014-16 సం.కి శ్రీమాన్ సీతారామయ్య చౌదరి అధ్యక్షులుగా, శ్రీమాన్ హరిప్రసాద్‌రావు ఉపాధ్యక్షులుగా, కార్యదర్శిగా శ్రీమాన్ వెంకటేశ్వరరావు, ఆరోగ్య వికాస్ సమన్వయ కర్తగా మాధవి (యద్దనపూడి) బాధ్యతలు స్వీకరించారు. నూతన జిల్లా కమిటీకి అందరూ అభినందనలు తెలియజేసారు.

ఆర్గనైజింగ్ సెక్రటరీ సూచన మేరకు ప్రతి వికాస తరంగిణి శాఖ నుండి అధ్యక్షులు, కార్యదర్శి, కోశాధికారి, సత్సంగ సమన్వయకర్త, మహిళా ఆరోగ్య వికాస్ సమన్వయ కర్తలను త్వరలో ఏర్పరచుకోవాలని సమావేశం నిర్ణయించింది. 120 మంది సభ్యులతో యువ వికాస్ ఏర్పడింది. ఆ శాఖ ప్రతినిధులు శ్రీమాన్ రంగనాయకులుగారు, శ్రీమాన్ నాగేంద్ర గారు సమావేశంలో ప్రసంగించారు. మహిళా ఆరోగ్య వికాస్ సమన్వయ కర్త మాధవీ రవీంద్ర (విజయవాడ) మహిళా ఆరోగ్య వికాస్ గురించి వివరించారు. ప్రకాశం జిల్లాలో 6 వైద్య శిబిరాలు నిర్వహించినట్లు తెలియజేసారు. శాంతిమంత్రంతో సమావేశం ముగిసింది.

**గుంటూరు :**

01-06-2014 గుంటూరు నగరంలో వికాసతరంగిణి కార్యాలయంలో సేవా భవన్‌లో జిల్లా శాఖల సమావేశం జరిగింది. 19 శాఖల నుండి 70మంది కార్యకర్తలు పాల్గొన్నారు.

వికాసతరంగిణి సెంట్రల్ కమిటి ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీమాన్ భవానీప్రసాద్‌గారు సహాయ కార్యదర్శి విద్యాసాగర్‌గారు పాల్గొన్నారు. గతంలో జరిగిన జిల్లా కార్యక్రమాలను సమీక్షించారు. సెంట్రల్ కమిటీ సభ్యులు శ్రీమతి గాయత్రీ గారు శాఖల గుర్తింపు కార్డులను అందజేసారు. శ్రీమతి మల్లిక్ గారు ఇప్పటి వరకు జిల్లా అధ్యక్షులుగా ఉన్నారు. పాత కమిటీవారికి సభ కృతజ్ఞతలు తెలియజేసింది. నూతనంగా శ్రీమతి లగడపాటి రామలక్ష్మి అధ్యక్షతన ఏర్పడిన నూతన కమిటీ అందరికీ అభినందనలు తెలియజేసారు. సమతామూర్తి శ్రీ భగవద్రామాను జల నిర్మాణంలో గుంటురుజిల్లాని భాగస్వామ్యం చేసే విష యంలో సభ్యులు ఉత్సాహంతో ముందుకు వచ్చారు. శాంతి మంత్రంతో సభ ముగిసింది.

**గొల్లపూడి, విజయవాడ :**

స్టేట్ కో-ఆర్డినేటర్ శ్రీమతి మాధవీరవీంద్ర గారి ఆధ్వర్యంలో 20-04-2014న గొల్లపూడిలోని గవర్నమెంట్ స్కూల్ నందు శ్రీమతి విజయలక్ష్మి గారు ఏర్పాటు చేసిన మహిళా వైద్య శిబిరానికి 106 మంది హాజరుకాగా అందులో 53 మందికి వి.ఐ.ఎ. పరీక్ష జరిపి 7గురు మహిళలను ఎన్.ఆర్.ఐ. హాస్పిటల్‌కు జియర్ ట్రస్ట్ ద్వారా ఉచిత పరీక్షలు చేయించారు. వారిలో శ్రీ కుమారి అనే మహిళకు కేన్సర్ లక్షణాలు ఉండడం వలన ఆపరేషన్ చేయించడం జరిగింది. పద్మ అనే మహిళకు కూడా అపరేషన్ చేయవలసిన అవసరం ఉందని డాక్టర్లు సూచించారు. ఎన్.ఆర్.ఐ.లో ఉచిత సేవలు పొందిన మహిళలు మరియు ఆపరేషన్ చేయించుకున్నవారు స్వామివారికి కృతజ్ఞ తలతో దాసోహం తెలియజేసారు.

**జగ్గయ్యపేట, కృష్ణా జిల్లా :**

26-05-2014న వైశాఖ మాసం సందర్భంగా శ్రీ లక్ష్మీ అమ్మవారి వెండి దేవాలయం వద్ద 50 మంది యాచకులకు పాదరక్షలు, మామిడిపండ్లు, మజ్జిగ, ప్రసాదం అందజేసారు.. ఆలయ అర్చకునకు గొడుగు, నూతన వస్త్రాలు, దక్షిణ తాంబూలాలు అందజేసారు. శ్రీమతి పద్మనాభం, పద్మావతి, ఇందుమత, శ్రీ యం. బదరీనారాయణ, పి కేశవరావు గార్లు ద్రవ్య సహకారం అందించారు. వికాసతరంగిణి కార్యకర్తలు, సభ్యులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

**ఏలూరు :**

వికాసతరంగిణి సభ్యులు వేసవికాలమంతా చలివేంద్రం ద్వారా మజ్జిగ నందించారు. శ్రీ జనార్ధనస్వామి ఆలయ సన్నిధిలో వికాసతరంగిణి ప్రతిరోజూ రోజుకొకరు చొప్పున అందరికి మజ్జిగ అందజేసారు. అధ్యక్షురాలు సాయిలీల, పి.పద్మావతి, కె. నాగలక్ష్మి, కె. కళావతి, కె.ప్రభావతి, కె. నిర్మల, ఉమాదేవి, వికాసతరంగిణి సభ్యులు సేవలందించారు.

**పాలకొల్లు, పశ్చిమగోదావరి జిల్లా :**

108వ శాఖ వికాసతరంగిణి కార్యకర్తలు ప్రజ్ఞ తరగతులు నిర్వహించారు. హర్యష్టకం, యోగ, ధ్యానం, భాగవత రామాయణ కథలను చెప్పి చక్కటి మానవతావిలువలను విద్యార్థులకు అర్థమయ్యేలా వివరించారు. 45మంది విద్యార్థులు శిక్షణ పొందారు. మాధురి, పార్వతిరామానుజ దాసి మొదలైన కార్యకర్తలు కార్యక్రమాన్ని నిర్వహించారు.

**కార్యకర్తలకు సూచన: మీ వికాసతరంగిణి శాఖ ద్వారా చేసే ఆధ్యాత్మిక, సామాజిక, సేవా కార్యక్రమాలను అందరితో పంచు కోవాలనుకుంటున్నారా! కార్యక్రమ వివరాలను సంక్షిప్తంగా వ్రాసి, కార్యక్రమ ఫోటోలను జతపరచి ప్రతి నెల 10వతేదీలోపుగా news@vtsbharath.org కి మెయిల్ చేయండి. Cell No. 9440106555**

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః

67 సం॥ల నుండి భగవద్బంధువులు ఆదరిస్తున్న...
ఆధ్యాత్మిక మాసపత్రిక

# భక్తినివేదన








సంపుటి 67

ఆగస్టు 2014

శ్రీజయనామ సంవత్సర శ్రావణమాసము

సంచిక 5


## పంచాంగ వివరములు

**ఆగస్టు:**

1. నాగ గరుడ పంచమీ, బదరీ నారాయణపెరుమాళ్‌తిరు
2. శ్రీసుదర్శనాళ్వాన్‌తిరు
3. ఆశ్లేషకార్తి, భానుసప్తమి
7. సర్వేషామేకాదశి
8. అవమతిథి, వరలక్ష్మీవ్రతం, గురుమౌఢ్యనివృత్తి, దామోదర ద్వాదశి
9. వరాహజయంతి, ఆళవందార్‌తిరు, పుండరీకాక్షులతిరు
10. ఋగ్యజుర్వేదులకు ఉపాకర్మ, హయగ్రీవజయంతి, రక్షా బంధనం, విఖనసజయంతి, తెర్కాళ్వార్‌తిరు
14. శ్రీశ్రీశ్రీ త్రిదణ్డి శ్రీమన్నారాయణ రామానుజ పెద్దజీయర్ స్వామి వారి తిరు
15. స్వాతంత్ర్యదినోత్సవము
17. మఖ కార్తె, సింహసంక్రమణము రా. 8-27, స్మార్త శ్రీకృష్ణజయంతి
21. సర్వేషామేకాదశి
23. మాసశివరాత్రి
25. పోలాలమావాస్య, పిండపితృయజ్ఞము, అమాసోమవారవ్రతం,
28. బలరామజయంతి, అట్ల తదియ, షోడశోమావ్రతం
29. విఘ్ననివారణ చతుర్థి, విష్వక్సేనపూజ, సామోపాకర్మ
30. ఋషిపంచమి
31. పుబ్బకార్తి, సూర్యషష్ఠి

**సెప్టెంబర్:**

5. సర్వేషామేకాదశి (పరివర్తనైకాదశి


వ్యవస్థాపకులు
పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ
రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు
శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి
శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. రంగరామానుజాచార్యులు

ఉప సంపాదకులు
శ్రీమతి డా॥ T.K. చూడామణి

చందావివరాలు :-
సంవత్సరచందా రూ.225/-
విదేశాలకు సంవత్సరచందా $30/-

మా సేవలో....
భక్తినివేదన, సీతానగరం - 522 501,
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

D.T.P. & Design by :
పరిశోధనాలయమ్

E-mail : jetsitanagaram@yahoo.com
Internet : www.chinnajeeyar.org


## విషయసూచికా




*Printed & Published by :* H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**
*Printed & Published at :* **Srijman Printers & processors** : C/o JET, Sitanagaram - 522 501, Guntur Dist., Andhra Pradesh.
*Editor :* Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.

# సంపాదకీయం "మాతృశతేభ్యోఽపి వత్సలతమా వేదమాతా"



భారతీయ సంస్కృతికి, నూతన సంప్రదాయానికి మూలకందం వేదం అని మనందరం విశ్వసిస్తాం. మనకు సాధనాలుగా ఉన్న ప్రత్యక్షం, అనుమానం మొదలైన ప్రమాణాలపైలేని విశ్వాసం మనకు మనవేదాలపై ఉంది. దానికి కారణం ప్రత్యక్షం మనల్ని వంచించవచ్చు. ఎందువల్లనంటే ఈ కన్నులతోనే చూచినదాన్ని ఒకప్పుడు మనం విశ్వసించలేం. కారణం–ఈకన్ను ఏదైనాదోషంతో కూడి ఉంటే సరిగా వస్తువును చూపలేక పోవడమే. కనుకనే చూచిందల్లా నిజమని నమ్మలేం. అయినా ఒకప్పుడు ఇది నిజం చెబుతుంది కనుక ప్రమాణంగానే పరిగణించాం. ఇక ఈ ప్రత్యక్షం మీద ఆధారపడిందే అనుమానం. ప్రత్యక్షాన్ని అనుసరించిన 'మానం' 'అనుమానం' (ప్రమాణం) ఇది. 'అను' అనేశబ్దం హీనార్థకంకూడా, కనుక 'అనుమానం' అంటే ప్రత్యక్షంకంటే హీనమైన ప్రమాణమన్నమాట. ఇది ఒక ఊహారూపం. అయితే ఇది హేతుబద్ధమైంది.

భారతీయదార్శనికుల్లో న్యాయవైశేషిక దర్శనకారులు "ఈశ్వరు"డని చెప్పబడే పరమాత్మ అనుమాన ప్రమాణంచేత తెలిసేవాడేనన్నారు. ఇక్కడ ప్రత్యక్షానుభవసిద్ధమైన తర్కాన్ని ప్రదర్శించారు. ఈ కనిపించే వస్తుజాతం 'చెట్టు' మొదలైంది? దానికి మూడు కారణాలున్నాయి. ఉపాదానం, నిమిత్తం, సహకారి అని. ఏ వస్తువూ, తనంతతాను పుట్టలేదు. మనంరోజూ వాడుకునే అనేక వస్తువులు ఏదో ఒకమూలద్రవ్యంతో ఎవరో ఒకరుతయారుచేస్తే ఏర్పడ్డవే తప్ప తమంతతాము పుట్టలేదుకదా! ఒకచెట్టుకు, విత్తనంమూలకారణం అయితే, ఆ విత్తనం నాటేవాడు మరొకడుంటాడు. వాడినే నిమిత్తకారణం అంటాం. ఇక నీరు మొదలైనవి సహకారి కారణం ఇలా ఈ మూడు కారణాలుంటే తప్ప ఏఒక్క వస్తువూ తయారుకాదు.

ఇలా, ఈ సమస్త జగత్తుకు, పృథివ్యాది పరమాణువులు మూలద్రవ్యం. దాన్ని ఉపయోగించి సృజించినవాడు ఒకడున్నాడని, ఆయనే ఈశ్వరుడని నైయాయికాది శాస్త్రవేత్తలు, తమ ఊహచేత ఈశ్వరుని ఉనికిని సాధించారు. కంటికి కనిపించకపోయినా ఊహించి ఆ పురుషధౌరేయుడున్నాడని మనం ఊహించవచ్చునని వారి అభిప్రాయం.

ఇలా కార్య–కారణభావవ్యవస్థను ఆశ్రయించి అనుమాన ప్రమాణంతో ఈశ్వరుని సాధించడానికి ప్రయత్నించిన వారిలో ఉదయనాచార్యుడు మొదలైనవారు భారతీయదార్శనికులు ఎందరో ఉన్నారు. న్యాయకుసుమాంజలి వంటి గ్రంథాల్లోవారి ఊహలు నిరూపింపబడ్డాయి. మానవుడు తన బుద్ధి బలంచేత భగవంతుని ఉనికిని హేతుబద్ధంగా ఊహించాడన్నమాట.

ఈ విధంగా ప్రత్యక్షం, అనుమానం అనే రెండు ప్రమాణాలు ఉన్నాయి. ఇవి మాత్రమే చాలదు. నైయాయికాదుల అనుమాన ప్రమాణ విధానాన్ని ఈశ్వరుని విషయంలో వైదికులైన వారంగీకరించరు. ఈశ్వరుడున్నాడని వారువేద ప్రామాణ్యంచేతనే అంగీకరిస్తారు. ఈ జగత్తుకు, దానికి కారణమైన వానికి మధ్య ఉన్న ఈ సంబంధాన్ని గ్రహించినవాడెవ్వడూ లేడు. పొగనుచూచి, దానితో అవినాభావ సంబంధం నిప్పుకున్న దని లోకంలో వంటింట్లో మనం గ్రహించవచ్చు. ఈ అనుభవాన్నిబట్టి, కంటికికనిపించే పొగనుచూచి, ఎక్కడో దూరంగా కొండపై కంటికి నేరుగా కనిపించకుండా ఉన్న నిప్పును ఊహింపవచ్చు. ఎందువల్లనంటే, పొగ–నిప్పు రెండు వేరువేరుగా మనంచూచినవే. వాటి అవినాభావ సంబంధాన్నీ మనంచూశాం. కనుక, వీటిలో పొగనుచూచి, నిప్పుకనిపించకపోయినా తప్పక ఉండి తీరుతుందని ఊహిస్తాం. నిప్పులేనిదే పొగరాదని మన అనుభవం కదా! అదీనిజమే అవుతోంది. నైయాయికులు అనే దార్శనికులు ఈ హేతుబద్ధమైన ఊహను అనుమాన ప్రమాణం అన్నారు. ఇంతవరకు అంగీకరించవచ్చుతప్ప, అలౌకిక విషయాలను ఊహించి తెలుసుకుంటాం అనేది తప్పు.

ఈ జగత్తుకు మూలద్రవ్యాలైన పరమాణువుల్ని మనం కంటితో చూడలేం. ఆ పరమాణువుల కలయిక, తన్మూలంగా ఈ విశ్వసృష్టికూడా ఈ కళ్లతో మనంచూడలేదు. కనుకనే నైయాయికులు కూడా సృష్ట్యారంభంలో పరమాణువులకలయికకు ప్రేరకం ఏదో చెప్పలేక, ఇది "అదృష్టం" వల్ల ఏర్పడిందన్నారు. ఈ "అదృష్టం" ఏమిటి? అంటే దానికి వారి సమాధానం సంతృప్తికరంకాదు. పరమాత్మే తప్పవేరు ఏమీ కాదు. ఇదే విషయాన్ని ఉదయనాచార్యుడు న్యాయకుసుమాంజలి గ్రంథంలో చర్చించి, చివరకు పరమాణువులను ఈశ్వరుడు అధిష్ఠించి ఉండి వాటిలో చలనాన్ని పుట్టిస్తాడని చెప్పకతప్పలేదు.

కనుక, ఇక్కడ మానవమేధ, దాని పై ఆధారపడిన హేతుబద్ధమైన ఊహనిలవదు. కనుక ఉదయనాచార్యులు కూడా వేదాన్ని ఆశ్రయించి, వేదమంత్రాల ప్రామాణ్యం స్వీకరించే పరమాత్మ ఉన్నాడని నిరూపించవలసివచ్చింది. న్యాయకుసుమాంజలి గ్రంథంలోని చివరి భాగంలో ఎన్నో వేద–గీతాదివచనాలను ఉదయనా చార్యులు ఉట్టంకించారు. ఇక్కడ–'కృత్స్నఏవహి వేదోయం పరమేశ్వరగోచరః' 'వేదమంతా పరమాత్మబోధకమే' అనడంద్వారా

తమ గ్రంథం వేద విరుద్ధంకాదని నిరూపించుకున్నారు. నైయాయికుల అభిప్రాయం ఇదేనని గ్రహించాలి.

కనుక, మన బుద్ధితో ఊహించరాని విషయాలను కేవలం 'తర్కం'తో నిర్ణయిస్తామనడం అవివేకమే అవుతుంది. అంతేకాదు కేవల తర్కాన్నిబట్టి తత్త్వాన్ని నిర్ధరించలేం. ఒకడు తర్కాన్ని పట్టుకొని దేవుడున్నాడని వాదిస్తే, మరొకడు అదేతర్కాన్ని పట్టుకొని దేవుడు లేడని కూడా వాదించవచ్చు. కనక అలౌకిక భగవత్తత్త్వాన్ని నిర్ణయించడానికి తర్కం పనికిరాదన్నాడు బ్రహ్మసూత్రకారుడైన బాదరాయణుడు–'తర్కాప్రతిష్ఠానాత్' (తర్కం నిలబడదుకనుక) అని మరైతే అలాంటి అలౌకికతత్త్వం ఉందని ఎలా తెలియాలి? అంటే అందుకోసమే "వేదం" ఉంది. ఇది ఎవ్వరో ఒక వ్యక్తి చేసిన రచనం కాదు. కనుక శంకరభగవత్పాదులతో ఆరంభించి మన ఆచార్యులంతా వేదాన్నే పరమ ప్రమాణంగా చేసికొని ఈశ్వరుని గురించి తెలుసుకున్నారు.

లోకంలో వ్యవహారం కోసం మనం మాట్లాడేమాటలపొందిక, ఆయావ్యక్తుల్ని బట్టిమారుతుంది. పదాలను అక్షరాలను వెనుక ముందులకు మార్చి, అపభ్రంశం చేసికూడా లోకులు వ్యవహరిస్తారు. 'నారికేళం' అంటారు. 'నాళికేరం' అంటారు. 'వాడువచ్చాడు' అంటారు. 'వచ్చాడువాడు' అనీ అంటారు. ఇక్కడకూడా ఒక క్రమం ఉన్నా ఆ క్రమం వ్యక్తినిబట్టి మారవచ్చు. వారి వారి ఇష్టాన్నిబట్టి ఒకే భావాన్ని వేరువేరు పదాలతో కూడా చెప్పవచ్చు.

ఇలా మన ఇష్టంవచ్చినట్లు ముందువెనుకలకు, ఎవరికి తోచిన విధంగా వారుమార్చవీలుకాని శబ్దరాశి–"వేదం". ఎక్కడ అక్షరాల ఆనుపూర్వి అంటే క్రమం, వ్యక్తుల ఇష్టానిష్టాలను బట్టిమారదో, అదే అపౌరుషేయమైన వేదరాశి అని నిర్వచించారు శాస్త్రకారులు. 'అగ్నిమీళేపురోహితం' అన్నమంత్రం ఎప్పుడూ ఎక్కడైనా అలానే ఉంటుంది. అక్షరాలు మార్చడానికి వీలులేదు. ఇందువల్లనే వేదం అనూచానంగా నిత్యం అంటారు శాస్త్రకారులు. ఈ వేదం ఒక్కటే భగవంతుడున్నాడని, ఆయనే ఈ సమస్తవస్తుసృష్టిచేశాడని నిర్ద్వంద్వంగా ఉద్ఘోషిస్తోంది. ఈశ్వరుడున్నాడని చెప్పడంలో ఇదే తప్ప మరేదీ ప్రమాణంకాదు. కాజాలదు. వేదాలు భారతీయ ఆత్మ, వైదిక సంస్కారం భారతీయ జీవనసరళి. ఇతర ప్రమాణాలకు కొన్ని పరిమితులున్నాయి. ఏవోకొన్ని క్రియాకలాపాలకు మాత్రమే వినియోగించేది వేదం అనే ఒక అపవాదం మనఅజ్ఞానంచేత మనమే ప్రచారం చేశాం. ఇది తప్పు

వేదరాశికి ఆ పరిమితులు లేవు. ఆసేతుశీతనగం ఒకే విధమైన ఆనుపూర్వి (అక్షరక్రమం) కలిగి వేదరాశి, వేరువేరుశాఖలుగా ఆదరింప బడుతోంది. ఈ వేదరాశి వేలాది తల్లులకంటే ప్రేమపూర్ణ మైంది. మానవులను వంచించక, యథార్థంచెప్పి ఈ జాతిని అనాదిగా ఒకటిగా నిలుపుతోంది. సంస్కారాన్నిస్తోంది. పురాణేతిహాసాది సమస్తవైదిక వాఙ్మయము– శాస్త్రాలు, లౌకిక కావ్యనాటకాది వాఙ్మయము వేదాన్ని ప్రమాణంగా చేసికొనే ఆవిర్భవించింది.

ఇలాంటి వేదవాఙ్మయంపై ప్రపంచపు నలుచెరగులా పరిశోధన సాగుతోంది. 'వేదాల్లో అన్నీ ఉన్నాయి 'షోయ్' అని కన్యాశుల్కంలాంటి నాటకాల్లో వెక్కిరింపులు కురిపించినా, సూర్యుని అరచేత కప్పలేనట్లే, వేద వాఙ్మయ వైభవాన్ని ఎవ్వరూ కాదనలేరు. వేదవాఙ్మయంలోపలకు వెళ్లలేనివారు మాత్రమే 'అందనిద్రాక్షపళ్లుపుల్లన' అన్నట్లు ప్రవర్తిస్తారు, మాత్సర్యంతో, అసూయతో, కాని నిర్మత్సరులైన విద్యావంతులు వేదాల సర్వతోముఖవైభవాన్ని కీర్తించకమానరు. ఆశ్రయింపక మానరు. భారతీయ జీవనానికి ఏకైకాలంబనం, ఏడుగడ అయిన వైదిక వాఙ్మయప్రాభవాన్ని లౌకిక విద్యలభ్యసిందేవారికి కూడా అందేలా ప్రభుత్వాలు, మేధావులు చొరవ తీసికోవాలి. వాటిలోని విషయాలను సరళంగా చేసి లోకానికి వైజ్ఞానిక దృష్టితో అందించే ప్రయత్నం చేయాలి.

వేదాల్లో ఉన్న మన విజ్ఞానరాశిని కనీసం చవిచూపే ప్రయత్నం మనం చేయాలి. వేదపాఠశాలలు నడుపుతున్నవారు, వాటిలో అధ్యాపనం చేస్తున్న వైదికులు, వేదమంత్రాలలో ఉన్న కొన్ని భావాలనైనా తమ విద్యార్థులకు తెలిసేలా తమవిద్యా ప్రణాళికలు ఏర్పరచుకోవాలి. గ్రామాలలో వేదవైభవం సామాన్యులకు తెలిసేలా ప్రచారమాధ్యమాన్ని ప్రభావితం చేయాలి. అప్పుడు మాత్రమే మన వారిలోనే అజ్ఞానమూలంగా ఏర్పడిన చులకనభావం తొలగిపోయే అవకాశం ఉంటుంది. వేదవిద్యార్థులుకాని, అధ్యాపకులుకాని, పాఠశాలలుకాని ఎవ్వరికో కొందరికే అన్న దుర్భావనను కూడా తొలగించవలసిన అగత్యం మనకు కూడా ఉంది.

**వేంకట రంగరామానుజాచార్య**




## ముఖచిత్ర పరిచయము

**ఆషాఢ శుద్ధ ఏకాదశినుంచి కార్తిక శుద్ధ ఏకాదశివరకు శ్రీమన్నారాయణుడు వ్యూహ వాసుదేవునిగా పాల్కడలిలో శయనించి ఉంటాడు. అమ్మ, ఆయనకు పరిచర్యలు చేస్తుంది. ఈ సమయాన్ని చాతుర్మాస్యంగా శాస్త్రాలు నిర్ణయించాయి. కొద్దిపాటి మార్పులతో పెద్దలు వ్రతంగా ఈ కాలాన్ని తమ అనుష్ఠానానికి, జ్ఞాన సముపార్జనకు వినియోగిస్తారు. అమ్మతో కలిపి స్వామిని సేవించడమే ఈ వ్రతానికి ప్రధాన లక్ష్యం. ఈ సమయంలో ఎన్నో పర్వాలు సందర్భపడుతున్నాయి. వాటిలో కొన్ని ఆండాళ్, బదరీనారాయణ, సుదర్శన, వరలక్ష్మీ, వారాహ, ఆళవందార్, హయగ్రీవ, శ్రీపెద్దజీయర్ స్వామి, విష్వక్సేనుల తిరునక్షత్రాలు మనం జరుపుకుంటాం. ఈ ముఖచిత్రం ఈ సన్నివేశాన్ని పరిచయం చేస్తున్నది.**

# మనసదాచార్య పరంపర

'శాస్త్రరత్నాకర' 'మహామహోపాధ్యాయ' 'కవిశాబ్దికకేసరి'
ఉ.వే.ప్ర. శ్రీమాన్ న.చ. రఘునాథాచార్యస్వామివారు- వరంగల్

భగవద్రామానుజుల శిష్యులుగా ప్రసిద్ధినొందిన శ్రీవత్సచిహ్న మిశ్రులవలె మరి ఎందరోవారి శిష్యులైన మహానుభావులుకూడ ఉభయవేదాన్త ప్రవర్తకులుగా ప్రసిద్ధనొందియున్నారు. వారిలో కురుకేశ్వరులు, శ్రీరామమిశ్రులు, అనంతాచార్యులు, శ్రీవిష్ణుచిత్తులు, మొదలైనవారు కొందరు శ్రీభాష్యమునకు వ్యాఖ్యను రచించియు, విష్ణుపురాణమునకు ద్రవిడప్రబన్ధములకు సంగ్రహ వ్యాఖ్యానములను రచించియూ రామానుజుల ఆజ్ఞచే తమతమ ప్రాంతములలో విశిష్టాద్వైతసిద్ధాన్త ప్రచారమును గావించిరి. అయినను రామానుజుల వారి అంతిమ ఆదేశమునుబట్టి వారి తదనంతరము శ్రీవైష్ణవాచార్య పీఠమును అధిష్ఠించిన ప్రధానాచార్యులు శ్రీపరాశరభట్టర్ వారు మాత్రమే. తమకంటే వయస్సునందు చాలా చిన్నవారైనను ఈ పరాశరభట్టర్ వారినే వెనుక చెప్పిన అనంతాచార్య, శ్రీరామమిశ్ర, విష్ణుచిత్తాచార్యులందరును రామానుజుల ఆజ్ఞను శిరసావహించి శ్రీవైష్ణవాచార్యపీఠఆచార్యులుగా పరిగిణించి సంభావించిరి.

కూరత్తాళ్వానుల పుత్రుల ఇరువురిలో వీరు మొదటివారు. వీరికి "పరాశరభట్ట" అనియు, వీరి తమ్ములకు "వ్యాసభట్ట" అనియు నామకరణముచేసి, విష్ణుపరత్వ స్థాపకులైన పరాశరవ్యాసమహర్షుల విషయమున రామానుజులవారు కృతజ్ఞతను ప్రకటించుకొన్నట్లు పెద్దలు చెప్పుదురు. ఇట్లు రామానుజుల తదనంతరము ఆచార్యపదవిని అధిష్ఠించిన ఈ పరాశరభట్టర్‌వారు, తమ తండ్రిగారగు కూరత్తాళ్వానుల వలె వ్యాకరణాది సామాన్యశాస్త్రముల యందును, సంస్కృతద్రావిడ వేదాన్తములయందును సంపూర్ణమగు వైదుష్యముకలిగి అఖండప్రతిభా సంపన్నులై శ్రీరంగమున వేంచేసియుండిరి.

వీరు అవతరించిన వెంటనే జాతాశౌచము నిర్వర్తించిన పిదప 11వరోజున శ్రీరామానుజులవారు, ఈ బాలుని లక్ష్మీఅమ్మవారి ఆలయమునకు రప్పించి అర్చనాదులను జరిపించి, లక్ష్మీకటాక్ష పాత్రుడైన ఇతను వర్ధిల్లి సిద్ధాన్తప్రచారకుడు కావలెనని మంగళాశాస నము చేసినట్లు సంప్రదాయ గ్రంథములోనున్నది. ఈ కారణముచేతనే అనంతాచార్యాది మహాశయులు గూడ పరాశరభట్టర్‌వారిని శ్రీరంగనాయకీమానసపుత్రుడని ప్రేమతో పిలచుచుండిరట. ఇట్లు లక్ష్మీదేవియొక్క అనుగ్రహమునకు, రామానుజుల అనుగ్రహమునకు బాల్యమునందే పాత్రభూతులైన ఈ భట్టర్‌వారు పెద్దవారై ఆచార్యపీఠమునకు వచ్చిన పిదప శ్రీరంగనాథ ఆలయమున అధ్యయనోత్సవ, బ్రహ్మోత్సవాది వివిధ కార్యక్రమము లకు నిర్వాహకులుగా నుండి శ్రీరంగనాథుని వైభవమునకు ప్రసిద్ధి తెచ్చుటచేత "శ్రీరంగేశపురోహితులు" అనియు వ్యవహరింప బడుచుండిరి.

రంగనాథుడు కూడ మహావైభవముగా వీరు జరిపించిన పలు మహోత్సవములకు సంతసించి, మరియు వీరు రచించిన శ్రీరంగరాజస్తవ శ్రవణముచేతను ప్రసన్నుడై ఏ ఇతర పూర్వాచార్యులకును లభించనంతటి గౌరవమర్యాదలను వీరికి కల్పించెనని తెలియుచున్నది. తండ్రిగారే వీరికి ఉపనయనాది సంస్కారములను చేసి సామాన్యశాస్త్రములను నేర్పినను ఆధ్యాత్మవిద్యను మాత్రము తమ సతీర్థ్యులైన గోవిన్దమిశ్రులనబడు ఎంబార్ ఆచార్యులసన్నిధిలో అధికరింపజేసిరట. కనుకనే, వీరు, తాము రచించిన విష్ణుసహస్రనామ భాష్యారంభమున **'వన్దే గోవిన్దతాతౌ'** అను శ్లోకమున గోవిన్దమిశ్రులను, శ్రీవత్సచిహ్న మిశ్రులను ఇద్దరిని ఆచార్యులుగా పేర్కొనిరి. తండ్రిగారిలోని శాస్త్రవైదుష్యము వీరిలోకూడ పరినిష్ఠితమైనది అనుటకు వీరు రచించిన శ్రీగుణరత్నకోశ, శ్రీరంగరాజ స్తవములలోని ప్రౌఢశబ్ద ప్రయోగములే సాక్ష్యమునిచ్చును. ఈ రెండు స్తోత్రములచే కాక అష్టాక్షరీ – ద్వయ– చరమశ్లోకములకు సంగ్రహ వివరణ ముగా "అష్టశ్లోకీ" అనుపేర చిన్నస్తోత్రమును కూడ ప్రసాదించియున్నారు. "భగవద్గుణ దర్పణము" అను పేరుతో విష్ణుసహస్రనామముపై వీరు రచించిన భాష్యము పరమ ప్రామాణికమైనది.

మరియు విశిష్టాద్వైత సిద్ధాన్తమునకు చెందిన ప్రమాణప్రమేయ నిష్కర్షను ప్రతిపాదించుచూ "తత్త్వరత్నాకరము" అను శాస్త్రార్థ జటిలమైన మహాగ్రన్థమును కూడా వీరు రచించినట్లు తెలియు చున్నది. నాథమునుల వారి న్యాయతత్త్వగ్రన్థమునువలె ఈ తత్త్వరత్నాకరమును కూడ శ్రీవేదాన్తదేశికుల వారు తమ న్యాయసిద్ధాంజన,సర్వార్థసిద్ధి ప్రభృతి గ్రన్థములలో పలు స్థలములలో ఉదాహరించియున్నారు. స్తోత్రములలోను, సహస్రనామభాష్య, తత్త్వరత్నాకరాది గ్రంథములలోను వీరు సంస్కృతవేదాన్త ప్రశస్తిని ఉగ్గడించుటయేకాక ఆళ్వారుల దివ్యప్రబన్ధ ములపై కూడా పరిపూర్ణ ప్రావణ్యము కలిగి శిష్యులకు ప్రవచనము చేయుచుండిరని వాటిలోగల స్వారస్యమును పలుచోట్ల రసోక్తిగా వ్యాఖ్యానించిరని ఆ ప్రబన్ధవాఖ్యానములలో కనబడుచున్నది. వీరి సద్గుణసంపత్తిని సదాచారనిష్ఠను సిద్ధాన్త ప్రవచన ప్రాగల్భ్యమును గుర్తించిన మహానుభావు లెందరో వీరినాశ్రయించి అతిభక్తితో సేవించి ఉజ్జీవించిరి.

వీరికన్న తల్లిగారైన కూరత్తాళ్వానుల భార్య ఆండాళమ్మవారు కూడ తక్కిన శిష్యవర్గములో తాముకూడా అంతర్భవించి వీరిని పుత్రులుగా కాక ఆచార్యప్రతిపత్తితో గౌరవించుచూ నిత్యము వీరి శ్రీపాదతీర్థమును స్వీకరించుచుండిరి అనుటను బట్టి వీరి జ్ఞానానుష్ఠాన సంపత్తి ఎంతటిదో గుర్తింపవచ్చును.

### కొన్ని మధురఘట్టములు

శ్రీపరాశరభట్టర్‌వారి జీవితములో ఎన్నో మధురఘట్టములు శ్రీవైష్ణవులందరికి నిత్యానుసంధేయములుగా భావించుకొనదగినవి కలవు. వాటిలో కొన్నిటిని ఇచ్చట ఉదాహరింతుము.

ఒకరోజు వీరు, తమ భార్యామణిని పిలిచి ఏవమ్మా వంటను చేసితివా? నేను వంటపదార్థములను ఆరగింపు సమర్పింపవచ్చునా? అని యథాలాపముగా అడిగిరి. ఆ మాటను విన్న ఆమె, వెంటనే "స్వామీ,

నేను తమ దాసురాలనగుభార్యనుకదా, నన్ను మీరు అమ్మా! అని పిలవవచ్చునా? ఇకముందు అట్లు పిలువకుడు!" అని విన్నవించుకొనెను. వెంటనే భట్టర్‌వారు ఓహో! "అమ్మా" అని పిలిచితినా? అది భగవత్ప్రేరణతో వచ్చిన మాటయేకనుక ఇకముందు నిన్ను భార్యగా కాక అమ్మగానే పరిగణింతునని చెప్పి ఆమెతో సాంసారిక భోగములను వదలి జీవితాంతము ఆమెపై మాతృవత్ గౌరవబుద్ధిని కలిగియుండిరట. విన్నవారి హృదయములను కలచివైచు ఈ సంఘటన, భట్టర్‌వారి ఇంద్రియ నిగ్రహమునకు ఉత్తమమైన నిదర్శనము.

ఒకరోజు వీరు, భగవద్దర్శనముకై ఆలయమునకు వెళ్ళుచుండగా వారికి శ్రీరంగవీధులలో ఆచార్య పురుషుల గృహంబులముందు భిక్షనెత్తుకొనుచున్న కొందరు భాగవతులు కనబడిరి. భాగవతశేష ప్రసాదమును భిక్షారూపమున స్వీకరించు ఈ యాచకులు ఎంత అదృష్టవంతులో? అని తమ మనస్సులో ఒక భావము స్ఫురించగా వెంటనే వారిని గురించి ఆశువుగా ఒక శ్లోకమును రచించిరి. వారి వ్యాకరణ పాండిత్య వైభవమునుబట్టి ఆ శ్లోకము వ్యాకరణ ప్రక్రియాజటిలమైనను మధురార్థబోధకమై ఆవిర్భవించెను. ఆ శ్లోకమిది.

**"దిదేవిషతి మానుషః స చ తితద్విభూషత్యసౌ**
**శిశర్విశతి సర్వథా వివిధయిష్యతే తేన చ ।**
**ముముక్షిషతి తత్త్వగత్యవగతేః స నిస్సంశయం**
**నినిత్యిషతి సోప్యహో! సచరిరఙ్గ భిక్షూషతి ॥**

అల్పాయువు, అదృఢగాత్రుడును అయిన మనుష్యుడు తాను దేవజాతిలలో జన్మించిన బాగుండునని కోరుకొనును. ఆ దేవజాతివాడు, త్రిలోకాధిపతియగు ఇంద్రుని పదవి వచ్చిన బాగుండునుగదాయని అపేక్షించును. ఆ శివుడు, తనపై వాడగు చతుర్ముఖబ్రహ్మపదవి తనకు లభించిన బాగుండునని కోరుకొనును. ఆ బ్రహ్మయు ప్రకృతిబంధమునుండి విముక్తినొంది ముక్తపురుషుడనై బ్రహ్మానందమును అనుభవించగలనని ఆశించును. ఆ ముక్తపురుషుడు, అనంత, గరుడ, విష్వక్సేనాది నిత్యపురుషుల వలె నిరంతరభగవత్సేవకు నోచుకొనక పోయితినే! అని ఆరాటపడును. ఇకానిత్యపురుషుడు భగవత్సేవకంటే భాగవతశేషత్వము మిన్న అని తలచి శ్రీరంగక్షేత్రమున భిక్షుకరూపమున భాగవతశేషప్రసాదమును స్వీకరించుటకై ఇట్లు వచ్చియుండును అని పై శ్లోకమునకు భావము. ఇట్లు శ్రీరంగభిక్షుకులను నిత్యసూరులకంటే అధికులుగా భావించిన ఈ పరాశరభట్టర్‌వారి భాగవతనిష్ఠ, పరాకాష్ఠకు చెందినది. పైశ్లోకములోని క్రియాపదములన్నియు అతివిచిత్రములై మహావైయాకరణులకే ఆశ్చర్యమును కలిగించునట్టివి.

శ్రీరంగము క్షేత్రముపైనను, శ్రీరంగనాధునిపైనను ఈ భట్టర్‌వారికి అపారమైన అభిమానముండేది. శ్రీరామనామామృతరుచి విశేషముచే హనుమంతుడు పరమపదవాసమునుకూడ తిరస్కరించినట్లు వీరును, శ్రీరంగమునందలి భగవద్భాగవతగోష్ఠి మహోత్సవాది దర్శనాభిలాషచే తమకు శ్రీవైకుంఠప్రాప్తికూడ వలదని తిరస్కరించిరి. ఒకప్పుడు వీరికి వీపుపైన రాచపుండు పుట్టి బాధపడుచూ రంగనాధుని చెంతకు దర్శనార్థమై వెళ్ళగా వీరి బాధను చూచి "మరణింతునేమోయని దుఃఖపడుచుంటిరా? భయపడకుడు మీకు మోక్షమును ప్రసాదింతును" అని స్వామి వీరిని సముదాయించెను. వెంటనే వీరు "రంగనాథా! నీ దివ్యకృపచేత శ్రీవైకుంఠమునందుకూడా నేను పంపిన చిన్న చీటిముక్క కూడ చెల్లుబాటు అగునట్లు అధికారమును పొందితిని. నాకు గాని నా సంబంధము కలవారికి గాని మోక్షమిత్తువు అనుటలో సందేహమే లేదు. కాని నేను శ్రీవైకుంఠమునకు పోయినచో అచట కస్తూరీకలితోర్ధ్వ పుండ్రతిలకం కర్ణాన్తలోలేక్షణం ముగ్ధస్మేరమనోహరాధరదళ మగు నీ ముఖారవింద సేవను అచట పొందలేనేమో? అనియు, ఈ దర్శనము అచ్చట కలగనిచో తిరిగి సూర్యమండలమును భేదించుకొని ఈ శ్రీరంగమునకే రాక తప్పదేమో? అనియు విచారించుచుంటిని" అని సమాధానమును తెలిపిరి.

ఈ కథను నాచ్చియార్‌తిరుమొళ్ళి ప్రబన్ధమున వ్యాఖ్యానకర్తయగు పెరియవాచ్చాన్‌పిళ్ళై స్వామి ఉదాహరించిరి. కొన్ని ప్రత్యేక సందర్భముల లోను, ద్రవిడప్రబన్ధ ప్రవచన సమయములలోను వీరు పలికిన ఛలోక్తులు, రసోక్తులు ఆనాటి సహృదయులందరిని ఆకర్షించినవి. శ్రీరంగనాథుని దేవాలయములోనికి ఒకనాడు శునకము ప్రవేశించగా ఆలయమునకు అపవిత్రత కలిగినదని భావించిన అర్చక-పురోహితులు సంప్రోక్షణ రూపమున శాంతికర్మను జరిపించుచుండిరి. ఆ సమయమున భగవద్దర్శనమునకై అచటికి వచ్చిన శ్రీరంగనాథునితో ముచ్చటించుచూ ఛలోక్తిగా ఒక శ్లోకమును చెప్పిరి.

**శ్లో॥ అసన్నికృష్టస్య నికృష్టజన్తోః మిథ్యాపవాదేన కరోషిశాన్తిమ్ ।**
**తతోనికృష్టే మయి సన్నికృష్టే కాం నిష్కృతింరఙ్గపతే! కరోషి?" ॥**

రంగనాథా! నిజముగా ఆ శునకము ఆలయమునకు వచ్చినదో లేదో ఆ క్షుద్రజంతువు లోనికి వచ్చినట్లు ఒక అపవాదమును దానిపైవేసి ఈ పెద్దశాన్తికర్మను జరిపించుకుంటున్నావు. అది జ్ఞానము లేని జంతువు. జ్ఞానము కలిగిన నేను ఎన్నో పాపకర్మలు చేయుచూ దానికంటే నీచస్థితిలో ఉన్నానుగదా! అట్టినేను, నిత్యము ఆలయములోనికి వచ్చుచున్నను శాంతికర్మను చేసుకొనవేమి? ఆశువుగా చెప్పిన ఈ ముక్తక శ్లోకములో ఆచార్యులవారు 'నేను జ్ఞానానుష్ఠాన సంపన్నుడను' అను అహంకారమును ప్రకటించుకొనక నైచ్యానుసంధానమును ఆవిష్కరించుకొనిరి. ఇదియే ఛలోక్తి.

ఇట్టిదే రంగనాథస్వామికి తిరుమంజనోత్సవము జరుగుతున్నప్పుడు తడిగుడ్డను ధరించియున్న భగవన్మూర్తిని చూచి ఆశువుగా చెప్పిన మరొక ఛలోక్తిగల శ్లోకము.

**శ్లో॥ "త్వం మేఽహం మేకుతస్తత్.... మృగ్యమధ్యస్థవత్ త్వం" ॥**

మొండివాడైన జీవునితో వివాదపడి, తాను సర్వస్వామినని జీవుడు దాసుడని కష్టపడి వాదించికూడ మరుగునపడిన తత్త్వమును నిజమని స్థాపించుటకై తడిగుడ్డను కట్టుకొని నలుగురిలో ప్రమాణము చేయుచుంటివా? రంగనాథా! అని ఈ శ్లోకమునకు భావము. ఇట్లు వీరు రచించిన ముక్తక శ్లోకములు మరెన్నియో కలవని పెద్దలు చెప్పుదురు. ఇక భగవద్విషయమునందు వీరు సెలవిచ్చిన రసోక్తులు అనేకములు వ్యాఖ్యానైక గమ్యములు. *(సశేషం)*




**శ్రుతివాక్య సమన్వయానికి రామానుజుల ప్రణాళి.**

వేదంలో అనేకరకాల వాక్యాలున్నాయి. కొన్ని అద్వైతాన్ని బోధిస్తాయి. కొన్ని ద్వైతాన్ని. ఇవి కాక ఘటక శ్రుతులు అని చెప్పబడే మరికొన్ని వాక్యాలు ఉన్నాయి. వీటన్నిటినీ సమన్వయించడంలో వేదాన్తులు వేరువేరు మార్గాలను ఆశ్రయించారు. అద్వైతశ్రుతులు అంటే 'బ్రహ్మం ఒక్కటే' అని చెప్పేవేదవాక్యాలు. ఈ వాక్యాలను సమన్వయించడంలో కలిగే ఇబ్బందిని దూరంచేసికోవడానికి 'లక్షణా' అనే శబ్దశక్తిని ఆశ్రయించడం మొదలైన విధానాన్ని అనుసరిస్తారు అద్వైతాన్ని పరమతత్త్వంగా స్వీకరించిన శాంకరులు. వీరికి భేదాన్ని బోధించేద్వైతవాక్యాలు ముఖ్యంకాదు. ఇక ద్వైతవాక్యాలు భేదాన్ని చెబుతాయి. జీవుడు వేరు, బ్రహ్మంవేరు.

జీవులు ఒకరికొకరువేరు. జీవులు ప్రకృతివేరు. పరమాత్మ జీవుడు వేరు. పరమాత్మ ప్రకృతి వేరు అంటూ ఇలా వేరుతనాన్నే పరమార్థంగా భావిస్తారు ద్వైతులు. ఈ ప్రపంచంలో మనందరికీ కనిపించే వస్తుభేదం అంతా వాస్తమేనని అంగీకరించే వారంతా ద్వైతులే. **ద్విత** అంటే, వేరుతనం. ఇదే ద్వైతం అని కూడా వ్యవహరింప బడుతున్నది. నిజానికి, నైయాయికులు (తార్కికులు) మీమాంసకులు, సాంఖ్యులు, యోగులు, జైనులు మొదలైన వారంతా ద్వైతులే అయినా, మధ్వాచార్య మతాన్ని ఆశ్రయించిన వారికి ద్వైతులనే ప్రసిద్ధి ఏర్పడింది. వీరు భేదాన్ని బోధించే శ్రుతివచనాలే ముఖ్యాలని అంటూ అద్వైత శ్రుతులకు వేరువేరు అర్థాలను బోధిస్తారు.

ఇలా, అద్వైతులు అద్వైత (అభేద) శ్రుతులకు, ద్వైతులు ద్వైత (భేద) శ్రుతులకు ప్రాధాన్యాన్ని, ముఖ్యతను కల్పించి, మిగిలిన శ్రుతులను అముఖ్యాలని వేరువేరు అర్థాలు కల్పిస్తారు. రామానుజులు ఘటకశ్రుతులను ఆలంబనంగా చేసికొని ద్వైత-అద్వైతశ్రుతులను రెంటినీ సమన్వయిస్తారు. రామానుజులు- 'తత్త్వమసి' మొదలైన వాక్యాలను సమన్వయించడానికి ఒక ప్రక్రియను చూపారు.

**అన్ని శబ్దాలూ, వైదికాలు అవైదికాలు బ్రహ్మవాచకాలే.**

వేదాల్లో ఉన్న శబ్దాలను వైదిక శబ్దాలంటాం. లోకంలో వాడుకలో ఉన్న శబ్దాలను లౌకికాలు అని అంటాం. వీటికి అర్థం ఏమిటి? అని విచారించినప్పుడు, వైదిక శబ్దాలకు భాష్యకారులు, వివరణకర్తలు చెప్పే అర్థాలూ, లౌకిక విధానాన్నే అనుసరించి ఉంటాయి. ఉదాహరణానికి ఇంద్ర-యమాది-శబ్దాలకు ఆయా విశేష దేవతలే అర్థమని వారి నిర్ణయం. ఇలాగే లోకంలో కూడా ఈ ధోరణిలోనే ఆయా శబ్దాలకు పరిమితమైన అర్థాన్నే చెప్పుకోవడం మనందరికీ తెలుసు. చెట్టు అంటే ఆకులు కొమ్మలు కాండం కల ఒక వస్తువనే కదా మన అవగాహన. ఈ అర్థవ్యవహారం సరైనదేనాకాదా అని విచారించినప్పుడు, ఇది సరైనదికాదంటారు భగవద్రామానుజులు.

"అనేన జీవేన ఆత్మనా అను ప్రవిశ్యనామరూపేవ్యాకరవాణి" అన్న శ్రుతివచనాన్ని బట్టి ప్రతివస్తువులోనూ, పరమాత్మ జీవుని ప్రవేశపెట్టి, తానూ దానికాధారంగా ప్రవేశిస్తాడని, అలా ప్రవేశించడంవల్లనే, ఏ పదార్థానికైనా పదార్థత్వం సిద్ధిస్తుందని వెనుక చెప్పుకున్నాం. పై మంత్రంలో భగవంతుడు 'నామరూపేవ్యాకరవాణి' అనడం చేత, 'నామ వ్యాకరణం' అంటే పేరును ఏర్పరచడం, తన్మూలశబ్దవ్యవహార యోగ్యతను కలిగించడం. 'రూపవ్యాకరణం' అంటే ఒక విశేష ఆకారాన్ని కలిగించడం. ఈ రెంటినీ పరమాత్మ స్వయంగా చేస్తాడని స్పష్టపరచబడింది.

ఇక్కడ మనంగమనించవలసింది, మనం వెనుక వ్యాసాల్లో చెప్పుకున్నట్లు, ఏ పదార్థంలోనైనా జీవుడు, పరమాత్మ ఇరువురూ తప్పక ప్రవేశించి ఉంటారు కనుక, ఆ పదార్థాన్ని బోధించే వైదిక శబ్దమైనా, లౌకిక శబ్దమైనా, తప్పనిసరిగా, పైకి అగుపించే పదార్థంతోపాటు, దానిలోపల ఉన్న జీవాత్మ పరమాత్మలను కూడా బోధించి తీర వలసి ఉంటుంది. కాని, లోకంలో ఆయావస్తువులను బోధించేవిగా మనం ప్రయోగించే శబ్దాలను అంటే, చెట్టు, కొండ, పశువు, పక్షి, మనుష్యుడు, దేవత ఇలా వివిధాకారాలు, నామాలు, కల పదార్థాలను వ్యవహరించేటప్పుడు 'ఇది చెట్టు' ఇది కొండ' 'వీడు దేవదత్తుడు' ఇది గుర్రం' 'ఇది కాకి' అని, ఇలా ఆయావస్తువులనే వ్యవహరిస్తాం. ఎందువల్ల? ఇవే మనకు కంటికి కనిపిస్తాయి కనుక.

అందువల్ల వీటిలోపల జీవుడున్నాడని, ఆ జీవునికి ఆధారంగా పరమాత్మ ఉన్నాడని, మనం గుర్తించలేం. అంతదాకా ఎందుకు? మనమంతా చూస్తాం, తింటాం, శయనిస్తాం ఇలా ఎన్నో పనులు

మరింత విశాలంగా ... వినూత్నంగా....
ప్రత్యేక 1 గ్రామ్ జ్యూయలరీ కౌంటర్
కామధేను సిల్క్స్
పట్టు చీరలు
ఫ్యాన్సీ చీరలు
వర్క్ శారీస్
గద్వాల
వెంకటగిరి
డ్రెస్ మెటీరియల్స్
బీసెంట్‌రోడ్, విజయవాడ-2. ఫోన్: 2574220

ఈ కరచరణా ద్యవయవాలతో కూడిన శరీరం ద్వారా చేస్తాం. మనకు నిత్యవ్యవహారంలో 'నేను చేస్తున్నాను' అనే భావన ఉన్నా, శరీరంలోపల 'నేను' అనే భావనకల జీవుడు ఒకడున్నాడని పెద్దల మాటల వల్లవిని, కొంత అవగాహన కల్గినా, ఆ 'నేను' అనే ఆత్మతత్త్వాన్ని చూడలేము కనుక, అనుభవించలేం. ఇక, ఆ జీవునికి ఆధారంగా ఉన్న పరమాత్మ అసలే కనిపించడు కనుక, ఆ పరమాత్మ కూడా ఈ శరీరంలోనే ఉన్నాడన్న 'అనుభవం' మనలో కూడా చాలా మందికి లేదని అంగీకరించక తప్పదు. అయితే, మనం వేదాన్తాధ్యాయనం చేసినప్పుడు, పైన చెప్పుకున్న జీవాత్మ పరమాత్మల రహస్యం మనకు అవగతం అవుతుందికాని, అనుభవానికి తెచ్చుకోవడానికి ఎంతో ప్రయత్నం ఉపాసనారూపంగా చేయవలసి ఉంటుంది. అయినా, మనకులేని అనుభవాన్ని పొందిన మహర్షులు నిర్మించిన వేదమంత్రాల్లోను, పురాణాగమాదు ల్లోనూ, ఈ రహస్యం స్పష్టంగా చెప్పబడిఉంది కనుక, ఆవచనాల పట్ల విశ్వాసంకల్గి, మనకు శాస్త్రముఖంగా కలిగిన జ్ఞానాన్ని అనుభవానికి తెచ్చుకొనే ప్రయత్నం చేయాలి తప్ప, మనకు అనుభవం కలగనంత మాత్రాన శాస్త్రవచనం యథార్థంకాదని నిర్ణయించే అధికారం మనకు లేదు.

కనుకనే, కేవలం మనకున్న లోకవ్యవహారానుభవాన్నిబట్టి ఈ శబ్దానికి ఇదే అర్థం అని నిర్ణయించడానికి వీలుకాదు. 'వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః' అన్నప్పుడు వేదంలోని శబ్దాలన్నీ పరమాత్మను బోధించి తీరాలి కదా! ఈ రహస్యం ఎరిగిన మహర్షుల హృదయాన్ని మహర్షులే ఎరుగుతారు తప్ప ఇతరులు కాదుకదా! కనుకనే బాదరాయణమహర్షి, తన బ్రహ్మసూత్రాల్లో, ఒక సూత్రాన్ని ప్రత్యేకంగా ఉట్టంకించి, సర్వపదాలు పరమాత్మనే బోధిస్తాయని నిష్కర్షించాడు.

**"చరాచరవ్యపాశ్రయస్తు స్యాత్తద్వ్యపదేశోఽ భాక్తః తద్భావ భావిత్వాత్"**

ఈ సృష్టిలో కదలికకల, కదలికలేని వస్తువులు ఎన్నో ఉన్నాయి. వాటిని బోధించేందుకు ఎన్నో శబ్దాలు కూడా ఉన్నాయి. కనుక చర (కదలికల) అచర (కదలికలేని) వస్తువులనాశ్రయించి ప్రయోగింపబడే శబ్దం, (చరాచర వ్యపాశ్రయస్తు) (తద్వ్యపదేశః) ఆ పరమాత్మను బోధించేదిగా (అభాక్తః) ముఖ్యంగానే (స్యాత్) అవుతుంది. ఎందువల్ల? తద్భావభావిత్వాత్– ఆ పరమాత్మయొక్క ఉనికి చేతనే (తద్భావ) ఈ చరాచర వస్తుజాతం మనగలుగుతోంది కనుక (భావిత్వాత్). ఇది దీని అభిప్రాయం.

ఈ సృష్టిలోని ఏ వస్తువూ తనంతతాను స్వతంత్రంగా మనలేదు. దీని ఉనికి, పరమాత్మ యొక్క ఉనికి పైననే ఆధారపడి ఉంది. అసలు, 'ఉనికి' సత్తలేక భావము అనే శబ్దమే పరమాత్మబోధకమని, విష్ణు సహస్రనామం **'భావ'** శబ్దాన్ని నామంగా నిర్దేశించింది. **"భగవత్సత్తా ప్రయుక్త స్వసత్తాకః అయంచరాచర ప్రపంచః"**

భగవంతుని ఉనికిని బట్టే ఇదంతా ఉంది తప్ప, దీనికి, భగవంతుని విడచి సత్త (ఉనికి) అసలు లేనే లేదు.

ఏ వస్తువు యొక్క ఉనికి భగవంతుని **'సత్త'** పైననే ఆధారపడి ఏర్పడిందో, ఆ వస్తువును బోధించే శబ్దం కూడా ముఖ్యంగా (వేరే క్రొత్త శక్తిని కల్పించనక్కర లేకుండా సహజంగానే) భగవంతుని కూడా బోధించి తీరవలసిందేనన్న మాట. ఈ అభిప్రాయాన్నే పురాణాది ప్రమాణాలు ఉద్ఘోషిస్తున్నాయి వేదంతోపాటు. ఎలాగో చూద్దాం. *(సశేషం)*

## విశేష సూచన

**మీరు జీవా ప్రాంగణంలోని ... సమాచారుం కోరుతున్నారా?**
**ప్రియమైన భక్తినివేదన పాఠకులకు, భగవద్బంధువులకు సూచన**

**శ్రీరాంనగర్ జీవాలో జరిగే వివిధ కార్యక్రమాల గురించి, స్వామివార్లు ప్రాంగణంలో ఉన్నారా? లేరా? ఇలాంటి ఎన్నో సమాచారాలు మీరు తెలికో కోరుతున్నారు. ఈక్రమంలో భక్తినివేదనలో కనిపించిన ప్రతి ఫోనునెంబరుకు ఫోను చేస్తున్నారు. ఇది సరికాదు. మీకు ఏ సమాచారం కావలసివచ్చినా ఈక్రింది రెండు నెంబర్లకు మాత్రమే చేసి తెలుసుకోండి! ఇక రామానుజ సహస్రాబ్ది గురించి తెలిసికోగోరినవారికి వేరే. ఆసమాచారం మన భక్తినివేదనలోనే విడిగా ఇస్తున్నాం. ఆ నంబర్లకే ఫోన్ చేసి, సమాచారం పొందవలసినదిగా భక్తినివేదన సూచిస్తున్నది.**

**జీవా రిసెప్షన్ ఫోన్ నెం - 9553549971 9553549972.**

అదృష్ట రత్నాలు ధరించండి ! అనుకున్నది సాధించండి !
శ్రీ సాయి
పవిత్ర డైమండ్స్
4/7, బ్రాడీపేట, ఖజానా జ్యూయలర్స్ ప్రక్కన, గుంటూరు. సెల్: 9246410099, ఫోన్ : 2262626.
బి/3, జైహింద్ కాంప్లెక్స్, గ్రౌండ్‌ఫ్లోర్, యాక్సిస్‌బ్యాంక్ ప్రక్కన, గవర్నర్‌పేట, విజయవాడ. సెల్ : 9246310099, ఫోన్ : 6665011.
సంపూర్ణ జ్యోతిష్యం చూడబడును
నాణ్యమైన జాతిరత్నాలు
జెమ్ టెస్టింగ్ ల్యాబ్
కెంపులు పచ్చల పూసలు
మంచి ముత్యములు, పగడములు
శివస్వరూపమైన రుద్రాక్షలు
స్పటికమాలలు
1 గ్రామ్ గోల్డ్ ఇమిటేషన్ జ్యూయలరి

# రామానుజ సహస్రాబ్ది సమాచారము

## జోనల్‌స్థాయి సమావే



కరీంనగర్‌లోని వైష్ణవి గార్డెన్స్‌లో జోనల్‌స్థాయి సమావేశం జరిగింది. ఈ సమావేశంలో కరీంనగర్‌తో పాటు నిజామాబాద్, ఆదిలాబాద్ ప్రతినిధులు, స్థానికంగా ఉన్న స్వచ్ఛంద సంస్థలను, ఆర్గనైజేషన్స్‌వారిని ఆహ్వానించడమైనది. 600కి పైగా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. శ్రీరామానుజ సహస్రాబ్ది సందర్భంగా వారు చేసిన సంస్కరణలు, వారి చరిత్రను తెలిపేవిధంగా ప్రతి వికాసతరంగిణి కార్యకర్తా ప్రయత్నించాలని, ఈవిధంగా కార్యక్రమాన్ని రూపొందించాలని ప్రతినిధులకు సూచించారు. అలాగే ప్రచారకమిటీ, ఆర్థికకమిటీలుగా రెండువిధాలుగా ఏర్పాటుచేసి, జిల్లా, మండల, గ్రామాలవారిగా పనిచేయాలని తెలిపారు. ముందుగా ఈ కార్యక్రమాన్ని కరీంనగర్ నుండి ప్రారంభిస్తామని అక్కడివారు తెలిపారు.



స్థాని శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు, శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయర్‌స్వామివార్లు, శ్రీ.ఉ.వే.శ్రీమాన్ రంగరామానుజాచార్యస్వామి, శ్రీమతి వనజాభాస్కర్, శ్రీమాన్ మహేందర్ రెడ్డి, శ్రీమాన్ భాను ప్రసాద్ -MLC మొదలైనవారు పాల్గొన్నారు.

## శ్రీరామానుజ సహస్రాబ్ది - 2016 - 17

ప్రియ భగవద్బంధువులారా! మీరంతా ఎంతో ఉత్సాహంతో భగవద్రామానుజ విగ్రహ నిర్మాణానికి మీమీ ద్రవ్యాన్ని వినియోగింపదలచడం చాలా ముదావహం. మీరు ద్రవ్యం బ్యాంక్ అకౌంట్‌కు జమకట్టే విషయంలో ఈక్రింది అంశాలను గమనించండి.

1. మీరు ఆంధ్రాబ్యాంక్, ముచ్చింతల్ బ్రాంచ్‌కి. 209710100000007 నెంబరుకు - ఏ ఆంధ్రాబ్యాంక్ బ్రాంచి నుంచి అయినా నేరుగా జమకట్టవచ్చు. జమకట్టేటప్పుడు -కౌంటర్ ఫయిల్, వర్జినల్ మీవద్ద ఉంచుకుని దాని నకలు, జతచేసి ఒక తెల్లకాగితంపై మీవివరాలు, అడ్రస్ స్పష్టంగా, ఎవరిపేరున రసీదు పంపాలో వ్రాసి మా అడ్రస్‌కు పంపండి.
2. మీరు ఆంధ్రాబ్యాంకు కాక, వేరేబ్యాంకు ద్వారా పంపదలిస్తే- IFSC Code ANDB – 0002097 అనే నెంబర్‌ను వినియోగించి పై ఆంధ్రాబ్యాంక్ అకౌంట్‌కే అమౌంట్‌ను పంపవచ్చును.

వివరాలు తప్పని సరిగా మా ఆఫీస్‌కు అందాలి. అందిన తరువాతనే రసీదు పంపబడుతుంది. ఎలా పంపినా -మీరు జమచేసిన వివరాలు- కౌంటర్‌ఫైల్ నకలు, మీపేరు, ఊరు, చిరునామా వగైరా ఈక్రింది అడ్రస్సుకు పోస్టులో పంపండి.

శ్రీరామానుజ సహస్రాబ్ది కార్యనిర్వాహక సమితి, 9553549971, 9553549972,
శ్రీరామానుజ సహస్రాబ్ది, జీవా, శ్రీరామనగర్, ముచ్చింతల్(గ్రా), పాలమాకుల(పో), శంషాబాద్ (మం), రంగారెడ్డి జిల్లా –509325
Email -contact@sriramanujasahasrabdi.org




పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్‌స్వామివారి మంగళాశాసనములతో...!

106వ తిరునక్షత్ర మహోత్సవ

12-7-2014 నుండి 17-9-2014 వరకు ప్రతిరోజు 5 గం॥ నుండి 9 గం॥ వరకు సుందరకాండ పారాయణము

శుభాహ్వానము

ది. 27-7-2014 నుండి ది. 4-9-2014 వరకు ప్రతిరోజు 9-30 గం॥ నుండి 12 గం॥ వరకు శ్రీ యాగం

ది. 9-8-2014 నుండి 14-8-2014 వరకు

శ్రీమదుభయవేదాంతాచార్యపీఠం, వాసుదాసాశ్రమం, నడిగడ్డపాలెం పోస్ట్, చుండూరు మం॥ గుంటూరు జిల్లా. 522 318.

27.7.14- శ్రీయాగం, 09.8.14- వాహనసేవలు, 10.8.14- శ్రీహయగ్రీవేష్టి, 11.8.14- వైనతేయేష్టి, 12.8.14-నారసింహేష్టి, 13.8.14- సుదర్శనేష్టి, 14.8.14-రథోత్సవం, 108 కలశాభిషేకం, 4.9.14-శ్రీయాగ మహాపూర్ణాహుతి, 17.9.14-సుందరకాండ పూర్తి మరియు సుందరకాండ హవనం,

యథాశక్తి తమ కైంకర్యములను ధన, వస్తురూపములో మనియార్డర్ ద్వారా కానీ, బ్యాంక్ శ్రీమదుభయవేదాంతాచార్యపీఠం, ఆంధ్రబ్యాంక్, చుండూరు ద్వారా సమర్పించవచ్చు.

ఫోన్ : 08644 276522, 08645 272929, 94410 65582, 996611807, 9701168704

# రామానుజుల శ్రీభాష్యసిద్ధాంతంపై ... యామునుల ప్రభావము

'పరమపదవాసులు' ఉ.వే.ప్ర.శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యస్వామివారు - హైదరాబాదు

మహా సిద్ధాంతములో అనుభూతి స్వతస్సిద్ధమని చెప్పునట్టి వాదాన్ని నిరాకరించునట్టి ఒక అంశమును పరికిద్దాం.

సంవిదః స్వతస్సిద్ధయాః ప్రాగభావాద్యభావాదుత్పత్తి ర్నిరస్యతే ..... సంవిత్ అనగా అనుభూతి. ఇది స్వతస్సిద్ధము, ఉత్పన్నముకాదు. నిత్యవిజ్ఞానమిదియని తాత్పర్యము. దీనికి ఉత్పత్తిలేదంటారు. ఉత్పత్తి ఉంటే కాదా నశించుతుంది. ఉత్పత్తి లేదు కనుక నాశముకూడా లేదు. అందుకని అనుభూతి నిత్యమని వీరి సాధన. ఇక్కడ ఉత్పత్తి లేదనడానికి కారణమేమంటే ప్రాగభావాదులు లేకపోవడమే అంటారు. పుట్టునట్టి ప్రతిపదార్థమునకు కొన్ని కారణాలుంటవి కదా. ఘటము పుట్టుకకు దండచక్రాదులు కారణకోటిలో చేరుతవి. ఐతే ఈకారణములు కార్యము పుట్టగానే నశించునవి కావు కదా. అందువలన పుట్టిన ఘటమే తిరిగి పుట్టవలసివస్తుంది. కారణ సామగ్రియంతయు ఉన్నప్పుడు కార్యమెందుకు పుట్టకూడదు. అని ఆశంక ఏర్పడును. అప్పుడు శాస్త్రకారులు మనకు కనిపించు దండచక్రాదులేకాక, ఘటకారణ సామగ్రిలో ఘటప్రాకభావమనునది కూడా ఒకటి కారణమని అంగీకరించవలసి వచ్చినది. ఈప్రాగభావము ఘటము పుట్టగానే నశించుతుంది. ఇట్లుపుట్టిన ఘటము యొక్క ప్రాగభావము నశించినందున ఈపుట్టిన ఘటము మళ్ళీ పుట్టజాలదు. దీనికారణసామగ్రికి చెందిన దీని ప్రాగభావము నశించినది. ఇట్లు దేనిప్రాగభావములేదో అది పుట్టదు అని ఏర్పడును.

ప్రకృతములో సంవిత్తుకు ప్రాగభావములేదుకనుక సంవిత్తు అనునది పుట్టదు అందురు. ప్రాగభావము లేదని ఎలా సాధించడం? అంటే ఉన్నదనిచెప్పు ప్రమాణమేమియూ లేదు కనుక అంటారు. ప్రాగభావమును చెప్పు ప్రమాణమనగా ప్రాగభావముయొక్క జ్ఞానమును కలిగించునట్టి సాధనము. ప్రాగభావముయొక్క జ్ఞానము కలగడానికే వీలులేనందున అట్టి జ్ఞానమును కలిగించునట్టి సాధనము లేదంటారు. ప్రాగభావముయొక్క జ్ఞానము ఎందుకు కలగడానికి వీలులేదో ఆలోచిద్దాం. మనమిచట సంవిత్తు యొక్క ప్రాగభావమును గురించి ముచ్చటించుకొనుచున్నాము అనగా జ్ఞానము యొక్క ప్రాగభావమును గురించిన సందర్భమిదియని గుర్తుంచుకొనవలెను. ఏదైనా వస్తువు ఉన్నప్పుడు దానియొక్క అభావముండదు. దీపముంటే దీపాభావముండదు. దీపము తన అభావాన్ని తానెలా చూపెడుతుంది? అలాగ జ్ఞానము తన ప్రాగభావాన్ని తాను చూపెట్టజాలదు. అందువలన జ్ఞానముయొక్క ప్రాగభావమున్నదను జ్ఞానము కానీ దానిని కలిగించు ప్రమాణము కానీ లేదంటారు.

దీనికి శ్రీభాష్యకారులు ఇట్లన్నారు. **నహ్యనుభూతిః స్వసమకాల వర్తిన మేవ విషయీకరోతీత్యస్తి నియమః, అతీతా నాగతయోర విషయత్వ ప్రసజ్గాత్, అథ మన్యసే అనుభూతి ప్రాగభావాదేస్సిధ్యతః తత్సమ కాల భావనియమోస్తీతి కిం త్వయా క్వచిదేవం దృష్టమ్? యేన నియమం బ్రవీషి? హన్త! తర్హితత ఏవ దర్శనా త్ప్రాగ భావాదిస్సిద్ధ ఇతిన తదపహ్నవః తత్ప్రాగభావశ్చ తత్సమ కాలవర్తినం అనున్మత్తః కోబ్రవీతి?**

ఈపంక్తులలో అర్థ శబ్ద రచనా సారూప్యాన్ని ఆళవందార్ స్వామి ఆత్మ సిద్ధి భాగములోని పంక్తులలో గమనించవచ్చును. ఆ పంక్తులివి **-నహిసంవిదా స్వకాల వర్తిన ఏవార్థాః సిధ్యన్తీత్యస్తి నియమః, అతీతానాగతయోరసంవేద్యత్వ ప్రసజ్గాత్, అథ సంవిత్ప్రాగభావ... తత్ప్రాగభావస్తత్సమకాల ఇత్యున్మత్తవచః** ఈపంక్తుల అర్థమున పరిశీలింతము - జ్ఞానము చేత తన కాలమందలి పదార్థములే సిద్ధించునను నియమము లేదు. అపుడతీతానాగతములు జ్ఞాన గోచరములు కాకపోవలసి వస్తుంది. ఇక జ్ఞాన ప్రాగభావాదుల సిద్ధించునపుడే జ్ఞాన సమకాలములుగా నుండవలయునను నియమమందురా? ఐతే ఆ నియమమెక్కడైనా చూచినారా? అలా చూడడమే జరిగితే అక్కడ జ్ఞాన ప్రాగభావజ్ఞానము కలిగినట్లే కాదా. ఇక జ్ఞాన ప్రాగభావాదులు సిద్ధించవనరాదు. దాని ప్రాగభావము దాని సమకాలములో నున్నదనుట ఉన్మత్తవాక్యము. ఇది పరమాచార్య ప్రదర్శితపథము - ఇక శ్రీభాష్యకార పంక్తుల అర్థాన్ని కూడా కొంచెము గ్రహిద్దాం.

అనుభూతి తానున్న కాలంలోనున్న దానినే గ్రహించునను నియమములేదు. అపుడతీతానాగతములు విషయములు కాకపోవలసి వచ్చును. ఇక అనుభూతి ప్రాగభావాదులు సిద్ధించునపుడే అనుభూతి సమకాలములో నుండవలయునని నియమమంటారా? ఐతే ఈ నియమము చెప్పునట్టి నీవు ఎక్కడైనా ఈనియమములున్నట్లు చూచినావా? అలా చూడడమే జరిగితే అలా చూచినందువల్లనే ఆజ్ఞాన ప్రాగభావాదులు సిద్ధించినటట్ల అగును కనుక దానిని దాచరాదు. దాని ప్రాగభావమును దాని సమకాలములో నున్న దానినిగా పిచ్చివాడు కాని వాడెవడు చెప్పును? ఇట్లు పరమాచార్యుల వారి ఆత్మసిద్ధి అనుభూతి విచార సందర్భమున, అహమర్థాది విచార సందర్భమున, కిం బహునా? ఏసందర్భమును చూచినా మహాసిద్ధాంతమున భగవద్రామానుజుల వారికెంత సహకరించినదో చూడవచ్చును.

ఇట్లే సిద్ధి త్రయములోని ఈశ్వర సిద్ధి భాగము అత్యల్పముగా లభించినది. అది మొత్తము భగవద్రామానుజులకు శాస్త్రయోనిత్వాధి కరణమునకు సంబంధించిన శ్రీభాష్యరచనకు బాగుగా ఉపకరించి నది. సిద్ధిత్రయములో ఉపలబ్ధమైన భాగము మొత్తము అధికరణ

పూర్వ పక్షరచనగానే నడచినది. దీనిని బట్టి ఈ అధికరణానికి సంబంధించిన సిద్ధాంత రచనకు కూడా ఈశ్వర సిద్ధి విభాగమే సహకరించి ఉండవచ్చునని ఊహించవచ్చును. ఈ సిద్ధాంత రచనకు సంబంధించిన ఈశ్వరసిద్ధి గ్రంథ భాగము మనకింతవరకు ఉపలబ్ధము కాలేదు. ఈగ్రంథములోని విషయమును శ్రీభాష్యకారులు ఎట్లు అనుసరించియున్నారో కొంత పరిశీలిద్దాం.

శాస్త్రయోనిత్వాధికరణము మనవేదాంత దర్శనములోని బ్రహ్మసూత్రములకు చెందిన మూడవ అధికరణము. ఇది శాస్త్రారంభ సమర్థన రూపమగు ఉపోద్ఘాత గ్రంథమునకు సంబంధించినది. దీనిలో జగజ్జన్మాదికారణమగు పరమాత్మను శాస్త్రం చెప్పదని, చెప్పవలసిన పనిలేదని పూర్వపక్షమేర్పడును. శాస్త్రము బ్రహ్మను చెప్పదనడానికి రెండురకాల వాదములున్నవి. ఒకటి బ్రహ్మపదార్థము వాస్తవానికి లేనేలేదు కనుక శాస్త్రము బ్రహ్మను చెప్పదు అనునది. ఇది పూర్వ మీమాంసకుల అభిప్రాయమును అభివ్యక్తము చేయుచున్నది. ఇక మరియొక విధానము తార్కికులది. వారు బ్రహ్మ ఉన్నదని అంగీకరింతురు. ఐతే ఆబ్రహ్మ వేరే ప్రమాణాలతో తెలిసినదంటారు. తెలిసిన దానిని శాస్త్రము చెప్పవలసిన పనిలేదు. శాస్త్రము అజ్ఞాత జ్ఞాపకమనికదా చెబుతారు. ఇతర ప్రమాణముతో తెలిసినదానిని గురించి తెలుసుకొనవలయునను కోరికయే ఉండదు. కనుక శాస్త్రము పరమాత్మను చెప్పవలసిన పనిలేదు. ఇది తార్కికులవాదము. ఇట్లు పూర్వ మీమాంసకులు తార్కికులు కూడా శాస్త్రము బ్రహ్మను చెప్పదు అనెడు పూర్వపక్షము చేయువారుగా భావించవచ్చును.

ఈపూర్వమీమాంసకుల పూర్వపక్షవిధానము ఈశ్వరసిద్ధి గ్రంథములో చాలా విస్తరముగా వివరించబడినది. పూర్వమీమాంస కులను శ్రీభాష్యకారులు పూర్వపక్షులుగా కాక సిద్ధాన్తులలో ఒకరకము వారినిగా చెప్పుకొనుచుందురు. ప్రత్యక్ష, అనుమాన ప్రమాణముల వలన పరబ్రహ్మను సాధించుకొనలేము అనువారు కదా సిద్ధాంతులు. ఈ విషయమును పూర్వ మీమాంసకులు కూడా అంగీకరింతురు. కనుక వీరిని సిద్ధాంతులలో చేర్చుకోవచ్చును. కాని పరబ్రహ్మ అను తత్త్వమే వాస్తవములో లేదు అని కదా పూర్వ మీమాంసకులయొక్క అభిప్రాయము. అందుకని వీరు సంపూర్ణంగా సిద్ధాంతులని చెప్పుకోలేము. ఈశ్వరసిద్ధి గ్రంథములో ఈపూర్వమీమాంసకుల అభిప్రాయమును మొదటతెల్పి పిదప తార్కికుల ద్వారా వీరి అభిప్రాయము ఖండించబడును. ఆపైన తార్కికులను కూడా ఖండిస్తూ సిద్ధాంత రచన జరిగి ఉంటుంది. సర్వ జగన్నియామకుడగు పరమపురుషుడొకడున్నాడు అని సాధించడానికి మొదట పూర్వపక్షమును ప్రతిపాదింతును అను తాత్పర్యముగల శ్లోకంతో ఈశ్వరసిద్ధి గ్రంథము ఆరంభించ బడినట్లు మనకుపలబ్ధమైన భాగము తెలుపుచున్నది.

**తత్ర కస్య చిదేకస్య వశే విశ్వం ప్రవర్తతే ।**
**ఇతి సాధయితుం పూర్వం పూర్వపక్షం ప్రచక్ష్మహే ॥**

ఇది ఆ శ్లోకము. దీని తరువాత "అత్ర మీమాంసకాః ప్రాహుః అని మీమాంసకులను ఈవిషయమున పూర్వపక్షులుగా ఈగ్రంథం పేర్కొనినది. పిదప వీరి మతము ఆనుమానికేశ్వరవాదులగు తార్కికుల చేత ఖండింప చేయబడినది. ఇంతవరకే ఈశ్వరసిద్ధి భాగము మనకిపుడు ఉపలబ్ధమగు చున్నది. ఇట్లు ఉపలబ్ధమైన ఈభాగమంతయు శాస్త్రయోనిత్వాధి కరణ పూర్వపక్షరచనలలో శ్రీభాష్యకారులకు బాగుగా సహకరించినది. ఐతే ఇక్కడ కొంచెము మార్పును మనమిక్కడ గమనింతుము. ఈశ్వరసిద్ధిలో పూర్వమీమాంస కులను ఖండించిన తార్కికులు పూర్వపక్షులు. వారితోవిపాటు పూర్వమీమాంసకులు కూడా పూర్వ పక్షకోటిలో చేర్చబడినలిరు. కాని శ్రీభాష్యంలో ఈఅధికరణానికి ప్రధాన పూర్వపక్షులు తార్కికులు మాత్రమే.

అధికరణ పూర్వపక్షము మొదట శాస్త్రము బ్రహ్మను ప్రతిపాదించదు. ఇతర ప్రమాణములతో బ్రహ్మసిద్ధించవచ్చును కనుక, అంటూ తార్కికుల పూర్వపక్షానుమానములు పరమాత్మను చెప్పజాలవు అని ఖండించడము జరిగినది. ఆపూర్వమీమాంసకులను తిరిగి శ్రీభాష్యకారులు తార్కికుల ద్వారా ఖండింపచేసినారు. ఇది శ్రీభాష్యకారులు సందర్భానుగుణంగా మలచుకొన్న చిన్నమార్పు. ఈమార్పునకు కారణము శ్రీభాష్యకారులది స్వతంత్ర గ్రంథము కాకపోవుటయే. ఈశ్వరసిద్ధి గ్రంథం స్వతంత్ర గ్రంథము. మరి శ్రీభాష్యమో బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యాన రూపమైన గ్రంథము. ఈమార్పునుబట్టి మరొక్క గుణం కూడా ఏర్పడినది.

అదేమంటే పూర్వమీమాంసకులు కూడా వేదార్థ విచారము చేయువారే కనుక వేదాన్తులతోపాటు ఒకేశాస్త్రమునకు సంబంధించినవారు. కనుక వారికి సిద్ధాన్తి ఏకదేశిత్వము లభించినది. ఏకొంచెమే అయిన వేదాన్తులు పూర్వమీమాంసకులపై ఆత్మీయతను కనపరిచినట్లైనది. తార్కికులవలె వీరికిని ఒకేవర్గానికి చెందిన పూర్వపక్షిత్వము అనునది లేకుండా చేయబడినది.

ఇట్లు చేసినందువలన వీరు శాస్త్రముకూడా ఈశ్వరుని విషయమున ప్రమాణము కాదు అను మీమాంసకమతమును ఉపపాదించి నిరసించవలసిన అవసరము తప్పిపోయినది. యామునేయులు ఈశ్వర సాధకములేమిటి అని ప్రశ్నించుకొను సందర్భమున ప్రత్యక్షమా? అనుమానమా? ఆగమమా? అని శాస్త్రమును కూడా స్పృశించినారు. ఐతే మనకు ఆగమవిషయ ప్రతిపాదక గ్రంథమే లభించలేదు. ఈశ్వరసాధక అనుమానములపై వీరు చూపెట్టు దోషములను ఉద్ధరించు సందర్భమువరకే గ్రంథభాగము ఉపలబ్ధమైనది. కనుక భగవద్రామానుజులు మీమాంసకులను ఇతర పూర్వపక్షుల కోటి నుండి విడదీసి వేదాన్తులతో పాటు వీరికి సిద్ధాంతిత్వమును, ఏకశాస్త్ర అనుయాయిత్వమును సంరక్షించడాన్ని మనం చూస్తాం. అస్తు.

*(సశేషం)*



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

(శ్రీమద్ భా. ప్ర. స్క-13వ అధ్యాయం)

నారదుడు, యుధిష్ఠిరునితో మాటాడుతున్నాడు. జీవులదైన్య గతిని, భగవంతుని నిరంకుశ వైభవాన్ని చాటుతున్నాడు.

"ఓ మహారాజా! ఈనాడు సమస్త ప్రాణులను పుట్టించే ఆభగవంతుడు, కాలస్వరూపుడై ఈభూమిమీద అవతరించాడు. దుర్మార్గులైన దేవద్వేషులను నిగ్రహించడమే, అంటే సత్త్వప్రవృత్తి కలవారిని రక్షించడమే పరమలక్ష్యంగా ఆయన అవతరిస్తాడన్నమాట. తాను చేయవలసిన దేవతాప్రయోజనాన్ని పూర్తిగా సాధించాడు. ఇక అవతారాన్ని చాలించడానికే ఎదురుచూస్తున్నాడు. ఆస్వామి, ఈభూమ్మీద ఉండేలోపే మీరు, మీకృత్యాన్ని నెరవేర్చుకోండి. ఇక, ధృతరాష్ట్రుడు గాంధారితోను, తన సోదరుడైన విదురునితోను కలిసి హిమాలయానికి దక్షిణాన ఉన్న ఋష్యాశ్రమానికి చేరాడు.

అక్కడ ఏడుప్రవాహాలతో ప్రకాశిస్తున్న గంగానది, సప్తర్షుల ప్రీతికోసమే అక్కడ వారికి సేవలు చేస్తోంది. ఆ నదీ జలాలలో స్నానాదికృత్యాలు నెరవేర్చి అగ్నినిప్రేలుస్తూ, శాస్త్రీయంగా, నీటిని మాత్రమే పుచ్చుకుంటూ, అన్ని కోరికలు జయించి ఉంటున్నాడు ధృతరాష్ట్రుడు. ఆయన ఆసనజయంపొందాడు. శ్వాసను నియమించాడు. ఆరు ఇంద్రియాలను వాటి విషయాలనుండి వెలికి తీశాడు. కేవలం శ్రీహరిభావనచే రజస్సును, తమస్సును అణచి, సత్త్వసంపన్నుడై ఉన్నాడు. జ్ఞానస్వరూపుడైన జీవాత్మయందు తన మనస్సును నిగిడ్చి, ఘటాకాశం మహాకాశంలో విలీనమైనట్లు, తాను పరబ్రహ్మంలో లీనమయ్యాడు త్రిగుణాత్మక మాయయొక్క గుణాల వల్ల కలిగే అన్నిరకాల వాసనలను నశింపచేసికొన్నాడు. తన ఇంద్రియాలను మనస్సును నిరోధించాడు. అన్నిరకాల ఆహారాలను తీసికోవడంమానివేశాడు. ఒక స్థిరమైన రాటలాగా ఉండిపోయాడు. అన్నికర్మలూ విడచిపెట్టాడుకనుక (భగవంతునికే అర్పించాడుకనుక) ఆయనకు ఏ ప్రతిబంధాలు లేవు-ఇక, ఓరాజా! ఈనాటినుంచి ఐదవరోజున తన భౌతికదేహాన్ని విడుస్తాడు. ఆ దేహం తనంతతాను బూడిద అయిపోతుంది. ఆయన దేహం కాలిపోతున్నప్పుడు, ఆయన పత్ని అయిన, గాంధారి, భర్తతోపాటు తామున్న పర్ణశాల కూడా దహింపబడిపోగా, వెలుపల నిలబడి చూస్తూ ఉంటుంది. అటు తరువాత, ఆ సాధ్వి, అదే అగ్నిలో తానూ ప్రవేశిస్తుంది. ఇక, విదురుడు, ఈ ఆశ్చర్య కర సన్నివేశాన్ని విని, ఆనందం, శోకం రెండూ అనుభవిస్తూ తీర్థాలను సేవించడానికి వెళ్లిపోతాడు".

అని చెప్పి, నారదుడు, తుంబురునితోపాటుగా స్వర్గానికి వెళ్లిపోయాడు. ధర్మరాజు ఈ వృత్తాన్తాన్ని విని తన శోకాన్ని విడిచిపెట్టాడు.

**14 వఅధ్యాయం**

ద్వారకలో అవతార పురుషుడైన శ్రీకృష్ణనివృత్తాన్తాన్ని తెలిసికోగోరి, అర్జునుడు బయలుదేరి వెళ్లాడు. ఇలా వెళ్లిన అర్జునుడు కొన్ని మాసాలైపోయినా తిరిగిరాలేదు. ధర్మరాజు, అనేక ఘోరశకునాలు చూచాడు. కాలస్వభావం పూర్తిగా మారిపోయింది. అనేకాలైన మార్పులు ఏర్పడ్డాయి-కాలంచాలా రౌద్రస్వరూపాన్ని ధరించింది. ఋతుధర్మాలన్నీ మారిపోయాయి. క్రోధం, లోభం, అసత్యం స్వభావంగా కల జనుల పాపపంకిలమైన ప్రవృత్తి, వృత్తాన్తం, కపటమైన వ్యవహారం, శఠత్వంతో కలగలిసిన స్నేహప్రవృత్తి ఇవన్నీ కాలకృతాలైన పరిణామాలుగా ఏర్పడ్డాయి. తండ్రి, తల్లి, మిత్రుడు, సోదరుడు, దంపతులు వీరందరి పాపాచరణం చాలా శోచనీయమై ఏర్పడింది. కన్యలను విక్రయించడం, తండ్రి బిడ్డలు తమతల్లిదండ్రులను పోషించకపోవడం, ఇలాంటివి ఎన్నో ఏర్పడ్డాయి. బ్రాహ్మణులు వేదమంటే గిట్ట నివారయ్యారు. ఇతరవర్ణాల వారంతా బ్రహ్మవేత్త లైనారు. ఎన్నో దుర్నిమిత్తాలు గోచరించాయి. లోభంవల్ల అధర్మ ప్రకృతిని చూచి, ధర్మజుడు కలతచెంది, భీమసేనునితో ఇలా అన్నాడు.

"ఓ భీమసేనా! బంధువులను చూచిరమ్మని అర్జునుని ద్వారకకు పంపాము. పుణ్యశ్లోకుడైన శ్రీకృష్ణుని వార్తను తెలుపమని నిదేశించాం. ఇప్పటికి ఏడునెలలు గడిచాయి. అయినా, ఇంకా నీ సోదరుడు తిరిగిరాలేదు. ఎంతగా ఆలోచించినా ఇలా రాక పోవడానికి గల కారణం ఏమిటో తెలియడంలేదు. ఆ దేవర్షి, నారదుడు ఆదేశించిన కాలం దగ్గర పడిందా? తాను లీలోపకరణంగా స్వీకరించిన ....కళేబరాన్ని విడచిపెట్టేకాలం ఆసన్నమైందా?

**యస్మాన్నః సంపదో రాజ్యం దారాః, ప్రాణాః, కులం ప్రజాః ।**
**ఆసన్ సపత్న విజయో లోకాశ్చ యదనుగ్రహాత్ ॥**

ఏ మహానుభావుని అనుగ్రహంవల్ల మనకు సంపదలు, రాజ్యం భార్యాదిభోగాలు, ప్రాణులు, కులము, సంతానము, శత్రువిజయం ఇహపరలోకాలు ఇవన్నీ ఏర్పడ్డాయో ఆయన తన దేహాన్ని విడవ సంకల్పించాడా? అనేకాలైనదుశ్శకునాలు నలువైపులా గోచరిస్తున్నాయి. *(సశేషం)*

తిరువరంగత్తముదనార్లు అనుగ్రహించిన ప్రపన్నగాయత్రి

# ఇరామానుశనూత్తన్దాది

గత సంచిక తరువాయి

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

**41వ పాశురము**

**మణ్మిశై యోనిగళ్ తోఱుమ్ పిఱన్దు, ఎంగళ్ మాతవనే**
**కణ్ణుర నిఱ్కిలుమ్ కాణకిల్లా ఉలకోర్కళెల్లామ్**
**అణ్ణల్ ఇరామానుశన్ వందు తోన్ఱియ అప్పొళుదే**
**నణ్ణరు ఞానమ్ తలైక్కొండు, నారాయణర్కాయినరే ॥**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **ఎంగళ్ మాతవనే** | = | మనకు నాథుడైన శ్రియఃపతియే |
| **మణ్మిశై** | = | ఈభూమిలో ఉండే |
| **యోనిగళ్ తోఱుమ్** | = | జాతులన్నిటిలోను |
| **పిఱందు** | = | అవతరించి |
| **కణ్ ఉఱ నిఱ్కిలుమ్** | = | అందరికళ్ళకు తమను లక్ష్యంగాచేసి కొన్నప్పటికీ |
| **కాణకిల్లా** | = | చూడలేని |
| **ఉలకోర్కళ్ ఎల్లామ్** | = | లోకులందరూ |
| **అణ్ణల్** | = | సర్వస్వామియైన |
| **ఇరామానుశన్** | = | భగద్రామానుజులు |
| **వందు** | = | ఈలోకానికి వచ్చి |
| **తోన్ఱియ అప్పొళుదే** | = | అవతరించిన వెంటనే |
| **నణ్ణ అరు** | = | పొందడానికి అరుదైన |
| **ఞానమ్** | = | జ్ఞానాన్ని |
| **తలైక్కొండు** | = | చక్కగా పొంది |
| **నారణర్కు** | = | శ్రీమన్నారాయణునకు |
| **అయినరే** | = | శేషభూతులయ్యారు. |

**తాత్పర్యము :** శ్రీరామానుజుల అవతారం భగవదవతారాల కంటే గొప్పది. ఎందుకంటే భగవంతుడు ఎన్నోజాతులలో ఎన్నోజన్మలెత్తాడు. కంటికి కనిపించాడు, ఏన్నో ఉపదేశాలు చేశాడు, తన మహిమలు చాటాడు. అయినా ఆయన గొప్పదనాన్ని ఎవ్వరూ గుర్తించలేదు. ఆయన అవతారాలవలన జీవులకు జ్ఞానోదయం కాలేదు. అదే మరి యతిరాజుల అవతారాన్ని చూడండి. ఆ అవతారం లోకానికెంతో ఉపయోగపడింది. లోకులు యథార్థజ్ఞానాన్ని పొందారు, ఉజ్జీవించారు. అందువల్ల రామానుజాచార్యులవారి అవతారమే, భగవంతుని అవతారముల కంటే గొప్పది, ప్రయోజనకరమైనది అంటున్నారు అముదనార్లు.

**42వ పాశురము**

**ఆయిళైయార్ కొంగై తంగుం, అక్కాతలళత్తఝున్ది**
**మాయుమెన్నావియై వందెడుత్తానిన్ఱు, మామలరాళ్**
**నాయకన్, ఎల్లా వుయిర్ కట్కుమ్ నాతన్ అరంగనెన్నుమ్**
**తూయవన్ తీతి లిరామానుశన్ తొల్లరుళ్ శురన్దే ॥**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **మామలరాళ్ నాయకన్** | = | లక్ష్మీదేవికి భర్త అయిన |
| **అరంగన్** | = | శ్రీరంగనాథుడు |
| **ఎల్లా ఉయిర్ కట్కుమ్** | = | జీవాత్మలందరికీ |
| **నాతన్ ఎన్నుమ్** | = | నాథుడు అని చెప్పిన |
| **తూయవన్** | = | పరమ పవిత్రులు |
| **తీతు ఇల్** | = | ఏ విధమైన దోషములేని |
| **ఇరామానుశన్** | = | భగవద్రామానుజులు (గొప్ప ఉపకారం చేశారు) |
| **ఆయ్ ఇళైయార్** | = | బంగారు ఆభరణాలు ధరించిన స్త్రీలయొక్క |
| **కొంగై తంగుమ్** | = | స్తనాగ్రములలో నిలువాలి అని |
| **అక్కాతల్ అళరు** | = | ఆశ అనే బురదలో |
| **అళున్ది** | = | మునిగి |
| **ఇన్ఱు** | = | ఇప్పుడు |
| **తొల్ అరుళ్** | = | అకారణమైన దయను |
| **శురందు** | = | స్రవించి |




www.mangalaakshatas.com
In commitment to help the people of spiritually inclined, we come up with the unique platform for 'Sri Vaishnava Community' to choose their life partner with an ideal mind set.
*With the Mangalasanams of*
"Sri SriSriTridandiChinnaSrimannarayanaRamanujaJeeyarSwamiji" we present you with 'mangalaakshatas' - A wedding platform for Sri Vaishnavas.
We are now open for free registrations. Please visit: www.mangalaakshatas.com
మీ జీవిత భాగస్వామికోసం ఎదురుచూస్తున్నారా?.. ఇదిగో మీ ముందుకు 'మంగళాక్షతలు' మన ఆచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి మంగళాశాసనములతో...! పై వెబ్‌సైట్‌లో రిజిస్టర్ చేసుకోండి!

**ఎడుత్తాన్** = ఉద్ధరించారు

**తాత్పర్యము :** నా ఆత్మ స్త్రీ సౌందర్యానికి, వారి ఆభరణాలకి వశపడిపోయి, ఆ బురదలోనే మునిగిపోయి అనాదిగా దుఃఖిస్తూ ఉండేది. అటువంటిసమయంలో నాపై తమ నిర్హేతుకకృపను వర్షించారు రామానుజులు. జీవులకు శ్రియఃపతి మాత్రమే నాథుడని చాటిన పవిత్రమూర్తి మా యతిరాజులు. ఆ దయామయుని అకారణ కరుణతో నేను సంస్కరింపబడ్డాను అని అముదనార్లు లోకానికి తమ ఆనందాన్ని చాటిచెప్పారు.

**43వ పాశురము**

**శురక్కుమ్, తిరువుమ్, ఉణర్వుమ్, శొలప్పుకిల్ వాయముతమ్**
**పరక్కుం ఇరువినై పత్తఅఓడుమ్ పడియిలుళ్ళీర్**
**ఉరైక్కిన్దనన్, ఉమక్కియాన్ అఱమ్ శీఱుం ఉఱుకలియై**
**త్తురక్కుమ్ పెరుమై, ఇరామానుశన్ ఎన్ఱు శొల్లుమినే ॥**

**ప్రతిపదార్థము :**

**పడియిల్ ఉళ్ళీర్** = ఈభూమిపై నివసించే ప్రజలారా!,
**యాన్ ఉమక్కు** = నేను మీకు,
**ఉరైక్కిన్దనన్** = ఒక మంచి విషయాన్ని చెబుతాను,
**అఱమ్ శీఱుమ్** = ధర్మమైన కోపము కలిగినవాడై,
**ఉఱు** = బలవంతుడైన,
**కలియై** = కలిని,
**తుఱక్కుమ్** = తరిమికొట్టే,
**పెరుమై** = గొప్పతనముగల,
**ఇరామానుశన్ ఎన్ఱు** = రామానుజులుఅనేవారి దివ్యనామాన్ని,
**శొల్లుమిన్** = నోరారా పలకండి (అలాచేస్తే),
**తిరువుమ్** = భక్తి అనే సంపద,
**ఉణర్వుమ్** = జ్ఞానం,
**శురక్కుమ్** = బాగావృద్ధిచెందుతుంది,
**శొలపుకిల్** = అనడం మొదలుపెట్టగానే,
**వాయ్** = వాక్కులో.
**అముతమ్** = అమృతము,
**పరక్కుమ్** = వ్యాపిస్తుంది,
**ఇరువినై** = మహాపాపాలు,
**పఱ్ఱు అఱ ఓడుమ్** = పూర్తిగా నశిస్తాయి,

**తాత్పర్యము :** ఓ లోకులారా! మీరంతా నే చెప్పే విషయాన్ని శ్రద్ధగా విని ఆచరించండి. ఒక మంచి విషయాన్ని మీకు చెపుతాను. శ్రీరామానుజులు, ధర్మానికి విరోధి అయిన కలిపురుషుని తరిమికొట్టిన మహనీయులు. వారి దివ్యనామాలను జపిస్తే మీకు జ్ఞానం, భక్తి సమకూరుతాయి. మీ పాపాలన్నీ నశిస్తాయి. ఆ నామాలు అనడం మొదలుపెట్టగానే నోటిలో అమృతం ఊరుతుంది. చెప్పండి, చెప్పండి అంటున్నారు అముదనార్లు. *(సశేషం)*




**శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్**

భగవద్రామానుజుల వైభవాన్ని తెలిపేస్తోత్రం ధాటీపంచకం. దీనిని రచించిన మహనీయులు ముదలియాన్దాన్ "దాశరథి"అని వీరిపేరు.

రెండవశ్లోకం -

**శ్లో॥ పాషండ షండ గిరిఖండన వజ్రదండాః**
**ప్రచ్ఛన్న బౌద్ధ మకరాలయ మంథ దండాః**
**వేదాన్తసార సుఖదర్శన దీపదండాః**
**రామానుజస్య విలసంతి మునేః త్రిదండాః"**

**ప్రతిపదార్థం :-**

**రామానుజస్య మునేః** = భగవద్రామానుజ మునులయొక్క
**త్రిదండాం** = మూడుదండములు (కూర్చిన త్రిదండం),
**పాషండ షండ గిరిఖండన వజ్రదండాః**
= పాషండ మతస్థుల సమూహాలనే పర్వతాలను ఖండించడంలో వజ్రదండము వలె.
**ప్రచ్ఛన్నబౌద్ధ మకరాలయ మంథదండాః**
= ముసుగు వేసుకున్న బౌద్ధ అద్వైతులనే సముద్రాన్ని మథించే కవ్వమువలె.
**వేదాన్తసార సుఖదర్శన దీపదండాః**
= ఉపనిషత్తులసారాన్ని చక్కగా దర్శించడంలో దివ్వటీ వలె.
**విలసంతి** = ప్రకాశించుచున్నది.

**తాత్పర్యం -** భగవద్రామానుజులు త్రిదండమును ధరించియుందురు కదా. చిత్, అచిత్, ఈశ్వర తత్త్వాలకి ప్రతీకగా ఏర్పడినదే త్రిదండం. అది ఎలాంటిదో ముదలియాణ్డాన్ ఈ శ్లోకంలో వివరిస్తున్నారు. వజ్రం పర్వతాలని అవలీలగా ముక్కలు చేస్తుంది. పాషండమత పర్వతాలని ఈ త్రిదండమనే వజ్రంకూడా అలాగే ముక్కలు చేస్తుంది. బౌద్ధమనే ముసుగులోఉన్న అద్వైతాన్ని– ఆ సముద్రాన్ని చిలికే కవ్వంలా పనిచేస్తుంది. ఉపనిషత్తులలో దాగిన విశేషార్థాన్ని, సారాంశాన్ని చూపించడంలో వెలుగులు జిమ్మే దివిటిలా ప్రకాశిస్తుంది. నాస్తికాన్ని రూపుమాపి, శ్రీమన్నారాయణ పరత్వాన్ని లోకానికి చాటి, చూపి, వేదాంతార్థాలను ప్రకాశింపచేసే అద్భుత సాధనమే భగవద్రామానుజుల హస్తమునలంకరించిన త్రిదండము.

# శ్రీవచన భూషణ సారమగు సప్తగాథ

శ్రీమతి చక్రవర్తుల చూడామణి- ఖమ్మం

**"తులా హిర్బుధ్న్య సంభూతం శ్రీలోకాచార్య పదాశ్రితం ।**
**సప్తగాథా ప్రవక్తారం నారాయణ మహంభజే ॥**
**సిద్ధిర్భవతి వానేతి సంశయోఽచ్యుత సేవినాం ।**
**నసంశయస్తు తద్భక్త పరిచర్యారతాత్మనామ్ ॥**

శ్రీమన్నారాయణుని కైంకర్యపరులకైనా పరమపదం సందేహమే కాని ఆయన భక్తులకు కైంకర్యం చేసేవారికి మాత్రం తప్పక లభిస్తుందని శాస్త్రం చెపుతుంది. ఈవిషయాన్ని మనసులో నిలుపుకుని చరమ పర్వనిష్ఠకు పరాకాష్ఠగా నిలిచిన ఉత్తములెందరో ఉన్నారు. పిళ్ళై ఉరంగావిల్లిదాసర్ ఎంబెరుమానార్లకు, ఏఱుతిఅం ఉడయదాసర్ నంబిళ్ళై గారికి, పిళ్ళైవానమామలై దాసర్ నడువిల్ తిరువీధిప్పిళ్ళై గారికి, విళాంశోలైపిళ్ళై పిళ్ళైలోకాచార్యులకు అనుంగు శిష్యులుగా ఉండి ఆచార్యుల మనసెరిగి ప్రవర్తించివారి అభిమానపాత్రులై "వైయ్యమన్ని వీత్తిరుందు విణ్ణుమాళువర్ మణ్ణాడే" అన్నట్టు లీలా విభూతి, నిత్యవిభూతిలో కూడా కైంకర్య భాగ్యం పొందారు.

విళాంశోలైపిళ్ళై అసలుపేరు నారాయణ దాసు. వీరు పిళ్ళైలోకాచార్యుల అనుంగుశిష్యులుగా ఉండి, ఆచార్య శ్రీముఖమునుండి వెలువడిన అష్టాదశరహస్యములను ఆసాంతం అధికరించారు. అయినా శ్రీవచన భూషణం, అందునా ఆరవ, ఆఖరి ప్రకరణమైన చరమపర్వనిష్ఠమీద వీరికి అపారమైన అభిమానం "ఉన్నిల్ తికజవచన భూషణత్తిన్ శీర్మై మొన్నుకొల్లై" (లోకంలో శ్రీవచన భూషణానికి సాటి మరేశాస్త్రము లేదు) అని నిరూపించేట్టుగా శ్రీవచనభూషణ సారంగా ''సప్తగాథ'' అనే గ్రంథాన్ని అనుగ్రహించారు. నమ్మాళ్వార్లు అథర్వణ వేదసారంగా ఏడుపాశురాలతో తిరువాశిరియ కూర్చినట్టు వీరుకూడా ఆరు ప్రకరణాలు, 463చూర్ణికలు ఉన్న శ్రీవచన భూషణసారంగా ఏడే పాశురాలతో 'సప్తగాథ' అనుగ్రహించారు. తిరువాశిరియం ప్రథమపర్వనిష్ఠకు పరాకాష్ఠగా, సప్తగాథ చరమపర్వనిష్ఠకు పరాకాష్ఠగా నిలిచింది. ద్రావిడభాషా పరిచయంగలవారికి సుళువుగా అర్థమయ్యేరీతిలో అలతిమాటలలో సులభమైన 'వేణేపా' చంధంలో కూర్చబడిందీ గ్రంథము.

ఇందులో సచ్ఛిష్యులకుండవలసిన లక్షణాలు, వాటి వలన వారు పొందగల ఉన్నతి, ఉండకూడదని లక్షణాలు, వాటి వలన వారు పొందగల అథోగతి చెప్పబడింది. అలాగా సదాచార్యులకు కూడా ఏర్పడగల అవధ్యాలు, వాటి నివృతిమార్గాలు చెప్పబడింది. ఈగ్రంథాన్ని అధికరించి ఆచరించి అందరూ ఉన్నతగతిని పొందాలని విళాంశోలైపిళ్ళైగారి అభిమతం. మనవంతు ప్రయత్నం మనమూచేద్దాం.

**వాళ్ఴి నలన్తిగళ్ నారణ తాదనరుళ్**
**వాళ్ఴి యవనముద వాయ్మొళ్ఴి గళ్ వాళ్ఴియే**
**ఏఱు తిరువుడైయాన్ ఎన్నుములగారియన్ శొలై**
**తేఱు తిరువుడైయార్ శీర్**

**అవతారిక**: శ్రీపిళ్ళైలోకాచార్యుల ప్రియశిష్యులు, సప్తగాథకృతికర్త అయిన నారాయణ దాసుడనే విళాంశోలైపిళ్ళై ఆచార్యాభిమానం చిరకాలం వర్ధిల్లాలని శ్రీతిరువాయ్మొళ్ఴి పిళ్ళైపై 8వ పాశురంలో ప్రస్తుతించారు.

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **నలయే తిగళుం** | = | జ్ఞానానందములచే ప్రకాశించుచున్న. |
| **నారణ తాదన్** | = | నారాయణ దాసుయొక్క. |
| **అరుళ్** | = | కృప |
| **వాళ్ఴి** | = | వర్ధిల్లుగాక |
| **అముదం** | = | అమృతోపమానమైన? |
| **వాయ్మొళ్ఴిగళ్** | = | సూక్తులు |
| **వాళ్ఴి** | = | వర్ధిల్లుగాక |
| **ఏఱుతిరు ఉడైయాన్** | = | నిరతిశయ, నిరంతర భగవద్భాగవత ఆచార్య కైంకర్య భాగ్యము కలిగినవారై |
| **ఎన్నుం** | = | ఎల్లప్పుడూ |
| **ఉలగారియన్** | = | పిళ్ళైలోకాచార్యులు |
| **శొల్** | = | సూక్తులు |
| **తేఱు** | = | నిస్సంశయముగా |
| **తిరు ఉడైయాన్** | = | ఆచార్యాభిమానమనే లక్ష్మీ సంపన్నుడు. |
| **వాళ్ఴి** | = | వర్ధిల్లుగాక. |

**తాత్పర్యము :** జ్ఞానానందములచే ప్రకాశించుచున్న నారాయణ దాసుడనే విళాంశోలైపిళ్ళై కృప నిరంతరము ప్రసరించుగాక. వారి అమృతమయమైన దివ్యసూక్తులు వర్ధిల్లుగాక. భగవద్భాగవత ఆచార్య కైంకర్యశ్రీ నిరాటంకముగా నిరంతరం వర్ధిల్లుగాక, శ్రీపిళ్ళైలోకాచార్యుల అష్టాదశ రహస్యగ్రంథముల సారమును నిశ్శేషంగా అధికరించిన శ్రీవిళాంశోలైపిళ్ళై ఆచార్యాభిమాన వైభవము ఆచంద్రతారార్కము వర్ధిల్లుగాక.

**అవతారిక :** ఈ పాశురము ఆచార్యవైభమును తెలియజేస్తున్నది.

**అమ్బొనరఙ్గర్కుమావిక్కుం అన్తరంగ**
**శమ్బన్దఙ్గాట్టి తడైగాట్టి- ఉమ్బర్**
**దివమెన్నుం వాశ్వుక్కు చ్చేర్ద నెఱిగాట్టుం**
**అవనన్రో వాశారియన్.**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **అమ్బొనరఙ్గర్కుమ్** | = | బహు సుందరమైన బంగారులోనిలో వేంచేసి ఉన్న శ్రీరంగనాథులకి |
| **ఆవిక్కుం** | = | చేతనులకు (ఉన్న) |
| **అంతరంగ సంబంధం** | = | అనేక విధాల అవినాభావ సంబంధం (నవవిధసంబంధాలు) |
| **కాట్టి** | = | చూపి |
| **తడై** | = | జీవాత్మ పరమాత్మలకు మధ్య ఉన్న అవినాభావ అనాదిసంబంధాన్ని తెలుసుకోవటానికున్న అవరోధాలు. |
| **కాట్టి** | = | చూపి |
| **ఉమ్బర్** | = | నిత్యసూరులయొక్క |
| **దివమెన్నుంవాశ్వుక్కు** | = | బ్రహ్మానుభవానంద సంపదను |
| **శేర్ద** | = | తనిన |
| **నెఱి** | = | ఉపాయము, ప్రపత్తిమార్గము |
| **కాట్టుం** | = | చూపించు, మార్గనిర్దేశము చేయు |
| **అవనన్రో** | = | కృపామాత్ర పసన్నాచార్యులుకదా |
| **ఆశారియన్** | = | చేతనోద్ధరణ చేయు ఆచార్యులు. |

**భావము :** సర్వేశ్వరుడికి, చేతనులకుమధ్య నవవిధసంబంధాలుంటాయని చెప్పబడింది. అవి. 1. పితృ-పుత్ర, 2. రక్ష్య-రక్షక, 3. శేష-శేషి, 4.భర్తృ-భార్యా, 5. జ్ఞాతృ-జ్ఞేయ, 6. స్వ-స్వామి, 7. ఆధార-ఆధేయ, 8. శరీర-ఆత్మ, 9. భోక్తృ-భోగ్య సంబంధాలు. ఆచార్యులుపదేశించే తిరుమంత్రం ఈ సంబంధాలను, వీటిని తెలుసుకోవటానికి ఆటంకంగా ఉండే విరోధిస్వరూపమును, దానినతిగమించి పరమాత్మను చేరడానికి ఉపాయస్వరూపమును, పరమపదము చేరి భగవదనుభవము పొందుట అనే పురుషార్థ స్వరూపమును, అనగా అర్థపంచకమును తెలియజేస్తుంది.

చేతనోద్ధరణ చేసే ఇంత గొప్పమంత్రాన్ని మంత్రార్థాన్ని నిర్హేతుకమైన కృపతో శిష్యులకుపదేశించేవారు కదా ఆచార్యులు.

**విశేషార్థములు :** 'అమ్బొన్నరఙ్గర్కుమ్' ఆ నారాయణుడే శ్రీరంగంలో రంగనాథునిగా వేంచేసి ఉన్నాడని చెప్పబడింది. 'అంతరంగ సంబంధం' విశిష్టాద్వైత సిద్ధాంతానికి మూల విషయమైన 'శరీరాత్మభావం' చెప్పబడింది. *(సశేషం)*


పరమహంస పరివ్రాజకులు
శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్‌స్వామివారి మంగళాశాసనములతో...!
సామూహిక కోటికుంకుమార్చన
సహస్ర గళార్చన,
లక్ష్మీఆవిర్భావఘట్టం నృత్యప్రదర్శన
22.8.2014
సా॥ 3గం॥ నుండి
వేదిక
ఆళ్వార్‌దాస్ గ్రౌండ్
యం.వి.పి. కాలనీ
విశాఖపట్నం.
శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయర్‌స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో...!
అమ్మ అనుగ్రహాన్ని పొంది మనమందరం భాగ్యవంతులమవుదాం! అన్ని రంగాల్లో విజయాన్ని సాధించి, సకల సౌభాగ్యాలతో, పాడి, పంట, సత్సంతానం పొంది, సుఖజీవనం సాగించుటకు సకల సంపత్‌ప్రదమైన ఈ శ్రావణమాసంలో4వ శుక్రవారం అందరం కలిసి శ్రీలక్ష్మీ సహస్రనామాలతో "కోటికుంకుమార్చన"లో పాల్గొందాం!
కోటికుంకుమార్చనలో అమ్మను ఆరాధించి, అఖండ ఐశ్వర్యాలను పొందాలని అందరినీ ఆహ్వానిస్తున్నాం!
సంప్రదించండి: వారిజ ఆశ్రమము మంగమారిపేట, భీమిలీబీచ్ రోడ్, విశాఖపట్నం, ఫోన్ 9247217901, 99083 33301



VILAN V
Just face the world
Hot Cutes
vijay ads



# భగవద్రామానుజుల మధురార్థనిర్వాహాలు - 2

ఈ.ఎ. సింగరాచార్యులు - తిరుపతి

ఆచార్యసార్వభౌములైన భగవద్రామానుజుల ప్రతిభ అసాధారణమైనది. బహుముఖమైనది. ఈ అంశాన్ని నిరూపించే విషయాలు అనేకం ఉన్నాయి. వాటిలో, శ్రీరామానుజులు ఆళ్వార్ల దివ్యప్రబంధాలలోని సూక్తులను ఆయా సందర్భాల్లో వారు చేసిన అర్థ నిర్వాహవైఖరి ఒకటి. అటువంటి అర్థనిర్వాహాలలో ఒక రస్యమైన అర్థనిర్వాహం ఇపుడు ప్రస్తావింపబడుతున్నది.

నమ్మాళ్వార్ల తిరువాయ్మొళి ప్రబంధం **"ద్రావిడీం బ్రహ్మ సంహితామ్"** అనే రీతిలో ద్రావిడభాషలోని బ్రహ్మసంహితగా కీర్తింప బడుతున్నది. అందువల్ల ఆ ప్రబంధంలోని పలుసూక్తులకు వేదవాక్యాలతోగల అర్థసామ్యాన్ని పూర్వాచార్యులు తమ వ్యాఖ్యానాలలో పలు సందర్భాలలో నిరూపించారు. ఈ ప్రక్రియ శ్రీమన్నాథమునులు, భగవద్యామునులు, భగవద్రామానుజులకాలంనుండి కొనసాగినట్లు పూర్వాచార్య వ్యాఖ్యానాలవద్ద తెలుస్తున్నది. ఆ విధంగా శ్రీరామానుజులు శఠకోపులు సహస్రగీతి (తిరువాయ్మొళి) ప్రబంధం లోని ఒక సూక్తిని వేదాన్తవాక్యంగా అన్వయించి అర్థాన్ని నిర్వహించిన రీతి నివేదింపబడుతున్నది.

నమ్మాళ్వార్ల తిరువాయ్మొళి ప్రబంధం ద్వయార్థప్రతిపాదకమని మన పూర్వాచార్యుల అభిప్రాయం. తదనుగుణంగానే వారి వ్యాఖ్యానశైలి కన్పిస్తుంది. నమ్మాళ్వార్లు ఈ ప్రబంధంలోని 3వ శతకములోని 3వ దశకంలో ద్వయమంత్రంలోని ఉత్తరవాక్యార్థాన్ని అనుసంధించారు. ఆ దశకంలోని 6వ పాశురంలో ఆళ్వార్లు **'వేమ్ కడజ్గళ్ మెయ్మేల్వినైముట్రవుమ్ తాజ్గళ్ తజ్గట్కు నల్లినవే శెయ్వాల్, వేజ్గడత్తు తైవార్క్కు నమ ఎన్నలామ్ కడ అదుశుమన్దార్కట్కే"** (వేంకటాద్రిలో వేంచేసి ఉండే శ్రియఃపతికి నమస్కరించడం అనే ఆ వ్యాపారాన్ని మోసే (చేసే) వారికి పూర్వాఘాలు మొత్తం నశిస్తాయి. ఉత్తరాఘాలు చేరవు. ఇదినిజం. ఈ విధంగా అనేవారు తమ మంచిని చేసికొన్న వారుకాగలరు.) అని అన్నారు. ఈ సూక్తిలో **"కడజ్గళ్, మేల్నినై"** అనే పదాలను వివరించేటపుడు ఎంబెరుమానార్ చూపిన ఒక విలక్షణమైన, శాస్త్రీయమైన అర్థనిర్వాహం ఇక్కడ ప్రస్తావింపబడుతున్నది.

**"వేమ్కడజ్గళ్"** అనే ప్రయోగంలోని శ్రీరామానుజులకు ముందు శ్రీయామునాచార్యులవారు **"కడజ్గళ్"** అనే పదానికి ఋణాలనే అర్థాన్ని గ్రహించారు. **"కడన్"** అనే ద్రావిడపదం **"కడమ్"**గా మారినపుడు, దాని బహువచనం **"కడజ్గళ్"** అనే రూపాన్ని పొందుతుంది. ద్రావిడభాష్యంలోని **"మనక్కళ్ ఉళదివరుమ్"** (మకారనకారాలకు పరస్పర నియమం ఉన్నది.) అనే క్రమాన్ని బట్టి ఈ మార్పువచ్చింది. ఇక్కడ **"కడజ్గళ్"** అనే పదం శాస్త్రాలలో తెలువబడిన ఋణత్రయాన్ని తెలుపుతున్నది. ఆ ఋణాలు ఏవి? అంటే, **"త్రిభిః ఋణవాజాయతే, బ్రహ్మచర్యేణ ఋషిభ్యఃయజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః ఏషవా అనృణః"** అని అంటూ యజుర్వేదం షష్ఠకాండంలో మానవుడు మూడు ఋణాలతో జన్మిస్తాడని, ఆ ఋణాలు 1.ఋషిఋణం, 2.దేవఋణం, 3.పితౄణం అని మూడని, వీటిలో, ఋషిఋణం, బ్రహ్మచర్యంద్వారా (వేదాధ్యయనం చేయడంద్వారా) దేవఋణం, వేదవిహితాలైన యజ్ఞయాగాదులను నిర్వర్తించడంద్వారా, పితౄణం, సత్సంతతిని పొందడంద్వారా తీరుతుందని, అపుడతడు ఆ ఋణాలనుండి విముక్తుడు కాగలడని తెలిపింది.

ఈ విషయాన్నే మనుస్మృతి **"ఋణాని త్రీణ్యపాకృత్య మనోమోక్షే నివేశయేత్, అనపాకృత్య మోక్షంతు సేవమానో వ్రజత్యధః"** (మూడు



వ్యక్తిత్వ వికాసానికి ... నాణ్యమైన సాంకేతిక విద్యా బోధనకు
కళ్ళం హరనాథరెడ్డి ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ


KHIT Campus - 10 KM from Guntur City, NH-5
బిటెక్ కోర్సులు
→ కంప్యూటర్ సైన్స్ అండ్ ఇంజనీరింగ్(సియస్ఇ)
→ ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ (ఇఇఇ)
→ ఎలక్ట్రానిక్స్ అండ్ కమ్యునికేషన్స్ ఇంజనీరింగ్ (ఇసిఇ)
→ సివిల్ ఇంజనీరింగ్ (సిఇ),
→ మెకానికల్ ఇంజనీరింగ్ (ఎమ్ఇ)
M.Tech :- CSE
మేనేజ్‌మెంట్ సీట్స్ కొరకు సంప్రదించండి : సెల్ : 98856 04528, 94402 61773, 94910 73337.
EAMCET Code KHIT
NH- 5.10వ కి.మీ వద్ద, కళ్ళం స్పిన్నింగ్ మిల్స్ వెనుక, చిలకలూరిపేట రోడ్, చౌడవరం, గుంటూరు- 19. ఫోన్: 0863 2119726.
సిటీ ఆఫీస్: ఫస్ట్‌లైన్, గుజ్జనగుండ్ల సర్కిల్, గుంటూరు -6. ఫోన్: 0863 2272345.

ఋణాలను తీర్చుకొన్న తరువాత మనస్సును మోక్షంలో లగ్నం చేయాలి. ఆ విధంగా తీర్చుకోకుండా మోక్షంకోసం ప్రయత్నిస్తే, అధోగతిపాలు కాగలడు.) అని ముముక్షువునకు ఋణత్రయముక్తి ఆవశ్యకమని, అది అతనికి అధికారాపాదకమని (ఈ విషయం **"అపాకృత్య", అనపాకృత్య"** అనే ల్యబంతక్రియలప్రయోగంద్వారా సూచింపబడింది. **"స్నాత్వా భుంజీత"** ఇత్యాదులలో వలె) అన్వయవ్యతిరేకాలద్వారా నొక్కివక్కాణించింది. ఆ విధంగా ముముక్షువులు తప్పక తీర్చుకోవలసినవి శాస్త్రాలలో తెలుపబడిన ఋణాలను మూడింటిని **"కడజ్గళ్"** అనే పదం నిర్దేశిస్తున్నదని యామునుల వివరణం. ఇది ముముక్షువునకు అవశ్యకమని శాస్త్రవచనంకనుక, ఈ పదాన్ని ఋణత్రయం వరంగా శ్రీయామునులు వివరించారు. ఈ ఋణాలు కృత్యాకరణ రూపాలు. ఇక, **మెయ్‌మ్మేల్ వినైముట్రవుమ్"** అనే ప్రయోగాన్ని శరీరసంబంధం కారణంగా సంభవించే పాపాల విషయంగా అన్వయించి యామునులు అర్థాన్ని చెప్పారు. **"మెయ్‌మ్మేల్ వినై" "మెయ్"** అంటే ప్రకృతివికారరూపమైన శరీరమని, తత్సంబంధంవల్లకలిగే, **"వినై"**. పాపాలు అని అర్థం. ఇవి అకృత్యకరణ- భగవదపచార- భాగవతాపచార- అసహ్యాపచారాది రూపాలు. (వీటి వివరం శ్రీవచనభూషణ, తద్వ్యాఖ్యాది గ్రంథాలలో, శరణాగతిగద్య వ్యాఖ్యాది గ్రంథాలలో గమనించవచ్చు.)

**"ముట్రవుమ్"**. అంటే మొత్తం సాకల్యంగా- అని అర్థం. పూర్వాఘ-ఉత్తరాఘరూపాలైన అన్ని పాపాలు- అని భావం. **"తదధిగమ ఉత్తర పూర్వాఘయోరశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్"** (4-1-13) అనే బ్రహ్మసూత్రంలో బ్రహ్మజ్ఞానికి పూర్వాఘ, ఉత్తరాఘూలు రెండు తీరిపోతాయని చెప్పబడింది. జ్ఞానం కల్గడానికి శరీరసంబంధ నిబంధనమైన అజ్ఞానంవల్ల, జ్ఞానానంతరం ప్రమాద-విస్మృత్యాదులవల్ల సంభవించే పాపాలే ఈ పూర్వాఘ, ఉత్తరాఘూలు. వీటిలో, ఉత్తరాఘానికి, **"తద్యథా పుష్కరపలాశ ఆపోనశ్లిష్యంతే, ఏవమేవం విదిపాపం కర్మనశ్లిష్యతే"** (ఏ విధంగా తామర ఆకును నీరు అంటదో, అదే విధంగా బ్రహ్మజ్ఞానికి ఉత్తరాఘం అంటదు). అనే ఛాందోగ్యోపనిషత్(4-14-3) వాక్యం ద్వారా అశ్లేషం, పూర్వాఘానికి **"క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే"** (బ్రహ్మజ్ఞానం కలిగిన తరువాత ఆ బ్రహ్మజ్ఞానం కలిగినవానికి అతని పూర్వాఘూలు నశిస్తాయి) అనే ముండకోపనిషత్ (2.29) వాక్యంవల్ల వినాశం తెలుపబడ్డాయి. ఈ రెండు పాశురంలోని **'వేమ్'** అనే పదంద్వారా తెలుపబడ్డాయి. ఈ విధమైన పూర్వాఘవినాశం- ఉత్తరాఘసంశ్లేషం అనేది, శ్రీవేంకటేశ్వరుని ఉద్దేశించి నమఃపదాన్ని పల్కితేచాలు, అవి సంభవిస్తాయి అని శ్రీయామునుల నిర్వాహాన్ని ఆలకించిన శ్రీరామానుజులు ఆళ్వార్లసూక్తికి ఇంకొక మధురమైన, శాస్త్రీయమైన అర్థనిర్వాహాన్ని చేశారు. దీనినికూడా నమ్పిళ్ళై, పెరియవాచ్చాన్‌పిళ్ళై తమ వ్యాఖ్యలలో ప్రస్తావన చేశారు. ఈ నిర్వాహాన్ని వివరించే ఈడు వ్యాఖ్యానపంక్తుల భావం ఈ క్రింది విధంగా ఉన్నది.

"శ్రీ యామునులు చేసిన ఈ నిర్వాహాన్ని శ్రీరామానుజులు విని దీనికి వేదాన్తం చెప్పబడే రీతిలో అర్థం చెప్పవచ్చుకదా. అని ఈ విధంగా అర్థనిర్వాహాన్ని చేశారు. ఏవిధంగా? అంటే, **"ఉత్తర పూర్వాఘయోరశ్లేషవినాశౌ"** అని, **"ఏవం హాస్యసర్వేపాప్మానః" ప్రదూయంతే**- ఈ విధంగా బ్రహ్మజ్ఞానం కలిగిన వానికి పాపాలన్నీ నశిస్తాయి" అని చెప్పబడే రీతిలో **"వేమ్"** (నశిస్తాయి) అని అనడంవల్ల, పూర్వాఘానికి వినాశం, ఉత్తరాఘానికి అశ్లేషం చెప్పవచ్చు. లేక, ఈ వినాశం మిగిలిన అశ్లేషాన్ని పరిశిష్టన్యాయంలో, "వేమ్" అనే పదం లక్షిస్తున్నదని భావించి, ఏ పాపమూ శేషించదు అనే అర్థం చెప్పబడినదనికూడా అర్థాన్ని నిర్వహించవచ్చు.

ఇక్కడ ఒక విషయాన్ని గమనించాలి. శ్రీయామునులు అర్థనిర్వాహంలో పూర్వాఘ-ఉత్తరాఘూలు రెండు **"వినై ముట్రవుమ్"** అనే పదంద్వారా సూచింపబడ్డాయి కాని, శ్రుతివాక్యాలలో ఈ రెండింటికి వేర్వేరు రీతులలో వినాశ-అశ్లేషరూపమైన వ్యవస్థాభేదం తెలుపబడింది. ఆ విధంగానే ఆళ్వార్లసూక్తికికూడా పూర్వాఘ ఉత్తరాఘూలవిషయంగా అర్థనిర్వహణను చేయవచ్చునని భావించిన శ్రీరామానుజులు తదనుగుణంగా ఒక విలక్షణమైన అర్థనిర్వహణ క్రమాన్ని తెలిపారు. ఆళ్వార్ల పాశురంలో **"మేల్‌వినై"**. అనే ప్రయోగమున్నది. దీనికి ఉత్తరాఘమని అర్థం. **"మేల్"** అనే ఈ పదం పూర్వాఘమనే అర్థాన్ని ఇచ్చే ప్రతిసంబంధిపదాన్ని అపేక్షిస్తుంది. కనుక, దానికి ముందున్న **"కడజ్గళ్"** అనేపదం ద్వారా పూర్వాఘమనే అర్థం చెప్పవచ్చునని శ్రీరామానుజులు భావించారు. ఈ విధంగా అర్థం చెప్పినపుడు శ్రుతివాక్యానుగుణమైన అర్థస్వారస్యమేకాక, శబ్దస్వారస్యంకూడా ఉండడం గమనించవచ్చు. *(సశేషం)*

రుచికి, సువాసనకి, ఆరోగ్యానికి నాణ్యమైన
"అజంతా"
పసుపు, కారం, ధనియాలపొడి మరియు సేమియానే ఎల్లప్పుడు వాడండి
రవికుమార్ అండ్ కంపెని - చెన్నై
044 25204046, 26171341
Vijay Ads

# శ్రీ వాసుదేవ మందిరే తిహాస నిర్ధారణ తామ్రశాసనమ్

**శ్రీమన్మందసనామ కీర్తిత భువి శ్రీ చంద్రవంశానుగే**
**మంజూషాహ్వయ సత్కులే సుజనిభృత్ సత్పార్థివైరాశ్రితః ।**
**స్వార్చా వైభవ భాసమాన మహిమా వైకుంఠధామాస్స్వయం**
**లోకానుగ్రహ మాతనోతు సతతం శ్రీవాసుదేవాత్మనా ॥ 1**

మందసానామంకల పుణ్యభూమిపై చంద్రవంశానికి చెందిన 'మంజూషా'కులంలో ఆవిర్భవించిన రాజులు ఆశ్రయించి, సేవించిన అర్చామూర్తి, సాక్షాత్తు పరవాసుదేవుడే. లోకానుగ్రహాన్ని నిరంతరం వర్షించునుగాక!

**ప్రమోద శుభవత్సరే శుభద మార్గశీర్షాభిదే**
**సుమాసి, బుధవాసరే కలితవృశ్చికే సత్తిథౌ ।**
**తతస్త్వసిత పక్షకే హరిహరాఖ్య సద్రాణ్మణి**
**ప్రతిష్ఠిత సువిగ్రహో జయతు వాసుదేవో హరిః ॥ 2**

ప్రమోదనామసంవత్సరం, మార్గశీర్షమాసంలో బుధవారం వృశ్చికాలగ్నం కృష్ణద్వాదశినాడు "హరిహర మహారాజు" వాసుదేవ పెరుమాళ్ళను ప్రతిష్ఠించారు. సువిగ్రహుడైన స్వామి సర్వోత్కృష్టుడగునుగాక!

**శ్రీవాసుదేవ కరుణా భరదృష్టి పాతైః**
**సుప్లావితేత్ర సుకులే కృతశస్త జన్మా**
**యో నైజ సత్సదసి విద్వదనూన వాణ్యా**
**సంశ్లోకితో నృపగణః జయతి ప్రకామమ్ ॥ 3**

శ్రీవాసుదేవుని కరుణాభరదృష్టులచే పవిత్రమైన ఈ కులంలో పుట్టి, విద్వాంసులచే కీర్తితమైన రాజవర్గం జయించుగాక!

**యదీయ సదసి స్వయం ప్రభువితీర్ణ సమ్మాననః**
**విపక్ష కరికేసరీ వ్యజయ దార్య రామానుజః ।**
**యతీన్ద్ర మత మాతనోదతుల వైభవాశాతతం**
**ప్రశస్త సుయశోంకితాం మహిత మందసా మాంచయత్ ॥ 4**

ఈ రాజులసభలో విపక్షగజాలకు సింహమైన శ్రీమద్రామానుజాచార్యస్వామి, యతీన్ద్రమత వైభవాన్నిలోకానికి చాటారు. మందసా రామానుజాచార్యస్వామిగా తామేకాక, తమకాశ్రయమైన మందసాభూమికి కూడా ప్రశస్తిని కలుగజేశారు.

**గోపాలార్యై ర్యతిపరివృఢై శ్చాపి సాతీర్థ్య వృత్త్యా ।**
**శుశ్రూషాత్తం యతిపతిమతం భాష్య గుప్తం యతోభూత్ ।**
**"తేకం" వంశోద్భవశుచిమణేః "మందసా" భాగధేయాత్**
**తస్యారాధ్యం ప్రథిత విభవం "వాసుదేవం" శ్రయామః ॥ 5**

ఏ మందసా రామానుజాచార్యస్వామి శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామి గోపాలాచార్యస్వాములచే సేవింపబడి, రామానుజ భాష్యాన్ని వారిరువురకూ కృపజేశారో, అలాంటి 'తె.కం' వంశంలో పుట్టి మందసాభాగధేయమైన రామానుజాచార్యస్వామిని, వారి ఆరాధ్యదైవమైన వాసుదేవపెరుమాళ్ళను ఆశ్రయింతునుగాక!

**గోదావరీసేతు విభంగ దృశ్యం స్వప్నే విలోక్యాకులితాంతరంగౌ ।**
**గురో స్సకాశే వినివేద్య వృత్తం ప్రహ్వౌ స్వశిష్యౌ కరుణాంతరంగః॥ 6**

**ప్రాప్తౌ యువానౌ యతిరాట్ సుభాష్యరహస్య భావగ్రహణోత్కబుద్ధీ ।**
**శ్రీవాసుదేవాయ గురుర్నివేద్య తుష్టోభవచ్చేతి కథాస్మృతే స్తత్ ॥ 7**

గోదావరీ వంతెన విరిగిపోయిన దుస్స్వప్నాన్ని కని, కలత చెందిన శ్రీమదాకులమన్నాడ చిలకమర్తి శ్రీమన్నారాయణాచార్య తె.కం. గోపాలాచార్య స్వామి ద్వయం నివేదించిన స్వప్నవృత్తాన్తాన్ని విని వారిపట్ల కరుణాంతరంగులైన మన మందసాస్వామివారు, వారిరువునీ, వాసుదేవ పెరుమాళ్ళసన్నిధిలో శరణాగతులు చేయించి, పరితుష్టులై, శ్రీభాష్యాన్ని కోరివచ్చిన ఆ యువకుల్నిద్దరి మనోరథాన్ని ఈడేర్చి ఓదార్చారు.

**శ్రీమన్నారాయణ యతివరైః వాసుదేవస్య జీర్ణం**
**శ్రీమద్దేవాయతనమతుల ప్రాభవం నిర్మితం సత్ ।**
**దేవప్రీత్యై విశదమనసై వార్పితం పార్థివేబ్దే**
**భక్తౌఘస్య ప్రముద మసమాం, మంగళం చాతనోతు ॥ 8**

ఇలా పెద్దస్వామివారికి, ఉ.వే. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్య స్వామివారికి ప్రీతిపాత్రమైన మందసావాసుదేవ మందిరాన్ని పార్థివనామ సంవత్సరంలో పునర్నిర్మించి శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారు తమ ఆచార్యులకు అసమాన ప్రీతిని కలుగజేశారు. భక్తబృందానికికూడా మందసా పెరుమాళ్ళు శుభపరంపరలను ఇచ్చుగాక.

**సమర్పితమిదం పత్ర మితిహాసవచోన్వితమ్ ।**
**రంగరామానుజాఖ్యేన, వాసుదేవ పదాంబుజే ॥ 9**

ఈ శ్లోక పత్రాన్ని ప్రతిష్ఠాదివసాన 'రంగరామానుజాచార్యస్వామి' వాసుదేవస్వామికి సమర్పించారు.

## జులై నెల మెదడుకు మేత సమాధానములు

1.యాస్కాచార్యుడు 2.ఫలితరామం 3.చిదచిత్తులు 4.పరవిద్య, 5.శ్రీధరుడు, వీరరాఘవులు 6. ఆపస్తంబ కల్పసూత్రం 7.వాయువు వంటివాడు 8.ధనము 9. రామానుజులు 10.తంజమాంబ 11. ధనవ్యయం, 12. వాసుదేవపెరుమాళ్ 13.నాచ్చియార్ తిరుమొళి 14. జెట్ కన్వెన్షన్‌వి 15.సంబంధకవి 16.కుంతీదేవి 17.గోకర్ణుడు 18.శిఖ, 19.ఇరామానుశనూత్తందాది 20. కాళ్ళు పాదాలు చల్లగా ఉంటాయి. 21.జీర్ణమండలం.



# అహో! భారతమ్

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

*గత సంచిక తరువాయి*

భీష్ముని మాటలకి శిశుపాలునికి చాలా కోపం వచ్చింది. ఏమిటయ్యా! పెద్ద.... రాజులందరినీ భయపెడుతున్నావా! నిన్ను నమ్ముకొని ఈ కౌరవులంతా గ్రుడ్డివాడి వెనుక నడుస్తున్నట్లు.. ఆహా.. ఏంత బాగుందీ.. ఏమిటీ కృష్ణుని గొప్పతనం. ఓ పక్షిని చంపాడా? (బకుని) ఓ గుఱ్ఱాన్ని (కేశి) చంపాడా? ఓ కఱ్ఱ ముక్కలబండిని పడేశాడా (శకటాసురుని) చెట్లు కూల్చాడా? పాము పొగరణిచాడా? చీమపుట్టంత గోవర్ధనాన్ని ఎత్తాడా? ఏం పరాక్రమం! తాను చెప్పిన ధర్మాలు తానే ఆచరించనివాడు భూలింగపక్షిలాంటివాడు. సాహసం చెయ్యద్దంటుంది సింహంనోట్లో మాంసం లాక్కుంటుంది. ఈ పక్షి, నువ్వూ అలాంటివాడివే. నీకో ధర్మం – దానికో మార్గం. సంతాన ఫలమంటే తెలియదే. గృహస్థాశ్రమమంటే తెలియదే. జ్ఞాతులు చంపిన హంస కథ తెలుసానీకు ?

పూర్వం సముద్రతీరంలో ఒక ముసలి హంస ఉండేది. అబ్బో. ఎన్నో ధర్మాలు చెప్పేది. కాని తానుమాత్రం ఏమీ చేసేదికాదు. పాపం ఈ విషయం తెలియని పక్షులు దాని మాటలు విని దానికి ఆహారం కూడా తెచ్చి ఇచ్చేవి. తమ గ్రుడ్లు దాని దగ్గర దాచుకొనేవి. ఈ హంస హాయిగా వాటిని స్వాహాచేసేది. కొన్నాళ్ళకి వాటికి దాని నిజరూపం తెలిసింది. అంతే అన్నీ కలిసి చంపేశాయి. అలా ఈ రోజు ఈ రాజులంతా నిన్ను చంపే పరిస్థితి వచ్చింది.

జరాసంధుడు ఈ శ్రీకృష్ణునితో యుద్ధమే చెయ్యలేదు అర్హుడుకాదని. ఆ రాజంటే నాకు ప్రాణం. ఆయన మీదికి మారువేషంలో వెళ్ళాడా? ఆయనొక వీరుడా!.. వింటున్నాడు భీముడు. కళ్ళు ఎఱ్ఱపడిపోతున్నాయి. నుదురు 3 పాయల గంగలా కనిపిస్తోంది. వీణ్ణి... వీణ్ణి చంపేద్దాం. దూకబోయాడు. అంతే అడ్డుపడ్డాడు భీష్ముడు. ఏం ఆగిపోయావే.. రా.. అగ్నిలో మిడుతలా... బూడిదైపోదువు గాని... రా... కవ్వించాడు శిశుపాలుడు. తాత వైపుచూశాడు భీముడు. నవ్వాడాయన. నాయనా. వీడి కథ చెబుతా. విను. శిశుపాలునిది చేదివంశం. వీడు మూడుకళ్ళతో, నాల్గు చేతులతో పుట్టాడు తెలుసా. పుట్టిన వెంటనే అచ్చు గాడిదలా ఏడిచాడు. అందరూ భయపడ్డారు. బాబోయ్.. వీణ్ణి విడిచిపెట్టేద్దాం. ఆలోచన అనే అంతలో అశరీరవాణి వినిపించింది. "రాజా భయపడకు. వీడిని చంపేవాడు పుట్టే ఉన్నాడు. ఈ బాలుణ్ణి ఎవరు ఎత్తుకున్నప్పుడు నుదిటి మీద మూడవకన్ను పోతుందో, రెండు చేతులు పోతాయో... ఆ ఎత్తుకొన్నవాడే వీడి పాలిట మృత్యువు" అంది. అంతే అందరికి ఆ అబ్బాయిని ఇవ్వడం, పరీక్షించడం. ఇతని తల్లి శ్రుతశ్రవ. ఆవిడకీ ఒకటే బాధ. తండ్రి దమఘోషుడు. శ్రుతశ్రవకే సాత్వతి అనికూడా పేరు. ఈవిడ వసుదేవుని చెల్లెలు. శ్రీకృష్ణునికి మేనత్త.

ఒకసారి బలరామకృష్ణులు తమ మేనత్తను చూడటానికి చేదిపురానికి వచ్చారు. యోగక్షేమ మర్యాదలయిన తరువాత అత్త శిశుపాలుని శ్రీకృష్ణుని చేతికందించింది. అంతే ఆతని అదనపు చేతులు రెండు రాలిపోయాయి. నుదుటి మీద కన్ను మాయమైపోయింది. గుండెల్లో రాయి పడిందావిడకి "నాయనా కృష్ణా! నాకో వరమిస్తావా? 'ఏమిటత్తా'. మా శిశుపాలుని తప్పులు అపరాధాలు క్షమిస్తావా తండ్రీ", ఓ తప్పక.. కాని వంద వరకూ క్షమిస్తాను. దాటితే... తల్లీ. వీడికోసం నువ్వు దుఃఖించకన్నాడు. అలా జరిగింది కథ. ఈ మందబుద్ధి గర్వంతో ఈ విషయం గుర్తించలేకపోతున్నాడు భీమా. శాంతించు తండ్రీ... అంటుండగానే శిశుపాలుడు మధ్యలో "భీష్మా.. చాలు... ఆపు... ఇంతమంది రాజులుండగా విడిచి ఈ యాదవునా... స్తుతిస్తున్నావు. గోపాలకుడతడు. ఇతణ్ణి పొగిడి ఎంత తప్పుచేస్తున్నావు"... అంటున్నాడు. భీష్ముడు రాజులందరినీ చూశాడు. యుద్ధానికి వస్తారా.. రండి.. శ్రీకృష్ణుని దేహంలో చేరుదురుగాని అన్నాడు.

శ్రీకృష్ణుడు రాజులను చూసి... పృథ్వీపతులారా. మేం ప్రాగ్జ్యోతిషపురానికి వెళ్ళామని తెలుసుకొని ఈ క్రూరుడు మా ద్వారకను తగులపెట్టాడు. నా తండ్రి చేసే అశ్వమేధంలో గుఱ్ఱాన్ని అపహరించిన ఘనుడు. పరభార్యను అపహరించిన ధీరుడు. మా మేనత్తకిచ్చిన మాటను పట్టి ఇతని అపరాధాలు వంద సహించా అంటూంటే రాజులంతా ఛీఛీ.... అంటూ చూశారు. 'నాకిచ్చి పెళ్ళి చేస్తానన్న రుక్మిణిని సిగ్గులేకుండా ఎలా చేసుకున్నావు? నువ్వెంత... నీ బ్రతుకెంత'...

విన్నాడు శ్రీకృష్ణుడు. చక్రాన్ని తలచుకున్నాడు. చేతిలో దర్శనమిచ్చింది. రాజులారా. వంద తప్పులు పూర్తయ్యాయి. ఇంక శిక్ష తప్పదు వీనికి అంటూ చక్రం విడిచాడు. క్షణంలో తల మొండెము వేరయ్యాయి. సూర్యకాంతి లాంటి కాంతి ఆతని శరీరం నుండి వచ్చి శ్రీకృష్ణునిలో కలిసిపోయింది. రాజులు దిగ్భ్రాంతులైపోయారు. వర్షం, పిడుగులు, భూకంపం, ఇదీ వాతావరణం. ధర్మజుని ఆజ్ఞతో సోదరులు శిశుపాలునికి అంతిమ సంస్కారం చేశారు. శిశుపాలుని పుత్రునికి తండ్రి రాజ్యాన్నిచ్చి పట్టాభిషేకం జేశారు.

ఆ రాజసూయ యజ్ఞంలో లక్షమంది బ్రాహ్మణుల భోజనం పూర్తయితే ఒకసారి మోగే ఘంట అలా మ్రోగుతూనే ఉంది. ఈ రాజసూయంలో వ్యాసుడు, ధౌమ్యుడు ఇలా పదహారుమంది ఋత్విజులు చక్కగా విధినిర్వహణ గావించారు. సంగీత, సాహిత్యం, నృత్యం, వాద్యం, సంగీతం ఇలా మంగళఘోష అంతటా వ్యాపించింది.

ధర్మరాజు తనకు కానుకలుగా వచ్చిన ధనరాశులన్నింటిని అప్పుడే విప్రులకు దానం చేశాడు. పెద్దలను పూజించాడు రాజసూయం ఇలా పూర్వం జరగలేదు. ఇకముందు జరుగదు అన్నంత వైభవంగా జరిగింది.

శ్రీకృష్ణుడు దగ్గరుండి రాజసూయాన్ని అద్భుతంగా పూర్తి చేయించాడు. అవభృథమైంది. అందరూ సార్వభౌముడైన ధర్మరాజును అభినందించారు. తిరిగి వెళ్ళడానికి అనుజ్ఞ కోరారు. ధర్మరాజు అందరినీ సన్మానించాడు. సోదరులను పిలిచి వీరందరూ భద్రంగా చేరే ఏర్పాట్లు చేయించాడు. అర్జునుడు ద్రుపదుని, భీముడు భీష్ముని, ఇలా ఒక్కొక్కరిని ఒక్కొక్కరు తగినట్లు సాగనంపారు. మరినాకుకూడా సెలవు ఇప్పిస్తావా బావా అన్నాడు శ్రీకృష్ణుడు. ఒక్కసారి కౌగిలించుకున్నాడు ధర్మరాజు. బావా. నీ దయవల్లే ఈ యాగం సుసంపన్నమయింది. వెళ్ళు అని అనాలని అనిపించడం లేదు. కాని తప్పదుకదా అన్నాడు. నవ్వి కుంతిని చూసి అత్తా మీ అబ్బాయి సార్వభౌముడయ్యాడు. మరినాకు సెలవియ్యి అన్నాడు. దారుకుడు రథం సిద్ధంచేశాడు సాత్యకి కృతవర్మ రథంలో చామరాలుపట్టి శ్రీకృష్ణుని సేవలో మునిగారు. ధర్మరాజు, సోదరులు వారి రథాన్ని అనుసరించి నడిచారు. రాజా! ప్రజలని బాగా పాలించు. ప్రాణులు మేఘాన్ని, పక్షులు మహావృక్షాన్ని, దేవతలింద్రుని, ఆశ్రయించినట్లు అందరూ నిన్నాశ్రయించి ఆనందంగా జీవించాలి అంటూ వీడ్కోలు పలికాడు.

వ్యాసమహర్షి శిష్యులతో వచ్చి సెలవు తీసుకొంటానని పలికాడు. తాతయ్యా. ఉత్పాతాలు అంటే పిడుగులు, ధూమకేతువులు, భూకంపాలు అని మూడురకాలు కదా. అవేమైనా శాంతించాయా... అన్నాడు "నాయనా... వాటి ఫలం పదమూడేళ్ళు ఉంటుంది. తర్వాత సర్వ క్షత్రియ నాశనం జరుగుతుంది. దుర్యోధనుని అపరాధం. భీమార్జునుల బలపరాక్రమాలు యుద్ధంగా మారతాయి. శివుడు దక్షిణ దిక్కు చూస్తున్నట్లు నీకొక కల వస్తుంది. క్షత్రియనాశన మన్నమాట. బెంగ పెట్టుకోకు. కాలం దాటరానిది. జాగ్రత్తగా ఉండు. ధర్మాన్ని విడువకు. అప్రమత్తంగా భూమిని పాలించు" అంటూ భవిష్యవాణిని వినిపించాడు వ్యాసుడు. తన శిష్యులందరితో కలిసి కైలాసపర్వతానికి బయలుదేరి వెళ్ళాడాయన. బెంగతో ఆలోచనలో పడ్డాడు ధర్మరాజు. వైరభావాన్ని విడిచిపెట్టాలి. అందరితో ప్రేమగా ఉండాలి. ధర్మాన్ని రక్షించాలి. సోదరులారా. ఇదే మన కర్తవ్యమని చాటాడు. *(సశేషం)*



## అనామయా - ఫార్మసిటికల్స్

**శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి మంగళాశాసనాలతో... హైదరాబాద్ - న్యూ మారుతీనగర్‌లో అనామయా ఫార్మసిటికల్స్ అనే సంస్థను స్థాపించారు. 10.6.2014నాడు శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయర్‌స్వామివారు దానిని ప్రారంభించి, నిర్వాహకులైన కె.వి. మురళీధర్, యం. శశిభూషణ్ మరియు విద్వద్గోష్ఠికి మంగళాశాసనాలు అందించారు.**

**ఈ సంస్థ అప్రతిహతంగా కొనసాగాలని భక్తినివేదన శుభకామనలను అందిస్తోంది.**

## చాతుర్మాస్యంలో - విశేష కార్యక్రమాలు

**శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు** యథానిర్దేశంగా తమ చాతుర్మాస్య దీక్షను జీవా ప్రాంగణంలో ప్రారంభించారు. ఈ సందర్భంగా ఉదయం 8.30 నుండి 9.30 వరకు భగవద్రామానుజులు అనుగ్రహించిన వేదార్థసంగ్రహం గ్రంథంపై తమ ప్రవచనాలు అందిస్తున్నారు. 9.30 గం॥కు తీర్థగోష్ఠి జరుగుతున్నది. ఎవరైనా శ్రీస్వామివారిని కలుసుకోగోరినవారు తీర్థగోష్ఠి అయిన తరువాత కలుసుకునే అవకాశం ఉన్నది. మరియు సా॥ 5గం॥నుండి 6గం॥ మధ్యలో కూడా కలవవచ్చును.

ఇక ఈ చాతుర్మాస్య సమయంలో చాలా విశేష కార్యక్రమాలు నిర్ణయించడం జరిగింది.

ముఖ్యంగా శ్రావణమాసంలో ప్రతి శుక్రవారం తీర్థగోష్ఠి తరువాత 10 నుండి 12గం॥ మధ్యలో శ్రీలక్ష్మీపూజలు జరుగుతాయి.

### విశేషంగా జరిగే కార్యక్రమాలు

| | | |
|---|---|---|
| 1. | ఆండాళ్ తిరునక్షత్రం | 30.7.2014 |
| 2. | బదరీనారాయణ తిరునక్షత్రం | 1.8.2014 |
| 3. | శ్రీసుదర్శన పెరుమాళ్ తిరు॥ | 2.8.2014 |
| 4. | శ్రీవరలక్ష్మీవ్రతం | 8.8.2014 |
| 5. | వారాహ, ఆళవందార్ తిరు॥ | 9.8.2014 |
| 6. | శ్రీహయగ్రీవ జయంతి | 10.8.2014 |
| 7. | శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారి తిరు॥ | 14.8.2014 |
| 8. | శ్రీవిష్వక్సేనుల తిరు॥ | 29.8.2014 |

**ఈ కార్యక్రమాల్లో ఎల్లరూ పాల్గొని పెరుమాళ్ళ కృపాకటాక్షాన్ని పొందవలసినదిగా ఆహ్వానిస్తున్నాం!**

# శ్రీవేంకటాచల "చిత్రే"తిహాసమాల




మూల సంస్కృత రచనం
శ్రీ అనంతాళ్వాన్

చిత్రానువర్తనం
సత్య శ్రీనివాస్ - సిద్ధాంతం

భగవద్రామానుజులు వేదపురాణేతిహాసాదులు ప్రమాణంగా ఉట్టంకించి తిరుమలక్షేత్రంలో వేంచేసి ఉన్న శ్రీనివాసుడు శ్రీమన్నారాయణుడేనని నిర్ధరించారు. దీనికి యాదవరాజు, సంతృప్తిచెందాడు. అయితే శాస్త్రవాదంతో పాటు, స్వరూప యథార్థతను నిరూపించేలా ఏదైనా ఒక నిదర్శనం ప్రమాణంగా చూపితే మరింత బలంగా ఉంటుందని స్వామి ప్రభావంకూడా వెల్లడయ్యేలా ఏదైనా చేయండి 'రామానుజా'అని ప్రార్థించాడు. రామానుజులు "ఓరాజా! నీవన్నట్లు తప్పక విపక్షులకుకూడా విశ్వాసం





కలుగజేద్దాం" అందుకోసం ఇలాచేద్దాం అంటూ స్వామి ధరించే ఆయుధాలైన శంఖ చక్రాలతోపాటు, ప్రతిపక్షులు పరమశివునిగా భావిస్తున్నారు కనుక, త్రిశూల దమరువులను కూడా స్వామి విగ్రహంచెంతన ఉంచుదాం. అందరూ చూస్తూ ఉండగా గర్భాలయానికి తాళంవేసి మరునాటి ఉదయం వచ్చి స్వామిని సేవించుదాం. ఈలోగా గర్భాలయాన్ని జాగరూకతతో కాపలాకాసేలా చేయి. ఎవ్వరికీ ఎటువంటి అనుమానానికి తావు ఏర్పడరాదు సుమా!" అని ఆదేశించారు యాదవరాజును రాజు. రామానుజుల ఆదేశాన్ని శిరసావహించి కట్టుదిట్టంగా కావలా ఏర్పాటుచేసి, ప్రతివక్షులు సహితం భాగస్వాములయ్యేట్లు వారికి విశ్వాసం కలిగేలా ఏర్పాట్లు చేశాడు. స్వామి ముందు వివిధాయుధాలు ఉంచారు. స్వామి ఏఆయుధాలను తాను స్వీకరిస్తే తిరుమల దైవం ఆయనేనని సర్వులూ సమ్మతించాలని నిర్ణయించారు.



స్వామిసన్నిధిలో అందరూ కోరినట్లుగా శంఖచక్రాలతో పాటు త్రిశూల డమరువులూ ఉంచి, తాళం వేసి కాపలా ఏర్పాటుచేశాడు ప్రభువు. భగవద్రామానుజులు, "ఆలయంలో వేంచేసి ఉన్నమూర్తి, ఆళ్వారులు నిర్ధరించినట్లు, వేదం ఉద్ఘోషించినట్లు, సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే! సందేహానికి తావెంతమాత్రంలేదు. అయినా, అవిశ్వాసులకు సహితం విశ్వాసాన్ని కలిగించినప్పుడే కదా, దైవతత్త్వనిర్ధారణం నిరాబాధంగా, శాశ్వతంగాసాగేది!" కనుక యాదవరాజుకు తామాదేశించిన విధానంగా కట్టుదిట్టమైన ఏర్పాటుకావింపజేశారు. తాము స్వామి గర్భాలయానికి ఏదురుగా పద్మాసనాసీనులై స్వామిని ధ్యానింపసాగారు. తమ యోగప్రభావం చేత ధ్యానపరీపాకదశలో స్వామిని సాక్షాత్కరించారు. "స్వామీ! నీవెవ్వరో మేమెరుగుదుము. కాని ఈ మూఢలోకం శాస్త్రప్రమాణానికి కట్టుబడక స్వకపోలకల్పనంతో నీకు లేని రూపాన్ని ఆపాదించి శాస్త్రానికి అపార్థం చెబుతున్నది. హిరణ్యకశిపుని చెండాడి నీ సర్వవ్యాపకతను నిరూపించుకున్నట్లు, నిన్నునిన్నుగా విశ్వసింపనివారి అవిశ్వాసాన్ని చీల్చి చెండాడి, నీవెవ్వరో నీవే నిరూపించుకోవయ్యా?" అని ప్రార్థించారు. స్వామి! అనుగ్రహించాడు. యథాపూర్వంగా తనకున్న శంఖచక్రాలను తానే చేబట్టాడు. ఇలా స్వామికి శంఖచక్రాలు అర్పించేలా ప్రేరించి భగవద్రామానుజులు "శంఖచక్రప్రదాత"గా ఆచార్యస్థానీయులైనారు.





చిత్రకథ- 33

# రామానుజ చిత్రకథ


















ప్రాయశ్చితంతో దోషాలు తొలగాలి. అప్పుడే కదా ఉత్తమగతి.
వయ:ప్రభావం చేత అంతశక్తి ఇప్పుడు నాకులేదు.


ఏంచెయ్యాలి?


బ్రహ్మహత్యాసంకల్పమే పెద్దతప్పు.
దానికి 'భూప్రదక్షిణ' చెయ్యాలి. నాకాశక్తి లేదే!


యతిరాజులుగా వెలుగొందే ఈ రామానుజులు
దైవాంశ సంభూతులు.ఆతని ప్రదక్షిణ అయినా
'భూప్రదక్షిణ' కన్నా మెరుగు.


నీకభిమతమయితే రామానుజులు నిన్ను తప్పక స్వీకరిస్తారు.
నీకు మరింత గౌరవప్రదమైన స్థానాన్నే ఇస్తారు.
ఆతని మనస్సు నాకు తెలుసు. నువ్వు బాగా ఆలోచించుకో.




సరే! నాసంశయాలన్నీ అక్కడే సరిచేసుకుంటాను.
ఆపై ఏంచెయ్యాలో దైవ నిర్ణయం.


ద్విజశ్రేష్ఠులు యాదవప్రకాశులు విచ్చేస్తున్నారు.
దేవరవారి ఆజ్ఞ అయితే...


ఆహా! ఏమాశ్చర్యం. సాదరంగా తీసుకువద్దాం!


నీవినయం, సౌహార్ధములే నీపాండిత్యానికి శోభనిస్తున్నాయి.
రామానుజా! వాటిని తలచుకొనే ఇటు వచ్చానయ్యా!


పెద్దలు, ఆచార్యులు ఏది చేసినా మాకది హితకరమే కదా! ఆజ్ఞాపించండి స్వామీ! ఈదాసుని ఏమి సేవ?


రామానుజా! ఎంతో కాలంగా మనస్సుని వేదిస్తున్న విషయాలను కూలంకషంగా చర్చిద్దామని కోరిక. నేను గృహస్థుడను. నీవు తురీయాశ్రమంలో 'యతిరాజు'గా ప్రకాశిస్తున్నావు.


స్వామీ! శాస్త్రమును అనుసరించేవారికి ఆశ్రమము అడ్డుకాదు కదా!


నీవు ఊర్ధ్వపుండ్రమును ధరించావు. తప్తములైన శంఖచక్రాలు ధరించావు. నిర్గుణతత్వాన్ని సగుణమంటున్నావు. వీటికి శాస్త్రీయములైన ప్రమాణాలున్నాయా?శాస్త్రవిధిని అతిక్రమించడం ఇహ-పరాలను రెంటినీ దూరం చేసుకోవడం గదూ?
ఇంకాఉంది..

## శ్రీశ్రీశ్రీ స్వామివారి లండన్ పర్యటన చిత్రాలు











లండన్‌లోని బ్రిటిష్ లైబ్రరీని సందర్శిస్తున్న శ్రీవారు






**శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు**
**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్నశ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి**
**మంగళాశాసనాలతో**
**శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారి సంకల్పానికి**
**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్నజీయర్ స్వామివారి సాకారంగా**
**తుదిమెరుగులు దిద్దుకుంటున్న**

# భద్రాచల దివ్యక్షేత్రంలో... మన శ్రీజీయర్‌మఠం



శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారి మంగళాశాసనములతో 1997వ సంవత్సరంలో ఒక పెంకుటిల్లో మొదలైన శ్రీజీయర్‌మఠం గత 17సంవత్సరాలుగా మన పరమాచార్యులు శ్రీపెద్దజీయర్‌స్వామి వారి ప్రధాన సంకల్పమైన తదీయారాధనతోపాటు మన ఆచార్యులు ఆదేశించిన ఎన్నో ఆధ్యాత్మిక, సామాజిక సేవా కార్యక్రమాలను నిర్వహిస్తూ భద్రాచల ప్రాంతములో ఒక ఆధ్యాత్మిక సేవా కేంద్రముగా కొనియాడబోతోంది.

ఆసేవలు మరింత విస్తృత పరిచే దిశగా శ్రీజీయర్‌మఠం నూతనభవన నిర్మాణానికి 3సంవత్సరాల క్రితం శ్రీవారి శ్రీహస్తాల మీదుగా శంఖుస్థాపన జరిగి, పరమాచార్యులవారి దివ్యానుగ్రహంతో, మన ఆచార్యుల మంగళాశాసనములతో, భగవద్బంధువులైన మీ అందరి సౌహార్దంతో ఈదిశకు చేరుకున్నది.

మనం ఆశించిన స్థాయిలో, మన ఆచార్యులు ఆదేశించిన పూర్తిస్థాయిలో భగవద్బంధువుల సేవకై మన జీయర్ మఠం అంకితం కావడానికి అక్షరాలా మరో కోటిరూపాయలు కావలసియున్నది. మన పెద్దజీయర్‌స్వామివారి స్మృతి కైంకర్యముగా జరుగుతున్న శ్రీజీయర్‌మఠం బృహన్నిర్మాణంలో మీరూ భాగస్వాములై భద్రాద్రిరాముని దివ్య అనుగ్రహానికి, మన ఆచార్యుల మంగళాశాసన ములకు పాత్రులై తరించవలసినదిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

***కైంకర్య వివరములు.***

| | |
|---|---|
| **1. సాధారణ గదికి** | **రూ॥ 2,00,000** |
| **2. ప్రత్యేక గదికి** | **రూ॥ 3,00,000** |
| **3. శ్రీగోదా కళ్యాణమండపానికి** | **రూ॥ 20,00,000** |
| **4. రామానుజ కూటం (తదీయారాధనహాలు)** | **రూ॥ 20,00,000** |
| **5. ఆధ్యాత్మిక గ్రంథాలయం** | **రూ॥ 3,00,000** |
| **6. తదీయారాధన సామగ్రి** | **రూ॥ 5,00,000** |
| **7. సోలార్ వాటర్ హీటర్** | **రూ॥ 2,00,000** |
| **8. ఎయిర్ కండీషనర్** | **రూ॥ 4,00,000** |
| **9. జనరేటర్** | **రూ॥ 5,00,000** |
| **10. లిఫ్ట్‌సౌకర్యం** | **రూ॥ 6,50,000** |
| **11. గదులలో ఫర్నీచర్** | **రూ॥ 8,00,000** |
| **12. కుర్చీలు, టేబుల్స్ వగైరా** | **రూ॥ 4,00,000** |
| **13.లైటింగ్, సౌండ్‌సిస్టం డెకరేషన్** | **రూ॥ 4,00,000** |

శ్రీ జీయర్‌మఠంలో జరిగే ప్రధాన సేవ తదీయారాధన ఇది నిరంతరాయంగా సాగడానికై మూలనిధిగా ఒక కోటిరూపాయలు సేకరించాలని శ్రీవారి ఆజ్ఞ. ఈదిశగా కూడా భగవద్బంధువులు సహకరించ ప్రార్థన.

| | |
|---|---|
| **మహారాజపోషకులు** | **రూ॥ 1,00,000** |
| **రాజపోషకులు** | **రూ॥ 50,000** |

ఆపై సమర్పకులు తాము ఎంచుకున్న అంచనాను అనుసరించి సమర్పించే ద్రవ్యాన్ని ఒకటి లేదా రెండు వాయిదాలలో అందించవచ్చును. వ్యక్తిగతంగా, సంస్థాగతంగాగాని సమర్పించిన మొత్తానికి సెక్షన్ 80జి క్రింది ఆదాయపన్ను రాయితీ కలదు. జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్, సీతానగరం వారి నియమ నిబంధనలకు లోబడి సమర్పకులు సౌకర్యములు కల్పించబడును.

సమర్పణలు పంపదలచినవారు స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్, భద్రాచలం శాఖ, **జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ అకౌంట్ నెం. SBHY0020163, 62058098145**

***వివరములకు:*** **ఫోన్ నెం. 9848548429, 9848527268, 9848290615. శ్రీజీయర్ మఠం, రాజవీధి, భద్రాచలం, ఖమ్మంజిల్లా-507111, తెలంగాణా రాష్ట్రం.**

# మన ఆళ్వార్లు



- శ్రీనృసింహ-

*గత సంచిక తరువాయి*

పరకాలురు నాగపట్టణానికి బయలుదేరారు. సరిగ్గా అదే సమయానికి ఒక వ్యాపారి కూడా నాగపట్టణానికి బయలుదేరుతున్నాడు. ఓడ నిండా పోకచెక్కలు నింపుకొని పోతున్నాడాయన. వీరు గబగబా ఆయన దగ్గరకి వెళ్ళి- 'బాబూ! కాస్త నన్ను కూడా మీ ఓడలో ఎక్కించుకొని నాగపట్టణానికి తీసుకొని పోతావా? అని అడిగారు. దానిదేముంది రండి. ఎలాగూ నేనక్కడికే కదా పోతున్నాను అంటూ అతనిని నావ ఎక్కించుకున్నాడు వ్యాపారి. సరే ఇద్దరూ సరదాగా మాటమాట కలిపారు. ఆ కబుర్ల మధ్యపరకాలురు ఒక పోకచెక్కను తీసికొని దానిని రెండు ముక్కలుగా చేశారు. అందరూ చూస్తూండగా ఒక చెక్కని ఓడలోని రాశిలో పడేశారు. అదేమిటి? అలా వేశారన్నాడాయన. పోనీలే. దిగగానే నా వక్క నాకిచ్చెయ్ అన్నాడీయన. నవ్వాడు వ్యాపారి సగంచెక్కా. సరే అలాగే ఇస్తాను అన్నాడు. అయితే మీరన్నట్లు చీటి వ్రాసి ఇవ్వండి అన్నారు పరకాలురు. వెంటనే వ్యాపారి నాగపట్నం చేరగానే మీ సగం వక్క మీరు తీసుకొనవచ్చు. అంటూ చీటి వ్రాసి ఇచ్చాడు.

ఓడ నెమ్మదిగా నాగపట్టణం చేరింది. పరకాలురు కూలీలను పిలచి ఈ ఓడలోని రాశిలో సగం వక్కను దింపించేస్తున్నారు. పరుగు పరుగున వచ్చాడు వ్యాపారి. అయ్యా! ఏం పని చేస్తున్నారూ? మీది వక్కలో సగంముక్క కదా! దానికి ఓడలో సగం దింపేస్తున్నారేమిటి అంటూ అడ్డుకున్నారు. నాయనా! నువ్వే చీటి వ్రాసి ఇచ్చి మళ్ళీ నువ్వే కాదంటే ఎలా–చీటి చూడంటూ చూపించారు. మీ సగం వక్క మీరు తీసుకోండి అంటే అర్థం ఎవరైన వక్కలో సగమని అంటారా చెప్పండి. మీరు వ్రాసి ఇచ్చారు నేను తీసుకుంటున్నాను అన్నారు. తెల్లబోయాడు వ్యాపారి. న్యాయాధిపతి దగ్గరికి పరుగుపెట్టాడు. ఆయన ఇద్దరినీ విచారించి– ఔనయ్యా– నావలోని వక్కలో సగం అంటే రాశిలో సగమనే అర్థం. ఎవరయినా సగంచెక్కకోసం చీటి వ్రాయించుకుంటారా? చెప్పు. అతని సగం అతనికిచ్చెయ్ అని ఆజ్ఞాపించాడు. నిర్ఘాంతపోయాడు వర్తకుడు. ఎంత మూర్ఖుణ్ణి ఇలా ఎలా వ్రాసి ఇచ్చాను! ఇంకా తేరుకోలేదు వ్యాపారి ఇంతలో పరకాలురు అయ్యా! మీ వక్కంతా మీరే తీసేసుకొని దానికి విలువకట్టి నాకెంత వస్తుందో అంతే ఇవ్వండి. శ్రీరంగనాథునికైంకర్యానికి ఉపయోగిస్తాను అన్నాడు. చేసేదేమీలేక వ్యాపారి తన వక్కలని తానే డబ్బిచ్చి కొనుక్కొని వెళ్ళిపోయాడు. పరకాలురు ధనం తీసుకొని నాగపట్టణం లోనికి బయలుదేరారు.

అర్ధరాత్రి దాకా అటూఇటూ తిరిగి కొన్ని అరటిబోదెలు తీసుకొని మధ్యరాత్రి సహచరులతో కలిసి గుడి గోపురమెక్కారు. శిఖరాన్ని అతి చమత్కారంగా ఊడదీశారు. బిలం లోపలికి అరటి బోదెల్ని వేశారు. ఆ శిల్పి చెప్పినట్టే లోపల యంత్రం రెక్కలు ఆ బోదెల్ని చుట్టుకొన్నాయి. దాంతో అవి ముక్కలు ముక్కలయ్యాయి. ఆదారాలు చుట్టుకొని పోవడంతో చక్రం ఆగిపోయింది. అమ్మయ్య ఇంక లోపలికి ఒకరు దిగాలి. తన శిష్యులలో యతిరాజు అనే ధైర్యవంతుడొకడున్నాడు. నేను లోపనికి దిగుతానని ముందుకు వచ్చాడతను. జాగ్రత్తగా, కష్టంగా, ఇబ్బందిగా, ఇరుక్కుని ఇరుక్కుని లోపలికి దిగాడతడు. బంగారు ప్రతిమ కనిపించింది. ఆనందంతో ఒళ్ళు ఉబ్బిపోయింది. ఇనుప గొలుసులతో కట్టి ఆ బొమ్మను అందించాడతడు. నెమ్మదిగా బావిలో నీరుచేదినట్లు పరకాలురాబొమ్మను పైకి చేదుకున్నారు. తరువాత యతిరాజు నెమ్మదిగా బైటికి వద్దామని ప్రయత్నిస్తే అబ్బే తల పట్టిందేకాని....శరీరం పట్టదే, అయ్యో! ఎలా! నాయనా...రా... ప్రయత్నం చెయ్యి. అవీ, అలాకాదు–అయ్యో! అటూ పట్టడం లేదా...మరెలా లాగను. అయ్యయ్యో–ఇటూ కుదరడం లేదే...భగవాన్– ఏంచెయ్యాలి? యతిరాజునెలాలాగి రక్షించాలి... దేవా...రక్షించు అంటూ మొరపెట్టారు. ఎన్నివిధాలుగా ప్రయత్నించినా లాభం లేకపోయింది. ఆయన శరీరం ఇరుక్కుపోయింది. వెంటనే యతిరాజిలా అన్నాడు.

స్వామీ! నాకోసం..ఈ వ్యర్థ శరీరంకోసం బాధపడకండి. శ్రీరంగనాథుని కైంకర్యానికి బంగారు విగ్రహం దొరికింది అదే చాలు. మీరు నా శిరస్సును ఖండించి మీతో పట్టుకొని పొండి. రండి... మళ్ళీ ఆలస్యమైతే ప్రమాదం. పనంతా చెడిపోతుంది. కంగారు పెట్టేశాడు యతిరాజు ఏం చెయ్యాలో తోచనిస్థితిలో పరకాలురు యతిరాజుల శిరస్సు ఖండించి దగ్గరలో ఒక పొదలో దాచారు. బంగారు విగ్రహాన్ని పట్టుకొని తెల్లవారేసరికి 'కృష్ణకుటీరం' తిరుక్కణ్ణంగుడి. అనే దివ్యదేశానికి చేరారు. అక్కడఒక పొలంలో ఒకచోట బౌద్ధ విగ్రహాన్ని పాతిపెట్టారు. ఇంతలో ఆ పొలం కాపరి వచ్చాడు. భూమిని దున్నివిత్తనాలు నాటాలి అని నాగలిని కూడా తెచ్చుకొని మరీవచ్చాడు. పరకాలురు వాణ్ణి గట్టుమీదే అడ్డుకున్నారు. పొలం లోకిదిగ నీయలేదు. ఏమోయ్! ఇది ఎవరిచేను అని ఇంతకాలంనుంచి దున్నుకుంటున్నావు? ఇంతకాలం మేమెవరం ఇక్కడికి రాలేదు కాబట్టి తేరగా మా భూమిని అనుభవించావు, ఇక పై ఇలా సాగదు తెలుసా. అంటూ భయపెట్టారు. ఇదెక్కడి అన్యాయం మా తాత ముత్తాతలు అనుభవించిన భూమిఇది. నీ దెలా ఔతుంది అని ఎదురుతిరిగాడు. చివరికి గ్రామాధికారుల దగ్గరికిపోయి మొరపెట్టుకున్నాడు. వారు పరకాలుని చూచి, ఏమయ్యా! ఇది నాదేనని

చెప్పడానికి ఆధారాలేవైనా ఉన్నాయా నీదగ్గర అని అడిగారు. ఆ ఉన్నాయి అన్నారాయిన. అయితే తీసుకొనిరా అన్నారువారు. సభ మరునాటికి వాయిదా వేశారు. అమ్మయ్య గండం గడిచింది పాతి పెట్టిన విగ్రహాన్ని రాత్రి చీకటి వేళ ఎవరూ చూడకుండా త్రవ్వి తీసుకొని తన అనుచరులతో కలిసి శ్రీరంగానికి ప్రయాణ మయ్యారు పరకాలురు.

శ్రీరంగంలో శ్రీరంగనాయకి శ్రీరంగనాథుడు చూస్తున్నారీ విషయాలు. అమ్మ తట్టుకొనలేక పోయింది స్వామీ! పాపం ఆయతిరాజు వీరికోసం ప్రాణాలర్పించేశాడే అయ్యో! మీరెమీ చేయలేరా... 'ఏంచెయ్యమంటావు!' ఏమిటేమిటి స్వామీ! ఆనాడు శ్రీకృష్ణావతారంలో సాందీపనికి పుత్రులనే తెచ్చి యిచ్చారే, మీరనుకొంటే అసాధ్యమేదైనా ఉంటుందా? ఆ యతిరాజును బ్రతికించండి. మన ఆలయ నిర్మాణాదుల కోసం పరకాలురు చేసిన ప్రయత్నంలో పాపం ఆ అమాయకుడు ప్రాణాలు కోల్పోవడ మేమిటి?... అంటూ పురుషకారం చేసింది. దేవీ...'నీ అనుగ్రహ పాత్రుడయ్యాడాయన'. నీ ఆజ్ఞ మీరగలనా?...అంటూ 'గరుత్మాన్' అని పిలిచాడు శ్రీరంగనాథుడు. అడియేన్... అంటూ వచ్చి వ్రాలాడాయన, నాయనా! నువ్వునాగపట్టణం చేరి యతిరాజు శిరస్సు-మొండెం కలిపి పునర్జీవితుని చెయ్యి. పరకాలురతో కలువు అంటూ ఆజ్ఞాపించాడు. గరుడుడు క్షణకాలంలో యతిరాజుని శరీరాన్ని కలిపి బ్రదికించి, పరకాలురతో కూర్చాడు. ఆశ్చర్యపోయారు పరకాలురు. శ్రీరంగని కటాక్షం పరిపూర్ణంగా ఉంది మనపైన అంటూ యతిరాజును కౌగిలించుకున్నారు. అందరూ కలిసి తిరుక్కణ్ణంగుడి మార్గంలో నడుస్తున్నారు. మార్గంలో చెప్పలేని దాహం వేసింది. ఆగి మంచినీళ్ళడిగారు. కాని ఆ గ్రామస్థులకి పరకాలురగురించి ముందే తెలుసు. ఇటువంటి దొంగకు ఉపకారం చెయ్యడమా? అంటూ తలుపులు వేసేసుకున్నారు. ఒక్కరు కూడా మంచినీళ్ళు పొయ్యలేదు. గొంతు ఎండిపోతోంది. కోపం వచ్చేసింది. ఈ ఊరిలో ఒక్క బావిలో కూడా నీటి బొట్టు అయినా లేకుండా పోవుగాక అంటూ శపించేశారు.

ఆ ఊరి ఆలయంలో పెరుమాళ్ళు దామోదర స్వామి, విన్నారా శాపం. వెంటనే మనుష్యరూపంలో పరకాలుర వెంట వస్తున్నారు. చూశారు పరకాలురు. ఎవడీయన. నా వెనకాల పడ్డారు? ఎందుకో... అడిగేస్తా.. 'ఏయ్.. ఎవరునువ్వు'..'నేనా.., తిరుక్కణ్ణంగుడి నగరపాలకుణ్ణి' 'అయితే...నా వెనకాల పడ్డావేమిటి?' అయ్యా! మీ శాపం విన్నాను. మా ఊరి జనం (బతకాలంటే నీరుండడ్డామరి) కనీసం ఒక బావిలో అయినా మంచి తీర్థం ఉండేలా అనుగ్రహించండి అన్నాడాయన. సర్వేశ్వరుడు సకలశక్తి సంపన్నుడై ఉండి ఆళ్వారులకు చేసిన ప్రార్థన అది. అయితే సరే... ఈ రాయి తీసుకో. నీ వెక్కడ తీర్థం కావాలనుకొంటావో అక్కడ ఈ చిన్న రాతిని వెయ్యి. నీళ్ళొస్తాయి అన్నారు. స్వామి తన సన్నిధి దగ్గర ఆ రాతిని వేశారు. వెంటనే అక్కడ నీరు ఊరుతూ వచ్చింది. ప్రజలంతా ఆశ్చర్యపోయారు. ఆ నీటిని తమ అవసరాలకు వాడుకున్నారు తరువాత కాలంలో.

పరకాలురు కొంతదూరం వెళ్ళి వెనక్కి చూశారు. ఆ మనిషి తన వెంట వస్తున్నట్లు గమనించి ఆగారు. ఏమిటయ్యా! మళ్ళీ వెంటపడ్డావు అన్నారు. అయ్యా! రాత్రి అయిపోయింది పాపం. ఒక్కడివీ వెళ్ళాలి. మార్గం కొత్తకదా. దారి చూపిద్దామని వస్తున్నా అన్నాడు నాయనా! నీసహాయం నాకక్కర్లేదు నాకు తెలుసుదారి. నేపోగలను అన్నారు. ఆగినట్లాగి మళ్ళీ వస్తున్నాడు. ఓహో-నా దగ్గర బంగారు బొమ్మ ఉందికదా. దాన్ని అపహరిద్దామని వెంటపడుతున్నాడు అని నిర్ణయించేసుకున్నారు. వెంటనే కత్తి తీసి గిరగిర త్రిప్పి అతని పైన పడిపోయారు. అంతే.. ఆ గాఢాంధకార సమయంలో ఆ మార్గమంతా కోటిసూర్యులొకేసారి ఉదయించినంత కాంతి వ్యాపించింది. ఆ వెలుగులో అప్పటివరకు సామాన్యునిగా కనిపించిన మనిషి ఒక్క సారిగా దివ్యపురుషుడై సాక్షాత్కరించాడు. ఆహా-అవిగో శంఖం, చక్రం, గద, ఖడ్గం, విల్లు పంచాయుధాలు. అదుగో! అమ్మ లక్ష్మీదేవి. ఓహో! లక్ష్మీనారాయణులు గరుడ వాహనారూఢులయ్యారు. ఇది కలా? నిజమా? స్వామీ! అమ్మతో, పంచాయుధాలతో, గరుడసేవ నాకు ప్రసాదించావా తండ్రీ! రెండుచేతులు నమస్కరించడంతో చేతిలోని కత్తి క్రిందపడిపోయింది. సాష్టాంగ నమస్కారం చేశారు పరకాలురు. శ్రియః పతికి మంగళాశాసనం చేశారు. వారిని ఆశీర్వదించి శ్రీలక్ష్మీనారాయణులు అంతర్హితులయ్యారు. *(సశేషం)*

## భగవద్విషయము

శ్రీ నమ్మాళ్వార్ 1102 పాశురములు గల తిరువాయ్‌మొళ్ళి అను గ్రంథమును అనుగ్రహించేరు. దీనికి అనేక వ్యాఖ్యానగ్రంథాలున్నాయి. వానిలో వడక్కు తిరువీధి పిళ్ళై అనువారు చేసిన వ్యాఖ్యానము ముఖ్యమైనది. దీనినే **భగవద్విషయము** అందురు. దీనిని ఉపదేశరూపముగా ఆచార్యుల నుండి గ్రహించుటనే కాలక్షేపమందురు. ఈ గ్రంథమునకు శ్రీమతి కరి తిరువేంగళమ్మ గారు (శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారి పుత్రిక) స్వచ్ఛమైన, స్పష్టమైన తెనుగులో శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి మంగళాశాసనములతో అనువదించేరు.

**"భగవద్విషయము"** వైష్ణవులందరికీ ముఖ్యమైన గ్రంథము. ఇది పదిపదులుగా 10 పుస్తకములుగా వెలువడినవి. కావలసినవారు ఈ క్రింది అడ్రసు నుండి పొందవచ్చును.

**చిరునామా:** **కె.వి.ఎన్ ఆచార్యులు,** ఎమ్.ఐ.జి. 81, అలకనందా కాలనీ, విజయనగరం, సెల్ నెం.: 9492862457.

**1 సెట్టు (పది పుస్తకములు) క్ష రూ.1,000/- విడిగా ఒక్కొక్క పుస్తకము రూ.100/-లు. పోస్టేజ్ అదనం.**

Address: **K.V.N. Acharyulu**, M.I.G. 81, Alakananda Colony, Viziyanagaram - 3. Cell: 9492862457.
1Set (10 Books) = R. 1000/- Each one 100/-.
Postage Extra.



# శ్రీమద్భాగవతమాహాత్మ్యము



గతసంచిక తరువాయి...

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యస్వామి - హైదరాబాద్

**శుకమహర్షి ఆగమనము**

ఇలా చెప్పి తరువాత సనకసనందనాదులు 7రోజులపాటు శ్రీమద్భాగవతాన్ని ప్రవచించారు. అందరూ ఈ భాగవత కథను విని తరించిపోయారు. ఈ కథ వినడం వలన భక్తి జ్ఞాన వైరాగ్యాలకు గొప్పపుష్టి చేకూరింది. భక్తులను వారు ముగ్గురు తమ వైపు ఆకర్షించే శక్తిని పొందారు. తన కోరిక నెరవేరినందుకు నారద మహర్షి మిక్కిలి సంతోషించాడు. సర్వపాపహారి అయిన హరి తన మనసులో సాక్షాత్కరించడం వలన నారదుడు సనకాదులకు కృతజ్ఞతను ఆవిష్కరించాడు.

అంతలో అక్కడికి యోగీశ్వరుడైన శుకుడు విచ్చేసాడు. అప్పుడు కూడా అతడు 16 సంవత్సరముల ప్రాయము వానిగనే దర్శనం ఇచ్చాడు. ఆయన భాగవత కథనే మనసులో తలచుకుంటున్నాడు. ఆ మహానుభావుణ్ణి అందరూ కలసి ఉన్నతమైన ఆసనంపై కూర్చుండబెట్టారు. నారదుడు ఆతనిని ప్రేమతో గౌరవించి పూజించాడు. అప్పుడు శుకుడిలా చెప్పాడు.

**శ్లో॥ నిగమకల్పతరోర్గలితం ఫలం**
**శుకముఖాదమృతద్రవ సంయుతమ్ ॥**
**పిబత భాగవతం రసమాలయం**
**ముహురహో రసికా భువి భావుకాః ॥**

రసికులారా! భావుకులారా! ఈ భాగవతము వేదమనే కల్పవృక్షానికి కాసిన పండు. శుకుడనే చిలుకచే కొట్టబడి అమృత రసంతో నిండిన పండు. దీనిని శరీరంలో చైతన్యమున్నంత వరకూ పానం చెయ్యండి.

ఇది వ్యాసమహాముని విరచితము. దీనిలో నిష్కపటము నిష్కామమైన పరమధర్మము నిరూపించబడింది. దీనిలో కళ్యాణ కారకమైన సత్యమైన వస్తువు వర్ణింపడింది. ఇది తాపత్రయాలను హరింపజేస్తుంది. దీనిని ఆశ్రయించిన తరువాత ఇతర శాస్త్రములను ఆశ్రయించే పనిలేదు. ఎవరైనా పుణ్యాత్ముడు దీనిని శ్రవణం చెయ్యగానే భగవంతుడు వాని హృదయంలోనికి వచ్చి చేరతాడు.

శ్రీమద్భాగవతం పురాణాలకు తిలకం లాంటిది. వైష్ణవులకు ధనం లాంటిది. ఇందులో భక్తిజ్ఞానవైరాగ్య ములతో పాటు ఈ లోకము యొక్క నివృత్తి మార్గము వెల్లడిచేయబడింది. దీనిని భక్తితో శ్రవణ పఠన మననములు చేసిన మానవుడు ముక్తుడౌతాడు. అందువలన ఈ రసాన్ని పానం చేయండి. ఇది ఇంకెక్కడా లభించని రసము.

**భగవంతుని సాక్షాత్కారం**

శుకుడిలా మాట్లాడుతుండగా సభలోకి ప్రహ్లాదుడు, బలి, ఉద్ధవుడు, అర్జునుడు మొదలైన వారు ఇరుపక్కల నిలచియుండగా శ్రీహరి ప్రత్యక్షమైయ్యాడు. అప్పుడు దేవర్షి అయిన నారదుడు భగవంతుణ్ణి ఆయన భక్తులను పూజించాడు. ప్రసన్నుడైన హరిని దేవర్షి ఒక విశాలమైన ఆసనంపై కూర్చుండబెట్టాడు.

అక్కడున్న భక్తులంతా శ్రీహరిని సంకీర్తనం చేయసాగారు. ఆ సంకీర్తనా వైభవాన్ని చూడటానికి పార్వతిదేవితో పాటు పరమేశ్వరుడు, బ్రహ్మ దేవుడు వచ్చారు. సంకీర్తన నిరాటంకంగా సాగుతోంది. ప్రహ్లాదుడు కర తాళములు మ్రోగించడం మొదలుపెట్టాడు. ఉద్ధవుడు ఒక కంచువాద్యాన్ని వాయించడం మొదలుపెట్టాడు. నారదుడు తన వీణను వాయిస్తున్నాడు. గాన విద్యా నిపుణుడైన అర్జునుడు రాగాలాపన చేసాడు. ఇంద్రుడు మృదంగాన్ని మ్రోగించాడు. సనకాదులు నడుమ నడుమ జయ జయ ధ్వానములను చేసారు. వీరందరి ముందు శుకుడు వివిధ రీతులలో సరస రచనా భావాలను వ్యక్తం చెయ్యడం మొదలుపెట్టాడు. భక్తిజ్ఞాన వైరాగ్యాలు నృత్యం చేయసాగారు. మిగిలిన అందరూ యథాశక్తి సంకీర్తనలో పాల్గొన్నారు. వీరందరి భక్తికి లొంగిన హరి వారికి ప్రసన్నుడై వారితో ఇలా ప్రేమతో అన్నాడు.

“నాయనలారా! మీరు చేసిన ఈ కథాసంకీర్తనాలకు నేను మిక్కిలి ప్రసన్నుడనయ్యాను. మీకేం కావాలో కోరుకోండి.” ఆ మాటలకు వారంతా ఆనందించి భగవంతుడితో ఇలా కోరుకున్నారు. “**దేవాదిదేవా! భవిష్యత్తులో ఎక్కడైనా ఈ భాగవత సప్తాహ కథ జరిగితే అక్కడకు కూడా నీవు ఇలానే ఈ పారిషదులందరినీ తీసుకుని తప్పక రావలసినది. మా ఈ కోరికను తప్పక తీర్చండి”**. భగవంతుడు వారి కోరికను విని **“అలాగే అవుతుంది గాక”** అని చెప్పి అంతర్ధానమయ్యాడు. *(సశేషం)*

## అమ్మా! మన్ను దినంగ నే శిశువునో...!

*పోతన భాగవతం (10-339)*

**వివరణం: చిత్రం - డా. చెలికాని మురళీకృష్ణారావు (బొబ్బిలి)**




**అమ్మా! మన్ను దినంగ నే శిశువునో యా కొంటినో, వెఱ్ఱినో?**
**నమ్మం జూడకు వీరిమాటలుమదిన్, నన్నీవుగొట్టంగ వీ**
**రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు, కాదేనిన్ మదీయాస్యగం**
**ధమ్మాఘ్రాణము సేసినావచనముల్ దప్పైన దండింపవే.**

వ్రేపల్లెలో బలరామకృష్ణులు గోపబాలకులతో వీధివీధి తిరుగుచూ అనేక ఆగడాలు చేసేవారు. ఒకనాడు బలరాముడూ, మిగిలిన గోపబాలకులూ, కృష్ణణ్ణి యశోదవద్దకు తీసుకొనివచ్చి, మన్ను తింటున్నాడని చెప్పేరు. యశోద చిన్నికృష్ణునిచేయి పట్టుకొని కోపంగా... "చిన్నికన్నా! మన్నెందుకు తిన్నావు? నేను చెప్పిన జాగ్రత్తలు నీవు పాటించడంలేదా? తల అడ్డంగా ఊపకు! నీ అన్నగారు, నీ స్నేహితులు చెబుతున్నారుకదా. అయినా మన్ను తినవలసిన కర్మ నీకేమి పట్టింది? అని యశోద అడగగా, చిన్ని కృష్ణుడు గడుసుగా ఇలా సమాధానంచెప్పాడు. "అమ్మా! మన్ను తినడానికి నేను పసిపాపనా? ఇప్పుడేకదాపాలు త్రాగి వెళ్ళాను, నాకు ఆకలి ఎందుకు వేస్తుంది? నేనేమైనా, వెఱ్రివాడననుకున్నావా? వీళ్ళ మాట నమ్మకమ్మా. నీ చేత నన్ను తన్నించాలని వీళ్ళు ఎత్తువేశారు. పోనీ నా మాట మీద నీకు నమ్మకం లేకపోతే నా నోరువాసన చూడు అమ్మా. నేను చెప్పింది అబద్ధమైతే నీవుతప్పక నన్ను దండింపవచ్చు" అని కన్నయ్య యశోదతో అన్నాడు.

---

### ప్రియమైన భక్తినివేదన పాఠకులకు భక్తినివేదన - వినమ్ర నివేదన

మన భక్తినివేదనను బహుకాలంగా ఆదరిస్తున్న మీకు మా ధన్యవాదాలు. శీర్షికల విషయంలోకాని,వ్యాసాల విషయంలో కాని, భాష విషయంలోకాని, సంపాదకీయం విషయంలోకాని, లెటర్ ఫాంటు విషయంలో గాని పాఠకులు తమ అభిప్రాయాలను నిర్ద్వంద్వంగా వెలిబుచ్చవచ్చును. వాటిని తప్పక స్వాగతిస్తున్నాం. సాధ్యమైనంతమేర తప్పక మార్పులు చేర్పులు చేసికుంటూ, పాఠకులకు తగినంత సమాచారాన్ని అందించే ప్రయత్నం చేస్తున్నాం, చేస్తాం. మీరు వ్రాసే లేఖలేవైనా ఈక్రింది చిరునామాకే వ్రాస్తే ఆలస్యం కాకుండా మాకే అందుతాయి. రచయితలు కూడా ఈక్రింది అడ్రస్సుకే వ్రాయండి. ముఖ్యంగా సంపాదకునికి వివిధ విషయాలపై మీఅభిప్రాయాలను వ్రాసేటప్పుడు తప్పనిసరిగా మీ పూర్తిచిరునామా, ఫోనునెంబరు ఇస్తే వెంటనే మీతో సంప్రదించే అవకాశం ఉంటుంది. ఇటీవల భాషవిషయంలో తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చిన ఒకపాఠకులు తమ చిరునామా వ్రాయలేదు. చిరునామా లేని లేఖలను పత్రిక పరిగణించదని గమనించగలరు. మీ సహకారానికి ధన్యవాదాలు **- సంపాదకుడు.**

**చిరునామా -** సంపాదకుడు, భక్తినివేదన, శ్రీరామనగర్, ముచ్చింతల్, పాలమాకుల(పో), 509325 రంగారెడ్డి జిల్లా, తెలంగాణా.

An.Y. ఆర్థోఫిట్ సిరప్
అన్ని రకముల జాయింట్ నొప్పులకు
సరికొత్త పరిష్కారం
fizikem
సత్వర నివారణకు అద్భుత ఆయుర్వేద ఔషధం
Also available as Oil & Capsules
ఇది ఫిజికెమ్ వారి ప్రతిష్ఠాత్మక ఉత్పాదనలలో ఒకటి
ORTHO Fit
ఇంటింటా ఆర్థోఫిట్ నొప్పులన్నీ ఫటాఫట్

# అరచేతిలో ఆరోగ్యం



ఆక్యుప్రెషర్ చికిత్సావిధానము ఏవిధముగా పనిచేస్తుందో కొంతవరకు తెలుసుకున్నాము. రాబోవు సంచికలలో మరికొంత తెలుసుకుందాము. జూలై నెల సంచికలో కొందరు ఏవిధముగా ఈచికిత్సాతో ఆరోగ్యం పొందారో చదివాము. నిజానికి ఈచికిత్సతో స్వస్థత పొందినవారి వివరాలు అనేకము ఉన్నాయి. మన సీతానగరం ఆశ్రమంలో 20సంవత్సరాల క్రితం శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారి పర్యవేక్షణలో శిక్షణపొందిన వారిలో శ్రీమతి నాయిని అరుణ, రాఘవేందర్‌రెడ్డి (మహబూబాబాద్) గారు వందలాది రోగులకు ఎన్నో దీర్ఘకాలిక రోగాలు నయం చేసారు. మరియు నెలల తరబడి ఫిజియోథెరఫీ చేసినా తగిన ఫలితం లభించని వారికి ఆక్యుప్రెషర్ చికిత్సతో 2,3రోజులకే మంచి ఫలితాలను పొందేలా శ్రీమతి అరుణ గారు ఈచికిత్సను ఆచార్యభక్తితో మరియు గొప్ప అనుభవంతో అందించారు. మన జీవా ప్రాంగణమందు శ్రీస్వామివారి మంగళాశాసనములతో శ్రీమాన్ చీటి వేణుగోపాల్ (హైద్రాబాద్), శ్రీమాన్ పుష్పాల విజయకుమార్ (కరీంనగర్) గార్లు ఆక్యుప్రెషర్ చికిత్స కొనసాగిస్తున్నారు. వందలాది మంది అనేక శారీర మానసిక రోగాలకు పరిష్కారము పొందుచున్నారు. ఎంతో డబ్బు ఖర్చుపెట్టి ఎన్నో ఆస్పత్రులు తిరిగి మరియు కొందరు విదేశాలలో కూడా పూర్తి ఉపశమనం పొందనివారు మన జీవా ప్రాంగణము, (శంషాబాద్- హైద్రాబాద్) లో ఈ ఆక్యుప్రెషర్ చికిత్సతో స్వస్థత పొందారు. మా ఆక్యుప్రెషర్ బృందము అనేక మందికి చికిత్సా విధానము నేర్పుతున్నారు. నేర్చుకున్న వారంతా శ్రీస్వామివారి మంగళాశాసనములతో వారివారి ప్రాంతాలలో వచ్చిన రోగులందరికీ మేలు చేయుచున్నారు. ఇక్కడ ఒక చిన్నకేసు విషయం తెలుపుతాను.

2013-2014 ధనుర్మాస కార్యక్రమము కరీంనగర్‌లో ఆక్యుప్రెషర్ చికిత్స శిబిరానికి ఒకరోజున 7నెలలు దాటిన గర్భిణి స్త్రీని తీసుకువచ్చారు. ఆమెకు కొన్ని రోజులుగా విపరీతమైన నడుము నొప్పి, ఎటువంటి కదలలేని స్థితి, చిన్న చిన్న పనులు చేసుకోవడానికి కూడా చాలా ఇబ్బంది. "నొప్పి నివారణ మందులు ఇవ్వలేము మరియు ఏమీ చేయలేము కాన్పు జరిగేవరకు" అని ఆమెను పర్యవేక్షిస్తున్న డాక్టర్లు తెలిపారట.

భర్త కన్నీటి పర్యంతం అయ్యారు. నిండు గర్భిణి స్త్రీకి ఆక్యుప్రెషర్ చికిత్స అనుభవం కలిగిన వారు మాత్రమే చేయాలి. ఎవరంటే వారు ఆక్యుప్రెషర్ చికిత్స చేయరాదు. ఎందరికో చేసిన అనుభవము ఉన్నప్పటికిని నేనూ ఒక్కక్షణం ఆలోచించాను. ఏమిచేయాలి? ఎదురుగా కొద్దిదూరంలో స్టేజిపై శ్రీ స్వామివారు ప్రవచిస్తున్నారు. స్వామివారి సన్నిధికి ఎంతో ఆతృతతో వచ్చారు. ఖాళీగా ఎలా పంపాలి? గురుదేవుణ్ణి ప్రార్థించుకున్నాను. ఏమాత్రం ఆలస్యం చేయకుండా నిండు గర్భిణిస్త్రీ అరచేయి పట్టుకుని పసిపిల్లలకు చేసే తీరులో ఆక్యుప్రెషర్ చేశాను. భార్య, భర్త ఎంతో ఆనందముతో దూరమునుండే స్వామివారికి నమస్కరించుకున్నారు. రోజుల తరబడి పడుతున్న బాధను అరక్షణంలో తొలగించిన విధానానికి ఆశ్చర్యపోయారు. లేనిచో ఆవిడ కాన్పు అయ్యే వరకు ఆబాధతోనే ఉండాల్సివచ్చేది.

ఆక్యుప్రెషర్ చికిత్స వలన శరీరంలో శక్తి, చురుకుతనం ఏర్పడుతాయి. కండరాలలో పటుత్వం వస్తుంది. రక్తపోటు నార్మల్‌గా ఉంటుంది. శరీరంలో హార్మోనులు, ఎంజైములు సంక్రమముగా ప్రవిస్తాయి. రోగ నిరోధక శక్తి పెరుగుతుంది. మానసిక బలం పెరుగుతుంది.

శరీరంలో అన్ని అవయవాల పనితీరును మెరుగుపరచడానికి ఏవిధంగా ఆక్యుప్రెషర్ బిందువు ఎక్కడ ఉన్నాయో గత సంచికలలో చదువుకున్నాము, ఇంకా కొంత తెలుసుకుందాము. శరీరంలో కాలేయం (లివర్) పాత్ర చాలా సంక్లిష్టమైనది. ఈ కాలేయం ఒక రసాయాన కర్మాగారం (కెమికల్ ఫ్యాక్టరీలాంటిది). పైత్య రసం విడుదల చేసి జీర్ణక్రియకు సహాయపడుతుంది. రక్తపుష్టికి అవసరమైన విటమిన్స్ (ఫోలిక్ యాసిడ్, బి 12, ఐరన్) నిల్వచేస్తుంది. రక్తాన్ని శుద్ధిచేసే ముఖ్యమైన అవయవం లివర్. రక్తం గడ్డకట్టడానికి ఫైబ్రినోజన్, ప్రోత్రాంబిన్ అనే రసాయనాలను కాలేయం తయారుచేస్తుంది. తిన్న ఆహారాన్ని శక్తిగా మారుస్తుంది. మందుల్ని, ఆహారాన్ని జల్లెడపట్టి వాటిలో విషాలని ఇది నిరపాయకారంగా మార్చి మనల్ని కాపాడుతుంది. కాని మన అలవాట్లు కొన్ని మనల్ని కాపాడే కాలేయాన్ని (లివర్) దెబ్బతీస్తాయి. చిన్న ఉదాహరణ- పిల్లలకు జ్వరం వస్తే ఈతరం తల్లిదండ్రులు క్రోసిన్ బిళ్లలు, సిరప్‌లు (పారాసిటమల్ మందు) వాడేస్తున్నారు. ఈ అలవాటు చాలా ప్రమాదం. లివర్‌పై చెడు ప్రభావం చూపే మందులలో ఇది కూడా ఒకటి. ఎక్కువ మోతాదులో వాడరాదు. తరచు వాడరాదు. చిన్నచిన్న జ్వరాలకు పెద్దలకైనా, పిల్లలకైనా ఎన్నో గృహ చిట్కాలు ఉన్నాయి. నిమ్మకాయ,తేనే, జీలకర్ర,ధనియాల కషాయం, జిందాతిలస్మాత్ చుక్కలు వాము కషాయం ఇలాంటివి వాడాలి. అవసరమైన హోమియో మందు వాడాలి. ముక్కుల్లో, చెవుల్లో సమస్యలకు కూడా వాడే అల్లోపతి డ్రాప్స్ కూడా శరీరాన్ని దీర్ఘకాలిక సమస్యలకు గురిచేస్తాయి. కావున ఇష్టానుసారంగా మందులు వాడరాదు.

కాలేయం బలహీనమైన యెడల శరీరంలో చెడుక్రొవ్వు శాతం పెరిగిపోతుంది. రక్తపోటు, గుండెపోటు వస్తుంది. మనం తినే అనేక ఆహార పదార్థాలు, ద్రవపదార్థాలు, కృత్రిమ రంగులు, రసాయనాలతో మిళితమయ్యాయి. మాంసం, పాలు వీటిల్లో యాంటిబయోటిక్స్, హార్మోన్లు అధిక మోతాదులో కల్పుతున్నారు. పంటలపై రసాయన పురుగుల మందులు- ఇవన్నీ మన శరీరంలో కాలేయం (లివర్) పనితనాన్ని బలహీనం చేస్తున్నాయి. ఆల్కాహల్ త్రాగడం, పొగత్రాగడం కాలేయానికి అవకాశం చేయిదాటుతుంది. తీపి పదార్థాలపై విపరీతమైన ఇష్టం, మలబద్ధకం, శరీరంలో దుర్వాసన, నాలుకపై జిడ్డు, కంటికింద నల్లటి వలయాలు, చర్మంపై విపరీతమైన దురద, తరచుతలనొప్పి, కోపం-చిరాకు ఇవి దుర్బల కాలేయ లక్షణాలు.

కాలేయం సమర్థవంతంగా పనిచేయడానికి పోషక ఆహారం, విటమిన్‌లు అవసరము. కొందరు అదే పనిగా రోజువిటమిన్‌లు తీసుకుంటారు. ఇది మంచిది కాదు. ఎందుకంటే సహజసిద్ధంగా శరీరంలో ఐరన్, విటమిన్ నిలువలు ఏర్పడుతుంటాయి. మోతాదు మించినప్పుడు కాలేయ పనితీరును దెబ్బతీస్తాయి. నేటి తరం తల్లిదండ్రులు పిల్లలకి బయటపుడ్ సెంటర్‌లలో తిండి అలవాటు చేస్తున్నారు. ఇలాంటి పిల్లలు రోగ నిరోధక శక్తి తగ్గి చిన్నవయస్సులోనే ముసలితనానికి దగ్గరౌతారు. కాబట్టి కృత్రిమ పోకడలు, అలవాట్లు దరిచేరకుండా ఉంచే బాధ్యత తల్లిదండ్రులు తీసుకోవాలి. ఆరోగ్యాన్ని మించిన ఆస్తిలేదు.

ఆక్యుప్రెషర్ చికిత్సతో కాలేయం యొక్క పనితీరును సరిచేయవచ్చును.

1. మునివ్రేళ్ళతో ఛాతి క్రింది భాగంపై ఆక్యుప్రెషర్ చేయాలి.
2. కాలియొక్క బొటనవ్రేలు, రెండవ వ్రేలికి మధ్య ఆక్యుప్రెషర్ చేయాలి.
3. కనుబొమ్మల చివర్లయందు మునివ్రేళ్ళతో నొక్కాలి.




డా॥ పావులూరి కృష్ణచౌదరి
8-3-945/ఏ22, నాగార్జున నగర్, అమీర్‌పేట, హైద్రాబాద్-500 873

## బాబోయ్ మలబద్ధకం

నిత్యం ఎంతోమందిని వేధిస్తుండే సర్వసాధారణ సమస్య మలబద్ధకం. సమస్య ఒకటే అయినా తరచి చూస్తే లక్షణాల్లో భిన్నత్వం కనబడుతుంది. మీ లక్షణాల ఆధారంగా మీరే ఔషధాన్ని ఎలా ఎంచుకోవాలంటే...

మలవిసర్జన ఒక క్రమబద్ధంగా జరగకుండా బాధిస్తుంటే దాన్ని 'మలబద్ధకమని' (కాన్‌స్టిపేషన్) వ్యవహరిస్తారు. మలవిసర్జన అనేది ఒక రకంగా మనం తినే ఆహారం మీద ఆధారపడి ఉంటుంది. శాకాహారులలో రోజుకు ఒకటి, రెండుసార్లు మలవిసర్జన సహజం. మాంసాహారులలో ప్రతిరోజూ జరగకపోవచ్చు. అలాగే పరిమాణం రీత్యా కూడా... శాకాహారులలో ఎక్కువగానూ మాంసాహారులలో తక్కువ పరిమాణంలోనూ మలవిసర్జన జరుగుతుంది.

మలవిసర్జనను ప్రభావితం చేసే మరో అంశం-పేగుల కదలికలు. నాడులు, హార్మోన్లు పేగుల కదలికలను ప్రభావితం చేస్తాయి. అందుకే నాడీమండల వ్యాధులతో బాధపడేవారిలో కూడా మలబద్ధకం కన్పిస్తుంది. థైరాయిడ్ రోగుల్లోనూ, గర్భాధారణ సమయంలోనూ హార్మోన్లలో వచ్చే తేడాల కారణంగా మలబద్ధకం ఎదురవుతుంటుంది. మన అలవాట్లు కూడా మలబద్ధకానికి కారణం కావచ్చు. ఎక్కువగా ప్రయాణాలు చేస్తుండటం, మరుగుదొడ్ల సౌకర్యాలు అందుబాటులో లేకపోవటం..., వంటివి కూడా మలబద్ధకానికి దోహదం చేస్తాయి. సరైన అలవాట్లు లేని కారణంగా చిన్నపిల్లల్లోనూ ఈ సమస్య కనబడుతుంటుంది.

పేగుల్లో కణతుల లాంటి వ్యాధులు, ఆసనంలో చీలికల (ఫిషర్) వంటి వాటితో బాధపడేవారు మలబద్ధకానికి గురికావచ్చు. కాబట్టి మలబద్ధకమనగానే కేవలం మలవిసర్జన క్రమబద్ధతే కాకుండా రోగికున్న ఇతరత్రా సమస్యలు, మలం తీరు, పొట్టలో ఉన్న బాధలను గమనించి, ఆయా రోగుల స్వభావాన్ని గుర్తించి ప్రత్యేక ఔషధాలను ఎంపికచేసి వాడుకోవడం సముచితం, శాస్త్రీయం కూడా.

**1. సమస్య**

కొందరిలో మలవిసర్జన కోరికే ఉండదు, మలం గట్టి పెంటికలుగా, విసర్జన బాధాకరం. కొందరిలో కోరిక ఉన్నా విసర్జన జరగదు. ఎంతో ముక్కాల్సి వస్తుంది. మరికొందరిలో తృప్తిగా విసర్జన జరగదు, పొట్ట ఉబ్బరించి బాధ.

**2. ఔషధాన్ని ఎంపిక చేసుకునేదెలా?**

ప్రధానంగా మలవిసర్జనకు వెళ్ళాలన్న కోరిక, మలం తీరుతెన్నులు, మలబద్ధకానికితోడు ఇతర అంశాలను బట్టి మందును ఎంచుకోవాల్సివస్తుంది.

మలవిసర్జనకోరికను బట్టి మల విసర్జనకు వెళ్ళాలనిపించదు. వెళ్ళినా ఎక్కువగా ముక్కవలసి వస్తుంది.

విసర్జన బాధాకరంగా ఉంటే - **అల్యూమినా**
ముక్కవలసి వచ్చి బాధపడుతుంటే - **బ్రయోనియా**
ఆసనం మంటబెడుతున్నట్లయితే - **గ్రఫయిటిస్**
మాటిమాటికి టాయిలెట్‌కు వెళ్ళాలనిపిస్తుండటం,
విసర్జన సాఫీగా కాకపోవడం - **నక్స్‌వామియా**
విపరీతమైన మలబద్ధకం,
విసర్జనకు వెళ్ళాలని కూడా అనిపించదు - **ఓపియం**
ఆసనం ముడుచుకునిపోయి, మలబద్ధకమైతే - **అల్యూమినా**
మలం తీరునుబట్టి మలం పెంటికలుగా ఉండటం, మలం మామూలుగా
ఉన్నా ఎంతగానో ముక్కవలసి ఉంటే - **అల్యూమినా**
మలం గట్టిపడటం, పెద్దదిగా ఉండటం - **బ్రయోనియా**
మలం చుట్టూ జిగురు, పెంటికలు ఒకదానికొకటి అతుక్కుని ఉండటం,
పులుసిన వాసన ఉంటే - **గ్రఫయిటీస్**
మలబద్ధకం, విరేచనాలు మార్చిమార్చి కన్పించడం.
మాటిమాటికీ దొడ్డికి వెళ్ళినా సాఫీగా కాకపోవడం - **నక్స్‌వామియా**
మలం గట్టిపడి, సాఫీగా విసర్జన జరగదు. కష్టపడతారు -**లైకోపోడియం**
మేక పెంటికలలాగే విరేచనం, మలబద్ధకం - **ఓపియం**

నాణ్యమైన ప్లాట్లు మరియు ఫ్లాట్లు కొనుగోలుకు నమ్మకమైన అగ్రగామి సంస్థ
అభినందన హౌసింగ్ (ప్రై). లిమిటెడ్
సెంట్రల్ ఆఫీస్: 4వ లైను, పండరీపురం, లక్ష్మీపురం మెయిన్ రోడ్, గుంటూరు. ఫోన్: 2354002.
మా బ్రాంచీలు: విజయవాడ 1, విజయవాడ 2, విజయవాడ 3, గుంటూరు 1, గుంటూరు 2, హైదరాబాద్, విశాఖపట్నం.
0866-6628668 : 0866-6642428 : 0866-6633668 : 0863-6641177 : 0863-6454588 : 040-66637799 : 0891-2538686.

పేగులలో మలం తట్టుకునిపోయి మలవిసర్జన కష్టంగా ఉంటే - **ప్లంబం**

పొట్టలో బాధల ఆధారంగా పొట్టలో కుట్టునొప్పి - **బ్రయోనియా**

పొట్ట ఉబ్బరం నొప్పి - **లైకోపోడియం**

సత్వరంగా విసర్జనావసరం. అయినా ముక్కాల్సివస్తుది - **అల్యూమినా**

పొట్టలో మంట, నొప్పి, మలం పెంటికలు - **సల్ఫర్**

మలవిసర్జన కష్టం, ఆసనం వెలుపలకు వచ్చినా తిరిగి లోనికిపోతూ ఉంటుంది. - **సిలికా**

**3. మీ ఔషధం గురించి మరిన్ని వివరాలు**

**అల్యూమినా** - మలవిసర్జన కోరిక ఉండదు. మలం మెత్తగా ఉన్నా విసర్జనకు ఎంతో ముక్కుతూ కష్టపడుతుంటారు. కడుపునొప్పి. కొందరిలో మలవిసర్జనకు వెళ్ళాలనిపిస్తుంది గానీ వెళ్తే ఎంతో శ్రమపడి ముక్కాల్సి వస్తుంది. మలం పెంటికలుగా ఒకదానికొకటి అతుక్కుని ఉంటాయి. వీరికి నరాల బలహీనత ఎక్కువ.

**బ్రయోనియా** - పెద్ద విరేచనం, మలం గట్టిపడుతుంది. ఆసనంలో మంట, వేడి చేసి మలబద్ధకం. పొట్టలో కుట్టునొప్పి. ముక్కి అవస్థపడుతుంటారు. వీరిది వ్యాపార మనస్తత్వం.

**గ్రఫయిటీస్** - పెద్ద విరేచనం మలం దుర్వాసన. పెంటికల చుట్టూ జిగురు. ఒకదానికొకటి అతుక్కుని ఉంటాయి. ఆసనంలో పుండు పడినట్లుగా బాధ. మొరటు స్వభావం.

**నక్స్‌వామియా** - ఆధునిక నాగరికతకు ప్రత్యేక ఔషధం. ఎంత ముక్కినా విరేచనం సాఫీగా కాదు. మాటిమాటికీ దొడ్డికి తిరుగుతుంటారు. ఆసనలో బాధగా ఉంటుంది. కొన్నాళ్ళు విరేచనాలు, కొన్నాళ్ళు మలబద్ధకం. కోపం అధికం.

**సిలికా** - ఆత్మవిశ్వాసం తక్కువ, సిగ్గు ఎక్కువ, నెలసరి సమయంలో మలబద్ధకానికి ప్రత్యేక ఔషధం. మలం వచ్చినట్లైతే లోపలకు పోతుంటుంది.

**లైకోపోడియం**- సాఫీగా మలవిసర్జన జరగదు. మలం గట్టిపడి ఉంటుంది. పొట్ట ఉబ్బరించినట్లనిపిస్తుంది. పిసినారి, డాంబికులు, ఇంట పిల్లి బయట పులి.

**ఓపియం** - విపరీతమైన మలబద్ధకం. మలవిసర్జనావసరం అసలు ఉండదు. మలం నల్లగా గట్టిగోలీలా ఉంటుంది. విసర్జన సమయంలో బయటిదాకా వచ్చి లోనికి పోతుంటుంది. నీతి అసలు పట్టదు.

**ప్లంబం** - మలం పురీషనాళంలో తట్టుకుని ఉంటుంది. ఆసనంవద్ద పీకుడు. మలం గట్టిపడి నల్లగా ఉంటుంది.

**సల్ఫర్** - మలవిసర్జన సాఫీగా జరగదు. ఆసనంవద్ద దురద, మంట, మలవిసర్జనకు మాటిమాటికి వెళ్ళాలనిపిస్తుంది. ఆసనం ఎర్రగా కన్పిస్తుంది. పిల్లల్లో మలబద్ధకానికి ఇది ప్రత్యేక ఔషధం. కీర్తి కాంక్ష ఎక్కువ, 'అందని ద్రాక్ష పుల్లన' స్వభావం

మోతాదు - మీరు ఎంచుకున్న ఔషధాన్ని 30 పొటెన్సీలో రోజూ ఉదయం, సాయంత్రం.... పెద్దలు 6 మాత్రలచొప్పున, 12 సంవత్సరాలలోపు పిల్లలు 3 మాత్రల చొప్పున... 2,3 వారాలపాటు వాడుకోవాల్సి ఉంటుంది.


పరమహంస పరివ్రాజకులు

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి

# చాతుర్మాస్య వ్రతమహోత్సవము

**12.7.2014 నుండి 6.11.2014 వరకు**

**జీవా ప్రాంగణం, శ్రీరామనగరం, శంషాబాద్, రంగారెడ్డి జిల్లా.**

ప్రియ భగవద్బంధువులారా!

ఆషాఢశుద్ధ పౌర్ణమి నుండి కార్తీక శుద్ధ పౌర్ణమి వరకు నాలుగుమాసములు చేయు వైదిక వ్రతము ఈ చాతుర్మాస్యము. యతిధర్మ సముచ్చయము మొదలైన గ్రంథాలలో చెప్పబడిన యతీశ్వరులు ఆచరించవలసిన నియమాలను అనుసరించి, శ్రీస్వామివారు నాలుగుమాసముల దీక్షను జీవా ప్రాంగణంలో స్వీకరించారు.

సంప్రదించవలసిన నెంబర్లు 92470 02289, 95535 49971/72

**ప్రతిరోజూ ఉదయం 8.30గం॥ నుండి 9.30గం॥ వరకు**

**వేదార్థసంగ్రహంపై ప్రవచనము**

**9.30గం॥ తీర్థగోష్ఠి జరుగును.**

గమనిక : విశేష కార్యక్రమములు 20వ పేజీలో ఇవ్వబడినవి.



పరమహంస పరివ్రాజకులు

# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



26.6.2014 ఉదయం ఆరాధనానంతరం శ్రీస్వామివారు దుబాయ్ మీదుగా లండన్‌కి చేరుకున్నారు. శ్రీస్వామివారి రాకకోసం శ్రీమాన్ జెట్ యు.కె. అధ్యక్షులు డా॥కడియాల, శ్రీమాన్ పి.బి.ఆనంద్, శ్రీమాన్ విష్ణుజీ హీత్రూ ఎయిర్‌పోర్ట్‌లో ఎదురుచూస్తున్న జెట్ యు.కె. కమిటీ బృందం, శ్రీమాన్ విక్రమ్, శ్రీమాన్ రంజిత్, శ్రీమాన్ ప్రవీణ్, శ్రీమాన్ జయరాం మొదలైన యువకార్యకర్తలబృందం శ్రీస్వామివారికి పుష్పగుచ్ఛాలు అందిస్తూ, సంప్రదాయక్రమంలో ఘనస్వాగతాన్ని సమర్పించారు. శ్రీస్వామివారు అందరికీ మంగళాశాసనలు చేసారు.

శంషాబాద్ జీవాప్రాంగణంలో ఉన్న గోశాలను బాధ్యతగా గోమాతలను ప్రేమగా చూసే శ్రీమతి నాగలక్ష్మీగారు వారి కుమార్తె అల్లుడు అయిన శ్రీమతి&శ్రీమాన్ అనూరాధ ప్రవీణ్‌దంపతుల గృహానికి విచ్చేసారు. ఆరాధనాదులు పూర్తిచేసి, భక్తులకు తీర్థగోష్ఠి జరిపారు.

27.6.2014 అనుష్ఠానంతరం జెట్ యు.కె.కమిటీవారితో, యువ కార్యకర్తల బృందంతో జరిగే కార్యక్రమాలను సమీక్షించారు. సాయంత్రం భారతీయులు ఎక్కువసంఖ్యలో ఉన్న ప్రాంతంలో ఉన్న శ్రీలక్ష్మీనారాయణ ఆలయాధికారులు ప్రార్థింపగా శ్రీస్వామివారు ఆలయాన్ని దర్శించి, తిరుమంజన కార్యక్రమాన్ని ప్రారంభించి, మంగళాశాసనాలు చేసారు. తరువాత కార్యక్రమం లక్ష్మీప్రదంగా జరగాలని దగ్గరగా ఉన్న కమ్యూనిటీహాల్లో జెట్ యు.కెవారు ఏర్పాటుచేసిన సామూహిక శ్రీలక్ష్మీనారాయణ పూజా కార్యక్రమాన్ని సుమారు 300మంది భక్తులతోటి అత్యంత వైభవంగా జరిపించారు. అక్కడనుండి బర్మింగ్‌హామ్‌కు ప్రయాణం కొనసాగింది.

28.6.2014న కార్యక్రమ నిర్వాహకులు ఏర్పాటుచేసిన శ్రీబాలాజీ దేవస్థాన గెస్ట్‌హౌస్‌లో ఆరాధనాది కార్యక్రమాలు పూర్తిచేసారు. శ్రీమాన్ మురళీ, శ్రీమాన్ రాజామూర్తి వారి బృందంతో గీతామందిరం ఏర్పాటుచేసిన నవాహ్నిక శ్రీరామాయణ ప్రవచన, సుందరకాండ పారాయణ కార్యక్రమాలను శ్రీస్వామివారు ప్రారంభించారు. రెండురోజులు స్వయంగా పారాయణ చేస్తూ, ప్రవచనాన్ని అందించారు. స్థానికంగా ఉన్న అధికారులు ఎం.ఎల్.ఎ., ఎం.పి.గార్లు శ్రీస్వామివారిద్వారా మంగళాశాసనాలు పొందారు. ఆప్రాంతంలోనే ఉన్న శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయాన్ని సందర్శించి, 'బాలాజీ' అన్న పేరు స్వామికి ఎలావచ్చిందో అక్కడ భక్తులకు తెలియజేసారు.

అనంతరం లండన్‌కి బయలుదేరి శ్రీమాన్ అనూ, ప్రవీణ్ దంపతుల గృహానికి విచ్చేశారు.

2.7.2014న శ్రీసుదర్శనహోమకార్యక్రమాన్ని శ్రీస్వామివారు జరిపింపజేసారు. శ్రద్ధాళులైన భక్తులకోసం శ్రీస్వామివారు మంత్రోపదేశాన్ని అనుగ్రహించారు.

3నుండి6వ తేదీ వరకు లండన్‌లోనే వేంచేసియున్నారు. ఈ కార్యక్రమం ముందు అనుకున్నది కాదు. కానీ, కార్యకర్తలు, యువబృందాలు శ్రీస్వామివారి రాకను సద్వినియోగ పరచుకోవాలని అనుకున్నారు. దీనికి శ్రీమాన్ విష్ణుగారి ప్రోత్సాహం ప్రధానకారణం. ఆయా ప్రాంతాలకు చెందిన కార్యకర్తలు వారి ప్రాంతాలలో శ్రీస్వామివారి ప్రవచనాలను, పూజా కార్యక్రమాలను ఏర్పాటు చేసుకున్నారు.

లండన్‌లోని బ్రిటిష్ లైబ్రరీని సందర్శించారు. ఆలైబ్రరీలో మన దేశానికి సంబంధించిన వేదగ్రంథాలనుండి ప్రారంభిస్తే, చిన్నచిన్న గ్రామాల నాయకుల చరిత్ర వరకూ ఉండే లక్షల పుస్తకాలు ఉన్నాయి. ఈ లైబ్రరీ సందర్శనం మన జెట్ యు.కె. కమిటీ సభ్యురాలు శ్రీమతి రాగసుధ ఏర్పాటుచేసారు.

ఒకరోజు గోల్ఫ్‌క్లబ్ హాలులో, మరోరోజు మిల్టన్‌కీన్స్, తరువాతరోజు రెడ్డింగ్ ప్రాంతాలలో, మరోరోజు మన వనజాభాస్కరరావుగారి బంధువులైన శ్రీమాన్ వశీధర్‌గారి గృహంలో కార్యక్రమాలు జరిగాయి.

శని ఆదివారాలలో తప్ప మిగతా రోజులలో కార్యక్రమాలలో పాల్గొనడానికి సమయం ఉండదు. అయినప్పటికీ యువ కార్యకర్తలు చూపించిన చొరవ, చేసిన ప్రచార ఫలితంగా ప్రతిప్రాంతంలో ఉండే మన భగవద్బంధువులు శ్రీస్వామివారి ప్రవచనాల్లో పాల్గొని, వారి ధార్మిక శ్రద్ధను చూపించుకున్నారు.

ప్రతివారూ కూడా శ్రీరామానుజ సహస్రాబ్ది కార్యక్రమం గురించి అడిగి తెలుసుకున్నారు. దీనిని తప్పక ప్రోత్సహిస్తామని తమ ఉత్సాహాన్ని తెలియజేసారు. రాత్రికి బయలుదేరి మాన్‌చెష్టర్‌కి చేరుకున్నారు.

మార్గమధ్యంలో ముందుగా సంప్రదాయనిష్ఠకలిగిన యువకార్యకర్త అయిన శ్రీమాన్ సుజితాదినేష్ దంపతుల గృహాని విచ్చేసారు. ఆ ఇల్లే దేవాలయంగా చుటూ ఉండే భక్తులతో సత్సంగాలు జరిపిస్తూ ఉంటారు. శ్రీస్వామివారు చేరే సమయానికి ఇస్కాన్ భక్తులు వచ్చి ఉన్నారు. కొంత సమయం శ్రీస్వామివారు వారితో సత్సంగం జరిపి, డా॥ కడియాల గారి గృహానికి





Malineni Lakshmaiah Group of Colleges

B.Tech | M.Tech | Polytechnic | B.Pharmacy | M.Pharmacy | MCA | MBA | B.Ed. | D.Ed.
Singarayakonda - Guntur

Co-Education/ Women's/ Integrated Colleges

Our City Offices:

GUNTUR: H.No. 3-28-18/90,Brindavan Gardens 4th Lane,Beside Syndicate bank,Guntur,Ph:(8886509898)

ONGOLE: Dia Complex,3rd Floor,RTO Office Road, Bhagyanagar 2nd Lane,Ongole,Ph:(9581205333)

Phones: 9885509898, 8886449999, 9703144771/2/3

www.malinenicolleges.acin



Dr.M.Perumallu
Vice-Chairman

చేరారు. అక్కడ సమావేశమైన డాక్టర్లతో మన జిమ్స్ హాస్పిటల్లో జరిగే వైద్యసేవలను వివరించారు. అక్కడి డాక్టర్లు భారత్‌కు వచ్చినప్పుడు జిమ్స్‌లో తమవంతు సేవను చేసే అవకాశాన్ని కల్పించమని కోరగా శ్రీస్వామివారు ఆనతిచ్చారు.

డా॥కడియాల లక్ష్మీవివేకానంద దంపతుల ఆతిథ్యాన్ని స్వీకరించి, అక్కడ దగ్గరలో ఉన్న బ్రాడ్‌ఫోర్డ్ నగరానికి చేరారు. అక్కడ మన సంస్థ కోశాధికారి శ్రీమాన్ పి.బి.ఆనంద్‌గారి నివాసంలో బసచేసారు.

7.7.2014న అక్కడ నగర మేయర్‌గారి ఆహ్వానంపై వారి కార్యాలయాన్ని శ్రీస్వామివారు సందర్శించారు. మేయర్ దంపతులు శ్రీస్వామివారిని ప్రేమతో స్వాగతించి, తమ కార్యాలయాన్ని, దానితో వివిధదేశాలనుండి ముఖ్యంగా భారత్‌నుండి వచ్చిన అనేక కానుకలను చూపించారు. వాటిని భద్రపరచిన తీరు, ప్రదర్శించే తీరు చూసి నేర్చుకోదగినది. వైభవాలకు చిహ్నముగా ఉండేవాటిని రహస్యంగా అమ్ముకోవడం, విదేశాలకు తరలించడం, కూలగొట్టుకోవడం వంటివి అలవాటుగా మనదేశంలో కనిపిస్తాయి. సంగ్రహించిన అలాంటివాటిని భద్రపరిచి గర్వంగా ప్రపంచానికి చూపించుకోవడం పాశ్చాత్యదేశాలలో కనిపిస్తాయి. మేయర్ కార్యాలయం ఎదుట సుమారుగా ఒక ఎకరం పనికిరాని ప్రాంతంగా ఉండేది. ఓ రెండు సంవత్సరాల క్రితం దానిని బాగుచేసి, ఆకర్షక స్థలంగానే కాక, ఆదాయాన్ని తెచ్చిపెట్టే స్థలంగా చేసిన తీరు అంతర్జాతీయ అవార్డును అందుకుందట. ఆ ప్రాంతాన్నంతా రాళ్ళతో పరచి, దానిచుట్టూ మధ్యలోనూ వాటర్‌ఫౌన్‌టేన్స్ ఏర్పాటుచేసారు. మామూలు రోజుల్లో 3,4 అంగుళాల ఎత్తులో నీరు ఉండి, పిల్లలకు, పెద్దలకు వినోదస్థలంగా ఉంటుంది. ఎప్పుడైనా సామాజిక సమావేశాలు జరుపుకోవాలంటే ఆనీటిని తీసేస్తారు. సుమారు 8 నుండి 10వేలమంది పట్టే ఆ స్థలంలో హాయిగా సమావేశాలు జరుపుకుంటారు. అప్పుడు అక్కడ నీరు ఉన్నట్టే తెలియదు. అవసరాన్ని బట్టి ఆ స్థలాని నాలుగైదు భాగాలుగా విడదీసి వివిధ కార్యక్రమాలకు అద్దెకు ఇస్తారట. అలాంటివి లేనప్పుడు తిరిగి ఫౌన్‌టెన్స్, నీళ్ళు, పిల్లల ఆటలు మామూలే. ఇది వారి కార్పొరేషన్‌కి చక్కటి రాబడి కేంద్రం. ఆశ్చర్యం ఏమిటంటే, మేయర్ ఆఫీస్‌లోనే రెండు పెద్దహాల్స్ ఉన్నాయి. వాటిలో శుక్రవారపు మధ్యాహ్నం నుండే వారి నగర పాలికాపరమైన కార్యక్రమాలు జరుగుతూంటాయి. మిగాతా రోజుల్లో ఆస్థలాన్ని కూడా బయటవారి కార్యక్రమాలకు అద్దెకిస్తూ, ధనాన్ని సేకరిస్తారన్న విషయం ఆశ్చర్యాన్ని కలిగించింది. ఈ విశేషాలన్నీ శ్రీస్వామివారికి అక్కడ అధికారులు వివరించారు. శ్రీరామానుజ సహస్రాబ్ది వివరాలను వారందరికీ తెలియజేసారు.

శ్రీమాన్ పి.బి.ఆనంద్ బ్రాడ్‌ఫోర్డ్ యూనివర్‌సిటీలో వివిధమతాలు సమన్వయం అనే అంశంపై శ్రీవారి ఆధ్వర్యంలో ఒక సమావేశాన్ని ఏర్పాటు చేసారు. దాంట్లో ఆప్రాంతానికి చెందిన క్రిస్టియన్, ముస్లీం, బౌద్ధ, సిక్, మార్మన్ వంటి వివిధ మతానుయాయులు పాల్గొని తమ సందేశాలను అందించారు. చివరిగా శ్రీస్వామివారు సమతామూర్తిగా భగవద్రామానుజుల వైభవాన్ని తెలియజేస్తూ, వారందరికీ సహస్రాబ్ది ఉత్సవాలకు స్వాగతం పలికారు. ఆ రాత్రి లండన్‌కు చేరుకున్నారు. 8 తెల్లవారురఝామున ఆరాధన పూర్తచేసుకొని, 9 తెల్లవారే సమయానికి హైదరాబాద్‌కు చేరుకున్నారు శ్రీస్వామివారు.

శ్రీమాన్ జె.భాస్కరరావుగారు అనారోగ్యంచేత పరమపదవాసులయ్యారు. వారి పరమపదోత్సవాన్ని శ్రీస్వామివారు జరిపించి, కుటుంబసభ్యులకు మంగళాశానాలు చేసి, జీవాకి చేరుకున్నారు.

10వ తేదీ ఉదయాన్నే చెన్నై చేరుకొని శ్రీమతి ఆనందకుమారిగారి భర్త ఐ.వి. రవీంద్రకుమార్ ఆచార్యతిరుపడిని చేరారు. వీరి పరమపదోత్సవానికి విచ్చేసి, ఆనందకుమారిగారికి వారి కుటుంబసభ్యులకు మంగళాశాసనాలు అనుగ్రహించారు. తరువాత ఎగ్జిబిషన్ ఫెస్టివల్ సందర్శించారు.

ఉ.వే.శ్రీమాన్ అణ్ణంగరాచార్యస్వామివారి మనుమడు శ్రీమాన్ వేలుకుడి వేంకటకృష్ణన్ స్వామి నిర్వహించిన కార్యక్రమంలో శ్రీస్వామివారు పాల్గొన్నారు. శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్ర భాష్యానికి శ్రీశంకర, శ్రీరామానుజ, శ్రీమధ్వ భాష్యసహితంగా తమిళవ్యాఖ్యాన గ్రంథాన్ని లోకార్పణగావించారు. విష్ణుహస్రనామ వైశిష్ట్యాన్ని అనుగ్రహించి, వారికి మంగళాశాసనం గావించారు. అనంతరం శ్రీమాన్ తిరుక్కోష్టియూర్ మాధవన్‌స్వామివారి గృహానికి విచ్చేసి, పెరుమాళ్ళకి మంగళాశాసనాన్ని అనుగ్రహించి, రాత్రికి నడిగడ్డపాలెం శ్రీపెద్దజీయర్‌స్వామివారి బృందావనం చేరుకున్నారు.

11వ తేదీ శ్రీ పెద్దజీయర్‌స్వామివారి శిష్యురాలు శ్రీమతి భారతమ్మగారి పరమపదోత్సవాన్ని శ్రీస్వామివారు నిర్వహింపచేసి, కుటుంబసభ్యులకు మంగళాశాసనాలు అనుగ్రహించి, శ్రీపెద్దజీయర్‌స్వామివారి సన్నిధిలో చాతుర్మాస్య వ్రతానికి ఆజ్ఞను స్వీకరించి, సీతానగరం విచ్చేసారు. అనుష్ఠానం పూర్తిచేసుకొని, జీవాప్రాంగణానికి చేరుకున్నారు.

12వ తేదీ శ్రీస్వామివారు, శ్రీదేవనాథజీయర్‌స్వామివారితో కలిసి, చాతుర్మాస్యదీక్షను ప్రారంభించారు.



## శ్రీరామానుజ సహస్రాబ్దికి సమర్పణ

**కోదాడకు చెందిన శ్రీమాన్ ఎన్.సిహెచ్. విష్ణుప్రియ వరదాచార్య దంపతుల సత్సంతానమైన చి॥శంతనుధరణి- 9వ తరగతి, చి॥ రఘునందన్- 6వ తరగతి. వీరిరువురూ తల్లిదండ్రుల ప్రోత్సాహంతో ప్రతిసంవత్సరం పుట్టినరోజు సందర్భంగా వీళ్ళు దాచుకున్న డబ్బును శ్రీస్వామివారికి సమర్పించడం ఆనవాయితీ. పోయిన సం॥ నేత్రవిద్యాలయ విద్యార్థులకోసం, ఈసంవత్సరం 23.7.14న జీవా శ్రీరాంనగర్‌లో శ్రీస్వామివారిని సేవించి, శ్రీరామానుజ సహస్రాబ్దికై 10622రూపాయలు కైంకర్యం చేసుకున్నారు. ఈ చిన్నారులకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు అందించారు.**

#  పరమపద వార్త 



చెన్నై వాస్తవ్యులు **శ్రీమాన్ ఐ.వి. రవీంద్రకుమార్‌గారు 26.7.2014న పరమపదించారు.** వీరి సతీమణి **శ్రీమతి ఆనందకుమారి**గారు. వీరు జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ మెంబర్‌గా ఉన్నారు. శ్రీమాన్ రవీంద్రకుమార్ గారు వేంకటగిరి వంశానికి చెందినవారు. అన్నవరం దేవస్థానానికి ఆనువంశిక ధర్మకర్తలుగా ఉన్నారు. వీరు స్వయంకృషితో వ్యాపారాలు నిర్వహించుకొని, క్రమాభివృద్ధిని, పేరు ప్రతిష్ఠలను పొంది, వేంకటగిరి వంశానికి వన్నె తెచ్చినవారు. వీరి కుటుంబం మన శ్రీజీయర్‌స్వామివారితో సన్నిహిత సంబంధాలు కలిగి ఉంది. శ్రీమతి ఆనందకుమారిగారు చెన్నై ఉభయవేదాంతాచార్యపీఠ శాఖతోనూ సంబంధం కలిగి ఉండటంతోపాటు శ్రీపెరుంబూదూర్ కుండలం స్వామివారి తిరుమాళిగను నిర్వహించడంలోకూడా ప్రధానపాత్రను వహించారు. శ్రీమాన్ రవీంద్రకుమార్‌గారు పరమపదోత్సవానికి శ్రీశ్రీశ్రీ స్వామివారు మంగళాశాసనాలు అనుగ్రహించారు. భక్తినివేదన వీరికి ప్రగాఢ సానుతాపాన్ని తెలియజేస్తున్నది.



శ్రీమాన్ తూపురాణి వేంకట సీతారామానుజాచార్యులు గారు 10.7.2014న ఆచార్య తిరువడి చేరినారు. శ్రీమాన్ తె.కం. అప్పకొండమాచార్యుల వారి తురువడి సంబంధీకులైన వీరు పరమపదోత్సవ సందర్భంగా భక్తినివేదనకు కానుక సమర్పించిన వీరికుమారులు శ్రీనివాస రామానుజాచార్యులు మరియు రామనరసింహాచార్యులకు, వీరి కుటుంబసభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు కృపచేసారు.



ఆదిలాబాద్‌జిల్లా మంచిర్యాల వాస్తవ్యులు శ్రీమతి ఎన్నమనేని ఆండాళమ్మగారు 9.7.2014న ఆచార్య తిరువడిని అలంకరించారు. వీరు పరమాత్మ పదసన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనాలు కృపచేసారు.



రామవరం వాస్తవ్యులు శ్రీమతి కతారు సావిత్రమ్మగారు 11.3.2013న పరమపదించారు. వీరి సంవత్సరీక సందర్భముగా కుటుంబసభ్యులు భక్తినివేదనకు కైంకర్యముగా సమర్పించారు. వీరికి మరియు కుటుంబసభ్యులకు శ్రీవారు మంగళాశా సనాలు అందించారు.



గుంటూరు జిల్లా తెనాలి వాస్తవ్యులు శ్రీమాన్ భీమవరపు లక్ష్మయ్యగారు 19.6.2014న పరమపదించారు. వీరు తెనాలి వికాసతరంగిణి సెక్రటరీగా కొంతకాలం సేవలనందించారు. వీరికి శ్రీస్వామివారు అనేక మంగళాశాసనాలు కృపచేసారు.



తూర్పుగోదావరి జిల్లా దుగ్గుదూరు వాస్తవ్యులు శ్రీమతి రేమళ్ళ పద్మినీదేవి (బుజ్జమ్మ) గారు 3.7.2014న ఆచార్య తిరువడిని అలంకరించారు. వీరు శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్ స్వామివారి వద్ద మంత్రోపదేశం పొంది, శ్రీచిన్నజీయర్‌స్వామివారు నిర్వహించే అనేక కార్యక్రమాల్లో అన్వయిసన్తూ ఉండేవారు. వీరికి శ్రీవారు అనేకమంగళాశాసనాలు అందించారు.



హైదరాబాద్ కూకట్‌పల్లి వాస్తవ్యులు శ్రీమాన్ మాధవరం కిషన్‌రావుగారు 2002లో పరమపదించారు. వీరి స్మృతిచిహ్నంగా వీరి సతీమణి శ్రీమతి మాధవరం లక్ష్మీభాయి, శ్రీస్వామివారు నిర్వహించే అనేక కార్యక్రమాలలో తమవంతు కైంకర్యాన్ని సమర్పించు కుంటున్నారు. వీరికి అనేక మంగళాశాసనాలు అనుగ్రహించారు.



తూర్పుగోదావరి జిల్లా అర్తమూరు వాస్తవ్యులు శ్రీమతి ఉద్దగిరి వీరరాఘవమ్మగారు 19.6.2014న ఆచార్య తిరువడిని చేరారు. వీరు స్వామి పదసన్నిధిలో నిత్యకైంకర్యప్రాప్తికై శ్రీస్వామివారు అనేకమంగళా శాసనాలు అందించారు.



కరీంనగర్‌జిల్లా పెద్దపల్లి వాస్తవ్యులు శ్రీమాన్ చింతలపని హనుమంతరెడ్డి గారు, శ్రీమతి జయప్రద గారు ఇరువురూ ఆగస్టు 4, 2013న కారుప్రమాదంలో స్వర్గస్థులైనారు. 24 జూలై 2014న సంవత్సరీక సందర్భంగా భక్తినివేదనకు కైంకర్యం సమర్పించారు. వీరికి శ్రీవారు మంగళాశాసనాలు అందించారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన **జూలై నెల సమాధానాలందాయి.** విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం! *గతనెల సమాధానాలు 18వ పేజీలో కలవు.*

| ప్రశ్నలు | సమాధానాలు |
|---|---|
| 1. న్యాయకుసుమాంజలి గ్రంథాన్ని వ్రాసినవారెవ్వరు? | |
| 2. అనంతాచార్యులు శ్రీరంగనాయకీ మానసపుత్రుడని ఎవరిని పిలిచేవారు? | |
| 3. ద్వైతాద్వైతశ్రుతులను సమన్వయించడానికి ఆలంబనమైన శ్రుతులను ఏమంటారు? | |
| 4. బ్రహ్మసూత్రాలకు చెందిన మూడవ అధికరణము ఏది? | |
| 5. ధృతరాష్ట్రుడు వెళ్ళిన ఋష్యాశ్రమ సమీపంలో గంగ ఎన్ని ప్రవాహాలు కలిగియుంది? | |
| 6. విశాంశోలైపిళ్ళై ఎవ్వరికి అనుంగుశిష్యులు? | |
| 7. భగవంతుని అవతారాలకంటే గొప్ప అవతారం ఎవరిది? | |
| 8. వేదాన్తసారాన్ని సుఖంగా చూపించే దీపదండాలు ఏవి? | |
| 9. నమ్మాళ్వారుల తిరువాయ్‌మొళి ఏ అర్థాన్ని ప్రతిపాదిస్తోంది? | |
| 10. భగవద్రామానుజులు శ్రీనివాసుని ఎలా సాక్షాత్కరించగల్గారు? | |
| 11. దోషాలు తొలగే మార్గం ఏది? | |
| 12. శ్రీమాన్ చిలకమర్రి రామానుజాచార్య,తె.కం. గోపాలాచార్య ద్వయానికి శ్రీభాష్యాన్ని ఎవ్వరు అనుగ్రహించారు? | |
| 13) శ్రీకృష్ణుడు రాజసూయసభలో చక్రంతో ఎవరిని ఖండించాడు? | |
| 14. యంత్రంలోని చక్రాలు ఎలా ఆగిపోయాయి? | |
| 15. ప్రాచీనకాలంలో భాగవతసప్తాహశ్రవణం ఎన్నిసార్లు జరిగింది? | |
| 16. మలబద్ధకాన్ని ఇంగ్లీషులో ఏమంటారు? | |
| 17. ఆక్యూప్రెషర్ చికిత్సతో దేనిపనితీరును సరిచేయవచ్చును? | |

మీ చిరునామా

........................................................

........................................................

శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో పూర్తిగా సమాధానించిన విజేతల పేర్లు:

కొమాండూరి ఇందిరా - హైదరాబాద్, ఎన్.ఎస్. అరవిందకుమార్ - గుంటూరు

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్లు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.

భక్తినివేదన సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929




సమగ్ర సమాచార నివేదన
సంపాదకులు శ్రీమతి టి. అరుణ

**హైదరాబాద్ :**



"ఆరోగ్యమే మహాభాగ్యం" కాని ప్రస్తుత పరిస్థితుల్లో నీరు, గాలి, ఆహారపదార్థాల కాలుష్యం వలన అనేక వేలమంది అనారోగ్యంతో బాధపడుతున్నారు. వచ్చిన వ్యాధులకు చికిత్స చేయించుకొనే ఆర్థిక స్థోమత లేక ఏమిచేయాలో తోచని నిస్సహాయస్థితిలో ఉన్నవారికి చేయూతనిచ్చి ఆదుకుంటోంది. విటిసేవ. ప్రపంచ వ్యాప్తంగా ఉన్న విటిసేవ ఇప్పటికే ఎందరికో ఆరోగ్యాన్నందించింది.

చి.మాధవి అనే పది సంవత్సరాల బాలిక కాలేయవ్యాధితో బాధపడుతోంది. గ్లోబల్ హాస్పిటల్‌లో లివర్ మార్పిడి చేయాలని డాక్టర్లు సూచించారు. మాధవి తండ్రిగారు ప్రార్థన చేయగా శ్రీశ్రీశ్రీ స్వామివారు విటిసేవ ద్వారా 4 లక్షల రూ. వారికి అందజేయమని సూచించారు. వికాసతరంగిణి కేంద్ర కోశాధికారి శ్రీమాన్ వై.సూర్యనారాయణగారు చెక్కును మాధవి తండ్రిగారికి అందజేసారు శ్రీశ్రీశ్రీ స్వామివారు పావకు మంగళాశాసనములు అందించారు.

**కొత్తపేట - దిల్‌షుక్ నగర్ :**

13-07-2014 తేదీన జంటనగరాల మహిళా ఆరోగ్యవికాస్ కార్యకర్తలు కొత్తపేట న్యూ మారుతీనగర్ కమ్యూనిటీ హాలులో ఉచిత



వైద్య శిబిరం నిర్వహించారు. - కేంద్రకమిటి ఆరోగ్యవికాస్ సమన్వయ కర్త శ్రీమతి మాధవిరవీంద్రగారు కాల్పోస్కోప్ ద్వారా విఐఎ పరీక్షలు నిర్వహించారు. 114మందికి పరీక్షలు నిర్వహించగా 22మందికి పైపరీక్షలు నిర్వహించవలసి ఉంది. కోలనీ ప్రెసిడెంట్ మృణాల్, యువజన కార్యకర్త రాహుల్, నరేంద్రరెడ్డిగారు, సోషల్ వర్కర్ అభినందన భవానీగారు ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు. జంట నగరాల ఆరోగ్యవికాస్ కన్వీనర్ శ్రీమతి సునీత, వికాసతరంగిణి ప్రెసిడెంట్ అరుణగారు, సెక్రటరి వనజగారు, ట్రెజరర్ మంగ గారు పాల్గొన్నారు. డా. గోవిందరాజ్ ఉచితంగా మందులు అందజేసారు.

**బడంగిపేట - హైదరాబాద్**

హైదరాబాద్‌లో నూతనంగా బడంగిపేట సత్సంగాన్ని నిర్వహించుకున్నారు. శ్రీ విష్ణుసహస్రనామ పారాయణ చేసారు. జంటనగరాల మహిళా ఆరోగ్య వికాస్ సమన్వయకర్త శ్రీమతి సునీతగారు వికాసతరంగిణి నిర్వహించే సేవలను గురించి తెలియజేసారు. బడంగిపేట సభ్యులు కొత్తపేటలో జరిగే మహిళా ఆరోగ్య వికాస్ వైద్య శిబిరంలో ఏడుగురు పాల్గొన్నారు. సంతోష్‌నగర్ వికాస తరంగిణి కార్యకర్తలు కూడా ఈ సత్సంగంలో పాల్గొన్నారు.

**కూకట్‌పల్లి - హౌసింగ్ బోర్డ్ కాలనీ :**

శ్రీమాన్ సత్యనారాయణమూర్తిగారు వికాసతరంగిణి కార్యక్రమంలో భాగంగా సత్సంగాలను నిర్వహిస్తుంటారు. విజయనగరం వికాసతరంగిణి

సభ్యురాలు శ్రీమతి బి. రమాదేవిగారు సుందరకాండ పారాయణ అనేకచోట్ల నిర్వహించారని తెలిసి హౌసింగ్‌బోర్డ్ కోలనీ శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయంలో కూడ పారాయణ చేయాలని మూర్తిగారు కోరారు. శ్రీమతి రమాదేవిగారు కూకట్‌పల్లిలో భక్తులందరితో కలసి మూడు రోజులు పారాయణ నిర్వహించారు. ఈ కార్యక్రమాన్ని సేవించిన భక్తులు అందరి గృహాలలో నిర్వహించమని అడిగారు. శ్రీమాన్ సత్యనారాయణ మూర్తి గారి గృహంలో మూడు రోజులు సుందరకాండ పారాయణ జరిగింది. ఈ కార్యక్రమంలో భక్తులు అధిక సంఖ్యలో పాల్గొన్నారు.

**కరీంనగర్ :**



"సత్యం, సత్యం పునస్సత్యం యతిరాజో జగద్గురుః" యతిరాజు మన భగవద్రామానుజాచార్యులు జగద్గురువు ఇది సత్యం. లోకానికంతటికీ అష్టాక్షరీ మంత్ర వైభవాన్ని అందించిన మహనీయులు వీరు. మానవతా విలువలను తెలియజేసిన సమతామూర్తికి స్ఫూర్తి కేంద్రాన్ని నిర్మింపజేస్తున్నారు మన ఆచార్యులు.

ప్రపంచమంతా రామానుజుల వైభవాన్ని ప్రకాశింప చేయాలని శ్రీశ్రీశ్రీ స్వామివారి ఆకాంక్ష. ప్రతి జిల్లాలో భగవద్రామానుజ సహస్రాబ్ది వైభవాన్ని వివరించటం కోసం శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరుస్వామివారు, శ్రీశ్రీశ్రీ దేవనాథ జీయరు స్వామివారు, శ్రీ ఉ.వే. శ్రీమాన్ డా. ఎస్.వి. రంగరామానుజా చార్య స్వామివారు కరీంనగర్ వేంచేసారు. 06-07-2014 ఆదివారం జోనల్ స్థాయి సమావేశం వైష్ణవి గార్డెన్‌లో జరిగింది. కరీంనగర్, నిజామాబాద్, ఆదిలాబాద్ జిల్లా కమిటీ సభ్యులు, వివిధ స్వచ్ఛంద సేవా సంస్థల సభ్యులు సుమారు 600 మంది పాల్గొన్నారు. శ్రీరంగరామానుజాచార్య స్వామివారు రామానుజ వైభవాన్ని వివరించారు. భగవద్రామానుజ సహస్రాబ్దికి మనమేమి చేయాలో అహోబిల శ్రీస్వామివారు వివరించారు. శ్రీమతి జి.వి. వనజా భాస్కర్, శ్రీ మహేందర్ రెడ్డి, శ్రీమతి శిరీష, శ్రీభాన్ ప్రసాదరావు (ఎమ్మెల్సీ) మొదలైనవారు పాల్గొన్నారు.

పెద్దలు తెలియజేసినట్లుగా వాడవాడలా రామానుజుల వారి వైభవాన్ని గురించి ప్రచారం చేస్తామని కమిటీ సభ్యులు తెలియ జేసారు. స్థానికంగా శ్రీ జగన్నాథ రెడ్డి, అయోధ్య రామారావు, బి.వి.రావ్, ఎస్. ప్రభాకరరావు, యం.అశోక్, జి. లీలాకుమారి, కె.గౌతమరావు తదితరులు పాల్గొన్నారు.

కుమారి శ్రేయసి అను ఇంటర్ విద్యార్థినికి వికాస తరంగిణి సభ్యులు శ్రీ సి.హెచ్. అయోధ్య రామారావుగారు కాలేజీలో ఉచితంగా ప్రవేశము కల్పించినారు. డ్రెస్సులు, పుస్తకములు కొని మన కార్యకర్తలు సహకారమందించారు.

**మహబూబ్‌నగర్ జిల్లా :**

వికాసతరంగిణి సమావేశం కేంద్రకమిటీ వారితో కలసి 25-05-2014న నిర్వహించారు. ఈ కార్యక్రమానికి శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయరు స్వామివారు వేంచేసారు. కేంద్ర కమిటి ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీమాన్ భవానీ ప్రసాద్, శ్రీ పద్మనాభరావుగారు, శ్రీమతి జ్యోతిగారు, శ్రీమతి గాయత్రిగారు పాల్గొన్నారు. దేవనాథ జీయరు స్వామివారు మంగళాశాసనం చేస్తూ చినజీయరుస్వామివారి ఆశయాలకు అనుగుణంగా అందరూ సేవలందించాలని, రామానుజ సహస్రాబ్ది ఉత్సవాలలో మనమూ ఉండడం మన అదృష్టమని, అందరూ ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని తెలియజేసారు. శ్రీమాన్ భవానీ ప్రసాద్‌గారు సత్సంగం ద్వారానే మనలో ఆధ్యాత్మిక వికాసం కలుగుతుందని తెలియజేసారు. ప్రతీ ప్రాంతంలో సత్సంగాలను, సంస్కారాన్ని వికసింపజేసేందుకు ప్రజ్ఞ కార్యక్రమాలను, ఆరోగ్యవికాస్ వంటి సేవా కార్యక్రమాలను కార్యకర్తలందరూ నిర్వహించాలని తెలియజేసారు. ఈ కార్యక్రమంలో మహబూబ్‌నగర్ జిల్లా వికాసతరంగిణి అధ్యక్షులు బి.రాజశేఖర్, ఉపాధ్యక్షులు రామకృష్ణారెడ్డి, కార్యదర్శి రఘునాథ్, బుచ్చయ్యగారు, సుమన్ మొదలైన 21 శాఖలకు సంబంధించిన కార్యకర్తలు పాల్గొన్నారు. 617 మంది వికాసతరంగిణి సభ్యత్వ గుర్తింపు కార్డులను పొందారు.

**విజయవాడ - కృష్ణా జిల్లా**

వికాసతరంగిణి నిర్వహిస్తున్న కార్యక్రమాలను పర్యవేక్షిస్తూ దిశానిర్దేశం చేయటానికి కేంద్రకమిటి ప్రతి జిల్లాలో జిల్లా కార్యకర్తలు సభ్యులతో సమావేశమవుతోంది. ఈ కార్యక్రమంలో భాగంగా కృష్ణాజిల్లా వికాసతరంగిణి సమావేశం సీతానగరంలో జరిగింది. అధ్యక్షులు శ్రీ వి.వి. రాఘవన్ అధ్యక్షతన జరిగిన కార్యక్రమంలో జిల్లా కార్యదర్శి శ్రీమాన్ నల్లూరు కృష్ణ, మహిళా ఆరోగ్యవికాస్ కేంద్ర సమన్వయ కర్త శ్రీమతి కె. మాధవి రవీంద్ర, వివిధ శాఖల సభ్యులు హాజరయ్యారు.

కేంద్రకమిటి ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీమాన్ భవానీ ప్రసాద్‌గారు, శ్రీమతి గాయత్రిదేవిగారు, ఉపాధ్యక్షులు కె. విద్యాసాగర్‌గారు పాల్గొన్నారు, 2014-2016 సంవత్సరాలకు సంబంధించిన సభ్యత్వ గుర్తింపు కార్డులు ఆయా శాఖలవారికి అందజేసారు. భగవద్రామానుజ సహస్రాబ్దికి కార్యకర్తలు చేయవలసిన కార్యక్రమాలు గూర్చి, సేవా కార్యక్రమాలను గూర్చి కేంద్రకమిటివారు తెలియజేసారు. వర్షాలు కురవాలని, పాడిపంటలతో సుఖంగా ఉండాలని కొత్తపేట, ముత్యాలంపాడు, సత్యనారాయణపురం వికాసతరంగిణి కార్యకర్తలు, ఆళిమళైకణ్ణా అనే తిరుప్పావై పాశురాన్ని రోజుకి 11 సార్లు 11 రోజులు పారాయణ చేసారు. చిన్నారులు పాల్గొని చక్కగా పారాయణ చేయడం విశేషం.

**గుంటూరు :**

6 జూలై 2014 ఆదివారం వికాసతరంగిణి జిల్లా శాఖ ఆధ్వర్యంలో మహిళా ఆరోగ్య వికాస్ పేరిట మహిళలకు కాల్పోస్కోప్ సహాయంతో గర్భకోశ వ్యాధుల నిర్ధారణ, చికిత్స మరియు రొమ్ము కేన్సర్‌పై అవగాహనా కార్యక్రమం జరిగింది. ఉదయం గం. 10లకు వికాసతరంగిణి సేవా



భవన్ నందు జిల్లా అధ్యక్షురాలు శ్రీమతి లగడపాటి రామలక్ష్మమ్మగారు జ్యోతి ప్రజ్వలనం చేసి వైద్య శిబిరం ప్రారంభించారు. వీరితోపాటు ఉపాధ్యక్షులు పెద్ది రమణరావు, కార్యదర్శి శ్రీమతి భవనాశి మల్లికాప్రసాద్, కోశాధికారి శ్రీ ఎ.వి. మల్లిఖార్జునరావు, ఉప కార్యదర్శి ఎన్.రామమోహనరావు, జిల్లా పర్యవేక్షకుడు కె.పురుషోత్తమ రామానుజదాస్ పాల్గొన్నారు. కేంద్రకమిటీ కో-ఆర్డినేటర్ శ్రీమతి మాధవి రవీంద్రగారు, చైతన్య మహిళా వికాస్ విజయవాడ సభ్యులు శ్రీమతి ఆదిలక్ష్మి, రత్నమాల, జయలక్ష్మి, సత్యవతి, చంద్రకళ, సత్యవాణి గార్లు వి.ఐ.ఎ. పరీక్షలు నిర్వహించారు. ప్రముఖ గైనకాలజిస్టులు డా. సంధ్య, డా. సరిత, డా. రాజ్యలక్ష్మి, డా. లగడపాటి వసుంధర గార్లు విచ్చేసి వైద్య సహాయం అందించారు. గుంటూరు జిల్లా ఆరోగ్య వికాస్ కార్యకర్తలు గిరిజా కుమారి, పి.వేంకటేశ్వర్లు మొదలైనవారు వైద్యసహాయం అందించారు. 114 మందికి వి.ఐ.ఎ. పరీక్షలు నిర్వహించగా 22మందికి పై పరీక్షలు నిర్వహించవలసి ఉంది. ఆరోగ్యవికాస్ కార్యకర్తలు వారికి ఎన్.ఆర్.ఐ. హాస్పిటల్‌లో పరీక్షలు చేయించారు.

**మార్కాపురం :**

వికాసతరంగిణి యువ వికాస్ సభ్యులు పట్టణంలో చక్కటి సేవలందిస్తున్నారు. వికాసతరంగిణి లక్ష్యాలు, ఆశయాలకు అనుగుణంగా పనిచేస్తున్నారు. ప్రభుత్వ పాఠశాల విద్యార్థులకు పోషకాహారాన్ని అందిస్తున్నారు. పదవతరగతి విద్యార్థులకు పోషకాహారంతోపాటు పుస్తకములు ఇచ్చి ప్రోత్సాహాన్ని అందిచడం వలన ఆ ప్రభుత్వ పాఠశాల విద్యార్థులు ఈ సంవత్సరం నూటికి నూరు శాతం ఉత్తీర్ణతను సాధించారు. ఒక విద్యార్థి 9.8 పాయింట్లు సాధించడం ఒక విశేషం. శ్రీశ్రీశ్రీ స్వామివారు నిర్వహిస్తున్న సేవలను చూసి స్పందించిన ప్రజలు పర్యావరణాన్ని పరిరక్షిస్తూ పోలిథిన్ సంచులు, ప్లాస్టిక్ గ్లాసులు నివారణకై పట్టణమంతా కృషి చేస్తున్నారు. యువవికాస్ సభ్యులు చక్కగా అమలుజరిగేలా చూస్తున్నారు. కాకర్ల గ్రామంలో శ్రీ వేణుగోపాలస్వామి ఆలయంలో వేణుగోపాలస్వామి విగ్రహం ఒరిగిపోయింది. అహోబిల జీయరు స్వామివారు ఆలయానికి విచ్చేసినపుడు విగ్రహం ఒరిగి ఉండకూడదని సరిచేయమని ఆదేశించారు. వికాసతరంగిణి సభ్యురాలు జి. వరలక్ష్మి కమిటీ వారితో మాట్లాడి ఆలయంలో పనులు ప్రారంభింపజేసారు. యువవికాస్ కార్యకర్తలు రంగనాయకులు నాయక్, మహేష్, అజయకుమార్, ప్రదీప్, పువ్వాడ సూర్యనారాయణ, వికాసతరంగిణి సభ్యులు మొదలైనవారు సేవలందించారు. ఖమ్మం వాసవి క్లబ్ వారు ప్రోత్సాహమందిస్తున్నారు.

**కాకినాడ - తూర్పుగోదావరి జిల్లా :**

తూర్పుగోదావరి జిల్లా వికాసతరంగిణి సమావేశం నిర్వహించారు. ఈ కార్యక్రమానికి జిల్లాలో 11 శాఖలకు చెందిన సభ్యులు పాల్గొన్నారు. సెంట్రల్ కమిటీ ఆర్గనైజింగ్ సెక్రటరీ భవానీప్రసాద్, ఉపాధ్యక్షులు శ్రీ యం.ఎస్.ఎస్.ఆర్ వర్మ, జోన్-1 కేంద్ర సమన్వయకర్త శ్రీమతి గాయత్రి దేవిగారు పాల్గొన్నారు. వికాసతరంగిణి సభ్యత్వ గుర్తింపు కార్డులు అందజేసారు. సభ్యులంత చిర్లా ప్రసాద్‌రెడ్డిని అధ్యక్షులుగా నిర్ణయించారు. ప్రసాద్‌రెడ్డిగారు మాట్లాడుతూ వికాసతరంగిణి శాఖలలో కార్యక్రమాలు విస్తరింపచేస్తానని తెలియజేసారు. అర్తమూరు, అనపర్తి, వీరభద్రపురం, వేంద్ర, దుగ్గుదూరు, కాజులూరు, తిప్పరాజు పాలెం, ఇంద్రపాలెం, వలసపాకల, కాకినాడ శాఖల సభ్యులు పాల్గొన్నారు.

గురుపౌర్ణమి రోజు కాజులూరు వికాసతరంగిణి ఆధ్వర్యంలో నిర్వహించిన కార్యక్రమంలో 30 గ్రామాల్లోవున్న 600 మంది భక్తులు పాల్గొన్నారు. శోభాయాత్ర, పాదపూజ, శ్రీశ్రీశ్రీ ఆచార్య వైభవ ప్రవచనాలు జరిగాయి. తదీయారాధన నిర్వహించారు. కాజులూరు శాఖ అధ్యక్షులు నర్ల సూర్యనారా యణగారు ఈ కార్యక్రమాలని నిర్వహించారు.

**తాడేపల్లిగూడెం - పశ్చిమగోదావరి జిల్లా :**

పశ్చిమ గోదావరి జిల్లా వికాసతరంగిణి సభ్యుల సమావేశం జరిగింది. ఈ కార్యక్రమంలో కేంద్రకమిటీ ఆర్గనైజింగ్ సెక్రటరీ భవానీ ప్రసాద్‌గారు, జోన్-1 సమన్వయ కర్త శ్రీమతి గాయత్రి దేవిగారు, పశ్చిమగోదావరి, కృష్ణ, గుంటూరు, ప్రకాశం జిల్లాల సమన్వయకర్త విద్యాసాగర్‌గారు పాల్గొన్నారు. భగవద్రామానుజ సహస్రాబ్ది నాటికి ఏ కార్యక్రమాలు నిర్వహించాలో భవానీ ప్రసాద్‌గారు తెలియజేసారు. ఒక కార్యకర్త ఎలా ఉండాలో అందరికి అర్థమయ్యేలా వివరించారు. 272 మంది కార్యకర్తలకు సభ్యత్వ గుర్తింపు కార్డులు అందజేసారు. కాళ్ళకూరు, తాడివాడ, ఏలూరు నుండి కార్యకర్తలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. పెరుమాళ్ళ రామకృష్ణ కుమార్ ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

**వారిజ :**

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామి వారు 23-06-2014 సాయంత్రం వారిజ నేత్ర విద్యాలయ పాఠశాలకు వేంచేసారు. విద్యార్థులందరితో మాట్లాడారు. ఏ విధంగా చదువుతున్నారో అందరిని అడిగి తెలుసుకున్నారు. శ్రీ స్వామివారికి చి. బలరామ్ అనే విద్యార్థి చక్కటి పాటపాడి విన్పించాడు. పోర్ట్ ట్రస్ట్ ఛైర్మన్ శ్రీమాన్ కృష్ణబాబుగారు కూడా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. వారిజ నేత్రవిద్యాలయ కమిటీ వారికి, నేత్రవిద్యాలయ సిబ్బందికి స్వామివారు మంగళాశాసనములు చేసారు.

**విశాఖపట్టణం :**

గురుపౌర్ణమి నుండి రెండు నెలలు శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు వారిజ ఆశ్రమంలో చాతుర్మాస దీక్షను చేస్తున్నారు. ఈ కార్యక్రమంలో ప్రతిరోజూ శ్రీ లక్ష్మీయాగం, లక్ష్మీ నారాయణ కళ్యాణం, లక్ష్మీ, విష్ణు సహస్రనామార్చన, రామానుజ వైభవం ప్రవచనం జరుగు తున్నాయి. శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్టణం నుండి భక్తులు ఈ కార్యక్రమంలో పాల్గొంటున్నారు. ఆగష్టు 10వ తేది ఆదివారం వేలాదిమంది విద్యార్థులచే హయగ్రీవ పూజ కార్యక్రమాలు చేయిస్తున్నారు.

విద్యార్థులంతా ఈ కార్యక్రమంలో పాల్గొని హయగ్రీవ అనుగ్రహం పొందాలని కమిటీ వారు అందరినీ ఆహ్వానిస్తున్నారు. యోగా కార్యక్రమాన్ని వేద గురువులు శ్రీకాంత్ గురువుగారు, సంతోష్ గురువుగారు నిర్వహిస్తున్నారు.

**పాయకరావు పేట - విశాఖ జిల్లా**

పాయకరావుపేట, కూర్మన్నపాలెం, అనకాపల్లి ప్రాంతాలలో కేంద్రకమిటీతో స్థానిక వికాసతరంగిణి సభ్యుల సమావేశం 07-07-2014న జరిగింది. పాయకరావుపేట, వేంపాడు, దొడ్డికల్లు, తుని ప్రాంతాల నుండి 80 మంది కార్యకర్తలు పాల్గొన్నారు. శ్రీనివాసవర్మగారు, ఆండాళ్‌గారు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. దొడ్డికల్లు వరలక్ష్మి, వేంపాడు సుజాత, సుబ్బలక్ష్మి మొదలైనవారు పాల్గొన్నారు. కేంద్ర కమిటి వారు సభ్యత్వ గుర్తింపు కార్డులు అందజేసారు. కార్యక్రమాలు ఎలా నిర్వహించాలో భవానీ ప్రసాద్‌గారు తెలియజేసారు. అనకాపల్లిలో కె.స్వామిగారు, నానిగారు, కూర్మన్నపాలెంలో అశోక్‌రాజు, నీలిమ, వరహాలరాజు, యువవికాస్ వర్మ మొదలైనవారు పాల్గొన్నారు. ఈ కార్యక్రమాన్ని వికాసతరంగిణి సెక్రటరీ శ్రీమాన్ రాజుగారు నిర్వహించారు.

**విజయనగరం జిల్లా :**



వికాసతరంగిణి మహిళా ఆరోగ్య వికాస్ గ్రామాలలో చేసే వైద్య శిబిరాలు చూసి శ్రీమాన్ చెరుకూరి శ్రీధర్‌గారు చెరుకూరి ట్రస్ట్ ద్వారా ఒక సంవత్సరము మహిళా వైద్య శిబిరాలు నిర్వహించడానికి ఆర్థిక సహాయమందించారు. చెరుకూరి శ్రీధర్ గారు శ్రీనివాస సేవాసంఘం ద్వారా మహిళా ఆరోగ్య వికాస్‌కి కాల్పోస్కోప్ ఎల్‌సిడి, కావలసిన పరికరములు అందజేసారు. మొత్తము 2లక్షల ఏభైవేల రూపాయాలతో పైవన్నీ ఆరోగ్యవికాస్‌కు అందించాలని నిర్ణయించుకున్నారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు నిర్వహిస్తున్న ఆధ్యాత్మిక, సేవా కార్యక్రమాలకు సహకరిస్తున్న శ్రీనివాస సేవా సంఘం వారికి వికాస తరంగిణి కార్యకర్తలు కృతజ్ఞతలు తెలియజేసారు. 21-06-2014 కళ్యాణ వేంకటేశ్వర స్వామి ఆలయంలో శ్రీనివాస సేవాసంఘం వారికి మంగళాశాసనం చేస్తూ కాల్పోస్కోప్‌ని శ్రీశ్రీశ్రీ చిన్నజీయరు స్వామివారు ప్రారంభించారు. ఎన్నో సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్న శ్రీనివాస సేవా సంఘం ఆలయకమిటీ అందరికీ ఆదర్శంగా నిలిచిందంటూ అభినందించారు. ఈ కార్యక్రమానికి కేంద్ర ఆరోగ్య వికాస్ కన్వీనర్ శ్రీమతి మాధవిరవీంద్ర బృందం హాజరయ్యారు. 22-06-2014 ఉదయం 11 గంటల నుండి కేంద్ర మహిళా ఆరోగ్య వికాస్ సమన్వయకర్త శ్రీమతి మాధవిరవీంద్ర కార్యకర్తలకు శిక్షణ నిస్తూ వైద్య శిబిరం నిర్వహించారు. విజయవాడ చైతన్య ఆరోగ్యవికాస్ కార్యకర్తలు సేవలందించారు. 48 మందికి పరీక్షలు నిర్వహించగా 13మందిని పై పరీక్షలకు పంపించడం జరిగింది. అందులో ఇద్దరికి డా.సుధాకుమారి గారు బయాప్సి చేసారు. శ్రీమతి శకుంతలగారు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. పాకలపాటి విజయ, సాలూరు లక్ష్మి, విజయలక్ష్మి, భారతి, సరస్వతి మొదలైనవారు సేవలందించారు. ఆరోగ్య వికాస్ సమన్వయ కర్త శకుంతల వైద్యం కోసం తన దగ్గరకు వచ్చినవారిని వైద్యశాలకు తీసుకువెళ్ళి వెంటనే డాక్టర్‌కు చూపించి పరీక్షలు చేయిస్తున్నారు. ఆదిలక్ష్మి, కుసుమ కుమారి, సత్యవతి, ధనలక్ష్మి, సునీత మొదలైన మహిళలకు సేవలందించారు.

**సహస్రగళార్చన**

వికాసతరంగిణి సభ్యురాలు శ్రీమతి కంచర్ల లక్ష్మి ఆధ్వర్యంలో సహస్రనామాలవానికి సహస్రగళార్చన కార్యక్రమం జరిగింది. హరినామ సంకీర్తన ద్వారా ప్రతి ఆదివారం రామదాసు నవరత్న కీర్తనలను శ్రీమాన్ బొర్రా శ్రీనివాస్‌గారు అందరికి నేర్పించారు. శిక్షణ పొందిన వారితో పాటు ఊరిలో సంగీత విద్వాంసులు, మల్లాది బ్రదర్స్ వంటి ప్రఖ్యాత గాయకులు సుమారు వెయ్యిమంది స్వామివారి సన్నిధిలో గానం చేయాలని లక్ష్మిగారి ఆకాంక్ష. 23-06-2014న శ్రీశ్రీశ్రీ చినజీయరుస్వామివారు, అహోబిల రామానుజ జీయరు స్వామి వార్ల ప్రత్యక్ష పర్యవేక్షణలో జ్ఞాన సరస్వతి ఆలయంలో ఈ కార్యక్రమం జరిగింది. శ్రీశ్రీశ్రీ స్వామి వారు సహస్రగళార్చన కార్యక్రమం నిర్వహించిన వారందరికీ మంగళాశాసనములు కృపచేశారు. శ్రీమాన్ బొర్రా శ్రీనివాస రావుగారు, కాళీగారు, ప్రసన్న, దారా శ్రీనివాస్, కాపుగంటి ప్రకాష్, ఎస్.వి.ఎన్. శ్రీనివాస్, చెరుకూరి శ్రీధర్, స్వప్న, అయోధ్య రామయ్య, శ్రీమతి భవాని, పెద్ద లక్ష్మి గారు, కృష్ణమూర్తి, రామతీర్థం వెంకటరమణ గారు, విటి సభ్యులు వెంకట రావుగారు,సత్యనారాయణ, భారతి, అప్పల నాయుడు మొదలైనవారు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

09-07-2014న విజయనగరం వికాసతరంగిణి జిల్లా సమావేశం నిర్వహించింది. ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి కేంద్ర కమిటి ఉపాధ్యక్షులు శ్రీ యం.ఎస్.ఎస్. ఆర్. వర్మ, కేంద్రకమిటి జోన్-1 కన్వీనర్ శ్రీమతి గాయత్రి దేవి పాల్గొన్నారు. కేంద్రకమిటీ వారు సాలూరు, బొబ్బిలి కూడా వెళ్ళి చూసి వచ్చారు. జిల్లా అధ్యక్షులు శ్రీమాన్ సత్యనారాయణగారు కార్యక్రమ విశేషాలను తెలియజేసారు. ఈ కార్యక్రమంలో 6 శాఖల కార్యకర్తలు పాల్గొన్నారు.

**గో సేవ :**

'గోవు' సర్వదేవతల స్వరూపం. భారతీయ సంస్కృతిలో 'గోవు' లక్ష్మీదేవితో సమానం. అటువంటి గోవులను బ్రతికి ఉండగానే కబేళాలకి



తరలించి వధిస్తున్నారు. 'గోవధ' చాలా పాపం. ఆ సాధు జంతువులను రక్షించాలని ఎందరో ముందుకు వస్తున్నారు. విజయనగరం పంచముఖ ఆంజనేయస్వామి ఆలయంలో శ్రీ జైన్ అనే భక్తుడు కబేళాలకి తరలించే ఆవులని రక్షించి గోసేవ కార్యక్రమాన్ని ఆలయంలో నిర్వహిస్తున్నరు. శ్రీశ్రీశ్రీ చిన జీయరుస్వామివారు ఆలయ కమిటివారి ప్రార్థనపై గోశాలకి వేంచేసి వారికి వికాస తరంగిణి ద్వారా ఒక లక్ష రూపాయలు గోసంరక్షణకై అందజేయ మన్నారు. వికాసతరంగిణి కేంద్ర కమిటి కోశాధికారి వై. సూర్య నారాయణ గారు లక్ష రూపాయల చెక్కును విజయనగరం వికాస తరంగిణి కి అందజేసారు. జూలై ఒకటవ తేదీ మంగళవారం చెక్కుని వికాసతరంగిణి సమావేశంలో శ్రీమాన్ దాసరి కృష్ణాజి, చెరుకూరి శ్రీధర్, అరుణ, సత్యనారాయణ, లక్ష్మి మొదలైన వారు గో సేవా కమిటీ వారికి అందజేసారు.

**సాలూరు - విజయనగరం జిల్లా :**



వికాసతరంగిణి కన్వీనర్ శ్రీమాన్ విశ్వనాథ్‌గారు, ప్రజ్ఞ-వైద్య శిబిరాలు, సత్సంగాలు నిర్వహిస్తూ యువతను ప్రోత్సహిస్తున్నారు. సాలూరులో 32 మంది యువవికాస్ కార్యకర్తలు సేవలందిస్తున్నారు. యువవికాస్ అందరు ఒకేలాంటి బనీన్లను ధరించి సేవాకార్యక్రమంలో పాల్గొంటారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు విజయనగరం విచ్చేసిన మూడు రోజులు ఈ కార్యకర్తలు చక్కటి సేవలందించారు. స్వామివారి ప్రవచనములు విని విశేషమైన స్ఫూర్తితో మరింత ఉత్సాహంగా సేవలంది స్తున్నారు. పరిసరాలు-పరిశు భ్రతలో భాగంగా 350 సం.క్రితం నిర్మించిన పురాతన ఆలయంలో పెరిగిన ముళ్ళ చెట్లను, గడ్డిని తీసివేసి శుభ్రపరిచారు. జీర్ణమవుతున్న ఆలయాన్ని బాగు చేయడానికి వీరు ముందుకు వచ్చారు. ఇంకా ఎన్నో సేవలను అందిస్తున్న యువ వికాస్ కార్యకర్తలు ఎందరికో ఆదర్శంగా నిలుస్తున్నారు.

06-07-2014న సాలూరు వికాస తరంగిణి యువ వికాస్ కార్యకర్తలు వర్షాలుపడి పంటలు బాగా పండాలని స్థానిక వేణుగోపాలస్వామి ఆలయంలో వరుణ హోమం నిర్వహించారు. సాయంత్రం శ్రీ విష్ణుసహస్రనామ పారాయణం జరిగింది. భజన బృందాలతో భజన నిర్వహించారు. 12-07-2014 గురు పౌర్ణమి సందర్భంగా గురుపూజ, నాలుగు గ్రామల భక్తులతో భజన కార్యక్రమం జరిగింది. స్వర్ణ, జానకి, వాసుదేవపండా, విశ్వనాథ్ ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. 15వ తేది పురాతన వేణుగోపాల ఆలయం మరమత్తుల కోసం కమిటీ సమావేశం జరిగింది. ఆలయం బాగుంటే గ్రామం బాగుంటుందని భావించి ఆలయ అభివృద్ధికి పాటుపడతామని కాలనీ వాసులు తెలియ జేసారు. శ్రీమాన్ సత్యం మాస్టారు, అర్చకులు శ్రీనివాస్ గారు, యువవికాస్ కార్యకర్తలు పాల్గొన్నరు. విజయనగరం నుండి శ్రీమతి అరుణగారు, వికాసతరంగిణి జిల్లా ప్రెసిడెంట్ ఎస్. సత్యనారాయణగారు, నాయుడు గారు పాల్గొన్నారు.

**మహిళా ఆరోగ్యవికాస్ :**

సాలూరు వికాసతరంగిణి వారి ఆధ్వర్యంలో విజయ నగరం మహిళా ఆరోగ్యవికాస్ కార్యకర్తలు మహిళలకు ఉచిత వైద్య శిబిరాన్ని సాలూరులో



నిర్వహించారు. డా. వి.ఆర్. మీనాక్షి గారు వారి వైద్య బృందం పరీక్షలు నిర్వహించి 400 మందికి ఆరోగ్యంపై అవగాహన కల్పించారు. దానిలో 80 మందికి సాధారణ పరీక్షలు, 40 మందికి వి.ఐ.ఎ. పరీక్షలు చేయడం జరిగింది. 18 మంది పై పరీక్షలు నిర్వహించవలసి ఉంది. 11 మందికి బయాప్సీ అవసరమని డాక్టరుగారు తెలియజేసారు. డా. మీనాక్షిగారు విజయనగరం నుండి వచ్చిన కార్యకర్తలందరికీ వారే స్వయంగా వంటచేసి వడ్డించారు. డాక్టర్‌గారు సాలూరు ఆరోగ్యవికాస్ సమన్వయకర్తే కాదు. స్వామివారి దగ్గర సమాశ్రయణం అయ్యారు. కార్యకర్తలందరికి శిక్షణ ఇస్తూ ఎంతో ఓపికగా పరీక్షలు నిర్వహించారు. ఈ కార్యక్రమంలో పి. విజయలక్ష్మి, భారతి, చంద్రిక, అరుణ, పడాల విజయలక్ష్మి, సి.హెచ్.వి రమణమ్మ, పద్మ మొదలైనవారు సేవలందించారు. ఆరోగ్యవికాస్ సమన్వయకర్త శ్రీమతి శకుంతలా నాయుడు వైద్య శిబిరాన్ని నిర్వహించారు. శ్రీమాన్ చెరుకూరి శ్రీధర్‌గారు సహకారమందించారు.

**రాజాం :**



వికాసతరంగిణి కార్యాలయంలో పిఠాపురం మున్సిపల్ కమీషనర్ బి. రాముగారి ఆధ్వర్యంలో ఉచిత యోగ శిక్ష తరగతులు టి.టి.వి. రమణమూర్తి (బుస్కీమాస్టారు) 10 రోజులు నిర్వహించారు. అత్యంత ఆసక్తితో ఉదయం ఒక బ్యాచ్, సాయంత్రం ఒక బ్యాచ్ శిక్షణ పొందారు. ఈ శిక్షణా తరగతుల్లో మనసు దాని నైజం, సమస్యలు ఎలా ఏర్పడతాయి? వాటికి పరిష్కార మార్గాలు, శాంతియుతమైన కుటుంబ జీవనం, కాలాన్ని ఎలా సద్వినియోగం చేసుకోవాలి? మరియు ధ్యానంలో జరిగే మానసిక

మార్పులు. ఇలా వివిధ విషయాలని బుస్కీ మాస్టారు వివరిస్తూంటే అందరూ మంత్రముగ్ధులై విన్నారు. చివరి రోజున వికాసతరంగిణి ఆశయాలు, లక్ష్యాలు, చేస్తున్న సేవా కార్యక్రమాలు, ఆరోగ్యవికాస్, ప్రజ్ఞ, నేత్ర విద్యాలయ, గిరిజన పాఠశాలలు గూర్చి వివరించారు. చిన్న జీయరు స్వామివారు చేస్తున్న సేవలకు స్పందించి పీఠాపురం వాకర్స్ క్లబ్ వారు నేత్ర విద్యార్థులకు రూ.6,000/- డి.డి. రూపంలో అందించారు.

రాజాం మండలం కొత్తవలస గ్రామ యువత వికాస తరంగిణి సేవా కార్యక్రమాలకు స్పందించి గ్రామంలో మరుగు దొడ్ల నిర్మాణం, పారిశుధ్యంపై ప్రత్యేక దృష్టిపెట్టి వాటి అవసరాన్ని గ్రామస్థులకు తెలియజేసారు. యోగ శిక్షణ పూర్తి చేసుకున్నవారంతా నేత్ర విద్యాలయను సందర్శించారు. శ్రీ కొయ్యాన హరి వారి బృందమంతా కలసి 4,900/- నేత్ర విద్యాలయానికి అందజేసారు.

జూన్ 8వ తేది సెంట్రల్ కమిటి వారితో వికాస తరంగిణి కార్యాలయంలో రాజాం వికాస తరంగిణి సభ్యుల సమావేశం జరిగింది. ఈ కార్యక్రమంలో కేంద్రకమిటి ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీమాన్ భవాని ప్రసాద్‌గారు, రాష్ట్ర ఉపాధ్యక్షులు శ్రీమాన్ ఎం.ఎస్.ఎస్.ఆర్. వర్మ, కేంద్రకమిటి జోన్-1 సమన్వయకర్త శ్రీమతి గాయత్రి, 3 జిల్లాల సమన్వయ కర్త, వికాస దర్శిని సంపాదకురాలు శ్రీమతి అరుణ పాల్గొన్నారు. రాజాం వికాసతరంగిణి నిర్వహించిన కార్యక్రమ నివేదికను కేంద్రకమిటికి తెలియజేసారు. శ్రీమతి గాయత్రి దేవి గారు వికాస తరంగిణి కార్యకర్తలకు సభ్యత్వ గుర్తింపు కార్డులు అందజేసారు. శ్రీమాన్ భవానీ ప్రసాద్‌గారు భగవద్రామానుజ సహస్రాబ్ది కార్యక్రమాలు వివరించారు. ఆరోగ్య వికాస్, ప్రజ్ఞ కార్యక్రమాలను శ్రీమతి అరుణగారు వివరించారు.

వారిజ ఆశ్రమంలో శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు నిర్వహించే శ్రీ యాగ కార్యక్రమాన్ని గూర్చి శ్రీమాన్ వర్మగారు తెలియజేసారు. రాజాం వికాసతరంగిణి అధ్యక్షులు టి.టి.వి. రమణమూర్తి, కార్యదర్శి మోనంగి నగేష్ కుమార్, ఉపాధ్యక్షులు పాలవలస శ్రీనివాసరావు, ఆరోగ్య వికాస్ కొత్త రమేష్, ప్రజ్ఞ : ఎ లలిత, నీలకంఠ పవన్‌కుమార్, అబ్బులు, బి. రాంబాబు, రామానాయుడు, లావణ్య మొదలైన కార్యకర్తలు పాల్గొన్నారు.

**టెక్కలి - శ్రీకాకుళం జిల్లా**

టెక్కలి వికాసతరంగిణి కార్యకర్తలు గ్రామంలో ప్రచారం చక్కగా నిర్వహిస్తున్నారు. కేంద్ర కమిటీ ఆర్గనైజింగ్ సెక్రటరీ భవనీప్రసాద్‌గారు,కేంద్ర కమిటీ జోన్-1 సమన్వయకర్త శ్రీమతి గాయత్రిదేవి, ఉపాధ్యక్షులు శ్రీ ఎం.ఎస్.ఎస్.ఆర్.వర్మ, శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్టణం సమన్వయ కర్త శ్రీమతి అరుణ టెక్కలి సమావేశంలో పాల్గొన్నారు. శ్రీమాన్ వేమన, శ్రీమతి రత్నాలమ్మ మొదలైన కార్యకర్తలు కార్యక్రమాన్ని నిర్వహించారు. సభ్యత్వం స్వీకరించిన వారికి గుర్తింపు కార్డులు అందజేసారు. ఈ కార్యక్రమంలో టెక్కలి వికాసతరంగిణి కార్యకర్తలు, లత్తయ్యస్వామి, ఉషారాణి, అనసూయమ్మ, సూర్యం మాస్టారు, శార్వాణి మొదలైనవారు పాల్గొన్నారు.

**కవిటి కొత్తూరు :**

శ్రీకాకుళం జిల్లా కవిటి కొత్తూరు శ్రీ సీతారామ దేవాలయంలో, కవిటి వేణుగోపాలస్వామి ఆలయంలో గురు పూజోత్సవాలు జరిగాయి. ఆలయ భక్త సేవా బృందంవారు, వికాసతరంగిణి కార్యకర్తలు పాల్గొన్నారు. ఉపాధ్యాయులు శ్రీ పూడి బాలయ్యగారు గురుపౌర్ణమి వైభవాన్ని వివరించారు. శేషాద్రిస్వామి, లజపతిస్వామి, అనసూయమ్మ, లక్ష్మి నారాయణ కార్యక్రమాన్ని నిర్వహించారు. అందరికీ ప్రసాదాలు అందజేసారు.

**చెన్నై :**



ది మద్రాస్ యతిరాజ మండలి వారు ఎన్నో ఆధ్యాత్మిక కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. శ్రీమతి లలితా సుధాకర్ గారు యతిరాజు వైభవాన్ని అందరికి తెలియజేసారు. శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి శ్రీ హస్తములతో ప్రతిష్ఠ చేసిన శ్రీ రామానుజ మందిరంలో మూడవ వార్షికోత్సవం నిర్వహించారు. సాంస్కృతిక కార్యక్రమంలో భాగంగా "యతిరాజ గుణచంద్రిక" బుర్రకథను పాలకొల్లు మహిళలు ప్రదర్శించారు. శ్రీమతి యం. లక్ష్మి కుమారి, గ్రంధి వైదేహి, అనంతవల్లి పద్మజ చాలా అద్భుతంగా ప్రదర్శించారు. శ్రీమతి లలితా సుధాకర్, తవ్వా విజయలక్ష్మి, కమిటి సభ్యులు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. వచ్చిన భక్తులందరికీ పారాయణ అనంతరం ప్రసాదాలను అందజేసారు.

**మహిళా ఆరోగ్య వికాస్ :**

## చికిత్స చేయించుకున్న మహిళ అనుభవం

నా పేరు కె. శారదా నరసింహాచార్యులు. మాది విజయ వాడ. నేను మీ అందరికీ ఒక విషయం మనవి చేయదలుచు కున్నాను. రెండు సంవత్సరాల క్రితం నుండి నడుము నొప్పితో బాధపడు చున్నాను. ఎన్ని మందులు వాడినా ఉపశమనం లేకపోయింది. శ్రీశ్రీశ్రీ చిన్న జీయరుస్వామివారు నాకు గురువుగారు. వారి శిష్యులు వికాసతరంగిణి ద్వారా మహిళా ఆరోగ్య సంక్షేమం కోసం మెడికల్ క్యాంపులు జరుపుతున్నారు. పెద్ద పెద్ద డాక్టర్ల దగ్గరకు వెళితేనే తగ్గలేదు ఇక ఈ క్యాంపులకు వెళితే ఏం తగ్గుతుంది అనుకున్నాను.

ఒక రోజు మా ఇంటికి శ్రీమతి మాధవీరవీంద్ర దంపతులు వచ్చారు. మా అబ్బాయి వలన వీళ్ళు నాకు పరిచయము. నా శారీరక స్థితిని చూసి శ్రీమతి మాధవి 'అమ్మా! మేము ఈ ప్రక్కనే క్యాంపు చేస్తున్నాము. మీరు రండీ, చెకప్ చేస్తాము' అంది. 'అమ్మో నాకు భయం. నా కసలే వద్దు. ఏదో చిన్న నొప్పే కదా అదే పోతుంది అయినా నాకు ఏ అనారోగ్యం లేదు' అని చెప్పాను. 'ఏమీ లేకపోతే మంచిదేకదా! మన స్వామివారు ముందుగా

మన వికాసతరంగిణి సభ్యులను పరీక్ష చేయించుకోమని ఆజ్ఞాపించారు ' అని చెబితే వెళ్ళాను. పరీక్షలో గర్భకోశంలో ఏదో తేడా కనిపించింది అని బయాప్సీ చేసారు. వారం తరువాత తెలిసింది గర్భకోశానికి క్యాన్సర్ రాబోయే సూచన ఉందని. ఆపరేషన్ చేసి తొలగించాలి అన్నారు. శ్రీమతి మాధవీరవీంద్ర దంపతులు దగ్గర ఉండి ఆపరేషన్ చేయించారు. ఇప్పుడు నేను ఆరోగ్యంగా ఉన్నాను. మన వికాసతరంగిణి ద్వారా ఎందరో మహిళలు ఈ క్యాన్సర్ బారి నుండి రక్షింపబడు తున్నారు. నాలాగ మంచి ఆరోగ్యాన్ని పొందిన వారు ఎందరో ఉన్నారు. కానీ ఇంకా తెలియనివాళ్ళకి తెలియజేయడం కోసమే ఇదంతా వ్రాస్తున్నాను. ప్రతి మనిషి నిండు నూరేళ్ళ బ్రతకాలని కోరుకుంటాడు. కానీ అర్ధాంతరంగా వచ్చే ఈ మాయదారి రోగాల బారి నుండి మనల్ని మనం కాపాడుకోవటానికి శ్రీస్వామి వారు వికాసతరంగిణి ఏర్పరచారని భావిస్తున్నను. వికాస తరంగిణి సేవలను వినియోగించుకుందాం. ప్రతి మహిళ ప్రతి ఆరు నెలలకు ఒకసారి పరీక్ష చేయించుకోవాలట. బయట ఇదే పరీక్ష చేయించాలంటే కొన్ని వేల రూపాయలు ఖర్చు అవుతుంది. వి.టి. వారు ఉచితంగా చేయడం వలన సామాన్యునికి కూడా అందుబాటులో ఉంది. మంచి సేవలందించే వి.టి.వారికి ప్రత్యేక ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

## కార్యకర్త అనుభవం

నా పేరు మందపాటి చంద్రిక. నేను ఎం.ఎస్.సి చదివాను. నా వయస్సు 27 సం.లు. నా స్నేహితురాలు భారతి విజయనగరం మహిళా వికాస్ చేసే సేవలను చూసి నేను కూడా సేవ చేయాలని అనుకున్నాను. ఆరోగ్య వికాస్ కన్వీనర్ శ్రీమతి శకుంతలగారు చాలా శ్రద్ధగా కార్యక్రమాన్ని కార్యకర్తలందరితో చేయిస్తున్నారు. స్వామివారు జూన్ 21వ తేదీన విజయనగరంలో కాల్పోస్కోప్ ప్రారంభించిన దగ్గర నుండి ఎలాగైనా ల్యాప్‌టాప్ ఆపరేటింగ్ నేర్చుకుని పేషేంట్స్ రిపోర్టు రికార్డు చేయాలని అనుకున్నాను. కాల్పోస్కోప్ ఎలా ఉపయోగించాలో కంపెనీకి చెందిన చంద్రశేఖర్ గారు చక్కగా వివరించారు. మాకు డా.మాటూరి సుధాకుమారిగారు వి.ఐ.ఎ. పరీక్షలు ఎలా నిర్వహించాలో శిక్షణనిస్తున్నారు. ఉచిత వైద్య శిబిరం నిర్వహించేటప్పుడు ముందుగా ఆ ప్రాంతంలో ప్రతీ ఇంటికి వెళ్ళి సర్వే చేయడం, వైద్య శిబిరం ముందు రోజు పరీక్ష చేసే పరికరాలను స్టెరిలైజ్ చేయడం, శిబిరం నిర్వహిం చడం మాకు ఎంతో ఆనందాన్ని కలిగిస్తోంది. మేము కార్యక్రమంలో కొత్తగా వస్తున్నాం. 15వ తేది సాలూరు మెడికల్ క్యాంప్‌లో పూర్తిగా సేవ చేసుకోగలిగాము. డా.మీనాక్షి గారు , (గైనకాలజిస్ట్, సాయిరమ్య హాస్పిటల్, సాలూరు) చాలా ఓపికగా మాకు తెలియని విషయాలను తెలియజేస్తూ పరీక్షలు నిర్వహించారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు నిర్వహించే సేవలు చూసి వారి శిష్యులుగానే మేమంతా ఉండాలని మా కుటుంబమంతా స్వామి వారి దగ్గర ఈ మధ్యనే సమాశ్రయణమయ్యాము. ఆరోగ్య వికాస్ ద్వారా పరీక్షలు చేయించుకున్న మహిళలు చెబుతున్న అనుభవాలు, వారి ఆనందం నేను ఎప్పటికీ మరచిపోలేను. ఇంతమంచి సేవ చేసుకునే అవకాశాన్నిచ్చిన స్వామి వారికి నా కృతజ్ఞతలు.

## సహస్రాబ్దికి చిన్నారి స్పందన



శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారు జూన్ 20 నుండి 23 వరకు శ్రీవైష్ణవ రామానుజ కూటం వారు నిర్వహించిన ఉభయ వేదాంత పండిత సభారజతోత్స వాలకు వేంచేసారు. భగవద్రా మానుజ సహస్రాబ్దిలో సమతా మూర్తి స్ఫూర్తి కేంద్ర నిర్మాణం గూర్చి తెలియజేసారు. రామానుజ వైభవాన్ని శ్రీశ్రీశ్రీ స్వామివారు చిన్నారులకు కూడా అర్ధమయ్యేలా అద్భుతంగా వివరించారు. ప్రవచనం విన్న చిరంజీవి దాచేపల్లి శ్రీనివాస్ సంకేత్ (డి.రమేష్ గారి కుమారుడు) తను దాచుకున్న (పోకెట్ మనీ) ఐదువేల రూపాయలను రామానుజలవారి విగ్రహనిర్మాణానికి విరాళంగా ఇచ్చాడు. శ్రీశ్రీశ్రీ స్వామివారు శ్రీనివాస్ సంకేత్‌కు మంగళా శాసనములు అందజేసారు.

## కార్యకర్తలకు సూచన

**మీ వికాసతరంగిణి శాఖ ద్వారా చేసే ఆధ్యాత్మిక, సామాజిక, సేవా కార్యక్రమాలను అందరితో పంచు కోవాలనుకుంటున్నారా! కార్యక్రమ వివరాలను సంక్షిప్తంగా వ్రాసి, కార్యక్రమ ఫోటోలను జతపరచి ప్రతి నెల 10వతేదీలోపుగా news@vtsbharath.orgకి మెయిల్ చేయండి.**

**Cell No. 9440106555**

**జై శ్రీమన్నారాయణ**

## సూచన

**వికాసదర్శినిలో అన్ని వికాసతరంగిణి శాఖల కార్యక్రమ విశేషాలను ప్రచురించాలనే మా ప్రయత్నం. పత్రికలో స్థలాభావం వలన మీరు పంపిన నెలలో ప్రచురించలేకపోయినా తదుపరి నెలలో ప్రచురిస్తున్నా మని పాఠకులు గమనించగలరు. మీ కార్యక్రమ విశేషాలను, ఫోటోలను news@vtsbharath.org కి మెయిల్ చేసినవి మాత్రమే భక్తినివేదనలో ప్రచురించగలము.**

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః

68 సం॥ల నుండి భగవద్బంధువులు ఆదరిస్తున్న ...

ప్రారంభం - ఏప్రిల్ 1947

# భక్తినివేదన

## ఆధ్యాత్మిక మాసపత్రిక








సంపుటి 67

సెప్టెంబర్ 2014

శ్రీజయనామ సంవత్సర భాద్రపదమాసము

సంచిక 6


### పంచాంగ వివరములు

**సెప్టెంబర్:**

5. సర్వేషాం పరివర్తనైకాదశి
6. తిథిద్వయం, వామనజయంతి
8. అనంతపద్మనాభవ్రతం
9. అవమతిథి, మహాలయపక్షారంభం
13. భరణిమహాలయము
14. ఉత్తరకార్తె
16. వైష్ణవులకు శ్రీకృష్ణజన్మాష్టమి
17. కన్యాసంక్రమణం రా॥ 8.46ని॥లకు
19. సర్వేషామేకాదశి
20. శుక్రమౌఢ్యారంభం
22. మాసశివరాత్రి
23. మహాలయ అమావాస్య
24. పితరమావాస్య, విశ్వకర్మ జయంతి
25. శరన్నవరాత్రారంభం, తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవారంభం
27. సప్తకార్తె

**అక్టోబర్:**

1. సరస్వతీపూజ
2. దుర్గాష్టమి, మహర్నవమి
3. అవమతిథి, విజయదశమి
4. సర్వేషామేకాశి, తిరువేంగడత్తాన్ తిరు॥ వేదాంతదేశికర్ తిరు॥ శ్రీవారి చక్రస్నానం
5. పద్మనాభ ద్వాదశి


వ్యవస్థాపకులు
పరమహంస పరివ్రాజకాచార్య
**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు
శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి
శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. **రంగరామానుజాచార్యులు**

ఉప సంపాదకులు
శ్రీమతి డా॥ T.K. **చూడామణి**

D.T.P & Design by:
పరిశోధనాలయం - సీతానగరం.
పరిశోధన-ప్రకాశన విభాగం
జీవా - శ్రీరాంనగర్

చందావివరాలు :-
సంవత్సరచందా రూ.225/-
విదేశాలకు సంవత్సరచందా $30/-



మీ సేవలో....,
భక్తినివేదన, సీతానగరం - 522 501.
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com**
Internet : www.chinnajeeyar.org


### విషయసూచికా




*Printed & Published by :* H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**
*Printed & Published at :* **Sriman Printers & processors** : C/o JET, Sitanagaram - 522 501, Guntur Dist., Andhra Pradesh.
*Editor* : Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.

సంపాదకీయం

# భారతీయ సనాతన సంస్కృతిని మనం మరచిపోతున్నామా?



ఏ దేశపు మనుగడ అయినా దాని సంస్కృతి ప్రాభవంపైనే ఆధారపడి ఉంటుంది. మనం మాటాడే మాట, తినే తిండి, కట్టుకొనే బట్ట, మనం చేసికొనే శరీరసంస్కార ప్రసాధనాలు మన ఆలోచనాధోరణులు వీటన్నింటిలోనూ మన సంస్కృతి ప్రతిబింబిస్తుంది. ఈ సంస్కృతినే మన 'సారస్వతం' ఆవిష్కరిస్తుంది. వేదాలు,పురాణాలు, ఇతిహాసాలు, కావ్యనాటకాది సాహిత్యం, కళలు, శాస్త్రాలు ఇవన్నీ సంస్కృతిని ఆవిష్కరించే మాధ్యమాలే. ఎన్నో పరస్పర విసంవాదులైన భావజాలాలు, ఉన్నా, వాటిని అందమైన దారాలతో విచిత్రంగా గోచరించే కలనేతచీరలోని దారాల్లా, ఒకదానివలన మరొకటి అందగించేలా ఏర్పడిన సుందరసన్నివేశంగానే మనంభావిస్తాం. ఈ భావజాలాల్లో పరస్పరవైరుధ్యాన్నికాక వైవిధ్యాన్నే మనం దర్శిస్తాం. వీటిలోనుంచి ఆవిష్కరింపబడేదే భారతీయ 'మిశ్రమ సంస్కృతి' (Composite Culture) దీన్ని రక్షించుకోవాలనే భారతీయ రాజ్యాంగం ఉద్ఘాటించింది.

విదేశాలనుంచి వచ్చి ఈ దేశంలో స్థిరపడిన, ఇస్లాం, క్రైస్తవాది మతావలంబకులు, జైనులు, బౌద్ధులు, పార్సీలు,ఇంకా ఎన్నో విభిన్న మత సంస్కృతి సంప్రదాయాలకు చెందిన లక్షలాది జనుల మూలంగా ఈనాడు భారతీయ సంస్కృతి మిశ్రమ సంస్కృతిగా చెప్పబడుతున్నా, ఈ మిశ్రమసంస్కృతిలో మూడువంతుల భాగస్వామ్యం వైదిక సనాతన సంస్కృతిదే. ఇది నిరాకరింపరాని సత్యం. దాన్ని పూర్తిగా విడచిపెట్టిన "భారతీయ సంస్కృతి" అనేది అసలు లేనేలేదు. సంభవమూ కాదు. ఒక కుటుంబంలో ఉన్న వ్యక్తులందరికీ, ఆ కుటుంబయోగక్షేమాలతో పాటు, గొప్పతనంలోను, తక్కువ తనంలోను భాగస్వామ్యం ఉండి తీరుతుంది. ఈ కుటుంబం గొప్పది అనడంలోను, ఇది పాడైపోయింది అనడంలోను సమానభాగస్వామ్యం ఉండి తీరుతుంది. ఒకదేశ సంస్కృతి విషయంలోను గౌరవ ప్రాభవాల విషంలోను ఇదేసూత్రం వర్తిస్తుంది.

కాని, దురదృష్టవశాత్తుగా మన పాలకులు సంకుచిత స్వార్థ రాజకీయప్రేరితాలైన స్వభావాలవల్ల, వారి అనాలోచిత ప్రవృత్తులవల్ల "భారతీయ సంస్కృతి" లోని ప్రధానభాగస్వామి అయిన "వైదిక సనాతన ప్రవృత్తి" అనాదరింపబడటం, ఇతర సంస్కృతులను ఆలంబించినవారివల్ల నిందలకు, అపమానాలకు గురికావడం జరుగుతోంది. అదే సమయంలో ఈనాడు మనం అనుకొంటున్న "మిశ్రమసంస్కృతి" కారణాలైన వర్గాలు ప్రభుత్వాల అతిథుల్లా గౌరవమర్యాదలు పొందుతున్నాయి. మూల సంస్కృతిమాత్రం అవమాన పడుతోంది. ఈ దేశం అనాదిగా ఉదారభావనకలది. ఎన్నో దేశాలవారిని అక్కున జేర్చుకున్నది. వారు ఎంతగా ఈ దేశసంస్కృతిని గొంతు చించుకొని అవహేళన చేస్తూన్నా, 'అల్పసంఖ్యాకులు' అనే ముసుగువేసి, వారి రక్షణం, వారి మతవిశ్వాసాలపై ఈగవాలనీయకపోవడం సనాతన భారతీయసంస్కృతిని, పురాణేతిహాసాలను అధిక సంఖ్యాకులైన భారతీయుల విశ్వాసాలను బాహాటంగా వేదికలెక్కి నిందిస్తూన్నా, ప్రేక్షకపాత్ర పోషించడం ప్రభుత్వాలకు పరిపాటి అయిపోయింది. ఇది చాలా శోచనీయం. దీనివల్ల అధికసంఖ్యాకుల విశ్వాసాలకు విలువలేని స్థితిని ప్రభుత్వాలు, రాజకీయనాయకులు (అందరు కాకపోయినా కొందరు) పనిగట్టుకొని కల్పించడం సనాతన ధర్మసంస్కృతి ప్రేమికులు సహించరాదు. ఒక మహాకవి ఆత్మాభిమానం లేని బ్రతుకు, తల్లి కడుపుకు భారమని ఉద్ఘోషించాడు.

**మా జీవన్ యః పరావజ్ఞా దుఃఖదగ్ధోపి జీవతి ।**
**తస్య త్వజనిరేవ స్యాత్ జననీక్లేశకారిణః ॥**

ఎవ్వడు ఇతరుల అవమానాలవల్ల కలిగిన దుఃఖంచేత లోపల దహింపబడుతూనే బ్రతుకుతాడో అలాంటివాడు పుట్టకుండా ఉండటమే మంచిది. వీడివల్ల తల్లికి గర్భక్లేశమే తప్ప ఏ ప్రయోజనంలేదుకదా అంటాడు కవి. ముఖ్యంగా ప్రాచీన సంస్కృతి సంప్రదాయాలు బాగా ఎరిగిన విద్యావంతులు, వివేచనాపరులు అయిన పెద్దలు ఇలాంటి హీనస్థితిని సహించకూడదు. బిగ్గరగా ఇలాంటి దౌష్ట్యాన్ని ఎలుగెత్తి ఖండించాలి. ఇటీవలికాలంలో ఇదివరకు ఎన్నడూ లేనంతగా సనాతనవైదికధర్మాన్ని, విశ్వాసాన్ని, ఆవిశ్వాసాలకు మూలకందమైన మన పురాణేతిహాసాదులను, వాటిలోని వ్యక్తిత్వాలను బాహాటంగా సంకుచితబుద్ధితో విమర్శించేధోరణి బాగా ప్రబలింది. అంతేకాదు, వైదిక సనాతన భారతీయ సంస్కృతికి ప్రతినిధులైన దేవాలయాలపట్ల ఎప్పుడో వైదేశికుల దండయాత్రలు, దోపిడులవల్ల ఉపద్రవము కలగడమేకాదు, ఇప్పుడుకూడా ఉపద్రవాలు కలుగుతూనే ఉన్నాయి.

ఆలయాల్లోని విగ్రహాలు దొంగిలించడం, ధ్వజస్తంభాలను పెకలించడం, ఆలయాల శిథిలనిర్మాణ భాగాలను దొంగతనంగా తరలించి అమ్ముకోవడం, ఇలాంటివే ఎన్నో జరుగుతున్నా మన ప్రభుత్వాలకు పట్టకపోవడం గర్హణీయం. ఆలయభూముల దురాక్రమణలు, వాటి ద్వారా ఆలయాలకు రావలసిన రాబడిని కబళించడం శోచనీయం. మేం మతవిశ్వాసాలకు దూరం అని

గొప్పగా తమ సిద్ధాన్తాల్లో ప్రకటించుకొనే సమసమాజవాద రాజకీయవర్గాలు సహితం, సనాతన భారతీయసంస్కృతిని, తన్మూలాలైన మత విశ్వాసాలను విమర్శించినంతగా, కనీసం ఇతర విశ్వాసాలను పల్లెత్తుమాటైనా అనని పక్షపాతవైఖరినే తన్మూలమైన సంస్కృతిలోనూ చూపిస్తున్నారు. ఏ మతవిశ్వాసంలోనైనా, కొన్ని కొన్ని అంశాలు ఇతర విశ్వాసులకు నచ్చనివి, లేదా ఆధునిక పోకడలకు గిట్టనివి ఉండవచ్చు. అలా విమర్శించదగినవి అన్ని విశ్వాసాల్లోను ఎన్నో ఉన్నాయి.

'నాస్త్యేవ తజ్జగతి సర్వమనోహరం యత్' అన్నారు పెద్దలు. ఈ జగత్తులో అందరికీ నచ్చే వస్తువంటూ ఉండనే ఉండదు. ఇంతమాత్రంచేత పక్షపాతధోరణితో కువిమర్శలకు దిగడం, మత-సంస్కృతి, సంప్రదాయవిశ్వాసాలను కించపరచడం సరైన పనికాదు. ఒక్కొక్క భావజాలం ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క సమాజానికి అంతగా నచ్చకపోవచ్చు. అంతమాత్రంచేత ఆవిశ్వాసాలను నోటికొచ్చినట్లు విమర్శించే పద్ధతి, మనల్ని ఎక్కడికి తీసుకొని పోతుందో మనం గమనించాలి.

ఇలాంటివి ఎన్ని జరుగుతున్నాయో లెక్కలేదు. ఎవరైనా దాతలు ఇచ్చినవో, లేక పూర్వప్రభుత్వాలద్వారా ఉత్తరోత్తరాభివృద్ధి కోసం ఈయబడినవో అయిన ఆలయ-తద్భూములను కూడా స్థానికంగా ఉంటున్న రాజకీయనాయకులు, 'కబ్జా' చేయడానికి స్వయంగానో, లేక స్థానికులైన కొన్నివర్గాలవారిద్వారానో ఉద్యమిస్తున్నారు. ఆలయాభివృద్ధికి అడ్డతగులుతున్న వైనం ఎక్కడోకాదు మహానగరాల్లోనే జరగడం, లేదా రెండు వర్గాలుగా ఒకే విశ్వాసానికి చెందినవారిని విడగొట్టి ఒకరిపై మరొకరు ఫిర్యాదులుచేసి ఆలయాభివృద్ధిని అడ్డుకొనేలా చేయడమో జరుగుతున్నది. ఆలయ పరిరక్షణా బాధ్యతను శిరసావహించిన సమభావనాపరులైన పెద్దలు ఇలాంటివాటిపై కూడా తమదృష్టిని నిష్పాక్షికంగా పెట్టి, సమస్యలను సామరస్యంగా పరిష్కరించే బాధ్యతను కూడా స్వీకరించాలి. భారతీయ సనాతనధర్మానికి ఏచోటైనా అడ్డుతగలనీయకూడదు.

విభిన్నమతవిశ్వాసాలు, ఆరాధనావిధానాలు, జీవనసరళులు కలిగిన ఈ దేశంలో ప్రతి సంవత్సరం అనేక పండుగలు వస్తూంటాయి. ఆ స్థితిలో ఆయా మతవిశ్వాసాలవారు తమ అభినివేశాన్ని శోభాయాత్రలద్వారా ప్రదర్శిస్తారు. 'గణపతిచతుర్థి' వీటిల్లో ఒకటి. ముఖ్యంగా నిమజ్జనం ఒకపెద్ద సన్నివేశం అయింది. ఇది వచ్చినప్పుడల్లా రక్షణాపరమైన సమస్య వస్తున్నది. దానికి కారణం, శోభాయాత్ర సాగుతున్నప్పుడు, వేరు మతవిశ్వాసాలు కలవారు, అప్పుడప్పుడు రాళ్ళు విసిరి అలజడులు సృష్టించడమే. ఇలాంటి సన్నివేశాలలో రక్షణాబాధ్యత వహించినవారు ఇరుపక్షాలపట్ల సమానవ్యవహారమే చేయవలసియుంటుంది. ముఖ్యంగా ఇలాంటి సన్నివేశాల కోసమే కొన్ని సంకుచిత రాజకీయవర్గాలు కాచుక్కూర్చునే స్థితి కనిపిస్తున్నది. ఇలాంటి స్థితుల్లో మార్పులు తేవాలి.

ఒకరి మత విశ్వాసాలను మరొకరు గౌరవించక పోయినా, కనీసం సహనం ప్రదర్శించేలా 'మతప్రచార' సంస్థలు తమ కార్యక్రమాలను రూపొందించుకోవాలి. ప్రభుత్వాలు, మతా(ఠా)ధిపతులు, రాజకీయ పురుషులు అంతా ఏకోన్ముఖంగా 'చిత్తశుద్ధితో' కృషి చేయవలసిన అగత్యం ఎంతైనా ఉంది.

**వేంకట రంగరామానుజాచార్య**


భగవద్బంధువులందరికీ శుభాహ్వానము

పరమహంస పరివ్రాజకులు

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి

**తిరునక్షత్రమహోత్సవము**

జీయర్ పురస్కార ప్రదానము, మరియు

శ్రీరామచంద్ర ప్రభువుకి 1008 కలశాలతో అభిషేకము

24.10.2014 జీవాప్రాంగణం, శ్రీరామనగర్, శంషాబాద్, రంగారెడ్డి జిల్లా.

వివరములు వచ్చేసంచికలో...




**నతాఃస్మ సర్వవచసాం ప్రతిష్ఠా యత్రశాశ్వతీ ।**
**తమాద్యన్త మశేషస్య జగతః పరమం ప్రభుమ్ ॥**

అన్న విష్ణుపురాణవచనం, సర్వశబ్దాలకు పరమాత్మయందే ప్రతిష్ఠ అని చెబుతున్నది. ఏ శబ్దానికైనా, దానిచే తప్పనిసరిగా బోధింపబడవలసిన ముఖ్యార్థం లేదా వాచ్యార్థం ఏది ఉంటుందో ఆ అర్థమందే ప్రతిష్ఠ ఉంటుంది. ఆ శబ్దం తనకు ఆధారభూమియైన అర్థాన్ని తప్పని సరిగా బోధించవలసిందేనన్నమాట. ఏ శబ్దానికైనా పరమాత్మ అనే అర్థమందే ప్రతిష్ఠ ఉంటుందని పురాణం ఉద్ఘోషిస్తున్నది. మరి, లోకంలో కనిపించే వస్తువులు ఏవీ శబ్దానికి అర్థంకావా? అని అంటే, నిజంగా కావు. ఆ కనిపించే అర్థాలు కేవలం లోకవ్యవహార మాత్రానికి ఉపపాదకాలు. అంటే, లోకంలో ప్రత్యక్షంగా మనకు కలిగే అనుభవాన్ని కుదర్చడానికి మాత్రమేతప్ప పరమార్థంకాదు. మరి పరమార్థం ఏమిటి? అంటే పరమాత్మను బోధించడమే. అయితే లోకానుభవానికీ, శాస్త్రీయమైన, వేదాన్త సిద్ధమైన ఉపాసనాజన్యమైన అనుభవానికీ చాలా తేడా ఉంది. ప్రత్యక్షంగా గోచరించని జీవాత్మ-పరమాత్మ తత్త్వాలు ఉపాసనలో గోచరిస్తాయి. ఆ అనుభవాన్నే శాస్త్రం చెబుతున్నది. ఈ విషయాన్నే (లోకవ్యవహారానికి, వేదాన్త పర్యాలోచనవల్ల ఉపాసనామూలంగా కలిగే అనుభవానికి ఉన్న భేదాన్ని, వెనుక వేదార్థసంగ్రహవచనాలను ఉట్టంకించి చెప్పడం జరిగింది. దీన్నిబట్టి తేలిందేమిటి? అన్ని శబ్దాలకూ పరమాత్మను బోధించడమే పరమలక్ష్యం-కనుక, అన్ని శబ్దాలకు "ముఖ్య"మైన అర్థం పరమాత్మయే.

ఈ విధమైన ప్రణాళిని ఏర్పరచుకొని రామానుజులు తత్త్వమసి మొదలైన శ్రుతివాక్యాలను సమన్వయించారు.

**'తత్త్వమసి'** వాక్య సమన్వయం

1. శంకరభగవత్పాదుల అభిప్రాయం-

'తత్ త్వమసి' అన్నది ఛాందోగ్యోపనిషత్తులోని 'సద్విద్య' అనే ఉపాసనను నిరూపించే ఘట్టంలో శ్వేతకేతువుకు, ఆతని తండ్రి అయిన ఉద్దాలకునికి ఏర్పడిన సంవాదంలో ఉన్న వాక్యం. ఈ వాక్యానికి సమన్వయం చూపడంలో ఆచార్యులు విభిన్న మార్గాలను త్రొక్కారు. ముఖ్యంగా శంకరభగవత్పాదులు, ఈ వాక్యానికి అర్థం చెప్పడంలో కొంత బాధ ఉన్నదని భావించి, ఆ శబ్దాలకు ఉన్న అర్థాలను మార్చి, కొంత అర్థాన్ని తీసివేసి, కొంత అర్థాన్ని మాత్రమే స్వీకరించి సమన్వయం చూపారు. రామానుజులు ఇలాంటి సమన్వయాన్ని విడచి, అన్ని శబ్దాలకు నిజంగా పరమాత్మయే అర్థమనే తమ ప్రణాళికననుసరించి శ్రుతికి విరుద్ధం కాని విధంగా సమన్వయించారు.

**'తత్ త్వమ్ అసి'** అని మూడు పదాలున్నాయి ఈ వాక్యంలో. సామామాన్యంగా ఈ పదాలకు భాషా పరంగా లోకవ్యవహారసిద్ధమైన అర్థాన్ని చూస్తే "తత్= అది; త్వమ్= నీవు; అసి= అయిఉన్నావు". అని అర్థంవస్తుంది. 'అది' అంటే అంతవరకూ నిరూపింపబడి ప్రసిద్ధమైన జగత్కారణమైన పరమాత్మ తత్త్వం. 'త్వం' అంటే 'నీవు' అని అర్థం కనుక, ఎదురుగా ప్రత్యక్ష సిద్ధమై గోచరిస్తున్న శ్వేతకేతువు అనే బాలుడు అయిఉన్నావు అనడంచేత, 'ఆ జగత్కారమైన పరమాత్మ తత్త్వం శ్వేతకేతువనే పేరుకలిగి ప్రత్యక్షసిద్ధమైన వ్యక్తియై ఉన్నది అని, లేదా, శ్వేతకేతువనే పేరుగలిగి ప్రత్యక్షసిద్ధమైన వ్యక్తియే ఆ జగత్కారణ తత్త్వమై ఉన్నాడు అనికాని అర్థం చెప్పవలసి వస్తుంది.

ఆ జగత్కారణతత్త్వాన్ని శ్వేతకేతువు అని అనడం కుదరదు. ఇక, శ్వేతకేతువు ఆ జగత్కారణ తత్త్వమనడమూ ప్రత్యక్షవిరుద్ధమే. ఇద్దరికీ ఉన్న స్వరూప స్వభావాలు వేరుకదా! పరస్పర విరుద్ధాలైన లక్షణాలుకల రెండు తత్త్వాలు ఒక్కటే అనడం ఎలా కుదురుతుంది? ఎందువల్ల?

'తత్' అన్న శబ్దంచే చెప్పబడిన సకల జగత్కారణ తత్త్వమైన పరమాత్మ, సర్వజ్ఞుడు, సర్వశక్తి సంపన్నుడు దేశ-కాల- వస్తు పరిచ్ఛేదంలేని అనంతమైన నిత్య సత్య వస్తువు. ఇక, 'త్వం' అనే పదంచే చెప్పదగిన వ్యక్తి, శ్వేతకేతువు. ఒక తండ్రికి బిడ్డ, దేశకాలవస్తుపరిమితికల ఒక అల్పజ్ఞుడు. ఈతడు ఆ జగత్కారణమైన 'తత్త్వం' ఎలా అవుతాడు? "తత్ త్వం" అనే పదార్థాలకు శబ్దప్రయోగ శైలినిబట్టి ఐక్యమే (ఆ రెండూ ఒక్కటేనని) తెలుస్తున్నది. దీన్ని (ఈ శబ్దప్రయోగశైలిని) సామానాధికరణ్యం అంటారు. ఇది ఇక్కడ ప్రత్యక్షానుభవవిరుద్ధం కనుక కుదరదు. అందువల్ల ఒక సర్దుబాటు చేయాలి. శాంకర ప్రక్రియలో పరబ్రహ్మం కంటే వేరే వస్తువులేదు. పరబ్రహ్మచైతన్యం కంటే వేరు ఏదీ లేదు. కనుక దేన్ని వ్యవహరించినా

మరింత విశాలంగా ... వినూత్నంగా....
ప్రత్యేక 1 గ్రామ్ జ్యూయలరీ కౌంటర్
కామధేను సిల్క్స్
బీసెంట్‌రోడ్, విజయవాడ-2. ఫోన్: 2574220

చైతన్యంగానే వ్యవహరించాలి. ఈ ప్రపంచంలో మూడు తత్త్వాలు వ్యవహారసిద్ధాలై ఉన్నాయి.

**1. ప్రమాత- ఈ సమస్తాన్నీ వీక్షించే వ్యక్తి.**

**2. ప్రమేయం-వానిచేత చూడబడే వస్తుజాతం.**

**3. ప్రమాణం- అలా చూడటానికి వినియోగింపబడే చక్షురాది సాధనాలు. ఈ మూడు చైతన్యమే. వీటిని ప్రమాతృచైతన్యం, ప్రమేయచైతన్యం లేదా విషయచైతన్యం, ప్రమాణచైతన్యం అంటారు. వీటికి అతీతమైంది శుద్ధ చైతన్యం. అది అనుభవగోచరంకాదు.**

'తత్త్వమసి' అనే చోట ప్రమాతృ చైతన్యం, శుద్ధచైతన్యం రెండూ కలిపి ఒక్కటిగా ప్రయోగింపబడ్డాయి. శ్వేతకేతువు అనే జీవుడు త్వంపదం చేత చెప్పబడే ప్రమాత. కనుక ప్రమాతృ చైతన్యంగా చెప్పాలి. ఇక తత్ అనే పదంచేత శుద్ధచైతన్యం చెప్పబడాలి. కాని అది కూడా తాను జగత్కారణం కావడానికి సర్వజ్ఞత్వము మొదలైన కొన్ని గుణాలను స్వీకరించి ఉంది. మొత్తానికి రెండు పదాలూ చైతన్యాన్నే చెప్పినా, ఒకటి కొన్ని జగత్కారణత్వాది లక్షణాలు కల చైతన్యాన్ని, మరొకటి జీవధర్మాలుకల చైతన్యాన్ని చెబుతున్నాయి కనుక, రెండుచోట్ల, చైతన్య మాత్రాన్నే స్వీకరించి దాని వెనుక చేరిన విశేషాలను విడచిపెట్టినప్పుడు తత్–త్వం పదాలు రెండూ చైతన్యాన్ని మాత్రమే చెబుతాయి. అందుకోసం జహత్ (కొంత అర్థాన్ని విడచిపెట్టేది) అజహత్ (కొంత అర్థాన్ని విడచి పెట్టనిది) అయిన 'లక్షణ' అనే ఒక శక్తిని స్వీకరించి శబ్దవ్యవహారాన్ని కుదర్చాలి అనుకున్నారు శంకరభగవత్పాదులు. *(సశేషం)*

## ముఖచిత్ర పరిచయము

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీమదుభయ వేదాంతాచార్యపీఠస్థాపకులు, భారతదేశంలో జీయర్ వ్యవస్థకే **'ఆంధ్రజీయర్'**గా ఒక గౌవవాన్ని కల్గించిన మహనీయులు, భగవచ్చింతనతోపాటు, సామాజిక రుగ్మతలను పోద్రోలి స్త్రీసమాజం, దళిత సమాజాలను ఉద్ధరించిన మహోద్యమశీలురు మన శ్రీపెద్దజీయర్ స్వామివారు. వీరి 105వ తిరునక్షత్రం ఈనెల14వతేదీ వరకు 5రోజులు జీవాలోని దివ్యసాకేతంలో వైభవంగా జరిగింది.

ప్రవచనమండపంలో శ్రీస్వామివారికి అభిషేకం జరిపిన సన్నివేశాలతో పాటు సర్వాలంకారభూషితులై విరాజిల్లుతున్న యతిసార్వభౌముల మనోజ్ఞమూర్తి ఈనెల ముఖచిత్రం.



## లోకంబులులోకేశులు

*పోతన భాగవతం (8-75)*

**వివరణం: చిత్రం - డా. చెలికాని మురళీకృష్ణారావు (బొబ్బిలి)**

**లోకంబులులోకేశులు**
**లోకస్థులుదెగిన తుదిన లోకంబగుపెం**
**జీకటి కవ్వల నెవ్వం**
**డేకాకృతి వెలుగు నతనినే సేవింతున్.**

గజేంద్రుని మనస్సులో మెదిలిన మహోన్నత పరమాత్మ తత్త్వం ఇది. లోకాలను, లోకాలను పాలించేవారు, లోకాలలో ఉండేవారు అందరూ నశించిన అనంతరం ఆకారు చీకట్లకు అవతల అఖండమైన రూపంతో ప్రకాశించే ఆ దేవాదిదేవుణ్ణి, నేను భావించి సేవిస్తాను.! అంటున్నాడు గజేంద్రుడు. అంటే నాశరహితమైన శాశ్వత తత్త్వం నన్ను రక్షించడానికి రావాలని గజేంద్రుడు ఆ పరమాత్మను ప్రార్థిస్తున్నాడు.

అదృష్ట రత్నాలు ధరించండి ! అనుకున్నది సాధించండి !
శ్రీ సాయి
పవిత్ర డైమండ్స్
4/7, బ్రాడీపేట, ఖజానా జ్యాయలర్స్ ప్రక్కన, గుంటూరు. సెల్: 9246410099, ఫోన్ : 2262626.
బి/3, జైహింద్ కాంప్లెక్స్, గ్రౌండ్‌ఫ్లోర్, యాక్సిస్‌బ్యాంక్ ప్రక్కన, గవర్నర్‌పేట, విజయవాడ. సెల్ : 9246310099, ఫోన్ : 6665011.
సంపూర్ణ జ్యోతిష్యం చూడబడును
నాణ్యమైన జాతిరత్నాలు
జెమ్ టెస్టింగ్ ల్యాబ్
కెంపులు పచ్చల పూసలు
మంచి ముత్యములు, పగడములు
శివస్వరూపమైన రుద్రాక్షలు
స్ఫటికమాలలు
1 గ్రామ్ గోల్డ్ ఇమిటేషన్ జ్యూయలరీ



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

ధర్మరాజు పరిపరివిధాల భావిస్తున్నాడు. "ద్వారకకు వెళ్ళిన అర్జునుడు తిరిగిరాలేదు. రకరకాల దుశ్శకునాలు గోచరిస్తున్నాయి. ఇలాంటి శకునాల్లో వ్యక్తుల తొడలు, కన్నులు, భుజాలు స్ఫురించటం, శరీరం వణకడం లాంటివీ ఉన్నాయి. ఎర్రగా నిప్పులాంటి ముఖంతో ఆడనక్క సూర్యాభిముఖంగా చూస్తూ బిగ్గరగా అరుస్తున్నది. ఈ సారమేయం (కుక్క) ఎంతమాత్రం భయపడకుండా నాకు ఎదురుగా మొరుగుతోంది. నాకు కుడిఎడమల పశువులు తిరుగుతున్నాయి. గుర్రాలు కన్నీరు పెట్టుకుంటున్నాయి. గాలి చాలా కఠోరస్పర్శ కలిగి వీస్తున్నది. ధూళితోపాటు, కప్పివేసి చీకట్లను ప్రసరింపజేస్తున్నది. మేఘాలు రక్తాన్ని వర్షిస్తున్నాయి. ఎటు చూచినా బీభత్సస్థితి గోచరిస్తోంది".

సూర్యుడు కాంతిహీనుడైనాడు. ఆకాశంలో గ్రహసంకులం కనిపిస్తోంది. సంకులాలైన భూతగణాలతో ద్యావాపృథువుల అంతరాళం వ్యాపించినట్లు కనిపిస్తోంది. దేవతాప్రతిమలు కదలడం, గోవులు ఏడ్వడం, శిశువులు స్తన్యాన్ని త్రాగకపోవడం, తల్లులు ఈయకపోవడం, గోకులంలోని వృషభాలు ఉత్సాహం కోలుపోవడం, నదీనదసరోవరాల్లో క్షోభ ఏర్పడటం, ఇలా ఎన్నో రకాల అపశకునాలను చూచి ధర్మజుడు కలవరపడ్డాడు.

**"మన్యఏతైర్మహోత్పాతైః నూనం భగవతః పదైః ।**
**అనన్యపురుషశ్రీభిః హీనా భూః హతసౌభగా ॥**

ఇలాంటి మహోత్పాతాలచేత, ఇతరపురుషులకులేని శోభలుకల భగవత్పాదారవిందాలచే ఈ భూమి విరహితం అయి, తన శోభను కోల్పోయిందని భావిస్తున్నాను" అని ఇలా పరిపరివిధాల చింతిస్తున్న, ధర్మరాజు దగ్గరకు అర్జునుడు వచ్చాడు. ద్వారకనుండి వచ్చిన అర్జునుడు ధర్మజుని పాదాలపైబడి ఆతురతతో కంటి వెంట అశ్రువులు జాలువారుస్తూ బేలయై కనిపించగానే, ఆతనిని చేతులతో ఎత్తి, బెగ్గురుపాటు చెందిన కంఠస్వరంతో, నారదుని మాటలు జ్ఞప్తికి తెచ్చుకుంటూ ధర్మజుడు ఇలా అడుగుతున్నాడు.

"అర్జునా! ద్వారకానగరంలో మన బాంధవులంతా క్షేమంగా ఉన్నారుకదా. మధు-భోజ-దాశార్హ-సాత్వత-వృష్ణి-అంధక జాతులకు చెందిన వారంతా క్షేమమేనా. శూరమహారాజు, వసుదేవుడు, దేవకీప్రభృతులు, శత్రుజిత్, బలరాముడు, ఆహుకుడు, ప్రద్యుమ్నుడు,అనిరుద్ధుడు, సుషేణుడు, చారుదేష్ణుడు, సాంబుడు, ఋషభాదులు వీరంతా క్షేమంగా ఉన్నారుకదా! మనపట్ల దృఢప్రేమతో మనల్ని స్మరిస్తున్నారు కదా!" అని అంటూ-

**"భగవానపి గోవిందో బ్రహ్మణ్యో భక్తవత్సలః ।**
**కచ్చిత్పురే సుధర్మాయాం సుఖమాస్తే సుహృద్వృతః ॥**

భగవానుడైన గోవిందుడు, భక్తవత్సలుడై తన స్నేహితులతో పాటు 'సుధర్మ' (సభ)లో నిరామయుడై ఉన్నాడుకదా!

**"మంగళాయ చ లోకానాం, క్షేమాయ చ భవాయ చ ।**
**ఆస్తే యదుకులాంభోధౌ, ఆద్యోఽనన్తసఖః పుమాన్ ॥**

లోకమాంగళ్యానికి, భవానికి, క్షేమానికి యదుకులసాగరంలో ఆవిర్భవించిన పరమపురుషుడు అనన్తసఖుడై క్షేమంగా ఉన్నాడుకదా!' అంటూ శ్రీకృష్ణస్వామివైభవాన్ని కీర్తిస్తూ, కళాహీనమైన ముఖంతో, ఎట్టి గౌరవమర్యాదలు పొందక, అవమానింపబడుతూ చాలాకాలం ఉన్నవానిలా కనిపిస్తున్నావు. నీకు ఆరోగ్యం బాగుందికదా!" ఇలా కళాహైన్యానికి గల వివిధకారణాలను తామే ఊహించి ధర్మజుడు ఏకరువు పెట్టాడు. చివరకు-

**కచ్చిత్ ప్రేష్ఠతమేనాథ హృదయ్యేనాత్మబంధునా ।**
**శూన్యోస్మి రహితో నిత్యం మన్యసే తేన్యధా న రుక్ ॥**

ఒకవేళ, నీకు చాలా ప్రీతిపాత్రమై ఆత్మబంధువైన నీహృదయం చేతనే నీవు నిత్యం శూన్యుడనైనానని భావిస్తున్నావా? నీకేవిధమైన రుగ్మత కనిపించడం లేదే! ఎందుకిలా బేలవైఉన్నావు' అని ప్రశ్నించాడు ధర్మజుడు.

కృష్ణసఖుడైన అర్జునుడు సోదరుడైన ధర్మజుడు కృష్ణుని గురించి వివిధ వికల్పాలు చేసి మాటాడిన మాటలకు కలత చెంది వివిధ శంకలకు నెలవైన తన రూపాన్ని కప్పిపుచ్చుకుంటూ, శోకంచేత శుష్కించిన ముఖంతో వసివాడిన శరీరంతో విభుడైన స్వామినే ధ్యానిస్తూ శోకాన్ని నిలువరించుకోలేక ప్రతి సమాధానం చెప్పలేకపోయాడు.

ఎంతో కష్టంతో తన క్లేశాన్ని అణచుకొని, కన్నులనుండి జాలువారుతున్న కన్నీటిని చేతితో తుడుచుకొని, లోపలినుండి ప్రణయము, తన్మూలమైన ఔత్కంఠ్యము పెల్లుబికి వస్తుంటే కృష్ణుడు తమ పట్ల చూపిన ప్రీత్యాదరాలను, స్నేహంతో ఆయన చేసిన సారథ్యాదులను జ్ఞప్తికి తెచ్చుకుంటూ సోదరునితో ఇలా అంటున్నాడు.

''ఓ మహారాజా! బంధురూపియైన శ్రీహరిచే నేను వంచింపబడ్డాను. ఆయనచేతనే నా ఈ తేజస్సంతా హరించబడింది. ఇది దేవతలకు కూడా ఆశ్చర్యాన్ని కలిగించే విషయం. ఏ మహానుభావుని క్షణకాలవియోగంచేత ఈ లోకమంతా అప్రియంగా

గోచరిస్తుందో అలాంటి మహానుభావుడు ప్రాణాలచేత విరహితుడైనాడని ఎలా చెప్పగలను?

**యత్సంశ్రయాత్ ద్రుపదగేహముపాగతానాం**
**రాజ్ఞాం స్వయంవరముఖే స్మరదుర్మదానామ్ ।**
**తేజో హృతంఖలు మయా అపిహతశ్చ మత్స్యః**
**సజ్జీకృతేన ధనుషా అధిగతా చ కృష్ణా ॥**

మనమంతా ద్రుపద గృహానికి వెళ్ళినప్పుడు మన్మథ దుర్మదులైన దుర్యోధనాది ప్రభువులు ద్రౌపదీ స్వయంవరంలో ఆటోపాన్ని ప్రదర్శిస్తున్నప్పుడు వారి తేజస్సును హరించి, మత్స్య రాజును నిగ్రహించడం జరిగింది. ఎక్కుపెట్టినధనుస్సు చేత ద్రౌపది స్వయంవరంలో సాధింపబడింది. ఇదంతా మహానుభావుడైన శ్రీకృష్ణుని ఆశ్రయించడం వల్లనేకదా! అన్నయ్యా! ఇంతే కాదు, ఆ మహానుభావుడు నా సన్నిధిలో ఉన్నందువల్లనే ఖాండవవనాన్ని నిర్భయంగా అగ్నికి ఆహుతిచ్చాను. అమరగణంతో పాటుగా ఇంద్రుణ్ణి జయించి, అద్భుతశిల్పమయమైన మయసభను సాధించాము. రాజసూయమహాధ్వరాన్ని నృపతులనుండి ఉపాయనాలను హరించి నిర్వహింపగలిగాము. *(సశేషం)*

## శ్రీరామానుజ సహస్రాబ్ది - 2016 - 17

**ప్రియ భగవద్బంధువులారా! మీరంతా ఎంతో ఉత్సాహంతో భగవద్రామానుజ విగ్రహ నిర్మాణానికి మీమీ ద్రవ్యాన్ని వినియోగింపదలచడం చాలా ముదావహం.**

**మీరు ద్రవ్యం బ్యాంక్ అకౌంట్‌కు జమకట్టే విషయంలో ఈక్రింది అంశాలను గమనించండి.**

1. **మీరు ఆంధ్రాబ్యాంక్, ముచ్చింతల్ బ్రాంచ్‌కి. 209710100000007 నెంబరుకు - ఏ ఆంధ్రాబ్యాంక్ బ్రాంచి నుంచి ఆయినా నేరుగా జమకట్టవచ్చు.**
   **జమకట్టేటప్పుడు -కౌంటర్ ఫయిల్, వర్జినల్ మీవద్ద ఉంచుకుని దాని నకలు, జతచేసి ఒక తెల్లకాగితంపై మీవివరాలు, అడ్రస్ స్పష్టంగా, ఎవరిపేరున రసీదు పంపాలో వ్రాసి మా అడ్రస్‌కు పంపండి.**
2. **మీరు ఆంధ్రాబ్యాంకు కాక, వేరేబ్యాంకు ద్వారా పంపదలిస్తే- IFSC Code ANDB - 0002097 అనే నెంబర్‌ను వినియోగించి పై ఆంధ్రాబ్యాంక్ అకౌంట్‌కే అమౌంట్‌ను పంపవచ్చును.**

**వివరాలు తప్పని సరిగా మా ఆఫీస్‌కు అందాలి. అందిన తరువాతనే రసీదు పంపబడుతుంది. ఎలా పంపినా -మీరు జమచేసిన వివరాలు- కౌంటర్‌ఫైల్ నకలు, మీపేరు, ఊరు, చిరునామా వగైరా ఈక్రింది అడ్రస్సుకు పోస్టులో పంపండి. మీ ఇమెయిల్ ఐడి కూడా తప్పక వ్రాసి పంపండి.**

**శ్రీరామానుజ సహస్రాబ్ది కార్యనిర్వాహక సమితి,**
**9553549971, 9553549972,**
**శ్రీరామానుజ సహస్రాబ్ది, జీవా, శ్రీరామనగర్, ముచ్చింతల్(గ్రా), పాలమాకుల(పో), శంషాబాద్ (మం), రంగారెడ్డి జిల్లా -509325**
Email -contact@sriramanujasahasrabdi.org

## చాతుర్మాస్యంలో - విశేష కార్యక్రమాలు

**శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు** యథానిర్దేశంగా తమ చాతుర్మాస్య దీక్షను జీవా ప్రాంగణంలో ప్రారంభించారు. ఈ సందర్భంగా ఉదయం 8.30 నుండి 9.30వరకు భగవద్రామానుజులు అనుగ్రహించిన వేదార్థసంగ్రహం గ్రంథంపై తమ ప్రవచనాలు అందిస్తున్నారు. ఎవరైనా శ్రీస్వామివారిని కలుసుకో గోరినవారు తీర్థగోష్ఠి అయిన తరువాత కలుసుకునే అవకాశం కల్పిస్తున్నారు.

ఇక ఈ చాతుర్మాస్య సమయంలో చాలా విశేష కార్యక్రమాలు నిర్ణయించడం జరిగింది.

22.8.2014 వరకు శ్రావణమాసపు శుక్రవార పూజలు పూర్తి అయినాయి. 23.8.14 తరువాత జరిగే కార్యక్రమాలు క్రింద ఇస్తున్నాము.

### విశేషంగా జరిగే కార్యక్రమాలు

| | | |
|---|---|---|
| 1. | విష్వక్సేనపూజ, విఘ్ననివారణ చతుర్థి | 29.8.2014 |
| 2. | నేత్రవిద్యాలయ వార్షికోత్సవం | 31.8.2014 |
| 3. | శ్రీకృష్ణ జన్మాష్టమి | 16.9.2014 |
| 4. | శరన్నవరాత్రోత్సవాలు, శ్రీయాగం | 25.9.2014 |
| 5. | విజయదశమి | 03.10.2014 |
| 6. | దీపావళి | 22.10.2014 |
| 7. | శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి తిరు॥ | 24.10.2014 |
| 8. | కార్తీకపూర్ణిమ, చాతుర్మాస్య వ్రత సమాప్తి | 06.11.2014 |

23.8.14 నుండి యథాపూర్వంగా ఉ॥ 8.30కు తీర్థగోష్ఠి పూర్తిచేసి, భగవద్రామానుజుల వేదార్థసంగ్రహ గ్రంథంపై శ్రీస్వామివారు తమ ప్రవచనాలు కొనసాగిస్తున్నారు. ఎల్లరూ పాల్గొనగలరు.

## విశేష సూచన

ప్రియమైన భక్తినివేదన పాఠకులకు, భగవద్బంధువులకు సూచన

**మీరు జీవా ప్రాంగణంలోని సమాచారం కోరుతున్నారా?**

**శ్రీరాంనగర్ జీవాలో జరిగే వివిధ కార్యక్రమాల గురించి, స్వామివార్లు ప్రాంగణంలో ఉన్నారా? లేరా? ఇలాంటి ఎన్నో సమాచారాలు మీరు తెలుసుకో కోరుతున్నారు. మీకు ఏ సమాచారం కావలసివచ్చినా ఈక్రింది రెండు నెంబర్లకు మాత్రమే చేసి తెలుసుకోండి! ఇక రామానుజ సహస్రాబ్ది గురించి తెలిసికో గోరినవారికి వేరే. ఆసమాచారం మన భక్తినివేదనలోనే విడిగా ఇస్తున్నాం. ఆ నంబర్లకే ఫోన్ చేసి, సమాచారం పొందవలసినదిగా కోరుతున్నాము.**

**జీవా రిసెప్షన్ ఫోన్ నెం - 9553549971 9553549972.**

తిరువరంగత్తముదనార్లు అనుగ్రహించిన ప్రపన్నగాయత్రి

# ఇరామానుశనూత్తన్దాది

గత సంచిక తరువాయి

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

## 44వ పాశురము

**శొల్లార్ తమిర్ఒరు మూన్ఱుమ్, శురుతికళ్ నాన్గుమ్ ఎల్లై**
**యిల్లా అఱనెఱి యావుమ్ తెరిన్దవన్, ఎణ్ణరుమ్ శీర్**
**నల్లార్ పరవుమ్ ఇరామానుశన్ తిరునామమ్ నంబి**
**క్కల్లార్ అకలిడత్తోర్, ఎతు పేఱెన్రు కామిప్పరే ॥**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **అకల్ ఇడత్తోర్** | = | విశాలమైన ఈభూమండలంలోఉండే వారు. |
| **శొల్ ఆర్** | = | శబ్దాలతో నిండిన. |
| **తమిర్ ఒరు మూన్ఱుమ్** | = | మూడు విధములైన ద్రావిడాన్ని, |
| **శురుతికళ్ నాన్గుమ్** | = | నాల్గు వేదాలను, |
| **ఎల్లై ఇల్లా** | = | లెక్క లేనన్ని, |
| **అఱమ్ నెఱి యావుమ్** | = | ధర్మశాస్త్రాదులన్నింటినీ, |
| **తెరిన్దవన్** | = | తెలిసినవారు, |
| **ఎణ్ అరు శీర్** | = | లెక్కించ సాధ్యముగాని కల్యాణగుణాలను కలవారు, |
| **నల్లార్** | = | సత్పురుషులచే, |
| **పరవుమ్** | = | స్తుతింపబడువారూ అయిన, |
| **ఇరామానుశన్** | = | భగవద్రామానుజుల, |
| **తిరునామమ్** | = | పవిత్రనామాన్ని, |
| **నమ్బి కల్లార్** | = | నా మాటను నమ్మి అభ్యసించినవారు లేరు, |
| **ఎతు పేఱు ఎన్ఱు** | = | మనకు పురుషార్థమేది? అని, |
| **కామిప్పరే** | = | అడుగుతున్నారే, అయ్యో!. |

**తాత్పర్యము :** అముదనార్లు లోకులను భగవద్రామానుజుల పవిత్ర నామాన్ని కీర్తించండి అని వేడుకున్నారు. ఎందుకంటే – రామానుజులు.

1. ద్రావిడ శాస్త్రాలన్నీ బాగా తెలిసినవారు. ద్రావిడం మూడువిధాలు అవి – ఇయల్, ఇశై, నాడకమ్, అని సాహిత్యం ప్రధానం, సంగీతం ప్రధానం, ఉభయ ప్రధానం అని మూడు రకాలైన ద్రావిడాన్ని చక్కగా తెలిసినవారు స్వామి.
2. నాల్గువేదాలు–ఋక్,యజుస్సు,సామ, ఆథర్వణం వీటి సారమంతా తెలిసినవారు.
3. లెక్కపెట్టలేనన్ని ధర్మశాస్త్రాలు, వారికి కరతలామలకాలు (తేలికగా వారికి తెలిసినవి)
4. ఇంక యతి సార్వభౌములు కల్యాణగుణ సంపన్నులు.
5. సత్పురుషులచే సర్వదా కీర్తింపబడే స్వామి.

ఇంతగొప్ప స్వామి నామాన్ని కీర్తించి తరించండి అని వేడుకున్నా లోకంలో ఒక్కరూ వినరే, పైగా, మేం ఎలా ఉజ్జీవించాలి అని ఒకటే బాధపడిపోతున్నారే, అయ్యో! నామాట నమ్మరే అని తల్లడిల్లుతున్నారు అముదనార్లు.

## 45వ పాశురము

**పేఱొన్ఱు మఱ్ఱిల్లై నిన్ శరణన్ఱి, అప్పేఱళిత్తఱ్కు**
**ఆఱొన్ఱుం ఇల్లై మఱ్ఱచ్చరణన్ఱి, ఎన్ఱి ప్పొరుళై**
**త్తేరు మవర్క్కుం ఎనైక్కుం ఉనై త్తన్ద శెమ్మైశొల్లాల్**
**కూఱుమ్ పరమన్ఱు, ఇరామానుశ ! మెయ్మ్మై కూఱిడిలే॥**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **ఇరామానుశ** | = | భగవద్రామానుజా! |
| **నిన్ శరణ్ అన్ఱి** | = | దేవరవారి శ్రీచరణాలు తప్ప. |
| **మఱ్ఱు పేఱుఒన్ఱుం ఇల్లై** | = | వేరొక ఫలం (పురుషార్థం) లేదు. |
| **అప్పేఱు అళిత్తఱ్కు** | = | ఆఫలాన్ని(మీ చరణాలని) పొందడానికి. |
| **అచ్చరణ్ అన్ఱి** | = | ఆ మీ దివ్యపాదాలు తప్ప. |
| **మత్తు ఆఱు ఒన్ఱుం ఇల్లై** | = | వేరొక ఉపాయం కూడా ఏదీలేదు. |
| **ఎన్ఱు ఇప్పొరుళై** | = | అనే ఈయథార్థమైన అభిప్రాయాన్ని |
| **తేఱుం అవర్క్కుమ్** | = | స్పష్టంగా తెలుసుకున్న మహానుభావులకూ |
| **ఎనక్కుమ్** | = | ఈ విషయాలేవీ తెలియని నాకూ. |
| **ఉన్నై తన్ద శెమ్మై** | = | (మధ్య ఏభేదం చూపక) తమనే అనుగ్రహించిన ఋజుత్వం. |
| **మేయ్మ్మై కూఱిడిల్** | = | నిజం చెప్పాలంటే. |
| **పరమ్ అన్ఱు** | = | సాధ్యంకాదు (అసాధ్యము) అనుభవించే తెలియాలి. |

**తాత్పర్యము :** భగవద్రామానుజుల నిర్హేతుక కటాక్షాన్ని వారు తమకు చేసిన మహోపకారాన్ని స్మరించి పులకించిపోతున్నారు అముద నార్లు. హే భగవద్రామానుజ! మాకు మీచరణాలు తప్ప వేఱుప్రాప్యం (పొందదగినది) ఏమీలేదు. అలా మీపవిత్రచరణాలు చేరాలంటే మీచరణాలే దిక్కుతప్ప వేరే ఏగతీలేదు. ఈసత్యాన్ని తెలుసుకున్న మహానుభావులను మీరెలా అనుగ్రహిస్తున్నారో, ఆవిషయాలేవీ తెలియని అజ్ఞానినైన నన్నుకూడా భేదం చూపక వారివలెనే అనుగ్రహిస్తున్నారు. ఎంతటి ఔదార్యంమీది! (కూరేశులు

వంటి వారిపై చూపించేదయనే నాపై కూడా చూపించి సేవకునిగా చేసికొన్నారే!) మీ ఋజుత్వగుణం గూర్చి వర్ణించడానికి, పొగడడానికి నాకు శక్తిలేదు, సాధ్యంకాదు. పెద్ద చిన్న భేదం చూపక అందరినీ ఒకేలా ప్రేమించి కరుణించడం సౌశీల్యం, ఆర్జవం. ఈగుణం యతిరాజుల స్వభావంగా మారింది.

**46వ పాశురము**

**కూఱుమ్ శమయఙ్గళ్ ఆఱుమ్ కులైయ, కువలయత్తే**
**మాఱన్ పణిత్త మఱై యుణర్న్దోనై, మఱియిలియేన్**
**తేఱుమ్బడి యెన్ మనమ్ పుకున్దానై, త్తిశై యనైత్తుమ్**
**ఏఱుమ్ కుణనై, ఇరామానుశనై యిఱైఞ్జినమే॥**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **కూఱుమ్** | = | తోచినట్లు పలుకుతున్న, |
| **శమయఙ్గళ్, ఆఱుమ్** | = | బాహ్యమతాలు ఆఱును, |
| **కులైయ** | = | తలవంచేటట్లు, |
| **కువలయత్తే** | = | ఈ భూమండలంలో, |
| **మాఱన్ పణిత్త** | = | నమ్మాళ్వార్లు అనుగ్రహించిన, |
| **మఱై** | = | ద్రావిడ వేదాన్ని. |
| **ఉణర్న్దోనై** | = | అభ్యసించి తెలిసినవారూ. |
| **మదియిలేన్** | = | జ్ఞానము లేని నేనుకూడా. |
| **తేరుమ్బడి** | = | తేటపడే విధముగా. |
| **ఎన్ మనమ్** | = | నామనస్సులోకి వచ్చి. |
| **పుకున్దానై** | = | ప్రవేశించినవారు. |
| **తిశై అనైత్తుమ్** | = | అన్ని దిక్కులలోను. |
| **ఏరుమ్ కుణనై** | = | వ్యాపించే కల్యాణగుణాలు కలిగిన వారైన. |
| **ఇరామానుశనై** | = | భగవద్రామానుజులను.(కు) |
| **ఇఱైఞ్జినమ్** | = | నమస్కరించితిమి కదా! |

**తాత్పర్యము :** కవి శ్రీరామానుజుల ఉపకార స్వభావాన్ని తలచుకొని తలచుకొని వారికి దాసోహములు సమర్పిస్తున్నారు.

వేదబాహ్యులైన మతాలు కొన్ని ఉన్నాయి. నాస్తిక వాదా లున్నాయి. ఒక ప్రమాణము, యుక్తి లేకుండ ఎవరికి తోచినట్లు వారు మతాలను ప్రచారం చేస్తుంటే మన నమ్మాళ్వార్లు వారందరికీ సరియైన సమాధానం చెప్పి తలవంచుకొనేలా అనుగ్రహించినదే ద్రావిడవేదం. తిరువాయ్ మొళ్గి ని నేర్చుకుని వేదవేద్యుని తెలిసికొన్నవారూ, ఏవిషయము తేలియని నా(అముదనార్) వంటివారు కూడా చక్కగా తెలుసుకొనేలా రామానుజులు నామనస్సులోపలికి వచ్చి చేరారు. నన్నూ తీర్చిదిద్దారు. వారికీర్తి అన్ని దిక్కులలోను చక్కగా వ్యాపించింది. అటువంటి యతీశ్వరులకి నమస్కరిస్తున్నాను. *(సశేషం)*




**శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్**

భగవద్రామానుజుల శిష్యులు ముదలియాండాన్. వీరిపేరు దాశరథి. వీరందించిన స్తోత్రమే ధాటీపంచకము. ధాటీ అంటే దాడి. శ్రీభాష్యకారులు వేదబాహ్యమతాలపై దాడిచేశారు. అంటే వేద ప్రతిష్ఠాపనాచార్యులుగా వైదిక సిద్ధాన్తాన్ని, శ్రీమన్నారాయణ పరత్వాన్ని స్థిరంగా స్థాపించారు. ఆ భావాన్ని, యతిరాజ వైభవాన్ని ఐదుశ్లోకాలలో చెప్పడం వలన ఇది ధాటీపంచకము అని ప్రసిద్ధిని పొందింది.

**3వ శ్లోకము**

**చారిత్రోద్ధారదండం చతుర నయ పథాలంక్రియా కేతుదండం**
**సద్విద్యాదీపదండం సకల కలికథా సంహతేః కాలదండమ్ ।**
**త్రయ్యంతాలంబదండం త్రిభువన విజయచ్ఛత్రసౌవర్ణదండం**
**ధత్తేరామానుజార్యః ప్రతి కథకశిరో వజ్రదండం త్రిదండమ్ ॥**

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **చారిత్ర.. ఉద్ధారదండం** | = | చక్కని నడవడిని అలవాటుచేసే బెత్తం. |
| **చతురనయపథాలం క్రియా కేతుదండం** | = | వేదశాస్త్ర మార్గాన్ని అలంకరించే ధ్వజస్తంభ. |
| **సద్విద్యా దీపదండం** | = | సద్విద్య మొదలైన బ్రహ్మవిద్యలను చక్కగా చూపించే దీపదండం. |
| **సకల కలికథా సంహతేః కాలదండం** | = | అన్ని విధములైన కలిదోషసముదాయానికీ యమదండమైనది |
| **త్రయ్యన్తాలంబదండం** | = | వేదాంతాలకు ఆధారదండమైనది. |
| **త్రిభువనవిజయ ఛ్ఛత్ర సౌవర్ణదండం** | = | ముల్లోకాలను జయించినాటిన ఛత్రానికి బంగారు స్తంభం. |
| **ప్రతికథకశిరో వజ్రదండం** | = | ప్రతివాదుల శిరస్సులను తుత్తునియలుచేసే వజ్రదండం అయిన |
| **త్రిదండం** | = | త్రిదండాన్ని (చిత్,అచిత్,ఈశ్వర తత్త్వాలకి ప్రతీకగా మూడు దండములు కలిపి కట్టినది.) |
| **రామానుజార్యః ధత్తే** | = | భగవద్రామానుజులు ధరించి ఉన్నారు. |

**తాత్పర్యము : భగవద్రామానుజులు పవిత్రహస్తంతో త్రిదండంధరించి ఉన్నారు. అది ఎలాంటిది అంటే 1. మంచి నడవడిని నేర్పే బెత్తం. (బెత్తంతో పిల్లల్ని మంచిగా మారుస్తాంకదా). 2. వేదమార్గాన్ని అలంకరించే ధ్వజస్తంభం. (వేదాత్ముడయిన గరుత్మంతుని స్థానము ధ్వజస్తంభం). 3. సద్విద్య మొదలైన బ్రహ్మవిద్యలను చూపించే దీపదండం. 4. కలిదోషాల పాలిటి యమదండం. 5. వేదాంతాలకు ఆధారదండం. మూడు లోకాలను జయించి నాటిన విజయచ్ఛత్రానికి బంగారు స్తంభం. వాదంలో ప్రతివాదులను అణచడంలో వజ్రదండం. విశిష్టాద్వైత సిద్ధాంత మూలములైన చిత్-అచిత్-ఈశ్వర తత్త్వాలకి ప్రతీక మన యతీశ్వరుల చేతిలోని త్రిదండము. ఇలాంటి ప్రభావము కలదని తాత్పర్యము.**

# శ్రీవచన భూషణ సారమగు సప్తగాధ

శ్రీమతి చక్రవర్తుల చూడామణి- ఖమ్మం

**అవతారిక :** ఈ పాశురములో ఆచార్యప్రపత్తి లేనివారు ఆత్మనాశమును తామే కోరుకుంటారని చెప్పబడింది.

**అఞ్జుపొరుకు మళిత్తవన్పా లన్బిలార్**
**నఞ్జిల్ మిగక్కొడియర్ నామ్‌శొన్నోమ్ - నఞ్జదాన్**
**ఊనై ముడిక్కుం ఇవరుయిరై ముడిప్పరెన్ఱు**
**ఈనమిలార్ శొన్నారిఱై** 2

**అర్థములు :**

| | | |
|---|---|---|
| **అంజుపొరుకుమ్** | = | అర్థపంచకమును |
| **అళిత్తవన్‌పాల్** | = | ఉపదేశించిన ఆచార్యులయెడ |
| **అన్బుఇలార్** | = | భక్తిలేనివారు |
| **నంజిల్‌మిగ** | = | విషముకంటే |
| **క్కొడియర్** | = | ప్రమాదకరమైనవారు |
| **నామ్ శొన్నోమ్** | = | మేము చెపుతున్నాం (విళాంశోలైపిళ్ళై) |
| **నంజ దాన్** | = | విషము |
| **ఊనై** | = | శరీరమును మాత్రమే |
| **ముడిక్కుమ్** | = | నశింపజేస్తుంది. |
| **ఇవర్** | = | ఆచార్యాభిమానం లేనివీరు |
| **ఉయిరై** | = | ఆత్మను |
| **ముడిప్పర్** | = | నశింపచేస్తారు |
| **ఎన్ఱుమివై** | = | అనేవిషయాలను |
| **ఈనమిలార్** | = | జ్ఞాన సంపన్నులు (పరిపూర్ణులు) |
| **శొన్నార్** | = | చెప్పారు. |

**భావము :** మొదటి పాశురములో అర్థపంచక ప్రతిపాద్యమైన తిరుమంత్రమును, మంత్రార్థమును ఉపదేశించి శిష్యులనుజ్జీవింప చేయుట ఆచార్య కృత్యముగా చెప్పబడింది. ఈపాశురములో అంతగొప్ప ఉపకారము చేసిన ఆచార్యుని పట్ల భక్తిలేని శిష్యులు విషము కంటే ప్రమాదకారులని చెప్పబడింది. విషము శరీరాన్ని మాత్రమే నశింపజేస్తుంది. ఆచార్యాపచారం ఆత్మస్వరూపాన్నే నాశనం చేస్తుందని జ్ఞాన సంపన్నులైన పూర్వాచార్యులు చెప్పారు.

**విశేషార్థములు :** 'అంజుపొరుళ్' అర్థపంచకము. 1. స్వస్వరూపము, 2. పరస్వరూపము, 3. పురుషార్థస్వరూపము. 4. ఉపాయ స్వరూపము, 5. విరోధిస్వరూపము. దీనినే తిరువాయ్‌మొழி తనియన్‌లో...

**"మిక్కవిఱైనిలైయుమ్ మెయ్యాముయిర్‌నిలైయుమ్,**
**తక్కనెఱియుమ్ తడైయాకి తొక్కియలుమ్,**
**ఊழ்వినైయుమ్ వాழ்வినయుమ్"** అని

చెప్పడం వలన తిరువాయ్‌మొழிలో అర్థపంచక నిరూపణ చేయబడిందని తెలుస్తున్నది.

**నంజుదాన్ ఊనై ముడిక్కుమే అదు ఉయిరై ముడిక్కుమే**

శిష్యుడికి ఆచార్యప్రపత్తి ఎలా ఉండాలో శ్రీవచనభూషణంలోని 349వ చూర్ణికలో చెప్పబడింది. 'ఇవనుక్కు శరీరావసానత్తళవుమే ఆచార్య విషయత్తిల్ ఎన్నై తీమనమ్ కెడుత్తాయ్' 'మరువిత్తొழுమ్ మనమేతందాయ్' 'ఎన్ను ఉపకార' స్మృతి నడక్క వేండుమ్' (శిష్యుడు తన శరీరావసాన దశదాకా ఆచార్య విషయంలో ఉపకార స్మృతి కలిగి ఉండాలి. ఎందుకంటే శిష్యుడిలోని దుర్గుణాలనుపోగొట్టి భగద్భాగవత ఆచార్య కైంకర్య బుద్ధిని ఇచ్చింది ఆచార్యులే కదా).

**అవతారిక :** శిష్యులుజ్జీవింపబడాలంటే శాస్త్ర పరిజ్ఞానము తగ్గినా ఫరవాలేదు. తప్పనిసరిగా ఆచార్యాభిమానం ఉండాలని ఈపాశురంలో చెప్పబడింది.

**పార్త గురువి నళవిల్ పరివిన్ఱి**
**శీర్తమిగు జ్ఞానమెల్లాం శేర్‌న్దాలుమ్ - కార్తకడల్**
**మణ్ణిన్‌మేల్ తున్బుత్తు మఱ్ఱుమే తేఱ్ఱామల్**
**నణ్ణుమే కీழ்ఞామ్ నరకు** 3

**అర్థములు :**

| | | |
|---|---|---|
| **పార్త గురువిన్ అళవిల్** | = | ప్రత్యక్షదైవమైన గురువుయందు. |
| **పరివిన్ఱి** | = | భక్తిలేక. |
| **శీర్త మిగు జ్ఞాన మెల్లాం** | = | భగవద్విషయంలో గొప్పజ్ఞానము. |
| **శేర్దాలుం** | = | సంపాదించినా. |
| **కార్త కడలే** | = | నల్లని సముద్రముచే ఆవరించబడిన. |
| **మణ్ణిన్‌మేల్** | = | ఈభూమండలంమీద. |
| **తున్‌పుత్తు** | = | పలువిధకష్టాలనుభవించి. |
| **మఱ్ఱుం** | = | నశిస్తాడు. |
| **కీళామ్** | = | అతిహేయమైన. |
| **నరకు** | = | నరకమును. |
| **నణ్ణుమ్** | = | పొందుతాడు. |

**భావము :** భగవత్సంబంధమైన శాస్త్రపరిజ్ఞానం ఎంతఉన్నా ఆచార్యాభిమానము లేనివాడు ఈభూమిమీద ఉన్నంతవరకూ కష్టాలను అభవించడమే కాక దేహాంతమున నరకమునే పొందుతాడు.

**విశేషార్థములు :** 'పార్తగురు' అంటే....

**1. మన చర్మచక్షువులతో చూడగలిగిన ఆచార్యులు,**

**2. మన విషయములో విశేషకృపాకటాక్షము కలిగిన ఆచార్యులు**

**3. పరమాత్మ మనకోసం ఏర్పాటుచేసిన ఆచార్యులు.**

**'శీర్తమిగు జ్ఞానము' అంటే 'జ్ఞానం' 'మిగుజ్ఞానం' 'శీర్తమిగుజ్ఞానం' అని మూడు రకాలుగా స్వీకరించాలి.**

**1. జ్ఞానము - సంస్కృత వేదాంత జ్ఞానము.**

**2. మిగుజ్ఞానము - ద్రావిడ వేదాంత జ్ఞానము**

**3. శీర్తమిగు జ్ఞానము - రహస్యార్థజ్ఞానము**



# మన ఉభయవేదాన్తాచార్యపీఠం గురించి మీకు తెలుసునా?

ఏఆచార్యులకైనా తమ సాంప్రదాయిక ప్రచారాన్ని కొనసాగించాలంటే ఏదైనా ఒక వ్యవస్థ ఉండాలి. ఆవ్యవస్థ ప్రభుత్వపు గుర్తింపును పొందినదై ఉండాలి. దానికి ఒక క్రమబద్ధమైన ప్రణాళి ఉండాలి. దీనికి ఒక స్పష్టమైన లక్ష్యం ఉండాలి. ఇవన్నీ ఉంటూ మనుగడ సాగించే సంస్థలే తమ ప్రచార సరళిని నిరాఘాతంగా ముందుకు తీసికొని వెళ్ళగలుగుతాయి. భగవద్రామానుజులు తమ దర్శన సిద్ధాన్తాన్ని ప్రచారం చేయడానికి శ్రీరంగంలోని మఠాన్ని నిలయంగా చేసికొన్నారు. ఇప్పుడది మనవాళమాముని సన్నిధిగా ప్రసిద్ధమై ఉంది. ఇలాగే వరవరమునుల శిష్యప్రశిష్యముఖంగా వానమామలై మఠం ఆవిర్భవించింది. వడగల సంప్రదాయానికి చెందిన పరకాల మఠం, ఆండవన్ మఠం, అహోబిలమఠం ఇలాంటి ఎన్నో సంప్రదాయ ప్రచారం సాగిస్తున్నాయి. కంచిలోని శ్రీమత్ప్రతివాద భయంకరం అణ్ణంగరాచార్యస్వామివారి తిరుమాళిగ (గృహం) ఇలాంటి ప్రముఖ కేంద్రస్థానమైన తెంగళై సంప్రదాయానికి ఏడుగడ అయింది.

ఇదే క్రమంలో శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు శ్రీవానమామలై (తోతాద్రి) దైవనాయక సన్నిధిలో శ్రీవేంకట రామానుజ(కదలక్కాయ్) జీయర్‌స్వామివారి ద్వారా కాషాయత్రిదండ స్వీకారం 1954లో కావించారు. ఆశ్రమస్వీకారానికిముందే 1939లో విశిష్టాద్వైత ప్రచారక సంఘాన్ని, 1947 ఏప్రియల్ నెలలో భక్తినివేదన పత్రికను స్థాపించడమేకాక, మహిళల అభ్యున్నతికి శ్రీయతిరాజ సేవాసమితిని స్థాపించారు.

ఇక 1954లో ఆశ్రమస్వీకారం కావించిన తర్వాత భవ్యకృత్యాలకు లెక్కేలేదు. వీటిలో శ్రీమదుభయవేదాన్తాచార్యపీఠం ట్రస్టును స్థాపించడం విశేషంగా పేర్కొనదగి ఉంది. దీన్ని మార్చి 3వతేదీ 1970లో శ్రీరంగంలో రిజిష్టరు చేయించారు శ్రీపెద్దస్వామివారు.

ఈసంస్థను స్థాపించడానికి ప్రేరకమైన సన్నివేశం ఏమిటో ఈసంస్థ సమర్పించిన ఆనాటి ప్రథమ నివేదనలోని ఈక్రింది మాటలు స్పష్టపరుస్తాయి.

## శ్రీమదుభయవేదాన్తాచార్యపీఠము యొక్క ప్రథమ నివేదన

"శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరబ్రహ్మాధిగచ్ఛతి" అను ప్రమాణమును అనుసరించి శబ్దప్రమాణమందలి నిష్ఠ పరబ్రహ్మప్రాప్తికి సాధనము. అట్టి శబ్దబ్రహ్మము వేదము, ఉపనిషత్తులు, గీతాభాష్యము, శ్రీభాష్యము, పురాణరత్నము, శ్రీరామాయణము, నాలాయిర దివ్యప్రబంధములు, భగవద్విషయము. వీనికి సంబంధించిన వాఙ్మయము ఇట్టి ప్రబల, ప్రముఖ, ప్రసిద్ధ, ప్రధాన, ప్రమాణ సిద్ధాన్తానుష్ఠానము గల శ్రీవైష్ణవము. శ్రీవిశిష్టాద్వైతము ప్రస్తుతకాలమున అధ్యయన, అధ్యాపకుల దౌర్లభ్యముచేత అత్యంత శోచనీయస్థితిలో యున్నది. దీనిచే గ్రంథదౌర్లభ్యముకూడ ఏర్పడియున్నది. ఈప్రస్తుత దీనస్థితికి పరితాపముచెందని శ్రీవైష్ణవుడుండడనియే నమ్ముచున్నాము.

తగినంత ఆర్థికసౌకర్యము, సాంఘిక గౌరవము యున్ననేగాని ప్రస్తుతపు ఈదీనదశ ఏమాత్రపు కొద్దియైనను తొలగజాలదు. అభివృద్ధియు నొందజాలదు. తాను వైష్ణవుడననితలంచు ప్రతి వాడును, విశ్వమానవ సోదరత్వముతో, ఐకమత్యముతో, విశ్వకల్యాణ కాంక్షతో యుండుటయే, వైష్ణవధర్మమని నమ్ముప్రతివాడును, ప్రస్తుత దీనదశకై పరితపించుచు, ఇది తొలగి వైష్ణవసంప్రదాయమును అభివృద్ధిచెందింపవలెనని కోరు ప్రతి వైష్ణవుడు, దీక్షవహించి యిందులకై తను, మన, ధనములతో ప్రయత్నించిననేగాని వైష్ణవత్వము నిలబడజాలదు, ప్రకాశించను జాలదు".

ఈకారణముచేతనే శ్రీత్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు 3మార్చి 1970న "శ్రీమదుభయ వేదాన్తాచార్య పీఠ ట్రస్టును స్థాపించి రిజిష్టరు చేయించిరి. పండిత సదస్సులు, పరీక్షలు జరుపుట, బిరుదు ప్రదానములు, ఆర్థిక సన్మానసంభావనలు సమర్పించుట, పాఠశాలలను, గురుకులములను స్థాపించుట, సంప్రదాయ గ్రంథపఠన, పాఠనములకు సౌకర్యము కలిగించుట, గ్రంథ ప్రచురణములు, గ్రంథవిక్రయకేంద్రములను స్థాపించుట. ప్రచారాదులచేయుట వగైరాలు ఈఆచార్య పీఠ కార్యములు.



# భగవద్రామానుజుల మధురార్థనిర్వాహాలు - 3

ఈ.ఎ. సింగరాచార్యులు - తిరుపతి

*(గతసంచిక తరువాయి)*

శ్రీరామానుజులు ఈ అర్థనిర్వాహాన్ని చేసేటపుడు రెండు విధాలైన క్రమాలను చూపారు. **"వేమ్ కడజ్గళ్"** అనే ప్రయోగానికి పూర్వాఘాలు నశించిపోతాయి. అనే అర్థాన్ని చెప్పిన తరువాత **"మేల్ వినై ముత్తవుమ్"** అని విశేషించిఉన్నది. దీనికి ఉత్తరాఘాలు అన్నీ అని అంటుంది. ఇక్కడ నిజానికి అశ్లేషమనే (అంటవు అనే) అర్థాన్ని తెలిపే పదమేమీలేదు. అందువలన అర్థపూర్తి కోసం చేరవు అనే అర్థాన్ని ఇచ్చే **"శారా"** అనే పదాన్ని అధ్యాహారంచే కొని **"మేల్ వినై ముత్తవుమ్ శారా"** అనే అన్వయాన్ని గ్రహించి అర్థనిర్వహణను చేయడం-ఒకక్రమం. ఇక్కడ **"శారా"** (చేరవు) అనే పదం **"పాపం కర్మ న శ్లిష్యతే"** (పాపకర్మలు అంటవు) అనే శ్రుతివాక్యచ్ఛాయలో అధ్యాహరింపబడింది. అందువల్ల ఈ అధ్యాహారం శ్రుత్యనుగుణం. అయితే పాశురంలో లేని, అశ్లేషమనే అర్థాన్ని సూచించే **"శారా"** అనే పదాన్ని అధ్యాహారం చేసికోవడమనే గౌరవం ఈ అర్థక్రమంలో ఉన్నందున, దానినికూడా పరిహరిస్తూ శ్రీరామానుజులు రెండవ అన్వయాన్ని చూపారు. **"వేమ్"** అనే పదాన్ని ఆవృత్తి చేసుకొని, అర్థనిర్వాహం చేయడమే ఆ రెండవక్రమం. **"వేమ్కడజ్గళ్"** అని పూర్వాఘవిషయంలో అన్వయించిన తరువాత, **"మేల్వినై ముత్తవుమ్ వేమ్"** అని రెండవమారు **"వేమ్"** అనే క్రియను ఆవృత్తి చేసుకొని దానికి అశ్లేషమనే అర్థాన్ని గ్రహించాలి.

**"వేమ్"** అనే ద్రావిడపదానికి నాశమనే అర్థం ఉన్నదేతప్ప, అశ్లేషమనే అర్థం లేదుకదా! అని అంటే **"ఛత్రిణో గచ్ఛన్తి"** (గొడుగులను కలిగినవారు వెడుతున్నారు) అనే వాక్యంలో ఛత్రిశబ్దం అజహల్లక్షణాక్రమంలో గొడుగును ఉన్నవారిని, లేనివారినికూడా తెల్పుతుంది. గొడుగులనుకలవారనే వాచ్యార్థంతోపాటు, వారితో కలిసివెళ్ళే ఒకరిద్దరు గొడుగు లేనివారిని కూడా ఈ పదం లక్షిస్తుంది. అదే విధంగా ఇక్కడ **"వేమ్"** అనే పదం నశింపజేస్తుందనే వాచ్యార్థంతో పాటుగా అశ్లేషమనే లక్ష్యార్థాన్ని కూడా తెల్పుతుంది. ఈ విధంగా వాచ్యార్థంతోపాటు, ప్రకృతార్థసంబంధాన్ని కల లక్ష్యార్థాన్ని బోధించే క్రమం అజహల్లక్షణ.

ఈ విధంగా ఉత్తరాఘ విషయంలో **"మేల్ వినై ముత్తవుమ్ వేమ్"** ఉత్తరాఘాలు అన్నీ అంటవు) అనే అన్వయాన్ని చెప్పాలి. మళ్ళీ ఇక్కడ ఇంకొక సందేహం కలుగవచ్చు. **"కడజ్గళ్"** అనే ద్రావిడపదానికి ఋణాలని అర్థం. ఈ అర్థమే భగవద్యామునుల అర్థనిర్వాహంలో గ్రహింపబడింది. కనుక, ఏ సందేహానికి తావులేదు. కాని, శ్రీరామానుజుల అర్థనిర్వాహంలో ఈ పదానికి పూర్వాఘాలు అనే అర్థం తెలుపబడింది కదా! ఇది ఏ విధంగా పొసుగుతుంది? అనేది ఆ సందేహం. ఋణం అనేది తప్పక చెల్లించవలసినది. **"అవశ్యమనుభోక్తవ్యం కృతంకర్మ"** అని చెప్పబడినట్లు **"అఘాలు"** (పాపాలు) అనేవికూడా అటువంటివే కనుక **"కడజ్గల్"** అని అంటూ ఋణవాచకశబ్దంతో అవశ్యానుభావ్యకర్మలు లక్షణయా నిర్దేశింప బడ్డాయి. అరుంబదకారులు (వివరణకారులు) **"కడజ్గళ్ ఎన్గు కడన్ పోలే అవశ్యానుభావ్య కర్మజ్గళై చ్చొల్లి"** అని ఈ విషయాన్ని తెలిపారు.

ఇక, పాశురంలో **"మెయ్"** అనే పదం ఒకటి మిగిలిఉన్నది. శ్రీరామానుజుల అర్థనిర్వాహంలో దానికి ఎక్కడ అన్వయం? అర్థమేమి? అనే సందేహంకూడా కల్గుతుంది. **"మెయ్"** అనే ద్రావిడ పదానికి శరీరమని, సత్యమని రెండర్థాలున్నాయి. వాటిలో, శరీరమనే అర్థం శ్రీ యామునుల అర్థనిర్వాహంలో గ్రహింపబడగా, శ్రీరామానుజుల అర్థనిర్వాహంలో సత్యం-అనే అర్థం గ్రహింప బడినది".



వ్యక్తిత్వ వికాసానికి ... నాణ్యమైన సాంకేతిక విద్యా బోధనకు
కళ్ళం హరనాథరెడ్డి ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ

శ్రీ కళ్ళం హరనాథరెడ్డి
చైర్మన్ : కళ్ళంగ్రూప్
EAMCET Code KHIT
KHIT Campus - 10 KM from Guntur City, NH-5
బిటెక్ కోర్సులు
కంప్యూటర్ సైన్స్ అండ్ ఇంజనీరింగ్(సియస్ఇ)
ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ (ఇఇఇ)
ఎలక్ట్రానిక్స్ అండ్ కమ్యునికేషన్స్ ఇంజనీరింగ్ (ఇసిఇ)
సివిల్ ఇంజనీరింగ్ (సిఇ),
మెకానికల్ ఇంజనీరింగ్ (ఎమ్ఇ)
మేనేజ్‌మెంట్ సీట్స్ కొరకు సంప్రదించండి : సెల్ : 98856 04528, 94402 61773, 94910 73337.
NH-5.10వ కి.మీ వద్ద, కళ్ళం స్పిన్నింగ్ మిల్స్ వెనుక, చిలకలూరిపేట రోడ్, చౌడవరం, గుంటూరు- 19. ఫోన్ : 0863 2119726.
సిటీ ఆఫీస్: ఫస్ట్‌లైన్, గుజ్జనగుండ్ల సర్కిల్, గుంటూరు -6. ఫోన్: 0863 2272345.
M.Tech :- CSE

పూర్వాఘఉత్తరాఘాలు అన్నీ, శ్రీవేంకటేశ్వరుని ఉద్దేశించి, నమశ్శబ్దాన్ని పల్కితే చాలు, నశిస్తాయి. (ఇది) నిజం. అనే భావంలో ఈ **"మెయ్"** అనే పదం సత్యమనే అర్థాన్ని ఇచ్చేదిగా అన్వయించ బడింది. అంతేకాక ఇది ఇక్కడ అవధారణార్థకం కావడంకూడా విశేషం. **'ఈ అర్థంలో ఏ విధమైన సందేహమూలేదు'** అని తాత్పర్యం. ఇటువంటి సందేహానికి ఇక్కడ ఏమి తావు? అంటే, ప్రమాణాలు ప్రత్యక్షానుమానశబ్దాల రూపంలో మూడు అంగీకరింప బడ్డాయి కదా! వాటిలో లోకంలో సామాన్యంగా ప్రత్యక్షం ప్రబల ప్రమాణంగా అంగీకరింపబడుతూ ఉన్నది. ఇక్కడ శబ్ద ప్రమాణానికి ప్రాధాన్యమిస్తూ **"ఏవం హ అస్య సర్వే పాప్మానః ప్రదూయంతే** (ఈ బ్రహ్మజ్ఞానికి అన్ని పాపాలు నశిస్తున్నాయి) అని వేదం తెల్పిందికదా! అందువల్ల ఇది సత్యమనే అవధారణార్థం ఈ పదం ద్వారా ద్యోతక మవుతున్నది.

ప్రబలప్రమాణంగా చెప్పబడే ప్రత్యక్షంకూడా ఒక్కొక్క సమయంలో భ్రమను కల్గించవచ్చు. ముత్యపు చిప్పను చూచి **"ఇదం రజతమ్"** ఇది వెండి అని అనుకోవడం భ్రమయేకదా! ఆ పిమ్మట వాస్తవాన్ని గ్రహించినపుడు **"నేదం రజతమ్"** ఇది వెండికాదు అనే భ్రమనివారణ కలుగవచ్చు. కాని, (శాస్త్రం యథార్థాన్నే పల్కుతుంది కదా) అనే రీతిలో అదిసత్యమైనదే అయి ఉంటుంది. దీనినిబట్టి **"ప్రత్యక్షమనుమానంచ శాస్త్రంచ వివిధాగమమ్, త్రయం సువిదితం కార్యం ధర్మసిద్ధి మభీప్సతా"** అని ప్రత్యక్షం, అనుమానం, శాస్త్రమని చెప్పబడే మూడుప్రమాణాలలో శాస్త్రానికే ప్రాధాన్యమని సూచింపబడింది. **"శాస్త్రయోనిత్వాత్"** అనికూడా బ్రహ్మసూత్రకారుని వచనం.

ఈ విధంగా శ్రీరామానుజులుచూపే అర్థనిర్వాహాలు విలక్షణంగాను, శాస్త్రీయంగాను ఉంటాయి. మళ్ళీ వచ్చే సంచికలో శ్రీరామానుజులు చూపిన ఇంకొక రహస్యార్థనిర్వాహం ప్రస్తావింపబడుతుంది.

**శేషోవా సైన్యనాథోవా శ్రీపతిర్వేతి సాత్త్వికైః ।**
**వితర్క్యాయ మహాప్రాజ్ఞైః భాష్యకారాయ మంగళమ్ ॥**



# తులసీస్తోత్రమ్



**ప్రాత భక్తినివేదన నుండి**

**యన్మూలే సర్వతీర్థాని యన్మధ్యే బ్రహ్మదేవతాః।**
**యదగ్రే వేదశాస్త్రాణి తులసి! త్వాం నమామ్యహమ్ ॥**

ఏ తులసి మొదట్లో అన్ని తీర్థాలు ఉన్నాయో, ఏ తులసి మధ్యలో బ్రహ్మాది దేవతలు ఉన్నారో, చివరలో వేదశాస్త్రాలు ఉన్నాయో అట్టి తులసీ! నిన్ను నమస్కరిస్తున్నాను.

**తులసి! శ్రీసఖి! శుభే! పాపహారిణి! పుణ్యదే! ।**
**నమస్తే నారదనుతే! నారాయణ మనఃప్రియే! ॥**

లక్ష్మికి సన్నిహితురాలా! మంగళరూపా!పాపాలు పోగొట్టి పుణ్యాల నిచ్చేదానా! నారదునిచేత స్తుతింపబడేదానా! నారాయణుని మనసుకిష్టమైన దానా! ఓ తులసి! నీకో నమస్కారము.

**సర్వేషామపి పాపానాం ప్రాయశ్చిత్తం త్వమేవ హి ।**
**దేవానాం చ ఋషీనాం చ పితౄణాం త్వం సదా ప్రియే ॥**

దేవతలకు ఋషులకు పితృదేవతలకు ఇష్టమైనదానా, అన్ని పాపాలకు ప్రాయశ్చిత్తం నీవేకదా!

**యజ్ఞోదానం జపః తీర్థం శ్రాద్ధం వై దేవతార్చనమ్ ।**
**తర్పణం మార్జనం చాన్యత్ న కుర్యాత్ తులసీం వినా ॥**

యజ్ఞము, దానము, జపము, తీర్థము, శ్రాద్ధము, దేవతారాధన, తర్పణము, మార్జనము ఏదైనాగాని తులసి లేకుండా చేయకూడదు.

**తులసీదారు మణిభిః జపస్సర్వార్థసాధకః ।**
**ఏవం న వేద యః కశ్చిత్ స విప్రః శ్వపచాధమః ॥**

తులసి పూసలమాలతో జపం అన్ని ప్రయోజనాలు కలిగించేది. ఇది తెలియని వాడు బ్రాహ్మణుడే అయినా, కుక్కమాంసం తినేవాడితో సమానము.

VILAN V
Just face the world
Hot Cutes
vijay ads

# భగవంతుని భక్తవాత్సల్యము

శ్రీమాన్ డా॥కె.కె.రంగరాజాచార్య-
ఎస్.వి. యూనివర్సిటీ, తిరుపతి

**జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్యతేజాంస్యశేషతః ।**
**భగవచ్ఛబ్దవాచ్యాని వినా హేయై ర్గుణాదిభిః ॥**

హేయములైన గుణములతో కూడినయుండని, జ్ఞానము, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు, అను గుణములకు **'భగము'** అని నామధేయము. వీటిని కలిగినవాడు భగవంతుడు.

భగవానుడనగా ఎట్టిదోషములు లేక, సద్గుణములన్నిటిని తనయందు పూర్ణముగా కల శ్రీమన్నారాయణుడు. అతని భక్తుడనగా – ఆస్వామిని, తద్గుణములను ప్రీతితో ఎల్లప్పుడూ ధ్యానించువాడు. ఆభక్తునిపట్ల భగవంతునకు గల వాత్సల్యము భక్తుని దోషములను గుణములుగా గ్రహించుట అనే ప్రేమ యొక్క పరిపక్వదశయే వాత్సల్యము. ఈగుణములను కొంచెము అనుభవించెదము.

**'స్నిగ్ధస్తు వత్సలః'** (స్నేహము కలవాడు వత్సలుడు) అని అమరకోశము తెలుపుచున్నది. **'వత్సే–పుత్రాదౌ స్నేహ పాత్రే కామః అభిలాషః అస్య అస్తీతి వత్సలః'** ప్రేమకు లక్ష్యమైన పుత్రుడు, పుత్రిక, మనుమడు, మనవరాలు, మొదలగువారి యందు అధికమైన ప్రీతి కలవాడు వత్సలుడు, అని వత్సశబ్దమునకు అమరకోశము వివరిస్తున్నది. **'వత్సాంసాభ్యాం కామబలౌ'** అని ప్రాణిని సూత్రమును బట్టి పుత్రుడు మొదలగువారిని నిర్దేశించు అని పాణిని సూత్రనమును బట్టి పుత్రుడు మొదలగువారిని నిర్దేశించు **'వత్స'** శబ్దములపై 'ఆశ' కలవాడు అను అర్థమిచ్చు **'లచ్'** అను ప్రత్యయము చేరగా వత్సలుడను పదము ఉత్పన్నమైనది. వీని వలన శిశువుపట్ల కన్నవారికుండే ప్రీతియే వాత్సల్యము అని స్ఫురించును. దోషములను గుణములుగా స్వీకరించుటయే ప్రీతియొక్క పరిపక్వదశ అగును.

శ్రీభాష్య జిజ్ఞాసాధికరణ వ్యాఖ్యానమున **'సంబంధ విశేషా న్వితేషు ప్రీతిః స్నేహః, యస్య విపాకాః అస్థానభయ శంసిత్వం, దోషానవభాసః, దోషేష్వపి గుణబుద్ధిః ఇత్యాదయః'** (అధికమైన సంబంధముకలవారియందు మనము చూపించు ప్రీతియే స్నేహమనబడుచున్నది. దాని పరిపక్వ దశలు ఏవనగా ఎవరియందు ప్రేమను చూపుదుమో వారికి ఏవిధమైన ఆపదలు కలుగుటకు అవకాశము లేకపోయిననూ, ఆపద కలుగునో, ఏమో! అని భయపడుట వారి యందున్న దోషములు స్ఫురింపకుండుట, ఆదోషములను గుణములుగా గ్రహించుటయు అని శ్రుతప్రకాశికాచార్యులు సాయించుటచే ఆప్రీతియందు పరాకాష్ఠగా ఇందు చూపబడిన దోషములను గుణములుగా తలచుటయే వాత్సల్యమని మనపూర్వాచార్యులు భావించిరి. సమన్వయాధికరణ శ్రీభాష్య శ్రుతప్రకాశికలో **'వాత్సల్యం నామ దోషేష్వపి గుణబుద్ధిః యథామాతుః వత్సే'** (వాత్సల్యమని ప్రసిద్ధముగా చెప్పబడు గుణమేది అనగా దోషములను గుణములుగా గ్రహించుటయే తల్లికి తన బిడ్డయందు ఉండు ప్రీతి అటువంటిదే) అని అనుగ్రహించిరి. అంతరాధికరణ శ్రీభాష్యశ్రుతప్రకాశికలో **'వాత్సల్యం నామ దోషా నాదరహేతుః స్నేహః యథామాతుః వత్సే'** (వాత్సల్యమని చెప్పబడునది ఏమనగా దోషములను తిరస్కరించుటకు కారణమైన స్నేహమే. తల్లికి బిడ్డపైనగల ప్రీతియే అది) అని తెలిపిరి. తన కుమారుని దోషిగా ఎవరైననూ తనవద్దకు తెలిపినచో **'నాపుత్రుడు తప్పేచేయలేదు'** అని తనకుమారుని తప్పును మరుగుపరచుటో, తిరస్కరించుటో చేయుటచే తల్లియొక్క వాత్సల్యము ప్రకటితమగును. అది స్నేహముయొక్క పరిపక్వదశ అగు దోషములను గుణములుగా స్వీకరించు వాత్సల్యము. ఉన్నతమైన ప్రమాణ గ్రంథములు కూడా ఈవిషయమునే తెలుపుచున్నవి.

అవి ఏమనగా కఠోపనిషత్తులోగల ఒకమంత్రము, శ్రీపాంచరాత్ర వచనము, ఆళ్వార్లు అనుగ్రహించిన పాశురములు.

**అంగుష్ఠమాత్రః పురుషః మధ్యే ఆత్మని తిష్ఠతి ।**
**ఈశానో భూతభవ్యస్య న తతో విజుగుప్సతే ॥**

అనునది కఠోపనిషత్తులో నున్న (4.12) మంత్రము. భూతభవ్యస్య ఈశానః పురుషః –త్రికాలములయందున్న చేతనా చేతనములకు ఈశ్వరుడైన పురుషుడు (శ్రీమన్నారాయణుడు), ఆత్మని మధ్యే అంగుష్ఠ మాత్రః తిష్ఠతి – తనను ఉపాసించువాని శరీరములో నడుమ అనగా హృదయమునందు, వాని బ్రొటనవేలు పరిమితిని కల దివ్య దేహమును పరిగ్రహించినవాడై వేంచేసియుండును. తతః న విజుగుప్సతే – పూర్వము తెలుపబడిన విధముగా మూడుకాలము లలోనున్న పదార్థములన్నిటికినీ ఈశ్వరుడగుటచే, అధికమైన వాత్సల్యము వలన ఉపాసకుని దేహములోపలనున్న రక్తము, మాంసము మొదలగునవి దోషములైనను వాటిని భోగ్యముగా అనుభవించి (గ్రహించి) ఆనందింపదగిన గుణములుగా గ్రహించుకొన్నాడు అని ఉపనిషద్భాష్యకారులగు శ్రీరంగరామానుజ స్వామి సాయించిన భాష్యములో తెలుపబడినది. ఇచ్చట (న విజుగుప్సతే) అనుటకు అసహ్యించుకొనుట లేదని వివరించుటయే సరిపోవుచుండగా **'న'** అనుటకు వ్యతిరేకార్థమును గ్రహించి, అసహ్యమునకు పూర్తి వ్యతిరేకమైన **'ఆశ'**ను పరమావధిగా (అనగా దోషములను భోగ్యములుగా తలచుట అను వాత్సల్యమును) పొందుచున్నాడని మిక్కిలి రసఘనముగా వ్యాఖ్యానించిన ఆ రంగరామానుజస్వామి వారి ఆంతర్యము తలచి తలచి ఆనందింపతగినది.

*(సశేషం)*



# అహో! భారతమ్

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

*గత సంచిక తరువాయి*

దుర్యోధనుడు, శకుని మయసభావిశేషాలు పూర్తిగా చూడాలని కొన్ని రోజులు ఇంద్రప్రస్థంలోనే ఉండిపోయారు. ఒకరోజు దుర్యోధనుడొక్కడే ఆ సభాసౌందర్యాన్ని చూడాలని బయలుదేరాడు. సభలో కొంచెం దూరంవెళ్ళాక ఒక ద్వారం తలుపులు మూసి కనిపించింది. అయ్యో! తలుపులు వేసి ఉన్నాయే అని వెనుదిరిగాడు. ఎవో మాటలు వినిపిస్తే వెనక్కి తిరిగి చూశాడు. తలుపులు మూసిలేవు. అలా భ్రమింపజేస్తున్నాయి.

ఆ ద్వారంలోనుండే వస్తూ కనిపించారు కొందరు. దిగ్భ్రాంతి చెందాడు. నాలుగడుగులు వేశాక మళ్ళీ అలాగే తలుపులు మూసి కనిపించాయి. ఇందాకా కూడా ఇలాగే భ్రమపడ్డాను. తెరిచే ఉన్నట్టున్నాయి. అనుకుంటూ ముందుకి అడుగువేశాడు. ఠక్కుమని తగిలింది తలుపు తలకి, అబ్బా! ఇక్కడ నిజంగా మూసిఉన్నాయా? ఏమిటీమాయా నిర్మాణం... నాకే ఇలా కనిపిస్తోందా? అందరికీ ఇంతేనా?

అబ్బో... ఇక్కడ చాలా ఎత్తుగా ఉందే.. ఎక్కాలి కాబోలు పైకి. ఎత్తుగా అడుగువేశాడు. లోపలికి పడింది అడుగు. ఏమిటీ... ఎత్తుగాలేదా.. సమతలమేనా... ఎంత ఆశ్చర్యం... అబ్బో... భవనంమధ్యలో జలాశయాలా... పంచెపైకి పట్టుకొని నడుద్దాం తడిసిపోనక్కర్లేదు. అంటూ పంచెపైకి పట్టుకొని నడుస్తున్నాడు. తడిలేదే.. నీళ్ళేలేవేంటి? నీళ్ళుకాదా... ఇంద్రనీల మణికాంతులా?

వారెవ్వా! ఏమినిర్మాణవైభవం ఇటుకూడా అలాంటికాంతే.. ఎంత అందంగా ఉందో... పంచె క్రిందికి దించి అడుగువేశాడంతే... దభేల్‌మని నీళ్ళలో పడ్డాడు. ఓహ్.... అది కాంతా? ఇది నీరా?... ఎలా తెలుస్తుంది ఇలా నిర్మిస్తే. లేవద్దాముందు ఈ మడుగులోపడి.. హహహా... కిల..కిల..కిల.. ఎవరా నవ్వేది. ఓహ్... పాంచాలి. పాండవులు నన్ను చూసి నవ్వుతారా? ఎంత గర్వమెంత పొగరది.. ఎంతటి అహంకారం. హృదయం భగభగమండిపోతుంది. ఎవరది. భీమసేనుడా?

సోదరా! అన్నయ్య మీకీ వస్త్రాలిమ్మన్నారు. అంటూ పొడి వస్త్రాలందించాడు. నా భంగపాటును గుర్తించడం.. పోనీ తెలియనట్లుండక నవ్వడం..పోనీ అనుకుంటే నా శత్రువు భీమునికిచ్చి వస్త్రాలు పంపడమా. ఇంతకంటే మరణం మేలుకదా. పుండుమీద కారం జల్లడమా. ఎంత అవమానం. తల ఎత్తడమెలా? ఛీ...బ్రతుకు. ఎందుకు.. నెమ్మదిగా లేచి అటుఇటు చూడకుండా మందిరానికి తరలిపోయాడు దుర్యోధనుడు.

లోకానికెంతో ఆనందాన్నిచ్చిన ఆ మందిరం తన కడుపులో మసిపోసింది. అవమానాన్ని దహించేస్తోంది. కుమిలిపోతూ హస్తినకు బయలుదేరాడు మామతో. శరీరంలో కళ తప్పింది. కృశించి పోయాడు. హస్తిన చేరినా మిత్రబృందాన్ని కలువలేదు. ఎవ్వరితో మాట్లాడలేదు. అవమానం. అవమానం. ఎటు కదిలినా...చూసినా... ఒకటే బాధ. ఎంతటి అవమానం. ఓహ్..ఎలా ఎలా నా బాధ తేరుతుంది!

నాయనా! దుర్యోధనా! నెమ్మదిగా దగ్గరగా వచ్చాడు శకుని. అలా ఉంటున్నావేం తండ్రీ.. ఈ మామ, నీ మామ శకుని బ్రతికి ఉండగా నీకు దుఃఖమా. నీ బాధకి కారణమేమిటో చెప్పు. చిటికెలో మాయంచేస్తా. ఈ భూమిమీద రాజులంతా నీ దాసులేకదా. ఇంకేంకావాలి.. చెప్పు. అలా ముఖం తిప్పుకోకు. ఏదీ ఇటుచూడు. చెప్పు నీ బాధ.

“మామా”... దుఃఖంతో మాటే రావడం లేదు దుర్యోధనునికి. ‘మామా. ఆ మయసభని నీవుకూడా చూశావుకదా. అసలు అంత గొప్పసభ! ఆ ధర్మరాజుకెలా వచ్చింది? అంత అదృష్టమా? రాజాధిరాజులంతా ఆయన కాళ్ళపైపడి మొక్కుతున్నారే. కప్పాలు కట్టారే. అతణ్ణి చక్రవర్తిని చేశారా.. ఎలా ఎలా సాధ్యమైంది? ఆ యాదవుడు ఆ శ్రీకృష్ణుడు మన శిశుపాలుని చంపేస్తే అంత సభలో ఒక్కరు.. ఒక్కరైనా నోరు మెదిపారా? పైగా జయజయధ్వానాలు చేస్తారా. ఆ యాదవుని కీర్తిస్తారా. కాలవైపరీత్యంకదూ. ఆ పాండవులు ఆ ఐశ్వర్యం. తలచుకుంటే కడుపు ఉడికిపోతుంది. పైగా కానుకలు అందరిదగ్గర గ్రహించమని, దాచమని నన్ను ఆ స్థానంలో కూచోపెడ్తాడా? ఎన్ని కానుకలు? ఎన్ని రత్నాలు? నా జీవితంలో చూడలేదే ఆ ఐశ్వర్యం. ఆ సంపదంతా నేను దోచేసుకోవడం ఎలా? ఏంచేస్తే ఆ పాండవులు అన్ని సంపదలు పోగొట్టుకొని నా కాళ్ళ దగ్గర పడి ఉంటారు? చెప్పు మామా చెప్పు. ఇది సాధ్యమేనా. నేనా వైభవాన్ని చూచి భరించలేకపోతున్నాను. మనస్సు భగభగ మండిపోతుంది మామా. మంట మంట.. నా మంట ఎలా చల్లారుతుంది చెప్పు. చెప్పుమరీ’. కుదిపేశాడు శకునిని పట్టుకొని.. విలాసవంతంగా నవ్వాడు మామ.

ఓ... అదా నీ చింత. నా చెంత గొప్ప ఉపాయముంది. చెప్తే

జేయగలవా... 'మామా'... ఔను. మామనే.. ముందుగా మీ నాన్నగారి అనుమతిని తీసుకో... ఆయిన తొందరగా సరే అంటే అదృష్టవంతులమే కాని సరే అంటాడా.. అని. ఎలాగయినా ఒప్పించు. భయపెట్టు. బెదిరించు ఏదో ఒకవిధంగా పని జరిగేలా చూడు. పద. నాన్నగారి దగ్గరికి వెళుదాం. ఉత్సాహంగా లేచాడు దుర్యోధనుడు. కుత్సితభావాలతో కదిలాడు శకుని.

ఇద్దరూ... ధృతరాష్ట్రుని చెంత చేరారు. "బావగారూ! వందనం". ఓ.. శకునీ. రా. "నేనేకాదు, మీ దుర్యోధనుడు ప్రియపుత్రుడు. ఇద్దరం కలిసివచ్చాం. వీడి స్థితి మీకు తెలియడంలేదు. శరీరం కృశించిపోయింది. మనిషి బాగా వాడిపోయాడు. మాట-మంతీ, స్నేహితులు, ఆటలుపాటలు, ఎబ్బే. ఏమీ లేవు. అంటూ దుర్యోధనుని చేతిని అతని చేతుల్లో పెట్టాడు నాయనా! దుర్యోధనా! నోటిమాటరాలేదు అంధరాజుకి. నీకేమి లోటువచ్చింది తండ్రీ... ఒళ్ళునిమురుతూ గొల్లుమన్నాడు తండ్రీ. ఇంద్రభోగాలు నీకు సమకూర్చాను కదా తండ్రీ. నీకిష్టమైన వారినే సేవకులుగా ఏర్పాటు చేశానుకదా. నీకెందుకురా విరక్తి. నీకెందుకురా బాధ. నీకు దుఃఖమా. బంగారుతండ్రీ కారణం చెప్పవూ ఈ గ్రుడ్డి తండ్రికి.

నాన్నా! పాండవుల ఐశ్వర్యం, వైభోగం చూసివచ్చాను. అది అలా అలా పెరిగిపోతుంది. అసూయ నన్ను దహించేస్తోంది నాన్నా. నేనెంత ప్రయత్నం చేసినా ఆ పాండవులు నీటిలో తామరలా వృద్ధి చెందుతున్నారు. అన్ని దిక్కులు జయించేశారు వాళ్ళు. అన్ని భోగాలూ అనుభవిస్తున్నారు ఆ పాండవులు. ఆ..యాదవుడు అబ్బ..సమస్త సముద్రజలాలతో, శంఖజలాలతో అభిషేకించడం చూస్తే నా ఒళ్ళంతా కాలిపోయింది. దేవతలుకూడా ప్రవేశించలేని ఉత్తరదిక్కును అర్జునుడు జయించి, ధనాలు తేవడం. తలుచుకుంటే శరీరం మీద పాములు ప్రాకినట్లుంది. అంతకంటే, ఇంకొకటి విను. అద్భుతం. లక్షమంది బ్రాహ్మణులు భోజనం చేయగానే ఒక శంఖం, ఒక ఘంట మ్రోగేలా ఏర్పాటు చేశాడా ధర్మరాజు. ఆ ధ్వని... అసలు ఆగనే ఆగదే... కోట్లమందికి అన్నారాధన జరుగుతూనే ఉందంటే. శరీరం గగుర్పొడవడం లేదూ. అసలే నేను బెంగపడిపోతుంటే తమకొచ్చే బహుమతులు స్వీకరించడం, జాగ్రత్త సేయడం అనే పనికి నన్ను అధికారిగా పెట్టాడాయన. ఒక్కొక్కటి చూస్తుంటే తండ్రీ.. తండ్రీ.. తలచుకుంటే ఆపాదమస్తకం అగ్నిలా బాధించేస్తోంది అసూయ. ఏంచెయ్యాలి చెప్పు తండ్రీ. గొల్లుమన్నాడు పుత్రుడు.

శ్రీకృష్ణార్జునుల కదలికలు, హాస్యాలు, నవ్వులు గుర్తుకువచ్చి కంపరం, అసూయ, బాధ,మంట ఊగిపోతున్నాడు ఒక్కొక్కరు ఇచ్చిన కానుకలు కళ్ళముందు చిత్రాల్లా కదలిపోతున్నాయి. అబ్బా..నాన్నా. కృంగిపోక ఏం చేయగలను? కృశించిపోక... నీకేం తెలుస్తుంది? ఆ ద్రౌపదిదేవి.. ఆవిడ మర్యాదలు. ఆ పెద్దరికం. ఎంత కష్టమైంది నాకు చూడడానికి. ఎపుడో హరిశ్చంద్రుడు చేశాడట ఈ యాగం. కాని అదికూడా ఇలా జరగలేదని అందరూ చెప్పుకున్నారు.

ఆ ధర్మరాజు ఒక చక్రవర్తి. సాత్యకిముత్యాల గొడుగుసేవ. భీమార్జునులు మణిఖచిత చామరసేవ. మిగిలినవారు మధ్యలో ఆనందంగా అందరినీ... నన్ను చూచి చూసి నవ్వడం, బాణం గ్రుచ్చుకున్నంత బాధ, సహించలేనీ బాధ తండ్రీ నా తరంకాదు. మామయ్య చెప్పాడు. ధర్మరాజుకు జూదం ఇష్టంకదా. పిలుద్దాం ఆ ధర్మరాజుని, మామయ్య నేర్పరితనంతో ఓడిద్దాం. సంపదలు స్వాధీనం చేసుకుందాం నాన్నా. ఈ శకుని అభిప్రాయాన్ని అంగీకరించు నాన్నా.

నాయనా.. నెమ్మదిగా నోరు తెరిచాడు తండ్రి. విదురుడు మేధావిరా. నీతికోవిదుడురా... దూరదృష్టి కలవాడురా. మనందరి క్షేమం కోరువాడుకదా. అతని అంగీకారం తీసుకొని, "నాన్నా... అరిచాడు పుత్రుడు. ఆ విదురుడా... ఆ పాండవ పక్షపాతి. అతని అనుమతి.. ఓష్.... ఇది జరిగేదేనా. ఆయన ఆపేస్తాడు మన ఆలోచనని. ఆయనతో ముడిపెట్టకు నువ్వు... నువ్వుసరే...అను. లేదా... ఈ క్షణంలోనే నే చచ్చిపోతా... ప్రాణాలు తీసుకుంటా... నువ్వు- నీ విదురుడు హాయిగా ఉండండి... *(సశేషం)*




www.mangalaakshatas.com
In commitment to help the people of spiritually inclined, we come up with the unique platform for 'Sri Vaishnava Community' to choose their life partner with an ideal mind set.
*With the Mangalasanams of*
"Sri SriSriTridandiChinnaSrimannarayanaRamanujaJeeyarSwamiji" we present you with 'mangalaakshatas' - A wedding platform for Sri Vaishnavas.
We are now open for free registrations. Please visit: www.mangalaakshatas.com
**మీ జీవిత భాగస్వామికోసం ఎదురుచూస్తున్నారా?.. ఇదిగో మీ ముందుకు 'మంగళాక్షతలు' మన ఆచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి మంగళాశాసనములతో...! పై వెబ్‌సైట్‌లో రిజిస్టర్ చేసుకోండి!**



మధురస్మృతులు

50సంవత్సరాల పూర్వపు భక్తినివేదన నుండి

# ప్రశ్నోత్తరములు

1952 సెప్టెం॥

"శ్రీమన్నారాయణ"

**ప్రశ్న :- పితృదేవతలంటూ యున్నారా? ఉన్నచో వారినెలా ఆరాధించవలెను?**

**సమాధానము:** పితృదేవలున్నారను నమ్మకము, విశ్వాసము శుభాశుభముల యందు తదారాధనమున్ను కేవలము ఆస్తికుల భారతీయులలోనే గాదు, నాస్తికులగు భారతీయులలోను, చైనీయులు, జపానీయులు, రష్యనులు, అరబ్బులు, యూదులు, పారశీయులు, రోమనులు, గ్రీకులు, యూరోపియనులు, అమెరికనులు వీరు వారననేల సకల ప్రజాసమన్వయమునందును గాఢముగ నున్నది. ఇందులకు ఇప్పటికీ ఆయా మతస్థుల దేశకాల–పాత్రానుసారములైన వివిధ సాంప్రదాయ రూపములై విలసిల్లుచున్న పితృదేవతారాధనములే సాక్ష్యములు. పితృదేవతారాధనమున సజాతీయ అన్నసంతర్పణ యనునది కూడా అన్ని జాతులలోను ఏదో రూపమున జరుగుచునే ఉన్నది.

దీనికంత ప్రాముఖ్యమేల? ప్రతిజీవికి కావలసినది తన సౌఖ్యము, తన ఆనందము. ఇది తన ఆత్మతృప్తివలన మాత్రమే కలుగుచున్నది. ఇట్టి తృప్తికై ప్రయత్నించుట ప్రతి ఆత్మకు సహజమే కదా! భార్య భర్తను ప్రేమించును ఎందులకు? భర్త తృప్తికై కాదు, తన తృప్తికై మాత్రమే. భర్త భార్యను ప్రేమించును ఎందులకు? భార్య తృప్తికై కాదు, తన తృప్తికై మాత్రమే. ఇటులనే తండ్రిపుత్రుని ప్రేమించినను, పుత్రుడు తండ్రిని ప్రేమించినను మిత్రుడు మిత్రుని ప్రేమించిననూ ఇది యది యననేల చివరికి భక్తుడు భగవంతుని ప్రేమించినను కూడా అందంతయూ తమ తృప్తికొరకేగాని, తనచే ప్రేమించబడువారి తృప్తికొరకు గాదు. ఇది సిద్ధాన్తము.

ఆత్మ నిత్యమైనది. ఈశరీర వియోగానంతరము కూడా అది స్థిరముగా యుండును. అది తన కిదివరలోని శరీర సంబంధులచే ఆదరించబడి ఆరాధించబడుటచే తృప్తి కలుగును. (ప్రతి జీవియు కూడా ఎపుడో ఒకప్పుడు తాను ఈశరీరమును విడిచిన పిమ్మట తన శరీర సంబంధులు తనను ఎటుల, ఎందుల కారాధింతురు? గాన) ప్రతి మానవుడు ఏదో విధమున తన పితృదేవతల నారాధించుచుండుట విధాయకము, సాంప్రదాయము, శిష్టాచారము అయియున్నది.

తాను జచ్చిన తరువాత తన్ను తనవారు గౌరవించి పూజించుచుండ వలయునను వాంఛతనకున్నప్పుడు తన పితృదేవతలయందు తనకు అట్టి మనోవైఖరి యేల యుండదు? అట్లుండకపోవుట దృష్టియుండక పోవుటయే కాని మరొకటి కాదు. కీర్తి, కాంక్ష, సర్వప్రాణి సహజ స్వభావము.

**ప్రశ్న - మానవునికి మతమేల?**

సమాధానము – మానవునికే గాదు, సకల ప్రాణికోటికి సర్వదా కావలసినది తృప్తి, అందును పరిణామక్రమమనుసరించియు, జ్ఞానవికాసత ననుసరించియు ఈతృప్తి యనునది మానవునికి మరింతావశ్యకమైయున్నది. భార్యయుండనీ, బిడ్డలుండనీ, ఆయువుండనీ, ఆరోగ్యముండనీ, భోగముండనీ, భాగ్యముండనీ, శక్తియుండనీ, కీర్తియుండనీ యెన్నియున్ననూ తృప్తిలేని మానవునికి ఆనందములేదు. సౌఖ్యము లేదు. జీవచ్ఛవమే, ఎపుడును మనోవ్యథయే. జీవితమే వ్యర్థము. మానవుడనగా దేహేంద్రియ ములతో గూడుకున్న ఆత్మయని అర్థము.

దేహమునకు అన్నపానీయములవలన తృప్తి, ఇంద్రియములకు విషయానుభవముల వలన తృప్తి మరి ఆత్మకు? ఆత్మకు కూడా ఆకలి దప్పులు అనుభవ విశేషములు గలవు. అవి శాంతించిన గాని ఆత్మకు తృప్తిలేదు.

ఆత్మజ్ఞానాత్మకమైనది. జ్ఞానగుణకమైనది గాన తత్సంబంధము వలన గాని ఆత్మయొక్క ఆకలి, దప్పులు, అనుభవ విశేషములు శాంతించవు. ఆత్మకు శాంతిని కలిగించునది మోక్షమార్గమును జూపించు అర్థపంచక జ్ఞానము మాత్రమే.

మతశబ్దమునకు వందలకొలది అర్థవిశేషములున్ననూ అసలైన సిసలైన అర్థము, స్వస్వరూప, పరస్వరూప, ఉపాయస్వరూప, ఫలస్వరూప, విరోధిస్వరూపముల తెలుపు అర్థపంచక జ్ఞానము మాత్రమే. ఎంత కరడుగట్టిన నాస్తికునికైనను ఆత్మశాంతిలేనిదే తన దేహేంద్రియములకు శాంతియుండదు.

గాన అట్టి ప్రధానమైన ఆత్మశాంతి నిమిత్తమై అర్థపంచక జ్ఞానార్థకమైన మతము అవసరమైయున్నది.

**పశ్న - మోక్షమునెట్లు పడయతగును? మోక్షమనెడు పురుషార్థ స్వరూపమెట్టిది?**

**సమాధానము:** వ్యాసమహర్షికీ సర్వేశ్వరునియొక్క సంకల్పముచే యజ్ఞార్థమై అగ్ని మథనము జేయుచుండగా ఘృతాచియను నొక యప్సరసా సందర్శనముచే అరణియందు రేతస్ఖలనమాయెను. వ్యాసుడు దానిని మథించగా అందుండి పంచభూతములధిక్కరించు మహాయోగియగు శ్రీశుకుడు బుట్టెను. వ్యాసుడతనికి వేద,వేదాంగ, వేదాంత, ఇతిహాస, పురాణములు ఫఠింపజేసి మోక్షపురుషార్థ స్వరూపజ్ఞానమునకై తన శిష్యుడగు జనకుని వద్దకు పంపెను.

జనకుడు చక్రవర్తి, గృహస్థుడు, ప్రవృత్తి మార్గములో నున్నవాడు, అయినను ఆయన మనస్సు నిష్కల్మషమై సదా శ్రీహరియందే తగుల్కొని యుండెను. సరస్సున బుట్టి దానినాశ్రయించుకొని యుండి, దానివలననే పెరుగుచున్న తామరాకు ఆనీటి సంబంధములేనిదై యుండునటులనే జనక చక్రవర్తికూడా ప్రకృతిలోలీనుడైయున్నప్పటికిన్ని, నివృత్తిమార్గనిష్ఠాగరిష్ఠుడై కేవల మోక్షధర్మానుష్ఠానపరుడై యుండును. మహామహులగు మహర్షులకు సహితము శక్యముగాని జ్ఞానానుష్ఠానములు జనకునియందు వెలుంగుచుండెను. గనుకనే వ్యాసమహర్షి సహితము తనయేకైక పుత్రరత్నమును ఆయన కడకు పంపెను. జనకుడు శ్రీశుకుని అనేక విధముల పరీక్షించి చివరకిటులనుపదేశించెను.

"మోక్షమార్గముననుసరించుటకు శాస్త్రజ్ఞానము, లౌకిక జ్ఞానము యుండవలయును. ఈ జ్ఞానము కేవలము గురూపదేశముచే మాత్రమే కలుగును. మరేవిధముననూ కలుగజాలదు.

రాజస, తామస, దోషముల వర్జింపవలెను. సాత్త్వికమార్గము ననుసరించి ఆత్మను దెలుసుకొనవలెను. సర్వభూతములయందు ఆత్మ యున్నది. అన్ని ఆత్మల స్వరూపములు నొక్కటియే. గాన సర్వభూతముల యందు తన్నును తన యందు సర్వభూతములను లెస్సగా కనుగొనుచు జలమందలి జంతువులవలె వానియందు తగులు లేకుండగ నుండవలయును. ప్రతిజీవియందును పరమాత్మవసించుచున్నాడు. పరమాత్మలేని జీవి యనునది లేనేలేదు. సమాహిత చిత్తముగల ప్రతివాడు పరమాత్మను దర్శించగలడు. ఈదర్శనమున గాని శాంతి కలుగదు. శాంతి లేనివానికి ముక్తిలేదు.

ఎవ్వనివలన పరులు భయపడరో, పరుల వలన నెవ్వడు భయపడడో ఎవ్వడు ఏఒక్క దానిని గోరకయు, ద్వేషింపకయు నుండునో అట్టివాడు పరమాత్మను తెలుసుకొనగలడు. మనస్సుచేతగాని, వాక్కుచేతగాని, కర్మముచేతగాని ఎపుడు సర్వభూతములయందు బాపమగు భావన లేకుండునో యపుడు పరమాత్మను తెలుసుకొన గలడు.

మనస్సును మోహపెట్టినట్టి అసూయను విడిచి కామమును మోహమును త్యజించినచో పరమాత్మను తెలుసుకొనగలడు. చెవికిని, గంటికిని మరియు తక్కిన యింద్రియములకును విషయములగు వానియందెల్లను, మరియు సర్వభూతములయందును సముడై ద్వంద్వములనెవుడు వీడునో యువుడు వరవూత్మను తెలుసుకొనగలడు.

స్తుతిని--నిందను, బంగారమును-ఇనుమును, సుఖమును-దుఃఖమును, చలువను-వేడిని, అర్థమును-అనర్థమును, ప్రియమును- అప్రియమును, జీవితమును-మరణమును, సమముగా నెపుడు భావించగలడో యపుడు పరమాత్మను తెలుసుకొనగలడు.

తాబేలు తన యవయవముల తనలోనికి ముడుచుకొను నటుల ఎవడు తన మనస్సును, ఇంద్రియములను విషయముల నుండి నుపసంహరించుకొనగలడో అట్టివాడు పరమాత్మను తెలుసుకొన గలడు. చీకటి గ్రమ్మిన యింటిని దీపముచే స్పష్టముగా చూడగలిగినటుల బుద్ధియనెడి దీపముచే తనలోపల యాత్మను చూడశక్యమగును. ఇట్టివాడు తనయందలి పరమాత్మను తెలుసుకొని, దానిని దర్శించి సదా దానినే స్మరించుచుండవలెను. దీనిచే వీని హృదయమందలి గ్రంథులన్నియు ఛిన్నాభిన్నములగును. సర్వ సంశయములు పటాపంచలగును. సమస్త కర్మములు సమూలముగ నశించును. దివ్యజ్ఞానము కలుగును. అట్టి పరమాత్మను ప్రీతితో నిరంతరము ధ్యానించుచు ఆత్మ-ఆత్మీయుల నాతనికి సమర్పణము చేయవలెను. దీనిచే పరమాత్మ ప్రీతికి పాత్రుడై ఆయనయొక్క నిర్హేతుక జాయమాన కటాక్షమునకు పాత్రుడై శరీరావసానమున మోక్షమును పొందగలడు. ఏ యోగమవలంబించినను ఈపైన తెలిపిన జ్ఞానానుష్ఠానములున్న గాని మోక్షప్రాప్తిలేదు. అన్ని యోగములు ఇట్టిస్థితికై మాత్రమే ఉపకరించును.



కృష్ణాజిల్లా ఏకనూరు వాస్తవ్యులు శ్రీమాన్ మాదివాడు రంగారావుగారు 5-02-2014న ఆచార్యతిరువడిని చేరినారు. వీరు జీయర్‌స్వామివారి వద్ద మంత్రోపదేశముపొంది, అనేక కార్యక్రమములలో అన్వయిస్తూండేవారు. వీరి ధర్మపత్ని శ్రీమతి మాదివాడ చిట్టెమ్మ. ప్రస్తుతము వారు శ్రీరామనగర చాతుర్మాస్యదీక్షా సందర్భంగా జరిగే తదీయారాధనలో పాత్రసంశోధనము చేస్తున్నారు. వీరికి శ్రీస్వామివారు అనేక మంగళాశాసనాలు కృపచేసారు.

కీ॥శే॥శ్రీమాన్ రంగారావుగారు పరమపదించిన సందర్భంగా భక్తినివేదనకు 500రూ- సమర్పించుకున్నారు.



హైదరాబాద్ హిమాయత్‌నగర్ వాస్తవ్యులు కీ॥శే॥ శ్రీమాన్ చింతపల్లి వెంకటరత్నంగారి ధర్మపత్ని శ్రీమతి సూర్యకాంతంగారు 13.6.2013న ఆచార్యతిరువడిని చేరినారు. వీరు వీరి పూర్వీకులు కృష్ణాజిల్లా ఉనికిలి వారు. శ్రీశ్రీశ్రీ పెద్దస్వామివారి శ్రీచరణ సమాశ్రితులు. శ్రీమతి సూర్యకాంతం గారి ప్రేరణతో ఎందరో బంధువులు శ్రీశ్రీశ్రీచిన్న స్వామివారికి శ్రీచరణ దాసులైనారు. వీరికి ముగ్గురు కుమారులు శ్రీమాన్ రామకృష్ణ, డా॥రవీంద్రనాథ్, శ్రీనివాసరావు, కుమార్తె సరోజిని. వీరికి శ్రీస్వామివారు అనేక మంగళాశాసనాలు కృపచేసారు.

# విశ్వాసం - సత్ ఫలదాయకం

సముద్రాల శఠకోపాచార్య స్వామి వరంగల్ 98483 73067

పశుపక్ష్యాదులకన్న మిన్నగా జ్ఞానాన్ని కలిగియున్న మానవులలో విశ్వాసమనే సద్గుణం తప్పక ఉండవలసిందే. సంకల్పించిన కార్యాన్ని నిర్విఘ్నంగా పూర్తిచేయగలుగుతాను అనే విశ్వాసాన్ని దృఢంగా కలిగియున్నవారే కార్యసాధకులుగా మనగలుగుతారు.

సంకల్పించిన కార్యాన్ని నేను తప్పక చేయగలుగుతాను అనే ఆత్మవిశ్వాసం అన్ని రంగాలవారికి తప్పక అవసరం. నేను చేయగలుగుతాను అనేది మంచిదే కాని నేనే చేయగలుగుతాను, నన్ను మించినవారు ఎవరూ లేరు, నేను ఎవరిదగ్గరా తలవంచవలసిన పని లేనేలేదు అనే అతివిశ్వాసం పనికిరాదు. నేను ఎప్పటికి తలవంచను ( న నమేయం కదాచన), నేనే విశ్వవిజేతను, యుద్ధరంగంలో నాతో పోరాడేవారు ఎవరూ లేరు అని అహంకరించిన రావణాసురుడు శ్రీరామచంద్రుని పరాక్రమానికి తలొగ్గాడు. ప్రాణాలు వదిలాడు. అందుకే 'అతిగర్వాద్ధతో రావణః' అతి గర్వమువలననే రావణుడు యుద్ధభూమిలో హతుడయ్యాడని ఆర్యోక్తి.

అతి విశ్వాసమెట్లా ప్రమాదకరమో, అవిశ్వాసం కూడా అనర్థదాయకమే. తనపై తనకు అవిశ్వాసం ఏర్పడితే ఏ వ్యక్తి కూడా అడుగుముందుకు వేయలేడు. ఏ పనినీ చేయలేడు. ఆత్మీయులపై, తన శ్రేయస్సును కోరే ఆప్తులపై, భార్యాపుత్రులపై, జన్మనిచ్చిన తల్లిదండ్రులపై, జ్ఞానప్రదులైన గురువులపై విశ్వాసం లేకపోతే మనిషికి ఆనందం కలుగదు, ఆరోగ్యం ఉండదు. ముఖ్యంగా అవిశ్వాసం వల్ల ఏ వ్యక్తికీ వికాసం ఏర్పడదు. తనకు చేదోడువాదోడుగా ఉండేవారిపై, అడుగడుగునా ఉపకరించే తల్లిదండ్రులపై, మానవజన్మ సార్థకతకు అవసరమైన సదుపదేశాలను చేసే గురువుపై విశ్వాసం ఉండాలి.

తల్లిదండ్రులను, గురువును, ఇంటికి వచ్చిన అతిథిని తోటివ్యక్తులు అనే భావనతో కాకుండా వారిని ప్రత్యక్ష దైవస్వరూపాలుగా విశ్వసించమని తైత్తిరీయోపనిషత్తులోని "మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అతిథిదేవోభవ'' అనే వాక్యాలు ఉపదేశిస్తున్నాయి. లౌకిక జీవనవికాసానికి, కార్యసాధనకు విశ్వాసం ఎంత అవసరమో, జీవన సాఫల్యానికి అవసరమైన పారమార్థిక చింతనకు విశ్వాసం అంతే అవసరం.

సర్వేశ్వరుడైన పరమాత్మపై పాపరాశిని తొలగించే నదీజలాలపై, పురజనుల హితాన్ని కోరే ద్విజవరునిపై, సర్వజగద్రక్షకుడు కూడా ఏ మంత్రంయొక్క అధీనంలో ఉంటాడో అట్టి మంత్రంపై, దైవజ్ఞునిపై, వైద్యునిపై, గురువుపై ఎంతటి విశ్వాసం ఉంటే అంతటి ఫలితాలు కలుగుతాయని "దేవే తీర్థే ద్విజే మంత్రే దైవజ్ఞే భేషజే గురౌ। యాదృశీభావనా యస్య సిద్ధిర్భవతి తాదృశీ॥ అనే శ్లోకం ప్రబోధిస్తున్నది. మంత్రముపై, మంత్రాధిష్ఠాన దేవతపై, మంత్రాన్నుపదేశించే గురువుపై సంపూర్ణ విశ్వాసాన్ని కలిగియుండాలి. (మంత్రే తద్దేవతాయాం, తథా మంత్రప్రదే గురౌ) అని మన పెద్దలు ఉపదేశించారు.

ఇనుమును బంగారంగా మార్చే రీతిలో నిత్యసంసారులుగా ఉండేవారికి భగవతత్త్వాన్ని ప్రబోధించి, స్వస్వరూపజ్ఞానాన్ని కలిగించి, నిత్యసూరులతో, ముక్తపురుషగణంతో కలిసి నిత్యము, నిరంతరము పరమపదములో పరమాత్మకు సర్వవిధ సేవలు చేయగలిగే స్థితిని కలిగించే ఆచార్యుని పరమాత్మను విశ్వసించినంతగా విశ్వసించాలి అని (యథా దేవే తథా గురౌ) అనే వాక్యం ఉపదేశిస్తుంది.

ఆచార్యుడు మనలను ఉద్ధరించుటకు, మన మధ్యలో సంచరించే సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే అనే సత్యాన్ని విశ్వసించాలి (ఆచార్యస్తు హరిస్సాక్షాత్ చరరూపీ న సంశయః).

సర్వజగత్తుకు జగదీశ్వరుడైన శ్రీవేంకటాచలపతికి ఆచార్యులైన భగవద్రామానుజులు విశ్వాసం మోక్షఫలదాయకమని, సంపూర్ణంగా విశ్వసించవలసినవాటిపై అవిశ్వాసం ఏర్పడితే నరకం తప్పదని తమను ఆశ్రయించిన శిష్యులకు తమ చరమోపదేశంగా పేర్కొన్నారు. అర్చారూపియైన శ్రీమన్నారాయణుని విగ్రహమును ఒక శిల అనే అవిశ్వాసాన్ని దరిచేరనీయకండి. అట్లే అవిశ్వాసముతో పరమాత్మ కల్యాణగుణాలను, దివ్యచేష్టలను ఆవిష్కరించే నామాలను, భగవత్తత్త్వాన్ని ప్రబోధించే మంత్రములను సామాన్య శబ్దసముదాయముగా, పరమాత్మయొక్క పాదతీర్థాన్ని, పరతత్త్వోపదేష్టలైన ఆచార్యుల పాదతీర్థాన్ని సామాన్యజలముగా, భగవత్సన్నిధి భాగ్యాన్ని, భగవత్కైంకర్యలాభాన్ని కలిగించే ఆచార్యుని సామాన్య నరునిగా, మోక్షప్రదాతయైన శ్రీమన్నారాయణుడు ఇతరదేవతలవంటివాడని భావించకండి అని ప్రబోధించారు.

భగవద్రామానుజుల ఈ ప్రబోధాన్ని మనం శిరసా వహిద్దాం. ఆచరణలో నిలుపుకుందాం. షడ్విధ శరణాగతిలో **రక్షిష్యతీతి విశ్వాసః** పరమాత్మ తప్పక రక్షిస్తాడు అనే విశ్వాసం ఎంత ప్రధానమైనదో గుర్తిద్దాం.

'మహత్యాపది సంప్రాప్తే స్మర్తవ్యో భగవాన్ హరిః' మహా భయంకరమైన ఆపద కలిగితే ఆర్తత్రాణ పరాయణుడైన శ్రీహరినే స్మరించాలి అనే సదుపదేశాన్ని సంపూర్ణంగా విశ్వసించి తమకు ఏర్పడిన సంకటములనుండి విముక్తులైన ప్రహ్లాదుణ్ణి, గజేంద్రుణ్ణి, ద్రౌపదిని, అహల్యను, ధ్రువుణ్ణి విశ్వాసంతో స్మరిద్దాం.

దేహాత్మ భ్రాంతికి లోనై, లౌకిక సుఖాలపై ఆసక్తి కలిగి పరమార్థాన్ని విస్మరిస్తున్న మనలను ఈ సంసారబంధం నుండి విడిపించుటకై అవతరించిన భగవద్రామానుజుల ఉపదేశాలను విశ్వాసంతో ఆచరణలో పెట్టుకుందాం. భగవద్రామానుజుల పరంపరలో కొనసాగుతూ మనకు ఆచార్యులై మనలను సన్మార్గంలోకి నడిపించే సదాచార్యుల ఉపదేశాలను విశ్వాసంతో శిరసా వహిద్దాం. మొక్కవోని విశ్వాసం వల్లనే సకల సత్ఫలితాలు సిద్ధిస్తాయి. సత్‌శబ్దవాచ్యుడైన శ్రీమన్నారాయణుని అనుగ్రహం లభిస్తుంది. అందుచేత విశ్వాసం "సత్" ఫలదాయకం అనే సత్యాన్ని గుర్తిద్దాం.

# తత్త్వరహస్యం

## శ్రీకృష్ణభగవానుడు గరుడునికి చెప్పిన రహస్యం

### (గరుడ పురాణము ధర్మకాండము)

**శ్రీమాన్ పురాణం వేంకటాచార్యులు**

**"జన్తూనాం నరజన్మ దుర్లభమ్"** అన్నారు పెద్దలు. జంతువు అంటే ప్రాణి. మనందరం జంతుకోటిలోని వాళ్ళమే! ప్రాణికి ఆహార నిద్రా భయమైథునాలు సమానమే! అయితే మానవుడు-జంతువు తేడా ఏమయిపోయిందో మానవులూ జంతువుల్లాగానే ప్రవర్తిస్తున్నారు కొందరీనాడు. ఇది కలి మహిమేమో!

ప్రాణికోటిలో మానవుడికి తప్ప ఇతర జంతువులకు విశేషంగా భాషలేదు. వాటి ప్రవర్తనా, అరుపులు, కూతలూ-ఇవే సంకేతాలు భావం తెలిపేందుకు.

అందువల్లే ఈమానవజన్మ రావడం కేవలం పుణ్యఫలం అన్నారు ఋషులు మన పెద్దలూను. ఇప్పటికి మనకీ జన్మ సిద్ధించినా తరువాతి జన్మ పశుపక్షి సరీసృప జలచరాలలో, క్రిమి కీటకాదులలో వస్తే ఎంత దారుణబాధ? అలా అవకూడదని మన పెద్దలు సత్సంగం చాలా అవసరమన్నారు. క్షుద్ర, నీచ జన్మలు రాకూడదని భావిస్తే మానవజన్మను సఫలం చేసుకోవాలంటే ఎలా ఈభూమిమీద ప్రవర్తించాలో మన ఋషులు తెలిపారు. ముఖ్యంగా పద్మపురాణంలో 34వ అధ్యాయంలో...

**భూతానాం ప్రాణినః శ్రేష్ఠాః ప్రాణినాం బుద్ధిజీవినః ।**
**బుద్ధిమత్సు నరాః శ్రేష్ఠాః తేషు చ బ్రాహ్మణాః స్మృతాః ॥**

భూతాలలో ప్రాణులు శ్రేష్ఠమయినవి. వాటిలో బుద్ధి కలిగినవి శ్రేష్ఠమయినవి. బుద్ధివున్న ప్రాణులలో మానవులు శ్రేష్ఠమయిన జీవులు. వారిలో ఆత్మతత్త్వజ్ఞానం తెలిపిన బ్రహ్మజ్ఞాన సంపన్నులు ఉత్తములు. ఇలా తెలుపుతూ ఇంకా లోతుకు వెళ్ళి ఇంతకంటే ఉత్తములను తెలిపారు.

**బ్రాహ్మణేషు చ విద్వాంసః విద్వత్సు కృత బుద్ధయః ।**
**కృతబుద్ధిషు కర్తారః కర్తృషు బ్రహ్మవాదినః ॥**

ఆత్మజ్ఞాన సంపన్నుల్లోనూ విద్వాంసులు శ్రేష్ఠులు. వారిలో కార్యాకార్య వివేకం కలవారూ, వారిలోనూ సత్క్రియలు చేసేవారూ, అట్టివారిలో కూడా బ్రహ్మతత్త్వమెరిగినవారు ఉత్తమోత్తములు. అందువలన వీరు పూజింపదగినవారు. కాబట్టి మూడు లోకాలలోనూ వీరు పూజ్యులే!

బ్రహ్మజ్ఞాన సామర్థ్యం కలగాలంటే ఊరికే పుస్తకాలు చదివితే రాదు. ప్రపంచంలో జరిగే పరిస్థితులను అవగాహన చేసుకోవాలి. సత్యనిర్ధారణ చేయగలిగినవాడికి తత్త్వం తెలుస్తుంది. ఉన్న యథార్థ స్థితి తెలుసుకోవడమే ఆస్థితిని తత్త్వానికి దగ్గర చేస్తుంది.
ఒకసారి ఈశ్లోకం చూద్దాం-

**జీర్యంతి జీర్యతః కేశాః దంతా జీర్యంతి జీర్యతః ।**
**ధనాశా జీవితాశా చ జీర్యతోపి న జీర్యతి ॥**

(బ్రహ్మపురాణం- 12వఅధ్యాయం)

ముసలితనం రాగానే వెంట్రుకలు నెరసిపోతాయి. దంతాలు ఊడిపోతాయి. కానీ చావుకు సిద్ధమయినా డబ్బుకొరకు ఆశ. ఇంకా జీవించాలనే ఆశా నశించవు. ఇవి మానవుల పరిస్థితులు.

ఏదో తింటున్నాం వుంటున్నామని కాకుండా, జ్ఞానము అనేది విశేషంగా పొందాలి. అసలు జన్మ, దేహము వ్యాధులు, మరణం వీటిని గురించి ఎవరాలోచిస్తున్నారు? జ్ఞానం కదా కర్మాచరణానికి మూలం? అజ్ఞానంతో కర్మలాచరిస్తే అధోగతే కదా ఫలం!

**చతుర్విధ శరీరాణి ధృత్వా ముక్త్వా సహస్రశః ।**
**సుకృతాన్మానవో భూత్వా జ్ఞానీ చేన్మోక్షమాప్నుయాత్ ॥ 12**

దేవతలుగా, మనుష్యులుగా, పశుపక్ష్యాదులు కదలని పదార్థాలుగా పుట్టీ, చచ్చీ ఏదో కొంచెం పుణ్యవశాత్తూ మానవుడైనవాడు జ్ఞానం కలిగితే మోక్షం పొందుతాడు. అయితే ఈజ్ఞానం మానవ జన్మకే లభ్యమవుతుంది గానీ ఇతర జన్మలలో తత్త్వజ్ఞానం తెలుసుకొనేందుకు ఆస్కారం లేదు, రాదు. ఈవిషయాన్నే గరుడపురాణంలో...

**చతురశీతిలక్షేషు శరీరేషు శరీరిణామ్ ।**
**న మానుషం వినాన్యత్ర తత్త్వజ్ఞానం తు లభ్యతే ॥**

ధర్మకాండలో వివరించేరు. ఇంకా మానవజన్మ ఎంత విలువైనదో ఇంకొకసారి తెలుసుకుందాం. *(సశేషం)*




సికింద్రాబాద్ వికాసతరంగిణివారు 15.8.14న లక్ష్మీనారాయణ దేవాలయంలో 14వ వార్షికోత్సవ సందర్భంగా శ్రీలక్ష్మీపూజలు నిర్వహించారు.

భాగవతోత్తములు 300మంది స్త్రీలు కుంకుమపూజలో పాల్గొన్నారు. చాలా చక్కగా నిర్వహించాము. శ్రీరామానుజ సహస్రాబ్ది గురించి తెలియజేసాము. ఎంతోమంది కైంకర్యం చేయడానికి సుముఖత చూపారు. పూజా ద్రవ్యాలు, ప్రసాదవితరణ జరిగింది. శ్రీమాన్ వేంకటేశ్ స్వామి పూజా కార్యక్రమాన్ని నిర్వహించారు. శ్రీమాన్ శశిధర్, శ్రీమాన్ గోపాల్, శ్రీమాన్ శ్రీనివాస్, శ్రీమతి పద్మావతమ్మగార్లు సేవాకైంకర్యం చేసారు. శ్రీమతి వనజాభాస్కరరావుగారు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

# శ్రీవేంకటాచల "చిత్రే"తిహాసమాల




మూల సంస్కృత రచనం
శ్రీ అనంతాళ్వాన్

చిత్రానువర్తనం
సత్య శ్రీనివాస్ - సిద్ధాంతం

శ్రీనివాసుడు శంఖచక్రాలు ధరించి తన నారాయణత్వాన్ని లోకానికి వెల్లడిచేసి, ఆచార్యుల విశ్వాసాన్ని స్వయంగా నిరూపించాడు. ఆనాటినుండి ఇతరులు తొలగిపోయారు. రామానుజులు ఆలయానికి మూల మూర్తులకు వైఖానసప్రక్రియలో సంప్రోక్షణ కావింపచేశారు. రామానుజులు చేసిన ఈకైంకర్యాన్ని అనంతార్యులు మంగళాశాసనరూపంగా కీర్తించారు.

శ్రీవేంకటాచలక్షేత్ర శైవాపన్మోక్షకారిణే ।
విష్ణుపారిషదేశాయ యతిరాజాయ మంగళమ్ ॥

శ్రీవేంకటాచలేశస్య శంఖచక్ర ప్రదాయినే ।
సదాచార్యాయస్యాత్తస్మై యతిరాజాయ మంగళమ్ ॥



అప్పటికే జీర్ణస్థితిలో ఉన్న ఆనందనిలయ విమానానికి ఉద్ధరణ చేయవలసి వచ్చింది. ఈజీర్ణోద్ధరణ ప్రక్రియ శ్రీవైఖానసాగమ ప్రోక్తరీత్యానే సాగాలని రామానుజులు నిర్ణయించారు. విమానానికి నాల్గుదిక్కులలోను వరాహమూర్తిని, నారసింహమూర్తిని, వైకుంఠనాథ భగవానుని విమానాధిదేవతామూర్తిని ప్రతిష్ఠింపచేశారు. అంతేకాదు విష్ణుపరివార దేవతలైన శేషుడు, శేషాశనుడు(విష్వక్సేనుడు), గరుడుడు, ద్వారపాలకులు, మొదలైనవారిని ఆయాస్థానాలలో ప్రతిష్ఠింపజేశారు. స్వామి కంఠసీమలో ద్విభుజయైన వ్యూహలక్ష్మిని కంఠమాలలో అలంకరించారని పూర్వమే చెప్పుకున్నాం.

చిత్రకథ– 34

# రామానుజ చిత్రకథ


















కప్యాసశ్రుతి వివరించినపుడే
నీమనస్సెంత సుకుమారమైనదో
గ్రహించాను.


మనం చేసే నిర్ణయాలకీ, నిర్వచనాలకీ శాస్త్రమే ప్రమాణంగ
ఉండాలనేదీ నీకు తెలుసు గద!


యాదవప్రకాశ స్వామీ!
పెద్దల సన్నిధిలో ఈదాసుడెప్పుడూ అంతేవాసియే.


తామే తెలిపినట్టు శాస్త్రమే మన నిర్వచనాలకి గీటురాయి.
ఆక్రమంలోనే ఆచారాలూ నిర్ణయించాలి.


సరి. మరి ఊర్ధ్వపుండ్రాన్ని యజ్ఞభస్మతో గద ధరించాలి?


అగ్నిస్పర్శ దేహాన్ని అపవిత్రం చేస్తుందే...
మరి శంఖచక్రాలు అగ్నిలో తపింపచేసి
భుజాలపై ముద్రిస్తే, వాళ్ళూ అస్పృశ్యులవరూ?


వైష్ణవ దీక్షకది మొదటి సంస్కారము.
భుజాలకు అగ్నితప్తాలైన విష్ణుచిహ్నాలు, శంఖచక్రాలుంటే,
యముడు వారి దరిదాపులకు రాడు.
దీనికెన్నో ప్రమాణాలున్నాయి.


అలా చక్రాంకితులైనవారు అస్పృశ్యులుకారు స్వామీ!
దేవతలకి కూడా ఆరాధ్యులని యముని వాక్కు.
ఏవా ప్రమాణాలు?


అయా ప్రమాణాలతో కూరేశమిశ్రులు మీసంశయాలను తీరుస్తారు.


శ్రీవత్సచిహ్నమిశ్రా! తప్తచక్రాంకణానికీ, ఊర్ధ్వ పుండ్రధారణకీ ప్రమాణాలను వివరించరూ!
యతిరాజా! దేవవరుల ఆజ్ఞ...
తప్పక ప్రయత్నిస్తా...


యాదవప్రకాశా! విద్వద్వరేణ్యా! వారే సర్వమూ చెప్పగలరు!
కానీ దాసుడికీ సేవను ఆజ్ఞాపించి ధన్యుణ్ణి చేస్తున్నారు. బుద్ధికందినంత వరకూ విన్నవిస్తాను.


విద్వాంసులైన తాము శ్రుతి, స్మృతి, పురాణాలను అంగీకరిస్తారు కదూ!
తప్పక! అందుకే కద! ఈ వాద ప్రతివాదాలన్ని సహించేది!


వేదాలు తాపసంస్కారాన్ని ప్రస్తావిస్తాయా?


'ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్'
వేదంలో సూక్ష్మంగ ఉన్న వాస్తవాలను ఇతిహాస, పురాణాదులు పెంచి చూపిస్తాయి.


స్మృతులూ, ఆగమాలూ కూడా ఉపబృంహణాలే. వైదికాచారాలను పెంచిచూపేవే, అంగీకరిస్తా.


ధన్యుణ్ణి. చక్కగ చెప్పారు. అందు ముందుగ ఇతిహాసంతో ప్రారంభిస్తా.

ఇంకా ఉంది.



శ్రీరాంనగర్, జీవాప్రాంగణంలో
శ్రావణపౌర్ణమినాడు ఉపాకర్మ చేసుకుంటున్న వటువులు, విద్యార్థులు
హయగ్రీవజయంతి సందర్భంగా ఇష్టికార్యక్రమంనిర్వహించుకున్నారు.

# స్వాతంత్ర్యోత్సవ వేడుకలు





రైలుప్రమాదంలో తన రెండుకాళ్ళను కోల్పోయిన శ్రీమాన్ వేంకటేశ్వర్లకు శ్రీస్వామివారు కృత్రిమావయవాలు ఇచ్చిన సన్నివేశం.



పతాకవందన కార్యక్రమంలో గురుకుల విద్యార్థులు




శ్రీరాంనగర్, దివ్యసాకేతంలో శ్రావణ శుక్రవారోత్సవాలలో అలంకరణలలో స్వామి అమ్మ

శ్రీసుదర్శన పెరుమాళ్ తిరునక్షత్రోత్సవం


జిమ్స్ హోమియో కళాశాలకు శంకుస్థాపనగావిస్తున్న శ్రీస్వామివారు




వెండి హంసవాహనంపై శ్రీరామచంద్రుడు


పట్టాభిషేకమహోత్సవంలో కిరీటాన్ని శ్రీరామునికి అలంకరిస్తున్నవైనం


శ్రీవిల్లిపుత్తూరు శ్రీగోదా అమ్మవారి అనుగ్రహాన్ని అందుకున్న శ్రీస్వామివారు


శ్రీపెద్దజీయర్‌స్వామివారిని తిరువీధిగా వేంచేపుచేస్తున్న శ్రీజీయర్‌స్వాములు


పట్టాభిషేక పూర్ణాహుతి


కార్యక్రమము సంకల్పర్తగా మంగళాశాసనాలు అందుకుంటున్న శ్రీమాన్ కె.మురళీకృష్ణగారు


ఆలయమర్యాదలను సమర్పించిన శ్రీమాన్ మాధవన్‌స్వామి


సామూహిక పూజలలో భక్తులు

*With Best Compliments from*








# KAKATIYA CEMENT

**Quality Always - Ahead**

53 Grade Cement &
White Crystal Sugar

**Sri P. VENKATESWARLU**
Chairman & Managing Director

# KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED

*Regd. Office :* 1-10-140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
✆:27637717, 27633627, Fax No : 040 - 27630172, E-mail : kcsil@sol.net.in
E-mail: info@kakatiyacements.com

*Cement Factory :*
Srinivasanagar, Jaggaiahpet,
Krishna Dist - 521 175
✆ 08654 - 200014
Fax No: 08654-296331

*Sugar Factory :*
Peruvancha Village, Kallur Mandal,
Khammam Dist - 507 209,
✆: 08761 - 287207
Fax No: 08761 - 287206

# మన ఆళ్వార్లు



- శ్రీనృసింహ-

*గత సంచిక తరువాయి*

పరకాలురు శ్రీరంగం చేరారు. స్వర్ణమూర్తి చిటికెనవ్రేలి ఖండాన్ని అతిభద్రంగా దాచారు. తక్కిన విగ్రహాన్ని కరిగించి అమ్మేశారు. ఆ ధనంతో రంగనాథునికి గోపుర, మండప, ప్రాకారాదులు కట్టడం ప్రారంభించారు.

ఇక్కడ నాగపట్నంలో మరునాడు ఉదయం ఆలయఅర్చకుడు ఆరాధనకోసం ద్వారాలు తెరిచాడు. చూడగానే గుండె ఆగినంతపని అయింది. స్వామి బంగారు మూర్తి ఏదీ... చుట్టూ వెదకుతూంటే తలలేని మొండెం ఒకటి కనిపించింది. భయంతో వణికిపోతూ ఆలయాధికారులకి వార్తని చేరవేశారు. అందరికీ ఆశ్చర్యం, భయం. ఇదెలా సాధ్యమంటూ పరుగుపెట్టుకుంటూ వచ్చి చూశారు. విగ్రహం లేదు. పైగా ఈకబంధం ఏమిటి? విషయం తెలుసుకొనవలసినదే అని చోరుని కనిపెట్టడం కోసం చారులను నాల్గుదిక్కులకు పంపించారు. వారిలో చాల సమర్థులు కొందరున్నారు. వారు అలా అలా శ్రీరంగం చేరారు. అక్కడ బంగారు వ్యాపారులతో మాటలాడుతూ విషయం తెలుసుకున్నారు. వెంటనే నాగపట్నం చేరవేశారావార్తని, అంతే వెంటనే అధికారులంతా హుటాహుటిన బయలుదేరి శ్రీరంగం వచ్చేశారు. పరకాలురను నిర్బంధించారు. వెంటనే ఆయన చేతిలో కత్తిని వేగంగా త్రిప్పుతూ – మీరెవరోయ్ నన్నడుగుతున్నారు, ఎవడు ఎత్తుకుపోయాడో వాడినడగండి, నన్నుకాదు. మీకేమన్నా పిచ్చిపట్టిందా, పొండి అంటూ మీదిమీదికి వచ్చారు. వారు బెదరిపోయారు. కలివైరిని మంచి చేసుకుందాం. నిజం తెలుస్తుంది. అని నమస్కారం పెట్టారు.

అయ్యా! మా విగ్రహమెక్కడుందో కనిపెట్టి మీరిస్తే మీకు కొంచెంకాదు, ఎంతకావాలంటే అంత డబ్బిస్తాం అంటూ ప్రార్థించారు. మెత్త పడ్డారు వారు. మీ విగ్రహం నాదగ్గర లేదు. అయినా దొంగలను కనిపెట్టి ఆబొమ్మలో చిటికెనవ్రేలుతప్పక ఇస్తాను. డబ్బుతెండి అన్నారు. ఒక సంవత్సరం సమయం ఇవ్వండి అన్నారు. వారంతా అంగీకరించారు. వెంటనే ఒక చీటి వ్రాసి ఇచ్చారు. మీవిగ్రహంలో చిటికెనవ్రేలుతప్పక ఇస్తాను అని ఆకాగితం తీసుకుని వారంతా అతనిని విడిచి వెళ్ళిపోయారు.

వీరు గోపుర ప్రాకారాదుల నిర్మాణంలో మునిగిపోయారు. సంవత్సరం గడిచిపోయింది. ఆలయాధికారులు మళ్ళీవచ్చారు. ఏదీ ఇవ్వండి అంటూ, వెంటనే పరకాలురు విగ్రహపు చిటికెనవ్రేలును కట్టిన గుడ్డముక్కను వారికందించారు. వారు విప్పి చూచి నిర్ఘాంతపోయారు. ఎంతమోసం అంటూ పాలకులదగ్గరికి పోయి మోసాన్ని విన్నవించారు. అధికారులు పరకాలుని పిలిచి అడిగారు. నేను వ్రాసి ఇచ్చిన కాగితం చూడండి అన్నాడాయన. చూస్తే చిటికెన వ్రేలు తప్పక ఇస్తాను అని ఉంది. నామాట ప్రకారం చేశానా లేదా అన్నారు పరకాలురు. అధికారులు కూడా ఔను అన్నట్లే చేశాడంటూ అందరిని పంపించివేశారు. అప్పటికే ఆయన గురించి విన్న ఆలయాధికారులు ఇంక ఎంత మొత్తుకున్నా ఏం లాభం లేదని తెలుసుకుని, ఎలా మోసపోయాము అనుకుంటూ వెళ్ళిపోయారు. రాజు పరకాలుని పిలిచి అయ్యా! నిజం చెప్పండిప్పుడు. ఏమిటీ విషయం అన్నారు.

వెంటనే తిరుమంగై ఆళ్వార్లు రాజుకి నమస్కరించి, అయ్యా! నేను వారి విగ్రహాన్ని నిజంగానే దొంగిలించాను. వారంతా వైదికాన్ని అంగీకరించడం లేదు. వేదమార్గాన్ని ప్రతిష్ఠించడమే నాలక్ష్యం. భగవంతుని కైంకర్యం చేయడమే నాధ్యేయం. ఆప్రయత్నంలో కొన్ని దొంగిలింపబడుతున్నమాట నిజమే. ఇది కేవలం శ్రీరంగనాథ భక్తితో చేసినపని. భగవంతుని సేవకోసం చేసే పనిలో పాపమున్నా ఆయన క్షమిస్తాడనే ధైర్యంతోనే ఇలా చేశాను. కేవలం దైవకార్యం కోసం తప్ప వేరొక భావన నాకు లేదు అంటూ తప్పును అంగీకరించారు. ఆరాజు ఆతనిలోని భక్తితత్త్వానికి, ఆభగవంతుని సేవకోసం తీసుకున్న నిర్ణయాలకి ఆశ్చర్యపోయాడు, ఆనందించాడు కూడ.

వెంటనే అమూల్యములైన రత్నాభరణాలను, వెలకట్టలేని వస్త్రాలను, పుష్కలంగా ధనాన్ని తెప్పించి శ్రీరంగనాథుని కైంకర్యం కోసం సమర్పించాడు. కలివైరి పరమానందభరితుడయ్యాడు. అమ్మయ్య శ్రీరంగనాథుని సేవకు అడ్డురాకుండా సహకరించాడేరాజు అనుకుంటూ అతనికి నమస్కరించి ఆ వెలకట్టలేని వస్త్ర ఆభరణాలను గ్రహించి మరింత కైంకర్యాసక్తితో బయలుదేరాడు. మూడు ప్రాకారాలు, పాకశాలకట్టడం పూర్తి అయింది. నాల్గవ ప్రాకారం మొదలు పెట్టారు. చుట్టు నేల త్రవ్వడం మొదలు పెట్టారు. ఆభూమిలో యోగదశలో ఉన్న యోగీంద్రుడొకరు కనిపించారు. అయ్యబాబోయ్! ఈభూమిలో ఈయనేమిటి? ప్రాకార నిర్మాణానికి అడ్డంగా

అనుకుంటూ స్వామీ! ఇలా మట్టిలో పూడుకుని ఉన్నారేమిటిక్కడ అని అడిగారు. ఆయోగీంద్రులు పరకాలుని చూసన్తానే యోగప్రభావంతో అతనిని గూర్చి తెలుసుకున్నారు. అందువలన వారికి నమస్కరించి నేను అన్ని క్షేత్రాలు దర్శిస్తూ ఇలా వచ్చాను. శ్రీరంగనాథుని కళ్ళారా చూశాను కాని తృప్తి కలుగదే ఏం చెయ్యాలి? అందుకని యోగనిష్ఠలో ఇక్కడున్నాను అన్నారు. అయితే స్వామీ, మీకో విషయం చెప్తాను. హిమవత్ పర్వత గుహలో అష్టభుజ నృసింహస్వామి ఉన్నారు. ఆయనని సేవించారా? ఆయన తనను సేవించే వారితో ప్రత్యక్షంగా మాట్లాడుతాడట మీకు తెలుసా? అన్నారు. ఆ ఎంత గొప్పమాట చెప్పావయ్యా! భగవంతుడు స్వయంగా మాటాడుతాడు అంటే ఎంత మహిమ చూపిస్తున్నాడో గదా! నేనిప్పుడే బయలుదేరి ఆస్వామిని సేవిస్తానంటూ మట్టిలో నుండి లేచి వెళ్ళిపోయాడు. ఆహా! ఎంతదయ, ఇప్పుడు ప్రాకార నిర్మాణం హాయిగా చేసుకోవచ్చు అనుకుంటూ మళ్ళీ పనిని ప్రారంభించారు.

అయితే నాల్గవ ప్రాకారం నిర్మించేటప్పుడు మరొకసమస్య ఎదురైంది. శ్రీతొండర్ అడిప్పొడి ఆళ్వార్ల గృహము ఆ స్థలంలో ఉంది. అయ్యో! అపరాధం భాగవతోత్తముల ఇల్లు పాడుచేయడం మంచిది కాదు అని భావించి ప్రాకారాన్ని దారి తప్పించి కట్టారు. అర్చామూర్తులు మహాత్ములు అయిన తొండర్ అడిప్పొడియాళ్వార్లు అందుకెంతో సంతోషించి, కృతజ్ఞతా సూచకంగా తమ పుష్పమాలా కైంకర్యానికుపయోగించే ఆయుధ విశేషానికి అరుళ్ మారి అని పరకాలుర పేరు పెట్టుకున్నారు. అంతేకాదు, ఆగృహానికి కూడా "పరకాల గృహము" అనే పేరు పెట్టారు. అది శ్రీరంగంలో చంద్రపుష్కరిణికి ఈశాన్యంలో పరకాలమండపమని ఈనాటికీ ప్రసిద్ధికల్గి కన్పిస్తోంది. అలా అలా ప్రాకార నిర్మాణం పూర్తి అయిపోయింది. *(సశేషం)*

### ఆగస్టు నెల మెదడుకు మేత సమాధానములు

1.ఉదయనాచార్యులు; 2.పరాశరభట్టర్‌వారిని; 3.ఘటకశ్రుతులు; 4.శాస్త్రయోనిత్వాధికరణము; 5.ఏడు ప్రవాహాలు; 6.పిళ్ళై లోకాచార్యులకు; 7.రామానుజులది; 8.రామానుజుల త్రిదండం; 9.ద్వయమంత్రార్థాన్ని; 10.తమ యోగమహిమచేత;11.ప్రాయశ్చిత్తం; 12.మందసారామానుజాచార్యస్వామి; 13.శిశుపాలుని; 14.అరటిబోదెలు వేయడంవల్ల; 15.మూడుసార్లు; 16.కాన్‌స్టిపేషన్; 17.కాలేయం.







వినాయక చవతి శుభాకాంక్షలు
శుభకార్యానికి శ్రీకారం
మా వస్త్రాభరణాలతో ఆరంభం
అమీర్‌పేట
Ph : 23756027 - Ph : 23756627
చందన బ్రదర్స్®
టెక్స్‌టైల్స్ & జ్యూయలర్స్
హైదరాబాద్
లింగంపల్లి
Ph : 23035022
మెహిదీపట్నం
Ph : 65353588

# అరచేతిలో ఆరోగ్యం



ఆగస్టు సంచికలో లివర్ గురించి తెలుసుకున్నాంకదా! మరికొంత తెలుసుకుందాం. క్రొత్త విషయాలు కాకపోవచ్చు కానీ మళ్ళీ మళ్ళీ తెలుసుకోవాలి.

వేదాలనుండి వచ్చిన వైద్యశాస్త్రములు గొప్పవి. వైద్యశాస్త్రాన్ని పూజ్యభావంతోనూ, అంకిత భావంతోనూ అధ్యయనంచేయాలి. ఇక్కడ మీకందిరికీ ఒక చక్కని సూక్తి గుర్తుచేస్తాను.

“If you cannot be the King, be a Healer” మీరు దేశానికి రాజుకాలేకపోయినా స్వస్థత చేకూర్చే ఒక వైద్యుడు అవ్వండి అని దీని అర్థం. “వైద్యుడు” అవ్వడం అంటే పెద్దపెద్ద డిగ్రీలు చదవాలా? అది అందరికీ సాధ్యం కాదుకదా! ఇక్కడ వైద్యుడు అంటే ఆరోగ్యానికి సంబంధించిన జ్ఞానము కలిగి ఉండడము. ఏమిటి ఆ జ్ఞానము?

మానసిక, ఆధ్యాత్మిక సమతుల్యత సాధించడము. సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము మొదలగు ఈమూడు గుణాలని అదుపులో ఉంచుకోవాలి.

**వైద్యము-చికిత్స ఏమిటి అసలు?**

మన శరీరంలోపల వాతావరణం ఉంటుంది అని తెలుసుకున్నాం కదా! ఆ వాతావరణం త్రిదోషములతో కూడుకుని ఉంటుంది. ఈత్రిదోషాలు వాతము, పిత్తము, కఫము. ఇవి ఎక్కువయినా, తక్కువైనా శరీరము రోగగ్రస్తము అవుతుంది. లివర్ పనితీరుని సక్రమముగా ఉంచడమే – త్రిదోష సమతుల్యము. ఈత్రిదోషాల యొక్క సమత్వమును సాధించుటయే వైద్యము – చికిత్స.

**ఎలా త్రిదోష సమతుల్యత సాధిస్తాము ?**

1. ఆహార విహారాలలో యుక్తాయుక్త విచక్షణ కలిగి ఉండాలి. సరియైన మందులు – సరియైన వైద్యము మాత్రమే చేయించాలి.
2. మనలోని కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యములు, రాగ ద్వేషాలు వీటిని ఆధ్యాత్మిక జ్ఞానంతో సరిచేసుకోవాలి.

కొందరికి శరీరానికి రోగం లేకపోవచ్చు. కానీ ఎదుటిమనిషి పట్ల అహంభావనతో ఉండటం, నమ్రత లేకపోవడం, చక్కని పలకరింపు – చిరునవ్వు లేకపోవడం ఇలాంటివే ఎక్కువ ప్రమాదకరమైన అనారోగ్యానికి గుర్తులు.

అందరూ వైద్యులు కావచ్చు అనుకున్నాము కదా! అది ఎలాగంటే అందరిపట్ల నిర్మలమైన మనస్సుతో మెలగాలి. మంచి మాట, ప్రేమతో కలసిమెలసి ఉండాలి. మనకు చేతనైన సహకారం అందించాలి. అంతే మనం “డాక్టరు” అయినట్టే లెక్క. ఒక చిరునవ్వుతో కూడిన మంచిమాట ఎదుటివారికి ఆక్షణం ఒక టానిక్‌లా పనిచేస్తుంది, వాళ్ళకి ప్రశాంతత ఏర్పడుతుంది. వాళ్ళకే కాదు మనకీ అంతే ఉపయోగం.

ఈపనులన్నీ నిర్వహణ చేయాలంటే “లివర్” శక్తివంతంగా ఉండాలి. ఆక్యుప్రెషర్ అంటూ ఈనీతిబోధనలేంటి అని అనుకోకండి. పైన చెప్పిన విషయాలన్నీ ఆరోగ్యమునకు కావలసినవే. ఆక్యుప్రెషర్ తో ఈగుణాలన్నీ సాధించవచ్చు. పసిపిల్లలతో సహా పెద్దవాళ్ళ వరకు రోజూ ఉదయం, సాయంత్రం ఒక 15ని॥ ఆక్యుప్రెషర్ చేయడం వలన శరీరంలో త్రిదోషాలు సరిచేయవచ్చు, మానసిక ఎదుగుదల కాపాడవచ్చు.

మెదడులోపం (సెరిబ్రల్ పాల్సి) ఉన్న చిన్న పిల్లలు మొదలు పెద్దపిల్లల వరకు కొందరికి ఆక్యుప్రెషర్ చికిత్స చేశాము. చికిత్సకి ముందు వాళ్ళ ముఖకవలికలు ఎంతో దీనంగా కనిపించేవి. రెండురోజుల చికిత్సతోటే ఆపిల్లల ముఖంలో చెప్పదగిన తేడాతో అందం – ఆరోగ్యం ప్రస్ఫుటించింది. అవయవాల పనితీరులో మార్పు ఏర్పడింది. ఆపిల్లలలో ఏళ్ళతరబడి మలమూత్రాల విసర్జనలో లోపాలు, మందగించిన ఆకలి ఇలాంటివన్నీ సరిచేయబడ్డాయి. ఆపిల్లల తల్లిదండ్రులు ఆశ్చర్యపోయారు. ఏళ్ళతరబడి ఫిజియోథెరఫీ ఇతరవైద్యం చేయించినా చెప్పదగిన మార్పు ఇంతగా కలుగలేదు. కేవలం రెండు మూడు రోజులకే నిలకడతో కూడిన మార్పు వాళ్ళు చూశారు. **ఇది ఎలా సాధ్యమైంది ?** *(సశేషం)*

An.Y.
ఆర్థోఫిట్ సిరప్
అన్ని రకముల జాయింట్ నొప్పులకు
సరిక్రొత్త పరిష్కారం
సత్వర నివారణకు అద్భుత ఆయుర్వేద ఔషధం
Also available as Oil & Capsules
ఇది ఫిజికెమ్ వారి ప్రతిష్టాత్మక ఉత్పాదనలలో ఒకటి
ORTHO Fit
ఇంటింటా ఆర్థోఫిట్ నొప్పులన్నీ ఫటాఫట్

# హోమియో....! మీకోసం....!



డా॥ పావులూరి కృష్ణచౌదరి
8-3-945/ఎ/22, నాగార్జున నగర్, అమీర్‌పేట, హైద్రాబాద్-500 873

## పూత, వాంతుల బెడద

కడుపులో చికాకు, వాంతులు వేధిస్తున్నప్పుడు అన్నకోశంలో పూత, వాపు దానికి కారణం కావచ్చు. ఈ లక్షణాల ఆధారంగా ఎవరికివారే హోమియో ఔషధాన్ని ఎలా ఎంచుకోవాలంటే...

మన శరీరాన్ని పైన చర్మం కప్పి ఉన్నట్టే... నోటి నుంచి అన్నకోశం, పేగులు, పసరుతిత్తివంటి భాగాలను లోపల వైపున జిగురుపొరలు (మ్యూకస్ మెంబ్రేన్స్) కప్పి ఉంటాయి. అన్నకోశంలోని ఈ జిగురుపొరలు పూయడం, ఒక్కోసారి పుండు కూడా పడటంవల్ల పొట్టలో ఏదో బరువుగా, ఓ మోస్తరు నొప్పిగా, ఇబ్బందిగా అనిపించటం...తిన్నది జీర్ణం కాకుండా వాంతుల వంటి బాధలు వేధిస్తుంటాయి. దీన్నే 'అన్నకోశంలో పూత (గ్యాస్ట్రయిటిస్)' అంటారు. ఇది సర్వసాధారణమైన సమస్యేగానీ దీన్ని సంపూర్ణంగా నివృత్తి చేసుకోవటం చాలా అవసరం.

అన్నకోశంలోని జిగురుపొరల్లో 1. పెరైటల్‌కణాలు 2. సీరస్‌కణాలు 3. మ్యూకస్ కణాలని మూడురకాల కణాలుంటాయి. వీటిలో పెరైటల్ కణాలు జీర్ణప్రక్రియకు అత్యంత ఆవశ్యకమైన హైడ్రోక్లోరిక్ ఆమ్లం, ఇంట్రెన్సిక్ ఫ్యాక్టర్‌లను ఉత్పత్తి చేస్తాయి. ప్రాణరక్షణలో ఈ ఇంట్రెన్సిక్ ఫ్యాక్టర్ ప్రధానమైనది. ఇక సీరస్ కణాలు పెప్సిన్ అనే ఎంజైమును విడుదల చేస్తాయి. మ్యూకస్ కణాలు-జిగురు స్రావాలను తయారు చేస్తాయి. ఇవి జీర్ణప్రక్రియకు దోహదం చేయటంతోపాటు అన్నకోశం గోడలకు రక్షణ కూడా ఇస్తాయి. రకరకాల కారణాలరీత్యా ఈ అన్నకోశంలో వాపు, పూత రావచ్చు. ఇది ప్రధానంగా తరుణవ్యాధిగా (అక్యూట్ గ్యాస్ట్రయిటిస్), దీర్ఘవ్యాధిగా (క్రానిక్ గ్యాస్ట్రయిటిస్)... రెండు రకాలుగా రావచ్చు. బాహ్య కారణాలవల్ల ఉదాహరణకు మద్యపానం, మసాలాలు తిన్నందువల్ల సమస్య తలెత్తితే దాన్ని చాలా వరకూ తరుణ వ్యాధిగా గుర్తించొచ్చు. ఇక వ్యక్తి లక్షణాలు-అంటే లింగభేదం, వయస్సు, జీవితంలో ఒత్తిళ్ళు, మనస్తత్వం వంటి అంశాలమీద ఆధారపడి సంభవించే వ్యాధిని దీర్ఘకాలిక వ్యాధిగా గుర్తించాల్సి ఉంటుంది. రోగి ఆహార విహారాదుల వంటి జీవనశైలికి సంబంధించిన అంశాలు అన్నకోశాన్ని ప్రభావితం చేస్తాయి. అన్నకోశంలో అల్సర్ల బారినపడే అవకాశం స్త్రీలకంటే పురుషుల్లో నాలుగురెట్లు ఎక్కువగా ఉంటోందంటే దీనిపై జీవనశైలి ప్రభావాన్ని అర్థంచేసుకోవచ్చు. ఆకలి ఎలా ఉంది? అన్నహితవు, అన్నకోశంలో బాధలు, వాంతులు, వికారం మొదలైన లక్షణాలెలా ఉన్నాయి? అలాగే సమస్య తరుణమా? దీర్ఘకాలికమా? వంటి అంశాల ఆధారంగా ఔషధాలు ఎంపికచేసి వాడుకోవాల్సి ఉంటుంది.

**1 సమస్య**

పొట్ట పైభాగంలో, నొప్పి, వాంతులు, వికారం, ఆకలి మందగించటం.

**2. ఔషధాన్ని ఎంపిక చేసుకునేదెలా?**

ప్రధానంగా 1. అన్నకోశంలో బాధలు 2. వికారం వాంతులు 3. ఆకలి, అన్నహితవులపై ఆధారపడి ఔషధాన్ని ఎంపిక చేసుకోవాల్సి ఉంటుంది.

**అన్నకోశంలో బాధలు-**

ఎక్కిళ్ళు, పొట్ట జారి ఉన్నట్లనిపిస్తుంది. **ఇపికాక్**

పొట్టలో ఏదో రాయి పెట్టినట్లనిపించడం. **నక్స్‌వామికా**

పొట్టలో మంట, గొంతుదాకా ఎగబాకినట్లనపిస్తుంది. **ఫాస్ఫరస్**

తిన్న చాలాసేపటికి వాంతి అవుతుండటం. **పల్సటిల్లా**

**వాంతులు, వికారం ఆధారంగా**

తీవ్రంగా వికారం, డోకు, నల్లటి పదార్థం వాంతి కావడం.

**కాడ్మియంసల్ఫ్**

నాణ్యమైన ప్లాట్లు మరియు ఫ్లాట్లు కొనుగోలుకు నమ్మకమైన అగ్రగామి సంస్థ
అభినందన హౌసింగ్ (ప్రై). లిమిటెడ్
సెంట్రల్ ఆఫీస్ : 4వ లైను, పండరీపురం, లక్ష్మీపురం మెయిన్ రోడ్, గుంటూరు. ఫోన్ : 2354002.
మా బ్రాంచీలు: విజయవాడ 1, విజయవాడ 2, విజయవాడ 3, గుంటూరు 1, గుంటూరు 2, హైదరాబాద్, విశాఖపట్నం.
0866-6628668 : 0866-6642428 : 0866-6633668 :. 0863-6641177 : 0863-6454588 :. 040-66637799 :. 0891-2538686.

వికారం అధికం, లాలాజలం ఎక్కువ, దాహం ఉండదు. **ఇపికాక్**

వికారం, ఉదయం లేస్తూనే డోకులు. **నక్స్‌వామికా**

తిన్న ఆహారం వాంతి చేసుకోవడం. **పల్స్‌టిల్లా**

**ఆకలి, అన్నహితవు**

వాంతి అయిన తరువాత ఆకలివేస్తుంది. **నక్స్‌వామికా**

చల్లటి ద్రవాలు తాగాలనిపిస్తుంది **ఫాస్పరస్**

ఆకలిగా ఉన్నా కొంచెం తినగానే కడుపు నిండినట్లు అనిపిస్తుంది. **లైకోపోడియం**

**3. మీ ఔషధం గురించి మరిన్ని వివరాలు**

**ఇపికాక్–** ముఖం పాలిపోయి ఉంటుంది. వాంతిలో జిగురు, రక్తం, పసరు, ఆహారం, ఏదైనా ఉండొచ్చు. నాలుక మీద మందం ఉండదు, శుభ్రంగా ఉంటుంది.

**నక్స్‌వామికా :** పొట్టలో బరువు పెట్టినట్టు నొప్పి, పుల్లగా, చేదుగా త్రేన్పులు. తిన్న తరువాత కొన్ని గంటలపాటు పొట్ట ఉబ్బరం. వాంతయితే బాగుండు అనిపిస్తుంది. కానీకాదు. తిన్న తరవాత బాధలెక్కువ, వాంతయితే హాయిగా ఉంటుంది.

**ఫాస్పరస్ :** తిన్న వెంటనే ఆకలేస్తుంది. తిన్నదంతా పుక్కిళ్ళాదిగా వాంతిలో వెళ్ళిపోతుంటుంది. తిన్న తర్వాత కొద్ది సేపటికే వాంతి అయిపోతుంటుంది. కడుపునొప్పి.

**పల్స్‌టిల్లా :** వేడి పదార్థాలు సహించవు. కొవ్వుపదార్థాలంటే ఏవగింపు. నోరు చేదుగా అనిపిస్తుంటుంది. ఆహారం త్రేన్పు వస్తే ఆ అరుచి చాలాసేపు ఉండిపోతుంది. పొట్టలో రాయిపెట్టినట్లుగా ఉంటుంది.

**కాడ్మియం సల్ఫ్ :** పొట్ట పైభాగం మధ్యలో మంటబెడుతూంటుంది. వాంతయిన తరువాత నిస్త్రాణ. పొట్టలో కోత పెట్టిన చందంగా నొప్పి బరువు పెట్టినట్లనిపిస్తుంది.

రుచికి, సువాసనకి, ఆరోగ్యానికి నాణ్యమైన
"అజంతా"
పసుపు, కారం, ధనియాలపొడి మరియు సేమియానే ఎల్లప్పుడు వాడండి
రవికుమార్ అండ్ కంపెని - చెన్నై
044 25204046, 26171341
Vijay Ads

**లైకోపోడియం :** ఛాతీలో మంట. పుల్లటి త్రేన్పులు. ఆకలితో అర్ధరాత్రి లేచి ఆబగా తినటం, వాంతి చేసుకుంటూ ఉంటారు. కొంచెం తిన్నా పొట్టఉబ్బరం. అపానవాయువు పోతే హాయి. వేడి ఆహారం, వేడి ద్రవాలంటే ఇష్టం.

**మోతాదు :** కీలక లక్షణాల ఆధారంగా మీరు ఎంచుకున్న ఔషధాన్ని 30 పొటెన్సీలో రోజూ ఉదయం, సాయంత్రం... పెద్దలు 6 మాత్రల చొప్పున,12 ఏళ్ళలోపు పిల్లలు 3 మాత్రలచొప్పున..., 2,3 వారాలపాటు వాడుకోవాల్సి ఉంటుంది.

## కేసు-రిపోర్ట్

**మంజుల- (పుత్తురు)**

6వరోజు పుట్టినతరువాత, బాధలు, వాంతులు, రోజుకు మూడుసార్లు. వాంతి పెరుగుమాదిరి గావుంది. బుగ్గలు పీక్కుపోయాయి. నిస్త్రాణ.

**'ఏథూజా' 30 పొటెన్సీలో** ఒక రోజుమాత్రమే వాడడం జరిగింది.

**గమనిక:** శిశువులు, పసిపిల్లలకు పాలు తాగిన తరువాత పెరుగు గడ్డలలాగా వాంతులవుతూ, నీరసించిపోతే, 'ఏథూజా' 30 పొటైటెన్సీ ప్రత్యేక ఔషధంగా వాడతగినది.

**సూచన:** (గడిచిన మాసం పత్రికలో వేయవలసిన కేసురిపోర్ట్, ఈ నెలలో ఇస్తున్నాం. గమనించగలరు.)

**బేబీ అరుణ (చింతలపల్లి).**

కూతురు అరుణ కాన్పుఅయిన 5వ రోజు కళ్ళు పచ్చబడిపోయాయి. గొంతు జీర బిడ్డ ఆకలి ఎక్కువై మాటిమాటికి పాలుతాగాలని ఏడుపు. రక్త పరీక్ష, బిలురూచిన్ 24 మి. గ్రా. ఒళ్ళుపచ్చబడింది.

బిడ్డకు ఫాస్పరస్ 30 పొటెన్సీలో ప్రతి 4 గం. ఒక డోసు ఇవ్వడం జరిగింది బిడ్డ ఏడుపు తగ్గింది. గొంతు జీర తగ్గింది. శరీరం పచ్చదనం తగ్గింది. 4 రోజులలో పూర్తిగా స్వస్థత లభించింది.

**గమనిక:–** పుట్టిన శిశువుల పచ్చకామెర్లకు ఫాస్పరస్ గుర్తుంచుకోదగ్గ ఔషధం.



# కుంకుమార్చన కార్యక్రమం - విశాఖపట్నం

మన ఆచార్యులు శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి మంగళాశాసనాలతో శ్రీఅహోబిల జీయర్‌స్వామివారు విశాఖపట్నం యం.వి.పి. కాలనీలోని, ఆళ్వార్‌రోడ్ గ్రౌండ్‌లో 'కోటికుంకుమార్చ' వైభవంగా నిర్వహించారు. పూజా కార్యక్రమంలో వేలాదిమంది భక్తులు పాల్గొన్నారు. పూజా ద్రవ్యాలను మన వికాసతరంగిణి ఉచితంగా అందించింది.

లక్ష్మీ సహస్రనామ పూజతో ప్రతి వందనామాలకు పెరుమాళ్ళకు నైవేద్యం సమర్పిస్తూ, వేద, నాలాయిర ప్రబంధ పారాయణలు విన్నవిస్తూ, సహస్రగళార్చనగా అమ్మ వైభవాన్ని గానం చేసారు.

విశాఖపట్నం, విజయనగరం, అనకాపల్లి నుండి 200మంది గాయకులు పాడుతూ ఉండేవారిని అనుసరిస్తూ, భక్తులందరూ సంకీర్తనలో పాల్గొన్నారు. పూజలో పాల్గొన్న భక్తులందరికీ సహస్రనామాలతో పాటు, పాటల పూలను కూడా మన వికాసతరంగిణి అందించింది. శ్రీమాన్ ఘటశాల పవన్‌కుమార్ బృందం 'పాలకడలిలో లక్ష్మీదేవి ఆవిర్భావం' నృత్యరూపకము భక్తులను ఆనందింపచేసింది. శ్రీమతి టి.కె. చూడామణిగారు మహాలక్ష్మీవైభవాన్ని నృత్యరూపకంగా రచించారు. శ్రీమతి టి.కె.సిష్టర్స్ సరోజ, సుజాతలు దీనిని స్వరపరిచి, గానంకూడా చేసారు. చక్కని రాగాల సమ్మేళనంతో స్వరమాధుర్యంతో నృత్యరీతులతో అందరినీ విశేషంగా ఆకట్టుకుంది ఈ కార్యక్రమం.

వాజీ ఛానల్‌వారి సౌజన్యంతో లక్షలాది మంది భక్తులు దీనిని దర్శించడం విశేషం. ఈ కార్యక్రమంలో శ్రీఉ.వే.శ్రీమాన్ తూపురాణి ఉదయవర్‌స్వామివారు, సింహాచలదేవస్థాన ప్రధానార్చకులు శ్రీమాన్ మోర్త సీతారామాచార్యస్వామి, శ్రీమాన్ రంగాచార్యస్వామి తదితర పండితులు పాల్గొన్నారు.

శ్రీఅహోబిల జీయర్‌స్వామి ప్రార్థనపై శ్రీచిన్నజీయర్‌స్వామి వారు జీయర్ ఛానల్‌ద్వారా ప్రత్యక్ష మంగళాశాసనాలు అందించారు. మహనీయుల దివ్యాశిస్సులు ఏకార్యక్రమాలకైనా విఘ్నాలు నశింపచేసి, విజయాన్ని చేకూర్చుతాయి అనడానికి ఈ కార్యక్రమం ప్రత్యక్ష ఉదాహరణం. చుట్టుప్రక్కల ప్రాంతాలన్నీ మన ఆనందంతో జలమయం చేసిన వరుణుడు ఈ పూజ జరిగిన ప్రాంతానికి మాత్రం గొడుగు పట్టడం అత్యంత వైభవోపేతమని భక్తులు దివ్యానందాన్ని ప్రకటించారు.

సరిగ్గా కార్యక్రమానికి ముందు మన కార్యకర్తలు పూజా సమయంలో వర్షం వస్తే ఎలాగా అని భయపడినపుడు మన అహోబిల స్వామివారు మన ఆచార్యులైన శ్రీ చిన్నజీయర్‌స్వామివారు ఉండగా మనకెందుకు సందేహం. ఆ గొడుగేదో వారే ఏర్పాటుచేస్తారు అని పలికిన ఆచార్యనిష్ఠ భక్తులను ఆనందపరవశులను చేసింది.

ఉదారులైన కైంకర్యపరులను శ్రీమాన్ వర్మగారు పరిచయం చేయగా శ్రీస్వామివారు వారికి ప్రసాదాలను, ప్రతిమను అందించారు. వికాసతరంగిణి విశాఖ అధ్యక్షులు శ్రీమాన్ జి.ఎస్.ఎన్.రాజుగారి నేతృత్వంలో వి.టి. సభ్యులు 200మంది చక్కటి సేవలందించారు.

మందస నుండి వచ్చిన రామానుజ యూత్ 30మంది అందించిన సేవలు ప్రశంసనీయము. వైభవ వేంకటేశ్వరస్వామి ఆలయ ప్రధానార్చకులు శ్రీమాన్ శేషాచార్యస్వామి తమ బృందంతో పాల్గొని, అమ్మవారికి విశేష అలంకరణచేసి, సభాకార్యక్రమాన్ని నిర్వహించిన రీతి కార్యక్రమానికి శోభను కలిగించింది. శ్రీమాన్ శ్రీకాంతాచార్యస్వామి, శ్రీమాన్ సంతోష్‌స్వామి వైదిక కార్యక్రమాన్ని చక్కగా నిర్వహించారు. మన నేత్రవిద్యాలయ విద్యార్థి ఇంగ్లీషులో చేసిన భాషణ శ్రీస్వామివారి కృషికి నిదర్శనమని భక్తులందరూ కొనియాడారు.

మధ్యాహ్నం 4గం॥నుండి రాత్రి 8.30వరకు భక్తులందరూ అత్యంత భక్తిశ్రద్ధలతో శ్రమను గుర్తించక, పాల్గొనడం విశేషం. 2016లో 'శ్రీరామానుజ సహస్రాబ్ది' శ్రీవారి సంకల్పాన్ని అందరికీ వీడియో ద్వారా చూపిస్తూ వివరించారు.

ఈ పూజలో పాల్గొన్న భక్తులకు ప్రతిరోజూ జరిగే శ్రీయాగరక్షను, కళ్యాణ అక్షతలను, శ్రీచూర్ణ పురోడాశములను అందించారు. అనంతరం భక్తులందరూ ఆనందంతో గృహాభిముఖులయ్యారు.



పరమహంస పరివ్రాజకులు
# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



**చాతుర్మాస్య సమయంలో జరిపిన విశేష కార్యక్రమాలు**

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీత్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు 12-7-2014వ తేదీ ఆషాఢశుద్ధ పూర్ణిమనాడు చాతుర్మాస్య దీక్షను స్వీకరించారు. స్వామివారితోపాటు శ్రీశ్రీశ్రీదేవనాథ రామానుజ జీయర్‌స్వామివారు కూడా దీక్షను స్వీకరించారు. శ్రీమాన్ మధుసూదనాచార్యులు స్వామివారు వేంచేసి ఉండే కుటీరంలోనే పూర్వరంగప్రక్రియ, విష్వక్సేనపూజా, పుణ్యాహవాచన, మృత్సంగ్రహణాలు జరిపించారు.

అటు తరువాత వపనాదిప్రక్రియలు పూర్తిచేసికొని స్వాములు మండపానికి విచ్చేసి ఈకార్యక్రమంలో అన్వయించడానికి వచ్చిన ఆర్తభక్తబృందాన్ని తమ అనుగ్రహభాషణ మంగళాశాసనాలతో అనుగ్రహించారు. ఈసందర్భంగా తీర్థగోష్ఠికి ముందు 8.30కు ప్రారంభించి 9.30వరకు భగవద్రామానుజులు అనుగ్రహించిన **"వేదార్థసంగ్రహ"**మనే గ్రంథంపై ప్రతిరోజు ఒక్కొక్క అంశంపై ప్రవచనాలు సాగించాలని నిర్ణయించి 13వతేదీనుండి ప్రవచనాలు ప్రారంభించారు. భగవద్రామానుజుల శ్రీభాష్యగ్రంథంలో విస్తరించిన శ్రీవైష్ణవదర్శన సిద్ధాన్తాన్ని సంగ్రహమనోహరంగా అందించేగ్రంథమే వేదార్థ సంగ్రహం. దీన్ని మొట్టమొదటిగ్రంథంగా భగవద్రామాను గ్రంథమాలలో పరిగణిస్తారు. తిరుమల వేంచేసినప్పుడు శ్రీనివాసుని సనినధిలో ఈగ్రంథాన్ని ఆశువుగా రామానుజులవారు అనుగ్రహించారు. రామానుజదర్శనంలో అభినివేశాన్ని పొందగోరేవారికి ఈగ్రంథం కరదీపిక అవడంచేత ఈగ్రంథాన్ని మనస్వామివారు ఎన్నుకొని ముఖ్యంగా మన గురుకుల విద్యార్థులను దృష్టిలో పెట్టుకుని ఈకార్యక్రమం ఆరంభించారు. జిజ్ఞాసువులైన భక్తశ్రోతృవర్గం కోరికననుసరించి కూడా ఇది సాగుతున్నది. ఈసంవత్సరపు చాతుర్మాస్యం శ్రీగోదమ్మ తిరునక్షత్రం ప్రథమవిశేషపర్వంగా వచ్చింది.

30-7-14 బుధవారం ఆండాళ్ తిరునక్షత్రం వైభవంగా జరిపారు. అమ్మను దివ్యసాకేతంలో అభిషేకాలంకారాదిప్రక్రియ జరిపిన తరువాత ప్రవచన మండపానికి ఊరేగింపుగా తీసికొనివచ్చి, వేదికపైవేంచేపుచేసి అష్టోత్తరపూజాదులు జరిపారు. నిత్యప్రవచనానన్తరం ఈకార్యక్రమం జరిపి తల్లివైభవాన్ని కీర్తంచడంతో ముగించారు.

ఆతరువాత 1-8-14శుక్రవారం బదరీనారాయణ తిరునక్షత్రం వైభవంగా జరిపారు. 10.నుండి ప్రారంభమైన శ్రావణమాసంలో ప్రసక్తాలైన అన్ని శుక్రవారాలు వైభవంగా లక్ష్మీపూజలు జరిపించారు శ్రీస్వామివారు. దివ్యసాకేతంలో వేంచేసి ఉన్న అమ్మవారికి ప్రతిశుక్రవారం అభిషేకం, అలంకరణం అయిన తరువాత ప్రవచన మండప వేదికపై వేంచేపుచేసి అష్టోత్తరనామపూజతోపాటు అమ్మవైభవాన్ని కీర్తించి తీర్థప్రసాదాలతో గోష్ఠిని ముగించడం జరిపారు. అన్ని శుక్రవారాల్లోను అమ్మవారి వైభవాన్ని శ్రీస్వామివారు అనుగ్రహించారు.

**వరలక్ష్మీవ్రతం**

...... తేదీన ఈసంవత్సరం వరలక్ష్మీదేవిగా శ్రీదేవి అనుగ్రహించింది. ప్రతిశుక్రవారం విశేషంగా మహిళలు జరుపుకుంటున్న ఈపూజలు వరలక్ష్మీవ్రతంనాడు మరింత వైభవంగా భక్తమహిళలచే జరిపించారు మనస్వామి. ఉ.వే.శ్రీమాన్ రంగరామానుజాచార్యస్వామి - లక్ష్మీవైభవాన్ని, ఇంద్రునికి త్రైలోక్యరాజ్యాన్నిచ్చి వరలక్ష్మి అయిన వైనాన్ని వివరించారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు స్వయంగా అన్ని శుక్రవారాలూ పూజోపచారాలు భక్తులచే అనుగ్రహించారు.

ప్రతి శుక్రవారం శ్రీయాగాన్ని వైదికంగా జరిపించి పూర్ణాహుతులచే సుసంపన్నం కావించారు.

**శ్రీరామాయణ పారాయణం**

ఆషాఢ పునర్వసునుండి శ్రావణ పునర్వసు వరకు 27రోజులు, రోజుకు 20సర్గలచొప్పున శ్రీరామాయణ పారాయణం కావించాలని స్వామివారు ఆరంభించారు. దీనికి ప్రేరకులు అమెరికానుండి స్వదేశానికి తిరిగివచ్చివేసి, ఆచార్య సేవానిరతులవ్వాలని ఆశించిన శ్రీమాన్ కల్వపూడి మురళీకృష్ణగారు హైదరాబాద్‌లో ఉంటూ, మన ఆశ్రమానికి తరచువస్తూ ఉంటారు. ఈకార్యక్రమానికి ఆగస్టు 22న పునర్వసునాడు పరిసమాపనం జరిగింది.







10-8-14 శ్రావణపూర్ణిమ శ్రీహయగ్రీవజయంతి వైభవంగా జరిగింది. నూతన ఉపనీతులైన వటువులతో తల్లిదండ్రులు ఆశ్రమానికి అసంఖ్యాకంగా విచ్చేసి మన స్వామివారి మంగళాశాసనాలతో ఉపాకర్మను పూర్తి చేసుకున్నారు.

**శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్ స్వామివారి తిరునక్షత్రమహోత్సవము**

శ్రావణపూర్ణిమతో ప్రారంభించి ఆగస్టు14వతేదీ వరకు ఐదు రోజులు శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్‌స్వామివారి తిరునక్షత్రోత్సవ వైభవంగా జరిగాయి. ప్రతిరోజు స్వామివారిమూర్తిని ప్రవచన మండపంలో వేంచేపుచేసి, అశేషభక్త సమక్షంలో అభిషేక, అష్టోత్తరపూజాది ప్రక్రియను జరిపించారు. ప్రతిరోజు జరిపే రామాయణ పారాయణం పూర్తిచేసుకుని మండపంలో వేంచేసిన స్వామివారికి మన చిన్న స్వామివారు అష్టోత్తరనామ పూజాదికాలు జరిపి, అలాగే భక్తులు ప్రేమతో సమర్పించిన గురుపరంపరా వైభవాన్ని ప్రకాశింపజేసే ఆచార్య రత్నహారాన్ని శ్రీపెద్దస్వామివారి కంఠసీమలో అలంకరింపజేసి తనియన్ అనుసంధానం, తీర్థప్రసాదగోష్ఠులతో కార్యక్రమాన్ని పూర్తిచేసారు.

14వ తేదీన తేదీన తిరునక్షత్రం అవడంవల్ల ఆనాడు విశేషార్చనాదులు జరిగాయి. అభిషేకానికి ముందు శ్రీ చిన్నజీయర్ స్వామివారు, అభిషేచనానంతరం అలంకార సమయంలో శ్రీమాన్ రంగరామానుజాచార్యస్వామి శ్రీపెద్దజీయర్ స్వామివారి వైభవాన్ని ప్రవచించారు.

శ్రీపెద్దస్వామివారి తిరునక్షత్ర సందర్భంగా జరిగిన విశేషకార్యక్రమాల్లో జిమ్స్ హోమియోపతి కళాశాలా భవనానికి శంకుస్థాపన జరపడం, అలాగే జీవాప్రాంగణంలో ప్రస్తుతం నడుస్తున్న ఆంధ్రబ్యాంక్ బ్రాంచ్ ఒక ప్రత్యేక భవనం నిర్మించడానికి శంకుస్థాపన చేయడం విశేష కార్యక్రమాలు. ఈ రెండు కార్యక్రమాలలోనూ ఇద్దరు జీయర్‌స్వామివార్లతోపాటు మైహోమ్ అధిపతి, జీవా ప్రధాన పోషకులు శ్రీమాన్ డా॥జె. రామేశ్వరరావు దంపతులు, జిమ్స్ డాక్టర్లు, ఆంధ్రాబ్యాంక్ అధికారులు డి.జియం. శ్రీవేంకటేశ్వర్లుగారు, జి.యమ్. శ్రీవెంకట



సుబ్రహ్మణ్యంగారు, జీవా పూర్వ-ప్రస్తుత కార్యదర్శులు, జీవా గురుకులం, దివ్యసాకేతం, నేత్రవిద్యాలయం సభ్యులు ఇంకా ఇతరపెద్దలు పాల్గొన్నారు.

**భారతస్వాతంత్ర్య దినోత్సవవేడుకలు**

ఈసంవత్సరం 65వ స్వాతంత్ర్యదినోత్సవ వేడుకలు ఉదయం 8.30గంటలకు, శ్రీస్వామివారి కరకమలములచే జాతీయ పతాకావిష్కరణ పురస్సరంగా వైభవంగా జరిగాయి. శ్రీస్వామివారు, జీవాకార్యదర్శి రంగరామానుజాచార్యస్వామివార్ల సందేశాలతో కార్యక్రమం సుసంపన్న మైంది.

**వికలాంగునికి కృత్రిమావయవాల సమర్పణ**

కర్నూలుకు చెందిన చి॥ వేంకటేశ్వర్లు, ఆక్వాగార్డు కంపెనీలో పనిచేస్తూ బార్యాబిడ్డలను పోషించుకుంటున్న వ్యక్తి, ప్రమాదవశాత్తు రైలుక్రిందపడి తన రెండుకాళ్ళు కోల్పోయాడు. ఒక కాలు మోకాలి పైభాగాన, మరొకకాలు మోకాలి క్రిందిభాగాన తెగిపోవడంవల్ల, ఇతరత్ర కృత్రిమావయవాలకై ప్రయత్నించినా సఫలత చెందలేక చివరకు హైదరాబాద్‌లోని 'టోటల్ ప్రోస్థెటిక్స్ మరియు ఆర్థోటిక్స్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్' వారిని చేరి అవయవాల అమరికకు ప్రయత్నించాడు.



దాదాపు నాల్గులక్షలపైగా ఖర్చు అవుతుందని తెలిసికొని కొంతసొమ్ము సమకూడినా దాదాపు 2లక్షల వరకు కొదవవస్తే మనస్వామిని స్వయంగా ఆశ్రమానికి వచ్చి తన క్లేశదశను విన్నవించాడు. అవయవాలు అమర్చేకంపెనీవారే 50వేలదాకా సర్దుబాటు చేయడానికి ముందుకు రాగా, మన వికాసతరంగిణి నుండి రూ- లక్షన్నర శ్రీస్వామివారు కంపెనీవారికి అందించి స్వాతంత్ర్యోత్సవంనాడు కృత్రిమావయవాలను అమర్చి ఆతను నడవగలిగేలా చేశారు. జండావందనం అయిన తరువాత ఈకార్యక్రమాన్ని కావించారు స్వామి. ఈకార్యక్రమంలో కృత్రిమావయవాలు తయారు చేయించి అమర్చిన శ్రీమాన్ సుందర్‌బాబు గారు తమ బృందంతో పాల్గొని శ్రీస్వామివారి మంగళాశాసనాలను, శ్రీమాన్ వేంకటేశ్వర్లుతోపాటు పొందారు. ఆనాడు స్వామివారుచేసిన ప్రసంగం విశేషస్పృహణీయంగా ఉంది. స్వాతంత్ర్యం అంటే ఏమిటో అది ఎప్పుడు సార్థకమవుతుందో వివరించారు స్వామి. తొలుత నేత్రవిద్యాలయం ప్రిన్సిపాల్ శ్రీమాన్ యాదగిరిస్వామి కార్యక్రమాన్ని ఆరంభించి, పర్యవేక్షించారు. గురుకులం ప్రిన్సిపాల్ కుమారి నీళ, వైస్‌ప్రిన్సిపాల్ శ్రీమాన్ గోవర్ధనాచార్యస్వామి విద్యార్థిబృందంతో కార్యక్రమానికి నిండుతనాన్ని చేకూర్చారు. గురుకులం విద్యార్థులు, నేత్రవిద్యాలయ విద్యార్థినీ, విద్యార్థులు ఉత్సాహంగా పాల్గొన్న ఈ కార్యక్రమం జాతీయగీతాలాపనాలతోనూ, మధురపదార్థ వితరణతోనూ ముగిసింది.





**శ్రీరామాయణపారాయణ సమాపనం**

22.8.14 పునర్వసు శుక్రవారం నాడు స్వామివారు గడచిన పునర్వసునాడు ప్రారంభించిన శ్రీరామాయణ పారాయణను వైభవంగా ముగించారు. ఉదయం అమ్మవారికి అభిషేకాదులు పూర్తిచేసికొని వాహనంపై మండపానికి వేంచేపు చేశారు. ఆలయం పెరుమాళ్ళతో పాటు మనస్వామివారి నిత్యారాధన దైవమైన సీతాహనుమల్లక్ష్మణ సమేతుడైన శ్రీరామచంద్రప్రభువుకూడా దివ్యసాకేతరామునిప్రక్కన ఠీవిగా కొలువైనాడు. భారీవిగ్రహం ప్రక్కన మన చిన్నరాముడు యువరాజులా భాసించాడు. ఆలయార్చనతోపాటు తానూ సకల సేవలంది, కల్యాణ, పట్టాభిషేకాలను పూర్తిచేసికొని, తానూ కిరీటాలంకృతుడైనాడు. మంటపంలోనే కల్యాణాంగంగా యాగం నిర్వహించి పూర్ణాహుతి కావించారు. అశేష జనసందోహముంది. ఎంతో భక్తిశ్రద్ధలతో శ్రీరామాయణ పారాయణం, చివరి శ్రావణ శుక్రవారపు పూజ సర్వమనోజ్ఞంగా సాగాయి. శ్రీశ్రీశ్రీచిన్నజీయర్‌స్వామివారు, శ్రీశ్రీశ్రీ దేవనాథరామానుజ జీయర్ స్వామివారు, రంగరామానుజాచార్య స్వామివార్ల మంగళాశాసనాలతో ఈకార్యక్రమం ముగిసింది. ఈ సందర్భంగా ఆలయమర్యాదలు సమర్పించిన శ్రీమాన్ తిరుక్కోష్టియూర్ మాధవన్‌స్వామికి, శ్రీరామాయణ పారాయణకి ప్రేరకులై 27రోజులు స్వయంగా పారాయణలో పాల్గొన్న శ్రీమాన్ కల్వపూడి మురళీకృష్ణగార్లను శ్రీస్వామివార్లను మంగళాశాసనాలతో అనుగ్రహించారు.



24.8.14న సాయంకాలం 6గం॥కు శ్రీమాన్ ప్రొవెలగపూడి ప్రకాశ్‌రావు (యు.ఎ,స్) గారి ప్రోత్సాహంతో శ్రీ గజల్ శ్రీనివాస్‌గారు నిర్వహించిన కార్యక్రమం సర్వాంగసుదరంగా సాగింది. గ్లోబల్ హిందూ హెరిటేజ్ ఫౌడేషన్ మరియు "సేవ్ టెంపుల్ ఆర్గ్" అనే పేరున స్థాపించన సంస్థద్వారా 'దేవాలయో రక్షతి రక్షితః" అనే కార్యక్రమం నిర్వహింప బడింది. తక్కువ నిడివికల డాక్యూమెంట్రీ చిత్రాలను ఆలయాలగురించి, గో పరిరక్షణాన్ని గురించి తీసినవాటిలో మూడు స్థాయిలలో గుర్తించి, తగిన బహుమతితో సత్కరించడం ఈ కార్యక్రమ లక్ష్యం. దాదాపు 113కి చిత్రాలు పోటీకి సమర్పింపబడ్డాయి. వీటిలో మూడింటిని ఎంపిక చేసి, వాటికి పురస్కారాలు అందించారు. దాదాపు 40 చిత్రాలు గో, ఆలయ పరిరక్షణంపై నిర్మించినవాటికి సత్కారాలు అందించారు.

ప్రధానమైన మూడు బహుమతుల్లో 1. స్వర్ణగోమాత, దీన్ని శాంతా బయోటెక్స్‌వారు సమర్పించగా, జి.ఆర్.ఫిల్మ్స్ టైటిల్‌తో నిర్మించిన 'అఆలు' అనే చిత్రానికి లభించింది. దీన్ని యు.కె.కి చెందిన కృష్ణప్రసాద్ నిర్మించారు. దీనికి స్వర్ణగోమాతతో పాటు లక్షరూపాయలు పారితోషికం కూడా సమర్పించడం జరిగింది.

ఇక రెండవ బహుమతికై 'దేవాలయం' అనే చిత్రం ఎంపికైంది. దీన్ని శ్రీమాన్ జి.వి.ఎస్. శ్రీనివాస్ (మేదరమెట్ల) నిర్మించగా 'రజత గోమాత'తో పాటు 75వేల పారితోషికాన్ని సమర్పించడం జరిగింది. ఇలా లభించిన పారితోషికాన్ని శ్రీమాన్ శ్రీనివాస్ (మేదరమెట్ల) శ్రీరామానుజ సహస్రాబ్ది కార్యక్రమానికి అర్పించడం విశేషంగా అభినందనీయం.

ఇక మూడవ చిత్రంగా మోరల్ ప్రొడక్షన్స్‌వారి 'ఆత్మా ది సోల్' అనే చిత్రానికి కాంస్య గోమాతతో పాటు 50వేల పారితోషికం లభించింది. దీన్ని మధు కొర్లపాటి, శిరీష కొర్లపాటి సమర్పించగా, శ్రీమాన్ కొత్తపల్లి సీతారాం నిర్మించారు.

ఈ చిత్రాలన్నింటినీ హిందీ, ఇంగ్లీషులలో అనువదించి, దేశవిదేశాలలో ఉచితంగా కూడా ప్రదర్శించదలచినట్లు గజల్ శ్రీనివాసు ప్రకటించారు. ఈ కార్యక్రమానికి అతిథులుగా విచ్చేసిన మన జీయర్‌స్వాముల్లో మొదట దేవనాథ జీయర్‌స్వామివారు ప్రసంగించిన తరువాత శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారు తమ మంగళాశాసన పురస్సర ప్రసంగాన్ని కొనసాగిస్తూ, ఎంతో ప్రభావవంతమైన సినీ మాధ్యమంలోని పెద్దలను మన ధర్మంవైపు, సంస్కృతి సంప్రదాయాలవైపు మరల్చే ప్రయత్నం ఆర్గనేజైషన్ ద్వారా జరపడం ప్రశంసనీయం అని అంటూ ఆలయవ్యవస్థపై విస్తారంగా మాట్లాడారు. ఇది 2000ల సం॥నాటిది కాదని, రామాయణం, సేతునిర్మాణాదులు నిరూపిస్తున్నాయని, రాముడు, కృష్ణుడు ఆలయాలకు వెళ్ళారని, ద్వారకదగ్గర సముద్రగర్భాన జరిపిన పరిశోధనలు కూడా నగరనిర్మాణం, ఆలయనిర్మాణాల వ్యవస్థ అతి ప్రాచీనమైనదని నిరూపిస్తున్నదని పేర్కొన్నారు. కొన్ని లక్షల సంవత్సరాల ప్రాచీనతగల ఆలయవ్యవస్థ ముస్లిం, క్రిస్టియన్ మొదలైన మతాల్లో కూడ ఉందని ఆలయవ్యవస్థ రక్షణానికి ఆవిర్భవించిన ఎండోమెంట్ డిపార్ట్‌మెంట్‌లోని అధికారులు తాము ఆ వ్యవస్థను రక్షించడానికే ఉన్నామని భావించి, పనిచేయాలని సూచించారు. ఈ కార్యక్రమంలో ఆం.ప్ర. దేవాదాయ శాఖామాత్యులు శ్రీమాన్ మాణిక్యాలరావు, ఉపముఖ్యమంత్రి శ్రీమాన్ కె.యి. కృష్ణమూర్తి, ఎండోమెంట్ కమీషనర్ శ్రీమతి అనూరాధ, ఇన్‌కమ్‌టాక్స్ కమీషనర్ శ్రీమాన్ రఘు, దూరదర్శన్‌కు చెందిన శ్రీమాన్ ఓలేటి పార్వతీశం ప్రభృతులు పాల్గొన్నారు. శ్రీమాన్ ప్రకాశ్‌రావుగారి సంపూర్ణ ప్రోత్సాహంతో శ్రీమాన్ గజల్ శ్రీనివాస్‌గారి నిర్వహణలో జరిగిన ఈ కార్యక్రమం సమాజానికి చక్కటి దిశానిర్దేశం చేసింది.

## లండన్‌లో పరిమళించిన తెలుగుపూవు



**శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారే ముహూర్తం నిర్ణయిస్తే దంపతులైన శ్రీమాన్ మెట్టు వేణుగోపాల్‌రెడ్డి, డా॥మెట్టు బృందారెడ్డి దంపతుల పుత్రికారత్నం మెట్టు స్నిగ్ధారెడ్డి, హైదరాబాద్‌లో పుట్టి సాక్షాత్తు జీయర్ స్వామివారిచేతనే "స్నిగ్ధ" అన్న నామధేయాన్ని పొంది యు.కె.కి మైగ్రేట్ అయింది. అక్కడ నార్థంప్టన్ బాలికల హైస్కూల్‌లో ఇగ్లాండులోనే బైయాలజీలో ప్రథమురాలైంది. కేంబ్రిడ్జిలో 2008లో మెడిసిన్‌లో చేరింది. 11లో బి.ఎ ఆనర్స్ పూర్తిచేసి 14లో మెడిసమ్ పూర్తిచేసింది. చైల్డ్ సైకాలజీలో గ్రెన్నీప్రైజ్ ప్రముఖవైద్యాధికారిద్వారా పొందగల్గింది. ఈమెసాధించిన విజయం దేశానికి, రాష్ట్రానికి, తెలుగువారికి గౌరవకారణాలని భావిస్తూ భక్తినివేదన ఈమెను, తల్లిదండ్రులను స్వామివారి మంగళాశాసనాలతో అభినందిస్తోంది.**

# శ్రీరాంనగర్‌లో జరిగిన వార్షిక వేదపరీక్షలు

శ్రీశ్రీశ్రీస్వామివారి సంకల్పానుసారముగా వేదవిద్యా పరిరక్షణలో భాగంగా వేద పరీక్షలు ప్రతి సంవత్సరంవలే ఈ సంవత్సరం కూడా ఆగస్టు 24,25,26 తేదీలలో, వివిధ ప్రాంతాలలోని వేదపాఠశాలలో అధ్యయనం చేసిన పరీక్షార్థులకు వేదపరీక్షలు జరిగాయి.

ఇందు **శుక్లయజుర్వేదం, కృష్ణయజుర్వేదం (తైత్తిరీయ శాఖ), సామవేదం (కౌథుమ, రాణాయణీయశాఖలు), అథర్వవేదం (శౌనకశాఖ) శ్రీ పాంచరాత్రాగమము, నాలాయిర దివ్యప్రబంధం** విభాగాలలో పరీక్షలు జరిగాయి. వివిధ ప్రాంతాల నుండి నిష్ణాతులు జీవాప్రాంగణానికి పరీక్షాధికారులుగా వేంచేసి నిర్వహించి నారు. ఉత్తీర్ణులైన వారి వివరాలు...

**ఉత్తీర్ణులై ప్రశంసాపత్రములను అందుకున్న పండితులు**

| వ.సం | పేరు | వేదశాఖ | శ్రేణి |
|---|---|---|---|
| | **ఋగ్వేదీయ శాకలశాఖ** | | |
| 1. | యనమండ్ర సత్యవేంకట గోపాలకృష్ణ | క్రమాన్తం | ప్రథమ |
| 2. | సాలగ్రామ విశ్వనాథ విష్ణుశర్మ | మూలం | ప్రథమ |
| 3. | చెన్నుభొట్ల సూర్యభాస్కర సార్యకుమార్ | మూలం | ద్వితీయ |
| | **శుక్లయజుర్వేదీయ కాణ్వశాఖ** | | |
| 4. | లట్టాల కోదండసత్యసాయిగోవింద వైవస్వత | క్రమాన్తం | ప్రథమ |
| 5. | సోలూర్ జితేష్‌బాబు | క్రమాన్తం | ద్వితీయ |
| 6. | విష్ణుదాస్ దేశ్‌పాండ్యే | క్రమాన్తం | ద్వితీయ |
| 7. | సుసరాపు సాయికుమార్ శర్మ | మూలం | ప్రథమ |
| 8. | ఆరాధ్యుల వేంకటకృష్ణసంపత్‌శర్మ | మూలం | ప్రథమ |
| 9. | లట్టాల వినోద్‌కుమార్‌శర్మ | మూలం | ద్వితీయ |
| | **కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయ శాఖ** | | |
| 10. | సామవేదం ఆదిత్యశర్మ | ఘనాన్తం | ప్రథమ |
| 11. | పాపరాజు సాయిరామశర్మ | క్రమాన్తం | ప్రథమ |
| 12. | కొడమంచిలి శ్రీరామశర్మ | క్రమాన్తం | ప్రథమ |
| 13. | మెట్టా సూర్య మణికరశర్మ | క్రమాన్తం | ద్వితీయ |
| 14. | పరాశరం సాయికృష్ణకిషోర్‌శర్మ | క్రమాన్తం | ద్వితీయ |
| 15. | జ్యోస్యుల హేమంత్ కృష్ణకాంత్‌శర్మ | క్రమాన్తం | ద్వితీయ |
| 16. | ఆకెళ్ళ వేంకట రామాంజనేయ సుబ్రహ్మణ్యశర్మ | క్రమాన్తం | ద్వితీయ |
| 17. | గుండేపూడి వేంకట నాగచంద్రశేఖరశర్మ | క్రమాన్తం | ద్వితీయ |
| 18. | అడసుమిల్లి లక్ష్మీనృసింహ శర్మ | క్రమాన్తం | ద్వితీయ |
| 19. | టి.యి. శ్రీనాథశర్మ | క్రమాన్తం | ద్వితీయ |
| 20. | పెండ్యాల సాయికిరణ్‌శర్మ | క్రమాన్తం | ద్వితీయ |
| 21. | కుప్పా వేంకట జనార్దనశర్మ | ఘనాన్తం | ప్రథమ |
| 22. | హరివేంకట శివసుబ్రహ్మణ్యలక్ష్మీనృసింహశర్మ | క్రమాన్తం | ప్రథమ |
| 23. | గంటి వేంకట సుబ్రహ్మణ్య భార్గవమల్లికార్జునశర్మ | క్రమాన్తం | ప్రథమ |
| 24. | ఉపాధ్యాయుల యజ్ఞేశ్వర పతంజలిశర్మ | క్రమాన్తం | ప్రథమ |
| 25. | సి.శంకరరామన్ శర్మ | క్రమాన్తం | ప్రథమ |
| 26. | వనం వేంకటసాయి జితేందర్‌శర్మ | క్రమాన్తం | ప్రథమ |
| 27. | యమ్. కృష్ణన్ | క్రమాన్తం | ద్వితీయ |
| 28. | తనికెళ్ళ మహేశ్‌చంద్రశర్మ | క్రమాన్తం | ప్రథమ |
| | **సామవేదం** | | |
| 29. | పోతరాజువిజయ్ పవన్‌కుమార్‌శర్మ | మూలం | ప్రథమ |
| | **అథర్వవేదం** | | |
| 30. | నల్లాన్‌చక్రవర్తుల హేమంత్ కృష్ణమాచార్య | మూలం | ప్రథమ |
| 31. | రవిశంకర ఉపాధ్యాయశర్మ | మూలం | ద్వితీయ |
| | **శ్రీపాంచరాత్రాగమము** | | |
| 32. | చక్రవర్తుల సుబ్రహ్మణ్యం (భాష్యకార్) | ఉత్సవం | ప్రథమ |
| 33. | తిరునగరి అనంతశయనాచార్య | ఉత్సవం | ప్రథమ |
| 34. | కందాళై శ్రీనాథాచార్య | ఉత్సవం | ప్రథమ |
| 35. | ప్రతాపురం భార్గవాచార్య | ఉత్సవం | ప్రథమ |
| 36. | గోవర్ధనం వేంకట రామానుజ శ్రీశాచార్య | ఉత్సవం | ద్వితీయ |
| 37. | చైతన్య సత్యనారాయణ మామిడాళ్వార్ | ఆరాధన | ద్వితీయ |
| 38. | ఆరుట్ల ఫణిరాజాచార్య | ఆరాధన | ద్వితీయ |
| 39. | వేల్పూరి జయవర్ధనాచార్య | ఆరాధన | ద్వితీయ |
| 40. | కుమ్మరిగుంటవేంకటసీతారామానుజ పవన్ | ఆరాధన | ద్వితీయ |
| 41. | చక్రవర్తుల వంశీకృష్ణ | ఆరాధన | ద్వితీయ |
| 42. | వైద్యం కృష్ణమాచార్య | ఆరాధన | తృతీయ |
| 43. | పొడిచేటి రామకృష్ణమాచార్య | ఆరాధన | ద్వితీయ |
| 44. | శ్రీపెరుంబూదూర్ వేణుగోపాలాచార్య | ఆరాధన | ద్వితీయ |
| 45. | దెబ్బట రాంప్రసాదాచార్య | ఆరాధన | ద్వితీయ |
| 46. | తిరుచానూర్ రమేశ్‌బాబు | ఆరాధన | ద్వితీయ |

ఈ వేదపరీక్షలలో ఉత్తీర్ణులైనవారికి శ్రీ చిన్న జీయరు స్వామి వారు సంభావన, యోగ్యతాపత్రాలు తమ శ్రీహస్తముల ద్వారా అందించారు.

ఉత్తీర్ణులైనవారికి అందించిన సంభావనలు...

| | | | |
|---|---|---|---|
| ఘనాంతం: | ప్రథమశ్రేణి ఒక్కొక్కరికి | | రూ. 4,500/- |
| | ద్వితీయశ్రేణి | " | రూ.4,000/- |
| క్రమాంతం: | ప్రథమశ్రేణి | " | రూ.3,500/- |
| | ద్వితీయశ్రేణి | " | రూ.3,000/- |
| మూలాంతం: | ప్రథమశ్రేణి | " | రూ.2,500/- |
| | ద్వితీయశ్రేణి | " | రూ.2,000/- |
| పాంచరాత్రం: | ప్రథమశ్రేణి | " | రూ.2,500/- |
| | ద్వితీయశ్రేణి | " | రూ.2,000/- |
| దివ్యప్రబంధం: | ప్రథమశ్రేణి | " | రూ.4,000/- |
| | ద్వితీయశ్రేణి | " | రూ.3,500/- |

పరీక్షాధికారులు ఒక్కొక్కరికి రూ. 5,000/-






**సంపాదకులు శ్రీమతి టి. అరుణ**

**హైదరాబాద్...కొత్తపేట :**



శ్రావణమాసం మొదటి శుక్రవారం మరియు బదరీ నారాయణ తిరునక్షత్రం సందర్భంగా స్వామివారి మంగళాశాసనము లతో న్యూ మారుతీ నగర్ - మారుతీ హైట్స్ అపార్ట్‌మెంట్‌లో వికాసతరంగిణి కార్యకర్తలు సామూహిక లక్ష్మీ పూజలు నిర్వహించారు. శాంతారాం గురువుగారు అందరికీ లక్ష్మీదేవి ప్రతిమలు అందజేసారు. భక్తులందరికీ అర్థమయ్యే విధంగా పూజా విధానాన్ని వివరిస్తూ పూజలు చేయించారు. శ్రీ శ్రీనివాసాచార్యులు, లక్ష్మీ వైభవాన్ని వివరించారు. మహాలక్ష్మీ మహిళా మండలి సభ్యులు, అపార్టుమెంటు వాసులు సుమారు 70 మంది పాల్గొన్నారు. శ్రీశ్రీశ్రీ చిన జీయరుస్వామి వారి దర్శన భాగ్యం కోలనీ వాసులకు కల్గించమని వికాసతరంగిణి వారిని భక్తులు కోరారు. వికాసతరంగిణి ప్రెసిడెంట్ శ్రీమతి అరుణగారు పాల్గొన్నారు. ట్విన్ సిటీస్ మహిళా ఆరోగ్య వికాస్ కన్వీనర్ శ్రీమతి సునీత ఈ కార్యక్రమం నిర్వహించారు. కొత్తపేట వికాసతరంగిణిశ్రీనివాస్ మరియు వికాసతరంగిణి సభ్యులు పాల్గొన్నారు.

**హైదరాబాద్ :**



మనిషి తన శరీరానికి బాధ కలిగితే వైద్యుని దగ్గరకు వెళ్ళి మందులు వేసుకొని బాధని తొలగించుకోవచ్చు. మనసుకు తగిలిన దెబ్బలు వలన కలిగిన బాధని ఓర్చుకోవడం చాలా కష్టం. మనసుకి ఆనందం లేకపోతే ఆహారం, నిద్ర సరిగా శరీరానికి అందక నరాల బలహీనతతో పనులు చేయలేక ఆర్థిక ఇబ్బందులు పడుతున్న వారికి చిన్న మాట సాయమో, ఆర్థిక సాయమో చేస్తే వారు పొందిన ఊరట మాటలలో చెప్పలేరు. హైద్రాబాద్‌లో సమస్యలతో సతమతమౌతున్న వికలాంగురాలు టి. శశికళ వారి అక్కచెల్లెళ్ళు శ్రీ స్వామివారిని సేవించుకొని వారి సమస్యలు వివరించారు. స్వామివారు వికాసతరంగిణి ద్వారా శశికళగారికి పదివేలు అందజేయవలసిందిగా ఆదేశించారు. వికాసతరంగిణి కోశాధికారి శ్రీమాన్ సూర్యనారాయణ గారు శ్రీమతి వనజా భాస్కర్‌గారి చేతులు మీదుగా పదివేల రూపాయలు అందజేసారు. శ్రీశ్రీశ్రీ స్వామి వారు మంగళాశాసన ములు తెలియజేసారు.

**కరీంనగర్ :**

ఆండాళ్ తిరునక్షత్ర కార్యక్రమం వికాసతరంగిణి జిల్లా కార్యాలయం



ఆండాళ్ భవనంలో నిర్వహించారు. పట్టణంలో 9 శాఖల సభ్యులు మరియు జెట్ కమిటీ సభ్యులు పాల్గొన్నారు. 300 మందికిపైగా కార్యక్రమంలో పాల్గొన్నారు. శ్రీరామానుజ సహస్రాబ్ది గురించి భక్తులకు తెలియజేసారు. ప్రతి ఇంటికి, వ్యాపార సంస్థలకి కోయిన్ బాక్స్ అందించి ప్రతి నెల నేత్ర విద్యాలయంకు ఆర్థిక సహకారం అందిస్తున్నారు. జూన్ నెలలో రూ.9,666/– నేత్ర విద్యాలయంకు సమర్పించారు. గోదాదేవి తిరునక్షత్రంకి విచ్చేసిన భక్తులకు శ్రీమతి శ్రీమతి రవీంద్రరావు తదీయారాధన ఏర్పాటు చేసారు.

**కరీంనగర్ – సప్తగిరి కోలనీ :**



కరీంనగర్ కోదండ రామాలయంలో ప్రజ్ఞ కార్యక్రమాలు ప్రతి ఆదివారం కుమారి శ్రీదేవి గారు నిర్వహిస్తున్నారు. భగవద్గీత, ప్రజ్ఞ శ్లోకాలు, కథలు చెప్తూ విద్యార్థులందరికి చక్కటి శిక్షణ నందిస్తున్నారు. శ్రీమతి విజయలక్ష్మిగారు ప్రతివారం సత్సంగ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

**కరీంనగర్ - భగత్‌నగర్** : శ్రీమాన్ కొమరయ్యగారు ప్రతి శనివారం తమ ప్రాంతాలలో సత్సంగం నిర్వహిస్తున్నారు. రామానుజ వైభవాన్ని అందరికి తెలియజేస్తున్నారు.

**సిరిసిల్లా – కరీంనగర్ జిల్లా :**

జూలై 30వతేదీన గోదాదేవి తిరునక్షత్రాన్ని వైభవంగా నిర్వహించారు. ఉదయం 6 గంటలకు తిరుమంజనంతో ప్రారంభించి రాత్రి 8 గంటలవరకు సేవాకాలం, అర్చన ప్రవచనాలతో కార్యక్రమం నిర్వహించారు. గౌరవ అధ్యక్షులు – జగన్నాధాచార్యులు, అధ్యక్షులు రాపెల్లి రాజేందర్, మంగ, కార్యదర్శి పద్మలత మొదలైన సభ్యులు పాల్గొన్నారు ప్రతివారం సత్సంగం, ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

శ్రీభగవద్రామానుజ సహస్రాబ్ది సందర్భంగా జిల్లాలో నున్న ప్రతిగ్రామములో పర్యటించి స్వామియొక్క ప్రభావాన్ని తెలియజేస్తూ ఈసూచనలు పాటించవలసియున్నదని కరీంనగర్‌లో వికాసతరంగిణి భక్తగోష్ఠినిర్ణయించింది.

1. జిల్లాలోని ప్రతిగ్రామము సందర్శించడం, గ్రామంలోని పెద్దలను, భక్తులను కలవడము అలాగే అందులోని కొందరిని కార్యకర్తలుగా గుర్తించడం.

2. గ్రామములోని సుమారుగా ఎంతోమంది ప్రభుత్వ, ప్రైవేట్ ఉద్యోగులు ఉన్నారో వివరాలు సేకరించి వారివారి అడ్రసులు సంపాదించి వారిని ఫోన్‌ద్వారా లేదా ఇతరులద్వారా సంప్రదించడం.

3. ప్రతి గ్రామములోని దళిత, బీద మరియు ధనవంతులని తారతమ్యం, లేకుండా శ్రీరామానుజ సహస్రాబ్దిలో అందరినీ భాగస్వాములనుచేయడం అవసరం.

4. గ్రామాల్లో ఉండే దళిత మరియు వెనుకబడ్డ వర్గాలవారినీ కలవాలి. వారికి సనాతన వైదిక సంప్రదాయం, భాగవత, రామాయణముల గురించి మరియు ఆగ్రామంలోని ఆలయ ప్రాముఖ్యం తెలియజేయాలి.

**మంచిర్యాల :**



ఆండాళ్ తిరునక్షత్రాన్ని వికాసతరంగిణి కార్యకర్తలు అత్యంతవైభవంగా నిర్వహించారు. కరీంనగర్ జోనల్ సభ్యులు శ్రీమాన్ గౌతమరావు, ప్రభాకరరావు, గోపాలరావు గార్లు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. మంచిర్యాల వి.టి. అధ్యక్షులు ఎ రాజేశ్వరరావు, జి. శ్యామసుందర్, ప్రభాకరరావు, హనుమంతరావు, ఉమగారు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. వికసతరంగిణి సభ్యులకు సభ్యత్వ గుర్తింపు కార్డులు అందించారు. రామానుజ సహస్రాబ్ది వైభవాన్ని వివరించారు.

***విద్యానగర్ కోలనీ - కరీంనగర్ :*** ప్రతాప్‌రెడ్డి, గోపాలరావుగారు రామానుజ సహస్రాబ్ది గురించి గ్రామాలకు వెళ్ళి ప్రచారం చేసారు. గోవిందాపురం మన్నెగూడ, గంబీర్‌పూర్, తండియాలా, అంబారీపేట, చింతకుంట, బొమ్మెన, కతలాపూర్ తక్కలపల్లి, దూలూరు, రుద్రాపురం మొదలైన గ్రామాలలో శ్రీమాన్ సీతారామాచారిగారితో రామానుజ వైభవం చెప్పిస్తూ – సత్సంగం ఎలా నిర్వహించుకోవాలో వికసతరంగిణి కార్యకర్తలు వివరిస్తున్నారు.

**మహబూబ్ నగర్ :**



నూతనంగా ఏర్పాటుచేసిన శ్రీ హయగ్రీవ వికాస తరంగిణి, లక్ష్మీనగర్ కాలనీ, శ్రీరామ వికాసతరంగిణి, శ్రీనివాసకాలనీ శాఖలలో గురుపౌర్ణమి నుండి ఒక్కొక్క గృహంలో సామూహిక శ్రీ విష్ణుసహస్రనామ పారాయణలు నిర్వహిస్తున్నారు. శ్రీమాన్ టి.బుచ్చయ్య, ప్రచార కార్యకర్త రామానుజ సహస్రాబ్ది విశేషాలను అందరికీ తెలియజేస్తున్నారు.

**మిర్యాలగుడా :**



జూలై 25 శుక్రవారం మిర్యాలగుడా విద్యానగర్ కోలనీలో భగవద్రామానుజ సహస్రాబ్ది ఉత్సవాల గూర్చి కార్యక్రమాన్ని నిర్వహించారు. ప్రతీవారం కోలనీలో సత్సంగాల ద్వారా రామానుజ వైభవాన్ని అందరికీ తెలియజేస్తున్నామని శ్రీమతి మందడి విజయగారు చెప్పారు ప్రతి కోలనీలో చుట్టు ప్రక్కల గ్రామాలలో రామానుజ వైభవం తెలియజేసే అదృష్టం రామానుజ సహస్రాబ్ది ఉత్సవాల ద్వారా మనకు కలిగిందని కారంపూడి రాఘవచార్యులు తెలియజేసారు. భజనలు చేస్తూ రామాయణ వైభవం గూర్చి స్మరిస్తూ కార్యక్రమం చక్కగా నిర్వహించారు. ఈ కార్యక్రమాలలో వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమతి మందడి విజయలక్ష్మి, రాగిరెడ్డి శ్రీదేవి, దేవస్థాన కమిటీ ఛైర్మన్ చిర్లంచర్ల రమేష్, శ్రీనివాసరెడ్డి పాల్గొన్నారు.

**మార్కాపురం - ప్రకాశం జిల్లా**

యువ వికాస్ (వి.టి. సేవ) కార్యకర్తలు కాకర్ల గ్రామ ప్రాథమిక పాఠశాలలో విద్యార్థులకు రూ.2,000/- ఆట వస్తువులు కొని అందజేసారు. ప్రతి నెల విద్యార్థులకు పౌష్టికాహార మందించడమే కాక 15 మంది అనాధ పిల్లలకు 2 జతల బట్టలు, చెప్పులు, నిత్యావసర వస్తువులు, పుస్తకాలు, పెన్నులు సుమారు 10వేల రూపాయల విలువచేసే వస్తువులను అందజేసారు. కార్యకర్తలు రంగనాయకులు, మహేష్, ప్రదీప్, కోళ్ళ వరలక్ష్మి ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

**ఏలూరు :**

వికాసతరంగిణి కార్యకర్తలు 27-07-2014న వెల్ఫేర్ అసోసియేషన్ ఆఫ్ ది విజువల్లీ హేండీకేప్డ్ అంధ మహిళల వసతి గృహమునకు వెళ్ళి స్వీట్స్ పంచిపెట్టారు. రూ. 6,116/- వసతి గృహ అభివృద్ధికి అందజేసారు. తవ్వా రామయ్యగారి గృహమందు సత్సంగం నిర్వహించారు. అందులో 80మంది భక్తులు పాల్గొన్నారు. జూలై 24 నుండి 26 వరకు 3 రోజులు జనార్ధనస్వామి ఆలయంలో సుందర కాండ పారాయణ జరిగింది. శ్రీమాన్ మాజేటి రవిగారు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. జూలై 27 నుండి ఆగష్టు 3 వరకు శ్రీ వంకదారు కులశేఖరుగారు గృహమందు నాలాయిర దివ్య ప్రబంధ సేవకాలం జరిగింది. ప్రతిరోజూ పారాయణ అనంతరం ముఖ్యమైన పాశురాలపై ప్రవచన కార్యక్రమాన్ని నిర్వహించారు. 120 మంది భక్తులు కార్యక్రమంలో పారాయణ చేసారు.

**పశ్చిమగోదావరి జిల్లా సిద్ధాంతం :**

వికాసతరంగిణి శాఖ కన్వీనర్ వంగూరి వేంకట రామయ్యగారి ఆధ్వర్యంలో తొలిఏకాదశి రోజున సామూహిక శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ 11 పర్యాయములు జరిపి అనంతరం ప్రసాద వితరణ కార్యక్రమం జరిగింది. గురుపూర్ణిమ రోజున వ్యాసమహర్షి వైభవ ప్రవచనం, గురుపూజ జరిగాయి. పెద్దలు శ్రీ ముదుంబై వేంకటాచార్యులవారికి పాదపూజ నిర్వహించారు. శ్రీశ్రీశ్రీ స్వామివారి పాదపూజా కార్యక్రమాన్ని వికాసతరంగిణి కార్యకర్తలు నిర్వహించారు.

**కాజులూరు - తూర్పుగోదావరి జిల్లా :**



వేణుగోపాలస్వామి వారి ఆలయంలో తొలి ఏకాదశి నుండి కృష్ణాష్టమి వరకు గత పదకొండు సంవత్సరాలుగా విష్ణుసహస్రనామ పారాయణ చేయుచున్నారు. 30 జూలై 2014 ఆండాళ్ తిరునక్షత్రం వైభవంగా నిర్వహించారు. గోదాదేవి వైభవ ప్రవచనాలు జరిగాయి. ప్రతి సోమవారం రాత్రి 8 గంటల నుండి 9 గంటల వరకు రామానుజ చరిత్ర చదివి విషయములు తెలుసుకుంటున్నారు.

**విశాఖపట్టణం :**



వారిజ ఆశ్రమంలో శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయరు స్వామివారు చాతుర్మాస దీక్షను స్వీకరించారు. ఈ చాతుర్మాసంలో ఉదయం తొమ్మిది గంటల నుండి లక్ష్మీహవనం, సహస్రనామార్చన, కుంకుమపూజ, లక్ష్మీనారయణ కళ్యాణం,ఇరామానుజ నూత్తందాది ప్రవచనం, పూర్ణాహుతి కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. సాయంత్రం అనేక ప్రాంతాలలో భగవద్రామానుజ సహస్రాబ్ది వైభవం - రామాయణం - మానవ ధర్మాలుపై ప్రవచన కార్యక్రమాలు జరుగుతున్నాయి.

యం.వి.పి. కోలనీ సెక్టర్ 9, పెందుర్తి, ఎన్.ఏ.డి. కొత్తరోడ్డు, యం.విపి. విలేజ్, గ్రీన్‌పార్క్ మొదలైన ప్రాంతాలలో అరుణ, లక్ష్మీదేవిగారు, యం.వి.పి. సెక్టార్1, తగరపువలస, గొల్లుపల్లి, భీమిలి మొదలై ప్రాంతాలలో శ్రీమతి దేవి, ఆరిలోవ, ఆర్ అండ్ బి గ్రీన్‌వేలీ పి.ఎస్.ఎన్.రాజు, గాజువాక, శ్రీనగర్ నాగసాయి, భీమిలి గ్రామం - సుధారాణి, అక్కయ్యపాలెం - పద్మావతి,

రాజుల తాళ్ళవలస రూప, మధురవాడ - నగరపాలెం, చంద్రపాలెం రఘు, అనకాపల్లి - కె.స్వామి, నాని, గవరకంచరపాలెం - పద్మావతి, ఆటోనగర్ - చిలకమ్మ, స్టీల్ ప్లాంట్ - అశోక్‌రాజు, రామ్‌నగర్ - లతాకుమారి, కొత్తవలస - నీలిమ, తాటిచెట్లపాలెం శ్రీదేవి, అరుణ, వైభవ వేంకటేశ్వర ఆలయం - బంగార్రాజు, కార్యక్రమాన్ని నిర్వహించారు. భగవద్రామానుజ వైభవాన్ని తమ ప్రాంతాలలో శ్రీశ్రీశ్రీ స్వామివారు వేంచేసి వివరించడం ఎంతో ఆనందాన్ని కల్గిస్తున్నదని భక్తులు సంతోషం వ్యక్తం చేసారు. వారిజ కమిటి సభ్యులు, వికాసతరంగిణి కార్యకర్తలు చక్కటి సేవలందిస్తున్నారు. హయగ్రీవ జయంతి రోజున విజ్ఞాన్ విద్యాసంస్థల విద్యార్థులు, ప్రేమసమాజం విద్యార్థులు తుని, పాయకరావుపేట, విజయనగరం, శ్రీకాకుళం అనేక ప్రాంతాల విద్యార్థులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. శ్రీమాన్ శ్రీకాంత్ గురువుగారు, సంతోష్ గురువుగారు, వేద విద్యార్థులు శ్రీ లక్ష్మీ యాగ కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారు.

**స్వాతంత్ర్యదినోత్సవ వేడుకలు :**

శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరుస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో వారిజ, నేత్ర విద్యాలయ ప్రాంగణంలో స్వాతంత్ర్యదినోత్సవ వేడుకలు జరిగాయి. ఉదయం గం. 9-00లకు శ్రీశ్రీశ్రీ స్వామివారు జాతీయ పతాకం



ఎగురవేసారు. మన భారతజాతి గొప్పదనాన్ని అద్భుతంగా వివరించారు. నేత్ర విద్యాలయ కరస్పాండెంట్ శ్రీమాన్ ఎం.ఎస్.రాజుగారు, అధ్యక్షులు శ్రీమాన్ కాశీ రాజుగారు మరియు వారిజ, నేత్ర విద్యాలయ కమిటీ సభ్యులు, వేద విద్యార్థులు, భక్తులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. విద్యార్థులు దేశభక్తి గీతాలను ఆలపించారు. వివిధ పోటీలలో గెలుపొందిన విద్యార్థులకు శ్రీ స్వామివారు బహుమతులు అందజేసారు.

**దాకమర్రి :**



విశాఖపట్టణం జిల్లా దాకమర్రి గ్రామంలో లక్ష్మీ వల్లభ నారాయణస్వామి ఆలయం 1071 సం.నాటి అతిపురాతన కట్టడాన్ని సందర్శించాడనికి 10 సం.ల క్రితం శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చిన్న జీయరుస్వామి వేంచేసారు. శ్రీమాన్ మురళి మరియు యువత స్వామివారు నిర్వహిస్తున్న సేవా కార్యక్రమాల స్ఫూర్తితో ఉచిత విద్యా బోధన కార్యక్రమం ప్రారంభించారు. ఒక ఇంటిని నిర్మించి ప్రతి రోజూ 80 మంది పిల్లలకు మంచి చదువు అందిస్తున్నారు. ఊరిలోనున్న యువత అందరూ మంచి కార్యక్రమాలు నిర్వహించటానికి ఉత్సాహం చూపించారు. విజయనగరం యువవికాస్ కన్వీనర్ శ్రీమాన్ పద్మనాభరావుగారు దాకమర్రిలోనున్న తమ ఇంటిని వికాస తరంగిణి కార్యాలయంగా వినియోగించుకొనుటకు అంగీకరించారు. 50 అడుగుల జాతీయ జెండాతో ఊరంతా శోభాయాత్ర నిర్వహించారు. స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలలో భాగంగా జెండావందనం, వివిధ విషయాలపై పోటీలు మరియు గెలుపొందినవారికి బహుమతులు అందజేసారు. పద్మనాభం గారితోపాటు దాకమర్రి యువత కూడా కార్యక్రమాన్ని చక్కగా నిర్వహించారు.శ్రీమతి తల్లాప్రగడ అరుణ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేశారు.

**యువ వికాస్ : విజయనగరం**

విజయనగరం : ఆగష్టు 12 అంతర్జాతీయ యువజన దినోత్సవమును యువవికాస్ కార్యకర్తలు విజయనగరం సత్య డిగ్రీ కళాశాలలో నిర్వహించారు. ఉదయం 10 గం నుండి 1 గం. వరకు కార్యక్రమం జరిగింది. గీతం ఇంజనీరింగ్ కళాశాల ఛైర్మన్ శ్రీమాన్ శశిభూషణరావుగారు "వ్యక్తిత్వ వికాస శిక్షణ లో- యువత - సమయాన్ని ఎలా సద్వినియోగం" చేసుకోవాలో



తెలియజేసారు. శ్రీమాన్ రఘు, ఎన్.సి.సి. (నెహ్రూ యువ కేంద్రం యూత్ కోర్డినేటర్) మాట్లాడుతూ 'యువత ఊహా జీవితాన్ని వదలి వాస్తవిక జీవితాన్ని గడపాలన్నారు. సమస్యలకు భయపడితే జీవితాంతం బాధపడవలసివస్తుంది. యువత చదవుతోపాటు సమాజసేవలో పాల్గోవాలని తెలియజేసారు. ఈ సదస్సులో కళాశాల ప్రిన్సిపాల్ సాయిదేవమణి, ఎన్.ఎస్.ఎస్. జిల్లా ప్రోగ్రాం అధికారి సూరపునాయుడు, ప్రభుత్వ జూనియర్ కళాశాల అధ్యాపకులు, సంఘ అధ్యక్షులు గౌరి ప్రసాద్, వికాసతరంగిణి అధ్యక్షులు బి. వెంకట్రావుగారు పాల్గొన్నారు. యువ వికాస్ కన్వీనర్ ఎస్.పద్మనాభరావు, కో-కన్వీనర్ యం. రవివర్మ, సాలూరు యువవికాస్ సభ్యులు కార్యక్రమాన్ని నిర్వహించారు. ప్రతిభ కల్గిన ఐదుగురు యువతను యువి వికాస్ కార్యకర్తలు సన్మానించారు. కార్యకర్త కొయ్య మహాలక్ష్మీ గారి కుమార్తె చి॥ నీలిమ చదువుకోవడానికి రూ.3,000/- ఆర్థిక సహాయం అందించారు. సత్య కళాశాల, యం.ఆర్.కళాశాల, ఉమెన్స్ కాలేజ్, గాయత్రి కళాశాల మొదలైన అనేక కళాశాలల నుండి యువత ఉత్సాహంగా పాల్గొన్నారు. వచ్చిన వారందరికి పంచముఖ ఆంజనేయ స్వామి ఆలయకమిటీ వారు ప్రసాదాలను అందజేసారు.

**బాలాజీ నగర్ - విజయనగరం :**



వికాసతరంగిణి కార్యకర్తలు తోటపాలెం ప్రాంతంలో గురుపౌర్ణమి నుండి ప్రతి రోజూ ఒక్కొక్కరి గృహంలో సత్సంగ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. తోటపాలెం రామాలయంలో ప్రతీ ఆదివారం సాయంత్రం ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహిస్తు న్నారు. ఈ కార్యక్రమంలో 50 మంది విద్యార్థులు పాల్గొని శ్లోకాలు, భజనలు నేర్చుకుంటున్నారు. ఈ కార్యక్రమాన్ని బాలాజీ నగర్ శాఖ అధ్యక్షులు శ్రీమాన్ మందపాటి రవివర్మగారు, శ్రీమతి మందపాటి చంద్రిక, రత్నం పద్మ మొదలైన కార్యకర్తలు నిర్వహిస్తున్నారు.

**గుమ్మలక్ష్మీపురం – విజయనగరం జిల్లా**



ప్రజ్ఞా కన్వీనర్ శ్రీమతి శివ్వా రమాదేవి గారు గుమ్మలక్ష్మీపురంలో భద్రగిరి గిరిజన సంక్షేమ పాఠశాలలో ఉచిత నేత్ర వైద్యశిబిరం నిర్వహించారు. ఈ కార్యక్రమంలో 600 మంది విద్యార్థులకు డాక్టర్ నగేష్ వైద్య పరీక్షలు నిర్వహించారు. అందులో 15 మందికి కంటి అద్దములను వికాసతరంగిణి కార్యకర్తలు అందజేసారు. ఈ కార్యక్రమంలో వి.టి. అధ్యక్షులు శ్రీమాన్ సత్యనారాయణగారు, ఆరోగ్య వికాస్ కన్వీనర్ శ్రీమతి శకుంతల, శ్రీమతి గౌరి, శ్రీమాన్ శివ్వా రాజా పాల్గొన్నారు. పాఠశాల హెడ్‌మాస్టర్ శ్రీమాన్ వరహాలుగారు సహకారమందించారు.

**సాలూరు – విజయనగరం జిల్లా :**

యువవికాస్ కార్యకర్తలు సాలూరు పట్టణంలో చక్కటి సేవలందిస్తున్నారు. విజయనగరం జిల్లా యువ వికాస్ కన్వీనర్ శ్రీమాన్ పద్మనాభరావుగారు సహకారంతో యువవికాస్ కార్యకర్తలు సాలూరు పట్టణంలో గ్రంథాలయం ఏర్పాటు చేసారు. వికాసతరంగిణి కమిటీ సభ్యులు గ్రంథాలయం ప్రారంభించారు. యువవికాస్ కార్యకర్తలు పురాతన వేణుగోపాల స్వామి ఆలయాన్ని శుభ్రపరచారు. ఆదీవాసీ గ్రామాలు (ట్రైబల్) సందర్శించి గ్రామ పెద్దలను కలిసి వికాసతరంగిణి చేసే సేవా కార్యక్రమాలను గూర్చి వివరించారు.

శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో గిరిజన ప్రాంతాల్లో వికాసతరంగిణి సేవలు అందించాలని సంకల్పించింది. పెద చీపురువలస, చీపురువలస, కందిరివలస, గుంటమామిడివలస, పాచిపెంట, కోస్టు వలస, మంచాలవలస, విశ్వనాథపురం, పణుకువలస మొదలైన ప్రాంతాలలో ఉచిత కంటి వైద్య శిబిరములు, ప్రజ్ఞ మొదలైన కార్యక్రమాలను వికాసతరంగిణి కార్యకర్తలు నిర్వహిస్తున్నారు.

అంతర్జాతీయ ఆదివాసి దినోత్సవం సందర్భంగా ఆగష్టు 9న పాచిపెంట గ్రామంలో వృద్ధులకు చీరలు, పాటలలో గెలుపొందిన వారికి, దిమ్సా నృత్యం ప్రదర్శించిన వారికి బహుమతులు మరియు గిరిజన కార్యకర్తలకు జ్ఞాపికలు అందించారు. ఆ ప్రాంత గిరిజనులంతా వికాస తరంగిణి తమను ప్రోత్సహిస్తున్నందుకు హర్షం వ్యక్తం చేసారు. ఈ కార్యక్రమాన్ని విజయనగరం వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ సత్యనారాయణగారు, యువ వికాస్ కన్వీనర్ శ్రీమాన్ పద్మనాభం గారు, సాలూరు కన్వీనర్ శ్రీమాన్ విశ్వనాథ్ గారు నిర్వహించారు.



**కొండవెలగాడ:**

వికాసతరంగిణి కార్యకర్త శ్రీమాన్ రమణ గ్రామస్తుల సహకారంతో 20మంది ఏ ఆధారం లేని వృద్ధులకు బియ్యం, కందిపప్పు మొదలైన నిత్యావసర వస్తువులను అందజేస్తున్నారు. జరజాపుపేట వికాసతరంగిణి కార్యకర్తలు వెలగాడ గ్రామస్తులకు నిత్యావసర వస్తువులు అందించారు.

**జరజాపుపేట – విజయనగరం జిల్లా :**

8 ఆగష్టు 2014 వికాసతరంగిణి కొండవెలగాడ కార్యకర్త శ్రీమాన్ భోగాపురపు రమణ, మిమ్స్ మెడికల్ కాలేజీవారి సహకారంతో ఉచిత కంటి వైద్య శిబిరాన్ని నిర్వహించారు. 130 మందికి పరీక్షలు జరిపి 25 మందికి ఆపరేషన్లు నిర్వహించారు. శ్రీమాన్ మాతా గోపి దంపతులు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

**రాజాం :**

శ్రీ టంకాల రమణమూర్తి గారు (బుస్కీమాస్టారు) జూలై నెల యోగ శిక్షణ తరగతులను రాజాం వికాసతరంగిణి కార్యాలయంలో నిర్వహించారు. ముఖ్య అతిథిగా రాజాం సర్కిల్ ఇన్‌స్పెక్టర్ సి. అంబేద్కర్, సబ్ ఇన్‌స్పెక్టర్లు జి. ప్రభాకరరావు, కె. అప్పలనాయుడు, రెడ్ క్రాస్ ఛైర్మన్ సాయి ప్రసాంత్ పాల్గొన్నారు. యోగ శిక్షణ ముగింపు సమావేశమునకు ముఖ్య అతిథిగా రాజాం ఎమ్మెల్యే కంబాల జోగులు పాల్గొన్నారు. కోయిన్ బాక్స్‌ల ద్వారా అందిన ద్రవ్యం రూ. 24,000/- (ఇరవై నాలుగు వేల రూపాయలు) నేత్ర విద్యాలయ నిర్వాహకులకు అందజేసారు. నేత్ర విద్యాలయ కరస్పాండెంట్ శ్రీమాన్ ఎం.ఎస్. రాజుగారు మరియు కమిటీ సభ్యులు కృతజ్ఞతలు తెలియజేసారు.



**కవిటి కొత్తూరు – శ్రీకాకుళం జిల్లా :**

కవిటి మండలం కవిటి కొత్తూరు గ్రామం శ్రీ సీతారామస్వామి దేవాలయంలో ఆగష్టు 8వ తేదీ శుక్రవారం వరలక్ష్మీ పూజలను నిర్వహించారు. ఆలయ భక్త బృందం వికాసతరంగిణి సభ్యులు ఈ కార్యక్రమం నిర్వహించారు. లజపతి స్వామి సహస్రనామార్చన నిర్వహించారు. వికాసతరంగిణి కన్వీనర్ బి. వకీలు రాంబాబు వికాసతరంగిణి గూర్చి తెలియజేసారు.

# మహిళా ఆరోగ్య వికాస్ నిర్వహించిన కార్యక్రమములవివరములు

29-06-2014 న శ్రీమతి మాధవీరవీంద్ర గారి నేతృత్వంలో గుంటూరు జిల్లా సత్తెనపల్లి దగ్గరలోని నందిగం గ్రామంలో శ్రీమతి రాజశ్రీ, పద్మావతి గార్లు ఏర్పాటుచేసిన ఉచిత మహిళా వైద్యశిబిరానికి మంచి స్పందన లభించింది. ఈ శిబిరానికి 110 మంది మహిళలు హాజరవగా 81 మందికి V.I.A పరీక్షలు నిర్వహించటమయినది. వీరిలో నుండి 11 మందికి N.R.I హాస్పిటల్ లోని జీయర్ ట్రస్ట్ నందు ఉచిత వైద్య పరిక్షలు నిర్వహించగా వెంకాయమ్మ అనే మహిళ వెంటనే ఆపరేషన్ చేయించుకోవట మయినది. లక్ష్మి, రత్తమ్మ ఇద్దరు మహిళలకు హిస్త్రోస్కోపి మరియు



బయాప్సీ చేయటమైనది. ఆ గ్రామంలో ఈనాడు విలేఖరి అయిన ప్రహ్లాద రావు గారు స్క్రినింగ్ టెస్ట్ యొక్క ఉపయోగాన్ని లాప్ టాప్ ద్వారా పరిశీలించి ఇంత మంచి కార్యక్రమాన్ని నిర్వహింప చేస్తున్న శ్రీ స్వామి వారికి పాదాభి వందనాలను తెలియచేయటమే కాక, మహిళలు తెలుసు కునే విధంగా దినపత్రికలో మంచి కథనాన్ని ప్రచురించారు. ఈ శిబిరంలో నందిగం ప్రెసిడెంట్ కొల్ల సుబ్బారావు గారు మరియు చైతన్యా మహిళా ఆరోగ్య వికాస్కార్యకర్తలైన రత్నమాల, శ్రీమతి జయలక్ష్మి, ఆదిలక్ష్మి, సత్యవతి, కమల, వాణి, చంద్రకళ, పొలాసు వెంకటరమణగార్లు తవ సహకారాన్ని అందించారు.

22-07-2014 న విజయనగరం జిల్లా ఆరోగ్య వికాస్ సమన్వయకర్త శ్రీమతి శకుంతల గారి నిర్వహణలో కనపాక గ్రామములోని యూత్ హాస్టల్ నందు ఏర్పాటు చేసిన ఉచిత మహిళా వైద్య శిబిరానికి 126 మంది మహిళలు హాజరైనారు. 59 మందికి మహిళలకు డాక్టర్ సుధాకుమారి గారు V.I.A పరిక్షలు నిర్వహించారు. 15 మంది ఆరోగ్య వికాస్ కార్యకర్తలు పాల్గొన్నారు. ఈ శిబిరంలో పాల్గొన్న మహిళలందరికి శ్రీమాన్ చెరుకూరి శ్రీధర్ గారు ఉచితంగా మందులు అందచేసారు.

21-07-2014 న శ్రీమతి మధవీరవీంద్ర గారు కృష్ణాజిల్లా, గంపలగూడెం లోని వికాస తరంగిణి కార్యకర్తలకు మహిళా ఆరోగ్య శిబిరాల యొక్క ప్రాముఖ్యతను వివరించి, వారిలో అవగాహన కలిగించి సర్వే చేయు విధానాన్ని తెలియచేయట మైనది. కార్యకర్తలు వెనువెంటనే స్పందించి,వారి ప్రాంతంలో స్వయంగా వారే సర్వేనిర్వహించుకొని శిబిరాన్ని ఏర్పాటు చేసుకొనుటకు ముందుకు రావటం అభినందనీయం.

27-07-2014 న గంపలగూడెం వికాసతరింగిణి నిర్వాహకులు శ్రీమతి జయప్రదా కోటేశ్వర రావు గారు, సీతారామ దేవస్థాన కళ్యాణ మండపంలో ఏర్పాటు చేసిన ఉచిత మహిళా వైద్య శిబిరానికి 116 మంది మహిళలు హాజరుకాగా 71 మందికి V.I.A పరిక్షలు నిర్వహించటమైనది.7 మహిళలకు తదుపరి పరిక్షలు నిర్వహించగా ఇద్దరు మహిళలకు నాగలక్ష్మి, సీతారావమ్మ వెంటనే



ఆపరేషన్ చేయటమైనది. మిగిలిన వారికి బయాప్సీ పరీక్ష చేయటమైనది. ఈ శిబిరంలో వికాసతరంగిణి సెక్రటరీ శ్రీమతి కృష్ణ కుమారి గారు, కోస్టల్ ఏరియా బ్యాంకు మేనేజర్ శ్రీనివాస గారు మరియు వికాసతరంగిణి కార్యకర్తలు, విజయవాడ చైతన్య ఆరోగ్య వికాస్ కార్యకర్తలు పాల్గొన్నారు.

27-07-2014 న గంపలగూడెం శిబిరాన్ని సందర్శించిన పత్రికావిలేఖరులైనప్రసాదరావు గారు, భానుమూర్తి గారు ఈనాడు, ఆంధ్రజ్యోతి మన స్వామి వారు నిర్వహింప చేసి ఆరోగ్య శిబిరాల ఆవశ్య కతను గ్రహించి, మహిళలల గురించి పత్రికలలో ప్రత్యేక కథనాన్ని ప్రచురించారు. మండలం లోని అన్ని ప్రాంతాలలో మహిళా ఆరోగ్య అవగాహన సదస్సులు ఏర్పాటు చేయవలసినదిగా కోరారు.

ఇందులో భాగంగా 3-08-2014 న ఊటుకూరు గ్రామంలో 450 మంది మహిళలను సమీకరించి వారికోసం ఒక సదస్సు ఏర్పాటుచేసారు. ఈ సదస్సుకి ఆ గ్రామ మహిళా సర్పంచ్ నిర్మల గారు మరియు మండల తెలుగు అధ్యక్షురాలైన చెన్నా రామలక్ష్మిగార్లు పాల్గొన్నారు. మహిళలలో ముందు అవగాహన కలిగించి తరువాత శిబిరాన్ని కూడా ఏర్పాటుచేస్తున్నారు.



10-08-2014 న విజయవాడలోని పోరంకి లో శ్రీమతి మాధవిరవీంద్ర గారి నిర్వహణలో ఏర్పాటుచేసిన ఉచిత మహిళా వైద్య శిబిరాన్ని స్థానిక బోడే ప్రసాద్ గారు జ్యోతి ప్రజ్వలనతో ప్రారంభించారు. ఈ శిబిరానికి 91 మంది మహిళలు హాజరుకాగా 39 మందికి V.I.A పరిక్షలు నిర్వహించటమైనది. 8 మంది మహిళలకు N.R.I హాస్పిటల్ లోని జీయర్ ట్రస్ట్ ద్వారా తదుపరి పరిక్షలు చేయించగా, ఒక మహిళకు బ్రెస్ట్ సర్జరీ, ఇద్దరికీ గర్భసంచి ఆపరేషన్ వెంటనే చేయాలనీ డాక్టర్లు సూచించారు. ఈ శిబిరానికి మన వికాసతరంగిణి సభ్యులైననశ్రీమాన్ తోటకూర రామకృష్ణ గారు, స్థానిక సంఘ సేవకులు అనుమోల ప్రభాకర్ గారు, డాక్టర్ అమ్మని గారు మరియు చైతన్య ఆరోగ్య వికాస్ కార్యకర్తలు తమ సహకారాన్నిఅందించారు.

శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో 2007లో ఏర్పడిన మహిళాఆరోగ్యవికాస్ ఎందరో మహిళలకు ఆరోగ్యప్రదాతగా నిలచింది. ఈసేవా కార్యక్రమమునకు విశేషస్పందన లభిస్తోంది. ఎంతోమంది మహిళలు తమ రుగ్మతలను తొలగించుకొని ఆరోగ్యవంతులైనారు. ఈశిబిరాలయొక్క ప్రాముఖ్యతను సాటిమహిళలకు తెలియచేసే ఉద్దేశంతో వారియొక్క అనుభవాన్ని ప్రచురిస్తున్నాం.



నాపేరు ఆవుని వయస్సు35సం॥ శ్రీస్వామివారిద్వారా జరిగే మహిళా ఆరోగ్యవికాస్ శిబిరాన్ని మిర్యాలగూడ వి.టి వారు హౌసింగ్ బోర్డుకాలనీలో ఏర్పాటుచేశారు. నేను ఈశిబిరంలో అనుకోకుండా పరీక్ష చేయించుకున్నాను. చిన్నివయస్సులో నాకేమి ఉంటుందిలే అనుకున్నాను. వివాహం అయిన ప్రతిమహిళా సంవత్సరానికి ఒకసారి స్క్రీనింగ్ టెస్ట్ చేయించుకోవాలి అని ఆరోగ్యవికాస్వారు చెప్పగా ఈపరీక్ష చేయించుకున్నాను. స్క్రీనింగ్ టెస్ట్ చేసిన వెంటనే శ్రీమతి మాధవీ రవీంద్రగారు నాకు ColpoScope లో నాగర్భసంచి ముఖద్వారానికి ఉన్న ఇన్‌ఫెక్షన్‌ని చూపించి వెంటనే డాక్టర్‌ని కలవమని సూచించారు. డాక్టర్‌ని కలసిన వెంటనే నాకు ఆపరేషన్ చేయాలని హైదరాబాద్ బసవతారకానికి పంపించారు. క్యాన్సర్ మొదటిదశలోనే ఉందని నాకు ఆపరేషన్ చేశారు. ప్రస్తుతం నేను చాలా ఆరోగ్యంగా, సంతోషంగా ఉన్నాను. నన్ను ప్రాణాపాయం నుండి కాపాడిన శ్రీస్వామి వారికి అనేక నమస్కారాలు తెలియజేస్తున్నాను. మహిళ లందరికీ నా విజ్ఞప్తి. నా అనుభవం ఆధారంగా మహిళందరూ స్క్రీనింగ్ టెస్ట్ చేయించుకుని మీకుటుంబాన్ని తద్వారా సమాజాన్ని కాపాడమని ప్రార్థిస్తున్నాను.

## జెట్ (ఎస్) నిర్వహించిన గిరిజన పాఠశాలల ఉపాధ్యాయుల శిక్షణశిబిరం – జీవా

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్నశ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి మంగళాశాసనములతో జీయర్ విద్యాసంస్థల ఉపాధ్యాయులకు "నిరంతర సమగ్ర మూల్యాంకనం" పై మే 15.5.14నుండి 30.5.14 వరకు రాష్ట్ర విద్య, పరిశోధన, శిక్షణసంస్థ, ఆంధ్రప్రదేశ్ వారిచే మొదటి విడత శిక్షణ శిబిరం నిర్వహించబడినది.

విద్యార్థుల శారీరక, మానసిక వికాసానికి వారి నైపుణ్యాలను సామర్థ్యాలను నిత్యజీవితంలో అన్వయించుకునే విధంగా ఉపయోగపడేటందుకు "నిరంతర సమగ్ర మూల్యాంకనం రెండవ విడత" శిక్షణశిబిరం 26.7.14 నుండి 29.7.14 వరకూ శ్రీస్వామివారి ప్రత్యక్షపర్యవేక్షణలో నిర్వహించబడినది. రాష్ట్రవిద్య, పరిశోధన, శిక్షణసంస్థ నుండి శ్రీమాన్ సువర్ణ వినాయక్ గారి బృందంవారు శిక్షణిచ్చారు. ఉపాధ్యాయులకు బోధనా మరియు పాఠ్యాంశములలో, మూల్యాంకనములో వచ్చిన మార్పులకు అనుగుణంగా అందిన శిక్షణవారి,వారి విశ్వాసపు స్థాయిలను పెంచటంలో బాగా రాణించింది.

శిక్షణ శిబిరం ఇంఛార్జ్ శ్రీమతి కృష్ణకుమారిగారు శిక్షణ–శిబిర నిర్వహణని చక్కగ నిర్వహించారు. శ్రీస్వామివారు, దేవనాథజీయర్ స్వామివార్ల మంగళాశాసనములతో శిక్షణ–శిబిరం సుసంపన్నమైనది.



# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన **ఆగస్టు నెల సమాధానాలందాయి.** విజేతల పేర్లు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం! *గతనెల సమాధానాలు 31వ పేజీలో ఉన్నాయి.*

**ప్రశ్నలు** **సమాధానాలు**

1. భారతీయ మిశ్రమ సంస్కృతిలో ప్రధాన భాగస్వామ్యం ఎవరిది?
2. తత్త్వమసి అనే వాక్యంలో ఎన్నిపదాలున్నాయి?
3. లోకంబులు ఇత్యాది పద్యం ఎవరిది?
4. మత్స్యరాజులను నిగ్రహించిన సందర్భం ఏది?
5. చాతుర్మాస్యంలో స్వామివారు ఏగ్రంథంపై ప్రవచనాలు ఇస్తున్నారు?
6. 'ఆఱు' అంటే అర్థమేమిటి?
7. రామానుజులు తమ హస్తాన ధరిస్తున్నది ఏమిటి?
8. 'అంజుపొరుళ్' అన్న శబ్దం ఏ అభిప్రాయాన్ని చెపుతుంది?
9. 'మెయ్' అనే ద్రావిడపదానికి ఎన్ని అర్థాలున్నాయి?
10. తులసికి చివర ఎవరున్నారు?
11. 'అంగుష్ఠమాత్ర' అనే మంత్రం ఏ ఉపనిషత్తులోనిది?
12. దుర్యోధనాదులు మయసభావిశేషాలు చూస్తూ ఎక్కడ ఉండిపోయారు?
13) శరీర వియోగానంతరం కూడా ఉండేది ఏది?
14. రామానుజులు తిరుమల ఆలయానికి ఏ ఆగమప్రక్రియలో సంప్రోక్షణ గావించారు?
15. ఈ నెల రామానుజ చిత్రకథలో ప్రచురించిన సంవాదం ఎవరిది?
16. షడ్విధ శరణాగతిలో ప్రధానమైనది ఏది?
17. శ్రీరంగం నాల్గోవ ప్రాకారం నిర్మించేడప్పుడు అడ్డువచ్చిన గృహం ఎవరిది?
18. శ్రీకృష్ణుడు గరుడునికి చెప్పిన రహస్యం ఏ పురాణంలోనిది?
19. పెద్దస్వామివారు 1970లో రిజిష్టర్ చేయించిన ట్రస్ట్ పేరేమిటి?
20. శరీరంలోని త్రిదోషాలను సరిచేయడానికి ఎంతసేపు ఆక్యూప్రెషర్ చేయాలి?
21. అన్నకోశంలోని జిగురు పొరలో ఎన్ని రకాల కణాలు ఉంటాయి?

మీ చిరునామా
..............................................
..............................................

శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో పూర్తిగా సమాధానించిన విజేతల పేర్లు:
పూర్ణచంద్రరావు- రాజమహేంద్రి, ఎ.వి. రాఘవాచార్యులు - బొబ్బిలి, టి. సుధీర - నెల్లూరు

**సూచన:** సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్లు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.
భక్తినివేదన సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః

68 సం॥ల నుండి భగవద్బంధువులు ఆదరిస్తున్న...

ప్రారంభం - ఏప్రిల్ 1947

# భక్తినివేదన

## ఆధ్యాత్మిక మాసపత్రిక








సంపుటి 67

అక్టోబర్ 2014

శ్రీజయనామ సంవత్సర అశ్వయుజమాసము

సంచిక 7


## పంచాంగ వివరములు

అక్టోబర్:

8. శరత్పూర్ణిమి, వాల్మీకిజయంతి
11. చిత్తకార్తె
15. అష్టమితిథి
16. శూన్యతిథి
18. తులాసంక్రమణము ఉ.7-14. 19. సర్వేషామేకాదశి
22. నరకచతుర్దశి స్నానం ఉదయాత్పూర్వము 4 గం॥ల నుండి మంగళహారతులు, దీపావళి
23. ధనలక్ష్మీపూజ, కేదారవ్రతం పిండపితృయజ్ఞము, అమావాస్య.
24. శ్రీశ్రీశ్రీ త్రిదణ్డి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి వారి తిరు, స్వాతికార్తె
25. ధన్వంతరి ద్వితీయ, చిత్రగుప్త జయంతి
27. నాగచతుర్థీ వల్మీకపూజా
28. మణవాళ మహామునుల తిరు
29. సెనైమొదలియార్‌తిరు
30. యాజ్ఞవల్క్య జయన్తి
31. పొయిఘయాళ్వార్ తిరు, పిళ్ళైలోకాచార్యర్‌తిరు

నవంబర్:

1. పూదత్తాళ్వార్‌తిరు, తిరుమలైయ్యాండాన్‌తిరు
2. పేయాళ్వార్ తిరు
3. సర్వేషామేకాదశి
4. చిలుకుద్వాదశి, తులసీవివాహం, క్షీరాబ్దిపూజ, చాతుర్మాస్య వ్రత సమాప్తి


వ్యవస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి

శ్రీ.ఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. రంగరామానుజాచార్యులు

ఉప సంపాదకులు

శ్రీమతి డా॥ T.K. చూడామణి

D.T.P & Design by:

పరిశోధనాలయం - సీతానగరం.

పరిశోధన-ప్రకాశన విభాగం

జీవా - శ్రీరాంనగర్

చందావివరాలు :-

సంవత్సరచందా రూ.225/-

విదేశాలకు సంవత్సరచందా $30/-

ఖిా సేవలో....

భక్తినివేదన, సీతానగరం - 522 501,

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : jetsitanagaram@yahoo.com

Internet : www.chinnajeeyar.org


## విషయసూచికా




| | | |
|---|---|---|
| *Printed & Published by* | : | H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust** |
| *Printed & Published at* | : | **Srijman Printers & processors** : C/o JET, Sitanagaram - 522 501, Guntur Dist., Andhra Pradesh. |
| *Editor* | : | Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh. |

సంపాదకీయం

# భయం, రాగం, వైరాగ్యం, యోగం...



భయం, రాగం, వైరాగ్యం, యోగం అనే పదాలు మనం తరుచు వాడుతూ ఉంటాం. లోకంలో ఈ పదాలకు, వాటి అర్థాలకు పెద్దగా ప్రాధాన్యం ఉన్నా లేకపోయినా వేదాన్త పరిభాషలో ఈ పదాలకు ఎంతో ప్రాధాన్యం ఉన్నది.

ఈ సంసారంపట్ల భయం, దీనిపట్ల రాగం, దీనిపట్ల వైరాగ్యం, సాంసారిక ప్రవృత్తుల్లో యోగం అనేవి విభిన్న సంస్కారాలకు చెందినవి. ఈ సాంసారిక ప్రవృత్తులన్నీ 'కర్మ'రూపాలు. ఈ కర్మలకు సంస్కారాలు ప్రేరకాలు. వెనుకటి సంస్కారాలచేత ప్రేరింపబడిచేసే మంచి చెడుకర్మలమూలంగ, ఏర్పడ్డ జీవనమే సంసారం అని చెప్పబడుతుంది తప్ప మరేమీకాదు.

ప్రస్తుతం మనం పెద్దగా వేదాన్తం గురించి మాట్లాడుకోనక్కర్లేదు కాని, కొంత ప్రాథమిక అవగాహన కోసం కొన్ని మాటలు అనుకోవడం అవసరం. జీవుడనేవాడు, తాను చేసుకొన్న పుణ్యపాపాల మూలంగా మనుష్య, పశుపక్ష్యాది జన్మలనెత్తి, తదనుకూలదేహాలను పొందుతాడు. అజ్ఞానంచేత, దేహంకంటే తాను (జీవుడు) వేరని తెలిసికోలేక, ఈ దేహమే తాను అనే భ్రాంతితో వ్యవహారం సాగించుతాడు. దానివల్ల సుఖదుఃఖాలనుభవించడం అనేదాన్ని **'సంసారం'** అని శాస్త్రం చెబుతుంది. ఒక్కమాటలో చెప్పాలంటే మనం ఈ ప్రపంచంలో మనుగడ సాగించడానికి చేసే అన్ని రకాల వ్యవహారాలూ **"సంసారం"** క్రిందనే పరిగణింపబడతాయి. వాటివల్ల కలిగే సుఖదుఃఖాలుకూడా సంసారంలో భాగమే. ఇలాంటి నిత్యసంసారంలో మనుగడ సాగిస్తూ సాగిస్తూ, ఇదిచాలా క్లేశభూయిష్ఠమైందని గమనించి, ఎదుర్కోవలసిన సమస్యల్ని ఎదుర్కోలేక భయపడిదూరంగా పారిపోదామనే ధోరణి కలవారంతా **"సంసారభీతు"**లు.

ఇలాంటి వారి గురించే భవభూతి, ఉత్తరరామచరిత నాటకంలో ఇలా అన్నాడు. **'ఏతే హి హృదయమర్మచ్ఛిదః సంసారభావాః, యేభ్యో బీభత్సమానాః సంత్యజ్య సర్వాన్ అరణ్యే విశ్రామ్యంతి మనీషిణః"** అని. ఈ సాంసారికభావాలు (ప్రేమానురాగాదులు) హృదయమర్మాన్ని ఛేదించేవి. వీటివల్ల భయపడి అందర్నీ విడచిపెట్టి అరణ్యాలలో విశ్రాంతి తీసికొంటారు బుద్ధిమంతులు". అని దీని అభిప్రాయం. ఇక్కడ వాస్తవానికి వైరాగ్యంకంటే సంసారభయమే వీరు సమాజాన్ని విడిచిపోవడానికి కారణమని స్పష్టమే కదా! వీరిని **'మనీషులు'** అని కవి సంభావించినా, వాస్తవానికి ఇలాంటి వారంతా ఈ సంసారం కొనసాగించడానికి భయపడే పలాయన పరాయణులన్నమాట. ఇలాంటివారిలోని దుర్బలహృదయులు కొందరు **'ఆత్మహత్య'** లకు కూడా పాల్పడతారు. ఇది హృదయదౌర్బల్యానికి చెందిన విషయం.

ఎంతటివారికైనా ఇలాంటి పలాయనదశ తటస్థపడటం ఉంటుంది. ఈ మనఃప్రవృత్తినే శ్రీరామాయణంలోని సుందరకాండలో హనుమంతుడు సీతమ్మ ఇద్దరూ ఎదుర్కొన్నారు. అయినా వారికిగల దృఢసంస్కారం వారిని ఈ దుర్బలస్థితినుంచి బయటపడవేసింది. సాంసారిక సమస్యలను ఎదుర్కోవడం సర్వసామాన్యమే అయినా, పరిష్కరించుకోగల సామర్థ్యం కొందరికే ఉంటుంది. అదిలేనివారికి పలాయనవాదమే శరణ్యం.

ఇక ఈ సంసారంలోని రెండవప్రవృత్తి **'రాగం'.** అంటే వల్లమాలిన ప్రీతి అన్నమాట. ఎన్ని సమస్యలు వచ్చినా వాటిని ఎదుర్కోవడం, అవసరమైతే కష్టసుఖాలు అనుభవించటానికి సిద్ధపడటం, ఈ సాంసారిక అనుభవమే పరమార్థమని భావించి సంసారాన్ని 'రసంగా' ఆస్వాదించడం కొందరినైజం. వీరికి సంసారభీతి ఏ కోశానా ఉండదు. ప్రీతే ఉంటుంది. లౌకికసుఖభోగాల కోసమే తమసర్వస్వాన్ని వెచ్చించే స్వభావంవీరిది. ఇలాంటివారే కొందరు నైతికసూత్రాలను ఆలంబించి జీవనంసాగిస్తారు. వీరు పలాయన పరాయణులు కాకపోయినా, దృఢ సంసారానురక్తులు.

ఇక మూడవరకమైన ప్రవృత్తి, ఈ సాంసారిక వ్యవహారం జీవనంపట్ల వైరాగ్యం. అంటే ఏహ్యభావన. దీన్ని దోషంగాచూచి, ఈ దుఃఖభాజనమైన సంసారపంజరంలో చిక్కుకోకూడదనే దృఢభావనతో, దీన్ని పూర్తిగా విడచి దూరంగా ఎక్కడో, జనసంచారానికి అందకుండా, వైయుక్తిక అనుష్ఠానంతో కాలం వెలిబుచ్చే స్వభావం. వీరికి సమాజజీవనం అసలుపట్టనే పట్టదు. ఒక విధంగా చెప్పాలంటే ఇది నేలవిడచినసాము. పరోక్షమైన పలాయనవాదమే. ఇలాంటి మనఃస్వభావం కలవారికి ఈ సాంసారిక జీవనవిధానం గందరగోళంగా అనిపిస్తూ దీనికి దూరంగా ఉండాలనుకుంటారు వీరు. ఇలాంటి మనస్తత్వాన్ని కాళిదాసు అభిజ్ఞానశాకున్తలనాటకంలో శారద్వతుడనే మునిద్వారా చెప్పించాడు.

**అభ్యక్తమివస్నాతః శుచిరశుచిమివ ప్రబుద్ధఇవసుప్తమ్ ।**

**బద్ధమివ స్వైరగతిః జనమిహ సుఖసంగినమవైమి ॥**

స్నానం చేసినవాడు నూనె పూసుకున్నవానిని, శుచిగా ఉన్నవాడు అశుచిగా ఉన్నవాణ్ణి, మేల్కొన్నవాడు నిద్రపోతున్నవాడిని, స్వేచ్ఛగా సంచరించేవాడు కటకటాల్లో బంధింపబడినవాడిని చూస్తే

ఎలా అనిపిస్తుందో ఈ సుఖలాలసులైన జనులను చూస్తే నాకలా అనిపిస్తోంది అంటాడు శారద్వతుడు. అయినా వీరికి సంసారభయంకంటే, సంసారప్రవృత్తి పట్ల ఏర్పడిన ఏహ్యాభావనయే వీరిని ఇలా చేస్తుంది. ఇక్కడ శాస్త్రవివేకంకూడా దోహదకారి అవుతుంది.

ఇక నాల్గవది యోగం. అంటే సాంసారిక జీవనాన్ని అవగాహనం చేసికొని, ఇందులో చిక్కుకోనివిధంగా సర్వవిధ ప్రవృత్తుల్ని చాల మెళకువతో, కౌశలపూర్ణంగా కొనసాగించడం. వీరికి **'యోగఃకర్మసుకౌశలమ్'** అన్న గీతావచనం బాగా అవగాహనలో ఉండటమేకాక ఆచరణంలోకూడా ఉండటం విశేషం. వీరికి తాముచేసే సాంసారిక వ్యవహారాలన్ని, తమకు అంటకుండా ఉండేలాచేసే విధానంపట్ల అవగాహనం ఉన్నదన్నమాట. ఏమిటా అవగాహన? చేసే ఏ కర్మైనా, భగవత్ప్రీతికోసమే చేస్తున్నాంతప్ప వ్యక్తిగత ప్రయోజనానికి కాదన్నభావన దృఢంగా ఉంటుంది. కనుక, తాము చేయవలసిన పనులను భయంతో మానడమో, లేక వైరాగ్యభావనతో పూర్తిగా విడిచిపెట్టడమో చేయరు. శాస్త్రం చేయాలని విధించిన సత్కర్మలను చేసి, ఫలాన్ని పరమాత్మకు విడిచిపెడతారు. శాస్త్రం చేయవద్దన్న కర్మలను చేయకుండా, విడిచిపెడతారు. ఇలా వివేచనతో కర్మాచరణం సాగించడమే "యోగం". దీన్నే కర్మయోగం అనికూడా అంటారు.

ఈ భావననే భగవద్రామానుజులు తమగ్రంథాల్లో ప్రతిబోధించారు. ప్రతిమనిషికి తప్పనిసరిగా తన వర్ణానికి ఉచితాలైనకర్మలు కొన్ని ఉంటాయి. తాము ఏ దశకు చెంది ఉన్నారో అంటే బ్రహ్మచర్యం, గృహస్థత్వం, వానప్రస్థం, యతిధర్మం అనే నాలిగింటిలో ఏ స్థితికలిగి ఉన్నారో దానికి తగిన కర్మలు కొన్ని ఉంటాయి. ఈ రెండురకాల కర్మల ఆవశ్యకతను ఎరిగి వాటిని భగవదర్పణ బుద్ధితో నిర్వహించే మనఃప్రవృత్తిని అలవరుచుకొని చేయడమే, **'ఫలాభిసంధి లేకుండా చేసే కర్మాచరణం'**గా శ్రీగీత చెప్పింది. సంగంలేని కర్మాచరణను ఆశ్రయించడమే కర్మయోగమన్న మాట.

తానాచరించే కర్మచేతనే భగవంతుని ఆరాధించి సిద్ధిని పొందే విధానమే ఇది. **'స్వకర్మణాతమభ్యర్చ్య సిద్ధింవిందతి మానవః'** అన్న గీతావచనానికి ఇదే అభిప్రాయం.

ఇలా ఆచరించేవారు గృహస్థులుగా ఉండవచ్చు. వీరిదీ యోగమే. ఇక, చిట్టచివరిదైన యతిధర్మాన్ని లేదా సన్యాసాశ్రమాన్ని స్వీకరించినవారూ ఇలా ఉండవచ్చు. కర్మను భగవదర్పణబుద్ధితో ఆచరించే విధానాన్ని అలవరచుకోవడం యోగంలో సర్వోత్తమస్థితి. ఈ స్థితినే రామానుజులు అనుసరించారు. పూర్వస్థితిలో అలవడిన యోగమే యతిధర్మాన్ని ఆశ్రయించినందున, మరింత పరిపూర్ణం అవుతుంది.

**'యతిధర్మం'** వ్యక్తిగతవ్యవస్థకు అతీతమైనది. విశ్వజనీనభావన ఈ ధర్మాన్ని ఆశ్రయించినవారికి ఏర్పడుతుంది. నిజానికి యతి, సర్వసంగపరిత్యాగి కనుక, ఆయనకు ఏ కర్మ సంబంధమూ ఉండదు. అయినా, ఈ సమాజంలోనే యతులూ ఉంటున్నారు కనుక, తామున్న సమాజపు మంచి చెడులకు, అవసరాలకు ప్రతిస్పందించి, దీనులను ఆదుకోవలసిన బాధ్యత తప్పనిసరిగా ఉంటుందని భగవద్రామానుజుల జీవితమే మనకు నేర్పుతుంది. నిజానికి ఏ సంప్రదాయానికి చెందిన ఆచార్యులకైనా యత్యాశ్రమస్థితిలో విశ్వజనీనత చాలా అవసరం. సమాజం పట్ల ప్రతిస్పందించగల స్వభావం తప్పనిసరిగా ఉండాలి. అదృష్టవశాత్తు మన దేశంలో ఆధ్యాత్మిక జీవనాన్ని ప్రచారంచేసే ఎన్నో మఠాలు నిర్వహించే యతీశ్వరులకు, సమకాలీన సమాజక్షేమంపట్ల అవగాహనం, ప్రతిస్పందించే స్వభావం ఉంది. కనుకనే, యతీశ్వరులచే నిర్వహింపబడుతున్న ఆశ్రమాలకు ఆధ్యాత్మిక జీవనాన్ని అలవరచడంతో పాటు, ఉత్తమ సామాజికతకు కావలసిన నైతిక మూల్యాల ప్రతిబోధనం, సామాజికావసరాలకు ప్రతిస్పందించడం ప్రధానకృత్యం అయింది ఈనాడు. శంకర, రామానుజాదుల త్యాగమయ జీవనాలు సామాజిక స్పృహతో సాగి ఉండకపోతే వారు ప్రతిబోధించిన తాత్త్వికభావజాలం విశ్వపరివ్యాప్తం అయిఉండేది కాదుకదా! కనుక, సన్యాసాశ్రమాన్ని**'యోగ'** పరాకాష్ఠగా మనం చెప్పవచ్చు. అలాగే ఉండాలి. మన వైదికధర్మప్రతిబోధకులైన మతప్రవక్తలు అలాంటివారే కావడం ఈ దేశం చేసుకున్న మహాపుణ్యమే కదా! అస్తు.

**వేంకట రంగరామానుజాచార్య**





# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

**అర్జునుడు కృష్ణవియోగాన్ని భరించలేక ఆయన వైభవాన్ని కీర్తిస్తున్నాడు.**

**యత్తేజసా నృపశిరోంఘ్రిమహన్ మఖార్థే**
**ఆర్యోఽనుజస్తవ గజాయుత సత్త్వవీర్యః ।**
**తేనాహృతాః ప్రమథనాథ మఖాయ భూపాః**
**యన్మోచితాః తదనయన్ బలిమధ్వరే తే ॥**

జరాసంధవధసన్నివేశాన్ని గుర్తుచేస్తున్నాడు అర్జునుడు. మహాభారతంలో ఈసన్నివేశం విస్తారంగా వర్ణింపబడింది. ధర్మరాజు స్వర్గంలోని తనతండ్రి, నారదముఖంగా పంపిన సందేశాన్ని అనుసరించి, రాజసూయయాగం చేయాలనుకున్నాడు. ఇది చాలా కష్టమని, దీని పర్యవసానంగా బహునృపతికలహం కూడా ఏర్పడవచ్చని నారదాదులు ప్రతిబోధించారు. అయినా పితృప్రీతిచేతను, తాను "సమ్రాట్టు" కావాలనే కాంక్షచేతను, ధర్మరాజు "కృష్ణా! నేను సమ్రాట్టు కాగోరుతున్నాను" **(సమ్రాట్ భవేయం కృష్ణాహమ్-భార)** అని ప్రార్థించాడు. దానికి కృష్ణుడు సమాధానం చెబుతూ, "రాజసూయం చేయడానికి సమ్రాట్టు కావడం తప్పనిసరి అయినా, ఈనాడు సమ్రాట్టుగా జరాసంధుడు ఉన్నాడు కనుక, ఆతనిని నిగ్రహించకుండా ఎవ్వరూ 'సమ్రాట్త్వ'దాన్ని పొందజాలరు. కనుక, ముందుగా జరాసంధనిగ్రహణానికి ఉపాయాన్ని ఆలోచించి, ఆతనిని సంహరించు అని చెప్పాడు. భీమార్జునులతో స్వయంగా జరాసంధుని వద్దకువెళ్ళి ఆతనిని భీముని ద్వారా నిగ్రహింపజేశాడు స్వామి. అక్కడ జరాసంధుని దౌష్ట్యాన్ని దురాచారాన్ని ఉద్ఘోషించి, జరాసంధవధ న్యాయ్యమేనని నిరూపించాడు. జరాసంధుడు పరమశివ ప్రీతికోసం తానాచరిస్తున్న యాగంలో యువకులైన రాజకుమారులను బలివ్వడం కోసం, వారిని బంధించి తెచ్చి కారాగారాల్లో పడవేసి ఉంచాడు. ఇది పెద్ద దురాచారమని, ఏ మనిషీ మరొక మనిషిని దేవతా ప్రీతికై బలివ్వరాదని నిర్ద్వంద్వంగా ఆతడు చేస్తున్న అకృత్యాన్ని నిందించాడు స్వామి. ఈప్రస్తుత భాగవత శ్లోకంలో ఆసన్నివేశాన్ని గుర్తుచేస్తున్నాడు అర్జునుడు.

'అన్నయ్యా! తానుచేసిన రుద్రయజ్ఞంలో బలివ్వడానికి నిగ్రహించి తెచ్చిన రాజకుమారలోకాన్ని విడిపించి ఏ మహానుభావుని తేజస్సుచేత, రాజలోకానికి తలమానికమై రాజుల శిరస్సులపై తన పాదాన్ని మోపిన జరాసంధుని, గజాయుత బలం (పదివేల ఏన్గులబలం) కల నీసోదరుడు భీముడు సంహరించాడో, (తేనా హమస్మి ముషితః పురుషేణ భూమ్నా) అలాంటి ఆపురుషోత్తమునిచే నేను దొంగిలింపబడ్డాను (వచింపబడ్డాను)".

**పత్న్యాస్తవాధి మఖ - క్లుప్త- మహాభిషేక-**
**శ్లాఘిష్ఠచారు కబరం కితవైః సభాయామ్ ।**
**స్పృష్టం వికీర్య పదయోః పతితాశ్రుముఖ్యా**
**యాస్తత్స్త్రియోఽకృత హతేశ విముక్తకేశాః ॥**

"అన్నయ్యా! నీపత్ని, ఆమహాసాధ్వి ద్రౌపది, యజ్ఞభూమిలో నీతోపాటు అవభృథమహాభిషేకాన్ని పొందింది. దానివల్ల పరమ పావనాలైన ద్రౌపదీకేశపాశాలు మహాసభలో చెదిరిపోయేలా దుశ్శాసనాదులచే పరామృశింపబడ్డాయి. ఇలా ద్రౌపది మహాపమానాన్ని పొందింది కదా! దీనికి ప్రతి ఫలంగా దుర్మార్గులైన ఆదుశ్శాసనాదుల ధర్మపత్నులు తమ భర్తలు మరణించగా కన్నీరుకారుస్తూ విరజిమ్ముకొన్న కేశపాశాలు కలవారైనారు సుమా! ఇది ఆ మహానుభావుని వల్లనే కదా!

ఏ మహానుభావుడు, వనానికి వచ్చి దుర్వాసుని నుండి మనలను రక్షించాడో ఆమహానుభావుడు మనలను వంచించి వెడలిపోయాడు. ఆనాడు మన శత్రువులైన దుర్యోధనాదుల దురాలోచనచే ప్రేరితుడు, పదివేలమంది శిష్యులతో పారణానికి వచ్చినవాడు అయిన దుర్వాసుడు, మనలను పరీక్షించి శపించ యత్నించినప్పుడు, మనం తినగా మిగిలిన అవశిష్ట భోజనాన్ని తాను స్వీకరించి, ఈ ముల్లోకాలలోని వారితో పాటు ఆదుర్వాసుడు కూడా 'తృప్తిచెందాన'ని భావించేలా చేశాడు. అలాంటి పరమకృపాళువైన కృష్ణుడు ఇకలేడు, అంటున్నాడు అర్జునుడు ఈక్రింది శ్లోకంలో ...

**యోనో జుగోప వన ఏత్యదురన్తకృచ్ఛ్రాద్**
**దుర్వాససోఽరిరచితా దయుతాగ్ర భుగ్యః ।**

**శాకాన్నశిష్టముపయుజ్య యతస్త్రిలోకీం,**
**తృప్తామమంస్త సలిలే వినిమగ్నసంఘః**

దుర్వాసమునివృత్తాన్తం వ్యాఖ్యాతలు చాలా స్పష్టంగా విశదపరచారు. శ్రీధరుల విశదనం ఇది. (మహాభారత కథ)

మహాభారతంలో ఇలా ఉంది. ఒకప్పుడు దుర్వాసుడు దుర్యోధనుని ఆతిథ్యాన్ని స్వీకరించి పరితుష్టుడయ్యాడు. దుర్యోధనుని ఏదైనావరం కోరుకొమ్మన్నాడు. దుర్వాసుని శాపంచేత పాండవులు నశించాలి అని ఆశించిన దుర్యోధనుడు, ఆమునిని ఇలా ప్రార్థించాడు. "స్వామీ! ధర్మరాజు మావంశంలో పెద్దవాడు కనుక, మీరు ఆతనిని కూడా మమ్ములను అనుగ్రహించినట్లే, మీవేలాది శిష్యగణంతో వెళ్ళి ఆతిథ్యాన్ని స్వీకరించి, అనుగ్రహించండి. కానీ, మహాసాధ్వి అయిన ద్రౌపది క్షుద్బాధ పడకుండా ఆమెకూడా భోజనం చేసిన తరువాతనే తమరు వెళ్ళండి, అని ప్రార్థించాడు. ఈప్రార్థనలోని ఆంతర్యాన్ని గ్రహించని దుర్వాసుడు, దుర్యోధనుడు కోరినట్లే, ధర్మరాజు ఉన్న అడవికి శిష్యవర్గంతో వెళ్ళాడు. దుర్వాసుడు రాగానే, ధర్మరాజు పరమోదారంగా "స్వామీ! మీరంతా మీ మాధ్యాహ్నిక కృత్యాన్ని పూర్తిచేసికొండి, అంతా సిద్ధంగా ఉంటుంది" అని సవినయంగా విజ్ఞాపనం చేశాడు. ముని సంఘమంతా మాధ్యాహ్నిక కృత్యాంశంగా అఘమర్షణ స్నానంకోసం సమీపంలోని నదికి వెళ్ళింది. దుర్వాసుని ఆగమనాన్ని శంకించి ద్రౌపది, భక్తవత్సలుడైన స్వామిని శరణు వేడింది. రుక్మిణీ సమీపంవీడి, స్వామి వడివడిగా అడవికి చేరుకున్నాడు.

ద్రౌపది, స్వామికి జరిగిన వృత్తాంతాన్ని నివేదించింది. అప్పుడు భగవానుడు ఇలా అన్నాడు. 'ఓ ద్రౌపదీ నేను ఆకలిగొని ఉన్నాను, ముందుగా నాకు భోజనం ఏర్పాటుచేయి' అని. ఈమాటలు విని ద్రౌపది సిగ్గుపడి ఇలా అన్నది. 'సూర్యుడు అనుగ్రహించిన అక్షయ పాత్రలోని అన్నం కూడా నేను భుజించేంతవరకే సిద్ధిస్తుంది. నేను అందరికీ భోజనం సమర్పించి, భుజించాను కనుక, అన్నంలేదు'. స్వామి, ద్రౌపది మాటలు విని ఊరుకోక నిర్బంధించి అక్షయపాత్రను తెప్పించి, సరిగా తోమనందువల్ల అంటుకొనివున్న చిన్న అన్నాణువును చూచి ఇలా అన్నాడు. "ఈ అన్నకణంచేత విశ్వాత్ముడైన భగవానుడు ప్రీతినొందును గాక! అమ్మా ద్రౌపదీ! భోజనానికి ముని బృందాన్ని ఆహ్వానించు, అని అంటూ భీమసేనుని ముని సమీపానికి పంపాడు. భీముడు ముని సమీపానికి వెళ్ళి **"స్వామీ! భోజనానికి విచ్చేయండి, ఎందుకు ఆలస్యం చేస్తారు?"** అన్నాడు. భగవానుడు అన్నకణాన్ని స్వీకరించినంతమాత్రంచేతనే మహామునికి, అతని శిష్యబృందానికి, అతి పరితృప్తి కలిగింది. నిండిన కడుపులతో ఇంకా భోజనం చేయడం మావల్లకాదని, శిష్యవర్గంతో ముని పలాయనాన్ని చిత్తగించాడు. ఈభారతకథను శ్రీధరస్వామి తనవ్యాఖ్యానంలో ఉట్టంకించారు. ఈసన్నివేశాన్ని అర్జునుడు గుర్తుచేసి, శ్రీకృష్ణుని వల్ల తమకు కలిగిన మహోపకారాన్ని శోకార్ద్రచిత్తంతో భావిస్తున్నాడు.

అంతేకాదు శ్రీకృష్ణునివల్ల తమకు కలిగిన ఎన్నో ఉపకారాలను ఒక్కొక్కటిగా అన్నవద్ద ఏకరువు పెడుతున్నాడు అర్జునుడు. *(సశేషం)*

## ఆచార్య త్రయము నృత్య ప్రదర్శన

**రామానుజ సహస్రాబ్ది ప్రచారకార్యక్రమంలో భాగంగా వికాసతరంగిణి, బెంగుళూరు శాఖవారు నిర్వహిస్తున్న, ఆచార్య త్రయము నృత్యప్రదర్శనకు బెంగుళూరు వారు అందరూ ఆహ్వానితులే!**

**వేదిక :** MVT Auditorium, ISKCON temple, Bangalore
**సమయం :** unday, 12th October 2014 6:30 p.m
Phone : 9342610851 & 9448085798



వ్యక్తిత్వ వికాసానికి ... నాణ్యమైన సాంకేతిక విద్యా బోధనకు


శ్రీ కళ్ళం హరనాథరెడ్డి
చైర్మన్ : కళ్ళంగ్రూప్

కళ్ళం హరనాథరెడ్డి ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ




బిటెక్ కోర్సులు
→ కంప్యూటర్ సైన్స్ అండ్ ఇంజనీరింగ్(సియస్ఇ)
→ ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ (ఇఇఇ)
→ ఎలక్ట్రానిక్స్ అండ్ కమ్యునికేషన్స్ ఇంజనీరింగ్ (ఇసిఇ)
→ సివిల్ ఇంజనీరింగ్ (సిఇ).
→ మెకానికల్ ఇంజనీరింగ్ (ఎమ్ఇ)
M.Tech :- CSE

మేనేజ్‌మెంట్ సీట్స్ కొరకు సంప్రదించండి : సెల్ : 98856 04528, 94402 61773, 94910 73337.

EAMCET Code KHIT

NH- 5.10వ కి.మీ వద్ద, కళ్ళం స్పిన్నింగ్ మిల్స్ వెనుక, చిలకలూరిపేట రోడ్, చౌదవరం, గుంటూరు- 19. ఫోన్: 0863 2119726.
సిటీ ఆఫీస్: ఫస్ట్‌లైన్, గుజ్జనగుండ్ల సర్కిల్, గుంటూరు -6. ఫోన్: 0863 2272345.

తిరువరంగత్తముదనార్లు అనుగ్రహించిన ప్రపన్నగాయత్రి

# ఇరామానుశనూత్తన్దాది

గత సంచిక తరువాయి

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

### 47వ పాశురము

ఇఱైఞ్జప్పడుమ్ పరన్ ఈశన్ అరంగన్ ఎన్ఱు, ఇవ్వులకత్తు
అఱమ్ శెప్పుమ్ అణ్ణల్ ఇరామానుశన్, ఎన్ అరువినైయిన్ ।
తిఱమ్శెగ్ఱు ఇరవుమ్ పకలుమ్ విడాతు ఎన్ తన్ శిన్దైఉళ్ళే
నిఱైన్దు ఒప్పఱ ఇరున్దాన్, ఎనక్కారుమ్ నికరిల్లైయే ॥

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **ఇఱైఞ్జప్పడు పరన్** | = | అందరిచే నమస్కరింపదగిన దైవమెవరంటే, |
| **ఈశన్** | = | సర్వేశ్వరుడైన, |
| **అరంగన్ ఎన్ఱు** | = | శ్రీరంగనాథుడే అని, |
| **ఇ ఉలకత్తు** | = | భూమండలములో, |
| **అఱమ్ శెప్పుమ్** | = | సాక్షాత్ ధర్మాన్ని అనుగ్రహించేవారై, |
| **అణ్ణల్** | = | సర్వస్వామి అయిన, |
| **ఇరామానుశన్** | = | భగవద్రామానుజులు, |
| **ఎన్, అరు వినైయిన్ తిఱమ్** | = | నాయొక్క, పోగొట్టలేని కర్మ సమూహాన్ని, |
| **శెగ్ఱు** | = | నశింపచేసి, |
| **పకలుమ్ ఇరవుమ్ విడాతు** | = | పగలు, రాత్రి కూడా విడువకుండా, |
| **ఎన్ తన్ శిన్దై ఉళ్ళే** | = | నాహృదయం లోపల, |
| **నిఱైన్దు** | = | పరిపూర్ణులై, |
| **ఒప్పు అఱయిరున్దాన్** | = | సాటిలేనిరీతిలో వేంచేసియున్నారు, |
| **ఎనక్కు** | = | ఇటువంటి దయను నోచుకున్ననాకు, |
| **ఆరుమ్ నికర్ ఇల్లై** | = | సాటి వచ్చేవారెవరూ లేరు. |

**తాత్పర్యము :** భగవద్రామానుజులు ఎంత గొప్పవారంటే –

1. శ్రీరంగనాథుడే లోకం మ్రొక్కవలసిన పరమదైవమని చాటినవారు.

2. భగవంతుని ఆశ్రయించడంలో అందరికీ రుచిని కల్గించినవారు.

3. నేను చేసిన మహాపాపములను సమూలంగా పెకిలించి వేసినవారు.

4. అనుక్షణము నాహృదయము లోపల పరిపూర్ణులై వేంచేసి ఉన్నవారు. ఇంతటి భాగ్యాన్ని పొందినవాడను ఈలోకంలో నేనొక్కడనే. అందువలన నాకెవరూ సాటిలేరు.

యతిరాజ వైభవాన్ని చక్కగా ఆవిష్కరించారు అముదనార్లు.

### 48వ పాశురము

నికరిన్ఱి నిన్ఱ ఎన్నీశతైక్కు, నిన్నరుళిన్ కణ్ అన్ఱి
పుకలొన్ఱుమ్ ఇల్లై అరుట్కుమ్ అహ్తే పుకల్, పున్మైయిలోర్ ।
పకరుమ్ పెరుమై యిరామానుశ! ఇనినామ్ పழுతే
అకలుమ్ పొరుళెన్, పయనిరువోముక్కుమ్ ఆనపిన్నే ॥

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **పున్మైయిలోర్** | = | మహానుభావులు, |
| **పకరుమ్ పెరుమై** | = | పలుక తగిన గొప్పతనము కలిగిన, |
| **ఇరామానుశ** | = | ఓ భగవద్రామానుజా!, |
| **నికర్ ఇన్ఱి నిన్ఱ** | = | సాటిలేక ఉన్న, |
| **ఎన్ నీశతైక్కు** | = | నా నీచత్వానికి, |
| **నిన్ అరుళిన్ కణ్ అన్ఱి** | = | దేవరవారి దయవద్ద తప్ప, |
| **పుకల్ ఒన్ఱుమ్ ఇల్లై** | = | వేరే ఒదిగే చోటు లేదు, |
| **అరుట్కుమ్** | = | ఆ నీకృపకు, |
| **అహ్తే పుకల్** | = | ఆనైచ్యమే శరణము (అందువలన), |
| **ఇరువో ముక్కుమ్** | = | నావలన మీకు,మీవలన ఈదాసునకు |
| **పయన్ ఆన పిన్** | = | ఫలము సిద్ధించిన పిమ్మట, |
| **ఇని** | = | ఇకపై, |
| **పழுతే** | = | వ్యర్థంగా, |
| **అకలుమ్ పొరుళ్** | = | విడిపోవడానికి కారణము, |
| **ఎన్** | = | ఏమున్నది. |

**తాత్పర్యము :** ఆచార్యా! లోకంలో నావంటి నీచుడు వేరొకడుండడు. ఇలాంటి నా నీచత్వం పోగొట్టడానికి దేవరవారి కృప తప్ప వేరే సాధనం లేదు. మీ దయకు నా అంతగా తగిన వారెవరూ లేరుకూడా. చూడండి. నన్ను విడిస్తే మీకెవరూ దొరకరు. నేను మిమ్మల్ని విడిస్తే నాకు వేరేగతిలేనేలేదు. ఇంతగొప్ప సంబంధ బంధం మనిద్దరిమధ్యా ఉన్నప్పుడు ఎలా విడిచిపెట్టగలం? ఎలా జీవించగలం?

విడిచే అవకాశమే లేదు అంటున్నారు అముదనార్లు.

**49వ పాశురము**

ఆనతు శెమ్మై, యఱనెఱి పొయిమ్మై, అఱుశమయమ్
పోనతు పొన్టి, యిఱన్దదు వెఞ్జలి, పూఞ్జమల ।
తేనతిపాయ్ వయల్ తెన్నరంగన్ కఴల్ శెన్నివైత్తు
త్తానతిల్ మన్నుమ్, ఇరామానుశ నిత్తలత్తుతిత్తే ॥

**ప్రతిపదార్థము :**

**పూ కమలమ్ తేన్** = తామర పూవులలో ఉండే తేనె,
**నదిపాయ్** = నదిగా ప్రవహించే,
**వయల్** = పంట పొలాలు కలిగిన,
**తెన్ అరంగన్** = శ్రీరంగములో వేంచేసియున్న శ్రీరంగనాథుని,
**కఴల్** = శ్రీచరణాలను,
**శెన్నివైత్తు** = శిరసావహించి,
**తాన్ అతిల్ మన్నుమ్** = తాము ఆస్వామి శ్రీచరణాలలో లగ్నమైన మనసుగల,
**ఇరామానుశన్** = భగవద్రామానుజులు,
**ఇ-తలత్తు-ఉదిత్తు** = ఈభూమిలో అవతరించినందు వలన,
**శెమ్మై** = ఋజువైన,
**అఱమ్ నెఱి** = ధర్మమార్గము,
**ఆనతు** = నిలిచింది,
**పొయ్మ్మై** = అసత్యముతో కూడిన,
**అఱు శమయమ్** = ఆఱు సిద్ధాంతాలు-వేదబాహ్యమతాలు
**పొన్టిపోనతు** = నాశమైనాయి,
**వెమ్ కలి ఇఱన్దతు** = క్రూరమైన కలికూడా నశించింది.

**తాత్పర్యము :** భగవద్రామానుజులు అవతరించినందువలన ఈలోకానికి ఎంతోమేలు జరిగింది. శ్రీరంగం అందమైన దివ్యక్షేత్రం. తటాకాలలోని పద్మాలనుండి తేనె నదిగా ప్రవహించి క్షేత్రాలలో కదలుతూంటే, ఎంత ఆనందం! ఎంత సమృద్ధి! ఆక్షేత్ర నాథుడైన శ్రీరంగనాథుని చరణసేవలో తరించిన ఎంబెరుమానార్లు అవతరించడం వలన కుదృష్టివాదులచే పాడైపోయిన ధర్మమార్గం తలెత్తి స్థిరంగా నిలిచింది.

లోకానికి ఇంతటి మేలు గావించిన మహనీయులు యతిరాజులు. *(సశేషం)*




శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

## ధాటీ పంచకము 4వ శ్లోకము

**శ్లో॥** త్రయ్యా మాంగల్యసూత్రం త్రియుగపద యుగారోహణాలమ్బసూత్రం
సద్విద్యాదీపసూత్రం సకలకలికథా సంహృతేః కాలసూత్రమ్ ।
ప్రజ్ఞాసూత్రం బుధానాం ప్రశమ ధనమనఃపద్మినీ నాళసూత్రం
రక్షాసూత్రం మునీనాం జయతి యతిపతేః వక్షసి బ్రహ్మసూత్రమ్ ॥

**ప్రతిపదార్థము :-**

**త్రయ్యా మాంగల్యసూత్రమ్**
= వేదకాంతకు మంగళసూత్రం (త్రయీ అంటే వేదం)

**త్రియుగపదయుగారోహణా లమ్బసూత్రమ్**
= జ్ఞానశక్తి, బల,ఐశ్వర్య,వీర్య తేజస్సులు ఇవి త్రియుగాలు మూడుజంటలు, మొదలైన ఆరుగుణాలు- షాడ్గుణ్య పూర్ణుడైన భగవంతుని శ్రీ పాదాలను ఆశ్రయించడానికి ఆలంబన సూత్రం.

**సద్విద్యా దీపసూత్రం**
= ఉపనిషత్ విద్య సద్విద్య. ఇది తత్త్వాన్ని చూపే దీపం. ఈ దీపానికి వత్తి.

**సకలకలికథా**
**సంహృతేః** = అన్ని విధాలైన కలిపురుషుని గోలలను నిరసించే
**కాలసూత్రం** = యమపాశం.

**బుధానాం ప్రజ్ఞాసూత్రం**
= విద్వాంసుల మేధను చాటేమీమాంసాసూత్రం.

**ప్రశమధనమనః పద్మినీనాళసూత్రం**
= యోగులమనస్సు అనే తటాకంలోని పద్మాలకు ఆధారమైన త్రాడు. (ఇంత గొప్పది అయిన)

**యతిపతేః వక్షసి బ్రహ్మసూత్రం**
= శ్రీరామానుజుల వక్షఃస్థలంలోని యజ్ఞోపవీతం

**జయతి** = దివ్యముగా వెలుగుచున్నది. (సర్వోత్కృష్టమై ఉంది)

**తాత్పర్యం :** ఈ శ్లోకంలో భగవద్రామానుజుల గుండెలపై ప్రకాశించే యజ్ఞోపవీతాన్ని వర్ణిస్తున్నారు. ఆ యజ్ఞోపవీతం -1) వేదకాంతకు మంగళసూత్రం లాంటిది. 2). జ్ఞానశక్తి-బలైశ్వర్య-వీర్యతేజస్సులు - త్రియుగాలు. మూడుజంటలు. ఈ ఆఱు గుణాలస్వామి భగవంతుని ఆశ్రయించడానికి ఆలంబనగా నిలిచే సూత్రమిది. 3). ఉపనిషత్ విద్య అనే దీపానికి వత్తిలాంటిది. 4). కలిసంహారానికి యమపాశం వంటిది. 5). పండితులు ప్రజ్ఞను చాటే మీమాంసాసూత్రంవంటిది. యోగిజనహృదయ పద్మాలకు తూడువంటిది. ఇలా వైదికస్థాపనలో, దైవాశ్రయంలో, విద్యాప్రజ్వలనంలో, కలిసంహరణలో, పండితప్రజ్ఞా ప్రకాశకములో అన్నింటికి ఆధారభూతము మన యతిరాజులు ధరించిన యజ్ఞోపవీతము.

# మన ఆళ్వార్లు



- శ్రీనృసింహ-

తిరుమంగై ఆళ్వారు దివ్యదేశయాత్రకి బయలుదేరారు. ముందుగా చోళదేశ దివ్యక్షేత్రాలు సేవించి తిరుప్పుళ్ళమ్‌పూతంగుడికి దగ్గరలో ఉండగా రాత్రి కలలో శ్రీరంగనాథుడు వారికి దర్శనమిచ్చాడు. ఆళ్వారే ముందు మీరు శ్రీరంగానికిరండి. ప్రాకారాలు, మండపాలు, గోపురాలు ఇలా అన్నీ నిర్మించండి. వెంటనే పని ప్రారంభించండి అంటూ ఆజ్ఞాపించాడు. ఆయన ఆజ్ఞని శిరసావహించి కూడలూరు నుండి బయలుదేరి తిరువెళ్ళరై దివ్యదేశంలో శ్వేతాద్రినాథ స్వామికి మంగళాశాసనం చేసి శ్రీరంగం చేరుకున్నారు. అక్కడ ప్రాకార మండప గోపురాది నిర్మాణాన్ని చేపట్టారు. శ్రీరంగంలో ఉన్న ఆశిల్పసౌందర్యం ఎంత అద్భుతంగా ఉంటుంది! ఒకొక్క ప్రాకారాన్ని చూడడానికి రెండు కన్నులు చాలవే! స్తంభాల నిర్మాణంలో తీసుకున్న శ్రద్ధ ఆశ్చర్యంలో ముంచెత్తుతుంది. ఏ మండపానికి ఆమండపమే అద్వితీయంగా భాసిస్తుంది. అడుగడుగునా.. "ఇదం హి రంగం" అనిపించి ఆనంద పారవశ్యాన్ని కల్గిస్తుంది. "మణి మండప విప్రగణాన్ విదధే పరకాల కవిః" అని శ్రీరంగరాజస్తోత్రంలో శ్రీపరాశరభట్టరులను గ్రహించినట్లు శిలాశాసనాలు దర్శనీయమౌతున్నాయి. ఎంత అందం! ఎంత అందం! జన్మ సార్థక్యాన్ని కల్గించే దివ్యక్షేత్ర దర్శనం శ్రీరంగదర్శనం.

ఆనిర్మాణ చాతుర్యానికి, భక్తికి, శ్రద్ధకి శ్రీరంగడే మురిసిపోయాడు. ఆళ్వార్లని పిలిపించాడు. అయ్యా! పరమాద్భుతమైన మీ భక్తికి మెచ్చాను. మీకు విశేష సన్మానం జరిపించాలని అనుకుంటున్నాను అన్నాడు. స్వామీ! నాకా! సన్మానమా! బలేవాడవే! కైంకర్యమింకా పూర్తికాలేదు. ఈలోపు నాదివ్యదేశయాత్ర పూర్తి చేసుకుని రానా.... అని అనుమతిని కోరారు. సరే అన్నాడు రంగడు. అప్పక్కుడత్తాన్ సన్నిధి మీదుగా నాథన్‌కోవిల్, తిరువిణ్ణగర్, తిరునరైయూర్, తిరుచ్చేరై, తిరువ..న్దూర్, శిఱుపులియూర్, తిరుక్కణ్ణమంగై, తిరుక్కణ్ణపురం, తిరుక్కణ్ణంగుడి, తిరునాగై అనే చోళదివ్య దేశాలలో మంగళాశాసనం పాడి, పాండ్య, మళయాళ, దివ్యక్షేత్రాలు దర్శించి, శ్రీరంగనాథుని ఆజ్ఞాతో ఆయన పాద సన్నిధిని నిలుచుకున్నారు. "కలివైరీ! మీకు సన్మానం చేయాలనుకుంటున్నాను" అన్నాడు స్వామి. రాళ్ళతో నీ ప్రాకారాదులు కట్టినందుకా స్వామీ! బంగారంతో నీకు కట్టలేకపోయానే అంటూ తలదించుకున్నారు.

భక్తుడా! నీకేం సందేహం వద్దు. ఇవన్నీ బంగారంగా మెరసిపోతున్నాయి. తలెత్తిచూడు అనగానే చూశారు పరకాలన్. ఆయన కంటికి అంతా స్వర్ణమయముగా కనిపించింది, ఆనందించారు. ఏం అలా చూస్తున్నావు. ఇంకేం కోరిక ఉంది అన్నాడు శ్రీరంగనాథుడు. స్వామీ! అప్పుడప్పుడు ఆయా సందర్భాలని పట్టి నువ్వు దశావతారాలెత్తావట, నేను సేవించలేకపోయాను. ఇప్పుడు... ఆగారు ఆళ్వార్లు. సందేహమెందుకయ్యా! ఇవిగో... దర్శించు... అంటూ తన దశ అవతారాలని చూపించాడు కరుణాసముద్రుడు రంగడు. పులకించారు ఆళ్వార్లు. తాము రచించిన తిరునెడుందాండకం గానం చేస్తూ పారవశ్యాన్ని పొందారు. ఇంకేమిటయ్యా నీకోరిక... చెప్పు అన్నాడు రంగడు. స్వామీ!

అదృష్ట రత్నాలు ధరించండి! అనుకున్నది సాధించండి!
శ్రీ సాయి
పవిత్ర డైమండ్స్
4/7, బ్రాడీపేట, ఖజానా జ్యూయలర్స్ ప్రక్కన, గుంటూరు. సెల్: 9246410099, ఫోన్: 2262626.
బి/3, జైహింద్ కాంప్లెక్స్, గ్రౌండ్‌ఫ్లోర్, యాక్సిస్‌బ్యాంక్ ప్రక్కన, గవర్నర్‌పేట, విజయవాడ. సెల్: 9246310099, ఫోన్: 6665011.
సంపూర్ణ జ్యోతిష్యం చూడబడును
నాణ్యమైన జాతిరత్నాలు
జెమ్ టెస్టింగ్ ల్యాబ్
కెంపులు పచ్చల పూసలు
మంచి ముత్యములు, పగడములు
శివస్వరూపమైన రుద్రాక్షలు
స్పటికమాలలు
1 గ్రామ్ గోల్డ్ ఇమిటేషన్ జ్యూయలరి

శ్రీనమ్మాళ్వార్లు ప్రసాదించిన ద్రవిడ వేదాలు నాల్గింటికి వేదంతో సమానత్వాన్ని కల్పించాలి. దేవరవారు నిండుకొలువు తీరిఉండగా నాల్గువేల పాశురాలు ఆళ్వార్లందరూ అనుగ్రహించినవి తియ్యగా గానం చేయబడాలి, నువ్వాలకించాలి.

శ్రీనమ్మాళ్వార్లు మోక్షమును పొందినది ధనుర్మాసశుక్ల ఏకాదశి కదా! దానికి ముందు పదిరోజులు, ఆనాటినుండి పదిరోజులు నాలాయిర దివ్యప్రబంధ పఠనం అధ్యయన ఉత్సవంగా జరగాలి. రాపత్తు, పగల్‌పత్తు అని రెండు పదులు ఇరవై రోజులు సాగే ఉత్సవంలో అరయర్లు గానం, నృత్యం చేయాలి అన్నారు. ఈ అఱయర్లు నాథముని వంశంవారు. ఆయన కాలంలో ఆయన మేనల్లుళ్ళే ఈపవిత్రకార్యానికి శ్రీకారం చుట్టారు. అప్పటి నుండి అరయర్ గానం ప్రసిద్ధమైంది.

పరకాలన్ కోరికను శ్రీరంగనాథుడు తీర్చాడు. అధ్యనోత్సవాలు స్వామి ఆజ్ఞతో ప్రారంభమైనాయి. ఒక్క శ్రీరంగంలోనే కాదు, శ్రీవిల్లిపుత్తూరు, ఆళ్వార్ తిరునగరి, తిరుక్కురుంగుడి మొదలైన దివ్యదేశాలలో కూడా ఈసంప్రదాయం ప్రారంభమైంది. తిరువరంగ ప్పెరుమాళ్ అరయర్ మొ॥లగు పెద్దలు జగద్విఖ్యాతి పొందారు. అధ్యయనోత్సవాలలో అరయర్లే నృత్యం, గానం చెయ్యాలి. వీరికి ప్రత్యేక మర్యాదలున్నాయి. పగల్‌పత్తు, రాపత్తులలో అర్చకులు శఠగోపాన్ని అరయర్లచేతనే ఇప్పిస్తారు. తీర్థప్రసాదాలు కూడా కొన్ని విశేష దినాల్లో అరయర్లే అనుగ్రహిస్తారు.

పగల్‌పత్తు, రాపత్తులలో మూడువేల పాశురాలు అరయర్లు గానం చేస్తారు. ఇరవైఒకటవరోజు తిరువరంగత్తముదనార్ల వంశీయులు స్వామి కొలువులో ఇయఱ్పా సహస్రాన్ని అనుసంధిస్తారు. రామానుజార్య దివ్యాజ్ఞా.... అన్నట్లు ఈసంప్రదాయం ఈనాటికీ శోభాయమానంగా, సంప్రదాయ పద్ధతిలో సాగుతుంది.

ఈఅధ్యనోత్సవాలను శ్రీరంగంలో తిరుమంగై ఆళ్వారులు ప్రారంభించారు. ఆళ్వార్ తిరునగరి నుండి శ్రీనమ్మాళ్వార్లను వేంచేయించుకుని వచ్చేవారు. శ్రీమన్నాథమునుల కాలంలోనూ అలాగే జరిగింది. తరువాత తరువాత ఆళ్వార్లందరిరూ కొలువుతీరగా ఉత్సవాలు జరగడం సంప్రదాయమైంది. క్రమక్రమంగా అన్ని శ్రీవైష్ణవ దివ్యాలయాలలో ఈఉత్సవాలు అద్భుతంగా కొనసాగే ఏర్పాట్లు చేశారు.

శ్రీనమ్మాళ్వార్లు, అధ్యనోత్సవ ప్రారంభకులు తిరుమంగైఆళ్వార్లు, ఉత్సవ పరిష్కరణలు, పద్ధతులు చక్కగా ఏర్పాటుచేసిన భగవద్రామానుజులు వీరి వైభవాన్ని ఈ ఉత్సవాలలో నేటికీ ఆనందంగా వీక్షిస్తున్నాము. **మణితోరణాలు, విచిత్రధ్వజాలు, అరటిస్తంభాలు, మేలుకట్లు, సుగంధ కస్తూరీ పరిమళాలు, భేరీ నినాదాలు, శంఖాకహళ ఘోషలు, నృత్త, గీత, వాద్య** విశేషాలు... భూలోక వైకుంఠం మన శ్రీరంగం.

**విరజానదియే శ్రీకావేరి**
**పరమపదమే శ్రీరంగం**
**శ్రీరంగనాథుడే పరమపదనాథుడు.**

అద్భుతానందాన్ని చేకూర్చి, అమృతత్త్వానికి మారుపేరుగా నిలిచి ఆత్మోద్ధారక మార్గాన్ని చేర్చేదే శ్రీఅధ్యయనోత్సవం. శ్రీతిరుమంగై ఆళ్వార్లు ప్రసాదించిన ఈఉత్సవం లోకమంతా వ్యాపించి, భక్తకోటికి అమందానందాన్ని చేకూరుస్తోంది.

## చాతుర్మాస్యంలో... విశేష కార్యక్రమాలు

**శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు** యథానిర్దేశంగా తమ చాతుర్మాస్య దీక్షను జీవా ప్రాంగణంలో ప్రారంభించారు. ఈ సందర్భంగా ఉదయం 8.30 నుండి9.30వరకు భగవద్రామానుజులు అనుగ్రహించిన వేదార్థసంగ్రహం గ్రంథంపై తమ ప్రవచనాలు అందిస్తున్నారు. ఎవరైనా శ్రీస్వామివారిని కలుసుకో గోరినవారు తీర్థగోష్ఠి అయిన తరువాత కలుసుకునే అవకాశం కల్పిస్తున్నారు.

ఇక ఈ చాతుర్మాస్య సమయంలో చాలా విశేష కార్యక్రమాలు నిర్ణయించడం జరిగింది.

22.8.2014 వరకు శ్రావణమాసపు శుక్రవార పూజలు పూర్తి అయినాయి. 23.8.14 తరువాత జరిగే కార్యక్రమాలు క్రింద ఇస్తున్నాము.

### విశేషంగా జరిగే కార్యక్రమాలు

| | |
|---|---|
| 4. శరన్నవరాత్రోత్సవాలు, శ్రీయాగం | 25.9.2014 |
| 5. విజయదశమి | 03.10.2014 |
| 6. దీపావళి | 22.10.2014 |
| 7. శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి తిరు॥ | 24.10.2014 |
| 8. కార్తీకపూర్ణిమ, చాతుర్మాస్య వ్రత సమాప్తి | 06.11.2014 |

**23.8.14 నుండి యథాపూర్వంగా ఉ॥8.30కు తీర్థగోష్ఠి పూర్తిచేసి, భగవద్రామానుజుల వేదార్థసంగ్రహ గ్రంథంపై శ్రీస్వామివారు తమ ప్రవచనాలు కొనసాగిస్తున్నారు. ఎల్లరూ పాల్గొనగలరు.**



# అహో! భారతమ్

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

*గత సంచిక తరువాయి*

దుర్యోధనుని మాటలు తండ్రికెంతో ఆవేదనను కల్గించాయి. అతనిమీదే ప్రాణాలు పెట్టుకున్న ధృతరాష్ట్రుడు కొడుకుకి ఆనందం కల్గించాలి అనుకున్నాడు. జూదం తగదు అని ఎలా చెప్పాలి అని మధనపడ్డాడు. పోనీ వీడికి కూడా ఒక సభను అందంగా నిర్మించి ఇస్తే, కాస్త ఉపశమనం కల్గుతుందేమో.... అనే ఆలోచన రాగానే వెయ్యిమంది గొప్ప శిల్పుల్ని రప్పించాడు. వెయ్యి స్తంభాల సభ. రత్నాలు పొదిగిన స్తంభాలవి. ఎంతో నేర్పుతో కట్టాలని ఆజ్ఞాపించాడు. నాల్గురోజులు గడిచాక నెమ్మదిగా విదురుని రప్పించాడు. చల్ల చల్లగా కొడుకు అభిప్రాయం అతని చెవిలో వేశాడు. నిర్ఘాంతపోయాడు విదురుడు. ఓహ్! కలికాలం ప్రవేశిస్తోంది. ఔను....ఇలాంటి ఆలోచనలే వస్తాయి మరి, జూదం సర్వజన నాశకరమని తెలియదా అనుకొని నిట్టూర్చాడు. రాజా! నీ మాట వింటేనే భయం వేస్తుంది నాకు. నేను పొరపాటున గూడ ఈపనికి అంగీకరించను. నువ్వుమాత్రం ఈ కపటపు ఆలోచనకు ఎలా అంగీకరించావు? కొడుకుల్లో విరోధం పెంచే పని ఇది అని నీకు తెలియదా? పిల్లలంతా కలిసి మెలిసి ఉండేలాంటి పని చెయ్యి. ఆలోచించు, జూదం వాదాలకి మూలం, వైరానికి మంచిమార్గం. నీకు చేతనయినంతగా దీనిని అడ్డుకొనే ప్రయత్నం చెయ్యి. కురు కులాన్ని రక్షించు అన్నాడు. అంధరాజుకి చెవికెక్కుతుందా? మిత్రనిధీ....అంటూ పిలిచాడు విదురుణ్ణి 'చూడు నాయనా! నువ్వు, నేను, గంగాపుత్రుడు-మనమంతా ఉండగా వైరం వచ్చే అవకాశమే లేదుకదా! దేవతల దయవలన చెడు జరగదులే. నువ్వుముందు అంగీకరించు. అక్కర్లేని అనుమానాలు పెట్టకు అన్నాడు. అంధప్రేమను అర్థం చేసుకొన్న విదురుని ఉపదేశం అరణ్యరోదనే అయింది. వెళ్ళు, మంచి గుఱ్ఱాలు కట్టిన రథంలో వెళ్ళు ధర్మరాజును తీసుకొనిరా' అన్నాడు. కొడుకుకి సభను గురించి చెప్పి ఎవ్వరూ లేకుండా చూచి 'నాయనా' ఈ సభను వారికి చూపించు జూదం వద్దులే. వైరాలు ఎందుకు? పాపం చేయకు పాపాత్ములకు సంపదలు నశించి పోతాయిరా, పైగా విదురునికది ఇష్టంగా లేదు. ధర్మరాజు కంటే గొప్పగా యజ్ఞం చెయ్యి. రాజులంతా నీకూ కానుకలిస్తారు. నామాట విను తండ్రీ. ఏదో చెప్పబోతున్న తండ్రికి ఎదురుతిరిగాడు కొడుకు 'నాన్నా అలాగే నేనూ చేస్తాను యజ్ఞం. ధర్మరాజుతో జూదమాడడమే నేను చేసే యజ్ఞం. నాకు తెలికగా సంపదలు వచ్చే ఉపాయం అదే, నాన్నా మీరంతా రాజసూయం తరువాత వెంటనే ఇక్కడికి వచ్చేశారు. నేను మయసభను చూడాలని అక్కడే ఉన్నాను కదా! ఆ సభని నువ్వు ఊహించగలవా! స్ఫటికాలతో నిర్మాణమా! రత్నాలతో కట్టడాలా! ఇంద్రనీలమణులతో తటాకాలా? నీరేమో అనుకొని వస్త్రం పైకెత్తి నేను నడవడం, నీళ్ళల్లో పడడం అది అందరూ చూడడమా' అబ్బ గుండెలు మండిపోతున్నాయి. నేలేకదా అనుకొని నడిస్తే నీళ్ళలో పడి బట్టలు తడిసిపోవడమా! గుట్టుగా లేచివద్దామంటే పొడిబట్టలతో ఆ భీముడు నవ్వుతూ వచ్చి... అయ్యో!అయ్యో! ద్వారం ఇటు ఇటు అంటూ తీసికొని వెళ్తాంటే... ఆపాంచాలి..ఆ..పాం.. చా..లి.. నవ్వడమా... ఎంత అవమానం! గుండెలు నలిపివేసేబాధ. ఎలా సహించాలి తండ్రీ ఈ బాధ! శత్రునాశనం చెయ్యాలి పాండవులని నేల రాయాలి..ఎలా?..ఎలా... ఆవేశంతో ఊగిపోతున్నాడు దుర్యోధనుడు.

దుర్యోధనా...పిలుపుకూడా వంకరే...శకునికి నాయనా! చతురంగబలాలు లేకుండా, యుద్ధవ్యూహాలు లేకుండా, ఆయుధాలు




www.mangalaakshatas.com
In commitment to help the people of spiritually inclined, we come up with the unique platform for 'Sri Vaishnava Community' to choose their life partner with an ideal mind set.
*With the Mangalasanams of*
"Sri SriSriTridandiChinnaSrimannarayanaRamanujaJeeyarSwamiji" we present you with 'mangalaakshatas' - A wedding platform for Sri Vaishnavas.
We are now open for free registrations. Please visit: **www.mangalaakshatas.com**
**మీ జీవిత భాగస్వామికోసం ఎదురుచూస్తున్నారా?.. ఇదిగో మీ ముందుకు 'మంగళాక్షతలు' మన ఆచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి మంగళాశాసనములతో...! పై వెబ్‌సైట్‌లో రిజిస్టర్ చేసుకోండి!**

ప్రయోగించకుండా కేవలం నా పాచికలు దొర్లించి...పాచికలతో వాళ్ల సంపదలన్నీ నీవైపు వచ్చేలా చేస్తా. నా ప్రజ్ఞ చూడు. పిలు ధర్మరాజుని. మొదలు పెట్టు ఆట...ఇంకచూడు...

'నాయనా! వద్దురా...అంధరాజు అంటుండగానే...నాన్నా! విదురుడు పాండవ పక్షపాతి. అతని మాట పక్కన పెట్టేయ్. స్నేహంగా కూడా జూదం ఆడవద్దు' అంటాడు. దేవతలంత గొప్పవాళ్ళెలా అయ్యారు! 'క్రీడాదిషు దీవ్యన్తి ఇతి దేవాః' దేవత్వాన్ని పొందడానికి మూలం ఆట అందులో తప్పేంలేదు.

ధృతరాష్ట్రుని బుద్ధి మళ్ళింది 'విదురా! వెళ్లు నాయనా! ధర్మరాజుని ఆహ్వానించి మన సభను చూపించు. ఈ రత్నసభా వేదిక మీద సరదాగా సోదరులంతా కాలక్షేపానికి మిత్రద్యూతం ఆడుకొంటారు'.

తడిగుడ్డతో గొంతుకోసే అతని స్వభావం, నోట తీపి అంగిట విషం...గల అతని మాట ఎంతోదుఃఖం కల్గించింది విదురునికి. రాజాజ్ఞకు తలవంచక తప్పలేదు ఇదే విధి బలీయమంటే. వెంటనే ఇంద్రప్రస్థంచేరాడు విదురుడు. పాండవులు పూజలందుకొన్నాడు తన రాకకు కారణం చెప్పాడు. ఒక్కక్షణం మౌనం దాల్చాడు ధర్మరాజు.

పుణ్యాత్మా! విదురా! మాపెదతండ్రి ఆహ్వానించడం మీరు రావడం ఆనందమే. కాని మధ్యలో ఈ జూదమెందుకు? జూదం వైరానికి పునాదికదా! పెద్దలని, 'కాదు' అనడం నా జీవితంలో లేదు. ఆజ్ఞను ధిక్కరించలేను. వస్తాను కాని...సగం సగం ఇష్టంతో అందరినీ తీసుకొని విదురుని వెంట హస్తినకు బయలుదేరాడు ధర్మరాజు. అక్కడికి చేరి పెద్దలందరికీ ప్రేమతో నమస్కరించాడు. ద్రౌపది అందాన్ని చూచి గాంధారి కోడళ్ళంతా విస్తుపోయారు. బ్రహ్మ లోకంలోని అందాన్నంతా ఒక్కచోటచేర్చి ద్రౌపదిగా సృష్టించాడేమో! ఇంత అందమా...నోట మాటరాలేదు. అసూయ హృదయమంతా నిండింది.

మర్నాడు తమ సభని చూపించాడు దుర్యోధనుడు. ఎంత బాగుందో అంటూ ఆనందంగా మెచ్చుకొన్నాడు ధర్మరాజు. అంతా ఆ సభలో వేదికపై కూర్చున్నారు. దుర్యోధనుడు ఓధర్మరాజా! ఈ వేదికపైన చక్కగా జూదమాడుకొందామా! కాలక్షేపంగా పాచికలాడడం బలే సరదాగా ఉంటుంది కదా! నీకు కూడా ఈ ఆటంటే చాలా ఇష్టమని విన్నాను మరి ఆడదామా...అన్నాడు.

సోదరా! జూదం మోసం. ఇది క్షత్రియ ధర్మానికి తగినదికాదు. ధర్మాత్ములీ ఆటలు ఆడరు. ఇది పాపపుపని. నీచులతో అసలు ఆడకూడదు. ధనం, ధర్మం రెండూపోతాయి. ధర్మజూదం ధర్మమే గాని కపటపు జూదం మహాపాపం అంటూ శకునిని చూశాడు. బుజాలు తడుముకొన్నాడు శకుని నేర్పరి, మేధావి, రాజనీతి కుశలుడు జూదాన్ని నిందించకూడదయ్యా. నీ కంత భయంగా ఉంటే మానెయ్ అన్నాడు శకుని. దాంతో అభిమానం దెబ్బతింది. జూదానికి ఆహ్వానించాలే ఆడనని వెనుతిరుగుతానా? అన్నాడు ధర్మరాజు. దైవ నిర్ణయమది. జూదస్థలాన్ని గంధం, కర్పూరం, కస్తూరి కలిపిన నీళ్ళతో శుద్ధిచేసి పాచికలను పూజించాడు శకుని... *(సశేషం)*

### సెప్టెంబర్ నెల మెదడుకు మేత సమాధానములు

1. సనాతన వైదిక సంస్కృతిది; 2. మూడుపదములు; 3. పోతన్న; 4. రాజసూయంలో; 5. వేదార్థసంగ్రహంపై; 6. ఉపాయం; 7. త్రిదండం; 8. అర్థపంచకం; 9. శరీరం, సత్యమని; 10. వేద శాస్త్రాలు; 11. కఠోపనిషత్తు; 12. ఇంద్రపస్థంలో; 13. ఆత్మ; 14. వైఖానస ప్రక్రియలో; 15. యాదవ ప్రకాశ– రామానుజులు; 16. రక్షిస్తాడనే విశ్వాసం; 17. తొండరడిప్పొడి ఆళ్వార్లది; 18. గరుడపురాణం; 19. శ్రీమదుభయవేదాంతాచార్యపీఠం; 20. పదిహేను నిమిషాలు; 21. మూడురకాలు.

రుచికి, సువాసనకి, ఆరోగ్యానికి నాణ్యమైన
"అజంతా"
పసుపు, కారం, ధనియాలపొడి మరియు సేమియానే ఎల్లప్పుడు వాడండి
రవికుమార్ అండ్ కంపెని - చెన్నై
044 25204046, 26171341
Vijay Ads

An.Y.
ఆర్థోఫిట్ సిరప్
fizikem
అన్ని రకముల జాయింట్ నొప్పులకు
సరికొత్త పరిష్కారం
సత్వర నివారణకు అద్భుత ఆయుర్వేద ఔషధం
Also available as Oil & Capsules
ఇది ఫిజికెమ్ వారి ప్రతిష్టాత్మక ఉత్పాదనలలో ఒకటి
ORTHO Fit
ఇంటింటా ఆర్థోఫిట్ నొప్పులన్నీ ఫటాఫట్

# భగవంతుని భక్తవాత్సల్యము

శ్రీమాన్ డా॥కె.కె.రంగరాజాచార్య-
ఎస్.వి. యూనివర్సిటీ, తిరుపతి

**కటుగంధేన విద్ధాయాం భూమౌ నవరత్నాంకురమ్ ।**
**యా న జిఘ్రతి సా ధేనుః స్వయోనిద్వారమార్గతః ॥**
**సద్యో జాతస్య వత్సస్య దేహమాలిన్య సంపదమ్ ।**
**యథా లిహతి సోల్లాసం తథా జీవస్య కల్మషమ్ ।**
**భోజ్యం మమ చ లక్ష్మ్యాశ్చ విద్ధి పంకజసంభవ! ॥**

నా నాభీకమలం నుండి ఆవిర్భవించిన చతుర్ముఖుడా! దుర్గంధము వలన అశుద్ధమైన భూమియందు అప్పుడే అంకురించిన తనకు ఇష్టమైన గడ్డిని వాసనకూడా చూడని (అంతటి పరిశుద్ధమైన) గోవు తన యోనినుండి అప్పుడే పుట్టిన తన దూడ ఒంటియందుగల మలినముల సమృద్ధిని ఎట్లు సంతోషముతో నాకి, ఆస్వాదించునో, – అనగా తనదూడయొక్క మలినములు గోవుకు ఎట్లు భోగ్యముగా అగుచున్నదో అట్లే నా బిడ్డలగు జీవాత్మల దోషములు(పాపములు) నాకును, శ్రీమహాలక్ష్మికిని భోగ్యముగా అనుభవించి, ఆనందింపతగిన గుణములుగా అగుచున్నవని గ్రహింపుము. అను ఈ ప్రమాణము శ్రీపాంచరాత్రాగమమునకు చెందిన బ్రహ్మసంహితలో బ్రహ్మదేవునకు శ్రియఃపతి తన వాత్సల్యమును గూర్చి తెలిపిన వచనము. స్వభావసిద్ధము గానే పరిశుద్ధమైన గోవుతన దూడయొక్క మలినము భోగ్యముగా స్వీకరించినట్లు, భగవంతుడును తన బిడ్డలమగు మన దోషములను గుణములుగా స్వీకరించుచున్నాడనుచు, భగవానుని వాత్సల్యమును ఈ వచనం, మన మనసులో పచ్చిచెట్టులో మేకు దిగగొట్టినట్లు ధృఢముగా స్థాపించు సొబగు ఆనందింపతగినది.

పిమ్మట అజ్ఞాన, అన్యథాజ్ఞాన, విపరీతజ్ఞానములను దోషము లేమియు లేని తత్త్వజ్ఞానమును పొందునట్లు భగవానునిచే అనుగ్రహింపబడిన ఆళ్వార్లలో ముగ్గురి సూక్తులలో మూడు పాశురములను క్రమముగా చూచెదము.

సరోయోగి అనుగ్రహించిన మొదటి తిరువందాదిలో 45వ పాశురము,

**“కున్ఱనైయ కుత్తమ్ శెయినుమ్ గుణమ్ కొళ్ళుమ్**
**ఇన్ఱు ముదలాక ఎన్ నెన్జే ఎన్ఱుమ్**
**పుఱమరైయే యాయినుమ్ పొన్నాళ్గిక్కైయ్యాన్**
**తిఱమురైయే శిన్దిత్తిరు”**

ఇది ఆళ్వార్లు తమ మనసుకు ఉపదేశము చేయు విధముగా ఉన్నది. “నేను చెప్పునది విని అట్లే నడుచునట్టి మనసా! నీవు ఈనాటినుండి మనస్సులో నుండి పలుకుమాట కాకున్నను, బయటకుమాత్రమే పలుకుమాట అయినను, అందమైన చక్రాయుధమును చేతియందు దాల్చిన సర్వేశ్వరుని గూర్చిన వార్తలనే ఎల్లప్పుడు చింతించుచూ ఉండుము. అట్లున్నచో కొండవలే పేరుకొని ఉండి, మన ప్రయత్నముచే కదల్చసాధ్యముకాని మన దోషములను ఆ స్వామి గుణములుగా గ్రహించి మనలను రక్షించును. తప్పులను చేసితిమే, మనలను ఎట్లు రక్షింపగలడు? అని భయపడకూడదు.

శ్రీభక్తిసార మునీన్ద్రులు అనుగ్రహించిన తిరుచ్చందవిరుత్తములోని 111వ పాశురము,

వైదున్ని న్నైవల్లవా । ప్పళ్గిత్త వర్కుమ్ మాతిల్‌పోర్ ।
శెయ్‌దునిన్ఱ శెత్తత్తీయిన్ । వెన్దవర్కుమ్ వన్దునైన్ ।
ఎయ్‌దలాగుమెన్బర్ । ఆదలాలెమ్మాయ నాయినేన్ ।
శెయ్‌దకుఱ్ఱమ్ నత్తమాగవేకొళ్ । ఞాలనాదనే ॥ 111

ఇది భగవానుని సంబోధించుచు ఆళ్వార్లు ప్రార్థించు విధమున అమరియున్నది. “నేను ఆశ్చర్యపడతగిన గుణములు కలవాడా! లోకములన్నిటికి నాయకుడవైన స్వామీ! నిన్ను తమ శక్తి కొలది దూషణవాక్యములతో నిందించువారికి నీతో అసమానమైన యుద్ధమును చేసి, నీ కోపమను అగ్నిలో పడి మాడిపోయిన వారికీ నిన్నాశ్రయింప వీలున్నదని పెద్దలందురు. కావున (నిన్ను దూషించుటయో, ఎదిరించి పోరాడుటయో, ఏదియును చేయకపోవుట) శునకమువలె మిక్కిలి నీచుడనైన నేను చేసిన తప్పులను గుణములుగా గ్రహించి, నన్ను కాపాడవలయును అని ఈ సూక్తి యొక్క తాత్పర్యము.

శ్రీభట్టనాథులు అనుగ్రహించిన పెరియాళ్వార్ తిరుమొళ్గి ప్రబంధములోని (4–9–2) పాశురము,

తన్నడియార్ తిఱత్త కత్తు । త్తామరై యాళాకిలుంశితకురైక్కుమేల్ ।
ఎన్నడియారదుశెయ్యార్ । శెయ్‌దారేల్ నన్ఱు శెయ్‌దారెన్బర్ పోలుం।
మన్ను డైయ విబీడణర్ క్కాయ్ । మతిళిలజ్గైత్తిశైనోక్కి మలర్కణ్ వైత్త ।
ఎన్ను డైయ తిరువరుజ్గర్‌క్కన్ఱియుమ్ । మత్తొరువర్కాళావరే ॥

అను పాశురము శ్రీరంగనాథుని గుణవైభవములను తెలుపుచున్నది. పెరియపెరుమాళ్ అను శ్రీరంగనాథుడు, తమ దాసుల విషయమునందు దోషములను పలుకుట తెలియని లక్ష్మీదేవికూడా, దోషములను, పలికినచో, **“నా దాసులు నీవు చెప్పినట్లు తప్పులు చేయనే చేయరు. ఒకవేళ చేసినచో మంచినే చేతురు. అని అలక్ష్యముగా బదులు పలుకును. కావున, భక్తి అను సంపదకల విభీషణునకై కోటలచే ఆవరింపబడిన లంకగల దక్షిణదిక్కును చూచుచూ, వికసించిన పూవువంటి నేత్రములను సారించును. పరుండిన నా స్వామియగు శ్రీరంగనాథునకు కాక వేరెవ్వరికి దాసులగుదురా?** అనునది ఈ పాశురభావము. ఇందు ‘ఎన్నడియార్ అదుశెయ్యార్’ అని దాసులు చేసిన తప్పులను తిరస్కరించుట (అవి తప్పులు కావనుట) లేకవానిని మఱుగుపరచుట– పూర్వము అంతరధికరణ శ్రుతప్రకాశికలో తెలుపబడిన **“వాత్సల్యమనగా దోషములను తిరస్కరించుటకు కారణమైన స్నేహమే అగును.”** అన్న సూక్తితో సరిపోవును. **“శెయ్‌దారేల్ నన్ఱు శెయ్‌దార్”** అనుట పూర్వము పలుమార్లు తెలుపబడిన **“వాత్సల్యమనగా దోషములను గుణములుగా గ్రహించుటయే యగును”** అన్నసూక్తితో సరిపోవును. విభీషణుడు తాను ఆశ్రయించుటకు ముందు రావణునితో కలిసియున్నప్పుడు అతడు చేసిన అధర్మములకన్నిటికీ సహకారిగా ఉండి గొప్పదోషములను చేసిననూ,

ఆ దోషములను గుణములుగా గ్రహించియే కదా భగవానుడు పరిగ్రహించెను.

విభీషణుని పట్ల చూపిన వాత్సల్యమును మనపట్ల చూపి, మనలను వీడక పరిగ్రహించు ఆ స్వామికి కాక ఇతర దేవతలకు దాసులగుట తగదని భట్టనాథులు మనకుపదేశము చేయుట మనసార అనుభవింపదగినది. కావున ఇంతవరకు ముగ్గురు ఆళ్వార్ల సూక్తులను ఆధారముగా చేసికొని వాత్సల్యమును వివరముగా అనుభవించితిమి. ఇక ఈ వాత్సల్యమును గొప్ప గుణమును ఆళ్వార్లలో ప్రధానులగు నమ్మాళ్వార్లు శ్రీనివాసుని విషయమున తిరువాయ్మొజి ప్రబంధములో అనుగ్రహించిన పాశురములు రెండింటిని గూర్చి అనుభవించెదము.

**ఈశన్ వానవర్క్కు । ఎన్బనెన్డాల్ । అదు –**

**తేశమో । తిరువేజ్గడత్తానుక్కు ।**

**నీశనేన్ । నిఱై వొన్ఱుమిలేన్ । ఎన్గణ్ –**

**పాశమ్ వైత్త । పరఞ్జుడర్ శోదిక్కే ॥** *(తిరువాయ్మొழி 3.3.4)*

దోషములు నిండిన నీచుడనై గుణములు ఏమియు లేని వాడనై యున్న నాపట్ల ప్రీతినిగొని దానివలన గొప్ప కాంతిని పొందిన, తేజోమయమైన దివ్యరూపముకల శ్రీనివాసుని "ఇతడు నిత్యసూరులకు నాయకుడు" అని పల్కెదను. ఇట్లు పలికినచో ఆ స్వామికి అతిశయము కలుగునా" అని ఈ పాశురభావం. ఇందు గుణమేమియు లేకనే దోషములు నిండిన తమయందు శ్రీనివాసుడు కలిగియున్న ప్రీతిని **'దోషములనే గుణములుగా గ్రహించుట అను వాత్సల్యమే'** అని ఆచార్య హృదయములో అழ்గియమణవాళపెరుమాళ్ నయనార్ "**మణ్ణోర్ విణ్ణోర్ వైప్పిళ్**" అని ప్రారంభమగు 160వ చూర్ణికలో వివరించిరి.

తిరువాయ్మొழிలోని (3.10.10) ఉలగముండ ప్పెరువాయా దశకములో

**"అకలకిల్లేన్ ఇఱైయుమెన్ఱు అలర్మేల్ మంగై యుఱైమార్బా,**

**నికరిల్ వుకళాయ్ ఉలకమూన్ఱుడైయాయ్ ఎన్నైయాళ్వానే**

**నిగరిల్ అమరర్ మునిక్కణజ్గళ్ విరుంబుమ్ తిరువేంగడత్తానే**

**పుకలొన్ఱిల్లా వడియేన్ ఉన్నడిక్కీழ் అమరన్దు పుకున్దేనే ॥**

అని కలదు. ఆళ్వార్లు పూర్వము "ఒழிవిల్ కాలమెల్లామ్" అను దశకములో శ్రీనివాసునకు మాత్రమే చేయవలెనని కోరిన కైంకర్యము అను పురుషార్థమునకు ఉపాయముగా – సహాయముగా ఆ స్వామినే ఆశ్రయించుటను (శరణాగతి చేయుటను) తెలుపు పాశురమిది. "నిన్ను వదిలియుండగలిగిన దానను కాను నేను'' అని పలుకుచునే అలిమేలుమంగ నిత్యనివాసము చేయు వక్షఃస్థలమును కలవాడా! సాటిలేని కల్యాణగుణములు(వాత్సల్యమును) గలవాడా! ముల్లోకములకు నాయకుడా! నాతో కలసియుండువాడా! సాటిలేని దేవతలు, మునులు, ఆశపడివచ్చి, గుంపులుగా చేరుచోటు అగు వేంకటాద్రి యందు నివసించువాడా! కాపాడువారు లేని, ఉపాయమేమియు లేని నీ దాసుడనగు నేను నీ పాదములందు అకించనుడనై వేరొక ఫలమునాశించక, ఆశ్రయించితిని." అని ఈ పాశురభావము. లక్ష్మిని పురస్కరించుకొని శ్రీనివాసుని శరణముగా ఆశ్రయించుటను తెలుపు ఈ పాశురమునందు లక్ష్మీపురుషకారముచే స్వామియందు తలయెత్తు గుణములు కొన్నిటిని తెలుపునపుడు "నికరిళ్ పుకళ్" అను పదముచే వాత్సల్యమునే అనగా– దోషములను గుణములుగా గ్రహించుట అను అసమానమైన గుణమునే ఆళ్వార్లు మనసున నుంచుకొనిరి. అని ముందు చూపబడిన చూర్ణికనందు ఆచార్య హృదయకారులగు అజిగియ మణవాళ పెరుమాళ్ నాయనార్ తెలిపిరి. 'పుకళ్' అనగా కీర్తింపబడు గుణము. 'నికరిల్ పుకళ్' సాటి లేని గుణము. అదియే వాత్సల్యము అని ఆళ్వార్లు అభిప్రాయపడిరి. కావున నమ్మాళ్వార్లు వాత్సల్యమును దోషములను గుణములుగా గ్రహించు స్వభావముగా తెలుపుట అనుభవింపదగినది.

నమ్మాళ్వార్ల శ్రీపాదాలనాశ్రయించి ఉజ్జీవించిన భగవద్రామానుజులు అనుగ్రహించిన 'శరణాగతిగద్య'లో శ్రీరంగనాథుని శరణాగతి చేయుచూ పరమాత్మ గుణములను తెలుపుక్రమములో రెండుసార్లు వాత్సల్యగుణమును అనుసంధానము చేసినను తృప్తి పొందక, మూడవ పర్యాయము ప్రత్యేకముగా **"ఆశ్రిత వాత్సల్యైక జలధే"** (అంతులేని, సాటిలేని సముద్రమువంటి భక్తవాత్సల్యమును గుణముగా కలవాడా!) అని సంబోధించుటచే వాత్సల్యమును సాటిలేని గొప్పగుణముగా అనుసంధించుటను గమనింపదగును. ఇచ్చట వ్యాఖ్యానముచేసిన శ్రుతప్రకాశికాచార్యులవారు, పెరియవాచ్చాన్పిళ్ళై దోషములను గుణములుగా గ్రహించుటయే వాత్సల్యమని వ్యాఖ్యానించుట గుర్తింపదగినది.

శ్రీవేదాన్త దేశికులు తమ దయాశతకములోని 97వశ్లోకములో పరమాత్మ వాత్సల్యగుణమును గురించి ఈ విధముగా అనుగ్రహించారు.

**ఔత్సుక్య పూర్వ ముపహృత్య మహాపరాధాన్**

**మాతః ప్రసాదయతు మిచ్ఛతి మే మనస్త్వామ్ ।**

**ఆలిహ్య తాన్ నిరవశేషమలబ్ధతృప్తిః**

**తామ్యస్యహో వృషగిరీశ ధృతా దయేత్వమ్ ॥**

దయాదేవీ! నీవునాకు తల్లివి. నీ పుత్రుడనైన నేను నీకు పరిపూర్ణమైన ఆహారమునిచ్చి పూర్ణతృప్తిని కలిగించుటకు లేదే అని మనసులో చింతించుచున్నావు. అహో! నీ మనసెంత గొప్పది! నేను నీకివ్వతగిన ఆహారము నా పాపములే వాటిని నీకు కానుకవలె తెచ్చి సమర్పించినాను. వాటిని కొంచెము కూడా మిగల్చక నీవు స్వీకరించితివి. బహుకాలము ఉపవాసమున్న వారిలా ఎంతో తృప్తిగా భుజించావు. ఆహా! నీ మనసెంత గొప్పది. పాపములను ఆహారముగా స్వీకరించుటచే దోషములను గుణములుగా వాత్సల్యగుణము గోచరించుచున్నది.

ఇంతవరకు భగవానుని భక్తవాత్సల్యమను గుణమును, వేదము, శ్రీపాంచరాత్రాగమము, ఆళ్వార్ల శ్రీసూక్తులు, శ్రీభగవద్రామానుజుల శ్రీసూక్తులు, ఆచార్యహృదయచూర్ణిక, శ్రుతప్రకాశికాచార్యుల శ్రీసూక్తులు, శ్రీవేదాన్తదేశికుల శ్రీసూక్తులుగొని తెలిసినంత వరకు విన్నవించితిని. ఇంకను పిళ్ళైలోకాచార్యులు, మణవాళమహామునులు మొదలగు పెద్దల సూక్తులు అసంఖ్యాకములుగా వారి గ్రంథములలో లభించుచున్నవి. విస్తరభీతిచే ఇంతటితో విరమించుచున్నాను.

## శ్రీరామాయణంలో
# నవవిధ సంబంధాలు

ఈ.ఎ. సింగరాచార్యులు - తిరుపతి

**పితా చ రక్షకః శేషీ భర్తా జ్ఞేయో రమాపతిః ।**
**స్వామ్యాధారో మమాత్మా చ భోక్తా చాద్యమనూదితః॥**

ఈ శ్లోకం మంత్రరాజమనబడే అష్టాక్షరీ మహామంత్రంలో సూచింపబడేది. భగవానునకు – జీవునకు మధ్య ఉండేవి అయిన తొమ్మిది సంబంధాలను తెల్పుతున్నది. భగవానుడు జీవులకు సర్వవిధబంధువు. **'బధ్నాతి ప్రీతి మితి బంధుః'** అనే బంధు శబ్దవ్యుత్పత్తి భగవానునకు జీవునివిషయంలో ఉండే సహజమైన, నిరవధికమైన ప్రీతిని వచిస్తున్నది. ఈ ప్రీతి నిరుపాధికమైనందున అనేక ప్రకారాలను కల్గినది అయినా, లోకరీతినిబట్టి, ప్రాధాన్యాన్నిబట్టి తొమ్మిది విధాలైన సంబంధాలు తిరుమంత్రంలో తెలుపబడుతున్నాయని మన పూర్వాచార్యులు భావించారు.

సుబాలోపనిషత్ కూడా **'మాతా పితా భ్రాతా నివాసః శరణం సుహృద్గతి ర్నారాయణః'** నారాయణుడు– జీవులకు తల్లి, తండ్రి, భ్రాత, నివాసం, శరణం, స్నేహితుడు, గతి అని ఈ ప్రీతి పలువిధాలైనదని అన్నది.

**'వేదమ్ తమిళ్ శెయ్దమాఱన్'** నమ్మాళ్వార్లు ఈ అర్థాన్ని **'శేలేయ్ కణ్ణియరుమ్ పెరుమ్ శెల్వముమ్ నన్మక్కళుమ్ మేలాత్తాయ్ తన్దైయుమ్ అవర్, ఇనియావారే'** అందమైన చేపలవంటి కన్నులనుకల స్త్రీలు, గొప్పసంపద, సత్సంతానం, ఇంకా తల్లి, తండ్రి ఆ భగవానుడే. ఇంకా మిగిన బంధువులంతా అతడే అని. **'తాయాయ్ తన్దైయాయ్ మక్కళాయ్ మట్రుమాయ్ ముట్రుమాయ్'** తల్లియై, తండ్రియై, సంతానమై, ఇంకా అన్నివిధాలైన బంధువై అని అనుసంధించారు.

ఈ రీతిలో భగవానునకు జీవులపై ఉండే ప్రీతి ఏరీతిలో అయినా, అది నిరుపాధికం, నిరవధికం.

**'భూతానామవ్యయః పితా'** జీవులకు వ్యయంలేని, నిత్యమైన తండ్రి అనే ఉపబృంహణసూక్తి. **'ఎన్ఱుమ్ ఇఱవాద ఎన్దై'** ఏనాడూ నశించని తండ్రి అని ముదలాళ్వార్లు అన్నారు.

**'ఋచో యజూంషి సామాని తథైవాథర్వణాని చ। సర్వ మష్టాక్షరాంతస్థమ్'** ఋగ్యజుస్సామాథర్వణాలనే వేదాలన్నీ అష్టాక్షరిలో ఇమిడి ఉన్నాయి అనే సూక్తి ప్రకారం వేదాల సంగ్రహరూపం అష్టాక్షరి. ఈ అష్టాక్షరిలో సూచింపబడే నవవిధ సంబంధాలు వేదోపబృంహణమైన శ్రీరామాయణంలో అనుసంధింపబడడం సహజయుక్తం కదా!

**'వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా'** వేదం శ్రీరామాయణరూపంలో ఆవిర్భవించింది కదా! ఈ నవవిధ సంబంధాలను నిరూపించే సందర్భాలు, సూక్తులు శ్రీరామాయణంలో కోకొల్లలుగా ఉన్నా, ఇక్కడ సంగ్రహంగా, సూచనగా మాత్రమే ప్రస్తావింపబడుతున్నాయి.

### 1. పితా - పుత్ర సంబంధము

పదత్రయాత్మకమైన అష్టాక్షరిలోని మొదటి పదం ప్రణవం. ఈ ప్రణవం కూడా మళ్ళీ పదత్రయాత్మకమే. అందులోని మొదటి పదం అకారం. ఈ అకారం ప్రకృత్యంశద్వారా పితా పుత్ర సంబంధాన్ని తెల్పుచున్నది. **'సమస్తశబ్దమూలత్వాత్ అకారస్య స్వభావతః, సమస్త శబ్దమూలత్వాత్ బ్రహ్మణోఽపి స్వభావతః। వాచ్యవాచక సంబంధస్తయోరర్థాత్ ప్రతీయతే'।** అనే ప్రమాణాన్ని బట్టి ఈ సంబంధం వాచ్యవాచక సంబంధ ప్రయుక్తం. దీనిని **'మాతాపితా పౌత్రా...'** అని మొదలైన శ్రుతులు, **'దేవదేవో హరిః పితా'** వంటి ఉపబృంహణసూక్తులు, **'ఎన్దైయ్ ఎన్నుమ్'** ఇత్యాది ఆళ్వార్ల సూక్తులు తెలుపుతున్నాయి.

ఈ సంబంధం శ్రీరామాయణంలో లక్ష్మణవచనం ద్వారా వ్యక్తమైనది. **'భ్రాతా భర్తా చ బంధుశ్చ పితా చ మమ రాఘవః'** శ్రీరాముడు నాకు భ్రాత, భర్త, బంధువు, తండ్రికూడా అనే లక్ష్మణవచనంతో పాటుగా, లక్ష్మణుని ఉద్దేశించి సుమిత్రాదేవి పల్కిన **'రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్'** శ్రీరాముని దశరథునిగా జానకిని నన్నుగా భావించు అనే వచనం కూడా ప్రమాణం.

### 2. రక్ష్య - రక్షక సంబంధము

ఇది కూడా అకారం ద్వారా సూచింపబడింది. అయితే, ఇది ధాత్వర్థ ప్రయుక్తం. ఈ అకారాన్ని **'అవ–రక్షణే'** అనే ధాతువునుండి పుట్టిన పదంగా గ్రహించినపుడు ఇది భగవానుని రక్షకత్వాన్ని

7 సం॥లలో CA/CWA లలో అత్యధిక ఆలిండియా ర్యాంకులు మరియు పాస్ పర్సెంటేజ్ సాధించిన నెం.1 కామర్స్ విద్యా సంస్థ
ఆంధ్రప్రదేశ్‌లోనే అత్యుత్తమ ఉత్తీర్ణతతో పాటు ర్యాంకులు సాధిస్తున్న ఏకైక అగ్రగామి కామర్స్ విద్యా సంస్థ
2012 Jr.MEC లో స్టేట్ 1st RANK 490/500 K. VYSHNAVI
No.1 for ▸ Inter(MEC / CEC) ▸ CA/CWA
శ్రీ MEDHA
Igniting Intelligence. Delivering Excellence.
Head Office: 6/9 Brodipet, Vuda Office Road, Guntur-2. Ph: 22 55 891 / 988 52 49166
Branch Office: Sriya Towers 2nd Floor, Besides Income Tax Office, Near Sidhardha Public School, Mogalrajpuram, VIJAYAWADA Ph:9248920266

బోధిస్తుంది. ఈ సంబంధాన్ని **'కోహ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్'** ఎవడు రక్షించగలడో, ఎవడు బ్రతికించగలడో ఇత్యాది శ్రుతులు, **'న హి పాలన సామర్థ్యమృతే సర్వేశ్వరం హరిమ్'** సర్వేశ్వరుడైన హరికి తప్ప పాలించే సామర్థ్యం ఎవరికీ లేదు ఇత్యాది ఉపబృంహణ సూక్తులు, **'కరుత్తిల్ తేవుమ్ ఎల్లాప్పొరుళుమ్ వరుత్తిత్త మాయాప్పిరాన్'** తన సంకల్పమాత్రంతో దేవతలను, ఇంకా అన్ని వస్తువులను వర్తింపజేసిన ఆశ్చర్యగుణచేష్టితుడు ఇత్యాది ఆళ్వార్ల సూక్తులు తెల్పుతున్నాయి.

శ్రీరామాయణంలో ఈ సంబంధం **'రక్షితా సర్వలోకస్య'** సమస్తలోకానికి రక్షకుడు.

**బాహుచ్ఛాయామవష్టబ్ధః యస్యలోకో మహాత్మనః'**
**గజం వా వీక్ష్యసింహం వా వ్యాఘ్రం వాపి వరాంగనా,**
**నాహారయతి సంత్రాసం బాహూ రామస్య సంశ్రితా।**

శ్రీరాముని బాహువులను ఆశ్రయించిన అందమైన సీత ఏనుగును చూచిగాని, సింహాన్ని చూచిగాని, పులిని చూచిగాని, ఏమాత్రం భయపడడంలేదు. ఇత్యాది పలుసూక్తులద్వారా వ్యక్తం.

### 3. శేష - శేషి సంబంధము

ఇది అకారంపై వచ్చి లోపించిన చతుర్థీవిభక్తి ద్వారా సూచింపబడుతున్నది.

జీవులందరు భగవానునకు శేషమని, అతడు సర్వశేషి అని దీని తాత్పర్యం. **'యస్యాస్మిన తమంతరేమి' 'పతిం పతీనామ్'** ప్రభువులకు ప్రభువు ఇత్యాది శ్రుతులద్వారా, **'జగత్పతిం దేవదేవమ్'** అనే ఉపబృంహణ వాక్యాలద్వారా, **'అమరర్‌కళ్ అదిపతి'** ఇత్యాది దివ్యసూరి వచనాల ద్వారా తెలుపబడుతున్నది.

శ్రీరామాయణలో ఈ సంబంధం లక్ష్మణ, భరత సూక్తుల ద్వారా స్పష్టం. రాజ్యపట్టాభిషేకాన్ని చేసికొని, రాజ్యాన్ని పాలించమని పల్కిన వసిష్ఠాదులతో భరతుడు పల్కిన **'రాజ్యం చాహం చ రామస్య'** నేను, రాజ్యం రామునకు శేషభూతులము అనే వచనం, తనను వనానికి వెంటగా తీసికొని వెళ్ళమని అర్థిస్తూ శ్రీరామునితో లక్ష్మణుడు పల్కిన **'కురుష్వ మామనుచరం వై ధర్మ్యం నేహ విద్యతే'** ఇత్యాది వచనాలు, **'అహం సర్వం కరిష్యామి'** ఇత్యాదులు ఇక్కడ ప్రమాణాలు.

### 4. భర్త - భార్యా సంబంధము

ఇది ప్రణవంలోని ద్వితీయాక్షరమై ద్వితీయపదమైన ఉకారం ద్వారా సూచింపబడుతున్నది. ఈ ఉకారం ద్వారా జీవుని భగవదనన్యార్హత్వం సూచింపబడింది. ఇటువంటి స్థితి లోకంలో భార్య భర్త విషయంలో కల్గి ఉంటుంది కనుక, ఈ ఉకారం భర్తృ- భార్యా సంబంధ వాచకం. దీనిని **'భగవత ఏవాహమస్మి'** భగవానునకు మాత్రమే చెందినవాడను. **'యో వై స్వామతి యజతే, ప్రస్వాయై దేవతాయై చ్యవతే, న పరాం ప్రాప్నోతి, పాపీయాన్ భవతి'** ఎవడు తనకు స్వరూపానురూపమైన దైవాన్ని వదలి అన్యదైవాన్ని భజిస్తాడో, అతడు తన దేవతనుండి దూరం కావడమే కాక, అతనికి పరగతిలేదు, పాపిష్ఠివాడవుతున్నాడు ఇత్యాది శ్రుతులు,

**'సంసేవ్య ఏకో హరిరింద్రియాణాం**
**సేవాన్యదేవే వ్యభిచార ఏవ ।**

హరి ఒక్కడే ఇంద్రియాలకు సేవ్యుడు. అన్యదైవాలను పారమ్యబుద్ధితో సేవించడం సరికాదు. ఇత్యాది ఉపబృంహణ వాక్యాలు, 'పఱవై ఏఱువరమ్ పురుడా! నీ ఎన్నైకైక్కొడిపిన్' గరుడుని అధిరోహించే పరమపురుషా! నీవు నన్ను పాణిగ్రహణంచేసిన తరువాత అనే పెరియాళ్వార్ల సూక్తి. **'ఊనిడైయాళి శఙ్గు ఉత్తమర్‌క్కెన్ఱు ఉన్నిత్తెఴున్ద ఎన్ తడములైకళ్ మానిడవర్ క్కెన్ఱు పేచ్చుప్పడిల్ వళకిల్లేన్'** శంఖచక్రధారియైన పురుషోత్తమునికోసంగా ఎదిగిన నాస్తనాలు-అంటే - జ్ఞానభక్తులు మానవులకోసమనే మాటవింటే జీవించలేను) అనే గోదాసూక్తి- ఇత్యాది దివ్యసూరిసూక్తులు తెలుపుచున్నాయి.

శ్రీరామాయణంలో ఈసంబంధం - సుందరకాండలో సీతాదేవి హనుమానుతో పల్కిన **"కౌసల్యాలోకభర్తారం సుషువే యం మనస్వినీ, తం మమార్థేసుఖం పృచ్ఛ"** (కౌసల్యాదేవి, లోకభర్త అయిన ఏ శ్రీరాముని కన్నదో, అతనిని నాకోసం కుశలమడుగు) అనే సూక్తి ద్వారా స్పష్టపడుతున్నది. *(సశేషం)*


హోమియోటుడే
వైద్య ఆరోగ్య విజ్ఞాన మాసపత్రిక
**తాజా సంచిక మార్కెట్లో ఉంది**
2011 ఏప్రిల్‌లో ప్రారంభమై రాష్ట్రంలోని ప్రముఖ హోమియో వైద్యుల సలహాలు, సూచనలు, ఆరోగ్య వ్యాసాలతోపాటు
హోమియో విజయాలు, హోమియో స్టూడెంట్స్
సినీ రంగంలో హోమియో అభిమానులు, హోమియో కవితలు
హోమియో వైద్య రంగ మహనీయులు, సింగిల్ డోస్
హోమియోన్యూస్, హోమియో మాట్రిమోని
తదితర విభిన్న శీర్షికలతో ముస్తాబై వస్తోంది.
చదవండి.... చదివించండి
చందాదారులుగా చేరండి.. చేర్పించండి
**విడిప్రతి రూ. 15/-**

| 'హోమియోటుడే' చందా వివరాలు | |
|---|---|
| 14 సంచికలు | రూ. 200/- |
| 28 సంచికలు | రూ. 400/- |
| 35 సంచికలు | రూ. 500/- |
| 70 సంచికలు | రూ. 1000/- |

చిరునామా: డోర్ నెం. 8-3-281, సెకండ్ ఫ్లోర్, హైదరాబాద్ రెస్టారెంట్ పక్కన, యూసుఫ్‌గూడ బస్తీ, హైదరాబాద్- 500045, ఫోన్: 9848028655
ఈ మెయిల్: homoeotodaymonthly@gmail.com
పూర్తి వివరాలకు సంప్రదించండి ఫోన్: 9848028655

# తత్త్వరహస్యం

## శ్రీకృష్ణభగవానుడు గరుడునికి చెప్పిన రహస్యం

**(గరుడ పురాణము ధర్మకాండము)**

**శ్రీమాన్ పురాణం వేంకటాచార్యులు**

**అత్ర జన్మసహస్రాణాం సహస్రైరపి కోటిభిః ।**
**కదాచిల్లభతే జన్తుః మానుష్యం పుణ్యసంచయాత్ ॥**

ఇక్కడ ఈలోకంలో వేల వేలకోట్లజన్మలలోని ఏదో ఒక పుణ్యఫలంగా మానవజన్మ లభిస్తుంది. ఈ లభించిన మానవజన్మ మెట్లు ఎక్కి ఎక్కి చేరి సంతోషించేది. దుర్లభమయినదీను అయినా....

**యస్తారయతి నాత్మానం తస్మాత్ పాపతరోఽత్ర కః ॥**

ఇంత మహాకాలంలో వేలవేలకోట్ల జన్మల తరువాత లభించిన మానవజన్మలో కూడ తరించడానికి ప్రయత్నించక ఆత్మహితాన్ని తెలుసుకోలేకపోతాడో వాడు ఎంత పాపిష్ఠివాడు? అంతకంటే పాపి ఎవరయినా వుంటాడా?

వ్యాసులవారు ఇంకా ఏమంటున్నారో గమనించండి.

**నరః ప్రాప్యేతరజ్జన్మ లబ్ధ్వా చేన్ద్రియసౌష్ఠవమ్ ।**
**నవేత్త్యాత్మహితం యస్తు స భవే ద్బ్రహ్మఘాతుకః॥**

పుట్టినా, కన్నూ ముక్కూ చెవీ నాల్క అంతరింద్రియ సౌష్ఠవాలు కలిగివున్నా తనకు హితమయిన ఆధ్యాత్మిక తత్త్వాన్ని తెలుసుకోనివాడు వేదఘాతకుడు, బ్రహ్మఘాతకుడు బ్రాహ్మణ ఘాతకుడు కూడాను. చూశారా?ఆత్మపరమాత్మల తత్త్వం తెలిసకొని ఆత్మ హితం యేదో తెలుసుకోకపోతే ఎంత తప్పు! కాదు కాదు ప్రమాదం!! వాణ్ణివాడే చంపుకున్నట్లన్నమాట!

**వినా దేహేనయస్యాపి పురుషార్థో నవిద్యతే**

అని కదా ఋషివాక్కు! శరీరం లేకుండగ ఏ పురుషార్థమూ దక్కదట. అందువలన శరీరాన్నీ డబ్బునీ రక్షించుకోవాలి. పుణ్యకర్మలకోసం. ఇంకో ముఖ్యమయిన విషయం జాగ్రత్తగా అవగాహన చేసుకోవలసినది వున్నది సుమా!

**రక్షేచ్చ సర్వదాత్మానం ఆత్మా సర్వస్య భాజనమ్ ।**
**రక్షణే యత్నమాతిష్ఠేత్ జీవన్ భద్రాణి పశ్యతి ॥ 19 శ్లో॥**
**పునర్గ్రామః పునః క్షేత్రం పునర్విత్తం పునర్గృహమ్ ।**
**పునః శుభాశుభం కర్మ న శరీరం పునః పునః ॥**

తన ఆత్మను తానెప్పుడూ సంరక్షించుకుంటూ వుండాలి. ఆత్మే అన్ని విషయాలకూ పాత్రమయినది. స్థానమయినది. అందుకే దానిని రక్షించుకొనే పనిలోనే వుండాలి. బ్రతికుంటే శుభాలు చూస్తాడు. ఏమో మంచిపనులు చేసే అవకాశం కూడా రావచ్చునుగదా!

గ్రామం తిరిగి సంపాదించవచ్చును. పొలం మళ్ళీ సంపాదించుకోవచ్చును. డబ్బుపోయినా సంపాదించ వచ్చును. అలాగే యిల్లు మరల సంపాదించవచ్చును. పుణ్యాలు పాపాలు– శుభాశుభాలు మళ్ళీమళ్ళీ చేసుకోవచ్చునుగాని శరీరమును మళ్ళీ పొందలేము. మళ్ళీ మానవజన్మనే పొందటానికి అవకాశము లేకపోవచ్చు.

అందుకే మన పెద్దలంటారు. "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" అని. వారు ధర్మసాధన ప్రక్రియ ప్రారంభించాలంటే మొదటిది శరీరమన్నారు.

**శరీర రక్షణోపాయాః క్రియన్తే సర్వదా బుధైః ।**
**నేచ్ఛన్తి చ పునస్త్యాగమపి కుష్ఠాది రోగిణః ॥ 20 శ్లో॥**

పండితులు శరీరరక్షణకు ఎన్నో ఉపాయాలు ఆశ్రయిస్తారు. కుష్ఠరోగి అయినా తన శరీరాన్ని ఒదులుకోవాలనుకోడు గదా! ఎవరయినా కావాలని (ఆత్మహత్య) చేతులారా మరణించినా అది దోషమే!

**తద్గోపితం స్యాత్ ధర్మార్థం ధర్మో జ్ఞానార్థమేవ చ।**
**జ్ఞానం తు ధ్యానయోగార్థం అచిరాత్ ప్రవిముచ్యతే ॥21శ్లో॥**

ధర్మం కోసం శరీరాన్ని రక్షించుకోవాలి. వారు ఆచరించే ఆ ధర్మం జ్ఞానం కోసం. అలా ఆచరించిన జ్ఞానయోగం ధ్యానయోగం కోసం అలా ఆచరించినవారు మోక్షం పొందుతారు.

**ఆత్మైవ యది నాత్మానం అహితేభ్యో నివారయేత్।**
**కోన్యో హితకరస్తస్మాత్ ఆత్మానం సుఖయిష్యతి ॥ 22 శ్లో॥**

ఆత్మే మానవుడికి హితకర్త. ఆత్మను అహితమునుండి నివారించాలి. అంతకంటే మేలు వేరు లేదు. అందుచే ఆత్మ తనను తరింప చేస్తుంది.

**ఇహైవ నరకవ్యాధేః చికిత్సాం న కరోతి యః ।**
**గత్వా నిరౌషధం దేశం వ్యాధిభ్యః కిం కరిష్యతి ॥23 శ్లో॥**

నరకానికి చేర్చే పాపపు పనులను చేసే, చేయాలనిపించే రోగానికి ఇక్కడే వైద్యం చేయకపోతే, ఔషధం దొరకని దేశానికి (నరకానికి) వెళ్ళి ఈ వ్యాధుల విషయంలో ఏం చేస్తాడు. శరీరం అశాశ్వతమనేమాట సత్యం. కాని, ఆ మాట అనుక్షణం గుర్తువుంటే ఎంత బాగుంటుంది? ఎంత మంచిపనులు చేస్తాం!

ఎల్లప్పుడూ ఆధ్యాత్మిక ఆలోచనలూ, మంచిపనులూ (పుణ్యకార్యాలు) చేస్తూ ఉండాలి. వ్యాసమహర్షి ఎంత చక్కగా సెలవిచ్చారో చూడండి.

(సశేషం)

### ప్రియమైన భక్తినివేదన పాఠకులకు - విశేష సూచన

మన భక్తినివేదనను బహుకాలంగా ఆదరిస్తున్న మీకు మా ధన్యవాదాలు. శీర్షికల విషయంలోకాని, వ్యాసాల విషయంలో కాని, భాష విషయంలోకాని, సంపాదకీయం విషయంలోకాని, లెటర్ ఫాంటు విషయంలో గాని పాఠకులు తమ అభిప్రాయాలను నిర్ద్వంద్వంగా వెలిబుచ్చవచ్చును. వాటిని తప్పక స్వాగతిస్తున్నాం. సాధ్యమైనంతమేర తప్పక మార్పులు చేర్పులు చేసికుంటూ, పాఠకులకు తగినంత సమాచారాన్ని అందించే ప్రయత్నం చేస్తున్నాం, చేస్తాం. మీరు వ్రాసే లేఖలేవైనా ఈక్రింది చిరునామాకే వ్రాస్తే ఆలస్యం కాకుండా మాకే అందుతాయి.

రచయితలు కూడా ఈక్రింది అడ్రస్సుకే వ్రాయండి. ముఖ్యంగా సంపాదకునికి వివిధ విషయాలపై మీఅభిప్రాయాలను వ్రాసేటప్పుడు తప్పనిసరిగా మీ పూర్తిచిరునామా, ఫోనునెంబరు ఇస్తే వెంటనే మీతో సంప్రదించే అవకాశం ఉంటుంది. ఇటీవల భాషవిషయంలో తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చిన ఒకపాఠకులు తమ చిరునామా వ్రాయలేదు. చిరునామా లేని లేఖలను పత్రిక పరిగణించదని గమనించగలరు. మీ సహకారానికి ధన్యవాదాలు - సంపాదకుడు.

చిరునామా : సంపాదకుడు, భక్తినివేదన, శ్రీరామనగర్, ముచ్చింతల్, పాలమాకుల(పో), 509325 రంగారెడ్డి జిల్లా, తెలంగాణా. మొ॥94415 62863

ప్రకృతిబడిలో... 10

# సాగరం నేర్పిన పాఠం

మే సంచిక తరువాయి

**వైశారదీ**

అవధూత యదుమహారాజుకి ప్రకృతినుండి తాను నేర్చిన పాఠాలని వివరిస్తున్న వైనం మనం తెలుసుకుంటున్నాం! భూమిమొదలైన పంచభూతాలనుండి, అజగరము, పావురము వంటి పశుపక్ష్యాదులనుండి, పర్వతము వంటి స్థావరాలనుండే కాక, సూర్యచంద్రులనుండి ఏమేమి నేర్చుకోవచ్చో ఇంతవరకు మనం తెలుసుకున్నాం! గత డిశంబరుమాస సంచికలో నిరంతర ప్రవాహశీలమైన జలము నుండి ఏమి నేర్చుకోవచ్చో తెలుసుకుంటే ఈ సంచికలో అలాంటి ప్రవాహాలన్నిటికీ లయస్థానము, ఆకరము అయిన సముద్రము నుండి ఏమి నేర్చుకోవాలో అవధూత యదుమహారాజుకి వివరించినది మనమూ తెలుసుకుందాం!

ఓ యదుమహారాజా! భూమి మీద మూడువంతుల భాగము ఆవరించి కనిపించేది, అనంతమైన జలరాశికి ఆవాసమైనది సాగరము. ఎన్నో ఏరులని, ప్రవాహాలని తమలో కలుపుకున్న నదులన్నీ చేరేది ఈ సాగరాన్నే. భూమిమీద ఏ ప్రదేశంలో నుండి చూసినా ఆవలి తీరమెక్కడో తెలియనంతగ అనంతంగ వ్యాపించినది. చూడడానికి పైకి ఎంతో ఆహ్లాదంగ ప్రసన్నంగ కనిపించే ఈ సాగరపు లోతెంతో తెలియరానిది. ఒక నదిలో ప్రవేశించి స్నానమాడగలం. ఈవలి ఒడ్డునుండి ఆవలి ఒడ్డుకి ఈదనూ గలం. కానీ, సాగరమో అవగాహించ రానిది, అపారమైనదీను.

ఎన్ని నదులు వచ్చి తనతో చేరినా ఎన్నడూ పొంగిపొరలదు. ఒకవేళ వానాకాలంలో ఆ నదులన్నిటికీ వరదలు వచ్చి మరింత నీరు తనలో చేరినా సాగరం హద్దు మీరదు. చెలియలికట్టను దాటనే దాటదు. లేక ఎండల ప్రభావానికి నదులలో నీరు ఇంకిపోయినా సముద్రమేమీ ఎండిపోదు కూడా. ప్రకృతిలో ఆయా ఋతువుల వలన ఏర్పడే మార్పులకి, నదులద్వారా తనలో వచ్చి చేరే నీటిశాతంలో ఎలాంటి హెచ్చుతచ్చులు ఏర్పడినా ఎలాంటి మార్పుకి లోను కాకుండా నిలచి ఉండే గాంభీర్యం(లోతు) సాగరానికే సొంతం. అందుకే శ్రీరామచంద్రుని కూడా సముద్ర ఇవ గాంభీర్యే అంటూ సాగరంతోనే పోల్చారు వాల్మీకి మహర్షి.

ఓ యదుమహారాజా! అనంతము, అపారము, గంభీరమై ఎవరికీ ప్రవేశించరానిదై, దేనికీ చలించనిదై, ఇంతటిది అని గ్రహించరానిదైన ఈ సాగరాన్ని చూస్తుంటే సాధకుడై, మననశీలుడైన వాని ప్రవృత్తి ఎలా ఉండాలో నిర్దేశిస్తున్నట్లుగ ఉందయ్యా! గమనించు!

మనిషికి, ఇష్టమైన దానిని గురించి మననం చేయడం సహజప్రవృత్తి. అది తనతో చేరితే పొంగిపోవడం, చేరకపోతే కుంగి పోవడమూ సామాన్యమే! కానీ, అదే మానవుడు మననశీలమైన తన మనస్సునీ, ప్రవృత్తినీ నారాయణపరం చేయగలిగితే, జీవితాన్ని సార్థకం చేసుకోగలుగుతాడు. కేవలం భౌతిక దృష్టితో బాహ్య విషయాలనే తలిస్తే, అవి లభిస్తే ఆనందిస్తూ, లేకుంటే బాధపడుతూ ద్వంద్వాల మధ్య కొట్టుమిట్టాడుతూంటాడు. ఆచార్యానుగ్రహంతో కాస్త లోదృష్టిని, లోతైన దృష్టిని అలవరచుకున్నవాడు ఆ విషయసుఖాలన్నిటికీ లోపల వ్యాపించి ఆనందింప చేస్తున్న ఆ ఆనందఘనుని గుర్తించగలిగిననాడు, చేసే మననం నారాయణ పరమౌతుంది. ఆ దశకి చేరుకున్న నారాయణపరుడు ఈ సాగరంలానే ప్రసన్నంగ ఉంటాడు.

నదులన్నీ సాగరాన్ని చేరాలని తపనపడినట్లుగ, సన్మనుష్యులకి, సాధకులకీ ఆశ్రయణీయుడౌతాడు. బాహ్యవిషయ స్పర్శలేవీ అతనిని చలింపచేయలేవు. వాటినసలు అతడు కాంక్షించనే కాంక్షించడు. సదా అంతర్యామిని భావిస్తూ గంభీరమైన హృదయం కలిగి ఉంటాడు. సామాన్యులు చూస్తే పైకి ప్రసన్నంగ అందరిలాంటివాడే అన్నట్లున్నా లోపల సదా పరమాత్మ మననశీలుడై ఉంటాడు. జీవనయాత్రలో తన ప్రమేయం లేకుండ ఎదురయ్యే సుఖానుభవాలకి పొంగిపోయి మళ్ళీ మళ్ళీ కావాలని కోరుకోడు. బాధలకి భయపడి కుంగిపోడు. ఆయా అనుభవాలన్నీ కర్మానుభవంలో భాగంగ గుర్తించి సమబుద్ధితో స్థిరచిత్తంతో చలించకుండా ఉండగలుగుతాడు.

దీనినే శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత2 వ అధ్యాయంలో 70వ శ్లోకంలో వివరించాడు.

ఆపూర్యమాణమచల ప్రతిష్ఠం
సముద్రమాప ప్రవిశంతి యద్వత్।
తద్వత్ కామా యం ప్రవిశంతి లోకే
స శాంతిమాప్నోతి న కామకామీ

సముద్రము అంతటా నీరుతో నిండి ఉంటుంది. కనుకనే నదీ జలాలు వచ్చి చేరాలని ఆశించదు. వాటంతటవి చేరితే వద్దనదు. చేరాయే నన్ను అని ఉప్పొంగదు. ఎన్నడూ హద్దుమీరక గంభీరంగ నిలిచి ఉంటుంది. అలానే సాధకుడు ఆత్మానుభవంలో అంతర్ముఖుడై పరమానందంలో పరిపూర్ణంగ మునిగి ఉన్ననాడు ఇంద్రియాలు బాహ్య విషయానుభవానికై ఆశపడవు. ఆరాటపడవు. ఒకవేళ యాదృచ్ఛికముగ విషయసుఖాలు వచ్చి చేరినా, లేక ఉన్నవి దూరమైనా పొంగుకుంగులు లేకుండా ఉండగలుగుతాడు.

కోరకున్నా వచ్చిచేరే నీటివలన సాగరము కలతచెందక ప్రసన్నంగ ఉన్నట్లే, సాధకుడు కూడా శాంతితో గంభీరంగ ఉండగలుగుతాడు. ఎవరైతే విషయాలపట్ల ఆసక్తితో వాటిని పొందాలని ఆరాటపడుతుంటారో అలాంటివారికి శాంతి అనేదే ఉండదు. ఆత్మారాములకి, నారాయణ పరులకి అశాంతి అనేదే ఉండదు అన్న పరమాత్మ సందేశాన్ని ఈ సాగరము పదే పదే తలపింపచేస్తోంది! విషయాసక్తి వీడి, నారాయణ పరుడివై శాంతియుతంగ జీవించమంటోంది. స్థిరచిత్తంతో ముక్తిపథంలో గంభీరంగ నిలవమంటోంది! అంటూ అవధూత మహారాజుకి, సాగర మథనం కావిస్తే ఆవిర్భవించిన అమృతప్రాయమైన పాఠాన్ని, ఆ సాగరాన్ని గమనించి నేర్చుకున్నదానిని వివరించారు.



మధురస్మృతులు

ఖరనామసంవత్సరం, పుష్యమాసం

50సంవత్సరాల పూర్వపు భక్తినివేదన నుండి

# శ్రీరామానుజ మూర్తిధ్యానమ్

1952 జనవరి

" ఆచి శ్రీమన్నారాయణాచార్యస్వామి"

**శ్లో ॥ స్వరూపం పరమాత్మానం । స్వభావం శ్రీస్వభావకం ॥**

అర్థము॥ శ్రీరామానుజులవారియొక్క స్వరూపము పరమాత్ముడుగను, స్వభావం శ్రీలక్ష్మీస్వభావముగను.

**శ్లో ॥ మస్తకం శ్రీశఠారితిం నాథాఖ్యం ముఖమణ్డలమ్ ।**
**నేత్రయుగ్మం సరోజాక్షం కపోలం రాఘవంతథా ॥**

అ ॥ శిరస్సున శ్రీనమ్మాళ్వార్లుగాను, ముఖమండలమున శ్రీమన్నాథమునులుగను, నేత్రద్వంద్వమున శ్రీపుణ్డరీకాక్షులుగను కపోలమును శ్రీరామమిశ్రులుగను.

**శ్లో ॥ వక్షస్థలం యామునాఖ్యం కంఠం శ్రీపూర్ణదేశికమ్ ।**
**బాహుద్వయం గోష్ఠిపూర్ణం శైలపూర్ణస్తనద్వయమ్ ॥**

అ ॥ వక్షస్థలమును శ్రీయామునాచార్యులుగను, కంఠమును శ్రీపూర్ణదేశికులుగను, హస్తద్వయమును గోష్ఠీపూర్ణులుగను, స్తనద్వయమును శ్రీశైలపూర్ణులుగను.

**శ్లో ॥ కుక్షింతు వరరంగార్యం పృష్ఠం మాలాధరం తథా ।**
**కటిం కాంచీమునిం జ్ఞేయం గోవిందార్యం నితంబకమ్॥**

అ ॥ ఉదరమును తిరువరంగప్పెరుమాళయర్‌ను, వీపును తిరుమాలైయాండానుగాను, మొలను తిరుక్కచ్చినంబిగారుగను, నితంబమును ఎంబార్లుగను.

**శ్లో ॥ భట్టవేదాంతినౌ జంఘే ఊరుయుగ్మం కలిద్విషమ్ ।**
**కృష్ణం జానుయుగం చైవ లోకం శ్రీపాదపంకజమ్ ॥**

అ ॥ పిక్కలను భట్టరు-నంజీయర్లుగను, తొడలను నంబిళ్ళగను, మోకాళ్ళు రెండింటిని వడక్కుత్తిరువీధిపిళ్ళైగను, పాదములను పిళ్ళైలోకాచార్యులుగను.

**శ్లో ॥ రేఖాం శ్రీశైలనాథాఖ్యం పాదుకాం వరయోగినమ్ ।**
**పుండ్ర సేనాపతిం ప్రోక్తం సూత్రం కూరపతిం తథా ॥**

అ ॥ పాదమందలి రేఖలను శ్రీశైలనాథులుగను, పాదుకలను మణవాళ మహామునులుగను, ఊర్ధ్వపుండ్రమును సేనాపతిజీయర్ గను, యజ్ఞోపవీతమును కూరత్తాళ్వార్లుగను.

**శ్లో ॥ భాగినేయం త్రిదండం చ కాషాయం చాంధ్రపూర్ణకమ్।**
**మాలాం చ కురుకేశార్యం ఛాయాం శ్రీచాపకింకరమ్॥**

అ ॥ త్రిదండమును మొదలియాండానుగను, కాషాయమును ఆంధ్రపూర్ణులుగను, కంఠమందలిమాలికను తిరుక్కురుగైప్పిరాన్ పిళ్ళానుగను, నీడను శ్రీధనుర్దాసులుగను

**శ్లో ॥ ఏవం రామానుజార్యస్య అవయవానఖిలాన్ గురూన్ ।**
**అవయవిసం మహాత్మానం రామానుజమునింభజే ॥**

అ ॥ ఈ విధముగ శ్రీరామానుజుల వారియొక్క సమస్త అవయవములను మన పూర్వాచార్యులుగను అవయవిస్థానీయులుగ మహాత్ములైన శ్రీరామానుజ మునులను భజించుచున్నారు.

**శ్లో ॥గురుమూర్త్యాత్మ యోగీన్ద్రం యోధ్యాయేత్ ప్రత్యహం నరః ।**
**సర్వాన్ కామానవాప్నోతి లభేచ్చాంతే పరంపదమ్ ॥**

అ ॥ పూర్వాచార్యుల నందరను తమశరీరముగ ధరించియున్న భగవద్రామానుజ యోగీన్ద్రులను ప్రతినిత్యము ధ్యానించు నరుడు సమస్త కోరికలను పొంది చివరకు పరమపదమును పొందగలడు.

ఈ విధముగా ప్రతినిత్యము ధ్యానము చేయుటచే పూర్వాచార్యులతో గూడుకున్న భగవద్రామానుజుల వారిని ధ్యానము చేయుటయగును.

---

### దివ్యప్రబంధ పారాయణ - ప్రవచనములు

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి మంగళాశాసనాలతో...**

**18.9.2014 నుండి 24.9.2014 వరకు నాలాయిర దివ్యప్రబంధమును దివ్యసాకేతంలో గుడివాడకు చెందిన శ్రీమతి జయమ్మగారి ఆధ్వర్యములో, మరియు రోహిణిగారి దివ్యప్రబంధ ప్రవచనములతో వైభవంగా జరిగింది.**


జై శ్రీమన్నారాయణ

తీర్థయాత్ర

8.10.2014 విజయవాడనుండి బయలుదేరును

108 శ్రీ వైష్ణవ దివ్య దేశములలో 95 తమిళనాడు మరియు కేరళలోని శ్రీ వైష్ణవ దివ్య దేశముల 16 రోజుల తీర్థయాత్ర

ముక్తినాథ్ యాత్ర కలదు.

| | |
|---|---|
| తొండైనాడు | 22 |
| నడునాడు | 2 |
| చోళనాడు | 40 |
| పాండ్యనాడు | 18 |
| మలైనాడు | 13 |
| క్షేత్రములు | 95 |

వివరములకు : విష్ణు వందన ట్రావెల్ సర్వీసెస్ సెల్: 09290574187 09032935316

# శ్రీవేంకటాచల "చిత్రే"తిహాసమాల




మూల సంస్కృత రచనం
శ్రీ అనంతాళ్వాన్

చిత్రానువర్తనం
సత్య శ్రీనివాస్ - సిద్ధాంతం

భగవద్రామానుజులు ఏర్పరచిన ఆరాధనా విధానాన్ని శ్రీమదనన్తార్యులు తమ శ్రీవేంకటాచలేతిహాసమాలలో ఉట్టంకించారు. లోకంలో శూరులైనవారు ముందుగా తమ శౌర్యానికి ఉపకరణాలైన ఆయుధాలను చందనం, పూవులు మొదలైన ద్రవ్యాలచే అలంకరించి, తరువాతనే చందన పుష్పాదులచే తమ శరీరాలంకారాన్ని అంగీకరిస్తారు. ఇదే పద్ధతిలో శ్రీనివాసునికి మూడు సంధ్యల్లోను అర్చనా విధానం సాగాలి. ఎలా? శ్రీనివాసునికి చందనకుసుమమాలలతో అలంకారంచేసే సమయంలో, మొట్టమొదట స్వామి యొక్క విజయ పరంపరలకు ప్రధాన సాధనాలైన శ్రీమత్సుదర్శనచక్రం, పాంచజన్యశంఖం, అటుతరువాత దివ్య చరణ



పద్మాలు, వీటి అలంకారం చేయాలి. తరువాత వక్షఃస్థలంలోని కనకమయ కంఠికాలంకృతయైన పద్మావతీదేవిని అలంకరించి, తరువాత స్వామి కిరీటానికి అలంకారం చేయాలి. అటు తరువాత స్వామి దివ్యావయవాలన్నింటికీ చందన కుసుమమాలలచే అలంకరించి ఆరాధనం అదే క్రమంలో చేయాలి అని భగవద్రామానుజులు చేసిన నియమనాన్ని అనంతార్యులు తమ గ్రంథంలో ఆవిష్కరించారు.



ప్రాచీనకాలంలో తిరుమల కొండమీద స్వామివారి ఉత్సవాదులు నిర్వహించడానికి కావలసిన వీధులు ఏర్పడి ఉండనందువల్ల బ్రహ్మోత్సవం అక్కడ జరిగేదికాదు. క్రింద తిరుచానూరులోనే జరిగేది. కొండపై ధ్వజారోహణం చేసి ఉత్సవారంభం కావించుకొని, క్రిందకు స్వామిని తోడ్కొనివచ్చి, తీరువీధి ఉత్సవాదులన్నీ యథాశాస్త్రంగా జరిపి, పైకి వెళ్ళి ధ్వజావరోహణం జరిపేవారని ఇతిహాసమాల ఉట్టంకించింది.



చిత్రకథ– 35

# రామానుజ చిత్రకథ


















చక్రాంకితులైనవారికి ఎప్పుడూ అడ్డులేదు.
మేము తిరిగి వచ్చేవరకూ చక్రాంకితులు కానివారికి ప్రవేశం లేదు.
చిత్తం! ప్రభో!


ఆగమగ్రంథాలలోనైతే ప్రమాణాలకి కొదవే లేదు.
పంచసంస్కారాలు కానిదే ఏపనికీ అర్హతే లేదంటున్నాయి.
శంఖచక్రధారణ ప్రాథమిక సంస్కారమని చెపుతున్నాయి.


పురాణాల మాటేమిటి?


ద్విజోత్తమా! తామస పురాణాలైన స్కాందపురాణం,లింగపురాణాలే ఈచక్రాంకణాన్ని వేనోళ్ళ కీర్తిస్తున్నాయంటే... ఇక సాత్విక పురాణాల గురించి ఏమి చెప్పాలి?


ఏవా వాక్యాలు? కొన్ని వినిపిస్తారా?
ముందుగ చక్రాంకితుడి ప్రభావం చెప్పే ఈశ్లోకాలు వినండి....


అలాగే.


చక్రాంకితునికి చేసే దానం మోక్షఫలాన్నిస్తుందని ఈ ప్రమాణం...
విషు వాయన సంక్రాంతిషూపరాగే తథారవే:!
చక్రాంకితాయ విప్రాయ దానాత్ మోక్షమవాప్నుయాత్!!
విష్ణు ఘడియలలో, అయనం ప్రారంభమైనపుడు, సూర్యుడు రాశుల్లో చేరే సంక్రాంతి దినాన చక్రాంకితుడైన వైష్ణవునికి దానం చేస్తే మోక్షం లభించును.





విష్ణుభక్తాయ విప్రాయ చక్ర చిహ్నాయ మానవ:!
గోచర్మ మాత్రం యోదద్యాత్ భూమింస్యాత్ సతు రాజ్యభాక్!



చక్రాంకితుడైన వైష్ణవునికి గోచర్మమంత భూమి దానమిచ్చినా, వాడు సామ్రాజ్యాధిపతి అగును.

అహా!

చక్రాంకితాయ విప్రాయ యోభక్త్యాన్నం దదాతిచ!
అన్న సంఖ్యాని వర్షాణి బ్రహ్మలోకే మహీయతే!!



చక్రధారి అయిన వైష్ణవునికి
ప్రేమతో అన్నం పెడితే,
ఆ మెతుకులున్నన్ని
సంవత్సరాలు బ్రహ్మలోకంలో
పూజలందుకొనును.

అ!

స్వామీ! చక్రాంకితానాం నామాని యోవదేత్ భక్తిమాన్ నర:!
సర్వ పాప వినిర్ముక్త: సయాతి పరమంపదమ్!!

చక్రాంకితుని పేరు పలికినా పాపం తొలగి,
పరమపదం లభిస్తుంది.

శంఖ చక్రాంకితం విప్రం దృష్ట్వాయో2హ్లాదో భవేత్!
సపుణ్యలోకానాప్నోతి హి ఐహికం సుఖ మశ్నుతే!!

చక్రాంకితుని చూచి సంతోషిస్తే పరలోక సుఖము సులభం.
ఇక ఐహలౌకిక సుఖాలు లభిస్తాయనడంలో సందేహమేమిటి స్వామీ?



చూస్తేనే చాలా? పాపాలు పోతాయా? ఆశ్చర్యంగ ఉంది సుమా!



చక్రాంకితుణ్ణి భోక్తగ స్వీకరిస్తే ఆ పితరులు
తృప్తులై విష్ణు సాయుజ్యాన్ని పొందుతారు.

విష్ణు చక్రాంకితం విప్రం యోభూమావభి వాదయేత్!
లలాటేసక్త పాంసూనాం సంఖ్యాతస్యాస్తి యావతీ!
తావత్ సమా స మనుజో బ్రహ్మలోకే మహీయతే!!

చక్రాంకితునికి శిరసా సమస్కరిస్తే, ముఖాన ఎన్ని రేణువులంటునో అన్నేళ్ళు బ్రహ్మలోకంలో వసించును.

ఎక్కడిదీ ప్రమాణం?

స్వామీ! శేషధర్మమనే గ్రంథంలోనిది.
ఇంకా ఇలా ఉంది దానిలో.
శంఖ చక్రాంకితాన్ భక్తాన్ య: పూజయతి మానవ:!
ససాక్షాద్విష్ణు సామీప్యం లభతే నాత్ర సంశయ:!!

చక్రాంకితుణ్ణి ఆరాధిస్తే
తప్పక విష్ణులోకంలో
విష్ణుసాన్నిధ్యము లభించును.

పద్మపురాణం ఏమైనా తెలిపినదా?
అది కదా సాత్వికపురాణం.

చాల విలక్షణంగ తెలిపింది,
వైష్ణవ చిహ్నాలన్నింటినీ. సారమిదిగో...

యే కంఠ లగ్న తులసీ నళినాక్షమాలా:
యే బాహుమూల పరిచిహ్నిత శంఖ చక్రా:!
యేవా లలాట ఫలకే లసదూర్ధ్వపుండ్రా:
తే వైష్ణవా: భువనమాశు పవిత్రయన్తి!!

ఈ భువిని పావనం చేసేవారు వైష్ణవులు.
తులసి, పద్మ బీజ మాలలు వారు ధరిస్తారు.
భుజములపై శంఖ చక్ర ముద్రలు ధరిస్తారు.
వారి నుదుట ఊర్ధ్వపుండ్రము ప్రకాశిస్తూంటుంది.

పరాశర స్మృతి ఇలా చెప్పింది.

వినా యజ్ఞోపవీతేన వినా చక్రస్య ధారణాత్ !
వినా ద్వయేన వై విప్ర: చండాలత్వ మవాప్నుయాత్ !!

జాతితో ఎవ్వడూ చండాలుడు కాడు. ప్రవృత్తిని బట్టి కద!
విప్రుడు యజ్ఞోపవీతం ధరించకున్నా,
శంఖ చక్రాలు ధరించకపోయినా,
ద్వయ మంత్రాన్ని ఉపదేశంగ పొందకున్నా చండాలుడగును.

హరి, హరి!

ఇంకా ఉంది...





# పరమపదాలంకృతులు చిన్నారి చిరంజీవులు

**ట్రస్ట్‌కు మూలకారకులు**

**డి.వి.ఎస్.ఎస్.పెరుమాళ్ 1981 - 1992**

**డి. వేంకటేశ్ 1983 - 1994**

డి.వి.ఎస్.ఎస్. పెరుమాళ్ (1981-92) మరియు డి. వేంకటేష్ (1983-94) మెమోరియల్ ట్రస్ట్, రిజిస్టర్డ్, విజయనగరం. 535001, మనగింగ్ ట్రస్టీ డి.ఎస్. పెరుమాళ్ వారి శ్రీత్రైవర్ణిక వైష్ణవ రామానుజ కూటమునకు చేసిన కైంకర్య వివరములు.

5.11.1997న సుమారు 54 సం॥ల క్రితం దాసుడు సింగపెరుమాళ్‌చే సమర్పింపబడిన దక్షిణావృత శంఖం నుండి జాలువారిన సుగంధ పరిమళ (సుగంధ ద్రవ్యములకలయిక) తీర్థమును సాలగ్రామమూర్తికి అభిషేకించిన అతి పవిత్రమయిన తీర్థం వహించుటకుగాను కైంకర్యము ఒక వెండి కలశము(ప్రస్తుతం సదరు కలశము మరియు 4బంగారు ప్రమిదలు నిత్యకైంకర్యముగా ఉపయోగంలో ఉన్నవి.

2.6.1999న రామానుజకూటం నిత్యాన్నదానపథకమునకు చెక్కునెం.130122 ద్వారా రూ.5000-

17.12.2003 నుండి నిర్విరామంగా నిరాటంకముగా జరుగుతున్న శాశ్వత అఖండ 4దీపారాధనలు నిమిత్తం ప్రతినెలా నాల్గున్నర కేజీల తైల కైంకర్యము (ఈకైంకర్యము సూర్యచంద్రాదులు ఉన్నంతవరకూ సాగుతుంది మాట్రస్టు తరపున దాసుడు హామీ ఇస్తున్నాడు.

10.2.2004న పైన చెప్పిన తైల కైంకర్యం 57.020 గ్రాములు నిమిత్తం 4బంగారు ప్రమిదలు తూకము.

7.6.2009 తేదీన సదరు ప్రమిదలు మరమ్మత్తు సమయంలో అదనంగా కైంకర్యం చేసిన బంగారం అనగా మొత్తం బంగారం 64.220 గ్రాములు సుమారు 8సంవత్సరములనుండి ఒక సంవత్సరములో 12మాసములు నాల్గున్నర కేజీల నూనెయు, ధనుర్మాసం ఒకనెలలో తైలములనకు బదులుగా నాల్గున్నర కేజీల నేయ్యితో ఈశాశ్వత అఖండ దీపారాధనకైంకర్యము నిర్విఘ్నంగా కొనసాగుచున్నది.

18.12.2007న మా రామానుజకూటం నిత్యాన్నదాన పథకానికి రెండవ కైంకర్యముగా చెక్కునెం.428387 ద్వారా రూ.5116 ఇవ్వడం జరిగింది.

1.11.2008న మారామానుజ కూటం దేవాలయ జీర్ణోద్ధరణశాఖకు ఎంబేరయ్యగుడి దేవాలయ జీర్ణోద్ధరణ చెక్కునెం.428390 రూ.10116-

పై ట్రస్టు వ్యవస్థాపకులు నిర్వాహకులు మేనేజింగ్ ట్రస్టీ అయిన దాసరి సింగపెరుమాళ్ వారి నాన్నరు ఆచార్యతిరువడిని అలంకరించిన మా త్రైవర్ణిక వైష్ణవ రామానుజకూటం, విజయనగరం ప్రధాన ప్రముఖ వ్యవస్థాపకులు, కారకులు అయిన శ్రీమాన్ దాసరి రామానుజంగారి జ్ఞాపకార్థం ప్రేమాభిమాన ములతో అప్పుడు అనగా 1976సం॥లో మా ఈరామానుజకూటంలో భాగవతుల వసతికి మాత్రమే ఒకగది, స్నానాలగది, కొళాయితో నిర్మాణం నిమిత్తము నగదు చెల్లింపు రూ.3000-

9.4.2012 తేదీన మా యీరామానుజకూటం పునరుద్ధరణ (జీర్ణోద్ధరణ)కి చెక్కునెం.428396 ప్రకారం రూ.300000- సమర్పణ.

పైన వివరించిన 10కైంకర్యములేకాకుండా రికార్డులేని అనేక చిన్నచిన్న కైంకర్యములు వస్తురూపేణ, నగదుమూలంగానూ పూజలకు, ప్రసాదములకు, భగవద్రామానుజులవారి మీద ఉన్న అచంచలమైన భక్తి, ప్రేమ, విశ్వాసములు ఆచార్య తిరువడిని అలంకరించిన మాపెద్దలు మాకు నేర్పిన భక్తిమార్గంలో చేస్తూనే ఉన్నాము.




వేదికను అలంకరించిన శ్రీమాన్ కొండా విశ్వేశ్వర రెడ్డి - ఎం.పి. చేవెళ్ళ నియోజకవర్గం
శ్రీమాన్ డా॥ కరి రామిరెడ్డిగారు, శ్రీమాన్ బి.వి.ఆర్. మోహన్ రెడ్డిగారు - సి.ఈ.ఓ. C.E.O. of CYIENT
శ్రీమాన్ డా॥ జె. రామేశ్వరరావుగారు.



బ్రెయిలీ లిపిలోకి శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రం,
భగవద్గీత గ్రంథాలను తయారుచేసిన
నేత్రవిద్యాలయ విద్యార్థులు. ఆవిష్కరిస్తున్న శ్రీస్వామివారు



శ్రీస్వామివారి నుండి జ్ఞాపిక అందుకుంటున్న
శ్రీమాన్ బి.వి.ఆర్. మోహన్ రెడ్డిగారు




నృత్యప్రదర్శనలో నేత్రవిద్యాలయ విద్యార్థినులు




శ్రీస్వామివారితో నేత్రవిద్యాలయ విద్యార్థినీ విద్యార్థులు, అధ్యాపక బృందం


వికాసతరంగిణి సభ్యసమావేశం - జీవా, శ్రీరాంనగర్‌లో అన్వయించిన కార్యకర్తలు


హైదరాబాద్ - నొవాటల్‌లో జరిగిన ప్రాజెక్ట్ మేనేజ్‌మెంట్ నేషనల్ కాన్ఫరెన్స్‌లో ప్రసంగిస్తున్న శ్రీస్వామివారు.


జీవాప్రాంగణంలో శ్రీకృష్ణజన్మాష్టమి సందర్భంగా జరిగిన చిత్రలేఖన పోటీలలో పాల్గొన్న చిన్నారులు




చిత్రలేఖన పోటీలలో జీవా గురుకుల విద్యార్థులు


ఉపాధ్యాయుల దినోత్సవ సందర్భంగా నేత్రవిద్యాలయ విద్యార్థులు నిర్వహించిన ప్రదర్శన

# శ్రీకృష్ణ జన్మాష్టమి వేడుకలు - జీవా ప్రాంగణం,


శ్రీకృష్ణ పూజా కార్యక్రమం


జీవా - గోశాలలో లడ్డు ప్రసాదాన్ని తినిపిస్తున్న శ్రీస్వామివారు.


ఉట్టికార్యక్రమంలో జీవా గురుకుల విద్యార్థులు



నేత్రవిద్యాలయ విద్యార్థినీ విద్యార్థులు


ఉట్టికార్యక్రమ సంబరాల అనంతరం భక్తులు,
జీవా కార్యకర్తలతో శ్రీస్వామివారు


శ్రీకృష్ణజన్మాష్టమి - విజయవాడ


చాతుర్మాస్య వ్రతసమాప్తి - వారిజ


నృత్యప్రదర్శన గావిస్తున్న చిన్నారులు


గ్రంథావిష్కరణ గావిస్తున్న శ్రీమాన్ గోకరాజు గంగరాజుగారు (ఎం.పి.), శ్రీమాన్ రాంమాధవ్‌గారు - బిజేపి నేషనల్ సెక్రటరి


సేవలనందిస్తున్న నలంద కాలేజ విద్యార్థినీ విద్యార్థులు

## శ్రీకృష్ణజన్మాష్టమి - నిజామాబాద్



నిజామాబాద్ జిల్లా వికాసతరంగిణి అధ్వర్యంలో సుభాష్‌నగర్‌– శ్రీరామాలయంలో శ్రీశ్రీశ్రీ దేవనాథ జీయర్‌స్వామివారి ప్రత్యక్షపర్యవేక్షణలో శ్రీకృష్ణజన్మాష్టమి వేడుకలు సంగీత, నృత్య కార్యక్రమాలతో మూడు రోజులపాటు ఎంతో వైభవంగా జరిగాయి. 15 సాయంత్రం సంగీత విభావరి, 16 ఉదయం శ్రీరామచంద్రునికి 81కలశాలతో అభిషేకం, సాయంత్రం నృత్య గానములతో శ్రీకృష్ణుని పుట్టినరోజు వేడుకలు వేలాదిమంది భక్తులు ఆనందోత్సాహాలతో జరుపుకున్నారు.

ఉత్సవంలో భాగంగా 17 ఉదయం ఆరోగ్యవికాస్‌వారు శ్రీస్వామివారు పర్యవేక్షణలో **మహిళా ఆరోగ్య శిబిరాన్ని** నిర్వహించారు. మన వికాసతరంగిణి, ఆరోగ్యవికాస్ కార్యక్రమాలు నిర్వహించే శ్రీమతి మాధవీ రవీంద్రగారి బృందం ఎంతో ఓపికగా క్యాంప్ నిర్వహించారు. సుమారు 250మంది మహిళలు ఈ క్యాంప్‌లో పాల్గొన్నారు.

సాయంత్రం ఉట్టి కార్యక్రమంలో కూడా వందలాది భక్తులు ఉత్సాహంగా పాల్గొని తరించారు. ఉత్సవంలో పాల్గొన్న భక్తులకు, కార్యక్రమాన్ని ఎంతో శ్రద్ధగా నిర్వహించిన జిల్లా అధ్యక్షులు శ్రీమాన్ గంపా శ్రీనివాస్‌కి, కార్యదర్శి శ్రీమాన్ నంగునూరి శ్రీనివాస్‌కి, ఇతర కమిటీ సభ్యులకు, సహకరించిన శ్రీరామాలయ అర్చకులకు, శ్రుతి, ప్రియాంక, అలేఖ్యలను ప్రోత్సహిస్తూ శ్రీదేవనాథ జీయర్‌స్వామివారు ఆచార్యమంగళాశాసనాలు కృపచేసారు.

# భగవద్బంధువులందరికీ శుభాహ్వానము

24.10.2014 నుండి
28.10.2014 వరకు

వేదిక: జీవాప్రాంగణం, శ్రీరామనగర్, శంషాబాద్, రంగారెడ్డి జిల్లా.

పరమహంస పరివ్రాజకులు
శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి

# తిరునక్షత్రమహోత్సవము

జీయర్ పురస్కార ప్రదానము



శ్రీరామచంద్రునికి 1008 కలశాలతో అభిషేకము



ఆచార్యునికి పాదపూజ



దాదాపు వేయి సంవత్సరాలనాడు ఈ పరమపావన భరతభూమిని తమ దివ్యావతార కటాక్షంతో తనిపిన భగవద్రామానుజుల, దివ్యాజ్ఞ చేతనే శ్రీవైష్ణవాచార్య పరంపర, లోకాన్ననుగ్రహిస్తున్నదని సాంప్రదాయికుల విశ్వాసం. మణవాళమామునుల తరువాత ఈ కాలంవారిని తరింపజేయ నవతరించిన మహనీయులు **శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు.** **'దినాన్తే నిహితం తేజః సవిత్రేవ హుతాశనః'** అన్నట్లు పెద్దస్వామివారి ఆధ్యాత్మిక బలాన్ని పరిపూర్ణానుగ్రహాన్ని స్వాయత్తపరచుకొని అవతరించారు **శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు.**

ఈ ఇరువురు మహానుభావులు పరమహంస పరివ్రాజక చక్రవర్తులై దక్షిణోత్తర భరతభూములనే కాక యావత్ప్రపంచాన్ని భగవద్రామానుజ పరిదర్శిత మార్గంలో పునీతం చేశారు. యత్యాశ్రమాన్ని స్వీకరించగనే చేపట్టిన 108వ స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞముతో ప్రారంభించిన ఆధ్యాత్మిక సేవ, అన్ని నదుల పుష్కరాలకు బ్రహ్మయజ్ఞాలు, 1008 హోమగుండముల శ్రీవిష్ణుయాగం, శ్రీయాగం, కృష్ణం వందే జగద్గురుమ్, విరాట్ విష్ణు సహస్రనామ పారాయణలు, గీతాజ్యోతి, ఆచార్య సేవాయాత్ర వంటి కార్యక్రమాలతో స్వామి త్రివిక్రమావతారంలా **"ఇంతింతై వటుడింతయై"** అన్నట్లు విశ్వవ్యాప్తంగా అద్వితీయమైన ప్రచారం చేస్తున్నారు.

ఆర్తులను ఆదుకోవడంలో శ్రీ స్వామి చేస్తున్న సేవ అపూర్వం. సామాజిక శాంతికై పంజాబులో వేదపాదయాత్ర, కోనసీమ తుఫాను బాధితుల ఆదరణ, గుజరాత్ భూకంప, సునామీ బాధితులకు గృహనిర్మాణాలు, ఆదివాసుల పిల్లలకు, మత్స్యకారుల పిల్లలకు, అంధులకై పాఠశాల నిర్వహణ. ఎన్నెన్నో కార్యక్రమాలతో సామాజిక సేవలు అందిస్తున్నారు

వేద విద్యా పోషణ, ఆగమ దివ్యప్రబంధ, తత్త్వ విద్యాలయాల నిర్వహణతో పాటు, ప్రస్తుతం హైదరాబాద్ శంషాబాద్-శ్రీరాంనగర్‌లో సంకల్పించిన జీయర్ ఇంటిగ్రేటెడ్ వేదిక్ అకాడమి దాదాపు 1600 మంది విద్యార్థులకు ఆవాస వ్యవస్థతో వివిధ వేదవేదాంగ-తదనుబద్ధ విద్యావ్యాసంగం ఇక్కడ కొనసాగుతున్నాయి. ఈ సంస్థ వేదవేద్యుడైన స్వామికి ఒక అక్షర నీరాజనం కాగలదని ఆశిస్తున్నాం. వైదిక-లౌకిక విద్యలు రెండూ సమస్కంధాలుగా ఆదరింపబడుతున్నాయి. శ్రీపెద్ద స్వామివారి దివ్యస్మృతిగా ప్రతిసంవత్సరం **"జీయర్ అవార్డు"** ఇచ్చి ఒక వేద విద్వాంసుని పురస్కరించడం పై కార్యక్రమాలకన్నిటికి తలమానికం. 93 నుండి ఇప్పటివరకు 18 మంది మహా విద్వాంసులు పురస్కృతులు కాగా, యథాపూర్వంగా ఈ సంవత్సరం కూడా సాంప్రదాయికంగా వేదాధ్యయనం చేసి, వేదాంగ శాస్త్రపరిచయం కూడా పర్యాప్తంగా కలిగి ఉన్న విద్వాంసునికి శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారి తిరునక్షత్ర సందర్భంగా జీయర్ అవార్డు సమర్పించుకుంటున్నాము.

## కార్యక్రమ వివరాలు

**ఉ॥ 8-30 ని॥ తీర్థగోష్ఠి; 9-30 ని॥ జీయర్ పురస్కార సభా ప్రారంభం; జ్యోతిః ప్రజ్వలన; వేదశాంతి; సభాహ్వానము; అధ్యక్షుల భాషణం; సమ్మాన్యులైన వేద విద్వాంసుల పరిచయం; పురస్కార ప్రదానం - సత్కారము; సమ్మానితుల - అభిభాషణం; అతిథుల ప్రసంగములు; అతిథి సత్కారములు; శ్రీశ్రీశ్రీ జీయర్‌స్వామివార్ల అభిభాషణ; శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారి తిరునక్షత్ర పురస్కృత విశేష సందేశము, మంగళాశాసనములు; శాంతిపాఠము; తదీయారాధన.**

**పై కార్యక్రమాలన్నీ జీవా ప్రాంగణంలో జరుపబడతాయి. కనుక స్వామివారి భక్తులు, అభిమానులు ఎల్లరూ ఈ కార్యక్రమంలో పాల్గొని, దీన్ని సుసంపన్నంచేయ కోరుతున్నాము.**

వివరములకు:

**జీవా, శ్రీరామనగరం, ముచ్చింతల్, శంషాబాద్, రంగారెడ్డి జిల్లా. ఆం.ప్ర. 95535 49971/72**

*With Best Compliments from*








# KAKATIYA CEMENT

**Quality Always - Ahead**

53 Grade Cement &
White Crystal Sugar

**Sri P. VENKATESWARLU**
Chairman & Managing Director

## KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED

*Regd. Office :* 1-10-140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
✆:27637717, 27633627, Fax No : 040 - 27630172, E-mail : kcsil@sol.net.in
E-mail: info@kakatiyacements.com

*Cement Factory :*
Srinivasanagar, Jaggaiahpet,
Krishna Dist - 521 175
✆ 08654 - 200014
Fax No: 08654-296331

*Sugar Factory :*
Peruvancha Village, Kallur Mandal,
Khammam Dist - 507 209,
✆: 08761 - 287207
Fax No: 08761 - 287206

## శ్రీరామానుజ సహస్రాబ్ది ప్రయుక్త సహస్ర గ్రంథ ప్రకాశనం

రాబోయే 16-17 సంవత్సరాలలో శ్రీభగవద్రామానుజ తిరునక్షత్ర ప్రయుక్తమైన సహస్రవర్షపూర్తి జరుగనున్నదని అందరికీ తెలిసిన విషయమే. ఈసందర్భంగా భవ్యమైన ఈసన్నివేశాన్ని, స్థిరంగా స్మృతిపథంలో నిలుపుకోవడానికి దేశవిదేశాలలో అనేక కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్నశ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామి వారి మంగళాశాసనాలతో, వారి ప్రత్యక్షపర్యవేక్షణలో శ్రీభగవద్రామాన ుజుల భవ్యమైన మూర్తిని, జీవాప్రాంగణంలో ప్రతిష్ఠించుకోవడానికి పూర్వరంగాన్ని ఏర్పరచుకున్నాం. ఇదే సందర్భంలో భగవద్రామానుజ సంప్రదాయ సంబద్ధాలైన వేయి గ్రంథాలను వివిధ భాషల్లోనికి అనువదింపజేయడం, మూలగ్రంథాలను వ్యాఖ్యానాలతో ముద్రించు కోవడం చేయాలని, సంకల్పించాం.

సంస్కృతం, తెలుగు, తమిళం, కన్నడం, హిందీ, ఇంగ్లీషుల్లో ఈప్రచురణలు చేయాలని పెద్దల సంకల్పం. దీనికి విద్యావేత్తలైన సంప్రదాయ రసికుల అనుబంధం, ఆదరణం ఎంతైనా అవసరం. ముఖ్యంగా భగవద్రామానుజ గ్రంథ పరిచయం కలిగినవారు, గ్రంథరచనం, ప్రవచనం చేస్తూ సంప్రదాయ ప్రచారం కావిస్తున్నవారు ఎందరో పెద్దలున్నారు. యువకుల్లో కూడా సంప్రదాయాభినివేశం ఉన్నవారు ఎంతమందో ఉన్నారు. వారిని ఒకచోట సమావేశపరచి, వారికి ఈకార్యక్రమ విశేషాలను ఎరుకపరచి వారి యోగదానంతో ఈకార్యక్రమాన్ని సుసంపన్నం చేయాలని భావించడం జరిగింది. ఇందుకోసం నవంబర్ 2వతేదీని జీవా ప్రాంగణంలో ఒక విద్వద్గోష్ఠి ఏర్పాటు చేయడం జరిగింది. ఈ సమావేశానికి దక్షిణభారతం నుండి దేశపు ఇతర ప్రాంతాలనుండి పండితులు, విద్వాంసులైన యువకులు విచ్చేస్తారని ఆశిస్తున్నాం.

### సహస్ర గ్రంథ ప్రకాశనం - విద్వద్గోష్ఠి - సాదరాహ్వానం

**ఈకార్యక్రమానికి పెద్దలందరికీ మాదగ్గర ఉన్న సమాచారాన్ని పురస్కరించుకుని ఆహ్వానాలు పంపుతున్నాము. ఏకారణం చేతనైనా ఆహ్వానం అందకపోయినా, దీనినే ఆహ్వానంగా స్వీకరించి రామానుజ సంప్రదాయ అభినివేశం కలిగి, గ్రంథరచనాభ్యాసం కల పెద్దలు, యువకులు ఆనాటి సమావేశానికి తప్పక విచ్చేయవలసినదిగా కోరుతున్నాం. ఈవిషయంలో విశేషించి మొ॥9441562863 తో సంపర్కాన్ని పెట్టుకొని సమాచారాన్ని తెలుసుకొనకోరుతున్నాం.**

## పరమపదవార్తలు



సూర్యనారాయణ 23.6.14న పరమపదం పొందారు. ఒక సాధువుగా వచ్చి, ఆంజనేయ స్వామి గుడిలో 35సం॥లు పూజారిగా చేసారు. తనకంటూ ఎవరున్నారో లేరో ఎవ్వరికీ చెప్పలేదు. మన చిన్నజీయర్‌స్వామివారి వద్ద 25 సం॥ల క్రితం మంత్రోపదేశంపొంది, మన గోష్ఠివారంతా నిలబడి శ్రీవైష్ణవ సంప్రదాయంలో పరమపదోత్సవాన్ని జరిపించారు. వీరు ఋషీకేశ్ మన మఠంలో సేవచేస్తూ సూర్యనారాయణ జీయర్‌దాస్‌గా మారారు. వీరి కైంకర్యాలు అనిర్వచనాలు. వీరికి శ్రీస్వామివారు అనేక మంగళాశాసనాలు అనుగ్రహించారు.



హైదరాబాద్ అలకాపురికి చెందిన శ్రీమతి రామరాజు లక్ష్మమ్మగారు 4.9.14న పరమపదాన్ని అలంకరించారు. వీరికి పరమ పదంలో నిత్యకైంకర్యం లభించాలని, వీరి కుమారులు రామరాజు వెంకటేశ్వరరావు, విద్యాసాగరరావు, అమృతరావులకు శ్రీస్వామివారు అనేక మంగళాశాసనాలు అనుగ్రహించారు.



హైదరాబాద్ ఇందిరాపార్క్ ఎల్.ఐ.సి. కాలనీ వాస్తవ్యులు శ్రీమాన్ వి.వి.ఎన్.ఎస్. ఆచార్యుల గారి తల్లి శ్రీమతి వంగల వేంకట ఆండాళమ్మగారు 13.9.89ఆచార్య తిరువడిని అలంక రించినారు. 6.9.2014న వీరి 25వ వర్ధంతిని పురస్క రించు కొని భక్తినివేదనకు కైంకర్యం సమర్పించడ మైనది.



సికింద్రాబాద్-సైనిక్‌పురి వాస్తవ్యులు అమరవాది రంగాచార్యులగారి తల్లిగారు అనపర్తి కాపురస్తులు లేటు శ్రీమాన్ అమరవాది శరణ్యాచార్యులగారి సతీమణియైన శ్రీమతి వేంకటమ్మగారు తమ 92 ఏట పరమపదించారు. వీరు శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్ స్వామివారి వద్ద సమాశ్రయణాన్ని పొందారు. వీరి కుమారులు భక్తినివేదనకి కైంకర్యం సమర్పించారు. వీరికి శ్రీస్వామివారు మంగళాశాసనాలు అందించారు.



పాలకొల్లు వాస్తవ్యులు శ్రీశ్రీశ్రీ పెద్దజీయర్ స్వామివారి శిష్యురాలైన శ్రీమతి జవ్వాజి రత్నమాణిక్యమ్మగారు 2.6.2014న పరమపదాన్ని అలంకరించారు. వీరికి పరమపదంలో శాశ్వత కైంకర్యం లభించాలని శ్రీస్వామివారు అనేక మంగళాశాసనాలు కృపచేసారు.



గుంటూరు వాస్తవ్యులు శ్రీమతి ఉప్పటూరి భారతిగారు 2.9.14న ఆచార్య తిరువడిని అలంకరించారు. వీరికి శ్రీస్వామివారు శాశ్వత పరమపద స్థానం లంభించాలని మంగళాశాసనాలు అనుగ్రహించారు.

# విజయదశమి నిర్ణయము

దైవజ్ఞశిఖామణి, జ్యోతిషరత్న
తి.న.చ. సంపత్కుమార కృష్ణమాచార్య సిద్ధాంతి
బాణాపురం, జనగామ, వరంగల్‌జిల్లా

శ్రీజయనామ సం॥ర ఆశ్వయుజ శు॥నవమి శుక్రవారము తేది 03-10-2014 రోజున నవమి ఘడి 0-26 విఘ. ఉదయం గం॥లు 6-17 ని॥లు దశమి ఘడి 54-24 విఘ రా.తె.గం॥ 4-3 ని॥లు ఉత్తరాషాఢ నక్షత్రము ఘడి 29-28 విఘ సాయంత్రము గం॥లు 5-54 ని॥లు తదుపరి శ్రవణానక్షత్రమున్నందువల్ల విజయదశమి (దసరా) ఎట్లా ఆచరించవలయును ?

**శ్లో ॥ యదాతు కేవల దశమీ కేవల శ్రవణార్షం చ భవతి ।**
**తదాశ్రవణార్షం విహాయ కేవల దశమ్యేవ గ్రాహ్యా ॥**

ఎప్పుడయితే కేవలం దశమీ వచ్చినప్పుడు కేవలం శ్రవణానక్షత్రమగుచున్నదో అప్పుడు శ్రవణానక్షత్రమును పరిత్యజించి కేవలము దశమితిథితోనే గ్రహించవలయును. (కా.ని.చంద్రికా) 'తిథిరేవకారణత్వాత్' తిథియే కారణమగుటవలన 'తిథి శ్శరీరం తిథిరేవ కారణం, తిథిప్రమాణం తిథిరేవసాధనం' తిథియే శరీరము, తిథియే కారణము, తిథియే ప్రమాణం. తిథియే సాధనమగుటవలన 'తిథిం వినాచాపి శశీనదృశ్యతే" తిథి లేకుండా చంద్రుడు కనపడడు. 'వినేందునాచాపి నకర్మసిద్ధ్యతీతి" చంద్రుడు లేకుండా కర్మలు సిద్ధింపవు. (నిర్ణయసింధు)

**శ్లో ॥ అశ్వినస్య సితే పక్షే దశమ్యాం తారకోదయః ।**
**సకాలో విజయోజ్ఞేయః సర్వకార్యార్థసిద్ధిదః ॥**

ఆశ్వయుజ శుక్లపక్షదశమీ రోజున నక్షత్రములుదయించుకాలము విజయకాలము ఈ కాలము సర్వకార్యములు సిద్ధింపజేయును. (చింతామణి)

**శ్లో ॥ ఈషత్సంధ్యా మతిక్రాంతః కించిదుద్భిన్న తారకః ।**
**విజయోనామ కాలోయం సర్వకార్యార్థసిద్ధిదః ॥**

కొంచెము సంధ్యాకాలము దాటి నక్షత్రములు ఉదయించినపుడు అది విజయకాలము అందురు యిది సర్వకార్యప్రయోజనములను సిద్ధింపజేయును. (ధ.సిం)

**శ్లో ॥ అశ్వనీ దశమీ శుక్లా శ్రవణేన సమన్వితా ।**
**విజయాదశమీ ప్రోక్తా సాచైవాత్యంతదుర్లభా ॥**

ఆశ్వయుజ శుక్ల దశమీ శ్రవణానక్షత్రముతో సమన్వితమైనపుడు (కూడినచో) అది విజయదశమీ యనబడును యిట్టి యోగము అత్యంత దుర్లభము. (జ్యో. ర్ని.)

**శ్లో ॥ సాయాహ్న వ్యాపినీ యాస్యాద్ దశమీ విజయాభిధా ।**
**నవమీ శేష యుక్తాపి సాగ్రాహ్యా వైష్ణవోత్తమైః ॥**
**ఈషత్సంధ్యా మతిక్రాన్తః కించిదుద్భిన్నతారకః ।**
**విజయోనామ కాలోయం సర్వకర్మార్థసిద్ధిదః ।**
**తస్మాత్ సాయాహ్న సంయుక్త దశమీ క్షేమదానృణామ్ ॥**

సాయాహ్న వ్యాపినీ కలిగిన దశమి విజయమును కల్గించును. నవమి శేషమై దశమితో కల్సినను అదియే గ్రహించవలయును వైష్ణవోత్తములు. సంధ్యాకాలము అతిక్రమించినను కొద్ది తారకలు ఉదయించిన కాలము విజయకాలమే. కాక సర్వకర్మ ప్రయోజనములను సిద్ధించును అందువలన సాయంకాలవ్యాప్తి కల్గిన దశమీ మానవులకు క్షేమమునిచ్చును. (శ్రీప్రశ్నసంహితా)

**నవమీ కలయాచైవ విద్ధాత్యాజ్యాభవేత్సదా ।**
**పరవేధాయుతాయాంతు దశమ్యాముత్సవం చరేత్ ॥**
**శ్రవణర్షయుతాం చాపి పూర్వవిద్ధాం పరిత్యజేత్ ।**
**అపరాజితార్చనే భూయాచ్ఛ్రవణ ర్క్షాధికతా భువి ॥**
**తథైవ శుభయాత్రా యా స్సాయంకాలస్థితా తిథిః ।**
**కించ శ్రీ వాసుదేవస్య ఉత్సవార్థం తు భూతలే ॥**
**దశమీంతు పరిత్యజ్య శుద్ధామేవ పరిగృహేత్ ।**
**తిథిలోపే యదాభూయాద్దశమీ నవమీదినే ॥**
**పరస్మిన్ ముహూర్తం వా దశమీ యదినాస్తి చ ।**
**ఏకాదశ్యాం తు శ్రీవిష్ణోః కుర్యాదేతన్మహోత్సవమ్ ॥**
**నత్వేతత్తు భవేత్పూర్వవిద్ధాయాం దశమీదినే ।**
**కదాపిచ మునిశ్రేష్ఠా రాజరాష్ట్రప్రవృద్ధయే ॥**

తలామాత్రమైనను నవమీవిద్ధ యేర్పడిన ఆదివసమ్మును త్యజించవలయును. ఏకాదశీరోజున ఏ మాత్రమైనను దశమి శేషించి యుండిన యుత్సవము ఆ రోజున ఆచరించవలయును. శ్రవణానక్షత్ర యోగము సంభవించినను నవమీవిద్ధగల రోజున విజయదశమీ యుత్సవము ఆచరించరాదు. అపరాజిత అర్చనలకు శ్రవణానక్షత్రము యొక్క ఆధిక్యతయున్ను ప్రస్థానాదులకు సాయంకాల వ్యాప్తమగు దశమీ తిథియొక్క యాధిక్యత యున్ను పరిగణింపదగును కాని భగవ దుత్సవాదులకు రాజులయొక్క పట్టాభిషేకాదులకున్ను శేషదశమి ప్రాధాన్యతను బరిశీలింపవలయును. ఒకప్పుడు తిథి లోపాదులచే నవమి రోజున దశమితిథి పూర్తిగా నుండుటయు మరురోజున తలామాత్రమేని దశమి శేషింపకపోవుటయు తటస్థించిన యెడల ఏకాదశి రోజున ఈ ఉత్సవము సేయవలయును *(పరమపురుష సంహిత)*

పై ప్రమాణముల సారముగా ఋషిప్రోక్తమైన 'పరమపురుష సంహిత' కూడదని చెప్పినను, భగవచ్ఛాస్త్రమైన శ్రీప్రశ్నసంహిత మొదలగు ధర్మశాస్త్రాది గ్రంథాలన్నియు నవమి శుక్రవారము రోజున శ్రవణానక్షత్రము దశమి స్పర్శయగుటచేతను నక్షత్రము ఉదయించు సమయము విజయప్రదమైనందున అపరాహ్ణమునకు దశమివ్యాప్తి యున్నందున దశమిశ్రవణయోగము ప్రశస్తమైనందున తేది 03-10-2014 శుక్రవారము (దసరా పండుగ జరుపుకొనుటకు) ఆచరణయోగ్యమని పై శాస్త్రప్రమాణములు తెలుపుచున్నందున శుక్రవారము విజయదశమీ (దసరాపండుగ) ఆచరించవలయును.

# అరచేతిలో ఆరోగ్యం



యం. విజయలక్ష్మి - హైదరాబాద్ (శ్రీరామస్థూప ప్రాజెక్ట్.)

సెరిబ్రల్‌పాల్సి (మెదడులోపం) ఉన్న పిల్లలలో ఎలా ఆక్యుప్రెషర్ వైద్యముతో నిలకడతో కూడిన మంచి మార్పు సాధించామొ తెలుసుకుందాము అనుకున్నాము కదా!

మానవశరీరంలో అతి ముఖ్యమైన ఏడుగ్రంథులు ఉంటాయి. వీటిని ఎండోక్రైన్ గ్లాండ్స్ అంటారు. మనస్సు–శరీరము వీటిని శాసించేవి ఈ గ్రంథులే. వీటిస్థానం మెదడు మొదలు ఉదరక్రింది భాగం వరకు.

అవి.

**1) పీనియల్ గ్రంథి** – శరీరంలో నీటి నిల్వలను ఈ గ్రంథి సరిచేస్తుంది. జననేంద్రియాల పనితీరు క్రమపరుస్తుంది. మిగతా ఆరుగ్రంథులని పర్యవేక్షిస్తుంది. నరాల పనితీరుని సరిచేస్తుంది. ఈ పీనియల్‌గ్రంథి సరిగా పని చేయకున్న (మల్ఫన్‌క్షన్) జననేంద్రియాల ఎదుగుదలలో లోపం ఏర్పడుతుంది. హైబి.పి వస్తుంది.

**2) పిట్యూటరీ గ్రంథి** – శరీరం ఎదుగుదల, మెదడు–పనితీరు, జ్ఞాపకశక్తి దీని ఆదీనంలో ఉంటాయి. దీనిలోపం (మల్ఫన్‌క్షన్) వలన పిల్లలు పొడుగు ఎదగరు. మానసిక ఎదుగుదల ఉండదు. క్రమశిక్షణ లోపిస్తుంది. అబద్ధాలు చెప్పుతారు. కృతఘ్నులుగా ఉంటారు.

**3) థైరాయిడ్ గ్రంథి** – ఊపిరితిత్తుల నిర్వాహణ, హృదయ పనితీరు, శరీరఉష్ణోగ్రత, కాల్షియం (ఎముకల ధృఢత్వానికి) నిర్వాహణ. ఈ గ్రంథిలోపం వలన శరీరం బరువులో హెచ్చుతగ్గులు, పనులు చేయడంలో అతిగా లేదా మందకొడితనం, కళ్ళు ఉబ్బటం, చిరాకు, నిస్పృహ.

**4) థైమస్ గ్రంథి** – పిల్లలు కౌమారదశ (15సం॥ రాలు వయస్సుదాటేవరకు) తల్లివలె ఈ గ్రంథి పనిచేస్తుంది. ఈ గ్రంథి పనితీరు లోపిస్తే పిల్లలు నీరసించిపోతారు. మందబుద్ధులు అవుతారు.

**5) పాంక్రియాస్** – జీర్ణశక్తికి కావలసిన జీర్ణరసాలు ఉత్పత్తి నిర్వాహణలో పాత్ర, రక్తంలో షుగర్ నిల్వలు– ఇన్సూలిన్ ఉత్పత్తి, శరీర ఉష్ణోగ్రత నిర్వర్తన ఇంకనూ మనలోని 'ఒత్తిడి' నికూడా కంట్రోల్ చేస్తుంది. దీని లోపంవలన షుగర్‌వ్యాధి, లోబి.పి వస్తుంది.

**6) అడ్రినల్‌గ్రంథి** – రక్తప్రసరణ, జీర్ణరసాల నిర్వర్తన, దీనిలోపంవలన శరీరంలో జీవశక్తి తగ్గిపోతుంది. బ్లడ్‌ప్రెషర్ ఎక్కువవుతుంది.

**7) జననేంద్రియ గ్రంథులు** – శరీరంలో నీటినియంత్రణ, మరియు "జననేంద్రియాల హార్మోన్స్" ఉత్పత్తి–నిర్వాహణ ఈ గ్రంధుల పనితీరు లోపం వలన స్త్రీలయందు నెలసరి సమస్యలు ఇంకనూ స్త్రీ–పురుషులలో లైంగిక కోరికలు విపరీతం లేదా మందగించుట. ఈ గ్రంథులన్నింటికి ఆక్యుప్రెషర్ చికిత్సతో లోపాలు సరిచేయవచ్చు.

శరీరంలో జీవవిద్యుచ్ఛక్తి ముఖ్యమైన 14 మార్గాల్లో ప్రవహిస్తూందని తెలుసుకున్నాం కదా! ఈ ఏడుగ్రంథులు ఈ 14 ప్రవాహాలకి అనుసంధానమై ఉంటాయి.

ఈ మార్గాల బిందువులపై ఆక్యుప్రెషర్ చేయాలి. కీలకమైన ఈ గ్రంథులు– వాటి నరాలకణాలు ఈ చికిత్సతో సరిచేయ బడుతాయి.

రక్తప్రసరణలోమార్పు, నాడీమండలంలో సెరిబ్రోస్పైయినైల్ ఫ్లూయిడ్ (సి.యస్.యఫ్) నియంత్రణ, కీలకనాడులలో మంచిమార్పు ఏర్పడుతుంది. ఇంతటి ప్రాముఖ్యతయున్న ఈ గ్రంథులన్నింటిని నియంత్రించేది మళ్ళీ "కాలేయమే".

చూసారా! శరీరంలో కాలేయం ఎంతటి ప్రాధాన్యం పొందిన అవయవమో...

కొందరు పుణ్యాత్ములు శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి కార్యక్రమములలో "అవయవదానం" గురించి తెలుసుకొని మరణాంతరం తమ శరీర అవయవములు (వైద్యుల సూచనమేరకు) ఎవరికైతే సమకూర్చాల్సిన అవసరంఉన్నదో అలాంటి రోగులకు **"దానం"** ఇవ్వమని ముందుగానే ఇంట్లో వారికి చెప్పి 'అవయవదానపత్రం'లో పేరు, అడ్రస్ నమోదు చేయించుకుంటారు.

ఇంతటి గొప్ప అవయవము కాలేయము గురించి ఇంకా కొంత తెలుసుకుందాము. *(సశేషం)*

మరింత విశాలంగా ... వినూత్నంగా....
ప్రత్యేక 1 గ్రామ్ జ్యూయలరీ కౌంటర్
కామధేను సిల్క్స్
బీసెంట్‌రోడ్, విజయవాడ-2. ఫోన్: 2574220

# హోమియో....! మీకోసం....!

శ్రీ



డా॥ పావులూరి కృష్ణచౌదరి
8-3-945/ఎ22, నాగార్జున నగర్, అమీర్‌పేట, హైద్రాబాద్-500 873

శరీరం మీద చిన్న పుండుపడితేనే బాధకు లోనవుతాం. అలాంటిది అన్నకోశంలో, చిన్నపేగులో పడే పుండ్లు ఎంత వేధిస్తాయి! దీర్ఘకాలం బాధించే ఈ 'అల్సర్ల'కు రోగి ప్రకృతిని కూడా దృష్టిలో ఉంచుకుని వైద్యం చేయటం అవసరం.

అల్సర్ అంటే పుండు. అన్నకోశంలో చోటుచేసుకునే పుండునే 'పెప్టిక్ అల్సర్' అంటారు. ప్రపంచ ఆరోగ్య సంస్థ లెక్కల ప్రకారం మన జనాభాలో నూటికి 10మందిలో-ఈ అల్సర్లు ఉన్నాయి. లేదా ఇవి వచ్చే అవకాశం ఉంటోంది. దీన్నిబట్టే అర్థంచేసుకోవచ్చు..., ఇదెంత పెద్దసమస్యో.

ఈ అల్సర్లన్నవి అన్నకోశంలో రావచ్చు (గ్యాస్ట్రిక్ అల్సర్లు) లేదా అన్నకోశం దాటగానే ఉండే చిన్నపేగు మొదటిభాగం (డియోడినల్ అల్సర్లు)లో రావచ్చు. ఇవి అన్నకోశంలో కంటే డియోడినంలో వచ్చే అవకాశం 10 రెట్లు ఎక్కువ. అయితే అన్నకోశంలో అల్సర్ల బాధ సాధారణంగా పెద్ద వయసులోనే ఎక్కువ. డియోడినంలో అల్సర్లు ఏ వయసులోనైనా రావచ్చు. మొత్తంమీద ఈ అల్సర్ల బెడద స్త్రీలకన్నా పురుషుల్లోనే ఎక్కువ.

అన్నకోశం లోపలి పొరల్లో ఆమ్లం, పెప్సిన్ ఉత్పత్తి అవుతుంటాయి. ఈ స్రావాల ఉత్పత్తిలో సమతౌల్యం దెబ్బతినటం కూడా పెప్టిక్ అల్సర్‌కు కారణం కావచ్చు. ఇది బాహ్యంగా కనిపించే కారణం. ఇదిగాక అల్సర్లు రావటంలో అన్నకోశ జిగురు పొరలను కాపాడే కార్బనేట్ పాత్ర కూడా ఉంటుంది. వీటికితోడు హెలికోబ్యాక్టర్ పైలోరీ (హెచ్.పైలోరీ) సూక్ష్మక్రిములు కూడా దోహదం చేస్తాయని భావిస్తున్నారు. హార్మోన్లపరంగా- థైరాయిడ్ హార్మోన్లు ఎక్కువ కావటం (హైపర్ థైరాయిడిజం) కూడా పెప్టిక్ అల్సర్‌కు దోహదం చేస్తుంది. ఈ వ్యాధి కొన్ని కుటుంబాల్లో ఎక్కువగా కనిపించటంవల్ల వారసత్వపరంగా సంక్రమిస్తుందని నిర్ధారించారు. ఇవన్నీ కూడా అల్సర్‌కు సంబంధించిన బాహ్య కారణాలు.

అన్నకోశం లోపల ఉండే జిగురుపొరలు, అక్కడ ఉత్పత్తి అయ్యే ద్రవాలేగాక రోగిపాత్ర కూడా ప్రాధాన్యత సంతరించుకుంటుంది. హోమియో ఔషధాల ఎంపికలో రోగి, రోగం రెండూ ముఖ్యమేనని గుర్తుంచుకోవాలి. ఈ నేపథ్యంలో రోగిపరంగా ఉండే కారణాలనూ గుర్తించాలి. ఒక్క పెప్టిక్ అల్సర్ బాధితులకే కాదు. ఇది దీర్ఘకాలిక వ్యాధులన్నింటికీ వర్తిస్తుంది.

అల్సర్ బాధితుల్లో కనిపించే ప్రధాన లక్షణం అజీర్తి. పొట్ట పైభాగం నామాల గుంటలో నొప్పి. ఈ వ్యాధికి గురైనట్లయితే ప్రధానంగా రాత్రిళ్ళు నొప్పి కనిపిస్తుంది. యాంటాసిడ్ మాత్రలు వేసుకుంటే నొప్పి తగ్గుతుంది. వీరిలో కనిపించే మరో సామాన్య లక్షణం- ఆకలి వేసినప్పుడు పొట్ట పైభాగంలో నొప్పి, వికారం తోడుకావచ్చు. ఛాతిలో మంట, ఆకలి మందగించటం, బరువు తగ్గిపోవటం వంటివీ గుర్తుంచుకోదగ్గ లక్షణాలే.

**1. సమస్య**

**పొట్ట పైభాగంలో నొప్పి, వాంతులు, ఏమీ తినకపోతే బాధ, ఛాతీ వెనుకభాగంలో మంట, రక్తం తగ్గిపోవడం.**

**2. ఔషధాన్ని ఎంపిక చేసుకునేదెలా?**

**ప్రధానంగా 1. పొట్టలో నొప్పి, బాధ హెచ్చుతగ్గులతోపాటు ఇతర లక్షణాలు 2. వాంతుల తీరు. వీటి ఆధారంగా ఎవరికి ఏ బాధల తీవ్రత ఎక్కువగా ఉందో, ఏ లక్షణాలు ప్రస్ఫుటంగా కనుబడుతున్నాయో వాటిని బట్టి మందు ఎంచుకోవాల్సి ఉంటుంది.**

నాణ్యమైన ప్లాట్లు మరియు ఫ్లాట్లు కొనుగోలుకు నమ్మకమైన అగ్రగామి సంస్థ
అభినందన హౌసింగ్ (ప్రై). లిమిటెడ్
సెంట్రల్ ఆఫీస్: 4వ లైను, పండరీపురం, లక్ష్మీపురం మెయిన్ రోడ్, గుంటూరు. ఫోన్: 2354002.
మా బ్రాంచీలు: విజయవాడ 1, విజయవాడ 2, విజయవాడ 3, గుంటూరు 1, గుంటూరు 2, హైదరాబాద్, విశాఖపట్నం.
0866-6628668 : 0866-6642428 : 0866-6633668 : 0863-6641177 : 0863-6454588 : 040-66637799 : 0891-2538686.

**పొట్టలో నొప్పి ఆధారంగా :**

పొట్ట ఖాళీగా ఉంటే ముక్కు బిరడా (ప్లగ్) పెట్టినట్లుగా పొట్టలో ఓ మోస్తరు వీడని నొప్పి. **(ఎనాకార్డియం)**

నామాల గుంటలో అదురుతున్నట్లుండటం. **(హైడ్రాస్టిస్)**

మంట పొట్టలో కుట్టునొప్పి, అది వెన్నులోకి పొడుస్తుంటుంది. **(కేలైబ్రైక్రోమ్)**

కొద్దిగానే తిన్నా పొట్ట ఉబ్బిపోతుంటుంది. **(లైకోపోడియం)**

పొట్టలో మంట, చల్లటి ద్రవాలు హాయినిస్తాయి **(ఫాస్ఫరస్)**

**వాంతులు తీరునుబట్టి:**

పసుపచ్చని వాంతవుతుంటే **(కేలైబ్రైక్రోమ్)**

తాగిన నీరు వేడెక్కగానే వాంతవుతుంటే **(ఫాస్ఫరస్)**

**3. మీ ఔషధం గురించి మరిన్ని వివరాలు**

**ఎనాకార్డియం** : పొట్టలో బిరడా పెట్టినట్లుంటుంది. అన్నకోశంలో దేవినట్లవిస్తుంది. అన్నకోశంలో నొప్పి, ఆహారం తింటే హాయి. నోరుచేదు, జీర్ణశక్తి తగ్గిపోతుంది.

**కేలైబ్రైక్రోమ్** : అన్నకోశంలో కుట్టునొప్పి (Stiching pain), ఆ నొప్పి వెనక వెన్నులోకి వ్యాపిస్తుంది.
ఏదైనా తింటే హాయిగా ఉంటుంది. పసుపురంగులో వాంతులు. ఆకలి మందగిస్తుంది. పొట్ట ఉబ్బినట్లనిపిస్తుంది.

**హైడ్రాస్టిస్** : నోరు చేదు, అన్నకోశంలో నొప్పి, కూరగాయలు గిట్టవు. జీర్ణప్రక్రియ మందం.

**ఫాస్ఫరస్** : తిన్నవెంటనే పుల్లటి త్రేన్పులు, తిన్న వెంటనే తిరిగి ఆకలి, నోరు పులుపు, తినగానే పుక్కిళ్లాదిగా ఆహారం నోటిలోకి వస్తుంటుంది. చల్లటి ఆహారంతో హాయి, మంచుగడ్డలతో పొట్టలో హాయి.

**లైకోపోడియం** : పొట్టలో పులిసినట్లు గడబిడలు, గంటల తరబడి పొట్టలో మంట, నోరు చేదు. ఆకలి విపరీతం. కొద్దిగా తిన్నా పొట్ట ఉబ్బరిస్తుంది. సాయంత్రం 4-8 మధ్య బాధలు విపరీతం.

**మోతాదు** : మీరు ఎంచుకున్న ఔషధాన్ని 30 పొటెన్సీలో రోజూ ఉదయం సాయంత్రం... పెద్దలు 6 మాత్రల చొప్పున, 12 ఏళ్లలోపు పిల్లలు 3 మాత్రల చొప్పున... 2,3 వారాలపాటు వాడుకోవాల్సి ఉంటుంది.

*ఐ. ప్రసాద్ - జీవా గురుకులం.*

జ్వరం. చలితో వారం రోజులనుండి బాధపడుతున్నాడు పొడిదగ్గు, కూర్చేన్నా, మాట్లాడి దగ్గు ఉద్రేకిస్తుంది. పొట్ట నొప్పి, దగ్గితే ఎక్కువ. వెచ్చదనం గిట్టదు.

జ్వరం103. నాడి నిమిషానికి 93 సార్లు కొట్టుకుంటుంది. రక్తపరీక్ష వైడాల్ (టైఫాయిడ్) పాజిటివ్.

బ్రయోనియా 200. 12గంటలలో 2 రెండుసార్లు. తరువాత నేట్రంమూర్ 200 ఒకడోసు- జ్వరం పూర్తిగా తగ్గినది.

*గమనిక-* ఫ్లూ, టైఫాయిడ్, వైరస్ జ్వరాలలో ఆరంభదశలో బ్రయోనియా, రస్టాక్స్, జెల్సిబయం ప్రత్యేక ఔషధాలు.

## విశేష సూచన

**ప్రియమైన భక్తినివేదన పాఠకులకు, భగవద్బంధువులకు సూచన**

**మీరు జీవా ప్రాంగణంలోని సమాచారం కోరుతున్నారా?**

**శ్రీరాంనగర్ జీవాలో జరిగే వివిధ కార్యక్రమాల గురించి, స్వామివార్లు ప్రాంగణంలో ఉన్నారా? లేరా? ఇలాంటి ఎన్నో సమాచారాలు మీరు తెలుసుకో కోరుతున్నారు. మీకు ఏ సమాచారం కావలసివచ్చినా ఈక్రింది రెండు నెంబర్లకు మాత్రమే చేసి తెలుసుకోండి! ఇక రామానుజ సహస్రాబ్ది గురించి తెలిసికో గోరినవారికి వేరే. ఆసమాచారం మన భక్తినివేదనలోనే విడిగా ఇస్తున్నాం. ఆ నంబర్లకే ఫోన్ చేసి, సమాచారం పొందవలసినదిగా కోరుతున్నాము.**

**జీవా రిసెప్షన్ ఫోన్ నెం - 9553549971 9553549972.**



# శ్రీరామానుజ సహస్రాబ్ది విశేషాలు

విద్యానగర్ కోలనీ - కరీంనగర్ : ప్రతాప్‌రెడ్డి, గోపాలరావుగారు రామానుజ సహస్రాబ్ది గురించి గ్రామాలకు వెళ్ళి ప్రచారం చేసారు. గోవిందాపురం మన్నెగూడ, గంబీర్ పూర్ , తండియాలా, అంబారీపేట, చింతకుంట, బొమ్మెన, కతలాపూర్ తక్కలపల్లి, దూలూరు, రుద్రాపురం మొదలైన గ్రామాలలో శ్రీమాన్ సీతారామాచారిగారితో రామానుజ వైభవం చెప్పిస్తూ - సత్సంగం ఎలా నిర్వహించుకోవాలో వికాసతరంగిణి కార్యకర్తలు వివరిస్తున్నారు.

మిర్యాలగుడా : జూలై 25 శుక్రవారం మిర్యాలగుడా విద్యానగర్ కోలనీలో భగవద్రామానుజ సహస్రాబ్ది ఉత్సవాల గూర్చి కార్యక్రమాన్ని నిర్వహించారు. ప్రతీవారం కోలనీలో సత్సంగాల ద్వారా రామానుజ వైభవాన్ని అందరికీ తెలియజేస్తున్నామని శ్రీమతి మందడి విజయగారు చెప్పారు ప్రతి కోలనీలో చుట్టు ప్రక్కల గ్రామాలలో రామానుజ వైభవం తెలియజేసే అదృష్టం రామానుజ సహస్రాబ్ది ఉత్సవాల ద్వారా మనకు కలిగిందని కారంపూడి రాఘవాచార్యులు తెలియజేసారు. భజనలు చేస్తూ రామాయణ వైభవం గూర్చి స్మరిస్తూ కార్యక్రమం చక్కగా నిర్వహించారు. ఈ కార్యక్రమాలలో వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమతి మందడి విజయలక్ష్మి, రాగిరెడ్డి శ్రీదేవి, దేవస్థాన కమిటీ ఛైర్మన్ చిర్లంచర్ల రమేష్, శ్రీనివాసరెడ్డి పాల్గొన్నారు.

ఏలూరు : శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో రామానుజ సహస్రాబ్ది సందర్భంగా ప్రతి వారం ఇరామాజ నూత్తందాది పారాయణ చేస్తున్నారు. అందరికీ రామానుజ స్తోత్రాలు నేర్పించాలని కొత్తవారి గృహాలలో కూడా రామానుజ వైభవాన్ని తెలియజేస్తూ పారాయణ నిర్వహిస్తున్నారు.

## విజయనగరం శ్రీత్రైవర్ణిక రామానుజకూటంలో శ్రీస్వామివారి శ్రీరామానుజ సహస్రాబ్ది కార్యక్రమం

విజయనగరం శ్రీత్రైవర్ణిక రామానుజకూటం నిర్వాహకులు శ్రీ కృష్ణాజీగారు, వీరందరికీ మార్గదర్శనం చేస్తున్న శ్రీమతి జానకిగారు మొదలైనవారంతా జీవాకి వచ్చి శ్రీస్వామివారిని విశేషంగా ప్రార్థించినందువల్ల మూడు రోజులు రామానుజ సహస్రాబ్ది ప్రయుక్తంగా కార్యక్రమాన్ని స్వామివారు అనుగ్రహించారు. త్రైవర్ణిక రామానుజకూటం వారు ఉభయ వేదాంత ఆచార్య పీఠం విజయనగరం శాఖవారు సంయుక్తంగా నిర్వహించిన ఉభయవేదాంత పండిత సభారజతోత్సవ వేడుకలకు కూడా మంగళాశాసనం అనుగ్రహించడానికి కూడా సంకల్పించి, శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారు 20 జూన్ 2014 సాయంత్రం సుమారు 6 గంటల సమయంలో విజయనగరం వేంచేసారు. 21 నుండి 23 వరకు ఉభయ వేదాంత పండిత సభలలో ఉదయం 8 గం. నుండి మధ్యాహ్నం 2 గంటలవరకు ప్రవచనములు మరియు సాయంత్రం 5 గం.ల నుండి రాత్రి 8 గంట. వరకు శ్రీశ్రీశ్రీ స్వామి వారి ప్రవచనములు జరిగాయి. ఈ కార్యక్రమంలో చిన్నారులకు స్వామివారి మంగళశాస నములు, 70 సం. నిండిన వయో వృద్ధులకు స్వామివారు మంగళాశాసనములు అనుగ్రహించారు.

యువత ప్రదర్శించిన పరమపద వాసులు శ్రీమాన్ కందాళ వేంకటాచార్యులవారి తిరునక్షత్రప్రయుక్తంగా జరిపే కార్యక్రమాలలో భాగంగా విశేషించి శ్రీకందాళస్వామివారి జీవిత చరిత్ర రూపకం వంటి సాంస్కృతిక కార్యక్రమాలు ప్రత్యేక ఆకర్షణగా నిలిచాయి. శ్రీ సాయిబాలాజీ ఫంక్షన్‌హాలులో అశేష భక్తజనం భక్తి శ్రద్ధలతో శ్రీ స్వామివారి ప్రవచనం విని తరించారు.

శంషాబాద్‌లో నిర్మిస్తున్న సమతామూర్తి స్ఫూర్తి కేంద్ర వైభవాన్ని స్వామివారు చిన్న పెద్ద అనే తేడాలేకుండా అందరి కళ్ళకు ప్రత్యక్షమయ్యేలా వివరించారు. 22వ తేదీ మంత్రో పదేశములు, 23వ తేదీ డా. కందాళ వేంకటాచార్య స్వామివారి ఆచార్య వరివస్య కార్యక్రమాన్ని శ్రీమాన్ వజపు జగన్నాథం, దుర్గ దంపతులు ద్వారా స్వామివారికి సమర్పణ గావించారు. ఈ సంవత్సరం కణ్ణినుణ్ శిరుత్తాంబు అనే గ్రంథ ఆవిష్కరణ జరిగింది. శ్రీమతి కందాళ జానకమ్మగారు యువతని ప్రోత్సహిస్తూ సంప్రదాయ విషయాలను నేర్పిస్తూ త్రైవర్ణిక వైష్ణవ రామానుజకూటం సంప్రదాయ సేవలో తరించాలని యువతనే అన్ని సేవలలో నియమించారు. పండిత సభలకు వేంచేసిన పెద్దలకు, భక్తులకు యువతంతా సేవలందించారు. యువత అందరికి శ్రీ స్వామి వారు ప్రత్యేక మంగళశాసనములు అందించారు. రామానుజ సహస్రాబ్దికి భక్తులంతా కలసి సుమారు రూ. 3,24,000/- తమ వంతు కైంకర్యాన్ని అందజేసారు. రామానుజ కూటం కమిటీ సభ్యులు అందరూ శ్రీ స్వామివారికి కృతజ్ఞతలు తెలియజేసారు.

శ్రీకాకుళం : భగవద్రామానుజ సహస్రాబ్ది సందర్భంగా వికాస తరంగిణి సభ్యులు జూలై 28న బాబాజీ కళామందిర్ లో సమావేశమయ్యారు. శ్రీమాన్ చక్రవర్తిగారు - ప్రజ్ఞ కన్వీనర్ , శ్రీమతి ఉషశ్రీగారు, శ్రీమాన్ మధుసూదనరావు గారు భగవద్రామానుజ సహస్రాబ్ది వేడుకలను గూర్చి తెలియజేసారు. కార్యక్రమంలో భాగంగా ఆచార్యత్రయం నృత్య రూపకాన్ని శ్రీమతి మాధవీ రామానుజమ్‌గారు వారి శిష్య బృందంతో ప్రదర్శించారు. శ్రీమతి గుండా లక్ష్మీదేవి M.L.A.గారు ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేశారు. శ్రీమాన్ పద్మనాభాచార్యులు, శ్రీనివాసాచార్యులు విభావరి నాట్యమండలి మరియు మందస సభ్యులు పాల్గొన్నారు. అధిక సంఖ్యలో భక్తులు ఈ కార్యక్రమంలో పాల్గొని రామానుజ వైభవాన్ని తెలుసు కున్నారు.

## శ్రీరామానుజ సహస్రాబ్ది - 2016 - 17

**ప్రియ భగవద్బంధువులారా! మీరంతా ఎంతో ఉత్సాహంతో భగవద్రామానుజ విగ్రహ నిర్మాణానికి మీమీ ద్రవ్యాన్ని వినియోగింపదలచడం చాలా ముదావహం.**

**మీరు ద్రవ్యం బ్యాంక్ అకౌంట్‌కు జమకట్టే విషయంలో ఈక్రింది అంశాలను గమనించండి.**

1. **మీరు ఆంధ్రాబ్యాంక్, ముచ్చింతల్ బ్రాంచ్‌కి. 209710100000007 నెంబరుకు - ఏ ఆంధ్రాబ్యాంక్ బ్రాంచి నుంచి అయినా నేరుగా జమకట్టవచ్చు. జమకట్టేటప్పుడు -కౌంటర్ ఫయిల్, వర్జినల్ మీవద్ద ఉంచుకుని దాని నకలు, జతచేసి ఒక తెల్లకాగితంపై మీవివరాలు, అడ్రస్ స్పష్టంగా, ఎవరిపేరున రసీదు పంపాలో వ్రాసి మా అడ్రస్‌కు పంపండి.**
2. **మీరు ఆంధ్రాబ్యాంకు కాక, వేరేబ్యాంకు ద్వారా పంపదలిస్తే- IFSC Code ANDB – 0002097 అనే నెంబర్‌ను వినియోగించి పై ఆంధ్రాబ్యాంక్ అకౌంట్‌కే అమౌంట్‌ను పంపవచ్చును.**

**వివరాలు తప్పని సరిగా మా ఆఫీస్‌కు అందాలి. అందిన తరువాతనే రసీదు పంపబడుతుంది. ఎలా పంపినా -మీరు జమచేసిన వివరాలు- కౌంటర్‌ఫైల్ నకలు, మీపేరు, ఊరు, చిరునామా వగైరా ఈక్రింది అడ్రస్సుకు పోస్టులో పంపండి. మీ ఇమెయిల్ ఐడి కూడా తప్పక వ్రాసి పంపండి.**

**శ్రీరామానుజ సహస్రాబ్ది కార్యనిర్వాహక సమితి,**
**9553549971, 9553549972,**
**శ్రీరామానుజ సహస్రాబ్ది, జీవా, శ్రీరామనగర్, ముచ్చింతల్(గ్రా), పాలమాకుల(పో), శంషాబాద్ (మం), రంగారెడ్డి జిల్లా -509325**
Email -contact@sriramanujasahasrabdi.org



# పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



నూతన శక్తిని లోకాలకు ప్రసాదించడానికి ప్రతి ఏడాది నాలుగు నెలలు యోగనిద్రలో చేరతాడు భగవంతుడు. దానినే వానాకాలమంటారు. భక్తులు, పెద్దలైన మహానుభావులు ఈకాలాన్నే చాతుర్మాస్యంగా ఆచరిస్తారు.

గ్రామైకరాత్రమై యాత్రసాగించే యతులు ఈసమయంలో ఒకేచోట ఉండి, ఏడాదిలో వారు జరిపిన కార్యాలను పర్యాలోచన చేస్తారు. నూతన కార్యాలకు రూపుకల్పన చేస్తారు. తరచుగా సంచారశీలురైన సన్యాసులు, రెండునెలలు చాతుర్మాస్యం చేస్తుంటారు. **'పక్షాన్ వై చతురో మాసాన్'** ఒక్కొక్క పక్షానికి ఒకొక్క మాసంగా గణించి, రెండునెలల్లోనే సాధారణంగా దీక్షముగిస్తూ ఉంటారు. ఈసారి ప.ప.ఉ.వే.ప్ర.శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్ స్వామివారు, విశాఖపట్నం వద్ద 'వారిజ'లోనూ, శ్రీశ్రీశ్రీ దేవనాథ జీయర్‌స్వామివారు జీవా ప్రాంగణంలోనూ, చాతుర్మాస్య దీక్షను రెండునెలల క్రమంలో జరిపి, భాద్రపద పూర్ణిమ 9.9.2014వ తేదీన విరమించారు. తిరిగి తమ యాత్రావిశేషాలను కొనసాగిస్తున్నారు.

శ్రీచిన్నజీయర్ స్వామివారు జీవా ప్రాంగణంలోనే నాలుగునెలలూ దీక్షను కొనసాగిస్తున్నారు. ప్రతిరోజూ భగవద్రామానుజులవారి ప్రథమ గ్రంథమైన **'వేదార్థసంగ్రహాన్ని'** ఉదయపుపూట ప్రవచిస్తున్నారు. గురుకుల విద్యార్థులకు ఉపనిషత్సారాన్ని అనుగ్రహిస్తున్నారు. మిగిలిన సమయంలో వివిధ ప్రాంతాల భక్తులతో అధికసమయం వెచ్చిస్తున్నారు. భగవద్రామానుజ సహస్రాబ్ది పథకానికి సంబంధించిన విషయాలను పరిశీలిస్తున్నారు.

మధ్యమధ్యలో, అనుకూలమైనంతవరకూ కొన్ని బయటి కార్యక్రమాలలో పాల్గొంటున్నారు. అలాంటిదే హైదరాబాద్ పరిసర ప్రాంతంలో సన్‌సిటీ అనేచోట గంధంగూడ వద్ద గుట్టపై నిర్మాణాధీనమై ఉన్న శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయ ప్రాంగణంలో 30.8.14న జరిగిన హయగ్రీవ యాగం. ఆచుట్టు ప్రక్కల ఉండే వివిధ విద్యాలయ విద్యార్థులను ఆహ్వానించి, వారి విద్యాభివృద్ధికై, ఈయాగం చేశారు.

ఓ ప్రక్కన హోరున వానకురుస్తున్నా, స్కూలుబస్సులలో వందలాది విద్యార్థులు వచ్చి శ్రద్ధగా పాల్గొన్నారు. అన్యమతస్థుల దురాక్రమణలో మ్రగ్గిన ఆగుట్టని వైదిక స్థానంగా తీర్చిదిద్దే ఉద్యమంలో ఆ ప్రాంతాల సర్పంచ్‌లు పూనుకుని ఆలయ నిర్మాణం ప్రారంభించారు. శ్రీమాన్ పి.టి.కిషోరా చార్యులు వారికందరికీ ప్రోత్సాహకునిగా ఆయాగాన్ని చక్కగా నిర్వహించారు. శ్రీమాన్ రాజు, లక్ష్యసాధన ఫౌండేషన్ ద్వారా, చక్కని సమన్వయ కర్తగా వ్యవహరించారు. పూర్ణాహుతి శ్రీచిన్నజీయర్ స్వామివారి నేతృత్వంలో జరిగింది. అంతకుముందు శ్రీశ్రీశ్రీ రామచంద్ర రామానుజ జీయర్ స్వామివారు, శ్రీశ్రీశ్రీ వ్రతధర రామానుజ జీయర్ స్వామివారు, శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయర్‌స్వామివార్లు ఈ యాగంలో పాల్గొని మంగళాశాసనాలు చేశారు.

అనంతరం శ్రీస్వామివారు లక్ష్యసాధన ఫౌండేషన్ నిర్వహించే విద్యార్థి హాస్టల్‌ను సందర్శించి, మంగళాశాసనాలు చేశారు.

సెప్టెంబరు 13వతేదీన శ్రీస్వామివారు హైటెక్‌సిటీవద్ద నవోటెల్‌లో జరిగిన ప్రాజెక్ట్ మేనేజ్‌మెంట్ ఆఫ్ ఇండియా (పి.ఎమ్.ఐ) వారి జాతీయ సదస్సు2014లో అతిథిగ పాల్గొని మంగళాశాసనాలు చేశారు. శ్రీమాన్ శ్రీనివాస ప్రభు ఆకార్యక్రమాన్ని ఏర్పాటుచేశారు.

13,14 తేదీలలో వికాసతరంగిణి కార్యవర్గసభ్యుల సమావేశం జరిగింది. అత్యుత్సాహంతో వచ్చిన కార్యకర్తలందరూ రాబోయే శ్రీరామానుజ సహస్రాబ్దికి రెట్టించిన ప్రోత్సాహంతో సేవలందిస్తామన్నారు.

## శ్రీవైష్ణవసంఘం

75సం॥దాటినవారికి వారి సంతానంద్వారా వృద్ధులను సత్కరించే ప్రక్రియను అమలుపరుస్తూ 'వృద్ధదంపతీ వరివస్య' వైష్ణవసంఘం, భాగ్యనగరం వారు కార్యక్రమాన్ని రూపొందించారు. వృద్ధులైన తల్లిదండ్రులపట్ల వారి సంతానానికి ఉండవలసిన బాధ్యతలు గుర్తుచేయడం, విశేషించి వారు ఏ శ్రీవైష్ణవ సంప్రదాయానికి చెందినవారో, ఆసాంప్రదాయం పట్ల అవగాహన, ప్రీత్యాదరాలు పెంపొందేలా చేయడానికి శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారి మంగళాశాసనాలతో అక్టోబరు 12 ఆదివారంనాడు, జీవా ప్రాంగణంలో వృద్ధదంపతీ వరివస్య కార్యక్రమాన్ని నిర్వహించడం జరుగుతోంది. దీన్ని శ్రీవైష్ణవసంఘం నిర్వహిస్తోంది. శ్రీవైష్ణవ సంప్రదాయం ఒక కులానికి, వర్ణానికి మాత్రమే చెందినది కాదు. సమాజంలో ఎన్నో వర్ణాలకు చెందినవారు శ్రీవైష్ణవ సంప్రదాయ ప్రీతితో తదనుగుణంగా తమ జీవితాన్ని సాగిస్తున్నారు. విశేషించి, సాంప్రదాయ పోషకులుగా ఎందరో ఉన్నారు. అలాంటి వారిలోని వృద్ధులను కూడా మనం సత్కరించుకొనవలసిన బాధ్యత ఉంది.

ఈదృష్టితో అక్టోబరు 26వతేదీన 'వృద్ధదంపతీ వరివస్య' అనే పేరున అన్ని వర్ణాలకు చెందిన వృద్ధ దంపతులను సత్కరించాలని, శ్రీశ్రీశ్రీ స్వామివారు కార్యక్రమాన్ని రూపొందించారు. ఈకార్యక్రమం, జీవాప్రాంగణంలోనే జరుగుతుంది. 75సం॥లు దాటిన వేరువేరు సామాజిక వర్గాలకు చెందిన, శ్రీవైష్ణవ వృద్ధదంపతులు తమ వివరాలను అక్టోబరు 10వతేదీ లోపుగా తెలియజేయ గోరుతున్నాము. ముఖ్యంగా పురుషులు 75సం॥లు దాటిన వారైతే చాలు. స్త్రీలకు 75 అనే నియమం లేదు. కార్యక్రమంలో స్వయంగా పాల్గొన గలవారై ఉండాలి. అలాంటివారే తమ వివరాలు జీవాకార్యాలయానికి, తెలియజేయండి. ఈక్రింద ఈయబడిన రిసెప్షన్ నెంబరుకు ఫోనుద్వారా తమ వివరాలు చెప్పండి. అక్టోబరు 10లోగానే వివరాలు చెప్పాలి.

**ఫోన్: 95535 49971/72**

## నేత్రవిద్యాలయ డిగ్రీకళాశాల విద్యాస్థానం మార్పు

జీవా ప్రాంగణంలో అంధవిద్యార్థులకోసం మనం ఏర్పరచుకున్న జూనియర్ కళాశాల, డిగ్రీకళాశల్లో, జూనియర్ కళాశాలను జీవా ప్రాంగణంలోనే నిర్వహిస్తూ, డిగ్రీ కళాశాలను మాత్రం హైదరాబాద్-దోమల్‌గూడలో ఉన్న మన జెట్ ప్రాంగణానికి మార్చాలని నిర్ణయించడం జరిగింది. ఇందుకోసం కావలసిన అన్ని వసతులు దోమల్‌గూడ భవనంలో ఏర్పరచడం జరిగింది. దసరా తరువాత అనుస్యూతంగా నిర్వహింపనున్న ఈ కళాశాలకు విద్యార్థులను నిత్యం పంపడానికి వీలుగా రెండు నూతన వాహనాలను కొనడం జరిగింది. ఇదివరకు అల్లంపల్లి, బీర్సాయిపేటల్లో ఉన్న మన గిరిజన పాఠశాలలకు బస్సులను విరాళంగా సమర్పించిన US. VT Seva వారే ప్రస్తుతం నేత్రకళాశాలకు కూడా రెండు బస్సులను సమర్పించారు. వీటిని ఒక వారంరోజులపాటు పూర్వరంగంగా నడిపించడం ప్రారంభించారు.



శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి కరకమలాలతో ఈ రెండు వాహనాలకు 22.9.14 ఉదయం శుభారంభం జరిగింది. శ్రీశ్రీశ్రీ దేవనాథ జీయర్‌స్వామివారు, డా॥ఎస్.వి. రంగరామానుజాచార్యస్వామివారు, శ్రీమాన్ పార్థసారథిగారు ఇతర పెద్దలు ఈ శుభారంభ కార్యక్రమంలో పాల్గొన్నారు. కళాశాల విద్యార్థులను వాహనంలో ప్రిన్సిపాల్ శ్రీమాన్ యాదగిరిస్వామి దోమల్‌గూడకు తోడ్కొని వెళ్ళారు.

స్థానికంగా లభించే వివిధ బోధనాంశాలకు సంబంధించిన అధ్యాపకుల సహాయ సంపత్తులను తీసుకొని, విద్యార్థులకు మరింత మెరుగైన బోధనాప్రణాళిని ఏర్పరచాలనే సంకల్పానికి అనుగుణంగా ఈ కళాశాల స్థాన పరివర్తనం జరుపబడుతున్నది.

## శ్రీఅహోబిలజీయర్‌స్వామివారి

# చాతుర్మాస్యదీక్షా పరిసమాప్తి

9.9.2014 వారిజ భాద్రపద పౌర్ణమి శ్రీఅహోబిలజీయర్‌స్వామి వారి చాతుర్మాస్యదీక్షా పరిసమాప్తి వైభవంగా జరిగింది. రెండు మాసాలుగా జరిగిన శ్రీయాగము మహాపూర్ణాహుతి శ్రీలక్ష్మీనారాయణ, శ్రీసీతారాముల శాంతికల్యాణ మహోత్సవముతో పరిపూర్ణమైంది.

చాతుర్మాస్యంలోని చివరి 9రోజులు సామూహికంగా శ్రీమత్ సుందరకాండ పారాయణ చేశారు. ఈసందర్భంగా శ్రీరామచంద్రునికి మహాసామ్రాజ్యపట్టాభిషేకం నిర్వహించారు. విశేషించి శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారు ఈకార్యక్రమానికి గురుపూజా మహోత్సవాలు అని పేరు పెట్టారు. అందువల్లేనేమో! అనుకోకుండా చివరిరోజు శ్రీరామానుజులకు యతిరాజ పట్టాభిషేకము అంటూ అహోబిల జీయర్ స్వామివారు రామచంద్రునకు మహాసామ్రాజ్య పట్టాభిషేకము, భక్తిసామ్రాజ్య పట్టాభిషేకము, శ్రీరామానుజులకు సువర్ణకిరీటమును అలంకరించారు. **శ్రీఉ.వే.శ్రీమాన్ భాష్యం శ్రీనివాసాచార్యస్వామి, సింహాచల దేవస్థాన ప్రధానార్చకులు శ్రీఉ.వే.శ్రీమాన్ మోర్త సీతారామాచార్య సామి, సింహాచల దేవస్థాన స్థానాచార్యులు శ్రీఉ.వే.శ్రీమాన్ గోపాలాచార్యస్వామి, శ్రీఉ.వే. శ్రీమాన్ అమరవాది వేంకట నరసింహాచార్య స్వామి** తదితర పెద్దల ప్రవచనాలు జరిగాయి. కార్యక్రమాన్ని సేవించడానికి వేలాదిమంది భక్తులు విచ్చేశారు. కార్యక్రమాన్ని నిర్వహించిన వారిజ కమిటీకి మరియు విశాఖ వికాస తరంగిణి కార్యకర్తలకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేశారు.

సాయంత్రం శ్రీకాకుళంజిల్లా కొత్తపేటలో వికాసతరంగిణి నేతృత్వంలో నిర్మించిన అర్చకగృహాన్ని సందర్శించారు.

10వతేదీ మందస శ్రీవాసుదేవస్వామి ఆలయంలో శ్రీటి. రఘురాంస్వామి జరిపిన శ్రీలక్ష్మీనృసింహ హవనంలో పాల్గొని శ్రీరామనగరమునకు విచ్చేశారు.

### శ్రీజయన్తి - విజయవాడ

16.9.2014 శ్రీవారి మంగళాశాసనాలతో శ్రీఅహోబిలజీయర్ స్వామివారు 16వతేదీ విజయవాడలోని శేషసాయి కల్యాణ మండపంలో శ్రీజయన్తి ఉత్సవాన్ని నిర్వహించారు. ఉదయం తీర్థగోష్ఠి, స్వామివారి ప్రవచనము మొదలుకొని సాయంత్రం వరకు భజనలు, కోలాటాలు, నృత్య ప్రదర్శనలు, శ్రీవిష్ణుసహస్రనామ పారాయణలతో అధిక సంఖ్యలో భక్తులు పాల్గొన్నారు.

సాయంత్రం 6గం॥లకు శ్రీకృష్ణసందర్శనము, శ్రీకృష్ణపూజా 32రకాల విశేష ప్రసాదాలను స్వామికి సమర్పించారు. ముందుగా ఉ.వే.శ్రీమాన్ తూపురాణి ఉదయవర్లు స్వామి, ఉ.వే.శ్రీమాన్ అమరవాది వేంకట నరసింహాచార్యస్వామి, శ్రీమాన్ గుదిమెళ్ళ శ్రీకూర్మనాథ్‌స్వామివార్లు శ్రీకృష్ణుని వైభవంగురించి ప్రవచించారు. ఈ కార్యక్రమానికి నర్సాపురం (ఎమ్.పి.) శ్రీమాన్ గోకరాజు గంగరాజు, జిల్లా పరిషత్ చైర్‌పర్సన్ శ్రీమతి గద్దె అనూరాధ, విజయవాడ మేయర్ శ్రీ కోనేరు శ్రీధర్, శ్రీ లింగమనేని భాస్కరరావుగారు, డా॥ముక్కామల అప్పారావు, ఎన్.ఆర్.ఐ. సి.ఈ.ఓ. శ్రీ ఆనంద్, డా॥ఎమ్. పార్థసారథి పురప్రముఖులు పాల్గొన్నారు. అనేకమంది చిన్నారులు గోపిక, శ్రీకృష్ణ వేషధారణలో దర్శనమిచ్చారు. విజయవాడ గంగావాటర్ ఫిల్టర్ అధినేత శ్రీమతి సత్యవతి ప్రసాదకైంకర్యాన్ని సమర్పించారు. ఈ కార్యక్రమాన్ని శ్రీమాన్ పురాణం వేంకటాచార్యస్వామి, శ్రీమాన్ గుదిమెళ్ళ రఘునాథ్, వికాసతరంగిణి – విజయవాడ, శ్రీఎన్.కృష్ణ, దుర్గ, శ్రీ రాఘవన్, శ్రీ చక్రధర్ దిగ్విజయంగా జరిపించారు. నలంద కాలేజి విద్యార్థులు చక్కటి సేవలనందించారు. అధిక వర్షప్రభావం ఉన్నా... వేలాదిమంది కార్యక్రమంలో అన్వయించారు.

శ్రీస్వామివారి ప్రవచనం నుండి వెలువడిన **తులసీ మాహాత్మ్యము, ధ్యానసాధన, తత్త్వరహస్యం, విజయదశమి అనే** పుస్తకాలను శ్రీమాన్ గంగరాజుగారు, బిజెపి నేషనల్ సెక్రటరీ– శ్రీమాన్ రాంమాధవ్‌గారు ఆవిష్కరించారు. శ్రీఅహోబిల రామానుజ జీయర్‌స్వామివారు విచ్చేసిన ప్రముఖులకు మంగళాశాసనాలు అనుగ్రహించారు.

రాధాకృష్ణుల వేషధారణలోనున్న చిన్నారులకు నగర మేయర్ శ్రీమాన్ కోనేరు శ్రీధర్‌గారు, జడ్‌పి చైర్మన్ శ్రీమతి గద్దె అనూరాధ గారు బహుమతులను అందజేసారు.

అనంతరం ఉట్టికొట్టు కార్యక్రమం శ్రీమాన్ మధుస్వామి నిర్వహణలో జరిగింది. ఈ కార్యక్రమంలో వేదాగమ విద్యార్థులు కూడా పాల్గొన్నారు.

17.9.2014 సాయంత్రం 5గం॥లకు జగ్గయ్యపేట శ్రీరంగనాథస్వామి ఆలయంలో శ్రీజయంతి వేడుకలలో శ్రీస్వామివారు పాల్గొని, శ్రీకృష్ణవైభవాన్ని ప్రవచనం చేసారు. వికాసతరంగిణి అధ్యక్షురాలు శ్రీమతి విజయలక్ష్మి ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

18.9.2014 శ్రీస్వామివారి మంగళాశాసనాలతో 'మంచిని ప్రోత్సహించే దాతల తోడ్పాటుచే సాగే' మన వారిజ నేత్రవిద్యాలయం మరింత అభివృద్ధిపథంలో సాగుటకు శ్రీఅహోబిల జీయర్‌స్వామివారు వికాసతరంగిణి సెంట్రల్‌కమిటీ ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీమాన్ భవానీప్రసాద్ నూతన కార్యవర్గ మండలికి తగు సూచనలు అందించి మార్గనిర్దేశనం చేశారు.

19.9.14 రాజమహేంద్రిలో రాబోయే గోదావరి పుష్కరాలకై వికాసతరంగిణి సమావేశంలో పాల్గొని, కార్యకర్తలకు సూచనలు అందించారు.




# వికాసదర్శిని

సమగ్ర సమాచార నివేదన

సంపాదకులు శ్రీమతి టి. అరుణ

## వికాసతరంగిణి సభ్య సమావేశం - శిక్షణ తరగతులు




సెప్టెంబర్ 13,14 తేదీలలో శ్రీరామ్‌నగర్ జీవా ప్రాంగణంలో జరిగిన వికాసతరంగిణి సభ్య సమావేశంలో 1500 మందికి పైగా సభ్యులు పాల్గొన్నారు. ఈ రెండు రోజులూ కార్యక్రమంలో పాల్గొన్న అందరినోట ఒకటేమాట **"శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి అనుగ్రహ భాషణంలో ప్రతి ఒక్కమాట మాలో ఎంతో శక్తిని నింపింది. కార్యకర్తలకు కావలసిన అన్ని విషయాలు స్వామివారు తెలియజేసారు. వికాసతరంగిణిలో సభ్యులుగా ఉండడం మా అదృష్టం". "చాతుర్మాస దీక్షలో ఒకే వేదికపై ముగ్గురు జీయరు స్వాములను సేవించుకొని, వారి మంగళాశాసనములు తీసుకొని రామానుజ సహస్రాబ్దికి సేవలందించేందుకు సిద్ధమవడం మా అదృష్టం"** అంటూ ప్రతి కార్యకర్త ఆనందోత్సహాలతో తమ ప్రాంతాలకి ప్రయాణమయ్యారు. -

మరి వారినందరిని అంతగా ఆనందపరచిన సమావేశ వివరాల్లో కొన్నింటిని ఇక్కడ అందిస్తున్నాం.

13వ తేదీ ఉదయం 10 గంటలకు సభ ప్రారంభమ య్యింది. వికాసతరంగిణి కేంద్ర కమిటి అధ్యక్షులు శ్రీమాన్ రమేష్ గుప్తాగారు, సంఘటనా కార్యదర్శి శ్రీమాన్ భవానీ ప్రసాద్‌గారు సభను నిర్వహించారు. జీవ, ఉభయవేదాంతాచార్య పీఠం, భక్తినివేదన, ఇలా మన స్వామివారు నిర్వహించే అన్నిటికీ పెద్ద దిక్కుగా ఉంటూ అన్ని కార్యక్రమాలకు దిశానిర్దేశం చేసే శ్రీ ఉ.వే. శ్రీమాన్ డా.సముద్రాల వేంకట రంగరామానుజాచా ర్యుల వారు వికాసతరంగిణి కార్యకర్తలందరికి మంగళాశాస నములు అందిస్తూ" శ్రీశ్రీశ్రీ స్వామివారి అనుగ్రహంతో వికాస తరంగిణి కార్యకర్తలు కేవలం మన ప్రాంతంలోనే కాక ఖండాంతరాలకు వ్యాపించి విద్య, వైద్య సేవలందిస్తున్నారు. ప్రతి కార్యకర్త చేసిన కార్యక్రమాల నొక్కసారి సింహావలోకనం చేసుకొని చక్కటి సమయస్ఫూర్తితో, అందరితో కలసి కార్య క్రమాలు చేయగలగాలి. సేవా కార్యక్రమాలతో పాటు ఆధ్యాత్మిక కార్యక్రమాలు నిర్వహించాలి. మీ ప్రాంతాలలో స్వామివారి కార్యక్రమాలు ఎవరు నిర్వహించినా వికాసతరంగిణి కార్యకర్తలు నిర్వాహకులతోపాటు బాధ్యతగా సేవలందించాలి. వికాసతరం గాలు మంచి సేవా కార్యక్రమాలనే నీటిని ప్రవహింప చేస్తూ సమాజాన్ని విలువలతో సస్యశ్యామలం చేయాలి అని చక్కటి సందేశాన్నిచ్చారు.

శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయరు స్వామివారు మంగళాశాసనం చేస్తూ "మన వికాసం" ఎలా ఉండాలో తెలియజేస్తూ... సేవా భావన ఆచరణలో పరిపక్వం కావడానికి ఉండవలసిన ప్రేరణ పలురకాలుగా ఉంటుంది. అవగాహన స్థాయినుండి అనుభవ స్థాయిలోకి 'సేవాభావన' వచ్చినప్పుడే అది సేవా కార్యక్రమం అవుతుంది. మాధవుడు అంటే ఎవరు? ఒక గుడిలో విగ్రహమా? ఇంట్లో విగ్రహమా? ఒక దేవుని పటమా? ఇది మాత్రమే కాదు ప్రతీదీ మాధవుని రూపమే. నిజానికి భగవంతునిది కానిది అంటూ ఏదీ లేదు. ఈ భావన నిజంగా మనలో కలగాలి. ***మనలో కలిగే* వరకు మనం సాధన చెయ్యాలి.** ఇది కలిగేటట్లు మనస్సును అదుపులో ఉంచాలి. మనం చేసే సేవలన్నీ మాధవునికే చేస్తున్నామని భావన కలగాలి. శ్రీశ్రీశ్రీ స్వామివారు చెప్పారు కనుక చేస్తున్నాం, శ్రీ స్వామివారి ఆశీర్వచనాల కోసం చేస్తున్నాం, వారి మెప్పుకోసం చేస్తున్నాం అనే భావన మరింత పెరిగి మాధవునికి చెయ్యకుండా ఉండలేక చేస్తున్నాం అనే వికాసం మనలో కలగాలి. సేవలందించేందుకు తమని తాము తీర్చిదిద్దుకొనటంతోపాటు తమతోటి

సేవకులలో కూడా వికాసం కల్గించి కలసి పనిచేయగల్గిన వారు నిజమైన కార్యకర్తలు అంటూ శ్రీశ్రీశ్రీ స్వామివారు 2006లో చెప్పిన విషయాలను గుర్తు చేసారు.

శ్రీశ్రీశ్రీ అహోబిలరామానుజ జీయరు స్వామివారు మంగళాశాసనం చేస్తూ"మాధవ సేవగా సర్వప్రాణి సేవ" మన వికాసతరంగిణి ప్రధాన లక్ష్యం. 'మా' అంటే దయ - ధవుడు అంటే కలవాడు. మాధవుడు అంటే దయకునిలయం - దయకలవాడు. కరుణాంతరంగుడు అయిన భగవంతుడు ప్రతి వస్తువులోనూ ఉంటాడు. చెట్టు, గట్టు, పుట్ట, జంతువు, నాస్తికులు వీరు వారనే తేడాలేదు. సర్వప్రాణులలోను మాధవుని దర్శించి సేవ చేయాలనే లక్ష్యం గురించి మాట్లాడుకోవాలంటే సమాజ రూపంలో ఉన్న మాధవుడికి సేవ చేయాలి. మన మనస్సులో ఆయనపై ప్రేమ పొంగిపొరలితే ఆయన కోసం ఏదో ఒకటి చేయకుండా ఉండలేం. "పేరు కోసం, పదవి కోసం, అందరి మెప్పుకోసం కాకుండా ***మనం సేవ చేయడానికి మాధవునిపట్ల ఉన్న ప్రేమే ప్రేరణ కావాలి"*** మాధవుని మీద మనకు ప్రేమ ఎంత పెరిగితే మనం అందించే సేవలు అంత మధురంగా ప్రభావవంతంగా ఉంటాయి.

***" మాధవుని పట్ల ఉన్న ప్రేమ"*** మారకుండా స్థిరంగా ఉండాలంటే మన మనస్సుకు శిక్షణ బాగా అవసరం. ఆచార్య సేవ, పూజ, యజ్ఞం, జపం ఇవన్నీ ఆ సాధన కోసమే ***సత్సంగమే*** **మనస్సుకు శిక్షణను ఇచ్చేందుకు తగిన స్థానం** - అందు వలన సత్సంగాలను నిర్వసిస్తూ సంస్కారాలను పెంచుకుందాం" అంటూ అహోబిల రామానుజ స్వామివారు 2006లో శ్రీశ్రీశ్రీ స్వామివారు అందించిన ప్రవచన సారాన్ని సభ్యులకు గుర్తు చేసారు.

వికాసతరంగిణి సభ్యులందరికి ఒక పుస్తకాన్ని అందజేసారు. అందులో విషయం చదివిన తరువాత చర్చ చేయాలి.

***నాలోని నాయకుడు*** అనే అంశంపై కొన్ని విషయాలు చెప్పి కార్యకర్తలతో చర్చా కార్యక్రమాన్ని ఏర్పాటు చేసారు. కార్యకర్తలందరిని రెండు విభాగాలుగా చేసి ఒక విభాగానికి అహోబిలజీయరు స్వామివారు, ఒక విభాగానికి దేవానాధ జీయరు స్వామివారు కార్యకర్తలకు చర్చా కార్యక్రమం నిర్వహించారు. పలువురు కార్యకర్తలు అడిగిన ప్రశ్నలకు చక్కటి సమాధానాలు అందజేసారు.

సంఘటనా కార్యదర్శి శ్రీమాన్ భవానీ ప్రసాద్‌గారు మాట్లాడుతూ శ్రీశ్రీశ్రీ స్వామివారు అనుగ్రహించిన లక్ష్యాలదిశగా ప్రయాణించాలని వికాసతరంగిణి ద్వారా మనమంతా సేవలందిస్తున్నాం. తన పూర్వీకులను తరింప చేయడం కోసం భగీరథుడు గంగను భూమికి దింపాలని ప్రయత్నం చేసాడు. సర్వత్రా మాధవుని సేవించి సమాజానికి మనం సేవలందించా లనుకున్నాం. గంగను భూమికి చేర్చడమంత పవిత్రమైనదీ సేవాకార్యం. **ఇంత గొప్ప కార్యాన్ని మనకందించిన మన ఆచా ర్యులే సంస్థకున్న ఏకైక బలం. 'చినజీయర్'** నామానికి ఉన్న శక్తి ఇంతమందిని ఒకచోట చేర్చింది. మనమంతా వికాస తరంగిణి కుటుంబానికి చెందినవాళ్ళం. వ్యక్తుల మధ్య అనైక్యత, స్పర్థ, వ్యక్తిగత గుర్తింపు, పరస్పర నిందారోపణలు ఉండకూడదు. స్వచ్ఛందంగా సమయమిచ్చి,సంపదలనిచ్చి పనిచేస్తున్న వ్యక్తులు, మన సంస్థలో వేలాదిమంది ఉన్నారు. అందరూ చక్కటి సేవలందిస్తున్నారు.

స్వామివారి సమక్షంలో ఉన్నప్పుడు మనం జ్ఞాన సూర్యులుగా భాసిస్తాం. అది ఆచార్యుల సాత్విక తేజస్సు యొక్క ప్రభావం. - నిజానికి ***జ్ఞాన సూర్యుడు*** ఆచార్యులు మాత్రమే. మనం వట్టి నీటికుండలం. సూర్యుడు నీటి కుండలో ప్రతిబింబించినంత మాత్రాన కుండలు సూర్యుడ్ని ఒడిసి పెట్టలేవు. మన జ్ఞానం కూడా అంతే. మనం మన ప్రాంతాలలో ఉన్నప్పుడు మనలో తత్త్వ ప్రకాశం మాసిపోయి ఒకరంటే ఒకరికి అసూయ, ద్వేషం కలుగుతుంది. సాధనా బలం లేకపోవడం వలన అలా జరుగుతుంది.

భవనం ఎంత ఆకర్షణీయంగా ఉన్నా పునాదులు బలహీనంగా ఉంటే అవి నిలువలేవు. మన ఆధ్యాత్మిక పునాదులు అల్పంగా ఉంటే మన ప్రవర్తనలో అసూయ, ద్వేషాలు చోటు చేసుకుంటాయి. **సాధన చేస్తూ ప్రపత్తి మార్గంలో నడిస్తే మనసు ఏ వికారాలకు లోనుకాదు** అంటూ భవనీ ప్రసాద్ గారు ద్రావిడ ప్రబంధంలో నమ్మాళ్వార్ల సూక్తులను చక్కటి తెలుగులో తెలియ జేసారు. మౌలికంగా మనమంతా దివ్యానుభూతికి అఱ్ఱులు చాచేవారమే. అయితే మన కోరికకి తగ్గట్టు మన అంతరంగాన్ని తీర్చిదిద్దుకొనే శ్రద్ధ మనకు కావాలి. మన మనో మందిరాన్ని పరిశుభ్రంగా ఉంచుకోవడంలో నిర్లక్ష్యం వహించ కూడదు. మనో మందిరంలో సమాజరూపంలో ఉన్న మాధవుని నిలుపగలిగితే ఎదుటివారిని మాధవునిగా గుర్తించ గల్గుతాం.

**వైష్ణవుడు ఎవరినీ శత్రువుగా గుర్తించడు. తనపై శత్రుత్వం వహించిన వారికి కూడా మోక్షాన్ని కోరుకునే ప్రేమికుడు వైష్ణవుడు.**

**"వైష్ణవమంటే ప్రేమించే విధానం. మన భావం పరిశుద్ధమైతే మన ప్రవర్తనా పరిశుద్ధమౌతుంది. వ్యక్తులలో దోషాలు వెతుకుతూ సమయాన్ని వృదా చేసుకోకండి. ఏ దోషం లేనివాడు జగత్తులో లేడు. ఇతరుల దోషాలు ఎత్తి చూపే అధికారం ఎవరికీ లేదు. ఇతరులను ప్రేమించి, సేవించడంలో మంచితనమున్నది. దానిని పెంచుకొనేవాడే వైష్ణవుడన్న** రామానుజ బోధనలను స్వీకరిద్దాం, ఆచరిద్దాం అంటూ వికాసతరంగిణి కార్యకర్తలకు కార్యదర్శి చక్కటి సందేశమందించారు.

*రెండవ చర్చాంశము శోధన- సాధన :*

వికాస తరంగిణి సభ్యులుగా మనం - అంతటా వ్యాపించి అన్నింటినీ శాసిస్తున్న దైవానికి సేవకులుగా రాణించాలని భావిస్తున్నాం. మనం చేసే "ప్రతి పనీ దైవసేవ" అయినప్పుడే "మాధవ సేవగా సర్వప్రాణి సేవ" సార్థకమవు తుంది.

ఈ దిశగా మనల్ని తీర్చిదిద్దుకోవడం కోసం ఏర్పడిన విభాగం **సంస్కారవికాస్.**

మనం ఎంతోశ్రమపడి భౌతిక వస్తురాశిని విలువైన సంపదగా మార్చుకుంటాం. ఉదాహరణ : వజ్రం. ముడి వజ్రం నుండి మట్టి తొలగిస్తాం మెరుగులు దిద్దుతాం. ఆ తరువాత అందమైన ఆభరణంలో పొదుగుతాం. ఇలా రత్నం, వెండి, బంగారం, కర్ర, రాయి ఏదైనా ఎన్నో మార్పులు పొంది ఉపయోగించు కోవడానికి అవసరమైన విలువను సంపాదించుకుంటున్నాయి. అలాగే దైవానికి ఉపయోగపడాలనుకునే మనకు ***విలువను*** పెంచుకునే అవసరం ఉంది. అలా మారాలనుకొనేవారికి సాధనం ***సంస్కారవికాస్.*** మనిషిగా మనం గుణ, దోషాల మిశ్రమం. మనలో దోషాలను నివారించి సుగుణాలను ప్రకాశింపచేసే ప్రక్రియ ***సంస్కారవికాస్.*** సమస్త చేతన అచేతనాల్లో హరిని తప్ప బయట తేడాలను చూడబోమనే నియమాన్ని ఏర్పరచుకొన్న వ్యక్తులందరం ఆ జగన్నాధునికి సేవ చేయాలంటే భగవత్ బంధుత్వాన్ని గుర్తించాలి. అలాంటి బంధుత్వాన్ని గుర్తుచేసేది సత్సంగం.

మనల్ని మనం సంస్కరించుకునే కేంద్రం సత్సంగం.

**సత్సంగం ఏం చేస్తుంది?**

మనలో ఆత్మ విశ్వాసాన్ని పెంచుతుంది. మనలో నిరుత్సాహాన్ని తొలగిస్తుంది. మన సంస్కారాలను ***సత్సంగం*** ద్వారా వికసింపచేసేందుకు మన ఆచార్యులు ***సంస్కారవికాస్*** విభాగాన్ని అందించారు.

***సత్సంగాలను*** సక్రమంగా నిర్వహించుకొనేందుకు ***సంస్కారవికాస్ సమన్వయ కర్తలు*** కృషి చేస్తారు.

సంస్కారవికాస్ కార్యక్రమాలు ఎలా నిర్వహించాలో జోనల్ స్థాయిలో శిక్షణ తరగతులు నిర్వహిస్తారు. మన హృదయ పరివర్తన కోసం శ్రీ స్వామివారే సాధన సామగ్రి అందిస్తారు. మనకి శరీర శుభ్రత తెలుసు, వస్త్ర శుభ్రత, గృహ శుభ్రత తెలుసు. హృదయ శుభ్రత గురించి మాత్రం నిర్లక్ష్యం చేస్తాము. రాబోయే రామానుజ సహస్రాబ్ది లోపల మన రామానుజులు, ఆచార్యులు తృప్తిపడే శిష్యులుగా తయారుకావడానికి సత్సంగాలను వీలయినంత ఎక్కువ మందితో ప్రతీ ప్రాంతాలలో నిర్వహించే బాధ్యతను ***సంస్కార వికాస్*** చేపట్టింది.

ఆత్మ సౌందర్యాన్ని పెంచుకొనే సంస్కారాలు అందరిలో కలిగేలా కృషిచేద్దాం అని శోధన - సాధన కార్యక్రమం స్వామి వారి పర్య వేక్షణలో అహోబిల రామానుజ జీయర్ స్వామి, దేవనాథ జీయరు స్వామి నిర్వహించారు.

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామి వారు** కార్యకర్తలందరికి మంగళాశాసనములు చేస్తూ ప్రారంభించిన ప్రవచనంలో ప్రతిమాట కార్యకర్తలకు మలయమారుతంలా, సంపెంగల సుగంధంలా, మధుర పదార్థంలా అందరి మనస్సులకి ఆహ్లాదాన్ని కల్గించింది. ఆచార్యులు అంటే ఆచరించి చూపించేవారు. ***మనిషి మాటతీరు*** ఎలా ఉండాలో వారి మాటలు వింటే అర్థమవుతుంది.

"మీ అందర్నీ చూస్తుంటే ప్రాణం లేచివచ్చినట్లుంది. ఇంతమంది కార్యకర్తలు మీమీ ప్రాంతాలలో ఎంతో చక్కటి కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. మీరంతా ఏదైనా కోరి చేస్తున్నారా? చెయ్యకుండా ఉండలేక చేస్తున్నారు. ప్రేమతో సేవలు చేస్తున్నారు. 1991లో ప్రారంభించి, 1996 కోనసీమ ఉప్పెన నుండి ఈనాటివరకు ఎంతో ఆర్తితో చేస్తూనే ఉన్నారు. కృష్ణం వందే జగద్గురుమ్, గీతా జ్యోతి వంటి ఎన్నో పెద్ద కార్య క్రమాలు ఇచ్చినా ఆనందంతో చేసారు. ప్రధానంగా సమాజంలో ఏది అవసరమో ఆ సేవను మనం చెయ్యాలి. ఉదాహరణకు నేత్ర విద్యాలయ అంధుల పాఠశాలను ప్రారంభించి వారి పరీక్ష వారే వ్రాసుకునేలా కృషి చేసాం. ముందు వ్యతిరేకించిన ఇంటర్ మీడియట్ బోర్డ్ తరువాత మనకి పరీక్షలకు పర్మిషన్ ఇచ్చింది. దానిని చూసి, ఉస్మానియా యూనివర్సిటీ కూడా బి.ఎ., బి.కామ్, లాప్‌టాప్‌తో వ్రాయడానికి ఒప్పుకుంది. ఈ రోజు నేత్ర విద్యాలయ విద్యార్థులు జాతీయ స్థాయిలో బంగారు పతకాలు సాధించడం మాకు చాలా ఆనందంగా ఉంది.

మహిళలకు కేన్సర్ వ్యాధి రాకుండా అవగాహన కల్గించాలని ప్రారంభించాం. కాల్పోస్కోప్ ద్వారా పరీక్షలు నిర్వహించి అవసరమైన వారికి వైద్య సేవలు అందించాలని ప్రారంభించాం. గత నాలుగు సంవత్సరాలలో ఒక లక్ష యాభైవేల మందికి అవగాహన కల్గిస్తూ పరీక్షలు నిర్వహించారు. ఏడువేల మందికి ఆపరేషన్లు జరిగాయి. మన సంస్థ అంతమంది మహిళలకు ఆరోగ్యాన్ని అందించగలగడం మాకు చాలా ఆనందాన్ని కల్గిస్తోంది. మహిళా ఆరోగ్యవికాస్ ద్వారా అందరికి అవగాహన కల్గిస్తున్న కన్వీనర్ శ్రీమతి మాధవి, శ్రీమాన్ రవీంద్ర దంపతులకి, మెడికల్ క్యాంప్ సమాచారాన్ని వెంటనే ఇ-మైల్స్ ద్వారా అందిస్తున్న వారి కుమారుడు చి॥సాయి కృష్ణ సాత్విక్‌కు, మిగిలిన జిల్లాల్లో మహిళా ఆరోగ్యవికాస్ కార్యకర్తలకు మంగళాశాసనం చేస్తున్నాం. ఇంతవరకు ఎందరో పెద్దలు వికాసతరంగిణి కార్యక్రమాలు నిర్వహించారు. ఇప్పుడు ఎందరో నిర్వహిస్తున్నారు. ఈనాటి కార్యకర్తలలో పెద్దవారితో పాటు యువత కూడా ముందుకు వస్తోంది. మనిషి ఆచరణలో ***మార్పు*** చిన్నప్పటి నుండి రావాలి. వారు చక్కటి పౌరులు కావాలి అంటే ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహించి పిల్లలకి మంచి విషయాలు నేర్పించాలి. అమెరికాలో తల్లిదండ్రులే ప్రజ్ఞ టీచర్లు. ఎన్నో వేల మంది పిల్లలు ఇతర దేశాలలో ప్రజ్ఞ కార్యక్రమాల ద్వారా చక్కటి విషయాలు నేర్చుకుంటున్నారు. మనదేశంలో కూడా ఇంకా ప్రజ్ఞ బాగా జరగాలి. లోకంలో అందరూ మంచివారే కాని వారిలో మంచిని ఆచరణ పర్యంతం చేయాలంటే శిక్షణ అవసరం. సమాజంలో అందరితో మాట్లాడి మంచి పనులు చేయించటమెట్లాగో తెలియాలి అంటూ రామాయణంలో చక్కటి ఉదాహరణతో సవివరంగా అందించారు.

మనము ఉన్న స్థితి నుండి ఉన్నత స్థితికి ఎదగాలి. ధనం ఉంటేనే అన్ని పనులు చెయ్యగలం అనేది ఏమీలేదు. దీక్ష, దక్షత - చేస్తున్న పనిమీద పరిపూర్ణమైన విశ్వాసం ఉంటే దానికి తగిన వనరులు తప్పక తోడు అవుతాయి. అన్ని ఉత్తమ కార్యాలు సాధించగలం అని శ్రీ స్వామివారు సభ్యులకి చక్కటి సందేశ మిచ్చారు.

అధ్యక్షులు శ్రీమాన్ రమేష్ గుప్తాగారు, భవానీ ప్రసాద్‌గారు కార్యక్రమాలు చక్కగా రూపొందించారు. అందరికీ మాట్లాడే అవకాశం కల్పించారు.

***14వ తేదీ*** ఉదయం గం. 7-30ని.లకు తీర్థగోష్ఠి ప్రారంభించారు. కార్యకర్తలు, ఆదివారం సెలవు దినం కావడంతో భక్తులు అధిక సంఖ్యలో పాల్గొన్నారు. వేలాది మందికి తీర్థాన్ని అనుగ్రహించి ఆలయానికి వేంచేసి మంగళాశాసనం చేసి సరిగ్గా 9 గంటలకు సభను ప్రారంభించారు.

శ్రీమాన్ రమేష్ గుప్తాగారు తన చక్కటి మాటలతో సభ్యులలో ఉత్సాహాన్ని నింపారు. శ్రీ స్వామివారి విషయంలో వారి ఆర్తి మాటలలో వ్యక్తం చేస్తున్నప్పుడు సభ అంతా కరతాళధ్వనులతో మారుమ్రోగింది.

శ్రీశ్రీశ్రీ స్వామివారు దేశ విదేశాల వారిని ఆన్‌లైన్ ద్వారా ఒకచోట కలిపారు. అమెరికాలో వివిధ ప్రాంతాల వారితో మాట్లాడించి సభ్యులకి ఉత్సాహం కల్గించారు. వికి సేవ, జెట్ సభ్యులు శ్రీమాన్ కృష్ణకాంత్, శ్రీమాన్ కిరణ్ వంగల, శ్రీమాన్ రఘు, మురళి, జెట్ యుఎస్ఎ అధ్యక్షులు అపర్ణ, అందరికీ మార్గ నిర్దేశం చేసే వైశారది గారు (శారద) తమ అనుభవాలను కార్యకర్తలతో పంచుకున్నారు. వారంతా మాట్లాడుతూ, "శ్రీశ్రీశ్రీ స్వామివారి పరిపూర్ణ మంగళాశాసనములతో సుమారు 50 పట్టణాలలో వికి సేవ కార్యక్రమాలు జరుగుతున్నాయి. మేము భారత్ వచ్చినప్పుడు అల్లంపల్లి, నేత్రవిద్యాలయం ఆరోగ్య వికాస్ సేవలు ఇవన్నీ చూసి వాటికి సేవలందించాలని అనుకున్నాం. ఇక్కడ ప్రజ్ఞ విద్యార్థులు, వికి సేవ కార్యకర్తలు అక్కడ మన సంస్థలకు సేవలందించడానికి ప్రతి సంవత్సరం వసంతం, తరంగిణి, రాగ, ఉత్సవ్ స్ప్రింగ్ - మొదలైన కార్యక్రమాలు, వాకతాన్, మొదలైనవి నిర్వహిస్తూ ఉంటాము. సేవ, సంప్రదాయం ఒకదానికొకటి తోడు చేసుకొని కార్యక్రమాలు

చెయ్యాలని మా అందరి కోరిక. వికాసతరంగిణి-విటి సేవా సమాజానికి చేస్తున్న సేవలకి ప్రపంచంలో ఎంత పేరు ఉందో తెలియదానికి ఒకటే ఉదాహరణ. ప్రపంచ వ్యాప్తంగా సేవా సంస్థలకు చేజ్ కమ్యునిటీ నిర్వహించిన పోటీలలో అందరూ ఓట్ చేసి మనకు 3వ స్థానం కల్పించారు. వికాసతరంగిణి అందరి సేవలతో మరింత ఎదగాలి'' అంటూ భారత్‌లో ఉన్న సభ్యులతో మాట్లాడినందుకు అందరూ ఆనందాన్ని వ్యక్తం చేసారు.

తరువాత స్వామివారు 2015 జూలై నెలలో జరిగే గోదావరి పుష్కరాలు మనం భద్రాచలం, మంచిర్యాల, రాజ మండ్రి మూడు ప్రాంతాలలో జరుపుకుంటామని తెలియ జేసారు.

వికాసతరంగిణి లో సభ్యులైన కార్యకర్తలకు వికాస తరంగిణి గుర్తింపు కార్డు వున్నవారికి జిల్లా అధ్యక్షులు, కార్యదర్శులు అనుమతి పత్రంతో కేంద్ర కమిటి అంగీకార పత్రంతో మన ఆశ్రమాలలో (తిరుపతి, శ్రీరంగం, మేల్కొట, బదరి మొదలైన ప్రాంతాలలో) వసతి ఏర్పాటు కల్గిస్తారు. ఆశ్రమాలలో వికాసతరంగిణి కూడా బాధ్యత వహిస్తూ వుండుట వలన మనము చక్కటి సేవలందిచవచ్చు.

ప్రతి వికాసతరంగిణి ప్రజ్ఞ - యువవికాస్ - ఆరోగ్య వికాస్ - సంస్కారవికాస్ ఈ నాలుగు విభాగాలను నిర్వహిస్తూ రామానుజ సహస్రాబ్దికి సుశిక్షుతులైన కార్యకర్తలను తయారు చేయాలని మంగళాశాసనం చేసారు.

లండన్ విటిసేవా నుండి ప్రొఫెసర్ పి.బి. ఆనంద్‌గారు వారి ప్రాంతంలో జరిగే సేవా కార్యక్రమాలగూర్చి తెలియజేసారు. విటి సెంట్రల్ కమిటి సభ్యులు జీవా కమిటీ సభ్యులు చక్కటి సేవలందించారు.

వికాసతరంగిణి గత అధ్యక్షులు నేటి గౌరవ సలహాదారు శ్రీమాన్ మహేందర్ రెడ్డి, ఉపాధ్యక్షులు శ్రీమాన్ లక్ష్మీనరసింహా రావు, జీవా ఉపాధ్యక్షులు శ్రీమాన్ విష్ణురెడ్డి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. వికాసతరంగిణి పుస్తకంలో అందించిన శాంతి మంత్రం అర్థంతో ప్రార్థనతో సభ ముగిసింది.

సభ్యులకు చక్కటి తదీయారాధన, వసతి కల్పించడమే కాకుండా సభ్యులందరికీ బస్ సౌకర్యం, రాత్రి ప్రయాణమయ్యే వారికి ప్రసాదం ప్యాక్ చేసి మరీ అందజేసారు. జీవా ప్రాంగ ణంలో సేవలందించిన అందరికీ వికాసతరంగిణి సభ్యులు కృతజ్ఞతలు తెలియజేసారు.

**అమీర్‌పేట - రంగారెడ్డి జిల్లా :** వికాసతరంగిణి కార్యకర్తలు - శ్రీ గీతభక్త సమాజం సంయుక్తంగా అమీర్ పెటలో శ్రీకృష్ణ జన్మాష్టమి వేడుకలు నిర్వహించారు. ఈ కార్యక్రమంలో గోపిక-కృష్ణ వేషధారణలో ఉన్న బాలబాలికలతో తిరువీధి ఉత్సవం నిర్వహించారు. అనంతరం ఉట్ల ఉత్సవం



జరిగింది. రామ్‌నగర్ - శంషాబాద్ నుంచి వచ్చిన శాంతారామ్‌గారు భగవద్గీత, భాగవతంలో కృష్ణలీలలపై ప్రవచించారు. సూర్యోదయ పబ్లిక్ స్కూల్ విద్యార్థులు చక్కటి సాంస్కృతిక కార్యక్రమాలు ప్రదర్శించారు. వేష ధారణలో గెలుపొందిన వారికి బహుమతులు అందజేసారు. వికాసతరంగిణి సభ్యులు బి.శంకరయ్య, ఎ. రమేష్, ఆర్ వెంకటేశ్వరరావు మొదలైన కార్యకర్తలు కార్యక్రమాన్ని నిర్వహించారు.

**కె.పి.హెచ్.బి. కోలనీ - హైదరాబాద్ :** వికాసతరంగిణి కార్యకర్తలు ఉ చిత కంటి పంటి పరీక్షలు 07-09-2014న నిర్వహించారు.ప్రముఖ దంత




వైద్యులు డా. పవన్‌కుమార్ మరియు డా. రమేష్ బాబు మరియు వారి సిబ్బంది బాలానగర్ నుండి వచ్చి వైద్య సహాయమం దించారు. లయన్స్ ఐ హాస్పిటల్ డాక్టర్ కిషన్ కుమార్ గారు కంటి వైద్య శిబిరానికి సేవలందించారు. కె.పి.హెచ్.బి. కోలనీ ప్రభుత్వ పాఠశాలలో 117 మంది విద్యార్థులకు, కోలనీ చుట్టు ప్రక్కలవారైన 95 మంది వృద్ధులకు ఈ సేవలు అందించారు. అందులో 16 మందికి కేటరేక్ట్ ఆపరేషన్‌లు, 5 గురికి గ్లకోమా ఆపరేషన్స్ మరియు కొంతమందికి కళ్ళద్దములు డాక్టర్లు సూచించారు. బాలానగర్ హాస్పిటల్‌లో ఉచిత ఆపరేషన్లు నిర్వహిస్తామని డాక్టర్లు సూచించారు. వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమతి వి. శశికుమారి, తులసి, సుబ్బలక్ష్మి, మాండవి, శ్రీమాన్ సత్యనారాయణ మూర్తిగారు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీనివాస్ రెడ్డిగారు సహకారమందించారు.

**మియాపూర్ - జంటనగరాలు :** శ్రీమతి బాలలింగరాజు మరియు ఇతర వికాస తరంగిణి సభ్యులు ఆచార్యత్రయమ్ నృత్య రూపకాన్ని ఏర్పాటు



చేసారు. జె.పి.ఎన్. నగర్ వెల్ఫేర్ అసోసియేషన్ వారు ఈ కార్యక్రమ నిర్వహణకు సహకరించారు. జంట నగరాల కార్యదర్శి శ్రీమతి వనజ చలపతిరావు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. 200 మంది ఈ కార్యక్రమంలో పాల్గొని ఆచార్య వైభవాన్ని తెలుసుకున్నారు.

**మంచిర్యాల - ఆదిలాబాద్ :** నాసాపూర్‌శాఖలో మంచిర్యాల వికాసతరంగిణి సభ్యులు ఒక సమావేశం ఏర్పాటు చేసారు. వికాసతరంగిణి కార్యక్రమ నిర్వహణ గూర్చి నూతన కార్యరక్తలకు తెలియజేసారు. వికాసతరంగిణి కార్యవర్గ సభ్యులైన శ్రీమాన్ రాజేశ్వరరావు, శ్యామ సుందరం,



హనుమంతరావు, ప్రభాకరరాజు, ఉమ, విజయలక్ష్మి మొదలైనవారు కార్యక్రమాన్ని నిర్వహించారు.

**భద్రాచలం :** భద్రాచలం వికాసతరంగిణి కార్యకర్తలు 10-07- 2014 నుండి జీయర్ మఠంలో కూచిపూడి నాట్యంలో శిక్షణ కార్యక్రమాన్ని శ్రీ



కొండలరావు ఆధ్వర్యంలో నిర్వహించారు. 12వ తేదీన గోవిందరాజస్వామి వారి ఆలయంలో 50 మంది కార్యకర్తలు పులిహోర ప్రసాదం అందించారు. వరలక్ష్మీ వ్రతం సందర్భంగా వికాసతరంగిణి అధ్యక్షురాలు శ్రీమతి పి.కమల రాజశేఖర్, సభ్యులందరితో కలసి సీతారామచంద్రస్వామి ఆలయానికి రూ.6000/- సమర్పించారు. 12-08-2014న కొత్తకోలనీ ప్రభుత్వ హోమియో వైద్యశాఖ, వికాసతరంగిణి కలసి ఉచిత వైద్య శిబిరం నిర్వహించారు. జిల్లాలో ఉన్న హోమియోపతి సీనియర్ డాక్టర్లు ఆరుగురు పాల్గొన్నారు. 650 మంది ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. వికాసతరంగిణి కార్యకర్తలు అవసరమైన వారందరికి మందులు అందజేసారు. 21వ తేదీ జీయర్ మఠంలో ఉచిత కుట్టు మిషన్ శిక్షణ శిబిరం శ్రీ తిప్పన సిద్దులు గారు ప్రారంభించారు. 20 మంది మహిళలకు శిక్షణనిస్తూ చేతి పనుల ద్వారా ఉపాధి లభించే ఏర్పాటు చేస్తున్నారు.

వినాయకచవితి సందర్భంగా పర్యావరణ పరిరక్షణలో భాగంగా మట్టి గణపతి విగ్రహాలను 200 పైగా అందజేసారు. భద్రాచల వికాసతరంగిణి శ్రీ సీతారామచంద్ర దేవస్థాన సేవలలో నిత్యము పాల్గొంటున్నారు.

**జగ్గయ్యపేట :** శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో జగ్గయ్యపేట వికాసతరంగిణి సభ్యులు ప్రతివారం సత్సంగ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. శ్రావణమాసం నాలుగు వారాలు శుక్రవారం మహిళలకు కుంకుమ పూజ కార్యక్రమాన్ని శ్రీరంగనాయక స్వామి ఆలయంలో నిర్వహించారు.



**కోదాడ:** వికాసతరంగిణి సామూహిక వరలక్ష్మీ వ్రత కార్యక్రమాన్ని 08-08-2014 ఎం.కాశీనాధమ్ ఫంక్షన్ హాలులో నిర్వహిం చారు. శ్రీమాన్వి రవికుమారాచార్యులు గారు పూజా కార్యక్రమాన్ని నిర్వహించారు. రామానుజ సహస్రాబ్ది వైభవాన్ని గూర్చి వివరించారు. ఈ కార్యక్రమంలో 300 మంది పాల్గొన్నారు. అధ్యక్షులు చంద్రయ్యగారు, కార్యదర్శి ఎం. కోటేశ్వరరావు, కోశాధికారి ఇమ్మిడి సూర్యప్రకాష్‌గారు మిలిగిన సభ్యులు, కార్యకర్తలు వైభవంగా కార్యక్రమం నిర్వహించారు.

**సూర్యపేట:** ఆత్మకూరు గ్రామంలో ప్రభుత్వ ఉన్నత పాఠశాల మరియు ప్రాధమిక పాఠశాలలో ఉచిత దంతవైద్య పరీక్షలు 200 మందికి నిర్వహించడమైనది. ఇందులో 78 మందికి తదుపరి దంత వైద్యం చేయించుట జరిగింది. వేణుగోపాలా చార్యులు, సత్యనారాయణ మరియు ప్రధానోపాధ్యాయి ఈ కార్యక్రమం నిర్వహించారు. వేంకటేశ్వరస్వామి ఆలయంలో లక్షకుంకుమార్చన సూర్యపేట వికాసతరంగిణి సభ్యులు నిర్వహించారు.

**రాజమండ్రి :** 07-09-2014 ఆదివారం నుండి ప్రజ్ఞ తరగతులు రాజమండ్రిలో ప్రారంభమయ్యాయి. శ్రీమతి పద్మావతి రామానుజంగారు ప్రతి



ఆదివారం ఎపెక్స్ ఇంగ్లీషు మీడియం స్కూల్ ఇన్నీస్‌పేటలో ప్రజ్ఞ తరగతులు నిర్వహిస్తున్నారు. పద్మగారు విద్యార్థులకు శ్రీ విష్ణుసహస్రనామాల్ని నేర్పిస్తున్నారు. పర్యావరణ పరిరక్షణకై వినాయకచవితి రోజు ప్రజ్ఞా విద్యార్థులకు మట్టి విగ్రహాలు అందజేసారు. విద్యార్థులు తయారు చేసిన మట్టి విగ్రహాలను

శోభాయాత్రగా వీధులలో తీసుకుని వెళ్తూ అందిరకీ అందిస్తూ అవగాహన కల్గించారు.




**బొబ్బిలి – విజయనగరం జిల్లా :** బొబ్బిలి వికాసతరంగిణి ప్రతివారం సత్సంగ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. శ్రీశ్రీశ్రీ స్వామివారనుగ్రహించిన లక్ష్మీ నారాయణ వ్రతాలు 130 ప్రాంతాలలో ప్రతి ఏకాదశికి నిర్వహిస్తున్నారు. నేత్ర విద్యాలయంకు భక్తులంతా కలసి ప్రతి నెల ఆర్థిక సహకారమందిస్తున్నారు.

**రాజాం – శ్రీకాకుళం :** రాజాం వికాసతరంగిణి కార్యకర్తలు ప్రజ్ఞ కార్య క్రమాల్లో భాగంగా రాజాం ప్రభుత్వ సాంఘిక సంక్షేమ వసతి గృహంలో ఉన్న విద్యార్థులలో వికాసం కలిగించడానికి విద్యా ర్థులకు తెలుగు, ఇంగ్లీషు, లెక్కలు, హిందీ పాఠ్యాంశాలను ఉచితంగా బోధించుటకు బాధ్యతను స్వీకరించారు. ప్రతీ రోజు ఉదయం 5 గంటల నుండి 6 గంటల వరకు యోగాలో శిక్షణ నిస్తూ, సాయంత్రం పాఠ్యాంశములు బోధిస్తున్నారు. విద్యార్థులకు కాపీరైటుంగు పుస్తకములు, బెల్ట్, టై, బూట్లు, గ్రంథాలయ పుస్తకములు, బాత్ రూములు శుభ్రపరచుటకు ఫినాయిల్, హార్పిక్ మొదలైనవి ఉచితంగా అందజేస్తున్నారు. కొత్తా భాగ్యలక్ష్మి కుమారులు కొత్తా రమేష్ కుమార్, కొత్తా మధు, గంట్రేటి ప్రకాష్, అరుణ్‌కుమార్, టి.టి.వి. రమణమూర్తి, రౌతు రామినాయుడు, జి. గురునాథ్ స్వామి మొదలైనవారు పాల్గొన్నారు. సాంఘిక సంక్షేమ వసతి గృహాన్ని ఈ సంవత్సరమంతా అభివృద్ధి చేయుటకు వీరు కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.



*పర్యావరణ పరిరక్షణ :*

అన్ని జీవులకు సంతోషంగా స్వేచ్ఛగా జీవించే హక్కుంది. ఒక జాతి సంతోషము మరోజాతికి దుఃఖం కలిగించ కూడదు. ఒకజాతి స్వేచ్ఛా జీవితం మరో జాతికి బంధం కాకూడదు. అన్ని జీవుల్లో భగవంతుడున్నాడు. ఆ జీవుల సంతోషాన్ని స్వేచ్ఛను కాపాడడమే "మాధవ సేవగా సర్వప్రాణి సేవ" ఇది ప్రకృతి సమతుల్యతను కాపాడే అద్భుతమైన జీవన సూత్రం. ఇది వికాసతరంగిణి ప్రధాన లక్ష్యం. చిన్న జీయరు స్వామి వారందించిన ఈ లక్ష్యం దిశగా సేవలందించడం వికాస తరంగిణి కార్యకర్తలకొక వరం. జాతి ఐకమత్యానికి, విలువలు కొనసాగించడానికి, ప్రకృతిని కాపాడుకోవడానికి గౌరవించడా నికి నిర్వహించేవే పండగలు. కాని నేడు పండుగలు జరుపుకునే తీరు ఎక్కిన కొమ్మను నరుక్కునే విధంగా ఉంది. భవిష్యత్తును కాలుష్య కోరలకు బలిచేస్తుంది. నీరు, భూమి కాలుష్యమవు తున్నాయి. అనేక జలచరాలు కలుషితమైన నీరు త్రాగి మరణిస్తున్నాయి. వినాయకచవితి నాడు ప్లాస్ట్ ఆఫ్ పారిస్‌తో చేసిన వినాయక విగ్రహాలు పూజించి, నీటిలో నిమజ్జనం చేయటం వలన నీరు కలుషితమవుతోంది. ఎన్నో జలచరాలకి ప్రాణ హాని కలుగుతోంది. ఈ ప్రాణహాని అరికట్టాలి అని రాజాం వికాసతరంగిణి 2000 మందికి ఉచితంగా మట్టి విగ్రహాలను పెంచిపెట్టింది. హరిజన వీధి,యాతపేట, మల్లయ్య పేట, డోలవేట మొదలైన అనేక ప్రాంతాలో కరపత్రాల ద్వారా అవగాహన కల్గిస్తూ మట్టి విగ్రహాలను కార్యకర్తలు అందించారు. బుద్ధాం, రాజాం మొదలైన గ్రామాలలో కూడా మట్టి విగ్రహాలు పంచిపెట్టారు. 5 మండలాల్లో విద్యార్థులకు మట్టి విగ్రహముల ప్రాముఖ్యాన్ని తెలియజేసి గ్రామాల్లో అందరికీ అవగాహన కల్గించారు. రాజాం పరిసర ప్రాంతాలలో నిరాడంబరంగా భక్తితో – పవిత్ర భావనతో నవరాత్రులు నిర్వహించిన వారికి బహుమతులు అందజేసారు. ఈ కార్యక్రమాలకై విశేష స్పందన లభించింది. ప్రథమ బహుమతి పొనుగుటివలస గ్రామానికి, ద్వితీయ – దొంకలమిల్లు సెంటర్, తృతీయ బహుమతి – చిన్న చెరువుగట్టు ప్రాంతానికి అందజేసారు. ఈ బృహత్తర కార్యక్రమాన్ని చూసి వికాసతరంగిణి సేవలకు స్పందించిన వికలాంగురాలైనా కూలి పని చేసుకుంటున్న చి. గుత్తి అలివేణి 25 విగ్రహాలను ఉచితంగా పంపిణీ చేయడానికి ఆర్థిక సహాయం అందించింది. వికాసతరంగిణి కార్యకర్తలు ఆమెను ఘనంగా సత్కరించారు. వికాసతరంగిణి సేవలకు పట్టణంలో విశేష ఆదరణ లభించింది.

## కార్యకర్తలకు సూచన

**మీ వికాసతరంగిణి శాఖ ద్వారా చేసే ఆధ్యాత్మిక, సామాజిక, సేవా కార్యక్రమాలను అందరితో పంచు కోవాలనుకుంటున్నారా! కార్యక్రమ వివరాలను సంక్షిప్తంగా వ్రాసి, కార్యక్రమ ఫోటోలను జతపరచి ప్రతి నెల 10వతేదీలోపుగా news@vtsbharath.org కి మెయిల్ చేయండి. Cell No. 9440106555**

# మహిళా ఆరోగ్యవికాస్

శ్రీమతి మాధవీరవీంద్ర- విజయవాడ



20.7.14న శ్రీమతి రుక్మిణిగారి నిర్వహణలో కృష్ణాజిల్లా, కోసూరులో ఉచిత మహిళావైద్య శిబిరాన్ని ఏర్పాటుచేశారు. ఈశిబిరానికి 85మంది మహిళలు హాజరవగా 52మందికి V.I.A పరీక్షలు నిర్వహించారు. తదుపరి పరీక్షలు చేయవలసిన ముగ్గురుకి N.R.I హాస్పటల్‌లోని జీయర్‌ట్రస్ట్‌ద్వారా చికిత్స చేయించడటమైనది. విజయవాడలోని ప్రముఖ కార్డియాలజిస్ట్ డా॥రమేష్ గారి సహకారంతో ఏర్పాటు చేసిన శిబిరానికి డా॥శ్రీలత గారు మరియు ఉషగారు సేవలు అందించారు. 14మంది ఆరోగ్యవికాస్ కార్యకర్తలు పాల్గొన్నారు.

17.8.14న హైదరాబాద్‌లోని మియాపూర్‌నందు జె.పి.నగర్ కాలనీలో ఆరోగ్యవికాస్ రాష్ట్ర కో–ఆర్డినేటర్ శ్రీమతి మాధవీరవీంద్ర గారి నేతృత్వంలో శ్రీమతి బాలాలింగరాజుగారు ఏర్పాటుచేసిన ఉచిత మహిళావైద్యశిబిరానికి 120మంది హాజరుకాగా 85మంది V.I.A పరీక్ష నిర్వహించారు. వీరిలో 14మందికి తదుపరి పరీక్షలు నిర్వహించగా మూడునెలలకోర్సు వాడి మరల రావలసిందిగా డాక్టర్లు సూచించారు. అరుణ అనే మహిళకు వెంటనే ఆపరేషన్ చేయవలసిన ఆవశ్యకత ఉందని తెలియచేశారు. ఈశిబిరానికి జె.పి.నగర్ కమిటీవారు అవసరమైన ఏర్పాట్లు చేశారు. ఈశిబిరానికి జంటనగరాల వికాసతరంగిణి కార్యదర్శి శ్రీమతి వనజాచలపతిరావు గారు, ఆరోగ్యవికాస్ సమన్వయకర్త సునీతగారు, పద్మశ్రీగారు, ఆండాళ్‌గారు, శ్రీనివాస్‌గారు మరియు ఆరోగ్యవికాస్, వికాసతరంగిణి కార్యకర్తలు తమపూర్తి సహకారాన్ని అందించారు.

21.8.14న భద్రాచలం జీయర్‌మఠంలో శ్రీమాన్ భట్టర్‌గారు ఏర్పటుచేసిన ఉచిత మహిళా వైద్యశిబిరానికి శ్రీమతి మాధవీరవీంద్రగారి నేతృత్వంలో 85మంది హాజరుకాగా 59మందికి V.I.A పరీక్ష నిర్వహించటమైనది. ఈశిబిరానికి నగరంలోని ప్రముఖ సీనియర్ గైనకాలజిస్ట్ డా॥జయభారతిగారు మరియు డా॥లాస్య గారు తమ సహకారాన్ని అందించారు. ముందుగా ఏర్పాటుచేసిన అవగాహనాసదస్సులో డా॥జయభారతిగారు మాట్లాడుతూ శ్రీస్వామివారు చేసే కార్యక్రమాలను కొనియాడుతూ, క్యాన్సర్ మహిళలలో ఎంత వేగంగా వ్యాప్తిచెందుతుందో హెచ్చరిస్తూ, తీసుకోవలసిన జాగ్రత్తలను వివరించారు.



ఈశిబిరాలను ఏర్పాటుచేయటం ద్వారా ఒక మంచిమార్గాన్ని ఏర్పరచారు. వాటిని అందరూ ఉపయోగించుకునే విధంగా సూచన చేశారు. అంతే కాకుండా తదుపరి పరీక్షలు అవసరమైనవారికి ఉచితంగా నిర్వహిస్తామని హామీ ఇచ్చారు. ఈశిబిరంయొక్క బాధ్యతను భద్రాచలం కో–ఆర్డినేటర్ శ్రీమాన్ వెంకటాచారిగారు, వి.టి ప్రెసిడెంట్ శ్రీమతి కమలరాజశేఖర్‌గారు మరియు వి.టి. కార్యకర్తలు చక్కగా నిర్వర్తించారు. విజయవాడ చైతన్య ఆరోగ్యవికాస్ సభ్యులైన రత్నమాలగారు, శ్రీమతి జయలక్ష్మిగారు, ఆదిలక్ష్మికారు తమ సహకారాన్ని అందించారు.

24.8.2014న విజయవాడలోని ముత్యాలంపాడు, గవర్నమెంట్ స్కూలు నందు, కృష్ణాజిల్లా ఆరోగ్యవికాస్ సమన్వయకర్త శ్రీమతి రుక్మిణిగారు ఏర్పాటుచేసిన ఉచిత మహిళావైద్యశిబిరానికి 69మంది మహిళలు హాజరవగా వారిలో 53మందికి V.I.A పరీక్ష నిర్వహించటమైనది. తదుపరి పరీక్షలు చేయవలసిన వారికి N.R.I హాస్పటల్ ద్వారా పరీక్షలు నిర్వహింపచేయటమైనది. ఈశిబిరానికి డా॥శ్రీలత గారు, ఉషగారు తమ సహకారాన్ని అందించారు. శ్రీమాన్ కీ॥శే॥ కె.నరసరాజుగారి జ్ఞాపకార్థం వారి కుమార్తె శ్రీమతి వెంకటరావమ్మగారు ఈశిబిరానికి కావలసిన మందులను ఉచితంగా అందించారు.

24.8.14 కృష్ణాజిల్లా గంపలగూడెం వికాసతరంగిణి వారు ఏర్పాటు చేసిన ఉచిత మహిళావైద్యశిబిరానికి 99మంది మహిళలు హాజరుకాగా వారిలో 59మందికి V.I.A పరీక్ష నిర్వహించటమైనది. తదుపరి పరీక్షలు అవసరమైన ఆరుగురికి శ్రీమాన్ డా॥రామకోటేశ్వర రావు గారు పరీక్షలు నిర్వహించారు. ఈశిబిరానికి శ్రీమాన్ కోటేశ్వరరావుగారు మరియు వికాసతరంగిణి కార్యకర్తలు, విజయవాడ చైతన్య ఆరోగ్యవికాస్ కార్యకర్తలు రత్నమాలగారు, శ్రీమతి జయలక్ష్మి, ఆదిలక్ష్మి, వేంకటరమణ, సత్యవతి, చంద్రకళ గార్లు తమ సహకారాన్ని అందించారు. రాష్ట్ర కో–ఆర్డినేటర్ శ్రీమతి మాధవీ రవీంద్రగారి ఆధ్వర్యములో ఈశిబిరము నిర్వహింపచేయడం జరిగింది.

26.8.14న విజయనగరంజిల్లా దాసన్నపేటలో జిల్లా ఆరోగ్యవికాస్ సమన్వయకర్త శ్రీమతి శకుంతలానాయుడుగారు ఏర్పాటు చేసిన ఉచిత మహిళా వైద్యశిబిరానికి 90మంది మహిళలు హాజరుకాగా 55మందికి V.I.A పరీక్ష నిర్వహించారు. డా॥సుధాకుమారి గారు ఈశిబిరానికి తమ సహకారాన్ని అందించారు. తదుపరి పరీక్షలు చేయవలసిన వారికి పాప్‌స్మియర్ చేయించటమైనది. ఈశిబిరానికి చెరుకూరి శ్రీధర్ గారు తమ సహకారాన్ని అందించారు.

03.8.2014న కృష్ణాజిల్లా, గంపలగూడెం మండలం, ఊటుకూరు గ్రామంలో పత్రికా విలేఖరుల ప్రోద్భలంతో ఏర్పాటుచేసిన మహిళా ఆరోగ్య సదస్సుకు అనుగుణంగా 31.8.14 వ తేదీన శ్రీమతి మాధవీరవీంద్రగారి నిర్వహణలో ఏర్పాటు చేసిన మహిళావైద్యశిబిరానికి విశేషస్పందన లభించింది. ఈశిబిరంలో 132మంది మహిళలు పాల్గొనగా 108మందికి V.I.A పరీక్షలు నిర్వహించటమైనది. 13మందికి తదుపరి పరీక్షలు నిర్వహించవలసి ఉంది.

ఆరోగ్యవికాస్ సదస్సుకు స్పందించిన ఊటుకూరు మహిళలు శ్రీమతి రామలక్ష్మిగారి నేతృత్వంలో వారికి వారే స్వయంగా మందులకు అయ్యేఖర్చుని సమకూర్చుకుని శిబిరాన్ని ఏర్పాటు చేసుకోవడం హర్షించదగిన విషయం. శ్రీమతి రామలక్ష్మిగారు మహిళలను ప్రోత్సహించడమేకాక, వికాసతరంగిణిద్వారా శ్రీస్వామివారు నిర్వహించే కార్యక్రమాలకు స్పందించి వారుకూడా మన సంస్థలో సభ్యులుకావడం, సేవచేయటానికి ముందుకు రావడం మహిళలలోని స్పందనను తెలియచేస్తుంది.

7.9.14వ తేదీన ప్రకాశంజిల్లా మార్కాపురం దగ్గరలోని కాకర్లగ్రామంలో **శ్రీమతి గోళ్ళ వరలక్ష్మి, వాసుదేవరావు**గారు ఏర్పాటు చేసిన ఉచిత మహిళావైద్య



శిబిరానికి 162మంది మహిళలు హాజరుకాగా 88మంది మహిళలు V.I.A పరీక్షలు నిర్వహించటమైనది. 9మంది మహిళలకు తదుపరి పరీక్షలు నిర్వహించవలసి ఉంది. మార్కాపురం యువవికాస్ ప్రెసిడెంట్ రంగనాయకులుగారు మరియు కాకర్ల గ్రామ గవర్నమెంట్‌స్కూల్, హెడ్‌మాస్టర్ (G.H.M) అయిన **సుధాకర్, మహేష్** గార్లు చాలా ఉత్సాహంతో తమ పూర్తిసహకారాన్ని అందించారు. ఈశిబిరానికి అవసరమైన మందులను శ్రీమాన్ **డా॥విష్ణు,వింధ్య** గారు కైంకర్యంగా సమర్పించారు. రాష్ట్ర కో–ఆర్డినేటర్ శ్రీమతి మాధవీరవీంద్రగారి నేతృత్వంలో రత్నమాల, శ్రీమతి జయలక్ష్మి, వేంకటరమణ, సుజాత, అనూరాధ, కమల గార్లు సహకారమందించారు.

10.9.14వ తేదీన కరీంనగర్ వికాసతరంగిణివారు ఏర్పాటు చేసిన ఆరోగ్యవికాస్ శిక్షణ తరగతులకు 44మంది వికాసతరంగిణి మహిళాకార్యకర్తలు హాజరైనారు. ఈతరగతులలో చల్మెడ హాస్పటల్స్ చైర్మన్ శ్రీమాన్ లక్ష్మీనరసింహారావుగారు మాట్లాడుతూ గతంలో కరీంనగర్ కార్యకర్తల సహకారంతో 120 శిబిరాలు నిర్వహించామని, కానీ ప్రజలలో క్యాన్సర్ శిబిరం అనే ఒకరకమైన భయంఉండుట వలన సమాజంలోని మహిళలందరూ



ఈసేవలు వినియోగించుకో లేక పోయారని, కానీ ఇప్పుడు శ్రీస్వామివారి సూచనలమేరకు క్యాన్సర్ అనేపదం ఉపయోగించకుండా "స్త్రీల ఉచిత ఆరోగ్య అవగాహన చికిత్సా శిబిరములకు" మహిళలలో మంచి స్పందన లభించి మహిళలకు ఉన్న ఇన్‌ఫెక్షన్‌ను మొదటిదశలో గుర్తించి, నివారించగలుగుతున్నారని పేర్కొన్నారు.

మన వికాసతరంగిణి మహిళా కార్యకర్తలందరూ ఈవిధంగా శిబిరాలు నిర్వహించాలని వారి హాస్పటల్ నుండి పూర్తసహకారం లభిస్తుందని తెలిపారు. ఈకార్యక్రమంలో శ్రీమాన్ గౌతమ్‌రావుగారు, ఎస్. ప్రభాకర్‌రావుగారు, డా॥కవితగారు, మాధవీరవీంద్రగారు మరియు వికాసతరంగిణి పెద్దలు, కార్యకర్తలు, విజయవాడ చైతన్య ఆరోగ్యవికాస్ సభ్యులైన రత్నమాల, శ్రీమతి జయలక్ష్మి గార్లు పాల్గొన్నారు.

11.9.14వ తేదీన కరీంనగర్ వేదభవన్‌లో ఏర్పాటుచేసిన శిబిరంలో 25మంది వికాసతరంగిణి మహిళా కార్యకర్తలు పాల్గొని సర్వేచేయు విధానాన్ని స్టెరిలైజేషన్ మరియు శిబిరం నిర్వహించు విధానాన్ని ఆరోగ్యవికాస్ రాష్ట్ర కోఆర్డినేటర్ శ్రీమతి మాధవీరవీంద్ర గారి ద్వారా తెలుసుకుని, స్క్రీనింగ్ టెస్ట్ కాల్పోస్కోప్ మిషన్ ద్వారా జరిపించుకోనగా వారిలో ఒక కార్యకర్తకి సర్జరీ అవసరమైనట్లుగా గుర్తింపబడినది.



**మహిళ అనుభవం**

నాపేరు శ్రీనివాస్, పైఫోటోలోని మహిళ ప్రమీల మా అమ్మగారు, వయస్సు 52సం॥లు. మాది ప్రకాశంజిల్లా కోరంకి గ్రామం. 25.2.14 తేదీన మాగ్రామములో శ్రీస్వామివారిద్వారా ఆరోగ్యవికాస్ వారు నిర్వహించే మహిళ శిబిరాన్ని మాగ్రామపెద్దల సహకారంతో శ్రీమతి మాధవిగారు (మార్టూరు జీవనవికాస్) ఏర్పాటు చేశారు. ఆశిబిరంలో మా అమ్మగారైన ప్రమీలగారు ఉచిత పరీక్ష చేయించుకున్నారు. 'కోల్పోస్కోప్' ద్వారా మా అమ్మగార్కి ఉన్న సమస్యను ఈశిబిరంలో చూపించుట ద్వారా మాకు అర్థమైంది. అంతకు ముందు బయట డాక్టరుగారి దగ్గరకు వెళ్ళినపుడు, మా అమ్మగార్కి ఏసమస్యా లేదని చెప్పారు. మాకు స్వామివారి ద్వారా ఏర్పరచిన శిబిరంలో 'కోల్పోస్కోప్'లో చూపించి, ముక్క పరీక్ష 'Boipsy' చేయించుకోమని వివరించడం జరిగింది. తదుపరి వేరే వైద్యుని దగ్గరకు వెళ్ళి, పరీక్షచేయించుకుంటే క్యాన్సర్ స్టేజ్–2... గా నిర్ధారించారు. హైదరాబాద్ బసవతారకం నందు మా అమ్మగారికి కీమోథెరపీ ప్రతి సంవత్సరానికి ఒకసారి చెక్‌చేయించుకోవలసినదిగా సూచించారు.

ఇప్పుడు మా అమ్మగారు చాలా ఆరోగ్యంగా తనపని తాను చేసుకుంటున్నారు. మహిళ ఆరోగ్యశిబిరాలని ఏర్పరచి, మా అమ్మలాంటి ఎందరికో రెండో జీవితాన్ని ప్రసాదిస్తూ, నాలాంటి కొడుకులకు మాతృదానం చేస్తున్న గురుదేవులు చిన్న జీయర్ స్వామివారికి "స్పందించిన హృదయంతో జీవితాంతం వారి స్మరణ తప్ప ఏమీ చెయ్యలేని సామాన్యుడిని"

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన **సెప్టెంబర్ నెల సమాధానాలందాయి.** విజేత పేరు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం! *గతనెల సమాధానాలు 11వ పేజీలో కలవు.*

**ప్రశ్నలు** **సమాధానాలు**

1. సంగంలేకుండా కర్మాచరణ చేయడాన్ని ఏమంటారు?
2. శ్రీధరస్వామి వ్యాఖ్యానంలో దొరికిన భారతకథ ఏది?
3. జీవకోటికి పరమదైవ మెవరని భగవద్రామానుజులు చాటారు?
4. వేదకాంతకు మంగళసూత్రమేది?
5. ఆచార్యాభిమానం లేనివారు ఎటువంటివారు?
6. బంధు శబ్దం దేన్ని ప్రతిపాదిస్తోంది?
7. దోషాలనే గుణాలుగా భావిండం ఏగుణం?
8. ధర్మజ్ఞుడు 'వైరానికి పునాది' అని దేనిని భావించాడు?
9. రామానుజ దివ్యస్వరూపంలో పాదస్థానీయులు ఎవరు?
10. భగవద్రామానుజ స్వభావమేట్టిది?
11. ధర్మసాధనలో మొట్టమొదటిదేది?
12. ముసలితనం ఎలా మీద పడుతుంది?
13. స్వామి ఆరాధనలో ముందుగా పూజలందుకునేదెవరు?
14. తిరుమలలో బ్రహ్మోత్సవాలు ప్రాచీనకాలంలో ఎక్కడ జరిగేవి?
15. తామస పురాణాలలో ఏ ఒక్కటైనా పేర్కొనండి?
16. విజయకాలమని దేనిని అంటారు?
17. తిరువెళ్ళత్తై అనే దివ్యదేశంలోని స్వామిపేరేమి?
18. అఱియర్లు ఎవరి వంశానికి చెందినవారు?
19. అవధూతకు గురువెవరు?
20. జ్ఞాపకశక్తిని నియంత్రించేది ఏది?

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేతల పేర్లు:**
గుడివాడ రాజ్యలక్ష్మి-గుంటూరు.

మీ చిరునామా
..........................................
..........................................
..........................................
..........................................

**సరియైన సమాధానములు వ్రాసినవారు**
జి. నరసింహారావు- వద్దేపల్లి. ఈయుణ్ణి అమృతలక్షిమ - భీమవరం. కె. పూర్ణచంద్రరావు -రాజమహేంద్రి. కే. నారాయణాచార్యులు - ముత్తురాసుపల్లి. కె. రాజ్యలక్ష్మి- కొత్తగూడెం. గుడివాడ రాజ్యలక్ష్మి-గుంటూరు.

*సూచన:* సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.
భక్తినివేదన సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929







# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాసపత్రిక

శ్రీసర్వజిత్ నామ సంవత్సర చైత్రము (ఏప్రిల్, 1947) నుండి ఆధ్యాత్మిక సేవలో...

నవంబర్ 2014

వెల 20/-



డా॥పి. రామానుజన్ స్వామి వారికి జీయర్ పురస్కార ప్రదానం



శ్రీమాన్ కొడిచర్ల పాండురంగాచార్య స్వామివారికి, ఋగ్వేదరత్నం శ్రీమాన్ కోయిల్ కాలమేఘ అయ్యంగార్‌స్వామివార్లకు
విశిష్ట పురస్కార ప్రదానము

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః

68 సం॥ల నుండి భగవద్బంధువులు ఆదరిస్తున్న ...

ప్రారంభం - ఏప్రిల్ 1947

# భక్తినివేదన

## ఆధ్యాత్మిక మాసపత్రిక








సంపుటి 67

నవంబర్ 2014

సంచిక 8


### పంచాంగ వివరములు

నవంబర్:

6. కార్తీక పూర్ణిమ, ధాత్రీనారాయణపూజ, ఆమలకస్నానం
7. విశాఖకార్తి
16. వృశ్చిక సంక్రమణము రా.తె. 4-39
18. సర్వేషామేకాదశి
20. అనూరాధకార్తె, మాసశివరాత్రి
22. అమావాస్య, పిండపితృయజ్ఞము.
28. అవమతిథి, సుబ్రహ్మణ్యషష్ఠి

డిసెంబర్:

2. సర్వేషామేకాదశి, గీతాజయంతి
3. మత్స్య ద్వాదశి, వాసుదేవ ద్వాదశి
4. హనుమద్వ్రతం, శుక్రమౌఢ్య నివృత్తి
5. తిరుమంగైయాళ్వార్ తిరు, నంబిళ్ళైతిరు, శ్రీవైష్ణవ దేవాలయములందు ప్రబంధ నిగమనం, దత్తాత్రేయ జయంతి
6. తిరుప్పాణియాళ్వార్‌తిరు, శ్రీవైష్ణవ గృహాదులయందు ప్రబంధ నిగమనం


శ్రీజయనామ సంవత్సర కార్తీకమాసము

వ్యవస్థాపకులు
పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ
రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు
శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి
శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. రంగరామానుజాచార్యులు

ఉప సంపాదకులు
శ్రీమతి డా॥ T.K. చూడామణి

D.T.P & Design by:
పరిశోధనాలయం - సీతానగరం.
పరిశోధన-ప్రకాశన విభాగం
జీవా - శ్రీరాంనగర్

చందావివరాలు :-
సంవత్సరచందా రూ.225/-
విదేశాలకు సంవత్సరచందా $30/-

విూ సేవలో....
భక్తినివేదన, సీతానగరం - 522 501,
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : **jetsitanagaram@yahoo.com**
Internet : www.chinnajeeyar.org


### విషయసూచికా




*Printed & Published by :* H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**
*Printed & Published at :* **Sriman Printers & processors** : C/o JET, Sitanagaram - 522 501, Guntur Dist., Andhra Pradesh.
*Editor* : Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.

సంపాదకీయం

# మంచి నడువడిని మానవుడు ఇంకా నేర్వలేదు - ఇదంతా 'కలి' ప్రభావమేనా!



ఏ దేశంలోనూ లేని నైతికజీవనవిధానాన్ని ప్రతిబోధించే వాఙ్మయం ఈ భారతభూమిలో ఉంది. చతుర్వేదాలు, రామాయణ మహాభారతాలు, ఇంకా అపారమైన కావ్యనాటకాదిసారస్వతం ఎంతో ఉంది. వేలాది సంవత్సరాలుగా ఈ వాఙ్మయమంతా భారతజాతినే కాదు, ప్రపంచాన్నే ప్రతిబోధిస్తోంది. అయినా, మానవుల ప్రవృత్తిలో కాని, ఆలోచనల్లోకాని ఇసుమంత మార్పురాకపోవడానికి కారణం ఏమిటి? అంటే **'ఇది కలిధర్మం'** అంటున్నారు పెద్దలు. కలిలో కృతధర్మాన్నో, త్రేతాధర్మాన్నో తీసికొనిరావడం సాధ్యంకాదు, ఇది యుగస్వభావానికి విరుద్ధం అంటారు వీరు. అయితే ఆ కాలాల్లో కూడా ఇలాంటివి జరిగాయి కనుక అవేవీ ఈ కాలానికి ఆదర్శం కాదంటారు మరికొందరు. ప్రవచనాలు, ప్రతిబోధనలు, నైతికతాప్రేరకాలైన రచనలు ఏవీ ఈ కాలంలో ఎంతమాత్రం పనిచేయడం లేదని వీరు ఖేదపడుతున్నారు. వీరనేది నిజమేనేమోననిపిస్తుంది సాధారణంగా ఆలోచించే ప్రతివానికి. కామప్రవృత్తి పురుషార్థంగాకాక, పురుషానర్థంగా ఎలా పరిణమించరాదో రామాయణేతిహాసం మానవజాతికి చెప్పింది. వేలాది సంవత్సరాలుగా రామాయణం వింటూనే ఉంది ఈ జాతి. పారాయణం చేస్తూనే ఉంది.

అయినా, మనిషిలోని కామప్రవృత్తిలో మార్పులేదు. నిండుసభలో పరమధార్మికులైన పెద్దలు, ధర్మం ప్రతిబోధించకుండా, జరుగుతున్న అరాచకాన్ని దుర్మార్గాన్ని అరికట్టకుండా, దుర్నయాన్ని చూస్తూ ఊరుకున్నందువల్ల, ఒక స్త్రీకి ఎలాంటి అనర్థం జరిగిందో, ఎలా అది ఒక జాతి వినాశనానికి కారణం అయిందో రోజూ వింటూనే ఉన్నాం. అయినా ఆ ప్రవృత్తి, ఆ ఆలోచన మానవుని బుద్ధిలోనుంచి దూరంకాలేదు సరికదా ఊరికో దుర్యోధనుడు, వీధికో దుశ్శాసనుడు పుట్టుకొస్తున్న తీరు ఆందోళన కలిగిస్తున్నది. ఆనాడు ఒక్కడే నరకాసురుడు. ప్రజల సొమ్మును దోచి **'మణిమయపర్వతాన్ని'** నిర్మించుకున్నాడు. ఆనాడు భగవంతుడు కృష్ణరూపంలో ఆవిర్భవించి వాణ్ణి నిగ్రహించి, వాడుదోచిన సొత్తును ద్వారకావాసులకు పంచాడు. ఈనాడు ఇలాంటి నరకాసురులు కోకొల్లలుగా పుట్టుకొస్తున్నారు.

అపహరణలు, అపచారాలు, మానభంగాలు, కోకొల్లలుగా నిత్యం జరుగుతూనే ఉన్నాయి. ప్రజలు ఆందోళన చేస్తూనే ఉన్నారు. ఈ ప్రతిబోధాలన్నీ ఏమైపోయాయి? కామింపరాని పరస్త్రీని కామించడం, చేయరాని దురాచారం **'నిర్భయం'**గా చేయడం, ఇలాంటి వ్యవహారాలు నిత్యం ప్రసారమాధ్యమాల ద్వారా మనం తెలుసుకుంటూనే ఉన్నాం. ఏ ఒక్క దినమూ మానవునిలో కరడుగట్టిన నీచ ప్రవృత్తిని ఆవిష్కరించని ప్రసారమాధ్యమం ఒక్కటికూడా లేదంటే, ఇదంతా కలివిజృంభణం అనుకోక తప్పదా?

ఒకవైపు వైజ్ఞానికంగా ఎదుగుతున్నాం. అంతరిక్షంలో స్థానం కల్పించుకున్నాం. మరోవైపు అన్ని రంగాల్లో అవినీతి తాండవంచేస్తుంది. మరొకవైపు మన జీవనవిధానం మనం వినియోగించుకొనే వస్తువులు, పీల్చే గాలి, త్రాగేనీరు అన్నీ కలుషితాలైపోయాయి. కాదు, మనమే కలుషితం చేస్తున్నాం. ఆలోచనలో కాలుష్యం. వ్యవహారంలో కాలుష్యం. ఇలా సమాజాన్ని కలుషితం చేసే వారు తామర తంపరల్లా పుట్టుకొస్తున్నారు.

ఆశ్చర్యం ఏమిటంటే, ఇతరదేశాల్లో చాలా చోట్ల లేని దుష్టప్రవృత్తి, దురాలోచనప్రవృత్తి మొత్తం భారతీయ సమాజాన్నే పీడిస్తోంది. యూరప్‌లోని చాలా చిన్న దేశాల్లో ఇంతటి దుర్నయం, దుష్టవృత్తి లేదని, వారు ఇంకా ఈ ప్రపంచంలోనూ నైతికంగానే నియమనిబంధనలతో బ్రతుకుతున్నారని ఆ దేశాల్లో పర్యటించినవారు చెబుతున్నారు. ఈనాటి భారతీయ సమాజం దుష్టరాజకీయాలచేత ప్రభావితమై నడుస్తున్నట్లు మరేనాడు లేదని విజ్ఞులు వాపోతున్నారు. వారు చేసే ఆక్రోశం అరణ్యరోదనమే అవుతున్నది. మన వేదపురాణాదుల ఉద్బోధనం బధిరశంఖారావమే అవుతోంది.

ఇంకా ఈసమాజంలో ఎందరో మంచివారున్నారు. సమాజాన్ని పట్టిపీడిస్తున్న అవినీతి మొదలైన రుగ్మతలను పారద్రోలాలనే వారి భావన ఫలవంతం కావడంలేదు. పోనీ భారతసమాజంలో ప్రజలకు పరిణతి లేదా అంటే, లేదనడానికి అవకాశం లేదని, పలు సందర్భాల్లో సామూహికంగా ప్రజలు చేసిన తీర్పులు, ముఖ్యంగా ఇటీవల ఏర్పడిన రాజకీయ పరిణామాలు సూచిస్తున్నాయి. అయినా, ఏదో ఒక మూల నిత్యం మానసికాపరిపక్వతను సూచించే సన్నివేశాలు ఎన్నో జరుగుతూనే ఉన్నాయి. కొందరిని అవినీతిలో మునిగి పోయినట్లు, లెక్కలేని అభియోగాల్లో చిక్కుకొని ఉన్నారని,

దోషపరిశోధనా సంస్థలు నిర్ణయించినా, దేశంలో పత్రికలు, ప్రసారమాధ్యమాలు ఎలుగెత్తిచాటినా, ఇలాంటివారిని ఎన్నుకోకూడదని న్యాయస్థానాలు సూచించినా, న్యాయస్థానాల నిర్ణయాలు తుంగలో త్రొక్కి, న్యాయస్థానాల నిర్ణయాలకు కార్యరూపం ఏర్పరచవలసిన బాధ్యత నెత్తికెత్తుకున్న రాజకీయపాలనావ్యవస్థలు స్వార్థరాజకీయ ప్రేరణచే వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నాయి. న్యాయస్థానాల నిర్ణయాలను నిర్వీర్యం చేస్తున్నాయి. కొంతమంది సామాన్యజనం ఇవేవీ పట్టించుకోకుండా, అలాంటి అవినీతిపరులనే రాజకీయ పదవులకు ఎన్నకోవడం, మేధావులను కలవరపరుస్తున్న సన్నివేశమే. ఇదికూడా ప్రజల పరిణతిని సూచించదుకదా!

తాము చేసిన దోషాలమూలంగా కారాగారాలకు వెళ్ళివచ్చి కూడా, ఎలాంటి నైతికతకు కట్టుబడక, నాయకుల్లా చలామణీ అవుతున్న వారినిచూస్తే **కలిధర్మం** బాగా విజృంభించిందని అంగీకరించక తప్పదు. ఎంత పెద్ద శిక్ష వేసినా, శిక్షింపబడ్డ నేరంచేసిన వ్యక్తిలోని నేరంచేసే ప్రవృత్తిలో ఏ మాత్రం మార్పు రాకపోవడం, ప్రజలు చాలా ఉదాసీనంగా పట్టించుకోకుండా ఉండటం, ఇది తమకేమీ సంబంధంలేనట్లు ఉండటం ఈ మాత్రమైనా బ్రతక గలగడమే మహాభాగ్యమని బ్రతుకువెళ్ళదీయడంకూడా దేశంలోని చాలాచోట్ల ప్రత్యక్షంగా అనుభవగోచరమైన విషయమే.

భారతసమాజంలో బాధ్యతనుభావిస్తున్న వారిని కలవర పరుస్తున్న విషయం ఇది. అనుదినం స్త్రీలభద్రత క్రమంగా లోపిస్తున్న తీరు చాలా ఆందోళనను కలిగిస్తోంది. ఇళ్ళలో ఒంటరిగా ఉన్నవారికి, త్రోవలో ప్రయాణించేవారికీ భద్రత పూర్తిగా కరువైంది. ఒక్కొక్క దోషిపైన, 20,30 అభియోగాలున్నా, ప్రభుత్వరక్షణ వ్యవస్థలో ఇలాంటివారిపై తీసుకొంటున్న తీవ్రచర్యలు లేకపోగా, వారిని కేవలం లాంఛనంగా బంధించి, నాలుగురోజులు కారాగారంలో ఉంచి, మళ్లీ స్వేచ్ఛగా సమాజంపై విడిచిపెడుతున్న తీరు కూడా కొన్నిచోట్ల కనిపిస్తోంది, ఇది చాలా గర్హణీయం. న్యాయవ్యవస్థ దీనిపై విశేషంగా దృష్టి పెట్టడం చాలా అవసరం. ఋజుప్రవృత్తి, సచ్ఛీలతకల అధికారులకు ఈ దేశంలో లోటులేదు. వారు కొరడా ఝుళిపించివలసిన సమయం ఇంతకంటే మరొకటి రానేరాదు.

ఒకసారి శిక్ష అనుభవించికూడా మళ్ళీమళ్ళీ అదే **'నేరం'** చేస్తున్నవాణ్ణి, తాత్కాలికంగానైనా విడిచిపెట్టే అవకాశం న్యాయవ్యవస్థలో అసలు ఉండనేకూడదు. హత్యలు, అత్యాచారాల్లాంటి తీవ్రదోషాలు చేసేవారిని అసలు ఏ స్థితిలోనూ విడువనేకూడదు. ఈ విషయంలో న్యాయస్థానాలు తీవ్రమైన దృష్టిపెట్టాలని, సామాన్యులు కోరుతూనే ఉన్నారు. సమాజంలోని బలహీనులపట్ల, స్త్రీసమాజంపై విశేషంగా జరుగుతున్న ఈ నేరాలను అరికట్టేలా న్యాయవ్యవస్థకు బలమిచ్చి, రక్షణవ్యవస్థను గట్టిగా కట్టదిట్టంచేయాలనే ప్రయత్నం ఎంతచేసినా మంచి అధికారులుకూడా కృతకృత్యులు కాలేకపోతున్నారు, వారే అవినీతులద్వారా రాజకీయంగా చాలా చిక్కులు ఎదుర్కొంటున్నారు. ఈపరిస్థితి మారితేనే సమాజానికి మనుగడ. మంచి అధికారులకు, రాజకీయ నాయకులకు, విజ్ఞులు, వివేక సంపన్నులు అయిన మేధావుల, సామాజిక వేత్తల, బలం చాలా అవసరం. మేధావులు మౌనం విడచి సత్యాన్ని ఎలుగెత్తిచాటగలగాలి. అలాంటి పరిస్థితి ఈసమాజంలో తప్పకవస్తుందని ఆశాజీవులైనవారు ఆశపడటం తప్పుకాదు.

మనలో మార్పుకలిగితే, మన నిర్ణయాల్లో నైశ్చల్యం ఏర్పడితే, యోగ్యమైన పరిపాలనావ్యవస్థని తెచ్చుకోవడం సాధ్యమే అన్నది భారత సమాజం వర్తమాన ప్రభుత్వాన్ని తీసుకురావడం ద్వారా నిరూపించింది. మనలో కలిగే ఈ దృఢమైన సంకల్పం కలి ప్రభావాన్ని కూడా దూరంగా జరపడంలో తప్పక తోడ్పడుతుంది. దైవం దానికి నిస్సందేహంగ అనుకూలిస్తుంది. అందుకే మన ఆలోచనల్లో మార్పుని తెచ్చుకుందాం! దాన్ని స్థిరంగ నిలపమని భగవంతుని ప్రార్థన చేద్దాం! ఆ ప్రార్థన ఫలేగ్రాహి కాగలదని విశ్వసిద్దాం!

**జయతు ధర్మః అపజయతు అధర్మః**

**వేంకట రంగరామానుజాచార్య**






# భక్తుని ఛలోక్తి

'శాస్త్రరత్నాకర' 'కవిశాబ్దికకేసరి'
మహామహోపాధ్యాయ,
డా॥ శ్రీ.న.చ.రఘునాథాచార్య స్వామి

**ఛలోక్తి అనగా చమత్కార సంభాషణం**

"నిరంకుశాః కవయః" అన్నట్లు భక్తులైనవారుగూడ కవులైతే, భగవంతునితో గూడ ఛలోక్తులు విసురుతూ మాట్లాడగలరు. తన చేతికి చిక్కినట్లే చిక్కిక్షణంలో విదలించుకొని పోయిన బాలకృష్ణుణ్ణి, గ్రుడ్డివాడైన లీలాశుకుడు (శ్రీకృష్ణకర్ణామృతం).

**"హస్తమాక్షిప్య యాతోஉసి బలాత్కృష్ణ! కిమద్భుతమ్।**
**హృదయాద్యది నిర్యాసి పౌరుషం గణయామి తే।"** అంటూ ఛలోక్తితో అలరించినాడు గదా!! ముదుసలినైన నాచేతినుండి తప్పించుకుపోయినావు గాని, నా మనస్సునుండి తప్పించుకు పోగలవా! అని సవాలు విసరినాడు గదా!!

ఇదే పద్ధతిలో మరొక భక్త కవి భగవంతునిపై క్రింది విధంగా ఛలోక్తిని అతిమధురమైన శ్లోకంలో ప్రయోగిస్తున్నాడు, గమనించండి।

**శ్లో॥ గోపాల ఇతి కృష్ణ! త్వం- ప్రచుర క్షీరవాంఛయా ।**
**శ్రితః, మాతృస్తన క్షీరమ్- అప్యలభ్యం త్వయాకృతమ్ ॥**

ఓ గొల్లకులంలో పుట్టి పెరిగిన కృష్ణా! నీవు గోపాలుడివి గదా, అని చాలా ఆశపడ్డాను. నిన్ను ఆశ్రయిస్తే నీవద్ద పుష్కలంగా గోసమృద్ధి ఉన్నది గనుక, రోజూ తృప్తిగా ఇష్టమొచ్చినంత ఆవుపాలను త్రాగవచ్చునని ఆశపడ్డాను. కాని, నా ఆశ పేరాసయే ఐనది. ఇక పైన నాకు ఈ జన్మతొలగిపోతే, తదనన్తరం అసలు తల్లి పాలకు గూడా నేను నోచుకోకుండునట్లు చేసినావు గదయా! నీకు ఇది తగునా!!

ఈ ఛలోక్తిలోని అసలు అంతరార్థం ఏమంటే-

ఇకపైన నాకు పునర్జన్మ లేకుండా చేసినావుగదా, అని. - అనగా- నాకు మళ్ళీ మరొక జన్మరావటం, అందులో ఆకలిదప్పులు, రోగాలురొష్టులు నానావిధ దుఃఖాలు అనుభవించే దుస్థితి నాకు కలుగకుండా చేసి, ఆనందమయమైన నీ దివ్యధామానికి నన్ను చేర్చుకొని, శాశ్వత బన్ధవిముక్తిని కలిగిస్తున్నావు గదా! ఇదే మళ్ళీ తల్లిపాలకు గూడా నోచుకోకుండా చేయడమన్నమాట॥ ఇది పైకి ఆక్షేపరూపమైన మాటగా తోచవచ్చును గాని, **"అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి"** అన్నట్లు నీవు నాకు దుఃఖ లేశ రహితమైన ముక్తిని ప్రసాదిస్తావని- అన్తర్నిగూఢమైన భావం ఇచట సూచితమైనది.

---

### శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి

## పర్యటన వివరాలు

**నవంబర్:**

- **6.** శ్రీరామనగర్‌లో చాతుర్మాస్యదీక్ష విరమణ
- **7.** విజయవాడచేరి గీతాజయంతి ఏర్పాట్లను పర్యవేక్షిస్తారు
- **10.** రాత్రికి భద్రాచలం చేరి, రాబోయే గోదావరి పుష్కరాల ఏర్పాట్లను పర్యవేక్షిస్తారు.
- **11.** ఉదయం భద్రాద్రిరాముని సేవించి, రాజమహేంద్రిమీదుగ విశాఖలోని వారిజ చేరతారు.
- **12.** వారిజ నుండి మందసా మీదుగ ఒరిస్సాలోని ఖరగ్‌పూర్ చేరుతారు
- **14-17** ఖరగ్‌పూర్‌లో భక్తులు ఏర్పాటుచేసిన కార్యక్రమాలలో పాల్గొంటారు
- **17** ఖరగ్‌పూర్‌లో అర్థులకు మంత్రోపదేశం కావిస్తారు
- **21** ఖరగ్‌పూర్‌నుండి క్రమంగా విజయవాడ చేరతారు
- **22-23** గీతాజయంతి పురస్సర శ్రీయాగ కార్యక్రమ ఏర్పాట్లను పర్యవేక్షిస్తారు

**24- డిసెంబర్ 2 వరకు గీతాజయంతి మహోత్సవాలు - శ్రీయాగం**

**డిసెంబర్:**

- **3-7** చెన్నై పర్యటన
- **8** శ్రీమాన్ ఎ.ఎన్. శ్రీరాంగారి ఆహ్వానంపై సేలం పర్యటన
- **16** వరంగల్లో ధనుర్మాస మహోత్సవాలు ప్రారంభిస్తారు



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
డైరెక్టర్ - అకడమిక్ కౌన్సిల్ 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

(స్కం-1-అధ్యా. 15)

## అర్జున పరిదేవనం

శ్రీకృష్ణునితో తమకుగల సంబంధాన్ని స్మరిస్తూ అర్జునుడు పరిపరివిధాల తన హృదయ పరిదేవనను ఆవిష్కరిస్తున్నాడు.

**యత్తేజసా సభగవాన్ యుధి శూలపాణి**
**ర్విస్మాపిత స్సగిరిశోఽ స్త్ర మదాన్నిజం మే।**
**అన్యేఽ పి చాఽ హ మమునైవ కళేబరేణ**
**ప్రాప్తో మహేంద్ర భవనే మహదాసనార్థమ్ ॥**

అన్నయ్యా! ఆమహానుభావుని తేజస్సుచేత, యుద్ధంలో శూలపాణి అయిన భగవానుడు పరమశివుడు పార్వతితోపాటు ఆశ్చర్యపరచబడి తన పాశుపతాస్త్రాన్ని నాకిచ్చాడో, ఇతరులైన లోకపాలురు కూడా తమ ఆయుధాలను నాకిచ్చారో, అంతేకాదు, ఈ దేహంతోనే ఇంద్రభవనానికి వెళ్ళి, ఆతని సన్నిధిలో అర్ధాసనాన్ని కూడా పొందగలిగానో, అది ఆమహానుభావుని ప్రభావంచేతనే కదా, దేవేంద్ర భవనంలో ఉన్నప్పుడే నివాతకవచాది దానవ హననార్థం గాండీవ ధనుర్ధారణం చేసిన భుజదండ యుగంకల నన్నాశ్రయించారు దేవతలు. సాక్షాత్తుగా ఇంద్రాదులే నన్నాశ్రయించారంటే ఇదంతా ఆకృష్ణునిప్రభావమే. అలాంటి మహా పురుషునిచే నేను వంచింపబడ్డాను సుమా!

ఆమహానుభావుడైన కృష్ణుడు బంధువుగా కలిగి ఉన్నందు వల్లనే ఏకరథస్థుడనై అనన్త పారమై దాటరాని కురుసైన్య మహాసాగరాన్ని దాటగల్గాను. ఆనాడు ఉత్తరగోగ్రహణ సమయంలో భీష్మద్రోణాది మహావీర పరీతమైన సైన్యాన్ని జయించడమేకాక, ఉత్తరకోరిన విధంగా కురువీరుల శిరస్సులనుండి అమూల్యరత్నాలను, ఉష్ణీషాలను (తలపాగలను) బొమ్మపొత్తికలకోసం కత్తిరించి తెచ్చానుకదా? అన్నయ్యా! భీష్మద్రోణకర్ణశల్యాది సంకులమైన సైన్యం గొప్పగొప్ప రాజన్య సమూహాల రథమండలాలచే పరిమండితమై ఉండగా, సైన్యాగ్రాన నా రథానికి సారథిగా ఉండి, ముందుకు నన్ను నడుపుతూ తన కంటి చూపులచే సైన్యాధిపుల ఆయువు, మనస్సులతో పాటు వారి తేజస్సును కూడా లాగివేశాడు కాదా! ఆ స్వామి రక్షణంలో ఉన్న నన్ను, ద్రోణ-భీష్మ-కర్ణ- అశ్వత్థామ-త్రికర్త-శల్య-సైంధవాదులచే ప్రయోగింపబడిన అమోఘాలైన అస్త్రాలేవీ స్పృశింపలేక పోయినాయి. నృహరిదాసులను అసురులు స్పృశింపజాలనట్లే ఆ అస్త్రాలుకూడా నన్ను స్పృశింపలేకపోయినాయి. సారథ్యం నిర్వహించడానికి ఆ మహానుభావుని ఎన్నుకోవడమే ఒక మహాపరాధం. ఆయన సాధారణ పురుషుడు కాదు, ఆత్మదుడైన ఈశ్వరుడు. ఈ సంసారంలో నుండి బయల్పడి మోక్షాన్ని పొందడానికే సంసారులీ మహానుభావుని పాదపద్మాలు ఆశ్రయిస్తారు. అలాంటి మహాత్ముని సంరక్షణంలో ఉన్న నేను విశ్రాన్తుడనై ఉండగా, నాగుర్రాలు అలసి ఉండగా, రథికులెవ్వరూ భూమిపై ఉన్న నన్ను, ఈ స్వామి ప్రభావాతిశయం చేతనే తమ బాణాలతో కొట్టలేక పోయారు సుమా! ఆ శ్రీకృష్ణస్వామి నన్నుద్దేశించి, ఓపార్థా! అర్జునా! ఓసఖా! కురునందనా! అంటూ ఉదారమనోజ్ఞశోభితాలైన నర్మభాషణాలు చేశాడు. మాటాడిన మాటలను స్మరిస్తూ ఉంటే, అవి, నాహృదయమర్మాన్ని స్పృశిస్తున్నాయి. ఏకశయనం పై కూర్చుండినప్పుడు, ఏకాసనంపై ఆసీనులమై ఉన్నప్పుడు, ఆత్మశ్లాఘ చేసికొంటూ మాటాడు కొంటున్నప్పుడు, భోజనాది వివిధ క్రియల్లోను సర్వప్రవృత్తుల్లోనూ మానసిక భావనలలో ఐక్యం ఏర్పడి ఉండగా, ఎక్కడైనా ఒకచోట నామాటల్లో అది కొరవడితే, "ఓహో! నిజం చెప్పావోయ్" అంటూ సోల్లుంఠనంగా (దెప్పిపొడుపుగా) పలికి నన్ను తిరస్కరించే వాడు సుమా! ఆ మహానుభావుడు, ఒక మిత్రుని ప్రవృత్తిని మరొక మిత్రునిలా, కుమారుని ప్రవృత్తిని తండ్రిలా సమస్త వ్యవహారాన్నీ సహించేవాడు. కుమతినైన నేను చేసిన పాపాలన్నీ సహించాడు.

**సోఽ హం నృపేంద్రరహితః పురుషోత్తమేన**
**సఖ్యా ప్రియేణ సుహృదా హృదయేన శూన్యః ।**
**అధ్వన్యురుక్రమ పరిగ్రహమంగ రక్షన్**
**గోపైరసద్భి రబలేవ వినిర్జితోఽ స్మి ॥**

అన్నయ్యా! నీవు శంకించిన పరాజయాన్ని కూడా నేను పొందాను. ఇంతగా నన్ను స్వీకరించిన ఆ పురుషోత్తముడు మనకు ప్రీతిపాత్రుడు, ప్రియుడు, సుహృత్తు. అలాంటి మహానుభావుడు మనలను విడిచిపెట్టాడు. అందువల్లనే నేను నాహృదయాన్ని కోలుపోయాను. అన్నయ్యా! స్వామికి చెందిన భార్యలను మార్గంలో రక్షిస్తూ తీసికొనివస్తూ ఉండగా, పాపప్రవృత్తులైన గోపకులు నన్నడ్డగించి, ఓడించి కృష్ణభార్యలను హరించారు.

అన్నయ్యా! ఆనాడు ఖాండవదహనంలోను, కురుక్షేత్రంలోను ధరించిన అదే ధనుస్సు- ఆనాడు శత్రువులపై ప్రయోగించిన అవేబాణాలు, ఆనాడు కృష్ణసారథ్యంలో యుద్ధంలో అధిరోహించిన

రథంకూడాఅదే. గుర్రాలూ అవే. ఇక రథంలో రథికునిగా ప్రభువు లందరిచే ఏకకంఠంగా బహుమతుడనైన ఆనేనే ఈనాడు కూడా, అయినా, అన్నీ కృష్ణవియోగంలో ఒక్కక్షణంలో బూడిదలో వేసిన హవ్యం, అసత్పాత్రదత్తధనం, ఊసరభూమిలో నాటిన విత్తనం అయింది అంటున్నాడు అర్జునుడు-

శ్లో॥ తద్వై ధనుః త ఇషవః సరథో హయాస్తే
సోऽహం రథీ నృపతయో యత ఆమనన్తి
సర్వం క్షణేన తదభూ దసదీశ రిక్తం
భస్మన్ హుతం కుహకరాద్ధ మివోప్త మూష్యామ్ ॥

ఓరాజా! మన మిత్రనగరమైన ద్వారకలో నీవు కుశలమడిగిన మనస్నేహితులు బ్రాహ్మణశాపోపహతులైనారు. అందువల్ల వివేకం కోల్పోయి, వారుణీమదిరను త్రాగి ఉన్మాద విమూఢమనస్కులై పిడికిళ్ళతో ఒకరినొకరు పొడుచుకొని చంపుకొన్నారు. వారిలో నల్గురు ఐదుగురు మాత్రమే మిగిలారు. ఇదంతా కేవలం భగవత్సంకల్పం. ప్రాణులు పరస్పరం సంభావించుకోవడం లేదా ఒకరినొకరు చంపుకోవడం ఇదంతా శ్రీకృష్ణచేష్టితమే తప్ప వేరుకాదు. నీళ్ళలో నివసించే జలజంతువుల్లోనే పెద్దవి చిన్నవాటిని, బలవంతాలైన సత్త్వాలు బలహీనాలను, చంపుకుతింటాయి. ఇక బలవంతులు అన్యోన్యం చంపుకోవడం ఈశ్వర సంకల్పమే కదా!

ప్రాయేణైతద్భగవతః ఈశ్వరస్య విచేష్టితమ్ ।
మిథో నిఘ్నంతి భూతాని, భావయన్తి చ యన్మిథః ॥
జలౌకసాం జలే యద్వత్ మహాన్తోऽదన్త్యణీయసః।
దుర్బలాన్ బలినో రాజన్! మహాన్తో బలినో మిథః ॥

ఇలాగే బలవంతులైన యాదవులచే ఇతరులైన రాజన్యులను అలాగే యాదవులను, యాదవులచేతనే అన్యోన్యం భూమికి బరువైనవారినల్లా సంహరించాడు ఆ మహానుభావుడు.

దేశకాలార్థయుక్తాని హృత్తాపోపశమాని చ ।
హరన్తి స్మరత శ్చిత్తం గోవిందా భిహితాని మే ॥

ఆ శ్రీకృష్ణస్వామి మాటాడిన దేశకాలప్రయోజనవంతాలైన మాటలు హృదయతాపాన్ని ఉపశమింపచేసేవై, స్మరిస్తున్న నా మనస్సును హరిస్తున్నాయి అని స్మరించి దుఃఖపడుతున్నాడు అర్జునుడు.

(సశేషం)

## శ్రీజయనామసంవత్సర దీపావళిర్జయతు

**(శ్రీ దీపావళీసందర్భే - తిరునక్షత్రమహోత్సవం పురస్కృత్య తత్రశ్రీచరణానుద్దిశ్య అకిఞ్చనదాసేనానేనక్రియమాణా)**

**వాచికీ వరివస్యా (సంస్కృతపద్యరూపా)**

శ్రీకృష్ణమాచార్యః, తోతాద్రిమఠ్, సప్తసాగర్, అయోధ్యా, 224123

1) సీతాలక్ష్మణ సంయుతో హనుమతా సంసేవితో రాఘవః
శ్రీనారాయణసంయమీన్ద్రచరణైరారాధ్యమానస్సదా ।
లోకానాముపకారకో బహువిధైర్యజ్ఞైస్సమారాధితః
పాయాన్నో యతిరాజనామకగురుం విఘ్నైర్వినా, సర్వదా ॥

2) వర్ధన్తాం యతిశేఖరస్య వివిధాశ్శాస్త్రోక్తసేవాస్సదా
భూయాచ్ఛ్రీయతిరాజనామక గురుర్నీరోగకాయస్సదా ।
వర్ధేరన్ యతిరాజపాదసవిధే భక్తోత్తమాస్సన్తతం
కాకుత్స్థః కులదైవతం వితనుతాత్, క్షేమస్య పారంపరీమ్ ॥

3) వేదాన్తద్వయ పారశ్శుభగుణైర్జుష్టో దయామ్భోనిధిః
శ్రీనారాయణ సంయమీశ్వరగురుర్జేతు భూమౌసదా ।
శ్రీదీపావళివైభవం ప్రసరతాత్ కృత్స్నేపి భూమణ్డలే
స్వాతిస్సా శుభతారకా యతిపతేర్జీయాచ్చిరం సాదరమ్ ॥

4) శ్రీమన్నారాయణాఖ్యో యతిపతిరనఘో విశ్వవిఖ్యాతకీర్తిః
జీయాల్లీలావిభూతౌ, శుభతమయతిరాట్ సంప్రదాయధ్వజోసౌ ।
జీయాసుర్వైదికాస్తే గుణగణభరితాశ్ఛాత్రబృన్దాశ్చనిత్యం
జీయాసుశ్శిష్యశాఖా, గురువరపదయోర్భక్తిముద్వేలయన్త్యః ॥

5) గురోర్గోపాలార్యాత్సముపచితవేదాన్తయుగళం
భజే శ్రీమన్నారాయణయతిపతే రూపమపరమ్ ।
తదీయం శ్రీపీఠం సమధిగతవన్తం గుణనిధిం
తులామాసే స్వాత్యాం భువిసమవతీర్ణం యతివరమ్ ॥

6) యతిపతిసంప్రదాయనిపుణం కరుణాజలధిం
నిగమశిరోద్వయాశ్రిత హృదం బహుశాస్త్రవిదమ్ ।
విపులవసున్ధరావిచరణైకయశోవిభవం
బుధవరచిన్నజీయరగురుం ప్రణమామి సదా ॥

7) జయజయ చిన్నజీయరగురో! కరుణాజలధే!
జయజయసంయమీశ్వర! గుణార్ణవ! దేశికభోః ।
రఘుపతిపాదపద్మభ్రమరాయిత మానస!హే!
జయజయహే యతీశ్వర!భవాన్ శరదాం సుశతమ్ ॥

8) వేదమార్గ ప్రతిష్ఠాపకం సజ్జనం సర్వదా ధర్మసంస్థాపనే తత్పరమ్।
వైదికే సత్పథే సఞ్చరన్తం ముదా సన్నమామస్సదా చిన్నజీయర్గురుమ్।

9) తులామాస్యవతీర్ణాయ జ్ఞానవైరాగ్యరాశయే ।
విశ్వవిఖ్యాతసన్నామ్నే యతిరాజాయ మఙ్గళమ్ ॥

10) శ్రీమన్నారాయణాచార్య! యతిశేఖర!తేసదా ।
మఙ్గళం సన్తతం భూయాత్ గురువర్య! దయానిధే ॥

11) శ్రీమన్నారాయణాభిఖ్య యతిరాజ పదాబ్జయోః ।
కృష్ణమాచార్యదాసేన వాఙ్మాలేయం నివేదితా ॥

తిరువరంగత్తముదనార్లు అనుగ్రహించిన ప్రపన్నగాయత్రి

# ఇరామానుశనూత్తన్దాది

గత సంచిక తరువాయి

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

### 50వ పాశురము

ఉదిప్పన ఉత్తమర్ శిన్దైయుళ్, ఒన్నలర్ నెఞ్జమఞ్జి
క్కొదిత్తిడ మాఱి నడప్పన, కొళ్ళైవన్ కుఱ్ఱమెల్లామ్
పదిత్త ఎన్ పున్ కవి పావినమ్ పూణ్డన పావు తొల్ శీర్,
ఎదిత్తలై నాదన్, ఇరామానుశన్ తన్ ఇణై యడియే ॥

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **పావు** | = | లోకమంతా వ్యాపించిన |
| **తొల్‌శీర్** | = | నిత్యకల్యాణ గుణములు కలవారు |
| **ఎదితలై నాదన్** | = | యతీశ్వరులైన వారికి నాథులు అయిన |
| **ఇరామానుశన్ తన్** | = | భగవద్రామానుజులయొక్క |
| **ఇణై అడి** | = | పాద ద్వంద్వము, రెండుపాదములు |
| **ఉత్తమర్ శిన్దైయుళ్** | = | ఉత్తములైన వారి మనస్సులలో |
| **ఉదిప్పన** | = | ప్రకాశించేవి |
| **ఒన్నలర్ నెఞ్జమ్** | = | శత్రువుల మనస్సు |
| **అఞ్జి కొదిత్తిడ** | = | భయపడి తపించేలా |
| **మాఱినడప్పన** | = | మాఱి మాఱి నడిచేగుణం కలవి. |
| **కొళ్ళైవన్ కుఱ్ఱమ్** | = | అంతులేని బలమైన దోషాలు |
| **ఎల్లామ్ పదిత్త** | = | అన్నింటిని నింపుకొనిన |
| **ఎన్ పున్ కవి** | = | నా నీచ కవిత్వముగల |
| **పా ఇనమ్ పూణ్డన** | = | పాశురాలనుకూడా గ్రహించినవి. |

**తాత్పర్యము :** యతీంద్రుల శ్రీచరణాలు ఈపాశురంలో వర్ణింపబడ్డాయి. మన రామానుజుల కీర్తి లోకమంతా నిండింది. వారు యతిసార్వభౌములు. ఆదివ్యమూర్తి శ్రీచరణాలు ఎంతగొప్పవి అంటే–

1. వడుగనంబి వంటి మహనీయులచే నిరంతరం ధ్యానింపబడేవి.
2. వేదబాహ్యుల మనస్సులో పరితాపాన్ని కల్గించేవి.
3. దోషాలతో నిండిన నేను రచించే పాశురాలను కూడా స్తోత్రంగా భావించి స్వీకరించేవి, కుదృష్టివాదులను ఓడించడం కోసం ఎన్నోచోట్ల సంచరించినవి. అని అముదనార్లు వర్ణించారీపాశురంలో.

### 51వ పాశురము

అడియై త్తొడర్న్దు ఎழுమ్ ఐవర్‌కట్కాయ్, అన్ఱు పారదప్పోర్
ముడియ ప్పరినెడుమ్ తేర్ విడుమ్ కోనై, ముழுదుణర్న్ద ।
అడియర్ క్కముదతమ్ ఇరామానుశన్ యాళవన్దు
ఇప్పడియిల్ పిఱన్దదు, మఱ్ఱిల్లై కారణమ్ పార్త్తిడిలే ॥

**ప్రతిపదార్థము :**

| | | |
|---|---|---|
| **అన్ఱు** | = | పూర్వకాలములో |
| **అడియై తొడర్న్దు** | = | శ్రీచరణాలను ఆశ్రయించి |
| **ఎழுమ్** | = | గర్వించి విజృంభించిన |
| **ఐవర్‌కట్కు ఆయ్** | = | పంచపాండవులకోసం |
| **పారదప్పోర్** | = | భారతయుద్ధంలో |
| **ముడియ** | = | కౌరవులు నశించేటట్లు |
| **పరినెడుతేర్** | = | గుఱ్ఱాలను పూన్చిన రథాన్ని |
| **విడుమ్** | = | నడిపిన |
| **కోనై** | = | సర్వేశ్వరుని |
| **ముழுదు ఉణరన్ద** | = | పూర్తిగా తెలుసుకున్న |
| **అడియర్కు** | = | భాగవతులకు, |
| **అముదమ్** | = | పరమభోగ్యులైన |
| **ఇరామానుశన్** | = | భగవద్రామానుజులు, |
| **ఇప్పడియిల్** | = | ఈభూమండలములో |
| **వన్దు పిఱన్దదు** | = | వచ్చి అవతరించడం |
| **ఎన్నైఆళ** | = | ఈదాసుడనైన నన్ను రక్షించడం కోసమే |
| **పార్‌త్తిడిల్** | = | పరిశీలించిచూస్తే |
| **మఱ్ఱుకారణమ్ ఇల్లై** | = | వేరొక కారణములేదు. |

**తాత్పర్యము:** ఆనాడు పంచపాండవులు శ్రీకృష్ణుని పాదపద్మాలనే ఆశ్రయించారు. వారికోసం భారతయుద్ధంలో అర్జునునికి రథసారథి అయ్యాడు స్వామి. ఆసౌలభ్యగుణాన్ని చక్కగా తెలిసికొని ఆనందించే భాగవతోత్తములకు పరమభోగ్యులయ్యారు మన రామానుజులు. పరమోదారులైన ఆయతిరాజులు ఈదాసుని అనుగ్రహించడం కోసమే ఈలోకంలో అవతరించారు తప్ప వేరే కారణమేదీ లేదన్న సంగతి ఆలోచిస్తే అర్థమయింది. ఆ శ్రీకృష్ణుని సౌలభ్యగుణమే మన ఆచార్యులలో చోటు చేసికొంది అని ఆనందిస్తున్నారు అముదనార్లు.

### 52వ పాశురము

పార్‌త్తాన్ అఱు శమయఙ్గళ్ పతైప్ప, ఇప్పార్ ముழுదుమ్
పోర్‌త్తాన్ పుకழ్ కొణ్డు పున్మైయినేనిడైత్తాన్ పుకున్దు ।

తీర్త్తాన్ ఇరువినైతీర్త్తు, అరఙ్గన్ శెయ్య తాళిణైయోడు
ఆర్త్తాన్, ఇవై ఎమ్మిరామానుశన్ శెయ్యుమ్ అఱ్పుదమే ॥

**ప్రతిపదార్థము:**

**శ్రీరామానుజులు-**

| | | |
|---|---|---|
| **అఱు శమయఙ్గళ్** | = | వేద బాహ్యములైన ఆఱుమతములును |
| **పతైప్ప** | = | గడగడ వణుకుతూ నిర్మూలమయ్యేలా |
| **పార్తాన్** | = | కటాక్షించారు |
| **ఇప్పార్ ముఱ్ఱుదుమ్** | = | ఈ భూమండలమంతటినీ |
| **పుకర్ద్ కొణ్డు** | = | తమ దివ్యకీర్తితోనే |
| **పోరుత్తాన్** | = | (వ్యాపింపచేశారు) ఆవరించారు |
| **పున్మయినే నిడై** | = | పరమ నీచగుణములు గల నాయందు |
| **తాన్ పుకున్దు** | = | తమంత తామే వచ్చి ప్రవేశించి |
| **ఇరువినై** | = | గొప్ప పాపములను |
| **తీర్త్తాన్** | = | పోగొట్టారు |
| **తీర్త్తు** | = | ఇలా పాపాలను పోగొట్టడమేకాక |
| **అరఙ్గన్** | = | శ్రీరంగనాథుని యొక్క |
| **శెయ్య** | = | అందమైన |
| **తాళ్ ఇణైయోడు** | = | పాదారవింద యుగళముతో |
| **ఆర్తాన్** | = | నన్ను అన్వయింపచేశారు |
| **ఇవై** | = | ఈపనులన్నీ |
| **ఎమ్ ఇరామానుశన్** | = | మాకు స్వామి అయిన భగవద్ రామానుజులు. |
| **శెయ్యుమ్** | = | చేసిన |
| **అఱ్పుదమే** | = | ఆశ్చర్యలీలలు |

**తాత్పర్యము :** శ్రీరామానుజులు చేసిన అద్భుతాలను అముదనార్లు వర్ణిస్తున్నారు. యతిరాజులు వేదబాహ్యమతాలను నశింపచేశారు. (ఆ మతాలు శాక్య, ఔలూక్య, బౌద్ధ, చార్వాక, పాశుపత, కాణాదులనే ఆఱు).

2. ఈభూమండలం అంతా తమకీర్తితో నింపారు. మంచి ఆత్మ గుణాలు లేని నాలో తమంత తామే వచ్చి ప్రవేశించారు. నాపాపాలను పోగొట్టారు. శ్రీరంగనాథుని చరణదాసునిగా నన్ను చేశారు. ఇలాంటి ఆశ్చర్యకరమైన పనులను చేయడం వారి స్వభావము. *(సశేషం)*




శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

## ధాటీ పంచకము 5వశ్లోకము

శ్లో॥ పాషండ సాగర మహా బడబా ముఖాగ్నిః
శ్రీరంగరాజ చరణాంబుజ మూలదాసః ।
శ్రీవిష్ణులోక మణి మండప మార్గదాయీ
రామానుజో విజయతే యతిరాజ రాజః ॥

ప్రతిపదార్థము :–

**పాషండ సాగర మహా బడబా ముఖాగ్నిః–**

| | |
|---|---|
| **పాషండ** | = పాషండ మతస్థులనే |
| **సాగర** | = మహా సముద్రాన్ని |
| **మహా బడబా ముఖాగ్నిః** | = ఇంకింప చేసే బడబాగ్నివంటివారు |

**శ్రీరంగరాజ చరణాంబుజ మూలదాసః–**

| | |
|---|---|
| **శ్రీరంగరాజ** | = శ్రీరంగనాథుని యొక్క |
| **చరణాంబుజ మూలదాసః** | = శ్రీపాదపద్మాలలో దాసులైనవారు, |

**శ్రీవిష్ణులోక మణి మండప మార్గదాయీ–**

| | |
|---|---|
| **శ్రీవిష్ణులోక** | = పరమపదములోని |
| **మణిమండప** | = తిరుమామణి మండపముయొక్క |
| **మార్గ** | = మార్గమును, దారిని |
| **దాయీ** | = అనుగ్రహించేవారు |
| **యతిరాజరాజః** | = యతి సార్వభౌములయిన |
| **రామానుజః** | = శ్రీరామానుజులు |
| **విజయతే** | = సర్వోత్కర్షతో వెలుగొందుచున్నారు. |

**తాత్పర్యం:** ఈశ్లోకంలో భగవద్రామానుజుల వైభవాన్ని ముదలియాణ్డాన్ ఎంత అద్భుతంగా వివరించారో! ఎంబెరుమానార్ల వైభవ మెంతగొప్పది! వేదబాహ్యమతాలతో మొదటిది, పాషండమతం, ఆ మతమనేది సముద్రంలా వ్యాపించింది. సముద్రంలో బడబ అనే అగ్ని ఉంటుంది అది సముద్రజలాన్ని ఇంకించేస్తుంది. రామానుజులు అనే ఈ బడబాగ్ని పాషండ సముద్రాన్ని ఎండకట్టేసింది. ఆ మతం నశించిపోయింది. ఇంక శ్రీరంగనాథుని దాసులలో మూలదాసులుగా నిలిచారు, ముఖ్యులయ్యారు మన ఉడయవర్లు. పరమపదానికి నిచ్చెన వేసినట్లు, అక్కడి తిరుమామణిమండపాన్ని మానవులకు అనుగ్రహించారు మన భాష్యకారులు. వారు యతిసార్వభౌములు. కాలమున్నంత వరకు విరాజిల్లే దివ్య మంగళమూర్తి.

శ్రీమతే రామానుజాయనమః

# మన ఆళ్వార్లు



- శ్రీనృసింహ-

భగవంతుని అవతారాలు పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చా అవతారాలు గదా! ముదలాళ్వారులకి పరత్వమంటే ఎంత ఇష్టమో. శుకమహర్షి మొదలైన వారికీ అంతే. తిరుమళ్లిశై ఆళ్వార్లకి అంతర్యామి అంటే అంత ఇష్టం. సనకాదులు కూడా అంతర్యామికే ఈడు పడ్డారు. కులశేఖరులు శ్రీరామావతారమంటే మురిసిపోయారు వాల్మీకాదులు అంతే. పెరియాళ్వార్లు, ఆండాళ్‌తల్లి శ్రీకృష్ణావతారానికి, అంకితమయ్యారు. నమ్మాళ్వార్లు కృష్ణతృష్ణా తత్త్వమే కదా! పరాశరాదులు, వ్యాసాదులు, శ్రీకృష్ణమూర్తి అంటేనే మురిసిపోయారు. తొండరడిప్పొడి ఆళ్వార్, తిరుప్పాణి ఆళ్వార్, నారదాదులు శ్రీరంగధామునిపై మనసు పారేసుకున్నారు. మన తిరుమంగై ఆళ్వార్లు అర్చావతారమూర్తికి తమ మనసు సర్పించేసుకున్నారు. ఎందుకు? ఏమిటి? ఈ అర్చావతారంలో గొప్పదనం ఏమిటి అంటే మన పిళ్ళైలోకాచార్యులవారు అనుగ్రహించారుకదా!

**భూగతజలం పోలే అన్తర్యామిత్వమ్**
**ఆవరణ జలమ్బోలే పరత్వం**
**పాఱ్కడల్ పోలే వ్యూహమ్**
**పెరుక్కాఱు పోలే విభవంగళ్**
**"అదిలే తేఙ్గిన మడుక్కళ్ పోలే అర్చావతారం"** (శ్రీవచన-38సూ)

ఒక వ్యక్తికి దాహంగా ఉంది. తాను నిలుచున్నచోట భూమిలో నీరుంది కాని తన దాహం తీర్చడానికి ఉపయోగిస్తుందా, అలాగే అంతర్యామి-మనలో ఉన్నాడు గాని ఈకళ్ళకి కనిపించడు. అష్టాంగ యోగాది ప్రయత్నం చెయ్యాలి. ఇంక పరత్వం అది లీలావిభూతిలో లేదుకదా. సంసారబంధంనుండి ముక్తిపొందిన అనంత గరుడ విష్వక్‌సేనాదులకే దర్శన సాధ్యం. మనకి కాదు, పోనీ వ్యూహం చూద్దామా! క్షీరసముద్రంలాంటిది బ్రహ్మరుద్రేంద్రాదులు పోగలరు కాని మనకి ఏమీ ఉపయోగపడదు.

నదీ జలాలున్నాయికదండీ. అవి ఆయా కాలాల్లో ఉన్నవాళ్ళకే ఉపయోగిస్తాయి. అలాంటివే విభవావతారాలు. ఆ రాముడు, శ్రీకృష్ణుడు పుట్టినప్పుడెవరున్నారో వారు-అందులోనూ కొందరే చూడగల్గి ఉంటారు. ఈ లోటుపాట్లు ఏమాత్రం లేని అవతారం అర్చావతారం. భూమి త్రవ్వి నీరు తీయక్కరలేదు. దేశాంతరం పోనక్కరాదు. ఏ కష్టము పడనక్కరలేదు. ఎలాగంటే తటాకజలంలాగ అన్నమాట దానికోసం ఏ పాట్లు పడనక్కరలేదు. దాహం తీర్చేసుకోవచ్చు. అలాగే అర్చావతారం అన్ని కాలాలలో, అన్ని దేశాలలో, అందరికీ అందుబాటులో ఉన్న అద్భుతావతారం. అందుకే మన తిరుమంగై ఆళ్వార్లకి ఈ అర్చావతారమంటే ఎంతిష్టమో. **"ముయిల్‌విట్టు కాక్కై పిన్ పోవదే"** ఎదురుగా ఉన్న కుందేటిని విడిచిపెట్టి, ఆకాశంలో ఎగిరే కాకి కోసం ప్రయత్నిస్తారేమిటి అంటారు వారు. అర్చావతారము అంతగొప్ప అని వారి భావన. గుణపూర్తి అర్చావతారానికే చెల్లింది.

అందుకే తిరుమంగై ఆళ్వారు నాయికావస్థను పొందినా, రాయబారాలు పంపినా, మడల్-ఎత్తినా- (నాభర్త నన్ను బాగా చూడడం లేదని వీధిన పడినా) శరణాగతి చేసినా, అన్ని పనులు అర్చామూర్తిని ఉద్దేశించి చేసినవే. అంతేకాదు. 108 దివ్య తిరుపతుల పెరుమాళ్ళకు మంగళాశాసనం చెయ్యాలని వీరి కోరిక. అందుకే 108 తిరుమొళ్ళిలతో పెరియ తిరుమొళ్ళికి అనే ప్రబంధం రచించారు. ఒకొక్కరికి ఒక పదంతో, ఒక్కొక్కరికి ఒక పాదంతో, ఒక్కొక్కరికి ఒక పదితో- ఇలా మంగళాశాసనాలు చేసిన తిరుమంగై ఆళ్వారు ఇద్దరు దివ్యదేశాధిపతులకు మాత్రం నూరు పాశురాలతో మంగళాశాసనం చేశారు. ఆ ఇద్దరెవరు?

7 సం॥లలో CA/CWA లలో అత్యధిక ఆలిండియా ర్యాంకులు మరియు పాస్ పర్సెంటేజ్ సాధించిన
నెం.1 కామర్స్ విద్యా సంస్థ
ఆంధ్రప్రదేశ్‌లోనే అత్యుత్తమ ఉత్తీర్ణతతో పాటు ర్యాంకులు సాధిస్తున్న ఏకైక అగ్రగామి కామర్స్ విద్యా సంస్థ
2012 Jr.MEC లో స్టేట్ 1st RANK 490/500
K. VYSHNAVI
No.1 for ▸ Inter(MEC / CEC) ▸ CA/CWA
శ్రీMEDHA
Igniting Intelligence. Delivering Excellence.
Head Office: 6/9 Brodipet, Vuda Office Road, Guntur-2. Ph: 22 55 891 / 988 52 49166
Branch Office: Sriya Towers 2nd Floor, Besides Income Tax Office, Near Sidhardha Public School, Mogalrajpuram, VIJAYAWADA Ph:9248920266

తిఱుక్కణ్ణమంగైయూర్‌నంబి వీరికి పంచసంస్కారములు అనుగ్రహించిన మహనీయులు. అలాగే తిరుక్కణ్ణపురం శౌరిరాజ పెరుమాళ్ మంత్రోపదేశం చేసిన ఆచార్యులు. వీరి గురించి ఎక్కువ పాశురాలు రచించారు.

తిరువాలి తిరునగరిలో వయలాళి మణవాళన్ వద్ద మంత్రోపదేశం పొంది–"వాడినేన్...నాన్ కణ్డుకొణ్డేన్ నారాయణా ఎన్నుమ్ నామమ్"– అన్నారు గదా... మరి తిరుక్కణ్ణపురం అంటున్నారేమిటంటే–వయలాళి మణవాళన్ దగ్గర, కేవలం మంత్రోపదేశం మాత్రం పొందారు. అర్థాన్ని తెలుసుకోవాలని శ్రీరంగనాథుని–"తుళఙ్గునీణ్ముడి... తిరువరఙ్గత్తమ్మానే (పె.తి)" అంటూ ప్రార్థించారు. అపుడు శ్రీరంగనాథుడు ఆళ్వార్లతో "నమ్ముడైయ కీర్త్ విట్టిలే శొల్లుకిఱోమ్"– తిరుక్కణ్ణపురంలో ఉపదేశిస్తాను అని చెప్పారు. వెంటనే ఆళ్వార్లు స్వామి ఆజ్ఞతో తిరుక్కణ్ణపురం చేరారు. శ్రీశౌరిరాజ పెరుమాళ్ళ నాశ్రయించారు. తిరుమంత్ర అర్థాన్ని కాలక్షేపంగా విన్నారు. కృతజ్ఞతతో ఆ స్వామిని గూర్చి పాశురాలు పాడారు.

తిరుమంగై ఆళ్వారు కేవలం మానసికంగా దివ్యదేశ పెరుమాళ్ళను భావించి మంగళాశాసనం చెయ్యలేదు. ఒకొక్క దివ్యదేశానికి స్వయంగా వెళ్ళారు. అక్కడి అర్చామూర్తిని ప్రత్యక్షంగా దర్శించారు. వారికి మంగళాశాసనాలు చేశారు. అధిక జ్ఞాన మూర్తులైయారు. 83 దివ్యదేశాలను సేవించి మంగళాశాసనం చేశారు.

వదరి వణఙ్గుదుమే అని బదరీక్షేత్ర దర్శనాన్ని వీరు నిర్దేశించారు. **నైమిశారణి యత్తుళెన్దాయ్** అంటూ నైమిశంలో అరణ్య రూపుడై ఉన్న స్వామికి మంగళాశాసనం చేరారు. కుళిర్ మామలై వేఙ్గడవా! అంటు తిరుమలలో నిత్యనివాసం చేసే శ్రీనివాసుని ప్రార్థించారు.

ఆయన ఏ పనిచేసినా ఎలా భావించినా అన్నీ శాస్త్ర సమ్మతాలే అయ్యాయి. భగవన్ ముఖోల్లాసం కోసం చేసిన చోరత్వాదులు కూడా పాపహారకాలు, ఆదరణీయాలే అయ్యాయి.

తిరుమంగై ఆళ్వార్లు కొంతకాలం శ్రీరంగంలోనే స్వామి సేవలో గడిపారు. శ్రీరంగనాథుని ఆజ్ఞను పొంది తిరుక్కురుంగుడి చేరారు. నిన్ఱనమ్బి, ఇరున్దనమ్బి, కిడన్దనమ్బి, తిరుప్పాఱ్కడల్‌నంబి, మలైమేల్‌నంబి అనే పంచనంబులను సేవించారు. అழగియనంబి శ్రీపాదాలనే ఆశ్రయించారు. స్వామి సేవలో తరించి పరమపదానికి వేంచేశారు.

వీరు అవతరించిన దినములనుండి శ్రీకూరత్తాళ్వారుల అవతార నక్షత్రం వరకు ద్రావిడ వేదానికి నిగమనము అంటే అనధ్యయనము–అంటే (చదువనికాలము) అని ఒక నియమం ఏర్పడింది.

ఈయన నాల్గువిధాల కవిత్వం చెప్పడంలో నేర్పరి. యమక కవిత్వం, మధురకవిత్వం, చిత్రకవిత్వం, విస్తారకవిత్వమనే నాల్గుకవితా పద్ధతులలో వీరు రచనలు చేయడంవలన "చతుష్కవి శిఖామణులు" అనే బిరుదు వీరిని వరించింది. వీరు 105 సంవత్సరాలు జీవించారు.

నీలురు, పరకాలురు, కలివైరి, తిరుమంగైమన్నన్, తిరుమంగై ఆళ్వార్, మొ॥ ప్రసిద్ధ నామాలలో కొన్ని. వీరి ప్రబంధాలు

1. పెరియతిరుమొழி 2. తిరుక్కురున్దాణ్డకమ్, 3. తిరునెడుందాణ్డకమ్, 4. తిరువెழுక్కూత్తిరుక్కై, 5. శిఱియ తిరుమడల్, 6. పెరియ తిరుమడల్– అనేవి. ఇవి, సంస్కృతవేదాలు నాల్గింటికి ఆరు అంగాలున్నట్లు, నమ్మాళ్వార్ల నాల్గు ద్రవిడవేదాలకి, ఆరుఅంగాలుగా నిర్ణయింపబడ్డాయి.

భగవద్రామానుజులు శ్రీరంగనాథుని ఆజ్ఞను అనుసరించి వీరి అవతార స్థలమైన 'తిరుక్కుఱయలూరు' లో వీరికి ఆలయ, మండప, ప్రాకారాదులు నిర్మింపచేశారు. వీరికి, కుముదవల్లి నాచ్చియార్‌కి అర్చావిగ్రహములు ప్రతిష్ఠింప చేశారు. నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, అయనోత్సవ, సాంవత్సరికోత్సవాదులు అతి వైభవంగా జరిపించి, అలా జరిగేలా శాశ్వతమైన ఏర్పాటు గావించారు. శ్రీతిరుమంగై ఆళ్వార్ వైభవం ఎంత చెప్పుకున్నా అయిపోయిందని అనిపించేది కాదు. అలాంటి మహనీయుల శ్రీచరణాల సేవలో మన జీవితాలను ఆనందంగా గడిపి, వారి సాహిత్య మాధుర్యాన్ని ఆస్వాదిస్తూ, శ్రీరంగనాథ, భగవద్రామానుజాదుల మంగళాశాసనాల్ని అందుకొందాం!

**తిరుమంగై ఆళ్వార్ల తిరునక్షత్ర తనియన్**

శ్లో॥ వృశ్చికే కృత్తికాజాతం చతుష్కవి శిఖామణిమ్ ।
షట్ ప్రబంధకృతం శార్ఙ్గమూర్తిం కలిహ మాశ్రయే ॥

**నిత్యతనియన్**

శ్లో॥ కలయామి కలిధ్వంసం కవిం లోక దివాకరమ్।
యస్య గోభిః ప్రకాశాభిః ఆవిద్యం నిహతం తమః ॥

*(సంపూర్ణమ్)*

అదృష్ట రత్నాలు ధరించండి! అనుకున్నది సాధించండి!
శ్రీ సాయి
పవిత్ర డైమండ్స్
4/7, బ్రాడీపేట, ఖజానా జ్యూయలర్స్ ప్రక్కన, గుంటూరు. సెల్: 9246410099, ఫోన్: 2262626.
బి/3, జైహింద్ కాంప్లెక్స్, గ్రౌండ్‌ఫ్లోర్, యాక్సిస్‌బ్యాంక్ ప్రక్కన, గవర్నర్‌పేట, విజయవాడ. సెల్: 9246310099, ఫోన్: 6665011.
సంపూర్ణ జ్యోతిష్యం చూడబడును
నాణ్యమైన జాతిరత్నాలు
జెమ్ టెస్టింగ్ ల్యాబ్
కెంపులు పచ్చల పూసలు
మంచి ముత్యములు, పగడములు
శివస్వరూపమైన రుద్రాక్షలు
స్ఫటికమాలలు
1 గ్రామ్ గోల్డ్ ఇమిటేషన్ జ్యూయలరి



# అహో! భారతమ్

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

*గత సంచిక తరువాయి*

ఆటకి రమ్మని పిలిచిన తరువాత వెనుకంజవేసే అలవాటు నాకులేదు. విధి బలీయం. సరే ఆట మొదలు పెడదాం. శకుని, వివింశతి, చిత్రసేనుడు, వికర్ణుడు-వీరంతా చుట్టూ చేరారేమిటి? వీరిలో నాతో జూదమాడే వారెవరు? అన్నాడు ధర్మరాజు. ఇదిగో నా పక్షాన మా మామ శకుని నీతో జూదమాడతాడు. కాదనకు అతడు ఏవస్తువులు పణంగా ఒడ్డినా నేను తప్పకుండా ఇస్తాను అన్నాడు దుర్యోధనుడు.

అదేమిటి? ఎవరికి వారే ఆడాలి గాని, ఒకరి పక్షాన ఒకరు ఆడడం అక్రమం కదా అన్నాడు ధర్మజుడు. తన కిష్టమైనట్లు పాచికలు రూపొందించుకొని మోసంగా ఆడే జూదరి శకుని అని అతనికి తెలుసు. మరి తెలిసినపుడు ఆడనని, మానేయవచ్చుకదా..... ఉహూ....అదిగో-అదే వ్యసనం. ఇది ఎంతో బలీయమైనది ఆ విషయం ఇక్కడ స్పష్టంగా తెలుస్తోంది. అక్రమమని, అన్యాయమని తెలిసీ కూడా ధర్మరాజు జూదానికి సంసిద్ధుడవడం విధి గొప్పదనాన్ని, మనిషి బలహీనతని చాటుతోంది.

జూదం ప్రారంభమయింది. అంధరాజు ఆరాటం రెట్టింపు అయింది. విషయం తెలిసిన రాజులంతా హడావిడిగా సభలో చేరారు. విషాదం నిండిన మనస్సులతో భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, విదురుడు ఎలాగో తమ ఆసనాలు చేరుకున్నారు. అక్ష తత్త్వవేత్త శకుని వంకర నవ్వుతో పాచికలు తీసుకున్నాడు. దుర్యోధనుడు చేతి రత్నాల కంకణాలు తీశాడు. ఒకరికై వేరొకరితో ఆటా...అనుకుంటూ.... అంటూ ఉత్తమోత్తమములైన మణులు పొదిగిన బంగారు హారాన్ని మెడలోనుండి తీసి ముందు పడేశాడు ధర్మరాజు. పందెం చెప్పడం...ఓడిపోవడం తృటిలో జరిగిపోయింది.

శకునీ...,ఏదీ...,మళ్ళీ పందెం వేస్తున్నా ఇదుగో, హిరణ్యభాండాలు, రత్నభాండాలు...ఊ కానీ....

ఇదుగో..., నేనే గెల్చాను...చూడు..నవ్వాడు శకుని. ఆ....అయితే ఏం మేమిక్కడికి వచ్చిన జైత్రమనే రథం-ఇది వేయిరథాలతో సమానం తెలుసా. బంగారు మువ్వలతో, మేలు జాతి గుర్రాలతో....అబ్బ...అద్భుత రథం...పందెం ఏదీ వెయ్యి...,

అహా..., వేయ్...వేశా ఓడిపోయావు యుధిష్ఠిరా... ఇదీ ఓడిపోయావు... హ...హ...హ...

ఎంతమోసం శకునీ...నీ ఆట...అయినా పర్వాలేదు. లక్ష... ఒక లక్షమంది స్త్రీలు, దాసీలు.., 64 కళలతో నేర్పరులు. సంగీత నృత్యాలలో ఆరితేరినవారు రాజసేవకులే...వారంతా నా ధనమే...ఒడ్డాను...ఏదీ...

"అయిపోయావు ధర్మరాజా..., ఈ సారి కూడా ఓటమి నిన్ను వరించింది. వక్రంగా కనుబొమ్మలు తిప్పాడు శకుని.

క్రోధం పెరిగిపోతోంది ధర్మరాజుకి ఈ దాసీలుపోతే అయిపోయిందా-లక్షల మంది దాసజనం రాత్రింబవళ్ళు పాత్రలు చేతబట్టి అతిథులకు భోజనం పెట్టేవారే వీరంతా ఊ....కాస్కో...

ఆ....ఆ....చూస్కో....అయిపోయింది ఇది కూడా ఎంతమోసం, ఎంతమోసం, అయితేనేం...మళ్ళీ పందెం ఒదులుతున్నా...వేల మదగజాలు. ఆడ...మగ... ఏనుగుల సంపద ఒడ్డేశా"... "ఓడిపోయావ్....ఓ...డి...పోయావ్.

రథికులు....అది గోవిందా

గంధర్వ అశ్వాలు...అయిపోయాయి...గోవిందా... శూరులు-వీరులు....ఆహా...ఓటమి రుచి చూశారులే.

ఆ...అయితే బంగారు నిధులతో పాత్రలు...వెయ్యి....

ఆ...ఆ... అమ్మయ్య..., అవీ, నా సొంతమయ్యాయి

An.Y. ఆర్థోఫిట్ సిరప్
అన్ని రకముల జాయింట్ నొప్పులకు
సరికొత్త పరిష్కారం
సత్వర నివారణకు అద్భుత ఆయుర్వేద ఔషధం
Also available as Oil & Capsules
ఇది ఫిజికెమ్ వారి ప్రతిష్ఠాత్మక ఉత్పాదనలలో ఒకటి
ORTHO Fit
ఇంటింటా ఆర్థోఫిట్ నొప్పులన్నీ ఫటాఫట్

చూస్తున్నాడు విదురుడు. మహారాజా! నేనేం చెప్పినా నీకు నచ్చదు. అయినా చెప్తున్నా. ఈశకుని మోసం, నీ కొడుకు దోషం కలిపి వంశనాశనానికి దారి తీస్తోంది. నీ కొడుకు పుట్టినప్పుడే నక్కల ఏడ్పులా ఏడ్చాడు. ఎన్ని చెడు శకునాలు కలిగాయో గుర్తుందా, వీడు ఆ మాయావి శకుని వలన, మోసం చేసి గెలుస్తున్నాడు. ఇది ధర్మంకాదు. వీడు, పేట్రేగి పోతున్నాడు. ఆపు ఎక్కడో ఒకచోట ఆగాలి. అర్జునుడు వాణ్ణి ఆపగలడు. కులం కోసం ఒకణ్ణి విడిచిపెట్టడం ధర్మం..., రాజా..నువ్వు అధర్మాన్ని ప్రోత్సహించకు. **<u>జూదం కలహాలకి మూలం.</u>** శత్రుత్వానికి ఇది గొప్పదారినిస్తుంది. అధః పతనం తప్పదు. మీరు ఆ దృష్టితోనే దీనిని ఏర్పాటు చేశారు గదా! ఇది కపటద్యూతం. న్యాయంగా సాగట్లేదు ఆపించు.... ఆపించవయ్యా".... ఏమీ వినబడనట్లు కూర్చున్నాడు అంధరాజు. ఉడికిపోయాడు విదురుడు. దుర్యోధనా–నామాటలు వినబడడం లేదా... ఇలా మోసంతో గెలవడం వీరులకి తగినపనా? చేస్తే బలంతో యుద్ధం చెయ్యాలి గాని, మోసం, కపటం, జూదం...ఇదా పద్ధతి–చెప్పు హుంకరించాడు. ముఖం కందగడ్డే అయింది దుర్యోధనునికి–చాలు.. చాలు.. ఆపింక. నువ్వెప్పుడూ నాశత్రువులను పొగిడేవాడవే. పాండవ పక్షపాతివే. మాలో తప్పులు వెదకడమే నీపని. కూర్చో... మాకు నీ సలహా అవసరం లేదు. విన్నాడు విదురుడు. ఔనులే... ధృతరాష్ట్రుని మీద ప్రేమతో నేను ఈ అధర్మం వద్దంటున్నాను. అది నీ కర్థం కావడం లేదు. నేను మంత్రిని. కపటజూదాన్ని అడ్డుకొనడం నా కర్తవ్యం చెప్పవలసినది చెప్పాను... మౌనం చోటు చేసికొంది. మామా! కానీ..., అరిచాడు దుర్యోధనుడు.. ఆ...ఆ.. ఇదుగో...ధర్మరాజా! ఇటుచూడు సంపదలన్నీ అయిపోయాయికదా– ఇంక ఒడ్డడానికి పాపం ఏమున్నాయి... చెప్పు అంటూ పాచికలు పక్కకి విసిరి, ఆట మానేసినట్లు కూర్చున్నాడు...

ఏయ్....నారాజ్యం...ధారుణీతలం... అంతా ఒడ్డేస్తున్నా వ్యసనం తలకెక్కిపోయింది...

ఓహో...అయిందా...చూడు చూడు...అదీ ఓడిపోయావు.. ధ...ర్మ...రా...జా...అ...దీ...అ..దీ.. అబ్బ...హ.... హ... హ్హ... కోపవశుడయ్యాడు ధర్మరాజు.. దానాలిచ్చినవి కాక, మిగిలిన భూములు, ఇంకా సామాన్యజనులు.....ఇంకే.....

ఓ...ఊ...ఓడావు...అవీ ఓడావు..."మరి ఇదుగో"... నా సోదరులు సహదేవ, నకుల, అర్జున, భీమసేనులు నలుగురినీ... ఒడ్డేస్తున్నా....

ఉత్కంఠతతో పైకి లేచాడు దుర్యోధనుడు–ఓరకంటచూచి పందెంవేశాడు మామ...."వేయ్, వేయ్...ఆ వీరులంతా... మావశమయ్యారు.

అయితే... నేనే స్వయంగా నన్ను నేనే ఒడ్డుకుంటున్నా... .ఆ...అక్కడా...ఓడిపోయానా... హతవిధీ...."

ఇలా చూడు ధర్మరాజా....అప్పుడే నిన్నెందుకు ఒడ్డావు? నీకు ఇంకొక ధనం మిగిలి ఉందిగా మరిచిపోయావా? నే జ్ఞాపకం చెయ్యనా...అదే...మీ అందరి ప్రియురాలు, భార్య...ద్రౌపది... ద్రుపదరాజపుత్రి ఆవిడ నీధనం కాదా ఏమిటి? తల భూమిలోకి దిగిపోతోంది ధర్మరాజుకి. ఓటమి..ఓటమి..ఓటమి, ఈ సారి ఎలాగైనా గెలవాలి ఔను ద్రౌపదిని పణంగా పెట్టిగెలుస్తాను. దుర్యోధనా...పాంచాలిని ఒడ్డుతున్నాను.

కక్షతో కూడిన ఆనందం దుర్యోధనుని పెదాలపై నిండింది. తల ఎగిరేసి, కనుబొమ్మలెగరేసి పాచికలు మోసంగా దొర్లించి ధర్మజా....ఓడిపోయావ్...యుధిష్ఠిరా... అదీ పూర్తయింది. దుర్యోధనా.... అంటూ కళ్ళెగరేశాడు శకుని. ఇంకేముంది ఆడడానికన్నట్లు చూశాడు. గర్వం, కోపం, దిగిపోయి, దైన్యం నిండి తలవంచాడు ధర్మజుడు. ధర్మపత్నిని ఓడిపోయేదాకా లాగి పడేసింది అతని వ్యసనం. ఆహా–వ్యసన పరుడైన వాని జీవితం ఎలాంటి హీనస్థితిని తెస్తుంది! అదే వ్యసన మహిమ!

కురు వృద్ధులంతా నిశ్చేష్టులయిపోయారు. నోటమాట రావడం లేదు. వారికళ్ళు శ్రావణ మేఘాలయ్యాయి. సభలో కలకలం– కౌరవేశ్వరుని సంభ్రమం–అంధరాజు ఆ అలజడి విని–ఏమయింది? ఎవరేమి ఒడ్డారు? ఎందుకింత కలకలం, అంటూ మహా ఉత్సాహాన్ని ప్రదర్శిస్తున్నాడు.

చెలరేగుతున్నాడు దుర్యోధనుడు. ఆ పాం...చా...లి నన్ను చూచి నవ్వడమా...ఇప్పుడు చెపుతా...విదురా...ఒక్క అరుపు అరిచాడు. అతనికి తండ్రి మాటే లేదు. విజయగర్వం. విదురా...వెళ్ళు...నా ఇల్లు శుభ్రం చేయడానికి ఆ ద్రౌపదిని–ఆ దాసిని తీసుకొనిరా...ఊ".....గర్జించాడు.

"ఛీ! ఇదా నీ అహంకారం! ఇలాంటి దౌర్భాగ్యపు పనికి నన్ను...న..న్ను పంపిస్తావా మూర్ఖుడా..! ద్రౌపది అంటే ఎవరనుకున్నావ్....ఈ భూసామ్రాజ్యానికే పట్టమహిషి కావలసిన పవిత్రమూర్తి– పాండవుల ధర్మపత్ని. ఎంత మోసం చేసి జూదమాడావు! ఎంత కపటం చేసి ఈ శకుని జూదంలో గెలిచాడు! మీ మోసానికి, మీ కపటబుద్ధికి, మీ దురాలోచనకి ఫలం అనుభవిస్తావు....దుఃఖంతో ఆగాడు విదురుడు.

ఛీ....ఈ విదురుడెప్పుడూ ఇంతే. పాండవులంటే ఇష్టం. మనని ఎప్పుడూ తిడుతూనే ఉంటాడు. తీసెయ్ ఆయనమాట. ప్రాతికామీ! ఇలా రా....దణ్ణం పెడుతూ వచ్చాడు సూతనందనుడు ప్రాతికామి.

*(సశేషం)*

# ఉపనిషత్ కథలు

## నచికేతోపాఖ్యానం-1

శ్రీమాన్ కోటేటి రామకృష్ణమాచార్యస్వామి - హైదరాబాద్

నచికేతోపాఖ్యానం కఠోపనిషత్తులో చెప్పిన కథ. కఠోపనిషత్తు అనేది కృష్ణయజుర్వేదం లోనిది. ఈ ఉపనిషత్తు రెండు భాగాలుగా ఉంటుంది. ప్రతి భాగాన్ని మూడు వల్లులుగా విభజించారు. ఇదే నచికేతోపాఖ్యానం తైత్తిరీయ బ్రాహ్మణంలో కూడా ఇవ్వబడింది. ఇదే మహాభారతంలో కూడా చెప్పబడింది. అయితే తైత్తిరీయ బ్రాహ్మణంలో చెప్పిన కథకి, మహాభారతంలో చెప్పిన కథకి పూర్వరంగంలో కొద్ది తేడాలు కనబడినా మౌలికమైన భేదాలేమీ లేవు. ఈ స్వల్ప భేదాలు కూడా కల్ప భేదాలు కావచ్చును. కాని ఈ గ్రంథంలో వివరించినది మాత్రం కఠోపనిషత్ లో చెప్పబడిన కథా భాగమే.

ఈ కథలో అంశాలు వైదికమైన యజ్ఞాలు ఆచరించగానే సరిపోదు. వాటిని ఆచరించేటప్పుడు మనకి సాత్త్వికమైన శ్రద్ధ కూడా ఉండాలి. అలాకాకపోతే ఆ యజ్ఞాలు నిష్ఫలమైపోవచ్చును. అంతేకాదు పితృభక్తి పరాయణుడైన వాడికి కలిగే శక్తి అంతా ఇంతాకాదు. అది యమధర్మరాజునే విచలితుణ్ణి చేస్తుంది. ... లోకంలో అందరిచేత గౌరవింపబడతారు. ఈ నచికేతోపాఖ్యానంలో కథాంశం ఇదే.

పూర్వం వాజశ్రవుడనే ఒక మహర్షి ఉండేవాడు. ఆతడు తన దగ్గర ఉన్న ధనమంతా ఖర్చు చేస్తూ నిరతాన్న దానాన్ని చేసేవాడట. అన్నాన్ని **"వాజమని"** సంస్కృతంలో అంటారు. అందుకే శ్రవస్సంటే కీర్తి. అన్నదాన మూలంగా పొందిన కీర్తికలవాడు వాజశ్రవసుడు. ఈతనిని వాజశ్రవుడని అంటారు. ఆతనికి ఒక కుమారుడున్నాడు. అతడే వాజశ్రవసుడు. ఈ వాజశ్రవసుడు ఒక యజ్ఞాన్ని చేస్తున్నాడు. దానిని **'విశ్వజిత్'** అని **"సర్వవేదసం"** అని అంటారు.

సర్వవేదసం అంటే తన సర్వాన్ని ధారపోయవలసిన యజ్ఞమన్నమాట. ఈ యజ్ఞాన్ని ఊర్ధ్వలోకాలమీద కోరికతో చేస్తారు. ఈ వాజశ్రవసుని పుత్రుడే నచికేతుడు. పదిహేను సంవత్సరాల ప్రాయము కలవాడు.

ఈ యజ్ఞం చేసిన వారు తనకు గల సర్వస్వాన్ని ఋత్విక్కులకు, వేద పండితులకు దక్షిణగా ఇచ్చి వేయాలి. అందుకు ఈ వాజశ్రవసుడు తనకు గల సమస్త గోవులను దానం చేస్తున్నాడు. ఆ దానంలో ఆతడు దానం చేస్తున్న గోవులను ఇలా వర్ణించారు. వాటిలో కొన్ని 'పీతోదకాలు'. ఇవి గతంలో నీళ్లు తాగేవి. ఇప్పుడు నీళ్లు తాగడానికి కూడా ఓపిక లేనివి.

మరి కొన్ని **'జగ్ధతృణాలు'.** అంటే ఇవి గతంలో గడ్డిమేసేవి, ఇప్పుడు గడ్డి కూడా మేసే శక్తి లేనివి. మరి కొన్ని **'దుగ్ధదోహాలు'.** అంటే ఇంతకుముందు పాలిచ్చేవి. ఇప్పుడు వట్టిపోయినవి. అవి **'నిరింద్రియములు'.** అంటే అవి చూడుతో ఉండడానికి అసమర్ధమైనవి. అంటే ఈ దానమిచ్చే గోవులన్నీ ముసలివి, ఎందుకూ పనికిరానివి. ఆతని వద్ద మంచిగోవులు లేకపోవడం వల్లనే ఇలాంటి ఆవులు దానాలు చేస్తున్న తండ్రిని నచికేతుడు చూచాడు. అది చూచి చాల ఆవేదన చెందాడు. "అయ్యో! ఇటువంటి దానాలు చేసి, నా తండ్రి యజ్ఞఫలమైన స్వర్గానికి దూరమవడమే కాక 'అనందములని' చెప్పబడే నరకలోకాలకి పోవలసిస్తుందే" అని బాధపడ్డాడు. తన తండ్రికి కావలసిన యజ్ఞఫలం దక్కించడానికి, రాబోయే అనిష్టాన్ని తప్పించాలని భావించాడు నచికేతుడు. తాను కూడా దాన వస్తువులలో చేర్చబడితే తన తండ్రికి యజ్ఞఫలం దక్కుతుందని భావించి, తండ్రితో ఇలా అన్నాడు.

**నచికేతు** : తండ్రీ! నన్నుకూడా ఒక యోగ్యుడైన ఋత్విక్కుడికి దానం చేయండి.

**తండ్రి** : (సమాధాన మీయలేదు)

**నచికేతు** : తండ్రీ! నన్ను కూడా దాన వస్తువుగా దానం చేయండి.

**తండ్రి** : (విననట్లే నటించాడు)

**నచికేతు** : తండ్రీ! నన్నెవరికి దానమిస్తున్నావు?

**తండ్రి** : (కోపంతో) నిన్ను ఆ యముడికి దానమిస్తున్నాను ఫో...! (అని గట్టిగా అరచాడు)

**నచికేతు** : "తండ్రీ ! నీవు నన్ను యముడికి దానమిచ్చాను అంటున్నావు. నేను యముడి దగ్గరకు వెళ్ళడానికి కూడా సంశయించను. కాని నా చింతల్లా ఏమిటంటే అన్ని కోరికలు తీరిన యముడికి నా వల్ల ఏం ప్రయోజనం ఉంటుందా అని చింతిస్తున్నాను."

అలా అన్న నచికేతుడు, ఉద్దాలకుడు ఏదో కోపంతో యముడికిస్తానన్నా, నిజంగా తనని యముడి వద్దకు పంపడం ఇష్టం లేదని తెలుసుకున్నాడు.) "తండ్రీ! మన వంశంలో ఎవరూ ఆడి తప్పిన వారు లేరు. అందుకని మనం కూడా ఆడి తప్పరాదు. నన్ను యముడి దగ్గరికి పంపు. నీవు అలా పంపక పోయినా ఎప్పటికి మనం భూలోకం లోనే ఉండిపోలేము కదా! అందుకే నన్ను యముడి దగ్గరకు దయచేసి పంపు." నచికేతుని మాటలకు కలవరపడిన తండ్రి ఉద్దాలకుడు చాల బాధపడుతూనే తన అంగీకారాన్ని తెలిపాడు.

అక్కడి నుండి బయలుదేరి నచికేతుడు యమలోకానికి వెళ్లాడు. తాను యమలోకానికి వెళ్లిన సమయానికి అక్కడ యముడు లేడు. యముడు ఎన్నో నరకలోకాలకు అధిపతి. నెలలో చాలా రోజులు తన నరక లోకాలను సందర్శిస్తూ సంచారం చేస్తుంటాడట. నచికేతుడు వెళ్లినప్పుడు యముడు లేకపోయే సరికి యమధర్మరాజు కొరకు ఆతడు మూడు రోజులపాటు నిరాహారుడై ఉపవాసం చేస్తూ వేచియున్నాడు.

యముడు తిరిగి రాగానే నచికేతుని గురించి యమలోక కింకరులు ఇలా చెప్పారు. "యమరాజా! మన లోకానికి అతిథిగా వచ్చిన ఈ బ్రాహ్మణ బాలకుడు అగ్నిలాంటివాడు. అటువంటి బ్రాహ్మణుని ఎవరైనా అనాదరం చేస్తే ఆ గృహస్థుడు దహింపబడతాడు. ఈ బ్రాహ్మణుడు నీ నుండి అర్ఘ్యపాద్యాది ఉపచారములు గ్రహించడానికి అర్హుడు. కాని ఇతడు నీ కై వేచి యుండి గత మూడు రోజుల బట్టి ఉపవాసం చేస్తున్నాడు. ఇలాంటి బ్రాహ్మణుడు ఎవరింట్లో ఉపవాసం చేస్తాడో, అతడు ఆ గృహస్థు పుణ్యాలన్నింటిని అపహరిస్తాడు. ఆతని ఐశ్వర్యాన్ని అంతటిని హరించివేయగలడు. కాబట్టి జలములను తెప్పించి ఈతనిని సత్కరించు." అప్పుడు యముడు నచికేతుని వద్దకు వెళ్లి నమస్కరించి ఇలా అన్నాడు. "ఓ బ్రాహ్మణోత్తమా! నీకు నమస్కారము. నా ఇంటికి అతిథిగా వచ్చి మూడు రోజుల బట్టి ఉపవాసం చేస్తున్నావు. ఇది నాకు దోషం, అపచారం. దీనికి పరిహారంగా నీకు మూడు వరాలనిస్తాను, కోరుకో. దీని వలన నాకు అపయశస్సు తొలగి క్షేమం కలుగుతుంది." *(సశేషం)*


జై శ్రీమన్నారాయణ!

పరమహంస పరివ్రాజకులు

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి ప్రత్యక్షపర్యవేక్షణలో...!

సర్వారిష్టశాంతి, నక్షత్రగ్రహానుకూలతాసిద్ధిప్రద

**శ్రీయాగం**

**23.11.2014 నుండి 2.12.2014 వరకు**

**PWD గ్రౌండ్స్, విజయవాడ, ఆంధ్రప్రదేశ్.**

**2.12.2014**

**గీతాజయంతి**

సందర్భంగా సామూహిక "భగవద్గీతపారాయణము"

**భగవద్బంధువులకు స్వాగత సుమాంజలి**

రండి! కార్యక్రమంలో అన్వయించండి!! ప్రకృతిని ప్రసన్నంచేసుకుందాం!! రండి

శ్రీరామాయణంలో

# నవవిధ సంబంధాలు

గత సంచిక తరువాయి **ఈ.ఎ. సింగరాచార్యులు - తిరుపతి**

6. జ్ఞాతృ-జ్ఞేయసంబంధం అయిదవది. ఇది ప్రణవంలోని మకారంద్వారా సూచితం. ఈమకారాన్ని " మన-జ్ఞానే" అనే ధాతువునుండి "మను-అవబోధనే" అనే ధాతువు నుండి గాని పుట్టినపదంగా గ్రహించినపుడుఈసంబంధం వ్యక్తమవుతుంది. శ్రియః పతి అయిన భగవానుని లక్ష్యంగా కల్గిన జ్ఞానమే- శ్రియఃపతి పరతత్త్వమనే జ్ఞానమే-యథార్థజ్ఞానం. అందువల్ల జ్ఞేయ స్వరూపుడు భగవానుడే. ఈసంబంధాన్ని "నిదిధ్యాసితవ్యః ఇత్యాది శ్రుతులు," "ధ్యేయోనారాయణస్సదా" (నారాయణుడు సదా ధ్యానించదగినవాడు) ఇత్యాది ఉపబృంహణాలు, "ఎన్ ఉణర్వినుళ్ళే ఇరుత్తినేన్" (నాజ్ఞానానికి నిన్ను విషయంగా చేసికొన్నాను) అని "ఒణ్ తామరైయాళ్ కేళ్వన్ ఒరువనైయే నోక్కుమ్ ఉణర్వు" (జ్ఞానమనేది- లక్ష్మీదేవి వల్లభుని మాత్రమే లక్ష్యంగా కల్గినది) ఇత్యాది దివ్యసూరి సూక్తులు తెల్పుతున్నాయి.

శ్రీరామాయణంలో ఈసంబంధం విశ్వామిత్రమహర్షి వచనంద్వారా తెలుపబడింది. యజ్ఞసంరక్షణార్థం శ్రీరాముని విశ్వామిత్రుని వెంట పంపడానికి సందేహించిన దశరథునితో విశ్వామిత్రుడు "అహం వేద్మి మహాత్మానమ్ రామమ్" అని పల్కిన సూక్తిద్వారా ఈజ్ఞాతృజ్ఞేయ సంబంధం తెలుపబడింది. "అహం రామం వేద్మి" అంటే శ్రీరాముని నాజ్ఞానానికి విషయంగా చేసికొన్నానని కదా అర్థం. ఈజ్ఞానం ఎటువంటిది? అంటే "మహాత్మానం వేద్మి" అని విశేషించి పలుకబడింది. ఈవచనం "వేదాహమేతం పురుషం మహాన్తమ్" అనే పురుషసూక్త ప్రక్రియను అనుసరిస్తున్నది అని పెరియవాచ్చాన్‌పిళ్ళై తనిశ్లోకంలోని సూక్తి.

ఆరవది స్వ-స్వామి భావ సంబంధము. ఇది అష్టాక్షరిలోని నమః శబ్దం ద్వారా సూచితమైనది. "మః" అంటే- నేను నాసొత్తు అని అర్థం. "న" అనేది ఈభావాన్ని నివర్తింపజేస్తున్నది. అందువల్ల నమః అంటే నేను నాసొత్తు కాదు, భగవానుని సొత్తును. అతడే నాస్వామి అని భావం. ఈసంబంధాన్ని "ఈశానో భూత భవ్యస్య" (భూత భవిష్యత్తులకు స్వామి) ఇత్యాది శ్రుతులు "స్వత్వమాత్మని సంజాతం స్వామిత్వం బ్రహ్మణి స్థితమ్" (సొత్తుగా ఉండే స్థితి ఆత్మలో ఉన్నది, స్వామిగా ఉండేస్థితి పరబ్రహ్మలో ఉన్నది). ఇత్యాది ఉపబృంహణ వాక్యాలు, "ఉలకమ్ మూన్రు డైయుమ్" (ముల్లోకాలను సొత్తుగా కలవాడా) ఇత్యాది ఆళ్వార్ల సూక్తులు తెలుపుతున్నాయి.

ఈసంబంధం శ్రీరామాయణంలో లక్ష్మణుడు పల్కిన 'అహమస్యావరో భ్రాతా గుణైర్దాస్య ముపాగతః" అనే సూక్తిద్వారా బోధింపబడుతున్నది. "అఖిల జగత్ స్వామిన్" అనే శరణాగతి గద్యలోని సంబోధనను పెరియవాచ్చాన్‌పిళ్ళై "అపరాధత్తై త్తవిరప్పిత్తు అభిముఖ్యత్తై ఉణ్డాక్కి దేవర్ తిరువడికళిలే పుమరనిఱుత్తుకైక్కు వేఱునిర్వాహకరుణ్డో" (అపరాధాలను తీర్చి, అభిముఖ్యాన్నికల్గించి నీ శ్రీచరణాలలో ప్రవేశింపజేసి, నిలుపడానికి ఇంకొక నిర్వాహకులున్నారా!) అని వివరించారు. ఇందువల్ల జీవుల విషయంలో స్వామిత్వమంటే తనపట్ల వారికి గల ప్రాతికూల్యాన్ని పోగొట్టి, తనపట్ల ప్రీతిని కల్గించి, వారి నుండి కైంకర్యాన్ని గ్రహించడమే కదా! ఈభావం "అహమస్మి" ఇత్యాది ప్రమాణంలోని "గుణైః దాస్యముపాగతః" అనే ప్రయోగం ద్వారా ద్యోతకమవుతున్నది. దీనిని శరణాగతిగద్య వ్యాఖ్యలో శ్రుతప్రకాశికాచార్యులవారు శ్రీరంగగద్యలో దేశికులు ప్రమాణీకరించారు కూడా.

7. ఏడవది ఆధార-ఆధేయ సంబంధం. ఇది నారాయణ పదానికి చెప్పబడే తత్పురుష సమాసంద్వారా సూచింపబడుతున్నది. నిత్య వస్తువుల సమూహమైన నారాలకు అయనం-ఆధారమైన వాడనే అర్థాన్ని బట్టి ఈసంబంధం సూచితమవుతున్నది. ఇది "సదాయతనాః సత్ప్రతిష్ఠాః" ఇత్యాది శ్రుతులు, "మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ" (దారంలో మణుల సమూహంవలె నాలో ఈచరాచరాలు అన్నీ గుది గుచ్చబడి ఉన్నాయి) ఇత్యాది ఉప బృంహణవచనాలు, "మూవులగుమ్ తన్‌నెఱియా వయిత్తిల్ కొణ్డు" (ముల్లోకాలను ఏ అలసట లేకుండా తన ఉదరంలో గ్రహించి) ఇత్యాది దివ్యసూక్తుల ద్వారా ద్యోతకమవుతున్నది.



వ్యక్తిత్వ వికాసానికి ... నాణ్యమైన సాంకేతిక విద్యా బోధనకు
కళ్ళం హరనాథరెడ్డి ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ

శ్రీ కళ్ళం హరనాథరెడ్డి
ఛైర్మన్ : కళ్ళంగ్రూప్


బిటెక్ కోర్సులు
కంప్యూటర్ సైన్స్ అండ్ ఇంజనీరింగ్(సియస్ఇ)
ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ (ఇఇఇ)
ఎలక్ట్రానిక్స్ అండ్ కమ్యునికేషన్స్ ఇంజనీరింగ్ (ఇసిఇ)
సివిల్ ఇంజనీరింగ్ (సిఇ)
మెకానికల్ ఇంజనీరింగ్ (ఎమ్ఇ)
M.Tech :- CSE
మేనేజ్‌మెంట్ సీట్స్ కొరకు సంప్రదించండి : సెల్: 98856 04528, 94402 61773, 94910 73337.
EAMCET Code KHIT
NH- 5.10వ కి.మీ వద్ద, కళ్ళం స్పిన్నింగ్ మిల్స్ వెనుక, చిలకలూరిపేట రోడ్, చౌడవరం, గుంటూరు- 19. ఫోన్: 0863 2119726.
సిటీ ఆఫీస్: ఫస్ట్‌లైన్, గుజ్జనగుండ్ల సర్కిల్, గుంటూరు -6. ఫోన్: 0863 2272345.

శ్రీరామాయణంలో యుద్ధానంతరం బ్రహ్మ శ్రీరామునిస్తుతించే సందర్భంలో గల "త్వం ధారయసి భూతాని వసుధాం చ సపర్వతామ్" (నీవు సమస్త ప్రాణులను, పర్వతాలతో కూడిన చర్మమును ధరిస్తున్నావు) ఇత్యాది వచనాల ద్వారా తెలుపబడింది. ఇటువంటి వచనాలు ఈసందర్భంలో ఇంకా ఉన్నాయి.

8. ఎనిమిదవది ఆత్మాత్మీయ సంబంధం. ఇది నారాయణ పదానికి చెప్పబడే బహువ్రీహి సమాసం ద్వారా బోధింపబడుతున్నది. నారాలను అంటే నిత్యవస్తుసమూహాన్ని తనూ ఆధారంగా చేసికొని వాటిలో అంతరాత్మగా వ్యాపించి ఉంటాడనే అర్థం ద్వారా ఈసంబంధం భాసిస్తున్నది. "యస్యాత్మా శరీరం యస్యపృథివీ శరీరమ్" ఇత్యాది శ్రుతులు, "తత్ సర్వం వై హరేస్తనుః" (అది అంతా హరికి శరీరమే కదా) ఇత్యాది ఉపబృంహణ (విష్ణుపురాణ) సూక్తులు, "ఉమ్మియిర్ వీడుడైయాన్" (మీ ఆత్మలను శరీరంగా కలవాడు) ఇత్యాది ఆళ్వార్ల సూక్తులు దీనిని తెల్పుతున్నాయి.

ఈసంబంధం శ్రీరామాయణంలో యుద్ధకాండలో బ్రహ్మచేసిన స్తుతిలోని "జగత్సర్వం శరీరం తే" (జగత్తు అంతా నీకు శరీరం), "అశ్వినౌ చాపి తే కర్ణౌ చంద్రసూర్యౌ చ చక్షుషీ" "దృశ్యసే సర్వభూతేషు బ్రాహ్మణేషు చ గోషు చ" ఇత్యాదిగా గల పలువచనాలద్వారా వ్యక్తమైనది.

9. ఇక చివరిది భోగ్య-భోక్తృ సంబంధం. ఇది నారాయణ పదంపై వచ్చిన "ఆయ" అనే చతుర్థీ విభక్తిద్వారా సూచితం. "అహమన్న మహమన్న మహమన్నమ్" (నేను భగవానునికి అన్నం - భోగ్య వస్తువును) ఇత్యాది శ్రుతులు, "భోక్తారం యజ్ఞతపసామ్" (యజ్ఞాల, తపస్సుల భోక్త) ఇత్యాది ఉపబృంహణసూక్తులు, "ఉణ్డిట్టాయ్, ఇని ఉణ్డొళియాయ్" (నా ఆత్మను భుజించావు, ఇక పూర్తిగా భుజించు). "ఎన్నై మత్తుమ్ ఉయిరుణ్డ" (నా ఆత్మను పూర్తిగా అనుభవించిన) అనే దివ్యసూరి సూక్తులు నారాయణపదంపై గల చతుర్థీద్వారా వ్యక్తమయే జీవుని అనన్యభోగ్యత్వాన్ని సూచిస్తున్నాయి.

శ్రీరామాయణంలో ఈసంబంధం శత్రుఘ్నునిద్వారా తెలుపబడింది. కణ్ణినున్ శిరుత్తాంబు ప్రబంధావతారికలో నంబిళ్ళై, పెరియవాచ్చాన్ పిళ్ళై, నాయనార్ ప్రస్తావించిన శ్రీరామానుజులకు చెందిన ఒకవార్త ఇక్కడ స్మరణీయం. "శ్రీశత్రుఘ్నాళ్వాన్ పెరుమాళుక్కువల్లనానపడి- అవనైయల్లదఱియాద శ్రీభరతాళ్వానై యల్లదువేఱొన్ఱు అఱియాదపడి ఆనాన్- ఎన్ఱు ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్‌దార్" శ్రీశత్రుఘ్నాళ్వాన్ శ్రీరామునకు ప్రీతిపాత్రుడు ఎందుకు అయ్యాడు? అంటే శ్రీరాముని తప్ప వేఱొకరిని తెలియని వాడు శ్రీభరతాళ్వాన్. **ఆ చక్రత్తాళ్వాన్**ను తప్ప ఇంకొకరిని తెలియనివాడై శ్రీశత్రుఘ్నాళ్వాన్ ఉన్నందువల్ల అని శ్రీరామానుజులన్నారు అనేది ఈవార్త. దీనివల్ల తనూ ఆత్మ స్థానీయుడైన తన భక్తునిపట్ల, పరమభక్తినికల్గి ఉండేవారిపట్ల భగవానునకూ "మద్భక్తభక్తేషు ప్రీతిరభ్యధికా భవేత్" (నా భక్తులకు భక్తులైన వారి విషయంలో నాకు ప్రీతి మిక్కిలి ఎక్కువ) అనే రీతిలో చాలా ప్రీతి. ఇటువంటి వారిని చూచి భగవానుడు చాలా ఆనందపడతాడు. ఈజ్ఞానమే ఆత్మయాథాత్మ్యజ్ఞానం. పరమాత్మకు అత్యంతం ప్రీతికరమైన భాగవత శేషత్వపారతంత్ర్యాలను అనుష్ఠించి చూపినవాడు శత్రుఘ్నుడు కనుక, భోగ్య-భోక్తృ సంబంధం శత్రుఘ్నుని ఆచరణద్వారా సువ్యక్తమైనది. ఈవిషయాన్ని మన పూర్వాచార్యులు "భరతేన తదానఘః", "శత్రుఘ్నో నిత్య శత్రుఘ్నో నీతః ప్రీతి పురస్కృతః" అనే శ్రీరామాయణశ్లోకాన్ని ప్రమాణీకరించి, వ్యాఖ్యానించడం ద్వారా నిరూపించిన విషయం గమనార్హం.

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ
జీయరు స్వామి వారి ఆశీస్సులతో...
గోదావరి HDPE పైప్స్, స్ప్రింక్లర్స్ & డ్రిప్
GODAVARI POLYMERS
గోదావరి పాలిమర్స్ ప్రై.లి.
315, మినర్వా కాంప్లెక్స్, సరోజినీదేవి రోడ్, సికింద్రాబాద్ - 500 003, ఇండియా.
ఫోన్ : +91-40-27842092, 27897733, ఫ్యాక్స్ : +91-40-27819467
E-mail : homail@godavaripipe.com

## శ్రీస్వామివారి 58వ తిరునక్షత్ర సందర్భంగా...

## 58రోజులలో అద్భుత కైంకర్యం...!

చిరంజీవి గీతికా వాగ్దేవి శ్రీశ్రీశ్రీ స్వామివారి 58వ తిరునక్షత్ర సందర్భంగా 'వారిజ నేత్రవిద్యాలయ విద్యార్థుల తదీయారాధనకోసం' 58మంది ఉభయదారులనుండి సుమారు 6,00,000రూ॥ను సేకరించి, సమర్పించింది.

10వ తరగతి చదువుతున్న ఈ చిన్నారి 58రోజులలో ఈలక్ష్యాన్ని శ్రీశ్రీస్వామివారి మంగళాశాసనాలతో సాధించగలిగానని సంతోషాన్ని వ్యక్తపరచింది.

ఇది ఆదర్శంగా తీసుకొని శ్రీస్వామివారి మంగళాశాసనాలతో ఎవరైనా, దేనినైనా సాధించగలుగుతారని విశ్వాసం వ్యక్తం చేసింది. ఈ చిరంజీవి ఉత్సాహానికి, ఆసక్తికి మంగళాశాసనాలు చేస్తూ, 'యువత తలచుకుంటే, ఎన్నెన్నో మంచి కార్యక్రమాలు చేయగల'రన్నారు.

# తత్త్వరహస్యం

## శ్రీకృష్ణభగవానుడు గరుడునికి చెప్పిన రహస్యం

(గరుడ పురాణము ధర్మకాండము)

శ్రీమాన్ పురాణం వేంకటాచార్యులు

**వ్యాఘ్రీవాస్తే జరా చాయుః యాతి భిన్నఘటాంబువత్ ।**
**నిఘ్నంతి రిపువద్రోగాః తస్మాత్ శ్రేయః సమభ్యసేత్ ॥**

ముసలితనం ఆయువు పెద్దపులిలా పొంచివున్నది. పగిలిన కుండలో నీళ్ళలాగాను, ఒకప్రక్కన ఆయుర్దాయం తెలియకుండగానే ఖర్చుయిపోతోంది. ఇక రోగములు శత్రువుల్లాగ క్రుంగదీస్తున్నాయి. అందువల్ల శ్రేయోమార్గాన్ని వెతుక్కొని అలా చేసేందుకు అభ్యాసం చెయ్యాలి.

దుఃఖం రాకముందే, ఆపదలు పొందకముందే ఇంద్రియాలు సడలిపోకముందే శ్రేయోమార్గంలో పయనించాలి.

శరీరం వున్నప్పుడే తత్త్వం తెలుసుకొనే ప్రయత్నం చేయాలి. ఇల్లు తగలబడుతోంటే ఎవడైనా అపుడు బావి త్రవ్విస్తాడా? కారణమేమిటంటే  మనకు కాలం కరుగుతోందని తెలియనే తెలియదు. ఆ విషయం గుర్తుచేశారు వ్యాసులవారు.

**కాలో న జ్ఞాయతే నానాకార్యైః సంసార సంభవైః ।**
**సుఖం దుఃఖం జనో హన్త న వేత్తి హితమాత్మనః ॥**

సంసార బంధాలతో సుఖదుఃఖాలనుభవిస్తూ కాలం గడచిపోతున్నదనే సంగతే గుర్తురాక తమ హితం తెలుసుకోలేక పోతున్నారు జనులు. “ఏం చేస్తాం? సంసార బాధ్యతలు కదండీ” అనుకొంటారే తప్ప హితం కోల్పోతున్నామనుకోరు. ఇది లోకరీతి. ఇంకోసంగతి చూశారూ...

**జాతానార్తాన్ మృతానాపద్భ్రష్టాన్ దృష్ట్వా చ దుఃఖితాన్ ।**
**లోకో మోహసురాం పీత్వా న బిభేతి కదాచన ॥**

ఎవరన్నా తాగి పెద్దా చిన్నా తేడాలేకుండగ మాట్లాడేస్తుంటే (ధైర్యంగానన్నమాట!) ఎవరికీ భయపడకుండగ వాణ్ణి ‘తాగుబోతు’ అంటూ నిందిస్తున్నాం. అవును. ముమ్మాటికీ నిజం! అసలు మనం చేస్తున్నది ఏమిటి? మనమూ ఒక రకంగా కల్లుతాగి భయం లేకుండగ, ధైర్యంగా వున్నాం. ఇది నిజంగా దయనీయస్థితి. ఏమిటనుకోవద్దు. చెప్పారు మన వ్యాసులవారు.

పుట్టేవాళ్ళనీ, బాధపడే దీనుల్నీ, చస్తున్నవాళ్ళనీ, ఆపదల్లో క్రుంగిన వాళ్ళనీ ఎప్పుడూ దుఃఖించేవాళ్ళనీ చూసి కూడా ‘మోహం’ అనే కల్లు త్రాగడంవల్ల మత్తెక్కివున్నాం. ఇక హితమార్గంలో మనం నడుస్తామా? సంపదలు కలలే, యౌవనం పువ్వులాంటిది. ఆయుర్దాయం మెరుపుతీగలా చంచలమైనది. కాని కాసేపట్లో వాడిపోయేదే కదా! ఇదీ యౌవ్వన పరిస్థితి, విషమస్థితి అన్నమాట.

ఒక యౌవ్వనమే కాదు, జీవితం కూడా చాలా అల్పం. అది నూరేళ్ళయినా సరే! ఎందుకంటే ఎంతకాలముంటామో! పోనీ వున్నా నిద్రతోనూ బద్ధకంతోనూ సగం కాలం ఖర్చయిపోతుంది. బాల్యంలో కొంత వృధా, రోగంతో కొంతకాలం జరుగుతుంది. ఇక మిగిలేది చాలా స్వల్పం కదా! ఆ అత్యల్పకాలంలో అయినా ఆత్మతత్త్వం, భగవచ్చింతన, సంసార విషయంలో నిస్పృహ వుండగలిగితే కొంతమేలే!

ప్రారబ్ధాలనుభవించేప్పుడు ప్రయత్నం ఏమీ చెయ్యకుండా వుంటాడు మనిషి. మేల్కొని వుండవలసిన సమయంలో నిద్రపోతాడు. తప్పక భయపడవలసిన చోట విశ్వాసంతో వుంటాడు. ఇది నన్నేం చేస్తుందిలే అని. ఇలా ఉంటే హతుడు కాడా మరి?

**తోయఫేనసమే దేహే జీవేనాక్రమ్య సంస్థితే ।**
**అనిత్యాం ప్రయసంవాసే కథం తిష్ఠతి నిర్భయః ॥**

జీవితం బుద్బుదప్రాయం అంటూ వుంటాం కదా! వ్యాసులవారు అంటున్నారు. నీటి నుఱగలాంటి ఈదేహంలో, జీవుడు వచ్చి చేరినపుడు అనిత్యము, హితము కలిగించని ప్రయమూ అయిన చోట భయం లేకుండా ఎలా ఉంటాడు.

తానెవరో తెలుసుకోక కీడును మేలనుకుంటాడు. అనర్థాన్ని అర్థవంతం అనుకుంటాడు. అశాశ్వతమయిన దానిని శాశ్వతమనుకుంటాడు. నిష్ప్రయోజనమయిన దానిని ప్రయోజనకారి అనుకుంటాడు. చూస్తూనే జారిపోతాడు. (పొరపాటు పడతాడు) విన్నా, చదివినా అర్థం చేసుకోలేడు. అర్థంకాదు. వాడు భగవంతుని మాయతో మోహింపబడ్డవాడు.

ఈజగత్తంతా లోతయిన కాలమనే సముద్రంలో మునిగివున్నది. చావు, రోగము, ముసలితనము అనే మొసళ్ళ బారినపడి తేరుకోలేక బయట పడలేకపోతున్నాడు మానవుడు.

*(సశేషం)*

రుచికి, సువాసనకి, ఆరోగ్యానికి నాణ్యమైన
“అజంతా”
పసుపు, కారం, ధనియాలపొడి మరియు సేమియానే ఎల్లప్పుడు వాడండి
రవికుమార్ అండ్ కంపెని - చెన్నై
044 25204046, 26171341
Vijay Ads

శ్రీమతే రామానుజాయ నమః

# శాస్త్రదీపం

శ్రీమాన్ సముద్రాల శఠకోపాచార్యస్వామి-వరంగల్

మానవుడు యుక్తాయుక్త విచక్షణ జ్ఞానం కలవాడు. అయినా **'ప్రమాదో ధీమతామపి'** అన్నట్లు కొన్ని సందర్భాల్లో భ్రమ, ప్రమాదాలకు లోనవుతుంటాడు. చేయవలసిన, చేయకూడని కార్యాల విషయంలో సందేహం కలవాడవుతాడు.

సందేహగ్రస్తుడైన వ్యక్తికి పలురకములైన సందేహాలను పోగొట్టేది, కన్నుల ఎదుట లేని దానిని కూడా కన్నులకు కట్టినట్లుగా ప్రతివ్యక్తికి చూపేది 'శాస్త్రం' అనే జ్ఞాననేత్రమేనని

**"అనేక సంశయోచ్ఛేది పరోక్షార్థస్య దర్శనమ్, సర్వస్య లోచనం శాస్త్రం"**

అనే సూక్తి మనకు తెలియజేస్తున్నది. శాస్త్రప్రమాణముద్వారానే కృత్యాకృత్యములను తెలుసుకొనగలుగుతామని, శాస్త్రవిధానమును అనుసరించి కర్మలను ఆచరించినపుడే ఐహికమైన సుఖశాంతులను పారమార్థికమైన శ్రేయస్సును పొందగలుగుతామని

**తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ ।**
**జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మ కర్తు మిహార్హసి ॥**

అనే భగవద్గీతా శ్లోకం మనకు ఉపదేశిస్తున్నది. వేదాంతదేశికుల వారు వేయిమంది తల్లిదండ్రులకంటే ఎక్కువగా మనపై వాత్సల్యాన్ని చూపే శాస్త్రాన్ని ఒక దీపంగా పేర్కొన్నారు. శ్రీవేంకటేశ్వరస్వామియొక్క దయాగుణవైభవాన్ని కీర్తిస్తూ వేదాన్తదేశికులు తాము రచించిన దయాశతకములో – ఓ శ్రీనివాసుని దయాగుణమా! నీవు ప్రజలయందు పరిపూర్ణమైన ప్రేమకలదానవై ఆరిపోకుండా స్థిరంగా ఉండే శాస్త్రమనే దీపమును వెలిగించి ప్రజలయొక్క అజ్ఞానమనే చీకటిని పోగొడుతున్నావు.

**"అనుగుణదశార్పితేన శ్రీధరకరుణే! సమాహితస్నేహా ।**
**శమయసి తమః ప్రజానాం శాస్త్రమయేన స్థిరప్రదీపేన॥"** అని పేర్కొన్నారు.

గాలివల్ల ఆరిపోకుండా రక్షింపబడిన ప్రదీపం చీకట్లో ఉన్నవస్తువుని మనకంటికి చూపడానికి సమర్థవంతమైనట్లే, వివేకసంపన్నుడైన మానవునికి కార్యాచరణసమయంలో సందేహం ఏర్పడి అతడు తికమకపడుతుంటే, పూర్వం ఆ వ్యక్తి నేర్చుకున్న శాస్త్రజ్ఞానం దీపంవలె కర్తవ్యాన్ని దర్శింపజేస్తుంది.

**"మతిభేదతమ స్తిరోహితే గహనే కృత్యవిధౌ వివేకినామ్ ।**
**సుకృతః పరిశుద్ధ ఆగమః కురుతే దీప ఇవార్థ దర్శనమ్ ॥**

అని భారవి మహాకవి కిరాతార్జునీయంలో తెలిపారు. సర్వజగత్సృష్టి కర్తయైన పరమాత్మ మానవులకు దేహేన్ద్రియాదులను వివేకసంపత్తిని అనుగ్రహించిన పిమ్మట, పరమకారుణికుడై ఎపుడైనా భ్రమప్రమాదాలకు ఈ మానవులు లోనవుతారేమోననే ముందుచూపుతో సదసద్వివేచన చేయగలుగుటకు, అజ్ఞానము సంశయము అనే అంధకారమును తొలగించుకొనగలుగుటకు శాస్త్రప్రమాణము అనే ప్రదీపాన్ని ప్రసాదించాడు.

**"హర్తుం తమస్సదసతీ చ వివేక్తుమీశః**
**మానం ప్రదీపమివ కారుణికో దదాతి ।** అని శ్రీరంగరాజ స్తవంలో శ్రీపరాశరభట్టర్‌వారు మనకు తెలియజెప్పినారు.

పరమాత్మసంతానమైన మానవులమందరం చీకట్లో దారి కనబడక అయోమయానికి గురై ఏ బావిలోనో పడే ప్రమాదం ఉందని పసిగట్టిన శ్రీవేంకటేశ్వరుని దయాగుణం, మనకు శాస్త్రదీపాన్ని ఇచ్చి మంచిదారిలో సురక్షితంగా భగవత్పాదసన్నిధి అనే గమ్యాన్ని చేరునట్లుగా ఉపకరిస్తున్నదని వేదాన్తదేశికులు దయాశతకంలో పేర్కొన్నారు.

ఆచార్యాభిమానపురస్సరంగా లభించే శాస్త్రదీపసహాయంతో మనం మన కర్తవ్యాన్ని గుర్తించి సత్కార్యాచరణ కొనసాగిస్తూ జీవితాన్ని సార్థకమొనరించుకునే దిశగా కృషి సలుపుదాం.




www.mangalaakshatas.com
In commitment to help the people of spiritually inclined, we come up with the unique platform for 'Sri Vaishnava Community' to choose their life partner with an ideal mind set.
*With the Mangalasanams of*
"Sri SriSriTridandiChinnaSrimannarayanaRamanujaJeeyarSwamiji" we present you with 'mangalaakshatas' - A wedding platform for Sri Vaishnavas.
We are now open for free registrations. Please visit: www.mangalaakshatas.com
మీ జీవిత భాగస్వామికోసం ఎదురుచూస్తున్నారా?.. ఇదిగో మీ ముందుకు 'మంగళాక్షతలు' మన ఆచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి మంగళాశాసనములతో...! పై వెబ్‌సైట్‌లో రిజిస్టర్ చేసుకోండి!



మధురస్మృతులు- సంపుటి.4
నందననామసం॥, ఆశ్వయుజమాసం
50సంవత్సరాల పూర్వపు భక్తినివేదన నుండి

# యథార్థవిద్య

1952 జనవరి, సంచిక- 2
" ఆచి శ్రీమన్నారాయణాచార్యస్వామి"

స్థలము – శ్రీభట్టర్‌వారి కాలక్షేపమందిరము సన్నివేశము– శ్రీభట్టర్‌వారు కాలక్షేపము సాయించుటకై ఎత్తైన ఆసనమందు వేంచేసి యుందురు. వారికి ఎదురుగ వారిశిష్యులు కూర్చొని యుందురు. శ్రీభట్టర్‌వారి ఎదురుగా వ్యాసపీఠముపై ఆచార్యహృదయకోశము ఉండును. వారు ఎవరిరాక కొరకో నిరీక్షించు చుందురు.

**కాలము** : **ఉదయం గం॥ 8-00ల వేళ**

**భట్టర్‌వారు** : **ఏ మాత్రము పొద్దెక్కినది?**

**ఒక శిష్యుడు** : **స్వామి! సుమారొక ఝాము ప్రొద్దెక్కినది.**

**భట్టర్‌వారు** : **అబ్బఅలాగునా! ఇంకను మన నరసింహాచార్య స్వామి వారు వేంచేయలేదేమో?**

**మరొకశిష్యుడు** : **మాములుగ వచ్చువేళ కొద్దిగ అతిక్రమించినది. వచ్చుచునే యుండవచ్చును,**

**మరొకశిష్యుడు** : **ఏమో ఆయన ఎప్పుడు వచ్చినను ఒకటే, శాస్త్రజ్ఞానమా? మన్నా? అన్నీ సున్నా!**

శాస్త్రీయ విషయములతో నిగూఢమై, రత్నాకరముకంటే గంభీరమై విశేషధర్మ విభూషితమై, సహృదయ హృదయవిధేయమై విరాజిల్లు ఈ ఆచార్యహృదయము సాహిత్యజ్ఞాన శూన్యులైన, రామశబ్దమే రానటువంటి శ్రీసీతారామాభ్యాన్నమః గార్లకు కొరకుపడునా? భావమేనా స్ఫురించునా? వారి కొఱకై నిరీక్షించుట వృథా కాలహరణము స్వామీ(ఈమాటకు శిష్యులలో కొందరు నివ్వెరపడి జూచుచుందురు. కొందరు చేతితో నోరుమూసుకొని ఆమాటాడు శిష్యుని కనుసైగతో సహా నివారించుచుందురు. మరికొందరు బట్టయడ్డము పెట్టుకొని మరుగుగ ముసిముసి నవ్వులు నవ్వుచుందురు.)

భట్టర్‌వారు :– (ఆమాటాలాడిన శిష్యునివైపు తల పంకించుచు చిరునవ్వు నవ్వుచుందురు. ఆ నవ్వులో ఆశిష్యుని యజ్ఞానమును, దౌష్ట్యమును అనుచిత సాహసమును అధిక్షేపించు చిహ్నాలుండును). (ప్రకాశముగ)

మీయందరికి ఆయన రాకుండగ ప్రారంభించుటే యభిప్రాయమైనచో అలాగుననే చేతము. వారు వేంచేసినచో తిరిగి వారికి వేరుగా విన్నవించుకొందును. ఇంతలో బీదవేషముతో, చంకని గుమ్మిడికాయ రాగిచెంబు జోలితో నరశింహాచార్యస్వామి చేతులు రెండు జోడించుకొని పరుగుపరుగున వచ్చుదురు. గోష్టికి ఎదురు సాష్టాంగ దండప్రణామములాచరించి, స్వాముల వెనుకనుండి శ్రీభట్టర్‌వారి వద్దకు వత్తురు. శ్రీభట్టర్‌వారుకూడ వెంటనేలేచి ఆస్వామికి సాష్టాంగదండము సమర్పించి, లేచి,తమదగ్గర ఆస్వామిని కూర్చుండ నియోగింతురు. మిగత శిష్యులు కొద్దిగ వంగి దండము సమర్పింతురు)

నరశింహాచార్యస్వామి ః– స్వామి రాత్రి శ్రీరంగవిభజన సమాప్త మగుసరికి చాల ప్రొద్దుపోయినది. అందుచే తెల్లవారుఝామున లేచుటలో కొద్దిగ ఆలస్యమైనది. మరియు నేడు ఆచార్యమాస తిరునక్షత్రమగుటచే పెరుమాళ్ళ తిరుమంజనము, సేవకాలము అగుటలో పొద్దు తెలియక ఆలస్యము చేసి అపచారపడితిని. దాసుని క్షమించవలెను.

**భట్టర్‌వారు** : **ఆలస్యమేమైనది పరవాలేదులెండి.**

**నరశింహాచార్యస్వామి** : **అడియేన్!**

**భట్టర్‌వారు** : **ఆజ్ఞా ! ప్రారంభించుదామా.**

**నరశింహాచార్యస్వామి** : **అడియేన్.**

**భట్టర్‌వారు** : **(ఆచార్యహృదయ శ్రీకోశమును తెరచి చదువుదురు)**

“ఆజ్ఞర్ భ్రమిక్కఱ వర్ణాశ్రమ విద్యావృత్తంగళై గార్దభజన్మం శ్వపచాధమం, శిల్పనైపుణ్యం, భస్మాహుతి, శవ, విధవాలంకారం ఎన్నుకజికప్పర్‌కళ్”

లోకములో తత్త్వహిత పురుషార్థములు యథార్థస్వరూపమును తెలియనట్టుయు, తెలిసిను నమ్మకము కుదురనట్టియు, నమ్మకము

గోపురం
కుంకుమ, పసుపు పొడి
పూజ, పండుగ, శుభకార్యములకు శ్రేష్ఠమైనది
Y.V.S. AGENCIES, No.77-11/B, Ashram Street, Bhavani Puram, Vijayawada-12.Ph:0866-6535178/9299557247.
For trade enquiries:044-42943939 email: yvs@gopuramproducts.com

కుదిరినను మానసికమైన సంపూర్ణవిశ్వాసము లేనట్టియు, సంపూర్ణవిశ్వాసము కలిగినను పరులకుపదేశించుటయేగాని తామనుష్ఠించ ప్రయత్నించనట్టియు, తామనుష్ఠించ ప్రయత్నించినను అధ్యవసాయలోపముచే వాసనావాసిత సంస్కారవిశేషముచే ఆకర్షితులై పూర్వపుధోరణిలో పడువారలందరు కూడ అజ్ఞానులే. కాని అట్టివారు కూడ మేము సత్కులజాతలమనియో, ఉత్తమాశ్రమస్థులమనియో విద్యానిపుణలమనియో, గొప్పవృత్తుల గలవారమనియో, విర్రవీగుచుందురు, అంతియేకాదు ఇతరులను అవమానపరచి కించపరచుచుందురు అది కాలమహిమ.

**శ్లో ॥ విద్యానిపూణా వయ మిత్యన్యే హృద్యా ధనినో వయ మిత్యన్యే।**
**సత్కులజాతా వయమిత్యన్యే తేషు కలిం పరిపూర్ణం మన్యే ॥**

ఇట్లు అహంకారము, ఆత్మశ్లాఘ్యము, పరనైచ్యానుసంధానం చాల అపచారకరమైనది. స్వరూపనాశకరమైనది.

గాన భ్రమాత్మక, వర్ణాశ్రమ విద్యావృత్తులు గాడిదయొక్క జన్మమువలెను. శ్వపచాధమునివలెను, దొమ్మరివిద్య నాటకముల యందలి వేషములు కాగితములమీద గీయుబొమ్మలు వలెను, బూడిదలో చేయబడు ఆహుతులవలెను శవములకు విగతభర్తృకలకు చేయబడు అలంకారములు వలెను వ్యర్థములు. అంతియేకాదు, నీచములు, నిషిద్ధములు యగుచున్నవి. జ్ఞానమే ప్రధానమైనది, అదియే ఆదరించబడవలసినది. దానిని బట్టియే ఉచ్చనీచ తారతమ్యములు నిర్ణయించబడును. అందుచే జ్ఞానులగు పెద్దలు కేవల బాహ్యములగు వర్ణ–ఆశ్రమ–విద్యా–వృత్తులనుబట్టి మాత్రమే చూడక అంతరంగిక జ్ఞానమును బట్టియే ఎవరినైనను ఆదరింతురు, తామును అటులనే తరింప ప్రయత్నింతురు. (ఇంతలో ఒక శ్రీవైష్ణవ సన్నిధి స్వామివచ్చి భట్టర్‌వారితో ప్రకాశముగా)

**సన్నిధిస్వామి : అడియేన్!**

**భట్టర్‌వారు : (కాలక్షేపమాపి, ఆ వచ్చిన స్వామికేసి తిరిగి) ఏమండీ ఏమిటి విశేషం?**

సన్నిధిస్వామి– అడియేన్, ఎవరో ఒక విద్వాంసులు విచ్చేసిరి. ఆయన షట్ఛాస్త్రపండితులట. అనేక విద్వత్సభలలో, రాజమహారాజ సన్నిధిలో జయశ్రీని వరించి సన్మానముల బొందియుండెనట. తనకీ లోకమున సమాన పండితులెవరును లేరట. చాల దూరదేశమునుండి వచ్చినాడట. దేవరవారినొక పర్యాయము జూచి పోదలచి వచ్చినారట. ఆవల తెన్నెపై కూర్చుండబెట్టి దేవరవారి యాజ్ఞకై వచ్చినాడ.

భట్టర్‌వారు – అలాగునా? ఎవరైతేనేమి? ఎవరోఒకరు కాలక్షేప విరోధి. అయినను నేడు కొద్ది ఆలస్యమైనది. మన స్వాములకు ప్రొద్దుపోయినది. సరే, నిమ్మళముగా వారిని తీసుకొని రమ్ము. (నరసింహాచార్యులవారి వైపుతిరిగి నేటికి శాంతి చెప్పుటకు యాజ్ఞా.

నరసింహాచార్యులు : అడియేన్, దేవరవారికటాక్షం. (భట్టర్‌వారు ఆసనమునుండి లేవగా శిష్యులందరుకూడ లేతురు. అందరు శాంతిపాఠమును చదివి సాష్టాంగ దండము సమర్పింతురు. నరసింహాచార్యులువారు : స్వామి ఆజ్ఞా!

భట్టర్‌వారు : అడియేన్(అనుచు నరసింహాచార్యస్వాములువారు వెళ్ళుచుండగా భట్టర్‌వారు తాముకూడ వారితో కొద్ది దూరము వెళ్ళి సాగనంపి వచ్చి తిరిగి తమ ఆసన మలంకరింతురు. శిష్యులు కూర్చొనియుందురు. ఇంతలో మొగమున పెద్దకుంకుమ బొట్టును ధరించి పెద్ద ఎర్రని జరీ అంచుల కాశ్మీర శాలువను గప్పుకొని, తలకు బనారసు కండువా తలపాగా చుట్టుకొని యున్న పండితుని సన్నిధిస్వామి తీసుకొని వత్తురు. ఆ పండితుడు ఏ మాత్రము వినయము లేనివాడై గర్విష్ఠిగా కనబడుచుండును. నమస్కారాదుల నేమియు చేయదు భట్టర్‌వారు కూడ దూరమునుండియే ఆ పండితుని వాలకమును గ్రహించి తామాననమునుండి లేవకయే నమస్కారాదులచేయకయే ప్రకాశముగ)

పండితవర్యా దయజేయుడు. (అని తమ ప్రక్కనే ఒక ఆసనమును జూపుదురు.)

మరింత విశాలంగా ... వినూత్నంగా....
కామధేను సిల్క్స్
ప్రత్యేక 1 గ్రామ్ జ్యూయలరీ కౌంటర్
పట్టు చీరలు ఫ్యాన్సీ చీరలు పర్శ్-శారీస్ గద్వాల్ వెంకటగిరి మదీనాన్స్ డ్రెస్ మెటీరియల్స్
బీసెంట్‌రోడ్, విజయవాడ-2. ఫోన్: 2574220

జై శ్రీమన్నారాయణ
తీర్థయాత్ర
ముక్తినాథ్ యాత్ర కలదు.
8.10.2014 విజయవాడనుండి బయలుదేరును
108 శ్రీ వైష్ణవ దివ్య దేశములలో 95 తమిళనాడు మరియు కేరళలోని శ్రీ వైష్ణవ దివ్య దేశముల 16 రోజుల తీర్థయాత్ర
వివరములకు :
విష్ణు వందన ట్రావెల్ సర్వీసెస్ సెల్: 09290574187 09032935316
తొండైనాడు - 22
నడునాడు - 2
చోళనాడు - 40
పాండ్యనాడు - 18
మలైనాడు - 13
క్షేత్రములు 95

# శ్రీవేంకటాచల "చిత్రే"తిహాసమాల




మూల సంస్కృత రచనం
శ్రీ అనంతాళ్వాన్

చిత్రానువర్తనం
సత్య శ్రీనివాస్ - సిద్ధాంతం

## తిరుమలలో వీథీనిర్మాణం

తిరుమలలో ఉత్సవాలు నిర్వహించడానికి తగిన విశాలవీథులు లేకపోవడం చేత బ్రహోత్సవాలలో తిరువీథిని తిరుచానూరులో చేసేవారని, వెనుక చెప్పుకున్నాము కదా!

ఆలోటును పూరించడానికి భగవద్రామానుజులు కొండపైననే అన్ని ఉత్సవాలు, తొండమానుని కాలంలానే జరపాలని నిశ్చయించారు. దీనికి పర్యవసానంగా ఆలయం నాలుగుప్రక్కలా భూమిని సమతలంచేసి, దివ్యనగరాన్ని నిర్మింపచేసారు. భవనపంక్తితో ఒప్పుతున్న వీథుల్లో (మాడవీథుల్లో) మహోత్సవ సమయాల్లో వాహనసేవ అప్రతిహతంగా సాగేలా ఏర్పాటుచేసారు. అందుకోసం చక్కగా వీథులను నిర్మింపచేసారు.





## భగవద్రామానుజులు చేసిన విగ్రహ పరివర్తనం

భగవద్రామానుజుల నాటికి ఉన్న మూర్తులకు కొంతమార్పుచేసి, ఆరాధన ప్రక్రియ సాగించారు. ఆనాడు ఉత్సవమూర్తిగా ఆరాధింప బడుతున్న 'వేంగడత్తురైవర్' (వేంకటవాసి) అనే స్వామి అవతార దినం మూలంగా దివ్యనగరాభివృద్ధికి ప్రతిబంధం కలుగుతోందనే భావంతో ముఖ్యంగా కనకలతాయోగంలో ఆవిర్భవించిన శ్రీనివాసునికి భవిష్యాత్కాలిక ప్రతిబంధం కలగకుండా ఉండడానికి ఒక మార్పుచేసారు.

ఏమంటే, కౌతుకమూర్తియైన మలయప్పస్వామికి ఉత్సవ బేరాభిషేకాన్ని, వేంగడత్తురైవర్ స్వామికి కౌతుకబేరాభిషేకాన్ని చేయించారు. ప్రాణధారణ పురస్సరంగా ప్రతిష్ఠనుకూడా శాస్త్రీయంగా నిర్వహింపచేసారు. యథావిధిగా ఆరాధన కొనసాగేలా మార్పులు చేసారు.

ఈ విషయాలను వేంకటాచలేతిహాసమాల 4వగుచ్ఛం స్పష్టపరిచింది.




## పలికెడిది భాగవతమట

పోతనామాత్యుడు ఇలా అనుకుంటున్నాడు.

నేను ఎన్ని జన్మలెత్తి ఉంటాను. అనేక జన్మలతపఃఫలితం పండింది. నాహృదయంలో శ్రీమన్నారాయణుని పుణ్యకథలను రచించాలనే కుతూహలం కలిగింది. అది ఒక పూర్ణిమారాత్రి, నిండు జాబిల్లి పండు వెన్నెలను కురిపిస్తున్నాడు. ఆరోజు చంద్రగ్రహణం ఆకాశాన్ని అంటిపొంగే గౌతమీ గంగ వద్దకు వెళ్ళాను. ఆనదిలో స్నానం చేశాను. వెలుపలకు వచ్చి ఒక ఎత్తైన తెల్లని ఇసుక తిన్నెమీద, పరమశివుణ్ణి ధ్యానిస్తూ కూర్చున్నాను. ఆసమయంలో ఒక రాజశ్రేష్ఠుడు నాకన్నులముందు సాక్షాత్కరించాడు. ఆయన ప్రక్కన ఒక అంగన ఉన్నది. ఆయన ముఖంలో మందహాసం చిందుతూ ఉన్నది. ఆయన భూజాన ధనుస్సు వ్రేలాడుతున్నది. ఆయన శిరస్సుపై కిరీటం విరాజిల్లుతున్నది. తెల్లని తామరరేకులవంటి కన్నులతో విశాలమైన వక్షస్థలంతో, విశ్వమంగళరూపంతో విరాజిల్లుతున్నాడు. నేను రెప్పవాల్చకుండా చూస్తూ మాట్లాడదామని ప్రయత్నించాను. అంతలో ఆయన నేను రామభద్రుణ్ణి, నాపేరు మీదగా శ్రీమహాభాగవతాన్ని తెలుగుచెయ్యి. నీభవబంధాలు పటాపంచలవుతాయి! అని శెలవిచ్చి అంతలోనే అంతర్ధానమైనాడు. నేను కన్నులు తెరిచిచూచాను అంతా ఆశ్చర్యంగా ఉంది. నాలో నేనిట్లా అనుకున్నాను. "పలికెడిది భాగవతమట! పలికించెడివాడు రామభద్రుండట! నే బలికిన భవహరమగునట, పలికెద వేఱొండుగాథ పలుకనేలా?

ఆహా! ఏమి నాఅదృష్టము! పలికేది పరమ పవిత్రమైన భాగవతమా! పలికించేవాడు రామభద్రుడా! పలికినందువల్ల భవబంధాలు పరిహారమౌతాయా! మరి వేరే ఏవో కథలు రాయటం ఎందుకు? ఆభాగవతాన్నే రచిస్తాను అంటున్నాడు పోతనమహాకవి. తాను ఆయన చేతిలో ఒకపరికరం మాత్రమే. కర్తృత్వాన్ని భగవంతునికి అప్పచెప్పిచేసే పనులు మోక్షకారకాలు అవుతాయని ఈపద్యం ద్వారా మనకి తెలుస్తోంది.

**ద్వాసుపర్ణా సయుజా సఖాయా, సమానం వృక్షం పరిషస్వజాతే।**
**తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి, అనశ్నన్ అన్యో అభిచాకశీతి ॥**

శ్వేతాశ్వతరోపనిషత్తులోని మంత్రానికి చిత్రానువర్తనం ఇది. ఈచిత్రంలోని రెండు పక్షులు సమాన యోగక్షేమంకలిగి చక్కని రెక్కలు కలిగి అందంగా ఒకే చెట్టుకొమ్మపై కూర్చుని ఉన్నాయి. ఆరెంటిలో ఒకటి మధుర ఫలాలను ఆస్వాదిస్తూ ఉంది. రెండవది, ఫలాస్వాదనంపై దృష్టిపెట్టక, తృప్తిగా ఉంది. ఈ రెండు పక్షులు జీవాత్మ పరమాత్మలకు ప్రతీకాలు. ఈ ఇరువురు ఈ ప్రాకృతిక ప్రపంచంలో ఆయా శరీరాలల్లో ఉన్నారు. ఇద్దరూ జ్ఞానానంద స్వరూపులే. జ్ఞానానంద గుణులే. అయినా జీవుడు కర్మఫలాన్ని అనుభవిస్తున్నాడు. పరమాత్మ కర్మఫలానుభవానికి దూరంగా నిరామయంగా ప్రకాశిస్తూ ఉన్నాడు. ఈ అభిప్రాయాన్నే ఈచిత్రం చెబుతున్నది. జీవాత్మ పరమాత్మలు ఒకే శరీరంలోని హృదయస్థానంలో ఒకరు అంతర్యామిగాను, మరొకరు నియామ్యుడు (పరమాత్మచే నియమింపబడేవాడు)గాను ఉండి పరమాత్మ శరీరం మూలంగా సుఖదుఃఖానుభవం లేకుండా నిరామయంగా ఉండగా జీవాత్మ కర్మఫలానుభవం చేస్తున్నాడు. ఇదే వీరిరువురికీ ఉన్న తేడా!.



1967లో, ప్రస్తుత సంపాదకులు, **డా॥ ఎస్.వి. రంగరామానుజాచార్యస్వామి** స్వయంగా వేసిన చిత్రం ఇది.

చిత్రకథ–36

# రామానుజ చిత్రకథ















స్వామీ! తమకు వేదాలలోనే ప్రమాణాలను విన్నవిస్తా.


ఋగ్వేదం ఏమైనా చెప్పిందా?


ఓ! వినండి ఈమంత్రాన్ని...
" పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే! ప్రభుర్గాత్రాణి పర్యేషి విశ్వత:
అతప్తతనూర్నతదామో అశ్నుతే, శృతాస ఇద్వహన్త: తత్సమాసత"


ఎలా చెపుతారు దీనికి అర్థాన్ని? అసలెక్కడిది ఇది?
9వ మండలం, 83వ సూక్తంలోనిది.


చతుర్ముఖునికి నిర్వాహకుడా!
పావనమైన నీచక్రం అన్నింటా వ్యాపించి ఉంది.
దాని తేజస్సు అన్నింటినీ శుద్ధి చేస్తుంది.
అప్పుడు నీవు ఆయా వస్తువుల్లో వ్యాపిస్తావు.
ప్రభో! అప్పుడే వాటిని నీవు పాలిస్తావు. నీచక్రస్పర్శతో తాపసంస్కారం
పొందిన జీవులకే పాపాలు పక్వమై తొలగుతాయి.
వారే బ్రహ్మానందాన్ని పొందుతారు. తాపసంస్కారం
లేనివారు బ్రహ్మానందానికి దూరులే.


'పవిత్రం' అంటే 'సుదర్శన చక్రం' అని ఎక్కడుంది?


గొప్ప ప్రశ్న వేసారు మీరు.


తెలుసుకోవాలనే ప్రశ్నించాను. ఆక్షేపించడానికేం కాదు.


జిజ్ఞాసు ప్రశ్న ఏదైనా తప్పక సమాధాన పరచవలసిందే.
వేద నిఘంటువు ఈ విషయాన్ని స్పష్టం చేసింది.


ఎలాగో చెప్పరూ స్వామీ?


పవిత్రం చరణం చక్రం లోకద్వారం సుదర్శనం !
పర్యాయ వాచకాహ్యేతే చక్రస్య పరమాత్మన: !! అనిన్నీ ...
సుదర్శనం సహస్రారం పవిత్రం చరణం పవి:! అనిన్నీ చెప్పినది.


అంటే ఏమిటి స్వామీ?


శ్రీవిష్ణువు చేతిలో ఉండే సుదర్శన చక్రాన్ని 'పవిత్రం, చరణం, చక్రం, లోకద్వారం, సహస్రారం, పవి:' మొదలైన పేర్లతో పిలుస్తారు.


అందుకే పై మంత్రంలో 'పవిత్రం' అనే పదానికి తాపసంస్కారంతో జీవులను పాపరహితులుగ చేసే ప్రభావం కల 'శ్రీసుదర్శన చక్రం' అనే చెప్పాలి.


ఇంకా ఎక్కడైనా ఉందా?


అదే ఋగ్వేదం 9వ మండలం, 96వ సూక్తం, 19వ ఋక్ చూడండి.
"చమూషచ్ఛ్యేన శ్శకునోవిభృత్వా గోవిందుద్రప్స ఆయుధాని బిభ్రత్
అపా మూర్మిం స చ మాన స్సముద్రం తురీయం ధామ మహిషో వివక్తి"


ఇది చమసమనే పాత్రలో ఉండే సోమరసాన్ని గురించిన మంత్రం కదూ!
ఇంకాఉంది...

# శ్రీవైష్ణవసంఘం ఏర్పాటుచేసిన వృద్ధదంపతీ వరివస్య


వృద్ధదంపతీ వరివస్యలో పాల్గొని, గోష్ఠికి మంగళాశాసనాలు చేస్తున్న ఉ.వే.శ్రీమాన్ న.చ. రఘునాథాచార్యస్వామివారు


వృద్ధదంపతులకు ఆయుష్యహోమం చేయించి, పూర్ణాహుతిలో అన్వయించిన శ్రీస్వామివారు


వరివస్యలో భాగంగా మాతాపితరుల పాదపూజ


సమ్మానపత్రాన్ని ఆశీఃపూర్వకంగా అందిస్తున్న శ్రీస్వామివారు


ఉ.వే.శ్రీమాన్ న.చ. రఘునాథాచార్యస్వామివారిని ఆరాధిస్తున్న రాష్ట్రసలహాదారు శ్రీమాన్ రమణాచార్యులు (ఐ.ఎ.ఎస్)



# ఆచార్య తిరునక్షత్ర చిత్రమాల


ఉదయం 5గం॥లకు శ్రీస్వామివారికి శుభాకాంక్షలు తెలియజేసి, మంగళాశాసనాలు పొందుతున్న భక్తులు


దివ్యసాకేతంలో జీయర్‌స్వాములు


దీపప్రజ్వలన గావిస్తున్న శ్రీస్వామివారు


తీర్థగోష్ఠిలో అన్వయించిన శ్రీమాన్ వెంకయ్యనాయుడు


దీపప్రజ్వలన చేస్తున్న శ్రీమాన్ జె. రామేశ్వరరావు,
పార్లమెంట్ సభ్యులు శ్రీమాన్ జి.గంగరాజుగార్లు


పురస్కారగ్రహీత శ్రీమాన్ పాండురంగాచార్యస్వామిని
వేంచేపుచేసుకుంటున్న శ్రీస్వామివార్లు


జ్యోతిప్రజ్వలనగావించి శ్రీపెద్దజీయర్‌స్వామివారిని సేవిస్తున్న
శ్రీ ఉ.వే.శ్రీమాన్ ఎన్.సి. రఘునాథాచార్యస్వామివారు


జ్యోతిప్రజ్వలనగావిస్తున్న శ్రీమాన్ పి. వీరయ్యగారు

# తిరునక్షత్ర సభావేదికపై ఆసీనులైన అతిథులు, కైంకర్యపరులు

## గ్రంథావిష్కరణలు





ఋగ్వేదసంహితా ఆవిష్కరణ


అగస్త్యసంహితా ఆవిష్కరణ


శ్రీపాద్మసంహితా చర్యాపాద ఆవిష్కరణ



పద్మపురాణం - పాతాళఖణ్డం గ్రంథ ఆవిష్కరణ


ఋగ్వేదగ్రంథాన్ని అందుకుంటున్న శ్రీమాన్ న.చ.రఘునాథాచార్యస్వామివారు


పద్మపురాణం - పాతాళఖణ్డం గ్రంథాన్ని అందుకుంటున్న శ్రీమాన్ శ్రీనివాసాచార్యస్వామి


శ్రీరామానుజ సహస్రాబ్దికి కైంకర్యంగా సమర్పిస్తున్న శ్రీమాన్ భట్టర్‌స్వామి, చి॥రామకృష్ణ


శ్రీస్వామివారి మంగళాశాసనాలను అందుకుంటున్న ఎన్ టివి అధినేత శ్రీమాన్ నరేంద్రచౌదరి దంపతులు


శ్రీస్వామివారి మంగళాశాసనాలను అందుకుంటున్న శ్రీమాన్ చల్మెడ ఆనందరావు దంపతులు


ఋగ్వేదసంహితా సంపాదకులు శ్రీమాన్ ప్రతాప సుబ్రహ్మణ్యంగారు


శ్రీరామానుజ సహస్రాబ్దికి కైంకర్యం చేసుకుంటున్న శ్రీమతి మాధవీ రామానుజం


శ్రీపాద్మసంహితా చర్యాపాద గ్రంథ కైంకర్యపరులు శ్రీమతి వసుమతి భాస్కరరావు కుటుంబసభ్యులు

# తిరునక్షత్ర సందర్భంగా జీవాలో ఏర్పాటుచేసిన శ్రీవైష్ణవ వృద్ధదంపతీ వరివస్య



480 మంది దంపతులతో 'మీ సంతానాన్ని సంప్రదాయ పరిరక్షణలో ప్రోత్సహించమని, మీ తల్లిదండ్రులు పాటించిన సంప్రదాయాన్ని వదలక కొనసాగించడం మీబాధ్యత' ని సందేశమిస్తున్న శ్రీస్వామివారు




తల్లి దండ్రులపై భక్తిప్రపత్తులను ప్రకటిస్తున్న సినీప్రముఖులు దర్శకులు శ్రీమాన్ హరీష్‌శంకర్, శ్రీమాన్ గజల్ శ్రీనివాస్ ప్రభృతులు




వృద్ధదంపతులకు ఆయుష్యహోమం జరిపిస్తున్న స్వాములు

టి.టి.డి. వారు గత నెలలో నిర్వహించిన వేదశాస్త్రాగమ విద్వత్సదస్సులో ఉత్తీర్ణులై బంగారు పతకాలను అందుకుంటున్న చి॥ అనంతశయనాచార్యులు, చి॥ వేంకటరమణాచార్యులు, చి॥ సంతోషకృష్ణమాచార్యులు




శ్రీరామచంద్రునికి క్షీరాభిషేకం



మాధుర్యమూర్తికి మధువుతో అభిషేకం


ఫలప్రదాతకు ఫలరసాభిషేకం



శ్రీమాన్ కోటేశ్వరరావు (ఎస్.పి.గారికి) శ్రీమాన్ మురళీకృష్ణంరాజు జ్ఞాపికను అందజేస్తున్నారు


కలశాలను అందిస్తున్న విద్యార్థులు, సేవిస్తూ తరిస్తున్న భక్తులు

జీవా, శ్రీరాంనగర్

*With Best Compliments from*








# KAKATIYA CEMENT

**Quality Always - Ahead**

## 53 Grade Cement & White Crystal Sugar

**Sri P. VENKATESWARLU**
Chairman & Managing Director

# KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED

*Regd. Office :* 1-10-140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
✆:27637717, 27633627, Fax No : 040 - 27630172, E-mail : kcsil@sol.net.in
E-mail: info@kakatiyacements.com

*Cement Factory :*
Srinivasanagar, Jaggaiahpet,
Krishna Dist - 521 175
✆ 08654 - 200014
Fax No: 08654-296331

*Sugar Factory :*
Peruvancha Village, Kallur Mandal,
Khammam Dist - 507 209,
✆: 08761 - 287207
Fax No: 08761 - 287206

# అరచేతిలో ఆరోగ్యం



యం. విజయలక్ష్మి - హైదరాబాద్ (శ్రీరామస్తూప ప్రాజెక్ట్.)

ఇది చదివే పాఠకులు కొందరు అడుగుతుంటారు "ఆక్యుప్రెషర్ పాయింట్లు దేనికోసం ఎక్కడ చేయాలో వ్రాయండి" అని. కేవలం పాయింట్లు గురించి వ్రాయడం సరి అయిన పద్ధతికాదు. "ఒక్కో అవయవము" గురించి కనీసం కొంత జ్ఞానము కలిగించుకొని, దానికి సంబంధించిన 'సైన్సు' తెలుసుకుంటే అప్పుడు దాని పనితీరు సరిచేయడానికి శ్రద్ధ ఏర్పడుతుంది. జీవనశైలి-ఆహారపు అలవాట్లు మార్చుకుంటాం. జాగ్రత్తలు పాటిస్తాము. అప్పుడు కదా ఆక్యుప్రెషర్ ఎక్కడ-ఎలా చేయాలో నేర్చుకోవాల్సింది.

అందుకే ఒక్కో అవయవము గురించి కొంతవరకు తెలిపే ప్రయత్నం చేస్తున్నాను. 'లివర్' గురించి కదా! గత 3 నెలలుగా చదువుకుంటున్నాము. ముందుగా ఈనెల కొన్ని "కేసులు" గురించి తెలుపుతాను.

**1) వై. ప్రకాశ్, వయసు-45. కాలేజి ఉపాధ్యాయులు చికిత్సకై వచ్చారు.**

**సమస్య** - 6సం॥గా షుగర్వ్యాధి, 15రోజులనుండి విపరీతమైన ఆకలి. రోజంతా తినాలనిపించేదట. మరియు 3 రోజులనుండి తలపైభాగం భరించరాని నొప్పి. ఏవో మందులు వాడారు. తగ్గలేదట.

వీరికి రోజంతా ఆకలికి కారణం 'అజీర్తి' దీని మూలాన 'గ్యాసు' కడుపునిండా చేరి అది శిరోభాగాన్ని చేరింది. మానసిక ఒత్తిడి కారణంగా కూడా శరీరంలో 'గ్యాసు' అతి సులభంగా ఏర్పడుతుంది.

**చికిత్స** - పెద్ద ప్రేగు మార్గం చూపుడు వేళ్ళనుండి ప్రారంభము అవుతుంది. 4వ పాయింటుపై అనగా చూపుడువ్రేలు మొదటి కణుపు క్రింది భాగంలో రెండువైపుల ఆక్యుప్రెషర్ చేసి, 'కడుపు' సంబంధిత రిఫ్లక్స్ పాయింటు పై ఆక్యుప్రెషర్ చేస్తున్నప్పుడు పేషంటుకి భరించరాని నొప్పి. చేసింది 4 సెకనులవైద్యమే. 3రోజుల తలనొప్పి వెంటనే తొలగిపోయినది. అతను ఆశ్చర్యపోయాడు. 'మళ్ళీ ప్రాణంవచ్చింది' అని అన్నాడు. తలనొప్పికి కారణాలు అనేకముంటాయి. ఎందువలనో తెలుసుకొని, ఆ మార్గంలోని బిందువులపై వైద్యం చేయాలి.

**2) యమ్.రవికుమార్, 45సం॥లు, హైద్రాబాద్. అల్లోపతి డాక్టర్.**

**సమస్య** - అరికాళ్ళలో తిమ్మిర్లు, 6నెలలు కావొస్తుంది. తగ్గలేద (షుగర్వ్యాధిలేదు)

**చికిత్స** - 'పెరికార్డియంఛానల్' అరచేయి మధ్యవేలు చివరికణుపు నుండి 7,8,9 పాయింట్లపై ప్రెషర్చేసి, హార్ట్ ఛానల్- చిటికెనవేళ్ళు (చేతిలోనివి) మరియు రెండు చేతులయొక్క మణికట్టు భాగాలపై వైద్యము చేసాక తిమ్మిర్లు మాయమైనవి. ఇంకా ఎలా చేసుకోవాలో సూచించాము. 6నెలలుగా మందులకు లొంగనిది ఆక్యుప్రెషర్తో తీరింది.

**3) యం.వెంకటరమణ, వయస్సు 52సం॥లు, జిల్లాపరిషత్ హైస్కూల్ ఉద్యోగి, హైద్రాబాద్.**

**సమస్య** - 20సం॥ల నుండి కడుపులో నొప్పి ఉంటూనే ఉంది. 'నాభి' సమస్య' అని చెప్పారుట వైద్యులు. ఎన్నో మందులు-ఎందరో వైద్యులు తిరిగాన్నారు. లాభం కనిపించలేదు.

**చికిత్స** - లివర్ - స్ప్లీన్ యొక్కమార్గాలు కాళ్ళ బొటనవ్రేలు నుండి మొదలవుతాయి. వాటి బిందువులపై వైద్యము 2 నిమిషములు చేసాక చాలా ఉపశమనము కల్గిందని తెలిపారు. వీరి సమస్యకి కావలసిన సలహాలు ఇచ్చి రోజూ ఏ విధముగా ఆక్యుప్రెషర్ చేసుకోవాలో నేర్పినాము.

**4) పి.శ్యామ్ సుందర్, సెల్నెం- 9294104993.**

**సమస్య** - విపరీతమైన మెడనొప్పి కొన్ని రోజులనుండి

**చికిత్స** - చూపుడువ్రేలు గోరుకింద, పెద్దప్రేగు మార్గంలోని మొదటి పాయింట్పై ఆక్యుప్రెషర్ సెకండ్సులో తగ్గినది.

**5) పి.సుదర్శన్, 27సం॥లు, వనపర్తి, సెల్నెం - 7799339860**

**సమస్య** - 3సం॥ల క్రితం ఎడమకాలులో మోకాలు వద్ద బెణికినది. భరించరాని నొప్పితో వైద్యులవద్దకి వెళితే (అమీర్పేటలోని ఒక పెద్ద ఆసుపత్రి) ఆపరేషన్ చేసారు. ఉపయోగం జరగలేదు, వేరే ఆసుపత్రికి తిరిగారు, ఫిజియోథెరపీ చేయించారు. మార్పు రాలేదు, తీవ్రమైన నొప్పి కాలులో... మోకాలు కదల్చలేని పరిస్థితి. మూడు సం॥గా ఎక్కువగా నడవలేని స్థితి. రోజంతా పడుకోనే ఉండాల్సిన స్థితి. బి.యస్.సి చదువుకొని కెమిస్ట్రీ ఉద్యోగం చేస్తున్నవాడుకాస్తా ఉద్యోగం మానుకున్నాడు.'నరకం'లో ఉన్నాను అని వాపోయాడు. కన్నీరు పెట్టుకున్నాడు, డబ్బు ఖర్చు అయింది. సమస్య పెరిగింది.

**చికిత్స** - కిడ్నీ ఛానల్- 3వపాయింట్, మూత్రాశయమార్గంలో 11,64, 65 పాయింట్స్, కాళ్ళు-చేతుల్లో రిఫ్లక్స్ పాయింట్స్ 5నిమిషాలు వైద్యం చేసాము. వైద్యము చేస్తున్న సమయంలో నొప్పి తట్టుకోలేకపోయాడు. అయినా ఓపికగా చేయించుకున్నాడు. వెంటనే ఆశ్చర్యంతో ఆనందపడి మళ్ళీ మళ్ళీ వస్తానని తెలిపి 70% హాయిగా ఉంది, అని అందరితో చెప్పాడు.

ఆక్యుప్రెషర్ వైద్యములో రోగియొక్క సమస్య ఎంత ఎక్కువగా ఉంటే పాయింట్ అంతగా నొప్పి ఉంటుంది. రోగం తగ్గుముఖం పడితే పాయింట్పై నొప్పికూడా తగ్గుతుంది. అంతేకాని మేము గట్టిగా నొక్కడం అంటూ ఉండదు.

ఆక్యుప్రెషర్ వైద్యములో అతిసున్నితంగా లేదా అతిగట్టిగా నొక్కడం ఉండదు. చేసే పాయింట్నిబట్టి, అవసరాన్నిబట్టి మధ్యస్థంగా ప్రెషర్ చేస్తాము. *(సశేషం)*

ప్రకృతిబడిలో...జీవనపాఠాలు 11

# మిడతలా కావద్దు!

*గత సంచిక తరువాయి* **వైశారదీ**

మనిషిని సృష్టించడానికి ముందే దయాళువైన పరమాత్మ మనిషికి అవసరమైన వస్తుజాతాన్నంతటినీ సృష్టించి సిద్ధం చేసి ఉంచాడు. ఇది గుర్తించితే మానవుడు కృతజ్ఞతతో మనసుని వరాధవుని పై నిలపగలుగుతాడు. మనుగడకి అవసరమైనంతవరకే విషయాలను భగవత్ప్రసాదంగ స్వీకరిస్తాడు. ఇలా జీవనయానాన్ని కొనసాగించగలిగిననాడు మనీషిగ మనగలుగుతాడు. విషయలోలుడు కాకుండా ఉండగలుగుతాడు.తద్వారా లాభాలాభాలకు పొంగుకుంగులు లేకుండా గంభీరంగ నిలవగలుగుతాడు. లేకుంటే విషయపరుడై ఎలా నశిస్తాడో సోదాహరణంగ అవధూత వివరించిన పాఠాలని ఈ సంచికనుండి తెలుసుకుందాం!

నేటి ప్రపంచంలో మనసుకి ఆకర్షకమైన సుఖాలు ఎన్నెన్నో కొన్ని కోట్ల రకాలుగ ఎదురౌతున్నాయి కద! నిజానికి ఈ విషయాలన్నింటినీ సూక్ష్మంగ విభజిస్తే ఐదే ఐదు. ఆశ్చర్యమన్పిస్తోందా! అవును అచ్చంగ ఐదే ఐదు విషయాల వెంబడి మనస్సు మనలని పరుగులు పెట్టిస్తోంది. అలా మనస్సుని ప్రేరేపిస్తున్నవి ఓ పది ఇంద్రియాలు.

ఐదు కర్మేంద్రియాలు. ఐదు జ్ఞానేంద్రియాలు. ఇందులోనూ మొదటి ఐదూ పాపం నిరంతరం పనిచేస్తూ పోతుంటాయి. వాటికలా పని పెట్టేవి మనసుని స్థిరంగ నిలవనీయునివీ ఐదు జ్ఞానేంద్రియాలే. ఎందుకంటే మనస్సుయొక్క సహకారమే లేకపోతే ఏ ఇంద్రియమూ తనంత తాను విషయాలని చేరలేదు అనుభూతినీ పొందలేదు.

ఇవి ఒక్కొక్కటీ మనస్సహకారంతో ఒక్కొక్క విషయంతో చేరి దానిని మాత్రమే గ్రహించగలవు. ఆ అనుభవజ్ఞానాన్ని మనసు ద్వారా మన(ఆత్మ)కి చేరవేస్తుంటాయి. అంతటితో ఊరుకోవు ఆ సుఖానుభూతికై మళ్ళీ మళ్ళీ ఆ విషయం కావాలని మనసుని ప్రేరేపిస్తాయి. పొందేదాక మనసుని స్థిమితంగ ఉండనీయవు.

ఆ ఐదు జ్ఞానేంద్రియాలు గ్రహించే ఐదు విషయాలేమిటంటే..

1. చక్షురింద్రియం- ఇది కంటిలోని నల్లగుడ్డుపై ఉండేది అతి సూక్ష్మ మైనది. రూపాన్ని మాత్రమే గుర్తించగలదు.
2. రసనేంద్రియం- ఇది నాలుకపై ఉంటుంది. రుచిని గుర్తిస్తుంది.
3. ఘ్రాణేంద్రియం- ఇది . ముక్కుపై ఉంటుంది. వాసనని గ్రహిస్తుంది.
4. త్వగింద్రియం- ఇది శరీరమంతటా చర్మంపై ఉంటుంది. స్పర్శని తెలుసుకుంటుంది.
5. శ్రవణేంద్రియం- ఇది చెవిలో ఉంటుంది. శబ్దాన్ని గ్రహిస్తుంది.

కన్ను వాసన చూడలేదు రుచిని చూడలేదు శబ్దాన్ని గ్రహించలేదు. అలానే చెవి రూపాన్ని రుచిని వాసనని చూడలేదు. స్పర్శని తెలుసుకోలేదు. ఇలా ఒక్కొక్క ఇంద్రియం ఒక్కొక్క విషయాన్నే ప్రధానంగ గ్రహించ గలుగుతాయి. అయినా ఏ ఒక్క ఇంద్రియం దానికి సంబంధించిన విషయంలో తగులుకున్నా మనసు గతి ఇంతే! మనబ్రతుకూ అంతే! మాధవుని పరమై ఉండాల్సిన మనస్సుని, ఇంద్రియాలు నిరంతరం బాహ్యపదార్థాలవైపు లాగివేస్తాయి. నారాయణ పరమైన మనసనే తెరచాపతో గంభీరంగ సాగుతూ గమ్యం చేరవలసిన జీవన నౌకని దుఃఖసాగరంలో ముంచివేస్తాయి.

అలా మనసు విషయపరమైపోతే ఎలాంటి నాశనాన్ని పొందాల్సి వస్తుందో మనచుట్టూ ఉండే వన్య జీవులని చూపి అవధూత వివరించారు. ఇంతవరకు సాగరం మొదలైన వాటిని చూచి ఎలా ఉండాలో తెలిపారు. ఇపుడు మనం ఎలా ఉండతగదో నేర్పే గురువులని గురించి వివరిస్తున్నారు.

పతంగ మధుకర గజహరిణ మీనాః...పంచైతే గురవః అంటూ అవధూత ప్రకృతిలోని ఓ ఐదు ప్రాణులని గురువులుగ చెప్పారు. అవి పతంగము మధుకరము గజము, హరిణము, మీనము వీటిలో ఉన్న విశేషము ఏమిటి మనం నేర్చుకోవలసిందేమిటో అవధూత అందించిన క్రమంలో ఒక్కొక్కటిగ తెలుసుకుందాం!

పతంగము అంటే మిడత లేదా దీపపు పురుగు. చిన్ని చిన్ని రెక్కల సహాయంతో ఎగురుతూ ఉంటుంది. ఇది దీపపు కాంతిని చూసి అదేదో భోగ్యపదార్థమనుకుని, దీపం వైపు ఆకర్షితమౌతుంది. భగభగమండుతూ ప్రకాశించే అగ్నిది చాలా ఆకర్షణీయమైన రూపం కదా! బహుశా ఆ రూపాన్ని చూసి అదేదో తినదగిన పదార్థమనుకొని మిడత అగ్ని వైపు వెళుతుంది. తీరా దగ్గరకి వెళ్ళాక ఆ వేడికి తనకున్న చిన్ని రెక్కలు కాలిపోయి ఎగరలేక అందులోనే పడి అసువులు కోల్పోతుంది. అందుకే దీనికి పతంగమని పేరు. పతతి అగ్నౌ ఇతి పతంగః అన్నారందుకే!

అవధూత ఇది గమనించి నేర్చుకున్న పాఠాన్ని యదు మహారాజుకి వివరించారు. "ఓ యదు మహారాజా! మిడతలోని చక్షురింద్రియం అగ్ని స్వరూపానికి ఆకర్షితమైంది. దాని ప్రాణానికే ముప్పు ఏర్పడింది. అందుకే అది నాలా పై పై మెరుపులకి ఆకర్షితులు కాకండి ప్రాణాపాయం కొనితెచ్చుకోకండి అంటోంది. దీనిని బట్టి మనం చక్షురింద్రియంతో ఎంత జాగ్రత్తగ ఉండాలో తెలుస్తుంది.

భగవంతుని సృష్టిలో కంటికి ఆకర్షకమైన అందమైన రూపాలు ఎన్నెన్నో. అన్నింటిలోకి మిక్కిలి ఆకర్షకమైనది స్త్రీ సౌందర్యం. భగవంతుడిచ్చిన అవయవ సౌష్టవానికితోడు చిత్ర విచిత్రమైన వస్త్రాలంకారాలు ఆభరణాలు చందనాది పరిమళాలు ఆమె సౌందర్యాన్ని మరింత ఇనుమడింపచేస్తాయి. ఆ పై ఆమె విలాస చేష్టలు పురుషుణ్ణి మరింత మోహింపచేస్తాయి. ఆమె రూప విలాస ప్రలోభాలకి లొంగితే ఎంతటి సాధకులైన పతనమయి, మిడతలా నశించిపోయే ప్రమాదం ఉంది.

దీనికి ఉదాహరణ బ్రహ్మర్షి కావాలనుకున్న విశ్వామిత్ర మహర్షి మేనక సౌందర్యానికి ఆకర్షితుడై తపస్సుని నష్టపోయాడు. కొన్ని వేల సంవత్సరాలుగ చేసిన తపస్సును నాశనం చేసుకున్నాడు. అంతేకాదు మరికొన్ని సంవత్సరాలకాలం తాను తాపసినన్న సంగతే మరచిపోయాడు. భగవంతుని దయతో తిరిగి స్మరణ వచ్చిన తరువాత సాధన కొనసాగించగలిగాడు. కాలాంతరంలో మళ్ళీ రంభ వస్తే గతానుభవంతో ఆమె ప్రలోభానికి లొంగక తనను తాను నిలువరించుకున్నాడు. అయితే తపస్సుకి విఘాతం కలిగించడానికి వచ్చిందన్న కోపానికి లొంగిపోయాడు. మళ్ళీ చేసిన తపస్సంతనూ నష్టపోయాడు.

అందుకే సాధకులు భగవంతుని సృష్టిలో ఉన్న ఎన్నో నయనానందకర పదార్థాలను చూసి వాటి సృష్టికర్త అయిన వాని దివ్య సౌందర్యాన్ని భావన చేయాలే తప్ప, వాటిని భోగ్యములుగా భావించి ఆకర్షితులు కారాదన్న పాఠం మిడతని చూసి నేర్చుకోవాలి" అని అవధూత యదుమహారాజుకి చెప్పిన ఆనాటి పాఠం, ఈ నాటికీ మనకందరికీ ఆచరణయోగ్యం. కేవలం ఒక్క చక్షురింద్రియ ప్రవృత్తి వలనే ఎంత ప్రమాదానికి లోనవుతామో గమనించాలి.

నిజానికి సర్వేంద్రియాణాం నయనం ప్రధానం అన్నారు. మనని సరైన మార్గంలో నడిపించేదే చక్షురింద్రియం. ఇది మిగిలిన ఇంద్రియాలన్నిటికీ కూడా మార్గనిర్దేశం చేయగలిగినది. కానీ చూసిన రూపాలన్నిటినీ రికార్డుచేసి పెట్టేస్తుంది. అందుకే మన మెదడనే కంప్యూటర్‌లో 75% Memoryని ఒక్క కన్నే ఆక్రమించేస్తుంది. కంప్యూటర్ లలో కూడా ఆడియో కంటే వీడియో లేదా ఫోటోలకే ఎక్కువ Space పడుతుందన్నది మనకి తెలిసిన విషయమే కదా! అంటే మనమెదడంతా చూసిన విషయాలన్నిటి తోటే నిండిపోతోందన్నమాట!

ఇక ఆ మెదడులో వచ్చే ఆలోచనలన్నీ వాటి చుట్టూనే తిరుగుతూ అవే కావాలంటూ ఉంటాయన్న మాట! ఇక చక్షురింద్రియం గాడి తప్పి తగని విషయాలకి ఆకర్షితమయ్యిందా మనని గతి తప్పించేస్తుంది. ఒక్కొక్కసారి అది మరణాంతకం కూడా అవుతుంది. కనుక సామాన్యులమైన మనమంతా కంటికి ఆకర్షణీయమైనవన్నీ ఆనందదాయకములు లేదా ఆరోగ్యకరములు కాలేవని గుర్తించాలి. ప్రధానమైన ఈ చక్షురింద్రియాన్ని ఎంత జాగ్రత్తగ వాడుకుంటే మన మెదడు కంప్యూటర్ అంత బాగా పనిచేస్తుంది. జీవితం సుఖకరంగా సాగుతుంది.

ఓ యదు మహారాజా! ఒక చిన్ని ప్రాణి అయిన మిడత కూడా ఎంతటి పాఠాన్ని నేర్పిస్తోందో చూశావా! మనమెంతో ప్రధానమనుకునే మనకన్నే మనని మోసం చేయగలదు. అందుకనే ఇంద్రియాలని నారాయణ పరం చేయగలిగితే కన్పించే ప్రతి రూపం లోపల ఉన్న ఆ దివ్యత్వాన్ని గుర్తించగలుగుతాం! బాహ్యరూపానికి ఆకర్షితమైన మిడతలాంటి అపాయాన్ని తొలగించుకోగలుగుతాం! అంటూ మధుకరమనే మరో ప్రాణినుండి ఏమి నేర్చుకోవచ్చో అవధూత తెలిపినది, వచ్చే సంచికలో తెలుసుకుందాం!



# శ్రీరామానుజ సహస్రాబ్ది విశేషాలు



రామానుజ సహస్రాబ్ది ప్రాజెక్ట్

గత మేనెలలో అక్షయతృతీయనాడు మన దివ్యసాకేత రాముని సన్నిధికి సమీపంలో భగవద్రామానుజ సహస్రాబ్ది సమతామూర్తి స్ఫూర్తికేంద్రానికి శంకుస్థాపన జరిగిన విషయం విదితమే. ఆనాటి నుండి ఈప్రాజెక్ట్‌ని క్రమబద్ధంగా తీర్చిదిద్దే ఉద్యమం కొనసాగుతోంది. గచ్చిబౌలి మైహోమ్ హబ్‌లోని కార్యాలయం తత్సంబంధితమైన కృషిని నిరంతరం సాగిస్తోంది. అందులో భాగంగా స్థపతులు, ఆర్కిటెక్ట్స్ కూడా దక్షిణ దేశయాత్ర చేసి మన ఆలయాలనెన్నింటినో సందర్శించి, గమనించి వాటిలోని ముఖ్యాంశాలని ఇక్కడ స్ఫూర్తికేంద్రపు నమూనాడ్రాయింగ్స్‌లో పొందుపరుస్తున్నారు. ఇంతవరకూ స్ఫూర్తికేంద్ర నిర్మాణానికి కేటాయించిన 45ఎకరాల స్థలాన్ని వాస్తుపరమైన, ఇతరత్ర ఎటువంటి లోపాలు లేకుండా, తీర్చిదిద్దే ప్రయత్నం పూర్తయింది.

ద్వారాలు, మండపాలు, కార్యాలయాలు, రక్షణవ్యవస్థ, శౌచవ్యవస్థ, మెట్లు, ఎక్కడెక్కడ ఎలాఎలా ఉండాలి అనే విషయంలో నిర్ణయాలు తీసుకుని వాటిని సక్రమంగా రూపొందించారు. దీని పూర్తి వివరాలు website: www.sriramanujasahasrabdi.orgలో త్వరలోనే తెలియచేస్తారు. నిర్మాణానికి సంబంధించిన పర్మిషన్స్‌కి అప్లికేషన్స్ జరుగుతున్నాయి. ఈకేంద్రంలో ఉండే 108 ఆలయాలు శిలామయాలు కావాలని నిర్ణయించారు. కనుక శిలాసేకరణకై తగిన స్థలాలను, కొండలను గుర్తించారు. శిలాసేకరణకి కావలసిన అంశాలు సంప్రదింపులు జరుగుతున్నాయి. రామానుజులవారి విగ్రహం లోహమయంగా ఉండాలని నిర్ణయం. దీనిని చేయగలిగిన నిర్మాతలని గుర్తించారు. చైనాలో మూడు నాలుగు సంస్థలు నిర్మాణంలో ఉత్సాహాన్ని చూపించాయి. విగ్రహనిర్మాణానికి పట్టే లోహము, దాని బరువు ఎంత ఉండాలో ఎలా అందించాలో మొదలైన వాటికై ఆయా సంస్థలతో సంప్రదింపులు జరుపుతున్నారు. త్వరలోనే ఒక నిర్ణయం తీసుకుంటారు.

ఇంతవరకూ 216అడుగుల ఎత్తు కలిగిన ఈమూర్తి నిర్మాణం ఎయిర్‌పోర్ట్ నియమాలదృష్ట్యా అంగీకరిస్తారా లేదా! అనే సంశయం ఉండేది. ఇప్పుడది తొలగిపోయింది. 230 అడుగుల ఎత్తుదాకా నిర్మాణానికి పర్మిషన్ లభించింది. కనుక మన ప్రాజెక్ట్‌కి ఇప్పుడు ఏవిధమైన ఆటంకాలూ లేవు. చాలామంది భక్తులు ఉత్సాహంతో ముందుకు వస్తున్నారు. శ్రీస్వామివారు ఇచ్చిన పిలుపుననుసరించి చిన్నారులుకూడా ఈమహోద్యమంలో తమవంతుగా కిడ్డీబ్యాంక్ నుండి చిరుకానుకలనుసైతం సమర్పించుకుంటున్నారు. ఇది ఎంతో ప్రోత్సాహకరంగా ఉంది. ఈకేంద్రము తప్పకుండా భక్తుల హృదయరంజకంగా రూపుదిద్దుకుంటుంది.

## చిన్నారుల పెద్దకానుక



మండపేట మండలం, వీరభద్రపురంకి చెందిన శ్రీకొండిపూడి కుమార స్వామి, గంగాభవాని దంపతుల సత్సంతాన మైన **చి॥ లోకేశ్వర్– 8వ తరగతి, చి॥సాయిజిజిత్ రాకేశ్ – 3వ తరగతి,** వీరిరువురూ తల్లిదండ్రుల ప్రోత్సాహంతో ప్రతిసంవత్సరం పుట్టినరోజు సందర్భంగా దాచుకున్న డబ్బును జీవా–శ్రీరామనగర్‌లో శ్రీరామానుజ సహస్రాబ్దికై 20,116/–రూ॥ను శ్రీస్వామివారికి సమర్పించు కున్నారు. ఈ చిన్నారుల చిరు కైంకర్యానికి హార్దమైన మంగళాశాసనాలు అనుగ్రహించారు.

## శ్రీరామానుజ సహస్రాబ్ది - 2016 - 17

**ప్రియ భగవద్బంధువులారా! మీరంతా ఎంతో ఉత్సాహంతో భగవద్రామానుజ విగ్రహ నిర్మాణానికి మీమీ ద్రవ్యాన్ని వినియోగింపదలచడం చాలా ముదావహం. ఈక్రింది అకౌంట్లకు తమ ద్రవ్యాన్ని నేరుగా జమచేయవచ్చును.**

1. ఆంధ్రాబ్యాంక్: శ్రీరాంనగర్ బ్రాంచి
   209710100000007
   IFSC Code ANDB – 0002097

2. యాక్సిస్ బ్యాంక్ - శంషాబాద్ బ్రాంచి
   Ac No- 914010046595367
   IFSC Code - UTIB 0000867

**మీరు ఈ అకౌంట్లకు వేరే బ్యాంకులనుండి ద్రవ్యం జమచేసినపుడు మాత్రమే IFSC Code వినియోగింపవలసి ఉంటుంది. మీద్రవ్యం జమచేసిన తరువాత ఈక్రింది అడ్రస్సుకు కౌంటర్‌ఫాయిల్ కాపీ, జమచేసిన బ్యాంకుతేదీ వివరాలు పంపండి. లేదా ఫోనులో చెప్పండి.**

**శ్రీరామానుజ సహస్రాబ్ది కార్యనిర్వాహక సమితి,**
**9553549971, 9553549972,**
**శ్రీరామానుజ సహస్రాబ్ది, జీవా, శ్రీరామనగర్, ముచ్చింతల్(గ్రా), పాలమాకుల(పో), శంషాబాద్ (మం), రంగారెడ్డి జిల్లా -509325**
Email -contact@sriramanujasahasrabdi.org

## శ్రీశ్రీశ్రీ అహోబిలజీయర్‌స్వామివారి కార్యక్రమ సమాచారం
### 25-09-2014 నుండి 01-10-2014వరకు

శరన్నవరాత్రులను పురస్కరించుకొని శ్రీశ్రీశ్రీత్రిదండి అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు సీతానగరం ఆశ్రమంలో ఉదయం కార్యక్రమములలో తిరువారాధన, శ్రీసుందరకాండ పారాయణలు నిర్వహించారు.

సాయంత్రం కార్యక్రమములలో కృష్ణాజిల్లాలో పలువికాసతరంగిణులను దర్శించి, రామానుజ సహస్రాబ్ది వికాస తరంగిణి శాఖలు చేపట్టవలసిన కార్యక్రమములు, భగవద్వైభవం ఆచార్యవైభవం, సంస్కృతి, సంప్రదాయ పరిరక్షణ, వికాసతరంగిణి ఆశయాలసాధనకై చేయవలసినకృషి మొదలగు విషయాలను కార్యకర్తలకు, భక్తబృందాలకు మార్గదర్శనం చేశారు.

శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు శ్రీరామానుజ సహస్రాబ్దిని పురస్కరించుకొని పలుచోట్ల రామానుజవైభవాన్ని ప్రవచిస్తూ అందరినీ సాదరంగా ఆహ్వానించారు.

విజయవాడ, గుణదల శ్రీవేంకటేశ్వరస్వామిదేవస్థానం, 26 గుడివాడ శ్రీలతగారి నివాసంలో, 27న మాచవరం ఆంజనేయస్వామి దేవస్థాం, 28 మానికొండ శ్రీరామాలయం, 29 గన్నవరం శ్రీసీతారామచంద్రస్వామి దేవస్థానం, 30 తాడేపల్లి బావాజీగూడెం ఆరోగ్యశిబిరం సందర్శన, అక్టోబర్ 1న గోసవీడు, ఊటుకూరు గ్రామాలలో ప్రవచించారు.

3వ తేది సాయంత్రం సీతానగరంలో విజయదశమి సందర్భంగా శమీపూజను నిర్వహించారు. ఆశ్రమంలో కార్యక్రమాలకు కావలసిన ఏర్పాట్లు చేసిన శ్రీమాన్ పురాణం వేంకటాచార్యస్వామి, శ్రీమాన్ గుదిమెళ్ళ రఘునాథ్ స్వామి, శ్రీమాన్ బాబులకు మంగళాశాసనం చేశారు.

ఈ సందర్భంగా అనేకమంది యువతీయువకులు ఆరోగ్యవికాస్, ప్రజ్ఞావికాస్, సంస్కారవికాస్‌లో చేరటానికి ఉత్సాహం చూపించారు. పలుచోట్ల శ్రీమద్రామాయణ నిత్యపారాయణ చేయగలమని మహిళలు, యువతీ యువకులు వాగ్దానం చేశారు.

ఈకార్యక్రమాన్ని కృష్ణాజిల్లా వికాసతరంగిణి-జిల్లాకమిటి శ్రీమాన్ బి.ఎల్. చక్రధర్ శ్రీమాన్ వి.వి.రాఘవన్, శ్రీమాన్ ఎన్. కృష్ణలు సమన్వయపరచారు.

జిల్లా శాఖలకు సంబంధించి పి. రుక్మిణి, కె. వెంకటరావమ్మ,ఎల్. విజయ, ఎ. స్వరాజ్యలక్ష్మీ, కె. ఆదిలక్ష్మీ, వై.అమ్మాజీ, శ్రీమతి, పాపమ్మ, చేలమ్మ, కె.వి. సరస్వతి, వరలక్ష్మీ, ఎమ్.ఎస్. రామకృష్ణ, బి. శ్రీహరి, డా॥రాజశ్రీ, కె. మాధవీ రవీంద్ర,ని ఎన్.శ్రీనివాసరావు, ఎమ్. కోటేశ్వరరావు, శ్రీనివాసరామ్ మొ॥ వారు పాల్గొన్నారు.

## శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయర్‌స్వామివారి కార్యక్రమ సమాచారం
### 3.10.2014 నుండి 17.10.2014వరకు

**సంగారెడ్డిలో విజయదశమి వేడుకలు** ది. 3-10-14న విజయదశమి వేడుకలను శ్రీవైకుంఠపురం శ్రీవిరాట్ వేంకటేశ్వర ఆలయంలో శ్రీశ్రీశ్రీత్రిదండి దేవనాథ రామానుజ జీయర్ స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో ఆలయ ప్రధానార్చకులు శ్రీమాన్ వరదాచార్య స్వామివారు, ఆలయ కమిటి వారి ఆధ్వర్యంలో ఘనంగా జరిగాయి. ఆలయంలో శమీపూజ కార్యక్రమాన్ని జరిపి శ్రీస్వామివారు సంగారెడ్డి మున్సిపల్ గ్రౌండ్స్‌లో గత 30 సం॥లుగ ప్రతి సం॥రము జరుగుతున్న విజయదశమి వేడుకల్లో పాల్గొని మంగళాశాసనం కృపజేసారు. కార్యక్రమాన్ని స్థానిక విశ్వహిందూపరిషత్ వారు నిర్వహించారు. వేడుకలలో భాగంగా రావణదహన కార్యక్రమంలో సుమారు 30వేలమంది పాల్గొన్నారు. శ్రీకమలానందభారతీస్వామి, శ్రీశివస్వాములతో పాటు, స్థానిక MLA.శ్రీచింతాప్రభాకర్‌గారు ZPTC చైర్‌పర్సన్, మున్సిపల్ చైర్మన్ పాల్గొన్నారు.

4వ తేది శ్రవణానక్షత్రం, పరమాత్మ శ్రీనివాసునిగా తిరుమల కొండపైకి చేరిన రోజు. స్వామి తిరునక్షత్రాన్ని పురస్కరించుకొని శ్రీవైకుంఠపురం శ్రీవిరాట్‌వేంకటేశ్వరస్వామి వారికి శ్రీదేవనాథరామానుజ జీయర్ స్వామివారు108 కలశాలతోటి అభిషేకాన్ని స్వయంగా జరిపారు.

MLA శ్రీచింతా ప్రభాకర్‌గారు, మాజీ ఉపముఖ్యమంత్రి శ్రీదామోదర రాజనర్సింహ గారి సతీమణి శ్రీమతి పద్మినిగారు పాల్గొన్నారు. శ్రీస్వామివారు కార్యక్రమ అనంతరం వారిని సమ్మానించి మంగళాశాసనాలు కృపజేసారు.

12వ తేది పర్వతాపురం శ్రీలక్ష్మీనృసింహస్వామి దేవస్థాన కమిటీ జంటనగరాల వికాసతరంగిణి, పర్వతాపుర వికాసతరంగిణుల ఆధ్వర్యంలో శ్రీమతి మాధవి రవీందర్‌గారి పర్యవేక్షణలో మహిళా ఆరోగ్య వికాస్ మెడికల్ క్యాంప్ నిర్వహణ జరిగింది. కార్యక్రమాన్ని శ్రీశ్రీశ్రీత్రిదండి దేవనాథ రామానుజ జీయర్ స్వామివారు దీప ప్రజ్వలనతో ప్రారంభించి శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారి ఆశయాలకు అనుగుణంగా మహిళలు ఆరోగ్యంగా ఉండాలి తద్వారా ఆరోగ్యవంతమైన సమాజం ఏర్పడాలి అని మంగళాశాసనాలు కృపచేసారు. కార్యక్రమంలో సుమారు 150 మంది మహిళలకు వైద్యపరీక్షలను నిర్వహించారు. కార్యక్రమానికి శ్రీయాదమాత గారు, ఆలయకమిటీ సభ్యులు, వికాసతరంగిణి సభ్యులు పాల్గొన్నారు.

అదిలాబాద్, నిజామాబాద్, కరీంనగర్ జిల్లాల వికాస తరంగిణి వారు నిర్వహించిన సంస్కారతరంగిణి కార్యక్రమంలో శ్రీదేవనాథరామానుజ జీయర్ స్వామివారు పాల్గొని మంగళాశాసనాలు కృపజేసారు.

17వతేదీన షాద్‌నగర్ శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయంలో నూతన వికాసతరంగిణిని శ్రీదేవనాథ జీయర్‌స్వామివారు ప్రారంభించి, మంగళాశాసనాలు కృపజేశారు. కార్యక్రమంలో కేంద్ర వికాసతరంగిణి కార్యదర్శి శ్రీమాన్ బాలకిషన్‌రావుగారు, జిల్లా ఇన్‌చార్జ్ శ్రీమతి విజితారెడ్డిగారు, శ్రీమతి జ్యోతిరెడ్డిగారు, మహబూబ్‌నగర్ జిల్లా ప్రెసిడెంట్ శ్రీమాన్ రాజశేఖర్‌గారు, కార్యదర్శి శ్రీమాన్ రఘునాథాచార్యులుగారు మొదలగువారు పాల్గొన్నారు. ఈకార్యక్రమాన్ని ప్రోత్సహించిన విజయ్‌గారికి మరియు కమిటీసభ్యులకు, కార్యకర్తలకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు చేశారు.

మెదక్ జిల్లా సంగారెడ్డి వైకుంఠపురంలో కొలువుదీరిన శ్రీవేంకటేశ్వర స్వామి వారిని శనివారం రాష్ట్ర రవాణాశాఖ మంత్రి మహేందర్‌రెడ్డిగారు కుటుంబసమేతంగా దర్శించుకుని ప్రత్యేక పూజలు చేశారు. మంత్రితోపాటు స్థానిక ఎమ్మెల్యే చింత ప్రభాకర్, మాజీ ఉపముఖ్యమంత్రి సతీమణి పద్మిని దామోదర్‌గారు కూడా ప్రత్యేకపూజలు చేశారు. ఆలయ కమిటీ ఆధ్వర్యంలో శ్రీశ్రీశ్రీ దేవనాథరామానుజ జీయర్‌స్వామివారు మంత్రి మహేందర్‌రెడ్డి దంపతులను పట్టువస్త్రాలతో సన్మానించి మంగళాశాసనాలు కృపజేశారు.



పరమహంస పరివ్రాజకులు

# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



## శ్రీవైష్ణవవృద్ధదంపతీ వరివస్య- 12-10-14

హైదరాబాద్ శ్రీవైష్ణవ సంఘంవారు 75సం॥లు నిండిన శ్రీవైష్ణవ దంపతులను సమ్మానించాలనే సంకల్పంతో ఒక కార్యక్రమాన్ని ఏర్పాటు చేశారు. వారి కార్యాలయములో తగిన వసతి చాలకపోవడంతో శ్రీశ్రీశ్రీస్వామి వారిని సంప్రదించారు. శ్రీస్వామివారు ఈకార్యక్రమానికి "శ్రీవైష్ణవ వృద్ధదంపతీ వరివస్య" అనే పేరును సూచించడంతోపాటు మన శ్రీరామనగరం ఆశ్రమంలోనే జరుపుకోవడానికి కావలసిన వసతులను, దంపతులకి వస్త్రాలను, ఇతర వనరులను అనుగ్రహించారు. ఆనాటి కార్యక్రమంలో 80మంది దంపతులు పాల్గొన్నారు. శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనాలతో ఆనాటి కార్యక్రమంలో పెద్దలు, తల్లిదండ్రుల ప్రాధాన్యాన్ని వివరించి, వారి శ్రేయస్సుకై ఆయుష్య హోమం జరిపించారు. అనంతరం ఆ దంపతులకి వారి సంతానం పాదపూజలు చేశారు.

ఆనాటి కార్యక్రమంలో వరంగల్లు నుండి విచ్చేసిన శ్రీఉ.వే.శ్రీమాన్ ఎన్.సి. రఘునాథాచార్య స్వామి దంపతులుగ వేంచేసి గోష్ఠికి మంగళాశాసనాలు చేశారు. రాష్ట్ర సలహాదారు I.A.S శ్రీమాన్ రమణాచార్య పాల్గొన్నారు. పూజలందుకున్న దంపతులంతా తమ సంతానాన్ని సంప్రదాయ పరిరక్షణలో ప్రోత్సహిస్తామని ప్రతిజ్ఞ చేశారు. వైష్ణవసంఘంవారు, పాల్గొన్న దంపతులందరికీ జ్ఞాపికనందించగా ఆచార్య పీఠం తరపున శ్రీశ్రీశ్రీ స్వామివారు సమ్మాన పత్రాలను అనుగ్రహించి మంగళాశాసనం చేశారు.

❀❀❀

## దక్షిణాఫ్రికా ప్రతినిధుల ఆశ్రమ సందర్శనం

12 తేదీన దక్షిణాఫ్రికా నుండి కొందరు ప్రతినిధులు మనదేశానికి విచ్చేశారు. వారి పర్యటనలోభాగంగా మన ఆశ్రమానికి వచ్చి ఇక్కడి విద్యాబోధన విధానాన్ని, విశేషంగా అంధులకి కంప్యూటర్‌ద్వారా శిక్షణ పరీక్షావిధానానికి సంబంధించిన సాంకేతికమైన అంశాలని, గిరిజన పాఠశాలల వివరాలను శ్రీస్వామివారినుండి తెలుసుకున్నారు.



## హుద్‌హుద్ తుఫాన్ బీభత్సం

అక్టోబర్ 12 వతేదీన తూర్పు సముద్రంలో పుట్టిన వాయుగుండం విశాఖవద్ద తీరాన్ని ఢీకొనడంతో, ఉత్తరాంధ్రలో విపరీతమైన గాలులతో విశాఖ, మొదలైన ప్రాంతాలకు భారీ ఆస్తినష్టం, కలిగింది. చాలా రోజులపాటు విద్యుత్ లేక గాఢాంధకారం నెలకొంది. పచ్చని మొక్కనేది మిగలక మరుభూమిగా తయారయింది. గత సంవత్సరం ఇదే సమయానికి వైజాగ్‌ని తాకుతుం దనుకున్న తుఫాను త్రుటిలోతప్పి ఒరిస్సా రాష్ట్రాన్ని ఢీకొంది. అప్రమత్తంగా లేకపోవడంతో భారీ జననష్టం జరిగింది. సరిగ్గా సంవత్సరం తరువాత తిరిగి అదే అక్టోబర్ 12వతేదీ మధ్యాహ్నం సమయానికి వైజాగ్‌ను తుడిచిపెట్టేసింది. ఇలాంటి విపత్తు కనీవినీ ఎరుగనిది. ఇంతవరకు వచ్చిన తుఫానుల్లో ఒక నగరంమొత్తం తుడిచిపెట్టుకు పోయిన సన్నివేశం మరొకటిలేదు.

వీధులన్నీ విరిగిన పెద్దపెద్ద చెట్లతోను, కూలిన విద్యుత్ స్తంభాలతోను, పైకెగిరిపోయిన రేకులషెడ్‌లతోను బీభత్సంగా తయారయింది. నాలుగురోజులపాటు ప్రజలెవ్వరూ తమ గృహాల్లోంచి వెలుపలికి వచ్చే అవకాశం కలుగలేదు. తినటానికి తిండి ఎలాగూలేదు, కనీసం త్రాగడానికి నీరు కూడా కరువయింది. పిల్లలకు త్రాగడానికి పాలులేవు, ఇలాంటి భయంకర వాతావరణాన్ని విశాఖప్రజలు ఎనాడూ ఎదుర్కోలేదు.

విశేషించి సముద్రతీరాన ఉన్న మన వారిజఆశ్రమంకూడా నష్టపోయింది. క్రిందటి ఏడాది సుమారు ఒకటిన్నర కోటిరూపాయల ఖర్చుతో నేత్రవిద్యాలయానికి పక్కాభవనం నిర్మించారు. శ్రీమాన్ నారాయణరెడ్డిగారి చొరవతో వారిజ సభ్యులందరూకలసి ఈశాశ్వత భవన నిర్మాణం చేయడంవలన మన వేదవిద్యార్థులు, నేత్రాలయ విద్యార్థులంతా సురక్షితంగా ప్రాణాలతో బయటపడగలిగారు. ఈఒక్క



భవనం తప్ప మిగిలిన కుటీరాలన్నీకూడా ముప్పుబారిన పడ్డాయి. విద్యుత్ సౌకర్యానికై ఏర్పాటు చేసిన సోలార్ ప్యానల్స్ సగంపైగా దెబ్బతిన్నాయి అంటే ఆశ్రమానికి జరిగిన నష్టతీవ్రత ఎంతటిదో ఊహించుకోవచ్చు.

**ప్రభుత్వనిధికి వికాసతరంగిణి విరాళ సమర్పణ**

ప్రభుత్వం సకాలంలో స్పందించి ప్రజలను హెచ్చరించడంద్వారా ప్రాణనష్టాన్ని చాలావరకు అడ్డుకోగలిగింది. స్వయంగా నేతలే పరిస్థితిని పర్యవేక్షిస్తూ ఆయాప్రాంతాలలో పర్యటిస్తూ ప్రజలని ఉపద్రవంనుండి రక్షించగలిగారు. కానీ ప్రకృతి వైపరీత్యంవల్ల కలిగే ఆస్తినష్టాన్ని ఎవరూ అడ్డుకోలేక పోయారు. ఇలాంటి ఉపద్రవంవల్ల కలిగిన నష్టాన్ని ఏ ఒక్కరూ పూరించలేరు. కనుక, ప్రజలకష్టాలను ప్రజలే ఎరిగి పరస్పరం ఆదుకోవల్సిన అవసరం ఎంతైనా ఉందని శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారు ప్రజలకు పిలుపునిచ్చారు.

ఈ ప్రకృతి వైపరీత్యానికి శ్రీస్వామివారు స్పందించి కేంద్రకార్యాలయ వికాసతరంగిణివారి శాఖల అన్నింటితరపున ప్రభుత్వానికి 10లక్షల విరాళాన్ని ప్రకటించారు. 21వ తేదీన



విజయవాడలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబునాయుడు గారికి, వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ రమేష్‌గుప్తగారు, శ్రీశ్రీశ్రీ అహోబిలజీయర్‌స్వామివారు ఈ 10లక్షల విరాళాన్ని ముఖ్యమంత్రి సహాయనిధికి అందించారు. వికాసతరంగిణి సభ్యులు మరియు సీతానగర ఆశ్రమ నిర్వాహకులు ఇందులో పాల్గొన్నారు. మన వారిజలో కూడా విద్యార్థులందరికీ తాత్కాలిక ఏర్పాట్లుచేసి, కుటీరాల స్థానంలో శాశ్వత భవన నిర్మాణాలను చేయాలని స్థానిక కార్యకర్తలు నిర్ణయించారు.

❁❁❁

18వ తేదీన తీర్థగోష్ఠి అనంతరం సమాశ్రయణ కార్యక్రమం ఇక్కడ శ్రీరాంనగర్, జీవాప్రాంగణంలో మంత్రోపదేశాన్ని అనుగ్రహించారు శ్రీ స్వామివారు.

19వతేదీ శ్రీరామనగరం ఆశ్రమంలో జంటనగరాల వికాసతరంగిణి ద్వారా జరిగిన సంస్కార వికాస్ కార్యక్రమంలో శ్రీవారు కార్యకర్తలందరికీ క్రమశిక్షణకు సంబంధించిన సూచనలు అందించి మంగళాశాసనాలుజేశారు.

20వ తేదీన సికింద్రాబాద్, బోయినపల్లిలోని శ్రీమాన్ కాసుగంటి ఆనంద్‌రావుగారి పరమపదోత్సవానికి వేంచేసి వారి కుటుంబసభ్యులకు మంగళాశాసనాలు గావించారు. వీరు నిజామాబాద్‌లో జరిగే సాంప్రదాయిక కార్యక్రమాలకు పట్టుగ ఉండేవారు.

❁❁❁

**దీపావళి మహోత్సవాలు - జీవా**

21వతేదీన తీర్థగోష్ఠి అనంతరం శ్రీశ్రీశ్రీ స్వామివారు JIMS వైద్య సిబ్బందికి, JIVA గురువులకు, విద్యార్థులకు, దివ్యసాకేతం





అర్చకస్వాములకు వారి పరివారానికి, ఆలయ సిబ్బందికి, ఆఫీస్ సిబ్బందికి, Jeeyar Channel సిబ్బందికి, ఉభయదారులకు, వికాసతరంగిణి కార్యకర్తలందరికీ దీపావళి సందర్భంగా నూతన వస్త్రాలను ముందుగానే అనుగ్రహించి మంగళాశాసనాలు చేశారు.

22వ తేదీ ఉదయం. 4. 00గం॥లకు నరకచతుర్దశి సందర్భంగా సూర్యోదయాత్పూర్వం పెరుమాళ్ళకు తైలాభ్యంజనం సమర్పించి, చంద్రకళలకు పెరుమాళ్ళ నూతన వస్త్రాలను సేవింపజేసి ఆవిధానం ఎందుకు చేయాలో వివరించి శ్రీవారు అందరికీ మంగళాశాసనాలు గావించారు. ఆ తరువాత వేదవిద్యార్థులందరికీ మంగళహారతులు అమ్మగార్లు ఇచ్చారు.

**భాగ్యలక్ష్మీదేవాలయం - చార్మినార్, హైదరాబాద్**

23వతేదీ సాయంత్రం దీపావళి సందర్భంగా చార్మినార్‌కి ఆనుకుని ఉన్న భాగ్యలక్ష్మిసన్నిధిలో శ్రీశ్రీశ్రీ స్వామివారు భక్తులందరికీ దీపావళి సందేశాన్ని అందించి మంగళాశాసనాలు అనుగ్రహించారు.



ప్రతిసంవత్సరం ఇక్కడజరిగే దీపావళి మహోత్సవంలో సుమారు 1,50,000 మంది భక్తులు పాల్గొంటున్నారు. ఈఉత్సవంలో భాగ్యలక్ష్మిసన్నిధిని శోభాయమానంగా అలంకరించారు. అది చార్మినార్‌కే కాక రాష్ట్రానికే శోభను పెంచుతోంది. వంశపారంపర్యంగా ఈసన్నిధిని చూసుకుంటున్నవారిలో ప్రస్తుతం కుమారి శశికళగారు వారి సోదరులు అద్భుతమైన ఏర్పాట్లు చేశారు. శ్రీస్వామివారు వారికి మంగళాశాసనాలు చేశారు. "భాగ్యనగరవాసుల భాగ్యాలపంట ఈభాగ్యలక్ష్మిసన్నిధి. ఈమె వల్లనే మన భాగ్యనగరం సార్థక నామధేయమైంది''. అంటూ అక్కడి భక్తులకు మంగళాశాసనాలు చేశారు. అక్కడి నుండి తిరిగివచ్చి శ్రీస్వామివారు శ్రీలక్ష్మీపూజ. అనంతరం దివ్యసాకేతంలో భక్తులకి దీపావళి సందేశాన్ని అందించి మంగళాశాసనం చేశారు.

❀❀❀

## ఆచార్యచంద్రుల తిరునక్షత్ర వైభవం

24అక్టోబర్2014 స్వాతినక్షత్రం శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యుల 58వ తిరునక్షత్రం, జీవా ప్రాంగణంలో వైభవంగా జరిగింది. దేశవిదేశాల నుండి వేలాదిమంది శిష్యులు జీవాప్రాంగణంలోని దివ్యసాకేతానికి తండోపతండాలుగా వచ్చారు. రాష్ట్ర గ్రామీణాభివృద్ధిశాఖామాత్యులు శ్రీమాన్ వెంకయ్యనాయుడు ప్రభృతులు శ్రీవారిని సందర్శించారు. తీర్థగోష్ఠి అనంతరం సాకేతమండపంలో తిరునక్షత్రోత్సవం, జీయర్ అవార్డు ప్రదానం జరిగాయి. ఈ కార్యక్రమం ఇంచుమించుగా సాయంత్రం4.00వరకు అవిచ్ఛిన్నంగా సాగింది. ఈ సంవత్సరం జీయర్అవార్డును రు.1,00,000–పురస్కారం డా॥పి.రామానుజన్ స్వామి, సి. డాక్ బెంగుళూరువారికి సమర్పించారు.

### జీయర్ పురస్కార గ్రహీత పరిచయము

శ్రీమాన్ డా॥రామానుజన్‌స్వామి వైదిక విద్యను అధికరించడంతోపాటు కంప్యూటర్ రంగంలో చక్కటి నైపుణ్యం కలిగి దేశంలో ప్రముఖులుగా కీర్తిపొందారు. ధర్మపత్నితోపాటు మన జీవాకు విచ్చేశారు. వీరు చక్కటి జ్ఞానంతోపాటు, ఆచరణనిష్ఠకూడా కలిగిన మహానుభావులు. పెరుమాళ్ళ ఆరాధనతోపాటు, స్వయంపాకం చేసికొని భగవన్నివేదనం చేసే నిష్ఠకలిగినవారు. బావినీటినిమాత్రమే ఉపయోగిస్తూ ఇంకా ప్రాచీన ఆచారాలను సజీవంగా నిలిపి ఉంచిన నిష్ఠురమైన అనుష్ఠానం కలవారు. నేటి ఆధునిక యుగంలోకూడా ప్రాచీన ఆచారాలను దాని వైశిష్ట్యాని చాటిచెప్పే విశిష్టజ్ఞానము, ఆచరణ కలిగిన ఇలాంటి మహానుభావులని సత్కరించుకో గలగడం విశేషం.

### విశిష్ట పురస్కార గ్రహీతలు

వీరితోపాటు విశిష్టపండిత సత్కారాన్ని మరిద్దరు విద్వాంసులకు కూడా సమర్పించారు. వారిలో ఒకరు తిరుమోగూర్ అనే దివ్యస్థలంలో వేంచేసి ఉన్న 'మార్గబంధు' స్వామిసేవలో, జీవితాన్ని పండించుకొని, ఆదివ్యదేశ పెరుమాళ్ల పేరునే **'కాలమేఘం' అయ్యంగార్** అనే పేరుగా పెట్టుకొని వేద–ద్రావిడప్రబంధ నిష్ణాతులైన స్వామి. ఇక మరొక స్వామి, 96 సంవత్సరాల నిండువార్ధకంలో కూడా మొక్కవోని కంఠపాటవం, స్పష్టమైన ఉచ్చారణ, ఓపిక కలిగి దాదాపు 4 గంటలు అనాయాసంగా సభలో కూర్చోగల్గిన మహనీయులు. వేదరత్న బిరుదాంచితులు **ఉ.వే.శ్రీమాన్ కొడిచర్ల పాండురంగాచార్యస్వామి**, శ్రౌతస్మార్త విద్యావైశద్యంకూడా కల వేదవేత్త. భాగ్యనగరవాసి. వీరికి కూడా సత్కారం సమర్పించడం జరిగింది. కాకతీయ సిమెంట్ శ్రీమాన్ P. వేంకటేశ్వర్లుగారి కుమారులు శ్రీమాన్ P. వీరయ్యగారు విచ్చేసి వేదికపై ఉండి, కార్యక్రమంలో భాగస్వాములై మొదటి సత్కార ద్రవ్య పారితోషికాన్ని ప్రతి ఏడాది సమర్పిస్తున్నట్లే, ఈ ఏడాది కూడా సమర్పించారు. మిగిలిన రెండు సత్కారాల్లో ఒకటి శ్రీ అరుణారాఘవరెడ్డి దంపతులు, రెండవది శ్రీమాన్ దిట్టకవి తాతాచార్యులుగారు సమర్పించారు. ఈ ఇద్దరు పండితులకు రూ.50,000– వేలచొప్పున విశిష్ట విద్వత్‌సత్కారం సమర్పించడం జరిగింది.

### విచ్చేసిన ప్రముఖ అతిథులు

పురస్కార ప్రదాన కార్యక్రమానికి ముందు పలువురు ప్రముఖులు శ్రీశ్రీశ్రీచిన్నజీయర్‌స్వామివారి వైభవాన్ని బహుముఖంగా కొనియాడారు. మొదట మన జీవా ఛైర్మన్, ఈ ప్రాంగణాన్ని, మన స్వామివారి సంకల్పమైన సహస్రాబ్ది సమతామూర్తి ప్రతిష్ఠలకు అదనపు స్థలాన్ని సమకూర్చిన మహోదారులు, శ్రీవైష్ణవ సంప్రదాయ నిష్ఠులు అయిన డా॥జె.రామేశ్వర రావుగారు సభకు స్వాగతం పలికి, స్వామివైభవాన్ని వివరించారు.

ఈ సభకు విచ్చేసిన, మనజెట్ అధ్యక్షులు, ఈమధ్య జరిగిన ఎన్నికలలో లోకసభ సభ్యులుగా ఎన్నికైన శ్రీమాన్ గోకరాజు గంగరాజు, ప్రస్తుతం MLA శ్రీమాన్ చింతల రామచంద్రారెడ్డి, మాజీ MLC శ్రీమాన్ కమలాకరరావు, భక్తినివేదన ఉపసంపాదకురాలు శ్రీమతి డా॥టి.కె.చూడామణి, **యు.ఎస్.ఎ** లో ప్రచారంచేస్తున్న కుమారి వైశారదిగారు, నేపాల్ జెట్ నిర్వాహకులు శ్రీమతి రేణుకాజీ, నేపాల్ నుంచి వచ్చిన శ్రీమతి ఉమభట్రాయ్, శ్రీమాన్ వామన నియోపానే, ప్రముఖ సినీకవి శ్రీమాన్ జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు, స్వామివారి వైభవాన్ని కీర్తించారు. ఆపై శ్రీశ్రీశ్రీ

అహోబిలరామానుజ జీయర్ స్వామివారు, శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయర్‌స్వామి వారు, శ్రీశ్రీశ్రీ వ్రతధర రామానుజ జీయర్‌స్వామివారు ప్రసంగించారు. శ్రీమతి చూడామణిగారి ఆచార్యపాద స్తవనగేయం, శ్రీమాన్ జొన్నవిత్తులవారి గేయం శ్రోతలను ఆకట్టుకొన్నాయి. ఈసభను జీవా పూర్వకార్యదర్శి శ్రీమాన్ ప్రొ॥ పురుషోత్తంరావు నిర్వహించారు.

### గ్రంథావిష్కరణ

ఈ ప్రసంగాల తరువాత నూతన గ్రంథావిష్కరణం, అవార్డు ప్రదానసభ, డా॥ శ్రీమాన్ ఎస్.వి. రంగరామానుజాచార్యస్వామి ఉభయవేదాన్త ఆచార్య పీఠం. ప్రెసిడెంటు, జీవా–కార్యదర్శిగారి నిర్వహణలో జరిగింది. మొదటగా శ్రీమాన్ ప్రతాప సుబ్రహ్మణ్యశాస్త్రిగారు స్వయంగా సంపాదకులుగా ఉండి మన జెట్ ముద్రించి అందించే ఋగ్వేదం సంహితాపాఠగ్రంథం స్వామివారు ఆవిష్కరించారు. దీని మొదటి ప్రతిని శ్రీమాన్ రామేశ్వరరావుగారికి సమర్పించారు. గ్రంథసంపాదకుని శ్రీవారు సత్కరించారు. రెండవ పుస్తకం పద్మపురాణం పాతాళఖండం రెండుభాగాలు శ్రీమాన్ జి.ఎస్.ఎన్.రాజుగారు సమర్పించారు. వీటి ప్రతులను ప్రూఫులనుదిద్ది పరిష్కరించిన శ్రీమాన్ జి. శ్రీనివాసాచార్యులు, స్వామివారి ద్వారా ప్రతిని స్వీకరించారు. శ్రీమాన్ పి.టి.జి.భారతశేఖరాచార్యులు సంపాదనం చేసిన అగస్త్యసంహిత కాపీలను శ్రీమాన్ శ్రీరామ చంద్రారెడ్డిగారు, శ్రీమాన్ కమలాకర్‌గారు శ్రీకోటేశ్వరరావు గారు (ADDL SP, CID) వారు స్వీకరించారు.

### పురస్కార ప్రదానము

అటు తరువాత జీయర్ అవార్డు ప్రదానం జరిగింది. తొలుత సభాధ్యక్షత వహించిన శాస్త్రరత్నాకర, కవిశాబ్దికకేసరి, మహామహోపాధ్యాయి, డా॥ఎస్.ఎన్.సి రఘునాథాచార్యస్వామివారు, స్వామివారిని ఒక చక్కటి శ్లోకంతో ఉపశ్లోకనం చేసి మంగళాశాసనం చేశారు. శ్రీమాన్ రంగరామానుజాచార్య స్వామివారు కూడ ఒక శ్లోకంతో స్వామివారిని ఉపశ్లోకించి జీయర్‌అవార్డు గురించి పరిచయం చేశారు. ఎంతమందికి ఇప్పటివరకూ అది లభించిందో చెప్పి, ప్రస్తుతం అవార్డు పుచ్చుకొంటున్న శ్రీమాన్ పి. రామానుజన్ స్వామి, శ్రీమాన్ కాలమేఘ అయ్యంగార్ స్వామి, శ్రీమాన్ కొడిచర్ల పాండురంగాచార్య స్వామివార్ల వైభవాన్ని సభకు పరిచయం చేశారు. తరువాత ముగ్గురు స్వాములకు చందన తాంబూలాదులతో, శాలువ, నూతన వస్త్రాలు, పారితోషికాలు సమర్పించడం జరిగింది. కాకతీయ సిమెంటు శ్రీమాన్ వేంకటేశ్వర్లుగారి పుత్రులు, తండ్రిగారి బాధ్యతల్ని సమర్థవంతంగా నిర్వహిస్తున్నవారు శ్రీమాన్ వీరయ్యగారు ప్రధానపురస్కారం రు1,00,000 డా॥ శ్రీమాన్ పి. రామానుజన్ బెంగుళూరువారికి సమర్పించారు. మిగిలిన రెండు విశేష పురస్కారాలను శ్రీమాన్ అరుణరాఘవరెడ్డి దంపతులు, శ్రీమాన్ దిట్టకవి తాతాచార్యదంపతులు సమర్పించారు.

శ్రీస్వామివారు విద్వాంసులకు సంస్కృతంలో వ్రాయబడిన అక్షర సమ్మాన పత్రాలను సమర్పించారు. సమ్మానితులు ముగ్గురు తమ హార్దాభిప్రాయాలు ఆవిష్కరించారు. శ్రీమాన్ రామకృష్ణారెడ్డిగారు ప్రసంగించిన తరువాత, స్వామివారు తమ ముగింపు ప్రసంగంచేస్తూ జీయర్‌వ్యవస్థలో తాము ప్రవేశించడానికి ఏర్పడిన సన్నివేశాలను వివరించారు. శ్రీపెద్దస్వామివారి అనుగ్రహం తమపై ఎలా ప్రసరించిందో విశదపరచారు. ఈ సందర్భంగా భగవద్రామానుజులను గురుద్రోహిగా పేర్కొంటూ ఒక ప్రముఖుడు చేసిన వ్యాఖ్యను తీవ్రంగా ఖండిస్తూ ఇలాంటి వారు మత ప్రవర్తకులు కాదని రామానుజులకు గోష్ఠీపూర్ణులకు జరిగిన సంవాదం పూర్వాపరాలు, పర్యవసానం ఇవేవీ తెలిసికోకుండా చేసే దుర్వ్యాఖ్యాలకు విలువ ఉండదని వ్యాఖ్యానించారు.

భగవద్రామానుజ సహస్రాబ్దిగురించి విస్తారంగా వివరించడమే కాక, నిర్మించతలపెట్టిన సమతామూర్తిని గురించిన చిన్న చిత్రాన్ని ప్రదర్శించి వివరించారు. ఆ తరువాత–వివిధ వ్యక్తులు, వివిధ దేవస్థానాల వారు చేసిన పుష్పమాలాసమర్పణాన్ని ఆలయ మర్యాదలను స్వీకరించడంతో ఈ కార్యక్రమం ముగిసింది.

### సాయంకాలపు సాంస్కృతిక కార్యక్రమాలు

సా॥ 5.00గం.లకు సాంస్కృతిక కార్యక్రమంలో భాగంగా విజయవాడకు చెందిన శ్రీమాన్ ఘంటసాల వపన్‌కుమార్ బృందం



క్షీరసాగరమథనం నృత్యరూపకాన్ని మనోజ్ఞంగా ప్రదర్శించింది. శ్రీస్వామివారికి శిష్యులు సాయంత్రం పాదపూజను సమర్పించారు.



**ప్రాణాయామంతో అద్భుత ప్రక్రియ**

**సా॥** మన జీవాగోశాలలో ఉండే పాలమూరుకు చెందిన చి॥నరసింహులు ఒక చక్కటి విన్యాసాన్ని ప్రదర్శించాడు. నాలుగు లారీ టైర్లను కేవలం ముక్కుతో గాలిని నింపే ప్రక్రియను అత్యుత్తమంగా 10ని॥54సె॥లో నింపి అందరినీ ఆశ్చర్య చకితులను చేశాడు. ఇంకా విశేషమేమిటంటే ఒకొక్క టైరుపై ఇద్దరు విద్యార్థులను నిలబెట్టి అంటే 8మంది విద్యార్థులు నిలబడి ఉండగా ముక్కుతో వదిలిన గాలితో నింపగలిగాడు. ఇది ఉదయంపూట నిరాహారంగా ఉండి చేయవల్సిన ప్రక్రియ, కానీ, శ్రీస్వామివారి ముందు ప్రదర్శించాలన్న తపనతో ఉదయం నుండి సాయంత్రందాకా నిరాహారంగా ఉండి, ఈపనిని సాధించాడు. లిమ్కా బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో ఎక్కాలని ఈ చిరంజీవి ఆశయం.



ఆ మరునాడే అతని బి.ఎ. పరీక్షలు హాజరు కావలసి ఉన్నప్పటికీ శ్రద్ధతో పట్టుదలతో ఈప్రక్రియను ప్రదర్శించిన ఈచిరంజీవిని గిన్నీస్ బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో స్థానం పొందగలడని శ్రీస్వామివారు మంగళాశాసనం చేశారు.

తిరునక్షత్ర కార్యక్రమాలలో భాగంగా 25వ తేదీ ఉదయం కార్యక్రమాన్ని వీక్షించడానికి విచ్చేసిన వారితో విశేష సంగోష్ఠి జరిగింది. పలువురు భక్తులు తమ హార్దభావాలను ప్రకటించారు. శ్రీశ్రీశ్రీ అహోబిల జీయర్‌స్వామివారు, శ్రీశ్రీశ్రీ దేవనాథజీయర్ స్వామివారు, వైశారదిగారు ఈ గోష్ఠిని నిర్వహించారు.

**చిన్నారి గీతావధానం**

25వతేదీ సాయంకాలం అమెరికాలో ప్రజ్ఞావిద్యార్థిని **చి॥జాహ్నవి,** 3వ తరగతి చదువుతున్న చిన్నారి "గీతావధానం" చేసి అలరించింది. ఈమె మన వెబ్‌టీమ్ మెంబర్ శ్రీమాన్ శ్రీనివాస్ వేమూరి, దుర్గ దంపతుల కుమార్తె. వికాస దర్శిని ఎడిటర్ శ్రీమతి అరుణకు మేనకోడలు. ఈమె బోస్టన్ నగరంలో ఉన్నప్పుడు, ప్రజ్ఞలో భాగంగా భగవద్గీత ప్రథమాధ్యాయంలో అవధాన ప్రక్రియను అభ్యసించింది. తిరునక్షత్ర సందర్భంగా శ్రీస్వామివారు, భక్తుల సమక్షంలో ప్రదర్శించి శ్రీస్వామివారి మంగళాశాసనములు పొందింది. శ్లోకమడిగితే సంఖ్యను, సంఖ్యను చెబితే శ్లోకాన్ని గుర్తించడం, పదాన్నిస్తే శ్లోకం చెప్పడం, పదాలలో ఉండే అర్థ వైచిత్రిని గుర్తించడం మొదలైన అంశాలు అవధాన ప్రక్రియలో ఉంటాయి. 8సం॥ వయస్సులోనే ఇంత పాటవాన్ని ప్రదర్శించడం అందరినీ ఆశ్చర్యచకితుల్నిచేసింది.



శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి తిరునక్షత్ర కార్యక్రమాలలో భాగంగా 26వతేదీన దాదాపు 480వృద్ధవైష్ణవ దంపతులను వైభవంగా సంభావించారు శ్రీస్వామివారు. అన్ని వర్ణాల్లోను సమాశ్రయణ పరులైన 70సంవత్సరాలు దాటిన నిష్ఠాపరులైన భగవద్బంధువులున్నారు. ఈవయస్సుల్లో చక్కని అనుష్ఠానం కల వీరు తమ వంశంలో సంతానానికి కూడా ఈసంస్కారం అందిస్తూ పరంపరను కొనసాగించేవారు అవ్వాలి. అట్టి ప్రేరకులుగా ఈ వృద్ధదంపతులను సంభావించాలని శ్రీశ్రీశ్రీ స్వామివారు చేసిన సంకల్పం విశేషస్పందనను పొందింది. రెండు తెలుగురాష్ట్రాలనుండీ అనేక వృద్ధదంపతులు ఆసక్తితో వచ్చి భాగస్వాములు కావడం అందరికీ ఆనందాన్ని కలిగించింది.

వృద్ధాప్యంలో బిడ్డలకుదూరమై, వారి సాన్నిధ్యానికి, సేవకు, నోచుకోలేని తల్లిదండ్రులెందరో ఉన్న ఈ కాలంలో, తల్లిదండ్రులకు బిడ్డలప్రీతి, సేవలు కనీసం ఒకనాడైనా కలిగి, బిడ్డలతో తల్లిదండ్రులు కలిసి ఆనందించే ఒక అద్భుతావకాశాన్ని ఈ కార్యక్రమం కలుగజేసింది. ఎందరో పుత్రులు, పుత్రికలు ఈ సదవకాశాన్ని అందిపుచ్చుకొని, మన జీవాప్రాంగణంలో తమ తల్లిదండ్రులను తృప్తిగా అర్చించి ఆనందించిన ఈ ఘట్టం పలువురి హృదయాలను తనిపింది. పెద్ద పెద్ద పారిశ్రామికులుగా ప్రసిద్ధి చెందినవారు, రాజకీయవేత్తలుగా ప్రసిద్ధులైనవారుకూడా విచ్చేసి పాల్గొని, బిడ్డల పూజలందుకోవడం మరువలేని సన్నివేశం.

ఈసభలో శ్రీమాన్ గజల్ శ్రీనివాస్ తమ మిత్రులు సినీరంగ ప్రముఖులు అయిన శ్రీమాన్ హరీష్‌శంకర్, శ్రీమాన్ కళామందిర్ కల్యాణ్, శ్రీరవి ప్రముఖులనుకూడా ఈ కార్యక్రమానికి తీసుకొనివచ్చి, తల్లిదండ్రులపై తాము వ్రాసిన గజళ్ళను పాడి శ్రోతల హృదయాలను తట్టిలేపారు. వచ్చిన సినీప్రముఖులు కూడా సముచితంగా భాషించి శ్రోతల మనస్సులను హరించారు.



**భగవద్రామానుజ కృతిమాల - సి.డి ఆవిష్కరణ**

శ్రీమాన్ శర్వాణి వ్రాసిన గేయాలను ప్రముఖగాయకులు గానంచేయగా తయారైన **సి.డి.**ని ఈ సభలో ఆవిష్కరించారు. ఈ సి.డి.కి ద్రవ్యసహాయం చేసి దీన్ని సిద్ధం చేసినవారు శ్రీమాన్ సేలం శ్రీరామ్‌గారు. వీరికి శ్రీనివాస్ ప్రభృతులకు స్వామి భగవద్రామానుజ ప్రతిమలు, జ్ఞాపికలను ఇచ్చి సత్కరించారు. శ్రీమాన్ శర్వాణికి, శ్రీమాన్ శ్రీరామ్‌గారికి భగవద్రామానుజ ప్రతిమలనిచ్చి



మంగళాశాసనం చేశారు. మొదటి సి.డి.ని శ్రీమాన్ మురళీకృష్ణం రాజు గారికి అందజేసారు.

ఈసభలో పాల్గొన్న జీవా కార్యదర్శి శ్రీమాన్ డా॥ యస్.వి. రంగరామానుజాచార్యస్వామివారికి శ్రీమాన్ డా॥ రామేశ్వర్‌రావు గారికి ఇంకా పలువురు ప్రముఖులకు సి.డి.లను బహుకరించారు. తరువాత వృద్ధదంపతులకు నక్షత్రహోమం పూర్ణాహుతి అయిన తరువాత కలశజలంతో స్వామి స్వయంగా ప్రతి ఒక్కరివద్దకు వచ్చి

తిరునక్షత్ర సందర్భంగా సర్వప్రాణులకు మధురపదార్థాల తదీయారాధన



ప్రోక్షించగా, శ్రీశ్రీశ్రీ అహోబిలస్వామివారు, దేవనాథస్వామివార్లు భగవత్ప్రతిమలను, అక్షరసమ్మానపత్రాన్ని బహుకరించారు. తొలుత, విచ్చేసిన దంపతులందరికీ నూతనవస్త్రాలు సమర్పించగా, వాటిని కట్టుకొని దంపతులు తమకు కేటాయించిన స్థానాల్లో కూర్చున్నారు. చివరిగా వారివారి బిడ్డలు తమతమ పితరులను ప్రీతితో ఆరాధించి, ఆశీస్సులను పొంది ఆనందించారు. మధురమైన రుచులతో జరిగిన తదీయారాధనంతో ఈ కార్యక్రమం ముగిసింది.

రాత్రి నృత్యకార్యక్రమం జరిగింది. ఆదిలాబాద్‌కి చెందిన శ్రీమతి మాధవీలతగారి బృందం **శ్రీసంభవ పరంపర** అనే పేరున లక్ష్మీసంభవ



వృత్తాన్తంతో జీయర్ వైభవాన్ని అనుసంధానం చేసిన నృత్యప్రయోగం ద్రష్టల మనస్సులను నయనాలను హరించింది.

27వతేదీ మన శ్రీరామనగరంలో శ్రీస్వామివారు మంత్రోపదేశం గావించారు. దీనిలో ఎందరో ఆచార్యులను ఆశ్రయించి పంచ సంస్కారాలను పొందారు.

సాయంత్రం భక్తి టి.వి. నరేంద్రచౌదరిగారి ఆహ్వానంపై ఎన్.టి.ఆర్ గ్రౌండ్స్‌లోని కోటి దీపోత్సవానికి వేంచేసి కృత్తిక దీపోత్సవ వైభవాన్ని వివరించి మంగళాశాసనాలు గావించారు.

## 28-10-2014 - సహస్రకలశస్నపనం

శ్రీశ్రీశ్రీ స్వామివారి తిరునక్షత్రోత్సవ ప్రయుక్తంగా ప్రతి సంవత్సరం జరుపుతున్న సహస్ర కలశ స్నపనాన్ని ఐదవరోజు, తదీయారాధన మండపంలో వైభవంగా జరిపారు. ఉదయం దివ్యసాకేతంలో తీర్థగోష్ఠిని పూర్తిచేసిన వెంటనే సహస్రకలశ ప్రస్తరణం చేసిన తదీయారాధన మండపంలోని వేదికపై స్వామివారి నిత్యారాధ్య దైవమైన శ్రీరామచంద్రపెరుమాళ్ళను స్నపనానికి సిద్ధంచేసి ఉంచారు యాజ్ఞిక స్వాములు. తొలుత, హవన వేదికవద్ద వేదస్వస్తితో ఆరంభంచేసి, పుష్పసమర్పణం చేసారు.

ఆనాటి కార్యక్రమంలో, ప్రాధాన్యం వహించిన శ్రీమాన్ కోటేశ్వరరావుగారు, (S.P.CID) గారు తమ పుత్రునితోపాటు వచ్చి వేదికపై ఉండగ వారిని, సమ్మానించే కార్యక్రమం జరిగింది. ఆచార్యపీఠాధ్యక్షులు, జీవాకార్యదర్శి, డా॥ఎస్.వి. రంగరామానుజా చార్య స్వామి, కార్యక్రమారంభంచేసి, సహస్రకలశ స్నపనానికి, నిమిత్తమైన సన్నివేశాన్ని వివరించి, ఆనాటి ఆ సన్నివేశంలో, శ్రీమాన్ కోటేశ్వరరావు గారికి ఏర్పడిన ప్రాధాన్యానికి కారణమైన అంశాలను వివరించారు. అటు తరువాత శ్రీమాన్ కోటేశ్వరరావుగారు, తమ అనుభవాలను వివరించారు. దాదాపు 20సం॥నాడు సరిగ్గా దీపావళి రోజు రాత్రి స్వామివారి పెరుమాళ్ళను, కొందరు, చోరులు లోభంతో అపహరించి తీసుకొనిపోగా, చింతాక్రాంతమైన సీతానగరం ప్రాంగణాన్ని యాధృచ్ఛికంగా పర్యవేక్షణకు వచ్చిన, అప్పటి తాడేపల్లి Police Station Sub Inspector శ్రీమాన్ కోటేశ్వరరావుగారు చూచి అక్కడి సన్నివేశాన్ని గమనించి స్వామివారి మానసిక క్లేశాన్ని గుర్తించి, పెరుమాళ్ళను వెదకి తెచ్చే బాధ్యతను స్వీకరించి కృతకృత్యులై పెరుమాళ్ళను వెదకితెచ్చి స్వామివారికి తిరిగి అప్పగించిన వైనాన్ని వివరించినప్పుడు, ఆయన కన్నులు చెమర్చడమేకాదు, అశేష భక్తబృందం ఆర్ద్రంగా స్పందించింది. స్వామివారు కోటేశ్వరరావు గారికి, మురళీకృష్ణంరాజు గారి ద్వారా జ్ఞాపికను బహూకరించి సత్కరించారు. తండ్రితోపాటు కుమారుడు చి॥గౌతమ్ విజయవర్ధన్ కూడా మంగళాశాసనం అందుకోవడం విశేషం.

ఇదే సందర్భంగా (Addl D.G) శ్రీమాన్ పూర్ణచంద్రరావుగారు కూడా విచ్చేసి శ్రీమాన్ కోటేశ్వరరావుగారిని అభినందించి, శ్రీస్వామివారినుండి మంగళాశాసనాలు అందుకున్నారు. ఈసందర్భంగా శ్రీశ్రీశ్రీ స్వామివారు ఒకవిషయాన్ని విశేషంగా ప్రస్తావించి శ్రీమాన్ పూర్ణచంద్రరావుగారి ప్రోత్సాహాన్ని ఆ విషయంలో కోరారు. మొట్టమొదటిసారి పెరుమాళ్ళను వెదకి తెచ్చిన వారికి ఏదైనా పారితోషిక సమర్పించాలని భావించినా, కోటేశ్వరరావుగారు మృదువుగా తిరస్కరించారని, అప్పటినుంచి పోలీస్‌డిపార్ట్‌మెంట్‌లో

విశేషసేవచేసి, విశేషించి దేవాలయాల్లో జరిగే చౌర్యాదుల్ని నివారించడానికి, దొంగలింపబడిన విగ్రహాలను తిరిగి సాధించడానికి కృషిసల్పిన పోలీసులను, ఆఫీసర్లను ఒకరిద్దరినైనా ఈరోజున సత్కరించాలని తాము భావించి, ఇద్దరుముగ్గురు సర్వోన్నతాధికారులకు వ్రాసినప్పటికీ సానుకూల స్పందన కలుగలేదని, తప్పక ఈ విషయంలో శ్రీమాన్ పూర్ణచంద్రరావుగారు సానుకూలత ఏర్పడేలా చేయమని సూచించారు.

అనంతరం శ్రీశ్రీశ్రీ స్వామివారికి శ్రీమాన్ కోటేశ్వరరావు గారికి శ్రీమాన్ కావురు ప్రభుకిషోర్‌గారి సమర్పణంలో శ్రీమాన్ పిన్నమనేని గాంధిగారు స్వాగతకుసుమాంజలి, అక్షరమాలిక లను రచించి,



చదివి బహూకరించారు. స్వామివారు ఆనాటి సన్నివేశాలను తమ స్మృతిపథం లోకి తెచ్చుకుని తమ పూర్వానుభవాన్ని కోటేశ్వరరావుగారి ఉపకారాన్ని విశేషంగా స్మరించి స్నపన ప్రక్రియను ప్రారంభించారు. శ్రీమాన్ ముడుంబై మధుసూదనాచార్యస్వామి, శ్రీమాన్ సముద్రాల శ్రీనివాసాచార్యస్వాముల ఆధ్వర్యవంలో ఒకవైపు హవన ప్రక్రియను సాగిస్తూ, మరొకవైపున స్నపనవిధిని యథాశాస్త్రంగా జరిపించారు. వైదికుల వైదికఘోష నిరంతరం సాగుతూ ఉండగా, సభలో విచ్చేసి ఉన్న జీయర్‌స్వాములు, పెద్దలు స్వామివారి తిరునక్షత్రవైభాన్ని, శ్రీరామచంద్ర వైభవాన్ని కొనియాడారు. వీరి తరువాత శ్రీమాన్ వాసుదేవఆత్రేయ స్వామి హిందీ భాషలో ప్రసంగించారు.

ఆతరువాత శ్రీమాన్ కవిరత్న గుదిమెళ్ళ రామానుజాచార్యస్వామి వారి పుత్రులు శ్రీమాన్ కూర్మనాథస్వామి జీయర్ స్వామి వైభవాన్ని ప్రశంసించారు. మధ్యమధ్య శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు సహస్ర కలశాభిషేక విశేషాలను వివరిస్తూ భక్తులచేత భజనం చేయించారు.

తరువాత జీవా, రీసర్చ్ మరియు పబ్లికేషన్స్ విభాగంలో నూతనంగా ప్రవేశించిన శ్రీమాన్ విజయరాఘవన్ స్వామి హిందీలో స్వామి వైభవాన్ని కొనియాడారు. ఆపై కుమారి వైశారదిగారు శ్రీరామచంద్ర స్వామి వైభవాన్ని, జీయర్‌స్వామి వైభవంతో కలిపి విశదపరచారు. ఆతరువాత వైదికుల వేదఘోషణంతో స్నపన కార్యక్రమం చివరిభాగాన్ని సుసంపన్నం చేశారు.



ఈకార్యక్రమాలన్నింటిలో జీవా గురుకుల విద్యార్థులు, సీతానగరం ఆగమకళాశాల విద్యార్థులు చక్కటి సేవలందించారు. వికాసతరంగిణి సభ్యులందించిన సేవలు ప్రశంసనీయాలు. జీవా ఆశ్రమంలో ఉండే వివిధ విభాగాల నిర్వాహకులందరూ పరిపూర్ణ శ్రద్ధతో తమతమ స్థాయిలో అందించిన విశేషసేవల ఫలితంగా 5దినాల సహస్ర కలశాభిషేక మహోత్సవాలు అద్భుతంగా ముగిసాయి. విద్యార్థులందరూ సమతామూర్తి స్ఫూర్తికేంద్రానికి ఒక నమూనాను తయారుచేసి ప్రదర్శించిన సన్నివేశం అద్భుతం. ఆర్టిస్టులు శ్రీమాన్ శ్రీనివాస్, సీతారామాచార్యులుగార్లు మార్గదర్శనంలో ఏర్పడిన ఈనమూనాను చూచి ఎందరో ఫొటోలు తీసుకుని పొంగిపోయారు. దీనిని జీవా ఆడిటోరియంలో జాగ్రత్తగా భద్రపరచారు మన విద్యార్థులంతా.

శ్రీవారికి సలహాదారులైన శ్రీమాన్ జి.వేణుగోపాలాచార్యులుగారికి ఈకార్యక్రమాలలో విశేష సహకార మందించిన శ్రీమతి జె. వసుమతిభాస్కర రావుగారికి, శ్రీమతి అనిల్‌గాయత్రిగారికి,



**భగవద్రామానుజ సమతామూర్తి స్ఫూర్తికేంద్ర నమూనాను తిరునక్షత్ర సందర్భంగా శ్రీమాన్ సీతారామాచార్యస్వామి, సత్య శ్రీనివాస్‌ల సహకారంతో జీవా గురుకుల విద్యార్థులు, భక్తుల సందర్శనకై తయారుచేసిన దృశ్యం**

అమెరికానుండి ప్రత్యేకించి వచ్చి కార్యక్రమంలో పాల్గొనడమేకాక, తమ ఔద్యోగిక సంపాదనలో పెన్షనుగా వచ్చే ధనాన్ని రూ. 5లక్షలు శ్రీరామానుజ సహస్రాబ్దికి సమర్పించిన శ్రీమాన్ కె. రామకృష్ణారెడ్డి గారికి శ్రీవారు విశేష మంగళాశాసనాలు చేసారు. వీరి కుమార్తె శ్రీమతి అపర్ణయే ప్రస్తుతం అమెరికాలోని జెట్‌సంస్థకు అధ్యక్షురాలుగ ఉంది. ఈవిధంగ ఈయేడాది దీపావళి తిరునక్షత్ర మహోత్సవాలు సుసంపన్నమైనాయి. అమెరికాలో మన భగవద్బంధువులు, **వి.టి** సేవ సంస్థద్వారా ఎన్నెన్నో విశేష సేవలను అందిస్తున్నారు. వాటి వివరాలన్ని www.vtsworld.org అనే వెబ్‌సైట్లో చూడవచ్చు. నేత్రవిద్యార్థుల సేవలో కొంత సహాయం చేయాలనే ఆశయంతో సియాటిల్‌లో నివసించే VTS శాఖవారు "ఉత్సవ్"పేర ఒక కార్యక్రమం చేశారు. వందలాది భక్తులు ముఖ్యంగా వందకుపైగా ప్రజ్ఞ చిన్నారులు, యువకులు పాల్గొన్న ఈకార్యక్రమం ఎందరికో ప్రేరణగ నిలిచింది.

**వి.టి.ఎస్** కార్యదర్శిగా ఉన్న శ్రీమాన్ కిరణ్ విశేషకృషితో ఈఉత్సవ్ ఆప్రాంతంలో చక్కటి చైతన్యాన్ని కలిగించింది. శ్రీమాన్ డా॥ పిన్నమనేని రామకృష్ణప్రసాద్ అధ్యక్షులుగ, శ్రీమాన్ ఉడుత శ్రీనివాస్ కోశాధికారిగ ఉన్న వి.టి.యస్ అందించే సేవలను అందరూ కొనియాడుతున్నారు. శ్రీజీయర్‌స్వామివారు వారందరికీ కూడా మంగళాశాసనాలు చేసారు.



ఇదిలా ఉండగ వి.టి.ఎస్ హ్యూస్టన్ శాఖకు చెందినవారు, ప్రస్తుతం అక్కడి మన అష్టలక్ష్మీ ఆలయ అధ్యక్షురాలుగ ఉన్న శ్రీమతి శోభాగాదిరాజు, తిరునక్షత్రోత్స వంలో పాల్గొనడానికి శంషాబాద్ వచ్చారు. నేత్ర విద్యార్థులకు యాతాయాత సౌకర్యం కలిగించడానికి ఒక బస్సు సేకరణకై వారు అవసరమైన ధనం రూ. 12లక్షలు సమర్పించారు. మన జీవాప్రాంగణంలో ఉన్న నేత్ర డిగ్రీకాలేజ్‌లో చదువుకునే విద్యార్థులకు ఉత్తమ శిక్షణకోసమని వీరి తరగతులను హైదరాబాద్, దోమలగూడలోని మన జెట్ భవనంలోకి మార్చారు. మధ్యాహ్నం జీవానుండి జెట్‌కి వెళ్ళి రాత్రి 8.00 వరకు తరగతులకు హాజరై తిరిగి, రాత్రికి విద్యార్థులంతా జీవాకి చేరుతారు. 60మందికి పైగా ఉన్న ఈవిద్యార్థులకు రెండుబస్సులు రోజూసాగే రాకపోకలకై అవసరమైనాయి. శ్రీస్వామివారు ఈవిషయాన్ని ప్రకటించగానే, స్పందించి, శ్రీమతి శోభాగారు ఒక బస్సుకయ్యేఖర్చును స్వయంగా సమర్పించారు. వీరి ఔదార్యానికి మంగళాశాసనం చేసారు శ్రీస్వామివారు. ముందుగానే రెండుబస్సులు కొని విద్యార్థులకు సౌకర్యం మన వికాస్‌తరంగిణిద్వారా నేత్రకాలేజ్ సమకూర్చినప్పటికీ, రెండవబస్సుకు కూడా వ్యవస్థ ఏర్పడవలసి ఉంది.

భద్రుకా కాలేజ్‌కి చెందిన ప్రిన్సిపాల్ డా॥శ్రీమాన్ సోమేశ్వరరావు, ప్రొ॥ పురుషోత్తమరావుగార్లు మన నేత్రవిద్యార్థులకు డిగ్రీపాఠాలను చెప్పే అధ్యాపకులను ఏర్పాటుచేసి వారికి మంచి విద్యను అభ్యసించే అవకాశాన్ని జెట్‌లో కలిగిస్తున్నారు. నేత్రవిద్యాలయ ఇంటర్ కళాశాల తరగతులుమాత్రం జీవా ప్రాంగణంలోనే జరుగుతున్నాయి. మరిన్ని ఫొటోలకు https://www.facebook.com/jeeyarswami లో సందర్శించండి!

## శ్రీరామానుజ సహస్రాబ్ది సహస్ర గ్రంథ ప్రకాశన విద్వద్గోష్ఠి

సెంట్రల్ యూనివర్సిటీ ఫార్మర్ ప్రో వైస్‌ఛాన్సలర్ శ్రీ ఉ.వే శ్రీమాన్ ప్రొ॥కణ్ణన్ స్వామి, డా॥రంగరామానుజాచార్య స్వామి ఇరువురూ కలసి నవంబర్ రెండవతేదీ శ్రీరామనగరంలో జరగబోయే విద్వద్గోష్ఠికి కావలసిన పూర్వరంగం ఏర్పాటు చేశారు. దేశంలోని వరిష్ఠ విద్వాంసులు, వివిధ విశ్వవిద్యాలయాల్లో, ప్రతిష్ఠాత్మక స్థానాల్లో ఉన్న విద్వాంసులు ఈగోష్ఠిలో పాల్గొనబోతున్నారు. రామానుజ సంప్రదాయాన్ని వివరించే ప్రాచీన గ్రంథాలలో కనీసం 1000ని అన్ని లిపులలోనూ, అన్ని భాషలలోనూ ప్రపంచంలో అందరికీ అందుబాటులో ఉండేట్లు, ఒక '**E - Library**'ని రూపొందించాలి అనేది ఈసదస్సుయొక్క ప్రధానలక్ష్యం.



## శ్రీరామానుజ సహస్రాబ్దికై అవగాహన సదస్సు

బెంగళూరు: కర్ణాటకలోని బెంగళూరులో వికాసతరంగిణి కార్యకర్తలు రామానుజ సహస్రాబ్దికి నిర్మించబోయే సమతామూర్తి శ్రీమద్రామానుజ స్ఫూర్తి కేంద్రం గురించి అవగాహన కలిపించ టానికి కార్యక్రమాలు ప్రారంభించారు. అందులో భాగంగా శ్రీమతి శారదా నూతక్కి గారి ఆధ్వర్యంలో తదితర వికాసతరంగిణి కార్యకర్తల సహకారంతోఅక్టోబర్ 12వ తేదీన ఆచార్యత్రయము నృత్యరూపకాన్ని బెంగళూరులోని ఇస్కాన్ ఆడిటోరియంలో నిర్వహించారు. ఈ నృత్యరూపకంలో శ్రీమతి సముద్రాల మాధవీ రామానుజం మరియు శిష్యబృందం శ్రీరామానుజ సంప్రదాయ వైభవాన్ని ప్రదర్శించారు. ప్రజ్ఞ విద్యార్థుల ప్రార్థనతో ప్రారంభమై నృత్యరూపకంతో ముగిసిన ఈ కార్యక్రమానికి నగరంలోని ప్రముఖ పారిశ్రామికవేత్తలు, ప్రముఖ ఆధ్యాత్మికవేత్తలు అనేకమంది భక్తులు పాల్గొని, తిలకించారు.

# మహిళా ఆరోగ్యవికాస్

శ్రీమతి మాధవీరవీంద్ర- విజయవాడ

**మహిళా ఆరోగ్యవికాస్ నిర్వహించిన శిబిరములు వివరములు-**

15వతేదీన శ్రీమతి మాధవీరవీంద్రగారి నేతృత్వంలో సైదాబాద్‌లోని సరస్వతీనగర్ కమ్యూనిటీహాల్‌నందు శ్రీమతి సుభద్రా ఆనంద్‌రావుగారు ఏర్పాటు చేసిన ఉచిత మహిళావైద్యశిబిరానికి 135మంది మహిళలు హాజరవగా, 109మందికి **వి.ఐ.ఎ** పరీక్ష మరియు రొమ్ము పరీక్ష చేయటమైనది. 24మంది మహిళలకు తదుపరి పరీక్షలు నిర్వహించటమైనది. ఈశిబిరానికి విచ్చేసిన నగరంలోని ప్రముఖ వైద్యురాలు డా॥ సువర్ణగారు మాట్లాడుతూ శ్రీస్వామివారిద్వారా ఇటువంటి శిబిరాలు నిర్వహించటం మహిళలకు చాలా ఉపయోగకరం అని ప్రశంసించారు.

తదుపరి పరీక్షలు నిర్వహించాల్సిన 24మందికి ఈవిడ ఉచితంగా రెండవ పరీక్షచేసి, ఇద్దరిని బయాప్సీకి పంపించారు. డా॥ శ్రీజగారు తమ విలువైన కాలాన్ని వెచ్చించారు. ఈశిబిరాన్ని సందర్శించిన సరస్వతీనగర్ కాలనీలోని ప్రముఖులు శ్రీమాన్ మహేందర్‌రెడ్డి, ప్రొ॥పురుషోత్తంగారు మరియు పెద్దలు వారివారి ప్రాంతాలలో కూడా ఇటువంటి శిబిరాలని ఏర్పాటు చేయవలసిందిగా కోరారు. ఆరోగ్యవికాస్ జంటనగరాల సమన్వయకర్త శ్రీమతి సునీతగారు తమ బృందంతోకలిసి శిబిరానికి కావలసిన ఏర్పాట్లను చక్కగా నిర్వహించారు. అంతేకాకుండా తదుపరి పరీక్షలు చేయవలసినవారికి దగ్గరుండి పరీక్షలు జరిపించి వారికి కావలసిన సూచనలను అందజేసారు. ఈ శిబిరానికి వచ్చిన వారందరికీ సైదాబాద్ వికాసతరంగిణివారు ఉచితంగా మందులు అందజేసారు.

శ్రీమతి గోపమ్మగారు మరియు రమగారు, విజయవాడ నుండి వచ్చిన చైతన్యఆరోగ్యవికాస్ కార్యకర్తలు శ్రీమతి జయలక్ష్మిగారు, రత్నమాలగారు, లావణ్యగారు చక్కటి సహకారాన్ని అందించారు. ఆరోగ్యవికాస్ కార్యక్రమాలను రికార్డుచేయటానికి వీలుగా, జంటనగరాల కార్యదర్శి అయిన శ్రీమతి వనజాచలపతిరావుగారి కుమారుడు శ్రీమాన్ జె. అత్రిచంద్రగారు (యు.ఎస్.ఎ) హైదరాబాద్ ఆరోగ్యవికాస్ వారికి లాప్‌టాప్‌ను ఉచితంగా అందించారు. వీరికి శ్రీస్వామివారు అనేకమంగళాశాసనాలు కృపజేశారు.

17.9.14న నిజామాబాద్‌లోని సుభాష్‌నగర్ నందు శ్రీమతి మాధవీరవీంద్రగారి నేతృత్వంలో నిజామాబాద్ వికాసతరంగిణివారు ఏర్పాటుచేసిన ఉచిత మహిళావైద్యశిబిరాన్ని **శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయర్‌స్వామి**వారు జ్యోతి ప్రజ్వలనతో ప్రారంభించారు. దేవనాథ రామానుజ జీయర్‌స్వామివారు శిబిరానికి హాజరైన మహిళలను ఉద్దేశించి మాట్లాడుతూ శ్రీచిన్నజీయర్‌స్వామివారు రూపొందించిన ఆరోగ్యవికాస్ సేవలను నిజామాబాద్ మహిళలు ఉపయోగించుకోవడంకోసం ఈశిబిరాన్ని ఏర్పాటుచేశాము అన్నారు. చెప్పుకోలేని సమస్యలను ముందుగా గుర్తించగలిగితే మందులతో తగ్గించుకోవచ్చును, సమస్య ముదిరితే తరువాత శారీరకంగా ఎక్కువ బాధపడాల్సివస్తుందని శ్రీస్వామివారు వివరించారు. ఈశిబిరానికి విచ్చేసిన డా॥ ఉషానవీన్ గారు మాట్లాడుతూ రోజుకు 200మంది మహిళలు క్యాన్సర్‌తో చనిపోతూ ఉన్నారు. ఇలాంటి శిబిరాలను శ్రీచిన్నజీయర్‌స్వామివారు ఏర్పాటుచేయడం ద్వారా ఎంతోమంది మహిళలకు ప్రాణదానం చేస్తున్నారు అని కొనియాడారు. తదుపరి పరీక్షలు చేయవలసిన మహిళలకు తను ఉచితంగా సేవలు అందిస్తానని పేర్కొన్నారు. ఎన్. శ్రీనివాస్‌గారు, జి.శ్రీనివాస్‌గారు మరియు పెద్దలు ఏర్పాటుచేసిన ఈశిబిరానికి 237మంది మహిళలు హాజరుకాగా 97మందికి **వి.ఐ.ఎ** పరీక్షను నిర్వహించారు. డా॥ డి.ఎల్.ఎన్. స్వామిగారు ఈశిబిరానికి విచ్చేశారు. యువవికాస్ కార్యకర్తలైన కుమారి శృతి, అలేఖ్య, ప్రియాంకలు చక్కటి సహకారాన్ని అందచేశారు. కుమారి శృతి తదుపరి పరీక్షలు చేయవలసిన మహిళలందరినీ **ఫ్లో-అప్** చేసి సరోజ, రమాదేవి అనే ఇద్దరు మహిళలకు ఆపరేషన్ చేయవలసిందిగా వైద్యులు సూచించారని తెలియపరచింది. శిబిరాలకు సహకారం అందించటమేకాకుండా తాను కూడా శిక్షణ తీసుకుని, ఇలాంటి శిబిరాలను నిర్వహించాలన్న కోరికను వ్యక్తపరచిన శృతి యువతకు ఆదర్శనీయురాలు, అభినందనీయురాలు. ఈశిబిరానికి జంటనగరాల ఆరోగ్యవికాస్ సమన్వయకర్త శ్రీమతి సునీతగారు, పద్మశ్రీగారు మరియు శ్రీమతి జయలక్ష్మిగారు తమ సహకారాన్ని అందించారు.

26.9.14మరియు 27.9.14 తేదీలలో శ్రీమతి మాధవీరవీంద్ర గారి నేతృత్వంలో భద్రాచలం వికాసతరంగిణివారు ఏర్పాటుచేసిన రెండురోజుల ఉచిత మహిళావైద్యశిబిరాన్ని శ్రీమాన్ డా॥కాంతారావుగారు ప్రారంభించారు. స్త్రీలు బాగుంటే, ఇల్లుబాగుంటుంది, ఇల్లు బాగుంటే దేశంబాగుంటుంది అని ప్రస్తావిస్తూ వికాసతరంగిణివారు ఈవిధంగా శిబిరాలను ఏర్పాటుచేయడం అభినందనీయం అని కొనియాడారు. జీయరు మఠంలో ఏర్పాటుచేసిన ఈశిబిరానికి 285మంది హాజరుకాగా 210మందికి **వి.ఐ.ఎ** పరీక్షచేయడం జరిగినది. 18మందికి తదుపరి పరీక్షలు నిర్వహించగా ఇందులో నుండి ఇద్దరికి ఆపరేషన్ చేయాల్సి ఉండగా, ఒకరికి హైదరాబాద్ వెళ్ళవలసిందిగా వైద్యులు సూచించారు.

ఈశిబిరానికి డా॥ లాస్యగారు తమసహకారాన్ని అందించారు. వీరితోపాటు భద్రాచలం పి.హెచ్.ఒ అయిన వి. రోజారాణిగారు శ్రీస్వామివారి సేవాకార్యక్రమాలకు స్పందించి రెండురోజులపాటు పూర్తిసమయాన్ని వెచ్చించటమే కాకుండా, మహిళలకు శ్రీస్వామివారు ఇచ్చే గౌరవాన్ని, స్థానాన్ని కొనియాడుతూ, ఉద్యోగానికి లోనై పాదాభివందనాలను తెలియజేశారు. మారుతీ నర్సింగ్ స్కూల్ విద్యార్థినులు రెండురోజులపాటు భద్రాచలంలో సర్వే నిర్వహించారు. ఇండియన్ మెడికల్ అసోసియేషన్ వారు ఉచితంగా మందులు అందచేశారు. ఈశిబిరాన్ని వి.టి.ప్రెసిడెంట్ అయిన కమలా రాజశేఖర్‌గారు, పి. జనార్దనభట్టర్‌గారు, వేంకటాచార్య, దేవి, సోమశేఖర్,

హరిశ్చంద్రనాయక్, వై. సూర్యనారాయణ, గోపాల్‌రావుగార్లు విజయవంతంగా నిర్వహించారు.

విజయవాడ చైతన్యఆరోగ్యవికాస్ సభ్యులైన రత్నమాలగారు, శ్రీమతి జయలక్ష్మిగారు, పి.వేంకటరమణగారు తమసహకారాన్ని అందించారు.

28.9.14వతేదీన కొత్తూరు, తాడేపల్లి (కృష్ణాజిల్లా)లో శ్రీమతి కె.వి. సత్యవతిగారు ఏర్పాటుచేసిన ఉచితమహిళావైద్య శిబిరానికి 78మంది మహిళలు హాజరుకాగా 53మందికి **వి.ఐ.ఎ** పరీక్ష నిర్వహించారు. 13మందికి తదుపరి పరీక్షలు నిర్వహించవలసి ఉంది. ఈశిబిరానికి డా॥శ్రీలతగారు, ఉషారాణిగారు తమ సహకారాన్ని అందించారు. కృష్ణాజిల్లా ఆరోగ్యవికాస్ సమన్వయకర్త శ్రీమతి రుక్మిణిగారు తమ బృందంతో కలసి శిబిరానికి కావలసిన ఏర్పాట్లను చక్కగా నిర్వర్తించారు. ఈశిబిరానికి శ్రీఅహోబిల రామానుజ జీయర్‌స్వామివారు వేంచేసి, గ్రామస్థులకు ఈశిబిరానికి వచ్చిన వారందరికీ మంగళాశాసనాలు అందజేసారు. కృష్ణాజిల్లా వికాసతరంగిణి పెద్దలైన శ్రీమాన్ నల్లూరి కృష్ణగారు, చక్రధర్‌గారు, రాఘవన్ గారు ఈశిబిరాన్ని సందర్శించారు. కె.వి.సుబ్బారావుగారు, ఎ.పద్మావతిగారు (గ్రామఅధ్యక్షులు) తమ సహకారాన్ని అందించారు.

30.9.14వతేదీన శ్రీమతి మాధవీరవీంద్రగారి నిర్వహణలో గుంటూరుజిల్లా తాడేపల్లిలోని గవర్నమెంట్ స్కూల్ నందు డి. నాగిరెడ్డిగారు వారి ధర్మపత్ని శివమ్మగారి జ్ఞాపకార్థం ఏర్పాటు చేసిన ఉచిత మహిళావైద్య శిబిరానికి 90మంది మహిళలు హాజరు కాగా వారిలో 77మందికి **వి.ఐ.ఎ** పరీక్ష మరియు రొమ్ముపరీక్ష చేయటమైనది. నలుగురికి తదుపరి పరీక్షలు నిర్వహించవలసివున్నది. ఈశిబిరాన్ని గుంటూరుజిల్లా వికాసతరంగిణి అధ్యక్షురాలు శ్రీమతి లగడపాటి రామలక్ష్మిగారు, పెద్ది రమణారావుగారు జ్యోతిప్రజ్వలనతో ప్రారంభించారు. ఈశిబిరానికి **వి.టి** కార్యకర్తలైన శ్రీమతి శారదగారు, పద్మగారు, వరలక్ష్మిగార్లు మరియు విజయవాడ చైతన్య ఆరోగ్యవికాస్ కార్యకర్తలైన శ్రీమతి జయలక్ష్మి, రత్నమాల, అనూరాధ, వెంకటరమణ, గంగాభవాని, చంద్రకళ, వాణి, దేవి రాధాకృష్ణగార్లు తమ సహకారాన్ని అందించారు. గుంటూరు వికాసతరంగిణివారు సీతానగరం ఆశ్రమంలో విజయదశమి కార్యక్రమాల సందర్భంగా వేంచేసియున్న శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయర్‌స్వామివారిని ఈశిబిరానికి ఆహ్వానించారు. శ్రీస్వామి వారు ఈశిబిరానికి వేంచేసి మహిళలందరికీ మంగళాశాసనాలు అందించారు. ప్రత్యేకించి వైద్యురాలుగా సేవలందించటానికి వచ్చిన డా॥ సౌమ్యకి పై చదువులు పూర్తి అయిన తరువాత కూడా ఇలాగే సేవలు అందించాలని శ్రీస్వామివారి సూచన చేశారు. కార్యకర్తలందరికి ప్రత్యేక మంగళాశాసనాలు కృపచేశారు. శ్రీస్వామివారి రాక కార్యకర్తలలో నూతన ఉత్సాహాన్ని నింపింది.

6.10.14వ తేదీన శ్రీమతి మాధవీరవీంద్రగారి నిర్వహణలో నల్గొండలోని అమీనాబాద్ (గవర్నమెంట్ స్కూలు)నందు శ్రీమాన్ ఎమ్. కోటేశ్వరరావుగారు ఏర్పాటుచేసిన ఉచిత మహిళావైద్య శిబిరానికి 141 మంది మహిళలు హాజరుకాగా 59మందికి **వి.ఐ.ఎ** పరీక్ష చేయటమైంది. ఐదుగురు మహిళలకు తదుపరి పరీక్షలు నిర్వహించవలసి ఉన్నది. డా॥ కార్తీక్‌గారు తమ విలువైన సమయాన్ని ఈశిబిరానికి వెచ్చించారు. ఈశిబిరానికి గవర్నమెంట్‌స్కూలు ప్రిన్సిపల్ అయిన ఎమ్. కోటేశ్వరరావు గారు, ఎ. రంగారావుగారు, కోదాడ వికాసతరంగిణి అధ్యక్షులు మరియు కార్యదర్శి, కోశాధికారులు పాల్గొన్నారు.

కోదాడ ఆరోగ్యవికాస్ సమన్వయకర్త శ్రీమతి నళినిగారు, భారతమ్మగారు దగ్గరుండి ఈశిబిరానికి కావలసిన ఏర్పాట్లను పర్యవేక్షించారు. యువవికాస్ కార్యకర్తలైన నాగరాజు, కృష్ణలు చక్కని సేవలు అందించారు. విజయవాడ ఆరోగ్యవికాస్ చైతన్య కార్యకర్తలు రత్నమాల, శ్రీమతి జయలక్ష్మి, సుజాత, అనూరాధ, కమలగార్లు చక్కని సహకారాన్ని అందించారు. నల్గొండజిల్లా ఆరోగ్యవికాస్ సమన్వయకర్త శ్రీమతి జానకిగారు ఈ శిబిరానికి వచ్చి నల్గొండజిల్లాలో ఆరోగ్యవికాస్ శిబిరాలు నిర్వహించటానికి కావలసిన పరికరముల వివరాలు తెలుసుకున్నారు.

11.10.14న శ్రీమతి మాధవీరవీంద్రగారి నిర్వహణలో హైదరాబాద్, సంతోష్‌నగర్‌లోని గ్రంథాలయంలో శ్రీమతి వసుంధరా హర్షవర్ధన్‌గారు మరియు వికాసతరంగిణివారు కలిసి ఏర్పాటుచేసిన ఉచిత మహిళావైద్య శిబిరానికి విశేషస్పందన లభించింది. ఈశిబిరానికి 177మంది మహిళలు హాజరుకాగా 144మందికి **వి.ఐ.ఎ** పరీక్ష చేయటమైంది. 17మందికి తదుపరి పరీక్షలు నిర్వహించవలసి ఉంది. ఈశిబిరానికి డా॥గ్రేస్ తేజోవతిగారు, డా॥శ్రీదేవిగారు, డా॥రాగ గారు తమ సహకారాన్ని అందించారు.

35సం॥లు అనుభవం కలిగి గవర్నమెంట్ వైద్యురాలిగా పదవీవిరమణ చేసిన డా॥గ్రేస్‌గారు శ్రీస్వామివారి ద్వారా జరిగే శిబిరాలు, వాటి స్పందన, కార్యకర్తలయొక్క దీక్ష, సేవానిరతిని కొనియాడారు. నేను ఇప్పటివరకూ ఇలాంటి శిబిరాలను చూడలేదు, నాకు కూడా మీ యూనిఫామ్ ఇవ్వండి అని ఆవిడ ప్రశంసించిన తీరు, తరువాతిరోజు పర్వతాపురంలో జరిగిన శిబిరానికి ఆవిడ స్వచ్ఛందంగా రావడం, వైద్యులే ప్రశంసించే స్థాయికి ఆరోగ్యవికాస్ చేరుకోవడం అభినందనీయం. ఈశిబిరానికి సంతోష్‌నగర్ వికాసతరంగిణి కార్యకర్తలైన శ్రీమతి మీనాగారు, శ్రీమతి ఆండాళ్‌గారు, శోభారెడ్డిగారు, వీణాశ్రవంతిగారు తమపూర్తి సహకారాన్ని అందించారు. జంటనగరాల ఆరోగ్యవికాస్ సమన్వయకర్త శ్రీమతి సునీతగారు తమబృందంతో కలిసి సర్వేనుండి మొదలుకొని అన్ని ఏర్పాట్లను దగ్గరుండి పర్యవేక్షించారు. శ్రీనివాస్‌గారు శిబిరానికి వచ్చిన వైద్యుల మరియు మహిళల యొక్క స్పందనను దగ్గరుండి రికార్డుచేశారు. చైతన్య ఆరోగ్యవికాస్ సభ్యులైన శ్రీమతి జయలక్ష్మిగారు, అనూరాధగారు తమ సేవలను అందించారు.

12.10.14న స్టేట్ కో-ఆర్డినేటర్ శ్రీమతి మాధవీరవీంద్రగారి నిర్వహణలో పర్వతాపురంలోని గ్రామపంచాయితీ కార్యాలయంలో శ్రీమాన్ రవీంద్రారెడ్డిగారు, అనితగారు ఏర్పాటుచేసిన ఉచిత మహిళా

వైద్యశిబిరాన్ని శ్రీశ్రీశ్రీ త్రిదండి దేవనాథ రామానుజ జీయర్‌స్వామివారు జ్యోతి ప్రజ్వలనతో ప్రారంభించారు. కేంద్ర కార్యదర్శి శ్రీమాన్ బాలకృష్ణగారు, జంటనగరాల అధ్యక్షురాలైన అరుణారాఘవరెడ్డిగారు, ఆశాలతగారు, ఎన్. శ్రీనివాస్ గారు ఈ శిబిరాన్ని సందర్శించారు. 147మంది మహిళలు హాజరవగా 91మందికి **వి.ఐ.ఎ** పరీక్ష నిర్వహించారు. 13మందికి తదుపరి పరీక్షలను నిర్వహించవలసి ఉన్నది. డా॥గ్రేస్ తేజోవతిగారు తమ విలువైన కాలాన్ని వెచ్చించారు. ఈశిబిరానికి అరుణారాఘవరెడ్డిగారు ఉచితంగా మందులు పంపిణీ చేశారు. జంటనగరాల ఆరోగ్యవికాస్ సమన్వయకర్త శ్రీమతి సునీతగారు, సునీలగారు, పద్మశ్రీగారు, శ్రీలతగారు, లక్ష్మిగారు, పద్మగారు, భారతమ్మగారు, అనూరాధ, జయలక్ష్మిగార్లు మరియు యువవికాస్ కార్యకర్త అయిన కుమారి శృతి చక్కని సహకారాన్ని అందించారు. పై శిబిరాలలో శ్రీశ్రీశ్రీత్రిదండి అహోబిలరామానుజజీయర్‌స్వామివారు, శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయర్‌స్వామివార్ల ఆగమనం అటు మహిళలలోనూ, ఇటు కార్యకర్తలలోనూ నూతన ఉత్సాహాన్ని నింపుతోంది. అన్ని ప్రాంతాలలోని మహిళలకూ "ఆచార్య మంగళాశాసనాలను" అందిస్తూ వికాసతరంగిణి, ఆరోగ్యతరంగిణిగా మహిళలను చైతన్య పరచాలనే శ్రీస్వామివార్ల యొక్క ఆకాంక్ష వర్ధతాం! అభివర్ధతాం!

6.9.14న విజయవాడ కృష్ణాజిల్లాలో మూడుమాసాల క్రితం ఏర్పడిన తేలప్రోలు వికాసతరంగిణి శాఖ, శ్రీస్వామివారి మంగళాశాసనాలతో మహిళా ఆరోగ్యవికాస్‌ద్వారా సేవలందించుటకు శ్రీకారం చుట్టింది. వికాసతరంగిణి తేలప్రోలు గ్రామ అధ్యక్షురాలు శ్రీమతి జంగావాణిగారు, కార్యదర్శి శ్రీమతి శ్రీభూమా శ్రీహరిగార్ల నేతృత్వంలో 31.8.14న తేలప్రోలు గ్రామంలో హోమియో వైద్యశిబిరం ఏర్పాటు చేయబడింది. వర్షాకాలంలో వచ్చే డెంగ్యూ, మలేరియా, స్వైన్‌ఫ్లూ వంటి వ్యాధుల నివారణకై గ్రామంలోని జిల్లాపరిషత్ పాఠశాల, ప్రతిభా కాన్వెంట్, మండల U.P పాఠశాలలో ఏకకాలంలో దాదాపు 10మంది హోమియో వైద్య నిపుణులచే ప్రాథమిక పరీక్ష, మందుల పంపిణీ జరిగింది. ఇందులో దాదాపు 2000మంది శిబిరానికి హాజరయ్యారు. ముందు జాగ్రత్తగా అందరికీ ఉచిత మందుల పంపిణీ చేశారు.

శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి మంగళాశాసనములతో విజయవాడ శ్రీనగర్ 6వలైను రామానుజ వీధిలో శ్రీమాన్ కాకర్లపూడి వేంకటరాజుగారింట్లో 2006లో ప్రారంభించిన ఉచిత హోమియో డిస్పెన్సరీ 8సంవత్సరములు పూర్తి చేసుకుని 9వ సంవత్సరములో అడుగిడిన సందర్భముగా డా॥ పి.వేంకటేశ్వరరావుగారికి చిరు సన్మానముతో శ్రీస్వామివారి మంగళాశాసనములు అందించటం జరిగింది. ఆరోజు వచ్చిన పేషంట్లందరూ ప్రతిగురువారం వచ్చి (ఒక వారంకూడా మానకుండా) ఎంతో ఓపికగా ఎంతమంది పేషంట్లు వచ్చినా ఎంత లేటయినా అందరినీ చూసి చక్కటి సేవను అందించినందుకు డాక్టరు గారిని, ఇంత చక్కటి సేవను అందిస్తున్న ముత్యాలంపాడు వికాసరంగిణి కార్యకర్తలను ఎంతగానో కొనియాడారు. దాదాపు ఇప్పటి వరకు ఈ 8సం॥లలో 32000 వేల మందికి ఉచిత హోమియో వైద్యం, మందులు అందించడం జరిగింది.

18వ తేదీన గుంటూరుజిల్లా సీతానగరం ఆశ్రమంలో జరిగిన సంస్కారవికాస్ కార్యకర్తల సమావేశాన్ని శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయర్‌స్వామివారు పర్యవేక్షించి కార్యకర్తలకు శాంతి మంత్రంలోని ఓంకారం నుండి పద్యాల వరకూ ఏవిధంగా చదవాలో తగిన సూచనలను అందించారు. కృష్ణాజిల్లా వికాసతరంగిణి కార్యదర్శి శ్రీమాన్ చక్రధర్‌గారు అధ్యక్షత వహించారు.

కేంద్ర కార్యాలయ సంఘటనా కార్యదర్శి భవానీప్రసాద్‌గారు, సహకార్యదర్శులు శ్రీమాన్ విద్యాసాగర్‌గారు, శ్రీమతి గాయత్రిగారు, ఆరోగ్య వికాస్ సమన్వయకర్త శ్రీమతి మాధవీరవీంద్రగారు పాల్గొన్నారు. శ్రీమాన్ భవానీ ప్రసాద్‌గారు సంస్కార్‌వికాస్ కార్యకర్తలందరికీ సంస్కారతరంగిణి అనే పుస్తకాన్ని అందించారు. పుస్తకంలోని భజనలు, వేమనపద్యాలు, నీతికథలను చదివించి వీటినుండి సంస్కారవికాస్ కార్యకర్త సత్సంగాన్ని ఏవిధంగా ఏర్పాటు చేసుకోవాలో, దానిలో ఏవిధంగా మాట్లాడాలో అందరికీ విశదీకరించారు. సంస్కారవికాస్ కార్యకర్తలతో ఈపాఠ్యసారాంశాన్ని మాట్లాడించటంద్వారా వారిలోని బిడియాన్ని, భయాన్ని పోగొట్టి, ధైర్యాన్ని నింపారు. ఈసమావేశానికి కృష్ణా, గుంటూరు, ప్రకాశం, పశ్చిమగోదావరి జిల్లాలనుండి సంస్కార వికాస్ విభాగానికి చెందిన సుమారు 140మంది కార్యకర్తలు హాజరైనారు. సీతానగరం ఆశ్రమ నిర్వాహకులు శ్రీమాన్ వేంకటాచార్యస్వామివారు, రఘుస్వామివారు ఈకార్యక్రమానికి చక్కని సహకారాన్ని అందించారు.

## కరీంనగర్ జోన్ సంస్కారవికాస్ శిక్షణశిబిరము

15తేది రోజున వికాసతరంగిణి కరీంనగర్ జోన్ అయిన (కరీంనగర్, అదిలాబాద్, నిజామాబాద్) సంస్కార్‌వికాస్ సభ్యుల శిక్షణ సమావేశము కరీంనగర్ వేదభవనంలో ఉ, 10॥నుండి సా॥ 4గంటలవరకు శ్రీదేవనాథజీయర్‌స్వామి పర్యవేక్షణలో నిర్వహించటమైనది.

19-10-2014 వ తేదిన శంషాబాద్ శ్రీరామనగర్ జీవాప్రాంగణం, హైదరాబాద్ జోన్ (రంగారెడ్డి, మెదక్, మహబూబ్‌నగర్, జంటనగరాలు) సంస్కారవికాస్ కార్యకర్తలు శిక్షణాశిబిరం శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయర్‌స్వామివారి ప్రత్యక్షపర్యవేక్షణలో నిర్వహించటమైనది. ఈ శిక్షణశిబిరంలో శ్రీ శ్రీశ్రీ అహోబిలరామానుజ జీయర్‌స్వామి, శ్రీదేవనాథరామానుజ జీయర్‌స్వామివారు కార్యకర్తలనుద్దేశించి సంస్కారవికాస్ కార్యకర్తలు వారి ప్రాంతాలలో సత్సంగములు ఏ విధముగా నిర్వహింపజేయాలో సూచనలు ఇవ్వటమైనది.

శ్రీ స్వామివారు కార్యకర్తలనుద్దేశించి ప్రతికార్యకర్త వారి ఆచరణలో క్రమశిక్షణ,నిబద్ధత, వారిమాటల్లో స్పష్టత అలవరుచుకొని 'యోగా' లాంటి శారీరక వ్యాయామాలను నేర్చుకొని సత్సంగాలు ప్రతిప్రాంతములో ఏర్పాటుచేసి వారికి పై కార్యక్రమాలు నేర్పిస్తూ మన

సం(ప్రదాయం, పురాణాలు, నీతికథలు, పద్యాలు మొదలగునవి భావితరాలకు తెలియు విధముగా నిర్వహించాలని మార్గదర్శనము చేసారు.

శిక్షణశిబిరానికి వచ్చిన కార్యకర్తలందరికి సంస్కారతరంగిణి పుస్తకములు అందజేశారు. ఆ పుస్తకములతోపాటు పొందుపరిచిన కథలు, పద్యాలు, శ్లోకాలు, భజనలు ప్రతి సత్సంగములతో నేర్పుట జరగాలని నిర్దేశించమైనది.

ఈ కార్యక్రమములో వైశారదిగారు, భవానీప్రసాద్, పద్మనాభం, బాలకిషన్ మొదలగువారు తమ సందేశాలు అందజేశారు.

కరీంనగర్‌జోన్‌లోని 71శాఖలద్వారా సంస్కార్‌వికాస్‌సభ్యులు మరియు ఆహూతులు (95మంది) పాల్గొన్నారు. వారందరికి సంస్కారతరంగిణి పుస్తకములు అందజేసినారు. వైశారదిగారు అహింస, ఇంద్రియనిగ్రహం, సర్వభూతదయ, క్షమ, జ్ఞానం, తపస్సు, ధ్యానం, సత్యం అనే ఎనిమిది పుష్పాలతో అర్చిస్తే కేశవుడు సంతుష్టుడౌతాడని సవివరముగా తెలియజేశారు.

సంస్కారవికాస్ కార్యకర్త ముందుగా తను సంస్కరింపబడి సత్సంగములద్వారా ఇతరులు కూడా సంస్కరించబడేటట్లుగా చేస్తూ సత్సంగములను నిర్వహించవలసిందిగా సూచించారు. ప్రారంభశ్లోకం ముగింపుశ్లోకం ఎలా పఠనం చేయాలో నేర్పించారు. ఈ సంస్కారవికాస్ శిక్షణా శిబిరానికి కేంద్రసంఘటనాకార్యదర్శి శ్రీమాన్ భవానీప్రసాద్‌గారు విచ్చేసి కార్యకర్తలకు మన సంస్థ లక్ష్యాలు, ఆశయాలు సవివరంగా తెలియజేసారు.

ఈ కార్యక్రమానికి కేంద్రకమిటి నుండి శ్రీమాన్ బాలకిషన్, శ్రీమతి గాయత్రి, శ్రీమాన్ అయోధ్యరామారావు, శ్రీమాన్ చల్మెడ లక్ష్మీనర్సింహరావు, శ్రీమాన్ నంగునూరిశ్రీనివాసరావు, శ్రీమాన్ ప్రభాకర్‌రావు, శ్రీమాన్ గౌతమ్‌రావు, శ్రీమాన్ ప్రతాప్‌రెడ్డిగార్లు హాజరైనారు.

### సెప్టెంబర్ నెల మెదడుకు మేత సమాధానములు

1. కర్మయోగము; 2. శ్రీధరుని వృత్తాంతం; 3. శ్రీరంగనాథుడు; 4. యజ్ఞోపవీతం; 5. నరకలోకమును పొందేవారు; 6. నిరవధికమైన ప్రీతి; 7. భక్తవాత్సల్య గుణము; 8. జూదం; 9. పిళ్ళైలోకాచార్యులు; 10. లక్ష్మీస్వభావము; 11. శరీరము; 12. వెంట్రుకలు నెరసి, దంతాలు ఊడిపోయి; 13. శ్రీమత్సుదర్శన చక్రం; 14. తిరుచానూరు; 15. స్కందపురాణము; 16. సంధ్యాకాలము అతిక్రమించిన కొద్దీ తారకలు ఉదయించిన కాలము; 17. శ్వేతాద్రినాథస్వామి; 18. నాథముని వంశంవారు; 19. సాగరం; 20. పిట్యూటరి గ్రంథి;



### మహిళ యొక్క అనుభవం

నాపేరు ఉప్పలపాటి సుబ్బలక్ష్మి. నేను విజయవాడలో విజయదుర్గానగర్ కాలువకట్టమీద ఉంటున్నాను.

మాకట్టమీద శ్రీజీయర్‌స్వామి శిష్యులు ప్రతి ఇంటికి వచ్చి 21.1.14వతేదీన మహిళలకు ఉచిత మెడికల్‌క్యాంపువుంది, మందులు కూడా ఉచితంగా ఇస్తాం, మీరు బయటకు చెప్పుకోలేని సమస్యలు ఉంటే అక్కడ మహిళాడాక్టర్స్ ఉంటారు. వారిచేత పరీక్ష చేయించుకుని సమస్యకు పరిష్కారం ఉంటుందంటే వెళ్ళాను. వారు నారొమ్మును పరీక్షించి గడ్డవుంది అని తెలిపారు. తరువాత నన్ను **ఎన్.ఆర్ ఐ** హాస్పటల్‌కి తీసుకుని వెళ్ళి బయాప్సీ అనే పరీక్ష ఉచితంగా జరిపించి క్యాన్సర్ గడ్డగా గుర్తించారు. ఇది తొలిదశలోనే వుంది అని ధైర్యంచెప్పారు. నేను ఆరోగ్యశ్రీ పథకంద్వారా క్యాన్సర్ హాస్పటల్‌లో ఆపరేషన్ చేయించుకుని ఇప్పుడు ఆరోగ్యంగా ఉన్నాను. ఈవిధంగా చేస్తున్న రుక్మిణిగారికి డాక్టర్స్‌కి మరియు కార్యకర్తలకు ముఖ్యముగా శ్రీజీయర్‌స్వామివారికి నా వందనములు.

### విశేష సూచన

**శ్రీశ్రీశ్రీ జీయర్‌స్వాముల కార్యక్రమ వివరాలు**

**మీరు జీవా ప్రాంగణంలోని సమాచారం కోరుతున్నారా?**

**మీకు కావలసి ఈక్రింది సమాచారాలను ఆయా నెంబర్లద్వారా మాత్రమే తెలిసికొండి.**

**1. దివ్యసాకేతం - 9347581218**

**2. గురుకులం - 9441583064**

**3. నేత్రవిద్యాలయం - 9490468626**

**4. శ్రీరామానుజ సహస్రాబ్ది - 8333078468**

**5. ఇంకా ఇతర వివరాలు , జీవారిసెప్షన్ - 9553549971-72**

**6. జీవా ఆఫీస్ మరియు సహస్రాబ్ది - 9704882707**


నాణ్యమైన ప్లాట్లు మరియు ఫ్లాట్లు కొనుగోలుకు నమ్మకమైన అగ్రగామి సంస్థ

**అభినందన హౌసింగ్ (ప్రై). లిమిటెడ్**

సెంట్రల్ ఆఫీస్ : 4వ లైను, పండరీపురం, లక్ష్మీపురం మెయిన్ రోడ్, గుంటూరు. ఫోన్ : 2354002.

మా బ్రాంచీలు : విజయవాడ 1, విజయవాడ 2, విజయవాడ 3, గుంటూరు 1, గుంటూరు 2, హైదరాబాద్, విశాఖపట్నం.

0866 - 6628668 : 0866 - 6642428 : 0866 - 6633668 :. 0863 - 6641177 : 0863 - 6454588 :. 040 - 66637799 :. 0891 - 2538686.

# సర్వారిష్టశాంతి, నక్షత్రగ్రహానుకూలతాసిద్ధిప్రద శ్రీయాగ శుభాహ్వానము

## తేదీ 24.11.2014 నుండి 01.12.2014 వరకు

*ప్రియ భగవద్ బంధువుల్లార!*

మనకికల ధనము, బలమూ, విజ్ఞానమూ ఇవేవీ ప్రకృతి ప్రమాదాలను అరికట్టలేకపోతున్నాయి. పాడి, పండిన పంటలను కాపాడలేకపోతున్నాయి. రైతుల కన్నీటిని తుడవలేకపోతున్నాయి. మన ప్రవృత్తులను చెడునుంచి మంచివైపు మరల్చలేకపోతున్నాయి. మనని ప్రయోజనవంతులుగ తీర్చిదిద్దలేకపోతున్నాయి. దీనిని బట్టి, మనకీ, ప్రకృతికీ కూడా వెనుక కొన్ని దైవీశక్తులున్నాయనీ, వాటికి మనం పరాధీనులమని స్పష్టమౌతోంది. వాటిని గౌరవించి అనుకూలంగ ప్రవర్తిస్తే అవి మనకి ప్రసన్నమౌతాయని వేదమూ, భగవద్గీత తెలిపాయి.

2004లో కృష్ణావసంతోత్సవం పేర చేసిన అలాంటి ప్రయత్నం సత్ఫలితాలనిచ్చి కృష్ణానది పుష్కలమైన నీటితో కళకళలాడింది. 2012 జూలైలో కావేరీనదిలో చేసిన కృషికూడా ఫలించి ఆ నది జలపూర్ణ అయింది. మరెన్నో సందర్భాలలో ఇది సత్యమని నిరూపితమైంది. పూర్వమే మన ఆచార్యులందరూ **'దైవీశక్తిని గుర్తించి శ్రద్ధకలిగి బ్రతికితే ప్రకృతిని కాపాడుకుంటే మనకి ఉపద్రవాలు రావు'** అనే ఈ సత్యాన్ని ఎన్నోసార్లు నిరూపించారు కూడా!

ప్రస్తుతము ప్రకృతిలో చెలరేగే ఉపద్రవాలు, మన దేశాన్ని, రాష్ట్రాన్ని అతలాకుతలం చేస్తున్నాయి. ప్రజలలో పరోపకారచింతన, పాలకులలో ప్రజల అవసరాలను తీర్చగలిగే నిష్ఠ, దానికి తగ్గ ఆర్థికపుష్టి పెరగాలి. కార్యదక్షతకు ప్రోత్సాహం లభించాలి. ప్రజలందరూ క్రియాశీలురు కావాలి. **'ఇవన్నీ నాకెందుకులే'** అనే నిర్లక్ష్యవైఖరి మనలో నశించాలి. **మన జాతి గౌరవాన్ని పెంచే పనులు చేయాలి. మన రాష్ట్రాన్ని అగ్రగామిగ మలచుకొనే కృషిసాగాలి.** దీనికి దైవం సహకరించాలి. అందుకే ఈ **"శ్రీయాగం"**

**అందరమూ కలిసి ఈ దైవకార్యాన్ని సాధిద్దాము రండి!**
**మీ వంతుసేవలను చేయండి!**
**మీ బంధుమిత్రులనూ ప్రోత్సహించండి!**

ఎండా, వానా, చలీ, వేడీ, గాలీ, నీరూ వంటివన్నీ దైవశక్తితో పనిచేసేవే. వాటిని మీరు గౌరవించండి. దాన్ని యజ్ఞమంటారు. అవి మీ అవసరాలు తీర్చేట్లు నేను చేస్తా. **"దేవాన్ భావయత అనేన తే దేవా భావయన్తు వః పరస్పరం భావయన్తః శ్రేయఃపర మవాప్స్యథ"** అంటూ భగ.3.12,13 శ్లోకాల్లో భగవంతుడు తెలిపాడు.

మన బుద్ధులనీ, పనులనీ సరిచేసుకోవాలంటే నక్షత్రాలు అనుకూలించాలి. వాటిని 27 రాశులుగ శాస్త్రాలు విభజించాయి. పుట్టే ప్రతిప్రాణీ ఈ రాశులలో చేరవలసిందే. ఈ నక్షత్రరాశులకీ అధిదేవతలుంటాయి. ఈ దేవతలనందరినీ 33 గణములని గుర్తించారు. వాటిని గౌరవిస్తే నక్షత్రాలనుకూలిస్తాయి. అందుకే 33 కుండములతో ఈ **'శ్రీయాగం'**

అటు దేవతలకీ, ఇటు నక్షత్రాలకీ కూడా వెనుక ఉండి నడిపే పరమాత్మ సాక్షాత్తు శ్రియఃపతి శ్రీమన్నారాయణుడే. మననీ నడిపేవాడాయనే. ఈ విషయాన్ని భగవద్గీత ఆదినుండి అంతందాక, ముఖ్యంగ భగవద్గీత 7,15వ అధ్యాయంలో స్పష్టంగ ప్రకటించాడు. ఆయన్ని గౌరవిస్తూ, ఆయన భగవద్గీతను ఉపదేశించిన గీతాజయన్తికి **మనమందరమూ ఏకకంఠంతో** ఆ భగవద్గీతను ప్రేమతో పారాయణ చేద్దాం!

నక్షత్రగ్రహశాంతిని, ప్రకృతిలోని ఉపద్రవాలు తగ్గి, మనకు సుఖశాంతులు కలగాలని, పాడి, పంట పెరగాలనీ, రైతన్నలముఖాలు ఆనందంతో వికసించాలని సర్వదేవతాంతర్యామి, సర్వనియన్త అయిన కరుణామయుణ్ణి, లక్ష్మీనాథుణ్ణి ప్రీతితో ఆరాధిస్తూ అందరం కలిసి వైభవంగ చేసుకుందాం ఈ **'శ్రీయాగాన్ని'**

రండి! పాల్గొనండి! చేతనైన సేవ చేయండి!
మీ వాళ్ళందరినీ ఆహ్వానించండి! అందరం కలిసి ఆనందిద్దాం!

## అందరం చేయగలిగినది :

**దేశవాళీ ఆవుపాలను తోడుపెట్టి, దాన్ని చిలికి వెన్నకాయండి. అలా చేసిన మంచినేతిని సేకరించండి! ఈ శ్రీయాగానికి సమర్పించండి. అలాంటి నేతితో చేసే హోమాలే సత్ఫలితాలనిస్తాయి. అదే చేద్దాం! అది ఎంతైనా ఫరవాలేదు. ఇప్పటినుండే మంచినెయ్యి సేకరించడం ప్రారంభిద్దాం!**

**దీనితోపాటు బియ్యం, పప్పులు, మొదలైన తదీయారాధన వస్తు సామగ్రి ఏదైనా, ఎంతైనా ప్రేమతో సమర్పించవచ్చు. 'శ్రీయాగం' చక్కగ చేసుకుందామనే మీ శ్రద్ధయే ప్రధానము.**

## మనం ఏం చేయాలి?

- **ఒకరోజు యజ్ఞంలో పాల్గొను ఉభయదారులు రూ. 5,001**
- **7 రోజులు యజ్ఞములో భాగస్వామ్యమునకు రూ. 25,000**
- **ఒక రోజు యజ్ఞంలో గోత్రనామాదుల సంకల్పంలో అన్వయించుటకు రూ.1,001**
- **28.11.2014 ఉ.10.00గం॥లకు సామూహిక లక్ష్మీపూజ రూ. 201**

**ఈ శ్రీయాగ కార్యక్రమంలో తమ కైంకర్యములను ధన, వస్తురూపములలో సమర్పించుకొనేవారు**

వివరాలకు సంప్రదించండి

**08645 272929, 272353, 98481 11368, 99850 06789, 78939 05388**
**Email: jetsitanagaram@chinnajeeyar.org**
**Visit us: www.chinnajeeyar.org**




**శ్రీమాన్ తిరుమలపెద్దింటి వేణుగోపాలాచార్యులుగారు 28.10.2014న పరంపదించారు.**

**వీరు గత 14 సం॥లుగా సీతానగరం ఆశ్రమంలో ఎకౌంటెంట్‌గా సేవల నందించడమే కాక, మన అల్లంపల్లి, బీర్సాయిపేట గురుకుల నిర్మాణ కార్యక్రమాలలో కూడా చక్కని బాధ్యత వహించారు.**

**వీరు గత కొద్దికాలంగా లంగ్స్ క్యాన్సర్ బాధతో చికిత్స పొందుతున్నారు. వీరికి వికాసతరంగిణి తరపున శ్రీస్వామివారు యశోద హాస్పిటల్‌లో వైద్యం చేయించారు. ఊపిరితిత్తుల సమస్యవల్ల పరమపదించడం జరిగింది.**

**శ్రీస్వామివారి అభిమానానికి పాత్రులైన శ్రీమాన్ వేణుగారు నిత్యసూరుల్లో ఒకరుగా నిలవాలని మంగళాశాసనాలు అనుగ్రహించారు.**



నిజామాబాద్ వాస్తవ్యులు శ్రీమాన్ కానుగంటి ఆనందరావుగారు 7.10.2014న ఆచార్య తిరువడిని అలంకరించారు. వీరికి 82సం॥లు. వీరు నిజామాబాద్‌లో శ్రీస్వామివారు ప్రతిష్ఠించిన శ్రీకోదండ రామాలయానికి 15సం॥ అధ్యక్షులుగా వ్యవహరించారు. ఆలయాభివృద్ధికి చాలా కృషిచేసారు. గత 20సం॥లుగా శ్రీస్వామివారి సేవలలో తరించిన వీరికి పరమాత్మ సాన్నిధ్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనాలు అనుగ్రహించారు.

హైదరాబాద్ వాస్తవ్యులు శ్రీమాన్ టి.వి.ఎన్ రెడ్డిగారు (ఐ.ఆర్.ఎస్. ఆఫీసర్) 3.10.2014న పరమపదాన్ని అలంకరించారు.



వీరు 94లో తిరుమలలో జరిగిన సహస్రకుండాత్మక మహావిష్ణుయాగంలో విశేష సేవల నందించారు. వీరికి, వీరి కుటుంబసభ్యులకు శ్రీస్వామివారు అనేక మంగళాశాసనాలు అనుగ్రహించారు.

# పరమపదవార్తలు



ఖమ్మం జిల్లా, బేతుపల్లి వాస్తవ్యులు శ్రీమాన్ సిద్దబోయిన వేంకట రామయ్యగారు 29.9.2014న పరమపదాన్ని అలంకరించారు. వీరి ఆత్మకు శాంతికలగాలని, పెరుమాళ్ళ సన్నిధిలో శాశ్వతకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు మంగళాశాసనాలు అనుగ్రహించారు.



కృష్ణాజిల్లా, తరిగొప్పుల గ్రామ వాస్తవ్యులు కోటగిరి లక్ష్మణరావుగారు 16.8.2014న పరమపదాన్ని అలంకరించారు. వీరు పరమాత్మ పదసన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని, కుమారుడు శ్రీమాన్ కోటగిరి రాంమోహన్‌రావుగారికి శ్రీస్వామివారు మంగళాశాసనాలు అందించారు.



హైదరాబాద్- కుకట్‌పల్లి వాస్తవ్యులు శ్రీమాన్ పోలవరపు శ్రీనివాసరావుగారు 1.9.2014న ఆచార్య తిరువడిని అలంకరించారు. వీరి సతీమణి, తండ్రి శ్రీమాన్ పి.వి. నరసింహారావు-విజయవాడ శ్రీస్వామి వారు నిర్వహించే అనేక కార్యక్రమాల్లో అన్వయి స్తున్నారు. వీరికి, వీరి కుటుంబసభ్యులకు శ్రీస్వామి వారు మంగళాశాసనాలు అనుగ్రహించారు.



కృష్ణాజిల్లా, తిరువూరు- అక్కపాలెంగ్రామ వాస్తవ్యులు శ్రీకమదన మంగాయమ్మరావుగారు 4.9.2014న ఆచార్య తిరువడిని చేరారు. వీరు శ్రీచిన్నజీయర్‌స్వామివారి వద్ద సమాశ్రయణాన్ని పొందినారు, వీరికి పరమాత్మ పదసన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని, వీరి కుమారుడు పాండురంగ పార్థసారథికి, రాయన్నరావుగారికి శ్రీస్వామివారు మంగళాశాసనాలు అందించారు.



గండిగుంట వాస్తవ్యులుశ్రీమతి శృంగవరపు సరోజినీదేవిగారు 26.9.2014న పరమపదాన్ని అలంకరించినారు. వీరికి పరమాత్మ పదసన్నిధిలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు అనేక మంగళాశాసనాలు అందించారు.



గుంటూరు జిల్లా వాస్తవ్యులు నక్కా నాగభూషణం గారి సతీమణి శ్రీమతి నక్కా తిరుపతమ్మగారు 29.9.2014న ఆచార్య తిరువడిని అలంకరించారు.

వీరు సుమారు 25సం॥క్రితం శ్రీచిన్న జీయర్‌స్వామివారి వద్ద మంత్రోపదేశం పొందారు. వీరికి పరమపదంలో నిత్యకైంకర్యం లభించాలని శ్రీస్వామివారు అనేక మంగళాశాసనాలు అనుగ్రహించారు.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన **అక్టోబర్ నెల సమాధానాలందాయి.** విజేత పేరు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం! *గతనెల సమాధానాలు 48వ పేజీలో కలవు.*

**ప్రశ్నలు** **సమాధానాలు**

1. భారతీయ వాఙ్మయంలోని ప్రత్యేకత ఏమి ?
2. జీవి తల్లిపాలకు కూడా నోచుకోకపోవడమంటే ఏమిటి ?
3. శ్రీకృష్ణుని ఏముఖ్యగుణం రామానుజులలో చోటుచేసుకుంది ?
4. శంకరుడు అర్జునునకిచ్చిన ఆయుధమేది ?
5. కుందేటిని విడిచి కాకికోసం ప్రయత్నమా - అన్నదెవరు ?
6. బడబ అంటే ఏమిటి ?
7. ద్రావిడ వేద నిగమనం అంటే ఏమిటి?
8. నచికేతుడెవరు ?
9. కళలెన్ని ?
10. 'ఆయ' అనే చతుర్థి ఏవిశేషాన్ని తెలుపుతున్నది ?
11. భాగవత పఠనం వల్ల లాభమేమి ?
12. కాంతిమతీదేవి ఎవరు ?
13. భగవద్రామానుజుల ముఖమండలమెవరిరూపము ?
14. విశ్వామిత్రుడు దశరథునితో రాముని ఎందుకు తనతో పంపించమని అడిగాడు ?
15. ఉష్ణీషం అంటే ఏమిటి ?
16. మితడ నేర్పిన పాఠమేమి?
17. చక్రాంకణం గురించి తెలిపిన వేదమేది?
18. పెద్దలు దేనినిబట్టి ఎవరినైనా ఆదరింతురు?
19. వార్షిక జీయర్‌పురస్కార ఉభయదారులెవరు?
20. నచికేతోపాఖ్యానం ఏ ఉపనిషత్తులోనిది?

**శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేతల పేర్లు:**

కె. మనోజ్ - H.No:7-Z-61, కొత్తగూడెం, ఖమ్మం జిల్లా.

**సరియైన సమాధానములు వ్రాసినవారు**

కె. మనోజ్ - కొత్తగూడెం, కొమాండూరి ఇందిర- పి.టి. కాలనీ, హైదరాబాద్

టి. కృపాకరరావు - హయత్ నగర్, రంగారెడ్డి జిల్లా.

మీ చిరునామా

............................................................

............................................................

............................................................

............................................................

సూచన: సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.

భక్తినివేదన సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929

శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః

68 సం॥ల నుండి భగవద్బంధువులు ఆదరిస్తున్న ...

ప్రారంభం - ఏప్రిల్ 1947

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాసపత్రిక








సంపుటి 67 డిసెంబర్ 2014 సంచిక 9

శ్రీజయనామ సంవత్సర మార్గశిరమాసము


## పంచాంగ వివరములు

డిసెంబర్:

16. మూలకార్తె, ధనుస్సంక్రమణము సా. 4-37 (ధనుర్మాసారంభము)
18. సర్వేషామేకాదశి
20. మాసశివరాత్రి
21. తొండరడిప్పొడియాళ్వార్‌తిరు, పిండపితృయజ్ఞము.
22. అమావాస్య, అమాసోమవారవ్రతం
28. భానుసప్తమి
29. పూర్వాషాఢకార్తె

1. ఆంగ్ల వత్సరాది, సర్వేషామేకాదశి, ముక్కోటి ఏకాదశి, శ్రీరంగాది సమస్త శ్రీవైష్ణవ క్షేత్రములయందు వైకుంఠ ద్వారదర్శనోత్సవం, ఏకాదశి, గురువారవ్రతము
2. కూర్మద్వాదశి, శ్రీశ్రీశ్రీ త్రిదణ్డి శ్రీమన్నారాయణ రామానుజ పెద్దజీయర్‌స్వామి వారి పరమపదోత్సవము
3. శనిత్రయోదశి


వ్యవస్థాపకులు
పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ
రామానుజ జీయరుస్వామివారు

సంపాదకులు
శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి
శ్రీఉ.వే.శ్రీమాన్ డా॥ S.V. రంగరామానుజాచార్యులు

ఉప సంపాదకులు
శ్రీమతి డా॥ T.K. చూడామణి

D.T.P & Design by:
పరిశోధనాలయం - సీతానగరం.
పరిశోధన-ప్రకాశన విభాగం
జీవా - శ్రీరాంనగర్

చందావివరాలు :-
సంవత్సరచందా రూ.225/-
విదేశాలకు సంవత్సరచందా $30/-

మీ సేవలో....
భక్తినివేదన, సీతానగరం - 522 501,
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. 08645 272929.

E-mail : jetsitanagaram@yahoo.com
Internet : www.chinnajeeyar.org


## విషయసూచికా




*Printed & Published by :* H.H. Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamiji on behalf of **Jeeyar Educational Trust**
*Printed & Published at :* **Srijman Printers & processors** : C/o JET, Sitanagaram - 522 501, Guntur Dist., Andhra Pradesh.
*Editor* : Sri **S.V. Rangaramanujacharyulu** S/o. Lakshmanacharyulu, JIVA, Sriramnagar, Shamshabad, R.R.Dist. Andhra Pradesh.

సంపాదకీయం

# గీతా సుగీతా కర్తవ్యా....



ప్రపంచతాత్త్విక విచారధారను విశేషంగా ప్రభావితం చేసిన ఘనత భారతభూమికి దక్కుతుంది. ఈ విచారధారలో ప్రముఖభాగస్వామ్యం వహించింది వైదికవాఙ్మయం, అందునా ఉపనిషత్ సారస్వతం. ఉపనిషత్తులు ఆయా కాలాల్లో ఆయా సంప్రదాయాలఛాయలో ఎన్నో ఆవిర్భవించినా, 108 ఉపనిషత్తులను పరిగణనం చేసినా, శంకర–రామానుజ–మధ్వాచార్యులు ప్రమాణంగా ఉట్టంకించినవి ఒక ఇరవైలోపే ఉంటాయి. స్వయంగా, ఉపనిషత్తు కాకపోయినా, ఒక మహేతిహాసంలో భాగమైన 'శ్రీగీత', ఎన్నో విధర్మభావనలను ప్రభావితం చేసిందనేది నిరాకరింపరాని సత్యం.

ప్రపంచంలోని ఎన్నో విశ్వవిద్యాలయాల్లోని తత్త్వవిచారణ ప్రధానంగా గల శాఖల్లోను, భారతీయాధ్యయన విభాగాల్లోను శ్రీగీత ఏదో ఒక దశలో ఆదరింపబడుతోంది. అమెరికా న్యూజెర్సీలో ఉన్న ప్రిన్‌స్టన్ యూనివర్సిటీలో క్రిస్టియన్ మతవిద్యను నేర్చే విద్యార్థులు తరచు శ్రీగీతలోని అంశాలను విశేషంగా అధ్యయనం చేస్తారని, ఈ సంపాదకుడు ఆ విశ్వవిద్యాలయానికి వెళ్ళి గమనించిన విశేషం. వారు ఏ ఉద్దేశ్యంతో గీతను అధ్యయనం చేసి, తమకిష్టమైన రీతిలో విశ్లేషణంచేసికొన్నా, వారినీ ఇది ప్రభావితం చేసిందన్నది నిరాకరింపరాని సత్యం. ఇక్కడ నుంచే, తమ భావజాలాన్ని పోషించుకున్నారు వారనేది త్రికాలాబాధసత్యమైనా, మా భావజాలాలు ఇక్కడా ఉన్నాయని వారు ప్రచారంచేసికోవడం, వారి ప్రచార ప్రణాళికలో ఒక భాగం. ఇంచుమించు విధర్మవాదులంతా ఈ ధోరణినే అవలంబించడం పరిపాటి.

ఎన్నో గీతలు ఇతిహాసపురాణాల్లో భాగాలుగా ఆవిర్భవించినా, 'గీత' అని నిరుపపదంగాను, 'భగవద్గీత' అని భగవత్పదం చేర్చి సమ్మానింపబడినది ఒక్కటే. అదే, మహాభారత యుద్ధం ఆరంభం కావడానికి ముందు,శ్రీకృష్ణుడు, తాను సారథిగా ఉండి రథం నడుపుతున్న దశలో, రథికుడైన అర్జునుని ఉద్దేశించి ఉపదేశించినది. వ్యాసుడు, తాను ఆవిష్కరించిన పురాణాల్లో ఎన్నో గీతలను ఉట్టంకించినా, వాటికి వేటికీ, "భగవద్గీత" అని పేరు పెట్టలేదు. శ్రీకృష్ణుని ముఖారవిందంనుంచి జాలువారిన తాత్త్వికవిచారధారాభరిత మైన ఉపదేశాన్ని మాత్రమే "శ్రీమద్భగవద్గీతాసు, ఉపనిషత్సు" ఇత్యాదిగా ఉపనిషత్తుగా, భగవద్గీతగా నిర్దేశించాడు వ్యాసమహర్షి. మన ఆచార్యులంతా వ్యాఖ్యానించి, తమతమ సంప్రదాయ తాత్త్విక రీతులను పరిపుష్టం చేసికొన్నది కూడా భగవద్గీతా భాష్యముఖంగానే.

ఏదైనా ఒక తాత్త్వికసిద్ధాన్తం ఆవిర్భవిస్తే అది ఆవిర్భవించిన కాలంనాటి స్థితిగతులు, వాటిని అవగాహనం చేసికొని వ్యాఖ్యానించే వ్యాఖ్యాతల కాలాలనాటి స్థితిగతులు వేరుగా ఉంటాయి. ఆయా కాలపరిస్థితులను బట్టి మౌలికసిద్ధాన్తవిశ్లేషణం ఆయా వ్యాఖ్యాతల అవగాహనా శైలిని, వారి అనుభవాలను బట్టి వేరువేరుగా ఉండటం సహజం. అపరిహార్యంకూడా. వ్యాసుడు ఏ తాత్త్వికభావనను ఏ దృష్టితో ఆవిష్కరించాడో, దాన్నే యథాతథంగా తరువాత కాలంలోనివారు, వ్యాఖ్యానిస్తారనే నియమం ఏమీలేదు. ఆయా కాలాల్లోని, సమాజాల మానసికావగాహనారీతిని బట్టి, అప్పటి పరిస్థితలనుబట్టి, అవసరాలనుబట్టి నిర్వచనాలు, నిరూపణలు, వివరణాలు ఏర్పడడం మనం గమనించాలి. ఈ దృష్టితోనే ఆయా వ్యాఖ్యానాలను, వివరణలను అర్థం చేసుకోవాలి. వాటిలోని వైవిధ్యాన్ని వైరుధ్యంగా భావించకూడదు.

శ్రీగీత ఏ దర్శనాన్ని మన ముందు ఉంచినా అది ఈనాటికీ సార్వకాలికం, సార్వజనీనంగా ఉంటున్నదని ఆధునిక విశ్లేషకుల భావన. మనం తినవలసిన ఆహారం దగ్గర నుండి, మన విహార వ్యవహారాలు, ఆలోచనలు ఎలా ఉండటం మనకు క్షేమకరమో నిర్దేశించింది శ్రీగీత.

భారతీయవేదాన్తం"కర్మణ్యత"ను ప్రోత్సహించదని, 'కర్మసిద్ధాన్తం' అనే పేరుతో వ్యక్తిలో నిర్వీర్యతను ప్రోదిచేస్తుందనే ఒక అపవాదాన్ని పాశ్చాత్యులు, ఇతర విధర్ములు చేస్తూ ఉంటారు. భగవద్గీతవారికి ధీటైన సమాధానం చెప్పింది. కర్మాచరణం ప్రతిబుద్ధిమంతుడైన మనిషికి అపరిహార్యమని చెప్పడమేకాక, కర్మమూలంగా ఎవ్వరూ ఇబ్బందుల పాలుకాకుండా, ప్రతి సత్కర్మ భగవదారాధనమేనని ఉద్ఘోషించి, "కర్మ" పట్ల పవిత్రభావన కలిగేలా చేసింది. కర్మ అనేది ఒక యోగంగా పరిణమించాలని శ్రీగీత ఉపదేశించింది.

ఈ మానవకోటి కర్మకు పరతంత్రం. చేసిన కర్మకు ఫలం అనుభవించక తప్పదనేదే కర్మ సిద్ధాన్తం తప్ప, కర్మ చేయవద్దనేది కర్మసిద్ధాన్తం కాదు. తన విధ్యుక్తకర్మను నిర్వహించడంలో తన హృదయదౌర్బల్యం కారణమై ఆ కర్మను ఆచరించనీయకపోతే, ఆ దౌర్బల్యాన్ని వీడి స్వధర్మనిష్ఠుడు కావాలి మానవుడని ఎలుగెత్తి చాటడమే గీతా తాత్పర్యం. ఇలా ఆచరించే కర్మ, ధర్మమౌతుంది. భగవంతునికి ప్రీతికరమై యోగమౌతుంది. ఎవరికి ఏది విధ్యుక్తకర్మమైతే, దాన్ని,

దానిలోని గుణదోషాలతో నిమిత్తం లేకుండా తప్పక ఆచరించి తీరాలనేదే గీతాప్రోక్తమైన కర్మ సిద్ధాన్తం.

**సహజం కర్మ కౌంతేయ! సదోషమపి న త్యజేత్ ।**

**సర్వకర్మసమారంభాః ధూమేనాగ్నిరివావృతాః ॥** అంటాడు స్వామి.

ఎవ్వరికి ఏ కర్మ వారివారి సామర్థ్యాన్ని నిరూపించే గుణాలనుబట్టి, తాను ఎన్నుకున్నదో, అది ఒకప్పుడు, సాధారణలోకదృష్టితో కొంత దోషయుక్తంగా కనిపించినా, దాన్ని విడిచిపెట్టకూడదు. నిజానికి ప్రతికర్మలోనూ ఎంతో కొంత పాపం, లేదా నీచత ఉంటుంది. ప్రాణాలను రక్షించి, సాక్షాత్తు నారాయణునిగా కీర్తింపబడే వైద్యవృత్తికూడా, స్పృశింపరాని అవయవాలను, మలపదార్థాలను స్పృశింపవలసిరావడం, కత్తులతో ప్రాణుల శరీర అవయవాలను, రక్తమాంసాలను పట్టించుకోకుండా, పరవేదనను గమనించకుండా కోయవలసిరావడం లాంటివి. ఇతరులకు ఏవగింపు కలిగించే దోషాంశాలున్నా, ప్రాణం నిలిపే మహాప్రయత్నమైన చికిత్స అనే కర్మలో భాగం అవడంవల్ల తప్పక ఆచరణీయమే అవుతోంది.

నిజంగా మలమూత్రాదులను శుద్ధిపరచే పనిని, విధ్యుక్తకర్మగా నిర్వహిస్తున్న వారెవరైనా శ్రీగీత దృష్టిలో కర్మయోగులే. ఇది గొప్పకర్మ, ఇది నీచమైంది అనే భావన మన సంకుచిత దృష్టిలోనే తప్ప భగవద్దృష్టిలో (గీతాదృష్టిలో)కాదు. నిప్పు పవిత్రమైందే అయినా దాన్ని చుట్టుకున్న పొగ అపవిత్రమైనట్లు, ప్రతి విశుద్ధకర్మకు చుట్టూవారి కొంత దోషం ఉండి తీరుతుంది. అయినా కర్మను విడిచిపెట్టరాదన్నదే గీతాసందేశం. యుద్ధమూ అలాంటిదే. కనుకనే స్వామి, అర్జునుని ప్రేరించాడు. కాళిదాసు ఈ గీతాసందేశాన్నే **"సహజం కిల యద్వినిందితం న హి తత్కర్మ వివర్జనీయకమ్"** అని ఉద్ఘోషించాడు. శాకుంతలనాటకంలో, చేపలుపట్టే వాని ముఖాన ఈ సందేశం సమాజానికి అందించాడు. (Dignity of labour) అంటే ఇదే. యాజ్ఞికునికి యజ్ఞనిర్వహణం ఎలాంటిదో, చేపలు పట్టేవానికి ఆ పనికూడా అంత పవిత్రమైనదేనని ఈ సన్నివేశం బోధిస్తున్నది.

ఈ కర్మ భగవంతుడు తనకు అనుగ్రహించిన గొప్ప అవకాశమని, దాన్ని తాను ఆచరించడమే భగవదారాధనమని భావించి ప్రవర్తించడమే గీతా చరమోపదేశం. దీన్ని ఇలా ఆచరించాలంటే తానేమో తెలుసుకోవాలి. తనకీ విధ్యుక్తధర్మాన్ని అనుగ్రహించి అవకాశం కల్పించిన అదృశ్యదైవతత్త్వం ఏదో తెలిసికోవాలి. తనకా తత్త్వంతో ఉన్న విడదీయరాని బంధం ఎలాంటిదో తెలుసుకోవాలి. వీటన్నిటి వివేకమే జ్ఞానయోగం అవుతుంది. ఇలా జ్ఞానపురస్సరంగా భగవదారాధనమైన కర్మనాచరించడానికి కావలసిన భగవత్ప్రీతి, భక్తియోగమౌతుంది. కర్మ-జ్ఞాన-భక్తులు మూడు కలసి యోగత్రివేణీసంగమమైన ఒక సమగ్రయోగంగా శ్రీగీత ప్రతిపాదించింది.

ఇది ఏదో ఒక జాతినో, ఒక వ్యక్తినో ఉద్దేశించి చెప్పిందికాదు. బుద్ధిమంతుడైన మానవమాత్రుని ఉద్దేశించి చేసిన ఉపదేశం. కనుకనే డిసెంబర్ 2న గీతాసందేశాన్ని ప్రపంచమంతా మననం చేసుకుంటుంది. 'తాను చేయవలసిన ఏ కర్మనైనా, పరిపూర్ణవివేకంతో భగవత్ప్రీతి కోసం' చేయాలని చెప్పడమే భగవద్గీతా పరమరహస్యం. ఇలా చేసినపుడే ఆ కర్మ సమాజశ్రేయోదాయకమౌతుంది. ఏ సంప్రదాయమైనా, ఏ సమాజమైనా ఈ భావన లేకపోతే ఒక్క అడుగుకూడా ముందుకుసాగదు. సామాజిక ప్రగతికి ఈ భావన తప్పక ఏర్పరుచుకోవలసిందే. ఇదే మన పూర్వాచార్యుల సామాన్యావగాహన. డిసెంబర్ 2న గీతామర్మాన్ని పెద్దలద్వారా ఎరిగి, గీతను మననం చేద్దాం.

మానవుడు సర్వస్వతంత్రుడు, సర్వనియామకుడు కాడు. తాను పీల్చేగాలి, త్రాగేనీరు తాను నివాసమున్న భూమి, తాను నిత్యంవాడుకొనే నిప్పు ఇవేవీ తన అదుపులోలేవు. అవి విజృంభిస్తే తాను బాధపడవలసిందే తప్ప ఎదిరించి నిలబడ కలవాడుకాదు. వాటిని అలా నియమించేవాడు ఎవ్వడో ఒక అదృశ్యదైవం ఉన్నాడని విశ్వసించి, ఆయన అనుగ్రహాన్ని పొంది, తన బ్రతుకు సార్థకపరచు కోవడంతప్ప తానెంత విర్రవీగినా ఏమీ చేయలేడు. యుద్ధాన్నంతా తానే నియమిస్తానని, తన కన్నులకదలికల్లోనే జయాపజయాలున్నా యని విర్రవీగిన అర్జునునికి తత్త్వాన్ని బోధించి, సర్వం దైవాధీనమేనన్న రహస్యాన్ని ఆవిష్కరించాడు శ్రీకృష్ణుడు. తన బలం దైవబలమేనని, తన ప్రతిచర్యా, దైవసంకల్పాధీనమేనని గీతాముఖంగా గ్రహించాడు. కృష్ణనిర్యాణానంతరం, కృష్ణపత్నులను రక్షించడంలో, వాస్తవమైన తన అశక్తత బయల్పడి పశ్చాత్తాపబడ్డాడు అర్జునుడు. అర్జునుడు సర్వమానవకోటికీ ఒక ప్రతీకం. అర్జునునికి చేసిన కర్తవ్యబోధయే ఇది. విద్యార్జనాపరులైన విద్యార్థులకు, విద్యావంతులైన యువకులకు, గృహస్థులకు, వ్యాపారులకు, పారిశ్రామికులకు, కృషీవలులకు, రాజకీయనాయకులకు, చివరకు, సర్వసంగ పరిత్యాగులైన యతీశ్వరులకు అందరికీ శ్రీగీత తన సందేశాన్ని అందిస్తూనే ఉంది. అందుకునే "బుద్ధి" మనకుంటే అది అవికలంగా అందుతునే ఉంటుంది. దాన్ని అందుకునే సంస్కారం ఆ కృష్ణభగవానుడే మనకనుగ్రహించును గాక. **"గీతాసుగీతా కర్తవ్యా"**.

**వేంకట రంగరామానుజాచార్య**



# అష్టపది

'శాస్త్రరత్నాకర' 'కవిశాబ్దికకేసరి' 'మహామహోపాధ్యాయ'
డా॥ న.చ. రఘునాథాచార్యస్వామి

శ్లో॥ **శేషోప్యశేషవంద్యః- వ్యగ్రోపి విధౌ విధేయతాహీనః ।**
**అగ్నిసమోపి న నేతా- చిరాయురయమస్తు యతివరః శ్రీమాన్॥**

ఇది శ్రీశ్రీశ్రీత్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయర్ స్వామివారి 57వ తిరునక్షత్ర సందర్భమున సాదరముగా నివేదించిన శ్లోకము. శ్రీవారికి పూర్ణాయుర్దాయమును ఆకాంక్షిస్తూ విన్నవించిన శ్లోకము.

అలంకారశాస్త్రంలో విరోధాభాసమనే ఒక అలంకారమున్నది. మొదట పైకి విరుద్ధార్థము స్ఫురించినా, సావధానంగా పరిశీలించి చూచినప్పుడు పరమార్థం ఆవిష్కృతమౌతుంది. ఇదే ఆ అలంకార స్వరూపం. శ్లోకంలో మూడు అపి శబ్దములున్నవి. అవి విరోధాన్ని స్ఫురింపచేస్తవి. ఆ విరోధానికి పరిహారమున్నూ శ్లోకంలో గర్భితమైయున్నది. మరియు, శ్లోకంలో శ్రీ స్వామివారిని బోధించే ఎనిమిది విశేషణ పదాలున్నవి. అవి అన్నీ వారి అసాధారణ వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించేవి. ఇక ఇపుడు ప్రతిపద వివరణకు దిగుదాం.

**1. శేషః** భగవన్తుడు సర్వశేషి గనుక, వీరు ఆ స్వామికి నిరన్తర శేషభూతులు. అనగా **నివాస శయ్యాసన పాదుకాంశుక ఉపధాన వర్షాతపవారణాదిభిః** అని శ్రీయామునా చార్యుల వారు ఆదిశేషుణ్ణి కీర్తిస్తూ ఆయనను భగవంతునికి సర్వ కైంకర్యములు చేయుటవల్ల శేషశబ్దవాచ్యుడు అన్నారు గదా! అలాగే ఈ స్వామివారు బహుముఖంగా భగవత్ కైంకర్యాలను నిర్వహిస్తున్నందువలన వీరున్నూ ఆ ఆదిశేషునివలె శేషశబ్దవాచ్యులు అని భావము. **"శేషత్వ మిల్లాదపోదు స్వరూపమిల్లై"** అని శ్రీ పిళ్లైలోకాచార్యులవారు ప్రసాదించినట్లు శ్రీవైష్ణవత్వ నిరూపకమైన శేషత్వం వీరిలో ప్రధాన లక్షణమని సారాంశం.

**2. అశేషవంద్యః**

సమస్త లోకమునకు వీరు వందనీయులు అని దీని అర్థం. ఇచట అశేషపదం శేషభూతులైన ఈ స్వామివారికంటే భిన్నులైన సర్వవ్యక్తులను బోధిస్తుంది. ఆ సర్వవ్యక్తులలో ఈశ్వరుడున్నూ పూర్వాచార్యులున్నూ చేరియున్నారు అని మనం గుర్తించాలి. మనకు వీరు వందనీయులు- నమస్కరింపదగిన వారు-సరే. ఈశ్వరునికి, పూర్వాచార్యుల కున్నూ వీరు వందనీయులా! అదెట్లా? ఇట్లా అనటం విరుద్ధం గదా! అని ఆశంకించకండి. విరోధమేమీ లేదు. ఇపుడు వందనీయులు అనగా ప్రశంసింపదగినవారు అని పరమార్థం. భగవంతుడు, పూర్వాచార్యులున్నూ వీరు నిర్వహించే భగవద్భాగవత కైంకర్యాలను చూచి పట్టరాని ఆనందంతో ప్రస్తుతిస్తున్నారు, మెచ్చుకుంటున్నారు- అని వంద్య శబ్దానికి ఇపుడు వాస్తవార్థం. **"వది అభివాదన స్తుత్యోః"** అని సంస్కృత వ్యాకరణం. 'వది' ధాతువునకు నమస్కారము-స్తుతి అని రెండర్థాలనున్నూ చెప్పినది గదా! మనకు వీరు నమస్కరణీయులు-భగవదాది పూర్వాచార్యు లకు స్తవనీయులు గూడా అని సారాంశం. ఇది ప్రథమ పాదార్థం. ఇక రెండవ పాదార్థాన్ని వివరించుకుందాం-

**3. విధౌవ్యగ్రః**

తాము ఆచరించవలసిన వివిధ కృత్యములలో వీరు అతి జాగరూకులు-ఏమరుపాటును కొంచెమైనా చూపనివారు అని అర్థము. లోకంలో ఏవేవో ఘనకార్యాలను సాధించాలని ఆరంభించే కొందరు చివరకు తమ అశక్తతనుబట్టి చతికిలబడటం చూస్తున్నాము. వీరు అట్లుగాక, సంప్రదాయ ప్రచార కార్యక్రమాన్ని మహోద్యమ రూపంగా స్వీకరించి కార్యసాధనను చేయగల సమర్థులు అని భావం.

**4. విధేయతాహీనః**

విధేయత అనగా వెనుకచెప్పిన కర్తవ్యనిష్ఠ. ఆ నిష్ఠ లేనివారు వీరు అని పైకి విరోధం స్ఫురించవచ్చునుగాని, ఇచట విధేయతా-అహీనః అని పదవిభాగం చెప్పుకోవాలి. హీనుడు-రహితుడు, అహీనుడు-సహితుడు అని అర్థం చెప్పుకొని విధేయతాధర్మసహితుడు అని, లేక అహీనుడు (అహి-ఇన) ఆదిశేషుని వంటివాడు అనిగాని అర్థం చెప్పుకుంటే విరోధం లేదు. ఆదిశేషునివలెనే భగవంతునికి సర్వవిధాల సేవచేసే పరతంత్రులు అని దీని తాత్పర్యం.

**5. అగ్నిసమః**

అగ్ని ఎంత పవిత్రమైనదో అంతటి పవిత్రతను కలిగియున్నవారు అని అర్థం. "తీర్థోదకం చ వహ్నిశ్చ నాన్యతః శుద్ధిమర్హతః" అన్నట్లు గంగాజలంగాని, అగ్నిగాని, తాము పవిత్రములగుటయే గాక, తమ స్పర్శచేత ఇతరములకు గూడ పరిశుద్ధతను ఆపాదించగలవి గదా! ఆ రెంటిలోని పవిత్రతను తాము కలిగియుండిగూడా - **"న-నేతా"** వీరు నేటి నాయకులలో కనబడే ఔద్ధత్యాది దుర్లక్షణాలు కలవారు కారు- అని తెలుపటం ఈ పదప్రయోగంలోని తాత్పర్యం.

**6.** ఇచట **"న-నేతా"** అనేది నఞ్‌సమాసం (ఏకపదం) కాక, వ్యస్తపదద్వయమే అనవచ్చును. ఏకపదమనుకున్నపుడు **"న శబ్దేన న సమాసః"** అని సమాధానించుకోవాలి. వ్యాకరణ చర్చ ఇపుడు అనవసరం. నాయకులు ఆజ్ఞారూపంలో ఆదేశిస్తారు. సదాచార్యులు ఆదేశించరు.

మృదు మధురోక్తులతో తత్త్వాన్ని మనకు ఉపదేశిస్తారు. వీరు అట్టి సదాచార్య లక్షణములు కలిగియున్నవారు అని దీని సారాంశం.

**7-8 ఇక "చిరాయుః-శ్రీమాన్"**

అనేవి రెండున్నూ విశేషణాలే. **"యతివరః"** అనేదే విశేష్యపదం. **"శ్రీమాన్"** అనగా ధన-కనక-వస్తు-వాహనాదులు పుష్కలంగా కలవారు అని అర్థంకాదు. వివేక-విమోక-అభ్యాసాది సాధనసంపత్తి, శమదమాది సద్గుణ సంపత్తి- ఈ రెండున్నూ వీరు కలిగియున్నవారు అని యర్థం. శ్రీవైష్ణవత్వాన్ని ముఖ్యంగా ఆవిష్కరించే ఉత్తమ లక్షణాలు ఇవే అనికదా మన పూర్వాచార్యులు నిర్ణయించియున్నారు. ధన-కనక-వస్తు- వాహనాది రాజ్యసుఖసంపదలను విడచి శ్రీరామసేవానువృత్తినే అభిలషించిన లక్ష్మణునిలో ఈ సంపదను గుర్తించియే సుమా వాల్మీకి **''లక్ష్మణో లక్ష్మిసంపన్నః''** అని ఉగ్గడించినాడు. అట్లే **"త్యక్త్వా దారాంశ్చ పుత్రాంశ్చ-రాఘవం"** అని చెప్పుకున్న విభీషణుని గూడా ఆ వాల్మీకి **"అన్తరిక్షగతః శ్రీమాన్"** అని కీర్తించినాడు గదా! ఆ భావంతోనే ప్రకృత శ్లోకంలోనూ "శ్రీమాన్" అని ప్రయోగింపబడింది.

ఇక **''చిరాయుః అస్తు''** అనేది విధేయాంశము. భగవద్రామానుజుల వలె వీరు చిరంజీవియై విశిష్టముగా సిద్ధాన్త ప్రచారకులై విలసిల్లుదురుగాక అని శుభాశంసనము. మనందరికోరిక. చిన్నలు కూడా పెద్దలకు శుభాశీస్సులను అందించుట సముచితమేనని సంప్రదాయవేత్తల అభిమతం. కనకనే భగవదారాధన ప్రక్రియలో చివరకు మంగళాశాసనం చెప్పబడింది. **శ్రీశ్రీశ్రీత్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారికి తిరునక్షత్ర సందర్భమున ఇవే మా జేజేలు.**

(ఈ శ్లోకం ఎనిమిది పదాలతో అంటే ఎనిమిది అర్థాలుకగు శబ్దభాగాలతో విరాజిల్లుతూ **"కవిశాబ్దికకేసరు"**లచే **అష్టపది**గా కూర్చబడిందని గ్రహింపగలరు- సంపాదకుడు.)




శ్రీగోదాయై నమః

శ్రీరంగనాయక్యై నమః

భగవద్బంధువులకు ధనుర్మాస ఆహ్వానము



16.12.2014 నుండి
14.1.2015 వరకు

వేదిక
ప్రభుత్వ కాకతీయ డిగ్రీకళాశాల,
హనుమకొండ, వరంగల్

కర్కటే పూర్వఫల్గున్యాం తులసీకాననోద్భవాం ।
పాండ్యే విశ్వంభరాం గోదాం వందే శ్రీరంగనాయకీమ్ ॥

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి
ప్రత్యక్షపర్యవేక్షణలో....

ధనుర్మాస వ్రత మహోత్సవములు

నిత్య కార్యక్రమాలు

ఉ॥ 6.30 ని॥లకు సేవాకాలం, 7 -8గం॥ వరకు అనుగ్రహభాషణం, 8 గం॥ తీర్థగోష్ఠి,
సా॥ 5.30ని॥ సామూహిక శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రపారాయణ,
6-8 గం॥ వరకు తిరుప్పావై ప్రవచనము

వివరాలకు

వికాసతరంగిణి, నక్కలగుట్ట బస్‌స్టాప్ ప్రక్కన, హనుమకొండ, వరంగల్.
ఫోన్ : 9849277389, 9849449476, 9848154449, 9948749999



# పిబత భాగవతం రసం...

శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి డా॥ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యస్వామి
కార్యదర్శి 'జీవా' శ్రీరాంనగర్ (శంషాబాద్)

గతసంచిక తరువాయి

ఇలా పరిపరి విధాల శ్రీకృష్ణునితో తనకుగల అనుబంధాన్ని భావించి, అతిగాఢ సౌహార్దంచేత శ్రీకృష్ణపాద సరోరుహాన్ని చింతిస్తున్న అర్జునుని మనస్సు క్రమంగా ప్రశాంతమైంది. వాసుదేవానుధ్యానమే సర్వమనః క్లేశాలను పోద్రోలుతుందంటాడు సూతుడు.

**వాసుదేవాంఘ్ర్యనుధ్యాన పరిబృంహితరంహసా ।**
**భక్త్యా నిర్మథితాశేష కషాయ ధిషణోఽ ర్జునః ॥**

వాసుదేవుని పాదసమనుధ్యానంచేత వేగాన్ని పుంజుకుంటుందట భక్తి. ఇలాంటి భక్తి అశేషమనః కషాయాలను మథించి మనస్సును ప్రశాన్త పరుస్తుందన్నమాట. వెనుక, శ్రీకృష్ణస్వామి, కురుక్షేత్ర మహాసంగ్రామ సమయంలో శ్రీగీతను అర్జునికి ప్రతిబోధించాడు. ఆనాడు, స్వామి, తనకు బోధించిన తత్త్వరహస్యాన్ని తానుకాలక్రమంగా విస్మరించినా, మళ్ళీ జ్ఞప్తికి తెచ్చుకుంటున్నానంటాడు అర్జునుడు.

**గీతం భగవతా జ్ఞానం యత్తత్సంగ్రామ మూర్ధని ।**
**కాల కర్మతమోరుద్ధం పునరధ్యగమద్విభుః ॥**

శ్రీమద్భాగవతంలో, స్వామి, తాను ప్రతిబోధించిన గీతను గురించి ప్రశ్నించాడు కొంతకాలం తరువాత. దానికి అర్జునుడు తన అశక్తతను ప్రకటించాడు. స్వామి చాలా క్లేశపడ్డాడు. ఇలాంటి అలసునికా నేను గీతను ప్రతిబోధించింది? అని అర్జునుని నిందించాడు. తరువాత మళ్ళీ అనుగీతలను ప్రతిబోధించాడు. ఈ సన్నివేశం మహాభారతంలో ఉంది.

అనుగీతా పర్వంలోని పదహారవ అధ్యాయంలో అర్జునుడు ఇలా అన్నాడు.

**విదితం మే మహాబాహో! సంగ్రమే సముపస్థితే ।**
**మాహాత్మ్యం దేవకీసూతః! తచ్చ తే రూపమైశ్వరమ్ ॥**
**యద్వద్ భాగవతా ప్రోక్తం పురా కేశవ సౌహృదాత్ ।**
**తత్సర్వం పురుషవ్యాఘ్ర! నష్టం మే భ్రష్టచేతసః ॥**

"ఓ మహాబాహూ! సంగ్రామం ప్రసక్తమైనప్పుడు, ఓ దేవకీపుత్రా! నీ మాహాత్మ్యము, నీ ఐశ్వర రూపము రెండూ నాకు తెలిశాయి. ఓ కేశవా! నాపట్లగల స్నేహంచేత, భగవంతుడువైన నీచే ఏదేది ప్రతిబోధింపబడిందో, అదంతా, మనోనాశాన్ని పొందిన నేను పోగొట్టుకున్నాను. నీవు త్వరలో ద్వారకకు వెళ్తున్నావు కనుక, నాకు మళ్లీ ఆతత్త్వాన్ని ప్రతిబోధించు స్వామీ! నాకు చాలా కుతూహలంగా ఉంది" అని అడిగాడు అర్జునుడు. అప్పుడు వాసుదేవుడిలా అన్నాడు.

"ఓ పార్థా! ఆనాడు నీకు నేను పరమగుహ్యమైన (రహస్యమైన) తత్త్వాన్ని వినిపించాను. సనాతన ధర్మాన్ని కూడా తెలియపరచాను. ఇవన్నీ నీకు ప్రత్యక్షంగా తెలియపరచాను. అయినా, బుద్ధిహీనుడవై గ్రహించలేక పోయావు. ఇది నాకు చాలా అప్రీతికరమైన విషయం. నిజంగా శ్రద్ధా విహీనుడవైయ్యావు. ఓ అర్జునా! నీవు దుర్మేధుడవు సుమా! మళ్లీ పూర్తిగా నీకు చెప్పడం సాధ్యం కాదు. ఆ ధర్మం పరబ్రహ్మపదాన్ని తెలిసికోవడానికి చాలినది కనుక! ఆనాడు చెప్పినట్లుగా ఆ ధర్మాన్ని సంపూర్ణంగా చెప్పడం ఇప్పుడు నాకే శక్యం కాదు సుమా!

**"శ్రావితః త్వం మయా గుహ్యం జ్ఞాపితశ్చ సనాతనమ్।**
**ధర్మం స్వరూపిణం పార్థ! సర్వలోకాంశ్చ శాశ్వతాన్ ॥**
**అబుద్ధ్యా నాగ్రహీర్యస్త్వం తన్మే సుమహదప్రియమ్ ।**
**న చ సాధ్యం పునర్భూయః స్మృతిర్మే సంభవిష్యతి ॥**
**నూనమశ్రద్దధానోఽ సి దుర్మేధాహ్యసి పాండవ! ।**
**న చ శక్యం పునర్వక్తు మశేషేణ ధనంజయ! ॥**
**స హి ధర్మః సుపర్యాప్తః బ్రహ్మణః పదవేదనే ।**
**న శక్యం తన్మయా భూయస్తథా వక్తు మశేషతః ॥** ఇత్యాదిగా వ్యాసుడు మహాభారతానుశాసన పర్వంలోని అనుగీతా పర్వంలో

నాణ్యమైన ప్లాట్లు మరియు ఫ్లాట్లు కొనుగోలుకు నమ్మకమైన అగ్రగామి సంస్థ
అభినందన హౌసింగ్ (ప్రై). లిమిటెడ్
సెంట్రల్ ఆఫీస్ : 4వ లైను, పండరీపురం, లక్ష్మీపురం మెయిన్ రోడ్, గుంటూరు. ఫోన్ : 2354002.
మా బ్రాంచీలు : విజయవాడ 1, విజయవాడ 2, విజయవాడ 3, గుంటూరు 1, గుంటూరు 2, హైదరాబాద్, విశాఖపట్నం.
0866-6628668 : 0866-6642428 : 0866-6633668 :. 0863-6641177 : 0863-6454588 :. 040-66637799 :. 0891-2538686.

చెప్పిన సన్నివేశాన్ని, భాగవతంలో అర్జునుడు జ్ఞప్తికి తెచ్చుకొన్నాడని వ్యాసుడే చెబుతున్నాడు.

కురుక్షేత్రంలో స్వామి ప్రతిబోధించిన తత్త్వరహస్యాన్ని మననం చేయడంవల్ల, హృదయంలో పేరుకున్న అజ్ఞానం తొలగి, 'జ్ఞానం' ప్రతిభాసించింది. జ్ఞాన దీపంచేత అజ్ఞానపు చీకట్లు పటాపంచలై శోకం నశించి 'విశోకు'డైనాడు అర్జునుడు. బ్రహ్మానుభవం కలగడం వల్ల, ఈ ప్రపంచం బ్రహ్మాత్మకం కాదనే మిథ్యాజ్ఞానం తొలగిపోయి, ఇదంతా బ్రహ్మాత్మకమేనన్న తత్త్వభావన విల్లివిరిసింది. దానివల్ల ప్రకృతిబంధం తొలగింది. ప్రాకృతిక గుణాలు తన్మూలదేహం తొలగి పోయింది. ఇక జన్మరాహిత్యదశేకదా ఏర్పడేది! ఇలాంటి దశనే అర్జునుడు అనుభవించాడు. (ఇదంతా భావనాప్రకర్షవల్ల కలిగినదేనని చెప్పాలి. ఎందువల్లనంటే దేహం ఇంకా తొలగిపోలేదుకదా!) అర్జునుని ద్వారా "కృష్ణ గతి"ని తెలిసికొన్నాడు ధర్మరాజు. అంతేకాదు యాదవ నిధనాన్ని కూడా విన్నాడు. ఇక స్వర్గమార్గ ప్రయాణమే లక్ష్యమని నిర్ణయించు కున్నాడు నిబ్బరంగా.

అర్జునుడు చెప్పిన కృష్ణ–యాదవకులవృత్తాన్తాన్ని కుంతికూడా విన్నది. పరిపూర్ణంగా శ్రీకృష్ణునియందే భక్తితో తన మనస్సును నిగిడ్చి, సంసారబంధం త్రెంచుకున్నది. కాలిలో గ్రుచ్చుకున్న ఒక కంటకాన్ని తొలగించడానికి మరొకకంటకాన్ని వినియోగించి, గ్రుచ్చుకున్న కంటకం తొలగిపోగానే, తొలగించడానికి వినియోగించిన కంటకాన్ని కూడా ప్రక్కన పడవేసినట్లు, కంటక ప్రాయులైన కౌరవ–యాదవకులాన్ని ఉన్మూలనం చేయడానికి తీసికొన్న ప్రాకృతికదేహ సమానదేహాన్ని, ఆకులాలను నిర్మూలించిన తరువాత విడిచిపెట్టడం విశేషం ఎంతమాత్రంకాదు. దేహపరిగ్రహణం–దేహత్యాగంరెండూ పరమాత్మకు లీలలే కదా!

ధర్మరాజు సోదరులతోపాటు స్వర్గారోహణానికి వెడలిపోయాడు.

భగవల్లీలా వైభవాన్ని, పాండవాదుల అవతార పరిసమాప్తిని శ్రద్ధగా విన్నవారు ముక్తిని పొందుతారని ఫలశ్రుతిని నిర్దేశించాడు పురాణకర్త.

**యఃశ్రద్ధయై తద్భగవత్ప్రయాణం**<br>
**పాండోస్సుతానామపి సంప్రయాణం,**<br>
**శ్రుణోత్యలం స్వస్త్యయనం పవిత్రం**<br>
**లబ్ధ్వా హరౌ భక్తి ముపైతి సిద్ధిమ్ ॥**

## 16వ అధ్యాయం–పరీక్షద్వృత్తం

పాండవానన్తరం పరీక్షిత్తు రాజ్యపాలనాధికారాన్ని పొందాడు. పరమభాగవతోత్తముడైన ఆతడు విజ్ఞులైన విప్రుల శిక్షణంలో రాజ్యపాలనం ప్రారంభించాడు.

ఈ పదహారవఅధ్యాయం భూమికి–ధర్మానికి జరిగిన సంవాదాన్ని ఆవిష్కరిస్తోంది.

పరీక్షిత్తు ఉత్తరుడనేవానికూతురు 'ఇరావతి'ని పరిణయం చేసికొన్నాడు. జనమేజయుడు మొదలైన నలుగురు పుత్రులను ఇరావతి ద్వారా పొందాడు.

ఒకప్పుడు కలి క్షుశూద్రరూపంతో ఆవును కొడుతూ ఉంటే ఆ కలిని గుర్తించి నిగ్రహించాడు, అని సూతుడు చెప్పగానే శౌనకుడు ఆసక్తితో ప్రశ్నించాడు. సూతుడు, కథను ఆరంభించాడు.

పరీక్షిత్తు, కురుజాంగలంలో ఉంటున్నప్పుడు, తన ఏలుబడిలో ఉన్న భూమిలో 'కలి' ప్రవేశించాడని విని, కలినిగ్రహణానికి ధనుర్బాణాలు పట్టి పయనమయ్యాడు పరీక్షిత్తు.

పచ్చని గుర్రాలుపూన్చి బాగా అలంకరింపబడిన రథానికి సింహధ్వజం కట్టి, దాన్ని అధిరోహించి, చతురంగబలాలు వెంటరాగా తన సైన్యంతో దిగ్విజయానికి బయలుదేరాడు. భద్రాశ్వం, కేతుమాలం, భారతం, ఉత్తరకురువులు, కింపురుషాది వర్షాలు జయించి, ఆప్రాంతాల నుంచి ఉపహారాలను పొందాడు. ఇలా దిగ్విజయానికి వెళ్తున్న సమయంలో తన పూర్వికులైన మహాత్ములవైభవాన్ని, శ్రీకృష్ణమాహాత్మ్యాన్ని విన్నాడు. తనను, అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రంనుండి రక్షించిన కృష్ణునితో పాండవులకు గల స్నేహాన్ని, వృష్ణి–పార్థులకు కేశవుని పట్ల గల భక్తిని అన్ని చోట్ల విస్తారంగా విన్నాడు. *(సశేషం)*

**శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయర్‌స్వామివారు నిజామాబాద్‌జిల్లాలో శ్రీరామానుజసహస్రాబ్దిని ప్రచారంచేస్తూ, ధనుర్మాస ప్రవచనాలను అందిస్తూ, పర్యటిస్తారు.**

వ్యక్తిత్వ వికాసానికి ... నాణ్యమైన సాంకేతిక విద్యా బోధనకు
కళ్ళం హరనాథరెడ్డి ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ
KHIT Campus - 10 KM from Guntur City, NH-5
శ్రీ కళ్ళం హరనాథరెడ్డి
చైర్మన్ : కళ్ళంగ్రూప్
బిటెక్ కోర్సులు
కంప్యూటర్ సైన్స్ అండ్ ఇంజనీరింగ్(సియస్ఇ)
ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ (ఇఇఇ)
ఎలక్ట్రానిక్స్ అండ్ కమ్యునికేషన్స్ ఇంజనీరింగ్ (ఇసిఇ)
సివిల్ ఇంజనీరింగ్ (సిఇ)
మెకానికల్ ఇంజనీరింగ్ (ఎమ్ఇ)
EAMCET Code KHIT
మేనేజిమెంట్ సీట్స్ కొరకు సంప్రదించండి : సెల్: 98856 04528, 94402 61773, 94910 73337.
NH- 5.10వ కి.మీ వద్ద, కళ్ళం స్పిన్నింగ్ మిల్స్ వెనుక, చిలకలూరిపేట రోడ్, చౌడవరం, గుంటూరు- 19. ఫోన్: 0863 2119726.
సిటీ ఆఫీస్: ఫస్ట్‌లైన్, గుజ్జనగుండ్ల సర్కిల్, గుంటూరు -6. ఫోన్: 0863 2272345.
M.Tech :- CSE

తిరువరంగత్తముదనార్లు అనుగ్రహించిన ప్రపన్నగాయత్రి

# ఇరామానుశనూత్తన్దాది

గత సంచిక తరువాయి

శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

## 53వ పాశురం

అఱ్పుతన్ శెమ్మై యిరామానుశన్, ఎన్నై యాళవన్ద
కఱ్పగమ్ కత్తురువర్ కాముఱుశీలన్, కరుతరియ
పఱ్పల్లుయిర్గళుమ్ పల్లులగియావుమ్ పరనదెన్నుమ్
నఱ్పొరుళ్ తన్నై, ఇన్నానిలత్తే వన్దు నాట్టిననే॥

**ప్రతిపదార్థము :**

| | |
|---|---|
| ఎన్నై | = నన్ను |
| ఆళవన్ద | = రక్షించడం కోసం అవతరించిన |
| కఱ్పకమ్ | = కల్పకమువలె ఔదార్యము కలిగినవారు, |
| కత్తివర్ | = జ్ఞానులు |
| కాముఱు | = కోరుకొనే రీతిలో ఉన్న |
| శీలన్ | = గుణవిశేషం కలిగినవారు, |
| అఱ్పుతన్ | = అద్భుతమైన పనులు చేయగలవారు |
| శెమ్మై | = ఋజుస్వభావులు అయిన |
| ఇరామానుశన్ | = భగవద్రామానుజులు |
| కరుత అరియ | = ఊహించడానికే సాధ్యముకానంతగా |
| పల్పల్ ఉయిర్గళుమ్ | = అనేకములైన ఆత్మలు |
| పల్ ఉలగియావుమ్ | = అనంతములైన ఈలోకాలన్నీ |
| పరనదు | = భగవంతుని సొత్తు |
| ఎన్నుమ్ | = అనే |
| నల్పొరుళ్ తన్నై | = సారంవంతమైన అర్థాన్ని |
| ఇన్నానిలత్తే | = ఈ లోకంలో |
| వన్దు | = వచ్చి అవతరించి |
| నాట్టిననే | = స్థాపించారు. |

**తాత్పర్యము :** భగవద్రామానుజులు కల్పవృక్షమువలె ఔదార్యం కలిగిన మహనీయులు. జ్ఞానులు కీర్తించే కల్యాణగుణ సంపన్నులు. ఎన్నో అద్భుతాలను చేసి చూపించిన సమర్థులు. నాలాంటి వారిని రక్షించడం కోసమే వారు ఈ లోకంలో అవతరించారు. సకల ప్రాణులు, ఆప్రాణులు నివసించే అన్ని లోకాలు శ్రీమన్నారాయణునికే శేషభూతులు. ఆతని సొత్తు అని లోకానికి చాటి చెప్పిన మహనీయులు.

రుచికి, సువాసనకి, ఆరోగ్యానికి నాణ్యమైన
"అజంతా"
పసుపు, కారం, ధనియాలపొడి మరియు సేమియానే ఎల్లప్పుడు వాడండి
రవికుమార్ అండ్ కంపెని - చెన్నై
044 25204046, 26171341
Vijay Ads

## 54వ పాశురం

నాట్టియ నీశచ్చమయఙ్గళ్ మాణ్డన, నారణనై
క్కాట్టియ వేతమ్ కళిప్పుఱ్ఱతు, తెన్ కురుకైవళ్ళల్
వాట్టమిలా వణ్ తమిఴ్మఱై వాఴ్న్దతు మణ్ణులకిల్
ఈట్టియ శీలత్తు, ఇరామానుశన్ తన్నియల్వుకణ్డే ॥

**ప్రతిపదార్థము :**

| | |
|---|---|
| మణ్ ఉలగిల్ | = ఈ భూలోకంలో |
| ఈట్టియ | = దినదినాభివృద్ధిచెందిన |
| శీలత్తు | = స్వభావముకల్గిన |
| ఇరామానుశన్ తన్ | = భగవద్రామానుజుల |
| ఇయల్వు | = స్వభావాన్ని |
| కణ్డు | = చూచి |
| కాట్టియ | = చెడుభావనతో స్థాపింపబడిన |
| నీశ శమయఙ్గళ్ | = క్షుద్రమతాలన్నీ |
| మాణ్డన | = నశించాయి |
| నారణనై | = శ్రీమన్నారాయణుని |
| కాట్టియ | = ప్రతిపాదించిన |
| వేదమ్ | = వేదవాఙ్మయము |
| కళిప్పు ఉత్తతు | = నిర్భయత్వంతో గర్వించింది |
| తెన్కురుగై | = అందమైన తిరుక్కురుగురులో అవతరించిన |
| వళ్ళల్ | = ఉదారులైననమ్మాళ్వార్లు అనుగ్రహించిన |
| వాట్టమ్ ఇలా | = ఏ కొరతా లేని |
| వణ్తమిఴ్మఱై | = గొప్పతిరువాయిమొఴ్రి అనే వేదము |
| వాఴ్న్దతు | = ఉజ్జీవించినది. |

**తాత్పర్యము :** భగవద్రామానుజుల సామర్థ్యాన్ని, స్వభావాన్ని చూచి క్షుద్రమతాలన్నీ రూపుమాసిపోయాయి. అవి నశించగానే, శ్రీమన్నారాయణుడే పరదైవమని చాటిన వేదాలు విలసిల్లాయి. వేదసారమైన ఆళ్వార్ల నాలాయిర సూక్తులన్నీ విరాజిల్లాయి. యతిరాజుల కల్యాణగుణాలు దినదినాభివృద్ధిని చెందుతూనే ఉన్నాయి.

## 55వ పాశురము

కణ్డవర్ శిన్దై కవరుమ్ కడిపొఴ్రిల్ తెన్నరఙ్గన్
తొణ్డర్ కులావుమ్ ఇరామానుశనై, తొగై యిఱన్ద

పణ్డరు వేదఙ్గళ్ పార్మేల్ నిలవిడ ప్పార్ త్తరుళుమ్
కొణ్డలై మేవి త్తొ్ఱుమ్, కుడియామెఙ్గళ్ కోక్కుడియే”

**ప్రతిపదార్థము**

| | |
|---|---|
| తొకై ఇఅన్ద | = లెక్కలేనన్నీ |
| వణ్తరు | = స్వరప్రధానాలైన |
| వేదఙ్గళ్ | = వేదాలు |
| పార్మేల్ | = ఈ భూమిలో |
| నిలవిడ | = పెరిగి వర్ధిల్లేటట్లు |
| పార్త్తరుళుమ్ | = చేసినవారు, |
| కొణ్డలై | = పరమ ఉదారులు |
| కణ్డవర్ శిన్దై | = దర్శించినవారి మనస్సును |
| కవరుమ్ | = అపహరించే |
| కడిపొఴిల్ | = సవాసనకల తోటలతో చుట్టబడిన |
| తెన్ అరంగన్ | = అందమైన రంగనగర నాథుడైన శ్రీరంగనికి |
| తొణ్డర్ | = దాసులైన శ్రీవైష్ణవులచే |
| కులావుమ్ | = పొగడబడే వారైన |
| ఇరామానుశనై | = భగవద్రామానుజులను |
| మేవి | = ఆదరించి |
| తొ్ఱుమ్ కుడి | = నమస్కరించే కులం |
| ఎఙ్గళ్ కోక్కుడియే | = మా స్వామిగా కూడిన కులం. |

**తాత్పర్యము :** శ్రీరంగదివ్యక్షేత్రం అందమైన తోటలతో చుట్టబడి ఉంది. చూపరుల హృదయాన్ని, నేత్రాలను కూడా ఆతోటలు ఆకర్షించి దోచుకుంటాయి. అక్కడ స్వామి శ్రీరంగనాథుడు. ఆయన భక్తులచే సతతం కీర్తింపబడుతూ ఇతరమతాలవారు మన వేదాలకు ఏ అపకారం చేయకుండా వాటిని రక్షించి, ప్రకాశింపచేసి, వర్ధిల్లచేసినవారు మన రామానుజులు. అంతే కాదు అందరి సంశయాలు తీర్చి చక్కని ఉపదేశాలనందించిన ఆచార్యులు. అటువంటి స్వామిని ఆశ్రయించి ఉజ్జీవించే మహనీయులే నాకు రక్షకులై నన్నుద్ధరించగలవారు అంటున్నారు అముదనార్లు. రామానుజులను ఆశ్రయించిన వారే మాకు స్వామి. రామానుజ సంబంధమే మాగొప్పకులము.




శ్రీమతి డా॥టి.కె. చూడామణి-సికింద్రాబాద్

**భగవద్రామానుజులను స్తుతించే కొన్ని ముక్తక శ్లోకాలలో వారి వైభవం చక్కగా ప్రకటింపబడింది. అటువంటి శ్లోకాలను కూడా నేర్చుకుందాం.**

**నమః ప్రణవ శోభితం నవకషాయ ఖండాబరం**
**త్రిదండ పరిమండితం త్రివిధ తత్త్వ నిర్వాహకమ్।**
**దయాంచిత దృగంచలం దళితవాది వాగ్వైభవమ్**
**క్షమాది గుణసాగరం శరణమేమి రామానుజమ్॥**

**ప్రతిపదార్థము**

| | |
|---|---|
| **నమః ప్రణవ శోభితమ్** | = నమః అనే శబ్దార్థంచేత, ఓంకారం చేత శేషత్వం, పారతంత్ర్యం తెలుస్తున్నాయి. ఆ గుణాలతో విలసిల్లేవారు, |
| **నవకషాయ ఖండాంబరమ్** | = మంచి కాషాయ రంగుతో కూడిన నూతన వస్త్రాన్ని ధరించిన వారు, |
| **త్రిదండ పరిమండితమ్** | = త్రిదండంతో అలకరింపబడినవారు |
| **త్రివిధతత్త్వనిర్వాహకమ్** | = చిత్తు, అచిత్తు, ఈశ్వరుడనే మూడు తత్త్వాలను నిరూపించినవారు. (తత్త్వత్రయాన్ని వివరంగా అందించిన వారు) |
| **దయాంచిత దృగంచలమ్** | = దయతో నిండిన అందమైన కటాక్షములు కలవారు |
| **దళితవాది వాగ్వైభవమ్** | = పరమత వాదుల వాదనలను ఖండించినవారు |
| **క్షమాది గుణసాగరమ్** | = అంతరేంద్రియ, బహిరింద్రియ జయము మొదలగు గుణాలకు సముద్రం వంటివారు అయిన |
| **రామానుజమ్** | = భగవద్రామానుజులను |
| **శరణం ఏమి** | = శరణు పొందుతున్నాను (ఆశ్రయిస్తున్నాను) |

**తాత్పర్యం:** స్వామి శేషి, మనంశేషులం. ఇది శేషత్వజ్ఞానం. దీనిని నమః అనే శబ్దం చాటుతోంది. ఆయన స్వతంత్రుడు. మనం ఆయనకే పరతంత్రులం. ఈ అర్థాన్ని ఓంకారం చాటుతోంది. అతి పవిత్రమైన ఈ అర్థాన్ని ఆచరణలో చూపించారు రామానుజులు. త్యాగానికి చిహ్నమైన కాషాయాన్ని ధరించారు. మూడు తత్త్వాలకు ప్రతీకగా త్రిదండం ధరించారు. వారి చూపులు అమృతాన్ని, దయను వర్షిస్తున్నాయి. వారి సిద్ధాంతం పరవాదనలను ఖండిస్తోంది. శమదమాది సద్గుణ సంపన్నులయిన భగవద్రామానుజులను నేను ఆశ్రయిస్తున్నాను.

# ఉపనిషత్ కథలు

## నచికేతోపాఖ్యానం - 1

శ్రీమాన్ వోలేటి రామకృష్ణమాచార్యస్వామి - హైదరాబాద్

### మొదటి వరము

దానికి నచికేతుడు కొద్దిసేపు ఆలోచించి యముడితో ఇలా అన్నాడు. "ఓ యమధర్మరాజా! నీవు నాకు వరములను ఇవ్వదలచు కున్నట్లయితే అలాగే కానీ. అయితే నా మొదటి వరాన్ని విను. నా తండ్రి గారు నన్ను నీ వద్దకు పంపి తన పుత్రుడెలా ఉన్నాడో అని తల్లడిల్లుతూ ఉన్నారు. వారికి నావలన కలిగిన అలజడి, నాపై కోపం తగ్గి సంతృప్తి పొందేవానిగా చెయ్యి. అంతేకాదు, చివరకు నేను నీ అనుమతితో నా తండ్రి దగ్గరకు కనుక వెళితే, అతడు నన్ను చూచి భయపడక నన్ను చక్కగా గుర్తించేటట్లు, నన్ను పలకరించేటట్లు, యథా పూర్వంగా ప్రసన్నుడై నాతో ఉండేటట్లు నాకు వరమియ్యి. ఇదే నేను కోరే మొదటి వరం".

పితృభక్తి పరాయణులు తమకంటే ముందు తమ పితృదేవుని స్వాస్థ్యాన్నే కోరుకుంటారు. తమ తండ్రికి కలిగిన స్వస్థతను చూసి ఆనందిస్తారు. జ్ఞానులైనవారు తమకోసం తాము ఏమికోరుకోరు మరి కొంత జ్ఞానం తప్ప. ఆ మాటలకు యముడు సంతసించి ఇలా అన్నాడు. "నచికేతా! నీ తండ్రి మనసు మారుతుంది. ఇంతకుముందు నిన్నెలా ఆదరించేవాడో ఆతడు నిన్ను ఇకముందు కూడా అలాగే ఆదరించగలడు. నిన్ను చూసినా *(మరణించి బ్రతికి వచ్చిన పుత్రుడని తలవక)* నిద్రనుండి లేచి వచ్చిన పుత్రుని వలే ఆదరిస్తాడు. నేటి నుండి ఎట్టి వ్యాకులత లేక హాయిగా నిద్రపోగలడు." అని తన తొలివరం అనుగ్రహించాడు యమధర్మరాజు.

### రెండవ వరము

నచికేతుడు తన రెండవ వరాన్ని కోరుకోవడం మొదలు పెట్టాడు. "ఓ యమధర్మరాజా! మోక్షస్థానమైన పరమపదంలో ఎటువంటి భయము ఉండదు. అక్కడ నీ అధికారం చెల్లదు. అక్కడ జరామరణాలు, ఆకలి దప్పులు ఉండవు. అన్ని దుఃఖములకు ఆవలనున్న ఆ మోక్షస్థానం అతి ఆనందకరంగా ఉంటుంది. అందువలన ఓ యమరాజా! సర్వము ఎరిగిన నీవు ఆ మోక్ష ఫలాన్నిచ్చే అగ్ని విద్యను ఎరుగుదువు. ఆ మోక్షప్రాప్తిని కోరే నాకు ఆ అగ్ని విద్యను ఉపదేశించు. ఆ మోక్షప్రాప్తినందిన వారికి గుణాష్టకావిర్భావం జరిగి జరామరణాదులు, ఆకలి దప్పులులేక, దుఃఖ ములు లేక పాపదూరులై అమృతాత్వాన్ని పొందుతారు. అందువలన నాకు రెండవ వరముగా ఈ అగ్ని విద్యను ఉపదేశించు" అని కోరుకున్నాడు నచికేతుడు.

ఇక్కడ ఈ మంత్రాలను అన్వయం చేసిన కొందరు **"స్వర్గలోకే" "స్వర్గం"** అన్న మాటలకు ఇంద్రాది దేవస్థానమైన స్వర్గలోకమని వ్యాఖ్యానిస్తారు. కాని బ్రహ్మవిద్యను గురించి ఎరిగిన నచికేతుడు స్వర్గ సౌఖ్యాలు కోరుకున్నాడనడంలో ఔచిత్యం లేదు. అంతే కాకుండా ఇంద్రాది, దేవతలకు కూడా మృత్యువు భయం ఉంది. అక్కడా సురాపానాది సౌఖ్యాలున్నాయి. 'చక్కటి భోజనాలున్నాయి. కాని నచికేతుడు చెప్పె లోకంగురించి అక్కడ నీవు అధికారివి కావు. అక్కడ మృత్యువు లేదు. దుఃఖం లేదు. ఆకలి దప్పులు లేవు' అని చెప్పడం వలన అది స్వర్గం కాదని మోక్షమని చెప్పబడే పరమపదమని చెప్పబడే వైకుంఠప్రాప్తేనని గ్రహించాలి.

అంతే కాకుండా యముడు ఆ వరాన్ని తీర్చేటప్పుడు **"అనంతలోక ప్రాప్తిని"** ఇచ్చేది, **"అధోప్రతిష్ఠాం"** అన్నమాటలు వాడాడు. అనంతలోకం అంటే విష్ణులోకమైన వైకుంఠం అనే అర్థం. అంతేకాని స్వర్గలోకం కాదు. అథో ప్రతిష్ఠాం అంటే నీకు మళ్ళీ అథోలోకాలకు వెళ్లక్కరలేని స్థితి అంటే పునరావృత్తి లేని స్థితిని కలిగించే అగ్ని విద్యను అని చెపుతాడు. అందువలన కూడా అది మోక్ష స్థానమనే అర్థం చేసుకోవాలి. ఈ అగ్ని విద్య మోక్ష ప్రాప్తికై వేద పూర్వభాగంలో చెప్పబడిన ఒక కర్మకాండ.

ఆ మాటలకి యమధర్మరాజు ఇలా అన్నాడు. "ఓ నచికేతా! నీవు కోరిన ఆ అగ్నివిద్యను నీకు వివరంగా చెపుతాను. జాగ్రత్తగా విను. ఈ విద్యను ఎరిగిన వాడు విష్ణులోక ప్రాప్తిని పొంది పునరావృత్తి లేని స్థితికి చేరుతాడు. ఇంతవరకూ నా హృదయంలో రహస్యంగా ఉన్న ఈ విద్యను నీవు గ్రహించు".

ఆ మాటలను చెప్పిన యమధర్మరాజు నచికేతుడికి అగ్ని విద్యను వివరంగా బోధించాడు. ఇక్కడ కఠోపనిషత్తు ఈ అగ్ని విద్య వివరాలనేమీ ఇవ్వలేదు. ఈ అగ్ని విద్యను అనుష్ఠానం చెయ్యడం ఎలాగో వేదాలలోని కర్మకాండంలో గల చయన ప్రకరణంలో వివరంగా చెప్పబడింది. ఇక్కడ ఈ ఉపనిషత్తు హోమ గుండము లేదా వేదికను ఎలా ఏర్పరచాలో, దానికి ఎంత ప్రమాణం గల ఇటుకలు కావాలి, ఎన్ని కావాలి, ఎలా పేర్చాలి, ఎలా హోమం చెయ్యాలి ఇలాంటి వివరాలన్నీ యముడు నచికేతుడికి వివరంగా తెలిపాడు, అని ఈ ఉపనిషత్తు మనకి ఇలా సంగ్రహంగానే చెప్పింది.

ఇలా అగ్నిదేవుని యొక్క స్వరూప స్వభావములను చెప్పి ఆ దేవుని ఉపాసించు పద్ధతిని వివరించాడు. నచికేతుడు స్ఫురద్రూపి. ఏక సంథాగ్రాహి. యముడు చెప్పిన విషయాలనన్నింటిని ఇట్టే గ్రహించేసాడు.

అదృష్ట రత్నాలు ధరించండి ! అనుకున్నది సాధించండి !
శ్రీ సాయి
పవిత్ర డైమండ్స్
4/7, బ్రాడీపేట, ఖజానా జ్యూయలర్స్ ప్రక్కన, గుంటూరు. సెల్: 9246410099, ఫోన్ : 2262626.
బి/3, జైహింద్ కాంప్లెక్స్, గ్రౌండ్‌ఫ్లోర్, యాక్సిస్‌బ్యాంక్ ప్రక్కన, గవర్నర్‌పేట, విజయవాడ. సెల్ : 9246310099, ఫోన్ : 6665011.
సంపూర్ణ జ్యోతిష్యం చూడబడును
నాణ్యమైన జాతిరత్నాలు
జెమ్ టెస్టింగ్ ల్యాబ్
కెంపులు పచ్చల పూసలు
మంచి ముత్యములు, పగడములు
శివస్వరూపమైన రుద్రాక్షలు
స్పటికమాలలు
1 గ్రామ్ గోల్డ్ ఇమిటేషన్ జ్యూయలరి

యముడు కూడా తాను చెప్పిన విషయాలు విద్యార్థి చక్కగా గ్రహించాడా లేదా అని తెలుసుకోవాడానికి ఒక పరీక్ష కూడా పెట్టాడు. "ఏది, నేను చెప్పిన అగ్ని విద్యను గురించి నీకేమి అర్థం అయ్యిందో చెప్పు" అన్నాడు. నచికేతుడు అడిగిందే తడవుగా యముడు బోధించిన విషయాలన్నింటిని తిరిగి అప్పజెప్పాడు. యముడు తన శిష్యుని మేధాశక్తికి పరమానంద భరితుడయ్యాడు. ఇలా శ్రద్ధా, తెలివి, అంకితభావం ఉన్న విద్యార్థులెక్కడ దొరుకుతారు? ఇక ఆనందంతో యముడు నచికేతుడితో ఇలా అన్నాడు. "నాయనా నచికేతా! ఇప్పుడు నీకో అదనపు వరాన్ని కూడా ఇస్తున్నాను. ఇప్పటి నుండి ఈ అగ్నిదేవతను ఉపాసించే ఈ యాగము **"నచికేతాగ్ని"** అని నీ పేరిటనే అది ప్రసిద్ధి పొందుతుంది. అని ఒక వరాన్నిచ్చి ఇంకా తృప్తిలేక తన మెడలో అనేక వర్ణాలు కలిగి, కణ కణ ధ్వనులతో కూడి యున్న ఒక నవరత్న ఖచిత హారాన్ని కూడా బహూకరించాడు.

ఈ నచికేతాగ్ని విద్యను చక్కగా అభ్యసించిన వాడు యజ్ఞ, వేదాధ్యయన, దానాది మూడు కర్మలను చక్కగా ఆచరిస్తూ, త్రివిధాగ్నులచేత భగవదుపాసనతో సంబంధం కలిగి, జనన మరణాల నుండి తరించి, తనను తాను బ్రహ్మాత్మకునిగా గ్రహించి, స్వస్వరూప జ్ఞానాన్ని పొంది, సంసారము నుండి బయట పడి, మోక్షమనే శాంతిని పొందుతాడు.

'నచికేతా! ఈ విద్యను నచికేతాగ్ని గానే లోక ప్రసిద్ధి కలిగి అందరు అలాగే వ్యవహరిస్తారు. ఇంత వరకూ నీవు కోరిన నీ రెండవ వరాన్ని నీకనుగ్రహించాను. ఇక నీ మూడవ వరాన్ని కోరుకో". అన్నాడు యముడు. నచికేతుడికి ఈ రెండు వరాలను ఇచ్చి యముడు తన శిష్యుడిని చక్కగా పరీక్ష చేసాడనే అనుకోవాలి.

**మూడవ వరము**

ఇక నచికేతుడు తన మూడవ వరాన్ని ఆవిష్కరించడం మొదలు పెట్టాడు. " ఓ యమధర్మరాజా! అయితే ఇక నా మూడవ వరాన్ని విను"

మరణించిన జీవుడు లేదా ముక్త పురుషుడు ఉన్నాడని కొందరు, లేడని కొందరు విరుద్ధమైన అభిప్రాయాలు చెపుతున్నారు. ఇంతవరకూ నీ వలన తత్త్వజ్ఞానాన్ని పొందుతున్న నేను, ఈ మరణించిన జీవునికి లభించే ఆ మోక్ష తత్త్వాన్ని గురించి చెప్పే బ్రహ్మవిద్యను తెలుసుకో గోరుతున్నాను. ఇది యే నా మూడవ వరము.

మోక్షం పొందడానికి సాధనమైన అగ్ని విద్యను నేర్చుకున్న తరువాత నచికేతుడు మోక్ష స్వరూపాన్ని బ్రహ్మము, జీవుడు, మొదలైన తత్త్వాల గురించి చెప్పే బ్రహ్మ జ్ఞానాన్ని తెలుసుకుని తాను కూడా ఆ మోక్షమార్గంలో ఉండడానికే ఆ కోరిక కోరాడు. నచికేతుడు అడిగిన ప్రశ్న విన్న యముడికి చాలా ఆనందం కలిగింది. ఎందుకంటే ఈ నచికేతుని కథ ఇన్నీ కోట్ల సంవత్సరాల నుండి బ్రతికి ఉందంటే కారణం ఈ మూడవ ప్రశ్నకు యమధర్మరాజు చెప్పిన సమాధానం కొరకే అన్నది నిర్వివాదాంశం. కాని ఈ అతిగూఢమైన దేవ రహస్యాన్ని చెప్పడానికి అతనికి నిజమైన యోగ్యత ఉందా? లేదా? అని ఇంకా పరీక్షించదలచాడు. యమధర్మరాజు ఇంతకు ముందు రెండవ ప్రశ్నకు సంబంధించిన జ్ఞానం ఇచ్చినప్పుడు, "ఇంత వరకు నేను చెప్పిన అగ్ని విద్య ఏంటో నీకేమర్థమైందో చెప్పు" అని ప్రశ్న వేయడం ద్వారా ఆతనికి ఉన్న శ్రద్ధా, తెలివి, ఆచార్యుడు మీద ఉన్న భక్తి మొదలైనవి పరీక్షించాడు యముడు.

ఇప్పుడు తాను పరీక్షించాలనుకుంటున్నది నచికేతుడికి భౌతికములైన భోగభాగ్యాల మీద ఇంకా ఏమైనా రుచి ఉందా? లేక పూర్తి వైరాగ్యంతో ఉన్నాడా? అన్న విషయం. ఎందుకంటే బ్రహ్మజ్ఞానం ఇవ్వవలసింది సంపూర్ణ వైరాగ్యం ఉన్నవాడికే కదా! అందుకే నచికేతుడిని కొంత ప్రలోభ పెట్టి చూద్దాం అనుకున్నాడు. ఆ ప్రలోభానికి పడిపోతే నచికేతుడు అయోగ్యుడు. అతనికి భౌతిక సుఖాలను వరంగా ఇచ్చి పంపేయవచ్చు. లేకపోతే అతడు యోగ్యుడుగా తేలితే ఈ నిగూఢ జ్ఞానాన్నే ప్రసాదించవచ్చు అని భావించి యమధర్మరాజు నచికేతునితో ఇలా అన్నాడు.

**యముడు :** నాయనా నచికేతా! ఈ ముక్తాత్మ స్వరూప విషయంలో జ్ఞానాధికులైన దేవతలకు కూడా అనాదిగా సందేహాలున్నాయి. మోక్షసాధనమైన ఈ తత్త్వ జ్ఞానం చాల నిగూఢమైనది. అది అంత సులభంగా తెలుసుకోవడానికి సాధ్యపడనిది. కాబట్టి నీవు మరేదైనా వరాన్ని కోరుకో. నన్ను మొహమాట పెట్టకు. కనీసం నీ ఆచార్యుడనైన నా కొరకైనా ఈ వరాన్ని వదిలేయ్.

**నచికేతుడు :** స్వామీ! మృత్యుదేవా! దేవతలకు కూడా సందేహాస్పదమైన ఈ జ్ఞానాన్ని నీవు తప్ప చెప్పగల సమర్థులు ఎవరూ నాకు లభించరు. అందువలన నీవు ఈ జ్ఞానాన్నే ఇవ్వవలసినదిగా ప్రార్థిస్తున్నాను.




www.mangalaakshatas.com
In commitment to help the people of spiritually inclined, we come up with the unique platform for 'Sri Vaishnava Community' to choose their life partner with an ideal mind set.
*With the Mangalasanams of*
"Sri SriSriTridandiChinnaSrimannarayanaRamanujaJeeyarSwamiji" we present you with 'mangalaakshatas' - A wedding platform for Sri Vaishnavas.
We are now open for free registrations. Please visit: www.mangalaakshatas.com
మీ జీవిత భాగస్వామికోసం ఎదురుచూస్తున్నారా?.. ఇదిగో మీ ముందుకు 'మంగళాక్షతలు' మన ఆచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి మంగళాశాసనములతో...! పై వెబ్‌సైట్‌లో రిజిస్టర్ చేసుకోండి!

**యముడు :** నువ్వీ వరం విషయంలో పట్టుదల వదిలేయ్. నీకు పూర్తి నూరేళ్లు జీవించగల కొడుకులను, మనుమలను ప్రసాదిస్తాను. అనేక గోవులను, ఏనుగులను, గుర్రాలను, బంగారాన్ని, మీభూలోకంలో ఎత్తైన సౌధాలను ఇస్తాను. నీకు ఎన్ని సంవత్సారాలు ఆయువు కోరుకుంటే అన్ని సంవత్సరాల ఆయువును ఇస్తాను. హాయిగా జీవించు. అంతే కాదు. ఈ వరంతో సమానమైన ఇంక ఏ వరాన్నైనా కోరుకో. ఈ విశాల భూమండాలనికి చక్రవర్తి పదవిని ఇస్తాను. తీసుకో. అందరూ నువ్వంటే ఇష్టపడేలా చేస్తాను. ఈ వరం తీసుకో. అంతే కాదు. నీకింకా ఏమేమి వరాలు కావాలో కోరుకో. అన్నీ ఇస్తాను. ఈ సుందరీమణులను చూడు, వీరు పురుషులను రమింపజేయగల అప్సరసలు. వీరిని గ్రహించు, ఇవి రథములు. వీటితో పాటు నీ దర్పానికి సరిపడా వాయించగల మేళతాళాల బృందాన్ని కూడా ఇస్తున్నాను. భూలోకానికి చక్రవర్తివై, నేనిచ్చిన భోగ భాగ్యాలను అనుభవిస్తూ హాయిగా జీవించు. అంతే కాని శరీర త్యాగము జరిగిన తరువాత వచ్చే ఆ మోక్షదశను గురించి నీకేందుకు? నా మాట విను.

**నచికేతుడు :** ఓ యమధర్మరాజా! అనిత్యములై రేపటి వరకు కూడా ఉండని ఈ భోగభాగ్యాలన్నీ అస్థిరాలు, అశాశ్వతాలు. ఈ భోగభాగ్యాలు కూడ ఆ భోగియొక్క శరీరములో గల సర్వేంద్రియాలకు తేజో విహీనత కలిగించి క్షీణింపజేస్తాయి. మానవ జీవితం కూడా స్వల్పమే కదా! ఈ ఏనుగులు, గుర్రాలు, స్త్రీలు, నృత్య, సంగీతాది భోగములు సర్వము నీవే ఉంచుకోవలసినది. నా కేమి అక్కర లేదు. నాకు నిజంగా ధనం మీద అపేక్ష లేదు. ధనంతో తృప్తిపడగల మానవుడెవరు? నిజంగా ధనం మీద ఆశ ఉంటే దానిని మనం ఎలాగైనా సంపాదించవచ్చు. మా ఈ బ్రతుకు ఎంత వరకూ సాగుతుంది? అది నీ దయ ఉన్నంత వరకే అని నాకు తెలుసు. నీ దర్శనం అవగానే ధనము, భోగము, ప్రాణము అన్నీ పోయినట్లే కదా! జరా మరణాలతో సంబంధము లేని ముక్తపురుషుల స్వరూప వైభవం తెలుసు కోవాలన్నదే నా కోరిక. అలాంటి నాకు భోగ్యభాగ్యాలపై కోరిక ఎంత మాత్రము లేదు. ముక్తునికి లభించే దివ్య శరీర మెటువంటిది? ఆతనికి లభించే భోగములు, ఆనందములు ఎటువంటివి? అనే విషయాలు తెలుసుకోవాలన్న కోరిక ఒక్కటే ఉంది. ఇలాంటి కోరికను మనసులో ఉంచుకొని క్షణభంగురమైన ఈవిలాసాలపై నాకు ప్రీతి ఎలా కలుగుతుంది? అందువలన నాకు మరే కోరికా లేదు. ఆ ముక్త పురుషుని గురించి చెప్పండి". *(సశేషం)*

శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయర్‌స్వామివారి ప్రత్యక్షపర్యవేక్షణలో....

## ధనుర్మాస వ్రత మహోత్సవములు



16.12.2014 నుండి 14.1.2015 వరకు

**భగవద్బంధువులందరూ విచ్చేసి, దివ్యసాకేతంలో ధనుర్మాప్రవచనాలు విని తరించవలసినదిగా ఆహ్వానిస్తున్నాం!**

వేదిక

జీవా ప్రాంగణం, శ్రీరాంనగర్, శంషాబాద్, రంగారెడ్డి జిల్లా.

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి పర్యటన వివరములు**

**డిసెంబరు 2వ తేదీ చెన్నై ప్రయాణం**

- **3,4,5,6,7 :** భగవద్గీత ప్రవచనములు - చెన్నై
- **8: సేలం :** శ్రీరామ్‌గారి గృహంలో శ్రీయాగ పూర్ణాహుతిలో పాల్గొంటారు. సా॥ సామూహిక లక్ష్మీపూజ.
- **9 : సేలం:** ఇళంపిళ్ళై వేంకటేశ్వరస్వామిని సేవించి మణిమామండపం దర్శించుకొని తిరుప్పత్తూరు ఆండాళ్ గోష్టికి మంగళాశాసనం చేసి రాత్రికి నెల్లూరు జిల్లా రాయవెల్లూరు (శ్రీపురం) చేరుకుంటారు.
- **10 :** నారాయణి అమ్మాళ్‌గారి ఆహ్వానంపై గోల్డెన్ టెంపుల్ సందర్శిస్తారు.. మనిమాడక్కోయిల్, లక్ష్మీసన్నిధిని దర్శించుకుంటూ బెంగుళూరుమీదుగా 12 రాత్రికి హైదరాబాద్ చేరుతారు.
- **13 :** శ్రీమాన్ దిట్టకవి వేంకట తాతాచార్యస్వామిగారి కుమారుడు శ్రీమాన్ భట్‌గారింట్లో సుదర్శన ఇష్టి
- **14 :** కరీంనగర్ పుల్లూర్ నారాయణదాస్‌గారి ఆశ్రమంలో "వృద్ధాశ్రమం" ప్రారంభిస్తారు.
- **15 :** రాత్రి వరంగల్
- **16 :** ధనుస్సంక్రమణం సా॥ 4.35 గోదాదేవికి తిరుమంజనం చేసి, మొదటి పాశుర విన్నపం.

**డిసెంబరు 16 నుండి 2015 జనవరి 14 వరకు వరంగల్**

VILAN V
Just face the world
Hot Cutes
vijay ads



ప్రకృతిబడిలో... 12

# నేనే ఒక తేనెటీగనై...!

వైశారదీ

అగ్నిరూపానికి ఆకర్షితమైన మిడతలా, కంటికి ఇంపుగా కనపడిన వాటివెంట పడవద్దనే పాఠం తెలుసుకున్నాం! మధుకరంగా పిలువబడే తేనెటీగ నుండి ఏమి తెలుసుకోవచ్చని అవధూత యదుమహారాజుకి చెప్పారో చూద్దాం!

ఓ యదుమహారాజా! మననశీలుడై పరమాత్మయందే మనసు నిలపాలనుకునే సాధకుడు తేనెటీగనుండి కూడా ఎంతో నేర్చుకోవలసి ఉంది. తేనెటీగకు సంస్కృతములో "మధుకరము, భ్రమరము" అని పేర్లు. మధు అంటే తేనె. ఆ తేనెను తయారు చేసేది కనుక మధుకరమని పేరు. మధు కరోతి ఇతి మధుకరః అని అంటారు. లేదా మధు కృంతతి ఇతి మధుకృత్ అని మరో అర్థము. పువ్వులనుండి తేనెను స్వీకరిస్తుంది కనుక 'మధుకృత్' అంటారు. మధుకృత్ అన్నా, మధుకరః అన్నా, భ్రమరము అన్నా, తేనెటీగ లేదా తుమ్మెద అనే అర్థము.

ఓ రాజా! ఈ తేనెటీగ అనేక పూలనుండి తేనెను సేకరిస్తుంది. ప్రతిపువ్వునుండి కొంచెం కొంచెంగానే సేకరిస్తుంది. అంతేగానీ పూర్తిగ పీల్చి పిప్పిచేయదు. సేకరించే క్రమంలో పూవుని ఏమాత్రం నలపదు. పూవుకి బాధ కలిగించకుండా కొంచెం మాత్రమే తేనె స్వీకరించి, కృతజ్ఞతతో పరపరాగ సంపర్కం కలిగించి పోతుంది.

అలానే మునియైన సాధకుడు శరీరపోషణకి అవసరమైనంత పదార్థాన్ని మాత్రమే మాధూకరవృత్తితో అంటే భిక్షుకుడిగా సేకరించాలి. అదికూడా ఒక్క గృహస్థునే ఇబ్బంది పెట్టకూడదు. తేనెటీగలాగ వేరువేరు గృహస్థులనుండి భిక్షరూపంలో తగినంత పొందాలి. ఎవరినీ నిర్బంధించి అడుగరాదు. తనకి వలసిన గ్రాసం అందించినవారికి తన వద్దనున్న జ్ఞానాన్ని పంచుతూ ముందుకు సాగిపోవాలి.

తేనెటీగ తామర లేదా కమలములోని తేనె ఆస్వాదయోగ్యంగ ఉందని ఒకవేళ ఆకర్షితమైందా! ఆ పువ్వులోని తేనెనే కడుపునిండా త్రాగిందా! మత్తిల్లి అందులోనే పడిపోతుంది! సూర్యాస్తమయం కాగానే ముకుళించుకున్న పుష్పంలోనే బందీ కూడా అవ్వచ్చు.

అలానే మునియైన భిక్షుకుడు ఒక యజమాని ఇంట ఆహారవసతి బాగుందని, వారి ఆదరణ బాగుందని అక్కడే నిలచిపోయాడా! సాంసారిక భావనలలో బందీ అయిపోతాడు. తన కర్తవ్యాన్ని, సాధనని మరచిపోతాడు. కూడని ప్రాపంచిక బంధాలలో పడి సాధన నుండి పతనమౌతాడు. అందుకే తేనెటీగలాగ నిరంతరం సంచరిస్తూండాలి. అది తేనెను సేకరించినట్లుగా ముని జ్ఞాన సేకరణతో గాఢసాధనను పొందగలగాలి.

అవధూత చెప్తున్న ఈ పాఠాన్ని సుభాషితకారులు కూడా స్మరిస్తూ ఇలా అన్నారు...

**మధులుబ్ధో యథా భృంగః పుష్పాత్ పుష్పాంతరం వ్రజేత్।**
**జ్ఞానలుబ్ధో తథా శిష్యః గురోః గుర్వంతరం వ్రజేత్ ॥**

ఎందరెందరినుండి ఏయే విషయాలు నేర్చుకోవచ్చో గమనిస్తూ, తెలుసుకుంటూ జ్ఞానాన్వేషణతో ముందుకిసాగిపోవాలి. ఇదికాక మరొక పాఠాన్ని అవధూత వివరించారిలా...

"ఓ యదుమహారాజా! ఈ తేనెటీగ వేపపువ్వు, మామిడి పువ్వులాంటి చిన్నపుష్పాల నుండైనా సారవంతమైన తేనెను తగినంత గ్రహిస్తుంది. కమలాలు వంటి పెద్ద పువ్వులనుండీ తేనెను గ్రహిస్తుంది. సాధకుడు కూడా చిన్నవి, అల్పసారం కలవి, పెద్దవి, గొప్పసారం కలవి అని ఎంచక అన్ని శాస్త్రాలనుండి సారమైన తత్త్వజ్ఞానాన్ని గ్రహించగలగాలి. శాస్త్రాలంటేనే వేదాలు! అవి మనం ఎలా ఉండాలో, ఎలా ఉండకూడదో, ఏమి చేయాలో, ఏమి చేయకూడదోవంటి ఎన్నో విషయాలని తెలియజేస్తున్నాయి. ఆ వేదార్థాన్ని మరింత తేలికగా అందించేందుకు ఏర్పడినవే స్మృతులు, ఇతిహాసాలు, పురాణాలు, ఆగమాలు, ప్రబంధాదులన్నీ! వాటన్నిటియందు సమాన ఆదరబుద్ధి కలిగి తెలుసుకునే ప్రయత్నం చేయాలి. మనకి అర్థం కావడం కోసం అవి ఎన్నెన్నో పాత్రలతో కూడిన కథలరూపంలో చెప్పినా, వాటి సారమునే సాధకుడు గ్రహించగలగాలి. తానెవరో, తన గమ్యం ఏమిటో, చేర్చే సాధనమేదో వాటినే ప్రతిగ్రంథం నుండి తెలుసుకోగలగాలి.

దీనినే మన పూర్వాచార్యులు ఒక చక్కటి శ్లోకంలో తెలిపారు.

**స్వజ్ఞానం ప్రాపకజ్ఞానం ప్రాప్యజ్ఞానం ముముక్షుభిః ।**
**జ్ఞానత్రయముపాదేయం ఏతదన్యత్ న కించన ॥**

ఇది కాక తేనెటీగ తెలిపే మరొక ప్రధాన పాఠాన్ని అవధూత వివరిస్తున్నారిలా... ఓ యదుమహారాజా! తేనెటీగలా చేయకూడని అంశం కూడా మనం గ్రహించాలి విను! తేనెటీగ ఎన్నోవేల మైళ్ళు తిరిగి, ఎన్నెన్నో రకాల పూలనుండి సేకరించినదంతా ఒకచోట తేనెపట్టులో దాస్తుంది. సాయంత్రానికిది ఆహారం. ఇదిరేపటికి ఆహారం అనుకుంటూ అమావాస్య నుండి పూర్ణిమదాకా సేకరించి నింపుతుంది. కానీ, అది అనుభవించడానికి ఏమీ, మిగలదు. పైగా అలా నిండుగా ఉన్న పట్టులోని తేనెకోసం మంటలు పెట్టి తేనెటీగలను నాశనం చేసి, లేదా చెదరగొట్టి వేరేవాళ్ళు తేనె పట్టుకుపోతారు.

మునికూడా ఇది గమనించాలి. ఏపూటకాపూట తనకి వలసినదాన్ని మాత్రమే భిక్షగ పొందాలి. ఇది సాయంత్రానికి తినవచ్చు. ఇది రేపటికి తినవచ్చు అంటూ ప్రోగు చేయరాదు. దోసిలియే పాత్రగ చేసుకొని, అందులో పట్టినంత మాత్రమే స్వీకరించాలి. ఉదరమే కుండగ చేసుకొని, అందులోకి పట్టినంతే చేర్చాలి. అలా కాక తేనెటీగ లాగ రేపటికి మాపటికి ఉపయోగిద్దాంలే అని ఆహారాన్నిగాని, వస్తువులనిగాని, ధనాన్నిగాని సేకరించరాదు. అలా చేసినట్లయితే తేనెటీగలాగ ఇతరుల చేతుల్లో వినాశం పొందవలసి వస్తుంది" అని అవధూత తేనెటీగలాగ ఏమి చేయాలో ఏమి చేయకూడదో వివరించారు.



మధురస్మృతులు,
సంచిక-2
నందననామసంవత్సరం, పుష్యమాసం
50సంవత్సరాల పూర్వపు భక్తినివేదన నుండి

# యథార్థ విద్య

సంపుటి-4, 1952 జనవరి
" ఆచ్చి శ్రీమన్నారాయణాచార్యస్వామి"

*(పూర్వ సంచిక తరువాత)*

పండితుడు నలుప్రక్కల వింతల జూచుచు సగర్వముగ ఆ దర్భాసనముపై కూర్చొనును.

భట్టర్‌వారు ః- మహాశయా! తమరేప్రాంతమువారు? ఇచ్చటి కెపుడు దయచేసినారు? తమ విశేషముల తెలియగోరుచున్నాను.

పండితులు ః- మేము కాశ్మీరపురవాసులము. కాశీలో 22 వత్సరములు షట్ఛాస్త్రములను చదివినాము. క్రమాంత అధ్యయనమును చేసినాము. వేదాన్తవిద్యయందు మాకభిమానము హెచ్చు. దిగ్విజయ యాత్ర జేయుచు నిన్ననే యిచ్చటికి వచ్చినాము.

భట్టర్‌వారు ః- ఓహో! అలాగా చాల సంతోషము.

పండితులు ః- నిన్న సాయంకాలమున దేవాలయమునకు వెళ్ళినపుడు ఈ మీ శిష్యులచ్చట పాఠముల వల్లించుకొనుచుండిరి. వీరందరిని న్యాయములోనొకరిని, వ్యాకరణమున నొకరిని, మీమాంసలో నొకరిని, అధ్యయనములో నొకరిని, బ్రహ్మసూత్ర భాష్యములో నొకరిని పరీక్షించి జూచితిమి. వీరందరు చాల బాగుగా చాల వ్యాసంగము చేసిన శాస్త్రీయపండితులే. వీరందరు, మీ సర్వతోముఖ పాండిత్య ప్రతిభలగూర్చి నాకు తెలిపిరి. మిమ్ముల జూచి పోదమని మేమే వచ్చితిమి.

భట్టర్‌వారు ః- చాల సంతోషము. మీ వంటి విద్వచ్ఛిఖామణుల కలుసుకొని నందులకు చాల ఆనందముగ నున్నది. (సన్నిధిస్వామితో) పండితులకై ఒక తాంబూలము తేవయ్యా!

సన్నిధిస్వామి ః- అడియేన్, (అని ఒక పళ్ళెములో ఒక తాంబూలమును రెండరిటి పళ్ళను తెచ్చి పండితులకందించును. పండితులు మొగము చిట్లించుకొనుచు ఆ తాంబూలమును తీసుకొని లేచును).

పండితులు ః- పోయివత్తుము.

భట్టర్‌వారు ః- (ఆసనముపై కూర్చొనియుండియే) చిత్తము. (పండితులు అసంతుష్టితో వెళ్ళిపోవును.)

ఒక శిష్యుడు ః- స్వామి ఈ పండితుడు చాల గొప్పవాడు. నిన్న మాతో చాల ప్రొద్దువాదించెను. ఆయన వాదనానైపుణ్యము శాస్త్రీయవ్యాసంగం యుక్తి సమర్థన చాల అద్భుతముగ నున్నవి. మన ప్రాంతమందే కాదు మనదేశమందే యిట్టి సర్వతోముఖ శాస్త్రీయపాండిత్యము కలవారున్నారా యని పండితులెవరైనా వచ్చినచో దేవరవారు వారినెంతో గౌరవింతురు. ప్రత్యుత్థానము చేతురు. ఎంతో సేపు ప్రసంగింతురు. చివరకు శాలువో, ధోవతులచాపో, బహూకరింతురు. గాని నేడీ పండితుని పట్ల దేవరవారేలనో ఔదాసీన్యము వహించితిరి. ఔదాసీన్యమే కాదు అసహ్యాభావమును వెళ్ళడించిరి. మన భైక్షుక నిశానీ-నిర్మాత-నరశింహాచార్యులువారు వచ్చినపుడు దేవరవారు చేయు గౌరవ మర్యాదలలో సహస్రాంశమైన దేవరవారీ పండితుని పట్ల జూపక పోవుట మాకమితాశ్చర్యముగ నున్నది. నిన్న మేమే ఈయన నిచ్చటి కాహ్వానించితిమికూడ....

భట్టర్‌వారు ః- ఓహో అలాగునా! ఈయన గొప్ప పండితుడే అయి ఉండవచ్చును. గాని ఆయనను జూడడము తోటే నాకదేమో మనస్సున గౌరవభావ మంకురించలేదు.

**శ్లో॥ విద్యా దదాతి వినయం వినయాద్యాతి పాత్రతామ్ ।**
**పాత్రత్వాత్ ధనమాప్నోతి ధనాత్ ధర్మం తతస్సుఖం ॥** కదా.

ఈయనయందు విద్య పుష్కలముగా యుండవచ్చునుగాని దానివల్ల కలుగవలసిన వినయాదులు ఆయనయందు సున్న. అసలాయన యందున్న ఆ విద్యా సంపత్తియు నిజమైన విద్యకాదు. అది భ్రమాత్మకమైనది. సందేహములకాకరమైనది.

తత్త్వహిత- పురుషార్థ నిశ్చయ జ్ఞాన మీయని విద్య విద్యయా? అట్టి విద్యా భ్రాంతి వలన నిశ్చిత భ్రాంతియే గాని శాంతి ఎక్కడిది?

శిష్యుడు ః- దేవరవారు ఆ పండితునితో శాస్త్రీయ ప్రసంగమే నొనర్చలేదే. ఆయన జ్ఞానమును యిటుల నిర్ధారణ జేయుట...

భట్టర్‌వారుః- మనిషిని జూచినచో, ఏదైనా మాటలు మాట్లాడినచో, తెలియదటయ్యా. మనిషి స్వరూప స్వభావములు.

**శ్లో ॥ యతీశ్వర సరస్వతీసురభితాశయానాం సతామ్ ।**
**వహామి చరణాంబుజం ప్రణతశాలినా మౌళినా ॥**

శ్రీమద్రామానుజ దివ్యశ్రీసూక్తి హృదయమున గలవారి పాదపద్మములు శిరస్సున ధరించవలసినదే. అంతేకాదు.

**శ్లో ॥ ఘ్నంతం శవంతం పరుషం వదన్తమ్ ।**
**న వైష్ణవం ప్రతికుర్వీత విద్వాన్ ॥**

ఆత్మస్తుతి-పరనింద-పరుషవాక్యములు గలవారిని పరమార్థజ్ఞానులు లాగ యాదరించుట ఎటుల? పోనిండు నేనే పొరబడితినేమో, రేపలా తిరిగి ఆయనను తీసుకొని రండు. వారి పాండిత్యప్రతిభను అనుభవించి ఆదరింతుము.

శిష్యుడు ః- అడియేన్, మహాభాగ్యము.

## రెండవ రంగము.

స్థలము ః- శ్రీభట్టర్‌వారి కాలక్షేపకూటము.

కాలము ః- మరుచటి దినము ఉదయము గం 11-00॥వేళ

సన్నివేశము ః- భట్టర్‌వారు ఒక ఆసనము మీదను పండితుడొక ఆసనము మీదను అధిష్ఠించియుందురు.

వారిని పరివేష్టించి శిష్యులందురు.

భట్టర్‌వారుః- ఆర్యా! తత్త్వ-హిత- పురుషార్థముల గురించి తమ నిశ్చయమైన విశ్వాసమేమి ?

పండితులు ః- అయ్యా! వీనిని గురించి ఇదమిత్థమని నిర్ణయించి నిశ్చయించుట చాలకష్టము. ఎందుచేతననగా శాస్త్రములన్నియు ప్రమాణతమములే. ఒక్కొక్కశాస్త్రము ఒక్కొక్క విధముగ తెలుపుతున్నది. వీటన్నింటికి తలబాదుకున్నను ఏకవాక్యత కుదరదు. ఏ శాస్త్రమును కాదని త్రోసివేయగలము? దేనికదేగొప్పది. మేము చాల భాష్యములు జూచియున్నాము. కాని ఏభాష్యము ఇదమిత్థమని సిద్ధాంతీకరించ లేకున్నది. జ్ఞానమాత్రమే తత్త్వమనియు, జ్ఞానస్వరూపమైన యాత్మయొక్క స్వరూపోచ్ఛిత్తియే మోక్షమనియు ప్రపంచప్రచార మొనర్చె బౌద్ధాదులు.

జగజ్జన్మాదికరణ రహిత పంగు సమాన కేవల అధిష్ఠానభూత పురుషవిశేషుడు మాత్రమే తత్త్వమనియు, అట్టి జగత్ప్రసూతి అంధురాలైన ప్రకృతియనియు, పురుష-ప్రకృతి వివేకమే హితమనియు, ప్రకృత్యతీతుడైపాషాణకల్పుడై యుండుస్థితిని సంపాదించుటే పురుషార్థమనియు వక్కాణించును సాంఖ్యశాస్త్రకర్త కపిలమహర్షి. జీవాత్మ-పరమాత్మలు భిన్నులుకాక వక్కటేనందురు సాంఖ్యులున్ను, యోగులున్ను. సర్వాత్మనా జీవవిశేష సమానుడు, ఆనుమానికుడు అగు పురుషవిశేషుడే తత్త్వమనియు, సప్తపదార్థతత్త్వజ్ఞానమే హితమనియు, ఆనందాది రహితమైన ఆ పురుష విశేష సాన్నిధ్యలాభమే పురుషార్థమనియు పలుకును వైశేషికశాస్త్ర కర్తకణాదమహర్షి.

సర్వజ్ఞ-సర్వశక్తి సమన్వితుడే అయినను ఊహసంజనిత బుద్ధిగ్రాహ్యుడై పరిమిత పరిమాణాది గుణాన్విత పురుషవిశేషుడే తత్త్వమనియు, షోడశపదార్థనిశ్చయజ్ఞానమే హితమనియు, చతుర్వింశతి దుఃఖధ్వంసమే పురుషార్థమనియు, ఢంకా బజాయించును. న్యాయశాస్త్రగురుడు గౌతమమహర్షి.

సర్వసాధకశక్తి విశిష్టపరమాపూర్వమే తత్త్వమనియు, స్వర్గాధిఫల సాధకమగు జ్యోతిష్టోమాది యజ్ఞయాగాదులే హితమనియు, స్వర్గాద్యనుభవమే పురుషార్థమనియు విధించుచున్నాడు మీమాంసాచార్యులగు జైమిని మహానుభావుడు.

పశుపతియే తత్త్వమనియు, తదుపాసనయే హితమనియు, పశుపతి సాన్నిధ్యరూప కైవల్యప్రాప్తియే పురుషార్థమనియు, ప్రతిపాదించుచున్నాడు పాశుపత మతసంస్థాపకుడగు బసవాచార్యుడు.

గణపతియే తత్త్వమనియు, వామాచార విశిష్టత దారధనమే హితమనియు, ఇంద్రియతృప్తినిచ్చు భోగాది విశిష్ట ఇహపర లోకానుభవమే పురుషార్థమనియు వ్రాక్కుచ్చియున్నారు శాక్తేయాది మతప్రవర్తకుడు శుక్రుడు మున్నగువారు.

భ్రమ-ప్రేమవిశిష్టుడైన బ్రహ్మ ఒక్కటే తత్త్వమనియు జీవాత్మ-పరమాత్మైకత్వానుసంధానమే హితమనియు, మహావాక్యార్థ అనుసంధానమే హితమనియు బ్రహ్మయొక్క భ్రమస్వరూపమైన జీవస్వరూపోచ్ఛిత్తియే మోక్షస్వరూపమనియు నొక్కి వక్కాణించుచున్నాడు అద్వైతాచార్యవర్యుడగు శంకరుడు.

అపహతపాప్మడైన పరమాత్మ ఒక్కడే తత్త్వమనియు, తత్ప్రతిబింబమో, తదుపాధియో, తత్పరిణామమో, తద్వివర్తమో యగు జీవునికి గల భేదబుద్ధియో, అభేదబుద్ధియో, భేదాభేదబుద్ధియో పోగొట్టునట్టి జ్ఞానము లేక జ్ఞాన-కర్మ సముచ్చయము హితమనియు, జీవునికి పరమాత్మ రూప స్వస్వరూపావిర్భావమే పురుషార్థమనియు, బోధించుచున్నారు భాస్కరుడు యాదవప్రకాశుడు మున్నగువారు.

బ్రహ్మచారి విష్ణువే పరతత్త్వమనియు, భక్తియే హితమనియు, నీచోచ్చభావంగతుడై జీవుడు పరమాత్మను దేహాంతరమునందు దేశవిశేషమున యనుభవించుటే పురుషార్థమని వచింతురు ద్వైతవాదులు.

నిఖిల జగదేకకారణుడు, అశేషహేయప్రత్యనీకానంత జ్ఞానానందైక స్వరూపుడు, స్వాభావికానవధికాతిశయా సంఖ్యేయ కల్యాణగుణాకరుడు, సకలేతర విలక్షణుడు, సర్వాత్మ భూతుడునగు శ్రీమన్నారాయణుడే తత్త్వము. తదుపాసనరూపభక్తి ప్రపత్తులే హితము. (పరమాత్మ శరీరభూతుడై తత్ప్రకారతయా భాసిల్లునట్టియు అనుకూలాపరిచ్ఛిన్న జ్ఞానస్వరూపుడైనట్టి పరమాత్మానుభవైకరసుడైనట్టి జీవునికి) అనాది కర్మరూపావిద్యోచ్ఛేద పూర్వమైన స్వాభావికమైన దేశవిశేషగత దేహం తైకభోగ్యమైన పరమాత్మానుభవమే పురుషార్థమని నిర్ధారణ చేయుదురు త్రయ్యంతనిష్ణాతలగు విశిష్టాద్వైతులు.

స్వామీ! ఈ విధముగ, శాస్త్రములు ఏ విషయములోను కూడా ఏకాభిప్రాయము లేనివై తలతోక లేనివై తలకొకదారి, తలకొక యభిప్రాయము, తలకొక సిద్ధాంతము కలవై పరస్పర భిన్నములై యున్నవి. వీనియొక్క కర్తలో మహామహులు, మహర్షి సత్తములున్ను, వాని ప్రచారకులో అపరిమిత మేధా సంపన్నులగు మహాత్ములు. ఆమతానుయాయులో మహిని అపరిమితులు. ఆ మతములో అనాది సిద్ధములు. తద్వ్యాప్తియో దిగంత వ్యాపకములు. అందుచే, వీనిలో ఇది సత్యము. ఇది సరియైనది, ఇది మంచిది అనిగాని, ఇది అసత్యము, ఇది సరైనదికాదు, ఇది చెడ్డది అని గాని నిర్ణయించుటకు ఆ సర్వజ్ఞుడైన సర్వేశ్వరునకు కూడ శక్యముకాదు. ఇక మన సంగతి చెప్పవలసినదేమి?

భట్టర్‌వారు ః- అయితే మనము దేనినో ఒకదానిని విశ్వసించి నడువక తప్పదుకదా. ఇన్నింటియొక్క యాథావస్థితిని కూలంకషముగ తరచి జూచిన మీరు దేనిని విశ్వసించితిరి ?

పండితులు ః- ఆ విషయమై గట్టిగ ప్రశ్నించకూడదు. ఏదో ముక్కు మూసుకొని ఆ సమయమునకు తోచిన దారిని త్రొక్కి ఏదో ఒక లాగున కాలక్షేపము జేయుటయే గాని దేనిమీదను విశ్వాసములేదు. అవిశ్వాసములేదు. *(సశేషం)*

# తత్త్వరహస్యం

## శ్రీకృష్ణభగవానుడు గరుడునికి చెప్పిన రహస్యం

(గరుడ పురాణము ధర్మకాండము)

**శ్రీమాన్ పురాణం వేంకటాచార్యులు**

కాలమంటే ప్రతిక్షణమూ భయం కలిగించేదే. కాలంలో కరిగి పోతున్నా మని తెలుసుకోలేక పోతున్నాం. నీటిలో ఉన్న ఆమకుంభంలాగనే ఇదెప్పుడో పగిలిపోతుందని తెలుసుకోవడం లేదు.

గాలిని చుట్టి పట్టుకోవడం, ఆకాశాన్ని నరకడం, సముద్ర తరంగాలను పట్టుకోవడం ఆపడం చేద్దామనుకుంటాడు. ప్రాణం ఎప్పుడూ అలాగే కదలక వుండాలనుకుంటాడు మానవుడు. శరీరంమీద ఎందుకింత యిష్టం, మమకారమూను.

భూమి కాల్చివేయబడుతుంది. మేరువు ముక్కలుగా చీలుతుంది. సముద్రం యింకి పోతుంది. (నీళ్ళు ఇగిరిపోతాయి.) అలా అవు తోంటే ఇక శరీరం కథేమిటి? మిగులుతుందా?

మానవుల మానసిక స్థితిని ఎంతగా విశదీకరించారో వ్యాసులవారు!

అపత్యం మే కలత్రం మే ధనం మే బాన్ధవాశ్చ మే।
జల్పన్తమతి మర్త్యాజం హన్తి కాలవృకో బలాత్॥

నా సంతానం, నా భార్య, నా ధనం, నా బంధువులు అని అతిమోహాన్ని చూపించే మానవుడు ఒక మేక. కాలమనే తోడేలు వీరిని బలవంతంగా తీసుకొని వెళ్ళిపోతోంది.

ఈ విషయాన్ని లోకంలో ఎందరిలోనో చూస్తున్నాం కాని ఆ విషయాన్ని ఆ జ్ఞానాన్ని అంతటితో వదిలేస్తున్నాం. మహర్షులు ఆ సత్యాన్ని మనం మరువగూడదని మళ్ళీ మళ్ళీ గుర్తు చేస్తూంటారు. ఇప్పుడయినా అది మనసులో నిలుపుకుంటే బాగుపడిపోతాం కదా!

**ఇదం కృత మిదం కార్యం** అంటూ 'ఇది చేశాం, ఇది చేయాలి. ఇది నేనొకటను కొంటే ఇంకోలా జరిగింది. అయ్యో ఇది చేయలేక పోయానే..' అని ఇలా అనుకొంటూ వుంటారు.

**ఏవ మీహా సమాయుక్తం కృతాన్తః కరుతే వశమ్** ఇలా అనేకమయిన వూహలతో వుంటూండగానే యముడికి వశులైపోతారు.

ఈ విషయాలనన్నింటినీ మనమనస్సుల కంటేలాగ ఎందరో ఋషులు చెప్పారు. ముఖ్యంగా వ్యాసులవారు. ఋషులు చెప్పే మాటలన్నీ సదుపదేశాలే కదా! ప్రతీమానవుడికీ, ప్రతి ఉద్యోగికీ ఏవృత్తిలో ఉండేవారికయినా సరే.. ముందుకు నడిపించేలా ఉపదేశించారు వ్యాసమహర్షి.

శ్వఃకార్యమద్య కుర్వీత పూర్వాహ్ణే చాపరాహ్ణికం।
న హి మృత్యుః ప్రతీక్షేత కృతం వాప్యథ వాకృతమ్॥

రేపటి పని ఇప్పుడే చెయ్యి. సాయంత్రం చేయవలసినది ఉదయమే చేసెయ్యి. నువ్వు చేశావో లేదో అని మృత్యువు ఆగదు. ఎదురు చూడదు.

మృత్యువు శత్రువయితే ముసలితనం సైనికుడు. ముసలితనం మార్గం చూపిస్తుంది. ఎదుటే కూర్చుని వుంటాడు మృత్యువనే శత్రువు. అలా యిరువురూ కనబడుతున్నా రక్షకుణ్ణి (శ్రీమన్నారాయణుని) ఆశ్రయించడం లేదు.

వ్యాసమహర్షి ఇంతే కాకుండా అజ్ఞానంతో కళ్ళు మూసుకుపోయిన వారి కళ్ళు జ్ఞానశలాకతో తెరిపించేందుకు ఎన్నో రూపాల ప్రయత్నించారు. లోకోపకారార్థం హితవు బోధించాడు. తృష్ణ అనే సూదితో చీల్చబడి ఇంద్రియ విషయాలనే నీటితో తడుపబడి, రాగద్వేషాలనే నిప్పుతో కాల్చబడి పక్వయిన –అంటే బాగా వుడికిన మానవుని శరీరాన్ని మృత్యువు తింటుంది.

ఇలా విశదపరుస్తున్నా మనం తృష్ణను, విషయసుఖాలనూ, రాగద్వేషాలను వదిలే ప్రయత్నంకూడా చేయం కదా! వీటిని వదులు కోవడమంటే ధర్మయుతంగా ఒక ప్రకారంగా ఉపయోగించుకోవాలి మోక్షం కోసం.

ఈ జగత్తు ఎలాంటిది? చిన్నపిల్లలను, యువకులను, వృద్ధులను, గర్భవతులనూ అందరినీ మృత్యువు ఆవేశించి వుంటుంది. ఈ జీవుడు తన దేహాన్ని వీడి యమపురికి చేరుతాడు. ఇంక స్త్రీలు, తల్లి, తండ్రి, సంతానమూ ఈ సంబంధాలన్నీ ఎందుకోసం?

ఎంతవరకు ప్రాణి తన మనసులో ఇష్టంగా సంబంధాలు పెట్టు కొంటుందో అంతవరకూ గుండెలో శోకాల మేకులు గుచ్చు కొంటూనే వుంటాయి.

మానవులను ధనం అనేక విధాల మోసం చేస్తోంది. అయ్యో! ఇంద్రియాలనబడే దొంగలతో లోకం వినాశమవుతుంది. మనలోని

An.Y. ఆర్థోఫిట్ సిరప్
అన్ని రకముల జాయింట్ నొప్పులకు
సరికొత్త పరిష్కారం
Fizikem
సత్వర నివారణకు అద్భుత ఆయుర్వేద ఔషధం
Also available as Oil & Capsules
ఇది ఫిజికెమ్ వారి ప్రతిష్ఠాత్మక ఉత్పాదనలలో ఒకటి
ORTHO Fit
ఇంటింటా ఆర్థోఫిట్ నొప్పులన్నీ ఫటాఫట్

లోభగుణం ఎంత తీవ్రమైనదంటే –

మాంసం కోసం చేప ప్రమాదకరమైన లోహపు మేకును చూడక ప్రాణం కోల్పోతున్నట్లే –సుఖాలకు లుబ్ధుడయిన మానవుడు యమబాధను చూడలేకపోతున్నాడు.

మేలు కలిగించేదేదో, కలిగించనిదేదో తెలియని ఉన్మాదులు నరకం చేరేవారే!

నిద్రాభీమైథునాహారాః సర్వేషాం ప్రాణినాం సమాః।
జ్ఞానవాన్ మానవః ప్రోక్తో జ్ఞానహీనః పశుః స్మృతః॥

నిద్ర, భయము, మైథునము, ఆహారమూ అనేవి ప్రాణులకు సమానమే అయినా జ్ఞానవంతులు ధర్మప్రకారం అనుసరిస్తారు. అలా అనుసరించని వారు వేరే విధంగా పిలువ బడతారు.

మానవ మౌఢ్యాన్ని గురించో సంగభంగాన్ని (సంగంలేకపోవడం) గురించీ తెలియచెప్పారు మహర్షి వ్యాసులవారు.

ఉదయం మలమూత్రాలతోనూ, మధ్యాహ్నం ఆకలి దప్పులతోను, రాత్రి కామవికార, నిద్రల తోనూ మూఢమానవులు బాధింపబడు తున్నారు.

స్వదేహ ధనదారాది నిరతాః సర్వజన్తవః।
జాయన్తే చ మ్రియన్తే చ హా హన్తా జ్ఞానమోహితాః॥

తన దేహము, ధనము, భార్య వీనియందే బుద్ధిపెట్టి అవే ఆలోచనలతో ప్రాణులు పుడు తున్నారు, చస్తున్నారు.

అందువలన సంగం వదిలేయాలి. ఒకవేళ సంగం వదలలేకపోతే ఆ సంగాన్ని మహానుభావు లయిన వారితో పెట్టుకోవాలి. ఎందుకంటే సంగానికి (మందు) వైద్యం పండితులే!

సత్సంగశ్చ వివేకశ్చ నిర్మలం నయనద్వయం।
యస్య నాస్తి నరః సోన్ధః కథం న స్యాదమార్గగః॥

సత్సంగమూ, వివేకమూ నిర్మలములయిన రెండు కళ్ళు. సత్సంగ వివేకాలు లేనివాడు గ్రుడ్డివాడు. సరయిన మార్గంలో పోలేడు.

వారి వారి వర్ణాశ్రమాలలో వుండే మానవులు చాలమంది పరమ ధర్మమేదో తెలియక దాంభికంతో వృధాగా చెడిపోతున్నారు.

తత్త్వజ్ఞానమే మోక్షసాధనం. దిగంబరంగా వుండడమూ, ఒడలెల్ల బూదిరాసుకోవడమూ, గడ్డి, ఆకులూ నీరూ– వీటితోనే బ్రతకడమూ ఇవి కాదు మోక్షసాధనాలు.

పుట్టినప్పటినుంచి చచ్చేదాకా కప్పలూ, చేపలూ గంగఒడ్డున, గంగలోనూ జీవిస్తున్నాయి. అవి యోగులా?

పావురాలు రాళ్ళు తింటాయి. చాతకపక్షులు ఆకాశంలోనే తప్ప నేలపై బడిన నీరు త్రాగవు. అది వ్రతమా! అవి వ్రతులా?

తస్మాన్నిత్యాదికం కర్మ లోక రంజన కారకమ్।
మోక్షస్య కారణం సాక్షాత్ తత్త్వజ్ఞాన ఖగేశ్వర॥

అందువలన నిత్యకర్మలూ మొదలయినవి కేవలం లోకులను సంతోష పెట్టడానికే! తత్త్వజ్ఞానమే మోక్షానికి కారణం అవుతుంది.

పఠన్తి వేదశాస్త్రాణి బోధయన్తి పరస్పరమ్।
న జానన్తి పరం తత్త్వం దర్వీ పాకరసం యథా॥

కూరరుచి గిన్నెలో తిరిగే తెడ్డు(గరిటె)కు తెలియనట్లు వేదశాస్త్రాలు చదువుతారు. ఒకరికొకరు చెప్పుకుంటారు కాని తత్త్వం తెలుసుకోరు. అలాంటివారు తెడ్డులాంటివారు.

సంసార మోహనాశాయ శాబ్దబోధో న హి క్షమః।
న నివర్తేత తిమిరం కదాచిత్ దీపవార్తయా॥

సంసార మోహం పోవాలంటే మాటలు మాత్రం మహోన్నతంగా చెబితే సరిపోదు. 'దీపం' – 'దీపం' అంటే చీకట్లు పోవుగద!

**దీపం వెలిగించాలి! తత్త్వం తెలుసుకోవాలి!!**

ప్రజ్ఞ లేనివాడి చదువు గ్రుడ్డివాడికి అద్దం చూపినట్లవుతుంది. అందువలన ప్రజ్ఞావంతుడు నేర్చిన జ్ఞానం తత్త్వజ్ఞానం తెలిపే లక్షణం కలది గద!

*ఇది గరుడపురాణంలో శ్రీకృష్ణుడు గరుడుడికి చెప్పి తత్త్వరహస్యం.*
*ధర్మకాండలో మోక్షోపాయ నిరూపణం.*
*గరుడ పురాణే ధర్మకాండే ఏకోన పంచాశత్తమోఽధ్యాయః*

## సెప్టెంబర్ నెల మెదడుకు మేత సమాధానములు

1. నైతిక జీవనవిధానాన్ని ప్రతిబోధించే వాఙ్మయం 2. పునర్జన్మ లేకపోవటం; 3. సౌలభ్యగుణము; 4. పాశుపతాస్త్రము; 5. తిరుమంగై ఆళ్వార్లు; 6. సముద్రంలో ఉండే అగ్ని; 7. అనధ్యయన కాలము; 8. వాజశ్రవుడుని పుత్రుడు; 9. 64 కళలు; 10. జీవుని అనన్య భోగ్యత్వాన్ని తెలుపుతుంది. 11. భవబంధాలు పరిహారమౌతాయి; 12. భగవద్రామానుజల తల్లి; 13. శ్రీమన్నాథముల; 14. యాగసంరక్షణార్థము; 15. బొమ్మపొత్తికలు(తలపాగ); 16. పైపై మెరుగులకు ఆకర్షితులు కాకండి ప్రాణాపాయం తెచ్చుకోకండి; 17. ఋగ్వేదము; 18. అంతరంగిక జ్ఞానమును బట్టి; 19. కాకతీయ సిమెంట్స్ అధినేత శ్రీమాన్ వేంకటేశ్వర్లుగారి కుమారుడు శ్రీమాన్ వీరయ్యగారు, శ్రీమాన్ అరుణారాఘవరెడ్డి, శ్రీమాన్ దిట్టకవి తాతాచార్య దంపతులు; 20. కఠోపనిషత్తు.

## శ్రీరామానుజ సహస్రాబ్ది - 2016 - 17

**ప్రియ భగవద్బంధువులారా! మీరంతా ఎంతో ఉత్సాహంతో భగవద్రామానుజ విగ్రహ నిర్మాణానికి మీమీ ద్రవ్యాన్ని వినియోగింపదలచడం చాలా ముదావహం. ఈక్రింది అకౌంట్లకు తమ ద్రవ్యాన్ని నేరుగా జమచేయవచ్చును.**

**1. ఆంధ్రాబ్యాంక్: శ్రీరాంనగర్ బ్రాంచి**
**209710100000007**
**IFSC Code ANDB – 0002097**

**2. యాక్సిస్ బ్యాంక్ - శంషాబాద్ బ్రాంచి**
**Ac No- 914010046595367**
**IFSC Code - UTIB 0000867**

**మీరు ఈ అకౌంట్లకు వేరే బ్యాంకులనుండి ద్రవ్యం జమచేసినపుడు మాత్రమే IFSC Code వినియోగింపవలసి ఉంటుంది. మీద్రవ్యం జమచేసిన తరువాత ఈక్రింది అడ్రస్సుకు కౌంటర్‌ఫాయిల్ కాపీ, జమచేసిన బ్యాంకుతేదీ వివరాలు పంపండి. లేదా ఫోనులో చెప్పండి.**

**శ్రీరామానుజ సహస్రాబ్ది కార్యనిర్వాహక సమితి,**
**9553549971, 9553549972,**
**శ్రీరామానుజ సహస్రాబ్ది, జీవా, శ్రీరామనగర్, ముచ్చింతల్(గ్రా), పాలమాకుల(పో), శంషాబాద్ (మం), రంగారెడ్డి జిల్లా -509325**
Email -contact@sriramanujasahasrabdi.org

## "సమతామూర్తి" సహస్రాబ్ది ప్రస్థానము

ఫ్లాట్‌నెం- 101, రోహిణీరెసిడెన్సీ, కాకతీయనగర్, సికింద్రాబాద్-56.
సమర్పణ-ఆచార్య పి.నరసింహం

అది క్రీ.శ.1076వ సంవత్సరము. దక్షిణ భారతదేశాన పాండ్యరాజ్యములో, శ్రీరంగపురము (శ్రీరంగము)లో శ్రీరంగనాథుని దేవస్థానము మూడుప్రక్కలనుండి కావేరీనదీము తల్లిచుట్టుకొని వుండి శోభాయమానంగా విరాజిల్లుతున్నది. సప్తప్రాకారాల మధ్య శ్రీరంగం దివ్య సన్నిధి అలరారుతున్నది.

ఆనాడు పుష్యశుద్ధ ఏకాదశి తిథికాగా, శ్రీవైకుంఠఏకాదశి (ముక్కోటి ఏకాదశి) బహుపుణ్యదినము. కనుక బ్రాహ్మీముహూర్తము నుండియే భాగవతోత్తములు, భక్తులు వేలాదిగ వచ్చి, శ్రీకావేరీనదిలో శిరఃస్నానాలు చేసి, శుచిశుభ్రతలు పాటిస్తూ, వినయ విధేయతలతో ఉత్తరద్వార దర్శనము చేసికొని, హరినామస్మరణలతో "శ్రీరంగ రంగ రంగ" "కస్తూరి రంగ రంగ" "కావేటి రంగ రంగ" అను నినాదాలతో శ్రీరంగనాథుని దేవాలయ ప్రాకారాల చుట్టూ, ప్రదక్షిణ నమస్కారములు, పొర్లుదండములు మున్నగునవి ఆచరిస్తున్నారు.

అప్పటికి ప్రాతఃకాలము కాగా, అరుణోదయముకానున్న సమయమున, ఒక దివ్యతేజోమూర్తి, శ్రీవైష్ణవ ఆచార్య శిరోమణి- కాషాయంబరధారి, శ్రీతులసి బీజమాలాలంకృతుడు, ద్వాదశ ఊర్ధ్వపుండ్ర శోభితుడు, త్రిదండ హస్తభూషణుడై "శ్రీమన్నారాయణ" "శ్రీమన్నారాయణ" అను నినాదముతో నడచివచ్చి, శ్రీరంగనాథ దేవాలయగోపుర అగ్ర భాగానికి మెలమెల్లగా అధిరోహించినాడు. అక్కడ మధ్యభాగానికి చేరి, నిటారుగా, నిలిచి, క్రింది భాగాన సంచరిస్తున్న అశేషజన సమూహాన్ని కలయజూచి, ఉచ్ఛైశ్వరంతో ఇలా ఉపన్యసించినాడు.

"ప్రియ భగవత్‌బంధువులారా! ఒక్కింత తడవు నేచెప్పనున్న ముఖ్యవిషయమును శ్రద్ధగా వినగలరు...

శ్రీమదష్టాక్షరీ మంత్రరత్నము, సర్వమానవకోటికి సులభసాధకమైన మోక్షోపాయ మార్గమని మనకందరకు తెలిసియున్న యథార్థము...., కాని, ఆరత్నము లభ్యమైనది ఏ కొందరికో తప్ప ఎక్కువమందికి కాదు. అందరికి కానేకాదు. ఇందుకు కారణము తరతమ భేదాలు, స్త్రీపురుష వివక్షలు కాక గురుశుశ్రూషలు వంటివి అనేక ఆటంకాలు అనాదిగ అడ్డువస్తున్నది. ఇది సమతాసృష్టి కాక, పక్షపాత బుద్ధి అని, నేను ఎన్నియో సంవత్సరములనుండి చింతించి, మనస్తాపము పొందివున్నాను. ఈ విపరీత పరిస్థితిని నివారించవలెనని దృఢనిశ్చయంతో ఇప్పుడు ఇక్కడకు వచ్చియున్నాను...

ప్రియభగవత్‌బంధువులారా! సృష్టిలోని ప్రతిప్రాణియు ఆ పరమాత్ముని సంతానమే అని మనము నమ్ముతున్నాము కదా! అటువంటప్పుడు కులప్రమేయంలో ధనికులని, దరిద్రులని, హరిజనులని, గిరిజనులని, పతితులని, భ్రష్టులని బాహ్యాన్నిమాత్రమే చూచి, మోక్షమార్గమునకు దూరముచేసి, ఆ పరమాత్ముని ఆశయానికి ఆటంకము కల్పిస్తున్నట్టుకాదా? ప్రతి మానవుడు పరమాత్ముని సంతానమే, కనుక అందరు సోదర తుల్యులు. అందరికి సమానముగ ఆ మోక్షసాధనము లభించవలె. "సత్యమ్, సత్యమ్ పునః సత్యమ్".

కాని, మన సనాతన ధర్మసూత్రములు, గురుపరంపర, సంప్రదాయ నియమాలవంటి విధినిషేధములు ఆటంకములు అడ్డుగా నిల్చివున్నవి. ఇంతకుమించి, నియమాన్ని దాటితే గురుశాపానికి పాత్రుడగును. అయినాసరే! నేను ఈనాడు ఆ నియమాలను దాటి, ఆమంత్ర రత్నాన్ని సర్వజనుల శ్రేయస్సు కొరకై ఉపదేశించినట్లయన యెడల, గురుశాప ప్రభావంచేత, నేను నరకములో పడక తప్పదు...పోనిండు, లక్షలాది ప్రజలు ఆమంత్రసిద్ధిపొందలేక, సంసార సాగరంలో పడిపోయికొట్టుమిట్టాడుతు, చచ్చుచు, పుట్టుచు, పుట్టుచు, చచ్చుచు చర్విత చర్వణులై తుదకు నరకమునకే చేరి, యమయాతనలు పొందువారిని కాపాడగలిగిన ఏకైక మంత్రరాజము (అష్టాక్షరీ)ను సులభసాధ్యముగ అందరికీ బోధించి, తరింపజేసినందువలన **నేను ఒక్కడినే నరకమునకు పోవచ్చును.** కాని, లక్షలాది మంది మానవమాత్రులు వర్తమాన, భవిష్యత్ కాలములో మోక్షంపొంది తరించెదరు కదా! "ఇది నా సంకల్పం".

కనుక ఇప్పుడు మీ అందరు అష్టాక్షరీ మంత్రమును శ్రద్ధగావిని, జ్ఞాపకముంచుకొని శుచి శుభ్రతలు పాటించుచు, సర్వదా మననం చేసుకొనవలెనని, కోరుచున్నాము. "ఓమ్ నమో నారాయణాయ" ఈ విశిష్ట మంత్రరాజమును మన సువిశాల భూమండలములో ఇష్టపడి కోరినవారందరకు నిస్సంకోచముగా బోధించి, వారిని తరింపజేయండి. రాగల తరాలలో గురుపరంపరకు నా ఆదేశముగా భావించి అనుసరించవలసినది. స్వస్తి..."శ్రీమన్నారాయణ" అని జపిస్తూ, శ్రీభగవద్రామానుజాచార్యులవారు గోపురంనుండి క్రిందకు దిగినారు. అప్పుడు శ్రీరంగనాథస్వామిదేవళముతో పాటు ఇతర దేవాలయములలోని అన్ని గంటలు 'గణగణ'మని మ్రోగినాయి. శ్రీకావేరీ నది మధ్యభాగమునందు ఒక పెద్ద కెరటము నృత్య హేలతో పైకి లేచి మెల్లమెల్లగా క్రిందకు దిగిపాకుతూ శ్రీస్వామిసన్నిధిలో వేంచేసియున్న గరుడాళ్వారు చక్రత్తాళ్వార్ల విగ్రహాలపాదాలచెంతకువచ్చి మృదువుగా తాకి, మెల్లమెల్లగా వెనుకకు తిరిగి మరలిపోయి నదీమతల్లి ఒడిలో ఒదిగిపోయినది.

శ్రీవైకుంఠైకాదశి సందర్భమున విశేషముగ స్వామివారిని సేవించుకుని, గర్భగుడినుండి బయటకు విచ్చేసిన (రామానుజుల గురుశ్రేష్ఠులు) గోష్ఠీపూర్ణులు జనసందోహమును దాటుకుని ముందుకు వచ్చి నిలువగానే శ్రీరామానుజులు ఎదురుగ వేంచేసి, గురువర్యులకు సాగిలపడి సాష్టాంగదండ ప్రణామం ఆచరించి, లేచి నిలబడగానే, శిష్యుని లేవదీసి, కౌగిలించుకుని "ఎంబెరుమానారే!" అని అభినందన పూర్వకంగా ఆశీర్వాదాన్ని కృపచేసినారు. "మాకంటె నీవే గొప్పవాడవయ్యా!" అని దాని కర్థము, కనుక భగవద్రామానుజులవారు "సమతామూర్తి" అని బిరుదు పొందటానికి తగినవారని చెప్పక తప్పదు.

రాగల 2016-17వ సంవత్సరములో శ్రీరామానుజలవారికి సహస్రవర్షములు నిండనున్న సందర్భమున, శ్రీరాంనగరులో ప్రతిష్ఠిత మగుతున్న శ్రీవారి బృహత్ విగ్రహ సంపూర్తితో శ్రీశ్రీశ్రీత్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్‌స్వామివారి ఆధ్వర్యమున మహోత్సవము జరుగనున్నది. అందుకు కోట్లాది రూపాయలు ఖర్చు కాగలవు, కనుక మనవంతుగా యథాశక్తితో విరాళములు సమర్పించి శ్రీరామానుజుల సహస్రాబ్ది ఉత్సవాలను ఘనంగా జరుపుకుని, శ్రీవారి ఋణాన్ని కొంతవరకైన తీర్చుకొనవచ్చును. "సర్వదేశదశకాలేషు అవ్యాహత పరాక్రమా, **రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతామ్ అభివర్ధతామ్" "శ్రీరామానుజాచార్య దివ్యాజ్ఞా ప్రతివాసరముజ్వలా, దిగంతవ్యాపినీ భూయాత్ సాహిలోక హితైషిణీ!**

**"సర్వేజనాః సుఖినో భవన్తు"**

# శ్రీరామానుజ సహస్రాబ్దికి చిన్నారుల స్పందన



రాజమహేంద్రి వాస్తవ్యులు శ్రీమాన్ చిరంజీవిగారి మనుమరాలు చిలకమర్రి అర్చిత. ఈమే ప్రాజెక్ట్ ఇంజనీర్‌గా బెంగులూరులో ఉద్యోగంచేస్తున్నారు. వీరు మొదటినెల వేతనం రూ.26,000 శ్రీరామానుజ సహస్రాబ్దికి సమర్పించారు. వీరికి శ్రీస్వామి వారు మంగళాశాసనాలు అనుగ్రహిస్తున్నారు.



శ్రీమతి శారదారాణి- శ్రీమాన్ శ్రీనివాస్ దంపతుల కుమార్తె చి॥ వెంకటలక్ష్మీ సుమేధా, చి॥ యజ్వన్‌శౌరి తల్లిదండ్రులు ఇచ్చిన ప్యాకెట్‌మనీని రూ.1,101ను శ్రీరామానుజ సహస్రాబ్దికి సమర్పించారు. ఇలాంటి సంతానాన్నే సత్సంతాన మంటారు అని శ్రీస్వామివారు మంగళాశాసనాలు అనుగ్రహించారు.



విజయవాడ వాస్తవ్యులు శ్రీమాన్ గొట్టుముక్కల శ్రీనివాసరాజు- లావణ్య దంపతుల కుమారుడు చి॥ ఖగేంద్ర రూ.5000 శ్రీరామానుజ సహస్రాబ్దికై శ్రీస్వామివారికి సమర్పించాడు. వీరికి అనేక మంగళాశాసనాలు అనుగ్రహించారు.



విజయవాడ వాస్తవ్యులు శ్రీమాన్ దుర్గాప్రసాద్ లక్ష్మీ దంపతుల కుమారుడు చి॥ ధన్వి రూ.1,116 శ్రీరామానుజ సహస్రాబ్దికై సీతానగరంలో శ్రీస్వామివారికి ప్రత్యక్షంగా అందజేసారు. వీరికి శ్రీస్వామివారు అనేక మంగళాశాసనాలు చేసారు.



నవంబర్ 20వ తేది శ్రీస్వామివారు తూ.గో జిల్లాలోని తుని పట్టణంలో సహస్రాబ్ది గురించి శ్రీస్వామివారు ప్రవచించగా విని, ఒక చిన్నారి వెనువెంటనే స్పందించి, తాను దాచుకున్న 10,000 రూపాయలను శ్రీస్వామి వారికి సమర్పించింది. అందుకు సంతసించి, శ్రీస్వామివారు మంగళాశాసనాలు అందించారు.



ఆదిత్యా కాలేజ్- భీమవరంలో ఇంటర్ సెకండ్ ఇయర్ చదువుతున్న చి॥విష్ణువర్ధన్ సూర్యనారాయణవర్మ, తన పుట్టినరోజులకోసం వారి తల్లిదండ్రు తనకిచ్చిన డబ్బుని దాచుకొని, రూ.25,000లు. శ్రీస్వామి వారు సీతానగరంలో వేంచేసి యుండగా వచ్చి, శ్రీరామానుజ సహస్రాబ్దికి సమర్పించాడు. శ్రీవారు అనేక మంగళాశాసనాలు అనుగ్రహించారు.



విజయవాడ వాస్తవ్యులు గుమ్మడి శ్రీమాన్ రాజేష్ పార్వతీ దంపతుల ననయుడు చి॥ వేంకటసాయి రూ.25,000 శ్రీరామానుజ సహస్రాబ్దికై సీతానగరంలో శ్రీస్వామివారి సమక్షాన సమర్పించాడు. వీరికి అనేక మంగళా శాసనపూర్వక ఆశీస్సులను అందించారు.



తాడేపల్లి వాస్తవ్యులు శ్రీమాన్ చందన రామోజీ దాసు, ఇతను వికలాంగుడయినా శ్రీరామానుజులపైన అమితమైన భక్తిచేత తన వంతుగా తోచినది స్వామికి సమర్పించాలనే త్వరతో సీతానగరం వచ్చి, శ్రీస్వామివారికి సహస్రాబ్దికి రూ.1,500 సమర్పించాడు. ఇతనికున్న శ్రద్ధా భక్తులుకు మెచ్చుకొని, మంగళాశాసనాలు అనుగ్రహించారు.

## శ్రీరామానుజ సేవలో తరించిన
## శ్రీమాన్ వంగల నరసింహాచార్యులుగారు

"భగవద్రామానుజ సహస్రాబ్ది చేరువౌతోంది. మనమంతా కలిసి ఆ సమతామూర్తి వైభవాన్ని ప్రతి ఒక్కరికీ తెలియచెప్పాలి. ఆ ఉత్సవాలలో పాల్గొనే అవకాశం లభిస్తున్నందుకు ఈ జన్మను సార్థకం చేసుకోవాలి. అందరూ నడుం కట్టండి. మీ మీ ప్రాంతాల్లో ప్రజలను చైతన్యవంతుల్ని చేయండి" అంటూ శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారు చేసిన మహోపదేశంవంటి ప్రసంగం చెవుల్లో మారుమ్రోగుతోంది. ఆలోచిస్తున్నారు శ్రీమాన్ వంగల నరసింహాచార్యులుగారు-రిటైర్డు ఫిజిక్స్ లెక్చరర్- పెనుగొండ.

ఔను ఆ యతీంద్రుల కటాక్షంతో పదవీకాలం ఆనందంగా ముగిసింది. శేషజీవితం అపరరామానుజులైన శ్రీ చిన్న జీయరు స్వామివారి ఆజ్ఞతో ఆ భగవద్రామానుజ సేవలోనే గడపాలి. అధ్యాపక వృత్తిలో జీవితం గడపడం వలన ... ఆ మార్గంలోనే విద్యార్థి లోకాన్ని సమాయత్తం చేసి సమతామూర్తి వైభవాన్ని చాటిచెప్పాలి అని నిర్ణయించుకున్నారు. కళాశాలల యాజమాన్యంతో సంప్రదించి కార్యక్రమ రూపకల్పన చేసుకున్నారు. ఆరోజు వాసవీ విజ్ఞాన కళాశాలలో విద్యార్థులతో సమావేశం. ఎంతోమంది విద్యార్థులు ఆసక్తితో ఎదురుచూస్తుండడం చెప్పలేని ఆనందం కల్గించింది. రామానుజ వైభవాన్ని విద్యార్థులకు తెలియచెయ్యాలని 'జై రామానుజ' అని అందరిచేత చెప్పించి ఆయన కూడా అంటూ 'రామానుజ' అని వ్రాస్తూ... అలా అలా ప్రక్కకి ఒరిగిపోయారు. భగవద్రామానుజుల స్వయంగా తమ కరాన్ని అందించి అతిప్రేమతో తమ సన్నిధిని చేర్చుకున్నారు.



శ్రీమాన్ నరసింహాచార్యులుగారు శ్రీ వైష్ణవ సిద్ధాంతానికి, శ్రీరామానుజ దర్శనానికి చేసిన సేవ అనేకవిధాలు. ధనుర్మాస వైభవోపన్యాసాలలో ఉపన్యాసకులని పరీక్షిస్తూ ఆళ్వార్ ప్రబంధ ప్రాజెక్టువారు వీరికి మీరు భౌతికశాస్త్రోపన్యాసకులు కదా.. తిరుప్పావైలో మీ శాస్త్రజ్ఞాన సమన్వయమెలా కుదురుతుంది అని అడిగితే ఆజిమజైక్కణ్ణా పాశురాన్ని తీసుకున్నారు. మేఘం - దాని ఏర్పాటు వేటి వేటితో ఏర్పడుతుంది, అందునా కాంతిధ్వని, ఈరెండింటి వేగం మొ॥ అంశాలను వివరించి అమ్మ గోదాదేవి శాస్త్రజ్ఞానంతో సమన్వయించినపుడు వారంతా ఆశ్చర్యపోయారు. ఇలాంటి వెన్నో...

శ్రీస్వామివారి ఆజ్ఞను శిరసావహించి వికాసతరంగిణి కార్యక్రమాలు ప్రచారం చేయడంలో, శ్రీరామ భక్తతరంగిణి సమాజ కార్యక్రమాలు నిర్వహించడంలో ఆయన చూపిన శ్రద్ధాసక్తులు అమితానందాన్ని కల్గిస్తాయి. ప్రచారకులు ముందు తాము ఆదర్శంతులుగా ఉండాలన్న సూక్తికి వీరు నూటికి నూరుపాళ్ళు న్యాయం చేశారు.

ఎంతోమంది విద్యార్థులకి కాలేజీలలో ఉచితంగా స్థానాన్ని కల్పించడం, ఒక్కపైసా తీసుకోకుండా వారికెన్నో విషయాలు చెప్పి విజ్ఞానవంతులను చేయడం, ఇళ్ళల్లో వ్యర్థంగా కాలాన్ని గడుపుతున్న వారెందరికో భగవత్తత్త్వవైభవాన్ని తెలియచేసి నిత్యపారాయణ గోష్ఠిలో చేర్చుకొనడం ఇవన్నీ కొన్ని మాత్రమే!

పరమత ప్రలోభాలకు గురిఔతున్న ఎందరికో మన సంస్కృతీ వైభవాన్ని చాటిచెప్పి గీత దాటకుండా చేసి వారికి కొత్త ఆధ్యాత్మిక జీవనాన్ని ప్రసాదించిన ఘనత అభినందనీయం. సాహసోపేతం కూడా. కొఠాలపఱ్ఱ కేశవస్వామి ఆరాధ్యదైవంగా భావించేవారు. అక్కడ జరిగే భగవద్రామానుజ ఉత్సవాలను వైభవంగా జరిపించడంలో సహకరించేవారు.

శ్రీమాన్ నరసింహాచార్యులవారి శ్రీమతి సీతమ్మగారు భర్త అడుగుజాడల్లో నడుస్తూ డొక్కా సీతమ్మగారు అనే దానశీలిని తలపించేవారు. వారి కుమారుడు శ్రీరంగనాథ ప్రసాదంగా లభించిన రంగనాథ్, కుమార్తె ల॥సౌ॥రాధికాపద్మజ అల్లుడు వంశీకృష్ణ మనుమరాలు ప్రణీత... ఆరి మార్గంలో నడుస్తున్న ధన్యులు.

మన వికాసతరంగిణి గొప్ప ప్రచారకుల్ని కోల్పోయింది. మన సిద్ధాంత ఒక ప్రజ్ఞామూర్తిని దూరం చేసుకుంది. పెనుగొండలో వారింటిముందున్న శ్రీరామాలయం వారి వలన కళకళలాడుతూ మురిసిపోతుండేది. టి.టి.డి. ధనుర్మాస సన్మానం ఆలయాభివృద్ధికే అర్పించారు నరసింహాచార్యులుగారు. జనార్దన స్వామికి ఆభరణాలు చేయించారు. ఇలా ఎన్నెన్నో కైంకర్యాలు. శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములు ఆ కుటుంబానికి శ్రీరామరక్ష. పరమపదనాథుని సన్నిధిలో వారు కైంకర్యంలో మునిగిఉన్నారు.

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామి వారి ఆశీస్సులతో...
గోదావరి HDPE పైప్స్, స్ప్రింక్లర్స్ & డ్రిప్
GODAVARI POLYMERS
గోదావరి పాలిమర్స్ ప్రై.లి.
E-mail : homail@godavaripipe.com

గోపురం
కుంకుమ, పసుపు పొడి
పూజ, పండుగ, శుభకార్యములకు శ్రేష్ఠమైనది
Y.V.S. AGENCIES, No.77-11/B, Ashram Street, Bhavani Puram, Vijayawada-12.Ph:0866-6535178/9299557247.
For trade enquiries:044-42943939 email: yvs@gopuramproducts.com

# శ్రీవేంకటాచల "చిత్రే"తిహాసమాల




మూల సంస్కృత రచనం
శ్రీ అనంతాళ్వాన్

చిత్రానువర్తనం
సత్య శ్రీనివాస్ - సిద్ధాంతం

## తిరుపతిలో ఆళ్వార్ ప్రతిష్ఠ

శుకాద్యా మునయః కేచిత్ భృగ్వాద్యాశ్చ తపోధనాః ।
ప్రహ్లాద ప్రముఖాః పుణ్యాః అంబరీ షాదయోనృపాః ॥
విష్ణోరేవా పరం దేహం మన్వానాః తం నగోత్తమం ।
పద్భ్యామాక్రమితుం భీతాః పర్యన్తేష్వేవ వర్తనాః ॥
తన్నిర్గత నదీష్వేవ కుర్వాణాః స్నాన తర్పణే ।
తపః కుర్వన్తి వాంఛన్తః సాక్షాత్కర్తుం జనార్దనమ్ ॥

శుకాదిమునులు, భృగువుమొదలైన కొందరు తపోధనులు, ప్రహ్లాదుడు మొదలైనవారు, అంబరీషాది పుణ్యప్రభువులు, శ్రీవేంకటగిరిని భగవంతుని మరొకరూపంగా భావించి దాన్ని తమపాదాలతో త్రొక్కడానికి భయపడి పర్వతపాద ప్రాంతాల్లోనే సంచరిస్తూ, సెలయేళ్ళలో స్నానార్ఘ్యాదులుచే స్తుతి, తపస్సును కొనసాగించే వారని వామనపురాణం చెబుతున్నది. ఆళ్వారులు కూడా ఈ భావనతోనే కొండ ఎక్కడానికి సిద్ధపడలేదు. దీన్ని గమనించిన భగవద్రామానుజులు, క్రింద తిరుపతిలోనే ఆళ్వారుల సన్నిధానాన్ని ఏర్పరచారు. కపిలతీర్థ సమీపాన నమ్మాళ్వారుల ఆలయం ఇలానే ఏర్పడింది. కపిల తీర్థానికి వెళ్లే త్రోవలో ముందుగా నమ్మాళ్వారుల ఆలయం గోచరిస్తుంది.



## చిత్ర కూటంలో గోవిందరాజస్వామి

చిదంబరానికి తిరుచిత్రకూటమని పూర్వవ్యవహారం. పుండరీకవల్లితాయారుతో శ్రీగోవిందరాజస్వామి పుండరీకవల్లి తాయారుతో సరోవర తీరాన వేంచేసి ఉంటాడు. ఈ తిరుచిత్రకూట వైభవాన్ని కులశేఖరులు, తిరుమంగైఆళ్వార్లు కీర్తించారు. దీన్ని చోళరాజు వైష్ణవద్వేషియై గోవిందరాజస్వామి మూలమూర్తిని పెకలించి సముద్రంలో పడవేశాడని ఐతిహ్యం చెబుతోంది. గరుడవాహన పండితుడుకూడా ఈ విషయాన్ని ఈ క్రింది శ్లోకంలో చెప్పాడు.



**దుర్మేధాః పరుషపురోహితానురోధీ నిర్భిద్యత్రిభువన నాయకస్య విష్ణోః ।**
**ధామైకం సులలిత చిత్రకూడముఖ్యం పాథాథేః పయసి సపాతయాం బభూవ॥**

దుర్బుద్ధి అయిన చోళరాజు, పురోహితుని మాటలు బుర్రకెక్కించుకొని, త్రిభువననాయకుడైన శ్రియఃపతి మందిరాన్నొకదాన్ని 'చిత్రకూటం' అని పిలువబడేదాన్ని ధ్వంసంచేసి సముద్రంపాలుచేశాడు. అని తెలిసికొన్నారు భగవద్రామానుజులు. చిత్రకూటనాథుని సముద్ధరించాలని ఉద్యమించారు. దానిఫలంగానే తిరుపతిలో గోవిందరాజు సన్నిధానం ఏర్పడిందని వేంకటాచలేతిహాసమాల చెబుతున్నది.

చిత్రకథ - 37

# రామానుజ చిత్రకథ














దాన్ని సంస్కరించి ఆహూతులు అర్పిస్తే...


పంచసంస్కార సంసన్నుడైన జీవుడు భగవత్కైంకర్యంగచేసే జీవన యానాన్ని...


చమసమనే పాత్ర దేవతలు దానిని ప్రీతితో గ్రహించడానికి ఉపయోగపడుతుంది.


గమనించి భగవంతుడు ఈతణ్ణి ప్రీతిత స్వీకరిస్తాడు.



అట్టి జీవుడు సముద్రంలాంటి సంసారాన్ని తాను దాటగలడు తనవారందరినీ దాటించనూ గలడు.


అలాంటి ప్రపన్నుడు ఈదుఃఖ
సాగరాన్ని శ్రమలేక దాటుతాడు.


విష్ణు వనే ఓడ వీణ్ణి సుఖంగా ఈ సంసార ప్రవాహంలోంచి ఆనందపు టంచులకి చేరుస్తుంది.


అంతేకాదు. అత్యుత్తమమైన పరమపదాన్ని ఇతడు శ్రేష్టుడై పొందుతాడు.


ఆహా! తాత్వికంగా చేసిన ఈ సమన్వయం అద్భుతంగ ఉంది.


యజుర్వేదంలో కూడా ఇలాంటి ది గమనించవచ్చు.


ఎక్కడ?


తైత్తిరీయ శాఖ 1.4. 51 మంత్రంలో
'యేన దేవాః పవిత్రేణ। ఆత్మానం పునతే సదా । తేన సహస్ర ధారేన పావమాన్యః పునంతుమాం'
దేవతలు సహస్రారమైన ఏ సుదర్శన చిహ్నముతో తమను పవిత్రులుగ చేసుకుంటున్నారో పావనులగు ఆచార్యులు నన్నుకూడా అట్టి తాప సంస్కారముతో పునీతుని చేయుదురు గాక!


దేవ గురువైన బృహస్పతిద్వారా దేవతలంతా పంచసంస్కార సంపన్నులౌతారు.


సరసంగ సమన్వయం చేసారు.


యజుర్వేద కాఠకలలో 3.12.14 వ మంత్రాన్ని కూడా పరిశీలించండి.
'చరణం పవిత్రం వితతం పురాణం యేన పూత స్తరత దుష్కృతాని తేన పవిత్రేన శుద్ధేన పూతాః అతి పాప్మాన మరాతిం తరేమ.


అవునూ! ఇది శుద్ధి మంత్రం కదా! దీనికెలా అర్థంచెప్పాలి.

ఇంకాఉంది.

With Best Compliments from








# KAKATIYA CEMENT

**Quality Always - Ahead**

53 Grade Cement &
White Crystal Sugar

**Sri P. VENKATESWARLU**
Chairman & Managing Director

## KAKATIYA CEMENT SUGAR & INDUSTRIES LIMITED

*Regd. Office :* 1-10-140/1, Gurukrupa, Ashok Nagar, Hyderabad - 500 020
✆:27637717, 27633627, Fax No : 040 - 27630172, E-mail : kcsil@sol.net.in
E-mail: info@kakatiyacements.com

*Cement Factory :*
Srinivasanagar, Jaggaiahpet,
Krishna Dist - 521 175
✆ 08654 - 200014
Fax No: 08654-296331

*Sugar Factory :*
Peruvancha Village, Kallur Mandal,
Khammam Dist - 507 209,
✆: 08761 - 287207
Fax No: 08761 - 287206

# అరచేతిలో ఆరోగ్యం



యం. విజయలక్ష్మి - హైదరాబాద్ (శ్రీరామస్థూప ప్రాజెక్ట్.)

**విష్ణువర్ధనాచార్య (వేదపాఠశాల విద్యార్థి) వయస్సు-9సం॥లు.**

**సమస్య :** ఈ పిల్లవాడికి జనవరి-2014 నుండి కళ్ళు తిరగడం, తలనొప్పి, జనవరినుండి మందులు వాడుతున్నాడు. సమస్య అలాగే ఉంది.

**ట్రీట్‌మెంట్ :** లివర్ ఛానల్ పాయింట్లు, గవర్నింగ్ ఛానల్ పాయింట్లు, గాల్‌బ్లాడర్ ప్రారంభపాయింట్లు (చెవిముందువైపు) పిల్లవాడు హాయిగా ఉంది అని చెప్పాడు. 10నెలల నుండి మందులువాడినా ఇంత హాయిగా ఎప్పుడులేదు" అన్నాడు. సూచనలు చేసి ఎలా చేసుకోవాలో తెలిపాము.

**టి. సంతోష్‌కుమార్ (వేదపాఠశాల విద్యార్థి) 10వ తరగతి.**

**సమస్య :** ఈ బాబుకి 3 సం॥ల క్రితంనుండి కాళ్ళనొప్పి, నడకలో తేడా. చాలాసార్లు డాక్టర్లు చూసారట. మందులు వాడినా సమస్య అలానే ఉంది.

**ట్రీట్‌మెంట్ :** కాళ్ళయొక్క రిఫ్లెక్స్‌పాయింట్లు, మరియు యూరినరి బ్లాడర్‌మార్గం, నొప్పి తగ్గి చక్కగా నడుస్తున్నాడు. ఇలా శారీరకరోగాలు- నొప్పులు ఎన్నో రకాలు అనేకమంది చికిత్స తీసుకొన్నవారి దస్తూరీ(చేతివ్రాతతో) వ్రాసిన రికార్డు పుస్తకాలున్నవి. ఆశ్రమము (జీవాప్రాంగణము) నందు మీరు చదివి తెలుసుకోవచ్చు. ప్రేరణ పొందవచ్చు. ఇక మానసిక రుగ్మతలతో పిల్లలు-పెద్దలుకూడా ట్రీట్‌మెంట్ కోసం వస్తూంటారు. లాభపడినవారు ఉన్నారు. ప్రస్తుతం రెండు కేసులు తెలుపుతాను చదవండి.

**ఒక అమ్మాయి వయస్సు 23సం॥లు, తల్లిదండ్రులతో అవనిగడ్డ నుండి వచ్చినది. మంచి ఉద్యోగం, తండ్రిటీచరు. ఆయన కూతురి 'డిప్రెషన్' గురించి చెప్పి కన్నీరు పెట్టుకున్నారు**

**సమస్య :** చిన్న మానసిక సమస్య. రెండు సంవత్సరాలనుండి మానసిక నిపుణుడివద్ద వైద్యం తీసుకుంటూ, మందులు వాడుచున్నది. సమస్య తీరలేదు. ఇంగ్లీష్ మందులు ఆపివేయమని సలహా ఇచ్చాను. మూడుసార్లు (ఒకటిన్నర రోజులో) ఆక్యుప్రెషర్ వైద్యం చేసాను. ఇంగ్లీష్ మందు ఆపివేసి మరియు 'కౌన్సిలింగ్' ఒక గంటపాటు చేసాను. ఎన్నో సూచనలు, ఉదాహరణలు చెప్పి, ఆ అమ్మాయి ఏ విషయంలో తీవ్రంగా ఆలోచిస్తున్నదో దానిపై అమ్మాయితో చర్చించి ఆ విషయం ఎంత అర్థరహితమో ఆ అమ్మాయి గ్రహించేలా వైద్యము మరియు కౌన్సిలింగ్ ఉపయోగపడ్డాయి.

**ట్రీట్‌మెంట్ :** డిప్రెషన్ కేసులకి లంగ్‌ఛానల్- లివర్ ఛానల్ ముఖ్యమైన ఆక్యుప్రెషర్ మార్గాలు. అటుపిమ్మట 'హార్ట్‌ఛానల్' పై వైద్యము చేస్తే మనస్సుకి మెదడుకి ప్రశాంతత ఏర్పడుతుంది. ఆ అమ్మాయి మరుసటిరోజు ఉదయం 10గం॥కి ఆక్యుప్రెషర్ క్లీనిక్‌కి వచ్చింది. ముఖంలో ఎంతో కళ. ఉత్సాహంగా వచ్చింది. తనలోని మార్పు రికార్డు బుక్‌లో వ్రాసియిచ్చింది.

**ఒక అబ్బాయి వయస్సు 18 సం॥లు, తల్లిదండ్రులతో వచ్చాడు. తండ్రి ఓ ఆస్పత్రిలో ఉద్యోగి.**

**సమస్య :** రెండుసం॥గా ఆ అబ్బాయికి మానసిక సమస్య (హైపర్ యాక్టీవ్) మానసిక వైద్యుని సూచనమేర ఇంగ్లీష్ మందులు వాడుతున్నాడు. మార్పు రాలేదు. పైగా రానురాను ఇంకా ఎక్కువ అగుచున్నది.

**ట్రీట్‌మెంట్ :** లివర్ ఛానల్- కిడ్నీ ఛానల్ పాయింట్లు వద్ద ఆక్యుప్రెషర్ వైద్యముచేసి ఎండోక్రైన్‌గ్లాండ్సుపై వైద్యము చేసాము. భయం పోయింది. అన్ని విషయాలు నార్మల్‌గా మాట్లాడాడు. ఇంట్లో ఎలా చేసుకోవాలో సూచించాము. హోమియో మందులు తీసుకొని ఇంగ్లీష్ మందులు ఆపివేశారు. మంచి మార్పు కొనసాగుతున్నట్లు వాళ్ళ తండ్రి ఫోన్‌చేసి చెప్పారు.

నేను,నా బృందము (టీమ్) ఎవ్వరు వచ్చినా, ఎలాంటి స్థితిలో వచ్చినా, చదువుకున్నవారు, చదువుకోనివారు గొప్పగొప్ప ఆసుపత్రులలో చికిత్స పొందినవారు, డబ్బులేక వైద్యం చేయించుకోనివారు, స్త్రీ, పురుషులు, పిల్లలు-పెద్దవాళ్ళు ఇలా... ఎవ్వరైనా సరే అందరిపట్ల ఒకే భావనతో ప్రేమతో - ఓపికతో వైద్యము చేస్తాము. ఎవ్వరిపట్ల ఎలాంటి తేడాలు ఉండవు. వేలాది మందికి చేశాము. ఒక్కరూకూడా ఖాళీగా వెళ్ళలేదు. 100 % లేదా 75% వరకు సమస్య తగ్గి వెళ్ళినవారే అందరు.

ఎందరెందరో వేలు-లక్షలు ఖర్చుపెట్టి, ఆపరేషన్స్ చేయించుకొని, రెండుమూడు సంవత్సరాలు కాదు 10,20,30 సంవత్సరాలు డాక్టర్ల చుట్టూ తిరిగి నయంకాకపోతే ఈ వైద్యముతో చాలా ఉపశమనము పొందారు. దీనికంతటికీ కారణం మన శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయర్‌స్వామివారు.

రోగం వచ్చినప్పుడు చిటికెలో రోగం నయం చేసే ఈ ఆక్యుప్రెషర్ వైద్యముతో లక్షలాది జనాలు బాగుపడుతుండాలి, ఏ ఇబ్బందులు లేకుండా డబ్బు ఖర్చు కాకుండా అందరికి- ఆరోగ్యం సమకూరాలని శ్రీచిన్నజీయర్‌స్వామివారి ఆరాటం.



# శ్రీరామానుజ సహస్రాబ్ది విశేషాలు

## సహస్రగ్రంథప్రకాశనం-విద్వద్గోష్ఠి

భగవద్రామానుజ సహస్రాబ్దిని పురస్కరించుకొని పలురకాల కార్యక్రమాలు దేశవ్యాప్తంగా జరుగుతున్నాయి. మన శ్రీరామ్‌నగర్ జీవాప్రాంగణానికి దగ్గరగా 'సమతామూర్తి' విగ్రహప్రతిష్ఠకు విశేషప్రణాళిని రచించడం, అమలుకు ఉద్యమించడం అందరూ ఎరిగిన విషయమే. ఇదే సందర్భంగా 'సమతామూర్తి' శ్రీరామానుజుల దర్శనాన్ని, సంప్రదాయాన్ని ప్రపంచానికి బహుముఖంగా 'సహస్రగ్రంథప్రకాశనం' అనే ప్రణాళిద్వారా అందించాలనే భావన




కొందరు పెద్దల మనస్సుల్లో కలగడం ముదావహం. ఈ భావనను వెలుపలికి తెచ్చినవారు శ్రీమాన్ ప్రొ॥ కణ్ణన్‌స్వామి. వీరు హైదరాబాద్ కేంద్రవిశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నవారు. స్వామివారిదగ్గరకు ఒక ప్రణాళికతో వచ్చారు. వారు తమ ముందుంచిన ప్రణాళిని, స్వామివారు ఆమోదించి, మనభక్తినివేదన సంపాదకులు శ్రీమాన్ రంగరామానుజాచార్యస్వామివారితోను, ఇటీవల మన 'జీవా' రీసర్చ్ మరియు పబ్లికేషన్స్ విభాగంలో నియుక్తులైన డా॥విజయరాఘవన్‌స్వామి వారితోను సంప్రదించి ప్రణాళికను రచించారు. తొలుత విద్వద్గోష్ఠిని ఒకదాన్ని ఏర్పరచి, ఆగోష్ఠిలో "సహస్రగ్రంథప్రకాశన ప్రణాళి"ని చర్చకు పెట్టాలని, అందుకోసం నవంబరు 2వ తేదీ ఒక సమావేశాన్ని ఏర్పరచాలని నిర్ణయించడం జరిగింది. ఈ నిర్ణయాన్ని అనుసరించి దాదాపు వందమంది పైగా ప్రముఖులు ఉత్సాహవంతులు అయిన విద్వాంసులను ఆహ్వానించడం జరిగింది. ఈ సమావేశానికి 60పైగా విద్వాంసులు విచ్చేశారు. ఢిల్లీ, బొంబాయి, మేల్కోటై, బెంగుళూరు, చెన్నై, త్రివేండ్రం, మధురాంతకం, శ్రీరంగం మొదలైన ప్రాంతాలనుంచి విచ్చేసిన ఈ విద్వాంసులకు ఆతిథ్యానికి తగిన వసతులు ముందుగానే సిద్ధంచేసి పెట్టి, విచ్చేసిన పెద్దలకు ఎలాంటి అసౌకర్యం కలక్కుండా జాగ్రతలు తీసికోవడం జరిగింది. ఈ ప్రయత్నంలో తమ సంపూర్ణ సహకారాన్ని, సహయోగాన్ని అందించిన శ్రీమాన్.ప్రొ.కణ్ణన్‌గారు, శ్రీమాన్ విజయరాఘవన్‌స్వామి విశేషాభివందనీయులు. శ్రీరామానుజసహస్రాబ్ది సమితి పక్షాన నిర్వహింపబడిన ఈ విద్వద్గోష్ఠి కార్యక్రమం 2వ తేదీ చాలా భవ్యంగా సాగింది. పలువురు విద్వాంసులు తమ అభిప్రాయాలను వ్యక్తపరచడమేకాక, తామేయేవిషయాల్లో తమసహయోగాన్ని అందించదలచారో వాటిని ఒక పత్రం పై వ్రాసి-సమావేశ నిర్వాహకులకు అందించారు. ఆనాటి సభ ఉ.11 గంటలకు ఆరంభమై మధ్యలో ఒక గంట విశ్రామంతో రాత్రి 7దాకా సాగింది. 'మహామహోపాధ్యాయ' 'కవిశాబ్దికకేసరి' 'శాస్త్రరత్నాకర' శ్రీమాన్S.N.C రఘునాథాచార్యులవారు అధ్యక్షులుగా, పరమహంసపరివ్రాజకులు శ్రీశ్రీశ్రీత్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారు, శ్రీశ్రీశ్రీత్రిదండి అహోబిలరామానుజ జీయర్‌స్వామివారు, శ్రీశ్రీశ్రీత్రిదండి దేవనాథ రామానుజ జీయర్ స్వామివార్ల మంగళాశాసనాలతో శ్రీమాన్ రంగరామానుజచార్య స్వామివారి పరిచయ వాక్యాలతో ఆరంభమైంది. శ్రీమాన్ విజయరాఘవన్ స్వామి శ్లోకోపశ్లోకనంతో స్వాగతం పలికారు. అధ్యక్షుల భాషణం, శ్రీమాన్ కణ్ణన్‌స్వామి ముందుమాటలు అయిన తరువాత విచ్చేసిన పెద్దలు క్రమంగా తమ అభిప్రాయాలు వెలిబుచ్చారు. ఈ క్రమంలో శ్రీమాన్ ప్రొ॥లక్ష్మీతాతాచార్యులుగారు, C. DAC డా॥ పి.రామానుజంగారు మొదలైనవారు ప్రసంగించారు.

ప్రొఫెసర్ కణ్ణన్‌గారు చాలా విస్తృతమైన రిపోర్ట్ గోష్ఠి ముందుంచారు.

### ఈ క్రింది అంశాలు విచారణకు వచ్చాయి

రామానుజ సంప్రదాయంలో వందలాది పూర్వ ఆచార్యులచే రచింపబడిన గ్రంథాలను గురించి సమగ్రంగా విచారణ జరిపి ఇంతవరకు ప్రకాశితాలు కాని గ్రంథాలను ప్రకాశింపజేయాలి. ప్రతి పుస్తకం తప్పనిసరిగా రెండు భాషల్లోనైనా ఉండాలి. సంస్కృతం,



ఆంగ్లం, హిందీ, తెలుగు, తమిళం, కన్నడం భాషల్లో ఏ రెండు భాషల్లోనైనా గ్రంథం లభించేలా చేయాలి. మొట్టమొదటగా ఏ పుస్తకాన్నైనా ఎలక్ట్రానిక్ పుస్తకరూపంగా ప్రకాశింపజేయాలి. అటుతరువాత ఆవశ్యకతనుబట్టి ముద్రించవచ్చును. ఏదైనా పుస్తకం ఇదివరకే ముద్రింపబడి ఉంటే దానికి అనువాదాలు సమకూర్చాలి. ఇదివరకు ముద్రింపబడిన గ్రంథాన్నైనా భాషాంతరానువాదంతోపాటు టిప్పణి, అనుబంధాలు, సూచికలు, మొదలైన వాటితో పరిష్కరించి సమగ్రరూపతను ఏర్పరచాలి.

**అనువాదరీతి**

అనువాదమనేది **1) యథాతథానువాదం 2) సంగ్రహానువాదం 3) సారాన్ని ఉద్ధరించడం 4) వివరణాత్మకానువాదం** ఇలా ఉండవచ్చును.

## స్వతంత్రవ్యాఖ్యాననిర్మాణం

1) పలుమార్లు ముద్రింపబడిన వ్యాఖ్యానాలుకాక క్రొత్తగా వ్రాసినవి, లేదా, ఇంతవరకు ప్రకాశితాలుకాని ప్రాచీన వ్యాఖ్యానాలు ముద్రించాలి.

2) ఆధునిక పండితుల్లో శాస్త్రపరిజ్ఞానంకలిగి స్వతంత్రంగా వ్యాఖ్యానం వ్రాయగలిగినవారిని ఎన్నుకొని వారిద్వారా సంస్కృతగ్రంథాలకు సంస్కృతంలోను, లేదా ఇతర భాషల్లోను వ్యాఖ్యానాలు వ్రాయించి ముద్రించాలి.

ఇందుకొరకు ముద్రింపదలచిన గ్రంథాలను ఈ క్రిందివిధంగా విభజించాలి.

1) శాస్త్రవిభాగం, 2) కావ్యవిభాగం, 3) స్తోత్రవిభాగం, 4) వ్యాఖ్యానవిభాగం, 5) సంకీర్ణవిభాగం. ఇవికాక,

1) ద్రావిడపద్యవిభాగం, 2) మణిప్రవాళరహస్యగ్రంథవిభాగం, 3) మణిప్రవాళవ్యాఖ్యావిభాగం, 4) ఆచార్యస్తోత్రవిభాగం. ఇలా విభాగం చేసి ఆయా విభాగానికి సంపాదకులు, అనువాదకులు, అక్షరటంకనం చేసేవారు, పరిష్కర్తలు, శోధకులు, వ్యాఖ్యాతలు, విమర్శకులు ఇలా అధికసంఖ్యలో విద్వాంసులు అన్వయించేలా చేయాలి.

## యువకులకు విశేషప్రోత్సాహం

1) ఈ-లైబ్రరీ తయారుచేయడంలో, ఇంకా ఇతర ఎలక్ట్రానిక్ మాధ్యమంలో గ్రంథాలను ప్రకాశింపజేయడంలో విశేషంగా కొందరు యువకులకు లఘుకాలిక శిక్షణం ఇవ్వాలని ఇటీవల కొందరు పెద్దలు (డా॥పి.రామానుజన్‌గారు) సూచించారు. స్థూలంగా ఈ ప్రక్రియలో గ్రంథప్రకాశన వ్యవస్థను చేయాలి.

## అముద్రితగ్రంథాల గవేశనం

దేశంలోని చాలా మ్యాన్యుస్క్రిప్ట్ లైబ్రరీల్లో అముద్రిత ప్రతులు ఎన్నో ఉన్నాయి. ఉదాహరణానికి చెన్నై ఓరియంటల్ మ్యాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలోను, ఇంకా ఇతరత్ర రామానుజసంప్రదాయానికి సంబంధించిన ఎన్నో మూలగ్రంథాలు, వ్యాఖ్యలు, స్తోత్రాదులు ఇంకా ముద్రణానికి నోచుకోకుండా ఉన్నాయని గమనించడం జరిగింది. ఇలాంటి వాటి విషయంలో విశేషదృష్టిపెట్టి ఇలా అముద్రితంగా ఉన్న వ్రాతప్రతుల గురించిన సమాచారం సేకరింపవలసివుంది. ఇలాగే బహుముఖాలుగా 'రామానుజ సహస్రాబ్ది' సందర్భంగా సహస్రగ్రంథప్రకాశనానికి ప్రయత్నం చేయవలసి ఉంటుందని విద్వద్గోష్ఠిలో విశేషంగా పై అంశాలపై చర్చ జరిగింది. విచ్చేసిన విద్వాంసులంతా తమ అమూల్యాలైన అభిప్రాయాలు స్పష్టంగా ఆవిష్కరించారు. సమావేశం పూర్తి అయి స్వస్థలాలకు వెళ్ళిన తరువాతకూడా విద్వాంసులు తమ అభిప్రాయాలను, సహయోగాన్ని ఆవిష్కరిస్తున్నారు ఇది చాలా ముదావహమైనది. ఈ విషయాల్లో తాత్కాలికంగా ప్రొఫెసర్ కన్నన్, యస్.వి. రంగరామానుజాచార్యులు, విజయరాఘవన్ గార్లు ఒక కమిటీగా ఏర్పడి పై అంశాలపై తగిన చర్యలు తీసుకుంటున్నారు.

అంతేకాదు, సాధ్యమైనంతవరకు రాబోయే మార్చిలో ఇలాంటి మరొక సమావేశాన్ని ఏర్పరచాలని, రాలేకపోయిన విద్వాంసులను మళ్ళీ ఆహ్వానించి అన్వయించేలా చేయాలని భావించడం జరుగుతున్నది. ఈ సమావేశానికి రాలేకపోయిన ప్రొఫెసర్ కె.ఈ. దేవనాథన్‌గారు ఇరవైమంది విద్వాంసులతో అముద్రితగ్రంథప్రకాశనానికి కావలసిన ప్రణాళిని సిద్ధం చేస్తామని తెలియబరచడం ముదావహం. ఇలాగే రాలేకపోయిన ఇతర విద్వాంసులుకూడా తమ సహకారాన్ని ఆవిష్కరించేలా వారితో సహస్రగ్రంథప్రకాశనసమితి (తాత్కాలికసమితి) చర్యలు తీసుకుంటున్నది. శ్రీరామానుజసహస్రాబ్ది కమిటీ పర్యవేక్షణలోనే ఈ పనులు జరుగుతాయి. శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి నిర్ణయాన్ని అనుసరించి, సహస్రగ్రంథ ప్రకాశనానికై ఒక స్థిరమైన కార్యనిర్వాహకవర్గం లేదా, సంపాదకమండలి ఏర్పడిన తరువాత ఆ సంపాదకమండలే ఈ కార్యాలను ఫలేగ్రాహులు చేస్తాయి.

## సహస్రగంథప్రకాశన సదస్సులో పాల్గొన్న విద్వాంసులు

1) ఉ.వే. శ్రీ డా॥ రామానుజన్‌గారు (బెంగళూరు)
2) ఉ.వే. శ్రీ డా॥ ఆళ్వార్ గారు (మైసూర్ సంస్కృతవిద్యాలయం)
3) ఉ.వే. శ్రీ డా॥ వి.వాసుదేవన్‌స్వామి (తిరువనంతపురం)
4) ఉ.వే. శ్రీ ప్రొ॥ యమ్.ఎ. లక్ష్మీతాతాచార్య స్వామి (బెంగళూరు)
5) ఉ.వే. శ్రీ కె.ఈ. శ్రీనాథ్‌స్వామి (తిరుపతి)
6) ఉ.వే. శ్రీ డా॥ తిరునారాయణన్‌స్వామి (శ్రీరంగం)
7) ఉ.వే. శ్రీ ప్రొ॥ యన్.ఆర్. శఠకోపతాతాచార్యస్వామి (పూరీ)
8) ఉ.వే. శ్రీ డా॥ యన్.ఆర్. శ్రీధరన్‌స్వామి (కేరళ, త్రిసూర్)
9) ఉ.వే. శ్రీ డా॥ రామకృష్ణమాచార్య (తిరుపతి)
10) ఉ.వే. శ్రీ డా॥ వానమామలై టి.డి. మురళీధరాచార్యస్వామి(ముంబాయి)
11) ఉ.వే. శ్రీ ఆర్. లక్ష్మీనరసింహన్ (మధురాన్తకం)
12) ఉ.వే. శ్రీ వి.యస్. విజయరాఘవన్‌స్వామి (జీవాఆశ్రమం)
13) ఉ.వే. శ్రీ కె.ఈ. గోపాలదేశికన్‌స్వామి (తిరువారూరు)
14) ఉ.వే. శ్రీ కొజియాలం అనంతన్‌స్వామి (ఢిల్లీ)
15) ఉ.వే. శ్రీ. యస్.యస్.ముకున్దన్‌స్వామి (మధురాన్తకం)
16) ఉ.వే. శ్రీ ఎ.కృష్ణమాచార్యస్వామి (శ్రీరంగం)
17) ఉ.వే. శ్రీ అనంతపద్మనాభాచార్యస్వామి (చెన్నై)
18) ఉ.వే. శ్రీ సి.యస్.లక్ష్మీనరసింహన్‌స్వామి (బెంగళూరు)
19) ఉ.వే. శ్రీ పయ్యంపాడి రాఘవాచారియర్య (చెన్నై)
20) ఉ.వే. శ్రీ ఎ. వాసుదేవాచార్‌స్వామి (హైదరాబాద్)
21) ఉ.వే. శ్రీ రంగరాజన్‌స్వామి చిలుకూరు (హైదరాబాద్)
22) ఉ.వే. శ్రీ సౌందరరాజన్‌స్వామి చిలుకూరు (హైదరాబాద్)
23) ఉ.వే. శ్రీ యమ్.యస్. శ్రీకాంత్‌స్వామి (మధురాంతకం)
24) ఉ.వే. శ్రీ జగ్గు వేంకటేశన్ స్వామి (బెంగళూరు)
25) ఉ.వే. శ్రీ డా॥ కోదండరామన్‌స్వామి (తంజావూరు)
26) ఉ.వే. శ్రీ ఒరట్టి శేషాద్రిస్వామి (తిరుచ్చి)
27) ఉ.వే. శ్రీ వి.బాలాజిస్వామి (చెన్నై)
28) ఉ.వే. శ్రీ దయానిధిస్వామి (చెన్నై)
29) ఉ.వే. శ్రీ యమ్.ఎ. అనంతన్‌స్వామి (మైసూరు)
30) ఉ.వే. శ్రీ డా॥ సంపత్కుమారాచార్యస్వామి (తిరుపతి)
31) శ్రీమతి సుధా గారు (శ్రీరంగం)
32) ఉ.వే. శ్రీ జగ్గుస్వామి (బెంగళూరు)
33) ఉ.వే. శ్రీ టి.కె. వి. అయ్యంగార్‌స్వామి (వరంగల్)
34) ఉ.వే. శ్రీ సుదర్శనంస్వామి (మధురాంతకం)
35) ఉ.వే. శ్రీ స్థలశాయిస్వామి (భద్రాచలం)
36) ఉ.వే. శ్రీ మురళీకృష్ణమాచార్యస్వామి (భద్రాచలం)
37) ఉ.వే. శ్రీ వి.రామస్వామి (హైదరాబాద్)
38) ఉ.వే. శ్రీ తిరుక్కోట్టియూర్ మాధవన్‌స్వామి (చెన్నై)
39) ఉ.వే. శ్రీ రామన్ భట్టర్‌స్వామి (తెరళందూర్)
40) ఉ.వే. శ్రీ అద్దంకి శ్రీనివాస్ (హైదరాబాద్)
41) ఉ.వే. శ్రీ జగ్గు శెల్వప్పిళ్ళై (బెంగళూరు)

## ఆచార్య అనుగ్రహం, తల్లిదండ్రుల ప్రోత్సాహంతో యువత ఏదైనా సాధించవచ్చు.

**శ్రీశ్రీశ్రీ స్వామివారి 58వ తిరునక్షత్ర సందర్భంగా వారిజ నేత్ర విద్యాలయకు తదీయారాధన సేవ**

పరమహంస పరివ్రాజకులు, సత్యసంకల్పులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి మంగళాశాసనములు ఉంటే ఎంతటి కార్యాన్నైనా సాధించవచ్చని తెలుసుకున్నాము. ప్రతి సంవత్సరం శ్రీశ్రీశ్రీ స్వామివారు నేత్ర విద్యాలయకు సేవచేసే భాగ్యం నాకు కల్పించారు. ఈ సంవత్సరం ఒక అద్భుతాన్ని ప్రత్యక్షంగా చూశాను. స్వామివారి 58వ పుట్టినరోజుకు (తిరునక్షత్రం) 58రోజులు వారిజ, నేత్ర విద్యాలయ విద్యార్థులకు తదీయారాధన ఏర్పాటు చేయాలనుకున్నాను. స్వామివారు మంగళాశాసనములు చేస్తూ "58రోజులు తిరునక్షత్రం లోగా పూర్తి చేయగలిగాలని పెరుమాళ్ళను ప్రార్థిస్తున్నాము" అన్నారు. స్వామివారి ఆశీస్సులతో వెంటనే అందరికీ ఈ-మెయిల్ ద్వారా విషయం తెలియజేశాను. రోజుకు 8వేలు తదీయారాధనకి అవుతుంది. అలా 58మంది అంటే 4లక్షల 64వేలు సమకూర్చాలి. ఇది నేను ఒక్కదానినే కాకుండా పన్నెండుమంది యువత ఒక్కొక్కరు 5రోజులు చొపన్న వారి తల్లిదండ్రుల ప్రోత్సాహంతో ఏర్పాటు చేయాలి. 12మంది యువతకు మెయిల్ చేశాను. ఇంతవరకు బాగానే జరిగింది.

అక్టోబర్ 13,14 తేదీలలో హుద్‌హుద్ తుఫాన్ ప్రళయతాండవం చేసింది. విజయనగరం, శ్రీకాకుళం, విశాఖపట్నంలలో చెట్లు విరిగి పడ్డాయి. విద్యుత్ స్తంభాలు నేలకొరిగాయి. కరెంటు లేదు. ఇంటర్నెట్ లేదు. కనీసం ఫోన్‌ద్వారా చెప్పాలన్నా మార్గంలేదు. 19వ తేదీన కరెంటు వచ్చింది. కాని నెట్ సౌకర్యం లేకపోవడం వలన నేను ఎక్కువమందితో మాట్లాడలేకపోయాను. అప్పటికి 20రోజులు మాత్రమే పూర్తయింది. ఇంకా 38రోజులకు దాతలు ముందుకు రావాలి. అంటే 3లక్షల రూపాయలు. చాలా భయం వేసింది. 23వ తేదీ దీపావళి నాటికి ఎలా జరిగిందో తెలియదు 53రోజులు పూర్తి అయ్యాయి. చాలా ఆశ్చర్యం అనిపించింది. తెల్లవారితే స్వామివారి పుట్టినరోజు. ఇంకా 5రోజులకు అంటే 40వేలు రావాలి. రాత్రి 10.30.గం॥లకి ఒక ఫోన్‌కాల్ వచ్చింది. "80సంవత్సరాల వృద్ధురాలు పేరు సూర్యనారాయణమ్మగారునేత్ర విద్యాలయం గురించి ఐదుగురికి చెప్పి 40వేలు సమకూరుస్తున్నారు" అని చెప్పారు. చాలా చాలా ఆనందం కలిగింది. స్వామివారి తిరునక్షత్రానికి 58రోజుల తదియారాధన స్వామివారు చెప్పినట్లే పూర్తయింది. ఇది అంతా కేవలం 5రోజులలో జరిగింది. శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనబలం ఏమిటో నాకు అర్థమైంది. శ్రీస్వామివారు 2010లో అంటే నా 10వ సంవత్సరంలో నేత్ర విద్యాలయకు సేవ ప్రారంభించినపుడు "ప్రతీ సంవత్సరం నువ్వు చేసే సేవ రెట్టింపు అవుతుంది" అని మంగళాశాసనం చేశారు. ఆశ్చర్యం... అద్భుతం... ఈ సంవత్సరం 6లక్షల రూపాయలకు పైగా (సుమారు 6లక్షల 30వేలు) అందరి సహకారంతో సమర్పించగలిగాను. సహకరించిన వారందరికీ నా కృతజ్ఞతలు. ఇది అంతా కేవలం శ్రీస్వామివారు మంగళాశాసనముల వలనే జరిగింది. వారికి కృతజ్ఞతలతో దాసోహములు.

1. తల్లిదండ్రులు పిల్లలను ప్రోత్సహిస్తే వారు సాధించలేనిది ఏదీ లేదు.

2. శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనాలతో మీ ఇంట్లో పిల్లలను కూడా సమతామూర్తి భగవద్రామానుజస్వావమివారి స్ఫూర్తికేంద్రానికి సేవలందించేలా ప్రోత్సహించండి. శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనాలతో స్వామివారు ఆదేశించినట్లు మనమంతా జీవితాంతం సేవలు చేయగలగాలిని కోరుకుంటూ...

యూత్ టీమ్‌లో చేరాలనుకునేవారు మీ వివరాలు ఖేశిగిళితిశినీశిలిబిళిటవీళిబిరిజి.బీళిళి కి మెయిల్ చేయండి - గీతికా వాగ్దేవి



పరమహంస పరివ్రాజకులు
# శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్‌స్వామివారి ప్రచారవార్తలు



ఈఏడాది జరిగిన శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి చాతుర్మాస్య కార్యక్రమంలో ఎన్నో క్రొత్త శోభలు చేరాయి. విలక్షణమైన కార్యక్రమాలు చోటు చేసుకున్నాయి. ముఖ్యంగ "వృద్ధ దంపతీ వరివస్య".

70సం॥పైబడి, దంపతులైయుండి, ఇరువురూ పంచసంస్కార సంపన్నులైతే, ఏ ఆచార్యులవల్ల వైష్ణవదీక్ష పొందినా అలాంటి వారందరినీ సత్కరించడం ఈ కార్యక్రమ లక్షణం.

ముఖ్యంగ ఆ దంపతులని మంచివస్త్రాలతో సత్కరించాలి. వారికి శేషజీవితమంతా ఆరోగ్యంగ, మానిసిక ప్రశాంతత లభించాలి. వారి కుటుంబసభ్యులకు శ్రీవైష్ణవులుగ తాము పొందిన అనుభూతులను పంచాలి. పిల్లలు గూడ ఆ పరంపర కొనసాగించాలి. ఇది పెద్దలుగ వీరు చేయవలసిన పని. దానికి శక్తి కలగాలని వారందరికోసం ఆయుష్యహోమం చేయించారు శ్రీస్వామివారు.

దీనికి ప్రతిగ ఆ దంపతుల పిల్లలు, మనవలూ కలిసి వీరికి పాదపూజ చేసుకొని ఆశీశ్శులను అర్థించి పొందాలి. ఇలా పెద్దలు పిల్లలూ అందరూ ఆప్యాయంగ ఒకచోట చేరడము ప్రధాన లక్ష్యము. ఆ తర్వాత అందరూ కలసి తదీయారాధనలో ప్రసాద స్వీకరణం చేయాలి. ఇవన్నీ చాల పద్ధతిగ జరిగాయి.

ఎందరో పెద్దలు "చాలాకాలం తర్వాత మా పిల్లలను ఇలా శ్రద్ధ కలవారిగ చూడటం మాకెంతో తృప్తిగ ఉంది" అన్నారు. మరెందరో పిల్లలు "మా తల్లిదండ్రులకు పూజ చేస్తామని ఎన్నిసార్లు ప్రార్థించినా అంగీకరించలేదు. శ్రీస్వామివారి వద్ద ఆశీశ్శులు, అనేటప్పటికి వారూ అంగీకరించి మా పూజను స్వీకరించారు. ఇది మా అదృష్టం" అన్నారు.

ఈ కార్యక్రమంలో సినీరంగానికి చెందిన శ్రీమాన్ గజల్ శ్రీనివాస్, శ్రీమాన్ కళ్యాణ్, శ్రీమాన్ డైరక్టర్ హరీష్‌శంకర్, రచయిత శ్రీమాన్ రవి పాల్గొన్నారు. అమ్మనాన్నల ప్రభావాన్ని వారందరూ వేనోళ్ళ కొనియాడారు. తాము కూడా తమ తల్లిదండ్రులను తెచ్చి ఉంటే బాగుండేదనుకున్నారు. ఇంటికి వెళ్ళగానే వారిని అర్చించి, ఆశీస్సులు గ్రహిస్తామన్నారు.

గజల్ శ్రీనివాస్‌గారి పాటలు అందరికీ హృదయాలని ఆర్ద్రంచేసి, కన్నీళ్ళను కురిపించి, వాటితో పెద్దలకభిషేకం చేయించాయి.

శ్రీమాన్ శర్వాణి, భగవద్రామానుజుల వారిపై 8పాటలను రచించారు. శేలంకి చెందిన శ్రీమాన్ ఎ.ఎన్.ఎస్. శ్రీరాం దంపతులు ఉభయదారులుగ ఆ క్యాసెట్‌ను ఈ సందర్భంగ శ్రీశ్రీశ్రీ అహోబిల జీయరు స్వామివారు ఆవిష్కరింపచేశారు.

ఎన్నో మరపురాని మధురానుభూతులను నింపిందీ శ్రీవైష్ణవ వృద్ధదంపతీ వరివస్య. ఏదో వందమంది కావచ్చుననుకొన్న ఈ సేవలో 550మంది దంపతులు పాల్గొన్నారు. మరి కొందరు "ఈసారి మాకు తెలియనే లేదాయె! మళ్ళీ సంవత్సరం కూడా ఇలా చేయాలి సుమా" అంటూ అర్జీలు పెట్టారు. ఇలా ఇదొక అద్భుతానందంతో సుసంపన్నమైంది.

27వ తేదీన ఎన్.టి.ఆర్. ఎన్.డి.టి.వి. వారేర్పచిన కార్తీక దీపోత్సవ ప్రారంభానికి శ్రీవారు వేంచేసి కార్తీక దీపవ్రత ప్రారంభం బలిచక్రవర్తి కోరికపై త్రివిక్రముడు వరమివ్వగా ప్రారంభమైనదని చరిత్రను వివరించారు.

వామనుడు బలియజ్ఞవాటిక చేరి మూడడుగుల నేలను పొంది, ముల్లోకాలు కొలిచాడు. బలి తలనుకూడా తన పాదస్పర్శతో తరింప చేశాడు. అయితే బలియజ్ఞం పూర్ణాహుతి కాకుండానే ఆగిపోయింది. దానిని పూర్తి చేయించే వరమిమ్మని బలి కోరాడు. ఎలా?

"కార్తీకమాసంలో పున్నమిదాక ఇండ్లలోనూ, పున్నమి నుండి ఆలయాలలో ఆకాశదీపాన్ని ఆరోపించాలి. భగవంతుని ప్రీతికి చేసిన యజ్ఞాగ్నితో ఈ దీపాలు వెలిగిస్తే వారికందరికీ బలియజ్ఞాన్ని పూర్తి చేయించిన ఫలం లభిస్తుందని త్రివిక్రముడు వరమిచ్చాడు. అప్పటినుండి ఈ కార్తీక దీపోత్సవాలు ప్రారంభమైనాయి" అని అనుగ్రహించారు శ్రీస్వామివారు.

28వ తేదీన మణవాళ మహామునుల తిరునక్షత్రోత్సవంతోపాటు శ్రీమాన్ స్వామివారి ఆరాధనామూర్తి శ్రీకోదండరామస్వామి పెరుమాళ్ళ ఏకోత్తర సహస్ర కలశాభిషేకం వైభవోదర్కంగ సాగింది. పోలీసు అధికారి శ్రీమాన్ పి. కోటేశ్వరరావుగారు ఆసాంతం ఉండి అభిషేకం జరిపించారు.

విశాఖలో జరిగిన తుఫాన్ దృష్ట్యా కార్యక్రమాలన్నీ తగ్గించి వైదిక కార్యాలను మాత్రం మన వారంతా యథావిధిగ జరిపారు. అలా ఈ 58వ తిరునక్షత్ర, స్నపన కార్యక్రమాలు సుసంపన్నమైయ్యాయి.

నవంబరు 2వ తేదీ పేయాళ్వార్ల తిరునక్షత్రం. దానికి ముందు రెండు దినాలూ పొయ్‌గై, పూదత్తాళ్వార్ల తిరునక్షత్రోత్సవాలూ జరిగాయి. ఈ ముగ్గురు ఆళ్వార్లలో మొదటివారు బాహ్యప్రపంచాన్నంతా భగవన్మయంగ దర్శింపచేస్తూ ఓ దీపం వెలిగించారు. రెండవవారు ఆంతర ప్రపంచాన్నంతా భగవన్మయంగ చూపించి మరో దీపాన్నావిష్కరించారు. పేయాళ్వారు బుద్ధిమంతులు. ఆ యిరువురూ వెలిగించిన ప్రదీపకాంతిలో శ్రియఃపతిని దర్శించి, లోకానికి చూపారు.

తత్త్వదర్శనం కావాలంటే వెలగవలసిన ప్రదీపమే "ప్రమాణము"

మన వైదిక వాఙ్మయము. ప్రమాణము సాత్త్వికమైనదీ, దృఢమైనదీ అయినపుడు లభించే తత్త్వదర్శనం కూడా స్థిరమైనదీ, సాత్త్వికమైనదీ అవుతుంది. ప్రమాణం మీదే కద ఆధారపడి ఉండేది ప్రమాతలూ, ప్రమేయమూ కూడ! 'ప్రమాత' అంటే ప్రమాణాన్ని వాడుకొని జ్ఞానం పొందేవ్యక్తి. మన ఆచార్యవర్గమంతా ప్రమాతృకోటికి చెందినవారు. ప్రమేయమంటే ఆ ప్రమాణం తెలియచేసే తత్త్వమైన శ్రియఃపతి.

మన భాగ్యవిశేషంచేత సాత్త్వికులైన ఋషులు, ఆచార్యులు, ఆళ్వారులు అందించిన వాఙ్మయము పరమ సాత్త్వికము. అది చూపే శ్రియఃపతి సత్త్వాధిష్ఠాన దేవత. ప్రమాణమనే మూలాధారం స్థిరంగ ఉన్నంత వరకూ లోకానికి అరిష్టాలు ఏర్పడవు. అందుకే ప్రమాణమైన మన వైదిక వాఙ్మయాన్ని జాగ్రత్తగ రక్షించుకోవలసిన అవసరముంది. ఈ వాఙ్మయానికి దిశానిర్దేశం చేసినవారు రామానుజులవారు. వారు స్వతంత్రించి క్రొత్త సిద్ధాంతాలు కనిపెట్టలేదు. సమన్వయ పరచుకోవడం చేతకాక కొందరు అపార్థాలు కల్పించిన వాఙ్మయాన్ని ఎలా సమన్వయపరచుకొని సదర్థాలను తెలుసుకోవచ్చో చూపించారు. అందుకే స్వయంగా శ్రీరంగనాథుడే వీరు చూపిన సమన్వయానికి "రామానుజదర్శన"మని ఎంబెరుమానార్ దర్శనం అని పేరు పెట్టమన్నాడని చరిత్ర. అదే రామానుజ సిద్ధాంతమైంది. తర్వాతి కాలంలో దానినే విశిష్టాద్వైత సిద్ధాంతంగ ప్రచారం చేశారు.

మన సంప్రదాయానికి మూలపురుషులైన శ్రీమన్నాథమునుల దగ్గరనుండి ప్రారంభిస్తే ఇప్పటివరకూ ఈ రామానుజ దర్శనానికి చెందిన గ్రంథాలు బహుముఖంగ వెలిసాయి. అందులో స్తోత్ర వాఙ్మయముంది. సూత్ర వాఙ్మయముంది. వ్యాఖ్యాన వాఙ్మయముంది. సంస్కృతంలో కొన్ని, ద్రావిడంలో కొన్ని, తెలుగులోనూ ఇతర భాషలలోనూ వెలిసిన గ్రంథాలూ ఎన్నో ఉన్నాయి. వీటి సంఖ్యవేలలోనే ఉంటుంది. వీట్లల్లో ముద్రితాలు కొన్ని. అముద్రితాలు కొన్ని. ముద్రితాలైన గ్రంథాలలో కూడా లభ్యమయ్యేవికొన్ని, అపురూపంగ దాగి ఉన్నవి కొన్ని ఇలా ఎన్నో రకాలుగ ఈ గ్రంథాలున్నాయి.

వీటిల్లో కనీసం ఓ వేయి గ్రంథాలనైనా, రామానుజల వేయి సంవత్సరాల పండుగనాటికి ఒకచోట చేర్చగలిగితే బాగుండును. అందులోగూడ ముందర అపురూపమైన వాటితో ప్రారంభించి, క్రమంగ అముద్రితాల వరకూ గ్రంథాలను సేకరించాలి. 2. వాటిని కంప్యూటర్‌లోకి యథాతథంగ కాపీ చేయడం. 3. డేటా ఎంట్రీగ టైపు చేయించడం, 4. తప్పులు లేకుండా ఎడిట్ చేయించడం. 5. గ్రంథాలన్ని అలాగే ఇతర లిపులలో లభించేట్టు చేయడం (Transliteration), 6. ఇతర భాషలలోనికి అనువదింపచేయడం, 7) వాటిని ప్రామాణికంగ సరిచేయించడం. 8) అలా కనీసం ఈ గ్రంథాలను / గ్రంథాల సారాంశాన్ని తెలుగు, హిందీ, కన్నడ, మళయాళీ, ఇంకా వీలైనన్ని లిపులలో ఒకచోట చూపడం, అనువదింపచేసి కూడా ఆయా లిపులలో అదేచోట అందివ్వడం. ఇలా ఎన్నెన్ని రకాలుగ ఆ గ్రంథజాతాన్ని సురక్షితంగ ఉంచడంతోపాటు, అందరికందేట్టు చేయాలని ఒక "E లైబ్రరీ" ఏర్పాటు చేస్తే బాగుంటుందని సెంట్రల్ యూనివర్శిటీ, విశ్రాంత వైస్ ఛాన్సలర్ అయిన ప్రొఫెసర్ కణ్ణన్ స్వామి ఒకసారి శ్రీ చిన్న జీయరు స్వామివారితో ప్రస్తావించారు.

అందుకు సమర్థులైన పండితులను ఆహ్వానించి ఒక నిర్ణయం చేద్దామని స్వామివారు అంగీకరించారు. మన జీవా కార్యదర్శి అయిన Dr. S.V. రంగరామానుజాచార్య స్వామి, కణ్ణన్‌స్వామి ఇరువురూ కలిసి, గ్రంథాల లిస్టు, కొంతైనా అనువాదం చేసే సామర్థ్యం ఉన్న పండితుల లిస్టు తయారు చేసి, వారిని స్వయంగ సంప్రదించి వివరాలు తెలిపారు.

నవంబరు 2వ తేదీన వారందరితో ఓ సదస్సు జరిగింది మన 'జీవా' ప్రాంగణంలో. సుమారు 25 మంది బయటి రాష్ట్రాలనుండి, 25 మంది మన రాష్ట్రం నుండే పాల్గొన్న ఈ సదస్సులో ప్రాథమికంగ చేయవలసిన కార్యక్రమ రూపురేఖలను తీర్చి దిద్దారు.

ఇందులో మొన్ననే జీయరు ఎవార్డు గ్రహీత డా॥ రామానుజన్ స్వామితోపాటు మేలుకోటలో ఎ.ఎస్.ఆర్ ప్రారంభించిన ప్రొఫెసర్ లక్ష్మీతాతాచార్యస్వామివంటి పెద్దలు పాల్గొన్నారు. కార్యక్రమం శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఎస్.ఎన్.సి. రఘునాథాచార్యస్వామివారి ఆధ్యక్ష్యంలో సాగింది.

ఈ మధ్యనే మన జీవాలో పరిశోధనా విభాగానికి సహాయకులుగ చేరిన శ్రీమాన్ విజయరాఘవన్ స్వామి, ఈ కార్యక్రమంలో వ్యవస్థను తీర్చిదిద్దే సహాయకులుగ వ్యవహరించారు. మొత్తానికి సదస్సు వేయిగ్రంథాల సేకరణ అనువాదం ప్రదర్శనలకు నాంది పలికింది. సహస్రాబ్ది మహోత్సవానికి పూర్వసంధ్య అయింది.

నవంబరు 3వ తేదీన శ్రీస్వామివారు శ్రీవరమహాలక్ష్మి శిల్క్స్'వారి వస్త్రాలయాన్ని ప్రారంభించారు. దీని నిర్వాహకులలో ఒకరైన శ్రీమాన్ కళ్యాణ్ 'దంపతీపూజ' కార్యక్రమానికి వచ్చినపుడు స్వామివారు ఎప్పుడొస్తే అప్పుడే తమ షాప్‌ను ప్రారంభిస్తామని, అది సాంప్రదాయిక చీరెలను దుస్తులను మాత్రమే ప్రోత్సహించేది కావడాన తప్పక స్వామివారు అనుగ్రహించదగినదే అంటూ కోరడంతో శ్రీవారు అంగీకరించారు.

అక్కడినుండి శ్రీమాన్ సౌమ్య, శశిధర్‌రెడ్డి దంపతుల గృహంలో పెరుమాళ్ళకు మంగళాశాసనం చేసి, ఆచార్య వైభవాన్ని ప్రవచించారు. ఆపై శ్రీమాన్ డా॥ రామేశ్వరరావు శ్రీకుమారి దంపతుల గృహంలో పెరుమాళ్ళకు మంగళాశాసనం చేసారు. మైహోమ్ హబ్‌లో ఉన్న శ్రీరామానుజ సహస్రాబ్ది కార్యాలయంలో జరుగుతున్న ప్రాజెక్టు డ్రాయింగ్స్‌ను పరిశీలించారు.

ఇంతవరకూ ఈ చాతుర్మాస్యకాలంలో డ్రాయింగులను పూర్తి చేయించారు. శ్రీమాన్ ఆనందసాయి తమ బృందంతో ఈ ప్రాజెక్టుకు సంబంధించిన డిజైన్లన్ని తయారు చేస్తున్నారు. రామానుజులవారి చుట్టూ రాబోయే 108 దివ్యదేశాల నిర్మాణ వివరాలన్ని శ్రీమాన్ ప్రసాదు స్థపతి, తమ పరివారంతో చేస్తున్నారు. వాస్తు,

దివ్యదేశమూర్తుల, మందిరాల నిర్మాణంలో ఏ లోటూ రాకుండా ఉండాలని, మిగిలిన నిర్మాణాలన్నీ ఆ దివ్యదేశాల పవిత్రతకు ప్రోద్బలకాలుగ ఉండాలనేది వీరందరి కృషి. ప్రవేశద్వారంతో ప్రారంభిస్తే కార్ల పార్కింగ్, సామాన్లు, పాదరక్షలు భద్రపరచడం, గుర్తింపు పత్రాలు పొందడం, లోపలికి ప్రవేశించడం, చేతకానివారు ప్రయాణించడానికి బ్యాటరీ వాహనాలు, అవి తిరిగే మార్గాలు, మామూలు దర్శనార్థులకు అడ్డురాకుండా ఉంచడం, అక్కడక్కడ ఆహారపదార్థాలు అందించడం, అవసరాలకై బాత్‌రూములు ఇవేవీ నిత్యారాధనకు ఇబ్బందికరంగ కాకుండా చూడడం, సామాన్లు తెచ్చి చేరవేసే సౌకర్యాలు నీటివసరులు, పరిశుభ్రత, వీటన్నింటిని జాగ్రత్తగ నడుపుతూ, భక్తులకేవిధమైన ఇబ్బంది కలుగకుండా చూచే రక్షక దళాల వ్యవస్థ. ఇలా ఒకటేమిటి సమస్త వ్యవస్థా దృష్టిలో పెట్టుకొని ఈ డ్రాయింగులను వేయించడంతో అవి ఒక కొలిక్కి రావడానికి ఇంత సమయం పడుతోంది. 'మనం చేయబోయే ఈ ప్రాజెక్టును చూడడానికి దేశవిదేశ యాత్రీకులు రావాలి. వారికి కూడా ఇది చూస్తే "ఓహ్" అనిపించాలి. అనేదే మా ప్రయత్నం. ఈ యాంత్రికయుగంలోంచి ఆ దివ్యయుగానికి వెళ్ళాలి. చూసినవారంతా అంటారు శ్రీ ఆనందసాయి స్థపతిగారు కూడా ఇంతవరకూ ఈ డిజైన్ల భాగం పూర్తి అయింది కనుక ఇక ఇంజనీర్లు నిర్మాణ వివరాలమీద దృష్టిపెడతారు.

శ్రీరామానుజుల శ్రీమూర్తి ఒకటే సుమారు 300 టన్నుల బరువు ఉండచ్చు. దాని నిర్మాణానికి రూ.వందకోట్లు సుమారుగ ఖర్చు కావచ్చునంటూ ప్రాథమిక అంచనాలను, నిర్మించే కంపెనీలు పంపాయి. ఇంకా అది నిర్ణయించవలసి ఉంది. దాని బరువును బట్టి ఇంజనీర్లు క్రింద ఉండవలసిన పీఠంయొక్క నిర్మాణానికి డిజైన్లు తయారు చేస్తారు. అవన్నీ సక్రమంగ ఉన్నాయనుకుంటే అప్పుడు ఫైర్ సర్వీసువారికి, మున్సిపాలిటీవారికీ, విమానయాన విభాగం వారికీ పర్మిషన్లు ఇవ్వడానికి అడగాలి. వారికి చెల్లించే ఫీజులన్నీ చెల్లించాలి. నిర్మాతలకు ఎడ్వాన్సులు ఇవ్వాలి. అంటే **అంతధనం సమకూర్చుకోవలసి ఉందన్నమాట.**

భగవద్బంధువులందరూ వారి వారి శక్తికి తగ్గట్టు యిప్పటికే ఈ ఆచార్యకైంకర్యంలో పాల్గొంటున్నారు. ఇంకా ఎందరో అందుకు సిద్ధపడుతున్నారు. ప్రతివ్యక్తీ ఒక్కొక్క నెల తాను ఆర్జించే ధనాన్ని ఒక్కసారిగకానీ, 2,3, వాయిదాలుగ చేస్కొని కానీ ఈ సేవలో వినియోగించాలనేది మన శ్రీజీయరు స్వామివారు యిప్పటికే ప్రకటించి ఉన్నారు.

అయితే... అలా మనం చేస్తూ మన వారందరికీ ఈ విషయాన్ని తెలపాలి. వారి భాగస్వామ్యాన్ని కూడా ఈ పవిత్రకార్యానికి తోడవ్వాలని ఆహ్వానించాలి.

**"ఈ అద్భుత కార్యం ఏ ఒక్కరికో చెందరాదు. సామాన్యులు కూడా ఇందులో భాగం పంచుకోవాలి. వేల సంవత్సరాలు నిలిచే ఈ రామానుజపదసేవలో నా భాగస్వామ్యమూ ఉంది. ఈ నిర్మాణంలో నాదీ ఒక ఇటుక ఉంది. దీనిని వర్ధిల్ల చేయడం, కాపాడడంలో నేను ముందుంటానని అందరూ అనుకోగలగాలి. ఇలా కనీసం ఒక లక్షమంది ఇందులో పాల్గొనగలిగేట్లు మనమందరమూ చేద్దాం" అంటూ శ్రీ చిన్న జీయరు స్వామివారు కార్యాలయంలోని వారందరినీ ప్రోత్సహించారు.**

నవంబరు 6వ తేదీన శ్రీ చిన్న జీయరు స్వామివారి చాతుర్మాస్య దీక్ష వైభవోపేతంగ ముగిసింది.

శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయరుస్వామివారు నిజామాబాద్‌లో ప్రచారానికై మూడుదినాలకు ముందే వేంచేశారు. శ్రీశ్రీశ్రీ అహోబిల రామానుజ జీయరు స్వామివారు "శ్రీయాగ" ఏర్పాట్లకై విజయవాడలో పర్యటిస్తున్నారు. శ్రీ చిన్న జీయరు స్వామివారు 6వ తేదీ రాత్రి మన బదరీ కమిటీసభ్యులైన శ్రీమాన్ రవిగారి గృహానికి విచ్చేశారు. మార్గమధ్యంలో తుర్కీ ఎంజాల్ శ్రీ వేంకటేశ్వరస్వామివారి సన్నిధిని దర్శించి, 5వ బ్రహ్మోత్సవాలను ప్రారంభించి ప్రవచించారు.

7వ తేదీ ఉదయం ఆరాధనానంతరం బయలుదేరి సాయం కాలానికి విజయవాడ వద్దనున్న K.L. యూనివర్శిటీని సందర్శించి విద్యార్థులకు "ప్రకృతి వైపరీత్యాలకు కారణాలు – మన స్పందన"ను గురించి సందేశమిచ్చారు. కృష్ణా గుంటూరు జిల్లాల ప్రముఖులను కలిసాక బయలుదేరి రాత్రికి పిట్టలవానిపాలెంలో శ్రీమాన్ మురళీకృష్ణంరాజుగారి గృహంలో బసచేశారు.

8వ తేదీ ఉదయం ఆరాధనకాగానే అక్కడి భక్తులను శ్రీయాగానికి ఆహ్వానించారు. భగవద్రామానుజుల స్ఫూర్తి కేంద్రానికి సంబంధించిన వివరాలను కూడా ప్రవచించారు. సాయంకాలం విజయవాడ సమీపంలో నున్నవద్ద NRI విద్యాసంస్థల ఆహ్వానం మేరకు ఆ కాలేజిని సందర్శించి విద్యార్థులకు సందేశాన్ని, శ్రీయాగాన్ని పరిచయం చేస్తూ వారిని కూడా వాలంటీర్లుగ రమ్మని ఆహ్వానించారు.

9వ తేదీన ఆదిలాబాద్ శ్రీమతి సముద్రాలమాధవి రామానుజం గారు తమ పరివారంతో సీతానగరంలో "ఆచార్యత్రయం" ప్రదర్శించారు. వారు ప్రదర్శించదలచిన 108లో ఇది సుమారు 50వ ప్రదర్శన. 10వ తేదీన PWD గ్రౌండ్స్‌లో శ్రీయాగానికి సంబంధించి భూమిపూజ జరిగింది. శ్రీమాన్ G. గంగరాజుగారు (M.P.) శ్రీమాన్ మురళీకృష్ణంరాజుగారు ప్రభృతులు ఎందరో భక్తులు ఈ ఉత్సవంలో పాల్గొని "శ్రీయాగా"నికి నాంది పలికారు.

శ్రీ చిన్న జీయరు స్వామివారు అక్కడినుండే గుంటూరులోని ప్రముఖ వైష్ణవాగ్రేసరుడు, పారిశ్రామికవేత్త, క్రేన్ సంస్థల అధినేత శ్రీమాన్ గ్రంథి సుబ్బారావుగారిని పలుకరించడానికి గుంటూరు విచ్చేశారు. అశక్తులుగా ఉన్నా తమ విధులను శ్రద్ధగ నిర్వహించే శ్రీమాన్ సుబ్బారావుగారిని, వారి కుటుంబ సభ్యులతో పాటు కలిసి పరామర్శించారు. వారి కుమారుడు శ్రీమాన్ లక్ష్మీకాంతారావు తండ్రిగారికి తగిన తనయుడు. అన్ని పనులు తండ్రిగారి పేర చేస్తాడు. మానసికంగ తండ్రిగారికి ఎంతో ఉత్సాహాన్ని కలిగిస్తుంటాడు. యజ్ఞ వివరాలను అన్నింటిని వారే తండ్రికి తెలిపారు. శ్రీయాగానికి బియ్యం,

పప్పు, ఉప్పు అవసరాన్ని బట్టి యిస్తూ ఉంటానని వాగ్దానం చేశారు. శ్రీస్వామివారు వారికి మంగళాశాసనాలు చేసి, నేరుగ భద్రాది క్షేత్రానికి దర్శనానికై బయలుదేరారు. రాత్రి 9గంటలకు అనుష్ఠానం చేస్కొని, స్వామిని దర్శించి, రాముని శయనోత్సవంలో పాల్గొన్నారు.

11వ తేదీ ఉదయం భద్రాద్రిలో మన జెట్ నిర్మించిన "జీయరుమఠం" రెండవ అంతస్థును ప్రారంభించారు. హైదరాబాదు నుండి శ్రీమాన్ J. వసుమతి భాస్కరరావుగారు కూడా తమ సమస్త పరివాదిరంతో భద్రాద్రి చేరారు. వారు భాస్కరరావుగారి మాసిక కార్యక్రమాన్ని వారి చిరంజీవులు శ్రీమాన్ J.V. కృష్ణారావు, వంశీల ద్వారా జరిపించారు. ఆపై జీయరు మఠములోని వారందరికీ ఆలయ పరివారమందరికీ భూరి సంభావనలను వస్త్రాలను సమర్పించారు.

గతంలో చిన్నదిగ ఉండే మన మఠాన్ని, కమిటీ సభ్యులందరూ శ్రీమాన్ జనార్ధన్ భట్టర్‌గారిని ముందుంచుకొని పూర్తిగ తొలగించి, పునర్నిర్మాణం చేశారు. దానికై ఇంతవరకూ సుమారు రూ. 2కోట్లు ఖర్చైందని, ఇంకా సుమారు రూ. 60/70లక్షలు ఖర్చు చేయవలసినంత పని మిగిలి ఉందని, ఇంతవరకూ తమ పవిత్ర ధనాన్ని ఉదారంగ అర్పించిన దాతలందరికి శ్రీవారి మంగళాశాసనాలు అర్పిస్తున్నామని, మిగిలినది కూడా త్వరలో పూర్తి అయ్యేట్లు భక్తులంతా భూరి విరాళాలర్పించి, ఈ భవనాన్ని పూర్తి భాగవతసేవకు వినియోగపడేట్లు చేయమని" శ్రీ భట్టర్‌గారు తెలిపారు. పట్టుదలతో యింత నిర్మాణాన్ని చేయించిన భట్టరుగార్కి, ప్రోత్సహించిన శ్రీమాన్ మురళీకృష్ణమాచార్యులు, స్థలశాయిగార్లకు ఆలయ అర్చకాది వైదిక పరివారానికి, విశేషించి స్థలదానంతో గతంలోనే ముందుకొచ్చిన ప్రధానార్చకులు శ్రీమాన్ కోటు రామకృష్ణమాచార్యులుగారికి, ముఖ్యంగ ఆలయాధికారిణి శ్రీమతి కృష్ణవేణి దంపతులకు, మిగిలిన భక్తబృందాలందరికి శ్రీవారు మంగళాశాసనాలు చేశారు.

అనంతరం భద్రాద్రిలో రాబోయే గోదావరి పుష్కరాలను జూలై 14వ తేదీన ప్రారంభిస్తామని, 16 మధ్యాహ్నం దాక అక్కడ ఉండి ఉపదేశాత్మక **సంక్షేప రామాయణాన్ని** పారాయణ చేద్దాము. దానికై అందరూ సేవాదళాలుగ సిద్ధం కావాలని, వికాసతరంగిణి సభ్యులకు శ్రీవారు సూచించారు.

అక్కడ మంగళాశాసనాల అనంతరం బయలుదేరి రాత్రికి తూర్పు గోదావరి జిల్లాలోని రంపచోడవరం ద్వారా రాజమహేంద్రి, రంగధామానికి చేరారు.

మధ్యలో రంపచోడవరంలో శ్రీమాన్ సాదిఖ్‌హుస్సేన్ నిర్మింపచేసిన శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయాన్ని వారి నిర్బంధంపై సందర్శించి భక్తులకు మంగళాశాసనాలు చేశారు.

రంగధామంలో అనుష్ఠానం ముగిసాక రాజమండ్రిలోని వైద్యప్రముఖులంతా కలిసి నిర్మించుకొన్న ఐఎమ్ఎ భవనం పైఅంతస్థును ప్రారంభించి, తమ దివ్యసందేశాన్ని వారికందించారు.

12వ తేదీ ఉదయం రంగధామంలో భక్తులకు పుష్కరసందర్భంగా ఏది, ఎలా చేయాలో సూచనలందించి మార్గమధ్యలో జగ్గంపేటవద్ద భక్తశిఖామణి శ్రీమాన్ ఎమ్. బంగార్రాజుగారి గృహాన్ని సందర్శించి అక్కడి భక్తులకు మంగళాశాసనం చేశారు. ఆపై వారిజకు బయలుదేరారు. రాత్రికి విశాఖపట్నంలోని వారిజ చేరారు.

హుద్‌హుద్ తుఫాన్ నాటి కష్టనష్టాలను భక్తుల ద్వారా విని, అంత తుఫాన్‌లోనూ ధైర్యంగ నిలిచిన నేత్ర విద్యార్థులను అభినందించారు. వారికి అండగ నిలచిన కమిటీ సభ్యులను, భక్తులను, వికాసతరంగిణి సేవకబృందాలకు మంగళాశాసనాలు చేశారు.

మన జీవా కమిటీ సభ్యులైన శ్రీమాన్ విష్ణురెడ్డిగారు విచ్చేసి, అక్కడ తుఫాన్ బారిన పడి పాడైన సోలార్ పానెల్స్‌ను బాగుచేసే ఉద్యమాన్ని ప్రారంభించారు. అందరి ధైర్యాన్ని, అందించిన సేవలకునూ ప్రశంసించి శ్రీవారు రాత్రికి మందసా శ్రీ వాసుదేవ పెరుమాళ్ళ సన్నిధికి చేరారు.

12వ తేదీన వారందరితో ఓ సదస్సు జరిగింది.

శ్రీమాన్ కూర్మాచార్యులు, ఇక్కడి ప్రధానార్చకునిగ బాధ్యతలు తీసుకున్నాక ఆలయాన్ని చక్కగ నిర్వహిస్తూ, భక్తులకూ మంచిప్రోత్సాహకులుగ ఉన్నారు. పెరుమాళ్ళ కృపవల్ల తుఫాన్ ప్రభావం ఇక్కడస్సలు లేనేలేదట. వారికి మంగళాశాసనాలు చేసారు.

పలాసకు చెందిన వ్యాపారవేత్త శ్రీమాన్ సుడియా సురేష్, మన ఆలయానికి దక్షిణాన చక్కని కళ్యాణమండపాన్ని నిర్మింపచేస్తున్నారు. ఆ పనిని సందర్శించారు శ్రీవారు. 13వ తేదీ ఉదయం భక్తులకు ప్రవచనాన్ని అనుగ్రహించి, భువనేశ్వర్, కటక్ మీదుగా రాత్రి సుమారు గం. 2.00 ఖరగ్‌పూర్ చేరారు.

**ఖరగ్‌పూర్:** పశ్చిమబెంగాల్ రాష్ట్రంలోని ఖరగ్‌పూర్ అనే పట్టణము ఆసియాలోనే పెద్ద రైల్వే వర్క్‌షాప్‌కు ప్రసిద్ధి. అంతే కాకుండా భారతదేశంలో ప్రసిద్ధి చెందిన I.I.T. (Indian Institute of Technology) ఇక్కడ ఉంది. ఆసియాలో అతి పొడవైన రైల్వే ప్లాట్‌ఫామ్ ఖరగ్‌పూర్‌లో ఉంది. వీరిలో ఉత్సాహం కల కార్యకర్త శ్రీమాన్ వెలుగుల కుమార్. వీరు తమ మిత్రబృందముతో గతంలోనే స్వామివారిని అక్కడికి రమ్మని ఆహ్వానించారు. వారి అభ్యర్ధన మేరకు శ్రీస్వామివారు 2014 నవంబరు 14,15,16,17 తేదీలలో వీరికి కార్యక్రమాన్ని ఇచ్చారు. ఇక్కడి జనాభా 6 లక్షలలో 80% తెలుగువారే కావడం విశేషం. ఈ మధ్యకాలంలో అది 60% అయిందట. ఆ తెలుగు వారంతా సుమారు 150సం॥లుగా అక్కడ ఉన్నా తెలుగుతనాన్ని కాపాడుకుంటున్నారు.



శ్రీస్వామివారు 13వ తేదీ అర్ధరాత్రి ఖరగ్‌పూర్ చేరుకొని రైల్వేకి సంబంధించిన గీతాంజలి కమ్యూనిటీ హాల్‌లో బసచేశారు.

14వ తేదీ శుక్రవారం కావడంతో శ్రీస్వామివారు సామూహిక



శ్రీలక్ష్మీనారాయణపూజ నిర్వహించారు. మధ్యాహ్నము శ్రీసాయినాథ్ ఆటోమొబైల్స్ అధినేత శ్రీమాన్ సతీష్‌గారింటికి విచ్చేసి మంగళాశాసనాలు అందించారు. వీరే శ్రీస్వామివారి ఖరగ్‌పూర్ పర్యటనకు ఏర్పాట్లకు ప్రధానంగా ప్రోత్సాహాన్నిచ్చి ఉభయదారులుగా నిలబడ్డారు. అనంతరం "ప్రవాసాంధ్ర నవ్యకళా పరిషత్" వారేర్పరచిన కార్యక్రమంలో మన తెలుగుభాష యొక్క ప్రాశస్త్యాన్ని వివరించారు. సాయంకాలం 6.00 గం॥లకు సామూహిక శ్రీ విష్ణు సహస్రనామస్తోత్ర పారాయణము అనంతరము శ్రీస్వామివారు వారి దివ్యసందేశాన్ని కృపచేశారు.

15వ తేదీ శ్రీస్వామివారు సత్సంగముయొక్క ప్రాముఖ్యతను వివరించి తీర్థగోష్ఠి అనుగ్రహించారు. అనంతరం పాతకోళీలోని వైకుంఠద్వార శ్రీ వేంకటేశ్వర ఆలయాన్ని సందర్శించి ఆలయ ఆవరణలో గోశాలను ప్రారంభించారు. అక్కడ చేరిన భక్తగోష్ఠికి గోవు ప్రాశస్త్యాన్ని వివరించారు. ఆలయ కమిటీవారి శ్రద్ధకు అనేక మంగళాశాసనాలు అందించారు. అనంతరం ఖరగ్‌పూర్‌లోని మరో ఆరు ఆలయాలను సందర్శించి మంగళాశాసనం చేశారు. సాయంకాలం సహస్రనామ స్తోత్ర పారాయణ అనంతరం జెట్–వికాసతరంగిణి నిర్వహిస్తున్న వివిధ కార్యక్రమాలను పవర్‌పాయింట్‌లో వివరించారు. శ్రీరామానుజ సహస్రాబ్ది ప్రాజెక్ట్‌ను గూర్చి కూడా వివరించారు.

16వ తేదీన ఉదయం సామూహిక శ్రీ సీతారామ కళ్యాణం నిర్వహించారు. 110మంది దంపతులకు శ్రీస్వామివారు తమ దివ్యహస్తాలతో శ్రీ సీతారామ పరివార మూర్తులను అనుగ్రహించారు. ఆగమ పండితులు శ్రీమాన్ ముదుంబై మధుసూదనాచార్యస్వామి,



జెట్–సీతానగరం ఆగమ కళాశాల విద్యార్థులతో విచ్చేసి అంగరంగ వైభవంగా ఈ కళ్యాణ మహోత్సవాన్ని జరిపించారు.

ఖరగ్‌పూర్ చరిత్రలోనే ఇటువంటి కళ్యాణ మహోత్సవం చూడలేదు అని భక్తగోష్ఠి అంతా శ్రీస్వామివారికి కృతజ్ఞతాంజలులు సమర్పించారు. ఖరగ్‌పూర్ భక్తగోష్ఠి అశేషంగా ఈ కళ్యాణ మహోత్సవాన్ని తిలకించడానికి తరలివచ్చారు.

గీతాంజలి కమ్యూనిటీహాల్ ప్రాంగణం అంతా జనంతో కిటకిటలాడిపోయింది. లోపల స్థలం సరిపోక పోవడంతో బటయ LED Projectors లో వీక్షించారు. అంతేకాకుండా ప్రతిరోజు



కార్యక్రమాన్ని ఖరగ్‌పూర్ వాసులంతా వీక్షించే విధంగా ప్రత్యక్ష ప్రసారం చేశారు. ఈ కళ్యాణ కార్యక్రమవిశేషాలను www.youtube.com/jetworldలో వీక్షించవచ్చు.

సహస్రనామ పారాయణం అనంతరం శ్రీస్వామివారు IIT ప్రొఫెసర్స్ మరియు తెలుగు సమాఖ్య విద్యార్థుల అభ్యర్థన మేరకు క్యాంపస్‌కు విచ్చేశారు.

శ్రీస్వామివారు మాట్లాడుతూ....... మానవుడియొక్క కోడ్ $R_2$ (Respond according to Realization) అని, అది ఐదు లెవెల్స్‌లో ఉండాలి. 1. శరీరం, 2. కుటుంబం, 3. సమాజం, 4. ప్రకృతి, 5. దైవము అని పవర్‌పాయింట్ షో తో వివరించారు. IIT విద్యార్థులు, ప్రొఫెసర్లు అంతా కూడా ఇది మాకు కనువిప్పు కలిగించేదిగా ఉంది అని శ్రీస్వామివారికి దాసోహములు సమర్పించారు. అనంతరం IIT విద్యార్థులు అడిగిన ప్రశ్నలకు శ్రీస్వామివారు చక్కటి సమాధానములను అనుగ్రహించి IIT క్యాంపస్ నుండి బయల్దేరారు. మార్గమధ్యంలో ఖరగ్‌పూర్ శ్రీస్వామివారి పర్యటనకు మూలకారణమైన రైల్వే ట్రైన్ ఆపరేటర్ శ్రీమాన్ వెలుగుల కుమార్‌గారి గృహానికి వేంచేసి మంగళాశాసనం చేశారు.

17వ తేదీ ఉ॥ తీర్థగోష్ఠి అనుగ్రహించి శ్రీస్వామివారు సమాశ్రయణ కార్యక్రమం నిర్వహించారు. మధ్యాహ్నం కార్యకర్త లందరికీ జ్ఞాపికలు అందించి "మీరు వికాసతరంగిణిగా ఏర్పడి సేవా కార్యక్రమాలు నిదిర్వహిస్తే తప్పకుండా మళ్ళీ వస్తాం" అని మంగళాశాసనం చేసి ఖరగ్‌పూర్‌నుండి బయల్దేరి రాత్రి 8.00లకు కటక్ చేరుకున్నారు.

మార్గమధ్యంలో శ్రీమాన్ అంతర్యామి సాహుగారి అభ్యర్థన మేరకు జాజ్‌పూర్‌లోని చిదానంద ఆశ్రమాన్ని సందర్శించారు.

**కటక్ :** కటక్ వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ రమణరావుగారు శ్రీస్వామివారికి పూర్ణకుంభస్వాగతం పలికారు. మేళతాళాలు, కోలాటంతో శ్రీస్వామివారిని శ్రీ రాధాకృష్ణ మందిరంలోకి ఆహ్వానించారు. అక్కడ ఏర్పాటు చేసిన సమావేశంలో కటక్ వికాసతరంగిణి నిర్వహిస్తున్న వివిధ సేవాకార్యక్రమాల నివేదికను శ్రీస్వామివారికి సమర్పించారు. శ్రీస్వామివారు వారు చేస్తున్న సేవాకార్యక్రమాలను శ్లాఘిస్తూ అక్కడ చేరిన భక్తగోష్ఠికి "దధిభాండుని కథ"ని వివరించారు. ఏ విధంగా శ్రీకృష్ణుడు దధిభాండుని ఆశ్రయించిన కుండకి దండకి కూడా మోక్షాన్ని ప్రసాదించాడో, ఇక్కడ మీరంతా వైష్ణవాగ్రేసరుడైన మా రమణరావుగారి పర్యవేక్షణలో సేవాకార్యక్రమాలు చేస్తూ మీ జీవితాన్ని ఉజ్జీవింప చేసుకుంటున్నారు అని శ్రీస్వామివారు వారందరికి మంగళాశాసనాలు అనుగ్రహించి శ్రీమాన్ రమణమూర్తిగారి గృహంలో బసచేశారు.

18వ తేదీ ఉ॥ కటక్‌లోని శ్రీమాన్ రమణరావుగారి గృహంలో తీర్థగోష్ఠి నిర్వహించి శ్రీస్వామివారు పలాస బయల్దేరారు. మార్గమధ్యంలో భువనేశ్వర్‌లోని శ్రీమాన్ నాగేశ్వరరావు (Addl. DGP) గారి గృహానికి వేంచేసి మంగళాశాసనం చేశారు. అక్కడ చేరిన వారి మిత్రులతో ఇష్టాగోష్ఠి నిర్వహించారు. వారు అడిగిన సందేహాలకి శ్రీస్వామివారు చక్కటి సమాధానాలు కృపచేసి సాయంకాలం 7.00లక "పలాస" చేరుకుని శ్రీమాన్ సుడియా సురేష్‌గారింట్లో బసచేశారు.

19వ తేదీ ఉ॥ తీర్థగోష్ఠికి ముందు శ్రీస్వామివారు భక్తులందరినీ ఉద్దేశించి మాట్లాడుతూ శ్రీరామానుజ సహస్రాబ్దికి అందరూ సిద్ధమవ్వాలి. ఆ సమతామూర్తి స్ఫూర్తికేంద్ర నిర్మాణంలో భాగస్వాములమవ్వాలని మంగళాశాసనములు కృపచేశారు. తిరుగుప్రయాణంలో పలాస సమీపంలోని బెండుగేటువద్ద శ్రీమాన్ కె. మల్లేశ్వరరావుగారి గృహానికి వేంచేసి అక్కడ చేరిన భక్తగోష్ఠిని అనుగ్రహించి మల్లేశ్వరరావుగారి కైంకర్యనిష్ఠని కొనియాడారు.

సాయంకాలం గం.3.00 లకు విశాఖలోని "వారిజ" ఆశ్రమానికి చేరుకున్నారు. శ్రీమాన్ ఎమ్.ఎస్. రాజు, కాశీరాజు, రామానుజం, శ్రీమాన్ నారాయణరెడ్డిగారు, శ్రీమాన్ వర్మగారు, శ్రీకాంత్‌స్వామి, సంతోష్‌స్వామి, వేద, నేత్ర విద్యార్థులు విజయనగరం, విశాఖ వికాసతరంగిణి భక్తగోష్ఠి శ్రీస్వామివారికి ఘనస్వాగతం పలికారు.

శ్రీస్వామివారు తుఫానుకు దెబ్బతిన్న కుటీరాలకు చేస్తున్న మరమ్మత్తులను పర్యవేక్షించారు. వేదవిద్యార్థుల నివాసం, శ్రీవారి కుటీరం, వంటశాలను, ఆఫీస్‌గా వాడుతున్న కుటీరాన్ని యుద్ధప్రాతిపదికన మరమ్మత్తులు చేయించారు. నేత్ర విద్యాలయంలో ఎగిరిపోయిన రేకులషెడ్ స్థానంలో R.C.C శ్లాబ్ వేయాలని నిర్ణయించారు. శ్రీస్వామివారికై నిర్మించిన మొదటి భవనంయొక్క దెబ్బతిన్న భాగాలను, తలుపులు, కిటికీలు, కూలిన పిట్టగోడలను పునర్వ్యవస్థీకరిస్తున్నారు.

మంగమారిపేటలోని మత్స్యకారులకి త్రాగునీటి వసతిలేదు. ఆహారపదార్థాలను ఇవ్వాలని మనవారు సిద్ధపడితే వారు, వాటికిబదులు బోరింగువేసి యిమ్మంటే, అలానే వేసి, దాంట్లో సబ్‌మెర్సిబుల్ పంప్‌ని వారి నాయకుడైన శ్రీమాన్ కింగ్ గారికి శ్రీవారు అందించారు. దీనికి గుంటూరు వి.టి.వారు ఆర్థికసహాయాన్నందించారు. శ్రీస్వామివారు వారిజలోని నేత్రవిద్యాలయానికి విచ్చేసి చందరంగం కాంపిటిషన్‌లో గెలుపొందిన విద్యార్థులకి సర్టిఫికెట్స్ ప్రదానం చేశారు. ఇటీవల జరిగిన విజ్ఞాన ప్రదర్శనలో చక్కటి నైపుణ్యాన్ని ప్రదర్శించిన విద్యార్థులకు బహుమతి ప్రదానం చేశారు. ఆరాత్రి 11.30గం॥లకు తూర్పుగోదావరి జిల్లాలోని "తుని" పట్టణానికి చేరుకుని వి.టి. సభ్యులైన శ్రీమాన్ సుబ్బరాజుగారి గృహంలో బసచేశారు. అంతకుముందు ఊరిబయటనే వి.టి. అధ్యక్షులు శ్రీమాన్ సుబ్బరాయలుగారు, సమన్వయకర్త శ్రీమాన్ వర్మ, మిగిలిన భక్తులందరితో శ్రీవారిని నగర పొలిమేరల్లో స్వాగతించారు.

20వతేదీన తీర్థగోష్ఠి నిర్వహించి నూతనంగా నిర్మించిన శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామి ఆలయాన్ని సందర్శించి పెరుమాళ్ళకు మంగళాశాసనం చేశారు. ఆలయవైభవాన్ని, చక్కటి నిర్వహణని చూసి శ్రీస్వామివారు ఆశ్చర్య చకితులై ఆలయ పాలకవర్గానికి, అర్చక పరివారానికి మంగళాశాసనాలు కృపచేశారు. చాలాకాలం తరువాత వచ్చిన శ్రీస్వామివారిని సేవించుకోవడానికి ఎస్. అన్నవరం, తుని, పాయకరావుపేట మరియు చుట్టుప్రక్కల గ్రామాలనుండి అశేష భక్తజనం వచ్చారు. శ్రీస్వామివారు వారందరికి మంగళాశాసనం చేసి బయలుదేరారు.

అన్నవరం మీదుగ వస్తున్న శ్రీస్వామివారు ఊరిలో ఉంటున్న శ్రీమతి గోపి కుమారుడు శ్రీమాన్ పచ్చిపులుసు వెంకటేశ్వర్లు దంపతుల ప్రార్థనపై వారి గృహాన్ని సందర్శించి, అక్కడి పెరుమాళ్ళకు మంగళాశాసనం చేశారు.

మధ్యాహ్నం 3.30గం॥లకు రాజమండ్రి సమీపంలోని కడియం పరిసరాల్లో ఉన్న "సత్యదేవ నర్సరీ"కి విచ్చేశారు. పుల్లా సత్యనారాయణ గారు మరియు సోదరుల ఆహ్వానం పురస్కరించుకొని చక్కగా నిర్వహిస్తున్న వారి నర్సరీని సందర్శించి మంగళాశాసనం చేశారు.

వారి తండ్రిగారు శ్రీమాన్ పుల్లా వెంకట్రావుగారు ఈ నర్సరీని వారి తండ్రిగారి పేర ప్రారంభించి చుట్టుప్రక్కల ఉన్న నర్సరీ వారందరికి మార్గదర్శకులయ్యారు. శ్రీస్వామివారు స్వయంగా 96సం॥ నిండిన శ్రీమాన్ పుల్లా వెంకట్రావు దంపతులకు నూతన వస్త్రాలను బహూకరించి అందరికీ మంగళాశాసనం చేశారు.

సాయంకాలం గం.6.00లకు తాడేపల్లిగూడెం సమీపంలోని అలంపురం వద్ద శ్రీమతి మానికొండ రవమ్మగారి మనుమరాలు శ్రీమతి శ్రీవాణి శ్రీమాన్ రాజేంద్ర దంపతులు నిర్మించుకొన్న శ్రీ ధర్మ ఫంక్షన్‌హాల్‌ని సందర్శించి మంగళాశాసనం చేశారు.

రాత్రి 9.30. గం॥లకు శ్రీస్వామివారు విజయవాడ P.W.D గ్రౌండ్స్‌కి చేరుకుని 23వ తేదీనుండి జరుగబోయే "శ్రీయాగము" కార్యక్రమానికి చేస్తున్న ఏర్పాట్లను పర్యవేక్షించి, సీతానగరం ఆశ్రమానికి చేరుకున్నారు. శ్రీయాగ కార్యక్రమ విశేషాలను వచ్చే సంచికలో తెలుసుకుందాం!




# "వికాసతరంగిణి వార్తావాహిని"

పరమహంస పరివ్రాజకులు, శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి మంగళా శాసనములతో వికాసతరంగిణి కార్యకర్తలు తమ ప్రాంతాలలో వీలయినంత సేవలు అందిస్తునే ఉన్నారు. తమ సంపదని, సమయాన్ని, శక్తిని శ్రద్ధతో సమాజానికి సమర్పించేలా శ్రీ స్వామివారు కార్యకర్తలను తీర్చిదిద్దారు. వికాసతరంగిణి అందిస్తున్న సేవలను చూసి సమాజంలో ఎందరో అభినందిస్తున్నారు. మన కార్యకర్తలు ఎలాంటి పరిస్థితులలోనైనా సేవకు ముందుంటారు అనడానికి చక్కటి ఉదాహరణ – హుద్ హుద్ తుపాను సమయంలో సేవలందించిన శ్రీమాన్ వర్మ – శిరీషా దంపతులు.

**విశాఖపట్టణం :** అక్టోబర్ 13,14 మరియు 15 తేదీలలో హుద్ హుద్ తుపాన్ ప్రళయతాండవం చేసింది. గాలివాన ఎన్నో కుటుంబాలను నిరాశ్రయులను చేసింది. చెట్లు విరిగి పడిపోయాయి. అపార్టుమెంట్లలో కూడా అద్దాల తలుపులు విరిగిపోయాయి. శ్రీమాన్ యం.ఎస్.ఎస్.ఆర్. వర్మగారు మన వికాసతరంగిణి కేంద్ర కమిటి సభ్యులు, వారి శ్రీమతి శిరీష గారు వారిజలో నేత్ర విద్యాలయ పాఠశాల సెక్రటరీ మరియు కరస్పాండెంట్‌గా చక్కటి సేవలు అందిస్తున్నారు. వీరు యం.వి.పి. కోలనీలో నివాసముంటున్నారు. వారి అపార్ట్‌మెంట్ ప్రక్కనే తుపాను రోజున 50 ఇళ్ళ ఇనుపరేకులు ఎగిరిపోవడం వర్మగారు చూసారు. పైనుండి ఆ ఇళ్ళల్లో ఉన్నవారిని వారి అపార్టు మెంటుకు రమ్మని గట్టిగా కేకలు వేసారు. వాళ్ళకి వచ్చే ప్రమాదం గమనించి కొంతమందితో కలసి వర్మగారే స్వయంగా వెళ్ళి అందరిని వారింటికి తీసుకువచ్చారు. కట్టుబట్టలతోవచ్చిన వారందరికి దుప్పట్లు, బట్టలు ఇచ్చి రెండు రోజులు ఇంట్లోనే వంట చేసిపెట్టారు. వారి వంట గదిలో మోకాలిలోతు నీళ్ళు చేరాయి. శ్రీమతి శిరీషగారు అందరికి ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం కావలసిన ఆహారాన్ని వండి వడ్డించారు. శ్రీమాన్ వర్మగారి అపార్ట్‌మెంట్ యజమాని శ్రీ మామిళ్ళపల్లి వేణుగోపాల్ (గోపి) ఉదయం ఫలహారాలు, టీలు ఏర్పాటు చేశారు. శ్రీమాన్ వర్మగారి కేబుల్ నెట్‌వర్క్ అంతా తుపాను తాకిడికి దెబ్బతిని సుమారు 2 కోట్లు నష్టం కల్గింది. అయినా వారు ఆ బాధని పక్కనిపెట్టి ఆ తుపాను బాధితులందరికి ఆతిధ్యమిచ్చారు. ఇది నిజమైన సేవ. దీనులకు, ఆర్తులకు వివిధ సేవలందించడం వికాసతరంగిణి ఆశయం. అవసరమైన సమయంలో ఆదుకున్న వర్మగారి కుటుంబాన్ని లోతట్టు ప్రాంత వాసులంతా "సాక్షాత్తు భగవంతడే వీరి రూపంలో వచ్చి మమ్మల్ని రక్షించారని" కొనియాడారు. ఆ పేటలో సుజాత అనే అమ్మాయి తను పనిచేసే ఇళ్ళల్లో వాళ్ళందరికి వర్మగారి కుటుంబం గూర్చి, వారు చేసిన సేవలను గూర్చితెలియజేస్తున్నదేకాని వర్మగారు కాని శిరీష గారు కాని 'మేమీ సేవలు చేసాం' అని ఎవ్వరికీ చెప్పలేదు. పేరు ప్రతిష్ఠలు ఆశించక ఆచార్యసేవ చేసే ఈ దంపతులు అందరికీ ఆదర్శం కావాలి. ఆచార్య మంగళాశాసనములతో సేవలందిస్తూ ఎందరికో మార్గదర్శకులై వికాసతరంగిణిని ముందుకు నడపాలని ఆకాంక్షిద్దాం.



**తుపాను ప్రాంతాలలో వికాసతరంగిణి సహాయక చర్యలు.**

**భీమిలి - విశాఖపట్టణం జిల్లా**

పెను తుపాను వలన మన వారిజ ఆశ్రమం కుటీరాలు చాలా దెబ్బతిన్నాయి. ఆశ్రమంలో చెట్లన్నీ విరిగిపడ్డాయి. ప్రక్కనే ఉన్న



నేత్రవిద్యాలయ పక్కా భవనం అవడంవలన వేదం గురువులు, విద్యార్థులు నేత్ర విద్యాలయంలోనే ఉన్నారు. శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనముల వలన ఎటువంటి ఆపద కలుగలేదు. శ్రీమతి బేబిగారు, వారి అమ్మాయి చి॥మాధురి 2 రోజులు నేత్ర విద్యాలయంలోనే విద్యార్థులకు తోడుగా ఉండి సేవలందించారు. నేత్రవిద్యాలయ, వారిజ కమిటీ సభ్యులు, శ్రీకాంతాచార్య గురువుగారు, సంతోష్ గురువుగారు జనరేటర్ ద్వారా నీటిని అందించడం వంటి అన్ని సౌకర్యాలు కల్గించారు. నేత్ర విద్యాలయ కరస్పాండెంట్ శ్రీమతి శిరీష, ప్రెసిడెంట్ శ్రీమాన్ రాజుగారు, కోశాధికారి శ్రీమతి విజయలక్ష్మి పాఠశాల విద్యార్థులకు ఎటువంటి ఇబ్బంది కలుగకుండా తగిన జాగ్రత్తలు తీసుకున్నారు. వారిజ నేత్ర విద్యాలయ సేవాబృందం చక్కటి సేవలందించారు.

వారిజ ఆశ్రమంలో విరిగిన చెట్లు, పడిపోయిన పై కప్పులను వెంటనే తీయించి శుభ్రపరుస్తున్నారు. యం.వి.పి. కోలనీ, మధురవాడ, తగరపువలస, తాళ్ళవలస, భీమిలి నుంచి కార్యకర్తలు వచ్చి సేవలందించారు. విశాఖపట్టణం వికాస తరంగిణి ఒక లక్ష రూపాయలు కుటీరాల కోసం అందించారు.

**మంచినీటి బోరుకై - నందిగామ వి.టి. సహకారం**

గుంటూరు జిల్లా సత్తెనపల్లి మండలం, నందిగామ వికాసతరంగిణి సభ్యులు విశాఖపట్నంలో తుపాను బాధితులకు అక్టోబర్ 17వ తేది గుంటూరు నుండి వేన్‌లో వచ్చి తమవంతు సహకారం అందించారు. వారిజ ఆశ్రమం సమీపంలో సాగరతీరంలోనున్న నగరపాలెం, మంగమారిపేట గ్రామాలలో బియ్యం 200 కేజీలు, 300 చీరలు నిత్యావసర సామాగ్రి పంచి పెట్టారు. మంచినీటి కోసం బోర్ వేయించడానికి గ్రామస్తులకు 30వేల రూపాయలు అందించారు. విశాఖపట్టణం వికాస తరంగిణి సభ్యులు సహకారమందించిన కార్యకర్తలకు కృత జ్ఞతలు తెలియజేసారు.



**విశాఖపట్టణం అక్కయ్యపాలెం**

వికాసతరంగిణి సభ్యులు తుపాను బాధిత గ్రామాలైన సోమన్నపాలెంలో దుప్పట్లు పంచిపెట్టారు.

శ్రీశ్రీశ్రీ స్వామివారి తిరునక్షత్రం సందర్భంగా యం.వి.పి. వికాసతరంగిణి, ఉషోదయ, తాళ్ళవలస, మధుర వాడ వికాసతరంగిణి సభ్యులు కె.నగరపాలెం, తగరపువలస, తాళ్ళవలస గ్రామాలలో బియ్యం, వస్త్రాలు, నిత్యావసర సరుకులు అందజేసారు. తమకు ఇంతగా సహకారమందిస్తున్న కార్యకర్తలకు గ్రామస్తులు కృతజ్ఞతలు తెలియజేసారు.

కార్యక్రమం నిర్వహిస్తున్నంతవరకు జై శ్రీమన్నారాయణ నామ సంకీర్తన చేస్తూ గ్రామస్తులంతా సేవలందుకున్నారు. వికాసతరంగిణి సభ్యులు 26వ తేదీ సుమారు 200 మందికి ఉచిత వైద్య సేవలందించారు. డా.పి.ఎ.ఎల్. రజని, డా. పి. రుక్మిణి, డా.పి. జగదీష్, డా. పి. అనిల్‌కుమార్ వైద్య పరీక్షలు నిర్వహించారు. కార్యకర్తలు ఉచితంగా మందులు అందజేసారు.

**విశాఖపట్టణం**

వారిజలో తుపాను వలన ఏర్పడిన చెత్తచెదారాన్ని, విరిగిన చెట్లను నేత్ర విద్యాలయ విద్యార్థులు స్వచ్ఛ భారత్ కార్యక్రమం నిర్వహించి శుభ్రపరిచారు.

**విజయనగరం**

విజయనగరం వికాసతరంగిణి కార్యదర్శి శ్రీమాన్ రవివర్మగారు వారి కళాశాల విద్యార్థులు,నరవ కార్యకర్తలతో కలసి వారిజలో సేవలందించారు. కుటీర నిర్మాణం కోసం 65వేల రూపాయలు వారిజ కమిటికి అందించారు. శ్రీశ్రీశ్రీ స్వామివారికి ఎంతో ఆనందాన్ని కల్గించే సాగర సమీపంలో ఈ ఆశ్రమంలో పక్క భవనములు నిర్మించవలసిన బాధ్యత మనందరిది. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుంటూ ఆచార్య సేవలో తరిద్దాం.

**మంచిపుస్తకం జీవితానికి మార్గదర్శకం :**

మన ఆచార్యులు వికాసతరంగిణి ద్వారా ఒక గొప్ప కార్యాన్ని మనకందించారు. ఆ కార్యమే "మాధవ సేవగా సర్వ ప్రాణి సేవ". ఆచార్య అనుగ్రహంతో మనము సమాజ రూపంలో ఉన్న శ్రీమన్నారాయణునికి మంచి సేవ చేసే పరికరాలుగా మనం తయారుకావాలి. మన విలువలని పెంచుకోవాలి. ప్రేమను పదిమందికి పంచాలి. ఈ ఆత్మీయత ఏ ఒక్కరిలోనో కాదు అందరిలో రావాలి. అలాంటి ఆత్మీయత మనమధ్య ఏర్పడాలంటే మనం తరచు కలుస్తుండాలి. భగవద్బంధుత్వాన్ని గుర్తుచేసే కలియికే సత్సంగం. మనల్ని మనం సంస్కరించుకోవ డానికి, మనలో సేవచేసే శక్తిని, ప్రేమని నింపుకోడానికి, మనలో ఆత్మ విశ్వాసాన్ని పెంచుకోవడానికి, మనలో నిరుత్సాహాన్ని తొలగించుకోడానికి 'సత్సంగం' చక్కటి వేదిక.

**మన సంస్కారాలను సత్సంగం ద్వారా వికసింపచేసేం దుకు మన ఆచార్యులు సంస్కార వికాస్ అనే విభాగాన్ని ఏర్పరచి 'సంస్కార తరంగిణి' అనే పుస్తకాన్ని అందించారు. మనము మారాలంటే ఈ 'సంస్కారతరంగిణి'ని చదవి అందులో తెలియజేసినట్లు ఆచరిస్తేచాలు.** ఆచార్యునికి ఆనందం కలిగించే శిష్యులుగా మనం తయార వుతాం. రాబోయే రామానుజ సహస్రాబ్ది నాటికి ఆచార్యులు తృప్తి చెందే విధంగా ప్రతి ప్రాంతం నుండి చక్కటి సేవకులు రావాలని సంస్కారవికాస్, సత్సంగాలను ఏర్పాటు చేస్తోంది. విజయనగరం, బాలాజీ నగర్, క్రొత్త అగ్రహారం, అలక నందకోలనీ, ప్రసాద్‌నగర్ కోలనీ, దాసన్నపేట, నరవ మొదలైన ప్రాంతాలలో సత్సంగాలు జరుగుతున్నాయి.

**సాలూరు :**

వికాసతరంగిణి యువవికాస్ కార్యకర్తలు శ్రీ వేణు గోపాలస్వామివారి ఆలయ జీర్ణోద్ధరణకు విశేష కృషి చేస్తున్నారు. ఇన్నాళ్ళు పదుల సంఖ్యలో కూడా కనబడని భక్తులు ఇప్పుడు అన్ని ఉత్సవాలకు విశేషంగా వస్తున్నారు. భజనలు, కోలాటాలు, ప్రవచనాలు ఎన్నో విశేష కార్యక్రమాలు నిర్వహించి అందరి మన్ననలు పొందుతున్నారు.

శ్రీశ్రీశ్రీ చిన్న జీయరుస్వామివారి తిరునక్షత్ర మహోత్స వం, దీపోత్సవం నిర్వహించారు. ఆదివారం వన భోజన కార్యక్రమంలో 130 మంది వికాసతరంగిణి కార్యకర్తలు పాల్గొన్నారు. ఆధ్యాత్మిక క్విజ్ నిర్వహణతోపాటు వికాసతరంగిణి ఆశయాలు, లక్ష్యాలు, స్వామివారి కార్యక్రమ విశేషాలను తెలియజేస్తూ శ్రీమాన్ విశ్వనాథ్‌గారు కార్యక్రమాన్ని నిర్వ హించారు.

**పార్వతీపురం :**

బెలగాం వివేక్ కోలనీ రామమందిరంలో అఖండ రామనామ సంకీర్తన కార్యక్రమాన్ని పార్వతీపురం వికాస తరంగిణి సభ్యులు



నిర్వహించారు. ప్రతివారం సత్సంగ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. శ్రీశ్రీశ్రీ స్వామివారి తిరునక్షత్ర సందర్భంగా వారిజ నేత్ర విద్యాలయ విద్యార్థులకు తదీయా రాధన నిర్వహించారు.

**తూర్పు గోదావరి జిల్లా - వీరభద్రపురం :**

మండపేట, వీరభద్రపురం వికాసతరంగిణి కార్యకర్తలు ఉచిత హోమియో వైద్య శిబిరాన్ని తాపేశ్వరంలో నిర్వహించారు. ప్రభుత్వ హోమియో వైద్యులు డా.అంజమ్మ, డాక్టర్ పి. అమీర్‌జానీ ఉచిత పరీక్షలు నిర్వహించి మందులు అందజేసారు. 250 మందికి పైగా ఈ కార్యక్రమంలో సేవలందుకున్నారు.

**రాజమండ్రి :**

ఉత్తరాంధ్రలో హుద్ హుద్ తుపాను వలన కలిగిన నష్టానికి ఎందరో స్పందించారు. రాజమండ్రి వికాసతరంగిణి సభ్యులు శ్రీమాన్ సత్తిరాజుగారు, వికాసతరంగిణి వారి సహకారంతో సుమారు 18,000 రూపాయల పాల ప్యాకెట్లను (400 లీటర్లు) విశాఖపట్టణంలో అందజేసారు. రోడ్లన్నీ కొట్టుకు పోయినా అతి కష్టంమీద కారులో విశాఖ చేరి 17వ తేది రాత్రి సీతంపేట పరిసర ప్రాంతాలలో సేవలందించారు. ముసలివారు, చిన్నపిల్లలు ఎందరో ఉన్న ఆ కోలనీవాసులు వికాసతరంగిణి వారికి కృతజ్ఞతలు తెలియజేసారు.

రాజమండ్రిలో ఉన్న శ్రీమతి మోరంపూడి లక్ష్మిగారు ప్రతి సంవత్సరం నేత్రవిద్యాలయ అంధుల పాఠశాలకు తన బంధువుల సహకారంతో సహాయాన్ని అందిస్తూ ఉంటారు. ఈ సంవత్సరం కూడా విశాఖపట్టణం వారిజ నేత్రవిద్యాలయ విద్యార్థులకు శ్రీలక్ష్మి మరియు రమాదేవిగార్ల సహకారంతో సుమారు 40వేల రూపాయలు అందజేసారు. శ్రీమతి వేదవతిగారు తమ బంధువులు, వికాసతరంగిణి కార్యకర్తలతో కలిసి శంషాబాద్ దివ్యసాకేతంలో ఉన్న గోశాలలో గో సేవా కార్యక్రమాన్ని నిర్వహించారు. లక్ష్మిగారు, సత్తిరాజుగారు మొదలైన కార్యకర్తలు సంస్కారవికాస్ సత్సంగాలను ప్రతి గురువారం నిర్వహిస్తున్నారు. తమ చుట్టుప్రక్కల ప్రాంతాలలో ఉన్న పాఠశాలల్లో ప్రజ్ఞ కార్యక్రమాలను ప్రారంభించారు. నవంబర్ 14 బాలల దినోత్సవం సందర్భంగా అనపర్తి శారదగారు పద్మావతి రామానుజంగారి సహకారంతో అనపర్తిలో ప్రజ్ఞ కార్యక్రమాలను ప్రారంభించారు.

**మధ్యపానాన్ని నిషేధించిన ఆదర్శగ్రామం 'అర్తమూరు'**

**కాకినాడ :**

శ్రీశ్రీశ్రీ చినజీయరు స్వామివారి తిరునక్షత్రం సందర్భంగా 40 రోజులు శ్రీరామాయణ పారాయణ, హనుమాన్ చాలీసా పారాయణ కార్యక్రమాన్ని కాకినాడలో నిర్వహించారు. శ్రీశ్రీశ్రీ స్వామివారి ఆరాధన, అనంతరం తదీయారాధన నిర్వహించారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు అవతరించిన గ్రామం అర్తమూరు. ఆ గ్రామాన్ని వికాసతరంగిణి ఆదర్శగ్రామంగా తయారుచేయాలని సంకల్పించారు. పర్యావరణ పరిరక్షణకై వస్త్రంతో తయారుచేసిన సంచులను ఇంటింటికి అందజేసారు. గ్రామానికి పడమరవైపు ఉన్న తాపేశ్వరం వరకు మొక్కలు నాటారు. అన్నిటికంటే విశేషమేమిటంటే, ఆ గ్రామంలో సారాయి(మధ్యం) దుకాణం లేకుండా కట్టుదిట్టం చేసారు. "పెద్దజీయరు స్వామివారు, చిన్న జీయరుస్వామివారుతో సంబంధమున్న ఆ గ్రామానికి సారాయి దుకాణం వద్దు" అని కలెక్టర్‌గార్కి, ఎమ్మెల్సీ మరియు ముఖ్యమంత్రి గార్కి లేఖ సమర్పించారు. ఈ మధ్యం దుకాణాలు మూసివేసిన తరువాత తమ జీవితాలు చాలా బాగున్నాయని మహిళలు సంతోషంతో వికాసతంగిణి కార్యకర్తలకు కృతజ్ఞతలు తెలియజేస్తున్నారు. వికాసతరంగిణి సభ్యులు శ్రీ బి. స్వామిరెడ్డి గారు 25 లక్షల రూపాయలతో, సుద్ధజల ప్రాజెక్టును కట్టించి గ్రామానికి మంచినీరు అందిస్తున్నారు. తూర్పుగోదావరి జిల్లా వికాసతరంగిణి ప్రెసిడెంట్ శ్రీ చర్ల ప్రసాదరెడ్డి తదితరులు కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారు.

**సిద్ధాంతం - పశ్చిమ గోదావరి జిల్లా :**

పెనుగొండ మండలం, సిద్ధాంతం గ్రామంలో శ్రీ విజయ గోపాలస్వామివారి ఆలయ ప్రాంగణంలో వికాసతరంగిణి శాఖ అధ్యక్షులు శ్రీ వంగూరి వెంకటరామయ్య గారు శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ, సహస్రదీపారాధన కార్యక్రమం నిర్వహించారు. ఈ కార్యక్రమానికి భక్తులు అధిక సంఖ్యలో పాల్గొని శ్రీస్వామివారి వైభవాన్ని శ్రవణం చేసారు.

**జంగారెడ్డిగూడెం - పశ్చిమ గోదావరి జిల్లా:**

వికాసతరంగిణి సభ్యులు ప్రతి వారం సంస్కారవికాస్, సత్సంగ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. శ్రీశ్రీశ్రీ స్వామివారి తిరునక్షత్ర వేడుకలు వైభవంగా నిర్వహించారు. శ్రీమాన్ హృషీకేశ్ అను వానికి నెల రోజుల క్రితం ప్రమాదం జరుగగా వారికి స్వామివారి పేరుమీదుగా తిరునక్షత్రం రోజు 5000 రూపాయలు, బియ్యం, నిత్యావసర వస్తువులు అందజేశారు. ఈ కార్యక్రమాన్ని అధ్యక్షులు కొల్లూరు శ్యామలాంబ, కార్యదర్శి వక్కలగడ్డ హేమలత, కోశాధికారి అనంతలక్ష్మి, వికాసతరంగిణి సభ్యులు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

**చైతన్య వికాసతరంగిణి పడపట విజయవాడ :**

హుద్ హుద్ తుపాను బాధితుల సహాయార్థం శ్రీశ్రీశ్రీ స్వామివారు ముఖ్యమంత్రి సహాయనిధికి వికాసతరంగిణి ద్వారా 10 లక్షలు అందజేసారు. ఈ విషయం వెబ్‌సైట్‌లో చూసిన వెంటనే విజయవాడ పడమట చైతన్యవికాసతరంగిణి శాఖ వారు 50వేలు ఆంధ్రాబ్యాంకు అకౌంట్ ద్వారా సమర్పించారు.

**మారుమూల గ్రామాలలో ప్రజ్ఞ కార్యక్రమం :**

**గంపలగూడెం - కృష్ణా జిల్లా :**

తోటమూల సరస్వతీ ఆలయంలో వికాసతరంగిణి సభ్యులు ప్రజ్ఞ కార్యక్రమాలు ప్రారంభించారు. విద్యార్థులకు చిన్నతనం నుండే నైతిక విలువలు నేర్పించాలని స్వామివారు అందించిన ప్రజ్ఞ కథలు చాలా బాగున్నాయని కార్యక్రమాన్ని ప్రారంభించిన గంపలగూడెం కోస్టల్ బ్యాంక్ మేనేజర్ శ్రీనివాస్ గారు అన్నారు.



ప్రతి వారంలో రెండు రోజులు పాఠశాలలలో ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ఈ కార్యక్రమాన్ని అధ్యక్షురాలు కొల్లా కృష్ణకుమారి, పద్మావతి, సత్యవతి మొదలైనవారు నిర్వహించారు.

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి తిరునక్షత్ర మహోత్సవాన్ని స్థానిక రామాలయంలో నిర్వహించారు. ప్రతి నెల పునర్వసు నక్షత్రం నాడు అన్నదాన కార్యక్రమం రామాలయంలో నిర్వహిస్తున్నారు. గంపలగూడెం మహిళా కార్యకర్తలు ఈ కార్యక్రమం ప్రతి నెల నిర్వహించడానికి చాలా ఉత్సాహం కనబరుస్తున్నారు. ప్రతి వారం శ్రీ విష్ణుసహస్రనామ పారాయణ కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారు. కృష్ణకుమారి గారు గంపలగూడెం వికాస తరంగిణి వారు నేత్ర విద్యాలయంకు 3,025 రూపాయలు సహకార మందించారు.

**మార్కాపురం :**

యువ వికాసతరంగిణి సభ్యులు శ్రీశ్రీశ్రీ స్వామివారి తిరునక్షత్రంరోజు వినోద్ హాస్పిటల్‌లో ఆ రోజు వచ్చిన పేషెంట్స్‌కి ఉచితంగా చికిత్స చేయించారు. డా. విష్ణు చైతన్య, డా. వింధ్యవైష్ణవి వైద్య పరీక్షలు నిర్వహించారు. ఆల్‌షాపు వర్కర్స్ సభ్యులకు ఉచితంగా టోకెన్లు అందించారు. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా మార్కాపురం మున్సిపల్ ఛైర్మన్ వక్కలగడ్డ రాధికగారు విచ్చేసారు. యువవికాస్ అధ్యక్షులు డి.రంగ నాయకులు, సెక్రటరీ పువ్వాడ ప్రదీప్, ట్రెజరర్ కె. మహేష్, యువవికాస్ కార్యకర్తలు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

**మిర్యాలగుడ : హౌసింగ్‌బోర్డ్ కోలనీ :**




శ్రీశ్రీశ్రీ స్వామివారి తిరునక్షత్రం సందర్భంగా 26-10-2014 ఆదివారం అనంతపురం గ్రామంలో వృద్ధాశ్రమంలో వృద్ధులకు వికాసతరంగిణి కార్యకర్తలు పండ్లు, వస్త్రాలు పంచిపెట్టారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు నిర్వహిస్తున్న సేవలను అందరికి తెలియజేసారు. వృద్ధాశ్రమ నిర్వాహకులు 'వృద్ధులకు మనో ధైర్యాన్ని పెంచే సత్సంగ కార్యక్రమాలను నిర్వహించమని కార్యకర్తలను కోరారు. ఈ కార్యక్రమంలో మిర్యాలగుడ వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమతి యం. విజయలక్ష్మి, సి.హెచ్. రమేష్, కె.రఘునాధాచార్యులు, ఇతర కార్యకర్తలు మరియు గ్రామ పెద్దలు పాల్గొన్నారు.

**సంస్కారవికాస్ :**

శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో మిర్యాల గుడ హౌసింగ్ బోర్డు వికాసతరంగిణి 07-11-2014నుండి సంస్కార్ వికాస్ సత్సంగ కార్యక్రమం ప్రారంభమయింది. విద్యా నగర్ వాసులందరు సత్సంగం నిర్వహించారు.శ్రీ రాగిరెడ్డి శ్రీదేవి దంపతులు గృహంలో ఈ కార్యక్రమం ప్రారంభమయింది. కార్యక్రమంలో పాల్గొన్న కార్యకర్తలందరూ "ఇలాంటి కార్యక్రమాల వలన పరస్పర స్నేహ భావాలు మంచినడవడి, ఆధ్యాత్మిక చైతన్యం అందరిలో కలుగుతాయని, తెలియని విషయాలు చర్చించుకోవడం ద్వారా అందరికి తెలుస్తాయని ఆనందించారు. వికాసతరంగిణి సభ్యులంతా ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు.

**హనుమకొండ - వరంగల్ :**

జోన్ 3 ( వరంగల్ - నల్గొండ - ఖమ్మం) సంస్కార వికాస్ సమన్వయ కర్తల సమావేశం హనుమకొండలో 31-10-2014న



జరిగింది. ఈ కార్యక్రమం శ్రీశ్రీశ్రీ త్రిదండి దేవనాథ రామానుజ జీయర్‌స్వామి వారి ప్రత్యక్ష పర్యవేక్షణలో జరిగింది. సెంట్రల్ ఆర్గనైజింగ్ సెక్రటరీ భవాని ప్రసాద్‌గారు, కార్యదర్శి బాలకిషన్‌గారు, సెంట్రల్ కమిటీ పూర్వ అధ్యక్షులు శ్రీ మహేంద్రరెడ్డిగారు, 3వ జోన్ కన్వీనర్, వరంగల్ జిల్లా అధ్యక్షులు ప్రొ. పి. జ్యోతిగారు, సెంట్రల్ వికాసతరంగిణి సభ్యులు సంస్కార వికాస్ సమన్వయకర్తలు, వికాసతరంగిణి సభ్యులు సుమారు 100 మంది సమావేశంలో పాల్గొన్నారు.

సంస్కార్ వికాస్ మన దోషాలను తొలగించుకోవడానికి ఉపయోగపడే చక్కటి కేంద్రం - సత్సంగంలో సంస్కార వికాస్ అందిస్తున్న 'సంస్కార తరంగిణి' అనే చక్కటి పుస్తకం ద్వారా అందరూ భగవంతునికి నచ్చే సేవకులుగా తయారుకావచ్చు. ప్రతిచోట సత్సంగాలు బాగా జరగాలి. ***సంస్కార తరంగిణి*** ద్వారా మంచి విషయాలను అందరూ తెలుసుకొని ఆచరించాలని స్వామివారు, కేంద్ర కమిటీ సభ్యులు తెలియజేసారు. మనం మనమన ప్రాంతాలలో సత్సంగాలను చాలా విస్తరింపచేయాలని తెలియజేసారు.

**నిజామాబాద్ :**

శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి మంగళాశాసనములతో 08-11-2014 శనివారం శ్రీశ్రీశ్రీ త్రిదండి దేవనాథ రామానుజ జీయరు



స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో నిజామాబాద్‌శాఖ సమావేశము జిల్లా కార్యాలయంలో జరిగింది. శ్రీశ్రీశ్రీ దేవనాథ జీయరుస్వామివారి ధనుర్మాస కార్యక్రమాన్ని నిజామాబాద్‌లో నిర్వహించుటకు కమిటి నిర్ణయించింది. స్వామివారు ధనుర్మాసాన్ని అనుగ్రహించటంతో పాటు సుమారు 36 మండలాలలో శ్రీరామానుజ సహస్రాబ్ది వైభవాన్ని వివరిస్తారు. కమిటి వారంతా ఉత్సాహంగా కార్యక్రమాలకు ఏర్పాట్లు చేస్తున్నారు. శాఖ అధ్యక్షులు జి. శ్రీనివాస్, కార్యదర్శి ఎన్. శ్రీనివాస్ తదితర కార్యకర్తలు పాల్గొన్నారు. కరీంనగర్‌శాఖ సభ్యులు గౌతమరావుగారు, ప్రభాకరరావుగారు పాల్గొన్నారు

**18 పాఠశాలలో భగవద్గీత శ్లోకపఠన పోటీలు :**

**కరీంనగర్ :**

కరీంనగర్ వికాసతరంగిణి డిసెంబర్ 2 గీతా జయంతి సందర్భంగా 18 పాఠశాలలలో భగవద్గీత శ్లోక పఠన పోటీలు నిర్వహించనున్నారు. నవంబర్1వ తేదీన అంటే నెల రోజులు ముందుగా భగవద్గీత పుస్తకాలను సప్తగిరి కోలనీ వికాసతరంగిణి పాఠశాలలకు అందించారు. పాఠాశాలల ఉపాధ్యాయుల సహ కారంతో వికాసతరంగిణి సభ్యులు ఈ కార్యక్రమం నిర్వ హిస్తున్నారు.

**రామానుజ సహస్రాబ్దికై దేవనాథజీయర్ స్వామివారి పాదయాత్ర:**

**మంచిర్యాల :**

శ్రీ దేవనాథ రామానుజ జీయరుస్వామి వారు మంచిర్యాల ప్రాంతంలో భగవద్రామానుజ సహస్రాబ్ది ప్రచార కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. నవంబర్ 10వ తేదీన గోదావ్రార్, రామకృష్ణా పూర్, మందమర్రి మొదలైన ప్రాంతాలలో శోభాయాత్ర నిర్వహించారు. రెండు మండలాల్లో ప్రచార కార్యక్రమం నిర్వహించారు. రామానుజ వైభవాన్ని పాఠశాల విద్యార్థులకు సైతం అర్థమయ్యేల చక్కగా వివరించారు. వి.టి. అధ్యక్షులు ఎ. రాజేశ్వరరావు, ప్రభాకర రావు, ఉమగారు, రుద్ర, పద్మజ, సురేఖ, చిట్టి సుప్రజ, బాలకిషన్ రావు మొ॥ వారు పాల్గొన్నారు.

**కెపిహెచ్‌బి కోలనీ - హైదరాబాద్**

వికాసతరంగిణి సభ్యులు నవంబర్ 10వ తేదీన అవయవదాన అవగాహన యాత్ర (రెండు కిలోమీటర్లు) నిర్వహించారు. నారాయణ,




శ్రీచైతన్య, ప్రగతి కళాశాలల విద్యార్థులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. అవయవ దానం వలన కలిగే లాభాలను, ఏఏ అవయవాలను ఎలా దానం చెయ్యాలనే విషయాలను తెలియజేసారు. ఎమ్మెల్యే, కెపిహెచ్‌బి కోలనీ కార్పొరేటర్ కూడా ఈ అవగాహనా యాత్రలో పాల్గొన్నారు.

కె.పి.హెచ్.బి. కోలనీ వికాసతరంగిణి సభ్యులైన శ్రీమాన్ సత్యనారాయణ గారు ఈ ప్రాంతంలో 20 సంవత్సరము లుగా వేంకటేశ్వరస్వామి వారి ఆలయంలో ప్రతిరోజూ సత్సంగ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ప్రతి రోజు 30 మంది తక్కువ కాకుండా ఆదివారం మరియు సెలవులలో 100మంది సభ్యులు ఈ కార్యక్రమంలో పాల్గొంటారు. శ్రీస్వామివారు ఆదేశించిన అన్ని కార్యక్రమాలను ఈ శాఖ సభ్యులు నిర్వహిస్తారు. నూతనంగా కమిటి సభ్యులను నియమించారు. ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. అందులో భాగంగా కంటి పరీక్షలు నిర్వహించారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు తిరునక్షత్ర సందర్భంగా అనాథ బాలబాలికల పాఠశాల, మండల ప్రాథమిక పాఠశాలలో ఫలాలు, మధుర పదార్థాలను పంచిపెట్టారు. ఇక్కడ ప్రజ్ఞ తరగతులను కూడా నిర్వహిస్తున్నారు

**హైదరాబాద్ :**

శ్రీమతి వనజ చలపతిరావు శ్రీమతి బాల లింగరాజు గారు మల్లాపూర్, చందానగర్‌లో ఉన్న ప్రభుత్వ పాఠశాలలో అనాథ శరణాయాలలో స్వీట్లు పంచారు.

**బెంగుళూరు :**

వికాసతరంగిణి సభ్యులు భగవద్రామానుజ సహస్రాబ్ది ప్రచార కార్యక్రమాన్ని కర్ణాటక రాష్ట్రంలో ప్రారంభించారు. రామానుజ వైభవాన్ని




అనేక ప్రాంతాలలో తెలియజేసారు. అక్టోబర్ 12న శ్రీమతి శారద నూతక్కి గారి ఆధ్వర్యంలో ఇస్కాన్ ఆడిటోరియంలో కార్యక్రమాలు అత్యంత వైభవంగా జరిగాయి. ప్రజ్ఞ విద్యార్థుల ప్రార్థనతో సభ ప్రారంభమైంది. శ్రీమతి సముద్రాల మాధవీ రామానుజం బృందం 'ఆచార్యత్రయం' నృత్య రూపకాన్ని ప్రదర్శించారు. ఈ కార్యక్రమానికి ప్రముఖ పారిశ్రామిక వేత్తలు, ఆధ్యాత్మిక వేత్తలు, శ్రద్ధాళువులైన భక్తులు పాల్గొని ఆనందించారు.

**చెన్నై:**

జెట్, వికాసతరంగిణి వారు సీతకింగ్‌స్టన్ పాఠశాలలో ప్రజ్ఞ కార్యక్రమాన్ని నిర్వహించారు. ప్రజ్ఞ కన్వీనర్ శ్రీమతి కమలగారు ప్రతి సంవత్సరం ప్రజ్ఞ తరగతులు నిర్వహిస్తున్నారు. 500 మంది విద్యార్థులు శిక్షణ పొందుతున్నారు. వారిలో వంద మందికి మొదటి మాడ్యుల్‌పై పరీక్షలు నిర్వహించి బహుమతులు అందజేసారు. ఒకటి, రెండు తరగతుల విదార్థులకు శ్రీమతి హేమగారు, శారదగారు ప్రజ్ఞ శ్లోకాలు నేర్పిస్తున్నారు. శ్రీమతి గజలక్ష్మిగారు కోవలంలో ప్రజ్ఞ నిర్వహిస్తున్నారు.

**వృద్ధదంపతీ పరివస్య - భక్తుల విశేష స్పందన**

**అనుభవ వేదిక -**

మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్య దేవోభవ అనే వేదవాక్యాలని మనం వింటూవుంటాం. తల్లీ,తండ్రీ,గురువు సాక్షాత్తు భగవంతుని స్వరూపాలు. వారు చేసిన ఉపకారానికి ఏమి ఇచ్చి ఋణం తీర్చుకోగలం? మనల్ని కని, పెంచి, పోషించి పెద్దవారిని చేసిన తల్లిదండ్రులను ఏ విధంగా గౌరవించాలో, పూజించాలో జ్ఞాన ప్రదాత అయిన గురువుగారే స్వయంగా అందరికీ తెలియజేసిన అద్భుత కార్యక్రమం 'వృద్ధ దంపతీ పరివస్య' (వృద్ధ దంపతీ సేవ) .

భగవంతుని అంతటా సందర్శించిన సమతామూర్తి భగవద్రామానుజులు. వారు లోకానికి అందించిన అష్టాక్షరి మహా మంత్ర వైభవాన్ని ఈనాటికి అందరికీ అందిస్తున్న సదాచార్యులు ఎందరో సంప్రదాయాన్ని పరిరక్షిస్తున్నారు. అటువంటి ఆచార్యులవద్ద సమాశ్రితులై ప్రతీరోజూ ("రామానుజార్య దివ్యాజ్ఞ వర్ధతాం అభివర్ధతాం") అంటూ

ప్రార్థనచేసే భక్తులు కోట్లాదిమంది ఉన్నారు. అటువంటి భక్తులలో గృహస్థాశ్రమాలలో ఉంటూ తన కుటుంబాన్ని, సమాజ క్షేమం కోసం వైదిక కార్యక్రమాలని నిర్వహిస్తున్న వృద్ధ దంపతులను శ్రీశ్రీశ్రీ చినజీయరు స్వామివారు అక్టోబర్ 26న సన్మానించారు. ఆ దంపతుల క్షేమం కోసం నక్షత్రశాంతి హోమాలు జరిపించారు. ఇటువంటి కార్యక్రమాన్ని ఇంతకు ముందెన్నడు దర్శించలేదని ఎందరో భక్తులు తమ అనుభవాలను వ్యక్తపరిచారు.వృద్ధదంపతుల సేవలో తల్లిదండ్రులకు పాదపూజ కార్యక్రమం నిర్వహించడానికి వారి పరివారమంతా వచ్చారు. కొత్తగా ఆశ్రమానికి వచ్చిన ఆ భక్తులు శ్రీ స్వామివారు నిర్వహిస్తున్న సేవలు మరువలేనివి అంటూ తమ అభిప్రాయాన్ని వ్యక్తపరిచారు. వేలాదిమంది భక్తులు తెలియజేసిన అనుభవాలలో మొదటిగా ఒకటి ఇక్కడ ప్రచురిస్తున్నాం.

**శ్రీమతి వెణుతురుపల్లి ఇందిర - విశాఖపట్టణం :**

70 సంవత్సరాలు నిండిన దంపతులకు సేవచేసే భాగ్యం శ్రీ స్వామివారు అందరికీ కలుగజేసారు. మా తల్లిదండ్రులకు శ్రీ స్వామివారి సన్నిధిలో పాదపూజ చేసుకోవడం చాలా ఆనందంగా ఉంది. ఇంతవరకూ దివ్యసాకేతము చూడని మాలాటి వారికి అక్కడ చేస్తున్న సేవలు చాలా ఆనందాన్ని కలిగించాయి. జిమ్స్ హాస్పటల్, నేత్ర విద్యాలయ, జీయర్ గురుకుల పాఠశాల, గోసేవ, ఆలయం ఇవన్నీ ఎంతో ఆనందాన్ని ఇచ్చాయి. ముఖ్యంగా ఆక్యుప్రెషర్ వైద్యం ద్వారా నేను అక్కడ ఆరోగ్యవంతురాల్ని అయ్యాను. శ్రీమతి విజయలక్ష్మిగారు ఎన్నాళ్ళ నుండో ఉన్న నా మోకాలి నొప్పిని ఆక్యుప్రెషర్ ద్వారా తగ్గించారు. ఆక్యుప్రెషర్ రెండు రోజులు అక్కడ చేయించుకున్న తరువాత నేను నొప్పి లేకుండా నడవగలుగుతున్నాను. ఇంటికి వచ్చిన తరువాత వారు చెప్పినట్లుగా ఆక్యుప్రెషర్ చేసుకుంటూ చాలా ఆరోగ్యంగా ఉన్నాను. ఉచితంగా స్వామివారు చేయిస్తున్న ఈ సేవలకు కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

**ఓపెన్ చెస్ టోర్నమెంట్‌లో నేత్రవిద్యాలయ విద్యార్థుల ప్రతిభ**

ఫోర్త్ డిస్ట్రిక్ట్ ఓపెన్ చెస్ టోర్నమెంట్ పోటీలను హార్ట్ ఎకాడమీ వారు 16-11-2014న విశాఖపట్టణం జిల్లాలో నిర్వహించారు. ఈ పోటీలలో




నేత్రవిద్యాలయానికి చెందిన గొలగాన రమణ, పల్లా గణేష్, ఒమ్మి నరసింహం పాల్గొన్నారు. ఓపెన్ టోర్నమెంట్‌లో మొదటి పది స్థానాలలో తొమ్మిదో స్థానాన్ని పల్లా గణేష్ గెలుపొందారు. విజువల్లీ ఛాలెంజ్డ్ విభాగంలో పల్లా గణేష్ ప్రథమ స్థానం కైవసం చేసుకున్నారు. ఎంతోమంది పాల్గొన్న ఈ పోటీలో నేత్రవిద్యాలయ ప్రథమ స్థానాన్ని పొందినందుకు శిక్షణనిచ్చిన ఉపాధ్యాయుడు భాస్కర్ సంతోషాన్ని వ్యక్తపరిచారు.

**భగవద్రామానుజ సహస్రాబ్దికి విశాఖపట్టణం నేత్రవిద్యాలయ ఉపాధ్యాయుల అద్భుత కైంకర్యం :**

శ్రీశ్రీశ్రీ స్వామివారు భగవద్రామానుజాచార్య స్వామి వారి సహస్రాబ్దికి **సమతామూర్తి స్ఫూర్తి కేంద్రాన్ని** నిర్మిస్తున్న విషయం అందరికీ తెలిసిందే. ఒకనెల సంపాదనను స్ఫూర్తి కేంద్ర నిర్మాణానికి సమర్పించమని స్వామివారు అందరికీ తెలియజేస్తున్నారు. విశాఖపట్టణం వారిజ నేత్ర విద్యాలయ ఉపాధ్యాయులు సేవా భావంతో నేత్ర విద్యాలయలో సేవలు అందిస్తున్నారు. వారందరికి **సమతామూర్తి స్ఫూర్తి కేంద్రానికి** తమ వంతు సేవ అందించాలని అనిపించింది. 10మంది ఉపాధ్యాయులు వారికి వచ్చిన జీతంలో ప్రతి నెల వెయ్యి రూపాయలు చొప్పున ఆదాచేసి వచ్చిన మొత్తాన్ని ఒక్కొక్కనెల ఒక్కొక్కరు రామానుజ సహస్రాబ్దికి సమర్పిస్తున్నారు. దాన ధర్మాలు చేయడానికి కోటీశ్వరులే కానవసరం లేదు, సేవ చేయాలనే శ్రద్ధ, సమర్పించాలనే ఆసక్తి ఉంటే చాలు ఈ నేత్ర విద్యాలయ ఉపాధ్యాయులను ఆదర్శంగా తీసుకుని సహస్రాబ్దికి మనవంతు కైంకర్యాన్ని సమర్పిద్దాం.

**బాలల దినోత్సవం సందర్భంగా విశాఖపట్టణం నేత్రవిద్యాలయ విద్యార్థుల విజ్ఞాన ప్రదర్శన (సైన్స్ ఫేర్)**

'అంధులం కాము మేము ఆత్మబల శూరులం. ఎందులో తీసిపోము చూసి తెలుసుకోండి' అని నేత్ర విద్యాలయ విద్యార్థులు వారి ప్రతిభాపాటవాలను తెలియజేస్తూ వారి పాఠశాల గూర్చి ఒక పాట వ్రాసుకున్నారు. ఆ మాట నిజం చేసారు. లోకాన్ని చూస్తూ విజ్ఞానాన్ని గ్రహిస్తూ ఉన్నవారు చేసే కష్టమైన సైన్స్‌ఫేర్ ఎంతో అద్భుతంగా చేసి చూపించారు నేత్ర విద్యాలయ విద్యార్థులు. 3వ తరగతినుండి 10వ తరగతి వరకు విద్యార్థులు తమ సైన్స్ పుస్తకాలలో చెప్పిన విషయాలను చాలా చక్కగా ప్రదర్శించారు. **జ్ఞానేంద్రియాలు వాటి పనితీరు, విద్యుత్ వాహకాలు, సముద్రపు నీటిని మంచినీటిగా మార్చుట, ప్లాస్టిక్ వాడకం వల్ల వచ్చే అనర్థాలు, ఘనద్రవ వాయుపదార్థాలలో పరమాణువుల అమరిక, సమతల ఆహారం, చంద్రకళలు, ప్రథమ చికిత్స, బ్రెయిలీ లిపి వాటి పరికరాలు** మొదలైన విషయాలను సమగ్రంగా వివరించారు. పాఠశాల చుట్టుప్రక్కల ప్రాంతాలలోనున్న మంగమారిపేట ఉన్నత పాఠశాల, గీతం ఇంజనీరింగ్ కళాశాల, రామాద్రి ప్రాథమిక పాఠశాల విద్యార్థులు,ఉపాధ్యాయులు సైన్స్‌ఫేర్‌లో విద్యార్థుల ప్రతిభకు ఆశ్చర్యపోయారు. తాముకూడా అలా వివరించలేము అని ప్రభుత్వ పాఠశాల విద్యార్థులు తమ ఆనందాన్ని వ్యక్తం చేశారు. నేత్రవిద్యాలయ ఫెసిలిటేటర్ శ్రీమతి డి. పద్మజ గారు ఉపాధ్యాయుల సహకారంతో ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. ఉపాధ్యాయులు శ్రీమతి అన్నపూర్ణ, పద్మజ, సురేష్ విద్యార్థులతో విజ్ఞాన ప్రదర్శన నిర్వహించారు. వారిజ వేద విద్యార్థులకు, నేత్రవిద్యాలయ విద్యార్థులకు ఆటల పోటీలు నిర్వహించారు. సైన్స్‌ఫేర్‌లో, ఆటలలో గెలుపొందిన వారికి శ్రీశ్రీశ్రీ స్వామివారు 19వ తేదీన బహుమతులు అందజేసారు. నేత్రవిద్యాలయ విద్యార్థులకు, ఉపాధ్యాయులకు ఈ కార్యక్రమం ఎంతో స్ఫూర్తినిచ్చింది. పాఠశాల కరస్పాండెంట్ శ్రీమతి శిరీష ప్రతి నెల విద్యార్థులతో విజ్ఞాన ప్రదర్శన కార్యక్రమాలను నిర్వహిస్తామని తెలియజేసారు.

# విదేశ వికాస

పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి తిరునక్షత్ర మహోత్సవం మన భారత దేశంలోనే కాదు అమెరికా, ఆస్ట్రేలియా, ఆఫ్రికా వంటి విదేశాలలో కూడా చాలా వైభవంగా నిర్వహించారు.

భారతదేశంలో పుట్టిపెరిగి ఉద్యోగరీత్యా విదేశాలకు వెళ్ళిన భారతీయులు సంస్కృతి సంప్రదాయాలను మరచి పోకుండా వారికి తమ ప్రవచనాల ద్వారా జ్ఞానామృతాన్ని పంచి ఇచ్చిన ఆచార్యుని ఆరాధించకుండా ఎలా ఉండగలరు? సమాజానికి సేవచేసే అదృష్టాన్ని కలిగించే సదాచార్యుని స్మరించని క్షణంలేదు. విదేశాలలోనున్న వి.టి.సేవ మరియు జెట్ సభ్యులు నిరంతరం స్వామివారి ఆదేశానుసారం కార్యక్రమాలను నిర్వహిస్తూనే ఉంటారు. క్షణం తీరికలేని ఉద్యోగ బాధ్యతలు నిర్వహిస్తున్నా స్వామివారు అనుగ్రహించిన ప్రజ్ఞ.సత్సంగం, సేవా, ఆధ్యాత్మిక కార్యక్రమాలు క్రమం తప్పకుండా నిర్వహించే కార్యకర్తలు వేలాదిమంది విదేశాలలో ఉన్నారు.

అమెరికాలో 50 కేంద్రాలలో 5వేలకు పైగా విద్యార్థులు ప్రజ్ఞలో శిక్షణ పొందుతున్నారు. సుందరకాండ పారాయణ, శ్రీసూక్త హోమాలు, శ్రీనివాస కళ్యాణాలు అనేక ప్రాంతాలలో నిర్వహిస్తున్నారు. శ్రీ యుగంధరాచార్యులు "గుడ్‌మార్నింగ్ అమెరికా" అనే కార్యక్రమంలో ప్రాతఃస్మరణీయంతో ప్రారంభించి ఎన్నెన్నో విశేషాలు అందరికీ తెలియజేస్తుంటారు. ప్రస్తుతం "నీరాట్టమ్" (భగవంతునికి స్నానం చేయించినపుడు చదివే పాశురాలు) నేర్పిస్తున్నారు. ప్రతినిత్యం ఉత్సాహంతో, సేవా భావంతో కార్యక్రమాలు నిర్వహించే వి.టి., సేవా కార్యవర్గ సభ్యుల ప్రోత్సాహంతో కార్యక్రమాలు నిర్వహిస్తున్న వారిని శ్రీశ్రీశ్రీ స్వామివారు నూతన కార్యవర్గ సభ్యులుగా నియమించి మంగళాశాసనము చేశారు. వి.టి.సేవా గౌరవ సలహాదారులుగా శ్రీమాన్ కృష్ణకాంత్ వెన్నమనేని, శ్రీమతి పద్మ ఉడత, అధ్య క్షులుగా డా. రామకృష్ణప్రసాద్ పిన్నమనేని, కార్యదర్శిగా శ్రీమాన్ కిరణ్ వెంగల, కోశాధికారిగా శ్రీమాన్ శ్రీనివాస్ ఉడత, సహాయ కార్యదర్శిగా డా.రీనా బొమ్మసాని ఇతర వి.టి. సభ్యులతో కలసి చక్కటి సేవలందిస్తున్నారు.

శ్రీ స్వామివారి మంగళాశాసనాలతో వి.టి.సేవ నిర్వహించే కార్యక్రమాలు అత్యద్భుతంగా ఉంటాయి. ఇంత పెద్ద ఎత్తున ఎలా నిర్వహిస్తారా! అని ఆశ్చర్యం కలుగుతుంది కూడా.

ప్రతి సంవత్సరం నిరాశ్రయులైన అక్కడ నివసించే అనాథలకు ఆహారపదార్థాలు అందించే కార్యక్రమం ఒకటి చేస్తారు. ఏదో దానం చేయాలి కదా అని బాధపడుతూ చేయరు. ఆ చేసే కార్యక్రమాన్ని అమెరికాలో **'థేంక్స్ గివింగ్'** అంటారు. మన వి.టి. సేవ వారు **'దివాలీ-థేంక్స్ గివింగ్ ఫుడ్ డ్రైవ్'** అనే కార్యక్రమాన్ని నవంబర్-డిసెంబర్ నెలల్లో చేస్తారు. ప్రతి వి.టి. సేవ బ్రాంచివారు ఈ సేవలో పాల్గొంటారు. కావలసిన ఆహార పదార్థాలను సేకరించడానికి ప్రతి ఇంటికి వెళ్ళి మొహమాట పడకుండా అడుగుతారు. సూపర్ మార్కెట్ దగ్గర నిలబడి సామాగ్రి కొనుక్కునే వారందరికీ చెప్పి వారికి కూడా సేవచేసుకునే అవకాశం కల్పిస్తారు. **షేర్ యువర్ హాలిడే** అంటూ అందరినీ 'సెలవు దినాలను సేవలకు ఉపయోగించండి' అని ఆహ్వానిస్తారు. అందరూ కలసి ఈ కార్యక్రమంలో నిరాశ్రయులకు సుమారు 7,000 కేజీల శాఖాహార పదార్థాలను చక్కటి ప్యాకింగ్ చేసి మరీ అందిస్తారు. అక్కడ ఉండే ఫుడ్ బ్యాంక్‌లు నిరాశ్రయులైనవారికి ఆహారాన్ని ప్యాకెట్లుగా కట్టి అందిస్తారు. ఆ ప్యాకింగ్ కట్టడంలోకూడా మన కార్యకర్తలు వెళ్ళి సహాయం అందిస్తారు. ఈ సంవత్సరం 18,216 ఫుడ్ ప్యాకెట్లు కట్టడంలో సహకరించారు.

సేవచేసేవారి సేవలను అక్కడి ప్రభుత్వం గుర్తించడం విశేషం. పెద్దవారు, చిన్నవారు అన్న తేడాలేదు. ఎవరు ఎంత సేవచేస్తే అంతగా ప్రశంసలందుకుంటారు. సంవత్సరంలో చిన్నపిల్లలు 70 గంటలు పైగా సేవలందిస్తే వారిని ప్రశంసించి ప్రభుత్వం ప్రోత్సహిస్తుంది. పెద్దవారు సంవత్సరంలో 400 గంటలు పైగా సేవలందిస్తే వారిని కూడా సత్కరిస్తుంది. శ్రీశ్రీశ్రీ స్వామివారి అనుగ్రహంతో వి.టి.సేవ చిన్నారులు, పెద్దలు అమెరికా ప్రెసిడెంట్ వారి నుండి ఎన్నో ప్రశంసలు, బంగారు, వెండి పతకాలు అందుకుంటూనే ఉన్నారు. అద్భుత సేవలు ప్రతి నిత్యం నిర్వహిస్తూ ఆదర్శంగా నిలుస్తున్నారు.

***కార్యక్రమ విశేషాలు :***

***డెల్లాస్ -***




అక్టోబర్ 5న కేన్సర్ అవగాహనయాత్రను నిర్వహించారు. నాలుగు సంవత్సరాలుగా ఈ అవగాహనయాత్ర చేస్తు న్నారు. ఈ కార్యక్రమంలో భారతదేశంలో మహిళా ఆరోగ్యవికాస్ నిర్వ హించే కేన్సర్ అవగాహన చికిత్స గురించి అందరికీ అర్థ మయ్యేలా తెలియజేస్తున్నారు. కాల్పోస్కోప్ పరికరం ఉపయోగించి వి.ఐ.ఎ.పరీక్షలు నిర్వహించి కేన్సర్ రహిత దేశంగా తయారుకావడానికి స్వామివారు చేయిస్తున్న కృషిని అక్కడి వారందరికీ వివరిస్తున్నారు. ప్రముఖ ఆంకాలజిస్ట్ డా.కంచర్ల కిరణ్ అవయవదాన అవగాహన కల్గిస్తూ చక్కటి విషయాలను తెలియజేసారు. ముంబాయికి చెందిన శ్రీ శుశాంత్ కేన్సర్ రహిత భారతదేశానికై చాలా కృషి చేస్తున్నారు. వారు మన వి.టి. సేవా కార్యకర్తలు నిర్వహిస్తున్న కేన్సర్ అవగాహన యాత్రను చూసి మహిళా ఆరోగ్యవికాస్ చేసే సేవలు గురించి అడిగి తెలుసుకుని అభినందించారు.

అక్టోబర్ నెలలో వచ్చిన హుద్ హుద్ తుపాను కల్గించిన నష్టాన్ని చూసి డెల్లాస్‌కు చెందిన ప్రజ్ఞ విద్యార్థులు పుట్టినరోజులు, దీపావళి వేడుకలు చేసుకోకుండా ఆ ఖర్చు చేసే మొత్తాన్ని వారి తల్లిదండ్రులకు అప్పగించారు ఆ చిరంజీవులు పురుషోత్తమ్, గోపాల్, శ్రీజ, విరాజ్, విక్రాంత్, శ్రియ, ఆకాష్, శ్రీరాం,లక్ష్మణ్. చిన్న వయస్సులో ఉన్నా వీరి పెద్దమనసును తల్లిదండ్రులు అభినందించారు. న్యూజెర్సీలో ఉన్న సంధ్యగారు, శేషగిరిగారు సెలవుదినాలలో విహార యాత్రలకు వెళ్ళడమాని ఆ ద్రవ్యాన్ని హుద్

హుద్ సహాయ నిధికి అందజేసారు. డేల్లాస్ వి.టి.శాఖ నూతన సమన్వయకర్త శ్రీమతి కోడూరి శ్రీగౌరి మిగిలిన సభ్యులతోకలిసి ఈ కార్యక్రమాలను నిర్వహించారు.

**సియాటిల్ :**



ప్రతి సంవత్సరం సియాటిల్ వి.టి. సేవ వారు 'ఉత్సవ్' అనే కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారు. సేవ చేయడం అదృష్టంగా మాత్రమే కొందరు భావిస్తారు. సేవ చేయాలి అనే గుణం కలవారందరూ ఒకచోట కలిసి చేసుకునే పండగే 'ఉత్సవ్' అంటారు సియాటిల్ వి.టి.సేవవారు. ఈ సంవత్సరం కార్యక్రమంలో 650మందికిపైగా పాల్గొన్నారు. 108మంది చిన్నారులు, యువత ఈ కార్యక్రమాన్ని నిర్వహించడం విశేషం. నేత్ర విద్యాలయ పాఠశాల గురించి అందరికీ తెలియజేసి వచ్చిన వారందరూ అందించిన సహకారాన్ని **నేత్రవిద్యాలయకు** అందించారు

నేత్రవిద్యాలయ పాఠశాల విద్యార్థులు తయారుచేసిన కీచైన్స్, ద్వారాల తోరణాలు, గృహ అలంకార వస్తువులు 'ఉత్సవ్' కార్యక్రమంలో ప్రదర్శించారు. అక్కడికి వచ్చినవారంతా ఆ వస్తువులను కొనుగోలుచేసి విద్యార్థుల పనితనాన్ని ప్రశంసించారు. వాటి ద్వారా వచ్చిన ద్రవ్యాన్ని నేత్ర విద్యాలయకు వి.టి.సేవ వారు అందజేసారు.

భారతదేశం తమిళనాడు రాష్ట్రంలో కోయంబత్తూర్ అనే ప్రాంతంలో **యూనివర్సల్ పీస్ ఫౌండేషన్** అనే సంస్థవారు 225మంది అనాథబాలలకు ఆశ్రయం కలిగించి విద్యాబుద్ధులు నేర్పిస్తున్నారు. సియాటిల్ వి.టి.శాఖకు చెందిన శ్రీమతి శ్యామలా రంగరాజన్ ప్రస్తుతం కోయంబత్తూర్‌లో ఉంటున్నారు. ఆ ఫౌండేషన్‌వారు నిర్వహిస్తున్న సేవలను చూసి వారి కోరిక మేరకు శ్రీమతి శ్యామలగారు సియాటిల్‌లోగల శ్రీమాన్ శ్రీనివాసన్ కనక సుబ్రహ్మణ్యం వారికి తెలియజేసి శ్రీనివాస్‌గారి నేతృత్వంలో ఆరులక్షల రూపాయలను సియాటిల్ వి.టి.సేవద్వారా కోయంబత్తూరు పాఠశాలకు సమర్పించారు.

**షార్లెట్**

నార్త్ కెరోలినా రాష్ట్రానికి చెందిన షార్లెట్ అనే ప్రాంతంలో వి.టి.సేవ నూతన శాఖ ఏర్పాటు చేశారు. హుద్ హుద్ తుపాను బాధితులకై వాకతాన్ నిర్వహించి లక్ష రూపాయలను సేకరించి సహాయనిధికి అందజేసారు. శ్రీమతి కల్పన గొట్టిపర్తి ఈ శాఖకు సమన్వయకర్తగా వ్యవహరి స్తున్నారు.




**హ్యూస్టన్ :**

నేత్రవిద్యాలయ కళాశాల విద్యార్థులకు అవసరమైన రెండు బస్సులలో ఒక బస్సుకు అష్టలక్ష్మీ ఆలయ ప్రెసిడెంట్ శ్రీమతి శోభా గాదిరాజు 12 లక్షల రూపాయలు అందజేసారు. హ్యూస్టన్ వి.టి. సేవా సభ్యులు మరియు వాషింగ్‌టన్ డి.సి. సభ్యులు రెండవ బస్సుకు తమ సహకారాన్ని అందించారు.

**ఫ్లోరిడా :**

టేంపా నగరంలో శ్రీమాన్ సుబ్రహ్మణ్యంగారి నేతృత్వంలో జెట్ సభ్యులంతా అనేక కార్యక్రమాలు నిర్వహిస్తు న్నారు. శ్రీ గౌరవల్లి శ్రీధర్‌గారు ఇతర జెట్ సభ్యులు కార్తీకవన మహోత్సవం నిర్వహించారు. చక్కటి సంప్రదాయ పద్ధతిలో వనరూపంలోనున్న భగవంతుని ఆరాధించారు. సంకీర్తనలు, దీపోత్సవం, ఆధ్యాత్మిక ఆటపాటలు, వనప్రదేశంలోనే స్వయంగా వంటచేసి భగవంతునికి నివేదనలు ఇవన్నీ చూసస్తూ పూర్వకాలంలో వన మహోత్సవాలను గుర్తుచేసు కున్నారు. అమెరికాలో అనేక ప్రాంతాలలో జెట్ సభ్యులు శ్రీశ్రీశ్రీ స్వామివారి తిరునక్షత్ర మహోత్సవాలను నిర్వహించారు.

**దక్షిణాఫ్రికా - టాంజానియా**

ఇక్కడ నివసిస్తున్న గుజరాతీలు 'సనాతన ధర్మ సభ' పేరు మీదుగా అనేక కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. వారు శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయాన్ని నిర్మించి శ్రీ స్వామివారిని ఆ ప్రాంతానికి ఆహ్వానించి ఆలయప్రతిష్ఠ కార్యక్రమాన్ని చేశారు. శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయంలో ఆగమ, వేద పండితులు శ్రీమాన్ యాదగిరి ఆచార్యులు, శేషాచార్యులు అర్చనా కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. వారి నేతృత్వంలో శ్రీమాన్ సత్యనారాయణ, శ్రీనివాస్, మన్నె శివ మొదలైనవారు సేవా కార్యక్రమాలు, ప్రజ్ఞ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. శ్రీశ్రీశ్రీ స్వామివారి తిరునక్షత్రం సందర్భంగా ప్రతి సంవత్సరం అంధుల పాఠశాల, అనాథశరణాలయాలలో అనేక సేవా కార్యక్రమాలు నిర్వహిస్తూ ఉంటారు. ఈ సంవత్సరం టాంజానియా సత్యసాయి ఆర్గనైజేషన్ వారు నిర్వహిస్తున్న అంధుల పాఠశాలలో స్వామివారి తిరునక్షత్రం సందర్భంగా విద్యార్థులకు అవసరమైన ఆహార పదార్థాలు, నిత్యావసర వస్తువులు, స్వెట్టర్లు, దుప్పట్లు అందజేసారు. అనంతరం ఆరాధన, భజన కార్యక్రమాలు నిర్వహించారు.

**డెట్రాయిట్ - ఆల్‌బెన్నీ** వి.టి. శాఖవారు ఏన్యువల్ వాలీబాల్ టోర్నమెంట్ నిర్వహించారు. వాలీబాల్ టోర్నమెంట్‌లో పాల్గొన్నవారు సమర్పించిన ద్రవ్యాన్ని నేత్రవిద్యాలయ సహా యార్థం అందజేసారు. శ్రీమాన్ సుధాకర్ కొల్లూరి, శ్రీ వేణు గోపాల్ దరూరి ఇతర వి.టి.సేవ కార్యకర్తలు ఈ కార్యక్రమాలు నిర్వహించారు.

డెట్రాయిట్‌లో మరొకశాఖ బ్లూమింగ్‌టన్‌లో శ్రీమతి అర్చనాశేఖర్ మహిళా ఆరోగ్య అవగాహన సదస్సు నిర్వహిం చారు. భారతీయ మహిళలు అధిక సంఖ్యలో ఈ కార్యక్రమంలో పాల్గొని ఆరోగ్యవంతులయ్యారు.

బోస్టన్ శాఖవారు ఐదు కిలోమీటర్లు నేత్రవిద్యాలయ అవగాహనయాత్ర నిర్వహించారు. వీరు సూప్‌కిచెన్ (అనాథలకు వంట చేసే శాల)లో ఆహారపదార్థాలు తయారుచేసి నిరాశ్రయు లకు అందజేస్తూ ఉంటారు.

**కార్యకర్తలకు సూచన**

**మీ వికాసతరంగిణి శాఖ ద్వారా చేసే ఆధ్యాత్మిక, సామాజిక, సేవా కార్యక్రమాలను అందరితో పంచు కోవాలనుకుంటున్నారా! కార్యక్రమ వివరాలను సంక్షిప్తంగా వ్రాసి,డిజిటల్ కెమేరాతో తీసిన కార్యక్రమ ఫోటోలను జతపరచి ప్రతి నెల 10వతేదీలోపుగా news@vtsbharath.org కి మెయిల్ చేయండి.**
**Cell No. 9440106555**

# మహిళా ఆరోగ్యవికాస్

శ్రీమతి మాధవీరవీంద్ర- విజయవాడ




26.10.14న శ్రీమతి సునీతగారి నిర్వహణలో హైదరాబాద్‌లోని హుడా కాంప్లెక్స్ నందు స్ఫూర్తి మహిళా మండలి వారు ఏర్పాటు చేసిన ఉచిత మహిళా వైద్య శిబిరానికి 113మంది హాజరుకాగా, 82మందికి వి.ఐ.ఎ. పరీక్ష చేయటమైనది. 16మందికి తదుపరి పరీక్షలు జరుపగా అందులో నుండి ఇద్దరికి బయాప్సీ చేయటమైనది. ఈశిబిరానికి డా॥ ప్రసూనగారు, గ్రేస్ తేజోవతి గారు తమ విలువైన సమయాన్ని కేటాయించారు. జంటనగరాల ఆరోగ్యవికాస్ కార్యకర్తలు చక్కటి సహకారాన్ని అందించారు. రాష్ట్ర కోఆర్డినేటర్ శ్రీమతి మాధవీరవీంద్రగారి టీమ్ పర్యవేక్షణలో నిర్వహించారు.



26.10.14న కృష్ణాజిల్లా, మొవ్వగ్రామంలోని డిగ్రీ కాలేజ్‌లో శ్రీమతి రుక్మిణిగారి నిర్వహణలో ఏర్పాటుచేసిన ఉచిత మహిళావైద్య శిబిరానికి హాజరైన వారిలో 42మందికి వి.ఐ.ఎ పరీక్ష చేయటమైనది. 10మందికి తదుపరి పరీక్షలు చేయవలసి ఉంది. డా॥శ్రీలతగారు, ఉషగారు తమ విలువైన సమయాన్ని వెచ్చించారు. సాయికోమల్ ట్రస్ట్ మహాలక్ష్మిగారు మరియు 11మంది ఆరోగ్యవికాస్ కార్యకర్తలు తమ సహకారాన్ని అందించారు.

1.11.2014 మహిళా ఆరోగ్య వికాస్ జంటనగరాల కమిటీ ఆధ్వర్యంలో సంగారెడ్డి, మెదక్‌జిల్లా వికాసతరంగిణివారు, శ్రీవేంకటేశ్వర స్వామి కోవెలలో ఏర్పాటు చేసిన శిబిరంను శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయర్ స్వామివారు ప్రారంభించి మంగళాశాసనములు చేశారు. ఈశిబిరానికి 128మంది మహిళలు హాజరుకాగా అందులో 87మంది మహిళలకు **వి.ఐ.ఎ** పరీక్షలు కేంద్ర కమిటీ సమన్వయ కర్త శ్రీమతి మాధవీ రవీంద్రగారు నిర్వహించగా 17మంది మహిళలకు తదుపరి పరీక్షలు జరుపబడినవి.

ఈశిబిరానికి డా॥ అపర్ణగారు తమ సహకారం అందించారు. ఈశిబిరాన్ని మాజీ ఉపముఖ్యమంత్రి శ్రీమాన్ దామోదర రాజ నరసింహగారి సతీమణి శ్రీమతి పద్మిని గారు సందర్శించి మహిళలకు శ్రీస్వామివారు ఆరోగ్యవికాస్‌ద్వారా అందించుచున్న సేవలను కొనియాడుతూ వారు కూడా స్క్రీనింగ్ టెస్ట్ చేయించుకున్నారు.



ఈశిబిర నిర్వహణకు ప్రధాన అర్చకులు శ్రీమాన్ వరదాచార్యులుగారు, ప్రసాద్‌గారు మరియు కోవెల కమిటీ, కార్యకర్తలు సహకారమందించారు. జంటనగరాల కార్యదర్శి శ్రీమతి వనజాచలపతి గారు, శ్రీమతి మంగా అశోక్‌రావు, శ్రీమతి బాలా లింగరాజుగారు విచ్చేశారు. ఈశిబిరానికి జంటనగరాల మహిళా ఆరోగ్యవికాస్ సమన్వయకర్త సునీతగారు సభ్యులు శ్రీలతా, జయలక్ష్మి, శ్రీనివాస్, సుజాత, సునీల గార్లు మరియు ఇతర సభ్యులు ఇతర సభ్యులు పాల్గొన్నారు.

2.11.14వతేదీ మహిళాఆరోగ్యవికాస్ జంటనగరాల కమిటీ ఆధ్వర్యంలో, లయన్స్‌క్లబ్ మరియు కాలనీ ప్రెసిడెంట్ మణికొండ రాఘవేంద్రరావుగారి సహకారంతో స్వర్ణధామ్ నగర్, బోయిన్‌పల్లి, వికాసతరంగిణివారు ఏర్పాటుచేసిన శిబిరానికి సుమారు 132మంది మహిళలు హాజరుగాగా అందులో 95మంది మహిళలకు వి.ఐ.ఎ పరీక్షలు కేంద్రకమిటీ సమన్వయకర్త శ్రీమతి మాధవీ రవీంద్రగారు నిర్వహించారు.

8మంది మహిళలకు తదుపరి పరీక్షలు జరుగుతున్నవి. ఈశిబిరానికి డా॥ గ్రేస్ గారు తమ సహకారం అందించారు. ఈశిబిరంలో స్వర్ణధామ్‌నగర్, వికాసతరంగిణి సభ్యులు పాల్గొన్నారు. ఈశిబిరానికి జంటనగరాల మహిళా ఆరోగ్యవికాస్ రమ, శ్రీలత, సునీల, లక్ష్మి, సుజాత గార్లు మరియు ఇతర సభ్యులు పాల్గొన్నారు.

15.11.14న కోదాడ సమీపంలోని గోండ్రియాల లో శ్రీమతి నళినిగారు కోదాడ వికాసతరంగిణి వారి సహకారంతో ఏర్పాటు చేసిన ఉచిత మహిళావైద్య శిబిరానికి 246మంది హాజరుకాగా 94మందికి వి.ఐ.ఎ పరీక్ష చేయటమైనది. 8మందికి తదుపరి పరీక్షలు నిర్వహించవలసి ఉన్నది. డా॥కృష్ణారెడ్డిగారు ఈశిబిరానికి తమ సేవలను అందించారు. **వికాసతరంగిణి** పెద్దలైన భారతమ్మగారు మరియు గ్రామ సర్పంచ్‌లు తమ సహకారాన్ని అందించారు. కేంద్ర సమన్వయకర్త శ్రీమతి మధవీరవీంద్రగారి టీమ్ ఈశిబిరాన్ని నిర్వహించారు.

శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళా శాసనములతో హైదరాబాద్ వాస్తవ్యులైన



శ్రీమతి మంగ అశోక్‌రావుగారు దంపతులు జంటనగరాల ఆరోగ్యవికాస్ వారికి ఒక "కోలోస్కోప్"ని బహూకరించారు. దీనిని శ్రీస్వామివారు దివ్యకరకమలములతో ప్రారంభించి వారికి అనేక మంగళాశాసనములను కృపజేశారు. ఈ "కోలోస్కోప్"ని ఉపయోగించి జంటనగరాల ఆరోగ్య వికాస్ వారు స్వయంగా శిబిరాలను నిర్వహించుకొనుటకు శ్రీస్వామివారు అనేక మంగళాశాసాలను కృపజేశారు.

శ్రీశ్రీశ్రీ జీయర్‌స్వామివారి మంగళాశాసనములతో... మహిళా ఆరోగ్యవికాస్ జంటనగరాల కమిటీ ఆధ్వర్యవంలో 1.11.14న సంగారెడ్డి, మెదక్‌జిల్లా వికాసతరంగిణివారు, శ్రీవేంకటేశ్వరస్వామి కోవెలలో ఏర్పాటుచేసిన శిబికాన్ని శ్రీశ్రీశ్రీ దేవనాథ రామానుజ జీయర్‌స్వామివారు ప్రారంభించి, మంగళాశాసనాలు చేసారు.

ఈ శిబిరానికి 128మంది మహిళలు హాజరుకాగా, అందులో 87 మంది మహిళలకు VIA పరీక్షలు కేంద్రకమిటి సమన్వయ కర్త శ్రీమతి మాధవీరవీంద్రగారు నిర్వహించారు. 17మంది మహిళలకు తదుపరి పరీక్షలు జరుపబడుచున్నవి. ఈ శిబిరానికి డా॥ అపర్ణగారు తమ సహకారం అందించారు. ఈ శిబిరాన్ని మాజీ ఉపముఖ్యమంత్రి శ్రీమాన్ దామోదర రాజ నరసింహగారి సతీమణి శ్రీమతి పద్మినిగారు సందర్శించి, మహిళలకు శ్రీస్వామివారు ఆరోగ్య వికాస్‌ద్వార అందించుతున్న సేవలను కొనియాడుతూ వారు కూడా స్క్రీనింగ్‌టెస్ట్ చేయించుకొన్నారు. ఈ శిబిర నిర్వహణకు ప్రధాన అర్చకులు శ్రీమాన్ వరదాచార్యులుగారు, ప్రసాద్‌గారు మరియు కోవెల కమిటి, కార్యకర్తలు సహకారమందించారు. జంటనగరాల కార్యదర్శి శ్రీమతి వనజా చలపతిరావుగారు, శ్రీమతి మంగా అశోక్‌రావు, శ్రీమతి బాలలింగరాజుగారు విచ్చేసారు. ఈ శిబిరానికి జంటనగరాల మహిళా ఆరోగ్యవికాస్ సమన్వయకర్త సునీతగారు, సభ్యులు శ్రీలత, జయలక్ష్మి, శ్రీనివాస్, సుజాత, సునీలగార్లు మరియు ఇతరసభ్యులు పాల్గొన్నారు.



మహిళా ఆరోగ్యవికాస్ జంటనగరాల కమిటీ ఆధ్వర్యవంలో 2.11.14న లయన్స్ క్లబ్ మరియు కాలనీ ప్రెసిడెంట్ మణికొండ రాఘవేంద్రరావుగారి సహకారంతో స్వర్ణధామ్ నగర్, బోయిన్‌పల్లి వికాసతరంగిణివారు ఏర్పాటుసేన శిబిరానికి సుమారు 132మంది మహిళలు హాజరుకాగా, అందులో 95 మంది మహిళలకు VIA పరీక్షలు కేంద్ర కమిటీ సమన్వయకర్త శ్రీమతి మాధవీ రవీంద్రగారు నిర్వహించారు. 8మంది మహిళలకు తదుపరి పరీక్షలు జరుగుచున్నవి. ఈ శిబిరానికి డా॥ గ్రేస్‌గారు తమ సహకారం అందించారు. ఈ శిబిరంలో స్వర్ణధామ్ నగర్ వికాసతరంగిణి సభ్యులు పాల్గొన్నారు. ఈ శిబిరానికి జంటనగరాల మహిళా ఆరోగ్యవికాస్ కార్యకర్తలు రమ, శ్రీలత, సునీత, లక్ష్మి, సుజాతగార్లు మరియు ఇతర సభ్యులు పాల్గొన్నారు.

## మహిళ అనుభవం



నాపేరు శోభారెడ్డి, వయస్సు 55సం॥లు.

నేను శ్రీస్వామివారి ఆరోగ్య వికాస్‌ద్వారా జివ్స్ హాస్పటల్‌లో ఏర్పాటుచేసిన ఉచిత మహిళావైద్య శిబిరాలను ఏర్పాటుచేసే శిక్షణను తీసుకోవడానికి వెళ్ళాను. శ్రీమతి మాధవీరవీంద్రగారు ఏవిధంగా శిబిరాలు నిర్వహించాలో తెలియజేస్తూ, కార్యకర్తలను ముందు స్క్రీనింగ్ పరీక్ష చేయించుకుని, తద్వారా మన అనుభవాన్ని అందరికీ వివరించవచ్చు అని తెలియజేసారు. ట్రైనింగ్‌కి వచ్చినవారందరికీ స్క్రీనింగ్ టెస్ట్‌చేసి నన్ను వెంటనే బయాప్సీ చేయించుకోవలసినదిగా సలహా ఇచ్చారు. నేను మాప్రాంతంలోని హాస్పిటల్‌కు వెళ్ళగా, డాక్టరు మీకు ఎవరు చూపించుకోమని సలహాఇచ్చారు అని ప్రశ్నించారు? శ్రీస్వామివారిద్వారా వికాసతరంగిణి నిర్వహిస్తున్న ఉచిత మహిళావైద్య శిబిరాలను గురించి వివరించారు.

ఆరోగ్యవికాస్ వారు చేయు వి.ఐ.ఎ పరీక్ష విధానాన్ని "కోలోస్కోప్" ద్వారా మనయొక్క గర్భాశయ ముఖద్వార పరిస్థితిని, వెనువెంటనే ఇన్‌ఫెక్షన్ యొక్క తీవ్రతను మహిళలకు తెలియజేసే విధానాన్ని అభినందిస్తూ తదుపరి పరీక్షలు నిర్వహించి ఆపరేషన్ చేయటం ద్వారా మొదటి దశల్లోనే క్యాన్సర్‌ను నివారించారు.

సమస్య బయటపడి ఆనందంగా నేను ఇప్పుడు ఆరోగ్యవికాస్‌లో సేవలు అందిస్తున్నాను. శ్రీస్వామివారి ఆశయం యఎతోమంది మహిళలను క్యాన్సర్ బారిన పడకుండా, ఎన్నో కుటుంబాలు రక్షింపబడుతున్నాయి అనడానికి నేనే ఒక నిదర్శనం. మహిళలందరి తరపున శ్రీశ్రీశ్రీ స్వామివారికి శతకోటి దాసోహములు సమర్పించుకుంటున్నాను.

# మెదడుకి మేత!

భగవద్బంధువులారా! జిజ్ఞాసతో మీరంతా చదువుతూ ఆదరిస్తున్న 'భక్తినివేదన'లో మీకోసం ఈ శీర్షిక! **ఈ పత్రికలోని వ్యాసాలనుండే మీకు ప్రశ్నలిస్తున్నాం!** అయినా మరొక్కసారి జ్ఞాపకం చేసుకోవడం మనస్సుకి ఆనందమని మెదడుకీ చిన్నమేత! అన్నీ సరిగా వ్రాస్తే ఆకర్షణీయ బహుమతులు! ప్రతినెల 15వ తేదీలోపు మాకందిన సమాధానాలని మాత్రమే పరిశీలిస్తాం! ఆ పై దాటివచ్చినవి పరిశీలించము. దీనిపై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండవు. శ్రద్ధతో మీరు పంపిన **నవంబర్ నెల సమాధానాలందాయి.** విజేత పేరు క్రింద ప్రకటించాము. బహుమతులు పంపిస్తాం! *గతనెల సమాధానాలు 17వ పేజీలో కలవు.*

**ప్రశ్నలు** **సమాధానాలు**

1. ప్రిన్‌స్టన్ యూనివర్సిటీలో క్రిస్టియన్ మతవిద్యను నేర్చే విద్యార్థులు తరచు ఏ అంశాలను అధ్యయనం చేస్తారు?
2. శాకుంతుల నాటకంలో సమాజానికి అందించిన సందేశం...
3. వివేక-విమోక-అభ్యాసాది సాధనసంపత్తి, శమదమాది సద్గుణ సంపత్తి- ఈ రెండున్నూ వీరు కలిగియున్నవారిన ఏమంటారు
4. స్వామి ప్రతిబోధించిన తత్త్వరహస్యాన్ని మననం చేయడంవల్ల అర్జునునికి ఏమి....
5. పరీక్షిత్తుని భార్యపేరు ఏమి?
6. లోకాలు ఎవరికి శేషభూతులు?
7. త్యాగానికి చిహ్నంగా దేనిని ధరిస్తారు?
8. నచికేతుడు మోక్షసాధనకై ఏ విద్యను ఉపదేశించమని అడగాడు?
9. ముని భిక్షాటన ఎలాచేయాలి?
10. న్యాయశాస్త్రగురుడు ఎవ్వరు?
11. ఈ జీవుడు తన దేహాన్ని వదిలాక ఎక్కడకు చేరతాడు?
12. సంసార మోహం పోవాలంటే ఏమి చెబితే సరిపోదు?
13. చందన రామోజీ దాసు దేనినిమిత్తం సమర్పించారు? ఏ ఊరుకి చెందినవారు?
14. శ్రీమాన్ నరసింహాచార్యులుగారు దేనికి సేవలు చేసినారు?
15. కపిలతీర్థానికి వెళ్లే త్రోవలో ముందుగా ఏది గోచరిస్తుంది?
16. చిదంబరంలో వేంచేసియున్న తాయారుపేరు?
17. సోమరసం ఏ పాత్రలోకి తీస్తారు?
18. కళ్ళు తిరగడం, తలనొప్పి కలిగిన అబ్బాయిపేరు?
19. విద్వద్గోష్ఠిని మరలా ఏనెలలో జరగనున్నది?
20. సూర్యనారాయణమ్మగారు దేనికోసం 40వేలు సమకూర్చారు?

శతాధికంగా పంపిన మెదడుకు మేత సమాధానాలలో లాటరీ ద్వారా విజేతల పేర్లు:

కె. రాజ్యలక్ష్మి-కొత్తగూడెం.

మీ చిరునామా
..............................................
..............................................
..............................................
..............................................

సూచన: సమాధానాలు ఈ పత్రంలోనే నింపి, 15వ తేదీలోపు అందేట్టు ఈ క్రింది చిరునామాకి పంపగలరు.

భక్తినివేదన సీతానగరం-522 501, తాడేపల్లి పోస్ట్, గుంటూరు జిల్లా. ఆంధ్రప్రదేశ్. 08645 272929